
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

http://dwarkadheeshvastu.com



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయానుక్రమణిక

❖ ❖ ❖

## ఓం శ్రీపరమాత్మనే నమః

దైవానుగ్రహమున పెక్కు శాస్త్రములను అవలోకించుటకును, మహాపురుషుల ప్రవచనములను శ్రవణము చేయుటకును, మననము కావించుటకును అవకాశము లభించుట నామహద్భాగ్యము. తత్ప్రభావమున లోకకల్యాణకారకములైన గ్రంథరాజములలో "శ్రీమద్భగవద్గీత" ఒక 'మేలు బంతి'యని నేను గ్రహింపగల్గితిని. అది నిరుపమానము. సర్వజనాదరణీయము. అది మానవాళికి బహుళప్రయోజనకారి. భగవత్ప్రాప్తికై 'గీత'యందు జ్ఞానయోగము, ధ్యానయోగము, కర్మయోగము, భక్తియోగము మొదలగు అనేక సాధనమార్గములు ప్రతిపాదింపబడినవి. మానవుడు తనకుగల శ్రద్ధ, అభిరుచి, యోగ్యతలను అనుసరించి, వానిలో ఏ ఒక్క సాధన చేసినను అతనికి శీఘ్రముగ శ్రేయస్సు కలుగును.

మహాపురుషులను ఆశ్రయించినచో వారి కృపవలన ఉపర్యుక్త సాధన మార్గములు సుబోధకములు కాగలవు. పరమాత్మ తత్త్వరహస్యములు తేటతెల్లములగును. వారి సాంగత్యము లభింపనిచో ఉత్తమశ్రేణికి చెందిన సాధకులను శ్రద్ధాభక్తులతో సేవింపవలెను. తద్ద్వారా గీతా తత్త్వార్థ భావములను గ్రహించుచు వాటిని మననము చేయుటయేగాక జీవితాంతము వఱకును వాటిని అనుసరించుటకు ప్రయత్నింపవలెను. అదియే మానవాళికి పరమశ్రేయోదాయకము.

హరిః ఓం తత్సత్ ఓం

శమ్

నివేదకుడు

జయదయాల్ గోయంద్కా

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# శ్రీ గీతామాహాత్మ్యమ్

*ధరోవాచ*

భగవన్! పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ! ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో । 1 ।

*శ్రీ విష్ణు రువాచ*

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।
సముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే । 2 ।
మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నలినీదళమంభసా । 3 ।
గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై । 4 ।
సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే ।
గోపాలా గోపికా వాఽపి నారదోద్ధవ పార్షదైః ।
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే । 5 ।
యత్ర గీతా విచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి । 6 ।
గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్ లోకాన్ పాలయామ్యహమ్ । 7 ।
గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః ।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా । 8 ।
చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానందతత్త్వార్థజ్ఞానమంజసా । 9 ।
యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్ । 10 ।
పాఠేఽసమర్థస్సంపూర్ణే తదర్ధం పాఠమాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః । 11 ।
త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ । 12 ।
ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః ।
రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసేచ్చిరమ్ । 13 ।
అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః ।
స యాతి నరతాం యావన్మనుకాలం వసుంధరే! । 14 ।
గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్ ।
ద్వౌత్రీనేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః । 15 ।

చంద్రలోక మవాప్నోతి వర్షాణామయుతం ధ్రువమ్ ।
గీతాపాఠ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్ । 16 ।

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తిముత్తమాం ।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్ । 17 ।

గీతార్థ శ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే । 18 ।

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః ।
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్ । 19 ।

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః ।
నిర్ధూతకల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్ । 20 ।

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్ ।
వృథాపాఠో భవేత్ తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః । 21 ।

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః ।
స తత్ఫలమవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్ । 22 ।

సూత ఉవాచ

మాహాత్మ్యమేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనం ।
గీతాంతే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ । 23 ।

॥ ఇతి శ్రీవరాహపురాణే గీతామాహాత్మ్యం సంపూర్ణమ్ ॥

(గీతా పారాయణమైన పిదప గీతా మాహాత్మ్యమును పఠింపవలెను.)

## అథ వినియోగః

ఓం అస్య శ్రీమద్భగవద్గీతాశాస్త్ర మహామన్త్రస్య శ్రీ భగవాన్ వేదవ్యాసో ఋషిః ॥ అనుష్టుప్ ఛందః ॥ శ్రీకృష్ణ పరమాత్మా దేవతా ॥ అశోచ్యానన్వశోచస్త్వం ఇతి బీజమ్ ॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతి శక్తిః ॥ అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ ఇతి కీలకమ్ ॥ మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ కరిష్యసీతి కవచమ్ ॥ కిరీటినమ్ గదినమ్ చక్రహస్తమ్ ఇత్యస్త్రమ్ ॥ అనాది మధ్యాన్తమనంతవీర్య మితి ధ్యానమ్ ॥ జ్ఞానయజ్ఞేన భగవదారాధనార్థే శ్రీకృష్ణ పరమాత్మ ప్రీత్యర్థే గీతాపారాయణే వినియోగః ॥

## ॥ అథ కరన్యాసః ॥

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇత్యంగుష్ఠాభ్యాం నమః ॥ న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుత ఇతి తర్జనీభ్యాం నమః ॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ఇతి మధ్యమాభ్యాం నమః ॥ నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతన ఇత్యనామికాభ్యాం నమః ॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశ ఇతి కనిష్ఠికాభ్యాం నమః ॥ నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః ॥

## ॥ అథ హృదయాదిన్యాసః ॥

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇతి హృదయాయ నమః ॥ న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుత ఇతి శిరసే స్వాహా ॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ఇతి శిఖాయై వషట్ ॥ నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతన ఇతి కవచాయ హుమ్ ॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశ ఇతి నేత్రత్రయాయ వౌషట్ ॥ నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ ఇతి అస్త్రాయ ఫట్ ॥

॥ శ్రీకృష్ణ ప్రీత్యర్థే పారాయణే వినియోగః ॥

## అథ ధ్యానమ్

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్ ।
అద్వైతామృతవర్షిణీం భగవతీమ్ అష్టాదశాధ్యాయినీమ్
అంబ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥ 1 ॥

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిందాయతపత్రనేత్ర ।
యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥ 2 ॥

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥ 3 ॥

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 4 ॥

భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ।
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః ॥ 5 ॥

పారాశర్యవచః సరోజమమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథా సంబోధనాబోధితమ్ ।
లోకే సజ్జనషట్పదైరహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపంకజం కలిమల ప్రధ్వంసి నః శ్రేయసే ॥ 6 ॥

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృపా తమహం వందే పరమానందమాధవమ్ ॥ 7 ॥

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్ ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥ 8 ॥

యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః
వేదైః సాంగపదక్రమోపనిషదైః గాయంతి యం సామగాః ।
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః ॥ 9 ॥

❖ ❖ ❖

# శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమ్

గీతాశాస్త్రమిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పదమవాప్నోతి భయశోకాదివర్జితః ॥ 1 ॥

గీతాధ్యయనశీలస్య ప్రాణాయామ పరస్య చ ।
నైవ సంతి హి పాపాని పూర్వజన్మకృతాని చ ॥ 2 ॥

మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే ।
సకృద్గీతాంభసి స్నానం సంసారమలనాశనమ్ ॥ 3 ॥

గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతా ॥ 4 ॥

భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిఃసృతమ్ ।
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే ॥ 5 ॥

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 6 ॥

ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతమ్ ఏకోదేవో దేవకీపుత్ర ఏవ ।
ఏకో మంత్రస్తస్య నామాని యాని కర్మాప్యేకం తస్య దేవస్య సేవా ॥ 7 ॥

## ప్రార్థన

కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం ।
నాసాగ్రేవరమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ॥
సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠే చ ముక్తావళీ ।
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥

ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాదిమధ్యలయుడెవ్వడు సర్వము తానయైన వా
డెవ్వడు వాని నాత్మభవునీశ్వరునే శరణంబు వేడెదన్ ॥

## శంఖారావము

పూరించెన్ హరి పాంచజన్యము(గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్
సారోదారశితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్ ॥

❖ ❖ ❖

# నమ్ర నివేదన

త్వమేవ మాతా చ పితా త్వమేవ । త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ । త్వమేవ సర్వం మమ దేవదేవ ॥
వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ । దేవకీపరమానందం కృష్ణం వందేజగద్గురుమ్ ॥

## గీతామహిమ

శ్రీమద్భగవద్గీత సాక్షాత్తుగా భగవానుని దివ్యవాణి. దీని మహిమ అపారమైనది. అపరిమితమైనది. ఆ మహిమను సంపూర్ణముగ ఎవ్వరును వర్ణింపజాలరు. ఆదిశేషుడుగాని, పరమశివుడుగాని, కడకు మహాగణాధిపతిగాని దీని మహిమను సమగ్రముగా వర్ణింపలేరు. ఇక మానవమాత్రుల విషయమున చెప్పవలసిన దేమున్నది? పురాణేతిహాసాదులలో పెక్కు చోట్ల దీని మహిమ కీర్తింపబడినది. ఆయా సందర్భములలో ప్రస్తుతింపబడిన దీని మహిమలను అన్నింటిని ఒకచోట చేర్చినను దానిని గూర్చి సమగ్రముగా తెలిపినట్లు కాదు. యథార్థముగా దీని మహిమను పూర్తిగా ప్రకటించుట ఎట్టి వారికిని సాధ్యము కాదనుట ముమ్మాటికి సత్యము. అందువలన దీని మహిమ వర్ణనాతీతము, కనుక అపరిమితము, అనంతము.

గీత పరమ రహస్య విషయ సమన్వితము. ఇది సమస్త వేదముల సారము. దీని రచన మిక్కిలి సరళము, పరమసుందరము. సులభగ్రాహ్యము. ఐనను దీని లక్ష్యము అతి నిగూఢమైనది. అత్యంత గంభీరమైనది. కావున జీవితాంతము నిరంతరము పరిశ్రమించినను దీనిలోతుపాతులు ఎరుగుట కష్టము. అనుక్షణము దీనిని తరచినకొలదియు నిత్య నూతన భావములను అది స్ఫురింప జేయుచునే యుండును. ఏకాగ్రచిత్తముతో భక్తిశ్రద్ధా పూర్వకముగ పరిశీలించినచో ప్రతి పదమునందును పరమ రహస్యము కొంత గోచరించుచుండును. ఇందు భగవంతుని గుణ ప్రభావ స్వరూప తత్త్వ రహస్యములేగాక ఉపాసనా కర్మజ్ఞానాది వివిధ విషయములు గూడ సుస్పష్టముగా వర్ణింపబడినవి. ఈ విషయములన్నియును ఇంత విపులముగా ఏ ఇతర గ్రంథములయందును ఒకేచోట లభింపవు. భగవద్గీతయందలి ప్రతి శబ్దము సదుపదేశప్రదము. కనుక ఇది నిరుపమానశాస్త్రము. గీత యందు నిరర్థకమైన పదమొక్కటియును లేదు. ఇందు తెల్పబడిన విషయములన్నియును 'అక్షరశః' యథార్థములు. సత్యస్వరూపుడైన భగవంతుని యొక్క వచనములను చాటువులుగా భావించుట ఆ భగవంతుని నిరాదరించుటయే యగును. గీత సర్వశాస్త్ర విషయ సమంచితము. వివిధ శాస్త్రముల సారము. అది సకల శాస్త్రములకును పెన్నిధి. గీతాజ్ఞానము ఆమూలాగ్రముగ అబ్బినచో సకల శాస్త్రముల తత్త్వజ్ఞానమూ కరతలామలకమే యగును. వాటికై (ఇతర శాస్త్రముల కొరకై) వేరుగా పరిశ్రమింపవలసిన పనియేలేదు.

'సర్వశాస్త్రమయీ గీతా' (గీత సకల శాస్త్రశోభితము) అని మహాభారతమున పేర్కొనబడినది. (భీష్మపర్వ 43/2) కాని ఇట్లు చెప్పుటయు సరిపోదు. ఏలనన శాస్త్రములన్నియును వేదముల నుండి ఏర్పడినవి. వేదములు బ్రహ్మముఖము నుండి వెలువడినవి. బ్రహ్మ భగవంతుని నాభికమలమునుండి ప్రభవించెను. ఈ రీతిని గమనించినచో భగవంతునకును శాస్త్రములకును మధ్య చాలా అంతరము ఉండును. కాని భగవద్గీత సాక్షాత్తుగా భగవంతుని ముఖారవిందమునుండియే అవతరించినది. కనుక శాస్త్రములన్నింటి కంటెను గీత సర్వశ్రేష్ఠమైనది. స్వయముగా వ్యాసభగవానుడే ఇట్లు పలికెను.

గీతా సుగీతా కర్తవ్యా, కిమన్యైః శాస్త్ర సంగ్రహైః ।
యా స్వయంపద్మనాభస్య ముఖపద్మాత్ వినిఃసృతా ॥

*(మహాభారతము – భీష్మపర్వము 43/1)*

ప్రతి వ్యక్తియు గీతను శ్రవణ, కీర్తన, పఠన, పాఠన, మనన ధారణాదుల ద్వారా సేవింపవలెను. అట్లు చేసినచో ఇతర శాస్త్రములతో పనియేలేదు. ఏలనన అది కేవలము సాక్షాత్తు పద్మనాభుడైన శ్రీమహావిష్ణువుయొక్క ముఖ కమలము నుండి ప్రభవించినది.

ఇచట పద్మనాభ శబ్దప్రయోగ వైశిష్ట్యము గమనింపదగినది. సకల శాస్త్రములకును మూలములు వేదములు. ఆ సమస్త వేదములకును కుదురైనది బ్రహ్మముఖము. ఆ బ్రహ్మ పుట్టుకకు ఆధారము పద్మము. ఆ పద్మము యొక్క

ఆవిర్భావమునకు ఆలవాలము శ్రీమహావిష్ణువు యొక్క నాభిప్రదేశము అనగా శ్రీమహావిష్ణువు. అట్టి పద్మనాభుని ముఖారవిందము నుండి ప్రభవించినదియే భగవద్గీత.

గీత గంగ కంటెను పవిత్రమైనది. గంగాస్నానము ముక్తి ప్రదమని శాస్త్రములు ప్రకటించుచున్నవి. కాని గంగాస్నానమును ఆచరించినవాడు స్వయముగా తాను తరించునే గాని ఇతరులను తరింపజేయజాలడు. కాని గీతాగంగయందు మునుకలు వేయువాడు తాను స్వయముగా తరించుటయేగాక ఇతరులను గూడ తరింపజేయగలడు. గంగ విష్ణు పాదములనుండి ఉద్భవించినది. గీత సాక్షాత్తు ఆ శ్రీమన్నారాయణుని ముఖము నుండియే వెలువడినది. ముక్తుడు కాగోరినవాడు తానే గంగకడకు వెళ్ళి, అందు స్నానమాచరింపవలెను. కాని గీతమాత్రము తానే ఇంటింటికి తిరిగి, వారికి కనికరముతో ముక్తి మార్గమును చూపును. ఇందువలన గీత గంగకంటెను శ్రేష్ఠతరమైనది.

గీత గాయత్రీమంత్రముకంటెను శ్రేష్ఠమైనది. గాయత్రిని జపించినవానికి ముక్తిలభించునను మాట సత్యమే. కాని ఆ మంత్రమును జపించిన వాడు తాను మాత్రమే ముక్తిని పొందగలడు. ఐతే గీతాభ్యాసమొనర్చిన వాడు తాను తరించుటయేగాక ఇతరులను సైతము తరింప జేయగలడు. అంతమాత్రమేగాదు ముక్తి ప్రదాతయైన ఆ భగవానుడే అతని వాడగును. అంతేగాదు ఒక్క మాటలో చెప్పవలెనన్న ముక్తికాంత అతనికి పాదదాసి. నిజముగా ఆతడే ఒక ముక్తి క్షేత్రము.

గీత ఆ భగవానుని కంటెను శ్రేష్ఠమైనదని చెప్పినను ఏ మాత్రమూ అతిశయోక్తి కాదు. స్వయముగా భగవానుడే -

గీతాశ్రయేహం తిష్ఠామి, గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతా జ్ఞానముపాశ్రిత్య త్రీన్ లోకాన్ పాలయామ్యహమ్ ॥

*(వరాహ పురాణము)*

"నేను గీతను ఆశ్రయించి యుందును. గీతయే నా నివాసము. ముల్లోకములను పాలించుటలో గీతా జ్ఞానమే నాకు పరమసాధనము" అని పలికెను. అంతేగాక "గీతోపదేశమును పాటించినవాడు నిస్సందేహముగ ముక్తిని పొందునని భగవంతుడే ఈ గీతయందు ప్రకటించియుండెను. (3/31) మరియు గీతాధ్యయనము చేసినవాడు జ్ఞానయజ్ఞము ద్వారా భగవానుని సేవించినట్లే యని అతడే నుడివెను (18/70). కేవలము గీతాధ్యయనమునకే ఇంత మహిమ యున్నప్పుడు, మానవుడు గీతోపదేశమును అనుసరించి జీవితమును గడుపుట వలనను, దీని రహస్యమును భక్తులచే ధారణ చేయించుట వలనను, దీనిని విస్తారముగ ప్రచారము చేయుటవలనను కలుగు మహాత్మ్యము ఎంతయని చెప్పగలము? గీతాధ్యయనాదులను గావించువారు భగవంతునకు అత్యంత ప్రియతములు. అట్టి భక్తులకు ఆతడు అధీనుడన్నను అనుచితముగాదు. మహాపురుషులు గూడ తమ సిద్ధాంతములను అనుసరించువారిని తమ ప్రాణములకంటెను ఎక్కువగా ప్రేమింతురు. అట్టి స్థితిలో భగవంతుడు తన పరమరహస్య గీతోపదేశమును అనుసరించువారిని ప్రియతములుగా భావించుట ఆశ్చర్యకరముగాదు.

గీత భగవంతునకు ఊపిరి, హృదయము, వాఙ్మయమూర్తి. తమ హృదయములయందును, వాక్కులయందును, శరీరములయందును అట్లే ఇంద్రియములన్నింటి యందును గీతానందమును నింపుకొనినవారు సాక్షాత్తు గీతామూర్తులే. వారియొక్క దర్శన స్పర్శన భాషణ చింతనముల వలన ఇతరులెల్లరును పునీతులగుదురు. ఇంక వారి ఆజ్ఞలను పాలించుచు, అనుసరించు వారల విషయము చెప్పనేల? యథార్థముగ ప్రపంచమున యజ్ఞ, దాన, తపస్తీర్థ వ్రతసంయమ - ఉపవాసాదు లెవ్వియును గీతకు ఏమాత్రమును సాటిరావు.

శ్రీకృష్ణభగవద్వాణిని సంకలనమొనర్చి జగత్తునకు అందించినవాడు వ్యాసభగవానుడు. శ్రీకృష్ణ భగవానుడు గీతోపదేశములను ఎక్కువ భాగము శ్లోకములలోనే ప్రకటించెను, దానిని వ్యాసుడు యథాతథముగ లోకమునకు అందించెను. స్వల్పముగానున్న గద్యరూప సందేశములను కూడ శ్లోక బద్ధమొనర్చెను. అట్లే అర్జున సంజయధృతరాష్ట్ర వచనములకు గూడ అతడు శ్లోక రూపములను గూర్చెను. ఆ ఏడువందల (సప్తశతి) శ్లోకములను పదునెనిమిది అధ్యాయములుగా విభజించి, మహాభారతేతిహాసమున అంతర్భాగముగా జేసెను. అది నేడు మనకు ఈ రూపమున లభ్యమగుచున్నది.

## గీతా తాత్పర్యము

శ్రీమద్భగవద్గీత ఒక జ్ఞానసాగరము. వివిధ జ్ఞానములకు అది అనంతభండారము. పేరు మోసిన పండిత ప్రకాండులుగాని, తత్త్వదర్శులైన మహాత్ములుగాని, దీని తత్త్వమును సమగ్రముగా వివరింపజాలరు. దీని పరతత్త్వ రహస్యమును సంపూర్ణముగా ఎరిగినవాడు ఆ భగవానుడు మాత్రమే. ఈ తత్త్వజ్ఞులలో తరువాత పేర్కొనదగిన వారు సంకలన కర్తయైన వ్యాసుడు, శ్రోతయైన అర్జునుడు - ఇట్టి అగాధ రహస్య నిధానమైన గీతయొక్క ఆశయరహస్యములను నావంటి సామాన్య మానవుడు తెలిసికొనబూనుట అనంతాకాశమును కొలుచుటకు ఒక చిట్టి పిట్ట ప్రయత్నించుటవంటిది.

గీత అనంత భావసముద్రము. రత్నాకరమున ధైర్యసాహసములతో బలముగా మునుకలువేసి, అట్టడగునకు చేరి, పరిశోధించినచో అమూల్య రత్నములు లభించును. అట్లే ఈ గీతారత్నాకరమునందు మునుకలువేయు జిజ్ఞాసువులకు నిత్య నూతనమైన, విలక్షణమైన భావరత్నరాసులు కొల్లలుగా లభించును. ఆకాశమున బలశాలియైన గరుత్మంతుడును ఎగురును, దుర్బలమైన దోమయు ఎగురును. కాని ఈ రెండు ప్రాణుల యొక్క సుఖానందానుభవముల స్థాయి మాత్ర మొకటి కాదు. అట్లే జిజ్ఞాసువులందరును తమ తమ భావపరిధులను అనుసరించి, యథాయోగ్యముగ అనందమును అనుభవింతురు.

నిశితముగా పరిశీలించి చూచినచో అనాది కాలమునుండియు అజ్ఞాన వశమున సంసారమునందు మునుకలు వేయుచున్న జీవులను ఉద్ధరించి, వారికి పరమాత్మప్రాప్తి కల్గించుటయే గీతయొక్క పరమలక్ష్యమని స్పష్టమగును. అందులకై మానవులు తమ ప్రాపంచిక కర్తవ్యకర్మలను చక్కగా ఆచరించుచు పరమాత్మ ప్రాప్తినందుటకు ఇందనేకమార్గములు సూచింపబడినవి. వాటి ద్వారా మానవులు తమ కర్తవ్య కర్మలను విధ్యుక్తముగా ఆచరించుచునే పరమాత్మ ప్రాప్తినందగలరు. నిజజీవితము నందు నిత్యనైమిత్తిక వ్యావహారిక కర్మలను ఆచరించుచునే పారమార్థిక లాభములను పొందు అద్భుత మార్గము గీతయందు ప్రకటింపబడినది. ఇందు ప్రతిపాదింపబడిన జ్ఞాననిష్ఠ (సాంఖ్యయోగము) యోగనిష్ఠ (కర్మయోగము) అను రెండు మార్గములలో మనుజులు తమ తమ యోగ్యతలను బట్టి దేనిని (3/3) అనుసరించినను పరమాత్మను పొందవచ్చును.

దాదాపు శాస్త్రములన్నింటియందును భగవత్ప్రాప్తికై కర్మ, భక్తి, జ్ఞాన మార్గములు మూడు ప్రధానముగా తెల్పబడినవి. మరి గీతయందు రెండే మార్గములు సూచింపబడినవి. గీతకు భక్తి మార్గము ఆదరణీయముకాదా? కాని లోకములో పెక్కుమంది గీతోపదేశము భక్తి ప్రధానమైనదనియే భావింతురు. అచ్చటచ్చట భగవానుడు భక్తియొక్క విశేషమహిమనే స్పష్టముగా తెలిపియుండెను **(6/47)**. భక్తి ద్వారా తనను పొందుట సులభమనియు అతడు పేర్కొనియుండెను. **(8/14)**. అందువలన శాస్త్రములయందు ప్రస్తావింపబడిన ఉపాసనా (భక్తి) మార్గము జ్ఞాన, కర్మ నిష్ఠలలో అంతర్భాగమనియే తలంపవలెను. సాధకుడు అభేద భావముతో భగవంతుని ఉపాసించినప్పుడు అది సాంఖ్యయోగములో భాగమనియు, భేదదృష్టితో ఉపాసించినప్పుడు అది యోగ(కర్మ) నిష్ఠలో అంతర్భాగమనియు గ్రహింపవలెను. సాంఖ్య, కర్మనిష్ఠలయందలి తారతమ్యమిదియే. ఇట్లే పదమూడవ అధ్యాయమందలి **24**వ శ్లోకమున కేవలము ధ్యానసాధన ద్వారా పరమాత్మ ప్రాప్తి కలుగునని తెల్పబడినది. కాని అచ్చటను ధ్యానమును అభేదదృష్టితో చేసినచో అది సాంఖ్యనిష్ఠలో భాగమనియు, భేదదృష్టితో కావించినచో యోగ (కర్మ) నిష్ఠలో అంతర్భాగమనియు గ్రహింపనగును. భక్తి భగవత్ప్రాప్తికి ప్రధాన సాధనమేయని గీత ప్రతిపాదించు చున్నట్లు లోకులు విశ్వసించుట సరియైనదే. అన్ని సందర్భములలోను భక్తికే ఉన్నత స్థానమొసంగి, (పెద్దపీట వేసి) గీత అర్జునుని భక్తుడవు కావలసినదిగా ఆజ్ఞాపించెను. **(9/34, 12/8, 18/57, 65, 66)** కాని గీత రెండు నిష్ఠలనే ప్రతిపాదించినది. ఐతే భక్తి మాత్రము యోగ (కర్మ) నిష్ఠలోనే అంతర్భాగము. ఏలనన భక్తియందు ద్వైతభావము ఉండును. అట్లు భావించుటయే యుక్తి యుక్తమగును. భక్తి యోగ(కర్మ) నిష్ఠలో ఎట్లు అంతర్భాగమగునో ముమ్ముందు విశదమగును-అస్తు.

యోగ(కర్మ) నిష్ఠ ద్వారా పూర్తిగా సాధన చేసినచో తప్పకుండా భగవత్ప్రాప్తి కల్గియే తీరును. దానియందలి ఒక్కొక్క అంగమును సాధన చేసినను భగవత్ప్రాప్తి కలుగ గలదని తెలుపుటకే గీతయందు కేవలము భజనలు, పూజలు లేక ధ్యానముల ద్వారా పరమపదప్రాప్తి కలుగునని భగవంతుడు నుడివియుండెను. భగవంతుడు తాను జీవులకు భక్తి సులభుడై యుండుట నిజముగా అతని కృపావిశేషమే, వీరి భాగ్యమే.

ఇంతేగాక జ్ఞాన కర్మ శబ్దములు గీతయందు విభిన్నార్థములలో నిగూఢ రీతిలో ప్రయుక్తములైనవి. గీతలో కర్మ, కర్మయోగము, జ్ఞానము, జ్ఞానయోగము ఏకార్థకములు కావు. గీతననుసరించి, శాస్త్రవిహిత కర్మలను జ్ఞాననిష్ఠతోడను, యోగ(కర్మ) నిష్ఠతోడను ఆచరింపవచ్చును. జ్ఞాన నిష్ఠయందును కర్మలు నిషిద్ధములు కావు. యోగ(కర్మ) నిష్ఠయందయితే కర్మాచరణమే ముఖ్యసాధనము. (6/3). వానిని వ్యావహారికముగా (ఆచరణలో) త్యజించుట ప్రమాదకరము. (3/4). రెండవ అధ్యాయము నందలి 47వ శ్లోకమునుండి 51వ శ్లోకము వరకును, 3వ అధ్యాయమునందలి 19వ శ్లోకమునందును 4వ అధ్యాయమున 42వ శ్లోకమునందును యోగనిష్ఠ దృష్టితో కర్మలనాచరింపుమని భగవానుడు అర్జునుని ఆదేశించి యుండెను. 3వ అధ్యాయమునందలి 28వ శ్లోకమునను, 5వ అధ్యాయమునందలి 8,9,13 శ్లోకములయందును, సాంఖ్యము అనగా జ్ఞాననిష్ఠ దృష్టితో కర్మలను ఆచరింపుమని ఆజ్ఞాపించెను. సకామ కర్మాచరణమునకు ఏ నిష్ఠయందును స్థానములేదు. సకామ బుద్ధితో కర్మలను ఆచరించు వారిని భగవానుడు అల్పబుద్ధులుగా పేర్కొనెను. (2/42-44, 49, 7/20-23, 9/20-24).

జ్ఞానశబ్దముయొక్క అర్థము కూడ కేవలము 'జ్ఞాన యోగము' అనియే గాదు. వివిధ సాధనమార్గముల ఫలస్వరూపమునకును 'జ్ఞానము' అనియే అర్థము. అనగా అది జ్ఞాన, యోగ(కర్మ) నిష్ఠల రెండింటి ఫలస్వరూపమే. దానినే యథార్థజ్ఞానమనియు, తత్త్వజ్ఞానమనియు పేర్కొనుట జరిగినది. 4వ అధ్యాయమునందలి 24వ శ్లోకమునను, 25వ శ్లోకముయొక్క ఉత్తరార్థమునను జ్ఞాన యోగ వర్ణనము గలదు. ఈ 4వ అధ్యాయము నందే 36 నుండి 39వ శ్లోకము వరకు 'ఫలరూప జ్ఞానము' వర్ణింపబడినది. ఇదే విధముగ ఇతర సందర్భముల యందును ప్రసంగానుకూలముగా అర్థవిశేషములను గమనింపవలెను.

సాంఖ్య, యోగ(కర్మ) నిష్ఠల స్వరూపమేమి? ఈ రెండింటి మధ్య గల తారతమ్యమేమి? వాటి మధ్య ఎన్ని మరియు ఏయే అవాంతర భేదములు గలవు? ఈ రెండును స్వతంత్రములా? లేక పరస్పరసాపేక్షకములా? ఈ ఉభయ నిష్ఠలకును ఎవరెవరు అర్హులు? మొదలగు ఇట్టి విషయములను గూర్చి సంగ్రహముగా పరిశీలింతము.

## సాంఖ్య, యోగ(కర్మ) నిష్ఠల స్వరూపములు

1) సాంఖ్యనిష్ఠయనగా - జగత్తంతయును (సమస్త వస్తుజాలము) మృగతృష్ణ యందలి నీటి వలెను, స్వప్నము నందలి దృశ్యములవలెను మాయామయము కనుక మాయాకార్యరూపములైన గుణములే గుణముల యందు వర్తించును. ఈ విధముగా భావించి, శరీరేంద్రియ మనస్సులద్వారా ఆచరింపబడు సమస్త కర్మలయందును కర్తృత్వాభిమానము లేకుండుట (5/8,9). అట్లే సర్వవ్యాపి యైన సచ్చిదానందఘన పరమాత్మ స్వరూపమునందు ఏకీభావముతో నిత్యస్థితుడైయుండి, సచ్చిదానందఘన పరమాత్మయైన వాసుదేవుడు తప్ప అన్యమైనదేనియందును అస్తిత్వభావము లేకుండుట (13/30). దీనినే సాంఖ్యనిష్ఠ అందురు. జ్ఞానయోగము, కర్మసన్న్యాసము అనియు దీనికి పేర్లు గలవు.

2) యోగ (కర్మ) నిష్ఠయనగా - సమస్తమూ భగవంతునకు చెందినదే అని భావించి, సిద్ధి - అసిద్ధుల యెడ సమభావము ఉంచి, ఆసక్తి ఫలేచ్ఛలను త్యజించి, భగవదాజ్ఞానుసారము సమస్త కర్మలను ఆచరించుట (2/47-51) మరియు భక్తి శ్రద్ధలతో మనోవాక్కాయములతో సర్వవిధముల భగవంతుని శరణుజొచ్చి, నామ, గుణ, ప్రభావ సహితముగ భగవత్స్వరూపమును నిరంతరము చింతన చేయుట (6/47). దీనినే భగవానుడు

సమత్వయోగము, బుద్ధి యోగము, తదర్థకర్మము, మదర్థకర్మము, సాత్త్విక త్యాగము మున్నగు పేర్లతో వ్యవహరించెను.

యోగనిష్ఠయందు సామాన్య రూపముననైనను, విశిష్ట రూపమున గాని భక్తి తప్పక యుండును. గీతాప్రతిపాదితమైన యోగనిష్ఠ ఏవిధముగను భక్తిరహితముగాదు. భక్తిని, లేక భగవంతుని గూర్చి స్పష్టముగా ప్రస్తావింపబడనిచోట్ల గూడ (2/47-51) భగవదాజ్ఞాపాలనము తప్పక ఉండును. ఈ దృష్టితో అచట గూడ భక్తి సంబంధమున్నట్లు తెలియునగును.

జ్ఞాననిష్ఠ సాధనకై భగవానుడు ఎన్నియో మార్గములను చూపెను. వాటి అన్నింటి ఫలము సచ్చిదానందఘన పరమాత్మప్రాప్తియే. జ్ఞానయోగమునందు అవాంతర భేదములెన్నియున్నను వాటిని ముఖ్యముగా నాలుగు విభాగములు చేయవచ్చును.

(1) ఉన్నదంతయూ బ్రహ్మమే. (2) గోచరమగు సమస్త దృశ్య ప్రపంచమూ మాయామయము (మిథ్య). వాస్తవముగా సచ్చిదానందఘన పరబ్రహ్మకు తప్ప మరిదేనికిని అస్తిత్వము లేదు. (3) గోచరమగునది అంతయు నా స్వరూపమే. అనగానేనే (4) గోచరమగునది అంతయును మాయామయము, అనిత్యము. వాస్తవముగా లేనేలేదు. కేవలము నిత్య చేతనమైన ఆత్మను నేను.

ఈ నాల్గు (4) విభాగములలో మొదటి రెండును 'తత్ త్వంఅసి' (తత్త్వమసి) అను మహావాక్యమునందలి 'తత్' అను పదమునకు సంబంధించినవి. తరువాతి రెండును 'త్వం' అను పదమునకు సంబంధించినవి. వీటి స్పష్టీకరణము ఈ క్రింది విధముగా చేయబడుచున్నది.

(1) ఈ చరాచర జగత్తునందు గోచరించునది అంతయును పరబ్రహ్మమే. సచ్చిదానందఘన పరమాత్మకు భిన్నమైన వస్తువేదియును లేదు. కర్మయు, కర్మసాధనమార్గములును, ఉపకరణములును, స్వయముగా కర్తయు అన్నియును బ్రహ్మమే - (4/24) సముద్రమునందలి మంచుగడ్డలు లోపల, బయట కూడ నీటితో నిండియుండును. అవి సహజముగా (వస్తుతః) జలరూపములే. అట్లే సమస్తచరాచర భూతముల లోపల, బయట కూడ పరమాత్మ యొక్కడే పరిపూర్ణముగా నిండియున్నాడు. అట్లే సమస్త ప్రాణుల రూపములలో గూడ అతడే ఉన్నాడు (13/15).

2) గోచరించు దృశ్యవర్గమంతయును మాయామయము, క్షణికము, నశ్వరము అని భావింపవలెను. అనిత్యములైన వీటన్నింటిని నిరాకరించి, వీటికి అధిష్ఠానము సచ్చిదానంద ఘనపరమాత్మయే యని తెలిసికొనవలెను. అట్లు తెలిసికొని, మనస్సును, బుద్ధిని కూడ బ్రహ్మమునందు తద్రూపమొనర్చి పరమాత్మయందు ఏకీభావస్థితుడై సాధకుడు అతని అపరోక్షజ్ఞానము ద్వారా అభేదస్థితిని పొందవలెను (5/17).

3) చరాచరములన్నియును బ్రహ్మస్వరూపమే. ఆ బ్రహ్మమును నేనే. కనుక అన్నియు నా రూపములేయని భావించి, చరాచరప్రాణులన్నియు తన ఆత్మయేయని యెఱుంగవలయును. ఈ విధముగ సాధన చేయువాని దృష్టిలో పరబ్రహ్మమునకు తప్ప మరిదేనికిని అస్తిత్వమే ఉండదు. అతడు ఆ విజ్ఞానానంద ఘన స్వరూపము నందే ఆనందమును అనుభవించును. (5/24, 6/27, 18/54)

4) ఈ మాయామయమైన దృశ్యవర్గమంతయును త్రిగుణముల కార్యరూపమే. దీనిని, దీని ద్వారా జరుగు క్రియలను తనకంటె (ఆత్మకంటె) వేఱనియు, నశ్వరమనియు, అనిత్యమనియు తెలిసికొనవలెను. వీటన్నింటిని విస్మరించి, కేవలము నిత్యసత్యమైన ఆత్మనే అనుభవింపవలెను. (13/27,34)

ఇట్టి ఈ స్థితిని పొందుటకు భగవంతుడు గీతయందు ఆత్మ ద్రష్ట, సాక్షి, చేతనము, నిత్యము అనియు, గోచరించు దేహాది జడ, దృశ్య వర్గమంతయును అనిత్యమగుటచే 'అసత్' అనియు, కేవలము ఆత్మయే 'సత్' అనియు, పెక్కుచోట్ల అనేక రీతులలో సాధకునకు వివరించెను. ఈ విషయమునే పరిపుష్ట మొనర్చుటకు భగవానుడు 2వ అధ్యాయమునందు 11 నుండి 30వ శ్లోకము వరకు ఆత్మ స్వరూపమును నిత్యము, శుద్ధము, బుద్ధము, నిరాకారము, నిర్వికారము, అక్రియము, గుణాతీతము అని వర్ణించెను. అభేదరూప సాధన చేయు

పురుషుడు ఆత్మ స్వరూపమును ఈ విధముగా తెలిసికొని, సాధన చేయుటవలన ఆత్మ సాక్షాత్కారమగును. గుణములు గుణములయందు ప్రవర్తించుట వలననే క్రియలు జరుగుచున్నవి. ఆత్మకు వాటితో ఎట్టి సంబంధమూ లేదు (5/8,9; 14/19) అది చేయునదియూగాదు, చేయించునదియూ గాదు అని భావించి, నిత్యమూ, నిరంతరమూ తనకుతానుగా అత్యంత ఆనందమును అనుభవించును. (5/13).

పైన తెలుపబడిన నాలుగు జ్ఞానయోగ సాధనలలో మొదటి రెండును బ్రహ్మోపాసనకు సంబంధించినవి. మూడు, నాలుగు సాధనల యందు సాధకుడు అహంగ్రహ-ఉపాసనకు అనగా "అహం బ్రహ్మాస్మి" అను అభేద భావనతో ఉపాసన చేయుటకు సంబంధించినవి. పై నాలుగు సాధనలును వ్యుత్థానావస్థయందు చేయదగినవియా? లేక ధ్యానావస్థయందు చేయదగినవియా? లేక రెండింటియందా? అను ప్రశ్నలు ఉదయించును. నాల్గవ (సాధన) ప్రక్రియ అంతిమదశయందు ఆచరింపదగినదని 5వ అధ్యాయమునందలి 9వ శ్లోకమున తెల్పబడినది. ఇది కేవలము వ్యవహార కాలమునందే చేయదగినది. రెండవ సాధనాప్రక్రియ ఆరంభమునందు 5వ అధ్యాయమునందలి 17వ శ్లోకమును అనుసరించి, ధ్యానకాలమునందే చేయదగును. మిగిలిన రెండును (1,3) రెండు స్థితులయందును చేయవచ్చును.

మొదటి సాధన యందు 'వాసుదేవః సర్వమితి' అనగా గోచరించునదంతయు వాసుదేవుని స్వరూపమే (7/19) అనియు, 'సర్వభూత స్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః' - సమస్త భూతముల (ప్రాణుల) యందు ఆత్మరూపుడనై ఏకీభావముతో నున్న సచ్చిదానందఘన వాసుదేవుడనైన నన్నే సేవించు పురుషుడు (6/31) అనియు ఏల ఉల్లేఖింపబడలేదు? అను ప్రశ్న తలయెత్తవచ్చును. ఈ రెండు శ్లోకములును భక్తికి సంబంధించినవి. మరియు ఈ రెండింటియందును పరమాత్మను పొందిన పురుషుని వర్ణనము గలదు. కావున ఈ సందర్భమున అవి ప్రస్తావింపబడలేదు. కాని జ్ఞాన మార్గ విషయమున వీటిని అనుసరించి, సాధన చేసినను ఎట్టి హానియులేదు.

సాంఖ్య నిష్ఠయందు నాల్గు విభాగములు ఉన్నట్లే యోగనిష్ఠ యందును ముఖ్యముగా మూడు భేదములు గలవు.

1. కర్మప్రధాన కర్మయోగము
2. భక్తి మిశ్రిత కర్మయోగము
3. భక్తిప్రధాన కర్మయోగము

**1. కర్మప్రధాన కర్మయోగము** - సమస్త కర్మల యందును సాంసారిక (ప్రాపంచిక) పదార్థముల యందు ఫలాసక్తులను సర్వథా త్యజించి, విధ్యుక్తము లైన వర్ణాశ్రమ కర్మలను ఆచరించుటయే 'కర్మప్రధాన కర్మయోగము'. ఈ ఉపదేశ సందర్భమున భగవానుడు అక్కడక్కడ కేవలము ఫలమును త్యజింపుమని తెలిపెను. (5/12; 6/1; 12/11; 18/11) మరికొన్నిచోట్ల కేవలము ఆసక్తిని త్యజింపుమని పల్కెను (3/19; 6/4). మరికొన్ని తావులయందు ఫలాసక్తులను రెండింటిని వీడవలెనని తెలిపెను (2/47, 48, 18/6,9) కేవలము ఫలత్యాగమును గూర్చి తెల్పిన సందర్భముల యందు ఆసక్తి, త్యాగముకూడ అందు చేరియున్నట్లు గ్రహింపవలెను. అట్లే ఆసక్తి, త్యాగ ప్రస్తావనలో ఫలత్యాగముగూడ అందు గర్భితమైయున్నట్లు భావింపవలెను. ఫలాసక్తులను రెండింటిని త్యజించినప్పుడే వాస్తవముగా కర్మయోగసాధన సంపూర్ణమగును.

**2. భక్తిమిశ్రిత కర్మయోగము** - సమస్త జగత్తును పరమేశ్వరుడే వ్యాపించియున్నట్లు ఎరింగి తమతమ వర్ణాశ్రమోచిత కర్మల ద్వారా భగవంతుని సేవించుటయే 'భక్తిమిశ్రిత కర్మయోగము' అనబడును. (18/46)

**3. భక్తిప్రధాన కర్మయోగము** - దీనియందు ప్రధానముగా రెండు అవాంతర భేదములు గలవు.

(క) భగవదర్పణ కర్మ, (ఖ) భగవదర్థ కర్మ.

భగవదర్పణ కర్మము గూడ రెండు విధములుగా చేయవచ్చును. సమస్త కర్మలయందు మమతాసక్తులను, ఫలేచ్ఛను త్యజించి, "ఇది యంతయు భగవంతునిదే. నేనును భగవంతుని వాడనే. నా ద్వారా జరుగు కర్మలు గూడ భగవంతునివే. భగవంతుడే అన్ని కర్మలను నాచే చేయించుచున్నాడు. అందు నేనొక ఆటబొమ్మను మాత్రమే." అని భావించి, భగవదాజ్ఞానుసారము భగవంతుని ప్రసన్నునిగా జేసికొనుటకై శాస్త్ర విహిత కర్మలను ఆచరించుటయే 'పూర్ణభగవదర్పణ కర్మ' యగును. (3/30; 12/6; 18/57, 66).

మొట్టమొదట వేరొక లక్ష్యముతో కర్మను ఆచరించినను

తరువాత దానిని భగవదర్పణ కావించుట, కర్మలను ఆచరించుచు మధ్యలోనే ఆ కర్మఫలాదులను భగవంతునకర్పించుట, కర్మాచరణము ముగియగనే భగవదర్పణము గావించుట, లేక కర్మఫలములను మాత్రమే భగవంతునకు అర్పించుట- ఇదియును భగవదర్పణ పద్ధతియే. భగవదర్పణ కర్మకు ఇది మొదటి మెట్టు. ఇట్లు చేయగా చేయగా పైన పేర్కొనబడిన పూర్ణభగవదర్పణ కర్మసిద్ధించును.

భగవదర్థకర్మయు రెండు విధములు -

1) భగవత్ప్రాప్తికై, భగవదనుగ్రహమునకై, భగవంతుని ప్రసన్నునిగా చేసికొనుటకై శాస్త్రవిహిత కర్మలను ఆచరించుట్లు

2) భగవద్విగ్రహాదులను ఆరాధించుట, భజన ధ్యాన, ఉపాసనాది కర్మలను భగవన్నిమిత్తమై చేయుట, మరియు భగవత్సంబంధమైన కార్యములను ఆచరించుట.

ఈ రెండును భగవదర్థకర్మలలో అంతర్గతములు. ఈ రెండును మత్కర్మ, మదర్థకర్మ అను పేర్లతో గీతయందు వ్యవహరింపబడినవి. (11/55; 12/10). అనన్య భక్తి, భక్తియోగము, (8/14,22; 9/13,14,22,30, 34; 10/9; 13/10; 14/26). అనునవియును భగవదర్పణ, భగదర్థకర్మల యందే సమ్మిళితములు. వీటన్నింటి ఫలము భగవత్ప్రాప్తియే -

భగవత్ప్రాప్తిని గూర్చుటకు యోగనిష్ఠ స్వతంత్రసాధనమా? లేక జ్ఞాననిష్ఠయొక్క అంగమా? అనునది ప్రశ్న - యోగనిష్ఠ మోక్షప్రాప్తికి (భగవత్ప్రాప్తికి) స్వతంత్ర సాధనము. మరియు జ్ఞాననిష్ఠకు సహాయకముగూడ. సాధకుడు తన అభిరుచిని అనుసరించి, జ్ఞాననిష్ఠను ఆశ్రయింపకయే నేరుగా కర్మయోగము ద్వారా పరమసిద్ధిని పొందవచ్చును. లేక కర్మయోగము ద్వారా జ్ఞాననిష్ఠను పొంది దాని ద్వారా పరమాత్మప్రాప్తి నందవచ్చును. ఈ రెండు మార్గములలో దేనిని ఆశ్రయించుట యనునది సాధకుని అభిరుచిపై ఆధారపడి యుండును. యోగనిష్ఠ స్వతంత్ర సాధనమని భగవానుడే స్పష్టపరచియుండెను. (5/4,5; 13/24). చిత్తమును భగవంతునియందే లగ్నమొనర్చి, ఆయనను ఉద్దేశించియే (తత్ప్రాప్తి కొరకై) కర్మలు చేయువానికి దైవకృప వలన భగవత్ప్రాప్తి కలుగును - అని ఆయనయే పలు సందర్భములలో నుడివియుండెను. (8/7 11/54, 55; 12/6-8).

అదే విధముగ నిష్కామకర్మ, ఉపాసన రెండును జ్ఞాన నిష్ఠయొక్క అంగములు కూడ కావచ్చును. (5/6; 14/26). కాని జ్ఞాన యోగమునందు అభేదోపాసన ఉండుట వలన జ్ఞాన నిష్ఠ భేదోపాసన రూప భక్తియోగమునకు అనగా యోగనిష్ఠకు అంగము కానేరదు. ఏదో ఒక జ్ఞాన నిష్ఠసాధకుడు తన సాధన కొనసాగించుచు అభిరుచి, లేక అభిప్రాయము మారుట వలన జ్ఞాన నిష్ఠను వదలి యోగ (కర్మ) నిష్ఠను అవలంబింపవచ్చును. అనంతరము అతనికి యోగనిష్ఠ ద్వారానే భగవత్ప్రాప్తి కలుగుటయు సంభవమే.

కర్మయోగ సాధన చేసిన పిదప సాంఖ్యయోగ సాధన ద్వారా సచ్చిదానందఘన పరమాత్మను పొందు సాధనకు ప్రణాళిక ఏవిధముగా నుండునో తెలుపుటకు త్యాగమను పేర ఏడు(7) శ్రేణులుగా విభజించి, వివరింపబడినది.

## సప్తసోపానములు

### 1. నిషిద్ధ కర్మలను పూర్తిగా త్యజించుట

దొంగతనము, వ్యభిచారము, అసత్యములాడుట, కపటము, మోసము, దుర్మార్గముగా బలవంతపెట్టుట, హింస, అభక్ష్యభక్షణము మరియు ప్రమాదాది శాస్త్ర నిషిద్ధ నీచకర్మలను మనోవాక్కాయముల ద్వారా ఏ విధముగను ఆచరింపకుండుట త్యాగము నందు మొదటి మెట్టు.

### 2. కామ్య కర్మలను త్యజించుట

స్త్రీపుత్ర ధనాది ప్రియవస్తు ప్రాప్తికై, అట్లే రోగ సంకటాది నివృత్తికై చేయబడు యజ్ఞదానతపస్సులు, ఉపాసన మొదలగు సకామకర్మలను తమ స్వార్థము కొరకై చేయకుండుట - త్యాగమునకు రెండవ మెట్టు.

ఏదైనా లౌకిక కర్మను గాని, శాస్త్రీయ కర్మను గాని అప్రయత్నముగ చేయవలసి వచ్చినచో అది సకామమైన దనుకారణమున దానిని ఆచరింపకున్నచో ఎవరికైనను క్లేశము సంభవింపవచ్చును. లేదా కర్మ - ఉపాసనా పరంపరకు ఏదైనను విఘాతము కలుగవచ్చును. కనుక దానిని స్వార్థబుద్ధితో గాక లోకహితార్థమై చేయుటయే యుక్తము. అప్పుడది సకామకర్మ అనబడదు.

### 3. తృష్ణను సర్వథా త్యజించుట

కీర్తి ప్రతిష్ఠలు, గౌరవాదరములు, అట్లే ప్రారబ్ధానుసారము లభించిన స్త్రీపుత్రధనాదులైన అనిత్య పదార్థములను

వృద్ధిచేయు కోరిక భగవత్ప్రాప్తికి ఆటంకమును గూర్చునని భావించి, దానిని త్యజించుట మూడవ మెట్టు.

### 4. తమ స్వార్థమునకై ఇతరులచే సేవలు చేయించుకొనుటను త్యజించుట

తమ సుఖలాభములకై యాచించిగాని, అయాచితముగ గాని ప్రాప్తించిన ధనాది పదార్థములను, సేవలను స్వీకరించుట, అట్లే ఏదోయొక విధముగా తమ స్వప్రయోజనములకై ఇతరులను ఉపయోగించుకొను కోరికను కలిగియుండుట మొదలగునవి అన్నియును స్వార్థచింతనతో ఇతరులనుండి సేవలను పొందుటయగును. వీటిని త్యజించుటయే త్యాగము యొక్క నాల్గవ మెట్టు.

తమ యోగ్యతను అనుసరించి, ఇతరులనుండి శరీర సంబంధములైన సేవలను గాని, భోజనాదికములను గాని స్వీకరింపకుండుట వలన ఇతరులకు కష్టము అనిపించినను, లేక సామాజిక శ్రేయస్సునకు ఏ విధముగనైనను హాని కలిగినను అట్టి సందర్భములయందు వారి తృప్తి కొరకై సేవాదికములను స్వీకరించుట దోషము గాదు. ఏలనన భార్యాపుత్రులు, సేవకులు మొదలగు వారు చేయు సేవలను, బంధువులు, మిత్రులు మొదలగు వారు చేయు సేవలను, బంధువులు, మిత్రులు మొదలగువారి ద్వారా లభించు భోజనాది పదార్థములను స్వీకరింపకుండుటచే వారికి మనః క్లేశము కల్గును. అట్లే లోక మర్యాదకు ఆటంకము కలుగును.

### 5. కర్తవ్యకర్మలన్నింటియందును అలసత్వమును, ఫలేచ్ఛను సర్వథా త్యజించుట

దైవభక్తి, దేవతారాధన, మాతాపిత్రాది గురుజనుల సేవలు, యజ్ఞదాన తపస్సులు, వర్ణాశ్రమ ధర్మానుసారము జీవితమునకును, శరీర నిర్వహణమునకును అవసరమగు అన్నపానాదుల సముపార్జనము మొదలగు కర్తవ్య కర్మలన్నింటి యందును అలసత్వమును వివిధములగు ఫలేచ్ఛలను త్యజించుట - ఇదియే త్యాగము యొక్క ఐదవ మెట్టు.

### 6. ప్రాపంచిక పదార్థములన్నింటియందును, కర్మల యందును మమతాసక్తులను సర్వథా త్యజించుట

ధన కనక వస్తువాహనములు, గృహాదులు, స్త్రీ పుత్రమిత్రాది బంధుజనులు, కీర్తిప్రతిష్ఠలు మొదలగు ఇహపరలోక విషయ భోగరూప పదార్థములన్నియును క్షణభంగురములు, నశ్వరములు. కనుక వాటిని అనిత్యములని యెఱింగి, వాటియందలి మమతాసక్తులను త్యజింపవలెను. కేవలము నిత్యుడైన పరమాత్మయందే అనన్యభక్తి భావములు గలిగి, మనోవాక్కాయముల ద్వారా జరుగు క్రియలయందు మమతాసక్తులను వీడుట - ఇదియే త్యాగముయొక్క ఆఱవ మెట్టు.

ఈ ఆఱవ మెట్టును చేరిన పురుషులకు ప్రాపంచిక పదార్థములన్నింటి యందును వైరాగ్యమేర్పడును గాన కేవలము పరమప్రేమ స్వరూపుడగు భగవంతుని యందే అనన్య భక్తి కలుగును. కనుక భగవంతుని గుణప్రభావ రహస్యములతో నిండిన నిర్మల భక్తి కథలను వినుట, వినిపించుట, మననము చేయుట, అట్లే ఏకాంతప్రదేశమున నిరంతరము దైవ భజన, ధ్యాన, శాస్త్రచర్చలను చేయుటయే వారికి ప్రీతి కల్గించును. విషయాసక్తులైన మనుష్యుల మధ్య హాస్య విలాస ప్రమాద నిందా విషయభోగములకు సంబంధించిన వ్యర్థ సంభాషణములతో కాలయాపన చేయుటకు వారు ఇచ్ఛగింపరు. వారి ద్వారా జరుగు కర్తవ్య కర్మలన్నియును భగవత్స్వరూప నామ మననములతో ఫలాసక్తి రహితముగా కేవలము భగవదర్థముగా జరుగుచుండును. ఇది కర్మయోగ సాధన. ఈ సాధనను కొనసాగించుచునే సాధకుడు భగవత్కృపచే పరమాత్మ స్వరూప తత్త్వమును తెలిసికొని, శాశ్వతమగు పరమపదమును పొందును (18/56).

సాంఖ్యయోగము ద్వారా పరమాత్మను పొందగోరువాడు పైన తెలుపబడిన సాధనలను చేసిన యనంతరము 7వ మెట్టు ననుసరించి సాంఖ్యయోగ సాధన చేయవలెను.

### 7. ప్రాపంచిక, శారీరిక కర్మలన్నింటి యందును, సూక్ష్మవాసనలను, అహంభావమును సర్వథా త్యజించుట

ప్రాపంచిక పదార్థములన్నియును మాయా కార్యములగుట వలన సర్వథా అనిత్యములు. సచ్చిదానంద ఘనపరమాత్ముడు ఒక్కడే సర్వత్ర సమభావముతో పరిపూర్ణుడు, నిత్యుడు - అని భావించి దృఢ నిశ్చయముతో శరీరమునందును, ప్రాపంచిక వస్తువులన్నింటి యందును, కర్మలయందును, సూక్ష్మ వాసనలను సైతము సర్వథా త్యజించుట - అనగా అంతఃకరణమునందు వాటి రూపరేఖలేమాత్రము లేకుండ జేయుట - శరీరమునందు అహంభావము

(దేహాభిమానము)ను సర్వథా త్యజించుట, మనోవాక్కాయ కర్మలన్నింటి యందును కర్తృత్వాభిమానము లేశమాత్రమును లేకుండుట - ఈ విధముగా శరీర సహిత సమస్త పదార్థములయందును, కర్మలయందును వాసన, అహంభావము, పూర్తిగా విడనాడి, సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపమునందే ఏకీభావముతో నిత్యమూ నిరంతరమూ దృఢస్థితిని కల్గియుండుట - త్యాగము యొక్క ఏడవ మెట్టు.

ఈ విధముగా సాధన చేయు సాధకునకు తత్‌క్షణమే సచ్చిదానంద ఘనపరమాత్మప్రాప్తి సులభముగా కలుగును (6/28). కాని పైన పేర్కొనబడిన విధముగా కర్మయోగ సాధన చేయక ఆరంభము నుండియే సాంఖ్యయోగ సాధన చేయు పురుషునకు పరమాత్మప్రాప్తి కష్టసాధ్యమగును.

**సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తుమయోగతః ।**

*(5/6)*

ఏ సాధకుడైనను ఒకే సమయమున రెండు నిష్ఠలను అనుసరించి సాధన చేయుటకు, వీలుగలదా? లేదా? లేనిచో అందులకు కారణమేమి?

సాంఖ్యయోగ, కర్మయోగ సాధనలను ఒకే కాలమునందు ఒకే సాధకుడు ఆచరించుటకు వీలుపడదు. ఏలనన కర్మయోగి సాధన కాలమునందు కర్మలను, కర్మఫలములను, పరమాత్మను, తనను వేర్వేరుగా భావించి, కర్మఫలాసక్తులను త్యజించి, ఈశ్వరార్థము ఈశ్వరార్పణబుద్ధితో సమస్త కర్మలను ఆచరించును. (3/30; 5/10; 11/55 12/10 18/56, 57).

సాంఖ్యయోగి మాయద్వారా ఉత్పన్నములగు గుణములే గుణముల యందు వర్తించుచున్నవనియు, ఇంద్రియములే ఇంద్రియార్థములయందు వర్తించుచున్నవనియు గ్రహించి, శరీరేంద్రియ మనస్సుల ద్వారా జరుగు క్రియలన్నింటి యందును, కర్తృత్వాభిమాన రహితుడై, సర్వవ్యాపియైన సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపమునందు మాత్రమే అభిన్న భావముతో స్థితుడైయుండును. (3/28; 5/13; 13/29; 14/19-20 18/49-55).

కర్మయోగి తనను కర్మలకు కర్తనుగా భావించును. (5/11) సాంఖ్యయోగి అట్లు భావింపడు (5/8,9). కర్మయోగి తన కర్మలను భగవదర్పణము చేయును. (9/27,28). సాంఖ్యయోగి మనస్సు, ఇంద్రియముల ద్వారా జరుగు అహంభావ రహిత క్రియలను కర్మలుగనే భావింపడు (18/17). కర్మయోగి పరమాత్మను తనకంటె వేరుగా భావించును. (12/10) సాంఖ్యయోగి సదా అభేద భావముతో నుండును (18/20). కర్మయోగి ప్రకృతి మరియు ప్రకృతిజన్య పదార్థముల యొక్క అస్తిత్వమును స్వీకరించును (18/61). సాంఖ్యయోగి పరబ్రహ్మమును తప్ప మరిదేని అస్తిత్వమునూ విశ్వసింపడు. (13/30). కర్మయోగి కర్మఫలములను, కర్మల ఉనికిని నమ్మును. సాంఖ్యయోగి పరబ్రహ్మను తప్పవేరుగా కర్మలను గాని, కర్మఫలములను గాని విశ్వసింపడు. వాటితో తనకు ఎట్టి సంబంధము ఉన్నట్లును భావింపడు. ఈ విధముగా ఈ రెండు సాధన ప్రక్రియల విషయమునను, వాటిని విశ్వసించు విషయమునను తూర్పు పడమరలకు ఉన్నంత భేదము గలదు. ఇట్టి పరిస్థితులలో రెండు నిష్ఠల సాధనను ఒకే వ్యక్తి ఒకే సమయమున ఆచరించుట కుదరదు. ఏ వ్యక్తియైనను భారతదేశమునుండి అమెరికాలో న్యూయార్కు నగరమునకు వెళ్లదలచినచో తూర్పుదిశగా సూటిగా ముందుకు సాగినను న్యూయార్కు చేరగలడు. అట్లే పశ్చిమదిశగా నేరుగా వెళ్ళినను న్యూయార్కు చేరగలడు. ఆదే విధముగా సాంఖ్యయోగ కర్మయోగముల సాధన ప్రక్రియల యందు పరస్పర భేదములుఉన్నప్పటికిని సాధకుడు ఏ ఒక్క సాధనయందైనను దృఢముగా తత్పరుడై సాధన చేసినచో రెండింటికిని పరమలక్ష్యమైన పరమాత్మప్రాప్తిని శీఘ్రముగా సాధింపగలడు (5/4).

## అర్హులు

గీతాప్రతిపాదితమైన సాంఖ్యయోగ కర్మయోగములను ఆచరించుటకు అర్హులెవరు? అను ప్రశ్న తలయెత్తును. అన్ని వర్ణములవారును, బ్రహ్మచర్యాది చతురాశ్రమముల వారును, అన్ని జాతులవారును, వీటిని ఆచరింపదగునా? లేక ఏదైనా ప్రత్యేక వర్ణము వారు మాత్రమే గాని, ప్రత్యేక ఆశ్రమమునకు చెందినవారు మాత్రమే గాని, లేక ప్రత్యేక జాతికి చెందినవారు మాత్రమే గాని వీటిని ఆచరించుటకు అర్హులా?

గీతా నిరూపితమైన ఈ సాధన ప్రక్రియలు ఋషిప్రోక్తములై, భారతీయ సంస్కృతికి సంబంధించినవే అయినప్పటికిని, గీతోపదేశములను నిశితముగా పరిశీలించి చూచినచో అందు తెల్పబడిన సాధన విధానములను అనుసరించి, వాటిని ఆచరించుటకు మానవులందరికిని

అధికారము గలదు. (ఇది కేవలము భారతీయులకు మాత్రమే పరిమితమైనది కాదు). జగద్గురువైన శ్రీకృష్ణ భగవానుడు మానవులందరును తరించుటకై (లోకోద్ధరణమునకై) ఈ ఉపదేశములను కావించెను. ఇది ఏ ఒక్క వర్ణము వారికి మాత్రమే గాని, ఏ ఒక్క ఆశ్రమము వారికి మాత్రమే గాని ప్రత్యేకముగా ఉద్దేశించి చేయబడినది కాదు. ఇదియే గీతయొక్క వైశిష్ట్యము. భగవానుడు - తన ఉపదేశములయందు అచ్చటచ్చట 'మానవః' 'నరః' 'దేహభృత్' 'దేహీ' మొదలగు పదములను ప్రయోగించుట ద్వారా ఈ విషయమునే (ఇది సర్వమానవాళికిని ఉద్దేశింపబడినదని) స్పష్టపరచెను. సాంఖ్యయోగమును ముఖ్య సాధనమార్గముగా తెల్పిన సందర్భమున భగవానుడు 'దేహీ' అను పదమును ఉపయోగించి, మనుష్యమాత్రుడు దీనికి అర్హుడని తెలిపెను. (5/13). అట్లే మానవులు తమతమ శాస్త్ర విహిత కర్మల ద్వారా సర్వవ్యాపియైన పరమేశ్వరుని సేవించి, సిద్ధిని పొందగలరని విస్పష్టమొనర్చెను. (18/46). అట్లే స్త్రీలు, శూద్రులు, పాపజన్ములును భక్తి మార్గమును అనుసరించుటకు అర్హులే యని తెలిపెను. (9/32) మరియును ఏ సాధన మార్గమును ఉపదేశించిన సందర్భమునందైనను ఆ సాధనను ఆచరించుటకు ప్రత్యేకముగా ఈ వర్ణము వారే, ఈ ఆశ్రమము వారే, ఈ జాతికి చెందినవారే అర్హులు, ఇతరులు కారు, అని భగవానుడు తెలుపలేదు.

ఐనప్పటికిని అన్ని కర్మలును మనుష్యులందరికిని ఉపయుక్తములు కావను విషయమును విస్మరింపరాదు. అందువలన భగవానుడు వర్ణాశ్రమధర్మములను గూర్చి నొక్కి చెప్పెను. ఆయా వర్ణముల వారికి విహితములైన కర్మలు వారికి మాత్రమే కర్తవ్యములు, ఇతర వర్ణముల వారికి కావు. ఈ విషయమును దృష్టియందుంచుకొనియే కర్మలను ఆచరింపవలెను. వర్ణాశ్రమ ధర్మములకు విహితములైన కర్తవ్య కర్మలను తమతమ అర్హతలను అభిరుచులను అనుసరించి, మనుష్య మాత్రులే చేయుగలరు. వర్ణాశ్రమ ధర్మములతోపాటు మానవమాత్రుల కందరికిని ఆచరణీయములైన సదాచారము, భక్తి మొదలగు సాధనలను అందరును అనుసరింపవచ్చును.

సాంఖ్యయోగ సాధనకు సన్న్యాసులు మాత్రమే అర్హులనియు, ఇతరాశ్రమవాసులు కారనియు కొందరు భావింతురు. ఈ భావన యుక్తి యుక్తముగా కన్పింపదు. సాంఖ్యయోగ దృష్టితోడను యుద్ధము చేయుటకు భగవానుడు ఆజ్ఞాపించెను. (2/18). కేవలము సన్న్యాసులే సాంఖ్యయోగమునకు అర్హులని భావించియున్నచో యుద్ధమునకు అర్జునుని పురికొల్పి యుండెడివాడు కాదు. ఏలనన సన్న్యాసాశ్రమమునందు కర్మత్యాగము చెప్పబడియున్నది. ఇక ఘోరకర్మయైన యుద్ధ విషయమున చెప్పనేల? పైగా అర్జునుడు సన్న్యాసియు కాడు. భగవానుడతనిని జ్ఞానుల కడకేగి, జ్ఞానమునార్జింపుమని తెల్పియుండెను. (4/34).

ఇంతేగాక 3వ అధ్యాయమునందలి 4వ శ్లోకము కేవలము కర్మలను ఆచరణాత్మకముగా త్యజించుటచే సాంఖ్యయోగ సిద్ధికలుగదని చెప్పెను. సాంఖ్యయోగమునకు కేవలము సన్న్యాసులే అర్హులని భావించినచో సాంఖ్యయోగసాధనకై కర్మాచరణమును త్యజించుట అవసరమని భగవానుడు తెల్పియుండెడి వాడు. కర్మాచరణమును త్యజించినంత మాత్రమున సాంఖ్యయోగసిద్ధి కలుగదని చెప్పియుండెడి వాడుకాడు. 13వ అధ్యాయము నందు 7 నుండి 11వ శ్లోకము వరకు జ్ఞాన సాధనను గూర్చి తెల్పుచు స్త్రీ పుత్రధన గృహాదుల యందు మమతాసక్తులను త్యజించుట అవసరమని తెల్పెను.

"అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు"

స్త్రీపుత్ర ధన గృహాదులతో లౌకికముగ (వ్యావహారికముగ) సంబంధము ఉన్నప్పుడే వాటియెడ మమతాసక్తుల త్యాగప్రస్తావనకు అవకాశముండును. సన్న్యాసాశ్రమము నందు వీటిని లౌకికముగనే త్యజించుట కలదు. అట్టి స్థితిలో సన్న్యాసులు మాత్రమే జ్ఞాన యోగసాధనకు అర్హులైనచో వీటన్నిటియెడ వారు మమతాసక్తులను త్యజింపవలెనను నిషేధము విధింపనవసరమే లేదు.

మరొక విషయము - 18వ అధ్యాయమున అర్జునుడు ప్రత్యేకముగా సన్న్యాసమును, త్యాగమును గూర్చి ప్రశ్నించినప్పుడు సన్న్యాసమునకు మారుగా సాంఖ్యయోగమునే వర్ణించెను (13-40) ఎచ్చటను సన్న్యాసాశ్రమమును గూర్చి ఉల్లేఖించుట జరుగలేదు. భగవానుడు సన్న్యాసము అను పదమునకు సన్న్యాసాశ్రమము అను అర్థమును భావించియున్నచో లేక సాంఖ్యయోగమునకు అర్హులు సన్న్యాసులే అని తలంచి యున్నను ఈ సందర్భమున స్పష్టముగా పేర్కొని యుండెడివాడు. కనుక సాంఖ్యయోగమునకు సన్న్యాసులును, గృహస్థులును

సమానముగా అర్హులే అను విషయము స్పష్టమగుచున్నది. అయితే సాంఖ్యయోగ సాధనకు సన్న్యాసాశ్రమము మిక్కిలి అనుకూలమైనదనుట పరమసత్యము. ఈ దృష్టితో చూచినచో సన్న్యాసాశ్రమము గృహస్థాశ్రమము కంటెను సాంఖ్యయోగ సాధనకు ఎంతేని ఉపయోగకరమని చెప్పవచ్చును.

కర్మయోగసాధనకు కర్మయే ముఖ్యము. వర్ణధర్మములకు అనుగుణముగ విహిత కర్మాచరణమునకే విశేషముగా ప్రాముఖ్యము ఇయ్యబడినది. (3/8, 18/45,46). కర్మాచరణమును త్యజించుట కర్మయోగమునందు బాధకమని తెల్పబడినది. (3/4). కావున సన్న్యాసాశ్రమమునందు కర్మ ప్రధాన కర్మయోగాచరణమునకు వీలుకాదు. ఏలనన అచ్చట (సన్న్యాసాశ్రమమున) ద్రవ్య సంబంధమైన కర్మలు, మరియు యజ్ఞదానాది కర్మలు, ఆచరణాత్మకముగ త్యజింపబడినవి. కాని భగవద్భక్తి సాధనకు చతురాశ్రమములయందును వీలున్నది. గీత సాధువులకును, సన్న్యాసులకును మాత్రమే ప్రయోజనకరమనియు, గృహస్థులకు కాదనియు కొందరు భ్రమపడుచుందురు. అందువలననే గీతను చదివినచో బాలబాలికలు గృహస్థాశ్రమమునకు విముఖులయ్యెదరని భయపడుదురు. కాని వారు ఇట్లు భావించుట పొరపాటేయని పై వివరణము వలన విశదమగును. మోహవశమున తన క్షాత్రధర్మము నెడ విముఖుడై భిక్షాన్నముతో జీవయాత్ర సాగించుటకు ఉద్యుక్తుడైన అర్జునుడు పరమరహస్యమైన ఈ గీతోపదేశమును విని, దాని ప్రభావమున జీవితాంతము గృహస్థుడుగానే ఉండి, క్షత్రియోచితమైన తన కర్తవ్యమును పాటించెను. అట్టి గీతాశాస్త్రము వలన విపరీత పరిణామములు ఎప్పుడును ఏ విధముగను సంభవింపవు. అంతేగాదు గీతోపదేష్టయైన శ్రీకృష్ణభగవానుడే ఈ ధరాతలముపై అవతరించియున్నంత వరకు కర్మలను స్వయముగా చేయుచునే యుండెను. సాధువులను రక్షించెను. దుష్టులను సంహరించి, వారినుద్ధరించెను. ధర్మమును స్థాపించెను. అంతేగాదు, ఒకవేళ భగవానుడు సావధానుడై కర్మప్రవృత్తుడు కానిచో లోకులు అతనిని చూచి, కర్మలను పరిత్యజించి, సోమరులగుదురు. ఆ విధముగా లోకమర్యాదలు ఛిన్నాభిన్నములగును. దానికతడే బాధ్యుడగును. (3/23, 24). ఇది సన్న్యాసులకు ఉపయుక్తము కాదనుట కూడ సహేతుకము గాదు. గీత అన్ని వర్ణాశ్రమ వాసులకును ఉద్దేశింపబడినది. అందరును తమతమ వర్ణాశ్రమ కర్తవ్య కర్మలను ఆచరించుచు సాంఖ్యయోగ కర్మయోగములలో తమ అర్హతలను అనుసరించి, ఏదో ఒక నిష్ఠ ద్వారా సాధన చేయవచ్చును.

## గీత - భక్తి మార్గము

గీతలో భక్తి, జ్ఞాన, కర్మమార్గములు విశదముగా చర్చింపబడినవి. వివిధ మార్గములను అనుసరించి, సాధన చేయువారికి ఇందు తగు మార్గదర్శక సూచనలు లభించును. అర్జునుడు భగవద్భక్తుడు. కనుక సమస్త విషయములను సమగ్రముగా ప్రతిపాదించుచు, స్వయముగా తనకు అనువైన మార్గమును అనుసరింపుమని అతనిని ఆజ్ఞాపించెను. భగవంతుడిచట అతనికి భక్తి ప్రధాన కర్మయోగమునే ఉపదేశించినట్లు భావింపవచ్చును. (3/30, 8/7, 12/8, 18/57, 62, 65, 66). అచ్చటచ్చట కేవలము కర్మాచరణమును ఆదేశించుట జరిగెను. (2/48,50, 3/8,9,19, 4/42, 6/46, 11/33, 34) కాని దానితోపాటు భక్తి మార్గమును గూడ ఆయాస్థలముల నుండి అధ్యాహారము చేసికొనవలయును. 4వ అధ్యాయము నందలి 34వ శ్లోకములో భగవానుడు అర్జునుని జ్ఞానుల యొద్దకేగి, జ్ఞానోపదేశమును పొందుమని ఆజ్ఞాపించెను. జ్ఞానప్రాప్తికి చేసిన ఈ సూచనయు, అర్జునునికి మార్గమును నిర్దేశించుట కొరకే. యథార్థముగా జ్ఞానప్రాప్తికై జ్ఞానుల కడకు అర్జునుని పంపుట భగవానుని ఆశయము కాదు. దానిననుసరించి, అర్జునుడు జ్ఞానార్జనకై ఎవ్వరి కడకునూ వెళ్ళలేదు. ఉపక్రమోపసంహారములను బట్టి గీతోపదేశ పరమోద్దేశ్యము శరణాగతియేయని తోచుచున్నది. గీతోపదేశము "అశోచ్యానన్వశోచస్త్వం" (2/11) అను శ్లోకముతో ప్రారంభమైనది. కాని ఈ ఉపక్రమమునకు బీజము 'కార్పణ్యదోషోపహతస్వభావః' (2/7) అను అర్జునుని పలుకునందే గలదు. అందు 'ప్రపన్నం' అను పదమున శరణాగతి భావము స్పష్టమగును. కనుక 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను శ్లోకముతో గీతోపదేశమును ముగించుచు భగవానుడు శరణాగతియే దాని ప్రధానాశయమని స్పష్టపరచెను. (18/66) మరొక్క మాట, గీతలో ప్రతి అధ్యాయమునందును ఏదో ఒకచోట భక్తి ప్రస్తావన లేకపోలేదు. ఉదాహరణమునకు 2వ అధ్యాయమున 61వ శ్లోకము, 3వ అధ్యాయమున 30వ శ్లోకము, 4వ

అధ్యాయమున 11వ శ్లోకము, 5వ అధ్యాయమున 29వ శ్లోకము, 6వ అధ్యాయమున 47వ శ్లోకము, 7వ అధ్యాయమున 14వ శ్లోకము, 8వ అధ్యాయమున 14వ శ్లోకము, 9వ అధ్యాయమున 34వ శ్లోకము 10వ అధ్యాయమున 9వ శ్లోకము 11వ అధ్యాయమున 54వ శ్లోకము, 12వ అధ్యాయమున 2వ శ్లోకము, 13వ అధ్యాయమున 10వ శ్లోకము, 14వ అధ్యాయమున 26వ శ్లోకము, 15వ అధ్యాయమున 19వ శ్లోకము, 16వ అధ్యాయమున 1వ శ్లోకము, (ఇందు 'జ్ఞానయోగ వ్యవస్థితిః' అను పదము ద్వారా భగవానుడు ధ్యాన విషయమును తెలిపెను) 17వ అధ్యాయమున 27వ శ్లోకము, 18వ అధ్యాయమున 66వ శ్లోకము ఈ భక్తి ప్రస్తావనను చేయుచున్నవి. దీనిని బట్టి ప్రతి అధ్యాయమునందును భక్తి ప్రస్తావన కలదని స్పష్టమగుచున్నది. 7 నుండి 12వ అధ్యాయము వరకును భక్తియోగ ప్రస్తావనయే నిండియున్నది. కావున ఆ ఆరు అధ్యాయములును భక్తి ప్రధానములని భావింపబడుచున్నవి. ఈ ఆరు అధ్యాయములకును 'భక్తిషట్కము' అను ప్రసిద్ధియు కలదు. ఈ అధ్యాయములయందు మచ్చునకై ఒక్కొక్క శ్లోక సంఖ్య మాత్రమే ఇయ్యబడినది.

ఇట్లే జ్ఞానప్రస్తావనయు పెక్కు అధ్యాయములలో చేయబడినది. ఉదాహరణమునకు, 2వ అధ్యాయమున 29వ శ్లోకము, 3వ అధ్యాయమున 28వ శ్లోకము, 4వ అధ్యాయమున 24వ శ్లోకము, 5వ అధ్యాయమున 13వ శ్లోకము, 6వ అధ్యాయమున 29వ శ్లోకము, 8వ అధ్యాయమున 13వ శ్లోకము, 9వ అధ్యాయమున 15వ శ్లోకము, 12వ అధ్యాయమున 3వ శ్లోకము, 13వ అధ్యాయమున 34వ శ్లోకము, 14వ అధ్యాయమున 19వ శ్లోకము, 18వ అధ్యాయమున 49వ శ్లోకము ఈ జ్ఞాన ప్రస్తావనను చేయుచున్నవి. ఇందును 2, 5, 13, 14, 18 అధ్యాయములందు జ్ఞానమునకు సంబంధించిన శ్లోకములు పెక్కు గలవు.

గీతయందు భక్తి, జ్ఞానతత్త్వముల వలెనే కర్మయోగ రహస్యము గూడ సమగ్రముగ తెల్పబడినది. 2వ అధ్యాయమున 39 నుండి 59వ శ్లోకము వరకును, 3వ అధ్యాయమున 4 నుండి 35వ శ్లోకము వరకును, 4వ అధ్యాయమున 13 నుండి 32వ శ్లోకము వరకు, 5వ అధ్యాయమున 2 నుండి 7వ శ్లోకము వరకును, 6వ అధ్యాయమున 1 నుండి 4వ శ్లోకము వరకును కర్మతత్త్వము పరిపూర్ణముగా ఉన్నది. ఇందును 2వ అధ్యాయమున 37వ శ్లోకమునను అట్లే 4వ అధ్యాయమున 16 నుండి 18వ శ్లోకము వరకును కర్మతత్త్వము విశేషముగా ప్రతిపాదింపబడినది. ఇంతేగాక ఇతర అధ్యాయములయందును కర్మతత్త్వ వివరణము గలదు.

వీటినన్నింటిని గూర్చి ఇంకను విపులముగా వివరింపవలసియున్నను స్థలాభావము వలన అది సాధ్యము కాలేదు. గీతయందు కేవలము భక్తి మార్గమును గూర్చియే గాక జ్ఞాన కర్మ భక్తి తత్త్వములు సమగ్రముగా ప్రతిపాదింపబడినట్లు విదితమగును.

### సగుణ - నిర్గుణ - ఉపాసన, తత్త్వములు

భగవదుపాసన భేద దృష్టితో చేసినను, అభేద దృష్టితో చేసినను రెండింటి ఫలము ఒకటియే యని పైన చెప్పబడినది. ఇది యెట్లు సాధ్యము? భేదోపాసకునకు భగవానుడు సాకార రూపమున దర్శనమిచ్చును. ఆ ఉపాసకుడు దేహత్యాగానంతరము పరమధామమును చేరును. అభేదోపాసకుడు స్వయముగా బ్రహ్మరూపుడే యగును. అతడెచ్చటికిని పోవుటగాని వచ్చుటగాని జరుగదు. పైన పేర్కొనబడిన విషయము గూడ సరియైనదే. ప్రశ్నగూడ సరియైనదే. ఈ రెండింటి సమన్వయమును గూర్చి పరిశీలింతము.

సాధన కాలమునందు సాధకుడు ఏవిధమైన భావముతో ఎట్టి శ్రద్ధతో పరమాత్మను ఉపాసించునో ఆ భావమును అనుసరించి, అతనికి భగవదనుగ్రహము సిద్ధించును. అభేదరూపముతో అనగా తమను భగవంతునికంటె వేరుగా భావింపక భగవదుపాసన చేయువారికి అభేద రూపముననే పరమాత్మ ప్రాప్తి కలుగును. భేద భావముతో భజించినవారికి భగవానుడు భేదరూపమున దర్శనమిచ్చును. సాధకుని నిష్ఠను అనుసరించి, పరమాత్మ వేర్వేరు రూపములలో అందరికిని లభ్యమగును.

భేదోపాసనయు, అభేదోపాసనయు, (రెండును) భగవదుపాసనలే. ఏలనన పరమాత్ముడు సగుణ నిర్గుణ, సాకార నిరాకార - వ్యక్తావ్యక్తరూపుడు. అతనిని నిర్గుణ నిరాకారుడని భావించిన వారికి అతడు నిర్గుణ నిరాకారుడే.

(12/3) సగుణ నిరాకారుడని భావించువారికి అతడు సగుణ నిరాకారుడే. (8/9). భగవంతుని సర్వశక్తిమంతుడనియు, సర్వాధారుడనియు, సర్వవ్యాపియనియు, సర్వోత్తముడనియు అనగా అన్ని విధముల ఉత్తమగుణములు కలవాడనియు భావించు వారికి అతడు సర్వసద్గుణ సంపన్నుడే. (15/15, 17, 19[1] భగవంతుడు సర్వరూపుడు – అని భావించువారికి అతడు సర్వరూపుడే. (7/7-12, 9/16-19) సగుణ సాకారుడని భావించువారికి అతడు సగుణ సాకార రూపమునే దర్శనమిచ్చును. (4/8, 9/26)

ఉపాసకుల నిష్ఠలను బట్టి భగవంతుడు తదనుగుణముగ అనుగ్రహించునను మాట యథార్థమే. కాని పై ప్రశ్నకు సమాధానము మాత్రము లభింపలేదు. భగవంతుడు సాధకులందరికిని వేర్వేరు రూపములలో లభ్యముగునప్పుడు ఫలమునందు ఏకత్వము ఎట్లు సిద్ధించును? మొదట సాధకుని భావముననుసరించి పరమాత్ముడు లభించును. పిదప భగవంతుని యథార్థ తత్త్వజ్ఞానము కలుగును. అది వాక్కులకందనిది. అనిర్వచనీయము. భేద, అభేద భావములతో చేయబడు వివిధోపాసనలకును అంతిమఫలము ఒక్కటియే. ఈ విషయమును స్పష్టపరచుటకే భగవానుడు అభేదోపాసకులకు తాను లభ్యముగుదునని తెల్పెను. (12/4, 14/19, 18/55). భేదోపాసకులకు బ్రహ్మప్రాప్తి కల్గునని, (14/26) శాశ్వత శాంతి, (9/31) బ్రహ్మజ్ఞానము, (7/29). అవ్యయ శాశ్వతపదము (18/56) మొదలగునవి లభించునని పల్కెను. అభేదోపాసన, భేదోపాసనల ఫలమొకటియే అను విషయమును స్పష్టపరచుటకు భగవానుడు పెక్కు రీతులలో విశదపరచెను.

భేదోపాసకులకును, అభేదోపాసకులకును ప్రాప్య వస్తువు యథార్థతత్త్వ మొకటియే. దానినే ఒకచోట పరమ శాంతి, శాశ్వతస్థానమనియు (18/62) మరియొకచోట పరమధామమనియు, (15/6) వేరొకచోట అమృతమనియు, (13/12) ఇంకొకచోట 'మాం' అనియు (9/34) ఇంకొక తావున పరమగతియనియు, (8/13). వేరొకతావున 'సంసిద్ధి' యనియు, (18/45) మరియొక తావున 'అవ్యయపదము' అనియు (15/5) అన్యత్ర 'బ్రహ్మనిర్వాణము' అనియు (5/24) ఇతరత్ర 'నిర్వాణపరమశాంతి' అనియు (6/15) పేర్కొనెను. ఇంతేగాక గీతయందు ఈ అంతిమ ఫలము ఇంకను అనేక నామములతో పేర్కొనబడినది. ఆ వస్తువు అన్ని సాధనల ఫలస్వరూపమే. ఇంతకు మించి ఆ విషయమున ఏమియు చెప్పుటకు వీలులేదు. అది వాక్కులకు అతీతమైనది. అది ప్రాప్తించిన వానికే తెలియును. కాని అతడు గూడ దానిని వర్ణింపజాలడు. పై శబ్దముల వలనను ఇతర శబ్దముల వలనను శాఖాచంద్రన్యాయమున దానిని లక్ష్యమాత్రముగ సూచింపవచ్చును. కావున అన్ని సాధనల ఫలరూపమైన పరమవస్తుతత్త్వము ఒకటియే అను విషయము యుక్తియుక్తము.

పరమాత్ముని తాత్త్విక స్వరూపము అలౌకికము, పరమ రహస్యమయము, గుహ్యతమము, అది ప్రాప్తించినవారే దానిని ఎరుగుదురు. ఈ విషయముగూడ ఆ లక్ష్యమును (తత్త్వమును) సూచించుటకు మాత్రమే చెప్పబడినది. వాస్తవముగా అట్లు చెప్పినను దానిని గూర్చి సమగ్రముగా చెప్పినట్లు కాదు.

## గీతయందు సమత్వము

గీతయందు సమత్వభావము ప్రముఖమైనది. భగవత్ప్రాప్తికి సమత్వమే గీటురాయి. జ్ఞాన కర్మ భక్తి అను మూడు మార్గములయందును సాధన కాలమునందు గూడ సమత్వ భావము అవసరమే. ఈ మూడు మార్గముల ద్వారా పరమాత్మ ప్రాప్తినందిన పురుషులకు గూడ సమత్వ భావము ఒక అసాధారణ లక్షణముగా పేర్కొనబడినది. సమత్వ భావము లేనిచో, ఆ సాధనయు అసంపూర్ణము. ఇక సిద్ధి విషయమున అది సమత్వరహితమైనచో అసమగ్రమే అని చెప్పనవసరములేదు.

అంతేగాదు సమత్వము లేనిచోట సిద్ధియే లేదు. 'సమ దుఃఖ సుఖమ్' అను పదము ద్వారా జ్ఞాన మార్గ సాధకులలో సమత్వభావము కలవారే. 'అమృతత్వము'నకు అనగా ముక్తికి అర్హులని తెల్పబడినది. (2/15) **"సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే"** – ఈ విధముగా కర్మయోగ

1) పై శ్లోకములయందు భగవంతుని శ్రేష్ఠగుణములు వర్ణింపబడినవి. కనుక 15/15 శ్లోకమునందు 'అపోహన' శబ్దమునకు స్మృతి జ్ఞానములనాశమని చెప్పక సంశయవిపర్యముల నాశమని తెల్పబడినది.

సాధకులను గూడ సమత్వ భావయుక్తులై కర్మలను ఆచరింపవలసినదిగా ఆదేశించుట జరిగినది. (2/48) భక్తిమార్గసాధకులకు గూడ ఈ గుణములనే పెంపొందించుకొనవలసినదిగా చెప్పబడినది (12/20). ఇదే విధముగ గుణాతీతుల (సిద్ధ జ్ఞాన యోగుల) లక్షణముల యందుగూడ సమత్వము ప్రధానమైనదే. (14/24, 25). సిద్ధ కర్మయోగియు 'సముడ'నియే చెప్పబడెను (6/7-9). సిద్ధభక్తుని లక్షణములయందుగూడ 'సమత్వము' ప్రస్తావింపబడినది. (12/18, 19). ఈ సమత్వ తత్త్వమును సులభముగా చక్కగా విశదీకరించుటకు భగవానుడు గీతయందు సకల ప్రాణులయందును, క్రియలయందును, భావములయందును, పదార్థములయందును సమత్వ వర్ణనము పెక్కు రీతులజేసెను. ఎట్లనగా.

### మనుష్యులలో - సమత్వము

**సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ *(6/9)***

సుహృదులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేష్యులు, బంధువులయందును, సాధువుల యందును, పాపులయందును సమత్వభావమును కలిగియుండు వాడు అత్యంత శ్రేష్ఠుడు.

### మనుష్యుల - పశువుల యెడ సమత్వము

**విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥**

***(5/18)***

విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యెడను, గోవు, ఏనుగు, శునకముల యెడను, చండాలుని యందును జ్ఞానులైనవారు సమదృష్టి కలిగి యుందురు. (భగవంతునే చూచుదురు)

### సమస్త జీవుల యందును సమభావము

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥**

***(6/32)***

ఓ అర్జున! సమస్త ప్రాణులను తనతో సమానముగ చూచువాడును, సుఖదుఃఖములను సమముగా భావించు వాడును ఐన యోగి పరమశ్రేష్ఠుడని పేర్కొనబడును.

అచ్చటచ్చట భగవానుడు వ్యక్తులయందును, క్రియలయందును, పదార్థములయందును, భావములయందును, సమత్వమును గూర్చి తెల్పెను. ఎట్లనగా-

**సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః ॥**

***(12/18)***

శత్రువులయందును, మిత్రులయందును, మానావమానముల యందును, శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములయందును సమభావము కలిగి, ఆసక్తి రహితుడైనవాడు నా భక్తుడు.

ఇచట శత్రుమిత్రులు వ్యక్తివాచకములు. మానావమానములు పరకృత క్రియావాచకములు. శీతోష్ణములు పదార్థములు. సుఖదుఃఖములు భావములు.

**సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।**
**తుల్యప్రియాప్రియోధీరఃతుల్యనిందాత్మసంస్తుతిః ॥**

***(14/24)***

నిరంతరము ఆత్మభావమునందు స్థితుడైనవాడు, సుఖదుఃఖములను సమానముగా భావించువాడు, మట్టి, రాయి, బంగారములయందును, సమానభావముగల జ్ఞానియైనవాడు, ప్రియమును, అప్రియమును ఒకటిగా భావించువాడు, తనను ఎవరైనను నిందించినను, స్తుతించినను, వికారములకు లోనుగాని వాడు గుణాతీతుడు అనబడును. ఇందు సుఖదుఃఖములు భావములు, లోష్టాశ్మ కాంచనములు పదార్థములు, నిందాస్తుతులు పరకృతక్రియలుకాగా, ప్రియాప్రియములు ప్రాణులకును, భావములకును, పదార్థములకును క్రియలకును వాచకములు. ఈ విధముగా సర్వత్ర సమదృష్టి కలిగి, వ్యవహారము నందు మాత్రము అహంకార, మమకారములు ఉన్నను అన్నిటియెడ సమబుద్ధి కలిగి, సమష్టి రూపముగా సమస్త జగత్తునందును సమభావము గలవాడే నిజమైన సామ్యవాది.

గీతయందలి సామ్యవాదమునకును, నేడు వ్యవహారములో నున్న సామ్యవాదములకును ఎంతో వ్యత్యాసము గలదు.[1]

## జీవుల గతి

జీవులయొక్క గుణకర్మలను అనుసరించి, వారికి ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ గతులు ప్రాప్తించునని గీత తెలుపుచున్నది. కర్మయోగ సాంఖ్యయోగ దృష్టితో శాస్త్రోక్తకర్మలను, ఉపాసనలను చేయు సాధకులగతులను గూర్చి 8వ అధ్యాయమునందలి 24వ శ్లోకమునందు తెలుపుట జరిగినది. అందులో యోగభ్రష్టులైనవారి గతి 6వ అధ్యాయమునందలి 40నుండి 45వ శ్లోకమువరకు వర్ణింపబడినది. మరణానంతరము వారు (యోగభ్రష్టులు) స్వర్గాదిలోకములను పొంది, అచ్చట సుదీర్ఘకాలము (పుణ్యము క్షీణించు వఱకును) సుఖములను అనుభవించి, పిదప పవిత్రములైన సంపన్న కుటుంబములయందు జన్మింతురనియు, లేదా స్వర్గాదిలోకములను చేరకుండగనే నేరుగా యోగుల కుటంబములో జన్మించి, పూర్వాభ్యాస వశమున అచట మరల యోగసాధనయందు ప్రవృత్తులై పరమగతిని పొందుదురనియు తెల్పబడినది.

సకామభావముతో విహిత కర్మలను, ఉపాసనలను చేయువారి గతులను గూర్చి 9వ అధ్యాయమున 20, 21 శ్లోకములలో వర్ణింపబడినది. స్వర్గసుఖములను కోరుచు వేదవిహితములైన యజ్ఞయాగాది కర్మలను ఆచరించు వారికి స్వర్గసుఖములు లభించుననియు, వారి పుణ్యములు క్షీణింపగనే మర్త్యలోకమునకు చేరుదురనియు అందు పేర్కొనబడినది. ఆ పుణ్యాత్ములు ఏ మార్గము ద్వారా ఎట్లు స్వర్గమును చేరునదియు 8వ అధ్యాయమునందలి 25వ శ్లోకవ్యాఖ్యానమునందు వివరింపబడినది. 14వ అధ్యాయమునందలి 14, 15, 18 శ్లోకములలో సాధారణముగా మనుష్యులందరి గతులను గూర్చి సంగ్రహముగా వివరింపబడినది. సత్త్వగుణ యుక్తులై మరణించువారు ఉత్తమలోకములను చేరుదురు. రజోగుణవృద్ధియందు మరణించువారు మానవలోకమున జన్మింతురు.

---

1.

| గీతలో వర్ణింపబడిన సామ్యవాదులు | నేటి సామ్యవాదులు |
|---|---|
| 1) సర్వత్ర ఈశ్వరుని దర్శించువారు. | 1) భగవద్విరోధులు (నాస్తికులు). |
| 2) అడుగడుగునను ధర్మమునకు బలమును చేకూర్చువారు. | 2) ధర్మమును నశింపజేయువారు. |
| 3) అహింసా ప్రతిపాదకులు. | 3) హింసాప్రవృత్తి గలవారు. |
| 4) స్వార్థ చింతన లేనివారు. | 4) స్వార్థపరులు. |
| 5) అన్నపానాదులలో శాస్త్రమర్యాదలను అనుసరించుచు యథాయోగ్యముగ భేదములను పాటించినను లోలోపల భేదభావములు లేక అందరిలోను పరమాత్మనే దర్శించువారు. | 5) భోజన భాజనముల యందు సమానత్వమునుచూపుచు లోలోపల భేదభావమును పాటించువారు. |
| 6) వీరి లక్ష్యము పరమాత్మ ప్రాప్తి. | 6) వీరి లక్ష్యము కేవలము ధనోపార్జనము. |
| 7) అభిమానములను త్యజించి జగత్తంతయు పరమాత్మ మయమని భావించి, అందరిని ఆదరించువారు. | 7) తమ వర్గమువారిని ఆదరించుచు ఇతరులను ద్వేషింతురు. |
| 8) అంతఃకరణ శుద్ధి ముఖ్యము. | 8) బాహ్య ప్రవర్తన ప్రధానము. |
| 9) ఆధ్యాత్మిక సుఖములు ముఖ్యము. | 9) భౌతిక సుఖములు ముఖ్యము. |
| 10) అందరియెడను సమానమైన ఆదరభావము. | 10) పరమతములయందును పరుల ఉన్నతి యందును ఓర్వలేనితనము. |
| 11) వీరివ్యవహారము రాగద్వేష రహితము. | 11) వీరి వ్యవహారము రాగద్వేష పూరితము. |

తమోగుణవృద్ధియందు మరణించువారు మరణానంతరము పశుపక్షికీటపతంగ వృక్షాది జన్మల నెత్తుదురు. ఈవిధముగా సత్త్వగుణోపేతులు మృతిచెంది, ఊర్ధ్వలోకములను చేరుదురు. రజోగుణయుతులు మనుష్యలోకమునందే ఉందురు. తమోగుణ స్థితులైన తామసులు అధోగతిని అనగా నరకములను గాని, పశుపక్ష్యాదిజన్మలను గాని పొందుదురు. ఆసురీ ప్రకృతిగల తామసులైన మనుష్యులు మరల మరల ఆసురీ యోనులలోనే జన్మించుచు అనగా సూకర శునకాది జన్మలను ఎత్తుచు, పిదప ఘోరనరకముల పాలగుదురని భగవానుడు 16వ అధ్యాయమునందలి 19, 20 శ్లోకములలో తెలిపెను. ఇదేవిధముగా వివిధ సందర్భములలో గుణకర్మలను అనుసరించి, జీవులకు ప్రాప్తించు గతులను గూర్చి గీతలో తెల్పబడినది. ముక్తపురుషుల గతులను గూర్చి సాంఖ్య మరియు యోగ ఫలరూపములలో పెక్కు చోట్ల విస్తృతముగా వర్ణింపబడినది. జీవన్ముక్తులైన వారు ఎచ్చటికిని పోవుటగాని, వచ్చుటగాని జరుగదు. వారు ఇచ్చటనే పరబ్రహ్మ పరమాత్మను పొందుదురు.

## గీతయందలి కొన్ని ముఖ్యాంశములు

### 1. గుణముల గుర్తింపు

గీతయందు సాత్త్విక, రాజస, తామస పదార్థములకును, భావములకును, క్రియలకును సంబంధించిన కొన్ని గుర్తింపు సూచనలు ప్రత్యేకముగా ఇయ్యబడినవి. వానిలో కొన్ని ఈ క్రింద తెలుపబడుచున్నవి.

క) స్వార్థ స్పర్శ లేనట్టివియును, మమతాసక్తి రహితములైనట్టివియును అగు భావములు, క్రియలు సాత్త్వికములు. వాటియొక్క ఫలము భగవత్ప్రాప్తియే.

ఖ) లోభము, స్వార్థము, ఆసక్తులతో కూడిన భావములు, క్రియలు రాజసములు, వీటిఫలము ప్రారంభమున క్షణిక సుఖప్రాప్తి, పరిణామమున అంతమందు దుఃఖము.

గ) హింస, మోహము, ప్రమాదములతో గూడిన భావములు, క్రియలు తామసములు. వీటియొక్క ఫలము దుఃఖము, అజ్ఞానము.

ఈ విధముగా మూడు విధములైన భావముల యందును క్రియలయందును గల భేదములను తెల్పి, భగవానుడు సాత్త్విక భావములను, క్రియలను తెలిసికొని ఆచరించుటకును, రాజస, తామస భావములను, క్రియలను త్యజించుటకును ఆదేశించెను.

### 2. గీతయందు ఆచరణముకంటెను భావమే ప్రధానము

గీతయందు ఉత్తమ ఆచరణము, అంతఃకరణము నందు ఉత్తమభావము రెండును శ్రేయస్కరములేయని పేర్కొనినను, అంతఃకరణ భావమునకే ప్రాముఖ్యము ఎక్కువగా ఇయ్యబడినది. 2, 12, 14 అధ్యాయాంతముల యందు క్రమముగా స్థితప్రజ్ఞుని, భక్తుని, గుణాతీతుని లక్షణములలో భావమునకే ప్రాముఖ్యము ఇయ్యబడినది. (2/55 నుండి 71, 12/13 నుండి 19, 14/22 నుండి 25) 2, 14 అధ్యాయములయందు అర్జునుడు ఆచరణ ప్రధానముగా ప్రశ్నించెను. కాని భగవానుడు ఇచ్చిన సమాధానములయందు భావమే ప్రధానమై నిలిచినది. గీతను అనుసరించి, సకామభావముతో చేయబడిన యజ్ఞదానతపస్సులు, సేవలు, పూజలు మొదలగు ఉత్తమోత్తమ కర్మలకంటెను నిష్కామభావముతో చేసిన యుద్ధము, వ్యాపారము, వ్యవసాయము, శిల్పము, సేవలు మొదలగు అల్పములైన కర్మలు ముక్తిదాయకములగుట వలన శ్రేష్ఠములు. (2/40, 49. 12/12. 18/46) 4వ అధ్యాయమునందు తెలుపబడిన అనేక విధములైన యజ్ఞరూపసాధనల యందును భావము ముఖ్య (ప్రధాన) మగుటవలన అవి ముక్తిదాయకములుగా పేర్కొనబడినవి. (4/24 నుండి 32)

### భగవద్గీత - వేదములు

భగవద్గీత వేదముల యెడ మిక్కిలి ఆదర భావము కలిగియున్నది. భగవంతుడు తనను గూర్చి వేదవేద్యుడుగను, వేదములను ప్రకటించినవాడుగను, వేదవిదుడుగను పేర్కొని వేదముల యొక్క మహత్త్వమును ఇనుమడింపజేసెను. (15/15). జగత్తును అశ్వత్థ వృక్షముతో పోల్చివర్ణించుచు భగవానుడు "ఈ వృక్షతత్త్వమును సమూలముగా ఎరిగినవాడే యథార్థముగా వేదరహస్యమును ఎరింగిన వాడు." (15/1) అని తెలిపెను. జగత్స్వరూప తత్త్వమును, జగత్కారకుడైన పరమాత్మ తత్త్వమును వాస్తవముగా తెలిసికొనుటయే వేదముల యొక్క పరమార్థము - అని భగవానుడు తెలిపెను. మరొక సందర్భమున వేదముల ద్వారా విభాగ పూర్వకముగా

తెలుపబడిన విషయమునే నేను నీకు తెల్పుచున్నాను - అని భగవానుడు పలికెను. (13/4). ఈ విధముగా తన ఉపదేశములను వేదప్రమాణములతో సమర్థించుచు వాటి మహాత్త్వమును ఇనుమడింపజేసెను. ఋగ్వేద, యజుర్వేద, సామవేదములు మూడును తన స్వరూపముగా తెలిపి, వాటిని ఇంకను ఎక్కువగా ఆదరించెను. (9/17). వేదములు తన ద్వారా ప్రకటితములైనవని భగవానుడు తెలిపెను. (3/15, 17/23). పరమాత్మ ప్రాప్తికై పెక్కు సాధన మార్గములు వేదములలో పేర్కొనబడినట్లు భగవానుడు ప్రకటించెను. (4/32). కొందరు వివేకహీనులైనవారు వేదములయందు కేవలము భోగప్రాప్తి సాధనమార్గములు మాత్రమే కలవని భావింతురు. అది సరికాదు. భగవత్ప్రాప్తి సాధనమార్గములు గూడ అందు అనేకములు ఉన్నవనియు భగవానుడు స్పష్టపరచెను. పరమపదము తన స్వరూపమే యనియు, దానినే వేదవేత్తలైనవారు ఓంకారము (అక్షరము) అని నిర్దేశించిరనియు భగవానుడు నుడివెను. (8/11). కేవలము సకామ పురుషులచే పొందబడు ఇహపరలోకములకు సంబంధించిన అనిత్యములైన భోగముల వర్ణనము మాత్రమే గాక వేదములలో శాశ్వతమైన పరమాత్మ స్వరూప వర్ణనము గూడ విపులముగానున్నట్లు అతడు సూచించెను. ఇంతవరకును తెలుపబడిన దానిని బట్టి భగవానుడు వేదములను పరిపూర్ణముగా ఆదరించినట్లు స్పష్టమగుచున్నది.

సకామపురుషులను వేదవాదరతులనియు, వివేక శూన్యులనియు పేర్కొనెను. (2/42). వేదములు గుణత్రయ కార్యరూపములైన సాంసారిక, భోగములను, వాటి సాధనములను ప్రతిపాదించునని తెలుపుచు, అట్టి భోగములయందు ఆసక్తి రహితుడగుటకు భగవానుడు అర్జునుని ఆదేశించెను. (2/45). వేదత్రయ ధర్మములను ఆశ్రయించు సకామ పురుషులు మాటిమాటికిని జనన మరణ చక్రములో పరిభ్రమించుచుందురని తెలిపెను. (9/21). ఈ ప్రస్తావనలను బట్టి భగవానుడు వేదములను నిందించుచున్నట్లు సందేహము కలుగవచ్చును. దీనికి సమాధానమేమి?

పై ప్రస్తావనలో వేదములు నిందింపబడినట్లు గోచరించుచున్నను, వాస్తవముగా అందు వేదనిందలేదు. గీతయందు సకామభావము కంటెను నిష్కామభావము అధికమహత్త్వము కల్గియున్నదనియు, భగవత్ప్రాప్తికి అది ఆవశ్యకమనియు తెల్పబడినది. కావున నిష్కామభావముతో పోల్చినప్పుడు సకామభావము నింద్యమనియు, నశ్వరములైన విషయసుఖములను ఇచ్చునదియనియు తెల్పుటకే దానిని గూర్చి అచ్చటచ్చట 'తుచ్ఛమైనదని' ప్రస్తావించుట జరిగినది. నిషిద్ధకర్మల వలె దీనిని నిందింపలేదు. వేదకర్మఫలములను త్రోసిపుచ్చు విషయములను ప్రస్తావించినప్పుడు గూడ సకామభావముతో చేయబడు కర్మలే ఉద్దేశింపబడినట్లు భావింపవలెను. (8/28). భగవానుడు గీతయందు ఎచ్చటను వేదనింద చేయులేదనియు, పైగా పెక్కు సందర్భములలో వేదప్రశంసయే చేసినట్లు పైవిశ్లేషణము వలన స్పష్టమగుచున్నది.

## గీత - సాంఖ్యదర్శనము - యోగదర్శనము

గీతయందు అక్కడక్కడ (పలుచోట్ల) సాంఖ్యపదము ప్రయుక్తమైనది. దానిని కపిల మహర్షి ద్వారా ప్రవర్తితమైన సాంఖ్యదర్శన వాచకముగా కొందరు భావించుచున్నారు. కాని అది సరికాదనిపించుచున్నది. గీతయందు 13వ అధ్యాయమున వరుసగా 3 (మూడు) శ్లోకములతో (19, 20, 21) మరియు ఇతరత్ర కూడ ప్రకృతి, పురుషుడు అను పదములు వెంటవెంట ప్రయోగింపబడినవి. ఈ పదములు విశేషముగా సాంఖ్యదర్శనమున ప్రయోగింపబడినవి. కావున గీతయందు కపిల సాంఖ్య సిద్ధాంతమే ప్రతిపాదింపబడినట్లు కొంతమంది భావించుచున్నారు. అట్లే యోగశబ్దమును గూడ కొందరు పాతంజలయోగముగా భావింతురు. 5వ అధ్యాయప్రారంభమునందును ఇంకను అనేక సందర్భములయందును సాంఖ్య-యోగ శబ్దములు ఒకేచోట గూడ ప్రయోగింపబడినవి. దీని వలన గూడ సాంఖ్య, యోగ శబ్దములు వరుసగా కపిలసాంఖ్యమునకును, పాతంజలయోగమునకును వాచకములని భావించుచున్నారు. కాని ఈ భావనలు సరియైనవి కావనితోచును. గీతయందలి 'సాంఖ్యము' కపిల సాంఖ్యముకాదు. అట్లే 'యోగము' పాతంజల యోగమూ కాదు. ఈ క్రింది వివరణమును బట్టి ఈ విషయము స్పష్టమగును.

1) ఈశ్వర స్వరూపమును గూర్చి గీతయందు భావింపబడినట్లుగా కపిల సాంఖ్యమునందు భావింపబడలేదు.

2) గీతయందు 'ప్రకృతి'యను పదము పలుచోట్ల ప్రయుక్తమైనను గీతయందలి 'ప్రకృతి'కిని, కపిల

సాంఖ్యమునందలి 'ప్రకృతి'కిని మిక్కిలి వ్యత్యాసము గలదు. కపిల సాంఖ్యమునందలి ప్రకృతి మూడు (3) గుణముల 'సామ్యావస్థ'. కాని గీతయందలి ప్రకృతి మూడు (3) గుణములకును కారణము. గుణములు దానికి (ప్రకృతికి) కార్యములు. (14/5) కపిల సాంఖ్యము నందు ప్రకృతి అనాది, నిత్యము. గీతయందు గూడ 'ప్రకృతి' అనాదియే. (13/19) కాని నిత్యముకాదు.

3) గీతయందలి 'పురుషునకును' కపిల సాంఖ్యమునందలి 'పురుషునకు'ను ఎంతో తారతమ్యము గలదు. కపిల సాంఖ్యమునసుసరించి పురుషులు అనేకులు. కాని గీతాసాంఖ్యమునందు 'పురుషుడు' ఒక్కడే. (13/22. 30. 18/20).

4) గీతయందలి 'ముక్తి'కిని, కపిలసాంఖ్యము నందలి 'ముక్తి'కిని మిక్కిలి భేదము గలదు. కపిల సాంఖ్యమును అనుసరించి "దుఃఖముల ఆత్యంతిక నివృత్తియే" (దుఃఖములు పూర్తిగా అంతరించి పోవుటయే) ముక్తి. కాని గీతయందు 'ముక్తి' యనగా దుఃఖముల ఆత్యంతిక నివృత్తియేగాక పరమానంద స్వరూపుడైన పరమాత్మ ప్రాప్తికూడ. (6/21, 22).

5) పాతంజల 'యోగము' నందు 'యోగ' శబ్దమునకు చిత్తవృత్తుల నిరోధము - అని అర్థము చెప్పబడినది. కాని గీతయందు సందర్భానుసారముగా యోగశబ్దము విభిన్నార్థములలో ప్రయోగింపబడినది. (2/53 వ్యాఖ్యానము చూడుడు).

ఈ విధముగా గీత - సాంఖ్యదర్శనము - యోగ దర్శనముల సిద్ధాంతములయందు ఎంతేని వ్యత్యాసము గలదు.

### వ్యాఖ్యాన ప్రయోజనము

భగవద్గీతపై సమగ్రవ్యాఖ్య వ్రాయుటకై మిత్రులు పెక్కు దినముల నుండి నన్ను ప్రేరేపించుచు వచ్చిరి. ఇప్పటికే పూజ్యపాదులైన పెక్కుమంది ఆచార్యులు, సత్పురుషులు, వేదాంత శాస్త్ర ధర్మమర్మజ్ఞులైన పండితులు గీతపై భాష్యములను, టీకా వ్యాఖ్యానములను వెలయించి యుండిరి. అవి యన్నియును ఆదరణీయములే. వారు అందఱును తమతమ దృక్పథములను అనుసరించి గీతారహస్యములను వెల్లడించిరి. కాని అవి యన్నియును ఎక్కువ భాగము సంస్కృత భాషయందే యుండుట వలన విద్వాంసులకు మాత్రమే ఉపయుక్తములయ్యెను. కావున సామాన్యులకు అందుబాటులో ఉండుటకై సరళమైన దేశీయ(హిందీ) భాషలో వ్యాఖ్యానమును రచింపుమని మిత్రులు ప్రోత్సహించిరి. కావున నేను ఈ రచనా కార్యక్రమమును చేపట్టితిని. కాని ప్రారంభమున ఈ కార్యము ఎంత సులభముగా తోచెనో రానురాను అనుభవమున అంతగా క్లిష్టమాయెను.

యోగ్యత, అధికారములను బట్టి చూచినచో ఈ బృహత్కార్య నిర్వహణమునకు పూనుకొనుట నావంటి వానికి దుస్సాహసమే. భగవంతుని ఈ గీతోపదేశమును సంపూర్ణముగా అవగాహన చేసికొనుమాట అటుండనిండు, అందు శతాంశమునైనను గ్రహించితినని తెలుపుట సాహసమేయగును. భగవదుపదేశమును ఏ కొంచముగానైనను గ్రహించి, ఆచరణలో పెట్టుట కష్టసాధ్యమేయగును. భగవత్కృపా విశేషమున్న వారికే ఇది సాధ్యమగును. గీతోపదేశమును పూర్తిగా ఆచరించు విషయమెట్లున్నను అందలి ఏ ఒక్క శ్లోకమునైనను అనుసరించి జీవితమును గడుపువారు నిజముగా ధన్యులు. వారి పాదకమలములకు నా పరశ్శత నమస్సుమాంజలులు. ఇట్టి వారు మాత్రమే గీతావ్యాఖ్యానమునకు అధికారులు.

అస్తు! నా ఈ ప్రయత్నము అన్నివిధములుగ దుస్సాహసమూ బాల్యచేష్టయేయైనను ఈ నెపముతోనైనను గీతాసందేశమును చింతనచేయుటకును, మననము కావించుటకును అందలి ఆధ్యాత్మిక విషయములను చర్చించుటకును అవకాశము లభించుట జీవితములో నాకిది యొక మహద్భాగ్యమేయని తలంతును.

గురుజనుల ఆశీస్సులతో, దైవానుగ్రహముతో నాకు అబ్బిన కొద్దిపాటి గీతాజ్ఞానముతో నేను రచించిన ఈ వ్యాఖ్యానమునందు ఎన్నియో దొసగులు దొర్లియుండవచ్చును. గీతోపదేశము యొక్క వాస్తవిక సందేశమును పూర్తిగా ఆ శ్రీకృష్ణ భగవానుడు మాత్రమే ఎఱుంగును. అందులో కొంతవఱకు అర్జునుడు ఎఱుంగును. భగవత్కృపవలన పరమాత్మ ప్రాప్తినందిన మహాత్ములు అందుకొంత ఎఱుగుదురు. ఈ విషయమును వివరించుటకు నేనెంతటి వాడను? గీతకు భాష్యములను, వ్యాఖ్యానములను రచించిన

మహానుభావులకు నేనెంతయో కృతజ్ఞుడను - అంతేగాదు వారికి నేను ఋణపడియున్నాను. ఏలనన నాయీప్రయత్నమునకు వారి రచనలే మార్గదర్శకములు. అట్టి పూజ్యపాదులకు నా హృదయపూర్వక నమస్కారములు.

నేనొనర్చిన ఈ టీకావ్యాఖ్యానములు ఏ విధముగా చూచినను సమగ్రములు కావు. భగవత్సందేశమును సంపూర్ణముగ ప్రకటించుట అశక్యము. కావున దానిని అవగాహన చేసికొనుటలోను, వివరించుటలోను పెక్కు లోపములు సంభవించి యుండవచ్చును. అంతేగాక కొన్ని విపరీత భావనలు గూడా ఇందు చోటుచేసికొని యుండవచ్చును. ఈ విషయమున దొరలిన నా దోషములను మన్నించి, నన్ను క్షమించుటకై ఆ భగవంతుని మఱియు గీతాభిమానులను వేడుకొనుచున్నాను. నేను ఈ రచనయందు ఏ ఆచార్యుల సిద్ధాంతములను గాని, వ్యాఖ్యాతల అభిప్రాయములనుగాని ఉల్లేఖింపనూలేదు, ఖండింపనూలేదు. ఇందు వారివారి సిద్ధాంతములకును, అభిప్రాయములకును ఏవైన విరుద్ధ భావనలు ఉన్నచో క్షంతవ్యుడను. ఆ సిద్ధాంతములకు ఖండనమండనములు కావించుటగాని, పోల్చుటగాని నా ఉద్దేశ్యముగాదు.

ఈ టీకావ్యాఖ్యాన రచనయందు నాకు సహాయ సహకారములనందించిన మహానుభావులకు, మిత్రులకు, బంధువులకు అందఱికిని నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నివేదకుడు - జయదయాల్ గోయన్దకా

❖ ❖ ❖

॥ శ్రీహరిః ॥

శ్రీ స్కంద పురాణాంతర్గత

# భగవద్గీతా మాహాత్మ్యము

శ్రీ భగవానువాచ

న బంధోఽస్తి న మోక్షోఽస్తి బ్రహ్మైవాస్తి నిరామయమ్ ।
నైకమస్తి న చ ద్విత్వం సచ్చిత్కారం విజృంభతే ॥ 1 ॥

గీతాసారమిదం శాస్త్రం సర్వశాస్త్రసునిశ్చితమ్ ।
యత్ర స్థితం బ్రహ్మజ్ఞానం వేదశాస్త్రసునిశ్చితమ్ ॥ 2 ॥

ఇదం శాస్త్రం మయా ప్రోక్తం గుహ్యవేదార్థ దర్పణమ్ ।
యః పఠేత్ ప్రయతో భూత్వా స గచ్ఛేద్విష్ణుశాశ్వతమ్ ॥ 3 ॥

ఏతత్పుణ్యం పాపహరం ధన్యం దుఃఖప్రణాశనమ్ ।
పఠతాం శృణ్వతాం వాపి విష్ణోర్మాహాత్మ్యముత్తమమ్ ॥ 4 ॥

అష్టాదశపురాణాని నవవ్యాకరణాని చ ।
నిర్మథ్య చతురో వేదాన్ మునినా భారతం కృతమ్ ॥ 5 ॥

భారతోదధి నిర్మథ్య గీతానిర్మథితస్య చ ।
సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే ధృతమ్ ॥ 6 ॥

మలనిర్మోచనం పుంసాం గంగాస్నానం దినే దినే ।
సకృద్గీతామ్బుసి స్నానం సంసారమలనాశనమ్ ॥ 7 ॥

గీతానామసహస్రేణ స్తవరాజో వినిర్మితః ।
యస్య కుక్షౌ చ వర్తేత సోఽపి నారాయణః స్మృతః ॥ 8 ॥

సర్వవేదమయీ గీతా సర్వధర్మమయో మనుః ।
సర్వతీర్థమయీ గంగా సర్వదేవమయో హరిః ॥ 9 ॥

పాదస్యాప్యర్థపాదం వా శ్లోకం శ్లోకార్థమేవ వా
నిత్యం ధారయతే యస్తు స మోక్షమధిగచ్ఛతి ॥ 10 ॥

కృష్ణ వృక్ష సముద్భూతా గీతామృతహరీతకీ ।
మానుషైః కిం న ఖాద్యేత కలౌ మలవిరేచనీ ॥ 11 ॥

గంగా గీతా తథా భిక్షుః కపిలాశ్వత్థసేవనమ్ ।
వాసరం పద్మనాభస్య పావనం కిం కలౌ యుగే ॥ 12 ॥

గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖ పద్మాద్వినిఃసృతా ॥ 13 ॥

ఆపదం నరకం ఘోరం గీతాధ్యాయీ న పశ్యతి ॥ 14 ॥

❖ ❖ ❖




कृपासिन्धु भगवान् श्रीकृष्ण

Lord Kṛṣṇa, the ocean of grace




धृतराष्ट्र-सञ्जय

Dhṛtarāṣṭra and Sañjaya



अनन्य चिन्तनका फल

**Undivided devotion fructified**




ध्रुवपर अनुग्रह

Shower of grace of Dhruva

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే। పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥
వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ । దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥
నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ । దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

# శ్రీమద్భగవద్గీత

## (తత్త్వవివేచనీ హిందీ వ్యాఖ్యకు ఆంధ్రానువాదము)

## మొదటి అధ్యాయము - అర్జున విషాదయోగము

**అధ్యాయ నామము :** *శ్రీ భగవానుడు అర్జునుని నిమిత్తముగా జేసికొని సమస్త విశ్వమునకు భగవద్గీతా రూపమున జేసిన మహోపదేశమునకు అవతారికగా ఈ అధ్యాయము ప్రారంభింపబడినది. దీనిలో ఉభయపక్షములకు సంబంధించిన ముఖ్యమైన యోధుల నామములు పేర్కొనబడినవి. పిదప అర్జునుడు తన బంధుమిత్రులు నశించెదరను సందేహమునకు లోనయ్యెను. తత్ఫలితముగా అతడు మోహవ్యాకులుడై, తీవ్రవిషాదమునకు గురియయ్యెను. ఇట్టి విషాదము కూడా సత్సాంగత్యప్రభావమున సాంసారిక భోగములయందు వైరాగ్యభావన కలిగించి శ్రేయోమార్గమున ముందునకు నడిపించును. అందువలన ఇది అర్జున విషాదయోగముగా పేర్కొనబడినది.*

**అధ్యాయ సారాంశము :** *ఈ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున ధృతరాష్ట్రుడు యుద్ధవిశేషములను గూర్చి వివరింపుమని సంజయుని అడిగెను. సంజయుడు దానికి సమాధానముగా దుర్యోధనుడు ద్రోణాచార్యుని యొద్దకేగి సంభాషణ కుపక్రమించెనని రెండవ శ్లోకమున తెల్పెను. మూడవ శ్లోకమున, దుర్యోధనుడు ద్రోణాచార్యునితో పాండవుల మహా సైన్యమును చూడవలసినదిగా కోరి, నాలుగునుండి ఆఱవశ్లోకమువరకు ఆ సైన్యములోని ప్రముఖయోధుల పేర్లను తెలిపెను. ఏడవ శ్లోకమున ద్రోణాచార్యులతో తమ సైన్యములోని ప్రధాన సేనానాయకులను లెస్సగా తెలిసికొనుమని చెప్పి ఎనిమిది, తొమ్మిదవ శ్లోకముల యందు వారిలో కొందరి పేర్లను, వారి పరాక్రమములను, యుద్ధకౌశలములను వర్ణించెను. పదవ శ్లోకమున తమ సైన్యము అపరిమితమైనదనియు, పాండవుల సైన్యము పరిమితమైనదనియు తెలిపెను. పదునొకండవ శ్లోకమున భీష్ముని రక్షించుచుండవలసినదిగా వీరులందరిని కోరెను. పన్నెండవ శ్లోకమున, భీష్మపితామహుడు శంఖమును పూరించెననియూ, పదుమూడవ శ్లోకమున, కౌరవసేనలో శంఖములు, భేరులు, తప్పెటలు, మృదంగములు, కొమ్ములు మొదలైన వివిధవాద్యములు ఒకేసారి మ్రోగినవనియు వర్ణింపబడెను. పదునాలుగు నుండి పదునెనిమిదవ శ్లోకము వరకు క్రమముగా శ్రీకృష్ణ భగవానుడు, అర్జునుడు, భీమసేనుడు, యుధిష్ఠిరుడు, నకులుడు, సహదేవుడు మరియు పాండవసేనలోని సమస్తములగు ఇతరేతర ప్రముఖయుద్ధవీరులు తమతమ శంఖములను పూరించిరని తెల్పబడెను. పందొమ్మిదవ శ్లోకమున ఆ శంఖధ్వనులనుండి ఉత్పన్నమైన భయంకరశబ్దముతో భూనభోంతరాళములు ప్రతిధ్వనించెననియు, తద్ద్వారా దుర్యోధనాదులు వ్యథితులైరనియూ వర్ణింపబడినది. ఇరువది, ఇరువదొకటవ శ్లోకములలో ధార్తరాష్ట్రులు యుద్ధసన్నద్ధులగుట జూచి అర్జునుడు, శ్రీకృష్ణునితో తన రథమును ఉభయసేనల మధ్య భాగమునకు నడిపింపుమని కోరెను. ఇరువది రెండు, ఇరువది మూడవ శ్లోకములయందు సర్వసైన్యమును సమగ్రముగ పరిశీలించువరకు రథమును అచ్చటనే నిలిపి యుంచవలసినదిగా సూచించి అతడు అందరిని చూచుటకు తన ఇచ్ఛను ప్రకటించెను. ఇరువది నాలుగు, ఇరువది ఐదవ శ్లోకములలో అర్జునుని కోరిక మేరకు ఆ రథమును రెండు సేనల మధ్య నిలిపి యుద్ధము చేయుటకై ఒకచోట చేరిన వీరులందరిని పరికించవలసినదిగా శ్రీకృష్ణుడు అర్జునునితో నుడివెను. అటు పిమ్మట ముప్పదియవ శ్లోకము వరకు*

స్వజనసమూహమును గాంచి అర్జునుడు వ్యాకులపాటునందుట, తన శోకాకులస్థితిని అతడు ప్రకటించుట వర్ణింపబడినవి. ముప్పది ఒకటవ శ్లోకమున, యుద్ధమువలన కలుగబోవు విపరీత పరిణామములను గురించి అతడు వివరించెను. ముప్పది రెండు, ముప్పది మూడవ శ్లోకములలో యుద్ధవిజయమును, రాజ్య సుఖమును తాను కోరనని సహేతుకముగ తన వాదమును వినిపించెను. ముప్పది నాలుగు, ముప్పది ఐదవ శ్లోకములయందు ఆచార్యాది స్వజనమును వర్ణించెను. పిదప అర్జునుడు "నేను మరణించవలసివచ్చినను లేక త్రిలోక రాజ్యాధిపత్యము లభించినను ఈ ఆచార్యులనుగాని పితృపుత్రాది ఆత్మీయ స్వజనులను గాని చంపుటకు ఇచ్చగింపను" అని చెప్పెను. ముప్పది ఆఱవ, ముప్పది ఏడవ శ్లోకములలో దుర్యోధనాది బంధువులు ఆతతాయులైనప్పటికిని వారిని చంపుటవలన పాపము కలుగుటయేగాక, సుఖశాంతులును లభింపవని వివరించెను. ముప్పది ఎనిమిది, ముప్పది తొమ్మిదవ శ్లోకములలో కులవినాశము, మిత్రద్రోహము వలన కలుగు పాపముల నుండి తప్పించుకొనుటకు యుద్ధము చేయకుండుటయే సమంజసమని చెప్పెను. నలుబదినుండి నలుబది నాలుగవ శ్లోకమువరకు కులవినాశమువలన ఉత్పత్తిల్లెడు దోషములను గూర్చి విస్తారముగా వర్ణించెను. నలుబది ఐదు, నలుబది ఆఱవ శ్లోకములలో రాజ్యసుఖాదుల లోభముచే స్వజనులను చంపుటకై యుద్ధసన్నద్ధత మహా పాపకృత్యముగా తెలిపి, శోకమును ప్రకటించుచు దీనికంటె దుర్యోధనాదులచేత తాను సంహరింపబడుటయే శ్రేష్ఠమని పార్థుడు స్పష్టీకరించెను. ఇక చివరిదైన నలుబది ఏడవ శ్లోకమున యుద్ధము చేయకుండుటకై నిశ్చయించి శోకనిమగ్నుడైన అర్జునుడు అస్త్రత్యాగము చేసి, తేరుపై చతికిలపడిపోయిన విషయమును వివరించుచు సంజయుడు అధ్యాయమును ముగించెను.

**సంబంధము :** రాజసూయయాగమునందు పాండవుల మహదైశ్వర్యమును చూచి దుర్యోధనుని మనస్సులో అంతులేని ఈర్ష్య జనించెను. అతడు శకుని మొదలగు వారి సూచనలమేరకు జూదమాడుటకై ధర్మరాజును ఆహ్వానించెను. కపటముతో అతనిని ఓడించి అతని సర్వస్వమును కాజేసెను. పర్యవసానముగా పంచపాండవులు ద్రౌపది సహితముగ పండ్రెండు సంవత్సరములు అరణ్యవాసము చేయుటకును, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము చేయుటకును నిశ్చయింపబడినది. ఈ ప్రకారముగా పదుమూడు వత్సరముల వరకు సమస్త రాజ్యముపై దుర్యోధనుని ఆధిపత్యము ఉండునట్లును, పాండవుల అరణ్య, అజ్ఞాతవాసములు అనుకున్న రీతిగా, సవ్యముగా సాగినచో పిదప పాండవులకు తిరిగి రాజ్యము అప్పగించునట్లు నిర్ణయింపబడినది. ఇట్టి నిర్ణయము ననుసరించి పదుమూడు వత్సరముల కాలమును గడిపిన పిమ్మట పాండవులు తమ రాజ్యమును తిరిగి ఇమ్మని కోరిరి. అప్పుడు దుర్యోధనుడు దానిని నిర్ద్వంద్వముగా నిరాకరించెను. రాజ్యము తిరిగి ఇచ్చుటకు గాను, వారిని సమ్మతింపజేయుటకై జ్ఞానవృద్ధుడు, వయోవృద్ధుడునైన ద్రుపదుని పురోహితుడు రాయబారిగా పంపబడెను. కాని వారు అతని మాటలను పెడచెవిన పెట్టిరి. అప్పుడు ఉభయపక్షములలో యుద్ధ సన్నద్ధత ప్రారంభమాయెను.

యుద్ధసహాయమునకు శ్రీకృష్ణభగవానుని అర్థించుటకై దుర్యోధనుడు ద్వారకను చేరెను. అదేవిధముగా అర్జునుడు కూడా అచటికి చేరుకొనెను. భగవానుడు తన భవనమున నిదురించుచుండుటను ఇరువురును గాంచిరి. అతడు నిదురించుచుండటను చూచి దుర్యోధనుడు అతని శిరమువైపున గల ఒక ఉన్నతాసనము నలంకరించెను. అర్జునుడు చేతులుమోడ్చి నమ్రతతో భగవానుని పాదములకడ నిలుచుండెను. మేల్కొనిన వెంటనే శ్రీకృష్ణుడు తనముందున్న అర్జునుని చూచెను. మరల వెనుకకు తిరిగి చూడగా తన తలవైపున కూర్చుండియున్న దుర్యోధనుడు కన్పట్టెను. శ్రీకృష్ణభగవానుడు ఉభయులకు స్వాగతసత్కారముల నొనర్చి వారి రాకకు గల కారణముల నడిగెను. అప్పుడు సుయోధనుడిట్లు వచించెను. "నాయందును అర్జునుని యందును మీకు ఒకేవిధమగు ప్రేమ కలదు. మేమిరువురము మీకు బంధువులము. కాని మీయొద్దకు నేను ముందుగా వచ్చితిని. మొదట వచ్చిన వారికే సహాయము చేయుట సజ్జనుల నియమమైయున్నది. సమస్త భూమండలమునందు సజ్జనులందరిలోను మీరే శ్రేష్ఠులు, పూజ్యులు. అందువలన మీరు నాకే సహాయము చేయవలెను." భగవానుడిట్లనెను - సందేహము లేదు. నీవే మొదట వచ్చితివి కాని, నేను ముందుగా అర్జునుని చూచితిని. అందువలన ఇరువురకును నేను సహాయము నందింతును. కాని శాస్త్రముననుసరించి బాలకులు ముందుగా కోరుకొనుట యుక్తము.

కాబట్టి అర్జునుని కోరికయే మొదట తీర్చవలెను. నేను రెండు విధములుగ సహాయము చేసెదను. ఒకవైపు అత్యంత బలీయమగు 'నారాయణీ' యను సేన యుండును. యుద్ధము చేయననెడి ప్రతిజ్ఞతో రెండవవైపు నేను ఒంటరిగా నిలిచెదను. నేను ఆయుధమును ప్రయోగింపను. అర్జునా! ధర్మము ననుసరించి మొదట నీ కోరిక పూర్తి కావలయును. కావున ఈ రెండింటిలో నీకేది కావలయునో కోరుకొనుము." అర్జునుడు సాక్షాన్నారాయణుడగు శ్రీకృష్ణభగవానుని కోరుకొనెను. దుర్యోధనుడు పరిశేష న్యాయమున నారాయణీ సైన్యమునే కోరుకొనెను. పిమ్మట అతడు ఆ సైన్యమును తీసికొని మిక్కిలి సంతోషముతో హస్తినాపురికి తిరిగి వెడలెను.

అనంతరము భగవానుడు అర్జునుని ఇట్లు ప్రశ్నించెను - 'అర్జునా! నేను యుద్ధమే చేయనని చెప్పినప్పుడు, నీవు ఏ ఉద్దేశ్యముతో నారాయణీ సైన్యమును కాదని నన్ను స్వీకరించితివి?' సమాధానముగా కుంతీపుత్రుడు - కృష్ణా! నీవొక్కడవే అందరిని నశింపజేయుటకు సమర్థుడవు. అట్టితరి నేను సైన్యమును స్వీకరించి ఏమిచేయుదును? ఇంతియేగాక, నీవు నాకు సారథిగా నుండవలయునని నేను చిరకాలముగా కోరుకొనుచుంటిని. ఇప్పుడీ మహాయుద్ధమునందు నా ఈ కోరికను తప్పక నెరవేర్చుము" అని అనెను. భక్తవత్సలుడగు భగవానుడు అర్జునుని ఇచ్ఛానుసారముగా అతని రథసారథ్యమును స్వీకరించెను. ఈ కథనము ననుసరించి శ్రీకృష్ణభగవానుడు పార్థుని రథసారథియై, యుద్ధారంభ సమయమున కురుక్షేత్రమునందు అతనికి దివ్యమైన గీతోపదేశము చేసెను. అస్తు.

దుర్యోధనుడు, అర్జునుడు ద్వారకానగరమునుండి తిరిగి వచ్చునరికి ఉభయపక్షముల సేనలు యుద్ధమునకు సిద్ధమైయుండెను. అట్టి సమయమున శ్రీకృష్ణభగవానుడు స్వయముగా హస్తినాపురమునకు పోయి అనేక విధములుగ సంధికి దుర్యోధనుని సమ్మతింపజేయుటకు ప్రయత్నించెను. కాని - "నేను బ్రతికియుండగా పాండవులు రాజ్యమునెప్పుడునూ పొందజాలరు. అంతియేగాక, సూదిమొన మోపినంత భూమిని కూడా పాండవులకు నేనీయను" అని దుర్యోధనుడు స్పష్టముగా జెప్పెను. *(మహాభారత - ఉద్యో.ప. 127/22 నుండి 25 వరకు)* అప్పుడు తమ న్యాయోచితమైన రాజ్యమును పొందుటకుగాను తల్లియైన కుంతీదేవి ఆజ్ఞయును, శ్రీకృష్ణభగవానుని ప్రేరణను పొంది, పాండవులు యుద్ధమే కర్తవ్యమని నిశ్చయించుకొనిరి.

ఉభయపక్షములలో యుద్ధసన్నాహములు పూర్తికాగానే వేదవ్యాస భగవానుడు ధృతరాష్ట్రుని సమీపమున కేతెంచి అతనితో ఇట్లనెను - "నీవు భయంకరమగు యుద్ధమును చూడగోరినచో నేను, నీకు దివ్య చక్షువులను ప్రసాదించెదను." అప్పుడు ధృతరాష్ట్రుడు ఇట్లనెను - "బ్రహ్మర్షివరేణ్యా! కులవినాశకమగు ఈ హత్యాకాండను నేను నా కన్నులతో చూడ నిచ్చగింపను. కాని, యుద్ధవృత్తాంతమునంతయును వినగోరుదును." అప్పుడు వేదవ్యాసమహర్షి సంజయునకు దివ్యదృష్టిని ప్రసాదించి, ధృతరాష్ట్రునితో ఇట్లనెను. 'ఈ సంజయుడు నీకు యుద్ధవృత్తాంతమునంతయును వినిపింపగలడు. యుద్ధమునందలి సన్నివేశములనన్నింటిని ఈతడు ప్రత్యక్షముగా చూడగలడు, వినగలడు, తెలిసికొనగలడు. ముందుగాని, వెనుకగాని, పగటియందుగాని, రాత్రియందుగాని, రహస్యమైనదిగాని, ప్రకటితమైనదిగాని, క్రియారూపముగా పరిణమించినదిగాని లేక కేవలము మనస్సునందుండునదిగాని ఇతనికి బోధపడగలదు. వేయేల! ఇతనికి తెలియనిదంటూ లేశమాత్రమైనను ఏదియూ ఉండదు. ఈతడు విషయముల నన్నింటిని యథాతథముగా తెలిసికొనగలుగును. ఇతని శరీరమును ఏ ఆయుధమైనను స్పృశింపదు. ఇతనికి ఎట్టి బడలికయు కలుగదు.' ఇయ్యది జరుగవలసినది, తప్పక జరిగితీరును. ఈ సర్వనాశమును ఎవరునూ ఆపలేరు. చివరకు ధర్మమే జయించును." - అని పలికి వ్యాసమహర్షి వెడలిపోయెను.

పిదప ధృతరాష్ట్రుని ప్రశ్నలకు సమాధానముగా సంజయుడు భూమియందలి వివిధ ద్వీపముల వృత్తాంతమును అతనికి వినిపింపసాగెను. ఆ సందర్భముననే అతడు భారతవర్షమును గూర్చి వర్ణించెను. తదనంతరము కౌరవ, పాండవ సంగ్రామము ప్రారంభమై, వరుసగా పది దినములవరకు యుద్ధము జరిగిన పిదప భీష్మపితామహుడు రణభూమిలో రథమునుండి పడగొట్టబడెను. అప్పుడు సంజయుడు, ధృతరాష్ట్రునియొద్దకేతెంచి భీష్ముడు కొట్టబడినట్లుగా అతనికి ఆకస్మిక సమాచారమును వినిపించెను. *(మహాభారతము - భీష్మపర్వ-13)* అది విని ధృతరాష్ట్రునకు మిగుల దుఃఖము కలిగెను.

యుద్ధవిశేషముల నన్నింటిని సవిస్తరముగా వినిపింపుమని అతడు సంజయుని కోరెను. అందుకు సంజయుడు ఇరుపక్షముల సైన్యముల వ్యూహరచనాది విశేషముల నన్నింటిని వర్ణించెను. అనంతరము ధృతరాష్ట్రుడు ఆరంభమునుండి అప్పటివరకు జరిగిన సమస్త సంఘటనలను వివరముగా తెలియగోరి సంజయుని ప్రశ్నించెను. ఇచటినుండియే శ్రీమద్భగవద్గీత ప్రథమాధ్యాయము ప్రారంభమగుచున్నది. ఇది మహాభారతమునందలి భీష్మపర్వములో ఇరువదియైదవ అధ్యాయము. దీని ప్రారంభమున ధృతరాష్ట్రుడు సంజయుని ఇట్లు ప్రశ్నించెను.

**ధృతరాష్ట్ర ఉవాచ**

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంజయ | = ఓ సంజయా | యుయుత్సవః | = యుద్ధకాంక్షగలవారును (యుద్ధసన్నద్ధులైయున్నవారును)అగు | పాండవాః | = పాండుకుమారులు |
| ధర్మక్షేత్రే | = ధర్మక్షేత్రమైన | | | ఏవ | = కలిసి |
| కురుక్షేత్రే | = కురుక్షేత్రమునందు | మామకాః | = నా వారు | కిమ్ | = ఏమి |
| సమవేతాః | = చేరియున్నవారును | చ | = మఱియు | అకుర్వత | = చేసిరి |

**ధృతరాష్ట్రుడు పలికెను - ఓ సంజయా! యుద్ధసన్నద్ధులై ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునకు చేరియున్న నా కుమారులును పాండు పుత్రులును ఏమి చేసిరి? (1)**

ప్రశ్న - కురుక్షేత్రమని ఏ ప్రదేశమునకు పేరు? దానిని ధర్మక్షేత్రమని ఏల అందురు?

సమా - మహాభారతమున అరణ్య పర్వమునందలి ఎనుబది మూడవ అధ్యాయమునను, శల్యపర్వమునందలి ఏబదిమూడవ అధ్యాయమునందును కురుక్షేత్రమాహాత్మ్యము విశేషముగా వర్ణింపబడినది. ఆ తావులలో నిది సరస్వతీనదికి దక్షిణ భాగమునకును, దృషద్వతీనదికి ఉత్తర భాగమునకును మధ్యన ఉండినట్లు తెలుపబడినది. దీని పొడవు వెడల్పులు ఐదేసి యోజనములు (40 మైళ్ళు) విస్తరించియుండెనని చెప్పుదురు. ఈ ప్రదేశము అంబాలాకు దక్షిణముగా, ఢిల్లీనగరమునకు ఉత్తరదిశగానున్నది. నేడు కూడా కురుక్షేత్రమను పేరుగల ప్రదేశము అచ్చటనే ఉన్నది. దీనికి శమంతపంచకమని కూడా పేరు కలదు. ఇచట అగ్ని, ఇంద్రుడు, బ్రహ్మ మొదలగు దేవతలు తపస్సు చేసియుండినట్లు శతపథ బ్రాహ్మణాదులలో చెప్పబడి యున్నది. కురుమహారాజు కూడా ఇచట గొప్ప తపస్సు చేసియుండెను. ఇచట మరణించినవారికి ఉత్తమగతి ప్రాప్తించును. అంతేగాక, ఇది ధర్మక్షేత్రము, పుణ్యక్షేత్రము అని చెప్పబడుటకు ఇతర కారణములు కూడా కలవు.

ప్రశ్న - ధృతరాష్ట్రుడు 'మామకాః' అను పదమును ఎవరినుద్దేశించి ప్రయోగించెను? అట్లే 'పాండవాః' అను పదము ఎవరిని ఉద్దేశించి చెప్పబడినది? 'సమవేతాః' 'యుయుత్సవః' అనువిశేషణములతోపాటు ప్రయోగింపబడిన 'కిమ్ అకుర్వత' అనుపదముల తాత్పర్యమేమి?

సమా - 'మామకాః' అను పదమును తన పుత్రులగు దుర్యోధనాదుల గురించియు మరియు అతని పక్షమునందలి యోధులందరిని గురించియు ధృతరాష్ట్రుడు ప్రయోగించెను. 'పాండవాః' అను పదము ధర్మరాజాదులను గూర్చియు, వారి పక్షము నందలి యోధులందరిని గూర్చియు ఉద్దేశించి ప్రయోగింపబడినది. 'సమవేతాః' 'యుయుత్సవః' అను విశేషణములతోబాటు 'కిమ్ అకుర్వత' అనుచు ధృతరాష్ట్రుడు గడచిన పది దినములనుండి జరుగుచున్న భయంకరమగు యుద్ధమును గురించిన వివరముల నెరుంగగోరెను. అంతియే గాక యుద్ధమునకై ఒకచోట చేరిన వీరందరును రణమునెట్లు ప్రారంభించిరి? ఎవరు, ఎవరితో, ఎట్లు తలపడిరి? ఎవరిచే నెవరు, ఏ విధముగ, ఎప్పుడు చంపబడిరి? మొదలగు వానిని తెలిసికొనగోరెను.

భీష్మ పితామహుని పతనమువరకు భయంకర యుద్ధ

రంగవిశేషములను ధృతరాష్ట్రుడు వినియే యుండెను. అందువలన అతనికి ఇంతవరకును యుద్ధవర్తమానము లేవియు తెలియవని భావింపరాదు. ధర్మక్షేత్ర ప్రభావమువలన తన పుత్రుల బుద్ధి చక్కబడి, వారు పాండవులకు వారి రాజ్యమునిచ్చి యుద్ధమును నిలిపిరా? ధర్మరాజైన యుధిష్ఠిరుడే ధర్మక్షేత్ర ప్రభావముచేత ప్రభావితుడై రణమును విరమించెనా? ఇప్పటివరకు ఉభయసేనలు నిలబడియేయున్నవా! యుద్ధము ఇంకనూ జరుగుచున్నదా? ఒకవేళ జరుగుచుండినచో దాని పరిణామ మేమి? ఇత్యాదులను తెలిసికొనగోరెను.

*సంబంధము - ధృతరాష్ట్రుని ప్రశ్నలకు సంజయుడిట్లు సమాధానము నిచ్చుచున్నాడు-*

**సంజయ ఉవాచ**

## దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా ।
## ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥ 2 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| తదా = | అప్పుడు | పాండవానీకమ్ = | పాండవసేనను | ఆచార్యమ్ ఉపసంగమ్య = | ద్రోణాచార్యుని సమీపమునకుచేరి |
| రాజా = | రాజైన | దృష్ట్వా = | చూచి | వచనమ్ = | (ఈ) వచనమును |
| దుర్యోధనః = | దుర్యోధనుడు | తు = | మరియు | అబ్రవీత్ = | పలికెను. |
| వ్యూఢమ్ = | మోహరించియున్న | | | | |

**సంజయుడు పల్కెను - ఆ సమయమున రాజైన దుర్యోధనుడు వ్యూహరచనతో సమరమునకు మోహరించియున్న పాండవసైన్యమును చూచి ద్రోణాచార్యుని కడకేగి యిట్లు పలికెను. (2)**

ప్రశ్న - దుర్యోధనుని రాజశబ్దముతో వ్యవహరించుటలోని అభిప్రాయమేమి?

సమా - సంజయుడు దుర్యోధనుని రాజశబ్దముతో వ్యవహరించుటలో అనేక భావములుండవచ్చును.

క) దుర్యోధనుడు గొప్పవీరుడు, రాజనీతిజ్ఞుడు, అంతియే గాక పరిపాలన సంబంధములైన కార్యములన్నింటిని అతడే నిర్వర్తించుచుండెను.

ఖ) సత్పురుషులు అందరినీ గౌరవింతురు. సంజయుడు సత్పురుషస్వభావము గలవాడు.

గ) కుమారునియెడ గౌరవసూచకవిశేషణ ప్రయోగమును విని ధృతరాష్ట్రునకు సంతోషము కలుగును.

ప్రశ్న - వ్యూహరచనతో కూడిన పాండవ సేనను గాంచిన దుర్యోధనుడు ద్రోణాచార్యుని కడకేగుటలోగల ఆంతర్యమేమి?

సమా - పాండవసేనా వ్యూహరచన విచిత్ర పద్ధతిలో నుండెను. దానిని గాంచిన దుర్యోధనుడు చకితుడయ్యెను. ధైర్యమును కోల్పోయి స్వయముగా దానిని గురించి తెల్పుటకై ద్రోణాచార్యుల యొద్దకు పరుగెత్తెను. పాండవ సేనావ్యూహరచనను గురించి విని, స్వయముగా చూచి ధనుర్వేదమహాచార్యుడైన ద్రోణుడు వారి వ్యూహరచనకంటె, తమ సైన్యమును కూడా అద్భుతరూపమున వ్యూహరచన చేయుటకుగాను భీష్మునకు తగు సూచనలను ఇయ్యవలసినదిగా అతడు ద్రోణునితో చెప్పెను. దుర్యోధనుని ఆంతర్యము ఇదియే.

ప్రశ్న - రాజైన దుర్యోధనుడు స్వయముగా సేనాపతి యొద్దకు వెళ్ళుటకు మారుగా ఆయననే తన యొద్దకు పిలిపించుకొని అన్ని విషయములను వివరింపవచ్చును కదా?

సమా - భీష్మపితామహుడు ప్రధానసేనాపతి అయినప్పటికినీ కౌరవసేనలో గురువైన ద్రోణాచార్యులవారి స్థానముకూడా ఉన్నతమైనది, బాధ్యతాయుతమైనది. సైన్యమునందు ప్రముఖ యోధుల నియామకములు ఏ స్థానములయందు జరిగినవో, అట్టి స్థానములనుండి వారు ప్రక్కకు తొలగిన యెడల సైనికవ్యవస్థలో గొప్ప అల్లకల్లోలము చెలరేగును. అందువలన ద్రోణాచార్యులను అతని స్థానము నుండి కదలనీయక దుర్యోధనుడు తానే అతని యొద్దకేగుట

ఉచితమని భావించెను. అదియునుగాక, ద్రోణాచార్యుడు వయోవృద్ధుడు, జ్ఞానవృద్ధుడేగాక గురువుమా అయి యుండుటవలన కూడా గౌరవపాత్రుడై యుండెను. ప్రధానముగా అతనినుండి తాను తన ప్రయోజనమును సిద్ధింపజేసికొనవలసి యుండెను. అందుచేత అతనికి గౌరవమిచ్చి, అతని ప్రేమకు పాత్రుడగుట కూడా అతని అభీష్టమై యుండెను. పారమార్థిక దృష్టితో కూడా అందరిపట్లను నమ్రతతో, గౌరవముతో వ్యవహరించుట కర్తవ్యమే కదా! రాజనీతిలో కూడా బుద్ధిమంతుడైన పురుషుడు తన పనిని నెరవేర్చుకొనుటకు ఇతరులను గౌరవించుచుండును. ఇటుల అన్నివిధముల దుర్యోధనుడు ద్రోణాచార్యులయొద్దకు వెళ్ళుట సముచితమే.

సంబంధము - ద్రోణాచార్యుల యొద్దకేగి, దుర్యోధనుడు చెప్పిన విషయమును సంజయుడు వివరించుచున్నాడు -

**పశ్యైతాం పాండుపుత్రాణామ్ ఆచార్య మహతీం చమూమ్ ।**
**వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆచార్య | = ఓ గురువరా! | ద్రుపదపుత్రేణ | = ద్రుపదపుత్రుని (ధృష్టద్యుమ్నుని)చే | ఏతామ్ | = ఈ |
| తవ | = నీయొక్క | | | మహతీమ్ | = గొప్పదియైన |
| ధీమతా | = బుద్ధిమంతుడును | వ్యూఢామ్ | = వ్యూహాకృతిలోనిలుపబడిన | చమూమ్ | = సైన్యమును |
| శిష్యేణ | = శిష్యుడునుఅగు | పాండు పుత్రాణామ్ | = పాండవుల యొక్క | పశ్య | = చూడుము. |

**ఓ ఆచార్యా! బుద్ధిమంతుడైన మీ శిష్యుడును, ద్రుపదపుత్రుడును అయిన ధృష్టద్యుమ్నునిచే వ్యూహాత్మకముగా నిల్పబడిన పాండవుల ఈ మహాసైన్యమును చూడుడు. (3)**

ప్రశ్న - ధృష్టద్యుమ్నుడు ద్రుపదుని కుమారుడు, మీ శిష్యుడు, బుద్ధిమంతుడు - అని దుర్యోధనుడు ఏ అభిప్రాయముతో అనెను?

సమా - దుర్యోధనుడు గొప్ప చతురుడు, కూటనీతిజ్ఞుడు. ద్రోణాచార్యునిలో ధృష్టద్యుమ్నుని యెడ ప్రతిహింసను, పాండవులయెడ దుష్ట భావమును కలిగించి, అతనిని ఉత్తేజపరచుటకుగాను దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుని 'ద్రుపదపుత్రుడు' అని, 'బుద్ధిమంతుడగు మీ శిష్యుడు' అని పేర్కొనెను. ఈ మాటలద్వారా ద్రోణాచార్యులకు దుర్యోధనుడు చెప్పదలచిన సారాంశమిది - "చూడుడు! ద్రుపదుడు పూర్వము మీ యెడల అనుచితముగా ప్రవర్తించెను. పిదప మిమ్ము వధింపనెంచి అతడు యజ్ఞము చేసి ధృష్టద్యుమ్నుని పుత్రునిగా బడసెను. ధృష్టద్యుమ్నుని కూటనీతిజ్ఞత, మీ సరళస్వభావము లెట్టివి అనగా - మిమ్ము వధించుటకొరకే పుట్టి అతడు మీ నుండియే ధనుర్వేద విద్యను పొందెను. ఇప్పుడు సైతము అతని బుద్ధినైపుణ్యమును తిలకింపుడు! అతడు మిమ్ములను రెచ్చగొట్టుటకొరకు ఎంతటి సుందరమైన వ్యూహమును పన్నినాడు. ఇట్టి వ్యక్తిని పాండవులు తమ ప్రధానసేనాపతిగా చేసికొనిరి. ఇప్పుడిక మీ కర్తవ్యమెద్దియో మీరే యోచింపుడు'

ప్రశ్న - కౌరవుల సైన్యము పదునొకండు అక్షౌహిణులు. పాండవసేన కేవలము ఏడు అక్షౌహిణులు మాత్రమే. అట్టితరి దుర్యోధనుడు పాండవులది చాల గొప్ప సైన్యమని ఎందుకు అనెను? దానిని చూడుడని ఆచార్యులనేల కోరెను?

సమా - సంఖ్యలో చాలా చిన్నదైనప్పటికిని వజ్రవ్యూహ కారణమున పాండవసేన చాల పెద్దదిగా కన్పట్టుచుండెను. సంఖ్యాదృష్టితో స్వల్పమైనప్పటికి కూడా సంపూర్ణమైన వ్యవస్థ కలిగిన సేన విశేషశక్తిశాలినిగా భావింపబడును. అందువలన - "వారిచే నిలబెట్టబడిన ఈ వ్యూహాకారమున నున్న సువ్యవస్థితమగు మహాసైన్యమును చూడుడు. దానికి ప్రతిగా మనకు విజయము సంప్రాప్తింప చేయగలుగు నుపాయమును ఆలోచింపుడు" అని దుర్యోధనుడు కోరుచున్నాడు.

సంబంధము - పాండవ సేనావ్యూహనిర్మాణమును జూపించిన దుర్యోధనుడు మూడు శ్లోకములలో పాండవసేనలోని ప్రముఖులగు మహారథుల పేర్లను వివరించుచున్నాడు-

**అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4 ॥**

**ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్ ।**
**పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥ 5 ॥**

**యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6 ॥**

అత్ర = ఈ సేనయందు
మహేష్వాసాః = గొప్పధనుస్సులు గలవారును
చ = మరియు
యుధి = యుద్ధమునందు
భీమార్జునసమాః = భీమార్జునులతో సమానులును
శూరాః = శూరులును అగు
యుయుధానః, చ = సాత్యకియును
విరాటః, చ = విరాటుడును
మహారథః = మహారథుడగు
ద్రుపదః = ద్రుపదుడును
ధృష్టకేతుః, చ = ధృష్టకేతుడును
చేకితానః, చ = చేకితానుడును
వీర్యవాన్ = పరాక్రమశాలియగు
కాశిరాజః = కాశీరాజు
పురుజిత్ = పురుజిత్తు
కుంతిభోజః, చ = కుంతిభోజుడును
నరపుంగవః = మానవులలో శ్రేష్ఠుడైన
శైబ్యః = శైబ్యుడును
విక్రాంతః = పరాక్రమవంతుడగు
యుధామన్యుః, చ = యుధామన్యుడును
వీర్యవాన్ = వీరుడైన
ఉత్తమౌజాః = ఉత్తమౌజుడు
సౌభద్రః చ = సుభద్రాకుమారుడైన అభిమన్యుడు
ద్రౌపదేయాః = ద్రౌపదీకుమారులు ఐదుగురును
సర్వే, ఏవ = అందఱును
మహారథాః = మహారథులు
(సంతి) = కలరు

ఈ సేనలో ధనుర్ధారులైన గొప్పయోధులు కలరు. వారిలో సాత్యకి, విరాటుడు, మహారథియైన ద్రుపదమహారాజు, ధృష్టకేతువు, చేకితానుడు, వీరుడైన కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరశ్రేష్ఠుడైన శైబ్యుడు, పరాక్రమవంతుడైన యుధామన్యుడు, వీరుడైన ఉత్తమౌజుడు, సుభద్రాపుత్రుడైన అభిమన్యుడు, ద్రౌపదియొక్క ఐదుగురు పుత్రులును కలరు. వీరందరును మహారథులు. శౌర్యమున భీమార్జునసమానులు. **(4-6)**

ప్రశ్న - 'అత్ర' అను పదము ఇచట ఏ అర్థమున ప్రయోగింపబడినది?

సమా - ఇచట 'అత్ర' అను పదము పాండవసైన్యమును గూర్చి ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'యుధి' అను పదము 'అత్ర'తో గాకుండా 'భీమార్జున సమాః' అనుపదముతో అన్వయింపబడినదేల?

సమా - అప్పటివరకు యుద్ధము ప్రారంభింపబడి యుండనందున 'యుధి' అను పదము 'అత్ర' యొక్క విశేష్యము కాజాలదు. అంతియేగాక, అంతకుముందే పాండవసైన్యము వర్ణింపబడినందున అత్ర అను పదము సహజముగా దానినే తెల్పును. కనుక దానికెట్టి విశేష్యముతో పనిలేదు. అందులకే ఇచట 'భీమార్జున సమాః'తోబాటు 'యుధి' శబ్దమును అన్వయించి, యుద్ధ విద్యయందు, పరాక్రమమునందు భీమార్జునులతో సమానులైన మహారథులగు వారి పేర్లు పేర్కొనబడినవి.

ప్రశ్న - యుయుధానుడు. విరాటుడు, ద్రుపదుడు,

ధృష్టకేతువు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అనువారలు ఎవరు?

సమా - అర్జునుని శిష్యుడగు సాత్యకికిగల నామాంతరమే **'యుయుధానుడు'** (మహాభారతం-ఉద్యో-81/5-8). ఇతడు యాదవవంశీయుడగు శినిరాజు పుత్రుడు. (మహాభారతం - ద్రోణ-144/17-19) ఈతడు శ్రీకృష్ణభగవానుని పరమభక్తుడు. గొప్ప బలశాలి మరియు అతిరథుడు. మహాభారత యుద్ధమునందు ఇతడు మరణింపక, యాదవుల మధ్య పరస్పరముగా సంభవించిన సంగరమునందు నిర్జింపబడెను. యాదవవంశీయుడగు వేరొక యోధుడు కూడా 'యుయుధానుడు' అను పేరును గలిగియుండెను. (మహాభారతం-ఉద్యో-152/6)

ధార్మికుడగు **విరాటుడు** మత్స్యదేశపు రాజు. పాండవులు ఒక సంవత్సరకాలము అజ్ఞాతవాసమును ఇతనియొద్దనే గడిపినారు. ఇతని కుమార్తెయగు ఉత్తరకు, అర్జునుని కుమారుడగు అభిమన్యునితో వివాహము జరిగినది. మహాభారత యుద్ధములో ఈతడు ఉత్తరుడు, శ్వేతుడు, శంఖుడను తన ముగ్గురు కుమారులతో సహా వధింపబడెను.

**ద్రుపదుడు** పాంచాలదేశ భూపతి. పృషతుని కుమారుడు. పృషతునికి, భరద్వాజమునికి మధ్యమంచి స్నేహముండెను. ద్రుపదుడు కూడా తన బాల్యావస్థలో భరద్వాజముని ఆశ్రమమున నుండెను. అప్పుడే భరద్వాజుని పుత్రుడగు ద్రోణునితో అతనికి మైత్రి ఏర్పడినది. పృషతుడు పరలోకగతుడైన పిమ్మట ద్రుపదుడు రాజయ్యెను. ఒకనాడు ద్రోణుడు అతని కడకేగి అతనిని మిత్రమా! అని సంబోధించెను. ద్రుపదునకది అవమానముగా దోచినది. అంతట ద్రోణుడు క్షోభపడి వెడలిపోయెను. అనంతరము ద్రోణుడు కౌరవపాండవులకు అస్త్రవిద్యను నేర్పి, గురుదక్షిణగా అర్జునుని ద్వారా ద్రుపదుని పరాజితుని గావించి, తన అవమానమునకు బదులు దీర్చుకొనెను. అతని అర్ధరాజ్యమును తీసికొనెను. ద్రుపదుడు పైకి ద్రోణునితో ప్రీతినటించెను. కాని అతని మనసులో క్షోభ గూడు కట్టుకొనియే యుండెను. అతడు ద్రోణుని చంపగలిగెడు పుత్రుని బడయుటకు యాజ, ఉపయాజులు అను ఋషుల సాయమున యజ్ఞము చేయించెను. ఆ యజ్ఞవేదిక నుండియే ధృష్టద్యుమ్నుడు, కృష్ణ ఉద్భవించిరి. ఆ కృష్ణయే ద్రౌపది. ఆమె యాజ్ఞసేని అను నామాంతరముతో ప్రసిద్ధి నొందెను. స్వయంవరము నందు విజయము సాధించి పాండవులు ఆమెను పెండ్లాడిరి. ద్రుపదరాజు గొప్ప శూరుడు, వీరుడు, మహారథి. మహాభారతరణరంగమునందు అతడు ద్రోణునిచేత నిహతుడాయెను. (మహాభారతం-ద్రోణ-186)

**ధృష్టకేతువు** చేది దేశాధిపతియైన శిశుపాలుని కుమారుడు. ఈతడు మహాభారత యుద్ధమందు ద్రోణునిచే సంహరింపబడెను. (మ.భార.ద్రోణ.125)

**చేకితానుడు** వృష్ణివంశీయుడగు యాదవుడు. (మ.భార. భీష్మ.84/20) మహారథుడు, యోధుడు, గొప్పశూరుడు. పాండవుల ఏడు అక్షౌహిణుల సైన్యమునకు చెందిన ఏడుగురు సేనాపతులలో నొకడు. (మహాభార.ఉద్యో.151) మహాభారత యుద్ధము నందు ఈతడు దుర్యోధనుని చేతిలో మరణించెను. (మ-భార-శల్య-12)

**కాశీరాజు** కాశీరాజ్యాధిపతి. ఈతడొక గొప్పవీరుడు. మహారథి. ఇతనిపేరు సరిగా తెలియరాదు. (మ.భార-ఉద్యో-171) కాని ఇతని పేర్లు సేనాబిందు, క్రోధహంత అని పేర్కొనబడినవి. కర్ణపర్వమునందలి ఆరవ అధ్యాయములో కాశీరాజు సంహరింపబడిన వర్ణనము నందు ఇతని పేరు **'అభిభూ'**అని పేర్కొనబడినది.

**పురుజిత్తు**, కుంతిభోజుడు అనువీరిరువురు కుంతీదేవి సోదరులు. యుధిష్ఠిరాదులకు మేనమామలు. ఈ సోదరులిరువురు మహాభారత రణము నందు ద్రోణాచార్యునిచేత చంపబడిరి. (మ.భా.కర్ణ 6/22,23)

**శైబ్యుడు** ధర్మరాజునకు కూతురు నిచ్చిన మామ. ఈతని కూతురగు దేవికతో యుధిష్ఠిరునకు వివాహమైనది. (మ.భార-ఆది.95) ఈతడు మానవశ్రేష్ఠుడు, అతిబలశాలి, వీరుడు, యోధుడు. అందుచేతనే ఇతడు 'నరపుంగవుడు' అని తెల్పబడెను.

**యుధామన్యుడు, ఉత్తమౌజుడు** అను ఇద్దఱు సోదరులు పాంచాల దేశ రాజకుమారులు (మ.భార - ద్రోణ-130) మొదట అర్జునుని రథచక్రములను రక్షించుటకు వీరు నియమింపబడిరి. (మ.భార.భీష్మ -15/19) వీరుభయులునూ బహుపరాక్రమవంతులు, అతిబలసంపన్నులగు వీరులు. అందువలననే వీరికి వరుసగా 'విక్రాంత', 'వీర్యవాన్' అను విశేషణములు చేర్చబడినవి. ఈ ఇరువురు రాత్రి

నిదురించువేళ అశ్వత్థామ చేత వధింపబడిరి. (మ.భార-సౌప్తిక-8/34-37)

ప్రశ్న - అభిమన్యుడెవరు?

సమా - శ్రీకృష్ణభగవానుని సోదరియగు సుభద్రను అర్జునుడు పరిణయమాడెను. వారి కుమారుడే అభిమన్యుడు. మత్స్యదేశరాజగు విరాటుని పుత్రికయగు ఉత్తరతో ఈతని వివాహమయ్యెను. ఇతడు తన తండ్రియగు అర్జునుని యొద్దను, ప్రద్యుమ్నుని యొద్దను అస్త్రవిద్యల నభ్యసించెను. ఇతడొక అసాధారణవీరుడు. మహాభారత రణరంగమునందు ఒకనాడు ద్రోణాచార్యుడు చక్రవ్యూహమును నిర్మించెను. పాండవ పక్షమునకు చెందిన యుధిష్ఠిరుడు, భీముడు, నకులుడు, సహదేవుడు, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు మొదలగు వీరులెవ్వరును దానియందు ప్రవేశింపలేకపోయిరి. జయద్రథుడు అందరిని పరాజితుల గావించెను. అర్జునుడప్పుడు వేరొకవైపున యుద్ధము చేయుచుండెను. ఆనాడు వీరుడు, యువకుడునగు అభిమన్యుడు ఒంటరిగా ఆ వ్యూహమును భేదించి, దాని యందు ప్రవేశించి అసంఖ్యాకులగు వీరులను సంహరించి తన అసాధారణ శౌర్యమును ప్రదర్శించెను. ద్రోణుడు, కృపాచార్యుడు, కర్ణుడు, అశ్వత్థామ, బృహద్బలుడు, కృతవర్మ - అను ఈ ఆరుగురు మహారథులు ఒక్కుమ్మడిగా అన్యాయముగా ఈతనిని చుట్టుముట్టిరి. అట్టి పరిస్థితిలో కూడా ఇతడొక్కడే పెక్కుమంది వీరులను మట్టి గరిపించెను. చివరకు దుశ్శాసనుని పుత్రుడు ఈతని శిరముపై గదతో గట్టిగా మోదుటచే ఇతడు మరణించెను. (మ-భార - ద్రోణ-49) ఇతని పుత్రుడే పరీక్షిన్మహారాజు.

ప్రశ్న - ద్రౌపది యొక్క అయిదుగురు పుత్రులెవరు?

సమా - ప్రతివింధ్యుడు, సుతసోముడు, శ్రుతకర్ముడు, శతానీకుడు, శ్రుతసేనుడు - అను ఐదుగురు వరుసగా యుధిష్ఠిర, భీమసేన, అర్జున, నకుల, సహదేవుల కుమారులు. ద్రౌపదీదేవి గర్భమున జన్మించినవారు. (మ-భార-ఆది-220/79-80) ఉపపాండవులని వీరు వ్యవహరింపబడిరి. రాత్రివేళ నిదురించుచుండగా అశ్వత్థామ వీరిని వధించెను. (మ.భార-సౌప్తిక-8)

ప్రశ్న - 'సర్వే ఏవ మహారథాః' అనుటలోగల అంతర్యమేమి?

సమా - శాస్త్రము నందు, శస్త్రవిద్యయందు అత్యంత నిపుణుడై యుండి, యుద్ధరంగమునందు ఒక పదివేలమంది ధనుర్ధారులగు యోధులను నడిపింప గలిగెడు అసాధారణ వీరుని 'మహారథుడు' అని అందురు.

ఏకో దశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినామ్ ।
శస్త్రశాస్త్రప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః ॥

దుర్యోధనుడిచ్చట పేర్కొనిన యోధులందరునూ మహారథులేయని తెలుపుటకే యిట్లు వచించెను. మ.భార-ఉద్యోగ-169-172లో ఇంతవరకును ఈ వీరులందరి పరాక్రమములు విడివిడిగా విస్తృతముగా వర్ణింపబడినవి: అచట కూడా వీరు మహారథులు, అతిరథులు అని పేర్కొనబడిరి. వీరుగాక పాండవ సేనలో మహారథులు ఇంకను ఉండిరి. వారి పేర్లు కూడా అచట పేర్కొనబడినవి. ఇచట గల 'సర్వే' అను పదముతో దుర్యోధనుడు వారందరిని గూర్చి సూచించెనని గ్రహింపవలయును.

*సంబంధము* - పాండవసేనలోని ప్రధానయోధుల పేర్లను తెలిపి, దుర్యోధనుడు ద్రోణాచార్యునితో ఇక తనసేనలోని ప్రధానవీరులను గూర్చి తెలిసికొనుమని కోరుచున్నాడు-

**అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।**
**నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ద్విజోత్తమ | = ఓ బ్రాహ్మణోత్తమా! | నిబోధ | = తెలిసికొనుడు | సైన్యస్య | = సేనకు |
| అస్మాకమ్ తు | = మనపక్షమువారైతే | తే | = మీయొక్క | నాయకాః | = నాయకులై యున్నారో |
| యే | = ఎవరు | సంజ్ఞార్థమ్ | = ఎఱుకకొఱకు | | |
| విశిష్టాః (సంతి) | = ప్రముఖులై ఉన్నారో | (యే) | = ఎవరయితే | తాన్ | = వారిని |
| తాన్ | = వారినిగూర్చి | మమ | = నా (యొక్క) | బ్రవీమి | = తెలిపెదను. |

**ఓ బ్రాహ్మణోత్తమా! మన పక్షముననున్న ప్రధానయోధులను గూడ గమనింపుడు. మీ యెఱుకకై మన సేనానాయకులను గూర్చియు తెలుపుచున్నాను. (7)**

ప్రశ్న - 'తు' అను పదముయొక్క అభిప్రాయమేమి? 'అస్మాకమ్' అను పదముతోబాటు దీనిని ప్రయోగించుటలో గల భావమేమి?

సమా - ఇచట 'తు' అను పదము 'కూడ' అను అర్థమును కలిగియున్నది. దీనిని 'అస్మాకమ్' అను పదముతో ప్రయోగించి దుర్యోధనుడు కేవలము

పాండవ సైన్యములోనేకాదు, మన పక్షమునందు కూడా చాలమంది గొప్ప గొప్పశూరులు, వీరులు ఉన్నారని చెప్పదలంచెను.

ప్రశ్న - 'విశిష్టాః' అను పదము ఎవరి నుద్దేశించుచున్నది? 'నిబోధ' అను క్రియాపదమునకు అర్థమేమి?

సమా - తన సేనలోని అందరికంటే గొప్పవారైన వీరులు, ధీరులు, బలశాలురు, బుద్ధిమంతులు, సాహసవంతులు, పరాక్రమశీలురు, తేజశ్శాలురు, శస్త్రవిద్యా విశారదులగు వారిని ఉద్దేశించి దుర్యోధనుడు ఇచట 'విశిష్టాః' అను పదమును ప్రయోగించెను. ఇక 'నిబోధ' అను క్రియాపదముతో - 'తమ సైన్యమునందు కూడా ఇట్టి సర్వోత్తమ శూరవీరులకు కొదువలేదు, నేను అందులో లెక్కింపదగిన కొందరి వీరుల పేర్లను ప్రత్యేకముగా మీకు తెల్పుదును. ఇక వినుడు', అని సూచించెను.

*సంబంధము - ఇక రాబోవు రెండుశ్లోకములలో దుర్యోధనుడు తన పక్షమునందలి ప్రధానవీరుల నామములను పేర్కొనుచు అన్యాన్య వీరులతోబాటు వారిని ప్రశంసించుచున్నాడు-*

**భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిస్తథైవ చ ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భవాన్, చ | = పూజ్యులైన మీరును | కృపః చ | = కృపాచార్యుడును | సౌమదత్తిః | = సోమదత్తుని కుమారుడగు భూరిశ్రవుడును. |
| భీష్మః, చ | = భీష్మపితామహుడును | తథా, ఏవ | = అట్లే | | |
| కర్ణః, చ | = కర్ణుడును | అశ్వత్థామా | = అశ్వత్థామయు | | |
| సమితింజయః | = సంగ్రామ విజయుడగు | వికర్ణః, చ | = వికర్ణుడును | | |

**మీరును, భీష్ముడు, కర్ణుడు, సంగ్రామ విజయుడగు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడు ఇందు ముఖ్యులు. (8)**

ప్రశ్న - ద్రోణాచార్యుడెవరు? దుర్యోధనుడు సమస్త వీరులలో అందరికంటెను ముందుగా 'మీరు' అనుచు అతనినేల పేర్కొనెను?

సమా - ద్రోణాచార్యుడు భరద్వాజ మహర్షి పుత్రుడు. ఈతడు అగ్నివేశ మహర్షియొద్ద మరియు పరశురాముని యొద్ద రహస్యముగా సమస్త అస్త్ర శస్త్రములను పొందెను. వేద వేదాంగ నిపుణుడు, మహా తపస్వి, ధనుర్వేద, శస్త్రాస్త్ర విద్యలలో గొప్ప మర్మజ్ఞుడు, అనుభవశాలి. ఇంకనూ యుద్ధవిద్యల యందు ఆరితేరినవాడు. అత్యంత సాహసి. అతిరథుడు, వీరుడు. బ్రహ్మాస్త్రము, ఆగ్నేయాస్త్రము మున్నగు దివ్యాస్త్రముల ప్రయోగములను అతడు చక్కగా తెలిసినవాడు. యుద్ధమున తన సంపూర్ణశక్తి నొడ్డి పరాక్రమించిన వేళ ఈతనినెవరునూ గెలువజాలరు. శరద్వానుమహర్షి కుమార్తెయగు కృపితో ఇతని వివాహమయ్యెను. వీరి కుమారుడే అశ్వత్థామ. ద్రుపదరాజునకు బాల్యసఖుడగు ద్రోణుడు ఒకనాడు అతని కడకేగి చిన్ననాటి చనువుతో 'ప్రియమిత్రమా!' అని సంబోధించెను. ఐశ్వర్యమదమత్తుడైయున్న ద్రుపదుడు అతనిని అవమానించుచు ఇట్లనెను. "నా వంటి ఐశ్వర్యవంతుడైన రాజుతో నీవంటి ధనహీనునకు, దరిద్రునకు మైత్రి ఏవిధముగను పొసగదు." ద్రుపదుని తిరస్కారమునకు ద్రోణుడు లజ్జితుడై, లోలోన మిక్కిలి బాధపడి,

హస్తినాపురమునకేగి తన బావమరిది యగు కృపాచార్యుని యొద్ద ఉండసాగెను. అచ్చట భీష్మపితా మహునితో పరిచయమేర్పడి కౌరవపాండవులకు విలువిద్యలను నేర్పుటకై నియమింపబడెను. విద్య ముగిసిన పిదప గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తేవలయునని శిష్యులకు తెల్పెను. అందు అర్జునుడే గురువుగారి ఆజ్ఞను పాలింపగలిగెను. వెంటనే వెళ్లి రణరంగమునందు ద్రుపదునోడించి మంత్రులతోబాటుగా అతనిని పట్టి తెచ్చెను. అప్పుడు ద్రోణుడు ద్రుపదుని చంపక అతనికి బుద్ధిచెప్పి వదిలిపెట్టెను. భాగీరథికి ఉత్తరదిశగానున్న అతని రాజ్యమును స్వాధీనపరముకొనెను. మహాభారత యుద్ధమునందు ఈతడు సేనాధిపతిగా నుండి ఐదు దినముల వరకు హోరాహోరిగా పోరాడెను. తుదకు 'తన పుత్రుడగు అశ్వత్థామ మరణించె'నను భ్రమ గొలుపు వార్తను విని అస్త్రసన్న్యాసము చేసెను. వెనువెంటనే సమాధిస్థితుడై భగవానుని ధ్యానింపసాగెను. ఇతడు ప్రాణత్యాగము చేసిన మీదట ఆతనిజ్యోతిర్మయస్వరూప తేజస్సు దిఙ్మండలమంతటా నిండిపోయెను. అట్టితరి ధృష్టద్యుమ్నుడు వాడియైన తన కరవాలముతో ఆతని తల నరికివేసెను.

ద్రోణుడు అత్యంతప్రసన్నుడై తన పక్షమున అత్యుత్సాహముతో యుద్ధము చేయుటకై 'మీరు' అనుచు దుర్యోధనుడు ఆతనిని ఇచట అందరికంటె ముందుగా పేర్కొనెను. విద్యనేర్పిన గురువగుటచే తాను గౌరవ పూర్వకముగా, మొట్ట మొదట 'మీరు' అనుచు పేర్కొనుట యుక్తియుక్తమే కదా!

ప్రశ్న - భీష్ముడెవరు?

సమా - భీష్ముడు శంతను మహారాజు వలన గంగాదేవియందు జన్మించెను. ఇతడు 'ద్యౌ' అను పేరుగల తొమ్మిదవ వసువుయొక్క అవతారము. (మ.భార-శాంతి-50/26) ఇతని మొదటి పేరు దేవవ్రతుడు. ఇతడు సత్యవతితో తన తండ్రి వివాహమును జరిపించుటకై ఆమె తండ్రి దాశరాజు ఆజ్ఞానుసారము పూర్ణయౌవనావస్థ యుందే స్వయముగా జీవితాంతము బ్రహ్మచారిగా నుందునని రాజ్యపదవిని త్యజింతునని భీష్మప్రతిజ్ఞ చేసెను. ఇట్టి భీషణప్రతిజ్ఞవలన ఇతనికి భీష్ముడను పేరు కలిగెను. తన తండ్రి సుఖమునకై మానవ మాత్రునకు మోహకారకమగు స్త్రీ సుఖమును, రాజ్యసుఖమును శాశ్వతముగా త్యజించెను. దీనితో మిక్కిలి ప్రసన్నుడయిన ఇతని తండ్రి శంతనుడు 'నీ ఇచ్ఛలేకుండా మృత్యువు కూడా నిన్ను కబళింపజాలదు' అను వరమును (ఇచ్ఛామరణమును) ప్రసాదించెను. ఇతడు అజన్మబ్రహ్మచారి, అత్యంత తేజస్వి, శస్త్రశాస్త్రములను రెండింటిని పూర్ణముగ నెరిగిన పారదర్శి, అనుభవజ్ఞుడు, మహాజ్ఞాని, గొప్ప వీరుడు, దృఢనిశ్చయసంపన్నుడగు మహాపురుషుడు. ఈతనిలో శౌర్యము, వీర్యము, త్యాగము, తితిక్ష, క్షమ, దయ, శమము, దమము, సత్యము, అహింస, సంతోషము, శాంతి, బలము, తేజస్సు, న్యాయప్రీతి, నమ్రత, ఉదారత, లోకప్రియత్వము, స్పష్టవాదము, సాహసము, బ్రహ్మచర్యము, విరతి, జ్ఞానము, విజ్ఞానము, మాతృపితృభక్తి, గురుసేవాది సకల సద్గుణములు పరిపూర్ణముగ వికసించియుండెను. ఇతని జీవితము భగవద్భక్తిచే ఓతప్రోతమై యుండెను. శ్రీకృష్ణుని స్వరూప తత్త్వములను చక్కగా గుర్తెరిగినవాడు. ఇతడు పరమ నిష్ఠాపరిపూర్ణ శ్రద్ధాసంపన్నుడు. శ్రీ కృష్ణ భగవానునికి పరమ భక్తుడు. మహా భారత ఆహవరంగమునందు ఇతనితో సముడైన వీరుడెవ్వడును లేడు. ఇతడు దుర్యోధనుని ఎదుట "నేను పంచపాండవుల నెన్నడును సంహరింపను. కాని ప్రతిదినము పదివేలమంది యోధులను వధింతును' అని ప్రతినబూనెను. (మ.భార.ఉద్యో. 156/21) భీష్ముడు కౌరవపక్షమునకు సేనాధ్యక్షుడై పది దివసములపర్యంతము భయంకరమైన యుద్ధమును జేసెను. తదనంతరము అంపశయ్యపై చేరి అందరకును జ్ఞానోపదేశము జేసి ఉత్తరాయణము ప్రవేశించిన మీదట తన ఇచ్ఛతో దేహమును త్యజించెను.

ప్రశ్న - కర్ణుడెవరు?

సమా - కర్ణుడు కుంతీదేవి పుత్రుడు. సూర్యుని అనుగ్రహమున కుంతీదేవి కన్యగా నున్నప్పుడే ఇతడు జననమందెను. అప్పుడీతనిని ఒక మందసమునందు భద్రపరచి కుంతీదేవి నదిలో వదిలివేసెను. కాని, భాగ్యవశమున ఇతడు మరణింపలేదు. ఆ మందసము నీటిలో కొట్టుకొనిపోయి హస్తినాపురమును జేరెను. అధిరథుడు అను పేరుగల సూతుడు ఆ బాలుని తన ఇంటికి గొనిపోయెను. అతని పత్నియగు రాధ కర్ణుని పెంచి పోషించెను. అప్పటినుండి ఇతడు రాధేయుడను పేరుతో వారి పుత్రునిగానే వ్యవహరింపబడెను. సహజకవచకుండలములతో జన్మించినందున అధిరథుడు ఈ బాలునకు 'వసుషేణుడు'

అని నామకరణముగావించెను. ఇతడు శస్త్ర, శాస్త్రముల యందు అభిజ్ఞుడు. అనుభవజ్ఞుడు, ఏలనన ఇతడు ద్రోణాచార్యుని యొద్దను, పరశురాముని యొద్దను శస్త్రాస్త్ర విద్యలనభ్యసించెను. శస్త్రవిద్యలయందును యుద్ధకళల యందును ఇతడు అర్జునునితో సమానుడు. దుర్యోధనుడు కర్ణుని అంగదేశమునకు రాజుగా జేసెను. దుర్యోధనునితో ఇతనికి ప్రగాఢమైన మైత్రి ఉండెడిది. కర్ణుడు తన తనువుతో, మనసుతో ఎల్లప్పుడు దుర్యోధనుని హితమునందే నిరతుడై యుండెడివాడు. చివరకు తన తల్లి కుంతీదేవియు, శ్రీకృష్ణభగవానుడును ఎంత నచ్చజెప్పినను ఇతడు దుర్యోధనుని వీడి పాండవపక్షమును జేరుటకు సమ్మతింపలేదు. ఇతని దానశీలత అద్వితీయము, ఎల్లప్పుడు ఇతడు సూర్యభగవానుని ఉపాసించెడివాడు. అట్టితరి ఎవరేమి అర్థించినను సంతోషముతో ఇచ్చెడివాడు. ఒకనాటి ఉదయము దేవతలరాజగు ఇంద్రుడు అర్జునుని హితముగోరి బ్రాహ్మణ వేషమును ధరించి కర్ణునియొద్దకు వెళ్లి అతని సహజ కవచకుండలములను ఇమ్మని కోరెను. అప్పుడతడు ఎంతయో ప్రసన్నుడై తత్క్షణమే తన కవచకుండలములను తీసి ఇచ్చెను. దానికి బదులుగా ఇంద్రుడు అతనికి వీరఘాతిని యను ఒక అమోఘశక్తిని ప్రసాదించెను. కదనమునందు కర్ణుడు ఈ శక్తినే ప్రయోగించి భీమసేనుని కుమారుడగు ఘటోత్కచుని వధించెను. ద్రోణాచార్యుని తర్వాత మహాభారత యుద్ధమునందు రెండు దినముల పాటు ప్రధానసేనాపతిగా నుండి అర్జుననిచే ఈతడు నిర్జింపబడెను.

ప్రశ్న - కృపాచార్యుడు ఎవరు?

సమా - ఇతడు గౌతమవంశీయుడగు శరద్వాను మహర్షి కుమారుడు. ధనుర్విద్యయందు ఆరితేరినవాడు. అనుభవజ్ఞుడు ఇతని సోదరి పేరు 'కృపి'. శంతను మహారాజు కృపతో వీరిని పెంచి పెద్దజేసెను. అందుచే ఇతడు 'కృపుడు' అనియు, ఈతని సోదరి 'కృపి' యనియు పేరొందిరి. ఇతడు వేదశాస్త్రపారంగతుడు, ధర్మాత్ముడు, సద్గుణ సంపన్నుడు, సదాచారుడు, ద్రోణాచార్యునికంటెను ముందుగ కౌరవ పాండవులకును, యాదవులకును ధనుర్విద్యలను నేర్పుచుండెడి వాడు. సమస్త కౌరవవంశము నాశనమైనను ఇతడు జీవించియే యుండెను. అనంతరము పరీక్షిత్తునకు అస్త్రవిద్యను నేర్పెను. ఇతడు గొప్ప వీరుడు. ఎదుటి పక్షమును జయించుటలో కడునేర్పరి. అందుచేతనే ఇతని పేరుతోపాటు 'సమితింజయః' అను విశేషణము చేర్చబడినది.

ప్రశ్న - అశ్వత్థామ ఎవరు?

సమా - అశ్వత్థామ ద్రోణాచార్యుని ఆత్మజుడు. శస్త్రాస్త్ర విద్యలయందు అత్యంత నిపుణుడు. యుద్ధకళా ప్రవీణుడు. గొప్ప వీరుడు, శూరుడు, మహారథుడు. ఈతడు తన తండ్రియగు ద్రోణాచార్యుల యొద్దనే యుద్ధవిద్య నభ్యసించెను.

ప్రశ్న - వికర్ణుడెవరు?

సమా - ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొకడు వికర్ణుడు. ఇతడు బహుధర్మాత్ముడు, వీరుడు, మహారథుడు. కౌరవరాజ్యసభలో అత్యాచారమునకు గురియైన ద్రౌపది సభలో నున్నవారిని "నేను నిజముగా ఓడబడితినా?" అని ప్రశ్నించెను. అప్పుడు విదురుడు తప్ప తక్కిన సభాసదులందరు మౌనము వహించిరి. వారిలో వికర్ణుడొక్కడే నిండు సభయందు నిలబడి తీవ్రపదజాలముతో న్యాయమునకు, ధర్మమునకు అనుకూలముగా ద్రౌపదిప్రశ్నకు తగు సమాధానము నీయకుండుట గొప్ప అన్యాయమనియు, ద్రౌపదిని మనము గెలువలేదనియు తన అభిప్రాయమును సుస్పష్టముగా ప్రకటించెను. (మ.భా.సభా-67/18-25)

ప్రశ్న - సౌమదత్తి ఎవరు?

సమా - సోమదత్తుని పుత్రుడగు భూరిశ్రవునే 'సౌమదత్తి' అని యందురు. ఇతడు శంతనుని జ్యేష్ఠసోదరుడగు బాహ్లికుని పౌత్రుడు. ఇతడు గొప్ప ధర్మాత్ముడు. యుద్ధకళాకోవిదుడు, శూరుడు, వీరుడు, మహారథుడు, గొప్ప దక్షిణలతో కూడిన అనేక యజ్ఞములు చేసెను. ఇతడు మహాభారతయుద్ధము నందు సాత్యకిచే నిహతుడయ్యెను.

ప్రశ్న - 'తథా', 'ఏవ' అను నీ రెండు అవ్యయములు ప్రయోగించుటలోని భావమేమి?

సమా - అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రవుడు కూడా కృపాచార్యునితో సరిసమానులైన సంగ్రామ విజయులని తెల్పుట కొరకే ఈ రెండు అవ్యయములు ప్రయోగింప బడినవి.

**అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః ।**
**నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ 9 ॥**

అన్యే, చ = ఇతరులైనవారు
మదర్థే = నాకొఱకై
త్యక్తజీవితాః = (తమ)జీవితములను పణముగా ఒడ్డినవారును
బహవః = పెక్కుమంది
శూరాః = శూరులు
నానాశస్త్ర ప్రహరణాః = వివిధములగు శస్త్రాస్త్రములను గలిగియున్నవారును
సర్వే = అందఱును
యుద్ధవిశారదాః = యుద్ధమున కుశలురైన వారు
(సంతి) = ఉన్నారు.

**ఇంకను పెక్కుమంది శూరులును, వీరులును మన సైన్యమునందు కలరు. వీరందరును యుద్ధవిశారదులు. నానాశస్త్రాస్త్రధారులు. నాకొరకు తమ ప్రాణముల నొడ్డియైనను యుద్ధము చేయుటకు సిద్ధముగా నున్నవారు. (9)**

ప్రశ్న - ఈ శ్లోకము నందలి ప్రత్యేకత ఏమి?

సమా - ఇంతకుముందు శల్యుడు, బాహ్లీకుడు, భగదత్తుడు, కృతవర్మ మరియు జయద్రథాది మహారథుల పేర్లు తెలుపబడలేదు. ప్రస్తుతశ్లోకము నందు వారందరినీ ఉద్దేశించి దుర్యోధనుడు - 'ఇప్పటి వరకు నేను తెల్పిన వీరులే గాక మన పక్షమునందు మరెందరో కృపాణము, గద, త్రిశూలాది ఆయుధములను హస్తములయందు ధరించి శస్త్రములచేతను, బాణ, తోమర, శక్తిమున్నగు ప్రయోగాస్త్రములచే సుసజ్జితులైన యోద్ధలు, యుద్ధకళా కుశలురగు మహారథులు గలరు. వీరందరును నా కొరకై తమ ప్రాణముల నర్పించుటకైననూ సిద్ధముగా నున్నారు. అంతియేగాక వీరందరు తమ అంతిమశ్వాసను విడుచువరకు నా విజయమునకై నిలబడి వీరోచితముగా పోరాడుదురు అని తెలిపెను.

*సంబంధము - తన సేనయందలి యోధులగు మహారథులను ప్రశంసించి ఇక దుర్యోధనుడు ఉభయ సైన్యములను పోల్చుచూ, తమసేన, పాండవసేనకంటెనూ అతిశక్తిమంతమైనదని, ఉత్తమమైనదని ప్రకటించుచున్నాడు-*

**అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।**
**పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10 ॥**

భీష్మాభిరక్షితమ్ = భీష్మపితామహునిచే రక్షితమైన
అస్మాకమ్ = మనయొక్క
తత్ బలమ్ = ఆ సేన
అపర్యాప్తమ్ = అపరిమితమైనది (అజేయమైనది)
తు,భీమాభిరక్షితమ్ = అయితే భీమునిచే రక్షింపబడిన
ఏతేషామ్ = వీరియొక్క
ఇదమ్ బలమ్ = ఈ సైన్యము
పర్యాప్తమ్ = పరిమితమైనది (జయించుటకు సులభమైనది)

**భీష్మపితామహునిచే సురక్షితమై, అపరిమితముగానున్న మన సైన్యము అజేయమైనది. భీమునిచే రక్షింపబడుచు పరిమితముగానున్న ఈ పాండవ సైన్యమును జయించుట సులభము. (10)**

ప్రశ్న - దుర్యోధనుడు తన సేనను భీష్మపితామహుని వలన సురక్షితమని, అపరిమితమని తెలుపుటలోని అంతర్యమేమి?

సమా - దీనిచే దుర్యోధనుడు తన సేనయొక్క గొప్పదనమును సహేతుకముగ నిరూపించెను. మన సేన పైన పేర్కొనబడిన ఎందరో మహారథులతో నిండియున్నది. పరశురామునివంటి మహాయోధుని సైతము ఓడించగలిగిన అద్వితీయవీరుడగు భీష్మ పితామహునిచే సురక్షితమై యున్నది. సంఖ్యయందు కూడా పాండవసేనకంటెను నాలుగు అక్షౌహిణులసేన అధికముగా నున్నది. ఇట్టి సేనపై

విజయమును సాధించుట ఎవరికిని సంభవము కాదు. ఈ సేన అన్ని విధముల అపర్యాప్తము అనగాఅపరిమితము. శక్తిశాలిని. అందుచే సర్వథా అజేయమని అతని కథనము. మహాభారత ఉద్యోగపర్వమునందలి ఏబది ఐదవ అధ్యాయమునందు దుర్యోధనుడు ధృతరాష్ట్రుని ముందు తన సేనను గూర్చి వర్ణించుచు ఈ మహారథుల పేర్లను సూచించుచు భీష్మునిచే సురక్షితమైన తన సేన గొప్పదనమును ప్రకటించెను-

గుణహీనం పరేషాంచ బహు పశ్యామి భారత ।
గుణోదయం బహుగుణమాత్మనశ్చ విశాంపతే ॥
(మ.భార-ఉద్యో-55/67)

"భరతవంశీయుడవగు ఓ రాజా! నేను ప్రతిపక్ష సైన్యమును మిక్కిలి బలహీనముగ నున్నట్లు భావించుచున్నాను. మన సేనను ఎక్కువ గుణయుక్తముగను, పరిణామమున మిక్కిలి బలోపేతమైనదానిగను భావింతును. కావున, నేను అపజయము పాలగుటకు అవకాశమే లేదు." అనెను. ఇదే విధముగ భీష్మపర్వమునందు దుర్యోధనుడు ద్రోణుని ఎదుట తన సేనను వర్ణించినప్పుడు పై గీతాశ్లోకమును ఉన్నదియున్నట్లుగా మరల చెప్పెను. (మ.భార.భీష్మ-51/6) అంతకు ముందటి శ్లోకమునందును ఇట్లు చెప్పియున్నాడు-

ఏకైకశః సమర్థా హి యూయం సర్వే మహారథాః ।
పాండుపుత్రాన్ రణేహన్తుం స సైన్యాన్ కిముసంహతాః ॥
(మ.భార.భీష్మ-51/5)

'మీలో ఒక్కొక్కడు రణమునందు నిలిచి, పాండవులను సైన్యసమేతముగా సంహరించుటలో కడుంగడు సమర్థుడగు మహారథుడు. ఇక అందరును కలిసి వారిని వధింపగలరని వేరే చెప్పవలసినదేమున్నది?'

కావున ఇచ్చట 'అపర్యాప్తమ్' అను శబ్దముతో దుర్యోధనుడు తన సేనయొక్క గొప్పదనమునే ప్రకటించెను. ఇక మీదట పేర్కొనబడిన స్థలములలో ఈ శ్లోకము తన పక్షమునకు చెందిన యోధులను ప్రోత్సహించుటకే చెప్పబడినదని భావించుటయే సమంజసము, సందర్భోచితము.

ప్రశ్న - పాండవసేన భీమునిచే రక్షింపబడుచున్నదనియు, పరిమితమనియు తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - దీని ద్వారా దుర్యోధనుడు పాండవసేనయెడ తన న్యూనతాభావమును ప్రకటింపజూచెను. ఇచట మన సేనాసంరక్షకుడుగా భీష్ముడు ఉన్నట్లుగనే. అచట వారి సేనా సంరక్షకుడుగా భీముడు గలడు. అతడు శారీరకముగా గొప్ప బలశాలియేయైనను భీష్మునితో మాత్రము అన్నింటను సరితూగజాలడు. యుద్ధకళా విశారదుడు, శస్త్రాస్త్రనిపుణుడు. బుద్ధిమంతుడునగు భీష్మ పితామహుడెక్కడ? ధనుర్విద్య యందు అకుశలుడు, స్థూలబుద్ధియగు భీముడెక్కడ? కావున వారిసేన, మనసేనకంటెను పర్యాప్తము అనగా పరిమితశక్తి గలది. దానిపై మనము అవలీలగనే విజయమును సంపాదింపవచ్చునని అతడు ప్రకటింపదలంచెను.

*సంబంధము - ఈ విధముగ భీష్మునిచే సంరక్షితమగు తన సేన అజేయమని తెల్పి ఇక అన్ని విధములుగ భీష్ముని రక్షింపుడని దుర్యోధనుడు ద్రోణాచార్యాది మహారథుల నందరినీ అభ్యర్థించుచున్నాడు-*

**అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।**
**భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి ॥ 11 ॥**

చ =మఱియు=(కావున)
సర్వేషు అయనేషు చ = అన్ని వ్యూహ ద్వారములయందును
యథాభాగమ్ = మీమీ స్థానములయందు
అవస్థితాః = నిలిచియున్నవారై
భవంతః = మీరు,
సర్వే, ఏవ = అందఱును
హి = నిస్సందేహముగా
భీష్మమ్ ఏవ = భీష్మపితామహునే
అభిరక్షంతు = (అన్నివైపుల నుండి) రక్షింతురుగాక.

కనుక మీరందరును మీమీ స్థానములలో సుస్థిరముగా నిలిచి, అన్నివైపులనుండి నిశ్చయముగా భీష్ముని రక్షించుచుండుడు. (11)

ప్రశ్న - ఈ శ్లోక వైశిష్ట్యమేమి?

సమా - భీష్మపితామహుడు తనను తాను రక్షించుకొనుటలో సర్వథా సమర్థుడే అను విషయము దుర్యోధనుడు బాగుగా నెరుగును. 'ద్రుపద పుత్రుడగు శిఖండి తొలుత స్త్రీగా జన్మించి, తదుపరి పురుషుడుగా మారెను, "స్త్రీ రూపముతో జన్మించినందున నేను వానిని ఇప్పటికిని స్త్రీగనే భావింతును. వీరపురుషుడగువాడు స్త్రీలపై శస్త్రములను ప్రయోగింపడు. కాన అతడు ఎదురుగా వచ్చినను నేను అతనిపై శస్త్రమును ప్రయోగింపను." అని భీష్ముడు ముందుగనే పచించి యుండెను. అందువలన తమ పూర్తిసైన్యము ఒకచోట చేరిన పిదట యోధులందరితోబాటు దుశ్శాసనుని హెచ్చరించుచూ దుర్యోధనుడు ముందుగనే ఇదే విషయమును సవిస్తరముగా తెలియజెప్పెను. (మ.భార.భీష్మ- 15/14-20) ఇచట కూడా అట్టి భయమునే ఊహించి దుర్యోధనుడు తన పక్షమున గల ప్రముఖ మహారథులందరిని ఈ విధముగా కోరుచున్నాడు- "మీరందరును నియమింపబడిన వ్యూహద్వారములయందు దృఢముగ నిలిచియుండి, పూర్తిగా అప్రమత్తులై ఏ వ్యూహద్వారము నుండియు శిఖండి మన సేనలోనికి ప్రవేశించి భీష్మపితామహుని యొద్దకు చేరకుండునట్లు చూడుడు. ముందుకు వచ్చినచో, తత్క్షణమే శిఖండిని తరిమి పారద్రోలుటకు మహారథులగు మీరందరు సావధానులై యుండగలరు. ఇట్లు మీరు శిఖండినుండి భీష్ముని రక్షింపగలిగినచో, మనకెట్టి భయములేదు. మిగిలిన మహారథులను జయించుట భీష్మునకు చాల సులభమైన పని."

*సంబంధము - దుర్యోధనుడు స్వపక్షమునందలి మహారథులను ప్రశంసించి, పిదప భీష్మపితామహుని ప్రత్యేకముగా కొనియాడిన తీరును సంజయుడు వినిపించెను. తర్వాత సంఘటనలను అతడు వర్ణించుచున్నాడు-*

## తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।
## సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ 12 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కురువృద్ధః | = కురువంశమువారిలో వృద్ధుడును | తస్య | = అతని (దుర్యోధనుని) యొక్కహృదయమునందు | సింహనాదమ్, వినద్య | = సింహగర్జనమొనర్చి |
| ప్రతాపవాన్ | = పరాక్రమవంతుడును ఐన | హర్షమ్ | = సంతోషమును | శంఖమ్ | = శంఖమును |
| | | సంజనయన్ | = కలిగించుచు | దధ్మౌ | = ప్రయోగించెను (పూరించెను). |
| పితామహః | = భీష్మపితామహుడు | ఉచ్చైః | = బిగ్గరగా | | |

**కురువృద్ధుడును, ప్రతాపశాలియును ఐన భీష్మ పితామహుడు (దుర్యోధనుని ఈ మాటలు విని) అతనిని సంతోషపఱచుటకై ఉచ్చస్వరముతో సింహనాదమొనర్చి, తన శంఖమును పూరించెను. (12)**

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - కురు వంశమునందు బాహ్లీకుడు తప్ప మిగిలిన వారందరికంటెను పెద్దవాడు భీష్ముడు. కౌరవ, పాండవులందరిని ఇతడు ఒకే విధముగ ఆదరించును. పితామహుడగుటచే ఇరువర్గముల వారికిని పూజ్యుడే. అందుచే సంజయుడు ఇతనిని కురువృద్ధుడని, పితామహుడని పేర్కొనెను. వయసు నందు వృద్ధుడైనను బల, వీర్య, తేజఃపరాక్రమముల యందును, సామర్థ్యమునందును, వీరులగు యువకిశోరములను మించినవాడు. ఇందుచే ఇతనిని 'ప్రతాపవాన్' అని పేర్కొనెను. ద్రోణాచార్యుని వద్ద నిలిచిన దుర్యోధనుడు పాండవసేనను గాంచి ఒకింత కలవరపడి, చింతాక్రాంతు డగుటను భీష్ముడు గ్రహించెను. దుర్యోధనుడు తన లోలోని వ్యథను అణచుకొని యోధులలో ఉత్సాహము పెంపొందించుటకు తన సేనను ప్రశంసించుచుండుటను గూడ అతడు పరికించెను. అంతేగాక, ద్రోణాచార్యాది మహారథులనందరిని, తనను రక్షించుటకై ప్రార్థించు చుండుటను కూడా ఆయన గమనించెను. అట్టితరి భీష్మపితామహుడు తన వీరత్వమును చూపి దుర్యోధనుని ఉల్లాస పరచుటకై ప్రధాన సేనాపతిగా సమస్త సైన్యమునకును యుద్ధారంభసూచనగా సింహసదృశుడై గర్జించి, బిగ్గరగా శంఖమును పూరించెను.

**తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।**
**సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్ ॥ 13 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తతః | = పిమ్మట | పణవానక గోముఖాః | = డోళ్లు, మృదంగములు కొమ్మువాద్యములు మొదలగునవి | అభ్యహన్యంత | = మ్రోగినవి |
| శంఖాః చ | = శంఖములును | | | సః, శబ్దః | = ఆ శబ్దము |
| | | | | తుములః | = మిక్కిలి భయంకరమైనదిగా |
| భేర్యః చ | = నగారాలును | సహసా, ఏవ | = ఒక్కుమ్మడిగా | | |
| | | | | అభవత్ | = ఆయెను |

మరుక్షణమునందే శంఖములు, నగారాలు, తప్పెటలు, మృదంగములు, గోముఖవాద్యములు మొదలగునవి ఒక్కసారిగా మ్రోగినవి. దిక్కులను పిక్కటిల్లజేయు ఆ వాద్యనాదములు భయంకరములై ఒప్పినవి. **(13)**

ప్రశ్న - ఈ శ్లోక భావ విశేషమేమి?

సమా - భీష్మపితామహుడు సింహ సదృశముగ గర్జించి, శంఖము నూది యుద్ధారంభమును ప్రకటించిన వెంటనే అన్ని వైపుల ఉత్సాహము ఉప్పొంగినది. సమస్త సేనలో అన్ని దిశల నుండి విభిన్న సేనా నాయకుల శంఖములు, వివిధములగు యుద్ధ వాద్యములు ఒక్కసారిగా మ్రోగినవి. అవన్నియూ ఒక్కసారిగా మ్రోగుటచే వెలువడిన ఆ భయానక శబ్దముతో ఆకాశమంతయు ప్రతిధ్వనించెను.

సంబంధము - *"యుద్ధమునకై ఒకచోట గూడిన నావారు, పాండునందనులు ఏమి చేసిరి?" అను ధృతరాష్ట్రుని ప్రశ్నకు ప్రత్యుత్తరముగా సంజయుడు ఇంతవరకు కౌరవపక్షమునందలి వారిని గూర్చి తెల్పెను. ఇక రాబోవు అయిదు శ్లోకములలో పాండవులు ఏమి చేసిరో తెలియజెప్పుచున్నాడు-*

**తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।**
**మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥ 14 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తతః | = పిదప | స్యందనే | = రథమునందు | దివ్యౌ | = దివ్యము (అలౌకికము) లైన |
| శ్వేతైః | = తెల్లని | స్థితౌ | = కూర్చొనియున్న | | |
| హయైః | = గుఱ్ఱములతో | మాధవః, చ | = శ్రీ కృష్ణపరమాత్ముడును | | |
| యుక్తే | = కూడియున్న | పాండవః, ఏవ | = పాండుకుమారుడైన అర్జునుడును | శంఖౌ | = శంఖములను |
| మహతి | = ఉత్తమమైన | | | ప్రదధ్మతుః | = పూరించిరి. |

తదనంతరము శ్వేతాశ్వములను పూన్చిన మహారథముపై ఆసీనులైయున్న శ్రీకృష్ణార్జునులు తమ దివ్యశంఖములను పూరించిరి. **(14)**

ప్రశ్న - ఈ శ్లోకము నందలి వైశిష్ట్యమేమి?

సమా - అర్జునుని రథము బహువిశాలమైనది, దివ్యమైనది. అది సువర్ణఖచితమై తేజోవంతమైనది. మిక్కిలి దృఢమై, కడుసుందరమైనది. చిరుమువ్వలు కట్టబడిన అనేకపతాకములు దానిపైన రెపరెపలాడుచుండెను. గొప్ప దృఢమైన, విశాలములగు చక్రములను కలిగియుండెను. చంద్రతారకల చిహ్నములను కలిగిన ఎత్తైన ధ్వజము సౌదామినీ సన్నిభముగా కాంతులను విరజిమ్ముచుండెను. దానిపై హనుమంతుడు విరాజమానుడై యుండెను. ఆ ధ్వజమును గూర్చి పూర్వము సంజయుడు, దుర్యోధనునితో

నిట్లు వివరించి యుండెను. 'ఆ ధ్వజము అన్నివైపుల యోజనపర్యంతము అటునిటు ఆవరించి రెపరెప లాడుచుండును. అంబరమునందు ప్రకాశవంతమైన ఇంద్రధనుస్సువలె ఆ ధ్వజము విచిత్రవర్ణములతో గోచరించు చుండును. ఇంతటి విశాలముగ వ్యాపించియున్ననూ, అది భారమైనది కాదు, ఎచ్చటను ఆగదు, చిక్కుకొనదు. చెట్ల గుంపుల మధ్య నుండి అది నిరాటంకముగా పయనింపగలదు. దానిని చెట్లు తాకనైనను తాకజాలవు.'

అట్టి దివ్యరథమునకు దివ్యములగు నాలుగు తెల్లని గుఱ్ఱములు పూన్చబడినవి. అవి మనోహరములైనవి, సుసజ్జితములైనవి, సుశిక్షితములైనవి, బలీయములైనవి. అత్యంత వేగముగా పరుగెత్తునవి. అవి గంధర్వరాజగు చిత్రరథుడు అర్జునునకు బహుమతిగా నొసంగిన నూరు గుఱ్ఱములలోనివి. ఇందెన్ని చంపబడినప్పటికినీ వాటి సంఖ్యలో నూరింటికి నూరు సిద్ధమై యుండును. తగ్గుచుండెడివికావు. ఇవి భూమ్యాకాశములందెచటనైనను సంచరింపగలవు. ఈ గొప్పతనము రథమునకు కూడా ఉండెను. (మ.భార.ఉద్యో-56) పూర్వము ఖాండవవనము దహించువేళ అగ్నిదేవుడు ప్రసన్నుడై ఈ దివ్యమహారథమును అర్జునునకు ప్రసాదించెను. (మహాభారతం. ఆది-225) శ్రీకృష్ణ భగవానుడు, వీరవరుడగు అర్జునుడును దీనిని అలంకరించి యుండిరి. భీష్మ పితామహుడును ఇతర కౌరవయోధులును మ్రోగించిన శంఖములు మొదలగు రణవాద్యముల ధ్వనులను వారు వినిరి. వారు కూడా యుద్ధారంభమును ప్రకటించుచు తమ శంఖములను పూరించిరి. శ్రీకృష్ణార్జునులు పూరించిన ఈ శంఖములు సామాన్యమైనవి కావు, అవి అత్యంత విలక్షణములై, తేజోవంతములై, అలౌకికములైనవి, అందుచే అవి దివ్యమైనవని పేర్కొనబడినవి.

**పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।**
**పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హృషీకేశః | = శ్రీకృష్ణుడు | దేవదత్తమ్ | = దేవదత్తమను పేరుగల శంఖమును (పూరించెను) | వృకోదరః | = భీమసేనుడు |
| పాంచజన్యమ్ | = పాంచజన్యమను పేరుగల శంఖమును (పూరించెను) | భీమకర్మా | = భయంకర కృత్యములను చేయునట్టి | పౌండ్రమ్ | = పౌండ్రమను పేరుగల |
| ధనంజయః | = అర్జునుడు | | | మహా శంఖమ్ | = మహాశంఖమును |
| | | | | దధ్మౌ | = పూరించెను. |

**శ్రీకృష్ణుడు 'పాంచజన్యము'ను, అర్జునుడు 'దేవదత్త(శంఖ)ము'ను పూరించిరి. అరివీరభయంకరుడైన భీముడు "పౌండ్రము" అను మహాశంఖమును పూరించెను. (15)**

ప్రశ్న - భగవానుని 'హృషీకేశ' నామములోని అంతరార్థమేమి? అతనికి 'పాంచజన్యము' అను శంఖము ఎవరి నుండి లభించినది?

సమా - 'హృషీక'ములనగా ఇంద్రియములు. 'ఈశు'డనగా అధిపతి, స్వామి; ఇంద్రియములకధిపతిని 'హృషీకేశు'డని యందురు.[1] అంతియేగాక, హర్ష, సుఖ, సౌఖ్యయుతమైన ఐశ్వర్య నిధానమును 'హృషీకేశ'మని యందురు.[2] భగవానుడు ఇంద్రియములకు అధీశ్వరుడు మరియు హర్ష, సుఖ, పరమైశ్వర్యములకు నిధానమైనవాడు కూడా అగుటచే అతనికి 'హృషీకేశు'డను పేరు ఏర్పడెను. పంచజనుడను పేరుగల శంఖరూపధారియగు దైత్యుని సంహరించి భగవానుడు అతని శంఖమును స్వీకరించెను.

1) హృషీకాణీంద్రియాణ్యాహుస్తేషామీశో యతో భవాన్ । హృషీకేశస్తతో విష్ణో ఖ్యాతో దేవేషు కేశవ ॥
అనగా - ఓ విష్ణో! హృషీకములని ఇంద్రియముల నందురు. మీరు వాటికి ఈశులై(స్వామియై) యున్నారు. అందుచే కేశవా! మీరు దేవతలలో హృషీకేశుడను పేరుతో విఖ్యాతినొందినారు.

2) హర్షాత్ సుఖాత్ సుఖైశ్వర్యాత్ హృషీకేశత్వమశ్నుతే । (మ.భార.ఉద్యో-70/9)
అనగా- హర్ష (హృషీ) సుఖ (క) సుఖమయ ఐశ్వర్య (ఈశ)ములకు నిధానమగుటచే శ్రీకృష్ణుడు హృషీకేశత్వమును పొందెను.

అందుచే ఆ శంఖమునకు 'పాంచజన్యము'ను పేరు కలిగినది. (హరివంశం 2/33/17)

ప్రశ్న - అర్జునునకు 'ధనంజయు'డను పేరేల కలిగెను? 'దేవదత్త'మను శంఖము అతనికి ఎట్లు లభించినది?

సమా - రాజసూయాధ్వర సమయమున అర్జునుడు పెక్కుమంది రాజులను జయించి అపార ధనమును తెచ్చియుండెను. అకారణమున అతనికి ధనంజయుడను పేరు కలిగినది. పూర్వము అర్జునుడు నివాతకవచాది దైత్యులతో పోరువేళ ఇంద్రుడు అతనికి 'దేవదత్త'మను శంఖమును ప్రసాదించెను. (మ.భార.అరణ్య - 174/5) ఈ శంఖధ్వని అతి భయంకరమైనది. ఆ ధ్వనిని వినిన శత్రుసైన్యములు భయముతో గడగడలాడెడివి.

ప్రశ్న - భీమసేనునకు భీమకర్మా, వృకోదరః, అను పేర్లు ఏల కల్గినవి? అతని పౌండ్రమను శంఖము మహాశంఖమని ఏల తెల్పబడినది:

సమా - భీమసేనుడు అతి బలశాలి. అతని పనులు చూచిన వారికినీ, వినిన వారికినీ మనస్సునందు అత్యంత భయోత్పాతము కలుగుచుండెడిది. అందుచే అతడు 'భీమకర్మా' అనబడెను. అతని భోజనపరిమాణము మిక్కిలి ఎక్కువగా నుండుట చేతను, దానిని జీర్ణించుకొను శక్తిమంతుడగుటచేతను, అతడు 'వృకోదరుడ'ను నామముతో వ్యవహరింపబడెను. ఈతని పౌండ్రనామ శంఖము కూడా గొప్ప ఆకారమును గలిగి, చాలా భయంకరశబ్దమును చేయునదగుటచే అది 'మహాశంఖ'మని పిలువబడెను.

**అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।**
**నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ 16 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కుంతీపుత్రః | = కుంతీదేవియొక్క కుమారుడును | అనంత విజయమ్ | = ఆనంతవిజయమను పేరుగల శంఖమును | సుఘోష మణిపుష్పకౌ | = సుఘోషము, మణిపుష్పకము అనుపేర్లుగల శంఖములను (పూరించిరి). |
| రాజా | = రాజైన | నకులః | = నకులుడు | | |
| యుధిష్ఠిరః | = యుధిష్ఠిరుడు | సహదేవః, చ | = సహదేవుడును | | |

**కుంతీపుత్రుడును, రాజును ఐన యుధిష్ఠిరుడు 'అనంత విజయము' అను శంఖమును, నకులసహదేవులు 'సుఘోష' 'మణిపుష్పకము'లను శంఖములను పూరించిరి. (16)**

ప్రశ్న - యుధిష్ఠిరుని కుంతీపుత్రుడని, రాజా! అని పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - పాండుమహారాజు కుమారులు అయిదుగురిలో యుధిష్ఠిరుడు, భీముడు, అర్జునుడు కుంతీదేవికి జన్మించిన వారు. నకులుడు, సహదేవుడు మాద్రికుమారులు. యుధిష్ఠిరుడు మరియు నకులసహదేవుల తల్లులు వేర్వేరను విషయమును స్పష్టపరచుటకొరకే యుధిష్ఠిరుని 'కుంతీపుత్రు'డని పేర్కొనెను. పైగా ప్రస్తుతము రాజ్యభ్రష్టుడయినప్పటికినీ అతడు తొలుత రాజసూయయాగము జేసి రాజులందరిపై విజయమును సాధించి, చక్రవర్తియై సామ్రాజ్యమును స్థాపించెను. భవిష్యత్తునందు అతడే రాజు కాగలడని సంజయుని దృఢ విశ్వాసము. అంతేగాక ఇప్పుడు కూడా అతని దేహము నందు సమస్త రాజలక్షణములు ఉట్టిపడు చున్నందునవే యుధిష్ఠిరుని సంజయుడు 'రాజా' అని పేర్కొనెను.

**కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః ।**
**ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥ 17 ॥**
**ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।**
**సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ॥ 18 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| పృథివీపతే | = ఓ రాజా! | అపరాజితః | = అజేయుడైన | మహాబాహుః | = గొప్ప బాహువులు గలవాడైన |
| పరమేష్వాసః | = శ్రేష్ఠమైన ధనుస్సుగల | సాత్యకిః | = సాత్యకియు | | |
| కాశ్యః చ | = కాశీరాజును | ద్రుపదః చ | = ద్రుపదమహారాజును | సౌభద్రః | = అభిమన్యుడును |
| మహారథః | = మహారథుడైన | ద్రౌపదేయాః చ | = ద్రౌపదియొక్క కుమారులు ఐదుగురును | సర్వశః | = అన్నివైపులనుండి |
| శిఖండీ చ | = శిఖండియును | | | పృథక్-పృథక్ | = వేర్వేఱుగా |
| ధృష్టద్యుమ్నః చ | = ధృష్టద్యుమ్నుడును | | | శంఖాన్ | = శంఖములను |
| విరాటః చ | = విరాటరాజును | | | దధ్ముః | = పూరించిరి |

**ఓ రాజా! మహాధనుర్ధారియైన కాశీరాజు, మహారథుడైన "శిఖండి"యు, ధృష్టద్యుమ్నుడును, విరాటరాజు, అజేయుడైన 'సాత్యకి'యు, ద్రుపదమహారాజు, ద్రౌపదియొక్క ఐదుగురు పుత్రులును, భుజబలశాలియు సుభద్రాపుత్రుడును అగు అభిమన్యుడును తమ తమ శంఖములను వేర్వేరుగా పూరించిరి. (17-18)**

ప్రశ్న - కాశిరాజు, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదీదేవి కుమారులు అయిదుగురు, అభిమన్యుడు ఇత్యాదులను గూర్చి ఇంతకు ముందే ప్రసంగవశాత్తుగా పరిచయము చేయబడినది. ఇక శిఖండి ఎవరు? ఇతడెట్లు జన్మించెను?

సమా - శిఖండి మరియు ధృష్టద్యుమ్నుడు అను ఇరువురునూ ద్రుపదమహారాజు కుమారులు. శిఖండి జ్యేష్ఠుడు, ధృష్టద్యుమ్నుడు కనిష్ఠుడు. పూర్వము ద్రుపద మహారాజునకు సంతానము లేకుండెను. అప్పుడాతడు సంతానమునకై ఆశుతోషుడగు శ్రీశంకరభగవానుని ఉపాసించెను. శంకరుడు ప్రసన్నుడైన పిదప రాజు ఆతనిని సంతానమునకై అర్థించెను. అంతట శివుడు – 'నీ కొక కుమార్తె కలుగగలద'ని వరము నొసగెను. ద్రుపదుడంతట - 'భగవాన్! నాకు కుమార్తె వలదు. నాకొక పుత్రుని ప్రసాదింపు'మని వేడుకొనెను. పిమ్మట శంకరుడిట్లనెను- 'ఆ కన్యయే కొంతకాలమునకు పుత్రరూపమున మార్పు చెందగలదు.' ఇట్టి వరప్రసాద ఫలస్వరూపముగా ద్రుపదుని ఇంట కన్య జన్మించినది. రాజు శివుని వచనములపై విశ్వాసముంచినవాడై ఆ కన్యను కుమారుడనియే ప్రసిద్ధమొనర్చెను. రాణిగారు కూడా తన కుమార్తెను మరుగుపరచి వాస్తవవిషయమును ఎవరికినీ తెలియనీయలేదు. ఆ కుమార్తెకు మగవారివలె 'శిఖండీ' అను నామకరణము జేసి, రాజకుమారునకు తగిన దుస్తులనే ధరింపజేసి యథావిధిగా విద్యాధ్యయనము చేయించిరి. యుక్తవయసు రాగానే దశార్ణదేశాధిపుడగు హిరణ్యవర్మగారి కుమార్తెతో అతనికి వివాహము కూడా జరిగెను. హిరణ్యవర్మ కుమార్తె అత్తగారి ఇంటికి వచ్చిన పిదప శిఖండి పురుషుడు కాడని, స్త్రీయేనని తెలిసికొని మిగుల దుఃఖించి, అచటి పరిస్థితిని పూర్తిగా ఒక దాసితో తన తండ్రియగు హిరణ్యవర్మకు కబురంపెను. ఇందులకు హిరణ్యవర్మ క్రుద్ధుడై ద్రుపదునిపై దండెత్తి ఆతనిని వధించుటకు నిశ్చయించుకొనెను. ఈ వార్త నెఱిగిన ద్రుపదుడు యుద్ధమునుండి రక్షించుకొనుటకై దైవారాధన చేయసాగెను. ఇక పురుషవేషధారియైన ఆ కన్యక తన కారణముగా తండ్రికి కలిగిన భయంకరమగు విపత్తును గాంచి ఎంతగానో దుఃఖించి ప్రాణత్యాగము జేయ నిశ్చయించుకొని గుట్టుచప్పుడు కాకుండా గృహమును వదలి వెడలిపోయెను. అడవిలో ఆమెకు స్థూణాకర్ణుడను పేరుగల ఐశ్వర్యవంతుడగు నొక యక్షునితో పరిచయమయ్యెను. శిఖండి వృత్తాంతమును విని దయతో స్థూణాకర్ణుడు తన పురుషత్వమును ఆతనికిచ్చి, కొంతకాలము కొరకై ఆతని స్త్రీత్వమును గ్రహించెను. ఈవిధముగ శిఖండి పురుషుడాయెను. శిఖండి తిరిగి ఇంటికేగి జరిగిన వృత్తాంతమును తల్లిదండ్రులకు వివరించి ఓదార్చెను. పిమ్మట మామయగు హిరణ్యవర్మకు తాను పురుషుడైన సంగతిని తెల్పి అతనిని శాంతపరచెను. అటు పిమ్మట కుబేరుని శాపము వలన స్థూణాకర్ణుడు జీవితాంతము స్త్రీగా నుండి పోయెను. ఈ విధముగా శిఖండి శాశ్వతముగ పురుషుడై యుండిపోయెను. ఈ ఇతిహాసము నంతయు భీష్మపితామహుడెరిగి యుండెను. అందుచే అతడు శిఖండిపై శస్త్రప్రహారము చేయకుండెను. శిఖండికూడా గొప్ప శూరుడు, వీరుడైన మహారథుడు. ఈతనిని ముందుంచుకొని అర్జునుడు - భీష్మపితామహుని నేలగూల్చెను.

ప్రశ్న - వీరందరూ వేర్వేరు శంఖములను పూరించిరి - అని చెప్పుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - 'సర్వశః' అను శబ్దముతో - శ్రీకృష్ణుడు, పాండవులు ఐదుగురు, కాశిరాజు మొదలగు ప్రధానవీరులు, అంతేగాక పాండవ సైన్యమునందలి ఎందరో రథికులు, మహారథులు, అతిరథులగు వారందరునూ తమ తమ శంఖములను పూరించినారని సంజయుడు సూచించెను. ఇదియే ఇందుగల ప్రత్యేకాంశము.

*సంబంధము - శ్రీకృష్ణభగవానుడు, అర్జునుడు తర్వాత పాండవ సేనలోని తదితర వీరులందరూ అన్నివైపుల శంఖములు మ్రోగించినారను విషయమును చెప్పి, ఇక ఆ శంఖధ్వనుల పరిణామమును సంజయుడు వివరించుచున్నాడు-*

**స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।**
**నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | నభః చ | = ఆకాశమును | ధార్తరాష్ట్రాణామ్ | = ధార్తరాష్ట్రులయొక్క అనగా మీ వారి |
| సః | = ఆ (అట్టి) | పృథివీమ్ ఏవ | = భూమిని గూడ | హృదయాని | = హృదయములను |
| తుములః | = భయంకరమైన | వ్యనునాదయన్ | = ప్రతిధ్వనింప జేయుచు | వ్యదారయత్ | = కకావికలములుగాజేసెను. |
| ఘోషః | = నాదము | | | | |

**పాండవపక్షమహాయోధుల శంఖనినాదములకు భూమ్యాకాశములు దద్దరిల్లినవి. ఆ శంఖారావములకు ధార్తరాష్ట్రుల హృదయములు కకావికలములయ్యెను. (19)**

ప్రశ్న - ఈ శ్లోకమందలి భావవైశిష్ట్య మేమి?

సమా - పాండవసేనలోని వీరులెల్లరు ఒక్కుమ్మడిగా శంఖములు మ్రోగింపగనే ఆ ధ్వని ఎంతో గంభీరమై, గాఢమై, ఉచ్చమై, భయానకమై సమస్త భూనభోంతరాళములు వ్యాపించెను. ఈ విధముగా అన్ని దిశలయందు భీషణధ్వనులు నిండగా, సర్వత్ర ప్రతిధ్వని యుత్పన్నమై భూమ్యాకాశములు మార్మ్రోగెను. ఆ శంఖారావముల ప్రతిధ్వనిని విన్న దుర్యోధనాది ధృతరాష్ట్ర పుత్రులకును, వారి పక్షమున నిలిచియున్న అన్యయోధులందరికిని హృదయకుహరములలో మహాభయము జనింపగా, వారు తమ గుండెలను ఎవరో పిండుచున్నట్లుగా వ్యథజెందిరి.

*సంబంధము - పాండవుల శంఖధ్వనితో కౌరవవీరులు వ్యథితులగుటను వర్ణించిన సంజయుడు ఇక రాబోవు నాలుగు శ్లోకములలో శ్రీకృష్ణభగవానునితో అర్జునుడు పలికిన ఉత్సాహపూరిత వచనములను వర్ణించుచున్నాడు-*

**అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।**
**ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ॥ 20 ॥**
**హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే ।**

**అర్జున ఉవాచ**

**సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహీపతే | = ఓ రాజా! | దృష్ట్వా | = చూచి | హృషీకేశమ్ | = శ్రీకృష్ణుని (తో) |
| అథ | = అనంతరము | తదా | = అప్పుడు | ఇదమ్ వాక్యమ్ | = ఈ వాక్యమును |
| కపిధ్వజః | = కపిధ్వజుడైన | శస్త్రసంపాతే ప్రవృత్తే | = శస్త్రములను ప్రయోగించుటకు సన్నద్ధుడైయున్న సమయమున | ఆహ | = పలికెను |
| పాండవః | = అర్జునుడు | | | అచ్యుత | = ఓ కృష్ణ! |
| వ్యవస్థితాన్ | = యుద్ధసన్నద్ధులై నిలిచియున్న | | | మే రథమ్ | = నా రథమును |
| | | | | ఉభయోః | = ఉభయపక్షములయొక్క |
| ధార్తరాష్ట్రాన్ | = ధృతరాష్ట్రునకు సంబంధించినవారిని | ధనుః | = ధనుస్సును | సేనయోః మధ్యే | = సేనలమధ్య |
| | | ఉద్యమ్య | = పైకెత్తి | స్థాపయ | = నిలిపియుంచుము. |

**ఓ ధృతరాష్ట్ర మహారాజా! పిమ్మట యుద్ధమునకై నడుము బిగించి సమర సన్నద్ధులైయున్న ధార్తరాష్ట్రులను చూచి, కపిధ్వజుడైన అర్జునుడు ధనుస్సును పైకెత్తి శ్రీకృష్ణునితో ఇట్లనెను. "ఓ అచ్యుత! నా రథమును ఉభయసేనలమధ్య నిలుపుము." (20-21)**

ప్రశ్న - కపిధ్వజుడని అర్జునుని పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - మహావీరుడైన హనుమంతుడు భీమసేనునకు వాగ్దానము చేసిన ప్రకారము (మ.భార.అరణ్య-151/17-18) అర్జునుని రథముయొక్క సమున్నతమగు టెక్కెముపై విరాజమానుడై యుండెను. సంగరమునందు అప్పుడప్పుడు మిక్కిలి బిగ్గరగా గర్జించుచుండెడి వాడు. (మ.భార.భీష్మ - 52/18) ఈ విషయమునే ధృతరాష్ట్రునకు జ్ఞప్తికి దెచ్చుటకై సంజయుడు అర్జునునకు కపిధ్వజుడను విశేషణమును ప్రయోగించెను.

ప్రశ్న - 'వ్యూహమును పన్ని నిశ్చలముగా నిలిచియున్న ధార్తరాష్ట్రులను అర్జునుడు చూచి శస్త్రప్రయోగమునకు తలపడునట్టి సమయములో తన గాండీవధనుస్సును ఎత్తిపట్టెను.' - అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - దుర్యోధనుడు, అతని సోదరులు, కౌరవ పక్షమున గల ఇతర యోధులందరు యుద్ధమునకు సన్నద్ధులై యుండుటను అర్జునుడు గాంచెను. వారందరును శస్త్రప్రహారములకై పూర్తిగా సంసిద్ధులై యుండిరి. అట్టి తరి అర్జునుని మనస్సున రణోత్సాహము ఉప్పొంగి వెంటనే అతడు తన గాండీవధనువును ఎత్తిపట్టెను.

ప్రశ్న - ఇచట సంజయుడు భగవానుని మరల హృషీకేశుడని నుడువుటకు కారణమేమి?

సమా - శ్రీకృష్ణుడు ఇంద్రియములకు ప్రభువు, సాక్షాత్తు పరమేశ్వరుడు. అతడు అర్జునుని రథముపై కూర్చుండి సారథ్యము చేయుచుండెను. అట్టివానితో తలపడి మీరు విజయమును ఆశించుచున్నారు. ఇదెంతటి అజ్ఞానమోకదా! అని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలియజెప్పుటకే భగవానుని హృషీకేశుడని పేర్కొనెను.

ప్రశ్న - తన రథమును ఇరుసేనల నడుమ నిలిపియుంచుమని ప్రార్థించు సమయమున అర్జునుడు శ్రీకృష్ణభగవానుని 'అచ్యుతా!' అని సంబోధించుటకు హేతువేమి?

సమా - ఏ సమయమందు కూడా పరాభవముగానీ, పతనముగానీ సంభవింపని వానిని, తన స్వరూప, శక్తి, మహాత్త్యములయందు ఎప్పటికీ, ఎల్లవేళల అస్ఖలితుడై యుండువానిని 'అచ్యుతు'డని యందురు. ఈ నామముతో భగవానుని సంబోధించి అర్జునుడు - భగవానుని మహత్త్వమును గూర్చియు అతని స్వరూపమును గూర్చియు తనకున్న జ్ఞానమును వ్యక్తపరచెను. ఇంకను అతడు పరమాత్మునితో 'మీరు రథమును నడుపుటవలన కలుగు నష్టమేమి? వాస్తవముగ మీరు సదా, సర్వదా సాక్షాత్తు పరమేశ్వరులే' యని తెలిపెను.

యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్యమ్ అస్మిన్ రణసముద్యమే ॥ 22 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| యావత్ | = ఎంతవఱకైతే | ఏతాన్ | = ఈ ప్రతియోధులను | కైః సహ | = ఎవరితో |
| అహమ్ | = నేను | నిరీక్షే | = చక్కగాచూడగలనో | యోద్ధవ్యమ్ | = యుద్ధము చేయవలసి యున్నదో (అంత వఱకును రథమును నిలిపియుంచుము) |
| అవస్థితాన్ | = రణరంగమున నిలిచి యున్నట్టి | అస్మిన్ | = ఈ | | |
| యోద్ధుకామాన్ | = యుద్ధాభిలాషులైన | రణసముద్యమే | = మహారణభూమియందు | | |
| | | మయా | = నాతో (నాకు) | | |

రణరంగమునందు యుద్ధాభిలాషులై నిలిచియున్న ప్రతిపక్ష యోధులందరిని బాగుగా పరిశీలించునంత వరకును, వారిలో ఎవరితో నేను యుద్ధము చేయవలసియున్నదో గమనించునంతవరకును రథమును నిలిపియుంచుము. (22)

ప్రశ్న - ఈ శ్లోక భావమునందలి అంతర్యమేమి?

సమా - అర్జునుడు శ్రీకృష్ణభగవానునితో ఇట్లు చెప్పుచున్నాడు - 'నా తేరును ఉభయసేనల మధ్యకు నడిపించి, సరియగు ఒకస్థానమునందు నిలుపుము. యుద్ధమొనర్చుటకై సంసిద్ధులైయున్న యోధులనందరినీ చక్కగా పరిశీలించి నేను తిలకింపగలను. నేను ఈ సంగరరంగమునందు ప్రతిపక్షమున నున్న ఏయే వీరులతో తలపడవలసి యున్నదో తెలిసికొనగల్గుదును.

**యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।**
**ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దుర్బుద్ధేః | = దుర్బుద్ధిగలవాడైన | యే | = ఎవరెవరు | సమాగతాః | = చేరియున్నారో |
| ధార్తరాష్ట్రస్య | = దుర్యోధనునియొక్క | ఏతే | = (రాజులుగలరో) వీరు | యోత్స్యమానాన్ | = యుద్ధసన్నద్ధులై యున్నట్టి వారిని |
| యుద్ధే | = యుద్ధమునందు | | | | |
| ప్రియచికీర్షవః | = ప్రియమునుగూర్ప దలచినట్టివారు | అత్ర | = ఇచ్చట (ఈ సమర భూమియందు) | అహమ్ | = నేను |
| | | | | అవేక్షే | = చూచెదనుగాక |

"దుర్బుద్ధియైన దుర్యోధనునకు ప్రియమును గూర్చుటకై యుద్ధమున పాల్గొనదలచి వచ్చియున్న రాజులను అందరిని ఒకపరి పరికించెదను." (23)

ప్రశ్న - దుర్యోధనుని దుర్బుద్ధి యని అర్జునుడు ఏల పేర్కొనెను?

సమా - పండ్రెండేండ్లు అరణ్యవాసము ఒక ఏడు అజ్ఞాతవాసము నెరపి పదుమూడేండ్లు పూర్తియైన పిమ్మట పాండవులకు వారి రాజ్యమును తిరిగి ఇచ్చివేయుటకు నిశ్చితమై యుండెను. అంతవరకు వారి రాజ్యము కౌరవుల చేతిలో న్యాసరూపమున నుండెను. కాని ఆ రాజ్యమును అన్యాయముగా కాజేయవలెనను దుర్నీతితో దుర్యోధనుడు దానిని (ఒప్పందమును) పూర్తిగా తిరస్కరించెను. దుర్యోధనుడు పాండవులయెడ ఇప్పటివరకూ పెక్కు అన్యాయములను, అత్యాచారములను చేయుచునే యుండెను. కాని, ఈసారి అతని అన్యాయము సహింపరానిదయ్యెను. దుర్యోధనుని ఇట్టి పాపబుద్ధిని తలంచి అర్జునుడు అతనిని దుర్బుద్ధి యని పేర్కొనెను.

ప్రశ్న - యుద్ధమునందు దుర్యోధనునకు ప్రియమును గూర్చుటకై వారి సైన్యమునందు చేరి సమరము చేయునట్టి రాజులను నేను చూచెదను అని అర్జునుడు పల్కుటలోని అంతర్యమేమి?

సమా - పాపబుద్ధి గల దుర్యోధనుని అన్యాయములును అత్యాచారములును సకల లోకములకును విదితములు. అయినను వానికి ప్రియమును చేకూర్పవలెనను కోర్కెతో అతనికి అండగా నిలుచుటకై రాజులనేకులు ఇచట చేరియున్నారు. దీనిచే దుర్యోధనునితో బాటు వీరి బుద్ధి కూడా పాపభూయిష్ఠమైనదని తెలియుచున్నది. వీరందరును ఈ

అన్యాయమును బాహాటముగా సమర్థించుటకై ఇట కూడియున్నారు. తమ శీవిని (ప్రదర్శించి అతని మెప్పించుచున్నారు. కాని అతనికి (దుర్యోధనునకు) మేలు చేకూర్పదలచియు నిజమునకు కీడునే గూర్చుచున్నారు. తమను తాము గొప్ప బలవంతులమని యెంచి సమరమొనర్చుటకై ఔత్సాహికులై నిలిచిన వీరు ఎవరెవ్వరో ఒక్కమారు చూచెదను. అటులనే రణరంగమున వీరెంతటి యోధులో పరికించెదను. అన్యాయమును, అధర్మపక్షమును వహించిన వీరందరికి నాదెబ్బరుచి చూపించెదను! ఇదియే అర్జునుని మాటల ఆంతర్యము.

*సంబంధము - ఈ విధముగా అర్జునుడు మాటలాడిన పిదప భగవానుడు ఏమి చేసెనో ఇక ముందు రెండు శ్లోకములలో సంజయుడు వర్ణించుచున్నాడు-*

***సంజయ ఉవాచ***

**ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24 ॥**
**భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।**
**ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ ధృతరాష్ట్రా! | భీష్మ ద్రోణ ప్రముఖతః | = భీష్మద్రోణాదుల సమక్షమున | ఇతి ఉవాచ | = ఈ విధముగా పలికెను |
| గుడాకేశేన | = అర్జునునిచేత | | | పార్థ | = ఓ అర్జునా! |
| ఏవమ్ | = ఈవిధముగా | చ | = మఱియు | సమవేతాన్ | = (యుద్ధమునకై) చేరియున్న |
| ఉక్తః | = చెప్పబడిన | సర్వేషామ్ | = సమస్త | | |
| హృషీకేశః | = శ్రీకృష్ణుడు | మహీక్షితామ్ | = రాజుల యెదుట | ఏతాన్ | = ఈ |
| ఉభయోః | = ఉభయపక్షములవారి | రథోత్తమమ్ | = ఉత్తమమైన రథమును | కురూన్ | = కౌరవులను |
| సేనయోః | = సేనలయొక్క | | | పశ్య | = చూడుము. |
| మధ్యే | = మధ్య | స్థాపయిత్వా | = నిలిపి | | |

**సంజయుడు పలికెను- ఓ ధృతరాష్ట్రా! అర్జునుని కోరికమేరకు శ్రీకృష్ణుడు ఆ దివ్యరథమును భీష్మద్రోణులకును, ఆ పక్షమునందలి మహారాజులందరికిని ఎదురుగా ఉభయసేనల మధ్య నిలిపెను. పిదప అతడు అర్జునునితో " పార్థా! ఇక్కడ సమావేశమైన ఈ కౌరవ వీరులందరిని పరికింపుము" అని నుడివెను. (24-25)**

ప్రశ్న - 'గుడాకేశ' శబ్దమునకు అర్థమేమి? సంజయుడు ఇచ్చట అర్జునుని గుడాకేశుడని ఏల పేర్కొనెను?

సమా - 'గుడాక' అనగా నిద్ర. నిద్రను జయించిన వానిని 'గుడాకేశు'డని యందురు. అర్జునుడు నిద్రను జయించెను. అతడు నిదురింపకున్నను హాయిగా నుండగలడు. నిద్ర అతనిని బాధించునది కాదు. సోమరితనమున అతడెన్నడును చిక్కుపడెడి వాడు కాడు. అందువలన సంజయుడు, అర్జునుని 'గుడాకేశు'డని పేర్కొని - నిరంతరము జాగృతుడై, సావధానుడై యుండెడు అర్జునుని మీ కుమారులు ఎట్లు జయించగలరు? అని సూచించుచున్నాడు.

ప్రశ్న - 'యుద్ధ సన్నద్ధులై చేరియున్న ఈ కౌరవులను చూడుము' - అని భగవానుడనుటలోని విశేషమేమి?

సమా - 'యుద్ధసన్నద్ధులై నిలిచియున్న వారినందరిని పరికించునంతవరకు రథమును నిలిపి యుంచుమని నీవు కోరియుంటివి. ఆ విధముగనే ఏ ప్రదేశమునుండి నీవు

అందరిని చక్కగా చూడగలుగుదువో, అట్టి స్థలమునందు నేను అరదమును నిలిపి యుంచితిని. తేరు కదలక స్థిరముగా నిలిచియున్నది. నీవు అందరిని చక్కగా చూడగలుగునంత వరకు వీక్షింపుమని భగవానుడు పల్కెను.

ఇచ్చట 'కురూన్ పశ్య' అనగా 'కౌరవులను చూడుము.' అనుమాటను ప్రయోగించి - ఓ అర్జునా! ఈ సేనయందు గల వారందరునూ నీ వంశజులే సుమా! అంతియేగాక, నీ ఆత్మీయులు, స్వజనులై యున్నారు. వారినందరిని, నీవు బాగుగా గమనింపుమని భావగర్భితముగా భగవానుడు సూచించెను. భగవానుని ఈ సూచనయే అర్జునుని అంతః కరణమున దాగియున్న బంధుప్రీతిని మేల్కొల్పెను. బంధుప్రేమచే ఉత్పన్నమైన కారుణ్యజనితమగు పిరికితనము వెల్లడియగుటకు ఈ పలుకులే బీజసదృశములైనవి.

అర్జునుని నిమిత్తముగా జేసికొని లోకకల్యాణార్థము భగవానుడే అర్జునుని యుద్ధవిముఖునిగా చేయుటకు ఈ మాటలను పలికినట్లు స్పష్టమగుచున్నది. దాని ఫలస్వరూపమే సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుని ముఖారవిందమునుండి పరమ దివ్యగీతామృత మధురరసధార వెల్లువికినది. అది త్రిలోకపావనము. అనంతకాలము సమస్తజీవులకు అత్యంత శ్రేయోదాయకము.

సంబంధము - శ్రీకృష్ణభగవానుని ఆజ్ఞను వినిన అర్జునుడు ఏమి చేసెనో సంజయుడు తెలుపుచున్నాడు-

**తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా ॥ 26 ॥**
**శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథ | = తరువాత | పితామహాన్ | = తాత ముత్తాతలను | సఖీన్ | = మిత్రులను |
| పార్థః | = అర్జునుడు | ఆచార్యాన్ | = గురువులను | శ్వశురాన్ | = పిల్లనిచ్చిన మామలను |
| తత్ర | = అచట (అ) | మాతులాన్ | = మేనమామలను | | |
| ఉభయోః | = ఉభయపక్షముల | భ్రాతౄన్ | = సోదరులను | సుహృదః, చ ఏవ | = మొదలగు ఆత్మీయులను అందరిని |
| సేనయోః అపి | = సేనలయందును | పుత్రాన్ | = పుత్రులను | | |
| స్థితాన్ | = నిలిచియున్న | పౌత్రాన్ | = మనుమలను | | |
| పితౄన్ | = పినతండ్రులను, పెదతండ్రులను | తథా | = అట్లే | అపశ్యత్ | = చూచెను |

**పిమ్మట ఆ ఉభయసేనలయందును చేరియున్న తన పెదతండ్రులను, పినతండ్రులను, తాతముత్తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, మిత్రులను, పిల్లనిచ్చిన మామలను మున్నగు ఆత్మీయులను పార్థుడు చూచెను. (26, 27 పూర్వార్థము)**

ప్రశ్న - ఈ శ్లోకముల భావవైశిష్ట్యమేమి?

సమా - భగవానుని ఆజ్ఞను అనుసరించి అర్జునుడు ఉభయసేనలలో గల సమస్త స్వజనులను వీక్షించెను. వారిలో భూరిశ్రవాది పినతండ్రులు, పితృసమానులగువారును ఉండిరి. భీష్ముడు, సోమదత్తుడు, బాహ్లీకుడు మొదలగు పితామహులు, ప్రపితామహులును ఉండిరి. ద్రోణాచార్య, కృపాచార్యాది గురుజనులు, పురుజిత్తు, కుంతిభోజుడు, శల్యుడు ఆదిగాగల మామలు ఉండిరి. అభిమన్యుడు, ప్రతివింధ్యుడు, ఘటోత్కచుడు, లక్ష్మణుడు ఆదిగా గల తన, తన సోదరపుత్రులును ఉండిరి. ఇక అర్జునునకు వరుసకు పౌత్రు (మనుమ)లగు లక్ష్మణాదుల కుమారులును ఉండిరి. తనతో కూడియాడిన మిత్రులు, సఖులును గలరు. ఇంకను ద్రుపదుడు, శైబ్యుడు మొదలగు మామలునూ ఉండిరి. ఇంతియే గాక, ఎల్లప్పుడూ అర్జునుని శుభమును గోరు పెక్కుమంది సహృదయులును ఉండిరి.

*సంబంధము - వారినందరిని పరికించిన పిదప అర్జునుడు ఏమి చేసెనో సంజయుడు తెలుపుచున్నాడు-*

**తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్ ॥ 27 ॥**

**కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।**

(28 పూర్వార్ధము)

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవస్థితాన్, తాన్ | = అట్లు చేరియున్న వారైన | సః కౌంతేయః | = కుంతీపుత్రుడైన అర్జునుడు | విషీదన్ | = శోకించుచు |
| సర్వాన్ బంధూన్ | = బంధువులందఱిని | పరయా కృపయా | మిక్కిలి కనికరముతో | ఇదమ్ | = ఈ వచనమును |
| సమీక్ష్య | = పరికించి | ఆవిష్టః | = కూడినవాడై | అబ్రవీత్ | = పలికెను. |

సమరభూమికి వచ్చియున్న బంధువులను అందరిని చూచి, కుంతీపుత్రుడైన అర్జునుడు అత్యంత కరుణాసమంచితుడై శోకసంతప్తుడై ఇట్లు పలికెను. **(28 పూర్వార్ధము)**

ప్రశ్న - 'ఉపస్థితులైన బంధువులు' అనగా ఎవరు?

సమా - అర్జునుడు తన తండ్రులను, తాతలను, ఇంకా అనేకులనుగూర్చి చెప్పియుండెను. వారేగాక, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సురథుడు మున్నగు బావమరదులను, జయద్రథాది బావలను, ఇతరులగు బంధువులను, స్వజనులను ఇరు సేనలయందు గల వారినందరిని సూచించుటకే సంజయుడు 'ఉపస్థితులైన బంధువులనందరినీ' అని పల్కెను.

ప్రశ్న - 'అర్జునుడు మిక్కిలి జాలితో గూడిన వాడయ్యెను' అని అనుటలోని అంతర్యమేమి?

సమా - అర్జునుడు నలువైపులనున్న స్వజనసముదాయమును గాంచి, ఈ యుద్ధమునందు వీరందరునూ సంహరింపబడుదురని తలచుకొనినప్పుడు బంధుప్రీతి కారణమున అతని హృదయము చలించినది. అప్పుడాతనిలో యుద్ధవిముఖత, కారుణ్యజనితమైన పిరికితనము ప్రబలములైనవి. 'అత్యంత కరుణ' అనగా నిదియే. దీనినే సంజయుడు 'పరయా కృపయా' అని తెల్పెను. ఈ పిరికితనమునకు లోనైన అర్జునుడు తన క్షత్రియోచితమగు వీరస్వభావమును మరచి, మిక్కిలి మోహవశుడయ్యెను. అతడు 'మిక్కిలి జాలితో కూడిన వాడయ్యె' ననుటలో గల అంతర్యమిదియే.

ప్రశ్న - 'ఇదమ్' అనుపదము అర్జునుని ఏయే మాటలను తెల్పును?

సమా - రాబోవు శ్లోకము నుండి నలుబది ఆఱవ శ్లోకమువరకు అర్జునుడు చెప్పిన మాటలనన్నింటిని 'ఇదమ్' అను పదము తెలుపును.

*సంబంధము - బంధుప్రీతి వలన అర్జునునిలో కలిగిన స్థితిని గూర్చి అర్జునుడే స్వయముగా రాబోవు రెండున్నర శ్లోకములలో వివరించుచున్నాడు-*

**అర్జున ఉవాచ**

**దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥ 28 ॥**

**సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।**

**వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥ 29 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృష్ణ! | = ఓ కృష్ణా! | దృష్ట్వా | = చూచి | చ | = ఇంకను |
| సముపస్థితమ్ | = (సమరభూమికి) చేరియున్న | మమ | = నాయొక్క | మే | = నాయొక్క |
| యుయుత్సుమ్ | = యుద్ధాభిలాషతో నున్న | గాత్రాణి | = అంగములు | శరీరే | = శరీరమునందు |
| ఇమమ్ స్వజనమ్ | = ఈ స్వజన సముదాయమును | సీదంతి | = పట్టుతప్పుచున్నవి | వేపథుః | = కంపము |
| | | చ | = మఱియు | రోమహర్షః చ | = గగుర్పాటు గూడ |
| | | ముఖమ్ | = నోరు | జాయతే | = కలుగుచున్నది |
| | | పరిశుష్యతి | = ఎండిపోవుచున్నది | | |

అర్జునుడు పలికెను- ఓ కృష్ణా! సమరోత్సాహముతో రణరంగమున నిలిచియున్న ఈ స్వజన సమూహమును జూచి, నా అవయవములు శిథిలములగుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. శరీరమునందు వణుకు, గగుర్పాటు కలుగుచున్నవి. (28½-29)

ప్రశ్న - అర్జునుని ఈ మాటలలోని ఆంతర్యమేమి?

సమా - "ఈ మహాయుద్ధపరిణామము అతిభయంకరముగా నుండును. ఇప్పుడు నా కట్టెదుట, నిలిచియున్న ఈ పిన్నలు, పెద్దలు, బంధువులు, ఆత్మీయులు, స్వజనులు అందరును మృత్యువునకు ఆహుతి అయ్యెదువారేకదా! అను ఈ విషయమును తలచినంతనే నాకు తట్టుకొనలేని వేదన కలుగుచున్నది. నా హృదయాంతరాళమున అంతులేని భయము ఉప్పతిల్లినది. అందువలన నా దేహమునకు ఇంతటి దురవస్థ కలుగుచున్నది." అని అర్జునుడు పలికెను.

**గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।**
**న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హస్తాత్ | = చేతినుండి | పరిదహ్యతే | = తాపము నొందుచున్నది | (అతః) | = అందువలన |
| గాండీవమ్ | = గాండీవధనుస్సు | చ, మే | = అట్లే నాయొక్క | అవస్థాతుమ్ చ | = నిశ్చలముగా నిలిచి యుండుటకును |
| స్రంసతే | = జారిపోవుచున్నది | మనః | = మనస్సు | న శక్నోమి | = సమర్థుడను కాకున్నాను |
| చ, త్వక్ ఏవ | = మఱియు చర్మముగూడ | భ్రమతి ఇవ | = భ్రమకులోనగు చున్నట్లున్నది | | |

గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మము తపించిపోవుచున్నది. మనస్సు భ్రమకు గురియైనట్లు అనిపించుచున్నది. కనుక ఇక్కడ నిలబడలేకపోవుచున్నాను. (30)

ప్రశ్న - ఈ శ్లోకము నందలి భావవైశిష్ట్యమేమి?

సమా - కారుణ్యజనితమగు పిరికితనముచే అర్జునునకు కడు శోచనీయమగు స్థితి దాపురించినది. దీనినే అర్జునుడు ఇట్లు వర్ణించుచున్నాడు - 'నా సర్వాంగములును దుర్బలములైనవి. గాండీవమును ఎక్కుపెట్టి సాయకమును సంధించుటకాదుగదా, కనీసము దానిని పట్టుకొని నిలువ జాలనంతగా చేతులు బలహీనములగుచున్నవి. అందుచే గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. యుద్ధ భవిష్యత్పరిణామములను గురించిన తలంపు (చింత) నా మనసునందు మంటలను చెలరేపుచున్నది. చర్మముకూడా దహింపబడుచున్నది. ఇట్టి మానసికవేదనవలన నా మనసు దేనియందును క్షణకాలమైనను స్థిరముగా నిలువజాలకున్నది. తత్ఫలితముగా నా తల తిరిగి పోవుచున్నది. ఇప్పుడే, ఇక్కడనే నేను మూర్ఛితుడనై పడిపోవుదునేమో యని అనిపించు చున్నది.'

ప్రశ్న - అర్జునుని గాండీవము ఎట్టిది? అది అతనికి ఎట్లు ప్రాప్తించెను?

సమా - అర్జునుని గాండీవము దివ్యమైనది. అది తాళ వృక్షముతో సమానమైనది. (మ.భార.ఉద్యో-161) తన

గాండీవమును గూర్చి పరిచయము చేయుచు బృహన్నల రూపముననున్న అర్జునుడే స్వయముగా ఉత్తరకుమారునితో నిట్లు చెప్పెను- 'ఇది అర్జునుని జగ(త్ప్రసిద్ధమైన ధనుస్సు. ఇది సువర్ణఖచితమైనది. శస్త్రములలో కెల్ల శ్రేష్ఠమైనది. లక్ష ఆయుధములతో సమమైన శక్తి కలది. ఈ ధనువుచే అర్జునుడు దేవతలపై, మానవులపై విజయమును సాధించెను. విచిత్రమైన, అద్భుతమైన, కోమలమైన, విశాలమైన ఈ ధనుస్సును దేవతలు, దానవులు, గంధర్వులు దీర్ఘకాలము వరకు ఆరాధించిరి. మిక్కిలి దివ్యమైన ఈ ధనుస్సును బ్రహ్మదేవుడు ఒక వేయి వత్సరములు, ప్రజాపతి ఐదువందల మూడు సంవత్సరములు, ఇంద్రుడు ఎనభై అయిదు వర్షములు, చంద్రుడు అయిదు వందల సంవత్సరములు, వరుణుడు నూరేండ్లు తమయొద్ద నుంచుకొనిరి.' (మ.భార. విరాట-43) దీనిని అర్జునునకు ఖాండవవనదహన సమయమున అగ్నిదేవుడు, వరుణునిచే ఇప్పించెను. (మ.భార.ఆది-225)

సంబంధము - అర్జునుడు తన విషాదస్థితిని వర్ణించిన పిదప తన ఉద్దేశ్యములో యుద్ధము చేయుట అనుచితమని ప్రతిపాదించుచున్నాడు-

**నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।**
**న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే ॥ 31 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కేశవ! | = ఓ కృష్ణా! | పశ్యామి | = చూచుచున్నాను | హత్వా | = చంపి |
| విపరీతాని | = విపరీతములైన (అశుభసూచకములైన) | ఆహవే | = యుద్ధమునందు | శ్రేయః చ | = (ఎట్టి) శ్రేయస్సును గూడ |
| నిమిత్తాని, చ | = శకునములను గూడ | స్వజనమ్ | = స్వజనసమూహమును (ఆత్మీయులను) | న అనుపశ్యామి | = చూడజాలకున్నాను |

**ఓ కేశవా! పెక్కు అపశకునములు కనబడుచున్నవి. యుద్ధమున స్వజనసమూహమును చంపుటచే శ్రేయస్సు కలుగునని అనిపించుటలేదు. (31)**

ప్రశ్న - నాకు అపశకునములు కన్పట్టుచున్నవి. అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - కొన్ని కార్యముల భావిపరిణామములను శకునములు సూచించుచుండును. ఈ శ్లోకమున 'నిమిత్తాని' అను పదము వీటిని తెల్పుటకే చెప్పబడినది. అర్జునుడు అపశకునములు కనబడుచున్నవని తెలుపుచు - 'వేళగానివేళ గ్రహణము పట్టుట, భూమి కంపించుట, ఆకాశమునుండి నక్షత్రములు రాలిపడుట మొదలగు అపశకునములచే ఈ యుద్ధపరిణామము అంత మంచిది కాబోదని వ్యక్తమగుచున్నదనియు, యుద్ధము చేయకుండుటయే శ్రేయస్కరము' అనియు తన భావమును ప్రకటించెను.

ప్రశ్న - 'యుద్ధమునందు స్వజన సమూహమును సంహరించినచో శ్రేయస్సు కలుగునని నేను తలపను' అని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - స్వజనులను, బాంధవులను యుద్ధము నందు సంహరించుట వలన ఏ విధముగను హితము చేకూరదు. ఏలనన, (1) ఆత్మీయులగు స్వజనులను సంహరించుటచే చిత్తమున పశ్చాత్తాపజనితమగు క్షోభ కలుగును. (2) వారులేని జీవితము దుర్భరమై, దుఃఖమయమగును. (3) వారిని చంపుటచే మహాపాపము కలుగును. ఈ దృష్టితో చూచినప్పుడు ఇహమున గాని, పరమునగాని జరుగుమేలు ఏమియును లేదు. అందువలన యుద్ధమొనరించుట ఏ విధముగను ఉచితముకాదని అర్జునుని మాటల ఆంతర్యము.

సంబంధము - స్వజనులను చంపుటవలన ఏ విధముగను శ్రేయస్సు కలుగదని అర్జునుడు పలికెను. దానికే మరల పుష్టి నొసగుచున్నాడు-

**న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।**
**కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా ॥ 32 ॥**

కృష్ణ! = ఓ కృష్ణా!
విజయమ్ = విజయమును
న కాంక్షే = (నేను) కోరుటలేదు (కోరను)
చ రాజ్యమ్ = మఱియు రాజ్యమును
న సైతము (కోరను)

సుఖాని చ (న) = సుఖములనుగూడ (కోరను)
నః = మాకు
రాజ్యేన = (అట్టి) రాజ్యముతో
గోవింద! = ఓ కృష్ణా!

కిమ్ = ఏమి ప్రయోజనము
వా = అథవా (లేక)
భోగైః = భోగములతో(గాని)
జీవితేన = జీవితముతో(గాని)
కిమ్ = ఏమిలాభము?

**ఓ కృష్ణా! నాకు విజయము గాని, రాజ్యము గాని, సుఖములు గాని అక్కఱయే లేదు. గోవిందా! ఈ రాజ్యమువలనగాని, ఈ భోగములవలన గాని, ఈ జీవితమువలన గాని ప్రయోజనమేమి?(32)**

ప్రశ్న - అర్జునుని మాటలలోని అంతరార్థమేమి?

సమా - అర్జునుడు తన మానసికస్థితిని చిత్రీకరించుచు "ఓ కృష్ణా! ఆత్మీయులగు నా స్వజనులను సంహరించినపిదప లభింపనున్న విజయమును గాని, రాజ్యమునుగాని, సుఖమును గాని నేనెంతమాత్రమును కోరుకొనుట లేదు. వీరందరిని వధించిన మీదట ఇహలోకమునందుగాని, పరలోకమునందుగాని నాకు మిగిలేది పరితాపమేయని స్పష్టమగుచున్నది. అప్పుడిక యుద్ధము జేయుటేల? వీరిని వధించుటేల? ఇటువంటి రాజ్య భోగములతో లభించున దేమి? వీరినందరిని సంహరించి జీవించుటవలన కూడా పొందులాభమేమియును లేదని' నా బుద్ధికి తోచుచున్నది." అనునదియే అర్జునుని మాటల అంతరార్థము.

*సంబంధము - ఇక స్వజనవధచే లభించు రాజ్యభోగాదులను ఆశింపకపోవుటకు గల కారణములను అర్జునుడు వివరించుచున్నాడు-*

## యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ ।
## త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ ॥ 33 ॥

యేషామ్ అర్థే = ఎవరికొఱకైతే
రాజ్యమ్ = రాజ్యము
భోగాః = భోగములు
సుఖాని చ = సుఖములును
నః = మాకు

కాంక్షితమ్ = అభీష్టమో, (అభీష్టములో)
తే = వారును
ఇమే = వీరును - (అందఱును)
ధనాని = సంపదలపైనను

ప్రాణాన్ = ప్రాణములపైనను
త్యక్త్వా = (ఆశలను)వదలుకొని
యుద్ధే = యుద్ధమునందు
అవస్థితాః = నిలిచి (సన్నద్ధులై) యున్నారు
చ = మఱియు

**మనము ఎవరికై ఈ రాజ్యమును, భోగములను, సుఖములను కోరుకొనుచున్నామో, వారే ధనప్రాణముల యెడ ఆశలు వదలుకొని యుద్ధమునకు సన్నద్ధులై వచ్చియున్నారు. (33)**

ప్రశ్న - ఈ శ్లోకమునందలి భావముల విశేషములేమి?

సమా - 'నాకు ఈ రాజ్యము, సుఖభోగముల అవసరము ఏమాత్రమూ లేనేలేదు. ఏలనన, ఇవి అనిత్యములేగాక, వీటివలన శాశ్వతమైన ఆనందము కూడా కలుగదని నేను ఎఱుగుదును. నా ఈ సోదరులు, బంధువులు మొదలగు స్వజనులకొరకే నేను రాజ్యాదులను కోరుచుంటిని. కాని వీరందరును యుద్ధమున తమ ప్రాణములను అర్పించుటకు సంసిద్ధముగా నిలిచియున్నట్లు తోచుచున్నది. ఒకవేళ వీరందరును రణరంగమున మృత్యువాత పడినచో, ఈ రాజ్యము, సుఖములు, భోగములు ఎందులకు? అందుచే ఏవిధముగ జూచినను పోరుసల్పుట ఉచితము కాదు.' అని అర్జునుడు ఇచట తన అభిప్రాయమును వెల్లడించుచున్నాడు.

*సంబంధము - ఈ ప్రకారముగా యుద్ధముయొక్క అనౌచిత్యమును విశ్లేషించిన అర్జునుడు రణమునందు తమ అసువులను అర్పించుటకు సిద్ధమై వచ్చిన స్వజనసముదాయమును గూర్చి సంక్షేపముగా వర్ణించుచున్నాడు-*

**ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః ।**
**మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధినస్తథా ॥ 34 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆచార్యాః | = గురువులు | తథా ఏవ | = అట్లే | పౌత్రాః | = మనుమలు |
| పితరః | = పినతండ్రులు, పెదతండ్రులు | పితామహాః | = తాతలు | శ్యాలాః | = బావమఱదులు |
| | | మాతులాః | = మేనమామలు | తథా, సంబంధినః | = అట్లే (ఇతర)బంధువులు (చేరియున్నారు) |
| పుత్రాః చ | = కుమారులును | శ్వశురాః | = పిల్లనిచ్చిన మామలు | | |

**గురువులు, తండ్రులు, తాతలు, కొడుకులు, మనుమలు, మేనమామలు, మామలు, బావమఱదులు, ఇతర బంధువులు మొదలగువారు అందరును ఇచ్చటికి చేరియున్నారు. (34)**

ప్రశ్న - తన బంధువుల పేర్లను పేర్కొనుచు అర్జునుడు చెప్పదలచినదేమి?

సమా - ఆచార్యులు, పెదతండ్రులు, పినతండ్రులు మొదలుగాగల బంధువులను గూర్చి తొలుతనే సంక్షేపముగా చెప్పియుండెను. ఇచ్చట 'శ్యాలాః' అను పదముచే ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సురథుడు ఇత్యాదులను, అట్లే 'సంబంధినః' అనుటచే జయద్రథాదులను గుర్తుచేసి - ఈ ప్రపంచమున మనుజుడు తనకు ప్రియమైన బంధువుల కొరకే ఈ భోగముల నన్నిటిని కోరుచుండును. వీరే చంపబడినప్పుడు రాజ్యభోగముల ఉపలబ్ధివలన ప్రయోజనమేమి? అట్టి రాజ్యభోగములు దుఃఖ కారణములే యగునుకదా! అని అర్జునుడు చెప్పదలచెను.

సంబంధము - సేనయందు నిలచిన శూరవీరులలో తనకు గల సంబంధమును తెలిపి, అర్జునుడు ఏ కారణముచేతనైనను వారిని చంపుటకు తన వైముఖ్యమును వెల్లడించుచున్నాడు-

**ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।**
**అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ 35 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మధుసూదన! | = ఓ మధుసూదనా! | హేతోః అపి | = నిమిత్తమైనను | న ఇచ్ఛామి | = ఇష్టపడను |
| ఘ్నతః అపి | = (నేను) చంపబడినను | ఏతాన్ | = వీరిని (ఈ స్వజనులను) | మహీకృతే | = భూమండలము కొఱకైతే |
| త్రైలోక్యరాజ్యస్య | = (లేక) మూడులోకముల రాజ్యాధిపత్యము | హంతుమ్ | = చంపుటకు | కిమ్ ను | = చెప్పవలసినదేమి? |

**ఓ మధుసూదనా! ముల్లోకాధిపత్యముకొరకైనను నేను ఎవ్వరినీ చంపను. ఇక ఈ భూమండలవిషయమై చెప్పనేల? అట్లే వీరిలో ఎవ్వరైనను నన్ను చంపబూనిననూ నేను మాత్రము వారిని చంపనే చంపను. (35)**

ప్రశ్న - ఇరుసేనల యందుండిన బంధువులలో అర్జునుని పక్షమువారు అర్జునుని చంపుదురను ప్రసక్తియే ఉండదుగదా! అట్టి స్థితిలో "నన్ను చంపినను, వీరిని నేను వధింప నిచ్ఛగింపను" అని అర్జునుడు ఏల పలికెను?

సమా - ఇందులకే అర్జునుడు 'ఘ్నతః', 'అపి' అను పదములను ప్రయోగించెను. "నా పక్షమువారు నన్ను చంపుదురను ప్రశ్నయే ఉదయింపదు. విపక్షమున గల బంధువులు సైతము నేను యుద్ధమును విరమించినప్పుడు కూడా బహుశా నన్ను సంహరించుటకు ఇష్టపడరు. ఏలనన వారు రాజ్యలోభముచే పోరు సల్పుటకు తలపడియుండిరి. మేము యుద్ధనివృత్తులమై రాజ్యకాంక్షను వీడినప్పుడు ఇక మమ్ము సంహరించుటకు వారికి ఎట్టి కారణము మిగిలి యుండదు. కానీ ఇంతలో ఒకవేళ ఎవరైనను చంపదలచినచో, అట్లు నన్ను వధించుటకు ప్రయత్నించువారిని కూడా నేను సంహరింపను" - అని అతని అభిప్రాయము.

ప్రశ్న - త్రైలోక్య రాజ్యమునే త్రోసిరాజనగా ఇక ఈ ధరణీరాజ్యమును గూర్చి చెప్పనేల? అను మాటలలోని ఆంతర్యమేమి?

సమా - ధారుణియందలి రాజ్యము, సుఖభోగముల మాట యేల? వీరిని సంహరించుట వలన నిష్కంటకమగు త్రైలోక్య రాజ్యము లభించినను ఆచార్యులను, ఆత్మీయులను, స్వజనులను చంపుటకు నేను ఇష్టపడను - అని అర్జునుని భావము.

*సంబంధము - ముల్లోకముల రాజ్యమునకైనను వారిని ఏల చంపకుందువు? అని ఒకవేళ ప్రశ్నించిన యెడల అర్జునుడు తనకు సంబంధించినవారిని సంహరించుటచే పొందు లాభముకంటెను పాపమే మిక్కుటమైనదని తెల్పుచు తన భావమునే బలపరచుకొనుచున్నాడు-*

**నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।**
**పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః ॥ 36 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనార్దన! | = ఓ జనార్దనా! | కా, ప్రీతిః స్యాత్? | = ఎట్టి సంతోషము కలుగును? | హత్వా | = చంపుటవలన |
| ధార్తరాష్ట్రాన్ | = ధృతరాష్ట్ర కుమారులను | ఏతాన్ | = ఇట్టి (ఈ) | అస్మాన్ | = మనలను |
| నిహత్య | = చంపినచో | ఆతతాయినః | = ఆతతాయులను (దుష్టులను) | పాపమ్ ఏవ ఆశ్రయేత్ | = పాపమే చుట్టుముట్టును |
| నః | = మనకు | | | | |

**ఓ జనార్దనా! ఈ ధార్తరాష్ట్రులను చంపి, మనము బావుకొనునది ఏమి? (మనము మూట కట్టుకొనునది యేమి?) ఈ ఆతతాయులను చంపుటవలన మనకు పాపమే కలుగును. (36)**

ప్రశ్న - ధృతరాష్ట్రసుతులను చంపుట వలన మాకేమి ప్రయోజనము? అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ప్రతిపక్షమునందున్న ఈ ధృతరాష్ట్రపుత్రులను, వారి సహచరులను చంపుటచే ఇహలోకమునందును, పరలోకము నందును మాకెంత మాత్రము ప్రయోజనము లభింపదు. ఈప్సితమగు వస్తువు లభింపనప్పుడు సంతసము కలుగుటెట్లు? కావున ఏ దృష్టితో పరికించినను వీరిని నేను సంహరింప గోరను.

ప్రశ్న - స్మృతికారులు స్పష్టమైన మాటలలో ఇట్లు వక్కాణించిరి-

ఆతతాయినమాయాంతం హన్యాదేవావిచారయన్ ।
నాతతాయివధే దోషో హంతుర్భవతి కశ్చన ॥
మనుస్మృతి - 8/350-51)

'తమకు కీడు కలిగించుటకు ప్రయత్నించుచున్న ఆతతాయులను ఆలోచింపకయే సంహరింపవలెను. ఆతతాయులను చంపువారికి ఎట్టి దోషమును కలుగదు.'

వసిష్ఠ స్మృతి యందు ఆతతాయుల లక్షణములు ఈ విధముగా పేర్కొనబడినవి -

అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః ।
క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః ॥
(3/19)

'నిప్పంటించువాడు, విషము నిచ్చువాడు, ఆయుధమును ధరించి చంపనుద్యుక్తుడగువాడు, ధనమునపహరించువాడు, భూమిని లాగుకొనువాడు, స్త్రీలను అపహరించువాడు ఈ ఆరుగురును ఆతతాయులు.'

దుర్యోధనాదులలో పైన పేర్కొనబడిన ఆతతాయుల లక్షణములన్నియును గలవు. లాక్షాగృహమున నిప్పంటించి పాండవులను చంపుటకు యత్నము గావించిరి. భీముని భోజనములో విషమును గలిపిరి. శస్త్రమును చేతధరించి చంపుటకు సంసిద్ధముగనే యుండిరి. జూదమున మోసగించి పాండవుల సమస్త ధనమును, రాజ్యలక్ష్మిని అపహరించిరి. అన్యాయముగ ద్రౌపదిని నిండుసభలోనికి రప్పించి, ఆమెను ఘోరముగ అవమానించిరి. జయద్రథుడు ఆమెను అపహరించుకొని పోయెను. ఇట్టి పరిస్థితిలోను ఆతతాయులను చంపినచో తమకు పాపమే కలుగునని అర్జునుడు ఏల చెప్పెను?

సమా - స్మృతికారుల అభిమతములననుసరించి ఆతతాయులను వధించుట దోషము కాదని తెలుపబడిన దనుటలో ఎట్టి సందేహమూ లేదు. దుర్యోధనాదులను ఆతతాయులనుట కూడా నిర్వివాద విషయమే. అయినను ఒకచోట స్మృతికారుడొక విశేషాంశమును ఇట్లు వచించెను-

స ఏవ పాపిష్ఠతమో యః కుర్యాత్ కులనాశనమ్ ।

'తన కులమును నశింపజేయువాడు అందరికంటెను గొప్పపాపి.'

ఈ వాక్యము సాధారణమైన ఆజ్ఞకన్న ఎక్కువ బలమైనదని భావించి, అర్జునుడు ఇచ్చట - 'ధృతరాష్ట్రుని పుత్రులు ఆతతాయులైనను తన వంశజులగుటచే వారిని వధించినచో పాపమే కలుగును. లాభము ఏ విధముగను లేదు. కావున నేను వీరిని చంపదలంపను' అని వచించుచున్నాడు. ఈ అధ్యాయము ముగియునంతవరకు అర్జునుడు ఇదే మాటను స్పష్టము చేసెను.

సంబంధము - స్వజనులను చంపుట అన్నివిధముల హానికరమని దెల్పి ఇప్పుడు అర్జునుడు తన నిర్ణయమును వెల్లడి చేయుచున్నాడు-

**తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్ ।**
**స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ? ॥ 37 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన | వయమ్ | = మనము | స్వజనమ్ | = స్వజనులను |
| మాధవ! | = ఓ మాధవా! | న అర్హాః | = అర్హులముకాము (మనమువారిని చంపదగదు) | హత్వా | = చంపి |
| స్వబాంధవాన్ | = మన బంధువులైన | | | కథంసుఖినః | = ఎట్లు? సుఖులము |
| ధార్తరాష్ట్రాన్ | = ధార్తరాష్ట్రులను | | | స్యామ | = కాగలము |
| హంతుమ్ | = హతమార్చుటకు | హి | = ఏలనన | | |

**కనుక ఓ మాధవా! మనబంధువులైన ఈ ధార్తరాష్ట్రులను చంపుట మనకు తగదు. స్వజనులను చంపిన మనకు సుఖము ఎట్లు అబ్బును? (37)**

ప్రశ్న - ఈ శ్లోక భావవిశేషమేమి?

సమా - ఈ శ్లోకములో 'తస్మాత్' అను పదమును ప్రయోగించి - 'నాకు కలిగిన పరిస్థితిని, యుద్ధము చేయకుండుటకై నేను ఇంతవరకు పలికిన పలుకులను, నా మదిలో రేకెత్తిన ఆలోచనా సరళిని కలబోసి చూడగా - దుర్యోధనాది బంధువులను చంపుట మాకు సర్వథా అనుచితముగా కన్పట్టుచున్నది. అంతియేగాక, కుటుంబమును నాశనము జేసిన మాకు ఇహ పరలోకముల యందు ఏ విధముగను, ఎట్టి సుఖమూ లభింపబోదు. అందుచే నేను యుద్ధము జేయుటకు ఇష్టపడను'- అని అర్జునుడు వచించుచున్నాడు.

*సంబంధము - కుటుంబనాశముతో కలిగెడు దోషము ఇరువురకును సమానమేగదా! మరి ఈ దోషమును గూర్చి విచారించి దుర్యోధనాదులు యుద్ధమును విరమించుటలేదు. అయినచో అర్జునుడే ఇంతగా ఏల వగచుచున్నాడు? అని ఇచట ప్రశ్న కలుగవచ్చును. దానికై రాబోవు రెండు శ్లోకములలో అర్జునుడు ప్రత్యుత్తరమును ఇచ్చుచున్నాడు-*

**యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః ।**
**కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ 38 ॥**
**కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥ 39 ॥**

యద్యపి = ఒకవేళ
లోభోపహతచేతసః = లోభముచే భ్రష్టచిత్తులై
ఏతే = వీరు
కులక్షయకృతమ్ = కులనాశము వలనకలుగు
దోషమ్ చ = దోషమును
మిత్రద్రోహే = మిత్రద్రోహకారణముగా
పాతకమ్ చ = (కలుగు) పాపమును
న పశ్యంతి = చూడకున్నవారైనను
జనార్దన! = ఓ జనార్దనా
కులక్షయకృతమ్ = కులక్షయమువలన కలుగు
దోషమ్ = దోషమును
ప్రపశ్యద్భిః = చక్కగా ఎఱింగినవారమైన
అస్మాభిః = మనచే
అస్మాత్ = ఇట్టి
పాపాత్ = పాపమునుండి
నివర్తితుమ్ = మఱలుటకు
కథమ్ = ఏల
న జ్ఞేయమ్ = ఆలోచింపరాదు?

**లోభకారణముగ భ్రష్టచిత్తులైన వీరు కులక్షయము వలన కలుగు దోషములను, మిత్రద్రోహము వలన సంభవించు పాపములను చూడకున్నచో, ఓ జనార్దనా! కులనాశనమువలన కలుగు నష్టములను ఎఱింగిన మనము ఈ పాపములకు దూరముగా ఉండుటకు ఏల ఆలోచింపరాదు? (38-39)**

ప్రశ్న - ఈ రెండు శ్లోకముల అంతరార్థమేమి?

సమా - "దుర్యోధనాదుల ఈ దుష్కార్యములు పూర్తిగా అనుచితమైనవేయనుట వాస్తవము, వారి చేష్టలు వింతగొల్పునవి కావు. ఏలనన, లోభము (దురాశ) వలన వారు వివేకభ్రష్టులైరి. అందువలన కులనాశనముచే గలుగు అనర్థములను వారు ఊహింపలేకున్నారు; దాని దుష్పరిణామములను తెలియులేకున్నారు. ఉభయ సైన్యములలో చేరియున్న సోదరులలో, బంధువులలో, మిత్రులలో పరస్పర వైరము గల్పించి ఒకరినొకరు హతమార్చుకొనునట్లు చేయుట ఎంతటి భయంకర మహాపాపమో వారి బుద్ధికి అందకున్నది. కాని మేము - వారివలె లోభముతో అంధులము కాలేము కదా! కులనాశము వలన గలిగెడు దోషములను బాగుగా తెలియుదుము. కాన తెలిసి, తెలిసి ఇంతటి ఘోరపాపమునకు ఎట్లు ఒడిగట్టుదుము? కాబట్టి బాగుగా ఆలోచించి మనము దీనినుండి బయటపడవలయును" అనునది అర్జునుని మాటల సారాంశము.

సంబంధము - వంశనాశమువలన ఉత్పన్నమయ్యెడు దోషములను గూర్చి అర్జునుడు వివరించుచున్నాడు-

**కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః ।**
**ధర్మే నష్టే కులం కృత్స్నమ్ అధర్మోఽభిభవత్యుత ॥ 40 ॥**

కులక్షయే = కులక్షయకారణముగ
సనాతనాః = సనాతనములైన (పరంపరాగతములైన)
కులధర్మాః = కులధర్మములు
ప్రణశ్యంతి = నశించిపోవును
ధర్మే నష్టే = ధర్మము అంతరించిపోవుచుండగా
కృత్స్నమ్ = సమస్తమైన (పూర్తిగా)
కులమ్ = వంశము (నందు)
అధర్మః ఉత = అధర్మమే
అభిభవతి = వ్యాపించును.

**కులక్షయమువలన సనాతనములైన కులధర్మములన్నియును నశించును. ధర్మము అంతరించి పోయినప్పుడు కులమునందు అంతటను పాపమే వ్యాపించును. (40)**

ప్రశ్న - సనాతనకులధర్మములని ఏ ధర్మములను తెలిపెదరు? కులనాశముచే ఆ ధర్మములెట్లు నశించిపోవును?

సమా - తమతమ కులములయందు పరంపరాగతములైన మర్యాదలు శుభకరములు శ్రేష్ఠములు. వాటివలన సదాచారములు సురక్షితముగా ఉండుటయేగాక ఆ కులముల యందలి స్త్రీపురుషులు అధర్మములను ఏ విధముగను ఆచరింపరు. అట్టి శుభకరములైన శ్రేష్ఠములైన కులమర్యాదలనే 'సనాతన కులధర్మముల'ని యందురు. కులనాశన కారణమున ఈ కులధర్మములను ఎఱింగినవారు, పరిరక్షించువారు ఐన పెద్దలు నశించినప్పుడు మిగిలిన బాలురయందును, స్త్రీలయందును ఈ ధర్మములు సహజముగనే అంతరించిపోవును.

ప్రశ్న - ధర్మము నశించిన పిమ్మట వంశము నందంతటను పాపమే మిక్కుటముగ వ్యాపించును - అని అనుటలోగల అంతర్యమేమి?

సమా - అధర్మము నుండి మానవుని కాపాడుటకును, ధర్మమును సురక్షితముగా నుంచుటకును సమర్థములైన హేతువులు ఐదు గలవు- ఈశ్వరునివలన భయము, శాస్త్రముల శాసనము, కులమర్యాదలు నశించునను భయము, రాజ్యాంగ చట్టము, శారీరిక, ఆర్థిక పరమైన అనర్థములను శంకించుట. వీనిలో ఈశ్వరుడు, శాస్త్రములు సత్యములే అయినను అవి శ్రద్ధావిశ్వాసములపై ఆధారపడి యున్నవి. కాని, ప్రత్యక్ష ప్రమాణములు కావు. రాజ్యాంగ చట్టము ప్రధానముగా ప్రజల కొరకే ఏర్పరచబడినది కాని, అధికారములో నున్నవారు తరచుగా దానిని పాటింపరు. శరీరహాని, ధననష్టములను శంకించుట చాలా వఱకు వ్యక్తిగత రూపముననే యుండును. ఒక్క కులమర్యాద మాత్రము కుటుంబము లేదా వంశము అంతటితో సంబంధమును పెనవేసికొని యుండును. పరంపరగా వచ్చుచున్న శుభకరమైన శ్రేష్ఠమైన మర్యాదలు ఏ సమాజమునందు, ఏ కులమునందు నశించిపోవునో, ఆ సమాజము లేదా ఆ కులము వారు కళ్ళెములేని గుఱ్ఱముల వలె యథేచ్ఛా విహారులై పోవుదురు. స్వేచ్ఛాచారము ఎట్టి నియమమునకు లోబడనియ్యదు. అది మనిషిని పూర్తి విశృంఖలునిగా (అడ్డు - అదుపులేని వానినిగా) మార్చి వేయును. ఈ రకమైన విశృంఖలత్వము గలిగిన మానవులతో కూడిన సమాజమునందు లేదా కులమునందు లేదా వంశము నందు సహజముగనే సర్వత్ర పాపము వ్యాపించును.

సంబంధము - కులమునందంతట పాపము పెచ్చుమీరినప్పుడు ఏమగునో అర్జునుడు ఇంకను స్పష్టముజేయుచున్నాడు-

**అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః ।**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥ 41 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కృష్ణ! | = ఓ కృష్ణా! | కులస్త్రియః | = కులస్త్రీలు | స్త్రీషు | = స్త్రీలు |
| అధర్మాభిభవాత్ | = అధర్మము (పాపము) అధికమగుటవలన | ప్రదుష్యంతి | = మిక్కిలి దూషితలగుదురు | దుష్టాసు | = దూషితలైనపుడు |
| | | | | వర్ణసంకరః | = వర్ణసాంకర్యము |
| | | వార్ష్ణేయ | = కృష్ణా! | జాయతే | = ఉత్పన్నమగును |

**ఓ కృష్ణా! అధర్మము (పాపము) పెచ్చుపెరిగిపోయినప్పుడు కులస్త్రీలు మిక్కిలి దూషితలగుదురు. ఓ వార్ష్ణేయా! స్త్రీలు దూషితలు ఐనచో వర్ణసాంకర్యము ఏర్పడును. (41)**

ప్రశ్న - ఈ శ్లోక భావవైశిష్ట్యమును వివరింపుము.

సమా - కులధర్మములు నశించి పోవుటచే కులము నందలి స్త్రీ పురుషులు విశృంఖలులై పోవుదురు. అప్పుడిక వారి కార్యకలాపము లన్నియును దాదాపు అధర్మయుక్తము లగుచుండును. తత్ఫలితముగా పాపము ప్రబలిపోయి సమాజము నందంతటను వ్యాపించును. సర్వత్ర పాపము వ్యాపించి పోవుటచే సమాజములో గల స్త్రీపురుషుల దృష్టిలో ఎటువంటి మర్యాదకైనా ఎంతమాత్రమూ విలువఉండదు. వాటిని పాటించుట కాదుగదా! కనీసము వాటిని తెలిసికొనుటకు కూడా ప్రయత్నింపబోరు. ఎవరేని తెలియజేయుటకు యత్నించినచో, వారిని గేలిచేయుదురు. మీదు మిక్కిలి వారిని ద్వేషింతురు. ఇటువంటి పరిస్థితిలో సామాజిక ధర్మమును రక్షించుటకు ఆధారభూతములై పవిత్రమగు సతీధర్మములు అభావమైపోవును. సతీమహాత్మ్యమును కోల్పోయి, పవిత్రమగు కులస్త్రీలు పాపభూయిష్ఠమగు వ్యభిచార దోషముచే దూషితలగుదురు. దానిచే వారికి వివిధ వర్ణములకు చెందిన పరపురుషులతో సంపర్కమేర్పడును. తలిదండ్రులు వేరు - వేరు వర్ణములకు చెందిన వారగుటచేత వారికి కలిగిన సంతానమువలన వర్ణసంకరము ఏర్పడును. ఈ ప్రకారముగా కులమునందలి పరంపరాగతమగు పవిత్రత దానంతటదియే పూర్తిగా తుడిచిపెట్టుకొని పోవును.

సంబంధము - వర్ణసాంకర్యముచే *గలిగిన సంతానమువలన* చేకూరునట్టి నష్టములను *గూర్చి* అర్జునుడు ఇప్పుడు తెలియజేయుచున్నాడు-

**సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।**
**పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః ॥ 42 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంకరః | = వర్ణసాంకర్యము | నరకాయ ఏవ | = నరకము కొఱకే (నరకప్రాప్తియే) అగును | ఏషామ్ | = వీరియొక్క |
| కులఘ్నానామ్ చ | = కులఘాతకులకును | | | పితరః హి | = పితరులు కూడ |
| కులస్య | = కులమునకును | లుప్తపిండోదకక్రియాః | = పిండోదకక్రియలు లుప్తమైనవారు(ను) | పతంతి | = అధోగతి పాలయ్యెదరు |

**వర్ణసాంకర్యము కులఘాతకులను, కులమును నరకమునందు పడవేయును. పిండోదకములు (శ్రాద్ధతర్పణములు) లోపించినందువలన వారి పితరులును అధోగతి పాలయ్యెదరు. (42)**

ప్రశ్న - 'కులఘాతకుల'ని ఎవరినందురు? ఈ శ్లోకమునందు 'కులస్య' అనుపదముతో 'చ' అను అవ్యయమును ప్రయోగించి చెప్పదలచినదేమి?

సమా - యుద్ధాదుల యందు తమ కులము వారినే సంహారము చేయు వానిని 'కులనాశకుడ'ని అందురు. 'కులస్య' అను పదముతో 'చ' అను అవ్యయమును ప్రయోగించి - వర్ణసంకరముతో నేర్పడిన సంతానము కేవలము ఆ కులనాశకులను మాత్రమే నరకమునకు చేర్చునదిగాకుండా, అది వాని సమస్తకులమును నరకమునకు గొంపోవుటలో సమర్థమగునని చెప్పబడినది.

ప్రశ్న - 'పిండోదకక్రియలు లుప్తమైనచో పితృదేవతలు అధోగతి పాలగుదురు' అని అనుటలోగల అంతర్యమేమి?

సమా - శ్రాద్ధమునందు చేయబడు పిండప్రదానమును, పితృదేవతలనిమిత్తముగా చేయింపబడు బ్రాహ్మణ భోజనాది క్రియలను 'పిండక్రియ' అనియు; తర్పణమునందు విడువబడు జలాంజలిని 'ఉదకక్రియ' అనియు; ఈ రెండింటి సమాహారమునే 'పిండోదక క్రియ' అనియు అందురు. వీనినే శ్రాద్ధతర్పణములు అనియు వ్యవహరింతురు. శాస్త్రమును, కులమర్యాదను తెలిసికొని, ఆచరించెడు వారు మాత్రమే శ్రాద్ధ తర్పణములను జేయుచుందురు. కాని, కులఘాతకులగువారి కులమునందు ధర్మము నశించిన మీదట వర్ణసాంకర్యమేర్పడును. ఇట్టి వర్ణసంకరములు అధర్మమునుండి ఉత్పన్నమై అధర్మముతో ఓతప్రోతమై పోయినందున శ్రాద్ధతర్పణాదిక్రియలను వారు బొత్తిగా ఎఱుగనే ఎఱుగరు; ఒకవేళ ఎవరేని తెలియబరచినచో, శ్రద్ధలేమి కారణముచే వారు చేయనే చేయరు. ఒక వేళ ఎవరైన ఆచరించినచో శాస్త్రవిధిననుసరించి వారికి అధికారము లేనందున, వారు చేసిన శ్రాద్ధక్రియలు పితరులకు చెందవు. ఈ ప్రకారముగా పితరులకు సంతానముద్వారా పిండ, జలములు లభింపనప్పుడు వారు దుర్గతుల పాలగుదురు.

*సంబంధము - వర్ణసంకరకారకములగు దోషములచే కలుగు హానిని గూర్చి తెలియబరచుచున్నాడు -*

**దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।**
**ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతైః | = ఇట్టి | దోషైః | = దోషములచే | కులధర్మాః చ | = కులధర్మములును |
| వర్ణసంకరకారకైః | = వర్ణసాంకర్యములకు హేతువులైన | కులఘ్నానామ్ | = కులఘాతకులయొక్క | జాతిధర్మాః | = జాతిధర్మములును |
| | | శాశ్వతాః | = సనాతనములైన | ఉత్సాద్యంతే | = నష్టములగును. |

**వర్ణసాంకర్యమునకు మూలములైన ఈ దోషములవలన కులఘాతకులయొక్క సనాతన కులధర్మములు, జాతిధర్మములు నష్టమగును. (43)**

ప్రశ్న - 'వర్ణ సాంకర్యమునకు మూలములైన దోషములు' ఏవి?

సమా - వర్ణసాంకర్యము ఏర్పడుటకు కారణములు (1) కులనాశము (2) కులనాశము వలన కులధర్మములు నశించుట (3) పాపవృద్ధి (4) పాపవృద్ధిచే కులస్త్రీలు వ్యభిచారాది దోషములతో దూషితలగుట.

ప్రశ్న - 'సనాతన కుల ధర్మములకును, జాతి ధర్మములకును గల భేదమేమి? పైన దెల్పిన దోషములతో వానికి నాశనమెట్లు జరుగును?'

సమా - వంశపరంపరాగత సదాచారముల మర్యాదలే 'సనాతనకులధర్మములు'. నలుబదవ శ్లోకమునందు దీనితో 'సనాతనాః' అను విశేషణము చేర్చబడినది. ఈ శ్లోకమునందు దీనితో 'శాశ్వతాః' అను విశేషణ మొసగబడినది. వేద శాస్త్రోక్తములగు 'వర్ణధర్మము'లకే 'జాతి ధర్మము'లని పేరు. కులము నందలి ఉత్తమ మర్యాదలను ఎఱిగి - ఆచరించెడు పెద్దలు, వృద్ధులు లేకుండుటచే 'కులధర్మము'లు నశించిపోవును. అంతియే గాక, వర్ణసాంకర్యమునకు కారకమగు దోషములు మితిమీరును. అప్పుడిక 'జాతి ధర్మములు' కూడా నష్టమైపోవును. ఏలనన, వర్ణాంతర సంయోగముచే ఉత్పన్నమగు సంకరసంతానము నందు వర్ణధర్మములు ఉండజాలవు. కావున ఇదే ప్రకారముగ వర్ణసంకర కారకమగు దోషములచే ఈ ధర్మములు నశించిపోవును.

*సంబంధము - 'కులధర్మములు', 'జాతిధర్మములు' నశించుటచే గలిగెడు హానిని గూర్చి వచించుచున్నాడు-*

**ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।**
**నరకేఽనియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥ 44 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనార్దన! | = ఓ జనార్దనా! | అనియతమ్ | = నిరవధికముగా | ఇతి | = అని |
| ఉత్పన్నకుల ధర్మాణామ్ | = కులధర్మములు నశించినవారైన | నరకే | = నరకమునందు | అనుశుశ్రుమ | = వినుచున్నాము. |
| | | వాసః | = నివాసము | | |
| మనుష్యాణామ్ | = మనుష్యులకు | భవతి | = అగును | | |

**ఓ జనార్దనా! కులధర్మములు నశించినవారికి నిరవధికముగా (కలకాలము) నరకప్రాప్తి తప్పదని ప్రతీతి. (44)**

ప్రశ్న - ఈ శ్లోక భావవైశిష్ట్యమేమి?

సమా - 'కులధర్మములు', 'జాతి ధర్మములు' నశించినచో మానవులు పూర్తిగా అధర్మములయందు చిక్కుకొందురు. వారు చేసిన పాపములకు ఫల స్వరూపముగా కుంభీపాక, రౌరవాది నరకములయందు ప్రవేశించి, దీర్ఘకాలము వరకు నానావిధ భయంకర యమయాతనలు అనుభవించవలసి వచ్చును అని మేము పరంపరగా వినుచున్నాము. అందువలన కులనాశనమునకు మూలమగు చేష్టలు ఎన్నడు కూడా చేయవలదు అను భావమును అర్జునుడు ప్రకటించెను.

*సంబంధము - ఈ విధముగా స్వజనసంహారముచే కలుగు తీవ్రమైన అనర్థములను వర్ణించి, అర్జునుడు, యుద్ధమునకై ఉద్యమించిన తన కృత్యములనుగూర్చి శోకముతో వెల్లడించుచున్నాడు-*

**అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।**
**యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః ॥ 45 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహో | = అయ్యో! | కర్తుమ్ | = చేయుటకు | స్వజనమ్ | = స్వజనులను |
| బత | = ఎంత దారుణము!! | వ్యవసితాః | = సిద్ధమైతిమి | హంతుమ్ | = చంపుటకు |
| వయమ్ | = మనము (బుద్ధిమంతులమై గూడ) | యత్ | = ఏదయితే (ఏమహాపాపమునకైతే) | ఉద్యతాః | = ఉద్యుక్తులమైతిమో (అట్టి మహాపాతకమునకు ఒడిగట్టితిమి) |
| మహత్ పాపమ్ | = మహాపాపమును | రాజ్యసుఖ లోభేన | = రాజ్యసుఖ లోభముచే | | |

**అయ్యో! మనము బుద్ధిమంతులమై యుండియు రాజ్యసుఖ లోభముచే స్వజనులనే సంహరించుటకు ఉద్యుక్తులమై ఈ ఘోర పాపకృత్యములకు ఒడిగట్టుచున్నాము- ఇది యెంత దారుణము? (45)**

ప్రశ్న - "మేము మహాపాపమొనరించుటకు ఒడిగట్టితిమి" అను వాక్యముతో 'అహో', 'బత' అను నీ రెండు అవ్యయములను ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - 'అహో' అను అవ్యయము ఇచట ఆశ్చర్యద్యోతకము. 'బత' అనుపదము మహాశోక సూచకము. ఈ రెండింటిని ప్రయోగించి పై నుదహరించిన వాక్యము ద్వారా అర్జునుడు - మేమందరము మహాత్ములముగా బుద్ధిమంతులముగా పరిగణింపబడుచుంటిమి. కావున ఇంతటి పాపకర్మయందు ప్రవృత్తులమగుట ఎంత మాత్రమును ఉచితము కానేరదు. అయినను మేము ఈ మహాపాపమునకు ఒడిగట్టితిమి కదా! కటకటా! ఈ మాట అత్యంత ఆశ్చర్యమును, మిగుల శోకమును కలిగించుచున్నదే! అని తన భావమును వెల్లడించెను.

ప్రశ్న - రాజ్యసుఖలోభముచే స్వజనులను సంహరించుటకు ఉద్యుక్తులమైతిమి గదా! అని అనుటలో గల ఆంతర్యమేమి?

సమా - మా అందరి రాజ్యసుఖానుభవలోభముచే ఈ విధముగ ఉద్యమించుట చాలా దోషము - అని అర్జునుడు తన తలంపును తెలిపెను.

సంబంధము - ఈ ప్రకారముగా పశ్చాత్తాపము నొందినవాడై అర్జునుడు ఇక తన నిర్ణయమును వినిపించుచున్నాడు-

## యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః ।
## ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్ ॥ 46 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| యది | = ఒకవేళ | మామ్ | = నన్ను | హన్యుః | = చంపినవారైనను (చంపినను) |
| అశస్త్రమ్ | = శస్త్రములను త్యజించినట్టి | శస్త్రపాణయః | = శస్త్రములను చేబూనిన | తత్ మే | = అది నాకు |
| అప్రతీకారమ్ | = ప్రతీకారమును చేయనట్టి | ధార్తరాష్ట్రాః | = ధార్తరాష్ట్రులు | క్షేమతరమ్ | = శ్రేయస్కరమే |
| | | రణే | = సమరమునందు | భవేత్ | = అగును |

**శస్త్రరహితుడనై, ఎదిరింపని నన్ను శస్త్రములను చేబూని ధార్తరాష్ట్రులు యుద్ధమున వధించినను, అది నాకు మిక్కిలి క్షేమకరమే యగును. (46)**

ప్రశ్న - ఈ శ్లోకము నందలి భావమేమి?

సమా - 'ఇప్పుడు యుద్ధము ప్రకటింపబడినప్పటికిని నేను శస్త్రములను త్యజించుదును; వారి ఎట్టి క్రియకైనను ప్రతిక్రియ జేయబూనను. అప్పుడు ఒకవేళ వారును యుద్ధము విరమించినచో ఆత్మీయులందరు రక్షింపబడెదరు. కాని ఒకవేళ వారట్లు చేయక నన్ను నిరాయుధుని; యుద్ధనివృత్తునిగా భావించి వధించినను, ఆ మృత్యువు కూడా నాకు అత్యంత కళ్యాణకారకమే యగును. ఏలనన, దీనితో నేను ముందుగా వంశనాశనమనెడు భయంకర పాపమునుండి కాపాడబడుదును; రెండవది - మా సోదరులు, బంధువులు,

ఆత్మీయులు రక్షింపబడుదురు; ఇక మూడవది- కుల రక్షాజనితమగు మహాపుణ్యకర్మ ఫలము వలన నాకు పరమపద ప్రాప్తి కూడా సుకరమైపోవును' అని అర్జునుడు వచించుచున్నాడు.

పైన పేర్కొనబడినట్టి ప్రతీకార రహితమగు తన మరణము వలన వంశరక్షణ, తన శ్రేయస్సు కలుగుట నిశ్చయమని అర్జునుని తలంపు. అందువలననే, ఆతడు ఇట్టి మరణమునే మిక్కిలి కళ్యాణకారకము (క్షేమతరమ్) అని పేర్కొనెను.

*సంబంధము - శ్రీకృష్ణభగవానునితో ఈ రీతిగా పలికిన పిమ్మట అర్జునుని స్థితిని గూర్చి సంజయుడు వివరించుచున్నాడు-*

***సంజయ ఉవాచ***

**ఏవముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 47 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సంఖ్యే | = రణభూమియందు | ఏవమ్ | = ఇట్లు | విసృజ్య | = విసర్జించి |
| శోకసంవిగ్న మానసః | = శోకాకుల మనస్కుడైన | ఉక్త్వా | = పలికి | రథోపస్థే | = రథముయొక్క వెనుకభాగమున |
| | | సశరమ్ | = బాణములతోగూడిన | | |
| అర్జునః | = అర్జునుడు | చాపమ్ | = ధనుస్సును | ఉపావిశత్ | = చతికిలబడెను |

**సంజయుడు పలికెను- అర్జునుడు ఈ విధముగా పలికి శోకసంవిగ్నమానసుడై, యుద్ధభూమియందు ధనుర్బాణములను త్యజించి, రథము వెనుకభాగమున చతికిలబడెను. (47)**

ప్రశ్న - ఈ శ్లోకమునందలి సంజయుని మాటల సారాంశమేమి?

సమా - విషాదమగ్నుడైన అర్జునుడు భగవానునితో ఇన్ని మాటలను చెప్పి, గాండీవ ధనుర్బాణములను వీడి, రథమునందలి వెనుకభాగమున మౌనముగా చతికిలబడి, నానావిధచింతలలో మునిగిపోయెను. ఆతని మనఃఫలకము నందు కులనాశము, తద్ద్వారా జరుగబోవు భయంకరమగు పాపములు, ఆ పాపఫలితములైన భయానక దృశ్యములు కనిపింపసాగెను. ఆతని ముఖమండలముపై విషాదము క్రమ్ముకొనెను. నేత్రములు శోకాకులములయ్యెను.

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః ॥ 1 ॥**

❖ ❖ ❖

ఇందలి ప్రతిఅధ్యాయము ముగిసిన తర్వాత పైనుదహరింపబడిన పుష్పిక ఈయబడినది. ఇందులో శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యము, ప్రభావము ప్రకటింపబడినవి. **'ఓం తత్సత్'** అనునది భగవానుని పవిత్ర నామము. (17/23) స్వయముగా శ్రీభగవానునిచే కీర్తింపబడిన కారణమున దీనికి 'శ్రీమద్భగవద్గీత' అని పేరు కల్గెను. ఇందు ఉపనిషత్తుల సారతత్త్వము సంగ్రహింపబడినది. ఇదియును ఒక 'ఉపనిషత్తే'. అందుచే నిది 'ఉపనిషత్' అని వక్కాణింపబడినది. నిర్గుణ, నిరాకార పరమాత్మని పరమతత్త్వమును సాక్షాత్కరింపజేయునది గావున దీనిని 'బ్రహ్మవిద్య' యని పేర్కొనిరి. కర్మయోగము యోగమను పేరుతో వర్ణింపబడినది. అట్టి నిష్కామకర్మ యోగతత్త్వమును తెలుపుటచే దీనిపేరు 'యోగశాస్త్రమైనది. ఇయ్యది సాక్షాత్తు పరమపురుషుడైన శ్రీకృష్ణభగవానుని, భక్తవర్యుడగు అర్జునుని సంవాదము. అంతియేగాక, దీనియందలి ప్రతిఅధ్యాయమునందును పరమాత్మను ప్రాప్తింపజేయు యోగము వర్ణింపబడినది. ఆ కారణముననే, **'శ్రీకృష్ణార్జున సంవాదే......యోగోనామ'** అని పేర్కొనబడినది.

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# రెండవ అధ్యాయము - సాంఖ్యయోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు శరణాగతుడైన అర్జునుడు తన శోకనివృత్తికై నిశ్చితమైన (తిరుగులేని) ఒకే ఒక ఉపాయమును తెల్పుమని భగవానుని ప్రార్థించెను. దానికి భగవానుడు 30వ శ్లోకం వరకు ఆత్మతత్త్వమును వర్ణించెను - సాంఖ్యయోగ సాధనయందు ఆత్మతత్త్వ శ్రవణ, మనన, నిదిధ్యాసనములే ముఖ్యములైనవి. ఈ అధ్యాయము నందలి 30వ శ్లోకము తరువాత స్వధర్మమును గూర్చి వర్ణించి, కర్మయోగ స్వరూపమును వివరించినప్పటికిని, ఉపదేశముయొక్క ఆరంభము సాంఖ్యయోగముతోడనే జరిగినది. ఆత్మతత్త్వ వర్ణనము ఇతరాధ్యాయముల కంటెను ఈ (ద్వితీయ) అధ్యాయమునందే విస్తృతముగా సమగ్రముగా చర్చింపబడినది. ఈ కారణమున ఈ అధ్యాయమునకు 'సాంఖ్యయోగము' అనునామము ఏర్పడినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందు మొదటి శ్లోకమున సంజయుడు అర్జునుని విషాదమును వర్ణించెను. 2వ, 3వ శ్లోకములలో భగవానుడు అర్జునుని మోహముతో, పిఱికి తనముతో గూడిన విషాదమును అధిక్షేపించుచు యుద్ధము చేయుటకై అతనిని ప్రోత్సహించెను. 4వ, 5వ శ్లోకములలో పూజ్యులైన భీష్మద్రోణాది గురుజనులను చంపుటకంటెను బిచ్చమెత్తుకొని జీవించుటయే శ్రేష్ఠమని అర్జునుడు పలికెను. 6వ శ్లోకమున యుద్ధము చేయుటయా? చేయకుండుటయా? అను వానిలో ఏది శ్రేయస్కరమో? నిశ్చయించుకొనలేక మోహము, కాతరత్వము అను దోషములకు లోనైన తాను భగవానుని శరణుపొందుచున్నాననియు, తనకు శ్రేయస్కరమైన దానిని ఉపదేశించుమనియు అర్జునుడు భగవానుని 7వ శ్లోకమున ప్రార్థించెను. 8వ శ్లోకమున నిష్కంటకమైన త్రైలోక్యరాజ్యప్రాప్తియు తన శోకమును తొలగింపజాలదని తెల్పుచు వైరాగ్యభావమును ప్రకటించెను. ఈ విధముగా అర్జునుడు యుద్ధమే చేయనని పల్కుచు మౌనమును వహించి చతికిల బడెననియు, అందులకు భగవానుడు చిరునవ్వుతో పలుకసాగెననియు 9, 10వ శ్లోకములలో సంజయుడు చెప్పెను. 11వ శ్లోకమున భగవానుడు తనయుపదేశమును ఆరంభించి, ఆత్మయొక్క నిత్యత్వమును నిర్వికారత్వమును 12, 13వ శ్లోకములలో నిరూపించెను. సమస్త భోగములు అనిత్యములని తెల్పుచు, సుఖ దుఃఖాది ద్వంద్వములను సహింపవలెనని 14వ శ్లోకమున స్పష్టపఱచెను. ఆ సహనశీలము మోక్షప్రాప్తికి హేతువని 15వ శ్లోకమున వివరించెను. 16వ శ్లోకమున 'సత్', 'అసత్తుల' లక్షణములను తెలుపుచు 17వ శ్లోకమున 'సత్' వస్తురూపమును, 18వ శ్లోకమున 'అసత్' వస్తుస్వరూపమును తెలిపి యుద్ధముచేయుమని భగవానుడు అర్జునుని ఆదేశించెను. ఆత్మ చంపునదియనియు, చంపబడునదియనియు భావించువారు అజ్ఞానులు - అని 19వ శ్లోకమున తెలిపి, 20వ శ్లోకమున జన్మాది షడ్వికార (ఆఱు వికారముల) రహితమైన ఆత్మ స్వరూపమును పూర్తిగా వివరించెను. 'ఆత్మతత్త్వమును ఎఱింగినవాడు ఎవ్వరినీ చంపడు, చంపించడు' అని 21వ శ్లోకమున పేర్కొనెను. పిమ్మట 22వ శ్లోకమున మనుష్యులు వస్త్రములను మార్చుకొనునట్లుగా ఆత్మయు దేహాంతరములను పొందుచుండునని తెలిపెను. 23 నుండి 25వ శ్లోకము వఱకు ఆత్మ అచ్ఛేద్యము, అదాహ్యము, అక్లేద్యము, అశోష్యము అనియు అది నిత్యము, సర్వగతము, స్థాణువు, అచలము, సనాతనము, అవ్యక్తము, అచింత్యము, నిర్వికారము - అనియు తెల్పి దానికై శోకించుట అనుచితమని పేర్కొనెను. 26, 27వ శ్లోకములలో, ఆత్మ జననమరణ శీలమని ఒకవేళ భావించినను, శరీరముల అనిత్యత కారణమున శోకింపదగదని 28వ శ్లోకమున తెలిపెను - ఆత్మతత్త్వముయొక్క ద్రష్ట, వక్త, శ్రోతల దుర్లభత్వమును 29వ శ్లోకమున ప్రతిపాదించి, ఆత్మతత్త్వము సర్వథా అవధ్యము అగుటవలన ఏ ప్రాణికొఱకైనను శోకించుట అనుచితమని 30వ శ్లోకమున వివరించెను - 31వ శ్లోకమునుండి 36వ శ్లోకమువఱకును క్షాత్రధర్మ దృష్టితో యుద్ధము చేయుట అర్జునునకు స్వధర్మమని తెలిపి దానిని త్యజించుట అన్ని విధముల అనుచితమని పేర్కొనెను. యుద్ధము ఇహపరలోక సుఖప్రదమని తెల్పుచు అర్జునుని యుద్ధసన్నద్ధుడవుకమ్మని 37వ శ్లోకమున ఆజ్ఞాపించెను. యుద్ధాది కర్మలయందు పాపములనుండి నిర్లిప్తుడగుటకు సమత్వ బుద్ధిని కలిగియుండుటయే ఉపాయమని 38వ శ్లోకమున దెలిపి కర్మబంధములను ఛేదించు కర్మయోగ విషయకబుద్ధిని వర్ణింతునని 39వ శ్లోకమున ప్రస్తావించెను. 40వ శ్లోకమున

కర్మయోగమహిమను దెలిపెను. నిశ్చయాత్మిక బుద్ధికిని, అవ్యవసాయులైన సకామపురుషుల బుద్ధులకును గల భేదమును **41**వ శ్లోకమున నిరూపించుచు **42, 43, 44**వ శ్లోకములయందు స్వర్గసుఖపరాయణులైన సకామపురుషుల స్వభావములను వర్ణించెను. **45**వ శ్లోకమున అర్జునుని నిష్కామ, నిర్ద్వంద్వ, నిత్య సత్త్వస్థుడవుకమ్మని పల్కుచు, తన యోగక్షేమములను గూర్చి ఆలోచింపక, ఆత్మ సంయమియగుటకు ఆదేశించుచు, బ్రహ్మజ్ఞుడైన బ్రాహ్మణునకు వేదోక్తములైన కర్మఫలరూప సుఖభోగముల వలన ఎట్టి ప్రయోజనమూ ఉండదని **46**వ శ్లోకమున దెలిపి, **47**వ శ్లోకమున సూత్రప్రాయముగ కర్మయోగ స్వరూపమును దెల్పెను. యోగమనగా సమత్వమని **48**వ శ్లోకమున పేర్కొని, సమత్వబుద్ధితో పోల్చినప్పుడు సకామకర్మలు అత్యంత తుచ్ఛములనియు, ఫలములనాశించువారు అత్యంత దీనులనియు, **49**వ శ్లోకమున వివరించెను. సమత్వబుద్ధియుక్తులైన కర్మయోగులను ప్రశంసించుచు అర్జునుని కర్మయోగమునందు నిమగ్నుడవగుమని ఆజ్ఞాపించి, సమత్వభావఫలము అనామయపదప్రాప్తియని **50**వ, **51**వ శ్లోకములలో పేర్కొనెను. పిమ్మట **52, 53**వ శ్లోకములయందు వైరాగ్యముతో గూడిన బుద్ధి శుద్ధమూ, స్వచ్ఛమూ, నిశ్చలమూ అగుననియు, తత్ఫలము పరమాత్మప్రాప్తియని తెలిపెను, **54**వ శ్లోకమున అర్జునుడు స్థితప్రజ్ఞుని విషయమై నాలుగు ప్రశ్నలు అడిగెను. భగవానుడు **55**వ శ్లోకమున మొదటి ప్రశ్నకును, **56, 57**వ శ్లోకములలో **2**వ ప్రశ్నకును, **58**వ శ్లోకమున **3**వ ప్రశ్నకును, సూత్రప్రాయముగా సమాధానములను ఇచ్చెను. సమస్త కోరికలను త్యజించి, బాహ్యసాధనములకై అపేక్ష కలిగియుండక, అంతరాత్మయందే సర్వదా సంతుష్టుడగుట, దుఃఖములవలన ఉద్విగ్నుడు గాక సుఖములయందు స్పృహారహితుడై రాగభయ క్రోధములను సర్వథా త్యజించి, శుభాశుభప్రాప్తియందు హర్షశోకములకును, రాగద్వేషములకును లోనుగాకుండుట, సమస్త ఇంద్రియములను విషయములనుండి మఱలించి, తనవశమునందుంచుకొనుట మొదలగునవి స్థితప్రజ్ఞునియొక్క లక్షణములని పైన పేర్కొనబడిన శ్లోకములలో **(55 నుండి 58**వ శ్లోకము వఱకు**)** విపులముగా వివరించెను. ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహింపనివానినుండి విషయములు వైదొలగినను వాటిపైగల ఆసక్తి మాత్రము తొలగదు. వాటి నివృత్తి కేవలము పరమాత్మ దర్శనము వలననే కలుగును - అను విషయమును **59**వ శ్లోకమున స్పష్టపఱచెను. **60**వ శ్లోకమున ఇంద్రియముల ప్రాబల్యమును నిరూపించుచు, మనస్సును, ఇంద్రియములను సంయమపూర్వకముగా భగవత్పరాయణము గావింపవలెనని తెల్పి, ఇంద్రియములను జయించినవానిని **61**వ శ్లోకమున ప్రశంసించెను. **62, 63,** శ్లోకములలో విషయచింతన వలన కలుగు పతనక్రమమును వివరించెను - రాగద్వేషరహితుడై కర్మల నాచరించు వానికి ప్రసాద (ఆధ్యాత్మిక ప్రసన్నత) ప్రాప్తి కలుగుననియు, దానివలన సమస్త దుఃఖములును నశించి, శీఘ్రముగా అతని బుద్ధి స్థిరమగునని, **64, 65**వ శ్లోకములలో వివరించెను. పిమ్మట **66**వ శ్లోకమున అయుక్తుడైన పురుషునకు శ్రేష్ఠబుద్ధి, భగవచ్చింతన, సుఖశాంతులు దూరమగునని తెల్పెను. **67**వ శ్లోకమున వాయు-నౌకల దృష్టాంతములనిచ్చి, మనస్సంయోగమువలన ఇంద్రియములు బుద్ధిని హరించునని తెల్పెను. ఇంద్రియములను వశమునందుంచుకొనిన వాడే వాస్తవముగా స్థితప్రజ్ఞుడని **68**వ శ్లోకమున సిద్ధాంతీకరించెను. పిమ్మట సామాన్య మానవులకు బ్రహ్మానందము రాత్రితో సమానమనియు, తత్త్వజ్ఞానియైన యోగికి విషయసుఖములు రాత్రితో సమానమనియు **69**వ శ్లోకమున తెల్పెను. **70**వ శ్లోకమున సముద్ర దృష్టాంతమును ఇచ్చుచు జ్ఞానియైన మహాత్ముని మహిమను కొనియాడెను. సమస్త కోరికలను, ఆసక్తులను, మమతాహంకారములను త్యజించి, ప్రవర్తించు వానికి పరమశాంతి లభించునని **71**వ శ్లోకముననుడివెను. **72**వ శ్లోకమున ఇట్టి బ్రాహ్మీస్థితిమాహాత్మ్యమును వర్ణించుచు ఈ యధ్యాయమును ముగించెను.

**సంబంధము** - మొదటి అధ్యాయమున గీతోపదేశ పూర్వరంగమును వర్ణించుచు సంజయుడు ఉభయసేనలలో గల మహారథులను, వారి శంఖధ్వనులను వర్ణించెను. రెండు సేనల మధ్యలో (తన) రథమును నిల్పుమని శ్రీకృష్ణుని అర్జునుడు అడుగుటయు, పిమ్మట ఉభయసేనలలో చేరియున్న స్వజనసముదాయమును జూచి, శోక మోహితుడై, అతడు యుద్ధమునుండి నివృత్తుడగుటయు మొదలగు విషయములను దెలిపి, సంజయుడు ఆ (ప్రథమ) అధ్యాయమును ముగించెను. ఇట్టి స్థితిలో శ్రీకృష్ణభగవానుడు తెలిపిన విషయమును, అతడు అర్జునుని యుద్ధసన్నద్ధునిగా చేసినరీతిని వివరించుటకై సంజయుడు అర్జునుని విషాదస్థితిని వర్ణించుచు రెండవ అధ్యాయమును ప్రారంభించెను-

### సంజయ ఉవాచ

**తం తథా కృపయావిష్టమ్ అశ్రుపూర్ణాకులేక్షణమ్ ।**
**విషీదంతమిదం వాక్యమ్ ఉవాచ మధుసూదనః ॥ 1 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| తథా | = ఆ విధముగా | అశ్రుపూర్ణాకులేక్షణమ్ | = అశ్రుపూర్ణములై, వ్యాకులపాటుతోగూడిన నేత్రములుగలవాడును | తమ్ | = ఆ అర్జునునిగూర్చి |
| కృపయా, ఆవిష్టమ్ | = కరుణతో నిండినవాడును | | | మధుసూదనః | = శ్రీకృష్ణుడు |
| | | | | ఇదమ్ వాక్యమ్ | = ఈ వాక్యమును |
| | | విషీదంతమ్ | = శోకించుచున్నవాడును-అగు | ఉవాచ | = పలికెను. |

సంజయుడు పలికెను- ఈ విధముగా కరుణాపూరిత హృదయుడైన అర్జునుని కనులలో అశ్రువులు నిండి యుండెను. అవి అతని వ్యాకులపాటును, శోకమును తెలుపుచుండెను. అట్టి అర్జునునితో శ్రీకృష్ణభగవానుడు ఇట్లనెను. **(1)**

ప్రశ్న - 'తమ్' అను పదము ఎవరిని తెలుపును. దానితోపాటు 'తథా, కృపయావిష్టమ్, అశ్రుపూర్ణాకులేక్షణమ్, విషీదంతమ్' అను మూడు విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - మొదటి అధ్యాయాంతమున అర్జునుడు శోకమగ్నుడై రథముపై చతికిలపడిన విషయము వర్ణింపబడెను. ఇచట 'తమ్' అను పదము ఆ యర్జునునే సూచించును. దానితోపాటు 'ఉపర్యుక్త' విశేషణములను ప్రయోగించుటద్వారా అతని స్థితిని వర్ణించుట జరిగినది. అర్జునుడు బంధుమిత్రులయెడగల వ్యామోహకారణమున హృదయదౌర్బల్యమునకు గురియయ్యెను. అతనినేత్రముల యందు అశ్రువులు నిండి అవి వ్యాకులములయ్యెను. బంధుమిత్రులనాశములను శంకించుచు, వారిని చంపుట మహాపాపమని భావించి, అర్జునుడు భయశోకములకు లోనయ్యెను. అర్జునుని ఈ స్థితియంతయు మొదటి అధ్యాయమున విస్తృతముగా వర్ణింపబడినది. అట్టి అర్జునునితో శ్రీకృష్ణభగవానుడు పలికెను.

ప్రశ్న - ఇచట 'మధుసూదనః' అను నామమును, 'వాక్యం' అను పదముతోపాటు 'ఇదమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - భగవానుని 'మధుసూదన' నామమును, 'ఇదమ్' 'వాక్యమ్' అను పదములను ప్రయోగించి, సంజయుడు ధృతరాష్ట్రుని హెచ్చరించెను. దేవతలను కష్టపెట్టుచున్న మధు అను రాక్షసుని శ్రీకృష్ణభగవానుడు పూర్వము సంహరించియుండెను. కావున ఆయనకు మధుసూదనుడను పేరు కల్గెను. ఆ భగవానుడే ఇప్పుడు యుద్ధ విముఖుడైన అర్జునుని 'ఈ వచనముల' ద్వారా యుద్ధమునకు ప్రోత్సహించుచున్నాడు. ఇట్టి స్థితిలో ధృతరాష్ట్రుని పుత్రులకు జయము అసంభవము. ఏలనన వారును దుర్మార్గులే. దుర్మార్గులను తుదముట్టించుట భగవంతుని పని. కనుక "ఇప్పుడైనను నీ పుత్రులకు నచ్చజెప్పి, సంధిగావింపుము. వారి సంహారమును నిల్పుము." - అని సంజయుడు ధృతరాష్ట్రుని హెచ్చరించుచున్నాడు.[1]

### శ్రీభగవానువాచ

**కుతస్త్వాకశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।**
**అనార్యజుష్టమస్వర్గ్యమ్ అకీర్తికరమర్జున ॥ 2 ॥**

1) భారతయుద్ధము 10 దినముల వఱకు జరిగిన పిమ్మట ఈ విషయములను సంజయుడు ధృతరాష్ట్రునితో తెల్పుచున్నాడు. "ఇప్పుడైనను సంధికావించుకొనుము - " అని తెల్పుటవలన 10 దినముల తర్వాత ఐనను యుద్ధమును నిలిపి, మిగిలిన కుటుంబములవారిని రక్షించుకొనుట బుద్ధిమంతుల లక్షణము - అని తెల్పుచున్నాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = ఓ అర్జునా! | సముపస్థితమ్ | = దాపురించినది? | అస్వర్గ్యమ్ | = స్వర్గమును ఇచ్చునదియుకాదు |
| విషమే | = తగనిసమయమున | యుతః | = ఏలనన, ఇది | | |
| ఇదమ్ కశ్మలమ్ | = ఇట్టి మోహము | అనార్యజుష్టమ్ | = శ్రేష్ఠులచే ఆచరింప బడునదియుకాదు | అకీర్తికరమ్ | = కీర్తిని కలిగించు నదియు కాదు. |
| త్వా కుతః | = నీకు ఎట్లు? | | | | |

**శ్రీభగవానుడు ఇట్లనెను- ఓ అర్జునా! తగనిసమయములో ఈ మోహము నీకు ఎట్లు దాపురించినది? ఇది శ్రేష్ఠులచే ఆచరింపబడునదియు కాదు, స్వర్గమును ఇచ్చునదియు కాదు, కీర్తిని కలిగించునదియు కాదు.** (2)

ప్రశ్న - 'ఇదమ్' అను విశేషణముతోపాటు 'కశ్మలమ్' అను పదము దేనిని సూచించును? "తగని సమయమున నీకు ఈ మోహము ఎట్లు దాపురించినది?" అని పల్కుటలోని ఆంతర్యమేమి?

సమా - 'ఇదమ్' అను విశేషణముతోపాటు 'కశ్మలమ్' అను పదము అర్జునుని మోహజనితశోకమును, కాతరత్వమును తెల్పును. ఈ వాక్యము ద్వారా భగవాముడు అర్జునుని మందలించుచు "ఈ విషమ స్థలమునందు అనగా భయపడుటకును, శోకించుటకును సర్వథా తగని యుద్ధభూమియందు యుద్ధప్రారంభసమయమున మహావీరుడవైన నీకు ఈ మోహమెక్కడి నుండి వచ్చి పడినది?" అని ఆశ్చర్యముతో అడిగెను.

ప్రశ్న - పైన తెల్పబడిన మోహమును (కాతరత్వమును) అనార్యజుష్టమ్' 'అస్వర్గ్యమ్' 'అకీర్తికరమ్' అని వర్ణించుటలోని ఆంతర్యమేమి?

సమా - దీని ద్వారా తన ఆశ్చర్యము సహేతుకమని భగవానుడు తెల్పెను. "ఈ మోహము శ్రేష్ఠపురుషులకు తగదు, ఇది స్వర్గప్రాప్తిని కలుగజేయదు. కీర్తిని వ్యాపింపజేయదు. దీని (ఈమోహము) వలన మోక్షము సిద్ధింపదు సరిగదా! ధర్మార్థభోగ(కామ)ములు గూడ లభింపవు. ఇట్టి పరిస్థితిలో బుద్ధిమంతుడవై యుండియు ఈ మోహమునకు ఎట్లు లోనైతివి?" అని భగవానుడు ఆశ్చర్యముతో ప్రశ్నించెను.

**క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥ 3 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ అర్జునా! | ఏతత్ | = ఇది (ఈ పిరికితనము) | హృదయ దౌర్బల్యమ్ | = హృదయ దౌర్బల్యమును |
| క్లైబ్యమ్ | = నపుంసకత్వమును (పిరికితనమును) | న, ఉపపద్యతే | = కలుగరాదు (తగదు) | త్యక్త్వా | = త్యజించి |
| మా, స్మ, గమః | = పొందవద్దు | పరంతప | = ఓ పరంతపా! | ఉత్తిష్ఠ | = లెమ్ము (యుద్ధమునకై నడుము బిగింపుము). |
| త్వయి | = నీ యందు (నీకు) | క్షుద్రమ్ | = తుచ్ఛమైన | | |

**కావున ఓ అర్జునా! పిరికితనమునకు లోనుకావద్దు. నీకిది ఉచితము కాదు. ఓ పరంతపా! తుచ్ఛమైన ఈ హృదయదౌర్బల్యమును వీడి, యుద్ధమునకై నడుము బిగింపుము.** (3)

ప్రశ్న - 'పార్థ!' అను సంబోధనతో పాటు "క్లైబ్యమును పొందకుము (నపుంసకత్వమునకు లోను గాకుము.) ఇది నీకు ఉచితముగాదు" అను వాక్యముల అంతరార్థమేమి?

సమా - కుంతికి మఱియొకపేరు పృథ. ఆమె వీరమాత. శ్రీకృష్ణభగవానుడు కౌరవ పాండవులకు సంధి చేయుటకై దూతగా హస్తినాపురమునకు వెళ్లినపుడు తన మేనత్తయైన కుంతితో కలిసెను. ఆ సమయమున కుంతి శ్రీకృష్ణుని ద్వారా అర్జునునకు వీరోచితమైన ఒక సందేశమును పంపెను. అందు 'విదుల'ను మఱియు ఆమె కుమారుడైన సంజయుని, ఉదాహరణముగా చూపుచు యుద్ధమునకై అర్జునుని

ప్రోత్సహించెను. కనుక ఇక్కడ శ్రీకృష్ణభగవానుడు అర్జునుని పార్థ! అని సంబోధించి, కుంతీదేవియొక్క క్షత్రియోచితమైన ఆ సందేశమును అతనికి జ్ఞప్తికి తెచ్చెను. పై రెండు వాక్యములద్వారా "నీ తల్లి వీరమాత - నీవు వీరుడవు. నీకు ఈ పిఱికితనము ఏవిధముగను తగదు." అని సూచించెను. "గొప్ప మహారథులైన వారి హృదయములలో కంపము పుట్టించునట్టి సాటిలేని నీ శౌర్యమెక్కడ? ఈ దీనస్థితియెక్కడ? నీ శరీరము గగుర్పాటు చెందినది. వణకుచున్నది. గాండీవము జారిపోవుచున్నది. చిత్తము విషాదగ్రస్తమై భ్రమకు లోనైనది. ఇట్టి పిఱికితనము నీవంటి వానికి ఏవిధముగను తగదు." అని ధైర్యము గొల్పెను.

ప్రశ్న - 'పరంతప!' అను సంబోధనలోని వైశిష్ట్యమేమి?

సమా - శత్రువులను తపింపజేయువానిని 'పరంతప!' అని యందురు. అర్జునుడు లోగడ పెక్కుమంది శత్రువులను గడగడలాడించి, హతమార్చి, ప్రసిద్ధికెక్కెను. నివాతకవచాది శక్తిశాలురైన దానవులను మట్టి గఱపించిన అర్జునుడు నేడు క్షత్రియస్వభావమునకు విరుద్ధముగా కాపురుషోచితమైన పిఱికితనమును వహించి, శత్రువులను సంతోషపఱచుట తగదు -" అని తెల్పుటకే 'పరంతప!' అని సంబోధించెను-

ప్రశ్న - 'క్షుద్రమ్' అను విశేషణముతో పాటు 'హృదయదౌర్బల్యమ్' అను సమాసమునకు అర్థమేమి? దానిని త్యజించి, యుద్ధసన్నద్ధుడవు కమ్ము - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ పిఱికితనము రణభీరువులైన వారి అంతః కరణముల యందు ఉండదగినది. శూరులు సర్వథా త్యజింపదగినది - కావున అర్జునుని వంటి మహావీరునకు తుచ్ఛమైన ఈ దౌర్బల్యము ఏ మాత్రము తగదు. కావున వెంటనే దానిని త్యజించి, యుద్ధమునకు నడుము బిగింపుము - అని భగవానుడు అర్జునుని ప్రోత్సహించెను.

సంబంధము - భగవానుడు ఈ విధముగా పల్కగా గురుజనులతో యుద్ధము చేయుట సర్వథా అనుచితమని నిరూపించుటకు అర్జునుడు తన నిర్ణయమును ప్రకటించుచున్నాడు-

**అర్జున ఉవాచ**

## కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
## ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥ 4 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| మధుసూదన | = ఓ మధుసూదనా! | భీష్మమ్ | = భీష్మపితామహుని | యతః | = ఏలననగా |
| అహమ్ | = నేను | చ | = మఱియు | అరిసూదన | = ఓ అరిసూదనా! |
| సంఖ్యే | = రణమునందు | ద్రోణమ్ | = ద్రోణాచార్యుని | తౌ | = ఆ ఇద్దఱును |
| కథమ్ | = ఏవిధముగా | ప్రతియోత్స్యామి | = ఎదుర్కొని పోరాడగలను? | పూజార్హౌ | = (నాకు) పూజింపదగినవారు |
| ఇషుభిః | = బాణములతో | | | | |

**అర్జునుడు పలికెను- ఓ మధుసూదనా! పూజ్యులైన భీష్మపితామహుని, ద్రోణాచార్యులను యుద్ధమున ఎదిరించి బాణములతో ఎట్లు పోరాడగలను? ఏలనన ఓ అరిసూదనా! ఈ ఇరువురును నాకు పూజ్యులు.** **(4)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు 'అరిసూదన!' 'మధుసూదన!' అను సంబోధనలతోపాటు 'కథమ్?' అను పదమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - మధువు అను రాక్షసుని సంహరించుటవలన శ్రీకృష్ణభగవానునకు మధుసూదనుడను పేరుకల్గెను. శత్రువులను రూపుమాపుటవలన ఆయనకు అరిసూదనుడు అని పేరు ఏర్పడెను. ఈ రెండు సంబోధనలతోపాటు 'కథమ్' అను పదమును ప్రయోగించి, అర్జునుడు తన ఆశ్చర్యమును ప్రకటించెను. ఏలనన భీష్మద్రోణాదులతో యుద్ధమొనర్పుమని శ్రీకృష్ణుడు అర్జునుని ప్రోత్సహించు

చుండెను. వారు దైత్యులును గారు, తనకు శత్రువులును గారు. పైగా పూజ్యులైన గురుజనులు. మరి తన స్వభావమునకు విరుద్ధముగా పెద్దలతో యుద్ధము చేయుమని ఎట్లు చెప్పుచున్నాడు? అని ఆశ్చర్యమును ప్రకటించుచు, వారిని నేను ఎట్లు చంపగలను?" అని ప్రశ్నించుచు **కథమ్?** అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - **'ఇషుభిః'** అనగానేమి?

సమా - **'ఇషు'** అను శబ్దమునకు బాణము - అని అర్థము. గురువుల (పెద్దల) యెడ సాధారణముగా చులకన భావమును ప్రకటించుచు మాట్లాడుటయు మహాపాపమే. అయినచో తీక్ష్ణములైన బాణములను ప్రయోగించుచు వారిపై యుద్ధము చేయుటయెట్లు? ఇట్లు ఘోరమైన పాపకార్యమునందు తనను ప్రవృత్తునిగా చేయుటకు గల కారణమేమి? అని తెల్పుటకై **'ఇషుభిః'** అను పదమును ప్రయోగించెను.

**గురూనహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే ।**
**హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥ 5 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహానుభావాన్ | = మహానుభావులైన | శ్రేయః | = శ్రేయస్కరము (అని భావింతును) | రుధిరప్రదిగ్ధాన్ | = రక్తసిక్తమైన |
| గురూన్ | = గురువులను | హి | = ఎందులకనగా | అర్థకామాన్ | = అర్థకామ రూపములైన |
| అహత్వా | = చంపక | గురూన్ | = గురుజనులను | భోగాన్ ఏవ తు | = భోగములనే |
| ఇహ లోకే | = (నేను) ఈ లోకమున | హత్వా (అపి) | = చంపి ఐనను | భుంజీయ | = అనుభవింపవలసి యుండును గదా! |
| భైక్ష్యమ్ అపి | = భిక్షాన్నమును ఐనను | ఇహ | = ఈ లోకమున | | |
| భోక్తుమ్ | = తినుటకు (తినుట) | | | | |

**మహానుభావులైన ఈ గురుజనులను చంపకుండా బిచ్చమెత్తుకొనియైనను ఈ లోకమున జీవించుట నాకు శ్రేయస్కరమే. ఏలనన ఈ గురుజనులను చంపినను, రక్తసిక్తములైన రాజ్యసంపదలను, భోగములను మాత్రమే నేను అనుభవింపవలసి యుండునుగదా! (5)**

ప్రశ్న - 'మహానుభావాన్' అను విశేషణముతో పాటు 'గురూన్' అను పదము ఇచట ఎవరిని సూచించును?

సమా - దుర్యోధనునియొక్క సేనయందు ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు మొదలగు గురువులును, బాహ్లీకుడు, సోమదత్తుడు, భీష్ముడు, భూరిశ్రవుడు, శల్యుడు మొదలగు పెద్దలును ఉండిరి. వారందఱును మిక్కిలి ఉదారభావము గలవారు మఱియు మహాత్ములు. అట్టి శ్రేష్ఠులైన పూజ్యులను తెల్పునదియే 'మహానుభావాన్' అను విశేషణముతోపాటు 'గురూన్' అనుపదము.

ప్రశ్న - ఇచట 'భైక్ష్యమ్' అను పదముతోపాటు 'అపి' అను అవ్యయమును ప్రయోగించుటలో వైశిష్ట్యమేమి?

సమా - భిక్షాన్నముతో శరీర పోషణము గావించుకొనుట క్షత్రియులకు నింద్యము. అయినప్పటికిని గురుజనులను వధించి, రాజ్యభోగములను అనుభవించుట కంటె అట్టి నింద్యమైన కర్మను ఆచరించుట కూడ తనకు సమ్మతమే అని తెల్పుటకై 'భైక్ష్యమ్' 'అపి' అను పదములను ప్రయోగించెను.

ప్రశ్న - 'భోగాన్' అను పదముతోపాటు 'రుధిరప్రదిగ్ధాన్' 'అర్థకామాన్' అను విశేషణములను 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - గురుజనులను వధించుట సర్వథా అనుచితమే. ఇట్టి అనుచిత కార్యము చేయుటవలన తనకు ముక్తియు లభింపదు. ధర్మమూ సిద్ధింపదు. కేవలము ఈ లోకమునందు అర్థకామరూపములైన భోగములు మాత్రమే లభింపవచ్చును. గురుజనుల జీవనములతో పోల్చినప్పుడు అవి మిక్కిలి అల్పములు. అవియును గురువుల హత్యా స్వరూపములగుట వలన ఒక విధముగ రక్తసిక్తములే. కావున అట్టి భోగముల కొఱకై గురుజనులను వధించుట ఏ విధముగను ఉచితముగాదు.

ప్రశ్న - 'అర్థకామాన్' అను పదమును 'గురూన్' అను పదమునకు విశేషణముగా భావించినచో కలుగుదోషమేమి?

సమా - 'గురూన్' అను పదముతో పాటు 'మహానుభావాన్' అను విశేషణము ప్రయుక్తము కానిచో ఈ విధముగ భావింపవచ్చును. కాని అదే శ్లోకమున అర్జునుడు ఆ గురుజనులను 'మహానుభావులు' అని పేర్కొనియుండెను. వెంటనే వారిని 'అర్థకామాన్' అనగా ధనాశగలవారు అని ఊహించుట సమంజసముగా కనబడదు. ఈ రెండు విశేషణములును పరస్పర విరుద్ధములు. కావున 'అర్థకామాన్' అను పదము 'గురూన్' అను పదమునకు విశేషణము కానేరదు.

*సంబంధము - ఈ విధముగా తన నిశ్చయమును ప్రకటించినప్పటికిని అర్జునునకు సంతృప్తి కలుగలేదు. తన మనోభావములపై తనకే సందేహము కలిగెను. కావున అతడు మఱల పలుకసాగెను-*

**న చైతద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా నో జయేయుః ।**
**యానేవ హత్వా న జిజీవిషామః తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతత్ చ | = ఇదియును | యత్ వా | = మఱియు (దీనిని గూడ ఎఱుగము) | యాన్ హత్వా | = ఎవరిని చంపి (మేము) |
| న విద్మః | = ఎఱుగము | | | న, జిజీవిషామః | = జీవించుటకును ఇష్టపడమో |
| నః | = మనకు (యుద్ధము చేయుట, చేయకుండుట అను) | జయేమ | = వారిని మనము జయించెదమా? | | |
| | | | | తే ఏవ | = వారే (ఆ ఆత్మీయులే) |
| | | యది వా | = లేక | ధార్తరాష్ట్రాః | = ధార్తరాష్ట్రులు |
| కతరత్ | = రెండింటిలో ఏది | నః | = మనలను | ప్రముఖే | = (మన) ఎట్టయెదుట |
| గరీయః | = శ్రేష్ఠము? | జయేయుః | = వారు జయింతురా? | అవస్థితాః | = నిలిచియున్నారు |

**ఈ యుద్ధముచేయుట శ్రేష్ఠమా? లేక చేయకుండుట శ్రేష్ఠమా? అనునది ఎఱుగము. యుద్ధమున వారిని మనము జయింతుమా? లేక మనలను వారు జయింతురా? అను విషయమునుగూడ ఎఱుగము. మనకు ఆత్మీయులైన ధార్తరాష్ట్రులే ఇచట మనలను ఎదిరించి (పోరాడుటకు) నిలిచియున్నారు. వారిని చంపి, జీవించుటకును మనము ఇష్టపడము. (6)**

ప్రశ్న - "ఈ యుద్ధమును చేయుట శ్రేష్ఠమా? లేక చేయకుండుట శ్రేష్ఠమా?" అనునది యెఱుంగము." అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యము ద్వారా అర్జునుడు తనకేది శ్రేయస్కరమో? నిర్ణయించుకొనలేని స్థితిని ప్రకటించెను. యుద్ధమును చేయుటయా? లేక చేయకుండుటయా? అను రెండింటిలో ఏది శ్రేష్ఠము? ఏలనన యుద్ధము చేయుట క్షత్రియ ధర్మము అనియు, దాని ఫలస్వరూపమైన కులనాశము మహాదోషము - అనియు భావింపబడినది -

ప్రశ్న - మనమే వారిని జయింతుమా? లేక వారే మనలను జయింతురా? అను వాక్యములయొక్క అంతరార్థమేమి?

సమా - ఒకవేళ ఏకపక్షముగా యుద్ధము చేయుటయే శ్రేష్ఠమని భావించినచో జయము మనకు దక్కునా? లేక వారికి దక్కునా? అనుదానిని గూడ నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు.

ప్రశ్న - ఆత్మీయులైన ధృతరాష్ట్రపుత్రులను చంపి, మనము జీవించుటకును ఇష్టపడము. అట్టి ఆత్మీయులే మనలను ఎదిరించి పోరాడుటకు నిల్చి యున్నారు - అని అనుటలోని విశేషమేమి?

సమా - "ఒకవేళ జయము మనకే దక్కునని భావించినను యుద్ధము చేయుట సముచితముగా కన్పింపదు. ఏలనన వారిని చంపి, మనము జీవించుటకు కూడ ఇష్టపడము. అట్టి సోదరులైన దుర్యోధనాదులే చావుకు సిద్ధపడియు మన యెదుట నిల్చియున్నారు" - అని యనుచు జయముగూడ వారిని చంపిన పిమ్మటనే లభించును గావున తమకేది కర్తవ్యమో అర్జునుడు నిర్ణయించుకొనలేక పోయెను.

*సంబంధము - కర్తవ్యనిర్ణయమునందు తన యసమర్థతను ప్రకటించిన పిదప అర్జునుడు భగవంతునకు శరణాగతుడై తనకేది కర్తవ్యమో? నిశ్చయముగా తెల్పుమని ప్రార్థించెను-*

**కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।**
**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కార్పణ్యదోషోప హతస్వభావః | = పిరికితనమనెడి దోషమునకు లోనైన స్వభావము కలిగినవాడనై | పృచ్ఛామి | = అడుగుచున్నాను | అహమ్ | = (ఏలనన) నేను |
| | | యత్ | = ఏ (ఏసాధన) | తే | = నీకు |
| | | నిశ్చితమ్ | = నిశ్చయముగా | శిష్యః | = శిష్యుడను |
| | | శ్రేయః, స్యాత్ | = మేలు అగునో? | త్వామ్ | = నిన్ను |
| ధర్మ సమ్మూఢచేతాః | = ధర్మవిషయమున మూఢచిత్తుడనై | తత్ | = దానిని | ప్రపన్నమ్ | = శరణుపొందినవాడను |
| | | మే | = నాకు | మామ్ | = (కనుక) నన్ను (నాకు) |
| త్వామ్ | = నిన్ను | బ్రూహి | = తెలుపుము | శాధి | = ఉపదేశింపుము |

**కార్పణ్యదోషము (పిరికితనము)నకు లోనై నా స్వభావమును కోల్పోయి గిలగిలలాడుచున్నాను. ధర్మాధర్మముల విచక్షణకు దూరమై నా కర్తవ్యమును నిర్ణయించుకొనలేకున్నాను. నాకు నిజముగా శ్రేయస్కరమైన దానిని తెలుపుము. నేను నీకు శిష్యుడను. శరణాగతుడను, ఉపదేశింపుము. (7)**

ప్రశ్న - 'కార్పణ్య దోషము' అనగానేమి? అర్జునుడు తాను ఉపహతస్వభావుడు ఐనట్లు చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - 'కృపణ' శబ్దమునకు వ్యవహారమునందు విభిన్నార్థములుగలవు.

1. ఒకనియొద్ద పుష్కలముగా సంపదగలదు. కాని అతనికి ధనముపై మిక్కిలి ఆసక్తియు, లోభత్వమూ కలవు. కావున న్యాయసమ్మతముగా దాన, భోగాదులకై అవసరమైనప్పుడు కూడ దానిని వెచ్చించుటకు ఇష్టపడడు. అట్టిలోభిని 'కృపణుడు' అనియందురు.

2. భగవత్తత్త్వమును తెలిసికొని, దానిని పొందుటయే మానవ జీవన ప్రధాన లక్ష్యమని శాస్త్రములు, మహాత్ములు ముక్తకంఠముతో తెల్పిరి. ఈ లక్ష్యమును మఱచి, విషయభోగములయందే తన జీవితమును వ్యర్థపఱచు మూర్ఖుని గూడ 'కృపణుడు' అని యందురు - శ్రుతి యిట్లు తెలుపుచున్నది.

"యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాస్మాల్లోకాత్ ప్రైతి స కృపణః!" (బృహదారణ్యక - ఉపనిషత్ - 3/8/10)

"ఓగార్గీ! శాశ్వతమైన ఈ పరమాత్మను ఎఱుంగకయే ఈ లోకమును వీడినవాడు (మరణించినవాడు) కృపణుడు."

"భోగైశ్వర్యములయందు ఆసక్తుడై ముఖ్యముగా వాటి ఫలములనే ఆశించుచుండువానిని 'కృపణుడు' అనియందురు. 'కృపణాః ఫలహేతవః' అని భగవానుడు గీతయందు పల్కియుండెను. (2/49)"

3. సాధారణముగా దీనస్వభావముగల వానిని 'కృపణ' శబ్దము సూచించును. ఇచట అర్జునుడు లోభియు కాడు, భోగాసక్తుడును కాడు. ఏలనన సహజముగనే అతడు అత్యంత ఉదారుడు, దాత, జితేంద్రియుడు. అతడే స్పష్టముగా "నాకు విజయము, రాజ్యము, భోగములు మున్నగు వానియందు ఆకాంక్షలేదు. ఎవరికొఱకై ఈ విజయాదులు అపేక్షితములో, అట్టి ఆత్మీయులందఱును చావుకు తెగించి, ఇచట ఎదురుగా నిలిచియున్నారు. ముల్లోకముల ఆధిపత్యము లభించినను నేను ఈ దుర్యోధనాదులను వధింపనిచ్ఛగింపను. (1/32 నుండి 35) సమస్త భూమండలముయొక్క నిష్కంటకమైన ఆధిపత్యము, దేవతలపై ప్రభుత్వము (అధికారము) గూడ నన్ను శోకరహితునిగా చేయజాలవు." అని పల్కియుండెను. (2/8) ఇట్టి త్యాగశీలము గలవాడు లోభి, భోగాసక్తుడు కానేరడు. ఈ ప్రకరణమున ఇట్టి అర్థములు సర్వథా అసమంజసములు.

ఇచట అర్జునుని కార్పణ్యము ఒక విధముగ దైన్యస్థితి. అది కరుణతో గూడిన హృదయ దౌర్బల్యముగా, శోకముగా ప్రకటితమైనది. మొదటి శ్లోకమున అర్జునుని 'కృపయావిష్టం' అను పదము ద్వారా అతనికరుణాజనిత దౌర్బల్యమును సంజయుడు నిర్దేశించెను. 3వ శ్లోకమున భగవానుడు గూడ 'క్లైబ్యం' అను పదమును ప్రయోగించి ఆ భావమునకే పుష్టిని చేకూర్చెను. కావున ఇచట అర్జునుని కార్పణ్యము బంధునాశముయొక్క ఆశంకచే ఏర్పడిన కరుణాయుక్తమైన దౌర్బల్యమని ప్రతీతమగును.

అర్జునుడు ఆదర్శక్షత్రియుడు. సహజముగనే శూరుడు, వీరుడు. ఆయనకు ఏ కారణము వలననైనను ఈ దౌర్బల్యము దోషమే. కావున అర్జునుడు దీనిని కార్పణ్య దోషము అని పేర్కొనెను.

ఈ కార్పణ్యదోషమువలన అర్జునుని సాటిలేని శౌర్య, ధైర్య, వీర్య, చాతుర్య, సాహస పరాక్రమాదులతో సంపన్నమైన అతని క్షత్రియస్వభావము నష్టప్రాయము (మఱుగున బడినది) ఆయెను. కావున అతని అంగములు శిథిలము లాయెను. ముఖము వాడిపోయెను. నోరు ఎండిపోయెను. శరీరము వణకుచుండెను. తాపము హెచ్చెను. మనస్సు భ్రమకు లోనైనట్లాయెను. కరుణతో నిండిన దౌర్బల్యావేశ ప్రభావమున అర్జునుడు తనలో స్వభావవిరుద్ధములైన లక్షణములను జూచి, "నేను కార్పణ్యదోషముచే ఉపహతస్వభావుడనైతిని" - అని పలికెను.

ప్రశ్న - అర్జునుడు తనను 'ధర్మసమ్మూఢచేతాః' అని యేల పేర్కొనెను?

సమా - ధర్మాధర్మములను, కర్తవ్యాకర్తవ్యములను యథార్థముగా నిర్ణయించుటకు అసమర్థమైన అంతః కరణము గలవానిని 'ధర్మసమ్మూఢ చేతాః ' అని యందురు - ఈ సమయమున అర్జునుని చిత్తము భయంకరమైన ధర్మసంకటము నందు పడెను. ఒకవైపు ప్రజాపాలనము, క్షాత్రధర్మము స్వత్వసంరక్షణము మొదలగు వాటి దృష్టితో యుద్ధము ధర్మము అనియెంచి, దానియందు పాల్గొనుట ఉచితమని భావించెను. మఱొకవైపు అతని చిత్తముయొక్క కార్పణ్యస్థితివలన యుద్ధము వలన కలుగు భయానక పరిణామములను చూచి, భిక్షావృత్తి, సన్న్యాసము, వనవాసము మొదలగునవి మేలని తలపోసెను. కరుణావిష్టమైన చిత్తముతో అతనిబుద్ధి ఎట్టి నిశ్చయమును చేయలేకపోయెను. కావున తాను 'కింకర్తవ్యవిమూఢు'డనైతిని - అని తెల్పుటకు 'ధర్మసంమూఢచేతాః' అని పల్కెను.

ప్రశ్న - 'నిశ్చితం శ్రేయః' అనగానేమి?

సమా - భీష్మద్రోణకర్ణాది విశ్వవిఖ్యాత శూరులును, వీరులును, అజేయులును, ఐన వారిచేత సంరక్షితమై, తన సేనకంటె పెక్కు రెట్లు అధికముగా నున్న కౌరవసేనను జూచి, అర్జునుడు భయపడినాడని తలంపరాదు. యుద్ధమున తనకు విజయము సంభవముకాదని భావించి, నిరాశ చెందినాడనియు తలపోయరాదు. యుద్ధము చేయుట తనకు మేలా? చేయకుండుట మేలా? అని తలంచుచు జయపరాజయముల విషయమునకు సంబంధించిన నిర్ణయమును నిశ్చితముగా తెల్పుమని శ్రీకృష్ణుని ప్రార్థించినట్లును భావింపరాదు.

ఒకవైపు అర్జునుని చిత్తమునందు బంధుప్రేమ జాగృతమై, అందువలన బంధునాశరూప పాపభీతి ఆవరించి, అది తన శ్రేయస్సునకు ప్రతిబంధకమగునని అతడు తలంచెను. మఱొకవైపు క్షత్రియధర్మోచితమైన యుద్ధమును త్యజించుట అధర్మమనీ, అది అతని శ్రేయస్సునకు భంగకరమనీ భావించెను.

ఇచ్చట నిశ్చితశ్రేయస్సు - అనగా జయపరాజయములకు సంబంధించినది కానే కాదు. అతని లక్ష్యము భగవత్ప్రాప్తి రూప పరమకల్యాణము - కావున అతడు 'భగవన్! నేను కర్తవ్యనిర్ణయమును చేయుటలో అశక్తుడనైతిని, నాకు పరమశ్రేయస్కరమైన సాధనమార్గమును నిశ్చయముగా నీవే తెల్పుము.' అని శ్రీకృష్ణుని ప్రార్థించెను -

ప్రశ్న - "నేను నీ శిష్యుడను - శరణాగతుడనైన నన్ను శాసింపుము-" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు శ్రీకృష్ణభగవానునకు ప్రియసఖుడు. ఆధ్యాత్మిక స్థాయిలో వారి స్థితులు వేర్వేఱు. కాని లోక వ్యవహారమున ఆ యిరువురి మధ్య అన్ని వేళల సమానస్థాయియే ఉండును. అన్నపానాదులయందును, నిద్రించునపుడును, రాకపోకలయందును, అన్నిచోట్ల భగవంతుడు ఆయనను సమానముగనే చూచుచుండెను. భగవంతుని శ్రేష్ఠత్వము నెడ అర్జునునకు మనస్సున శ్రద్ధాదరములు ఉన్నప్పటికిని ఆయనతో సమానముగనే మెలగుచుండెను. నేడు అర్జునుడు తన శోచనీయ స్థితిని

ఎఱింగి, వాస్తవముగా తాను ఆయనతో సమానుడనుకానని అనుభవపూర్వకముగ గ్రహించెను. సమానులమధ్య సలహాలు ఉండునుగాని ఉపదేశములు ఉండవు. ప్రేరణలు ఉండును గాని శాసించుటలుండవు. అతడు తన మానసికదైన్యస్థితి నుండి బయటపడుటకు సలహాలు, ప్రేరణలు పనిచేయవు. ఉపదేశములద్వారా తనను శాసించుచు శ్రేయోమార్గమున నడిపించునట్టి గురువు తనకు అవసరమని గ్రహించెను. తన శోకమును మోహమును సర్వథా పాఱద్రోలి, తనకు పరమశ్రేయస్సును కలిగించుటకు శ్రీకృష్ణుని మించిన గురువు లేడని అతడు భావించెను. శిష్యరూపక్షేత్రము గురూపదేశము అనెడి అమృతధారను గ్రహించుటకు అన్ని విధములుగ సిద్ధమైనప్పుడే అది వర్తించును. కనుక అర్జునుడు 'భగవన్! నేను నీ శిష్యుడను.' అని పల్కెను.

శిష్యులు పెక్కు విధములుగా నుందురు. గురూపదేశమును గ్రహించిన పిదప తమ పురుషార్థాహంకారములను కల్గినవారును, లేక తమ సద్గురువులపై గాక ఇతరులపై విశ్వాసములనుంచువారును, గురుకృపా లాభములను యథార్థముగ పొందలేరు. కనుక శిష్యత్వముతోపాటు తన యందలి అనన్యశరణ భావమును గూడ ప్రకటించుచు, "భగవన్! నేను కేవలము నీకు శిష్యుడనే గాక, శరణాగతుడను గూడ" అని పల్కెను. భగవంతుడు అత్యంతశక్తిశాలి, సర్వశ్రేష్ఠుడు - అని తెలిసికొని, ఆయనకు ఆత్మ సమర్పణము చేసికొనుటను ప్రపన్నశబ్దము తెలుపును. దీనినే శరణాగతి, ఆత్మనిక్షేపము, ఆత్మసమర్పణము, అనియు అందురు. భగవానుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, అనంతగుణసాగరుడు, సర్వాధిపతి, ఐశ్వర్య మాధుర్య ధర్మశౌర్య జ్ఞాన వైరాగ్యాదులకు పెన్నిధి. క్లేశ కర్మసంశయ భ్రమాదులను సర్వథా నాశనము చేయువాడు, పరమ ప్రేమాస్పదుడు, సుహృదుడు, ఆత్మీయుడు, గురువు, మహేశ్వరుడు అని విశ్వసింపవలెను. ఇక తనను గూర్చి సర్వథా ఆశ్రయము, ఆలంబనము, బుద్ధి, బలము, సత్త్వము మొదలగునవి ఏవియు లేనివాడని భావింపవలెను - అంతేగాక భగవంతుని ఆశ్రయము, ఆలంబనము, జ్ఞానము, శక్తి, సత్త్వము, మఱియు సాటిలేని శరణాగత వాత్సల్యము మొదలగు వానిపై అనన్యమైన దృఢవిశ్వాసము కల్గియుండవలెను. సర్వవిధములుగ, శాశ్వతముగ భగవంతుని చరణములపై ఆత్మార్పణ కావించుకొనవలెను. నిర్నిమేషనేత్రుడై మనోనయనాభిరాముడైన అతని ముఖచంద్రునే ధ్యానించుచుండవలెను. ఆటబొమ్మవలె నిత్యము, నిరంతరము, ఆయన సూచనలమేరకు నటించుటయే తన జీవితధ్యేయమని భావింపవలెను. పైన పేర్కొనిన రీతిగా భావించుచు భగవంతుని అనన్య చింతన చేయుటయే భగవంతునకు ప్రపన్నుడగుటయగును.

ఈ విధమైన ప్రపత్తి భావపరిపూర్ణుడై అర్జునుడు "భగవన్! నేను నీకు శిష్యుడను, శరణాగతుడను, నన్ను ఆజ్ఞాపింపుము." అని పల్కెను. 'తే, త్వామ్' అను పదములను ప్రయోగించి, అర్జునుడు ఈ భావమునే తెలిపెను. అర్జునుని శరణాగతి సర్వోత్తమమైనది. యథార్థమైనది. 18వ అధ్యాయము నందలి 65, 66వ, శ్లోకములలో భగవానుని సర్వగుహ్యతమమైన ఉపదేశప్రభావమున నిజమైన శరణాగతి రూపమున పరిణతి చెందెను. అప్పుడు భగవంతుని ఆజ్ఞానుసారము నడచుటకు సంసిద్ధుడాయెను. అప్పుడే గీతోపదేశము పూర్తియగును. వాస్తవముగా ఈ శ్లోకమునుండియే గీతాసాధన ఆరంభమైనది. గీతోపదేశ ప్రారంభమునకు ఇదియే బీజము. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను శ్లోకమునందే ఈ సాధనకు 'సిద్ధి' లభించినది. దీనికి అదియే ఉపసంహారము.

*సంబంధము - తనకు కర్తవ్యమును నిర్దేశించుచు ఉపదేశింపుమని భగవానుని ప్రార్థించి, తన ప్రార్థనకు గల హేతువులను తెల్పుచున్నాడు. ఈ సందర్భమున తన మనోవైకల్యమును ప్రకటించుచున్నాడు-*

**న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్ యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్ ।**
**అవాప్య భూమావసపత్నమృద్ధం రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | ఆధిపత్యమ్ | = ఆధిపత్యమును | ఉచ్ఛోషణమ్ | = శుష్కింపజేయునట్టి |
| భూమౌ | = భూమియందు | అవాప్య, అపి | = పొందియు | శోకమ్ | = శోకమును |
| అసపత్నమ్ | = నిష్కంటకమైన | యత్ | = ఏదైతే | అపనుద్యాత్ | = దూరము చేయగలదో |
| ఋద్ధమ్ | = ధనధాన్యసంపన్నమైన | మమ | = నాయొక్క | (తత్), | = దానిని (ఆ ఉపాయమును) |
| రాజ్యమ్ చ | = రాజ్యమును | ఇంద్రియాణామ్ | = ఇంద్రియముల యొక్క (ఇంద్రియములను) | | |
| సురాణామ్ | = దేవతలయొక్క | | | న, పశ్యామి | = చూడకున్నాను. |

ఈ శోకము నా ఇంద్రియములను దహించివేయుచున్నది. సిరిసంపదలతో గూడిన తిరుగులేని రాజ్యాధికారము లభించినను, కడకు సురాధిపత్యము ప్రాప్తించినను ఈ శోకదాహము చల్లారునుపాయమును గాంచలేకున్నాను. **(8)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు అర్జునుడు తెల్పిన విషయము యొక్క అంతరార్థమేమి?

సమా - పూర్వశ్లోకమున తనకు కర్తవ్యోపదేశమును చేయుమని అర్జునుడు భగవానుని ప్రార్థించెను. మొదట భగవానుడు తనను యుద్ధము చేయుమని ఆదేశించి యుండెను. యుద్ధమువలన ఎక్కువలో ఎక్కువ శత్రువిజయము, ఈ లోకమున నిష్కంటక రాజ్యప్రాప్తి కలుగవచ్చును. కాని ఆలోచించి చూడగా అర్జునుని ఇంద్రియములను దహించివేయు శోకము సురాధిపత్యము లభించినను చల్లారునదికాదు - ఇక భూలోక రాజ్యాధిపత్యము సంగతి చెప్పనేల? కనుక తన ఇంద్రియములను దహించు శోకమును శాశ్వతముగా తొలగించి తనకు పరమ సుఖమును చేకూర్చు ఉపాయమును తెల్పుమని అర్జునుడు ప్రార్థించెను-

సంబంధము - ఆపిదప అర్జునుడేమిచేసెనో సంజయుడు తెల్పుచున్నాడు-

**సంజయ ఉవాచ**

**ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప ।**
**న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 9 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప | = ఓ రాజా! (ఓ ధృతరాష్ట్రా!) | ఏవమ్, ఉక్త్వా | = ఈ విధముగా పలికి | ఇతి | = అని |
| | | గోవిందమ్ | = గోవిందుని ఉద్దేశించి | హ | = స్పష్టముగా |
| గుడాకేశః | = అర్జునుడు | | | ఉక్త్వా | = పలికి |
| హృషీకేశమ్ | = అంతర్యామియైన శ్రీకృష్ణుని (తో) | న, యోత్స్యే | = 'యుద్ధము చేయను' | తూష్ణీమ్ బభూవ | = మౌనము వహించెను. |

సంజయుడు పలికెను- ఓ రాజా! ఈ విధముగా పలికిన పిమ్మట అంతర్యామియైన శ్రీకృష్ణునితో గుడాకేశుడైన అర్జునుడు, "నేను యుద్ధము చేయనే చేయను" అని స్పష్టముగా నుడివి మౌనము వహించెను. **(9)**

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క అంతరార్థమేమి?

సమా - పైన తెల్పబడినవిధముగా భగవానుని 'శరణుజొచ్చి, తనకు ఉపదేశమునిమ్మని ప్రార్థనజేయుచు అర్జునుడు తనదైన్యస్థితిని ప్రకటించుచు 'నేను యుద్ధము చేయనే చేయను' అని పలికి మౌనము వహించెను. ఈ విషయమును ఈ శ్లోకమున సంజయుడు ధృతరాష్ట్రునకు వినిపించెను.

ప్రశ్న - 'గోవింద' శబ్దమునకు అర్థమేమి?

సమా - "గోభిః వేదవాక్యైః విద్యతే లభ్యతే ఇతి గోవిందః" అను వ్యుత్పత్తిని అనుసరించి, వేదవాణిద్వారా

భగవానుని స్వరూపము తెలియబడును - కనుక ఆయనకు గోవిందుడు అను పేరుగలిగినది - గీతయందును భగవానుడు 'వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః' (15/15) వేదములన్నియును నన్ను గూర్చియే తెల్పును." అని పేర్కొనెను.

*సంబంధము - ఈ విధముగా అర్జునుడు మౌనము వహించియుండగా శ్రీకృష్ణభగవానుడు ఏమి చేసెనో సంజయుడు తెలుపుచున్నాడు-*

**తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదం వచః ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = ఓ ధృతరాష్ట్రా! | విషీదంతమ్ | = శోకముతో పరితపించుచున్న | ఇదమ్ | = ఈ |
| హృషీకేశః | = అంతర్యామియైన శ్రీకృష్ణభగవానుడు | తమ్ | = అతనిని (ఆ అర్జునునితో) | వచః | = వచనమును (మాటలను) |
| ఉభయోః సేనయోః మధ్యే | = ఉభయసేనల మధ్యభాగమున | ప్రహసన్, ఇవ | = మందహాసముతో | ఉవాచ | = పలికెను. |

**ఓ ధృతరాష్ట్రా! ఉభయసేనల మధ్య శోకసంతప్తుడైన అర్జునుని జూచి, శ్రీకృష్ణుడు మందహాసముతో ఇట్లు పలికెను. (10)**

ప్రశ్న - "ఉభయోః సేనయోః మధ్యే విషీదంతమ్" అను విశేషణముతో 'తం' అను పదమును ప్రయోగించుట లోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు మొదట మిక్కిలి ధైర్యసాహసములతో తన రథమును ఉభయసేనల మధ్య నిలుపుము - అని భగవానునితో పల్కియుండెను. అతడే ఇపుడు ఉభయ సేనలమధ్య నిలిచియున్న స్వజనులను చూడగనే మోహకారణమున వ్యాకులుడాయెను. ఆ అర్జునునితోడనే కృష్ణుడు పలుకసాగెను.

ప్రశ్న - నవ్వుచున్న వానివలె (చిరునవ్వుతో) ఇట్లు పలికెను - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవానుడు ఏమిచెప్పెను? ఏ భావముతో చెప్పెను? అను విషయమును సంజయుడు ఈ వాక్యము ద్వారా సూచనప్రాయముగా వెల్లడించుచున్నాడు. అర్జునుడు తన శూరత్వమును, వీరత్వమును ప్రకటించుటకు మారుగా శోక సంతప్తుడై భగవానుని శరణుజొచ్చి, కర్తవ్యమును ఉపదేశింపుమని ప్రార్థించెను. ఆయన (భగవానుని) నిర్ణయమును వినక పూర్వమే యుద్ధము చేయనని ప్రకటించుచున్నాడు. పొంతనలేని అతని చర్యలకు లోలోపలనే నవ్వుకొనుచు భగవానుడు పలికెను.

*సంబంధము - ఈ విధముగా చింతామగ్నుడై అర్జునుడు భగవానుని శరణుజొచ్చి, తన దుర్భరశోకనివృత్తికి ఉపాయమును అడిగెను. ఇహపరలోకములయందలి రాజ్యసుఖములు గూడ అతని శోకమును దూరము చేయజాలవని తెల్పెను. అప్పుడు తన యుపదేశమునకు అర్హుడని భావించి, భగవానుడు అతని శోకమోహములను శాశ్వతముగా దూరమొనర్చుటకై మొదట 'నిత్యానిత్య వస్తువివేచనను చేయుచు సాంఖ్యయోగదృష్టితో గూడ యుద్ధము చేయుటయే అతని కర్తవ్యమని ప్రతిపాదించుచు 'సాంఖ్యనిష్ఠ'ను గూర్చి వర్ణించుచున్నాడు-*

*శ్రీభగవానువాచ*

**అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥ 11 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్వమ్ | = నీవు | ప్రజ్ఞావాదాన్ | = ప్రజ్ఞావంతులవలె | చ | = మఱియు |
| అశోచ్యాన్ | = శోకింపదగనివారిని గూర్చి | భాషసే | = పలుకుచున్నావు (కాని) | అగతాసూన్ | = ప్రాణములు పోనివారిని గూర్చియు |
| అన్వశోచః | = శోకించుచున్నావు | గతాసూన్ | = ప్రాణములుపోయిన వారిని గూర్చియు | పండితాః | = పండితులు |
| చ | = మఱియు | | | న, అనుశోచంతి | = శోకింపరు. |

**శ్రీభగవానుడు పలికెను- ఓ అర్జునా! శోకింపదగని వారికొఱకై నీవు శోకించుచున్నావు. పైగా పండితుని (జ్ఞాని)వలె మాట్లాడుచున్నావు. పండితులైనవారు ప్రాణములు పోయిన వారిని గూర్చిగాని, ప్రాణములుపోని వారిని గుఱించిగాని శోకింపరు. (11)**

ప్రశ్న - 'శోకింపదగని వారిని గూర్చి నీవు శోకించుచున్నావు' అని భగవంతుడు అర్జునుని యొక్క ఏ పలుకులకు సమాధానముగా పల్కెను?

సమా - ఉభయసేనలలోని తన మేనమామలు, పెదతండ్రులు, చుట్టాలు పక్కాలు, గురుజనులు మొదలగు వారిని చూడగనే వారు మృతిచెందుదురను ఆశంకతో విషాదపడుచు అర్జునుడు (మొదటి అధ్యాయమునందలి 28, 29, 30వ శ్లోకములలో వర్ణింపబడిన) తన స్థితిని వెల్లడించెను. 1/45వ శ్లోకమునందు తన యుద్ధ విముఖత్వమును ప్రకటించెను. అతని ఈ స్థితిని గూర్చి సంజయుడు 1/47వ శ్లోకమున వర్ణించెను. వీటన్నింటినీ దృష్టిలో నుంచుకొని భగవానుడు "నీవు శోకింపదగని వారి కొఱకు శోకించుచున్నావు" అని పలికెను. భగవంతుని గీతోపదేశము ఇచ్చటినుండియే ప్రారంభమగుచున్నది. దాని ముగింపు 18/66వ శ్లోకమునందు ('సర్వధర్మాన్ పరిత్యజ్య' అను శ్లోకమునందు) జరుగును.

ప్రశ్న - 'నీవు పండితునివలె భాషించుచున్నావు' - అని భగవానుడు అర్జునుని యొక్క ఏ వచనములకు సమాధానముగా పలికెను?

సమా - మొదటి అధ్యాయమునందలి 31వ శ్లోకము నుండి 44వ శ్లోకము వఱకును, 2వ అధ్యాయమున 4, 5, 6వ శ్లోకములయందును కులనాశము వలన ఉత్పన్నములగు మహాపాపములను గూర్చి అర్జునుడు వర్ణించెను. దురహంకారియైన దుర్యోధనుని నీచత్వమును, తన ధర్మజ్ఞతను అనేక విధములైన యుక్తి ప్రయుక్తుల ద్వారా వివరించుచు యుద్ధము చేయుట అనుచితమని ప్రకటించెను. అర్జునుని ఈ వచనములను దృష్టిలో ఉంచుకొనియే 'నీవు పండితునివలె భాషించుచున్నావు' - అని భగవానుడు పల్కెను.

ప్రశ్న - 'గతాసూన్, అగతాసూన్' అను పదములు ఎవరిని తెల్పును? వారికొఱకై పండితులు శోకింపరు - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - అసువులు (ప్రాణములు) బాసినవారిని **'గతాసువులు'** - అని యందురు. ప్రాణములతో ఉన్నవారిని **'అగతాసువులు'** అని అందురు. యుద్ధపరిణామ రూపమైన కులనాశము వలన వర్ణసాంకర్యము ప్రబలుననియు, చనిపోయిన తన పితరులకు అకారణముగా సద్గతులు లభింపవనియు అర్జునుడు మిక్కిలి వ్యాకులపడుచుండెను - అట్లే యుద్ధసన్నద్ధులై ఎదురుగా నిలిచియున్న తన బంధువుల కొఱకును చింతించుచుండెను. పైగా వారు ఎవ్వరును లేనప్పుడు రాజ్యముతోగాని, భోగములతోగాని ప్రయోజనమేమని భావించుచుండెను. కులనాశము వలన స్త్రీలు భ్రష్టలగుదురు - ఈ విధముగా పండితులైనవారు ఏ మాత్రము చింతింపరు - పండితుల దృష్టిలో 'సచ్చిదానంద పరబ్రహ్మ' ఒక్కడే నిత్యుడు, సద్వస్తువు. అతడు తప్ప నిత్యమైన వస్తువు ఏదియును లేదు. అతడే అందరికిని ఆత్మ. అతడు ఎన్నడును, ఏ విధముగను నశింపడు. శరీరము అనిత్యము - ఆత్మ శరీరముల సంయోగ వియోగములు వ్యావహారిక దృష్టితో అనివార్యములైనను వాస్తవముగా స్వప్నములవలె కల్పితములు. ఈ సత్యమును ఎఱిగిన పండితులు ఎవరికొఱకునూ ఏ కారణముననైననూ శోకింపరు - కాని అర్జునుడు శోకాకులుడయ్యెను. అందువలన అతడు పండితుడు కాడని తేటతెల్లమయ్యెను. కేవలము పండితునివలె భాషించుచున్నాడు.

*సంబంధము - భీష్మాది స్వజనులకొఱకై శోకించుట తగదనియు, అయినను వారికొఱకై అర్జునుడు శోకించుచున్నాడనియు, భగవానుడు పూర్వశ్లోకమున తెల్పెను. వారికొఱకై శోకించుట అనుచితమనుటకు కారణమేమి? అను సందేహము కలుగుట సహజము. కనుక భగవానుడు మొదట ఆత్మనిత్యత్వమును ప్రకటించుచు ఆత్మదృష్టితో వారికొఱకు శోకించుట అనుచితమని నిరూపించుచున్నాడు-*

**న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।**
**న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ॥ 12 ॥**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అహమ్ | = | నేను | ఇమే | = | ఈ | వయమ్, సర్వే | = | మనము |
| జాతు | = | ఒకప్పుడును | జనాధిపాః | = | రాజులు | | | అందఱము |
| న, ఆసమ్ | = | లేను-అనునది | న (ఆసన్) | = | 'లేరనునది'యును | న, భవిష్యామః | = | "లేకపోవుట" |
| న, తు, ఏవ | = | లేనేలేదు | | | లేదు | | | యనునది |
| త్వమ్ | = | నీవు | చ | = | మరియు | న, ఏవ | = | లేనే లేదు. |
| న (ఆసీః) | = | "లేవు-అనునది"లేదు | అతః, పరమ్ | = | ఇకమీదట | | | |

నీవుగాని, నేనుగాని, ఈ రాజులుగాని ఉండని కాలమే లేదు. ఇక ముందు కూడ మనము ఉండము అనుమాటయే లేదు. (అన్ని కాలములలోను మనము ఉన్నాము. ఆత్మ శాశ్వతము. అది అన్ని కాలములయందును ఉండును. శరీరపతనముతో అది నశించునది కాదు.) **(12)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు భగవానుడు తెల్పిన విశేషమేమి?

సమా - ఈ శ్లోకమునందు భగవానుడు ఆత్మరూపమున అందఱి నిత్యత్వమును నిరూపించెను. ఎవరు నశింతురని అర్జునుడు శోకించుచున్నాడో వారును, అర్జునుడును శ్రీకృష్ణభగవానుడును ఎన్నడును, ఏ కాలమునందును నశింపనివారే. వర్తమాన (ప్రస్తుత) శరీరముల పుట్టుకకు పూర్వము గూడ అందఱును ఉన్నవారే. ఆ తరువాత గూడ ఉందురు. శరీరములు నశించినను ఆత్మ నశింపదు. కావున వారు ఎల్లరును నశింతురనుభావముతో శోకించుట ఏ విధముగను తగదు. అని భగవానుడు స్పష్టపఱచెను.

*సంబంధము - ఈ విధముగా ఆత్మయొక్క నిత్యత్వమును ప్రతిపాదించి, ఇప్పుడు దాని నిర్వికారత్వమును గూర్చి పేర్కొనుచు ఆత్మ కొఱకై శోకించుట అనుచితమని పల్కుచున్నాడు-*

**దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।**
**తథా దేహాంతరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి ॥ 13 ॥**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| యథా | = | ఎట్లయితే | యౌవనమ్ | = | యౌవనము | తత్ర | = | ఆ విషయమున |
| దేహినః | = | జీవాత్మకు | జరా | = | ముసలితనము(కలవో) | ధీరః | = | ధీరుడైనవాడు |
| అస్మిన్, దేహే | = | ఈ దేహమునందు | తథా | = | అట్లే | న, ముహ్యతి | = | మోహమునకు |
| కౌమారమ్ | = | కౌమారము | దేహాంతర | } = | మఱియొక దేహము | | | గురికాడు |
| | | (బాల్యము) | ప్రాప్తిః | | ప్రాప్తించుటయు (కల్గును) | | | |

జీవాత్మకు ఈ దేహమునందు కౌమారము, యౌవనము, వార్ధక్యము ఉన్నట్లే మఱియొక దేహప్రాప్తియు కలుగును. ధీరుడైనవాడు ఈ విషయమున మోహితుడు కాడు. **(13)**

ప్రశ్న - ఈ శ్లోకమున భగవానుడు తెల్పిన విషయము యొక్క అంతర్యమేమి?

సమా - ఆత్మకు వికారములు గలవనియు ఒక శరీరము నుండి మఱియొక శరీరమునకు పోవుచు, వచ్చుచున్న సమయమున దానికి కష్టముకల్గుననియు భావించి, అజ్ఞానులు శోకింతురు. ఇది అనుచితమని భగవానుడు స్పష్టపఱచుచున్నాడు. బాల్యము, యౌవనము, వార్ధక్యము అను అవస్థలు వాస్తవముగా ఆత్మకు లేవు. అవి స్థూల శరీరమునకు సంబంధించినవి. అవి ఆత్మయందు ఆరోపింపబడుచున్నవి. అదే విధముగ ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు వచ్చుట పోవుట గూడ వాస్తవముగ ఆత్మకు కలుగునవికావు. అవి సూక్ష్మశరీరమునకు సంబంధించినవి. కాని ఆత్మయందు అవి ఆరోపింపబడుచున్నవి - కావున ఈ తత్త్వమును ఎఱుంగని అజ్ఞానులే దేహాంతరప్రాప్తికి శోకింతురు - ధీరులైన వారు శోకింపరు - ఏలనన వారి దృష్టిలో ఆత్మకు శరీరముతో ఎట్టి సంబంధమూ ఉండదు - కావున అర్జునుడు ఈ విషయమున శోకించుట తగదు.

*సంబంధము - పూర్వశ్లోకములయందు ఆత్మయొక్క నిత్యత్వమును, నిర్వికారత్వమును ప్రతిపాదించి, దానికొఱకై శోకించుట అనుచితమని భగవానుడు నిరూపించెను. ఆత్మ నిత్యము, నిర్వికారము ఐనచో బంధుజనులతో కలుగు సంయోగవియోగాదులవలన ప్రత్యక్షముగా సుఖదుఃఖాదులు అనుభవింపబడుచుండగా వాటికై శోకింపకుండుట ఎట్లు? అను సందేహము కల్గుట సహజము - దీనికి సమాధానముగా అన్నివిధములైన సంయోగవియోగములు అనిత్యములే యని తెల్పి వాటిని సహింపవలసినదే యని స్పష్టపఱచుచున్నాడు-*

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాః తాంస్తితిక్షస్వ భారత ॥ 14 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = ఓ కుంతీపుత్రా! (అర్జున!) | మాత్రాస్పర్శాః, తు | = విషయేంద్రియ సంయోగములయితే | భారత | = (కావున) భారతా! (అర్జునా!) |
| శీతోష్ణసుఖదుఃఖదాః | = శీతోష్ణములను సుఖదుఃఖములను కల్గించునవియైన | ఆగమాపాయినః | = ఉత్పత్తి వినాశ శీలములు(మఱియు) | తాన్ | = వాటిని (ఆ ద్వంద్వములను) |
| | | అనిత్యాః | = అనిత్యములు | తితిక్షస్వ | = సహింపుము |

**ఓ కౌంతేయా! విషయేంద్రియసంయోగమువలన శీతోష్ణములు సుఖదుఃఖములు కలుగుచున్నవి. అవి ఉత్పత్తి వినాశశీలములు. అనిత్యములు. కనుక భారతా! వాటిని సహింపుము. (పట్టించుకొనకుము) (14)**

ప్రశ్న - 'మాత్రాస్పర్శాః' అను పదము దేనిని తెలుపును?

సమా - ఒక వస్తువును కొలుచుటకు లేక దాని స్వరూపమును తెలిసికొనుటకు ప్రమాణమైన మానమును 'మాత్రా' అని యందురు. కావున ఇచట మాత్రా శబ్దము ఇంద్రియములను, అంతఃకరణమును సూచించును. 'స్పర్శము' అనగా సంబంధము, లేక సంయోగము. అంతఃకరణమునకును, ఇంద్రియములకును శబ్దస్పర్శ రూపరసగంధాదులయొక్క విషయములతో సంబంధము ఉండును. దానినే ఇచట 'మాత్రాస్పర్శాః' అను పదము సూచించును. 'మాత్రాః' అనగా అంతఃకరణము, ఇంద్రియములు. 'స్పర్శాః' అనగా వాటికి సంబంధించిన విషయములు.

ప్రశ్న - వీటినన్నింటిని 'శీతోష్ణసుఖదుఃఖదాః' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - శీతోష్ణములు, సుఖదుఃఖములు అను శబ్దములు ఇచట అన్ని ద్వంద్వములకును ఉపలక్షణములు. కావున విషయేంద్రియ సంయోగములను 'శీతోష్ణసుఖదుఃఖదాః' అని చెప్పుటవలన సమస్త విషయములతో ఇంద్రియముల

సంయోగము కలుగుటవలన శీతోష్ణములు, రాగద్వేషములు, హర్షశోకములు, సుఖదుఃఖములు, అనుకూలప్రతికూలములు మొదలగు ద్వంద్వములు ఉత్పన్నములగునని పేర్కొనుట జరిగినది. వాటియందు నిత్యత్వబుద్ధి యుండుట వలన వివిధ వికారములు ఉత్పన్నములగును. వాటిని అనిత్యములని భావించి, వాటి సంగముచు వలన మానవుడు ఏ విధమైన వికారములకును లోనుకాకూడదు.

ప్రశ్న - విషయేంద్రియ సంయోగములను ఉత్పత్తివినాశ శీలములనియు, అనిత్యములనియు తెలిపి, వాటిని సహింపుమని అర్జునుని ఆజ్ఞాపించుటలోని అంతర్యమేమి?

సమా - సుఖదుఃఖములను కలిగించు ఇంద్రియ విషయ సంయోగములు క్షణభంగురములు. అనిత్యములు. వాస్తవముగా వాటియందు సుఖము లేశమాత్రమైనను లేదు. కావున వాటిని సహింపవలెను. అనగా వాటిని అనిత్యములని భావించి, వాటివలన కలుగు రాగద్వేషములకును, హర్షశోకములకును లోనుకాకూడదు. బంధుమిత్రుల సంయోగ వియోగములు గూడ ఇందులో భాగములే. ఏలనన అంతఃకరణేంద్రియముల ద్వారానే ఇతర విషయముల వలె వారితో సంయోగ వియోగములు కలుగుచుండును. కావున అన్ని విధములైన సంయోగ వియోగముల పరిణామ స్వరూప సుఖదుఃఖములను సహింపుమని భగవానుడు ఇచ్చట అర్జునుని ఆజ్ఞాపించెను.

సంబంధము - ఈ ద్వంద్వములన్నింటిని సహించుటవలన కలుగు ప్రయోజనములను తెలుపుచున్నాడు-

**యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | యమ్, ధీరమ్ పురుషమ్ | = ఏ ధీరుడైన పురుషుని | న, వ్యథయంతి | = వ్యాకులపఱచవో |
| పురుషర్షభ | = ఓ పురుషశ్రేష్ఠా! | ఏతే | = ఇవి (విషయేంద్రియ సంయోగములు) | సః | = అతడు |
| సమదుఃఖ సుఖమ్ | = సుఖదుఃఖములను సమానముగా చూచునట్టి | | | అమృతత్వాయ | = మోక్షము కొఱకు |
| | | | | కల్పతే | = యోగ్యుడగును. |

**ఏలనన ఓ పురుషశ్రేష్ఠా! ధీరుడైనవాడు సుఖదుఃఖములను సమానముగా చూచును. అట్టి పురుషుని విషయేంద్రియ సంయోగములు చలింపజేయజాలవు. అతడే మోక్షమును పొందుటకు అర్హుడు.(15)**

ప్రశ్న - ఇచ్చట 'హి' అను అవ్యయ ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - 'హి' అనునది హేత్వర్థకము. విషయేంద్రియ సంయోగములను సహించుటకు కారణములను ఈ శ్లోకమునందు విశదపఱచుచున్నాడు.

ప్రశ్న - 'పురుషర్షభ!' అను సంబోధనలోని విశేషమేమి?

సమా - ఋషభ - అను పదము శ్రేష్ఠతా వాచకము. **పురుషర్షభ** - అనుపదము పురుషులలో మిక్కిలి శౌర్యపరాక్రమాది శ్రేష్ఠ లక్షణములు గల వానిని తెలుపును. అర్జునుడు గొప్ప వీరుడు, శూరుడు. సహనశీలము అతనికి సహజము. కావున స్వాభావికముగనే అతడు ఆ ద్వంద్వములను సహింపగలడు - అని తెల్పుటకై **పురుషర్షభ!** అని సంబోధించెను.

ప్రశ్న - 'ధీరమ్' అను పదము ఎవరిని సూచించును?

సమా - 'ధీరమ్' అను పదము చాల వరకు పరమాత్మప్రాప్తి నందిన పురుషునే తెలుపును. కాని అచ్చటచ్చట పరమాత్మప్రాప్తికి పాత్రుడైన వానినికూడ ధీరుడను పదము తెల్పును. కావున ఇచ్చట 'ధీరమ్' అనుపదము. 'సాంఖ్యయోగ' సాధనయందు పరిపక్వస్థితిని పొందిన సాధకుని సూచించును.

ప్రశ్న - 'సమదుఃఖసుఖమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని అంతరార్థమేమి?

సమా - ఇందు భగవానుడు ధీరపురుషుని లక్షణమును తెలిపెను. ధీరుడైనవాడు సుఖదుఃఖములను సమముగా చూచును. వాటిని అనిత్యములుగా భావించి, ఆ

ద్వంద్వములయందు భేదబుద్ధిని కలిగి యుండడు. అతడే వాటిని సహించుటకు సమర్థుడు.

ప్రశ్న - 'ఏతే' అను పదము వేటిని తెల్పును? 'న వ్యథయంతి' అనియుననగానేమి?

సమా - పూర్వ శ్లోకమున 'మాత్రాస్పర్శాః' అను పదము ద్వారా తెలుపబడిన విషయేంద్రియ సంయోగములనే ఇచట 'ఏతే' అను పదము తెల్పును. విషయేంద్రియ సంయోగ వియోగ ఫలితముగా రాగద్వేషములకును, హర్షశోకములకును లోనుగాకుండ అభ్యాసము చేయుగా చేయుగా సాధకుడు ఒక పరిపక్వ స్థితికి చేరును. అట్టి స్థితియందు ఎట్టి విషయేంద్రియ సంయోగము కూడ అతనిని ఏ విధముగను వ్యాకుల పఱచదు - అతనిలో ఎట్టి వికారములును ఉత్పన్నములు కావు. 'న వ్యథయంతి' అను క్రియాపద ప్రయోగవైశిష్ట్య మిదియే - అట్టి స్థితికి చేరిన వానిని 'ధీరః, సమదుఃఖసుఖః' - అని భగవానుడు పేర్కొనెను.

ప్రశ్న - 'అతడు మోక్షమునకు పాత్రుడు' అనియునుటలో అంతర్యమేమి?

సమా - పైన తెల్పబడిన విధముగా సమభావముగల పురుషుడు మోక్షమునకు - అనగా పరమాత్మప్రాప్తికి పాత్రుడగును. అతనికి శీఘ్రముగనే అపరోక్షానుభూతి కలుగును - అని భగవానుడు తెలిపెను.

*సంబంధము - ఆత్మయొక్క నిత్యత్వమును, నిర్వికారత్వమును గూర్చి భగవానుడు 12, 13 శ్లోకములలో ప్రతిపాదించెను. విషయేంద్రియ సంయోగములు అనిత్యములని 14వ శ్లోకమున తెల్పెను. కాని ఆత్మ నిత్యము - అనుటకును, ఈ సంయోగములు అనిత్యములు అనుటకును కారణములను స్పష్టపఱచలేదు. కనుక నిత్యానిత్య వస్తువివేచనా రీతిని తెల్పుటకై ఆ రెండింటి లక్షణములను భగవానుడు ఈ శ్లోకమున తెల్పుచున్నాడు-*

**నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।**
**ఉభయోరపి దృష్టోఽంతః త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ 16 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అసతః | = అసద్వస్తువునకు (లేనిదానికి) | సతః | = సద్వస్తువునకు (ఉన్నదానికి) | అనయోః ఉభయోః, అపి | = ఈ రెండింటి యొక్కయు |
| భావః | = ఉనికి | అభావః | = లేమి (లేకుండుట) | అంతః | = తత్త్వము |
| న విద్యతే | = లేదు | | | తత్త్వదర్శిభిః | = తత్త్వజ్ఞానులచేత (తెలిసికొనబడినది). |
| తు | = అయితే | న, విద్యతే | = లేదు | | |

**అసత్తు అనుదానికి (అనిత్యమైనదానికి) ఉనికియే లేదు. సత్తు అనుదానికి లేమి లేదు. ఈ విధముగ ఈ రెండింటియొక్క వాస్తవస్వరూపములను తత్త్వజ్ఞానియైనవాడే ఎఱుంగును. (16)**

ప్రశ్న - 'అసతః' అను పదము దేనిని సూచించును? 'దానికి ఉనికి లేదు' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పరివర్తన శీలములైన శరీరములు, ఇంద్రియములు, ఇంద్రియ విషయములతో గూడిన సమస్త జడవర్గమును 'అసతః' అను పదము సూచించును. ఈ శరీరాదులన్నియును ప్రతీతమగుటకు ముందుగాని ఆ పిమ్మట గాని ఉండవు. కావున ప్రతీతమగుచున్న సమయమునందు గూడ అవి నిజముగా లేనట్లే. ఈ భావమును తెల్పుటకే 'దానికి ఉనికియే లేదు' అని తెల్పబడినది. కావున భీష్మాది స్వజనుల శరీరములును లేక ఇతర జడవస్తువులును నశించునను ఆశంకతో శోకించుట అనుచితమని భగవానుడు అర్జునునితో పల్కెను.

ప్రశ్న - 'సతః' అను పదము దేనిని తెల్పును? 'దానికి అభావము (లేమి) లేదు' అనియునుటలోని అంతర్యమేమి?

సమా - 'సతః' అను పదము ఇచ్చట పరమాత్మ (ఆత్మ) తత్త్వమును తెల్పును. అతడు సర్వవ్యాపి, నిత్యుడు, ఆయనకు అభావము (లేమి) లేదు - అనియునుటలో ఆత్మయెన్నడును ఏ కారణమువలననైనను పరివర్తన చెందదు. నశింపదు. అది సర్వదా ఒకే విధముగా ఉండును. అది శాశ్వతము, నిర్వికారము. కావున భీష్మాదుల శరీరములు

నశించినను, వారి ఆత్మలు నశింపవుగావున వారికై శోకించుట తగదు – అని భగవానుడు పల్కెను.

ప్రశ్న - 'అనయోః' అను విశేషణముతోపాటు 'ఉభయోః' అను పదము ఎవరిని సూచించును? తత్త్వద్రష్టలైన జ్ఞానులు వీటి తత్త్వములను ఎఱుంగుదురు – అనియనుటలోని విశేషమేమి?

సమా - 'అనయోః' అను విశేషణముతోపాటు 'ఉభయోః' అను పదము పైన తెలుపబడిన 'అసత్', 'సత్' అను రెండింటిని సూచించును. వీటి తత్త్వములను ఎఱింగిన జ్ఞానులు ఈ రెండింటిని వివేచన చేయుదురు. పరివర్తన శీలములై నశ్వరములైన (శాశ్వతములుగాని) వస్తువులను 'అసత్' అని నిశ్చయముగా గ్రహింతురు – అనగా 'అసద్వస్తువులకు ఉనికియే యుండదు – అట్లే ఏ పరిస్థితి యందైనను, ఏ కారణము వలననైనను పరివర్తన చెందని, నశ్వరము కాని (శాశ్వతమైన) వస్తువును 'సత్' అని యెఱుంగుదురు – అనగా సద్వస్తువునకు ఎన్నడును అభావము (లేమి) ఉండదు. తత్త్వ ద్రష్టలైన వారే ఈ రెండింటి తత్త్వములను ఎఱుంగుదురు.

సంబంధము - పూర్వశ్లోకమున 'సత్తునకు' అభావము ఉండదు, అని తెల్పబడినది. ఇప్పుడు ఈ సత్తుతత్త్వ స్వరూపమును తెల్పుచున్నాడు-

**అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।**
**వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవినాశి | = నాశరహితమైన | తతమ్ | = వ్యాప్తమైయున్నదో | వినాశమ్ | = వినాశమును |
| తత్, విద్ధి | = దానిని తెలిసికొనుము | అస్య, అవ్యయస్య | = శాశ్వతమైన దానియొక్క (ఆత్మయొక్క) | కర్తుమ్ | = చేయుటకు |
| యేన, తు | = దేనిచేనైతే | | | కశ్చిత్ | = ఎవ్వడును |
| ఇదమ్, సర్వమ్ | = ఈ జగత్తంతయు (దృశ్యవర్గము) | | | న, అర్హతి | = సమర్థుడు కాడు. |

**నాశరహితమైన ఆ సత్యము (పరమాత్మ తత్త్వము) జగత్తునందు అంతటను వ్యాపించియున్నదని యెరుంగుము. శాశ్వతమైన దానినెవ్వరును నశింపజేయజాలరు. (17)**

ప్రశ్న - 'సర్వమ్' అను పదముతో పాటు 'ఇదమ్' అను పదము ఇచ్చట దేనిని తెల్పును? అది ఎవరి వలన వ్యాప్తమైనది? అతడు శాశ్వతుడనుటలోని ఆంతర్యమేమి?

సమా - శరీరేంద్రియ మనస్సులు, భోగవస్తువులు, భోగస్థానములు మొదలగు సమస్త జడవర్గమును ఇచట 'సర్వమ్' విశేషణముతోపాటు 'ఇదమ్' అను పదము సూచించును. ఈ సంపూర్ణజడవర్గము చైతన్య స్వరూపమైన పరమాత్మ తత్త్వముతో నిండి యున్నది. ఆ పరమాత్మ తత్త్వము నశింపనిది – అనగా శాశ్వతమైనది. దానినే పూర్వశ్లోకమున 'సత్' అను తత్త్వము పేరుతో పేర్కొనుట జరిగినది. తత్త్వజ్ఞానులు ఈ తత్త్వమును సమగ్రముగా ఎఱుంగుదురు.

ప్రశ్న - శాశ్వతమైన దీనిని (ఈ తత్త్వమును) ఎవ్వరును నశింపజేయ జాలరు – అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - మేఘము ఆకాశముచే వ్యాప్తమైయున్నట్లు ఈ జడవర్గమంతయును పరమాత్మ తత్త్వముచే వ్యాప్తమై యున్నది. ఆ కారణమున ఆ జడవర్గములోని ఏ వస్తువు గూడ ఈ పరమాత్మ తత్త్వమును నశింపజేయజాలదు – కావున సర్వదా ఒకే విధముగను, శాశ్వతముగను ఉండు ఆత్మయే 'సత్' అనబడును.

సంబంధము - ఈ విధముగా 'సత్' (సద్వస్తు) తత్త్వస్వరూపము తెల్పబడినది. ఇప్పుడు 'అసత్' (అసద్వస్తు) స్వరూపమును తెల్పుచున్నాడు-

**అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = ఓ అర్జునా! | నిత్యస్య | = శాశ్వతమైనదియు అగు | అంతవంతః | = నశించునవి అని |
| అనాశినః | = నాశరహితమైనదియు | శరీరిణః | = జీవాత్మ యొక్క | ఉక్తాః | = చెప్పబడినవి |
| అప్రమేయస్య | = అప్రమేయ (అనిర్వచనీయ) మైనదియు | ఇమే, దేహాః | = ఈ దేహములన్నియును | తస్మాత్ | = అందువలన |
| | | | | యుధ్యస్వ | = యుద్ధమొనరింపుము. |

**ఈ శరీరములు అన్నియును నశించునవియే. కాని జీవాత్మ నాశరహితము, అప్రమేయము (అనిర్వచనీయము). నిత్యము. కనుక (ఈ విషయమును ఎఱింగి) ఓ భరతవంశీ! అర్జునా! నీవు యుద్ధము చేయుము. (18)**

ప్రశ్న - 'ఇమే' అను పదముతోపాటు 'దేహాః' అను పదము దేనిని తెల్పును. అవియన్నియును 'అంతవంతః' అని తెల్పుటలోని అంతర్యమేమి?

సమా - 'ఇమే' అను పదముతోపాటు 'దేహాః' అను పదము ఇచ్చట సమస్తశరీరములను తెల్పును. 'అంతవంతః' అను పదమును ప్రయోగించుటద్వారా అవి (ఆ శరీరములు) అసద్వస్తువులు అనగా నశ్వరములు - అని స్పష్టముచేయుట జరిగినది - అంతఃకరణేంద్రియములతోసహా శరీరములు అన్నియూ నశించునవియే - స్వప్నమునందలి శరీరము, సమస్త జగత్తు, నిజముగా లేకున్నను ప్రతీతమగుచుండును. అట్లే ఈ సమస్త శరీరములును వాస్తవముగా 'ఉనికి' లేనట్టివే ఐనను అజ్ఞానమువలన అవి ఉన్నట్లు ప్రతీతమగుచున్నవి. వీటి నాశము అనివార్యము. కావున వీటికొఱకై శోకించుట వ్యర్థము.

ప్రశ్న - 'దేహాః' అను పదము బహువచనములోను, 'శరీరిణః' అనునది ఏకవచనములోను ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - సమస్త శరీరములందును ఉన్న ఆత్మ ఒక్కటియే. అజ్ఞాన కారణమున వేర్వేఱు శరీరములయందు ఆత్మవేర్వేరుగా ఉన్నట్లు తోచును. వాస్తవముగా అది ఒక్కటియే -

ప్రశ్న - 'శరీరిణః' అనగానేమి? ఆ పదముతోపాటు, 'నిత్యస్య' 'అనాశినః' 'అప్రమేయస్య' అను విశేషణములను ప్రయోగించుటలోను, శరీరములతో దానికి సంబంధము కలదని తెల్పుటలోను గల వైశిష్ట్యమేమి?

సమా - 'సత్' తత్త్వముతో సమస్త జడవర్గమూ వ్యాప్తమైయున్నది. - అని పూర్వశ్లోకమున తెల్పబడెను. ఇచట 'శరీరిణః' అను పదము ఆ 'సత్' తత్త్వమునే తెల్పును. ఈ మూడు విశేషణములును, ఆ సత్ తత్త్వము యొక్క ఏకత్వమును తెల్పుటకే ప్రయోగింపబడినవి. 'శరీరీ' అను పదమును ప్రయోగించి, శరీరములతో దీని సంబంధమును తెల్పుటయేగాక ఆత్మ పరమాత్మల ఏకత్వము గూడ ప్రతిపాదింపబడినది. వ్యావహారిక దృష్టిలో వేర్వేఱు శరీరములను ధరించి ఆత్మ వాటితో సంబంధము కల్గియున్నట్లు తోచుచున్నను, ఆత్మలు వేర్వేఱుగా లేవు. అన్నింటియందును ఉన్నది ఒకే చేతనతత్త్వము (చైతన్యము). నిద్రలో స్వప్నసృష్టియందు ఉండునది ఒక్క పురుషుడు (స్వాప్నికుడు) మాత్రమే. మఱియేవస్తువు ఉండదు. నిద్రాజనితములైన వివిధ వస్తువులునూ స్వప్నప్రపంచమునకు చెందినవే. మేల్కొనిన పిదప పురుషుడు ఒక్కడే మిగిలియుండును - అట్లే ఇచ్చట కూడ సమస్త వస్తు నానాత్వమూ అజ్ఞాన జనితము. జ్ఞానప్రాప్తి ఐన పిమ్మట ఎట్టి నానాత్వమూ ఉండదు.

ప్రశ్న - 'తస్మాత్' అను హేతువాచకమును ప్రయోగించి, 'యుద్ధము చేయుము' అని ఆజ్ఞాపించుటలోని అంతర్యమేమి?

సమా - శరీరము నశ్వరము - అనియు, దాని నాశము అనివార్యమనియు, ఆత్మనిత్యమనియు, అది యెన్నడును నశింపనిదనియు, నిశ్చయముగా తెలిసిన పిమ్మట యుద్ధము చేయుటకేమాత్రమూ శోకింపవలసిన అవసరమేయుండదు. కావున 'తస్మాత్' అను పదమును ప్రయోగించి, యుద్ధము చేయుమని భగవానుడు అర్జునుని ఆదేశించెను.

సంబంధము - ఆత్మయొక్క నిత్యత్వమును, నిర్వికారత్వమును పూర్వశ్లోకమున ప్రతిపాదించి, భగవానుడు అర్జునుని యుద్ధము చేయుటకై పురికొల్పెను. కాని అర్జునుడు "నేను వీరిని చంపుటకు ఇష్టపడను. ఒకవేళవారు నన్ను చంపినను అది నాకు క్షేమమే" అని పల్కియుండెను. దీనికి స్పష్టముగా భగవానుడు సమాధానమును ఇయ్యలేదు. కావున "ఆత్మ చంపబడుననియు, లేక చంపుననియు భావించుట అజ్ఞానమే" అని రాబోవు శ్లోకములలో తెల్పుచున్నాడు-

**య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ 19 ॥[1]**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఎవడైతే | ఏనమ్ | = దీనిని (ఈ ఆత్మను) | అయమ్ | = ఇది (ఈ ఆత్మ) వాస్తవముగా |
| ఏనమ్ | = దీనిని (ఈ ఆత్మను) | హతమ్ | = చంపబడుదానినిగా | న, హంతి | = (ఎవ్వరినీ) చంపదు |
| హంతారమ్ | = చంపునట్టి దానినిగా | మన్యతే | = భావించునో | న, హన్యతే | = (ఎవ్వరిచేతను) చంపబడదు |
| వేత్తి | = భావించునో | తౌ, ఉభౌ | = ఆ, ఉభయులును | | |
| చ | = అట్లే | న, విజానీతః | = తెలిసికొనినవారు (జ్ఞానులు) కారు (ఏలనన) | | |
| యః | = ఎవడయితే | | | | |

**ఆత్మ ఇతరులను చంపునని భావించువాడును, అది (ఆత్మ) ఇతరులచే చంపబడునని భావించువాడును, ఆ ఇద్దఱును అజ్ఞానులే. ఏలనన వాస్తవముగా ఆత్మ ఎవ్వరినీ చంపదు, ఎవ్వరిచేతను చంపబడదు. (19)**

ప్రశ్న - 'ఆత్మ చంపబడదు, ఎవ్వరినీ చంపదు' అను విషయము సత్యమే ఐనచో చచ్చునది ఎవరు? చంపునది ఎవరు?

సమా - స్థూలశరీరము నుండి సూక్ష్మశరీరము వియోగము చెందుటనే 'మరణించుట' అనియందురు. కనుక చనిపోవునది స్థూలశరీరము. అందువలననే 'అంతవంత ఇమే దేహాః' అని చెప్పబడినది. ఇదే విధముగ మనోబుద్ధులతో పాటు ఒక స్థూలశరీరము యొక్క చేష్టద్వారా మఱొక స్థూల శరీరముయొక్క ప్రాణములు వియోగము చెందినచో దానిని (మొదటి స్థూలశరీరమును) చంపునది యందురు. కావున చంపునదియు స్థూలశరీరమే ఆత్మకాదు. శరీర ధర్మములను తన (ఆత్మ)యందు అధ్యారోపితము చేయుటవలన అజ్ఞానులు ఆత్మయే చంపునని (కర్తయని) భావింతురు. (3/27) కనుక వారు (అజ్ఞానులు) ఆ కర్మఫలమును అనుభవింపవలసి వచ్చును.

సంబంధము - ఆత్మ ఎవ్వరిచేతను చంపబడదు - అని పూర్వశ్లోకమున తెల్పబడినది. ఆత్మ ఎవ్వరిచేతను చంపబడకుండుటకు కారణమేమి? అను జిజ్ఞాస కలుగవచ్చును. దీనికి సమాధానముగా భగవానుడు ఆత్మకు ఎట్టి వికారములు లేవని తెల్పుచు ఆత్మస్వరూపమును ప్రతిపాదించుచున్నాడు-

**న జాయతే మ్రియతే వా కదాచిత్ నాయం భూత్వా భవితా వా న భూయః ।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥ 20 ॥**

1) హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతమ్ । ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ (కఠో.1/2/19)

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయమ్ | = ఇది (ఈ ఆత్మ) | భూత్వా, భూయః భవితా, న | = ఉత్పన్నమై, అస్తిత్వమును పొందునదికాదు (ఏలనన) | నిత్యః | = నిత్యమైనది |
| కదాచిత్ | = ఏ కాలమునందైనను | | | శాశ్వతః | = శాశ్వతమైనది |
| న, జాయతే | = జన్మింపదు | | | పురాణః | = సనాతనమైనది |
| వా | = మఱియు | | | శరీరే | = శరీరము |
| న, మ్రియతే | = మరణింపదు | అయమ్ | = ఇది (ఈ ఆత్మ) | హన్యమానే | = చంపబడుచున్నను |
| వా | = అట్లే | అజః | = జన్మలేనిది | న, హన్యతే | = (ఇది) చంపబడదు. |

**ఈ ఆత్మ ఏ కాలమునందును పుట్టదు, గిట్టదు. పుట్టి ఉండునది కాదు. ఇది భావ వికారములు లేనిది (ఉత్పత్తి, అస్తిత్వము, వృద్ధి, విపరిణామము, అపక్షయము, వినాశము అను ఆఱును భావవికారములు). ఇది జన్మ లేనిది. నిత్యము, శాశ్వతము, పురాతనము. శరీరము చంపబడినను ఇది చావదు. (20)**

ప్రశ్న - 'నజాయతే', 'మ్రియతే' అను ఈ రెండు క్రియాపదముల అర్థమేమి?

సమా - ఆత్మకు ఉత్పత్తి, నాశములు లేవని తెల్పుటద్వారా దానికి ఉత్పత్తి మొదలగు ఆఱువికారములు గూడ లేవని యెఱుంగవలెను. ఆ వికారములను వేర్వేఱు శబ్దములను ప్రయోగించి తెల్పుట జరిగినది.

ప్రశ్న - 'ఉత్పత్తి' మొదలగు ఆఱు వికారములెవ్వి? ఆత్మకు ఆ వికారములు లేవని ఈ శ్లోకమునందు ఏయే పదముల ద్వారా తెల్పబడినది?

సమా - 1. ఉత్పత్తి (జననము) 2. అస్తిత్వము (జన్మించినతరువాత ఉండుట) 3. వృద్ధి (పెఱుగుట) 4. విపరిణామము (రూపాంతరము చెందుట) 5. అపక్షయము (క్షీణించుట) 6. వినాశము (మరణము) అనునవి ఆఱు వికారములు. ఆత్మను 'అజః' అనుటవలన 'ఉత్పత్తి' లేనిదనియు, 'అయం భూత్వా భూయఃనభవితా' అనగా ఇది జన్మించి, మఱల ఉనికి లేనిది. సహజమైన ఉనికి గలదనియు - తెల్పుటవలన 'అస్తిత్వము' అను వికారములేనిదని స్పష్టపఱచినట్లైనది - 'పురాణః' (చిరకాలము నుండియు ఒకేవిధముగా ఉండునది.) అనుటవలన 'వృద్ధి' అను వికారము లేనిది 'శాశ్వతః' (సర్వదా ఒకేరూపముతో ఉండునది.) అనుటవలన విపరిణామ వికారము, 'నిత్యః' (నిరంతరముగా ఉండునది.) అనుటవలన 'క్షయము' అను వికారము లేనిదని తెల్పినట్లైనది. 'శరీరే హన్యమానే న హన్యతే' (శరీరము నశించినను ఇది నశింపదు.) అని తెల్పుటవలన వినాశము అను వికారము లేదని విశదపఱచినట్లైనది.

*సంబంధము - ఆత్మ ఎవ్వరినీ చంపదు, ఎవ్వరిచేతను చంపబడదు - అని 19వ శ్లోకమున భగవానుడు తెలిపెను. ఆత్మ వికారరహితమనియు, అందువలన అది ఎవ్వరిచేతను చంపబడదనియు, 20వ శ్లోకమున పేర్కొనెను. రాబోవు శ్లోకమున అది ఎవ్వరినీ ఏ కారణముననైనను, చంపదు అను విషయమును తెల్పుచున్నాడు-*

**వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।**
**కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్ ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = ఓ అర్జునా! | నిత్యమ్ | = నిత్యమైనదానినిగా | కథమ్ | = ఎట్లు (ఏవిధముగా) |
| యః, పురుషః | = ఏ పురుషుడు | అజమ్ | = జన్మలేనిదానినిగా | కమ్ | = ఎవనిని |
| ఏనమ్ | = దీనిని (ఈ ఆత్మను) | అవ్యయమ్ | = మార్పులేనిదానినిగా | ఘాతయతి | = చంపించును |
| | | వేద | = తెలిసికొనునో | (కథమ్) | = ఎట్లు (ఏవిధముగా) |
| అవినాశినమ్ | = నాశరహితమైన దానినిగా | సః | = అతడు (ఆ పురుషుడు) | కమ్ | = ఎవనిని |
| | | | | హంతి | = చంపును? |

**ఓ పార్థా! ఈ ఆత్మ నాశరహితము, నిత్యము అనియు, జననమరణములు లేనిదనియు, మార్పులేనిదనియు తెలిసికొనిన పురుషుడు ఎవరిని ఎట్లు చంపించును? ఎవరిని ఎట్లు చంపును?(21)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు భగవానుడు తెల్పిన విషయమేమి?

సమా - ఆత్మస్వరూపమును యథార్థముగా ఎఱింగిన పురుషుడు అది పుట్టుక, వినాశములు లేనిదనియు, శాశ్వతము, నిత్యము అనియు, దాని తత్త్వమును అనుభవపూర్వకముగ సమగ్రముగ తెలిసికొనును - అట్లు తెలిసికొనిన వాడు ఎవ్వరినీ చంపడు, చంపింపడు. మనో బుద్ధీంద్రియములతో గూడిన స్థూలశరీరముద్వారా మఱియొక శరీరము నశించునని తెలిసికొన్నవాడు ఆత్మకు శరీరముతో ఎట్టి సంబంధమూ లేదని గ్రహించును. అట్టివాడు మఱొకరిని చంపుటగాని, చంపించుటగాని జరుగదు. అతడు సర్వత్ర ఉన్నది ఒకే ఆత్మతత్త్వము అని ఎఱుంగును. అది చావదు, చంపబడదు, వేఱొకరిని చంపదు, చంపించదు. కావున చనిపోవుట, చంపుట, చంపించుట మొదలగునవి అన్నియును వాస్తవముగా ఆత్మవలన జరుగు పనులు కావు. అజ్ఞానము వలన అవి ఆత్మయందు అధ్యారోపితము లగుచున్నవి. కావున ఎవ్వరును ఎవ్వరికొఱకును, ఏవిధముగను శోకింపనవసరములేదు.

*సంబంధము - ఆత్మనిత్యము, శాశ్వతము, అది యెన్నడును నశింపదు. కావున దానికొఱకై శోకించుట తగదు. శరీరము నశ్వరము (నశించునదియే) దాని నాశము అనివార్యము. కనుక దానికొఱకును శోకించుట తగదు - ఇది ముమ్మాటికిని నిజమే. కాని ఆత్మ ఒక శరీరముతో సంబంధమును వదలుకొని, మఱియొక శరీరముతో సంబంధమును ఏర్పఱచుకొనుటలో అది మిక్కిలి బాధకు లోనౌను గదా! కావున అట్టి పరిస్థితిలో శోకించుట అనుచితము ఎట్లగును? - అను ప్రశ్న తలయెత్తును. దీనికి సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| యథా | = ఏ విధముగా | నవాని | = నూతనములైన వానిని (క్రొత్త వస్త్రములను) | జీర్ణాని | = ప్రాత |
| నరః | = మానవుడు | | | శరీరాణి | = శరీరములను |
| జీర్ణాని | = జీర్ణమైనట్టి (ప్రాత) | | | విహాయ | = వీడి |
| వాసాంసి | = వస్త్రములను | గృహ్ణాతి | = గ్రహించునో | అన్యాని | = ఇతరములైన |
| విహాయ | = త్యజించి | తథా | = అట్లే | నవాని | = క్రొత్తశరీరములను |
| అపరాణి | = ఇతరములైన | దేహీ | = జీవాత్మ | సంయాతి | = పొందును |

**మానవుడు జీర్ణవస్త్రములను త్యజించి, నూతన వస్త్రములను ధరించినట్లు జీవాత్మ ప్రాతశరీరములను వీడి నూతనశరీరములను పొందును. (22)**

ప్రశ్న - మనుష్యుడు ప్రాతవస్త్రములను త్యజించి, క్రొత్త వస్త్రములను ధరించునపుడు సంతోషపడును. కాని ప్రాత శరీరమును వదలి క్రొత్త శరీరమును గ్రహించునపుడు బాధపడును. కనుక ఈ ఉదాహరణము ఇచట ఏ విధముగా సరిపోవును?

సమా - ప్రాత శరీరమును త్యజించి, క్రొత్త శరీరమును గ్రహించునపుడు అజ్ఞానియైన వాడు దుఃఖపడును. వివేకి దుఃఖింపడు. తల్లి తనకుమారుని మాసిన బట్టలు తీసివేసి క్రొత్త బట్టలు ధరింపజేయునపుడు అతడు ఏడ్చుచుండును. కాని ఆమె వాని ఏడ్పును పట్టించుకొనక అతని హితముకొఱకే వానికి బట్టలు మార్చును - అదే విధముగా భగవంతుడు గూడ జీవుని మేలుగోరి అతని దుఃఖమును ఏమాత్రము పట్టించుకొనక అతని దేహమును మార్చును. కనుక ఈ ఉదాహరణము సముచితమే.

ప్రశ్న - శరీరములతోపాటు 'జీర్ణాని' అను పదము ప్రయోగింపబడెను. కాని వృద్ధుడైన పిమ్మటనే (శరీరము

జీర్ణమైన పిమ్మటనే) మనుష్యుడు మృతిజెందవలయునను నియమము లేదు. నవయువకులును, బాలురును మరణించుచుండుట చూచుచున్నాము. కావున ఈ యుదాహరణము యుక్తియుక్తముగా తోచదు.

సమా - ఇచట 'జీర్ణాని' అను పదమునకు 80 లేక 100 సంవత్సరముల ఆయువు అను అర్థమును భావింపరాదు. ప్రారబ్ధవశమున ప్రాణి యువకుడుగా లేక బాలుడుగా మరణించు సమయమునే అతని ఆయువుగా భావింపవలెను. ఆ ఆయువు ముగింపు దశకు చేరుటయే జీర్ణావస్థ యగును. ఈ యుదాహరణము సర్వథా యుక్తియుక్తమే.

ప్రశ్న - ఇచట 'వాసాంసి,' 'శరీరాణి' అను రెండు పదములు బహువచనాంతములు. బట్టలు మార్చుకొనువాడు ఒకేసారి మూడులేక నాలుగు ప్రాత వస్త్రములను త్యజించి, క్రొత్తవాటిని ధరింపవచ్చును. కాని దేహి, అనగా జీవాత్మ ప్రాత శరీరమును ఒక్కదానినే త్యజించి, మఱియొక క్రొత్త శరీరమును ఒక్కదానినే పొందునుగదా! ఒకే సమయమున పెక్కు శరీరములను త్యజించుటగాని, గ్రహించుటగాని జరుగదు గదా! కావున ఇచ్చట 'శరీరాణి' అను బహువచనాంత ప్రయోగము ఉచితముగాదని తోచుచున్నది-

సమా - (క) జీవాత్మ ఇప్పటివఱకు ఎన్ని శరీరములను వదలి, ఎన్ని క్రొత్త శరీరములను ధరించినదో? అట్లే భవిష్యత్తులో ఇంకెన్ని శరీరములను వదలి, మరెన్ని నూతన శరీరములను ధరింపనున్నదో? తెలియదు. తత్త్వజ్ఞానము కల్గునంత వఱకును శరీరములను త్యజించుట, గ్రహించుట సాగుచునేయుండును. కనుక 'శరీరాణి' అను బహువచనప్రయోగము చేయబడినది.

(ఖ) స్థూలము, సూక్ష్మము, కారణము అని శరీరము మూడు విధములు. జీవాత్మ ఒక శరీరమును వదలి మఱొక శరీరమును చేరునప్పుడు ఈ మూడు శరీరములద్వారా ఆ జీవాత్మగతి (గమనము) కొనసాగును. మనుష్యుని కర్మలను అనుసరించియే అతని స్వభావము (ప్రకృతి) మార్పు చెందుచూ ఉండును. సత్త్వరజస్తమోగుణయుక్తమైన వ్యష్టి ప్రకృతియే ఇచట కారణశరీరము. దీనినే స్వభావమందురు. బహుశః స్వభావమునననుసరించియే అంత్యకాలమున సంకల్పము కలుగును. సంకల్పానుసారమే సూక్ష్మశరీరము ఏర్పడును. కారణ, సూక్ష్మశరీరములతోసహా జీవాత్మ ఈ శరీరమును వదలి, సూక్ష్మశరీరమునకు అనురూపమైన స్థూలశరీరమును పొందును. కనుక స్థూల, సూక్ష్మ, కారణ భేదములచే మూడు శరీరములయందును పరివర్తనము కలుగుటవలన గూడ బహువచన ప్రయోగము యుక్తియుక్తమేయగును.

ప్రశ్న - ఆత్మ నిశ్చలమైనది. దానికి గమనా గమనములు లేవు. అయినచో 'దేహి' మఱియొక శరీరమునకు పోవును అని ఎట్లు చెప్పబడినది?

సమా - వాస్తవముగా 'ఆత్మ' నిశ్చలమైనది. అది అక్రియము. దానికి ఎట్టి పరిస్థితియందును గమన, ఆగమనములు లేవు. ఒక కుండ ఒక ఇంటి నుండి మఱియొక ఇంటికి తీసికొని పోబడునప్పుడు దానిలోని ఆకాశమునకును (ఘటాకాశము) గూడ ఘట సంబంధమువలన గమనా గమనములున్నట్లు ప్రతీతమగును. అట్లే సూక్ష్మశరీరమునకు గమనాగమనములు ఉండుటవలన ఆ సూక్ష్మశరీర సంబంధమువలన ఆత్మయందును గమనా గమనములున్నట్లు ప్రతీతమగును. కనుక సామాన్యజనులకు వివరించుటకై (స్పష్టపఱచుటకై) ఆత్మయందు గమనాగమనములు ఔపచారికకల్పన చేయబడుచున్నది - ఇచట 'దేహి' అనుపదము దేహాభిమానముగల జీవుని సూచించును. కనుక దేహ సంబంధము వలన ఆత్మ యందును గమనాగమనములున్నట్లు ప్రతీతమగును. కనుక దేహి ఇతర శరీరమును చేరునని తెల్పబడినది.

ప్రశ్న - వస్త్రములను 'గృహ్ణాతి' అనియు, శరీరమును 'సంయాతి' యనియు తెల్పబడినది. ఒకే క్రియాపదప్రయోగము సరిపోవుచున్నప్పుడు రెండు వేర్వేఱు క్రియాపదములు ఎందువలన ప్రయోగింపబడినవి?

సమా - 'గృహ్ణాతి' అనగా గ్రహించుట, సంయాతి అనగా గమనము. "వస్త్రములు గ్రహింపబడును" - కనుక 'గృహ్ణాతి' అను పదము ప్రయోగింపబడినది. ఆత్మ ఒక శరీరమునుండి మఱియొక శరీరమును చేరుచున్నట్లు ప్రతీతమగుచున్నది. కావున 'సంయాతి' అని ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'నరః' 'దేహీ' అను రెండు పదములను ప్రయోగించుటకు గల కారణమేమి? ఒక్క పదము చాలును గదా!

సమా - 'నరః' అను పదము మనుష్య మాత్రుని సూచించును. 'దేహీ' అను పదము సమస్త జీవసముదాయమును సూచించును. కనుక రెండును సార్థకప్రయోగములే. ఏలనన వస్త్రములను గ్రహించుట త్యజించుట మనుష్యుడే చేయును. ఇతర జీవులు (పశుపక్ష్యాదులు) చేయవు. కాని ఒక శరీరము నుండి మఱియొక శరీరమునకు గమనాగమనములు దేహాభిమానులైన జీవులన్నింటియందును జరుగును. కావున వస్త్రములతో 'నరః' అనియు, శరీరములతో 'దేహీ' యనియు ప్రయోగింపబడినవి.

*సంబంధము - ఒక శరీరమును వదలి మఱియొక శరీరమును పొందు విషయమున శోకించుట అనుచితమని తెలిపి, భగవానుడు ఇప్పుడు 'ఆత్మస్వరూపము' దుర్విజ్ఞేయమగుట వలన మఱల మూడు శ్లోకముల ద్వారా ప్రకారాంతరమున దాని నిత్యత్వమును, నిరాకారత్వమును, నిర్వికారత్వమును విశదపరచుటకై "అది వినాశమగునను ఆశంకతో శోకించుట అనుచితము" అని మఱల వక్కాణించుచున్నాడు-*

**నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏనమ్ | = దీనిని (ఈ ఆత్మను) | పావకః | = అగ్ని | న, క్లేదయంతి | = తడుపజాలవు |
| శస్త్రాణి | = శస్త్రములు | న, దహతి | = దహింపజాలదు | చ | = మఱియు |
| న, ఛిందంతి | = ఛేదింపజాలవు | ఏనమ్ | = దీనిని | మారుతః | = గాలి |
| ఏనమ్ | = దీనిని | ఆపః | = నీరు | న, శోషయతి | = ఆరిపోవునట్లు చేయజాలదు |

**ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు. నీరు తడుపజాలదు. వాయువు ఆరిపోవునట్లు చేయజాలదు. (23)**

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క అంతరార్థమేమి?

సమా - అర్జునుడు శస్త్రాస్త్రములద్వారా తన గురుజనులు, బంధువులు నశింతురను ఆశంకతో శోకించుచుండెను. కావున అతని శోకమును దూరము చేయుటకై భగవానుడు ఈ శ్లోకమునందు పృథ్వి మొదలగు నాలుగు భూతములు ఏవియును ఆత్మను నశింపజేయ జాలవని తెలిపి, నిర్వికారమైన ఆత్మయొక్క నిత్యత్వమును, నిరాకారత్వమును నిరూపించెను. శస్త్రముల ద్వారా శరీరము ఛేదింపబడినను ఆత్మ ఛేదింపబడదు. ఆగ్నేయాస్త్రము ద్వారా శరీరమును కాల్చివేసినను ఆత్మ కాలదు - వారుణాస్త్రముతో శరీరమును తడిపినను ఆత్మ తడవదు. వాయవ్యాస్త్రము ద్వారా శరీరమును ఆరిపోవునట్లు చేసినను 'ఆత్మ' ఎండిపోదు- శరీరము అనిత్యము. అది సాకార వస్తువు. ఆత్మ నిత్యము. అది నిరాకారము. కనుక పృథ్వీతత్త్వము గల ఎట్టి అస్త్రశస్త్రాదులవలననైనను, వాయువు, అగ్ని, జలముల వలననైనను అది (ఆత్మ) నశించుట అసంభవము.

**అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమ్ అక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్యః సర్వగతః స్థాణుః అచలోఽయం సనాతనః ॥ 24 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయమ్ | = ఇది (ఈ ఆత్మ) | అక్లేద్యః | = తడుపుటకు శక్యము కానిది | అయమ్ | = ఇది |
| అచ్ఛేద్యః | = ఛేదించుటకు సాధ్యముకానిది | చ | = మఱియు | నిత్యః | = నిత్యమైనది |
| | | ఏవ | = నిస్సందేహముగా | సర్వగతః | = సర్వవ్యాపి |
| అయమ్ | = ఇది | అశోష్యః | = శోషింపజేయుటకు సాధ్యపడనిది | అచలః | = చలింపనిది |
| అదాహ్యః | = దహింపవీలుకానిది | | | స్థాణుః | = స్థిరముగా ఉండునది |
| | | | | సనాతనః | = సనాతనమైనది. |

ఈ ఆత్మ ఛేదించుటకును, దహించుటకును, తడుపుటకును, శోషింపజేయుటకును సాధ్యము కానిది. ఇది నిత్యము. సర్వవ్యాపి, చలింపనిది (అచలము). స్థాణువు (స్థిరమైనది). సనాతనము (శాశ్వతము). **(24)**

ప్రశ్న - శస్త్రాదుల ద్వారా ఆత్మ నశింపజేయబడదు - అని పూర్వ శ్లోకమున తెల్పబడినదిగదా! ఈ శ్లోకమున మఱల అది అచ్ఛేద్యము, అదాహ్యము, అక్లేద్యము, అశోష్యము - అని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - 'ఆత్మ' శస్త్రాదుల ద్వారా నాశము కాకుండుటకు గల కారణములను భగవానుడు ఈ శ్లోకమున దెల్పెను. ఆత్మ ఛేద్యముగాదు, కాలదు, తడవదు, ఎండదు. అది అఖండము, అవ్యక్తము, నిర్వికారము ఒకే విధముగా ఉండునది. కావున దానిని నశింపజేయుటకు శస్త్రాదులలో ఏదియు సమర్థము కాదు.

ప్రశ్న - అచ్ఛేద్యాది శబ్దములద్వారా ఆత్మయొక్క నిత్యత్వమును ప్రతిపాదించి, మఱల అది నిత్యము, సర్వగతము, సనాతనము అని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - అచ్ఛేద్యాది శబ్దముల వలన నాశరాహిత్యము (నశింపకుండుట) తెలియుచున్నది. ఇది ఆకాశవిషయమున గూడ నిజమే. ఏలనన ఆకాశము ఇతర సమస్తభూతముల కారణముగను, వాటియందు వ్యాప్తమై యుండుటవలనను, అది పృథ్వీతత్త్వముచే ఏర్పడిన శస్త్రములద్వారా ఛేదింపబడదు, అగ్నిచే కాల్చబడదు, నీటిచే తడుపబడదు, వాయువుచే శుష్కింపబడదు. ఆత్మయొక్క నాశరాహిత్యము దానికంటెను అత్యంత విలక్షణమైనది. ఈ విషయమును వివరించుటకే అది నిత్యము, సర్వగతము, సనాతనము అని తెల్పబడినది. ఆకాశము నిత్యము కాదు. ఏలనన మహాప్రళయ కాలమున అది నశించును. ఆత్మ ఎన్నడును నశింపదు. కావున అది నిత్యము. ఆకాశము సర్వవ్యాపియు కాదు. కేవలము అది తన కార్యావధిలోనే వ్యాప్తి చెందును. ఆత్మ సర్వవ్యాపి. ఆకాశము సనాతనమూ, శాశ్వతము, అనాదియు కాదు. ఆత్మసనాతనము, శాశ్వతము, అనాది - ఈ విధముగ పై శబ్దముల ద్వారా ఆకాశము కంటెను ఆత్మ అత్యంతము విలక్షణమైనదని తెల్పబడినది.

ప్రశ్న - ఆత్మను స్థాణువు, అచలము అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆత్మయందు కదలికలు, గమనములు అను రెండు క్రియలు లేవని తెల్పబడినవి. ఒకే స్థానమున నుండి చలింపదు. ఒక స్థానము నుండి మఱియొక స్థానమునకు గమనము గలిగియుండదు - ఏలనన అది సర్వవ్యాపి. అది లేని స్థానమే లేదు.

**అవ్యక్తోఽయమచింత్యోఽయమ్ అవికార్యోఽయముచ్యతే ।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ 25 ॥**

అయమ్ = ఇది (ఈ ఆత్మ)
అవ్యక్తః = వ్యక్తముకానిది (ఇంద్రియ గోచరము కానిది)
అయమ్ = ఇది
అచింత్యః = మనస్సునకును అందనిది
అయమ్ = ఇది
అవికార్యః = వికారములులేనిది
ఉచ్యతే = (అని) చెప్పబడుచున్నది
తస్మాత్ = అందువలన ఓ అర్జునా!
ఏనమ్ = దీనిని (ఈ ఆత్మను)
ఏవమ్ = ఈ రీతిగా (ఇంత వఱకును తెల్పబడినట్లుగా)
విదిత్వా = ఎఱింగి
అనుశోచితుమ్ = శోకించుటకు
న, అర్హసి = అర్హుడవుకావు (అనగా శోకించుట ఉచితముగాదు)

ఈ ఆత్మ అవ్యక్తమైనది. (ఇంద్రియగోచరముగానిది) అచింత్యము (మనస్సునకును అందనిది). వికారములు లేనిది. దీనిని గూర్చి ఇట్లు తెలిసికొనుము. కనుక ఓ అర్జునా! నీవు దీనికై శోకింపదగదు. **(25)**

ప్రశ్న - ఆత్మ అవ్యక్తము, అచింత్యము అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఆత్మ ఏ ఇంద్రియమునకును గోచరము గాదు - కావున దానిని అవ్యక్తము అందురు. అది మనస్సునకు అందనిది. కావున దానిని అచింత్యమందురు -

ప్రశ్న - 'ఆత్మ' 'అవికార్యము' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఆత్మను 'అవికార్యము' అనియనుట వలన అవ్యక్తప్రకృతికంటెను ఇది విలక్షణమైనదని తెల్పబడినది. సమస్త ఇంద్రియములు, అంతఃకరణము ప్రకృతియొక్క కార్యములు. కావున అవి తమ కారణమైన ప్రకృతిని గ్రహింపలేవు. ప్రకృతియు అవ్యక్తము, అచింత్యము. కాని అది నిర్వికారముగాదు. దానియందు వికారములు గల్గును. ఆత్మయందు ఎన్నడును ఏ పరిస్థితులయందును వికారములు కలుగవు. ప్రకృతికంటెను ఆత్మ మిక్కిలి విలక్షణమైనది.

ప్రశ్న - ఆత్మను ఈ విధముగ ఎఱింగి నీవు విచారింప దగదు - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పైన పేర్కొనబడినట్లుగా ఆత్మ నిత్యము, సర్వగతము, అచలము, సనాతనము, అవ్యక్తము, అచింత్యము, నిర్వికారము అని తెలిసికొనిన పిమ్మట దానికై శోకించుట సహేతుకముగాదు.

*సంబంధము - ఆత్మకు జననముగాని, వినాశముగాని లేవని తెలిపి, దానికై శోకించుట తగదని పై శ్లోకములయందు భగవానుడు వివరించెను. ఔపచారికరూపములో ఆత్మకు జననమరణములు ఉన్నవని భావించినను దానికొఱకు శోకించుట తగదని రెండు శ్లోకములలో తెల్పుచున్నాడు-*

**అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।**
**తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ॥ 26 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = ఓ మహాబాహూ! | వా | = అట్లే | ఏవమ్ | = ఈ విధముగా |
| అథ, చ | = కాని ఒకవేళ | నిత్యమ్ | = సతతము | శోచితుమ్ | = శోకించుటకు |
| త్వమ్ | = నీవు | మృతమ్ | = మరణించునట్టిది | న, అర్హసి | = అర్హుడవుకావు (శోకించుట తగదు). |
| ఏనమ్ | = దీనిని (ఈ ఆత్మను) | మన్యసే | = (అని) భావించినచో | | |
| నిత్యజాతమ్ | = సర్వదా జన్మించునట్టిది | తథాపి | = అట్లైనను | | |

**ఓ అర్జునా! ఈ ఆత్మకు జననమరణములు కలవని ఒకవేళ నీవు భావించినప్పటికిని దీనికై నీవు శోకింపదగదు. (26)**

ప్రశ్న - 'అథ' 'చ' అను అవ్యయములను ప్రయోగించుట లోని వైశిష్ట్యమేమి? వీటితోపాటు "దీనికి (ఆత్మకు) జననమరణములు ఉన్నవని నీవు భావించినను శోకింపదగదు" అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 'అథ' 'చ' అను రెండు అవ్యయములను ఇచట ఔపచారిక స్వీకృతి బోధకములు. వాస్తవముగా ఆత్మకు జననమరణములు లేవు. ఇది ముమ్మాటికిని సత్యము. ఐనను ఒకవేళ అర్జునుడు ఆత్మకు జనన మరణములు ఉన్నవని- అనగా శరీరసంయోగము ఏర్పడినప్పుడు ఆత్మ జన్మించినట్లుగను, శరీరవియోగము కలిగినప్పుడు ఆత్మ మరణించినట్లుగను, భావించినచో అప్పుడును అతడు ఈ విధముగా (మొదటి అధ్యాయము నందలి 28వ శ్లోకమునుండి 47 వఱకు వర్ణించినట్లుగా) శోకింపదగదు.

**జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।**
**తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥ 27 ॥**

హి = ఏలనన (ఇట్లు భావించినచో)
జాతస్య = పుట్టినవానికి
మృత్యుః = మరణము
ధ్రువః = నిశ్చయము (తప్పదు)
చ = మఱియు
మృతస్య = మరణించినవానికి
జన్మ = పుట్టుక
ధ్రువమ్ = నిశ్చితము(తప్పదు)
తస్మాత్ = అందువలన
అపరిహార్యే = పరిహరించుటకు సాధ్యముకాని
అర్థే = విషయమున
త్వమ్ = నీవు
శోచితుమ్ = శోకించుటకు
న, అర్హసి = అర్హుడవుకావు (శోకింపరాదు).

**ఏలనన పుట్టినవానికి మరణము తప్పదు. మరణించినవానికి పునర్జన్మ తప్పదు. కనుక అపరిహార్యములైన ఈ విషయములయందు నీవు శోకింపదగదు. (27)**

ప్రశ్న - 'హి' అను అవ్యయప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - 'హి' అనునది హేత్వర్థకము. శోకించుట అనుచితమని తెల్పుటకు పూర్వశ్లోకమున పేర్కొనిన కారణమునే ఇచట భగవానుడు నొక్కి చెప్పెను.

ప్రశ్న - జన్మించిన వాడు మరణింపక తప్పదు - ఈ విషయము లోకవిదితమే. కాని మరణించిన ప్రతిప్రాణియు మఱల జన్మించునని నిశ్చయముగా చెప్పుట యెట్లు? ఏలనన ముక్తుడైనవానికి పునర్జన్మ యుండదనుట ప్రసిద్ధమేగదా! (4/9, 5/17, 8/15, 16, 21 మొదలగునవి)

సమా - భగవంతుడు ఇచ్చట వాస్తవిక సిద్ధాంతమును గూర్చి చెప్పుటలేదు. అజ్ఞానుల దృష్టిలో ఆత్మకు జనన మరణములున్నట్లు విశ్వసించుట ప్రసిద్ధము - వారి విశ్వాసమును అనుసరించి మరణించిన వాడు జన్మించుట నిశ్చయము - ఏలనన ముక్తిని గురించి వారు విశ్వసింపరు. వాస్తవిక సిద్ధాంతమును అనుసరించి, ముక్తిని విశ్వసించు వారు ఆత్మకు జననమరణములు లేవని ఎఱుంగుదురు. ఈ జననమరణములు కేవలము అజ్ఞానజనితములే.

ప్రశ్న - 'తస్మాత్' అను పదప్రయోగవైశిష్ట్యమేమి? అట్లే అపరిహార్యే, అర్థే అను పదముల యొక్క భావమేమి? "దానికై శోకించుట అనుచితము" అనియనుటలోని అంతర్యమేమి?

సమా - "తస్మాత్" అను పదము హేతువాచకము - దీనితోపాటు 'అపరిహార్యే,' 'అర్థే' అను పదములను ప్రయోగించి, పైన తెల్పబడిన రీతిగా ఆత్మకు జనన మరణములున్నవని విశ్వసించినచో అవి అనివార్యములే యగును, వాటిని తప్పించుకొనుట అసంభవము అని స్పష్టపఱచినట్లగును, ఇట్టి స్థితియందు గూడ శోకించుట తగదు - కనుక ఈ దృష్టితో గూడ అర్జునుడు శోకించుట సర్వథా అనుచితమని భగవానుడు తెల్పుచున్నాడు.

సంబంధము - ఆత్మ నిత్యము. దానికి జననమరణములు లేవని విశ్వసించినను, లేక అది సదాజననమరణములకు లోనగుచుండునని నమ్మినను - ఏవిధముగ ఆలోచించినను శోకించుట అనుచితమని పూర్వశ్లోకములయందు విశదపఱచబడెను. ప్రాణుల స్థూలశరీరములు క్షణికములు. కావున వాటి కొఱకై పరితపించుట సముచితముగాదు - అని రాబోవు శ్లోకమున తెల్పుచున్నాడు-

**అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।**
**అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28 ॥**

భారత = ఓ భారతా! (ఓ అర్జునా!)
భూతాని = ప్రాణులన్నియును
అవ్యక్తాదీని = పుట్టుటకుముందు అవ్యక్త (అప్రకటిత)ములు
అవ్యక్తనిధనాని, ఏవ = మరణించిన పిమ్మట గూడ అవ్యక్తములే
వ్యక్తమధ్యాని = (కేవలము)జనన మరణముల మధ్యకాలమున మాత్రమే ప్రకటితములు (ఇంద్రియ గోచరములు)
తత్ర = ఇట్టి స్థితియందు
కా, పరిదేవనా = శోకించుట ఎందులకు? (శోకించుట వ్యర్థము)

**ఓ అర్జునా! ప్రాణులన్నియును పుట్టుకకు ముందు ఇంద్రియగోచరములు గావు- (అవ్యక్తములు) మరణానంతరము గూడ అవి అవ్యక్తములే- ఈ జననమరణముల మధ్యకాలమునందు మాత్రమే అవి ప్రకటితములు (ఇంద్రియ గోచరములు) అగుచుండును. ఇట్టి స్థితిలో వాటికై పరితపించుట నిష్ప్రయోజనము. (28)**

ప్రశ్న - 'భూతాని' అను పదము ఎవరిని తెలుపును? దానితోపాటు 'అవ్యక్తాదీని, అవ్యక్త నిధనాని, వ్యక్తమధ్యాని' అను విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - 'భూతాని' అను పదము ఇచ్చట సమస్త ప్రాణులను తెల్పును. ఆదియందు అనగా జన్మించుటకు పూర్వము వీటికి వర్తమాన (ఇప్పటి) స్థూలశరీరములతో సంబంధము లేదు - అని తెల్పుటకు 'అవ్యక్తాదీని' అను విశేషణము ప్రయుక్తము ఐనది - అంతమునందు అనగా మరణించిన తరువాత గూడా స్థూల శరీరములతో వీటికి సంబంధము లేదు - అని తెల్పుటకు 'అవ్యక్తనిధనాని' అను విశేషణము ప్రయుక్తమైనది. కేవలము పుట్టినది మొదలు మృత్యుపర్యంతము (మరణించువరకు) గల మధ్య కాలమందే ఇవి వ్యక్తమగును. వీటికి శరీరముతో సంబంధముండును అని తెల్పుటకు 'వ్యక్తమధ్యాని' అను విశేషణము ప్రయుక్తమైనది.

ప్రశ్న - ఇట్టి స్థితి యందు శోకింప పనియేమి? అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - స్వప్నసృష్టి స్వప్నకాలమునకు ముందుగాని, స్వప్నానంతరముగాని ఉండదు. కేవలము స్వప్నకాలమునందే మనుష్యునకు దానితో సంబంధమున్నట్లు ప్రతీతమగును- అదేవిధముగ జనన మరణముల మధ్యకాలమున (బ్రతికియున్న కాలమున) మాత్రమే దానికి స్థూలశరీరముతో సంబంధము ఉండును. ఆ సంబంధము శాశ్వతముగాదు. కనుక దానికై శోకించుట తగదు - మహాభారత స్త్రీ పర్వమున రెండవ (2)వ అధ్యాయమునందు విదురుడు కూడ ఈ విషయమునే ఈ విధముగా తెల్పెను.

అదర్శనాదాపతితాః, పునశ్చాదర్శనం గతాః ।
నైతే తవ న తేషాం త్వం, తత్ర కా పరిదేవనా ॥ 13 ॥

నీచే స్వజనులుగా భావింపబడువారు అందఱును అదర్శనమునుండి వచ్చిరి. అనగా పుట్టుటకు ముందు వారు వ్యక్తముకానివారు. మఱల వారు (మరణానంతరము) అదర్శనమునే (అవ్యక్తమునే) పొందిరి. యథార్థముగా వారు నీవారు కారు. నీవు వారి వాడవును కావు. ఈ విషయమున మఱి శోకించుట యెందులకు?

సంబంధము - ఆత్మతత్త్వము సులభగ్రాహ్యముకానందున దానిని వివరించుటకై భగవానుడు పై శ్లోకముల ద్వారా వివిధ రీతులుగా దాని స్వరూపమును వర్ణించెను. ఇప్పుడు ఆ ఆత్మ తత్త్వము యొక్క దర్శన, వర్ణన, శ్రవణముల అలౌకికత్వమును, దుర్లభత్వమును రాబోవు శ్లోకమున స్పష్టము చేయుచున్నాడు-

## ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్ ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।
## ఆశ్చర్య వచ్చైనమన్యః శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కశ్చిత్ | = ఎవరో ఒకమహా పురుషుడే | అన్యః | = మఱియొక మహాపురుషుడు | ఏనమ్ | = దీనిని (ఈ ఆత్మను) |
| | | | | ఆశ్చర్యవత్ | = ఆశ్చర్యముగా |
| ఏనమ్ | = దీనిని (ఈ ఆత్మను) | ఆశ్చర్యవత్ | = (దీని తత్త్వమును) ఆశ్చర్యకరముగా | శృణోతి | = వినును |
| ఆశ్చర్యవత్ | = ఆశ్చర్యమైనదానినిగా | | | చ | = మఱియు |
| పశ్యతి | = చూచును | వదతి | = చెప్పును (వర్ణించును) | కశ్చిత్ | = ఒక్కొక్కడు |
| చ | = మఱియు | చ | = అట్లే | శ్రుత్వా, అపి | = విన్నప్పటికిని |
| తథా, ఏవ | = అట్లే | అన్యః | = మఱియొకడు (యోగ్యుడైనవాడే) | ఏనమ్ | = దీనిని |
| | | | | న, ఏవ, వేద | = తెలిసికొనజాలడు. |

ఎవరో ఒక మహాపురుషుడు మాత్రమే దీనిని (ఈ ఆత్మను) ఆశ్చర్యకరమైన దానినిగా చూచును. మరియొక మహాత్ముడు దీని తత్త్వమును ఆశ్చర్యకరముగా వర్ణించును. వేఱొక పురుషుడు దీనిని ఆశ్చర్యకరమైన దానినిగా వినును. ఆ విన్నవారిలోకూడ కొందరు దీనిని గూర్చి ఏమియు ఎఱుగరు. **(29)**

ప్రశ్న - ఎవరో ఒక మహాపురుషుడు మాత్రమే దీనిని ఆశ్చర్యకరమైన దానినిగా చూచును - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఆత్మస్వరూపము మిక్కిలి ఆశ్చర్యకరము. కావున దానిని (ఆత్మను) చూడగలుగువాడు జగత్తునందు అరుదుగా నుండును. అతడును ఈ ఆత్మను ఆశ్చర్యకరమైన దానినిగనే చూచును. మనుష్యుడు లౌకిక దృశ్యవస్తువులను మనోబుద్ధీంద్రియముల ద్వారా 'ఇది' అను బుద్ధితో చూచును. కాని ఆత్మదర్శనము అట్లు కాదు. అది మిక్కిలి అద్భుతము, అలౌకికము. ఒకే చేతనాత్మకు తప్ప మఱిదేనికిని ఉనికి లేని స్థితియందు ఆత్మ స్వయముగా తనను తానే దర్శించును - అపుడు ద్రష్ట, దృశ్యము, దర్శనము అను త్రిపుటి యుండదు - కావున ఆత్మదర్శనము ఆశ్చర్యకరము.[1]

ప్రశ్న - మఱియొకడు దీనిని (ఈ ఆత్మను) ఆశ్చర్యకరమైన దానినిగా వర్ణించును - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఆత్మ సాక్షాత్కారమును పొందిన బ్రహ్మనిష్ఠ గరిష్ఠులందఱును ఇతరులకు ఈ ఆత్మ స్వరూపమును వర్ణింపలేరు. పరమాత్మ తత్త్వమును పూర్తిగా ఎఱింగిన మహాత్ములును, వేదశాస్త్రములను బాగుగా ఆకళించుకొనిన వారును మాత్రమే ఆత్మను వర్ణింపగలరు - ఆ వర్ణించుటయును ఆశ్చర్యకరముగనే యుండును - అనగా లౌకిక వస్తుస్వరూప వర్ణనము వలె కాక ఆత్మ వర్ణనము వేఱుగా - అనగా అలౌకికముగ అద్భుతముగ ఉండును. ఆత్మతత్త్వమును వర్ణించుటకు ఇయ్యబడు ఉదాహరణములు ఎవ్వియును దానిని సమగ్రముగా వివరింపజాలవు. దాని అంశలలో ఏదో ఒక దానిని మాత్రమే ఉదాహరణముల ద్వారా వివరింప వీలగును. ఏలననగా ఆత్మసదృశమైన మఱియొక వస్తువు ఏదియును లేదు - ఇట్టి పరిస్థితిలో ఏ ఉదాహరణము గూడ సంపూర్ణముగా దానిని వివరించుటకు చాలదు. ఐనను విధి - నిషేధరూపములలో ఆశ్చర్యకరము లైన పెక్కు సంకేతముల ద్వారా మహాత్ములు దానిని తెలుపుదురు. ఆశ్చర్యకరముగా దానిని వర్ణించుట యనగా నిదియే. వాస్తవముగా ఆత్మ వాక్కులద్వారా వర్ణించుటకు అలవికానిది అగుటవలన దీనిని స్పష్టమైన మాటలద్వారా వర్ణించుట అసాధ్యము.

ప్రశ్న - వేఱొకడు దీనిని ఆశ్చర్యకరమైన దానినిగా వినును - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ ఆత్మ వర్ణనను వినువాడు సదాచారుడు, పవిత్ర మనస్కుడు, శ్రద్ధాళువు, ఆస్తికుడు ఐయుండవలెను. అట్టి గుణములు గలవాడు చాల అరుదుగా మాత్రమే లభించును. అతడును దీనిని ఆశ్చర్యకరమైనదానినిగానే వినును. మొదట అతడు శరీరాదులను తన స్వరూపముగను, జడపదార్థములను శాశ్వతమైన వాటిగను, సుఖప్రదములుగను, రమణీయములుగను భావించుచు వచ్చెను. ఇప్పుడు అవియన్నియును అనిత్యములును, నశ్వరములును, దుఃఖ ప్రదములును, జడములును అనియు, ఆత్మ ఒక్కటి మాత్రమే వాటికంటెను సర్వథా విలక్షణమైనదని విని ఆశ్చర్యచకితుడగును. ఏలనన ఈ

1) కఠోపనిషత్తునందు దాదాపు ఈ శ్లోకభావమునే తెలుపు మంత్రము కలదు.

శ్రవణాయాపి బహుభిః యో న లభ్యః, శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః।
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధాఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥ (1/2/7)

ఆత్మతత్త్వము వినుటకు పెక్కుమందికి లభ్యముకాదు. విన్నవారిలో గూడ పెక్కుమంది దానిని ఎఱుంగలేరు. ఈ ఆత్మను వర్ణించువాడును ఆశ్చర్యకరమైనవాడే. (అరుదైనవాడే). దానిని తెలిసికొనుటకును ఏ ఒక్కడో సమర్థుడగును. ఆ తెలిసికొనువాడు గూడ కుశలుడైన ఆచార్యునిచే ఉపదేశింపబడినవాడై ఆశ్చర్యకరమైన పురుషుడే యగును.

తత్త్వమును మునుపు ఎన్నడును అతడు వినియుండలేదు. ఎవ్వరి ద్వారా కూడ తెలిసికొని యుండలేదు. పైగా లౌకిక వస్తువులెవ్వియును దానితో సమానము గావు. ఈ కారణము వలన అది (ఆత్మ) అతనికి అత్యద్భుతముగా తోచును. ఆ తత్త్వమును అతడు తన్మయత్వముతో విని ముగ్ధుడగును - అతని ధ్యాస మఱియొక వైపునకు మఱలదు - అతడు ఆశ్చర్యముగా వినుట యనగా ఇదియే -

ప్రశ్న - ఆ విన్నవారిలో గూడ కొందరు దీనిని తెలిసికొన జాలరు అని యనుటలోని అంతర్యమేమి?

సమా - అంతఃకరణశుద్ధి, ఆస్తిక భావము లేనివాని బుద్ధి పవిత్రముగను సూక్ష్మముగను ఉండదు. అట్టివాడు ఈ ఆత్మతత్త్వమును విన్నను సంశయ విపరీతభావనల కారణమున దాని స్వరూపమును యథార్థముగా గ్రహింపలేడు. కావున అర్హుడు కానివాడు ఈ ఆత్మతత్త్వమును తెలిసికొనజాలడు.

ప్రశ్న - 'ఆశ్చర్యవత్' అను పదము ఇచట ఆత్మకు విశేషణమా? లేక చూచువారికి, వినిపించువారికి, వినువారికి విశేషణమా? లేక చూచుట, వర్ణించుట, వినుట అను క్రియలకు విశేషణమా?

సమా - 'ఆశ్చర్యవత్' అను పదము ఇచట చూచుట వినుట, మొదలగు క్రియలకు విశేషణము - క్రియా విశేషణమగుట వలన దాని భావము కర్తకును, కర్మకును వర్తించును.

*సంబంధము - ఈ విధముగ ఆత్మతత్త్వముయొక్క దర్శన, వర్ణన, శ్రవణముల అలౌకికత్వమును, దుర్లభత్వమును వర్ణించి, 'ఆత్మ' నిత్యము, అవధ్యము (వధించుటకు వీలులేనిది) అగుటవలన ఏ ప్రాణికొఱకైనను శోకించుట తగదని తెల్పుచు భగవానుడు ఈ సాంఖ్యయోగప్రకరణమును ముగించుచున్నాడు-*

## దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
## తస్మాత్ సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥ 30 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = ఓ అర్జునా! | అవధ్యః | = వధింపవీలుకానిదియై యుండును | | (ఏ ప్రాణికొఱకు) ఐనను |
| అయమ్, దేహీ | = ఈ ఆత్మ | | | త్వమ్ | = నీవు |
| సర్వస్య | = ప్రతిప్రాణియొక్క | తస్మాత్ | = అందువలన | శోచితుమ్ | = శోకించుటకు |
| దేహే | = దేహమునందు | సర్వాణి | = సమస్తములైన | న, అర్హసి | = అర్హుడవుకావు (శోకింపదగదు). |
| నిత్యమ్ | = ఎల్లప్పుడును | భూతాని | = ప్రాణులను గూర్చి | | |

**ఓ అర్జునా! ప్రతిదేహమునందును ఉండెడి ఈ ఆత్మ వధించుటకు వీలుకానిది. కనుక ఏ ప్రాణిని గూర్చియైనను నీవు శోకింపదగదు. (30)**

ప్రశ్న - "అందఱి శరీరములయందుండు ఈ 'ఆత్మ' సదా అవధ్యము." అనియనుటలోని అంతర్యమేమి?

సమా - సమస్త ప్రాణుల శరీరములయందుండు 'ఆత్మ' ఒక్కటే. శరీర భేదముల వలన అజ్ఞాన కారణమున ఆత్మ యందును భేదము ప్రతీతమగును. వాస్తవముగా ఎట్టి భేదమూ లేదు. ఆత్మ సర్వదా 'అవధ్యము'. అది యెన్నడును ఏ సాధనమువలనను నశింపదు.

ప్రశ్న - ఈ కారణముగ సమస్త ప్రాణులలో దేని కొఱకైనను నీవు శోకింపదగదు - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యమునందు 'తస్మాత్' అను హేతువాచక పదమును ప్రయోగించుట వలన 'ఆత్మ' సర్వథా శాశ్వతము, దానిని నశింపజేయుటకు ఎవరును సమర్థులు కారు - అని ఈ సందర్భమున చెప్పబడిన విషయమును మఱల ధ్రువపఱచుట జరిగినది - కనుక ఏ ప్రాణికొఱకైనను శోకించుట తగదని భగవానుడు అర్జునునికి తెలిపెను - ఏలనన ఆత్మ ఏకాలమునందును ఏ సాధనము ద్వారాను నశింపనప్పుడు దానికొఱకై శోకింపనవసరమే లేదు - కావున ఎవ్వరైనను నశింతురను ఆశంకతో శోకింపక, యుద్ధసన్నద్ధుడవు కమ్మని భగవానుడు అర్జునుని ఆదేశించెను.

సంబంధము - ఇంతవఱకును సాంఖ్యయోగమును అనుసరించి, పెక్కు యుక్తులద్వారా నిత్యము, శుద్ధము, బుద్ధము, సమము, నిర్వికారము, అకర్త ఐన ఆత్మయొక్క ఏకత్వ, నిత్యత్వ, అవినాశిత్వాదులను భగవానుడు ప్రతిపాదించెను. శరీరము వినాశశీలమని తెల్పి, ఆత్మకొఱకుగాని, శరీరములకొఱకుగాని, లేక శరీరాత్మల వియోగములకొఱకుగాని శోకించుట అనుచితమని స్పష్టపఱచెను. ఈ సందర్భముననే ఆత్మకు జననమరణములు ఉన్నవని విశ్వసించినను దానికై శోకించుట తగదని పేర్కొని, యుద్ధము చేయుటకు అర్జునుని ఆజ్ఞాపించెను. ఇప్పుడు క్షాత్ర ధర్మమును అనుసరించియు శోకించుట తగదని ఏడు శ్లోకముల ద్వారా వివరించుచు, భగవానుడు యుద్ధమునకు అతనిని పురికొల్పుచున్నాడు-

**స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి ।**
**ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥ 31 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = ఇంకను | న,అర్హసి | = అర్హుడవుకావు (భయపడదగదు) | యుద్ధాత్ | = యుద్ధముకంటె |
| స్వధర్మం | = (నీ) స్వధర్మమును | | | అన్యత్ | = మఱియొకటి |
| అవేక్ష్య | = చూచి | హి | = ఏలనన | శ్రేయః | = శ్రేయస్కరమైన కర్తవ్యము |
| అపి | = ఐనను | క్షత్రియస్య | = క్షత్రియునకు | | |
| వికంపితుమ్ | = చలించుటకు (భయపడుటకు) | ధర్మ్యాత్ | = ధర్మయుక్తమైన | న విద్యతే | = ఉండదు. |

**అంతేగాక స్వధర్మమునుబట్టియు నీవు భయపడనక్కరలేదు. ఏలనన క్షత్రియునకు ధర్మయుద్ధమునకు మించినట్టి శ్రేయస్కరమైన కర్తవ్యము మఱియొకటి ఏదియును లేదు. (31)**

ప్రశ్న - 'అపి' అనుఅవ్యయ ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - 'ఆత్మ' నిత్యమనియు, శరీరము అనిత్యమనియు, తెలిసికొన్న పిదప శోకించుట, లేదా యుద్ధాదుల యెడ విముఖుడగుట ఎట్టి స్థితియందును తగదని భగవానుడు వివరించియే యుండెను. అంతేగాక తన వర్ణధర్మమునను సరించియు అర్జునుడు యుద్ధము చేయుటకు వెనుకాడరాదు - ఏలనన యుద్ధమునకు విముఖుడు కాకుండుటయే క్షత్రియునకు స్వాభావికధర్మము. (18/43) ఈ విషయమును తెల్పుటకే 'అపి' అను అవ్యయము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'హి' అను అవ్యయమునకు అర్థమేమి?

సమా - 'హి' అను అవ్యయము హేతువాచకము. యుద్ధమునకు (శత్రు పక్షము వారిని చంపుటకు) భయపడి, దానికి విముఖుడు ఏలకారాదో శ్లోకముయొక్క ఉత్తరార్థమున తెల్పుచున్నాడు.

ప్రశ్న - క్షత్రియునకు ధర్మయుద్ధమునకు మించిన శ్రేయస్కరమైన కర్తవ్యము మఱియొకటి లేదు - అనియునుటలోని ఆంతర్యమేమి?

సమా - నీతి రహితముకానిదియు, లోభకారణముగ చేయబడనిదియు, అన్యాయాచరణమునకు తావులేనిదియు, ఐన యుద్ధము ధర్మ బద్ధము, కర్తవ్యము, న్యాయానుకూలము - అట్టి యుద్ధమే ఇతర ధర్మములన్నింటి కంటెను క్షత్రియులకు మిక్కిలి శ్రేయస్కరము - క్షత్రియునకు అంతకంటెను మించిన కల్యాణప్రదమైన ధర్మము మఱియొకటి లేదు - ఏలనన ధర్మయుద్ధమును ఆచరించు క్షత్రియుడు అనాయాసముగనే ఇచ్ఛానుసారము స్వర్గమునుగాని మోక్షమునుగాని పొందగలడు.

**యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।**
**సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్ ॥ 32 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = ఓ పార్థా! | అపావృతమ్ | = తెఱువబడిన | సుఖినః | = అదృష్టవంతులైన |
| యదృచ్ఛయా | = అనుకోకుండ (సంకల్పములేకుండ) | స్వర్గద్వారమ్ | = స్వర్గద్వార (రూప)మై నట్టిదియు | క్షత్రియాః | = క్షత్రియులు మాత్రమే |
| ఉపపన్నమ్ | = ప్రాప్తించినట్టిదియును | ఈదృశమ్ | ఇట్టి | లభంతే | = పొందుదురు. |
| | | యుద్ధమ్ | యుద్ధమును | | |

**ఓ పార్థా! యాదృచ్ఛికముగా అనగా అనుకోకుండా తటస్థించిన ఇట్టి యుద్ధము అదృష్టవంతులైన క్షత్రియులకే లభించును. ఇది స్వర్గమునకు తెఱచిన ద్వారము వంటిది. (32)**

ప్రశ్న - **'పార్థ!'** అను సంబోధనయొక్క విశేషమేమి?

సమా - శ్రీకృష్ణుడు అర్జునుని **'పార్థ!'** అని సంబోధించి, అతని తల్లియైన కుంతీదేవి తనద్వారా పంపిన సందేశమును మఱల జ్ఞప్తికి దెచ్చెను. శ్రీకృష్ణుడు హస్తినాపురమునుండి మఱలి వచ్చునప్పుడు కుంతీదేవి భగవానునితో ఇట్లు పలికియుండెను.

**ఏతద్ధనంజయో వాచ్యో నిత్యోద్యుక్తో వృకోదరః ।**
**యదర్థం క్షత్రియా సూతే తస్య కాలోఽయమాగతః ॥**

(మహాభారతం - ఉద్యోగ పర్వం 137/9/10)

"ఒక వీరమాత (రాజమాత) గర్భమున జనించిన వీరపుత్రులు సమయము వచ్చినప్పుడు తమక్షత్రియ ధర్మమైన వీరోచితపరాక్రమములను ప్రదర్శించి, యుద్ధమొనర్చి, ధర్మమును పరిరక్షింపవలెను. ఆసమయము ఇప్పుడాసన్నమైనదని ధనంజయుడైన అర్జునునకును, సదాయుద్ధసన్నద్ధుడైయుండు భీమునకును తెల్పుము."

ప్రశ్న - ఇచట **'యుద్ధమ్'** అను పదముతోపాటు **'యదృచ్ఛయోపపన్నమ్'** అను విశేషణమును ప్రయోగించి, దానిని **'అపావృతమ్' 'స్వర్గద్వారమ్'** అని పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు యుద్ధమును తానుగా కోరుకొని అందుకు సిద్ధమై రాలేదు. పాండవులు సంధికై మిగుల ప్రయత్నములు సాగించిరి. కాని కౌరవుల కడ 'న్యాసము'గా ఉంచిన తమ వంతు రాజ్యమును తిరిగి తమకు ఇచ్చుటకు దుర్యోధనుడు అంగీకరింపనందు వలన యుద్ధము అనివార్యమయ్యెను. 'సూదిమొన మోపినంత భూమిని' గూడ పాండవులకు ఇయ్యనని దుర్యోధనుడు పలికెను[1] కావున పాండవులు యుద్ధసన్నద్ధులు కావలసివచ్చెను. **'యదృచ్ఛయోపపన్నమ్'** (అనగా కోరకయే వచ్చిపడిన యుద్ధము) అను పదముల ప్రయోగమునకు అర్థమిదియే-

ఇట్టి ధర్మయుద్ధమున మరణించు వీరులకు సరాసరి స్వర్గప్రాప్తి కలుగును. వారి మార్గములకు ఎట్టి అవరోధములును ఉండవు. ఈ భావమును ప్రకటించుటకే **'అపావృతమ్' 'స్వర్గద్వారమ్'** అను విశేషణములు ప్రయోగింపబడినవి.

ప్రశ్న - ఈ విధమైన యుద్ధము అదృష్టవంతులైన క్షత్రియులకే లభించును - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇట్టి ధర్మయుద్ధము ప్రతిక్షత్రియునకును లభింపదు - కేవలము అదృష్టవంతులైన క్షత్రియులకే అయాచితముగ కర్తవ్య రూపమున లభ్యమగును. ఇది స్వర్గమునకు ద్వారము వంటిది - అర్జునుడు మిక్కిలి అదృష్టవంతుడు అగుటవలననే ఇట్టి ధర్మయుద్ధము అతనికి అప్రయత్నముగ లభించినది - కావున దానినుండి వైదొలగుట అతనికి తగదు.

సంబంధము - ఇట్టి ధర్మయుద్ధమును చేయుటవలన కలుగు లాభమును తెలిపిన పిమ్మట దానిని చేయనిచో కలుగు హానినిగూడ తెలుపుచు భగవానుడు యుద్ధమునకై అర్జునుని ప్రోత్సహించుచున్నాడు-

## అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
## తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥ 33 ॥

1) యావద్ధి తీక్ష్ణయా సూచ్యా విద్ధ్యేదగ్రేణ కేశవ! తావదప్యపరిత్యాజ్యం భూమేర్నః పాండవాన్ ప్రతి ॥
(మహాభారతం - ఉద్యోగ 127/25)

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథ చేత్ | = ఐనను, ఒకవేళ | సంగ్రామమ్ | = యుద్ధమును | కీర్తిమ్ | = కీర్తిని |
| త్వమ్ | = నీవు | న కరిష్యసి | = చేయనిచో | హిత్వా | = పోగొట్టుకొని |
| ఇమమ్ | = ఈ (ఇట్టి) | తతః | = పిమ్మట | పాపమ్ | = పాపమునే |
| ధర్మ్యమ్ | = ధర్మయుక్తమైన | స్వధర్మమ్ చ | = స్వధర్మమునూ | అవాప్స్యసి | = పొందెదవు |

ఈ యుద్ధము నీకు ధర్మబద్ధము. ఒకవేళ నీవు దీనిని ఆచరింపకున్నచో నీ స్వధర్మమునుండి పాఱిపోయినవాడవు అగుదువు. దానివలన కీర్తిని కోల్పోవుదువు. పైగా నీవు పాపము చేసినవాడవగుదువు. **(33)**

ప్రశ్న - 'అథ' అను పదమునకు అర్థమేమి?

సమా - 'అథ' అనుపదము పక్షాంతరమున ప్రయుక్తమైనది. ఇప్పుడు ప్రకారాంతరమున యుద్ధము కర్తవ్యమని నిరూపింపబడుచున్నది.

ప్రశ్న - 'సంగ్రామమ్' అనుపదముతోపాటు 'ఇమమ్' 'ధర్మ్యమ్' అను విశేషణములను ప్రయోగించుచు 'నీవు ఈ యుద్ధమును చేయనిచో స్వధర్మమును, కీర్తిని కోల్పోయి పాపముల పాలయ్యెదవు' – అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ యుద్ధము ధర్మయుక్తమైనది. కనుక అది అవశ్యకర్తవ్యము ఈ విషయము ఇదివరకే బాగుగా వివరింపబడినది. ఐనను ఏకారణము వలననైనను అర్జునుడు యుద్ధము చేయనిచో అతడు స్వధర్మమును త్యజించినవాడగును. అంతేగాక నివాతకవచాది దానవులతో పోరాడి అతడు విజయమును సంపాదించియుండెను. పరమశివుని గూడ ఎదిరించి, పాశుపతాస్త్రమును గూడ పొంది యుండెను. ఆ కారణమున అర్జునుడు మహావీరుడుగా వాసికెక్కెను. ఆ కీర్తియంతయు ఇప్పుడు రూపుమాయును. మఱియు కర్తవ్యమును త్యజించుటవలన అతనికి పాపము అంటును. కావున పాపభీతిచే నైనను స్వధర్మమైన యుద్ధమును త్యజించుటవలన అతనికి పాపమే కల్గును. కావున అట్లు చేయుట సర్వథా అనుచితము.

## అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్ ।
## సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే ॥ 34 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | అకీర్తిమ్, అపి | = అపకీర్తిని గూర్చియు | అకీర్తిః | = అపకీర్తి |
| భూతాని | = సమస్తజనులు | కథయిష్యంతి | = చెప్పికొందురు | | |
| తే | = నీయొక్క | చ | = మఱియు | మరణాత్ | = మృత్యువుకంటెను |
| అవ్యయామ్ | = కలకాలము నిలిచియుండు | సంభావితస్య | = మాన్యుడైనవానికి | అతిరిచ్యతే | = అధిక (బాధాకర) మైనది. |

లోకులెల్లరును బహుకాలమువఱకును నీ అపకీర్తినిగూర్చి చిలువలు పలువలుగా చెప్పికొందురు. మాన్యుడైన పురుషునకు అపకీర్తి మరణముకంటెను బాధాకరమైనది. **(34)**

ప్రశ్న - 'అపి' అను అవ్యయమును ప్రయోగించి, లోకులెల్లరును కలకాలమూ నీ అపకీర్తిని గూర్చియే చెప్పికొందురు - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - కేవలము స్వధర్మమును, కీర్తిని కోల్పోయి పాపముల పాలగుటయే గాక, దేవతలు, ఋషులు, మనుష్యులు మొదలగు వారందఱిచే అనేక రీతుల అర్జునుడు దోషిగా నిందింపబడును - అను విషయమును తెలుపుటకే 'అపి' అను అవ్యయమును ప్రయోగించుట జరిగినది - ఈ అపకీర్తి తాత్కాలికముగనే గాకుండ శాశ్వతమైన మచ్చగా నిలిచిపోవును. కావున యుద్ధమును త్యజించుట అతనికి సర్వథా అనుచితము.

ప్రశ్న - "మాన్యుడైన వానికి అపకీర్తి మరణము కంటెను బాధాకరమైనది." అనియనుటలోని అంతర్యమేమి?

సమా - "అపకీర్తి వచ్చినచో రానిమ్ము, దానివలన నాకేమి

హాని కలుగును? అని ఒకవేళ అర్జునుడు భావించినచో- అట్టి భావన సరియైనది కాదు. జగత్ప్రసిద్ధుడైన శ్రేష్ఠపురుషునకు అపకీర్తి మరణము కంటెను ఎక్కువ దుఃఖకారకము. అట్టి అపకీర్తిని అర్జునుడు సహింపలేడు. ఏలనన జగత్తునందు మిక్కిలి శూరుడనియు, వీరుడనియు, శ్రేష్ఠ పురుషుడనియు అతడు వాసిగాంచెను. స్వర్గమునుండి పాతాళము వఱకును అతని ప్రతిష్ఠ వ్యాపించినది.

**భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః ।**

**యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | లాఘవమ్ | = (ఇప్పుడు) చులకన | భయాత్ | = భయమువలన (భయకారణముగా) |
| యేషామ్ | = ఎవరిదృష్టిలో | యాస్యసి | = అయ్యెదవు | | |
| త్వమ్ | = నీవు | మహారథాః | = ఆ మహారథులు | రణాత్ | = యుద్ధము నుండి |
| బహుమతః | = మిక్కిలిమాన్యుడవు | త్వామ్ | = నిన్ను | ఉపరతమ్ | = పాఱిపోయిన వానినిగా |
| భూత్వా | = అయి (ఉంటివో) | | | మంస్యంతే | = తలంతురు. |

ఈ మహారథుల దృష్టిలో ఇప్పుడు నీవు మిక్కిలి మాన్యుడవు. యుద్ధవిముఖుడవైనచో వీరి దృష్టిలో నీవు ఎంతో చులకన అయ్యెదవు. అంతేగాక నీవు పిరికివాడవై యుద్ధమునుండి పారిపోయినట్లు వీరు భావింతురు. **(35)**

ప్రశ్న - ఇంతవరకును నీవు వీరిదృష్టిలో మాన్యుడవు - కాని ఇక మీదట నీవు (యుద్ధవిముఖుడవైనచో) చులకన అయ్యెదవు - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - భీష్మద్రోణ శల్యాదులును, విరాట, ద్రుపద, సాత్యకి, ధృష్టద్యుమ్నాది మహారథులును అర్జునుని ఎంతో గౌరవించుచు వచ్చిరి. అతనిని వారు మహాశూరునిగా, వీరునిగా, యోధునిగా ధర్మాత్మునిగా భావించుచుండిరి. అతడు ఇప్పుడు యుద్ధమును త్యజించినచో వారిదృష్టిలో చులకన యగును - వారతనిని పిరికివానినిగా తలంతురు - ఫలితముగా అతనికి తలవంపులు తప్పవు.

ప్రశ్న - "భయపడి నీవు యుద్ధమునుండి వైదొలగితివని మహారథులు భావింతురు-" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ వాక్యముద్వారా మహారథుల దృష్టిలో అర్జునుడు చులకన యగునని భగవానుడు స్పష్టపఱచెను. అర్జునుడు తన స్వజనసముదాయముపై జాలిగొనుట వలనను మఱియు యుద్ధము పాపము అనిభావించుట వలనను అతడు యుద్ధము నుండి వైదొలగినట్లు వారు తలంపరు. భయగ్రస్తుడై తన ప్రాణములను రక్షించుకొనుటకై యుద్ధమున దిగుటకు వెనుకాడుచున్నట్లు వారు భావింతురు. ఈ పరిస్థితిలో యుద్ధము చేయకుండుట ఏ విధముగను ఉచితము కాదు.

**అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః ।**

**నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తవ | = నీయొక్క | నిందంతః | = నిందించుచు | వదిష్యంతి | = పలికెదరు |
| అహితాః | = శత్రువులు | బహూన్ | = అనేకములైన | తతః | = అంతకంటెను |
| తవ | = నీ | అవాచ్యవాదాన్ | = అనరానిమాటలను | దుఃఖతరమ్ | = అధికమైన దుఃఖము |
| సామర్థ్యమ్ | = సామర్థ్యమును | చ | = గూడ | కిమ్, ను | = ఇంక ఏముండును? |

నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచు నిన్ను గూర్చి పెక్కు అనరాని మాటలను అందురు. అంతకంటె విచారకరమైన విషయమేముండును? **(36)**

ప్రశ్న - లోకులెల్లరును నిన్ను నిందింతురని 34వ శ్లోకములో భగవానుడు పేర్కొనియే యుండెను. మఱల ఇచ్చట నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచు పెక్కు అనరాని మాటలను అందురు - అని పల్కుటలో ప్రత్యేకత యేమి?

సమా - 34వ శ్లోకమున చెప్పబడినది సామాన్య మానవులు కలకాలము అతనిని నిందించు విషయము - కాని ఇచట దుర్యోధనాది శత్రువులు అనరాని మాటలను అతని ముఖముమీదనే అందురని తెల్పుచున్నాడు. ఆ సామాన్యులు చేయునిందలు కేవలము మాన్యులైన వారికే మిక్కిలి దుఃఖకారకములు. అందఱికిని కాదు. కాని ముఖముపైననే శత్రువులు దుర్భాషలాడినచో వాటిని సామాన్యులు గూడ భరింప జాలరు. అందువలన అర్జునుని అపకీర్తి సమస్త జగత్తునందు వ్యాపించుటయేగాక ఇంతవఱకును అతనిని శూరునిగా వీరునిగా భావించినవారు గూడ, మిక్కిలి పిరికివానినిగా తలంతురు. అంతేగాదు అతనికి అహితము గోరువారును, అతనికి హాని కల్గినచో సంతోషపడువారును ఐన దుర్యోధనాదులు అతని బలపరాక్రమములను, యుద్ధకౌశలాదులను తూలనాడుచు, అతనిపై అసహ్యమైన వాగ్బాణములను ప్రయోగింతురు. అంతేగాదు వారు "అర్జునుడు ఎన్నడును వీరుడేగాడు. పుట్టుకతోనే అతడు నపుంసకుడు" అని గొంతులు చించుకొనుచు నిందింతురు. పైగా అతని గాండీవమును, పౌరుషమును గూడ కించ పఱచుదురు.

ప్రశ్న - "అంతకంటెను విచారకరమైన విషయము ఏముండును?" అను వాక్యముయొక్క అంతరార్థమేమి?

సమా - పైన తెల్పబడిన సంఘటనల పరిణామములు మిక్కిలి దుర్భరములని భగవానుడు తెల్పెను. అంతకంటెను విచారకరమైన విషయము ఏమియు ఉండదని భగవానుడు నుడివెను. ఇంతవరకును యుద్ధమును త్యజించుట సుఖప్రదమనియు యుద్ధము చేయుట దుఃఖకారకమనియు అర్జునుడు తలంచి యుండెను. అది అతని భ్రమ మాత్రమే. యుద్ధము నుండి వైదొలగుటవలననే అర్జునునకు అలవిగాని (భరింపరాని) దుఃఖము కలుగునని భగవానుడు స్పష్టపఱచెను.

*సంబంధము - యుద్ధము చేయకుండుటవలన కలుగు మహాహానిని సహేతుకముగా వివరించిన పిదప భగవానుడు ఇప్పుడు యుద్ధము చేయుటవలన రెండు విధములుగ లాభము కలుగునని తెల్పుచు యుద్ధసన్నద్ధుడవు కమ్మని అర్జునుని మఱల ఆదేశించుచున్నాడు-*

**హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।**
**తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| వా | = ఒకవేళ | మహీమ్ | = భూమండల రాజ్యమును | యుద్ధాయ | = యుద్ధము చేయుటకొఱకు |
| హతః | = (నీవు) చంపబడినచో | భోక్ష్యసే | = అనుభవించెదవు | కృతనిశ్చయః | = తిరుగులేని నిశ్చయము గలవాడవై |
| స్వర్గమ్ | = స్వర్గమును | తస్మాత్ | = అందువలన | ఉత్తిష్ఠ | = లెమ్ము (కటిబద్ధుడవు కమ్ము) |
| ప్రాప్స్యసి | = పొందగలవు | కౌంతేయ | = కుంతీకుమారా! (అర్జునా!) | | |
| వా | = లేక (అట్లుగాక) | | | | |
| జిత్వా | = (నీవు యుద్ధమున) జయించినచో | | | | |

**ఓ అర్జునా! రణరంగమున మరణించినచో నీకు వీరస్వర్గము ప్రాప్తించును. యుద్ధమున జయించినచో రాజ్యభోగములను అనుభవింపగలవు. కనుక కృతనిశ్చయుడవై యుద్ధమునకు లెమ్ము. (37)**

ప్రశ్న - ఈ శ్లోకముయొక్క అంతరార్థమేమి?

సమా - తాను యుద్ధము చేయుట మేలా? చేయకుండుట మేలా? చేసినచో విజయము తమకే దక్కునా? లేక శత్రుపక్షమునకు దక్కునా? అను ఊగిసలాటలోబడి అర్జునుడు తానెట్టి నిర్ణయమునకును రాలేకపోవుచున్నానని 6వ శ్లోకములో ప్రకటించియుండెను. దానికి సమాధానముగా యుద్ధము చేయుచుండగా ఒకవేళ మరణించినను లేక విజయము పొందినను రెండు విధములుగను మేలేయని తెల్పుచు అర్జునునకు యుద్ధవైశిష్ట్యమును భగవానుడు వివరించుచున్నాడు. యుద్ధములో శత్రువులు నెగ్గి, అర్జునుడు మరణించినను అది అతనికి మేలే. ఏలనన యుద్ధములో వీరమరణము పొందిన వారికి స్వర్గప్రాప్తి కల్గును. ఒకవేళ విజయము లభించినచో సుసంపన్నమైన రాజ్యభోగములు దక్కును. కావున ఏ దృష్టితో చూచినను యుద్ధము చేయుట అన్ని విధములుగను శ్రేయస్కరమే - కనుక యుద్ధమునకు నడుము బిగింపుమని భగవానుడు ఆదేశించెను.

*సంబంధము - "యుద్ధమునకు ఫలము రాజ్యసుఖప్రాప్తి లేక స్వర్గప్రాప్తి" - అని భగవానుడు పై శ్లోకమున తెల్పెను. కాని ఈ భూలోకరాజ్యాధికారమే గాదు ముల్లోకముల రాజ్యాధికారము లభించినను తాను కులనాశనమునకు ఒడిగట్టనని అర్జునుడు మునుపే తెల్పియుండెను. కనుక రాజ్యలాభములనుగాని, స్వర్గసుఖములనుగాని ఆశింపనివాడు యుద్ధమును ఎట్లు చేయగలడు? ఈ విషయమును గూర్చి రాబోవు శ్లోకమున భగవానుడు వివరించుచున్నాడు-*

**సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ 38 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| జయాజయౌ | = జయాప జయములను | కృత్వా | = భావించి | ఏవమ్ | = ఈ విధముగా (యుద్ధము చేయుటవలన) |
| లాభాలాభౌ | = లాభనష్టములను | తతః | = అనంతరము | పాపమ్ | = పాపమును |
| సుఖదుఃఖే | = సుఖదుఃఖములను | యుద్ధాయ | = యుద్ధము (చేయుట)కొఱకై | న, అవాప్స్యసి | = (నీవు) పొందనే పొందవు. |
| సమే | = సమానమైనవానివిగా | యుజ్యస్వ | = సన్నద్ధుడవుకమ్ము | | |

**జయాపజయములను, లాభనష్టములను, సుఖదుఃఖములను సమానముగా భావించి, యుద్ధసన్నద్ధుడవు కమ్ము. అప్పుడు నీకు పాపములు అంటనే అంటవు. (38)**

ప్రశ్న - జయాపజయములను, లాభనష్టములను, సుఖదుఃఖములను సమానముగా భావించుట యనగానేమి?

సమా - యుద్ధమునందు సంభవించు జయాప జయములు, లాభనష్టములు, సుఖదుఃఖములు మొదలగు వానియెడ ఏవిధమైన విచక్షణకును తావులేకుండుట - అనగా వాటి కారణమున మనస్సున రాగద్వేషములు, హర్షశోకాది వికారములు లేకుండుటనే వాటిని అన్నింటిని సమానముగా భావించుట యగును.

ప్రశ్న - "ఆ పిదప యుద్ధసన్నద్ధుడవుకమ్ము" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు రాజ్యలాభములనుగాని, స్వర్గ సుఖములనుగాని కోరకున్నను యుద్ధమున సంభవించు విషమభావములను, సర్వథా త్యజించి, యుద్ధము యొక్క ప్రతిపరిణామమునందును, సమభావము కలిగి, యుద్ధమును చేయవలెను. ఇట్టి యుద్ధమువలన శాశ్వతమైన పరమశాంతి లభించును.

ప్రశ్న - ఈ విధముగా యుద్ధము చేయుటవలన నీకు పాపములు అంటవు - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - యుద్ధమునందు స్వజనులను వధించుట మహాపాప కర్మయనియు, అట్టి యుద్ధమును తాను చేయుట ఉచితము కాదనియు అర్జునుడు పల్కియుండెను. (1/36, 39,45) దీనికి సమాధానముగ ఇప్పుడు భగవానుడు పైన తెల్పినరీతిగా (యుద్ధపరిణామములయందు సమభావమును ఉంచి) యుద్ధమొనర్చుటవలన అతనికి ఎట్టి పాపములును ఏ మాత్రమూ అంటవు - అనగా శుభాశుభకర్మబంధనరూప పాపములనుండియు సర్వథా ముక్తుడగునని తెల్పెను.

సంబంధము - ఇంతవఱకును భగవానుడు సాంఖ్యయోగ సిద్ధాంతమును అనుసరించియు, అట్లే క్షాత్ర ధర్మదృష్టితోడను యుద్ధముయొక్క ఔచిత్యమును విశదపఱచి, సమభావముతో యుద్ధమును చేయుమని అర్జునుని ఆజ్ఞాపించెను. ఇప్పుడు కర్మయోగదృష్టితో గూడ యుద్ధము చేయుటయే సముచితమని తెల్పుటకు కర్మయోగమునుగూర్చి భగవానుడు ప్రస్తావించుచున్నాడుద

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి ॥ 39 ॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పార్థ | = ఓ పార్థా! | అభిహితా | = తెల్పబడినది | యయా | = ఏ (ఆ) |
| ఏషా, బుద్ధిః | = ఈ సమత్వబుద్ధి | తు ఇమామ్ | = అయితే దీనిని | బుద్ధ్యా | = బుద్ధితో |
| తే | = నీకు | యోగే | = కర్మయోగ విషయమునను | యుక్తః | = కూడినవాడవై |
| సాంఖ్యే | = జ్ఞానయోగ విషయమునందు | శృణు | = వినుము | కర్మబంధమ్ | = కర్మబంధమును |
| | | | | ప్రహాస్యసి | = పారద్రోలగలవు. |

**ఓ పార్థా! ఈ (సమత్వ) బుద్ధిని ఇంతవఱకును జ్ఞానయోగదృష్టితో తెల్పితిని. ఇప్పుడు దానినే కర్మయోగదృక్పథముతో వివరించెదను, వినుము. దానిని ఆకళింపుచేసికొని, ఆచరించినచో కర్మబంధములనుండి నీవుముక్తుడవయ్యెదవు.** **(39)**

ప్రశ్న - ఇచట 'ఏషా' అను విశేషణముతో పాటు 'బుద్ధిః' అను పదము ఏ బుద్ధిని తెల్పును? "ఈ బుద్ధిని గూర్చి నీకు జ్ఞానయోగ దృష్టితో తెల్పుట జరిగినది" - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - పూర్వశ్లోకమున భగవానుడు అర్జునుని సమభావయుక్తుడవై యుద్ధము చేయుము - అని ప్రేరేపించెను. ఇచ్చట 'ఏషా' అను పదముతోపాటు 'బుద్ధిః' అను పదము ఆ "సమత్వబుద్ధిని' తెల్పును - ఏలనన 'ఏషా' అనుపదము అత్యంత సమీపవస్తువును గూర్చి తెల్పును. జ్ఞానయోగ సాధనద్వారా ఈ సమభావము ఏ విధముగా ప్రాప్తించును? ఆత్మయొక్క యథార్థస్వరూపమును వివేకముద్వారా గ్రహించి, జ్ఞానయోగియైనవాడు సమభావయుక్తుడై వర్ణాశ్రమోచిత విహితకర్మలను ఏవిధముగా చేయవలెను? - మొదలగు ఈ విషయము లన్నియును 11 నుండి 30వ శ్లోకము వఱకు వివరింపబడియుండెను. ఈ విషయమునే భగవానుడు 'ఏషా తేఽభిహితా సాంఖ్యే' అను వాక్యముద్వారా స్పష్టపఱచెను.

ప్రశ్న - 11వ శ్లోకమునుండి 30 వఱకు గల ఈ ప్రకరణమునందు ఈ సమత్వ భావవర్ణనము ఏ విధముగా చేయబడినది?

సమా - ఆత్మయొక్క యథార్థ స్వరూపమును ఎఱుంగకపోవుటవలననే మనుష్యునకు సమస్త పదార్థముల యందును విషమభావము కల్గును. ఆత్మయొక్క యథార్థ స్వరూపమును గ్రహించిన వాని దృష్టిలో ఆత్మ పరమాత్మల మధ్య భేదము ఉండదు. సచ్చిదానందఘనబ్రహ్మకు తప్ప మఱియే వస్తువునకును ఉనికియే ఉండదు - అప్పుడు అతనికి దేనియందును భేదబుద్ధి యేర్పడదు. కావున మరణ జీవనముల (చావుబ్రతుకుల) వలన కలుగు భ్రమజనితమైన విషమభావకారణమున ఏర్పడు శోకము సర్వథా అనుచితమని తెల్పుచు భగవానుడు 11వ శ్లోకమున అట్టి శోకము తగదని పేర్కొనెను. తరువాత ఆత్మయొక్క నిత్యత్వమును, అసంగత్వమును ప్రతిపాదించుచు ప్రాణుల మరణ జీవనములయందు (చావు, బ్రతుకుల మధ్య) ప్రతీతమగు భేదము అజ్ఞానజనితమనియు, ఆత్మ సమము, నిర్వికారము, నిత్యము అని తెలిసికొనిన ఆత్మజ్ఞానియైన ధీరపురుషుని యందు ఈ భేద బుద్ధి ఉండదనియు 12, 13 శ్లోకములలో తెల్పెను. తదనంతరము శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వముల ద్వారా భేదబుద్ధిని కలుగజేయు శబ్దాది సమస్త విషయసంయోగములు అనిత్యములనియు, వాటిని సహింపుమనియు అర్జునునకు తెలిపెను. అనగా

వాటిని సమానముగా భావింపుమని పేర్కొనెను. (2/14) సుఖదుఃఖాదులయందు సమభావముతోనుండు పురుషుని ప్రశంసించుచు, అతడు పరమాత్మప్రాప్తికి పాత్రుడని తెలిపెను. (2/15) పిమ్మట సత్యాసత్యవస్తు నిర్ణయము చేసి, యుద్ధమునకై అర్జునుని ప్రోత్సహించెను. (2/16, 17, 18) ఆత్మ చంపుననియు, చచ్చుననియు భావించువారిని అజ్ఞానులని తెల్పి, ఆత్మయొక్క నిర్వికారత్వమును, అకర్తృత్వమును, నిత్యత్వమును ప్రతిపాదించుచు, శరీరములు నశించినను ఆత్మ నశింపదను విషయమును సిద్ధాంతీకరించెను. కావున చావుబ్రతుకుల మధ్యగల విషమభావముతో ఏ ప్రాణి కొఱకైనను ఏ మాత్రమూ శోకింపదగదని అర్జునునకు తెల్పెను. (2/19 నుండి 30) ఈ విధముగా పైన చెప్పిన రీతిగా సత్యాసత్యపదార్థముల వివేచనల ద్వారా ఆత్మయొక్క యథార్థ స్వరూపమును తెలిసికొనుటవలన కలుగు సమత్వ భావమును వివరించెను.

ప్రశ్న - 'ఇమామ్' అను పదము ఏ బుద్ధిని తెల్పును? "ఇప్పుడు దీనిని (ఈ బుద్ధిని) గూర్చి యోగ దృక్పథముతో తెల్పెదను. వినుము" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - 'ఇమామ్' అను పదము గూడ పూర్వశ్లోకమున వర్ణింపబడిన సమత్వబుద్ధినే తెల్పును. ఆ సమభావమే కర్మయోగసాధనయందు ఏ విధముగా కల్గును? కర్మయోగి ఎట్టి సమభావమును కల్గి యుండవలెను? ఈ సమత్వము యొక్క ఫలమేమి? మొదలగు విషయములన్నియును రాబోవు శ్లోకమునుండి తెల్పబోవుచున్నాను. సావధానముగా వినుమని భగవానుడు అర్జునునితో పల్కెను.

ప్రశ్న - ఇచట 31 నుండి 37వ శ్లోకము వరకు తెల్పబడిన విషయమేమి?

సమా - అర్జునుడు క్షత్రియుడు. యుద్ధము చేయుట అతనికి స్వధర్మము - మఱియు సర్వథా లాభప్రదము - దానిని త్యజించుట అన్ని విధములుగను అనుచితము - అని ఈ శ్లోకములయందు (31 నుండి 37 వరకు) వివరించెను. యుద్ధము చేయుటయే కర్తవ్యమైనచో అది బంధహేతువు కాకుండ చేయుట యుక్తము అని 38వ శ్లోకమున తెల్పెను. కావున జ్ఞానయోగ కర్మయోగములు - అను రెండు సాధనమార్గములయందు సమత్వభావము కల్గియుండుట అవసరమని తెల్పెను. ఈ సమభావము దేహళీదీప న్యాయము వలె (కడపమీది దీపము వలె) రెండు విధములగు సాధనలతోడను సంబంధము కలిగియుండును - అని తెల్పెను.

ప్రశ్న - 'కర్మబంధము' అనగానేమి? ఉపర్యుక్త సమబుద్ధి ద్వారా దానిని తొలగించుకొనుట యనగానేమి?

సమా - జన్మజన్మాంతరములలో చేయబడిన శుభాశుభకర్మల సంస్కారముల ప్రభావమున జీవుడు బంధములలో చిక్కుపడును. ఈ మానవ శరీరము నందు మఱల అహంకార మమకారములు, ఆసక్తులు, కోరికలు మొదలగు వానితో నూతన కర్మలను ఆచరించుచు ఇంకనూ బలవత్తరముగా బద్ధుడగును. కనుక ఈ జీవాత్మను పదే పదే నానావిధములైన యోనులలో పడవేసి, జన్మ మృత్యు రూప సంసార చక్రమునందు పరిభ్రమించుటకు హేతువులైన జన్మజన్మాంతరములయందు చేయబడిన శుభాశుభ కర్మల సంచిత సంస్కార సముదాయమునే కర్మబంధము అను పదము తెల్పును. కర్మయోగ విధానము ద్వారా సమస్త కర్మలయందు మమతాసక్తులను ఫలేచ్ఛలను త్యజింపవలెను - సిద్ధి అసిద్ధుల యెడ సమత్వబుద్ధిని కలిగియుండవలెను - అనగా రాగద్వేష హర్షశోకాది వికారములకు లోనుగాకుండ ఉండవలెను. - తత్ఫలితముగా జన్మజన్మాంతరములలో చేయబడిన, ప్రస్తుత జీవితములో చేయబడుచున్న సమస్త కర్మలకు ఫలములను ఉత్పన్నము చేయు శక్తి నశించును. వేయించిన బీజము (గింజ)లకు వలె కర్మలకు అంకురించు శక్తి నశించును.సమబుద్ధి ద్వారా కర్మబంధములను సర్వథా (పూర్తిగా) రూపుమాపుట యనగానిదియే.

సంబంధము - ఈ విధముగా కర్మయోగ విషయమును ప్రస్తావించి ఇప్పుడు దాని మహాత్మ్య రహస్యములను తెల్పుచున్నాడు-

**నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇహ | = ఈ కర్మయోగము నందు | | విపరీత ఫలరూప దోషముగూడ | స్వల్పమ్, అపి | = ఏ కొంచెము సాధనయైనను |
| అభిక్రమనాశః | = ఆరంభ (బీజ) నాశము | న, విద్యతే | = (ఏ మాత్రము) ఉండదు | మహతః భయాత్ | = జన్మమృత్యు రూపమైన గొప్ప భయమునుండి |
| న, అస్తి | = ఉండదు | అస్య | = ఈ (కర్మయోగ రూపమైన) | | |
| ప్రత్యవాయః | = (మఱియు దీనికి) | ధర్మస్య | = ధర్మముయొక్క | త్రాయతే | = కాపాడును |

**ఈ (నిష్కామ) కర్మయోగమును ప్రారంభించినచో దీనికి ఎన్నటికిని బీజనాశము లేదు. దీనికి విపరీత ఫలితములే యుండవు. పైగా ఈ (నిష్కామ) కర్మయోగమును ఏ కొంచెము సాధనచేసినను అది జన్మమృత్యురూప మహాభయము నుండి కాపాడును. (40)**

ప్రశ్న - ఈ కర్మయోగసాధనకు ఎన్నటికిని బీజనాశము లేదు. అని యనుటలోని అంతర్యమేమి?

సమా - మనుష్యుడు, తన పొలము (క్షేత్రము) నందు గింజలు చల్లి వానిని రక్షింపకున్నను, వాటిని నీటితో తడుపకున్నను అవి నష్టమగును కాని, కర్మయోగ సాధనను ఆరంభించిన మానవుడు దానిని పూర్తిచేయకముందే మధ్యలో వదిలివేసిన (త్యజించిన)చో ఆ సాధన వృథాకాదు. ఈ సంస్కారములు (సాధనఫలములు) సాధకుని అంతః కరణము నందు స్థిరమై మఱొక జన్మయందు మఱల అతనిని సాధనలో నిమగ్నునిగా చేయును. (6/43, 44) కావున ఈ కర్మయోగ సాధనకు ఎన్నడును బీజనాశము లేదు. అందువలననే దీనిని భగవానుడు 'సత్' అని పేర్కొనెను. (17/27)

ప్రశ్న - దీనికి (ఈ కర్మయోగసాధనకు) విపరీత ఫలితములునూ ఉండవు - అనియనుటలో అంతర్యమేమి?

సమా - సకామకర్మలకు మంచిచెడు ఫలములుండును. ఈ కర్మయోగమునందు ఫలేచ్ఛ లేకుండుటచే దానికి విపరీతఫలములేమాత్రమూ ఉండవు. సకామభావముతో దేవపితృమనుష్యాది సేవలయందు ఏకారణము వలననైనను లోపము జరిగినచో వారికి అసంతృప్తి కలుగుటవలన సాధకునకు హానియు కలుగవచ్చును. కాని స్వార్థరహితమైన యజ్ఞదాన తపస్స్వాది కర్మలను ఆచరించుటయందు లోపము జరిగినను దానికి విపరీత ఫలరూపమైన హాని జరుగదు. రోగనివారణకై సేవింపబడు ఔషధము అనుకూలము కానిచో అది రోగమును నివారింపకపోగా దానిని ఎక్కువ చేయువచ్చును. కాని ఈ కర్మయోగ సాధనకు అట్టి విపరీత పరిణామము ఉండదు. (6/40) ఆ సాధన పూర్తి కాకుండుటవలన ఈ జన్మయందు సాధకునకు అది పరమపదప్రాప్తి కల్గింపకున్నను అతనికి పూర్వకృతపాపముల ఫలస్వరూపములును, ఈ జన్మయందు సంభవించిన అనుషంగిక హింసాదుల ఫలస్వరూపములును, ఏవ తిర్యగ్యోనులలో జన్మించుటగాని, లేక నరకయాతనల ప్రాప్తిగాని కలుగదు. పూర్వకృత శుభకర్మల ఫలరూపములైన ఇహపరలోక సుఖానుభవములను పొందియే తీరును. అతడు పుణ్యాత్ములు చేరు ఉత్తమలోకములను చేరి, అచట పెక్కు సంవత్సరములు నివసించి, మఱల పవిత్రమైన శ్రీమంతుల ఇండ్లలో జన్మించును. లేదా యోగులవంశములో జన్మించి, పూర్వాభ్యాస ప్రభావమున మఱల సాధనను కొనసాగించును. (6/41 నుండి 44)

ప్రశ్న - "ప్రత్యవాయో న విద్యతే" - అనువాక్యమునకు అర్థము కర్మయోగమునందు విఘ్నము, బాధ, ఆటంకములు కలుగవు అని పేర్కొనినచో దోషమేమి?

సమా - పూర్వజన్మల పాపములకారణమున విషయ భోగములయందు ఆసక్తుడగుట వలనను, ప్రమాద విషయలోలురైన నాస్తికులసాంగత్యము వలనను సాధనయందు విఘ్నములు, ఆటంకములు కలుగవచ్చును. కాని నిష్కామకర్మ ఎన్నడును చెడుఫలములను ఇయ్యదు- కావున ఈ వాక్యమునకు విపరీత ఫలములు ఉండవు అని అర్థము చెప్పుటయే సమంజసము.

ప్రశ్న - 'అస్య' అను విశేషణముతోపాటు 'ధర్మస్య' అను పదము దేనిని సూచించును?

సమా - పూర్వశ్లోకమునందు 'యోగము' అను పేరుతో వర్ణితమైన పదము కర్మయోగమునే తెల్పును.

ప్రశ్న - కర్మయోగ మనగానేమి?

సమా - శాస్త్రవిహితమైన ఉత్తమ క్రియనే 'కర్మ' యందురు. సమభావమును యోగమందురు. (2/48) కనుక మమతాసక్తులు, కామక్రోధములు, లోభమోహములు మొదలగునవి లేకుండ సమభావముతో తమ వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులను అనుసరించి, శాస్త్ర విహిత కర్తవ్యకర్మలను అనుసరించుటనే కర్మయోగమందురు. దీననే సమత్వయోగము, బుద్ధియోగము, తదర్థకర్మ, మదర్థకర్మ, మత్కర్మ అనియు అందురు.

ప్రశ్న - ఈ కర్మయోగమును ఏ కొంచెము సాధన చేసినను అది మహాభయము నుండి రక్షించును - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ కర్మయోగసాధన సంపూర్ణస్థితికి చేరినప్పుడు అది తత్క్షణమే సాధకునకు పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తిని కలిగించును. మనుష్యుడు దానిని కొలదిగా సాధనచేసినను (అనగా సమత్వము నందు నిశ్చల స్థితిని పొంది, ఆ సమభావముతోడనే అంత్యకాలము వరకును ఏకొంచెముగా కర్తవ్య కర్మలను చేసినను) తత్క్షణమే అతనికి నిర్వాణ బ్రహ్మప్రాప్తి కల్గును. (2/72) కొలదిగా ఈ కర్మయోగమును ఆచరించుట వలననే ఇంతటి ఫలము లభించుచున్నప్పుడు ఇంక సంపూర్ణ సాధన మహత్త్వమును గూర్చి చెప్పనేల? అట్లుకానిచో ఈ సాధన జన్మాంతరము నందు సాధకుని మఱల సాధనయందు ప్రవర్తింపజేసి, పరమగతిని ప్రాప్తింపజేయును. (6/41 నుండి 45 వఱకు) ఈ విధముగా అవకాశము ఉన్నంతలో తప్పక అతడు ఉద్ధరింపబడును. సకామభావముతో మహాయజ్ఞములు, దానములు, తపశ్చర్యలు, తీర్థయాత్రలు, వ్రతములు, ఉపవాసములు మొదలగు కర్మలు వేలకొలది సంవత్సరములు చేసినను, అవి వానిని సంసారమునుండి ఉద్ధరింపజాలవు. శాస్త్ర విహితమైన భిక్షాటనము, యుద్ధము, వ్యవసాయము, వాణిజ్యము సేవలు శిల్పాదికములైన కర్మలు గూడ సమభావయుక్తములగుటచేత అవి తత్క్షణమే అతనిని సంసారమునుండి ఉద్ధరించును. ఏలనన కల్యాణ సాధనయందు కర్మకంటెను భావమే ప్రధానమైనది.

ప్రశ్న - ఈ కర్మయోగముయొక్క కొద్దిపాటి - సాధనయు పూర్తియైన పిమ్మటనే మహాభయమునుండి సాధకుని రక్షించినచో ఈ కొద్దిపాటి కర్మసాధన మహత్త్వమేమి?

సమా - నిష్కామభావఫలితము సంసారమునుండి సాధకుని ఉద్ధరించుటయే. కావున ఈ ఫలితము పూర్తిగా సిద్ధించువఱకును అది నష్టమూ కాదు, విపరీతఫలమూ కలుగదు. చివరకు సాధకుని సంపూర్ణ నిష్కామభావయుక్తునిగా చేసి, అతనిని ఉద్ధరించును. ఇదియే దాని మహత్త్వము.

ప్రశ్న - ఈ కర్మయోగ సాధన ఏ కొంచెము ఆచరించినను అది మహాభయమునుండి సాధకుని రక్షించుచున్నప్పుడు, ఇంక సంపూర్ణసాధన చేయువలసిన పనియేమి?

సమా - స్వల్పసాధనయు సాధకుని రక్షించుననుటలో సందేహము లేదు. కాని దానికి ఎంతకాలము పట్టునను విషయమును చెప్పజాలము. ఈ జన్మలో గాని లేక జన్మాంతరమున గాని అతడు ఉద్ధరింపబడవచ్చును. ఏలనన ఈ స్వల్పసాధన క్రమముగా వృద్ధిచెంది సంపూర్ణ స్థితికి చేరినప్పుడే అతనిని ఉద్ధరించును. కావున శీఘ్రముగా శ్రేయస్సును కోరుకొనువారు తత్పరత, ఉత్సాహములతో సంపూర్ణముగా సమత్వస్థితిని పొందుటకు ప్రయత్నింపవలెను.

ప్రశ్న - మహాభయమనగానేమి? దానినుండి రక్షించుట యనగానేమి?

సమా - జీవులకు అన్నింటి కంటెను అధికమైనది మృత్యుభయము. అనంతకాలము వఱకును 'పునఃపునః' పుట్టుచు గిట్టుచు నుండుటయే మహాభయము. ఈ జనన మరణ రూపమహాభయమునే భగవానుడు రాబోవు శ్లోకములలో మృత్యుసంసారసాగరమని పేర్కొనెను - (12/7) సముద్రమునందు అనంతమైన అలలు ఉన్నట్లే సంసార సముద్రమునందును జన్మమృత్యు రూప తరంగములు అనంతముగా లేచుచు పడుచు ఉండును. సముద్ర తరంగములను లెక్కింపగలమేమోగాని, పరమాత్మతత్త్వము యొక్క యథార్థజ్ఞానము కలుగనంతవరకు ఈ జనన మరణరూప తరంగములను లెక్కింపలేము. ఇట్టి మృత్యురూప సంసార సముద్రమునుండి తరింపజేయుట అనగా శాశ్వతముగా జననమరణ చక్రమునుండి తప్పించి, జగత్తునకు అతీతుడైన సచ్చిదానందఘనబ్రహ్మప్రాప్తిని కల్గించుటయే. అదియే మహాభయమునుండి రక్షించుట యగును.

సంబంధము - ఈ విధముగా కర్మయోగ మహత్త్వమును దెలిపి, ఇప్పుడు దాని ఆచరణ విధానమును తెల్పబోవుచున్నాడు. దానికి ముందుగా పరమావశ్యకమైన నిశ్చయాత్మకమైన స్థిరమైన సమబుద్ధిని గూర్చి తెల్పుచున్నాడు. అట్లే కర్మయోగమునకు అంతరాయములను కల్గించు సకామ బుద్ధులనుగూర్చియు వివరించుచున్నాడు. ఇట్లు రెండు విధములైన బుద్ధులుగల సాధకుల మధ్యగల భేదములను వివరించుచున్నాడు-

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన ।**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ 41 ॥**

కురునందన = ఓ అర్జునా!
ఇహ = ఈ (నిష్కామ) కర్మయోగమునందు
వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మకమైన
బుద్ధిః = బుద్ధి
ఏకా(భవతి) = ఒకటిగా ఉండును
అవ్యవసాయినామ్ = (కాని) స్థిరబుద్ధిలేని వివేకహీనులైన సకామ మనుష్యులయొక్క
బుద్ధయః = బుద్ధులు
హి = నిశ్చయముగా
బహుశాఖాః = అనేక భేదములు గలిగినవై (చంచలములై)
చ = మఱియు
అనంతాః = అంతులేని (కోరికలుగల) వై (ఉండును).

**ఓ అర్జునా! ఈ (నిష్కామ) కర్మయోగమునందు నిశ్చయాత్మకబుద్ధి ఒకటియే యుండును. కాని భోగాసక్తులైన వివేకహీనుల బుద్ధులు చంచలములై, ఒకదారీ తెన్నూ లేక కోరికలవెంట నలువైపులా పరుగులు తీయుచూ అనంతములుగా నుండును. (41)**

ప్రశ్న - 'వ్యవసాయాత్మికా' అను విశేషణముతోపాటు 'బుద్ధిః' అను పదము ఇచట ఏ బుద్ధిని తెలుపును - "అదియొక్కటియే" అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 39వ శ్లోకమునందు సమత్వబుద్ధి యొక్క ఫలము 'కర్మబంధమునుండి ముక్తుడగుట' అని పేర్కొనబడెను. అది నిశ్చలమై స్థిరమై ఉండవలెను. అట్టి సమభావముతో గూడిన నిశ్చలమైన బుద్ధినే ఇచ్చట 'వ్యవసాయాత్మికా బుద్ధిః' అను పదములు తెల్పుచున్నవి. ఈ ప్రకరణమునందు పలుచోట్ల 'బుద్ధిః' అను పదము ఈ అర్థములోనే ప్రయోగింపబడినది. ఇందు కేవలము సచ్చిదానంద పరమాత్మ యొక్కడే నిశ్చలముగా నిలిచియుండును. కావున ఆ బుద్ధి ఒక్కటియే అని పేర్కొనబడినది. వివిధ విషయసుఖములను గూర్చిన, వాటి ప్రాప్తికై ఉపాయములను గూర్చిన ఆలోచనలకేమాత్రము ఈ స్థిరబుద్ధియందు తావుండదు. దీనినే స్థిరబుద్ధి, సమబుద్ధి అనియు అందురు.

ప్రశ్న - 'అవ్యవసాయినాం' అనుపదము ఎట్టి వారిని సూచించును? వారి బుద్ధులు వివిధములు, అనంతములు - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - పైన పేర్కొనబడిన నిశ్చయాత్మక బుద్ధిలేని వారు అజ్ఞానజనిత విషమభావముల కారణమున మోహితమైన అంతఃకరణము గలవారు ఐనట్టి వివేకహీనులు భోగాసక్తులు ఐన మనుష్యులను 'అవ్యవసాయినాం' అను పదము తెల్పును. వారి ఆలోచనలు వివిధములు, అనంతములు - సకామభావముతో యజ్ఞాదికర్మలను ఆచరించువారి ఉద్దేశ్యములు వేర్వేఱుగా ఉండును. ఒకరు ఒక భోగప్రాప్తికై ఒక విధమగు కర్మను ఆచరించినచో, మఱొకరు అందుకు భిన్నమైన ఇతరభోగములకై మఱియొక రీతిగా కర్మల నాచరించుచుందురు. ఇంతేగాక ఒకే లక్ష్యముతో ఆచరింపబడు కర్మలయందును అనేక భోగేచ్ఛలు చేరియుండును. సమస్త పదార్థముల యందును సంఘటనలయందును భావవైరుధ్యములు ఉండును. ఒకే పదార్థమునందలి ఒక అంశము ప్రియముగను, మఱియొక అంశము అప్రియముగను తోచును. ఈ విధముగ వారు ప్రపంచమునందలి సమస్త పదార్థములయందును, వ్యక్తులయందును, సంఘటనల యందును, అనేక విధములైన బుద్ధులు కలిగియుందురు - వాటి భేదములనంతములు.

*సంబంధము - ఈ విధముగ కర్మయోగిద్వైనవాడు అవశ్యముగా కలిగి యుండవలసిన నిశ్చయాత్మక బుద్ధిని గూర్చి తెల్పెను. ఇప్పుడు త్యజింపవలసిన సకామబుద్ధులను గూర్చియు సకామబుద్ధులు గల మనుష్యుల స్వభావ సిద్ధాంత ఆచారవ్యవహారములను గూర్చియు తెల్పుచున్నాడు-*

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥ 42 ॥**

**కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।**
**క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43 ॥**

**భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ 44 ॥**

పార్థ = ఓ పార్థా!
వేదవాదరతాః = వేదములలోని ఫలశ్రుతి యందు ప్రీతిగలవారు
అన్యత్ = అందు చెప్పబడిన స్వర్గాదుల కంటెను అధికమైన ఫలము వేఱొకటి
న, అస్తి, ఇతి వాదినః = లేదని వాదించు వారును
కామాత్మానః = కోరికలతోనిండిన మనస్సులు గలవారును
స్వర్గపరాః = స్వర్గమే పరమ ప్రాప్యముమువారును అగు
అవిపశ్చితః = అవివేకులు
జన్మకర్మ ఫలప్రదామ్ = జన్మరూప కర్మఫలమును ఇచ్చునట్టిదియు
భోగైశ్వర్య గతిం ప్రతి = భోగైశ్వర్యములను సంపాదించుటకు
క్రియావిశేష బహులామ్ = వివిధ కార్య కలాపములతో కూడినదియు
పుష్పితామ్ = ఫలప్రదముగాని కేవలముచూచుటకు మాత్రము రమ్యముగా నుండునదియుఅగు
యామ్, ఇమామ్ = ఏ ఈ
వాచమ్ = వాక్యమును
ప్రవదంతి = విశేషముగా చెప్పుచున్నారో
తయా = దానిచేత
అపహృత చేతసామ్ = అపహరింపబడిన మనస్సులు గలవారును
భోగైశ్వర్య ప్రసక్తానామ్ = భోగైశ్వర్యముల యందు మిక్కిలి ఆశగలవారికి
వ్యవసాయాత్మికా బుద్ధిః = నిశ్చయమైన బుద్ధి (ఏకాగ్రబుద్ధి)
సమాధౌ = దైవధ్యానమునందు
న విధీయతే = కలుగదు (నిలువదు)

ఓ అర్జునా! వివేకహీనులైన జనులు ప్రాపంచికభోగములయందే తలమున్కలై యుందురు. వారు కర్మఫలములను ప్రశంసించు వేదవాక్యములయొక్క బాహ్యార్థములయందే ప్రీతివహింతురు. వాటి అంతరార్థములజోలికేపోరు. స్వర్గమునకు మించినదేదియును లేదనియు, అదియే పరమప్రాప్యమనియు వారు భావింతురు. క్షణికములైన ప్రాపంచిక భోగైశ్వర్యముల యందలి ఆసక్తితో వివిధ సకామ కర్మలను ప్రోత్సహించుచు ప్రీతిని గూర్చు ఇచ్చకపుపల్కులు పలికెదరు. ఆ ఇచ్చకపుమాటల ఉచ్చులలోబడిన భోగైశ్వర్యాసక్తులైన అజ్ఞానులబుద్ధులు భగవంతుడు లక్ష్యముగాగల సమాధియందు స్థిరముగా ఉండవు. **(42-44)**

ప్రశ్న - 'కామాత్మానః' అనగానేమి?

సమా - ఇచట కామశబ్దము భోగములను తెల్పును. ఆ భోగములయందు అత్యంతాసక్తులై, వాటినే చింతించుచు తన్మయులై యుండువారు తమ మానవత్వమునే మఱచి పోవుదురు. అట్టి భోగాసక్తులైన మనుష్యులనే 'కామాత్మానః' అను పదము తెల్పును.

ప్రశ్న - 'వేదవాదరతాః' అనగానేమి?

సమా - ఇహ పరలోకముల భోగప్రాప్తికై అనేక విధములైన వేర్వేఱు కామ్యకర్మల విధానములు, వాటిఫలములు వేదముల యందు తెల్పబడినవి. వేదములలో ప్రస్తావింపబడిన ఈ కామ్యకర్మల యందు వాటిఫలరూపములైన భోగముల యందు అత్యంతాసక్తి గలవారిని 'వేదవాదరతాః' అను పదము సూచించును. వేదములయందు సంసారము నెడ వైరాగ్యమును కల్గించునట్టియు పరమాత్మయొక్క యథార్థ స్వరూపమును వర్ణించునట్టియు వచనములుగలవు. వాటియందు ఆసక్తిగల మనుష్యులను గూర్చి 'వేదవాదరతాః' అను ప్రయోగము తెలుపదు - ఏలనన అట్టి వాక్యములయందు ప్రీతి గలిగి వాటిని చక్కగా గ్రహించిన వారు "స్వర్గప్రాప్తియే పరమపురుషార్థము - దానిని మించినదేదియు లేదు." - అని భావింపరు. కనుక సమస్త వేదములు వాస్తవముగా పరమాత్మ స్వరూపమునే ప్రతిపాదించుచున్నవనియు, వేదములద్వారా తెలిసికొన దగిన వాడు పరమేశ్వరుడేయనియు (15/15) ఈ రహస్యములను ఎఱుగని వారినే 'వేదవాదరతాః' అను పదము సూచించును. ఈ రహస్యమును ఎఱుగని కారణమున వారు వేదోక్తములైన సకామ కర్మలయందును, వాటి ఫలములయందును ఆసక్తులైయుందురు.

ప్రశ్న - 'స్వర్గపరాః' అనగానేమి?

సమా - స్వర్గమే పరమప్రాప్యమనియు, స్వర్గమును మించిన ప్రాప్య వస్తువు ఏదియు లేదనియు తలంచుచు పరమాత్మప్రాప్తి సాధనకు విముఖులైన వారిని సూచించునదియే 'స్వర్గపరాః' అను పదము.

ప్రశ్న - 'నాన్యదస్తీతి వాదినః' అను విశేషణము యొక్క అంతరార్థమేమి?

సమా - వివేకహీనులైన వారు భోగముల యందే సదానిమగ్నులై యుందురు. వారిదృష్టిలో స్త్రీ పుత్రాదులు, ధనము, గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు మొదలగు ఇహలోక సుఖములు, స్వర్గాది పరలోకసుఖముల కంటె మించిన మోక్షాదులేవియు లేవనియు భావించుచు, అట్టి భోగప్రాప్తికే అఱ్ఱులు చాచుచుందురు. స్వర్గప్రాప్తియే వారికి పరమధ్యేయము - వేదవచనములను గూడ ఈ విధముగనే అర్థము చేసికొందురు- కావున వారు ఈ సిద్ధాంతములనే వర్ణించుచు, ప్రచారము చేయుచుందురు - అట్టి వారిని గూర్చియే 'నాన్యదస్తీతి వాదినః' అను విశేషణము తెలుపును.

ప్రశ్న - ఇట్టి మనుష్యులను 'అవిపశ్చితః' అనగా వివేకహీనులు అని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - సత్యాసత్య వస్తువివేచనము చేసి, తమ తమ కర్తవ్యములను నిశ్చయించుకొనువారు ఈ విధముగా భోగములలో చిక్కుకొనరు. కావున వివేకముతో మనుష్యులు తమ తమ కర్తవ్యములను నిశ్చయించుకొనవలెను. వివేకహీనులై భోగాసక్తులైనవారు కర్తవ్యములను నిశ్చయించుకొనలేరు. 'అవిపశ్చితః' అను పదము అట్టి వారినే తెలుపును.

ప్రశ్న - 'వాచమ్' అను పదముతో పాటు 'ఇమామ్', 'యామ్', 'పుష్పితామ్' అను విశేషణములను ప్రయోగించుట లోని ఆంతర్యమేమి?

సమా - తమకు తామే 'పండితులము' అని భావించువారు "స్వర్గసుఖములను మించినది ఏదియు లేదని" తలంతురు. దానికి ప్రమాణముగా తత్సంబంధములైన వేదవాక్యములను ఉదాహరింతురు - అట్టి వారిని గూర్చియే 'ఇమామ్', 'యామ్' అను విశేషణములు ప్రయుక్తములైనవి. అట్టివారి ఉపదేశములు విన్నవారిచిత్తములను అపహరించును, భ్రమింపజేయును. వారి పల్కులయందు వాస్తవమైన విశేషమహత్త్వము ఉండదు - అవి నశ్వరములైన భోగములను, నామమాత్రములైన క్షణిక సుఖములనే వర్ణించును. ఐనను అవి నిర్గంధకుసుమములవలె పైకి రమణీయముగా అందముగా కన్పట్టును. అందువలన సాంసారికులు (భోగాసక్తులు) వాటి ప్రలోభములలో చిక్కుపడుదురు. అట్టి వచనములనే 'పుష్పితామ్' అను విశేషణము తెలియజేయును.

ప్రశ్న - ఇచ్చట 'వ్యవసాయాత్మికా' అను విశేషణముతోపాటు 'బుద్ధిః' అనుపదము దేనిని సూచించును? 'సమాధి' అను పదమునకు 'పరమాత్మ'

అను అర్థము ఎట్లు చెప్పబడినది? మఱియు ఆపైన తెల్పబడిన రీతిగా ఆకర్షణీయమైన వాక్కులద్వారా భ్రమకులోనైన చిత్తములుగలవారు భోగైశ్వర్యములయందు మిక్కిలి ఆసక్తి గలిగియుందురు. వారికి పరమాత్మయందు నిశ్చయాత్మకబుద్ధి యుండదు - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 41వ శ్లోకమున వర్ణింపబడిన నిశ్చయాత్మిక బుద్ధినే ఇచట 'వ్యవసాయాత్మికా బుద్ధిః' అను పదము తెల్పును- "సమాధీయతే అస్మిన్ బుద్ధిః ఇతి సమాధిః" అను వ్యుత్పత్తిని అనుసరించి, ఇచట 'సమాధి' అను పదమునకు 'పరమాత్మ' అను అర్థము చెప్పబడినది. భోగైశ్వర్యములయందు ఆసక్తులైనవారి చిత్తములు అతి చంచలములగును - వారు మిక్కిలి స్వార్థపరులగుదురు. కావున వారికి పరమాత్మయందు నిశ్చలమైన స్థిరమైనబుద్ధి కలుగదు.

సంబంధము - భోగైశ్వర్యములయందు ఆసక్తులైన సకామపురుషుల బుద్ధి నిశ్చయాత్మకముగా ఉండదని తెల్పిన పిమ్మట కర్మయోగమును గూర్చి ఉపదేశించుటకు ముందుగా భోగైశ్వర్యములయందు ఆసక్తుడవు కాకుండ సమభావసంపన్నుడవై ఉండుమని భగవానుడు అర్జునుని ఆదేశించెను-

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45 ॥

అర్జున = ఓ అర్జునా!
వేదాః = వేదములు
త్రైగుణ్య విషయాః = (పైన తెలుపబడినట్లు) త్రిగుణకార్య రూపములైన భోగములను, వాటి సాధనలను ప్రతిపాదించును
నిస్త్రైగుణ్యః = (కావున నీవు) ఆ భోగముల యందును, వాటి సాధనల యందును ఆసక్తిలేనివాడవై
నిర్ద్వంద్వః = హర్షశోకాది ద్వంద్వములు లేనివాడవై
నిత్యసత్త్వస్థః = నిత్యుడైన పరమాత్మ యందే స్థితుడవై
నిర్యోగక్షేమః = యోగక్షేమములను ఆశింపక
ఆత్మవాన్ = అంతఃకరణమును స్వాధీనమొనర్చు కొనినవాడవు
భవ = అగుము

**ఓ అర్జునా! వేదములు సత్త్వరజస్తమోగుణములకార్యరూపములైన సమస్త భోగములను గూర్చియు, వాటిని పొందుటకై చేయవలసిన సాధనలను గూర్చియు ప్రతిపాదించును. నీవు ఆ భోగములయెడలను వాటి సాధనలయందును ఆసక్తిని త్యజింపుము. హర్షశోకాదిద్వంద్వములకు అతీతుడవు కమ్ము. నిత్యుడైన పరమాత్మయందే స్థితుడవు కమ్ము. నీ యోగక్షేమములకొఱకై ఆరాటపడవద్దు. అంతఃకరణమును వశమునందుంచుకొనుము. (45)**

ప్రశ్న - 'త్రైగుణ్యవిషయాః' అనగానేమి? వేదములను 'త్రైగుణ్య విషయములు' అని పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - "సత్త్వరజస్తమములు" అను మూడు గుణముల కార్యములను 'త్రైగుణ్యములు' అని యందురు. కావున సమస్త భోగైశ్వర్యమయ పదార్థములను, వాటి ప్రాప్తికై ఉపాయములైన (సాధనములైన) సమస్త కర్మలను సూచించునదియే 'త్రైగుణ్య' శబ్దము - వాటియొక్క అంగప్రత్యంగ సహిత వర్ణనము కలిగి యున్న వాటిని 'త్రైగుణ్య విషయాః' అనియందురు. వేదములయందు కర్మకాండ వర్ణనము అధికముగా ఉండుట వలన వాటిని త్రైగుణ్య విషయములని తెల్పుట జరిగినది.

ప్రశ్న - 'నిస్త్రైగుణ్యుడు' అగుట యనగానేమి?

సమా - త్రిగుణములయొక్క కార్యరూపములైన ఇహపరలోక భోగములన్నింటియందును తత్ప్రాప్తికై సాధనములైన సమస్త కర్మల యందును మమతాసక్తులను,

కోరికలను సర్వథా త్యజించుటనే 'నిస్త్రైగుణ్యుడు-అగుట' అనియుందురు- సమస్త కర్మల ఆచరణమును త్యజించుట నిస్త్రైగుణ్యుడగుట కాదు. ఏలననగా సమస్త కర్మల ఆచరణమును త్యజించుట, అట్లే విషయములను త్యజించుట సాధ్యముకాదు. ఈ శరీరముగూడ త్రిగుణముల కార్యమే. దీనిని త్యజించుటకు వలనుకాదు. కావున ఈ శరీరమునందును, దాని ద్వారా ఆచరింపబడు కర్మల యందును, వాటి ఫలరూపములైన సమస్తభోగముల యందును అహంకారమమకారములు, ఆసక్తులు, కోరికలు లేకుండుటనే 'నిస్త్రైగుణ్యుడగుట' అని యుందురు - అనగా త్రిగుణకార్యములనుండి దూరమగుట.

ప్రశ్న - ద్వంద్వములనగానేమి? ద్వంద్వరహితుడగుట యనగానేమి?

సమా - సుఖదుఃఖములు, లాభనష్టములు, కీర్త్యపకీర్తులు, మానావమానములు, అనుకూల ప్రతికూలములు మొదలగు పరస్పర విరుద్ధములైన జంటలనే 'ద్వంద్వములు' అనియుందురు. వీటి సంయోగవియోగములయందు సర్వదా సమముగా ఉండుటయు, వాటి కారణమున విచలితుడు లేక మోహితుడు కాకుండుట అనగా హర్షశోకరాగద్వేషాదులు లేకుండుటయే ద్వంద్వరహితుడగుట యగును.

ప్రశ్న - 'నిత్యసత్త్వము' - అనగానేమి? దానియందు స్థితుడగుట యనగానేమి?

సమా - సచ్చిదానందఘనపరమాత్మయే నిత్య సత్త్వస్వరూపుడైన సత్యము. కనుక నిత్యుడు, శాశ్వతుడు, సర్వజ్ఞుడు ఐన ఆ పరమేశ్వరుని స్వరూపమును నిత్యము, నిరంతరము చింతన చేయుచు, అతనియందు నిశ్చల భావముతో స్థితుడై యుండుటనే నిత్య సత్త్వమునందు స్థితుడగుట యగును.

ప్రశ్న - 'నిత్యసత్త్వస్థః' అను పదమునకు నిరంతరము సత్త్వగుణమునందు స్థితుడగుట - అను అర్థమును చెప్పిన దోషమేమి?

సమా - ఈ యర్థమునూ చెప్పవచ్చును - ఇందు దోషమేమియు లేదు - కాని పైన తెల్పబడిన యర్థమునందు శ్రేష్ఠమైన భావము గలదు. ఏలనన కర్మయోగముయొక్క అంతిమఫలము సమస్త గుణములకు అతీతుడైన పరమాత్మను పొందుట యని చెప్పబడినది.

ప్రశ్న - యోగక్షేమమనగానేమి? అర్జునుని నిర్యోగక్షేముడవు కమ్మని అనుటలోని అంతర్యమేమి?

సమా - అప్రాప్తవస్తుప్రాప్తిని 'యోగము' అని యుందురు. ప్రాప్తించిన వస్తువును రక్షించుటను 'క్షేమము' అనియుందురు. సాంసారిక భోగేచ్ఛలను త్యజించిన పిమ్మట గూడ శరీర నిర్వహణమునకై మానవునకు యోగక్షేమవాసనలు ఉండనే యుండును. ఆ వాసనలను గూడ సర్వథా త్యజించుటకై అర్జునుని 'నిర్యోగక్షేముడవు' కమ్మని తెల్పుట జరిగెను. మమతాసక్తులను సర్వథా త్యజించి, ఏ వస్తుప్రాప్తికై గాని దాని రక్షణకైగాని ఆరాటపడవద్దని' భగవానుడు అర్జునునితో పల్కెను.

ప్రశ్న - 'ఆత్మవాన్' అని ఎవరిని అందురు? అర్జునుని 'ఆత్మవంతుడవు' (ఆత్మయుతుడవు) కమ్మని తెల్పుటలోని అంతర్యమేమి?

సమా - ఇంద్రియములతో సహా శరీరాంతఃకరణములను ఇచట ఆత్మ అను పదము తెల్పును. మనోబుద్ధీంద్రియ ములు మనుష్యునకు వశము కానంత వరకును అవి అతనికి మిత్రములు గావు, శత్రువులే యగును. అప్పుడతడు ఆత్మవంతుడు కాజాలడు. మనోబుద్ధీంద్రియములు చక్క (పూర్తి)గా వశములో నున్నవాడు 'ఆత్మవాన్' అనగా ఆత్మ కలవాడు - అని యనబడును. మనోబుద్ధీంద్రియములు వశములో లేనివానికి సమత్వయోగ ప్రాప్తి కల్గుట మిక్కిలి కష్టము. మనోబుద్ధీంద్రియములు వశములో ఉన్నవారికి సాధనవలన సహజముగనే సమత్వయోగప్రాప్తి కలుగును. కావున భగవానుడు అర్జునుని 'ఆత్మవంతుడవు' కమ్మని ఆదేశించెను.

సంబంధము - వేదములన్నియును త్రిగుణముల కార్యములనే ప్రతిపాదించునని భగవానుడు అర్జునునితో పూర్వశ్లోకమున తెలిపెను. మూడు గుణముల కార్యరూపములైన సమస్తభోగములయందును, తత్ప్రాప్తి సాధనముల యందును ఆసక్తిని వీడుమని తెల్పెను. ఇప్పుడు తత్ఫలస్వరూపమైన బ్రహ్మజ్ఞానముయొక్క మహత్త్వమును తెల్పుచున్నాడు-

**యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| సర్వతః | = అంతట | ఉదపానే | = చిన్న జలాశయమునందు (మనుష్యునకు) | బ్రాహ్మణస్య | = బ్రహ్మజ్ఞానికి |
| సంప్లుతోదకే | = పరిపూర్ణమైన జలాశయము | యావాన్, అర్థః | = ఎట్టి ప్రయోజనము | సర్వేషు, వేదేషు | = సమస్త వేదములయందు |
| (ప్రాప్తే సతి) | = ప్రాప్తించుచుండగా (అందుబాటులో ఉండగా) | (అస్తి) | = ఉండునో | తావాన్ | = అంతప్రయోజనమే (ఉండును). |
| | | విజానతః | = బ్రహ్మతత్త్వమును ఎఱింగిన | | |

అన్నివైపులా జలములతో నిండియున్న మహాజలాశయము అందుబాటులోనున్న వానికి చిన్న చిన్న జలాశయములవలన ఎంత ప్రయోజనమో, పరమాత్మప్రాప్తినంది పరమానందమును అనుభవించు బ్రహ్మజ్ఞానికి వేదములవలన అంతియే ప్రయోజనము. **(46)**

ప్రశ్న - జలాశయదృష్టాంతముతో తెల్పబడిన విషయమేమి?

సమా - ఈ శ్లోకమున జలాశయదృష్టాంతముద్వారా భగవానుడు జ్ఞానులైన మహాత్ముల ఆత్యంతికతృప్తిని వర్ణించెను. అమృతప్రాయములైన జలములతో నిండియున్న మహా జలాశయము అందుబాటులో ఉన్నవానికి చిన్న చిన్న వాపీకూపతటాకాదులతో పనియేలేదు. వాని యొక్క జలావసరములన్నియును పూర్తియగును. అట్లే సమస్త భోగములయందలి మమతాసక్తులను త్యజించి, సచ్చిదానంద ఘనపరమాత్మజ్ఞానము ప్రాప్తించినవానికి అనగా పరమానంద సముద్రుడైన పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తి కల్గిన వానికి వేదోక్తకర్మల ఫలరూపములైన భోగములతో ఎట్టి ప్రయోజనమూ ఉండదు. అతడు సర్వథా పూర్ణకాముడు, నిత్యతృప్తుడు. కనుక ఇట్టి స్థితిని పొందుటకై మనుష్యుడు వేదోక్తకర్మల ఫలరూపములైన భోగములయందు మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించి, పూర్తిగా నిస్త్రైగుణ్యుడు కావలయును.

ప్రశ్న - అన్ని వైపులయందును పరిపూర్ణమైన జలాశయము అందుబాటులో ఉన్న మనుజుడు తనకు కావలసినంత జలమును మాత్రమే గ్రహించును. అట్లే బ్రహ్మజ్ఞానియైనవాడు తన ప్రయోజనమును ననుసరించి వేదాంశములను గ్రహించునని అర్థము చెప్పిన దోషమేమి?

సమా - ఈ యర్థమును కూడ గ్రహింపవచ్చును. ఇందు ఎట్టి దోషమూ లేదు. కాని పైన తెల్పబడిన యర్థము ఇంకను శ్రేష్ఠమైనది - ఏలనన బ్రహ్మప్రాప్తి కలిగిన జ్ఞానికి ఈ జగత్తున ఎట్టి వస్తువు తోడను అవసరమేయుండదు. (3/18)

*సంబంధము - ఈ విధముగా సమబుద్ధి రూపకర్మయోగమును దాని ఫలముయొక్క మహత్త్వమును తెలిపి, రెండు శ్లోకములలో కర్మయోగస్వరూపమును దెల్పుచు కర్మయోగమునందు స్థితుడవై కర్మలను ఆచరింపవలసినదని భగవానుడు అర్జునుని ఆదేశించుచున్నాడు-*

**కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి ॥ 47 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| తే | = నీకు | ఫలేషు | = దాని ఫలములయందు | తే | = (అట్లే) నీకు |
| కర్మణి, ఏవ | = కర్మయందే (కర్మాచరణమునందే) | కదాచన, మా | = ఎన్నడును లేదు | అకర్మణి | = కర్మను మానుటయందును |
| అధికారః | = అధికారము కలదు | కర్మఫలహేతుః, మా, భూః | = (నీవు) కర్మఫలమునకు హేతువు కావలదు | సంగః | = ఆసక్తి |
| | | | | మా, అస్తు | = ఉండరాదు. |

**కర్తవ్యకర్మమునాచరించుటయందే నీకు అధికారముగలదు. ఎన్నటికినీ దాని ఫలములయందులేదు. కర్మఫలములకు నీవు హేతువు కారాదు. కర్మలను మానుటయందు నీవు ఆసక్తుడవు కావలదు. అనగా ఫలాపేక్షరహితుడవై కర్తవ్యబుద్ధితో కర్మలనాచరింపుము. (47)**

ప్రశ్న - **'కర్మణి'** అనుపదము ఇచట ఏ కర్మను సూచించును? "కర్తవ్యకర్మను ఆచరించుటయందే నీకధికారము గలదు-" అనియనుటలోని అంతర్యమేమి?

సమా - వ్యక్తియొక్క వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులను అనుసరించి విహితములైన కర్మలను ఇచట **'కర్మణి'** అనుపదము సూచించును. శాస్త్ర నిషిద్ధ పాపకర్మలను ఇది సూచింపదు. ఏలనన పాప కర్మలు అతనికి కర్తవ్యములు గావు. అతడు రాగద్వేషములకు లోనై వాటియందు ప్రవర్తించును - అది అతనికి అనధికారచేష్ట యగును. అట్టి నిషిద్ధ కర్మలను చేయువాడు నరకయాతనలను అనుభవింపవలసి వచ్చును. "కర్మలను ఆచరించుటయందే నీకధికారము" అని పల్కుచు భగవానుడు ఈ క్రింది విషయములను స్పష్టపఱచెను.

1) మానవశరీరముద్వారానే జీవునకు నూతన కర్మలను ఆచరించుటకు స్వాతంత్ర్యము గలదు. కావున అతడు తన అర్హతను అనుసరించి, పరమేశ్వరుని ఆజ్ఞలను పాటించుచు కర్మల యందును వాటి ఫలములయందును ఆసక్తిని సర్వథా త్యజించి, ఆ కర్మలను పరమేశ్వర ప్రాప్తికి సాధనములుగా చేసినచో అతనికి సహజముగనే పరమాత్మ ప్రాప్తికల్గును. అర్జునుడు మానవ శరీరమును కల్గియుండుట వలన అతనికి కర్మాచరణమునకు అధికారము గలదు. కావున అతడా యధికారమును సదుపయోగము చేసికొనవలెను.

2) మనుష్యునకు కర్మలను చేయుటకే అధికారము గలదు - వాటి ఆచరణమును త్యజించుటకు అతనికి స్వాతంత్ర్యము లేదు. అతడు అహంకారముతో మొండిగా కర్మాచరణమును త్యజించుటకు ప్రయత్నించినను సర్వథా అతడట్లు చేయజాలడు (3/5) ఏలనన అతని స్వభావమే అతనిని కర్మలయందు బలవంతముగా నియోగించును. (3/33, 18/59,60) ఇట్టి పరిస్థితి యందు అతడు తన అధికారమును దుర్వినియోగము చేసినవాడగును. విహితకర్మలను త్యజించుట వలన అతడు శాస్త్ర నియమములను ఉల్లంఘించిన పాపమునకు శిక్షను అనుభవింపవలసి వచ్చును. కావున అర్జునుడు కర్తవ్య కర్మలను అవశ్యముగా ఆచరింపవలెను. వాటిని ఎన్నడును త్యజింపరాదు.

3) ప్రభుత్వము కొంతమందికి ఆయుధములను ఇచ్చి, వాటిని ఆత్మరక్షణకు గాని, ప్రజారక్షణకుగాని ఉపయోగించు నధికారమును గూడ ఇచ్చును. వాటిని ప్రయోగించు విషయమున కొన్ని నియమములను గూడ విధించును. ఏ వ్యక్తియైనను ఆ అధికారమును దుర్వినియోగము చేసినచో అతనికి శిక్ష విధింపబడుటయేగాక, అతని అధికారములును తీసివేయబడును. అదే విధముగా జన్మమృత్యురూప సంసారబంధములనుండి జీవుని ముక్తునిగా చేయుటకును, ఇతరులకు హితమును గూర్చుటకును మనోబుద్ధీంద్రియ ములతో సహా మానవశరీరమును ఒసంగి, తద్ద్వారా నూతన కర్మలను ఆచరించుటకు అధికారము ఇయ్యబడినది. కనుక ఈ అధికారమును సదుపయోగమును చేయువాడు కర్మబంధముల నుండి ముక్తుడై పరమపదప్రాప్తినందును. దుర్వినియోగ మొనర్చువాడు దండింపబడును. పైగా అతని అధికారము ఉపసంహరింపబడును - అనగా అతడు మానవ జన్మయొక్క అర్హతను కోల్పోయి, సూకరశునకాది జన్మలను ఎత్తవలసివచ్చును. ఈ రహస్యమును గ్రహించి, మానవుడు తన కర్తవ్యకర్మాచరణాధికారములను సద్వినియోగము గావింపవలెను.

ప్రశ్న - "కర్మఫలములయందు నీకెన్నడునూ అధికారము లేదు." అనియనుటలోని అంతర్యమేమి?

సమా - కర్మఫలప్రాప్తి విషయమున మానవుడు ఎన్నడును, ఏ విధముగను స్వతంత్రుడు కాడు. ఏ కర్మకు ఎట్టి ఫలము లభించును? ఆ ఫలము ఏ జన్మయందు ఎట్లు లభించును? మున్నగు విషయములు అతనికి తెలియవు. తన ఇచ్ఛానుసారముగా వాటిని అతడు పొందలేడు. ఆ ఫలములు ఎట్టివైనను వాటిని అనుభవింపక తప్పదు. తానొకటి తలచిన దైవము వేఱొకటి తలచును. పెక్కుమంది అనేకవిధములైన భోగానుభవములను కోరుకొందురు. కాని వాటిని అనుభవించు యోగము వారి చేతులలో ఉండదు. అనేక విధములైన సంయోగవియోగములను సహజముగా

వారు కోరరు. కాని అవి జరుగుచుండును. కర్మఫలములను నియంత్రించువాడు సర్వదా - సర్వథా విధాతయే. ఈ విషయమున మనుష్యుని సంకల్పములేవియు పనిచేయవు. పుత్రకామేష్టి మొదలగు శాస్త్రీయములైన యజ్ఞానుష్ఠానములను సాంగోపాంగముగా పూర్తిచేసి, వాటి ఫలములను పొందుటకు నిశ్చిత విధానము గలదు. అట్టి కర్మలను సకామపురుషులును చేయగలరు. కాని వాటి విహిత ఫలములు ఆకర్మలనాచరించు వారి అధీనములో ఉండవు. అవి దేవతల అధీనములో ఉండును. కావున ప్రత్యేకమైన వస్తువులకొఱకును, ధనైశ్వర్యములకొఱకును, కీర్తి ప్రతిష్ఠల కొరకును, స్వర్గాది లోకములప్రాప్తికొఱకును కోరుకొనుట అజ్ఞానమేయగును. పైగా అవి అత్యల్పములు, అనిత్యములు. కావున అట్టి ఫలేచ్ఛలను కోరుట తగదని భగవానుడు నుడివెను.

ప్రశ్న - ముక్తిని కోరుకొనుట గూడ తగదా?

సమా - ముక్తిని కోరుట శుభేచ్ఛ యగుట వలన అది ముక్తిప్రాప్తికి సహాయకమగును - ఐనను ఈ ఇచ్ఛ లేకుండుటయు మంచిదే. భగవత్తత్త్వ రహస్యములను యథార్థముగా తెలిసికొనక ఈ ఇచ్ఛయు లేనివాడై ఈశ్వరాజ్ఞాపాలనమే కర్తవ్యముగా భావించి, నిర్హేతుకముగా కర్మలను ఆచరించుట చాలా కష్టమే. కావున ముక్తికాంక్ష అనుచితము కాదు. ముక్తిని కోరనిచో శీఘ్రముగా ముక్తి లభించుననుభావము గూడ అప్రకటితముక్తికాంక్షయే.

ప్రశ్న - 'కర్మఫలహేతువు' - అగుటయనగానేమి? కర్మఫల హేతువు కావలదు - అని భగవానుడు అర్జునునితో పల్కుటలోని అంతర్యమేమి?

సమా - మనోబుద్ధీంద్రియముల ద్వారా చేయబడు శాస్త్ర విహితకర్మలయందును వాటి ఫలములయందును మమతాసక్తులు, వాసనలు, ఆశలు, స్పృహలు, కోరికలు కలిగియుండుటయే కర్మఫల హేతువగుట యగును - ఏలనన పైవిధముగా కర్మలయందును, వాటి ఫలములయందును ఆసక్తుడైన వానికే ఆ కర్మల ఫలములు లభించును. కర్మలయందును వాటి ఫలములయందును మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించిన వానికి కర్మఫలములు లభింపవు. (18/12). కావున పరమశాంతి ప్రాప్తికై మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించి, కర్తవ్యకర్మలను అనుష్ఠింపుమని తెల్పుటకే భగవానుడు అర్జునుని 'కర్మఫలహేతువు కావలదు' - అని ఆదేశించెను.

ప్రశ్న - పైన పేర్కొనబడిన విధముగా మమతాసక్తులను కోరికలను త్యజించి, కర్మలను చేయువాడు పాపకర్మల ఫలములకు హేతువుకాదా?

సమా - పైన తెల్పబడిన రీతిగా కర్మలను ఆచరించు వాడు ఏ విధముగను కర్మఫలములకు హేతువుకాడు. అతని శుభాశుభకర్మలన్నింటి యందును ఫలములనిచ్చు శక్తిక్షీణించును. ఏలనన పాపకర్మల ప్రవృత్తికి హేతువు ఆసక్తియే. కనుక మమతాసక్తులు కోరికలు సర్వథా దూరమైన పిమ్మట నూతన పాపకర్మలు అతనివలన కలుగనే కలుగవు. అంతకు మునుపు చేసిన పాపకర్మలు మమతాసక్తి రహిత పాప కర్మల ప్రభావమున భస్మమగును. ఈ కారణమున ఆ పాప కర్మలకు అతడు ఫలహేతువుకాడు. శుభకర్మల ఫలములను అతడు త్యజించును. అందువలన వాటికిని ఫలహేతువు కాడు. ఈ విధముగా కర్మలనాచరించు మనుష్యుని సమస్తకర్మలును విలీనములగును (4/23). అతడు అనామయపదమును పొందును. (2/51)

ప్రశ్న - "కర్మలను మానుటయందు ఆసక్తుడవు కావలదు"- అనియనుటలోని అంతర్యమేమి?

సమా - శాస్త్రవిహిత కర్మలకు విరుద్ధముగా నిషిద్ధ కర్మలను ఆచరించుట కర్మాధికారమును దురుపయోగ పఱచుటయే యగును. అట్లే వర్ణాశ్రమ, స్వభావ, పరిస్థితులను అనుసరించి, అవసరమైన కర్తవ్య కర్మలను చేయకుండుటయు ఆ అధికారమును దుర్వినియోగము చేసినట్లే. విహిత కర్మల త్యాగము ఏ విధముగను న్యాయ సంగతముగాదు. కనుక వీటిని మోహముతో త్యజించుట తామసత్యాగము అనబడును. (18/7). శారీరకక్లేశ భయముతో త్యజించుట రాజసత్యాగ మనబడును. (18/8) విహితకర్మలను అనుష్ఠింపనిదే మనుష్యునకు కర్మయోగసిద్ధియు లభింపదు. (3/4). కావున విహితకర్మలను అనుష్ఠింపకుండుటలో ఆసక్తిమాప వలదని భగవానుడు ఆదేశించెను.

*సంబంధము - "నీవు కర్మఫలములకు హేతువుకావలదు - కర్మను మానుటయందు ఆసక్తుడవు కారాదు" - అని పై (47వ) శ్లోకమున తెల్పబడినది. అనగా కర్మలను త్యజింపరాదు - అని శ్రీకృష్ణుడు పలికెను - ఐతే కర్మలను ఏవిధముగా ఆచరింపవలెను? అను ప్రశ్న ఉదయించును. దీనికి భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।**
**సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ 48 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధనంజయ | = ఓ ధనంజయా! | సమః | = సమబుద్ధి | కురు | = చేయుము |
| సంగమ్ | = ఆసక్తిని | భూత్వా | = కలిగి | సమత్వమ్ | = సమత్వమే (సమత్వబుద్ధియే) |
| త్యక్త్వా | = త్యజించి | యోగస్థః | = యోగమునందు స్థితుడవై | యోగః ఉచ్యతే | = యోగమని చెప్పబడును. |
| సిద్ధ్యసిద్ధ్యోః | = సిద్ధి - అసిద్ధులయందు | కర్మాణి | = కర్మలను | | |

**ఓ ధనంజయా! యోగస్థితుడవై ఆసక్తిని వీడి, సిద్ధి-అసిద్ధుల యెడ సమత్వ భావమును కలిగియుండి, కర్తవ్యకర్మలను ఆచరింపుము. ఈ సమత్వభావమునే యోగమందురు. (48)**

ప్రశ్న - సిద్ధి అసిద్ధులయెడ సమభావము కలిగి యున్నప్పుడు ఆసక్తి తనంతట తానే తొలగి పోవును. మఱి ఇచ్చట 'ఆసక్తిని త్యజింపుమని' అర్జునునకు తెల్పుటలోని ప్రత్యేకతయేమి?

సమా - ఈ శ్లోకమునందు భగవానుడు కర్మయోగా చరణ ప్రక్రియను తెల్పెను. కర్మయోగ సాధకుడు కర్మలయందును వాటిఫలముల యందును ఆసక్తిని త్యజించినప్పుడు వాటియందలి రాగద్వేషములు, వాటివలన ఏర్పడు హర్షశోకాదులు సహజముగనే తొలగిపోవును. అట్లగుట వలననే అతనికి సిద్ధి అసిద్ధులయందు సమత్వము ఏర్పడును. ఈ దోషములున్నప్పుడు సిద్ధి అసిద్ధుల యెడ సమభావము కుదురుకొనదు. సిద్ధి అసిద్ధుల యందు - అనగా చేయబడు కర్మలు పూర్తియగుట యందును, కాకపోవుట యందును అట్లే వాటి అనుకూల ప్రతికూల పరిణామములయందును సమముగా నుండుటకు ప్రయత్నము చేయుటచే చివరకు రాగద్వేషాదులు అంతరించును. ఈ విధముగా ఆసక్తి త్యాగమునకును, సమత్వభావమునకును పరస్పర ఘనిష్ఠ సంబంధము గలదు. ఈ రెండును పరస్పరము ఒకదానికి మఱియొకటి సహాయకములు. కావున ఆసక్తులను త్యజించి సిద్ధి అసిద్ధులయందు సమభావములను కల్గియుండి, కర్మలను ఆచరింపుమని భగవానుడు తెల్పియుండెను.

ప్రశ్న - సమత్వమే యోగము ఐనప్పుడు 'సిద్ధి అసిద్ధుల యందు సముడై కర్మలను ఆచరించుటయే యోగస్థితిని పొందినట్లగును, యోగమునందు స్థితుడవుకమ్మని మఱల ప్రత్యేకముగా చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - కర్మల సిద్ధి అసిద్ధులయందు సమభావమును క్రమక్రమముగా పెంపొందించుకొనుటవలన అందు నిశ్చలస్థితి ఏర్పడును. సమభావము స్థిరమగుటయే కర్మయోగమునకు పరమావధి. కేవలము సిద్ధి అసిద్ధుల యందు మాత్రము సమత్వము ఉండుట వలన ప్రయోజనము కలుగదు. ప్రత్యేకమైన క్రియను ఆచరించు సమయమున గూడ ఏ పదార్థమునందును, కర్మయందును దాని ఫలమునందును అట్లే ఏ ప్రాణియందును విషమ భావమును కల్గియుండక నిత్యమూ సమభావమున స్థితుడై యుండవలెను. ఇదియే యోగము నందు స్థితుడవై కర్మలను ఆచరింపుమని భగవానుడు పల్కుటలోని అంతర్యము.

ప్రశ్న - సమత్వమే యోగమనబడును - అనియనుట లోని అంతరార్థమేమి?

సమా - భగవానుడు 'యోగము' అను పదము యొక్క పారిభాషిక అర్థమును తెల్పెను. ఇచట 'యోగము' అనగా సమత్వము - ఏదైన ఒక సాధనద్వారా సమత్వమును పొందుటయే యోగి యగుటయగును. కావున కర్మయోగి అగుటకు సమభావమునందు స్థితుడవై కర్మలను ఆచరింపుమని భగవానుడు అర్జునుని ఆదేశించెను.

*సంబంధము - ఈ విధముగా కర్మయోగప్రక్రియను దెల్పి, సకామభావము కల్గియుండుటను అధిక్షేపించుచు, సమభావరూప బుద్ధియోగమహత్త్వమును ప్రకటించుచు దానిని ఆశ్రయింపుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు-*

**దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।**
**బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| బుద్ధియోగాత్ | = (సమత్వ) బుద్ధి యోగముకంటెను | ధనంజయ | = ఓ ధనంజయా! | హి | = ఏలనన |
| కర్మ | = సకామకర్మ | బుద్ధౌ | = సమత్వబుద్ధియందే | ఫలహేతవః | = ఫలములను ఆశించువారు (ఫలాసక్తితో కర్మలను ఆచరించువారు) |
| దూరేణ అవరమ్ | = మిక్కిలి నిమ్నశ్రేణికి చెందినది | శరణమ్ | = తరణోపాయమును | | |
| (అతః) | కావున | అన్విచ్ఛ | = వెదకుము (సమత్వబుద్ధి యోగమును ఆశ్రయింపుము) | కృపణాః | = అత్యంతదీనులు |

ఈ సమత్వబుద్ధియోగముకంటెను సకామకర్మ మిక్కిలి నిమ్నశ్రేణికి చెందినది. కావున ఓ ధనంజయా! నీవు సమత్వబుద్ధియోగమునే ఆశ్రయింపుము- ఏలనన ఫలాసక్తితో కర్మలు చేయువారు అత్యంతదీనులు, కృపణులు. **(49)**

ప్రశ్న - 'బుద్ధియోగాత్' అను పదము ఏ యోగమును సూచించును? కర్మయోగమునా? జ్ఞానయోగమునా?

సమా - మమతాసక్తులను, కోరికలను త్యజించి, సమబుద్ధితో కర్తవ్యకర్మలను అనుష్ఠించుకర్మయోగమునే 'బుద్ధియోగాత్' అను పదము సూచించును. ఏలనన 39వ శ్లోకమునందు 'యోగే త్విమాం శృణు' అనగా ఇప్పుడు నా నుండి బుద్ధియోగమును గూర్చి వినుము. అని తెల్పి భగవానుడు కర్మయోగవర్ణనమును ఆరంభించెను. అందువలన 'బుద్ధియోగాత్' అను పదమునకు "జ్ఞానయోగము" అను అర్థమును చెప్పుటకు వీలులేదు. ఇంతేగాక ఈ శ్లోకమున ఫలమునాశించు వారిని కృపణులనియు, దీనులనియు పేర్కొనెను. రాబోవు శ్లోకమున బుద్ధియుక్తుడైన వానిని ప్రశంసించుచు కర్మయోగివి కమ్మని అర్జునుని ఆజ్ఞాపించెను. బుద్ధియుక్తుడైనవాడు కర్మఫల త్యాగము చేసి, అనామయపదమును పొందును. (2/51) ఈ కారణమున 'బుద్ధియోగాత్' అను పదమునకు జ్ఞానయోగము అను అర్థమును చెప్పుట ప్రకరణ విరుద్ధము అగును. ఏలనన కర్మఫలత్యాగము ఒనర్చుటవలన అనామయ ఫలము ప్రాప్తించునని జ్ఞానయోగికి చెప్పవలసిన పనిలేదు - అతడు కర్మలకు తాను కర్తనని భావింపడు. ఇక ఫలత్యాగ ప్రస్తావనకు తావేలేదు.

ప్రశ్న - "బుద్ధియోగముకంటెను సకామకర్మ మిక్కిలి నిమ్నశ్రేణికి చెందినది" - అనియనుటలోని అంతర్యమేమి? 'కర్మ' అను పదమునకు 'నిషిద్ధకర్మ'యను అర్థమును చెప్పినచో దోషమేమి?

సమా - సకామ కర్మల ఫలము నశ్వరమైన, క్షణిక సుఖప్రాప్తి. కర్మయోగఫలము పరమాత్మప్రాప్తి. ఈ రెండింటి మధ్య మిక్కిలి అంతరము గలదు. ఇవి తూర్పు పడమరల వంటివి - కనుక బుద్ధి యోగముకంటెను సకామకర్మ మిక్కిలి నిమ్నశ్రేణికి చెందినదని భగవానుడు తెల్పెను. 'కర్మ' అను పదమునకు 'నిషిద్ధకర్మలు' అను అర్థమును చెప్పుటకు వీలులేదు - ఏలనన అవి (ఆ నిషిద్ధకర్మలు) సర్వథా త్యాజ్యములు. వాటి ఫలము మహాదుఃఖ ప్రాప్తి. సమత్వబుద్ధి యోగ మహత్త్వమును దెల్పుటకు దానిని నిషిద్ధకర్మలతో పోల్చుట అసమంజసము.

ప్రశ్న - 'బుద్ధౌ' అను పదము దేనిని తెల్పును? దానిని ఆశ్రయింపుమని అర్జునుని ఆదేశించుటలోని అంతర్యమేమి?

సమా - ఇది సమబుద్ధి ప్రకరణము. కనుక 'బుద్ధౌ' అను పదము. 'సమబుద్ధి'ని తెల్పును. దానిని ఆశ్రయింపుమని ఆదేశించి నిలుచున్నను, కూర్చున్నను, నడచుచున్నను, తిరుగుచున్నను, నిద్రించుచున్నను, మేల్కొనియున్నను ఇంత యేల ఏ పనిచేయుచున్నను నిరంతరము సమభావస్థితుడవై యుండుటకు ప్రయత్నింపుమనియు, అదియే కల్యాణప్రాప్తికి సులభమైన ఉపాయమనియు అర్జునునకు తెల్పెను.

ప్రశ్న - కర్మఫలాసక్తి గలవారు అత్యంత దీనులు, కృపణులు అని యనుటలోని అంతర్యమేమి?

సమా - కర్మలయందును, వాటి ఫలములయందును మమతాసక్తులు, కోరికలు కలిగి, కర్మఫలప్రాప్తికి కారణమగు వారు కృపణులు, దీనులు. అనగా కనికరింపదగినవారు. కావున అర్జునుడు అట్టివాడు కారాదని భగవానుడు పలికెను.

సంబంధము - ఈ విధముగా సమత్వబుద్ధి నాశ్రయింపుమని అర్జునుని ఆదేశించి, రెండు శ్లోకములలో సమతాబుద్ధియుక్తులైన మహాత్ములను ప్రశంసించుచు కర్మయోగమును అనుష్ఠింపుమని మఱల అర్జునుని ఆదేశించుచు దాని ఫలమునుగూడ తెల్పుచున్నాడు-

**బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ 50 ॥**

బుద్ధియుక్తః = సమత్వబుద్ధిగల పురుషుడు
సుకృతదుష్కృతే = పుణ్యపాపములను
ఉభే = రెండింటిని
ఇహ = ఈ లోకమునందే
జహాతి = త్యజించును (వాటి నుండి విముక్తుడగును)
తస్మాత్ = అందువలన
యోగాయ = సమత్వబుద్ధి యోగము కొఱకు
యుజ్యస్వ = (నీవు) ప్రయత్నింపుము (సాధన చేయుము)
యోగః = సమత్వరూపయోగమే
కర్మసు = కర్మలయందు
కౌశలమ్ = నేర్పును కలిగించును (కర్మబంధముల నుండి విడిపించును)

సమత్వ బుద్ధియుక్తుడైనవాడు పుణ్యపాపములను రెండింటిని ఈ లోకమునందే త్యజించును. అనగా కర్మఫలములు వానికి అంటవు. కనుక నీవు సమత్వబుద్ధి రూపయోగమును ఆశ్రయింపుము. ఇదియే కర్మాచరణమునందు కౌశలము. అనగా కర్మబంధములనుండి ముక్తుడగుటకు ఇదియే మార్గము. (50)

ప్రశ్న - సమబుద్ధియుక్తుడైన పురుషుడు పుణ్యపాపములను రెండింటిని ఈ లోకమునందే త్యజించును - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - జన్మ జన్మాంతరములయందును, ఈ జన్మయందును చేయబడిన పుణ్యపాపకర్మలు సంస్కార రూపమున అంతఃకరణమున సంచితమగును. సమబుద్ధి యుక్తుడైన కర్మయోగి ఈ కర్మలను అన్నింటిని ఈ లోకమునందే త్యజించును - అనగా ఈ ప్రస్తుత జన్మయందే అతడు తన సమస్త కర్మలనుండియు ముక్తుడగును. అప్పుడు అతనికి ఆ కర్మలతో ఎట్టి సంబంధమూ మిగిలియుండదు. కావున ఆ కర్మలు అతనికి పునర్జన్మరూప ఫలములను ఇయ్యవు. ఏలనన నిస్స్వార్థభావముతో కేవలము లోకహితార్థమై చేయబడు కర్మల వలన అతని సమస్త కర్మలును విలీనములగును. (4/23) ఈ విధముగా అతని క్రియమాణ పుణ్యపాపకర్మలుగూడ త్యజింపబడును. పాపకర్మలు అతనిచే ఆచరింపబడవు సరిగదా! శాస్త్రవిహిత పుణ్యకర్మలయందు ఫలాసక్తి త్యజింపబడుట వలన ఆ కర్మలు 'అకర్మలు' అగును - (4/20) కనుక అవి గూడ ఒక విధముగా త్యజింప బడినవే.

ప్రశ్న - "అందువలన నీవు సమత్వరూప యోగయుక్తుడవు కమ్ము" - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - సమబుద్ధియుక్తుడైన యోగి జీవన్ముక్తుడగును. అర్జునుని గూడ ఆ విధముగా జీవన్ముక్తుడవుకమ్మని ఆదేశించెను.

ప్రశ్న - ఈ సమత్వయోగమే కర్మలయందు కౌశలము- అని యనుటలోని అంతర్యమేమి?

సమా - కర్మలు సహజముగనే మనుష్యుని బంధములలో తగుల్కొనునట్లు చేయును. కర్మలు చేయకుండ మనుష్యుడు ఉండజాలడు. అతడు ఏదో ఒక పని చేయుచుండుటయే జరుగును. ఇట్టి పరిస్థితిలో కర్మలనుండి ముక్తుడగుటకు సమత్వ యోగమే ఉత్తమ మార్గము. ఈ సమబుద్ధియుక్తుడై కర్మలను ఆచరించువాడు వాటి (కర్మ) బంధములకు లోనుగాడు. కావున కర్మలయందు యోగమే కౌశలము. సాధన కాలమునందు సాధకుడు సమబుద్ధిద్వారా కర్మలను చేయప్రయత్నించును. సిద్ధావస్థయందు సమత్వమున పూర్ణస్థితి కల్గును.

**కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ॥ 51 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | | ఉత్పన్నమగు | అనామయమ్ | = వికారరహితమైన |
| బుద్ధియుక్తాః | = సమత్వ బుద్ధి | ఫలమ్ | = ఫలమును | | |
| | గలవారైన | త్యక్త్వా | = త్యజించి | పదమ్ | = పరమపదమును |
| మనీషిణః | = జ్ఞానులు | జన్మబంధ | = జన్మరూపబంధముల | | |
| కర్మజమ్ | = కర్మలవలన | వినిర్ముక్తాః | నుండి ముక్తులై | గచ్ఛంతి | = పొందుదురు. |

**ఏలనన సమబుద్ధియుక్తులైన జ్ఞానులు కర్మఫలములను త్యజించి, జనన మరణబంధములనుండి ముక్తులయ్యెదరు. అంతేగాక వారు నిర్వికారమైన పరమపదమును పొందుదురు. (51)**

ప్రశ్న - 'హి' అను పదప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - 'హి' హేతువాచకము. సమబుద్ధి పూర్వకముగా కర్మలను ఆచరించుటను 'కౌశలము' అనియనుటకు కారణమును ఈ శ్లోకమున భగవానుడు తెల్పుచున్నాడు. కనుక 'హి' అను అవ్యయమును ప్రయోగించెను.

ప్రశ్న - 'బుద్ధియుక్తాః' అనుసమాసము ఎవరిని తెల్పును? వారిని 'మనీషిణః' అని పిల్చుటలోని ఆంతర్యమేమి?

సమా - పూర్వోక్తరీతిగా సమబుద్ధియుక్తులైన వారిని అనగా నిశ్చల సమభావ స్థితిని కల్గియున్న కర్మ యోగులను 'బుద్ధియుక్తాః' అను పదము సూచించును. ఈ విధముగా సమభావయుక్తులైన వారు తమ మానవజన్మను సఫలమొనర్చుకొందురు. వాస్తవముగా వారే బుద్ధిమంతులు, జ్ఞానులు. కావున వారిని 'మనీషిణః' అని పేర్కొనుట జరిగినది. సాక్షాత్తు ముక్తిద్వారమైన మానవశరీరమును పొందియు భోగముల యందే మునిగియుండువారు బుద్ధిమంతులు కారు. (5/22)

ప్రశ్న - బుద్ధియుక్తులైన ఆ మనుష్యులు కర్మ ఫలములను త్యజించి, జననమరణబంధములనుండి ముక్తులయ్యెదరు - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - బుద్ధియుక్తులైన ఆ మనుష్యుల యొక్క సమత్వయోగ ప్రభావముచే జన్మజన్మాంతరముల యందును మఱియు ఈ జన్మయందును వారిచేత చేయబడిన సమస్త కర్మలయొక్క ఫలముల సంబంధము విచ్ఛేదమగును. తత్ఫలితముగా వారు జనన మరణ చక్రమునుండి శాశ్వతముగా ముక్తులగుదురు. కర్మఫలములను త్యజించి, జననమరణ బంధములనుండి ముక్తులగుట యనగా నిదియే. ఏలనన త్రిగుణకార్యరూపములైన సాంసారిక పదార్థముల యందలి ఆసక్తియే పునర్జన్మకు హేతువు. (13/21) వారియందు (బుద్ధియుక్తులైన జ్ఞానుల యందు) అది (ఆసక్తి) ఏ మాత్రమూ ఉండదు. కనుక వారికి పునర్జన్మ యుండదు.

ప్రశ్న - ఇట్టి పురుషులు నిర్వికార (అనామయ) పరమపదమును పొందుదురు - అనగానేమి?

సమా - రాగద్వేషాది క్లేశములును, శుభాశుభకర్మలును, హర్షశోకాది వికారములును, తదితర దోషములును లేనట్టిదియు, ప్రకృతి నుండియు, దాని కార్యముల నుండియు సర్వథా అతీతమైనదియు, భగవానునినుండి అభిన్నమైనదియు ఐన పరంధామమును సూచించునదియే అనామయ పరమపదము - దీనిని పొందినవారు మఱల ఈ లోకమునకు రారు. సచ్చిదానందఘన నిర్గుణ నిరాకార - సగుణ సాకార పరమాత్మను పొందుట యన్నను, పరమగతిని పొందుట యన్నను, అమృతత్వమును పొందుటయన్నను, భగవానుని పరంధామమును పొందుట యన్నను ఒక్కటియే. వాస్తవముగా ఇందు భేదములేదు - సాధకుల విశ్వాసమునందే భేదముండును.

*సంబంధము - కర్మయోగాచరణముద్వారా అనామయపదప్రాప్తి కలుగునని భగవానుడు తెలిపెను. దీనిపై తనకు ఈ అనామయ పరమపదప్రాప్తి ఎప్పుడు? ఎట్లు లభించును? - అను జిజ్ఞాస అర్జునునకు కలుగవచ్చును. దీనికి భగవానుడు రెండు శ్లోకములలో సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52 ॥**

యదా =ఎప్పుడైతే
తే బుద్ధిః =నీ బుద్ధి
మోహకలిలమ్ =మోహమనెడి ఊబిని (ఊబినుండి)
వ్యతితరిష్యతి =పూర్తిగా బయట పడునో
తదా =అప్పుడే
శ్రుతస్య =వినినట్టి
చ =మఱియు
శ్రోతవ్యస్య =వినబోవునట్టి (ఇహపర లోకములకు సంబంధించిన సమస్త భోగముల నుండి)
నిర్వేదమ్ =వైరాగ్యమును
గంతాసి =పొందెదవు.

**మోహమనెడి ఊబినుండి పూర్తిగా బయటబడినప్పుడే నీవు వినిన, వినబోవు ఇహపరలోక సంబంధమైన సమస్త భోగములనుండి వైరాగ్యమును పొందగలవు. (52)**

ప్రశ్న - మోహకలిలమనగానేమి? బుద్ధిదానినుండి పూర్తిగా బయటపడుట యనగానేమి?

సమా - స్వజనులను, బంధువులను వధించు ఆశంకతో స్నేహ ప్రభావమున అర్జునుని హృదయము నందు మోహము జనించెను. ఈ అధ్యాయమునందలి 2వ శ్లోకమున దీనినే **'కశ్మలం'** అని పేర్కొనుట జరిగెను. అదియే ఇచ్చట **'మోహకలిలం'** (ఊబి) అని పేర్కొనబడినది. దాని కారణమున అర్జునుడు ధర్మసంమూఢచేతస్కుడై తన కర్తవ్యమును నిశ్చయించు కొనలేకపోయెను. ఈ మోహకలిలము ఒక విధమగు ఆవరణయుక్తమైన మలదోషము. ఇది బుద్ధియొక్క నిశ్చయాత్మక శక్తిని నశింపజేసి, మనుజుని తనయందే కూరుకొని పోవునట్లు చేయును.

సత్సాంగత్య ఫలితముగా వివేకము ద్వారా నిత్యానిత్యములను, కర్తవ్యాకర్తవ్యములను నిశ్చయించి, మమతాసక్తులను, కోరికలను త్యజించి, భగవత్పరాయణుడై నిష్కామ భావముతో కర్మలను ఆచరించుటచే ఈ ఆవరణయుక్తమలదోషము పూర్తిగా తొలగిపోవును. మోహమనెడి 'ఊబి' నుండి బుద్ధి బయటపడుట యనగా ఇదియే.

ప్రశ్న - 'శ్రుత, శ్రోతవ్య' అను శబ్దములు వేటిని తెల్పును? వాటినుండి వైరాగ్యమును పొందుట యనగానేమి?

సమా - నేటివఱకును చూచినట్టి, వినినట్టి, అనుభవించినట్టి ఇహపరలోక భోగైశ్వర్యాదులన్నియును శ్రుతములనబడును. భవిష్యత్తులో చూడబడు, వినబడు, అనుభవింపబడు వానిని శ్రోతవ్యములు అని యందురు. అవియన్నియును దుఃఖ హేతువులనియు, అనిత్యములు అనియు భావించి, వాటియందలి ఆసక్తిని పూర్తిగా త్యజించుటనే "వైరాగ్యమును పొందుట" అనియందురు. మోహము నుండి బయటపడినప్పుడే బుద్ధి పూర్తిగా స్వాభావిక స్థితికి చేరుననియు, అప్పుడే ఇహపరలోకములకు సంబంధించిన సమస్త క్షణిక పదార్థముల యెడ నిజమైన వైరాగ్యము కల్గుననియు భగవానుడు తెలిపెను.

**శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।**
**సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ 53 ॥**

శ్రుతి విప్రతిపన్నా = నానావిధవచనములను వినుటవలన విచలితమైన
తే = నీ యొక్క
బుద్ధిః = బుద్ధి
యదా = ఎప్పుడయితే
సమాధౌ = పరమాత్మయందు
నిశ్చలా = నిశ్చలముగా
అచలా = స్థిరముగా
స్థాస్యతి = నిలుచునో
తదా = అప్పుడే
యోగమ్ = యోగమును (భగవత్సాక్షాత్కారమును)
అవాప్స్యసి = (నీవు) పొందగలవు.

**నానా విధములైన మాటలను వినుట వలన విచలితమైన (అయోమయమునకు గురియైన) నీ బుద్ధి పరమాత్మయందు నిశ్చలముగా స్థిరముగా ఉన్నప్పుడే నీవు ఈ యోగమును పొందగలవు. అనగా నీకు పరమాత్మతో నిత్య(శాశ్వత) సంయోగము ఏర్పడును. (53)**

ప్రశ్న - శ్రుతివిప్రతిపన్నమైన 'బుద్ధి' యొక్క స్వరూపమేమి?

సమా - ఇహపరలోక భోగైశ్వర్యములకును, వాటి ప్రాప్తి సాధనము (ఉపాయము)లకును సంబంధించిన (నానావిధములైన) వచనములను వినుట వలన బుద్ధి విక్షిప్తమగును. ఆ కారణమున అది ఒక నిశ్చయము (నిర్ణయము)పై నిశ్చలముగా స్థిరముగా ఉండజాలదు. ఇప్పుడొక విషయము మంచిగా తోచును - కొంతతడవైన పిదప మఱొక విషయము మంచిగా తోచును. (క్షణక్షణమునకును అటువి బుద్ధి మాఱుచుండును) ఇట్టి విక్షిప్తమైన అనిశ్చిత బుద్ధియే ఇచ్చట శ్రుతివిప్రతిపన్నమైన బుద్ధి అని పేర్కొనబడెను. ఇది బుద్ధియొక్క విక్షేపదోషము.

ప్రశ్న - అది (ఆబుద్ధి) పరమేశ్వరునియందు స్థిరముగా నుండుట యనగానేమి?

సమా - మోహమనెడి 'ఊబి' నుండి బయటపడిన కారణమున ఇహపరలోక భోగములనుండి బుద్ధి సర్వథా విరక్తమగును. అట్టి బుద్ధి విక్షేపదోష రహితమై పరమాత్మ యందు మాత్రమే నిశ్చలముగా స్థిరముగా ఉండును.

ప్రశ్న - అప్పుడు యోగమును పొందుటయనగానేమి?

సమా - ఇచట యోగశబ్దము పరమాత్మతో నిత్యమూ సంపూర్ణమైన సంయోగమును తెల్పును. మలవిక్షేప ఆవరణ దోషరహితమై వివేకవైరాగ్య సంపన్నమై పరమాత్మ యందు బుద్ధి నిశ్చలముగా స్థితమై యుండుటయే **'యోగము'** అనబడును. పరమాత్మ ప్రాప్తినందిన స్థిత ప్రజ్ఞునియొక్క లక్షణములను గూర్చి అర్జునుడు రాబోవు (54వ) శ్లోకమున అడుగుచున్నాడు. దీనిని బట్టి యోగశబ్దమునకు అర్థము పరమాత్మతో సంయోగమునియే గ్రహింపవలెను.

ప్రశ్న - 50వ శ్లోకమున యోగమునకు 'సమత్వము' అనియర్థము చెప్పబడినది. ఇచ్చట అది 'పరమాత్మప్రాప్తి'ని సూచించునని భావింపబడినది - దీని అంతరార్థమేమి?

సమా - 50వ శ్లోకమున యోగసాధనను చేయుమని భగవానుడు అర్జునుని ఆదేశించెను. ఇచ్చట స్థిరబుద్ధి ఏర్పడిన పిమ్మట ఫల రూపమున ప్రాప్తించు యోగవిషయము ప్రస్తావింపబడినది. కావున ఇచట యోగశబ్దము పరమాత్మ ప్రాప్తి వాచకముగా భావింపబడినది. గీతయందు యోగ, యోగి అను శబ్దములు క్రింద సూచింపబడు విధముగా సందర్భానుసారముగా వేర్వేఱు అర్థములలో ప్రయుక్తములైనవి -

యోగము

**(1)** కర్మయోగము - **(6/3)** - ఇచట యోగారూఢు డగుటకు కోరిక గలవానికి కర్మాచరణము కర్తవ్యముగా తెల్పబడినది. కనుక యోగశబ్దమునకు 'కర్మయోగము' అని యర్థము.

**(2)** ధ్యానయోగము - **(6/19)** - వాయురహిత స్థానమునందు ఉన్న దీపజ్యోతివలె చిత్తముయొక్క స్థిరత్వము వర్ణింపబడుటవలన యోగశబ్దము ధ్యానయోగ వాచకము.

**(3)** సమత్వయోగము - **(2/48)** - యోగమునందు స్థితుడవై ఆసక్తిరహితుడవై సిద్ధి అసిద్ధుల యందు సమబుద్ధిని గలిగి కర్మలను ఆచరింపుమని ఆజ్ఞాపించుటనుబట్టి ఇచట యోగశబ్దమునకు 'సమత్వయోగము' అని అర్థమును చెప్పవలెను.

**(4)** భగవత్ప్రభావరూపయోగము - **(9/5)** - ఇచట భగవానుడు ఆశ్చర్యకరమైన తన ప్రభావమును చూడుము- అని తెల్పుటవలన యోగశబ్దమునకు 'దివ్యశక్తి' అను అర్థమును గ్రహింపవలెను.

**(5)** భక్తియోగము - **(14/26)** - నిరంతరము అవ్యభిచారరూపభజన చేయుమని చెప్పుటవలన యోగశబ్దము భక్తియోగమును సూచించునని గ్రహింపవలెను. ఇచట స్పష్టముగా భక్తియోగశబ్దమే ప్రయుక్తమైనది.

**(6)** అష్టాంగయోగము - **(4/28)** - ఇచట యోగశబ్దమునకు సాంఖ్యయోగమనిగాని, కర్మయోగమనిగాని అర్థము చెప్పుటకు వీలులేదు - ఏలనన ఈ రెండు శబ్దములు మిగుల విపులార్థములు గలవి. యజ్ఞము - అనుపేర ఇచట వర్ణింపబడిన సాధనలు అన్నియును రెండు యోగములలో అంతర్గతములు - కావున యోగ శబ్దమునకు ఇచట 'అష్టాంగయోగము' - అని అర్థము చెప్పుటయే సమంజసము.

**(7) సాంఖ్యయోగము - (13/24)** - ఇచ్చట సాంఖ్య అనుపదము యోగము అను పదమునకు విశేషణముగా ప్రయుక్తమగుటవలన దీనిని సాంఖ్య యోగవాచకముగా భావింపవలెను. ఈ విధముగా వేర్వేఱు స్థలములయందు గూడ సందర్భానుసారముగ యోగశబ్దమునకు ఆయా అర్థములను గ్రహింపవలెను.

### యోగి

**(1) ఈశ్వరుడు - (10/17)** - ఇది శ్రీకృష్ణభగవానుని ఉద్దేశించిన సంబోధన అగుటవలన ఇచట 'యోగి' శబ్దము ఈశ్వరుని దెల్పును.

**(2) ఆత్మజ్ఞాని - (6/32)** - అందఱిని తనతో సమానముగా చూచువాడని తెలుపుట వలన ఇచట యోగి శబ్దము ఆత్మజ్ఞానిని తెలుపును.

**(3) సిద్ధభక్తుడు - (12/14)** - పరమాత్మయందే బుద్ధిని, మనస్సును అర్పణచేసిన తన (భగవానుని) భక్తుడు (మద్భక్తు) అని పేర్కొని యుండుటవలన ఇచట యోగిశబ్దము 'సిద్ధభక్తు'ని దెల్పును.

**(4) కర్మయోగి - (5/11)** - ఆసక్తిని త్యజించి, ఆత్మశుద్ధికొఱకు కర్మలను ఆచరించువానిని 'యోగి' అనియనుటవలన - ఇది కర్మయోగిని సూచించును.

**(5) సాంఖ్యయోగి - (5/24)** - అభేదరూపము ద్వారా బ్రహ్మప్రాప్తి ఈ యోగఫలమగుటవలన ఇచట 'యోగి' శబ్దమునకు 'సాంఖ్యయోగి' అను అర్థమునే చెప్పవలెను.

**(6) భక్తియోగి - (8/14)** - అనన్య చిత్తముతో నిత్యమూ నిరంతరమూ భగవంతుని స్మరించువాడని చెప్పుటవలన ఇచట 'యోగి' శబ్దము భక్తియోగిని సూచించును.

**(7) సాధక యోగి - (6/47)** - ప్రయత్నముద్వారా పరమగతిని పొందువాడని తెల్పుటవలన ఇచట 'యోగి' శబ్దము 'సాధకయోగి'ని తెల్పును.

**(8) ధ్యానయోగి - (6/10)** - ఏకాంత స్థానస్థితుడై, మనస్సును ఏకాగ్రమొనర్చి, ఆత్మను పరమాత్మయందు నిమగ్నము చేయువాడని పేర్కొనబడుటవలన ఇచట 'యోగి' శబ్దము ధ్యానయోగిని సూచించును.

**(9) సకామకర్మి - (8/25)** - ఇట్టివాడు తిరిగి ఈ లోకమునకు వచ్చును అని తెల్పుటవలన - ఇచట 'యోగి' శబ్దము సకామకర్మిని సూచించును.

**సంబంధము** - "నీ బుద్ధి మోహమను ఊబినుండి సర్వథా బయటపడినప్పుడే నీకు ఇహపరలోక సమస్త భోగములనుండి విరక్తి కల్గును. నీ బుద్ధి పరమాత్మయందు నిశ్చలముగా నిల్చును. అప్పుడు నీకు పరమాత్మప్రాప్తి కల్గును" - అని పూర్వశ్లోకములయందు భగవానుడు అర్జునునితో పల్కెను. దీనిపై పరమాత్మప్రాప్తి నందిన స్థిత ప్రజ్ఞుడైన సిద్ధయోగి లక్షణములను, ఆచరణములను తెలిసికొను కోరికతో అర్జునుడు ఇట్లు ప్రశ్నించుచున్నాడు-

**అర్జున ఉవాచ**

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కేశవ | = ఓ కేశవా! | భాషా, కా | = లక్షణమేమి? | కిమ్ ఆసీత | = ఎట్లు కూర్చుండును? |
| సమాధిస్థస్య, స్థితప్రజ్ఞస్య | = సమాధియందుస్థితుడై పరమాత్మ ప్రాప్తినందిన స్థిరబుద్ధిగల పురుషునియొక్క | స్థితధీః | = స్థిరబుద్ధిగలవాడు | కిమ్ వ్రజేత | = ఎట్లు సంచరించును? |
| | | కిమ్ ప్రభాషేత | = ఎట్లు మాట్లాడును? | | |

**అర్జునుడు పలికెను- ఓ కేశవా! సమాధిస్థితుడై పరమాత్మప్రాప్తినందిన స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములెవ్వి? అతడు ఎట్లు భాషించును? ఎట్లు కూర్చొనును? ఎట్లు నడుచును? (54)**

ప్రశ్న - "కేశవ!" అను సంబోధనయొక్క ప్రత్యేకత ఏమి?

సమా - క+అ+ఈశ+వ = అనునాల్గింటి సమ్మేళనమే 'కేశవ' అను పదము - కావున 'క' అనగా బ్రహ్మ, 'అ' అనగా విష్ణువు, 'ఈశ' అనగా శివుడు. ఈ ముగ్గురిని 'వ' (వపుః) అనగా స్వరూపముగా గలవాడు - కేశవుడు. అర్జునుడు శ్రీకృష్ణభగవానుని 'కేశవ!' అని సంబోధించి, 'నీవు సమస్త జగత్తునకు సృష్టిస్థితిలయకారకుడవు. కావున నీవే నా ప్రశ్నలకు సరియైన సమాధానములను ఇయ్యగలవు." - అని తెల్పెను.

ప్రశ్న - 'స్థిత ప్రజ్ఞస్య' అను పదముతోపాటు 'సమాధిస్థస్య' అను విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - "నీ బుద్ధి సమాధియందు అనగా పరమాత్మ యందు నిశ్చలముగా నిల్చియున్నప్పుడు నీకు యోగసిద్ధి కలుగును" - అని భగవానుడు పూర్వశ్లోకమున అర్జునునితో పల్కియుండెను. దానిని అనుసరించి పరమాత్మప్రాప్తినంది, పరమాత్మయందే సదా నిశ్చలమైన, స్థిరమైన, బుద్ధి కల్గిన అట్టి సిద్ధపురుషుని లక్షణములను అర్జునుడు తెలియగోరెను. ఈ భావమును స్పష్టపరచుటకే 'స్థితప్రజ్ఞస్య' అను సమాసపదముతోపాటు 'సమాధిస్థస్య' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ఉపర్యుక్తస్థితిని పరమాత్మ ప్రాప్తి సిద్ధించిన పురుషుని యొక్క అక్రియస్థితిగా భావింపవలెనా? సక్రియస్థితిగా భావింపవలెనా?

సమా - ఈ రెండు స్థితులుగాను భావింపవలెను. ఇచ్చట అర్జునుడు రెండింటిని గూర్చి అడిగెను. 'కింప్రభాషేత', 'కింవ్రజేత' అనునవి సక్రియస్థితిని, 'కిమాసీత' అనునది అక్రియస్థితిని దెల్పును.

ప్రశ్న - 'భాషా' అను శబ్దమునకు అర్థము 'వాణి' అని చెప్పక లక్షణము అని ఏల చెప్పబడినది?

సమా - స్థిరబుద్ధి గల పురుషుని వాణి విషయములో 'కింప్రభాషేత'? అనగా అతడెట్లు మాట్లాడును? అను మఱియొక ప్రశ్న అడుగబడినది. కనుక ఇచట 'భాషా' శబ్దమునకు 'వాణి' అను అర్థము చెప్పబడక "భాష్యతే కథ్యతే అనయా ఇతి భాషా" అనగా దీని ద్వారా వస్తుస్వరూపము చెప్పబడును - అను వ్యుత్పత్తిని అనుసరించి, 'భాషా' అను పదమునకు 'లక్షణము' అను అర్థము చెప్పబడినది. ప్రచారములో నున్న భాషననుసరించి, పరిభాషా శబ్దమునకు 'లక్షణము' అనియే అర్థము. కావున ఇచట 'భాషా' అను పదము ఆ అర్థములోనే ప్రయుక్తమైనది.

ప్రశ్న - స్థిరబుద్ధి గల పురుషుడు ఎట్లు మాట్లాడును? ఎట్లు కూర్చొనును? ఎట్లు నడచును? అను ప్రశ్నలలోని మాట్లాడుట, కూర్చొనుట, నడచుట, అను క్రియలు సాధారణార్థములో ప్రయుక్తములైనవా? లేక విశేషార్థములోనా?

సమా - పరమాత్మప్రాప్తినందిన సిద్ధపురుషుని యొక్క విషయములన్నింటియందును వైశిష్ట్యమే యుండును. కావున మాట్లాడుట, కూర్చొనుట, నడచుట మొదలగునవి అతనికి సహజక్రియలైనను వాటిలో విలక్షణత్వము ఉండును. కాని ఇచ్చట మాట్లాడుట, కూర్చొనుట, నడచుట అను అతని కర్మలు సాధారణార్థములో గ్రహింపరాదు. మాట్లాడుట యనగా అతని వచనములు, మనస్సులోని విభావములతో భావితమైనవి? 'కూర్చొనుట' అనగా వ్యవహారరహిత కాలమందు అతని స్థితి యేమి? అట్లే నడచుట యనగా అతని ఆచరణములెట్లున్నవి? అను ఈ రీతులలో వాటి అర్థములను గ్రహింపవలెను.

*సంబంధము - పరమాత్మప్రాప్తినందిన 'సిద్ధయోగి'కే సంబంధించిన నాలుగు (4) విషయములను అర్జునుడు పూర్వశ్లోకమునందు అడిగెను - ఈ నాలుగు (4) ప్రశ్నలకు భగవానుడు ఈ అధ్యాయపరిసమాప్తి వఱకును సమాధానములను ఒసంగెను - మధ్యలో ప్రసంగవశమున వేఱు విషయములను గూడ తెల్పెను. రాబోవు (55వ) శ్లోకమున అర్జునుని మొదటి ప్రశ్నకు సంక్షిప్తముగా సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**శ్రీ భగవాన్ ఉవాచ**

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ 55 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = ఓ పార్థా! | ప్రజహాతి | = (మనుజుడు) | ఆత్మని ఏవ | = ఆత్మయందే |
| యదా | = ఎప్పుడైతే | | పూర్తిగా | తుష్టః | = సంతుష్టుడగునో |
| మనోగతాన్ | = మనస్సునందున్న | | త్యజించునో, | తదా | = అప్పుడే |
| సర్వాన్ | = సమస్తములైన | | (మఱియు) | స్థితప్రజ్ఞః | = (అతడు) స్థితప్రజ్ఞుడు |
| కామాన్ | = కోరికలను | ఆత్మనా | = ఆత్మద్వారా | ఉచ్యతే | = అనబడును |

**శ్రీ భగవానుడు పలికెను- ఓ అర్జునా! మనస్సునందలి కోరికలన్నియును పూర్తిగా తొలగిపోయి, ఆత్మద్వారా ఆత్మయందుసంతుష్టుడైనవానిని, అనగా పరమాత్మ సంయోగమువలన ఆత్మానందమును పొందినవానిని స్థితప్రజ్ఞుడని యందురు. (55)**

ప్రశ్న - 'సర్వాన్' అను విశేషణముతోపాటు **'కామాన్'** పదము వేటిని తెల్పును? వాటిని పూర్తిగా త్యజించుట అనగానేమి?

సమా - ఇహపరలోక పదార్థములయందు దేనితోనైనను సంయోగవియోగములకు ఏదో ఒక కారణమున ఏదో ఒక విధముగా తిన్నగా గాని, తీవ్రముగా గాని మానవుని అంతఃకరణము నందు కోరికలు ఏర్పడుచుండును. వాటినన్నింటిని తెల్పునదియే ఇచట 'సర్వాన్' అను విశేషణముతోపాటు ప్రయుక్తమైన **'కామాన్'** అనుపదము వీటియందు వాసన, స్పృహ, ఇచ్ఛ, తృష్ణ మొదలగు భేదములు పెక్కు గలవు. వీటన్నింటి నుండియు శాశ్వతముగా, సర్వథా దూరమగుటయే వాటిని పూర్తిగా త్యజించుటయగును.

ప్రశ్న - వాసన, స్పృహ, ఇచ్ఛ, తృష్ణ - అను వాని మధ్యగల తారతమ్యములెట్టివి?

సమా - శరీరము, భార్యాపుత్రులు, ధనము, గౌరవప్రతిష్ఠలు మొదలగు ప్రియములైన వాటిని రక్షించుకొనుటకును, అప్రియములైన వాటిని తొలగించుకొనుటకును ఏర్పడు (రాగద్వేషజనితమైన) సూక్ష్మమైన కోరికనే వాసన యందురు- ఈ స్థితిలో దాని స్వరూపము పూర్తిగా వికసించియుండదు. ప్రియమైన వస్తువు ఏదైనను లేదని తెలిసినప్పుడు ఆ వస్తువు యొక్క అవసరమును గుర్తించి, అదిలేనిదే పని జరుగదని, చిత్తమునందు ఏర్పడు భావమునే అనగా అపేక్షారూపమైన కోరికను 'స్పృహ' అందురు. ఇది వాసనయొక్క వికసితరూపము. ప్రియమైన వస్తువు లభింపనప్పుడు దానిని కోరుకొనుటకును, అప్రియమైన వస్తువును దూరము చేసికొనుటకును కలుగుకోరికనే 'ఇచ్ఛ' యందురు. ఇది కోరిక యొక్క సంపూర్ణ వికసితరూపము. స్త్రీపుత్ర ధనాదులు యథేష్టముగా ప్రాప్తించినను వాటిని ఇంకను వృద్ధి చేసికొనవలయునను కోరికను తృష్ణయందురు. ఇది కోరిక యొక్క సంపూర్ణస్థూలరూపము.

ప్రశ్న - ఇచట **'కామాన్'** అనుపదముతో పాటు **'మనోగతాన్'** అను విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - కోరిక యొక్క వాసస్థానము మనస్సు. (3/40) కావున బుద్ధితోపాటు మనస్సు పరమాత్మయందు నిశ్చలముగా నిల్చినప్పుడు ఇవియన్నియును పూర్తిగా అంతరించిపోవును. కావున సాధకుని మనస్సునందుండు కోరికలన్నియును పూర్తిగా తొలగి పోనంతవఱకును అతని బుద్ధి స్థిరముగా నుండదు.

ప్రశ్న - ఆత్మద్వారా ఆత్మయందే సంతుష్టుడగుట యనగానేమి?

సమా - అంతఃకరణము నందున్న కోరికలన్నియు పూర్తిగా తొలగిపోయిన పిమ్మట సమస్త దృశ్య జగత్తునకు సర్వథా అతీతుడైన నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు ఐన పరమాత్మ యొక్క యథార్థస్వరూపమును దర్శించి, అతనియందే నిత్యతృప్తుడగుటను ఆత్మద్వారా ఆత్మయందు (పరమాత్మ యందు) సంతుష్టుడగుట - అని యందురు. మూడవ అధ్యాయము నందలి 17వ శ్లోకమున గూడ మహాపురుషుల లక్షణములయందు ఆత్మయందే తృప్తి, సంతుష్టి కలిగి యుండు విషయము చెప్పబడినది.

ప్రశ్న - "అప్పుడతడు స్థితప్రజ్ఞుడనబడును" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - కర్మయోగసాధన చేయుగా చేయుగా యోగికి ఉపర్యుక్తస్థితి యేర్పడును. అప్పుడు అతని బుద్ధి పరమాత్మ యందు నిశ్చల స్థితిని పొందినదని, అనగా ఆ యోగికి పరమాత్మప్రాప్తి కల్గినదని భావింపవలెను.

సంబంధము - స్థితప్రజ్ఞుని విషయములో అర్జునుడు నాలుగు ప్రశ్నలను అడిగెను. అందులో మొదటి ప్రశ్నయే మిక్కిలి సమగ్రమైనది. మిగిలిన మూడు ప్రశ్నలును అందులోని అంతర్భాగములే. ఈ దృష్టితో చూచిన ఈ అధ్యాయసమాప్తివఱకు ఈ ప్రశ్నకే సమాధానమును ఇచ్చుచున్నట్లు గ్రహింపనగును. కాని మిగిలిన మూడు ప్రశ్నల భేదమును తెలిసికొనుటకై ఇప్పుడు రెండు శ్లోకములలో 'స్థితప్రజ్ఞుడు' ఎట్లు మాట్లాడును? అను 2వ ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచున్నాడు-

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56 ॥**

దుఃఖేషు = దుఃఖములు ప్రాప్తించినప్పుడు
అనుద్విగ్నమనాః = మనస్సునందు ఉద్వేగమునకు లోనుకానివాడును (క్రుంగిపోనివాడును)
సుఖేషు = సుఖములు కలిగినప్పుడు
విగతస్పృహః = ఆసక్తిరహితుడును (పొంగిపోనివాడును)
వీతరాగ భయక్రోధః = (అట్లే) రాగ భయ క్రోధములను త్యజించినవాడును అగు
మునిః = ముని (మననశీలుడు)
స్థితధీః = స్థితప్రజ్ఞుడు
ఉచ్యతే = అనబడును

**దుఃఖములకు క్రుంగిపోనివాడును, సుఖములకు పొంగిపోనివాడును, ఆసక్తిని, భయక్రోధములను వీడినవాడును ఐనట్టి మననశీలుడు (ముని) స్థితప్రజ్ఞుడన బడును. (56)**

ప్రశ్న - 'దుఃఖేష్వనుద్విగ్నమనాః' అనగానేమి?

సమా - స్థిరబుద్ధి కలిగిన మనుష్యుని అంతఃకరణము నందు ఏ మాత్రము ఉద్వేగస్థితి నెలకొనియుండదు. అతని బుద్ధి పరమాత్మ స్వరూపమునందే నిశ్చలముగా నిల్చియుండుట వలన పరమాత్మ ప్రాప్తినందిన ఆ మహాత్ముని - ఆ స్థితినుండి మహాదుర్భరములైన దుఃఖములు గూడ విచలితునిగా చేయజాలవు. ఇక సామాన్య దుఃఖముల విషయమై చెప్పనేల? (6/22) శస్త్రముల ద్వారా శరీరము ఛేదింపబడుట, అతిదుస్సహములైన శీతోష్ణములును, వర్షము ఉరుములు మెరుపులు మొదలగు వానివలన ఏర్పడు శారీరిక బాధలును, అతి దుస్సహరోగజనితవ్యథలును, ప్రియతమవస్తువు లేక వ్యక్తియొక్క ఆకస్మికవియోగము, కారణము లేకుండగనే సంభవించు అవమానములు, తిరస్కారములు, నిందలు ఇవిగాక ఇంకను పెక్కు మహాదుఃఖములు వచ్చి పైబడినను అవి అతని మనస్సునందు ఏ మాత్రమూ ఉద్వేగమును కల్గింపజాలవు. ఈ కారణమున అతని వచనములయందు గూడ ఎంతమాత్రమూ ఉద్వేగములు ఉండవు. ఒకవేళ లోకహితముకొఱకు శారీరికములైన, వాచికములైన ఉద్వేగభావములు కన్పించినను అవి వాస్తవముగా ఉద్వేగములు కావు.

ప్రశ్న - 'సుఖేషు విగతస్పృహః' అనగానేమి?

సమా - స్థిరబుద్ధిగల మనుష్యుని అంతఃకరణము నందు స్పృహాదోషము ఏమాత్రమును ఉండదు. అతడు సుఖ దుఃఖములు రెండింటియందును సర్వదా సమముగా ఉండును. (12/13, 14/24) మహాదుఃఖములుగూడ అతనిని వాని స్థితినుండి ఏ మాత్రము విచలితునిగా చేయవు. అట్లే మహాసుఖములు గూడ అతని అంతఃకరణమునందు ఏ కొంచెము గూడ స్పృహను కలిగింపవు. ఈ కారణమున అతని వాక్కునందు స్పృహాదోషము ఇసుమంతయైనను ఉండదు. లోకహితముకొఱకు అతనిద్వారా వాక్కువలనను, శరీరము వలనను స్పృహాభావము లేశమాత్రము కనబడినను అది వాస్తవముగా స్పృహ కాదు.

ప్రశ్న - 'వీతరాగభయక్రోధః' - అనగానేమి?

సమా - స్థిరబుద్ధిగల యోగియొక్క అంతఃకరణము నందును వాక్కునందును ఆసక్తి, భయము, క్రోధము ఏమాత్రమూ ఉండవు - ఏదైనను ఒక సంఘటన కారణమున ఎట్టి పరిస్థితియందును అతని యంతఃకరణమున ఏ విధమైన

ఆసక్తియు ఉత్పన్నము కాదు. ఏ కొంచెము భయము గూడ ఉండదు - క్రోధమూ ఉండదు. ఈ కారణమున అతని వాక్కుగూడ ఆసక్తి, భయక్రోధభావరహితమై, శాంతముగా సరళముగా ఉండును. లోకహితముకొఱకు అతని శారీరిక, వాచిక క్రియలద్వారా ఎప్పుడైనను ఆసక్తి, భయక్రోధ భావములు కనబడవచ్చును. కాని వాస్తవముగా అతని మనస్సునందును, వాక్కులయందును ఏ విధమైన వికారములును ఉండవు. పైన పేర్కొనబడినట్లు కేవలము వాక్కును వికారరహితమొనర్చి, మాట్లాడుటకు ధీరుడైన బుద్ధిమంతునకు సాధ్యము కావచ్చును, కాని అతని అంతః కరణమునందు మాత్రము వికారములు లేకుండ ఉండవు. ఈ కారణమున 'స్థిరబుద్ధి గలవాడు ఎట్లు మాట్లాడును?' - అను ప్రశ్నకు సమాధానముగా పైపైని వాచికక్రియను వర్ణింపక అతని మనోభావములను భగవానుడు వర్ణించెను. కావున స్థిరబుద్ధిగల యోగియొక్క వాక్కులు గూడ వాస్తవముగా అతని అంతఃకరణమునకు అనుగుణముగా సర్వథా నిర్వికారమై శుద్ధమై యుండును.

ప్రశ్న - "ఇట్టి మునిని స్థిరబుద్ధిగలవాడని యందురు" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పై లక్షణములుగల యోగియే వాస్తవముగా ముని యనబడును. అతడే వాక్సంయమము కలవాడగును. అతడే స్థిరబుద్ధి. అంతఃకరణేంద్రియములు వికారములతో నిండియుండు నతడు వాక్సంయమియైనను స్థిరబుద్ధి కానేరడు.

**యః సర్వత్రానభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభమ్ ।**
**నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ మనుష్యుడైతే | తత్, తత్ | = ఆయా | తస్య | = అతనియొక్క |
| సర్వత్ర | = అంతట | శుభాశుభమ్ | = శుభాశుభములను | ప్రజ్ఞా | = బుద్ధి |
| న, అభినందతి | = ప్రసన్నుడుకాడో | ప్రాప్య | = పొంది | ప్రతిష్ఠితా | = స్థిరమై యుండును |
| అనభిస్నేహః | = మమతాసక్తులు లేనివాడై | న, ద్వేష్టి | = ద్వేషింపడో | | |

**దేనియందును మమతాసక్తులు లేనివాడును, అనుకూల పరిస్థితులయందు హర్షము, ప్రతికూల పరిస్థితులయందు ద్వేషము మొదలగు వికారములకు లోనుగానివాడును అగు పురుషుడు స్థితప్రజ్ఞుడు అనబడును.** **(57)**

ప్రశ్న - "సర్వత్ర అనభిస్నేహః" అనగానేమి?

సమా - స్థిరబుద్ధిగల యోగియందు అభిస్నేహము అనగా మమతాసహితమైన సాంసారిక, ఆసక్తి ఏ మాత్రమూ ఉండదు. సాంసారికులైన వారు తమ భార్యాపుత్రులు, సోదరులు, మిత్రులు తదితర కుటుంబసభ్యులు మొదలగు వారియందు మమతాసక్తులు కలిగియుందురు. రాత్రింబవళ్ళు వారియందు వ్యామోహితులై యుందురు. అట్లే వారి మాటలయందును ఈ మోహపూర్ణమైన ప్రేమభావములు జాలువాఱుచునే యుండును. స్థిరబుద్ధిగల యోగియందు ఇట్లు ఉండదు. అతనికి ఏ ప్రాణియందును మమతాసక్తులతో గూడిన ప్రేమ యుండదు. కావున అతని మాటలుగూడ మమతాసక్తి దోషరహితములై శుద్ధప్రేమ పూర్ణములై యుండును. ఆసక్తియే కామక్రోధాది వికారములకు మూలము. కనుక ఆసక్తి లేనప్పుడు ఇతర వికారములు ఏవియును ఏమాత్రమును ఉండనే ఉండవు.

ప్రశ్న - 'శుభాశుభం' అను పదము దేనిని సూచించును? దానితోపాటు 'తత్' అను పదము రెండు పర్యాయములు ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - ప్రియమైన - అప్రియమైనవాటిని అనుకూల ప్రతికూలములైన వాటిని '**శుభాశుభం**' అను పదము తెల్పును. వాస్తవముగా స్థిరబుద్ధిగల యోగికి సాంసారిక వస్తువులలో దేనియందును అనుకూల ప్రతికూల భావములుండవు. కేవలము వ్యావహారిక దృష్టిలో అతని మనస్సునకును శరీరేంద్రియములకును అనుకూలముగా కన్పడు వాటిని శుభములు అనియు, ప్రతికూలముగా కన్పడువాటిని అశుభములు అనియు తెల్పుటకే ఇచట

"శుభాశుభం" అనుపదము ప్రయుక్తమైనది. ఇట్టి అనుకూల ప్రతికూల వస్తువులు అనంతములు. వాటిలో ఏయే వస్తువులతో ఆయోగికి సంయోగము ఏర్పడునో ఆయా సంయోగముల యందు అతని భావములు ఎట్లుండునో తెల్పుటకు 'తత్' అను పదము రెండు మార్లు ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'న అభినందతి' అనగానేమి?

సమా - పైన తెల్పబడిన శుభాశుభ వస్తువులలో శుభమైన లేక అనుకూలమైన ఏ ఒక్క వస్తువుతో సంయోగము కల్గినను సామాన్యమానవుల అంతఃకరణములయందు మిక్కిలి సంతోషము కల్గును. వారు హర్షమగ్నులై తమ ఆనందమును మాటలద్వారా ప్రకటించెదరు. ఆ వస్తువును మెచ్చుకొందురు. కాని స్థిరబుద్ధిగల యోగికి అత్యంతము అనుకూలమైన వస్తువులతో సంయోగము ఏర్పడినను అతని అంతఃకరణము నందు లేశమాత్రమూ హర్షవికారము కలుగదు. (5/20) ఈ కారణమున అతని వాక్కులు గూడ సర్వథా హర్షవికార శూన్యములై యుండును. అతడు ఏ అనుకూలమైన వస్తువునుగాని, ప్రాణినిగాని, హర్షమును ప్రకటించుచు ప్రశంసింపడు. లోకహితముకొఱకు అతని వాక్కులద్వారా శరీరము ద్వారా హర్షము ప్రకటింపబడినను, లేక తత్ప్రశంస జరిగినను అది హర్షవికారము కాదు.

ప్రశ్న - 'న ద్వేష్టి' అనగానేమి?

సమా - సామాన్యజనులు అనుకూలవస్తు ప్రాప్తియందు ఏ విధముగా మిక్కిలి హర్షితులగుదురో అదేవిధముగా ప్రతికూలవస్తుప్రాప్తి కల్గినప్పుడు దానిని ద్వేషింతురు - వారి అంతఃకరణమునందు క్షోభ కలుగును. వారు ఆ వస్తువును ద్వేషముతో నిందింతురు - కాని స్థిరబుద్ధిగల యోగికి అత్యంత ప్రతికూలమైన వస్తువుతో సంయోగము ఏర్పడినను అతని అంతఃకరణమునందు లేశమాత్రము గూడ ద్వేష భావము ఉత్పన్నముగాదు - ఆ వస్తుసంయోగము వలన ఏ విధమైన ఉద్వేగముగాని, వికారముగాని ఆనంతయు కలుగదు. అతని అంతఃకరణము సర్వవస్తుప్రాప్తియందును సమముగా శాంతముగా నిర్వికారముగా ఉండును. (5/20) ఈ కారణమున అతడు ప్రతికూలమైన ఏ వస్తువునూ, ప్రాణినీ ద్వేషించుట గాని, నిందించుట గాని జరుగదు. అట్టి మహాత్ముని మాటల ద్వారా లోకహితము కొఱకు ఏదైననొక వస్తునిందగాని, ప్రాణినిందగాని జరిగినను వాస్తవముగా అది నిందగాదు - ఏలనన అతనికి దేనియందును ద్వేషభావము ఉండదు -

ప్రశ్న - "అతని బుద్ధి స్థిరమైనది" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఉపర్యుక్త లక్షణములతో సంపన్నుడైన మహాపురుషుని అంతఃకరణేంద్రియములయందు ఏ వస్తువు లేక ప్రాణియొక్క సంయోగవియోగముల వలనగాని, ఏదైననొక సంఘటనవలనగాని ఏ విధమైన వికారమూ, ఎన్నడునూ ఏ మాత్రమూ ఏర్పడదు. అట్టి వానిని స్థిరబుద్ధిగల యోగి అని భావింపవలెను.

ప్రశ్న - ఈ రెండు శ్లోకములలో సంభాషణా విషయము స్పష్టముగా తెల్పబడలేదు. మఱి "అతడెట్లు మాట్లాడును?" అను ప్రశ్నకు దీనిని సమాధానముగా ఎట్లు భావింపవలెను?

సమా - ఇచట సాధారణ సంభాషణ విషయము కాదని మొదటనే తెల్పబడినది. ఒకనేళ ఇది కేవలము వాగ్విషయమే ఐనచో ఎవడైనను 'దంభి' లేక 'కపటి' యైనవాడు మధుర వచనములను కంఠస్థమొనరించి చెప్పియుండ వచ్చును. ఇచట యథార్థముగా మనోభావములకే ప్రాముఖ్యము గలదు. ఈ రెండు శ్లోకములయందు మనోభావములను అనుసరించి, ప్రకటింపబడిన వాణిని గూర్చియే భగవానుడు తెల్పెను. కావున ఇచట వచన స్పష్టత, లేక మాధుర్యముల కంటెను మనోభావములకు ఎక్కువ ప్రాముఖ్యము ఇయ్యబడినది.

సంబంధము - "స్థిరబుద్ధిగల యోగి ఎట్లు మాట్లాడును?" అను రెండవ ప్రశ్నకు భగవానుడు సమాధానమునిచ్చెను. 'ఇప్పుడు అతడు ఎట్లు కూర్చొనును?' అను మూడవ ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచు స్థితప్రజ్ఞుని ఇంద్రియములు సర్వథా అతని వశమునందుండునని ఆసక్తిరహితముగా ఆయా ఇంద్రియార్థములనుండి ఉపరతుడగునని తెల్పుచున్నాడు-

**యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | యదా | = ఎప్పుడైతే | | ఉప సంహరించుకొనునో |
| కూర్మః | = తాబేలు | అయమ్ | = ఇతడు | తస్య | = (అప్పుడు) |
| సర్వశః | = అన్నివైపులనుండి | | (ఈ పురుషుడు) | | అతనియొక్క |
| అంగాని | = (తన) అంగములను | ఇంద్రియార్థేభ్యః | = ఇంద్రియార్థములనుండి | ప్రజ్ఞా | = బుద్ధి |
| సంహరతే, ఇవ | = ముడుచుకొనునట్లు | ఇంద్రియాణి | = ఇంద్రియములను | ప్రతిష్ఠితా | = స్థిరమైనది (అని |
| | | (సంహరతే) | = అన్ని విధముల | | భావింపవలెను). |

**తాబేలు తనఅంగములను అన్నివైపులనుండి లోనికి ముడుచుకొనునట్లుగా, ఇంద్రియములను ఇంద్రియార్థముల (విషయాదుల) నుండి అన్నివిధముల ఉపసంహరించుకొనిన పురుషుని యొక్క బుద్ధి స్థిరముగా ఉన్నట్లు భావింపవలెను. (58)**

ప్రశ్న - తాబేలువలె ఇంద్రియ విషయములనుండి ఇంద్రియములను అన్ని విధములుగ ఉపసంహరించుకొనుట యనగానేమి?

సమా - తాబేలు తన సమస్తాంగములను అన్నివైపుల నుండి లోనికి ముడుచుకొని స్థిరముగా నుండును. అట్లే సమాధికాలమునందు సాధకుడు సమస్త ఇంద్రియ వ్యాపారములను వాటి శబ్దాది విషయ భోగముల నుండి ఉపసంహరించుకొనును. ఏ ఇంద్రియము కూడ ఏ భోగములవైపునకు ఆకర్షితముగాక ఆ ఇంద్రియముల యందు మనోబుద్ధులను చలింపజేయు శక్తి తొలగిపోయినచో ఆస్థితినే తాబేలువలె ఇంద్రియములను ఇంద్రియ విషయములనుండి ఉపసంహరించుట యందురు. బాహ్యముగా ఇంద్రియములను నిరోధించి స్థూల విషయముల నుండి ఇంద్రియములను మఱల్చినప్పటికిని ఇంద్రియవృత్తులు విషయములవైపు పరుగులు తీయుచునే యుండును. ఈ కారణమువలన సామాన్య మానవుడు స్వప్నములో మనఃప్రపంచమునందు ఇంద్రియముల ద్వారా సూక్ష్మ విషయములను అనుభవించుచుండును. ఈ విధముగ విషయోప భోగముల నుండియు ఇంద్రియములను సర్వథా ఉపసంహరించు కొనవలెనని తెల్పుటకే 'సర్వశః' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - "అతని బుద్ధి స్థిరముగా నుండును" - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఇంద్రియములన్నియును తన వశము నందుంచుకొనిన వాని మనస్సు, బుద్ధి విషయములవైపు ఏ విధముగను ఆకర్షితములు కావు. ఈ విధముగా వశములోనున్న ఇంద్రియములను సర్వథా ఇంద్రియ విషయముల నుండి ఉపసంహరించుకొనినప్పుడు అతని బుద్ధి స్థిరమగును. ఇంద్రియములు వశములో లేని వాని బుద్ధి స్థిరముగా ఉండజాలదు. ఏలనన ఇంద్రియములు మనస్సును బుద్ధిని బలవంతముగా విషయానుభవములయందు మగ్నము చేయును.

*సంబంధము* - పూర్వ *(58వ)* శ్లోకమున *3వ* ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచు స్థితప్రజ్ఞుడు కూర్చొను రీతిని దెల్పి అందులో కలుగు సందేహములను దీర్చుటకై సామాన్య మానవుల ఇంద్రియసంయమ రీతులకంటెను స్థితప్రజ్ఞుని ఇంద్రియసంయమము విలక్షణమైనదని తెల్పుచున్నాడు-

**విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।**
**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 59 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| నిరాహారస్య | = ఇంద్రియములద్వారా | విషయాః | = శబ్దాదివిషయములు | రసః అపి | = ఆసక్తి కూడ |
| | విషయములను | వినివర్తంతే | = నివృత్తములగును | పరమ్ | = పరమాత్మను |
| | గ్రహింపని | రసవర్జమ్ | = (కాని) వాటియందలి | దృష్ట్వా | = చూచి (సాక్షాత్కారము |
| దేహినః | = పురుషునియొక్క | | ఆసక్తి మాత్రము పోదు | | పొంది) |
| | (పురుషునినుండి) | అస్య | = ఈ స్థితప్రజ్ఞుని యొక్క | నివర్తతే | = నివృత్తమగును. |

**ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహింపనివానినుండి ఇంద్రియార్థములు మాత్రము వైదొలగును. కాని వాటిపై ఆసక్తి మిగిలియుండును. స్థితప్రజ్ఞునకు పరమాత్మ సాక్షాత్కారమైనందు వలన వానినుండి ఆ ఆసక్తిగూడ తొలగిపోవును. (59)**

ప్రశ్న - ఇచ్చట **'నిరాహారస్య'** అను విశేషణముతో పాటు **'దేహిన:'** అను పదము దేనిని తెల్పును?

సమా - ప్రపంచమున భోజనము మానిన వానిని 'నిరాహారి' అనియందురు. కాని ఇచ్చట **'నిరాహారస్య'** అను పదము ఆ యర్థములో ప్రయుక్తము కాలేదు. ఏలనన ఇచ్చట **'విషయా:'** అను బహువచన ప్రయోగముచే సమస్త విషయములనుండి నివృత్తమగు సంగతి తెల్పబడినది. భోజనత్యాగము వలన కేవలము జిహ్వేంద్రియమే నివృత్తమగును. కాని శబ్ద స్పర్శరూపగంధముల నివృత్తికాదు. కావున ప్రతి ఇంద్రియ విషయము దానికి ఆహారముగా భావింపవలెను. ఈ దృష్టితో అన్ని ఇంద్రియముల ద్వారా సమస్త ఇంద్రియ విషయములను గ్రహించుట మానివేసిన దేహాభిమానిని ఇచట 'నిరాహారస్య' అను విశేషణముతో పాటు **'దేహిన:'** అను పదము తెలుపును.

ప్రశ్న - "ఇట్టి మనుష్యులనుండి కేవలము విషయములు మాత్రమే నివృత్తములగును. కాని వాటి నుండి ఆసక్తి తొలగిపోదు" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - విషయపరిత్యాగము చేయు అజ్ఞానియు తాబేలు వలె తన ఇంద్రియములను విషయములనుండి పైపైన మాత్రమే మరల్పగలడు. కాని ఆ విషయములయందు అతని ఆసక్తి నిల్చియే యుండును. అది తొలగిపోదు - ఈ కారణమున అతని ఇంద్రియ వృత్తులు విషయములవైపు పరుగులు దీయుచుండును. అవి అంత:కరణమును స్థిరముగా ఉండనీయవు - ఈ క్రింది ఉదాహరణముల ద్వారా ఈ విషయము బాగుగా అవగాహన కాగలదు.

రోగము లేక మృత్యుభయమువలన లేక మరే కారణమువలన నైనను విషయాసక్తుడైన వాడు ఏదోయొక విషయమును లేక పెక్కు విషయములను పరిత్యజించును. అప్పుడా విషయము నివృత్తియగును. అన్ని విషయములను త్యజించుట వలన విషయములన్నియును నివృత్తములు గావచ్చును. కాని ఆ నివృత్తి పట్టుదల, భయము, లేక మరొక కారణముచే ప్రేరేపింపబడినది మాత్రమే. కాని అట్టి నివృత్తిచే వాస్తవముగ ఆ విషయముల యందలి ఆసక్తి తొలగిపోదు.

దంభి(కపటి)యైనవాడు ఇతరులకు ప్రదర్శించుటకై శబ్దాది దశేంద్రియ విషయములను బాహ్యముగా పరిత్యజించినప్పుడు అవి పైపైన నివృత్తియగును. కాని ఆసక్తి యుండుట వలన మనస్సులో ఆ ఇంద్రియ విషయముల చింతన మాత్రము వీడదు. **(3/6)** కనుక అతని ఆసక్తి మాత్రము ఎప్పటి వలెనే స్థిరముగా ఉండును. భౌతిక సుఖములను కోరువాడు అణిమాది సిద్ధుల ప్రాప్తికొఱకును, లేక ఇతర విషయసుఖముల ప్రాప్తి కొఱకును ధ్యానకాలము నందును సమాధి అవస్థ యందును దశేంద్రియ విషయములను పైపైన త్యజించును. మనస్సునను వాటి చింతన చేయడు - కాని ఆ భోగానుభవములయెడ ఆసక్తి మాత్రము ఉండును. అది తొలగిపోదు. ఈ విధముగా పైపైన విషయ పరిత్యాగము చేయుటవలన విషయములు నివృత్తములు కావచ్చునేమోగాని వాటియందలి ఆసక్తి ఏమాత్రము తొలగిపోదు.

ప్రశ్న - ఇచట రసము అను పదమునకు అర్థము ఆస్వాదనము, లేక మనస్సుద్వారా అనుభవించుట అని భావించి, "దాని రసము నివృత్తముకాదు" అను వాక్యము యొక్క అర్థము "అట్టి పురుషుడు బాహ్యముగా విషయములను త్యజించినప్పటికిని మనస్సు ద్వారా వాటి ఉపభోగానుభవముల ఆనందమును పొందుచునే యుండును" అని చెప్పినచో కలుగు దోషమేమి?

సమా - పై వాక్యమునకు ఇట్టి అర్థమును గూడ చెప్పవచ్చును. కాని ఈ విధముగా మనస్సు ద్వారా విషయాస్వాదనము విషయములయందు ఆసక్తియున్నప్పుడే జరుగును - కావున 'రసము' అను పదమునకు 'ఆసక్తి' అను అర్థమును చెప్పినచో ఈ విషయముగూడ అందులో అంతర్గతమగును. మఱొక విషయము - పరమాత్మ సాక్షాత్కారమునకు పూర్వము పట్టుదల, వివేక విచారముల ద్వారా కూడ ఈ విధమైన మానసిక విషయోపభోగములను నిరోధింపవచ్చును. పరమాత్మ సాక్షాత్కారమైనంతనే దానికి మూలమైన (విషయోపభోగమునకు మూలమైన) ఆసక్తియు నశించును. పరమాత్మ సాక్షాత్కార సార్థకత ఇందులోనే

కలదు. అది (ఆ సార్థకత) మనస్సునుండి విషయోపభోగములను తొలగించుటలోలేదు. కావున 'రసము' అను పదమునకు ఇచ్చట ఇయ్యబడిన అర్థమే సరియైనది.

ప్రశ్న - 'అస్య' అను పదము దేనిని తెల్పును? దీని ఆసక్తి గూడ పరమాత్మ సాక్షాత్కారమైన పిమ్మట నివృత్తి యగును అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ ప్రకరణమును బట్టి 'అస్య' అనుపదము 'స్థితప్రజ్ఞుడైన యోగిని' సూచించును. అట్టి యోగికి పరమానంద సముద్రుడైన పరమాత్మ సాక్షాత్కారము కలుగుటవలన అతనికి మఱియే సాంసారిక పదార్థము నందును ఏ మాత్రమూ ఆసక్తి యుండదు - ఏలనన ఆసక్తికి కారణము 'అవిద్య'.[1] పరమాత్మ సాక్షాత్కారమైనంతనే అవిద్య తొలగిపోవును. సామాన్య మానవులకు మోహవశమున ఇంద్రియభోగముల యందు సుఖము ప్రతీత మగును. కావున వారికి ఆ భోగములయందు ఆసక్తియుండును. కాని వాస్తవముగ భోగములలో సుఖము ఏ మాత్రము ఉండదు. వాటిలో ప్రతీతమగు ఏ కొద్దిపాటి సుఖము గూడ పరమానంద స్వరూపుడైన ఆ పరమాత్మ యొక్క ఆనందమునందలి ఒక అంశము యొక్క ఆభాసమాత్రమే - చీకటి రాత్రియందు మినుకు మినుకు మనుచున్న నక్షత్రములయందు ప్రతీతమగు ప్రకాశము సూర్యప్రకాశము యొక్క ఆభాసమే - సూర్యోదయమైనంతనే వాటి ప్రకాశము అదృశ్యమగును. అదేవిధముగ సాంసారిక పదార్థములయందు ప్రతీతమగు సుఖము ఆనందమయుడైన పరమాత్మానందముయొక్క ఆభాసమాత్రమే - కావున పరమానందస్వరూపుడైన పరమాత్మ యొక్క ప్రాప్తి కల్గిన వానికి ఈ భోగములయందు సుఖము ప్రతీతమేగాదు - (2/69) అతనికి వాటియందు కించిన్మాత్రము గూడ ఆసక్తి యుండదు.

పరమాత్మ ఒక అద్భుత, అలౌకిక, దివ్య, ఆకర్షక వస్తువు. అది ప్రాప్తించినంతనే ఆత్మ అందులీనమై, ముగ్ధమై, తన్మయమై, తన అస్తిత్వమునే కోల్పోవును. మఱి తదితర వస్తు చింతనము ఎట్లు జరుగును? కావున పరమాత్మ సాక్షాత్కారమువలన ఆసక్తి సర్వథా నివృత్తమగునని తెల్పబడినది.

ఈ విధముగా ఆసక్తి లేకుండుట వలన స్థితప్రజ్ఞుని సంయమమునందు కేవలము విషయనివృత్తి మాత్రమేగాక సమూలముగా ఆసక్తికూడ సర్వథా అభావమగును - ఇదియే దానివైశిష్ట్యము.

*సంబంధము - ఆసక్తినాశము, ఇంద్రియసంయమము లేనిచో కలుగు హానియేమి? అను విషయమును గూర్చి భగవానుడు చెప్పుచున్నాడు-*

**యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।**
**ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ 60 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = ఓ అర్జునా! | ఇంద్రియాణి | = ఇంద్రియములు | మనః అపి | = మనస్సును గూడ |
| హి | = ఆసక్తినశింపని కారణమున | యతతః | = ప్రయత్నించునట్టి | ప్రసభమ్ | = బలవంతముగా |
| | | విపశ్చితః | = బుద్ధిమంతుడైన | హరంతి | = లాగికొనిపోవును. |
| ప్రమాథీని | = ప్రమథనశీలములైన | పురుషస్య | = పురుషుని యొక్క | | |

**ఓ అర్జునా! ఇంద్రియములు ప్రమథనశీలములు. మనుష్యుడు వాటిని నిగ్రహించుటకు ఎంతగా ప్రయత్నించినను, ఆసక్తి తొలగి పోనంతవఱకును అవి అతని మనస్సును ఇంద్రియార్థములవైపు బలవంతముగా లాగికొనిపోవుచునే యుండును. (60)**

1) అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః - (యోగ సూత్ర 2/3.) అజ్ఞానము, చిజ్జడగ్రంథి అనగా జడ చేతనములు ఒకే విధముగా ప్రతీతమగుట, ఆసక్తి, ద్వేషము, మృత్యుభయము, ఈ ఐదింటిని క్లేశములని యందురు. అవిద్యాక్షేత్రముత్తరేషాం- (యోగసూత్ర - 2/4) పైన తెల్పబడిన ఐదింటిలో చివరి నాల్గింటికిని అవిద్యయే మూలము - అనగా అవిద్య వలననే రాగద్వేషాదులు కలుగును.

ప్రశ్న - 'హి' అను అవ్యయ ప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - దేహళీ దీపన్యాయము ననుసరించి, ఈ శ్లోకమునకు పూర్వ (59వ)శ్లోకముతోను, రాబోవు (61వ) శ్లోకముతోను అన్వయము (సంబంధము) కలదని 'హి' అను అవ్యయప్రయోగము తెల్పుచున్నది. విషయములను కేవలము బాహ్యముగా (పైపైన) త్యజించుట వలన పురుషుని విషయములే నివృత్తములగును. అతనికి వాటియందలి రాగము నివృత్తము గాదు - అని పూర్వశ్లోకమున తెల్పబడినది. రాగము నివృత్తముకానిచో హానియేమి? అను సందేహము కల్గును. దీనికి సమాధానముగా ఈ శ్లోకమునందు మనుష్యునకు విషయమునందు ఆసక్తి యున్నంత వఱకు ఆ ఆసక్తి కారణముగ అతని ఇంద్రియములు అతనిని బలవంతముగా విషయముల యందు ప్రవృత్తునిగా చేయును. కావున అతని మనస్సు, బుద్ధి స్థిరముగా పరమాత్మ స్వరూపమునందు నిమగ్నము కావు. ఈ విధముగా ఇంద్రియములు మనుష్యుని మనస్సును బలవంతముగా హరించును. గావున ఇంద్రియములన్నింటిని వశపఱచుకొని సమాహితచిత్తుడై మనుష్యుడు భగవత్పరాయణుడై ధ్యానమున స్థితుడై యుండవలెను - అని రాబోవు శ్లోకమున భగవానుడు తెల్పుచున్నాడు. ఈ విధముగా 'హి' అను పదము పూర్వాపర (59, 61) శ్లోకములతో ఈ శ్లోకమునకు గల సంబంధమును తెల్పును.

ప్రశ్న - 'ఇంద్రియాణి' అను పదముతో గూడ 'ప్రమాథీని' అను విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - మనుష్యుడు ఇంద్రియములను వశపఱచుకొననంత వఱకును అతనికి ఇంద్రియ విషయములయందు ఆసక్తి యుండును. అప్పుడు ఇంద్రియములు అతని మనస్సును పునఃపునః విషయసుఖముల ప్రలోభములకు గురిచేయుచునే యుండును. అతనిని స్థిరముగా ఉండనీయవు- అనగా అతని మనస్సును మథించును. (తికమకలపాలు చేయును) ఈ విషయమును తెల్పుటకై 'ప్రమాథీని' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ఇచట 'యతతః' 'విపశ్చితః' అను రెండు విశేషణములతో పాటు, 'పురుషస్య' అను పదము ఎవరిని తెల్పును? 'అపి' అను అవ్యయ ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - శాస్త్రముల శ్రవణ మననముల ద్వారా, వివేకవిచారముల ద్వారా, విషయముల దోషములను తెలిసికొన్నవాడును, విషయములనుండి ఇంద్రియములను మరల్చుటకు ప్రయత్నము చేయువాడును అయినప్పటికిని, విషయాసక్తి నశింపని కారణమున ఇంద్రియములు అతనికి వశములో ఉండవు. అట్టి బుద్ధిమంతుడు, యత్నశీలుడు ఐన సాధకుని తెల్పునదియే ఇచ్చట 'యతతః' 'విపశ్చితః' అను రెండు విశేషణములతో గూడిన 'పురుషస్య' అను పదము - విషయాసక్తి కారణమున ఇట్టి బుద్ధిమంతుడును, వివేకియు, యత్నశీలుడును ఐన మనుష్యుని మనస్సును కూడ ప్రమథనశీలములైన ఇంద్రియములు బలవంతముగా విషయములయందు ప్రవృత్తమగునట్లు చేయును - ఇక సామాన్య మానవుల విషయము చెప్పనేల? దీనిని స్పష్టపఱచుటకే 'అపి' అను అవ్యయము ప్రయోగింపబడినది. కనుక స్థితప్రజ్ఞస్థితిని చేరుటకు కోరిక గల మనుష్యుడు ఆసక్తిని సర్వథా త్యజించి, ఇంద్రియములను తన వశములో ఉంచుకొనుటకు గట్టిగా ప్రయత్నింపవలెను.

సంబంధము - ఈ విధముగా ఇంద్రియ సంయమముయొక్క ఆవశ్యకస్థితిని ప్రతిపాదించి, ఇప్పుడు భగవానుడు సాధకుని కర్తవ్యమును తెలుపుచు ఇంద్రియ సంయమమును స్థితప్రజ్ఞుని స్థితికి హేతువుగా తెల్పుచున్నాడు-

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61 ॥**

తాని, సర్వాణి = ఆ సమస్తములైన ఇంద్రియములను
సంయమ్య = వశము నందుంచుకొని
యుక్తః = సమాహిత చిత్తుడైనవాడు
మత్పరః = మత్పరాయణుడై
ఆసీత = ధ్యానమునందు కూర్చొనవలెను
హి = ఏలనన
యస్య = ఎవనియొక్క
ఇంద్రియాణి = ఇంద్రియములు
వశే = వశమునందు (ఉండునో)
తస్య = అతనియొక్క
ప్రజ్ఞా = బుద్ధియే
ప్రతిష్ఠితా = స్థిరమైయుండును.

**కనుక సాధకుడు ఆ ఇంద్రియములను అన్నింటిని వశమునందుంచుకొని, సమాహితచిత్తుడై (చిత్తమును పరమాత్మయందు లగ్నముచేసినవాడై) మత్పరాయణుడై, ధ్యానమునందు కూర్చొనవలెను. ఏలనన ఇంద్రియములను వశమునందుంచుకొనువాని బుద్ధి స్థిరముగానుండును. (61)**

ప్రశ్న - 'ఇంద్రియాణి' అను పదముతోపాటు 'సర్వాణి' అను విశేషణమును ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - సమస్త ఇంద్రియములను వశములో నుంచుకొనవలసిన అవసరమును దెలుపుటకు 'సర్వాణి' అను విశేషణము ప్రయుక్తమైనది. ఏలనన ఇంద్రియములలో ఏ ఒక్కటి వశములో లేకున్నను అది మనుష్యుని మనస్సును, బుద్ధిని చలింపజేసి, సాధనయందు విఘ్నము కలిగించును. (2/67) కావున పరమాత్మ ప్రాప్తిని కాంక్షించు వాడు ఇంద్రియములను అన్నింటిని పూర్తిగా వశములో ఉంచుకొన వలయును.

ప్రశ్న - "సమాహిత చిత్తుడును, భగవత్పరాయణుడును అయి, ధ్యానమునందు కూర్చొనవలెను." - అని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - ఇంద్రియసంయమము కల్గియున్నప్పటికిని, మనస్సు వశములో లేనిచో మనస్సుద్వారా విషయచింతన కలిగి సాధకుడు పతనమగును. మనస్సు, బుద్ధి పరమాత్మ యందు నిమగ్నముకానిచో అవి స్థిరముగా ఉండజాలవు. ఈ కారణమున సాధకుడు సమాహితచిత్తుడై భగవత్పరాయణుడై పరమాత్మ ధ్యానమునందే కూర్చొనవలెనని చెప్పబడినది. 6వ అధ్యాయమున ధ్యానయోగ ప్రసంగమున గూడ ఈ విషయమే చెప్పబడినది. (6/14) ఈ విధముగా మనస్సును, ఇంద్రియములను వశములో నుంచుకొని, పరమాత్మ ధ్యానమునందు నిమగ్నమైన మనుష్యుని బుద్ధి స్థిరమగును - శీఘ్రముగనే అతనికి పరమాత్మ ప్రాప్తి కల్గును.

ప్రశ్న - "ఇంద్రియములను వశమునందుంచుకొనిన వాని బుద్ధి స్థిరమగును" - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ శ్లోక పూర్వార్థమునందు ఇంద్రియములను వశపఱచుకొని, సాధకుడు సంయుతచిత్తుడై భగవత్పరాయణుడై ధ్యానమునందు కూర్చొనవలెనని తెల్పబడినది. ఆ విషయమే ఉత్తరార్థమున సహేతుకముగ తెల్పబడు చున్నది. మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించి, మనస్సును, ఇంద్రియములను సంయమితమొనర్చి బుద్ధిని పరమాత్మ స్వరూపమునందు స్థిరపరచవలెను. ఏలనన మనస్సుతో సహా ఇంద్రియములను వశపఱచుకొన్న సాధకునిబుద్ధి స్థిరముగా ఉండును. మనస్సు ఇంద్రియములు వశములో లేనివాని బుద్ధి స్థిరముగా ఉండజాలదు. కావున సాధకుడు మనస్సును ఇంద్రియములను తన వశములో ఉంచుకొనుట అత్యంతావశ్యకము.

*సంబంధము - పైన తెల్పబడిన రీతిగా మనస్సును, ఇంద్రియములను వశపఱచుకొనక, భగవత్పరాయణుడు కాకయున్నచో కలుగు హాని రెండు శ్లోకములలో వివరించుచున్నాడు-*

**ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।**
**సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥ 62 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| విషయాన్ | = శబ్దాదివిషయములను | సంగః | = ఆసక్తి | సంజాయతే | = ఉత్పన్నమగును |
| ధ్యాయతః | = చింతన చేయుచుండునట్టి | ఉపజాయతే | = ఏర్పడును | కామాత్ | = కోరికవలన (ఆ కోరిక తీరనప్పుడు) |
| పుంసః | = పురుషునకు | సంగాత్ | = ఆసక్తివలన | | |
| తేషు | = ఆ (శబ్దాది) విషయములయందు | కామః | = కామము (విషయ వాంఛ) | క్రోధః | = కోపము |
| | | | | అభిజాయతే | = కలుగును |

**విషయచింతన చేయు పురుషునకు ఆ విషయములయందు ఆసక్తి ఏర్పడును. ఆసక్తివలన ఆ విషయములను పొందుటకై కోరికలు కలుగును. ఆ కోరికలు తీరనప్పుడు క్రోధము ఏర్పడును. (62)**

ప్రశ్న - "విషయ చింతన చేయువానికి ఆ విషయములయందు ఆసక్తియేర్పడును" - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - భోగములనే సుఖములుగా, రమణీయములుగా తలంచు వాడును, మనస్సు వశములో లేనివాడును, పరమాత్మ చింతన చేయనివాడును ఐన మనుష్యునకు పరమాత్మ యందు భక్తికలుగదు. ఆయనను ఆశ్రయింపడు. అందువలన అతని మనస్సు ఇంద్రియ విషయములనే చింతన చేయుచుండును. ఈ విధముగా విషయచింతన చేయగా చేయగా ఆ విషయముల యందు అతనికి అత్యంతము ఆసక్తి కలుగును. అప్పుడు అతని మనస్సు అతని స్వాధీనములో ఉండక విచలితమగును.

ప్రశ్న - విషయచింతనవలన మనుష్యులందరి మనస్సులలో ఆసక్తి జనించునా?

సమా - పరమాత్మప్రాప్తినందిన పురుషులలో విషయచింతన వలన ఆసక్తి కలుగునను ప్రశ్న ఉదయింపదు- 'పరం దృష్ట్వా నివర్తతే' అను వాక్యముద్వారా ఇట్టి పురుషులలో 'ఆసక్తి' ఏ మాత్రము ఉండదని భగవానుడు పేర్కొనెను. వీరుగాక ఇతరుల అందఱి మనస్సులలో కొద్దిగనో గొప్పగనో 'ఆసక్తి' కలుగుచునే యుండును.

ప్రశ్న - ఆసక్తివలన కోరికలు కలుగుట యనగానేమి? కోరికలవలన క్రోధము ఏర్పడుట యనగానేమి?

సమా - విషయచింతన చేయగా చేయగా మనుష్యునకు వాటియందు ఆసక్తి యేర్పడినప్పుడు అతని మనస్సులో నానావిధములైన భోగముల ప్రాప్తికొఱకు ఇచ్ఛలు ప్రబలములగును. ఆసక్తివలన కోరికలు తలయెత్తుట యనగా ఇదియే. ఈ కోరికలు తీరుటయందు ఏదో ఒకవిధమైన 'విఘ్నము' ఏర్పడుటవలన ఆ విఘ్నకారణముపై ద్వేషబుద్ధి గలిగి క్రోధము ఉత్పన్నమగును - కోరికలవలన క్రోధము ఏర్పడుట యనగా ఇదియే.

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 63 ॥**

క్రోధాత్ = క్రోధమువలన
సమ్మోహః = అత్యంతమైన మోహము
భవతి = ఉత్పన్నమగును
సమ్మోహాత్ = ఆ వ్యామోహమువలన
స్మృతివిభ్రమః = స్మృతి (జ్ఞాపక శక్తి) భ్రమ ఏర్పడును
స్మృతిభ్రంశాత్ = స్మృతిభ్రమవలన
బుద్ధినాశః = బుద్ధి (జ్ఞానశక్తి) నశించును
బుద్ధినాశాత్ = బుద్ధి (బలము) నశించుటవలన
ప్రణశ్యతి = (ఆ పురుషుడు తన స్థితినుండి) పతనమగును.

అట్టి క్రోధమువలన వ్యామోహము కలుగును. దాని ప్రభావమున స్మృతి ఛిన్నాభిన్నమగును. స్మృతిభ్రష్టమైనందున బుద్ధి అనగా జ్ఞానశక్తి నశించును. బుద్ధినాశమువలన మనుష్యుడు తన స్థితినుండి పతనమగును. **(63)**

ప్రశ్న - క్రోధమునుండి ఉత్పన్నమైన సమ్మోహము (అత్యంత మూఢభావము) యొక్క స్వరూపమేమి?

సమా - మనుష్యుని అంతఃకరణమునందు క్రోధవృత్తి ఉత్పన్నము ఐనప్పుడు వివేకశక్తి నశించును. అప్పుడు అతడు మంచిచెడ్డలను ఏ మాత్రము ఆలోచింపజాలడు. క్రోధమునకులోనై అతడు చేయు కార్యముయొక్క పరిణామములను ఏమాత్రము పట్టించుకొనడు. క్రోధమువలన ఉత్పన్నమగు సమ్మోహముయొక్క స్వరూపమిదియే.

ప్రశ్న - సమ్మోహము వలన కలుగు స్మృతి విభ్రమము యొక్క స్వరూపమేమి?

సమా - క్రోధమువలన మనుష్యుని అంతఃకరణమున మూఢభావము వృద్ధియగును. స్మరణశక్తి భ్రమకు లోనగును. కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుకొనలేని స్థితి యేర్పడును. ఏ మనుష్యులతో ఎట్లు ప్రవర్తింపవలెనో గుర్తెఱుంగజాలడు. అతనికి గల స్మృతిశక్తి క్షీణించి (ఛిన్నాభిన్నమై) అనుకొనిన పనులను నెరవేర్చలేడు. సమ్మోహము వలన కలిగిన స్మృతి విభ్రమము అనగా నిదియే.

ప్రశ్న - స్మృతి విభ్రమమువలన బుద్ధి నశించుటయు, బుద్ధినాశమువలన మనుష్యుడు తన స్థితి నుండి పతనమగుటయు అనగానేమి?

సమా - పైన తెల్పబడిన రీతిగా స్మృతి విభ్రమము కలుగుటవలన అంతఃకరణమునందు కర్తవ్యాకర్తవ్య నిశ్చయశక్తిని కోల్పోవుటయే బుద్ధినాశము అనబడును. ఇట్టి స్థితియందు మనుష్యుడు తన కర్తవ్యమును త్యజించి, అకర్తవ్యమునందు ప్రవృత్తుడగును. అతని నిత్య వ్యావహారిక జీవితములో కటుత్వము, కఠోరత్వము, పిరికితనము, హింస, ప్రతిహింస, దైన్యము, జడత్వము, మూఢత్వము మొదలగు అవగుణములు చేరును. అందువలన అతనికి పతనము ప్రారంభమగును. అతడు శీఘ్రముగా మొదటి స్థితినుండి దిగజారును. మరణానంతరము అతనికి వివిధములగు నీచజన్మలును, నరకమూ ప్రాప్తించును. బుద్ధినాశమువలన తన స్థితినుండి పతనమగుటయనగా నిదియే.

*సంబంధము - మనస్సు, ఇంద్రియములు వశములో లేని మనుష్యుని పతనక్రమమును తెల్పిన పిమ్మట భగవానుడు "స్థితప్రజ్ఞుడైన యోగి ఎట్లునడచుకొనును?" అను నాల్గవ ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచున్నాడు - మనస్సు, ఇంద్రియములు వశములో నున్న సాధకుడు విషయములయందు ఎట్లు చరించును? దాని ప్రభావమేమి? అను విషయములను రెండు శ్లోకములలో తెల్పుచున్నాడు-*

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ **64** ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | ఆత్మవశ్యైః | = తన వశములోనున్న | చరన్ | = సేవించుచున్నను |
| విధేయాత్మా | = అంతఃకరణము అదుపులోగల సాధకుడు | రాగద్వేషవియుక్తైః | = రాగద్వేషరహితములైన | ప్రసాదమ్ | = అంతఃకరణ ప్రసన్నతను |
| | | ఇంద్రియైః | = ఇంద్రియములద్వారా | | |
| | | విషయాన్ | = విషయములను | అధిగచ్ఛతి | = పొందును. |

**అంతఃకరణమును వశమునందుంచుకొనిన సాధకుడు రాగద్వేషరహితుడై, ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహించుచున్నను మనశ్శాంతిని పొందును. (64)**

ప్రశ్న - 'తు' అను అవ్యయప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - మనస్సు, ఇంద్రియములు వశములో లేని విషయాసక్తుడైన మనుష్యుని పతనమును గూర్చి పూర్వ శ్లోకము నందు వర్ణించుట జరిగినది. ఇప్పుడు అతనికంటె విలక్షణుడై మనస్సును, ఇంద్రియములను వశపఱచుకొనిన విరక్తుడైన సాధకుని ఉన్నతిని గూర్చి రెండు శ్లోకములలో భగవానుడు వర్ణించుచున్నాడు. ఈ భేదమును తెల్పుటకే 'తు' అను అవ్యయము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'విధేయాత్మా' అను పదము ఎట్టి సాధకుని తెల్పును?

సమా - అంతఃకరణమును పూర్తిగా వశపరచుకొనిన సాధకుని 'విధేయాత్మా' అను పదము తెల్పును.

ప్రశ్న - అట్టి సాధకుడు రాగద్వేష రహితుడై తనకు వశములోనున్న ఇంద్రియముల ద్వారా విషయములయందు చరించుట యనగానేమి?

సమా - సామాన్యమానవుల ఇంద్రియములు స్వతంత్రములు. (విశృంఖలములు). అవి వారి వశములో ఉండవు - ఆ ఇంద్రియములయందు రాగద్వేషములు నిండియుండును. ఆ కారణమున మనుష్యుడు ఇంద్రియములకు వశుడై, భోగములను అనుభవించుచు ఉచితానుచితములను విస్మరించి ఏదోయొక విధముగ భోగసామగ్రిని సమకూర్చుకొనుచు ఆ భోగానుభవముల యందు రాగద్వేషములు ఏర్పడి, సుఖదుఃఖములను పొందుచుండును. అతడు ఆధ్యాత్మిక సుఖములను అనుభవింపజాలడు.

కాని పైన పేర్కొనబడిన సాధకుడు ఇంద్రియములను వశములో నుంచుకొని యుండుట వలన అతనిలో రాగద్వేషములేమాత్రమూ ఉండవు. అందువలన అతడు తన

వర్ణాశ్రమ పరిస్థితులను అనుసరించి, తన యోగ్యతను బట్టి లభించిన భోగములయందు రాగద్వేషములు లేకుండ సంచరించును. అతని చూచుట, వినుట, తినుట, త్రాగుట, లేచుట, కూర్చొనుట, మాట్లాడుట, నర్తించుట, నడచుట, తిరుగుట, నిద్రించుట, మేల్కొని యుండుట మొదలగు సమస్త ఇంద్రియ వ్యవహారములు నియమితములై, శాస్త్రవిహితములై యుండును. అతని క్రియలన్నింటి యందును రాగద్వేష కామక్రోధలోభాదివికారములు ఏమాత్రమూ ఉండవు. రాగద్వేషరహితుడై తన వశములోనున్న ఇంద్రియముల ద్వారా ఇంద్రియములయందు సంచరించుటయనగా నిదియే.

ప్రశ్న - పరమాత్మ సాక్షాత్కారము కానిదే రాగము (ఆసక్తి) నశింపదని 59వ (ఏబదితొమ్మిదవ) శ్లోకమున తెల్పబడినది. మఱి ఇచ్చట రాగద్వేషరహితుడై విషయముల యందు సంచరించుట వలన మనశ్శాంతి కలిగి, స్థిరబుద్ధి ఏర్పడునని తెల్పబడుచున్నది. ఇచ్చటి వివరణను బట్టి పరమాత్మప్రాప్తికంటె ముందుగూడ రాగద్వేషములు నశించుట సంభవమని తోచుచున్నది కనుక ఈ రెండు వివరణల మధ్య వైరుధ్యమున్నట్లు కన్పడుచున్నది. దీని సమన్వయము ఎట్లు?

సమా - ఈ రెండింటి మధ్య ఎట్టి వైరుధ్యమూ లేదు. 59వ శ్లోకమున రాగద్వేషములు పూర్తిగా తొలగిపోవునని తెల్పబడినది - ఇచట రాగద్వేషరహితములైన ఇంద్రియముల ద్వారా విషయగ్రహణమును గూర్చి తెల్పి, రాగద్వేష రాహిత్యము ఒక సాధనగా తెల్పబడినది. 3వ అధ్యాయము నందలి 40వ శ్లోకమున ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అను మూడును కామమునకు అధిష్ఠానములని పేర్కొన బడినది - కావున ఇంద్రియములయందు రాగద్వేషములు లేకున్నను మనోబుద్ధుల యందు సూక్ష్మరూపమున రాగద్వేషములు ఉండవచ్చును. కాని 59వ శ్లోకమున 'అస్య' అను పదమును ప్రయోగించి, స్థిరబుద్ధిగల పురుషునియందు రాగద్వేషములు ఏమాత్రమూ ఉండవని తెల్పబడినది. అచట కేవలము ఇంద్రియములయందే రాగద్వేషములయొక్క అభావవిషయము పేర్కొనబడలేదు.

ప్రశ్న - ఇంద్రియములతో విషయసంయోగము లేకుండ చేయుట యనగా బాహ్యముగా విషయ త్యాగము చేయుట, ఇంద్రియ సంయమము, ఇంద్రియములను రాగద్వేష రహితములుగ చేయుట అను ఈ మూడింటిలో శ్రేష్ఠమైనదియు, భగవత్ప్రాప్తికి విశేషముగ సహాయక మైనదియు ఏది?

సమా - మూడును భగవత్ప్రాప్తి యందు సహాయకములే. కాని వీటిలో బాహ్యవిషయ త్యాగముకంటెను ఇంద్రియసంయమమూ, దానికంటెను ఇంద్రియములు రాగద్వేషరహితములై యుండుటయును విశేషముగా ఉపయోగకరము, శ్రేష్ఠము.

బాహ్యవిషయ త్యాగముగూడ భగవత్ప్రాప్తియందు సహాయకమైనప్పటికిని, ఇంద్రియముల సంయమమూ, రాగద్వేషముల త్యాగమూ కలుగనంతవఱకును కేవలము బాహ్యవిషయత్యాగమువలన సంపూర్ణముగా విషయనివృత్తి కానేరదు. సిద్ధియు ప్రాప్తింపదు - అట్లే బాహ్యవిషయ త్యాగము చేయనిచో ఇంద్రియసంయమము కలుగనే కలుగదు - అనుమాటయు సరియైనది కాదు - ఏలనన భగవంతుని పూజలును, సేవలును, జపములును వివేకవైరాగ్యాది ఇతర ఉపాయముల ద్వారాను సహజముగనే ఇంద్రియ సంయమము కలుగును. ఇంద్రియ సంయమము ఏర్పడిన పిదప అనాయాసముగనే విషయత్యాగము చేయుట సాధ్యమగును. ఇంద్రియములను వశపఱచుకొనినవాడు ఏ సమయమునందైనను, ఏ విషయము నైనను త్యాగము చేయవచ్చును. కావున బాహ్యవిషయత్యాగము కంటెను ఇంద్రియ సంయమము శ్రేష్ఠమైనది.

ఈ విధముగ ఇంద్రియసంయమము గూడ భగవత్ప్రాప్తికి సహాయకమే. కాని ఇంద్రియముల యందు రాగద్వేషములు తొలగిపోనంతవఱకును కేవలము ఇంద్రియసంయమము వలన సంపూర్ణముగ విషయనివృత్తి జరుగదు. వాస్తవముగ పరమాత్మప్రాప్తియు కలుగదు. బాహ్యవిషయత్యాగము, ఇంద్రియ సంయమము కలుగనిదే ఇంద్రియముల యందు రాగద్వేషములను త్యజించుట సంభవము కాదను మాటయు సరియైనది కాదు. సత్సంగము, స్వాధ్యాయము, మరియు వివేచన ద్వారా సాంసారిక భోగముల అనిత్యత్వము యొక్క స్ఫూర్తి కలుగుట చేతను, ఈశ్వరకృప, భజనధ్యానాదుల చేతను రాగద్వేషములు తొలగిపోవచ్చును. ఇంద్రియముల యందు రాగద్వేషములు తొలగిపోయిన వానికి బాహ్యవిషయ త్యాగము, ఇంద్రియసంయమము, అనాయాసముగను, అప్రయత్నముగను అలవడును. ఇంద్రియ విషయముల యందు రాగద్వేషములు

లేని పురుషుడు బాహ్యముగ విషయత్యాగము చేయక, విషయములయందు సంచరించుచున్నప్పటికిని పరమాత్మ ప్రాప్తిని పొందగలడు. కావున ఇంద్రియములు రాగద్వేష రహితములగుటయే విషయ త్యాగము కంటెను, ఇంద్రియ సంయమముకంటెను శ్రేష్ఠమైనది.

ప్రశ్న - 'ప్రసాదము' అను పదము ఇచట దేనిని సూచించును?

సమా - వశములోనున్న ఇంద్రియముల ద్వారా రాగద్వేషములు లేకుండ వ్యవహరించుటవలన సాధకుని యంతఃకరణము శుద్ధమై స్వచ్ఛమగును. ఆ కారణమున అతనికి ఆధ్యాత్మిక సుఖశాంతులు అనుభవములోనికి వచ్చును. (18/37). ఈ సుఖశాంతులను తెలుపునదియే ఇచటి 'ప్రసాదము' అను పదము - ఈ సుఖశాంతులకు హేతువైన అంతఃకరణ పవిత్రతయును మఱియు అంతః కరణ పవిత్రతకు కారణమగు భగవదర్పణ చేయబడిన వస్తువూ ఆ 'ప్రసాదము' అనియే చెప్పబడును. కాని రాబోవు శ్లోకమున ఇట్టి పురుషుని గూర్చి 'ప్రసన్న చేతసః' అను పదము ప్రయుక్తమైనది. కావున ఇచటి 'ప్రసాదమ్' అను పదమునకు అంతఃకరణము యొక్క ఆధ్యాత్మిక ప్రసన్నత - అను అర్థమును చెప్పుటయే సరిగా తోచును.

**ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।**
**ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 65 ॥**

| పదము | అర్థము |
|---|---|
| ప్రసాదే | = అంతఃకరణ ప్రసన్నత ప్రాప్తించినంతనే |
| అస్య | = ఇతనియొక్క |
| సర్వ దుఃఖానామ్ | = సమస్త దుఃఖములకును |
| హానిః, ఉపజాయతే | = అభావము కలుగును, సమస్త దుఃఖములును తొలగిపోవును |
| ప్రసన్నచేతసః | = ప్రసన్న మనస్కుడైన కర్మయోగియొక్క |
| బుద్ధిః | = బుద్ధి |
| ఆశు, హి | = శీఘ్రముగానే (వెంటనే) |
| పర్యవతిష్ఠతే | = పరమాత్మయందే పూర్తిగా స్థిరమగును. |

**మనఃప్రసన్నతను పొందిన వెంటనే అతనిదుఃఖములన్నియును నశించును. ప్రసన్నచిత్తుడైన కర్మయోగియొక్క బుద్ధి అన్నివిషయములనుండి వైదొలగి, పరమాత్మయందు మాత్రమే పూర్తిగా స్థిరమగును. (65)**

ప్రశ్న - అంతఃకరణ ప్రసన్నత వలన దుఃఖములన్నియును ఎట్లు నశించును?

సమా - పాపముల కారణముగనే మనుష్యులకు దుఃఖములు కలుగుచుండును. కర్మయోగ సాధన వలన పాపములు నశించి, అంతఃకరణము శుద్ధమగును. శుద్ధాంతః కరణము నందే ఉపర్యుక్త సాత్త్వికప్రసన్నత కలుగును. కావున సాత్త్వికప్రసన్నతవలన దుఃఖములన్నియును తొలగిపోవునని తెల్పుట సమంజసమే యగును. (18/36/37)

ప్రశ్న - 'సర్వదుఃఖానాం' అను పదము వేనిని తెల్పును? అవి తొలగి పోవుట యనగానేమి?

సమా - అనుకూల పదార్థముల వియోగము, ప్రతికూల పదార్థముల సంయోగములవలన ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములగు వివిధ దుఃఖములు సాంసారికులైన మనుష్యులకు ప్రాప్తించును. వాటిని అన్నింటిని తెల్పునదియే ఇచటి 'దుఃఖానాం' అను పదము. పైన తెల్పబడినట్లు సాధకునకు ఆధ్యాత్మిక సాత్త్విక ప్రసన్నత అనుభవములోనికి వచ్చిన పిమ్మట అతనికి ఎట్టి వస్తుసంయోగ, వియోగముల వలన లేశమాత్రము గూడ దుఃఖము కలుగదు. అతడు సర్వదా ఆనందమగ్నుడై యుండును. దుఃఖములన్నియును తొలగి పోవుట యనగా ఇదియే.

ప్రశ్న - ప్రసన్న చిత్తము గల యోగి బుద్ధి శీఘ్రముగనే అన్నివైపులనుండి మరలి పూర్తిగా పరమాత్మ యందే స్థిరమగును - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - అంతఃకరణము పవిత్రమగుట వలన సాధకునకు ఆధ్యాత్మిక ప్రసన్నత ప్రాప్తించును. పిమ్మట అతని మనస్సు క్షణ మాత్రము గూడ ఆ సుఖశాంతులను త్యజింపజాలదు. ఆ కారణమున అతని అంతఃకరణవృత్తులు అన్నివైపుల నుండియు తొలగిపోవును. అతని బుద్ధి శీఘ్రముగ

పరమాత్మ స్వరూపమునందే స్థిరపడును. ఒక్క సచ్చిదానంద ఘనపరమాత్మ తప్ప వేఱు (ఇతర) వస్తువు యొక్క ఉనికి ఏదియును అతనికి బుద్ధియందు ఉండనే ఉండదు.

ప్రశ్న - స్థితప్రజ్ఞుడైన సిద్ధపురుషుని గూర్చి అర్జునుడు ప్రశ్నించెను. ఈ శ్లోకమున సాధకుని వర్ణన కలదు. ఏలనన దీని ఫలమైన ప్రసాదప్రాప్తి ద్వారా శీఘ్రముగ బుద్ధి స్థిరపడునని తెల్పబడినది. కావున అర్జునుని నాల్గవ ప్రశ్నకు సమాధానముగా దీనిని ఎట్లు భావింపవచ్చును?

సమా - అర్జునుని ప్రశ్న సాధకునకు సంబంధించినది కాదు. కాని అర్జునుడు సాధకుడు. అతనిని సిద్ధునిగా చేయుటకు భగవానుడు సంకల్పించెను. కావున సులభముగా అతనికి వివరించుటకై భగవానుడు మొదట సాధకుని విషయమును తెలిపి, చివరకు 71వ శ్లోకమున దాని సిద్ధితో ఆ ప్రసంగమును ముగించెను. అర్జునుని ప్రశ్నకు పూర్తి సమాధానము ఆ ముగింపునందే గలదు. దాని భూమిక యొక్క ఆరంభము ఈ శ్లోకమునందు జరిగినది. కావున అర్జునుని 4వ ప్రశ్నకు సమాధానము ఇచ్చుటి నుండియే ఆరంభమైనదని తలంచుట సమంజసము.

*సంబంధము - మనస్సును, ఇంద్రియములను వశమునందుంచుకొని, అనాసక్త భావముతో ఇంద్రియముల ద్వారా, లౌకిక వ్యవహారములను కొనసాగించు సాధకునకు సుఖశాంతులు, స్థితప్రజ్ఞస్థితి ప్రాప్తించునని తెలిపెను. ఇప్పుడు దానికి భిన్నముగా మనస్సును ఇంద్రియములను జయింపక, విషయాసక్తుడైన మనుష్యునకు సుఖశాంతులు కరవగునని ప్రకటించుచు విషయసాంగత్యముచేత అతనిబుద్ధి విచలితమగు రీతిని వర్ణించుచున్నాడు-*

**నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।**
**న చాభావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్ ॥ 66 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయుక్తస్య | = ఇంద్రియములను, మనస్సును వశమునం దుంచుకొనని వానియందు | అయుక్తస్య | = అయుక్తుడైన వానియొక్క (అంతఃకరణమునందు) | శాంతిః | = శాంతి |
| | | | | న | = లభింపదు |
| | | భావనా | = పరమాత్మభావనయును | అశాంతస్య | = శాంతిలేనివానికి |
| | | న | = కలుగదు | సుఖమ్ | = సుఖము |
| బుద్ధి | = నిశ్చయాత్మక బుద్ధి, | చ | = మరియు | కుతః | = ఎట్లు లభించును? |
| న, అస్తి | = ఉండదు | అభావయతః | = పరమాత్మ భావన లేనివానికి | | |
| చ | = మఱియు | | | | |

**ఇంద్రియములు, మనస్సు వశమునందు ఉండని వానియందు నిశ్చయాత్మకబుద్ధి ఉండదు. అట్టి అయుక్తమనుష్యుని అంతఃకరణమునందు ఆస్తికభావమే కలుగదు. తద్భావనాహీనుడైన వానికి శాంతి లభింపదు. మనశ్శాంతి లేనివానికి సుఖము ఎట్లు లభించును? (66)**

ప్రశ్న - 'అయుక్తస్య' అను పదము ఇచ్చుట ఎట్టి మనుష్యుని తెల్పును?

సమా - మనస్సును, ఇంద్రియములను వశమునందు ఉంచుకొననివాడును, ఇంద్రియభోగముల యందు అత్యంతాసక్తుడైన వాడును ఐన విషయాసక్తుడైన అవివేకిని సూచించునదియే **'అయుక్తస్య'** అను పదము.

ప్రశ్న - అయుక్తునికి బుద్ధి యుండదు - అనగానేమి?

సమా - 41వ శ్లోకమున వర్ణితమైన నిశ్చయాత్మకమైన బుద్ధి అయుక్తునియందు ఉండదు. వివిధ భోగముల యందలి ఆసక్తి, కోరికల కారణమున అతని మనస్సు విక్షిప్తమగును. అందువలన అతడు తన కర్తవ్యమును నిశ్చయించుకొనలేడు. పరమాత్మ స్వరూపమునందు బుద్ధిని స్థిరముగా ఉంచజాలడు.

ప్రశ్న - అయుక్తుని అంతఃకరణమునందు ఆస్తిక భావనయే యుండదు- అని యనుటలోని అంతర్యమేమి?

సమా - మనస్సు, ఇంద్రియములు అధీనములో లేని విషయాసక్తునియందు నిశ్చయాత్మకమైన బుద్ధియుండదని చెప్పనవసరమే లేదు. అతనిలో ఆ భావనయు లోపించును.

అనగా పరమాత్మ స్వరూపమునందు అతని బుద్ధి స్థిరముగా నుండదు సరికదా! విషయాసక్తి కల్గియుండుట వలన అతడు పరమాత్మ స్వరూప చింతనయు చేయజాలడు. అతని మనస్సు నిరంతరము విషయములయందే రమించు చుండును.

ప్రశ్న - "భావనాహీనుడైనవానికి శాంతిలభింపదు" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పరమానంద స్వరూపుడు, శాంతి సముద్రుడు ఐన పరమాత్ముని చింతన చేయకుండుట వలన అయుక్తుడైన మనుష్యుని చిత్తము విక్షిప్తమైయుండును. దానియందలి రాగద్వేషములు, కామక్రోధములు, లోభమోహములు, ఈర్ష్యాదుల కారణముగ ప్రతిక్షణము ఆ చిత్తము అసూయతో వ్యాకులత్వముతో నిండియుండును. కావున అతనికి శాంతి లభింపదు.

ప్రశ్న - "శాంతిలేని వానికి సుఖమేయుండదు" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - చిత్తమునందు శాంతి నెలకొననిదే ఎచ్చటను, ఏ పరిస్థితి యందును, ఏ యుపాయము చేతనైనను మనుజునకు నిజమైన సుఖములభింపదు. విషయేంద్రియ సంయోగమునందును, నిద్రాలస్య ప్రమాదములయందును భ్రమవలన ప్రతీతమగు సుఖము వాస్తవముగా సుఖము కానేకాదు. అది దుఃఖకారకమగుటవలన వస్తుతః దుఃఖమే యగును.

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥ 67 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | | (నెట్టివేయునో) | యత్, అను విధీయతే | = ఏ ఇంద్రియముతో కూడియుండునో |
| ఇవ | = ఎట్లయితే | చరతామ్ | = (అట్లే) శబ్దాది విషయముల యందు చరించుచున్నట్టి | తత్ | = ఆ ఒక్క ఇంద్రియమే |
| అంభసి | = నీటియందు (సంచరించు) | ఇంద్రియాణామ్ | = ఇంద్రియములలో | అస్య | = ఈ అయుక్తుడైన పురుషునియొక్క |
| నావమ్ | = నావను | మనః | = మనస్సు | ప్రజ్ఞామ్ (హరతి) | = బుద్ధిని (హరించును) |
| వాయుః హరతి, ఇవ | = వాయువు ఎట్లు హరించునో | | | | |

నీటిపై తేలుచున్న నావను గాలినెట్టివేయును. అట్లే ఇంద్రియార్థములయందు సంచరించు ఇంద్రియములలో మనస్సు ఏ ఒక్క ఇంద్రియముతో కూడియున్నను ఆ ఒక్క ఇంద్రియమే మనోనిగ్రహములేని మనుజునిబుద్ధిని అనగా విచక్షణా శక్తిని హరించివేయును. **(67)**

ప్రశ్న - 'హి' అను అవ్యయమునకు అర్థమేమి?

సమా - అయుక్తుడైన మనుష్యునియందు నిశ్చలబుద్ధి, భావన, (పరమాత్మభావన) శాంతి, సుఖము ఉండవను విషయము పూర్వ (66వ) శ్లోకమున తెల్పబడినది. దానినే (ఆ విషయమునే) స్పష్టపఱచుటకు అవియన్నియు ఉండనికారణమును ఈ శ్లోకమున వివరించుచున్నాడు. ఈ భావమును తెల్పుటకే హేతువాచకమైన 'హి' అను అవ్యయము ప్రయుక్తమైనది.

ప్రశ్న - నీటిపై తేలుచున్న నావ మఱియు గాలియొక్క దృష్టాంతములద్వారా ఇచట తెల్పబడిన విషయమేమి?

సమా - ఈ దృష్టాంతమునందు బుద్ధిని నావతోడను, ఇంద్రియముతో గూడిన మనస్సును గాలితోడను, సంసార సముద్రమును జలాశయము తోడను, సమస్త విషయ సముదాయమును నీటితోడను పోల్చుట జరిగినది. నీటియందు తన గమ్యస్థానము వైపు పయనించు నౌకను ప్రబలమైన వాయువు రెండు విధములుగా విచలితమొనర్చును. భయంకరములైన నీటితరంగములలో దానిని ప్రక్కదారి పట్టించును. లేదా అగాధమైన నీటిలో ముంచివేయును. కాని చతురుడైన నావికుడు ఆ వాయుప్రసారమును తనకనుకూలముగా మలచుకొన్నచో ఆ

వాయువు ఆ నావను ప్రక్కదారి పట్టింపజాలదు. పైగా దానిని గమ్యస్థానమునకు చేర్చుటకై అది సహాయపడును. అట్లే మనస్సు, ఇంద్రియములు వశములోలేని మనుష్యుడు తన బుద్ధిని పరమాత్మ స్వరూపము నందు నిశ్చలముగా నుంచగోరినను అతని ఇంద్రియములు మనస్సును ఆకర్షించి, అతని బుద్ధిని రెండు విధములుగా విచలితమొనర్చును. ఇంద్రియములు బుద్ధియను నౌకను పరమాత్మవైపునుండి మఱల్చి, వివిధ భోగానుభవములను పొందుటకై ఉపాయములను ఆలోచించునట్లు చేయును. భయంకర తరంగముల మధ్య దారి మళ్ళించుట యనగా ఇదియే. అతనిని పాపములయందు ప్రవృత్తునిగా జేసి, అధః పతితునిగా చేయును. అతనిని ముంచివేయుట యనగా ఇదియే. కాని మనస్సు, ఇంద్రియములు వశములోనున్న వాని బుద్ధిని ఇంద్రియములు విచలితమొనర్పజాలవు. పైగా బుద్ధియను నౌకను పరమాత్మ కడకు చేర్చుటకు అవి సహాయపడును - 64, 65 శ్లోకములలో ఈ విషయమే తెల్పబడినది.

ప్రశ్న - ఇంద్రియములన్నింటి ద్వారా బుద్ధి విచలితమగునను విషయమును తెలుపక ఒక ఇంద్రియము ద్వారానే బుద్ధి విచలితమగునని తెలుపుటలోని అంతరార్థమేమి?

సమా - ఈ వాక్యము ద్వారా ఇంద్రియముల ప్రాబల్యము ప్రకటింప బడినది. ఇంద్రియములలో ఏ ఒక్క దానితో ప్రభావితమైనను మనస్సు మనుష్యుని బుద్ధిని విషయముల యందు చిక్కుపడునట్లుచేసి, దానిని విచలితమొనర్చును. ఇంద్రియములన్నింటి ప్రభావమునకును లోనైనప్పుడు బుద్ధి విచలిత మగునను విషయమును వేఱుగా చెప్పనవసరమే లేదు. కర్ణేంద్రియమునకు వశమైన జింకయు, స్పర్శేంద్రియమునకు లోనైన ఏనుగూ, చక్షురింద్రియమునకు వశమైన మిడుతయు, జిహ్వేంద్రియమునకు లోబడిన చేపయు, ఘ్రాణేంద్రియమునకు వశమైన తుమ్మెదయు- ఈ విధముగా ఒక్కొక్క ఇంద్రియ ప్రభావముననే చిక్కులపాలై ప్రాణములను పోగొట్టు కొనుచున్నవి.[1] ఈ విధముగనే మనుష్యుని బుద్ధియు ఒక్కొక్క ఇంద్రియము ద్వారా గూడ విచలితమగుననుట నిశ్చయము.

ప్రశ్న - 'యత్' 'తత్' అను శబ్దములు మనస్సునకే సంబంధించినవని యేల భావింపరాదు?

సమా - 'ఇంద్రియాణామ్' అను పదము 'నిర్ధారణ షష్ఠి'. కావున ఇంద్రియములలో ఒక్క దానితోడనే మనస్సునకు సంబంధమున్నట్లు 'యత్' అను పదము ప్రయుక్తమైనదిగా భావించుటయే సముచితము. 'యత్, తత్' నిత్య సంబంధము గలవి. కావున 'తత్' అను పదము గూడ ఒక్క ఇంద్రియముతోడనే సంబంధము గలిగియున్నది. 'అను విధీయతే' అను క్రియాపదము నందలి 'అను' ఉపసర్గకాదు - కర్మప్రవచనీయ సంజ్ఞక అవ్యయము. కావున దానితో కలిసి 'యత్' ద్వితీయా విభక్తితో ప్రయుక్తమైనది. కర్మకర్తృప్రక్రియను అనుసరించి, 'విధీయతే' అను క్రియకు 'కర్మ' యైన 'మనః' అను పదమే కర్తగా ప్రయుక్తమైనది. ఇంతేగాక రాబోవు శ్లోకములో తస్మాత్ అను పదమును ప్రయోగించి, ఇంద్రియములను వశమునందు ఉంచుకొనిన బుద్ధి స్థిరముగా ఉండునని తెల్పబడినది. కావున ఇచ్చట 'యత్', 'తత్' అను పదములు ఇంద్రియములతోడనే సంబంధము గలవియని భావించుట మిక్కిలి సమంజసము.

ప్రశ్న - మనస్సు లేక, ఇంద్రియము ఒంటరిగా బుద్ధిని హరించుటకు సమర్థమై యుండునా?

సమా - మనస్సుతో చేరనిదే కేవలము ఇంద్రియము బుద్ధిని హరింపజాలదు - కాని మనస్సు మాత్రము ఇంద్రియముతో చేరకయే ఒంటరిగా బుద్ధిని హరింపగలదు.

*సంబంధము - ఈ విధముగా అయుక్తుడైన పురుషుని బుద్ధి విచలితమగు రీతి తెల్పిన పిదప ఇప్పుడు మఱల భగవానుడు స్థితప్రజ్ఞస్థితి ప్రాప్తియందు అన్ని విధములుగ ఇంద్రియసంయమము ఆవశ్యకమని ప్రకటించుచు స్థితప్రజ్ఞునియొక్క స్థితిని వర్ణించుచున్నాడు-*

---

1) శబ్దాదిభిః పంచభిరేవ పంచ పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః ।
కురంగమాతంగపతంగమీనభృంగా నరః పంచభిరంచితః కిమ్ ॥ (వివేక చూడామణి - 78)

**తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన | ఇంద్రియార్థేభ్యః | = ఇంద్రియ విషయములనుండి | తస్య | = అతనియొక్క |
| మహాబాహో | = ఓ అర్జునా! | సర్వశః | = అన్నివిధముల | ప్రజ్ఞా | = బుద్ధి |
| యస్య | = ఎవనియొక్క | నిగృహీతాని | = నిగ్రహింపబడునో | ప్రతిష్ఠితా | = స్థిరమగును. |
| ఇంద్రియాణి | = ఇంద్రియములు | | | | |

**కనుక ఓ అర్జునా! ఇంద్రియములను ఇంద్రియార్థములనుండి అన్ని విధములుగ పూర్తిగా నిగ్రహించిన పురుషునియొక్క బుద్ధి స్థిరముగానుండును. (68)**

ప్రశ్న - 'తస్మాత్' అను పదము యొక్క అర్థమేమి?

సమా - మనస్సు, ఇంద్రియములు వశములో లేని విషయాసక్తుడైన మనుష్యుని ఇంద్రియములు అతని మనస్సును విషయముల యందు నిమగ్నమగునట్లుచేసి, అతని బుద్ధిని విచలితమొనర్చి, దానిని స్థిరముగా ఉండనీయవు - అను విషయము పూర్వ (67వ) శ్లోకమున తెల్పబడినది. కావున మనస్సును, ఇంద్రియములను వశములో ఉంచుకొనుట అత్యంతావశ్యకమని తెల్పుటకు ఇచ్చట 'తస్మాత్' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'మహాబాహో!' అని సంబోధించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - పొడవైన, దృఢమైన, బలిష్ఠమైన బాహువులు గలవానిని 'మహాబాహువు' (మహాబాహుః) అనియందురు - ఈ సంబోధన శూరత్వమును, వీరత్వమును తెల్పును. అర్జునుడు గొప్ప శూరుడు, వీరుడు. కనుక ఇంద్రియములను, మనస్సును వశములో ఉంచుకొనుట అతనికి ఏమియు కష్టమైనపనిగాదు -అని తెల్పుటకే భగవానుడు అతనిని 'మహాబాహో!' అని సంబోధించెను.

ప్రశ్న - ఇంద్రియార్థముల నుండి ఇంద్రియములను అన్ని విధముల నిగ్రహించుట యనగానేమి?

సమా - శ్రోత్రాదిసమస్త ఇంద్రియములకు సంబంధించిన శబ్దాది విషయములయందు నిరంతరముగా ప్రవృత్తమగుట ఇంద్రియముల స్వభావము. ఏలనన అనాదికాలము నుండియు జీవుడు ఈ ఇంద్రియముల ద్వారానే భోగములను అనుభవించుచున్నాడు - కావున ఇంద్రియములు వాటి యందు ఆసక్తమైయున్నవి. ఇంద్రియముల ఈ స్వాభావిక ప్రవృత్తిని సర్వథా నిరోధించుటయు, వాటి విషయలోలుప స్వభావమును పరివర్తన మొనర్చుటయు, వాటియందలి విషయాసక్తిని తొలగించుటయు, మనస్సును, బుద్ధిని విచలితమొనర్చుటయు, వాటియందలి విషయాసక్తిని తొలగించుటయు, మనస్సును, బుద్ధిని విచలితమొనర్చు శక్తిని నశింపజేయుటయు - ఈ మొదలైన ప్రక్రియలనే ఇంద్రియములను ఇంద్రియార్థములనుండి సర్వథా నిగృహీత మొనర్చుటయగును. ఈ విధముగా ఇంద్రియములను వశపఱచుకొన్న పురుషుడు ధ్యానకాలమునందు ఇంద్రియ క్రియలను (ఇంద్రియ వ్యాపారములను) త్యజించినచో అతని ఏ ఇంద్రియమూ ఏ విషయమును గూడ గ్రహింప జాలదు - తన సూక్ష్మవృత్తులద్వారా మనస్సునందు ఎట్టి విక్షేపమునూ కల్గింప జాలదు. అట్టి సమయమున అవి మనస్సునందు తద్రూపమును పొందును. వ్యుత్థాన కాలమునందు అతడు చూచుట, వినుట మొదలగు ఇంద్రియక్రియలను చేయు సమయమున అవి ఆసక్తి రహితములై నియమిత రూపమున యథాయోగ్యముగ శబ్దాదివిషయములను గ్రహించును. అవి ఏ విషయమునందును అతని మనస్సును ఆకర్షింపజాలవు. పైగా మనస్సు వెళ్ళు మార్గమునే అనుసరించును. స్థితప్రజ్ఞుడు లోకహితార్థమై ఏ ఇంద్రియము ద్వారా శాస్త్ర సమ్మతమైన ఏ విషయమును ఎంతకాలము వఱకు గ్రహింపదగునని తలంచునో ఆ ఇంద్రియమే అంతకాలము వఱకే ఆ విషయమును గ్రహించును - దానికి భిన్నముగా ఏ ఇంద్రియము గూడ ఏ విషయమునూ గ్రహింపజాలదు. ఈ విధముగా ఇంద్రియములపై పూర్తి ఆధిపత్యము కల్గినవాడు వాటి స్వతంత్ర ప్రవృత్తిని రూపుమాపి, వాటిని తనకు అనుకూలముగా చేసికొనును - ఇంద్రియములను

ఇంద్రియార్థములనుండి అన్ని విధములుగ నిగ్రహించుట యనగా ఇదియే.

ప్రశ్న - 58వ శ్లోకము, మఱియు, ఈ శ్లోకము యొక్క ఉత్తరార్థము ఒక్కటియే - మఱి అచట పూర్వార్థమున **'సంహరతే'** అనియు, ఈ శ్లోకమున **'నిగృహీతాని'** అనియు ప్రయుక్తములైన రెండు పదముల మధ్య గల వ్యత్యాసమేమి?

సమా - 58వ శ్లోకమునందు **'కిమాసీత'** అనగా ఎట్లు కూర్చొనును? అను అర్జునుని మూడవ (3వ) ప్రశ్నకు సమాధానముగ భగవానుడు స్థితప్రజ్ఞుని అక్రియావస్థను వర్ణించెను. కావున అచట తాబేలు దృష్టాంతము నిచ్చి, 'సంహరతే' అను పదము ద్వారా విషయములనుండి తొలగుట - అని పేర్కొనెను. బాహ్యముగా ఇంద్రియములను విషయములనుండి తొలగించుట సామాన్య మానవునకును శక్యమే - కాని అచటినుండి పూర్తిగా తాను తొలగిపోవుట ఒక విలక్షణ ప్రక్రియ. ఏలనన అది స్థితప్రజ్ఞుని లక్షణము. కావున ఆసక్తి రహితమైన మనస్సు ఇంద్రియముల సంయమము గూడ ఇచటి తొలగించుకొను ప్రక్రియలో అంతర్భాగమే - స్థితప్రజ్ఞుని ఈ స్వాభావిక స్థితిని వర్ణించుచు భగవానుడు ఇచట 'నిగృహీతాని' అను పదమును ప్రయోగించెను - విషయాసక్తి రహితుడు ఐనప్పుడే అన్ని విధములుగ మనస్సు, ఇంద్రియముల నిగ్రహము సాధ్యమగును. 'ని' అను ఉపసర్గద్వారా, 'సర్వశః' అను క్రియావిశేషణము ద్వారా కూడా ఈ విషయమే స్పష్టమగును. కావున ఈ రెండింటి వాస్తవిక స్థితియందు మౌలికముగా ఎట్టి వ్యత్యాసము లేకున్నను అచట స్థితప్రజ్ఞుని అక్రియావస్థను, ఇచట అన్ని సమయముల యందును అతని సాధారణస్థితిని వర్ణించుట జరిగినది. ఇదియే ఈ రెండింటి మధ్యగల వ్యత్యాసము.

ప్రశ్న - 'అతని బుద్ధి స్థిరమగును' అనియనుటలోని అంతరార్థమేమి?

సమా - మనస్సును, ఇంద్రియములను పైన పేర్కొనబడిన రీతిగా వశపఱచుకొనిన వాని బుద్ధి స్థిరముగా ఉండును. మనస్సు, ఇంద్రియములు వశములో లేనివాని బుద్ధి స్థిరముగా ఉండజాలదు.

*సంబంధము* - ఈ విధముగా మనస్సూ, ఇంద్రియములూ వశములో లేకుండుటవలన కలుగుహానినీ, వశములో ఉండుటవలన కలుగు లాభమునూ భగవానుడు తెలిపెను. అట్లే స్థితప్రజ్ఞస్థితిని పొందుటకై రాగద్వేషములను త్యజించి, మనస్సును, ఇంద్రియములను సంయమమొనర్చుట అత్యంతావశ్యకమని ప్రతిపాదించి, ఆస్థితప్రజ్ఞ స్థితిని వర్ణించెను. ఇప్పుడు విషయాసక్తులైన సామాన్య మానవులకును, మనస్సును, ఇంద్రియములను సంయమమొనర్చి, పరమాత్మ ప్రాప్తి నందిన స్థిరబుద్ధి గల మహాత్ములకును మధ్య నుండు భేదమును, రాత్రింబవళ్ళ దృష్టాంతముద్వారా వివరించుచు వారి స్వాభావికస్థితులను వర్ణించుచున్నాడు-

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69 ॥**

సర్వభూతానామ్ = సమస్తప్రాణులకును
యా = ఏదైతే
నిశా = రాత్రియో (రాత్రితో సమానమో)
తస్యామ్ = దానియందు (ఆ నిత్య జ్ఞానస్వరూప పరమానంద ప్రాప్తియందు)
సంయమీ = స్థిత ప్రజ్ఞుడైన యోగి
జాగర్తి = మేల్కొనియుండును
యస్యామ్ = నశ్వరమైన ఏ సాంసారిక సుఖప్రాప్తియందు
భూతాని = సకలప్రాణులును
జాగ్రతి = మేల్కొనియుండునో
పశ్యతః = పరమాత్మతత్త్వము నెఱింగిన
మునేః = మునికి
సా = అది
నిశా = రాత్రి (రాత్రితో సమానము)

నిత్యజ్ఞానస్వరూపపరమానందప్రాప్తియందు స్థితప్రజ్ఞుడైన యోగి మేల్కొనియుండును. అది ఇతరప్రాణులన్నింటికిని రాత్రితో సమానము. నశ్వరమైన ప్రాపంచిక సుఖప్రాప్తికై ప్రాకులాడుచు ప్రాణులన్నియు మేల్కొని యుండును. అది పరమాత్మతత్త్వమునెఱిగిన మునికి (మననశీలునకు) రాత్రితో సమానము. **(69)**

ప్రశ్న - ఇక్కడ 'సంయమి' అను పదము ఎవరిని సూచించును?

సమా - మనస్సును, ఇంద్రియములను వశపఱచుకొని, పరమాత్మను పొందిన స్థితప్రజ్ఞుని సూచించునదియే సంయమి యనుపదము. ఏలనన ఈ శ్లోకము యొక్క ఉత్తరార్ధమునందు 'పశ్యతః' అను పదము ప్రయుక్తమైనది - దానికి 'జ్ఞాని' అని యర్థము.

ప్రశ్న - ఇచట సమస్త ప్రాణులకును రాత్రితో సమానమగునదియేది? అందు స్థితప్రజ్ఞుడైన యోగి మేల్కొని యుండు ననగానేమి?

సమా - అజ్ఞానుల అనుభవములయందును, జ్ఞానుల అనుభవములయందు రాత్రింబవళ్ళవలె అత్యంత వైలక్షణ్యము ఉండును. ఈ విషయమును తెల్పుటకే రాత్రిసాదృశ్యముతో అజ్ఞానులైన సామాన్య మనుష్యుల స్థితులను, జ్ఞానులైన వారి స్థితులను వర్ణించుట జరిగినది. కనుక ఇచ్చట రాత్రియనగా సూర్యాస్తమయమునకు పిమ్మట వచ్చురాత్రిగాదు. ప్రకాశముతో గూడిన పగటిని గుడ్లగూబ తన దృష్టిదోషము వలన అంధకారమయముగా చూచును. అట్లే అనాదిసిద్ధమైన అజ్ఞానము అను తెరచేత అంతఃకరణ రూపనేత్రముల వివేక విజ్ఞానము అను ప్రకాశశక్తి కప్పబడుటచే అవివేకియైన వాడు స్వయంప్రకాశనిత్య బోధాత్మకుడు, పరమానందమయుడు ఐన పరమాత్మను చూడలేడు. ఆ పరమాత్మ ప్రాప్తియను సూర్యుడు ప్రకాశింపగనే (ప్రకాశించిన వెంటనే) పరమశాంతి, నిత్యానందము ప్రత్యక్షముగా అనుభవములోనికి వచ్చును. అది వాస్తవముగా పగటివలె ప్రకాశమయము. ఐనప్పటికిని పరమాత్మని గుణ ప్రభావ రహస్యతత్త్వములను ఎఱుగని అజ్ఞానులకు అది రాత్రియే - అనగా రాత్రితో సమానము. ఏలనన ఆ ప్రపంచమున వారు నిద్రాళువులే. ఆ పరమానందమును గూర్చి వారికి ఏ మాత్రమును తెలియదు. ఈ పరమాత్మప్రాప్తియే ఇచట ప్రాణులందఱికి రాత్రి. పరమాత్మ ప్రాప్తినందిన సంయమికి ఈ రాత్రియే పగటితో సమానము. స్థితప్రజ్ఞుడు ఆ సచ్చిదానందఘనపరమాత్మ స్వరూపమును సాక్షాత్కరింప జేసికొని, దానియందే స్థితుడైయుండును. సమస్త ప్రాణుల రాత్రియందు అతడు మేల్కొనియుండుట అనగానిదియే.

ప్రశ్న - సమస్త ప్రాణులు మేల్కొనుట యనగానేమి? ప్రాణులన్నియును మేల్కొనియుండు స్థితి పరమాత్మ తత్త్వము నెఱింగిన మునికి రాత్రితో సమానమెట్లగును?

సమా - ఇహపరలోకభోగములన్నియును నశ్వరములు, క్షణికములు, అనిత్యములు, దుఃఖరూపములు. ఐనను అనాదిసిద్ధమూ అంధకారమయమునైన అజ్ఞాన కారణమున విషయాసక్తులైన వారు వాటిని నిత్యములుగా, సుఖములుగా భావించెదరు. వారిదృష్టిలో విషయభోగానుభవములను మించిన సుఖమేదియును ఉండదు. ఈ విధముగా భోగాసక్తులై వాటి ప్రాప్తి కొఱకు ప్రయత్నించు చుండుటయు, అవి ప్రాప్తించినపుడు ఆనందమును అనుభవించు చుండుటయు, వాటియందు సకల ప్రాణులు మేల్కొనుట యగును. ఇది ఇంద్రియ విషయ సంయోగములచే ప్రమాదాలస్య నిద్రాదులచే ఉత్పన్నమైన సుఖరాత్రి వలె అజ్ఞానరూపమూ, అంధకారమయమూ అగుటవలన వాస్తవముగా రాత్రియే - ఐనను అజ్ఞాని దానినే పగలని భావించి, దానియందే మేల్కొనియుండును - ఎట్లనగా నిద్రలో స్వప్నగతుడైన మనుష్యుడు స్వప్న దృశ్యములను జూచుచు ఆ స్వప్నములో తాను మేల్కొని యున్నట్లే భావించును. కాని స్వప్నము నుండి మేల్కొనిన మనుష్యునకు స్వప్నజగత్తుతో ఎట్టి సంబంధమూ లేనట్లే పరమాత్మ తత్త్వమును ఎఱిగిన జ్ఞానికి సచ్చిదానందఘన పరమాత్మ తప్ప తదితరమైన ఏ వస్తువు తోడను సంబంధము ఉండదు. ఈ దృశ్యజగత్తునందు దీనికి అధిష్ఠానరూపమైన పరమాత్మ తత్త్వమునే అతడు చూచును. కావున అట్టి వానికి సమస్త సాంసారిక భోగములూ, విషయానందములూ రాత్రితో సమానము.

*సంబంధము - ఈ విధముగా రాత్రి సాదృశ్యముతో జ్ఞానుల, అజ్ఞానుల స్థితులయందలి భేదములను తెలిపి, సముద్రము యొక్క ఉపమానము ద్వారా జ్ఞాని పరమశాంతిని పొందుననియు, భోగేచ్ఛగల అజ్ఞానికి శాంతి యుండదనియు తెలుపుచున్నాడు-*

**ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।**
**తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే స శాంతిమాప్నోతి న కామకామీ ॥ 70 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యద్వత్ | = ఎట్లయితే | సముద్రమ్ | = సముద్రమును | ప్రవిశంతి | = (ఎట్టి వికారములు కల్గింపకయే) లీనమగునో |
| ఆపః | = (వేర్వేఱు నదులయొక్క) జలములు | ప్రవిశంతి | = (ఏ మాత్రము చలింపజేయ కుండగనే) ప్రవేశించునో | సః | = ఆ పురుషుడు |
| | | | | శాంతిమ్ | = పరమశాంతిని |
| ఆపూర్యమాణమ్ | = అన్నివైపుల పరిపూర్ణమైన | తద్వత్ | = అట్లే | ఆప్నోతి | = పొందును |
| | | సర్వే, కామాః | = సకల భోగములు | కామకామీ | = భోగేచ్ఛగలవాడు |
| అచలప్రతిష్ఠమ్ | = నిశ్చలముగానున్న | యమ్ | = ఏ స్థితప్రజ్ఞునియందు | న | = శాంతిని పొందజాలడు |

**సమస్తదిశలనుండి పొంగి ప్రవహించుచు వచ్చిచేరిన నదులన్నియును పరిపూర్ణమై నిశ్చలముగానున్న సముద్రమును ఏమాత్రము చలింపజేయకుండగనే అందులో లీనమగును అట్లే సమస్తభోగములును స్థితప్రజ్ఞునియందు ఎట్టి వికారములను కల్గింపకయే వానిలో లీనమగును. అట్టి పురుషుడే పరమశాంతిని పొందును. భోగాసక్తుడు శాంతిని పొందజాలడు. (70)**

ప్రశ్న - స్థితప్రజ్ఞుడైన జ్ఞానిని సముద్రముతో పోల్చుచు ఇచ్చట తెల్పబడిన విషయమేమి?

సమా - ఏదైననొక జడ వస్తువును ఉపమానముగా చూపి, స్థితప్రజ్ఞుని వాస్తవికస్థితిని సంపూర్ణముగా వర్ణించుట అసంభవము - ఐనను ఇప్పుడు సాదృశ్యము ద్వారా అతని స్థితియొక్క ఒక అంశను స్పష్టపరచవచ్చును. కావున 'ఆపూర్యమాణం' అనగా సర్వతోముఖముగా జలముతో పరిపూర్ణమైన సముద్రమువలె స్థితప్రజ్ఞుడు ఆనందముతో పరిపూర్ణుడై యుండును. అని తెల్పుటకే సముద్రముతో పోల్చి చెప్పుట జరిగినది. సముద్రమునకు నదీజలముల అవసరమే లేదు. అట్లే స్థితప్రజ్ఞునకు ఎట్టి సాంసారిక సుఖభోగముల అవసరము ఏ మాత్రమూ లేదు. అతడు సర్వథా ఆప్తకాముడు. సముద్రస్థితి నిశ్చలము. భయంకరములైన పెక్కు తుఫానులు వచ్చిపడినను, నదులు పొంగి పొరలుచు అందు చేరినను అది తన స్థితి నుండి యేమాత్రమూ విచలితముగాదు - దాని హద్దులను అది అతిక్రమింపదు - అట్లే పరమాత్మ స్వరూపమునందు స్థితుడైన యోగిస్థితియు సర్వథా నిశ్చలముగా ఉండును. సాంసారిక సుఖదుఃఖముల సంయోగవియోగములు ఎంతగా వచ్చిపడినను అతని స్థితియందు ఏమాత్రమూ మార్పు ఉండదు. అతడు సచ్చిదానంద ఘనపరమాత్మయందు నిత్యమూ, నిరంతరమూ, నిశ్చలముగా ఒకే విధముగా స్థితుడై యుండును.

ప్రశ్న - 'సర్వే' అను విశేషణముతో పాటు 'కామాః' అను పదము ఇచట నేటిని సూచించును? సముద్రము నందు జలములవలె అవి స్థితప్రజ్ఞునియందులీన మగును- అవి యనగానేమి?

సమా - 'కామ్యంత ఇతి కామాః' అనగా కోరబడునవి గావున ఇవి కామములు. ఈ వ్యుత్పత్తిని అనుసరించి, 'సర్వే' అను విశేషణముతో పాటు 'కామాః' అను పదము సమస్త ఇంద్రియ విషయములను తెల్పును. కోరికలను తెల్పదు. ఏలనన స్థితప్రజ్ఞునియందు కోరికలు ఏ మాత్రమును ఉండవు. కనుక అవి అతనిలో ప్రవేశించు ప్రసక్తియే యుండదు. సముద్రమునకు నదీజలముల అవసరము లేకున్నను పెక్కు నదీనదముల జలప్రవాహములు అందు ప్రవేశించుచునే యుండును. కానీ నదులవలె, సరోవరములవలె సముద్రమునందు వరదలు కలుగవు. అది తన స్థితినుండి విచలితముకాదు. హద్దుమీరదు. జలప్రవాహములన్నియు దానియందు ఏవిధమైన వికృతిని (కల్లోలమును) కల్గింపజాలవు. పైగా అందులో లీనమగును - అట్లే స్థితప్రజ్ఞునికి ఎట్టి సాంసారిక భోగముల అవసరము ఏమాత్రమును ఉండదు. ఐనను ప్రారబ్ధానుసారము అతనికి

వివిధ భోగములను ప్రాప్తించును. అనగా అతని మనోబుద్ధీంద్రియములతో అనుకూల ప్రతికూల విషయ సంయోగము ప్రారబ్ధమును బట్టి కల్గుచునే యుండును. కాని ఆ భోగములు అతనియందు హర్షశోకములను, రాగద్వేషములను, కామక్రోధములను, లోభమోహములను, భయోద్వేగములను, మఱి ఏ ఇతర వికారములను ఉత్పన్నము చేయుజాలవు. అతని నిశ్చల స్థితి నుండియు, శాస్త్ర మర్యాదల నుండియు అతనిని విచలితునిగా చేయుజాలవు. వాటి సంయోగమువలన అతని స్థితియందు ఎన్నడును, ఏమాత్రమును మార్పు కలుగదు. అవి ఏ విధమైన క్షోభను అతనియందు కల్గింపజాలవు. అతడు పరమానంద స్వరూపమునందు తద్రూపమును పొంది విలీనమగును. సముద్రమునందు జలములవలె అవి స్థితప్రజ్ఞునియందు లీనమగుట యనగా నిదియే.

ప్రశ్న - అతడే పరమశాంతిని పొందును. భోగేచ్ఛలు గలవాడు పొందడు - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - పైన తెల్పబడిన రీతిగా ఆప్తకాముడైన వానికి ఎట్టి భోగముల అవసరమూ ఏ మాత్రమును ఉండదు. ప్రారబ్ధమును బట్టి సమస్త భోగములును తమంతట తామే వచ్చి అతనిలో లీనమగును. అతడు స్వయముగా ఎట్టి భోగములను కోరడు. కనుక పరమశాంతిని పొందును. భోగములను కోరుకొను మనుష్యుడెన్నడును శాంతిని పొందజాలడు. ఏలనన అతని చిత్తము నిరంతరము వివిధ భోగేచ్ఛలతో విక్షిప్తమై యుండును. విక్షేపమున్నచోట శాంతికి తావే యుండదు - అచ్చట అడుగడుగునను చింత, అసూయాశోకములే స్థిర నివాసము చేయుచుండును.

ప్రశ్న - 58వ శ్లోకము నుండి ఇంతవఱకును తెల్పబడిన విషయము అర్జునుని మూడవ ప్రశ్నకే సమాధానముగా భావించినచో దోషమేమి? ఏలనన ఈ శ్లోకము నందు సముద్రము వలె నిశ్చలస్థితి ఉదాహరణముగా చూపబడినది.

సమా - దీనిని మూడవ ప్రశ్నకు సమాధానముగా భావించుటకు వీలులేదు. మూడవ ప్రశ్నకు సమాధానము 58వ శ్లోకమున ప్రారంభించి, 61వ శ్లోకమున ముగింపబడినది. కనుక అందు "ఆసీత" అను క్రియాపదము ప్రయుక్తమైనది. పిమ్మట ప్రసంగవశమున 62, 63వ శ్లోకముల యందు విషయచింతనతో ఆసక్తి మొదలగు వాటి ద్వారా అధఃపతన మగునని తెల్పుచు 64వ శ్లోకముతో 4వ ప్రశ్నకు సమాధానము ఆరంభమైనది. 'చరన్' అను పదము ద్వారా ఈ భేదము స్పష్టమగును. ఈ సందర్భమున విషయాసక్తుడును, అయుక్తుడును ఐన పురుషుని ఇంద్రియములు విశృంఖలములనియు, వాటిలో ఏ ఒక్కటియైనను బుద్ధిని హరించుననియు నౌకాదృష్టాంతము ద్వారా తెల్పబడినది. ఇందును 'చరతాం' అను పదము ప్రయుక్తమైనది. ఇంతేగాక ఈ శ్లోకమునందలి 'సర్వే కామాః ప్రవిశంతి' అను వాక్యము ద్వారా సమస్త భోగములును అతనిలో ప్రవేశించును - అని తెల్పబడినది. అక్రియావస్థయందు ప్రవేశద్వారము లన్నియును మూయబడియుండును. అచట ఇంద్రియములు విషయసంసర్గరహితములై యుండును. ఇచట ఇంద్రియ వ్యాపారములను గూర్చి ప్రస్తావింపబడినది. కావున భోగములు అతనియందు ప్రవేశించుట సంభవమగును. పరమాత్మ స్వరూపమునందు అతని స్థితి నిశ్చలమైనను వ్యవహారమును బట్టి అది అక్రియముగాదు. కనుక ఇచ్చట దీనిని నాల్గవ ప్రశ్నకు సమాధానముగా భావించుటయే యుక్తియుక్తము.

*సంబంధము - స్థితప్రజ్ఞుడు ఏ విధముగా సంచరించును? అను అర్జునుని నాల్గవప్రశ్న పరమాత్మ ప్రాప్తినందిన వానికి సంబంధించినదే. కాని ఈ ప్రశ్న ఆచరణ విషయమునకు సంబంధించినదగుట వలన దానికి సమాధానముగా 64వ శ్లోకమునుండి ఇంతవరకును స్థితప్రజ్ఞుడు కాగలిగిన వానియాచరణములను, కాలేని వాని ఆచరణములను, స్థితప్రజ్ఞుడైన పిమ్మట అట్టివాని స్థితిని భగవానుడు తెల్పెను. ఇప్పుడు ఆ నాల్గవ ప్రశ్నకు స్పష్టముగా సమాధానమును ఇచ్చుచు స్థితప్రజ్ఞుని ఆచరణ రీతులను తెల్పుచున్నాడు-*

**విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః ।**
**నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి ॥ 71 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః,పుమాన్ | = ఏ పురుషుడు | నిర్మమః | = మమతారహితుడై | సః | = అతడే |
| సర్వాన్, కామాన్ | = సమస్తమైన కోరికలను | నిరహంకారః | = అహంకారరహితుడై | శాంతిమ్ | = శాంతిని |
| | | నిఃస్పృహః | = స్పృహారహితుడై | అధిగచ్ఛతి | = పొందును. |
| విహాయ | = త్యజించి | చరతి | = చరించునో | | |

**కోరికలన్నింటిని త్యజించి, మమతా- అహంకార, స్పృహారహితుడై చరించునట్టి పురుషుడే శాంతిని పొందును. (71)**

ప్రశ్న - 'సర్వాన్' అను విశేషణముతో పాటు 'కామాన్' అను పదము వేటిని సూచించును? వాటిని త్యజించుట యనగానేమి?

సమా - ఇహపరలోక భోగములన్నింటికిని సంబంధించిన అనేక విధములైన కోరికలను సూచించునదియే 'సర్వాన్' అను విశేషణముతో కూడిన 'కామాన్' అను పదము - వివిధములైన ఈ భోగేచ్ఛలనన్నింటిని శాశ్వతముగా సర్వథా తొలగించుకొనుటయే వాటిని త్యజించుటయగును.

ఇచట 'కామాన్' అను పదము శబ్దాది విషయములను తెల్పదు - ఏలనన "స్థితప్రజ్ఞుడు ఏ విధముగా ఆచరించును?" అను అర్జునుని నాల్గవ ప్రశ్నకు ఇచట సమాధానము ఇయ్యబడుచున్నది - కనుక 'కామాన్' అను పదమునకు అర్థమును శబ్దాది విషయములని భావించినచో వాటిని సర్వథా త్యజించి, సంచరించుటకు వీలుపడదు.

ప్రశ్న - 'నిరహంకారః' 'నిర్మమః' 'నిఃస్పృహః' అను ఈ మూడు పదములయొక్క వేర్వేఱు అర్థములెవ్వి? ఆ స్థితిలో సంచరించుట యనగానేమి?

సమా - మనోబుద్ధీంద్రియములతో గూడిన శరీరముల యందు అజ్ఞానులైన సామాన్యమానవులకు ఆత్మాభిమానముండును. ఆకారణమున వారు శరీరమునే తమ స్వరూపముగా భావింతురు. తమను శరీరముకంటె వేఱుగా తలంపరు. కావున శరీరసుఖదుఃఖములవలననే తాము సుఖులమనియు, దుఃఖితులమనియు తలంతురు. ఈ దేహాభిమానమునే అహంకారమని యందురు. ఇది ఏవిధముగను లేకుండువానిని 'నిరహంకారః' అనగా అహంకారరహితుడు - అనియుందురు.

మనోబుద్ధీంద్రియములతో గూడిన శరీరమునందును దానితో సంబంధముగల భార్యాపుత్రులు, సోదరులు, బంధుపరంపర యందును, అట్లే గృహము, ధనము, ఐశ్వర్యము మొదలగు వస్తువులయందును, తనచే చేయబడు కార్యములయందును, ఆ కర్మఫల రూపములైన సమస్త భోగములయందును, సామాన్య మానవులకు మమత్వ ముండును. అనగా వీటన్నింటిని తమవిగా భావింతురు. ఈ భావమునే 'మమత' అని యందురు - ఈ భావమును ఏ విధముగను కల్గియుండని వానిని 'నిర్మమః' అనగా మమతారహితుడు - అనియుందురు.

ఏదైననొక అనుకూలవస్తువు లేనప్పుడు ఆ ప్రత్యేక వస్తువు అవసరమనియు, అది లేనిచో, పనులు నడువవనియు, భావించి, దానికొఱకై అపేక్షపడుట జరుగును - అట్టి అపేక్షనే 'స్పృహ' అని యందురు. ఇట్టి అపేక్ష ఏమాత్రమూ లేనివానిని 'నిఃస్పృహః' అనగా స్పృహారహితుడు అనియుందురు. స్పృహ కోరికల యొక్క సూక్ష్మ రూపము. అందువలన సమస్త కోరికల త్యాగముకంటెను ఈ స్పృహాత్యాగము వేఱుగా చూపబడినది.

ఈ విధముగా అహంకారమమతా స్పృహారహితుడై తన వర్ణాశ్రమ ప్రకృతి పరిస్థితులను అనుసరించి, కేవలము లోకహితముకొఱకే ఇంద్రియ విషయములయందు సంచరించుట- అనగా చూచుట, వినుట, తినుట, త్రాగుట, నిద్రించుట, మేల్కొనుట మొదలగు శాస్త్ర విహిత చేష్టలను చేయుటయే కోరికలనన్నింటిని త్యజించి, అహంకారమమతా స్పృహారహితుడై సంచరించుట యగును.

ప్రశ్న - ఇచట 'నిఃస్పృహః' అను పదమునకు ఆసక్తి రహితుడు అను అర్థమును చెప్పిన దోషమేమి?

సమా - స్పృహ ఆసక్తి యొక్క కార్యమే. కావున స్పృహకు అర్థమును 'ఆసక్తి' అని భావించుటలోను దోషము లేదు. వాస్తవముగా 'స్పృహ' అను శబ్దమునకు అర్థము సూక్ష్మమైన కోరిక- కాని ఆసక్తికాదు. కావున 'స్పృహ'కు అర్థము ఆసక్తియని భావింపక కోరిక యొక్క సూక్ష్మరూపమని భావింపవలెను.

ప్రశ్న - కోరిక, స్పృహ లేకుండవలెనని తెల్పిన పిదప 'నిర్మమః' 'నిరహంకారః' అని చెప్పుట వలన ప్రయోజనమేమి?

సమా - ఇచట పరిపూర్ణ శాంతిని పొందిన సిద్ధ పురుషుని వర్ణనగలదు. కావున అతనిని నిష్కామ, నిఃస్పృహలతోపాటు, మమతాహంకారరహితుడుగా గూడ పేర్కొనుట జరిగినది. ఏలనన అధికాంశములో కోరిక, స్పృహ లేనప్పటికిని ఎవరియందైనను మమతాహంకారములున్నచో అతడు సిద్ధపురుషుడు కానేరడు. నిష్కామ, నిఃస్పృహ, నిర్మముడైనను అహంకార రహితుడు కానిచో అతడును సిద్ధుడు కాలేడు. అహంకారము నశించుటతోడనే అన్నియు నశించును. కారణరూపమైన అహంకారము ఉన్నంత వఱకును కామనా స్పృహా మమతలుగూడ ఏదోయొక రూపములో ఉండనే యుండును. కామనాస్పృహా మమతాహంకారములు ఏ కొంచెముగనైనను ఉన్నంత వఱకును పరిపూర్ణ శాంతి లభింపదు. ఇచ్చట 'శాంతిమ్ అధిగచ్ఛతి' అను వాక్యము ద్వారా పూర్ణశాంతి విషయమే స్పష్టముచేయబడినది. మమతాహంకారరహితుడు కానిదే ఈ విధమైన పరిపూర్ణమైన నిత్యమైన శాంతిలభింపదు. కావున నిష్కామ నిఃస్పృహలను గూర్చి తెల్పిన పిదప గూడ నిర్మమ నిరహంకారములను గూర్చి తెల్పుట ఉచితమే.

ప్రశ్న - పై విధముగా భావించినచో నిరహంకార శబ్దము ఒక్కటియే చాలును. నిష్కామ నిఃస్పృహ నిర్మమత్వముల అవసరమేమి?

సమా - నిరహంకారుడైన వాడు కామనాస్పృహామమతలు గూడ కలిగియుండడను మాట సరియైనదే. ఏలనన అహంకారమే ఈయన్నింటికిని మూలకారణము. కారణము తొలగినంతనే కార్యములు తమంతట తామే అభావమగును-అనను స్పష్టముగా వివరించుటకై ఈ శబ్దములు ప్రయుక్తములైనవి.

ప్రశ్న - "అతడు శాంతిని పొందినవాడగును" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ శ్లోకమున పరమాత్మ ప్రాప్తినందిన పురుషుడు సంచరించు రీతిని దెల్పుచు స్థితప్రజ్ఞుని విషయమై అర్జునుని నాల్గవ ప్రశ్నకు సమాధానము ఇయ్యబడినది. కావున పై వివరణమును బట్టి ఈ విధముగా విషయములయందు సంచరించు పురుషుడే పరమశాంతి స్వరూపుడైన పరబ్రహ్మ పరమాత్మను పొందిన స్థితప్రజ్ఞుడని ఎఱుంగవలెను.

సంబంధము - ఈ విధముగా అర్జునుని నాలుగు ప్రశ్నలకును సమాధానములను ఇచ్చిన యనంతరము ఇప్పుడు స్థితప్రజ్ఞుడైన వాని స్థితియొక్క మహత్త్వమును దెలుపుచు భగవానుడు ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-

**ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = ఓ పార్థా! | ప్రాప్య | = పొంది (పొందినపిదప) | అస్యామ్ | = ఈ బ్రాహ్మీస్థితియందు |
| ఏషా | = ఇదియే | న, విముహ్యతి | = (యోగి ఎన్నడును) మోహితుడుకాడు | స్థిత్వా | = స్థితమైయుండినవాడు |
| బ్రాహ్మీ స్థితిః | = బ్రహ్మప్రాప్తినందిన పురుషునియొక్క స్థితి | అంతకాలే, అపి | = అంత్యకాలము నందును | బ్రహ్మ నిర్వాణమ్ | = బ్రహ్మానందమును |
| ఏనామ్ | = దీనిని | | | ఋచ్ఛతి | = పొందును |

**ఓ అర్జునా! బ్రాహ్మీస్థితి యనగా ఇదియే. (ఇదియే బ్రహ్మప్రాప్తి కలిగిన పురుషుని స్థితి.) ఈ బ్రాహ్మీస్థితిని పొందిన యోగి ఎన్నడును మోహితుడు కాడు. అంత్యకాలమునందును ఈ బ్రాహ్మీస్థితియందు స్థిరముగానున్నవాడు బ్రహ్మానందమును పొందును. (72)**

ప్రశ్న - 'ఏషా' 'బ్రాహ్మీ' అను రెండు విశేషణములతో పాటు 'స్థితిః' అను పదము ఏ స్థితిని సూచించును? దానిని పొందుట యనగానేమి?

సమా - బ్రహ్మవిషయకస్థితిని బ్రాహ్మీస్థితి యందురు. 'ఏషా' అను పదము ప్రస్తుత ప్రకరణమును సూచించును. అర్జునుని ప్రశ్నకు సమాధానముగా 55వ శ్లోకమునుండి

ఇంతవరకు స్థితప్రజ్ఞుని స్థితిని పలుచోట్ల భగవానుడు వర్ణించెను. బ్రహ్మప్రాప్తినందిన ఆ మహాత్ముని స్థితినే 'ఏషా' 'బ్రాహ్మీ' అను విశేషణములతో గూడిన 'స్థితిః' అను పదము తెల్పును. పైన తెల్పబడిన విధముగా అహంకార మమకారములను, ఆసక్తి స్పృహలను, కోరికలను త్యజించి, నిర్వికార నిశ్చల భావముతో సచ్చిదానందఘనపరమాత్మ స్వరూపము నందు నిమగ్నమై యుండుటయే ఆ స్థితిని పొందుటయగును.

ప్రశ్న - "ఈ స్థితిని పొందిన యోగి ఎన్నడును మోహితుడు కాడు" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - బ్రహ్మమనగానేమి? ఈశ్వరుడెవ్వడు? సంసారమనగానేమి? మాయయని దేనికి పేరు? వీటికిగల పరస్పర సంబంధమేమి? నేనెవరు? ఎచటినుండి వచ్చితిని? నా కర్తవ్యమేమి? నేను ఏమిచేయుచున్నాను? - ఈ మొదలగు విషయముల యథార్థ జ్ఞానము లేకపోవుటయే మోహమనబడును. ఈ మోహము జీవునకు అనాదికాలము నుండి యున్నది. దీని వలననే అతడు ఈ సంసార చక్రమున పరిభ్రమించుచున్నాడు. కాని అహంకార మమకారములు, ఆసక్తులు, కోరికలు, త్యజించి, మనుష్యుడు పైన తెల్పబడిన బ్రాహ్మీస్థితిని పొందినపుడు ఈ అనాది సిద్ధమైన మోహము అతని నుండి సమూలముగ తొలగిపోవును - కావున మరల అది ఉత్పన్నము కాదు.

ప్రశ్న - "అంత్యకాలమునందును ఈ స్థితి యందున్న యోగి బ్రహ్మానందమును పొందును" - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - జీవితకాలముననే ఈ స్థితిని పొందిన మనుష్యుడు బ్రహ్మానందమును పొంది జీవన్ముక్తుడు అగునని చెప్పనవసరమే లేదు. కాని సాధన చేయుగా చేయుగా అకస్మాత్తుగా మరణ కాలమునందును ఈ బ్రాహ్మీస్థితి యందున్న వాడు అనగా అహంకార మమకారములను, ఆసక్తి స్పృహలను, కోరికలను అంతరింపజేసికొని (త్యజించి) నిశ్చల భావముతో పరమాత్మ స్వరూపమునందే స్థితుడైయున్న వాడును బ్రహ్మానందమును పొందును.

ప్రశ్న - కర్మయోగమునందు శ్రద్ధగల సాధకుని మనస్సు ఏదో యొక కారణమున మృత్యుసమయమున సమభావమున స్థిరముగా ఉండనిచో అతని గతియేమగును?

సమా - మృత్యుకాలమునందు (మరణసమయమున) సమభావస్థితుడై యున్న సాధకుడు తత్కాలముననే (తత్ క్షణమే) ఉద్ధరింపబడును. కాని మరణ సమయమున అతని మనస్సు సమత్వము నుండి విచలితమైనను అతని అభ్యాసము (కృషి) వ్యర్థముగాదు. అతడు యోగభ్రష్టునిగతిని పొందును. సమభావసంస్కారము అతనిని తనవైపు ఆకర్షితునిగా చేసికొనును- (6/40-44) అనగా పూర్వజన్మ సంస్కారప్రభావమున అతడు మరల సాధన కొనసాగించి, సమభావస్థితిని పొందును. అట్టివాడు పరమాత్మ ప్రాప్తినందును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః ॥ ౨ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# మూడవ అధ్యాయము - కర్మయోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు విహితకర్మలను విధిగా ఆచరింపవలసిన అవసరమును గూర్చి అనేకవిధములుగా సహేతుకముగ నిరూపింపబడినది. అట్లే ప్రతివ్యక్తియు తన వర్ణాశ్రమధర్మములను అనుసరించి విధ్యుక్త కర్మలను ఎట్లు చేయవలెను ? ఏల చేయవలెను ? వానిని ఆచరింపకుండుటవలన కలుగు హానియేమి? ఆచరించినచో కలుగు ప్రయోజనమేమి? ఏ కర్మలు బంధకారకములు? ఏవి ముక్తిసాధకములు? - మున్నుగాగల ఈ విషయములు అన్నియు సాకల్యముగ ఇందు చర్చింపబడినవి. ఈ విధముగ ఈ అధ్యాయమునందు కర్మయోగవిషయములు ఇతర - అధ్యాయములకంటెను, అధికముగ, విస్తృతముగ వర్ణింపబడినవి. అట్లే ఇతరవిషయములకు సంబంధించిన వివరణము మిక్కిలి సంక్షిప్తముగా చేయబడినది. కనుక ఈ అధ్యాయమునకు "కర్మయోగము" అనుపేరు ఏర్పడినది.

**అధ్యాయ సారాంశము :** ఇంతవరకును భగవానుడు తెల్పిన విషయములు తనకు బోధపడని కారణమున, ఈ అధ్యాయమునందు మొదటి *1, 2* శ్లోకములలో అర్జునుడు తనకు శ్రేయస్కరమైన సాధన మార్గము ఏదియో తెలుపుమని భగవానుని ప్రార్థించెను. దానికి సమాధానముగా 3వ శ్లోకమునందు రెండు నిష్ఠలను (సాంఖ్య, కర్మయోగములను) గూర్చి తెల్పుచు *(4)* నాల్గవ శ్లోకమున ఏ నిష్ఠయందును కర్మాచరణమును త్యజింపనవసరమే లేదని భగవంతుడు నొక్కి చెప్పెను. 5వ శ్లోకమున క్షణమాత్రమైనను మానవుడు కర్మలను చేయకుండ ఉండజాలడని తెల్పెను. కేవలము బాహ్యముగ ఇంద్రియ వ్యాపారములను నిర్వహింపక మానసికముగ విషయచింతన చేయు మనుష్యుని 'మిథ్యాచారి'గ 6వ శ్లోకమున పేర్కొనెను. 7వ శ్లోకమున మనస్సు ద్వారా ఇంద్రియములను నిగ్రహించి, అనాసక్త భావముతో ఇంద్రియములద్వారా కర్మలను ఆచరించుటను గూర్చి ప్రశంసించెను. *8,9* శ్లోకములలో కర్మలను చేయకుండుటకంటె చేయుటయే శ్రేష్ఠమనియు, కర్మలను ఆచరింపక శరీర నిర్వహణము కూడా అసంభవమని తెల్పుచు నిస్స్వార్థ - అనాసక్త భావముతో విహిత కర్మలను చేయవలసినదిగా ఆజ్ఞాపించెను. *10* నుండి *12*వ శ్లోకము వఱకును సృష్టికర్తయైన బ్రహ్మ ఆజ్ఞానుసారము కర్మలు అవశ్యము ఆచరణీయములేయని పేర్కొనెను. యజ్ఞశిష్టాన్నము సర్వపాపములను నశింపజేయుననియు, యజ్ఞములు చేయనివాడు 'పాపి' యనియు 13వ శ్లోకమున తెలిపెను. 14వ, 15వ శ్లోకములయందు సృష్టి చక్రమును వర్ణించుచు సర్వవ్యాపియైన పరమేశ్వరుడు యజ్ఞరూపసాధనయందు నిత్యప్రతిష్ఠితుడు' అని పేర్కొనెను. ఈ సృష్టిక్రమమును అనుసరింపని వారిని 16వ శ్లోకమున అధిక్షేపించెను. *17, 18.* శ్లోకములలో 'ఆత్మజ్ఞాని' యైన మహాత్మునకు ఎట్టి కర్తవ్యము ఉండదనియు, కర్మచేయుటవలనగాని, చేయకుండుటవలనగాని అతనికి ఎట్టి ప్రయోజనమూ ఉండదనియు తెలిపెను. 19వ శ్లోకమున ఉపర్యుక్తకారణములవలన కర్మాచరణము ఆవశ్యకము అని నిరూపించుచు నిష్కామకర్మఫలము పరమాత్మప్రాప్తి యని తెలిపి, అనాసక్త భావముతో కర్మలను ఆచరింపుమని అర్జునుని భగవానుడు ఆదేశించెను. పిమ్మట 20వ శ్లోకమున జనకాదులు కర్మాచరణములద్వారా సిద్ధిని పొందినట్లు ప్రామాణికముగా తెలిపి, లోకకల్యాణము కొఱకు కర్మలను ఆచరించుట అవశ్య కర్తవ్యమని తెలిపెను. శ్రేష్ఠుడైనవాని ఆచరణమును, ఉపదేశములను ఇతరులు అనుసరింతురని 21వ శ్లోకమున పేర్కొని, 22 నుండి 24వ శ్లోకము వఱకును భగవానుడు తననే దృష్టాంతముగా చూపుచు, కర్మాచరణము వలన కలుగు లాభములను, కర్మలను చేయకుండుటవలన కలుగు హానిని వివరించెను. *25, 26* శ్లోకములయందు జ్ఞానియైన వాడును లోకకల్యాణమునకై స్వయముగా కర్మలను చేయుచు, ఇతరులచేతను చేయించుట సముచితమని పేర్కొనెను. *27, 28* శ్లోకములయందు కర్మలయందు ఆసక్తులైన జనులకంటె సాంఖ్యయోగియొక్క విలక్షణత్వమును ప్రతిపాదించుచు 29వ శ్లోకమున జ్ఞాని యైనవాడు సామాన్య మానవులను అపమార్గము పట్టింపరాదని తెల్పెను. ఆశ, మమత, సంతాపములను సర్వథా త్యజించి, భగవదర్పణబుద్ధితో యుద్ధము నాచరింపుమని 30వ శ్లోకమున భగవానుడు అర్జునుని ఆదేశించెను. 31వ శ్లోకమున ఆ సిద్ధాంతమును అనుసరించి, శ్రద్ధాళువులైన పురుషులు ముక్తులగుదురని తెలుపుచు దానిని అనుసరింపని దోషదర్శులు పతనమయ్యెదరని 32వ శ్లోకమున వివరించెను. 33వ శ్లోకమున స్వభావమునననుసరించి, కర్మాచరణమును

మానివేయుట మనుష్యులకు సాధ్యమే కాదని తెల్పుచు, *34*వ శ్లోకమున రాగద్వేషములకు వశము కాకుండ కర్మలను చేయవలెనని ప్రోత్సహించెను. పరధర్మములను ఆచరించుటకంటె స్వధర్మాచరణమే శ్రేయస్కరమనియు, పరధర్మము భయావహమనియు *35*వ శ్లోకమున పేర్కొనెను. *36*వ శ్లోకమున మానవుడు అప్రయత్నముగనే ఇచ్ఛలేకయు దేని ప్రోద్బలమువలన పాపకృత్యములయందు ప్రవృత్తుడగుచున్నాడు? అని అర్జునుడు ప్రశ్నించెను. *37*వ శ్లోకమున కామరూప శత్రువే సమస్త పాపకార్యములకును మూలకారణమని తెలుపుచు *38* నుండి *41*వ శ్లోకము వఱకును ఆజ్యాది హవిస్సులతో అగ్నిజ్వాలలు అధికమై, పైకెగయునట్లు కామము అనుభవించుకొలది అధికమగుచుండునే గాని ఉపశమింపదు - అనియు, ఇది జ్ఞానమును కప్పివేయు మహాశత్రువనియు, ఇంద్రియ సంయమముద్వారా ఈ కామమును నిగ్రహింపవలెననియు తెలిపెను. *42*వ శ్లోకమునందు ఇంద్రియములకంటెను మనస్సు, దానికంటెను బుద్ధి, దానికంటెను ఆత్మ మిక్కిలి శ్రేష్ఠమని తెలుపుచు, *43*వ శ్లోకమున బుద్ధిద్వారా మనస్సును నిగ్రహించి, ఈ కామరూప శత్రువును రూపుమాపుమని ఆదేశించుచు భగవానుడు ఈ యధ్యాయమును ముగించెను.

**సంబంధము** - రెండవ అధ్యాయమునందు భగవానుడు **"అశోచ్యానన్వశోచస్త్వమ్" (2/11)** అని ప్రారంభించి, **"దేహీ నిత్య మవధ్యోఽయం" (2/30)** వఱకు ఆత్మతత్త్వమును నిరూపించుచు సాంఖ్య యోగమును ప్రతిపాదించెను. పిమ్మట **"బుద్ధి ర్యోగేత్విమాం శృణు" (2/39)** నుండి **"తదా యోగ మవాప్స్యసి" (2/53)** వరకు సమత్వబుద్ధిరూప కర్మయోగమును వర్ణించెను. పిదప *54*వ శ్లోకమునుండి అధ్యాయ సమాప్తి వఱకు అర్జునుని ప్రశ్నలను అనుసరించి, భగవానుడు సమబుద్ధిరూపకర్మయోగముద్వారా ఆ పరమేశ్వర ప్రాప్తినందిన స్థితప్రజ్ఞుడైన సిద్ధపురుషుని లక్షణమును, ఆచరణమును మహత్త్వమును ప్రతిపాదించెను. అచ్చట కర్మయోగ మహత్త్వమును గూర్చి తెల్పుచు *47, 48* శ్లోకములయందు భగవానుడు కర్మయోగ స్వరూపమును తెలిపి, కర్మలను ఆచరింపుమని అర్జునునితో పలికెను. *49*వ శ్లోకమున సమబుద్ధి రూప కర్మయోగముకంటెను సకామకర్మ యొక్క స్థానము నిమ్నమైనదని తెలిపెను. *50*వ శ్లోకమునందు సమబుద్ధియుక్తుడైన పురుషుని ప్రశంసించుచు కర్మయోగ స్థితుడవు కమ్మని అర్జునుని ఆదేశించెను. *51*వ శ్లోకమునందు సమబుద్ధియుక్తుడైన జ్ఞానియైన వానికి అనామయ పదప్రాప్తి కలుగునని తెలిపెను. భగవానుడు వివరించిన విషయముల యథార్థస్వరూపమును అర్జునుడు స్పష్టముగ, సమగ్రముగ గ్రహింపలేకపోయెను. బుద్ధి అను శబ్దమునకు 'జ్ఞానము' అను అర్థమును గ్రహించుటచే అతడు భ్రమకు లోనయ్యెను. భగవానుని మాటలలో 'కర్మ' కంటెను 'జ్ఞానమే' శ్రేష్ఠమైనదిగా అతనికి తోచెను. ఆ మాటలు అతనికి అస్పష్టముగా కలగాపులగముగా కనబడెను. అందువలన ఆ విషయములను స్పష్టముగా తెలిసికొనుటకును తనకేది శ్రేయస్కరమో నిజముగా ఎఱుంగుటకును అర్జునుడు భగవానుని ప్రశ్నించుచున్నాడు-

**అర్జున ఉవాచ**

## జ్యాయసీ చేత్ కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।
## తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥ 1 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనార్దన! | = ఓ జనార్దనా! | తే, మతా, చేత్ | = నీ అభిప్రాయమైనచో | ఘోరే | = భయంకరమైన |
| కర్మణః | = కర్మకంటెను | తత్ | = అట్టిస్థితిలో | కర్మణి | = (ఈ) యుద్ధ కార్యమునందు |
| బుద్ధిః | = జ్ఞానము | కేశవ! | = ఓ కేశవా! | కిమ్ | = ఎందులకు |
| జ్యాయసీ | = శ్రేష్ఠమైనదని | మామ్ | = నన్ను | నియోజయసి | = నియోగించుచున్నావు? |

అర్జునుడు పలికెను- ఓ జనార్దనా! కేశవా! నీ అభిప్రాయమును బట్టి కర్మకంటెను జ్ఞానమే శ్రేష్ఠమైనచో, భయంకరమైన ఈ యుద్ధకార్యమునందు నన్నేల నియోగించుచున్నావు? **(1)**

ప్రశ్న - కర్మకంటెను జ్ఞానము శ్రేష్ఠమని భగవానుడు ఇంతకు ముందు ఎక్కడ చెప్పెను? ఒకవేళ అట్లు చెప్పనిచో అర్జునుని ప్రశ్నకు ఆధారమేమి?

సమా - భగవాను డీవిధముగా ఎక్కడను చెప్పనేలేదు. భగవంతుని మాటలకు సరియైన అర్థమును అర్జునుడు గ్రహింపలేకపోయెను. "దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ!" అను వాక్యమును భగవానుడు బుద్ధియోగము అను పదమును "జ్ఞానము" అను అర్థములో ప్రయోగించుచున్నాడనియు, అట్టి జ్ఞానముకంటెను 'కర్మ' నిమ్నమైనదిగా తెల్పుచున్నాడనియు అర్జునుడు భావించెను. కాని వాస్తవముగా అచ్చట 'బుద్ధియోగము' అను పదము జ్ఞానార్థకము కాదు. 'బుద్ధియోగము' సమబుద్ధితో గూడిన కర్మయోగమునకు వాచకము. 'కర్మ' అను పదము అచట 'సకామకర్మ' వాచకము. ఏలనన అదే శ్లోకమునందు భగవానుడు ఫలమును కాంక్షించు వారిని 'కృపణాః ఫలహేతవః' అని తెలిపి, వారిని అత్యంత దీనులుగా పేర్కొనెను. సకామకర్మలను తుచ్ఛములుగా తెల్పుచు 'బుద్ధౌ శరణమన్విచ్ఛ' అనుచు సమబుద్ధిరూపకర్మ యోగమును ఆశ్రయింపుమని అర్జునుని ఆదేశించెను. కాని అర్జునుడు ఈ తత్త్వమును (ఈ రహస్యమును) గ్రహింపలేక పై విధముగా ప్రశ్నించెను.

ప్రశ్న - 'బుద్ధి' అను పదమునకు అర్థము ఇచ్చట గూడ మునుపటివలె 'సమబుద్ధి రూపకర్మయోగము' అని ఏల భావింపరాదు?

సమా - ఇచట ఇది అర్జునుని ప్రశ్న. అతడు భగవానుని మాటల అర్థమును సరిగా గ్రహింపక 'బుద్ధి' అను పదమునకు 'జ్ఞానము' అను అర్థమును భావించెను. కనుక పై విధముగ ప్రశ్నించెను. 'బుద్ధి' అను పదమునకు 'సమబుద్ధిరూప కర్మయోగము' అను అర్థమును అర్జునుడు భావించి యున్నచో పై ప్రశ్నకు ఆధారమే ఉండదు. అర్జునుని అవగాహనమును బట్టి ఈ ప్రశ్నయందు 'బుద్ధి' అను పదమునకు 'జ్ఞానము' అను అర్థమును చెప్పుటయే సరియైనది.

ప్రశ్న - నన్ను ఈ ఘోరమైన కార్యమునందు ఏల నియోగించుచున్నావు? అను వాక్యముయొక్క అంతరార్థమేమి?

సమా - భగవానుని వచనములను అర్జునుడు సరిగా అవగాహన చేసికొనలేక పోయెను. ఆ కారణముననే 'తస్మాద్యుధ్యస్వ భారత!' - కనుక నీవు యుద్ధమొనరింపుము, 'కర్మణ్యేవాధికారస్తే' - కర్మ చేయుట యందే నీకు అధికారము గలదు, 'యోగస్థః కురు కర్మాణి' - యోగమునందు స్థితుడవై కర్మలను ఆచరింపుము, మొదలగు విధివాక్యముల ద్వారా భగవానుడు మునుపు తెల్పిన విధముగా తనను కర్మలయందే నియోగించుచున్నట్లు అతడు భావించెను. కావున పై ప్రశ్న ద్వారా "నీవు భయంకరమైన ఈ యుద్ధరూప ఘోరకర్మయందు నన్ను ఏల నియోగించుచున్నావు?" అని భగవానుని అధిక్షేపించు చున్నట్లుగా అతడు ప్రశ్నించెను.

ప్రశ్న - అర్జునుడు భగవానుని 'జనార్దన!' 'కేశవ!' అని సంబోధించుటలోని విశేషమేమి?

సమా - 'సర్వైః జనైః అర్ద్యతే యాచ్యతే స్వాభిలషిత సిద్ధయే ఇతి జనార్దనః' అను వ్యుత్పత్తిని అనుసరించి, జనులందఱును తమ మనోరథసిద్ధి కొఱకై అర్థించెదరు కావున - భగవానుని 'జనార్దనుడు' అని యందురు. అట్లే, 'క' అనగా బ్రహ్మ, 'అ' అనగా విష్ణువు, 'ఈశ' అనగా మహేశ్వరుడు అను ఈ ముగ్గురును ఎవనికి శరీరములో అనగా స్వరూపములో అతనినే 'కేశవుడు' అని యందురు. ఈ రెండు పేర్లతో భగవానుని సంబోధించుచు "నేను-మీకు శరణాగతుడను, నా కర్తవ్యమును తెలుపుమని మునుపే నిన్ను అర్థించియుంటిని, (2/7) నీవు సాక్షాత్తుగా పరమేశ్వరుడవు. ఇప్పుడును అర్థించుచున్నాను. కనుక శరణాగతుడనైన నాకు అవశ్యకర్తవ్యమును దయతో తెలుపుము." అని ప్రార్థించెను. జనార్దన! కేశవ! అను సంబోధనలలోని విశేషమిదియే.

**వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।**
**తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥ 2 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వ్యామిశ్రేణ, ఇవ | = కలగాపులగమువలె ఉన్న | మోహయసి, ఇవ | = భ్రమింపజేయు చున్నట్లు ఉన్నావు | ఆప్నుయామ్ | = పొందుదునో |
| వాక్యేన | = (నీ)మాటలతో | యేన | = దేనిచేత | తత్, ఏకమ్ | = అట్టి ఒక మార్గము (కర్మమునో, జ్ఞానమునో) |
| మే | = నా | అహమ్ | = నేను | నిశ్చిత్య | = నిశ్చయముగా |
| బుద్ధిమ్ | = బుద్ధిని | శ్రేయః | = శ్రేయస్సును | వద | = చెప్పుము. |

**కలగాపులగమువంటి నీ మాటలతో నా బుద్ధి భ్రమకు లోనగునట్లు చేయుచున్నావు. కనుక నాకు శ్రేయస్కరమైన ఒక మార్గమును నిశ్చయముగా తెల్పుము. (2)**

ప్రశ్న - "నీ కలగాపులగమునంటి మాటల ద్వారా నా బుద్ధిని భ్రమకు లోనగునట్లు చేయుచున్నావు." అను వాక్యము యొక్క ఆంతర్యమేమి?

సమా - కర్తవ్యసాధన మార్గములలో ఏ ఒక్క దానినీ నిర్దేశింపక అనేక విషయములను కలగలిపి, పలికెడి మాటలనే 'వ్యామిశ్ర' అనగా కలగాపులగపు మాటలు - అని యందురు. ఇట్టి మాటల వలన శ్రోతయొక్క బుద్ధి ఏ ఒక్క దానినీ నిశ్చయించుకొనలేక భ్రమకు లోనగును. భగవానుని వచనముల ఆంతర్యమును సరిగా గ్రహింపలేని కారణమున అర్జునునకు భగవద్వచనములు 'వ్యామిశ్ర' వచనములు (కలగాపులగపు మాటలు)గా గోచరించెను. బుద్ధియోగము కంటెను కర్మ మిక్కిలి నిమ్నమైనది. నీవు బుద్ధిని ఆశ్రయింపుము. (2/49). అను వాక్యములను అర్జునుడు సరిగా అవగాహన చేసికొనలేక "భగవానుడు జ్ఞానమును ప్రశంసించుచు కర్మలను నిందించుచున్నాడనియు, తనను 'జ్ఞానము'ను ఆశ్రయింపుమని ఆదేశించుచున్నాడనియు భావించెను. అట్లే "బుద్ధియుక్తుడైనవాడు పుణ్యపాపములను వదలి వేయును." (2/50) అను భగవద్వాక్యమునకు "పుణ్యపాపరూప సమస్త కర్మాచరణములను త్యజించిన వాడే బుద్ధియుక్తుడు" అను అర్థమును అర్జునుడు గ్రహించెను.

దీనికి విపరీతముగా 'నీకు కర్మాచరణము నందే అధికారము గలదు. (2/47). "యోగస్థితుడవై కర్మలను ఆచరింపుము" (2/48) అను వాక్యముల ద్వారా భగవానుడు తనను కర్మలయందు నియుక్తుని జేయుచున్నాడని అర్జునుడు తలంచెను. ఇంతేగాక "నిస్త్రైగుణ్యో భవ" "ఆత్మవాన్ భవ". (2/45) మొదలగు వాక్యముల ద్వారా కర్మలను త్యజించుటకును, 'తస్మాత్ యుధ్యస్వభారత!' (2/18) 'తతో యుద్ధాయ యుజ్యస్వ' (2/38). 'తస్మాత్ యోగాయ యుజ్యస్వ' (2/50) మొదలగు వచనములద్వారా కర్మలు చేయుటకు ప్రోత్సహించుచున్నాడని భావించెను. ఈ విధముగా పైవాక్యములయందు వైరుధ్యము కనబడెను.

నీవు సాధనమార్గములను వాస్తవముగా వేర్వేరుగనే స్పష్టముగా తెల్పుచున్నావు. ఏ విషయమును గూడ కలగాపులగము చేయుట లేదు. నీవు నాకు పరమ ప్రియుడవు హితైషివి. కనుక నన్ను నిజముగా భ్రమపెట్టుట లేదు. పైగా నా భ్రమ తొలగుటకే ఉపదేశించుచున్నావు. కాని నా అజ్ఞాన కారణమున నీవు పరస్పర విరుద్ధములైన కలగా పులగపు మాటలద్వారా నా బుద్ధిని భ్రమింప జేయుచున్నట్లు తోచుచున్నది" అని తెల్పుటకే 'ఇవ' అను అవ్యయమును రెండుమార్లు అర్జునుడు ప్రయోగించెను.

ప్రశ్న - 2వ అధ్యాయమునందలి 49, 50వ శ్లోకములను వినినంతనే అర్జునుని బుద్ధి భ్రమించి యుండెను. అయితే 53వ శ్లోకము చివరన ఆ సందర్భము పూర్తికాగానే తన భ్రమ తొలగుటకై భగవంతుని అతడు ఏల ప్రశ్నింపలేదు? 72వ శ్లోకము చివరి వరకు ఆగుటకు గల కారణమేమి?

సమా - అర్జునునకు ఈ సందేహము అప్పుడే (50వ శ్లోకమునందే) కలిగి యుండెను. కనుక అతడు అప్పుడే ప్రశ్నించి యుండవలసినది. కాని 53వ శ్లోకమున భగవానుడు "నీ బుద్ధి మోహపంకిలము నుండి బయటపడి, పరమాత్మ స్వరూపమునందు స్థిరముగా నున్నప్పుడు నీవు పరమాత్మ యందు సంయోగరూపయోగమును పొందెదవు" అని పల్కెను. అది వినగానే అర్జునుని మనస్సునందు పరమాత్మ యందు స్థిరబుద్ధి గలిగిన పురుషుని లక్షణమును, ఆచరణములను తెలిసికొనవలెనను కౌతుకము ప్రబలమాయెను. ఈ కారణమున తన సందేహమును ప్రక్కన బెట్టి స్థితప్రజ్ఞుని విషయమును ప్రశ్నించెను. దానికి సమాధానము లభింపగనే ఈ సందేహము వెల్లడించెను. ఒకవేళ అతడు ఈ సందేహమును మొదటనే

ప్రకటించియున్నచో స్థితప్రజ్ఞుని విషయమై వివరణమునకు ఇంకను వ్యవధి పెఱిగియుండెడిది.

ప్రశ్న - "నాకు శ్రేయస్కరమైన ఏదో యొక విషయమును నిశ్చయముగా తెలుపుడు." అని యనుటలోని విశేషమేమి?

సమా - ఇప్పటి వఱకును భగవానుడు ఉపదేశించిన విషయములు పరస్పర విరుద్ధములుగా కన్పించెను. కావున అతడు తన కర్తవ్యమును తేల్చుకొనలేక పోయెను. భగవానుడు అతనిని యుద్ధము చేయుమని ఆజ్ఞాపించు చున్నాడా? లేక సమస్త కర్మలను త్యజింపుమనుచున్నాడా? అను విషయము బోధపడలేదు. ఒక వేళ యుద్ధము చేయుమనియే ఆదేశించియున్నచో ఏ విధముగా చేయవలెను. కర్మ త్యాగమును సూచించి యున్నచో కర్మత్యాగమును చేసిన పిదప ఇంకేమి చేయవలెను? మొదలగు ఈ విషయములన్నియు అర్జునునకు బోధపడలేదు. కనుక బాగుగా ఆలోచించి, తనకు శ్రేయస్కరమైన ఏదో యొక మార్గమును తెల్పుమని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రార్థించెను.

ప్రశ్న - 'శ్రేయః' అను పదమునకు అర్థమేమి?

సమా - అర్జునుని ఉద్దేశ్యములో శ్రేయస్సనగా ఇహపరలోక భోగప్రాప్తి కాదు. ఏలనన అతడు "నిష్కంటక మైన ఈ రాజ్యాధిపత్యముగాని, దేవ లోకాధిపత్యముగాని నాశోకమును తొలగింప లేవు" (2/ 8) అని లోగడనే పలికి యుండెను. కావున శోకమోహములు సర్వథానశింపజేసి శాశ్వతమైన శాంతిని ఆనందమును చేకూర్చు "నిత్యవస్తుప్రాప్తి"నే అతడు తనకు శ్రేయస్సుగా భావించెను.

సంబంధము - అర్జునుని ప్రశ్నకు భగవానుడు సమాధానమును ఇచ్చుచు 'భక్తి ప్రధాన కర్మయోగమే అతనికి కర్తవ్యము'ని తెల్పు నుద్దేశ్యముతో తన పల్కులు కలగాపులగముగా లేవనియు, స్పష్టముగా వేర్వేఱుగా ఉన్నవనియు వివరించుచున్నాడు-

**శ్రీ భగవాన్ ఉవాచ**

**లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ ।**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ 3 ॥**

అనఘ! = పాపరహితుడా!
అస్మిన్, లోకే = ఈలోకమునందు
ద్వివిధా, నిష్ఠా = రెండు విధములగు నిష్ఠలు
మయా = నాచేత
పురా, ప్రోక్తా = ఇంతకుముందే చెప్పబడినవి
సాంఖ్యానామ్ = సాంఖ్యయోగులకు
జ్ఞానయోగేన = జ్ఞానయోగము ద్వారా (మరియు)
యోగినామ్ = యోగులకు
కర్మయోగేన = కర్మయోగము ద్వారా (నిష్ఠ కలుగును)

శ్రీభగవానుడు పలికెను- ఓ అనఘా! అర్జునా! ఈ లోకమున రెండు నిష్ఠలు గలవని ఇంతకుముందే చెప్పియుంటిని. వానిలో సాంఖ్యయోగులకు జ్ఞానయోగముద్వారా, యోగులకు కర్మయోగముద్వారా నిష్ఠ కలుగును. (3)

ప్రశ్న - 'అస్మిన్ లోకే' అను పదము ఏ లోకమును సూచించును.

సమా - 'అస్మిన్ లోకే' అను పదము ఈ మనుష్యలోకమును సూచించును. జ్ఞానయోగ, కర్మయోగ సాధనలకు మనుష్యులే అర్హులు.

ప్రశ్న - 'నిష్ఠా' అను పదమునకు అర్థమేమి? దానితో పాటు 'ద్వివిధా' అను విశేషణమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - 'నిష్ఠా' అనగా స్థితి. ముఖ్యముగా సాధన స్థితులు రెండు. ఒక స్థితి (సాంఖ్యయోగస్థితి) యందు మనుష్యుడు ఆత్మ - పరమాత్మలను అభేదముగా భావించును. అనగా తనను బ్రహ్మముకంటె వేఱుగా భావింపడు. రెండవస్థితి (కర్మయోగ స్థితి) యందు పరమేశ్వరుని సర్వశక్తిమంతునిగా, సంపూర్ణ జగత్తునకు కర్తగా, హర్తగా, స్వామిగాను తనను అతనికి ఆజ్ఞానువర్తియైన సేవకుని గాను తలంచును. ఇందు మొదటిది 'జ్ఞాననిష్ఠ'. ఈ నిష్ఠను అనుసరించు సాధకుడు

ప్రకృతి నుండి ఉత్పన్నములైన గుణములన్నియును గుణములలో ప్రవర్తించుచున్న వనియు, (3/28), వాటితో తనకు ఎట్టి సంబంధమూ లేదనియు భావించి, శరీరేంద్రియ మనస్సులద్వారా జరుగు క్రియల యందు, కర్తృత్వాభిమాన రహితుడై యుండును. ఏ క్రియయందును దాని ఫలము నందును అహంకార, మమకార - ఆసక్తి, కోరికలు ఏ మాత్రమూ కలిగియుండడు. సచ్చిదానందఘనబ్రహ్మనుండి తాను వేఱు గాదని భావించి, (అభేదభావముతో ఉండి) నిరంతరము పరమాత్మ భావమునందే స్థితుడై యుండును. అనగా బ్రహ్మభూతుడగును. (5/ 24, 6/27) ఈ స్థితి యందు యోగి హర్ష శోకాదులకును, కోరికలకును అతీతముగా సర్వత్ర సమదృష్టి కలిగియుండును. (18/ 54). ఆ స్థితిలో అతడు సమస్తజగత్తును ఆత్మయందు స్వప్నము వలె కల్పితముగ చూచును. మఱియు ఆత్మను సంపూర్ణ జగత్తునందు వ్యాప్తమైన దానినిగా చూచును (6/ 29). ఈ నిష్ఠ (స్థితి) యొక్క ఫలము పరమాత్మ స్వరూపము యొక్క యథార్థ జ్ఞానము. రెండవది కర్మయోగనిష్ఠ. వర్ణాశ్రమ ధర్మములను, స్వభావ పరిస్థితులను అనుసరించి, ఆయా వ్యక్తులకు శాస్త్రవిహితములైన స్వాభావిక కర్తవ్య కర్మలను ఇందు మానవుడు అనుష్ఠించును. ఆ కర్మలయందును, వాటి ఫలములయందును, మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించి, సిద్ధి+అసిద్ధుల యెడ సమభావమును సర్వదా కలిగియుండును. (2/47, 48) ఇంద్రియభోగముల యందును, కర్మలయందును ఆసక్తుడు గాక సంకల్పము లన్నింటిని వీడి యోగారూఢుడగును. (6/4) ఇట్టి కర్మయోగి పరమేశ్వరుని సర్వశక్తిమంతునిగా, సర్వాధారునిగా, సర్వవ్యాపిగా అందఱికిని సుహృదునిగా ప్రేరకునిగా భావించి, తనను సర్వథా అతనికి అధీనునిగా తలంచుచు సమస్త కర్మలను, వాటి ఫలములను భగవదర్పణము గావించును. (3/30, 9/27, 28) భగవదాజ్ఞా ప్రేరణలను అనుసరించి, సేవాభావముతో సమస్త కర్మలను ఆచరించుట, కర్మలయందును, వాటి ఫలముల యందును మమతాసక్తులు, కోరికలు ఏ మాత్రమూ లేకుండుట, భగవంతుని ప్రతి విధానమునందును సదా సంతుష్టుడై నిరంతరము అతని నామగుణ ప్రభావస్వరూపములను చింతనచేయుట (10/9, 12/6, 18/57) - మున్నగునవి భక్తిప్రధాన కర్మయోగ నిష్ఠలో భాగములు. ఈ కర్మయోగ స్థితిని పొందిన పురుషునిలో రాగద్వేషములు, కామక్రోధాది అవగుణములు, సర్వథా అంతరించి అన్నింటియెడ సమభావము కుదురుకొనును. ఏలనన అందఱి హృదయముల యందును ఆ పరమాత్మనే చూచును. (15/ 15, 18/61) సంపూర్ణ జగత్తును భగవత్స్వరూపముగనే అతడు భావించును. (7/7-12, 9/16-19). ఈ స్థితియొక్క ఫలము భగవత్ప్రాప్తియే.

ప్రశ్న - రెండు విధములైన నిష్ఠలను నేను ఇంతకు ముందే చెప్పి యుంటిని. అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవానుడు తెల్పిన ఈ రెండు నిష్ఠలును క్రొత్తగా చెప్పబడుచున్నవి గావు. వివిధ అవతారముల యందు ఈ రెండు నిష్ఠల స్వరూపములను వేర్వేరుగా ఇంతకుముందే తెల్పియుండెను. రెండవ అధ్యాయము నందలి 11వ శ్లోకమునుండి 30వ శ్లోకమువఱకును అద్వితీయ - ఆత్మస్వరూపమును ప్రతిపాదించుచు సాంఖ్యయోగ దృష్టితో యుద్ధము చేయుమని భగవాను డర్జునునితో నుడివెను. (2/18) 39వ శ్లోకమునందు యోగవిషయక బుద్ధిని గూర్చి చెప్పెదనని ప్రస్తావించుచు 40వ శ్లోకము నుండి 53వ శ్లోకము వఱకు ఫలసహితకర్మయోగమును గూర్చి వర్ణించుచు యోగమునందు స్థితుడవై యుద్ధాదికర్తవ్య కర్మలను చేయుమని ఆదేశించెను. (2/47-50) అట్లే ఈ రెండును వేర్వేరు అని తెల్పుటకు 39వ శ్లోకముననే - "ఇంతవఱకును తాను సాంఖ్యయోగవిషయమును గూర్చియే ఉపదేశించితి ననియు, ఇపుడు (కర్మ)యోగ విషయమును గూర్చి ఉపదేశించుచున్నట్లును భగవానుడు తెల్పెను. కనుక భగవానుని వచనములు కలగాపులగముగా లేవు" అని చెప్పుటయే ఇందలి విశేషము.

ప్రశ్న - అర్జునుని 'అనఘ!' అని సంబోధించుటలోని విశేషమేమి?

సమా - 'అఘము' అనగా పాపము. అనఘుడు అనగా పాపరహితుడు. పాపాత్ముడైనవాడు ఈ రెండింటిలో ఏ నిష్ఠను గూడ ఆచరించుటకు అర్హుడుకాడు. అర్జునుడు పాపరహితుడు గావున ఈ నిష్ఠాచరణమునకు అర్హుడని తెల్పుటకే 'అనఘ!' అని అతనిని సంబోధించెను.

ప్రశ్న - "సాంఖ్యయోగులకు 'జ్ఞానయోగనిష్ఠ'యు యోగులకు 'కర్మయోగనిష్ఠ'యు తగినవి". అని తెల్పుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - ఈ రెండు నిష్ఠలలో 'జ్ఞానయోగసాధన' చేయుగా చేయుగా సాంఖ్యయోగికి దేహాభిమానము క్రమక్రమముగా నశించి, ఆ జ్ఞానయోగనిష్ఠ సిద్ధించును. కర్మయోగసాధన చేయుగా చేయుగా కర్మయోగులకు కర్మలయందును, వాటి ఫలముల యందును మమతాసక్తులు, కోరికలు అంతరించి, సిద్ధి-అసిద్ధుల యందు సమభావము ఏర్పడును. ఈ రెండు నిష్ఠలకు అర్హులైన వారు పూర్వ సంస్కార శ్రద్ధాభిరుచులను అనుసరించి వేర్వేఱుగా ఉందురు. ఈ రెండు నిష్ఠలును స్వతంత్రములు.

ప్రశ్న - ఏ వ్యక్తియైనను 'జ్ఞానయోగ' 'కర్మయోగ' నిష్ఠలను రెండింటిని సాధన చేయుటకు పూనుకొన్నచో అది ఏ నిష్ఠయగును?

సమా - ఈ రెండు సాధనలును పరస్పర భిన్నములు. ఒకే వ్యక్తి ఒకే కాలమునందు ఈ రెండు సాధనలను చేయజాలడు. ఏలనన సాంఖ్యయోగ సాధనయందు ఆత్మ-పరమాత్మలను అభేదముగా భావించి, పరమాత్మ యొక్క నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘనరూపమునే సాధకుడు ధ్యానించును. కర్మయోగమునందు సాధకుడు ఫలాసక్తిని త్యజించి కర్మలను ఆచరించుచు భగవంతుని సర్వవ్యాపిగను, సర్వశక్తిమంతునిగను, సర్వేశ్వరునిగను భావించి, అతని నామగుణ ప్రభావ స్వరూపములను, ఉపాస్య - ఉపాసక భావముతో (భేదభావముతో) స్మరించును. కావున ఈ రెండింటి అనుష్ఠానములను ఒకే సమయమున ఒకే వ్యక్తి సాధన చేయజాలడు.

సంబంధము - పూర్వశ్లోకమునందు భగవానుడు సాంఖ్యనిష్ఠ జ్ఞానయోగసాధనద్వారాను, యోగనిష్ఠ కర్మయోగసాధన ద్వారాను సిద్ధించునని స్పష్టపఱచెను. ఆ విషయమునే మఱల ప్రస్తావించుచు ఏ నిష్ఠను ఆచరించుచున్నను కర్తవ్యకర్మాచరణమును మాత్రము విస్మరింపరాదని నొక్కి చెప్పెను-

**న కర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురుషః | = మానవుడు | న, అశ్నుతే | = పొందడు | సిద్ధిమ్ | = సిద్ధిని (సాంఖ్య యోగనిష్ఠను) |
| కర్మణామ్ | = కర్మలను | చ | = మరియు | | |
| అనారంభాత్ | = ఆచరింపకుండుటవలన | సన్న్యసనాత్, ఏవ | = కర్మలను త్యజించి నంతమాత్రమున | న, సమధిగచ్ఛతి | = పొందజాలడు. |
| నైష్కర్మ్యమ్ | = నైష్కర్మ్యమును అనగా యోగనిష్ఠాస్థితిని | | | | |

**మనుష్యుడు కర్మలను ఆచరింపకయే నైష్కర్మ్యము అనగా యోగనిష్ఠాసిద్ధి అతనికి లభింపదు. అట్లే కేవలము కర్మలను త్యజించినంత మాత్రమున సిద్ధిని అనగా సాంఖ్యనిష్ఠను అతడు పొందజాలడు. (4)**

ప్రశ్న - ఇచట 'నైష్కర్మ్యమ్' అనగా నేమి? మనుష్యుడు కర్మలను ఆచరింపకయే నైష్కర్మ్యము అతనికి లభింపదు - అని యనుటలోని అభిప్రాయమేమి?

సమా - పూర్వ శ్లోక వివరణమున 'యోగనిష్ఠ' అను పేరుతో వర్ణింపబడిన కర్మయోగ పరిపక్వస్థితినే ఇచటి ఈ 'నైష్కర్మ్యమ్' అనుపదము సూచించును. ఈ స్థితికి చేరిన పురుషుడు సమస్తకర్మలను చేయుచున్నను వాటినుండి సర్వథా ముక్తుడగును. ఆ కర్మలు బంధహేతువులు కావు. (4/22,41) అందువలన ఈ స్థితిని 'నైష్కర్మ్యమ్' లేదా 'నిష్కర్మత్వమ్' అని యందురు. నిష్కామభావముతో కర్తవ్య కర్మలను ఆచరించినప్పుడే మనుష్యునకు ఈ స్థితి లభించును. కర్మలను ఆచరింపకుండ లభింపదు. కనుక కర్మబంధము నుండి ముక్తుడగుటకు సాధకుడు కర్తవ్యకర్మలను నిష్కామభావముతో ఆచరింపవలెనేగాని వాటిని త్యజింపరాదు. ఈ భావమును స్పష్టపఱచుటకే, మనుష్యుడు కర్మలను ఆచరింపకయే అతనికి నైష్కర్మ్యము లభింపదు అని భగవానుడు పలికెను.

ప్రశ్న - కర్మయోగమనగా కర్మాచరణమే గదా! ఆ

విషయమున కర్మలను ఆచరింపకుండుటకు అస్కారమే లేదుగదా! మరి కర్మలను ఆచరింపకయే నైష్కర్మ్యము లభింపదని చెప్ప వలసిన అవసరమేమి?

సమా - కర్మలయందును, కర్మఫలముల యందును ఆసక్తిని త్యజింపుమనియు, ఆ కర్మల ఫలమైన కర్మ బంధముల నుండి ముక్తుడవు అగుదు వనియు అర్జునునకు బోధపఱచుటయే భగవానుని ఉద్దేశ్యము. (2/51) తాను కర్మలే చేయనిచో సహజముగానే బంధ విముక్తి కలుగును గదా! ఇక కర్మలు చేయవలసిన అవసరమేమున్నది? అని అర్జునుడు భావింపవచ్చును. అర్జునుని ఈ భ్రమను నివారించుటకే "మా తే సంగోఽస్త్వకర్మణి" కర్మ చేయకుండుట యందు ఆసక్తి ఉండకూడదు అని భగవానుడు కర్మయోగ ప్రకరణారంభమునందే తెల్పెను. అట్లే ఆఱవ అధ్యాయమునందు గూడ ఆరురుక్షువైన మునియు యోగారూఢుడగుటకు కర్మచేయుటయే యుక్తము, (6/3) అని పలికెను. కనుక శారీరకశ్రమకు భయపడిగాని, ఇతర-ఆసక్తుల వలనగాని, మనుష్యుడు కర్మయందు ప్రవృత్తుడు కానిచో అది కర్మయోగమునందు బాధకమగునని తెలుపుటకే భగవానుడు కర్మలను ఆచరింపనిదే నైష్కర్మ్యము లభింపదు" అని పలికెను.

ప్రశ్న - ఇచట "సిద్ధిమ్" అనుపదము దేనిని సూచించును? కేవలము కర్మలను త్యజించినంత మాత్రమున సిద్ధి లభింపదు - అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - పూర్వశ్లోక వివరణమున 'జ్ఞాననిష్ఠ' అను పేరుతో వర్ణింపబడిన జ్ఞానయోగసిద్ధిని అనగా పరిపక్వస్థితిని ఈ 'సిద్ధిమ్' అనుపదము సూచించును. దీనిఫలము తత్త్వజ్ఞాన ప్రాప్తి. ఈ స్థితిని చేరిన సాధకుడు బ్రహ్మభావమును పొందును. అతని దృష్టిలో ఆత్మ పరమాత్మలకు ఏ మాత్రమూ భేదముండదు. అతడు స్వయముగా బ్రహ్మరూపమును పొందును. కనుక ఈ స్థితిని 'సిద్ధి' అనియందురు. సాధకుడు కర్తృత్వాభిమానమును వీడి, సమస్త భోగములయందు మమతాసక్తులను, కోరికలను త్యజించి, నిరంతరము అభిన్నభావముతో పరమాత్మను చింతించుచు వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి కర్తవ్య కర్మలను ఆచరించుట వలననే జ్ఞాన యోగసిద్ధి కలుగును. కర్మాచరణమును త్యజించినంత మాత్రమున కలుగదు. ఏలనన అహంకార మమకారములు, ఆసక్తి అంతరింపకయే మనుష్యునకు అభిన్నభావముతో పరమాత్మయందు 'నిశ్చలస్థితి' ఏర్పడదు. మనస్సు, బుద్ధి, శరీరముల ద్వారా జరుగు ప్రతిచేష్టయందును తనను కర్తగా భావింపక ద్రష్టగా లేక సాక్షిగా భావించుటవలన (14/19) పై స్థితి లభించును. కనుక సాంఖ్యయోగియు వర్ణాశ్రమోచిత కర్మలను త్యజించుటకు ప్రయత్నింపక వాటియందు కర్తృత్వమును, మమతాసక్తులను, కోరికలను త్యజింపవలెను. ఈ భావమును స్పష్ట పరచుటకే "కేవలము కర్మలను త్యజించినంత మాత్రమున 'సిద్ధి' లభింపదు" అని భగవానుడు పలికెను.

ప్రశ్న - 'అనారంభాత్' 'సన్న్యసనాత్' అను రెండు పదముల అభిప్రాయము ఒకటియేనా? లేక వేర్వేఱా? వేర్వేఱైనచో ఆ రెండింటి మధ్యగల భేదమేమి?

సమా - ఈ రెండు పదముల అభిప్రాయము వేర్వేఱు అని భగవానుడు తెలిపెను. ఏలనన కర్మయోగి విహిత కర్మలను చేయకుండుట యోగనిష్ఠ ప్రాప్తియందు బాధకమని 'అనారంభాత్' అను పదము ద్వారా తెలిపెను. సాంఖ్యయోగి కర్మాచరణమును త్యజించుట సాంఖ్య నిష్ఠాప్రాప్తియందు బాధకము కాదని తెలుపుటకు 'సన్న్యసనాత్' అను పదమును ప్రయోగించెను. కేవలము 'సిద్ధి' లభించుటకు ఈ మాత్రమే చాలదు. అతడు కర్తృత్వభావనను త్యజించి సచ్చిదానంద ఘన బ్రహ్మయందు అభేదభావముతో స్థితుడైయుండుట అవసరము. కర్మాచరణమును బాహ్యముగా త్యజించుట అతనికి అంతగా ముఖ్యము గాదు. ఆంతరిక త్యాగమే ప్రధానము. కర్మయోగి అయితే కర్మాచరణమును త్యజింపకుండుటయే విధేయము. ఇదియే ఈ రెండు పదములను ప్రయోగించుటలో గల విశేషము.

*సంబంధము - కర్మయోగి కర్తవ్యకర్మలను చేయకుండుట యోగ నిష్ఠాప్రాప్తికి బాధకమనియు, సాంఖ్యయోగి 'సిద్ధి' ప్రాప్తికొఱకు కర్మాచరణమును బాహ్యముగా త్యజించుట గౌణమనియు తెల్పెను. ఇప్పుడు అర్జునుని కర్తవ్య కర్మలయందు ప్రవృత్తునిగా చేయుటకై వివిధ కారణములద్వారా కర్మాచరణముయొక్క ఆవశ్యకస్థితిని నిరూపించుటకు మొట్టమొదట 'కర్మత్యాగము' సర్వథా అశక్యమని తెల్పుచున్నాడు-*

**న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| హి | = నిస్సందేహముగా | న, తిష్ఠతి | = ఉండజాలడు | గుణైః | = గుణములచేత |
| కశ్చిత్ | = ఏమనుష్యుడైనను | హి | = ఏలనన, | అవశః | = అవశుడై (అవశముగనే) |
| జాతు | = ఒకానొకప్పుడును | సర్వః | = ప్రతిమనుష్యుడును (మనుష్యులందరును) | కర్మ | = కర్మను (చేయుటకు) |
| క్షణమ్, అపి | = క్షణకాలముగూడ | | | కార్యతే | = బాధ్యుడగు చున్నాడు. |
| అకర్మకృత్ | = కర్మను చేయనివాడై | ప్రకృతిజైః | = ప్రకృతిజనితములైన | | |

**ఏ మనుష్యుడైనను ఏ కాలమునందైనను క్షణమాత్రముగూడ కర్మను ఆచరింపకుండ ఉండలేడు. ఇందు ఎట్టి సందేహమునకును తావులేదు. ఏలనన మనుష్యులందఱును ప్రకృతిజనితములైన గుణములకు లోబడి కర్మలను చేయుటకు బాధ్యులగుదురు. ప్రతి వ్యక్తియు కర్మను ఆచరింపవలసియే యుండును. (5)**

ప్రశ్న - "ఏ మనుష్యుడైనను, ఏ కాలమునందైనను క్షణమాత్రము గూడ కర్మచేయకుండ ఉండలేడు." ఈ వాక్యము యొక్క ఆంతర్యమేమి?

సమా - నిలబడుట, కూర్చుండుట, తినుట, త్రాగుట, నిద్రించుట, మేల్కొనుట, ఆలోచించుట, మననము చేయుట, కలగనుట, ధ్యానించుట, సమాధి స్థితుడగుట, - మొదలగునవి యన్నియును కర్మలలో అంతర్గతములే. కనుక బ్రతికి ఉన్నంతవఱకును మనుష్యుడు తన ప్రకృతి ననుసరించి ఏదో ఒక కర్మను చేయుచునే యుండును. ఏ మనుష్యుడైనను క్షణమాత్రము గూడ ఎప్పుడైనను కర్మాచరణమును త్యజింపజాలడు. కావున వాటి యందు కర్తృత్వమును త్యజించుట, అనగా మమతాసక్తులను, ఫలేచ్ఛలను త్యజించుటయే వాటిని సర్వథా త్యజించుట యగును.

ప్రశ్న - ఇచట 'కశ్చిత్' అను పదములో గుణాతీతుడైన 'జ్ఞాని'యును చేరునా?

సమా - గుణాతీతుడైన జ్ఞానికి గుణములతో గాని, వాటి కార్యములతోగాని ఎట్టి సంబంధమూ ఏమాత్రమూ ఉండదు. అతడు గుణములకు వశుడై కర్మలను ఆచరించునని చెప్పజాలము. గుణాతీతుడైన జ్ఞాని 'కశ్చిత్' అను పదములో చేరడు. తథాపి (ఐనను) మనోబుద్ధీంద్రియాదుల సంఘాత రూపమైన అతని శరీరము ద్వారా జరుగు కర్మలు అతని యొక్కయు, లోకుల యొక్కయు ప్రారబ్ధానుసారము లోకదృష్టిలో జరుగుచునే యుండును. కాని కర్తృత్వము లేకుండుట వలన ఆ కర్మలు వాస్తవముగా కర్మలే కావు. మనోబుద్ధీంద్రియాదుల సంఘాత రూపమైన శరీరమును 'కశ్చిత్' అను పదమునందు చేర్చుటలో ఎట్టి దోషము లేదు, ఏలనన అది గుణముల కార్యమగుట వలన గుణముల కతీతముగాదు. ఆ శరీరమునకు సర్వథా అతీతుడగుటయే 'జ్ఞాని' గుణాతీతుడగుట యగును.

ప్రశ్న - ఇచట 'సర్వః' అను పదమునకు అర్థమేమి? "వారు గుణములకు వశులై కర్మలను చేయుటకు బాధ్యులగుదురు." అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - 'సర్వః' అను పదము సమస్తప్రాణులను సూచించునది. ఐనను ఇచ్చట అది ప్రత్యేకముగ మనుష్య సముదాయమునే సూచించుచున్నట్లు భావింపవలెను - ఏలనన కర్మాచరణమునందు మనుష్యులకే అధికారము గలదు. వారు పూర్వజన్మలలో చేసిన కర్మల సంస్కార జనితమైన స్వభావమునకు లోనై కర్మలయందు ప్రవృత్తు లగుదురు. గుణములకు వశులై కర్మలను ఆచరించుటకు బాధ్యులగుదురనగా ఇదియే.

ప్రశ్న - 'గుణైః' అను పదముతోపాటు 'ప్రకృతిజైః' అను విశేషణమును ప్రయోగించుటలోని అంతరార్థమేమి?

సమా - కపిల సాంఖ్యమునందు గుణముల సామ్యావస్థను 'ప్రకృతి'యని పేర్కొనుట జరిగినది. కాని భగవానుని దృష్టిలో సత్త్వరజస్తమోగుణములు ప్రకృతి యొక్క

కార్యములు. ఈ విషయమును స్పష్టపఱచుటకే భగవానుడు ఇచట 'గుణైః' అను పదముతో పాటు 'ప్రకృతిజైః' అను విశేషణమును ప్రయోగించెను. ఇదే విధముగా 'ప్రకృతి సంభవాన్' (13/19) 'ప్రకృతిజాన్' (13/21) 'ప్రకృతి సంభవాః' (14/5) 'ప్రకృతి జైః' (18/40) అను విశేషణముల ద్వారా వేర్వేఱు సందర్భముల యందు గుణములు ప్రకృతియొక్క కార్యములని తెల్పెను.

ప్రశ్న - ఇచట 'ప్రకృతి' అను పదమునకు అర్థమేమి?

సమా - సమస్త గుణముల, వికారముల యొక్క సముదాయరూపమైన జడ (దృశ్య) జగత్తునకు కారణ భూతమైనది మూలప్రకృతి. అది అనాది సిద్ధము. దానిని 'అవ్యక్తము', 'అవ్యాకృతము', 'మహాద్బ్రహ్మము', అనియు పిలుతురు. ఆ మూల ప్రకృతినే ఇచట 'ప్రకృతి' అను శబ్దము సూచించును.

*సంబంధము - మనుష్యుడు క్షణమాత్రము కూడ కర్మలను చేయకుండ ఉండలేడు, అని పూర్వశ్లోకమున చెప్పబడినది. ఇంద్రియవ్యాపారములను బలాత్కారముగా పట్టుదలతో నిగ్రహించి, మనుష్యుడు కర్మలను త్యజింపగలడు గదా! అను సందేహము రావచ్చును. కనుక బాహ్యముగా ఇంద్రియ వ్యాపారములను పట్టుబట్టి నిగ్రహించుట 'కర్మత్యాగము' కాదు. అని భగవానుడు చెప్పుచున్నాడు-*

**కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।**
**ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఎవడైతే | మనసా | = మనస్సుద్వారా | సః, విమూఢాత్మా | = ఆ మూఢుడు |
| కర్మేంద్రియాణి | = సమస్త ఇంద్రియములను | ఇంద్రియార్థాన్ | = శబ్దాది విషయములను | మిథ్యాచారః | = దంభా(కపటా) చారముగలవాడు - అని |
| సంయమ్య | = (బాహ్యముగా) అదుపుచేసి | స్మరన్ | = చింతించుచు | | |
| | | ఆస్తే | = ఉండునో | ఉచ్యతే | = చెప్పబడుచున్నాడు |

**బలవంతముగా, బాహ్యముగా ఇంద్రియవ్యాపారములను నిగ్రహించి, మానసికముగా ఇంద్రియవిషయములను చింతించునట్టి మూఢుని మిథ్యాచారి అనగా దంభి అనియందురు. (6)**

ప్రశ్న - 'కర్మేంద్రియాణి' అను పదము ఏ ఇంద్రియములను సూచించును? వాటిని బలవంతముగా నిగ్రహించుట యనగా నేమి?

సమా - ఇచట 'కర్మేంద్రియాణి' అను పదమునకు పారిభాషికార్థమును ఊహింపరాదు. ఇది ఇంద్రియసామాన్య వాచకము. శ్రోత్రాది జ్ఞానేంద్రియములను, వాక్పాణిపాదాది కర్మేంద్రియములను ఈ పదము తెల్పును. ఏలనన గీతయందు ఎచ్చటను శ్రోత్రాది పంచేంద్రియములకు జ్ఞానేంద్రియములు అను పదమును ప్రయోగింపలేదు. ఎందుకనగా విషయగ్రహణమునందును, కర్మాచరణముల యందును దశేంద్రియములును పాల్గొనును. కర్మేంద్రియములు అను పదమునకు కేవలము వాగాది పంచేంద్రియములు అనియే అర్థమును చెప్పినచో శ్రోత్రాది ఇంద్రియముల నిగ్రహమును గూర్చి చెప్పినట్లుకాదు. అప్పుడు మిథ్యాచారి అనుశబ్దము సార్థకము కాదు. వాగాది ఇంద్రియములను నిగ్రహించి, శ్రోత్రాది ఇంద్రియములతో అతడు ఏమి చేయగలడు. రాబోవు శ్లోకములో గూడ కర్మేంద్రియముల ద్వారా కర్మయోగమును ఆచరించుటకు భగవానుడు నుడివెను. కాని వాగాది కర్మేంద్రియముల ద్వారా కర్మాచరణము సాధ్యపడదు. కనుక ఇంద్రియములన్నింటి ప్రాముఖ్యము కాదనరానిది. అందువలన 'కర్మేంద్రియాణి' అను పదమునకు ఇంద్రియములు అన్నియు (దశేంద్రియములు) అను అర్థమును చెప్పుటయే యుక్తము. కావలెనని పట్టుబట్టి వినుట, చూచుట మొదలగు క్రియలను నిగ్రహించుటనే 'బలవంతముగా' నిగ్రహించుట యందురు.

ప్రశ్న - ఏ సాధకుడైనను భగవంతుని ధ్యానించుటకై లేక ఇంద్రియములను వశపఱచుకొనుటకై బలవంతముగా ఇంద్రియములను విషయముల నుండి నిరోధించుటకు

ప్రయత్నించు సమయమున మనస్సు వశమునందు ఉండని కారణమున విషయ చింతన జరిగినచో అతనిని 'మిథ్యాచారి' అని యనవచ్చునా?

సమా - అతడు మిథ్యాచారి కానేకాదు. అతడు సాధకుడు. ఏలనన మిథ్యాచారి వలె మానసికముగా విషయచింతన చేయుట అతని ఉద్దేశ్యముగాదు. అతడు మనస్సును గూడ నిగ్రహించుటకు కోరుకొనును. కాని అలవాటు, ఆసక్తి, సంస్కారముల ప్రభావమున అతని మనస్సు అప్రయత్నముగనే విషయముల మీదికి పరుగులు తీయును. కనుక అందు అతని దోషము ఏమియును లేదు. ఆరంభకాలమున అట్లగుట స్వాభావికమే.

ప్రశ్న - ఇచట 'సంయమ్య' అను పదమునకు 'వశపఱచుకొనుట' అని అర్థము చెప్పిన దోషమేమి?

సమా - ఇంద్రియములను వశపఱచుకొనువాడు మిథ్యాచారి కాడు. ఏలనన ఇంద్రియములను వశపఱచుకొనుట యోగములో ఒక భాగమే. కనుక ఇచట 'సంయమ్య' అను పదమునకు పైన పేర్కొనబడిన అర్థమే సరియైనది.

ప్రశ్న - 'ఇంద్రియార్థాన్' అనుపదము దేనిని సూచించును?

సమా - దశేంద్రియములను తమవైపునకు అనుక్షణము లాగికొను శబ్దాది విషయములను 'ఇంద్రియార్థాన్' అను పదము సూచించును. 5వ అధ్యాయము నందలి 9వ శ్లోకము నందును 'ఇంద్రియార్థేషు' అను పదము కూడ ఈ యర్థముననే ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'అతడు మిథ్యాచారి అనబడును' అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - పైన పేర్కొనబడిన విధముగా 'ఇంద్రియములను నిగ్రహించు' మనుష్యుడు చేపలను మోసగించుటకై స్థిరముగా నిలుచున్న దొంగ కొంగవలె బయటికి ఒక భావమును, మనస్సునందు మఱియొక భావమును కలిగియుండును. అతని ఆచరణము మిథ్య యగుటవలన అతనిని మిథ్యాచారి యందురు.

*సంబంధము - కేవలము బాహ్యముగా ఇంద్రియములను శబ్దాది విషయములనుండి మఱల్చిన వానిని 'మిథ్యాచారి' అని తెలిపి, ఇపుడు ఆసక్తిని త్యజించి, ఇంద్రియములద్వారా నిష్కామభావముతో కర్తవ్యకర్మలను చేయు యోగిని ప్రశంసించుచున్నాడు-*

**యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।**
**కర్మేంద్రియైః కర్మయోగమ్ అసక్తః స విశిష్యతే ॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | ఇంద్రియాణి | = ఇంద్రియములను | కర్మయోగమ్ | = కర్మయోగమును |
| అర్జున! | = ఓ అర్జునా! | నియమ్య | = వశపరచుకొని | ఆరభతే | = ఆచరించునో |
| యః | = ఎవడైతే | అసక్తః | = అనాసక్తుడై | సః | = అతడు |
| మనసా | = మనస్సుద్వారా | కర్మేంద్రియైః | = సమస్త ఇంద్రియములచేత | విశిష్యతే | = శ్రేష్ఠుడగును. |

**కాని, అర్జునా! మనస్సుతో ఇంద్రియములను వశపఱచుకొని, అనాసక్తుడై ఇంద్రియములద్వారా కర్మయోగాచరణమును కావించు పురుషుడు శ్రేష్ఠుడు. (7)**

ప్రశ్న - 'తు' అను అవ్యయమునకు అర్థమేమి?

సమా - బాహ్యముగ కర్మలను త్యజించిన వానితో పోల్చినప్పుడు ఆచరణాత్మకముగ కర్మలను నిర్వహించుచు ఇంద్రియములను వశమునందుంచుకొనిన యోగియొక్క వైశిష్ట్యమును ఇచట 'తు' అను ప్రయోగము తెలుపును.

ప్రశ్న - ఇచట 'ఇంద్రియాణి', 'కర్మేంద్రియైః' అని ప్రయోగింపబడిన రెండు పదములును ఏయే ఇంద్రియములను తెలుపును?

సమా - ఇచటి ఈ రెండు పదములును రెండు విధములైన (జ్ఞాన, కర్మ) ఇంద్రియములను సూచించును. ఏలనన కేవలము ఐదు ఇంద్రియములను వశపఱచుకొన్నంత మాత్రమున ఇంద్రియములన్ని(10) యును వశముకావు.

కేవలము ఐదింద్రియములతోడ కర్మయోగానుష్ఠానమే జరుగదు. ఏలనన చూచుట, వినుట మొదలగు క్రియలు లేక కర్మయోగానుష్ఠానము సంభవముగాదు. కనుక పై రెండు పదములును అన్ని ఇంద్రియములను సూచించునని గ్రహింపనగును. ఈ అధ్యాయముననే 41వ శ్లోకమునందు గూడ భగవానుడు **'ఇంద్రియాణి'** అను పదముతో **'నియమ్య'** అను పదమును ప్రయోగించి, ఇంద్రియములను అన్నింటిని వశపఱచుకొనవలెనని తెలిపెను.

ప్రశ్న - ఇచట **'నియమ్య'** అను పదమునకు 'వశము నందుంచుకొనుట' అని గాక 'నిరోధించుట' అను అర్థమును చెప్పిన దోషమేమి?

సమా - **'నిరోధించుట'** అను అర్థము ఇచట సరిపోదు. ఏలనన ఇంద్రియములను నిరోధించుటవలన వాటిద్వారా కర్మయోగాచరణము సాధ్యము గాదు.

ప్రశ్న- సమస్త ఇంద్రియములద్వారా కర్మయోగాచరణము చేయుట అనగానేమి?

సమా - సమస్త విహిత కర్మలయందును, వాటి ఫలరూపములైన ఇహపరలోక భోగముల యందును రాగద్వేషములను త్యజింపవలెను. సిద్ధి - అసిద్ధులయందు సమభావమును ఉంచవలెను. ఇంద్రియములను వశపఱచుకొని, వాటి ద్వారా శబ్దాది విషయములను గ్రహించుచు యజ్ఞదాన తపశ్చర్యలు, అధ్యయన - అధ్యాపనములు, ప్రజాపాలనము, వాణిజ్యవ్యాపారములు, సేవలు మొదలగు నవియు, అట్లే తినుట, త్రాగుట, నిద్రించుట, మేల్కొనుట, నడచుట, తిరుగుట, లేచుట, కూర్చొనుట మొదలగు సమస్త ఇంద్రియకర్మలు శాస్త్రవిధిననుసరించి, చేయుచు ఉండవలెను. సమస్త ఇంద్రియములద్వారా కర్మయోగమును ఆచరించుట అనగా ఇదియే - 2వ అధ్యాయమునందలి 64వ శ్లోకమున దీని ఫలమే ప్రసాదప్రాప్తి, సమస్త దుఃఖనాశము అని తెలుపబడినది.

ప్రశ్న - 'స విశిష్యతే' అను క్రియాపదము యొక్క భావమేమి? ఇచట కర్మయోగి పూర్వశ్లోకమున వర్ణింపబడిన మిథ్యాచారి కంటెను శ్రేష్ఠుడా?

సమా - కర్మయోగి సామాన్య మానవులందఱి కంటెను శ్రేష్ఠుడని తెలుపుచు అతనిని ప్రశంసించుటకై **'స విశిష్యతే'** అనుక్రియా పదము ప్రయోగింపబడినది. ఇంతకుముందు వర్ణింపబడిన కేవలము మిథ్యాచారికంటె కర్మయోగి శ్రేష్ఠుడని దీని అభిప్రాయము గాదు. మిథ్యాచారి ఆసురీ సంపదగల దంభి. అతనితో పోల్చినచో సకామభావముతో విహిత కర్మలను ఆచరించు మనుష్యుడు గూడ మిక్కిలి శ్రేష్ఠుడు. అట్టి స్థితిలో దైవీసంపదగల కర్మయోగి మిథ్యాచారి కంటెను శ్రేష్ఠుడని చెప్పుట వేశ్యకంటె పతివ్రత శ్రేష్ఠురాలని చెప్పుట వంటిది. ఇది కర్మయోగిని స్తుతించుటద్వారా నిందించుట యేయగును. కర్మయోగి సర్వశ్రేష్ఠుడని అతనిని ప్రశంసించుటకే **'స విశిష్యతే'** అను పదము ప్రయోగించుట జరిగినది.

*సంబంధము - "ఈ ఘోరకర్మను ఆచరింపుమని నన్నేల నియోగించుచున్నావు" అని అర్జునుడు ఇంతకుముందు ప్రశ్నించియుండెను. దానికి సమాధానముగా బాహ్యముగా కర్మలను త్యజించు మిథ్యాచారిని నిందించుచు భగవానుడు కర్మయోగిని ప్రశంసించెను. ఇపుడు కర్మలను ఆచరింపుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు-*

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| త్వమ్ | = నీవు | అకర్మణః | = కర్మలనాచరింప కుండుటకంటె | అకర్మణః | = కర్మలనాచరించక పోవుటచే |
| నియతమ్ | = విధ్యుక్తమైన | | | | |
| కర్మ | = కర్తవ్యకర్మను | కర్మ | = కర్మలను చేయుటయే | తే, శరీరయాత్రా | = నీ శరీరనిర్వహణ |
| కురు | = చేయుము | జ్యాయః | = శ్రేష్ఠము | అపి | = కూడా |
| హి | = ఏలననగా | చ | = మఱియు | న, ప్రసిద్ధ్యేత్ | = కొనసాగదు |

నీవు శాస్త్రవిహితకర్తవ్యకర్మలను ఆచరింపుము. ఏలనన కర్మలను చేయకుండుటకంటెను చేయుటయే ఉత్తమము. కర్మలను ఆచరింపనిచో నీ శరీర నిర్వహణముగూడ సాధ్యము గాదు. (8)

ప్రశ్న - 'నియతం' అను విశేషణముతో గూడిన 'కర్మ' అను పదము ఏ కర్మను సూచించును. దానిని ఆచరింపుమని ఆజ్ఞాపించుటలోని అంతర్యమేమి?

సమా - వర్ణాశ్రమధర్మములను అనుసరించి, స్వభావ పరిస్థితులకు అనుగుణముగా, మానవులకు వేర్వేరుగా కర్తవ్యకర్మలు శాస్త్రములందు తెలుపబడినవి. అట్టి శాస్త్ర విహిత స్వధర్మరూప కర్తవ్యకర్మలను అన్నింటిని సూచించునదియే 'నియతం' అను విశేషణముతో గూడిన 'కర్మ' అను పదము - భగవానుని వచనములను వ్యామిశ్రములుగా (కలగాపులగముగా) భావించి, అర్జునుడు భ్రమలోపడి, తన కర్తవ్యమును నిశ్చయముగా తెల్పుమని భగవంతుని కోరియుండెను. ఇపుడు 'కర్మలను ఆచరింపుమని ఆజ్ఞాపించుచు భగవానుడు అర్జునుని భ్రమను తొలగించెను. అర్జునుడు కోరినట్లుగా అతని కర్తవ్యమును నిశ్చయముగా తెలిపెను. పై కారణముల వలన ఏ విధముగనైనను కర్మాచరణమును త్యజించుట అతనికి శ్రేయస్కరము కాదనియు, కనుక శాస్త్ర విహిత కర్తవ్యకర్మరూప స్వధర్మమును ఆచరింపవలెననియు తెలిపెను. యుద్ధము చేయుట అర్జునునకు స్వధర్మము. పైకి అది క్రూరముగను, హింసాత్మకముగను కన్పించినను వాస్తవముగ అతనికి అది ఘోరకర్మ కాదు. పైగా నిష్కామభావముతో చేయుట వలన అది అతనికి శ్రేయస్కరమైనది గూడ. కావున "సంశయమును వీడి యుద్ధమునకు సన్నద్ధుడవు కమ్ము" అని భగవానుడు అర్జునుని ఆదేశించెను.

ప్రశ్న - "కర్మలను చేయకుండుటకంటెను చేయుటయే ఉత్తమము." అని యనుటలోని విశేషమేమి?

సమా - కర్మలను చేయుట కంటెను చేయకుండుటయే 'మేలు' అని భగవానుడు చెప్పినట్లు అర్జునుడు తన భ్రమకారణముగ భావించియుండెను. అర్జునుని ఆ భ్రమను భగవానుడు తొలగించెను. కర్తవ్యకర్మలను చేయుటవలన మనుష్యుని అంతఃకరణము శుద్ధమై అతని పాపములకు ప్రాయశ్చిత్తము కలుగును. కర్తవ్యకర్మలను త్యజించుట వలన అతడు పాపాత్ముడై నిద్ర, సోమరితనము, ప్రమాదములకు లోనై అధోగతి పాలగును. (14/18) కనుక కర్మచేయకుండుట కంటెను చేయుటయే సర్వథా ఉత్తమము. సకామభావముతో గాని, ప్రాయశ్చిత్త రూపముగా గాని, కర్తవ్యకర్మలను చేయుట అసలు చేయకుండుట కంటెను మిక్కిలి శ్రేష్ఠము - మఱి వాటిని నిష్కామభావముతో చేయుట సర్వశ్రేష్ఠమని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు.

ప్రశ్న - "కర్మలను ఆచరింపనిచో నీ శరీర నిర్వాహణము గూడ సాధ్యముగాదు" అనియనుటలోని విశేషమేమి?

సమా - కర్మాచరణమును త్యజించుటవలన మనుష్యుని మనుగడయే సాగదు. శరీర నిర్వాహణమునకై ఏదో ఒక పనిని అతడు ఆచరింపవలసియే యుండును. ఇట్టి స్థితిలో విహితకర్మలను త్యజించుటవలన మనుష్యుడు సహజముగనే పతనమగును. కనుక కర్మలు చేయకుండుట కంటె చేయుటయే ఉత్తమము.

సంబంధము - శాస్త్రవిహితములైన యజ్ఞ, దాన, తపశ్చర్యాది శుభకర్మలు కూడ బంధహేతువులుగనే భావింపబడుచున్నవి. మఱి కర్మలు చేయకుండుటకంటెను చేయుట ఎట్లు ఉత్తమమగును? అను జిజ్ఞాస ఏర్పడును. *(సందేహము తలయెత్తును.) దానికి సమాధానముగా భగవానుడు వివరించుచున్నాడు-*

**యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।**
**తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥ 9 ॥**

కౌంతేయ = ఓ కౌంతేయా!(అర్జునా)
యజ్ఞార్థాత్ = యజ్ఞార్థముచేయబడు
కర్మణః = కర్మలుగాక
అన్యత్ర = ఇతరకర్మలలో నిమగ్నులగుటవలన
అయమ్, లోకః = ఈలోకము (మనుష్య సముదాయము)
కర్మబంధనః = కర్మబంధములలో చిక్కుకొనును
ముక్తసంగః = (కనుక) ఆసక్తి రహితుడవై
తదర్థమ్ = యజ్ఞార్థము
కర్మ = కర్తవ్యకర్మను
సమాచర = చక్కగా ఆచరింపుము.

**ఓ అర్జునా! యజ్ఞార్థము చేయబడు కర్మలలో గాక ఇతర కర్మలయందు నిమగ్నులగుటవలన మనుష్యులు కర్మబంధములలో చిక్కుపడుదురు. కనుక నీవు ఆసక్తిరహితుడవై యజ్ఞార్థమే కర్తవ్యకర్మలను చక్కగా ఆచరింపుము. (9)**

ప్రశ్న - యజ్ఞార్థము చేయబడు కర్మలయందు గాక ఇతర కర్మల యందు నిమగ్నులగుట వలననే మనుష్యులు కర్మబంధములలో చిక్కుపడుచుందురు అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - శాస్త్ర విహిత కర్మలు మనుష్యుని యొక్క కర్తవ్యరూప యజ్ఞపరంపరను సురక్షితముగా నిలుపును. వాటిని అనాసక్తభావముతో ఆచరింపవలెను. ఎట్టి ఫలమును ఆశించి చేయరాదు. అట్టి విధ్యుక్తకర్మలు బంధహేతువులు కావు సరికదా మీదు మిక్కిలి అకర్మాచరణము వలన మనుష్యుని అంతఃకరణము శుద్ధమగుటయే గాక భగవత్ప్రాప్తియు కలుగును. కాని ఇట్టి లోకోపకారక కర్మలు కాకుండ ఇతర పుణ్య పాపకర్మలు అన్నియును పునర్జన్మ హేతువులగుట వలన బంధకారకములు. మనుష్యుడు స్వార్థబుద్ధితో శుభాశుభకర్మలలో దేనిని ఆచరించినను తత్ఫలితముగ ఆ కర్మానుసారము అతడు నానాయోనుల యందు జన్మింపవలసి వచ్చును. మాటిమాటికి పుట్టుటయు గిట్టుటయు కర్మబంధములు అని యెఱుంగవలెను. కనుక సకామకర్మల యందును లేక పాపకర్మలయందును నిమగ్నుడగు మనుష్యుడు ఆ కర్మబంధములలో చిక్కుకొనును. అందువలన మనుష్యుడు కర్మబంధముల నుండి ముక్తుడగుటకు నిష్కామభావముతో కేవలము కర్తవ్యపాలన బుద్ధితోడనే శాస్త్రవిహిత కర్మలను ఆచరింపవలెను.

ప్రశ్న - 'అయం లోకః' అనగా ఏమి?

సమా - కర్మచేయుటకు మానవులకే అధికారము (యోగ్యత) కలదు. మానవజన్మలో చేసిన కర్మల ఫలములను అనుభవించుటకే ఇతరజన్మలను ఎత్తవలసియుండును. మానవేతర జన్మలను ఎత్తినప్పుడు నూతనమైన (మఱల) పుణ్యపాప కర్మాచరణములు జరుగవు. అందువలన ఇతర జన్మలలో చేసిన కర్మలు బంధహేతువులుగావు. కేవలము మానవజన్మలో చేసిన కర్మలే బంధహేతువులు. 'అయం లోకః' పదద్వయప్రయోగము యొక్క విశేషమిదియే.

ప్రశ్న - 'నీవు ఆసక్తి రహితుడవై యజ్ఞార్థము కర్తవ్య కర్మలను చక్కగా ఆచరింపుము' అను వాక్యమునందలి అంతరార్థమేమి?

సమా - ఆసక్తిరహితముగా యజ్ఞార్థము చేయుకర్మలు మనుజుని బంధింపవు. పైగా అట్టి కర్మలు చేయువాని పూర్వ సంచితములైన పుణ్య పాపములన్నియును విలీనములగును (భస్మమగును). అందువలన మమతాసక్తులను వీడి సర్వథా శాస్త్రవిహిత కర్తవ్యకర్మల పరంపరను రక్షించు ఉద్దేశ్యముతో నిష్కామభావముతో కర్మలనన్నింటిని ఉత్సాహపూర్వకముగా చక్కగా ఆచరింపుమని భగవానుడాదేశించెను.

ప్రశ్న - పై శ్లోకమునందలి 'ముక్తసంగః' అను విశేషణ ప్రయోగనైశిష్ట్యమేమి?

సమా - కర్మలయందును, వాటి ఫలములయందును మమతాసక్తులను త్యజించి కర్మలను ఆచరింపవలెనని 'ముక్తసంగః' అను విశేషణము సూచించుచున్నది. కర్మఫల త్యాగముతోపాటు కర్మలయందును, వాటి ఫలముల యందును మమతాసక్తులనుగూడ త్యజింపవలెను.

*సంబంధము - 'యజ్ఞార్థము కర్మలను ఆచరించు మనుష్యుని ఆ కర్మలు బంధింపవు.' అని భగవానుడు పూర్వశ్లోకమున నుడివియుండెను. యజ్ఞమనగా నేమి? దానిని ఏల చేయవలెను? ఆ యజ్ఞకర్మలు మనుష్యుని ఏల బంధింపవు? మొదలగు ప్రశ్నలు ఉదయించును. ఈ విషయములను వివరించుటకై భగవానుడు బ్రహ్మదేవుని పలుకులను ప్రమాణములుగా గొని తెలుపుచున్నాడు-*

**సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వమ్ ఏష వోఽస్త్విష్టకామధుక్ ॥ 10 ॥**

ప్రజాపతిః = ప్రజాపతియైన బ్రహ్మ
పురా = కల్పాదియందు
సహయజ్ఞాః = యజ్ఞసహితముగా
ప్రజాః = ప్రజలను
సృష్ట్వా = సృజించి,
ఉవాచ = పలికెను
(యూయమ్) = మీరు
అనేన = ఈయజ్ఞముద్వారా
ప్రసవిష్యధ్వమ్ = వృద్ధిచెందుడు
ఏషః = ఈయజ్ఞము
వః = మీకు
ఇష్టకామధుక్ = ఇష్టభోగములను ఇచ్చునది
అస్తు = అగుగాక!

కల్పాదియందు బ్రహ్మదేవుడు యజ్ఞసహితముగ ప్రజలను సృష్టించి, "మీరు ఈ యజ్ఞములద్వారా వృద్ధిచెందుడు. ఈ యజ్ఞములు మీకు కామధేనువు వలె కోరిన కోర్కెలనెల్ల తీర్చును" అని పల్కెను.**(10)**

ప్రశ్న - 'సహయజ్ఞాః' అను విశేషణముతోపాటు 'ప్రజాః' అను పదము ఎవరిని సూచించును? 'అనేన' అను పదమునకు అర్థమేమి?

సమా - వర్ణాశ్రమోచితములైన శాస్త్రవిహిత యజ్ఞదాన తపస్స్వాది కర్మలకు అధికారులైన వారిని, పూర్వశ్లోకమున 'అయం లోకః' అను పదములచే సూచింపబడిన మనుష్యులను 'సహయజ్ఞాః' అను విశేషణముతోపాటు 'ప్రజాః' అను పదము సూచించును. వారికై వర్ణాశ్రమ ధర్మములయు, స్వభావ పరిస్థితులయు భేదములను అనుసరించి, వేర్వేఱుగా యజ్ఞదాన తపస్సులు, ప్రాణాయామ - ఇంద్రియ సంయమములు, అధ్యయన - అధ్యాపనములు, ప్రజాపాలనము, యుద్ధము, వ్యవసాయము, వాణిజ్యము, సేవలు మొదలగు కర్తవ్య కర్మలన్నియును స్వధర్మ రూపయజ్ఞములు. వీటినన్నింటిని సూచించునదియే 'అనేన' అను పదము.

ప్రశ్న - "మీరు ఈ యజ్ఞముల ద్వారా వృద్ధి పొందుడు. ఈ యజ్ఞములు మీరు కోరిన కోర్కెలను తీర్చును." అని యనుటలోని విశేషమేమి?

సమా - ఈ వాక్యముల ద్వారా బ్రహ్మదేవుడు మనుష్యులను (మానవలోకమును) ఆశీర్వదించెను. వారికొఱకే అతడు ఈ స్వధర్మరూపయజ్ఞములను సృష్టించెను. వీనిని సాంగోపాంగముగా ఆచరించుటచే వారు వృద్ధి చెందుదురు. వారికి ఎప్పుడును పతనము సంభవింపదు. దీని వలన వారు ప్రస్తుత స్థితి నుండి ఉన్నతికి చేరుదురు. ఈ లోకమునందును వారి అవసరములన్నియును తీరును.

## దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।
## పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥ 11 ॥

అనేన = ఈయజ్ఞముద్వారా (మీరు)
దేవాన్ = దేవతలను
భావయత = తృప్తిపరచుడు
తే, దేవాః = ఆ దేవతలు
వః = మిమ్ములను
భావయంతు = వృద్ధిపరచుదురుగాక!
(ఏవమ్) = ఈ విధముగా
పరస్పరమ్ = పరస్పరము
భావయంతః = సంతృప్తిపఱచుకొనుచు
(యూయమ్) = మీరు
పరమ్, శ్రేయః = పరమ శ్రేయస్సును
అవాప్స్యథ = పొందగలరు.

"ఈ యజ్ఞముల ద్వారా మీరు దేవతలను తృప్తిపఱచుడు. మఱియు ఆ దేవతలు మిమ్ములను అనుగ్రహింతురు. నిస్స్వార్థభావముతో మీరు పరస్పరము సంతృప్తిపఱుచుకొనుచు పరమశ్రేయస్సును పొందగలరు." అని పల్కెను. **(11)**

ప్రశ్న - 'అనేన' అను పదమునకు అర్థమేమి? దీని ద్వారా దేవతలను తృప్తిపఱచుట అనగానేమి?

సమా - 'అనేన' అను పదము ఈ స్వధర్మరూప యజ్ఞములను సూచించును. కాని యజ్ఞములయందు వేదమంత్రముల ద్వారా దేవతలకు హవిస్సును ఇచ్చుటను ఉపలక్షణముగా చేసి స్వధర్మపాలనరూప యజ్ఞాచరణము ఆవశ్యకమని ప్రతిపాదింపబడినది. కనుక హవనరూప యజ్ఞమును ఉపలక్షణ రూపములో గ్రహింపవలెను. ఈ

యజ్ఞముల ద్వారా దేవతలకు హవిస్సులను సమర్పించి, వారి అవసరములను పూర్తి చేయుటయే వారిని సంతృప్తిపఱచుట. ఈ ఉపలక్షణము ద్వారా యజ్ఞము అనగా స్వధర్మము - అని భావింపవలెను. మానవులు తమ తమ వర్ణాశ్రమముల ననుసరించి, కర్తవ్యపాలన ద్వారా ఋషులు, పితరులు, భూతప్రేతములు, మనుష్యులు, పశుపక్ష్యాది ప్రాణులన్నింటికిని సుఖములను గూర్చుచు వాటిని సంతృప్తి పఱచుట కూడ ఈ యజ్ఞాచరణములో అంతర్భాగమే.

ప్రశ్న - "ఆ దేవతలు మిమ్ములను అనుగ్రహించెదరు." అని యనుటలోని విశేషమేమి?

సమా - యజ్ఞముల ద్వారా మానవులు దేవతలను సంతృప్తి పఱచినట్లే దేవతలు గూడ మానవుల అవసరములను దీర్చి, వారి అభివృద్ధికి తోడ్పడవలెను. అది వారికి కర్తవ్యము - కావున బ్రహ్మదేవుడు దేవతలకు కూడ తమ కర్తవ్యములను పాటింపవలసినదిగా ఉపదేశించెను.

ప్రశ్న - "నిఃస్వార్థ భావముతో పరస్పరము మేలు చేకూర్చుకొనుచు మీరు పరమ శ్రేయస్సును పొందగలరు" అని యనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - ఈ విధముగా తమ స్వార్థములను వీడి, పరస్పరౌన్నత్యము కొఱకు తమ కర్తవ్యములను పాటించినచో దేవతలు మనుష్యులు కూడ లౌకికోన్నతిని సాధించుటయేగాక పరమ శ్రేయోరూపమైన మోక్షమును గూడ పొందగలరు. మానవులు దేవతలను సంతృప్తిపఱచుటకై సేవలు, పూజలు, యజ్ఞదాన తపశ్చర్యాది కర్మలు ఒకవేళ చేయకున్నను, దేవతలు మాత్రము స్వార్థ రహితముగా మనుష్యులకు మేలు చేకూర్చుట తమ కర్తవ్యముగా భావింపవలెనని బ్రహ్మదేవుడు వారిని ఆదేశించెను. అట్లే మానవులును దేవతల సంతుష్టికై నిస్స్వార్థముగా వారికి సేవలు, పూజలు, యజ్ఞాది కర్తవ్యకర్మలు ఆచరించుచుండవలెనని బ్రహ్మదేవుని ఆదేశము. ఇంతేగాక ఋషులు, పితరులు, మానవులు, పశు, పక్షి, కీట, పతంగాదులకు గూడ వారు తమ స్వధర్మపాలనము ద్వారా నిస్స్వార్థభావముతో సుఖములను గూర్చవలెను.

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।**
**తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥ 12 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యజ్ఞభావితాః | = యజ్ఞములద్వారా సంతృప్తిచెందిన | భోగాన్ | = భోగములను | యః | = ఎవడైతే |
| దేవాః | = దేవతలు | హి | = నిశ్చయముగా | ఏభ్యః | = వీరికి |
| వః | = మీకు | దాస్యంతే | = ప్రసాదించెదరు | అప్రదాయ | = ఇయ్యకయే |
| ఇష్టాన్ | = ఇష్టములైన | తైః | = ఆ దేవతలచే | భుంక్తే | = అనుభవించునో |
| | | దత్తాన్ | = ఇయ్యబడిన భోగములను | సః | = అతడు |
| | | | | స్తేనః, ఏవ | = దొంగయే |

**యజ్ఞములద్వారా సంతృప్తిని పొందిన దేవతలు మీకు (మానవులకు) అయాచితముగనే ఇష్టములైన భోగములను ప్రసాదించెదరు. ఈ విధముగ దేవతలచే అనుగ్రహింపబడిన ఈ భోగములను ఆదేవతలకు నివేదనచేయక తానే అనుభవించువాడు నిజముగా దొంగయే. (12)**

ప్రశ్న - "యజ్ఞముల ద్వారా సంతుష్టి నందిన దేవతలు మీకు ఇష్టభోగములను నిశ్చయముగా ప్రసాదించెదరు." అని యనుటలోని అంతర్యమేమి?

సమా - మానవులు తమ కర్తవ్యములను పాటించుచు యజ్ఞాదుల ద్వారా దేవతలను సంతృప్తి పఱచవలెను. అట్లు సంతుష్టులైన దేవతలు వారికి సదా సుఖభోగములను, జీవన నిర్వహణమునకై వలయు పదార్థములను ఇచ్చుచునే యుందురు. ఇందులకు సందేహమే లేదు. ఏలనన వారు తమ కర్తవ్యపాలనము చేయుటకు బాధ్యులు.

ప్రశ్న - "దేవతలు ప్రసాదించిన భోగములను వారికి సమర్పింపకయే తాను అనుభవించువాడు నిజముగా చోరుడే." అని యనుటలోని విశేషమేమి?

సమా - ఇంతవఱకును వివరింపబడిన విషయములు బ్రహ్మదేవునిచే చెప్పబడినవి. వాటిని అనుసరించి

సృష్ట్యాదినుండియు దేవతలు మానవవాళికి సుఖములను గూర్చుటకై, వారి అవసరములను తీర్చు నిమిత్తము, పశుపక్ష్యాదులు, ఔషధములు, వృక్షములు, తృణములు మొదలగు వానికి పుష్టిని చేకూర్చుచున్నారు. అట్లే అన్నము, నీరు, పూవులు, ఫలములు, ధాతువులు మొదలగు ఉపయోగపడు సమస్త వస్తువులను మానవులకు ఇచ్చుచున్నారు. ఆ దేవతల ఋణమును దీర్చకయే అనగా వారి న్యాయోచితమైన సొత్తును వారికి అర్పింపకుండగనే ఆయా వస్తువులను తన స్వార్థమునకు అనుభవించువాడు కృతఘ్నుడు - నిజముగా దొంగయే. అట్లే వాత్సల్యపూర్ణులైన తల్లిదండ్రులచే పోషింపబడిన పుత్రుడు వారికి సేవలు చేయకున్నను, వారి మరణానంతరము వారికి శ్రాద్ధతర్పణాదులను ఆచరింపకున్నను, ఇతరుల వలన ఉపకారమును పొందినవాడు వారికి ప్రత్యుపకారములను చేయకున్నను, దత్తపుత్రుడైనవాడు తండ్రివలన లభించిన సంపదను తాను అనుభవించుచు తల్లిదండ్రులను సేవింపకున్నను - వీరందఱును కృతఘ్నులు, చోరులే అగుదురు.

ప్రశ్న - దేవతలు మనుష్యుల సేవాదులకు సంతుష్టులైన పిదప వారికి అవసరమైన భోగవస్తు ప్రదానముచేసినప్పుడు వారినుండి పొందిన భోగములను మఱల వారికే తిరిగి సమర్పింపనివాడు చోరుడెట్లగును?

సమా - సృష్ట్యాది నుండియు మనుష్యులు యజ్ఞముల ద్వారా దేవతలను సంతుష్టిపఱచుచునే యున్నారు. దేవతలు మనుష్యులకు వారి ఇష్టభోగములను అనుగ్రహించుచునే యున్నారు. ఈ సంప్రదాయము సృష్ట్యాది నుండియు జరుగుచునే యున్నది. ఈ పరంపరాగతమైన ఆదాన ప్రదానములందు పాల్గొని మొదటి నుండియు యజ్ఞాదుల ద్వారా దేవతలను సంతుష్టి పఱచుచున్నవారు, ఇప్పుడును సంతుష్టులను చేయుచున్నవారు చోరులుకారు. కాని ఇతరుల ద్వారా చేయబడిన యజ్ఞయాగాదులతో సంతుష్టి చెందిన దేవతలు ప్రసాదించిన ఇష్టభోగములను తాను పొంది, యజ్ఞాది కర్మలను చేయనివానిని 'చోరుడనుట' ఉచితమే. ఉదాహరణమునకు - ఒకడు పోషించిన ఆవులను క్షీరాదులను మఱొకడు అనుభవించుచు "మనుష్యులేగదా! గోసేవ చేయునది, నేను గూడ మనుష్యుడనేగదా!" అని కుతర్కము చేయుచు ఆవులను పోషింపనివాడు 'చోరుడు'గా భావింపబడును. కనుక ఇతరుల ద్వారా సంతుష్టులైన దేవతలొసంగెడి భోగములను తాననుభవించు మనుష్యుడు 'చోరుడే' అని భావింపబడును.

సంబంధము - ఈ విధముగా బ్రహ్మదేవుని మాటలను ప్రమాణముగా చూపి, యజ్ఞాదికర్మలు కర్తవ్యములను భగవానుడు ప్రతిపాదించెను. యజ్ఞయాగాది కర్మలను చేయనివానిని 'చోరుడు'గా పేర్కొనెను. ఇప్పుడు కర్తవ్య కర్మాచరణములను చేయు పురుషులను ప్రశంసించుచు, కేవలము శరీర పోషణకొఱకే కర్మలను ఆచరించు పాపులను అధిక్షేపించుచున్నాడు-

**యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।**
**భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥ 13 ॥**

యజ్ఞశిష్టాశినః = యజ్ఞశిష్టాన్నమును భుజించునట్టి
సంతః = సత్పురుషులు
సర్వకిల్బిషైః = సర్వపాపములనుండి
ముచ్యంతే = ముక్తులగుదురు
యే, పాపాః, తు = ఏపాపాత్ములైతే
ఆత్మకారణాత్ = తమశరీర పోషణకొఱకే
పచంతి = (అన్నమును) వండుకొందురో
తే, తు = వారైతే
అఘమ్ = పాపమునే
భుంజతే = భుజింతురు

యజ్ఞశిష్టాన్నమును తిను శ్రేష్ఠపురుషులు అన్ని పాపములనుండి ముక్తులయ్యెదరు. తమ శరీరపోషణకొఱకే ఆహారమును సిద్ధపఱచు (వండు)కొను పాపులు పాపమునే భుజింతురు.(13)

ప్రశ్న - 'యజ్ఞశిష్టాశినః' అను పదము ఎట్టి మనుష్యులను తెల్పును?

సమా - ఇచట 'యజ్ఞము' అను పదము ద్వారా ముఖ్యముగా పంచమహాయజ్ఞములను గూర్చి తెలుపుచు భగవానుడు ఆచరణాత్మకముగ ఫలప్రదములగు శాస్త్రీయ సత్కర్మలనన్నింటిని గూర్చి పేర్కొనుచున్నాడు. సృష్టి కార్యము సక్రమముగ జరుగుటలోను, సృష్టింపబడిన జీవుల పోషణయందును, పంచవిధములగు ప్రాణులకు పరస్పర సంబంధము గలదు - దేవతలు, ఋషులు, పితరులు, మనుష్యులు, ఇతర ప్రాణులు- ఐదు విధములగు ఈ ప్రాణుల సహకారము వలననే సమస్త జీవులకును పుష్టి చేకూరును. దేవతలు సమస్త జగత్తునకును ఇష్టభోగములను ప్రసాదింతురు. ఋషులు, మహాత్ములు అందఱికిని జ్ఞాన ప్రదానము చేయుదురు. పితరులు తమ సంతానమును పోషించుచు వారికి హితమును గూర్చుచుందురు. మనుష్యులు తమ కర్మలద్వారా అందఱికిని సేవలొనరింతురు. పశుపక్షి వృక్షాదులు అందఱికి సుఖసాధనములుగా తమను తాము అర్పించుకొనును. యోగ్యత, అధికారము, సాధన సంపదలు కలిగియుండుట వలన అందఱికిని పుష్టిని చేకూర్చు బాధ్యత మనుష్యుని పైననే గలదు. కనుక శాస్త్రీయకర్మల ద్వారా అందఱికిని అతడు సేవలను సమకూర్చును. పంచమహాయజ్ఞములనగా లోకహితమునకై సలుపబడు శాస్త్రీయ సత్కర్మలనియే ఎఱుంగవలెను.(1)

మనుష్యుని సంపాదనలో ఈ ఐదు వర్గముల ప్రాణులకును భాగస్వామ్యమున్నట్లు తలంచుట అతని కర్తవ్యము - ఏలనన ఈ ఐదింటి సహాయసహకారముల వలననే అతడు సంపాదించుట, భుజించుట జరుగును. కనుక యజ్ఞాచరణమునకు పిమ్మట మిగిలిన అన్నమును అనగా ఈ ఐదు వర్గములకును వాటి వాటి భాగములను అర్పించిన పిమ్మట మిగిలిన అన్నమును తినువానిని శాస్త్రకారులు 'అమృతాశీ' (అమృతమును భుజించువాడు) అని పేర్కొందురు. ఇట్లుచేయక ఇతరుల స్వత్వమును అపహరించి కేవలము తన కొరకే సంపాదించుకొని తినువాడు పాపమునే భుజించును. వేర్వేఱు కర్మల ద్వారా సంపాదించిన ఆహార పదార్థములను వండిన పిమ్మటనే అది భోజ్యము (తినదగినది) అగును. దానిని అగ్నియందు ఆహుతిగా వేయునిదే దైవయజ్ఞము, బలి వైశ్వదేవము పూర్తికావు. కావున ఇచటహోమము, బలివైశ్వదేవములకు ప్రాధాన్యము ఈయబడినది. కాని కేవలము హోమ, బలి, వైశ్వదేవ రూప కర్మలతోడనే పంచమహా యజ్ఞములు పూర్తికావు. తన సంపాదనను యథాయోగ్యముగ అందరికిని పంచి, మిగిలిన భాగమునే ఉపయోగించువాడు వాస్తవముగా యజ్ఞశిష్టాన్నమును భుజించువాడు. అట్టి స్వార్థత్యాగులైన కర్మయోగులను సూచించు పదమే 'యజ్ఞశిష్టాశినః' అనుపదము.

ప్రశ్న - 'సన్తః' అను పదము ఇచట సాధకులను సూచించునా? లేక సిద్ధులనా?

సమా - ఇది సాధకులను సూచించును. ఏలనన సిద్ధ పురుషులయందు పాపములే యుండవు. ఇచట పాపముల నుండి విముక్తులగు వారి విషయము చెప్పబడినది.

ప్రశ్న - 'సన్తః' అను పదము సిద్ధ పురుషుల విషయమున ప్రయోగించుటకు వీలులేదా? సిద్ధపురుషులు యజ్ఞములను ఆచరింపరా?

సమా - సిద్ధ పురుషులుగూడ సజ్జనులే. కాని ఇచట 'సన్తః' అను పదము నిస్స్వార్థ భావముతో కర్మలను ఆచరించు సాధకులను సూచించును. సిద్ధ పురుషులు యజ్ఞములను చేయుదురు. కాని వారు పాపములనుండి ముక్తి పొందుటకుగాక సహజముగా లోకహితార్థమై వాటిని ఆచరింతురు.

ప్రశ్న - ఇచట 'అన్ని పాపముల నుండియు విముక్తుడగుట' యనగా నేమి?

సమా - మనుష్యునకు లోగడ చేసిన పాపసంచయము ఉండనే యుండును. ప్రస్తుత జీవన నిర్వహణకై చేయబడు విధ్యుక్త ధనార్జన కర్మలయందును ఆనుషంగికముగా

---

1) పాఠో, హోమశ్చాతిథీనాం సపర్యా, తర్పణం, బలిః । అమీ పంచమహాయజ్ఞా బ్రహ్మ యజ్ఞాది నామకాః ॥ సత్-శాస్త్ర పఠనము (బ్రహ్మయజ్ఞము లేక ఋషియజ్ఞము), హోమము (దేవయజ్ఞము), అతిథిసేవ (మనుష్య యజ్ఞము), శ్రాద్ధతర్పణములు (పితృయజ్ఞము), సమస్త ప్రాణులకును ఆహారము నొసంగి సేవలు చేయుట (భూతయజ్ఞము) - ఈ ఐదు మహాయజ్ఞములకును బ్రహ్మయజ్ఞాదులని ప్రసిద్ధి.

పాపములు జరుగుచునే యుండును. 'సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః' (18/48) అను వచనానుసారము హోమము, ప్రజాపాలనము, యుద్ధము, వ్యవసాయము, వ్యాపారము, శిల్పాది వివిధ జీవనోపాధి కార్యములయందును ఎంతో కొంత హింస జరుగుచునే యుండును. గృహస్థుల ఇండ్లలోను ప్రతిదినము వండుట, తిరుగలితో విసరుట, ఊడ్చుట, దంచుట, నీరు నిల్వ జేయుట మొదలగు కృత్యములయందు హింస జరుగుచునే యుండును.[1] ఇదిగాక ప్రమాదాది కారణముల వలన ఇతర విధములైన అనేక పాపములు గూడా జరుగుచునే యుండును. నిస్స్వార్థ భావముతో కేవలము లోకహితార్థమై జీవులందరికిని సుఖములను గూర్చుటకే పంచమహాయజ్ఞాదులను చేయువాడును, అందే తన జీవితము చరితార్థమగునని భావించువాడును తన న్యాయోపార్జిత ధనముచే యథాశక్తి యథాయోగ్యముగ అందరికిని సేవారూప యజ్ఞములను చేయువాడును, అందు మిగిలిన అన్నమును కేవలము లోకసేవార్థము జీవించుటకై ప్రసాదరూపమున భుజించువాడును అగు సత్పురుషుడు భూతవర్తమాన పాపములన్నింటినుండియు ముక్తుడై సనాతన బ్రహ్మపదమును పొందును. (4/31). అందువలన ఇట్టి సాధకుడు సత్పురుషుడనబడును. ఇచట పాపములన్నింటి నుండియు ముక్తుడగుట యనగా ఇదియే.

తన సుఖోపభోగ ప్రాప్తికై శాస్త్రవిధిని అనుసరించి, కర్మలను చేయువాడును, ప్రాయశ్చిత్తరూపమున నిత్యమూ హోమ బలివైశ్వదేవాది కర్మలను ఆచరించుచు ఎవరి భాగస్వామ్యము (సొత్తు)ను వారికి ఇచ్చుచు సకామకర్మల నాచరించు పురుషుడు కూడ నిత్యము ఇంటిలో జరుగు పంచవిధములైన పాపములనుండి ముక్తుడగును. కాని ఇచ్చట నిష్కామభావముతో పంచమహాయజ్ఞాదులను అనుష్ఠించు సత్పురుషులు భూత వర్తమాన పాపములన్నింటినుండియు ముక్తులయ్యెదరని తెల్పుటకే 'సన్తః' అను పదమును 'సర్వకిల్బిషైః' అను సమాసమును ప్రయోగించుట జరిగినది.

ప్రశ్న - తమ శరీర పోషణకొఱకే వండుకొని తినువారిని పాపులనియు, వారు పాపమునే భుజించుచున్నారనియు తెల్పుటకు కారణమేమి?

సమా - వండుకొని తినుటను ఉపలక్షణముగాగొని ఇచట ఇంద్రియములద్వారా అనుభవించు సమస్త భోగముల విషయము చెప్పబడినది. భోగ వస్తువులను సంపాదించి, వాటిని యజ్ఞావశిష్టములుగా నిష్కామభావముతో లోకహితార్థమై అనుభవించు వాడగుచో అతడు పైన పేర్కొనబడిన పాపముల నుండి ముక్తుడగును. కేవలము సకామభావముతో అందరికిని న్యాయోచిత భాగములను పంచియిచ్చి, మిగిలిన భోగవస్తువులను అనుభవించువాడు కూడ పాపికాడు. కేవలము తన సుఖముకొఱకే తన శరీరేంద్రియముల పోషణకొఱకే భోగ్య వస్తువులను సంపాదించుకొని, వాటిని తాను మాత్రమే అనుభవించువాడు పాపములద్వారా పాపమునే ఆర్జించి, పాపమునే అనుభవించును. ఏలనన అతని క్రియలు యజ్ఞార్థములు గావు. అతడు తన సంపాదననుండి అందరికిని యథాయోగ్యముగ న్యాయముగ భాగములను పంచి ఇయ్యడు. కనుక అతని సంపాదన, ఉపభోగములు రెండును పాపయుక్తములే అగుటవలన అతనిని 'పాపి' అనియు, అతడు పాపములనే భుజించుచున్నాడనియు వివరింపబడినది.[2]

*సంబంధము - యజ్ఞము చేయకుండుటవలన కలుగు హానియేమి? అను ప్రశ్న ఇచట ఉదయింపవచ్చును. ఈ సంశయనివారణకై సృష్టిక్రమము చక్కగా కొనసాగుటకై యజ్ఞములు అవసరమని భగవానుడు ప్రతిపాదించుచున్నాడు-*

**అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ 14 ॥**
**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।**
**తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 15 ॥**

1) కండనీ పేషణీ చుల్లీ ఉదకుంభీ చ మార్జనీ । పంచ సూనా గృహస్థస్య వర్తన్తేఽహరహస్సదా ॥
2) అఘం సకేవలం భుంక్తే యః పచత్యాత్మకారణాత్ ।
తనకొఱకే వంట చేసికొనువాడు కేవలము పాపమునే భుజించును. (మనుస్మృతి 3/118)

భూతాని = ప్రాణులన్నియును
అన్నాత్ = అన్నమునుండి
భవంతి = ఉత్పన్నములగును
పర్జన్యాత్ = వర్షమువలన
అన్నసంభవః = అన్నోత్పత్తి యగును
పర్జన్యః = వర్షము
యజ్ఞాత్, భవతి = యజ్ఞమువలన కలుగును
యజ్ఞః = యజ్ఞము
కర్మసముద్భవః = విహితకర్మలవలన ఏర్పడును
కర్మ = కర్మ (సముదాయము)
బ్రహ్మోద్భవమ్ = వేదములనుండి ఉత్పన్నములైన వనియు
బ్రహ్మ = వేదము(లు)
అక్షర సముద్భవమ్ = నాశరహితుడైన పరమాత్మనుండి ప్రకటితము లైనవనియు
విద్ధి = ఎఱుంగుము
తస్మాత్ = అందువలన
సర్వగతమ్ = సర్వవ్యాపియైన
బ్రహ్మ = పరమాత్మ
నిత్యమ్ = సర్వదా
యజ్ఞే = యజ్ఞమునందు
ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠితుడైనవానినిగా (ఎఱుంగుము).

**ప్రాణులన్నియు అన్నము (ఆహారము) నుండి జన్మించును. అన్నోత్పత్తి వర్షములవలన ఏర్పడును. యజ్ఞములవలన వర్షములు కురియును. విహితకర్మలు యజ్ఞములకు మూలములు. వేదములు విహిత కర్మలకు మూలములు. వేదములు నిత్యుడైన పరమాత్మనుండి ఉద్భవించినవని తెలిసికొనుము. అందువలన సర్వవ్యాపియు, అవ్యయుడును ఐన పరమాత్మ సర్వదా యజ్ఞములయందే ప్రతిష్ఠితుడై యున్నాడు.** **(14-15)**

ప్రశ్న - 'అన్నము' అను పదమునకు అర్థమేమి? ప్రాణులన్నియును అన్నము నుండి పుట్టుచున్నవి - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 'అన్నము' అనగా కేవలము బియ్యము గోధుమలు మొదలగు పదార్థములు మాత్రమే కావు. వివిధ ప్రాణుల శరీరములకు పుష్టిని గూర్చు స్థూల సూక్ష్మ ఖాద్య పదార్థములన్నింటిని అన్నము అనుపదము తెలుపును. ఈ ఖాద్య పదార్థముల నుండియే సమస్త ప్రాణుల శరీరములయందు రజస్సు, వీర్యము మొదలగునవి ఏర్పడుచున్నవి. ఈ రజోవీర్యాదుల సంయోగమునుండియే వివిధ ప్రాణులు ఉద్భవించుచున్నవి. పుట్టిన తరువాత వాటి పోషణము ఖాద్యపదార్థములవలననే జరుగుచుండును. ప్రాణుల యొక్క ఉత్పత్తి, వృద్ధి, పోషణలకు అన్నమే కారణము. శ్రుతియు (వేదము) గూడ ఇట్లే చెప్పుచున్నది. "అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, అన్నేన జాతాని జీవన్తి" (తైత్తిరీయోపనిషత్ 3/2) అనగా ప్రాణులన్నియును అన్నము నుండియే ఉద్భవించుచున్నవి. ఆ పుట్టినవన్నియును అన్నము వలననే జీవించుచున్నవి.

ప్రశ్న - అన్నోత్పత్తి వర్షములవలన ఏర్పడును - అనియనుటలోని విశేషమేమి?

సమా - ప్రపంచమున స్థూలసూక్ష్మఖాద్య పదార్థములన్నింటి ఉత్పత్తికి నీరే ప్రధాన కారణము. నీరు కొద్దిగనో గొప్ప (సమృద్ధి)గనో అన్ని చోట్లను ఉండును. నీటికి వర్షములే ఆధారము.

ప్రశ్న - 'వర్షములు' 'యజ్ఞముల వలన కలుగును'- అనియనుటలోని విశేషమేమి?

సమా - సృష్టిలోని సమస్తప్రాణుల యొక్క పోషణ, సంరక్షణల బాధ్యత మనుష్యులదే. ఈ బాధ్యతను గుర్తించి, ప్రాణుల హితార్థమై, సుఖార్థమై (బహుజన హితాయ, బహుజన సుఖాయ) మనుష్యులు మనోవాక్కాయ సత్కర్మలను ఆచరించుటయు 'యజ్ఞము' అనబడును. ఈ యజ్ఞకర్మల యందు హోమము, దానము, తపస్సు, మఱియు జీవనోపాధికి సంబంధించిన కర్తవ్యకర్మలన్నియును చేరియున్నవి. హోమ ప్రధాన యజ్ఞాచరణముల ద్వారా అగ్నికి ఆహుతులను సమర్పించుట వలన వర్షములు పడుననియు, వర్షముల వలన ఆహారోత్పత్తియు, ఆ కారణముగ ప్రజోత్పత్తి కలుగుచుండుననియు శాస్త్రములు తెలుపుచున్నవి. కేవలము హోమములతో గూడిన ప్రక్రియనే 'యజ్ఞము' అని భావింపరాదు. లోకోపకారార్థము చేయబడు సత్కర్మ లన్నియును యజ్ఞములే.

మనుష్యులు ఆచరించు కర్తవ్యపాలన రూప యజ్ఞముల ద్వారానే వర్షములు వచ్చును. కాని కొన్ని దేశములలో

యజ్ఞములు ఆచరింప బడకున్నను అప్పట వర్షములు కురియుచుండునుగదా! అను సందేహము రావచ్చును. కాని అప్పట కూడ ఏదో ఒక రూపమున లోకోపకారార్థమై సత్కర్మలు జరుగుచునే యుండును. ఇంతేగాక సృష్ట్యాది నుండియు యజ్ఞములు జరుగుచున్నవి. వాటి ఫలస్వరూపముగ అచట వర్షములు కురియుచుండును. ఇట్లు పూర్వము ఆచరింపబడిన యజ్ఞముల ఫలములు ముగియు వఱకు వర్షములు పడుచునే యుండును. కాని మనుష్యులు యజ్ఞములు చేయుట మానివేసినచో ఆ సంచయము క్రమక్రమముగా తరిగి పోవును. ఫలితముగ వర్షములు కురియుట ఆగిపోవును. అందువలన ప్రాణుల శరీరధారణ, పోషణముల నిర్వహణ క్లిష్టతరమగును. కనుక వర్షములు కురియుటకై మానవులు తమ కర్తవ్యపాలనరూప యజ్ఞములను కొనసాగించుచునే యుండవలయును.

ప్రశ్న - యజ్ఞములు విహితకర్మల నుండి ఉత్పన్నములగును అనియనుటలోని విశేషమేమి?

సమా - మనుష్యులకు వారి వారి వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులను అనుసరించి వేర్వేఱు యజ్ఞములు శాస్త్రముల యందు తెల్పబడినవి. అవి యన్నియును శరీరేంద్రియ మనస్సుల ద్వారానే నిర్వహింపబడును. శాస్త్రవిహితము కాని యేకర్మయు యజ్ఞము కానేరదు. 4వ అధ్యాయము నందలి 32వ శ్లోకమున ఈ విషయమే స్పష్టీకరింపబడినది.

ప్రశ్న - 'బ్రహ్మోద్భవమ్' అను సమాసమునందలి 'బ్రహ్మ' పదమునకు అర్థమేమి? దాని నుండి కర్మలు ఉత్పన్నములగునని చెప్పుటలోని వైశిష్ట్యమేమి?

సమా - గీతయందు 'బ్రహ్మ' అను శబ్ద ప్రయోగము సందర్భానుసారముగ 'పరమాత్మ' (8/3, 24) ప్రకృతి (14/3,4) సృష్టికర్తయైన బ్రహ్మ (8/17,11/37) వేదములు (4/32, 17/24) బ్రాహ్మణులు (18/42) అను అర్థములలో చేయబడినది. ఇది కర్మల ఉత్పత్తి సందర్భము. విహిత కర్మల జ్ఞానము వేదముల వలనను, వేదానుకూల శాస్త్రములవలనను మనుష్యులకు కలుగును. కనుక ఇచట బ్రహ్మశబ్దమునకు వేదములు అను అర్థమును గ్రహింపవలెను. ఇంతేగాక ఈ బ్రహ్మ అక్షరసముద్భవముగా పేర్కొనబడినది. కనుక 'బ్రహ్మ' అనగా వేదములు అనియే భావింపవలెను. ఏలనన పరమాత్మ స్వయముగా అక్షరుడు. మఱియు ప్రకృతి అనాది. కనుక ఈ రెంటిని (పరమాత్మ, ప్రకృతిని) అక్షరసముద్భవములుగ తెలుపుటకు వీలు లేదు. అంతేగాదు ఈ సందర్భముగ ఈ పదమునకు సృష్టికర్తయైన బ్రహ్మయని గాని, బ్రాహ్మణుడు అనిగాని అర్థము చెప్పుటకు వీలులేదు. పైగా మనుష్యులు వారి వారి కర్తవ్యకర్మలను ఏ విధముగా ఆచరింపవలసినదియు వేదశాస్త్రములే తెల్పుచున్నవి. అట్టి విధ్యుక్త కర్మలను తెలిసికొని వాటిని ఆచరించుటకు మనుష్యులు తగిన జ్ఞానమును పొందవలెను.

ప్రశ్న - 'వేదములు అక్షర సముద్భవములు' అని చెప్పుటలోని వైశిష్ట్యమేమి? ఏలనన వేదములు అనాదియని భావింపబడును గదా!

సమా - పరబ్రహ్మ పరమేశ్వరుడు నిత్యుడు. ఆ కారణమున అతని విధాన రూపములైన 'వేదములు'ను నిత్యములే. ఇందులకు సందేహమే లేదు. కాని సృష్ట్యాది యందు పరమేశ్వరుని నుండియే వేదములు ఉత్పన్నములయ్యెను. ప్రళయ కాలమునందు అతనియందే విలీనములగును. వేదములు అపౌరుషేయములు. అనగా ఏ పురుషులచేతను రచియింపబడినవి కావు. ఈ భావమును ప్రకటించుటకే వేదములు అక్షరుడైన పరమేశ్వరుని నుండి ఉత్పన్నములైనట్లు తెల్పబడెను. వీని వలన వేదముల అనాదిత్వము గూడ వెల్లడియగుచున్నది. 17వ అధ్యాయమునందలి 23వ శ్లోకమున గూడ వేదములు పరమాత్మ నుండియే ఉత్పన్నములైనట్లు పేర్కొనబడినవి.

ప్రశ్న - 'సర్వగతమ్' అను విశేషణముతో పాటు 'బ్రహ్మ' అను పదము ఎవరిని సూచించును? మఱియు 'తస్మాత్' అను హేతువాచక పదమును ప్రయోగించి, ఆ బ్రహ్మ యజ్ఞములందు నిత్యప్రతిష్ఠితుడు అని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - 'సర్వగతమ్' అను విశేషణముతోపాటు 'బ్రహ్మ' అను పదము ఇచట సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, సర్వాధారుడైన పరమేశ్వరుని గూర్చి తెలుపును. సమస్త యజ్ఞవిధానములను తెలుపునట్టి వేదములు భగవద్వాణియే. 'తస్మాత్' అను పదమును ప్రయోగించి పరమేశ్వరుడు యజ్ఞముల యందు నిత్యప్రతిష్ఠితుడు అని చెప్పుటలోని భావమిదియే. వేదములయందు పేర్కొనబడిన విధానముల ననుసరించి చేయబడు యజ్ఞములన్నింటికిని సర్వవ్యాపియైన

పరమేశ్వరుడే అధిష్ఠాత. ఆ యజ్ఞములయందు పరమేశ్వరుడే సర్వదా స్వయముగా విరాజమానుడై యుండును. కనుక యజ్ఞము సాక్షాత్తుగా పరమేశ్వరమూర్తియే. కనుక ప్రతి మనుష్యుడు భగవత్ప్రాప్తికై భగవదాజ్ఞానుసారము తన కర్తవ్య పాలనము చేయవలెను.

*సంబంధము - 'ఈ విధముగా సృష్టిచక్రము యజ్ఞములపై ఆధారపడియున్నది. పరమాత్మ ఆ యజ్ఞములయందు ప్రతిష్ఠితుడై యుండును." అని పలికి యజ్ఞరూప స్వధర్మపాలనావశ్యక స్థితిని నిరూపించుటకై సృష్టిచక్రమునకు అనుకూలముగా ప్రవర్తింపని వారిని అనగా తమ కర్తవ్య పాలనమును చేయని వారిని భగవానుడు నిందించుచున్నాడు-*

**ఏవం ప్రవర్తితం చక్రమ్ నానువర్తయతీహ యః ।**
**అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ 16 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓపార్థా! | ప్రవర్తితమ్ | = ప్రచలితమైన | ఇంద్రియారామః | = ఇంద్రియసుఖ లోలుడైనవాడు |
| యః | = ఎవడైతే | చక్రమ్ | = సృష్టిచక్రమును | | |
| ఇహ | = ఈలోకమున | న, అనువర్తయతి | = అనుసరింపడో (తన కర్తవ్యమును పాటింపడో) | అఘాయుః | = పాపాత్ముడు |
| ఏవమ్ | = ఈ విధముగా (పరంపరగా) | | | మోఘమ్, జీవతి | = వ్యర్థముగా జీవించును. |
| | | సః | = అతడు (అట్టి) | | |

**ఓ అర్జునా! ఇట్లు పరంపరాగతముగా కొనసాగుచున్న సృష్టిచక్రమునకు అనుకూలముగా ప్రవర్తింపనివాడు అనగా తన కర్తవ్యములను పాటింపక ఇంద్రియ సుఖలోలుడైన వాడు పాపి. అట్టివానియొక్క జీవితము వ్యర్థము. (16)**

ప్రశ్న - ఇచట 'చక్రమ్' అను పదమునకు అర్థమేమి? దానితోపాటు 'ఏవమ్' 'ప్రవర్తితమ్' అను వాటిని ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి? దానికి అనుకూలముగా ప్రవర్తించుట యనగానేమి?

సమా - 14వ శ్లోకమున వర్ణింపబడినట్లు 'చక్రమ్' అను పదము ఇచట సృష్టి పరంపరను (సృష్టి క్రమమును) తెలుపును. మనుష్యులచే ఆచరింపబడు శాస్త్ర విహిత కర్మలే యజ్ఞములుగా పేర్కొనబడును. యజ్ఞముల వలన వర్షములు, వాటి వలన అన్నోత్పత్తి, దానివలన ప్రాణుల పుట్టుకలు జరుగుచుండును. మఱల ప్రాణులలో భాగమైన మనుష్యుల ద్వారా కర్తవ్య కర్మ రూప యజ్ఞములు సాగుచుండును. మఱల ఆ యజ్ఞముల ద్వారా వర్షములు కురియుచుండును. ఇట్లు సృష్టి పరంపర (సృష్టిక్రమము) నిరంతరము చక్రము వలె తిరుగుచుండును. ఈ భావము విశదపఱచుటకే 'చక్రమ్' అను పదముతోపాటు 'ఏవమ్ ప్రవర్తితమ్' అనునవి ప్రయోగింపబడినవి. తమ తమ వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులను అనుసరించి స్వధర్మములను పాటించుట మనుష్యులకు కర్తవ్యము. అట్లు కర్తవ్యములను సావధానముగా ఆచరించుటయే ఈ సృష్టిచక్రమును అనుసరించుట యగును. ఆసక్తి, కోరికలను త్యజించి, కేవలము ఈ సృష్టి చక్రమును సువ్యవస్థిత మొనర్చుటకే యోగి కర్తవ్యమును అనుష్ఠించును. అందు అతనికి ఏమాత్రము స్వార్థచింతన ఉండదు. తత్ఫలితముగా అతనికి స్వధర్మరూప యజ్ఞమునందు ప్రతిష్ఠితుడైన పరమేశ్వరుడు లభించును.

ప్రశ్న - ఈ సృష్టి చక్రమునకు అనుకూలముగా ప్రవర్తింపని ఇంద్రియ సుఖలోలుడు 'పాపి' యనియు, అతని జీవితము వ్యర్థమనియు పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - సృష్టి చక్రమునకు అనుకూలముగా ప్రవర్తింప కుండుట యనగా తన కర్తవ్యములను నెరవేర్చకుండుటయే. తన కర్తవ్యములను మఱచి శబ్దాది విషయములందు ఆసక్తుడై ప్రాపంచిక భోగానుభవములయందే మునిగి తేలుచు అదియే తన జీవిత పరమావధిగా భావించువాడు ఇంద్రియ సుఖలోలుడు.

ఈ విధముగా తన కర్తవ్యమును త్యజించిన మనుజుడు భోగవాంఛలచే ప్రేరితుడై, విశృంఖలముగా. (విచ్చలవిడిగా)

ప్రవర్తించును. అతడు ఎల్లప్పుడును స్వార్థచింతనయందే నిమగ్నుడై ఇతరుల హితాహితములను గూర్చి యేమాత్రము ఆలోచింపడు. అతని ప్రవర్తనయొక్క చెడు ప్రభావము ఇతరులపైబడి సృష్టివ్యవస్థ ఒడుదుడుకులకు లోనగును. ఈ కారణముగ ప్రజలకు ఇబ్బందులు ఏర్పడును. కనుక తన కర్తవ్యపాలన చేయక సృష్టి వ్యవస్థను అస్థిరపరచినవాడు దోషి యగును. అట్టివాడు స్వార్థసిద్ధికై జీవిత పర్యంతము అన్యాయముగా ధనమును, ఐశ్వర్యమును కూడబెట్టుకొనును. కనుక అతనిని 'మహాపాపిగా' పేర్కొనుట జరిగినది.

మనుష్యుని జీవితమునకు ప్రధాన లక్ష్యము కర్తవ్యపాలన ద్వారా ప్రాణులకు సుఖసంతోషములను కూర్చుట, పరమ కల్యాణ స్వరూపుడైన పరమేశ్వరుని పొందుటయే. పైన పేర్కొనబడిన మహాపాపి ఈలక్ష్యసాధనకై ఆలోచింపక అమూల్యమైన తన మానవ జీవితమును విషయభోగముల యందే గడుపుచు దానిని వృథా చేసికొనును. కనుక అతని జీవితము వ్యర్థమని పేర్కొనబడినది.

సంబంధము - పై విధముగా సృష్టిక్రమమునను సరించి ప్రవర్తించు బాధ్యత వాస్తవముగా ఎట్టివారిపై ఉండును? అను ప్రశ్న తలయెత్తుట సహజము. సాధారణముగా మానవులందఱును కర్తవ్యపాలనరూపమైన ఈ బాధ్యతను పాటించుటలో భాగస్వాములే. కాని సిద్ధులైన మహాపురుషులకు కర్తవ్యకర్మాచరణబాధ్యతలు లేకున్నను వారు లోకహితార్థమై నిష్కామభావముతో కర్మలను ఆచరించుచునే యుందురు. ఈ విషయములనే రాబోవు రెండు శ్లోకములలో భగవానుడు తెల్పుచున్నాడు-

**యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | ఆత్మతృప్తః | = ఆత్మయందే తృప్తిచెందునో | స్యాత్ | = ఉండునో |
| యః, మానవః | = ఏ మనుజుడు | చ | = అట్లే | తస్య | = అతనికి |
| ఆత్మరతిః, ఏవ | = ఆత్మయందే రమించునో | ఆత్మని, ఏవ, సంతుష్టః | = ఆత్మయందే సంతుష్టుడై | కార్యమ్ | = ఎట్టి కర్తవ్యమూ |
| చ | = మరియు | | | న, విద్యతే | = (మిగిలి) ఉండదు. |

**సచ్చిదానందఘనపరమాత్మప్రాప్తినందిన జ్ఞానియైన మహాత్ముడు నిత్యమైన ఆత్మయందే రమించును. అతడు పూర్ణకాముడు. కనుక ఆత్మయందే తృప్తినొందును. అతడు ఆత్మయందే నిత్యసంతుష్టుడు. అట్టివానికి ఎట్టి కర్తవ్యమును ఉండదు. (17)**

ప్రశ్న - 'తు' అను దాని యొక్క అర్థమేమి?

సమా - పూర్వ శ్లోకములయందు మానవాళికి స్వధర్మపాలనము అవశ్యకర్తవ్యము అని తెలుపుచు, స్వధర్మపాలన చేయనివాడు 'మహాపాపి' అనియు, అందువలన అతని జీవితము వ్యర్థమనియు పేర్కొనెను. సాధారణ మానవులకంటెను జ్ఞానులైన మహాపురుషులు విలక్షణులనియు, వారిని శాస్త్రనియమములు బంధింపవనియు, వారి స్థితిని వేఱుగా చూపుటకే 'తు' అను అవ్యయము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'ఆత్మరతిః' 'ఆత్మతృప్తః' 'ఆత్మన్యేవసంతుష్టః' అను మూడు విశేషణములతోపాటు 'యః' అను పదము ఎవరిని తెల్పును? అతనిని 'మానవః' అని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - పైన తెలుపబడిన విశేషణములతో పాటు 'యః' అను సర్వనామము ఇచట సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్మను పొందిన జ్ఞానియైన మహాత్ముని తెలుపును. పరమాత్మ ప్రాప్తికి మానవుడే అర్హుడు. అనగా ఇతర ప్రాణికోటికి ఆ అర్హత లేదనియు ప్రతి మానవుడును సాధన ద్వారా పరమాత్ముని పొందవచ్చుననియు తెల్పుటకే 'మానవః' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'ఏవ' అను అవ్యయముతోపాటు 'ఆత్మరతిః' అను విశేషణ ప్రయోగము యొక్క అంతరార్థమేమి?

సమా - పరమాత్మ ప్రాప్తినందిన పురుషుని దృష్టియందు, ఈ సంపూర్ణ జగత్తు, స్వప్నము నుండి మేల్కాంచిన మనుష్యుడు భావించు స్వప్న దృశ్యమువలె గోచరించును. కావున అతనికి ఏ ప్రాపంచికవస్తువు పైనను ఏ మాత్రము ప్రీతి యుండదు. ఏ వస్తువు నందును అతడు ప్రత్యేకముగా ఆనందమును పొందడు 'కేవలము పరమాత్మయందే అభేద భావముతో అతనికి నిశ్చలస్థితి యుండును. ఈ కారణముగా అతని మనస్సు, బుద్ధి ప్రాపంచిక విషయముల మీదికి పోక పరమాత్మ స్వరూపము నందే స్వాభావికముగ నిశ్చల స్థితి యేర్పడును. ఆత్మయందు రమించుట యనగా ఇదియే.

ప్రశ్న - 'ఆత్మతృప్తః' అను విశేషణ ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - పరమాత్మప్రాప్తి నందినవాడు పూర్ణకాముడు. అతనికి ప్రాపంచిక వస్తువులలో దేనిని కూడ పొందవలసిన అవసరమే ఉండదు. అతడు పరమాత్మ స్వరూపమునందే అనన్య భావస్థితుడై సర్వదా తృప్తుడై యుండును. అట్టి వానిని గూర్చి తెలుపునదియే 'ఆత్మతృప్తః' అను విశేషణము.

ప్రశ్న - 'ఆత్మన్యేవ సంతుష్టః' అను విశేషణ ప్రయోగము యొక్క ప్రత్యేకతయేమి?

సమా - పరమాత్మ ప్రాప్తినందినవాడు నిత్యము నిరంతరము పరమాత్మ యందే సంతుష్టుడై యుండును. ఏ ప్రాపంచిక వస్తువు గూడ అతనిని ప్రలోభపఱచి, తనవైపునకు ఆకర్షింపజాలదు. ఏ కారణము వలననైనను, ఏ సంఘటనమువలననైనను అతనికి ఏ మాత్రము అసంతృప్తి కలుగజాలదు. ఏ ప్రాపంచిక వస్తువుతో గూడ అతనికి ఎట్టి సంబంధమూ ఉండదు. అతడు సర్వదా హర్ష శోకాది వికారములకు అతీతుడై సచ్చిదానందఘన పరమాత్మయందే నిరంతరము సంతుష్టుడై యుండును.

ప్రశ్న - 'అతనికి ఎట్టి కర్తవ్యమూ ఉండదు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - పరమాత్మ ప్రాప్తి పొందిన వానికి సమస్త కర్తవ్యములూ సమాప్తమగును. అతడు కృతకృత్యుడు. శాస్త్ర విహితములైన మానవ కర్తవ్య కర్మలకు పరమలక్ష్యము కల్యాణ స్వరూపుడైన పరమాత్మయొక్క ప్రాప్తియే. ఆ లక్ష్యము అతనికి నెరవేఱినది. కనుక అతనికి ఎట్టి కర్తవ్యములూ మిగిలియుండవు.

ప్రశ్న - 'జ్ఞాని' యైనవాడు ఎట్టి కర్మలనూ చేయుడా?

సమా - జ్ఞానికి శరీరేంద్రియ మనస్సులతో ఎట్టి సంబంధమూ ఉండదు. కనుక వాస్తవముగ అతడు ఏమియు చేయుడు. కాని లోకదృష్టిలో మనస్సు, బుద్ధి, ఇంద్రియముల ద్వారా పూర్వాభ్యాస ప్రారబ్ధానుసారము శాస్త్రానుకూలముగ కర్మలు జరుగుచునే యుండును. అట్టి కర్మలు మమతాసక్తులు, అభిమానము, కోరికలు ఏ మాత్రము లేకుండ చేయబడుటవలన అవి పవిత్రములై ఇతరులకు ఆదర్శప్రాయములుగా ఉండును. ఐనప్పటికిని అట్టి పురుషునిపై శాస్త్ర విహితవిధుల ప్రభావము ఏ మాత్రమూ ఉండదు.

**నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।**
**న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తస్య | = అట్టిమహాపురుషునకు | అకృతేన | = కర్మచేయకుండుట | | యందును |
| ఇహ | = ఈలోకమున | | వలననూ | అస్య | = ఇతనికి |
| కృతేన | = కర్మాచరణమువలన | ఏవ, న(అస్తి) | = (ప్రయోజనమూ) ఉండదు | కశ్చిత్ | = ఎట్టి |
| కశ్చన, అర్థః | = ఎట్టి ప్రయోజనమూ | చ | = అట్లే | అర్థ వ్యపాశ్రయః | = స్వార్థ సంబంధమూ |
| న(అస్తి) | = ఉండదు | సర్వభూతేషు | = సమస్తప్రాణుల | న(అస్తి) | = ఉండదు |

అట్టి మహాత్ముడు ఈ జగత్తునందు కర్మలు చేయుటవలనను, చేయకుండుట వలనను అతనికి ఎట్టి ప్రయోజనమూ ఉండదు. అతనికి సర్వప్రాణులతోడను స్వార్థపరమైన సంబంధము ఏవిధముగను ఏమాత్రము ఉండదు. **(18)**

ప్రశ్న - "అట్టి మహాపురుషుడు కర్మలను, చేయుట వలనగాని, చేయకుండుటవలనగాని అతనికి ఎట్టి ప్రయోజనము ఉండదు" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - జ్ఞానియైన వానికి ఎట్టి కర్తవ్యము ఉండదని పూర్వ శ్లోకమున చెప్పబడిన విషయమునకు పుష్టిని చేకూర్చుటకై ఇందు అతని కర్తవ్యాభావ స్థితికి హేతువు వివరింపబడుచున్నది. అట్టి మహాత్ముడు నిరంతరము పరమాత్మ స్వరూపమునందే సంతుష్టుడై యుండుట వలన ఏ కర్మద్వారా కూడ అతనికి సిద్ధింపవలసిన ఎట్టి లౌకిక లేక పారలౌకిక ప్రయోజనమూ మిగిలియుండదు. అట్లే కర్మ త్యాగము ద్వారా కూడ ఎట్టి ప్రయోజనమూ మిగిలియుండదు. ఏలనన అతని అవసరములన్నియును పూర్తియైనవి. కనుక అతనికి ఏ వస్తుప్రాప్తియు మిగిలి యుండదు. కాబట్టి అతనికి కర్మలు చేయుటగాని, చేయకుండుటగాని విధ్యుక్తముగాదు. అతడు శాస్త్ర నియమముల నుండి సర్వదా ముక్తుడు. అతని శరీరేంద్రియ మనస్సుల ద్వారా కర్మలు చేయబడుచున్నచో శాస్త్రములు వాటిని అడ్డగింపవు. అవి చేయబడకున్నచో వాటిని చేయుటకై శాసింపవు.

జ్ఞానము సిద్ధించిన పిమ్మట గూడ జీవన్ముక్తి సుఖములను అనుభవించుటకై జ్ఞాని కర్మలను త్యజించుట లేక అనుష్ఠించుట అవసరమని అతడు భావింపపనిలేదు. ఏలనన జ్ఞానప్రాప్తియైన పిదప మనస్సుకు ఇంద్రియములకు విశ్రాంతినిచ్చు తుచ్ఛ సుఖములతో అతనికి ఎట్టి సంబంధమూ ఉండదు. అతడు శాశ్వతముగా నిత్యానందము నందు మగ్నుడై స్వయముగా ఆనంద రూపుడగును. కనుక ఏదైనా సుఖ విశేషప్రాప్తికై గ్రహణరూప లేక త్యాగరూప కర్తవ్యశేషమును భావించువాడు వాస్తవముగా జ్ఞానికాడు. కాని అతడు అట్టి స్థితి విశేషమునే జ్ఞాన ప్రాప్తియని భావించుచు తనను జ్ఞానిగా తలంచువాడు మాత్రమగును. 17వ శ్లోకము నందు చెప్పబడిన లక్షణములు గల జ్ఞానిని గూర్చి మాత్రము ఇట్లు భావించుటకు వీలులేదు. ఈ విషయమునే ఉత్తర గీతయందు భగవానుడు ఇట్లు చెప్పెను.

జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః ।
న చాస్తి కించిత్ కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్ ॥
(ఉత్తరగీత - 1/22)

అనగా జ్ఞానామృతమువలన తృప్తుడై కృతకృత్యుడైన యోగికి ఎట్టి కర్తవ్యమూ ఉండదు. ఒకవేళ ఏదైనా కర్తవ్యము ఉన్నచో అతడు తత్త్వజ్ఞానికాడు.

ప్రశ్న - "అతనికి సర్వప్రాణులతోడను స్వార్థపరమైన సంబంధము ఏమాత్రము ఉండదు." అని యనుటలోని అంతర్యమేమి?

సమా - జ్ఞానియైన వాడు కర్మలు చేసినను చేయకున్నను అతనికి కలుగు ప్రయోజనము ఏమియు యుండదు. అట్లే చరాచరములలో దేనివలనను అతనికి ఎట్టి ప్రయోజనము ఉండదు. దేహాభిమానము పూర్తిగా త్యజింపక పరమాత్మప్రాప్తికై సాధన చేయువాడు (సాధకుడు) తన సుఖభోగములకై ఏమియు ఆశింపకున్నను శరీరనిర్వహణకై ఏదో ఒక రూపమున అతనికి ఇతర ప్రాణులతో కొంత స్వార్థసంబంధము ఉండియే తీరును. (అనగా ఇతరులపై కొంత ఆధారపడవలసి వచ్చును.) కనుక అతనికి శాస్త్రవిహితములైన కర్మలను గ్రహించుట, త్యజించుట కర్తవ్యములగును. కాని సచ్చిదానంద పరమాత్మప్రాప్తి నందిన జ్ఞానికి దేహాభిమానము లేని కారణమున అతడు తన జీవితమును గూర్చి పట్టించుకొనడు. అట్టి స్థితిలో శరీరనిర్వహణము ప్రారబ్ధానుసారము తనంతటతానే సాగి పోవును. కనుక అతనికి ఏ ప్రాణితోడను ఏ విధముగను ఎట్టి స్వార్థ సంబంధమూ ఉండదు. కావున అతనికి ఎట్టి కర్తవ్యశేషమూ ఉండదు. అందువలన అతడు సర్వథా కృతకృత్యుడు.

ప్రశ్న - ఇట్టి స్థితియందు అతనిద్వారా కర్మలు ఏల చేయబడవు?

సమా - ప్రారబ్ధానుసారము లోకదృష్టితో అతని ద్వారా లోకహితము కొఱకు కర్మలు జరుగుచుండును. వాస్తవముగ అతనిచే కర్మలు చేయబడవు. ఆ కర్మలతో అతనికి ఎట్టి సంబంధమూ ఉండదు. కనుక ఆ కర్మలు 'కర్మలు'గనే భావింపబడవు.

సంబంధము - మనుష్యునకు పరమశ్రేయస్కరమైన పరమాత్మప్రాప్తి కలుగునంతవఱకు స్వధర్మపాలన అనగా వర్ణాశ్రమధర్మములను అనుసరించి, విహిత కర్మానుష్ఠానము నిస్స్వార్థభావముతో చేయుట ఆవశ్యకర్తవ్యము. పరమాత్మ ప్రాప్తినందిన సిద్ధ పురుషునకు ఏ విధమైన కర్తవ్యములును లేకున్నను అతని మనస్సు, ఇంద్రియముల ద్వారా లోకహితముకొఱకు ప్రారబ్ధానుసారము కర్మలు జరుగుచునేయుండును. ఇంతవఱకు భగవానుడు ఈ విషయములనే సహేతుకముగ వివరించెను. పై వివరణను అనుసరించి ఇపుడు భగవానుడు అనాసక్తభావముతో కర్తవ్యకర్మలను ఆచరించుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు.

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ 19 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన | సమాచర | = చక్కగా ఆచరింపుము | కర్మ | = కర్మ(ల)ను |
| సతతమ్ | = ఎల్లప్పుడును | హి | = ఏలనన | ఆచరన్ | = ఆచరించుచు |
| అసక్తః | = ఆసక్తిరహితుడవై | పూరుషః | = మనుష్యుడు | పరమ్ | = పరమాత్మను |
| కార్యమ్, కర్మ | = కర్తవ్యకర్మను | అసక్తః | = ఆసక్తిరహితుడై | ఆప్నోతి | = పొందును. |

అందువలన నీవు నిరంతరము ఆసక్తిరహితుడవై కర్తవ్య కర్మలను చక్కగా ఆచరింపుము. ఏలనన ఆసక్తిని వీడి కర్మలను సదా ఆచరించు మనుష్యునకు పరమాత్మ ప్రాప్తి కలుగును. (19)

ప్రశ్న 'తస్మాత్' అను పద ప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - 'తస్మాత్' అను పదము పూర్వశ్లోకముతో గల సంబంధమును తెలుపును. ఇంత వఱకు భగవానుడు స్వధర్మపాలన చేయవలసిన అవసరమును గూర్చి సహేతుకముగ వివరించెను. ఆ విషయములన్నింటిని పరిశీలించిన పిమ్మట స్వధర్మపాలనయే అర్జునునకు శ్రేయస్కరమని తెలుపుచు తన వర్ణధర్మమును అనుసరించి, కర్మలను ఆచరించుటయే యుక్తమని తెల్పెను.

ప్రశ్న - 'అసక్తః' అను పదమునకు అర్థమేమి?

సమా - 'అసక్తః' అను పదము ద్వారా సమస్తకర్మల యందును, వాటి ఫలరూపములైన సమస్తభోగముల యందును ఆసక్తిని వీడి, కర్మలను ఆచరింపుమని భగవానుడు అర్జునుని ఆదేశించుచున్నాడు. కోరికలను త్యజించుట ఆసక్తిని వీడుటలోనే అంతర్భాగము. ఏలనన ఆసక్తి వలననే కోరికలు ఉత్పన్నములగును. (2/62) కనుక ఇచట ఫలేచ్ఛాత్యాగము వేఱుగా చెప్పుట జరగలేదు.

ప్రశ్న - 'సతతమ్' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - 'ఏ మానవుడైనను క్షణమాత్రము గూడ కర్మను చేయకుండ ఉండలేడు.' అను విషయమును భగవానుడు ఇదివరలో తెల్పియుండెను. (3/5) మనుష్యుడు నిరంతరము ఏదో ఒక పనిని చేయుచునే యుండునని దీనివలన బోధపడును. ఆచరించు సమస్త కర్మలయందును వాటి ఫలముల యందును సర్వదా ఆసక్తిని వీడి, చేయుమనియు ఏ సమయమునందును, ఏ కర్మనైనను ఆసక్తి పూర్వకముగ చేయవలదనియు అర్జునుని ఆదేశించుచు భగవానుడు 'సతతమ్' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'కర్మ' అను పదముతో పాటు 'కార్యమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ప్రతి వ్యక్తియు వర్ణాశ్రమ ధర్మములను, స్వభావమును, పరిస్థితులను అనుసరించి, కర్తవ్య కర్మలను చేయవలయును. పరధర్మములను అనుసరించు కర్మలను గాని, నిషిద్ధ కర్మలను గాని, వ్యర్థ లేక కామ్య కర్మలను గాని చేయరాదు. అర్జునునకు ఈ విషయములను తెల్పుటకే 'కర్మ' అను పదముతోపాటు 'కార్యమ్' అను విశేషణము గూడ ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'సమాచర' అను క్రియాపదము యొక్క అర్థమేమి?

సమా - 'ఆచర' అను క్రియాపదము ఇచట 'సమ్' అను ఉపసర్గ పూర్వకముగ ప్రయుక్తమైనది. అర్జునుడు కర్మలను సావధానముగా, విధ్యుక్తముగ యథాయోగ్యముగ ఆచరింప వలయుననియు, అట్లు చేయనిచో కర్మలయందు లోపము ఏర్పడి పరమశ్రేయః ప్రాప్తికి విలంబము ఏర్పడుననియు తెల్పుటకై 'సమాచార' అను క్రియాపదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - "ఆసక్తి రహితముగా కర్మలను చేయువాడు పరమాత్మను పొందును." అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఇందు కర్మయోగ ఫలము తెలుపబడినది. ఆసక్తిని త్యజించి, కర్తవ్య కర్మలను ఆచరించుమనుష్యుడు కర్మబంధముల నుండి ముక్తుడై, పరమ పురుషుడైన పరమాత్మను చేరును. ఈ కర్మయోగ మహాత్మ్యము ఇట్టిది. కావున అర్జునుడు కూడ సమస్తకర్మలను ఆసక్తి రహితుడై చేయవలయునని భగవానుడు ఆదేశించెను.

సంబంధము - ఆసక్తిరహితముగా కర్మచేయుటచే మనుష్యుడు పరమాత్ముని పొందునని పూర్వశ్లోకమున భగవానుడు తెలిపియుండెను. ఆ విషయమునకు పుష్టిని చేకూర్చుటకే జనకాదులను ఆదర్శముగా గొని, కర్మల నాచరించుట యుక్తమని అర్జునునకు తెలుపుచున్నాడు-

**కర్మణైవ హి సంసిద్ధిమ్ ఆస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| జనకాదయః | = జనకుడు మొదలగు జ్ఞానులు గూడ | సంసిద్ధిమ్ | = పరమసిద్ధిని | సంపశ్యన్, అపి | = దృష్టియందుంచుకొనుచూ |
| కర్మణా,ఏవ | = (ఆసక్తిరహిత) కర్మాచరణముద్వారానే | ఆస్థితాః | = పొందియుండిరి | కర్తుమ్, ఏవ | = (కర్మ)చేయుటకే |
| | | హి | = కావున | అర్హసి | = (నీవు)తగియున్నావు |
| | | లోకసంగ్రహమ్ | = లోకహితమును | | |

**జనకుడు మొదలగు జ్ఞానులుగూడ ఆసక్తి రహితముగా కర్మలను ఆచరించుట వలననే పరమసిద్ధిని పొందిరి. కావున నీవును లోకహితార్థమై కర్మలను ఆచరించుటయే సముచితము. (20)**

ప్రశ్న - 'జనకాదయః' అను పదము ద్వారా ఎవరెవరు సూచింపబడిరి? వారు కూడ కర్మల ద్వారానే పరమసిద్ధిని పొందిరి' అని యనుటలోని విశేషమేమి?

సమా - గీతోపదేశ కాలమువఱకు సుప్రసిద్ధులైన జనకుడు, అశ్వపతి, ఇక్ష్వాకుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు మొదలగువారు మమతాసక్తులను, కోరికలను వీడి, కేవలము పరమాత్మ ప్రాప్తికై కర్మలను ఆచరించి పరమసిద్ధిని పొందిరి. 'జనకాదయః' అను పదము వీరినే సూచించును.

ఆసక్తి రహితముగ కర్మలను ఆచరించుటచే మనుష్యుడు పరమాత్మ ప్రాప్తినందునని పూర్వశ్లోకమున తెల్పబడియుండెను. ఈ విషయమును ప్రమాణీకరించుటకే (ప్రమాణముగా చేయుటకే) ఈ విధముగా పరమసిద్ధిని పొందిన జనకాదులను ఆదర్శముగా పేర్కొనెను. నేటి వఱకును పెక్కుమంది మహాపురుషులు మమతాసక్తులను కోరికలను వీడి, కర్మ యోగము ద్వారా పరమాత్మను పొందిరి. ఈ విషయము క్రొత్తది కాదు. పరమాత్మప్రాప్తి సాధన విషయమున ఇది ఒక స్వతంత్రమైన నిశ్చితమైన మార్గము. ఇందెట్టి సందేహములేదు.

ప్రశ్న - పరమాత్మప్రాప్తి తత్త్వజ్ఞానము ద్వారా కలుగునుగదా! మఱి ఆసక్తి రహిత కర్మలు పరమాత్మ ప్రాప్తికి ద్వారములని చెప్పుటకు కారణమేమి?

సమా - ఆసక్తి రహిత కర్మల ద్వారా అంతఃకరణ శుద్ధి కలిగిన సాధకునకు భగవదనుగ్రహముచే తత్త్వజ్ఞానము తనంతటతానే ఏర్పడును (4/38). అట్లే కర్మయోగ యుక్తుడైన మునికి పరమాత్మప్రాప్తి వెంటనే లభించును. (5/6). కనుక ఇచట ఆసక్తిరహిత కర్మలు పరమాత్మ ప్రాప్తికి ద్వారములని తెలుపబడినవి.

ప్రశ్న - లోకసంగ్రహమనగానేమి? 'లోకసంగ్రహ విషయమును గూడ దృష్టిలో ఉంచుకొని కర్మలు చేయుట ఉచితము' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - సృష్టిక్రమమును సురక్షితముగా నుంచుటకును, దాని వ్యవస్థయందు ఎట్టి అడ్డంకులు లేకుండుటకును సహాయపడుటనే 'లోకసంగ్రహమును పాటించుట' యందురు. అనగా సమస్త ప్రాణుల పోషణ రక్షణ బాధ్యతలు మనుష్యులపైననే ఉండును. కావున వారు తమ వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులను అనుసరించి, కర్తవ్యకర్మలను చక్కగా ఆచరించుచు ఇతరులకు ఆదర్శముగా ఉండవలెను. మఱియు ఇతరులచే దుర్గుణదురాచారములను మాన్పించి వారు గూడ స్వధర్మాచరణముల యందు నిమగ్నులగునట్లు చేయవలెను. దీనినే లోకసంగ్రహమునకై కర్మలను ఆచరించుట అని యందురు.

శ్రేయస్సును కోరుకొనువారు పరమ శ్రేయోదాయకమైన పరమేశ్వర ప్రాప్తికై ఆసక్తిరహితముగ కర్మలను ఆచరించుచుండుట ఉచితమే. అంతేగాక లోకహితము కొఱకు గూడ మనుష్యులు కర్మలను చేయుచుండవలెను. ఒకవేళ అర్జునుడు కర్మలను చేయుట మానినచో ఇతరులు

గూడ అతనిని ఆదర్శముగా గొని, కర్మలను త్యజింతురు. అందువలన సృష్టి వ్యవస్థ దెబ్బ తినును. దాని కారణముగ విప్లవములు (అల్లకల్లోలములు) చెలరేగును. సృష్టివ్యవస్థ సురక్షితముగా కొనసాగుటకు కర్తవ్య పాలనము ముఖ్యము. ఈ విషయమును దృష్టిలో ఉంచుకొనియే కర్తవ్యకర్మలను చేయుమనియు, వాటిని త్యజించుట ఉచితము కాదనియు శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించెను.

ప్రశ్న - లోక సంగ్రహార్థము ఆయాకర్మలను పరమాత్మ ప్రాప్తినందిన జ్ఞానియే చేయవలెనా? లేక సాధకుడును చేయవచ్చునా?

సమా - జ్ఞానికి మాత్రము ప్రత్యేకముగా కర్తవ్యకర్మలు అనునవియే ఉండవు. కనుక అతడు చేయు కర్మలు అన్నియును లోక సంగ్రహార్థమే. (లోకకల్యాణార్థమే) జ్ఞానిని ఆదర్శముగా తీసికొని సాధకుడు లోకహితార్థమై కర్మలు చేయవచ్చును. కాని వాటిని అతడు సమగ్రముగా చేయజాలడు. ఏలనన అజ్ఞానము పూర్తిగా తొలగిపోవునంతవరకు ఏదో ఒక అంశమున అతనికి స్వార్థము ఉండియే తీరును. స్వార్థసంబంధము ఏ కొంచెము ఉన్నను అతనిద్వారా లోకహితార్థమై కర్మలు జరుగవలసినంతగా జరుగవు.

ప్రశ్న - జ్ఞానికి నిజముగా ఎట్టి కర్తవ్యములును లేనప్పుడు, అతని దృష్టిలో కర్మలకు ఎట్టి ప్రాధాన్యమూ ఉండనప్పుడు, అతడు లోకహితార్థమై చేయుకర్మలు లోకులకు చూపుటకే అనగా ఆడంబరమునకే కావచ్చును గదా?

సమా - జ్ఞానికి ఎట్టి కర్తవ్యకర్మలును లేకున్నను అతడు చేయు కర్మలు కేవలము లోకులకు ప్రదర్శించుటకు మాత్రము గాదు. మనస్సు నందు కర్మల యెడ ఎట్టి ప్రాధాన్యమూ లేకుండ లోకులు చూచుటకు కర్మలను ఆచరించినచో అది 'దంభము' అనబడును. జ్ఞానియందు దంభమునకు తావే ఉండదు. కనుక అతడు చేయునదంతయును లోకమునకు హితమును గూర్చునదే యనియు, శ్రేష్ఠము మరియు ఆవశ్యకమైనదే యనియు భావించి చేయును. ఎట్టి స్థితియందును అతనిలో ఆడంబరము, ఆసక్తి, కోరికలు, అహంకారము ఏ మాత్రమూ వాసనకు కూడ మిగిలియుండవు. జ్ఞాని ద్వారా కర్మలు ఏ భావముతో జరుగునో ఎవ్వరికినీ తెలియదు. కనుక అతని కర్మలు మిక్కిలి విలక్షణములైనవిగా భావింపబడును.

*సంబంధము - లోకసంగ్రహదృష్టితో కర్మలను ఆచరించుట సముచితమని పూర్వశ్లోకమున భగవానుడు అర్జునునకు తెల్పెను. కర్మలు చేయుటవలన లోకహితమెట్లు కలుగును? అను జిజ్ఞాసకలుగ వచ్చును. కనుక ఆ విషయమును భగవానుడు వివరింపబోవుచున్నాడు-*

**యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రేష్ఠః | = శ్రేష్ఠపురుషుడు | తత్, తత్, ఏవ | = అట్టిదానినే | కురుతే | = చేయునో, (స్వీకరించునో) |
| యత్, యత్ | = ఏమేమి | (ఆచరతి) | = ఆచరించును | లోకః | = లోకము |
| ఆచరతి | = ఆచరించునో | సః | = అతడు | తత్, అనువర్తతే | = దానిననుసరించి ప్రవర్తించును |
| ఇతరః, జనః | = ఇతర జనసముదాయము | యత్, ప్రమాణమ్ | = దేనిని ప్రమాణముగా | | |

**శ్రేష్ఠుడైన పురుషుని ఆచరణమునే (ప్రవర్తననే) ఇతరులును అనుసరింతురు. అతడు నిల్పిన (ప్రతిష్ఠించిన) ప్రమాణములనే లోకులందఱును పాటించెదరు. (21)**

ప్రశ్న - ఇచట 'శ్రేష్ఠః' అను పదము ఎవరిని తెలుపును?

సమా - శ్రేష్ఠుడైనవాడు సద్గుణములు, సదాచారములు గల్గి ధర్మాత్ముడై యుండును. అందువలన అతనిని పెక్కుమంది భక్తి శ్రద్ధలతో గౌరవించుచుందురు. అట్టి ప్రసిద్ధుడైన మహాత్ముని, జ్ఞానిని తెల్పునదియే 'శ్రేష్ఠః' అను పదము.

ప్రశ్న - శ్రేష్ఠుడైన వాడు చేయుకర్మలను ఇతరులు గూడ అనుసరింతురు - అని అనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ శ్రేష్ఠుడు తన వర్ణాశ్రమ ధర్మములను చక్కగా అనుష్ఠించినచో ఇతరులును ఆతనిని చూచి, తమతమ వర్ణాశ్రమ ధర్మములను శ్రద్ధగా పాటించు చుందురు. ఇందువలన నిరాఘాటముగా లోకవ్యవస్థ చక్కగా కొనసాగుచుండును. కాని ధర్మాత్ముడైన జ్ఞాని తన వర్ణాశ్రమ ధర్మములను పాటింపనిచో దాని ప్రభావము ఇతరులపై గూడ పడును. వర్ణాశ్రమ ధర్మములను శ్రేష్ఠులైనవారు పాటింప కుండుట చూచి, అవి నిష్ప్రయోజకములనియు, వాటిని పాటించుట వ్యర్థమనియు సామాన్య మానవులు తలంతురు. కనుక వారును అశ్రేష్ఠుల దారినే అనుసరించి, తమ వర్ణాశ్రమాది ధర్మములను ఆచరించుట మానివేయుదురు. ఇట్లగుట వలన లోకము అల్లకల్లోలములకు లోనగును. ప్రాపంచిక వ్యవస్థ దెబ్బతినును. కనుక మహాత్ములైనవారు లోకహితమును దృష్టిలో ఉంచుకొని, తమ వర్ణాశ్రమములను అనుసరించి, శ్రద్ధగలవారై యథా యోగ్యముగ, సావధానముగ సమస్త కర్మలను అనుష్ఠింపవలెను. కర్మలను అవహేళన చేయుటగాని, మానివేయుటగాని తగదు.

ప్రశ్న - 'శ్రేష్ఠుడు ప్రమాణముగా స్వీకరించి, అనుష్ఠించిన దానినే లోకులు పాటింతురు' - అనియనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - శ్రేష్ఠులైన వారు శాస్త్రవిహితములైన కర్తవ్య కర్మలను పూర్తిగా ఆచరించుచు, వాటిని గూర్చి ప్రత్యక్షముగా, పరోక్షముగ లోకమునకు బోధపరుచుదురు. ఇంకను ఏ యే కర్మలను ఏ విధముగా చేయవలెనో, ఏ యే కర్మలను ఏ విధముగా చేయగూడదో తెలుపుచు, లోకుల అంతః కరణముల యందు విశ్వాసమును నెలకొల్పుదురు. దానిననుసరించి సాధారణ మానవులు గూడ తమ తమ కర్తవ్యకర్మలను యథావిధిగా ఆచరింతురు. కనుక శ్రేష్ఠుడైనవాడు సృష్టి వ్యవస్థను చక్కగా నుంచు ఉద్దేశ్యముతో సావధానుడై తాను స్వయముగా కర్మలు చేయుచు ఉపదేశముల ద్వారా ఇతరులను గూడా కర్తవ్య పరాయణులనుగా చేయవలెను. అతడు తన ఉపదేశములు, ఆచరణముల వలన ప్రాపంచిక స్థితిని సుస్థిర మొనర్చుటకై వర్ణాశ్రమ ధర్మములును లేక మానవధర్మపరంపరయు నిరాటంకముగా కొనసాగునట్లు అనగా కర్మాచరణముల యందు లోకులకు శ్రద్ధాదరములు తగ్గకుండునట్లు చూడవలెను.

ప్రశ్న - శ్రేష్ఠుడు ఆచరించిన దానినే ఇతరులును అనుకరింతురు - అని చెప్పిన పిమ్మట అతడు ప్రమాణముగా చేసిన దానిని లోకులు పాటింతురు - అని చెప్పనవసరమేమి?

సమా - ప్రపంచమున అందఱి కర్తవ్యకర్మలును ఒకే రీతిగా ఉండవు. దేశము, సమాజము, తమ తమ వర్ణాశ్రమములు, కాలము, స్థితులు మున్నగు వానిని అనుసరించి, కర్తవ్యములు వేర్వేఱుగా ఉండును. శ్రేష్ఠుడైనవాడు అందరికిని యోగ్యములైన కర్మలను వేర్వేఱుగా తాను ఆచరించి చూపుట అశక్యము. కావున శ్రేష్ఠుడు ఏయే వైదిక, లౌకిక క్రియలను ఉపదేశముల ద్వారా ప్రమాణీకరించునో వాటినే అనుసరించి లోకులు వ్యవహరింతురు. కనుక పైవిధముగా చెప్పుట యుక్తమే.

సంబంధము - శ్రేష్ఠులైన మహాపురుషుల ఆచరణము లోకమునకు తోడ్పడునని తెలుపుచు భగవానుడు మూడు (3) శ్లోకములలో తననే ఆదర్శముగా పేర్కొనుచు వర్ణాశ్రమానుసారము విహిత కర్మలను అవశ్యముగా ఆచరింపవలెనని ప్రతిపాదించుచున్నాడు-

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ 22 ॥**

పార్థ! = ఓ పార్థా!
మే = నాకు
త్రిషు, లోకేషు = ముల్లోకముల యందును
కించన, కర్తవ్యమ్, = ఎట్టి
న, అస్తి కర్తవ్యములేదు
చ = మరియు
అవాప్తవ్యమ్ = పొందదగినవస్తు వేదియునూ
అనవాప్తమ్, న = పొందబడకుండా లేదు
కర్మణి, ఏవ = (ఐనను నేను) కర్మయందే
వర్తే = ప్రవర్తిల్లుచున్నాను.

**ఓ అర్జునా! ఈ ముల్లోకములయందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే పొందదగిన వస్తువులలో ఏదియును నేను పొందనిదియును లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను- (22)**

ప్రశ్న - అర్జునుని 'పార్థ' అని సంబోధించుటలోని ఉద్దేశ్యమేమి?

సమా - కుంతికి 'పృథ' అనునది మఱియొక పేరు. బాల్యమునందు ఆమె తన తండ్రియైన శూరసేనుని యొద్ద ఉన్నంతవఱకును ఆమె పేరు 'పృథ'. కుంతిభోజుడు ఆమెను పెంచుట వలన ఆమెకు 'కుంతి' అను పేరు ఏర్పడెను. తల్లికి గల 'కుంతి' అను పేరునుబట్టి 'కౌంతేయుడు' అనియు, 'పృథ' అను పేరును బట్టి 'పార్థుడు' అనియు అర్జునునకు పేర్లు ఏర్పడెను. కృష్ణుడు తన మేనత్త (పృథ) కుమారుడైన అర్జునునియందు తన ఆత్మీయతను ప్రకటించుటకే అతనిని **'పార్థ'!** అని సంబోధించెను. అంతేగాక "నాయనా! నేను చెప్పుచున్న విషయము ఏమాత్రమూ నిమ్నశ్రేణికి చెందదు. నీవు నాకు ఆత్మీయుడవు. మిత్రమా! నేను ఆచరించుదానినే నీకును తెల్పుచున్నాను. ఇది నీకు పరమశ్రేయస్కరము" అని తెల్పుటకు అతనిని **'పార్థ'!** అని సంబోధించినట్లు భావింపవచ్చును.

ప్రశ్న - 'ఈ ముల్లోకముల యందును నాకు ఎట్టి కర్తవ్యమూ లేదు.' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - మనుష్యునకు కేవలము ఈ మర్త్యలోకముతో మాత్రమే సంబంధము ఉండును. కనుక ధర్మార్థకామ మోక్షములు అను చతుర్విధ పురుషార్థముల సిద్ధికై కర్తవ్య విధానము ఈ లోకమునందే యుండును. కాని శ్రీకృష్ణుడు మానవమాత్రుడు కాడు. స్వయముగా అందఱి కర్తవ్య విధానములను నిర్ణయించు సాక్షాత్ పరమేశ్వరుడు. కనుక స్వర్గమర్త్య పాతాళములు అను ముల్లోకములయందును అతడు సర్వదా వ్యాపించియుండును. అతనికి ఏ లోకమునందును ఎట్టి కర్తవ్యశేషము ఉండదు.

ప్రశ్న - 'ఈ ముల్లోకములయందును నాకు ప్రాప్తము కాదగిన వస్తువు ఏదియును అప్రాప్తముగా లేదు.' అనియనుటలోని విశేషమేమి?

సమా - ఈ మర్త్యలోక విషయమును గూర్చి మాత్రమే చెప్పనేల ముల్లోకముల యందును పొందదగిన వస్తువు ఏదియును అతనికి (భగవానునకు) అప్రాప్తముగా లేదు. ఏలనన అతడు సర్వేశ్వరుడు, పూర్ణకాముడు సమస్తమును సృష్టించువాడు.

ప్రశ్న - "ఐనప్పటికిని నేను కర్మలను ఆచరించుచునే యుందును" అని అనుటలోని అంతర్యమేమి?

సమా - భగవంతునకు ఏ వస్తువునూ పొందవలసిన అవసరమే లేదు. ఆయనకు ఎట్టి కర్తవ్యశేషమూ ఉండదు. ఐననూ లోకహితార్థము ప్రాణికోటిపై గల వాత్సల్యముచే కర్మలయందే (కర్మలను చేయుటయందే) నిమగ్నుడై యుండును. కర్మత్యాగము చేయడు. కనుక ఏ మానవుడును తనకు భోగాసక్తి లేనప్పుడుగాని, కర్మఫలరూపమైన ఏ వస్తువూ అవసరమే లేనప్పుడుగాని తానేల కర్మలు చేయవలయును? అని భావించి, కర్మలను ఏ విధముగను త్యజింపరాదు. పరమపద ప్రాప్తి పొందినవారు కూడ తాము కర్మలు చేయనవసరములేదని భావించి కర్మలు చేయుట మానరాదు. ఏలనన ఏ ఇతర కారణములవలననైనను కర్మాచరణ - అవశ్యకస్థితి లేకున్నను లోకహితార్థమై కర్మలను చేయుచునే యుండవలయును.

**యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః ।**
**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | అతంద్రితః | = సావధానుడనై | మనుష్యాః | = మనుజులు |
| పార్థ | = ఓ పార్థా! | కర్మణి | = కర్మయందు | సర్వశః | = అన్నివిధములా |
| యది | = ఒకవేళ | న, వర్తేయమ్ | = ప్రవర్తింపకున్నచో (గొప్ప హాని కలుగును, ఏలనన) | మమ | = నా |
| జాతు | = ఎప్పుడైనను | | | వర్త్మ | = మార్గమునే |
| అహమ్ | = నేను | | | అనువర్తంతే | = అనుసరించెదరు. |

**(ఏలనన) ఓ పార్థా! ఎప్పుడైనను నేను సావధానుడనై కర్మలయందు ప్రవర్తింపకున్నచో లోకమునకు గొప్పహాని సంభవించును. ఎందుకనగా మనుష్యులందఱును అన్ని విధముల నా మార్గమునే అనుసరింతురు. (23)**

ప్రశ్న - 'హి' అను అవ్యయ ప్రయోగ విశేషమేమి?

సమా - తనకు ఎట్టి కర్తవ్యమూ లేకున్నను తాను కర్మ చేయుచునే యుందునని పూర్వశ్లోకమున భగవానుడు నుడివియుండెను. కర్తవ్యమే లేనప్పుడు కర్మ చేయుటకు కారణమేమి? అను సందేహము కలుగుట సహజము. కనుక తాను కర్మలను చేయుటకు గల హేతువులను తెలుపుచు భగవానుడు ఇచట 'హి' అను అవ్యయమును ప్రయోగించెను.

ప్రశ్న - "యది, జాతు" అను అవ్యయములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవానుడు ధర్మసంస్థాపన కొఱకు అవతరించుచుండును. కనుక ఏ సమయమునందైనను సావధానముగా సమగ్రముగా అతడు కర్మలను ఆచరింపకుండుట గాని, చులకనచేయుట గాని సంభవము గాదు. ఒకవేళ అతడు ఎప్పుడైనను సావధానముగా కర్మలను ఆచరింపనిచో సృష్టిక్రమమునకు తీవ్రమైన విఘాతము ఏర్పడును. ఏలనన ఈ సంపూర్ణ జగత్తునకు మర్యాదాపురుషోత్తముడైన ఆ భగవంతుడే సృష్టి, స్థితి, లయకారకుడు.

ప్రశ్న - 'మనుష్యులు అన్ని విధములుగ నా మార్గమునే అనుసరింతురు.' అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - పెక్కు మంది భగవానుని శక్తిశాలిగను, శ్రేష్ఠునిగను, మర్యాదాపురుషోత్తమునిగను విశ్వసింతురు. ఆ కారణమున వారు భగవానుని అన్ని విధముల యథాశక్తిగా అనుకరింతురు. ఒకవేళ భగవానుడు తన కర్తవ్య కర్మలను సావధానముగ చేయునిచో, లేక వాటిని చులకన భావముతో చూచినచో వారును ఆ మార్గముననే నడతురు. అందువలన వారు స్వార్థమునకును, పరమార్థమునకును దూరమగుదురు. కావున లోకులను కర్మాచరణ మార్గమున నడిపించుటకు భగవానుడు స్వయముగ సావధానముగ కర్మలయందు ప్రవృత్తుడగుచుండును. ఆ విషయమున ఎన్నడును అతడు అశ్రద్ధకు తావీయడు.

**ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।**
**సంకరస్య చ కర్తా స్యామ్ ఉపహన్యామిమాః ప్రజాః ॥ 24 ॥**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| **చేత్,అహమ్** | = | ఒకవేళ నేను | **ఉత్సీదేయుః** | = | కష్టనష్టములపాలగును | **స్యామ్** | = | అగుదును |
| **కర్మ** | = | కర్మను | **చ** | = | మరియు (నేను) | **ఇమాః, ప్రజాః** | = | ఈ ప్రజలందరినీ |
| **న, కుర్యామ్** | = | చేయునిచో | **సంకరస్య** | = | సాంకర్యమునకు | **ఉపహన్యామ్** | = | కష్టముల పాలు చేసిన వాడనగుదును. |
| **ఇమే, లోకాః** | = | ఈ లోకములు | **కర్తా** | = | కర్తను | | | |

**నేను కర్మలను ఆచరించుట మానినచో ఈ లోకములన్నియును నశించును. అంతేగాదు. లోకములందు అల్లకల్లోలములు (సాంకర్యములు) చెలరేగును. ప్రజానష్టము వాటిల్లును. అప్పుడు అందులకు నేనే కారకుడనయ్యెదను. (24)**

ప్రశ్న - పూర్వశ్లోకమున "నేను సావధానుడనై కర్మయందు ప్రవృత్తుడను కానిచో" అని భగవానుడు పలికియే యుండెను. మఱి ఈ శ్లోకమునందును 'నేను కర్మను చేయునిచో' అని మఱల చెప్పుటకు అవసరమేమి? ఇది పునరుక్తి కాదా?

సమా - పూర్వశ్లోకమున భగవానుడు తాను సావధానముగ విధ్యుక్తముగ కర్మలను ఆచరింపనిచో కలుగు హానిని గూర్చి తెలిపినాడు. ఇచట తాను కర్మలను చేయకున్నచో అనగా కర్మలను త్యజించినచో లోకమునకు కలుగు హానిని వివరించుచున్నాడు. ఈ రెండును వేర్వేఱు

విషయములు. కావున ఇందు పునరుక్తిలేదు.

ప్రశ్న - "నేను కర్మలను ఆచరింపనిచో మానవులెల్లరును కష్టనష్టముల పాలగుదురు." అని యనుటలోని అంతర్యమేమి?

సమా - భగవానుడు తన కర్తవ్యకర్మలను త్యజించినచో ఇతరులును శాస్త్రవిహితకర్మలు వ్యర్థములని భావించి వాటిని పరిత్యజించెదరు. రాగద్వేషములకు లోనై ప్రకృతి ప్రవాహమున బడి తమకు ఇష్టము వచ్చినరీతిగా నీచకర్మలకు దిగుదురు. ఒకరిని జూచి మఱియొకరు స్వార్థ పరాయణులును, భ్రష్టాచారులునునై విశృంఖలముగా ప్రవర్తింతురు. అట్టివారు ప్రాపంచిక భోగముల యందు ఆసక్తులై తమ స్వార్థసిద్ధికై ఒకరికొకరు హాని తలపెట్టుచు, అన్యాయముగా, శాస్త్ర విరుద్ధముగా పాపకర్మలను ఆచరింతురు. అందువలన లోకవినాశము జరుగును. ఆ కారణముగ వారి మానవజన్మ భ్రష్టమగుటయు, మరణానంతరము వారికి నీచజన్మల ప్రాప్తియు, నరక ప్రాప్తియు కలుగును.

ప్రశ్న - 'నేను సాంకర్యమునకు కారకుడనగుదును' అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఇచట 'సంకరస్య' అనుపదము అన్ని విధములగు సాంకర్యములను తెలుపును. వర్ణాశ్రమములు, జాతి, సమాజము, స్వభావము, దేశకాలములు, రాష్ట్రము, పరిస్థితులను బట్టి, మనుష్యులందఱికిని వేర్వేఱుగా వారివారి విహిత కర్మలుండును. శాస్త్రవిధులను పరిగణింపక నియమపూర్వకముగ తమ తమ ధర్మములను పాటింపనిచో సామాజిక వ్యవస్థ అస్తవ్యస్తమగును. ధర్మాచరణములు తారుమారగును. ప్రజలు కర్తవ్య కర్మభ్రష్టులగుదురు. క్రమముగా ధర్మమునకు హాని యేర్పడి, మానవత్వమే అడుగంటి పోవును. కనుక భగవంతుడు తన కర్తవ్య కర్మలను విస్మరించినచో ఆయనను ఆదర్శముగా గొని, లోకులుగూడ శాస్త్రీయ కర్మాచరణములను మానివేయుదురు. పరిణామమున ఈ ధర్మనాశనమునకు దారితీయు సాంకర్యమునకు భగవానుడే కారకుడగును.

ప్రశ్న - 'ఈ సమస్త ప్రజల కష్టనష్టములకును నేనే బాధ్యుడనగుదును' అని యనుటలోని విశేషమేమి?

సమా - జనులు కర్తవ్యకర్మభ్రష్టులగుటచే వివిధ రంగములు స్వత్వమును కోల్పోయి, సాంకర్యావస్థకు గురియగును. అందువలన మనుజులు భోగపరాయణులై స్వార్థముతో అంధులై వివిధ రీతులలో పరస్పర వినాశమునకు పాల్పడుదురు. అత్యంత క్షుద్రమైన క్షణికమైన సుఖోప భోగములకై ప్రాకులాడుచు పరస్పరహింసలకు ఏమాత్రమును వెనుకాడరు. ఇట్లు అత్యాచారములు ప్రబలుట వలన క్రొత్తక్రొత్త ప్రకృతి-ఉపద్రవములు గూడ సంభవించు చుండును. ఆ కారణమున సమస్త ప్రాణులకు అవసరమైన అన్నపానాదులు, తదితర జీవన మార్గములు మృగ్యములగును. దశదిశల రోగములు, కఱవు కాటకములు, అనావృష్టి, జలప్రళయములు, అగ్ని ప్రమాదములు, భూకంపములు, ఉల్కాపాతములు మొదలగు ఉత్పాతములు సంభవించును. ఫలితముగ ప్రాణికోటికి నష్టము వాటిల్లును. కనుక భగవానుడు తాను శాస్త్రవిహిత కర్తవ్యకర్మలను త్యజించినచో లోకులలో విచ్చలవిడితనము ప్రబలి ప్రాణికోటి వినాశనమునకు తాను కారకుడు కావలసివచ్చునని తెల్పెను.

*సంబంధము* - కర్మలను శ్రద్ధాదరములతో చేయకుండుట వలనను వాటిని త్యజించుటవలనను కలుగు పరిణామములకు తనను దృష్టాంతముగ చూపుచు మూడు శ్లోకములలో వివరించెను. లోకహితదృష్టితో అందఱును విహితకర్మలను ఆచరింపవలసిన అవసరమును ప్రతిపాదించుచు, జ్ఞానులును కర్మలను ఆచరించుట యుక్తమని వారిని ప్రోత్సహించుచున్నాడు-

**సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।**
**కుర్యాద్విద్వాంస్తథాసక్తః చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ 25 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | కుర్వంతి | = (కర్మలను) ఆచరింతురో | చికీర్షుః | = చేయగోరువాడై |
| కర్మణి, సక్తాః | = కర్మయందు ఆసక్తులైన | అసక్తః | = ఆసక్తిరహితుడైన | తథా | = అట్లే |
| అవిద్వాంసః | = అజ్ఞానులు | విద్వాన్ | = విద్వాంసుడుకూడ | కుర్యాత్ | = (కర్మలను) ఆచరింపవలెను. |
| యథా | = ఎట్లు | లోకసంగ్రహమ్ | = లోకహితమును | | |

**ఓ భారతా! (అర్జునా!) అజ్ఞానులు కర్మలయందు ఆసక్తులై వాటిని ఆచరించినట్లుగా విద్వాంసుడు (జ్ఞాని) కూడా లోకహితార్థమై ఆసక్తిరహితుడై కర్మలను ఆచరింపవలెను. (25)**

ప్రశ్న - ఇచట 'కర్మణి' అనుపదము ఏ కర్మలను గూర్చి తెలుపును?

సమా - తమతమ వర్ణాశ్రమ స్వభావ పరిస్థితుల ననుసరించి చేయబడు శాస్త్ర విహిత కర్తవ్యకర్మలను సూచించునదియే 'కర్మణి' అను పదము. ఏలనన అజ్ఞానులు అట్టి కర్మలలో ప్రవృత్తులగుటకే వారిని భగవానుడు ఆజ్ఞాపించెను. అట్టి కర్మలలో ప్రవృత్తులగుట కొఱకే జ్ఞానులను గూడ ప్రేరేపించెను. కనుక వీటిలో నిషిద్ధకర్మలుగాని, వ్యర్థకర్మలు గాని చేరవు.

ప్రశ్న - 'కర్మణి, సక్తాః' అను పదములతో పాటు ప్రయుక్తమైన 'అవిద్వాంసః' అను పదము ఎట్టి అజ్ఞానులను సూచించును?

సమా - శాస్త్రములయందును, శాస్త్ర విహిత కర్మల యందును, వాటి ఫలములయందును శ్రద్ధాదరములను కలిగియుండి, ఆసక్తితో శాస్త్ర విహిత కర్మలను విధ్యుక్తముగా తమ తమ అర్హతలను అనుసరించి, సకామ కర్మలను అనుష్ఠించు వారిని సూచించునదియే "కర్మణి, సక్తాః" అను పదములతో పాటు ప్రయుక్తమైన 'అవిద్వాంసః' అను పదము - కర్మఫలాసక్తులగుట వలన వీరు సాత్త్విక కర్మయోగుల శ్రేణిలో చేరరు. శాస్త్ర విహిత కర్మలను శ్రద్ధాదరములతో చేయు వారగుటవలన వీరు ఆసురీ, రాక్షసీ, మోహినీ, స్వభావములు గల పాపాత్ములైన తామస జనులలో గూడ చేరరు. కనుక వీరిని సత్త్వగుణ మిశ్రిత రాజసస్వభావముగల వారి శ్రేణిలో చేర్చవచ్చును. వీరిని గూర్చి 2వ అధ్యాయమునందలి 42, 43, 44 శ్లోకములలో 'అవిపశ్చితః' అను పదము ద్వారాను, 7వ అధ్యాయము నందలి 20 నుండి 23వ శ్లోకము వఱకు 'అల్పమేధసాం' అను పదము ద్వారాను, 9వ అధ్యాయమునందలి 20, 21, 23, 24 శ్లోకములయందు 'అన్యదేవతాభక్తాః' అను పదము ద్వారాను వివరింపబడినది.

ప్రశ్న - ఇచట 'యథా-తథా' అను అవ్యయముల ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - తల్లి తన సంతానమునెడగల స్వాభావికమైన ప్రేమాసక్తులతో, అట్లే వారి నుండి భవిష్యత్తులో సేవలనందుకొను ఆశతో హార్దికమైన వాత్సల్య తత్పరతలతో వారి లాలన పాలన ఎట్లుచేయునో అట్లు ఇతరులు చేయరు. అదే విధముగా కర్మలయందును వాటి ఫలరూపములైన భోగముల యందును సహజమైన ఆసక్తి కలిగి, వాటి విధానములను నిర్ణయించు శాస్త్రముల యందు విశ్వాసముగల వారును శ్రద్ధాదరములతో విధ్యుక్తముగ శాస్త్ర విహిత కర్మలను సాంగోపాంగముగ ఎట్లు చేయుదురో, శాస్త్రముల యందు శ్రద్ధాదరములు లేనివారు శాస్త్రవిహిత కర్మలను అట్లు చేయరు. కాని అహంకారము, మమకారము, ఆసక్తి, కోరికలు, సర్వథా త్యజించినప్పటికిని, జ్ఞానులైన మహాత్ములు కేవలము లోకహితము కోరి, కర్మఫలాసక్తులైన మనుష్యుల వలెనే శాస్త్ర విహిత కర్మలను విధి పూర్వకముగ, సాంగోపాంగముగ అనుష్ఠింపవలెను. అని తెల్పుటకే 'యథా - తథా' అను అవ్యయములు ప్రయోగింపబడినవి.

ప్రశ్న - 'విద్వాన్' అను పదమునకు అర్థమును తత్త్వజ్ఞాని అనిగాక, శాస్త్రజ్ఞాని అని భావించినచో దోషమేమి?

సమా - 'విద్వాన్' అను పదముతో పాటు 'అసక్తః' అను విశేషణము గూడ ప్రయోగింపబడినది. కనుక దీని అర్థమును కేవలము శాస్త్రజ్ఞానియని భావించుటకు వీలులేదు. ఏలనన శాస్త్రజ్ఞానమాత్రమున మనుష్యుడు 'ఆసక్తి రహితుడు' అగునని చెప్పుటకు వీలులేదు.

ప్రశ్న - 'లోక సంగ్రహం చికీర్షుః' అను ప్రయోగమును బట్టి జ్ఞానికిని కోరికలుండునట్లు తెలియుచున్నది. ఇది వాస్తవమా?

సమా - ఔను ఇది వాస్తవమే. ఇది అత్యంత విలక్షణమైనది. సర్వథా ఇచ్ఛారహితుడైన పురుషుని యందు ఉండు ఇచ్ఛారూపము ఇట్టిదియని చెప్పుటకు వీలులేదు. వీనియందలి కోరిక సామాన్య మానవులను కర్మతత్పరులనుగా చేయుటకు స్ఫూర్తి నిచ్చునట్టిది మాత్రమే. ఇట్టి ఇచ్ఛ పరమాత్ముని యందును ఉండును. వాస్తవముగ ఇది ఇచ్ఛయేగాదు. తనను చూచి ఇతరులును తమ

కర్తవ్యకర్మలను త్యజింపకుండుటకును, త్యజించి కష్టనష్టములపాలు కాకుండుటకును జ్ఞాని ద్వారా కేవలము లోకహితార్థమే క్రియలు ఆచరింపబడును. ఇది తప్ప అతని కర్మాచరణమునకు మఱి ఏ ఉద్దేశ్యమును ఉండదు. ఈ భావమును స్పష్టపఱచుటకే 'లోకసంగ్రహం చికీర్షుః' అని ప్రయోగించుట జరిగినది.

**న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్ ।**
**జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ ॥ 26 ॥**

యుక్తః = పరమాత్మ స్వరూపమునందు నిశ్చలముగా ఉండునట్టి
విద్వాన్ = జ్ఞాని
కర్మసంగినామ్ = శాస్త్రోక్త కర్మలయందు ఆసక్తులైన
అజ్ఞానామ్ = అజ్ఞానులకు
బుద్ధిభేదమ్ = బుద్ధియందు భ్రమను (కర్మలయందు అశ్రద్ధను)
న, జనయేత్ = కల్గింపరాదు
సర్వకర్మాణి = (స్వయముగా) విహిత కర్మలను అన్నింటిని
సమాచరన్ = చక్కగా ఆచరించుచు
జోషయేత్ = (వారిచే గూడ అట్లే) ఆచరింపజేయవలెను

పరమాత్మస్వరూపమునందు నిశ్చలస్థితిని పొందిన జ్ఞాని శాస్త్రవిహిత కర్మలను ఆసక్తితో (ఫలాసక్తితో) ఆచరించు అజ్ఞానులబుద్ధులను భ్రమకు లోనుచేయరాదు. అనగా కర్మలయందు వారికి అశ్రద్ధను కలిగింపరాదు. పైగా తానుకూడ శాస్త్రవిహితములైన సమస్తకర్మలను చక్కగా చేయుచు వారిలోగూడ అట్లే చేయింపవలెను. **(26)**

ప్రశ్న - 'యుక్తః' అను విశేషణముతోపాటు ప్రయుక్తమైన 'విద్వాన్' అను పదము ఎవరిని సూచించును?

సమా - పరమాత్మ స్వరూపమునందు నిశ్చలస్థితి గలిగి, (ఫలమునందు) ఆసక్తిరహితుడైన తత్త్వజ్ఞానిని సూచించునదియే 'యుక్తః' అను విశేషణముతోపాటు ప్రయుక్తమైన 'విద్వాన్' అనుపదము. ఈ విద్వాంసుని విషయమును గూర్చి పూర్వశ్లోకమున కొంత ప్రస్తావింపబడినది.

ప్రశ్న - "శాస్త్ర విహిత కర్మలయందు ఆసక్తిగల అజ్ఞానుల బుద్ధులలో భ్రమను ఉత్పన్నము చేయకూడదు" అని యనుటలోని అంతర్యమేమి? ఇట్టి వారికి తత్త్వజ్ఞానమును గూర్చి గాని, కర్మయోగమునుగూర్చిగాని ఉపదేశము చేయరాదా?

సమా - బుద్ధియందు సందేహమునుగాని, ఊగిసలాటను గాని కలిగింపజేయుటనే బుద్ధిని భ్రమింపజేయుటయుని యందురు. కర్మ విధాయక శాస్త్రములయందును, కర్మలయందును, కర్మఫల రూపభోగముల యందును ఆస్తికబుద్ధి కలిగిన కర్మాసక్త మనుష్యుల బుద్ధులను చలింపజేసి, వారి మనస్సుల యందు కర్మలయెడను, శాస్త్రములయెడను అశ్రద్ధను ఉత్పన్నము చేయుటయే వారి బుద్ధిని భ్రమింపజేయుట యగును. అట్టివారికి నిష్కామకర్మను గూర్చియు, తత్త్వజ్ఞానమును గూర్చియు ఉపదేశము చేయునమయమున అతని ఆచారవ్యవహారముల, ఉపదేశముల ప్రభావమున ఇతరుల అంతఃకరణములయందు కర్తవ్య కర్మలయెడ, శాస్త్రాదులయెడ ఏవిధమైన అశ్రద్ధయు, లేక సందేహము ఉత్పన్నము కాకుండ జ్ఞానియైనవాడు తగు జాగ్రత్త వహింపవలెను. ఏలనన శ్రద్ధతో, సకామభావముతో అనుష్ఠించు కొద్దిపాటి శాస్త్రవిహిత కర్మలనుగూడ జ్ఞానము, నిష్కామభావము అను పేరుతో త్యజించుటకు అవకాశము ఏర్పడును. ఫలితముగా ఉన్నతి కలుగదు సరిగదా! వర్తమాన స్థితినుండియు పతనము సంభవించును. అజ్ఞానులకు తత్త్వజ్ఞానమును గూర్చిగాని, నిష్కామతత్త్వమును గూర్చిగాని, ఉపదేశము చేయగూడదని భగవానుని అభిప్రాయముకాదు. తత్త్వజ్ఞాన ప్రాప్తికి ముందుగాని, తరువాత గాని కర్మాచరణము అనవసరము అనుభావము అజ్ఞానుల మనస్సులయందు కలుగనీయరాదు. ఫలేచ్ఛయే లేనప్పుడు కర్మల నాచరింపవలసిన అవసరమేముండును? అను సందేహము గూడ వారి మనస్సులకు రానీయరాదు. ఫలాసక్తితో, సకామ భావముతో కర్మలు చేయుటవలన కలుగు స్వర్గప్రాప్తియే అత్యుత్తమ పురుషార్థమనియు, అంతకు మించి, ఎట్టి కర్తవ్యమూ మనుష్యునకు లేదనియు అనుభ్రమ వారిలో

మిగులనీయరాదు. తమ ఆచరణములద్వారా, ఉపదేశముల ద్వారా వారి అంతఃకరణములయందుగల ఆసక్తులను కోరికలను తొలగించుచు ఎప్పటివలెనే శ్రద్ధతో కర్మను చేయుటకు జ్ఞానులు వారిని ప్రోత్సహింపవలెను.

ప్రశ్న - కర్మాసక్తులైన అజ్ఞానులు మొదటి నుండియు కర్మలయందు నిమగ్నులయియే యుందురుగదా! మఱి విద్వాంసుడు స్వయముగా కర్మలను చక్కగా ఆచరించుచు వారితో అదే విధముగా చేయింపవలెననియుమటలోని అంతరార్థమేమి?

సమా - అజ్ఞానులైనవారు కర్మలయందు శ్రద్ధతో నిమగ్నులగుదురను మాట సత్యమే. కాని తత్త్వజ్ఞానమును గూర్చియు, ఫలాసక్తిత్యాగములను గూర్చియు తెల్పినప్పుడు ఆ విషయముల ఆంతర్యమును సరిగా గ్రహింపని కారణమున తత్త్వజ్ఞాన ప్రాప్తికిగాని, ఫలాసక్తి త్యాగమునకు గాని, కర్మలు చేయనవసరము లేదను భ్రమకు లోనగుదురు. కర్మాచరణ ప్రాముఖ్యమును తక్కువగా భావింతురు. అందువలన క్రమక్రమముగ కర్మలను త్యజించుటకే వారు అలవాటుపడుదురు. కడకు మోహవశమున వారు విహితకర్మలనుగూడ త్యజించి, ప్రమాదాలస్యములకు లోనగుదురు. కనుక జ్ఞాని అనాసక్తభావముతో కర్మలను సాంగోపాంగముగ స్వయముగ ఆచరించి, అందఱికిని ఆదర్శప్రాయుడు కావలెను. అకారణముగ ఇతరులు విహితకర్మలయందు ఎన్నడును అశ్రద్ధను, అరుచిని చూపక నిష్కామభావముతో కర్తృత్వాభిమాన రహితులై కర్మలను విధ్యుక్తముగా ఆచరించుచు తమ మానవజన్మను సఫలమొనర్చుకొందురు.

*సంబంధము - ఇంతవఱకును జ్ఞాని లోకహితార్థమై శాస్త్ర విహితకర్మలను చేయవలయునని భగవానుడు రెండు శ్లోకములలో చెప్పి యుండెను. ఇక కర్మాసక్తులైన జనులతో పోల్చినప్పుడు సాంఖ్యయోగియొక్క వైలక్షణ్యమును రెండు శ్లోకములలో ప్రతిపాదించుచున్నాడు-*

**ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।**
**అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే ॥ 27 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మాణి | = కర్మలన్నియును | క్రియమాణాని | = చేయబడుచుండును | అహం, కర్తా, ఇతి | = 'నేనే కర్తను' అని |
| సర్వశః | = అన్నివిధముల | అహంకార విమూఢాత్మా | = అంతఃకరణమునందు అహంకార మోహితుడైన అజ్ఞాని | మన్యతే | = తలంచును. |
| ప్రకృతేః, గుణైః | = ప్రకృతి గుణములద్వారా | | | | |

**వాస్తవముగా కర్మలన్నియును అన్నివిధముల ప్రకృతిగుణములద్వారానే చేయబడుచుండును. అహంకార విమూఢాత్ముడు (అహంకారముచే మోహితమైన అంతఃకరణముగల అజ్ఞాని) 'ఈ కర్మలకు నేనే కర్తను' అని భావించును. (27)**

ప్రశ్న - కర్మలన్నియును అన్ని విధముల ప్రకృతి గుణముల ద్వారానే చేయబడుచూ ఉండును - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ప్రకృతి నుండి ఉత్పన్నములైన సత్త్వ రజస్తమో గుణములే బుద్ధి, అహంకారము, మనస్సు, ఆకాశాది పంచసూక్ష్మ మహాభూతములు, శ్రోత్రాది దశేంద్రియములు, శబ్దాది పంచవిషయములు, అను 23 తత్త్వరూపములుగా పరిణతి చెందినవి. ఇవి యన్నియును ప్రకృతి యొక్క గుణములు. వీటి వలన అంతఃకరణము, మఱియు ఇంద్రియములు విషయములను (ఇంద్రియార్థములను) గ్రహించును. అనగా బుద్ధి విషయ విశ్లేషణకును, నిశ్చయమునకును తోడ్పడును. మనస్సు మననము చేయును. చెవి శబ్దమును, చర్మము స్పర్శను, కనులు రూపమును, నాలుక రుచిని, ముక్కు వాసనను గ్రహించును. వాక్కు శబ్దోచ్చారణమును, చేతులు వస్తుగ్రహణాదికమును, కాళ్ళు గమనమును, గుదోపస్థలు మలమూత్ర విసర్జనములను చేయుచుండును. కావున ప్రపంచమున క్రియలన్నియును అన్నివిధములుగ గుణముల ద్వారా

చేయబడుచున్నవి. నిర్గుణ నిరాకార - ఆత్మకు నిజముగా వాటితో ఎట్టి సంబంధమూ లేదు.

ప్రశ్న - 'అహంకార విమూఢాత్మా' అను సమాసము ఎట్టి వానిని గూర్చి తెలుపును?

సమా - ప్రకృతి కార్యరూపములైన బుద్ధి, అహంకారము, మనస్సు, మహాభూతములు, ఇంద్రియములు, విషయములు (తన్మాత్రలు) అను 23 తత్త్వముల సంఘాతరూపమైన శరీరమే నేను అను దృఢమైన ఆత్మభావమునే 'అహంకారము' అని యందురు. అజ్ఞానియొక్క అంతఃకరణము అనాది సిద్ధమైన ఈ అహంకార సంబంధ ప్రభావముచే మిక్కిలి మోహితమగుచుండును. వివేకశక్తి లుప్తమైపోవును. ఈ కారణమున ఆత్మ - అనాత్మ వస్తు వివేచనను సరిగా చేయజాలడు. తనను శరీరముకంటె భిన్నమైన (వేఱైన) శుద్ధ - ఆత్మగా లేక పరమాత్మయొక్క సనాతనమైన అంశగా తెలిసికొనజాలడు. ఇట్టి అజ్ఞానియైన మనుష్యుని తెలుపునదియే ఇచటి 'అహంకార విమూఢాత్మా' అను సమాసము - అంతేగాని ఆసక్తిరహితుడై, వివేకశీలుడై కర్మయోగ సాధనచేయు సాధకుని 'అహంకార విమూఢాత్మా' అని తెలుపదు. ఏలనన అతని అంతఃకరణము అహంకారముచే మోహితము కాలేదు - పైగా అతడు అహంకారమును నశింపజేయు ప్రయత్నములోనే యున్నాడు.

ప్రశ్న - పైన పేర్కొనబడిన 'అజ్ఞాని' 'నేనే కర్తను' అని భావించుటలోని విశేషమేమి?

సమా - వాస్తవముగా ఆత్మకు కర్మలకు సంబంధము లేకున్నను అజ్ఞాని ఈ 23 తత్త్వముల సంఘాతమునందు ఆత్మాభిమానముగలిగి, వాటిద్వారా చేయబడు కర్మలతో తనకు సంబంధమేర్పఱచుకొని ఆ కర్మలకు తననే కర్తగా భావించుకొనును. అనగా, 'నిశ్చయించువాడను, సంకల్పించు వాడను నేనే. వినుట, చూచుట, తినుట, త్రాగుట, నిద్రించుట, నడచుట మొదలగు క్రియలన్నియును చేయువాడను నేనే' అని భావించును. అందువలన అతనికి కర్మలతో బంధమేర్పడును. ఆ కర్మఫలములను అనుభవించుటకై అతడు మాటిమాటికి జన్మమృత్యురూప సంసార చక్రమునందు పరిభ్రమింపవలసి వచ్చును.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ 28 ॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తు | = అయితే | తత్త్వవిత్ | = | తత్త్వమునెఱింగిన జ్ఞానయోగి | వర్తంతే | = | ప్రవర్తిల్లును |
| మహాబాహో! | = ఓ మహాబాహూ! | | | | ఇతి, మత్వా | = | అనితలంచి |
| గుణకర్మ విభాగయోః | = గుణవిభాగ, కర్మ విభాగములయొక్క | గుణాః | = | గుణములన్నియును | న, సజ్జతే | = | ఆసక్తుడుకాడు. |
| | | గుణేషు | = | గుణములయందే | | | |

**కాని, ఓ మహాబాహూ! (అర్జునా!) గుణవిభాగతత్త్వమును, కర్మవిభాగ తత్త్వమును తెలిసికొన్న జ్ఞానయోగి గుణములే గుణములయందు ప్రవర్తిల్లుచున్నవని భావించి, వాటియందు ఆసక్తుడు కాడు. (28)**

ప్రశ్న - 'తు' అను అవ్యయప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - 27వ శ్లోకమున వర్ణింపబడిన అజ్ఞాని యొక్క స్థితికిని, జ్ఞానయోగి యొక్క స్థితికిని మిక్కిలి అంతరము గలదు. దీనిని వివరించుటకే 'తు' అను అవ్యయ ప్రయోగము చేయబడినది.

ప్రశ్న - 'గుణవిభాగము' 'కర్మవిభాగము' అనగానేమి? ఈ రెండింటి తత్త్వములను తెలిసికొనుటయనగా నేమి?

సమా - పూర్వశ్లోకమున ప్రస్తావింపబడిన సత్త్వరజస్తమో గుణముల కార్యరూపములైన 23 తత్త్వముల యొక్క సముదాయమునే గుణ విభాగమని యందురు. అంతః కరణమునందలి సాత్త్విక, రాజస, తామస భావముల సంబంధముచే కర్మలు గూడ సాత్త్విక, రాజస, తామసములు అను మూడు భేదములతో గుర్తింపబడును. ఆయా కర్మల సంబంధము ననుసరించి, మనుష్యులు గూడ సాత్త్విక, రాజస, తామస భేదములతో గుర్తింపబడుదురు. ఈ గుణవృత్తులు

గూడ గుణ విభాగములో అంతర్గతములే. పైన పేర్కొనబడిన గుణ విభాగము ద్వారా వేర్వేఱు క్రియలు చేయబడు చుండును. వీటి వివరణము పూర్వశ్లోక వ్యాఖ్యయందు కావింపబడినది. ఈ క్రియలయందు కర్తృత్వాభిమానము, ఆసక్తి ఉండుటచే మనుష్యుడు బంధములలో చిక్కుకొనును. ఈ సమస్త క్రియాసమూహామునే కర్మవిభాగము అందురు. ఈ గుణకర్మ విభాగములన్నియును ప్రకృతియొక్క విస్తృతి రూపములే. కనుక ఇవి యన్నియును జడములు, క్షణికములు, నశ్వరములు, వికారశీలములు, మాయామయములు. స్వప్నసదృశములై లేకున్ననూ ప్రతీతమగును. ఈ గుణకర్మ విభాగముల కంటె సర్వథా వేఱైనదగు ఆత్మకు వీటితో ఏ మాత్రము సంబంధమూ లేదు. ఆత్మ సర్వథా నిర్గుణమూ, నిరాకారమూ, నిర్వికారమూ, నిత్యశుద్ధమూ, ముక్తమూ, జ్ఞాన స్వరూపమూ అని ఈ తత్త్వమును చక్కగా ఎఱుంగుటయే గుణకర్మ విభాగతత్త్వమును చక్కగా ఎఱుంగుట యగును.

ప్రశ్న - గుణకర్మ విభాగతత్త్వముల నెఱింగిన జ్ఞానయోగి, సమస్తగుణములే గుణములయందు వర్తిల్లుచున్నవని తెలిసికొని, వాటియందు ఆసక్తుడు కాడు - అను ఈ వాక్యముల అంతరార్థమేమి?

సమా - ఈ గుణకర్మవిభాగతత్త్వముల నెఱింగిన సాంఖ్యయోగి శరీరమనోబుద్ధీంద్రియాదుల ద్వారా జరుగు ప్రతి క్రియయందును గుణముల కార్యరూపములైన మనోబుద్ధీంద్రియాదులు అనెడికరణములే గుణముల కార్యరూపములైన తమతమ విషయముల యందు వర్తించుచున్నవనియు, వీటితో తనకు ఎట్టి సంబంధమూ లేదనియు భావించును. అందువలన అతడు ఏ కర్మమునందును, లేక కర్మఫలరూప భోగమునందును ఆసక్తుడు కాడు. అనగా ఏ కర్మతోగాని, దాని ఫలముతోగాని తనకు ఏ విధమైన సంబంధమూ ఉన్నట్లు భావింపడు. అవి యన్నియును అనిత్యములు, జడములు, వికారశీలములు, నశ్వరములనియు, తాను సదా నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, నిర్వికారుడు, అకర్త, అసంగుడు అనియు భావించును. 5వ అధ్యాయమునందలి 8,9 శ్లోకములలోను, 14వ అధ్యాయము నందలి 19వ శ్లోకమునందును ఈ విషయమే తెలుపబడినది.

*సంబంధము - కర్మాసక్తులైన మనుష్యులకు సాంఖ్యయోగికి మధ్యగల అంతరమును తెల్పిన పిమ్మట ఇప్పుడు ఆత్మతత్త్వమును పూర్తిగా ఎఱింగిన మహాత్ములు కర్మాసక్తులైన అజ్ఞానులను చలింపజేయరాదని (భ్రమింపజేయరాదని) సూచించుచున్నాడు-*

ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥ 29 ॥

ప్రకృతేః = ప్రకృతియొక్క
గుణసమ్మూఢాః = గుణములచే మోహితులైన వారు
గుణకర్మసు = గుణములయందును, కర్మలయందును
సజ్జంతే = ఆసక్తులైయుందురు
తాన్ = అట్టి
అకృత్స్నవిదః = మిడిమిడి జ్ఞానముగల
మందాన్ = మందబుద్ధులను
కృత్స్నవిత్ = సంపూర్ణజ్ఞాని
న, విచాలయేత్= భ్రమకు గురి చేయరాదు.

**ప్రకృతిగుణములచే పూర్తిగా మోహితులైన మనుష్యులు ఆ గుణముల యందును, కర్మలయందును మిక్కిలి ఆసక్తులగుదురు. అట్టి మిడిమిడిజ్ఞానముగల మందబుద్ధులైన అజ్ఞానులను పూర్తిగా తెలిసిన జ్ఞానియైనవాడు భ్రమకు (ఊగిసలాటకు) గురిచేయరాదు. (29)**

ప్రశ్న - 'ప్రకృతేః గుణసమ్మూఢాః' అను విశేషణము ఏ శ్రేణి మనుష్యులను సూచించును? వారు గుణముల యందును, కర్మలయందును ఆసక్తులగుదురు - అని యనుటలోని విశేషమేమి?

సమా - ఇహపరలోక భోగములయందలి వాంఛలతో శ్రద్ధాసక్తులు గలిగి కర్మలయందు నిమగ్నులగు సత్త్వమిశ్రిత రజోగుణులు, సకాములు, కర్మఠులు ఐన మనుష్యులను సూచించునదియే 'ప్రకృతేః గుణసంమూఢాః' అను పదము. 25, 26 శ్లోకముల యందు తెలుపబడిన కర్మాసక్తులైన అజ్ఞానులు వీరే. పరమాత్మ ప్రాప్తికై సాధన చేయు

శుద్ధసాత్త్వికులు ప్రకృతి గుణములతో మోహితులు కారు. నిషిద్ధ కర్మలనాచరించు తామసులకు శాస్త్రముల యందు శ్రద్ధాదరములు లేనికారణమున వారికి విహిత కర్మలయందు విశ్వాసమూ ఉండదు. పైగా అట్టి కర్మలను ఆచరింపరు గూడ. కనుక అట్టి తామస స్వభావులను కర్మలనుండి చలింపజేయు ప్రశ్నయే ఉదయింపదు. కాని వారికి శాస్త్రములయందు విశ్వాసము కలిగించి, వారు నిషిద్ధ కర్మలను మానునట్లును, విహిత కర్మలను ఆచరించునట్లును చేయవలెను.

గుణములచే మోహితులగుటవలన గుణముల యందును, కర్మలయందును ఆసక్తులగు సకాములైన వారికి ప్రకృతికి అతీతమైన సుఖమును గూర్చి ఏ మాత్రమూ తెలియదు. వారు ప్రాపంచిక భోగములే మిక్కిలి సుఖదాయకములని భావింతురు. కనుక వారు గుణముల కార్యరూపములైన భోగములయందును, అట్టి భోగప్రాప్తికి ఉపాయములైన కర్మలయందును నిమగ్నులగుదురు. అట్టి వారు గుణబంధములనుండి విముక్తులగుటకు వాంఛింపరు. ప్రయత్నింపరు గూడ.

ప్రశ్న - 'తాన్' అను పదముతోపాటు 'అకృత్స్నవిదః' 'మందాన్' అను విశేషణముల అర్థమేమి?

సమా - పైన పేర్కొనబడిన సకామ పురుషులు యథార్థ తత్త్వమును ఎఱుంగకున్నను శాస్త్రోక్తకర్మల యందును వాటి ఫలముల యందును శ్రద్ధాదరములను కలిగియుండుటచే ఏదో యొక అంశమును మాత్రము ఎఱిగియే యుందురు. కనుక వారు అధర్మమును ధర్మముగను, ధర్మమును అధర్మముగను భావించి యథేచ్ఛగా ప్రవర్తించు తామసుల కంటెను కొంత శ్రేష్ఠులు. వారు సర్వథా (పూర్తిగా) బుద్ధిహీనులు కారు. మందబుద్ధులు మాత్రమే. కావున వారి కర్మఫలము పరమాత్మ ప్రాప్తిగాక నశ్వరమైన భోగప్రాప్తియే అగును.

ప్రశ్న - 'కృత్స్నవిత్' అను పదము ఎవరిని సూచించును? వారు ఆ అజ్ఞానులను చలింపజేయరాదు - అని యనుటలోని విశేషమేమి?

సమా - పూర్వోక్తమైన గుణకర్మ విభాగ తత్త్వములను పూర్తిగా తెలిసికొని, పరమాత్మ స్వరూపము యొక్క యథార్థజ్ఞానమును సమగ్రముగా పొందిన జ్ఞానులైన మహాత్ములను సూచించునదియే - 'కృత్స్నవిత్' అను పదము. వీరు 'అజ్ఞానులను చలింపజేయరాదు' అనగా కర్మాసక్తులైన సకామపురుషులకు "కర్మలత్యంత శ్రమతో గూడినవి. అవి బంధహేతువులు. వ్యర్థములు. జగత్తు మిథ్యయే." అను ఉపదేశముల ద్వారా శాస్త్రవిహితకర్మల నుండి వారు తొలగునట్లుగాని, వాటియందు వారి శ్రద్ధాదరములు తక్కువ యగునట్లుగాని చేయుట సముచితముగాదు. ఏలనన అట్లు చేయుటవలన వారికి పతనము సంభవించును. కనుక శాస్త్రవిహితకర్మల యందును, వాటి విధానములను నిర్ణయించు శాస్త్రములయందును, వాటి ఫలములయందును జనుల విశ్వాసములను పదిలపఱచుచునే వారికి యథార్థ తత్త్వమును బోధింపవలెను. దానితోపాటు వారు మమతాసక్తులను, ఫలేచ్ఛను త్యజించి, శ్రద్ధా ధైర్యోత్సాహములతో సాత్త్విక కర్మలను (18/23) లేక సాత్త్విక త్యాగము (18/9) చేయు రీతిని తెలుపవలెను. దాని వలన వారు అనాయాసముగా ఆతత్త్వమును చక్కగా గ్రహింపగలరు.

**సంబంధము** - అర్జునుడు తనకు శ్రేయస్కరమైన మార్గమును తెలుపుమని భగవానుని ప్రార్థించెను. అతని ప్రార్థనను అనుసరించి, "మనుష్యుడు ఏ స్థితిలోనున్నను తన వర్ణాశ్రమ స్వభావపరిస్థితులకు అనుగుణముగా విహితకర్మలను చేయుచునేయుండవలెనని" భగవానుడు అతనికి తెలిపెను. ఈ విషయమునే పూర్వశ్లోకములయందు క్రమముగా ఈ విధముగా వివరించెను.

1) కర్మలనాచరింపక 'నైష్కర్మ్య సిద్ధి'రూప కర్మనిష్ఠ లభింపదు. (3/4)

2) కర్మలను త్యజించినంత మాత్రమున 'జ్ఞాననిష్ఠ' సిద్ధింపదు. (3/4)

3) క్షణమాత్రమైనను మనుష్యుడు కర్మలను చేయకుండ ఏ విధముగానూ ఉండలేడు. (3/5)

4) బాహ్యముగ కర్మలను త్యజించి, మనస్సుతో విషయచింతన చేయుచుండుట మిథ్యాచారము. (3/6)

5) మనస్సును, ఇంద్రియములను వశపఱచుకొని నిష్కామభావముతో కర్మలను ఆచరించువాడు శ్రేష్ఠుడు. (3/7)

6) కర్మలను చేయకుండుటకంటె చేయుటయే శ్రేష్ఠము. (3/8)

7) కర్మలను ఆచరింపకుండ శరీరనిర్వహణము కూడ జరుగదు. (3/8)

8) యజ్ఞార్థము ఆచరింపబడు కర్మలు బంధకారకములుగావు. పైగా అవి ముక్తిదాయకములు. (3/9)

9) కర్మ చేసితీరవలెనని ప్రజాపతి మానవులను ఆజ్ఞాపించెను. నిస్స్వార్థభావముతో దానిని పాటించుట వలన శ్రేయస్సు కల్గును. (3/10, 11)

10) కర్తవ్యకర్మలను ఆచరింపకుండ భోగములను అనుభవించువాడు దొంగ. (3/12)

11) కర్తవ్యకర్మలను ఆచరించి, యజ్ఞశేషముతో శరీరనిర్వహణకై భోజనాదికములను చేయువాడు అన్ని పాపములనుండి ముక్తుడగును. (3/13)

12) యజ్ఞాదికములను ఆచరింపక కేవలము స్వశరీరపోషణమునకై ఆహారపదార్థములను వండుకొనువాడు పాపి (3/13)

13) కర్తవ్యకర్మలను త్యజించి, సృష్టిచక్రమునకు విఘాతము కల్గించు మనుష్యుని జీవితము వ్యర్థము. పాపమయము. (3/16)

14) అనాసక్తభావముతో కర్మలను ఆచరించుటవలన పరమాత్మప్రాప్తి కల్గును. (3/19)

15) పూర్వకాలమున జనకాదులు కూడ కర్మలను ఆచరించియే సిద్ధిని పొందిరి. (3/20)

16) శ్రేష్ఠుడైన వానిని ఇతరులు అనుకరింతురు గావున అతడు తప్పక కర్మలను ఆచరింపవలెను. (3/21)

17) భగవానునకు ఎట్టి కర్తవ్యకర్మలూ ఉండవు. ఐనను అతడు లోకహితార్థమై కర్మలను ఆచరించును. (3/22)

18) జ్ఞానికిని ఎట్టి కర్తవ్యము ఉండదు. ఐనను అతడు లోకసంగ్రహమునకై కర్మలను ఆచరింపవలెను. (3/25)

19) జ్ఞాని తన విహితకర్మలను స్వయముగా త్యజించిగాని, కర్మలను త్యజింపుమని ఇతరులకు ఉపదేశించిగాని, వారిని కర్తవ్యకర్మలకు విముఖులుగా చేయరాదు. పైగా తాను స్వయముగ ఆచరించి, ఇతరులచే చేయింపవలెను. (3/26)

20) జ్ఞానియైన మహాత్ముడు కర్మాసక్తులైన వారికి శాస్త్రవిహితకర్మలను ఆచరణాత్మకముగ (స్వరూపతః) త్యజింపుమని ఉపదేశింపరాదు. అట్లు ఉపదేశించినచో వారిని కర్మాచరణములనుండి చలింప జేసినవాడగును. (3/29)

*భగవానుడు ఈ విధముగా కర్మాచరణముయొక్క అవశ్యకర్తవ్యతను ప్రతిపాదించి, అర్జునుడు (2వ శ్లోకమున) చేసిన ప్రార్థనను అనుసరించి, అతనికి పరమ శ్రేయస్కరమైన ఏకైక సర్వశ్రేష్ఠమైన నిశ్చితసాధనను తెలుపుచు యుద్ధమును చేయుమని ఆజ్ఞాపించుచున్నాడు-*

**మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।**
**నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అధ్యాత్మచేతసా | = అంతర్యామినైన నాయందులగ్నమైన మనస్సుద్వారా | మయి | = నాయందు | విగతజ్వరః | = సంతాపరహితుడవు |
| సర్వాణి, కర్మాణి | = సమస్తకర్మలను | సన్న్యస్య | = సమర్పించి | భూత్వా | = అయి |
| | | నిరాశీః | = ఆశారహితుడవు | యుధ్యస్వ | = యుద్ధమొనర్పుము. |
| | | నిర్మమః | = మమతారహితుడవు | | |

అంతర్యామిని, పరమాత్మను ఐన నాయందే నీ చిత్తమును ఉంచి, కర్మలనన్నింటినీ నాకే అర్పించి, ఆశా మమతా సంతాపములను వీడి, యుద్ధము చేయుము. (30)

ప్రశ్న - 'అధ్యాత్మచేతసా' అను సమాసమున 'చేతస్' అను శబ్దము ఎట్టి చిత్తమును తెలుపును. దాని ద్వారా సమస్తకర్మలను భగవంతునియందు అర్పణచేయుట యనగానేమి?

సమా - సర్వాంతర్యామియైన పరమేశ్వరుని యొక్క గుణ ప్రభావ స్వరూపములను తెలిసికొని, వాటిపై విశ్వాసముంచి, నిరంతరము సర్వత్ర వాటి చింతనచేయు చిత్తమును సూచించునదియే ఇచటి 'చేతస్' అను శబ్దము. ఈ విధమైన చిత్తము ద్వారా భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు, సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు అట్లే పరమప్రాప్యుడు, పరమగతి, పరమహితైషి, పరమప్రియుడు, పరమసుహృదుడు, పరమదయాళువు అని భావింపవలెను. తన అంతఃకరణమును, ఇంద్రియ సహితమైన శరీరమును, వాటి ద్వారా చేయబడు కర్మలను, జగత్తునందలి సమస్త పదార్థములను భగవంతునివేయని తెలిసికొని, వాటియందలి మమతాసక్తులను సర్వథా త్యజింపవలెను. "దేనిని చేయుటకును నాలో శక్తిలేదు. భగవంతుడే అన్ని విధములుగా శక్తిని ప్రసాదించి, నా ద్వారా తన యిచ్ఛానుసారము యథా యోగ్యముగ సమస్త కర్మలను చేయించుచున్నాడు. నేను కేవలము నిమిత్త మాత్రుడను." అని భావించుచు సర్వథా భగవంతునకు అధీనుడై భగవదాజ్ఞానుసారము అతని కొఱకై, అతని ప్రేరణతో అతడు చేయించినట్లు సమస్త కర్మలను ఆటబొమ్మవలె చేయుచుండవలెను. ఆ కర్మలతోగాని, వాటి ఫలములతోగాని, ఏ విధముగను మానసికముగా సంబంధముంచుకొనక, అంతయు భగవంతునిదే యని భావింపవలెను. అధ్యాత్మచిత్తముతో సమస్తకర్మలను భగవంతునకు సమర్పణ చేయుట యనగా ఇదియే. ఈ విధముగా భగవంతునియందే సమస్త కర్మలను సమర్పణ చేయు విషయము 12వ అధ్యాయమున 6వ శ్లోకమునందును, 18వ అధ్యాయమున 57, 66వ శ్లోకములందును ప్రస్తావింపబడినది.

ప్రశ్న - పై విధముగ సమస్త కర్మలను భగవంతుని యందే సమర్పణ చేయుట వలన ఆశ, మమత, సంతాపములు తమంతట తామే తొలగిపోవును. అయితే ఇచట ఆశా, మమతా, సంతాప రహితుడవై యుద్ధము చేయుమని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - అధ్యాత్మ చిత్తముతో భగవంతునియందే సమస్త కర్మలను సమర్పణ చేయుట వలన ఆశామమతా సంతాపములు తొలగిపోవును. ఈ విషయమును స్పష్టపఱచుటకే భగవానుడు అర్జునుని ఆశామమతాసంతాప రహితుడవై యుద్ధమొనర్పుమని పల్కెను. సమస్త కర్మల భారమును తనపై ఉంచి అన్ని విధములుగా ఆశా మమతలు, రాగద్వేషములు, హర్షశోకాది వికారములు లేనివాడవై తన ఆజ్ఞననుసరించి యుద్ధమొనర్పుమని ఆదేశించెను. కర్మలు చేయునపుడుగాని, వాటి ఫలములను అనుభవించునప్పుడు గాని, సాధకునకు ఆ కర్మలయందును, కర్మఫలరూపభోగముల యందును, మమతాసక్తులు కోరికలు ఉన్నను లేక అతని అంతఃకరణమునందు రాగద్వేషహర్షశోకాది వికారములున్నను అతని సమస్త కర్మలు భగవదర్పణము కాలేదనియే భావింపవలెను.

సంబంధము - అర్జునునకు శ్రేయస్కరమైన నిశ్చితసాధనమును తెలుపుచు యుద్ధమును చేయుమని ఆజ్ఞాపించి, ఆ మార్గమును అనుసరించుటవలన కలుగు ఫలమును తెలుపుచున్నాడు-

**యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః ।**
**శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః ॥ 31 ॥**

| | | | |
|---|---|---|---|
| యే, మానవాః = ఏ మనుష్యులు | మే, ఇదమ్, మతమ్ = నా, ఈ మతమును | అనుతిష్ఠంతి = అనుసరింతురో | |
| అనసూయంతః = దోషదృష్టిలేనివారై | నిత్యమ్ = సర్వదా | తే, అపి = వారును | |
| శ్రద్ధావంతః = శ్రద్ధగలవారై | | కర్మభిః = కర్మలనుండి | |
| | | ముచ్యంతే = ముక్తులయ్యెదరు. | |

**దోషదృష్టి లేకుండ శ్రద్ధాయుక్తులై నా ఈ మతమును అనుసరించు మానవులు గూడ సమస్త కర్మబంధములనుండి ముక్తులయ్యెదరు. (31)**

ప్రశ్న - ఇక్కడ 'యే' అను పదముతోపాటు 'మానవాః' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ సాధన ఒక జాతికి, ఒక వ్యక్తికి పరిమితమైనది కాదు. సమస్త మానవాళికిని దీనిని ఆచరించు అధికారము గలదు. వివిధ వర్ణాశ్రమములవారును, వివిధ జాతులవారును, సమాజములవారును తమతమ కర్తవ్య కర్మలను పైన పేర్కొనబడిన విధముగా భగవంతునకు సమర్పణచేసి ఈ సాధనను అనుష్ఠింపవచ్చును - అని తెల్పుటకే 'యే' 'మానవాః' అను పదములు ప్రయోగింపబడినవి.

ప్రశ్న - 'శ్రద్ధావంతః' 'అనసూయంతః' అను రెండు పదముల అర్థమేమి?

సమా - భగవంతునియెడ దోషదృష్టి గలవారును (దోషములను ఆపాదించువారును) భగవంతుని సాక్షాత్ పరమేశ్వరునిగా భావింపక సామాన్య మానవునిగా తలంచువారును, భగవంతునిపై విశ్వాసము లేనివారును, ఈ సాధనకు అర్హులుగారు. భగవంతునియందు ఎన్నడును ఏ విధమైన దోషములెంచనివారును, ఆయన యెడ సర్వదా భక్తిశ్రద్ధలు కలవారు మాత్రమే ఈ సాధనను అనుష్ఠింపగలరు. కనుక ఈ సాధనను అనుష్ఠింపగోరువారు పై సద్గుణములను కలిగియుండవలెను. ఈ సద్గుణములు లేనివారు దీనిని అనుష్ఠింపలేరు సరిగదా, వారు దీనిని అవగాహన చేసికొనుటయు కష్టమే.

ప్రశ్న - 'నిత్యమ్' అను పదము 'మతమ్' అను పదమునకు విశేషణమా? లేక 'అనుతిష్ఠంతి' అను పదమునకు విశేషణమా?

సమా - భగవంతుని ఉపదేశము నిత్యమే. శాశ్వత సత్యమే. కనుక 'నిత్యమ్' అను పదమును 'మతమ్' అనుదానికి విశేషణముగా భావించుటలో తప్పులేదు. కాని ఇచ్చట 'అనుతిష్ఠంతి' అను క్రియకు విశేషణముగా తలంచుటయే యుక్తము. సాధకుడు తన కర్మలను అన్నింటిని భగవంతునకు సమర్పించుచు వాటిని ఆ భావముతోడనే ఆచరింపవలెను.

ప్రశ్న - ఇచ్చట 'అపి' అను పదమును ప్రయోగించి, వారుగూడ సమస్త కర్మ బంధముల నుండి ముక్తులగుదురు - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ సాధన ద్వారా "ఇతరులు కూడ సమస్త కర్మల నుండి ముక్తులగుచున్నారు" అనగా జనన మరణరూప కర్మబంధముల నుండి శాశ్వతముగా ముక్తులై పరమకల్యాణస్వరూపుడైన పరమాత్మను పొందుదురు. ఇతరులకే (సామాన్యులకే) పరమాత్మప్రాప్తి కలుగుచుండగా అర్జునుని విషయమును గూర్చి ఇక చెప్పనేల? అని స్పష్టపఱచుటకే 'అపి' అను పదము ప్రయోగింపబడినది.

*సంబంధము - పైన పేర్కొనబడిన రీతిగా అనుష్ఠానఫలమును తెలిపి దానిని అనుసరింపని వారికి కలుగు హానినిగూర్చి వివరించుచున్నాడు-*

**యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్ ।**
**సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః ॥ 32 ॥**

తు = కాని
యే = ఎవరైతే
అభ్యసూయంతః= దోషారోపణ చేయువారై
మే, ఏతత్, మతమ్= నా, ఈమతమును (ఉపదేశమును)
న, అనుతిష్ఠంతి= ఆచరింపరో
తాన్, అచేతసః = అట్టి మూర్ఖులను
సర్వజ్ఞాన, విమూఢాన్ } = విపరీత జ్ఞానోపహతులైన వారినిగా
నష్టాన్ = భ్రష్టులైనవారినిగా
విద్ధి = తెలిసికొనుము.

కాని నాయందు దోషారోపణ చేయుచు, నా ఈ ఉపదేశమును అనుసరింపని మూర్ఖులు సమస్త జ్ఞానవిషయములయందును మోహితులై (విపరీత జ్ఞానోపహతులై) భ్రష్టులై, కష్టనష్టముల పాలయ్యెదరని ఎఱుంగుము. **(32)**

ప్రశ్న - 'తు' అను ప్రయోగముయొక్క ప్రత్యేకతయేమి?

సమా - పూర్వ శ్లోకమున వర్ణింపబడిన సాధకులకు వ్యతిరేకముగా ప్రవర్తించువారికి పట్టుగతి ఈ శ్లోకమున వివరింపబడినది - ఈ విషయమును స్పష్టపఱచుటకే 'తు' అను ప్రయోగము చేయబడినది -

ప్రశ్న - భగవంతునియెడ దోషారోపణ చేయుచు అతని "ఉపదేశానుసారము అనుష్ఠింపకుండుట" యనగా నేమి?

సమా - భగవంతుని సామాన్యమానవునిగా భావించుచు, "తాను పూజలను అందుకొనుటకే అతడు ఇట్లు ఉపదేశించుచున్నాడనియు, సమస్త కర్మలను అయనకు సమర్పణ చేయుటవలన మనుజుడు కర్మబంధములనుండి ముక్తుడగుట నట్టిమాట యనియు, మొదలగు భావములను కలిగియుండుటయు, వాటినే ఇతరులకు చెప్పుటయు భగవంతుని యెడ దోషారోపణ చేయుట యగును. ఈ విధముగ దోషారోపణ దృష్టి కలిగియుండి, మమతాసక్తులను, కోరికలను త్యజింపక, కర్మలను పరమేశ్వరార్పణ చేయక యథేచ్ఛగా కర్మలను ఆచరించుచు శాస్త్రవిహిత కర్మలను త్యజించుట మున్నగునవి అన్నియును భగవంతునిపై దోషారోపణ చేయుచు, భగవంతుని ఉపదేశములను అనుష్ఠింపక పోవుటయగును.

ప్రశ్న - 'అచేతసః' అను పదము ఎట్టి వారిని గూర్చి తెలుపును? వారు పూర్తిగా విపరీతజ్ఞానముచే మోహితులై కష్టనష్టముల పాలగుదురు - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - 'అచేతసః' అను పదము తామస స్వభావులైన మూర్ఖులను తెల్పును. వారి మనస్సులు దోషపూర్ణములు. వారు వివేకరహితులు. వారికి చిత్తము వశమునందు ఉండదు. ఇట్టి వారు విపరీత బుద్ధి కలిగి యుందురు. ఆ కారణముగ లౌకిక పారలౌకిక సుఖసాధనములన్నింటిని గూర్చి వక్రముగా చిత్రీకరించుచు (తలంచుచు) విపరీతా చరణముల యందు ప్రవృత్తులగుదురు. ఫలితముగా ఇహ-పరలోకములనుండి పతనమగుదురు. తమ వర్తమాన స్థితినుండి కూడ భ్రష్టులయ్యెదరు. మరణానంతరము తమ కర్మఫలములను అనుభవించుటకు సూకర శునకాది నీచజన్మలనెత్తు చుందురు. మఱియు ఘోరనరకములలోబడి భయానక యాతనలను అనుభవింతురు.

సంబంధము - భగవదుపదేశములను పాటింపనివారికి కలుగు కష్టనష్టములను గూర్చి పూర్వశ్లోకమున స్పష్టము చేయబడినది. భగవంతుని ఉపదేశానుసారము కర్మలను ఆచరింపక మూర్ఖత్వముతో సమస్తకర్మలను త్యజించినచో కలుగు హానియేమి? అను జిజ్ఞాస కలుగుట సహజము. దీనికి సమాధానమును ఈ శ్లోకమునందు వివరించుచున్నాడు-

**సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి ।**
**ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ 33 ॥**

భూతాని = ప్రాణులన్నియును
ప్రకృతిమ్, యాంతి = నిజస్వభావములకు లోబడి కర్మలను చేయుచుండును
జ్ఞానవాన్, అపి = జ్ఞానియును
స్వస్యాః, ప్రకృతేః, సదృశమ్ } = తన ప్రకృతికి తగినట్లుగా
చేష్టతే = క్రియలను ఆచరించును
నిగ్రహః = (అర్థములేని) పట్టుదల
కిమ్, కరిష్యతి= ఏమిచేయును?

**సమస్త ప్రాణులును తమ తమ ప్రకృతులను అనుసరించి (స్వభావములకు లోబడి) కర్మలు చేయుచుండును. జ్ఞానియు తన ప్రకృతిని (స్వభావమును) అనుసరించియే క్రియలను ఆచరించును. ఎవ్వరైనను పట్టుబట్టి కర్మలను ఎట్లు త్యజింపగలరు? (33)**

ప్రశ్న - ప్రాణులన్నియును ప్రకృతిని అనుసరించును - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - నదీజలములన్నియును స్వాభావికముగనే సముద్రమువైపు ప్రవహించును. ఆ ప్రవాహమును బలవంతముగ ఎవ్వరును ఆపలేరు. అట్లే సమస్త ప్రాణులను తమతమ ప్రకృతికి అధీనములై ప్రకృతి ప్రవాహమునబడి ప్రకృతివైపే పరుగెత్తును. కనుక ఏ మనుష్యుడును ఏ విధముగను కర్మలను త్యజింపలేడు. నదీప్రవాహములను ఒకవైపునుండి మఱొక వైపునకు మఱలింపవచ్చును. అదే విధముగ మనుష్యుడు తన కర్మాచరణలక్ష్యమును మార్చుకొని కర్మప్రవాహదిశను మఱలించుకొనవచ్చును. అనగా రాగద్వేషములను త్యజించి, ఆ కర్మలను పరమాత్మ ప్రాప్తికి సాధనములుగా చేసికొనవచ్చును.

ప్రశ్న - ప్రకృతియను శబ్దమునకు ఇచట అర్థమేమి?

సమా - జన్మజన్మాంతరములయందు చేయబడిన కర్మల సంస్కారములే స్వభావ రూపమున ప్రకటితములగును. ఆ స్వభావములనే ప్రకృతి అనియందురు.

ప్రశ్న - ఇచట 'జ్ఞానవాన్' అను శబ్దము ఎవరిని సూచించును?

సమా - పరమాత్మ యొక్క యథార్థ తత్త్వమును తెలిసికొని భగవత్ప్రాప్తినందిన మహాత్ముని తెల్పునదియే 'జ్ఞానవాన్' అను పదము.

ప్రశ్న - 'అపి' అను అవ్యయ ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - గుణములకతీతుడైన జ్ఞానియు తన స్వభావమునను సరించి, క్రియలను ఆచరించుచున్నప్పుడు, ప్రకృతికధీనములో నుండి అజ్ఞానులైన మనుష్యులు ప్రకృతి ప్రవాహమును బలవంతముగా ఎట్లు నిరోధింపగలరు? ఈ భావమును స్పష్ట పరచుటకే 'అపి' అను అవ్యయము ప్రయుక్తమైనది.

ప్రశ్న - పరమాత్మ ప్రాప్తినందిన జ్ఞానులైన మహాత్ముల స్వభావములు గూడ వేర్వేఱుగా ఉండునా?

సమా - పూర్వసాధన ప్రారబ్ధముల భేదములను అనుసరించి సమస్త జ్ఞానుల స్వభావములును వేర్వేఱుగా ఉండుట అనివార్యము.

ప్రశ్న - జ్ఞానికిని పూర్వార్జిత కర్మల సంస్కార రూపస్వభావముతో సంబంధము ఉండునా? సంబంధములేనిచో జ్ఞానియు తన స్వభావమును అనుసరించియే కర్మలు చేయును- అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - వాస్తవముగ జ్ఞానికి కర్మసంస్కారములతో ఏ విధమైన సంబంధమూ ఉండదు. అతడు ఎట్టి క్రియలనూ ఏ విధముగనూ చేయుడు. కాని అతని అంతఃకరణము నందు పూర్వార్జితప్రారబ్ధ సంస్కారములుండును. వాటిని అనుసరించి అతని బుద్ధి, మనస్సు ఇంద్రియముల ద్వారా ప్రారబ్ధ ఫలరూపముగను, లోకహితార్థముగను కర్తృత్వ క్రియలు జరుగుచునే యుండును. ఆ క్రియలనే లోకదృష్టితో జ్ఞానియందు అధ్యారోపణముచేసి, 'జ్ఞానియు తన ప్రకృతిననుసరించి, క్రియలు చేయుచున్నట్లు' భావింపబడును. జ్ఞానియొక్క క్రియలయందు కర్తృత్వ భావనగాని, రాగద్వేషములు, అహంకారమమకారములు గాని ఏ విధముగనూ ఏ మాత్రమూ ఉండవు. కనుక అవి చేష్టామాత్రములే. అవి లౌకికకర్మలవంటివి కానే కావు. ఈ భావమును విశదము చేయుటకే 'చేష్టతే' అను క్రియాపదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - జ్ఞానియొక్క అంతఃకరణమునందు రాగద్వేష హర్ష శోకాది వికారములు ఉండనే ఉండవా? లేక వాటితో ఆ యంతఃకరణమునకు సంబంధమే ఉండదా? ఒకవేళ అంతఃకరణముతో ఎట్టి సంబంధమూ లేని కారణముగా వికారములే లేనిచో శమ, దమ, తితిక్ష, దయ, సంతోషాది సద్గుణములు గూడ అందుండకూడదుగదా?

సమా - జ్ఞానికి అంతఃకరణముతోనే సంబంధము లేనప్పుడు దానియందు కలుగు వికారములతోను సద్గుణములతోను సంబంధమెట్లుండును. కాని అతని అంతః కరణముగూడ అత్యంత పవిత్రముగా ఉండును.

నిరంతరము పరమాత్మ స్వరూప చింతన చేయగా చేయగా అతని అంతఃకరణము నుండి మల, విక్షేప - ఆవరణములు అను, దోషములు సర్వథా తొలగిపోవును. అప్పుడు సాధకునకు పరమాత్మ ప్రాప్తి కలుగును. ఈ కారణమున అతని అంతఃకరణమునందు అవిద్యామూలకములైన అహంకారమమకారములు, రాగద్వేషములు, హర్షశోకములు, దంభకపటములు, కామక్రోధములు, లోభమోహములు మొదలగు వికారములు ఉండనే యుండవు. కనుక జ్ఞానియైన మహాత్ముని అంతఃకరణము అత్యంత నిర్మలము, పరమ పవిత్రము అగుటవలన దానియందు కేవలము సమత, సంతోషము, దయ, క్షమ నిఃస్పృహాత్వము, శాంతి మొదలగు సద్గుణముల స్ఫురణము స్వాభావికముగనే యేర్పడును. వాటి ప్రభావమున లోకహితార్థమై శాస్త్రవిహిత కర్మలు అతని శరీరేంద్రియమనస్సులద్వారా జరుగుచునే యుండును. దుర్గుణదురాచారములకు అందు ఏ మాత్రమూ తావుండదు.

ప్రశ్న - జ్ఞానులైన సిద్ధ పురుషుల అంతఃకరణముల యందును కామక్రోధాది దుర్గుణములు గోచరించునట్లును వాటి ననుసరించి, ఇంద్రియముల ద్వారా క్రియలు జరిగినట్లును ఇతిహాస పురాణముల యందు పలు సందర్భములలో ప్రస్తావనలు కలవు గదా! వాటి విషయమై యేమని భావింపవలెను?

సమా - శాస్త్రములలో తెల్పబడిన విధి వాక్యములు మిక్కిలి ప్రభావాన్వితమైనవి. నిషేధ వాక్యములు వాటి కంటెను ప్రబలమైనవి. స్పష్టమైనవి. కాని పురాణేతిహాసముల యందు ప్రస్తావింపబడిన కథల అంతర్యములు సమగ్రముగా సరిగా తెలిసికొనుట క్లిష్టమైన విషయము. అంతఃకరణము నందు నిజముగా కామక్రోధాది దుర్గుణములు ఏర్పడినచో వాటిననుసరించి క్రియలు జరిగినచో అతడు భగవత్ప్రాప్తి నందిన 'జ్ఞాని' కానేకాడు. ఏలనన "జ్ఞానులైన మహాపురుషుల యందును కామక్రోధాది అవగుణములు ఉండును" వంటి విధివాక్యములు ఆ శాస్త్రములయందు ఎచ్చటను కనబడవు. పైగా వాటి నిషేధ వాక్యములు పెక్కు సందర్భములలో కనబడుచుండును. గీతయందును మహాపురుషుల లక్షణములను గూర్చి చెప్పబడిన చోట్లను గూడ రాగద్వేషములు, కామక్రోధాది దుర్గుణములు, దురాచారములు, వారిలో ఏ విధముగను ఉండగూడదనియే పేర్కొనబడినది. (5/26, 28, 12/17) కాని లోకహితము కొఱకు అవసరములను బట్టి వారు ఆ విధముగా నటించినచో ఆ క్రియలు దోషములుగా పరిగణింపబడవు.

ప్రశ్న - బలవంతముగా కర్మలను ఆపుట ఎట్లు సంభవమగును? అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఏ మనుష్యుడైనను, క్షణమాత్రమైనను కావలెనని పట్టుబట్టి కర్మలను త్యజింపజాలడు. ప్రకృతి వానిద్వారా బలవంతముగనే కర్మలను జరిపించును. (18/59,60) కనుక మనుష్యుడు కర్మలను త్యజించి కర్మబంధముల నుండి విముక్తుడగుటకు పట్టుబట్టక స్వభావమునననుసరించి, నియతకర్మలనాచరించుచు, కర్మ బంధములనుండి బయటపడుటకు ప్రయత్నింపవలెను. అందే మనుష్యుడు సఫలీకృతుడగును. విహిత కర్మలను త్యజించినచో అతడు స్వేచ్ఛాచారియై మునుపటికంటెను అధికముగా కర్మబంధములలో చిక్కుకొని పతనమగును.

ప్రశ్న - అందఱును ప్రకృతిననుసరించి, కర్మలు చేయవలసియున్నచో, మనుష్యునకే మాత్రము స్వతంత్రము లేనిచో విధి నిషేధాత్మక శాస్త్రముల ఉపయోగమేమి? స్వభావము ననుసరించి, మనుష్యుడు శుభాశుభ కర్మలను చేయవలసియున్నచో వాటిని అనుసరించి అతని స్వభావము (ప్రకృతి) ఏర్పడును. ఇట్టి స్థితియందు మనుష్యుడు ఉద్ధరింపబడుట ఎట్లు?

సమా - శాస్త్రవిరుద్ధమైన అసత్కర్మాచరణము రాగద్వేషాదుల వలనను, శాస్త్ర విహిత సత్కర్మాచరణ భక్తిశ్రద్ధాది సద్గుణముల వలనను ఏర్పడుచుండును. రాగద్వేషాది దుర్గుణములను త్యజించి, భక్తిశ్రద్ధాది సద్గుణములను జాగ్రత్తమొనర్చి వాటిని పెంపొందించుకొనుటకు మనుష్యుడు స్వతంత్రుడు. కనుక దుర్గుణములను త్యజించి, భగవంతునియందును, శాస్త్రముల యందును భక్తి విశ్వాసములు గలిగి, భగవదనుగ్రహముకొఱకై కర్మాచరణమును జరుపవలెను. ఈ ఆదర్శమును ముందుంచుకొని, కర్మలనాచరించు మనుష్యుల ద్వారా నిషిద్ధ కర్మలు ఏ మాత్రమును జరుగవు. శుభకర్మలే జరుగును. అవి గూడ ముక్తిప్రదములే గాని బంధకారకములు కావు. కర్మలను నిరోధించుటకు మనుష్యుడు స్వతంత్రుడు కాడు. అతడు కర్మలు చేయవలసియే యుండును. కాని సద్గుణములను ఆశ్రయించి, తమ ప్రకృతిని సంస్కరించుకొనుటకు

అందఱును స్వతంత్రులే - ప్రకృతి యందు (స్వభావము నందు) జరుగు పరిణామమును బట్టి క్రియలు సహజముగనే విశుద్ధములగును. కనుక భగవంతుని శరణుజొచ్చి, తమ స్వభావమును సంస్కరించుకొనవలెను. ఇట్లు చేయుటవలననే అతడు ఉద్ధరింపబడును.

*సంబంధము - అందఱును తమ స్వభావములను అనుసరించి కర్మలు చేయవలసియే యుండును. అయినచో కర్మబంధములనుండి విముక్తులగుటకు మనుష్యులేమి చేయవలయును? అను ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ 34 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇంద్రియస్య, ఇంద్రియస్య, అర్థే | = ప్రతి-ఇంద్రియార్థము నందు | | (మనుష్యుడు) | అస్య | = ఇతనియొక్క (హితమునకు) |
| | | తయోః వశమ్ | = వాటివశమునకు | | |
| రాగద్వేషౌ | = రాగద్వేషములు | న, ఆగచ్ఛేత్ | = లోనుకారాదు | పరిపన్థినౌ | = విఘ్నములను |
| వ్యవస్థితౌ | = దాగియుండును | హి, తౌ | = ఏలనన ఆ రెండును | | కల్గించు శత్రువులు. |

**ప్రతిఇంద్రియార్థమునందును (ప్రతిఇంద్రియ విషయమునందును) రాగద్వేషములు దాగియున్నవి. మనుష్యుడు ఈ రెండింటికిని వశము కాకూడదు. ఏలనన ఈ రెండే మానవుని శ్రేయస్సునకు విఘ్నకారకములు, మహాశత్రువులు. (34)**

ప్రశ్న - ఇచట 'అర్థే' అను పదముతో సంబంధమున్న 'ఇంద్రియస్య' అను పదమును రెండుమార్లు ప్రయోగించుట లోని ఆంతర్యమేమి?

సమా - శ్రోత్రాది జ్ఞానేంద్రియముల ద్వారాను, వాక్కు మొదలగు కర్మేంద్రియముల ద్వారాను, అంతఃకరణము ద్వారాను గ్రహించు ప్రతివిషయము (ఇంద్రియార్థము) నందును వేర్వేఱుగా రాగద్వేషముల స్థితిని చూపుటకే 'అర్థే' అను పదముతో సంబంధము గల 'ఇంద్రియస్య' అను పదము రెండుసార్లు ప్రయోగింపబడినది. సమస్త ఇంద్రియముల తోడను, అంతఃకరణముతోడను, సంయోగ వియోగములను కలిగియుండు విషయములన్నింటిలోను రాగద్వేషములు రెండును వేర్వేఱుగా దాగియుండునని దీని అంతరార్థము.

ప్రశ్న - 'ఇంద్రియార్థములయందు ఇంద్రియముల రాగద్వేషములు దాగియున్నవి.' అను అర్థమును చెప్పినచో వచ్చు దోషమేమి?

సమా - ఇట్లు అర్థము చెప్పినచో దీనిభావము సరిగా ప్రకటితము కాదు. ఏలనన ఇంద్రియములు అనేకములు. వాటి విషయములు కూడ అనేకములు. మఱి ఒకే ఇంద్రియార్థము నందు ఒకే ఇంద్రియము యొక్క రాగద్వేషములు స్థితమై యున్నట్లు చెప్పుట ఎట్లు? కనుక 'ఇంద్రియస్య' 'ఇంద్రియస్య' అను పదములకు 'సర్వేంద్రియాణాం' అను అర్థమును చెప్పినచో పైన చేసిన వివరణము సరిపోవును.

ప్రశ్న - ప్రతి ఇంద్రియార్థమునందు రాగద్వేషములు రెండును ఎట్లు దాగియుండును? వాటికి వశపడకుండుట అనగానేమి?

సమా - మానవునకు ఒక వస్తువునందుగాని, ప్రాణియందుగాని, ఘటనయందుగాని ప్రతీతమగు సుఖమును అనుకూల భావమును ఆసక్తిని రాగమందురు. అట్లే వాటియందు ప్రతీతమగు దుఃఖమును. ప్రతికూల భావమును ద్వేషమందురు. వాస్తవముగా ఏ వస్తువునందును సుఖముగాని, దుఃఖముగాని ఉండదు. మనుష్యుని భావమును అనుసరించి, ఒకే వస్తువు ఒకరికి సుఖప్రదముగాను, మఱియొకరికి దుఃఖదాయకముగను గోచరించుచుండును. అట్లే ఒకే మనుష్యునకు ఒక సమయమునందు సుఖప్రదముగా గోచరించు వస్తువు మఱియొక సమయమున దుఃఖదాయకమగును. కనుక ప్రతి ఇంద్రియార్థము నందును

రాగద్వేషములు దాగియే యుండును. అనగా అన్ని వస్తువులును రాగద్వేషములు రెండింటికిని కారణములగును. ఏలనన మనుష్యునకు వాటితో సంయోగ వియోగములు తటస్థించినప్పుడెల్లను రాగద్వేషములు కలుగుచునే యుండును.

అందువలన శాస్త్ర విహితకర్తవ్య కర్మలను ఆచరించుచునే మనస్సుతో, ఇంద్రియములతో విషయసంయోగ వియోగములు కలిగినప్పుడు ఏ వస్తువునందును, ప్రాణియందును, క్రియ లేక ఘటనయందును ప్రియ - అప్రియ భావనలను రానీయరాదు. సిద్ధి అసిద్ధులు, జయాపజయములు, లాభనష్టములు మొదలగు వానియందు సమభావమును కలిగియుండవలెను. ఏ మాత్రమూ హర్షశోకములకు తావు ఈయరాదు. ఇట్టి స్థితివే రాగ ద్వేషములకు వశపడకుండుట యందురు - ఏలనన రాగద్వేషములకు లోనగుచుండుట వలననే మనుష్యునకు భేదబుద్ధి (ప్రియాప్రియభావములు) కలిగి అంతః కరణమునందు హర్షశోకాది వికారములు ఏర్పడును. కనుక మనుష్యుడు పరమేశ్వరుని శరణుజొచ్చి, ఈ రాగద్వేషములకు సర్వథా అతీతుడై యుండవలెను.

ప్రశ్న - రాగద్వేషములు రెండును మనుష్యుని శ్రేయోమార్గమునకు విఘాతము కల్గించు పరమ శత్రువులని యెట్లు చెప్పగలము?

సమా - మనుష్యుడు అజ్ఞానవశమున రాగద్వేషములకు వశుడై నశ్వరములగు భోగములను సుఖహేతువులుగా భావించి, శ్రేయోమార్గము నుండి భ్రష్టుడగును. రాగద్వేషములు సాధకుని వ్యామోహపఱచి, విషయలోలుని గావించును. మఱియు అతని శ్రేయోమార్గమునకు విఘాతము గల్గించి, అమూల్యమైన మానవజీవన రూపసంపదను కబళించును. ఈ కారణమున అతడు మానవజన్మ పరమలక్ష్యము నుండి పతనమగును. రాగద్వేషములకు వశుడై విషయభోగానుభవములకై స్వధర్మములను త్యజించి, పరధర్మముల పాలగును. లేదా నానావిధములగు నిషిద్ధ కర్మలను ఆచరించును. దీని ఫలస్వరూపముగా మరణానంతరము గూడ అతనికి దుర్గతియే ప్రాప్తించును. అందువలన రాగద్వేషములు 'పరిపంథి' అనగా శ్రేయోమార్గమునకు విఘాతము కలిగించు శత్రువులుగా పేర్కొనబడినవి.

ప్రశ్న - ఈ రాగద్వేషములు సాధకుని శ్రేయో మార్గమునకు ఎట్లు బాధకములగును?

సమా - ఉదాహరణకు - ఒక నిశ్చిత గమ్యస్థానమును చేరుటకై ఒక బాటసారి బయలుదేఱెను. దారిలో కొందఱు దొంగలు అతనితో కలిసిరి. వారు అతనితో మిత్రులవలె నటించుచు, ఇచ్చకపు మాటలతో వానికి చేరువఅయిరి. ఇతర ప్రయాణికులతోడను, బండితోలువానితోడను కలిసి, కుట్రపన్ని, ఆ బాటసారి వివేకశక్తిని కుంటుపఱచి, భ్రమలలో ముంచివేసిరి. మిథ్యాసుఖముల ద్వారా ప్రలోభపఱచి, తమ తీయని మాటల వలలలో చిక్కుకొనచేసిరి. గమ్యస్థాన మార్గమునుండి అతనిని ప్రక్కదారి పట్టించి, అతనిని ఒక దట్టమైన అడవి మధ్యకు తీసికొని వెళ్ళిరి. అతని సర్వస్వమును దోచుకొని, వానిని ఒకలోతైన గోతిలో పడద్రోసిరి. ఆ విధముగా అతడు అధోగతి పాలాయెను.

అదే విధముగ రాగద్వేషములు అను దొంగలు శ్రేయోమార్గమున సాగిపోవు సాధకుని కలిసి, మిత్రులవలె నటించి, వాని మనస్సును, ఇంద్రియములను వివేకశక్తిని నష్టపఱచుట జరుగును. పిదప అవి వానిని ప్రాపంచిక విషయ భోగానుభవములతో ప్రలోభపఱచి, పాపకర్మాచరణములో ప్రవృత్తునిగా చేయును. తత్ప్రభావముతో అతని సాధన క్రమముగ దెబ్బతినును. పాపకర్మల ఫలితముగా ఘోరనరకములపాలై భయంకర దుఃఖములను అనుభవించును. ఈ విధముగా సాధకుని శ్రేయోమార్గమునకు రాగద్వేషములు బాధకములగును.

*సంబంధము - "ఘోరమైన ఈ యుద్ధకర్మనుండి తప్పుకొని, భిక్షావృత్తిని చేపట్టినచో శాంతియుత కర్మలయందు నిమగ్నుడనై, రాగద్వేషములకు దూరము కావచ్చును గదా!" అను ఆలోచన అర్జునునకు కలుగవచ్చును. మఱి భగవానుడు తనను ఈ యుద్ధమునకు ఏల పురికొల్పుచున్నాడు? అను సందేహము అతనికి రావచ్చును. దానికి సమాధానముగా భగవానుడు ఇట్లు చెప్పుచున్నాడు-*

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| స్వనుష్ఠితాత్ | = బాగుగా ఆచరింపబడిన | స్వధర్మః | = స్వధర్మము | శ్రేయః | = శ్రేయస్కరము |
| పరధర్మాత్ | = ఇతరుల ధర్మము కంటెను | శ్రేయాన్ | = అత్యుత్తమమైనది | పరధర్మః | = ఇతరుల ధర్మము |
| | | స్వధర్మే | = స్వధర్మమునందు | భయావహః | = భయమును గొలుపునది |
| విగుణః | = గుణరహితమే ఐనను | నిధనమ్ | = మరణము(ఐనను) | | |

పరధర్మమునందు ఎన్నో సుగుణములు ఉన్నను స్వధర్మమునందు అంతగా సుగుణములు లేకున్నను చక్కగా అనుష్ఠింపబడు ఆ పరధర్మముకంటెను స్వధర్మాచరణమే ఉత్తమము. స్వధర్మాచరణమునందు మరణించుటయు శ్రేయస్కరమే. పరధర్మాచరణము భయావహము. (35)

ప్రశ్న - 'సుఅనుష్ఠితాత్' అను విశేషణముతో గూడిన 'పరధర్మాత్' అను పదము ఏ ధర్మమును సూచించును? దానికంటెను గుణరహితమేయైనను స్వధర్మమే అత్యుత్తమమని పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యమునందు పరధర్మమును స్వధర్మముతో పోల్చుచు పరధర్మముతోపాటు 'సు-అనుష్ఠిత' అను విశేషణమును, స్వధర్మముతో 'విగుణ' అను విశేషణమును ప్రయోగించుట జరిగినది. ప్రతివిశేషణముతో అందలి వ్యతిరేక భావముగూడ కలిసియేయున్నట్లు భావింపవలెను. అనగా పరధర్మము సు-అనుష్ఠితమైనదే కాక సద్గుణ సంపన్నమైనదనియు, అట్లే స్వధర్మము గుణరహితమైనదేగాక అనుష్ఠానము నందు లోపభూయిష్ఠ మైనదనియు భావింపవలెను. క్షత్రియ వైశ్యాదుల ధర్మములతో పోల్చినప్పుడు బ్రాహ్మణుల విశేష ధర్మమునందు సద్గుణములు ఉండును. అట్లే గృహస్థాశ్రమధర్మములతో పోల్చినప్పుడు సన్న్యాసాశ్రమ ధర్మములయందు సద్గుణము లెక్కువ. శూద్రుల కర్మలకంటెను క్షత్రియ, వైశ్యకర్మలు అధికగుణయుక్తములే, బాగుగా అనుష్ఠింపబడిన ఆ కర్మలు గుణయుక్తములే యైనను అవి అనుష్ఠించువానికి విహితములుకాక ఇతరులకు విహితములైనచో అట్టి కర్మలను 'సు-అనుష్ఠితాత్' అను విశేషణముతోపాటు "పరధర్మాత్" అను పదము సూచించును. అట్టి పరధర్మముకంటెను గుణరహితమే యైనను స్వధర్మాచరణమే ఉత్తమము. భర్త చూచుటకు కురూపి, గుణహీనుడూ ఐనను స్త్రీ అతనికి సేవలు చేయుటయే శ్రేయస్కరము. అదే విధముగా చూచుటకు సద్గుణయుక్తము కాకున్నను, అనుష్ఠానమున లోపములు ఉన్నను అవి విహితకర్మలైనచో మానవునకు అవియే శ్రేయస్కరములు. ఇక స్వధర్మములు సర్వగుణసంపన్నములై వాటి అనుష్ఠానములు సాంగోపాంగముగా చక్కగా సాగినచో అవి అత్యుత్తములు అని చెప్పవలసిన పనియే లేదు.

ప్రశ్న - 'స్వధర్మము' అను పదము ఏ ధర్మమును తెలుపును?

సమా - వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులను అనుసరించి, ప్రతి మనుష్యునకును శాస్త్రవిహితములైన కర్మలే స్వధర్మములు. అసత్యము, కపటము, దొంగతనము, హింస, మోసము, వ్యభిచారము మొదలగు నిషిద్ధకర్మలు ఎవ్వరికిని స్వధర్మములు గావు. కామ్యకర్మలు గూడ ఎవ్వరికిని అవశ్యకర్తవ్యములు గావు. అందువలన అవియును స్వధర్మములుగా పరిగణింపబడవు. ఇవిగాక ఒక వర్ణము లేక ఆశ్రమమువారికి విశేష ధర్మములుగా పేర్కొనబడి, వాటిని ఆచరించుటకు వారికి తప్ప ఇతర వర్ణాశ్రమముల వారికి అధికారము లేదని తెల్పబడినప్పుడు ఆయా వర్ణాశ్రమముల వారికే అవి వేర్వేరు స్వధర్మములు. ద్విజులకు మాత్రమే అధికారము కలదని తెల్పబడిన వేదాధ్యయనము, యజ్ఞాదికర్మలు ద్విజులకు స్వధర్మములు. అన్ని వర్ణాశ్రమముల వారికిని, స్త్రీ పురుషులకును అధికారములు గల ఈశ్వర భక్తి, సత్యభాషణము, మాతాపితరుల సేవలు, మనస్సు, ఇంద్రియముల సంయమనము, బ్రహ్మచర్యపాలనము, అహింస, అస్తేయము, సంతోషము, దయ, దానము, క్షమ, పవిత్రత, వినయము మొదలగు సామాన్య ధర్మములు అందరికిని స్వధర్మములు.

ప్రశ్న - వర్ణాశ్రమ వ్యవస్థ లేనట్టి, వైదిక సనాతన ధర్మములను విశ్వసింపనట్టి మానవ సమాజములయందు ఈ స్వధర్మ, పరధర్మ వ్యవస్థ ఎట్లుకొనసాగును?

సమా - వాస్తవముగా వర్ణాశ్రమవ్యవస్థ మానవ సముదాయములన్నింటిలోను ఉండియే తీరవలెను. వైదికసనాతన ధర్మములు గూడ మనుష్యులందఱికిని విశ్వసనీయములు. కావున వర్ణాశ్రమ వ్యవస్థలేని సముదాయమునందు స్వధర్మ పరధర్మ నిర్ణయములను చేయుట కష్టమైన పనియే. కాని ఇప్పటి దేశకాల పరిస్థితులనుబట్టి మానవసముదాయములకు ఈ ధర్మసంకటము ఎదురగుచున్నది. గీతయందు సమస్త మానవుల సముద్ధరణమునకై మార్గము చూపబడినది. ఏదో యొక జాతియందును, సమాజమునందును మాతాపితరుల సంపర్క ప్రభావమున మానవునకు జన్మ లభించును. జన్మించినది మొదలు తన కర్తవ్యములను తెలిసికొను యోగ్యత కలుగువఱకును ఆయా సమాజములను బట్టియు, మాతాపితరుల పాలన, పోషణములను బట్టియు అతనికి ఆయా సంస్కారములు అబ్బును. మఱియు పూర్వజన్మ సంస్కారములు గూడ ఉండును. వీటి నన్నింటిని బట్టి అతని స్వభావము ఏర్పడును. ఆ స్వభావమును అనుసరించియే జీవనోపాధికర్మలయందు అతనికి స్వాభావిక ప్రవృత్తి ఏర్పడును. కనుక వర్ణాశ్రమ వ్యవస్థ లేని మానవసముదాయమునందును వారి వారి స్వభావ పరిస్థితులను బట్టి విహితకర్మలు ఏర్పడును. అనగా ఇహపరలోకములయందు వారి ఉన్నతికై ఉపయుక్తములని మహాపురుషులచే భావింపబడిన కర్మలు సరియైన అవగాహనతో గ్రహించి ఆచరింపబడుచుండును. ఇతర ధర్మములకును, హితములకును బాధకము కానివి మనుష్యులందఱికిని సామాన్య ధర్మములు. అవియే వారికి స్వధర్మములు. అందులకు భిన్నముగా ఇతరులకు విహితములైనవి, తమకు విహితములు కానివి పరధర్మములు.

ప్రశ్న - 'స్వధర్మః' అను పదముతోపాటు 'విగుణః' అను విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - 'విగుణః' అను పదము తక్కువ గుణములు కలిగియుండుటను సూచించును. యుద్ధ మొనరించుట, దుష్టులను దండించుట మొదలగునవి క్షత్రియులయొక్క స్వధర్మములు. వీనియందు అహింస, శాంతి, మొదలగునవి లోపించియుండునట్లు కన్పించును. అట్లే వైశ్యుల స్వధర్మములైన వ్యవసాయాది కర్మములయందును హింసాది దోషములు ఉండును. అందువలన అహింసా శాంతియుతము లైన బ్రాహ్మణుల కర్మలతో పోల్చినప్పుడు అవి (క్షత్రియ వైశ్యకర్మలు) విగుణములు. అనగా గుణహీనములు. ఆ విధముగనే క్షత్రియ వైశ్యకర్మల కంటెను శూద్రుల కర్మలు నిమ్న శ్రేణికి చెందినవి. ఇంతేగాక ఈ కర్మలను అనుష్ఠించుటలో (ఆచరించుటలో) ఏ భాగము లోపించినను అది అనుష్ఠాన లోపమగును. పైన తెలుపబడినట్లు స్వధర్మము గుణములయందును, అనుష్ఠానమునందును ఎట్టి లోపములు కలిగియున్నను అది పరధర్మము కంటెను శ్రేయస్కరమే. 'స్వధర్మః' అను పదముతోపాటు 'విగుణః' అను విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమిదియే.

ప్రశ్న - 'స్వధర్మాచరణమునందు మరణించినను శ్రేయస్కరమే' - అని యనుటలోని విశేషమేమి?

సమా - స్వధర్మపాలనలో ఎట్టి ఆటంకములును రానిచో జీవిత పర్యంతము మనుష్యుడు దానిని ఆచరించినచో అతని భావానుసారము (సకామ, నిష్కామభావములను అనుసరించి) అతనికి స్వర్గముగాని, ముక్తిగాని లభించును - అనియనుటలో సందేహము లేదు. ఏదైనను ఆటంకము ఏర్పడినను అతడు తన ధర్మము నుండి వైదొలగక ఆ కర్మలను ఆచరించినచో, అదియును అతనికి శ్రేయ్కరమే. స్వధర్మపాలనమునందు మరణించినవారికిని, మరణించు వరకు ఎట్టి కష్టములనైనను సహించుచు స్వధర్మపాలన చేయువారికిని శ్రేయోలాభములు కలుగునని పురాణేతిహాసములు నిరూపించుచున్నవి.

దిలీపమహారాజు తన క్షాత్రధర్మమును పాటించుచు ఒక గోవును రక్షించుటకై తన శరీరమునే ఒక సింహమునకు అర్పించుటకు సిద్ధపడి, తన అభీష్టమును పొందెను. శిబి చక్రవర్తి శరణాగత రక్షణకై స్వధర్మమును ఆచరించుచు ఒక పావురమునకు మాఱుగా తన శరీరమునుండి మాంసఖండములను కోసి యిచ్చి మరణించుటకు సన్నద్ధుడాయెను. ఫలితముగా అతని అభీష్టము నెరవేరెను. ప్రహ్లాదుడు భగవద్భక్తి రూపమైన స్వధర్మమును పాటించుచు పెక్కు పర్యాయములు మృత్యుముఖమును చేరుటకు

సిద్ధపడెను. ఫలితముగ అతనికి పరమశ్రేయస్సు లభించెను. ఈ విధముగా పురాణేతిహాసములలో ఇంకను అనేక - ఉదాహరణములు లభించును. ఈ విషయమునే మహాభారతము ఇట్లు చెప్పుచున్నది.

న జాతు కామాన్న భయాన్న లోభాత్
ధర్మం త్యజేజ్జీవితస్యాపి హేతోః ।
నిత్యో ధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః ॥

*(స్వర్గారోహణపర్వం 5/63)*

అనగా కోరికలను సాధించు కొనుటకుగాని, భయము నుండి బయటపడుటకు గాని, లోభములకు లోబడిగాని, కడకు జీవితమును కాపాడుకొనుటకై గాని మానవుడు ఎట్టి పరిస్థితులలోను ధర్మమును త్యజింపరాదు. ఏలనన ధర్మము శాశ్వతము. సుఖదుఃఖములు అనిత్యములు. అట్లే జీవుడు నిత్యుడు. జీవనహేతువు అనిత్యము.

అందువలన మరణస్థితి ఏర్పడినను మానవుడు సంతోషముతో నవ్వుచు మృత్యువును స్వీకరింపవలెను. కాని ఏది ఏమైనను స్వధర్మమును పరిత్యజింపరాదు. ఇట్లు మసలుకొనుటయే మానవునకు అన్ని విధముల శ్రేయోదాయకము.

ప్రశ్న - "పరధర్మము భయావహము"- అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇతరుల ధర్మమును పాటించుటలో సుఖమున్నప్పటికిని అది భయమును గొల్పునదియే. ఉదాహరణమునకు వైశ్యశూద్రులు తమకంటె అగ్రవర్ణముల వారి ధర్మములను పాటించినచో అగ్ర వర్ణముల వారిచే పూజలందుకొనుట వలనను, వారి వృత్తులకు భంగము కల్గించుటవలనను వారు పాపములను పొందుదురు. ఫలితముగా నరకప్రాప్తి కలుగును. అట్లే బ్రాహ్మణ క్షత్రియులు తమకంటె నిమ్నవర్ణముల వారి ధర్మములను ఆచరించినచో వారు తమ వర్ణముల నుండి పతనమగుదురు. ఇతరుల వృత్తులకు ఆటంకము కలిగించి, పాపఫలములను అనుభవింతురు. ఆశ్రమధర్మములను గూర్చియు, తదితర ధర్మములను గూర్చియు ఇట్లే గ్రహింపవలెను. కనుక "ఎవ్వరైనను తమ శ్రేయస్సుకొఱకు పరధర్మములను స్వీకరింపనవసరములేదు. చూచుటకు పరధర్మము ఎంత గుణసంపన్నముగా ఉన్నను అది భయావహమే. ఏ మాత్రము శుభప్రదము గాదు. ఆది ఎవరికి విహితమో వారికే స్వధర్మము."(1)

*సంబంధము - స్వధర్మమును పాటించుటయందే మానవునకు శ్రేయస్సు కలదు. పరధర్మాచరణము, నిషిద్ధకర్మాచరణము అన్నివిధముల హానికరము. ఈ విషయమును అర్జునుడు చక్కగా గ్రహించెను. కాని మానవుడు తన ఇచ్ఛకును, ఆలోచనకును ధర్మమునకును విరుద్ధముగా పాపములను ఆచరించుటకు కారణమేమి? అను విషయమును తెలిసికొనుటకు అర్జునుడు ప్రశ్నించుచున్నాడు-*

**అర్జున ఉవాచ**

**అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥ 36 ॥**

వార్ష్ణేయ! = ఓ కృష్ణా!
అథ = మఱి
అయమ్, పూరుషః = ఈ పురుషుడు
అనిచ్ఛన్, అపి = ఇష్టపడకున్నను
బలాత్ నియోజితః, ఇవ = బలవంతము చేయబడినట్లుగా
కేన, ప్రయుక్తః = ఎవరిచే ప్రేరితుడై
పాపమ్ = పాపము(ల)ను
చరతి = ఆచరించును

1) మనుస్మృతియందు ఇట్లు చెప్పబడినది -

శ్లో॥ వరం స్వధర్మో విగుణో న పారక్యః స్వనుష్ఠితః । పరధర్మేణ జీవన్ హి సద్యః పతతి జాతితః ॥ (10/97)
గుణరహితమే ఐనప్పటికిని స్వధర్మము శ్రేష్ఠము. కాని చక్కగా ఆచరించినప్పటికిని పరధర్మము శ్రేష్ఠము కాదు. ఏలనన ఇతరుల ధర్మముద్వారా జీవించువాడు తన జాతినుండి వెంటనే పతితుడగును.

**అర్జునుడు పలికెను- ఓ కృష్ణా! మానవుడు తనకు ఇష్టము లేకున్నను ఇతరులు బలవంతము చేసినట్లుగా దేని ప్రభావముచే ప్రేరితుడై పాపములను చేయుచుండును? (36)**

ప్రశ్న - ఈ శ్లోకమునకు సంబంధించి, అర్జునుని ప్రశ్నలోని అంతరార్థమేమి?

సమా - ప్రయత్నశీలుడు, బుద్ధిమంతుడు ఐన మనుష్యుని మనస్సును గూడ ఇంద్రియములు బలాత్కారముగ చలింపజేయును - అని భగవానుడు ఇదివఱకే నుడివియుండెను. (2/60) బుద్ధిమంతుడు, వివేకియైనవాడు ప్రత్యక్షానుమానముల ద్వారా పాపకర్మల పరిణామములను చూచి, విచారించి, వాటియందు ప్రవృత్తుడగుట సరికాదని భావించును. కనుక అతడు ఇచ్ఛాపూర్వకముగా పాపకర్మలను ఆచరింపడు. ఐనను రోగి అపథ్య పదార్థములను సేవించినట్లు, అతనిద్వారా పాపకర్మలు జరుగుచునే యుండును. ఇట్లు బలాత్కారముగ మనుష్యుని పాపకర్మలకు ప్రేరేపించునది యెవరు? అను విషయమును అర్జునుడు తెలిసికొనగోరుచున్నాడు. పరమేశ్వరుడే మానవులను పాపకర్మల యందు నియుక్తులను చేయుచున్నాడా? ఆ కారణమున వారు వాటినుండి వైదొలగ లేక యున్నారా? లేక ప్రారబ్ధవశమున వారు పాపకర్మలయందు ప్రవృత్తులగుచున్నారా? లేక మఱియొక కారణమేదైనను కలదా? అనునవి అర్జునునకు గల సందేహములు.

సంబంధము - భగవానుడు అర్జునుని ప్రశ్నలకు సమాధానములను ఇచ్చుచున్నాడు-

**శ్రీ భగవాన్ ఉవాచ**

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ 37 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| రజోగుణ సముద్భవః | = రజోగుణమునుండి ఉత్పన్నమైన | ఏషః | = ఇది | ఇహ | = ఈవిషయమున |
| ఏషః, కామః | = ఈ కామమే | మహాశనః | = ఎంత తిన్నను తృప్తిలేనిది, (తిండిపోతు) | ఏనమ్ | = దీనిని |
| క్రోధః | = క్రోధము | మహాపాప్మా | = మిక్కిలి పాపిష్ఠిది | వైరిణమ్ | = శత్రువుగా |
| | | | | విద్ధి | = ఎఱుంగుము |

**శ్రీభగవానుడు పలుకుచున్నాడు - రజోగుణమునుండి ఉత్పన్నమగునదే కామము. ఇదియే క్రోధరూపమును దాల్చును. ఇది మహాశనము. భోగానుభవములతో ఇది చల్లారునది గాదు. పైగా అంతులేని పాపకర్మాచరణములకు ఇదియే ప్రేరకము. కనుక ఈ విషయమున దీనిని పరమశత్రువుగా ఎఱుంగుము. (37)**

ప్రశ్న - 'కామః' 'క్రోధః' అను రెండు పదములతోపాటు 'ఏషః' అను పదమును రెండు పర్యాయములు ప్రయోగించుట లోని విశేషమేమి? మఱియు 'రజోగుణ సముద్భవః' అను విశేషణము ఏ పదమునకు సంబంధించినది?

సమా - 34వ శ్లోకమునందు ప్రతి-ఇంద్రియ విషయములయందుగల రాగద్వేషములు మనుష్యుని మనస్సును దోచుకొను దొంగలని తెల్పబడినది. వాటి స్థూలరూపమే కామక్రోధములు. ఈ రెండింటిలోను కామము ముఖ్యమైనది. ఏలనన ఇది రాగముయొక్క స్థూలరూపము - దీని నుండియే క్రోధము ఉత్పన్నమగును. (2/62) ఈ భావమును తెల్పుటకే 'కామః' 'క్రోధః' అను రెండు పదములతో పాటు 'ఏషః' అను పదము రెండుసార్లు ప్రయుక్తమైనది. కామము రాగము నుండి ఉత్పన్నమగును. కనుక 'రజోగుణసముద్భవః' అను విశేషణము కామమునకు సంబంధించినది.

ప్రశ్న - కామక్రోధములు రెండును మనుష్యులకు శత్రువులైనప్పుడు భగవానుడు మొదట రెండింటిని

ప్రస్తావించి, పిదప కామమును ఒక్క దానినే శత్రువుగా తెలిసికొనుమని యేల చెప్పెను?

సమా - కామమునుండియే క్రోధము ఉత్పన్నమగునని ఇంతకు ముందే చెప్పబడినది. కనుక కామమునశించిన తోడనే క్రోధము తనంతట తానే రూపుమాయును. కనుక భగవానుడు కామమును మాత్రమే శత్రువుగా పేర్కొనెను. కాని పాపములకు హేతువు కేవలము కామమేయనియు, క్రోధముతో వాటికి ఎట్టి సంబంధమూ లేదనియు తలంచుటకు వీలులేదు. కావున ప్రకరణారంభమున కామముతోపాటు క్రోధము గూడ పేర్కొనబడినది.

ప్రశ్న - కామము యొక్క ఉత్పత్తి రజోగుణము నుండియా? లేక రాగము నుండియా?

సమా - రజోగుణము నుండి రాగము, రాగము నుండి రజోగుణము వృద్ధియగును. కనుక ఈ రెండింటి స్వరూపము ఒకటియేయని భావింప బడినది. (14/7) కనుక కామము యొక్క ఉత్పత్తికి రెండును కారణములే.

ప్రశ్న - కామము 'మహాశనః' అనగా ఎంతకును తృప్తి చెందనిది అనియనుటలోని విశేషమేమి?

సమా - భోగములను ఎంతగా అనుభవించినను ఈ కామము తృప్తిచెందదు. దీని దాహకశక్తి గొప్పది. నెయ్యి, సమిధలు వేసినకొలది అగ్ని వృద్ధియైనట్లు భోగములను అనుభవించిన కొలదియు భోగతృష్ణ పెఱుగుచునే యుండును. సామ, దాన, నీతిమార్గములద్వారా భోగములను ఆశచూపి, కామరూప శత్రువును జయించుటకు మానవుడు ఆలోచింపరాదు. దానిపై దండనీతిని ప్రయోగించుటయే సముచితము.

ప్రశ్న - కామమును 'మహాపాప్మా' అని యనుటలోని విశేషమేమి?

సమా - అన్ని యనర్థములకును కామమే మూలము. ఇచ్ఛలేకున్నను మానవుని పాపములకు ప్రేరేపించునది ప్రారబ్ధమూ కాదు, ఈశ్వరుడూ కాదు. ఈ కామమే మనుష్యుని వివిధభోగముల యందు ఆసక్తునిగాచేసి, బలవంతముగా పాపప్రవృత్తుని చేయును. కనుక దానిని మహాపాపియని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - 'ఈ విషయమున కామమును శత్రువుగా ఎఱుంగుము' - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - బలవంతముగా లాగుకొనిపోయి దుఃఖముల పాలు చేయుదానిని, మృత్యుముఖమున చేర్చుదానిని శత్రువుగా పరిగణింపవలెను. కనుక దానిని (శత్రువును) వీలైనంత శీఘ్రముగ తుదముట్టింపవలెను. ఈ కామము మనుష్యుని, అతని ఇష్టము లేకుండగనే, బలవంతముగా పాపములయందు ప్రవర్తింపజేసి, జననమరణరూప లేక నరకభోగరూప దుఃఖములయందు పడవేయును. కనుక దీనిని శ్రేయోమార్గమునకు పరమశత్రువని భావింపవలెను. భగవానుడు పరమదయాళువు. ప్రాణులకు సుహృదుడు. అతడెవ్వరిని పాపములయందు పడద్రోయడు. పురాకృతకర్మల ఫలానుభవమే ప్రారబ్ధము. ఎవ్వరినీ పాపములయందు పడద్రోయు శక్తి దానికి లేదు. కనుక పాపములయందు మనుజుని ప్రవృత్తునిగా జేయు శత్రువు కామమేగాని మఱెవ్వరును కాదు.

సంబంధము - అన్ని అనర్థములకును మూలమైనదియు, మనుష్యునకు ఇష్టము లేకున్నను వానిని పాపములలో పడద్రోయునదియు కామమే. కనుక అది శత్రువు - అని పూర్వశ్లోకమున పేర్కొనబడినది. ఈ కామము మనుష్యుని ఏ విధముగా పాపములయందు ప్రవృత్తునిగా చేయును? అను సందేహము కలుగుట సహజము - ఈ కామము మనుష్యుని జ్ఞానమును కప్పివేసి, అతనిని అంధునిగా జేసి, పాపములనెడి గోతిలో పడద్రోయునని భగవానుడు మూడు శ్లోకములలో వివరించుచున్నాడు-

**ధూమేనావ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ ।**
**యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥ 38 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యథా | = ఏవిధముగా | ఆవ్రియతే | = కప్పబడియుండునో | తథా | = అట్లే |
| ధూమేన | = పొగతో | యథా | = ఎట్లు | తేన | = ఆ కామముచే |
| వహ్నిః, చ | = అగ్నియు | ఉల్బేన | = మావి (మాయ)చే | ఇదమ్ | = ఈ జ్ఞానము |
| మలేన | = దుమ్ముతో | గర్భః | = గర్భము | ఆవృతమ్ | = కప్పబడి యుండును. |
| ఆదర్శః | = అద్దము | ఆవృతః | = కప్పబడియుండునో | | |

**పొగచే అగ్నియు, ధూళిచే అద్దము, మావిచే గర్భము కప్పివేయబడినట్లు, జ్ఞానము కామముచే ఆవృతమై యుండును. (38)**

ప్రశ్న - పొగచే అగ్నియు, ధూళిచే అద్దము, మావిచే గర్భము కప్పి వేయబడినట్లు కామముచే జ్ఞానము కప్పివేయబడును - అని యనుటలోని విశేషమేమి?

సమా - ఈ కామమే మల, విక్షేప, ఆవరణములు - అను మూడు దోషములుగా పరిణతి చెంది, మనుష్యుని జ్ఞానమును కప్పివేయును. ఇచ్చట ధూమస్థానమున విక్షేపము నుంచవలెను. ధూమము, (పొగ) చంచలమైనదేయైనను అగ్నిని కప్పివేయునట్లు చంచలమైన విక్షేపము జ్ఞానమును కప్పివేయును. ఏలనన ఏకాగ్రతలేని అంతఃకరణమునందు జ్ఞానము ప్రకాశింపదు. అది అణగియుండును. (మఱుగున బడి యుండును). ధూళిస్థానమున మలదోషమును భావింపవలెను. అద్దముపైన దుమ్ము పేరుకొనిపోయి యున్నప్పుడు అందు ప్రతిబింబము పడనట్లు పాపముల ద్వారా మలినమైన అంతఃకరణమునందు వస్తువు యొక్క లేక కర్తవ్యముయొక్క యథార్థస్వరూపము ప్రతిభాసితముకాదు. అందువలన మనుజుడు దానిని యథార్థముగా వివేచన చేయజాలడు. మావిస్థానమున ఆవరణదోషమును ఊహింపవలెను. మావివలన గర్భము ఆచ్ఛాదితమైనట్లు ఆవరణమువలన జ్ఞానము కప్పివేయబడును. అజ్ఞానముచే మోహితమైన అంతఃకరణము గల మానవుడు నిద్రా-ఆలస్యాది సుఖావస్థలలో బడి ఏ విధమైన ఆలోచనయు చేయడు.

కామమే మనుష్యుని అంతఃకరణమునందు బహువిధములైన భోగములయెడ తృష్ణను వృద్ధిచేసి, దానిని విక్షిప్తము చేయును. ఇదియే మనుష్యునిచే అనేక విధములగు పాపములను చేయించి, అతని అంతఃకరణమునందు మలదోషమును వృద్ధి చేయును. ఇదియే అతనికి నిద్ర, సోమరితనము, అకర్మణ్యత్వములయందు సుఖబుద్ధిని కలుగజేసి, అతనిని సర్వథా వివేకశూన్యునిగా చేయును. కావున కామము మూడువిధములుగా జ్ఞానమును ఆచ్ఛాదితమొనర్చునని చెప్పబడినది.

ప్రశ్న - ఇచట 'తేన' అను పదమునకు 'కామము' అనియు, 'ఇదమ్' అను పదమునకు 'జ్ఞానము' అనియు, అర్థము చెప్పుటకు ఆధారమేమి?

సమా - ఇంతకు ముందు (37వ) శ్లోకమున భగవానుడు కామమును శత్రువుగా భావింపుమని తెల్పియుండెను. ఈ శ్లోకమున ఈ కామముచేతనే జ్ఞానము కప్పబడునని స్పష్టపఱచెను. కావున 'తేన' అను సర్వనామము కామమునకు మాఱుగాను, 'ఇదమ్' అను సర్వనామము జ్ఞానమునకు మాఱుగాను ఉపయుక్తములైనట్లు గ్రహింపవలెను.

*సంబంధము - పూర్వ (38వ) శ్లోకమున 'తేన' అను పదము కామమును, 'ఇదమ్' అను పదము జ్ఞానమును సూచించునని తెల్పబడెను. ఈ విషయమును స్పష్టపఱచుటకే కామము అగ్నివలె ఎన్నడును తృప్తి చెందదని తెలుపబడుచున్నది-*

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥ 39 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | | కానిదియు | నిత్యవైరిణా | = నిత్యవైరియుఐన |
| కౌంతేయ! | = ఓ అర్జునా! | కామరూపేణ | = కామరూపాత్మక | ఏతేన | = ఈకామముచే |
| అనలేన | = అగ్నివంటిదియు | | మైనదియు | జ్ఞానమ్ | = జ్ఞానము |
| దుష్పూరేణ | = పూరింపసాధ్యము | జ్ఞానినః | = జ్ఞానికి | ఆవృతమ్ | = కప్పబడియుండును. |

ప్రశ్న - 'అనలేన' 'దుష్పూరేణ' అను పదద్వయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - చాలును. ఇంక ఏమియు అవసరములేదు - అని, తృప్తిని సూచించునది 'అలమ్' అను పదము. ఈ

తృప్తిభావము లేనిదానిని 'అనలం' అని యందురు. అగ్నిలో నెయ్యి, ఇంధనములు ఎంతవేసినను అది తృప్తి చెందదు. కనుక అగ్నికి అనలము అని పేరు. ఏ విధముగను దాని తృష్ణను పూరించుట వీలుపడదు. గావున దానిని 'దుష్పూరమ్' అనియు అందురు. కామము గూడ అగ్నివలె 'అనలమ్' 'దుష్పూరమ్' మానవుడు విషయ భోగములను అనుభవించిన కొలదియు అగ్నివలె వాటియెడ కామము (కోరికలు) వృద్ధియగుచునే యుండును గాని తృప్తి ఏర్పడదు. యయాతి పెక్కు భోగములను అనుభవించిన పిమ్మట చివరకు ఇట్లనెను-

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥
*(శ్రీమద్భాగవతం - 9/19/14)*

విషయములను అనుభవించుట వలన కామము (కోరికలు) ఎన్నటికి చల్లారుట జరుగదు. నెయ్యి పడుటవలన వృద్ధియగు అగ్నిజ్వాలవలె అది అధికమగుచునే యుండును.

ప్రశ్న - ఇచ్చట 'జ్ఞానినః' అను పదము ఎట్టి జ్ఞానులను సూచించును? మఱియు 'కామము' వారికి 'నిత్యవైరి' అని పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - యథార్థజ్ఞానప్రాప్తికై సాధన చేయు వివేకశీలురైన సాధకులను సూచించునదియే 'జ్ఞానినః' అను పదము. ఈ కామమను శత్రువు ఆసాధకుల అంతఃకరణమునందు వివేకవైరాగ్యములను నిష్కామభావమును స్థిరముగా ఉండనీయక వారి సాధనకు విఘాతము కల్గించుచుండును. కావున దీనిని జ్ఞానులకు 'నిత్యవైరి' అని తెల్పుట జరిగినది. వాస్తవముగా ఈ కామము అందఱిని అధోగతిపాలు చేయునదియే. కనుక ఇది అందఱికిని వైరియే - కాని అవివేకి యైనవాడు విషయములను అనుభవించు సమయమున ఆ భోగములయందు సుఖబుద్ధి కలిగి యుండుటవలన భ్రమపడి దీనిని మిత్రునిగా భావించును. దీని తత్త్వము నెఱిగిన వివేకి ఇది హానికరమని భావించును. కనుక ఈ కామము అవివేకులకు (అజ్ఞానులకు) నిత్యవైరియని తెలుపక, జ్ఞానులకు నిత్యవైరియని తెల్పబడినది.

ప్రశ్న - ఇచట 'కామరూపేణ' అను పదము ఏ కామమును సూచించును?

సమా - ప్రాపంచిక విషయభోగముల యెడగల కోరికలను తెలుపునదియే ఇచటి 'కామరూపేణ' అను పదము - ఇది దుర్గుణశ్రేణిలో పరిగణింపబడును. దీనిని త్యజింపవలెనని గీతయందు పలుచోట్ల పేర్కొనబడినది. (2/71, 6/24). 16వ అధ్యాయమున దీనిని నరకద్వారముగా పేర్కొనుట జరిగినది. (16/21) భగవత్ప్రాప్తికిని, భగవద్భజన ధ్యానాదులను ఆచరించుటకును, అట్లే సాత్త్విక కర్మలను అనుష్ఠించుటకును కలిగియుండు శుభేచ్ఛలను 'కామము' అనిభావింపరాదు. అది మనుష్యునకు శ్రేయోదాయకము. మఱియు అది విషయ భోగేచ్ఛారూపకామమును నశింపజేయునది. అది సాధకునకు శత్రువుకానేరదు. కనుక గీతయందు 'కామము' అను పదమునకు ప్రాపంచికములైన ఇష్టానిష్టభోగముల సంయోగవియోగముల యెడ గల కోరికలు, లేక భోగ్యపదార్థములు అను నర్థమును గ్రహింపవలెను. అదే విధముగ 34వ శ్లోకమునందును, మఱియు ఇతరత్ర ప్రయుక్తమైన 'రాగము', 'సంగము' అను పదములకు గూడ భగవద్విషయకమైన అనురాగమని అర్థమును చెప్పక కామోత్పాదక 'భోగాసక్తి'యేయని గ్రహింపవలెను.

ప్రశ్న - 'జ్ఞానము' అనుపదము ఎట్టి జ్ఞానమును సూచించును? అది కామముచే కప్పి వేయబడును - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇచట 'జ్ఞానము' అను పదము పరమాత్మ యొక్క యథార్థజ్ఞానమును సూచించును. మావిచే కప్పబడినను శిశువు ఆ మావిని చీల్చుకొని, బయటికి వచ్చుటకు సమర్థుడగును. ప్రజ్వలించుచున్న అగ్ని తనను ఆవరించిన పొగను పారద్రోలును. అదే విధముగ సత్పురుషుల సాంగత్యము వలనను, శాస్త్రములయొక్క ఉపదేశముల ద్వారాను పరమాత్మని తత్త్వజ్ఞానము కలిగినంతనే కామముచే కప్పబడినప్పటికిని అది (ఆ జ్ఞానము) కామమును రూపుమాపి స్వయంప్రకాశకమగును. కనుక కామము జ్ఞానమును కప్పియుంచినప్పటికిని వాస్తవముగా జ్ఞానము కంటెను అది బలహీనమైనదే.

సంబంధము - జ్ఞానము కామముచే ఆవృతమై యుండునని తెలిపిన పిదప దానిని రూపుమాపుటకు ఉపాయమును తెలుపునుద్దేశ్యముతో దాని వాసస్థానములను, దాని ద్వారా జీవాత్మ మోహితమగుటను గూర్చియు తెలుపుచున్నాడు-

**ఇంద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।**
**ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥ 40 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఇంద్రియాణి | = ఇంద్రియములు | అధిష్ఠానమ్ | = వాసస్థానము అని | జ్ఞానమ్ | = జ్ఞానమును |
| మనః | = మనస్సు | ఉచ్యతే | = చెప్పబడును | ఆవృత్య | = కప్పివేసి |
| బుద్ధిః | = బుద్ధి | ఏషః | = ఇది (ఈ కామము) | దేహినమ్ | = జీవాత్మను |
| అస్య | = దీనికి | ఏతైః | = వీటిద్వారా | విమోహయతి | = మోహితముగాజేయును |

**ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఈ కామమునకు నివాసస్థానములు. ఇది (ఈకామము) మనోబుద్ధీంద్రియముల ద్వారా జ్ఞానమును కప్పివేసి, జీవాత్మను మోహితునిగా చేయును. (40)**

ప్రశ్న - మనోబుద్ధీంద్రియములు కామమునకు వాసస్థానములు - అని తెల్పుటలోని వైశిష్ట్యమేమి?

సమా - మనోబుద్ధీంద్రియములు మనుష్యుని వశములో ఉండవు. అందువలన కామము వాటిని తన అదుపులో ఉంచుకొనును. కనుక శ్రేయస్సును కోరుకొను మనుష్యుడు తన మనోబుద్ధీంద్రియముల నుండి ఈ కామరూప శత్రువును శీఘ్రముగనే పారద్రోలవలెను, లేక అచటనే దానిని నిల్పి తుదముట్టింపవలెను. లేనిచో అది ఇంటిలో ప్రవేశించిన శత్రువు వలె మానవజీవితమనెడి అమూల్యధనమును నష్టపఱచును.

ప్రశ్న - ఈ కామము మనోబుద్ధీంద్రియముల ద్వారా జ్ఞానమును కప్పివేసి, జీవాత్మను మోహిత మొనర్చును - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ కామము మనుష్యుని మనోబుద్ధీంద్రియముల యందు ప్రవేశించి, అతని వివేకశక్తిని నష్టపరచును. భోగములలో సుఖమున్నట్లు చూపి, అతనిని పాపకార్యముల యందు ప్రవృత్తుడగునట్లు చేయును. దానివలన మనుష్యుడు అధోగతి పాలగును. కనుక అతడు శీఘ్రముగ జాగృతుడు కావలెను.

ఈ విషయము ఒక కల్పితదృష్టాంతము ద్వారా వివరింపబడుచున్నది. చేతనసింహుడు అను ఒక రాజుగలడు. అతని ప్రధానమంత్రి పేరు జ్ఞానసాగరుడు. ఆ ప్రధానమంత్రి అధీనములో అతనికి సహకార మందించుటకు చంచలసింహుడను ఒక సహాయమంత్రియుండెను. రాజు తన ప్రధాన మంత్రితో సహాయమంత్రితో గూడ తన రాజధానియైన మధ్యపురియందు నివసించుచుండెను. రాజ్యము పది జిల్లాలుగా విభజింపబడి యుండెను. ప్రతి జిల్లాకును ఒక ఉన్నతాధికారి నియుక్తుడైయుండెను. రాజు మిక్కిలి విచారశీలుడు, కర్మపరతంత్రుడు, సుశీలుడు, అతని రాజ్యమున అందఱును సుఖులైయుండిరి. రాజ్యము దినదినప్రవర్ధమాన మగుచుండెను. ఒకనాడు అతని రాజ్యమున జగన్మోహనుడు అను పేరుగల కపటి ప్రవేశించెను. అతడు చాల కుత్సితుడు, మోసగాడు. అతడు లోపల కపటమును విషము నింపుకొని బయటికి తియ్యగా మాటలాడుచుండువాడు. అతడు తనతో మాట్లాడువారి నందఱిని మోహితులను చేయుచుండెడివాడు. అతడొక వ్యాపారివేషములో వచ్చి, జిల్లా అధికారులను అందఱిని కలిసి ఆ రాజ్యము నందు వ్యాపారము చేసికొనుటకు అనుమతిని కోరెను. జిల్లా అధికారులకు ధనమును ఆశ చూపెను. వారతని ధనమునకు ఆశపడిరి. కాని పై అధికారుల అనుమతి లేనిదే వారు ఏమియును చేయజాలకుండిరి. జగన్మోహనుని సలహా మేరకు వారందఱును కలిసి, సహాయమంత్రియైన చంచలసింహుని యొద్దకు అతనిని తీసికొని వెళ్ళిరి. చంచలసింహుడు కూడ ఆ కపట వ్యాపారి తియ్యని మాటలకును, ప్రలోభములకును లోబడి పోయెను. చంచలసింహుడు జ్ఞానసాగరుడను ప్రధానమంత్రి కడకు ఆ వ్యాపారిని తీసికొనిపోయెను. జ్ఞానసాగరుడు బుద్ధిమంతుడేయైనను అతడు దుర్బల హృదయుడు. అతడు చక్కగా ఆలోచించి, ఒక నిర్ణయమునకు వచ్చువాడు కాడు.

కనుక తన సహాయమంత్రియైన చంచలసింహుని యొక్కయు, పదిజిల్లాల అధికారుల యొక్కయు సలహాల మేరకు నడచుచుండెడివాడు. ఆ అవకాశమును వారు తమ స్వార్థములకు ఉపయోగించుకొనుచుండిరి. ఇప్పుడు అతడు చంచలసింహాదుల మాటలను నమ్మి కపట వ్యాపారి వలలో పడిపోయెను. అతడు వ్యాపారి కోరికను మాటవరుసకు సమ్మతించెను. కాని చేతనసింహుని (రాజుగారి) ఆజ్ఞలేనిదే రాజ్యమున వ్యాపారము చేసికొనుటకు అనుమతినిచ్చుటకు వీలు లేదని తెల్పెను. చివరకు కపటవ్యాపారి సలహామేరకు అతనిని ప్రధానమంత్రి రాజుగారికడకు తీసికొని వెళ్ళెను. ఆ కపటవ్యాపారి మిక్కిలి చతురుడు. రాజుకు గూడ గొప్ప ఆశలు చూపెను. రాజు కూడ ఆశలకు లోబడి ఆ కపట వ్యాపారికి తన రాజ్యమున అంతటను నిరాటంకముగ వ్యాపారము చేసికొనుటకును, కొట్లు పెట్టుకొనుటకును అనుమతినిచ్చెను. జగన్మోహనుడు జిల్లా అధికారులకును, ఇద్దఱు మంత్రులకును వారు సంతోషపడునట్లుగా ధనమిచ్చి వారిని లోబరచుకొనెను. పిమ్మట తన వ్యాపారీతిలో రాజ్యమంతటా వలపన్నెను. సర్వత్ర అతని ప్రభావము పెటిగెను. అతడు నిరాటంకముగా ప్రజలను దోచుకొనసాగెను. జిల్లా అధికారులు, ఇద్దఱు మంత్రులు అతని ప్రలోభములకు ఇదివఱకే వశమైయుండిరి. ప్రజలను కొల్లగొట్టిన ధనములో కొంతభాగమును ఇచ్చి, రాజును గూడ అతడు లోబఱచుకొనెను. తన వంచనా కౌశలముతో కల్లబొల్లి మాటలతో రాజును, విషయలోలురైన ఇతర అధికారులను, చెడుత్రోవల బట్టించి, అందఱిని శక్తిహీనులుగా, అకర్మణ్యులుగా, దుర్వ్యసనపరులుగా జేసెను. తిన్నగా రహస్యముగా తన బలమును పెంచుకొని రాజ్యముపైన సంపూర్ణాధికారమును చేజిక్కించుకొనెను. ఈ విధముగా రాజుయొక్క సర్వస్వమును కొల్లగొట్టి, రాజును పదవీభ్రష్టునిజేసి అతనిని కారాగారమున నుంచెను.

ఈ దృష్టాంతమును ఈ విధముగా అర్థము చేసికొనవలెను. రాజైన చేతనసింహుడు జీవాత్మ. అతని ప్రధానమంత్రి జ్ఞానసాగరుడు బుద్ధి. సహాయమంత్రి చంచలసింహుడు మనస్సు. రాజధాని మధ్యపురి హృదయము. పదిజిల్లాల అధికారులు దశేంద్రియములు. పది జిల్లాలు ఈ ఇంద్రియ స్థానములు. కపట వ్యాపారి జగన్మోహనుడు కామము. విషయభోగ ప్రలోభములే ఆశలు. విషయభోగములయందు ముంచి, జీవాత్మను నిజమైన సుఖమునుండి భ్రష్టుని గావించుటయే అతని సర్వస్వమును దోచుకొనుట - జీవాత్మయొక్క జ్ఞానమును కప్పివేసి, సర్వథా మోహితునిగా జేసి, మానవజీవిత పరమ లక్ష్యము నుండి అతనిని దూరము చేయుటయే కారాగారమున బంధించుటయగును. కామము శ్రేయోమార్గమును భంగపఱచునట్టిది. అది దుర్జయమైన శత్రువు. అది మనోబుద్ధీంద్రియములను విషయభోగమిథ్యా సుఖముల ద్వారా ప్రలోభపఱచి, వాటిని అదుపులో నుంచును. ఈ మనోబుద్ధీంద్రియముల ద్వారా విషయ సుఖరూపలోభములచే జీవాత్మయొక్క జ్ఞానమును కప్పివైచి, దానిని మోహమయ సంసారములో పడవేయును. పరమాత్మప్రాప్తియను శాశ్వత సంపదనుండి దూరముచేసి, అమూల్యమైన మానవ జీవితమును అధోగతి పాలుచేయును.

*సంబంధము - భగవానుడు కామరూప శత్రువుయొక్క దుష్కృత్యములను, దాని వాసస్థానములను తెలిపెను. ఈ కామరూప శత్రువును రూపుమాపు ఉపాయములను తెలుపుచు, దానిని నిర్మూలింపుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు-*

**తస్మాత్ త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన | ఇంద్రియాణి | = ఇంద్రియములను | ఏనమ్, పాప్మానమ్ | = మహాపాపియైన ఈ కామమును |
| భరతర్షభ! | = ఓ అర్జునా! | నియమ్య | = అదుపుచేసి | | |
| త్వమ్ | = నీవు | జ్ఞానవిజ్ఞాన-నాశనమ్ | = జ్ఞానవిజ్ఞానములను నశింపజేయునట్టి | హి | = అవశ్యముగా |
| ఆదౌ | = మొదట | | | ప్రజహి | = సంహరింపుము. |

**కావున ఓ అర్జునా! మొదట ఇంద్రియములను వశపఱచుకొనుము. పిదప జ్ఞానవిజ్ఞానములను నశింపజేయునట్టి మహాపాపియైన ఈ కామమును అవశ్యముగా సర్వశక్తులనొడ్డి రూపుమాపుము. (41)**

ప్రశ్న - 'తస్మాత్' 'ఆదౌ' అను రెండు పదములను ప్రయోగించి 'ఇంద్రియములను వశపఱచుకొనుము' అని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - 'తస్మాత్' అను పదము హేతువాచకము. కామమే సమస్త - అనర్థములకు మూలము. ఇది మొదట ఇంద్రియములయందు ప్రవేశించి, వాటిద్వారా మనస్సును బుద్ధిని, ఆ పిమ్మట జీవాత్మను మోహములో ముంచివేయును. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు దీనికి వాసస్థానములు. కనుక మొదట ఇంద్రియములను అదుపులో నుంచుకొని, ఈ కామరూపశత్రువును నిర్మూలింపవలెనని తెల్పుటకే 'ఆదౌ' అను పదమును ప్రయోగించి, ఇంద్రియములను వశపఱచుకొనుమని భగవానుడు పలికెను. ఈ కామముయొక్క వాసస్థానములను (మనోబుద్ధీంద్రియములను) నిగ్రహించుటద్వారా దీనిని నిర్జించుట సులభమగును. కనుక మొదట ఇంద్రియములను పిమ్మట మనస్సును నిరోధింపవలెను.

ప్రశ్న - ఇంద్రియములను వశపరచుకొను ఉపాయమేమి?

సమా - అభ్యాసము, వైరాగ్యము అను రెండు ఉపాయముల ద్వారా ఇంద్రియములు వశమగును. మనస్సును వశపఱచుకొనుటకు గూడ ఈ రెండు ఉపాయములే తెల్పబడినవి. (6/35) విషయేంద్రియ సంయోగమువలన కలుగు రాజస సుఖమును, (18/38) అట్లే నిద్రాలస్య ప్రమాద జనితమైన తామస సుఖమును (18/39) వాస్తవముగా క్షణికములు, నశ్వరములు, దుఃఖ దాయకములు అని తెలిసికొని, ఇహపరలోక భోగములన్నింటి యందును విరక్తుడగుటయే వైరాగ్య మనబడును. పరమాత్మ యొక్క నామరూపగుణ చరిత్రాదులను శ్రవణ, కీర్తన, మననాదులను గానించుట, నిస్స్వార్థ భావముతో లోకసేవాకార్యక్రమములయందు ఇంద్రియములను నిమగ్నమొనర్చుట, ధారణా శక్తి ద్వారా ఇంద్రియములను, శాస్త్ర విహితకర్మల వైపు మళ్ళించుట, ఇంద్రియముల యందు స్వేచ్ఛా ప్రవృత్తిని మొలకెత్తనీయకుండ చేయుట మొదలగు వాటినన్నింటిని అభ్యాసములనియందురు. ఈ రెండు ఉపాయముల ద్వారానే ఇంద్రియములను మనస్సును వశపరచుకొన వచ్చును.

ప్రశ్న - ఇచట 'జ్ఞానము' 'విజ్ఞానము' అను రెండు పదముల అర్థమేమి? కామము ఈ రెండింటిని నశింపజేయును - అని అనుటలోని అంతరార్థమేమి?

సమా - భగవంతుని నిర్గుణనిరాకార తత్త్వముల ప్రభావమహత్త్వ రహస్యముల యథార్థజ్ఞానమును 'జ్ఞాన'మనియందురు. అట్లే సగుణ నిరాకార దివ్యసాకార తత్త్వముల లీలారహస్య గుణమహత్త్వ ప్రభావముల యథార్థ జ్ఞానమును 'విజ్ఞాన' మని యందురు. ఈ జ్ఞాన విజ్ఞానముల ప్రాప్తికై హృదయమునందు ఉత్పన్నమగు ఆకాంక్షను ఈ కామమను మహాశత్రువు తన మోహినీ శక్తిద్వారా నిత్యము నిరంతరము అణచివేయుచుండును. అనగా ఈ ఆకాంక్ష జాగృతమగుట వలన ఉత్పన్నమగు జ్ఞాన విజ్ఞానముల సాధనములకు అవరోధములు కల్గించుచుండును. ఫలితముగా అవి (జ్ఞానవిజ్ఞానములు) బహిర్గతములు కాజాలవు. కనుక కామము వాటిని నశింపజేయునదియని తెలుపబడినది. నాశము అను పదమునకు రెండర్థములు గలవు. ప్రకటితము కాకుండ చేయుట, మఱియు పూర్తిగా రూపుమాపుట - ఇచట నాశము అను పదము 'ప్రకటితము కాకుండ చేయుట' అను అర్థములో ప్రయుక్తమైనది. ఏలనన పూర్వశ్లోకముల యందును జ్ఞానము కామముచే కప్పబడియుండునట్లు తెల్పబడినది. జ్ఞానవిజ్ఞానములను సమూలముగా రూపుమాపు శక్తి కామమునకు లేదు. ఏలనన అది అజ్ఞానమునుండి ఉత్పన్నమైనది. కనుక జ్ఞానవిజ్ఞానములు ఒకసారి ప్రకటితము ఐనంతనే అజ్ఞానము సమూలముగా రూపుమాయును. అపుడు జ్ఞానవిజ్ఞానములు నశించుననుప్రశ్నయే ఉదయింపదు.

*సంబంధము - ఇంద్రియములను వశపఱచుకొని కామరూప శత్రువును నిర్జింపుమని పూర్వశ్లోకమున తెల్పబడినది. కాని మనోబుద్ధీంద్రియములపై కామము అధికారము కల్గియున్నప్పుడు వాటిద్వారా అది జీవాత్మను మోహములో పడవేసి యుండు స్థితిలో ఇంద్రియములను వశపఱచుకొని కామమును నిర్జించుటకు ఎట్లు వీలగును? అను సందేహము కలుగవచ్చును. ఈ సంశయమును తొలగించుటకు భగవానుడు ఆత్మయొక్క యథార్థ స్వరూపమును తెల్పుటకై ఆత్మశక్తిని గూర్చి అర్జునునకు జ్ఞాపకము చేయుచున్నాడు-*

**ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥ 42 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇంద్రియాణి | = ఇంద్రియములు | ఇంద్రియేభ్యః | = ఇంద్రియములకంటెను | తు | = మఱియు |
| పరాణి | = (స్థూలశరీరముకంటెను) శ్రేష్ఠములు, బలీయములు, సూక్ష్మములు | మనః | = మనస్సు | యః | = ఏదైతే |
| | | పరమ్ | = శ్రేష్ఠమైనది, సూక్ష్మమైనది | బుద్ధేః, పరతః | = బుద్ధికంటెను శ్రేష్ఠమైనదో |
| | | మనసః, తు | = మనస్సుకంటెను | | |
| ఆహుః | = (అని)అందురు | బుద్ధిః, పరా | = బుద్ధి శ్రేష్ఠమైనది | సః | = అది (ఆత్మ) |

**స్థూలశరీరముకంటెను ఇంద్రియములు బలీయములు, సూక్ష్మములు, శ్రేష్ఠములు అని పేర్కొందురు. ఇంద్రియములకంటెను మనస్సు, దానికంటెను బుద్ధి శ్రేష్ఠమైనవి. ఆ బుద్ధికంటెను అత్యంతశ్రేష్ఠమైనది, సూక్ష్మమైనది ఆత్మ. (42)**

ప్రశ్న - స్థూల శరీరముకంటెను ఇంద్రియములు శ్రేష్ఠములు, బలీయములు, సూక్ష్మములు అని చెప్పుటకు ఆధారమేమి?

సమా - కఠోపనిషత్తునందు శరీరము రథమనియు, ఇంద్రియములు గుఱ్ఱములనియు పేర్కొనబడినవి. (1/3/3-4) రథముకంటె గుఱ్ఱములు శ్రేష్ఠములు మఱియు చేతనములు. అవి రథమును తమ ఇచ్ఛానుసారము కొనిపోగలవు. అట్లే ఇంద్రియములు ఈ స్థూలదేహమును తమ ఇచ్ఛానుసారము నడిపింపగలవు. కనుక శరీరముకంటెను అవి బలీయములు, చేతనములు. స్థూలశరీరము కన్నులకు గోచరమగు చుండును. ఇంద్రియములు గోచరములు కావు. అందువలన అవి సూక్ష్మములు. ఇంతేగాక స్థూలశరీరముకంటెను ఇంద్రియముల యొక్క శ్రేష్ఠత్వము, సూక్ష్మత్వము, బలము ప్రత్యక్షముగగూడ గోచరించును.

ప్రశ్న - కఠోపనిషత్తులో (1/3/10-11) ఇంద్రియముల కంటెను ఇంద్రియార్థములు (పంచతన్మాత్రలు), వాటికంటెను మనస్సు శ్రేష్ఠములనియు, మనస్సు కంటెను బుద్ధి, బుద్ధికంటెను మహత్తత్త్వము, సమిష్టి బుద్ధిరూపమహత్తత్త్వము కంటెను అవ్యక్తము, అవ్యక్తము కంటెను పురుషుడు శ్రేష్ఠములని తెల్పబడెను. ఈ పురుషునికంటెను శ్రేష్ఠము, సూక్ష్మము, అయినదేదియును లేదనియు, అదియే అన్నింటికిని పరాకాష్ఠ, పరమగతి అనియు తెల్పబడినది. కాని ఇచట భగవానుడు ఇంద్రియార్థములను మహత్తత్త్వమును, అవ్యక్తమును, ప్రస్తావింపలేదు. దీనికి కారణమేమి?

సమా - భగవానుడు ఈ విషయమును సారరూపమున వర్ణించెను. కనుక ఈ మూడింటిని గూర్చి ప్రస్తావింపలేదు. ఏలనన కామమును రూపుమాపుటకై ఇంద్రియార్థములు మహత్తత్త్వము, అవ్యక్తముల శ్రేష్ఠత్వమును నిరూపింపనవసరము లేదు. ఇచట కేవలము ఆత్మయొక్క మహత్త్వమును గూర్చియే తెలుపవలసి యున్నది.

ప్రశ్న - కఠోపనిషత్తులో ఇంద్రియములకంటెను అర్థములు (ఇంద్రియార్థములు) శ్రేష్ఠములైనవని తెల్పుటకు కారణమేమి?

సమా - 'అచట అర్థములనగా పంచతన్మాత్రలు. ఈ తన్మాత్రలు ఇంద్రియములకంటెను సూక్ష్ములైనవి. కనుక వాటిని శ్రేష్ఠములని తెల్పుట సముచితము.

ప్రశ్న - ఇచ్చట భగవంతుడు 'ఇంద్రియములకంటెను మనస్సును, దానికంటెను బుద్ధిని శ్రేష్ఠము, సూక్ష్మము, బలీయము అని తెల్పెను. కాని రెండవ అధ్యాయము నందు 'ప్రయత్నశీలుడైన బుద్ధిమంతుని మనస్సును గూడ ప్రమథన శీలములైన ఇంద్రియములు బలవంతముగ హరించును.' అని తెల్పియుండెను. (2/60). అట్లే 'విషయముల యందు చరించు ఇంద్రియములలో ఏ ఒక్కదానితో మనస్సు కూడిఉన్నను ఆ ఒక్క ఇంద్రియమే మనుష్యుని బుద్ధిని హరించును. (2/67) అని చెప్పబడినది. ఈ వాక్యములను బట్టి మనస్సు కంటెను ఇంద్రియములు

ప్రబలములైనవనియు, ఇంద్రియములు మనస్సుతో కూడియున్నప్పుడు అవి బుద్ధికంటెను ప్రబలములై యుండునట్లును స్పష్టమగును. కనుక పూర్వాపరములయందు వైరుధ్యము గోచరించుచున్నది. కావున దీని స్పష్టీకరణ అవసరము.

సమా - కఠోపనిషత్తు రథముయొక్క దృష్టాంతము ద్వారా ఈ విషయమును సమగ్రముగా వివరించినది. ఆత్మ రథికుడు, బుద్ధి అతని సారథి, శరీరము రథము, మనస్సు పగ్గములు, ఇంద్రియములు గుఱ్ఱములు, శబ్దాది విషయములే వాటి మార్గములు.[1] వాస్తవముగా సారథి రథికునకు అధీనుడుగను, సారథికి పగ్గములు, పగ్గములకు గుఱ్ఱములు అధీనములై యుండుట యుక్తమే. ఐనను బుద్ధియనుసారథి వివేక శూన్యుడైనప్పుడు పగ్గములు నియమానుసారము పట్టుకొనలేడు. అట్టిస్థితిలో ఇంద్రియములనెడి గుఱ్ఱములు విశృంఖలములై దుష్టాశ్వములవలె అవ (విషయ) మార్గముల వెంటకొనిపోయి, జీవాత్మయను రథికుని గోతిలో పడవేయును.[2] కనుక మనోబుద్ధీంద్రియములపైన జీవాత్మయొక్క ఆధిపత్యము ఉండనంతవఱకును అతడు తన సామర్థ్యమును మఱచి, వాటికి అధీనుడై పోవును. అపుడు ఇంద్రియములు మనస్సును, బుద్ధిని, మోసగించి, వాటిని బలవంతముగా లాగుకొనిపోయి తప్పుత్రోవ పట్టించును. ఇంద్రియములు మొదట మనస్సునకు విషయసుఖముల ఆశచూపి దానిని తమకు అనుకూలముగా చేసికొనును. పిమ్మట ఇంద్రియములు, మనస్సు ఏకమై బుద్ధిని తమ వైపునకు త్రిప్పుకొనును. ఇవి యన్నియుతోడై ఆత్మనుగూడ తమ అధీనములోనికి తెచ్చుకొనును. కాని వాస్తవముగ ఇంద్రియములకంటెను మనస్సు, మనస్సుకంటెను బుద్ధి, వీటి అన్నింటికంటెను ఆత్మయే బలీయమైనది. కనుక బుద్ధియను సారథి వివేక శీలుడైనప్పుడు మనస్సనెడి పగ్గములు అతని అధీనములో ఉండును. అప్పుడు ఇంద్రియములనెడి గుఱ్ఱములుగూడ శ్రేష్ఠములైన గుఱ్ఱముల వలె అతని వశములో ఉండునని కఠోపనిషత్తు పేర్కొనుచున్నది. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు స్వాధీనములో ఉన్న పవిత్రాత్మ పరమపదమునుచేరి మఱల తిరిగి వచ్చుటయే యుండదు.[3]

1) ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవ తు । బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥
ఇంద్రియాణి హయానాహుః, విషయాంస్తేషు గోచరాన్ । ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥
(కఠోపనిషత్ 1/3/3-4)

ఆత్మను రథికునిగా, శరీరమును రథముగా ఎఱుంగుము. బుద్ధిని సారథియనియు, మనస్సును పగ్గమనియు గ్రహింపుము. ఇంద్రియములను గుఱ్ఱములనియు, విషయములను వాటి మార్గములనియు, వివేకవంతులైనవారు తెలిపెదరు. శరీరేంద్రియ మనస్సులతోగూడిన ఆత్మనే భోక్తయని పేర్కొందురు.

2) యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా । తస్యేంద్రియాణ్యవశ్యాని, దుష్టాశ్వా ఇవ సారథేః ॥
యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః । న స తత్పదమాప్నోతి, సంసారం చాధిగచ్ఛతి ॥
(కఠోపనిషత్ - 1/3/5,7)

కాని బుద్ధియనెడి సారథి సర్వదా అవివేకియైనప్పుడు చిత్తము అతని వశములో లేనప్పుడు సారథి అధీనములో లేని దుష్టాశ్వములవలె అతని ఇంద్రియములు అదుపు తప్పి ప్రవర్తించును. బుద్ధిరూప సారథి విజ్ఞాని కానిచో, అతడు తన మనస్సును అదుపులో ఉంచుకొనలేడు. అతడు సదా అపవిత్రుడే యగును. అతడు పరమపదమును పొందలేడు. సంసారములోనే పడియుండును.

3) యస్తువిజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా । తస్యేంద్రియాణి వశ్యాని, సదశ్వా ఇవ సారథేః ॥
యస్తువిజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః । స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే ॥
(కఠోపనిషత్ 1/3/6,8)

కాని బుద్ధి యనెడి సారథి వివేకవంతుడు (కుశలుడు) అట్లే సమాహిత చిత్తుడు ఐనప్పుడు అతని ఇంద్రియములు ఉత్తమాశ్వములవలె (సుశిక్షితములైన గుఱ్ఱములవలె) అతని అధీనములో ఉండును. అట్లే విజ్ఞానియు, మనోనిగ్రహము గలవాడును, సర్వదా పవిత్రుడును ఐనవాడు పరమపదమును పొందును. అచటి (ఆ పరమపదము) నుండి అతడు తిరిగి రాడు. అనగా అతనికి పునర్జన్మ యుండదు.

గీతయందును మనోబుద్ధీంద్రియములను జయించినవానికి తన ఆత్మ మిత్రమనియు, అట్లు జయింపనివానికి శత్రువనియు తెల్పబడినది. (6/6) కనుక సహజముగ మనోబుద్ధులకంటెను ఇంద్రియములు దుర్బలములు. కాని జయింపబడని ఇంద్రియములు మాత్రము మనోబుద్ధులకంటెను ప్రబలములగును. ఈ విషయమే (రెండవ) అధ్యాయమునందు వివరింపబడినది. ఇచట వాటి వాస్తవిక స్థితి తెల్పబడినది. కావున పూర్వా పరములయందు ఎట్టి వైరుధ్యమూ లేదు.

ప్రశ్న - ఇచట 'పరతః' అనుపదమునకు అత్యంత శ్రేష్ఠము - అను అర్థమును చెప్పుటలోని విశేషమేమి?

సమా - కఠోపనిషత్తునందును ఈ విషయము వివరింపబడినది. అచట బుద్ధికంటెను మహత్తత్త్వము, దానికంటెను అవ్యక్తము శ్రేష్ఠమైననియు, అవ్యక్తముకంటెను పురుషుడు పరమశ్రేష్ఠుడనియు తెల్పబడినది. ఆ పురుషుడే పరాకాష్ఠ. అతనికంటెను శ్రేష్ఠమైన దేదియును లేదు.[1] ఆశ్రుతివాక్యమునే స్పష్టపఱచుటకు ఇచట 'పరతః' అను పదమునకు అత్యంత శ్రేష్ఠము అను అర్థము చెప్పబడినది. ఆత్మ అన్నిటికిని ఆధారము, కారణము, ప్రకాశకము, ప్రేరకము. అట్లే సూక్ష్మము, వ్యాపకము, శ్రేష్ఠము, బలీయము. అందువలన దానిని అత్యంత పరము (శ్రేష్ఠము) అనుట సముచితమే.

ప్రశ్న - ఇది కామమునకు సంబంధించిన చర్చాసందర్భము. రాబోవు శ్లోకమున గూడ కామమును నిర్మూలింపుమని భగవానుడాదేశించెను. కనుక ఈ శ్లోకమున 'సః' అను సర్వనామము కామమును సూచించునదియే అని భావించినచో దోషమేమి?

సమా - ఇచట కామమును నిర్మూలించుటను గూర్చి చర్చింపబడినది. కాని అది శ్రేష్ఠమని చెప్పబడలేదు. దానిని నిర్మూలించుశక్తి ఆత్మకు గలదు. మనుష్యుడు తన ఆత్మ బలమును తెలిసికొనినచో సహజముగనే మనోబుద్ధీంద్రియములపై తన పూర్ణాధికారమును కలిగియుండి కామమును నిర్మూలింపగలడు. ఈ విషయమే ఈ శ్లోకమున వివరింపబడినది. ఇంద్రియ మనోబుద్ధులకంటె కామమే అత్యంత శ్రేష్ఠమని భావించినచో వాటిద్వారా కామమును నిర్మూలింపుమని చెప్పుట అసంగతమే యగును. అంతేగాక 'సః' అను సర్వనామమునకు 'కామము' అను అర్థమును చెప్పినచో కఠోపనిషత్తు నందలి వివరణకు గూడ విరుద్ధమే యగును. కావున 'సః' అనగా 'కామము' అను అర్థము కానే కాదు. 2వ (రెండవ) అధ్యాయములో చెప్పబడినట్లు 'సః' అను దానికి "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" (2/59). ఆ పరతత్త్వము అనగా నిత్య శుద్ధ, బుద్ధ స్వరూప పరమాత్మయే అను అర్థమును గ్రహింపవలెను.

*సంబంధము - పూర్వశ్లోకమున వర్ణింపబడిన రీతిగా ఆత్మను సర్వశ్రేష్ఠమైన దానినిగా భావించి, కామరూపశత్రువును నిర్మూలింపుమని భగవానుడు అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు-*

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ 43 ॥**

1. ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః । మనసస్తు పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః ॥
మహతః పరమవ్యక్తమవ్యక్తాత్ పురుషః పరః । పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః ॥
(కఠోపనిషత్ 1/3/10,11)

ఇంద్రియములకంటెను వాటి అర్థములు (శబ్దస్పర్శ రూపరస గంధములనెడి తన్మాత్రలు) పరములు. (శ్రేష్ఠములు, సూక్ష్మములు, బలీయములు) అర్థములకంటె మనస్సు, దానికంటెను బుద్ధిపరమైనవి. బుద్ధికంటెను శ్రేష్ఠమైనది మహత్తత్త్వము (సమష్టి బుద్ధి) మహత్తత్త్వముకంటెను అవ్యక్తము, (మూలప్రకృతి). దానికంటెను పురుషుడు శ్రేష్ఠుడు. పురుషుని కంటెను శ్రేష్ఠమైనదేదియును లేదు. అతడే పరమగతి, పరాకాష్ఠ.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏవమ్ | = ఈవిధముగా | బుద్ధ్వా | = తెలిసికొని | దురాసదమ్ | = దుర్జయమైన |
| బుద్ధేః | = బుద్ధికంటెను | ఆత్మనా | = బుద్ధిద్వారా | కామరూపమ్ | = కామమనెడి |
| పరమ్ | = సూక్ష్మము, బలీయము శ్రేష్ఠమైనది ఆత్మయని | ఆత్మానమ్ | = మనస్సును | శత్రుమ్ | = శత్రువును |
| | | సంస్తభ్య | = వశపఱచుకొని | జహి | = నిర్మూలింపుము |
| | | మహాబాహో! | = ఓ మహాబాహూ! | | |

ఈ విధముగా బుద్ధికంటెను ఆత్మపరమైనదని అనగా సూక్ష్మము, బలీయము, మిక్కిలి శ్రేష్ఠము ఐనదని తెలిసికొని, ఓ మహాబాహూ! బుద్ధిద్వారా మనస్సును వశపఱచుకొని, దుర్జయశత్రువైన కామమును నిర్మూలింపుము. **(43)**

ప్రశ్న - ఇచట బుద్ధికంటెను ఆత్మశ్రేష్ఠమైనదని తెలిసికొని, కామమును నిర్మూలింపుమని చెప్పుటలో అంతర్యమేమి?

సమా - మనుష్యుల జ్ఞానము అనాదికాలము నుండియు అజ్ఞానముచే కప్పబడియున్నది. ఆ కారణమున వారు తమ ఆత్మ స్వరూపమును విస్మరించినారు. ఆత్మస్వయముగా అన్నిటికంటెను శ్రేష్ఠమైనదేయైనను వారు దాని శక్తిని మఱచి, కామమనెడి శత్రువునకు వశమగుచున్నారు. ఇతరుల నుండి వినియు, శాస్త్రముల ద్వారా తెలిసికొనియు, లోకులు 'ఆత్మ' సర్వశ్రేష్ఠమని గ్రహించుటలేదు. ఆత్మస్వరూపమును సమగ్రముగ ఎఱింగినచో రాగమనెడి కామము సహజముగనే అంతరించును. కామమును నిర్మూలించుటకు ఆత్మస్వరూపమును తెలిసికొనుటయే ప్రధానమైన ఉపాయము. కావున బుద్ధి ద్వారా ఆత్మను అత్యంత శ్రేష్ఠమైన దానినిగా తెలిసికొని కామమును నిర్మూలింపుమని భగవానుడాదేశించెను. ఆత్మతత్త్వము అత్యంత నిగూఢమైనది. మహాపురుషుల ద్వారా వివరింపబడినప్పటికిని, సూక్ష్మదర్శియైనవాడు మాత్రమే దీనిని తెలిసికొనగలడు. కఠోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది. "సర్వభూతములందు దాగియున్న ఈ ఆత్మ వారికి (సర్వభూతములకు లేక ప్రాణులకు) ప్రత్యక్షముగా గోచరింపదు. కేవలము సూక్ష్మదర్శియైన పురుషుడే అత్యంత తీక్ష్ణమైన సూక్ష్మమైన బుద్ధి ద్వారా దీనిని ప్రత్యక్షము చేసికొనగల్గును."[1]

ప్రశ్న - ఇచట 'ఆత్మానమ్' అను పదమునకు మనస్సు అనియు, 'ఆత్మనా' అను పదమునకు బుద్ధియనియు అర్థము చెప్పుటకు గల కారణమేమి?

సమా - శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, జీవుడు - వీటన్నింటిని 'ఆత్మ' అను పదము తెలుపును. వీటిలో మొదట ఇంద్రియములను వశపరచుకొనవలెనని 41వ శ్లోకములో చెప్పబడినది. శరీరము ఇంద్రియములలో చేరినదే. జీవాత్మ స్వయముగా వశపఱచుకొనువాడు. ఇక మిగిలినవి మనస్సు, బుద్ధి. బుద్ధి మనస్సు కంటెను బలీయమైనదిగా చెప్పబడినది. కనుక బుద్ధి ద్వారా మనస్సును వశపఱచుకొనవచ్చును. అందువలన 'ఆత్మానమ్' అను పదమునకు 'మనస్సు' అనియు, 'ఆత్మనా' అనుపదమునకు 'బుద్ధి' యనియు అర్థములు చెప్పబడినవి.

ప్రశ్న - బుద్ధిద్వారా మనస్సును వశపఱచుకొను ఉపాయమేమి?

సమా - భగవానుడు 6వ (ఆఱవ) అధ్యాయమున మనస్సును వశపఱచుకొనుటకు 'అభ్యాసము' 'వైరాగ్యము' అను రెండు ఉపాయములు చెప్పినాడు. (6/35) ప్రతి ఇంద్రియ విషయమునందును మనుష్యునకు సహజముగ రాగద్వేషములుండును. విషయములతో ఇంద్రియములకు సంబంధము ఏర్పడినప్పుడు సావధానముగా బుద్ధిద్వారా పరిశీలించి, రాగద్వేషములకు వశము కాకుండ ప్రయత్నించినచో మెల్లమెల్లగా రాగద్వేషములు తగ్గుచూ వచ్చును. బుద్ధిద్వారా పరిశీలించి ఇంద్రియ భోగముల యందలి దుఃఖములను, దోషములను, మాటిమాటికి గమనించుచూ మనస్సునకు వాటియందు (భోగాదుల యందు) అరుచిని కల్గించుటయే 'వైరాగ్య' మనబడును. వ్యవహారకాలమందు స్వార్థత్యాగము, ధ్యానసమయమునందు మనస్సును పరమేశ్వరుని యందు నిమగ్నమొనర్చుట, మనస్సును భోగప్రవృత్తుల నుండి మఱల్చి, పరమాత్మ చింతనయందు నిరంతరము లగ్నము

1)ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽఽత్మా న ప్రకాశతే । దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥ (కఠోపనిషత్ 1/3/12)

చేయుటనే 'అభ్యాసము' అని యందురు.

ప్రశ్న - ఆత్మ స్వయముగా అన్నింటికంటెను బలీయము, ఐనప్పుడు అదే స్వయముగా కామమను శత్రువును నిర్మూలింపవచ్చును గదా! బుద్ధిద్వారా మనస్సును వశపఱచుకొని, కామమును నిర్మూలింపుమని భగవానుడు ఏల చెప్పెను?

సమా - నిజముగా 'ఆత్మ' అత్యంత బలీయమైనదే. అది కామమును నిర్మూలింపగలదు. వాస్తవముగా 'ఆత్మబలము' తోడనే అందఱును బలశాలురు, క్రియాశీలురు కాగలరు. కాని అది తన బలమును విస్మరించుచుండును. మిక్కిలి శక్తిశాలియైన చక్రవర్తి అజ్ఞాన వశమున తన బలమును మఱచి, తనకంటె అన్నివిధముల బలహీనులు, క్షుద్రులైన సేవకులకు అధీనుడై వారు చెప్పినట్లు చేసిన రీతిగా ఆత్మ కూడ తన మనోబుద్ధీంద్రియములకు అధీనమై వాటి కామములచే ప్రేరితమై విశృంఖలముగా ప్రవర్తించుటకు వాటిని అనుమతించును. ఇందువలన మనోబుద్ధీంద్రియముల లోపల దాగిన కామము జీవాత్మకు విషయభోగములనెడి ఆశలనుచూపి, సంసారమను ఉచ్చులో బిగించును. ఆత్మ తన స్వరూపమును తెలిసికొని, తన శక్తిని గ్రహించి, మనోబుద్ధీంద్రియములను నిగ్రహించి, వాటి స్వేచ్ఛా ప్రవృత్తిని అడ్డుకొని, దొంగవలె దాగియున్న కామమును బయటికి పంపినచో మనోబుద్ధీంద్రియాదులు శక్తిహీనములగును. అప్పుడు కామము క్షణమాత్రము గూడ అచట నిలువజాలదు. ఆత్మ నుండియే అస్తిత్వమును, స్ఫూర్తిని, శక్తిని పొంది దాని బలము మూలముగనే అవి బలీయములగును. మనోబుద్ధీంద్రియములు దానినే (ఆత్మనే) అణచివేసి, తమ యిష్టానుసారము ప్రవర్తించుట ఆశ్చర్యకరమైన విషయము. కనుక ఆత్మ తన స్వరూపమును శక్తిని గుర్తించి, మనోబుద్ధీంద్రియములను వశపఱచుకొన వలెను. కామము వీటిలోనే దాగియుండును. వీటిని వశపఱచుకొనుట వలన కామము సహజముగనే రూపుమాయును. వస్తుతః అక్రియమైన ఆత్మ కామమును జయించుటకిదియే ఉపాయము. కనుక బుద్ధిద్వారా మనస్సును వశపఱచుకొని, కామమును నిర్మూలింపుమని చెప్పబడినది.

ప్రశ్న - ఈ కామరూప శత్రువును దుర్జయము- అని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - వాస్తవముగా కామమునందెట్టి బలమూ లేదు. ఆత్మబలముద్వారా బలీయములైన మనోబుద్ధీంద్రియముల యందు చేరుటవలన వాటి బలమువలన ఇది కూడ బలీయమైనది. మనోబుద్ధీంద్రియములు తనకు (ఆత్మకు) వశము కానంతవఱకు వాటి ద్వారా ఆత్మబలమే కామమునకు ప్రాప్తించుచుండును. అందువలన కామము మిక్కిలి ప్రబలమైనదనియు, దుర్జయమైనదనియు చెప్పబడినది. కాని ఆత్మ తన స్వరూపమును తెలిసికొని, మనోబుద్ధీంద్రియములను వశపఱచుకొననంతవరకే కామమునకు ఈ దుర్జయత్వము ఉండును.

ప్రశ్న - 'మహాబాహో!' అను సంబోధన యొక్క ప్రత్యేకత ఏమి?

సమా - మహాబాహో! అను సంబోధన పదము దీర్ఘ భుజములు గల బలశాలిని, మహాశూరుని తెలుపును. శ్రీకృష్ణభగవానుడు కామమును దుర్జయమని తెలుపుచు దాని నిర్మూలింపుమని అర్జునుని ఆదేశించియుండెను. మహాబాహో! అను సంబోధన ద్వారా మహాశక్తిసంపన్నుడైన అతని ఆత్మబలమును స్ఫురింపజేయుచున్నాడు. పైగా శ్రీకృష్ణ భగవానుడు అనంతమైన, అచింత్యమైన దివ్యశక్తి సంపన్నుడు. అతని అనంత శక్తిలో అతి సూక్ష్మాంశమును పొంది, దేవతలు, లోకపాలురు, సమస్త విశ్వమును నడుపుచున్నారు. ఆ పరాత్పరుని శక్తిలో కోట్యంశమును పొంది, జీవులు మహాశక్తిసంపన్నులు అగుచున్నారు. అట్టి భగవానుడే అర్జునుని శక్తిసంపన్నునిగా భావించి, దుర్జయమైన కామమును జయించుటకు అతడు సమర్థుడని తలచి ఆజ్ఞ యిచ్చుచున్నాడు. అట్టి సర్వశక్తిసంపన్నుడైన భగవానుని దృష్టిలో గూడ అర్జునుడు మహాబలవంతుడు. కనుక అతని అద్భుత బలమును స్ఫురింపజేయుటకే భగవానుడు అర్జునుని 'మహాబాహో!' అని సంబోధించెను. కావున కామమెంత దుర్జయమైనను, దుర్ధర్షవైరియైనను దానిని అవలీలగా నిర్జించి, అర్జునుడు విజయమును పొందుటకు సమర్థుడు - అని తెల్పుటయే ఈ సంబోధన యొక్క ప్రత్యేకత.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః ॥3॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# నాల్గవ అధ్యాయము - జ్ఞాన, కర్మ సన్న్యాసయోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు 'జ్ఞాన' శబ్దము పరమార్థ జ్ఞానమును, లేక తత్త్వజ్ఞానమును ప్రతిపాదించును. 'కర్మ' శబ్దము కర్మయోగమును అనగా యోగమార్గమును సూచించును. అట్లే 'సన్న్యాస' శబ్దము సాంఖ్యయోగమును లేక జ్ఞానమార్గమును తెలుపును. వివేకజ్ఞానము మరియు శాస్త్రజ్ఞానము అనునవియును జ్ఞాన శబ్దములో చేరినవే. ఇందు భగవంతుడు తన అవతార రహస్యములను, కర్మయోగముయొక్క యథార్థతత్త్వమును అట్లే సన్న్యాసయోగమును గూర్చియు విశదపరచెను. అంతేగాక ఈ మూడింటి ఫలస్వరూపమైన పరమాత్మతత్త్వముయొక్క యథార్థజ్ఞానమును గూడ వర్ణించెను. అందువలన ఈ అధ్యాయమునకు 'జ్ఞాన-కర్మ-సన్న్యాసయోగము' అని పేరు పెట్టబడినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందలి *1,2,3* శ్లోకములలో కర్మయోగవిషయపరంపరయు, దాని ప్రశంసయు చేయబడినది. *4*వ శ్లోకములో శ్రీకృష్ణుని జన్మయొక్క పూర్వాపర విషయములలో అర్జునుడు తన సందేహమును ప్రకటించెను. తనకును, అర్జునునకును పెక్కు జన్మలు గతించినవనియు, వాటిని తాను ఎఱుగుదుననియు, అర్జునుడు ఎఱుగడనియు *5*వ శ్లోకమున కృష్ణభగవానుడు తెలిపెను. *6, 7, 8* శ్లోకములలో భగవంతుడు తన అవతారతత్త్వమును రహస్యమును, సమయమును కారణములను తెలిపెను. *9, 10* శ్లోకములలో భగవానుడు తన జన్మలు, కర్మలు దివ్యములనియు, తనను ఆశ్రయించిన వారికి భగవత్ప్రాప్తియే ఫలమనియు వివరించెను. *11*వ శ్లోకమున తన భక్తుల ప్రవత్తికిని సేవలకును అనుగుణముగ భగవంతుడు వారిని అనుగ్రహించునని తెలుపుట జరిగెను. *12*వ శ్లోకమున అన్యదేవతోపాసనల వలన లౌకిక ఫలములు శీఘ్రముగనే లభించునని తెలిపెను. *13, 14* శ్లోకములయందు భగవంతుడు జగత్కర్తయైనను, అకర్తయే అనియు, అతని కర్మలు దివ్యములనియు తెలిసికొనిన వానిని కర్మబంధములు అంటవనియు పేర్కొనెను. అందువలన ప్రాచీనముముక్షువులరీతిగా నిష్కామ కర్మలను ఆచరింపుమని *15*వ శ్లోకమున భగవానుడు అర్జునుని ఆజ్ఞాపించెను.

*16, 17, 18* శ్లోకములలో శ్రీకృష్ణుడు కర్మల రహస్యములను తెలుపుదునని ప్రతిజ్ఞచేసి. వాటి తత్త్వమును తెలిసికొనుట జటిలమే ఐనను అది ఆవశ్యకమేయని పేర్కొనుచు, కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించువారిని ప్రశంసించెను. *19* నుండి *23*వ శ్లోకమువఱకు కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను మహాపురుషులును, సాధకులును దర్శింపగలరని తెలిపి, అట్టివారి లక్షణములను, ఆచరణములను వివరించుచు భగవానుడు వారిని ప్రశంసించెను. *24* నుండి *30*వ శ్లోకమువఱకు బ్రహ్మయజ్ఞము, దైవయజ్ఞము, అభేదదర్శన రూపయజ్ఞము మొదలగు వివిధ యజ్ఞములను వర్ణించి, ఆ యజ్ఞకర్తలందఱిని యజ్ఞవేత్తలుగా, పాపరహితులుగా పేర్కొనెను. *31*వ శ్లోకమున యజ్ఞశిష్టామృతమును సేవించినవారికి సనాతన బ్రహ్మప్రాప్తి కలుగుననియు, యజ్ఞములను ఆచరింపనివారికి ఇహపరలోక సుఖము లేవియును లభింపవనియు భగవానుడు తెలిపెను.

*32*వ శ్లోకమున పైన తెల్పిన యజ్ఞములన్నియును వేదముల ద్వారా విస్తరింపబడినవనియు, వాటి తత్త్వములను ఎఱిగి ఆచరించుట వలన మానవుడు కర్మబంధముల నుండి ముక్తుడగుననియు తెలిపెను. *33*వ శ్లోకమున ద్రవ్యమయయజ్ఞములకంటెను జ్ఞానయజ్ఞము ఉత్తమమైనదని తెలిపెను. *34, 35*వ శ్లోకములయందు జ్ఞానులైన మహాత్ముల కడకేగి వారినుండి తత్త్వజ్ఞానమును పొందుమని అర్జునుని ఆదేశించుచు ఆ తత్త్వజ్ఞానమును ప్రశంసించెను. *36*వ శ్లోకమున జ్ఞాననౌకద్వారా పాపసముద్రమును తరింపవచ్చుననియు, *37*వ శ్లోకమున అగ్ని ఇంధనములనువలె జ్ఞానాగ్ని శుభాశుభ కర్మలను భస్మమొనర్చుననియు నుడివెను. *38*వ శ్లోకమునందు జ్ఞానము పవిత్రమైనదనియు, అది శుద్ధాంతఃకరణముగల కర్మయోగికి సహజముగనే లభించుననియు తెలిపెను. *39*వ శ్లోకమున సంయమియైన శ్రద్ధాళువే తత్త్వజ్ఞానమునకు అర్హుడనియు, జ్ఞానప్రాప్తితో శీఘ్రముగ పరమశాంతి లభించుననియు భగవానుడు నుడివెను. *40*వ శ్లోకమున శ్రద్ధయు,

వివేకములేని సంశయాత్ముడు పరమార్థమునుండి భ్రష్టుడగుననియు, అట్టి వానికి ఇహపరసుఖములు ఉండవనియు తెలిపెను. *41వ శ్లోకమునందు వివేకము ద్వారా సంశయములను తొలగించుకొని, కర్మలను భగవదర్పణ చేసినవానిని కర్మలు బంధింపజాలవనియు, 42వ శ్లోకమున అజ్ఞానజనితములైన సంశయములను జ్ఞాన ఖడ్గముతో ఖండించి, కర్మయోగ స్థితుడవై యుద్ధము చేయుమని శ్రీకృష్ణభగవానుడు పార్థుని ఆదేశించుచూ ఈ అధ్యాయమును ముగించెను.*

*సంబంధము - 3వ అధ్యాయమునందు 4వ శ్లోకము నుండి 29వ శ్లోకము వరకును భగవానుడు వివిధములైన విహితకర్మల ఆచరణావశ్యకస్థితిని ప్రతిపాదించెను. 30వ శ్లోకమున 'కర్మయోగ విధులను భక్తిపూర్వకముగ ఆచరింపుము. మమకారములను, విషయాసక్తిని, కామ్యములను సర్వథా త్యజింపుము. భగవదర్పణ బుద్ధితో కర్మల నాచరింపుము.' అని అర్జునుని ఆజ్ఞాపించెను. 31 నుండి 35వ శ్లోకమువరకు ఈ సిద్ధాంతము ననుసరించి కర్మలను చేయువారిని ప్రశంసించుటయు, చేయని వారిని ఆక్షేపించుటయు జరిగినది. రాగద్వేషములకు లోనుగాకుండ స్వధర్మపాలన మొనర్పవలెనని నొక్కి చెప్పెను. 36వ శ్లోకమునందు 'వివిధములగు అనర్థములకు కామమే మూలము. కనుక మనస్సును, ఇంద్రియములను బుద్ధిబలముతో వశపరచుకొని కామరూప శత్రువును జయింపుము,' అను ఉపదేశములతో తృతీయాధ్యాయము ముగిసెను. కర్మయోగతత్త్వము మిక్కిలి నిగూఢమైనది. అందువలన ఈ అధ్యాయమున ఆ విషయములనే అనేక విధముల విశదపఱచుటకు ప్రయత్నించెను. ఈ కర్మయోగము 'అనాది' యనియు, 'పరంపరాగతము' అనియు తెలుపుచు ఈ 4వ అధ్యాయమును ప్రారంభించుచున్నాడు-*

**శ్రీభగవాన్ ఉవాచ**

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ **1** ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = నేను | ప్రోక్తవాన్ | = చెప్పియుంటిని | ప్రాహ | = చెప్పెను |
| ఇమం, అవ్యయం,= | ఈశాశ్వతమైన | వివస్వాన్ | = సూర్యుడు | మనుః | = (ఆ) మనువు |
| యోగం | యోగమును | మనవే | = (తన కుమారుడైన వైవస్వత) మనువునకు | ఇక్ష్వాకవే | = తన కుమారుడైన ఇక్ష్వాకునకు |
| వివస్వతే | = సూర్యునకు | | | అబ్రవీత్ | = చెప్పెను |

**శ్రీ భగవానుడు ఇట్లు పలికెను- నేను నిత్యసత్యమైన ఈ యోగమును సూర్యునకు తెలిపితిని. సూర్యుడు తనపుత్రుడైన వైవస్వతమనువునకు దీనిని బోధించెను. ఆ మనువు తన కుమారుడైన ఇక్ష్వాకునకు ఉపదేశించెను. (1)**

ప్రశ్న - ఈ సందర్భమున **'ఇమమ్'** అను విశేషణముతో **'యోగమ్'** అను పదము ప్రయుక్తమైనది. ఇది ఏ యోగమును సూచించును? కర్మయోగమునా? లేక సాంఖ్య యోగమునా?

సమా - ద్వితీయాధ్యాయమునందు 39వ శ్లోకములో కర్మయోగ వివరణమును ప్రారంభింతునని భగవానుడు ప్రతిజ్ఞచేసెను. ఆ అధ్యాయాంతము వరకు కర్మయోగమును చక్కగా ప్రతిపాదించెను. తరువాత 3వ అధ్యాయమున అర్జునుని ప్రశ్నకు సమాధానముగ కర్మ చేయవలసిన ఆవశ్యకమును సయుక్తికముగ తెలిపెను. 30వ శ్లోకమున భక్తి పూర్వక కర్మయోగమును అనుసరించుచు యుద్ధము చేయుమని ఆజ్ఞాపించెను. ఈ కర్మయోగమున మనస్సును వశమందుంచుకొనుట ముఖ్యము. కావున బుద్ధిబలముతో మనస్సును వశపరచుకొని, కామరూప శత్రువును వధింపుమని అధ్యాయాంతమున పలికెను. దీనినిబట్టి 3వ అధ్యాయమునందు ముఖ్యముగా కర్మయోగమే సాంగోపాంగముగా ప్రతిపాదింపబడి నట్లు భావింపవలెను. కావున **'ఇమమ్'** అను పదము కర్మయోగవాచకమే. అందువలన **'ఇమమ్'** అను విశేషణముతో గూడిన

**'యోగమ్'** అను శబ్దము 'కర్మయోగము'నే సూచించును. ఇంతియే గాక కర్మయోగ పరంపర వివరణలో సూర్యుడు మనువు మొదలగువారి పేర్లు ప్రస్తావింపబడినవి. వారందరును గృహస్థులు, కర్మయోగులు. ఇంకను ఈ అధ్యాయమునందే 15వ శ్లోకమున 'ప్రాచీన ముముక్షువులను' ఉదాహరణముగా గొనియు కర్మలను ఆచరింపుమని శ్రీకృష్ణుడు అర్జునుని ఆదేశించెను. ఇందువలన 'ఇమమ్, యోగమ్' అను పదములు 'కర్మయోగవాచక'ములే అని గ్రహింపవలెను.

ప్రశ్న - భగవానుడు 3వ అధ్యాయాంతమున **'ఆత్మానం ఆత్మనా సంస్తభ్య'** ఆత్మద్వారా ఆత్మను నిరోధించి, అని చెప్పుటను బట్టి సమాధిస్థుడవగుమని సూచించినట్లు తలంపవచ్చును గదా? మరియు **'యుజ్ సమాధౌ'** అను ధాత్వర్థము ననుసరించి 'యోగ, శబ్దమునకు 'సమాధి' అని యర్థము. కావున ఇచట యోగశబ్దార్థ వివరణమున మనస్సును, ఇంద్రియములను నియంత్రించి సమాధిస్థుడవు కమ్ము - అని భావించుట దోషము కాదు గదా?

సమా - ఈ సందర్భమున భగవంతుడు ఆత్మ ద్వారా ఆత్మను నియంత్రించి అనగా బుద్ధిబలముతో మనస్సును వశపరచుకొని, దుర్జయమైన కామరూప శత్రువును వధింపుమని ఆజ్ఞాపించెను. కర్మయోగమున నిష్కామభావమే ముఖ్యము. అది కామ్యములను రూపుమాపినప్పుడే సాధ్యము. కనుక మనస్సును ఇంద్రియములను అదుపులో నుంచుకొనుట కర్మయోగికి పరమావశ్యకమని భావింపబడినది (2/64). కావున బుద్ధి ద్వారా మనస్సును ఇంద్రియములను వశపరచుకొనుట, కామ్యములను రూపుమాపుట - అనునవి కర్మయోగమునకు అంగములు. ఇవి కర్మయోగమునకు సాధనములు అని భగవానుడు చెప్పిన మాటలను పై ప్రశ్నకు సమాధానముగ భావింపవలెను. కనుక ఇచట యోగశబ్దమునకు హఠయోగమనిగాని, సమాధియోగమనిగాని అర్థము చెప్పరాదు. యోగమనగా కర్మయోగమనియే భావింపవలెను.

ప్రశ్న - 'ఈ యోగమును నేను సూర్యునకు చెప్పితిని. అతడు వైవస్వత మనువునకును, ఆ మనువు తన కుమారుడైన ఇక్ష్వాకునకును చెప్పెరి' అని భగవానుడు ఈ మాటలను చెప్పుటలో ఆంతర్యమేమి?

సమా - 1. ఈ యోగము పరంపరాగతమైనది. 2. ఈ యోగము మొట్టమొదట క్షత్రియులకు (కర్మశూరులకు) లభించినది. 3. ఈ కర్మయోగము అనాది (నిత్యసత్యము) అయినది. ఈ విషయములను ప్రకటించుటకే భగవానుడు పై విధముగ వచించెనని మనము భావింపవలెను.

### ఏవం పరంపరాప్రాప్తమ్ ఇమం రాజర్షయో విదుః ।
### స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥ 2 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప! | = ఓ పరంతపా! (అర్జునా!) | ఇమమ్ | = ఈ యోగమును | మహతా, కాలేన | = చాలాకాలము క్రిందటనే |
| | | రాజర్షయః | = రాజర్షులు | | |
| ఏవమ్ | = ఈ విధముగా | విదుః | = ఎఱింగిరి | ఇహ | = ఈభూలోకమునందు |
| పరంపరాప్రాప్తమ్ | = పరంపరగా ప్రాప్తించిన | సః, యోగః | = ఆయోగము | నష్టః | = లుప్త ప్రాయమాయెను. |

**ఓ పరంతపా! (అర్జునా!) ఈ విధముగ పరంపరాప్రాప్తమైన ఈ యోగమును రాజర్షులు ఎఱింగిరి. కాని అనంతరము ఈ యోగము కాలక్రమమున భూలోకమునందు లుప్తప్రాయమయ్యెను. (2)**

ప్రశ్న - పరంపరాప్రాప్తమైన ఈ యోగమును రాజర్షులు తెలిసికొనిరనుటలోని భావమేమి?

సమా - ఒకరినుండి మఱియొకరు ఉపదేశములను పొంది అనేక తరముల వరకు ఉత్తములైన రాజులు ఈ కర్మయోగమును ఆచరించుచు వచ్చిరి. ఆ కాలమున దీని పరమార్థము సులభగ్రాహ్యము ఐనది కాని నేడు అట్లుకాదు. అని దీని భావము.

ప్రశ్న - రాజర్షి యనగా ఎవరు?

సమా - ఋషితుల్యుడైనరాజు రాజర్షి. అనగా రాజుగా ఉండి వేదమంత్రముల అర్థతాత్పర్యములను

(తత్త్వరహస్యములను) బాగుగా ఎఱిఁగినవాడు.

ప్రశ్న - 'దీనిని రాజర్షులు ఎఱిఁగిరి' అనుటలో ఇతరులు ఎఱుగరని దీని అభిప్రాయమా?

సమా - అట్లనుట సరికాదు. ఇతరులు దీనిని తెలిసికొనుటలో ఎట్టి నిషేధమును లేదు. ఈ కర్మయోగ తత్త్వమును క్షుణ్ణముగా తెలిసికొనుటలో రాజర్షుల ప్రాముఖ్యము కాదనరానిది. దీనిని (ఈ కర్మయోగతత్త్వమును) ఇతరులును రాజర్షుల నుండియే గ్రహించుచు వచ్చిరని చరిత్రలు ఋజువు పరచుచున్నవి. అందువలన క్షత్రియులే ఈ కర్మయోగమును మొదటి నుండియు ఆచరించుచు వచ్చిరనియు, అర్జునుడు కూడ క్షత్రియ వంశజుడైనందున దీనికి అతడు అర్హుడనియు, ఇదియే ఆయనకు సముచితము, సులభము అయిన మార్గమనియు భగవానుని అభిప్రాయము.

ప్రశ్న - 'కాలక్రమమున ఈ కర్మయోగము లుప్తప్రాయమైనది' అని యనుటలోని అభిప్రాయమేమి?

సమా - యోగాసక్తిగల రాజర్షిపరంపర దీనిని ఆచరించుచు వచ్చినంత వరకు ఈ కర్మయోగము ఈ భూలోకమున చెక్కు చెదరకుండ ఉండెను. అనంతరము పాలకులలోను ప్రజలలోను భోగాసక్తి పెరుగుచు వచ్చిన కొలది ఈ యోగము క్షీణింపసాగెను. తత్ఫలితముగా సర్వోత్తమమైన ఈ కర్మయోగము లుప్తప్రాయమైనది. ఈ కారణమున ఈ తత్త్వమును గ్రహింపగలవారి సంఖ్య తగ్గినది. పెక్కుమందిలో దీని స్పృహయే లేని స్థితి యేర్పడినది.

ప్రశ్న - మొదటి శ్లోకములో ఈ యోగము శాశ్వతము (అవ్యయమ్) అని చెప్పబడినది. ఈ శ్లోకమున అది లుప్తమైనదిగా తెలుపబడినది. ఇది పరస్పర విరుద్ధముగా ఉన్నది గదా! అది శాశ్వతమైనదే అగుచో లుప్తముకారాదు. నష్టమగుటకు వీలున్నచో శాశ్వతమని చెప్పరాదు గదా?

సమా - కర్మ, జ్ఞాన, భక్తియోగములు మున్నగునవి అన్నియును పరమాత్మ ప్రాప్తికి పరమ సాధనములే. అవి నిత్యసత్యములు. అవియెప్పుడును లుప్తములు కావు. పరమేశ్వరుడునిత్యుడు. కావున తత్ప్రాప్తికై ఆయనచే ప్రోక్తములైన నియమములు (సాధనలు) అనిత్యములు కానేరవు. జగత్తుయొక్క ప్రాదుర్భావముతోబాటు భగవత్ప్రోక్తము లైన సమస్త నియమములు గూడ ప్రకటితములగుచునే యుండును. జగత్తుకు ప్రళయము ఏర్పడినప్పుడు, ఆ నియమములు ( సాధనలు) మరుగున పడుచుండును. కాని లుప్తములు కావు. ఈ దృష్టితోనే పూర్వ (ప్రథమ) శ్లోకమున కర్మయోగము శాశ్వతము (అవ్యయమ్) ఐనదని తెలిపి దాని 'అనాదిత్వము' సిద్ధాంతీకరింపబడినది.

కాలక్రమమున ఈ యోగము లుప్తప్రాయమైనదని ఈ శ్లోకమున చెప్పుటలో గల ఆంతర్యము ఏమనగా ఈ తత్త్వమును పూర్తిగా ఎఱిగిన ఉత్తమ పురుషుల సంఖ్య ఈ భూలోకమున తగ్గినదని చెప్పుటయే. అభిజ్ఞుల సంఖ్య తగ్గుట వలన మఱుగునపడినదే గాని లుప్తము కాలేదు. సత్యము ఎప్పుడును నశింపదు. సృష్ట్యాదిలో ఇది భగవంతుని నుండి ప్రాదుర్భవించును. అనేక కారణముల వలన అప్పుడప్పుడు అది మఱుగున పడుచుండును. దేనికైనను వెలుగు చీకట్లు సహజములే. కాలక్రమమున ప్రళయము నందు జగత్తుతోబాటు ఈ నియమములును భగవంతునిలో లీనమగుచుండును. ఈ విలీనస్థితినే 'నష్టము' అని, 'అదృశ్యము' అని చెప్పుట జరిగినది. వాస్తవముగ అది అవ్యయము. కావున ఎప్పుడును నష్టము కాదు. కనుక పూర్వ శ్లోకమునకును ఈ శ్లోకమునకును మధ్య వైరుధ్యము ఏమియును లేదు.

**స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ 3 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| (త్వమ్) | = (నీవు) | సః, పురాతనః, యోగః, ఏవ | = ఆ ప్రాచీనమైన యోగమే | తే | = నీకు |
| మే, భక్తః | = నా భక్తుడవు | అయమ్ | = ఇది (ఈ యోగము) | ప్రోక్తః | = చెప్పబడుచున్నది |
| చ | = మఱియు | అద్య | = నేడు | హి | = ఎందువలననగా |
| సఖా, అసి, ఇతి | = ప్రియసఖుడవు, కనుక | మయా | = నా చేత | ఏతత్ | = ఇదిఉత్తమమైనది |
| | | | | రహస్యమ్ | = గోప్యమైనది. |

**ఈ యోగము ఉత్తమమైనది. రహస్యముగా ఉంచదగినది. నీవు నాకు భక్తుడవు. ప్రియసఖుడవు. కనుక మిక్కిలి పురాతనమైన ఈ యోగమును నేడు నీకు తెలుపుచుంటిని. (3)**

ప్రశ్న - 'నీవు నాకు భక్తుడవు, సఖుడవు', అనుటలోని ఆంతర్యమేమి?

సమా - అత్యంత రహస్యమైన ఈ విషయమును పాత్రాపాత్రవిచక్షణ లేకుండ ప్రతి వ్యక్తికి తెలుపరాదు. అర్జునుడు శ్రీకృష్ణభగవానునకు చిరకాల భక్తుడు, ప్రాణసఖుడు అగుటచే అతి గోప్యమైన ఈ యోగము ఆయనకు ఉపదేశింపబడినది.

ప్రశ్న - 'అట్టి పురాతన యోగమును నేడు నీకు తెలుపుచున్నాను' ఈ వాక్యము యొక్క అంతరార్థమేమి?

సమా - 'సః, ఏవ, పురాతనః' అను పదములను ప్రయోగించుటచే ఈ యోగము యొక్క అనాదిత్వము నొక్కి చెప్పబడినది. 'తే' అను పదమును అర్జునుని 'నిర్దేశించి' ప్రయోగించుట ద్వారా ఆతనియొక్క అర్హత నిరూపితమైనది. ఈ యోగమును మొదట భగవానుడు సూర్యునకు తెల్పియుండెను. దీని పరంపర అనాదికాలము నుండియు వచ్చుచున్నది. 'అద్య' అను పదమును ప్రయోగించుట వలన ఆ కాలమున ఈ ఉపదేశముయొక్క ఆవశ్యకస్థితియు స్పష్టమగుచున్నది. అర్జునుడు యుద్ధక్షేత్రమున దిక్కుతోచనివాడై యుండెను. వ్యాకులచిత్తుడైయున్న ఆతనికి ఏది శ్రేయస్కరమో తెలియకుండెను. ప్రపన్నుడై జిజ్ఞాసతో శ్రీకృష్ణుని ఉపదేశమును అర్థించెను. ఆ సమయమున అర్జునుని స్థితి అది.

సామాన్యముగా లోకమున వ్యాకులచిత్తుడైనవాడు దిక్కుతోచని స్థితికి లోనగును. అట్టి స్థితిలోనున్న వాడు వివేకియైనచో జిజ్ఞాసతో శ్రేయోమార్గమును అన్వేషించును. సర్వజ్ఞుడైన భగవంతుని ప్రపన్నుడై ఆశ్రయించును. అప్పుడే అతడు సదుపదేశమునకు అర్హుడగును. క్రమముగా ఈ దశలను అనుభవించిన అర్జునుడు భగవానుని ఉపదేశమునకు అర్హుడైనాడు. (2/7). అర్జునుడిట్టి పరిస్థితికి మునుపు ఎన్నడును లోనుకాలేదు. నేడు అట్టి పరిస్థితి ఏర్పడినందున 'అద్య' అను పదము సార్థకముగ ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'ఇది మిక్కిలి ఉత్తమమైనది, రహస్యమైనది' అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ యోగము అనేక విధములైన దుఃఖముల నుండి బంధనముల నుండి అర్జుని విముక్తుని జేయును. పరమానంద స్వరూపుడైన భగవంతునియొక్క ప్రాప్తిని సులభముగ కలిగించును. కనుక ఇది మిక్కిలి (అత్యంత) ఉత్తమమైనది. కావున గోపనీయము. సూర్యుడు మొదలుకొని అర్జునునివరకు ఈ ఉపదేశమును పొందిన వారందరును ఉత్తములు, పాత్రులు. పాత్రులకు మాత్రమే తెలుపబడునది కాన ఇది రహస్యము. మీదు మిక్కిలి శ్రీకృష్ణుని ఈశ్వరత్వమును ప్రకటించునది గావున ఇది అత్యంత గోపనీయము. కనుక దీనిని అనర్హులకు ఉపదేశింపరాదు. అర్జునుడు శ్రీకృష్ణుని భక్తుడు గావున ఈ యుపదేశమునకు అర్హుడు.

*సంబంధము - శ్రీకృష్ణుడు ద్వాపర యుగమునకు చెందినవాడు. సూర్యుడు, మనువు, ఇక్ష్వాకుడు మున్నగువారు అంతకంటెను ముందున్నవారు. అత్యంత ప్రాచీనులు. ఐనచో సూర్యునకు శ్రీకృష్ణుడు ఉపదేశించుట ఎట్లు పొసగును? పై వివరణను బట్టి ఈ సందేహము ఎవ్వరికైనను రావచ్చును. కావున ఈ సంశయమును పొందిన అర్జునుడు తన శంకానివృత్తికై శ్రీకృష్ణునియొక్క అవతారతత్త్వమును చక్కగా ఎఱుంగగోరి, ఇట్లు ప్రశ్నించుచున్నాడు-*

**అర్జున ఉవాచ**

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।**
**కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భవతః, జన్మ | = మీజన్మ | | (కల్పాదియందు జరిగినది) | ఏతత్ | = ఈయోగమును |
| అపరమ్ | = ఇటీవలిది | త్వమ్ | = నీవు | ప్రోక్తవాన్ | = చెప్పియుంటివి |
| వివస్వతః, జన్మ | = సూర్యుని జన్మ | ఆదౌ | = కల్పాదియందు (సూర్యునకు) | ఇతి | = అని |
| పరమ్ | = అతి ప్రాచీనమైనది | | | కథమ్ | = (నేను) ఎట్లు |
| | | | | విజానీయామ్ | = తెలిసికొనగలను. |

అర్జునుడు పలికెను - కృష్ణా! నీ జన్మ ఇటీవలిదే. సూర్యునిజన్మ కల్పాదియందు జరిగినది. అనగా అతి ప్రాచీనమైనది. కనుక నీవు సూర్యునకు దీనిని ఉపదేశించుట ఎట్లు సాధ్యపడును? దీనిని నేను విశ్వసించుట యెట్లు? **(4)**

ప్రశ్న - అర్జునునియంతటివాడు ఇట్లు ప్రశ్నించుటలో అర్థమేమి?

సమా - 'శ్రీకృష్ణుడు మానవమాత్రుడు కాడు. అతడు దివ్యమానవరూపములో నున్న సర్వశక్తిమంతుడైన పరమాత్మయే' - అను విషయమును అర్జునుడు ఇదివరకే ఎఱుంగును. రాజసూయయాగ సందర్భమున భీష్ముడు తెలిపిన శ్రీకృష్ణుని మహిమలను అతడు వినియేయుండెను. (మహాభార.సభా. 38/23,29) ఇంకను ఇతర ఋషుల వలనను శ్రీకృష్ణ ప్రభావములను గూర్చి వినియే యుండెను. అరణ్యవాసకాలమున అతడు స్వయముగా కృష్ణభగవానునితో చర్చించి ఆయన మహత్త్వమును గ్రహించియుండెను. (మహా-వన-12/11-43) ఇంతేగాక శిశుపాలాదుల వధా ఘట్టములయందును, ఇతర సంఘటనములయందును భగవానుని అద్భుత ప్రభావములను అతడు ప్రత్యక్షముగ చూచియుండెను. దీనినిబట్టి అర్జునుడిదివరకే శ్రీకృష్ణపరమాత్మ దివ్యతత్త్వములను ఎఱింగి యుండెనమట స్పష్టము. ఐనను భగవానుని 'ముఖతః' ఆయన అవతార రహస్యములను తాను వినుటకును, సాధారణ మానవుల శంకలను నివారించుటకును ఇట్లు ప్రశ్నించెను.

శ్రీకృష్ణుడు కొద్దికాలము క్రిందట దేవకీ వసుదేవులకు జన్మించిన విషయము అందఱును ఎరిగినదే. సృష్ట్యాది యందు- అదితి గర్భమున సూర్యుని జన్మ కలిగినది. సృష్ట్యాదిలో జన్మించిన సూర్యునకు ఇటీవల జన్మించిన మీరు ఉపదేశించుట పొసగని విషయము. ఇందులో ఏదియో రహస్యమున్నది. దయతో ఆ రహస్యమును బహిర్గతమొనర్చి, నన్ను ధన్యుని గావింప ప్రార్థన.' అర్జునుని విన్నపములోని ఆంతర్యము ఇదియే.

సంబంధము - అర్జునుని జిజ్ఞాసను, ఆరాటమును గమనించి, శ్రీకృష్ణుడు తన అవతారతత్త్వ రహస్యములను, సర్వజ్ఞత్వమును ప్రకటించుటకు పూనుకొనెను-

**శ్రీభగవాన్ ఉవాచ**

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।**
**తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ 5 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప! | = ఓపరంతపా! | బహూని, జన్మాని | = పెక్కుజన్మలు | త్వం, న, వేత్థ | = నీవెఱుంగవు |
| అర్జున! | = ఓఅర్జునా! | వ్యతీతాని | = గతించినవి | అహమ్, వేద | = నేను ఎఱుగుదును. |
| మే, చ, తవ | = నావియు, నీవియు | తాని, సర్వాణి | = వాటినన్నింటిని | | |

శ్రీ భగవానుడు తెలిపెను - ఓ పరంతపా! ఓ అర్జునా! నాకును నీకును పెక్కు జన్మలు గతించినవి. కాని వాటిని అన్నింటిని నేను ఎఱుంగుదును. నీ వెఱుగవు. **(5)**

ప్రశ్న - నీ, నా జన్మలు ఎన్నో గతించినవి. అనుటలోని రహస్యమేమి?

సమా - 'నీవు నేను ఇప్పుడు ఉన్నాము. ఇదివరలో లేము. అనుమాట సరియైనది కాదు. మనము నిత్యులము. నిత్యమైన నా మూల స్వరూపము ఉండనే ఉన్నది. అదికాక మత్స్య-కూర్మ, వరాహ, నరసింహ, వామనాది బహురూపములను నేను లోగడ స్వీకరించియుంటిని. వసుదేవ సుతునిగా నేను ఇటీవలి వాడనే యైనను లోగడ వివిధ రూపము (జన్మ)లలో పెక్కుమంది పురుషులకు అనేక ఉపదేశములను ఇచ్చియుంటిని.' ఇది శ్రీకృష్ణుడు తెలిపిన ఆయన అవతారముల రహస్యము.

దీనినిబట్టి శ్రీకృష్ణుని మూలరూపము నారాయణుడని స్పష్టమైనది. కనుక ఈ శ్రీకృష్ణుడే నారాయణ రూపములో కల్పాదియందు సూర్యునకు ఈ (కర్మ) యోగమును ఉపదేశించెను. వసుదేవసుతునిగా నేడు దీనిని అర్జునునకు ఉపదేశించెను. ఇందు కాలవ్యత్యాసమున్నది గాని, వైరుధ్యము ఏమియులేదు.

ప్రశ్న - ఈ జన్మలను అన్నింటిని నేను ఎఱుగుదును. నీవు ఎఱుగవు - అని యనుటలోని విశేషమేమి?

సమా - ఇందు భగవానుడు తన సర్వజ్ఞత్వమును జీవుల అల్పజ్ఞత్వమును ప్రకటించుచున్నాడు. భగవంతుడు తన అన్ని అవతారముల (జన్మల) కారణములను, ఆయా అవతారముల (జన్మల)లో అతడు ప్రకటించిన తన లీలలను, ఘటనములను, ఇతర విశేషములను ఎఱుంగును. సర్వజ్ఞుడు కానందున వానిని అర్జునుడెఱుంగడు. అర్జునునకు తన పూర్వజన్మల స్మృతియులేదు. కనుక అతడట్లు ప్రశ్నించెను. జగత్తులోని ప్రతి సంఘటనయు ఆయనకు (కృష్ణునకు) తెలియకుండ జరుగదు. భూత భవిష్యద్వర్తమానములన్నియును భగవానునకు వర్తమానములే. సర్వజ్ఞుడైన అతడన్నియును ఎఱుంగును. (7/26) కల్పాదియందు సూర్యునకు నారాయణ రూపమున శ్రీకృష్ణుడు ఉపదేశించిన విషయమును అర్జునుడు ఎఱుగడు. శ్రీకృష్ణుడెఱుగును.

*సంబంధము - తాను పెక్కు జన్మలను పొందినట్లు భగవంతుడే స్వయముగా చెప్పినప్పుడు 'భగవంతుని జన్మ ఏ విధముగ జరుగును? భగవంతుని జన్మలకును, ఇతరుల జన్మలకును గల భేదమేమి?' అను విషయమును తెలిసికొనవలయునను కోరిక కలుగుట సహజము. ఈ విషయమును విశదపరచుటకే భగవంతుడు తన జన్మతత్త్వమును తెల్పుచున్నాడు-*

**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| (అహమ్) | = (నేను) | భూతానామ్ | = సమస్తప్రాణులకు | అధిష్ఠాయ | = అధీనములో ఉంచుకొని |
| అజః | = జన్మరహితుడను | ఈశ్వరః, సన్, అపి | = ఈశ్వరుడను ఐనప్పటికిని | ఆత్మమాయయా | = నా యోగమాయచే |
| అవ్యయాత్మా సన్, అపి | = శాశ్వతుడను ఐనప్పటికిని | స్వామ్, ప్రకృతిమ్ | = నా ప్రకృతిని | సంభవామి | = అవతరించుచుందును. |

**నేను జన్మరహితుడను, నిత్యుడను, సమస్త ప్రాణులకు ఈశ్వరుడను. అయినను నా ప్రకృతిని అధీనములోనుంచుకొని, నా యోగ మాయచే అవతరించుచుందును. (6)**

ప్రశ్న - 'అజః' 'అవ్యయాత్మా', 'భూతానాం ఈశ్వరః' - ఈ పదములతో బాటు 'అపి', 'సన్' అని ప్రయోగించుటలోని భావమేమి?

సమా - భగవానుడు అజుడు, అవ్యయుడు, అనగా జనన మరణములు లేనివాడు. ఐనను, అతడు సాధారణ మానవులవలె పుట్టుచున్నట్లును, గిట్టుచున్నట్లును కన్పించుచుండును. అట్లే సమస్త ప్రాణులకు ఈశ్వరుడైనను సాధారణ వ్యక్తివలెనే కన్పించుచుండును. భగవంతుని అవతారతత్త్వమును ఎఱుగనివారు ఆయన మత్స్యకూర్మాది అవతారముల నెత్తినపుడు జన్మించినాడనియు, ఆ యవతారములను చాలించినప్పుడు మరణించినాడనియు భావింతురు. ఆయా అవతారములలో అతడు లీలలను

ప్రకటించినప్పుడు ఆ లీలల దివ్యత్వమును తెలిసికొనలేక ఆయనను సాధారణ వ్యక్తిగా భావించి ఆయనపట్ల తిరస్కార భావమునే కలిగియుందురు. (9/11) భగవంతుడు సర్వశక్తిమంతుడు. సర్వేశ్వరుడు. అతడు నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావుడు. సాక్షాత్ పరమాత్మయే, పూర్ణబ్రహ్మమే. జగత్కల్యాణమును గూర్చుటకై ఆయా రూపములను దాల్చి, తన దివ్య లీలలను ప్రదర్శించుచున్నట్లు అజ్ఞానులెఱుంగరు. ఏలనన భగవంతుడు ఆ సమయమున తన యోగ మాయయను తెరలో దాగియుండును. (7/25)

ప్రశ్న - 'స్వామ్' అను విశేషణముతో గూడిన 'ప్రకృతిమ్' అను పదము దేనిని తెలుపును.? అట్లే 'ఆత్మమాయయా' అనుపదము తెల్పునదేమి? ఈ రెండింటి మధ్యగల తారతమ్యమేమి?

సమా - నవమాధ్యాయము నందలి 7,8 శ్లోకములలో భగవంతుని శక్తిరూపమైన మూలప్రకృతి ప్రస్తావన చేయబడినది. 14వ అధ్యాయములో ఈ మూల ప్రకృతియే 'మహద్బ్రహ్మ'గా పేర్కొనబడినది. ఇచట 'స్వామ్' అని విశేషణముతో గూడిన 'ప్రకృతిమ్' అను పదము ఆ మూల ప్రకృతినే సూచించును. భగవంతుడు తన యోగశక్తిచే సమస్త జగత్తును పోషించుచున్నాడు. తన అసాధారణశక్తి ద్వారా అనేక రూపములను దాల్చి లోకమున మెలగుచున్నాడు. ఈ యోగ శక్తిలో దాగియున్నందున లోకులు ఆయనను గుర్తింపలేకున్నారు. ఈ శక్తియే 7వ అధ్యాయమునందలి 25వ శ్లోకమున యోగమాయ అని తెలుపబడినది. ఇచట 'ఆత్మ మాయయా' అను పదము దానినే తెలుపును. మూలప్రకృతిని తన అధీనములో ఉంచుకొని తన యోగశక్తి ద్వారా భగవానుడు అవతారములను దాల్చుచుండును.

మూలప్రకృతి నుండి ఈ జగత్తు సృష్టింపబడుచున్నది. యోగమాయ అత్యంత ప్రభావముతో, ఐశ్వర్యముతో కూడిన భగవచ్ఛక్తి. ఇదియే ఈ రెండింటి మధ్య గల భేదము.

ప్రశ్న - నేను నా ప్రకృతిని వశమునందుంచుకొని, నా యోగమాయచే బహిర్గతుడ నగుచున్నాను - అనియనుట లోని ఆంతర్యమేమి?

సమా - సాధారణ జీవుల జన్మలకంటెను తనజన్మ విలక్షణమైనదని భగవంతుడు ఇందు తెలిపెను. జీవులు ప్రకృతికి వశులై తమతమ కర్మల ననుసరించి ఉత్తమాధమ యోనులలో జన్మించి, సుఖదుఃఖములను అనుభవింతురు. భగవంతుని జన్మ అట్టిదికాదు. అతడు తన ప్రకృతికి అధిష్ఠాత. తన యోగమాయచే సమయానుసారముగ దివ్యలీలలను ప్రదర్శించుటకు ఆవశ్యక రూపములను ధరించును. ఆయన జన్మలన్నియును స్వతంత్రములు. దివ్యములు. జీవులకువలె కర్మలకు వశములై యుండునవి కావు.

ప్రశ్న - జీవుల జనన మరణములకును, భగవానుడు అవతారములెత్తుటకును, చాలించుటకును మధ్యగల భేదమేమి?

సమా - జీవుల జనన మరణములు వారి వారి కర్మల ననుసరించి ఏర్పడుచుండును. వారి ఇష్టముల ననుసరించి కలుగవు. జీవులు మాతృగర్భముల యందున్నప్పుడు గర్భయాతనలను అనుభవింతురు. భౌతిక శరీరములతో బాహ్య జగత్తులో అడుగిడి పెరిగి పెద్దవారై మృతి చెందుదురు. మరల వారివారి కర్మల ననుసరించి, ఆయా జన్మల నెత్తుచుందురు. కాని భగవానుని అవతారములును, అంతర్ధానములును విలక్షణములైనవి. భగవదిచ్ఛాను సారముగ సంభవించుచున్నవి. భగవంతుడు ఎప్పుడు, ఎక్కడ, ఏ రూపములో తన అవతారములావశ్యకములగునో గ్రహించి, తదనుసారముగా సంకల్పమాత్రమున వాటిని ప్రవర్తిల్లజేయును. ఈ అవతారాంతర్ధానములన్నియును భగవత్సంకల్పాధీనములే. అతడు క్షణకాలములోనే స్థూల, సూక్ష్మ రూపములను ప్రదర్శింపగలడు. అతడు ప్రకృతిబద్ధుడు కాడు. ప్రకృతియే ఆయన ననుసరించును. అర్జునుని కోరికపై భగవంతుడు విశ్వరూపమును ప్రదర్శించుట, చతుర్భుజుడుగా ప్రత్యక్షమగుట పిదప మానవరూపమును దాల్చుటయే ఇందుకు నిదర్శనము. ఇవి యన్నియు ఆయన లీలావిలాసములే గాని జననమరణములు గావు.

ప్రశ్న - శ్రీకృష్ణుని జననము దేవకీ గర్భము నుండి సాధారణ మానవశిశుజన్మవలె ఐనది గదా! 'ఇతర మానవుల జన్మల'కును, భగవంతుని జననమునకును భేదమేమున్నది?

సమా - ఇట్లనుట సరికాదు. శ్రీమద్భాగవతమునందలి ఆ ప్రకరణమును గమనించినచో ఈ సందేహము తొలగును. ఆ సమయమున దేవకీదేవి సమక్షమున శ్రీహరి శంఖచక్ర గదాపద్మములను తన చతుర్భుజములయందు దాల్చి నిలిచెను. అప్పుడామె అతనిని స్తుతించెను. దేవకీదేవి ప్రార్థనపై

అతడు శిశు రూపమును దాల్చెను.[1] కనుక ఆయన జననము సాధారణ మనుజుల జన్మలవలె తల్లిగర్భమునుండి కాలేదు. కాని, సాధారణమానవుల వలె తాను గూడ పదిమాసములు తల్లిగర్భమున నున్నట్లును, పిదప జన్మించినట్లును తన లీలా విలాసములతో భాసింపజేసెను.

సంబంధము - ఈ విధముగ భగవంతుని ద్వారా జన్మతత్త్వవిశేషములను విన్నవారు భగవానుని అవతారములకుగల కారణములను సమయములను తెలిసికొనుటకై కుతూహలపడుట సహజము. ఇందులకై భగవానుడు రెండు శ్లోకములలో తన అవతారములయొక్క అవసరములను, హేతువులను, ఉద్దేశ్యములను తెలుపుచున్నాడు-

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | అధర్మస్య | = అధర్మమునకు | అహమ్ | = నేను |
| యదా, యదా | = ఎప్పుడెప్పుడు | అభ్యుత్థానమ్ | = వృద్ధియు | ఆత్మానమ్ | = నారూపమును |
| ధర్మస్య | = ధర్మమునకు | భవతి | = అగునో | సృజామి | = ప్రకటించు |
| గ్లానిః | = హానియు | తదా, హి | = అప్పటికి అప్పుడే | | చుందును. |

**ఓ భారతా! (అర్జునా) ధర్మమునకు హాని కలిగినప్పుడును, అధర్మము పెచ్చుపెరిగిపోవు చున్నప్పుడును నన్ను నేను సృజించుకొందును. అనగా సాకారరూపముతో ఈ లోకమున అవతరింతును. (7)**

ప్రశ్న - 'యదా' అను పదమును రెండు పర్యాయములు వెంట వెంట ప్రయోగించుటలో గల ఆంతర్యమేమి?

సమా - ఈ యుగమునందే, ఈ సంవత్సరమునందే, ఈ మాసములోనే, ఈ దినముననే భగవానుడు అవతరింపవలెనను సమయ నిశ్చయము లేదు. భగవంతుడు ప్రతియుగమునను ఇన్ని పర్యాయములు మాత్రమే అవతరింపవలెనను నియమము కూడ లేదు. ఈ విషయమును స్పష్టపరచుటకే ఇచట 'యదా' అను పదము రెండుమార్లు ప్రయోగింపబడినది. ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి ఏర్పడినప్పుడు తన అవతారము ఆవశ్యకమని భావించినప్పుడు అతడవతరించుచుండును.

ప్రశ్న - ధర్మమునకు హానియు, అధర్మమునకు వృద్ధియు ఏ స్థాయిలో జరిగినప్పుడు భగవంతుడు అవతరించును?

సమా - ధర్మగ్లాని, అధర్మవృద్ధి ఏ స్థాయికి చేరిన తానవతరింపవలసి యుండునో వాస్తవముగా ఆ భగవంతుడు మాత్రమే యెఱుంగును. మానవమాత్రు లెఱుంగలేరు. మహర్షులు, ధార్మికులు, భగవద్భక్తులు, సదాచార సంపన్నులు, నిరపరాధులు, బలహీనులు మున్నగువారిపై బలవంతులైన దుర్మార్గుల దురాగతములు మితిమీరినప్పుడు లోకమున అస్తవ్యస్త పరిస్థితులు ఏర్పడును.

1) ఉపసంహర విశ్వాత్మన్నదో రూపమలౌకికమ్ । శంఖచక్రగదాపద్మశ్రియాజుష్టం చతుర్భుజమ్ ॥

(శ్రీమద్భాగవతమ్ 10/3/30)

ఇత్యుక్త్వాసీద్ధరిస్తూష్ణీం భగవానాత్మ మాయయా ।
పిత్రోః సంపశ్యతోః సద్యో బభూవ ప్రాకృతః శిశుః ॥ (శ్రీమద్భాగవతమ్ 10/3/46)

ఓ విశ్వరూపా! శంఖచక్రగదాపద్మ శోభలతో విలసిల్లు చతుర్భుజములతో అలరారుచున్న నీ ఈ అలౌకిక దివ్యరూపమును ఉపసంహరింపుము - అని దేవకి ప్రార్థించెను.

భగవంతుడు ఈ విధముగా పలికి మౌనము వహించెను. పిమ్మట అతడు తల్లిదండ్రులు చూచుచుండగనే ఆ క్షణమునందే తన మాయతో సాధారణ శిశువుగా మారెను.

అప్పుడు జనులలో సద్గుణములు, సదాచారములు అడుగంటి, దుర్గుణములు, దురాచారములు అధికమైపోవును. అట్టి పరిస్థితులు ఏర్పడినప్పుడు ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి కలిగినదని చెప్పవచ్చును. కృతయుగమున హిరణ్యకశిపుని దుష్టపాలనలో దుర్గుణములు, దురాచారములు మితిమీరినవి. నిరపరాధులు పీడింపబడిరి. ప్రజల ధ్యానజప తపములు, పూజా పారాయణములు, యజ్ఞదానాది పవిత్రకర్మలు, దైవోపాసనలు బలవంతముగ నిలిపివేయబడెను. దేవతలు హింసింపబడిరి. స్థానభ్రష్టులు కావింపబడిరి. నిరపరాధియైన ప్రహ్లాదునివంటి పరమభక్తుడు అనేక విధముల హింసింపబడెను. అట్టి పరిస్థితులలో భగవంతుడు నృసింహావతారమును దాల్చెను. ప్రహ్లాదుని ఉద్ధరించెను. దుష్టులను శిక్షించి, ధర్మమును పరిరక్షించెను. ఈ విధముగనే ఇతర అవతారములు గూడ జరిగినవి.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ 8 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సాధూనామ్ | = సత్పురుషులయొక్క | చ | = మఱియు | సంభవామి | = నందును (నేను) అవతరింతును |
| పరిత్రాణాయ | = పరిరక్షణముకొరకు | ధర్మసంస్థాపనార్థాయ | = ధర్మమును సుస్థిరమొనర్చుటకు | | |
| దుష్కృతామ్ | = దుష్టులయొక్క | యుగే, యుగే | = ప్రతియుగము | | |
| వినాశాయ | = వినాశముకొఱకు | | | | |

సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపుమాపుటకును, ధర్మమును సుస్థిరమొనర్చుటకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును. (8)

ప్రశ్న - 'సాధు' అను శబ్దము ఎట్టివారిని తెలుపును. (సాధువులనగా ఎవరు?) వారిని పరిరక్షించుట లేక ఉద్ధరించుట అనగానేమి?

సమా - అహింస, సత్యము, అస్తేయము (దొంగతనము చేయకుండుట), బ్రహ్మచర్యము మొదలగు సామాన్య ధర్మములతోబాటు యజ్ఞదాన తపస్సులు చేయువారు, అధ్యాపనము, ప్రజాపాలనము మొదలగు తమతమ వర్ణాశ్రమ ధర్మములను చక్కగా పాటించువారు, సహజముగనే ఇతరులకు హితమును గూర్చువారు, సద్గుణనిధులు, సదాచార సంపన్నులు, భక్తిశ్రద్ధలతో భగవాముని నామ, రూప, గుణ, ప్రభావ, లీలాదివిశేషములను వినుచుండువారు, కీర్తించుచుండువారు, స్మరించుచుండువారు, తదితర భక్తిరీతులతో సేవించుచుండువారు - వీరందరికిని 'సాధు' శబ్దము వర్తించును. (వీరందరిని సాధువులుగా) భావింపవచ్చును.

ఇట్టి సాధువులపై దుష్టులు, దుర్మార్గులు దురాచారములు చేయుచుందురు. అట్టి దురాగతముల నుండి వారిని సర్వథా విముక్తులను గావించుట, వారికి ఉత్తమగతులను ప్రసాదించుట, తన దర్శన ప్రభావముతో వారి సంచిత పాపముల నన్నింటిని సమూలముగా నశింపజేసి, వారికి పరమ శ్రేయస్సులను గూర్చుట, తన దివ్యలీలా విలాసములను ప్రదర్శించి, వాటిని శ్రవణ, మనన, చింతన, కీర్తనాది రీతుల ప్రస్తుతించువారికి మోక్షమార్గములను చూపుట - ఈ మొదలగునవి యన్నియును సాధుపరిరక్షణము (ఉద్ధరణము)లోని భాగములు. (క్లుప్తముగా చెప్పవలెనన్న - సాధువులను బాధించు దుష్టుల ఆటలు కట్టించి, వారిని (సాధువులను) కాపాడుట, తన దర్శనలీలావిలాస ప్రభావముతో వారికి వివిధరీతులలో మోక్షమార్గమును చూపుట.)

ప్రశ్న - 'దుష్కృతామ్' అను పదము ఎట్టివారిని గూర్చి చెప్పును. (దుష్కృతులు/దుష్టులు అనగా ఎవరు?) వారిని నాశనము చేయుట అనగానేమి?

సమా - నిరపరాధులు, సదాచార సంపన్నులు, భగవద్భక్తులు మొదలగువారిపై దురాగతము లొనర్చువారు, అసత్యవాదులు, మోసగాళ్ళు, దొంగలు, వ్యభిచారులు, ఇతర దుర్గుణములు గలవారు పెక్కు విధముల అన్యాయ

మార్గములలో ధనము నార్జించువారు, నాస్తికులు, సతతము భగవంతుని, వేదశాస్త్రములను ద్వేషించువారు - ఇట్టి అసురలక్షణములు గల వారిని గూర్చి తెలుపునదియే 'దుష్కృతాం' అను పదము. ఇట్టి దుర్మార్గులను దుష్టప్రవృత్తుల నుండి విముక్తులను గావించుట, వారిని దండనాది వివిధమార్గములద్వారా పాపవిముక్తులను జేయుట, యుద్ధములోగాని, మఱియొక పద్ధతితోగాని వారిని సంహరించుట, లేక సంహరింపజేయుట మొదలగునవి ఈ దుష్టశిక్షణ ప్రక్రియలో అంతర్భాగములు.

ప్రశ్న - భగవంతుడు పరమ దయాళువుగదా! ఆ దుష్టులకు నచ్చజెప్పి వారి దుష్టస్వభావములను ఎందుకు మార్చరాదు? వారిని ఈ విధముగ దండించుట ఎందులకు?

సమా - దుష్టులను దండించుటలోను, చంపుటలోను భగవంతుని దయాస్వభావమే నిండియున్నది. అట్టి దండన, మృత్యువు ద్వారా భగవంతుడు వారి పాపములను నశింపజేయును. భగవంతుని ఈ దండన విధానమును బట్టి ఆయన దయాస్వభావములో లోపమున్నదని భావింపరాదు. తల్లిదండ్రులు తమ సంతానము యొక్క శరీరావయవములలో దేనిపైనైనను వ్రణము ఏర్పడినప్పుడు దానిని నయము చేయుటకై మొదట ఔషధములను వాడుదురు. ఔషధములకు అది లొంగదనిగాని, ఆలసించిన అది విషపూర్ణమై, ఆ దోషము ఇతరాంగములకు సోకుననిగాని తెలిసినప్పుడు ఇతరాంగములను రక్షించుటకై దూషితాంగమునకు శస్త్రచికిత్స చేయింతురు. తప్పనిసరియైనచో ఆ దూషితాంగమును ఖండింప జేయుదురు. సర్వప్రాణులకును తల్లియు, తండ్రియు తానేయైన ఆ భగవంతుడు దుర్మార్గుల దుష్టత్వమును దూరమొనర్చుటకు దుర్యోధనునకు నచ్చజెప్పిన రీతిగా వారికి నచ్చజెప్ప ప్రయత్నించును. దండనభయమును గూడ సూచించును. అది గూడ పనిచేయక, వారి దుష్టత్వము మితిమీరినప్పుడు వారిని దండించును. చంపించును. ఆ విధముగ వారి పాపఫలములను వారిచే అనుభవింపజేయును. పూర్వసంచిత కర్మ మంచిదైయుండి, ఏదేని నిమిత్తమువలనగాని, చెడు సాంగత్యమువలనగాని ఈ జన్మలో దుష్టవర్తనులైనచో వారిని స్వయముగ తానే చంపి, వారికి ముక్తిని ప్రసాదించును - ఈ ప్రక్రియలన్నింటి యందును భగవంతుని దయయే ప్రసరించుచుండును.

ప్రశ్న - 'ధర్మసంస్థాపనము' అనగానేమి?

సమా - ధర్మశాస్త్రములలో నుడివిన రీతిగా స్వయముగా ప్రవర్తించి ధర్మప్రభావమును చాటుట, వేదములు, శాస్త్రములు, పరలోకము, మహాపురుషులు, భగవంతుడు మొదలగు విషయములపై గట్టి విశ్వాసమును ప్రమాణబుద్ధిని ఏర్పఱచుటకై అందరి హృదయములలో పాతుకొని పోవునట్లుగా సహేతుకమైన సమర్థమైన ప్రవచనముల ద్వారా ఉపదేశముల నిచ్చుట, తిరుగులేని విధముగ ఆదేశముల నిచ్చుట, సద్గుణములయెడ సదాచారములపైన శ్రద్ధాదరములను కలిగించుట ఈ యన్నింటిని ప్రజల హృదయములలో సుస్థిరముగా నాటుకొనునట్లు చేయుట - మొదలగునవి యన్నియును 'ధర్మసంస్థాపన' ప్రక్రియలోని అంతర్భాగములే.

ప్రశ్న - సాధుపరిరక్షణము, దుష్టశిక్షణము, ధర్మ సంస్థాపనము- ఈ మూడింటి అవసరములు ఏర్పడినప్పుడే భగవంతుడు అవతరించునా? లేక ఏ ఒకటి రెండింటి కొఱకైనను అవతారమెత్తునా?

సమా - ఈ మూడు కారణములు ఒకే సమయమున ఏర్పడినప్పుడే భగవంతుడు అవతరింపవలయునను నియమము లేదు. ఇందులో ఏ ఒకటి, రెండు లక్ష్యములను సాధించుటకైనను భగవంతుడు అవతరించుచుండును.

ప్రశ్న - భగవంతుడు సర్వశక్తిమంతుడు. అవతారము లెత్తకుండగనే ఈ పనులన్నింటిని చేయగల్గును గదా! మఱి అవతారముల ఆవశ్యకమేమి?

సమా - నిజముగా ఇది సరియైన ప్రశ్న. భగవంతుడు అవతారము లెత్తకుండగనే అన్నింటిని అవలీలగా చేయగలడు, చేయును గూడ. తన దర్శన స్పర్శనభాషణాదుల ద్వారా లోకులను సులభముగ తరింపజేయుటకును, తన పరమ భక్తులు తన దివ్యలీలా విలాసములను ఆస్వాదించునట్లు చేయుటకును, వారిపైగల అనన్య వాత్సల్యముతో భగవంతుడు సాకారరూపమున అవతరించుచుండును. భగవంతుని అవతారముల రూప, గుణ, ప్రభావ, నామ, మహిమా, దివ్యకర్మలను వినుచు, కీర్తించుచు, స్మరించుచు, లోకులు సహజముగనే సంసార సాగరమును దాటగలరు. అవతారముల వలననే ఇది సాధ్యమగును.

ప్రశ్న - నేను ప్రతి యుగమున అవతరింతును. అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - యుగధర్మములను అనుసరించి ధర్మగ్లాని సంభవించిన అన్ని సమయములయందును అవసరమును బట్టి భగవానుడు ఎన్ని మార్లైనను అవతరించుచునే యుండును. యుగమున కొక్కసారి మాత్రమే అవతరింప వలెనను నియమము లేదు.

*సంబంధము - ఈ విధముగ భగవంతుడు తన దివ్యజన్మ (అవతారము)ల అవసరములను, హేతువులను, లక్ష్యములను విశదీకరించి, పిమ్మట ఆ జన్మ (అవతారము)లను గూర్చియు, అందలి కర్మల దివ్యతత్త్వములను గుఱించియు తెలిసికొనుటవలన కలుగు ఫలితములను తెలుపుచున్నాడు-*

**జన్మ కర్మ చ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥ 9 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున! | = ఓ అర్జునా! | ఏవమ్, యః | = ఇట్లు ఎవడైతే | దేహమ్, త్యక్త్వా | = తనువును వీడిన పిమ్మట |
| మే, జన్మ | = నాయొక్క జన్మయును | తత్త్వతః | = తాత్త్వికముగా | పునః, జన్మ, న, ఏతి | = మఱల జన్మను పొందడు |
| కర్మ, చ | = కర్మయును | వేత్తి | = ఎఱుంగునో | మామ్, ఏతి | = నన్నేపొందును |
| దివ్యమ్ | = దివ్యము(లు) | సః | = అతడు | | |

**ఓ అర్జునా! నా జన్మ (అవతారము)లు, కర్మములు, దివ్యములు. అనగా నిర్మలములు. అలౌకికములు. ఈ తత్త్వరహస్యమును తెలిసికొనినవాడు తనువును చాలించిన పిమ్మట మఱల జన్మింపడు సరికదా! నన్నే చేరును. (9)**

ప్రశ్న - భగవంతుని జన్మలు దివ్యములు. ఇందలి తత్త్వరహస్యమును ఎఱుగుట యనగానేమి?

సమా - పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు. పూర్ణబ్రహ్మము. అతడు జనన మరణములకతీతుడు. ఆయన జన్మ (అవతారము) జీవుల (మానవుల) జన్మల వంటిదికాదు. భక్తులపై తనకుగల అనుగ్రహ కారణముగ భగవంతుడు తన దివ్యలీలల ద్వారా వారి మనస్సులను తనవైపు ఆకర్షించుకొనుటకై తన దర్శన స్పర్శన భాషణాదుల ద్వారా వారికి సుఖములను చేకూర్చుటకై, జగత్తునందు తన దివ్యకీర్తిని వ్యాపింపజేసి, వాటిని వినుచు, కీర్తించుచు, స్మరించుచుండు జనుల పాపములను నాశనము చేయుటకై, లోకములో దుర్మార్గులను రూపుమాపి, ధర్మసంస్థాపనను చేయుటకై అతడు (అవతారములను) జన్మలను ఎత్తుచుండును. అవి (ఆ జన్మలు) కేవలము లీలామాత్రములు. ఆయన జన్మ (అవతారము) దోషరహితము. అలౌకికము. లోకకల్యాణము కొరకే భగవంతుడు మనుష్యాది రూపములలో అవతరించుచుండును. ఆయన రూపము (ఆకృతి) పాంచభౌతికమైనది కాదు. అది దివ్యము. చిన్మయము. ప్రకాశమానము. శుద్ధము. అలౌకికము. ఆయన జన్మ గుణకర్మ సంస్కారముల కారణముగ ఏర్పడునది కాదు. ఆయన మాయకు వశుడై జన్మించుట (అవతరించుట) లేదు. ప్రకృతికి అధిష్ఠాతయై (ప్రకృతిని తన అధీనములో ఉంచుకొని) యోగశక్తిచే కేవలము జనులపై గల వాత్సల్యముతో అతడు మనుష్యాది రూపములలో జన్మించు (అవతరించు) చుండును.

ఈ విషయమును చక్కగా తెలిసికొనుట - అనగా ఈ విషయమున ఏ మాత్రము సంశయముగాని, విపరీతభావము గాని లేకుండ, సంపూర్ణ విశ్వాసమును ఉంచుట, సాకార రూపముగల భగవంతుని సాధారణ మానవునిగా నెంచక, సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు, సర్వాంతర్యామి, సాక్షాత్ సచ్చిదానంద ఘన పూర్ణబ్రహ్మ, పరమాత్మగా ఎఱుంగుటయే భగవంతుని జన్మ (అవతారము) యొక్క దివ్యతత్త్వ రహస్యమును తెలిసికొనుట యగును. ఈ అధ్యాయము

నందలి ఆఱవ (6వ) శ్లోకమున ఈ విషయమే వివరింపబడినది. భగవంతుని తత్త్వరహస్యములను ఎఱుంగక ఆయనను సామాన్య మానవునిగా భావించువారు ఏడవ (7వ) అధ్యాయము నందలి 24, 25 శ్లోకములలో తొమ్మిదవ (9వ) అధ్యాయము నందలి 11, 12 శ్లోకములలో నిందింపబడిరి. ఈ తత్త్వము నెఱిగిన వారిని గూర్చి పదవ అధ్యాయమునందలి 3వ శ్లోకములో ప్రశంసించుట జరిగినది. భగవంతుని జన్మల (అవతారముల) దివ్య తత్త్వము నెఱింగినవారు ఒక్క క్షణమైనను ఆయన వియోగమును సహింపలేరు. ఆయన యెడ మిక్కిలి అనన్యభక్తిశ్రద్ధలు కలవారగుట వలన వారు ఎల్లప్పుడు భగవంతునే స్మరించుచుందురు.

ప్రశ్న - భగవంతుని కర్మలు దివ్యములు - అనుటలో గల తత్త్వరహస్యమేమి?

సమా - భగవంతుడు జగత్తును సృష్టించుట, ఆయా అవతారములలో వివిధలీలలు సలుపుట మొదలగు కర్మలన్నింటిలో ఏ మాత్రము స్వార్థ స్పర్శలేదు. కేవలము జనులననుగ్రహించుటకే ఆయన మనుష్యాది అవతారముల నెత్తి వివిధ కర్మల నాచరించుచుండును. (3/22, 23) భగవంతుడు తన ప్రకృతి ద్వారా సమస్త కర్మలను చేయుచున్నప్పటికిని ఆ కర్మలయెడ కర్తృత్వ భావము లేనందున వాస్తవముగ అతడు చేయనివాడే. కనుక ఆయనకు కర్మబంధములంటవు. కర్మఫలములయందు ఆయనకు ఏ మాత్రము స్పృహయే ఉండదు. (4/13, 14). భగవంతుని చేష్టలన్నియును లోకహితార్థమే (4/8). ఆయన ప్రతికృత్యమునందును లోకహితమే నిండియుండును. అతడు అనంతకోటిబ్రహ్మాండములకు స్వామియైనను గర్వరహితుడై దయావాత్సల్యములతో విలసిల్లుచు, అందరితో సమభావముతో వ్యవహరించును. (9/29). భక్తుల సేవలకు తగినట్లుగా వారిని అనుగ్రహించును. (4/11). అతడు తన పరమభక్తుల యోగక్షేమములను తానే స్వయముగ వహించును. (9/22) వారికి దివ్యజ్ఞానమును ప్రసాదించును. (10/10,11) భక్తినౌకను ఆశ్రయించిన మహాభక్తులను సంసారసముద్రమునుండి తరింపజేయుటకు తానే చుక్కాని పట్టువాడై వారిని ఉద్ధరించును. (12/7) భగవంతుని ఇట్టి దివ్యకృత్యములలో ఆసక్తి, అహంకారము, కోరికలు మొదలగు దోషము లెట్టియును ఎంత వెదకినను కానరావు. అవి నిర్మలములు, పరిశుద్ధములై కేవలము జగత్కల్యాణముకొరకే నిర్వహింపబడును. నీతి, ధర్మము, పవిత్రప్రేమ, భక్తి మొదలగు వానిని జగత్తులో వ్యాపింప జేయుటకే ఉద్దేశింపబడినవి. ఈయన్నింటిని నిర్వహించుచున్నను భగవంతునకు వాస్తవముగ వాటితో ఎట్టి సంబంధమును ఉండదు. అతడు 'అకర్త'. వాటికి అతీతుడు. ఈ విషయముల నన్నింటిని చక్కగా ఎఱుంగుటయు, ఇందేమాత్రముసంశయముగాని, విపరీత భావముగాని లేకుండ పూర్ణ విశ్వాసమునుంచుటయే భగవంతుని లీలాకృత్యముల దివ్యతత్త్వములను ఎఱుంగుట యగును.

భగవంతుని కర్మల దివ్యతత్త్వమును ఈ విధముగ తెలిసికొన్న వారి కర్మలు కూడ పవిత్రములు, అలౌకికములు అగును. అనగా వారు గూడ అందరి యెడల దయ, సమత్వము, ధర్మము, నీతి, వినయము కలిగి నిష్కామ ప్రేమ భావముతో మెలగుదురు.

ప్రశ్న - భగవంతుని జన్మలు, కర్మలు అను రెండింటి దివ్యత్వమును ఎఱుంగుటవలన భగవత్ప్రాప్తి కలుగునా? లేక వీనిలో ఏ ఒక్కదాని దివ్యత్వము నెఱింగినను కలుగునా?

సమా - ఈ రెండింటిలో ఏ ఒక్కదాని దివ్యత్వము నెఱింగినను భగవత్ప్రాప్తి కలుగును. (4/14, 10/3) ఇక రెండింటి దివ్యత్వమును తెలిసికొన్న వారి విషయమున చెప్పవలసినదేమున్నది!

ప్రశ్న - ఈ విషయమును తెలిసికొన్నవానికి పునర్జన్మ యుండదు. అతడు నన్నే పొందును - అని యనుటలోని పరమార్థమేమి?

సమా - అతడు పునర్జన్మను పొందక ఏ స్థితిని పొందును? అను ప్రశ్నకు సమాధానము - ఇది. భగవంతుని జన్మ కర్మల దివ్యజ్ఞానమును పొందిన వ్యక్తి అవసాన దశయందు భగవంతునే స్మరించును. కనుక అతనికి భగవత్ప్రాప్తి కలుగును. భగవత్ప్రాప్తి కలిగిన వానికి పునర్జన్మ యుండదు గదా! ఇది పరమ సిద్ధాంతము. (8/16)

ప్రశ్న - భగవంతుని జన్మ కర్మల దివ్యత్వము నెఱింగిన వానికి ఈ తనువును చాలించిన పిమ్మట (మరణానంతరము) భగవత్ప్రాప్తి కలుగునని చెప్పబడినది. అయినచో ఆ భక్తునకు ఈ జన్మలోనే భగవత్ప్రాప్తి కలుగదా?

సమా - ఈ జన్మలో భగవత్ప్రాప్తి కలుగదను ప్రసక్తియే

లేదు. భగవంతుని జన్మకర్మల దివ్యత్వమును సంపూర్ణముగా ఎఱింగిన మరుక్షణముననే అతనికి భగవత్ సాక్షాత్కారము లభించును. మరియు మరణానంతరము వానికి పునర్జన్మయే ఉండదు. అతడు సరాసరి పరమపదమునే చేరును. అతడు 'తనువును చాలించిన పిమ్మట భగవంతునే పొందును' అని తెలుపుటలోని పరమార్థమిదియే.

సంబంధము - ఈ విధముగ భగవంతుని జన్మకర్మల దివ్యతత్త్వమును ఎఱుంగుట వలన కలుగు ప్రయోజనము అనాది నుండియు పరంపరగా లభ్యమగుచున్నదే - అను విషయమును భగవంతుడు స్పష్టపఱచుచున్నాడు-

**వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వీతరాగ, భయక్రోధాః | = రాగభయ క్రోధరహితులు | మామ్, ఉపాశ్రితాః | = నన్ను ఆశ్రయించిన వారు (అగు) | జ్ఞానతపసా | = జ్ఞానరూప తపస్సుచే |
| మన్మయాః | = నాయందే అనన్యభక్తితో స్థితమైనవారు | బహవః | = పెక్కుమంది భక్తులు | పూతాః | = పవిత్రులై |
| | | | | మద్భావమ్, ఆగతాః | = నా స్వరూపమును పొందియుండిరి |

ఇదివరలోగూడ సర్వథా రాగభయక్రోధరహితులైనవారు, దృఢమైన భక్తి తాత్పర్యములతో స్థిరబుద్ధి గలిగి, నన్ను ఆశ్రయించిన భక్తులు పెక్కుమంది జ్ఞాన తపస్సంపన్నులై పవిత్రులై నాస్వరూపమును పొందియుండిరి. (10)

ప్రశ్న - 'వీతరాగ భయక్రోధు'లనగా ఎవరు? ఈ విశేషణమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - రాగమనగా ఆసక్తి. ఏదేని ఒక ఆపద కలుగునను ఊహతో మనస్సు కలత చెందుటను భయమందురు. తనకు అపకారము చేయువారి యెడలను, నీతివిరుద్ధముగా లేక తన ఆలోచనలకు వ్యతిరేకముగా ప్రవర్తించువారి పైనను కలుగు ఉద్రేకపూరిత భావము క్రోధమనబడును. ఈ మూడు వికారములు ఏ మాత్రము లేనివారిని, 'వీతరాగ భయక్రోధు'లు అని యందురు. భగవంతుని యొక్క దివ్యములైన జన్మల, కర్మల రహస్యములను ఎఱిగిన వారికి భగవంతునిపై అనన్యభక్తి, ఆసక్తి ఏర్పడును. అట్లు భగవదాసక్తులైన వారికి లౌకిక విషయములపై లేశమాత్రమైనను ఆసక్తి (రాగము) కలుగదు. భగవత్తత్త్వమును తెలిసికొన్నవారికి సర్వత్ర భగవంతుడే కన్పించుచుండును. సర్వత్ర భగవద్బుద్ధి ఏర్పడిన కారణముగ వారినుండి భయము దూరమగును. భగవత్తత్త్వము తెలిసినవారి యెడల ఎవరెట్లు ప్రవర్తించినను ఆ సంఘటనలన్నియును భగవంతుని లీలలేయనియు, భగవత్సంకల్పానుసారమే జరుగుచున్నవనియు వారు తలంతురు. ఎట్టి పరిస్థితులలోను వారిలో క్రోధవికారము కలుగదు. భగవంతుని దివ్యతత్త్వమును ఎఱింగిన భక్తుల నుండి రాగ, భయ, క్రోధములు తొలగిపోవుటయే గాక భగవదనుగ్రహ ప్రభావమున దుర్గుణము లన్నియును దూరమగును. ఈ రహస్యమును దెలుపుటకే ఇచట ఈ 'వీత రాగభయక్రోధాః' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'మన్మయాః' అను పద ప్రయోగము నందలి ప్రత్యేకత ఏమి?

సమా - భగవంతునిపై అనన్యభక్తి కల్గిన వారికి సర్వత్ర భగవంతుడే కనబడుచుండును. అప్పుడు వారు 'సర్వమ్ విష్ణుమయమ్' అను స్థాయికి చేరుదురు. అట్టి వారినే 'మన్మయాః' అను పదము సూచించును. భగవంతుని జన్మకర్మలు దివ్యములని తెలిసికొన్నవారు భగవత్తత్త్వమును చక్కగా ఎఱుంగుదురు. అట్టి జ్ఞానులైన భక్తులకు భగవంతునియందు అనన్య ప్రేమ కలుగును. వారు నిరంతరము భగవంతునియందు తన్మయులై సర్వత్ర భగవంతునే చూచెదరు.

ప్రశ్న - 'మాముపాశ్రితాః' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - భగవంతుని శరణు గోరినవారు తమ

భారమునంతయును భగవంతునిపైనే ఉంచెదరు. వారు చేయు సమస్త కర్మలను తమకొఱకైగాక భగవత్సేవలో భాగముగనే చేయుచుందురు. అందులోనే వారు సంతుష్టి చెందుచుందురు. అట్టివారిని సూచించునదియే 'మాముపాశ్రితాః' అను పదము.

శరణాగతి పారమ్యమును ప్రకటించుటయే ఈ విశేషణ ప్రయోగము యొక్క పరమలక్ష్యము. ప్రపన్నులై తనను ఆశ్రయించిన వారి సమస్త భారములను భగవంతుడు తానే వహించును. మరియు ప్రపత్తి భావములన్నింటిని వారిలో సంపూర్ణముగ వికసింపజేయును.

ప్రశ్న - 'జ్ఞాన తపసా' అను పదము యొక్క అర్థమును ఆత్మజ్ఞానరూపమైన తపస్సు అని భావింపక భగవంతుని జన్మకర్మల జ్ఞానమని భావించుటలోని యభిప్రాయమేమి? అట్టి జ్ఞాన తపస్సుచే పవిత్రులై భగవత్స్వరూపమును పొందుదురని చెప్పుటలోని యభిప్రాయమేమి?

సమా - ఇచట సాంఖ్య(ఆత్మజ్ఞాన) యోగ ప్రసక్తిలేదు. ఇది భక్తికి సంబంధించిన ప్రకరణము. పూర్వశ్లోకమునందు భగవంతుని జన్మకర్మలను దివ్యములుగా తెలిసికొనుటవలన ఫలము భగవత్ప్రాప్తియని చెప్పబడినది. దానినే ఈ శ్లోకము ప్రామాణిక మొనర్చుచున్నది. కనుక జ్ఞానతపసా అను పద ప్రయోగములో జ్ఞానమనగా భగవంతుని జన్మకర్మల దివ్యజ్ఞానమే కాని ఆత్మజ్ఞానము కాదు.

ఈ జ్ఞాన రూప తపః ప్రభావమున భక్తునకు భగవంతునిపై అనన్య ప్రేమ ఏర్పడును. ఫలితముగ అతని యొక్క సమస్త పాపతాపములు నశించును. క్రమముగ అంతఃకరణ శుద్ధి కలుగుటచే అన్ని విధములైన దుర్గుణములును వానినుండి దూరమగును. అప్పుడు వాని కర్మలన్నియును భగవత్కర్మములవలె దివ్యములగును. అతడెన్నడును భగవంతునినుండి వేఱుకాడు. అతనికి భగవంతుడు సదా ప్రత్యక్షమై యుండును - అట్టి భక్తులు జ్ఞానరూప తపస్సుచే పవిత్రులై భగవంతుని స్వరూపమును పొందుదురనగా ఇదియే.

*సంబంధము - పదవ శ్లోకములో భగవంతునియొక్క జన్మకర్మల దివ్యత్వము నెఱిగినవారికి భగవత్ప్రాప్తి కలుగునని చెప్పబడినది. భగవంతుడు ఏ ప్రకారముగ ఏ రూపములో వారికి లభ్యుడగును - అను విషయము ఈ 11వ శ్లోకములో వివరింపబడుచున్నది-*

**యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ।**
**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ 11 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓపార్థా! | అహమ్ | = నేను | సర్వశః | = అన్నివిధముల |
| యే | = ఎవరు | తాన్ | = వారిని | మమ | = నాయొక్క |
| మామ్ | = నన్ను | తథా, ఏవ | = అట్లే | వర్త్మ | = మార్గమును |
| యథా, ప్రపద్యంతే | = ఎట్లు సేవింతురో? | భజామి | = అనుగ్రహింతును | అనువర్తంతే | = అనుసరించుచుందురు. |
| | | మనుష్యాః | = మనుష్యులు | | |

**పార్థా! భక్తులు నన్ను సేవించిన రీతికి అనుగుణముగ నేను వారిని అనుగ్రహింతును. మనుష్యులందరును వివిధరీతులలో నా మార్గమునే అనుసరింతురు. (11)**

ప్రశ్న - 'భక్తులు నన్ను సేవించిన రీతికి అనుగుణముగ నేను వారిని అనుగ్రహింతును.' అట్లనుటలోని విశేషమేమి?

సమా - భక్తులు భగవంతుని వేర్వేఱు పద్ధతులలో సేవింతురు. వారు తమ తమ భావముల ననుసరించి వివిధ రూపములలో కొలిచెదరు. తమ సంప్రదాయముల ప్రకారము భజింతురు. స్మరింతురు. కావున భగవంతుడు కూడ భక్తుల అభీష్టానుసారము ఆయా రూపములలోనే వారికి దర్శనమిచ్చును. భక్తులు విష్ణు, రామ, కృష్ణ, శివ, దేవీ - ఇత్యాది రూపములలో ఉపాసింతురు. భగవంతుడును వారిని ఆయా రూపములలోనే అనుగ్రహించును. భగవంతుని నిరాకారసర్వవ్యాపిగా భజించువారిని తదనుగుణముగ తరింపజేయును. అట్లే భగవంతుని మత్స్య, కూర్మ, నృసింహ,

వామనాది వివిధ రూపములలో కొలుచువారికి ఆయా రూపములలోనే దర్శనమిచ్చి వారిని ఉద్ధరించును. ఎవరు ఏయే భావములతో భగవంతుని భజింతురో వారిని తదనుసారముగనే అతడనుగ్రహించును. తనను స్మరించు వారిని అతడు స్మరించును. తనకై వ్యాకులపడువారి విషయమున అతడును వ్యాకులత చెందును. ఆయన వియోగమును సహింపలేని వారి వియోగమును తానును సహింపలేడు. తనకు సర్వస్వమును ధారపోయువారిని తానును సర్వాత్మనా ఆదుకొనును. గోపాలురవలె తనను మిత్రునిగా భావించిన వారికి మిత్రుడుగను, యశోదానందుల వలె పుత్రునిగా భావించువారికి పుత్రునిగను, రుక్మిణివలె భర్తగా సేవించువారికి భర్తగను, హనుమంతునివలె స్వామిగా సేవించువారికి స్వామిగను, గోపికలవలె మధురభక్తితో భజించినవారి విషయమున ప్రియతమునిగను వ్యవహరించి, వారికి శుభములను ప్రసాదించుటయేగాక తన దివ్యలీలా రసానందములను వారిచే అనుభవింపజేయును.

ప్రశ్న - మనుజులందరును నా మార్గమునే అనుసరింతురు - అనుటలోని ఆంతర్యమేమి?

సమా - లోకులు భగవన్మార్గమునే అనుసరింతురు. భగవంతుడు భక్తులను ప్రేమాదరములతో కాపాడినట్లు భక్తులు కూడ పరస్పరము అదే విధముగ వ్యవహరింతురు. ధర్మ సంస్థాపనమే భగవదవతారమునకు ముఖ్య లక్ష్యము. కావున ఈ ధర్మనీతిని జగత్తున అతడు వ్యాపింపజేయును. (4/8)

*సంబంధము - అట్లయినచో లోకులు భగవంతుని సేవింపక ఇతర దేవతలను ఎందులకు పూజించెదరు? - అను విషయము తరువాత శ్లోకములో వివరింపబడుచున్నది-*

**కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।**
**క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ 12 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇహ, మానుషే, = | ఈ మనుష్య | కాంక్షంతః | = కోరుకొనువారు | కర్మజా, సిద్ధిః = | కర్మలను ఆచరించుట |
| లోకే | లోకమునందు | దేవతాః | = (ఇతర) దేవతలను | | వలన కలుగు ఫలము |
| కర్మణామ్ | = కర్మలయొక్క | యజంతే | = పూజింతురు | క్షిప్రమ్, భవతి = | (వారికి) శీఘ్రముగా |
| సిద్ధిమ్ | = ఫలమును | హి | = ఏలనన | | లభించును. |

**ఈ లోకమున కర్మఫలములను ఆశించువారు ఇతర దేవతలను పూజింతురు. ఏలనన అట్లు చేయుటచే కర్మలవలన కలుగు సిద్ధి వారికి శీఘ్రముగా లభించును. (12)**

ప్రశ్న - 'ఇహ, మానుషే, లోకే' అను ప్రయోగమునందలి రహస్యమేమి?

సమా - యజ్ఞాది కర్మల ద్వారా ఇంద్రాది దేవతలను ఉపాసించు అర్హత మానవులకు మాత్రమే కలదు. ఇతర ప్రాణులకు లేదు. 'ఇహ, మానుషే', లోకే' అను పదప్రయోగము ఈ భావమునే తెలుపును.

ప్రశ్న - 'కర్మల ఫలములను కోరు జనులు, దేవతలను పూజింతురు. ఏలనన వారికి కర్మలవలన కలుగు సిద్ధి శీఘ్రముగా లభించును.' ఈ వాక్యముల భావమేమి?

సమా - సాంసారిక భోగములయందాసక్తి గలవారు తామాచరించు కర్మలకు ఫలములుగా భార్యాపుత్రులు, ధనము, గృహము, ఆదర సత్కారములు మొదలగు వానిని కాంక్షింతురు. వారి బుద్ధి జ్ఞానములు విషయసుఖాదివాసనలతో కప్పబడియుండుటవలన వారు పరమాత్మను సేవింపక కామ్యఫలప్రాప్తికై ఇంద్రాది దేవతలను పూజింతురు. (7/20, 21, 22, 9/23, 24) ఉపాసకుల యొక్క అనుష్ఠాన స్థాయిని బట్టి దేవతలు వారి మనోరథములను తీర్చెదరు. ఉపాసకుల హితాహిత విచారణ వారిదికాదు. సాంగోపాంగముగ అనుష్ఠానములను పూర్తిచేసిన ఉపాసకులకు తగిన ఫలములను వారు తమ తమ పరిధులకు లోబడి ఇచ్చెదరు. కాని భగవద్విధానము వేఱు. ఆయన భక్తుల యొక్క హితాహితములను పరిశీలించి, వారి భక్తిస్థితి (స్థాయి)కి అనుగుణముగా ఫలములనిచ్చును. భక్తులు సకామ భావముతో ఆరాధించినను భగవంతుడు వారి

కోర్కెలను గూడ తీర్చును. కాని తత్ఫలితముగ వారికి విషయసుఖములయెడ వైరాగ్యమేర్పడి భగవంతుని యెడ భక్తి విశ్వాసములు వృద్ధిచెందును. ఐహిక ఫలముల నాశించి సేవించువారికి భగవద్భక్తివలన త్వరగా ఫలములు సిద్ధించునట్లు కనబడదు. కావున అట్టి మందబుద్ధులు సద్యః ఫలములకై ఆరాటపడుచు ఇతర దేవతలను పూజింతురు.

*సంబంధము - 9వ శ్లోకములో భగవంతుడు తన జన్మకర్మల దివ్యత్వమును ఎఱుంగుట వలన కలుగు ఫలితము భగవత్ప్రాప్తియని తెలిపెను. అంతకుముందు భగవానుడు తన జన్మల దివ్యత్వమునుగూర్చి చక్కగా వివరించెను. కాని అతని కర్మల దివ్యత్వవిషయము స్పష్టము కాలేదు. కావున రాబోవు రెండు (13, 14) శ్లోకములలో భగవంతుడు తన సృష్టిరచనాది కర్మలయందు కర్తృత్వముగాని, వైషమ్యము (పక్షపాతదృష్టి)గాని, ఆసక్తిగాని తనకు లేవని తెలుపుచు తన కర్మలయొక్క దివ్యత్వమును ప్రకటించుచున్నాడు-*

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుణకర్మవిభాగశః | = గుణ, కర్మల విభజనను అనుసరించి | మయా | = నాచేత | అవ్యయమ్ | = శాశ్వతుడ (పరమేశ్వరుడ)నైన |
| చాతుర్వర్ణ్యమ్ | = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర రూప (నాలుగు) వర్ణముల సమూహము | సృష్టమ్ | = సృష్టింపబడినది | మామ్ | = నన్ను |
| | | తస్య | = ఆసృష్టికి | అకర్తారమ్ | = అకర్తనుగా |
| | | కర్తారమ్, అపి | = కర్తను ఐనప్పటికిని | విద్ధి | = ఎఱుంగుము. |

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణముల వారిని వారి గుణకర్మల ననుసరించి వేర్వేరుగా సృష్టించితిని. ఈ సృష్టి కార్యక్రమమునకు నేనే కర్తనయినను, శాశ్వతుడను, పరమేశ్వరుడైన నన్ను వాస్తవముగా అకర్తనుగా తెలిసికొనుము.

ప్రశ్న - గుణకర్మలనగా నేమి? వాటిని విభాగ పూర్వకముగా భగవంతుడు నాలుగు వర్ణముల వారిని సృష్టించుచున్నాడనుటలో గల విశేషమేమి?

సమా - అనాది నుండియు జీవులు జన్మ జన్మాంతరము లలో చేసిన కర్మల ఫలములు అనుభవింపనంత వరకు వాటి ననుసరించి, సత్త్వరజస్తమో గుణములు ఎక్కువ తక్కువలుగా నుండును. ఈ గుణకర్మల ననుసరించియే భగవంతుడు వారికి బ్రాహ్మణాది వర్ణములలో జన్మనిచ్చును. సత్త్వగుణము అధికముగా నున్నవారు బ్రాహ్మణులుగను, సత్త్వమిశ్రిత రజోగుణ మధికముగ నున్నవారు క్షత్రియులుగను, తమోమిశ్రిత రజోగుణము ఎక్కువగా నున్నవారు వైశ్యులుగను, రజోమిశ్రిత తమోగుణము హెచ్చుగా నున్నవారు శూద్రులుగను జన్మింతురు. ఈ తీరుగ సృష్టింపబడిన వర్ణముల వారికి వారి స్వభావముల ననుసరించి, వేర్వేఱు కర్మలను గూడ భగవంతుడే విధించెను. బ్రాహ్మణులు శమదమాది కర్మలలోను, క్షత్రియులు శౌర్యము, తేజస్సులతో గూడిన కర్మల యందును, వైశ్యులు కృషి, గోరక్షణాది కార్యక్రమముల యందును, శూద్రులు తదితర సామాజిక సేవలయందును నిరతులగుదురు. (18/41 నుండి 44) ఇట్లు గుణ కర్మవిభాగ పూర్వకముగ భగవానుడు నాలుగు వర్ణముల వారిని సృజించెను. ఈ వర్ణవ్యవస్థ నిరంతరము సాగుచునే యుండును. వర్ణశుద్ధి ఉన్నంత వరకు ఒకే వర్ణమునకు చెందిన స్త్రీ పురుషులకు కలుగు సంతానమునకు గూడ ఆ తల్లిదండ్రుల గుణములే వచ్చును. అప్పుడీ సమాజమునందు ఎట్టి ఒడుదొడుకులును ఉండవు. ఒకవేళ అవి ఏర్పడినను ఈ వర్ణవ్యవస్థ న్యూనాధిక రూపములో ప్రవర్తిల్లుచునే యుండును.

ఈ ప్రకరణమునందు కర్మలు, ఉపాసనలు చర్చనీయాంశములు. వీటిని ఆచరించు (నడుపు) వారు మనుష్యులే. కనుక మనుష్యులను ఉదాహరణముగా తీసికొని వర్ణవిభాగము వివరింపబడినది. అట్లే దేవ, పితృ, పశు పక్ష్యాదుల సృష్టిగూడ వారి (వాటి) గుణకర్మలను

అనుసరించియే చేయబడును. కావున ఈ సృష్టికార్యక్రమము నందు భగవంతునకు ఏ మాత్రము వైషమ్యము లేదు. ఈ భావమే ఇచట విశదము చేయబడినది.

ప్రశ్న - బ్రాహ్మణాది వర్ణముల విభాగము జన్మవలన ఏర్పడినదా? లేక కర్మవలననా?

సమా - వర్ణవిభాగమునకు జన్మ, కర్మలు రెండును సమానాంగములైనప్పటికిని ఈ విభజనకు జన్మయే ముఖ్యమైనదని భావింపవలెను. తల్లిదండ్రులు ఒకే వర్ణమునకు చెందిన వారైనచో, జన్మలో ఏవిధమైన సాంకర్యము లేనిచో సహజముగా కర్మలో గూడ ఎట్టి సాంకర్యము జరుగదు. సహవాసదోషము, ఆహారదోషము, మఱియు దోషభూయిష్ఠములైన చదువు సంధ్యలబ్బుట మున్నగువాని వలన కర్మలలో వైపరీత్యములు ఏర్పడవచ్చును. కావున వర్ణరక్షణకు జన్మయే మూలము. ఐనప్పటికిని కర్మశుద్ధి విషయము గూడ కాదనరానిది. కర్మభ్రష్టత్వమేర్పడినచో వర్ణమును రక్షించుకొనుటయు కష్టమగును. జీవిక విషయముననను వివాహాది సందర్భములయందును జన్మకే ప్రాధాన్యము. శుభ లాభముల విషయమున కర్మము జీవనాడి. జన్మతః బ్రాహ్మణుడైనను వాని కర్మలు బ్రాహ్మణోచితములు కానిచో వానికి మేలు జరుగదు. అట్లే సర్వసాధారణధర్మములైన శమదమాది గుణములను సత్ప్రవర్తనను కల్గియున్నను శూద్రుడు బ్రాహ్మణోచితములైన యజ్ఞయాగాది కర్మలను ఆచరించినచో అతడు తన జీవికను సంపాదించు కొనవచ్చును, కాని పాప ఫలమును అనుభవింపక తప్పదు.

ప్రశ్న - నష్టప్రాయమైన వర్ణవ్యవస్థగల ఈ కాలములో జన్మనుబట్టి వర్ణమును నిర్ణయింపక, కర్మాచరణమును బట్టి వర్ణమును నిర్ణయించుటలో గల దోషమేమి?

సమా - ఇట్లు భావించుట యుక్తము కాదు. వర్ణవ్యవస్థలో కొంత శైథిల్యము ఏర్పడిన మాట వాస్తవమే. ఐనను అది పూర్తిగా నశింపలేదు. జీవులు తమ కర్మఫలములను అనుభవించుట కొఱకే వారి పూర్వకర్మానుసారము భగవంతుడు వారిని ఆయా వర్ణములలో పుట్టించును. భగవద్విధానమును మనుష్యులు మార్చజాలరు. కర్మాచరణమును బట్టి వర్ణమును నిర్ణయించుట అసంభవము. ఒకే తల్లిదండ్రులకు జన్మించినవారి కర్మాచరణముల యందు భిన్నత్వము కనబడుచుండును. ఒకే వ్యక్తియు ఒక దినమునందు ఒక సందర్భమున బ్రాహ్మణ కర్మలను, మరియొక సమయమున శూద్రకర్మలను ఆచరించుచుండును. ఇట్టి సందర్భములలో వర్ణమును నిర్ణయించుట యెట్లు? అట్లయినచో నిమ్నవర్ణస్థుడగుటకు ఎవడు సమ్మతించును? భోజనవివాహాది విషయములలో కల్లోలములు (విషమ సమస్యలు) ఏర్పడును. తత్ఫలితముగ వర్ణవిప్లవమేర్పడి వర్ణవ్యవస్థ చిన్నాభిన్నమగును. అందువలన కర్మలనుబట్టి వర్ణములను నిర్ణయింపరాదు.

ప్రశ్న - భగవంతుడు 14వ అధ్యాయమున సత్త్వగుణ ప్రధానులైనవారు మరణానంతరము ఊర్ధ్వలోకములను చేరుదురనియు, రజోగుణ ప్రధానులైన వారు మనుజులుగను, తమోగుణ ప్రధానులైనవారు పశుపక్ష్యాదులుగను జన్మింతురని పేర్కొనెను. కాని ఇచ్చట సత్త్వగుణ ప్రధానులు బ్రాహ్మణులుగను, రజోగుణులు క్షత్రియాది వర్ణములయందును జన్మింతురని పేర్కొనుట జరిగినది. ఇవి పరస్పర విరుద్ధముగ కన్పించు చున్నవి గదా?

సమా - ఇందు వాస్తవముగ వైరుధ్యమేమియు లేదు. రాజసస్వభావము గలవారు, రజోగుణవృద్ధి యందు మృతిచెందినవారు మానవులుగా జన్మించుట సత్యము. కాని రజోగుణప్రధానులైన మానవులందరి గుణములు సమానముగా ఉండవు. ఈ గుణములలో తారతమ్యము లుండును. తదనుసారముగ సత్త్వగుణ ప్రధానులు బ్రాహ్మణులుగను, సత్త్వమిశ్రిత రజఃప్రధానులు క్షత్రియులుగను, తమోమిశ్రిత రజఃప్రధానులు వైశ్యులుగను, రజోమిశ్రిత తమఃప్రధానులు శూద్రులుగను జన్మింతురు. సత్త్వరజోగుణ స్పర్శ లేకుండ కేవలము తమోగుణ ప్రధానులు దానికంటె నిమ్నకోటియోనులలోను జన్మింతురు.

ప్రశ్న - 9వ అధ్యాయము నందలి 10వ శ్లోకమున ప్రకృతియే సమస్త జగత్తును సృష్టించుచున్నట్లు తెల్పబడినది. ఇచట భగవంతుడే స్వయముగ సృష్టికర్త యైనట్లు పేర్కొనబడినది. ఇందు పరస్పర వైరుధ్యమున్నట్లు కనబడుచున్నది దీనికి సమాధానమేమి?

సమా - ఇందులో ఎట్టి వైరుధ్యమును లేదు. ఆ శ్లోకమున కేవలము ప్రకృతియే జగత్తును సృష్టించుచున్నట్లు పేర్కొనబడలేదు. భగవంతుని అధ్యక్షతన ప్రకృతి జగత్తును రచించినట్లు చెప్పబడినది. ప్రకృతి జడమగుట వలన భగవంతుని సహాయము లేకుండ గుణకర్మవిభాగము చేసి

సృష్టి రచన చేయు సామర్థ్యము దానికి లేదు. దీనిని బట్టి ప్రకృతియే జగత్సృష్టి చేయుచున్నట్లు తెలుపబడిన సందర్భములన్నింటను భగవంతుని పర్యవేక్షణ తోడనే అది జరుగుచున్నట్లు గ్రహింపవలెను. భగవానుడే సృష్టికర్తయని తెలిపిన సందర్భములలో ఆయనయే స్వయముగ రచింపడనియు, ప్రకృతి ద్వారా రచింపజేయుననియు ఎఱుంగవలెను.

ప్రశ్న - నేను జగత్సృష్టికి కర్తనే యైనను నన్ను అకర్తగనే ఎఱుంగుము. అని అనుటలోని అంతర్యమేమి?

సమా - ఇందువలన భగవంతుని కర్మల దివ్యత్వము అవగతమగుచున్నది. భగవంతుని ఏ కర్మలయందును రాగద్వేషములుగాని, కర్తృత్వము గాని ఉండవు. సదా, సర్వథా అతడా కర్మలకు అతీతుడు. ఆయన అధ్యక్షతన ప్రకృతియే సమస్త కర్మలను చేయును. లోక వ్యవహారమున భగవంతుడే 'కర్త'గా గోచరించుచున్నను వాస్తవముగా అతడు ఉదాసీనుడు. కర్మలతో ఆయనకు ఎట్టి సంబంధమును లేదు. (9/9,10) ఈ భావమును స్పష్టపరచుటకే భగవంతుడు తనను 'అకర్త'గా పేర్కొనెను. జ్ఞానియైనవాడు తాను కర్మలను ఆచరించునప్పుడు ప్రతిఫలాపేక్షగాని, కర్తృత్వబుద్ధిగాని వానికి ఉండవు. కావున కర్మల ఫలముతో అతనికి సంబంధము ఉండదు. జ్ఞానియైన మనుజుని విషయమే ఇట్లుండగా ఇక భగవంతుని విషయమున చెప్పవలసిన దేమున్నది? భగవంతుని కర్మలన్నియును అలౌకికములే.

**న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా ।**
**ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మఫలే | = కర్మఫలమునందు | న, లింపంతి, ఇతి | = అంటవు అనియు | సః, కర్మభిః | = అతడు కర్మలచేత |
| మే, స్పృహా, న | = నాకు ఆసక్తి లేదనియు | యః | = ఎవడైతే | న, బధ్యతే | = బంధింపబడడు. |
| మామ్ | = నన్ను | మామ్ | = నన్ను | | |
| కర్మాణి | = కర్మలు | అభిజానాతి | = తెలిసికొనునో | | |

నాకు కర్మఫలాసక్తి లేదు. కావున కర్మలు నన్నంటవు. ఈవిధముగా వాతత్త్వమును తెలిసినవారు కర్మబద్ధులు కారు. (14)

ప్రశ్న - కర్మలంటుట అనగానేమి? 'కర్మ ఫలముల యందు నాకాసక్తి లేదు. కనుక కర్మలు నన్నంటవు.' అనుటలోని అంతర్యమేమి?

సమా - కర్మల నాచరించు వానికి మమకారము, ఫలేచ్ఛ, ఆసక్తి, అహంకారము మొదలగు లక్షణములు ఉండుట వలన ఆ సంస్కారములు అతని అంతఃకరణములో సంచితములగును. ఆ కారణముగ పునర్జన్మయు, సుఖ దుఃఖానుభవములును కలుగును. 'కర్మలంటును' అనుటలోని భావమిదియే.

భగవంతుని ద్వారా జరుగు కర్మల యొక్క ఫలరూప భోగములలో దేనియందును ఆయనకే మాత్రము ఆసక్తి ఉండదు. అనగా ఆయనకే వస్తువునందును అపేక్ష యుండదు. (3/22) భగవంతుని ద్వారా జరుగు కర్మలన్నియును కేవలము లోకకల్యాణము కొఱకే. (4/8) అందు మమత, ఆసక్తి, ఫలేచ్ఛ, కర్తృత్వము అనునవి మచ్చునకైనను ఉండవు. వీటితో ఆయనకు ఏ మాత్రము సంబంధమే యుండదు. అందువలననే ఆయన సమస్త కర్మలును దివ్యములు. కనుక అవి ఆయననంటవు. అనగా బంధింపవు.

ప్రశ్న - పైన చెప్పిన రీతిగా భగవంతుని తత్త్వమును తెలిసికొనుట అనగానేమి? ఆ విధముగా తెలిసికొనిన వారిని కర్మలు ఏల బంధింపవు?

సమా - విశ్వసృష్ట్యాది సమస్త కర్మలను చేయుచున్నను భగవంతుడు వాస్తవముగా అకర్తయే. ఆ కర్మలతో ఆయనకెట్టి సంబంధమూ లేదు. ఆకర్మల విషయమున ఆయనకు ఏ మాత్రము వైషమ్యమూ ఉండదు.

కర్మఫలములయందును ఆయనకు ఆసక్తి, మమత, కోరిక అనునవి ఉండవు. కనుక అవి ఆయనను కర్మబంధముల యందు పడవేయజాలవు. భగవత్తత్త్వమును తెలిసికొనుట అనగా నిదియే. ఈ విధముగ భగవంతుని కర్మల రహస్యమును యథార్థముగ తెలిసికొన్న మహాత్ములు చేయు కర్మలు గూడ భగవంతుని కర్మల వలె మమత, ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకారాది రహితములై కేవలము లోక కల్యాణము కొఱకే జరుగుచుండును. కనుక వారిని గూడ కర్మలు బంధింపవు.

'తాము చేయు కర్మలయందు కర్తృత్వబుద్ధి, కర్మఫలముల యందు కాంక్ష, మమత, ఆసక్తి కలవారికి వస్తుతః భగవత్కర్మల దివ్యత్వము తెలియనే తెలియదు'. అను విషయము స్పష్టమగుచున్నది.

*సంబంధము - ఈ విధముగ భగవంతుడు తన కర్మల దివ్యత్వమును, దాని తత్త్వరహస్యమును తెలిసికొనుటవలన కలుగు మహత్త్వమును తెలిపి, ముముక్షువులైన మహాపురుషులను ఉదాహరించుచు, వారివలెనే నిష్కామ భావముతో కర్మల నాచరింపుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు-*

**ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।**
**కురు కర్మైవ తస్మాత్ త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ 15 ॥**

పూర్వైః = ప్రాచీనులైన
ముముక్షుభిః అపి = ముముక్షువుల చేతగూడ
ఏవమ్ = ఈ విధముగా
జ్ఞాత్వా = తెలిసికొనబడి
కర్మ, కృతమ్ = కర్మలు చేయబడినవి
తస్మాత్ = అందువలన
త్వమ్ = నీవును
పూర్వైః = ప్రాచీనులచేత
పూర్వతరమ్, కృతమ్ = నిరంతరము చేయ బడుచువచ్చిన
కర్మ, ఏవ = కర్మలనే
కురు = చేయుము.

**ఓ అర్జునా! ప్రాచీనులైన ముముక్షువులు ఈ విధముగ (నా తత్త్వ రహస్యమును) దెలిసికొని కర్మల నాచరించిరి. కావున నీవును ఆ పూర్వులవలెనే నిష్కామ భావముతో కర్మల నాచరింపుము. (15)**

ప్రశ్న - ముముక్షువులనగా ఎవరు? అట్లే వారిని ఉదాహరించుచు ఈ శ్లోకమున తెలిపిన విషయమేమి?

సమా - ముముక్షువులనగా - **1.** జనన మరణరూప సంసారబంధములనుండి ముక్తులై పరమానందస్వరూపుడైన పరమాత్మను పొందగోరువారు. 2. సాంసారిక భోగములు దుఃఖమయములనియు, క్షణభంగురములనియు తెలిసికొని వాటినుండి విరక్తులైనవారు. 3. ఇహపర భోగములయందు కాంక్షలేనివారు. అర్జునుడు కూడ ముముక్షువే. అతడు కర్మబంధముల భయముచే స్వధర్మరూపకర్తవ్య కర్మను త్యజింపబూనెను. కావున భగవానుడు ప్రాచీన ముముక్షువుల నుదాహరించుచు, కర్మలను త్యజించినంత మాత్రమున మనుష్యులు కర్మబంధములనుండి ముక్తులు కానేరరు అని విశదపరచెను. ప్రాచీన ముముక్షువులు కూడ భగవంతుని కర్మల దివ్యతత్త్వము నెఱింగి, ఆయనవలెనే కర్మలయందు మమత్వము, ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకారము వదలి నిష్కామ భావముతో తమ తమ వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి కర్మలను ఆచరించిరి. కావున అర్జునుడు కూడ కర్మబంధములనుండి ముక్తుడు కాగోరినచో పూర్వ ముముక్షువులవలెనే నిష్కామ భావముతో స్వధర్మరూపకర్తవ్య కర్మలను ఆచరించుట యుక్తమనియు, వానిని త్యజించుట యుక్తము కాదనియు భగవానుడు తెలిపెను.

*సంబంధము - ఈ విధముగా నిష్కామభావముతో కర్మలను ఆచరింపుమని అర్జునుని భగవానుడాజ్ఞాపించెను. కాని కర్మల, అకర్మల తత్త్వముల నెఱుగకుండ మనుజులు నిష్కామభావముతో కర్మల నాచరింపలేరు. కావున ఇపుడు భగవంతుడు మమత, ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకారములు లేకుండ చేయబడు దివ్య కర్మల తత్త్వమును చక్కగా తెలుపుటకును, ఆ కర్మతత్త్వము యొక్క గాంభీర్యమును (లోతు పాతులను/ గహనత్వమును) తెలిసికొనుట వలన కలుగు మహత్త్వమును ప్రకటించుచు దానిని వివరించుటకును ప్రతిజ్ఞ చేయుచున్నాడు-*

**కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 16 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కర్మ, కిమ్ | = కర్మ అనగానేమి? | కవయః, అపి | = బుద్ధిమంతులును | మోక్ష్యసే | = విముక్తి పొందుదువో? |
| అకర్మ, కిమ్ | = అకర్మయనగానేమి? | మోహితాః | = మోహితులగుచున్నారు | | |
| ఇతి, అత్ర | = (అను) ఈ విషయమును నిర్ణయించుటలో | యత్, జ్ఞాత్వా | = (కావున) దేనిని తెలిసికొని, (నీవు) | తత్, కర్మ | = అకర్మతత్త్వమును |
| | | | | తే | = నీకు |
| | | అశుభాత్ | = కర్మబంధమునుండి | ప్రవక్ష్యామి | = విశద పరచుచున్నాను. |

**కర్మ అనగా నేమి? అకర్మ యనగానేమి? ఈ విషయమును నిర్ణయించుటలో విద్వాంసులు సైతము భ్రాంతికి లోనగుచున్నారు. (తికమకపడుచున్నారు) కావున కర్మతత్త్వమును నీకు చక్కగా విశదపరచెదను. దానిని తెలిసికొని నీవు అశుభముల నుండి అనగా కర్మబంధములనుండి ముక్తుడవయ్యెదవు. (16)**

ప్రశ్న - ఇక్కడ 'కవయః' అను పదము ఎవరిని సూచించును. వారు 'కర్మ' 'అకర్మ'ల విషయ నిర్ణయములో మోహితులగుట యనగానేమి? ఈ శ్లోకమునందు 'అపి' అను పదమును ప్రయోగించుటలో గల భావమేమి?

సమా - 'కవయః' అనుపదము శాస్త్రములను చక్కగా ఎఱింగిన బుద్ధిమంతులను సూచించును. శాస్త్రములు వేర్వేరు ప్రక్రియలద్వారా కర్మతత్త్వమును తెలుపుచున్నవి. ఇట్టి భావముతో చేసిన లేక త్యజించిన క్రియలు 'కర్మలు' అనియు, అట్లే ఇట్టి భావముతో చేసిన లేక త్యజించిన క్రియలు 'అకర్మలు' అనియు శాస్త్రములను చూచి, విని బుద్ధిబలముతో నిర్ణయించుకొనలేకపోవుట, అనగా కర్మల, అకర్మల విషయములను ఇదమిత్థముగా నిర్ణయించుకొన లేకపోవుటనే, 'మోహితులగుట'గా తెలిసికొనవలెను. గొప్ప విద్వాంసులు 'సైతము' ఈ విషయమున మోహితులై 'ఇదమిత్థ'మని నిర్ణయింప నశక్తులగుచున్నారు విద్వాంసుల విషయమే అట్లుండగా సామాన్య మానవుల విషయము ఇక చెప్పనేల? ఈ భావమును తెలుపుటకే 'అపి' అను పదము ప్రయోగింపబడినది. కావున 'కర్మతత్త్వము'ను తెలిసికొనుట సులభసాధ్యము కాదు.

ప్రశ్న - భగవంతుడు ప్రతిజ్ఞ చేసిన 'కర్మతత్త్వ వర్ణనము' ఈ అధ్యాయమున ఎచ్చట చేయుబడినది? దాని తత్త్వరహస్యమును తెలిసికొనుట యనగా నేమి? దానిని తెలిసికొనుటవలన కర్మబంధములనుండి 'ముక్తి' ఎట్లు లభించును?

సమా - ఈ అధ్యాయమున 18వ శ్లోకము నుండి 32వ శ్లోకము వరకును ఈ కర్మతత్త్వ వర్ణనము చేయబడినది. ఎట్టి భావముచే ఏ కర్మలు చేసిన, లేక త్యజించిన మానవునకు పునర్జన్మ రూపబంధ హేతువగునో, ఏ భావముచే ఎట్టి కర్మలు చేసిన, లేక త్యజించిన ముక్తి హేతువగునో - అను విషయమును చక్కగా ఎఱుంగుటయే 'ఈ తత్త్వమును' తెలిసికొనుటయగును. ఈ తత్త్వమును తెలిసికొనిన మానవుడు కర్మ (సంసార) బంధహేతువులైన ప్రక్రియలను పాటింపడు. అతని కర్తవ్య కర్మలన్నియును మమత, ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకార రహితములై కేవలము భగవత్పరములుగ లోక కల్యాణమునకై జరుగుచుండును. ఈ కారణము వలన పై కర్మతత్త్వమును తెలిసికొనిన మానవుడు కర్మ (సంసార) బంధములనుండి 'ముక్తుడు' అగును.

*సంబంధము - శాస్త్ర విహిత కర్తవ్యమును 'కర్మ' అనియు, త్యజింపవలసిన క్రియను 'అకర్మ' యనియు అందఱెఱిగిన విషయమే. ఇందు భ్రాంతికి తావెక్కడ? వీనిని లోతుగా తెలిసికొనుట అనగా నేమి? మున్నగు ఈ విషయములను జనులు సాధారణముగ తర్కింపవచ్చును. కేవలము ఇంత మాత్ర జ్ఞానముతో 'కర్మ' 'అకర్మ'ల నిర్ణయము చేయుట సాధ్యముకాదు. కావున కర్మతత్త్వమును చక్కగా తెలిసికొనుట ఎంతేని అవసరము. ఈ భావమునే భగవంతుడు స్పష్టపరచుచున్నాడు-*

**కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17 ॥**

కర్మణః, అపి = కర్మ యొక్క తత్త్వముగూడ
బోద్ధవ్యమ్ = తెలిసికొనదగినది
చ, అకర్మణః, అపి = అట్లే అకర్మయొక్క స్వరూపముగూడ
బోద్ధవ్యమ్ = ఎఱుంగదగినది
వికర్మణః, చ = వికర్మలక్షణముగూడ
బోద్ధవ్యమ్ = తెలిసికొనదగినది
హి = ఏలనన
కర్మణః, గతిః = కర్మయొక్క గతి (తత్త్వము)
గహనా = అతినిగూఢమైనది.

**'కర్మ' తత్త్వమును తెలిసికొనవలెను, అట్లే 'అకర్మ' స్వరూపమును గూడ ఎరుగవలెను, 'వికర్మ' లక్షణములనుకూడా తెలిసికొనుట చాల అవసరము. ఏలనన కర్మ తత్త్వము అతినిగూఢమైనది.(17)**

ప్రశ్న - కర్మతత్త్వమును తెలిసికొనుట అనగా నేమి?

సమా - శాస్త్రోక్త కర్తవ్య కర్మలనే 'కర్మలు' అని సాధారణముగ లోకులు తలంతురు. కాని ఇంతమాత్రము తెలిసికొనుట వలన కర్మతత్త్వము పూర్తిగా బోధపడదు. ఆయా కర్మల ఆచరణలో గల భేదములను బట్టి స్వరూపము నందును భేదము సంభవించును. ఏ భావముతో ఏ ప్రకారముగా చేయబడిన క్రియను 'కర్మ' అనవచ్చును? ఏ స్థితియందు ఏ మనుష్యుడు శాస్త్ర విహితమైన ఎట్టి కర్మను ఏ విధముగా చేయవలెను? మొదలగు విషయములన్నియును శాస్త్రములను ఎఱిగిన తత్త్వజ్ఞులు మాత్రమే తెలిసికొందురు. కావున తమ యోగ్యతను బట్టి వర్ణాశ్రమోచిత కర్తవ్య కర్మలను ఆచరించుటకు వాటిని తత్త్వవిదులైన మహాపురుషుల ద్వారా తెలిసికొనవలెను. వారి ప్రేరణ, ఆజ్ఞల ననుసరించి, వాటిని ఆచరించవలెను.

ప్రశ్న - 'అకర్మ' స్వరూపమును తెలియుట అనగానేమి?

సమా - మనోవాక్కాయములచే చేయబడు క్రియలను భౌతికముగా త్యజించుటనే 'అకర్మ' (కర్మరాహిత్యము) అని సాధారణముగ లోకులు భావింతురు. కాని ఈ మాత్రము తెలిసికొనుట వలన అకర్మయొక్క వాస్తవిక స్వరూపము తెలిసినట్లుకాదు. భావవైవిధ్యములను బట్టి లోకులు 'అకర్మ' యని భావించు క్రియలు 'కర్మ' లేక 'వికర్మ'లు అయియుండవచ్చును. అట్లే లోకులు 'కర్మ' యని భావించునవి 'అకర్మ'లుగాని 'వికర్మ'లుగాని అయియుండవచ్చును. ఏ భావముతో, ఏ ప్రకారము చేయబడిన లేక త్యజించబడిన క్రియలు అకర్మలగును? అట్లే ఏ స్థితియందు ఏ మనుష్యుడు ఎట్లు వానిని (ఆ క్రియలను) ఆచరించవలెను? మొదలగు ఈ విషయములను తత్త్వజ్ఞులైన మహాత్ములే పూర్తిగా ఎఱుంగుదురు. కావున కర్మబంధములనుండి ముక్తులు కాగోరువారు మహాపురుషులద్వారా మాత్రమే ఈ 'అకర్మ' స్వరూపమును చక్కగా నెఱింగి, వారు చెప్పిన రీతిగా సాధన చేయవలెను.

ప్రశ్న - వికర్మ లక్షణములను తెలిసికొనుట యనగానేమి?

సమా - సాధారణముగా అబద్ధము, కపటము, దొంగతనము, వ్యభిచారము, హింస మొదలగు పాపకర్మలు 'వికర్మ'లుగా ప్రసిద్ధములు. కాని ఈ మాత్రము తెలిసికొనుట వలన 'వికర్మ' యొక్క యథార్థస్వరూపము తెలియదు. ఏలనన శాస్త్ర జ్ఞానములేని మూఢులు పుణ్యమును పాపముగను, పాపమును పుణ్యముగను భావింతురు. వర్ణాశ్రమ ధర్మముల భేదముల వలన ఒకరికి విహిత కర్తవ్యము (కర్మ)లు అయినవి మరొకరికి నిషిద్ధములైన పాపకర్మ (వికర్మ)లు కావచ్చును. అన్ని వర్ణముల వారికి సేవ చేయుచు జీవించుట శూద్రునకు విహితకర్మ. కాని అదియే బ్రాహ్మణునకు నిషిద్ధ కర్మ. దానము స్వీకరించి, వేదములను నేర్పుచు, యజ్ఞములను చేయించుచు జీవితమును గడుపుట బ్రాహ్మణునకు కర్తవ్యకర్మ. కాని అది ఇతర వర్ణముల వారికి పాపకర్మ (వికర్మ). న్యాయోపార్జితమైన ధనసంపాదన, ఋతుకాలమునందు స్వపత్నీ గమనము మున్నగునవి గృహస్థ ధర్మములు, కాని సన్న్యాసికి కామినీ కాంచనముల దర్శన స్పర్శలు మహాపాపములు. అబద్ధమాడుట, వంచన చేయుట, దొంగతనము చేయుట, వ్యభిచరించుట, హింసించుట

మొదలగునవి అందరికిని నిషిద్ధములే. అట్లే వర్ణాశ్రమ భేదముల ననుసరించి, వేర్వేఱుగా ఆయా వ్యక్తులకు నిషిద్ధములైన కర్మలును గలవు. వీటన్నింటిని త్యజించుటకై 'వికర్మ లక్షణములను' చక్కగా తెలిసికొనవలెను. ఈ 'వికర్మ స్వరూపము'ను గూడ తత్త్వవేత్తలైన మహాపురుషులే సమగ్రముగా తెలుపగలరు.

ప్రశ్న - కర్మగతి (కర్మమార్గము) గహనము - అనగానేమి? ఈ సందర్భమున 'హి' అను అవ్యయ ప్రయోగముయొక్క ప్రాముఖ్యమేమి?

సమా - 'హి' అను అవ్యయము ఇచట హేతువాచకము. ఇంతకు ముందు 17వ శ్లోకములో చెప్పబడిన రీతిగా కర్మతత్త్వము మిక్కిలి నిగూఢమైనది. 'కర్మ' అనగానేమి? 'అకర్మ' అనగానేమి? 'వికర్మ' అనగానేమి? దీని నిర్ణయమును ప్రతివ్యక్తియు చేయజాలడు. విద్యావివేకములు గల పండితులు గూడ అప్పుడప్పుడు ఈ నిర్ణయ విషయమున అశక్తులగుదురు. కావున కర్మతత్త్వమును చక్కగా నెఱింగిన మహాపురుషుల నుండి ఈ తత్త్వమును గ్రహించుట అవసరము.

*సంబంధము - ఈ విధముగ శ్రోతల అంతఃకరణములలో శ్రద్ధాసక్తులను పెంపొందించుటకై కర్మతత్త్వము యొక్క నిగూఢత్వమును, దానిని తెలిసికొనవలసిన అవసరమును తెలిపి, ఇప్పుడు భగవంతుడు తాను చేసిన ప్రతిజ్ఞానుసారముగ కర్మతత్త్వమును విశదపరచుచున్నాడు-*

**కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఎవరయితే | అకర్మణి | = అకర్మయందు | బుద్ధిమాన్ | = బుద్ధిశాలి |
| కర్మణి | = కర్మయందు | కర్మ | = కర్మను (దర్శించునో) | సః, యుక్తః | = అట్టియోగి |
| అకర్మ, పశ్యేత్ | = అకర్మను దర్శించునో | సః | = అతడు | కృత్స్న-కర్మకృత్ | = సమస్త కర్మలను చేయువాడు. |
| యః, చ | = ఎవరైతే | మనుష్యేషు | = మనుష్యులలో | | |

**కర్మయందు 'అకర్మ'ను, అకర్మయందు 'కర్మ'ను దర్శించువాడు మానవులలో బుద్ధిశాలి. అతడు యోగి మఱియు సమస్త కర్మలు చేయువాడు. (18)**

ప్రశ్న - కర్మయందు 'అకర్మ'ను చూచుట యనగానేమి? అట్లు దర్శించువాడు మానవులలో బుద్ధిశాలి, యోగి, సమస్త కర్మలు చేయువాడు ఎట్లగును?

సమా - మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరము, అనువాటిద్వారా జరుగు వ్యాపారములు మాత్రమే 'కర్మలు' అని లోకప్రసిద్ధి. కాని వానిలో శాస్త్రవిహిత కర్తవ్య కర్మలే 'కర్మలు' అనబడును. శాస్త్ర నిషిద్ధ పాపకర్మలు 'వికర్మలు' అనబడును. ఈ 'వికర్మలు' సర్వథా త్యాజ్యములు. కావవాటి ప్రస్తావన ఇచ్చట చేయబడుట లేదు. శాస్త్ర విహిత కర్తవ్య కర్మలయందు 'అకర్మ'ను చూచుట యనగానేమి? ఈ విషయము విచారింపదగినదే. యజ్ఞదానతపఃకర్మలను వర్ణాశ్రమధర్మ కృత్యములను, జీవికకును శరీరపోషణమునకును సంబంధించిన శాస్త్ర విహిత కర్మలను 'ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారము, అహంకారములను' త్యజించి చేయుట వలన ఇహపర లోకములయందు సుఖదుఃఖాది ఫలములను అనుభవింపవలసిన పనియుండదు. పునర్జన్మ ప్రాప్తియు ఉండదు. అంతేగాక పురాకృత పుణ్యపాప (శుభాశుభ) కర్మలన్నియును నశించుటయు, సంసార బంధముల నుండి 'ముక్తి' లభించుటయు జరుగును. ఈ రహస్యము నెఱుంగుటయే 'కర్మ' యందు 'అకర్మ'ను చూచుటయగును.

ఈ విధముగ 'కర్మ' యందు 'అకర్మ'ను చూచువాడు ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారములను వీడి, విహితకర్మలను యథాయోగ్యముగ ఆచరించును. కావున అతడు కర్మలు చేసినను అవి వానిని అంటవు. అతడు మనుష్యులలో బుద్ధిశాలి. అతడు పరమాత్మను పొందును (దర్శించును). కనుక అతడు యోగి, కృతకృత్యుడు. వానికి కర్తవ్యశేషము ఉండదు. అందువలన అతడు కర్మలన్నియును చేసినవాడే.

ప్రశ్న - 'అకర్మ' యందు 'కర్మ'ను చూచుట యనగానేమి? అట్లు చూచినవాడు మనుష్యులలో బుద్ధిశాలి,

యోగి, సమస్త కర్మలు చేసినవాడు ఎట్లగును?

సమా - లోక వ్యవహారమునందు 'మనోవాక్కాయ వ్యాపారము'లను త్యజించుట 'అకర్మ'యని ప్రసిద్ధి. ఈ త్యాగరూప 'అకర్మ' గూడ ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారము, అహంకారములతో కూడినచో అది పునర్జన్మ హేతువగును. ఇంతేగాదు. కర్తవ్య కర్మలు గూడ అవహేళన (ఉపేక్షా భావము)తో దంభముతో చేసిన యెడల అది 'వికర్మ' (పాపకర్మ)గా మారిపోవును. ఈ రహస్యమును తెలిసికొనుటయే 'అకర్మ' యందు 'కర్మ'ను చూచుట యగును.

ఈ రహస్యమును తెలిసికొనినవాడు వర్ణాశ్రమోచిత కర్మలలో దేనినైనను శారీరక శ్రమకు భయపడిగాని, రాగద్వేషములకును మోహమునకును వశుడైగాని, గౌరవ ప్రతిష్ఠాది ఫలప్రాప్తికైగాని త్యజింపడు. కావున అతడు తన కర్తవ్య కర్మలకు దూరముకాడు. ఏ విధమైన త్యాగములయందు గూడ మమత, ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకారములను కలిగియుండడు. కనుక పునర్జన్మను పొందడు. అందువలన మనుష్యులలో అతడు బుద్ధిశాలి. అతనికి పరమేశ్వర ప్రాప్తియు కలుగును. కావున అతడు యోగి. అతనికి ఎట్టి కర్తవ్యము మిగిలి ఉండదు. కనుక అతడు సమస్త కర్మలను చేసినవాడే యగును.

ప్రశ్న - కర్మలు మూడు విధములు 1. క్రియమాణ కర్మ 2. సంచిత కర్మ 3. ప్రారబ్ధకర్మ అని లోకమున ప్రసిద్ధి. క్రియమాణ కర్మను 'కర్మ' అనియు, సంచిత కర్మను 'వికర్మ' యనియు, ప్రారబ్ధ కర్మను 'అకర్మ' యనియు కొందరు భావింతురు. దానిని అనుసరించి క్రియమాణ కర్మను (కర్మను) ఆచరించు సమయమున అదియే భవిష్యత్తులో ప్రారబ్ధకర్మ (అకర్మ)గా మారి, దాని ఫలానుభవస్థితి ఏర్పడును. కనుక దానినే కర్మలో అకర్మగా భావింపవచ్చును. అట్లే ప్రారబ్ధరూపఫలభోగ సమయమున ఆ ఫలానుభవములు (సుఖదుఃఖ రూప ఫలానుభవములు) పురాకృతక్రియమాణ కర్మల ఫలితములే అని భావించి, దానినే అకర్మలో కర్మగా భావింపవచ్చును. ఇట్లు భావించి, పాపకర్మలను త్యజించి, శాస్త్రవిహిత కర్మలను చేయుచుండుటలో దోషమేమి కలదు?

సమా - మంచిది. ఇట్లు భావించుటయు సముచితమే. సహేతుకమే. కాని, "కవయోఽప్యత్ర మోహితాః, గహనా కర్మణో గతిః, యద్ జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్, స యుక్తః కృత్స్నకర్మకృత్, తమాహుః పండితం బుధాః, నైవ కించిత్ కరోతి సః" మొదలగు వాక్యములలో ఈ యర్థము సమన్వయరూపములో వ్యక్తము కాదు. కావున ఈ యర్థము వేరొక సందర్భమున సరిపోయినను ఇచట మాత్రము ప్రకరణవిరుద్ధమే.

ప్రశ్న - కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూచు సాధకుడు గూడ ముక్తుడగునా? లేక సిద్ధ పురుషుడు (ముక్తుడు) మాత్రమే ఈ విధముగ చూడగలుగునా?

సమా - ముక్తపురుషునకు స్వాభావికములైన లక్షణములే సాధకునకు సాధ్యములు. ముక్త పురుషునకు ఈ తత్త్వము సహజముగనే తెలిసియుండును. సాధకుడు ముక్తుని యుపదేశము ననుసరించి, సాధన చేయుటవలన ముక్తుడగును. అందువలననే భగవానుడు "నేను నీకు ఆ కర్మతత్త్వమును తెలిపెదను. దానిని తెలిసికొని, నీవు కర్మబంధములనుండి ముక్తుడవగుదువు" - అని పలికెను.

*సంబంధము - ఈ విధముగ కర్మలో అకర్మను అకర్మలో కర్మను దర్శించుటవలన కలుగు మహత్త్వమును దెలిపి, ఇపుడు ఐదు (5) శ్లోకములలో పైన పేర్కొన్న విధముగ (కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను) దర్శించుచు కర్మల నాచరించు సిద్ధుల, సాధకుల నిస్సంగత్వమును గూర్చి వేర్వేరు రీతులలో భగవానుడు స్పష్టపఱచుచున్నాడు-*

**యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।**
**జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యస్య సర్వే, సమారంభాః | = ఎవనియొక్క శాస్త్రసమ్మతములైన కర్మలన్నియును | జ్ఞానాగ్నిదగ్ధ-కర్మాణమ్ | = ఎవనియొక్క కర్మలన్నియును జ్ఞానాగ్నిచే భస్మమగునో | బుధాః | = జ్ఞానులు |
| కామసంకల్ప-వర్జితాః | = కామసంకల్ప రహితములై (జరుగునో) | తమ్ | = ఆ మహాపురుషుని | పండితమ్, (ఇతి) | = పండితుడని |
| | | | | ఆహుః | = అందురు. |

**ఎవని కర్మలన్నియును, శాస్త్రసమ్మతములై, కామసంకల్ప వర్జితములై జరుగునో, అట్లే ఎవని కర్మలన్నియును జ్ఞానాగ్నిచే భస్మమగునో, అట్టి మహాపురుషుని జ్ఞానులు పండితుడని అందురు.(19)**

ప్రశ్న - 'సమారంభాః' అను పదము యొక్క అర్థమేమి? మరియు ఇచట ప్రయుక్తమైన 'సర్వే' అను విశేషణము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - తన తన వర్ణాశ్రమ ధర్మములను, పరిస్థితులను అనుసరించి ఆచరింపబడు యజ్ఞములు, దానములు, తపస్సులు, ఇంకను జీవికకును, శరీర పోషణకును వలసిన శాస్త్ర సమ్మత కర్తవ్య కర్మలన్నియును 'సమారంభాః' అను పద ప్రయోగముచే సూచింపబడును. క్రియలన్నింటినీ 'ఆరంభము' అందురు. జ్ఞానియొక్క కర్మలు శాస్త్రనిషిద్ధములు గాని, వ్యర్థములుగాని కావు. ఈ భావమును వ్యక్తపఱచుటకే 'ఆరంభ' శబ్దముతో బాటు 'సమ్' అను ఉపసర్గము ప్రయుక్తమైనది. సాధనకాలము నందు మానవులొనర్చు వివిధ కర్మలపై కామ సంకల్ప ప్రభావములు ఉండకపోవు. ఏదోయొక కర్మయందైనను కొద్దిగనో గొప్పగనో కామసంకల్పములు సంగతములై యుండును. సాధన చేయగా చేయగా సిద్ధుడైన మహాపురుషుని కర్మలన్నియును కామసంకల్పరహితములగును. అతడు చేయు ఏ కర్మయైనను శాస్త్ర విరుద్ధముగాని, కామ సంకల్ప యుక్తముగాని కాదు. ఈ భావమును నొక్కి చెప్పుటకే 'సర్వే' అను విశేషణము ప్రయుక్తమైనది.

ప్రశ్న - **'కామసంకల్పవర్జితాః'** అను సమాసములో **'కామ' - 'సంకల్ప'** శబ్దముల అర్థమేమి? అవి లేని కర్మలెట్టివి?

సమా - స్త్రీ, పుత్రులు, ధనము, గృహము, గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు, స్వర్గ సుఖము మొదలగు ఇహపరలోక విషయములలో ఏ ఒక్క దానిపైనైనను కించిన్మాత్రమైనను 'ఇచ్ఛ' కలిగియుండుటను **'కామము'** అందురు. అట్లే ఏ విషయమునుగూర్చియైనను మమత, అహంకారము, రాగద్వేషములు మఱియు రమణీయబుద్ధితో స్మరించుటను **'సంకల్పము'** అని యందురు. కామన ('ఇచ్ఛ') అనునది సంకల్పము యొక్క కార్యము. సంకల్పము ఆ కామనకు కారణము. విషయములను స్మరించుట వలన వాటిపై ఆసక్తి, కామన జనించును. **(2/62)** ఏ వస్తువు నందైనను సంయోగ వియోగములచే కలుగు కోరికగాని, మమత, అహంకారము, ఆసక్తులుగాని ఏ మాత్రము లేకుండ కేవలము లోక కల్యాణార్థమై చేయబడు చేష్టామాత్ర కర్మలన్నియును కామసంకల్పవర్జితములు.

ప్రశ్న - **'కామసంకల్పవర్జితాః'** అను సమాసము నందు **'సంకల్ప'** శబ్దమునకు **'స్ఫురణ'** అను అర్థము చెప్పినచో దోషమేమి?

సమా - 'స్ఫురణ' లేనిదే ఏ పనియు జరుగదు. మొదట స్ఫురించిన పిమ్మటనే మనస్సు, వాక్కు, శరీరముల ద్వారా కర్మలు చేయబడును. ఇతర కర్మల విషయము చెప్పనేల? స్ఫురణ లేనిదే భుజించుట, త్రాగుట, నడచుట మొదలగు శారీరక కర్మలును జరుగవు గదా. మరి 'సమారంభాః' అను పదము ద్వారా సూచింపబడు శాస్త్ర విహిత కర్మలు ఎట్లు జరుగును? కావున ఇచట సంకల్పమనగా కేవలము **'స్ఫురణము'** అని యర్థము చెప్పుట యుచితము కాదు.

ప్రశ్న - **'జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్'** అను సమాసమున **'జ్ఞానాగ్ని'** శబ్దమునకు అర్థమేమి? మఱియు దానివలన కర్మలు దగ్ధమగుట యనగానేమి?

సమా - ఏ సాధన మార్గమును అనుష్ఠించినను దానివలన కలుగు పరమాత్మ ప్రాప్తి జ్ఞానమే ఇచట జ్ఞానాగ్ని వాచకము. అగ్ని ఇంధనములను దగ్ధమొనర్చునట్లే ఈ పరమాత్మ జ్ఞానము సమస్త కర్మలను భస్మము చేయును. **(4/37)** (అగ్ని లక్షణములను దీనియందు ఆరోపించుట వలన ఇదిజ్ఞానాగ్నిగా పేర్కొనబడినది.) అగ్నిచే వేగింపబడిన విత్తనములయందు అంకురించు శక్తి (మొలకెత్తుశక్తి) నశించును. అట్లే జ్ఞానరూపాగ్నిచే దగ్ధమైన సమస్త కర్మలయందును ఫలములను ఉత్పత్తి చేయుశక్తి సర్వథా నశించును. జ్ఞానాగ్నిలో కర్మలు దగ్ధమగుట యనగా నిదియే.

ప్రశ్న - **'బుధాః'** అను పదము యొక్క అర్థమేమి? పై విధముగా 'జ్ఞానాగ్నిదగ్ధకర్ములు ఐనవారు పండితులు' అనగా అర్థమేమి?

సమా - **'బుధాః'** అను పదము ఇచట తత్త్వజ్ఞులైన మహాత్ములను గూర్చి తెలుపును. ఇచట 'పండితాః' అను పదము ద్వారా 'సిద్ధయోగుల' యొక్క ప్రశంసచేయబడినది. కర్మలయందు మమత, ఆసక్తి, అహంకారము లేకుండ

మరియు వాటి (కర్మల) వలన తనకు ఎట్టి ప్రయోజనము లేకున్నను, ధీరుడు, వీరుడు, గంభీరుడు, బుద్ధిమంతుడు అయినవాడు వాటిని (కర్మలను) వాస్తవముగ (వ్యావహారికముగ) త్యజింపక శాస్త్రవిహిత కర్మలను లోకకల్యాణము కొఱకు విధ్యుక్తముగా చక్కగా నెరవేర్చును. అట్టివానినే జ్ఞానులు పండితుడు (తత్త్వజ్ఞుడైన మహాత్ముడు) అని యందురు.

**త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్ కరోతి సః ॥ 20 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కర్మఫలాసంగమ్ | = సమస్తకర్మల యందును, వాటి ఫలముల యందును ఆసక్తిని | నిరాశ్రయః | = ప్రాపంచిక-ఆశ్రయరహితుడై | కర్మణి | = కర్మలయందు | | |
| | | నిత్యతృప్తః | = (పరమాత్మయందే) నిత్య తృప్తిని పొందిన | అభిప్రవృత్తః, అపి | = పూర్తిగా ప్రవృత్తుడు అయినప్పటికిని | | |
| | | | | కించిత్, ఏవ | = ఏ కొంచెముగూడ | | |
| త్యక్త్వా | = (సర్వథా)వీడి | సః | = అట్టి పురుషుడు | న, కరోతి | = (వాస్తవముగా) చేయువాడు కాదు | | |

**సమస్తకర్మలయందును, వాటిఫలితములయందును సర్వథా ఆసక్తిని వీడి, సంసార - ఆశ్రయ రహితుడై, పరమాత్మయందే నిత్యతృప్తుడైన పురుషుడు, కర్మల యందు చక్కగా ప్రవృత్తుడైనప్పటికిని వాస్తవముగా వాటికి (కర్మలకు) కర్త కాడు. (20)**

ప్రశ్న - కర్మలయందును, వాటి ఫలముల యందును ఆసక్తిని త్యజించుట యనగా నేమి?

సమా - యజ్ఞము, దానము, తపస్సు మొదలైన వానియందును, అట్లే జీవికకు, శరీరపోషణమునకు అవసరమైన శాస్త్ర విహిత కర్మలయందును మనుజునకు స్వాభావికముగనే ఆసక్తియుండును. అందువలన అతడాకర్మలను చేయకుండ ఉండలేడు. ఆ కర్మల నాచరించు సమయమున తదేకమగ్నుడై యుండుటవలన అతనికి ఈశ్వరునిపై గాని, ఇతర జ్ఞాన విషయములపై గాని స్మృతియే యుండదు. అట్టి కర్మలపై గల ఆసక్తిని సర్వథా త్యజింపవలెను. అట్టి కర్మలవలన ప్రాప్తించు ఇహ-పరలోకభోగ విషయములను గూర్చి మమత, ఆసక్తి, ఇచ్ఛలు ఏమాత్రము ఉండరాదు. దీనినే కర్మలయందును, కర్మఫలములయందును ఆసక్తిని త్యజించుట యందురు.

ప్రశ్న - ఈ విధముగా ఆసక్తిని త్యజించి, నిరాశ్రయుడు, నిత్యతృప్తుడు అగుట యనగానేమి?

సమా - ఆసక్తిని వీడి, శారీరకమైన అహంకార మమకారములను వర్జించుట, ఎట్టి ప్రాపంచిక వస్తువులను, మనుష్యులను ఆశ్రయింపకుండుట అనగా 'ఈ వస్తువువలననే లేక ఈ వ్యక్తి వలననే నా నిర్వహణ జరుగుచున్నది. వీరే నా కాధారము. వీరు (వస్తువులు, మనుష్యులు) లేక నాకు మనుగడయే లేదు.' ఈ విధమైన భావములు ఏ మాత్రము లేకుండుటనే నిరాశ్రయుడగుట యందురు. ఇట్టి స్థితియందు మనుజునకు ప్రాపంచికమైన పదార్థమేదియును, ఏ మాత్రము అవసరముండదు. అప్పుడతడు పూర్ణకాముడగును. పరమానందస్వరూపుడైన పరమాత్మయొక్క ప్రాప్తి కలుగుటవలన అతడు నిరంతరము ఆనందమగ్నుడై యుండును. అట్టి స్థితిలో అతనిపై ఏ సంఘటన ప్రభావము కొంచెమైనను పడదు. దీనినే 'నిత్యతృప్తుడు అగుట' యందురు.

ప్రశ్న - "కర్మణి అభిప్రవృత్తః అపి న ఏవ కించిత్ కరోతి సః" ఈ వాక్యమునందు 'అభి' అను ఉపసర్గను, 'అపి, ఏవ' అను అవ్యయములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇట్టి మనుష్యుడు కూడ (నిరాశ్రయుడు, నిత్యతృప్తుడైనవాడు) తన వర్ణాశ్రమ ధర్మములననుసరించి, అన్ని విధముల శాస్త్రవిహిత కర్మలను చక్కగా శ్రద్ధగా వివేకముతో చేయును. ఈ భావమును తెల్పుటకే 'ప్రవృత్తః'

అను పదమునకు 'అభి' అను ఉపసర్గ చేర్చబడినది. మమత, అహంకారము, ఫలాసక్తి గల మనుష్యుడు కర్మలను వ్యావహారికముగ త్యజించినను కర్మబంధముల నుండి ముక్తుడు కాలేడు. నిత్యతృప్తుడైన మనుష్యుడు సమస్త కర్మలను చేయుచు గూడ సంసార బంధములలో చిక్కుకొనడు. ఈ భావమును స్పష్టపఱచుటకే 'అపి' అను అవ్యయము ప్రయుక్తమైనది. "తాను చేయు కర్మలతో అతనికి ఏ మాత్రము సంబంధము ఉండదు" అను భావమును వ్యక్తపఱచుటకే 'ఏవ' అను అవ్యయము ప్రయోగింపబడినది. కావుననే అతడు సమస్త కర్మలను చేయుచున్నను వాస్తవముగ 'అకర్త'యే.

కర్మయందు 'అకర్మ'ను, అకర్మయందు 'కర్మ'ను చూచు 'ముక్త పురుషుడు' పూర్ణకాముడగుట వలన అతనికి ఎట్టి కర్తవ్యము గూడ మిగిలియుండదు (3/17) అను విషయము ఇచట స్పష్టమైనది. అతనికి ఏ విధముగను, ఏ వస్తువుతోడను అవసరమేయుండదు. కావున అతడు కర్మను చేసినను, లేక దానినుండి ఉపరతుడైనను, వాటిని శాస్త్రోక్తముగా అనాసక్తితో కేవలము లోకహితార్థమే చేయును. కనుక వాస్తవముగ అతనికర్మలు 'కర్మ'యని పిలువబడదు.

*సంబంధము - మమత, ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకారము లేకుండ, కేవలము లోకహితముకొఱకై, శాస్త్రసమ్మతములైన యజ్ఞము, దానము, తపస్సు మొదలగు సమస్తకర్మలను చేయుచు గూడ జ్ఞానియైనవాడు వాస్తవముగా 'అకర్త'యే, యని పూర్వశ్లోకమున తెలుపబడినది. కావున అతడు కర్మ (సంసార) బంధమున చిక్కుకొనడు. జ్ఞానిని ఆదర్శముగా తీసికొని పైన చెప్పిన ప్రకారము కర్మల నాచరించు సాధకులు నిత్యనైమిత్తికాది కర్మలను త్యజింపరు. నిష్కామభావముతో వివిధములగు శాస్త్రవిహితకర్తవ్యకర్మలను అనుష్ఠించుచునే యుందురు. అందువలన వారికి ఎట్టి పాపములును అంటవు. కాని శాస్త్రోక్తములైన యజ్ఞదానాది కర్మల ననుష్ఠింపక కేవలము శరీరపోషణకు అవసరమగు స్నానపానాది కర్మలను ఆచరించువారిని పాపములు అంటవచ్చును గదా! అను ప్రశ్న ఉదయించును. ఈ సందేహనివృత్తికై భగవానుడు ఇట్లు పలుకుచున్నాడు-*

**నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21 ॥**

| పదము | అర్థము |
|---|---|
| యతచిత్తాత్మా = | అంతఃకరణమును, శరీరేంద్రియములను జయించినవాడును |
| త్యక్తసర్వపరిగ్రహాః = | సమస్త భోగసామగ్రిని పరిత్యజించినవాడును |
| నిరాశీః = | ఆశారహితుడైనవాడును- (అగు సాంఖ్యయోగి) |
| కేవలమ్ = | కేవలము |
| శారీరమ్, కర్మ = | శారీరిక కర్మలను |
| కుర్వన్ = | ఆచరించుచును |
| కిల్బిషమ్ = | పాపము(ల)ను |
| న, ఆప్నోతి = | పొందడు. |

**అంతఃకరణమును, శరీరేంద్రియములను జయించినవాడు, సమస్త భోగసామగ్రిని పరిత్యజించినవాడు, ఆశారహితుడుఐన సాంఖ్యయోగి కేవలము శారీరికకర్మలను ఆచరించుచును, పాపములను పొందడు. (21)**

ప్రశ్న - 'నిరాశీః, యతచిత్తాత్మా, త్యక్తసర్వపరిగ్రహః' - ఈ మూడు విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - సాంసారికములైన (ప్రాపంచికములైన) ఏ వస్తువుల అవసరము లేనివాడు, ఏ కర్మవలనను, ఏ వ్యక్తి వలనను ఎట్టి భోగ ప్రాప్తికిని ఏ మాత్రము ఆశగాని, ఇచ్ఛగాని లేనివాడు, సర్వవిధములైన ఇచ్ఛలు, కామ్యములు, వాసనలు మొదలగు వానిని సర్వథా త్యజించినవాడు - 'నిరాశీః' అని చెప్పబడును. అతనికి అంతఃకరణము, సమస్తేంద్రియములు, శరీరము వశములో నుండును. అనగా మనస్సు, ఇంద్రియములు, రాగద్వేష రహితములగుటవలన వాటిపై శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల ప్రభావము ఏ మాత్రము పడదు. శరీరముగూడ అదుపులో నుండును. అట్టివాడు గృహస్థుడైనను, సన్న్యాసియైనను, 'యతచిత్తాత్మా' అనబడును. ఎట్టి వస్తువునందును మమతలేనివాడు. ఎట్టి భోగవస్తువులను కూడబెట్టనివాడు అయినట్టి సన్న్యాసి

'త్యక్తసర్వపరిగ్రహః' అని చెప్పబడును. ఇతరాశ్రమస్థులును, 'పరిగ్రహత్యాగము' చేసినచో వారును త్యక్తసర్వ పరిగ్రహు లనబడుదురు.

ఇట్లు ప్రాపంచిక వస్తువులతో సంబంధము లేకుండ అంతరాత్మయందే సంతుష్టుడైనవాడు సాంఖ్యయోగి. అతడు యజ్ఞదానాది కర్మలను అనుష్ఠింపక, కేవలము శరీరసంబంధమైన స్నానపానాది కర్మలను ఆచరించినను అతనికి పాపములంటవు. ఏలనన అతని ఆ త్యాగము ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకారపూర్వక మోహముతో కూడినది కాదు. మరియు అది ఆసక్తి, ఫలేచ్ఛ, అహంకారరహితమై శాస్త్రసమ్మతమైనది. అన్ని విధముల లోకహితకారి.

ప్రశ్న - 'శారీరం', 'కేవలం' అను విశేషణములతో ప్రయుక్తమైన 'కర్మ' అను పదము ఏయే కర్మలను సూచించును. 'కిల్బిషమ్' అనగానేమి? అది అంటకుండుట యనగానేమి?

సమా - స్నానపానశయనాదికములైన కేవలము శరీర నిర్వహణకు సంబంధించిన క్రియలనే 'శారీరం' 'కేవలం' అను విశేషణములతో గూడిన 'కర్మ' అను పదము సూచించును. యజ్ఞదానాది విహిత కర్మలను త్యజించుటవలన కలుగు ప్రత్యవాయపాపమును, శరీరనిర్వహణకై చేయు క్రియల యందు సంభవించు అనివార్యమైన హింసాది పాపములను సూచించునదియే 'కిల్బిషమ్' అను పదము. పై (3) లక్షణములు గల వ్యక్తిని, యజ్ఞాదికర్మలను అనుష్ఠింపని కారణమున కలుగు ప్రత్యవాయ రూప పాపముగాని, శరీర నిర్వహణకై చేయు క్రియలవలన కలుగు పాపములు గాని అంటవు. 'కిల్బిషమంటకుండుట' అనగానిదియే.

సంబంధము - పరమాత్మప్రాప్తి లభించిన సిద్ధపురుషులు కర్మచేయుటవలననూ, చేయకుండుట వలననూ ఎట్టి ప్రయోజనమునూ కలిగియుండరు. అట్లే జ్ఞానయోగులైన సాధకులద్వారా కర్మాచరణముగాని కర్మత్యాగముగాని శాస్త్రోక్తముగా మమతాసక్తి రహితముగా జరుగును. కావున ఆ ఉభయులును కర్మలు చేయుచున్నప్పుడును వానిని త్యజించునప్పుడును అన్ని సమయములయందును కర్మబంధములనుండి సర్వథా ముక్తులగుదురు. ఈ విషయములన్నియును పూర్వశ్లోకములలో వివరింపబడినవి. కర్మలో 'అకర్మ'ను దర్శించుచు కర్మలుచేయు 'కర్మయోగి' కూడ కర్మబంధములలో చిక్కుకొనడు - అను విషయమును భగవంతుడు ఇప్పుడు వివరించుచున్నాడు-

**యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।**
**సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥ 22 ॥**

యదృచ్ఛాలాభ-సంతుష్టః = అప్రయత్నముగా అమరిన లాభములతో సంతుష్టుడైన వాడు
విమత్సరః = అసూయలేనివాడు
ద్వంద్వాతీతః = హర్షశోకాది ద్వంద్వములకు అతీతుడు
సిద్ధౌ, అసిద్ధౌ, చ = సిద్ధి, అసిద్ధులయందును
సమః = సమదృష్టి కలిగియుండు వాడు- అగు కర్మయోగి
కృత్వా, అపి = కర్మలను చేయుచును
న, నిబధ్యతే = బంధింపబడడు.

**తాను కోరకుండగనే లభించిన పదార్థములతో (అప్రయత్నముగా అమరిన లాభములతో) సంతుష్టుడైనవాడు, అసూయలేనివాడు, హర్షశోకాదిద్వంద్వములకు అతీతుడు అయినవాడు సిద్ధియందును, అసిద్ధియందును సమదృష్టి కలిగియుండును. అట్టి కర్మయోగి కర్మలనాచరించుచున్నను వాటి బంధములలో చిక్కుపడడు. (22)**

ప్రశ్న - 'యదృచ్ఛాలాభ' మనగానేమి? అందు 'సంతుష్టుడగు'ట యనగానేమి?

సమా - స్వప్రయత్నము లేకుండ దైవేచ్ఛవలన ప్రారబ్ధానుసారము లభించిన అనుకూల లేక ప్రతికూలపదార్థమే (దైవికముగ కలిగిన లాభమే) 'యదృచ్ఛాలాభ' మనబడును. దైవికమైన లాభము తనకు అనుకూలముగా కన్పించినప్పుడు దానిపై అనురాగము గాని, దానిని రక్షించుకొనుటకును, పెంచుకొనుటకును కోరికగాని

లేకుండుట, అట్లే ఆ దైవికమైన లాభము ప్రతికూలముగా కన్పించినప్పుడు దానిని ద్వేషించుటగాని, తొలగించుకొనుటకై యత్నించుటగాని చేయకుండుట, - ఈ రెండు పరిస్థితులను ప్రారబ్ధములుగా, విధి నిర్ణయములుగా భావించి, నిరంతరము శాంత ప్రసన్నచిత్తుడై ఆనందించుచుండుటను - 'యదృచ్ఛాలాభసంతుష్టుడగుట' యందురు.

ప్రశ్న - 'విమత్సరః' అనగానేమి? ఆ పదప్రయోగములోని 'ఆంతర్య'మేమి?

సమా - ఇతరులయొక్క విద్యాబుద్ధులు, ధనమాన గౌరవములు, సంపత్తి గుణములు మున్నగువాని ఉన్నతిని చూచి అసూయపడుటను మత్సరము అని యందురు. ఈ అసూయా లక్షణములేని వానిని 'విమత్సరః' అని యందురు. విద్వాంసులు, బుద్ధిమంతులు అయిన వారిలో గూడ ఈ అసూయాదోషము దాగియే యుండును. పరస్పర ప్రేమాభిమానములు గల్గియున్న మిత్రుల యొక్క, ఆప్తులయొక్క ఉన్నతివిషయమునను పెక్కుమంది అసూయకులోనగుచునే యుందురు. ఒక్క కర్మయోగిలో మాత్రమే హర్షశోకాది ద్వంద్వములు గాని, అసూయగాని ఏ మాత్రము ఉండవు. అందువలన 'విమత్సరః' అను విశేషణము ప్రత్యేకముగ ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'ద్వంద్వములకు అతీతుడగుట'యనగానేమి?

సమా - హర్షశోకములు, రాగద్వేషములు మున్నగు మనోవికారముల జంటలనే "ద్వంద్వములు" అని యందురు. అంతఃకరణమునందు ఈ ద్వంద్వవికారములు ఏ మాత్రము లేకుండుటను - 'ద్వంద్వాతీతుడగుట' అనియందురు.

ప్రశ్న - 'సిద్ధి' 'అసిద్ధి' అనగానేమి? వానియందు 'సమ'దృష్టి కలిగియుండట యనగానేమి?

సమా - యజ్ఞము, దానము, తపస్సు మొదలగు కర్తవ్య కర్మలు ఎట్టి విఘ్నములు లేకుండ పరిసమాప్తి చెందుటను, 'సిద్ధి' యందురు. ఎట్టి కారణమువలననైనను విఘ్నములకు గురియై ఈ కర్తవ్యకర్మలు సమాప్తి కాకుండుటను 'అసిద్ధి' యందురు. కర్మల యొక్క ఉద్దేశ్యము నెఱవేఱినచో 'సిద్ధి' అనియు, నెఱవేఱకున్నచో 'అసిద్ధి' అనియు చెప్పబడును. ఈ విధములైన 'సిద్ధి' 'అసిద్ధు'లయందు 'భేదబుద్ధి లేకుండుట' అనగా 'సిద్ధి' యందు హర్షము ఆసక్తి మున్నగునవియు, 'అసిద్ధి' యందు ద్వేషము, శోకము మొదలగు వికారములును లేకుండుట, మఱియు 'సిద్ధి' 'అసిద్ధు'లయందు ఒకేస్థితి కలిగియుండుటను 'సిద్ధి' 'అసిద్ధు'లయందు సమదృష్టి కలిగియుండుట - అని యందురు.

ప్రశ్న - ఇట్టి పురుషుడు కర్మలు చేసియు, వానిచే బంధింపబడడు, అనియనుటలోని అంతరార్థమేమి?

సమా - కర్మలు చేయుటకధికారము మనుష్యులకే కలదు (2/47) ప్రజాపతి కర్మలను చేయుమని మానవుని ఆజ్ఞాపించెను. (3/10) అందువలన మనుష్యుడు కర్మ చేయనిచో పాపభాజనుడు అగును (3/16). అంతేగాక అతడు ఏ విధముగను కర్మాచరణబాధ్యతనుండి తప్పించుకొనజాలడు (3/5). తమ తమ ప్రకృతుల ననుసరించి, ప్రతి వ్యక్తియు కర్మలను చేయవలసియే యుండును.

కేవలము శారీరక కర్మలను మాత్రమే అపరిగ్రహముగా (ఎట్టి ప్రయోజనమును ఆశింపక) చేయుచు, ఇతర కర్మలను ఆచరింపకపోయినను సాంఖ్యయోగిని పాపములంటవు. అట్లే కర్మయోగి విహితకర్మలను అనుష్ఠించుచున్నను అవి (ఆ కర్మల ఫలములు) వానిని బంధింపవు.

సంబంధము - పైన చెప్పిన రీతిగా చేయబడిన "కర్మలు బంధహేతువులు కావు" అను మాటయేనా? లేక అందు ఇంకేమైనను విశేషమున్నదా? అను ప్రశ్న ఉదయించును. దీనికి సమాధానముగా భగవానుడు ఇట్లు చెప్పుచున్నాడు-

**గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।**
**యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| గతసంగస్య | = సర్వథా ఆసక్తిరహితుడును | జ్ఞానావస్థితచేతసః | = పరమాత్మ జ్ఞానమునందే నిరంతరము మనస్సును లగ్నమొనర్చినవాడును | ఆచరతః | = కర్మలను ఆచరించువాడును ఆగు పురుషునియొక్క |
| ముక్తస్య | = దేహాభిమానము, మమకారము ఏమాత్రమూ లేనివాడును | యజ్ఞాయ | = కేవలము యజ్ఞార్థమే | సమగ్రమ్, కర్మ | = కర్మలన్నియును |
| | | | | ప్రవిలీయతే | = విలీనములగును |

**ఏలనన ఆసక్తి, దేహాభిమానము, మమకారము ఏ మాత్రమూ లేనివాడును, పరమాత్మజ్ఞానమునందే నిరంతరము మనస్సును లగ్నమొనర్చినవాడును, కేవలము యజ్ఞార్థమే కర్మలను ఆచరించువాడును అగు మనుష్యుని యొక్క కర్మలన్నియును పూర్తిగా విలీనములగును అనగా మిగిలియుండవు.(23)**

ప్రశ్న- ఆసక్తి సర్వథా నశించుట యనగానేమి? "గత సంగస్య" అనగానేమి?

సమా - కర్మలయందును, వాటి ఫలస్వరూపములైన సమస్త భోగములయందును ఏ మాత్రమును ఆసక్తి, కోరిక లేకుండుటను "ఆసక్తి సర్వథా నశించుట" యందురు. ఇట్లు ఆసక్తి రహితుడైన కర్మయోగిని సూచించునదియే "గతసంగస్య" అనుపదము. కర్మయందును కర్మఫలముల యందును ఆసక్తిని త్యజించుట, సిద్ధి, అసిద్ధుల యెడ సమత్వమును కలిగియుండుట – అనుటలోని భావమిదియే.

ప్రశ్న - "ముక్తస్య" అను పదము యొక్క భావమేమి?

సమా - అంతఃకరణముతో ఇంద్రియముల సమూహముతో కూడిన శరీరమునందు ఏ మాత్రమును అభిమానము, మమకారము లేని, దేహాభిమానరహితుడైన "జ్ఞానయోగిని" తెల్పునదియే "ముక్తస్య" అను పదము.

ప్రశ్న - "జ్ఞానావస్థిత చేతసః" అను సమాసము యొక్క భావమేమి?

సమా - "సర్వం బ్రహ్మమయమ్" అని భావించుచు, వివిధ కర్మల నాచరించు సమయము లన్నింటియందును నిరంతరము పరమాత్మ జ్ఞానము నందే చిత్తమును లగ్న మొనర్చు "జ్ఞానయోగి"ని సూచించునదియే "జ్ఞానావస్థిత చేతసః" అను పదము.

ప్రశ్న - "యజ్ఞాయ ఆచరితః" అను దానిలో యజ్ఞశబ్దము యొక్క అర్థమేమి? మఱియు దాని కొఱకై కర్మలను ఆచరించుట యనగానేమి?

సమా - వర్ణాశ్రమ ధర్మములను, పరిస్థితులను అనుసరించి, ప్రతివ్యక్తియు ఆచరించు శాస్త్రోక్త కర్తవ్యకర్మయే, అతనికి 'యజ్ఞము' అగును. శాస్త్ర విహితయజ్ఞకర్మలను ఆచరించుట- అనగా ఏ మాత్రమును స్వప్రయోజనమును ఆశింపక లోకహితార్థమే యజ్ఞపరంపరను రక్షించుటకై కర్మలను ఆచరించుటనే యజ్ఞము కొఱకై కర్మలను చేయుట - అనియందురు. మూడవ (3) అధ్యాయము యొక్క తొమ్మిదవ శ్లోకమునందలి 'యజ్ఞార్థాత్ కర్మణః' అనుటలోని భావము గూడ ఇదియే.

ప్రశ్న - 'సమగ్రమ్' అను విశేషణముతో కూడిన 'కర్మ' అను పదము ఏ కర్మలను సూచించును? అవి విలీనమగుట యనగానేమి?

సమా - జన్మ జన్మాంతరములయందు చేసిన కర్మలు సంస్కారరూపమున మనుష్యుని అంతఃకరణమునందు సంచితమైయుండును. వాటి ప్రభావమున నూతన (అనంతర) కర్మలు ఆచరింపబడును. వీటిని అన్నింటిని సూచించునదియే 'సమగ్రమ్' 'కర్మ'. ఆ కర్మలన్నియును నశించుట యనగా వాటియందు ఎట్టి బంధనశక్తియు లేకపోవుటయే విలీనమగుట. పై విధముగ కర్మల నాచరించు పురుషుని ఎట్టి కర్మలును బంధింపవు సరికదా! పూర్వసంచితకర్మలు కూడ అందు విలీనమగును. అనగా దగ్ధమగును. కాలుచున్న చిన్న గడ్డిపరక పెద్దవామిపై పడినప్పుడు తాను కాలిపోవుటయే గాక ఆ గడ్డివామిని గూడ పూర్తిగా భస్మమొనర్చును. అట్లే ఆసక్తి, ఫలేచ్ఛ, మమత, అభిమానములను త్యజించుటయను అగ్నిచే కాలిన కర్మలు పూర్వసంచిత సమస్త కర్మలతోపాటు పూర్తిగా విలీనమైపోవును. అట్టివానియొక్క ఏ కర్మయందును ఏ విధమైన ఫలమునిచ్చు శక్తియు ఉండదు.

సంబంధము - పూర్వశ్లోకమునందు యజ్ఞార్థము కర్మ చేయువాని సమస్తకర్మలును రూపుమాసిపోవునని తెలుపబడినది. అచట కేవలము అగ్నియందు హోమము చేయుటయే యజ్ఞముగా భావింపబడినది. ఇట్టి యజ్ఞమునకువలసిన ద్రవ్యసంపాదనమునకై చేయబడు క్రియలన్నియు యజ్ఞార్థము చేయబడుకర్మలు. కాని ఇంత మాత్రమే కాదు. వర్ణాశ్రమ ధర్మములను, స్వభావమును, పరిస్థితులను అనుసరించి చేయబడు కర్తవ్య కర్మలన్నియును యజ్ఞములే. వానిని పాటించుటకై అవసరమగు క్రియలను నిస్స్వార్థబుద్ధితో లోకహితార్థమై చేయుటయే యజ్ఞార్థము కర్మచేయుట యగును. ఈ భావమును స్పష్టపఱచుటకే రాబోవు ఏడు శ్లోకములలో భగవత్ప్రాప్తికై నేర్పాటు యోగులచే చేయబడు శాస్త్రవిహితసాధనరూప కర్తవ్యకర్మలను వివిధ యజ్ఞములుగా భగవంతుడు వర్ణించుచున్నాడు-

**బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ 24 ॥**

అర్పణమ్, బ్రహ్మ = యజ్ఞకర్మలయందు ఉపయుక్తములగు స్రువాది సాధనములు బ్రహ్మము
హవిః, బ్రహ్మ = హోమద్రవ్యము బ్రహ్మము
బ్రహ్మణా = బ్రహ్మరూపకర్తద్వారా
బ్రహ్మాగ్నౌ = బ్రహ్మరూపాగ్నియందు
హుతమ్ = హోమముచేయబడినదియు బ్రహ్మము
తేన, బ్రహ్మకర్మ-సమాధినా = అట్టి బ్రహ్మరూపకర్మయందు స్థితుడైన యోగి ద్వారా
గన్తవ్యమ్ = పొందదగినది (ఫలము) కూడ
బ్రహ్మ, ఏవ = బ్రహ్మమే

యజ్ఞకార్యములయందు ఉపయుక్తమగు స్రువాదిసాధనములు బ్రహ్మము. హోమము చేయబడు ద్రవ్యము బ్రహ్మము. అగ్నియు బ్రహ్మము. యజ్ఞము నాచరించు కర్తయు బ్రహ్మము. హవనక్రియయు బ్రహ్మము. ఈ బ్రహ్మకర్మయందు స్థితుడై యుండు యోగి ద్వారా పొందదగిన యజ్ఞఫలముగూడ బ్రహ్మమే. **(24)**

ప్రశ్న - ఈ శ్లోకము నందు యజ్ఞదృష్టాంతము ద్వారా తెలుపబడిన భావమేమి?

సమా - సర్వం ఖల్విదమ్ బ్రహ్మ (ఛాందోగ్య ఉప. 3/14/1) అను సూక్తి ననుసరించి సర్వత్ర బ్రహ్మ దర్శన రూపసాధనమే యజ్ఞదృష్టాంతముగా ఇచట చెప్పబడినది. కర్త, కర్మ, కరణము మొదలగు విభిన్న రూపములలో ప్రకటితమగు సమస్త పదార్థములను బ్రహ్మరూపమున దర్శించు అభ్యాస కర్మయు పరమాత్మ ప్రాప్తికి సాధనమగుటచే అది యజ్ఞమనబడినది.

ఈ యజ్ఞమునందు స్రువము, హవిస్సు, హవనము చేయువాడు, హోమక్రియ మొదలగునవి విభిన్న రూపములలో కన్పించుచున్నను అవియన్నియు బ్రహ్మమే (బ్రహ్మ స్వరూపములే). ఈ యజ్ఞము చేయు యోగి మనోబుద్ధ్యాదుల ద్వారా సమస్త జగత్తును బ్రహ్మ స్వరూపముగనే భావించు అభ్యాసము గలవాడు. అతడు తనను, స్రువాది సాధనములను, అభ్యాసరూప క్రియను, మఱియేఇతర వస్తువునైనను బ్రహ్మముకంటె వేఱుగా తలంపడు. అన్నింటిని బ్రహ్మరూపముననే చూచును. కావున అతనికి వాటియందు ఎట్టిభేదబుద్ధియు ఉండదు.

ప్రశ్న - 'అర్పణమ్' అను పదమునకు హోమక్రియ అని యర్థము చెప్పినచో దోషమేమి?

సమా - 'హుతమ్' అను పదము ఇందు హవన క్రియార్థముగా ప్రయుక్తమైనది. 'అర్పణమ్' అను పదమునకు గూడ ఇందు హవనక్రియ అను నర్థము చెప్పినచో పునరుక్తి దోషము కలుగును. తొమ్మిదవ అధ్యాయమునందలి పదునాఱవ శ్లోకమున గూడ 'హుతమ్' అను పదమునకు హవనక్రియ అను అర్థమే చెప్పబడినది. 'అర్ప్యతే అనేన' అను వ్యుత్పత్తిరీతి ననుసరించి, హవ్యద్రవ్యములైన ఘృతం మొదలగు వానిని అగ్నిలో వేయుటకు ఉపయోగింపబడు స్రువాది సాధనములకు 'అర్పణమ్' అని యర్థము చెప్పుటయే సముచితము.

ప్రశ్న - బ్రహ్మకర్మయందు స్థితుడగుట అనగానేమి? అట్లు స్థితుడైన యోగికి ప్రాప్యమగు ఫలము గూడ బ్రహ్మమే యనుటలోని ఆంతర్యమేమి?

సమా - నిరంతరము సర్వత్ర బ్రహ్మబుద్ధిని కలిగి యుండుట, దేనిని కూడ బ్రహ్మేతరముగా భావింపకుండుట- బ్రహ్మకర్మయందు స్థితుడగుట యనగా ఇదియే. ఈ విధమైన సాధనయొక్క ఫలితము నిస్సందేహముగా పరమాత్మప్రాప్తియే. పై విధముగ సాధన చేయు యోగికి పరబ్రహ్మ ప్రాప్తి రూపమైన ఈ ఫలమే లభించును. అందువలననే అట్టి యోగికి ప్రాప్యఫలము బ్రహ్మమే అని చెప్పబడినది.

సంబంధము - బ్రహ్మకర్మరూపయజ్ఞమును ఈ విధముగ వర్ణించి, దేవపూజారూపయజ్ఞమును, ఆత్మ, పరమాత్మల అభేదదర్శనరూపయజ్ఞమును గూర్చి భగవంతుడు వర్ణించుచున్నాడు-

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ 25 ॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అపరే | = ఇతరులు (కొందఱు) | పర్యుపాసతే | = | చక్కగా అనుష్ఠింతురు | యజ్ఞేన, ఏవ | = | అభేద దర్శనరూప యజ్ఞముద్వారానే |
| యోగినః | = యోగులు | అపరే | = | మఱికొందరు | | | |
| దైవమ్, యజ్ఞమ్, ఏవ | = దైవపూజారూప యజ్ఞమునే | బ్రహ్మాగ్నౌ | = | పరబ్రహ్మ పరమాత్మ రూప-అగ్నియందు | యజ్ఞమ్, ఉపజుహ్వతి | = | ఆత్మరూపయజ్ఞమును ఆచరింతురు. |

కొందఱు యోగులు దైవపూజారూపయజ్ఞమును చక్కగా అనుష్ఠింతురు. మఱికొందఱు యోగులు బ్రహ్మాగ్నియందు అనగా పరబ్రహ్మపరమాత్మరూపాగ్నియందు అభేదదర్శనరూప యజ్ఞము ద్వారా ఆత్మరూపయజ్ఞమును ఆచరింతురు. (25)

ప్రశ్న - ఇచట 'యోగినః' అను పదము ఎట్టి యోగులను గూర్చి తెలుపును? 'అపరే' అను విశేషణము యొక్క ప్రత్యేకత ఏమి?

సమా - మమత, ఆసక్తి, ఫలేచ్ఛ మొదలగు వానిని త్యజించి, శాస్త్రవిహిత యజ్ఞాది కర్మల నాచరించు సాధకులను తెల్పునదియే యోగినః అను పదము. పూర్వశ్లోకమున వర్ణింపబడిన బ్రహ్మకర్మ యోగులకును వీరికిని భేదము గలదు. వీరి సాధన రీతి ఆ యోగుల సాధన పద్ధతికంటెను భిన్నమైనది. ఈ ఉభయ సాధకుల యొక్క లక్షణములును విభిన్నములు. ఈ విషయమును స్పష్టపఱచుటకే 'యోగినః' అను పదమునకు 'అపరే' అను విశేషణము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'దైవమ్' అను విశేషణ సహితముగా 'యజ్ఞమ్' అను పదము ఏ కర్మను సూచించును? ఆ కర్మను చక్కగా అనుష్ఠించుట అనగానేమి? ఈ శ్లోకము యొక్క పూర్వార్థమునందు వివరింపబడిన విషయ విశేషమేమి?

సమా - బ్రహ్మ, శివుడు, శక్తి (దేవి), గణపతి, సూర్యుడు, చంద్రుడు, ఇంద్రుడు, వరుణుడు మొదలగు శాస్త్రసమ్మత దేవతల తృప్తికై హోమము చేయుట, వారిని పూజించుట, వారి మంత్రములను జపించుట, వారి నిమిత్తమై దానములు చేయుట, అన్నసంతర్పణలను జేయుట మొదలగు సమస్త కర్మలను 'దైవమ్' అను విశేషణముతో గూడిన 'యజ్ఞమ్' అను పదము తెలుపును.

మమత, ఆసక్తి, ఫలేచ్ఛలు లేకుండ కేవలము భగవత్ప్రాప్తికై హోమపూజాదిక్రియలన్నియు తమ కర్తవ్యములుగా భావించి, భక్తిశ్రద్ధలతో శాస్త్ర విహితముగా పూర్తిగా అనుష్ఠించుటయే దైవ యజ్ఞమును చక్కగా నెఱవేర్చుట అనబడును. ఈ విధమైన దైవోపాసనలు కూడ యజ్ఞ కర్మాంతర్గతములే.

ప్రశ్న - బ్రహ్మరూపాగ్నియందు అభేద దర్శనరూప యజ్ఞము ద్వారా ఆత్మరూప యజ్ఞమును ఆచరించుట అనగానేమి?

సమా - అనాదిసిద్ధమైన అవిద్యా కారణమున శరీరోపాధివలన ఆత్మ వేఱు, పరమాత్మ వేఱు అను భావము అనాదికాలము నుండియు ప్రతీతమగుచున్నది. అజ్ఞాన (అవిద్యా) జనితమైన ఈ భేద - ప్రతీతిని జ్ఞానాభ్యాసము ద్వారా రూపుమాపుట - అనగా శాస్త్రముల ద్వారా, ఆచార్యోపదేశముల ద్వారా గ్రహించిన తత్త్వజ్ఞానమును నిరంతరము మనన, నిదిధ్యాసలను చేయుచు, నిత్యుడు విజ్ఞానానందఘనుడు, గుణాతీతుడు అయిన పరబ్రహ్మ పరమాత్మ యందు అభేద భావముతో ఆత్మను ఐక్యము చేయుటయే (విలీన మొనర్చుటయే) బ్రహ్మ రూపాగ్నియందు అభేదదర్శనరూప యజ్ఞము ద్వారా ఆత్మరూప యజ్ఞమును ఆచరించుట అనబడును.

ఈ విధమగు యజ్ఞము నాచరించు జ్ఞానయోగుల దృష్టిలో నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘనబ్రహ్మమునకు తప్ప తనకుగాని, మఱి దేనికైననుగాని ఏ మాత్రమును అస్తిత్వమనునదియే యుండదు. త్రిగుణాత్మక (త్రిగుణమయ)మైన ఈ జగత్తుతో ఆతనికి ఎట్టి సంబంధమూ ఉండదు. ఆతనికి ఈ ప్రపంచమంతయు లేనిదే యగును.

ప్రశ్న - పూర్వశ్లోకమున వర్ణింపబడిన బ్రహ్మకర్మకును ఈ అభేదదర్శన రూపయజ్ఞమునకును మధ్యగల తారతమ్యము ఎట్టిది?

సమా - ఈ రెండు సాధనలును సాంఖ్యయోగులు ఆచరించునవియే. ఈ రెండింటియందును అగ్నిస్థానీయుడైన వాడు పరబ్రహ్మ పరమాత్మయే. ఈ కారణమున ఈ రెండును ఒకటిగనే ప్రతీతమగును. అట్లే ఈ రెండింటి ఫలము కూడ అభేద భావముతో సచ్చిదానందఘనబ్రహ్మ ప్రాప్తియే యగుటచే వాస్తవముగ ఈ రెండింటియందు ఎట్టి తారతమ్యములును లేవు. కేవలము సాధనప్రక్రియల యందు మాత్రమే భేదము గలదు. ఈ విషయమును స్పష్టపఱచుటకే రెండింటి వర్ణనము వేర్వేఱుగా చేయబడినది. పూర్వ శ్లోకమున వర్ణింపబడిన సాధనయందు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' (ఛాందోగ్య-ఉప- 3/14/1) అను శ్రుతి వాక్యము ననుసరించి, సర్వత్ర బ్రహ్మబుద్ధి భావము వర్ణింపబడినది. ఈ సాధనమున సమస్త జగత్తుతో సంబంధము అభావమొనర్చి, ఆత్మ పరమాత్మల అభేదదర్శన విషయ వర్ణనము చేయబడినది.

*సంబంధము - ఈ విధముగ ద్వైవయజ్ఞమును, అభేదదర్శనరూప యజ్ఞములను వర్ణించిన పిదప ఇప్పుడు భగవానుడు ఇంద్రియసంయమనరూప యజ్ఞమును విషయహవనరూప యజ్ఞమును విశదపరచుచున్నాడు-*

**శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।**
**శబ్దాదీన్ విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అన్యే | = కొందరు యోగులు | జుహ్వతి | = హోమము చేయుదురు | విషయాన్ ఇంద్రియాగ్నిషు | = విషయములను ఇంద్రియరూపాగ్నుల యందు |
| శ్రోత్రాదీని, ఇంద్రియాణి | = శ్రోత్రాది సమస్త-ఇంద్రియములను | అన్యే | = మఱికొందరు యోగులు | | |
| సంయమాగ్నిషు | = సంయమనరూపాగ్నులయందు | శబ్దాదీన్, | = శబ్దాది సమస్త | జుహ్వతి | = హవనము చేయుదురు |

**కొందరు యోగులు శ్రోత్రాది-ఇంద్రియములను సంయమన రూపాగ్నుల యందు హోమము చేయుదురు. మఱికొందరు యోగులు శబ్దాది సమస్తవిషయములను ఇంద్రియరూపాగ్నులయందు హవనము చేయుదురు. అనగా యోగులు మనోనిగ్రహము ద్వారా ఇంద్రియములను అదుపు చేయుదురు. తత్ఫలితముగా శబ్దాది విషయములు ఎదురుగా లేకున్నను వాటి ప్రభావము వారి ఇంద్రియములపై ఏమాత్రము ఉండదు. (26)**

ప్రశ్న - సంయమమును అగ్నిగా చెప్పుటలో భావమేమి? అందు బహువచన ప్రయోగము చేయుటలో గల విశేషమేమి?

సమా - ఇంద్రియసంయమ రూపసాధనమును యజ్ఞముగా పేర్కొనుటకై ఇచట సంయమమును అగ్నిగా చెప్పుట జరిగినది. ప్రతి ఇంద్రియ సంయమము వేర్వేరుగా ఉండును. ఈ విషయమును స్పష్టపఱచుటకే ఇందు బహువచనము ప్రయోగింపబడినది.

ప్రశ్న - సంయమరూపాగ్నులందు శ్రోత్రాది - ఇంద్రియములను హవనము చేయుట అనగానేమి?

సమా - ఇంద్రియములు బాగుగా మథించు స్వభావము గలవి. అవి సాధకుని మనస్సును హరించుటలో ప్రబలమైనవి. (2/60) అందువలన ఇంద్రియములన్నింటిని వశమునందుంచు కొనవలెను. వాటి విశృంఖలత్వమును రూపుమాపవలెను. వానియందలి మనస్సును చలింపజేయు శక్తిని తొలగింపవలెను. ప్రాపంచిక భోగములయందు అవి చిక్కుకొనకుండ చూడవలెను. ఈ ప్రక్రియనే ఇంద్రియములను సంయమ రూపాగ్నులయందు హోమము చేయుట యందురు.

త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను (జ్ఞానేంద్రియములను) వశము నందుంచుకొని, ప్రత్యాహారము చేయుట అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది బహిరంతర్విషయముల నుండి వివేక పూర్వకముగ మఱల్చి, చిత్తైకాగ్రతను

సాధించుటయే శ్రోత్రాది - ఇంద్రియములను సంయమ రూపాగ్నులయందు హవనము చేయుట యందురు. ఈ విషయము రెండవ అధ్యాయము నందలి ఏబది యెనిమిదవ శ్లోకమున తాబేలు దృష్టాంతము ద్వారా స్పష్టము చేయబడినది.

ప్రశ్న - మూడవ అధ్యాయము నందలి 6వ శ్లోకమున ఇంద్రియసంయమము మిథ్యాచారమని పేర్కొనబడినది. దానికిని ఇక్కడ తెలుపబడిన ఇంద్రియ సంయమమునకును మధ్యగల తారతమ్యమేమి?

సమా - కేవలము చూచుట, వినుట, తినుట, త్రాగుట మొదలగు బాహ్య వ్యాపారముల నుండి ఇంద్రియములను మఱల్చుటయే సంయమమని అక్కడ (3వ అధ్యాయమున) చెప్పబడినది. ఇంద్రియములను వశము నందుంచుకొనుట అను విషయ ప్రస్తావనము అందులేదు. అతడు మనస్సుద్వారా ఇంద్రియ విషయ చింతన చేయునని స్పష్టముగా తెలుపబడినది. కాని ఇక్కడ ఇంద్రియములను వశపఱచుకొనుటయే సంయమమని నొక్కి చెప్పబడినది. ఇట్లు ఇంద్రియములను వశపఱచుకొనుట వలన విషయముల యందు ప్రవృత్తమగు శక్తి మనస్సున నశించును. ఇంద్రియములను వశపఱచుకొనకుండగనే ఇంద్రియములను విషయములనుండి మఱల్చి మనస్సున ఆ విషయ చింతన చేయువాడు దంభాచారి. పరమాత్మప్రాప్తికొఱకు ఇంద్రియములను వశపఱచుకొనిన వాని మనస్సున విషయచింతన ఉండదు. అతని మనస్సున నిరంతరము పరమాత్మ చింతనమే ఉండును. మిథ్యాచారి (దంభా చారి) సంయమమునకును, యోగి (యథార్థ) సంయమమునకును గల భేదమిదియే.

ప్రశ్న - ఇంద్రియములను అగ్నులుగా చెప్పుటలో (ఇంద్రియములయందు అగ్నిత్వారోపణ చేయుటలో) గల అర్థమేమి? 'ఇంద్రియాగ్నిషు' అని ఇచట బహువచన ప్రయోగము చేయుటలో గల అంతర్యమేమి?

సమా - ఆసక్తి లేకుండ నిష్కామభావముతో ఇంద్రియముల ద్వారా విషయసేవనరూపసాధనకు యజ్ఞరూపము నిచ్చుటకు ఇంద్రియములను అగ్నులుగా చెప్పుట (ఇంద్రియములయందు అగ్నిత్వారోపణ చేయుట) జరిగినది. ప్రతి ఇంద్రియముద్వారా అనాసక్త భావముతో వేర్వేఱుగా విషయగ్రహణము జరుగును. ఈ అంశమును స్పష్టపఱచుటకే ఇచట బహువచన ప్రయోగము చేయబడినది.

ప్రశ్న - శబ్దాది విషయములను ఇంద్రియ రూపాగ్నులలో హవనము చేయుట అనగానేమి?

సమా - ఇంద్రియములను వశపరచుకొని రాగద్వేష రహితముగా వర్ణాశ్రమ ధర్మములను, పరిస్థితులను యోగ్యతలను అనుసరించి, విషయములను (ఇంద్రియార్థములను) గ్రహించి, వానిని ఇంద్రియములలో విలీనము చేయుట (2/64) అనగా ఇంద్రియార్థములను (విషయములను) గ్రహించు సమయమునందుగాని, ఇతర సమయములందుగాని అంతఃకరణమునందు, లేక ఇంద్రియములయందు ఏ విధమైన వికారమును ఉత్పన్నము కావించు శక్తిని నశింపజేయుటను - శబ్దాది విషయములను ఇంద్రియ రూపాగ్నులలో హవనము చేయుట యగును. చెవుల ద్వారా నిందాస్తుతులను లేక అనుకూల ప్రతికూల శబ్దములను వినుచు, నేత్రముల ద్వారా మంచి, చెడు దృశ్యములను చూచుచు, జిహ్వ (నాలుక) ద్వారా అనుకూల ప్రతికూల రుచులను గ్రహించుచు - ఇదే విధముగ ఇతర సమస్తేంద్రియముల ద్వారా ప్రారబ్ధానుసారముగా యోగ్యత ననుసరించి, ప్రాప్తించిన విషయములను (ఇంద్రియార్థములను) అన్నింటిని అనాసక్త భావముతో గ్రహించుచు అంతఃకరణమునందు సమభావమును కలిగియుండుట, భేదబుద్ధి జనితమైన రాగద్వేషములకును, హర్షశోకాది వికారములకును తావులేకుండుట - అనగా శబ్దాది విషయములలో (ఇంద్రియార్థములలో) మనస్సును, ఇంద్రియములను విచలితమొనర్చు (వికారములకు లోను చేయు) శక్తి నశింపజేసి, వానిని (శబ్దాది విషయములను) ఇంద్రియములలో విలీనమొనర్చుచుండుట - ఇదియే శబ్దాది విషయములను ఇంద్రియరూపాగ్నులలో హవన మొనర్చుట యనబడును - ఏలననగా విషయములయందు ఆసక్తి, సుఖము, రమణీయబుద్ధి లేని కారణమున ఆ విషయభోగములు సాధకునిపై ఎట్టి ప్రభావమును చూపలేవు. అగ్నిలో గడ్డివలె అవి స్వయముగ భస్మమగును.

సంబంధము - ఇప్పుడు ఆత్మ సంయమ యోగరూప యజ్ఞమును వర్ణించుచున్నాడు-

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| అపరే | = మఱికొందరు యోగులు | ప్రాణకర్మాణి | = ప్రాణక్రియలను అన్నింటిని | ఆత్మసంయమ-యోగాగ్నౌ | = ఆత్మసంయమ యోగ రూపాగ్నియందు |
| సర్వాణి, ఇంద్రియకర్మాణి | = ఇంద్రియ కర్మలను అన్నింటిని | జ్ఞానదీపితే | = జ్ఞానముచే ప్రకాశితమైన | జుహ్వతి | = హవనము చేయుచుందురు |
| చ | = మఱియు | | | | |

మఱికొందఱు యోగులు ఇంద్రియముల క్రియలను, ప్రాణములక్రియలను అన్నింటిని జ్ఞానముచే ప్రకాశితమైన ఆత్మసంయమయోగరూపాగ్నిలో హవనము చేయుచుందురు. అట్టివారు పూర్తిగా పరమాత్మయందే స్థితులైయుందురు. అపుడు ప్రాణ ఇంద్రియముల స్వభావము వారిపై ఏ మాత్రము ఉండదు. ఏలనన వారి బుద్ధియందు పరమాత్మ మాత్రమే నిలచి యుండును. (27)

ప్రశ్న - ఆత్మసంయమయోగమనగానేమి? దానిని అగ్నిగా చెప్పుటలో (దానియందు అగ్నిత్వారోపణ చేయుటలో) గల ఆంతర్యమేమి? 'జ్ఞానదీపితే' అను విశేషణము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - ఇచట 'ఆత్మసంయమయోగము' సమాధి యోగమును తెలుపును. ఆ సమాధి యోగమునకు యజ్ఞరూపమును ఇచ్చుటకై అగ్నిత్వము ఆరోపింపబడినది. సమాధి అవస్థలో వివేకము, విజ్ఞానము జాగృతమగును. సమాధి యందు శూన్యత్వమునకు తావులేదు. అనగా శూన్యత్వము సమాధి కాదు. సుషుప్తిలో శూన్యత్వము కలదు. ఈ భేదము ఇచట తెలుపుట జరిగినది. ప్రజ్వలితాగ్నివలె సమాధి యోగమునందు జ్ఞానము ప్రకాశితమగును. ఈ ప్రక్రియకు యజ్ఞరూపము నిచ్చుటకై 'జ్ఞానదీపితే' అను విశేషణము వాడబడినది.

ప్రశ్న - ఈ సమాధియోగముయొక్క స్వరూపమేమి? దానియందు ఇంద్రియముల క్రియలను, ప్రాణముల క్రియలనన్నింటిని హోమము చేయుట యనగానేమి?

సమా - ధ్యానయోగములో ధ్యేయముపై మనస్సును కేంద్రీకరింపజేయుట రెండు విధములుగా జరుగును. ప్రాణ-ఇంద్రియ వ్యాపారములను నిరోధించి, పిదప ధ్యేయము (వస్తువు)పై మనస్సును కేంద్రీకరింపజేయుట. ఒక పద్ధతి. మనస్సు ధ్యేయము (వస్తువు)ను చింతన చేయుటను అభ్యసింపగా క్రమముగా అది ధ్యేయముపై (ధ్యేయ వస్తువుపై) కేంద్రీకృతమగును. ఇప్పుడు మనస్సు ధ్యానావస్థకు చేరును. పిమ్మట ఈ ధ్యానము గాఢస్థితిని పొంది మనస్సు సమాధి స్థితిని చేరును. ఆ సమయములో ప్రాణముల - ఇంద్రియముల వ్యాపారములన్నియు తమంతట తామే ఆగిపోవును. ఇది మఱియొక (రెండవ) పద్ధతి దీనిని అనుసరించియే ఇచట ధ్యానయోగ వర్ణనము చేయబడినది.

భగవంతుని సగుణ సాకారుడుగా గాని, నిర్గుణ నిరాకారుడుగా గాని - తమ తమ విశ్వాసముల ప్రకారము భావన చేసి, విధి పూర్వకముగా మనస్సును కేంద్రీకరించుటయే సమాధియోగ స్వరూపము.

ఈ విధమైన ధ్యానయోగమునందు మనోనిగ్రహ పూర్వకముగా ఇంద్రియ వ్యాపారములైన చూచుట, వినుట, ఆఘ్రాణించుట, స్పృశించుట, ఆస్వాదించుట, గ్రహించుట, త్యజించుట, భాషించుట, నడచుట మొదలగు వానిని, అట్లే ప్రాణవ్యాపారములైన ఉచ్ఛ్వాస నిశ్వాసములు, కదలికలు మొదలగు సమస్త క్రియలను విలీన మొనర్చి, సమాధిస్థుడగుటయే ఆత్మ సంయమయోగ రూపాగ్నియందు ప్రాణేంద్రియ క్రియలన్నింటిని హోమము చేయుటయగును.

*సంబంధము* - *ఈ విధముగ సమాధియోగసాధనను యజ్ఞముగా వర్ణించి, తదుపరి శ్లోకములో ద్రవ్య యజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయరూపజ్ఞానయజ్ఞములను సంక్షిప్తముగా వివరించుచున్నాడు-*

**ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే ।**
**స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥ 28 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అపరే | = కొందఱు | తథా | = అట్లే | యతయః | = వ్రతములను చేపట్టిన యత్నశీలురైన వారు |
| ద్రవ్యయజ్ఞాః | = ద్రవ్యసంబంధ యజ్ఞములను | యోగయజ్ఞాః | = (కొందరు) యోగరూప యజ్ఞములను | స్వాధ్యాయజ్ఞాన-యజ్ఞాః | = స్వాధ్యాయరూప జ్ఞానయజ్ఞములను ఆచరింతురు |
| తపోయజ్ఞాః | = (కొందరు) తపోరూప యజ్ఞములను | చ | = మఱియు | | |
| | | సంశితవ్రతాః | = అహింసాది తీక్ష్ణ | | |

కొందఱు ద్రవ్యసంబంధయజ్ఞములను, మఱికొందఱు తపో-రూప యజ్ఞములను, కొందఱు యోగరూపయజ్ఞములను చేయుదురు. మఱికొందఱు అహింసాదితీక్ష్ణవ్రతములను చేపట్టి, యత్నశీలురై స్వాధ్యాయరూపజ్ఞానయజ్ఞములను ఆచరింతురు. (28)

ప్రశ్న - ద్రవ్యసంబంధయజ్ఞము అనగానేమి? వీనిని చేయుటకు యోగ్యులెవరు? ఇచటి 'ద్రవ్యయజ్ఞాః' అను పదప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - తమతమ వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను త్యజించి న్యాయార్జిత ద్రవ్యమును యథాయోగ్యముగ లోకహితార్థము వినియోగించుటయే ద్రవ్యయజ్ఞము. వాపీకూపతటాకములను త్రవ్వించుట, దేవాలయములు, ధర్మశాలలు (ధర్మసత్రములు) మొదలగు వానిని ఏర్పఱచుట, ఆకలిగొన్న వారికి, అనాథలకు, రోగులకు, దుఃఖితులకు, బలహీనులకు, భిక్షువులకు ఇంకను తదితర - అర్థులకు అవసరమైనంత మేరకు అన్నవస్త్రములు, నీరు, ఔషధములు, పుస్తకములు మొదలగు వస్తు ప్రదానముల ద్వారా సేవలొనర్చుట, విద్వాంసులు, తాపసులు, వేదపండితులు, సదాచార సంపన్నులైన బ్రాహ్మణులకు, గోవులు, భూములు, వస్త్రములు, ఆభరణములు మొదలగువానిని యథాయోగ్యముగ (వారి వారి యోగ్యతలను బట్టి) తమ తమ శక్త్యనుసారము దానములను చేయుట - ఇదే విధముగ ఇతర ప్రాణులకును సుఖములను గూర్చు లక్ష్యముతో యథాశక్తి ద్రవ్యమును వినియోగించుట మున్నగునవి అన్నియును ద్రవ్యయజ్ఞములోని విధులే - ఈ యజ్ఞము నాచరించుటకు గృహస్థులు మాత్రమే అర్హులు. ఏలనన ధనార్జనకును, దానిని పరోపకారార్థము వినియోగించుటకును సన్న్యాసులకును, ఇతరాశ్రమముల వారికిని అధికారము లేదు. భగవత్ప్రాప్తియే పరమలక్ష్యముగా లోకహితార్థము ధనమును వినియోగించుచు నిస్స్వార్థ భావముతో కర్మలు చేయుటయు యజ్ఞకర్మలో అంతర్గతమే అని తెలుపుటకే ద్రవ్యయజ్ఞము అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'తపోయజ్ఞ'మని దేనినందురు? దానికి ఎవరు అర్హులు?

సమా - పరమాత్మప్రాప్తి లక్ష్యముతో అంతః కరణేంద్రియముల శుద్ధికై ఆచరింపబడు యజ్ఞములలో తపోయజ్ఞము ముఖ్యమైనది. మమత, ఆసక్తి, ఫలేచ్ఛలు లేకుండ వివిధవ్రతములను ఆచరించుట, విహితోపవాసములను చేయుట, ధర్మపాలనకై కష్టములను సహించుట, మౌనమును పాటించుట, శీతాతపవాయు బాధలను ఓర్చుకొనుట, ఒకటి రెండు వస్త్రములను మాత్రమే కలిగియుండుట, అన్నమును తినుటమాని, కేవలము పండ్లు పాలతో శరీర నిర్వహణము చేయుట, వనవాసము చేయుట మొదలగునవి శాస్త్రవిహిత తితిక్షాసంబంధక్రియలు. వీనిని ఆచరించుటయే తపోయజ్ఞము.

ఈ తపోయజ్ఞము నాచరించుటకు ముఖ్యముగా వానప్రస్థాశ్రమవాసులే అర్హులు. ఇతరాశ్రమవాసులు గూడ శాస్త్రవిధి ననుసరించి, తమతమ యోగ్యతలకు అనుగుణముగ దీనిని ఆచరించుటకు అర్హులే.

ప్రశ్న - యోగయజ్ఞమనగానేమి? 'యోగ యజ్ఞాః' అని బహువచన ప్రయోగము చేయుటలోని అంతర్యమేమి?

సమా - యోగయజ్ఞమున కర్థము సర్వజ్ఞుడైన ఆ భగవంతునకే ఎఱుక. ఏలనన దాని విశేషలక్షణములు ఇచట తెలుపబడలేదు. కాని చిత్తవృత్తి నిరోధరూపమైన అష్టాంగయోగమే ఇచట యోగయజ్ఞశబ్దప్రయోగముచే సూచించబడుచున్నట్లు భావింపవచ్చును. భగవత్ ప్రాప్తియే లక్ష్యముగా గల సాధకులలో పెక్కుమంది ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారములను త్యజించి, ఈ అష్టాంగయోగరూప యజ్ఞమును ఆచరించుచుండుట లోకప్రసిద్ధము. కనుక 'యోగయజ్ఞాః' అని ప్రయోగింపబడినది. ఈ యోగసాధన రూప కర్మకూడ యజ్ఞకర్మలో భాగమే. కావున ఈ సాధకుల సమస్త కర్మలును విలీనములై వారికి సనాతన బ్రహ్మప్రాప్తి కలుగును.

ప్రశ్న - పైన పేర్కొనబడిన అష్టాంగ యోగము యొక్క ఎనిమిది (8) అంగము లెవ్వి?

సమా - పతంజలి యోగదర్శనమునందు పేర్కొనబడిన ఎనిమిది (8) అంగములు.

'యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణాధ్యాన సమాధయోఽష్టావంగాని' - (2/29) యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు యోగముయొక్క అష్టాంగములు.

వీనిలో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహారములు ఐదు (5)ను బహిరంగ సాధనలు. ధారణ, ధ్యాన, సమాధులు మూడు (3)ను అంతరంగ సాధనలు. 'త్రయమేకత్ర సంయమః' (3/4) ఈ మూడింటి సముదాయమును సంయమము అని యందురు.

'అహింసా-సత్యాస్తేయ-బ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః' (యోగ-2/30) ఏ ప్రాణికైనను, ఏ విధముగను, ఏ మాత్రమును, ఎట్టి కష్టమును కల్గింపకుండుట - (అహింస), మేలు గూర్చు భావముతో, కపటములేకుండ, ప్రియవచనములతో, యథార్థభాషణము - (సత్యము), ఏప్రకారముగనైనను ఎవరి సొత్తును లేక అధికారమును అపహరింపకుండుట మఱియు దోచుకొనకుండుట - (అస్తేయము), మానసికముగా గాని, వాచికముగాగాని, శారీరికముగా గాని, సర్వావస్థల యందును సదా సర్వదా (అన్ని విధములుగను) మైథునములను (మిథునక్రియలను) పరిహరించుట (ఆచరింపకుండుట) (బ్రహ్మచర్యము), శరీర నిర్వహణకు మాత్రమే తప్ప ఏ ఇతర భోగ్య వస్తువులను గూడ సమకూర్చుకొనకుండుట - (అపరిగ్రహము), ఈ ఐదింటిని యమము అనియందురు.

"శౌచ, సంతోష, తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః" (యోగ 2/32). అన్ని విధములుగ బాహ్యాభ్యంతర పవిత్రత (శౌచము), ప్రియాప్రియములు, సుఖ దుఃఖములు మొదలగునవి ప్రాప్తించినపుడు సదా సర్వదా సంతుష్టుడై యుండుట (సంతోషము), ఏకాదశి మొదలగు వ్రతములు, ఉపవాసములు ఆచరించుట - (తపస్సు), లోకహితమును గూర్చు శాస్త్రముల అధ్యయనము మఱియు దైవనామ గుణ సంకీర్తనము - (స్వాధ్యాయము), భగవంతునకు సర్వస్వమును అర్పించి, భగవదాదేశములను పాటించుట - (ఈశ్వర ప్రణిధానము) - ఈ ఐదింటిని - నియమము అందురు.

"స్థిరసుఖమాసనమ్" (యోగ 2/46). స్థిరముగా సుఖముగా (హాయిగా) కూర్చుండుట ఆసనము. ఆసనములు అనేక విధములు. వానిలో ఆత్మ సంయమము కోరువారికి 1. సిద్ధాసనము 2. పద్మాసనము 3. స్వస్తికాసనము అను మూడును ఉపయోగకరములని భావింపబడినవి. వీనిలో ఏ ఆసనమునైనను - వెన్నెముకను, తలను, మెడను నిటారుగా ఉంచవలెను. దృష్టిని నాసికాగ్రముపైగాని, భ్రుకుటి మధ్యభాగముపై గాని నిలుపవలెను. అలసిపోయినప్పుడు కనులు మూసికొనియు కూర్చొనవచ్చును. సుఖముగా ఎక్కువ సమయము కూర్చొనుటకు వీలైన ఆసనమే ఉత్తమమైనది.

"తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః" (యోగ 2/49) ఆసనమున స్థిరముగా నుండి ఉచ్ఛ్వాస నిశ్వాసగతులను క్రమబద్ధ మొనర్చుట ప్రాణాయామము. బయటి గాలిని లోపలికి పీల్చుట ఉచ్ఛ్వాసము. లోని గాలిని బయటకు వదలుట నిశ్వాసము. ఈ రెండింటిని క్రమబద్ధ మొనర్చుట ప్రాణాయామము.

"బాహ్యాభ్యంతరస్తంభవృత్తిర్దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘసూక్ష్మః" (యోగ 2/50)

దేశకాలమాత్రా సంఖ్యలను బట్టి బాహ్య, అభ్యంతర, స్తంభ వృత్తి అను మూడు విధములైన ప్రాణాయామములు దీర్ఘముగను, సూక్ష్మముగను ఉండును.

లోపలి శ్వాసను బయటికి వదిలి బయటనే నిలుపుటను

బాహ్యకుంభకమందురు. ఎనిమిది (8) ప్రణవ మాత్రల కాలము రేచక మొనర్చి (బయటికి వదలి) పదునాఱు మాత్రల (16) కాలము బాహ్యకుంభకమొనర్చి (నిలిపి) నాలుగు (4) మాత్రల కాలము పూరకము (లోనికి పీల్చుట) చేయవలెను. ఈ విధముగ రేచక పూరకములతో బాహ్య కుంభకము చేయుటను బాహ్యవృత్తి ప్రాణాయామము అందురు.

బయటి నుండి శ్వాసను లోనికి పీల్చి, లోపలనే నిలుపుటను ఆభ్యంతర కుంభమని యందురు. నాలుగు (4) మాత్రల కాలము పూరకమొనర్చి, (16) మాత్రల కాలము ఆభ్యంతర కుంభక మొనర్చి పిదప (8) మాత్రల కాలము రేచక మొనర్పవలెను. ఈ విధముగ పూరక రేచకములతో కుంభక మొనర్చుటను ఆభ్యంతర వృత్తి ప్రాణాయామము అందురు.

బయటగాని, లోపలగాని సులభముగా శ్వాసను నిలుపుటను స్తంభవృత్తి ప్రాణాయామము అందురు. నాలుగు ప్రణవ మాత్రల కాలము పూరకమును, 8 ప్రణవ మాత్రల కాలము రేచకమును చేయవలెను. ఈ విధముగ పూరకము రేచకము చేయుచు సుఖముగా శ్వాసను నిలుపుటను స్తంభవృత్తి ప్రాణాయామము అనియందురు.

ఈ విషయములో ఇంకను అనేక భేదములున్నవి. పూరక, కుంభక, రేచకములను సమానమాత్రల కాలమున నడిపియు ప్రాణాయామము చేయవచ్చును.

నాభి, హృదయము, కంఠము మఱియు ముక్కులోపలి భాగము వఱకు ప్రాణవాయువునకు ఆభ్యంతరస్థానము అందురు. నాసాపుటమునకు బయట 16 అంగుళముల వఱకు బాహ్యస్థానము అందురు. పూరక ప్రాణాయామము చేయు సమయమున నాభి వఱకు శ్వాసను చేర్చు సాధకుడు దానిని 16 అంగుళముల వఱకు బయటికి వదలవలెను. హృదయమువఱకు శ్వాసను చేర్చునతడు 12 అంగుళముల వఱకును, కంఠము వఱకు చేర్చువాడు 8 అంగుళముల వఱకును, నాసికాగ్రము వఱకు చేర్చువాడు 4 అంగుళముల వఱకును శ్వాసను బయటికి వదలవలెను.

ప్రాణాయామమున సమయముయొక్క ఎక్కువ తక్కువలను (హెచ్చు తగ్గులను) బట్టి దానిని దీర్ఘము అనియు, సూక్ష్మము అనియు వ్యవహరింతురు.

ప్రాణాయామము నందు సంఖ్యా - కాలములకు పరస్పర (అవినాభావ) ఘనిష్ఠ సంబంధముండుట వలన దాని విషయమున నియమోల్లంఘనము జరుపరాదు.

నాలుగు (4) ప్రణవమాత్రల పూరక సమయము ఒక సెకను అయినచో 16 ప్రణవ మాత్రల కుంభకకాలము 4 సెకన్లు మఱియు 8 ప్రణవమాత్రల రేచక కాలము 2 సెకన్లు అయి ఉండవలెను. ప్రణవమంత్రమును గణించుటను సంఖ్య లేక మాత్ర అనియు, దానికి పట్టు సమయమును కాలము అనియు వ్యవహరింతురు. దీనిని సుఖముగా చేయగలిగినచో సాధకుడు పైన తెలిపిన కాలమును, మాత్రలను, రెండింతలు, మూడింతలు, నాల్గింతలు లేక సాధ్యమైనన్ని రెట్లు యథాశక్తి పెంచవచ్చును. కాలము యొక్క మఱియు మాత్రల యొక్క హెచ్చు తగ్గులను బట్టియు ప్రాణాయామము దీర్ఘమనియు, సూక్ష్మమనియు వ్యవహరింపబడును.

"బాహ్యాభ్యంతర విషయాక్షేపీ చతుర్థః" (యోగ 2/51)

ఇంద్రియములకు బాహ్య విషయములైన శబ్దస్పర్శ రూపరస గంధములను, అంతఃకరణ విషయములైన సంకల్ప వికల్పాదులను త్యజించి - ఉపేక్షించి అనగా విషయ చింతనలు చేయనిచో ప్రాణగమనము సహజముగ నిలిచిపోవును. దీనిని చతుర్థ ప్రాణాయామము అనియందురు.

పూర్వ సూత్రమున తెలుపబడిన ప్రాణాయామముల యందు ప్రాణముల నిరోధము ద్వారా మనస్సు యొక్క సంయమము గలదు. ఇచట మనస్సు ఇంద్రియముల సంయమము ద్వారా ప్రాణముల సంయమము గలదు. ఇచట ప్రాణములను (శ్వాసను) నిలుపుటకు స్థాననిర్దేశము లేదు. ఎచట నైనను నిలుపవచ్చును. అట్లే కాల-సంఖ్యల నియమము లేదు.

"స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః" (యోగ 2/54)

ఇంద్రియములు తమతమ విషయముల నుండి దూరమై నాటితో సంయోగరహితములై యున్నప్పుడు అవి చిత్తస్థితిలో నుండుట ప్రత్యాహారము అనబడును. "దేశబంధశ్చిత్తస్య ధారణా" (యోగ 3/1) చిత్తమును ఒక్క ధ్యేయమునందే స్థిరముగా నిల్పుటను 'ధారణ' అనియందురు. అనగా స్థూల

సూక్ష్మములలో గాని బాహ్యాభ్యంతరములలో గాని ఏదో ఒక ధ్యేయస్థానము నందు చిత్తమును కట్టివేయుట లేక స్థిరముగా నుంచుటను ధారణ యనియందురు. ఇది పరమేశ్వర విషయము అనగా ధ్యేయము పరమేశ్వరుడే. కావున ధారణ, ధ్యాన, సమాధులు పరమేశ్వరుని యందే చేయవలెను. "తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్" (యోగ 3/2)

పూర్వోక్తధ్యేయమునందు (పరమేశ్వరుని యందు) చిత్త వృత్తులన్నింటిని ఏకీకృత మొనర్చుటను ధ్యానము అందురు. అనగా గంగాప్రవాహమువలె లేక తైలధారవలె అవిచ్ఛిన్న రూపమున చిత్తవృత్తులను ధ్యేయవస్తువునందు లగ్నము చేయుటను ధ్యానము అని యందురు.

"తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః" (యోగ 3/3) ధ్యానమే పరాకాష్ఠస్థితికి చేరి, స్వస్వరూప స్ఫురణ కోల్పోయి కేవలము ధ్యేయవస్తు స్వరూపమే భాసించుచుండుట సమాధియని యన బడును. ధ్యానము చేయగా చేయగా యోగి చిత్తము ధ్యేయ స్వరూపమును పొందినప్పుడు, స్వయముగా ధ్యేయమునందు తన్మయుడైనప్పుడు, తాను ధ్యేయము కంటెను వేఱు కాదు అను అనుభూతి పొడుకొని (స్థిరపడి)నప్పుడు - అట్టిస్థితిని సమాధి యందురు.

ధ్యానమునందు ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను త్రిపుటి యుండును. సమాధియందు కేవలము అర్థమాత్ర వస్తువు అనగా ధ్యేయము మాత్రమే యుండును. ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను మూడును ఏకత్వమును పొందును.

ప్రశ్న - 27వ శ్లోకమునందు తెలుపబడిన ఆత్మ సంయమయోగ రూప యజ్ఞమునకును దీనికి గల తారతమ్యమేమి?

సమా - అచట ధారణా ధ్యాన సమాధి రూపమైన అంతరంగ సాధన ముఖ్యమైయున్నది. యమ నియమ - ఆసన ప్రాణాయామ ప్రత్యాహారములు ముఖ్యస్థానము వహించుటలేదు. ఇవియన్నియు అప్రయత్నముగనే సిద్ధించును. ఇచట యమ నియమాది సాధనములన్నియును క్రమముగ చేయుటను గూర్చి చెప్పుట జరిగినది.

ప్రశ్న - ఇచట 'యోగ' శబ్దమునకు కర్మయోగము, జ్ఞానయోగము అని గ్రహింపక, అష్టాంగయోగము అని యేల గ్రహింపవలెను?

సమా - భగవత్ప్రాప్తికి సాధనములగుట వలన యజ్ఞములన్నియు కర్మయోగ, జ్ఞానయోగములలోని భాగములే. కావున ఇచట 'యోగ' శబ్దమునకు కేవలము జ్ఞానయోగమని గాని, కర్మయోగమని కాని అర్థమును గ్రహింపవలసిన పనిలేదు.

ప్రశ్న - 'యతయః' అను పదమునకు సన్న్యాసులు అను అర్థమును చెప్పక ప్రయత్నశీలురైన పురుషులు అని చెప్పుటలో గల విశేషమేమి?

సమా - స్వాధ్యాయరూపజ్ఞానయజ్ఞమును వివిధ ఆశ్రమవాసులు అందఱును (చతురాశ్రమ వాసులును) అనుష్ఠింపవచ్చును. అందువలన ఇచట 'యతయః' అను పదమునకు ప్రయత్నశీలురు అను అర్థమును చెప్పుటయే సముచితము. సన్న్యాసాశ్రమస్థులకు గృహస్థులకువలె నిత్యనైమిత్తిక కర్మలును, జీవికావసరములగు కర్మలును కర్తవ్యములు కావు. అందువలన స్వాధ్యాయరూప జ్ఞానయజ్ఞము యొక్క అనుష్ఠానము సన్న్యాసులు (సన్న్యాసాశ్రమస్థులు) అధికముగ చేయగలరు. వారిలో గూడ ప్రయత్నశీలురైనవారే దీనిని బాగుగా చేయగలరు. కావున 'యతయః' అను పదమునకు ప్రయత్నశీలురు అను అర్థమే సరియైనది. అంతేగాక బ్రహ్మచర్యాశ్రమమునందు కూడ స్వాధ్యాయమునకు ప్రాముఖ్యము గలదు. స్వాధ్యాయరూప జ్ఞానయజ్ఞము చేయువారిని గూర్చియే 'యతయః' అను పదము ప్రయోగింపబడినది. అందువలననే దాని యర్థము సన్న్యాసులు అని చెప్పబడలేదు.

ప్రశ్న - 'సంశితవ్రతాః' అనగానేమి? ఈ పదమును 'యతయః' అను విశేష్యమునకు విశేషణముగా భావింపక శ్లోకము యొక్క పూర్వార్థములో ఉల్లేఖింపబడిన తపోయజ్ఞము చేయువారి కంటె వేఱు వ్రతములను ఆచరించు పురుషులుగా భావించుటలో దోషమేమి?

సమా - అహింస, సత్యము, అస్తేయము (దొంగతనము చేయకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము మొదలగు సదాచార నియమములను చక్కగా పాటించువారిని, రాగద్వేష - అభిమానాది దోషరహితులు అయిన వారిని 'సంశితవ్రతాః' అని వ్యవహరించెదము. 'సంశితవ్రతాః' అను పదములో 'యజ్ఞ' ప్రస్తావనలేదు. కావున దానికి ఒక ప్రత్యేక వ్రత యజ్ఞమును చేయువారు అని అర్థము 'యతయః' అను విశేష్యమునకు విశేషణముగా చెప్పుటయే యుక్తము.

ప్రశ్న - స్వాధ్యాయ జ్ఞానయజ్ఞము ఏ కర్మను సూచించును? మఱియు దానిని స్వాధ్యాయ యజ్ఞము అని యనక స్వాధ్యాయజ్ఞానయజ్ఞము అని యనుటలో గల విశేషమేమి?

సమా - భగవత్తత్త్వమును, ఆయన గుణ, ప్రభావ, గాథలను మఱియు ఆయన సాకార, నిరాకార, సగుణ, నిర్గుణ వర్ణనలను తెలుపు శాస్త్రములను అధ్యయనము చేయుట భగవంతుని స్తుతులను పఠించుట, ఆయన నామగుణముల సంకీర్తనము గానించుచు, వేద వేదాంగములను అధ్యయనము చేయుట మొదలగునవి స్వాధ్యాయ కర్మలలో చేరినవి. ఈ స్వాధ్యాయ కర్మలను అర్థజ్ఞాన సహితముగ మమత, ఆసక్తి, ఫలేచ్ఛా రహితముగ చేయుట వలన వీనిని స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞములుగ పేర్కొనుట జరిగినది. స్వాధ్యాయ రూప కర్మయు జ్ఞానయజ్ఞమే కావున గీతాధ్యయనమును గూడ జ్ఞానయజ్ఞమని భగవానుడు పేర్కొనెను. (గీత 18/70)

సంబంధము - ద్రవ్యయజ్ఞము మొదలగు చతుర్విధయజ్ఞములను సంక్షిప్తముగా వర్ణించి, రాబోవు రెండు శ్లోకములలో ప్రాణాయామరూప యజ్ఞములను వివరించి, పిదప అన్ని విధములగు యజ్ఞముల నాచరించు సాధకులను గూర్చి వర్ణించుచున్నాడు-

**అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే ।**
**ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ॥ 29 ॥**
**అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।**
**సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అపరే | = కొందఱుయోగులు | అపరే | = మఱికొందరు | ప్రాణేషు | = ప్రాణములయందు |
| అపానే | = అపానవాయువునందు | నియతాహారాః | = నియమిత ఆహారనిష్ఠితులై | జుహ్వతి | = హోమము చేయుదురు |
| ప్రాణమ్ | = ప్రాణవాయువును | | | ఏతే, యజ్ఞవిదః | = యజ్ఞవిదులైన ఈ సాధకులు |
| జుహ్వతి | = హోమము చేయుదురు | ప్రాణాయామ పరాయణాః | = ప్రాణాయామ పరాయణులైనవారు | | |
| తథా | = అట్లే మరికొందరు యోగులు | | | సర్వే, అపి | = అందఱును |
| ప్రాణే | = ప్రాణవాయువునందు | ప్రాణాపానగతీ | = ప్రాణాపానగమనములను | యజ్ఞక్షపిత-కల్మషాః | = యజ్ఞముల ద్వారాపాపములను రూపుమాపినవారు |
| అపానమ్ | = అపానవాయువును (హవనము చేయుదురు) | రుద్ధ్వా | = నిలిపి | | |
| | | ప్రాణాన్ | = ప్రాణములను | | |

కొందరు యోగులు అపానవాయువునందు ప్రాణవాయువును, మఱికొందరు ప్రాణవాయువునందు అపానవాయువును హవనము చేయుదురు. ఇంకను కొందఱు నియమితాహార నిష్ఠితులై, ప్రాణాయామ పరాయణులైనవారు ప్రాణాపానగమనములను నిలిపి, ప్రాణములను ప్రాణములయందే హవనము చేయుదురు. యజ్ఞవిదులైన ఈ సాధకులందఱును యజ్ఞముల ద్వారా పాపములను రూపుమాపుదురు. **(29-30)**

ప్రశ్న - ఇచ్చట 'జుహ్వతి' అను క్రియాపదము యొక్క ప్రత్యేకత ఏమి?

సమా - ప్రాణాయామ సాధనకు యజ్ఞ రూపము నిచ్చుటకై 'జుహ్వతి' అను క్రియ ప్రయోగింపబడినది. ప్రాణాయామ రూపసాధన కూడ యజ్ఞమే. మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను వీడి పరమాత్మ ప్రాప్తికై ప్రాణాయామ మొనర్చుటయు యజ్ఞార్థ కర్మయగుటచే మనుష్యులను అది కర్మబంధముల నుండి ముక్తులను గావించి, పరమాత్మ ప్రాప్తిని సిద్ధింపజేయును.

ప్రశ్న - అపానవాయువునందు ప్రాణవాయువును హవనము చేయుట యనగానేమి?

సమా - యోగవిషయము మిక్కిలి దుర్విజ్ఞేయము. గహనము. అనుభవజ్ఞులైన యోగులు మాత్రమే దీనిని పూర్తిగా విశదీకరింపగలరు. కనుక శాస్త్రదృష్టితో విశదపరచబడిన యుక్తరీతులే ఇచ్చట తెలుపబడినవి. శాస్త్రములందు ప్రాణాయామము యొక్క వివిధ భేదములు పద్ధతులు తెలుపబడినవి. వానిలో దేనిని లక్ష్యముగా గొని భగవానుడు తెలిపెనో, అది ఆయనకే ఎరుక. శాస్త్రముల ననుసరించి అపానవాయుస్థానము గుదము, ప్రాణవాయు స్థానము హృదయము. బయటి గాలి లోపలికి ప్రవేశించుటను శ్వాసక్రియ యందురు. దీనినే అపానగతి యనియు అందురు. ఏలనన అపానవాయు స్థానము క్రింద నుండును. బయటిగాలి లోనికి ప్రవేశించు సమయమున దాని గమనము శరీరమున క్రిందివైపునకు ఉండును. అట్లే లోపలి గాలి బయటికి వదలుటను నిశ్వాసమని యందురు. దీనిని ప్రాణగతి యందురు. ఏలనన ప్రాణవాయుస్థానము పైన ఉండును. లోపల నాసిక ద్వారా బయటికి వదలునపుడు దాని గతి శరీరమునందు ఊర్ధ్వరీతిలో నుండును.

పైన తెలుపబడిన ప్రాణాయామ రూపయజ్ఞమునందు అగ్నిస్థానీయము అపానవాయువు. హవిస్స్థానీయము ప్రాణవాయువు. పూరక ప్రాణాయామ మొనర్చుటయే అపానవాయువునందు ప్రాణవాయువును హవనమొనర్చుట. ఏలనన సాధకుడు పూరక ప్రాణాయామము చేయునపుడు బయటి గాలిని నాసిక ద్వారా శరీరములోనికి ప్రవేశపెట్టును. అప్పుడు బయటి గాలి హృదయమునందు గల ప్రాణవాయువుతో కలిసి, నాభి ద్వారా అపానమునందు విలీనమగును. ఈ సాధన రీతియందు మాటిమాటికి బయటి గాలినిలోనికి చేర్చి (పీల్చి) అచటనే నిలుపుట జరుగును. కావున దీనిని ఆభ్యంతర కుంభకము అందురు. దీనినే ప్రాణవాయువును అపానవాయువులో హవనము చేయుట అనియందురు.

ప్రశ్న - ప్రాణవాయువునందు అపానవాయువును హవనము చేయుట యనగానేమి?

సమా - మఱియొక ప్రాణాయామరూపమైన ఈ యజ్ఞమునందు ప్రాణవాయువు అగ్ని స్థానీయము. అపానవాయువు హవిస్స్థానీయము. రేచక ప్రాణాయామమునే ప్రాణవాయువునందు అపానవాయువును హవనము చేయుట అని యందురు. ఏలనన సాధకుడు రేచక ప్రాణాయామమును చేయునపుడు లోపలి గాలిని నాసిక ద్వారా శరీరము వెలుపలికి వదలి నిలుపును. అపుడు మొదట హృదయమునందలి ప్రాణవాయువు బయటికి వచ్చి నిల్చును. ఆ నిల్చిన ప్రాణవాయువులో అపానవాయువు వచ్చిచేరును. ఈ సాధన ప్రక్రియయందు లోపలిగాలి మాటిమాటికి బయటికి వదలి అచటనే నిలుపబడును. కావున దీనిని బాహ్యకుంభకమని యందురు. అపానవాయువును ప్రాణవాయువునందు హవనము చేయుటయనగా ఈ ప్రక్రియయే.

ప్రశ్న - 'నియతాహారాః' అనగానేమి?

సమా - యోగశాస్త్ర నియమానుసారము ప్రాణాయామమునకు అనుగుణమైన సాత్త్వికాహారము (భగవద్గీత 17/8) పరిమితముగా స్వీకరించువారు 'నియతాహారులు'. వారు అధికముగా భుజించుటగాని, కటికి ఉపవాసములు చేయుటగాని కూడదు. యోగాభ్యాసానుకూలమైన సాత్త్వికాహారమును స్వీకరించు వారికే యోగము సిద్ధించును. (గీత 6/17) అధికముగా భుజించువారికిని, పూర్తిగా భోజనము త్యజించిన వారికిని యోగము సిద్ధింపదు. (గీత 6/16)

ప్రశ్న - 'ప్రాణాయామపరాయణాః' అను విశేషణము యొక్క అర్థమేమి?

సమా - ప్రాణములను అదుపులో నుంచుకొనుటలో అనగా తరచుగా, ప్రాణములను క్రమబద్ధమొనర్చుట యందు తత్పరులైనవారు, అట్లు చేయుటయే పరమాత్మ ప్రాప్తికి ప్రధాన సాధనమని భావించువారు 'ప్రాణాయామ పరాయణులు'.

ప్రశ్న - 'నియతాహారాః, ప్రాణాయామ పరాయణాః' అను విశేషణములు మూడు విధములైన ప్రాణాయామ సాధకుల విషయమున ప్రస్తావింపక కేవలము ప్రాణములలో ప్రాణములను హవనము చేయువారివిషయముననే ప్రస్తావించుటలోని యాంతర్యమేమి? మిగిలిన రెండు మార్గముల సాధకులు నియతాహారులు, ప్రాణాయామ పరాయణులు కారా?

సమా - ప్రాణాయామరూపయజ్ఞము నాచరించు

యోగులందఱును నియతాహారులు, ప్రాణాయామ పరాయణులే. కావున ఈ రెండు విశేషణములు యోగులందఱికిని వర్తించుననుటలో ఎట్టి అభ్యంతరమునకును తావులేదు. కాని పై శ్లోకములలోని ఈ రెండు విశేషణములును మూడవ వర్గమునకు చెందిన సాధకులకే అనువుగా (దగ్గరగా) ఉన్నవి. కనుక ఈ విశేషణములు కేవలము కుంభక సాధకులకే వర్తించునని సమ్మతింపబడినది. కాని స్థూలముగా చూచినచో ఈ రెండు విశేషణములు ప్రాణములయందు అపానములను, అపానములయందు ప్రాణములను హవనము చేయు సాధకులకును వర్తించునని భావింపవచ్చును.

ప్రశ్న - 30వ శ్లోకములో ప్రాణశబ్దమునకు బహువచనమును ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి? ప్రాణాపానముల గతిని నిరోధించి ప్రాణములను ప్రాణములలో హవనము చేయుట యనగానేమి?

సమా - శరీరమునందు ప్రసరించు వాయువులు ఐదు విధములు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానవాయువులు. (వీనిని 'పంచప్రాణములు' అనియు వ్యవహరింతురు). హృదయము ప్రాణవాయు స్థానము. అపానవాయుస్థానము గుదము. నాభి సమానవాయుస్థానము. కంఠము ఉదానవాయు స్థానము. శరీరమంతయును వ్యానవాయు స్థానము - అని శాస్త్రములయందు పేర్కొనబడినది. ఈ యైదు వాయువులను పంచప్రాణములు అనియందురు. అందువలన ఈ ఐదు వాయువులను వశము నందుంచుకొని, వానిని నిరోధించు సాధనమునకు యజ్ఞరూపము నిచ్చుటకై ప్రాణశబ్దము బహువచనమున ప్రయుక్తమైనది. ఈ సాధనప్రక్రియలో అగ్ని లక్షణములు హవిస్సు లక్షణములు ప్రాణములయందు చెప్పబడినవి. ఇచ్చట ప్రాణాపాన గతులు నిరోధింపబడును. అనగా కేవలము పూరకముగాని, రేచకముగాని చేయబడవు. ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిలుపబడిన పిమ్మట ప్రాణాపానాది పంచవాయువులు తమతమ స్థానములలో స్తంభింప జేయబడును. ఈ ప్రక్రియనే ప్రాణాపాన గతులను నిరోధించి, ప్రాణములను ప్రాణములయందు హవనము చేయుటయని పేర్కొనుట జరిగినది. ఈ సాధనమునందు బయటిగాలిని లోనికి చేర్చి నిల్పుటగాని, లోని గాలిని బయటికి తెచ్చుటగాని జరుగదు. పంచవాయువులు తమ తమ స్థానములలో స్తంభింప జేయబడును. కావున దీనిని కేవలను 'కుంభకము' అని పేర్కొనిరి.

ప్రశ్న - పైన తెలుపబడిన మూడు విధములైన ప్రాణాయామరూప యజ్ఞములయందు జపము చేయుట అవసరమా? అవసరమగుచో ప్రణవము (ఓం)నే జపింపవలెనా? లేక మఱొక నామమును దేనినైనను జపింపవచ్చునా?

సమా - ప్రణవము (ఓం) సచ్చిదానంద ఘన పూర్ణబ్రహ్మపరమాత్మ వాచకము. (17/23) ఏ పవిత్రకార్యమును ప్రారంభించుచున్నను ముందుగా ప్రణవమును ఉచ్చరించుట కర్తవ్యముగా (సంప్రదాయ సిద్ధముగా) రూఢియైనది. (17/24) కావున ఈ ప్రకరణము నందు వర్ణింపబడిన అన్ని యజ్ఞములయందును భగవన్నామమును చేర్చవలెను. ప్రణవము యొక్క స్థానములో శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీశివ మొదలగు వానిలో ఏ నామమునైనను తమ భక్తి శ్రద్ధలకు అనుగుణముగ జపింపవచ్చును. ఏలనన పరబ్రహ్మ పరమాత్మ నామజపఫలము భక్తిశ్రద్ధలనుబట్టి లభించుచుండును. ఇచ్చట అన్ని సాధనప్రక్రియలకును యజ్ఞరూపము ఇయ్యబడినది. మంత్రజప రహితమైనచో అది తామస యజ్ఞమగును. (17/13) అందువలన మంత్రస్థానమున భగవన్నామ జపము అత్యంతావశ్యకము. ఈ ప్రాణాయామ రూపయజ్ఞమునందు ఒకటి, రెండు, మూడు మొదలగు సంఖ్యలను గాని లేక చిటికెలనుగాని ప్రయోగించుటవలన మంత్రలోపము కలుగును. అది సాత్త్విక యజ్ఞము కానేరదు. కావున ప్రాణాయామ రూపయజ్ఞమునందు నామజపము పరమావశ్యకము. దానితోపాటు ఇష్టదైవధ్యానము చేయుటకూడ ముఖ్యము.

ప్రశ్న - యజ్ఞవిదులైన ఈ సాధకులందఱును యజ్ఞములద్వారా పాపములను రూపుమాపుదురు. అని తెల్పుటలోని విశేషమేమి?

సమా - యజ్ఞార్థము కర్మలను అనుష్ఠించు వారి కర్మలన్నియును విలీనమగును అని 23వ శ్లోకములో తెలుపబడినది. ఆ విషయమే ఇచ్చట స్పష్టము చేయబడినది. 24వ శ్లోకమునుండి 30వ శ్లోకము వఱకు వివిధ యజ్ఞములను గూర్చియు, ఆయా యజ్ఞసాధకులను గూర్చియు, ఆ యజ్ఞముల ప్రక్రియలను గూర్చియు వివరింపబడినది. ఈ

యజ్ఞసాధకులు మమత, ఆసక్తి, ఫలేచ్ఛారహితులై యజ్ఞార్థమై తదనుగుణములగు యజ్ఞప్రక్రియలను అనుష్ఠించి, తద్ద్వారా పూర్వసంచిత కర్మసంస్కారరూప శుభాశుభ కర్మలను అన్నింటిని రూపుమాపుదురు. కనుక వారు యజ్ఞతత్త్వములను ఎఱిగినవారు. పైన పేర్కొనబడిన సాధనలలో ఎన్నింటినైనను, సకామ భావముతో ప్రాపంచిక సుఖములలో దేని కొఱకైనను చేయువారు ఏ కర్మలను చేయనివారి కంటె మంచివారే. కాని వారు యజ్ఞతత్త్వమును తెలిసికొని, యజ్ఞార్థము కర్మలు చేయువారు కారు. కావున వారు కర్మబంధములనుండి విముక్తులు కాజాలరు.

*సంబంధము - ఈ విధముగ వివిధ యజ్ఞములను ఆచరించు సాధకులను ప్రశంసించి, పిదప ఆ యజ్ఞములను చేయుటవలన కలుగు సత్ఫలములను, చేయకుండుటవలన కలుగు ప్రమాదములను తెలిపి, భగవానుడు ఆ యజ్ఞాచరణముల ఆవశ్యకమును ప్రతిపాదించుచున్నాడు-*

**యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥ 31 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కురుసత్తమ! | = కురుశ్రేష్ఠుడవైన ఓ అర్జునా! | సనాతనమ్ | = సనాతనుడైన | అయమ్,లోకః, న, అస్తి | = ఈ లోకమే సుఖప్రదము కాదు | | |
| యజ్ఞశిష్టామృత భుజః | = యజ్ఞపూత శేషమైన అమృతమును అనుభవించు యోగులు | బ్రహ్మ | = పరబ్రహ్మమును | అన్యః | = (ఇంక) పరలోక (విషయ)ము | | |
| | | యాంతి | = పొందుచున్నారు | కుతః | = ఎట్లు? (ఎక్కడిది?) | | |
| | | అయజ్ఞస్య | = యజ్ఞము చేయనివానికి | | | | |

**ఓ కురుసత్తమా! (అర్జునా!) యజ్ఞపూతశేషమైన అమృతమును అనుభవించు యోగులకు సనాతనుడును, పరబ్రహ్మమును అగు పరమాత్మయొక్క లాభము కలుగును. యజ్ఞము చేయనివారికి ఈమర్త్యలోకమే సుఖప్రదము కాదు. ఇంక పరలోక విషయము చెప్పనేల? (31)**

ప్రశ్న - యజ్ఞపూత శేషమైన అమృతమనగానేమి? దానిని అనుభవించుట యనగానేమి?

సమా - దేవతల కొఱకై నేయి మొదలగు పదార్థములను అగ్నిలో హోమము చేయుటను 'యజ్ఞము' అనియనుట లోక ప్రసిద్ధము. అందులో మిగిలిన హవిష్యాన్నమునే (హవిస్సునే) యజ్ఞశిష్టామృతము అనియందురు.

స్మృతికారులు పంచమహాయజ్ఞములను గూర్చి వర్ణించిరి. దేవతలకును, ఋషులకును, పితరులకును, మనుష్యులకును, అన్యప్రాణులకును యథాశక్తి విధి పూర్వకముగా అన్నభాగములను సమర్పింపగా మిగిలిన అన్నమును యజ్ఞశిష్టామృతముగా పేర్కొనిరి.

కాని ఇచట భగవంతుడు పరమాత్మ ప్రాప్తిజ్ఞానము, సంయమము, తపస్సు, యోగము, స్వాధ్యాయము, ప్రాణాయామము మున్నగు వివిధ రూపయజ్ఞములను వర్ణించెను. వాటితో అన్నమునకు సంబంధము లేదు. కనుక ఈ జ్ఞానాది యజ్ఞములను అనుష్ఠించుట వలన సాధకుల అంతఃకరణములు శుద్ధమై అందు లభించు ప్రసాదరూపమైన ప్రసన్నతయే యజ్ఞశిష్టామృతము. (2/64-65, 18/36-37) ఏలనన అమృతస్వరూపుడైన పరమాత్మునియొక్క ప్రాప్తికి అది హేతువుగదా! అట్టి విశుద్ధ భావమునుండి ఉత్పన్నమైన సుఖమునందు నిరంతరానందమును పొందుటయే. ఆ యమృతమును అనుభవించుట యగును.

ప్రశ్న - పరమాత్మప్రాప్తి సాధన రూపములైన పై యజ్ఞములను అనుష్ఠించువారికి సనాతన పరబ్రహ్మప్రాప్తి ఈ జన్మయందే కలుగునా? లేక జన్మాంతరమునందు కలుగునా?

సమా - అది వారి సాధనపై ఆధారపడియుండును. శ్రద్ధాలోపము లేకుండ సాధన చేయువారికి సనాతనపరబ్రహ్మ ప్రాప్తి ఈ జన్మయందే అతిశీఘ్రముగా కలుగును. సాధనయందు ఏ విధమైన లోపము ఏ కొంచెము జరిగినను,

ఆ లోపము సర్దుబాటు అయిన పిదపనే పరమాత్మప్రాప్తి కలుగును. కాని అంతకుముందు చేసిన సాధన ఏ మాత్రము వృథాకాదు. ఇట్టి సాధకులకు పరమాత్మప్రాప్తి తప్పక కల్గును. **(6/40)** ఈ విషయమే ఇందు స్పష్టము చేయబడినది.

ప్రశ్న - సనాతన బ్రహ్మప్రాప్తి యనగా సగుణ బ్రహ్మప్రాప్తియా? లేక నిర్గుణబ్రహ్మప్రాప్తియా?

సమా - సగుణబ్రహ్మయు, నిర్గుణబ్రహ్మయు వేర్వేఱుగాదు. సచ్చిదానందఘనపరమేశ్వరుడే సగుణ బ్రహ్మయు, నిర్గుణబ్రహ్మయు. తమతమ భావనలను, విశ్వాసములను అనుసరించి, సాధకుల దృష్టిలో మాత్రమే సగుణ నిర్గుణ భేదములు గలవు. వాస్తవముగ ఎట్టి భేదమును లేదు. సనాతన పరబ్రహ్మ ప్రాప్తియైన పిదప ఎట్టి భేదమును ఉండదు.

ప్రశ్న - అయజ్ఞస్య అను పదము ఎట్టివారిని సూచించును? అట్టివారికి ఈ లోకమే సుఖప్రదము కాదు. ఇక పరలోకము సుఖప్రదమెట్లగును? అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - పైన తెలుపబడిన యజ్ఞములయందు గాని, శాస్త్రములయందు వర్ణింపబడిన అనేకములైన సాధన రూపయజ్ఞముల యందుగాని ఏ ఒక్క దానిని ఏ విధముగను చేయక మానవజీవితముయొక్క కర్తవ్యమును పాటింపని పురుషుని ఇచ్చట ఈ 'అయజ్ఞస్య' అను పదము సూచించును.

పై యజ్ఞ ప్రక్రియలకు (మానవజన్మ కారణమున) అర్హులైనప్పటికిని వాటిని ఏ మాత్రము ఆచరింపని కారణమున ముక్తి లభింపదు. సరికదా! స్వర్గము కూడా లభింపదు. పైగా ముక్తిద్వారమైన ఈ మానవ జీవితమునందు ఎన్నడును శాంతియు లభింపదు.

పరమార్థ సాధనకు దూరమైన మానవుడు నిరంతరము వివిధ చింతాగ్నిజ్వాలలో మసియైపోక తప్పదు. మఱి నిజమైన సుఖప్రాప్తికి తావేలేని భోగయోనులలో జన్మించినప్పుడు శాంతి యెట్లు లభించును? మానవజన్మలో చేసిన శుభాశుభ (పుణ్య పాప) కర్మల ఫలములనే ఇతర జన్మలలో అనుభవింపవలసి యుండును. కావున ఈ మానవ జన్మయందు తన కర్తవ్యకర్మలను ఆచరింపనివాడు ఏ జన్మయందును నిజమైన సుఖమును పొందజాలడు.

ప్రశ్న - ఈ లోకమునందు శాస్త్ర విహితములైన ఉత్తమ కర్మలను చేయనివారును, శాస్త్ర నిషిద్ధములైన కర్మలను ఆచరించువారును, భార్యాపుత్రులను, ధనమును, కీర్తిప్రతిష్ఠలను మున్నగు లాభములను పొంది, సుఖములను అనుభవించుచుండుటను చూచుచునే యున్నాము గదా! అయినచో యజ్ఞకర్మలను చేయనివారికి ఈ లోకమున సుఖములే లభింపవు - అనుమాట చెల్లదు గదా?

సమా - వారికి భార్యాపుత్రాది లాభములును, తదితర సుఖములును కలుగుచున్న మాట వాస్తవమే. కాని అవి పురాకృత సుకృత ఫలములు మాత్రమే. అంతేగాని వారు ఈ జన్మలో చేసిన పాపకర్మలవలనగాని, పుణ్య (శుభ) కర్మలను చేయనందువలన గాని లభించిన సుఖములు ఎంతమాత్రము కావు. అంతేగాక వాస్తవముగా ఇవి సుఖములే గావు. పరమానంద స్వరూపుడైన పరమాత్మప్రాప్తికి ద్వారమైన మానవ శరీరము లభ్చినను యజ్ఞకర్మలను చేయని (సాధన రహితుడైన) మానవునకు అతని అవిద్య (అజ్ఞానము/ మూర్ఖత్వము) వలన సాత్త్విక సుఖము (నిజమైన సుఖము) లభించుట లేదు. పైగా వివిధములైన భోగవాసనల కారణముగ అతడు నిరంతరము చింతావ్యాకులితుడై శోకసముద్రమున కొట్టుమిట్టాడుచున్నాడు.

ప్రశ్న - పుత్రుడు మాతాపితరులను సేవించుట, భార్య పతి సేవలొనర్చుట, శిష్యుడు గురువునకు శుశ్రూషలు చేయుట, అట్లే తదితర శాస్త్రవిహిత శుభకర్మలను ఆచరించుట, యజ్ఞార్థ కర్మలలో చేరునవి యగునా? కాదా? వానిని చేయువారికి బ్రహ్మప్రాప్తి కలుగునా? కలుగదా?

సమా - ఉపర్యుక్తములైన పితృసేవాది కార్యములన్నియును స్వధర్మపాలనలో అంతర్గతములే. స్వధర్మపాలనరూపయజ్ఞ పరంపరను నిర్విఘ్నముగా కొనసాగించుటకై పరమేశ్వరుని ఆజ్ఞగా భావించి, నిస్స్వార్థ భావముతో చేయు యుద్ధము, కృషి (వ్యవసాయము) వాణిజ్యము, గోరక్షాది కర్మలు అన్నియును యజ్ఞములలోని భాగములే. ఈ కర్మల నొనర్చువారికి సనాతన బ్రహ్మప్రాప్తి కలుగును. తల్లిదండ్రులను, పతిని, గురుజనులను దైవముగా భావించి, వారికి సేవలు చేయుట తమ కర్తవ్యముగా నెంచి, వారికి సుఖములను గూర్చుటకై నిస్స్వార్థ భావముతో వారిని సేవించుట యజ్ఞార్థము కర్మలను చేయుటయే యగును. అందువలన ఈ సేవలను ఆచరించు మానవులకు

బ్రహ్మప్రాప్తి కలుగుననుటలో ఎట్టి సందేహమునకును తావులేదు.

ప్రశ్న - ఈ ప్రకరణమున తెలుపబడిన వేర్వేరు యజ్ఞప్రక్రియలు జ్ఞానయోగికి కర్తవ్యములా? లేక కర్మయోగికి కర్తవ్యములా?

సమా - ఈ ప్రకరణము నందలి 24వ శ్లోకములో తెలుపబడిన బ్రహ్మయజ్ఞమును 25వ శ్లోకము యొక్క ఉత్తరార్ధములో ప్రస్తావింపబడిన ఆత్మ-పరమాత్మల అభేద దర్శనరూప యజ్ఞమును జ్ఞానయోగియే అనుష్ఠింపగలడు. కర్మయోగి ఆచరింపజాలడు. ఏలనన వాటిలో సాధకుడు పరమాత్మకంటె వేఱుకాడు. ఇవి తప్ప మిగిలిన యజ్ఞములను జ్ఞానయోగియు, కర్మయోగియును ఆచరింపవచ్చును. ఈ విషయమున వారికి ఎట్టి ఆటంకములును ఉండవు.

*సంబంధము - కర్మబంధములను తొలగించి, ముక్తిని ప్రసాదించు కర్మతత్త్వమును తెలిపెదనని 16వ శ్లోకమున భగవానుడు ప్రతిజ్ఞ చేసియుండెను. తదనుసారముగ 18వ శ్లోకము నుండి ఇప్పటి వఱకును కర్మతత్త్వమును వర్ణించెను. ఈ రాబోవు శ్లోకములో దానిని ముగించుచున్నాడు-*

**ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।**
**కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏవమ్ | = ఇట్లు | వితతాః | = విశదపఱచబడినవి | | సుసంపన్నమగునని |
| బహువిధాః, | = బహువిధములైన | తాన్, సర్వాన్ | = వాటినన్నింటిని | విద్ధి | = తెలిసికొనుము |
| యజ్ఞాః | యజ్ఞములు | కర్మజాన్ | = మనోవాక్కాయ | ఏవమ్, జ్ఞాత్వా | = ఇట్లు తెలిసికొని |
| బ్రహ్మణః, ముఖే | = వేదము(ల) ద్వారా | | కర్మల ద్వారా | విమోక్ష్యసే | = విముక్తుడవయ్యెదవు |

**ఈ ప్రకారముగనే ఇంకను బహువిధములైన యజ్ఞములు వేదములలో విస్తృతముగా వివరింపబడినవి. ఈ యజ్ఞములనన్నింటిని త్రికరణశుద్ధిగా (మనో వాక్కాయములచే) ఆచరించినప్పుడే అవి సుసంపన్నములగునని తెలిసికొనుము. ఇట్లు ఈ కర్మతత్త్వమును తెలిసికొని, అనుష్ఠించుటవలన నీవు ప్రాపంచిక(కర్మ) బంధములనుండి సర్వథా విముక్తుడవయ్యెదవు. (32)**

ప్రశ్న - ఈ ప్రకారము ఇంకను అనేక విధములగు యజ్ఞములు వేదములలో విస్తృతముగా చెప్పబడినవి. అనగానేమి?

సమా - భగవత్ప్రాప్తి సాధనములుగా తెల్పబడిన యజ్ఞములలో ఇవియేగాక ఇంకను అనేకములైన ప్రతీకాత్మక-ఉపాసనాది యజ్ఞములు వేదములలో తెలుపబడినవి. అభిమానము, మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను త్యజించి, వాటినన్నింటిని అనుష్ఠించు సాధకులందఱును యజ్ఞార్థమే కర్మలను ఆచరించువారగుదురు. అందువలన పైన వివరింపబడిన యజ్ఞములను ఆచరించువారివలె వీరును కర్మబంధములలో చిక్కుపడక సనాతన పరబ్రహ్మను పొందుదురు.

ప్రశ్న - 3వ అధ్యాయమునందలి 10వ శ్లోకమున ప్రజాపతియైన బ్రహ్మ, యజ్ఞ సహితముగ ప్రజలను సృష్టించెనని తెల్పబడినది. మఱియు 17వ అధ్యాయమునందలి 23వ శ్లోకమున పరమేశ్వరుని ద్వారా బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు సృష్టింపబడినట్లు పేర్కొనుట జరిగినది. కనుక ఇచ్చట బ్రహ్మశబ్దమునకు బ్రహ్మ, లేక పరమేశ్వరుడు - అను అర్థమును చెప్పి, యజ్ఞములన్నియును వేదములలో వివరింపబడినవని చెప్పుటకు మాఱుగా బ్రహ్మ, లేక పరమేశ్వరుని ముఖమునుండి విస్తృతముగా చెప్పబడినవని భావింపవచ్చును గదా?

సమా - ప్రజాపతియైన బ్రహ్మను పరమేశ్వరుడే సృష్టించెను. ఆ బ్రహ్మ వేదములను, బ్రాహ్మణులను, యజ్ఞాదికములను సృష్టించెను. కావున ఈ వేదాదుల సృష్టిని

బ్రహ్మసృష్టియన్నను పరమేశ్వరసృష్టియన్నను ఒకటియే. వివిధములైన యజ్ఞముల విస్తృతవివరణము వేదములలో గలదు. వేదములను ప్రకటించినవాడు బ్రహ్మ. బ్రహ్మను సృష్టించినవాడు పరమేశ్వరుడు. కనుక ఈ యజ్ఞముల ఏర్పాటు వేదములవలన జరిగినదన్నను, ప్రజాపతి బ్రహ్మనుండి లేక పరమేశ్వరునివలన జరిగినదన్నను ఒకటియే. మఱొక్కమాట. యజ్ఞములు వేదముల నుండియే ఉత్పన్నములైనట్లు 3వ అధ్యాయమున పేర్కొనబడినది (3/15). వాటి విస్తృతవర్ణనముగూడ వేదములయందు ఉన్నది. కావున బ్రహ్మ శబ్దమునకు ఇచట వేదములు అని అర్థము చెప్పుటయే సమంజసమని తోచుచున్నది.

ప్రశ్న - ఆ యజ్ఞముల నన్నింటిని మనోవాక్కాయములచే అనుష్ఠించినప్పుడే అవి సుసంపన్నములగునని తెలిసికొనుము- అను ఈ వాక్యములోని విశేషమేమి?

సమా - ఈ వాక్యము ద్వారా కర్మలకు సంబంధించిన మూడు విషయములను గ్రహింపవలసియున్నదని భగవానుడు తెలుపుచున్నాడు.

1. ఇంతవరకును తెల్పబడిన సాధనరూప యజ్ఞములే గాక అనేక యజ్ఞములు వేదశాస్త్రముల యందు వర్ణింపబడినవి. అవి యన్నియును మనస్సు, ఇంద్రియములు, శరీరము అనువాటి క్రియలద్వారా ఆచరింపబడవలసినవే. వానిలో కొన్ని కేవలము మనస్సునకు మాత్రమే సంబంధించినవి. కొన్ని మనస్సు, ఇంద్రియములకు సంబంధించినవి. కొన్ని మనస్సు, ఇంద్రియములు, శరీరములకు సంబంధించినవి. ఈ మూడింటిలో ఏ ఒక్కదానికైనను సంబంధింపని యజ్ఞము ఏదియు లేదు. ఈ యజ్ఞముల సాధనయందు శరీరేంద్రియ, ప్రాణముల క్రియా ఫలములను, మనోవ్యాపారములైన సంకల్ప వికల్పాది క్రియాఫలములను త్యాగము చేయుటయు కర్మయేయని సాధకుడు తెలిసికొనవలెను. ఈ క్రియల నన్నింటినిగూడ మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను వీడి ఆచరింపవలెను. లేనిచో అవి బంధహేతువులే యగును.

2. యజ్ఞనామకములైన శాస్త్రవిహిత కర్తవ్య కర్మలు, పరమాత్మ ప్రాప్తికై ఆచరింపబడు వేర్వేఱు సాధనలు, ప్రకృతిజన్యములైన మనస్సు, ఇంద్రియములు, శరీరముల క్రియల ద్వారా కార్యరూపము దాల్చును. ఆత్మకును వాటికిని ఎట్టి సంబంధము ఉండదు. కాని జ్ఞానయోగి ఏ కర్మయందును, సాధన యందును కర్తృత్వాభిమానమును కలిగియుండరాదు.

3. మనస్సు, ఇంద్రియములు, శరీరముల యొక్క క్రియారూపకర్మలు చేయకుండ ఏ సాధకునకును కర్మబంధముల నుండి విముక్తి, మఱియు పరమాత్మప్రాప్తి కలుగవు. (3/4) కర్మబంధముల విముక్తికై తెల్పబడిన ఉపాయములన్నియును మనస్సు, ఇంద్రియములు, శరీరక్రియల ద్వారా జరుగును. కావున కర్మబంధముల నుండి విముక్తిని, పరమాత్మ ప్రాప్తిని కోరు జనులందరును అభిమానము, మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను వదలి, పై సాధనలలో ఏదో ఒకదానియందు అవశ్యము తత్పరులై యుండవలెను.

ప్రశ్న - ఈ తత్త్వమును తెలిసికొని, నీవు కర్మబంధముల నుండి సర్వథా ముక్తుడవయ్యెదవు - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - 18వ శ్లోకమునుండి ఇంతవఱకును భగవంతునిచే వివరింపబడిన కర్మల తత్త్వమును చక్కగా తెలిసికొని వాటిననుసరించి యజ్ఞముల నాచరించువాడు కర్మబంధముల నుండి ముక్తుడగును. ఏలనన ఈ తత్త్వమును గ్రహించి కర్మల నాచరించు పురుషుని కర్మలు బంధహేతువులు కావు. పైగా పూర్వసంచితకర్మలను నశింపజేసి ముక్తిదాయకములగును.

*సంబంధము - ఈ ప్రకరణమునందు భగవానుడు అనేక యజ్ఞములను గూర్చి వివరించెను. ఇంకను వేదశాస్త్రములయందు వివిధ యజ్ఞములను గూర్చి చెప్పబడినట్లును తెలిపెను. అయినచో ఈ యజ్ఞములన్నింటిలో ఏది శ్రేష్ఠమైనది? అను జిజ్ఞాస కలుగును. ఈ విషయమును గూర్చి భగవంతుడు తెలుపుచున్నాడు-*

**శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।**
**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33 ॥**

పరంతప! పార్థ! = ఓ పరంతపా! ఓ పార్థా!
ద్రవ్యమయాత్ = ద్రవ్యములతో ఆచరింపబడు
యజ్ఞాత్ = యజ్ఞము కంటెను
జ్ఞానయజ్ఞః, = జ్ఞానయజ్ఞము
శ్రేయాన్ = మిక్కిలి శ్రేష్ఠమైనది
అఖిలమ్, సర్వమ్, కర్మ = కర్మలన్నియును
జ్ఞానే = జ్ఞానమునందు
పరిసమాప్యతే = పరిసమాప్తమగును

**ఓ పరంతపా! అర్జునా! ద్రవ్యమయయజ్ఞముకంటెను జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. కర్మలన్నియును జ్ఞానమునందే పరిసమాప్తమగును. (33)**

ప్రశ్న - ద్రవ్యమయయజ్ఞమనగానేమి? జ్ఞానయజ్ఞమనగానేమి? ద్రవ్యమయయజ్ఞము కంటెను జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమనుటలో గల విశేషమేమి?

సమా - ద్రవ్యముల (భౌతిక వస్తువుల) వినియోగము గల యజ్ఞమును ద్రవ్యయజ్ఞము అని యందురు. నేయి, చక్కెర, పాలు, పెఱుగు, నువ్వులు, బియ్యము, పండ్లు, చందనము, కర్పూరము, ధూపము, సుగంధయుక్తములైన ఓషధులు మొదలగు హవిస్సులను విధ్యుక్తముగా అగ్నియందు హోమము చేయుట, దానధర్మములు చేయుట, లోకోపకారము కొఱకు బావులు, చెఱువులు త్రవ్వించుట, ధర్మశాలలు (సత్రములు) మొదలగు వానిని కట్టించుట, వైశ్వదేవములను చేయుట మొదలగు (భౌతికపదార్థముల ప్రమేయముగల) శాస్త్ర విహిత (శుభ) పవిత్ర కర్మలన్నియును ద్రవ్యమయయజ్ఞములే. ఉపర్యుక్త సాధనలయందు వీటి వర్ణనము దైవయజ్ఞము విషయహవన రూప యజ్ఞము, ద్రవ్యయజ్ఞము అను పేర్లతో చేయబడినది.

ఇందుకు భిన్నముగా సదసద్వివేక చర్చలు, ఆధ్యాత్మిక విషయగోష్ఠులు, ప్రవచన శ్రవణాదులు మొదలగు జ్ఞానసంబంధముగల కర్మలన్నియును జ్ఞాన యజ్ఞములలో అంతర్భాగములు. ఏ సాధకుడైనను తన అర్హత ననుసరించి, శాస్త్రవిహితమైన అగ్నిహోత్రాది హవన కర్మలను, బ్రాహ్మణ భోజన దానాది పవిత్ర కర్మలను అనుష్ఠింపక కేవలము ఆత్మ సంయమము, శాస్త్రాధ్యయనము, తత్త్వవిచారము, యోగసాధనాది వివేక విజ్ఞాన సంబంధమైన జ్ఞానయజ్ఞ కర్మలలో ఏ ఒక్కదానిని అనుష్ఠించినను అతడు ద్రవ్యమయ యజ్ఞకర్మలను త్యజించినవాడు కాడు. పైగా అతడు వాటికంటెను శ్రేష్ఠమైన యజ్ఞము చేసినవాడే యని భావింపవలెను. ఏలనన ద్రవ్యమయయజ్ఞములను గూడ మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను త్యజించి, జ్ఞానయుక్తముగ చేసినప్పుడే అవి ముక్తిహేతువులగును. లేనిచో బంధహేతువులే యగును. జ్ఞానయజ్ఞకర్మలయందు నిరతులైనవారు భౌతికముగా గూడ విషయములను (ఇంద్రియార్థములను) త్యజించినవారే యగుదురు. వారి కార్యములయందు హింసాదిదోషములు ఏ మాత్రమును ఉండవు. అందువలన వారు ఉత్తములు. యథార్థ జ్ఞానము (తత్త్వజ్ఞానము) యొక్క ప్రాప్తియందు భావమే ప్రధానము, ప్రాపంచిక వస్తు బాహుళ్యము కాదు. కనుక ద్రవ్యమయయజ్ఞము కంటెను జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమైనది.

ప్రశ్న - ఇచట 'అఖిలమ్, సర్వమ్' అను విశేషణములతో గూడిన 'కర్మ'యను పదము దేనిని సూచించును? కర్మలన్నియును జ్ఞానమునందు సమాప్తమగును. దీనియర్థమేమి?

సమా - ఈ ప్రకరణమునందు తెల్పబడిన సాధనరూప యజ్ఞకర్మలను, వేదశాస్త్రోక్తములైన పవిత్రయజ్ఞములను అన్నింటిని ఈ 'అఖిలమ్, సర్వమ్' అను విశేషణములతో కూడిన 'కర్మ' పదము సూచించును. సమస్త సాధనల యొక్క ఉన్నతోన్నత ఫలము పరమాత్మయొక్క యథార్థ జ్ఞానమును కలిగించుటయే. అట్టి యథార్థజ్ఞానముద్వారా పరమాత్మప్రాప్తి కలుగును. అట్టివానికి (పరమాత్మ ప్రాప్తి కల్గినవానికి) ఇక పొందవలసినదేమియు మిగిలియుండదు.

ప్రశ్న - ఈ శ్లోకము నందలి జ్ఞానము, జ్ఞానయజ్ఞము అను రెండు పదముల అర్థము ఒకటియేనా? వేర్వేఱా?

సమా - ఆ రెండింటి యొక్క అర్థము ఒకటికాదు. యథార్థ జ్ఞానప్రాప్తికై ఆచరింపబడు వివేకవిచారయుక్తమైన సంయమప్రధానమైన సాధనలను జ్ఞానయజ్ఞము అను పదము తెలుపును. జ్ఞానమనగా సమస్తసాధన కర్మఫలస్వరూపమైన పరమాత్మయొక్క యథార్థ తత్త్వజ్ఞానము. జ్ఞానయజ్ఞము సాధన సూచకము. జ్ఞానము సాధ్య(లక్ష్య) సూచకము. ఈ రెండింటికిని గల భేదమిదియే.

సంబంధము - ఈ విధముగ జ్ఞానయజ్ఞమును, దాని ఫలస్వరూపమైన జ్ఞానమును ప్రశంసించి, భగవానుడు రెండు శ్లోకములలో జ్ఞానమును పొందుమని అర్జునుని ఆజ్ఞాపించుచు, దానిని పొందు మార్గమును, పొందుట వలన కలుగు ఫలమును తెలుపుచున్నాడు-

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 34 ॥**

తత్త్వదర్శినః = పరమాత్మతత్త్వమును ఎఱింగిన
జ్ఞానినః = జ్ఞానులు
జ్ఞానమ్ = తత్త్వజ్ఞానమును
తే = నీకు
ఉపదేక్ష్యంతి = ఉపదేశించెదరు
ప్రణిపాతేన = (వారికి) దండ ప్రణామములను ఆచరించుటద్వారా
సేవయా = సేవలొనర్చుటద్వారా
పరిప్రశ్నేన = వినయముతో ప్రశ్నించుటవలన
తత్ = ఆ తత్త్వజ్ఞానమును
విద్ధి = (నీవు) తెలిసికొనుము

నీవు తత్త్వమును దర్శించిన జ్ఞానుల కడకేగి, ఆ జ్ఞానమును గ్రహింపుము. వారికి దండప్రణామములాచరించుటవలనను, సేవలొనర్చుటవలనను, కపటము లేకుండ భక్తిశ్రద్ధలతో సముచితరీతిలో ప్రశ్నించుట వలనను పరమాత్మతత్త్వమును చక్కగానెఱింగిన జ్ఞానులు సంప్రీతులై, నీకు ఆ పరమాత్మతత్త్వజ్ఞానమును ఉపదేశించెదరు. **(34)**

ప్రశ్న - ఇచట 'తత్' అను పదము దేనిని సూచించును?

సమా - పూర్వ శ్లోకమునందు ప్రశంసింపబడిన, సమస్త సాధనల ఫలరూపమైన పరమాత్మ స్వరూపము యొక్క యథార్థ జ్ఞానమునే ఈ 'తత్' అను శబ్దము సూచించును.

ప్రశ్న - ఆ జ్ఞానమును తెలిసికొనుము అని చెప్పుటలో గల విశేషమేమి?

సమా - పరమాత్ముని యథార్థతత్త్వమును ఎఱుంగనిదే మనుష్యుడు జననమరణరూప కర్మబంధముల నుండి విముక్తుడు కాజాలడు. కనుక అట్టి జ్ఞానమును ఎఱుంగుట పరమావశ్యకము.

ప్రశ్న - తత్త్వమును దర్శించిన జ్ఞానుల నుండి ఆ జ్ఞానమును గ్రహింపుమని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవానుడు మాటిమాటికి పరమాత్మ తత్త్వవిషయమును తెల్పినప్పటికిని అర్జునుడు దానిని పూర్తిగా గ్రహింప లేకుండుటలో అతని శ్రద్ధయందలి అసమగ్రత కొంత గోచరించుచున్నది. కావున అతని శ్రద్ధకు సమగ్రతను గూర్చుటకు తత్త్వమును దర్శించిన జ్ఞానుల నుండి భగవత్తత్త్వమును తెలిసికొనుమని అతనిని సావధానునిగా చేసెను.

ప్రశ్న - 'ప్రణిపాతము' అనగానేమి?

సమా - భక్తిశ్రద్ధలతో సాదరముగా దండప్రణామమును ఆచరించుటను ప్రణిపాతము అనియందురు.

ప్రశ్న - సేవించుట యనగానేమి?

సమా - మహాత్ముల నాశ్రయించి, వారికడ భక్తిశ్రద్ధలతో మసలుకొనుట, వారి ఆజ్ఞలను పాలించుట, వారి మనోభావములను గ్రహించి, వివిధ రీతులలో వారికి ఆమోద ప్రమోదములను గూర్చుట మొదలగునవి అన్నియును సేవించుటలోని యంతర్భాగములే.

ప్రశ్న - 'పరిప్రశ్న' యనగానేమి?

సమా - పరమాత్మ తత్త్వమును తెలిసికొను కోరికతో భక్తిశ్రద్ధలతో ప్రశ్నించుటను పరిప్రశ్నయందురు. అనగా నేను ఎవరిని? మాయయనగానేమి? పరమాత్ముని స్వరూపము ఎట్టిది? నాకును పరమాత్మకును గల సంబంధమేమి? బంధమనగా నేమి?ముక్తి యనగానేమి? ఏ విధముగు సాధనల ద్వారా భగవత్ప్రాప్తి కలుగును? మొదలగు ఆధ్యాత్మిక విషయములను అన్నింటిని భక్తిశ్రద్ధలతో సాదరముగా ప్రశ్నించుటను పరిప్రశ్న అనియందురు. కుతర్కము, వితండవాదము 'పరిప్రశ్న' కానేరవు.

ప్రశ్న - దండప్రణామము చేయుట వలనను, సేవలొనర్చుట వలనను, సాదరముగా జిజ్ఞాసతో ప్రశ్నించుట వలనను తత్త్వజ్ఞులు నీకు జ్ఞానోపదేశము చేయుదురు - అని యనుటలోని అంతర్యమేమి? ఇవి యన్నియును చేయకున్నచో జ్ఞానులైనవారు జ్ఞానోపదేశము చేయరా?

సమా - భగవత్తత్త్వమును ఎఱుంగుటకు భక్తిశ్రద్ధలు, సరళసాదరభావములు మిక్కిలి అవసరము. భక్తిశ్రద్ధలు లేని మనుష్యుడు ఎట్టి సదుపదేశమును గ్రహింపజాలడు. మహాపురుషులు ఎవ్వరినుండియు ప్రణామములను, సేవలను, ఆదరసత్కారములను కోరుకొనరు. కాని దురభిమానముతో, గర్వముతో పరీక్షాబుద్ధితో, కపటభావముతో ప్రశ్నించువారికి తత్త్వజ్ఞాన విషయములను తెల్పుట వారి ప్రవృత్తియేగాదు. కావున తత్త్వజ్ఞానమును పొందగోరువాడు భక్తిశ్రద్ధలతో మహాపురుషులను ఆశ్రయింపవలెను. వారికి ఆత్మసమర్పణ చేసికొనవలెను. చక్కగా వారికి సేవలొనర్పవలెను. సమయోచితముగా పరమాత్మతత్త్వమునుగూర్చి, సముచితముగా వారిని ప్రశ్నింపవలెను. దూడను చూచిన గోమాతకు వాత్సల్యములతో పొదుగు పొంగి అది పాలను వర్షించినట్లు, బిడ్డను చూచిన జననికి స్తన్యము చిమ్మినట్లు, యోగ్యుడైన సాధకుడు దరిజేరి తన జిజ్ఞాసను ప్రకటించినప్పుడు అతనికి ఉపదేశించుటకై జ్ఞానియైన మహాపురుషుని యంతఃకరణము నందు జ్ఞానసముద్రము తరంగితమై పొంగి పొరలును.

ఈ సందర్భమున ముండకోపనిషద్వచనమును గమనింతము.

తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్‌! (ముండకోపనిషత్ - 1/2/12)

తత్త్వజ్ఞానజిజ్ఞాస గల సాధకుడు సమిత్పాణియై యథాశక్తి ఉపాయనములను (ఫల, పుష్పాదులను) గైకొని, నిరభిమానముతో వేదశాస్త్ర పారంగతుడైన తత్త్వజ్ఞానియగు మహాత్ముని ఆశ్రయింపవలెను.

ప్రశ్న - 'జ్ఞానినః' అను విశేష్యమునకు 'తత్త్వదర్శినః' అను విశేషణమును, దానికి బహువచనమును ప్రయోగించుటలో గల పరమార్థమేమి?

సమా - పరమాత్మ తత్త్వమును చక్కగా ఎఱింగిన వేదవేత్తయైన (వేదార్థ రహస్యజ్ఞుడైన) జ్ఞాని, మహాత్ముడు మాత్రమే ఆ తత్త్వజ్ఞానమును ఉపదేశింపగలడు. కేవలము శాస్త్రములను నేర్చినవాడు గాని, సాధారణ మానవుడుగాని ఉపదేశింపలేడు. మహాపురుషుడైన జ్ఞానియెడ గౌరవ సూచకముగా బహువచనము ఇచట ప్రయోగింపబడినది. **(పూజ్యార్థే బహువచనమ్ అని ఆర్యోక్తి)** అంతేగాని పెక్కుమంది జ్ఞానుల యొద్ద ఉపదేశమును పొందుమని కాదు.

## యద్ జ్ఞాత్వా న పునర్మోహమ్ ఏవం యాస్యసి పాండవ ।
## యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ 35 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాండవ! | = ఓ అర్జునా! | యేన | = ఎట్టి | | నీయాత్మయందును |
| యత్, జ్ఞాత్వా | = దేనిని తెలిసికొని | | జ్ఞానప్రభావముచేత | అథో | = పిమ్మట |
| పునః | = మఱల | భూతాని | = సమస్త భూతములను | మయి | = పరమాత్మనైన నాయందును |
| ఏవమ్, మోహమ్ | = ఇట్టి మోహమును | అశేషేణ | = నిశ్శేషముగా | ద్రక్ష్యసి | = చూడగలవో |
| న, యాస్యసి | = పొందవో | ఆత్మని | = (మొదట) | | (దానిని ఎఱుంగుము) |

**ఓ అర్జునా! ఈ తత్త్వజ్ఞానమునెఱింగినచో మఱల ఇట్టి వ్యామోహములో చిక్కుకొనవు. ఈ జ్ఞాన ప్రభావముతో సమస్తప్రాణులను నీలో సంపూర్ణముగా చూడగలవు. పిమ్మట సచ్చిదానంద ఘనపరమాత్ముడనైన నాలో చూడగలవు. (35)**

ప్రశ్న - ఇచట యత్ అను పదము దేనిని సూచించును. దానిని తెలిసికొనుట యనగానేమి? మఱల ఈ విధముగు మోహములో పడవు - అని అనుటలో గల అంతర్యమేమి?

సమా - ఈ యత్ అను పదము పూర్వశ్లోకమునందు వర్ణింపబడిన జ్ఞానులైన మహాపురుషుల ద్వారా ఉపదేశింపబడిన తత్త్వజ్ఞానమును సూచించును. ఆ

ఉపదేశానుసారము పరమాత్మ స్వరూపమును చక్కగా అనుభవపూర్వకముగా చూచుటయే దాని వెలుంగుట యగును. ఈ సమయమున అర్జునుడు మోహవశుడై, శోకమగ్నుడై యుండెను. (గీత 1/28 నుండి 47 వఱకు, 2/6,8) మహాపురుషుల ద్వారా ఉపదిష్టమైన జ్ఞానప్రభావమున పరమాత్మ స్వరూపమును అనుభవ పూర్వకముగ దర్శించిన పిమ్మట మఱల అట్టి మోహమునకు లోనుగాడు. రాత్రివేళ సర్వత్ర వ్యాపించిన అంధకారము సూర్యోదయమైనంతనే పటాపంచలై పోయినట్లు, పరమాత్మ స్వరూపము యొక్క యథార్థ జ్ఞానము కలిగినంతనే, నే నెవరు? జగత్తనగానేమి? మాయయనగానేమి? బ్రహ్మమనగానెవరు? మొదలగు ప్రశ్నలకు తావుండదు. ఫలితముగా శరీరమును ఆత్మగా భావించి, తత్సంబంధిత ప్రాణులయందు పదార్థములయందు మమకారమును కలిగియుండుట, శరీరము యొక్క ఉత్పత్తి వినాశములను ఆత్మయొక్క జనన మరణములుగా భావించి, వాటి సంయోగ వియోగముల యందు సుఖదుఃఖముల ననుభవించుట, అట్లే మఱి యే ఇతర కారణములవలన నైనను రాగద్వేషములకును హర్షశోకములకును లోనగుట మొదలగు మోహజనితములైన వికారములు ఏ మాత్రమును కలుగవు. లౌకిక సూర్యుడయితే ఉదయించును, అస్తమించును. అస్తమించిన పిమ్మట చీకట్లు క్రమ్ముకొనును. కాని జ్ఞానసూర్యుడు ఒకసారి ఉదయించిన పిమ్మట మఱల ఎప్పుడును అస్తమించడు. పరమాత్మజ్ఞానము శాశ్వతమైనది. స్థిరమైనది. ఎన్నటికిని నశింపనిది. ఇందువలన పరమాత్మ తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట మఱల మోహము జనింపనే జనింపదు. ఈ విషయమే శ్రుతియందు ఇట్లు చెప్పబడినది.

యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః ॥
(ఈశావాస్యోపనిషత్-7)

తత్త్వజ్ఞానియైన పురుషునకు సమస్త ప్రాణులు ఆత్మస్వరూపులుగనే గోచరించినపుడు అట్టి ఏకత్వదర్శికి శోకమోహము లెట్లు కలుగును? అనగా కలుగనే కలుగవు.

ప్రశ్న - ఇట్టి జ్ఞానప్రభావమున సమస్త ప్రాణులను ఆత్మయందే సంపూర్ణముగా చూచుట అనగానేమి?

సమా - మహాపురుషుల ద్వారా తత్త్వజ్ఞానోపదేశమును పొందిన మనుష్యుడు ఆత్మను సర్వవ్యాపిగను, అనంత స్వరూపిగను తెలిసికొని, సర్వప్రాణుల యెడ భేదబుద్ధిని వీడి సర్వత్ర ఆత్మ భావమునే కలిగి యుండును. (ఆత్మవత్ సర్వభూతాని)

స్వప్నానంతరము మేల్కొనినవాడు స్వప్నజగత్తును తన మనస్సున స్మృతిమాత్రముగా చూచును. వాస్తవముగ తనకంటె భిన్నమైన మఱొక దానిని దేనిని చూడడు. అదే విధముగ సమస్తజగత్తును తనకంటె అభిన్నముగ తనలో అంతర్గతముగ భావించుటను సమస్త ప్రాణులను తనలో సంపూర్ణముగ చూచుట యగును. (గీత 6/29) ఇట్టి ఆత్మజ్ఞానము కల్గినంతనే మనుజుని శోకమోహములు సర్వథా తొలగిపోవును.

ప్రశ్న - ఈ విధముగ ఆత్మదర్శనము జరిగిన పిమ్మట సర్వప్రాణులను సచ్చిదానంద ఘన పరమాత్మయందు చూచుట యనగానేమి?

సమా - ఆత్మదర్శనరూపస్థితియొక్క ఫలమే సమస్త ప్రాణులను సచ్చిదానంద ఘనపరమాత్మయందు చూచుటయగును. దీనినే పరమాత్మప్రాప్తి యనియు, నిర్వాణబ్రహ్మప్రాప్తి యనియు, పరమాత్మయందు ఐక్యమగుట అనియు అందురు. ఈ స్థితిని పొందిన పురుషునిలోని అహంభావము సర్వథా అంతర్ధానమగును. ఆ స్థితిలో యోగికి పరమాత్మకంటె వేఱైన ఉనికి ఉండదు. కేవలము సచ్చిదానంద ఘనబ్రహ్మ యొక్కడే యుండును. సమస్త ప్రాణులను పరమాత్మ యందు చూచుట యనునది శాస్త్రదృష్టితో చెప్పినదియే. వాస్తవముగ అతనికి ద్రష్టదృశ్యముల మధ్య భేదము ఉండదు. అపుడు చూచువాడెవడు? చూడబడునది ఏమి? ఆ స్థితి వాక్కులకు అందనిది. కనుక వాక్కుల ద్వారా దీనిని కేవలము స్థూలముగా (సంకేత పూర్వకముగా) చెప్పగలము. లోకవ్యవహారములో జ్ఞాని మనస్సు, బుద్ధి, శరీరములతో ఉండును. అతని భావములనుబట్టి అతడు సమస్త ప్రాణులను సచ్చిదానంద ఘనబ్రహ్మయందు చూచునని చెప్పుట జరుగును. వస్తుతః అతని బుద్ధియందు జగత్తంతయు నీటియందు మంచువలె, ఆకాశమునందు మేఘమువలె, బంగారమున నగలవలె బ్రహ్మరూపమే యగును. ఏ పదార్థమైనను, ప్రాణియైనను బ్రహ్మము కంటె వేఱుగాదు. ఈ స్థితియే 6వ అధ్యాయమునందలి 27వ శ్లోకములో యోగి బ్రహ్మరూపస్థితి పొందునట్లును చెప్పబడినది. 29వ శ్లోకములో సమస్త

ప్రాణులను తనలోను, తనను సర్వప్రాణులలోను దర్శించు సమదర్శియగు యోగి 'యోగయుక్తాత్మా' అని పేర్కొనబడెను. ఆ విషయమే ఇచట "ద్రక్ష్యసి ఆత్మని" అను పదప్రయోగము ద్వారా తెల్పబడినది. ఇది (సమస్త ప్రాణులను తనయందు చూచుట) ప్రాథమిక స్థితి. 6/28వ శ్లోకమునందు చెప్పబడిన బ్రహ్మ సంస్పర్శ రూప - అత్యంత సుఖప్రాప్తి ఇచట 'అథో మయి' అను పదప్రయోగముచే తెలుపబడినది. ఇది (సమస్త ప్రాణులను పరమాత్మ యందు దర్శించుట) ఆ ప్రాథమిక స్థితికి ఫలరూపమైన రెండవస్థితి. 18వ అధ్యాయము నందును జ్ఞానయోగిని వర్ణించుచు 54వ శ్లోకమునందు యోగి బ్రహ్మభూతుడగుట, 55వ శ్లోకమునందు జ్ఞానరూప పరాభక్తి ద్వారా అతడు ( ఆ యోగి) పరమాత్మయందు ఐక్యమగుట తెల్పబడినది. ఆ విషయమే ఇచ్చట వివరింపబడినది.

సంబంధము - ఈ విధముగ గురుజనుల వలన తత్త్వజ్ఞానమును సాధించు మార్గమును, దాని ఫలమును తెలిపి, ఇప్పుడు ఆ తత్త్వజ్ఞానమహిమను తెలుపుచున్నాడు-

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 36 ॥**

(త్వమ్) = నీవు
సర్వేభ్యః, పాపేభ్యః, అపి = పాపులందరటి కంటెను
పాపకృత్తమః, అపి, చేత్ = అధికముగా పాపములను చేసినవాడవైనచో
జ్ఞానప్లవేన, ఏవ = జ్ఞానమనెడి నౌక ద్వారా
సర్వమ్, వృజినమ్ = సమస్త పాప సముద్రమును
సంతరిష్యసి = పూర్తిగా దాటగలవు.

**ఒకవేళ పాపాత్ములందరికంటెను నీవు ఒక మహాపాపివి అయినచో, జ్ఞాననౌక సహాయముతో పాపసముద్రము నుండి నిస్సందేహముగా పూర్తిగా బయట పడగలవు. (36)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు 'చేత్', 'అపి' అను అవ్యయములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - వాస్తవముగా అర్జునుడు పాపి యే మాత్రము కాడు. అతడు దైవలక్షణసంపన్నుడు (గీత 16/5) పైగా భగవంతునకు ప్రియసఖుడు, పరమభక్తుడు. (గీత 4/3) కావున వానిని ఏ విధముగను పాపములంటజాలవు. ఈ జ్ఞాన మహిమా ప్రభావములతో మహాపాపాత్ములు సైతము తామొనర్చిన పాపములు, అవి యెంతటివైనను, ఆ పాప సముద్రమునుండి సునాయాసముగా బయట పడగలరు. కొండలవంటి పాపములుగూడ వారిని అడ్డగింపజాలవు.

ప్రశ్న - అంతఃకరణ శుద్ధిలేని మహాపాపాత్ముడు ఈ జ్ఞానమును పొందుటకు అనర్హుడు గదా! అయినచో జ్ఞాననౌకద్వారా పాపసముద్రమునుండి తరించుట యెట్లు?

సమా - 'చేత్', 'అపి' అను పదములను ప్రయోగించుట వలన ఇట్టి శంకలకు తావులేదు. పాపాత్ముడైనవాడు ఈ జ్ఞానమును పొందుటకు అర్హుడు కానిమాట వాస్తవమే. ఈ కారణమున అతనికి జ్ఞాననౌక లభించుటయే అసాధ్యము. అయితే భగవదనుగ్రహమువలనగాని, మహాత్ముల దయవలనగాని మఱియే యితర కారణములవలనగాని ఈ జ్ఞానము లభించినచో అతడు ఎంతటి పాపాత్ముడైనను వెంటనే ఆ పాపములనుండి ఉద్ధరింపబడును.

ప్రశ్న - సకామ భావములతో చేయబడిన పుణ్యకర్మలు గూడ మనుష్యునకు బంధహేతువులే యగును. మఱి పాపములనుండి తరించునని చెప్పుటలో గల ఆంతర్యమేమి?

సమా - పుణ్యకర్మలుగూడ సకామ భావముతో చేసినప్పుడు అవి బంధహేతువులే. సమస్త కర్మబంధముల నుండి సర్వథా ముక్తుడైనప్పుడే పాపములన్నింటి నుండి బయటపడగలడు. ఇది వాస్తవము. కాని పుణ్యకర్మ ఫలత్యాగము చేయుట మనుష్యుని అధీనములోని విషయము. అతనికి సంకల్పము కలిగినప్పుడు వాటిని (పుణ్యకర్మ ఫలములను) త్యజింపవచ్చును. కాని జ్ఞానమును పొందకుండ పాపముల నుండి తరించుట అతని అధీనములో లేదు. కావున పాపకర్మలనుండి ముక్తుడగునను మాటలో పుణ్యకర్మబంధముల నుండి కూడ ముక్తుడగుచున్నట్లు తెలిసికొనవలెను.

ప్రశ్న - జ్ఞాననౌకద్వారా పాపసముద్రమునుండి పూర్తిగా తరించుట యనగానేమి?

సమా - నౌకలో కూర్చొన్న మనుజుడు అగాధమైన, అపారమైన సముద్రముపై తేలుచు పయనించును. క్రమముగ అవతలి తీరమునకు చేరును. అట్లే జ్ఞానస్థితుడైనవాడు తన ఆత్మస్వరూపుని అసంగుడుగా, నిర్వికారుడుగా, నిత్యుడుగా, అనంతుడుగా సర్వథా భావించుచు, అనేకములైన పూర్వజన్మల యందును, ఈ జన్మయందును చేసిన ప్రాపంచిక విషయములకు సంబంధించిన సమస్త పాపసముదాయములను అతిక్రమించును (దాటును). అనగా సమస్త కర్మ (ప్రాపంచిక) బంధములనుండి సర్వథా శాశ్వతముగ విముక్తుడగును. జ్ఞాననౌకద్వారా పాపసముద్రమును పూర్తిగా దాటుట యనగానిదియే.

ప్రశ్న - ఈ శ్లోకమునందలి 'ఏవ' అను అవ్యయ ప్రయోగము యొక్క ప్రత్యేకత ఏమి?

సమా - ఇచట 'ఏవ' అను అవ్యయము దృఢ నిశ్చయార్థమును తెలుపును. చెక్కలతో చేయబడిన నౌకలో కూర్చుండి సముద్రముపై ప్రయాణము చేయుచున్న మనుజుడు ఎప్పుడైనను నౌక పగిలిపోవుటవలన గాని, దానికి రంధ్రములు పడుటవలనగాని, తుపానువలనగాని ఇంకను ఏ యితర ప్రమాదముల వలననైనగాని నౌకతోపాటు తానును నీటిలో మునిగిపోవచ్చును. కాని ఈ జ్ఞాననౌక నిత్యము. దీని నాశ్రయించిన మనుజుడు నిస్సందేహముగా, నిరాటంకముగా పాపములను అధిగమించును. అతని పతనమునకు ఏ మాత్రము ఆస్కారమే లేదు.

సంబంధము - ఏ పరమార్థ విషయమైనను ఒకే దృష్టాంతముద్వారా సమగ్రముగా తెలుపుట సాధ్యముగాదు. దాని ఒక అంశమును మాత్రమే తెలుపుటకు వీలగును. పూర్వశ్లోకమున తెలుపబడిన జ్ఞానమహత్త్వమునే అగ్ని దృష్టాంతముద్వారా మరల స్పష్టపఱచుచున్నాడు-

**యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున! | = ఓ అర్జునా! | ఏధాంసి | = ఇంధనములను | జ్ఞానాగ్నిః | = జ్ఞానమనెడి అగ్ని |
| యథా | = ఎట్లైతే, | భస్మసాత్, కురుతే= | భస్మమొనర్చునో | సర్వకర్మాణి | = కర్మలను అన్నింటిని |
| సమిద్ధః, అగ్నిః= | ప్రజ్వలించుచున్న అగ్ని | తథా | = అట్లే | భస్మసాత్, కురుతే= | భస్మమొనరించును |

**ఓ అర్జునా! ప్రజ్వలించుచున్న అగ్ని సమిధలను భస్మముచేసినట్లు జ్ఞానమను అగ్ని కర్మల నన్నింటిని భస్మమొనరించును. (37)**

ప్రశ్న - జ్ఞానమును అగ్నితో పోల్చుచు ఆ జ్ఞానాగ్ని కర్మలను (కర్మ ఫలములను) సంపూర్ణముగ భస్మము చేయుననుటలోని అంతర్యమేమి?

సమా - ప్రజ్వలించుచున్న అగ్ని, కట్టెలు మొదలగు సమస్త- ఇంధనములను భస్మము చేసినట్లు తత్త్వజ్ఞానరూప అగ్ని సమస్త పుణ్యపాపకర్మలను భస్మమొనర్చును. అనగా ఆ కర్మల ఫలరూపములైన సుఖదుఃఖభోగములను, వాటికి కారణములైన అవిద్యను, అహంకార మమకారములను, రాగద్వేషాది సమస్తవికారములను భస్మమొనర్చును. శ్రుతియు ఈ విషయమునే చెప్పుచున్నది.

భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥
(ముండకోపనిషత్తు 2/2/8)

పరావరుడైన (అణోరణీయాన్ మహతో మహీయాన్ అను వేద వచనముల కర్థభూతుడైన) పరమాత్ముని సాక్షాత్కారమైనంతనే జ్ఞానియొక్క జడ చేతనాత్మకమైన హృదయగ్రంథి విప్పుకొనును. జడదేహాదులయందు అజ్ఞానజనితమైన ఆత్మాభిమానమువలన ఏర్పడిన సంశయము లన్నియును పటాపంచలైపోవును. పరమాత్మ స్వరూపజ్ఞాన విషయమున ఏవిధమైన సందేహముగాని, భ్రమగాని ఏ మాత్రము మిగులదు. సమస్త కర్మల ఫలములు

నశించును. ఈ విషయమే ఈ యధ్యాయమునందలి 19వ శ్లోకమున 'జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్' అను ప్రయోగము ద్వారా తెలుపబడినది.

ఈ జన్మయందును, జన్మాంతరములయందును చేసిన సమస్త కర్మలు సంస్కార రూపమున మానవుల అంతః కరణములయందు రాశిగా ఏర్పడియుండును. వీటినే సంచితకర్మలు అని యందురు. ఈ జన్మలో అనుభవించుచున్న ఆ కర్మఫలములను ప్రారబ్ధకర్మలు అనియందురు. ఇప్పుడు చేయుచున్న కర్మలను క్రియమాణ కర్మలు అని యందురు. పైన పేర్కొనబడిన తత్త్వజ్ఞానరూపాగ్ని జ్వలింపగనే పూర్వసంచిత సంస్కారములన్నియును రూపుమాయును. మనస్సు, బుద్ధి, శరీరములతో ఆత్మకు ఎట్టి సంబంధమేలేదని గ్రహించుటవలన, మనస్సు, ఇంద్రియములు, శరీరాదులతో ప్రారబ్ధ భోగముల సంబంధము ఉన్నప్పటికిని అట్టి భోగములకు కారణములైన హర్షశోకాది వికారములు అంతః కరణము నందు కలుగనేరవు. ఈ కారణము వలన అవి గూడ (ప్రారబ్ధ కర్మలు గూడ) నశించును. క్రియమాణ కర్మలయందును అతనికి (జ్ఞానికి) కర్తృత్వాభిమానము, మమత, ఆసక్తి, వాసనలు లేనందువలన అవి సంస్కారరూపములను పొందవు. కావున వాస్తవముగా అవి కర్మలే కావు.

ఈ విధముగ సమస్త కర్మలును నశించును. కర్మలే లేనప్పుడు కర్మఫలముల ప్రసక్తికి తావెక్కడ? సంచిత సంస్కారములే లేనప్పుడు అతనియందు రాగద్వేషములు, హర్షశోకాది వికారముల వృత్తులు ఎట్లుండును? కావున అతని సమస్త వికారములు, కర్మల ఫలములుగూడ కర్మలతోపాటే నష్టమైపోవును.

*సంబంధము - 4/24వ శ్లోకము నుండి ఇప్పటి (37వ శ్లోకము) వఱకు తత్త్వజ్ఞానులైన మహాపురుషుల నాశ్రయించి, వారి సేవాదులను ఆచరించి, తత్త్వజ్ఞానమును పొందుటను గూర్చియు, దాని ఫలములను, మాహాత్మ్యమును గూర్చియు భగవానుడు తెలిపెను. ఈ తత్త్వజ్ఞానమును జ్ఞానులైన మహాత్ములద్వారా గ్రహించి, దానిని విధి పూర్వకముగా మనన, నిదిధ్యాసనాది జ్ఞాన యోగసాధనల ద్వారా మాత్రమే పొందవలెనా? లేక దానిని పొందుటకు ఇతర మార్గములేవైనను కలవా? అను జిజ్ఞాస కలుగును.*

*రాబోవు శ్లోకమున మఱల ఆ జ్ఞానమహత్త్వమును ప్రకటించుచు భగవానుడు కర్మయోగమును విధివిహితముగా పూర్తిగా ఆచరించినచో ఆదే జ్ఞానము తనంతటతానే సిద్ధించును అని తెలిపెను-*

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥ 38 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇహ | = ఈ జగత్తునందు | న, విద్యతే | = (ఏదియును) లేదు | | శుద్ధాంతఃకరణము గలవాడు |
| జ్ఞానేన, సదృశమ్ | = జ్ఞానముతో సమానముగా | తత్ | = ఆ జ్ఞానమును | స్వయమ్ | = స్వయముగనే |
| పవిత్రమ్ | = పవిత్రమైనది | కాలేన | = దీర్ఘకాలమువఱకును | ఆత్మని | = ఆత్మయందు |
| హి | = నిస్సందేహముగా | యోగసంసిద్ధః | = కర్మయోగముద్వారా | విందతి | = పొందును |

**ప్రపంచమున జ్ఞానముతో సమానముగ పవిత్రమైనది మరియొకటి లేనేలేదు. శుద్ధాంతఃకరణముగల సాధకుడు బహుకాలమువరకు కర్మయోగాచరణము చేసి, ఆత్మయందు అదే జ్ఞానమును తనంతటతానే పొందగలడు. (38)**

ప్రశ్న - ప్రపంచమున జ్ఞానముతో సమానముగ పవిత్రమైనది మఱియొకటి లేనేలేదు, అని యనుటలోగల విశేషమేమి?

సమా - ఈ ప్రపంచమున యజ్ఞము, దానము, తపస్సు, సేవలు, పూజలు, వ్రతములు, ఉపవాసములు, ప్రాణాయామము, శమదమాదులు, సంయమము, జపధ్యానాది సాధనములును, గంగ, యమున, త్రివేణి మొదలగు తీర్థములును మనుష్యుల పాపములను రూపుమాపి, వారిని పవిత్రమొనర్చునవియే. వానిలో ఏవియును యథార్థముగ జ్ఞానముతో సమానమైనవి కావు.

ఏలనన అవియన్నియును తత్త్వజ్ఞాన సాధనములు మాత్రమే. కాని జ్ఞానము ఈ యన్నింటికిని ఫలస్వరూపము. అవి సాధనములు. ఇది సాధ్యము. జ్ఞానప్రాప్తికి సాధనము లైనందున అవియును పవిత్రములైనవిగా భావింపబడు చున్నవి. ఈ జ్ఞానమువలన సాధకుడు పరమాత్మయొక్క యథార్థ స్వరూపమును చక్కగా ఎఱుంగును. అతనిలో అసత్యము, కపటము, చౌర్యము, వ్యభిచారము మొదలగు పాపములును, రాగద్వేషములు, హర్షశోకములు, అహంకార మమకారములు మున్నగు వికారములన్నియును, మఱియు అజ్ఞానము అంతరించిపోవుట వలన అతడు పరమ పవిత్రుడగును. అతని మనస్సు, ఇంద్రియములు, శరీరము కూడ మిక్కిలి పవిత్రములగును. అందువలన జ్ఞానియైన ఆ మహాత్ముని దర్శనము, స్పర్శ, వందనము, చింతనము మొదలగునవి చేయువారును, అట్లే అతనితో సంభాషించు ఇతర జనులును పవిత్రులగుదురు. కావున ప్రపంచమున పరమాత్మ తత్త్వజ్ఞానముతో సమానముగ పవిత్రమైన దేదియును లేదు.

ప్రశ్న - 'ఇహ' అను పద ప్రయోగము యొక్క విశేషమేమి?

సమా - ప్రకృతి యొక్క కార్యరూపమైన ఈ జగత్తునందు జ్ఞానముతో సమానమైన దేదియును లేదు. అన్నింటికంటెను ఎక్కువగా పవిత్ర మొనర్చునదియు జ్ఞానమే. కాని పరమాత్ముడు ఈ ప్రకృతి కంటెను అతీతుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, సర్వలోకేశ్వరుడు, గుణసముద్రుడు, సగుణ నిర్గుణ సాకార నిరాకార స్వరూపుడు. ఈ ప్రకృతికే అధ్యక్షుడు. అట్టి భగవంతుని సాక్షాత్కరింప జేయునది అగుటవలన జ్ఞానము పవిత్రమైనది. అందరికిని సుహృదుడు సర్వాధారుడు అయిన పరమాత్ముడు పరమ పవిత్రుడు. జ్ఞానము అతనికంటెను మించి పవిత్రమైనదిగా తెల్పబడలేదు. ఏలనన పరమాత్మునకు సమానమైనదేదియు లేనప్పుడు, అతనిని మించినది ఏముండును? అందువలననే అర్జునుడు కూడ ఈ మాటనే చెప్పినాడు - 'పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్' (గీత- 10/12) అనగా నీవే పరబ్రహ్మవు. పరంధాముడవు. పరమపవిత్రుడవు. ఈ మాటనే భీష్ముడు గూడ నొక్కి చెప్పెను. 'పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్' అనగా పరమేశ్వరుడు పవిత్రము చేయువారిలో మిక్కిలి పవిత్రుడు. శుభస్వరూపులలో అత్యంత శుభ స్వరూపుడు. (మహా భార.అను.149/10)

ప్రశ్న - 'యోగసంసిద్ధః' అను పదము ఎవరిని సూచించును? అతడు అట్టి జ్ఞానమును తనంతట తానే ఆత్మయందు పొందును. అనగానేమి?

సమా - ఎంతోకాలము కర్మయోగము నాచరించి, రాగద్వేషములు నశించుటవలన అంతఃకరణశుద్ధి కలిగినవాడు, కర్మయోగఫలసిద్ధిని అందినవాడు, మమత, ఆసక్తి, ఫలేచ్ఛలు లేకుండ భగవదాజ్ఞానుసారము భగవంతుని కొఱకై సమస్తకర్మలను చేయువాడు - ఇట్టి సాధకుని సూచించునదియే 'యోగసంసిద్ధః' అను పదము.

అతని కర్మయోగసాధన పరమావధిని చేరినప్పుడు తత్క్షణమే భగవదనుగ్రహమువలన అతని అంతఃకరణమున జ్ఞానము ప్రకాశించును. ఈ జ్ఞానసిద్ధి నందుటకు అతడు ఏ యితర సాధనను అనుష్ఠించుటగాని, జ్ఞానులను ఆశ్రయించుటగాని చేయనవసరము లేదు. మఱి ఏ యితర సాధన సహాయము లేకుండగనే కేవలము కర్మయోగ సాధనవలననే అతనికి అట్టి జ్ఞానము భగవత్కృపవలన తనంతట తానే లభించును.

సంబంధము - ఈవిధముగ తత్త్వజ్ఞానమహిమను తెలిపి తత్ప్రాప్తికై సాంఖ్యయోగము, కర్మయోగము అను రెండు మార్గములను తెలిపిన పిదప భగవానుడు అట్టి జ్ఞానమును పొందుటకు పాత్రుడు ఎవరు? అను విషయమును వివరించుచు, పరమశాంతియే అట్టి జ్ఞానఫలమని తెలుపుచున్నాడు-

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరామ్ శాంతిమ్ అచిరేణాధిగచ్ఛతి ॥ 39 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంయతేంద్రియః | = జితేంద్రియుడు | జ్ఞానమ్ | = ఈ తత్త్వజ్ఞానమును | అచిరేణ | = తత్క్షణముననే |
| తత్పరః | = సాధనపరాయణుడు | లభతే | = పొందును | పరామ్, శాంతిమ్ | = పరమశాంతిని |
| శ్రద్ధావాన్ | = శ్రద్ధగలవాడు | జ్ఞానమ్, లబ్ధ్వా | = (ఈ) జ్ఞానమును పొంది | అధిగచ్ఛతి | = పొందును |

**జితేంద్రియుడు, సాధనపరాయణుడు శ్రద్ధాళువైన మనుజునకు ఈ భగవత్తత్త్వ జ్ఞానము లభించును. ఆ జ్ఞానము కలిగిన వెంటనే (ఏ మాత్రము విలంబము లేకుండ) అతడు భగవత్తత్త్వ రూపమైన పరమశాంతిని పొందును. (39)**

ప్రశ్న - 'శ్రద్ధావాన్' అను పదము ఎట్టివానిని సూచించును అతడు జ్ఞానమును పొందును అనగానేమి?

సమా - వేదశాస్త్రములయందును, భగవంతుని యెడను, మహాపురుషుల వచనములయందును, పరలోకము నందును, ప్రత్యక్ష ప్రమాణమునందువలె పరమవిశ్వాసము, ఈ అన్నింటియందును పూజ్యభావము, ఉత్తమోత్తమ భావము కలిగియుండు స్థితిని శ్రద్ధ యందురు. అట్టి శ్రద్ధ గలవాడే 'శ్రద్ధావాన్'. అట్టి శ్రద్ధాళువైనవాడే జ్ఞానులైన మహాత్ముల నాశ్రయించి ప్రణామములు చేయుట, సేవలొనర్చుట, వినయపూర్వకముగ జిజ్ఞాసతో ప్రశ్నించుట మొదలగువాని ఆచరణలద్వారా వారి మన్ననలకు పాత్రుడై, వారినుండి ఉపదేశములను పొంది, జ్ఞాన, కర్మ, యోగసాధనలను కావించి, ఆ తత్త్వజ్ఞానమును పొందగలడు. శ్రద్ధాళువు కానివాడు జ్ఞానోపదేశమునకే పాత్రుడు కాజాలడు.

ప్రశ్న - శ్రద్ధాళువు కానివాడుగూడ మహాత్ముల నాశ్రయించి, ప్రణమిల్లి, సేవించి వారిని ప్రశ్నింప వచ్చును గదా! మఱి జ్ఞానప్రాప్తికి శ్రద్ధయే ముఖ్యమని యెట్లు చెప్పవగును?

సమా - శ్రద్ధలేనివాడు మహాత్ములను పరీక్షించుటకు గాని, తన పాండిత్యమును ప్రదర్శించుటకుగాని, తన కీర్తి ప్రతిష్ఠలను పెంచుకొనుటకుగాని, దంభాచరణమునకుగాని మహాత్ములకడకేగి, ప్రణమిల్లి, సేవించి, వారిని ప్రశ్నింపవచ్చును. కాని దానివలన వానికి జ్ఞానము ప్రాప్తించదు. ఏలనన శ్రద్ధ లేకుండ చేసిన యజ్ఞము, దానము, తపస్సు మొదలగు సాధనలన్నియును వ్యర్థములని తెల్పబడినవి. (17/28) కావున జ్ఞానప్రాప్తియందు శ్రద్ధ మిక్కిలి ముఖ్యము. ఎంత ఎక్కువ శ్రద్ధతో జ్ఞానసాధన కావించిన అంత శీఘ్రముగ జ్ఞానప్రాప్తి కలుగును.

ప్రశ్న - జ్ఞానప్రాప్తియందు శ్రద్ధయే ముఖ్యమైనచో ఇచట 'శ్రద్ధావాన్' అను ప్రయోగముతోపాటు 'తత్పరః' అను విశేషణమును ప్రయోగింపవలసిన అవసరమేమి?

సమా - సాధనయొక్క తత్పరత్వమునందు కూడ శ్రద్ధయే మూలము. తత్పరత్వము శ్రద్ధకు ఒరిపిడి రాయి. శ్రద్ధ లోపించినచో సాధనయందు అకర్మణ్యత్వము, (కర్మయందు చురుకుగా పాల్గొనకుండుట) సోమరితనము మొదలగు దోషములు కలుగును. దీనివలన అభ్యాసము (కర్మసాధన) తత్పరతతో జరుగదు. శ్రద్ధాతత్త్వమును ఎఱుగని వాడు తన గోరంత శ్రద్ధను గూడ కొండంతలుగా చెప్పికొనును. కాని కార్యసిద్ధి కలుగదు. అప్పుడు అతడు తన సాధనయందు తత్పరత లేమిని (తత్పరత లేకుండుటను) గుర్తింపక శ్రద్ధయున్నను తనకు భగవత్ప్రాప్తి కలుగలేదని తలంచును. ఈ విధముగ భావించుట పొరపాటే. సాధనయందు శ్రద్ధతోపాటు 'తత్పరత'యు ఉండవలెను.

లోక వ్యవహారమున ధనార్థి తదార్జన కొఱకు ఏదేని ఒక వ్యాపారము చేయును. తన వ్యాపారమునందు ధనలాభము కలుగునని నమ్మకము ఏర్పడినప్పుడు దానియందు పూర్తిగా తత్పరుడగును. అప్పుడు ఆకలి దప్పులు, నిద్రాసుఖములు, విశ్రాంతి మొదలగునవి అతనికి ఏ మాత్రము పట్టవు. శరీరమునకు క్లేశము కలిగినను అతడు పట్టించుకొనడు. తదుపరి కలిగిన ధనలాభమునలన అతని చిత్తము ప్రసన్నతను పొందును. అట్లే ఏ ఇతర విషయమునందైనను విశ్వాసమువలననే తత్పరత కలుగును.

కావున పరమానంద శాంతిప్రదుడును, నిత్య విజ్ఞానానంద ఘనుడును అయిన పరమాత్మునియొక్క ప్రాప్తికి చక్కని రాజమార్గమైన భగవత్తత్త్వజ్ఞానము నందును, దాని సాధనయందును శ్రద్ధ ఏర్పడినప్పుడు అత్యంత తత్పరత ఏర్పడుటయు స్వాభావికమే. సాధనయందు తత్పరత లోపించినచో శ్రద్ధయు లోపించినట్లే. ఈ విషయము నొక్కి చెప్పుటకే, 'శ్రద్ధావాన్' అను పదముతో పాటు 'తత్పరః' అను విశేషణము గూడ ప్రయుక్తమైది.

ప్రశ్న - శ్రద్ధయు, తత్పరతయు ఉన్నప్పుడు జ్ఞానప్రాప్తి కలుగుననుటలో ఎట్టి సందేహమును ఉండదు. మఱి 'శ్రద్ధావాన్' అను పదమునకు 'సంయతేంద్రియః' అను మఱియొక విశేషణమును ప్రయోగింపవలసిన అవసరమేమి?

సమా - శ్రద్ధాపూర్వకముగ గట్టిగా అభ్యాసము (సాధన) చేయుటచే పాపములు నశించును. సంసార విషయ

భోగములపై వైరాగ్య మేర్పడును. మనస్సునకు ఇంద్రియములకు సంయమను ఏర్పడును. పరమాత్మ స్వరూపముయొక్క యథార్థజ్ఞానము కూడ కలుగును. ఇందు ఏ మాత్రమును సందేహములేదు. కాని ఈ రహస్యము తెలియని సాధకుడు స్వల్ప సాధనను గూడ ఎంతో సాధన చేసినట్లు భావించును. దానివలన అతనికి కార్య(లక్ష్య) సిద్ధి జరుగదు. అతడు నిస్పృహకు లోనై సాధనను వదలివేయును. మనస్సు, ఇంద్రియములు వశమగునంత వఱకును పట్టుబట్టి శ్రద్ధాపూర్వకముగ తీవ్రమగు అభ్యాసమును చేయుచునే యుండవలెను. అవిచ్ఛిన్నమైన అభ్యాసమున (సాధన)కు ఇంద్రియసంయమమే ఒరిపిడి రాయి. శ్రద్ధతో గూడిన తీవ్ర అభ్యాసము, (సాధన) ఇంద్రియ సంయమము పరస్పరముగా ఆధారాధేయములు. ఇంద్రియసంయమము సడలినచో సాధన బలహీనమగును. సాధనలో లోపము ఏర్పడినచో శ్రద్ధ సన్నగిల్లినట్లు భావింపవలెను. ఈ విషయమును స్పష్టపఱచుటకే 'సంయతేంద్రియః' అను విశేషణము కూడ ప్రయోగింపబడినది.

ప్రశ్న - జ్ఞాన ప్రాప్తియైన మఱుక్షణమునందే అతడు భగవత్ప్రాప్తి రూపమైన పరమశాంతిని పొందును. అని యనుటలోని విశేషమేమి?

సమా - సూర్యోదయము అయినంతనే చిమ్మచీకట్లును మటుమాయమై వస్తువులన్నియు ప్రత్యక్షముగా నిలిచినట్లు భగవత్తత్త్వజ్ఞానము కలిగినంతనే అజ్ఞానము పటాపంచలై పరమాత్మ స్వరూపము సాక్షాత్కారమగును. (5/16) అజ్ఞానజనిత వాసనలు, రాగద్వేష, హర్షశోకాది వికారములు శుభాశుభ కర్మల ఫలములు అంతరించుట, భగవత్తత్త్వ జ్ఞానము సిద్ధించుట, పరమాత్మ స్వరూపము ప్రత్యక్షమగుట మొదలగునవి యన్నియును ఏకకాలమునందే జరుగును. విజ్ఞానానందఘనుడైన పరమాత్మయొక్క సాక్షాత్కారమే ఇచట పరమశాంతిగా పేర్కొనబడినది.

సంబంధము - శ్రద్ధవలన జ్ఞానము, దానివలన పరమశాంతి కలుగునని తెలిపి, శ్రద్ధావివేకములు లేని సంశయాత్ముని అధిక్షేపించుచున్నాడు-

**అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ 40 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అజ్ఞః | = వివేకహీనుడును | వినశ్యతి | = భ్రష్టుడై నశించును | న, అస్తి | = ఉండదు |
| చ | = మఱియు | సంశయాత్మనః | = సంశయాత్మునకు | న, పరః, చ | = పరలోకమూ ఉండదు |
| అశ్రద్దధానః | = శ్రద్ధారహితుడు | అయమ్,లోకః | = ఈ లోకము | న, సుఖమ్ | = సుఖమూ ఉండదు |
| సంశయాత్మా | = సంశయగ్రస్తుడైనవాడు | | | | |

అవివేకియు, శ్రద్ధారహితుడును అయిన సంశయాత్ముడు పరమార్థ విషయమున అవశ్యము భ్రష్టుడేయగును. అట్టి సంశయాత్మునకు ఈ లోకమునందుగాని, పరలోకమునందుగాని ఎట్టి సుఖమూ ఉండదు. **(40)**

ప్రశ్న - 'అజ్ఞః' 'అశ్రద్దధానః' అను విశేషణములతో కూడిన 'సంశయాత్మా' అను పదము ఎవరిని సూచించును? మఱి అతడు పరమార్థ విషయమున అవశ్యము భ్రష్టుడగును. అనగానేమి?

సమా - 'అజ్ఞః' అనగా వివేకజ్ఞానరహితుడు. అట్టి అవివేకికి సత్యాసత్యముల పరిజ్ఞానము గాని, ఆత్మానాత్మల వివేచనశక్తిగాని ఉండవు. అందువలన కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించు కొనలేడు. భగవంతునియందును, పరలోకము నందును, తదుభయప్రాప్తికై మార్గములను తెలుపు శాస్త్రముల యందును, మహాపురుషులయందును, వారు ఉపదేశించిన సాధనమార్గములయందును, వాటి ఫలితములయందును శ్రద్ధలేని వానిని అశ్రద్దధానః అను పదము సూచించును. ప్రతి విషయమునందును సందేహగ్రస్తుడగువాడు 'సంశయాత్మా' అనబడును. అతడు ఈశ్వరుని విషయమునగాని, పరలోక విషయమునగాని మఱియే ఇతర విషయమునగాని ఎట్టి నిర్ణయమును తీసికొనలేడు.

పైన తెలుపబడిన అజ్ఞత, అశ్రద్ధాళుత - అను రెండు దోషములు గలవానిని సూచించునదియే ఇచ్చట 'అజ్ఞః'

'అశ్రద్దధానః' అను రెండు విశేషణములు గల సంశయాత్మా అను పదము. అతడు పరమాత్మ విషయమున అవశ్యము భ్రష్టుడేయగును.

సంశయాత్ముడు వేదశాస్త్రములను, మహాపురుషుల వచనములను, వారుపదేశించిన సాధన మార్గములను చక్కగా గ్రహింపలేడు. ఒకవేళ పైపైన కొన్నింటిని గ్రహించినను ఆ కొన్నింటియందును విశ్వాసమును ఉంచడు. ప్రతి విషయమునను సంశయగ్రస్తుడే యగును. కనుక అతడు కింకర్తవ్యతామూఢుడై ఎట్టి నిర్ణయమును తీసికొనలేడు. ఇట్టి సంశయాత్ముని జీవితము వ్యర్థము. అందువలన అతనికి అందుబాటులోనున్న సత్ఫలములను అతడు కోల్పోవును.

ప్రతి విషయమునను స్వయం వివేచనాశక్తి గలవాడును. వేదశాస్త్రములయందు, మహాపురుషుల వచనముల యందు శ్రద్ధాదరములు గలవాడును ఈ విధముగ (సంశయాత్ముని వలె) నష్టపడడు. అతడు వేదశాస్త్ర జ్ఞానాది సహాయమున అర్జునునివలె తన సంశయములన్నింటిని సర్వథా నివృత్తి చేసికొని, కర్తవ్యపరాయణుడై, కృతకృత్యుడై, జన్మసాఫల్యమును పొందగలడు. స్వయం వివేచనాశక్తిలేని అజ్ఞుడు కూడ శ్రద్ధాళునైనచో మహాపురుషుల ఉపదేశముల ప్రభావమున సంశయరహితుడై సాధన పరాయణుడు కావచ్చును. ఆ మహాత్ముల కృపవలన అతనికిని శుభమే చేకూరును. (13/25) కాని వివేచన శక్తిగాని, శ్రద్ధగాని లేని సంశయాత్ముని సంశయ నివృత్తికి ఎట్టి మార్గమునులేదు. కావున శ్రద్ధ, వివేకములు కుదురుకొనునంత వఱకును పరమార్థ విషయమున అతని జీవితము పతనోన్ముఖము గానే కొనసాగును.

ప్రశ్న - "సంశయగ్రస్తుడైన వానికి ఈ లోకమునందు గాని, పరలోకమునందు గాని ఎట్టి సుఖమూ ఉండదు" అని అనుటలోని విశేషమేమి?

సమా - "సంశయాత్ముడు కేవలము పరమార్థ విషయమునందే భ్రష్టుడగును" అని అనుటయును సరిపోదు. అతనికి సందేహ నివృత్తి కానంతవఱకు ఇహపరలోకముల యందును సుఖము లభింపదు. అనగా ఈ లోకమున (ఈ మానవ జీవితమున) అతనికి ధనము, ఐశ్వర్యము, యశస్సు మొదలగునవి లభింపవు. మరణానంతరము స్వర్గసుఖాదులును లభింపవు. ఏ విధమైన ప్రాపంచిక సుఖములను అనుభవింపలేడు. సంశయగ్రస్తుడైనవాడు ఏ విషయమును నిర్ణయించుకొనలేడు. ఎందులోను అతనికి సాఫల్యము చిక్కదు. కనుక మానవుడు శ్రద్ధా వివేకములద్వారా సంశయములను విధిగా నివృత్తి చేసికొని తీరవలెను.

*సంబంధము - ఇంతకుముందు వివేకశూన్యుడు, అశ్రద్ధాళువు, అయిన సంశయాత్మునకు జ్ఞానప్రాప్తి దుర్లభమని భగవానుడు తెలిపెను. ఇప్పుడు వివేకముద్వారా సంశయములను తొలగించుకొని కర్మయోగమును అనుష్ఠించుటకు అర్జునుని ప్రోత్సహించుటకై సంశయరహితుడై, అంతఃకరణమును వశమునందుంచుకొనిన కర్మయోగిని ప్రశంసించుచున్నాడు-*

**యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।**
**ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥ 41 ॥**

ధనంజయ! = ఓ ధనంజయా! అర్జునా!
యోగసన్న్యస్తకర్మాణమ్ = విధ్యుక్త కర్మలను ఆచరించుచు వాటిని భగవదర్పణము చేయువాడును
జ్ఞానసంఛిన్నసంశయమ్ = వివేకముద్వారా సంశయములను అన్నింటిని తొలగించుకొనిన వాడును
ఆత్మవంతమ్ = అంతఃకరణమును వశమునందు ఉంచుకొనిన వాడును అగువానిని
కర్మాణి = కర్మలు
న, నిబధ్నంతి = ఏమాత్రము బంధింపవు

**ఓ ధనంజయా! (ఓ అర్జునా!) విధిపూర్వకముగ కర్మలను ఆచరించుచు, కర్మ ఫలములను అన్నింటిని భగవదర్పణము చేయుచు, వివేకముద్వారా సంశయములనన్నింటిని తొలగించుకొనుచు, అంతఃకరణమును వశమునందుంచుకొనిన వానిని కర్మలు బంధింపజాలవు. (41)**

ప్రశ్న - 'యోగ సన్న్యస్త కర్మాణం' అను సమాసము నందలి యోగశబ్దమునకు అర్థమును జ్ఞానయోగముగా భావించి, జ్ఞానయోగము ద్వారా శాస్త్రవిహిత సమస్త కర్మలను అచరణాత్మకముగా త్యజించువాడని అర్థము చెప్పినచో దోషమేమి?

సమా - ఇచట ఆచరణాత్మకముగ కర్మలను త్యజించు ప్రస్తావన లేదు. యోగము ద్వారా కర్మలను త్యాగము చేసిన వానిని కర్మలు బంధింపవు - ఈ విషయమునే 42వ శ్లోకమున వివరించుచు 'తస్మాత్' అను పదము ప్రయోగించి, భగవానుడు అర్జునుని యోగమునందు స్థితుడవై యుద్ధము చేయుమని ఆజ్ఞ యిచ్చెను. కావున అర్జునుని యుద్ధమునకు (కర్మాచరణమునకు) ప్రోత్సహించుటను బట్టి చూచినచో ఇచట కర్మలను ఆచరణమున త్యజించుట యని యర్థము చెప్పుట సరికాదు. కనుక 'యోగసన్న్యస్త కర్మాణమ్' అను పదమునకు ఆచరణమున కర్మలను త్యజించువాడు అని యర్థమును చెప్పక, మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను త్యజించి, కర్మలను చేయుచు, కర్మఫలములను భగవంతునకు సమర్పణ చేయు త్యాగియని యర్థము చెప్పుటయే సమంజసము (3/30, 5/10) ప్రకరణానుసారము ఈ యర్థమును చెప్పుటయే సముచితము గదా!

ప్రశ్న - 'జ్ఞానసంఛిన్నసంశయమ్' అను సమాసము నందలి జ్ఞానశబ్దమునకు అర్థమేమి? గీతయందు ఏయే శ్లోకములలో ఏయే అర్థములలో ఈ జ్ఞానశబ్దము ప్రయుక్తమైనది?

సమా - ఏదేని ఒక వస్తు స్వరూపమును గూర్చి దాని సదసద్విషయ వివేచన మొనర్చి, సంశయములను తొలగించునట్టి వివేకశక్తి అనియే ఇచట జ్ఞానశబ్దమునకు అర్థము. 'జ్ఞా అవబోధనే' అను ధాత్వర్థమును అనుసరించి, జ్ఞానశబ్దమునకు తెలిసికొనుట అని యర్థము. గీతయందలి జ్ఞానశబ్దము వేర్వేరు ప్రకరణములలో భిన్నభిన్నార్థములలో ప్రయుక్తమైనది.

(క) 12వ అధ్యాయము నందలి 12వ శ్లోకములో జ్ఞానముకంటె ధ్యానము శ్రేష్ఠమనియు, దానికంటెను కర్మఫలత్యాగము శ్రేష్ఠమనియు తెలుపబడినది. కావున అచట జ్ఞానమునకు శాస్త్రజ్ఞానమనియు, శ్రేష్ఠపురుషులద్వారా లభించు వివేకజ్ఞానమనియు అర్థము.

(ఖ) 13వ అధ్యాయము నందలి 17వ శ్లోకమున జ్ఞేయ శబ్దమునకు విశేషణముగ జ్ఞానశబ్దము ప్రయోగింపబడినది. అచట జ్ఞానశబ్దమునకు పరమేశ్వరునియొక్క నిత్యవిజ్ఞానానందఘనస్వరూపము అని అర్థము.

(గ) 18వ అధ్యాయమునందలి 42వ శ్లోకమున బ్రాహ్మణుని స్వాభావిక కర్మలలో జ్ఞానమొకటియని చెప్పబడినది. ఆ సందర్భమున జ్ఞానశబ్దమునకు శాస్త్రముల అధ్యయనాధ్యాపనములు చేయుట అని యర్థము.

(ఘ) ఈ 4వ అధ్యాయమున 36వ శ్లోకము నుండి 39వ శ్లోకము వఱకును ప్రయుక్తములైన జ్ఞానశబ్దము లన్నింటికిని పరమాత్మ తత్త్వజ్ఞానము అని యర్థము. ఆ తత్త్వజ్ఞానము సమస్త కర్మలను భస్మమొనర్చునది యనియు, సమస్త పాపముల నుండి తరింపజేయునది యనియు, సమస్తయజ్ఞాది సాధనములకంటెను, తీర్థముల కంటెను పవిత్రమైనదనియు, యోగసిద్ధికి ఫలస్వరూపమనియు, పరమశాంతిని కూర్చునదియనియు వివరింపబడెను. అట్లే 5వ అధ్యాయము నందలి 16వ శ్లోకమున పరమాత్మ స్వరూపమును సాక్షాత్కరింప జేయునదియనియు, 14వ అధ్యాయమునందలి 1,2 శ్లోకములలో జ్ఞానములన్నింటి కంటెను ఇది ఉత్తమమైనదని చెప్పబడుటచే జ్ఞానశబ్దమునకు తత్త్వజ్ఞానమే అని యర్థమును చెప్పవలెను. ఇతర సందర్భములయందును ప్రసంగములను బట్టి ఈ యర్థమునే స్వీకరింపవలెను.

(జ) 18వ అధ్యాయమునందలి 21వ శ్లోకమున నానా వస్తువులను, ప్రాణులను వేర్వేఱుగా భావించుటచే అచట జ్ఞానశబ్దమునకు రాజసజ్ఞానము అను అర్థమును గ్రహింపవలెను.

(చ) 13వ అధ్యాయమునందలి 11వ శ్లోకమున తత్త్వజ్ఞానము యొక్క అమానిత్వాది సాధన సముదాయమును జ్ఞానము అని పేర్కొనుట జరిగినది.

(ఛ) 3వ అధ్యాయమునందలి 3వ శ్లోకమున యోగశబ్దముతోపాటు ప్రయుక్తమగుటచే జ్ఞానశబ్దమునకు అర్థము జ్ఞానయోగము లేక సాంఖ్యయోగము అని తెలిసికొనవలెను. ఇదే విధముగ ఇతర సందర్భముల యందును జ్ఞానశబ్దము సాంఖ్యయోగము అను అర్థములో వాడబడినది. ఇంకను అనేక సందర్భములలో జ్ఞానశబ్దము వివిధార్థములలో ప్రయోగింపబడినది. సందర్భోచితముగా దాని వివిధార్థములను గ్రహింపవలెను.

ప్రశ్న - 'జ్ఞాన సంఛిన్న సంశయమ్' అను సమాసము నందలి జ్ఞానశబ్దమునకు అర్థము తత్త్వజ్ఞానము అని చెప్పిన దోషమేమి?

సమా - తత్త్వజ్ఞానమును పొందిన తత్ క్షణమే సంశయములన్నియును సమూలముగా నశించి, పరమాత్మప్రాప్తి కలుగును. పరమాత్మ ప్రాప్తికి మఱియొక సాధనము అవసరము లేదు. కావున ఇచట జ్ఞానము అను శబ్దమునకు అర్థము తత్త్వజ్ఞానము అని భావించుట సరికాదు. ఏలనన తత్త్వజ్ఞానము కర్మయోగము యొక్క ఫలము. ముందు (రాబోవు) శ్లోకములో భగవానుడు అర్జునుని జ్ఞానప్రభావమున అజ్ఞానజనిత సంశయములను తొలగించుకొని, కర్మయోగస్థితుడవుకమ్ము అని పలికెను. అందువలన ఇచట తెలుపబడిన అర్థమే సరియైనదని భావింపనగును.

ప్రశ్న - వివేకరూపజ్ఞానము ద్వారా సంశయనివృత్తి యగుట అనగానేమి?

సమా - భగవంతుడు కలడా? లేడా? ఉన్నచో అతడు ఎట్లుండును? పరలోకము ఉన్నదా? లేదా? ఉన్నచో అది ఎట్లుండును? ఎక్కడ ఉండును? శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఇవి యన్నియును ఆత్మయేనా? లేక ఆత్మకంటె వేఱైనవా? అవి జడములా? చేతనములా? సర్వవ్యాపకములా? లేక ఏకదేశీయములా? కర్తయును, భోక్తయును, జీవాత్మయా లేక ప్రకృతియా, ఆత్మ ఒక్కటియేనా లేక అనేకములా? ఒకటియైనచో అది యెట్లుండును? అనేకములైనచో అవి యెట్లుండును? జీవుడు స్వతంత్రుడా? పరతంత్రుడా? పరతంత్రుడైనచో ఎవరికి? ఎట్లు? కర్మబంధములనుండి విముక్తుడగుటకు ఆచరణాత్మకముగ కర్మలను త్యజించుట యుక్తమా? లేక సాంఖ్యయోగము ననుసరించి సాధనచేయుట యుక్తమా? మొదలగు బహువిధములైన సందేహములు తార్కికుల అంతఃకరణములయందు కలుగుచుండును. వీటిని సంశయములు అనియందురు.

ఈ సంశయము లన్నింటిని వివేకజ్ఞాన ప్రభావమున వివేచన మొనర్చి ఒక నిర్ణయమునకు వచ్చుట - అనగా ఏ విషయమునందును సంశయగ్రస్తుడు కాక తన కర్తవ్యమును నిర్ణయించుకొనుట - దీనినే వివేకజ్ఞానప్రభావమున సంశయములన్నింటిని తొలగించుకొనుట యగును.

ప్రశ్న - 'ఆత్మవంతం' అను పదమునకు అర్థమేమి?

సమా - ఇంద్రియములతో గూడ అంతఃకరణముపై సంపూర్ణ అధికారముగల వానిని - అనగా మనస్సును ఇంద్రియములను తన వశమునందు ఉంచుకొనిన వానిని 'ఆత్మవంతం' అనుపదము తెలుపును.

ప్రశ్న - ఈ శ్లోకమున తెలుపబడిన విశేషణములతో గూడిన పురుషుని కర్మలు బంధింపవు అనగానేమి?

సమా - ఈ విశేషణములు గల పురుషుడు ఆచరించు శాస్త్ర విహితకర్మలు మమత, ఆసక్తి, ఫలేచ్ఛారహితము లగుటవలన అవి అతనిని బంధింపజాలవు.

*సంబంధము - ఈ విధముగ కర్మయోగిని ప్రశంసించి, కర్మయోగ స్థితుడవై యుద్ధమొనర్పుమని అర్జునుని ఆజ్ఞాపించి భగవానుడు ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-*

**తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగమ్ ఆతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 42 ॥**

తస్మాత్ = అందువలన
భారత! = ఓ అర్జునా!
హృత్స్థమ్ = (నీ) హృదయమునందున్న
ఏనమ్, అజ్ఞాన-సంభూతమ్ = ఈ అజ్ఞానజనితమైన
ఆత్మనః, సంశయమ్ = నీ సంశయమును
జ్ఞానాసినా = వివేకమనెడి ఖడ్గముచే
ఛిత్త్వా = ఛేదించి
యోగమ్ = సమత్వ రూపకర్మ యోగమునందు
ఆతిష్ఠ = స్థితుడవుకమ్ము
ఉత్తిష్ఠ = యుద్ధమునకై లెమ్ము

**కావున ఓ భారతా! (అర్జునా!) నీ హృదయమునందు గల అజ్ఞానజనితమైన ఈ సంశయమును వివేకజ్ఞానమను ఖడ్గముతో రూపుమాపి, సమత్వరూప కర్మయోగమునందు స్థితుడవై యుద్ధమునకు సన్నద్ధుడవగుము. (42)**

ప్రశ్న - ఇచట **'తస్మాత్'** అను పదము యొక్క భావమేమి?

సమా - హేత్వర్థకమైన **'తస్మాత్'** అనుపదమును ప్రయోగించి, భగవానుడు అర్జునుని కర్మయోగస్థితుడ వగుమని ప్రోత్సహించెను. పూర్వ శ్లోకమునందు వర్ణింపబడిన రీతిగా కర్మయోగమునందు స్థితుడైన మనుష్యుడు కర్మబంధముల నుండి ముక్తుడగును. కావున అర్జునుని కర్మయోగ స్థితుడవగుము అని ఆదేశించెను.

ప్రశ్న - **'భారత!'** అను సంబోధనయొక్క ప్రాముఖ్య మేమి?

సమా - రాజర్షియైన భరతుడు గొప్ప కర్మిష్ఠి, సాధనపరాయణుడు, ఉత్సాహి. అర్జునుడు ఆ భరతుని వంశమున జన్మించినవాడు. కావున ఆ మహాపురుషునివలెనే వీరత్వము, ధీరత్వము, గాంభీర్యము కలిగి కర్తవ్య పరాయణుడవగుమని ఉత్తేజపరచుటకు **'భారత!'** అని సంబోధించెను.

ప్రశ్న - సంశయమునకు విశేషణముగా ప్రయుక్తమైన **'ఏనమ్'** అను పదము ఏ 'సంశయము'ను తెలుపును? **'అజ్ఞానసంభూతం హృత్స్థమ్'** అను విశేషణములను ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - 41వ శ్లోకము నందలి **'జ్ఞానసంఛిన్న సంశయమ్'** అను సమాస విశేషణములను వివరించుచు అచట సంశయము యొక్క విస్తృతరూపము వ్యాఖ్యానింప బడినది. ఇచటి **'ఏనమ్' 'సంశయమ్'** అను ప్రయోగము దానినే సూచించును. ఈ సంశయమునకు కారణము అవివేకము అని చెప్పుటకు **'అజ్ఞానసంభూతమ్'** అను విశేషణము ప్రయుక్తమైనది. వివేకముద్వారా అవివేకము తొలగిపోయినప్పుడు వెంటనే సంశయ నివృత్తి జరుగును. ఈ సంశయమునకు స్థానము హృదయము (అంతఃకరణము). అంతఃకరణము వశమునందున్నప్పుడు సంశయము సహజముగనే అంతరించును. కావున **'హృత్స్థమ్'** అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ఆ సంశయమును ఛేదింపుమని అర్జునునకు చెప్పుటలోని ఆంతర్యమేమి? ఇంకను అర్జునుని అంతఃకరణమునందును అట్టి సంశయము ఉండెనా?

సమా - మొదట యుద్ధము చేయుట ఉచితమని భావించి, అర్జునుడు యుద్ధసన్నద్ధుడై రణభూమికి చేరెను. ఉభయ సేనల మధ్య రథమును నిలుపుమని శ్రీకృష్ణుని కోరెను. ఉభయ పక్షములయందును మరణించుటకును సిద్ధమై యుద్ధము చేయుటకు నిలిచియున్న బంధుగణమును చూచెను. మోహవశమున చింతాక్రాంతుడయ్యెను. యుద్ధము పాపకర్మమని తలంచెను. (1/28-47) భగవానుడు యుద్ధమునకు ప్రోత్సహించినను (2/3) అర్జునుడు కింకర్తవ్యతా విమూఢుడయ్యెను. గురుజనులతో యుద్ధమునకు సిద్ధము కాలేకపోయెను. (2/4) తనకు ఏది శ్రేయస్కరము? యుద్ధమున జయము ఎవరికి దక్కును? (2/6) ఈ విధముగ తన సందేహ పరంపరను ప్రకటించి, శ్రేయోమార్గమును చూపుము తన చిత్తభ్రమణమును తొలగింపుమని ప్రార్థించెను. (2/7) దీనిని బట్టి అర్జునుని అంతఃకరణము సంశయగ్రస్తమై మోహాధిక్యమున అతని వివేకశక్తి కుంటుబడినదనియు, దాని వలన అతడు కర్తవ్యమును నిర్ణయించుకొనలేక పోయెననియు స్పష్టమగుచున్నది. మఱియు ఆరవ అధ్యాయమున అర్జునుడు తన సంశయములను పోగొట్టగలవాడు భగవానుడే అని (6/39) పేర్కొనెను. గీతోపదేశమును పొందిన పిమ్మట తన సందేహములన్నియును తొలగిపోయినవి అని తెలిపెను. (18/73) భగవానుడును తన మాటలను నిస్సందేహముగ విశ్వసింపుమని ఆయా సందర్భములలో అర్జునునితో చెప్పుచు వచ్చెను (8/7 : 12/7) అర్జునుని అంతఃకరణము సంశయగ్రస్తమైన కారణమున అతడు క్షత్రియ ధర్మమైన యుద్ధమును త్యజించుటకు సిద్ధమయ్యెనని - దీనివలన తెలియుచున్నది.

కనుక భగవానుడు అర్జునునితో "నీ హృదయము నందున్న సంశయములన్నింటిని తొలగించుకొని నాయాజ్ఞ ననుసరించి యుద్ధమునకు సిద్ధము కమ్ము" అని పలికెను.

ప్రశ్న - ఇచ్చట అర్జునునితో నీ యొక్క సంశయమును నివృత్తి చేసికొనుము- అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు శ్రీకృష్ణభగవానునకు భక్తుడు, సఖుడు. కావున ఇతరుల అంతఃకరణములయందు ఏవైనను సంశయములున్నచో అనునయపూర్వకముగ వాటిని అతడు తొలగింపవలెననియు, అది సాధ్యము కానిచో కనీసము తన సందేహములనైనను పూర్తిగ నివృత్తి చేసికొనవలెననియు భగవానుడు బోధించెను.

ప్రశ్న - యోగస్థితుడవై యుద్ధమునకు సిద్ధము కమ్ము అని యనుటలోని విశేషమేమి?

సమా - ఇది ఈ యధ్యాయమును ముగించుచు చెప్పినమాట. అర్జునుడు మొదట తనకు శ్రేయస్కరమైన దానిని ఉపదేశింపుమని కోరెను. భగవానుడు అర్జునుని హితము కోరియే నిస్సంశయముగ యుద్ధమొనర్పుమని ఆజ్ఞాపించెను. అందును యోగస్థితుడవై యుద్ధ మొనర్పుమని చెప్పెను. అనగా మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను త్యజించి (యుద్ధ ఫలితములను గూర్చి ఆలోచింపక) యుద్ధము చేయుటయే అతనికి శ్రేయస్కరమని తెల్పెను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞాన, కర్మ, సన్న్యాసయోగోనామ చతుర్థోఽధ్యాయః ॥ ౪ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఐదవ అధ్యాయము - కర్మసన్న్యాసయోగము

**అధ్యాయ నామము :** ఈ పంచమాధ్యాయమున కర్మయోగనిష్ఠయు, సాంఖ్యయోగనిష్ఠయు వర్ణింపబడినవి. సాంఖ్య యోగమునకు సన్న్యాసయోగము పర్యాయవాచకము కనుక ఈ అధ్యాయమునకు కర్మసన్న్యాస యోగము అని పేరు వచ్చినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున 'సాంఖ్యయోగ', 'కర్మయోగము'లలో తనకేది శ్రేయస్కరమో తెలుపుమని అర్జునుడు శ్రీకృష్ణ భగవానుని కోరెను. 2వ శ్లోకమునందు అర్జునుని ప్రశ్నకు సమాధానముగ భగవానుడు సాంఖ్యయోగ కర్మయోగములు రెండును శ్రేయస్కరములే యనియు, కాని కర్మ సన్న్యాసము కంటెను సాధన సులభమైన కర్మయోగమే శ్రేష్ఠమని తెలిపెను. 3వ శ్లోకమున కర్మయోగియొక్క మహత్త్వమును తెలుపుచు, 4,5 శ్లోకములలో సాంఖ్యయోగ కర్మయోగముల ఫలమొక్కటేయగుటవలన ఆ రెండింటి ఏకత్వమును ప్రతిపాదించెను. 6వ శ్లోకమున కర్మ యోగమును ఆచరింపక సాంఖ్యయోగమును అనుష్ఠించుట క్లిష్టతరమని తెలుపుచు కర్మయోగఫలము తత్క్షణబ్రహ్మప్రాప్తి యని పేర్కొనెను. 7వ శ్లోకమునందు కర్మయోగినిర్లిప్తస్థితిని ప్రతిపాదించుచు 8,9 శ్లోకములయందు సాంఖ్యయోగియొక్క అకర్తృత్వమును నిర్దేశించెను. 10,11 శ్లోకములలో కర్మలను భగవదర్పణబుద్ధితో ఆచరించు కర్మయోగిని ప్రశంసించుచు, అట్టివాని కర్మలు ఆత్మశుద్ధి కారకములని తెలిపెను. 12వ శ్లోకమున సకామభావముతో ఆచరింపబడు కర్మలు బంధహేతువులనియు, నిష్కామకర్మలు పరమశాంతిని గూర్చునవియు పేర్కొనెను. 13వ శ్లోకమున, అంతఃకరణశుద్ధి గల సాంఖ్యయోగి యొక్క స్థితిని వర్ణించెను. 14,15 శ్లోకములయందు కర్మలను కర్తృత్వమును కర్మఫల సంయోగమును భగవంతుడు రచింపడనియు, అవి ప్రకృతి ద్వారా జరుగుచుండుననియు, ఆయా వ్యక్తుల పుణ్యపాపకర్మలను అతడు గ్రహింపడనియు, అజ్ఞానముచే జ్ఞానము కప్పబడుటవలన జీవులు మోహితులగుదురనియు తెలిపెను. 16వ శ్లోకమున పరమాత్మతత్త్వజ్ఞాన మహత్త్వమును దెలిపి, 17వ శ్లోకమున జ్ఞానయోగము యొక్క ఏకాంతసాధన విధానమును వర్ణించెను. పిదప 18 నుండి 20వ శ్లోకము వఱకును పరబ్రహ్మ పరమాత్మయందే నిరంతరము అభిన్న భావస్థితులైన మహాపురుషుల సమదృష్టిని, స్థితిని వర్ణించి, వారికి పరమగతి ప్రాప్తించునని తెలిపెను. 21వ శ్లోకమునందు అక్షయానందమును పొందుటకై చేయదగు సాధనను గూర్చియు, తత్ప్రాప్తిని గూర్చియు పేర్కొనెను. 22వ శ్లోకమున భోగములు దుఃఖకారకములు, నశ్వరములు అనియు తెలిపి, వివేకవంతులు వాటియందు ఆసక్తులు కారనియు నుడివెను. 23వ శ్లోకమునందు కామక్రోధముల వేగమునకు తట్టుకొనగల పురుషుని యోగి, మఱియు సుఖి అని పేర్కొనెను. 24 నుండి 26వ శ్లోకము వఱకును సాంఖ్యయోగి యొక్క అంతిమ స్థితిని, నిర్వాణబ్రహ్మప్రాప్తి కలిగిన జ్ఞానులైన మహాపురుషుల లక్షణములను తెలిపెను. 27, 28 శ్లోకములయందు ఫలసహితమైన ధ్యానయోగ వర్ణనము సంక్షిప్తముగా చేసెను. కడకు 29వ శ్లోకమున భగవంతుడే సమస్త యజ్ఞములకును భోక్తయనియు, సర్వలోకమహేశ్వరుడనియు, సకలప్రాణులకును పరమసుహృదుడనియు తెలిసికొనుటవలన కలుగు ఫలము పరమశాంతి ప్రాప్తియే అని పేర్కొనుచు ఈ ఐదవ అధ్యాయమును ముగించెను.

సంబంధము - మూడు, నాల్గు అధ్యాయములయందు శ్రీకృష్ణ భగవానుడు కర్మయోగమును అనేక విధముల ప్రశంసించుచు దానిని ఆచరింపుమని ప్రోత్సహించెను. కర్మయోగము ద్వారా భగవత్స్వరూపతత్త్వజ్ఞానము తనంతట తానే సిద్ధించుననియు తెలిపెను. (4/38). నాల్గవ అధ్యాయము నందలి చివరి (42వ) శ్లోకమున భగవంతుడు కర్మయోగమును అనుష్ఠింపుమని అర్జునుని ఆజ్ఞాపించెను. కాని అక్కడక్కడ బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నావపరే యజ్ఞం, యజ్ఞేనైవోపజుహ్వతి, తద్విద్ధి ప్రణిపాతేన మొదలగు వచనములద్వారా జ్ఞానయోగమును అనగా కర్మసన్న్యాసయోగమును ప్రశంసించెను. ఈ రెండింటిలో (కర్మయోగ, జ్ఞాన యోగములలో) తనకేది శ్రేయస్కరమో అర్జునుడు నిర్ణయించుకొనలేకపోయెను. కనుక తనకు శ్రేయస్కరమైన సాధన (మార్గము)ను సునిశ్చితముగా తెలుపుమని భగవంతుని ప్రార్థించుచున్నాడు-

### అర్జున ఉవాచ

**సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।**
**యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృష్ణ! | = కృష్ణా! | యోగమ్ చ, | = కర్మయోగమునూ | సునిశ్చితమ్ | = నిశ్చయముగా |
| కర్మణామ్, సన్న్యాసమ్ | = (ఒకసారి) కర్మసన్న్యాసమును | శంససి | = ప్రశంసించుచున్నావు | మే, శ్రేయః | = నాకు శ్రేయస్కరమో |
| | | ఏతయోః | = ఈ రెండింటిలో | తత్, ఏకమ్ | = ఆ ఒక్కదానిని |
| పునః | = మఱియొకసారి | యత్ | = ఏది | బ్రూహి | = తెలుపుము |

అర్జునుడుపలికెను - ఓ కృష్ణా! ఒక్కసారి కర్మసన్న్యాసమును, మరియొకసారి కర్మయోగమును ప్రశంసించుచున్నావు. నిశ్చయముగా ఈ రెండింటిలో నాకు ఏది శ్రేయస్కరమో చెప్పుము. (1)

ప్రశ్న - ఇచట 'కృష్ణ'! అని సంబోధించుటలో గల విశేషమేమి?

సమా - 'కృష్' ధాతువునకు ఆకర్షించుట/లాగుట అని యర్థము. "ణ" అనునది ఆనందవాచకము. భగవంతుడు నిత్యానంద స్వరూపుడు. కావున అందఱిని తనవైపు ఆకర్షించును. శ్రీకృష్ణుడు సర్వశక్తిమంతుడు. సర్వజ్ఞుడు. కావున అర్జునుని ప్రశ్నకు సమాధానము నిచ్చుటకు అతడే సర్వసమర్థుడు. కనుక అర్జునుడు సాభిప్రాయముగా 'కృష్ణ!' అని సంబోధించెను.

ప్రశ్న - కర్మసన్న్యాసము అనగా కర్మలను భౌతికముగ (ఆచరణాత్మకముగ) త్యజించుట యనియా?

సమా - నాల్గవ అధ్యాయమున ఎచ్చటను కర్మాచరణమును త్యజింపుమని భగవంతుడు ప్రస్తావింపనే లేదు. కర్మత్యాగము చేయుమని అర్జునుని ఎప్పుడును ఆజ్ఞాపింపలేదు. పైగా పెక్కు సందర్భములలో నిష్కామ భావముతో కర్మల నాచరింపుమనియే చెప్పెను. (4/15,42). కావున ఇచట కర్మసన్న్యాసమనగా కర్మాచరణమును త్యజించుట యనిగాదు. కర్మలన్నింటియందును కర్తృత్వాభిమానమును వీడి గుణములు గుణములలో ప్రవర్తించుచున్నవని భావించుట (3/28). నిరంతరము పరమాత్మస్వరూపము నందే ఏకీభావముతో స్థితుడై యుండుట, సర్వదా సర్వత్ర బ్రహ్మదృష్టి కలిగియుండుట (4/24)–ఇదియే జ్ఞానయోగము. ఇదియే కర్మసన్న్యాసము. నాల్గవ అధ్యాయమున జ్ఞానయోగ ప్రశంస ఈ రీతిగనే చేయబడినది. దానిని అనుసరించియే అర్జునుడు ఈ ప్రశ్నవేసెను.

సన్న్యాసము, కర్మయోగము ఈ రెండును కల్యాణ కారకములే. ఈ యధ్యాయమునందే నాల్గు, ఐదు శ్లోకములలో సాంఖ్యమనియు, ఆఱవ శ్లోకములో సన్న్యాసము అనియు పేర్కొని, కర్మ సన్న్యాసమనగా సాంఖ్యయోగము లేక జ్ఞానయోగమనియు కర్మలను వాస్తవముగా త్యజించుట కాదనియు స్పష్టపఱచెను. అంతేగాక కర్మలను ఆచరణాత్మకముగ త్యజించినంత మాత్రముననే శుభములు కలుగవు (3/4) ఆచరణాత్మకముగ కర్మలను త్యజించుట అసంభవము కూడ (3/5, 18/11) కావున ఇచట కర్మసన్న్యాసమనగా జ్ఞానయోగమే గాని కర్మాచరణమును త్యజించుట కానేకాదు అని భావింపవలెను.

ప్రశ్న - మూడవ అధ్యాయ ప్రారంభమున అర్జునుడు జ్ఞానయోగ కర్మయోగములలో ఏది తనకు శ్రేయస్కరమో తెలుపుమని అడిగియుండెను. ఇపుడు మఱల అదే ప్రశ్నను అడుగుటలోని ఆంతర్యమేమి?

సమా - అచట అర్జునుడు జ్ఞానయోగ, కర్మయోగములను గూర్చి అడుగలేదు. అక్కడి ప్రశ్నలోని ఆంతర్యమే వేఱు. నీ ఉద్దేశ్యములో కర్మకంటెను జ్ఞానమే శ్రేష్ఠమైనచో నన్ను ఈ ఘోరమైన కర్మయందు ఏల నియోగించుచున్నావు? ద్వైవిధ్యముగా నున్న నీ మాటలు నాకు బోధపడుట లేదు. ఏదో ఒక విషయమును స్పష్టముగా చెప్పుము అనునది అప్పటి ప్రశ్న.

ఇప్పటి ప్రశ్న తీరు దానికి భిన్నమైనది. అర్జునుడు కర్మకంటెను జ్ఞానము శ్రేష్ఠమనిగాని, భగవానుని వాక్యములు అస్పష్టములనిగాని భావించుట లేదు.

భగవంతుడు జ్ఞానయోగ కర్మయోగములను వేర్వేఱుగా తెలిపి, ఆ రెండింటిని ప్రశంసించుచున్నాడు (3/3). భగవత్ప్రాప్తికి ఈ రెండును ఉత్తమ సాధనములేయని అర్జున డెఱింగియు వాటిలో తనకేది శ్రేయస్కరమో తెలుపుమని ఇప్పుడడుగు చున్నాడు. కావున 3వ అధ్యాయమునందలి అర్జునుని ప్రశ్న ఇక్కడ పునరావృత్తము కాలేదు.

ప్రశ్న - 3వ అధ్యాయమునందలి 19, 30 శ్లోకములలోను, నాల్గవ అధ్యాయమునందలి 15, 42 శ్లోకములలోను, కర్మయోగమును అనుష్ఠింపుమని భగవానుడు అర్జునుని స్పష్టముగా ఆదేశించియే యుండెను. మఱల అదే విషయమును భగవానుని ప్రశ్నించుటలో విశేషమేమి?

సమా - ఈ విధముగ ప్రస్తావించుట సముచితమే. నాల్గవ అధ్యాయమునందలి 24వ శ్లోకమునుండి 30వ శ్లోకము వఱకు కర్మయోగ జ్ఞానయోగముల రెండింటి నిష్ఠల ననుసరించి, వివిధ సాధనమార్గములను యజ్ఞములనెడి పేరుతో వర్ణించెను. ద్రవ్యమయయజ్ఞముల కంటెను జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమని ప్రశంసించెను (4/33). తత్త్వద్రష్టలైన జ్ఞానులకడ జ్ఞానోపదేశమును పొందుమని ప్రేరేపించెను (4/34,35). మఱల కర్మయోగముద్వారా సంపూర్ణసిద్ధి నొందిన మనుజునకు తత్త్వజ్ఞానము తనంతటతానే లభించుననియు తెలిపెను (4/38). ఈ విధముగ రెండు సాధనల ప్రశంసలను వినిన పిదప అర్జునుడు తాననుసరింపదగిన మార్గమును నిర్ణయించుకొనలేక పోయెను. కావున అర్జునుడిట్లు ప్రశ్నించుట యుక్తమే.

ఓ ఆనందకంద శ్రీకృష్ణ! తత్త్వజ్ఞానులను ఆశ్రయించి, శ్రవణ మననాది సాధన పూర్వకముగ జ్ఞానయోగ విధులను ఆచరించి, యథార్థ తత్త్వ జ్ఞానమును పొందవలెనా? లేక ఆసక్తి, ఫలేచ్ఛలు లేకుండ నిష్కామభావముతో భగవదర్పణముగ కర్మలను ఆచరించుచు కర్మయోగ విధానముద్వారా దానిని పొందవలెనా? దీనిని స్పష్టపరచుమని అర్జునుడు శ్రీకృష్ణుని కోరెను.

సంబంధము - అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణుడు సమాధానమునిచ్చుచున్నాడు-

**శ్రీభగవాన్ ఉవాచ**

**సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।**
**తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥ 2 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సన్న్యాసః | = సన్న్యాసము | నిఃశ్రేయసకరౌ | = పరమశ్రేయస్సును గూర్చునవియే | కర్మసన్న్యాసాత్ | = కర్మసన్న్యాసముకంటెను |
| చ | = మఱియు | | | కర్మయోగః | = (సాధనసులభమైన) కర్మయోగము |
| కర్మయోగః | = కర్మయోగము | తు | = అయితే | | |
| ఉభౌ | = (అను) ఈ రెండును | తయోః | = ఆ రెండింటిలో | విశిష్యతే | = శ్రేష్ఠమైనది |

శ్రీ కృష్ణ భగవానుడు పలికెను - కర్మసన్న్యాసము, కర్మయోగము అను ఈ రెండును పరమకల్యాణదాయకములే. కాని ఈ రెండింటిలోను కర్మసన్న్యాసముకంటెను కర్మయోగము సాధనయందు సుగమముగుటవలన శ్రేష్ఠమైనది. (2)

ప్రశ్న - ఇచట 'సన్న్యాస' పదమునకు అర్థమేమి?

సమా - 'సం' అనగా 'సమ్యక్' రీతి చక్కగా లేక బాగుగా, 'న్యాస'మనగా 'త్యాగము'. కావున సన్న్యాసమునకు పూర్ణత్యాగము అని యర్థము. మనోవాక్కాయ కర్మలయందు కర్తృత్వాభిమానమును వదలుట, శరీరమునందును, ప్రాపంచిక విషయములయందును అహంకార, మమకారములను పూర్తిగా త్యజించుట - ఇట్టి త్యాగమునే సన్న్యాసము అని యందురు. గీత యందు సన్న్యాసము, సన్న్యాసి అను పదములు సందర్భాను సారముగా వేర్వేఱు అర్థములలో ప్రయుక్తములైనవి. సన్న్యాసమనగా కర్మలను

భగవదర్పణము గావించుట (3/30, 12/6, 18/57) కామ్యకర్మలను త్యజించుట (18/2) మనస్సుతో కర్మలను త్యజించుట (5/13) ఒకచోట కర్మయోగమును (6/2) మరొకచోట కర్మలను ఆచరణాత్మకముగ త్యజించుట అనియు (3/4, 18/7) మఱొకచోట సాంఖ్యయోగము అనగా జ్ఞాననిష్ఠ (5/6, 18/49) అనియు తెల్పుట జరిగెను. ఇదే విధముగ కర్మయోగిని సన్న్యాసి యనియు (6/1, 18/12) 'సన్న్యాసయోగయుక్తాత్మా' అనియు (9/28) తెల్పుట జరిగినది. కావున సన్న్యాసము అను పదము గీతయందు అన్నిచోట్లను ఒకే అర్థములో ప్రయుక్తము కాలేదని తెలియుచున్నది. సందర్భానుసారము అది వేర్వేఱు అర్థములను కలిగియున్నది. ఇచట సాంఖ్యయోగ, కర్మయోగముల తులనాత్మక వివేచనము గలదు. 4,5 శ్లోకములలో సన్న్యాసము అనగా సాంఖ్యమని భగవానుడు చక్కగా స్పష్టీకరించెను. కావున ఇచట సన్న్యాసమనగా సాంఖ్యయోగమని భావించుటయే యుక్తము.

ప్రశ్న - సన్న్యాసము (సాంఖ్యయోగము), కర్మ యోగము - ఈ రెండును కల్యాణ కారకములేయని తెలుపుట వలన రెండును కలిసియే కల్యాణరూప ఫలమును ఇచ్చునని భావించినచో దోషమేమి?

సమా - ఒకే సమయమున ఒకే వ్యక్తి, సాంఖ్యయోగ, కర్మయోగ సాధనలను చేయజాలడు. ఏలనన కర్మయోగి సాధనసమయమున కర్మలు, కర్మఫలములు, పరమాత్మ, తాను వేర్వేఱు అని భావించి, కర్మఫలమునందు ఆసక్తిని త్యజించి, ఈశ్వరార్పణ బుద్ధితో సమస్త కర్మలను ఆచరించును (3/30, 5/10, 9/27,28, 12/10, 18/56,57).

సాంఖ్యయోగి మాయవలన ఉత్పన్నమైన గుణములన్నియును గుణములయందు ప్రవర్తిల్లుచున్న వనియు (3/28) లేక ఇంద్రియములు ఇంద్రియార్థముల యందు ప్రవర్తిల్లుచున్నవనియు (5/8-9) భావించి, మనస్సు, ఇంద్రియములు, శరీరము ద్వారా జరుగు క్రియలన్నింటి యందును కర్తృత్వాభి మానమును వదలి, కేవలము సర్వవ్యాపి, సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపము నందే అభిన్న (అభేద) భావస్థితుడైయుండును. కర్మయోగి తన కర్మలకు తననే కర్తగా భావించుచుండును (5/11). సాంఖ్యయోగి తనను కర్తగా భావింపడు (5/8,9). కర్మయోగి తన కర్మలను భగవంతునకు అర్పణము చేయును (9/, 27,28). సాంఖ్యయోగి మనస్సు, ఇంద్రియముల ద్వారా జరుగు అహంకారరహిత క్రియలను కర్మలుగా భావింపడు. (18/17). కర్మయోగి పరమాత్మను తనకంటెను వేఱైన వానినిగా భావించును (12/6,7). సాంఖ్యయోగి సర్వదా భగవంతునియెడ అభేద భావమునే కలిగియుండును (18/20). కర్మయోగి ప్రకృతిని, ప్రకృతియందలి పదార్థముల ఉనికిని అంగీకరించును (18/61). సాంఖ్యయోగి బ్రహ్మము తప్ప ఇతరమైన దేని ఉనికిని అంగీకరింపడు (13/30). కర్మయోగి కర్మల ఫలములను కర్మల ఉనికిని అంగీకరించును. సాంఖ్యయోగి బ్రహ్మముకంటె వేఱైన కర్మలను గాని వాటి ఫలముల ఉనికిని గాని అంగీకరింపడు. వాటితో తనకు ఎట్టి సంబంధమునూ గుర్తింపడు.

ఈ విధముగ ఈ ఇరువురి సాధనల యందును, విశ్వాసముల యందును తూర్పు పడమరలకు వలె మిక్కిలి భేదముగలదు. కనుక ఈ సత్య సూత్రము ననుసరించి, ఈ రెండు యోగనిష్ఠల సాధనలను ఒకే వ్యక్తి ఏకకాలమున చేయజాలడు. సాంఖ్యయోగ కర్మయోగముల రెండింటిలో తనకు ఏది శ్రేయస్కరమో నిశ్చయముగా తెలుపుమని అర్జునుడడిగి యుండెను. కర్మసన్న్యాసము కంటెను కర్మయోగమే శ్రేష్ఠమైనదనియు సాంఖ్యయోగులకు లభించు ఫలమే కర్మయోగులకును లభించుననియు భగవానుడు తెలిపెను. ఈ వాక్యములను బట్టి ఈ రెండు యోగముల నిష్ఠలు స్వతంత్రములని స్పష్టమగుచున్నది. ఈ రెండు యోగముల సాధన ఫలము యథార్థతత్త్వజ్ఞానము ద్వారా పరమకల్యాణ స్వరూపుడైన పరమేశ్వరుని ప్రాప్తియే యైనప్పుడు సాంఖ్యయోగమును ఆచరింపుమని అర్జునుని ఆదేశింపవచ్చును గదా! కాని అర్జునుని స్వభావమును (క్షత్రియ స్వభావమును) అర్హతను అనుసరించి, సాధన సౌలభ్యమును బట్టి అర్జునునకు సాంఖ్యయోగము కంటెను కర్మయోగమే శ్రేష్ఠమైనదని తలచి, కర్మయోగమునే అనుష్ఠింపుమని భగవానుడు ఆదేశించెను.

ప్రశ్న - సన్న్యాసము (జ్ఞానయోగము), కర్మ యోగము రెండును స్వతంత్రములై పరమ కల్యాణ కారకములే యైనప్పుడు సాంఖ్యయోగము కంటెను కర్మయోగమే శ్రేష్ఠమైనదని భగవానుడు చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - కర్మయోగి కర్మలను ఆచరించుచున్నను సదా సన్న్యాసియే. అతడు హాయిగా అనాయాసముగా సంసార

బంధములనుండి విముక్తుడగును (5/3). అతనికి శీఘ్రముగ పరమాత్మ ప్రాప్తి కలుగును (5/6). ప్రతి స్థితి (అవస్థ) యందును భగవంతుడు అతనిని రక్షించును. కర్మయోగమును కొద్దిగా అనుష్ఠించిన వాడును జనన మరణ రూప భయము నుండి బయటపడును (2/40). కాని జ్ఞానయోగసాధన క్లిష్టమైనది. మొదట కర్మయోగ సాధన చేయనిదే జ్ఞానయోగసాధన కష్టమగును. ఈ కారణములన్నింటి వలనను జ్ఞానయోగము కంటెను కర్మయోగాచరణమే విశిష్టమైనదని తెలిపెను.

సంబంధము - సాంఖ్యయోగము కంటెను కర్మయోగమే శ్రేష్ఠమైనదని తెల్పియుండెను. ఆ విషయమునే ధ్రువపఱచుటకు ఇప్పుడు కర్మయోగిని ప్రశంసించుచున్నాడు-

**జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।**
**నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే ॥ 3 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = ఓ అర్జునా! | నిత్యసన్న్యాసీ | = సదా సన్న్యాసిగా | | ద్వంద్వరహితుడు |
| యః | = ఎవడైతే | జ్ఞేయః | = తెలిసికొన దగినవాడు | సుఖమ్ | = సుఖముగా |
| న, ద్వేష్టి | = (ఎవరినీ) ద్వేషింపడో | హి | = ఏలనన | బంధాత్ | = సంసార బంధముల నుండి |
| న, కాంక్షతి | = (దేనినీ) ఆశింపడో | నిర్ద్వంద్వః | = రాగద్వేషాది | ప్రముచ్యతే | = ముక్తుడగును |
| సః | = అట్టి కర్మయోగి | | | | |

**మహాబాహూ! ఎవ్వరినీ ద్వేషింపని, దేనినీ కాంక్షింపని కర్మయోగిని నిత్యసన్న్యాసిగా ఎఱుంగవలెను. ఏలనన రాగద్వేషాది ద్వంద్వములను అధిగమించినవాడు అవలీలగా సంసారబంధములనుండి ముక్తుడగును. (3)**

ప్రశ్న - ఇచ్చట కర్మయోగిని నిత్యసన్న్యాసి అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - కర్మయోగి ఎవ్వరినీ ద్వేషింపడు ఏ వస్తువునూ కాంక్షింపడు. అతడు రాగద్వేషాది ద్వంద్వములకు అతీతుడు. వాస్తవముగా సన్న్యాసి యొక్క లక్షణములు ఇట్టివియే. రాగద్వేషరహితుడే నిజమైన సన్న్యాసి. అట్టివానికి సన్న్యాసాశ్రమ స్వీకారముతో గాని, సాంఖ్యయోగముతో గాని పనియే లేదు. అతడు సమస్త కర్మలను చేయుచున్నను సదా సన్న్యాసియే. అతడు నిశ్చింతగా (అనాయాసముగా) కర్మబంధముల నుండి విముక్తుడగును. కావున కర్మయోగిని నిత్యసన్న్యాసియని పేర్కొని, భగవానుడు అతని మహత్త్వమును ప్రకటించెను.

ప్రశ్న - కర్మయోగి (కర్మలను ఆచరించుచును) కర్మబంధముల నుండి ఎట్లు సుఖముగా విముక్తుడగును?

సమా - మానవునకు శ్రేయోమార్గ సాధనలో విఘాతములను కలిగించు ప్రబల శత్రువులు రాగద్వేషములే. వీటి ప్రభావముననే మానవుడు కర్మబంధములయందు చిక్కుకొనును. కర్మయోగి రాగద్వేషముల కతీతుడై కర్మలను భగవదర్థముగా చేయును. కనుక భగవత్కృపా ప్రభావమున అతడు అనాయాసముగా కర్మబంధముల నుండి ముక్తుడగును.

ప్రశ్న - బంధముల నుండి ముక్తుడగుట యనగానేమి?

సమా - అజ్ఞానమూలకములైన శుభాశుభ కర్మలును, వాటి ఫలములును బంధకారకములు. ఈ బంధములలో చిక్కుకొనిపోవుట వలననే జీవులు (ప్రాణులు) జననమరణ చక్రములో నిరంతరము తిరుగుచుందురు. ఈ జననమరణ రూప బంధములనుండి శాశ్వతముగ బయటపడుటయే బంధవిముక్తుడగుట యగును.

సంబంధము - సాధన సౌలభ్య కారణమున సాంఖ్యయోగముకంటెను కర్మయోగము శ్రేష్ఠమైనదని విశదీకరింపబడెను. ఈ రెండు నిష్ఠలయొక్క ఫలము 'నిశ్శ్రేయసము' - అనగా 'పరమ పదప్రాప్తి' అని తెలుపుట జరిగెను. తదనుసారముగ రెండు నిష్ఠలయొక్క ఫలములలో భగవంతుడు ఏకత్వమును ప్రతిపాదించుచున్నాడు-

**సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః ।**
**ఏకమప్యాస్థితః సమ్యక్ ఉభయోర్విందతే ఫలమ్ ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| బాలాః | = మూర్ఖులు | ప్రవదంతి | = చెప్పుచుందురు | సమ్యక్, ఆస్థితః | = బాగుగా స్థితుడైనవాడు |
| సాంఖ్యయోగౌ | = సన్న్యాసయోగము, కర్మయోగము | న, పండితాః | = పండితులు అట్లు చెప్పరు | ఉభయోః, ఫలమ్ | = రెండింటి ఫలమగు పరమాత్మను |
| పృథక్ | = వేర్వేఱు ఫలములను ఇచ్చునవిగా | (హి) | = ఎందుకనగా | విందతే | = పొందును. |
| | | ఏకమ్, అపి | = ఆ రెండింటిలో ఏ ఒక్క దానియందైనను | | |

**సాంఖ్య, కర్మయోగములు వేర్వేఱుఫలములను ఇచ్చునని మూర్ఖులు పలికెదరు. పండితులట్లు పలుకరు. ఆ రెండింటిలో ఏ ఒక్కదానినైనను బాగుగా (విధివిధానముగ) ఆచరించినవాడు ఈ రెండింటి ఫలస్వరూపమైన పరమాత్మను పొందును. (4)**

ప్రశ్న - సాంఖ్యయోగ, కర్మయోగములు వేర్వేఱు అని భావించువారు మూర్ఖులు (బాలురు) అని పేర్కొనుటలోని అర్థమేమి?

సమా - సాంఖ్యయోగము, కర్మయోగము అను రెండింటి ఫలము పరమార్థ తత్త్వజ్ఞానము ద్వారా పరమపదప్రాప్తియే. రెండింటి ఫలము ఒకటియేయైనను వాటి ఫలములలో భేదములను ఊహించుచు సాధనలు వేర్వేరు అని భావించువారు బాలకులు (అజ్ఞానులు). రెండింటి సాధన ప్రక్రియలలో భేదమున్నను ఫలములలో ఏకత్వము ఉండుట వలన వాస్తవముగ అవి రెండును ఒకటియే.

ప్రశ్న - కర్మయోగఫలము పరమార్థజ్ఞానము ద్వారా పరమపదప్రాప్తి - అనుట సముచితము. ఈ విషయమునే భగవంతుడు పెక్కు సందర్భములలో స్పష్టపఱచెను. నేను వారికి బుద్ధియోగము నిచ్చెదను. దాని ద్వారా వారు నన్ను చేరుకొందురు (10/10). వారిపై అనుగ్రహమును చూపుటకై జ్ఞానరూపజ్యోతి ద్వారా వారి అజ్ఞానాంధకారమును తొలగింతును (10/11). కర్మయోగము వలన అంతఃకరణ శుద్ధి కలిగి తత్త్వజ్ఞానము తనంతట తానే ప్రాప్తించును (4/38). ఇత్యాది వచనముల ద్వారా భగవానుడు పైవిషయములనే విశదపరచెను. కాని సాంఖ్యయోగము స్వయముగ తత్త్వజ్ఞానమే గదా! అయినచో (అదియే తత్త్వజ్ఞానమైనచో) దాని ఫలము తత్త్వజ్ఞానము ద్వారా మోక్షప్రాప్తియని చెప్పుట ఎట్లు సమంజసము?

సమా - సాంఖ్యయోగము పరమార్థ తత్త్వజ్ఞానము యొక్క పేరు కాదు. అది తత్త్వజ్ఞానుల ఉపదేశానుసారము ఆచరింపబడు సాధనమార్గము యొక్క పేరు .. 13వ అధ్యాయమునందలి 24వ శ్లోకములో ధ్యానయోగము, సాంఖ్యయోగము, కర్మయోగము అను మూడును ఆత్మదర్శనమునకు వేర్వేఱు స్వతంత్ర సాధనలుగా తెల్పబడినవి. కనుక సాంఖ్యయోగఫలము పరమార్థ జ్ఞానముద్వారా మోక్షప్రాప్తియని చెప్పుటయే యుచితము. 18వ అధ్యాయమునందలి 49వ శ్లోకమునుండి 55వ శ్లోకము వఱకును సాధకులు బ్రహ్మభూతులగుటను వర్ణించెను. అందు అభిన్న భావముతో బ్రహ్మభూత స్థితియను సాంఖ్యయోగమును పొందిన పిదప దాని ఫలరూపములైన తత్త్వజ్ఞాన పరాభక్తిని, దాని ద్వారా పరమాత్మ స్వరూప యథార్థ జ్ఞానమును పొంది, అందు ప్రవేశించును - అని తెలుపబడెను. కావున సాంఖ్యయోగసాధనవలన యథార్థ తత్త్వజ్ఞానమును పొందిన పిదప మోక్షప్రాప్తి కలుగునని స్పష్టమగుచున్నది.

ప్రశ్న - పండిత శబ్దమున కర్థమేమి?

సమా - పండా అనగా పరమార్థ తత్త్వజ్ఞానరూప బుద్ధి యని యర్థము - పండా కలవాడు పండితుడు. కావున భగవత్తత్త్వ జ్ఞానము సిద్ధించిన మహాపురుషుడు పండితుడు.

ప్రశ్న - ఒకే నిష్ఠా సాధనయందున్నవాడు (ఒకే నిష్ఠాస్థితి యందున్నవాడు) ఒక ఫలమును (ఒకే ఫలమును) మాత్రమే పొందుచుండుట సహజము. అంతేగాని ఒక నిష్ఠ యందు స్థితుడైనవాడు రెండింటి ఫలములను ఎట్లు పొందును?

సమా - రెండునిష్ఠలఫలము పరమార్థ జ్ఞానము ద్వారా

పరమాత్మ ప్రాప్తియే. కావున ఒక నిష్ఠయందు పూర్తిగా స్థితుడైన వానికి రెండింటి ఫలము లభించుననుట సమంజసమే. కర్మయోగ ఫలము సాంఖ్యయోగము అయినచో, సాంఖ్యయోగ ఫలము భగవత్సాక్షాత్కారరూప మోక్షమైనచో రెండింటి ఫలములయందు భేదముండుట వలన అట్లు చెప్పుట (ఒక నిష్ఠయందు స్థితుడైనవాడు రెండింటి ఫలములను పొందునని చెప్పుట)కు వీలులేదు గదా! ఏలనన అట్లు భావించినచో సాంఖ్యయోగమునందు స్థితుడైనవాడు కర్మయోగఫలమైన సాంఖ్యయోగమునందు మొదటనే స్థితుడైయున్నాడుగదా! మఱి అతడు కర్మయోగఫలమును ఎట్లు పొందును? అట్లే కర్మయోగము నందు చక్కగా స్థితుడైనవాడు ఒకవేళ సాంఖ్యయోగము ద్వారా పరమాత్మను పొందినచో అది సాంఖ్యయోగఫలమే యౌను గదా! అది కర్మయోగ ఫలము ఎట్లగును? కావున ఒక నిష్ఠయందు మాత్రమే చక్కగా స్థితుడైనవాడు రెండింటి ఫలమును పొందునని ఎట్లు చెప్పనగును? కనుక ఈ రెండు నిష్ఠలును స్వతంత్రములై నప్పటికిని, రెండింటి ఫలము మాత్రము ఒక్కటే. కాబట్టి ఒక నిష్ఠయందు చక్కగా స్థితుడైనట్టి వానికి రెండింటి ఫలము ప్రాప్తించునను మాట అర్థయుక్తమే. 13వ అధ్యాయము నందలి 24వ శ్లోకమునందును భగవానుడు ఆత్మ సాక్షాత్కారమునకై ఈ రెండును స్వతంత్ర సాధనలని పేర్కొనెను.

ప్రశ్న - మొదటి శ్లోకమున అర్జునుడు కర్మసన్న్యాసమును, కర్మయోగమును ప్రస్తావించి, ఆ రెండింటిలో తనకేది శ్రేయస్కరమో తెలుపుమని ప్రశ్నించియుండెను. రెండవ శ్లోకమున భగవానుడు ఆ రెండును కల్యాణకారకములే అని తెలిపియుండెను. మఱి అదే ప్రకరణమున ఇచట సాంఖ్యము, యోగము అని తెలిపి, ఆ రెండింటి ఫలము ఒకటేయని పేర్కొనుటలో గల విశేషమేమి?

సమా - కర్మసన్న్యాసమనగా కర్మలను భౌతికముగ (ఆచరణాత్మకముగ) వదలివేయుటయనియు, కర్మయోగమనగా కర్మలను ఏదోవిధముగ చేయుట యనియు భావించి, లోకులు భ్రమపడకుండునట్లుగా ఈ రెండు శబ్దార్థముల మధ్యగల తారతమ్యమును తెలుపుటకు కర్మసన్న్యాసమనగా సాంఖ్యమనియు, సిద్ధి-అసిద్ధుల యెడ సమత్వ రూపయోగమే కర్మయోగమనియు (2/48) భగవంతుడు స్పష్టపఱచెను. కనుక మరియొక పదప్రయోగముతో భగవానుడు క్రొత్త విషయమునేమియు తెలుపలేదు.

ప్రశ్న - ఇక్కడ 'అపి' అను అవ్యయ ప్రయోగమువలన తెలియవచ్చు విశేషమేమి?

సమా - చక్కగా అనుష్ఠించినపుడు రెండు సాధనలుగూడ ఫలమునిచ్చుటలో సర్వథా స్వతంత్రములు, సమర్థములు అని తెల్పుటకే 'అపి' అను అవ్యయప్రయోగము చేయబడినది.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥ 5 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్, స్థానమ్ | = ఏ పరంధామము | గమ్యతే | = పొందబడును | ఏకమ్ | = ఫలవిషయమున ఒక్కదానినిగా |
| సాంఖ్యైః | = జ్ఞానయోగులచేత | యః | = ఏ పురుషుడు | పశ్యతి | = చూచునో |
| ప్రాప్యతే | = పొందబడునో | సాంఖ్యమ్ | = జ్ఞానయోగమును | సః, చ | = అతడే |
| తత్ | = ఆస్థానము | చ | = మఱియు | పశ్యతి | = నిజముగా చూచువాడు (నిజమైన ద్రష్ట). |
| యోగైః, అపి | = కర్మయోగులచేతను | యోగమ్ | = కర్మయోగమును | | |

జ్ఞానయోగులు పొందు పరంధామమునే కర్మయోగులును పొందుదురు. జ్ఞానయోగఫలమును, కర్మయోగఫలమును ఒక్కటిగా చూచువాడే యథార్థమును గ్రహించును. (5)

ప్రశ్న - సాంఖ్యయోగ, కర్మయోగములు రెండును స్వతంత్రసాధనమార్గములు. రెండింటి సాధన ప్రక్రియలును (ఇంతకుముందు చెప్పినట్లుగా) తూర్పు, పడమర మార్గములలో పయనించువారి గమనముల వలె విభిన్నదిశలలో సాగునని. అట్లైనప్పుడు ఈ రెండు యోగముల సాధకులకు ఒకే ఫలము ఎట్లు లభించును?

సమా - భారతదేశమునుండి అమెరికాకు వెళ్ళగోరు మనుష్యుడు సూటిగా పూర్వదిశయందే పయనించినను, లేక పశ్చిమదిశయందే పయనించినను అమెరికా చేరును. అట్లే సాంఖ్యయోగ, కర్మయోగ ప్రక్రియలు విభిన్నములేయైనను సాధకుడు వానిలో ఏ ఒక్కదానినైనను దృఢదీక్షతో లక్ష్యసిద్ధి వఱకు అనుష్ఠించినచో రెండింటికిని పరమలక్ష్యమైన పరమాత్మను చేరును.

సంబంధము - సాంఖ్యయోగ కర్మయోగఫలముల ఏకత్వమును తెలిపి, కర్మయోగసాధన వైశిష్ట్యమును స్పష్టపఱచుచున్నాడు-

**సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥ 6 ॥**

తు = అయితే
మహాబాహో! = ఓ మహాబాహూ!
అయోగతః = కర్మయోగమును అనుష్ఠింపక
సన్న్యాసః = సన్న్యాసము (శరీరేంద్రియ మనస్సులద్వారా జరుగు కర్మలన్నింటి యందును కర్తృత్వమును త్యజించుట)
ఆప్తుమ్ = పొందుట
దుఃఖమ్ = కష్టము
మునిః = భగవత్స్వరూపమును మననము చేయు
యోగయుక్తః = కర్మయోగి
బ్రహ్మ = పరబ్రహ్మ పరమాత్మను
నచిరేణ = శీఘ్రముగా
అధిగచ్ఛతి = పొందును.

**కాని ఓ అర్జునా! కర్మయోగమును అనుష్ఠింపక సన్న్యాసము అనగా మనస్సు, ఇంద్రియములు, శరీరములద్వారా జరుగు కర్మలన్నింటియందును కర్తృత్వమును త్యజించుట కష్టము. భగవత్స్వరూపమును మననముచేయు కర్మయోగి పరబ్రహ్మపరమాత్మను శీఘ్రముగ పొందగలడు.(6)**

ప్రశ్న - 'తు' అను అవ్యయమును ఇచట ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా- ఇచట 'తు' అను అవ్యయము విలక్షణార్థకము. సన్న్యాస (సాంఖ్యయోగ) కర్మయోగముల ఫలము ఒకటేయైనను సాధనయందు కర్మయోగముకంటెను సాంఖ్యయోగము క్లిష్టమైనది - అని తెలుపుటకు 'తు' ప్రయుక్తమైనది.

ప్రశ్న - అర్జునుని 'మహాబాహో!' అని సంబోధించుటలో గల విశిష్టత యేమి?

సమా - గొప్ప బాహుబలము కలవానిని మహాబాహువు అనియందురు. అర్జునుడు మహాబాహువు. బాహు శబ్దమునకు సోదరుడు, మిత్రుడు అనియును అర్థములు గలవు. అర్జునుని సోదరుడైన యుధిష్ఠిరుడు గొప్ప ధర్మాత్ముడు. మిత్రుడైన శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్ముడు. స్వయముగా మిక్కిలి బాహుబలముగల అర్జునునకు అట్టి సోదర మిత్రుల సహాయముండుట వలన కర్మానుష్ఠానము (అది ఎంతగా జటిలమైనది యైనను) సులభసాధ్యమే.

ప్రశ్న - సాంఖ్యయోగము, కర్మయోగము - అను రెండును స్వతంత్ర సాధనమార్గములే యైనప్పుడు కర్మయోగమును అనుష్ఠింపక సన్న్యాస(యోగ)మును ఆచరించుట కష్టము అని చెప్పుట యెట్లు?

సమా - ఈ రెండును స్వతంత్ర సాధన మార్గములే యైనను ఆ రెండింటి మధ్య సౌలభ్యకాఠిన్య భేదములున్నట్లు భగవానుడు స్పష్టపఱచెను. ఒక ముముక్షువు కలడను కొందము. ఆ ముముక్షువు యొక్క దృష్టిలో దృశ్య ప్రపంచమంతయును స్వప్న జగత్తువలె మిథ్య. బ్రహ్మము

మాత్రమే సత్యము. ఈ ప్రపంచమంతయును మాయద్వారా ఆ బ్రహ్మమునందే అధ్యారోపితమైనది. వాస్తవముగ బ్రహ్మేతరమైనది ఏదియును లేదు. కాని అతని అంతఃకరణము రాగద్వేషములకును, కామక్రోధాది దోషములకును లోనైనది, గావున శుద్ధముగాదు. అంతఃకరణ శుద్ధికై అతడు ఎట్టి ప్రయత్నమును చేయక కేవలము తన విశ్వాసము మీదనే ఆధారపడి, సాంఖ్యయోగ సాధనకు ఉద్యుక్తుడైనచో రెండవ అధ్యాయము నందలి 11వ శ్లోకము నుండి 30వ శ్లోకము వఱకును 18వ అధ్యాయము నందలి 49వ శ్లోకము నుండి 55వ శ్లోకము వఱకును తెలుపబడిన సాంఖ్యనిష్ఠ అతనికి వాస్తవముగ (సహజముగ) ప్రాప్తింపదు. ఏలనన దేహాభిమానము, భోగాసక్తి, అనుకూల ప్రతికూల స్థితులయందు రాగద్వేషములు ఉన్నంతవరకు జ్ఞాననిష్ఠను కొనసాగించుట అనగా కర్మలన్నింటి యందును కర్తృత్వాభిమానమును వదలి, నిరంతరము సచ్చిదానంద ఘన నిర్గుణ నిరాకార బ్రహ్మ స్వరూపమునందు అభిన్నభావముతో స్థితుడైయుండుట పొసగని విషయము. అంతేగాదు అది ఊహాకే కుదరని (అందని) విషయము మఱియును అంతఃకరణ శుద్ధిలేనందునవలనను, మోహావశమునను, జగద్రక్షకుడు (జగన్నియంత) కర్మఫల ప్రదాతయైన భగవంతుని యందును, కర్మఫలములైన స్వర్గనరక లోకానుభవముల యందును విశ్వాసము లేకుండుటచే ప్రయత్నసాధ్యములైన శుభకర్మలకు దూరమగును. విషయసుఖాసక్తి - ఆది దోషముల కారణమున అతడు పాపమయభోగములయందు మునకలు వేయుచుండును. అట్టివాడు శ్రేయోమార్గముల నుండి భ్రష్టుడగుటయు సంభవమే.

అందువలన సాంఖ్యయోగమే పరమాత్మ సాక్షాత్కారమును పొందుటకు మార్గమని విశ్వసించును. ఇట్టి ముముక్షువు సాంఖ్యయోగ సాధనకు ఉద్యుక్తుడగుటకు ముందుగ నిష్కామ భావముతో యజ్ఞదాన తపస్సులు మున్నగు శుభ కర్మలను ఆచరించి, రాగద్వేషాది దోషములను తొలగించుకొని, తన అంతఃకరణమును పరిశుద్ధమొనర్చుకొనవలెను. అప్పుడే సాంఖ్యయోగ సాధన నిర్విఘ్నముగ కొనసాగును. నిశ్చయముగ ఫలప్రాప్తి కలుగును. కనుక కర్మయోగమును అనుష్ఠింపక సన్న్యాసయోగమును ఆచరించుట కష్టమని చెప్పుటలోని ఆంతర్యమిదియే.

ప్రశ్న - 'మునిః' అను విశేషణ సహితముగ **'యోగయుక్తః'** అను పదము ఎవరిని సూచించును. అతడు పరబ్రహ్మ పరమాత్మను శీఘ్రముగ ఎట్లు పొందును?

సమా - ఈ సమస్త ప్రపంచము భగవదధీనము అని భావించి, సిద్ధి అసిద్ధుల యెడ సమభావమును కలిగియుండి, ఆసక్తి ఫలేచ్ఛలను వీడి, భగవదాజ్ఞానుసారముగ సమస్త విధ్యుక్త కర్తవ్య కర్మలను ఆచరించుచు, భక్తిశ్రద్ధలతో భగవంతుని నామగుణ ప్రభావ స్వరూపములను చింతన చేయు భక్తియుక్తుడైన కర్మయోగిని **"మునిః"** అను విశేషణ సహితముగ **'యోగయుక్తః'** అను పదము సూచించును.

అట్టి కర్మయోగి భగవత్కృప వలన పరమార్థజ్ఞానము ద్వారా శీఘ్రముగ పరబ్రహ్మ పరమాత్మను పొందును.

ప్రశ్న - 'మునిః' అను పదమునకు వాక్సంయమి, జితేంద్రియుడైన సాధకుడు అని యర్థము చెప్పిన దోషమేమి?

సమా - భగవత్స్వరూప చింతనము చేయు కర్మయోగి వాక్సంయమి, జితేంద్రియుడును అయియే యుండును. ఇందు దోషప్రస్తావనకు ఆస్కారమే లేదు.

ప్రశ్న - 'బ్రహ్మ' శబ్దమునకు అర్థము నిర్గుణ పరబ్రహ్మము అనియా? సగుణ పరమేశ్వరుడనియా?

సమా - వాస్తవముగా సగుణ పరమేశ్వరుడు, నిర్గుణ పరబ్రహ్మము అని వేర్వేఱుగా లేరు. ఈ రెండును ఒకే పరమాత్మను గూర్చి చెప్పును. కనుక బ్రహ్మ శబ్దమునకు నిర్గుణ పరబ్రహ్మము అనియు, సగుణపరమేశ్వరుడు అనియును అర్థము.

సంబంధము - కర్మయోగి లక్షణములను వర్ణించుచు అతడు కర్మలయందు చిక్కుకొనని రీతిని తెలుపుచున్నాడు-

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।**
**సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7 ॥**

| పదము | | అర్థము | పదము | | అర్థము | పదము | | అర్థము |
|---|---|---|---|---|---|---|---|---|
| విజితాత్మా | = | మనస్సును వశము నందుంచుకొనిన వాడును | సర్వభూతాత్మ భూతాత్మా | = | సర్వప్రాణులలో ఆత్మ స్వరూపుడైన పరమాత్మను తన ఆత్మగా కలవాడునగు | యోగయుక్తః | = | కర్మయోగి |
| జితేంద్రియః | = | జితేంద్రియుడును | | | | కుర్వన్, అపి | = | కర్మలను ఆచరించుచున్నను |
| విశుద్ధాత్మా | = | అంతఃకరణశుద్ధి కలవాడును | | | | న, లిప్యతే | = | ఆ కర్మలు వానిని అంటవు |

**మనస్సును వశమునందుంచుకొనినవాడు, జితేంద్రియుడు, అంతఃకరణశుద్ధి కలవాడు, సర్వప్రాణులలో ఆత్మస్వరూపుడైన పరమాత్మను తన ఆత్మగా కలవాడు అగు కర్మయోగి కర్మలను ఆచరించుచున్నను ఆకర్మలు వానిని అంటవు. (7)**

ప్రశ్న - **'యోగయుక్తః'** అను విశేష్య(పద)ముతో విజితాత్మా, జితేంద్రియః, విశుద్ధాత్మా అను విశేషణములను ప్రయోగించుటలో గల ప్రత్యేకత ఏమి?

సమా - మనస్సు, ఇంద్రియములు సాధకుని వశములో లేనిచో అవి స్వాభావికముగ విషయముల యందు (విషయ సుఖములయందు) ప్రవృత్తములగును. అంతఃకరణము రాగద్వేష కలుషితమగును. అప్పుడు సిద్ధి - అసిద్ధుల యెడ సమభావము ఉండుట అసంభవము. కావున మనస్సు, ఇంద్రియములు పూర్తిగా వశము కానంతవఱకును, అంతః కరణము సంపూర్ణముగా పరిశుద్ధము కానంతవఱకును, సాధకుని కర్మయోగిగా పేర్కొనుటకు వీలులేదు. కనుక ఈ విశేషణములు అన్నియును కల్గియున్నవాడే పూర్తిగా కర్మయోగి. అతనికే శీఘ్రముగా పరబ్రహ్మ ప్రాప్తి కలుగును.

ప్రశ్న - 'సర్వభూతాత్మ భూతాత్మా', అనగానేమి?

సమా - పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల ప్రాణులలో ఆత్మస్వరూపుడైనవాడు పరమేశ్వరుడు. అట్టి పరమాత్మయే తన ఆత్మగా అనగా అంతర్యామిగా కలిగి, ఆయన ప్రేరణతోనే కర్మలన్నింటిని చేయుచు, భగవంతుని యందు తప్ప శరీరము, మనస్సు, బుద్ధులయందును మఱి ఏ ఇతర వస్తువుల యందును మమత్వము లేనివాడు 'సర్వభూతాత్మ భూతాత్మా' అని యనబడును.

ప్రశ్న - 'అపి' అను అవ్యయమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - సాంఖ్యయోగియైనవాడు ఏ కర్మయందును తనను కర్తగా భావింపడు. తన మనస్సు, బుద్ధి, ఇంద్రియముల ద్వారా క్రియలన్నియును జరుగుచున్నను "నేనేమియు చేయుటలేదు, గుణములే గుణముల యందు వర్తించుచున్నవి. వీటితో నాకెట్టి సంబంధము లేదు" అని అతడు తలంచును. కనుక అతనిని కర్మలంటకుండుట సహజమే. కాని తనను కర్తగా భావించు కర్మయోగియు భగవదాజ్ఞానుసారము భగవదర్పణముగ కర్మల నన్నింటిని చేయుచు, వాటియందు ఫలేచ్ఛ, ఆసక్తులు లేకుండుట వలన అవి అతనిని బంధింపవు. 'అపి' అను అవ్యయ ప్రయోగము ఈ విశేషమునే తెలుపుచున్నది.

*సంబంధము - భగవానుడు రెండవశ్లోకమున సూత్రప్రాయముగ సాంఖ్యయోగ కర్మయోగఫలములు ఒకటియేయని చెప్పి, సౌలభ్యదృష్టితో సాంఖ్యయోగము కంటెను కర్మయోగము శ్రేష్ఠమని తెలిపెను. మూడవ శ్లోకమున కర్మయోగిని ప్రశంసించెను. నాల్గు, ఐదు శ్లోకములయందు రెండింటి ఫలముల ఏకత్వమును, స్వతంత్రరీతులను విశదపరచెను. పిమ్మట ఆఱవ శ్లోక పూర్వార్ధమున కర్మయోగాచరణము లేకుండ సాంఖ్యయోగానుష్ఠానము కష్టమని తెలిపి, ఉత్తరార్ధమున కర్మయోగ సౌలభ్యమును వివరించెను. ఏడవశ్లోకమున కర్మయోగి లక్షణములను పేర్కొనెను. దీనిని బట్టి ఈరెండు సాధనలు ఒకే ఫలమును ఇచ్చుచున్నను, రెండింటి సాధన మార్గములు పరస్పర భిన్నములని విశదమగుచున్నది. రెండింటి యొక్క ఆచరణాత్మక రీతులను వివరింపదలచి, ముందుగా 8,9 శ్లోకములలో సాంఖ్యయోగి వ్యవహారశైలిని స్పష్టపరచుచున్నాడు-*

**నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥ 8 ॥**

**ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి ।**
**ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ॥ 9 ॥**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| తత్త్వవిత్, యుక్తః | = | తత్త్వజ్ఞుడైన సాంఖ్యయోగి | స్వపన్ | = | నిద్రించుచు | ఇంద్రియార్థేషు | = | తమ తమ శబ్దాది విషయములయందు |
| | | | శ్వసన్ | = | శ్వాసక్రియలను నడుపుచు | | | |
| పశ్యన్ | = | చూచుచు | ప్రలపన్ | = | భాషించుచు | వర్తంతే, ఇతి | = | ప్రవర్తించుచున్నవని |
| శృణ్వన్ | = | వినుచు | విసృజన్ | = | త్యజించుచు | ధారయన్ | = | తలంచుచు |
| స్పృశన్ | = | స్పృశించుచు | గృహ్ణన్ | = | గ్రహించుచు | కించిత్, న, ఏవ, కరోమి | = | నేను ఏ కొంచెమూ (ఏమియు)చేయుట లేదు |
| జిఘ్రన్ | = | ఆఘ్రాణించుచు | ఉన్మిషన్ | = | కనులను తెరచుచు | | | |
| అశ్నన్ | = | తినుచు | నిమిషన్, అపి | = | మూయుచును | | | |
| గచ్ఛన్ | = | నడుచుచు | ఇంద్రియాణి | = | ఇంద్రియములు | ఇతి, మన్యేత | = | అని భావించును |

**తత్త్వజ్ఞుడైన సాంఖ్యయోగి చూచుచు, వినుచు, స్పృశించుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, నడుచుచు, నిద్రించుచు, శ్వాసక్రియలను నడపుచు, భాషించుచు,త్యజించుచు, గ్రహించుచు, కనులను తెరచుచు, మూయుచు ఉన్నను ఇంద్రియములు తమతమ విషయములయందు వర్తించుచున్నవనియు, తానేమియు చేయుటలేదనియు భావించును. (8,9)**

ప్రశ్న - ఇచట 'తత్త్వవిత్, యుక్తః' అను రెండు విశేషణములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - దృశ్య ప్రపంచమంతయు క్షణభంగురము, అనిత్యము, అది ఎండమావులలోని నీటివలె, స్వప్నజగత్తువలె మాయామయము. కేవలము సచ్చిదానంద ఘనబ్రహ్మమే సత్యము. ఆయనయందే ఈ ప్రపంచమంతయును మాయద్వారా అధ్యారోపితమైయున్నది - అని ఈ విధముగ నిత్యానిత్యవస్తుతత్త్వమును గ్రహించి నిరంతరము నిర్గుణనిరాకార సచ్చిదానంద ఘనపరబ్రహ్మ పరమాత్మయందు అభిన్నభావముతో స్థితుడైనవాడు "తత్త్వవిత్, యుక్తః" అని చెప్పబడును. సాంఖ్యయోగ సాధకుడు ఇట్లుండవలెనని తెలుపుటకై ఈ రెండు విశేషణములును ఇచట ప్రయుక్తము లైనవి.

ప్రశ్న - చూచుట, వినుట మొదలగు క్రియలనన్నింటిని చేయుచున్నను తానేమియు చేయుటలేదని భావించుటలోని విశేషమేమి?

సమా - కలలోనుండి మేల్కొనిన మనుష్యుడు స్వప్నకాలము నందు స్వప్న శరీరము మనస్సు, ప్రాణము, ఇంద్రియముల ద్వారా ఆచరింపబడినట్లు గోచరించిన క్రియలన్నియు వాస్తవముగ ఆచరింపబడలేదనియు, వాటితో తనకెట్టి సంబంధము లేదనియు భావించును. అట్లే భగవత్తత్త్వమును ఎఱింగి, నిర్వికార, నిష్క్రియ పరమాత్మయందు అభిన్న భావముతో స్థితుడైన సాంఖ్యయోగియును జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల ద్వారా, ప్రాణ మనస్సుల ద్వారా లోకవ్యవహారరీతిలో తాను చేయుచున్న చూచుట, వినుట మొదలగు క్రియలన్నియు వాస్తవముగ తాను చేయుట లేదనియు, మాయావృతమైన మనస్సు, ప్రాణము, ఇంద్రియములు మాయామయమైన విషయముల యందు ప్రవర్తిల్లుచున్నవనియు, వాటితో తనకెట్టి సంబంధమూ లేదనియు గ్రహించును.

ప్రశ్న - అట్లయినచో రాగద్వేషములు, కామ క్రోధాది దోషములు కలవారు కూడ తమను సాంఖ్యయోగులుగా భావించుచు, మనస్సు ఇంద్రియముల ద్వారా తాము ఆచరించు మంచి చెడ్డలతో తమకు ఎట్టి సంబంధము లేదని చెప్పుకొనవచ్చును గదా! అట్టి స్థితిలో యథార్థ సాంఖ్య యోగులను గుర్తించుట యెట్లు?

సమా - ప్రకటించుకొనినంత మాత్రమున ఎవ్వడును సాంఖ్యయోగి కాజాలడు. కర్మబంధములతో వానికి సంబంధము తెగిపోదు. నిజమైన సాంఖ్యయోగి సమస్త జగత్తును స్వప్నమువలె మాయామయమని భావించును.

కనుక అతనికి ఏ వస్తువునందును ఏ మాత్రమును ఆసక్తి యుండదు. అతనిలో రాగద్వేషములు ఏ మాత్రము ఉండవు. కామక్రోధాది (అరిషడ్వర్గ) దోషములు మచ్చునకైనను కన్పింపవు. ఈ స్థితియందు నిషిద్ధకర్మాచరణము లేనందున పవిత్రమైన అతని మనస్సు, ఇంద్రియముల ద్వారా జరుగు క్రియలన్నియును విధ్యుక్తములై లోకహితార్థముగనే కొనసాగును. నిజమైన సాంఖ్యయోగికి ఇదియే నిదర్శనము. సాంఖ్యయోగ సాధకుడు తన యందు రాగద్వేషములు, కామక్రోధాదులు ఏ కొద్దిగా మిగిలియున్నట్లు కనుగొన్నను తన సాధనయందు లోపమున్నదని గ్రహింపవలెను.

ప్రశ్న - సాంఖ్యయోగి శరీరయాత్రకు అవసరమైన కేవలము అన్నపానాది క్రియలనే ఆచరించునా? లేక విధ్యుక్తములైన వర్ణాశ్రమ ధర్మముల నన్నింటిని ఆచరించునా?

సమా - ఈ విషయమున ప్రత్యేకమైన నియమమేదియును లేదు. వర్ణాశ్రమములు, స్వభావము, ప్రారబ్ధము, పరివారము, జీవన విధానము (అభ్యాసము)ల యందు భేదములుండుట వలన సాంఖ్యయోగుల అందఱి కర్మాచరణములును ఒకేరీతిగా ఉండవు. 'చూచుట, వినుట, స్పృశించుట, ఆఘ్రాణించుట, భుజించుట' అను పదములు వరుసగా కన్నులు, చెవులు, చర్మము, ముక్కు, నాలుక అను పంచజ్ఞానేంద్రియ క్రియలను తెలుపును. నడచుట, గ్రహించుట, మాట్లాడుట, విసర్జించుట' అనునవి కాళ్ళు, చేతులు, వాక్కు మున్నగు పంచకర్మేంద్రియములకు సంబంధించిన క్రియలు. 'శ్వాసక్రియ' ప్రాణాపానాది పంచప్రాణక్రియలను సూచించును. కనులు మూయుట, తెరచుట అనునవి కూర్మాది పంచవాయువుల క్రియలను తెలుపును. నిద్రించుట అనునది అంతఃకరణ క్రియను తెలుపును. ఈ విధముగా ఇంద్రియములు, ప్రాణములు అంతఃకరణమునకు సంబంధించిన క్రియలన్నింటిని తెలుపుటచే వానిలో సాంఖ్యయోగి ఆచరించు వర్ణాశ్రమ ధర్మములు, స్వభావము, ప్రారబ్ధము, పరివారములను బట్టి శరీరయాత్రకై, లోకహితార్థమై చేయు విధ్యుక్త ధర్మములు, అన్నపానాదులు, జీవన విధానము, ఉపదేశము, వ్రాయుట, చదువుట, వినుట, ఆలోచించుట మొదలగు అన్ని క్రియలును అంతర్గతములై యున్నవి.

ప్రశ్న - మూడవ అధ్యాయమునందలి 28వ శ్లోకమున గుణములు గుణములయందు ప్రవర్తించుచుననియు, పదుమూడవ అధ్యాయము నందలి 29వ శ్లోకమున సమస్త కర్మలును ప్రకృతి ద్వారా జరుగుననియు తెలుపుట జరిగినది. కాని ఇచ్చట ఇంద్రియములు ఇంద్రియార్థముల యందు ప్రవర్తిల్లుచున్నవి-అని పేర్కొనుట జరిగినది. ఇట్లు విభిన్నరీతులలో వివరించుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇంద్రియములును వాటి సమస్త విషయములును (ఇంద్రియార్థములును) సత్త్వరజస్తమోగుణముల కార్యములు. ఈ మూడు గుణములును ప్రకృతియొక్క కార్యములు. కావున కర్మలన్నియును ప్రకృతి ద్వారా చేయబడుచున్నవని చెప్పినను, గుణములు గుణముల యందును లేక ఇంద్రియములు ఇంద్రియార్థములయందును ప్రవర్తిల్లుచున్నవని చెప్పినను ఒకటియే. ఒకే సిద్ధాంతమును సాకల్యముగా బలముగా నొక్కి చెప్పుటకై ప్రసంగము ననుసరించి, ఇట్లు విభిన్న రీతులలో వివరించుట జరిగినది.

ప్రశ్న - ఇంద్రియములు, ప్రాణములు, మనస్సులకు సంబంధించిన వివిధ క్రియలను వర్ణించినప్పటికిని, కేవలము ఇంద్రియములు ఇంద్రియార్థములయందు ప్రవర్తిల్లుచున్నవని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - కర్మాచరణమునందు ఇంద్రియములకే ప్రాధాన్యము కలదు. ప్రాణములు గూడ ఇంద్రియములుగానే వర్ణింపబడినవి. మనస్సు గూడ అంతఃకరణమగుటచే ఇంద్రియమే. ఈ విధముగా ఇంద్రియ శబ్దములో అన్నియును అంతర్గతములే. కనుక ఇట్లు చెప్పుటలో దోషమేమియును లేదు.

ప్రశ్న - 'ఏవ' అను అవ్యయ ప్రయోగము యొక్క విశేషమేమి?

సమా - కర్మాచరణమునందు కర్తృత్వము ఏ మాత్రము లేదని చెప్పుటకే 'ఏవ' అను అవ్యయము ప్రయుక్తమైనది. సాంఖ్యయోగి ఏ విషయమునందును, ఎప్పుడును కర్మాచరణమున తనను కర్తగా భావింపడు.

*సంబంధము - ఇంతవఱకును సాంఖ్యయోగియొక్క సాధన స్వరూపమును తెలిపి, ఇప్పుడు 10, 11 శ్లోకములలో కర్మయోగి యొక్క సాధనఫలస్వరూపములను తెలుపుచున్నాడు-*

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥ 10 ॥

యః = ఎవడైతే
కర్మాణి = కర్మలనన్నింటిని
బ్రహ్మణి, = భగవదర్పణము
ఆధాయ గావించి
సంగమ్, త్యక్త్వా = ఆసక్తిని త్యజించి
కరోతి = (కర్మలను) ఆచరించుచున్నాడో
సః = ఆ పురుషుడు
అంభసా, = జలబిందువులచే
పద్మపత్రమ్, ఇవ = పద్మపత్రమువలె (తాకబడకుండునట్లు)
పాపేన = పాపము(ల)చే
న, లిప్యతే = తాకబడడు (పాపములు ఆపురుషుని ఏ మాత్రముఅంటవు)

కర్మలనన్నింటిని భగవదర్పణము గావించి, ఆసక్తిరహితముగ కర్మలనాచరించు వానిని తామరాకుపై నీటిబిందువులవలె పాపములు అంటవు. (10)

ప్రశ్న - కర్మలనన్నింటిని భగవదర్పణము చేయుట అనగానేమి?

సమా - భగవద్భక్తి, దైవారాధన, మాతాపితృ గురుజనుల సేవలును, యజ్ఞదాన తపస్సులును, అర్థోపార్జనకై శరీర పోషణాదులకై చేయు వర్ణాశ్రమానుకూల శాస్త్ర విహిత కర్మలు మొదలగు వానిని మమతాసక్తులను వీడి చేయవలెను. ఈ కర్మలన్నియును భగవంతునివే అని భావించి, ఆయన కొఱకై ఆయన సంకల్పానుసారము ఆటబొమ్మలవలె కర్మల నాచరించుటనే కర్మల నన్నింటిని భగవదర్పణము చేయుటయని యందురు.

ప్రశ్న - ఆసక్తిని వదలి కర్మలను ఆచరించుట అనగానేమి?

సమా - భార్యాపుత్రులయందును, గృహధనాది భోగవస్తువుల యందును, స్వర్గాది లోకముల యందును, శరీరము నందును, సమస్త కర్మలయందును, కీర్తి ప్రతిష్ఠాదుల యందును, అన్ని విధముల ఆసక్తిని త్యజించి, ఇంతకు ముందు తెలిపినట్లుగా కర్మలను ఆచరించుటయే ఆసక్తిరహిత కర్మాచరణమనబడును.

ప్రశ్న - కర్మయోగి శాస్త్రవిహిత సత్కర్మలనే చేయును గదా! అతడు పాపకర్మలను చేయనే చేయడు గదా! పాపకర్మలనే చేయనప్పుడు అతనిని పాపములంటుటకు ఆస్కారమే ఉండదు గదా? అట్టిస్థితిలో అతనిని పాపములు అంటవు అని చెప్పుటకు అవకాశమెక్కడ?

సమా - శాస్త్రవిహిత కర్మలు గూడ సర్వథా దోషరహితములని చెప్పుటకు వీలులేదు. కర్మాచరణల యందు పాపహేతుకములైన దోషములు సూక్ష్మముగనైనను తెలిసియో తెలియకయో జరుగుచునే యుండును. కావుననే భగవానుడు 'సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః' (18/48). కర్మాచరణమును దోషయుక్తముగా తెలిపియుండెను. కావున ఫలేచ్ఛ - ఆసక్తులకు లోనై భోగవిరాముములకై కర్మల నాచరించువాడు ఎన్నటికిని పాపముల నుండి తప్పించుకొనలేడు. ఆసక్తి ఫలేచ్ఛలే ఎల్లరకును బంధహేతువులు. ఆసక్తి ఫలేచ్ఛలు లేకుండ కర్మలను ఆచరించు వానిని పాపములు అంటవు అని చెప్పుట యుక్తమే.

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ॥
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥ 11 ॥

యోగినః = కర్మయోగులు
సంగమ్ = మమతాసక్తులను
త్యక్త్వా = వీడి
కేవలైః = కేవలము
ఇంద్రియైః = ఇంద్రియములచేతను
మనసా = మనస్సుచేతను
బుద్ధ్యా = బుద్ధిచేతను
కాయేన, అపి = శరీరముచేతను
ఆత్మశుద్ధయే = ఆత్మశుద్ధికొఱకు మాత్రమే
కర్మ, కుర్వంతి = కర్మలను ఆచరించుచుందురు.

కర్మయోగులు మమతాసక్తిరహితులై కేవలము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, శరీరముల ద్వారా అంతఃకరణశుద్ధికై కర్మలను ఆచరింతురు. **(11)**

ప్రశ్న - 'కేవలైః' అను విశేషణమును ప్రయోగించుటలో గల విశేషమేమి? ఆ విశేషణము కేవలము ఇంద్రియములకే వర్తించునా? లేక మనస్సు, బుద్ధి, శరీరములకును వర్తించునా?

సమా - మమతారాహిత్యమును నొక్కి, చెప్పుటకై 'కేవలైః' అను విశేషణము ప్రయోగింపబడినది. ఇది ఇంద్రియములకే విశేషణముగా ప్రయోగింపబడినను మనస్సు, బుద్ధి, శరీరములకును ఇది వర్తించును. కర్మయోగులు మనస్సు, బుద్ధి, శరీరము, ఇంద్రియములయందు మమత్వమును కలిగియుండరు. ఇవి యన్నియును భగవత్సేవకే వినియోగింపబడునవి గావున అవి ఆయనకు చెందినవి గానే వారు భావింతురు. లౌకిక స్వార్థ ప్రయోజనములను త్యజించి, నిష్కామభావముతో భగవత్సంకల్పానుసారము కర్తవ్య కర్మలను అన్నింటిని ఆయన చేయించినట్లు చేయుదురు.

ప్రశ్న - కర్మలనన్నింటిని భగవదర్పణము గావించి, ఆసక్తి రహితముగ వాటిని ఆచరింపుమని 10వ శ్లోకములో చెప్పబడియే యున్నది గదా! మఱల నిచ్చట ఆసక్తిని త్యజింపుమని చెప్పుటలోని విశేషమేమి?

సమా - కర్మలనన్నింటిని భగవదర్పణము గావించి, ఆసక్తిని త్యజింపవలసిన విషయము చెప్పబడియున్న మాట వాస్తవమే. కాని అది భక్తి ప్రధానకర్మయోగి వర్ణన. ఈ అధ్యాయమునందలి 8,9 శ్లోకములలో సాంఖ్యయోగి మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, ప్రాణములు, శరీరముల ద్వారా జరుగు సమస్తక్రియలును ఏయే భావములతో ఏయే విధములుగా జరుగునో తెలిపియుండెను. అట్లే కర్మ ప్రధాన యోగి క్రియలు ఏ భావములతో ఏ విధముగా జరుగునో ఇచట విశదపఱచబడినది. కర్మయోగి మనస్సు, బుద్ధి, ఇంద్రియములు శరీరముల యందును, వాని ద్వారా జరుగు క్రియల యందును మమతాసక్తులను ఉంచక అంతఃకరణ శుద్ధికై కర్మలను ఆచరించును. ఆ విషయమును స్పష్టపఱచుటకే ఇచట మఱల ఆసక్తి రాహిత్య ప్రస్తావన చేయబడినది.

*సంబంధము - భక్తి ప్రధానముగా కర్మలను ఆచరించు కర్మయోగిని పాపములంటవు. కర్మప్రధానముగా కర్మలను ఆచరించు కర్మయోగికి అంతఃకరణ శుద్ధి కలుగును. ఈ విషయములను ఎఱింగిన పిమ్మట కర్మయోగఫలము కేవలము అంతఃకరణశుద్ధికే పరిమితమా? ఇంకను విశేషఫలము ఏదైనను కలదా? అను జిజ్ఞాస కలుగును. ఈ విధముగ కర్మలను ఆచరింపక, సకామభావముతో శుభకర్మలను ఆచరించినచో కలుగు దోషమేమి? ఈ విషయము మున్ముందు స్పష్టపరచబడుచున్నది-*

**యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యుక్తః | = నిష్కామకర్మయోగి | | శాంతిని | ఫలే, సక్తః | = ఫలాసక్తితో (కర్మలనుఆచరించి) |
| కర్మఫలమ్ | = కర్మఫలము(ల)ను | ఆప్నోతి | = పొందును | | |
| త్యక్త్వా | = త్యజించి | అయుక్తః | = సకామపురుషుడు | నిబధ్యతే | = బంధింపబడును (బద్ధుడగును) |
| నైష్ఠికీమ్, శాంతిమ్ | = భగవత్ప్రాప్తిరూపమైన | కామకారేణ | = వాంఛల ప్రేరణలచే | | |

నిష్కామకర్మయోగి కర్మఫలములను త్యజించి, భగవత్ప్రాప్తి రూపమైన శాంతినిపొందును. కర్మఫలాసక్తుడైనవాడు ఫలేచ్ఛతో కర్మలనాచరించి బద్ధుడగును. **(12)**

ప్రశ్న - 8వ శ్లోకమునందు "యుక్తః" అను పదమునకు సాంఖ్యయోగి అని యర్థము చెప్పబడినది. ఇచట 'యుక్తః' అను పదమునకు కర్మయోగి అని యర్థము చెప్పుట ఎట్లు పొసగును?

సమా - శబ్దములకు అర్థములు సందర్భానుసారముగా చెప్పబడుచుండును. కావున ఈ యుక్తశబ్దము వివిధ సందర్భములలో వేర్వేఱు అర్థములతో ప్రయుక్తమైనది. యుక్త శబ్దము 'యుజ్' ధాతువు నుండి ఏర్పడినది. దానికి కలుపుట, కూడియుండుట అను అర్థములు కలవు. 2వ అధ్యాయము నందలి 61వ శ్లోకమున 'యుక్తః' అను పదము సంయమి అను అర్థమున ప్రయోగింపబడినది. 6వ అధ్యాయమునందలి 8వ శ్లోకమున భగవత్ప్రాప్తి నందిన తత్త్వజ్ఞాని యనియు, 17వ శ్లోకమున ఆహార విహారముల యందు ఔచిత్యమును పాటించు యోగియనియు, 18వ శ్లోకమున ధ్యానయోగి యనియు, 7వ అధ్యాయము నందలి 22వ శ్లోకమున శ్రద్ధతో కూడినవాడు అనియును, సందర్భానుసారముగ దానికి వేర్వేఱు అర్థములు చెప్పబడినవి. ఈ 5వ అధ్యాయమునందలి 8వ శ్లోకమున యుక్త శబ్దము ఇంద్రియము లన్నియును ఇంద్రియార్థముల యందే ప్రవర్తించుచున్నట్లు భావించి, తనయందు కర్తృత్వ భావమును వీడిన తత్త్వజ్ఞుడైన పురుషుని గూర్చియే తెలుపును. కావున అచట యుక్తశబ్దమునకు సాంఖ్యయోగి అను అర్థము చెప్పుటయే సమంజసము - కాని ఇచట (12వ శ్లోకమున) యుక్తః అను పదము కర్మఫలత్యాగిని గూర్చి తెలుపును. కావున దీని యర్థము ఇచట కర్మయోగి యనియే గ్రహింపవలెను.

ప్రశ్న - "నైష్ఠికీ శాంతి" పదమునకు భగవత్ప్రాప్తి రూప శాంతి అను అర్థమునే ఏల చెప్పవలెను?

సమా - 'నైష్ఠికీ' అను పదమునకు నిష్ఠవలన ఏర్పడినది అని అర్థము. కావున కర్మయోగనిష్ఠ వలన సిద్ధించు భగవత్ప్రాప్తి రూపశాంతికి నైష్ఠికీ శాంతి అను అర్థమును చెప్పుట యుక్తము.

ప్రశ్న - 'అయుక్తః' అను పదమునకు ప్రమాది (ప్రమాదమును శంకించి కర్మయందు అశ్రద్ధ చూపువాడు) సోమరి (కర్మ చేయనివాడు) అను అర్థములు చెప్పక కామ్య కర్మలు చేయువాడు అను అర్థమునే ఎందుకు చెప్పవలెను?

సమా - ఫలేచ్ఛ కలిగియుండి దానియందు ఆసక్తుడైన పురుషుని సూచించుపదము 'అయుక్తః' కావున, 'అయుక్తః' అను పదమునకు కామ్యకర్మలు చేయువాడు అర్థమును చెప్పుటయే సమంజసము.

ప్రశ్న - బంధనము అనగానేమి?

సమా - సకామ భావముతో కర్మలను ఆచరించుట వలన దాని ఫలస్వరూపమైన జనన మరణ చక్రములోబడి నిరంతరము తిరుగుచుండుటయే బంధనము.

*సంబంధము - కర్మయోగి కర్మబంధములలో చిక్కుకొనక పరమాత్మ ప్రాప్తి రూపమైన శాంతిని పొందును. కామ్యకర్మలను ఆచరించువాడు ఫలాసక్తికారణమున జననమరణ రూపబంధనములలో చిక్కుకొనును - అని తెల్పబడినది. అయినచో సాంఖ్యయోగి ఎట్టి ఫలమును పొందును - అను విషయమును తెలుపుచున్నాడు-*

**సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।**
**నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్ న కారయన్ ॥ 13 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వశీ, దేహీ | = అంతఃకరణమును వశమునందుంచుకొని, సాంఖ్యయోగమును ఆచరించు పురుషుడు | న, కారయన్, ఏవ | = ఆచరింపజేయకయే | సన్న్యస్య | = త్యజించి |
| న, కుర్వన్ | = కర్మలను ఆచరింపక | నవద్వారే, పురే | = నవద్వారములుగల శరీరమను పురమునందు | సుఖమ్ | = సుఖముగా |
| | | సర్వకర్మాణి | = సమస్తకర్మలను | ఆస్తే | = (సచ్చిదానంద ఘనపరమాత్మ స్వరూపమున) స్థితుడైయుండును. |
| | | మనసా | = మానసికముగా | | |

**అంతఃకరణమును అదుపులోనుంచుకొని, సాంఖ్యయోగమును ఆచరించు పురుషుడు కర్మలను ఆచరింపకయే, ఆచరింపజేయకయే, నవద్వారములుగల శరీరమునందు సమస్తకర్మలను మానసికముగా త్యజించి, సచ్చిదానంద ఘనపరమాత్మ స్వరూపమున స్థితుడై, ఆనందమును అనుభవించును. (13)**

ప్రశ్న - సాంఖ్యయోగి శరీరమును, ఇంద్రియములను, అంతఃకరణమును మాయామయములని భావించును. వాటితో ఆతనికి ఎట్టి సంబంధము ఉండదుగదా! అయినచో అతనిని **'దేహీ', వశీ'** అని చెప్పుటలోని ఔచిత్యమేమి?

సమా - సాంఖ్యయోగి దృష్టితో చూచినప్పుడు అతనికి శరీరేంద్రియాంతఃకరణములతో ఎట్టి సంబంధమూ ఉండదు అనియు, అతడు సర్వదా సచ్చిదానంద ఘన పరమాత్మయందు అభిన్న రూపముతో స్థితుడై యుండుననియు తెలియవలెను. కాని లోకవ్యవహార దృష్టిలో అతడు దేహధారియే. కావున అతనిని **'దేహీ'** అని చెప్పుట జరిగినది. మఱియును 14వ అధ్యాయమునందు 20వ శ్లోకమున గుణాతీతుని వర్ణనము నందును అతనిని **'దేహీ'** అని పేర్కొనుటయే జరిగినది. లోక వ్యవహార దృష్టిలో అతని మనస్సు, బుద్ధి, ఇంద్రియముల చేష్టలు అన్నియు నియమితములై శాస్త్రానుసారములై లోకకల్యాణార్థము ఉపయుక్తములగును. కావున అతనిని **'వశీ'** అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - **'ఏవ'** అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - సాంఖ్యయోగికి శరీరమునందు, ఇంద్రియముల యందు అహంభావము లేకుండును గాన, అతని ద్వారా జరుగు కర్మలకు అతడు కర్తగాడు. మమత్వము లేకుండుట వలన అతడు చేయించువాడును కాడు. శరీరేంద్రియ మనస్సుల ద్వారా జరుగు కర్మలకు అతడు కర్తగాని, కారయిత (చేయించువాడు) గాని కానేకాడు అని నొక్కి చెప్పుటకే **'న కుర్వన్, న కారయన్'** అను పదములతోపాటు ఇచట **'ఏవ'** అను అవ్యయము కూడ ప్రయుక్తమైనది.

ప్రశ్న - **'నవద్వారేపురే ఆస్తే'** అను వాక్యమునకు తొమ్మిది ద్వారాములు గల శరీరము అనుపురమున ఉన్నాడు అను అర్థమును చెప్పక **'నవద్వారే పురే సర్వకర్మాణి మనసా సన్న్యస్య'** అనగా తొమ్మిది ద్వారములు గల శరీరము అను పురమునందు జరుగు కర్మలను అన్నింటిని మనస్సుతో త్యజించి (మనస్సునకు తాకనీయక) అను అర్థము ఏల చెప్పబడినది?

సమా - సాధారణ పురుషుని స్థితికిని సాంఖ్యయోగి యొక్క స్థితికిని మధ్య మిక్కిలి వ్యత్యాసము గలదు. శరీరము అను పురమునందు ఉండుట సాధారణపురుషుని లక్షణము. ఇందు ప్రత్యేకత ఏమియు లేదు. కాని శరీరము పురమునందు అనగా ఇంద్రియాది ప్రాకృతిక వస్తువులయందును, వాటి కర్మలయందును కర్తృత్వభావము లేకుండ వాటిని మనస్సుతో త్యజించి యుండుట సాంఖ్యయోగి యొక్క ప్రత్యేక లక్షణము. సాంఖ్యయోగియే ఇట్లు చేయగలడు. సాధారణ పురుషుడు చేయలేడు. కావున ఇచట చేయబడిన అన్వయమే సరియైనది.

ప్రశ్న - ఇంద్రియాదుల ద్వారా జరుగు కర్మలను ఇంద్రియాదులయందే త్యజింపక నవద్వారములు గల శరీరమునందు త్యజించునని యేల చెప్పబడినది?

సమా - రెండు కన్నులు, రెండు చెవులు, రెండు నాసికారంధ్రములు, ఒకనోరు అను ఏడు ఊర్ధ్వ ద్వారములు, మలమూత్రముల విసర్జనకు ఉపయోగింపబడు రెండు అధో ద్వారములు - అను తొమ్మిది ద్వారములు గల శరీరము అని చెప్పుటచే వాస్తవముగ ఇంద్రియ కర్మలు అన్నియు ఇంద్రియములలో త్యజింపబడుననియే చెప్పినట్లు అయినది. ఏలనన సమస్త కర్మలను ఆచరించు ఇంద్రియములకు శరీరమే ఆధారము. ఈ అధ్యాయమునందే 8,9 శ్లోకములలో ఇంద్రియకార్యములు తెల్పబడినవి. ఇచట వాటి స్థానములు సూచింపబడినవి. భేదము ఇంతమాత్రమే. భావమున ఎట్టి భేదమును లేదు.

ప్రశ్న - కర్మలను మనస్సుతో త్యజించి అని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - వాస్తవముగా కర్మలను అన్నింటిని శరీరము ద్వారా త్యజించినచో అనగా ఆచరింపకున్నచో జీవనయాత్రయే కొనసాగదు. కావున మనస్సుతో అనగా వివేకబుద్ధితో కర్తృత్వమును, కారయితృత్వమును త్యజించుట

సాంఖ్యయోగి యొక్క త్యాగముగును. ఈ భావమే ఇచట స్పష్టము చేయబడినది.

ప్రశ్న - శ్లోకార్థవివరణమునందు అతడు సచ్చిదానంద ఘనపరమాత్మయందు స్థితుడై ఆనందమును అనుభవించును - అని తెలుపబడినది. కాని మూల శ్లోకమునందు ఈ ప్రస్తావనలేదు. మూలములో లేని ఈ విషయమును వివరణములో అదనముగా కలుపుటకు కారణమేమి?

సమా - మూలమున 'ఆస్తే' అను క్రియాపదము ప్రయోగింపబడినది. 'ఆస్తే' అను పదమునకు స్థితుడై ఉన్నాడు అని అర్థము. ఉండుటకు ఆధారము కావలెను. ఇది సాంఖ్యయోగికి సంబంధించిన సందర్భము. సాంఖ్యయోగి వాస్తవముగ సచ్చిదానందఘన పరమాత్మ స్వరూపమునందే స్థితుడై యుండును. కావున ఈ వాక్యము వివరణములో (అదనముగా) చేర్చబడినది.

*సంబంధము - ఆత్మ వాస్తవముగ కర్మలను స్వయముగా వేయునది గాదు, ఇంద్రియముల ద్వారా చేయించునదియును గాదు. అయినచో మానవులు తమను కర్మలకు కర్తలుగా ఏల భావింతురు? అట్లే కర్మఫలములకు భాగస్వాములు ఎట్లగుదురు?* అను విషయము మున్ముందు వివరింపబడును-

**న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।**
**న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ 14 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రభుః | = పరమేశ్వరుడు | కర్మాణి | = (వారి) కర్మలను | తు | = అయితే |
| లోకస్య, కర్తృత్వమ్ | = మానవుల కర్తృత్వమును | న (సృజతి) | = సృజింపడు | స్వభావః | = (ఈయన్నింటియందును) ప్రకృతియే |
| | | కర్మఫలసంయోగమ్ | = కర్మఫల సంయోగమును | | |
| న, సృజతి | = సృజింపడు | న (సృజతి) | = సృజింపడు | ప్రవర్తతే | = ప్రవర్తిల్లును |

**పరమేశ్వరుడు మానవుల యొక్క కర్తృత్వమునుగాని, వారి కర్మలనుగాని, కర్మఫల సంయోగమును గాని సృజింపడు. ఈ యన్నింటిలో ప్రకృతియే ప్రవర్తిల్లును. (14)**

ప్రశ్న - ప్రభువు అను పదమున కర్థమేమి? మానవుల కర్మల కర్తృత్వమును, కర్మలను, కర్మఫలసంయోగమును సృష్టికర్తయైన పరమేశ్వరుడు సృజింపడు. అని తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - ప్రభువు అనగా సమస్త జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములకు కారకుడు. సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడు. శాస్త్రములలో అచ్చటచ్చట పరమేశ్వరుడే సృష్టి రచనాది కర్మలకు కర్తగా తెలుపబడినది. ఆ కర్తృత్వ విషయ ప్రస్తావన లన్నియును సగుణ పరమేశ్వరుని గూర్చినవిగా తెలిసికొనవలెను. మనుష్యుల యొక్క కర్తృత్వరచన భగవంతునివలన జరిగినది గాదు. అజ్ఞానియైన మనుజుడు అహంకారకారణమున తనను తాను కర్తగా భావించును. (3/27). మనుష్యుల కర్మలను గూడ భగవంతుడు సృజింపడు. పుణ్యాపాపకర్మలలో దేనిని ఏ వ్యక్తి చేయవలెను? అను విషయమును భగవంతుడు రచింపడు. అట్లు రచించినచో విధి నిషేధ శాస్త్రములు సార్థకములు కావుగదా! కర్మఫల సంయోగమును గూడ భగవంతుడు కావింపడు. మనుష్యులే అజ్ఞానవశమున కర్మలతోపాటు వాటి ఫలములను గూర్చియు చింతన చేయుచుందురు. కొందఱు కర్మలయందాసక్తులై వాటికి తాము కర్తలుగా మసలుకొందురు. మఱికొందఱు కర్మఫలముల యందు ఆసక్తులై కర్మలతో సంబంధమును పెట్టుకొందురు.

ఒకవేళ భగవంతుడే ఈ మూడింటిని (కర్తృత్వ, కర్మాచరణ, కర్మఫల సంయోగములను) రచించి యున్నచో మానవులు కర్మబంధముల నుండి బయటపడలేరు. వారికి ఎట్టి తరణోపాయము ఉండదు. కావున సాధకుడు కర్మల కర్తృత్వమును పూర్వోక్తరీతిగా ప్రకృతియందు ఉంచవలెను (5/8,9). లేదా! భగవదర్పణము కావింపవలెను (5/10).

లేదా! కర్మఫలాసక్తులను త్యజించి (5/12) కర్మలతో తన సంబంధములను దూరమొనర్చు కొనవలెను. (4/20) ఈ విషయమును స్పష్టపఱచుటకే పరమేశ్వరుడు మనుష్యుల కర్తృత్వమును, కర్మలను, కర్మఫలములను గూడ రచింపడని తెలుపబడినది.

ప్రశ్న - స్వభావమే వీటన్నింటిలో ప్రవర్తిల్లును అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఆత్మకు కర్తృత్వముతో గాని, కర్మాచరణములతో గాని, కర్మఫలములతో గాని, వాస్తవముగా ఎట్టి సంబంధమూలేదు. అట్లే ఈ మూడింటి యందును భగవంతునకును ఏ మాత్రమూ సంబంధము లేదు. అయినచో ఇవి ఎట్లు ప్రకటితములగుచున్నవి? అను జిజ్ఞాస కలుగును? ప్రకృతియే అనగా స్వభావమే సత్త్వరజస్తమో గుణములుగ, రాగద్వేషాది వికారములుగ, పుణ్యాపాప కర్మలుగా, వాటి సంస్కారములుగ పరిణతి చెంది, కర్తృత్వాది త్రయమును (ఈ యన్నింటిని) నడిపించును. జీవప్రకృతి సంబంధము అనాదిసంసిద్ధము. ఇందువలననే వారిలో కర్తృత్వభావము ఉత్పన్నమై అహంకారముచే మోహితులైనవారు తమను కర్తలుగా భావించుచున్నారు (3/27). దీనివలననే వారికి కర్మలతో, కర్మఫలములతో సంబంధమేర్పడి, కర్మబంధములలో చిక్కుకొనుచున్నారు. యథార్థముగా ఆత్మకు వీటితో ఎట్టి సంబంధమును లేదు.

*సంబంధము - సాధకుడు సమస్తకర్మలను, కర్మఫలములను భగవదర్పణము గావించి, తనకు కర్మఫలములతో ఎట్టి సంబంధమును లేకుండ చేసికొన్నచో అయా శుభాశుభకర్మ ఫలములకు భాగస్వామి భగవంతుడగునా? అను ప్రశ్నకు సమాధానము ముమ్ముందు వివరింపబడుచున్నది-*

**నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| విభుః | = సర్వవ్యాపియైన భగవంతుడు | చ | = మఱియు | ఆవృతమ్ | = ఆవరింపబడును |
| | | సుకృతమ్, ఏవ, | = పుణ్యకర్మలను | తేన | = ఆకారణముచేత |
| కస్యచిత్ | = ఏ ఒక్కనియొక్క | న, ఆదత్తే | గ్రహింపడు (కాని) | జంతవః | = ప్రాణులు(మానవులు) |
| పాపమ్, | = పాపకర్మమును | అజ్ఞానేన | = అజ్ఞానముచేత | ముహ్యంతి | = మోహితులగుచున్నారు |
| న, ఆదత్తే | గ్రహింపడు | జ్ఞానమ్ | = జ్ఞానము | | |

**సర్వవ్యాపియైన భగవంతుడు ప్రాణుల పుణ్యాపాప కర్మలలో దేనికిని భాగస్వామి కాడు. అజ్ఞానముచే జ్ఞానము కప్పబడియుండుటవలన ప్రాణులు మోహితులగుచుందురు. (15)**

ప్రశ్న - 'విభుః' అను పదమునకు అర్థమేమి? అతడు ఎవరి పుణ్యాపాప కర్మఫలములకును ఫలభోక్తకాడు అనుటలోని అంతర్యమేమి?

సమా - అందఱి హృదయములయందుండు వాడు 'విభుడు'. (13/17, 15/15, 18/61) ఆ విభుడు సమస్త జగత్తును స్వసంకల్పము ద్వారా నడిపించుచుండును. అతడు సర్వశక్తిమంతుడు. సగుణ నిరాకార పరమేశ్వరుడు. ఆతని శక్తిచేతనే మనుష్యుల ద్వారా సమస్త కర్మలును జరుగుచున్నవి. వారి వారి కర్మలను అనుసరించి, ప్రాణులకు శక్తి, బుద్ధి, ఇంద్రియాదులను అతడు ప్రసాదించుచుండును. వారు చేసిన కర్మల ఫలములతో ఆయనకు ఎట్టి సంబంధము లేదు. అనగా ఆయా కర్మఫలములకు అతడు భాగస్వామి కాడు.

ప్రశ్న - ఈ అధ్యాయమునందలి చివరి శ్లోకమునందును, 9వ అధ్యాయము నందలి 24వ శ్లోకమునందును యజ్ఞ తపస్సులకు తానే భోక్తనని భగవంతుడు చెప్పియున్నాడు. అయినచో భగవంతుడు ఎవరి శుభకర్మలను గూడ గ్రహింపడని చెప్పుట ఎట్లు పొసగును?

సమా - విశ్వమంతయును సగుణ పరమేశ్వరుని స్వరూపమే. కావున దేవతాది రూపములలో భగవంతుడే యజ్ఞము లన్నింటికిని భోక్త. అయినప్పటికిని భగవంతునకు

కర్మలతోను, కర్మఫలములతోను వాస్తవముగా ఎట్టి సంబంధమూ లేదు. భగవంతుడు అవతారము లెత్తుచున్నను అజుడే. (4/6) సృష్ట్యాది కర్మలను నడిపించుచున్నను అకర్తయే. (4/13). అట్లే దేవమనుష్యాది రూపములలో సమస్త యజ్ఞములకు భోక్తయైనను, భక్తుల ద్వారా అర్పింపబడిన వస్తువులను, క్రియలను స్వీకరించినను, యథార్థముగా వాటితో ఆయనకు ఎట్టి సంబంధమూ లేదు. కనుక అతడు ఎట్టి శుభకర్మ ఫలములకును భాగస్వామి కాడనుట సముచితమే.

ప్రశ్న - అజ్ఞానముచే జ్ఞానము కప్పబడియుండుట వలన జీవులు మోహితులగుచున్నారు - అనగానేమి?

సమా - వాస్తవముగా మనుష్యులకును, పరమేశ్వరునకును, కర్మలతో, కర్మఫలములతో ఎట్టి సంబంధము లేకున్నను మానవులు ఈ కర్మను "నేను ఆచరించితిని. ఈ కర్మలు నావి. వీటి ఫలము నాకు లభించును". అని భావించుటకు కారణము ఏమి? అనాది సిద్ధముగ జీవుల యథార్థ జ్ఞానము అజ్ఞానముచే కప్పబడియున్నది. కనుక మానవులు తమ స్వరూపమును, పరమేశ్వరస్వరూపమును, కర్మతత్త్వమును తెలియక తమయందును, ఈశ్వరుని యందును కర్తృత్వమును, కర్మాచరణములను, కర్మఫల సంయోగమును ఆరోపించి మోహితులగుచున్నారు. అందువలన వారు అట్లు భావించుట జరుగుచున్నది.

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తు | = అయితే | నాశితమ్ | = నశింపజేయబడునో | ఆదిత్యవత్ | = సూర్యునివలె (సూర్యప్రభవలె) |
| యేషామ్ | = ఎవరియొక్క | తేషామ్ | = వారికి | ప్రకాశయతి | = ప్రకాశింప (దర్శింప) జేయును. |
| తత్, అజ్ఞానమ్ = | ఆ అజ్ఞానము | జ్ఞానమ్ | = ఆ జ్ఞానము | | |
| ఆత్మనః, జ్ఞానేన = | పరమాత్మ తత్త్వజ్ఞానముచేత | తత్పరమ్ | = సచ్చిదానంద ఘనపరమాత్మను | | |

**కాని, వారి(ప్రాణుల) అజ్ఞానము పరమాత్మతత్త్వజ్ఞానప్రాప్తిద్వారా తొలగిపోవును. అప్పుడు ఆ జ్ఞానము వారికి సచ్చిదానందఘనపరమాత్మను సూర్యుని వలె(సూర్యప్రభవలె) దర్శింపజేయును.(16)**

ప్రశ్న - 'తు' అను పద ప్రయోగముయొక్క వైశిష్ట్యమేమి?

సమా - అజ్ఞానముచేత జ్ఞానము కప్పబడి యుండుట వలన మానవులు మోహితులగుచున్నారని 15వ శ్లోకమున తెలుపబడినది. అట్టి సాధారణ మానవులనుండి ఆత్మతత్త్వ జ్ఞానము గల వారిని వేఱుచేసి చూపుటకు 'తు' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'అజ్ఞానము'నకు 'తత్' అను పదమును విశేషణముగా ప్రయోగించుటలో గల ప్రత్యేకతయేమి?

సమా - అనాది కాలము నుండియు జీవుల యొక్క జ్ఞానము అజ్ఞానముచే కప్పబడుచున్నదనియు, అందువలన వారు ఆత్మ పరమాత్మల యథార్థ స్వరూపమును గ్రహింపలేక మోహితులగుచున్నారనియు 15వ శ్లోకమున తెల్పబడినది. ఆ అజ్ఞానమును గూర్చి నొక్కి చెప్పుటకే ఇచట 'తత్' అను పదము విశేషణముగ ప్రయోగింపబడినది. అనాదిసిద్ధమైన ఆ అజ్ఞానమును పరమాత్మ యథార్థజ్ఞానము ద్వారా తొలగి పోయినప్పుడు మనుష్యులు మోహితులు కారు, అని గూడ దీని (ఈ తత్ ప్రయోగము) ద్వారా స్పష్టపఱచబడినది.

ప్రశ్న - ఇచట సూర్యుని ఉదాహరించుటలోని విశేషమేమి?

సమా - సూర్యుడు అంధకారమును రూపుమాపి దృశ్యప్రపంచమును దృగ్గోచరమొనర్చును. అట్లే తత్త్వజ్ఞానము కూడ అజ్ఞానమును అంతరింపజేసి, పరమాత్మ స్వరూపమును చక్కగా దర్శింపజేయును. ఇట్టి యథార్థ జ్ఞానమును పొందినవారు ఎప్పటికిని మోహితులుకారు.

సంబంధము - యథార్థజ్ఞానము ద్వారా పరమాత్మప్రాప్తి సిద్ధించునని సంక్షిప్తముగా వివరించి, ఇచటినుండి 26వ శ్లోకము వఱకు జ్ఞానయోగముద్వారా పరమాత్మప్రాప్తిని కల్గించు సాధనలను, భగవత్ప్రాప్తి నందిన సిద్ధపురుషుని లక్షణములను, ఆచరణములను, మహత్త్వమును, మఱియు స్థితిని వర్ణించు ఉద్దేశ్యముతో మొదట జ్ఞానయోగము యొక్క నైకైక సాధన ద్వారా పరమాత్మప్రాప్తిని గూర్చి తెల్పుచున్నాడు-

**తద్బుద్ధయస్తదాత్మానః తన్నిష్ఠాస్తత్పరాయణాః ।**
**గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తదాత్మానః, తద్బుద్ధయః | = తద్రూపమును పొందిన, మనోబుద్ధులు గలవారును | | నిరంతరము ఏకీభావముతో స్థితులైనవారును | జ్ఞాననిర్ధూత-కల్మషాః | = జ్ఞానసాధనతో పాపరహితులై |
| తన్నిష్ఠాః | = ఆ సచ్చిదానందఘన పరమాత్మయందే | తత్పరాయణాః = | తత్పరాయణులును అగు పురుషులు | అపునరావృత్తిమ్ | = పునరావృత్తిరహితమైన పరమగతిని |
| | | | | గచ్ఛంతి | = పొందుదురు |

**తద్రూపమును పొందిన మనోబుద్ధులుగలవారై, సచ్చిదానందఘనపరమాత్మ యందే నిరంతరము ఏకీభావముతో స్థితులై, తత్పరాయణులైన పురుషులు జ్ఞానసాధనతో పాపరహితులై, పునరావృత్తిరహితమైన పరమగతిని పొందుదురు. (17)**

ప్రశ్న - మనస్సు తద్రూపమును పొందుట యనగానేమి? సాంఖ్యయోగమును అనుసరించి, ఏ విధమైన అభ్యాసము చేసినచో మనస్సు తద్రూపమును పొందును?

సమా - సాంఖ్యయోగ సాధకుడు ఆచార్య శాస్త్రోపదేశముల ప్రభావముతో సమస్త జగత్తు మాయామయమనియును, సచ్చిదానంద ఘనపరమాత్మయే సత్యమనియును గ్రహింపవలెను. అనాత్మ వస్తువుల అన్నింటి చింతనను సర్వథా త్యజింపవలెను. మనస్సును పరమాత్మ స్వరూపమునందే నిశ్చలముగా నుంచుటకై అతని ఆనందమయ స్వరూపమును ధ్యానింపవలెను. అట్లు పదే పదే ఆనందానుభూతిని పొందుచు, దానియందే ధారణ సల్పవలెను. ఆనందము యొక్క వివిధ స్థితులను, గతులను (పూర్ణానందము, అపారానందము, శాంతానందము, ఘనానందము, అచలానందము, ధ్రువానందము, నిత్యానందము, బోధస్వరూపానందము, జ్ఞాన స్వరూపానందము, పరమానందము, మహదానందము, అనంతానందము, సమానందము, అచింత్యానందము, చిన్మయానందము, ఏకమాత్రానందములను) అనుభవించి, పరిపూర్ణానంద స్థితిని పొందవలెను. ఆనందముకంటెను భిన్నమైన మఱొక వస్తువు లేదని నిరంతరము మననము చేయుచు, సచ్చిదానంద ఘన పరమాత్మ యందు మనస్సు అభిన్న భావముతో నిశ్చలముగా ఉండుటయే మనస్సు తద్రూపమును పొందుట యగును.

ప్రశ్న - బుద్ధి తద్రూపమును పొందుట యనగానేమి? మనస్సు తద్రూపమును పొందిన పిదప ఏ అభ్యాసము వలన బుద్ధి తద్రూపమును చేరును?

సమా - పైన చెప్పిన రీతిగా మనస్సు తద్రూపమును పొందిన పిమ్మట బుద్ధియందు నిశ్చయముగా సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపము నిల్చును. పిదప ఆ స్వరూపమును అవిచ్ఛిన్నముగా ధ్యానింపగా బుద్ధి తన ప్రత్యేకస్థితిని కోల్పోయి సచ్చిదానంద ఘనపరమాత్మ యందే ఏకత్వమును పొందును. ఇట్టి స్థితినే బుద్ధి తద్రూపము నందుట అనియందురు.

ప్రశ్న - సచ్చిదానంద ఘన పరమాత్మయందు ఏకీభావము పొందినట్టి తన్నిష్ఠాస్థితి ఏ దశను సూచించును? మనోబుద్ధులు తద్రూపమును పొందిన పిమ్మట ఆ నిష్ఠాస్థితి స్వరూపమేమి?

సమా - ఆత్మ పరమాత్మల మధ్య భేదభ్రమ ఏర్పడుటకు మనోబుద్ధులే ముఖ్య హేతువులు. కావున పైన చెప్పబడిన

రీతిగా మనోబుద్ధులు పరమాత్మయందు ఏకాకృతిని పొందనంతవఱకును సాంఖ్యయోగికి (సాధకునకు) పరమాత్మయందు అభిన్న భావస్థితి కలుగదు. మనోబుద్ధులు తద్రూపమును పొందిన పిమ్మట సాధకునకు ఆత్మపరమాత్మల మధ్య భేదభ్రమ తొలగిపోవును. అట్టిస్థితిలో ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను త్రిపుటి అభావమేర్పడి (భేద భావము నశించి) సాంఖ్యయోగి కేవలము సచ్చిదానంద ఘన పరమాత్మయందే ఏకీభావస్థితిని పొందును. ఈ స్థితినే తన్నిష్ఠాస్థితి అని యందురు.

ప్రశ్న - 'తత్పరాయణాః' అను పదమునకు అర్థమేమి?

సమా - పైన వివరింపబడిన రీతిగా ఆత్మపరమాత్మల మధ్య భేదభ్రమ తొలగిపోయిన పిమ్మట సాంఖ్యయోగి సచ్చిదానందఘనపరమాత్మ యందు అభిన్న భావముతో నిశ్చల స్థితిని పొందును. అట్టిస్థితిలో పరమాత్మ తప్ప మఱియే వస్తువు ఉనికియే యుండదు. సాదకుని మనోబుద్ధులు, ప్రాణములు మొదలైనవి అన్నియును పరమాత్మ రూపమునే పొందును. ఈ విధముగా సచ్చిదానంద ఘన పరమాత్మ యొక్క అపరోక్ష జ్ఞానము ద్వారా ఏకత్వమును పొందిన వారిని 'తత్పరాయణాః' అనియందురు.

ప్రశ్న - 'తత్' అను శబ్దమునకు సచ్చిదానంద ఘన పరమాత్మ అను అర్థమునే ఏల చెప్పవలెను?

సమా - పూర్వ (16వ) శ్లోకమున 'పరమ్' అను పదమునకు 'తత్' అనునది విశేషణముగ ప్రయుక్తమైనది. యథార్థజ్ఞానము ద్వారా ఆ పరమతత్త్వ సాక్షాత్కారము పొందుట అని వివరింపబడినది. ఈ శ్లోకమునందు గూడ సందర్భానుసారముగ 'తత్' శబ్దమునకు సచ్చిదానందఘన పరమాత్మ అను అర్థము చెప్పుటయే సముచితము.

ప్రశ్న - 'జ్ఞాన నిర్ధూత కల్మషాః' అను సమాసము నందలి జ్ఞాన శబ్దమునకు అర్థమేమి? అట్లే కల్మష, నిర్ధూత అను శబ్దములయొక్క అర్థములెవ్వి?

సమా - 16వ శ్లోకమున చెప్పబడిన రీతిగా అజ్ఞానమును అంతరింపజేయునదియు, సూర్యునివలె (సూర్యప్రభవలె) పరమాత్మను దర్శింపజేయునదియు అగు యథార్థ తత్త్వజ్ఞానమే అచటి జ్ఞాన శబ్దమునకు అర్థము. పుణ్యపాపకర్మలు, రాగద్వేషాది - అవగుణములు, విక్షేప - ఆవరణములు మొదలగునవి అన్నియును ఆత్మకు బంధహేతువులు గావున అవియన్నియును కల్మషమునకు అర్థములు. ఈ కల్మషములన్నియును తొలగిపోవుటను నిర్ధూత శబ్దము తెలుపును. పైన పేర్కొనబడిన రీతిగా సాధనవలన ప్రాప్తించిన యథార్థ జ్ఞానము ద్వారా సాధకుల మల, విక్షేప-ఆవరణాది సమస్త పాపములును తొలగిపోవును. ఫలితముగ వారి పాపములు లేశ మాత్రమును మిగులవు. వారు సర్వథా పాపరహితులగుదురు - అట్టివారినే 'జ్ఞాన నిర్ధూతకల్మషాః' అనియందురు.

ప్రశ్న - అపునరావృత్తిని పొందుట అనగానేమి?

సమా - అపునరావృత్తి ప్రాప్తించుట యనగా యథార్థజ్ఞాన ఫలస్వరూపమైన పరమాత్మ ప్రాప్తి. దీనిని పొందిన యోగి (సాధకుడు) తిరిగిరాడు అనగా పునర్జన్మను పొందడు. ఈ స్థితియే ( ఈ అపునరావృత్తి స్థితియే) 16వ శ్లోకమున 'తత్పరమ్' (పరమపదము) అని చెప్పబడినది. గీతయందు దీనినే-అక్షయసుఖము, నిర్వాణ బ్రహ్మము, ఉత్తమ సుఖము, పరమగతి, పరమధామము, అవ్యయపదము దివ్యపరమ పురుషుడు అని ఆయా సందర్భములలో వివరించుట జరిగినది.

సంబంధము - పరమాత్మప్రాప్తి సాధనవిధానములను తెలిపిన పిమ్మట, పరమాత్మ ప్రాప్తినందిన సిద్ధపురుషుల సమభావనను గూర్చి వివరింపబడుచున్నది-

**విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ 18 ॥**

పండితాః = జ్ఞానులు
విద్యావినయసంపన్నే = విద్యతో, వినమ్రతతో ఒప్పుచున్న
బ్రాహ్మణే, చ = బ్రాహ్మణుని యందును
గవి = గోవునందును
హస్తిని = ఏనుగునందును
శుని = కుక్కయందును
శ్వపాకేచ = చండాలుని యందును
సమదర్శినః ఏవ = సమదృష్టినే కలిగియుందురు.

**జ్ఞానులు విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందును, గోవు, ఏనుగు, కుక్క మొదలగు వానియందును, చండాలునియందును సమదృష్టినే కలిగి యుందురు. (18)**

ప్రశ్న - 'పండితాః' అనగానేమి?

సమా - పండితులనగా తత్త్వజ్ఞానులు, మహాత్ములు, సిద్ధ పురుషులు.

ప్రశ్న - విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందును, గోవు, ఏనుగు, కుక్క మొదలగు వానియందు, చండాలుని యందును సమదర్శనమును కలిగియుండుట అనగానేమి?

సమా - తత్త్వజ్ఞానులైన మహాత్ములకు విషమభావము ఏ మాత్రమూ ఉండనే ఉండదు. వారి దృష్టిలో సచ్చిదానంద ఘనపరబ్రహ్మ పరమాత్మయే సత్యము, తక్కిన వానికి ఉనికియే లేదు. కనుక వారికి సర్వత్ర సమభావమే నిలుచును.

మనుష్యులయందు శ్రేష్ఠతముడు బ్రాహ్మణుడు. అధమాధముడు చండాలుడు. జంతువులలో ఉత్తమోత్తమమైనది గోవు. నీచాతి నీచమైనది కుక్క. మధ్యస్థాయికి చెందినది ఏనుగు. ఈ ఐదింటిని ఉదాహరణముగా చూపి జ్ఞానులకు గల సర్వత్ర సమభావనను వివరించుట జరిగినది. ఈ ఐదు ప్రాణుల విషయములో లోకవ్యవహారమునందు అసమత్వము అనివార్యము. ఆవుపాలను అందఱును సేవింతురు. కాని కుక్కపాలను మనుష్యులు త్రాగరు. ఏనుగుపై ఎక్కి విహరించుచుందురు. కుక్క పై విహరింపరు. జీవనయాత్రలో పశువులకు ఉపయోగపడు వస్తువు మనుష్యులకు పనికిరాదు. ఉత్తముడైన బ్రాహ్మణుని పూజా సత్కారములచే గౌరవింపవలెనని శాస్త్రములు ఆదేశించుచున్నవి. కాని చండాలుని విషయములో అట్లు లేదు. కావున లోక వ్యవహారములో అసమత్వము అనివార్యమైన విషయములయందు గూడ జ్ఞానులు సమభావమును కలిగియుందురు. ఏ కారణము వలననైనను, ఎప్పుడైనను, ఎక్కడైనను జ్ఞానులు విషమభావమును చూపరు.

ప్రశ్న - జ్ఞానులు సర్వత్ర సమభావమును చూపుదురు, సరే అందరి యెడలను వారి ప్రవర్తన ఒకే విధముగ ఉండునా?

సమా - అందఱి యెడల ఒకేరీతిగా ఎవ్వరును వ్యవహరింపజాలరు. శాస్త్రములలో చెప్పబడిన రీతిగా న్యాయయుక్తమైన వ్యవహార భేదములను అందఱును పాటింపవలసినదే. లోక వ్యవహార దృష్టిలో వారి వారి (ఆయా) యోగ్యతలను అనుసరించి, ఆవశ్యక (అవసరమగు) భేదములను పాటించుటయే జ్ఞానుల వైశిష్ట్యము. బ్రాహ్మణుని యెడ బ్రాహ్మణోచితముగ, చండాలునియెడ చండాలోచితముగ, అట్లే, గోవు, ఏనుగు, కుక్క మొదలగు జంతువులయెడ యథోచితముగ వ్యవహరింతురు. అయినను అందఱి యెడల వారికి ప్రేమాదరములు, పరమాత్మభావము సమానముగనే యుండును.

శరీరమునకు శిరస్సు, చేతులు, పాదములు మొదలగు అంగములున్నట్లు, సమాజమునకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులు అంగములైయున్నారు. శరీరాంగములలో వేటి ప్రాముఖ్యము వాటిదే. వేటి కర్మాచరణములు వాటివే. ఒక అంగము ఆచరించు కార్యమును మఱియొక అంగము ఆచరింపదు. అయినప్పటికిని మానవుడు అన్ని అంగముల యెడలను ఆత్మీయ భావమునే కలిగియుండును. అన్నింటి సుఖ దుఃఖానుభవములయందును సమాన భావముతోడనే వ్యవహరించును. ఆతని ప్రేమాదరముల విషయముల యందును, ఆత్మీయతయందును అసమాన స్థితి యుండదు. అట్లే తత్త్వజ్ఞానులైన మహాపురుషులకు సర్వత్ర బ్రహ్మదృష్టియుండుట వలన లోకవ్యవహార దృష్టిలో ఆయా ప్రాణులయెడ యథాయోగ్య భేదములు ఉన్నప్పటికిని వారి ఆత్మీయతలు, ప్రేమాదరములు సర్వత్ర సమముగానే యుండును. మానవుడు తన అంగములలో దేనికైనను (ఏ అంగమునకైనను) దెబ్బతగిలినను, దెబ్బ తగులుటకు అవకాశమున్నదని భావించినను దాని రక్షణకై సర్వవిధముల పాటుపడును. అట్లే తత్త్వజ్ఞానియు లోక వ్యవహారమునందు ఎవ్వరికైనను, ఏ ప్రాణి సముదాయమునకైనను విపత్తి (ఆపద) సంభవించి నప్పుడు ఎట్టి భేదభావములును లేక తద్రక్షణకై (ఆ ఆపన్నివారణకై) యథాయోగ్యముగ పాటుపడును.

**సంబంధము** - ఇంతవఱకును తత్త్వజ్ఞాని యొక్క సమభావము వివరింపబడినది. ఇప్పుడు సమభావమునే బ్రహ్మస్వరూపముగ పేర్కొని అందు స్థితులైన మహాపురుషుల మహత్త్వమును వర్ణించుట జరుగుచున్నది-

**ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యేషాం, మనః | = ఎవరి మనస్సు | | యగును | తే | = వారు (అట్టిజ్ఞానులు) |
| సామ్యే, స్థితమ్ | = సమభావమునందు స్థితమై యుండునో | హి | = ఏలనన | బ్రహ్మణి, స్థితాః | = సచ్చిదానందఘన పరమాత్మయందు స్థితులు అనగా వారు త్రిగుణా తీతులు, జీవన్ముక్తులు |
| తైః | = వారిచే | బ్రహ్మ | = సచ్చిదానంద ఘనపరమాత్మ | | |
| ఇహ, ఏవ | = ఈ జన్మయందే | నిర్దోషమ్, సమమ్ | = దోషరహితుడు, సముడు | | |
| సర్గః | = జగత్తంతయు | | | | |
| జితః | = జయింపబడినది | తస్మాత్ | = అందువలన | | |

సర్వత్ర సమభావస్థితమనస్కులు ఈ జన్మయందే సంపూర్ణజగత్తును జయించిన వారగుదురు. అనగా ప్రాపంచిక విషయాతీతస్థితికి చేరుదురు. సచ్చిదానందఘనపరమాత్మ దోషరహితుడు, సముడు. సమభావస్థితమనస్కులైన జ్ఞానులు సచ్చిదానంద ఘనపరమాత్మయందుస్థితులు. కనుక వారు త్రిగుణాతీతులు. జీవన్ముక్తులు. **(19)**

ప్రశ్న - సమభావస్థితమనస్కులైన వారు ఈ జగత్తును ఈ జన్మయందే జయించినవారు అనగానేమి?

సమా - సమభావస్థిత మనస్కులైనవారు అనగా సర్వత్ర సమబుద్ధి గలవారు లోకవ్యవహార దృష్టిలో శరీరములు కల్గియున్నను ఆ శరీరములతో వాస్తవముగా వారికి ఎట్టి సంబంధము ఉండదు. ఈ జన్మయందే వారు జననమరణ చక్రమునుండి విముక్తులై జీవన్ముక్త స్థితినందుదురు. అట్టి వారిని ఈ జన్మయందే (సాధనానుష్ఠాన దశయందే) ఈ జగత్తును జయించినవారుగా (ప్రాపంచిక విషయ విజేతలుగా) చెప్పవచ్చును.

ప్రశ్న - బ్రహ్మమునకు 'నిర్దోషమ్ సమమ్' అను విశేషణములు ప్రయోగించుటలో గల ప్రత్యేకతయేమి? అట్లే 'హి, తస్మాత్' అను వానిని ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - సత్త్వరజస్తమోగుణములలోని దోషములలో హెచ్చు తగ్గులు ఉండవచ్చును. మొత్తముమీద ఆ త్రిగుణములును దోషయుతములే. ఈ సమస్త జగత్తు ఆ మూడు గుణముల కార్యరూపము అగుట వలన దోషయుతమే. ఈ గుణముల సంబంధము కల్గియుండుట వలననే విషమ భావము, రాగద్వేష మోహాదులైన అవగుణములన్నియును ఏర్పడుచుండును. బ్రహ్మము (సచ్చిదానంద ఘన పరమాత్మ) ఈ మూడు గుణములకును అతీతుడు. కావున ఆ బ్రహ్మమును 'నిర్దోషమ్, సమమ్' అను విశేషణములతో వర్ణించుట జరిగినది. ఇట్టి బ్రహ్మమునందు స్థితుడైయుండుట వలన తత్త్వజ్ఞానియు గుణాతీతుడగును. కనుక అతని యందలి రాగ, ద్వేష, మోహ, మమతాహంకారాది అవగుణములును, విషమభావములును నశించి అతనికి సమభావస్థితి ఏర్పడును. సమభావము బ్రహ్మము యొక్క స్వరూపము. సమభావస్థితుడైన తత్త్వజ్ఞాని బ్రహ్మస్థితుడై యున్నట్లు అగును. లోకవ్యవహార దృష్టిలో వారు (తత్త్వజ్ఞానులు) త్రిగుణమయమైన శరీరమునందు స్థితులైయున్నట్లు కనబడుచున్నను వారు సమభావస్థితులు అగుటవలన ఈ త్రిగుణమయ జగత్తుతో, శరీరముతో వాస్తవముగా వారికి ఎట్టి సంబంధము ఉండదు. అతని స్థితి బ్రహ్మమునందే అగును. ఈ భావమును ప్రకటించుటకే 'హి, తస్మాత్' అను హేతువాచకములు ప్రయుక్తములైనవి.

ప్రశ్న - గీతయందు పెక్కు సందర్భములలో అనర్థములకన్నింటికిని రజస్తమోగుణములే హేతువులనియు, కావున వానిని త్యజింపవలెననియు భగవానుడు తెలిపియుండెను. కనుక రజస్తమోగుణములు రెండును సమస్త దోషములకు నిలయములనుట యుక్తమే. కాని సత్త్వగుణము భగవత్ప్రాప్తికి దోహదకారి గదా! మరి దానిని

రజస్తమోగుణములతో సమానముగా దోషపూర్ణమని చెప్పుట ఎట్లు పొసగును?

సమా - రజస్తమోగుణములతో పోల్చినచో సత్త్వగుణము శ్రేష్ఠమైనది. మానవుని ఉన్నతికి సహాయకారి. అయినను అహంకారస్పర్శగల సుఖముతో, జ్ఞానముతో కూడియుండుట వలన అదియును (సత్త్వగుణము కూడ) బంధహేతువుగా పేర్కొనబడినది (14/6). మూడు గుణముల తోడను సంబంధము పూర్తిగా తెగిపోవునంత వఱకును సాధకుడు పూర్తిగా దోషరహితుడగుట జరుగదు. అతనికి సమభావస్థితి సంపూర్ణముగా ఏర్పడదు. కావున గుణాతీత ప్రసంగ విషయమున సత్త్వగుణము గూడ దోషయుక్తమని పేర్కొనుట అనుచితము కాదు.

*సంబంధము - నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘనబ్రహ్మను పొందిన సమదర్శియగు సిద్ధపురుషుని లక్షణములు తెలుపబడుచున్నవి-*

**న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియమ్ ।**
**స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ 20 ॥**

ప్రియమ్, ప్రాప్య = ప్రియమునుపొంది
న, ప్రహృష్యేత్ = పొంగిపోనివాడును
చ = అట్లే
అప్రియమ్, ప్రాప్య = అప్రియమునుపొంది
న, ఉద్విజేత్ = ఉద్వేగమునకులోను కానివాడును
స్థిరబుద్ధిః = నిశ్చలమైన బుద్ధి గలవాడును
అసమ్మూఢః = మోహ వివశుడు కాని వాడును అగు,
బ్రహ్మవిత్ = బ్రహ్మవేత్త
బ్రహ్మణి = సచ్చిదానంద ఘన పరబ్రహ్మమునందు
స్థితః = ఏకీభావస్థితుడై యుండును.

**ప్రియలాభములకు పొంగిపోనివాడును, అప్రియములు ఎదురైనప్పుడు క్రుంగి పోనివాడును, స్థిరమైన బుద్ధిగలవాడును, మోహవివశుడు కానివాడును అయిన బ్రహ్మవేత్త సచ్చిదానందఘనపరబ్రహ్మ పరమాత్మయందు సదా ఏకీభావస్థితి యందుండును. (20)**

ప్రశ్న - ప్రియమైన వాటికి పొంగిపోక, అప్రియమైన వాటికి క్రుంగిపోక ఉండుటయనగానేమి?

సమా - మనోబుద్ధీంద్రియ శరీరములకు అనుకూలములైన వాటిని ప్రియములందురు. అజ్ఞానికి అట్టి అనుకూలములైన వాటియందు ఆసక్తి యుండుటచే అవి లభించినప్పుడు అతడు సంతోషించును. కాని తత్త్వజ్ఞాని సమభావస్థితి కలిగియుండుట వలన ఏ వస్తువునందును లేశమాత్రమైనను అతనికి ఆసక్తి యుండదు. ప్రారబ్ధమును బట్టి ఏదైనను అనుకూల వస్తుప్రాప్తి కలిగినను అనగా మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరములకు ఏదైనను ప్రియపదార్థ సంయోగము ఏర్పడినను అతడు పొంగిపోడు. ఏలనన మనస్సు, ఇంద్రియములు, శరీరము మొదలగు వానియందు మమతాసక్తులు, అహంభావము అతనికి ఏ మాత్రమును ఉండవు.

ఇదే విధముగ మనోబుద్ధీంద్రియ శరీరమునకు ప్రతికూలములైన వాటిని అప్రియములు అందురు. అజ్ఞానికి ఇట్టి అప్రియములైన వాటియందు అనిష్టభావముండును. కనుక అవి ప్రాప్తించినప్పుడు ఉద్విగ్నుడై దుఃఖితుడగును. కాని జ్ఞానికి ఏ వస్తువునందును ద్వేషభావము ఉండదు. కనుక మనస్సుకు, బుద్ధికి, ఇంద్రియములకు, శరీరమునకు ప్రతికూల పదార్థ సంయోగము ఏర్పడినప్పుడును అతడు ఉద్విగ్నుడు, దుఃఖితుడు కాడు.

ప్రశ్న - 'స్థిరబుద్ధిః' అను విశేషణము యొక్క ప్రాముఖ్యము ఏమి?

సమా - తత్త్వజ్ఞానియైన సిద్ధపురుషుని దృష్టిలో బ్రహ్మము తప్ప ఈ జగత్తులో మఱి యేదియు సత్యము గాదు. కావున లోకవ్యవహారదృష్టిలో అనేక విధములుగా సుఖదుఃఖాదులు కలిగినను అతని బుద్ధి బ్రహ్మస్థితి నుండి ఎప్పుడును, ఏ విధముగను తొలగదు. అది (బుద్ధి) సచ్చిదానంద ఘన బ్రహ్మమునందే నిశ్చలస్థితిలో ఉండును. అట్టివానిని 'స్థిరబుద్ధిః' (స్థిరబుద్ధి గలవాడు) అని యందురు.

ప్రశ్న - 'అసంమూఢః' అను ప్రయోగము యొక్క ప్రాముఖ్యము ఏమి?

సమా - జ్ఞాని యొక్క అంతఃకరణమునందు సంశయము, భ్రమ, మోహము లేశమాత్రమును ఉండవు. అందువలన అతనిలో అజ్ఞానము అంతరించును. అట్లే సంశయాదులును తొలగిపోవును. అట్టి జ్ఞానినే 'అసమ్మూఢః' అని యందురు.

ప్రశ్న - 'బ్రహ్మవిత్' అనగానేమి?

సమా - అతడు సచ్చిదానంద ఘన బ్రహ్మతత్త్వమును బాగుగా ఎఱుంగును. బ్రహ్మము అనగానేమి? జగత్తు అనగానేమి? బ్రహ్మ, జగత్తుల సంబంధమేమి? ఆత్మ అనగానేమి? పరమాత్మ అనగానేమి? జీవేశ్వర లక్షణము లెట్టివి? జీవునకును ఈశ్వరునకును మధ్యగల భేదమేమి? మొదలగు బ్రహ్మ సంబంధ విషయములన్నియును అతనికి కరతలామలకములు. బ్రహ్మము యొక్క స్వరూపము అతనికి ప్రత్యక్షము. అట్టివానిని 'బ్రహ్మవిత్' అని యందురు.

ప్రశ్న - 'బ్రహ్మణి స్థితః' అనగానేమి?

సమా - బ్రహ్మవేత్త జాగ్రత్ స్వప్నసుషుప్త్యవస్థల యందును సదా బ్రహ్మమునందే స్థితుడైయుండును. భౌతికములయిన శరీరాదులయందు అతని కెప్పుడును ధ్యాస యుండదు. బ్రహ్మమునందు తాదాత్మ్యస్థితి కలిగియుండుట వలన అతడెప్పుడును బ్రహ్మము నుండి వేఱుకాడు. అతని స్థితి సదా ఒకే రీతిగా ఉండును. అట్టివానిని 'బ్రహ్మణి స్థితః' అని యందురు.

*సంబంధము - బ్రహ్మైక్య స్థితిని పొందిన జ్ఞాని లక్షణములు తెల్పబడినవి. ఇట్టి స్థితిని పొందుటకు సాధన విధానములను వాటి ఫలములను వివరించుట జరుగుచున్నది-*

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ 21 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| బాహ్యస్పర్శేషు | = ప్రాపంచిక విషయములయందు | (తత్) | = సాత్త్వికానందము కలదో దానిని | | | | ధ్యానయోగమునందు అభిన్న భావస్థితుడై |
| అసక్తాత్మా | = అనాసక్తమైన అంతః కరణముగల సాధకుడు | విందతి | = పొందును | అక్షయమ్, సుఖమ్ | = అక్షయానందమును |
| | | సః | = (పిదప) అతడు | | |
| ఆత్మని యత్, సుఖమ్ | = ఆత్మయందు(స్థితమైన) ధ్యాన జనితమైన ఏ | బ్రహ్మయోగ-యుక్తాత్మా | = సచ్చిదానందఘన పరబ్రహ్మ పరమాత్మ | అశ్నుతే | = పొందును (అనుభవించును). |

**ప్రాపంచిక విషయములయందు అనాసక్తమైన అంతఃకరణముగల సాధకుడు ఆత్మస్థితధ్యాన జనితమైన సాత్త్వికాత్మానందమును పొందును. పిదప అతడు సచ్చిదానంద ఘనపరబ్రహ్మపరమాత్మ ధ్యానయోగమునందు అభిన్నభావస్థితుడై అక్షయానందమును అనుభవించును. (21)**

ప్రశ్న - 'బాహ్య స్పర్శేష్వసక్తాత్మా' అనగానేమి?

సమా - శబ్దస్పర్శరూపరసగంధాదులైన ఇంద్రియ విషయములనే బాహ్యస్పర్శ విషయములందురు. వివేకి వాటియందలి ఆసక్తిని తన మనస్సునుండి పూర్తిగా తొలగించుకొనును. అతనికి సమస్త భోగములయందును వైరాగ్యము ఏర్పడి వాటన్నింటియందును ఉపరతి కలుగును. (చంచలమగు మనస్సును నిశ్చలముగ జేసి బాహ్య విషయముల నుండి మఱలించి, సర్వదా బ్రహ్మమునందే నిల్పుట ఉపరతి యనబడును.) అట్టి పురుషుని 'బాహ్య స్పర్శేష్వసక్తాత్మా' అనియందురు.

ప్రశ్న - ఆత్మానందమును పొందుట అనగానేమి?

సమా - ఇచట ఆత్మ శబ్దమునకు అంతఃకరణమని యర్థము. ఆ అంతఃకరణమునందు సర్వవ్యాపియైన సచ్చిదానంద ఘనపరమాత్మ స్థితిని సాధకుడు దర్శించు చుండును. అట్టి పరమాత్మను సతతము నిరంతరముగ ధ్యానించుట వలన కలుగు సాత్త్వికానందమును

అనుభవించుచుండుటయే ఆత్మానందమును పొందుట యగును. ఇంద్రియ భోగములనే సుఖములని భావించు వారికి ఈ ధ్యానజనిత సుఖము లభింపదు. ప్రాపంచిక భోగములయందు నిజమైన సుఖము లేనే లేదు. ఆ సుఖము కేవలము ఆభాసమాత్రమే. వైరాగ్యసుఖము దానికంటె గొప్పది. వైరాగ్యసుఖముకంటెను ఉపరతి వలన కలుగు సుఖము చాల గొప్పది. కాని పరమాత్మ ధ్యానమునందు నిశ్చలస్థితి వలన లభించు సుఖము అన్నిటికంటెను ఉత్కృష్టమైనది. ఇట్టి సుఖానుభవమే ఆత్మానందమును పొందుట అగును.

ప్రశ్న - 'బ్రహ్మయోగ యుక్తాత్మా' అనగానేమి? 'సః' అను సర్వనామ ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - ఇంద్రియ సుఖములన్నింటి యందును ఆసక్తిరహితుడై సాధకుడు ఉపరతిని పొందును. పిదప పరమాత్మ ధ్యానమునందు నిశ్చలస్థితిలో నుండుట వలన అతనికి సర్వోత్కృష్ట సుఖానుభవము కలుగును. అతడే బ్రహ్మయోగయుక్తాత్మా అనబడును. అనగా పరబ్రహ్మ పరమాత్మ ధ్యానయోగమునందు అభేద భావస్థితిని పొందినవాడు, 'బాహ్యస్పర్శేష్వసక్తాత్మా' మరియు 'విందతి ఆత్మనియత్సుఖమ్' అను రెండు విశేషణములతో వర్ణింపబడిన సాధకుడే ఇచట 'బ్రహ్మయోగయుక్తాత్మా' అనియు చెప్పబడుచున్నాడు. వీటి యేకత్వమును తెలుపుటకే 'సః' అను సర్వనామము ప్రయోగింపబడినది.

ప్రశ్న - అక్షయానందము అనగానేమి? దానిని అనుభవించుట యనగానేమి?

సమా - సదా ఏకరసాత్మకుడు, పరమానంద స్వరూపుడు, శాశ్వతుడు అయిన పరమాత్మయే అక్షయసుఖస్వరూపుడు. నిరంతరము అట్టి పరమాత్మను ధ్యానించుచు అభేద భావముతో తాదాత్మ్యమును చెందుటయే అక్షయానందమును అనుభవించుట.

ఈ అక్షయసుఖముతో పోల్చదగిన సుఖము ఏదియును లేదు. ప్రాపంచిక భోగములయందు భాసించు సుఖము క్షణికము. కనుక అది సుఖమని చెప్పదగినదియే గాదు. దీనితో పోల్చినప్పుడు ధ్యానజనిత సుఖమునకు హేతువులైన వైరాగ్య-ఉపరతి సుఖములు శ్రేష్ఠములు. ధ్యానజనిత సుఖము పరమాత్మ సాక్షాత్కార కారకము. కావున ఈ రెండింటి కంటెను శ్రేష్ఠతరము - సాధనకాలము నందలి ఈ సుఖములలో దేనిని గూడ అక్షయము అని చెప్పుటకు వీలులేదు. అక్షయానందము అనగా పరమాత్మ స్వరూపమే.

*సంబంధము - ఇంద్రియ విషయాసక్తిని త్యజించుట పరమాత్మప్రాప్తికి దారితీయును - అని తెలుపుట జరిగినది. ఇంద్రియభోగములు, దుఃఖకారకములు, అనిత్యములు. కనుక వాటియందు ఆసక్తిరాహిత్యము అత్యావశ్యకము - అని ప్రస్తుతశ్లోకమునందు వివరింపబడుచున్నది-*

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥ 22 ॥**

కౌంతేయ! = ఓ అర్జునా!
యే, సంస్పర్శజాః, భోగాః = విషయేంద్రియ సంయోగము వలన ఉత్పన్నములగు భోగములు ఏవి గలవో
తే = (భోగలాలసులకు సుఖములుగ భాసించు) ఆ భోగములు అన్నియును
హి = నిస్సందేహముగా
దుఃఖయోనయః, ఏవ = దుఃఖహేతువులే
ఆద్యంతవంతః = (అవి) ఆదియు, అంతము గలవి (అనిత్యములు)
బుధః = వివేకి
తేషు = వాటియందు
న, రమతే = రమింపడు.

విషయేంద్రియసంయోగమువలన ఉత్పన్నములగు భోగములన్నియును భోగలాలసులకు సుఖములుగా భాసించినను అవి నిస్సందేహముగా దుఃఖహేతువులే. ఆద్యంతములు గలవి. అనగా అనిత్యములు. కావున ఓ అర్జునా! వివేకి వాటియందు ఆసక్తుడు కాడు. (22)

ప్రశ్న - విషయేంద్రియ సంయోగము వలన కలుగు భోగములు కేవలము దుఃఖహేతువులు అనుటలోని ఆంతర్యమేమి?

సమా - మిడుతలు మోహవశమున అగ్నిజ్వాలలను సుఖహేతువులుగా భ్రమపడి వానిని పొందగోరి, ఎగిరి వానిపై బడి భయంకర తాపములను అనుభవించి దగ్ధములగును. అట్లే అజ్ఞానులు భోగములను సుఖహేతువులుగా భావించి, వాటియందు ఆసక్తులై ఆ ఆభాససుఖముల సుడిగుండములలో పడి దుఃఖముల పాలగుదురు. అజ్ఞానులు విషయములను సుఖహేతువులుగా భావించుట వలన వాటిని అనుభవింపవలెనను ఆసక్తి వారిలో అధికమగును. ఆ ఆసక్తి కారణముగ కామక్రోధాది వికారములు వారిలో పెల్లుబుకును. వాటి ప్రభావమున అనేక విధములైన దుర్గుణములు, దురాచారములు వారిని చుట్టుముట్టును. అందువలన వారి జీవితములు పాపపంకిలములగును. తత్ ఫలితముగ వారు ఇహపర లోకముల యందును వివిధములైన భయంకర యాతనలకు గురియగుదురు.

అవివేకి భ్రమ ప్రమాదములకు లోనై స్త్రీ ప్రసంగాది భోగములను సుఖకారకములుగా తలంచి, ఆ విషయ భోగములలో మునిగిపోవును. ఆ కారణముగ అతని బలము, వీర్యము, ఆయువు క్షీణించును. అట్లే వానియొక్క మనస్సు, బుద్ధి, ప్రాణములు, ఇంద్రియములు దుర్బలములగును. అంతేగాక అవి శాస్త్ర విరుద్ధములైనచో అతడు పరలోకమున దుర్భరములైన నరకయాతనలకు గురియగును.

మఱియును అజ్ఞాని ఇతరులకు గల అధికములైన భోగసంపదలను చూచినప్పుడు అతని మనస్సున ఈర్ష్యాగ్ని రగుల్కొనును. ఆ ఈర్ష్యాగ్నియే వానిని దగ్ధమొనర్చును.

సుఖములుగా భాసించిన భోగవిషయములను ప్రారబ్ధవశమున కోల్పోయినచో మానవుడు వాటి పైగల వ్యామోహ ప్రభావమున వాటినే పదేపదే స్మరించుచుండును. క్రమముగా శోకమగ్నుడై విలవిలలాడును. ఈ వివరణములను అన్నింటిని బట్టి చూచినచో విషయ సంయోగము వలన ప్రాప్తించిన భోగములు వాస్తవముగా పూర్తిగా దుఃఖహేతువులే యనియు, వాటియందు సుఖము ఏ మాత్రము లేదనియు తెలియును. అజ్ఞానకారణముగనే అవి సుఖకరములుగా భ్రమగొల్పును. కావున అవి కేవలము దుఃఖహేతువులేయని భగవంతుడు తెలిపెను.

ప్రశ్న - భోగములు ఆద్యంతములు గలవి (అనిత్యములు) అని తెలుపుటలో గల విశేషమేమి?

సమా - ఇంద్రియ భోగములు స్వప్న సదృశములు, మెఱుపులవలె క్షణభంగురములు అని వివరించుటకే అవి ఆద్యంతములు గలవి అని పేర్కొనుట జరిగినది. నిజముగ వీటివలన సుఖము లేనేలేదు. అజ్ఞాన ప్రభావమున ఒకవేళ ఇవి సుఖకరములుగా అనిపింపవచ్చును. అట్టి పరిస్థితి యందును సుఖకరముగా ఏ ఒక్క అంశము భాసించినను అది కూడ నిత్యము గాదు, క్షణికమే. ఏలనన సహజముగనే అనిత్యమైన వస్తువు నిత్య సుఖమును ఈయజాలదు. రెండవ అధ్యాయము నందలి 14వ శ్లోకమున గూడ ఇంద్రియ విషయములు ఉత్పత్తి వినాశశీలములగుట వలన అవి అనిత్యములని పేర్కొనబడెను.

ప్రశ్న - అర్జునుని ఇచట **'కౌంతేయ!'** అని సంబోధించుటలో గల విశేషమేమి?

సమా - అర్జునుని తల్లియగు కుంతీదేవి మిక్కిలి బుద్ధిమంతురాలు. సంయమము గలది. వివేకవతి. విషయభోగములయందు విరక్తి గలది. స్త్రీ అయియుండి తన పూర్తి జీవితము వైరాగ్యయుక్తముగ, ధర్మాచరణ మొనర్చుచు, భగవద్భక్తితోడనే గడిపెను. అట్టి ధర్మశీలయగు కుంతీదేవికి పుత్రుడైన కారణమున ఆ తల్లి శుభలక్షణములకు వారసుడుగా అర్జునుడు విషయాసక్తుడగుటకు అవకాశమే లేదని తెల్పుటకు **కౌంతేయ!** అని సంబోధించుట జరిగినది.

ప్రశ్న - అజ్ఞాని విషయ భోగముల యందు రమించును. కాని జ్ఞాని వాటియందు ఆసక్తుడు కాడు. దీనికి కారణమేమి?

సమా - విషయభోగములు అనిత్యములు, క్షణభంగురములు, దుఃఖహేతువులు. కాని వివేకహీనుడైన అజ్ఞాని నిత్యానిత్య విచారము చేయక విషయభోగాను భవముల పర్యవసానములను ఆలోచింపక వాటిలో మునిగి తేలుచు నానాక్లేశములను అనుభవించును. కాని వివేకవంతుడైన జ్ఞాని విషయభోగముల అనిత్యత్వమును క్షణభంగుర స్థితిని గూర్చి ఆలోచించును. అవి కామక్రోధ పాపతాపాది అనర్థములకు మూలములని యెఱుంగును. వాటియందలి ఆసక్తిని త్యజించుట అక్షయసుఖప్రాప్తికి తోడ్పడుననియు గ్రహించును. కావున వాటియందు అతడు నిరాసక్తుడగును.

సంబంధము - కామక్రోధాదుల మూలమున విషయభోగములు దుఃఖహేతువులని వివరించుట జరిగినది. ఇప్పుడు మానవజన్మ వైశిష్ట్యమును తెల్పుచు దుర్జయమైన కామక్రోధాది శత్రువులను జయించిన వారిని భగవానుడు ప్రశంసించుచున్నాడు-

**శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ సాధకుడు | కామక్రోధో-ద్భవమ్, వేగమ్ | = కామక్రోధాదులవలన కలిగిన ఉద్వేగమును | సః, నరః | = ఆ సాధకుడు |
| ఇహ | = ఈజన్మయందు | | | యుక్తః | = నిజమైన యోగి |
| శరీరవిమోక్షణాత్, ప్రాక్, ఏవ | = శరీరమును విడువకముందే | సోఢుమ్ | = సహించుటకు | సః | = అతడే |
| | | శక్నోతి | = సమర్థుడగుచున్నాడో | సుఖీ | = నిజమైన సుఖి |

**ఈ శరీరమును విడువకముందే అనగా జీవించియుండగానే కామక్రోధాదుల ఉద్వేగములను అదుపులోనుంచుకొనగల సాధకుడే నిజమైన సుఖి, యోగి. (23)**

ప్రశ్న - 'ఇహ, ఏవ' అను అవ్యయములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - మానవజన్మ వైశిష్ట్యమును తెల్పుటకే ఈ రెండు అవ్యయములును ప్రయోగింపబడినవి. దేవాదుల జన్మలు విలాసములకును, భోగములకును నిలయములు. పశుపక్ష్యాదుల జన్మలు జడత్వముతో గూడినవి. కనుక కామక్రోధాదులను నిరోధించుటకు ఆ జన్మలన్నింటికిని అవకాశము లేదు. ఈ మానవజన్మయందే, మృత్యు ముఖమున పడకముందే కామక్రోధాదుల విజృంభణములను అరికట్టుటకు సాధకుడు శక్తుడు కావలెను. అశ్రద్ధ వలన గాని, ఉపేక్షవలన గాని దుర్లభమైన మానవ జీవితమును భోగవస్తువులను సమకూర్చుకొనుటలోను, వాటిని అనుభవించుటలోను గడిపినచో పిదప తలపట్టుకొని పశ్చాత్తాపపడవలసి వచ్చును - అని భగవానుడు హెచ్చరించు చున్నాడు. ఈ విషయమే కేనోపనిషత్తునందు ఇట్లు చెప్పబడినది.

**ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః (2/5)**

ఈ మానవజీవితమునందే భగవంతుని తెలిసికొన్నచో శుభములు కలుగును. లేనిచో తీరని నష్టములు వాటిల్లును.

ప్రశ్న - 'ప్రాక్శరీరవిమోక్షణాత్' అనగానేమి?

సమా - ఈ శరీరము నశ్వరము. దీనితో వియోగము తప్పదు. ఇది ఎప్పుడు రాలిపోవునో ఎవ్వరికిని తెలియదు. ఇది మృత్యువాత పడకముందే కామక్రోధాదులను అదుపులో ఉంచుకొనవలయును. కామక్రోధాదిశత్రువుల విజృంభణముల బారినపడి జీవితము మాటిమాటికి అస్తవ్యస్తము కాకుండ ఉండుటకు శక్తిని పొందుటకు తగిన సాధన చేయవలెను. పరవళ్ళు త్రొక్కుచు ప్రవహించుచు వచ్చిన నదులన్నియును సముద్రములో కలిసిన పిదప నామరూప రహితములగును. అట్లే విజృంభించుచున్న కామక్రోధాది శత్రువులు సాధకుని నిగ్రహసముద్రమున విలీనమై మటుమాయమగుటకు అతడు ప్రయత్నింపవలెను.

ప్రశ్న - కామక్రోధాదుల విజృంభణము అనగానేమి? వాటిని ఓర్చుకొనుటకు సమర్థుడగుట యనగానేమి?

సమా - స్త్రీ పురుష పరస్పరసంయోగములకును, సంతాన ప్రాప్తికిని, ధనాది వస్తులాభములకును, స్వర్గాది సుఖములకొఱకును, ఇంకను దర్శన శ్రవణాది ఇంద్రియ సుఖములకొఱకును ఆసక్తిపడి, వాటిని పొందుటకై చూపు ఇచ్చను కామమని యందురు. తత్ఫలితముగ అంతః కరణమునందు కలుగు సంకల్పవికల్ప ప్రవాహమునే కామవిజృంభణమని యందురు. అట్లే మనస్సు, బుద్ధి, ఇంద్రియములకు ప్రతికూలములైన పరిస్థితులు సంభవించినప్పుడును, ఇష్టవస్తుప్రాప్తికి అవరోధములు ఏర్పడినప్పుడు, అట్టి పరిస్థితులకు కారణమైన వస్తువుల యెడను, ప్రాణులయెడను, ద్వేషభావము ఏర్పడుటవలనను, అంతఃకరణమునందు కలుగు ఉద్వేగమునే క్రోధము అని

అందురు. ఈ కారణమున కలుగు వివిధ సంకల్ప వికల్పముల ప్రవాహమునే క్రోధవిజృంభణము అని యందురు. ఈ విజృంభణములకు చలింపక ప్రశాంతముగా ఉండువాడు వాటిని నిస్తేజమొనర్చి నిలుచుటలో సమర్థుడగును.

ప్రశ్న - 'యుక్తః' అను విశేషణము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - 'యుక్తః' అనునది సాంఖ్యయోగ సాధకునకు ప్రయోగింపబడిన విశేషణము. అతడు పదే పదే విజృంభించు కామక్రోధాది శత్రువులకు లొంగడు. మనస్సును, ఇంద్రియములను వశమునందుంచుకొని కామక్రోధాదుల వేగములను నిరోధించుటలో సమర్థుడగును.

ప్రశ్న - ఇట్టి సాధకుని 'సుఖీ' అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ప్రపంచములో మనుష్యులందఱును సుఖములనే కోరుదురు. కాని వాస్తవముగా సుఖమనగానేమి? అది ఎట్లు లభించును? అను విషయము తెలియక వారు భ్రమలకులోనై భోగములనే సుఖములుగా భావించి, వాటిని కోరుకొందురు. వాటిని పొందుటకు ఆరాటపడుదురు. తత్ప్రయత్నములో ఆటంకము ఏర్పడినప్పుడు క్రోధమునకు లోనగుదురు. కామక్రోధాదులకు లోనైనవారు నిజముగా ఎప్పుడును ఎట్టి సుఖమును పొందలేరు. కామవశుడైనవాడు స్త్రీపుత్రాదుల కొఱకును, ధనమానాదుల కొఱకును, అట్లే క్రోధవశుడైనవాడు ఇతరులకు హానిచేయుట కొఱకును, వివిధములగు అనర్థకర కార్యములయందును, పాపకర్మల యందును ప్రవృత్తుడగును. ఫలితముగా అతడు ఈ లోకమున రోగము, శోకము, అవమానము, అపకీర్తి, వ్యాకులత, భయము, అశాంతి, ఉద్వేగము మరియు అనేక విధములైన తాపములకు గుఱియగును. పరలోకమున నరక బాధలను, పశు, పక్షి, క్రిమి, కీటకాదుల జన్మలను పొంది దుర్భర క్లేశములను అనుభవించును (16/18, 19,20). ఈ విధముగా అతడు ఏ మాత్రము సుఖములను పొందక, సదా దుఃఖితుడగును. కాని భోగములను దుఃఖహేతువులుగా క్షణభంగురములుగా భావించి, కామక్రోధాదుల ఉచ్చులనుండి తప్పించుకొని, వాటిని జయించినవాడు సదా 'సుఖి' యగును.

ప్రశ్న - ఇచట 'నరః' అను పదప్రయోగము యొక్క ప్రత్యేకత ఏమి?

సమా - కామక్రోధాది దుర్గుణములను జయించి, భోగములయెడ విరాగియై, ఉపరతుడై, సచ్చిదానంద ఘనపరమాత్మను పొందినవాడే నిజమైన నరుడు. ఆకారముచేత స్త్రీయైనను, పురుషుడైనను ఆ నరశబ్దము ఇట్టి వ్యక్తినే సూచించును. అజ్ఞానమోహితుడైన మనుష్యుడు ఆసక్తి వశమున ఆపాతరమణీయ విషయముల ప్రలోభములలో చిక్కుపడి పరమాత్మను విస్మరించును. అతడు కామక్రోధవివశుడై, పశుప్రాయుడై, పిశాచములవలె ఆహార నిద్రామైథునములయందును, కలహములయందును నిమగ్నుడగును. అతడు నరుడే గాడు. పశువుకంటెను హీనుడు. కొమ్ములు, తోకయులేనట్టి జంతు విశేషము. అతడు శోభారహితుడు, నీచుడు, జగత్తునకు కీడు కూర్చువాడు. పరమాత్మప్రాప్తికై నిజమైన నరుని గుణములను, ఆచరణములను, లక్ష్యముగా చేసికొని, కామక్రోధాది శత్రువులను జయించిన సాధకుని మాత్రమే నరః - నరుడు అని చెప్పవచ్చును.

ప్రశ్న - కామక్రోధములను జయించినవాడు, యుక్తుడు, సుఖి అయిన పురుషుని సాధకుడని యేల చెప్పవలెను. అతనిని సిద్ధుడని భావించినచో దోషమేమి?

సమా - కేవలము కామక్రోధములను జయించినంత మాత్రమున ఎవ్వడును సిద్ధుడు కాలేడు (16/22). సిద్ధుని యందయితే కామక్రోధాదుల వాసన కూడ ఉండదు. ఈ విషయము ఈ అధ్యాయమునందే 26వ శ్లోకమున చెప్పబడినది. ఇచట సాధకుడు సుఖిగా చెప్పబడినాడు. సిద్ధుడు అక్షయసుఖి. సాధకుని గూర్చి సిద్ధునితో సమానునిగా చెప్పదలచినచో పరమసుఖి అనిగాని మరియొక విలక్షణమైన విశేషణముతో గాని వర్ణించుట జరిగి యుండెడిది. 21వ శ్లోకము యొక్క పూర్వార్థమున చెప్పబడినట్లు పరమాత్మను ధ్యానించునప్పుడు సాత్త్వికసుఖానుభవమును పొందిన సాధకుని గూర్చియే ఇచట వర్ణింపబడినట్లు తెలియవలెను.

*సంబంధము - బాహ్యవిషయభోగములు క్షణికములనియు, దుఃఖకారణములనియు భావించి, వాటిపై ఆసక్తిని వదలి, కామక్రోధాదులపై విజయము సాధించిన సాంఖ్యయోగియొక్క సాఫల్యపరిణామ స్థితిని వర్ణించుచున్నాడు-*

**యోఽన్తఃసుఖోఽన్తరారామః తథాన్తర్జ్యోతిరేవ యః ।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ పురుషుడు | తథా | = అట్లే | | పరబ్రహ్మ |
| ఏవ | = నిశ్చయముగా | యః | = ఎవడు | | పరమాత్మ యందు |
| అంతఃసుఖః | = సమష్టి, అంతరాత్మ యందు సుఖించు వాడును | అంతర్జ్యోతిః | = ఆత్మ జ్ఞానముకల వాడు అగునో | | ఏకీభావస్థితుడైన |
| | | | | యోగీ | = సాంఖ్యయోగి |
| అంతరారామః | = ఆత్మయందు రమించువాడును | సః | = ఆ (అట్టి) | బ్రహ్మ-నిర్వాణమ్ | = బ్రహ్మనిర్వాణ (పరమపద)మును |
| | | బ్రహ్మభూతః | = సచ్చిదానందఘన | అధిగచ్ఛతి | = పొందును |

**(సమష్టి) అంతరాత్మయందే సుఖించువాడును, ఆత్మయందే రమించువాడును, ఆత్మజ్ఞానియైనవాడును అగు సాంఖ్యయోగి, సచ్చిదానందఘనపరబ్రహ్మ పరమాత్మయందు ఏకీభావస్థితుడై, బ్రహ్మనిర్వాణమును పొందును. (24)**

ప్రశ్న - 'అంతఃసుఖః' అనగానేమి?

సమా - ఇచట 'అంతః' అను శబ్దమునకు జగత్తంతటా స్థితుడైన అనగా సర్వవ్యాపియైన పరమాత్మ యని యర్థము. అంతఃకరణమనికాదు. బాహ్య విషయభోగరూపములైన సాంసారిక సుఖములు స్వప్నములవలె అనిత్యములని భావించి, వాటి యందు సుఖము లేదనియు, సర్వాంతర్యామియు, ఆనంద స్వరూపుడును అగు పరమాత్మయందే సుఖమున్నదనియు విశ్వసించువాడు 'అంతస్సుఖః' అని యనబడును. అనగా పరమాత్మయందే సుఖించువాడు.

ప్రశ్న - 'అంతరారామః' అనగానేమి?

సమా - బాహ్య విషయ భోగముల యందు అస్తిత్వబుద్ధి, మరియు సుఖబుద్ధి లేనందువలన వాటి యందాసక్తి యుండదు. కావున వాటియందు రమింపక, పరమాత్మ యందే రమించువాడు 'అంతరారామః' అనబడును. అతడు పరమానంద స్వరూపుడైన పరమాత్మనే నిరంతరము అభిన్న భావముతో చింతన చేయుచుండును.

ప్రశ్న - 'అంతర్జ్యోతిః' అనగానేమి?

సమా - పరమాత్మ సమస్త జ్యోతి స్వరూపములకును పరంజ్యోతియైనవాడు (13/17). జగత్తంతయును ఆతని ప్రకాశముతోడనే వెలుగొందుచున్నది. నిరంతరము అభిన్న భావముతో పరమజ్ఞాన స్వరూపుడైన అట్టి పరమాత్మను (పరమానందమును) అనుభవించుచు ఆతని యందే స్థితుడైనవాడును, విజ్ఞానానంద స్వరూపుడైన పరమాత్మకు తప్ప దృశ్య ప్రపంచమునందు ఏ వస్తువునకు ప్రత్యేకమైన ఉనికి లేదని తలంచువాడును 'అంతర్జ్యోతి' యనబడును.

నిద్రించుచున్నవాడు స్వప్నమును సత్యమని తలంచుచు ఆనందించుచుండును. అట్లే అజ్ఞాని దృష్టిలో జగత్తంతయు సత్యమువలె భాసించును. అందువలన దానినే చింతించుచు అతడు ఆనందించుచుండును. అతడు అంతర్జ్యోతి కానేరడు. ఏలనన పరమజ్ఞాన స్వరూపుడైన పరమాత్మను అతడు చూడలేడు.

ప్రశ్న - 'ఏవ' అనుదాని అర్థమేమి? అది దేనితో అన్వయించును?

సమా - 'ఏవ' అను అవ్యయము ఆత్మను తప్ప తక్కిన వానినన్నింటినీ నిరాకరించు (వ్యావృత్తి) పదము. 'అంతస్సుఖః' 'అంతరారామః' 'అంతర్జ్యోతిః' అను పదములతో ఇది అన్వయించును. పరమాత్మయందే సుఖమును, రతిని, జ్ఞానమును అనుభవించు యోగికి బాహ్యదృశ్య ప్రపంచముతో ఎట్టి సంబంధమూ ఉండదు.

ప్రశ్న - 'బ్రహ్మభూతః' అనగానేమి?

సమా - "బ్రహ్మభూతః" అనునది సాంఖ్యయోగికి విశేషణము. సాంఖ్యయోగసాధకుడైన యోగి అహంకార మమకారములను, కామక్రోధాది అవగుణములనన్నింటిని

త్యజించి, నిరంతరము అభిన్నభావముతో పరమాత్మచింతన చేయుచు బ్రహ్మస్థితినందును. అట్టి బ్రహ్మాభేదస్థితిని పొందిన సాంఖ్యయోగినే బ్రహ్మభూతుడు అని యందురు.

ప్రశ్న - 'బ్రహ్మనిర్వాణమ్' అనగానేమి? అది యెట్లు ప్రాప్తించును?

సమా - 'బ్రహ్మనిర్వాణమ్' అనగా సచ్చిదానంద ఘననిర్గుణనిరాకార నిర్వికల్ప శాంతస్వరూపుడైన పరమాత్మ. అభిన్నభావతాదాత్మ్యమే అతని ప్రాప్తి. బ్రహ్మభూతుడుగా నిర్దేశింపబడిన సాంఖ్యయోగి యొక్క సాధన ఫలస్వరూపమే ఈ బ్రహ్మనిర్వాణము. శ్రుతి గూడ 'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' అని చెప్పుచున్నది. (బృహదారణ్యక 4/4/6). అనగా బ్రహ్మస్వరూపమునంది బ్రహ్మమును పొందును. దీనినే పరమశాంతిని పొందుట అనియు, అక్షయసుఖమును పొందుట అనియు, బ్రహ్మప్రాప్తి, మోక్షప్రాప్తి, పరమగతిప్రాప్తి అనియు అందురు.

*సంబంధము - పరబ్రహ్మపరమాత్మను పొందిన యోగుల లక్షణములను రెండు శ్లోకములలో వర్ణించుచున్నాడు-*

**లభంతే బ్రహ్మనిర్వాణమ్ ఋషయః క్షీణకల్మషాః ।**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥ 25 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్షీణకల్మషాః | = పాపరహితులును | యతాత్మానః | = గోరువారును నిశ్చల స్థితితో మనస్సును పరమాత్మ యందు లగ్నము చేసినవారును అగు | ఋషయః | = బ్రహ్మవేత్తలు |
| ఛిన్నద్వైధాః | = జ్ఞాన ప్రభావమునసమస్త సంశయముల నివృత్తిని సాధించిన వారును | | | బ్రహ్మ నిర్వాణమ్ | = బ్రహ్మ నిర్వాణమును (శాంత బ్రహ్మను) |
| సర్వభూతహితే, రతాః | = సర్వప్రాణుల హితమును | | | లభంతే | = పొందుదురు. |

**పాపరహితులును, జ్ఞానప్రభావమున సమస్తసంశయములనివృత్తిని సాధించినవారును, సర్వప్రాణులహితమును గోరువారును, నిశ్చలస్థితితో మనస్సును పరమాత్మయందు లగ్నముచేసినవారును అగు బ్రహ్మవేత్తలు బ్రహ్మనిర్వాణమును పొందుదురు. (25)**

ప్రశ్న - 'క్షీణకల్మషాః' అను విశేషణ ప్రయోగ ప్రాముఖ్యమేమి?

సమా - జన్మజన్మాంతర కర్మల సంస్కారములు, రాగద్వేషాది దోషములు, వాటి వృత్తులు, మనుష్యుని అంతఃకరణమునందు గూడుకట్టుకొని యుండును. అవి బంధహేతువులగుటవలన కల్మషములు. అనగా పాపములు. పరమాత్మ సాక్షాత్కారమైనంతనే ఇవియన్నియును నశించును. అట్టి పురుషుని అంతఃకరణము నందు దోషములు ఏ మాత్రమును ఉండవు. అట్టి దోషరహితులను గూర్చియే 'క్షీణకల్మషాః' అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - 'ఛిన్నద్వైధాః' అను విశేషణము యొక్క వైశిష్ట్యము ఏమి?

సమా - ద్వైధ మనగా సంశయము. ఊగిసలాట. దీనికి కారణము అజ్ఞానము. పరమాత్మ స్వరూపము యొక్క యథార్థజ్ఞానము కలిగినంతనే అజ్ఞానజనిత సంశయము లన్నియును తొలగిపోవును. పరమాత్మప్రాప్తినందిన వారి నిర్మలాంతఃకరణములయందు లేశమాత్రమైనను విక్షేపావరణ దోషములుండవు. ఈ విషయమునే 'ఛిన్నద్వైధాః' అను విశేషణము విశదపఱచును.

ప్రశ్న - 'యతాత్మానః' అనగానేమి?

సమా - మనస్సును వశమునందుంచుకొని చంచలత్వాది దోషరహితుడై, పరమాత్మ స్వరూపమునందు తాద్రూప్యమును పొందిన వానిని 'యతాత్మా' అని యందురు.

ప్రశ్న - 'సర్వభూతహితేరతాః' అను విశేషణము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - పరమాత్మయొక్క అపరోక్ష జ్ఞానము కలిగిన వానికి స్వపర భేదములుండవు. అతడు సమస్త ప్రాణులలోనూ ఆత్మ బుద్ధి కలిగియుండును. తన శరీరమునే ఆత్మయని భావించు అజ్ఞాని తన హితమునందే (స్వార్థమునందే) రతుడగును. అట్లే జ్ఞాని అందఱిని సమ(ఆత్మ) భావముతో చూచుట వలన స్వాభావికముగనే సర్వజనహితమునకై పాటుపడును. ఈ భావమును విశదపఱచుటకే 'సర్వభూతహితే రతాః' అను విశేషణము ప్రయోగింపబడినది.

లోక వ్యవహార దృష్టిలో జ్ఞాని యొక్క ఆదర్శ జీవనరీతిని చెప్పుటకే ఇట్లు వివరింపబడినది. వాస్తవముగ జ్ఞానిదృష్టిలో పరబ్రహ్మమునకు తప్ప సర్వభూతములకును వేఱైన ఉనికి ఉండనే ఉండదు. అతడు సర్వభూతములకును హితమును గూర్చు కర్తగా తనను గూర్చి భావింపడు.

ప్రశ్న - 'ఋషయః' అను పదమునకు బ్రహ్మవేత్త అను అర్థము ఎట్లు చెప్పబడినది?

సమా - గత్యర్థకమైన 'ఋష్' ధాతువుయొక్క భావార్థము జ్ఞానము లేక తత్త్వార్థదర్శనము. దీనిని బట్టి 'ఋషయః' అనగా బ్రహ్మముయొక్క యథార్థ తత్త్వజ్ఞానమును ఎఱిగినవారు. అనగా బ్రహ్మవేత్తలు అను అర్థమును గ్రహించుటయే సమంజసము. 'క్షీణకల్మషాః, ఛిన్నద్వైధాః, యతాత్మానః' అను విశేషణములును ఈ యర్థమునే సమర్థించును.

భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥
*(ముండకోపనిషత్తు 2/2/8.)*

అనునది శ్రుతి వాక్యము.

అనగా కార్యకారణ స్వరూపుడు, స్థావరజంగమాత్మకుడైన పరమాత్మ సాక్షాత్కారమైనంతనే జ్ఞాని హృదయగ్రంథి విప్పుకొనును. సంశయములన్నియును తొలగును. సమస్త కర్మలును క్షీణించును.

**కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ 26 ॥**

కామక్రోధ-వియుక్తానామ్ = కామక్రోధ రహితులును
యతచేతసామ్ = చిత్తమును జయించినవారును
విదితాత్మనామ్ = పరబ్రహ్మపరమాత్మ సాక్షాత్కారమును పొందినవారును అగు
యతీనామ్ = జ్ఞానులకు
అభితః = అంతటను
బ్రహ్మ-నిర్వాణమ్ = శాంత పరబ్రహ్మ పరమాత్మయే
వర్తతే = పరిపూర్ణుడై యుండును (గోచరించును).

**కామక్రోధరహితులును, చిత్తవృత్తులనుజయించినవారును అయి, పరబ్రహ్మపరమాత్మ సాక్షాత్కారమునుపొందిన జ్ఞానులకు అంతటను శాంతపరబ్రహ్మపరమాత్మయే గోచరించును.(26)**

ప్రశ్న - కామక్రోధరహితులని చెప్పుటలో గల విశేషమేమి? జ్ఞానులైన మహాత్ముల మనస్సుల యందును, ఇంద్రియ వ్యాపారముల యందును కామక్రోధములకు తావేలేదా?

సమా - జ్ఞానులైన మహాత్ముల అంతఃకరణములు సర్వదా పరిశుద్ధములే. కావున వాటియందు కామక్రోధాది వికారములు లేశమాత్రమును ఉండవు. అట్టి మహాత్ముల మనస్సు, ఇంద్రియములద్వారా వ్యాపారములన్నియును సహజముగా పరహితార్థమే జరుగుచుండును. లౌకిక వ్యవహారములయందు సందర్భానుసారముగ వారి మనస్సులద్వారా ఇంద్రియముల ద్వారా శాస్త్రసమ్మత పరిధిలో కామక్రోధములు ప్రకటితములు కావచ్చును. అవి నాటక ప్రదర్శనములయందు వివిధ పాత్రధారులు అభినయించు కామక్రోధాదుల వంటివే. అవి కేవలము లోకసంగ్రహమునకై లీలామాత్రముగ ప్రదర్శింపబడుననియే అని భావింపవలెను.

ప్రశ్న - ఇచట యతి అను శబ్దమునకు అర్థమేమి?

సమా - మల-విక్షేప-ఆవరణములు అనుమూడు దోషములును జ్ఞానప్రాప్తికి మిక్కిలి ప్రతి బంధకములు. జ్ఞానులలో ఈ మూడు దోషములును ఏ మాత్రమును

ఉండవు. పరమాత్మ యొక్క పరిపూర్ణజ్ఞానము కలిగినవారిలో **'కామ క్రోధవియుక్తానాం'** అను లక్షణముచే మలదోషము ఉండదనియు, **'యతచేతసాం'** అను లక్షణముచే విక్షేప దోషము ఉండదనియు, **'విదితాత్మనాం'** అను లక్షణముచే ఆవరణ దోషము ఉండదనియు తెల్పబడినది. కావున ఈ మూడు లక్షణములు గల యతిని సాంఖ్యయోగము ద్వారా పరమాత్మప్రాప్తి కలిగిన ఆత్మ సంయమియైన తత్త్వజ్ఞానియని భావించుట సముచితము.

ప్రశ్న - జ్ఞానులకు అంతటను శాంత పరబ్రహ్మయే గోచరించును అనియనుటలో గల విశేషమేమి?

సమా - పరమాత్మప్రాప్తి నందిన జ్ఞానులైన మహాత్ముల అనుభవములో సర్వత్ర - భూమ్యాకాశములయందును, అన్ని దిశలయందును నిరంతరము విజ్ఞానానందఘనపరబ్రహ్మ పరమాత్మయే గోచరించును. వారిదృష్టిలో పరమాత్మకు తప్ప మఱే యే పదార్థమునకు ఉనికియే లేదు. ఈ విషయమును విశదపరచుటకే వారికి అంతటను పరమాత్మయే గోచరించును - అని చెప్పబడినది.

*సంబంధము - కర్మయోగ, సాంఖ్యయోగసాధనమార్గములద్వారా పరమాత్మను పొందుటను గూర్చియు, పరమాత్మను పొందిన మహాత్ముల లక్షణములను గూర్చియు వివరించుట జరిగినది. కర్మయోగ సాంఖ్యయోగ సాధకులు వైరాగ్యపూర్వకముగ (ప్రాపంచిక భోగములయెడ ఆసక్తిని వీడి) మనస్సును ఇంద్రియములను వశపఱచుకొనుటలో ధ్యానయోగసాధనము కీలకపాత్ర వహించును. అందువలన సంక్షిప్తముగా ధ్యానయోగమును గూర్చియు, దాని ఫలమును గూర్చియు వివరించుట జరుగుచున్నది-*

స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ ॥ 27 ॥
యతేంద్రియమనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥ 28 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| బాహ్యాన్, స్పర్శాన్ | = బాహ్యవిషయ భోగములను | నాసాభ్యంతర-చారిణౌ | = నాసికా రంధ్రముల యందు చరించుచున్న | మోక్షపరాయణః | = మోక్షపరాయణుడై |
| బహిః ఏవ, కృత్వా | = బయటికి పారద్రోలి | | | మునిః | = మననశీలుడై |
| చ | = మఱియు | ప్రాణాపానౌ | = ప్రాణాపానవాయువులను | విగతేచ్ఛాభయక్రోధః | = ఇచ్ఛాభయక్రోధరహితు డైనవాడును అగునో |
| చక్షుః | = దృష్టిని | సమౌ, కృత్వా | = సమముగాచేసి | సః | = అతడు |
| భ్రువోః,అంతరే | = భ్రూమధ్యమున (నిలిపి) | యతేంద్రియ-మనోబుద్ధిః | = మనోబుద్ధీంద్రియము లను జయించినట్టి | సదా | = సర్వదా |
| | | యః | = ఎవడైతే | ముక్తః, ఏవ | = ముక్తుడే యగును |

బాహ్యవిషయభోగములను చింతనచేయక వాటిని పారద్రోలవలెను. దృష్టిని భ్రూమధ్యమునందు స్థిరముగా ఉంచవలెను. నాసికయందు ప్రసరించుచున్న ప్రాణాపానవాయువులను సమస్థితిలో నడుపవలెను. ఈ ప్రక్రియల ప్రభావమున మనస్సు, బుద్ధి, ఇంద్రియములు సాధకుని వశములోనికి వచ్చును. ఇట్టి సాధనవలన మోక్షపరాయణుడైన ముని ఇచ్ఛాభయక్రోధరహితుడై సదా ముక్తుడగును. **(27-28)**

ప్రశ్న - బాహ్యవిషయభోగములను పాఱద్రోలుట అనగానేమి?

సమా - బాహ్యవిషయములతో జీవుని సంబంధము స్పర్శాదినుండియు వచ్చుచునే యున్నది. అతని అంతః కరణమునందు వాటి చిత్రములు (సంస్కారములు) అసంఖ్యాకములుగా నిండియున్నవి. విషయములు సుఖకరములు అను భ్రమలో ఉండుట వలన, వాటిచే ఆకర్షితుడు అగుచుండుటవలన మనుష్యుడు నిరంతరము విషయచింతననే చేయుచుండును. అవి పూర్వజన్మ సంస్కారములను కదిపి, అతని మనస్సునందు ఆసక్తి, కోరికలు అను అగ్నులను రగుల్కొల్పును. తత్ఫలితముగ అతని మనస్సు ఎల్లప్పుడును అశాంతికి నిలయముగా మాఱును. అతడు భౌతికముగ విషయములను త్యజించి, ఏకాంతముగ ధ్యానమునకు ఉద్యుక్తుడైనప్పుడును ఆ సంస్కారములు వానిపై దాడి చేయుటను మానవు.

అందువలన అతడు పరమాత్మను ధ్యానించుట కుదరదు. నిరంతరము విషయచింతన చేయుచుండుటయే దీనికి ప్రధాన కారణము. విషయముల యందు సుఖబుద్ధి యున్నంతవఱకును విషయచింతన కొనసాగుచునే యుండును. వివేకముతో వైరాగ్యయుక్తుడై, బాహ్య విషయములు అన్నియును క్షణభంగురములు, అనిత్యములు, దుఃఖమయములు శోకకారణములు అని భావించి, వాటి సంస్కారరూప చిత్రములను అన్నింటిని అంతఃకరణము నుండి తొలగింపవలెను. వాటిని స్మృతిపథమునుండి సర్వథా రూపుమాపవలెను. అప్పుడే చిత్తము నిశ్చలమై ప్రశాంతమగును.

ప్రశ్న - దృష్టిని భ్రూమధ్యమున స్థిరముగా నిలుపవలెనని చెప్పుటకు కారణమేమి?

సమా - కన్నులు తెరచి యుంచినచో చూపులు అన్ని దిశలయందును ప్రసరించుచుండును. దాని వలన ధ్యానమునకు సహజముగనే భంగము కలుగును. కన్నులు పూర్తిగా మూసికొనినచో సోమరితనమునకును, నిద్రకును లోనగు ప్రమాదము గలదు. కనుక అర్ధనిమీలితనేత్రములతో భ్రూమధ్యమున దృష్టిని నిలుపవలెనని చెప్పబడినది.

అంతేగాక ఇందులకు యోగశాస్త్రమునకు సంబంధించిన కారణము గూడ గలదు. భ్రూమధ్యమున ద్విదళ - ఆజ్ఞాచక్రము ఉండునని అనుభవజ్ఞులు చెప్పుదురు. దీనికి సమీపమున సప్తకోశములు గలవు. వాటిలో అంతిమకోశమునకు 'ఉన్మని' అనిపేరు. ధ్యానరూపమున అచటికి చేరిన యోగికి పునరావృత్తి ఉండదు. కావున యోగులు ధ్యాన సమయమున దృష్టిని ఆజ్ఞాచక్రమునందు స్థిరముగా నిలిపి ఉంచెదరు.

ప్రశ్న - 'ప్రాణాపానౌ' అను విశేష్యమునకు 'నాసాభ్యంతరచారిణౌ' అను విశేషణమును ప్రయోగించుటలో గల వైశిష్ట్యమేమి?

సమా - ప్రాణాపానముల గతిని నిరోధించుటను గాక సమమొనర్చుటనే ఇచట ప్రస్తావించుట జరిగినది. అట్లు చేయుటలో నాసిక ప్రధానమైన కరణము. కావున 'నాసాభ్యంతరచారిణౌ' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ప్రాణాపానములను సమము చేయుట అనగానేమి? వాటిని సమము చేయుట ఎట్లు?

సమా - ప్రాణాపానముల గమనములు సహజముగా సమానములు గావు. విషమములు. ఒక్కొక్కసారి అవి ఎడమ నాసికా రంధ్రమునందును, మఱియొకసారి కుడి నాసికారంధ్రమునందును ప్రసరించుచుండును. ఎడమవైపున సంచరించునప్పుడు ఇడానాడి యందును, కుడివైపున ప్రసరించునప్పుడు పింగళానాడియందును అవి సాగిపోవుచుండునని చెప్పుదురు. ఇట్టి స్థితి యందు మానవుని మనస్సు చంచలముగా ఉండును. విషమరీతిలో సంచరించు ప్రాణాపానవాయువుల గమనమును నాసికయొక్క రెండు రంధ్రములందును సమస్థితిలో నడపుటయే వాటిని సమమొనర్చుట యందురు. అప్పుడవి సుషుమ్నానాడి యందు సంచరించును. ఆ సమయమున ప్రాణాపాన వాయువుల గతి మిక్కిలి సూక్ష్మముగను ప్రశాంతముగను ఉండును. మనశ్చాంచల్యము, అశాంతి తమంతటతామే అంతరించును. సాధకుడు సహజముగ పరమాత్మధ్యానము నందు నిమగ్నుడగును.

ప్రాణాపానములను సమము చేయుటకు మొదట ఎడమ నాసికారంధ్రము ద్వారా అపానవాయువును లోనికి తీసికొనిపోయి, కుడినాసికా రంధ్రము ద్వారా ప్రాణవాయువును బయటికి తీసికొని రావలయును. మరల అపానవాయువును కుడి నాసికారంధ్రము ద్వారా లోనికి గొనిపోయి ప్రాణవాయువును ఎడమ నాసికా రంధ్రము ద్వారా బయటికి వదలవలెను. ఈ విధముగా ప్రాణాపానములను

సమమొనర్చు అభ్యాస సమయమున పరమాత్మనామమును జపింపవలెను. అట్లే ఉచ్ఛ్వాస నిశ్వాసములను సమానమైన వేగములో సాగింపవలెను. వాటి గమనమును సమానముగ, సూక్ష్మముగ చేయుట ముఖ్యము. ఈ విధముగ నిరంతరము అభ్యాసము చేయుచుండగా ఆ రెండింటి గతి సమము, శాంతము, సూక్ష్మము అగును. నాసిక యొక్క బాహ్యాంతరములయందును, కంఠాది ప్రదేశములయందును వాటి స్పర్శజ్ఞానము ఉండదు. అప్పుడు ప్రాణాపానములు సమముగను, సూక్ష్మముగను ఉన్నట్లు గ్రహింపవలెను.

ప్రశ్న - ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అనువానిని జయించుట యనగానేమి? వాటిని ఎట్లు ఎందుకు జయింపవలెను.?

సమా - ఇంద్రియములు ఎల్లప్పుడును విషయోన్ముఖములుగా నిరాటంకముగ పరుగులు దీయుచుండును. మనస్సు చంచలమై దాని స్వభావగతిలో సాగుచుండును. తత్త్వభావమున పరమాత్మ విషయమున అది స్థిరముగా ఉండదు. స్వేచ్ఛాప్రవృత్తి, విశృంఖలత్వము వీటి సహజ లక్షణములు. వివేకవైరాగ్యములతో సాధన ద్వారా వీటిని వశమునందుంచుకొనుట, ఆజ్ఞానుసారము ప్రవర్తించునట్లుగా చేయుట, అంతర్ముఖములుగా భగవన్నిష్ఠాపరములుగా ఉండునట్లు చేయుటను వీటిని జయించుట అనియందురు. ఇట్లు చేయుటవలన ఇంద్రియముల స్వేచ్ఛ ఆగిపోవును. అవి విషయనిమగ్నములు కాక, సాధకుని ఇచ్ఛానుసారము ప్రవర్తించును. మనస్సు నిశ్చలమై ఏకాగ్రతతో నిలుచును. ఈ పరిణామములతో బుద్ధి నిశ్చయముగా సాధకుని ఇష్టవస్తువుపై స్థిరముగా ఉండును.

ఇంద్రియములపై విజయము సాధించుట వలన ప్రత్యాహారము (ఇంద్రియ వృత్తులను నిరోధించుట), మనస్సునువశము నందుంచుకొనుట వలన ధారణ (చిత్తమును ఏకాగ్రతలో ఉంచుట), బుద్ధిని అధీనములో ఉంచుకొనుటవలన ధ్యానము (బుద్ధిని ఒకే వస్తువుపై నిశ్చలముగా ఉంచుట) సహజములగునని భావింపబడును. అది సముచితమే. కావున ధ్యానయోగమునందు ఈ మూడింటిని వశమునందుంచుకొనుట మిక్కిలి ఆవశ్యకము.

ప్రశ్న - 'మోక్షపరాయణః' అనగానేమి?

సమా - మోక్షమనగా పరమాత్మ ప్రాప్తి. పరమగతి. పరమపద ప్రాప్తి, ముక్తి. ఈ స్థితి మనస్సునకును, వాక్కులకు అందనిది. ఈ స్థితియందు సాధకుడు సమస్త కర్మబంధముల నుండి సర్వథా పూర్తిగా ముక్తుడై అనంత-అద్వితీయ పరమ కల్యాణ పరమానంద స్వరూపుడుగా అగును.

మోక్షమును లేక పరమాత్మ ప్రాప్తిని కోరుకొను సాధకుడు తన ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని, అన్ని విధములుగను తన్మయములుగ (పరమాత్మ మయములుగా) చేయును. అతడు పరమాత్మప్రాప్తికై ఆ సాధనయందే నిరంతరము నిమగ్నుడగును. పరమాత్మను పొందుటయే అతని ఏకైక లక్ష్యము. అతని దృష్టిలో పరమాత్మ తప్ప మఱి యేదియును ప్రాప్యము కాదు. అట్టివాడే మోక్షపరాయణుడు.

ప్రశ్న - 'మునిః' అను పదమునకు అర్థమేమి?

సమా - మునియనగా మననశీలుడు. భగవంతుడు సర్వవ్యాపకుడు అను విశ్వాసమును దృఢముగా కలిగియుండుట వలన ధ్యానకాలము నందువలెనే లౌకిక వ్యవహార కాలమునందును సదా పరమాత్మనే మననము చేయువాడు 'ముని' యనబడును.

ప్రశ్న - 'విగతేచ్ఛాభయక్రోధః' అను విశేషణము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - ఇచ్ఛ అనగా కోరిక. అప్రియము/అనిష్టము కలుగునను శంకయే భయము. కోరికలకు విఘ్నములు ఎదురైనప్పుడును, మనస్సునకు నచ్చిన కార్యములు సాగనప్పుడును క్రోధము ఏర్పడును.

సాధకుని ధ్యానయోగానుష్ఠానము సిద్ధించిన పిమ్మట అతనికి సర్వత్ర సర్వదా సర్వథా పరమాత్మయే అనుభవములోనికి వచ్చును. (పరమాత్మ ప్రాప్తి కల్గును). అట్టిస్థితిలో అతనిలో ఎట్టి ఇచ్ఛలును మిగిలియుండవు. పరమాత్మ తప్ప మఱియొకటి సత్యమైనది గాని నిత్యమైనది గాని లేనేలేదు. పరమాత్మ అనంతుడు, సనాతనుడు, అచ్యుతుడు (చ్యుతి/నాశము లేనివాడు). భగవత్ప్రాప్తి కలిగిన వానికి అప్రియము కలుగునను శంకయుండదు. కావున భయమునకు తావులేదు. భగవదనుగ్రహము (భగవత్ప్రాప్తి) సిద్ధించిన కారణమున సాధకుని యందు ఎట్టి కోరికయు (మనోరథము) మిగులదు. క్రోధమునకు మూలములైన కోరికలే లేనప్పుడు ఇక క్రోధమునకు తావెక్కడ? ఇట్టి స్థితిలో సిద్ధ పురుషుని అంతఃకరణమున ఇచ్ఛాభయక్రోధములు

ఉత్పన్నములు కానేరవు. ఇట్టివానినే 'విగతేచ్ఛా భయక్రోధః' అని యందురు.

ప్రశ్న - 'ఏవ' అను అవ్యయ ప్రయోగము యొక్క ప్రాముఖ్యమేమి? అట్టి పురుషుడు సదాముక్తుడే అని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - 'ఏవ' అను అవ్యయము నిశ్చయబోధకము. నిరంతరధ్యానయోగసాధన ప్రభావమున సర్వథా ఇచ్ఛాభయ క్రోధరహితుడైన మహాత్ముడు, ధ్యానకాలము నందును, లోక వ్యవహార కాలమునందును, జీవితకాలము నందే గాని, తదనంతరమునగాని, సర్వావస్థలయందును ముక్తుడే. అతడు సంసారబంధములనుండి శాశ్వతముగ ముక్తుడై పరమాత్మను నిస్సందేహముగ పొందినవాడే.

*సంబంధము - అర్జునుని ప్రశ్నకు సమాధానముగ భగవానుడు కర్మయోగ సాంఖ్యయోగముల స్వరూపస్వభావములను ప్రతిపాదించి, ఈ రెండింటి ద్వారా పరమాత్మప్రాప్తి సిద్ధించిన పురుషుని లక్షణములను తెలిపెను. ఈ రెండు యోగముల సాధనలకు ఉపయుక్తమగు ధ్యానయోగమును గూడ సంక్షిప్తముగ వర్ణించెను. మనస్సును ఇంద్రియములను జయించి, కర్మయోగ, సాంఖ్యయోగ, ధ్యానయోగముల సాధనలయందు అశక్తుడైన సాధకుడు సులభముగ పరమపదమును పొందుటకు భక్తియోగమును సంగ్రహముగ వర్ణించుచున్నాడు-*

**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥ 29 ॥**

మామ్ = నన్ను; యజ్ఞతపసామ్ = యజ్ఞములకును, తపస్సులకును; భోక్తారమ్ = భోక్తనుగాను; సర్వలోక-మహేశ్వరమ్ = సమస్త లోకములకును, లోకేశ్వరులకును అధిపతినిగాను; సర్వభూతానామ్ = సకలప్రాణులకును; సుహృదమ్ = ఆత్మీయునిగాను; జ్ఞాత్వా = తెలిసికొని (తత్త్వ జ్ఞానముతో గ్రహించి); శాంతిమ్ = (భక్తుడు) పరమశాంతిని; ఋచ్ఛతి = పొందును.

**భగవంతుడు యజ్ఞములకును, తపస్సులకును భోక్త. సమస్తలోకములకును లోకేశ్వరులకును అధిపతి. సమస్తప్రాణులకును ఆత్మీయుడు. అనగా అవ్యాజదయాళువు. పరమప్రేమస్వరూపుడు. ఈ భగవత్తత్త్వమును ఎఱిగిన భక్తునకు పరమ శాంతి లభించును. (29)**

ప్రశ్న - యజ్ఞము, తపస్సు అనగానేమి? వాటికి భగవంతుడు భోక్తయని ఎట్లు చెప్పవచ్చును? ఆయనను భోక్తగా తెలిసికొనుట వలన మానవునకు శాంతి యెట్లు లభించును?

సమా - అహింస, సత్యము మొదలగు విధ్యుక్త ధర్మములను ఆచరించుట, దేవతలు, బ్రాహ్మణులు, మాతాపితరులు, గురుజనులు మున్నగు వారిని సేవించుట, దీనులు, దుఃఖితులు, పేదసాదలు, పీడితజనులు మున్నగువారికి ప్రేమాదరములతో సేవలు చేయుట, నిస్సహాయస్థితిలో నున్న జీవుల దుఃఖములను తొలగించుట, తద్విముక్తికై పాటుపడుట, యజ్ఞ దానాది పవిత్రకర్మలను ఒనర్చుట మొదలగునవి యన్నియును యజ్ఞతపః కర్మలలోని భాగములే. భగవంతుడు సర్వప్రాణులకును ఆత్మ (10/20). కావున సర్వాంతర్యామియైన భగవంతుడు దేవతా, బ్రాహ్మణ, దీన, దుఃఖితుల రూపమున సమస్త సేవలను, పూజలను అందుకొనును. ఈ రూపమున యజ్ఞ తపస్సుల ఫలానుభవము ఆయునదే. కనుక అతడు భోక్త (9/24).

భగవంతుని తత్త్వమును ప్రభావమును తెలియని కారణమున మానవులు తామొనర్చు సేవలకు, పూజలకు (ఇంద్రాది) దేవతలు మనుష్యులు మాత్రమే భోక్తలని భావించుటచే వారు అల్పమైన, నశ్వరమైన, క్షణికమైన ఫలములనే పొందుదురు (7/23). వారికి నిజముగా సరియైన శాంతి లభింపదు. కాని భగవంతుని తత్త్వమును ప్రభావమును తెలిసిన వారు అందఱిలోను వెలుగొందు భగవంతుని దర్శించుచు, అందఱిని పరమాత్మ రూపులుగనే భావింతురు. వారికి సేవలొనర్చునప్పుడు తాము

దేవబ్రాహ్మణ దీన దుఃఖితుల రూపములో నున్న పరమపూజ్యుడు, ప్రేమాస్పదుడు, సర్వవ్యాపియైన భగవంతునే సేవించుచున్నామని భావింతురు.

తమ దృష్టిలో శ్రేష్ఠులైన వారిని తమ శ్రద్ధాభక్తులకు పాత్రులైన వారిని, హార్దికములై తమ ప్రేమాదరములకు నోచుకొన్నవారిని సేవించుటలో మానవునకు మిక్కిలి ఆనందమూ, అనంతమైన శాంతియును లభించును. పితృభక్తిగల పుత్రుడు తండ్రికిని, ప్రేమస్వరూపిణియైన తల్లి పుత్రునకును, ప్రణయస్వరూపిణియైన భార్య తన భర్తకును సేవలు చేయుటలో అలసిపోరుగదా! భక్తి ప్రపత్తులు గల శిష్యుడు పూజ్యుడైన గురువునకును, మార్గ దర్శకుడైన మహాత్మునకును సేవలొనర్చునప్పుడు ఏ కారణమున నైనను వైదొలగుటకు ఆలోచించునా? తమకు ప్రేమాదర గౌరవపాత్రులైన స్త్రీ పురుషులకు సేవలు చేయుటకై ఎవ్వరికైన మనస్సునందు అనుక్షణము నూతనోత్సాహ తరంగములు పొంగిపొరలును. వారికెంత సేవ చేసినను తనివియే తీరదు. వారు తాము చేయుచున్న సేవలను ఉపకారములుగా గాని, ఘనకార్యములుగా గాని భావింపరు. వారు తమ సేవలకు ఎప్పుడును గర్వపడరు. అట్లు సేవలొనర్చుట వారు తమ అదృష్టముగా తలంతురు. సేవలొనర్చిన కొలదియు వారిలో వినయ విధేయతలు పెంపొందును. తమ సేవలవలన ఎదుటివారికి మేలు (ప్రయోజనము) జరుగుచున్నట్లు ఎప్పుడును భావింపరు. ఈ సేవాభాగ్యము ఎప్పుడు చేజారిపోవునోయని భయపడుచుందురు. ఇట్టి సేవలవలన వారు అపూర్వమైన శాంతిని అనుభవింతురు. ఫలితముగ వారి చిత్తములు ఆనందాతిరేకముతో ఉప్పొంగుచుండును. ఈ ఆనందము క్రమక్రమముగ అధికమగుచునే యుండును. కనుక వారు ఆ సేవల నుండి వైదొలగరు. ఆ కారణముగ శాంతి వారికి నిరంతరముగా లభించుచునే యుండును.

ప్రాపంచిక రీతిలో ప్రేమాదరములతో గౌరవ ప్రపత్తులతో మాతాపితృగురుజనాది పూజ్యులను సేవించుట వలన వాస్తవముగా శాంతి లభించుచున్నప్పుడు ఇక భగవంతుని సేవించినచో కలుగు పరమశాంతిని గూర్చి చెప్పనేల? భగవంతుడు సమస్త జగత్తునకు పరమ పూజ్యుడు. దేవాధి దేవుడు. సర్వశక్తిమంతుడు. ఆ పరంధాముని ప్రభావములు ఊహాలకందనివి. భగవద్భక్తుడు అట్టి పరమాత్ముని నానావిధ రూపములలో దర్శించుచు, నిండుగుండెతో, పూర్ణ విశ్వాసముతో, నిరంతరముగా, అవిచ్ఛిన్నముగా కొనసాగు పవిత్రప్రేమామృత ప్రవాహములో మునిగి తేలుచు భగవానుని పూజించును. అపుడు అతనికి లభించు అలౌకికానందము, అపూర్వదివ్యశాంతి ఇంత అనిగాని, ఇట్టిది అనికాని చెప్పనలవి కానిది. భగవత్కృపకు పాత్రులైన వారికే ఇట్టి సేవాభాగ్యము లభించును. వారు మాత్రమే ఈ పరమానందమును అనుభవింతురు.

ప్రశ్న - భగవంతుని సర్వలోక మహేశ్వరుడుగా తెలిసికొనుట అనగానేమి? అట్లు తెలిసికొన్న వారికి శాంతి లభించుటకు కారణమేమి?

సమా - ఇంద్ర, యమ, వరుణ, కుబేరాది దిక్పాలకుల కును, వివిధ బ్రహ్మాండములను నియంత్రించు దివ్యప్రభువులకును సర్వాధిపతియైనవాడు ఆ జగన్నాథుడు. ఈ విషయమును శ్రుతి ఇట్లు వివరించుచున్నది.

'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' (శ్వేతాశ్వతర-ఉపనిషత్తు 6/7). ఆ ఈశ్వరులందరికిని పరమ మహేశ్వరుడు. భగవంతుడు తన అనిర్వచనీయ మాయాశక్తి ద్వారా లీలావిలాసములతో అనంతకోటి బ్రహ్మాండముల యొక్క ఉత్పత్తి, స్థితి, సంహారములను చేయుచు వాటినన్నింటిని యథాయోగ్యముగ నియంత్రించును. ఇట్లు చేయుచును అతడు అన్నింటికిని అతీతుడుగా ఉండును. ఈ విధముగా భగవంతుని సర్వశక్తిమంతునిగా సర్వనియంతగా, సర్వాధ్యక్షునిగా, సర్వేశ్వరేశ్వరునిగా ఎఱుగుటయే అతనిని సర్వలోక మహేశ్వరునిగా ఎఱుంగుటయగును.

ఈ భగవత్తత్త్వమును తత్ప్రభావమును తద్రహస్యమును కూలంకషముగా ఎఱింగిన కారణమున భక్తుడు క్షణకాలము గూడ భగవంతుని విస్మరింపజాలడు. అతడు సర్వథా నిర్భయుడై నిశ్చింతతో అనన్యమైన ఆ భగవచ్చింతనమునే చేయుచుండును. శాంతికి విఘాతమును కలిగించు కామక్రోధాది శత్రువులు అతని దరిదాపులకే రావు. అతని దృష్టిలో భగవంతుడే సర్వాధికుడు. అతడు భగవచ్చింతనము నందే నిరంతరము నిమగ్నుడై పరమశాంతిని, నిరుపమానందమును అనుభవించుచు భగవద్ధ్యానమునందే మునకలు వేయుచుండును.

ప్రశ్న - భగవంతుడు సర్వప్రాణులకును ఆత్మీయుడు అనగా అవ్యాజ దయాళువు ఎట్లగును? అతనిని ఆత్మీయునిగా ఎఱుగుటవలన శాంతి యెట్లు లభించును?

సమా - ఈ జగత్తునందలి వస్తువులన్నియును భగవదధీనములే. అనగా అవియన్నియును అతనివే. కాని వాటియెడ అతడు ఏ మాత్రము స్వార్థదృష్టి కలిగియుండడు. అతడు సర్వదా సర్వథా పూర్ణకాముడు. అతనికి ప్రాప్తవ్యమనునదియే లేదు. అప్రాప్యమైనదియు ఏదియును లేదు (3/22). అయినప్పటికిని దయామయుడగుటవలన సహజముగనే అందఱిని అనుగ్రహించుచూ లోక హితార్థమై ఈ ప్రాపంచిక రీతిని నడుపుచుండును. ఇందులో భాగముగా పదే పదే అవతరించుచు తన విచిత్ర లీలలను ప్రదర్శించుచుండును. ఆ లీలాగానములతోడనే లోకులు తరింతురు. అతని ప్రతికార్యమునందును జగత్కల్యాణ రీతియే నిండియున్నది. అతని చేతిలో మరణించుట గాని, దండింపబడుటగాని అతని కృపాకార్యములే. అతని ప్రతికార్యము కృపావాత్సల్య పూరితమే. కావున భగవంతుడు సర్వప్రాణులకును సుహృదుడు.

లోకులు (జనులు) ఈ రహస్యమును ఎఱుంగక అనగా, భగవదనుగ్రహమున మాత్రమే సమస్త వస్తు ప్రాప్తియు కలుగుచున్నట్లు ఎఱుంగక లౌకిక దృష్టితో ఇష్ట, అనిష్ట వస్తుప్రాప్తి కారణముగ సుఖమును దుఃఖమును అనుభవించుట జరుగుచున్నది. అందువలన వారికి శాంతి దక్కుటలేదు. భగవంతుడు అవ్యాజకరుణామయుడు అనియు, విధి నిర్ణయము మేరకు తనకు ఏది జరిగినను అది తనమేలునకు అనియు ఎఱింగి, సంపూర్ణముగ విశ్వసించువాడు భగవల్లీలా రీతులను నిజముగా తెలిసికొన్నవాడు. అతడు సర్వకాలసర్వావస్థలయందును, ఎట్టి అనుభవములు ఎదురైనను తొణకక అవి దయాళువైన పరమేశ్వరుని వాత్సల్యపూరిత నిరంతరమంగళప్రదలీలా విలాసములే యని భావించి ప్రసన్నముగా (హాయిగా) ఉండును. కనుక అతనికి పరమశాంతి లభించును. ఏది ఏమైనను (మిన్ను విరిగి మీద పడినను) అతని ఆ పరమశాంతికి భంగము వాటిల్లదు.

ఒక ఉన్నతాధికారిగాని, లేక ఒక మహారాజుగాని ఒక సామాన్యునిపై సుహృద్భావమును చూపినప్పుడు అతడు శక్తిసంపన్నుడైన ఆ అధికారిగాని, ఆ మహారాజుగాని తనపై చూపిన ఆ హితకాంక్షకు మురిసిపోవును. ఆ ఉన్నతాధికారి గాని లేక ఆ మహారాజుగాని పూర్తిగా స్వార్థరహితుడు కాకపోయినను, సర్వశక్తిమంతుడు కాకున్నను, సర్వాధిపత్యము కలవాడు కాకున్నను ఆ సామాన్యుడు తనను భాగ్యశాలిగా భావించి, ఒకరీతిలో నిర్భయముగా చింతారహితుడై ఆనందమగ్నుడగును. లౌకిక వ్యవహార విషయమునందే ఇట్లుండగా - సర్వశక్తిమంతుడు, సర్వలోక మహేశ్వరుడు, సర్వనియంత, సర్వాంతర్యామి, సర్వదర్శి, అనంత - అచింత్య గుణసముద్రుడు, పరమదయాళువు, అయిన పరమేశ్వరుడు తనను మనయందఱికిని సుహృదునిగా తెలిపినప్పుడు, ఆ విషయమును విశ్వసించి, ఆయనను మనము మన సుహృదునిగా భావించినప్పుడు మనకు ఎంతటి అలౌకికానందము కలుగునో, ఎట్టి అపూర్వశాంతి లభించునో ఊహించుటయు కుదరని పని.

ప్రశ్న - భగవంతుని యజ్ఞతపఃఫలముల భోక్తగను, సర్వలోక మహేశ్వరునిగను, సమస్త ప్రాణుల సుహృదునిగను తెలిసికొనిన వానికే శాంతి లభించునా? లేక ఈ మూడింటిలో ఏ ఒక్క లక్షణముతో కూడిన వానినిగా తెలిసికొన్న వానికిని శాంతి లభించునా?

సమా - భగవంతుని ఈ మూడింటిలో ఏ ఒక్క లక్షణము కలవానినిగా తెలిసికొన్నను వానికి శాంతి లభించును. ఇక మూడు లక్షణములతో కూడిన వానినిగా తెలిసికొన్నవాని విషయము చెప్పనవసరమే లేదు. ఏలనన వీనిలోని ఏ ఒక్క లక్షణమును గుఱించియైనను పూర్తిగా తెలిసికొన్నవాడు అనన్య భావముతో భగవంతుని భజింపకుండ ఉండనేలేడు. ఈ భజన ప్రభావమున భగవత్కృప అతనిపై అపారముగా వర్షించును. తత్కృపా ప్రభావమున అతడు శీఘ్రముగా భగవంతుని స్వరూప ప్రభావతత్త్వములను గుణములను తెలిసికొని పరిపూర్ణశాంతిని పొందును.

సమస్త దేవతలకును, సర్వమహర్షులకును పూజ్యుడు, సకల యజ్ఞ తపఃఫలములకు భోక్తయును, అఖిల బ్రహ్మాండములకు పరమమహేశ్వరుడును అయిన భగవానుడు తనకు పరమ మిత్రుడని తెలిసికొన్నవాడు ఆ సమయమున ఎట్టి అపూర్వానందమును అనంతశాంతిని పొందునోగదా!

"మిక్కిలి అల్పుడనైన నేనెక్కడ? అనంత - అచింత్య మహిమాన్వితుడైన ఆ భగవంతుడెక్కడ? అట్టి భగవంతుని కృపకు నేను పాత్రుడనైతిని. నా కంటె అదృష్టవంతుడు మఱియెవరుందురు?" అని తలంచుచు అతడు అపూర్వ కృతజ్ఞతా పూర్ణమైన హృదయముతో పవిత్రభావధారలలో తడిసి ఆనందాబ్ధిలో మునిగి, భగవంతుని పావన చరణములపై శాశ్వతముగా వ్రాలిపోవును.

ప్రశ్న - భగవంతుడు సర్వయజ్ఞతపఃఫలములకు భోక్తయనియు, సర్వలోక మహేశ్వరుడనియు, సకల ప్రాణులకును సుహృదుడనియు తెలిసికొను ఉపాయమేది? ఏ సాధనము వలన మానవుడు భగవంతుని స్వరూపప్రభావ తత్త్వములను, గుణములను చక్కగా ఎఱింగి అనన్య భక్తుడు కాగలడు?

సమా - భక్తిశ్రద్ధలతో సత్పురుషుల సాంగత్యము చేయుట, వారి ద్వారా ధర్మశాస్త్ర విషయములను వినుట, మననము చేయుట, భగవంతుని శరణుజొచ్చి, మిక్కిలి ఉత్సుకతతో భగవంతుని ప్రార్థించుటవలన తత్కృపకు పాత్రుడగును. ఆ దైవకృపా ప్రభావమున భగవంతుని స్వరూప ప్రభావ తత్త్వములను గుణములను తెలిసికొని, అతడు అనన్యభక్తుడు కాగలడు.

ప్రశ్న - ఇచటి 'మామ్' అను పదము భగవంతునకు సంబంధించిన ఏ స్వరూపమును దెల్పును?

సమా - పరమేశ్వరుడు అజుడు, శాశ్వతుడు, సర్వభూత మహేశ్వరుడు అయినప్పటికిని సందర్భానుసారముగా త్రిగుణాత్మకమైన మూలప్రకృతిని తన అధీనము నందుంచుకొని, తన యోగమాయ ద్వారా ఈ జగత్తునందు అవతరించు చుండును. ఆ అవతారములను స్వీకరించునట్టి పరమేశ్వరుడే శ్రీకృష్ణ రూపమున అర్జునునకు ఉపదేశమును ఇచ్చుచున్నాడు. అట్టి నిర్గుణ, సగుణ, నిరాకార, సాకార, వ్యక్తావ్యక్త స్వరూపుడును,సర్వరూపుడును, పరబ్రహ్మ పరమాత్మయును, సర్వశక్తిమంతుడును, సర్వవ్యాపియును, సర్వాధారుడును, సర్వలోక మహేశ్వరుడును అయిన అట్టి పరమేశ్వరుని గూర్చియే 'మామ్' అను పదము ప్రయోగింపబడినది.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగో నామ పంచమో-ధ్యాయః ॥ ౫ ॥

❖ ❖ ❖

ఓం శ్రీపరమాత్మనే నమః

# ఆఱవ అధ్యాయము - ఆత్మసంయమయోగము

**అధ్యాయ నామము :** కర్మయోగసాధనయందును, సాంఖ్యయోగసాధనయందును ఉపయుక్తమగు ధ్యానయోగవర్ణనము ఈ (ఆఱవ) అధ్యాయమునందు స్పష్టముగా విశదపఱచబడినది. ధ్యానయోగమునందు శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అనువాని సంయమము పరమావశ్యకము. శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - ఇవి అన్నియును ఆత్మ అనుపదముతో పేర్కొనబడును. ఈ అధ్యాయమునందు వీటి సంయమవర్ణనమే విశేషముగా చేయబడినది. కావున ఈ అధ్యాయమును ఆత్మసంయమయోగము అను పేరుతో పేర్కొనుట జరిగినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందలి మొదటి శ్లోకమునందు కర్మయోగియొక్క ప్రశంస చేయబడినది. *2వ* శ్లోకమునందు సన్న్యాస మఱియు కర్మయోగముల ఏకత్వము ప్రతిపాదింపబడెను. *3వ* శ్లోకమున కర్మయోగ సాధనరీతి వర్ణింపబడెను. *4వ* శ్లోకమున యోగారూఢపురుషుని లక్షణములను తెలిపి, *5వ* శ్లోకమున అట్టి పురుషుడు యోగారూఢావస్థను పొందుటకై వానిని ఉత్సాహపఱచుచు అతని కర్తవ్య నిరూపణ చేయబడినది. *6వ* శ్లోకమున మానవుడు తనకు తానే మిత్రుడు, తనకు తానే శత్రువు అను విషయ రహస్యము వివరింపబడెను. *7వ* శ్లోకమునందు శరీరమును, మనస్సును, ఇంద్రియాదులను జయించుటవలన కలుగు ఫలము తెలుపుట జరిగినది. *8,9* శ్లోకములయందు పరమాత్మప్రాప్తినందిన పురుషుని లక్షణములు, మహత్త్వము వర్ణింపబడినవి. *10వ* శ్లోకమున ధ్యానయోగమునకు ప్రేరణను ఇచ్చిన పిదప *11* నుండి *14వ* శ్లోకము వరకును క్రమముగా స్థానము, ఆసనవిధానము, ధ్యానయోగవిధులు వివరింపబడినవి. *15వ* శ్లోకమున ధ్యానయోగ ఫలము తెల్పబడిన పిదప *16, 17* శ్లోకములయందు ధ్యానయోగమునందు పాటింపవలసిన ఆహారవిహారశయనాదుల నియమములు, వాటి ఫలములును వివరింపబడినవి. *18వ* శ్లోకమున ధ్యానయోగ సాధనలో అంతిమస్థితికి చేరిన పురుషుని లక్షణములు తెలుపబడినవి. *19వ* శ్లోకమున దీపమును దృష్టాంతముగా గొని యోగిచిత్తస్థితి వివరింపబడినది. అనంతరము *20* నుండి *22వ* శ్లోకము వరకును ధ్యానయోగముద్వారా పరమాత్మప్రాప్తి నందిన పురుషుని స్థితి వర్ణింపబడినది. *23వ* శ్లోకము అట్టి స్థితి యోగము అని పేర్కొనబడి దానిని పొందుటకు ప్రేరణ కావింపబడినది. *24, 25* శ్లోకములయందు అభేదరూపమున పరమాత్మధ్యాన యోగసాధనవిధానము తెలుపబడినది. *26వ* శ్లోకమున విషయముల వెంట పరుగులు తీయు మనస్సును పదేపదే వెనుకకు లాగుచు పరమాత్మపై లగ్నమొనర్చుటకు ప్రోత్సహించుట జరిగినది. *27, 28* శ్లోకములలో ధ్యానయోగఫలస్వరూపము ఆత్యంతికసుఖప్రాప్తి యని తెలుపబడినది. *29వ* శ్లోకమున సాంఖ్యయోగి వ్యవహారకాలస్థితి వివరింపబడెను. *30వ* శ్లోకమున భక్తియోగ సాధన చేయు యోగియొక్క అంతిమ స్థితి, అతడు సర్వత్ర భగవంతునే దర్శించు విషయమును వర్ణించుట జరిగినది. *31వ* శ్లోకమున భక్తి ద్వారా భగవంతుని పొందుటను గూర్చియు, అట్లే *32వ* శ్లోకమున సాంఖ్యయోగముద్వారా పరమాత్మప్రాప్తి నందిన పురుషుల లక్షణములను, మహత్త్వములను విశదపఱచుట జరిగినది. *33వ* శ్లోకమున మనస్సు చంచలమైనదగుటవలన సమత్వయోగ స్థిర స్థితి క్లిష్టమైనదని తెలుపుచు, మనస్సును నిగ్రహించుట అతికష్టమని *34వ* శ్లోకమున అర్జునుడు పేర్కొనెను. *35వ* శ్లోకమున భగవానుడు అర్జునుని మనోభావములను ఆమోదించుచు మనస్సును నిగ్రహించు ఉపాయమును తెలిపెను. *36వ* శ్లోకమున మనోనిగ్రహము కుదురనప్పుడు యోగము దుష్ప్రాప్యమనియు, కుదిరినచో సులభప్రాప్యమనియు తెలిపెను. *37, 38* శ్లోకములయందు యోగభ్రష్టునికి ప్రాప్తించు గతి విషయమునుగూర్చి ప్రశ్నించి, *39వ* శ్లోకములో ఆ విషయమున తన సంశయములను నివారింపుమని అర్జునుడు భగవానుని ప్రార్థించెను. *40* నుండి *45వ* శ్లోకము వఱకును అర్జునుని ప్రశ్నలకు సమాధానముగా భగవానుడు ఇట్లు పలికెను. "యోగభ్రష్టులైన వారికి దుర్గతి ప్రాప్తింపదు. కొందఱు స్వర్గాది సుఖములను అనుభవించిన పిదప పవిత్రసంపన్నకుటుంబములలో జన్మింతురు. విరాగులైన యోగభ్రష్టులు జ్ఞానులైన యోగుల కుటుంబములోనే జన్మించి, పూర్వజన్మకు సంబంధించిన బుద్ధియోగమును అనాయాసముగా పొందుదురు. పవిత్రసంపన్నకుటుంబములలో జన్మించిన యోగభ్రష్టులు గూడ పూర్వజన్మ సంస్కారముల ప్రభావమున భగవంతుని వైపు ఆకర్షితులగుదురు. పిమ్మట

యోగజిజ్ఞాసు మహత్త్వమును తెల్పుచు యోగుల కుటుంబములలో జన్మించిన యోగభ్రష్టులు పరమగతిని పొందుదురు" అని పేర్కొనెను. *46*వ శ్లోకమున యోగుల మహత్త్వమును వర్ణించి, అర్జునుని గూడ యోగివికమ్మని భగవానుడాదేశించెను. *47*వ శ్లోకమున యోగులందఱియందును అనన్యభక్తిశ్రద్ధలతో భగవంతుని భజించువారు శ్రేష్ఠులని ప్రశంసించుచు ఈ అధ్యాయమును ముగించెను.

సంబంధము - ఐదవ అధ్యాయ ప్రారంభమున కర్మసన్న్యాసము (సాంఖ్యయోగము), కర్మయోగము అను రెండింటిలో తనకేది శ్రేయస్కరమో నిశ్చయముగా తెలుపుమని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రార్థించెను. రెండు యోగసాధనలును శ్రేయస్కరములే యనియు, రెండింటి ఫలములు సమానములే అనియు తెలుపుచు కర్మసన్న్యాసముకంటెను కర్మయోగము సాధనలో సులభమగుటవలన అది శ్రేష్ఠమైనదని భగవానుడు విశదపఱచెను. అనంతరము రెండు సాధనల స్వరూపస్వభావములను, విధులను, ఫలములను చక్కగా వివరించి, ఆ రెండింటి సాధనలకు ఉపయుక్తమైన, పరమాత్మప్రాప్తికి మిక్కిలి సహకారియైన ధ్యానయోగమును సంక్షేపముగా ప్రస్తావించెను. కాని ఈ రెండింటిలో ఏ సాధన చేయవలయునో అర్జునునకు స్పష్టపఱచబడలేదు. మీదుమిక్కిలి ధ్యానయోగమునుగూర్చియు అంగప్రత్యంగ సహితముగ (సవివరముగ, సమగ్రముగ) వర్ణింపబడలేదు. కావున ఇప్పుడు ధ్యానయోగమును ఆమూలాగ్రముగ వర్ణించుటకు *6*వ అధ్యాయము ప్రారంభింపబడుచున్నది. మొట్టమొదట అర్జునుని భక్తిశ్రద్ధలతో కర్మయోగమునందు ప్రవృత్తుని చేయుటకు భగవానుడు కర్మయోగమును ప్రశంసించుచు ఈ ప్రకరణమును (ఈ అధ్యాయమును) ఆరంభించుచున్నాడు-

**శ్రీభగవాన్ ఉవాచ**

**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।**
**స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః ॥ 1 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ పురుషుడు | సః | = అతడే | | త్యజించినవాడు |
| కర్మఫలమ్ | = కర్మఫలమును | సన్న్యాసీ | = నిజమైన సన్న్యాసి | న | = సన్న్యాసికాడు |
| అనాశ్రితః | = ఆశ్రయింప (ఆపింప)నివాడై | చ | = మఱియు | చ | = అట్లే |
| | | యోగీ | = నిజమైన యోగి | అక్రియః | = కేవలము క్రియలను |
| కార్యమ్, కర్మ | = కర్తవ్యకర్మను | చ | = కాని | | త్యజించినవాడు |
| కరోతి | = ఆచరించునో | నిరగ్నిః | = కేవలము అగ్నికార్యములను | న | = (యోగియు)కాడు. |

**శ్రీభగవానుడు పలికెను - కర్మఫలమును ఆశ్రయింపక కర్తవ్యకర్మను ఆచరించువాడే నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి . కాని కేవలము అగ్ని కార్యములను త్యజించినంతమాత్రమున సన్న్యాసియుకాడు. అట్లే కేవలము క్రియలను త్యజించినంతమాత్రమున యోగియుకాడు. (1)**

ప్రశ్న - కర్మఫలమును ఆశ్రయింపక అని పేర్కొనబడినది. కాని ఆసక్తి త్యాగమును గూర్చి ప్రస్తావింపలేదు. దీనికి కారణమేమి?

సమా - భోగముల యందు లేక కర్మలయందు ఆసక్తిగల పురుషుడు కర్మఫలములను ఆశ్రయింపక ఉండలేడు. ఆసక్తియుండుట వలన సహజముగనే కర్మఫలకాంక్ష యుండును. కనుక కర్మఫలమును ఆశ్రయింపనివాడు కర్మఫలాసక్తిని త్యజించినవాడేయగును. ప్రతి విషయమునను అన్ని పదములను ప్రయోగింప నవసరములేదు. కొన్ని సందర్భములలో ఇతరత్ర ప్రయుక్తములైన పదములను అధ్యాహారముచేసికొన (కలుపుకొన) వలెను. ఫలత్యాగమును గూర్చి చెప్పి, ఆసక్తి త్యాగ విషయమును ప్రస్తావింపనిచోట (2/51, 18/11) ఆసక్తి త్యాగము గూడ చెప్పబడినట్లు గ్రహింపవలెను. అట్లే ఆసక్తిత్యాగమును గూర్చిచెప్పి, ఫలత్యాగమును గూర్చి ప్రస్తావింపని చోట (3/19, 6/4) ఫలత్యాగమును గూర్చి చెప్పినట్లే గ్రహింపవలెను.

ప్రశ్న - కర్మఫలమును ఆశ్రయింపకుండుట అనగానేమి?

సమా - భార్యాపుత్రులు, సంపదలు, కీర్తిప్రతిష్ఠలు మొదలగు ఐహిక భోగములు, స్వర్గసుఖాది పరలోక భోగములు అన్నియును కర్మఫలములు అనబడును. సాధారణముగ మానవుడు ప్రతి కర్మను ఏదో ఒక ఫలమును ఆశించియే చేయుచుండును. తత్ఫలితముగ అతడు పదేపదే జనన మరణ చక్రములో పడుచుండును. కనుక ఇహపరలోక భోగములు అన్నియును అనిత్యములు, క్షణభంగురములు, దుఃఖహేతువులు అని గ్రహించి, సమస్త కర్మలయందును మమత, ఆసక్తి, ఫలేచ్ఛలను సర్వథా త్యజించుటయే కర్మఫలములను ఆశ్రయింపకుండుట యగును.

ప్రశ్న - కర్తవ్య కర్మలు అనగానేమి? వానిని ఎట్లు చేయవలెను.

సమా - తమతమ వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి, ఆచరింపబడు శాస్త్ర విహిత నిత్యనైమిత్తిక కర్మలు, యజ్ఞ, దాన, తపఃకర్మలు, శరీరపోషణ రక్షణములకై చేయబడు కర్మలు, సమాజ శ్రేయస్సునకై నిర్వహింపబడు పవిత్ర కర్మలు అన్నియును కర్తవ్యకర్మలే. వీటి నన్నింటిని విధ్యుక్తముగా యథాయోగ్యముగ, శ్రద్ధతో తమతమ శక్తికి తగినట్లుగా కర్తవ్య పరాయణ బుద్ధితో ఉత్సాహపూర్వకముగ సర్వదా చేయుచునే యుండవలెను.

ప్రశ్న - అట్టివాడే నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి అనియనుటలోని విశేషమేమి?

సమా - ఇట్టి కర్మయోగి సమస్త సంకల్పములను త్యజించినవాడై, యథార్థ తత్త్వజ్ఞానమును పొందును. అదియే కర్మయోగ, సాంఖ్యయోగ సాధనల చరమఫలము. కావున అప్పుడతడు సన్న్యాసియనియు, యోగియనియు భావింపబడును.

ప్రశ్న - 'న నిరగ్నిః' అనగానేమి?

సమా - అగ్నికార్యములను త్యజించి, సన్న్యాసాశ్రమమును స్వీకరించిన వానిని 'నిరగ్నిః' అందురు. కేవలము అగ్ని కార్యములను త్యజించి, సన్న్యాసాశ్రమమును స్వీకరించి, జ్ఞాన (సాంఖ్య) యోగ లక్షణములతో యుక్తుడు కానివాడు వాస్తవముగ సన్న్యాసి కాడు. అతడు కేవలము అగ్నికార్యములనే త్యజించెను. సమస్త క్రియలయందు కర్తృత్వమును, అభిమానమును వీడలేదు. అట్లే మమతాసక్తులను, దేహాభిమానమును త్యజింపలేదు.

ప్రశ్న - 'న చ - అక్రియః' అనగానేమి?

సమా - సమస్త క్రియలను సర్వథా త్యజించి, ధ్యానమగ్నుడైన పురుషుని 'అక్రియః' అని యందురు. క్రియలను (కర్మలను) ప్రాపంచికముగ త్యజించి, ధ్యానస్థితుడైనప్పటికిని, అతని అంతఃకరణము నందు అహంకార మమకారములు, రాగద్వేషములు, కోరికలు మొదలగు దోషములు ఉన్నప్పుడు వాస్తవముగ అతడు యోగికాడు. అతడు కేవలము భౌతికముగ కర్మలను త్యజించినంత మాత్రమున చాలదు. మమత, అభిమానము, ఆసక్తి, కోరికలు, క్రోధము మొదలగువానిని కూడ త్యజింపవలెను.

ప్రశ్న - అగ్నికార్యములను సర్వథా త్యజించి, సన్న్యాసాశ్రమమును స్వీకరించి, జ్ఞానయోగ (సాంఖ్యయోగ) లక్షణములను అన్నింటిని (5/8,9,13,24,25,26 అనుసరించి) చక్కగా కలిగియున్న వాడు సన్న్యాసి కాడా?

సమా - కాకపోవుటేమి? అట్టివాడే ఆదర్శ సన్న్యాసి. ఈ విధమగు సన్న్యాసుల మహత్త్వమును ప్రకటించుటకే జ్ఞాన యోగ లక్షణములు గల ఇతర ఆశ్రమవాసులను గూడ సన్న్యాసులుగనే ప్రశంసించుట జరుగుచున్నది. వారిని సన్న్యాసులని పిలుచుటకు ఇంతకంటెను వేఱుగా విశేషమేమి ఉండగలదు?

ప్రశ్న - ఈ విధముగనే సమస్త కర్మలను త్యజించి, ధ్యానస్థుడైన పురుషుని అంతఃకరణము నందు మమత, రాగద్వేషములు, కామక్రోధాదులు సర్వథా లేనప్పుడు, అట్టి సర్వ సంకల్ప సన్న్యాసియు యోగి కాడా?

సమా - సర్వసంకల్ప త్యాగియైనట్టి మహాత్ముడు ఆదర్శయోగియే.

**సంబంధము** - కర్మఫలములను ఆశ్రయింపక, కర్మలను ఆచరించు సాధకుని సన్న్యాసి యనియు, యోగి యనియు భగవానుడు మొదటి శ్లోకమున పేర్కొనెను. సన్న్యాసము, యోగము రెండును వేర్వేఱు స్థితులైనప్పుడు, ఒకే సాధకుని సన్న్యాసి యనియు, యోగి యనియు పేర్కొనుట యెట్లు? అను శంక కలుగును. కావున ఈ సంశయమును నివారించుటకు రెండవ శ్లోకమున సన్న్యాస మరియు యోగములయొక్క ఏకత్వము ప్రతిపాదింపబడుచున్నది-

యం సన్న్యాసమితి ప్రాహుః యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥ 2 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాండవ! | = ఓ అర్జునా! | తమ్, యోగమ్, విద్ధి | = దానిని యోగమని యెఱుంగుము | | చేయనివాడు |
| యమ్ | = దేనిని | హి | = ఏలనన | కశ్చన | = ఎవ్వడును |
| సన్న్యాసమ్, ఇతి | = సన్న్యాసము-అని | అసన్న్యస్తసంకల్పః | = సంకల్పత్యాగము | యోగీ, న, భవతి | = యోగి కాలేడు. |
| ప్రాహుః | = చెప్పుదురో | | | | |

ఓ అర్జునా! సన్న్యాసము అని పిలువబడునదియే యోగము అని తెలిసికొనుము. ఏలనన సంకల్పత్యాగము చేయనివాడెవ్వడును యోగి కాలేడు. (2)

ప్రశ్న - సన్న్యాసమను దానినే యోగమనియు తెలిసికొనుము - అని అనుటలోని అంతర్యమేమి?

సమా - సన్న్యాసమనగా శరీరము, ఇంద్రియములు మనస్సు ద్వారా జరుగు క్రియలన్నింటియందును కర్తృత్వమును వదలి కేవలము పరమాత్మయందే అభిన్న భావముతో స్థితుడగుటయే. ఇదియే సాంఖ్యయోగము యొక్క పరాకాష్ఠ. మమత, ఆసక్తి, కోరికలను త్యజించుట వలన కలుగు కర్మయోగము యొక్క పరాకాష్ఠరూపమైన నైష్కర్మ్య సిద్ధినే యోగము అందురు. రెండింటి యందును సర్వథా సంకల్పరాహిత్యము ఉండును. సాంఖ్యయోగియు, కర్మయోగియు, పరబ్రహ్మపరమాత్మనే పొందుదురు. ఈ విధముగా రెండింటి యందు సమస్త సంకల్పముల త్యాగము కలదు. రెండింటి ఫలముకూడ ఒక్కటియే. అందువలన "సన్న్యాసమునే యోగమనియు తెలియుము" - అని చెప్పుట జరిగినది.

ప్రశ్న - సంకల్పము అనగానేమి? దానిని సన్న్యసించుట అనగానేమి?

సమా - మమత, రాగద్వేషములు కలిగియుండి, ప్రాపంచిక విషయములను గూర్చి చింతన చేయు అంతః కరణముయొక్క వృత్తినే సంకల్పము అని అందురు. అట్టి వృత్తిని సర్వథా త్యజించుటను సన్న్యాసము అని అందురు.

ప్రశ్న - సంకల్ప త్యాగము చేయనివాడెవ్వడును యోగి కానేరడు - అనుటలోని అంతర్యమేమి?

సమా - సంకల్పములను సంపూర్ణముగా త్యజింపనిదే చిత్తము పరమాత్మయందు పూర్తిగా లగ్నము కానేరదు. కావున సంకల్పత్యాగము సాధకులందఱికిని ఆవశ్యకము. కొందరు సాధకులు ఏకాంతప్రదేశమునందు ఆసన ప్రాణాయామాదుల ద్వారా పరమాత్మ ధ్యానమును అభ్యసింతురు. మఱికొందరు నిష్కామ భావముతో సర్వదా కేవలము భగవదాజ్ఞానుసారము భగవదర్పణముగ కర్మలను ఆచరించుదురు. మఱికొందరు అప్పుడప్పుడు ధ్యానసాధన యొనర్చుచు నిష్కామ భావముతో కర్మలను గూడ చేయుచుందురు. సర్వథా సంకల్పత్యాగము చేయనిదే వీరిలో ఎవ్వనిని గూడ యోగారూఢుడు లేక యోగి అని చెప్పుటకు వీలులేదు. సమస్త కర్మఫలముల యందును, విషయముల యందును ఆసక్తిరహితుడై సర్వసంకల్పములను త్యజించినప్పుడే ఏ సాధకుడైనను, యోగారూఢుడు అని యనబడును.

సాంఖ్యయోగియు చిత్తమునందు సంకల్పముల యొక్క వాసనలను ఏమాత్రము లేనప్పుడే నిజమైన సన్న్యాసియగును. అందువలననే శ్లోక పూర్వార్థము నందు ఇద్దరును (సన్న్యాసి, యోగి) ఒక్కటియే యని తెల్పుట జరిగినది.

సంబంధము - కర్మయోగమును ప్రశంసించి, ఇప్పుడు దాని సాధనవిధానమును భగవానుడు తెల్పుచున్నాడు-

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥ 3 ॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| యోగమ్, | = యోగారూఢస్థితిని | కారణమ్ | | కారణమని | కారణమ్ | = | (మోక్షప్రాప్తికి) |
| ఆరురుక్షోః | పొందగోరు | ఉచ్యతే | = | చెప్పబడుచున్నది | | | మూలము |
| మునేః | = మననశీలుడైన | యోగారూఢస్య | = | యోగారూఢుడైన ఆ | | | (సాధన)గా |
| | పురుషునకు | తస్య | | పురుషునకు | ఉచ్యతే | = | చెప్పబడు |
| కర్మ | = నిష్కామకర్మాచరణమే | శమః, ఏవ | = | సర్వసంకల్పరాహిత్యమే | | | చున్నది. |

**యోగారూఢస్థితినిపొందగోరు మననశీలుడైన పురుషునకు నిష్కామకర్మాచరణమువలననే యోగప్రాప్తికలుగును. యోగారూఢుడైన పురుషునకు సర్వసంకల్పరాహిత్యమే మోక్షప్రాప్తికి మూలము.(3)**

ప్రశ్న - 'మునేః' అను పద ప్రయోగ ప్రాముఖ్యమేమి?

సమా - యోగారూఢస్థితి పరమాత్మ ప్రాప్తికి హేతువు. ఆ స్థితిని పొందగోరు పురుషుడు ముని యనబడును. మునియనగా మననశీలుడు. అతడు సహజముగనే పరమాత్మ స్వరూపమును చింతన (మననము) చేయుచుండును.

ప్రశ్న - యోగారూఢ స్థితి ప్రాప్తికి హేతువులైన కర్మలేవి?

సమా - వర్ణాశ్రమ ధర్మములను తమ స్థితికి సంబంధించిన శాస్త్ర విహిత కర్మలను ఫలాసక్తి రహితముగా చేయుటచే అవియన్నియును యోగారూఢ స్థితి ప్రాప్తికి హేతువులగుచున్నవి.

ప్రశ్న - యోగా రూఢస్థితి ప్రాప్తికి కర్మలు హేతువులుగా చెప్పబడుటకు కారణమేమి? కర్మలను త్యజించి, ఏకాంతమున ధ్యానము చేయుటచే యోగా రూఢ స్థితి ప్రాప్తింపదా?

సమా - ఏకాంతమున పరమాత్మను ధ్యానించుటయు ఒకవిధమగు కర్మయే. ఈ విధముగా ధ్యానసాధన చేయువాడును శరీరపోషణ రక్షణాదులకై శౌచ స్నానఅన్నపానాది క్రియలు చేయవలసియే యుండును. కావున వర్ణాశ్రమ ధర్మములు, యోగ్యతా స్థితులను బట్టి ఆచరించవలసిన కర్తవ్య కర్మలను, ఫలములను, ఆసక్తిని వీడి వాటిని ఆచరించుట యోగారూఢ స్థితిప్రాప్తికి హేతువగును. ఇట్లు చెప్పుట సముచితమే. కర్మలను ఆరంభింపకయే మనుజుడు నైష్కర్మ్యసిద్ధిని అనగా యోగారూఢస్థితిని పొందజాలడని మూడవ అధ్యాయము నందలి 4వ శ్లోకమున చెప్పబడినది.

ప్రశ్న - 'శమః' అను పదమునకు భౌతికముగ క్రియల (కర్మల) త్యాగమని అర్థము చెప్పక సర్వసంకల్పరాహిత్యమని అర్థము చెప్పుట ఎందులకు?

సమా - ఈ (6వ) అధ్యాయమునందలి 2వ, 4వ శ్లోకములలో సంకల్పములను త్యజించుటను గూర్చియే ప్రస్తావింపబడినది. 'శమః' అను పదమునకు మనస్సును వశపఱచుకొని దానిని శాంతింపజేయుటయే (అనగా దానిని నిశ్చలముగా ఉంచుట) అని యర్థము. 18వ అధ్యాయము నందలి 42వ శ్లోకమున గూడ 'శమః' అను పదము ఈ అర్థమునందే ప్రయుక్తమైనది. మనస్సు వశమై నిశ్చలస్థితిని పొందినప్పుడే సంకల్ప రాహిత్యము సాధ్యమగును. మనోనిశ్చల స్థితి లేకుండ కర్మలను 'స్వరూపతః' (ఆచరణాత్మకముగా) త్యజించుటయు శక్యముగాదు. కావున 'శమః' అను పదమునకు సర్వసంకల్ప రాహిత్యమని యర్థమును చెప్పుటయే సముచితము.

ప్రశ్న - యోగారూఢ పురుషుని విషయమున 'శమః' అను పదమునకు కర్మాచరణమునకు హేతువు అను అర్థమును చెప్పిన దోషమేమి?

సమా - 'శమః' అను పదమునకు సర్వసంకల్ప రహిత ప్రశాంతత అనియే అర్థము - కావున అది కర్మాచరణమునకు హేతువు కాజాలదు. యోగారూఢ పురుషుని ద్వారా జరుగు కర్మలన్నింటికిని అతని యొక్క మఱియు ఇతరుల యొక్క ప్రారబ్ధములే హేతువులగును. కావున 'శమః' అను పదమునకు కర్మాచరణమునకు హేతువు అని అర్థము చెప్పుట సరికాదు. అది పరమాత్మప్రాప్తికి హేతువని తలంచుట సమంజసము.

**సంబంధము** - పూర్వశ్లోకమున ప్రస్తావింపబడిన యోగారూఢపురుషుని లక్షణములను ఇందు వివరించుచున్నాడు-

**యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।**
**సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే ॥ 4 ॥**

యదా = ఎప్పుడయితే
ఇంద్రియార్థేషు = శబ్దాది విషయములయందు
న, అనుషజ్జతే= ఆసక్తుడుకాడో
కర్మసు, హి = కర్మల యందును
న, (అనుషజ్జతే) = ఆసక్తుడుకాడో
తదా = అప్పుడు
సర్వసంకల్పసన్న్యాసీ = సమస్త సంకల్పములను త్యజించిన పురుషుడు
యోగారూఢః, = యోగారూఢుడు
ఉచ్యతే = అనబడును.

**ఇంద్రియభోగములయందును, కర్మలయందును ఆసక్తుడుగాక సర్వసంకల్పములను త్యజించిన పురుషుడు యోగారూఢుడని చెప్పబడును. (4)**

ప్రశ్న - ఇచట ఇంద్రియ భోగముల యందును, కర్మల యందు కేవలము ఆసక్తిని త్యజించుటను గూర్చి చెప్పబడినది. కాని వాటి యందలి కోరికలను త్యజించుటను గూర్చి ప్రస్తావించుట జరుగలేదు. కారణమేమి?

సమా - ఆసక్తి నుండియే కోరికలు జనించును (2/ 62). భోగములయందును, కర్మలయందును ఆసక్తిలేనప్పుడు కోరికలు తమంతట తామే అంతరించిపోవును. కారణములు లేకుండ కార్యము జరుగనే జరుగదు. ఆసక్తిరాహిత్యములో వాంఛారాహిత్యము కూడ చేరియే యున్నది.

ప్రశ్న - సర్వసంకల్ప సన్న్యాసము అనగానేమి? సంకల్పములను అన్నింటిని త్యజించిన పిమ్మట ఏ విషయమునైనను గ్రహించుటగాని, కర్మలను ఆచరించుటగాని ఎట్లు పొసగును?

సమా - సంకల్పత్యాగమనగా సర్వథా స్ఫురణా మాత్ర త్యాగము గాదు. ఒకవేళ దానిని స్ఫురణామాత్ర త్యాగమని భావించినచో యోగారూఢస్థితిని వర్ణించుటయే సంభవముగాదు. యోగారూఢ స్థితిని పొందనివాడు యథార్థ తత్త్వమును తెలిసికొనలేడు. పొందినవాడు దానిని వివరింపలేడు. మఱి ఆ స్థితియొక్క వర్ణనమును ఎవరు చేయగలరు? సమస్త కర్మలును కోరికలు, సంకల్పములు లేకుండగనే సఫలమగునట్టి మహాత్ముని పండితుడందురు. అని నాల్గవ అధ్యాయమునందలి 19వ శ్లోకమున భగవంతుడు వివరించియుండెను. అచట ప్రశంసింపబడిన మహా పురుషుడును యోగారూఢుడే. ఇట్టి స్థితిలో సంకల్పరహితుడైన పురుషునిద్వారా కర్మలు జరుగవని చెప్పుటకు వీలులేదు. కావున సంకల్పములను త్యజించుట యనగా స్ఫురణలను, చిత్తవృత్తులను మాత్రము త్యజించుటకాదు. మమతాసక్తులు, రాగద్వేషములు కలిగి, ప్రాపంచిక విషయములను చింతన చేయుచుండుటయే సంకల్పమనబడును. ఇట్టి సంకల్పములను పూర్తిగా త్యజించుటయే సర్వసంకల్ప సన్న్యాస మనబడును. ఇట్టి త్యాగము వలన కర్మలను చక్కగా ఆచరించుటకు ఎట్టి అవరోధము గూడ ఉండదు. యోగారూఢుని బుద్ధియందు భగవంతునకు తప్ప మఱిదేనికిని చోటేఉండదు. భగవద్బుద్ధితో అతడు విషయములను గ్రహించుట లేక త్యజించుట అను వానిని సంకల్పజనితములుగా భావింపరాదు. ఇట్టి విషయ త్యాగము, గ్రహణములకు సంబంధించిన కర్మలు జ్ఞానులైన మహాత్ములద్వారా కూడ జరుగుచుండును. అతడు అన్నింటియందును ప్రవర్తించుచున్నను నా ధ్యాసతోడనే ప్రవర్తించుచుండును (6/31) అని భగవంతుడు ఇట్టి మహాత్ముని గూర్చియే పేర్కొనెను.

ప్రశ్న - మానవుడు భోగప్రాప్తికై కర్మలను ఆచరించును. వాటియందు ఆసక్తుడగును. కావున శబ్దాదివిషయముల యందు ఆసక్తిని త్యజింపుమనుట యుక్తమే. కర్మలయందు ఆసక్తి రాహిత్యముయొక్క అవసరమేమి?

సమా - భోగముల యందు ఆసక్తిని త్యజించినప్పటికిని కర్మలయందు ఆసక్తియుండుట సంభవమే. ఏలనన భ్రమ ప్రమాదముల కారణముగ వ్యర్థకర్మలయందును మనుష్యులు ఆసక్తిని చూపుచుండుట చూచుచునే యుందుము. కావున భోగముల యందును, కర్మలయందును ఆసక్తిని త్యజించుటకై యిట్లు చెప్పబడినది.

సంబంధము - పరమపదప్రాప్తికి మూలమైన యోగారూఢస్థితిని వర్ణించి అట్టి స్థితిని పొందుటకై ప్రేరణ కల్గించుచు భగవానుడు మానవకర్తవ్యకర్మలను తెలుపుచున్నాడు-

**ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥ 5 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆత్మనా | = (ప్రతివ్యక్తియు) తనచేత | ఆత్మానమ్ | = తనను | ఆత్మనః | = తనకు |
| ఆత్మానమ్ | = తనను | న, అవసాదయేత్ | = (తాను) అధోగతిలో పడవేయరాదు | బంధుః | = బంధువు |
| ఉద్ధరేత్ | = (సంసార సముద్రము నుండి) ఉద్ధరించుకొనవలెను | హి | = ఏలనన | ఆత్మా, ఏవ | = తానే |
| | | ఆత్మా, ఏవ | = (మనుష్యుడు) తానే | ఆత్మనః | = తనకు |
| | | | | రిపుః | = శత్రువు. |

**మనుజులు ఈ సంసారసాగరమునుండి తమను తామే ఉద్ధరించుకొనవలెను. తమకుతామే అధోగతిపాలు కారాదు. ఏలనన లోకములో వాస్తవముగ తమకు తామే మిత్రులు, తమకు తామే శత్రువులు. (5)**

ప్రశ్న - తమను తామే ఉద్ధరించుకొనుట యనగానేమి? తమ కారణముగ తామే అధోగతి పాలగుట యనగానేమి?

సమా - జీవుడు అజ్ఞానవశమున అనాది కాలమునుండియు ఈ దుఃఖమయసంసార సాగరమున మునకలు వేయుచు నానా విధములగు జన్మల నెత్తుచు భయంకరములైన వివిధ దుఃఖములకు లోనగుచున్నాడు. జీవుని ఈ దీనదశను చూచి దయాళువైన భగవంతుడు అతనికి సాధనానుకూలమైన, దేవతలకును దుర్లభమైన మానవ శరీరమును ప్రసాదించి, మంచి తరణోపాయమును చూపుచున్నాడు. ఆ శరీరముతో జీవుడు తగిన సాధన ద్వారా ఒకే జన్మయందు సంసార సముద్రము నుండి బయటపడి పరమానందస్వరూపుడైన పరమాత్మను సహజముగ పొందవచ్చును. కావున మానవుడు దుర్లభమైన తన మానవజన్మను వృథా కానీయక కర్మయోగ, సాంఖ్యయోగ, భక్తియోగాదులలో ఏదో ఒక దానియందు సాధన చేసి, తన జన్మను సార్థకము చేసికొనవలెను. ఇదియే తనను తాను ఉద్ధరించుకొనుట.

దీనికి వ్యతిరేకముగ రాగద్వేష, కామక్రోధ లోభమోహాది దోషములయందు చిక్కుకొని, మానవుడు వివిధ దుష్కర్మలను ఆచరించుచుండును. తత్ఫలితముగ మానవ జీవిత పరమలక్ష్యమైన భగవత్ప్రాప్తిని పొందలేకపోవుటయు, దుష్కృత ప్రభావమున క్రమముగ అతడు సూకరశునకాది జన్మలెత్తుటయు జరుగుచుండును. తనను తాను అధోగతి పాలుచేసికొనుట యనగా నిదియే. ఉపనిషత్తునందు ఇట్టి మనుష్యులను ఆత్మహంతకులు అని పేర్కొని వారి దుర్గతిని వర్ణించుట జరిగినది.[1]

"తమకు సంభవించిన దుఃఖములు తమ ప్రారబ్ధ ఫలితములనియూ, తమకు ఉన్నతిని పొందుయోగము లేదనియూ" అని ఎవ్వరునూ నిస్పృహకు గురికారాదు. పతనోత్థానములు, ప్రారబ్ధాధీనములు కావనియు, తమ అధీనములోనే ఉండుననియు తెలిసికొని ఎల్లరును సాధన ద్వారా అవనత కూపముల నుండి బయటపడి, ఉన్నతశిఖరములను చేరవలెను అని లోకమునకు ప్రేరణ ఇచ్చుటకే భగవంతుడు తమను తామే ఉద్ధరించుకొనవలెను

1) అసుర్యా నామ తే లోకా అంధేన తమసావృతాః। తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః ॥

*(ఈశోపనిషత్ 3)*

'దైవప్రాప్తి సాధనమార్గములను విస్మరించి, దుష్కర్మలను ఆచరించువారు సూకరశునకాది జన్మలతోడను, నరకరూప - అసురలోకముల తోడను అజ్ఞానాంధకారము తోడను కప్పబడియుందురు. అట్టివారు ఆత్మ హంతకులనబడుదురు. వారు చనిపోయిన పిదప ఆ అసురలోకమునే చేరుదురు.'

అని హితవు పలికెను. కావున మానవుడు సావధానముగ తత్పరత్వముతో సర్వదా ఆత్మోన్నతికై (తానున్నస్థితినుండి ఉన్నతస్థితిని చేరుటకై) ప్రయత్నింపవలెను. రాగద్వేషములు, కామక్రోధములు, భోగములు, ప్రమాదాలస్యములు, పాపకృత్యములు మున్నగు వానిని సర్వథా త్యజించి, శమ, దమ, తితిక్షా, వివేక, వైరాగ్యాది సద్గుణములను పెంపొందించుకొనవలెను. విషయ చింతనలను మాని భక్తిశ్రద్ధలతో భగవచ్చింతన చేయవలెను. భజన, ధ్యానము, సేవలు, సత్సాంగత్యములు మొదలగు వాని ద్వారా భగవత్ప్రాప్తికై సాధన చేయవలెను. భగవత్ప్రాప్తి కలుగునంత వఱకు వెనుతిరుగుటగాని, ఆగుటగాని చేయక సాధనను కొనసాగింపవలెను. భగవత్కృపా ప్రభావమున ధైర్య పరాక్రమములతో దృఢ నిశ్చయముతో ఏ మాత్రము చలింపక ప్రగతి మార్గమున లక్ష్యసిద్ధికై ముందునకు సాగవలెను మానవుడు తన స్వభావములను కర్మలను సంస్కరించుకొనుటయే ఉన్నతికి తోడ్పడును. దీనికి వ్యతిరేకముగా స్వభావ కర్మలు దోషపూర్ణములగుట వలన పతనమునకు దారితీయును. కావున అతడు స్వభావ కర్మలను లక్ష్యసిద్ధికి అనుగుణముగా సంస్కరించుకొనుచు పురోగమింపవలెను.

ప్రశ్న - మనుష్యుడు తనకు తానే మిత్రుడు. తనకు తానే శత్రువు. అనగానేమి?

సమా - మానవుడు ప్రాపంచిక సంబంధ కారణమున, ఆసక్తి వశమున తనకు మిత్రులుగా భావింపబడు వారు బంధహేతువులగుట వలన నిజమైన మిత్రులుకారు. బంధవిముక్తికై సహాయపడు సత్పురుషులు, మహాత్ములు, నిస్స్వార్థ సాధకులు నిజమైన మిత్రులు. వారియెడ మానవుడు మనస్ఫూర్తిగా భక్తిశ్రద్ధలు కలిగియుండి వారిని నిజమైన మిత్రులుగా భావించినప్పుడు వారు చూపిన మార్గమును అనుసరించినప్పుడు మాత్రమే అతనికి వారి మైత్రి లభించును. ఈ దృష్టితో చూచినప్పుడు మానవుడు తనకుతానే మిత్రుడని స్పష్టమగును. ఇదేవిధముగ మానవుడు తాను మఱొకరిని (ఇతరుని) శత్రువుగా భావించినప్పుడు మాత్రమే హాని కలుగును. లేనిచో ఒక వ్యక్తికి మఱియే యితర వ్యక్తియును పారమార్థిక హాని చేయలేడు. కావున మానవుడు వాస్తవముగా తనకు తానే శత్రువు. ఆత్మోద్ధరణకు పాటుపడువాడు తనకు తానే మిత్రుడు. ఇందుకు విరుద్ధముగా ప్రవర్తించువాడు తనకుతానే శత్రువు. కనుక తనకు తానే తప్ప ఇతరులెవ్వరును మిత్రులుగాని, శత్రువులుగాని కారు.

సంబంధము - మనుష్యుడు తనకు తానే మిత్రుడు, తనకు తానే శత్రువు అగుట తెల్పబడినది. తనకు తానే మిత్రుడైన వాని లక్షణములేవి? తనకు తానే శత్రువైన వాని లక్షణములేవి? అను విషయము ఇందు స్పష్టపఱచబడుచున్నది-

**బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ 6 ॥**

యేన, ఆత్మనా, = ఏజీవాత్మద్వారా
ఆత్మా = మనస్సుతో, ఇంద్రియములతో గూడిన శరీరము
జితః = జయింపబడినది యగునో
తస్య, ఆత్మనః = అట్టి జీవాత్మకు
ఆత్మా, ఏవ = తానే
బంధుః = మిత్రుడు
తు = మఱియు
అనాత్మనః = మనస్సుతో, ఇంద్రియములతో గూడిన శరీరమును జయింపనివానికి
ఆత్మా, ఏవ = తానే
శత్రువత్ = శత్రువువలె
శత్రుత్వే = శత్రుత్వమునందు (లక్ష్యసాధనకు అవరోధముగా)
వర్తేత = వర్తించును.

మనస్సును, ఇంద్రియములను, శరీరమును జయించిన జీవుడు తనకుతానే మిత్రుడు. అట్లు జయింపనివాడు తనకుతానే శత్రువు. అనగా జితేంద్రియునకు మనస్సు, ఇంద్రియములు, శరీరము భగవత్ప్రాప్తిసిద్ధికై మిత్రునివలె సహకరించును. అట్లుగాక జితేంద్రియుడు కానివానికి మనస్సు, ఇంద్రియములు, శరీరము శత్రువులవలె ప్రవర్తించి లక్ష్యసాధనకు అవరోధకములుగా నిలుచును.(6)

ప్రశ్న - మనస్సును, ఇంద్రియములను, శరీరమును జయించుట యనగానేమి? వాటిని ఏ విధముగ జయింపవచ్చును? జయింపబడిన శరీరేంద్రియ మనస్సుల లక్షణములేవి? ఈ విధముగా ఇంద్రియాదులను జయించిన మనుజుడు తనకు తానే మిత్రుడెట్లగును?

సమా - శరీరమును, ఇంద్రియములను, మనస్సును పూర్తిగా తన వశము నందుంచుకొనుటయే వాటిని జయించుట యగును. వివేకయుక్తమైన అభ్యాసవైరాగ్యముల ద్వారా అవి వశముకాగలవు. మానవుడు భగవత్ప్రాప్తికై సాధన చేయునప్పుడు శరీరేంద్రియ మనస్సులు తద్విపరీత మార్గములలో సంచరింపక, అతని ఇచ్ఛానుసారము అవలీలగా ప్రవర్తించుచున్నప్పుడు అవి అతని వశములో ఉన్నట్లు భావింపవలెను. ఈ విధముగ శరీరేంద్రియ మనస్సులను జయించిన మనుష్యుడు సులభముగ సంసార సాగరము నుండి బయటపడి, పరమానంద స్వరూపుడైన పరమాత్మను పొంది కృతార్థుడగును. కనుక అతడు తనకు తానే మిత్రుడు.

ప్రశ్న - శరీరము, ఇంద్రియములు, మనస్సు వశము కానప్పుడు వానిని అనాత్మ యనుటకు కారణమేమి? అప్పుడతడు తనకు తాను శత్రువువలె ప్రవర్తించుట యనగానేమి?

సమా - శరీరము, ఇంద్రియములు, మనస్సు ఈ మూడును ఆత్మయను పేరుతో వ్యవహరింపబడును. అవి సాధకునకు వశము కానప్పుడు యథేచ్ఛగా విచ్చలవిడిగా విషయములయందు ప్రవర్తించును. వాటినన్నింటిని తన లక్ష్యసిద్ధికి అనుకూలముగా తన ఇచ్ఛానుసారము శ్రేయోమార్గమునందు నడిపింపలేని వానిని అనాత్మ యందురు. అనగా ఆత్మవంతుడు కాడు.

అట్టివాడు (అనాత్ముడు) మనస్సు, ఇంద్రియాదులకు వశుడై అపథ్యము చేసిన రోగివలె శ్రేయోమార్గమునకు వ్యతిరేకముగా ఆచరించును. అహంకార మమకారములు, రాగద్వేషములు, కామక్రోధ లోభమోహాదుల ప్రభావమున ప్రమాదాలస్యములయందును, విషయ భోగముల యందును చిక్కుకొని, పాపకర్మలను ఆచరించుచు బలమైన బంధములలో పడిపోవును. శత్రువువెవరినైనను సుఖమార్గములనుండి తప్పించి, దుఃఖముల పాలగునట్లు చేయును. జితేంద్రియుడు కానివాడు శరీరేంద్రియ మనస్సులను శ్రేయోమార్గమునందు నడిపింపలేక భోగములయందే ప్రవర్తిల్లజేయును. తత్ఫలితముగ తనకు తానే నరకాదులలో పడిపోయి నానా జన్మలను ఎత్తుచు అంతులేని భయంకర దుఃఖములను అనుభవించుచుండును. ఎవడును తనను తాను ద్వేషింపడు. కావున తనకు కీడును కోరుకొనడు. అయినను అజ్ఞాన మోహితుడైన మనుష్యుడు విషయాసక్తుడై దుఃఖమును సుఖముగ, అహితమును హితముగా భావించును. అందువలన అతడు నిజమైన శ్రేయోమార్గమునకు వ్యతిరేకముగా ప్రవర్తించును. ఈ విషయమును స్పష్టపఱచుటకే అతడు శత్రువువలె శత్రుత్వముతో ప్రవర్తించునని తెల్పబడినది.

సంబంధము - శరీరేంద్రియ మనస్సులను జయించినవాడు 'తనకు తానే ఎందుకు మిత్రుడు' అను దానిని స్పష్టపఱచుటకై శరీరేంద్రియ మనోరూపమైన ఆత్మను వశపఱచుకొనుట వలన కలుగు ఫలములను వివరించుచున్నాడు-

**జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| శీతోష్ణసుఖదుఃఖేషు | = శీతోష్ణసుఖదుఃఖముల యందును | ప్రశాంతస్య | = అంతఃకరణవృత్తులు నిశ్చలముగా ఉన్నట్టి | పరమాత్మా | = (జ్ఞానమునందు) సచ్చిదానందఘన పరమాత్మ |
| తథా | = అట్లే | జితాత్మనః | = స్వాధీనమైన ఆత్మ గలవానియొక్క | సమాహితః | = చక్కగా స్థితుడై యుండును. |
| మానావమానయోః | = మానావమానముల యందును | | | | |

శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు మున్నగు ద్వంద్వములయందు అంతఃకరణవృత్తులు నిశ్చలముగా(చలింపక) ఉండి, స్వాధీనమైన ఆత్మగల పురుషునిజ్ఞానమునందు సచ్చిదానందఘనపరమాత్మ చక్కగా స్థితుడైయుండును. అనగా పరమాత్మతప్ప అతని జ్ఞానమునందు అన్యమేదియును ఉండదు. (7)

ప్రశ్న - శీతోష్ణ సుఖదుఃఖ మానావమానములలో చిత్తవృత్తులు ప్రశాంతముగా ఉండుట యనగానేమి?

సమా - శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు అనునవి ఉపలక్షణములు మాత్రమే. ఈ సుఖదుఃఖాది ప్రస్తావనలను శరీరేంద్రియ మనస్సులకు సంబంధించిన ప్రాపంచికములైన పదార్థములు, భావములు, సంఘటనలు మొదలగు వానికి ప్రతీకలుగా గుర్తింపవలెను. ఇట్టి అనుకూల ప్రతికూల పదార్థముల, భావముల, వ్యక్తుల, సంఘటనల సంయోగ వియోగములయందు అంతఃకరణమునందు రాగద్వేషములు, హర్షశోకములు ఇచ్ఛాభయములు, ఈర్ష్యాసూయలు కామక్రోధ విక్షేపాది వికారములేవియును ఏ మాత్రము లేకుండుట, ఎట్టి పరిస్థితులయందైనను చిత్తము సమముగా ప్రశాంతముగా ఉండుట - దీనినే శీతోష్ణ సుఖ దుఃఖమానావమానముల యందు చిత్తవృత్తులు ప్రశాంతముగ ఉండుట అని యందురు.

ప్రశ్న - 'జితాత్మనః' అనగానేమి? ఈ పద ప్రయోగం యొక్క విశేషమేమి!

సమా - శరీరేంద్రియ మనస్సులను పూర్తిగా తన వశమునందుంచుకొనిన సాధకుని జితాత్మ (జితాత్ముడు) అని యందురు. అట్టివాడు సర్వకాల, సర్వావస్థలయందును ప్రశాంతముగ నిర్వికారుడుగ ఉండును. సంసారసాగరము నుండి తనను తాను ఉద్ధరించుకొని పరమాత్మ ప్రాప్తినందును. కనుక అతడు తనకు తానే మిత్రుడగును. ఈ భావమును తెలుపుటకే 'జితాత్మనః' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - పరమాత్మ అను పదమునకు అర్థమేమి? 'సమాహితః' అనగానేమి?

సమా - 'పరమాత్మ' అను పదప్రయోగము సచ్చిదానంద ఘన పరబ్రహ్మను తెల్పును. సర్వకాల సర్వావస్థలయందును స్థిరచిత్తుడైన విజితాత్మునకు సదా సర్వత్ర ప్రత్యక్షముగా గోచరించువాడు అను భావమును తెలుపుటకు 'సమాహితః' అను పదము ప్రయోగింపబడినది.

సంబంధము - శరీరేంద్రియ మనస్సులను వశపరచుకొనుట వలన కలుగు ఫలము పరమాత్మప్రాప్తియని తెల్పబడినది. అట్లు పరమాత్మ ప్రాప్తినందిన పురుషుని లక్షణములను రెండు శ్లోకములలో వర్ణించుచు అతనిని ప్రశంసించుచున్నాడు-

**జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥ 8 ॥**

జ్ఞానవిజ్ఞాన-తృప్తాత్మా = అంతఃకరణమునందు జ్ఞాన విజ్ఞానములు నిండి యున్నట్టి
కూటస్థః = వికారరహితుడును
విజితేంద్రియః = ఇంద్రియములను జయించినవాడును
సమలోష్టాశ్మ-కాంచనః = మట్టిని, ఱాతిని, బంగారమును సమానముగా చూచువాడును, అగు
యోగీ = యోగి
యుక్తః, ఇతి = పరమాత్మ ప్రాప్తినందినవాడు అని
ఉచ్యతే = చెప్పబడును.

పరమాత్మ ప్రాప్తినందిన యోగియొక్క అంతఃకరణమునందు జ్ఞానవిజ్ఞానములు నిండియుండును. అతడు వికారరహితుడు, ఇంద్రియాదులను పూర్తిగా వశపఱచుకొనినవాడు. అతడు మట్టిని, రాతిని, బంగారమును సమానముగా చూచును. (8)

ప్రశ్న - 'జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా' అను పదప్రయోగమునకు అర్థమేమి?

సమా - పరమాత్మయొక్క నిర్గుణ నిరాకార తత్త్వప్రభావము, మాహాత్మ్యము మొదలగు వాని యథార్థ జ్ఞానమును జ్ఞానమని యందురు. సగుణ నిరాకార సాకారతత్త్వము యొక్క లీలలు, రహస్యము, మహత్త్వము గుణప్రభావాదుల యథార్థ జ్ఞానమును విజ్ఞానమని యందురు. పరమాత్మని సగుణ నిర్గుణ సాకార నిరాకార తత్త్వముల జ్ఞానమును పూర్తిగా కలిగినవాడును, ఈ రెండు తత్త్వముల యథార్థ జ్ఞానముతో తృప్తినందిన అంతఃకరణము గలవాడును, తెలిసికొనవలసిన దంతయును తెలిసిన వాడును (అనగా ఇంకను తెలిసికొనవలసినది ఏమియు లేనివాడును) అగు యోగి 'జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా' అనబడును.

ప్రశ్న - 'కూటస్థః' అనగానేమి?

సమా - కంసాలివారు, కమ్మరివారు, ఉపయోగించు 'దాకలి' అను పరికరమును కూటము అనియందురు. దానిపై బంగారు, వెండి, ఇనుము మొదలగు లోహవస్తువులను ఉంచి సుత్తితో గాని, సమ్మెటతో గాని కొట్టుదురు. మాటిమాటికిని కొట్టునప్పుడు దానికి బలమైన దెబ్బ తగులుచునేయుండును. అయినను అది కదలక మెదలక ఏ మాత్రము చలింపక యుండును. అదే విధముగా వివిధములైన తీవ్రాతి తీవ్ర దుఃఖములు సంభవించినను తన స్థితినుండి లేశమాత్రము చలింపనివాడును, అంతఃకరణము నందు ఎట్టి వికారములకును లోనుగానివాడును, సర్వదా నిశ్చలభావముతో పరమాత్మస్వరూపమునందే స్థితుడైన వాడును అగు సాధకుడు కూటస్థుడు అనబడును.

ప్రశ్న - 'విజితేంద్రియః' అనగానేమి?

సమా - యోగి ప్రాపంచిక విషయములన్నియును క్షణికములనియు, మాయామయములనియు భావించును. కనుక వాటియందు ఏమాత్రమును ఆసక్తిని చూపడు. ఆ కారణమున అతని ఇంద్రియములు నిస్సారములైన విషయ భోగములయందు వైముఖ్యమును చూపును. అవి లోకహితమునకై ఆ యోగి ఇచ్ఛానుసారముగా ప్రవర్తించును. అవి స్వతంత్రముగా వ్యవహరింపజాలవు. అతని మనస్సు నందు ఎట్టి వికారములను (క్షోభను) కలిగింపజాలవు. ఈ విధముగ ఇంద్రియములను తన అధీనములో ఉంచుకొనిన వానిని విజితేంద్రియుడు అని యందురు.

ప్రశ్న - 'సమలోష్టాశ్మ కాంచనః' అనగానేమి?

సమా - లోకవ్యవహారమున సామాన్యుడు (అజ్ఞాని) బంగారమును విలువగలదానినిగా చూచి, దానియందు ఆసక్తుడగును. రాయి, మట్టి మొదలగు వానియందు చులకన భావము కలిగియుండును. జ్ఞానియైనవాడు వానివలె కాక బంగారమునందు ఆసక్తి చూపడు. రాయి, మట్టి మొదలగు వానియందు ద్వేషభావమును కలిగియుండడు. అన్నింటియందును పరమాత్మ బుద్ధియే యుండుటవలన యోగి బంగారమునందును, మట్టి, రాయి మొదలగువాని యందును సమభావమునే కలిగియుండును. అట్టివానిని 'సమలోష్టాశ్మకాంచనః' అని యందురు.

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ 9 ॥

| | | | |
|---|---|---|---|
| సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు | = సుహృదులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు మధ్యస్థులు, ద్వేషింపదగినవారు, బంధువులు మొదలగువారియందును | | |
| సాధుషు, చ | = సత్పురుషుల యందును | పాపేషు, అపి | = పాపులయందును |
| సమబుద్ధిః | = సమానభావముగలవాడు | విశిష్యతే | = మిక్కిలిశ్రేష్ఠుడు |

సుహృదులయందును, మిత్రులయందును, శత్రువులయందును, ఉదాసీనులయందును, మధ్యస్థులయందును, ద్వేషింపదగినవారి యందును, బంధువులయందును, ధర్మాత్ములయందును, పాపులయందును సమబుద్ధి కలిగియుండువాడు మిక్కిలి శ్రేష్ఠుడు. (9)

ప్రశ్న - సుహృదులకును, మిత్రులకును మధ్యగల భేదమేమి?

సమా - సంబంధమును, ప్రతిఫలమును అపేక్షింపక, ఎట్టి కారణము గూడ లేక స్వాభావికముగ ప్రేమతో హితమును గూర్చువారు సుహృదులనబడుదురు. పరస్పరము ప్రేమాదరములతో హితమొనర్చుకొనువారు మిత్రులు.

ప్రశ్న - అరికిని (వైరికిని), ద్వేషింపదగిన వానికిని మధ్య గల భేదమేమి?

సమా - ఏదేని ఒక నిమిత్తముతో (సాకుతో) కీడు చేయతలంచువాడును, కీడుచేయువాడును వైరి అనబడును. స్వాభావికముగనే ఇతరులకు కీడు చేయుచుండువాడు ద్వేషపాత్రుడు. అనగా ద్వేషింపదగినవాడు.

ప్రశ్న - మధ్యస్థునకు, ఉదాసీనునకును మధ్యగల భేదమేమి?

సమా - పరస్పరము కలహించుకొనువారి మధ్య సంధి గూర్చువాడు, పక్షపాతరహితముగ వారికి హితకరముగ న్యాయమును గూర్చువాడు మధ్యస్థుడనబడును. పరస్పరము కలహించుకొను ఉభయపక్షముల వారి విషయమున ఎట్టి ప్రమేయమును పెట్టుకొనక ఉపేక్ష వహించువాడు ఉదాసీనుడు అనబడును.

ప్రశ్న - 'అపి' అను అవ్యయప్రయోగము యొక్క ప్రత్యేకత యేమి?

సమా - సుహృదులు, మిత్రులు, ఉదాసీనులు, మధ్యస్థులు, సాధువులు, సజ్జనులు, తమ కుటుంబసభ్యులు మొదలగువారియెడ మనుష్యులకు, ప్రేమాదరములుండుట లోకసహజము. అట్లే శత్రువులు, ద్వేషింపదగినవారు, పాపులు మున్నగువారి యెడ ద్వేషము, జాలి కలుగుచుండుట విదితమే (ప్రసిద్ధమే). వివేకశీలురైన వ్యక్తులు కూడ ఆయా జనులయెడ సహజముగనే రాగద్వేషములకు లోనగుచుండుట చూచుచునే యుందుము. అత్యంత విరుద్ధలక్షణములు గల మనుష్యుల యెడను రాగద్వేషములు, భేదబుద్ధి లేకుండుట, సమబుద్ధి కలిగియుండుట మిక్కిలి క్లిష్టమైన విషయము. ద్వేష్యాదుల యందును సమ భావమును చూపుచుండెడివారు ఇతరత్ర కూడ సమభావమును చూపుచుండుటలో ఆశ్చర్యమేమి? 'అపి, చ' అను ప్రయోగములు ఈ భావమునే స్పష్టపఱచుచున్నవి.

ప్రశ్న - 'సమబుద్ధిః' అనగానేమి?

సమా - సర్వత్ర పరమాత్మ బుద్ధి గల్గియుండుటవలన అట్టి వారిపై అత్యంత విరుద్ధ లక్షణములు గల మిత్రులు, శత్రువులు, సాధువులు, పాపులు మున్నగువారి ఆచరణ, స్వభావ, వ్యవహార భేదముల ప్రభావము ఏ మాత్రము ఉండదు. ఏ సమయమునందైనను, ఎట్టి పరిస్థితులలోను, ఏ కారణమువలననైనను వారి బుద్ధియందు భేదభావము జనింపదు. అట్టివారినిగూర్చియే ఈ 'సమబుద్ధిః' అను పదము తెలుపును.

*సంబంధము - శరీరేంద్రియ మనోరూపమైన ఆత్మను (అనగా శరీరేంద్రియ మనస్సులను) జయించినవాడు తనకుతానే మిత్రుడు అని 6వ శ్లోకమున తెల్పబడినది. జితాత్ముడైన పురుషునకు పరమాత్మప్రాప్తి కలుగునని 7వ శ్లోకమున వివరింపబడినది. పరమాత్మప్రాప్తినందిన పురుషుని లక్షణములను 8,9 శ్లోకములయందు వర్ణించుచు అతనిని ప్రశంసించుట జరిగినది. జితాత్ముడైన పురుషుడు పరమాత్మప్రాప్తినందుటకై చేయవలసినదేమి? ఏ సాధనద్వారా పరమాత్మప్రాప్తి శీఘ్రముగా కలుగును? అను జిజ్ఞాస కలవారికి సమాధానముగా ధ్యానయోగప్రకరణమును భగవంతుడారంభించుచున్నాడు-*

**యోగీ యుంజీత సతతమ్ ఆత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యతచిత్తాత్మా | = శరీరేంద్రియ మనస్సులను వశమునందుంచుకొనినవాడును | అపరిగ్రహః | = భోగసామగ్రిని ప్రోగు చేయనివాడును అగు | స్థితః | = ఉన్నవాడై |
| | | | | ఆత్మానమ్ | = ఆత్మను |
| | | యోగీ | = యోగి | సతతమ్ | = నిరంతరము |
| | | ఏకాకీ | = ఒంటరిగా | యుంజీత | = పరమాత్మయందు లగ్నము చేయవలెను. |
| నిరాశీః | = ఆశారహితుడును | రహసి | = నిర్జన ప్రదేశమున | | |

శరీరేంద్రియమనస్సులను స్వాధీనపఱచుకొనినవాడు, ఆశారహితుడు, భోగసామగ్రిని ప్రోగుచేయనివాడు అయిన యోగి ఒంటరిగా నిర్జన (ఏకాంత) ప్రదేశమున కూర్చొని, ఆత్మను నిరంతరము పరమాత్మయందు లగ్నము చేయవలెను. **(10)**

ప్రశ్న - 'నిరాశీః' అనగానేమి?

సమా - ఇహ - పర లోకములకు సంబంధించిన భోగ్యవస్తువులను ఎట్టి పరిస్థితుల యందును, ఏ విధముగనైనను, ఏ మాత్రమైనను కోరక, (అపేక్షింపక) యుండువాడు 'నిరాశీః' అనబడును.

ప్రశ్న - 'అపరిగ్రహః' అనగానేమి?

సమా - భోగసామాగ్రిని సమకూర్చుకొనుటను పరిగ్రహము అందురు. ఆసామగ్రిని సమకూర్చుకొనకుండుటను అపరిగ్రహము అనియందురు. గృహస్థుడైనచో ఏ వస్తువులను గూడ ఆసక్తితో (మమకారముతో) కూడబెట్టరాదు. బ్రహ్మచారి, వానప్రస్థుడు, సన్న్యాసి అయినవారు ఏ వస్తువునైను, ఏ విధముగ నైనను శాస్త్రవిరుద్ధముగ పరిగ్రహింపరాదు. పురుషుడు ఏ ఆశ్రమస్థుడైనను ఈ లక్షణమును కల్గియున్నచో అతడు 'అపరిగ్రహః' అనబడును.

ప్రశ్న - 'యోగి' అను పదమునకు అర్థమేమి?

సమా - ఇది ధ్యానయోగ ప్రకరణము. కనుక ఇచటి ఈ యోగి యను పదమునకు ధ్యానయోగార్హుడైన సాధకుడు అనియర్థము. ఇతడు సిద్ధయోగి కాడు.

ప్రశ్న - 'ఏకాకీ' అను విశేషణము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - పెక్కుమందిమధ్య ధ్యానయోగ సాధనచేయుట మిక్కిలి కష్టము. దాదాపు అసాధ్యము కూడ. ఒక వ్యక్తితోపాటు రెండవవాడు ఉన్నచో ముచ్చటలు ప్రారంభమై ధ్యానమునకు ఆటంకములు ఏర్పడును. కావున ధ్యాన సాధనకు ఏకాకిగా ఉండుట తప్పనిసరి. కావున ఏకాకీ అను విశేషణము వాడబడినది.

ప్రశ్న - ధ్యానమునకు ఏకాంతస్థలమున కూర్చుండవలెనని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - వనములు, పర్వతములు, గుహలు మున్నగు ఏకాంత (నిర్జన) ప్రదేశములు ధ్యానమునకు మిక్కిలి అనువుగా ఉండును. జనసంచార ప్రదేశములు ధ్యానయోగ సాధనకు భంగకరములు. అందువలన అట్లు చెప్పబడినది.

ప్రశ్న - ఇచట ఆత్మ అను పదమునకు అర్థమేమి? దానిని పరమాత్మయందు లగ్నముచేయుట యనగానేమి?

సమా - ఇచట ఆత్మ యను పదమునకు మనోబుద్ధి రూపమైన అంతఃకరణము అని యర్థము. మనస్సు, బుద్ధిని పరమాత్మయందు తన్మయము ఒనర్చుటయే దానిని పరమాత్మయందు లగ్నముచేయుట అందురు.

ప్రశ్న - 'సతతం' అను పదము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - 'సతతం' అను పదము **యుంజీత** అను క్రియకు విశేషణము - నిరంతరము అని దానికి అర్థము. ధ్యాన సమయమున ఏ మాత్రము అంతరాయము కలుగరాదు. పరమాత్మ ధ్యానసాధన నిరంతరాయముగా సాగుచుండవలెను.

సంబంధము - జితాత్ముడైన వాడు ధ్యానయోగ సాధన చేయవలెనని చెప్పబడినది. ధ్యానయోగమును విస్తారముగా వర్ణించుటకు ముందు స్థానము, ఆసనములను గూర్చి వివరింపబడుచున్నది-

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ॥ 11 ॥**

శుచౌ, దేశే = పరిశుభ్రమైన ప్రదేశమున
చైలాజినకుశోత్తరమ్ = క్రమముగా దర్భాసనమును, జింకచర్మమును వస్త్రమును (ఒకదానిపై నొకటి) పఱచబడినట్టిదియు
న, అత్యుచ్ఛ్రితమ్ = మిక్కిలి ఎత్తుగా లేనట్టిదియు
న, అతినీచమ్ = మిక్కిలి నిమ్నముగా లేనట్టిదియు ఐన
ఆత్మనః, ఆసనమ్ = తన ఆసనమును
స్థిరమ్ = స్థిరముగా
ప్రతిష్ఠాప్య = ఏర్పఱచుకొని

పరిశుభ్రమైన ప్రదేశమున క్రమముగా ధర్భాసనమును, జింకచర్మమును, వస్త్రమును ఒకదానిపై ఒకటి పఱచి, అంత ఎక్కువగాకాని, తక్కువగాకాని కాకుండ సమానమైన ఎత్తులో స్థిరమైన స్థానమును ఏర్పఱచుకొనవలెను. **(11)**

ప్రశ్న - 'శుచౌ దేశే' అనగానేమి?

సమా - ధ్యానయోగ సాధనకై సహజముగా పరిశుభ్రమైన ప్రదేశమును ఎన్నుకొని, ఊడ్చి, జలశుద్ధితో దానిని నిర్మలముగా సిద్ధము చేసికొనవలయును. దీనికి నదీతీరములు, కొండగుహలు, దేవాలయములు, తీర్థస్థానములు, ఉపవనములు మొదలగు ప్రదేశములు అనుకూలములు. స్వచ్ఛమైన గాలి లభించు ప్రదేశము పరిశుభ్రముగా, పవిత్రముగా, నిర్జనముగా లభించినచో అట్టిది సాధనకు యోగ్యమైన ప్రదేశము.

ప్రశ్న - 'ఆసనమ్' అను పదమునకు అర్థమేమి? దీనితోపాటు 'నాత్యుచ్ఛ్రితమ్, నాతినీచమ్, చైలాజిన కుశోత్తరమ్' అను విశేషణములను ప్రయోగించుటలో గల వైశిష్ట్యమేమి?

సమా - సాధకుడు స్థిరముగా కూర్చొనుటకు అనుకూలముగా చెక్కతోగాని, రాతితోగాని చేయబడిన పీటను లేక అరుగును ఆసనము అనియందురు. ఆసనము మిక్కిలి ఎత్తుగానున్నచో ధ్యాన సమయమున ఒకప్పుడైనను క్రిందపడిపోవు ప్రమాదము ఉండును. ఎత్తు మిక్కిలి తక్కువగానున్నచో భూమివలన కలుగు శీతోష్ణముల ప్రభావమునగాని, క్రిమికీటకాదుల వలన గాని ధ్యానమునకు ఆటంకములు ఏర్పడవచ్చును. కావున ఆసనము యొక్క ఎత్తు మిక్కిలి ఎక్కువగాని, తక్కువగాని కాక ఒక ప్రమాణములో ఉండవలెనని తెల్పుటకై 'నాత్యుచ్ఛ్రితమ్, నాతినీచమ్' అను విశేషణములు ప్రయోగింపబడినవి.

చెక్క ఆసనము గాని, రాతి ఆసనముగాని, కఠినముగా నుండుటవలన కాళ్ళకు బాధ ఏర్పడు అవకాశముండును. కావున దానిపై కుశాసనము, మృగచర్మము, వస్త్రము క్రమముగా ఒకదానిపై ఒకటిగా పఱచి, మెత్తగా నుండునట్లు చేయుటకై 'చైలాజిన కుశోత్తరమ్' అను విశేషణ ప్రయోగము చేయబడినది. మృగచర్మము[1] క్రింద దర్భాసనమును ఉంచుట వలన అది ఎక్కువ కాలము భద్రముగా ఉండును. చర్మముపై వస్త్రమును పఱచుట వలన అది శరీరమునకు గ్రుచ్చుకొనక మెత్తగా ఉండును. కావున ఈ మూడింటిని పఱచవలెనని చెప్పబడినది.

ప్రశ్న - 'ఆత్మనః' అనగానేమి?

సమా - ధ్యానయోగ సాధనను ఇతరుల ఆసనముపై కూర్చొని చేయరాదు. సాధకుడు తనకై ఏర్పఱచుకొనిన ఆసనముపై మాత్రమే కూర్చుండి చేయవలెను.

ప్రశ్న - 'స్థిరమ్ ప్రతిష్ఠాప్య' అను ప్రయోగము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - ఆసనము ఇటునటు కదలక స్థిరముగా ఉండవలెను. అది కదలుచున్నచో ధ్యాన సమయమున ఏకాగ్రత దెబ్బతినును. కఱ్ఱతో లేక, రాతితో చేయబడిన ఆసనము స్థిరముగా ఉండును.

*సంబంధము - పవిత్ర ప్రదేశమున ఆసనమును ఏర్పఱచుకొన్న పిమ్మట ఆచరింపవలసిన ధ్యాన సాధనా విధులను గూర్చి తెలుపుచున్నాడు-*

**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।**
**ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగమాత్మవిశుద్ధయే ॥ 12 ॥**

1) చర్మము కొఱకు జింకలను చంపరాదు. అట్లు చేయుట జీవహింసయగును. అట్టి చర్మము ధ్యానమునకు పనికిరాదు. కనుక సహజముగ మరణించిన జింకల చర్మములనే దీనికి ఉపయోగింపవలెను. జింక చర్మము లభింపనిచో, 'కంబళి'ని ఆసనముగా ఉపయోగింపవచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తత్ర, ఆసనే | = ఆ ఆసనముపై | మనః | = మనస్సును | యోగమ్ | = యోగమును |
| ఉపవిశ్య | = కూర్చుండి | ఏకాగ్రమ్, కృత్వా | = ఏకాగ్రమొనర్చి | యుంజ్యాత్ | = అభ్యసింప వలెను. |
| యతచిత్తేంద్రియ-క్రియః | = చిత్తేంద్రియక్రియలను వశమునందుంచుకొని | ఆత్మవిశుద్ధయే | = అంతఃకరణశుద్ధి కొఱకు | | |

ఆ ఆసనముపైకూర్చొని, చిత్తేంద్రియవ్యాపారములను వశమునందుంచుకొని, ఏకాగ్రతగల మనస్సుతో అంతఃకరణశుద్ధికై ధ్యానయోగమును సాధనచేయవలెను. **(12)**

ప్రశ్న - ప్రత్యేక యోగాసన ప్రసక్తిలేకుండ, సామాన్యరీతిలో కూర్చుండుమని చెప్పుటలోని విశేషమేమి?

సమా - ధ్యానయోగ సాధనకు కూర్చొనునప్పుడు పాటింపవలసిన విధులు రాబోవు శ్లోకమున ప్రస్తావింప బడును. వాటిని పాటించుచు, స్వస్తిక, సిద్ధ, పద్మాది ఆసనములలో సాధకుడు సుఖముగా, ఎక్కువకాలము స్థిరముగా కూర్చుండుటకు అనువగు ఆసనము అతనికి ఉపయుక్తము కాగలదు. అందువలన ఇక్కడ ప్రత్యేకమైన ఆసనమును గూర్చి ప్రస్తావింపలేదు.

ప్రశ్న - 'యతచిత్తేంద్రియక్రియః' అనగానేమి?

సమా - చిత్తమనగా అంతఃకరణము. మనస్సు చేత, బుద్ధి చేత ఆలోచించి, నిశ్చయించు ప్రాపంచిక విషయములను సర్వథా త్యజించి, వాటినుండి ఉపరతుడగుటయే అంతఃకరణ వ్యాపారములను వశపఱచుకొనుట యగును. ఇంద్రియములనగా జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు. వీటి వ్యాపారములను అనగా వినుట, చూచుట మొదలగు క్రియలను ప్రాపంచిక విషయముల నుండి మఱల్చుటయే ఇంద్రియ వ్యాపారములను వశపఱచుకొనుట యగును.

ప్రశ్న - మనస్సును ఏకాగ్రతతో నిలుపుట యనగానేమి?

సమా - మనోవృత్తులను ధ్యేయ వస్తువునందు పూర్తిగా లగ్నము చేయుటయే మనస్సును ఏకాగ్రతతో నిలుపుట యగును. ఈ సందర్భమును అనుసరించి పరమాత్మయే ధ్యేయవస్తువు. కనుక పరమాత్మయందే మనస్సును లగ్నము చేయవలెను. ఈ విషయమునే 14వ శ్లోకమునందు 'మచ్చిత్తః' అను విశేషణముతో స్పష్టపఱచుట జరిగినది.

ప్రశ్న - "అంతఃకరణశుద్ధి కొఱకు ధ్యానయోగసాధన చేయవలెను." అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - ధ్యానయోగ సాధన లక్ష్యము క్షణికములైన ప్రాపంచిక ప్రయోజనములను పొందుటగాని, ఐశ్వర్యప్రాప్తిగాని కాదు. ఏకైక పరమాత్మప్రాప్తియే దాని పరమ లక్ష్యము. ఆ లక్ష్యసిద్ధికై అంతఃకరణమునందు పాదుకొనియున్న రాగద్వేషాది అవగుణములను, పాపములను, అజ్ఞానవిక్షేపములను అంతరింపజేయుట అవసరము. కనుక దీనికి ధ్యానయోగ సాధన ఆవశ్యకము.

ప్రశ్న - యోగసాధన అనగానేమి?

సమా - ఇంతకుముందు తెలిపిన రీతిగా స్థిరాసనముపై కూర్చొని చిత్తేంద్రియ క్రియలను వశమునందుంచుకొని, మనస్సును పరమేశ్వరునియందే లగ్నమొనర్చి, నిరంతరముగా అవిచ్ఛిన్నముగా పరమాత్మచింతన చేయుటయే యోగసాధన అనబడును.

*సంబంధము - పై శ్లోకమునందు స్థిరాసనముపై కూర్చుండి, ధ్యానయోగసాధన చేయవలెనని తెల్పబడినది. ఆ ఆసనముపై ఎట్లు కూర్చుండవలెను? సాధకుని భావము ఎట్లుండవలెను? అతడు ఏయే నియమములను పాటింపవలెను? ధ్యానము ఏ రీతిగా చేయవలెను? మొదలగు విషయములన్నియును ఒక రెండు శ్లోకములలో వివరింపబడుచున్నవి-*

**సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 13 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కాయ-శిరోగ్రీవమ్ | = | శరీరమును, శిరస్సును, మెడను | ధారయన్ | = | ఉంచుచు(ఉంచి) | సంప్రేక్ష్య | = దృష్టిని ఉంచి |
| సమమ్ | = | నిటారుగా | చ | = | మఱియు | దిశః, అనవ-లోకయన్ | = చూపులను దిక్కుల వైపునకు పోనీయక ఉంచవలెను. |
| అచలమ్ | = | నిశ్చలముగా | స్థిరః | = | స్థిరముగానున్నవాడై | | |
| | | | స్వమ్, నాసికాగ్రమ్ | = | తన నాసికాగ్రముపై | | |

**శరీరమును మెడను శిరస్సును నిటారుగ నిశ్చలముగా స్థిరముగానుంచి[1] చూపులను ఏ దిక్కునకును పోనీయక తననాసికాగ్రభాగమునందే దృష్టిని నిలుపవలెను. (13)**

ప్రశ్న - శరీరమును, మెడను, శిరస్సును సమముగా నిశ్చలముగా నుంచుట అనగానేమి?

సమా - ఈ సందర్భమును అనుసరించి, కటిభాగము నుండి మెడవఱకు గల తనువు యొక్క భాగమును శరీరముగా గ్రహింపవలెను. గ్రీవమనగా మెడ. మెడయొక్క పైభాగము శిరస్సు. నడుము పొట్టభాగములను ముందు వెనుకలకు గాని, ఈ ప్రక్క ఆ ప్రక్క (కుడి, ఎడమ)లకు గాని వంగనీయరాదు. అనగా వెన్నెముకను నిటారుగా ఉంచవలెను. మెడను గూడ ఇటునటు త్రిప్పరాదు. ఈ విధముగా ఈ మూడింటిని ఏ మాత్రము కదలనీయక నిటారుగా నిలుపుటను సమముగా నిశ్చలముగా ఉంచుటయందురు.

ప్రశ్న - శరీరాదులను నిశ్చలముగా ఉంచవలెనని చెప్పిన పిదప మఱల స్థిరముగా ఉంచవలెనని చెప్పుటలోని విశేషమేమి?

సమా - శరీరమును, మెడను, శిరస్సును సమముగా నిశ్చలముగా ఉంచినప్పటికిని కాళ్ళుగాని, చేతులుగాని కదలుటకు అవకాశము గలదు. ధ్యాన సమయమున వాటిని ఆసన నియమానుసారము ఏ రీతిగనైనను ఉంచవచ్చును. కాని వాటిని స్థిరముగా ఉంచుట మాత్రము అవసరము. ఏ అంగము కదలినను ధ్యానమునకు భంగము కలుగును. కావున అంగము లన్నియును నిశ్చలముగా స్థిరముగా ఉండుట అవసరము. అవయవములను అన్నింటిని నిశ్చలముగా ఉంచుటయేగాక ధ్యాన సాధన ముగియువఱకు ఆ నిశ్చల స్థితి అవిచ్ఛిన్నముగ (స్థిరముగా) కొనసాగవలెను.

ప్రశ్న - దృష్టిని ఏ దిక్కునకును పోనీయక నాసికాగ్రమునందే నిల్పవలెను. అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - నిమీలిత నేత్రములతో దృష్టిని నాసికాగ్రమునందే నిల్పవలెను. ఏ వైపునకును దృష్టిని మఱలనీయరాదు. నిద్రా విక్షేపములకు తావులేకుండ కేవలము దృష్టిని మాత్రమే నాసికాగ్రమున నిలునవలెను. మనస్సును మాత్రము పరమాత్మయందే లగ్నము చేయువలెను. మనస్సును నాసికాగ్రమున నిలుపరాదు.

ప్రశ్న - ఆసనాది విషయములలో ఇన్ని నియమములను ఏర్పఱుచుటలోని ఆంతర్యమేమి?

సమా - నిద్ర, సోమరితనము, విక్షేపము, శీతోష్ణాది ద్వంద్వములు ధ్యానయోగ సాధనకు విఘ్నములను కలిగించుటలో ప్రబలమైనవి. శరీరము, మెడ, శిరస్సు నిటారుగా ఉంచి, నిమీలిత నేత్రుడైనచో నిద్రయు, సోమరితనము అతనిని తాకనైనను తాకలేవు. మనస్సును భగవత్పరము గావించి, నాసాగ్రమున దృష్టిని నిల్పుటవలన బాహ్యవిక్షేపముల ప్రభావములకు లోనుగాక సాధకుడు అంతర్ముఖుడగుటకు అవకాశము ఏర్పడును. ఆసనస్థిరత్వమువలన శీతోష్ణాది ద్వంద్వముల బాధలు దూరమగును. ఈ కారణములవలన ధ్యానయోగ సాధనసమయమున ఆసనాది విషయములయందు ఈ నియమములను ఏర్పఱచుట జరిగినది.

ప్రశ్న - ఈ మూడు శ్లోకములయందును పేర్కొనబడిన ఆసనాది నియమములతో గూడిన ధ్యానయోగసాధనకు ధ్యేయము సగుణ పరమేశ్వరుడా? లేక నిర్గుణ పరబ్రహ్మయా?

సమా - ధ్యానయోగసాధనలక్ష్యము సగుణ పరమేశ్వరుడైనను కావచ్చును. నిర్గుణపరబ్రహ్మమైనను కావచ్చును. అది సాధకుని అభీష్టమును బట్టియు, యోగ్యతను (పటిమను) బట్టియు ఉండును. ఆసనాది నియమములు అందఱికిని ఆవశ్యకములే.

1) స్థిరసుఖమాసనమ్ (యోగ 2/46) ఎక్కువ కాలము సుఖముగా స్థిరముగా కూర్చొనియుండుటను 'ఆసనము' అనియందురు.

**ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ 14 ॥**

యుక్తః = ధ్యానయోగి
బ్రహ్మచారివ్రతే = బ్రహ్మచర్య వ్రతమునందు
స్థితః = ఉన్నవాడై
విగతభీః = భయములేనివాడై
ప్రశాంతాత్మా = ప్రశాంతమైన అంతఃకరణము గలవాడై
మనః = మనస్సును
సంయమ్య = వశము నందుంచుకొని
మచ్చిత్తః = నాయందే చిత్తము గలవాడును
మత్పరః = మత్పరాయణుడును ఐ
ఆసీత = ఉండవలెను.

**ధ్యానయోగి ప్రశాంతాత్ముడై, భయరహితుడై, బ్రహ్మచర్యవ్రతమును పాటించుచు, మనోనిగ్రహముతో మత్పరాయణుడై నిశ్చలుడై యుండవలెను. (14)**

ప్రశ్న - బ్రహ్మచర్య వ్రతమును పాటించుటయనగానేమి?

సమా - బ్రహ్మచర్యమునకు తాత్త్వికార్థము వేఱేయైనను, ఈ సందర్భమున మాత్రము ముఖ్యమైన యర్థము వీర్యధారణము. మానవ శరీరమునందు వీర్యము మౌలికమైనది. అమూల్యమైనది. దీనిని పరిరక్షించుకొననిదే శారీరకముగా, మానసికముగా, ఆధ్యాత్మికముగ శక్తిని పొందుటయు జరుగదు. దానిని నిలుపుకొనుటయు జరుగదు. కావున ఆర్య (ఆర్ష) సంస్కృతి యందలి చతురాశ్రమములయందు బ్రహ్మచర్యము మొట్టమొదటిది. మిగిలిన మూడు ఆశ్రమములకును ఇది పునాది. బ్రహ్మచర్యాశ్రమమునందున్న బ్రహ్మచారి పాటించు అనేకవిషయములు వీర్యధారణకు దోహదకారులు అగును. బ్రహ్మచర్య పాలన వలన వీర్యధారణ చక్కగా జరిగి శరీరమునందు విలక్షణమైన విద్యుచ్ఛక్తి (ఓజస్సు) ఉత్పన్నమగును. ఈ తేజస్సు మిక్కిలి శక్తిపూర్ణమై దాని ప్రభావమున ప్రాణ, మనోగతులు తమంతట తామే స్థిరమగును. చిత్తగతి ధ్యేయోన్ముఖముగా సంతత ప్రవాహరూపమున సహజముగా సాగును. ఈ సంతత స్రోతస్సే ధ్యానము.

ఆధునికులకు ఎంతగా ప్రయత్నించినను ధ్యానము కుదురుట లేదు. వారి చిత్తము ధ్యేయవస్తువుపై నిలుచుట లేదు. దీనికి ముఖ్యకారణము వారు వీర్యధారణ చేయక పోవుటయే. వివాహితుడును తన భార్యతో సంయమముతో నియమములు పాటించుచు దాంపత్య జీవనము గడుపుటయు బ్రహ్మచర్యమే. దాని వలనను ధ్యానమునకు మేలు జరుగును. మొదటి నుండియు బ్రహ్మచర్య నిష్ఠా పాలనము చక్కగా ఆచరించినవాడు, ధ్యానయోగ సాధన సమయము వఱకును ఏ విధముగను శుక్ర నష్టమునకు ఆస్కారమియ్యని వాడు ధ్యానయోగసాఫల్యమును మిక్కిలి శీఘ్రముగ, సులభముగ పొందును.

మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్ర గ్రంథములయందును, ఇతర శాస్త్ర గ్రంథములయందును బ్రహ్మచారి పాటింప వలసిన వ్రత నియమములు చక్కగా వివరింపబడినవి. అందు ముఖ్యమైనవి - బ్రహ్మచారి నిత్యము స్నానము చేయవలెను. సబ్బు, నలుగుపిండి మొదలగువానిని వాడరాదు. కాటుకను పెట్టుకొనరాదు. తలకు నూనెను వాడరాదు. అత్తరు మొదలగు సుగంధవస్తువుల జోలికి పోరాదు. పూలమాలలను గాని, సొమ్ములనుగాని ధరింపరాదు. నృత్యగాన వినోదములు సలుపరాదు. పాదరక్షలు, గొడుగు వాడరాదు. మంచముపై పరుండరాదు. జూదమాడరాదు. స్త్రీలను చూడరాదు. స్త్రీలకు సంబంధించిన చర్చలు చేయరాదు. నియమితమైన సాత్త్విక భోజనము చేయవలెను. మృదువైన వస్త్రములను ధరింపరాదు. దేవర్షులను, గురువులను పూజింపవలెను, సేవింపవలెను. ఎవ్వరితోడను వివాదములు సలుపరాదు. ఎవ్వరిని గూడ నిందింపరాదు. తిరస్కరింపరాదు. సత్యమును పలుకవలెను. అహింసను పాటింపవలెను. కామ, క్రోధ లోభాదులను సర్వథా త్యజింపవలెను. ఒంటరిగా పరుండవలెను. వీర్యస్ఖలనమును ఏ సమయమునను జరుగనీయరాదు. బ్రహ్మచారి ఈ నియమముల నన్నింటిని పాటింపవలెను. ఇచట భగవానుడు బ్రహ్మచారివ్రత ప్రస్తావనమిషతో ఆశ్రమ ధర్మములను గూడ చెప్పెను. ఇతరాశ్రమవాసులును ధ్యానయోగసాధన సమయమున

వీర్యధారణ, వీర్య సంరక్షణ చేయుట మిక్కిలి ఆవశ్యకము. పై నియమములన్నియును వీర్యధారణకు తోడ్పడును. ఈ నియమములను అన్నింటిని గట్టిగా ఆచరించుటయే బ్రహ్మచర్య వ్రతమును పాటించుటయగును.

ప్రశ్న - 'విగతభీః' అనగానేమి?

సమా - పరమాత్మ సర్వవ్యాపి. (పరమాత్మ సర్వత్ర ఉండును). ధ్యానయోగి పరమాత్మ ప్రాప్తికై ధ్యానము చేయును. అప్పుడతనికి భయపడవలసిన పనియేలేదు. మనస్సున ఏ కొంచెము భయమున్నను ఏకాంతమందు నిర్జనప్రదేశమున సహజముగనే చిత్తవిక్షేపము కలుగును. సర్వవ్యాపియైన భగవంతుడు సర్వశక్తిమంతుడనియు, సర్వరక్షకుడనియు దృఢముగా విశ్వసించుట వలన సాధకునకు ఎట్టి భయమును ఉండదు. ప్రారబ్ధవశమున సాధనసమయమున అతడు మరణించినను పరిణామమున అది శ్రేయస్కరమేయగును. నిజమైన ధ్యానయోగి ఈ విషయమున దృఢవిశ్వాసము కలిగియుండును. గాన అతడు 'విగతభీః' అనబడును.

ప్రశ్న - ప్రశాంతాత్మా అనగానేమి?

సమా - ధ్యాన (యోగ) సమయమున రాగద్వేషములను, హర్షశోకములను, కామక్రోధాది దూషితవృత్తులను, ప్రాపంచిక సంకల్ప వికల్పములను మనస్సునుండి సర్వథా దూరము చేయవలెను. వైరాగ్యముతో మనస్సును నిర్మలముగను, శాంతముగను ఉంచి, ధ్యానసాధన చేయవలెను. ప్రశాంతాత్మా అను విశేషణము ఈ భావమునే స్పష్టపఱచును.

ప్రశ్న - 'యుక్తః' అను విశేషణము యొక్క విశేషమేమి?

సమా - ధ్యాన సమయమున సాధకుడు నిద్ర, సోమరితనము, ప్రమాదాది అవరోధములను తప్పించు కొనుటకు సావధానుడై యుండవలెను. ఈ సావధాన స్థితి యందు ఏ మాత్రము ఏమఱుపాటు సంభవించినను, మనస్సు, ఇంద్రియములు అతనిని ప్రక్కదారులకు మఱల్చి ధ్యానమునకు పెక్కు అవరోధములను కల్గించును. ఈ విషయమును విశదపఱచుటకే 'యుక్తః' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - మనస్సును నిగ్రహించుట అనగానేమి?

సమా - మనస్సు నిలకడలేనిది. బలవంతముగా దానిని నిలుపుటకు ప్రయత్నించినను విషయములవైపే పరుగెత్తుట దాని స్వభావము. ఈ మనస్సును పూర్తిగా నిగ్రహింపనిదే ధ్యానయోగసాధన ఏ మాత్రము కుదరదు. కావున ధ్యానసమయమున మనస్సును బాహ్యవిషయముల నుండి పూర్తిగా మఱల్చి తన లక్ష్యమునందు (భగవంతునియందు) పూర్తిగా తన్మయము చేయుటనే మనస్సును నిగ్రహించుట యందురు.

ప్రశ్న - 'మచ్చిత్తః' అనగానేమి?

సమా - చిత్తగమనము ధ్యేయోన్ముఖముగ సంతతప్రవాహ రూపమున సాగుటయే ధ్యాన మనబడును. ఆ ధ్యేయవస్తువు పరమాత్మయే. సాధకునకు మిక్కిలి ప్రేమాస్పదమైన వస్తువునందే చిత్తము లగ్నమగుచుండుట సహజము. భక్తితత్పరుడైన ధ్యానయోగ సాధకునకు భగవంతుడు మాత్రమే ప్రేమాస్పదుడు. కావున ధ్యానయోగి సర్వలోక పరమ హితకరుడును, సుహృదుడును, పరమప్రేమాస్పదుడును అయిన పరమేశ్వరుని గుణ ప్రభావ తత్త్వ రహస్యములను బాగుగా తెలిసికొని, ప్రాపంచిక వ్యామోహములను తెంచుకొని, పరమాత్ముని యందే అనన్య భావముతో చిత్తమును లగ్నమొనర్పవలెను. భగవంతుడు 'మచ్చిత్తః' అని పలుకుటలోని ఆంతర్యము ఇదియే.

ప్రశ్న - భగవత్పరాయణుడగుట అనగానేమి?

సమా - పరమేశ్వరునే (పరమేశ్వరప్రాప్తియే) ధ్యేయముగా పెట్టుకొని ఆయన ధ్యానమునందే చిత్తమును లగ్నము చేయువారు భగవత్పరాయణులే అగుదురు. కావున ధ్యానయోగసాధకుడు భగవంతుడే పరమగతిగా, పరమధ్యేయముగా, పరమాశ్రయముగా, మిక్కిలి ప్రేమాస్పదుడుగా విశ్వసించి, నిరంతరము ఆయననే ఆశ్రయింపవలెను. భగవంతుడే సర్వరక్షకుడుగా, సహాయకుడుగా, స్వామిగా, జీవన ప్రాణ సర్వస్వముగా భావించి, భగవల్లీలావిలాసముల యందే సంతుష్టుడగు చుండవలెను. భగవత్పరాయణుడగుట యనగా నిదియే.

ప్రశ్న - ఈ శ్లోకమునందు పేర్కొనబడిన ధ్యానము సగుణపరమేశ్వరుని గూర్చియా? లేక నిర్గుణ పరబ్రహ్మను గూర్చియా? ఈ ధ్యానము భేదభావముతో ఉపాస్య, ఉపాసక భావముతో గూడినదా? అభేద భావముతో గూడినదా?

సమా - ఈ శ్లోకమునందు 'మచ్చిత్తః', 'మత్పరః' అను

పదములు ప్రయోగింపబడినవి. అందువలన ఈ ధ్యానము నిర్గుణ పరబ్రహ్మను గూర్చి అభేద భావముతో చేయునది కాదు. ఇచట ఉపాస్య - ఉపాసక భేదములను స్పష్టముగా సూచించుచు సగుణ పరమేశ్వరుని ధ్యానించు విషయమే ప్రస్తావింపబడినది.

ప్రశ్న - ఈ ధ్యానము సగుణ పరమేశ్వరుని గూర్చి చేయునదియనుట సరే. కాని ఈ సగుణధ్యానము సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు అయిన పరమేశ్వరుని నిరాకార తత్త్వమును గూర్చినదియేనా? లేక శ్రీశంకరుడు, శ్రీవిష్ణువు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మున్నగు సాకార రూపములలో ఒకదానిని గూర్చియా?

సమా - భగవంతుని గుణప్రభావ తత్త్వ రహస్యములను[1] తెలిసికొని సాధకుడు తన ఇష్టమును, స్వభావమును, యోగ్యతను బట్టి తన మనస్సు సులభముగా లగ్నమగు రూపమును ధ్యానము చేయవలెను. భగవంతుడొక్కడే. అన్ని రూపములును అతనివే. ఇచట ప్రత్యేకముగా ఈ రూపమునే ధ్యానింపుమని చెప్పినట్లు భావింపరాదు.

ప్రస్తుతము సాధకుల ఉపయోగార్థము ధ్యానానుకూలముగా భగవత్స్వరూపములు కొన్ని వర్ణింపబడుచున్నవి.

### ధ్యానమగ్నుడైన శ్రీ పరమశివుని ధ్యానము

హిమాలయము యొక్క గౌరీ శంకర శిఖరముపై ఏకాంతమున పరమేశ్వరుడు (శివుడు) ధ్యానమగ్నుడై పద్మాసనమున విరాజిల్లుచుండును. ఆయన యొక్క మిక్కిలి తెల్లని శరీరముపై సూక్ష్మముగా ఎఱ్ఱని కాంతులు ప్రసరించుచుండును. ఆయన శరీరము యొక్క పైభాగము నిశ్చలముగా నిటారుగా సమున్నతముగా ఉండును. విశాల ఫాలభాగమున భస్మత్రిపుండ్రరేఖలు శోభిల్లుచుండును. పింగళ వర్ణముతో విరాజితమైన జటాజూటము సర్పశోభితమై అలరారుచుండును. రుద్రాక్షమాలావృతములై చెవులు మనోహరముగా నుండును. ఆయన ధరించిన వ్యాఘ్రచర్మముపై గల నల్లని కాంతులు నీలకంఠుని గళ శోభలతో ద్విగుణీకృతములై విరాజిల్లుచుండును. ఆ త్రినేత్రుని చూపులు నాసికాగ్రభాగమున స్థిరముగా నుండును. ఆతని నిమీలితనేత్రముల శోభలు నలువైపుల విరాజిల్లుచుండును. పద్మాసనస్థుడైన ఆ పరమశివుని చేతులు ఒడిలో నుంచబడి వికసిత పద్మములవలె విరాజిల్లుచుండును. సమాధిస్థితిలో తనలోని వాయు ప్రసారములను నిగ్రహించి ధ్యానస్థితుడైన ఆ శంకరుడు జలపూర్ణమై నిరాడంబరముగా నున్న నీరదమువలెను, అలలు ఆగిన అలజడులులేని మహాసాగరమువలెను, నిర్వాత ప్రదేశమున వెలుగొందు స్వచ్ఛమైన జ్యోతిర్మయ దీపకళికవలెను ప్రకాశించుచుండును.

### శ్రీమహావిష్ణు ధ్యానము

శ్రీ మహావిష్ణువు యోగుల హృదయకమలముల యందు గాని, సమున్నత ప్రదేశమున కెంపుల కాంతులతో

---

1) భగవంతుని గుణప్రభావ తత్త్వరహస్యములను స్పష్టముగా ఇదమిత్థమని (ఇది ఇట్లని) చెప్పుటకు సాధ్యము కాదు. ఈ విషయమును గూర్చి ఏమి చెప్పినను, ఎంతగా చెప్పినను, సూర్యునకు దివిటీ చూపుట వంటిదే. తథాపి (ఐనప్పటికిని) ఆ భగవానుని గుణాదికమును గూర్చి, స్మరణ, శ్రవణ, కీర్తనలను ఏ కొంచెము కావించినను అవి మనుజుని మిక్కిలి పవిత్రునిగా చేయును. అందువలన భక్తితత్పరులు తద్గుణాదికమును కీర్తింతురు. ఆ సత్పురుషులబాటలో ఆదివ్య గుణాదికమును ఇట్లు గ్రహింపవలెను. సమత్వము, శాంతి, దయ, ప్రేమ, క్షమ, మాధుర్యము, వాత్సల్యము, గాంభీర్యము, ఔదార్యము, సౌహార్దము మొదలగు భగవద్గుణములు అనంతములు, అపరిమితములు (హద్దులు లేనివి), అత్యంత విలక్షణములు. భగవంతుని బలము, ఐశ్వర్యము, శక్తి సామర్థ్యములు సాటిలేనివి. అతడు అఘటన, ఘటనా సమర్థుడు. ఆతని ప్రభావములు అట్టివి. పరమాణువు, ఆవిరి, మేఘము, జల్లులు, మంచు మొదలగునవి యన్నియును జలముయొక్క రూపాంతరములే. అట్లే సగుణ - నిర్గుణ, సాకార-నిరాకార, వ్యక్త-అవ్యక్త, జడ-చేతన, స్థావర-జంగమ, సత్-అసత్ మొదలగునవియును, వాటికి అతీతమైనవియును భగవంతుని రూపాంతరములే యని గ్రహించుటయే భగవత్ తత్త్వము.

భగవంతుని దర్శనము, భాషణము, స్పర్శ, చింతనము, కీర్తనము, అర్చనము, వందనము, స్తవము మొదలగునవి పాపులను గూడ పరమ పవిత్రులనుగా చేయును. శాశ్వతుడు, సర్వలోకేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వత్ర సమభావస్థితుడు అయిన భగవంతుడు తన దివ్యావతారములద్వారా తన లీలలను ప్రకటించును. అతని ఈ దివ్యగుణప్రభావతత్త్వములు ఊహాకందనివి. అపరిమితములు. దివ్యములు. వీటిని అతడు తప్ప మఱి ఎవ్వరును తెలిసికొనలేరు. ఇదియే భగవద్రహస్యము.

విలసిల్లుచున్న సహస్రదళపద్మమున వారి యెట్టయెదుటగాని శోభిల్లుచుండును. సర్వాంగసుందరుడైన ఆ నీలమేఘశ్యాముడు వివిధాభరణములతో విరాజిల్లుచుండును. ఆతని దివ్య శరీరము నుండి శ్రీగంధపరిమళములు గుబాళించుచుండును. అతని సుందర ముఖారవిందము ప్రశాంతమై రమణీయముగా నుండును. ఆ చతుర్భుజుని ఆజానుబాహువుల శోభలు మిక్కిలి మనోహరములు. ఆయన గ్రీవము అందములను ఒలుకుచుండును. కపోలములు కమనీయములు. చిరునగవులను చిందించు ముఖవిలాసములు మరులుగొల్పునవి. బింబాధర రాగలీలలు మిక్కిలి మనోజ్ఞములు. మొనదేలిన నాసిక అందచందాలు వర్ణింపనలవి కానివి. చెవులను ఆశ్రయించిన కుండలముల ప్రభలు మరువలేనివి. చుబుకము (గడ్డము) యొక్క సొంపులు ఇంపుగొలుపునవి. ప్రఫుల్లకమలకాంతులను మరపించు విశాలనేత్రముల అందచందాలు పరమాకర్షణీయములు. ఆ కమలాక్షుని నేత్రముల నుండి సహజములైన దయా, వాత్సల్యములు, శాంతి సమత్వములు, జ్ఞానానందములు, ప్రకాశప్రభావములు సంతతధారగా ప్రభవించుచుండును. భుజములు సమున్నతములు. నీలోత్పలముల నిగనిగలతో ఒప్పు ఆశ్యామసుందరుని శరీరముపై పీతాంబరముయొక్క బంగారువన్నెలు మిలుమిట్లుగొల్పుచుండును. లక్ష్మీనివాస స్థానమైన వక్షస్థలము నందున్న శ్రీవత్స చిహ్నము యొక్క వన్నెచిన్నెలు వర్ణనాతీతములు. ఉపరిస్థితదక్షిణహస్తమున విలసితమైన సుదర్శనచక్రదీధితులు దర్శనీయములు. మఱియొక దక్షిణ హస్తమున కుదురుకొనిన కౌమోదకీ గద చూచువారికి మోదము గొల్పునది. ఉపరిస్థిత వామహస్తమున ఒదిగిన పాంచజన్యశంఖము అరివీర భయంకరము, ఆర్తత్రాణ పరాయణము. మఱియొక వామహస్తమున అలరారు కెందామర అత్యంత రమణీయము. గళసీమ నలంకరించిన రత్నహారము, హృదయముపై విలసిల్లు తులసిమాల వైజయంతీ కౌస్తుభమణులు మిలమిలలాడుచుండును. పాదముల నలంకరించిన రత్నఖచితనూపురముల గల గలలు సర్వమనోజ్ఞములు. శిరమున స్థిరముగా నెలకొన్న స్వర్ణకిరీట శోభలు దేదీప్యమానములు. విశాల సమున్నతఫాలమున విలసిల్లు ఊర్ధ్వపుండ్రతిలకములు, కరముల కాంతులీను రత్నకంకణములు, కమనీయ కటిఘటితమేఖల, అంసముల (భుజముల)పై అలరారు భుజకీర్తులు, చేతివ్రేళ్ళయందు సిరులొలుకు రత్నాంగుళీయకములు, పరమ రమణీయములు. మహితమంజులములు. అందములను చిందించు అలకల ఒయ్యారాలు మానసోల్లాసాలు. కోటిసూర్యప్రభాభాసమానుడైన ఆ జగన్నాథుని వాత్సల్య ప్రభావిత శీతల కిరణాలు జగదానందదాయకములు. అతడు ఆశ్రితులకు కామధేనువు. భక్తులకు కల్పతరువు.

## శ్రీరామచంద్ర ధ్యానము

సర్వాంగ సుందరమైన రత్నఖచిత హేమసింహాసనముపై ధర్మస్వరూపుడై శ్రీరామచంద్ర ప్రభువు సీతాసమేతుడై విరాజిల్లుచుండును. అతడు నూతనమైన (దూర్వదళతుల్య) గడ్డి పరకల వలె శ్యామవర్ణశోభితుడు. కమలదళ సదృశ విశాలనేత్రుడు. సుందర ముఖ శోభితుడైన ఆతని విశాల ఫాలమునందలి ఊర్ధ్వపుండ్ర తిలక శోభలు పరమ రమణీయములు. ముంగురుల శృంగారాలు అతి మనోహరాలు. శిరమున ధరించిన స్వర్ణకిరీట కాంతులు సూర్యకిరణ సదృశ ప్రభావిలసితాలు. ఆతని లావణ్య లాలిత్యములు మునిజన మోహనములు. ఆతడు దివ్యపీతాంబర శోభితుడు. మెడలో రత్నహారములను, సుందర కుసుమమాలలను ధరించువాడు. శ్రీచందనలేపిత గాత్రుడు. హస్తములయందు ధనుర్బాణములను ధరించువాడు, బింబాధరములపై చిఱునగవులను చిందించు వాడు. వామభాగమున సీతాదేవితో విరాజిల్లుచుండువాడు. బంగారువన్నెగల సీతమ్మ నీలవర్ణ వస్త్రములను ధరించునది. కరకమలములయందు కెందామరలను, సర్వాంగముల యందు దివ్యాభరణములను తాల్చునది. ప్రేమానురాగములకు ప్రతి రూపములైన ఆ సీతారాములు జగత్కల్యాణ ప్రదాతలు. సర్వజనానంద సంధాతలు. వారి దర్శనము అపూర్వము, మనోహరము.

## శ్రీకృష్ణభగవానుని ధ్యానము

### (1)

యమునా నదీతీరమున బృందావన శోభలు సర్వ మనోజ్ఞములు. అందలి అశోకవృక్షనవపల్లవముల మధ్య అందాల నొలికించు కాళిందీ కుంజము అతి సుందరము. అందు నీలమేఘశ్యామసుందరుడైన శ్రీకృష్ణ భగవానుడు తన సఖులతో విహరించుచుండును. నీలమేఘముల మధ్య

మిరుమిట్లు గొలుపు ఇంద్రధనుశ్శోభలవలె ఆ శ్యామసుందరునిపై ప్రసరించు పీతాంబరస్వర్ణకాంతులు అతిరమణీయములై చూపరులను ఆహ్లాదపఱచుచుండును. కంఠసీమయందు ఒప్పారు వనమాలాసుమ తులసీదళ సౌరభాలు ఎంతో హాయిగూర్చుచుండును. ఉరమున గల వైజయంతీమాలా వైభవములు కనులపండువు గావించు చుండును. ముద్దులొలుకు ముంగురులవన్నెలు కపోల స్వర్ణకాంతులను ఇనుమడింపజేయుచుండును. అత్యంత రమణీయములైన ముఖారవిందశోభలు త్రిభువన మోహనములు. మధుర దరహాసములు సర్వమనోహరములు. శిరోభూషణమున సిరులొలుకు శిఖిపింఛలీలావిలాసములు హృదయంగమములు. కర్ణకుండలముల కాంతులు కోమలకపోలములపై ప్రతిఫలించుచుండును. సర్వాంగములు సౌందర్య శోభితములు. కర్ణములపై కరవీర (గన్నేరు) పుష్పకాంతులు, శరీరముపై అలంకరింపబడిన అద్భుతధాతువులు, చిత్ర విచిత్ర నవపల్లవ ప్రభలు, వక్షమున శ్రీవత్స చిహ్నవైభవము గళమున కౌస్తుభమణిచ్ఛటలు, కోమల సుందర బింబాధరముల శోభలు, లోకములను ముగ్ధమొనర్చుచుండును. విశాలనేత్రములనుండి ప్రేమానందామృత ధారలు జాలువాఱుచుండును. శ్రీకృష్ణుని దర్శించు భాగ్యశాలురందఱును తత్సౌందర్యమునకు ముగ్ధులై ఆనందాబ్ధిలో ఓలలాడుచుందురు. వ్యత్యస్త పాదారవిందముల నిలిచి తన కుసుమకోమలములైన అంగుళీస్పర్శలతో ప్రభవించు మంజులవంశీనాద మధురిమలతో ఆ కృష్ణభగవానుడు లోకములనే మురిపించు చుండును, మరపించుచుండును. ఆ ఆనంద స్వరూపుని లీలావిలాసములట్టివి.

## శ్రీకృష్ణ పరమాత్మ ధ్యానము
## (2)

అది కురుక్షేత్రరణ ప్రాంగణము. నలువైపుల వీరయోధులు యుద్ధసన్నద్ధులై నిలిచియున్నారు. అచట తేజస్సులను విరజిమ్ముచున్న అర్జున రథము ఆగియున్నది. రథముయొక్క పైభాగమున విశాల ధ్వజముపై తారాచంద్రుల తళతళలు మిఱుమిట్లు గొలుపుచున్నవి. సమున్నత ధ్వజముపై మహావీరుడైన మారుతి విరాజిల్లుచున్నాడు. రణరంగమున పలుపతాకములు రెపరెపలాడుచున్నవి. రథము నొగలపై శ్యామసుందరుడైన శ్రీకృష్ణపరమాత్మ విజయసారథియై విలసిల్లుచున్నాడు. ఆ పురుషోత్తముడు సౌందర్యనిధి. ఆకృతిదాల్చిన వీరస్వరూపము. భద్రకవచ పీతాంబరశోభితుడు. పరమ శాంతమూర్తి. జ్ఞానదీప్తులతో తేజోమయ స్వరూపుడై తేజరిల్లుచున్నాడు. జ్యోతిర్మయములైన విశాలనేత్రముల నుండి అరుణారుణ కాంతులను వెదజల్లుచున్నవాడు. వామహస్తమున రథాశ్వముల పగ్గములను దాల్చియున్నవాడు. దక్షిణకరమును జ్ఞానముద్రాంచిత మొనర్చి, అభయమును ప్రకటించుచున్నవాడు. ధైర్యశాంతులను రంగరించుచు అర్జునుని గుండెలలో గీతాసారమును నింపుచున్నవాడు. పెదవులపై చిఱునగవులను చిందించుచు సవ్యసాచి సందేహములను తన కనుసన్నలతోడనే కనుమఱుగు కావించు చున్నవాడు. ఆ లీలామానుష విగ్రహుని లీలా విలాసములు అద్భుతములు. అనన్య సామాన్యములు. అనితరసాధ్యములు.

సంబంధము - ఇంతవఱకును ధ్యానవిధానములు వర్ణింపబడినవి. ఇప్పుడు ధ్యానయోగ సాధన ఫలములు తెలుపబడుచున్నవి-

**యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ॥**
**శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| నియతమానసః యోగీ | = మనోనిగ్రహముగల వాడగు యోగి | యుంజన్ | = (పరమేశ్వరుడనైన నాస్వరూపమునందే) లగ్నమొనర్చుచు | నిర్వాణ పరమామ్, శాంతిమ్ | = పరమానందమునకు పరాకాష్ఠ రూపమైన శాంతిని |
| ఏవమ్ | = ఈ ప్రకారముగా | | | | |
| ఆత్మానమ్ | = ఆత్మను | మత్సంస్థామ్ | = నాయందు స్థితమై యున్న | | |
| సదా | = నిరంతరము | | | అధిగచ్ఛతి | = పొందును. |

**మనోనిగ్రహశాలియైన యోగి నిరంతరము పరమేశ్వరుడనైన నా స్వరూపమునందే ఆత్మను ఈ విధముగా లగ్నమొనర్చి నాయందున్న పరమానందమునకు పరాకాష్ఠ రూపమైన శాంతిని పొందును.(15)**

ప్రశ్న - ఇచట యోగికి 'నియతమానసః' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - అంతఃకరణమును వశమునందుంచుకొనిన వానిని నియతమానసుడు అనియందురు. అట్టిసాధకుడే ధ్యాన యోగసాధన చేయగలడు. ఈ విషయమును వివరించుటకే యోగికి 'నియతమానసః' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ఈ విధముగ ఆత్మను నిరంతరము పరమేశ్వర స్వరూపమునందు లగ్నము చేయుటయనగానేమి?

సమా - మనోబుద్ధుల ద్వారా నిరంతరము తైలధారవలె అవిచ్ఛిన్నముగా భగవత్స్వరూపమును చింతనచేయుట, అందు నిశ్చలముగా తన్మయత్వమునందుటనే ఆత్మను పరమేశ్వర స్వరూపమునందు లగ్నము చేయుట యందురు.

ప్రశ్న - నాయందున్న పరమానందమునకు పరాకాష్ఠ రూపమైన శాంతిని పొందును - అని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - ఈ శాంతిని నైష్ఠికశాంతి (5/12) శాశ్వతశాంతి (9/31) పరాశాంతి (18/62) అనియు పిలుతురు. ఈ శాంతిని పొందుటనే పరమేశ్వరప్రాప్తి, పరమదివ్య పురుషప్రాప్తి, పరమగతిప్రాప్తి మొదలగు పేర్లతో వర్ణింతురు. ఈ శాంతి అద్వితీయ - అనంతానందములకు అవధి. పరమదయాళువు, పరమసుహృదుడు, ఆనందనిధి, ఆనంద స్వరూపుడైన భగవంతునియందు ఈ ఆనందము నిరంతరము నిశ్చలముగా స్థిరముగా ఉండును. ధ్యానయోగసాధకుడు ఇట్టి శాంతినే పొందును.

సంబంధము - ధ్యానయోగవిధానమూ, ఫలమూ చెప్పబడినవి. ఇప్పుడు ధ్యానయోగ సాధకుడు పాటింపవలసిన ఆహార, విహార, శయనాది నియమములు ఒక రెండు శ్లోకములలో వివరింపబడుచున్నవి-

**నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః ।**
**న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| అర్జున! | ఓ అర్జునా! | ఏకాంతమ్, అనశ్నతః, చ | ఏ మాత్రము భుజింపని వానికినీ | జాగ్రతః, చ | పూర్తిగా మేల్కొని యుండువానికినీ |
| యోగః | ధ్యానయోగము | న | కలుగనేరదు | న, ఏవ | కలుగనే కలుగదు. |
| అతి, అశ్నతః, తు | అతిగా భుజించు వానికిని | అతి, స్వప్న శీలస్య, చ | మిక్కిలి నిద్రించు వానికినీ | | |
| న, అస్తి | కలుగనేరదు | | | | |

**అర్జునా! అతిగా భుజించువానికిని, ఏ మాత్రము భుజింపనివానికిని, అతిగా నిద్రించువానికిని, ఎల్లప్పుడు (ఏమాత్రము నిద్రింపక) మేల్కొనియుండువానికిని ఈ యోగసిద్ధికలుగదు. (16)**

ప్రశ్న - ఇచట యోగశబ్దమునకు అర్థమేమి?

సమా - పరమాత్మప్రాప్తికై ఉపయుక్తమగు సాధన మార్గములన్నియును యోగ శబ్దవాచకములే. సందర్భము ననుసరించి, దీనిని ధ్యానయోగ వాచకముగా భావింపవలెను. ఇది అన్ని విధములైన దుఃఖములను పాఱద్రోలి పరమానందధాముడు, పరమశాంతికి నిధియైన పరమేశ్వర ప్రాప్తిని కలిగించును.

ప్రశ్న - అతిగా భుజించువానికిని, ఏ మాత్రము భుజింపని వానికిని ధ్యానయోగము సిద్ధింపకుండుటకు కారణమేమి?

సమా - అతిగా భుజించుట వలన మత్తు వచ్చును, సోమరితనము ఏర్పడును. జీర్ణశక్తిని పట్టించుకొనక అతిగా తిన్నచో వివిధ రోగములు ఉత్పన్నములగును. అట్లే ఆహారము పూర్తిగా త్యజించి కటిక ఉపవాసములు చేసినచో వాని ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు శక్తిహీనములగును.

అప్పుడు అతడు ఆసనముపై స్థిరముగా కూర్చుండలేడు. పరమేశ్వరుని యందు మనస్సును లగ్నము చేయలేడు. ఈ విధముగ ధ్యానసాధనకు విఘ్నము ఏర్పడును. కావున ధ్యానయోగి అవసరమునకు మించి భుజింపరాదు. కటికి ఉపవాసములు చేయరాదు.

ప్రశ్న - అతిగా నిద్రించువానికిని, ఏ మాత్రమూ నిద్రింపక ఎల్లప్పుడును మేల్కొని యుండువానికిని ధ్యానయోగము సిద్ధింపకుండుటకు కారణమేమి?

సమా - తగినంతగా నిద్రించుట వలన అలసట తొలగి, చురుకుదనము ఏర్పడును. ఆ నిద్రయే అవసరము కంటెను అధికమైనచో తమోగుణము హెచ్చును. దీనివలన సోమరితనము ఆవహించును. స్థిరముగా కూర్చొనుటకును కష్టమగును. దీనికితోడు అతిగా నిద్రించుట వలన జీవితమున అమూల్యమైన కాలము వ్యర్థమైపోవును. అట్లే ఏ మాత్రము నిద్రింపక పూర్తిగా మేలుకొనియున్నచో అలసట కలుగును. చురుకుదనము నశించును. శరీరము, ఇంద్రియములు, ప్రాణములు శక్తిహీనములై శిథిలము లగును. క్రమముగా అనేక రోగములు ఏర్పడును. ఆ కారణముగ మబ్బుగా (మంపుగా) ఉండుట, సోమరియగుట సంభవించును. ఈ విధముగా ఎక్కువగా నిద్రించుటగాని, ఎల్లప్పుడును మేల్కొని యుండుటగాని ఈ రెండును ధ్యానయోగసాధనకు విఘ్నకారకములే. కావున ధ్యానయోగి తన ఆరోగ్యమును భద్రముగా ఉంచుకొన వలయును. ధ్యానయోగసాధనకు ఏ మాత్రము విఘ్నములను కలుగ నీయరాదు. ఈ ఉద్దేశ్యముతోనే తన శరీరస్థితిని, ప్రకృతిని, ఆరోగ్యమును గమనించుచు అవసరముకంటెను ఎక్కువ నిద్రింపరాదు. సదా మేల్కొని యుండరాదు.

**యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ 17 ॥**

| పదము | | అర్థము |
|---|---|---|
| యుక్తాహారవిహారస్య | = | యుక్తమైన (తగిన) ఆహారవిహారములు గలవాడును |
| కర్మసు | = | కర్మాచరణములయందు |
| యుక్తచేష్టస్య | = | యోగ్యముగ ప్రవర్తించువాడును |
| యుక్తస్వప్నావబోధస్య | = | నిద్రయందును, మేల్కొనియుండుట యందును యథాయోగ్యముగ ఉండువాడును-అగు మనుష్యునకు |
| దుఃఖహా | = | దుఃఖనాశకమగు |
| యోగః | = | ధ్యానయోగము |
| భవతి | = | అగును (సిద్ధించును) |

**ఆహారవిహారాదులయందును, కర్మాచరణములయందును, జాగ్రత్స్వప్నాదుల యందును యథాయోగ్యముగ ప్రవర్తించు వానికి దుఃఖనాశకమగు ధ్యానయోగము సిద్ధించును. (17)**

ప్రశ్న - ఆహార విహారములయందు యథాయోగ్యముగ ప్రవర్తించుట యనగానేమి?

సమా - అన్నపానాదులను ఆహారమని యందురు. జీవన విధానములనుబట్టియు, అవసరములనుబట్టియు అటునిటు సంచరించుటను విహారమని యందురు. సముచిత స్థాయీరీతులలో ఆహార విహారాదులను నడుపుటనే వాటిని యథాయోగ్యముగ నడుపుటయందురు. వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి అన్నపానాదులను స్వీకరింపవలెను. ఆ అన్నపానాదులు సత్య న్యాయ మార్గముల ద్వారా సమకూర్చుకొనబడినవియు, శాస్త్రానుకూలములైనవియు, సాత్త్వికములును అయియుండవలెను. (17/8). అవి రజస్తమో గుణములను కలిగించునవి కారాదు. అవి యోగసాధనకు సహాయకములుగా పవిత్రములై, సాధకుని స్వభావస్థితులకును, అభిరుచులకును అనుగుణముగా ఉండవలెను. సాధకుని ఆరోగ్యభాగ్యములకును, సాధనకును తగినట్లుగా హితముగా మితముగా ఉండవలెను. అదే విధముగా విహారాదులను అవసరముల మేరకు హితమును గూర్చునట్లు నడుపవలెను.

నియమితమైన, సముచితమైన ఇట్టి ఆహార విహారముల వలన శరీరేంద్రియ మనస్సులయందు సత్త్వగుణము వృద్ధియగును. నిర్మల, ప్రసన్న చేతనత్వములు పెంపొంది ధ్యానయోగసిద్ధి సులభమగును.

ప్రశ్న - యుక్తకర్మాచరణ మనగానేమి?

సమా - వర్ణాశ్రమ ధర్మములకును, వయో-వస్థాస్థితులకును, వాతావరణాదులకును సంబంధించి శాస్త్రోక్తములైన కర్తవ్య కర్మలనే ఇచట కర్మ అనియందురు. ఈ కర్మలనే సముచిత స్థాయిలో ఉచితరీతులలో యథా యోగ్యముగ చేయుటయే యుక్తకర్మాచరణమనబడును. దైవభక్తి, దేవతారాధన, దీనదుఃఖితులను సేవించుట, మాతాపితరులను, ఆచార్యాది గురుజనులను పూజించుట, యజ్ఞదానతపస్సులను ఆచరించుట మొదలగునవి యన్నియును నిధ్యుక్తకర్మలు. అట్లే జీవనోపాధులకు సంబంధించిన కర్మలు అనగా విద్యార్జనము, స్వాధ్యాయ ప్రవచనములు, వ్యాపారాదికములు, శౌచస్నానాదిక్రియలు మొదలగు కర్మలన్నియును ముఖ్య కర్తవ్యములు. ఇవి శాస్త్రవిహితములై, సాధుసమ్మతములై స్వావలంబనమునకు తోడ్పడునవియై, యోగసాధనకు సహాయకములై యుండవలెను. ఇవి ఇతరులకు అపకారకములు గాని, కష్టములు కల్గించునవి గాని, ఎవరిపైనను భారమును వేయునవి గాని కారాదు. వీటిని ఆవశ్యకమైన మేరకు న్యాయముగా జీవితమును కొనసాగించుటకు వీలుగా ఆచరింపవలెను. ధ్యానయోగ సాధనకు తగినంత సమయమును వినియోగించుచు ఈ కర్మలను ఆచరింపవలెను. ఇట్లు చేయుట వలన శరీరేంద్రియ మనస్సుల స్వాస్థ్యము (ఆరోగ్యము) దృఢముగా నుండును. ధ్యానయోగ సిద్ధి సులభమగును.

ప్రశ్న - యుక్త స్వప్నావబోధములనగా నేమి?

సమా - పగలు మేల్కొని యుండుట, రాత్రియందు మొదటి, చివరి జాములలో మేల్కొనియుండుట, మధ్యనున్న రెండు జాముల యందు నిద్రించుటను సముచితమైన జాగ్రత్స్వప్నములనిభావింతురు. మధ్యనున్న ఆఱుగంటల సమయమునందే అందఱును విధిగా నిద్రింపవలెనని నియమము లేదు. ధ్యానయోగి తన శరీర పరిస్థితినమసరించి, స్వభావమునకు అనుగుణముగా నిద్రాదులను ఆచరింపవలెను. ధ్యానసమయమున మంపురానిచో, సోమరితనము కలుగనిచో, ఆరోగ్యమునకు భంగకరము కానిచో రాత్రులయందు నాలుగైదు గంటలు నిద్రించినను చాలును. ఆహారవిహారములు, కర్మాచరణములు, జాగ్రత్స్వప్నములు శాస్త్ర ప్రతికూలములు కానిచో, సాధకుని స్వభావము, స్వాస్థ్యము, అభిరుచి మున్నగువానికి అనువుగా నున్నచో వాటిని యుక్తములుగా భావింపవచ్చును.

ప్రశ్న - యోగశబ్దమునకు ఉపయోగింపబడిన 'దుఃఖహా' అను విశేషణముయొక్క ప్రత్యేకత ఏమి?

సమా - ధ్యానయోగము సిద్ధించిన పిమ్మట ధ్యానయోగికి పరమానందస్వరూపుడు, పరమశాంతికి నిధానము అయిన పరమేశ్వరుని ప్రాప్తికలుగును. ఫలితముగ దుఃఖములన్నియు సమూలముగ నశించును. పొరపాటునసైనను అతనిని జననమరణరూపసంసార దుఃఖములంటవు. స్వప్నమున నైనను చింత, శోకము, భయము, ఉద్వేగము మొదలగునవి వాని దరిదాపులకును రావు. అతడు సర్వదా, సర్వథా ఆనంద మహాసాగరమున నిమగ్నుడై యుండును. దుఃఖమును పూర్తిగా నశింపజేయు ఈ స్థితిని సూచించుటకే యోగ శబ్దమునకు 'దుఃఖహా' అను విశేషణము ప్రయోగింపబడినది.

సంబంధము - ధ్యానయోగమునకు ఉపయుక్తమగు ఆహారవిహారాది నియమములను వర్ణించిన పిదప నిర్గుణ నిరాకార పరబ్రహ్మను ధ్యానించు ధ్యానయోగియొక్క అంతిమస్థితి లక్షణములను తెలుపుచున్నాడు-

**యదా వినియతం చిత్తమ్ ఆత్మన్యేవావతిష్ఠతే ।**
**నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వినియతమ్ | = బాగుగా నిగ్రహింపబడిన | అవతిష్ఠతే | = స్థిరముగనుండునో | | రహితుడైన |
| చిత్తమ్ | = చిత్తము | తదా | = అప్పుడు | (పురుషః) | = పురుషుడు |
| యదా | = ఎప్పుడు | సర్వకామేభ్యః | = సమస్త భోగములనుండి | యుక్తః, ఇతి | = యోగయుక్తుడు అని |
| ఆత్మని, ఏవ | = పరమాత్మయందే | నిఃస్పృహః | = స్పృహా (వాంఛా) | ఉచ్యతే | = చెప్పబడును. |

చిత్తమును పూర్తిగా వశమునందుంచుకొని, దానిని పరమాత్మయందే స్థిరముగా నిల్పినప్పుడు పురుషుడు సర్వభోగములయందును స్పృహారహితుడగును. అప్పుడతడు యోగయుక్తు డనబడును. (18)

ప్రశ్న - 'చిత్తమ్' అను పదమునకు 'వినియతమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని విశేషమేమి? దానిని పరమాత్మయందు స్థిరముగా నుంచుట యనగానేమి?

సమా - చక్కగా వశమైన చిత్తమే పరమాత్మ యందు స్థిరముగా ఉండగలదు. 'వినియతం' అను విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమిదియే. ఇట్టి చిత్తమును ప్రమాదాలస్య విక్షేపములకు సర్వథా దూరమొనర్పవలెను. పరమాత్మ తప్ప మఱియే ఇతర వస్తువుయొక్క స్మృతి ఏ మాత్రము లేకుండ పరమాత్మయందే దానిని స్థిరముగా నుంచుటను చిత్తమును పరమాత్మయందు స్థిరముగా నుంచుట యగును.

ప్రశ్న - భోగములన్నింటియందును సంపూర్ణముగా స్పృహారహితుడగుట అనగానేమి?

సమా - పరమానందస్వరూపుడు, పరమశాంతి నిధానము అయిన పరమాత్మయందే ధ్యానయోగి అనన్యస్థితి కలిగి యుండును. భోగములు ఏ రీతిగానైనను ఎప్పుడైనను అవి అనిత్యములు, క్షణికములు అనగా నశించునవియే. అట్టి ఇహపర భోగములన్నింటియందును అతనికి వైరాగ్యము ఏర్పడును. ఈ కారణమువలన ప్రాపంచికములైన అన్ని వస్తువులలో ఏ వస్తువునందును ఏ మాత్రము అవసరము గాని, ఆకాంక్షగాని లేకుండుటనే భోగములన్నింటియందును సంపూర్ణముగా స్పృహారహితుడగుట అనియందురు.

ప్రశ్న - 'యుక్తః' అను పదము యొక్క అర్థమేమి?

సమా - 'యుక్తః' అను పదము ధ్యానయోగము యొక్క పూర్ణస్థితిని తెల్పును. సాధనచేయగా చేయగా యోగి యందు పైరెండు లక్షణములును (అనగా చిత్తమును పరమాత్మ యందే స్థిరముగా నుంచుట, ఇహపర భోగములన్నింటి యందును స్పృహారహితుడగుట) చక్కగా కుదురుకొనినపుడు, అతడు ధ్యానయోగముయొక్క పూర్ణస్థితికి చేరినట్లు భావింపవలెను-

సంబంధము - పూర్తిగా వశమైన చిత్తము ధ్యానకాలమునందు పరమాత్మయందే నిశ్చలముగా స్థిరముగా ఉన్న సమయమున ఆ చిత్తము యొక్క స్థితి యేమి? అను విషయము ఇచట వివరింపబడుచున్నది-

**యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| నివాతస్థః | = వాయుప్రసారములేని చోట ఉన్న | సా | = అట్టి | యుంజతః | = అనుష్ఠించుచున్న |
| దీపః | = దీపము | ఉపమా | = పోలిక (దృష్టాంతము) | యోగినః | = యోగియొక్క |
| యథా | = ఎట్లు | ఆత్మనః | = పరమేశ్వరునియొక్క | యతచిత్తస్య | = నిగ్రహింపబడిన చిత్తమునకు |
| న, ఇంగతే | = చలింపక యుండునో | యోగమ్ | = ధ్యానయోగమును | స్మృతా | = భావింపబడినది. |

వాయుప్రసారములేనిచోట నిశ్చలముగానుండు దీపమువలె యోగికి వశమైయున్న చిత్తము పరమాత్మధ్యానమున నిమగ్నమైయున్నప్పుడు నిర్వికారముగా నిశ్చలముగా నుండును. (19)

ప్రశ్న - దీపము అను శబ్దమునకు అర్థమేమి ? జయింపబడిన చిత్తమును నిశ్చలముగా నుండు పర్వతాదులతో పోల్చక దీపముతో పోల్చుటకు కారణమేమి?

సమా - ఇచట దీప శబ్దమునకు ప్రకాశించుచున్న దీపశిఖయని యర్థము. పర్వతాదులు ప్రకాశించులక్షణము లేనివి. సహజముగనే అచలములు. కావున చలనశీలమైన చిత్తమును వాటితో పోల్చుట సరికాదు. దీపశిఖ చిత్తమువలె ప్రకాశించు లక్షణము గలది, చంచలమైనది. కావున చక్కని

సామ్యమున్న దీపముతో చిత్తము పోల్చబడినది. వాయుప్రసారము లేనప్పుడు దీపశిఖ చలింపనట్లే జయింపబడిన చిత్తము ధ్యానకాలమునందు అన్ని విధముల సురక్షితమై ఏ మాత్రమును చలింపదు (అనగా వికారములకు లోనుగాదు). అది నిశ్చల దీపశిఖవలె సమస్థితితో ఒప్పుచుండును. అందువలన ప్రకాశించు లక్షణములేని పర్వతాది - అచల పదార్థములతో పోల్చక చిత్తమును దీపశిఖతో పోల్చుటయే సముచితము.

ప్రశ్న - 'చిత్తస్య' అను పదమునకు యత అను విశేషణమును చేర్చి 'యతచిత్తస్య' అని ప్రయోగించుటలోని ప్రత్యేకతయేమి?

సమా - జయింపబడిన చిత్తమే పరమాత్మయందు స్థిరముగా ఉండగలదు. జయింపబడని (వశమున నుండని) చిత్తము స్థిరముగ ఉండజాలదు. ఈ విషయమును నొక్కి చెప్పుటకే 'యతచిత్తస్య' అని ప్రయోగించుట జరిగినది.

*సంబంధము - ధ్యానయోగముయొక్క పూర్ణస్థితిని పొందిన పురుషుని గూర్చియు, అతనికి వశమైయున్న చిత్తస్థితిని గూర్చియు వర్ణించిన పిదప మూడు (3) శ్లోకములలో ధ్యానయోగము ద్వారా సచ్చిదానందపరమాత్మను పొందిన పురుషుని స్థితిని గూర్చి వివరించుచున్నాడు-*

**యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।**
**యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ 20 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యోగసేవయా | = ధ్యానయోగసాధనచే | యత్ర | = ఏ స్థితియందు (పరమాత్మను ధ్యానించుటవలన పవిత్రమైన) | పశ్యన్ | = (యోగి) చూచుచు (సాక్షాత్కారింపజేసికొనుచు) |
| నిరుద్ధమ్ | = నిగ్రహింపబడిన | | | | |
| చిత్తమ్ | = చిత్తము | | | | |
| యత్ర | = ఏ స్థితియందు | | | ఆత్మని, ఏవ | = ఆ సచ్చిదానంద ఘనపరమాత్మయందే |
| ఉపరమతే | = ఉపరతిని పొందునో | ఆత్మనా | = సూక్ష్మబుద్ధిద్వారా | | |
| చ | = మఱియు | ఆత్మానమ్ | = పరమాత్మను | తుష్యతి | = సంతుష్టుడగునో. |

**ధ్యానయోగసాధనచే నిగ్రహింపబడిన చిత్తము ఉపరతిని పొంది, పరమాత్మను ధ్యానించుట ద్వారా పవిత్రమైన సూక్ష్మబుద్ధితో, ఆ భగవానుని సాక్షాత్కారింపజేసికొని, యోగి ఆ సచ్చిదానందఘనపరమాత్మయందే సంతుష్టుడగుచున్నాడు. (20)**

ప్రశ్న - యోగసేవ అనగానేమి? ఆ యోగ సేవ వలన చిత్తమును నిగ్రహించుట (నిరుద్ధ చిత్తమ్) అనగానేమి?

సమా - యోగసేవ అనగా ధ్యానయోగసాధన. ధ్యానయోగ సాధన చేయగా చేయగా చిత్తము పరమాత్మునియందే ఏకాగ్రతతో స్థిరముగా నుండును. దానినే 'నిరుద్ధ చిత్తమ్' అనియుందురు.

ప్రశ్న - ఈ నిరుద్ధచిత్తము ఉపరతిని పొందుట యనగానేమి?

సమా - పరమాత్ముని యందు యోగి చిత్తము సంపూర్ణముగా స్థిరమై యున్నప్పుడు అది (ఆచిత్తము) సాంసారికవిషయముల నుండి పూర్తిగా ఉపరతిని పొందును. (ప్రాపంచిక విషయముల నుండి దూరమగును). యోగి అంతఃకరణము నందు ప్రాపంచిక విషయములకు ఎట్టి తావు ఉండదు. లోకదృష్టిలో అతని (యోగి) చిత్తము సమాధి సమయమున ప్రాపంచిక విషయములకు దూరముగా నున్నట్లును, లౌకిక వ్యవహార జీవితమున ప్రాపంచిక విషయములతో సంబంధము కలిగియున్నట్లుగా కనిపించుచున్నప్పటికిని వాస్తవముగా అతనికి ప్రాపంచిక విషయములతో ఎట్టి సంబంధము ఉండదు. నిరుద్ధచిత్తము ఉపరతిని పొందుట యనగా ఈ స్థితియే.

ప్రశ్న - 'యత్ర' అనగానేమి?

సమా - ధ్యానయోగసాధకుడు పరమాత్మయందే నిమగ్నుడై యున్నప్పుడు అనగా పరమాత్మ సాక్షాత్కారమును పొందినప్పుడు ప్రాపంచిక విషయములతో అతనికి

సంబంధము పూర్తిగా తెగిపోవును. ఈ స్థితినే భగవంతుడు 23వ శ్లోకమున (6/23) యోగ శబ్దముతో పేర్కొనెను. ఇచట 'యత్ర' అను పదము ఈ స్థితినే తెలుపును.

ప్రశ్న - 'ఏవ' అను ప్రయోగము యొక్క ప్రాముఖ్యమేమి?

సమా - పరమాత్మ సాక్షాత్కారము వలన కలిగిన ఆనందము తప్ప ఇతర సాంసారిక సంతోషహేతువులను నిరాకరించుటకే 'ఏవ' అను ప్రయోగము చేయుబడినది. పరమానంద స్వరూపుడు, పరమశాంతి నిధానము అయిన పరమాత్ముని సాక్షాత్కారమైన పిమ్మట యోగి సర్వదా ఆ ఆనందమునందే సంతుష్టుడైయుండును. ఆతనికి తదితర సాంసారిక సుఖముల స్పృహయే ఏ మాత్రము ఉండదు.

ప్రశ్న - పరమాత్మ సాక్షాత్కారమును కల్గించు ధ్యానయోగ సాధనమును ఎట్లు చేయవలెను?

సమా - ఏకాంతప్రదేశమున స్థిరముగ ఆసనముపై కూర్చుండి, మనస్సంకల్పములను పూర్తిగా త్యజించి, పరమాత్మను క్రింద తెల్పిన రీతిగా ధ్యానింపవలెను.

విజ్ఞానానంద ఘనపూర్ణబ్రహ్మ, పరమాత్మయే నిత్యసత్య స్వరూపుడు. పరిపూర్ణుడు. అతడు జ్ఞానస్వరూపుడు. అతడు సనాతనుడు. నిర్వికారుడు. దేశకాలాది పరిమితులకు అతీతుడు, సర్వవ్యాపి, అనంతుడు, చైతన్య స్వరూపుడు, నిరాకారుడు, దోషరహితుడు. మనోబుద్ధ్యహంకారములు, ద్రష్ట, దర్శనము, దృశ్యము మొదలగునవి యన్నియును ఆ పరబ్రహ్మమునందే ఆరోపితములు, వస్తుతః అవి బ్రహ్మస్వరూపములే. అతడు ఆనందమయుడు. వర్ణనాతీతుడు, ఆయన స్వరూపము కూడ ఆనందమయమే. అతని ఆనందస్వరూపము పరిపూర్ణము, నిత్యము, సనాతనము, జనన మరణరహితము, పరమము, చరమము, సత్యము, చేతనము, విజ్ఞానమయము, కూటస్థము, అచలము, ధ్రువము, అనామయము, బోధమయము, అనంతము, శాంతము, ఈ విధముగ ఆనందస్వరూపమును చింతన చేయుచు దీనికి అతిరిక్తముగా సర్వోన్నతమైనది మరియొకటి లేదని అనుక్షణము దృఢనిశ్చయముతో ఉండవలెను. మనస్సున కలిగిన ప్రతిసంకల్పమును ఆనంద స్వరూపుని వలననే కలిగినదనియు, అదియును ఆనందమయమే యనియు భావించి, కడకు ఆనంద స్వరూపమునందే లీనమొనర్ప వలెను. ఈ విధముగ భావించుట వలన సంకల్పము లన్నియును ఆ ఆనందస్వరూపునియందు విలీనమగును. ఆ ఆనంద ఘనపరమాత్మకు తప్ప మఱి యే ఇతర సంకల్పములకును అస్తిత్వమే లేనందున సాధకునకు ఆనంద స్వరూపుడైన పరమాత్మయందే నిశ్చల స్థితి యేర్పడును. ఈ విధముగ నిత్యము నియమప్రకారము ధ్యానసాధనచేయుగా చేయుగా తనయొక్క, ప్రపంచము యొక్క ఉనికి అభిన్నమైనప్పుడును, సర్వము పరమానంద పరమశాంతి స్వరూపుడైన బ్రహ్మయే యైనప్పుడు సాధకునకు పరమాత్మ సాక్షాత్కారము వాస్తవముగ, సహజముగ జరుగును.

సుఖమాత్యంతికం యత్తత్ బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ 21 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| అతీంద్రియమ్ = | ఇంద్రియగోచరము కానిదియు | యత్, సుఖమ్ = | ఏ బ్రహ్మానందము కలదో | (యత్ర) స్థితః= | దేనియందు స్థితుడైన |
| బుద్ధిగ్రాహ్యమ్ = | పవిత్రమైన సూక్ష్మ బుద్ధి ద్వారా మాత్రమే గహింపదగినదియు | తత్ = | దానిని (ఆ బ్రహ్మానందమును) | అయమ్ = | ఈ యోగి |
| | | యత్ర = | ఏ స్థితియందు | తత్త్వతః = | పరమాత్మ స్వరూపము నుండి |
| | | వేత్తి = | అనుభవించునో | న, ఏవ, చలతి = | ఎన్నడునూ విచలితుడుకాడో |
| ఆత్యంతికమ్ = | నిరవధికమైన | చ = | మఱియు | | |

బ్రహ్మానందానుభవము ఇంద్రియాతీతమైనది. పవిత్రమైన సూక్ష్మబుద్ధిద్వారా మాత్రమే గ్రాహ్యమైనది. ఆ బ్రహ్మానందమును అనుభవించుచు దానియందే స్థితుడైయున్న యోగి పరమాత్మ స్వరూపమునుండి ఏమాత్రమూ విచలితుడు కానేకాడు. **(21)**

ప్రశ్న - సుఖమ్ అను విశేష్యమునకు **'ఆత్యంతికమ్' 'అతీంద్రియమ్' 'బుద్ధిగ్రాహ్యమ్'** అను విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - **18**వ అధ్యాయమునందు **36**వ శ్లోకము నుండి **39**వ శ్లోకము వఱకును సాత్త్విక, రాజస, తామస సుఖములను గూర్చి వర్ణించుట జరిగినది. కాని పరమాత్మ స్వరూపసుఖము అత్యంత విలక్షణమైనది. అది ప్రాపంచిక సుఖములవలె క్షణికము, నశ్వరము, దుఃఖహేతువు, దుఃఖమిశ్రితము కాదు. ఈ సుఖము సాత్త్వికసుఖముకంటెను అత్యంతము ఉత్కృష్టమైనది, విలక్షణమైనది. ఇది నిత్యము. పరివర్తనశీలము కానిది. ఏలనన అది పరమాత్మ స్వరూపమే. దానికంటె వేఱైనది కాదు. ఆత్యంతికము ఈ భావమునే విశదపఱచును.

ఈ బ్రహ్మానందానుభవము విషయ జనిత రాజస సుఖమువలె ఇంద్రియములద్వారా భోగ్యమైనది కాదు. అట్టి ఇంద్రియాతీత పరబ్రహ్మ పరమాత్మానుభవ సుఖమునే **'అతీంద్రియమ్'** అని పేర్కొనుట జరిగినది. అందువలన ఇచట అతీంద్రియము అను విశేషణము ప్రయుక్తమైనది.

ఈ సుఖము స్వయముగా జ్ఞానస్వరూపమైనది, నిత్యమైనది, మాయాతీతమైనది. కావున ఇది బుద్ధికి గోచరము కాదు. అయినప్పటికిని నిర్మలమైన స్వచ్ఛమైన అద్దమునందు ఆకాశము ప్రతిబింబించునట్లు భజన ధ్యానముల చేతను, వివేక వైరాగ్యాదుల వలనను నిశ్చలము, సూక్ష్మము, పవిత్రము అయిన బుద్ధియందు ఈ సుఖము ప్రతిఫలించును. కావున ఈ సుఖము **'బుద్ధిగ్రాహ్యమ్'** అని పేర్కొనబడినది.

పరమాత్మధ్యానమువలన కలుగు సాత్త్వికసుఖము గూడ ఇంద్రియాతీతము, బుద్ధిగ్రాహ్యము, అక్షయ సుఖమునకు హేతువు అగుటవలన ఇతర ప్రాపంచిక సుఖములకంటెను అత్యంత విలక్షణమైనది. కాని అది కేవలము ధ్యానకాలమునందే నిలుచును. సంతత ధారాలక్షణము కలిగియుండదు. అది చిత్తము యొక్క ఒకానొక స్థితి. కనుక దానిని **ఆత్యంతికమ్**, అక్షయ సుఖము అని చెప్పుటకు వీలులేదు. పరమాత్మ స్వరూపసుఖము ఈ ధ్యానజనిత సుఖము యొక్క ఫలము. కావున అది అత్యంత విలక్షణమైనది. సాత్త్విక సుఖమువలె ఈ సుఖము అనుభవమునకు వచ్చునది కాదని ఈ మూడు విశేషణముల ప్రయోగమువలన స్పష్టపఱచబడినది.

ధ్యాత, ధ్యానము, ధ్యేయము - ఈ మూడింటికిని ఏకత్వస్థితి ఏర్పడినప్పుడు ఈ పరమాత్మ స్వరూపసుఖము తనంతటతానే అనుభవములోనికి వచ్చును.

ప్రశ్న - తత్త్వమునుండి (పరమాత్మ నుండి) చలింపకుండుట యనగానేమి? 'ఏవ' అను ప్రయోగము యొక్క ప్రత్యేకత యేమి?

సమా - తత్త్వమనగా పరమాత్మ స్వరూపము. దానినుండి ఎప్పుడును వేఱుకాకుండుటయే చలింపకుండుట యగును. పరమాత్మ సాక్షాత్కారమైన పిదప యోగి దానియందే స్థిరముగా ఉండును. అతడు మఱల ఎప్పుడును ఏ స్థితియందును, ఏ కారణము వలననైనను పరమాత్మ నుండి వేఱుకాడు. 'ఏవ' అను అవ్యయ ప్రయోగము ఈ విషయమునే స్పష్టపఱచును.

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥ 22 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యమ్, లాభమ్ = | ఏ ప్రయోజనమును | న, మన్యతే = | విశ్వసింపడో | స్థితః = | స్థితుడైయుండు యోగి |
| లబ్ధ్వా = | పొంది | చ = | మఱియు | గురుణా, దుఃఖేన, = | తీవ్రమైన దుఃఖము |
| తతః, అధికమ్ = | దానికంటె అధికముగా | యస్మిన్ = | పరమాత్మప్రాప్తి రూప | అపి | వలనకూడ |
| అపరమ్ = | మఱియొకదానిని | | మైన ఏ అవస్థయందు | న, విచాల్యతే = | చలింపబడడో. |

పరమాత్మప్రాప్తిరూపలాభమును పొందినవాడు(అనగా భగవత్సాక్షాత్కారమును పొందినవాడు) మఱేయితర లాభమునుగూడ దానికంటె అధికమైన దానినిగా తలంపడు. బ్రహ్మానందానుభవస్థితిలో నున్న యోగిని ఎట్టి బలవద్దుఃఖములును చలింపజేయజాలవు. **(22)**

ప్రశ్న - 'యమ్' అను పదముయొక్క అర్థమేమి? దానిని పొందిన పిదప యోగి మఱియే యితర లాభమును దానికంటె అధికమైన దానినిగా తలంపడు-అవి అనుటలోని విశేషమేమి?

సమా - 'యమ్' అనగా భగవత్సాక్షాత్కారరూప పరమానందస్థితి. రాబోవు శ్లోకములో చెప్పబడిన రీతిగా అది దుఃఖరూప సంసారబంధములనుండి విముక్తిని కలిగించును. ఈ స్థితియందు యోగి పరమానందస్వరూపుడును పరమశాంతికి నిధానమును అయిన పరమాత్మని పొందుట వలన అతడు పూర్ణకాముడు అగును. అతని దృష్టిలో ఇహపరలోక భోగములు, త్రిలోకాధిపత్యము, సంపదలు, అత్యధిక కీర్తిప్రతిష్ఠలు మొదలగు ప్రాపంచిక సుఖములన్నియును క్షణభంగురములు, అనిత్యములు, హేయములు, తుచ్ఛములు, రసహీనములు, గణింపదగనివి (ఉపేక్షింపదగినవి). కావున ఎట్టి ప్రాపంచిక వస్తువునుగూడ ప్రాప్యముగా భావింపడు. అట్టి స్థితిలో వాటినతడు అధికమైన వానినిగా భావించు ప్రసక్తి ఎక్కడ?

ప్రశ్న - బలవద్దుఃఖములు అతనిని చలింపజేయజాలవు-అనగా నేమి?

సమా - పరమాత్మప్రాప్తిని పొందిన యోగికి అత్యధిక భోగైశ్వర్యములును రసహీనములుగా, తుచ్ఛములుగా గోచరించును. వాటిని పొందుటకై అతడు ఏ మాత్రమును ప్రాకులాడడు. అవి ప్రాప్తింపకున్నను, నష్టమైనను నిఃస్పృహ చెందడు. తన స్థితినుండి ఏమాత్రమును చలింపడు. అట్లే బలవద్దుఃఖములు ప్రాప్తించినను అతడు చలింపనే చలింపడు. ధైర్యశాలి, సహనశీలి అయిన సామాన్య మానవుడుగూడ లోకసాధారణ దుఃఖములను సహింపగలడు. మఱియోగివిషయమున దానిని గూర్చి చెప్పనవసరమే లేదు. ఈ పరమానందస్థితిని పొందినయోగికి అత్యంత భయానకములైన భరింపరాని దుఃఖములు తటస్థించినను అతడు ఆస్థితియందే నిశ్చలముగా నుండును. ఈ భావమును స్పష్టపఱచుటకే 'దుఃఖేన' అను పదమునకు 'గురుణా' అను విశేషణము 'అపి' అను అవ్యయము ప్రయోగింపబడినవి. శస్త్రముల వలన కలుగు గాయములు, దుస్సహమైన శీతవాతాతపాదులవలనను, పిడుగులవలనను కలుగు శారీరక బాధలు, దుర్భరములైన రోగవ్యథలు, మిక్కిలి ఇష్టములైన వస్తువుల హఠాద్వియోగములు, అకారణముగా ఎదురగు అవమానములు, తిరస్కారములు, నిందలు మొదలగు దుఃఖకారణ పరిస్థితులన్నియును ఒక్కుమ్మడిగా వచ్చి మీద పడినను అతనిని వానిస్థితినుండి ఏ మాత్రము గూడ చలింపజేయజాలవు. ఏలనన పరమాత్మ సాక్షాత్కారమైన పిదప వాస్తవముగా ఆ యోగికి ఈ శరీరముతో ఎట్టి సంబంధమూ ఉండదు. కేవలము లోకదృష్టిలో మాత్రమే ఆ శరీరము అతనిదిగా కన్పట్టుచుండును. ప్రారబ్ధానుసారము అతని శరీరేంద్రియ మనస్సులకు ప్రాపంచిక వస్తువులతో సంయోగ వియోగములు కలుగుచుండును. శీతోష్ణములు, మానావమానములు, స్తుతినిందలు అనుకూల ప్రతికూల భోగవస్తువుల ప్రాప్తి, లాభనష్టములు మొదలగునవి కలుగవచ్చును. కాని అతడు సుఖదుఃఖముల భోక్తగానందున అతని అంతఃకరణమునందు ఎట్టి పరిస్థితిలోను ఏ నిమిత్తముగా నైనను ఏ విధముగను, ఏ మాత్రమును వికారములు కలుగనే కలుగవు. అతనికి పరమాత్మయందు నిత్యనిశ్చలస్థితి యథాతథముగనే ఉండును.

*సంబంధము - 20, 21, 22 శ్లోకములలో పరమాత్మ ప్రాప్తిరూపస్థితియొక్క మహత్త్వము, లక్షణములు వర్ణింపబడినవి. ఆ స్థితిని యోగము అని తెల్పుచు, దానిని పొందుటకై ప్రేరణను కల్గించుచున్నాడు-*

**తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।**
**స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥ 23 ॥**

దుఃఖసంయోగ-వియోగమ్ = దుఃఖరూప సంసార బంధములనుండి విముక్తిని కలిగించు
తమ్ = అట్టి స్థితిని
యోగసంజ్ఞితమ్ = యోగమను పేరుతో
విద్యాత్ = ఎఱుంగవలెను
సః, యోగః = ఆ యోగము
అనిర్విణ్ణచేతసా = విసుగులేని చిత్తముతో (ధైర్యోత్సాహములతో)
నిశ్చయేన = నిశ్చయముగా
యోక్తవ్యః = సాధన చేయదగినది.

**దుఃఖరూపసంసారబంధములనుండి విముక్తిని కలిగించు ఈ స్థితిని (భగవత్సాక్షాత్కార రూపస్థితిని) యోగము అని తెలియవలెను. అట్టి యోగమును దృఢమైన, ఉత్సాహపూరితమైన అనిర్విణ్ణ (విసుగులేని) చిత్తముతో నిశ్చయముగా సాధన చేయవలెను. (23)**

ప్రశ్న - దుఃఖరూప సంసారబంధముల నుండి విముక్తస్థితి యనగానేమి? ఆ స్థితిని పొందినయోగి ఆ పిమ్మట గూడ ఎల్లప్పుడు ధ్యానావస్థలోనే స్థిరముగా ఉండునా? ఆ దశ (స్థితి)లో అతని శరీరేంద్రియ - అంతఃకరణముల ద్వారా ప్రాపంచిక కార్యములు జరుగుచుండవా?

సమా - దుఃఖరూప సంసారబంధముల నుండి శాశ్వతముగ సంబంధవిచ్ఛేదము జరుగుటయే సంసారబంధ విముక్తి అనబడును. ఆ స్థితియందు యోగియొక్క శరీరేంద్రియ మనస్సుల ద్వారా నడచుట, తిరుగుట, చూచుట, వినుట, చింతనచేయుట, నిశ్చయించుట మున్నగు కార్యములు జరుగవని చెప్పజాలము. ఈ పనులన్నియును ప్రారబ్ధము ననుసరించి జరుగవచ్చును. కాని అతని అంతఃకరణమున పరమాత్మ జ్ఞానము తప్ప మఱియేమియు ఉండదు గావున అతనికి ఆ కర్మలతో వాస్తవముగ ఎట్టి సంబంధము ఉండదు. అతని ఈ స్థితి ధ్యాన కాలమునందును, వ్యుత్థాన (వ్యవహార) కాలమునందును, ఒకే విధముగా ఉండును.

ప్రశ్న - కేవలమ్ 'దుఃఖవియోగమ్' అనిన చాలుగదా! 'దుఃఖసంయోగవియోగమ్' అనుచు సంయోగశబ్దమును అదనముగా ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ద్రష్ట (చూచువాడు) మఱియు దృశ్యముల (చూడబడునది) సంయోగము అనగా ఆత్మ, దృశ్య ప్రపంచము యొక్క అజ్ఞాన జనితమైన అనాది సంబంధమే జననమరణచక్రరూప దుఃఖములు ప్రాప్తించుటకు మూలకారణము. ఈ అనాది సంబంధము అంతరించుటతో దుఃఖములు కూడ శాశ్వతముగా తొలగిపోవును. ఈ విషయమును స్పష్టపఱచుటకే సంయోగ శబ్దము ప్రయోగింపబడినది.

పాతంజలియోగ దర్శనమున చెప్పబడిన విషయములు- 'హేయం దుఃఖమనాగతమ్' (2/16) భవిష్యత్తులో ప్రాప్తించు జనన మరణరూప మహాదుఃఖమును 'హేయ'మని అందురు. 'ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః' (2/17). ద్రష్ట మఱియు దృశ్యముల సంయోగమే హేయమునకు కారణము. 'తస్య హేతురవిద్యా' (2/24). అట్టి సంయోగమునకు కారణము అజ్ఞానము. 'తదభావాత్ సంయోగాభావో హానమ్ తద్దృశేః కైవల్యమ్' (2/25). ఈ అజ్ఞానము తొలగినంతనే ద్రష్ట మరియు దృశ్యముల సంయోగము కూడ అంతరించును. దానినే (హేయము తొలగిపోవుటనే) 'హానమ్' అనియందురు. అదియే ద్రష్ట యొక్క కైవల్యరూప స్థితి.

ప్రశ్న - 'తమ్' అను సర్వనామమునకు 'యోగ సంజ్ఞితమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - ఇంతకుముందు చెప్పబడిన మూడు (3) శ్లోకములలో పరమాత్మ ప్రాప్తి రూప స్థితియొక్క మహత్త్వము, లక్షణములు వర్ణింపబడినవి. దాని పేరే యోగము - ఈ విషయమును తెలుపుటకే 'తమ్' అను సర్వనామమునకు యోగసంజ్ఞితమ్ అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'విద్యాత్' అనగానేమి?

సమా - 'యత్రోపరమతే చిత్తమ్' (6/20) నుండి ఇప్పటి వఱకు వర్ణింపబడిన స్థితిని పొందుటకై సిద్ధులైన మహాత్ముల కడకు వెళ్ళి, శాస్త్రములను అభ్యసించి, దాని స్వరూపమహత్త్వములను, సాధన విధానమును ఆమూలాగ్రముగా తెలిసికొనవలెను. ఈ విషయమును స్పష్టపఱచుటకే 'విద్యాత్' అను ప్రయోగము చేయబడినది.

ప్రశ్న - 'అనిర్విణ్ణచేతసా' అనగానేమి?

సమా - సాధన ఫలము శీఘ్రముగా వెంటనే సిద్ధింపనిచో కొంతసాధన చేసిన పిదప మనస్సు నిస్పృహకు గుఱి యగుచుండుట సహజము. అట్టి స్థితియందు సాధకుడు- ఈ పని యెప్పటికి పూర్తియగును? నాకిది సాధ్యమేనా? అను ఊగిసలాటలో పడును. దీనినే 'నిర్విణ్ణత' అనియందురు. ఇట్టిస్థితిని అధిగమించి పురోగమించు ధైర్యోత్సాహయుక్తమైన చిత్తమునే 'అనిర్విణ్ణ చిత్తము' అనియందురు. కనుక సాధకుడు తన చిత్తమునుండి నిర్విణ్ణతా దోషమును సర్వదా దూరము చేయవలెను. యోగసాధనయందు విముఖతను కలిగించునట్టి,

ధైర్యోత్సాహములను తగ్గించునట్టి భావములను తన చిత్తమునకు రానియ్యనేరాదు. అట్టి 'అనిర్విణ్ణ' చిత్తముతోనే యోగసాధన చేయవలెను.

ప్రశ్న - దృఢ నిశ్చయముతో యోగసాధన చేయుటయే కర్తవ్యము - అని అనుటలోని అంతర్యమేమి?

సమా - నిశ్చయశబ్దము శ్రద్ధా, విశ్వాసములను తెల్పును. యోగసాధనయందును, దాని విధానము తెల్పు శాస్త్రముల యందును, ఆచార్యుల యందును, యోగసాధన ఫలసిద్ధి యందును సంపూర్ణముగ శ్రద్ధా విశ్వాసములను కలిగి యుండవలెను. యోగసాధనను తన జీవిత ముఖ్యకర్తవ్యముగా భావించి, పరమాత్మప్రాప్తి రూపమైన యోగసిద్ధినే ధ్యేయముగా చేసికొని, దృఢముగా తత్పరత్వముతో తత్సాధనయందు నిమగ్నము కావలెను.

**సంబంధము** - *పరమాత్మప్రాప్తి కలిగిన సాధకుని స్థితి యోగము అని చెప్పబడినది. దానిని పొందుటయే నిశ్చిత కర్తవ్యము - అనియు తెల్పబడినది. ఆ స్థితిని పొందుటకు అభేదరూపమున పరమాత్మయొక్క ధ్యానయోగసాధనరీతిని రాబోవు రెండు శ్లోకములలో వివరించుచున్నాడు-*

**సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।**
**మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ 24 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంకల్ప ప్రభవాన్ | = సంకల్పములనుండి ఉత్పన్నములగు | త్యక్త్వా | = త్యజించి | సమంతతః, ఏవ | = అన్నివైపుల నుండియు |
| సర్వాన్, కామాన్ | = కోరికలనన్నింటిని | మనసా | = మనస్సుద్వారా | వినియమ్య | = చక్కగా (పూర్తిగా) నిగ్రహించి |
| అశేషతః | = నిశ్శేషముగా | ఇంద్రియ-గ్రామమ్ | = ఇంద్రియ సముదాయమును | | |

**సంకల్పములవలనకలిగిన కోరికలనన్నింటిని నిశ్శేషముగా త్యజించి, ఇంద్రియ సముదాయములను అన్నివిధములుగ మనస్సుతో పూర్తిగా నిగ్రహింపవలెను. (24)**

ప్రశ్న - ఇచట కోరికలు సంకల్పముల వలన కలుగునని చెప్పబడినది. 2వ అధ్యాయమునందలి 62వ శ్లోకమున కోరికలు ఆసక్తి కారణముగ ఉత్పన్నములగునని చెప్పుట జరిగినది. ఈ భేదమెందులకు?

సమా - అచట (ఆ 2వ అధ్యాయమున) సంకల్పముల నుండి ఆసక్తి, ఆ ఆసక్తి వలన కోరికలు జనించునని చెప్పబడినది. కావున కోరకలకు మూలములు సంకల్పములే. కావున అచ్చటను ఇచ్చటను కోరికలకు మూలములు సంకల్పములేయని చెప్పినట్లు భావింపవలెను. కనుక ఉభయత్ర చెప్పిన విషయములో ఎట్టి భేదమును లేదు.

ప్రశ్న - కోరికలన్నియు అనగానేమి? వాటిని నిశ్శేషముగ త్యజించుట యనగానేమి?

సమా - ఇహ పరలోకములకు సంబంధించిన కోరికలు పెక్కు గలవు. అవియును పెక్కు విధములుగా కలవు. వానిలో కొన్ని తీవ్రమైనవి. కొన్ని మధ్యస్థములైనవి. కొన్ని సామాన్యములైనవి. ఈ అన్ని విధములైన కోరికలను కలిపి 'సర్వాన్ కామాన్' అని చెప్పుట జరిగినది. స్పృహ, ఇచ్ఛ, తృష్ణ, ఆశ, వాసన మొదలగు మనోరథ లక్షణములలో వివిధములగు కోరికలన్నియును అంతర్గతములే. కోరికలు సంకల్పముల నుండి ఉత్పన్నములగునని చెప్పబడినది. కావున ఆసక్తియు ఇందులో అంతర్భాగమే.

ఎట్టి భోగవస్తువులయందైనను ఏ విధమైన వాసన, ఆసక్తి, స్పృహ, ఇచ్ఛ, లాలస, ఆశ, తృష్ణ మొదలగునవి ఏ మాత్రము లేకుండుటయే కోరికలను అన్నింటిని నిశ్శేషముగ త్యజించుట అనబడును. గిన్నెలో నుండి నేతిని తీసిన పిమ్మట గూడ ఆ నేతి జిడ్డు ఆ గిన్నెలో అంటుకొని యుండనేయుండును. డబ్బాలలో నుండి కర్పూరమును, కేసరిని, కస్తూరిని తీసినప్పటికిని వాటి వాసనలు ఆ డబ్బాలలో అంతో ఇంతో మిగిలియే యుండును. అట్లే కోరికలను త్యజించిననూ, వాటి వాసన కొంచెమైననూ మిగిలియే యుండును. కావున ఏ

మాత్రమూ కోరికల వాసనలే లేకుండ వాటిని త్యజించుటను కోరికలను నిశ్శేషముగ త్యజించుట యగును.

ప్రశ్న - మనస్సుతో ఇంద్రియములను నిగ్రహించుట యనగానేమి?

సమా - విషయముల యందు ఆసక్తములగుచుండుట ఇంద్రియములకు సహజ లక్షణము. మనస్సుయొక్క ప్రమేయము ఉన్నప్పుడే ఇంద్రియములన్నియును తమ తమ విషయముల యందు (ఇంద్రియార్థములయందు) ప్రవర్తింప గల్గుచుండును. మనస్సు దుర్బలముగా నున్నచో అవి దానిని బలముగా తమతో లాగుకొనిపోవును. కాని నిర్మలమైన నిశ్చయాత్మకమైన బుద్ధిబలముతో మనస్సు దృఢముగా పరమాత్మయందు ఏకాగ్రతతో నిల్చియున్నప్పుడు మనస్సుయొక్క సహకారము ఆగిపోయినందున, ఈ ఇంద్రియములు విషయాసక్తములగుటకు సమర్థములు కానేరవు. కావున 11వ శ్లోకము నుండి 13వ శ్లోకము వఱకును చెప్పబడిన రీతిగా ధ్యానయోగసాధనకై ఆసనముపై స్థిరముగా కూర్చొని యోగి తన వివేక వైరాగ్య ప్రభావములచే మనస్సు ద్వారా ఇంద్రియముల నన్నింటిని వాటి బాహ్య విషయముల నుండి పూర్తిగా తొలగింపవలెను. ఏ ఇంద్రియమును ఏ విషయము నందును కొంచెముగా గూడ ఆసక్తము కాకుండునట్లుగా చేసి వాటిని అన్నింటిని అంతర్ముఖములుగా చేయవలెను. మనస్సు ద్వారా ఇంద్రియములను నిగ్రహించుట యనగా నిదియే.

**శనైః శనైరుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ 25 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శనైః, శనైః | = క్రమక్రమముగా (అభ్యసించుచు) | బుద్ధ్యా | = బుద్ధిద్వారా | కించిత్, అపి | = పరమాత్మను తప్ప మఱిదేనిని కూడ |
| ఉపరమేత్ | = ఉపరతిని పొందవలెను | మనః | = మనస్సును | | |
| ధృతిగృహీతయా | = ధైర్యయుక్తమైన | ఆత్మసంస్థమ్, కృత్వా | = పరమాత్మయందు స్థిరమొనర్చి | న, చింతయేత్ | = స్మరింపరాదు. |

**క్రమక్రమముగా సాధనచేయుచు ఉపరతిని పొందవలెను. ధైర్యముతో బుద్ధిబలముతో మనస్సును పరమాత్మ యందు స్థిరమొనర్చి, పరమాత్మనుతప్ప మఱి ఏ ఇతర విషయమును ఏ మాత్రమూ చింతనచేయరాదు. (25)**

ప్రశ్న - క్రమక్రమముగా సాధన ద్వారా ఉపరతిని పొందుట యనగానేమి? ధైర్యముగా బుద్ధి ద్వారా మనస్సును పరమాత్మయందు స్థిరపఱచుట యనగానేమి?

సమా - పూర్వశ్లోకమునందు మనస్సు ద్వారా ఇంద్రియములను బాహ్య విషయముల నుండి సర్వదా తొలగింపవలెనని చెప్పబడినది. కాని మనస్సు విషయ చింతన చేయుచున్నంత వఱకును అది పరమాత్మ యందు పూర్తిగా ఏకాగ్రతను కలిగియుండజాలదు, సరికదా ఇంద్రియములను విషయముల నుండి గూడ పూర్తిగా మఱలింపజాలదు. విషయ చింతన చేయుచుండుట మనస్సునకు అనాదికాలమునుండియు సంక్రమించిన లక్షణము. మనస్సునకు చిరకాలమునుండియు సంక్రమించిన ఈ విషయచింతన నుండి దానిని మఱల్చి పరమాత్మ యందు లగ్నము చేయవలయును. మనస్సు ఒక వస్తువునందు లగ్నమై యుండుటకు అలవాటుపడిన పిమ్మట అది దాని స్వరూపమును పొందును. సహజముగనే దానినుండి అది (మనస్సు) వైదొలగుటకు సిద్ధపడదు. మనస్సును విషయ చింతనము నుండి మఱల్చుటకు ఉపయోగపడు ఉపాయములు అంతకుముందు అలవడిన పూర్వాభ్యాసములకు విరుద్ధముగా క్రొత్త అభ్యాసమును తీవ్రముగా చేయవలెను. ఎట్టి పరిస్థితియందును ఏమాత్రమూ నిస్స్పృహకు గురికాకుండ లక్ష్యముపై దృఢ నిశ్చయముతో ధైర్యము కలిగియుండునట్టి బుద్ధి ద్వారా దానిని (ఆ మనస్సును) నయాన భయాన నచ్చజెప్పి నిగ్రహించి, నూతనాభ్యాసముపై లగ్నమగునట్లు చూడవలెను. ధైర్యము సడలినను, మార్పుకై తొందరపడినను ఫలితము ఉండదు.

బుద్ధి దృఢముగా ఉండి అభ్యాసము కొనసాగుచూ ఉన్నచో అచిరకాలములోనే మనస్సు పూర్వము అలవడిన విషయముల నుండి వైదొలగి తద్విషయాకారములను దాల్చును. కాని ప్రాత వాసనలను వెంటనే వీడుట మనస్సునకు అంత సులభ సాధ్యము కాని పని. కావుననే విషయచింతన నుండి క్రమక్రమముగ ఉపరతిని పొంది, దృఢమైన బుద్ధి ద్వారా మనస్సును పరమాత్మ యందే స్థిరముగా నుంచవలెనని భగవానుడు పలికెను.

పసిబాలుడు తన చేతిలో కత్తెరనుగాని, కత్తిని గాని పట్టుకొన్నప్పుడు దానిని గమనించిన తల్లి వానికి నయాన భయాన నచ్చజెప్పిగాని, కోపించిగాని, దండించిగాని మెల్లగా వాని చేతినుండి ఆ కత్తెరను, కత్తిని లాగుకొనును. అట్లే వివేక వైరాగ్యములు గల బుద్ధి ద్వారా మనస్సునకు ప్రాపంచిక భోగముల అనిత్యత్వమును, క్షణభంగురత్వములను గూర్చి విశదపరచవలెను. భోగములలో చిక్కుకొనుట వలన కలుగు బాధలను గూర్చియు నరకాది యాతనల భయమును గూర్చియు తెలియపఱచి, ఆ మనస్సును విషయ చింతనల నుండి సర్వథా తొలగింపవలెను. క్రమక్రమముగా ఉపరతిని పొందుట యనగా ఇదియే.

మనస్సు విషయచింతనను పూర్తిగా విడిచిపెట్టునంత వఱకు సాధకుడు ప్రతిదినము స్థిరాసనముపై కూర్చుండి మొదట ఇంద్రియములను బాహ్యవిషయముల నుండి నిగ్రహించుచు, బుద్ధిద్వారా మనస్సును విషయచింతన నుండి మఱల్చుటకు క్రమక్రమముగా ప్రయత్నింపవలెను. ఈ సాధనతో పాటు ధైర్యముతో దృఢనిశ్చయ బుద్ధితో మనస్సు పరమాత్మయందు స్థిరముగా నుండునట్లు చేయుచుండవలెను. పరమాత్మ తత్త్వమును, రహస్యమును తెలిసికొనని కారణమున బుద్ధియును ఆసక్తి, సంశయభ్రమలకు సహజముగనే లోనగుచుండును. అట్టిబుద్ధి స్థిరముగా దృఢముగా ఉండనేరదు. అట్టిస్థితిలో ఆ బుద్ధి మనస్సును పరమాత్మ ధ్యానమునందు స్థిరముగా నిల్పజాలదు. కాని సత్సంగాదుల ద్వారా పరమాత్మ తత్త్వ రహస్యములను తెలిసికొని బుద్ధి స్థిరత్వమును పొందినప్పుడు అది దృశ్యవర్గమును వీడి, పరమాత్మయందే నిలిచి ఆనందమునను భవించును. ఆ పరిస్థితిలో ఆ బుద్ధికి పరమాత్మతప్ప మఱియేదియు గోచరింపదు. అప్పుడు ఆ దృఢబుద్ధి మనస్సును విషయముల నుండి మఱల్చి, దానిని పరమాత్ముని చింతనయందే నిమగ్నమొనర్చి క్రమముగా దానికి తదాకారమును కల్గించును. దృఢముగా బుద్ధిద్వారా మనస్సును పరమాత్మయందు స్థిరపఱచుటయనగా ఇదియే.

ప్రశ్న - 'పరమాత్మను తప్ప మఱి దేనిని చింతన చేయరాదు.'- అనగానేమి?

సమా - మనస్సు పరమాత్మయందే స్థిరముగా నుండి సర్వదా తద్రూపమునే పొందువఱకు అనగా పరమాత్మ ప్రాప్తి కలుగునంతవఱకు అది ధ్యేయవస్తువునందు (పరమాత్మ యందు) నిరంతరము లగ్నమై యుండునని నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు. అందువలన తీవ్రమైన సాధన అవసరము. సాధకుడు ధ్యానమునందు కూర్చొని, మనస్సును పరమాత్మయందే లగ్నమొనర్చినప్పుడు ఆ మనస్సు మఱల ఇతరవిషయముల వైపునకు క్షణమాత్రము గూడ పోకుండ అతడు జాగరూకుడై యుండవలెను. సాధకుని ఈ జాగరూకత అభ్యాసము దృఢపడుటకు బాగుగా తోడ్పడును. నిత్యము ధ్యానమును కొనసాగించుచు, దాని ప్రభావముతో మనస్సును ఇతర విషయముల వైపునకు ఏ మాత్రము పోనీయక సావధానుడై ఎక్కువ సమయము పరమాత్మయందే నిలుపవలెను.

ప్రశ్న - ధ్యానసమయమున మనస్సును పరమాత్మయందు ఎట్లు లగ్నమొనర్పవలెను?

సమా - పూర్వోక్తరీతిగా అభ్యాసమొనర్చుచు సాధకుడు ఏకాంత ప్రదేశమున కూర్చుండి మనస్సును సర్వథా నిర్విషయమొనర్చి కేవలము పరమాత్మస్వరూపమునందే లగ్నమొనర్చుటకు ప్రయత్నింపవలెను. మనస్సునందు ఏ ఇతర వస్తుస్వరూపము ఏ మాత్రము మెదలినను దానిని కల్పనామాత్రమైన దానినిగా తలంచి, వెంటనే త్యజింపవలెను. ఈ చిత్తమునందు స్ఫురించు వస్తుస్వరూపములను త్యజించుచు క్రమముగ శరీరేంద్రియ మనోబుద్ధుల ఉనికిని కూడ విస్మరింపవలెను. ఈ అన్నింటిని దూరమొనర్చుచు, చిత్తమునుండి దృశ్యపదార్థములను అన్నింటిని పారద్రోలినప్పుడు, అన్నింటి అభావస్థితిని నిశ్చయమొనర్చు (స్థిరపఱచు) వృత్తి మాత్రమే మిగిలియుండును. ఈ వృత్తి శుభకరమైనది, శుద్ధమైనది. కాని దృఢధారణ వలన దీనిని గూడ నిరాకరించవలయును. సమస్త దృశ్య ప్రపంచము అభావస్థితిని పొందినప్పుడు ఇది తనంతట తానే ప్రశాంతస్థితిలో నుండిపోవును. దీనికి పిమ్మట

అచింత్యతత్త్వమే (పరతత్త్వమే) మిగిలిపోవును. అది ఉపాధిరహితము, పరిపూర్ణము, 'కేవలము', నిరంజనము. దానిని ఎవ్వరును వర్ణింపలేరు. చింతనము చేయలేరు. కనుక ఈ విధముగ దృశ్యప్రపంచమును, శరీరేంద్రియ మనోబుద్ధ్యహంకారములను అభావమొనర్చి, అట్టి అభావమొనర్చు వృత్తిని సైతము అంతరింపజేసి, అచింత్యమైన తత్త్వమునందే అది స్థిరపడుటకు సాధకుడు పూనుకొనవలెను.

సంబంధము - మనస్సును పరమాత్మయందు స్థిరపఱచి, పరమాత్మచింతన తప్ప మఱియే యితర విషయచింతనము చేయరాదని తెల్పబడెను. కాని చిత్తము పూర్వవాసనల ప్రభావమున విషయముల వైపు బలవంతముగా ఆకర్షితమైనచో సాధకుడు ఏమి చేయవలెనో చెప్పుచున్నాడు-

**యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్ ॥ 26 ॥**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అస్థిరమ్ | = | స్థిరముగా నిలువనట్టి | | | కారణముగా | నియమ్య | = | నియమించి |
| చంచలమ్ | = | చలించునట్టి | నిశ్చరతి | = | (విశృంఖలముగా) | | | (మఱల్చి) |
| ఏతత్, మనః | = | ఈ మనస్సు | | | సంచరించునో | ఆత్మని, ఏవ | = | పరమాత్మయందే |
| యతః, యతః | = | ఏయే శబ్దాది | తతః, తతః | = | ఆయా విషయముల | వశమ్, నయేత్ | = | (పదేపదే) స్థిరపఱచ |
| | | విషయముల | | | నుండి (దానిని) | | | వలెను. |

**సహజముగా నిలుకడలేని చంచలమైన మనస్సు ప్రాపంచిక విషయములయందు విశృంఖలముగా పరిభ్రమించుచుండును. అట్టి మనస్సును ఆయా విషయములనుండి మఱల్చి, దానిని పరమాత్మయందే స్థిరముగా నిల్పవలెను. (26)**

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క విశేషమేమి?

సమా - మనస్సు మిక్కిలి అస్థిరమైనది, చంచలమైనది. ఒకచోట స్థిరముగా నిలువకుండుటయే దాని స్వభావము. క్రొత్తసాధన ప్రక్రియల విషయమున అది చిక్కకుండా పాఱిపోవుచుండును. సాధకుడు తీవ్రముగా ప్రయత్నించి మనస్సును పరమాత్మయందు నిల్పి, అది పరమాత్మయందే నిమగ్నమైయున్నట్లు తలంచును. కాని మఱుక్షణమునందే చూచినను దాని ఉనికియే అచట కనబడదు. అది ఎచ్చటికి పోయినదో ఎంతదూరము వెళ్లిపోయినదో కూడ తెలియదు. అందువలననే సాధకుడు అనుక్షణము జాగరూకుడై యుండవలెననియు, మనస్సు పరమాత్మను తప్ప మఱిదేనిని గూడ చింతన చేయకుండునట్లు చూచుకొనవలయుననియు మునుపటి శ్లోకమున చెప్పబడినది. కాని మిక్కిలి సావధానుడై యున్నప్పటికిని ఏ మాత్రము అవకాశము దొఱికినను అది తప్పించుకొని పాఱిపోవుచుండును. అది ఎప్పుడు? ఎక్కడికి? పోయినదో గూడ కొంతసేపటికి గాని తెలియదు. పరమాత్మనువీడి విషయములవైపు పఱుగులు తీయుటకు అజ్ఞానమే ముఖ్యకారణము. అందువలన మోహవశమున శాంతి - ఆనందముల నిధానమైన సచ్చిదానంద ఘనపరమాత్మను వదలి, అనిత్యములు, క్షణభంగురములు, దుఃఖజనకములు అగు విషయములవైపు పఱుగులు దీసి, వాటియందే రమించు చుండును. మనస్సు ఈ విధముగా వశమునందుండక పోవుటకు చిరకాల విషయవాసనల ప్రభావమే ప్రధాన కారణము. కనుక ధ్యానసమయమున మనస్సు ఇతర విషయముల కడకు పరుగెత్తినదని తెలిసినంతనే సాధకుడు మిక్కిలి జాగరూకతతో దృఢముగా ఏ మాత్రము ఏమఱుపాటు లేకుండ వెంటనే దానిని పట్టుకొని వచ్చి (వెనుకకు మఱల్చి) పరమాత్మయందు లగ్నము చేయవలెను. ఈ విధముగనే మాటిమాటికి విషయముల నుండి మఱల్చి, దానిని పరమాత్మయందు లగ్నము చేయుటకు సాధనచేయుచుండవలెను. మనస్సు అనునయ వినయరీతులద్వారాగాని, వేడుకొనిగాని, లోభమోహాది ఆకర్షణవలనగాని, భయపెట్టిగాని ఎన్నివిధములుగా లోబఱచుకొనుటకు ప్రయత్నించినను సాధకుడు దానికి

లొంగక దృఢముగా నిలువవలెను. ఏ మాత్రము ఏమరినను దాని విజృంభణము మితిమీఱును. ఈ పరిస్థితులయందు మనఃప్రభావమునకు లోబడి దానిదారివెంట బోయినచో రోగికి మోహవశమున అపథ్యాహారమును ఇచ్చినట్లును, పసి బాలుని చేతికి వాడియైన కత్తిని ఇచ్చినట్లును, అగును. ఇచట మెలకువ కలిగియుండుటయే ప్రధాన సాధనము. సాధకుడు ఈ స్థితియందు ఏ మాత్రము ఏమఱుపాటుతో ఉన్నను, అశక్తుడైనను ధ్యానయోగము సఫలముగాదు. కనుక అతడు మిక్కిలి సావధానుడై, మనస్సును మాటిమాటికి శబ్దాది విషయములనుండి మఱల్చి, పరమాత్మయందు లగ్నము చేయుచుండవలెను.

ప్రశ్న - మునుపటి శ్లోకమునందును, ఈ శ్లోకము నందును, ఆత్మ శబ్దమునకు పరమాత్మయని యర్థము చెప్పుటకు కారణమేమి?

సమా - ఇది ఆత్మ-పరమాత్మల అభేదప్రకరణము. ఈ విషయమును స్పష్టపఱచుటకే ఆత్మయను శబ్దమునకు పరమాత్మయని అర్థము చెప్పబడినది.

సంబంధము - చిత్తమును అన్నివైపులనుండి మఱల్చి, పరమాత్మయందే స్థిరముగా నిల్పుటవలన కలుగు ఫలమును గూర్చి తెల్పుచున్నాడు-

**ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27 ॥**

హి = ఏలనన
ప్రశాంతమనసమ్ = ప్రశాంతమైన మనస్సు కలవాడును
అకల్మషమ్ = పాపరహితుడును
శాంతరజసమ్ = ప్రాపంచిక విషయముల యందు ఆసక్తి తొలగిన వాడును
బ్రహ్మభూతమ్ = సచ్చిదానందఘన పరమాత్మయందు ఏకీభావము పొందిన వాడును అగు
ఏనమ్, యోగినమ్ = ఈ, యోగిని
ఉత్తమమ్ = సర్వశ్రేష్ఠమైన
సుఖమ్ = బ్రహ్మానందము.
ఉపైతి = పొందును

ప్రశాంతమైనమనస్సు కలవాడును, పాపరహితుడును, రజోగుణము శాంతమైనవాడును, అనగా ప్రాపంచిక కార్యములయందు ఆసక్తి తొలగినవాడును, సచ్చిదానందఘనపరమాత్మయందు ఏకీభావమును పొందినవాడును అగు యోగి బ్రహ్మానందమును పొందును. **(27)**

ప్రశ్న - 'ప్రశాంతమనసమ్' అనగానేమి?

సమా - ఈ ప్రశాంత మనస్కుడు వివేకవైరాగ్యముల ప్రభావమున విషయచింతనము వదలివేయును. చంచలత్వము, విక్షేపము లేనివాడగును. ఆతని చిత్తము సర్వథా స్థిరముగా ప్రసన్నముగా ఉండును. ఈ ఉత్తమలక్షణముల ఫలస్వరూపముగా పరమాత్మ స్వరూపమునందే అతడు నిశ్చల స్థితిని పొందియుండును. అట్టి యోగినే 'ప్రశాంతమనస్కుడు' అనియందురు.

ప్రశ్న - 'అకల్మషమ్' అనగానేమి?

సమా - తమోగుణము, మనుష్యుని అధోగతి పాలుచేయును. వాటి కార్యరూపములైన ప్రమాదాలస్యములు, అతినిద్రామోహములు, దుర్గుణ దురాచారాది మలరూపములైన దోషములన్నియును కల్మషములు అనబడును. ఈ కల్మషములు (పాపములు) లేనివాడు 'అకల్మషుడు' అనబడును.

ప్రశ్న - పాపకర్మలును, సకామ పుణ్యకర్మలును లేనివానిని 'అకల్మషుడు' అని చెప్పిన దోషమేమి?

సమా - సకామపుణ్యకర్మల రాహిత్యమును 'శాంతరజసమ్' అనుపదము తెల్పును. కనుక 'అకల్మషమ్' అను పదమునకు అర్థము పాపకర్మల రాహిత్యమే అని యెఱుంగవలెను.

ప్రశ్న - 'శాంతరజసమ్' అనగానేమి?

సమా - ప్రాపంచిక విషయములయందు ఆసక్తి, స్పృహ, కామన, లోభము, తృష్ణ, సకామకర్మలు - ఇవన్నియును

రజోగుణ కారణముగనే కలుగుచుండును. (14/7,12). ఇవి యన్నియును రజోగుణమును వృద్ధి చేయుచుండును గూడ. కనుక వీటిని అధిగమించిన వానిని 'శాంతరజసమ్' అను పదము తెల్పును. చంచలత్వ రూపమైన విక్షేపము గూడ రజోగుణ కార్యమే. కాని 'ప్రశాంతమనసమ్' అను పదము ద్వారా అది వివరింపబడినది. కావున దానిని గూర్చి ఇచట మఱల ప్రస్తావించుట జరుగలేదు.

ప్రశ్న - 'బ్రహ్మభూతమ్' అనగా నేమి?

సమా - నేను దేహమును గాను. సచ్చిదానంద ఘన పరబ్రహ్మను అనుభావముతో సాధనచేయుచు సాధకుడు సచ్చిదానంద ఘన పరబ్రహ్మమునందే దృఢస్థితిని పొందును. ఈ విధముగా అభిన్నభావముతో పరబ్రహ్మమునందు స్థితుడైన వానినే 'బ్రహ్మభూతమ్' అనియందురు.

ప్రశ్న - 'బ్రహ్మభూతమ్' అను పదము సాధకుని గూర్చి తెల్పునా? లేక సిద్ధపురుషుని గూర్చి తెల్పునా?

సమా - 'బ్రహ్మభూతమ్' అను పదము ఉచ్చశ్రేణికి చెందిన అభేదమార్గసాధకుని గూర్చి తెలుపును. అట్టి సాధకునిలో రజస్తమోగుణములు అంతరించి శాంతించి యుండును. కాని అతడు సర్వథా గుణాతీతుడు కాలేదు. అతని దృష్టిలో అతడు బ్రహ్మస్వరూపమునందు స్థితుడైయున్నట్లే. అయినను వాస్తవముగా అతడు బ్రహ్మప్రాప్తిని పొందనట్లే. ఈ విధముగ బ్రహ్మస్వరూపమునందు దృఢస్థితి కల్గినప్పుడు తత్త్వజ్ఞానముద్వారా శీఘ్రముగ బ్రహ్మప్రాప్తియు కల్గును. రాబోవు శ్లోకమున ఈ స్థితియొక్క ఫలము ఆత్యంతిక సుఖప్రాప్తి అనగా బ్రహ్మప్రాప్తి అని తెల్పబడెను. 5వ అధ్యాయము నందలి 24వ శ్లోకమున గూడ 'బ్రహ్మభూతః' అను పదము ఈ అర్థమునందే ప్రయుక్తమైనది. అచట దాని ఫలము నిర్వాణబ్రహ్మప్రాప్తి అని తెలుపబడెను. 18వ అధ్యాయమునందలి 54వ శ్లోకమునందు గూడ బ్రహ్మభూతుడైన వానికి పరాభక్తి (తత్త్వజ్ఞానము) ప్రాప్తించుననియు, తదనంతరము పరమాత్మప్రాప్తి కలుగుననియు పేర్కొనబడెను. (18/55). కావున ఇచటి 'బ్రహ్మభూతమ్' అను పదమునకు సిద్ధపురుషుడు అని యర్థముకాదు.

ప్రశ్న - 'ఉత్తమసుఖప్రాప్తి' అనగానేమి?

సమా - రజస్తమోగుణముల కతీతుడై శుద్ధసత్త్వము నందు స్థితుడైన సాధకుడు నిత్యము విజ్ఞానానంద ఘన పరమాత్మ ధ్యానమునందు అభిన్నభావముతో స్థితుడై యున్నప్పుడు అతనికి ధ్యానజనితమైన సాత్త్వికానందము లభించును. దానినే ఉత్తమసుఖముగా పేర్కొనుట జరిగినది. 5వ అధ్యాయము నందలి 21వ శ్లోకపూర్వార్థమున సుఖము అనియు, 24వ శ్లోకమున అంతస్సుఖము అనియు పేర్కొనబడిన దానినే ఇచట ఉత్తమసుఖముగా పేర్కొనుట జరిగినది.

సంబంధము - పరమాత్మయొక్క అభేద రూపముతో ధ్యానసాధన చేయు బ్రహ్మభూతుడైన యోగియొక్క స్థితి తెలుపబడినది. ఇపుడు అట్టి స్థితియొక్క ఫలమును తెల్పుచున్నాడు-

**యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మసంస్పర్శమ్ అత్యంతం సుఖమశ్నుతే ॥ 28 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| విగతకల్మషః | = పాపరహితుడగు | యుంజన్ | = (పరమాత్మయందే) లగ్నమొనర్చుచు | అత్యంతమ్ | = అనంతమైనది యునగు |
| యోగీ | = (ఆ) యోగి | సుఖేన | = సుఖముగా (హాయిగా) | సుఖమ్ | = ఆనందమును |
| ఏవమ్ | = ఇట్లు | బ్రహ్మ-సంస్పర్శమ్ | = పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తి రూపమైనదియు | అశ్నుతే | = అనుభవించును. |
| సదా | = సంతతము | | | | |
| ఆత్మానమ్ | = ఆత్మను | | | | |

పాపరహితుడైన ఆ యోగి పూర్వోక్తరీతిగా నిరంతరము ఆత్మను పరమాత్మయందే లగ్నమొనర్చుచు, పరబ్రహ్మపరమాత్మప్రాప్తిరూపమైన అపరిమితానందమును హాయిగా అనుభవించును. (28)

ప్రశ్న - 'విగతకల్మషః' అను విశేషణముతోపాటు యోగీ అను పదప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - పూర్వశ్లోకమున 'అకల్మషమ్' అను పదమునకు తెలిపిన అర్థమే ఇచట ప్రయుక్తమైన 'విగతకల్మషః' అను పదమునకును సరిపోవును. పాపరహితుడై అభేదభావముతో పరమాత్మ స్వరూపధ్యానము చేయు ఉత్తమశ్రేణికి చెందిన సాధకుడే 'యోగి' అనబడును.

ప్రశ్న - ఈ విధముగా నిరంతరము ఆత్మను పరమాత్మ యందు లగ్నముచేయుట యనగానేమి?

సమా - 25వ శ్లోకమున చెప్పబడిన రీతిలో దృశ్యవస్తువుల చింతనను మాని దృఢ నిశ్చయముతో సాధకుడు నిరంతరము అభేదరూపమున పరమాత్మయందు స్థితుడగుటయే- అనగా బ్రహ్మభూతుడగుటయే పూర్వోక్త ప్రకారముగా ఆత్మను పరమాత్మయందు లగ్నము చేయుట యగును.

ప్రశ్న - 12వ అధ్యాయము నందలి 5వ శ్లోకమున నిర్గుణ పరబ్రహ్మప్రాప్తిసాధన క్లేశముతో కూడినదని చెప్పబడినది. మఱి ఇచ్చట అవ్యక్త పరబ్రహ్మప్రాప్తి సుఖపూర్వకమని చెప్పుటకుగల కారణమేమి?

సమా - దేహమే నేను అనుకొను దేహాభిమానికి అవ్యక్త పరబ్రహ్మప్రాప్తి నిజముగా ( నూటికి నూఱుపాళ్ళు) కఠినమైన విషయమే. 12వ అధ్యాయమునందలి 5వ శ్లోకమున 'దేహవద్భిః' అను పదముద్వారా దేహాభిమాని విషయమున చెప్పబడినది. సాంఖ్యయోగ సాధకుడు దేహాభిమానమును వీడిన పిదప పరబ్రహ్మయందు స్థితుడగును. సాధకునకు దేహాభిమానము తొలగినప్పుడు అతనికి బ్రహ్మస్వరూపము నందు అభేదరూపస్థితి సహజముగనే కలుగును. అట్టి బ్రహ్మభూతుడైన సాధకునకు పరబ్రహ్మప్రాప్తి సుఖపూర్వక మైనది. అధికారి భేదమునుబట్టి రెండుచోట్ల చెప్పబడినదియు సముచితమే. (అచట అది దేహాభిమాని విషయము. ఇచట ఇది దేహాభిమానమును వీడిన సాంఖ్యయోగి విషయము.)

ప్రశ్న - పరబ్రహ్మపరమాత్మప్రాప్తిరూపమైన అపరిమితా నందమును అనుభవించును - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - లోకములో అత్యంత సుఖములుగా భావింపబడు వానియందు వాస్తవముగా సుఖము లేనేలేదు. ఏలనన ఆ సుఖములలో ఏ ఒక్కటియు, అది ఎంత ఉత్కృష్టమైనది యైనను, నిత్యమైనది కాదు (శాశ్వతమైనది కాదు). అవిచ్ఛిన్నముగా కొనసాగునదియు కాదు. కావున-

యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి।
భూమైవ సుఖం భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః॥
(ఛాందోగ్య-ఉప.7/23/1)

నిరతిశయసుఖము 'భూమా' అనియనబడును. అదియే నిజమైన సుఖము. అల్పమునందు సుఖములేదు. భూమా అను సుఖమును గూర్చియే విశేషముగ (ఆమూలాగ్రముగ) తెలిసికొనవలయును.

అని శ్రుతి గూడ ఈ విషయమునే స్పష్టపఱచుచున్నది. 'అల్పము' మఱియు 'భూమా' అను సుఖములను గూర్చి శ్రుతి ఇంకను ఇట్లు వివరించుచున్నది-

'యత్ర నాఽన్యత్ పశ్యతి, నాఽన్యత్ శృణోతి, నాఽన్యత్ విజానాతి స భూమాఽథ యత్ర అన్యత్ పశ్యతి, అన్యత్ శృణోతి, అన్యత్ విజానాతి తదల్పమ్. యో వై భూమా తదమృతమ్ అథ యదల్పమ్ తన్మర్త్యమ్.' (ఛాందోగ్య - ఉప 7/24/1)

పరమాత్మకంటె వేఱుగా దేనిని గూడ చూడక, వినక, తెలిసికొనక (ఆలోచింపక) ఉండు స్థితిని 'భూమా' యని యందురు. పరమాత్మ కంటె అన్యమైన దానిని చూచుచు, వినుచు, తెలిసికొనుచు (ఆలోచించుచు) ఉండు స్థితిని అల్పమనియందురు. 'భూమా' అమృతము (శాశ్వతము). 'అల్పము' నశ్వరము.

నేడు ఉండి రేపు నశించునది యథార్థముగా సుఖమేగాదు. ఏ రీతిగను దానిని సుఖముగా భావింపనే రాదు. అది తుచ్ఛమైనది. గణింపరానిది. యాజ్ఞవల్క్య మహర్షి సుఖముల తారతమ్యములనుగూర్చి వివరించుచు ఇట్లు చెప్పెను.

సమస్త భూమండలముయొక్క రాజ్యాధికారము, మానవలోకములోని సమస్తైశ్వర్యములు, స్త్రీ పుత్రాదులు, ధనధాన్యములు, ఆరోగ్యభాగ్యములు, కీర్తిప్రతిష్ఠలు మున్నగు భోగ్యపదార్థములన్నియు గలవాడు మనుష్యులలో అందఱిలో గొప్ప సుఖములు గలవాడుగా పరిగణింపబడును. సామాన్య మానవులకు ఇదియే పరమానందము. పితృలోకానందము దానికంటె నూరురెట్లు అధికమైనది. దానికంటెను గంధర్వ లోకానందము నూఱురెట్లును, యజ్ఞయాగాది ఫలముగ లభించిన దేవలోకానందము దానికి నూఱురెట్లును,

దానికంటెను దేవానందము నూఱురెట్లును, దానికంటెను ప్రజాపతిలోకానందము నూఱురెట్లును, దానికంటెను బ్రహ్మలోకానందము నూఱు రెట్లును అధికమైనది. పాపరహితుడైన నిష్కామశ్రోత్రియుడు పొందునట్టి పరమానందము ఇదియే (ఈ బ్రహ్మలోకానందమే). ఏలనన తృష్ణారహితుడైన శ్రోత్రియుడు ప్రత్యక్ష బ్రహ్మమే. (బృహదారణ్యక - ఉప 4/3/33).

పరబ్రహ్మప్రాప్తి కల్గినవానికి - అనంతము, అపరిమితము, అచింత్యము అయిన ఈ ఆనందము లభించును. దీనితో ఏ ఆనందమును పోల్చుటకును వీలులేదు. పరబ్రహ్మపరమాత్మ ప్రాప్తి కల్గిన పురుషుని స్వస్వరూపమే. ఈ నిరతిశయానందము. అనంతమైన ఈ పరిపూర్ణానందమునే (బ్రహ్మానందమునే) ఈ అధ్యాయమునందలి 21వ శ్లోకమున 'ఆత్యంతిక సుఖము' అనియు, 5వ అధ్యాయమునందలి 21వ శ్లోకమున 'అక్షయ సుఖము' అనియు పేర్కొనుట జరిగినది.

**సంబంధము** - *ఈ విధముగా అభేద భావముతో సాధన చేయు సాంఖ్యయోగియొక్క ధ్యానమును, దాని ఫలమును వర్ణించిన పిదప ఆ సాధకునియొక్క వ్యవహారరీతిని వర్ణించుచున్నాడు-*

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29 ॥**

యోగ-యుక్తాత్మా = సర్వవ్యాప్తమైన అనంత చైతన్యమునందు ఏకీభావ స్థితి రూప యోగ యుక్తమైన ఆత్మగల వాడును
సర్వత్ర = అంతటను (అన్నింటిని)
సమదర్శనః = సమభావముతో చూచు వాడును అగు యోగి
ఆత్మానమ్ = తన ఆత్మను
సర్వభూతస్థమ్ = సర్వప్రాణులయందును స్థితమైయున్నట్లుగను
చ = మఱియు
సర్వభూతాని = ప్రాణులను అన్నింటిని
ఆత్మని ఈక్షతే = తన ఆత్మయందు (కల్పితములుగను) చూచును

**సర్వవ్యాప్తమైన అనంతచైతన్యమునందు ఏకీభావస్థితిరూపయోగయుక్తమైన ఆత్మగలవాడును, అంతటను అన్నింటిని సమభావముతో చూచువాడును అగు యోగి తనయాత్మను సర్వప్రాణులయందు స్థితమైయున్నట్లుగను, ప్రాణులన్నింటిని తన ఆత్మయందు కల్పితములుగను భావించును (చూచును).[1]** **(29)**

ప్రశ్న - 'యోగయుక్తాత్మా' అనగానేమి?

సమా - సచ్చిదానంద నిర్గుణ నిరాకార పరబ్రహ్మ యందు అభిన్నభావ స్థితుడై బ్రహ్మభూతుడైన యోగిని గూర్చి తెల్పుపదమే యోగయుక్తాత్మా. 5వ అధ్యాయము నందలి 21వ శ్లోకమున 'బ్రహ్మయోగ యుక్తాత్మా' అనియు, 5వ అధ్యాయము నందలి 24వ శ్లోకమునను, 6వ అధ్యాయము నందలి 27వ శ్లోకమునను 18వ అధ్యాయము నందలి 54వ శ్లోకమునను 'బ్రహ్మభూతః' అనియు ఈ యోగివర్ణనమే చేయబడినది.

ప్రశ్న - ఇట్టి యోగి అందఱిని సమభావముతో చూచును. అనగానేమి?

సమా - 5వ అధ్యాయమునందలి 18వ శ్లోకమునను, ఈ అధ్యాయమునందలి 32వ శ్లోకమునను జ్ఞానులైన మహాత్ముల సమదర్శన వర్ణనము చేయబడినది. అదే విధముగ యోగి అందఱి తోడను శాస్త్రానుకూలముగ యథాయోగ్యముగ చక్కగా వ్యవహరించుచు నిత్యము, నిరంతరము అందఱియందును తన స్వరూపమైన ఒకే అఖండ - ఆత్మ చైతన్యమును దర్శించును. అందఱిని సమభావముతో చూచుట యనగా నిదియే.

---

1) ఈశావాస్యోపనిషత్తు (6వ) మంత్రము ఈ విషయమునే నొక్కి చెప్పుచున్నది.
యస్తు సర్వాణి భూతాన్యాత్మ న్యేవాను పశ్యతి । సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥
సర్వప్రాణులను ఆత్మయందును, ప్రాణులన్నింటి యందును ఆత్మను చూచువాడు ఎవ్వరినీ ద్వేషింపడు. ఎవ్వరినీ నిందింపడు.

ప్రశ్న - ఆత్మను అన్ని ప్రాణులయందు స్థితమైన దానినిగాను, ప్రాణులన్నింటిని ఆత్మయందు కల్పితములు గను చూచుట యనగానేమి?

సమా - అద్వితీయ సచ్చిదానంద ఘనపరబ్రహ్మ పరమాత్మయే సత్యమైన తత్త్వము. ఆతనికంటె భిన్నమైనది ఈ జగత్తులో ఏదియును లేదు. ఈ రహస్యమును చక్కగా తెలిసికొని అభిన్నభావములో ఆతనియందు స్థితుడై - స్వప్నదృశ్యములను దర్శించు ద్రష్టవలె చరాచర ప్రాణులన్నింటి యందును ఒక్క అద్వితీయ - ఆత్మనే అధిష్ఠానరూపమున పరిపూర్ణముగా చూడవలెను. అనగా ఒక అద్వితీయ ఆత్మయే ఈ రూపములన్నింటిలోను కనబడుచున్నది. అది తప్ప జగత్తులో మఱేదియును లేదు - అను విషయమును అనుభవపూర్వకముగ గ్రహించుటయే ప్రాణులన్నింటియందును ఆత్మను చూచుట యగును. ఇదే విధముగ సమస్త చరాచరప్రాణులనన్నింటిని ఆత్మయందు కల్పితములుగ చూచుట. అనగా స్వప్నమునుండి మేల్కొనిన మనుష్యుడు స్వప్నజగత్తును, అనేక విధములగు కల్పిత దృశ్యములను తన సంకల్ప కారణముగనే తనయందే చూచినట్లు చూచుటయే ప్రాణులన్నింటిని ఆత్మయందు కల్పితములుగ చూచినట్లు అగును. ఈ విషయమును స్పష్టపఱచుటకే భగవంతుడు 'ఆత్మానమ్' అను పదమునకు 'సర్వభూతస్థమ్' అను విశేషణమును ప్రయోగించి, ఆత్మను ప్రాణులన్నింటి యందును స్థితమైన దానినిగా చూడవలెనని తెలిపెను. కాని ప్రాణులను ఆత్మయందు స్థితమైన వానినిగా కాక, కేవలము కల్పితములుగా చూడవలెనని తెల్పెను.

సంబంధము - ఈ విధముగ సాంఖ్యయోగసాధన చేయు యోగిని, సర్వసమదర్శనము చేయు అతని అంతిమ స్థితిని వర్ణించిన పిదప భక్తియోగసాధన చేయు యోగియొక్క అంతిమస్థితిని, సర్వత్ర అతని భగవద్దర్శనమును వర్ణించుచున్నాడు-

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ పురుషుడైతే | పశ్యతి | = చూచునో | తస్య | = ఆ పురుషునకు |
| సర్వత్ర | = సకలప్రాణుల యందును | చ సర్వమ్ | = అట్లే సమస్తప్రాణులను | అహమ్ | = నేను |
| మామ్ | = ఆత్మ రూపమున వ్యాపించియున్న నన్ను (వాసుదేవుని) | మయి | = నాయందు (అంతర్గతములైయున్నట్లు) | న, ప్రణశ్యామి | = అదృశ్యుడను కాను |
| | | పశ్యతి | = చూచునో | సః, చ | = అతడును |
| | | | | మే | = నాకు |
| | | | | న, ప్రణశ్యతి | = అదృశ్యుడుకాడు. |

**సకల ప్రాణులయందును ఆత్మరూపముననున్న నన్ను (వాసుదేవుని) చూచు పురుషునకు, అట్లే ప్రాణులన్నింటిని నాయందు అంతర్గతములుగానున్నట్లు చూచువానికి నేను అదృశ్యుడను కాను. అతడును నాకు అదృశ్యుడు కాడు. (30)**

ప్రశ్న - సకల ప్రాణులయందును పరమాత్మను, పరమాత్ముని యందు సకల ప్రాణులను దర్శించుట, యనగానేమి?

సమా - మేఘముల యందు ఆకాశము, ఆకాశము నందు మేఘములును ఉన్నట్లే ప్రాణులన్నింటి యందును భగవానుడైన వాసుదేవుడు కలడనియు, వాసుదేవునియందే సకలభూతములు కలవనియు అను అనుభూతిని పొందుటయే అట్లు చూచుట యగును.

ప్రశ్న - ఇట్లు చూచుట కార్యకారణ దృష్టితోడనా? వ్యాప్యవ్యాపక దృష్టితోడనా? ఆధేయ ఆధార దృష్టితోడనా?

సమా - అన్ని విధములగు దృష్టులతోడను ఈ విధముగ చూడవచ్చును. ఏలనన మేఘములకు ఆకాశమువలె భగవంతుడైన వాసుదేవుడే ఈ సంపూర్ణ చరాచర జగత్తునకు మహాకారణము. అతడే అన్నింటియందును వ్యాపించియుండువాడు. అతడు మాత్రమే సర్వాధారము.

ప్రశ్న - ఆ పరమేశ్వరుడే ఆకాశమువలె సంపూర్ణ చరాచర జగత్తునకు మహాకారణ మెట్లగును? ఏ విధముగ సర్వవ్యాపియు, సర్వాధారుడును అగును?

సమా - 'ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః' (తైత్తరీయ ఉప. 2/1) ఈ శ్రుతి ననుసరించి, ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలరూపమైన మేఘము ఉత్పన్నములైనవి. పంచమహాభూతములయందు ఆకాశము మొదటిది. ఈ అన్నింటికిని అది కారణము. దీని పుట్టుకకు మూలకారణము ప్రకృతి. ప్రకృతియే పరమేశ్వరుని అధ్యక్షతన అన్నింటిని సృష్టించును. ఆ ప్రకృతి పరమేశ్వరుని శక్తివిశేషము. కావున పరమేశ్వరుని కంటెను అది భిన్నమైనది కాదు. ఈ దృష్టితో చూచినచో ఈ చరాచర జగత్తంతయు ఆ పరమేశ్వర సృష్టియేయని స్పష్టమగును. కనుక అతడే దీనికి మహాకారణము. భగవంతుడే స్వయముగ ఇట్లు చెప్పెను.

అహం సర్వస్య ప్రభవో, మత్తస్సర్వం ప్రవర్తతే ।
(10/8-గీత)

నేనే సర్వమునకును సృష్టికర్తను. నా అధ్యక్షతన ప్రకృతి కార్యములనన్నియును కొనసాగుచున్నవి.

ఇదే విధముగ మేఘముల అంశములన్నింటిలో ఆకాశము సర్వదా పరిపూర్ణమై వ్యాప్తమై యున్నట్లు పరమేశ్వరుడు సమస్తచరాచరజగత్తునందును వ్యాపించియున్నాడు.

'మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా' (గీత-9/4) అవ్యక్తమూర్తియు పరమేశ్వరుడనైన నాచే ఈ జగత్తంతయు వ్యాప్తమైయున్నది.

మేఘములకు ఆధారము ఆకాశము. ఆకాశము లేకుండ మేఘము ఎచ్చట ఉండును? మేఘము మాత్రమే కాదు - వాయువు, అగ్ని, జలము మొదలగు మహాభూతము లన్నియును ఆకాశము యొక్క ఆశ్రయము లేనిదే నిలువజాలవు. అట్లే ఈ సంపూర్ణ చరాచర విశ్వమునకు ఏకైక పరమాధారము పరమేశ్వరుడే (గీత 10/42).

ప్రశ్న - సమస్త జగత్తునందు భగవంతునియొక్క సాకార రూపమును, భగవంతుని యొక్క సాకారరూపమునందు సమస్త జగత్తును చూచుటకు ఎట్లు వీలగును?

సమా - ఒక సమర్థుడైన నటుడు నానా విధములైన వేషములను ధరించి, అనేక రూపములతో ప్రదర్శనలను ఇచ్చును. అతని నానావిధవేషభాషల తీరుతెన్నులతో పరిచయమున్న వ్యక్తి అతని అన్ని రూపములలోను అతనిని గుర్తించును. అట్లే ప్రపంచమున గల రూపములన్నియును భగవానుని వేషములే. ఆ వివిధవేషములను ధరించువాడును, వివిధరూపములను ప్రదర్శించువాడును భగవంతుడేయని మనము గుర్తించుట లేదు. కనుక అవి భగవంతునికంటె భిన్నములని భావించి వాటి విషయమున భయసందేహాదులను పొందుదుము. మనము వాటిని సేవించుటకు సిద్ధపడము. జగత్తునందలి సమస్త ప్రాణుల యందు భగవంతుని దర్శించువారు రూపముయొక్క భేదములును, లౌకిక వ్యవహారరీతుల భేదములును ఉన్నప్పటికిని హృదయ పూర్వకముగ భక్తితో ఆ పరమాత్మనే పూజింతురు. మనతండ్రిగాని, ప్రియతమ బంధువుగాని ఏ రూపములో వచ్చినను అతనిని గుర్తించిన పిమ్మట అతనికి సేవాసత్కారములలో ఎట్టి లోపమును రానీయము గదా! శ్రీ గోస్వామి తులసీదాస్ మహారాజ చెప్పినట్లు-

'సీయ రామమయ సబ్ జగ జానీ ।
కరఉ ప్రనామ జోరి జుగపానీ ॥'

జగత్తంతయు శ్రీ సీతారామమయమని తెలిసికొని, నేను నా రెండు చేతులను జోడించి, అందఱికిని నమస్కరింతును. శ్రీ బలరాముడు వ్రేపల్లెలోని గోవులములోను, వత్సములలోను, గోపబాలకులలోను, వారి వస్తువులలోను శ్రీకృష్ణునే దర్శించెను.[1]

1) ఇదియే వ్రేపల్లె వృత్తాంతము - ఒకనాడు యమునా నదీతీరమున శ్రీకృష్ణభగవానుడు తన గోపబాలసఖులతో కలిసి భుజించుచు బాల్యక్రీడలను కొనసాగించు చుండెను. నడుముకు బిగించిన దట్టీలో పిల్లనగ్రోవిని (మురళిని) ఉంచెను. కొమ్మును, బెత్తమును తన ఎడమ చంకన ధరించెను. చేతివ్రేళ్ళ సందున నిమ్మపచ్చడి ముక్కలు అంటుకొనియుండెను. చేత వెన్నతో కలిసిన అన్నం ముద్దలు పట్టుకొని, అందఱి మధ్యలో నిలబడి, చలోక్తులు విసరుచు, నవ్వుచు, నవ్వించుచుండెను. గోపబాలురందఱును తన్మయులై విందు ఆరగించుచుండిరి. గోవత్సములు దూరముగా వెళ్ళిపోయెను. శ్రీకృష్ణుడు వాటిని వెదకుటకై అన్నంచేతితోనే పరుగెత్తెను. బ్రహ్మదేవుడీ దృశ్యమును జూచి మోహితుడాయెను. అతడు గోవులను, వత్సములను, గోపబాలురను హరించెను. బ్రహ్మయొక్క ఈ చర్యను గమనించి, గోమాతలను, గోప బాలుర తల్లులను సంతోష పఱచుటకును, బ్రహ్మను

గోపికలును ప్రేమతో నిండిన తమ చూపులతో సర్వత్ర, సర్వదా కృష్ణునే చూచుచుండిరి[1] అదే విధముగా భక్తులు సర్వత్ర శ్రీకృష్ణుడు, రాముడు, విష్ణువు, శంకరుడు, శక్తి మొదలగు భగవద్రూపములలో తమకిష్టమైన సాకార

ఆశ్చర్యపఱచుటకును, శ్రీకృష్ణుడే స్వయముగ, గోవత్సములుగా, గోపాలకులుగా మాఱెను. గోవత్సముల యొక్కయు గోపబాలుర యొక్కయు రూపురేఖలను, వేషభాషలను, వారి సాధనములను, వస్త్రాభరణములను, అట్లే స్వభావ గుణరీతివిశేషములను, ఆహార విహారములను అచ్చుగ్రుద్దినట్లుగా తానే ప్రదర్శించి, జగత్తంతయు 'హరిమయము' అను నానుడిని సార్థక పఱచెను. బలరాముడు మొట్టమొదట ఈ విశేషములను ఏమియు గ్రహింపలేకపోయెను. కానీ ఈ లీలాగోపబాలుర యెడ తల్లులు చూపెడి ప్రేమాధిక్యములను గాంచియు, గోమాతలు ఎడ దూడలకును మిక్కిలి తమకముతో పాలు ఇచ్చుటను జూచియు, అతనికి సందేహము కలిగెను. పిమ్మట అటు పరిశీలనా దృష్టిని ప్రసరింపజేయగా ఆతనికి గోవత్సములయందును, గోపబాలురయందును, వారి వస్తువుల యందును శ్రీకృష్ణ రూపమే దర్శనమిచ్చెను. అందులకు అతడాశ్చర్య చకితుడాయెను. పిమ్మట బ్రహ్మయు, అందరియందును శ్రీకృష్ణరూపమునే చూచి దిగ్భ్రాంతి నంది తనలో తాను ఇట్లు వితర్కించుకొనెను.

శా॥ మందన్‌గల్గు సవత్స బాలకులు నామాయా గుహాసుప్తులై
యెందున్ బోవరు లేవరిప్పుడును, వేఱే చేయు నా కన్యు లిం
దెందున్ లేరు విధాత నేఁబరులు వీరెవ్వార లెట్టి రొకో
యెందేతెంచిరొ కృష్ణుతో మెలగువారేఁడయ్యెడిన్ నేటికిన్!! (10/531) తెలుగు భాగవతము 10. స్కం-పద్యం 531)

మ.కో॥ బ్రహ్మపంపున గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్
బ్రహ్మనొక్కడ గాని వేఱొక బ్రహ్మలేడు సృజింపగా
బ్రహ్మ నేను సృజింప నొండొక బాలవత్సకదంబ మే
బ్రహ్మమందు జనించె నొక్కట బ్రహ్మమే నది చూడగాన్ !! (తెలుగు. భాగ. స్కం. 10/532)

కం॥ మోహములేక జగంబుల
మోహింపఁగఁ జేయునేర్చి మొనసిన విష్ణున్
మోహింపించెదననియెడు
మోహమున విధాత దానమోహితుఁడయ్యెన్!! (10/534)

కం॥ బుట్టిరి బుద్ధి యెఱింగితిఁ
బుట్టించితి జగము, సగము పోయెన్ బ్రాయం
బిట్టివి నూతన సృష్టులు,
పుట్టుటలే దౌర! యిట్టి బూమెలు భూమిన్!! (10/537)

అనుచూ శ్రీకృష్ణుని స్తుతించి, తనను క్షమింపుమని వేడుకొనెను. (శ్రీమద్భాగవతము 10/13)

1) గోపికలు ప్రేమారుణ నేత్రములతో ఇట్లనుచున్నారు.
ఏమాశ్చర్యము!
ఎల్లెడల అశ్యామసుందరుని శ్యామశోభలే ప్రతిఫలించుచున్నవి.
ఏమాశ్చర్యము! ఏమాశ్చర్యము!
ఎచట చూచినను అశ్యామసుందరుని దివ్య మంగళ విగ్రహమే!
ఈలతానికుంజములలో కన్నయ్య విహారలీలలే కనబడుచున్నవి.
యమునానదియందును ఆ కృష్ణుడే విహరించుచున్నాడు.
ఏనీలాకాశమునందును, నీలమేఘములయందును కృష్ణుడే గోచరించుచున్నాడు.
అణువణువునను శ్రీకృష్ణుడే వ్యాపించియున్నాడు
ఏమాశ్చర్యము! నేను వెఱ్ఱిదాననైతినా? అని ఒక గోపిక

రూపమును దర్శింపవలెను. భగవంతుని సాకార రూపమును సమస్త జగత్తునందు చూచుటయనగా ఇదియే.

అర్జునుడు చూచిన శ్రీకృష్ణభగవానుని దివ్యవిరాట్ స్వరూపము గీతలో 11వ[1] అధ్యాయము నందు వర్ణింపబడినది. యశోదమాత బాలకృష్ణుని ముఖమునందును బ్రహ్మాండమును దర్శించెను.[2]

భక్తుడైన కాకభుశుండి శ్రీరామచంద్రుని ఉదరము నందును[3] సమస్త విశ్వమును చూచియుండెను. అట్లే -

అందరికనుపాపలలో కృష్ణుడే వసించుచున్నాడేమి? పిండారిన పండువెన్నెలలోను శరద్రాత్రుల శ్రీకృష్ణ రాసలీలలే కన్పించుచున్నవి. అరుణకిరణములయందును కృష్ణుడే భాసించుచున్నాడు. మృగసౌరభములును శ్రీకృష్ణ పరిమళములనే వెదజల్లుచున్నవి. పురులువిప్పి నాట్యమాడు నెమళ్ళలోను శ్రీకృష్ణుడే కన్పట్టుచున్నాడు. భూమండలమంతయు శ్రీకృష్ణ శోభాంచితమే. వేదాక్షరములన్నియు శ్రీకృష్ణునే స్తుతించుచున్నవి. దీపశిఖలయందును శ్రీకృష్ణ ప్రభలే వెలుగుచున్నవి. ఆ నిర్వికార పరబ్రహ్మమే శ్రీకృష్ణుడై దర్శనమిచ్చు చున్నాడు. వేయేల "సర్వం కృష్ణమయం జగత్".

1) గీత - ఏకాదశాధ్యాయమును చూడుడు -

2) వ్రేపల్లెలో నివసించు యశోదమాత, గోపికలు,గోపాలుడు (స్త్రీలు, పురుషులు) బాలబాలికలు ఎల్లరును చిన్నారి కన్నయ్య ముద్దు మురిపెములను, విచిత్ర లీలలను చూచి, అపరిమితానందములను అనుభవించుచుండిరి. ఒకనాడు శ్రీకృష్ణుడు మన్ను తినెను. ఆ విషయము తెలియగానే తల్లి కోపించి, 'నీవు మట్టిని ఏల తింటివి. తినుటకు కారణమేమి?' అని కృష్ణుని గద్దించెను. దానికి కృష్ణుడు "నేను మట్టిని తినలేదు. అందఱు నామీద చాడీలు చెప్పుచున్నారు. నీకు నామాటపై విశ్వాసము లేనిచో నాముఖమును (నోటిని) చూడుము." అని పలుకుచు తననోటిని తెఱచి తల్లికి చూపెను. యశోద ఆ దృశ్యమునుగాంచి, చకితురాలయ్యెను. ఆ శ్రీకృష్ణుని చిన్ని ముఖమున "సమస్త చరాచరజీవులను, పంచభూతములను, దశదిశలను, పర్వతములను, ద్వీపములను, సముద్రములను, సూర్యచంద్రులను, నక్షత్రములను ఇంద్రియాధిష్ఠాన దైవములను ఇంద్రియములను, మనస్సును, శబ్దాది విషయములను, మాయా త్రిగుణములను విచిత్ర జీవ శరీరములను మఱియు సమస్త వ్రజ మండలమును" యశోద దర్శించెను. ఆ అద్భుత దృశ్యములను కన్నులార్పక అదేపనిగా సంభ్రమాశ్చర్యములతో చూచుచు "నేను కలగనుట లేదుగదా!" అను యనుకొనుచు యశోదమ్మ విస్తుపోయెను.

క॥ అలలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వతవనభూ
గోళశిఖి తరణి శశిది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్. (భాగ.10.స్కం. 341) కనుగొని (10/342)

మ॥ కలయో వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్ నేరకయున్న దానన్ యశోదాదేవిగానో పర
స్థలమో బాలకుడెంత యీతని ముఖస్థంబై యజాండంబు! ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువో మహాశ్చర్యంబు చింతింపగన్ (10/344)

ఆ.వె. బాల మాత్రుడైన బాలుని ముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసి యుండు?
బాలు భంగినితడు భాసిల్లుగాని ప (10/343)
ర్వాత్ము డాది విష్ణుడగుట నిజము.

పిమ్మట ప్రణమిల్లి, ప్రసన్నురాలయ్యెను. ఆమెను కృష్ణుడు మాయామోహములలో పడవేసెను. పిదప మాతృవాత్సల్యముతో యశోదమ్మ హృదయముప్పొంగిపోయెను. ఆమె ఆ శ్యామసుందరుని తన అక్కున చేర్చుకొని తనివిదీర ముద్దాడెను.

3) కాకభుశుండి శ్రీరామచంద్రుని బాల్య చేష్టలకు ఆనంద పరవశుడగుచుండెను. ఆ చిన్నారి రాముడు మోకాళ్ళపై బలముగా గబగబా దోగాడుచు కాకభుశుండిని పట్టుకొనుటకు పరుగిడెను. అతడు ఎగిరి పోయెను. అతనిని పట్టుకొనుటకు భగవంతుడు (శ్రీరాముడు) భుజములను విస్తరించెను. కాకభుశుండి ఎగురుచు బ్రహ్మలోకము వఱకు వెళ్ళెను. అచటను శ్రీరామచంద్రుని భుజములు తనను వెంటాడుచుండుట అతడు చూచెను. అతనికిని శ్రీరామచంద్రుని భుజములకును మధ్య రెండంగుళముల

భగవంతునియొక్క అన్ని రూపములయందును అంతర్గతముగ సమస్త విశ్వమును చూడవలయును. భగవంతుని యొక్క సగుణ సాకార రూపమునందు సమస్త జగత్తు చూచుట యనగా నిదియే.

ప్రశ్న - అతనికి నేను అదృశ్యుడను కాను. నాకు అతడు అదృశ్యుడు కాడు. అనుటలోని ఆంతర్యమేమి?

సమా - సమస్త జగత్తునందు భగవంతుని, భగవంతుని యందు జగత్తును చూచువాని దృష్టినుండి భగవంతుడు ఎన్నడును కనుమఱుగు కాడు. భగవంతుని దృష్టిలో కూడ అతడు మఱుగున పడడు. సౌందర్య, మాధుర్య, ఐశ్వర్య, ఔదార్యాది అనంతగుణ సముద్రుడు, రసస్వరూపుడు, ఆనందమయుడు ఐన భగవంతుని దర్శనము దేవతలకును దుర్లభము. అట్టి సచ్చిదానంద స్వరూపుని సాక్షాత్తు (ప్రత్యక్షముగా) దర్శించిన పిదప భగవంతునకును భక్తునకును మధ్యగల అనుబంధము అవిచ్ఛిన్నమై యుండును.

ప్రశ్న - భగవంతుని సగుణసాకారస్వరూపదర్శనసిద్ధికై సాధనను ఆరంభదశయందు ఎట్లు చేయవలెను? అట్టి సాధన యొక్క అంతిమ స్థితి యెట్లుండును?

సమా -సగుణసాకారస్వరూపమునందు శ్రద్ధాదరములను ఉంచుట ముఖ్య విషయము. నా ఇష్టదైవము (నా ఇలవేలుపు), సర్వశక్తిమంతుడు, సర్వోన్నతుడు, సగుణుడు, నిర్గుణుడు అన్నియును అతడే, అను దృఢ విశ్వాసము సగుణసాకార స్వరూప - ఉపాసకునకు ఉండుట ఎంతేని ఆవశ్యకము. సాధకుడు తన ఇష్టదైవస్వరూపమునెడ చూపెడి శ్రద్ధాదరములను తదితర దైవస్వరూపము వైపునకు మళ్ళించినచో తన ఇష్టదైవోపాసనవలన కలుగు సత్ఫలము లభింపదు. క్రమముగా దృఢబుద్ధితో తన మనోనుకూల నిశ్చయానుసారము ఇష్టదైవముయొక్క మూర్తిని గాని, చిత్రపటమును గాని ఎదుట నుంచుకొని తన ఇష్టదైవమే ఈ రూపమున తన ముందు ప్రత్యక్షముగా ఉన్నట్లు దృఢముగా భావించి, అత్యంత భక్తిశ్రద్ధలతో విధ్యుక్తముగా పూజింపవలెను. స్తుతి, ప్రార్థన ధ్యానాదుల ద్వారా తన భక్తి భావములను పెంచుకొనవలెను. పూజా సమయమున దృఢభక్తి కలిగియుండుట వలన సాధకుడు ఆ మూర్తిని జడస్వరూపమని భావింపరాదు. ఆ భగవన్మూర్తి చైతన్య రూపమున నడచుచు, తిరుగుచు, నవ్వుచు, మాట్లాడుచు, తినుచు, త్రాగుచు, తన యెదుట మసలుచున్నట్లుగనే భావింపవలెను. సాధకుడు నిజమైన దృఢమైన భక్తి శ్రద్ధలతో ఆరాధించినచో భగవంతుడు విగ్రహమునందే అర్చావతారమున చైతన్యమూర్తియై వివిధరీతుల తన

దూరమే యుండెను. ఆ భుశుండి తన శక్తిమేరకు పరుగులు తీయుచునే యుండెను. కాని శ్రీరాముని భుజములు వానిని తరుముచు వెంబడించుచునే యుండెను. వ్యాకులుడై భుశుండి కన్నులు మూసికొనెను. కనులు తెఱచు సరికి అతడు అయోధ్యలో ఉండెను. ఎదుట పసివాడైన శ్రీరాముడు నవ్వుచుండెను. భుశుండి వెంటనే అతని నోటిలో ప్రవేశించెను. పిదప శ్రీరాముని ఉదరమున అతడు చూచిన దృశ్యములు అత్యద్భుతములు. వాటిని అతని నోటనే విందాము.

"పక్షిరాజా! (గరుడా!) వినుము. నేను అతని ఉదరమున అనేక బ్రహ్మాండములను చూచితిని. అందులో అనేకములైన విలక్షణములైన లోకములు ఒకదానికంటె మిన్నగా మఱియొకటి యుండెను. కోట్లాది చతుర్ముఖ బ్రహ్మలను, శివులను, అసంఖ్యాకములైన తారకలు, సూర్యచంద్రులు, లోకపాలురు, పర్వతములు, నదులు, సముద్రములు, వనములు మొదలగు నానావిధ సృష్టి విచిత్రములను చూచితిని. ప్రతిభువనమునందును వేర్వేఱు అయోధ్యానగరములు, సరయూనదులు, స్త్రీపురుషులు ఉండుట కాంచితిని. దశరథుడు, కౌసల్యాదేవి, భరతాది సోదరులు అనేక రూపములు గలిగియుండిరి. నేను ప్రతిబ్రహ్మాండమును శ్రీరాముని అవతారమును అతని బాల్య క్రీడలను చూచుచు తిరుగుచుంటిని. శ్రీరామచంద్రప్రభువు యొక్క ఆకారము మాత్రము వేర్వేఱుగా లేక ఒకటి గానే యుండెను. అన్ని చోట్లను అదే బాల్యము, అదే సౌందర్యము. అంతటను దయాళువైన అరఘువీరుడే దర్శనమిచ్చుచుండెను. ఈ విధముగ అనేక బ్రహ్మాండములలో పరిభ్రమించుచు, మోహవాయువులచే కొట్టబడి తిరుగుచు నూఱుకల్పములు గడచినట్లాయెను. పిదప నా ఆశ్రమమునకు వచ్చి, కొంతకాలమచట గడిపితిని. నా స్వామి అయోధ్యానగరమున అవతరించిన విషయమును విని భక్తి, ప్రపత్తులతో లేచి అచటికి పరుగిడుచు అచటికి చేరితిని. అయోధ్యలో శ్రీరామచంద్రుని జన్మమహోత్సవములను చూచితిని. మనస్సును మోహమావరించుటచే నేను అలసి పోయితిని. నేని డస్సియుండుట చూచి, శ్రీరామచంద్ర ప్రభువు నవ్వెను. అంతట నేను ఆ స్వామి ముఖమునుండి బయటపడితిని." - ఇవి ఆ కాకభుశుండి స్వానుభవముతో చెప్పిన కొన్ని దివ్య విశేషములు.

వాత్సల్యమును ప్రదర్శించుచు, సాధకుని జీవితమును సఫలము, ఆనందమయము కావించును. (తన అర్చావతార ప్రభావముననే భగవంతుడు మీరాబాయి మొదలగు భక్తుల జీవితములను ధన్యములు గావించెను.) క్రమముగా భగవదనుగ్రహము వలన సాధకునకు అతని ఇష్టదైవము ప్రత్యక్షము అగుటయు సంభవించును. భగవత్సాక్షాత్కారమునకు నిశ్చితకాలపరిమితి ఉండదు. సాధకుని ఉత్కంఠను బట్టి, భగవత్కృపను అనుసరించి, సాక్షాత్కారము శీఘ్రముగా గాని, ఆలస్యముగా గాని కావచ్చును. ఒకసారి భగవంతుడు ప్రత్యక్షమైనచో ఆ పిమ్మట ఆ సాధకునిపై భగవత్కృప ఎల్లప్పుడును ప్రసరించుచునే యుండును. అనంతరము ఎప్పుడైనను, ఎక్కడైనను వానికి భగవద్దర్శనము లభించుచునే యుండును. సాక్షాత్కారమైన పిమ్మట సాధకుని పరిస్థితి ఎట్లుండును? అను విషయము ఇతరులకు తెలియునది కాదు. సాధకునకు మాత్రమే తెలియును. అది అనుభవైకవేద్యము.

భగవత్సాక్షాత్కారమునకు మఱియొక సాధన మార్గముగలదు. తన యిష్టదైవ స్వరూపమును విగ్రహ రూపమునగాని, చిత్రపట రూపమునగాని తన ముందుంచుకొని సాధకుడు ఆరాధింపవలెను. ఆ ఆరాధన సమయమునందే ఏకాంతముగా ప్రతిదినము నియమపూర్వకముగా ధ్యానించుచు ఆ స్వరూపమును దృఢముగా చిత్తమునందు నిలుపుకొనవలెను. కొంతధారణ ఏర్పడిన పిమ్మట ఏకాంతమున కూర్చొని, కనులు తెఱచి, ఆకాశమున మానసికమూర్తిని ఏర్పఱచుకొని, దానిని చూచుచు సాధన చేయువలెను. భగవదనుగ్రహమును గోరుచు దృఢమైన భక్తిశ్రద్ధావిశ్వాసములతో నిరంతరము సాధన చేసినచో కాలక్రమమున ఆకాశమునందు సర్వాంగశోభలతో భగవంతుడు వానికి దరహాసముతో దర్శనమిచ్చును. ఈ సాధన సాధ్యమే. సాధకుడు తన చిత్తవృత్తులను ఇష్టదైవ స్వరూపములో పరిపూర్ణము గావించి, అనన్య భావముతో ఆ స్వరూపమునే చింతన చేయుచుండవలెను. ఆ స్థితిలో దయాళువైన భగవంతుడు సాధకునకు కోరినరూపమున కోరినచోట దర్శనమిచ్చు చుండును. ఈ సాధన బలపడిన పిమ్మట సాధకుడు అటునిటు తిరుగుచున్నను, మనుష్యుల యందును, పశుపక్ష్యాదుల యందును, లతలయందును, వృక్షముల యందును భగవత్స్వరూపమునే చూచుచుండ వలయును. ఈ విధమైన సాధనను చేయగా చేయగా ప్రతి వస్తువు నందును, ఆ వస్తుస్థానమునందును మానసికముగా గూడ సాధకుడు తన ఇష్టదైవ స్వరూపమును సులభముగా చూడగలడు. అనంతరము భగవత్కృపా ప్రభావమున అతనికి ప్రత్యక్షముగా దైవదర్శనము సిద్ధించును. అతడు సర్వత్ర సర్వదా భగవంతుని దర్శింపగలడు.

సంబంధము - అంతటను, అన్నింటను భగవంతుని దర్శింపగల్గిన సాధకునకు భగవత్సాక్షాత్కారము కల్గునను విషయము తెల్పబడినది. భగవత్ప్రాప్తి కలిగిన పురుషుని లక్షణమును, మహత్త్వమును వివరించుచున్నాడు–

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ పురుషుడు (యోగి) | | మున స్థితుడనైయున్న | సర్వథా, వర్తమానః, అపి | = సర్వవ్యవహారముల యందు ప్రవర్తించు చున్నను |
| ఏకత్వమ్, ఆస్థితః | = భగవంతునియందు ఏకీభావస్థితుడై | మామ్ | = సచ్చిదానంద ఘన వాసుదేవుడనైన నన్ను | | |
| సర్వభూత-స్థితమ్ | = సమస్తభూతముల యందును ఆత్మరూప | భజతి | = భజించునో | మయి | = (వాసుదేవుడనైన)నాయందే |
| | | సః, యోగీ | = అట్టి యోగి | వర్తతే | = ప్రవర్తించును. |

భగవంతునియందు ఏకీభావస్థితుడైన పురుషుడు సర్వభూతములయందును ఆత్మరూపమున నున్న సచ్చిదానందఘనవాసుదేవుడనైయున్న నన్ను భజించును. అట్టి యోగి సర్వథా సర్వవ్యవహారముల యందు ప్రవర్తించుచున్నను నాయందే ప్రవర్తించుచుండును. (31)

ప్రశ్న - ఏకీభావ స్థితుడగుట అనగానేమి?

సమా - సాధకుడు సర్వదా సర్వత్ర తన ఇష్టదైవ స్వరూపమును నిరంతరము ధ్యానించుచు తన వ్యష్టి (భిన్న) స్థితిని మఱచి, తన్మయుడగుచుండును. అతని జ్ఞానమునందు భగవద్రూపము తప్ప అన్యమేదియు నుండదు. ఇట్టి భగవత్ప్రాప్తి రూప స్థితినే భగవంతుని యందు ఏకీభావ స్థితుడగుట అని యందురు.

ప్రశ్న - సర్వభూతస్థితుడైన భగవంతుని భజించుట యనగానేమి?

సమా - ఆవిరి, మేఘము, పొగమంచు, నీటిబిందువులు, మంచు మొదలగు వాని యన్నింటి యందును నీరే నిండియున్నది. అట్లే చరాచర విశ్వము నందంతటను భగవంతుడే పరిపూర్ణుడై (వ్యాపించినవాడై) యున్నాడు, అని తెలిసికొని ప్రత్యక్షముగా చూచుటయే సర్వభూతస్థితుడైన భగవంతుని భజించుట యగును. ఈ విధముగా భజించువానిని భగవానుడు సర్వోత్తముడైన మహాత్ముడు అని పలికెను (7/19).

ప్రశ్న - అట్టి యోగి సర్వధా అన్ని విధముల సమస్త వ్యవహారములయందు ప్రవర్తించుచున్నను నాతోనే ప్రవర్తించు చుండును. అనుటలోని అంతర్యమేమి?

సమా - భగవత్ప్రాప్తి నందిన పురుషునకు అంతటను, అన్నింటియందును. ప్రత్యక్షముగా భగవంతుడే కన్పించు చుండును. అట్టి స్థితియందు అతని మనోవాక్కాయ కర్మలన్నియును అతని దృష్టిలో భగవత్సంకల్పమును అనుసరించి, భగవత్పరముగనే జరుగుచుండును. అతడొనర్చు ప్రతిసేవయు, చూచెడి ప్రతిదృష్టియు, ఆర్ద్రభావముతో పలికెడి ప్రతి మధురవచనము భగవద్భావనతో భగవత్పరముగనే జరుగుచుండును. ఈ విధముగ సాగు అతని కర్మలన్నియును భగవదర్పితములే. అందువలన అతడు సర్వథా సమస్త వ్యవహారములయందు ప్రవర్తించుచున్నను భగవంతుని తోడనే ప్రవర్తించుచున్నట్లు భావింపవలెను.

ప్రశ్న - అంతయు భగవన్మయమే అను భావముతో నున్నప్పుడు అతనిద్వారా జరుగు లౌకిక వ్యవహారములన్నియును లోకమర్యాద ప్రకారము ఎట్లు జరుగును?

సమా - చురిక (చిన్నకత్తి), కత్తెర, బాణలి, ఇనుప గరిటె, సుత్తె, ఖడ్గము, బాణము మొదలగు వాటియందు ప్రత్యక్షముగా లోహమునే చూచుచున్నను వాటి ఉపయోగార్థ తలను బట్టి వాటిని ఆయా కార్యములయందు వేర్వేఱుగా వినియోగించుచున్నాము. అట్లే భగవత్ప్రాప్తి నందిన భక్తుడు సర్వత్ర అన్నింటను భగవంతునే చూచుచున్నను అందరి యెడ యథాయోగ్యముగా శాస్త్రానుకూలముగా వ్యవహరించును. ఈ విషయమున సాధారణమానవుల వ్యవహారరీతికిని ఈ ఏకీభావ స్థితయోగి రీతికిని ఎంతేని అంతరముండును. సాధారణ మానవుడు ఇతరుల యెడ శ్రద్ధాదరములతో వ్యవహరించినను వారియందు భగవద్భావన లేకుండుట వలన, కొద్దిగనో గొప్పగనో స్వార్థముండుట వలన ఆశించిన సత్ఫలములు లభింపక పోవచ్చును. సర్వత్ర అందఱియందును భగవంతునే దర్శించుచుండుటవలన భక్తుని నిస్స్వార్థసేవల వలన అందఱికిని హితమే కలుగును. ఈ భక్తుని ద్వారా జరుగు ఏ పనివలన నైనను ఎట్టి పరిస్థితిలోను వాస్తవముగా ఎవ్వరికిని ఏ మాత్రము అహితము జరుగదు.[1]

ప్రశ్న - అతడు సర్వదా లౌకిక వ్యవహారములయందు ప్రవర్తించుచుండును. అను వాక్యమునకు అతడు పుణ్యాపాప (మంచి, చెడు) కర్మలను చేయుచు గూడ నాతోడనే (భగవంతుని తోడనే) ప్రవర్తించుచుండును. అను అర్థమును చెప్పినచో దోసమేమి?

సమా - ఈ వాక్యమునకు ఇట్లు అర్థము చెప్పుటకు వీలులేదు. ఏలనన భగవత్ప్రాప్తినందిన సత్పురుషుడు - ఎట్టి పాపకర్మలను చేయనే చేయడు. సమస్త అనర్థములకును మూలకారణములు పాపకారకములగు కామములే (3/37). ఆసక్తివలననే కామము కలుగును (2/62). పరమాత్మ సాక్షాత్కారమైన పిదప ఆసక్తి అంతరించును (2/59) అని

1) ఉమా జే రామ చరన రత బిగత కామ మద క్రోధ। నిజ ప్రభుమయ దేఖహి జగత కేహి సన కరహి బిరోధ ॥
ఉమా! కామక్రోధమదరహితులై శ్రీరామచరణ రతులైనవారు జగత్తును రామమయముగా చూచుదురు. ఇంక వారికి విరోధము ఎవరి యెడనుండును? (శ్రీరామచరితమానస్).

భగవానుడే స్పష్టముగా పేర్కొనియుండెను. ఇట్టి పరిస్థితిలో భగవత్ప్రాప్తినందిన మహాత్మునిద్వారా నిషిద్ధకర్మలు (పాప కార్యములు) జరుగుట సంభవింపదు. శ్రేష్ఠపురుషుని (జ్ఞాని) ఆచరణములనే ఇతరులందఱును అనుసరింతురు (3/21) అనియు భగవంతుడు నుడివి యుండెను. లోకమున సదాచరణము (సత్ప్రవర్తనము) కొనసాగుటకు సహజముగ జ్ఞానియు బాధ్యత వహించును. కావున భగవత్ప్రాప్తినందిన పురుషుడు పాపకర్మలను చేయనే చేయడు.

*సంబంధము - ఈ విధముగ భక్తియోగము ద్వారా భగవత్ప్రాప్తి నందిన వాని మహత్త్వమును వివరించి, ఇప్పుడు సాంఖ్యయోగముద్వారా పరమాత్మప్రాప్తి కలిగిన పురుషుని సమదర్శనమును, మహత్త్వమును వివరించుచున్నాడు-*

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32 ॥**

- అర్జున! = ఓ అర్జునా!
- యః = ఏ యోగి
- సర్వత్ర = అంతట (సమస్త ప్రాణులను)
- ఆత్మౌపమ్యేన = తనవలె (తనతో)
- సమమ్ = సమానముగా
- పశ్యతి = చూచునో
- సుఖమ్, వా, యది, వా, దుఃఖమ్ = సుఖమునుగాని, దుఃఖమునుగాని (సమానముగా భావించునో)
- సః, యోగీ = అట్టి యోగి
- పరమః, మతః = పరమశ్రేష్ఠుడు అని భావింపబడును.

**ఓ అర్జునా! సర్వప్రాణులను తనవలె (తనతో) సమానముగా చూచువాడును, సుఖమునుగాని, దుఃఖమునుగాని సమముగా (సమానముగ) చూచువాడును (ఇతరుల సుఖ దుఃఖములను తన సుఖదుఃఖములుగా భావించువాడును) అయిన యోగి పరమశ్రేష్ఠుడు. (32)**

ప్రశ్న - సమస్త ప్రాణులను తనవలె సమముగా చూచుట యనగానేమి?

సమా - మనుష్యుడు తన అవయవములను తన ఆత్మను వలె సమభావముతో చూచుకొనునట్లు, సకల చరాచర జగత్తు నందు అందరినీ సమభావముతో చూచుటయే "సమస్త ప్రాణులను తన వలె సమముగా చూచుట" యగును.

ప్రశ్న - సమస్త చరాచర జగత్తునందు సుఖదుఃఖములను తనవివలె సమముగా చూచుట యనగానేమి?

సమా - మనుష్యుడు తన శరీరాంగములను ఆత్మభావమున సమానముగా చూచుట వలన వాటి సుఖ దుఃఖములను తనవి (ఆత్మకు కలిగినవి)గా భావించును. అట్లే సకల చరాచర జగత్తునందు ఆత్మభావము సమానముగా ఉండుట వలన వాటికి కలుగు సుఖదుః ఖములను తనకు కలిగిన సుఖదుఃఖములుగా భావించును. సర్వత్ర ఆత్మదృష్టి కలిగియుండుట వలన విరాడ్రూపమున నున్న సమస్తవిశ్వము వానికి తన స్వరూపముగనే తోచును. జగత్తునందు తనకంటె వేఱైనది ఏదియు ఉండదు. మనుష్యుడు తనకు ఎప్పుడును, ఏవిధముగను, ఏ మాత్రముగను, దుఃఖమును కలిగించుకొనుటకు పూనుకొనడు. మీదు మిక్కిలి నిరంతరము సుఖప్రాప్తి కొఱకే ఆరాటపడుచుండును. సర్వత్ర అందఱియెడను ఆత్మదృష్టిగల యోగి తనసంకల్పమువలన గాని, తన ప్రయత్నమువలన గాని, తనకు సుఖము గల్గినప్పుడు తనపై తాను కృపజూపుటగాని, తననుండి తాను కృతజ్ఞతను కోరుకొనుటగాని ఉండదు. తన ద్వారా ఇతరులకు మేలు జరిగినప్పుడు తానే దానికి కారకుడనని, తాను కర్తవ్య పరాయణుడనని గర్వపడడు. స్వపరభేదములేక అందఱి సుఖము కొఱకు పాటుపడును. అది అతనికి సహజలక్షణము. యోగి సమస్త విశ్వమునకు (జగత్తునకు) ఎప్పుడును, ఏ విధముగను, ఏ మాత్రముగను హాని తలపెట్టక సదా దాని (జగత్తు) హితమునకే కృషిచేయుచుండుట అతనికి సహజలక్షణము.

(పాశ్చాత్య ప్రపంచమునందు ప్రజలెల్లరును సోదర భావముతో మెలగుట మంచిదని భావింతురు. ఈ విశ్వబంధుత్వ సిద్ధాంతము వాస్తవముగా విశిష్టమైనదే. కాని సోదరులయందు స్వార్థభావమువలన ఏదో ఒక

విషయమునందు పరస్పర కలహములు సంభవింప వచ్చును. కాని ఆత్మభావము అనగా అతడును నేనే అను భావము స్థిరముగా నున్నచోట స్వార్థభావమునకు గాని, పరస్పర కలహములకు గాని చోటే ఉండదు. కావున నేడు పాశ్చాత్య విద్వాంసులు గూడ అన్ని సిద్ధాంతముల కంటెను గీతాజ్ఞాన సిద్ధాంతమే ఉత్కృష్టమైనదని భావించుచున్నారు.)

ప్రశ్న - పరమాత్మ ప్రాప్తినందిన యోగి లోకములోని సమస్తచరాచరజీవుల సుఖదుఃఖములను తాను వాస్తవముగా అనుభవించునా? లేక భావనామాత్రముగ అనుభవించునా?

సమా - ఆ సుఖదుఃఖానుభవములను వాస్తవములని గాని, భావనామాత్రములని గాని చెప్పలేము. అతని (యోగి) దృష్టిలో సచ్చిదానంద ఘనపరమాత్మ తప్ప ఇతరమైన ఏ వస్తువునకును అస్తిత్వమే లేనప్పుడు నేటే అనుభవమునకు చోటు ఎక్కడిది? కేవలము భావనామాత్రమైనచో ఇతరులకు దుఃఖము కలుగకుండుటకును, సుఖము కలుగుటకును తన ద్వారా ప్రయత్నమెట్లు జరుగును? ఆ సమయమున వాస్తవముగా అతనిలోగల భావము, దృష్టి అతనికే తెలియును. మాటలద్వారా ఆ భావమును, దృష్టిని వ్యక్తపఱచుట సాధ్యము కాదు. పరమాత్మానందానుభవము తప్ప ఇతరమైన ఏ వస్తువునకు సంబంధించిన అనుభవము అతనికి కలుగదు. లోకదృష్టిలో అది కేవలము భావనామాత్రమే. అయినప్పటికిని అతని కార్యములు ఉత్తమములైనవి, నియమబద్ధములైనవి, సువ్యవస్థితములైనవి.

ప్రశ్న - అవి వాస్తవముగా అనుభవింపబడకున్నచో లోకదృష్టిలో ప్రతీతములగు (భావనా మాత్రములగు) దుఃఖముల నివృత్తికై అతని ద్వారా ప్రయత్నమెట్లు జరుగును?

సమా - అతని వైశిష్ట్యమిదియే. అతని కార్యనిర్వహణము ఉత్తమోత్తమముగా ఉండును. కాని అతని దృష్టిలో ఆ క్రియలకు ఎట్టి ఉనికిగాని, ప్రయోజనముగాని యుండదు. కాని అతని ద్వారా క్రియయు ఉత్తమోత్తమరీతిలో జరుగును. ఈ విషయమును స్థూలముగా అవగాహన చేసికొనుటకు ఒక ఉదాహరణము. చిన్నపిల్లలు ఆటల సమయమున పనికిమాలిన, విలువలేని కంకరరాళ్ళు, మట్టి, పుల్లలు మొదలగు వానికై పరస్పరము కలహించుకొందురు. అజ్ఞానము వలన కొట్టుకొని, బాధపడుటయు జరుగు చుండును. బుద్ధిమంతుడైనవాడు ఈ అర్థములేని కొట్లాటలను చూచి, అందు జోక్యము కల్గించుకొని, వారికి నచ్చజెప్పి, వారి బాధల నివారణకు ప్రయత్నించును. కడకు వారికి సంతుష్టి కలిగించును. అట్లే పరమాత్మప్రాప్తి కల్గిన యోగి బాధలకు లోనైన ప్రపంచ ప్రజల బాధల నివృత్తికొఱకు సహజముగనే పాటుపడును. యోగులైన మహాత్ములు ధన, మాన, కీర్తి, ప్రతిష్ఠాదులనలన ఎట్టి ప్రయోజనములను ఆశింపరు. వారి దృష్టిలో పొందదగిన వస్తువు ఏదియు ఉండదు. పరమాత్మ తప్ప వారు దేని యునికిని గుర్తింపరు. వారి అవర్ణనీయ స్థితి వివరించుటకు ఏ దృష్టాంతముగూడ సరిపోదు. వారి విషయమున ఏ లౌకిక దృష్టాంతము కూడా సంపూర్ణముగ ఉపయోగపడదు. ఎట్టి దృష్టాంతమైనను వారి సమదర్శనమహత్త్వస్థితి యొక్క ఏదో ఒక అంశమును, అదియును లేశమాత్రముగనే తెలుపును.

ప్రశ్న - యోగి అను విశేష్యమునకు 'పరమః' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకతయేమి?

సమా - ఇచట పేర్కొనబడిన యోగి సాధకస్థితిని అధిగమించి సిద్ధిని పొందినవాడు. అట్టి సిద్ధయోగిని సూచించుటకే ఇచట 'పరమః' అను విశేషణము ప్రయుక్తమైనది. ఏ సాధన మార్గమునన్నైనను పరమాత్మ ప్రాప్తినందిన పురుషునియందు సమత్వ లక్షణము అత్యంతావశ్యకము. పరమాత్మప్రాప్తినందిన పురుషుని వర్ణించిన ప్రతి సందర్భమునందును భగవానుడు సమత్వమునకే ప్రాధాన్యమును ఇచ్చెను. ఇతర సద్గుణములు (ఉత్తమలక్షణములు) అనేకములున్నను సమత్వము లేనిచో అట్టివానికి పరమాత్మప్రాప్తి కలుగలేదనియే గ్రహింపవలెను. ఏలనన సమత్వములేనిదే రాగద్వేషముల సంపూర్ణ రాహిత్యము, సర్వప్రాణులయందును సహజమైన సౌహార్దభావము కలుగవు. సమత్వమును సాధించినవాడే పరమాత్మను పొందిన పరమయోగి యనబడును.

సంబంధము - సమభావస్థితిని గూర్చి భగవంతుడు అర్జునునకు వివరించెను. అది విన్న తరువాత అర్జునుడు చంచల స్వభావము గల మనస్సును నిశ్చల స్థితిలో నిల్పుట మిక్కిలి కష్టమని ప్రస్తావించుచున్నాడు-

### అర్జున ఉవాచ

**యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।**
**ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితింస్థిరామ్ ॥ 33 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మధుసూదన! | = ఓ మధుసూదనా! | అయమ్, యోగః | = ఈ యోగము | అహమ్ | = నేను |
| సామ్యేన | = సమభావముతో (సమభావమును గూర్చి) | త్వయా | = నీచేత | ఏతస్య | = ఈ యోగముయొక్క |
| | | ప్రోక్తః | = చెప్పబడినదో | స్థిరామ్, స్థితిమ్ | = శాశ్వతస్థితిని |
| యః | = ఏదైతే | చంచలత్వాత్ | = మనశ్చాంచల్య కారణమున | న, పశ్యామి | = తెలిసికొన (దర్శింప) లేకున్నాను. |

అర్జునుడు పలికెను - ఓ మధుసూదనా! సమభావమును గూర్చి నీవు చెప్పిన ఈ యోగము యొక్క స్థిరస్థితిని మనశ్చాంచల్యకారణమున తెలిసికొనలేకున్నాను. (33)

ప్రశ్న - 'అయం యోగః' అను పదములు ఏ యోగమును గూర్చి తెలుపుచున్నవి?

సమా - కర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము మొదలగు సాధనల పరాకాష్ఠ రూపమైన సమదర్శన భావమే ఇచట యోగము అని తెల్పబడినది.

ప్రశ్న - ఈ యోగమును ధ్యానయోగము అని ఏల భావింపరాదు? ఏలనన మనశ్చాంచల్యము ధ్యానయోగమునకే భంగకరము కదా!

సమా - ఈ అధ్యాయము నందలి 28వ శ్లోకమువఱకు ప్రకరణమును అనుసరించి, ధ్యానయోగము అని భావించుటయే సముచితము. కాని 31,32 శ్లోకములయందు భగవత్ప్రాప్తి నందిన పురుషుని వ్యవహారస్థితి వర్ణింపబడినది. సైగా అర్జునుడు సమత్వమును గూర్చియే ప్రశ్నించెను. కావున ఇచట యోగము అనగా సమత్వ యోగము అనియే భావింపవలెను.

ప్రశ్న - ఈ సమత్వము యొక్క స్థిరస్థితిని పొందుటకు మనశ్చాంచల్యము భంగకరము అనియేల భావింపబడినది?

సమా - చిత్తవిక్షేపమునే చంచలత్వము అని యందురు. ఈ విక్షేపమునకు ప్రధానకారణములు రాగద్వేషములే. రాగద్వేషములు ఉన్నచోట సమత్వము ఉండదు. ఏలనన రాగద్వేషములు సమత్వమునకు ప్రతిబంధకములు. కనుక సమత్వస్థితికి మనశ్చాంచల్యము భంగకరము అని చెప్పుట సమంజసమే.

*సంబంధము - సమత్వయోగమునకు మనశ్చాంచల్యము భంగకరము - అని తెల్పిన పిమ్మట మనస్సును నిగ్రహించుట మిక్కిలి కష్టమని అర్జునుడు పలుకుచున్నాడు-*

**చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | దృఢమ్ | = దృఢమైనది | వాయోః, ఇవ | = వాయువును నిగ్రహించుటను వలె |
| కృష్ణ! | = ఓ కృష్ణా! | బలవత్ | = మిక్కిలి బలీయమైనది | | |
| మనః | = మనస్సు | (అతః) | = అందువలన | సుదుష్కరమ్ | = అతిదుష్కరము అని, |
| చంచలమ్ | = మిక్కిలి చంచలమైనది | తస్య, నిగ్రహమ్ | = దానిని నిగ్రహించుట | | |
| ప్రమాథి | = ప్రమథనశీలమైనది | | | అహమ్, మన్యే | = నేను తలంతును |

**ఓ కృష్ణా! ఈ మనస్సు మిక్కిలి చంచలమైనది. ప్రమథనశీలమైనది (బాగుగా మథించు స్వభావము గలది). దృఢమైనది. మిక్కిలి బలీయమైనది. కనుక దానిని నిగ్రహించుట గాలిని ఆపుటనువలె మిక్కిలి దుష్కరమని భావింతును. (34)**

ప్రశ్న - చంచలత్వమును గూర్చి మునుపటి శ్లోకమున అర్జునుడు చెప్పియే యున్నాడు గదా! మఱల దానిని ఇక్కడ ప్రస్తావించుటకు గల కారణమేమి?

సమా - సమత్వయోగము యొక్క స్థిరస్థితికి మనశ్చాంచల్యము భంగకరమని అర్జునుడు అచట నుడివెను. మనస్సును వశపఱచుకొన్నచో చాంచల్యము దూరమగును అని భగవానుడు చెప్పియుండవచ్చును. కాని మనస్సును వశపఱచుకొనుట మిక్కిలి కష్టమని అర్జునుడు తలంచెను. కనుక అతడు దానిని గూర్చి మఱల ప్రస్తావించెను.

ప్రశ్న - మనస్సునకు ప్రమాథి (మథించునది) అను విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - మనస్సు దీపశిఖవలె చంచలమే. కాని అది కవ్వమువలె మథించు స్వభావము కలది కూడ. పెఱుగు మొదలగు వానిని కవ్వము తఱచినట్లు మనస్సు శరీరేంద్రియములను బాగుగా మథించి (ఊగిసలాటలో ముంచెత్తి) క్షోభకు గురిచేయును.

ప్రశ్న - రెండవ అధ్యాయమునందలి 60వ శ్లోకములో ఇంద్రియములు ప్రమథన శీలములని చెప్పుట జరిగినది. ఇచట మనస్సు ప్రమథనశీలము అని చెప్పుటకు కారణమేమి?

సమా - విషయముల సాంగత్యము వలన రెండును ఒకదానినొకటి క్షోభపెట్టుచుండును. ఆ రెండును కలిసి బుద్ధిని క్షోభకు గురిచేయును (2/67). కావున రెండింటిని ప్రమథనశీలములని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - మనస్సు బలవత్తరమైనది అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - ఈ మనస్సు ఒకేచోట స్థిరముగా నుండక ఇటునటు విశృంఖలముగా సంచరించుచుండును. ఇది శరీరేంద్రియములను మథించుచుండును. మదించిన ఏనుగు వలె మిక్కిలి బలవత్తరమైనది. పరాక్రమము గల ఏనుగునైన అంకుశముతో మాటిమాటికి పొడిచినను అది ఏ మాత్రము మాటవినక తన ఇష్టానుసారము ప్రవర్తించుచుండును. అట్లే వివేకమను అంకుశముతో మాటిమాటికి ఎంతగా పొడిచినను ఈ బలవత్తరమైన మనస్సు విషయారణ్యములనుండి బయటపడుటకు ఇచ్చగింపదు.

ప్రశ్న - మనస్సు దృఢమైనది అనుటలోని విశేషమేమి?

సమా - ఈ మనస్సు చంచలము, ప్రమథనశీలము, బలవత్తరమైనదే కాక ఉడుమువలె దృఢమైనది కూడ. ఇది తాను రమించు విషయమునందే చిక్కుకొనిపోయి అందే తాదాత్మ్యమును చెందును. అట్టి స్థితిలో దానిని ఆ విషయముల నుండి విడదీయుట మిక్కిలి కష్టము. అందువలన అది (మనస్సు) దృఢమైనదని చెప్పుట జరిగినది.

ప్రశ్న - మనస్సును నిగ్రహించుట గాలిని ఆపుటవలె మిక్కిలి దుష్కరము అని అర్జునుడు భావించుటలోని విశేషమేమి?

సమా - మనస్సు మిక్కిలి చంచలము, దుర్ధర్షము అయినదగుట వలన దానిని నిగ్రహించుట మిక్కిలి కష్టము. శరీరమునందు అనుక్షణము (నిరంతరము) ప్రవహించు ఉచ్ఛ్వాస నిశ్వాస వాయువులను హఠయోగము, విచార వివేకములు, బలాది సాధనముల ద్వారా నిగ్రహించుట (అపుట) మిక్కిలి కష్టమైనట్లే, విషయములయందు నిరంతరము సంచరించునట్టి మనస్సు చంచలము, ప్రమథన శీలము, బలీయము, దృఢమైనదగుటచే దానిని వశపఱచుకొనుట మిక్కిలి కష్టము, ఈ విషయమును స్పష్టపఱచుటకే గాలిని ఉదాహరణముగా చెప్పుట జరిగినది.

ప్రశ్న - కృష్ణ! అని సంబోధన ప్రయోగమును చేయుటలోని ఆంతర్యమేమి?

సమా - భక్తుల చిత్తములను తనవైపు ఆకర్షించుకొను వాడు గావున భగవంతునకు కృష్ణ అను పేరు ఏర్పడినది. ఇచట కృష్ణ! అని సంబోధించి అర్జునుడు, ఓ పరమాత్మ! నా మనస్సు మిక్కిలి చంచలమైనది. దీనిని వశపఱచుకొనుటకు నాకు (నా యొక్క) శక్తి చాలదు. భక్తుని మనస్సును నీవైపు ఆకర్షించుకొనుట నీకు స్వాభావికము. అది నీకు చాల సులభము గూడ. కనుక దయతో నా మనస్సును గూడ నీ వైపునకు ఆకర్షించుకొనుము అని ప్రార్థన చేసినట్లు గ్రహింపవలెను.

సంబంధము - మనోనిగ్రహవిషయమున అర్జునుని అభిప్రాయమును ఆదరించుచు, మనస్సును వశపఱచుకొను ఉపాయమును భగవానుడు తెలుపుచున్నాడు-

**శ్రీభగవాన్ ఉవాచ**

**అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35 ॥**

| | | |
|---|---|---|
| మహాబాహో != ఓ అర్జునా! | దుర్నిగ్రహమ్ = నిగ్రహింపశక్యము కానిదే | అభ్యాసేన, చ = అభ్యాసముచేతను |
| అసంశయమ్ = నిస్సందేహముగా | | వైరాగ్యేణ = వైరాగ్యమువలనను |
| మనః = మనస్సు | తు = ఐననూ | గృహ్యతే = నిగ్రహింపబడును (నిగ్రహించుట సాధ్యమే) |
| చలమ్ = చంచలమైనదే | కౌంతేయ! = ఓ కుంతీసుతా! | |

శ్రీ భగవానుడు పలికెను - హే మహాబాహో! నిస్సందేహముగా మనస్సు చంచలమైనదే. దానిని వశపఱచుకొనుట మిక్కిలి కష్టము. కాని కౌంతేయా! అభ్యాస వైరాగ్యములద్వారా దానిని వశపఱచుకొనుట సాధ్యమే. **(35)**

ప్రశ్న - 'నిస్సందేహముగ మనస్సు చంచలమే. దానిని వశపఱచుకొనుట మిక్కిలి కష్టము.' అని భగవానుడు చెప్పుటలోని విశేషమేమి?

సమా - ఆ విధముగ అర్జునుని అభిప్రాయమును సమర్థించుచు, మనస్సు యొక్క సహజ చాంచల్యమునూ, దానిని నిగ్రహించు విషయమున లోకసాధారణమైన కష్టస్థితిని భగవానుడు అంగీకరించుచున్నాడు.

ప్రశ్న - ఇచ్చట 'తు' అను దానిని ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 'మనస్సును వశపఱచుకొనుట మిక్కిలి కష్టమేయైనను అభ్యాసముతోడను, వైరాగ్యముతోడను సహజముగా వశపఱచుకొనవచ్చును'[1] - ఈ విషయమును విశదపఱచి, అర్జునుని ఆశ్వాసించుటకు 'తు' అనునది ప్రయోగింపబడెను.

ప్రశ్న - 'అభ్యాసము' అనగానేమి?

సమా - మనస్సును లక్ష్యసాధన విషయమున లగ్నము చేయుటకై దానిని ఇతర విషయముల నుండి మఱల్చి మాటిమాటికి ఆ లక్ష్యమునందే స్థిరముగా నిల్పుటకు చేయు ప్రయత్నమును 'అభ్యాసము' అని యందురు. ఇచటి ఈ సందర్భమును అనుసరించి 'పరమాత్మను' ధ్యేయముగా చేసికొని, చిత్తవృత్తుల ప్రవాహమును ఆ పరమాత్మ వైపు మఱల్చి, ఆయనయందే లగ్నము చేయు ప్రయత్నమును "అభ్యాసము" అని గ్రహింపవలెను.[2]

ప్రశ్న - చిత్తవృత్తులను పరమాత్మ వైపునకు మళ్ళించి, అందే స్థిరముగా నిల్పుటకు 'అభ్యాసము' నెట్లు చేయవలెను?

సమా - పరమాత్మయే సర్వోన్నతుడు, సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు సర్వశ్రేష్ఠమైన ఒకే ఒక పరమతత్త్వము. అతనిని పొందుటయే జీవితపరమలక్ష్యమను దృఢ విశ్వాసముతో సాధనను కొనసాగింపవలెను. ఈ సాధన పద్ధతులు శాస్త్రములయందు పెక్కు విధములుగా తెలుపబడినవి. వాటిలో కొన్ని ఈ క్రింద వివరింప బడుచున్నవి.

1. భక్తిశ్రద్ధలతో ధైర్యయుక్తమైన బుద్ధి ద్వారా మనస్సును సచ్చిదానంద ఘనపరమాత్మయందు పదే పదే

---

1) పాతంజలి యోగ దర్శనమునందు గూడ ఈ విషయమే చెప్పబడినది. 'అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః (సూ.1/12). అభ్యాసవైరాగ్యముల ద్వారా చిత్త వృత్తులను నిరోధింపవచ్చును.'

2) "తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః" పతంజలి యోగసూత్రము (1/13) ఆ భగవంతుని యందు స్థిరముగానుంచు ప్రయత్నమే అభ్యాసము.

లగ్నమొనర్చుటకు సాధన చేయుట. (6/26-గీత)

2. మనస్సు ధ్యాసపడిన విషయమునందు పరమేశ్వర స్వరూపమును చింతన చేయుట.
3. భగవంతుని మానసికముగా పూజించుటకు అభ్యాసము చేయుట.
4. వాక్కు, శ్వాస. (ఉచ్ఛ్వాస నిశ్వాసలు) నాడి, (ప్రాణాయామము), కంఠము (ఉపాంశువు), మనస్సు మొదలగువానిలో ఒకదాని ద్వారా, శ్రీరామ, శ్రీకృష్ణ శివ, విష్ణు, సూర్య, శక్తి మొదలగు నామములలో ఇష్టదైవనామమును పరబ్రహ్మ పరమాత్మ నామముగా భావించి, నిష్కామభావముతో భక్తిశ్రద్ధలతో నిరంతరము జపము చేయుట.
5. శాస్త్రోక్తములైన భగవత్సంబంధ - ఉపదేశములను శ్రద్ధాభక్తులతో పదే పదే మననము చేయుచుండుట, వాటిని ఆచరించుటకు ప్రయత్నించుచుండుట.
6. భగవత్ప్రాప్తినందిన మహాత్ములను ఆశ్రయించి, వారి అమృతమయములైన వచనములను ఆదరాభిమానములతో వినుట, తదనుసారముగ నడచుకొనుటకు ప్రయత్నించుట. (13/25-గీత)
7. మనశ్చాంచల్యమును అరికట్టి, భగవంతుని యందే అది లగ్నమగుటకు హృదయపూర్వకముగ నమ్రభావముతో పదే పదే భగవంతుని ప్రార్థించుట.

మనస్సును నిగ్రహించుటకు ఇవిగాక ఇంకను ఇతర మార్గములును గలవు. అత్యంతాదరబుద్ధితో, భక్తిశ్రద్ధా విశ్వాసములతో నిరంతరము ఎక్కువ సేపు అభ్యాసము చేసినప్పుడే అది సఫలమగునను విషయమును మఱువరాదు.[1]

సాధనలయందు ఎట్టి అంతరాయములను రానీయరాదు. ఒకరోజు ఒక సాధన, మఱియొక రోజు ఇంకొకసాధన, కొద్దిరోజుల పిమ్మట మఱియొక సాధన - ఇట్లు సాధనలను మార్చుట తగదు. సాధనలను మార్చుటవలన ఏ సాధన మార్గమునందును సరియైన విశ్వాసము లేనట్లు అగును.

ఎన్నుకొన్న సాధన మార్గమును గూడా ఒకరోజు చేయుట, మఱునాడు మానుట వంటి అంతరాయములతో దానిని నడుపరాదు. కొద్దిరోజులు వరుసగా సాధన చేసిన పిదప నిస్పృహతో అధైర్యపడి దానిని మాని వేయరాదు. ఇట్లు చేయుట నిష్ప్రయోజనము.

ప్రశ్న - వైరాగ్య లక్షణ మెట్టిది?

సమా - ఇహపరలోకములకు సంబంధించిన పదార్థము లన్నియును నశ్వరములని భావించి, వాటియందు ఆసక్తి, కాంక్షలు, సంపూర్ణముగా లేకుండుటను 'వైరాగ్యము' అని యందురు. విరాగి యొక్క చిత్తమునందు సుఖదుఃఖముల వలన ఎట్టి వికారములును (మార్పులు) కలుగవు. ఈతని చిత్తము ఎట్టి పరిస్థితులయందును, ఏ విధమైన ఆకర్షణలకును లోనుకానప్పుడు అతడు నిశ్చలమైన దృఢమైన ఆంతరికమైన అనాసక్తిని సంపూర్ణవైరాగ్యమును కల్గినవాడగును.[2]

ప్రశ్న - 'వైరాగ్యము' ఎట్లు ప్రాప్తించును?

సమా - "వైరాగ్యము" పెక్కు మార్గముల వలన సిద్ధించును. వానిలో కొన్ని -

1. సదసద్వివేక ప్రభావముతో ప్రాపంచిక విషయముల యందు ఆకర్షణ (ఆసక్తి), మమకారము, సుఖభావన లేకుండుట.
2. ప్రాపంచిక విషయములు జనన మరణ జరారోగాది దుఃఖములకు కారణములనియు, దోషయుక్తము లనియు, అనిత్యములనియు, భయదాయకము లనియు భావించుట.

---

1) స తు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః ॥ (యోగదర్శనము 1/14) ఆ అభ్యాసము ఎక్కువ కాలము నిరంతరము ఆదరసత్కారములతో ఆచరించుట వలననే దాని పునాది పటిష్ఠమగును.

2) వైరాగ్య విషయమును గూర్చి పతంజలి మహర్షియు ఈ విధముగనే వివరించియున్నాడు. "దృష్టానుశ్రవిక విషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్"॥ (యోగ 1/15) ఈ లోకమునకు సంబంధించిన స్త్రీ, ధనము, భవనములు, గౌరవాభిమానములు, కీర్తిప్రతిష్ఠలు మున్నగువానియందును, స్వర్గసుఖాది పరలోక విషయములయందును తృష్ణలేకుండ మనస్సును వశమునందుంచుకొను స్థితియే వైరాగ్యము. "తత్పరం పురుష ఖ్యాతేర్గుణవైతృష్ణ్యమ్" (యోగ 1/16) ప్రకృతి జన్యములైన సత్త్వరజస్తమోగుణముల యందు తృష్ణ లేకపోవుటయే శ్రేష్ఠమైన వైరాగ్యము. ప్రకృతి కంటెను వేఱైన పురుషుని (పరమాత్మ) జ్ఞానము ద్వారా ఈ వైరాగ్యము కలుగును.

3. భగవంతుని గూర్చియు, ప్రపంచమును గూర్చియు యథార్థతత్త్వ నిరూపణ చేయు ఉత్తమ శాస్త్రములను అధ్యయనము చేయుట.

4. పరమ విరాగులైన మహాత్ముల సాంగత్యము చేయుట, వారి సాంగత్యము లభింపనిచో వైరాగ్యపరిపూర్ణులైన అట్టి వారి యొక్క చిత్రపటములను దర్శించుచుండుట, చరిత్రలను పఠించుచుండుట, మననము చేయుచుండుట, కీర్తించుచుండుట.

5. పాడుబడిన విశాలభవనములను, నిర్జనములైన నగరములను, గ్రామములను, శిథిలములైన శిల్పారామములను చూచి, ప్రపంచము యొక్క క్షణభంగురస్థితిని గ్రహించుట.

6. ఏకైక పరబ్రహ్మమే అఖండ – అద్వితీయ సత్యమని గ్రహించి, తదన్యములన్నియును అనిత్యములని ఎఱుంగుట.

7. భగవంతుని యొక్క గుణ, ప్రభావ, తత్త్వ, ప్రేమ, రహస్యములు, అతని లీలామహత్త్వములు, పవిత్ర చరిత్రములు, దివ్య సౌందర్య మాధుర్యాది వైభవములు మొదలగునవి యన్నియును అవర్ణనీయములు. (వర్ణింపనలవికానివి). అర్హులైన మహాపురుషుల ద్వారా వాటిని గూర్చి భక్తిశ్రద్ధలతో వినుట, సమగ్రముగా తెలిసికొనుట, వాటి ప్రభావములకు ముగ్ధులగుట – ఈ విధములగు వైరాగ్య సాధన మార్గములు అనేకములు గలవు.

ప్రశ్న - మనస్సును వశపఱచుకొనుటకు అభ్యాస, వైరాగ్యములు రెండును ఆవశ్యకములా? లేక వాటిలో ఒక్కటి చాలునా?

సమా - రెండును ఆవశ్యకములే. అభ్యాసము చిత్తవృత్తుల ప్రవాహమును భగవంతునివైపునకు త్రిప్పి పోవు సరియైన రాజమార్గము. వైరాగ్యము విషయాభిముఖమైన చిత్తగతిని నిరోధించుటలో ప్రబలమైన ఆనకట్ట. కాని ఈ రెండును పరస్పరసహాయకములని గమనింపవలెను. అభ్యాసము వలన వైరాగ్యము బలపడును. వైరాగ్యము వలన అభ్యాసము వృద్ధిచెందును. అందువలన ఏ ఒక్క దానినైనను బలముగా ఆశ్రయించినచో మనస్సు వశము కాగలదు.

ప్రశ్న - ఇచ్చట అర్జునుని 'మహాబాహో!' అని సంబోధించుటలోని విశేషమేమి?

సమా - అర్జునుడు విశ్వవిఖ్యాత వీరుడు. దేవదానవ మనుష్యులలో వీరాధివీరులను గూడ అతడు తన బాహుబలముచే పరాజితులను గావించెను. మనస్సు మిక్కిలి బలమైనదనియు, దానిని నిగ్రహించుట మిక్కిలి కష్టమనియు భావించి, అధైర్యపడి, ఉత్సాహమును వీడుట అతులపరాక్రమ శాలియైన అర్జునుని వంటి వీరునకు ఏ మాత్రము తగదనియు తెల్పుచు అతని పరాక్రమస్ఫూర్తిని జ్ఞప్తికి దెచ్చుచు ఉత్సాహితుని గావించుటకే భగవంతుడు అతనిని 'మహాబాహో!' అని సంబోధించెను. కుడియెడమల తారతమ్యములు లేక రెండు చేతులతో బాణములను ప్రయోగించి, శత్రుసంహారమొనర్చిన 'సవ్యసాచి'కి ఈ మనస్సును జయించుట ఏమంత కష్టమైన పని గాదని తెల్పుటకే ఈ సంబోధన చేయబడినది.

సంబంధము - మనస్సు వశపఱచుకొను ఉపాయములను ఇంతకు ముందు భగవంతుడు తెలిపెను. మనస్సును వశపఱచుకొననిచో కలుగు హానిని గూర్చి వివరించుచున్నాడు-

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥ 36 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అసంయతాత్మనా | = మనస్సును వశపఱచుకొనని వానికి | | అశక్యము) | అవాప్తుమ్, | = (దానిని) పొందుట |
| యోగః | = యోగము (యోగసిద్ధి) | తు | = అయితే | శక్యః ఇతి | = శక్యమే అని |
| దుష్ప్రాపః | = దుష్ప్రాప్యము (పొందుట | వశ్యాత్మనా, | = మనస్సువశమైన | మే, మతిః | = నా అభిప్రాయము |
| | | యతతా ఉపాయతః | = ప్రయత్నశీలునకు సాధనద్వారా | | |

మనస్సును వశపఱచుకొనని పురుషునకు యోగసిద్ధి కలుగుట కష్టము. కాని మనస్సు వశమునందున్న ప్రయత్నశీలుడైన పురుషుడు సాధనద్వారా సహజముగా యోగసిద్ధిని పొందుట సాధ్యమే అని నా అభిప్రాయము. **(36)**

ప్రశ్న - మనస్సును వశపఱచుకొనని పురుషునకు సమత్వ ప్రాప్తికలుగుట ఏల కష్టము?

సమా - అభ్యాస, వైరాగ్యములద్వారా తన మనస్సును వశమునందుంచుకొననివాడు రాగద్వేషములకులోనగును. వాటి ప్రభావమున కోతివలె అతని మనస్సు అటునిటు గంతులు వేయుచు, దుముకుచుండును. అది భోగముల యందు ఆసక్తమగుటవలన అతని బుద్ధి విషయలంపటమున మునిగి అస్థిరమై పోవును. (గీత. 2/41-44) ఇట్టి పరిస్థితిలో సమత్వ యోగప్రాప్తి యెట్లు కలుగును? అందువలన అట్లు చెప్పబడినది.

ప్రశ్న - వశపఱచుకొనబడిన మనస్సుయొక్క లక్షణము లెవ్వి?

సమా - వశపఱచుకొనబడిన పిదప మనస్సు యొక్క చాంచల్యము, మథించుగుణము, ప్రాబల్యము, దృఢత్వము దానినుండి దూరమగును. మఱియు నిరాడంబరుడై సరళ శాంతస్వభావుడై గురువుననుసరించు శిష్యునివలె ఆ మనస్సు సాధకుని ఆజ్ఞలకు లోబడి మెలగుచుండును. ఆ సాధకుని ఆజ్ఞానుసారము ఎప్పుడైనను, ఎక్కడైనను, ఎంతవఱకైనను లక్ష్యమునందే నిమగ్నమైయుండును. లక్ష్యమునందే నిమగ్నమైయుండుటకు అది యేమాత్రము సంకోచింపదు. ఇంద్రియముల మాట వినదు. పెడదారి పట్టదు. స్వతంత్రించి విశృంఖలముగా ప్రవర్తింపదు. నిస్పృహకు గురికాదు. ఉపద్రవములను తెచ్చిపెట్టదు. ప్రశాంతముగా నుండును. సాధకుని ఇష్టవస్తువుతో తాదాత్మ్యము చెందును. దీనికి ప్రత్యేకమైన అస్తిత్వము ఉన్నదా? లేదా? అనుస్థితిలో మిగులును. వశవర్తియైన మనస్సుయొక్క లక్షణములిట్టివియే.

ప్రశ్న - 'తు' ప్రయోగముయొక్క విశేషమేమి?

సమా - మనస్సు వశముకాని పురుషునితో పోల్చుచు, మనస్సును వశమునందుంచుకొనిన వాని విలక్షణస్థితిని చూపుటకు 'తు' ప్రయోగింపబడినది.

ప్రశ్న - మనస్సును వశపఱచుకొనిన పురుషుడు 'ప్రయత్నశీలుడు' కావలెనని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - మనస్సు వశవర్తియైన పిదపకూడ నిత్య ప్రయత్నము కొనసాగుచు ఉండనిచో అనగా మనస్సును పరమాత్మయందు సంపూర్ణముగా లగ్నము చేయుటకు గట్టి సాధన చేయనిచో సమత్వయోగము తనంతట తానే లభింపదు. కావున సాధకుడు 'ప్రయత్నశీలుడు'గా ఉండుట ఎంతేని ఆవశ్యకమని చెప్పబడినది.

ప్రశ్న - మనస్సు వశమైన పిదప సమత్వయోగప్రాప్తికి సాధన మార్గములేవి?

సమా - సాధన మార్గములు అనేకములుగలవు. వానిలో కొన్ని -

1. కోరికలను, విషయములను (ఇంద్రియార్థములను) అన్నింటిని వీడి, వివేక వైరాగ్యయుక్తుడై, పవిత్రమైన, స్థిరమైన, పరమాత్మాభిముఖమైన బుద్ధి ద్వారా మనస్సును నిత్యము నిరంతరము విజ్ఞానానందఘన పరమాత్మ స్వరూపమునందు నిలిపి, ఆ పరమాత్మను తప్ప తదన్యమైనదానిని, దేనిని చింతన చేయకుండుట. (గీత. 6/25)

2. సమస్త చరాచర జగత్తునకు లోపల, బయట, పైన, క్రింద, అన్నివైపుల సర్వవ్యాపకుడు నిత్యుడు ఐన విజ్ఞానానంద ఘన పరమాత్మను ఒక్కనినే పరిపూర్ణునిగా చూచుట, తనతో సహా సమస్త దృశ్య ప్రపంచము పరమాత్మ స్వరూపమేయని తెలిసికొనుట, ఆకాశమునందున్న మేఘములకు పైన, క్రింద, లోపల, బయట, ఆకాశమే పరిపూర్ణముగా ఉన్నట్లు, మఱియు ఆకాశమే దానికి ఉపాదాన కారణమైనట్లు తనతో సహా బ్రహ్మాండమంతయును అన్నివైపుల పరమాత్మతో నిండి యున్నదనియు, పరమాత్మ స్వరూపమేయనియు తెలిసికొనుట. (13/15 గీత)

3. శరీరేంద్రియమనస్సులద్వారా ప్రపంచమున జరుగు క్రియలన్నియును గుణములద్వారానే జరుగుచున్నవి. అనగా ఇంద్రియములు తమతమ ఇంద్రియార్థములయందు వర్తించుచున్నవి - అని తెలిసికొని, ఆ క్రియలనన్నింటికిని తాను సర్వథా వేఱుగానున్న ద్రష్ట అనగా సాక్షి అని గ్రహించి, నిత్యము విజ్ఞానానంద ఘన పరమాత్మయందు అభిన్నభావస్థితుడై, సమష్టి బుద్ధిద్వారా ఆ నిరాకార - అనంత

చేతన స్వరూపము యొక్క అంతర్గత సంకల్పము యొక్క ఆధారముపై నిలిచిన దృశ్యప్రపంచము క్షణ భంగురమని గ్రహించుట. - (5/8,9/14/19)

4. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శివుడు, విష్ణువు, సూర్యుడు, శక్తి, విశ్వరూపుడు, మొదలుగాగల స్వరూపములన్నియును భగవంతునివే. సర్వోన్నతుడు, సర్వాంతర్యామి, సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, పరమ దయాళువు, ప్రేమాస్పదుడు ఐన వాడు ఆ పరమాత్మ. ఇట్టి భావనతో తనకిష్టమైన దైవస్వరూపముయొక్క చిత్రపటమును గాని, మూర్తినిగాని తనకు ఎదురుగా ఉంచుకొనవలెను. లేక తన మనస్సు ద్వారా తన హృదయమునందుగాని, బయటగాని భగవద్రూపమును నిల్పుకొని మిక్కిలి భక్తి శ్రద్ధలతో నిరంతరము అతనియందే మనస్సును లగ్నముచేయవలెను. అట్లే పత్ర పుష్పఫలాదుల ప్రదానములతోగాని, తదితరములైన సముచిత విధానములగాని, అతని సేవా పూజాదికములను గావింపవలెను. భగవన్నామజపమును గూడ చేయవలెను.

5. సిద్ధి - అసిద్ధులయెడ సమభావముంచి, ఆసక్తి ఫలేచ్ఛలను త్యజించి, శాస్త్రవిహిత కర్తవ్యకర్మలను ఆచరింపవలెను. (2/48)

6. ప్రపంచ వస్తుజాలమంతయును భగవంతునకు చెందినదే - అని భావించి, యజ్ఞదానతపస్సేవాది శాస్త్రోక్త కర్మలను భక్తిశ్రద్ధలతో భగవత్పరముగ చేయవలెను. (గీత 12/10)

7. సమస్త కర్మలను, తనను, భగవంతునకర్పించుకొని, మమతాసక్తులను త్యజించి, నిరంతరము ఆ భగవంతునే స్మరించుచుండవలెను. భగవదిచ్ఛానుసారము ఆట బొమ్మవలె తాను నిమిత్తమాత్రుడై సర్వకార్యములను చేయుచుండవలెను. (18/57)

ఇవిగాక ఇంకను మఱి యెన్నో సాధన మార్గములు గలవు. మొట్ట మొదట ఏదేని ఒక సాధన మార్గమున మనస్సును వశపఱచుకొనవలెను. పిమ్మట శ్రద్ధాదరములతో పరమాత్మ ప్రాప్తియే లక్ష్యముగా ఉపర్యుక్త మార్గములద్వారా సాధన చేసినచో సమత్వ యోగప్రాప్తి కలుగును.

*సంబంధము - యోగసిద్ధికై మనస్సును వశమునందుంచుకొనుట పరమావశ్యకమని తెలుపబడినది. మనస్సు వశమునందుండకున్నను యోగాచరణమునందు శ్రద్ధయుండుటవలన భగవత్ప్రాప్తికై సాధన చేయుచు అతడు మరణించినచో వాని గతి యేమగును? అని అర్జునుడు ప్రశ్నించుచున్నాడు-*

**అర్జున ఉవాచ**

**అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।**
**అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37 ॥**

| పదము | అర్థము |
|---|---|
| కృష్ణ! | ఓ కృష్ణా! |
| శ్రద్ధయా, ఉపేతః | (యోగమునందు) శ్రద్ధాదరములు గలవాడైనను |
| అయతిః | సంయమికానివాడై |
| యోగాత్, చలితమానసః | అవసాన దశయందు యోగమునుండి చలించిన మనస్సుకల వాడైన (సాధకుడు) |
| యోగసంసిద్ధిమ్ | యోగసిద్ధిని |
| అప్రాప్య | పొందక |
| కామ్, గతిమ్ | ఎట్టిగతిని |
| గచ్ఛతి | పొందును? |

అర్జునుడు పలికెను- ఓ కృష్ణా! యోగమునందు శ్రద్ధాదరములతో యోగసాధన చేయుచు మనస్సు వశమునందుండని కారణమున అవసాన దశలో మనస్సు చలించి, యోగసిద్ధిని (భగవత్సాక్షాత్కారమును) పొందకయే మరణించిన సాధకుని గతి యేమగును? (37)

ప్రశ్న - ఇచట 'అయతిః' అను పదమునకు ప్రయత్నరహితుడు అనిగాక 'అసంయమీ' అను అర్థమును చెప్పుటకు గల కారణమేమి?

సమా - పూర్వ (36వ) శ్లోకమున మనస్సును వశపఱచుకొనని అసంయతాత్మునకు యోగప్రాప్తి కష్టమని చెప్పబడినది. ఈ ప్రశ్నకు అదియే ఆధారము. శ్రద్ధాళువైన పురుషుడు తప్పక ప్రయత్నశీలుడు అగును. ఇందు శంకకు తావులేదు. వశపఱచుకొనబడిన మనస్సు విచలితమగునేమో యని శంకింపబనిలేదు. ఈ కారణముల వలన 'అయతిః' అను పదమునకు ప్రయత్నరహితుడు అను అర్థమును చెప్పక అసంయమి అనగా మనస్సును జయింపనివాడు అను అర్థమును చెప్పుటయే సముచితము.

ప్రశ్న - ఇచట యోగ శబ్దమునకు అర్థమేమి? దాని సాధనసమయమున మనస్సు చలించుట యనగానేమి? శ్రద్ధాళువైన సాధకుని మనస్సు యోగము నుండి చలించుటకు గల కారణమేమి?

సమా - పరమాత్మ ప్రాప్తియే లక్ష్యముగా గొని కొనసాగింపబడు సాంఖ్యయోగ, భక్తియోగ, ధ్యానయోగ, కర్మయోగాది సాధనలన్నింటిద్వారా సిద్ధించు సమభావమునే ఈ యోగశబ్దము తెలుపును. శరీరమునుండి ప్రాణములు వియోగమును పొందునప్పుడు (అవసాన దశయందు) సమభావము నుండి అనగా పరమాత్మస్వరూపమునుండి మనస్సు చలించుటయే మనస్సు యోగము నుండి చలించుట యనబడును. మనశ్చాంచల్యము, ఆసక్తి, కోరికలు, శరీరబాధ, అపస్మారకస్థితి మొదలగునవి అనేకములు ఈ మనస్సు చలించుటకు గల కారణములు.

ప్రశ్న - 'యోగసంసిద్ధిమ్' అను పదము దేని సిద్ధిని సూచించును?

సమా - కర్మ జ్ఞాన భక్తి ధ్యానాది యోగముల వలన సిద్ధించు సమభావముయొక్క ఫలము పరమాత్మప్రాప్తి. ఆ పరమాత్మ ప్రాప్తిని తెలుపునదియే 'యోగసంసిద్ధి' అను పదము. మరణకాలమందు (అవసానదశయందు) సమభావ రూపమైన యోగము నుండి అనగా భగవత్స్వరూపము నుండి మనస్సు చలించిన కారణమున పరమాత్మ సాక్షాత్కారము కాకుండుటయే యోగసంసిద్ధి కలుగకుండుట అని అనబడును.

ప్రశ్న - మనస్సు యోగమునుండి చలించినచో అతనికి ఏ గతి పట్టును? అనునది అర్జునుని ప్రశ్న. దీనికి మృత్యు సమయమున మనస్సు సమత్వయోగమునుండి చలించుట అని వివరణ చేయుబడినది. కాని అట్లుగాక సాధకుడు కర్మ, ధ్యానయోగాది సాధన మార్గములను అనుసరించుచు మధ్యలో సాధనలను మానివేసి విషయభోగములయందు చిక్కుకొనినచో అతని గతి యేమగును? అని వివరణ చేసినచో దోషమేమి?

సమా - అర్జునుని ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచు సాధకుని మరణానంతరగతిని గూర్చి పునర్జన్మను గూర్చి భగవానుడు వివరించెను. కనుక అర్జునుని ప్రశ్నయు సాధకుని మృత్యుకాలమునకు సంబంధించినదే యనుట స్పష్టము. మఱియును గతియను పదము సామాన్యముగా మరణానంతర స్థితినే సూచించును. కావున ఈ ప్రశ్న (సందర్భము) సాధకుని అవసానకాలమునకు సంబంధించినదిగా భావించుటయే సముచితము.

**కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి ।**
**అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ 38 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో! | = ఓ కృష్ణా! | విమూఢః | = మోహితుడై | | మేఘమువలె |
| బ్రహ్మణః, పథి | = భగవత్ప్రాప్తి రూప మార్గమునందు | అప్రతిష్ఠః | = ఆశ్రయరహితుడై | ఉభయవిభ్రష్టః | = ఉభయభ్రష్టుడై |
| | | ఛిన్నాభ్రమ్, ఇవ | = ఛిన్నాభిన్నమైన | కచ్చిత్, న, నశ్యతి | = అధోగతిపాలుకాడుగదా? |

**హే మహాబాహో! అతడు (యోగభ్రష్టుడు) భగవత్ప్రాప్తిమార్గమునుండి జారినవాడై, ఆశ్రయరహితుడై (ఆలంబనము లేనివాడై), ఉభయభ్రష్టుడై, ఛిన్నాభిన్నమైన మేఘమువలె అధోగతి పాలు కాడు గదా! (38)**

ప్రశ్న - భగవత్ప్రాప్తి మార్గమునుండి పతితుడగుట, ఆశ్రయ రహితుడగుట అనగానేమి?

సమా - మనశ్చాంచల్యము, వివేక వైరాగ్యముల లోపముల కారణముగ భగవత్ప్రాప్తి సాధనమార్గముల నుండి మనస్సు పెడదారి పట్టుటవలన పరమాత్మప్రాప్తి కలుగదు. ఫలేచ్ఛను త్యజించుట వలన శుభకర్మల ఫలస్వరూపమైన స్వర్గాది లోకలాభములును దక్కవు. ఇట్టి స్థితినే భగవత్ప్రాప్తి మార్గమునుండి పతితుడై, ఆశ్రయ రహితుడగుట - అని యందురు.

ప్రశ్న - ఉభయభ్రష్టుడై ఛిన్నాభిన్నమైన మేఘమువలె అధోగతిపాలగుట యనగానేమి?

సమా - జీవిత పర్యంతము ఫలేచ్ఛను త్యజించి, కర్మలు చేయుటవలన వారికి స్వర్గాది భోగములు ఎట్లును లభింపవు. అంతిమ సమయమున యోగసాధననుండి మనస్సు చలించుటచే భగవత్ప్రాప్తియును లభింపదు. మేఘమునుండి ఒక శకలము వేఱై మఱియొక మేఘముతో చేరక ఛిన్నాభిన్నమైనట్లు సాధకుడు అటు పరమాత్మను గాని, ఇటు స్వర్గాది భోగములను గాని పొందక ఉభయభ్రష్టుడు కాడు గదా? (అనగా అధోగతిపాలుకాడు గదా?) అని అర్జునుని సందేహము.

సంబంధము - అర్జునుడు ఇట్టి సందేహమును ప్రకటించి, దాని నివృత్తికై భగవంతుని ప్రార్థించుచున్నాడు-

**ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।**
**త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 39 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృష్ణ | = ఓ కృష్ణా! | ఛేత్తుమ్ | = ఛేదించుటకు (తొలగించుటకు) | త్వదన్యః | = నీవు తప్ప మఱి యెవ్వడును |
| మే | = నా యొక్క | అర్హసి | = (నీవే) అర్హుడవు | అస్య, సంశయస్య, ఛేత్తా | = ఈ సంశయమును తొలగింప గలవాడు |
| ఏతత్, సంశయమ్ | = ఈ సందేహమును | హి | = ఏలనన | న, ఉపపద్యతే | = లభింపడు |
| అశేషతః | = పూర్తిగా | | | | |

**ఓ కృష్ణా! ఈ నా సందేహమును పూర్తిగా నివృత్తిచేయుట నీకే చెల్లును. ఏలనన ఈ సందేహమును తొలగించుట నీకు తప్ప మఱెవ్వరికిని శక్యము కాదు. (39)**

ప్రశ్న - అర్జునుడు ప్రకటించిన ఈ భావములను స్పష్టీకరింపుము.

సమా - సాధకుని (యోగభ్రష్టుని) మరణానంతరగతిని అర్జునుడు తెలిసికొన గోరుచున్నాడు. ఈ రహస్యమును సాధారణ మానవులెవ్వరును బుద్ధిబలముచే గాని, తార్కికశక్తిచే గాని సంపూర్ణముగా తెలిసికొనజాలరు. సమస్త కర్మల పూర్వాపరములను, సృష్టినియమములను, సమస్త లోకరహస్యములను ఆమూలాగ్రముగ తెలిసినవాడే ఈ రహస్యమును విప్పిచెప్పగలడు. సమస్త లోకముల యందలి దేవతలు, అన్ని లోకములయందును సంచరింపగలుగు ఋషులును, మునులును, తపస్సంపన్నులును, వివిధ లోకములయందలి సంఘటనలు చూచి తెలిసికొను సామర్థ్యము గల యోగులు మున్నగువారు సైతము ఇందలి ఏకాంశమును గూర్చి మాత్రమే కొంతమేరకు తెలిసికొనగలరు. దీని పూర్తి రహస్యము భగవంతునకు మాత్రమే తెలియును. శ్రీకృష్ణభగవానుని మహిమను అర్జునుడు మొదటి నుండియు ఎఱిగియుండెను. శ్రీకృష్ణ భగవానుడు 4వ అధ్యాయము నందు తాను సమస్త ప్రాణుల జన్మ రహస్యములను ఎఱిగిన వాడననియు (4/5) జన్మరహితుడను, శాశ్వతుడను, సమస్త ప్రాణులకు ఈశ్వరుడును అయినవాడననియు (4/6) గుణకర్మలను బట్టి సమస్త ప్రాణులను సృజించువాడననియు, (4/13) సర్వలోకమహేశ్వరుడననియు (5/29) స్వయముగానే తెల్పియుండెను. ఈ కారణమువలన అర్జునునకు శ్రీకృష్ణుని

పరమేశ్వరత్వముపై విశ్వాసము మిక్కిలి దృఢపడెను. అందువలన శ్రీకృష్ణుడొక్కడే తన సందేహములను నివృత్తి చేయగలవాడనియు, తదితరులకు అది అసాధ్యమనియు విశ్వాసమును ప్రకటించి, తన సందేహమును తీర్చుమని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రార్థించెను.

అంతేగాక అర్జునుడు శ్రీకృష్ణ భగవానుని గూర్చి-

"నీవు సర్వాంతర్యామివి, సర్వజ్ఞుడవు, సర్వశక్తిమంతుడవు, సమస్త లోకమర్యాదలకును నిర్మాతవు, నియంత్రణకర్తవు, సాక్షాత్పరమేశ్వరుడవు, అనంత కోటి బ్రహ్మాండముల యందలి అనంతజీవుల గతుల రహస్యములను ఎఱిగినవాడవు, సమస్త లోకములలో అన్ని (త్రి) కాలముల యందును సంభవించు సంఘటనలను తెలిసినవాడవు. అట్టి నీకు యోగభ్రష్టుల స్థితిగతులను గూర్చి సంపూర్ణముగ వివరించుట మిక్కిలి సులభము. నీ అనుగ్రహమునకు పాత్రుడనై నిన్నే నమ్మిన నాకు ఈ సందేహమును నీవు తప్ప ఇంకెవరు తీర్చగలరు? కావున దయతో ఈ రహస్యమును విప్పి చెప్పి, నా సంశయ పరంపరను నివృత్తి చేయుము" అని పలికెను.

*సంబంధము - యోగమునుండి విచలితుడైన సాధకుడు ఉభయభ్రష్టుడై అధోగతిపాలు కాడు గదా? అని అర్జునుడు ప్రశ్నించెను. దానికి భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**శ్రీభగవాన్ ఉవాచ**

**పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ॥ 40 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | అముత్ర, ఏవ | = పరలోకమునందును | | కర్తవ్య కర్మలను |
| తస్య | = అట్టి పురుషునకు | న(విద్యతే) | = (వినాశము) ఉండదు | | ఆచరించువాడు |
| ఇహ | = ఈ లోకమున | హి | = ఏలనన | కశ్చిత్ | = ఎవ్వడును |
| వినాశః | = వినాశము | తాత! | = ఓ నాయనా! | దుర్గతిమ్, న గచ్ఛతి | = దుర్గతిపాలుగాడు |
| న, విద్యతే | = ఉండదు | కల్యాణకృత్ | = భగవత్ప్రాప్తికై | | |

**శ్రీభగవానుడు పలికెను - ఓ పార్థా! అట్టి (ఆ) పురుషుడు ఈ లోకమున గాని, పరలోకమున గాని అధోగతిపాలుగాడు. ఏలనన, నాయనా! ఆత్మోద్ధరణమునకు అనగా భగవత్ప్రాప్తికై కర్తవ్యకర్మలను ఆచరించువాడెవ్వడును దుర్గతి పాలుగాడు. (40)**

ప్రశ్న - యోగభ్రష్టుడైన సాధకునకు ఈ లోకమున గాని, పరలోకమునగాని, మఱియెచ్చటనైనను దుర్గతి కలుగదు - అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ప్రస్తుతస్థితినుండి పతనమగుటయే దుర్గతి. కావున మరణానంతరము ఆతనికి మానవజన్మ ప్రాప్తించినచో అది ప్రస్తుతస్థితినుండి పతనస్థితిగా భావింపరాదు. అది ఉత్థానమేయగును. ఒకవేళ స్వర్గాది-ఊర్ధ్వలోకములలోనే జన్మించినచో దానిని సైతము పతనస్థితిగా భావింపరాదు. ఉత్థానమేయగును. ఈ కారణమువలన అతనికి ఈ లోకమునందును, పరలోకము నందును, ఎచ్చటను గూడ దుర్గతి ప్రాప్తింపదు. అతడు ఎచ్చట ఉన్నను అచటనే పరమాత్మ ప్రాప్తి మార్గమును అనుసరించుచునే ముందునకు సాగుచుండును. అర్జునుడు సందేహపడిన ఉభయభ్రష్ట విషయమునకు భగవంతుని సమాధానము ఇదియే. అతడు ఇహపరలోకభోగములకు దూరము గాడు. అట్లే భగవత్ప్రాప్తి మార్గమునకును దూరము కాడు.

ప్రశ్న - 'హి' అను అవ్యయము ఏ అర్థమున ప్రయోగింపబడినది? శ్రేయస్సునకై కర్మలను ఆచరించు వానికెవ్వనికిని దుర్గతి ప్రాప్తింపదు. అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - 'హి' అను అవ్యయము హేతువాచకము. సాధకుడు తన శక్త్యనుసారము శ్రద్ధాదరములతో శుభకర్మలను ఆచరించినచో అతనికి ఏ కారణముల వలననైనను, ఎప్పుడైనను సూకర శునక కీట పతంగాదినీచ జన్మలుగాని, కుంభీపాకాది నరకములు గాని ప్రాప్తింపవు. అని భగవంతుడు సమాధానపరచెను.

ప్రశ్న - భగవత్ప్రాప్తికై కర్మలను ఆచరించు ఏ పురుషుడును దుర్గతిని పొందడు అని చెప్పబడినది. అది సరే! మనుష్యుల పూర్వకృత పాపముల ఫలితముగ మరణానంతరము వారికి దుర్గతులు ప్రాప్తింపవచ్చును గదా!

సమా - పూర్వకృత పాపము లున్నప్పటికిని భగవత్ప్రాప్తికై అనగా ఆత్మోద్ధరణమునకై కర్మల నాచరించు వారికి ఎట్టి దుర్గతియు కలుగదు. ఇది నిజము. ఒక లోకానుభవమును పరిశీలింతము. నీతి నిజాయితీలు గల ఒక పురుషుడు ఒక ధనవంతునికడ అప్పు పడియున్నాడను కొందము. అతడు ఒకేసారి ఆ అప్పును తీర్చుటకు శక్తిలేనివాడు. తన దగ్గర ఉన్న సైకమునంతయును అతడు ఆ అప్పుక్రింద ఇచ్చివేసెను. సంపాదించుకున్న ధనమును గూడ ఆ అప్పు క్రింద జమకట్టుచునే యుండెను. అట్టి నీతిపరుని, దయాళువైన వ్యాపారి ఆ (అప్పు ఇచ్చినవాడు) ఎట్టి శిక్షకును గురిచేయడు. అతని నిజాయితీలో లోపము రానంతవఱకు అతనికి అవకాశమును ఇచ్చుచునే యుండును. అదేవిధముగ భగవంతుడుగూడ భగవత్ప్రాప్తికై సాధనచేయు పురుషుని సద్భావననుచూచి అతని పాపఫలితములను నిలిపివేసి, సాధన ద్వారా బంధవిముక్తుడగుటకు అతనికి అవకాశము ఇచ్చును. సాధారణ-ఋణదాతయే అప్పుపడిన వానికి అప్పు తీర్చుటకు అవకాశమును ఇమ్చుచున్నప్పుడు దయామయుడైన భగవానుడు సాధకునకు అవకాశమును ఇచ్చుటలో ఆశ్చర్యము ఏమున్నది?

ప్రశ్న - జడ భరతుడు ఆత్మోద్ధరణమునకై సాధన చేయుచున్నప్పటికిని అతనికి మరణానంతరము హరిణ జన్మయే ప్రాప్తించినట్లు పురాణములు చెప్పుచున్నవి. ఆత్మోద్ధరణమునకై సాధన చేయువానికి మరణానంతరము దుర్గతి కలుగదను నియమమేయున్నచో ఆ భరతునకు అదెట్లు కలిగినది?

సమా - జడ భరతుడు గొప్ప యోగసాధకుడు. అందు సందేహమే లేదు. కాని భూతదయ కారణముగ మోహావశమున అతనికి ఒక జింకపిల్లయందు మమకారము, ఆసక్తి ఏర్పడినవి. కనుక అంత్యకాలమున భగవంతునియందు స్థితమైయున్న అతని ధ్యాస జింకపై మఱలెను. అందువలన అతనికి జింక జన్మము ప్రాప్తించెను. అంతిమ సమయమున చింతనచేయు స్వరూపమే మనుష్యునకు మఱుజన్మమునందు తప్పక ప్రాప్తించుననుట ప్రబలమైన నియమము. (8/6). ఇది తిరుగులేని సత్యము. ఈ జడభరతునకు పశుజన్మ ప్రాప్తించినను దానిని దుర్గతిగా భావింపనవసరము లేదు. అతడు జింకగా జన్మించినను పూర్వజన్మ స్మృతి కలిగియేయుండెను. అతడు మోహమును, ఆసక్తిని వీడి గొప్ప సాధకుల వలె వివేకముతో మెలగెను. రాలిన ఆకులనే తినుచు సంయమముతో పవిత్రజీవనమును గడిపి, ఆ మఱుజన్మమున బ్రాహ్మణుడై పుట్టి, పూర్వజన్మల సంస్కారముల ప్రభావమున శీఘ్రముగా పరమపదమును పొందెను (6/44). దీనిని బట్టి పైన నుడివిన సిద్ధాంత నియమమునకు ఎట్టి ప్రతిబంధకము (బాధయు) లేదు. భగవత్ప్రాప్తియే లక్ష్యముగా చేసికొనిన జీవన విధానమును ఎవ్వరును ఎప్పుడును వీడరాదని జడభరతాదుల వృత్తాంతములు తెలుపుచున్నవి.

ప్రశ్న - ప్రపంచమున పెక్కుమంది సత్సంగములు, భజనలు, ధ్యానములు మొదలగు పవిత్ర కర్మలను ఆచరించినను వారి ద్వారా పాపకర్మలు గూడ జరుగుచునే యుండును. అట్టి వారికి ఏగతి పట్టును?

సమా - వారును దుర్గతులను పొందరు. ఏలననగా శాస్త్రములయందును, మహాపురుషుల యందును శ్రద్ధాదరములు గలవారు పాపముల యొక్క ఫలస్వరూపము భయంకర దుఃఖముల, నరకయాతనల ప్రాప్తియను విషయమునందు సంపూర్ణ విశ్వాసము కలిగియుందురు. కనుక స్వభావ సిద్ధములైన పాపములనుండి, రక్షించుకొనుటకు వారు ప్రయత్నింతురు. దీనికి తోడు భజన ధ్యానాదుల నిత్యాభ్యాసములను కొనసాగించుచుండుటచే వారికి అంతఃకరణశుద్ధియు ఏర్పడును. ఈ లక్షణములను అన్నింటిని కల్గియుండి, అంతశ్శుద్ధి కలవారు స్వభావ

వశమున పాపాత్ములైనను సత్సంగ, భజన, ధ్యానాదికముల ప్రభావముచే వారును పాపాచరణములనుండి విముక్తులై శీఘ్రముగ ధర్మాత్ములు అయ్యెదరు. క్రమముగా వారు ఉద్ధరింపబడుదురు. పతనము చెందరు (గీత 9/30,31).

ప్రశ్న - **'తాత!'** అను సంబోధనము నందలి ప్రత్యేకత యేమి?

సమా - ఎదుటివారిని ప్రేమాదరవాత్సల్యములతో సంబోధించినపుడు తాత! నాయన! మొదలగు పదములను ఉపయోగించుచుండుట సహజము. అర్జునుడు శ్రీకృష్ణునకు ప్రియమిత్రుడు, భక్తుడు, కనుక శ్రీకృష్ణుడు అతనికి అభయమిచ్చుచు, ప్రేమతో ఆశ్వాసించుచు అర్జునుని **'తాత!** (నాయనా) అని సంబోధించెను.

భగవత్ప్రాప్తికై సాధన చేయు మానవుడు ఏ కారణమున నైనను దుర్గతిని పొందక, ఉత్తమ గతినే పొందునపుడు భక్తుడైన అర్జునుని విషయము చెప్పనేల?

*సంబంధము - యోగభ్రష్టునకు దుర్గతి ప్రాప్తింపదు అని తెలుపబడినది. అయినచో అతనికి ఏ గతి ప్రాప్తించును? అను విషయమును భగవానుడు వివరించుచున్నాడు-*

**ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీః సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥ 41 ॥**

యోగభ్రష్టః = యోగభ్రష్టుడైన పురుషుడు
పుణ్యకృతామ్, లోకాన్ = పుణ్యాత్ములు పొందు లోకములను అనగా స్వర్గాది-ఉత్తమ లోకములను
ప్రాప్య = పొంది (అచట)
శాశ్వతీః,సమాః, ఉషిత్వా = పెక్కు సంవత్సరములు గడిపి
శుచీనామ్, శ్రీమతామ్ = పవిత్రులైన సంపన్నుల యొక్క
గేహే = గృహము నందు
అభిజాయతే = జన్మించును

**యోగభ్రష్టుడు పుణ్యాత్ములు పొందు లోకములను అనగా స్వర్గాది- ఉత్తమ లోకములను పొంది, ఆయా లోకములలో పెక్కు సంవత్సరములు గడిపి, పిదప పవిత్రులైన సంపన్నుల గృహమున జన్మించును. (41)**

ప్రశ్న - యోగభ్రష్టుడనగా ఎట్టివాడు?

సమా - జ్ఞాన, భక్తి, ధ్యాన, కర్మాది యోగ సాధనలు చేయుచున్న పురుషుని మనస్సు విక్షేపాది దోషముల వలనను, విషయాసక్తి వలనను, రోగాదుల వలనను అంత్యకాలమున లక్ష్యమునుండి చలించినచో అట్టివానిని యోగభ్రష్టుడని యందురు.

ప్రశ్న - యోగభ్రష్టుడు పుణ్యాత్ములు చేరు లోకములను పొందుననియు, శ్రీమంతుల ఇంటిలో జన్మించుననియు ఇచట చెప్పబడినది. అతనికి నరకాది లోకములు, నీచజన్మలు ప్రాప్తింపవనియు దీనిద్వారా స్పష్టమగుచున్నది. కాని పుణ్యాత్ములు చేరు స్వర్గాది లోకములయందును, ధనవంతుల ఇండ్లలోను, భోగములు అధికముగా నుండును. ఈ కారణముల వలన అతడు (యోగభ్రష్టుడు) భోగాసక్తుడై, భోగానుభవములకై పాపకర్మల యందు ప్రవృత్తుడు అగుట సంభవమే గదా! అట్లు జరిగినచో ఈ రెండుగతులును పరిణామక్రమమున పతన హేతువులే గదా! కావున మఱొక విధముగ (ప్రకారాంతరమున) ఇదియును దుర్గతికే దారితీయును గదా!

సమా - మృత్యు (మానవ) లోకము నుండి బ్రహ్మలోకము వఱకుగల ఊర్ధ్వలోకము లన్నియును పుణ్యాత్ముల లోకములే. ఈ పుణ్యలోకములలో గూడ సుఖభోగానుభవములకు తావిచ్చునవి కొన్ని మాత్రమే. యోగభ్రష్టుడైన పురుషుడు తన గొప్ప పుణ్యవిశేషముచేత భోగస్థానములైన లోకములకు చేరడు. కావున భోగములలో చిక్కుకొనడు. దుర్గతి పాలు కాడు. దుర్గతికి హేతువులైన అపవిత్ర స్పర్శగల (నీచగుణములు, నీచకర్మాచరణములు

గల) సంపన్న కుటుంబములలో జన్మింపడు. కావున శ్రీమతాం అను పదముతో పాటు శుచీనాం అను విశేషణమును ప్రయోగించి, యోగభ్రష్టుడు పవిత్రమైన శ్రేష్ఠగుణములు, విశుద్ధములైన ఆచరణములు గల ధనిక కుటుంబమునందే జన్మించునని తెలుపబడినది. కావున ఇది ప్రకారాంతరమున దుర్గతికాదు.

ప్రశ్న - పెక్కు సంవత్సరములు పుణ్యలోకముల యందే యుండుటకు కారణమేమి?

సమా - ఆ పుణ్యలోకముల యందు పెక్కు సంవత్సరములు ఉండుటకు అతని భోగాసక్తియే కారణము. కర్మయందును. వాటి ఫలములయందును గల మమతాసక్తులే ఆయాకర్మ ఫలానుభవములకు హేతువులగును (2/47). సాధకుని అంతఃకరణమునందు గల కర్మఫలాసక్తిని బట్టి కర్మఫలానుభవములకు వలయు సమయము అచట ఉండుట జరుగుచుండును. ఎక్కువ ఆసక్తిగలవాడు ఎక్కువకాలము, తక్కువ ఆసక్తిగలవాడు తక్కువకాలము పుణ్యలోకముల యందు ఉండుట జరుగును. భోగాసక్తిలేని విరాగియైన యోగభ్రష్టుడు ఆ పుణ్యలోకములకు పోకయే నేరుగా యోగుల కుటుంబమున జన్మించును.

*సంబంధము - సాధారణ యోగభ్రష్టుడైన పురుషుని గతిని గూర్చి తెలుపుట జరిగినది. ఇప్పుడు ఆసక్తి రహితుడైన ఉత్తమశ్రేణికి చెందిన యోగభ్రష్టుని యొక్క విశేషగతిని భగవానుడు వర్ణించుచున్నాడు-*

**అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।**
**ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ 42 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథవా | = అథవా (విరాగియైన పురుషుడు ఆ పుణ్య లోకములకు పోకుండగనే) | యోగినామ్ కులే, ఏవ | = యోగుల కుటుంబములోనే | ఏతత్ | = ఇదియే |
| ధీమతామ్ | = జ్ఞానులైన | భవతి | = జన్మించును | లోకే | = లోకమునందు (లభించుట) |
| | | ఈదృశమ్, జన్మ | = ఈ విధమైన జన్మ | హి | = నిస్సందేహముగా |
| | | యత్ | = ఏది కలదో | దుర్లభతరమ్ | = మిక్కిలి దుర్లభము. |

**అథవా విరాగియైన పురుషుడు ఆ పుణ్య (ఊర్ధ్వ) లోకములకు పోకుండగనే జ్ఞానులైన యోగుల కుటుంబములోనే జన్మించును. కాని లోకమునందు ఇట్టి జన్మ ప్రాప్తించుట మిక్కిలి దుర్లభము. (42)**

ప్రశ్న - 'అథవా' అను ప్రయోగము చేయుటలోని ఆంతర్యమేమి?

సమా - యోగభ్రష్టులలో విషయాసక్తులైనవారు స్వర్గాది లోకములకు వెళ్ళుటయు, అచటి సుఖాది అనుభవముల యనంతరము మరుజన్మలో పవిత్రులైన సంపన్నుల కుటుంబములలో జన్మించుటయు జరుగును. కాని విరాగులైన (విషయాసక్తులుకాని) వారు ఏ ఇతర లోకములకును వెళ్ళరు. ధనికుల కుటుంబములలో జన్మించు అవసరము కూడా వారికి ఉండదు. వారు నేరుగా జ్ఞానులైన సిద్ధులగు యోగుల ఇండ్లలోనే జన్మింతురు. యోగభ్రష్టులైన ఈ రెండు విధముల వారిని వేఱుగా చూపుటకు 'అథవా' అను ప్రయోగము చేయబడినది.

ప్రశ్న - స్వర్గాది పుణ్యలోకముల ప్రాప్తి యోగభ్రష్టు లందరికిని సమానముగనే కలుగుననియు, అచటి సుఖానుభవముల యనంతరము వారిలో కొందరు పవిత్ర ధనికుల కుటుంబములలోను, మరికొందరు జ్ఞానులైన యోగుల ఇండ్లలోను జన్మించుట జరుగుననియు 'అథవా' అను ప్రయోగమునకు అర్థము చెప్పిన దోషమేమి?

సమా - ఇట్లు భావించుట సముచితముకాదు. ఏలనన భోగములయందు నిజమైన వైరాగ్యముకలవారు స్వర్గాది లోకములకు చేరి, పెక్కు సంవత్సరములక్కడ భోగములను అనుభవించుచు ఉండుట వారికి శిక్షతో సమానము.

భగవత్ప్రాప్తియందు విలంబము ఏర్పడుట వైరాగ్యమునకు ఫలముకానేకాదు. కావున పైన తెలుపబడిన అర్థమే సరియైనది.

ప్రశ్న - విరాగులైన యోగభ్రష్టులు యోగుల కుటుంబముల లోనే జన్మింపవలెనన్న ఆ యోగులు గృహస్థులై యుండవలెను. ఏలనన గృహస్థులే జన్మయిచ్చుటకు అర్హులు కదా! 'ధీమతాం' అను పదమునుబట్టి యోగులైన ఈ గృహస్థులు జ్ఞానులై యుండవలెను. గృహస్థులుకూడా జ్ఞానులై యుండుట కుదురునా?

సమా - భగవతత్త్వజ్ఞానము అన్ని ఆశ్రమముల (చతురాశ్రమముల) వారికిని లభించుటకు అవకాశము కలదు. ఈ విషయము గీతలో స్పష్టముగా చెప్పబడినది (3/20, 4/19, 18/56). ఇతర శాస్త్రములయందు కూడా ఇందులకు పెక్కు ఉదాహరణములు కలవు. వశిష్ఠ మహర్షి, యాజ్ఞవల్క్యుడు, వ్యాసుడు, జనకుడు, అశ్వపతి, రైక్వాది మహా పురుషులందరును గృహస్థులై యుండియు జ్ఞానులైయున్నవారే.

ప్రశ్న - 'యోగినాం' అను పదమునకు జ్ఞానులైన యోగులు అను అర్థమును చెప్పక సాధకయోగులు అను అర్థమును చెప్పిన దోషమేమి?

సమా - అట్లు చెప్పినచో 'ధీమతాం' అను పద ప్రయోగము వ్యర్థమగును. అంతేకాక దుర్లభతరం అను పదమును ప్రత్యేకముగా ప్రయోగించుటను బట్టి, ఇట్టి జన్మ (జ్ఞానులైన యోగుల ఇండ్లలో జన్మించుట) పవిత్ర సంపన్నుల కుటుంబములలో జన్మించుటకంటెను మిక్కిలి దుర్లభమైనదని గ్రహింపవలసియున్నది. కావున 'ధీమతాం' అను విశేషణముతో కూడిన 'యోగినాం' అను పదమునకు జ్ఞానులైన సిద్ధయోగులు అను అర్థమును చెప్పుటయే సమంజసము.

ప్రశ్న - యోగుల కుటుంబములలో జన్మించుట అత్యంత దుర్లభము అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - యోగ (పరమార్థ) సాధనకు వలయు అనుకూల పరిస్థితులు యోగుల కుటుంబములలోనే కుదురుకొని యుండును. అవి స్వర్గాది లోకములలోగాని, సంపన్నుల ఇండ్లలో గాని, మరియే ఇతర ప్రదేశములలోగాని లభ్యములుగావు. యోగుల కుటుంబములయందలి తదనుకూల వాతావరణ ప్రభావమున సాధకులు జీవిత ప్రారంభదశనుండియే యోగసాధన యందు నిమగ్నులు కానచ్చును. మరియును జ్ఞానుల కుటుంబములలో జన్మించినవారు అజ్ఞానులు కానేకారు. దీనికి శ్రుతి ప్రమాణము కూడా కలదు.[1] మహాత్ములయొక్క మహిమలను ప్రభావములను చూచిన పిమ్మట, అట్టివారి సాంగత్యమే దుర్లభము, అగమ్యము, అమోఘము అని భావింపబడుచుండునప్పుడు, అట్టి వంశమున జన్మించుట మిక్కిలి దుర్లభమైన విషయమే కదా![2] కావున జ్ఞానులైన యోగుల కుటుంబములో జన్మించుట దుర్లభతరమని చెప్పుట సమంజసమే.

సంబంధము - యోగి వంశమునందు జన్మించిన యోగభ్రష్టునకు మఱుజన్మలోని పరిస్థితి యెట్లుండునో తెల్పుచున్నాడు-

**తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।**
**యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥ 43 ॥**

1) నాస్యాబ్రహ్మవిత్ కులే భవతి। తరతి శోకంతరతి పాప్మానం గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి ॥ (ముండక, ఉప.3/2/9) బ్రహ్మజ్ఞాని వంశమున బ్రహ్మజ్ఞాని కానివాడు ఉండడు. అతడు శోకములనుండియు, పాపములనుండియు తరించును. హృదయమున అవరించియున్న మాయనుండి బయటపడి అతడు అమరుడగును. అనగా శాశ్వతముగ జనన మరణములు లేనివాడగును.

2) మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ (నారదభక్తి సూత్రములు 39) మహాత్ముల సాంగత్యము దుర్లభము, అగమ్యము, అమోఘము.

కురునందన! = ఓ అర్జునా!
తత్ర = అచ్చట
పౌర్వదేహికమ్= పూర్వదేహమున సాధించిన
తమ్, బుద్ధి-సంయోగమ్ = ఆ బుద్ధి యోగమును
(అనగా సమత్వబుద్ధి రూపయోగ సంస్కారములను),
లభతే = (అనాయాసముగా) పొందును
చ = మఱియు
తతః = దానిప్రభావమున
సంసిద్ధౌ = పరమాత్మ ప్రాప్తికై
భూయః, యతతే = మునుపటికంటె ఎక్కువగా మఱల ప్రయత్నించును

అచట (యోగి కుటుంబమున పుట్టిన పిదప) పూర్వదేహమున సాధించిన బుద్ధి సంయోగమును అనగా సమబుద్ధిరూపయోగసంస్కారములను అతడు సులభముగనే పొందును. ఓ కురునందనా! ఆబుద్ధిసంయోగప్రభావమున అతడు మఱల పరమాత్మప్రాప్తి సిద్ధించుటకై మునుపటికంటెను అధికముగా సాధన చేయును. **(43)**

ప్రశ్న - తత్ర అనుపదము కేవలము జ్ఞానులైన యోగుల కుటుంబములో జన్మించుటనే నిర్దేశించునా? లేక పవిత్రులైన సంపన్నుల ఇండ్లలో జన్మించుటను సూచించునా? లేక రెండింటిని సూచించునా?

సమా - జ్ఞానులైన యోగుల కుటుంబమును గూర్చి గత శ్లోకమున వర్ణించుట జరిగినది. ఆ యోగుల కుటుంబమున జన్మించుటకు మధ్యలో దేవాది శరీరములను పొందనవసరము లేదు. ఇచట తత్ర అను పదమునకు యోగుల కుటుంబము అని గ్రహించుటయే సముచితముగా తోచుచున్నది.

ప్రశ్న - అయినచో పవిత్ర సంపన్నుల ఇంటిలో జన్మించిన సాధకులకు బుద్ధిసంయోగము ప్రాప్తింపదా?

సమా - వారు కూడ (పవిత్రసంపన్న కుటుంబములో పుట్టినవారు కూడ) పూర్వసాధన ప్రభావమువలన విషయ భోగములకు దూరమై భగవంతుని వైపు ఆకర్షితులగుదురు. ఈ విషయము రాబోవు శ్లోకమున స్పష్టపఱచబడును.

ప్రశ్న - పూర్వదేహమున సాధించిన బుద్ధి సంయోగము ప్రాప్తించుట యనగానేమి ?

సమా - కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన, యోగాది సాధనల యందు ఏదో యొకదానిద్వారా పూర్వజన్మలో సాధించిన సమభావము ఈ జన్మలో సులభముగ జాగృతమగుటయే బుద్ధి సంయోగము ప్రాప్తించుట యగును.

ప్రశ్న - ఇచట **'తతః'** అను పదముయొక్క అర్థమేమి?

సమా - యోగభ్రష్టుడు యోగుల వంశమునందు జన్మించి, అచట పూర్వసంస్కార ప్రభావమున మఱల సులభముగనే యోగసాధనయందు నిమగ్నుడగుటను **'తతః'** అను పదము సూచించును.

సంబంధము - ఇప్పుడు పవిత్రమైన శ్రీమంతుల ఇంటిలో జన్మించు యోగభ్రష్టుని స్థితిని గూర్చి వర్ణించుచు యోగసాధన జిజ్ఞాసయొక్క మహాత్మ్యమును గూర్చి తెలుపుచున్నాడు-

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44 ॥**

సః = అతడు
అవశః, అపి = పరాధీనుడైనను
తేన, పూర్వాభ్యాసేన, ఏవ = ఆ పూర్వాభ్యాస ప్రభావముననే
హి = నిస్సందేహముగా
హ్రియతే = (భగవంతునివైపు) ఆకర్షితుడగును
యోగస్య, జిజ్ఞాసుః, అపి = అట్లే సమబుద్ధిరూప యోగ జిజ్ఞాసువు గూడ
శబ్దబ్రహ్మ = వేదములలో తెల్పబడిన సకామ కర్మఫలములను
అతివర్తతే = అధిగమించును.

శ్రీమంతుల ఇంటిలో జన్మించిన యోగభ్రష్టుడు పరాధీనుడైనను పూర్వసాధన ప్రభావమున నిస్పందేహముగ భగవంతునివైపు ఆకర్షితుడగును. అట్లే సమబుద్ధిరూపయోగజిజ్ఞాసువుగూడ వేదములలో తెల్పబడిన సకామకర్మల ఫలమును అధిగమించును. **(44)**

ప్రశ్న - ఇచట 'సః' అను పదమునకు శ్రీమంతుల ఇంటిలో జన్మించిన యోగభ్రష్టుడే అను అర్థమును యేల చెప్పవలెను?

సమా - యోగుల కుటుంబమున జన్మించు విరాగియైన యోగభ్రష్టుడు భోగములకు వశమగుననుటకు ఆస్కారమే ఉండదు. కావున అతని విషయములో 'అవశః అపి' అను పదముల ప్రయోగము సముచితము గాదు. అంతేగాక యోగుల ఇంటిలో సహజముగనే సత్సాంగత్యము కలుగుచుండుట వలన భగవంతుని వైపు ఆకర్షితుడగుటకు పూర్వసాధన మాత్రమే హేతువుగా చెప్పుటకు వీలులేదు. కావున ఈ వర్ణనము శ్రీమంతుల ఇంటిలో జన్మించు యోగభ్రష్టునకు సంబంధించినదే అని భావించుట సముచితముగా తోచుచున్నది.

ప్రశ్న - 'అవశః' అను పదముతో పాటు అపి అను ప్రయోగమును చేయుటలో గల విశేషమేమి?

సమా - పవిత్రులును, సత్ప్రవర్తన గలవారును అగు ధనికుల కుటుంబములో సాధారణ ధనికకుటుంబము నందు వలె సుఖభోగలౌల్యమునకు తావుండదు. అయినను అచటను ఏ కారణము వలననైనను యోగభ్రష్టుడైనవాడు స్త్రీ పుత్రధన గౌరవాది భోగములకు లోబడినచో పూర్వ జన్మసాధన ప్రభావమున భగవత్ప్రాప్తి సాధనవైపే మొగ్గుచూపును. 'అవశః' అను ప్రయోగముల ప్రత్యేకత ఇదియే.

ప్రశ్న - 'పూర్వాభ్యాసేన' అను పదముతో 'ఏవ' అని ప్రయోగము చేయుటలోని ఆంతర్యమేమి?

సమా - భోగములకు వశుడైనవానిని విషయజాలము నుండి తప్పించి, భగవంతుని వైపు మఱల్చుటకు పూర్వ జన్మ సాధన సంస్కారమే ప్రధానహేతువు. 'పూర్వాభ్యాసేన' అను పదముతో 'ఏవ' అను పదమును ప్రయోగించుటలోని ఆంతర్యమిదియే.

ప్రశ్న - 'జిజ్ఞాసుః' అను పదముతో పాటు 'అపి' అను అవ్యయమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - సమబుద్ధిరూప యోగమును ప్రశంసించుటకే 'అపి' అను ప్రయోగము చేయబడినది. యోగజిజ్ఞాసువు యోగసాధనయందు శ్రద్ధాళువై దాని సిద్ధికై ప్రయత్నించును. అతడు కూడా వేదోక్తములైన సకామకర్మల ఫలస్వరూపము లగు ఇహపరలోక సుఖభోగములను అధిగమించును. అప్పుడు జన్మజన్మాంతరములనుండి యోగసాధన చేసిన యోగభ్రష్టుని విషయమున ఇక చెప్పవలసిన పనిలేదు.

సంబంధము - ఈ విధముగా శ్రీమంతుల ఇంటిలో జన్మించు యోగభ్రష్టుని స్థితిని వర్ణించి, యోగసాధన జిజ్ఞాసు మహాత్మ్యమును తెలిపిన పిదప ఇప్పుడు జ్ఞానులైన యోగుల వంశమున జన్మించిన యోగభ్రష్టుని గతిని మఱల ప్రతిపాదించుచున్నాడు-

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్ ॥ 45 ॥

తు = అయితే
ప్రయత్నాత్ = ప్రయత్న పూర్వకముగా
యతమానః, యోగీ = అభ్యాసము చేయు యోగి
అనేకజన్మ-సంసిద్ధః = అనేక జన్మల సంస్కారముల ప్రభావమున ఈజన్మయందే సిద్ధిని పొంది
సంశుద్ధ-కిల్బిషః = సంపూర్ణముగా పాపరహితుడై
తతః = తత్ క్షణమే
పరామ్, గతిమ్ = పరమగతిని
యాతి = పొందును

కాని, ప్రయత్నపూర్వకముగ యోగసాధనచేయు యోగి అనేకజన్మలసంస్కారముల ప్రభావమున ఈ జన్మయందే సిద్ధిని పొంది, సంపూర్ణముగా పాపరహితుడై, తత్క్షణమే పరమ పదమును పొందును.**(45)**

ప్రశ్న - ఇచట 'తు' అను దానిని ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - శ్రీమంతుల ఇండ్లలో జన్మించువారికిని, యోగసాధన జిజ్ఞాసువులకును లభించు గతికంటెను విలక్షణమైన గతిని యోగి కుటుంబములో జన్మించు యోగభ్రష్టుడు పొందునని తెల్పుటకై 'తు' అనునది ప్రయోగింపబడెను.

ప్రశ్న - యోగి పదమునకు 'ప్రయత్నాద్యతమానః' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - యోగుల కుటుంబమున జన్మించిన యోగభ్రష్టుడు యోగసాధన సిద్ధికై ఆ జన్మయందు గట్టి ప్రయత్నము చేయునని (6/43) శ్లోకమున చెప్పబడినది. ఆ ప్రయత్నఫలవిషయము అక్కడ ప్రస్తావింపబడలేదు. ఈ శ్లోకమున అట్టి యోగికి పరమపదప్రాప్తి కల్గుట నిశ్చయమని స్పష్టపఱచుటకై యోగి అను పదముతో 'ప్రయత్నాద్యతమానః' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'అనేక జన్మసంసిద్ధః' అను సమాస ప్రాధాన్యమేమి?

సమా - యోగి కుటుంబములో జన్మించిన యోగభ్రష్టుడు పూర్వజన్మల యోగసాధన సంస్కారములను ఈ జన్మలో పొందునని 43వ శ్లోకములో చెప్పబడినది. ఈ విషయమును స్పష్టపఱచుటకే ఇచట 'అనేక జన్మసంసిద్ధః' అను సమాస ప్రయోగము చేయబడినది. పూర్వజన్మలలో చేసిన యోగసాధనయు, ఈ జన్మయందు కొనసాగిన యోగసాధనయు, రెండును కలిసి అతని యోగసిద్ధిప్రాప్తికి అనగా సాధన పరాకాష్ఠకు చేరుటకు హేతువులగును. ఏలనన పూర్వసంస్కారముల ప్రభావముచే అతడు ఈ జన్మయందు గట్టి ప్రయత్నముతో సాధన చేయుచు, సాధన పరాకాష్ఠను చేరుకొనును.

ప్రశ్న - 'సంశుద్ధకిల్బిషః' అనగానేమి?

సమా - సమస్త పాపములును నశించిపోయిన వానిని 'సంశుద్ధకిల్బిషః' అని యందురు. ఈ విధముగా సాధన చేయు యోగియందు పాపములు లేశమాత్రము కూడ ఉండవు అని దీని భావము.

ప్రశ్న - 'తతః' అను ప్రయోగము యొక్క విశిష్టత యేమి?

సమా - 'తతః' అను దానికి దాని తరువాత (తత్పశ్చాత్) అని యర్థము. సాధన యొక్క పరాకాష్ఠ రూప సంసిద్ధిని పొందిన తరువాత, వెంటనే ఏ మాత్రము వ్యవధి లేకుండ పరమగతి ప్రాప్తించును అని స్పష్టపఱచుటకే 'తతః' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - పరమగతి ప్రాప్తి అనగానేమి?

సమా - పరబ్రహ్మ పరమాత్మను పొందుటయే పరమగతి ప్రాప్తి అనబడును. దీనినే పరమపదప్రాప్తి అనియు, పరమధామ ప్రాప్తి అనియు, నైష్ఠిక శాంతి ప్రాప్తి అనియు అందురు.

*సంబంధము - యోగభ్రష్టుని గతికి సంబంధించిన విషయములను సాకల్యముగా వివరించిన పిమ్మట భగవానుడు యోగి మహిమను ప్రశంసించుచు యోగివగుమని అర్జునుని ఆదేశించుచున్నాడు-*

**తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 46 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యోగీ | = యోగి | అధికః | శ్రేష్ఠుడు అని | కర్మిభ్యః, | సకామ కర్మలనుఆచరించు |
| తపస్విభ్యః, | = తాపసులకంటెను | మతః | = భావింపబడును | అధికః | = వారి కంటెను శ్రేష్ఠుడు |
| అధికః | శ్రేష్ఠుడు | చ | = మఱియు | తస్మాత్ | = అందువలన |
| జ్ఞానిభ్యః,అపి | = శాస్త్రజ్ఞానులకంటెను | యోగీ | = యోగి | అర్జున! | = ఓ అర్జునా! |
| | | | | యోగీ, భవ | = యోగివి కమ్ము |

యోగి తాపసులకంటెను శ్రేష్ఠుడు. శాస్త్రజ్ఞానులకంటెను శ్రేష్ఠుడు. సకామకర్మలను ఆచరించువారికంటెను శ్రేష్ఠుడని భావింపబడును. కావున ఓ అర్జునా! నీవు యోగివి కమ్ము. **(46)**

ప్రశ్న - 'తపస్వి' అను పదమునకు అర్థమేమి?

సమా - వర్ణాశ్రమధర్మపాలనమును సకామభావముతో చేయుచును, ఇంద్రియ సంయమపూర్వకముగా క్రియాఫలములను, లేక విషయభోగములను త్యజించి, మనస్సునకును ఇంద్రియములకును, శరీరమునకును సంబంధించిన క్లేశములను అన్నింటిని సహించుటనే తపస్సు అనియందురు. ఆ తపస్సును ఆచరించువానిని తపస్వి అనియందురు.

ప్రశ్న - 'జ్ఞాని' అనుపదమునకు అర్థమేమి?

సమా - ఇచట జ్ఞాని అనుపదమునకు భగవత్ప్రాప్తి నందిన తత్త్వజ్ఞాని అనిగాని, పరమాత్మ ప్రాప్తికై జ్ఞానయోగ సాధన చేయు జ్ఞానయోగి అనిగాని అర్థము చెప్పరాదు. కేవలము శాస్త్రములను, ఆచార్యోపదేశములను అనుసరించి, వివేక బుద్ధి ద్వారా సమస్త విషయములను తెలిసికొనిన శాస్త్రజ్ఞుడు అని మాత్రమే దీనికి అర్థము.

ప్రశ్న - 'కర్మి' అనగానేమి?

సమా - స్త్రీ పుత్ర ధన స్వర్గాదులను పొందుటకై సకామ భావముతో యజ్ఞదాన పూజాసేవాది శాస్త్రవిహిత శుభ కర్మలను చేయువానిని 'కర్మి' అని అందురు.

ప్రశ్న - తాపసులును (తపమాచరించు వారును) శాస్త్రజ్ఞానులును సకామభావసముపేతులే గదా! కనుక వారిని గూడ కర్మిగణము (పవిత్ర కర్మాచరణము చేయువారి)లో చేర్చుటయే సముచితము గదా! అట్లుగాక వారిని వేఱుగా తెల్పుటకు గల కారణమేమి?

సమా - ఇచట 'కర్మి' అను పదము ఇంత విశాలార్థములో ప్రయుక్తముగాలేదు. సకామ భావముతో యజ్ఞదానాది శాస్త్రవిహిత కర్మలను ఆచరించువానినే కర్మి అని అందురు. ఇందు క్రియాబాహుళ్యము కలదు. తపస్వి అను పద ప్రయోగములో క్రియలకు ప్రాధాన్యములేదు. మనస్సు, ఇంద్రియముల సంయమమే ముఖ్యము. జ్ఞాని అను పద (ప్రయోగ)మునందు శాస్త్రీయబుద్ధితో ఆలోచించుటకే ప్రాముఖ్యము గలదు. ఈ ప్రత్యేకతను స్పష్టపఱచుటకే కర్మి అను పదములో తపస్వి, శాస్త్రజ్ఞాని అనువారిని చేర్చక వేఱుగా చూపుట జరిగినది.

ప్రశ్న - ఇచట యోగి అను పదమునకు అర్థమేమి?

సమా - జ్ఞాన, ధ్యాన, భక్తి, కర్మయోగాదులలో ఏదైనను ఒక సాధన మార్గము ద్వారా, సాధన పరాకాష్ఠ రూపమైన సమత్వయోగమును పొందిన వానిని గూర్చియే ఇచట యోగి అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ఇంతకుముందుగా ముఖ్యముగా జ్ఞానయోగము, కర్మయోగము అను రెండు నిష్ఠలు మాత్రమే తెల్పబడినవి గదా! అయినచో భక్తియోగమును ధ్యానయోగమును వీనికంటెను వేరైనవిగా పేర్కొనుట యెందులకు?

సమా - భక్తియోగము కర్మయోగమునందే అంతర్గత మగును. భక్తిప్రధానమైన కర్మయున్నచోట అది భక్తియోగ మనబడును. అట్లే కర్మ ప్రధానమగుచోట అది కర్మయోగము అనబడును. ధ్యానయోగము కర్మయోగ, జ్ఞానయోగములనెడి రెండు నిష్ఠలయందును సహాయకమగు సాధనము. అది (అ ధ్యానయోగము) అభేద బుద్ధితో చేయబడినప్పుడు జ్ఞానయోగము నందును, భేద బుద్ధిచే జేయబడినప్పుడు కర్మయోగము నందును సహాయకమగును.

*సంబంధము - పూర్వ శ్లోకమునందు అందఱికంటెను యోగి సర్వశ్రేష్ఠుడని తెల్పుచు భగవానుడు అర్జునుని యోగివి కమ్మని ఆదేశించెను. కాని జ్ఞానయోగ, ధ్యానయోగ, భక్తియోగ, కర్మయోగాది సాధనలయందు అర్జునుడు ఏ సాధనను అనుసరింపవలెనో స్పష్టముగా చెప్పలేదు. కావున ఇప్పుడు భగవానుడు తనయందు అనన్యభక్తి కలిగిన యోగిని ప్రశంసించుచు అర్జునుని తనవైపునకు మఱలించుచున్నాడు-*

**యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥ 47 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వేషామ్, యోగినామ్, అపి | = యోగులందఱిలోను | మద్గతేన, అంతరాత్మనా | = నాయందు లగ్నమైన అంతరాత్మతో | సః | = అట్టియోగి |
| | | | | మే | = నాకు |
| యః | = ఎవడయితే | మామ్ | = నన్ను | యుక్తతమః | = పరమశ్రేష్ఠుడు అని |
| శ్రద్ధావాన్ | = శ్రద్ధగలవాడై | భజతే | = నిరంతరము భజించునో | మతః | = భావింపబడును |

**యోగులందఱిలోను శ్రద్ధాళువై, అంతరాత్మను నాయందే లగ్నమొనర్చి, అనగా భక్తివిశ్వాసములతో నిశ్చలమైన, దృఢమైన అనన్య భావముతో నాయందే స్థిరమైయున్న మనోబుద్ధిరూప - అంతః కరణమును గలిగి, నిరంతరము నన్నే భజించువాడు నాకు పరమశ్రేష్ఠుడు. (47)**

ప్రశ్న - ఇచట 'యోగినాం' అను పదముతో 'అపి' అను అవ్యయమును, సర్వేషాం అను విశేషణమును ప్రయోగించుట లోని వైశిష్ట్యమేమి?

సమా - 4వ అధ్యాయమునందలి 24వ శ్లోకమునుండి 30వ శ్లోకము వఱకు భగవత్ప్రాప్తికై యజ్ఞముపేరుతో చెప్పబడిన సాధనలను, అవిగాక ఇప్పటి వఱకును వర్ణింపబడిన భగవత్ప్రాప్తి సాధనలను సమష్టిగా యోగమను పేరుతో పేర్కొనవచ్చును. వివిధములగు ఈ యోగసాధన మార్గములలో సాధకులు తమతమ స్వభావములను అనుసరించి యోగసాధనలను చేయుచుందురు. అట్టి వేర్వేఱు యోగులను ఉద్దేశించియే 'యోగినాం' అను పదముతో 'అపి' అను అవ్యయమును 'సర్వేషాం' అను విశేషణమును ప్రయోగించుట జరిగినది.

ప్రశ్న - ఏయే లక్షణములు గలవానిని 'శ్రద్ధావాన్' అని పేర్కొనవచ్చును?

సమా - భగవంతునియొక్క అస్తిత్వము, అవతారములు, వచనములయందును, ఆతని అచింత్యానంతదివ్యగుణముల యందును అట్లే అతని పవిత్ర నామములయందును లీలలయందును, మహిమాశక్తి, ప్రభావైశ్వర్యాదులయందును సంపూర్ణముగ దృఢభక్తివిశ్వాసములుగల వానిని 'శ్రద్ధావాన్' అని పేర్కొనవచ్చును.

ప్రశ్న - 'మద్గతేన' అను విశేషణముతో కూడిన 'అంతరాత్మనా' అను పదప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - భగవంతునే సర్వశ్రేష్ఠునిగా సర్వగుణాధారునిగా, సర్వశక్తిమంతునిగా, ప్రియతమునిగా, తెలిసికొని, ఆతనియందే భక్తి విశ్వాసములు గలిగి, నిశ్చలమైన దృఢమైన అనన్య భావముతో ఆతనియందే స్థిరమైయున్న మనోబుద్ధి రూప- అంతఃకరణమును 'మద్గతాంతరాత్మా' (మద్గత + అంతరాత్మా) అని యందురు. దానితో అనగా నాయందే లగ్నమైన అంతఃకరణముతో - అని సమన్వయము.

ప్రశ్న - అనన్యమైన భక్తితో భగవంతునియందు స్థిరమైన మనోబుద్ధులనే మద్గత + అంతరాత్మా అని యేల భావింపవలెను? భయద్వేషాది కారణములవలన కూడ మనోబుద్ధులు భగవంతునియందు లగ్నము కావచ్చునుగదా!

సమా - ఆ విధముగను కావచ్చును. ఏ కారణము వలననైనను మనోబుద్ధులు పరమాత్మయందు లగ్నమగుట శ్రేయస్కరమే. కాని ఇచట భక్తిపూర్వకముగ భగవంతుని యందు మనోబుద్ధులను లగ్నముచేయుటను గూర్చియే ప్రస్తావించుట జరిగినది. భయద్వేషములతో భగవంతుని యందు మనోబుద్ధులను లగ్నము చేసిన వానిని 'శ్రద్ధావాన్' అని గాని, పరమయోగి అనిగాని, భావించుటకు వీలులేదు. 7వ అధ్యాయప్రారంభములోనే 'మయ్యాసక్తమనాః' అని పేర్కొనుచు భగవంతుడు అనన్యభక్తినే సూచించెను. ఇంతేగాక గీత యందు అచ్చటచ్చట మనోబుద్ధులను భక్తి విశ్వాసములతో భగవంతుని యందు లగ్నము చేయుటయే ప్రశంసింపబడెను. (7/17, 9/14,10/10). కావున ఇచట గూడ ఆ విధముగ భావించుటయే సమంజసము.

ప్రశ్న - ఇచట 'మాం' అను పదము భగవంతునియొక్క సగుణరూపమును గూర్చి తెలుపునా? లేక నిర్గుణ బ్రహ్మానా?

సమా - నిరతిశయ జ్ఞాన, శక్తి - ఐశ్వర్య, తేజస్సులు మున్నగు గుణములు గలవాడును, పరమ - ఆశ్రయ సౌందర్య మాధుర్య - ఔదార్యాది అనంతగుణ సముద్రుడును, పరమదయాళువూ, సుహృదుడును, ప్రేమాస్పదుడును, దివ్యమైన అచింత్యానంద స్వరూపుడును, నిత్యుడును, సత్యస్వరూపుడును, అజుడును, శాశ్వతుడును, అచ్యుతుడును, సర్వాంతర్యామియు, సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, సర్వదివ్యగుణాలంకృతుడును, సర్వాత్ముడునూ, అమేయమహిమాన్వితుడును, చిత్రవిచిత్ర లీలలను ప్రదర్శించువాడును, లీలామాత్రముగ ప్రకృతి ద్వారా జగదుత్పత్తి స్థితి లయ కారకుడును, అట్లే రససాగరుడును, రసమయుడును, ఆనందకందుడును అగు సగుణ నిర్గుణరూప పూర్ణబ్రహ్మ పురుషోత్తముని తెలుపునదియే - ఈ 'మాం' అను పదము.

ప్రశ్న - 'భజతే' అను క్రియాపదమునకు అర్థమేమి?

సమా - అన్ని విధముల అన్ని కోణములనుండియు మనస్సును బుద్ధిని భగవంతునియందే నిమగ్నమొనర్చి,

అత్యంత శ్రద్ధా భక్తులతో నడచుచును, తిరుగుచును, నిలుచున్నను, కూర్చున్నను, తినుచున్నను, త్రాగుచున్నను, నిద్రలోను, మెలకువలోను, ఏపని చేయుచున్నను లేక ఏకాంతముగానున్నను నిరంతరము భగవంతునిభజన ధ్యానాదులను చేయుచుండుటయే 'భజతే' అను క్రియాపదమున కర్థము.

ప్రశ్న - "అతడు పరమశ్రేష్ఠుడు, అని నా అభిప్రాయము-" అని అనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - భగవంతుడు తన ప్రియతమ భక్తుల ప్రత్యేకతను గూర్చి వర్ణించుచున్నాడు. తాపసి, జ్ఞాని, కర్మి మొదలగు వారందఱును భగవంతునకు ప్రియమైనవారే. మరియు అందరికంటెను భగవత్ప్రాప్తికై సాధన చేయు సమత్వయోగి భగవంతునకు మిక్కిలి ప్రియమైనవాడు. కాని భగవంతుని సంపూర్ణ రూపమును తెలిసికొని, అనన్య భక్తితో కేవలము భగవంతుడే తనకు మిక్కిలి ప్రేమాస్పదుడని భావించి, ఏ విషయమునందును ఆకాంక్ష, అపేక్ష, ఉపేక్షలు లేక రాత్రింబవళ్ళు భగవంతుని యందే తన అంతరాత్మను నిమగ్నమొనర్చువాడు, సంతతము తల్లినంటిపెట్టుకొని యుండు శిశువువలె భగవంతుని తప్ప తదన్యమైన దానిని దేనిని గూడ ఎఱుంగనివాడు, భగవంతుని హృదయమునకు పరమోత్కృష్ట సంపదవంటివాడు. మాతృహృదయములు సంతతము అపత్య ప్రేమామృతములతో పొంగిపొరలు చుండును. వారు (తల్లులు) తమ సంతానమును నిరంతరము చూచుచుండుటలోనే పరమానందమును పొందుచుందురు. ఈ వాత్సల్యమూర్తులైన సమస్త మాతృహృదయముల యందలి ప్రేమామృత జలధులన్నియు కలిసి కూడ ఆ భగవంతుని అచింత్యానంత వాత్సల్య పరిపూర్ణ హృదయ మహాసాగరము నందలి ఒక బిందువునకును సమానము కావు. అట్టి తన హృదయముతో భగవంతుడు అతనిని (అనన్య భక్తుని) చూచుచునే యుండును. అట్టి భక్తుని ప్రతిచేష్టయు భగవంతునకు అపారమైన ఆనందమును కల్గించును. సమస్త జగత్తునకును అనాదికాలము నుండియు లభించుచున్న నానావిధానందము లన్నియును కలసినను ఆ భగవదానందసాగరము నందలి (ఆ బ్రహ్మానంద సాగరమునందలి) ఒక బిందువునకును సాటిరావు. అనంతానందమునకు అపారాంబుధియైన భగవంతుడు కూడ తన అనన్య భక్తుని (సర్వదా భగవంతునియందే నిమగ్నమైన అంతఃకరణము గల వాని) యొక్క చేష్టలను చూచి చూచి పరమానందమును పొందుచునే యుండును. అట్టి భక్తుని ఔన్నత్యమును గూర్చి ఎంతగా పొగడుదును? అని భగవంతుడు నుడివెను.

కాని అట్టి భక్తుని గూర్చి ప్రశంసించుచు భగవంతుడే "అతడు నాకు ఆత్మీయుడు, నావాడే. అతనిని మించిన ప్రియతముడు నాకెవ్వడును లేడు. అతడు నాకు అత్యంత ప్రియతముడు, శ్రేష్ఠుడు. కనుక అతడే నాకు సర్వోత్తమభక్తుడు. సర్వోత్తమయోగి" అని పల్కెను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగో నామ షష్ఠోఽధ్యాయః ॥ ౬ ॥

❖ ❖ ❖

॥ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఏడవ అధ్యాయము - జ్ఞాన విజ్ఞాన యోగము

**షట్క వివరణము :** శ్రీమద్భగవద్గీత యందలి 18 అధ్యాయములలో కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగముల వివరణ గలదు. ఈ 18 అధ్యాయములు ఈ క్రమములోనే మూడు షట్కములుగా విభజింపబడినట్లు భావింతురు. కాని ప్రతిషట్కమునందును ప్రత్యేకముగా ఆ యోగమును గురించి మాత్రమే వర్ణింపబడినట్లు భావింపరాదు. కాని ప్రతి షట్కమునందును అన్ని యోగములనుగూర్చియు ప్రస్తావింపబడినప్పటికిని ఆషట్కమునకు సంబంధించిన యోగమునుగూర్చి విశేషముగా వర్ణించుట జరిగినది. దానిని బట్టియే ఆ షట్కమునకు ఆ పేరు రూఢమైనది.

మొదటి షట్కమునందలి ప్రథమాధ్యాయము ప్రస్తావన మాత్రమే. అందు ఈ మూడు యోగములలో దేనిని గూర్చియు ప్రత్యేక వివరణలేదు. రెండవ అధ్యాయమునందు 11 నుండి 30వ శ్లోకము వఱకును సాంఖ్య (జ్ఞాన) యోగవిషయము గలదు. పిమ్మట 39వ శ్లోకమునుండి 3వ అధ్యాయము చివరివఱకు కర్మయోగముయొక్క విస్తృతవర్ణనము గలదు. 4,5, అధ్యాయములయందు కర్మయోగ జ్ఞానయోగముల మిశ్రిత వర్ణనముగలదు. 6వ అధ్యాయమున ప్రధానముగా ధ్యాన యోగ వివరణము ఉన్నప్పటికిని ప్రసంగానుసారముగా కర్మయోగాదుల వర్ణనము గూడ కలదు. ఈ విధముగ ఈ మొదటి షట్కమునందు అన్ని విషయములును కలిసి ఉన్నప్పటికిని కర్మయోగ వర్ణనము మిగిలిన (భక్తి, జ్ఞానముల) రెండింటికంటెను అధికముగా కలదు. కనుక దీనిని కర్మయోగ ప్రధానషట్కముగా భావించుట జరిగినది.

7వ అధ్యాయము నుండి 12వ అధ్యాయమునఱకు గల షట్కమునందు ప్రసంగవశమున అచ్చటచ్చట ఇతర యోగముల ప్రస్తావనలున్నను ముఖ్యముగా భక్తియోగమును గూర్చియే విశదముగా వర్ణింపబడినది. కావున ఇది భక్తియోగషట్కముగా ప్రసిద్ధికెక్కినది.

చివరి షట్కమునందు 13,14 అధ్యాయములలో ప్రధానముగా జ్ఞానయోగ ప్రస్తావనలే గలవు. 15వ అధ్యాయమునందు భక్తియోగ వర్ణనము, 16వ అధ్యాయమునందు దైవీ, అసురీ సంపదల వివరణములును కలవు. 17వ అధ్యాయమున శ్రద్ధ, ఆహారము యజ్ఞదానతపశ్శర్యాదుల సాత్త్విక, రాజస, తామస విభాగముల విపులనిరూపణము జరిగినది. 18వ అధ్యాయము గీతోపదేశమును ముగించునది గావున అందు కర్మభక్తి జ్ఞానయోగముల మూడింటి వర్ణనములునుగలవు. అట్లే చివరకు శరణాగతి ప్రధానముగా గల భక్తియోగముతో గీతోపదేశము ముగించుట జరిగినది. ఐనప్పటికిని ఈ షట్కమునందు జ్ఞానయోగమును గూర్చియే విపులముగా చర్చింపబడుట వలన దీనిని జ్ఞానయోగప్రధానషట్కముగా పేర్కొనుట జరిగినది.

**అధ్యాయ నామము :** పరమాత్మయొక్క నిర్గుణ నిరాకార తత్త్వప్రభావ మహత్త్వాది రహస్యముల సంపూర్ణ జ్ఞానమునే 'జ్ఞానము' అని యందురు. సగుణ నిరాకార, సాకార, తత్త్వముల లీలారహస్యమహత్త్వగుణ ప్రభావాదులను సమగ్రముగా తెలిసికొనుటయే 'విజ్ఞానము' అనబడును. ఈ జ్ఞానవిజ్ఞాన సహితముగ భగవత్స్వరూపమును తెలిసికొనుటయే సమగ్రముగా భగవంతుని తెలిసికొనుట యగును. ఈ అధ్యాయమునందు భగవత్స్వరూపమును గూర్చియు, దానిని పూర్తిగా తెలిసికొనుటకు యోగ్యులైన వారిని గూర్చియు, సాధనలను గూర్చియు వర్ణనలు గలవు. కనుక ఈ అధ్యాయమునకు 'జ్ఞాన విజ్ఞాన యోగము' అను పేరు నిర్పడినది.

**అధ్యాయ సారాంశము :** ఈఅధ్యాయమునందలి మొదటి శ్లోకమున భగవానుడు తన సంపూర్ణ రూప వర్ణనమును వినుమని అర్జునుని ఆజ్ఞాపించెను. విజ్ఞాన సహితముగ జ్ఞానమును వర్ణించెదనని 2వ శ్లోకమున ప్రతిజ్ఞచేసి, దానిని ప్రశంసించుచు 3వ శ్లోకమున భగవత్స్వరూపజ్ఞానము యొక్క దుర్లభత్వమును తెలిపెను. 4,5 శ్లోకములయందు తన అపరా-పరా ప్రకృతుల స్వరూపములను తెలిపి, 6వ శ్లోకమున ఈ రెండు ప్రకృతులును సమస్త ప్రాణుల సృష్టికి కారణములనియు, తాను అన్నింటికిని మహాకారణమనియును తెలిపెను. 7వ శ్లోకమున జగత్తంతయును తన స్వరూపమేయని తెల్పి, మాలాదృష్టాంతముతో తన వ్యాపకత్వమును నిరూపించెను. 7 నుండి 12వ శ్లోకము వఱకును, తన సర్వవ్యాపకత్వమును

విస్తృతముగావర్ణించెను. 13వ శ్లోకమున మనుష్యులు భగవత్తత్త్వమును ఎఱుంగని కారణములను తెలుపుచు 14వ శ్లోకమున తన మాయను దాటుట కష్టమని పేర్కొని, దానిని దాటునుపాయమును వివరించినాడు. 15వ శ్లోకమున మూఢులు, పాపాత్ములైనవారు తనను భజింపరని తెల్పెను, తనను భజించుపుణ్యాత్ములైన చతుర్విధ భక్తులను గూర్చి 16వ శ్లోకమున వివరించెను. జ్ఞానులైన భక్తులు శ్రేష్ఠులు అని 17వ శ్లోకమున తెల్పెను. భక్తులందఱును ఉదారులేయైనను జ్ఞాని తనకు ఆత్మస్వరూపుడని 18వ శ్లోకమున పేర్కొనెను. జ్ఞానులైన భక్తులు చాల అరుదని 19వ శ్లోకమున ఉగ్గడించెను. 20వ శ్లోకమున అన్యదేవతోపాసకులను గూర్చి తెల్పుచు, వారికి ఆయా దేవతలయందే శ్రద్ధాదరములను స్థిరపఱచుదునని 21వ శ్లోకమున వివరించెను. అట్టి వారి ఉపాసనాఫలములను 22వ శ్లోకమున నిరూపించెను. అన్యదేవతోపాసనాఫలము నశ్వరమనియు, తనను ఉపాసించుట వలన కలుగు ఫలము పరమపదప్రాప్తియనియు 23 శ్లోకమున పేర్కొనెను. 24, 25 శ్లోకములయందు తన గుణప్రభావస్వరూపములను మానవులు ఎఱుంగని కారణములను వర్ణించెను. 26వ శ్లోకమున - తాను సమస్తమును ఎఱుగుదుననియు, కాని తనను ఎవ్వరును ఎఱుగరనియు, తెలిపెను. మనుష్యులు అట్లు తనను ఎఱుగక పోవుటకు గల కారణములను 27వ శ్లోకమున వివరించుచు, తనను భజించునట్టి దృఢవ్రతులైన ఉత్తమభక్తుల లక్షణములను 28వ శ్లోకమున వర్ణించినాడు. పిమ్మట భగవంతుని ఆశ్రయించుటకు యత్నించు వారికి బ్రహ్మపదప్రాప్తి లభించు విషయమును 29వ శ్లోకమున వివరించి, 30వ శ్లోకమున తన సంపూర్ణ స్వరూప జ్ఞాన మహిమలను విశదపరచి, ఈ అధ్యాయమును ముగించెను.

సంబంధము - 6వ అధ్యాయమునందలి చివరి శ్లోకమున భగవానుడు 'అంతరాత్మను నాయందే లగ్నమొనర్చి శ్రద్ధాదరములతో నన్నే భజించువాడు యోగులలో శ్రేష్ఠుడు' - అని తెలిపియుండెను. కాని భగవంతుని స్వరూపగుణ ప్రభావములను మనుష్యుడు ఎఱుగనంత వరకును ఆయనయందు తనయంతరాత్మను లగ్నమొనర్చి, నిరంతరము భగవంతుని భజించుట కష్టము. పైగా భజన విధానమును గూడ ఎఱుంగుట అవసరము. కనుక భగవానుడు గుణ ప్రభావసహితముగ తన సంపూర్ణ స్వరూపమును, అట్లే వివిధ భక్తిరీతులను వర్ణించుటకై, 7వ అధ్యాయమును ఆరంభించుచున్నాడు. అన్నింటికంటెను ముందుగా రెండు శ్లోకములలో తాను చెప్పబోవు విషయములను సావధానముగా వినుమని అర్జునుని ప్రోత్సహించుచు జ్ఞాన విజ్ఞానములను గూర్చి తెలుపుదునని ప్రతిజ్ఞ చేయుచున్నాడు-

**శ్రీ భగవాన్ ఉవాచ**

**మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః ।**
**అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | యోగమ్, యుంజన్ | = యోగమునందు నిమగ్నుడవగుచు | మామ్ | = నన్ను |
| మయి, | = అనన్యభక్తితో | | | యథా | = ఎట్లు (నీవు) |
| ఆసక్తమనాః | నాయందే ఆసక్తమైన మనస్సు కలవాడవై | సమగ్రమ్ | = సంపూర్ణ విభూతి, బలము, ఐశ్వర్యాది గుణయుక్తుడను, సర్వప్రాణులకు, ఆత్మస్వరూపుడను ఐన | అసంశయమ్ | = నిస్సందేహముగా |
| | | | | జ్ఞాస్యసి | = తెలిసికొనగలవో |
| మదాశ్రయః | = మత్పరాయణుడవై | | | తత్ | = దానిని (ఆవిధమును) |
| | | | | శృణు | = వినుము |

శ్రీ భగవానుడు పలికెను - ఓ పార్థా! అనన్యభక్తితో నాయందే ఆసక్తమైన మనస్సు కలిగినవాడవై యుండుము. అనన్య భావముతో మత్పరాయణుడవై, యోగమునందు నిమగ్నుడవగుము. అట్టి నీవు సంపూర్ణవిభూతిబల - ఐశ్వర్యాదిగుణయుక్తుడను, సర్వప్రాణులకును ఆత్మస్వరూపుడను ఐన నన్ను సమగ్రముగా తెలిసికొను విధమును వినుము. (1)

ప్రశ్న - 'మయ్యాసక్తమనాః' అనుపదము ఎవరిని తెలుపును?

సమా - ఇహ పరలోక భోగములయందు పూర్తిగా అనాసక్త మనస్కుడును, సమస్త ప్రాపంచిక విషయముల నుండి తన మనస్సును మఱల్చినవాడును, పరమ ప్రేమాస్పదుడు, సర్వగుణ సంపన్నుడైన పరమేశ్వరుని యందే మిక్కిలి ఆసక్తుడును ఐన పురుషుని 'మయ్యాసక్త మనాః' అని యందురు. నీటినుండి బయటపడిన చేప మఱల నీటిని చేరువఱకు అది గిలగిల్లాడును. అట్లే ఇతడు భగవద్వియోగమును, విస్మరణమును క్షణమైనను తట్టుకొనలేక విలవిలలాడును.

ప్రశ్న - 'మదాశ్రయః' అను పదము ఎవరిని సూచించును?

సమా - బంధకారకములైన ప్రాపంచిక - ఆశ్రయములను అన్నింటిని త్యజించి, సమస్తమైన ఆశల యెడలను, విశ్వాసముల యెడను విముఖుడై, కేవలము భగవంతుని పైననే ఆధారపడి యుండువాడును, సర్వశక్తిమంతుడైన భగవంతుడే తనకు పరమాశ్రయుడు, పరమగతియని తెలిసికొని, (గ్రహించి) కేవలము ఆయన యందే విశ్వాసముంచి సదా నిశ్చింతగా నుండువానిని సూచించునదియే 'మదాశ్రయః' అను పదము.

ప్రశ్న - 'యోగమ్ యుంజన్' అనగానేమి?

సమా - ఇది భక్తి యోగ ప్రకరణము. కనుక మనస్సును బుద్ధిని నిశ్చల భావముతో భగవంతుని యందే స్థిరముగా నిలిపి, నిత్యము నిరంతరము భక్తిశ్రద్ధలతో అతనిని చింతన చేయుటయే 'యోగమ్ యుంజన్' అను పదములకర్థము.

ప్రశ్న - 'భగవంతుని గూర్చి సంపూర్ణముగా, నిస్సందేహముగా అనగా పూర్తి విశ్వాసముతో తెలిసికొనుట యనగానేమి?

సమా - భగవత్స్వరూపము ఇంత అనిగాని, అంత అనిగాని చెప్పనలవికానిది. అనంతకోటి బ్రహ్మాండము లన్నియును అతనిలోనే యున్నవి. అవి అన్నియును అతని స్వరూపములే. ఈ బ్రహ్మాండముల లోపల వెలుపల ఉన్నవన్నియును అతనిలోనే గలవు. అతడు నిత్యుడు, సత్యస్వరూపుడు, సనాతనుడు, సర్వగుణసంపన్నుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వాధారుడు, సర్వరూపుడు. అట్లే అతడు స్వయముగా తన యోగమాయ ద్వారా జగద్రూపమున వ్యక్తమగుచుండును. వాస్తవముగా అతనికి తప్ప మఱి దేనికిని అస్తిత్వమే లేదు. వ్యక్తావ్యక్త సగుణ నిర్గుణ రూపములన్నియును అతడే. ఈ విధముగా భగవత్స్వ రూపమును ఎట్టి సందేహ భ్రమలకును తావులేకుండ గ్రహించుటయే భగవంతుని సంపూర్ణముగా, నిస్సందేహముగా తెలిసికొనుట యగును.

**జ్ఞానం తేఽహం సవిజ్ఞానమ్ ఇదం వక్ష్యామ్యశేషతః ।**
**యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥ 2 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = దేనిని | జ్ఞాతవ్యమ్ | = తెలిసికొనదగినది | అహమ్ | = నేను |
| జ్ఞాత్వా | = ఎఱింగినచో | న, అవశిష్యతే | = మిగిలియుండదో అట్టి | తే | = నీకు |
| ఇహ | = ఈ లోకమున | సవిజ్ఞానమ్, ఇదమ్, జ్ఞానమ్ | = విజ్ఞానసహితమైన ఈ తత్త్వ జ్ఞానమును | అశేషతః | = సంపూర్ణముగా |
| భూయః | = మఱల | | | వక్ష్యామి | = తెలిపెదను |
| అన్యత్ | = మఱియొకటి | | | | |

నేను నీకు విజ్ఞానసహితముగా తత్త్వజ్ఞానమును సంపూర్ణముగా తెలిపెదను. దీనిని ఎఱిగిన పిమ్మట ఈ జగత్తులో తెలిసికొనవలసినది ఏదియు మిగులదు.

జ్ఞానము - అనగా భగవంతుని నిర్గుణ నిరాకార ప్రభావ మాహాత్మ్య రహస్యములతో గూడిన యథార్థతత్త్వజ్ఞానము. విజ్ఞానము - అనగా సగుణ నిరాకార దివ్య సాకార తత్త్వముయొక్క లీలారహస్యగుణమహత్త్వ ప్రభావసహితమైన యథార్థజ్ఞానము. (2)

ప్రశ్న - 'జ్ఞానము, విజ్ఞానము' అను పదములు వేనిని తెల్పును?

సమా - భగవంతుని నిర్గుణ నిరాకార తత్త్వముల ప్రభావమహత్త్వ రహస్యముల యథార్థ జ్ఞానమునే 'జ్ఞానము' అని యందురు. ఇదే విధముగా అతని సగుణ నిరాకార, దివ్య సాకార తత్త్వముల లీలా రహస్య గుణమహత్త్వ ప్రభావముల యథార్థతత్త్వము యొక్క జ్ఞానమే 'విజ్ఞానము' అనబడును.

ప్రశ్న - ఈ జ్ఞాన విజ్ఞానముల వర్ణన ఈ యధ్యాయము నందు ఎచ్చట చేయబడినది?

సమా - ఈ యధ్యాయమున చేయబడిన ఉపదేశమంతయును జ్ఞాన విజ్ఞాన ప్రాప్తికి సాధన రూపమే. 13వ అధ్యాయము నందలి 7 నుండి 11వ శ్లోకమువఱకు జ్ఞాన సాధనలను జ్ఞానముని తెల్పిన రీతిగా ఈ అధ్యాయమునందలి జ్ఞాన విజ్ఞానములకు సంబంధించిన ఉపదేశము నంతయును జ్ఞాన విజ్ఞానరూపముగనే భావింప వలయును.

ప్రశ్న - మున్ముందు వర్ణింపబడు విజ్ఞాన సహిత జ్ఞానమును తెలిసికొన్న పిమ్మట ప్రపంచమున ఇంక తెలిసికొన వలసినదేదియును మిగులదు-అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - జ్ఞాన విజ్ఞానముల ద్వారా భగవంతుని సంపూర్ణ స్వరూపము చక్కగా అవగతమగును. ఈ విశ్వబ్రహ్మాండము లన్నియును ఈ భగవంతుని సంపూర్ణ స్వరూపముయొక్క ఒక అల్పాంశము మాత్రమే. మనుష్యుడు భగవంతుని సంపూర్ణ రూపమును తెలిసికొనిన పిమ్మట అతనికి ఇంకను తెలిసికొనవలసిన విషయమేమియును మిగిలి యుండదు. 10వ అధ్యాయము చివర భగవానుడు "అర్జునా! ఇంకను ఎక్కువ వివరములను తెలిసికొనుటచే ప్రయోజనమేమి? నా తేజస్సు యొక్క ఒక అంశముతోడనే ఈ సంపూర్ణ జగత్తు ధరింపబడి స్థితమైయుండును" - అని చెప్పియుండెను. కనుక ఇచ్చట ఈ విధముగ చెప్పుటయే సమంజసము.

*సంబంధము - తన సంపూర్ణరూపముయొక్క జ్ఞాన విజ్ఞానములను తెలుపుదునని ప్రతిజ్ఞచేసి, ఇప్పుడు భగవానుడు ఆ స్వరూప తత్త్వజ్ఞాన దుర్లభత్వమును గూర్చి తెల్పుచున్నాడు-*

## మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
## యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| మనుష్యాణామ్, సహస్రేషు | = వేలకొలది మనుష్యులలో | యతతి | = ప్రయత్నించును | మామ్ | = నన్ను |
| కశ్చిత్ | = ఒకానొకడు మాత్రమే | యతతామ్ సిద్ధానామ్, అపి | = (అట్లు) ప్రయత్నించినట్టి యోగులలో గూడ | తత్త్వతః | = నా యథార్థ స్వరూపమును |
| సిద్ధయే | = భగవత్ప్రాప్తి సిద్ధించుటకై | కశ్చిత్ | = ఒకానొకడు మాత్రమే (మత్పరాయణుడై) | వేత్తి | = ఎఱుంగును |

**వేలకొలది మనుష్యులలో ఎవడో ఒకడు మాత్రమే నన్నుగూర్చి తెలిసికొనుటకు ప్రయత్నించును. అట్లు ప్రయత్నించిన వారిలోగూడ ఒకానొకడు మాత్రమే మత్పరాయణుడై నా తత్త్వమును అనగా నా యథార్థస్వరూపమును ఎఱుంగును. (3)**

ప్రశ్న - ఇచట 'మనుష్యులు' అను పదప్రయోగముయొక్క వైశిష్ట్యమేమి?

సమా - మనుష్యజన్మ చాలా దుర్లభము. భగవంతుని అపారకృపవలననే ఇది లభించును. భగవత్ప్రాప్తిసాధనకు మానవులందఱికిని జన్మతోడనే అధికారము సిద్ధించును. జాతి, వర్ణాశ్రమ దేశ భేదములు ఈ విషయమున ప్రతిబంధకములు కావు. ఇంతేగాక మనుష్యేతర జన్మలయందు ప్రత్యేక కర్మాచరణములకు అధికారములేదు. ఇతర ప్రాణులు భగవత్ప్రాప్తికై సాధన చేయజాలవు. పశు, పక్షి, కీట, పతంగాది తిర్యగ్యోనులలో జన్మించిన ప్రాణులకు

సాధనచేయు శక్తిగాని, యోగ్యత గాని ఉండవు. దేవతలు మొదలగు వారికి శక్తియున్నను, భోగానుభవముల ఆధిక్య కారణముగ, ప్రత్యేకముగ అధికారము లేనందున వారు సాధన చేయజాలరు. తిర్యక్కులలో గాని, దేవతలలోగాని ఎవరికైనను పరమాత్మజ్ఞానము కలిగినచో అది భగవంతుని యొక్క లేక మహాపురుషుల యొక్క విశేష దయాప్రభావమహత్త్వముల వలననే అని భావింప వలెను.

ప్రశ్న - 'మానవులలో నూటికి కోటికి ఒక్కరు మాత్రమే భగవత్ప్రాప్తికై సాధన చేయు చుందురు.' అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవత్కృపావిశేషముచే మానవజన్మ లభించినను, జన్మజన్మాంతర సంస్కారముల ప్రభావమున భోగములయందు మిక్కిలి ఆసక్తి యుండుట వలనను, భగవంతునియందు భక్తి శ్రద్ధలు లేకుండుట వలనను, లేక తక్కువగా ఉండుట వలనను మనుష్యులలో ఎంతోమంది ఈ మార్గము వైపునకే తిరిగి చూడరు. ఉత్తమమైన పూర్వసంస్కారములు గలవాడును, భగవంతుని యందును, మహా పురుషుల యందును, శాస్త్రముల యందును, భక్తి శ్రద్ధలు కల్గియున్నవాడును, పూర్వపుణ్య విశేషము వలననో భగవత్కృపవలననో, సత్పురుషుల సాంగత్యము లభించినవాడును, ఐనవాడు ఎవడైనను నూటికి కోటికొక్కడున్నచో అట్టివాడు మాత్రమే ఈ మార్గమునందు ప్రవృత్తుడగుటకు ప్రయత్నించును.

ప్రశ్న - భగవత్ప్రాప్తికై ప్రయత్నించువారిలో ఎవరో ఒక్కరు మాత్రమే భగవత్తత్త్వమును తెలిసికొనగలరు - అని యనుటకు కారణమేమి? అందఱును ఏల తెలిసికొన జాలరు?

సమా - పూర్వసంస్కారములును, శ్రద్ధయు, ప్రీతియు, సత్సాంగత్యమూ, క్రియానైపుణ్యములూ మున్నగువాని కారణమున అందఱి సాధనలును ఒకేరీతిగా ఉండవు. అహంకారము, మమకారము, కోరికలు, ఆసక్తి, సంగదోషాది కారణముల వలన అనేక విధములగు విఘ్నములును కలుగ వచ్చును. కనుక చాల కొద్దిమంది మాత్రమే భక్తి శ్రద్ధలతో సాధనను సంపూర్ణముగా చేయగలరు. ఆ సాధన ఫలస్వరూపముగ ఈ జన్మయందే భగవంతుని సాక్షాత్కారమును పొందగలరు.

ప్రశ్న - "యతతామ్" (ప్రయత్నించువారు) అను విశేషణముతోపాటు 'సిద్ధానామ్' అను పదమును ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - భోగములలో చిక్కుకొని, విషయాసక్తులైన మనుష్యులతో పోల్చినప్పుడు పరమాత్మప్రాప్తి పరమసిద్ధికై ప్రయత్నించువారును సిద్ధులేయని యెఱుంగవలెను.

సంబంధము - ఇంతవఱకును భగవానుడు తన సంపూర్ణ స్వరూప జ్ఞాన విజ్ఞానములను తెలిపెదనని ప్రతిజ్ఞచేసి, వాటి మహిమలను ప్రశంసించెను. ఇప్పుడు జ్ఞాన విజ్ఞాన ప్రకరణమును ఆరంభించుచు, తన అపరా-పరాప్రకృతుల స్వరూపములను వివరించుచున్నాడు-

**భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4 ॥**
**అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।**
**జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ 5 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూమిః | = భూమి | మనః | = మనస్సు | మే | = నాయొక్క |
| ఆపః | = నీరు | బుద్ధిః | = బుద్ధి | ఇయమ్ | = ఇట్టి (ఈ) |
| అనలః | = అగ్ని | చ | = మఱియు | ప్రకృతిః | = ప్రకృతి |
| వాయుః | = వాయువు | అహంకారః,ఏవ | = అహంకారమూ | అష్టధా, భిన్నా | = ఎనిమిది విధములుగా (కలదు) |
| ఖమ్ | = ఆకాశము | ఇతి | = అని | | |

| పదము | అర్థము |
|---|---|
| మహాబాహో | = ఓ అర్జునా! |
| ఇయమ్, తు | = ఈ అష్టవిధప్రకృతి అయితే |
| అపరా | = అపరాప్రకృతి అనియు లేక జడప్రకృతి అనియు (చెప్పబడుచున్నది) |
| యయా | = దేనిచేత |
| ఇదమ్, జగత్ | = ఈ జగత్తు |
| ధార్యతే | = ధరింపబడుచున్నదో |
| మే | = నాయొక్క |
| జీవభూతామ్ | = జీవరూపమైన |
| పరామ్, ప్రకృతిమ్ | = పరా ప్రకృతిని |
| ఇతః, అన్యామ్ | = ఈ అష్టవిధ ప్రకృతి కంటెను వేరైన దానినిగా |
| విద్ధి | = ఎఱుంగుము |

**ఓ మహాబాహూ! భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అని నా ప్రకృతి ఎనిమిది విధములుగా కలదు. ఎనిమిది భేదములు గల ఈ ప్రకృతిని 'అపరా' లేక 'జడ' ప్రకృతి అనియందురు. ఇదిగాక ఈ సంపూర్ణజగత్తును ధరించునట్టి మఱియొక 'ప్రకృతి' కలదు. అదియే నా జీవరూప 'పరాప్రకృతి' లేక చేతనప్రకృతి అని తెలిసికొనుము. (4,5)**

ప్రశ్న - భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అను వాటి ప్రత్యేకత యెట్టిది?

సమా - స్థూల భూతముల మరియు శబ్దాది ఐదు విషయముల కారణరూపములైన సూక్ష్మ పంచమహాభూతములే ఇచ్చట పృథ్వి (భూమి) మున్నగు పేర్లతో వర్ణింపబడినవి. సాంఖ్య, యోగ శాస్త్రములయందు ఇవి పంచతన్మాత్రలుగా తెల్పబడెను.

ప్రశ్న - మనస్సు, బుద్ధి, అహంకారము అను వాటివలన తెలియవచ్చు విశేషము లెవ్వి?

సమా - మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి అంతః కరణము యొక్క భేదములే. ఈ మూడింటిని కలిపి "సమష్టి అంతఃకరణము" అని గ్రహింపవలెను.

ప్రశ్న - 13వ అధ్యాయమునందలి 5వ శ్లోకమున అవ్యక్తప్రకృతిభేదములు 23గ పేర్కొనబడినవి. దానిని అనుసరించి, ప్రకృతి 23 విభాగములుగ నున్నట్లు గ్రహింపవలెను. కాని ఇచట కేవలము 8 భేదములలోనే ప్రకృతి విభక్తమైనట్లు చెప్పబడుటకు కారణమేమి?

సమా - శబ్దాది విషయములు సూక్ష్మ పంచమహాభూతముల యొక్క కార్యములు, దశేంద్రియములును, అంతఃకరణము యొక్క కార్యములు. ఈ 15 విభాగములు గూడ పై 8 భేదములలో అంతర్భాగములే. ఈ విధముగ అపరాప్రకృతి 23 విభాగములన్నను, 8 భాగములన్నను ఒకటియే.

ప్రశ్న - దీనిని అపరాప్రకృతి యనుటకు కారణమేమి?

సమా - 13వ అధ్యాయమున భగవానుడు అవ్యక్తమూల ప్రకృతి కార్యములు 23 అని తెలిపెను. దానినే ఇచట ఎనిమిది విభాగములుగ పేర్కొనెను. ఈ అపరా ప్రకృతి జ్ఞేయము. అట్లే జడము. జీవరూప పరాప్రకృతి జ్ఞాత మఱియు చేతనము. పరాప్రకృతికంటెను ఇది (అపరాప్రకృతి) భిన్నమైనది. నిమ్న శ్రేణికి చెందినది. ప్రపంచమునకు హేతు రూపమైనది. జీవుని బంధించునది. కనుక దీనిని 'అపరా' అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - జీవరూప చేతన తత్త్వము పుంలింగ వాచకము. మఱి ప్రకృతి యను పేర దానిని స్త్రీలింగ వాచకముగా పేర్కొనుటకు కారణమేమి?

సమా - జీవాత్మకు వాస్తవముగా స్త్రీత్వ, పుంస్త్వ, నపుంసకత్వ (లింగ) భేదములులేవు. ఈ చేతనతత్త్వము ఒకచోట పురుషుడు, (15/16) క్షేత్రజ్ఞుడు (13/1) అని పుంలింగ వాచకముగను, మఱియొక చోట "అధ్యాత్మ" అని (7/21,8/3) నపుంసక లింగ వాచకముగను తెలుపబడినది. దానినే ఇచట 'పరా' ప్రకృతి యని స్త్రీలింగ వాచకముగ ప్రయోగించుట జరిగినది.

ప్రశ్న - ఇచట 'జగత్' అను శబ్దము దేనిని సూచించును? అది జీవరూప ప్రకృతి ద్వారా ధరింపబడుచున్నది - అని చెప్పుటకు కారణమేమి?

సమా - సమస్త జీవుల శరీరములు, ఇంద్రియములు, ప్రాణములు, అట్లే భోగ్య వస్తువులు, భోగ్యస్థానములతో గూడిన వ్యక్తప్రకృతి యంతయు 'జగత్' అని యనబడును. ఈ జగద్రూపజడతత్త్వము చేతనతత్త్వముచే వ్యాప్తమైనది.

కనుక అదియే దీనిని ధరించునది. దీనికంటెను అది అన్ని విధముల శ్రేష్ఠమైనది. సూక్ష్మమైనది. చేతనతత్త్వసంయోగము లేకుండ ఈ జగత్తు యొక్క ఉత్పత్తి వికాసములు ధారణ పోషణములు సంభవములు కావు. అందువలన జీవరూప పరాప్రకృతిచేత ఈ జగత్తు ధరింపబడినది అని తెలుపబడినది.

సంబంధము - పరా-అపరా ప్రకృతులయొక్క స్వరూపములను తెల్పిన పిదప ఈ రెండు ప్రకృతులే సమస్త చరాచర భూతములకు కారణములనియు ఈ రెండు ప్రకృతులతో కలిసిన సమస్త జగత్తునకు తాను మహాకారణమనియు భగవానుడు తెల్పుచున్నాడుద

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥ 6 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వాణి, భూతాని= | సమస్తప్రాణులును | అహమ్ = | (మఱియు) నేను | ప్రలయః = | విలీనస్థానము (అనగా సమస్త జగత్తునకు నేనే మూలకారణము) |
| ఏతద్యోనీని = | ఈ రెండు ప్రకృతుల నుండియే ఉత్పన్నములు అగుచున్నవి | కృత్స్నస్య, జగతః = | సమస్త జగత్తునకు | | |
| | | ప్రభవః = | పుట్టుకస్థానము | | |
| | | తథా = | అట్లే | ఇతి, ఉపధారయ = | అని, ఎఱుంగుము |

**ఓ అర్జునా! సమస్తప్రాణులును ఈ రెండువిధములైన ప్రకృతులనుండియే ఉత్పన్నములగుచున్నవి, ఈ జగత్తుయొక్క ప్రభవమూ (పుట్టుకయూ) ప్రలయమూ (లీనమగుటయూ) నావలననే జరుగుచున్నవి. అనగా ఈ సంపూర్ణ జగత్తునకు నేనే మూలకారణము. (6)**

ప్రశ్న - 'సర్వాణి' అను విశేషణముతో కూడిన 'భూతాని' అను పదము వేనిని సూచించును? అట్లే 'పరా - అపరా' ప్రకృతులు రెండును వాటికి జన్మస్థానములు ఎట్లగును?

సమా - స్థావర జంగములు అనగా చరాచర ప్రాణులన్నింటిని భూతాని అనుపదము తెలుపును. సమస్త ప్రాణుల ఉత్పత్తి, స్థితి, వృద్ధులు ఈ అపరా(జడ) పరా (చేతన) ప్రకృతుల సంయోగమునుండియే కలుగుచున్నవి. కనుక వీటి ఉత్పత్తికి ఈ రెండును కారణములు. ఇదే విషయము 13వ అధ్యాయమునందలి 26 శ్లోకమునందు క్షేత్ర-క్షేత్రజ్ఞులను పేర ప్రస్తావింప బడినది.

ప్రశ్న - 'సంపూర్ణ జగత్' అనగానేమి? దాని ప్రభవ ప్రలయములు భగవంతుని వలననే జరుగుచున్నవి - అనియనుటలోని విశేషమేమి?

సమా - 'జగత్తు' అనగా ఈ జడచేతన (చరాచర) విశ్వము. దీని ఉత్పత్తి, స్థితి, ప్రలయములు భగవంతుని వలన ఏర్పడుచున్నవి. మేఘము ఆకాశమునుండి ఉత్పన్నమై, ఆకాశములోనే యుండి ఆకాశములోనే విలీనమగుచున్నది. అనగా ఆకాశమే దానికి మూలకారణము. ఆధారము. అట్లే ఈ విశ్వమంతయును భగవానునినుండియే ఉత్పన్నమై, ఆయన యందే స్థితమై. ఆయనలోనే విలీనమగుచున్నది. అనగా భగవానుడే దీనికి ఒకే ఒక మహాకారణము. పరమాధారము. ఈ విషయము 9వ అధ్యాయమునందు 4,5,6 శ్లోకములలో స్పష్టపఱచబడినది. కాని భగవంతుడు ఆకాశమువలె జడము గాని, వికారములు గలవాడుగాని కాడు. కేవలము ఉదాహరణముగా మాత్రమే ఆకాశముతో భగవంతుని పోల్చుట జరిగినది. నిజముగా భగవంతుడు జగద్రూపములో ప్రకటితమగుట అతని లీలా విశేషమే.

సంబంధము - భగవానుడు 'సమస్త విశ్వమునకు మూలకారణము. పరమాధారము' - అను విషయము తెలుపబడినది. సహజముగనే ఈ విశ్వము భగవత్స్వరూపము. అతనిచే వ్యాప్తము. ఈ విషయమునే భగవానుడు స్పష్టపఱచుచున్నాడు-

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధనంజయ! | = ఓ ధనంజయా! | న, అస్తి | = లేదు | మణిగణాః, ఇవ | = మణులవలె |
| మత్తః | = నాకంటెను | ఇదమ్, సర్వమ్ | = ఈ సంపూర్ణ జగత్తు | మయి | = నాయందు |
| అన్యత్, కించిత్ | = వేఱైనదేదియును | సూత్రే | = సూత్రమునందు | ప్రోతమ్ | = కూర్చబడినది |
| పరతరమ్ | = పరమకారణమైనది | | | | |

ఓ ధనంజయా! నాకంటెను పరమకారణమైనది ఏదియును లేదు. ఈ జగత్తునందలి వస్తువులన్నియును సూత్రమున సూత్రమణులవలె నాయందే కూర్చబడియున్నవి. (7)

ప్రశ్న - ఈ జగత్తునకు నాకంటె వేఱైన పరమకారణము ఏదియును లేదు - అని భగవంతుడనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - మహాకాశము మేఘమునకు కారణము. ఆధారము. దాని కార్యమైన మేఘము ఆ ఆకాశముయొక్క స్వరూపము. వాస్తవముగా అది తనకు కారణమైన ఆకాశముకంటె భిన్నమైనది కాదు. పరమాత్మ ఈ జగత్తునకు కారణము, ఆధారము అగుటవలన జగత్తు అతని స్వరూపమే. అతనికంటె వేఱుకాదు. కనుక పరా-అపరాప్రకృతులు ప్రాణులన్నింటికిని కారణమైనను పరమాత్మ అన్నింటికిని పరమకారణము.

ప్రశ్న - సూత్రమునందు సూత్రమణులవలె ఈ భగవంతుని యందు జగత్తు ఎట్లు కూర్చబడి యున్నది?

సమా - సూత్రమునందు అచ్చటచ్చట ముడులువేసి, వాటిని మణులుగా రూపొందించి, దానిని 'మణిమాల'గా భావింతురు. ఈ సూత్రమునందును. ముడులమణుల యందును సర్వత్ర కేవలము దారమే వ్యాపించియున్నది. సమస్త జగత్తు భగవంతునియందే కూర్చబడినది. అనగా భగవంతుడే అన్నిటియందును వ్యాప్తమైయున్నాడని భావము.

సంబంధము - సూత్రము, సూత్రమునందలి మణుల దృష్టాంతముతో భగవానుడు సర్వరూపములును తననే యనియు, అంతటను తానే వ్యాపించియున్నాననియు తెల్పెను. ఇప్పుడు భగవంతుడు రాబోవు నాల్గు శ్లోకములలో ఈ విషయమునే చక్కగా విశదపరచుటకు ఈ విశ్వస్థితికి ప్రధానమైన అన్ని వస్తువులపేర్లను, పేర్కొని, వాటన్నింటియందును సారభూతముగా తానే వ్యాపించి యున్నానని తెల్పుచున్నాడు-

రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | ప్రభా | = ప్రకాశమును | శబ్దః | = శబ్దమును |
| అహమ్ | = నేను | సర్వవేదేషు | = వేదములన్నింటియందును | నృషు | = మానవులయందు |
| అప్సు | = నీటియందు | ప్రణవః | = ఓంకారమును | పౌరుషమ్ | = పౌరుషమును |
| రసః | = రసతన్మాత్రను | ఖే | = ఆకాశమునందు | అస్మి | = ఐ యున్నాను |
| శశిసూర్యయోః | = సూర్యచంద్రులయందు | | | | |

ఓ అర్జునా! జలములో రసతన్మాత్రను నేనే. సూర్యచంద్రులలో కాంతిని నేనే. వేదములన్నింటిలోను ఓంకారమును, ఆకాశమునందు శబ్దమును, పురుషులయందు పౌరుషమును నేనే. (8)

ప్రశ్న - ఈ శ్లోకమును సమగ్రముగా స్పష్టముగా వివరించునది?

సమా - ఒక వస్తువునకు ఆధారమైనదియు, దానియందు వ్యాప్తమైనదియు ఐన తత్త్వము దానికి జీవనము, స్వరూపము. అనగా దానికి అదియే సారభూతము - అని యందురు. దీనిని అనుసరించి, జలమునకు రసతత్త్వము, సూర్యచంద్రులయందు ప్రకాశము, వేదములయందు ప్రణవము అనగా ఓంకారము, ఆకాశమునందు శబ్దము, పురుషులయందు పౌరుషము, అనుసారభూతములైన తత్త్వములు ఆ భగవంతుడే.

## పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
## జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ 9 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పృథివ్యామ్ | = పృథ్వియందు | తేజః | = తేజస్సును | జీవనమ్ | = జీవశక్తిని (చైతన్యమును) |
| పుణ్యః, గంధః | = పవిత్రమైన గంధతన్మాత్రను | అస్మి | = ఐ యున్నాను | చ | = మఱియు |
| చ | = మఱియు | చ | = మఱియు | తపస్విషు | = తాపసులయందు |
| విభావసౌ | = అగ్నియందు | సర్వభూతేషు | = సమస్తప్రాణుల యందు | తపః | = తపస్సును |
| | | | | అస్మి | = ఐ యున్నాను |

పృథ్వియందు పవిత్రగంధతన్మాత్రను, అగ్నియందు తేజస్సును, సమస్త ప్రాణులలో జీవశక్తిని (చైతన్యమును) తాపసులలో తపస్సును నేనే. **(9)**

ప్రశ్న - ఈ శ్లోకమునందలి విశేషములేమి?

సమా - 8వ శ్లోకమునందు వలెనే ఈ శ్లోకము నందును ప్రతి వస్తువునందు సారభూతముగా నున్న తన వ్యాపకత్వమును, ఆధారస్థితిని తెలుపుచున్నాడు. పృథ్వియందు గంధము, అగ్నియందు తేజస్సు, సమస్త ప్రాణులయందు జీవనము, తాపసుల యందు తపస్సు - ఆ భగవంతుడే.

ప్రశ్న - 'గంధః' అను పదముతోపాటు 'పుణ్యః' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకతయేమి?

సమా - 'గంధః' అను పదము విషయ (భోగ్య వస్తు) రూప గంధమును సూచింపదు. పృథ్వికి కారణమైన గంధతన్మాత్రను సూచించును. ఈ విధముగనే రసమును, శబ్దమును గూడ గ్రహింపవలెను.

ప్రశ్న - 'సర్వభూతేషు' అను పదము, ఎవరిని సూచించును, మఱియు జీవము - అనగానేమి?

సమా - 'సర్వభూతేషు' అను పదము సమస్త చరాచర సజీవప్రాణులను సూచించును. జీవతత్త్వమనగా ప్రాణశక్తియే- దానినుండియే సమస్త సజీవ ప్రాణులును అనుప్రాణితములగును. ఈ ప్రాణశక్తి ప్రభావమున అవి నిర్జీవ పదార్థములకంటెను విలక్షణమైనవిగా ఉండును.

## బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
## బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥ 10 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | మామ్ | = నన్ను | బుద్ధిః | = ప్రజ్ఞను |
| సర్వభూతానామ్ | = సమస్తభూతములకును | విద్ధి | = ఎఱుంగుము | తేజస్వినామ్ | = తేజోవంతులలో |
| సనాతనమ్ | = శాశ్వతమైన | అహమ్ | = నేను | తేజః | = తేజస్సును |
| బీజమ్ | = బీజముగా | బుద్ధిమతామ్ | = ప్రజ్ఞావంతులలో | అస్మి | = ఐ యున్నాను |

ఓ పార్థా! సమస్త భూతములకును నన్ను సనాతన (శాశ్వత) మైన బీజముగా ఎఱుంగుము. ప్రజ్ఞావంతులలో ప్రజ్ఞను, తేజోవంతులలో తేజస్సును నేనే. **(10)**

ప్రశ్న - ఇచట 'సనాతన బీజము' అనగానేమి? భగవానుడు దానిని తన స్వరూపము అని తెల్పుటకు గల కారణమేమి?

సమా - శాశ్వతమైనదియు, ఎన్నడును నాశము కానిదియు అగునది సనాతనము అనబడును. భగవానుడే సమస్త చరాచర ప్రాణులకు పరమాధారము. అతని నుండియే అవియన్నియును ప్రభవించు (పుట్టు) చున్నవి. కనుక అతడే వాటన్నింటికిని సనాతన బీజము - అని గ్రహింప వలెను. 9వ అధ్యాయము నందలి 18వ శ్లోకమున అవినాశిబీజము అనియు, 10వ అధ్యాయము నందలి 39వ శ్లోకమున అన్ని భూతము (ప్రాణు)లకు బీజమనియు పేర్కొనబడినది ఈ సనాతన బీజమే.

ప్రశ్న - బుద్ధిమంతుల యందలి బుద్ధిని, 'తేజస్విగణము' లోని తేజస్సును నేనే. అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - మనస్సును, ఇంద్రియములను తన వశమునం దుంచుకొని, వాటిని నడిపించుచు పదార్థ తత్త్వములను నిశ్చయించునట్టి, అంతఃకరణము యొక్క పరిశుద్ధ బోధమయ శక్తిని బుద్ధి యందురు. ఇట్టి బుద్ధి అధికముగా గలవారు బుద్ధిమంతులు. ఈ బుద్ధి శక్తి భగవంతుని అపరా ప్రకృతి యొక్క అంశయే. కనుక బుద్ధిమంతులలో సారభూతమైన బుద్ధితత్త్వము తానేయని భగవానుడు పల్కెను. ఇదే విధముగా అందఱి పైనను ప్రభావము చూపు శక్తి విశేషమే తేజస్సు - ఈ తేజస్తత్త్వము అధికముగా నున్నవాడు తేజస్వి. ఈ తేజస్సు గూడ భగవంతుని యొక్క అపరాప్రకృతి యొక్క అంశయే కనుక భగవంతుడు ఈ రెండింటిని తన స్వరూపముగనే తెలిపెను.

**బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।**
**ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ 11 ॥**

| | | | |
|---|---|---|---|
| భరతర్షభ! = ఓ అర్జునా! | బలమ్ = బలమును | | విరుద్ధముకాని |
| అహమ్ = నేను | చ = మఱియు | | (శాస్త్రానుకూలమైన) |
| బలవతామ్ = బలవంతులలో | భూతేషు = సమస్తప్రాణులయందును | కామః | = కామమును |
| కామరాగవివర్జితమ్ = కామరాగ రహితమైన | ధర్మావిరుద్ధః = ధర్మమునకు | అస్మి | = నై యున్నాను. |

**ఓ భరతశ్రేష్ఠా! బలవంతులలో కామరాగరహితమైన బలమును నేను, భూతములన్నింటియందును (సమస్తప్రాణులయందును) ధర్మమునకు విరుద్ధముగాని (శాస్త్రసమ్మతమైన) కామమును నేనే.(11)**

ప్రశ్న - ఈ శ్లోకమును సమగ్రముగా స్పష్టీకరించుడు?

సమా - కోరికలు, ఆసక్తి, అహంకారము, క్రోధాదులతో గూడిన బలము ఆసుర బలము. దీనిని గూర్చి ఆసురీ సంపదలో విశదీకరింపబడినది. (16/18). దీనిని త్యజింపవలెనని చెప్పుట జరిగినది. (18/53). ఇదే విధముగా ధర్మ విరుద్ధమైన కామము గూడ ఆసురీ సంపద యొక్క ప్రధాన గుణముగుటవలన ఇది సమస్త అనర్థములకును మూలము. (3/37) ఇది నరకమునకు ద్వారము, త్యాజ్యము. (16/21) కామ, రాగ యుక్తమైన బలము కంటెను, ధర్మవిరుద్ధమైన కామముకంటెను విలక్షణమైన విశుద్ధబలమూ, విశుద్ధ కామములే ఉపాదేయములు. భగవంతుడు అర్జునుని భరతర్షభ! అని సంబోధించుటను బట్టి, అర్జునుడు, భరతవంశ శ్రేష్ఠుడగుట వలన అతనియందు ఆసురబలముగాని, అధర్మయుక్తమైన కామముగాని లేవని స్పష్టమగుచున్నది. అతనియందు వాంఛాసక్తులు లేని శుద్ధబలమే ఉన్నది. ధర్మమునకు విరుద్ధముకాని కామమున్నది. బలవంతులయందలి ఇట్టి శుద్ధబలతత్త్వము, ప్రాణులయందలి విశుద్ధకామతత్త్వము తానే యని భగవానుడు తెలిపెను.

**సంబంధము** - ఈ విధముగా ప్రధానమైన వస్తువులన్నింటియందును సారరూపముగా తన వ్యాపకత్వమును తెల్పుచు, భగవానుడు సమస్త జగత్తునందును తానే వ్యాపించియున్నట్లును, అన్నియును తన స్వరూపములే అని నిరూపించెను. ఇప్పుడు ఈ త్రిగుణమయ జగత్తునకు తానే మూలకారణమని తెలుపుచు ఈ ప్రసంగమును ముగించుచున్నాడు-

**యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।**
**మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి ॥ 12 ॥**

| పదము | అర్థము |
|---|---|
| యే, చ, ఏవ | = ఏవైతే |
| సాత్త్వికాః, భావాః | = సాత్త్వికభావములు గలవో |
| యే, చ, రాజసాః | = రాజసభావములేవిగలవో |
| తామసాః | = తామసభావము లేవిగలవో |
| తాన్ | = వాటిని |
| మత్తః, ఏవ, ఇతి | = నామండియే కలుగుచున్నవానివిగా |
| విద్ధి | = ఎఱుంగుము |
| తు | = ఐతే |
| తేషు | = ఆ త్రిగుణ భావముల యందు |
| అహమ్, చ | = నేనుగాని |
| తే | = అవి |
| మయి,చ | = నాయందుగాని |
| న | = లేవు (నేను త్రిగుణాతీతుడను) |

**సాత్త్విక, రాజస, తామస భావములన్నియును నా నుండియే కలుగుచున్నవని తెలిసికొనుము. కాని, యథార్థముగా వాటిలో నేను గాని, నాలో అవిగాని లేవు. అనగా నేను త్రిగుణాతీతుడను.(12)**

ప్రశ్న - సాత్త్విక, రాజస, తామస భావములనగానేమి? అవి యన్నియును భగవంతుని నుండియే యేర్పడును - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - మనస్సు, బుద్ధి, అహంకారము, ఇంద్రియములు, ఇంద్రియార్థములు, తన్మాత్రలు, పంచమహాభూతములు, సమస్త గుణ - అవగుణములు, కర్మలు మొదలగు భావములన్నియును సాత్త్విక, రాజస, తామస భావములలో అంతర్గతములు. ఈ సమస్త పదార్థ వికాస విస్తారములు భగవంతుని 'అపరా' ప్రకృతినుండియే ఏర్పడును. ఆ ప్రకృతియు భగవంతునకు చెందినదే. కనుక అది ఆతనికంటె భిన్నమైనదికాదు. అతని లీలాసంకేతముతో ప్రకృతిద్వారా అన్నింటి సృష్టి, విస్తృతి, ఉపసంహారములు జరుగుచున్నవి. కనుక ఇవియన్నియును భగవంతునినుండియే కలుగుచున్నవని గ్రహింపవలెను.

ప్రశ్న - త్రిగుణమయ భావములన్నియు భగవంతుని నుండియే కలుగుచున్నప్పుడు "నేను వాటిలో గాని, అవినాలోగాని లేవు" అని యనుటలో అంతరార్థమేమి?

సమా - ఆకాశమునందుత్పన్నమైన మేఘములకు కారణము, ఆధారము, ఆకాశమేయైనను ఆకాశము వాటియందు నిర్లిప్తమై యుండును. మేఘములు, ఆకాశమునందు ఎల్లప్పుడును ఉండవు. అవి అనిత్యములగుటవలన వాస్తవముగా వాటికి స్థిరమైన ఉనికియు లేదు. కాని ఆకాశము మేఘములయందు లేకున్నను ఎల్లప్పటికిని ఉండును. మేఘములు లేనిచోట గూడ ఆకాశము ఉండును. అది మేఘములను ఆశ్రయించుటలేదు. నిజముగా (వస్తుతః) మేఘముగూడ ఆకాశమునకు భిన్నమైనది గాదు. దానియందే దానినుండియే మేఘము ఉత్పన్నమగుచున్నది. కావున యథార్థముగా మేఘములకు వేఱు ఉనికియే లేనందువలన అది ఏ సమయమునందును మేఘములయందు ఉండదు. అది సర్వదా తనలో తానే స్థితమై యుండును. ఇదే విధముగా భగవంతుడు గూడ త్రిగుణమయ భావములన్నిటికిని కారణము, ఆధారము ఐనప్పటికిని, ఆ గుణములు ఆతనిలో ఉండవు. అట్లే అతడును వాటిలో ఉండడు. భగవానుడు సర్వథా సర్వదా గుణాతీతుడు, నిత్యుడు. తనయందు తానే స్థితుడైయుండువాడు కనుక "వాటియందునేనుగాని, నాయందు అవిగాని ఉండవు" అని భగవంతుడు పల్కెను. ఈ విషయమే 9వ అధ్యాయమునందలి 4,5 శ్లోకములలో స్పష్టము చేయబడినది.

*సంబంధము - సమస్త జగత్తు తన స్వరూపమే యనియు తన చేతనే అది వ్యాప్తమైయుండుననియు భగవానుడు తెలిపెను. ఈ విధముగ భగవంతుడు సర్వత్ర నిండియున్నవాడై, అత్యంతము సమీపముననే యున్నను జనులు అతనిని ఏల గుర్తించుటలేదు? అను జిజ్ఞాస కలుగుట సహజము. దీనికి భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**త్రిభిర్గుణమయైర్భావైః ఏభిః సర్వమిదం జగత్ ।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ 13 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుణమయైః = | గుణములయొక్క కార్యరూపములైన | ఇదమ్, సర్వమ్, జగత్ = | ఈ సమస్త జగత్తు (ప్రాణి సముదాయము) | పరమ్ = | శ్రేష్ఠుడనైన |
| | | | | అవ్యయమ్ = | శాశ్వతుడనైన |
| ఏభిః, త్రిభిః, భావైః = | మూడు విధములైన సాత్త్విక, రాజస, తామస భావములచే | మోహితమ్ = | మోహితమగుచున్నది | మామ్ = | నన్ను |
| | | ఏభ్యః = | (కనుక) ఈ మూడు గుణములకంటెను | న, అభిజానాతి = | (ఆప్రాణి సముదాయము) తెలిసికొనలేకున్నది |

ఈ జగత్తు అనగా ప్రాణిసముదాయము అంతయును గుణములయొక్క కార్యరూపములైన సాత్త్విక, రాజస, తామసములు అను త్రివిధ భావములచే మోహితమగుచున్నది. కనుక త్రిగుణములకు అతీతుడను, శాశ్వతుడను ఐన నన్ను ఆప్రాణులు తెలిసికొనలేకున్నవి. **(13)**

ప్రశ్న - గుణముల కార్యరూపములైన ఈ మూడు విధములగు భావములతో ఈ జగత్తంతయు మోహితమగుచున్నది - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - పూర్వ (12వ) శ్లోకమున వర్ణింపబడిన మూడు విధములైన భావములతోడనే జగత్తంతయు మోహితమగుచున్నదని ఇచట తెలుపబడుచున్నది. ఈ మూడు గుణములను అనుసరించి, ఈ భావములు అన్నియును మూడు భాగములలోనే విభక్తములైనవనియు, అవి గుణముల వికారములే యనియు, తెల్పుటకు 'త్రిభిః' 'గుణమయైః' అను విశేషములు ప్రయోగింపబడినవి. 'జగత్' అను శబ్దము సమస్త సజీవ ప్రాణులను సూచించును. ఏలనన నిర్జీవ పదార్థములు మోహితములగుననుటకు అవకాశమే లేదు. జగత్తునందు మనుష్యులతో సహా దేహాభిమానము గల ప్రాణులన్నియును తమ తమ స్వభావ, ప్రకృతి, ఆలోచనలను అనుసరించి, అనిత్యమైన, దుఃఖపూర్ణమైన ఈ త్రిగుణమయ భావములనే నిత్యములుగ, సుఖహేతువులుగ భావించుట జరుగును. వీటియొక్క కల్పిత రామణీయకములకు, సుఖముగా కన్పించు పైపైని తళుకుబెళుకులకులోనై జీవితము యొక్క పరమలక్ష్యమును విస్మరించుట జరుగును. తత్ఫలితముగ భగవంతుని గుణ ప్రభావ తత్త్వస్వరూప రహస్యములయొక్క చింతనాజ్ఞానములకు విముఖులై విపరీత భావన అసంభావనలకులోనై భగవంతునియెడ అశ్రద్ధ వహింతురు. ఈ మూడు గుణముల వికారముల యందు మునకలు వేయుచున్నకారణమున వారి వివేక దృష్టి మందగించి, వారు విషయములను సేకరించుట, వాటిని అనుభవించు చుండుట తప్ప, జీవితమునకు మఱియొక కర్తవ్యముగాని, లక్ష్యముగాని ఉన్నట్లుగా ఏ మాత్రము తలంపరు.

ప్రశ్న - మూడు గుణములకు అతీతుడనై, శాశ్వతుడనైన నన్ను ఈ జగత్తు తెలిసికొన లేకున్నది - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - విషయభోగ వ్యామోహితులైన మనుష్యులయొక్క వివేకదృష్టి త్రిగుణాత్మకమైన, నశ్వరమైన, ప్రపంచమును అధిగమించి చూడలేదు. కనుక వారు ఈ త్రిగుణములకు సర్వథా అతీతుడును, శాశ్వతుడును ఐన భగవానుని తెలిసికొనలేరు.

15వ అధ్యాయమునందలి 18వ శ్లోకమునందు గూడ తాను క్షరపురుషునికంటె సర్వథా అతీతుడనని భగవానుడు నుడివెను. అచట 'క్షర పురుషుడు' - అను పేరుతో వర్ణింపబడిన తత్త్వమే ఇచట 'అపరాప్రకృతి' అనియు, త్రిగుణమయ భావమనియు పేర్కొనబడినది. అచట 'అక్షర పురుషుడు' అని వర్ణింపబడిన తత్త్వము ఇచట 'పరాప్రకృతి' అనియు, మోహితమగు ప్రాణి (జీవ) సముదాయము అనియు పేర్కొనబడినది. అచట పురుషోత్తముడని వర్ణింపబడిన పరమాత్ముడు ఇచట 'మాం' అను పదముచేత సూచింపబడెను. ఇట్లు భగవంతుని 'పురుషోత్తముడు' అని ఎఱుగక పోవుటయే గుణాతీతుడై శాశ్వతుడైన పరమాత్ముని తెలిసికొనలేక పోవుట.

*సంబంధము - జగత్తంతయు త్రిగుణమయభావములచే మోహితమగుచున్నదని భగవానుడు తెలిపెను. ఈ విషయమును విన్న అర్జునునకు దీని నుండి (ఈ మోహమునుండి) ముక్తుడగుటకై ఉపాయ (మార్గ) మును తెలిసికొను ఇచ్ఛ కలిగెను. అంతర్యామియైన భగవానుడు అతని మనస్సులోనున్న సందేహమును గ్రహించి, ఈ మాయ దుస్తరమనియు, కాని దానిని దాటుటకు ఉపాయము కలదనియు సూచించుచున్నాడు-*

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥ 14 ॥**

హి = ఏలననగా
ఏషా = ఈ
మమ, మాయా = నా మాయ
దైవీ = అలౌకికమైనది
గుణమయీ = త్రిగుణాత్మకమైనది
దురత్యయా = అధిగమింప సాధ్యముకానిది
యే = ఎవరైతే
మామ్, ఏవ = కేవలము, నిరంతరము నన్నే
ప్రపద్యంతే = భజించుచున్నారో
తే = వారు
ఏతామ్, మాయామ్ = ఈ, మాయను
తరంతి = ఉల్లంఘించి, సంసార సముద్రమునుండి బయటపడుదురు

**నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలము నిరంతరము నన్నే భజించువారు ఈ మాయను అధిగమించి, సంసారసముద్రము నుండి బయటపడగలరు. (14)**

ప్రశ్న - 'మాయా' అనుపదముతోపాటు 'ఏషా' 'దైవీ' 'గుణమయీ' 'దురత్యయా' అను విశేషణములను ప్రయోగించుచు దానిని 'మమ' అనగా 'నాది' అని తెల్పుటలో గల విశేషమేమి?

సమా - 'ఏషా' అను పదము ప్రత్యక్షవస్తువును నిర్దేశించును. ప్రకృతి కార్యరూపములోనే ప్రత్యక్షమగును. పూర్వ (13వ) శ్లోకమున త్రిగుణమయమని వర్ణింపబడిన ప్రకృతియే ఇచట 'మాయ'యని తెలుపబడినది. గుణములును వాటి కార్యరూపమైన ఈ జడప్రపంచమూ ఈ 'మాయ'కు లోబడియేయున్నవి. కనుక దీనిని 'గుణమయీ' అని వర్ణించుట జరిగినది. ఈ మాయ ఇంద్రజాలికుల లేక దానవుల మాయ వలె సాధారణమైనదికాదు. ఇది భగవంతుని యొక్క అనన్య సాధారణమైన అత్యంత విచిత్ర శక్తి. కనుక దీనిని 'దైవీ' అని వర్ణించుట జరిగినది. ఈ దైవీ శక్తియైన మాయ 'తనదే' అని తెల్పుచు, 'దురత్యయా' అనగా తరించుట (దాటుట) సులభముగాదని తెలుపుచు భగవానుడు దీనికి తానే 'స్వామి' యనియు, తనను శరణు పొందిన వాడు తప్ప మఱి ఎవ్వడును ఈ మాయను దాటలేడనియు విశదపఱచెను.

ప్రశ్న - కేవలము నన్నే నిరంతరము భజించువారు అనగా వారు ఎట్టి వారు?

సమా - అనన్య భక్తితో భగవంతునే శరణు జొచ్చిన వారు నిరంతరము అతనినే భజించుచుందురు. భగవంతుడు ఒక్కడే తమకు పరమాశ్రయుడు, పరమగతి, పరమ ప్రియుడు, పరమ ప్రాప్యుడు అని వారు విశ్వసింతురు. 'అంతయు, లేక అన్నియు భగవంతునకు చెందినవే, భగవంతునికొఱకే' అని భావించి, శరీరము, స్త్రీ, పుత్ర, ధన, గృహ, కీర్తి మొదలగు వానియందు మమత్వమును, ఆసక్తిని వీడి వాటినన్నింటిని భగవంతునకే సమర్పింతురు. భగవంతుడు సృజించిన విధానమునందు సదా సంతుష్టులై, అతని ఆజ్ఞను పాటించుటయందే తత్పరులై స్మరణపరాయణులై అన్ని విధముల సంతతము భగవంతుని యందే నిమగ్నులై యుందురు. ఇట్టి పురుషులే సంతతము భగవంతుని భజించువారుగా పరిగణింపబడుదురు. ఇట్టి శరణాగత భక్తులే మాయను తరింతురు.

ప్రశ్న - 'మాయను తరించుట' యనగా నేమి?

సమా - కార్యకారణరూపమైన 'అపరా ప్రకృతి' యే మాయ యనబడును. మాయాపతియైన పరమేశ్వరుని శరణు జొచ్చి, అతని కృప ద్వారా ఈ మాయారహస్యమును సంపూర్ణముగా తెలిసికొని, దీనితో గల సంబంధమును సర్వథా తెంచుకొని, మాయాతీతుడైన పరమేశ్వరుని పొందుటయే మాయను తరించుట యందురు.

*సంబంధము - మాయ దుస్తరమని తెల్పి దానిని తరించు (దాటు)టకు తనను భజించుటయే ఉపాయమని భగవానుడు తెలిపెను. అట్లైనచో జనులందఱును భగవంతుని నిరంతరము ఏల భజింపరు? అను ప్రశ్న ఉదయించును. దీనికి భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।**

**మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మాయయా | = మాయచేత | ఆశ్రితాః | = ఆశ్రయించిన వారును | మూఢాః | = మూర్ఖులు |
| అపహృతజ్ఞానాః | = అపహృతమైన జ్ఞానముగల వారును | నరాధమాః | = నరులలో అధములును | మామ్ | = నన్ను |
| ఆసురమ్, భావమ్ | = ఆసుర స్వభావమును | దుష్కృతినః | = దుష్కర్మలను ఆచరించువారును అగు | న, ప్రపద్యంతే | = భజింపరు |

మాయలో చిక్కుపడుటవలన విపరీత జ్ఞానమునకు లోనైనవారును, ఆసుర ప్రవృత్తిగలవారును, నరాధములును, మూఢులును, దుష్కర్మలను ఆచరించువారును నన్ను భజింపరు. (15)

ప్రశ్న - ఈ శ్లోకమునందలి భావములను స్పష్టీకరించునది.

సమా - జన్మజన్మాంతరములనుండి పాప కార్యములను చేయుచు ఈ జన్మయందును బుద్ధి పూర్వకముగనే పాపములయందే ప్రవృత్తులగుచున్న ఆసురీ ప్రకృతిగల మూఢులు భగవానుని ఎన్నడును భజింపరు. ప్రకృతి యనగానేమి?పురుషుడనగా ఎవరు? భగవంతుడెట్టివాడు? జీవునకును భగవంతునకును గల సంబంధమేమి? మున్నగు విషయములను గూర్చి ఈ పాపాత్ములు ఏ మాత్రము ఎఱుగరు సరిగదా! ఎఱుగుటకును ఇష్టపడరు. భగవత్ప్రాప్తియే మానవజన్మ లక్ష్యమనియు, దానిని పొందుటకు భగవంతుని భజించుటయే ప్రధానకర్తవ్యమనియు వీరు విశ్వసింపరు. ఇట్టి వివేకహీనులైన మూఢజనుల ఆలోచనలు, కర్మలు నీచములు, విషయాసక్తులై ప్రమాదాలస్యములకు లోనై, కేవలము విషయభోగములయందే తమ జీవితములను వ్యర్థము చేయుదురు. ఆ విషయభోగములను పొందుటకై నిరంతరము నింద్యములైన నీచకర్మలయందే నిమగ్నులగుదురు. నరాధములైన వీరి జ్ఞానము మాయచే హరింపబడుట వలన విపరీతభావనలు, అశ్రద్ధ అధికమై వీరి వివేకము నష్టభ్రష్టమగును. వేదశాస్త్రములు, గురువుల సదుపదేశములు, ఈశ్వరుడు, కర్మఫలము, పునర్జన్మ మొదలగు విషయములను విశ్వసింపరు. మిథ్యాకుతర్కములతోడను, నాస్తికవాదముతోడను కాలమును వ్యర్థము చేయుచుందురు. ఈ అజ్ఞానులు ఇతరులకు హాని చేయుచుందురు. ఈ అన్ని దుర్గుణములతోపాటు దంభము, దర్పము, దురభిమానము, కాఠిన్యము, కామము, క్రోధము, లోభము, మోహము మొదలగు ఆసురభావములను ఆశ్రయింతురు. ఇట్టివారు భగవంతుని భజింపరు.

సంబంధము - ఆసురీ ప్రకృతిగల మూఢులు, పాపాత్ములు భగవంతుని భజింపరని పూర్వశ్లోకమున స్పష్టము చేయబడినది. ఐనచో ఎట్టి మనుష్యులు భగవంతుని భజింతురు?- అను ప్రశ్నకు భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-

**చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ।**

**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 16 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతర్షభ! | = ఓ భరతశ్రేష్ఠా! | | సంతాపములకు గురియైన) ఆర్తులును | చ | = మఱియు |
| అర్జున! | అర్జునా! | జిజ్ఞాసుః | = ఐహిక విషయములపై ఆసక్తిని వీడి, పరమాత్మతత్త్వ జ్ఞానమును పొందుటకు ఇచ్ఛగలవారును | జ్ఞానీ | = పరమాత్మ ప్రాప్తినందిన జ్ఞానులును ఐన |
| సుకృతినః | = శుభకర్మలను ఆచరించువారై | | | చతుర్విధాః | = నాలుగువిధములైన |
| అర్థార్థీ | = సంపదలను కోరువారును | | | జనాః | = భక్తులు |
| | | | | మామ్ | = నన్ను |
| ఆర్తః | = (శారీరక, మానసిక | | | భజంతే | = భజింతురు |

**ఓ భరతశ్రేష్ఠా! అర్జునా! శుభకర్మలను ఆచరించుచు సుఖసంపదలను కోరుకొనువారు (అర్థార్థులు), శారీరిక మానసిక సంతాపములకు గురియైన ఆర్తులు, ఐహికవిషయములపై ఆసక్తిని వీడి పరమాత్మ తత్త్వజ్ఞానమును పొందుటకు ఇచ్ఛగలవారు (జిజ్ఞాసువులు), పరమాత్మప్రాప్తినందిన జ్ఞానులు అను చతుర్విధ భక్తులు నన్ను భజింతురు. (16)**

ప్రశ్న - "సుకృతినః" అను పదమునకు అర్థమేమి? ఈ విశేషణము ఎవరిని గూర్చి వివరించును?

సమా - జన్మ జన్మాంతరములలో శుభకర్మలు చేయగా చేయగా వారు సహజముగనే ఉత్తమశీలురు అగుదురు. పూర్వసంస్కారముల కారణముచేతను, సత్సంగముల ప్రభావముననూ, ఈ జన్మయందును వారు భగవదాజ్ఞను సారము సత్కర్మలనే చేయుచుందురు. అట్టి వారినే "సుకృతినః" అను పదము తెలుపును. ఈ శుభకర్మల మూలమున వారికి భగవంతుని ప్రభావ మహత్త్వముల జ్ఞానము కలిగి, భగవంతునిపై విశ్వాసము పెరుగును. అట్టివారు భగవంతుని భజింతురు. "సుకృతినః" అను విశేషణము ఇచ్చట ప్రగాఢ విశ్వాసముతో భగవంతుని సేవించు చతుర్విధ భక్తులను గూర్చి తెలుపునదియే.

ప్రశ్న - "అర్థార్థి" యగు భక్తుని లక్షణములెట్టివి?

సమా - ఆలుబిడ్డలు, సంపదలు, గౌరవ ప్రతిష్ఠలు స్వర్గసుఖములు మొదలగు ఇహ పరలోక భోగముల యందలి కోరికలలో ఒకటి లేక అనేకమైన వాటిని మనస్సులో కోరుచు వాటిని పొందుటకై భగవానుని అర్థించువాడు, భక్తిశ్రద్ధలతో భగవంతుని సేవించువాడు 'అర్థార్థి' భక్తుడనబడును, సుగ్రీవ విభీషణాదులు. 'అర్థార్థి' శ్రేణికి చెందిన భక్తులు. వీరిలో ధ్రువుడు ప్రముఖుడు.

స్వాయంభువు మనువు కుమారుడైన ఉత్తానపాదునకు సునీతి, సురుచి అను ఇద్దఱు భార్యలుండిరి. సునీతికి ధ్రువుడు, సురుచికి ఉత్తముడు అను కుమారులు ఉండిరి. ఉత్తానపాదునకు సురుచిపై మిక్కిలి మక్కువ ఉండెను. ఒకరోజు బాలుడైన ధ్రువుడు తండ్రి యొడిలో కూర్చొనబోయెను. వెంటనే సురుచి అనాదరభావముతో అతనిని క్రిందికి నెట్టివేసెను. పిమ్మట అతనితో "నీవు సునీతి గర్భమున జన్మించిన దురదృష్టవంతుడవు. నా గర్భమున జన్మించియున్నచో నీకు రాజసింహాసనాధికారము దక్కియుండెడిది. వెళ్ళుము. శ్రీహరిని ఆరాధింపుము. అప్పుడు నీ మనోరథము తీరును" అని సురుచి పలికెను. సవతితల్లివలన కలిగిన అవమానమును భరింపలేక ధ్రువుడు విలపించుచు తన తల్లియైన సునీతి కడకేగి జరిగిన వృత్తాంతమును వినిపించెను. సునీతి అతనితో 'నాయనా! సురుచి నిజమే పలికినది. భగవంతుని ఆరాధింపనిదే నీ కోరిక నెరవేరదు.' అని పలికెను. తల్లి మాటలు విని, రాజ్యప్రాప్తికై బాలుడైన ధ్రువుడు భగవంతుని సేవించుటకై ఇంటినుండి బయలుదేరెను. త్రోవలో నారదుడు కలిసెను. అతనిని వెనుకకు మఱల్చుటకై ప్రయత్నించెను. రాజ్యమును ఇప్పించెదనని పల్కెను. కాని ధ్రువుడు తన నిశ్చయమును వీడలేదు. అప్పుడు నారదుడతనికి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను ద్వాదశాక్షరి మంత్రమును ఉపదేశించి, చతుర్భుజుడైన విష్ణువును ధ్యానించు పద్ధతిని తెలిపి ఆశీర్వదించెను.

ధ్రువుడు 'యమునా తీరము'న మధువనము నందు తపస్సు చేయసాగెను. అతని తపస్సు భంగపఱచుటకై అనేక విధములగు విఘ్నములు వచ్చిపడెను. భయపెట్టుట, ప్రలోభ పఱచుట జరిగెను. కాని వాటికి అతడు చలింపక తపస్సునందే దృఢముగా నిల్చెను. భగవానుడు అతని నిశ్చలభక్తికి సంతసించి, అతనికి ప్రత్యక్షమాయెను. దేవర్షి నారదుని ద్వారా ఈ వృత్తాంతమునువిని, రాజు ఉత్తానపాదుడు తన పుత్రుడైన ఉత్తమునితో, ఇద్దఱు రాణులతో గూడి, అతనిని (ధ్రువుని) తీసుకొని వచ్చుటకై బయలుదేరెను. మార్గమధ్యమున తపోమూర్తి యైన ధ్రువుడు కలిసెను. రాజు ఏనుగుపై నుండి దిగి, అతనిని కౌగిలించుకొనెను. పిమ్మట ఆనందోత్సాహములతో అతనిని (ధ్రువుని) ఏనుగుపై ఎక్కించుకొని, నగరమునకు తీసికొని వచ్చెను. కడకు రాజు ధ్రువునకు రాజ్యమును అప్పగించి తాను వానప్రస్థాశ్రమమును స్వీకరించెను.

ప్రశ్న - "ఆర్తుడైన భక్తుని లక్షణములు" ఎట్టివి?

సమా - శారీరిక లేక మానసిక సంతాపములు, ఆపదలు, శత్రుభయములు, రోగములు, అవమానములు, చోరులు, దుష్టులు, క్రూరమృగములు మొదలగువానికి భీతిల్లి

వాటినుండి రక్షించుకొనుటకై, సంపూర్ణ విశ్వాసముతో అనన్య భక్తితో భగవంతుని భజించువారు ఆర్తభక్తులు.

గజేంద్రుడు, జరాసంధునిచే బంధింపబడిన రాజులు మొదలగు వారు ఈ ఆర్తభక్తశ్రేణిలో చేరుదురు. ద్రౌపదీ దేవి ఆర్తులలో ముఖ్యురాలు.

ద్రౌపది ద్రుపదరాజ పుత్రి. ఆమె యజ్ఞకుండము నుండి ఉద్భవించినది. ఆమె శరీరము శ్యామవర్ణము కలిగి మిక్కిలి సుందరముగా ఉండుట వలన ఆమెకు 'కృష్ణ' అను పేరు ప్రసిద్ధికెక్కినది. ఆమె మిక్కిలి గుణవతి. గొప్ప పతివ్రత. ఆదర్శగృహిణి. నిజమైన భగవద్భక్తురాలు. శ్రీకృష్ణుని 'పూర్ణబ్రహ్మ సచ్చిదానంద ఘనపరమేశ్వరుని'గా ఆమె భావించుచుండెడిది. భగవానుని అంతరంగిక లీలా విశేషములు సైతము ఆమెకు తెలిసియుండెడివి. బృందావనము నందలి గోపికలు శ్రీకృష్ణునితో గడిపిన మధుర భక్తిగాథలు వారి భర్తలకును, పుత్రులకును తెలిసియుండెడివికావు. కాని ఆ లీలా సంఘటనములన్నియును ద్రౌపదికి తెలిసియుండెడివి. కనుక వస్త్రాపహరణ సమయమున ద్రౌపది భగవానుని గోపీజనప్రియ! అని సంబోధించెను.

దుష్టుడైన దుశ్శాసనుడు దుర్యోధనుని ఆజ్ఞచే ఏక వస్త్రయైన ద్రౌపదిని సభలోనికి ఈడ్చుకొని వచ్చి, ఆమె వలువలు లాగసాగెను. తనను ఎవ్వరును రక్షించువారులేరని గ్రహించితాను నిస్సహాయురాలనని భావించి ఆమె సర్వరక్షకుడైన శ్రీకృష్ణుని స్మరించెను. తాను స్మరించినంతనే భగవానుడు తప్పక వచ్చుననియు, తన పిలుపు విన్నపిమ్మట అతడు నిలువజాలడనియు ఆమెకు గట్టి విశ్వాసము ఉండెను. ద్రౌపది భగవానుని ఇట్లు ప్రార్థించెను-

**గోవింద! ద్వారకావాసిన్! కృష్ణ! గోపీజనప్రియ! ।**
**కౌరవైః పరిభూతాం మాం, కిం న జానాసి కేశవ! ॥**

**హే నాథ! హే రమానాథ! వ్రజనాథార్తినాశన! ।**
**కౌరవార్ణవమగ్నాం మాముద్ధరస్వ జనార్దన! ॥**

**కృష్ణ! కృష్ణ! మహాయోగిన్! విశ్వాత్మన్! విశ్వభావన! ।**
**ప్రపన్నాం పాహి గోవింద! కురుమధ్యే-వసీదతీమ్ ॥**

(మహాభారత - సభాపర్వ - 67)

'ఓ గోవింద! ద్వారకావాస! ఓకృష్ణ! గోపీజనప్రియ! కేశవ! కౌరవులు నన్ను అవమానించుచున్న విషయమును నీవెఱుగవా? ఓ జగన్నాథ! లక్ష్మీనాథా! వ్రజనాథా! దుఃఖనాశన! జనార్దన! కౌరవసముద్రమునందు మునుగుచున్న నన్ను రక్షింపుము. హేకృష్ణ! కృష్ణ! మహాయోగీశ్వర! విశ్వాత్మా! విశ్వభావన! గోవింద! దుఃఖితురాలనై నిన్ను శరణుజొచ్చిన నన్ను కౌరవుల బారినుండి రక్షింపుము'.

ద్రౌపది పిలుపు వినినంతనే భగవానుని హృదయము ద్రవించెను. అతడు

**త్యక్త్వా శయ్యాసనం పద్భ్యాం కృపాళుః కృపయాఽభ్యగాత్**

కృపాళువైన భగవానుడు దయాపరవశుడై శయ్యనువీడి, కాలినడకతోడనే పరుగిడసాగెను. దానవస్వభావులైన కౌరవుల సభయందు భగవానుడు వస్త్రావతారమును దాల్చెను. వివిధ వర్ణములు గల వస్త్రములు అఖండముగా ద్రౌపదిని చేరసాగెను. దుశ్శాసనుడు లాగుకొలదియు ఆ నిండుసభలో చీరెలు రాసులురాసులుగా ప్రోగయ్యెను. అంతట దుశ్శాసనుడు అలసిపోయి నేలపై కూలబడెను. ఈ విధముగా ఆత్మబంధువైన శ్రీకృష్ణుడు సరియైన సమయమునకు వచ్చి ద్రౌపదీ మానసంరక్షణముగావించెను.

ప్రశ్న - జిజ్ఞాసువైన భక్తుని లక్షణములెట్టివి?

సమా - సంపదలు, భార్యాపుత్రులు మొదలగు వారిపై ఆసక్తిని వీడి, రోగములు, సంకటములు మొదలగు వానిని లక్ష్యపెట్టక పరమార్థతత్త్వ జిజ్ఞాసతో నిష్ఠాపరుడైన, భగవద్భక్తుని **'జిజ్ఞాసువు'** అనియెందురు. (14/26)

జిజ్ఞాసువులైన భక్తులలో పరీక్షిత్తు మొదలగు వారు అనేకులు గలరు. కాని ఉద్ధవుడు ఈ శ్రేణివారిలో మిక్కిలి ప్రసిద్ధుడు. శ్రీమద్భాగవతమునందు ఏకాదశస్కంధములో (7 నుండి 30వ అధ్యాయము వరకు) శ్రీకృష్ణ భగవానుడు ఉద్ధవునికి దివ్యజ్ఞానోపదేశము చేసెను. ఇది 'ఉద్ధవగీత' అని ప్రసిద్ధికెక్కెను.

ప్రశ్న - **'జ్ఞాని'** యైన భక్తుని లక్షణములెట్టివి?

సమా - పరమాత్మప్రాప్తి నందినవారు జ్ఞానులు. వారిదృష్టిలో పరమాత్ముడు ఒక్కడే సత్యము. పరమాత్మ తప్ప జగత్తునందు ఏదియులేదు. పరమాత్మప్రాప్తితో వారి సమస్త వాంఛలు నిశ్శేషముగా పూర్తియగును. ఇట్టి స్థితియందు వారు స్వాభావికముగనే పరమాత్మను భజింతురు. (12/13 నుండి 19 వరకు) 9వ అధ్యాయమునందలి 13, 14 శ్లోకములలోను,

10వ అధ్యాయమునందలి 3వ శ్లోకమునందును, 15వ అధ్యాయమునందలి 19వ శ్లోకమునందును వర్ణింపబడిన నిష్కామ - అనన్య భక్తులైన సాధకులుగూడ 'జ్ఞానులైన భక్తులశ్రేణి'లో చేరుదురు.

జ్ఞానులలో శుకదేవుడు, సనకాదులు, నారదుడు, భీష్ముడు మొదలగువారు ప్రముఖులు. బాలుడైన ప్రహ్లాదుడు కూడా జ్ఞానియైన భక్తుడే. అతడు తల్లి గర్భమున నుండగనే నారదుని ద్వారా ఉపదేశమును పొందెను. అతడు దైత్యరాజైన హిరణ్యకశిపుని పుత్రుడు. హిరణ్యకశిపుడు భగవంతుని ద్వేషించెను. ఇతడు భగవద్భక్తుడు కనుక తండ్రి ఇతనిని మిక్కిలి బాధించెను. పాములతో కరిపించెను. ఏనుగులచే త్రొక్కించెను. ప్రాసాదములనుండి పడద్రోయించెను. సముద్రములో పడవేయించెను. అగ్నులలోనికి త్రోయించెను. గురువుల ద్వారా శిక్షింప జేసెను. కాని భగవానుడు ఇతనిని రక్షించెను. ఇతని కొఱకై భగవంతుడు నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని వధించెను. దేనికిని భయపడకుండుట ప్రహ్లాదుని జ్ఞానస్థితికి నిదర్శనము. బాల్యముననే గురుకులమునందు తోడివిద్యార్థులకు ఇతడు దివ్యోపదేశములను జేసెను. దానిని బట్టియు ఇతడు 'జ్ఞాని' అను విషయము రూఢి యగుచున్నది. భాగవతమునందును, విష్ణుపురాణమునందును ప్రహ్లాదుని ప్రభావమనోజ్ఞ గాథలు పరమసుందరముగా వర్ణింపబడినవి. వాటిని చదువవలెను.

ప్రశ్న - ఇచట 'చ' అను అక్షరమును ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - అర్థార్థి, ఆర్తుడు, జిజ్ఞాసువులైన భక్తులతో పోల్చినప్పుడు 'జ్ఞాని' యొక్క విలక్షణత్వమును, శ్రేష్ఠత్వమును తెల్పుటకై 'చ' అను అక్షరము ప్రయుక్తమైనది. 17, 18, 19 శ్లోకములలో వర్ణింపబడిన జ్ఞానియొక్క మహిమను గూడ ఇచట ప్రయుక్తమైన 'చ' అనునది సంకేతముగా సూచించుచున్నది.

ప్రశ్న - ఈ చతుర్విధభక్తులలో ఎవరు ఎవరికంటె ఉత్తములు? ఎందువలన?

సమా - దృఢమైన విశ్వాసముతో భగవంతుని ఏవిధముగ సేవించినను వారందరును ఉత్తములే. అందువలననే ఈ నాలుగు విధముల వారిని గూడ ఈ శ్లోకమున 'సుకృతినః' అనియు, 18వ శ్లోకమున 'ఉదారాః' అనియు పేర్కొనెను. కాని ఇచ్చటి వర్ణనను బట్టి పరస్పర తారతమ్యములను పరికించినచో అర్థార్థులకంటె ఆర్తులు, వారికంటెను జిజ్ఞాసువులు, వారికంటెను జ్ఞానులు ఉత్తములు అని గోచరించును. అర్థార్థి ప్రాపంచిక భోగములనే సుఖహేతువులుగా భావించి, వాటిపై గల అపేక్షతో భగవంతుని సేవించును. వారు భగవంతుని ప్రభావమును సంపూర్ణముగా ఎఱుగరు. అందువలన వారికి భగవంతునియందు ప్రగాఢమైన భక్తి కుదురుకొనదు. కావున వారు భోగములను కాంక్షింతురు. ఆర్తులైన భక్తులు ఐహిక సుఖభోగములకై ఎన్నడును భగవంతుని ఏమియు కోరరు. కనుక అర్థార్థుల కంటె వీరికి భగవంతుని యెడ భక్తి ఎక్కువయని భావింపవచ్చును. కాని వీరి దృష్టి (ఆసక్తి) శారీరక సుఖములు, గౌరవప్రతిష్ఠాదుల యందును కొంత ప్రసరించుచునే యుండును. కనుక వారు ఘోరసంకటములుగాని, అవమానములుగాని ఎదురైనప్పుడు వాటినుండి బయటపడుటకు భగవంతుని ప్రార్థింతురు. జిజ్ఞాసువులైన భక్తులు ఇహపర, సుఖభోగములకు అపేక్షపడరు. లౌకికమైన విపత్తులకు భయపడరు. వీరు కేవలము భగవత్తత్త్వమును తెలిసికొనుటకే ఇష్టపడుదురు. ప్రాపంచిక భోగములయందు వీరికి ఆసక్తి యుండదు. కాని మోక్షకాంక్ష మాత్రము బలీయముగా నుండును. కనుక అర్థార్థులకంటెను, ఆర్తులకంటెను వీరి భక్తి విలక్షణము, అధికము ఐనప్పటికిని జ్ఞానులతో పోల్చినప్పుడు తక్కువయే అనిపించును. కాని భగవత్స్వరూప తత్త్వమును సమగ్రముగా తెలిసిన జ్ఞానులు ఎట్టి అపేక్షయులేక సహజముగనే నిష్కామభక్తి భావముతో నిత్యము నిరంతరము భగవంతుని సేవింతురు. కనుక వారు ఉత్తమోత్తమ భక్తులు.

ప్రశ్న - ఇచట భగవానుడు అర్జునుని 'భరతర్షభ!' అని సంబోధించుటలోని విశేషమేమి?

సమా - అర్జునుని భరతవంశశ్రేష్ఠుడు అని తెల్పుచు, అతడు సుకృతి యనియు, నిరంతరము తనను సేవించుచునే యున్నాడనియు తెల్పుటకై 'భరతర్షభ!' అని అతనిని సంబోధించెను.

**సంబంధము** - చతుర్విధ భక్తుల విషయమును భగవానుడు ఇంతవఱకును తెలిపెను. ఇపుడు వారిలో జ్ఞానియైన భక్తుని ప్రశంసించుచు ఇతర భక్తులకంటె అతని శ్రేష్ఠత్వమును నిరూపించుచున్నాడు-

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్ అహం స చ మమ ప్రియః ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తేషామ్ | = వారిలో | విశిష్యతే | = శ్రేష్ఠుడు | అత్యర్థమ్ | = అత్యంతము |
| నిత్యయుక్తః | = నిరంతరమునాయందే ఏకీభావస్థితుడును | హి | = ఏలనన | ప్రియః | = ఇష్టుడను |
| ఏకభక్తిః | = అనన్యమైనభక్తిగల | జ్ఞానినః | = యథార్థముగ నాతత్త్వమును ఎఱింగిన జ్ఞానికి | చ | = మఱియు |
| జ్ఞానీ | = జ్ఞానియైనవాడు | అహమ్ | = నేను | సః, మమ | = అతడును నాకు |
| | | | | ప్రియః | = ఇష్టుడు |

**ఈ చతుర్విధభక్తులలో నిరంతరము నాయందే ఏకీభావస్థితుడై, అనన్య భక్తియుతుడైన జ్ఞాని అత్యుత్తముడు. ఏలనన వాస్తవముగ నన్ను (నాతత్త్వమును) తెలిసికొనిన జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడును నాకు మిక్కిలి ఇష్టుడు. (17)**

ప్రశ్న - 'జ్ఞాని' అను పదముతో పాటు 'నిత్యయుక్తః' 'ఏకభక్తిః' అను విశేషణములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - సంసారమును, శరీరమును, తనను తాను సర్వథా మఱచి, అనన్యభావముతో నిత్యము, నిరంతరము కేవలము పరమాత్మయందే స్థితుడైన వానిని నిత్యయుక్తుడందురు. భగవానునియందే నిర్హేతుకమైన, అవిరళమైన భక్తిగల వానిని 'ఏకభక్తిః' అని యందురు. భగవత్తత్త్వమును ఎఱింగిన జ్ఞానియైన భక్తునియందు ఈ రెండు లక్షణములును సంపూర్ణముగా ఉండును. కనుక ఈ విశేషణములు ప్రయోగింపబడినవి.

ప్రశ్న - 'జ్ఞాని'కి నేను అత్యంత ప్రియుడను, అతడు నాకు అత్యంత ప్రియుడు-అని యనుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - భగవానుని యథార్థ తత్త్వమును, రహస్యమును బాగుగా తెలిసినవారికి సర్వత్ర అన్ని సమయములందును భగవత్స్వరూపమే కనబడును. అతని దృష్టిలో భగవంతుడు తప్ప అన్యమేదియును ఉండదు. భగవంతుని పరమశ్రేష్ఠునిగా పరమప్రియతమునిగా అతడు తెలిసికొనును. ఆ కారణమున అతని మనోబుద్ధులయందు 'ఆసక్తి' ఆకాంక్షలు ఏమాత్రము లేక అవి భగవంతుని యందే లీనమైయుండును. ఇట్టి అనన్యభక్తి కలిగిన వానికి భగవానుడు ఎంత ప్రియుడో ఎవ్వరును చెప్పజాలరు. లౌకిక వ్యవహార దృష్టితో మానవులు ఇహపరలోక భోగములయందు అత్యంతము ఆసక్తి కలిగియుందురు. అవియేమిక్కిలి సుఖప్రదములనియు, అవి దుర్లభములనియు భావించి, వాటికై అనుక్షణమూ ప్రాకులాడుచుందురు. కాని 'జ్ఞాని'యైనవాడు భగవత్ప్రాప్తికై ఈ సుఖములనన్నింటిని తృణప్రాయముగా భావించి త్యజించును. అతని దృష్టిలో భగవంతుడు ఎంతటి మహిమాన్వితుడో, అతనికి ఎంత ప్రియుడో ఎవ్వరును చెప్పజాలరు. కనుకనే భగవానుడు "అతనికి నేను అత్యంత ప్రియుడను" అని పలికెను. భక్తునకు భగవంతునిపై ఎంతటి ప్రీతియుండునో భగవంతునకును భక్తునిపై అంతటి ప్రీతియు ఉండును. ఏలనన భగవానుడు సహజముగనే ప్రేమస్వరూపుడు. అతని ప్రేమామృత జలధినుండి ఒక బిందువులభించినను జనులు ఆనందాబ్ధిలో ఓలలాడుచుందురు.[1] "నన్ను ఎవరు ఎట్లు భజింతురో నేను వారిని అట్లే అనుగ్రహింతును." అని భగవానుడు స్వయముగా తెలిపెను. కనుక భగవంతునకు అతడు అత్యంత ప్రేమాస్పదుడు అనుటలో ఆశ్చర్యములేదు. కనుక 'అతడునాకు అత్యంత ప్రియుడు' అని భగవానుడు పలికెను. ఈ శ్లోకమున భగవానుని గుణ ప్రభావరహస్యతత్త్వములను చక్కగా ఎఱింగిన మహాభక్తుల ప్రేమాధిక్యములను గూర్చియు, ఉత్తమ శ్రేణికి చెందిన అనన్యభక్తుల ప్రేమపరాకాష్ఠ స్థితులనుగూర్చియు తెలుపుచు వారిని ప్రశంసించుట జరిగినది.

1) 'రసో వై సః రసగ్ంహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి' (తైత్తిరీయోపనిషత్ 2/7) అతడే రసస్వరూపుడు. ఆ రసమును పొందినవాడు అనంతానందమును పొందును.'

సంబంధము - జ్ఞానియైన భక్తుడు అందఱికంటెను శ్రేష్ఠుడనియు తనకత్యంత ప్రియుడనియు భగవానుడు తెలిపెను. అయినచో ఇతర భక్తులు శ్రేష్ఠులును, ప్రియులును కారా? అను సందేహము కలుగవచ్చును. దీనికి భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ 18 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతే | = ఈ చతుర్విధభక్తులు | | నా స్వరూపమే, అని | | స్థిరముగా నిల్చినవాడై |
| సర్వే, ఏవ | = అందఱును | మే, మతమ్ | = నా అభిప్రాయము | అనుత్తమామ్, గతిమ్ | = అత్యుత్తమ గతి స్వరూపమైన |
| ఉదారాః | = ఉదారులే | హి | = ఏలనన | | |
| తు | = కాని | సః | = అట్టిభక్తుడు | మామ్, ఏవ | = నాయందే |
| జ్ఞానీ | = జ్ఞానియైనవాడు మాత్రము | యుక్తాత్మా | = తన మనస్సును, | ఆస్థితః | = స్థితుడై |
| ఆత్మా, ఏవ | = (సాక్షాత్తుగా) | | బుద్ధిని నాయందే | | ఉన్నవాడు |

ఈ చతుర్విధభక్తులందఱును ఉదారులే. (అనగా భగవంతునియందు విశ్వాసమునుంచి, ఎల్లప్పుడును అతనినే సేవించుచు ఉండువారు.) కాని జ్ఞానియైన వాడు నా స్వరూపమే. ఇది నా అభిప్రాయము. ఏలనన అట్టి భక్తుడు తనమనస్సును బుద్ధిని నాయందే స్థిరముగా ఉంచి నన్నే పరమప్రాప్యునిగా భావించును. ఈవిధముగా అతడు నాయందే స్థితుడు. (18)

ప్రశ్న - 'వీరందఱును ఉదారులే' అనియనుటలోని విశేషమేమి?

సమా - ఇచట ప్రస్తావింపబడిన చతుర్విధభక్తులలో జ్ఞానుల విషయమును గూర్చి చెప్పనవసరమేలేదు. అర్థార్థులు, ఆర్తులు, జిజ్ఞాసువులైన భక్తులుగూడ సర్వథా ఏకనిష్ఠాపరులే. వారును భగవంతునిపై దృఢవిశ్వాసమును కలిగియుందురు. భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, పరమదయాళువు, పరమసుహృదుడు అనియు, తమ ఆశలను, ఆకాంక్షలను అతడొక్కడే తీర్చగలడనియు వారు గట్టిగా విశ్వసింతురు. ఇట్లు విశ్వసించి, తెలిసికొని, ఇతరమైన వానిని వేటిని ఆశ్రయింపక తమ జీవితమును భగవంతుని భజన, స్మరణ, పూజలు, సేవలు మొదలగు వానియందే గడుపుదురు. భగవద్విశ్వాసమునందు ఏమాత్రము లోపము రానీయక తమ జీవనమును కొనసాగింతురు. వారి కోరికలు సర్వథా పూర్తి కాకున్నను వాటిని భగవంతుని అనుగ్రహము వలన నెరవేర్చుకొనగోరుదురు. పతివ్రతయైన ఒక స్త్రీ తన కొఱకై ఏదైన నొకవస్తువును కోరినచో దానిని తనకు ప్రాణప్రియమైన పతిద్వారా సమకూర్చుకొనును. ఆమె ఇతరుల వైపు చూడదు. వారిని విశ్వసింపదు. తెలిసికొనదు. అదేవిధముగ భక్తుడును భగవంతునిపైననే పూర్తిగా విశ్వాసమును ఉంచును. కనుక వారందఱును ఉదారులే (శ్రేష్ఠులే) అని భగవానుడు తెలిపెను. 23వ శ్లోకమునందు "నాభక్తులు నన్నేవిధముగ భజించినను వారు చివరకునన్నే చేరుదురు -" అని పేర్కొనెను. 9వ అధ్యాయము నందును భగవద్భక్తికి ఇట్టి ఫలమే తెల్పబడినది. (9/25).

ప్రశ్న - 'తు' అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - చతుర్విధభక్తులును ఉత్తములు. భగవత్ప్రీతి పాత్రులు. కాని వారిలో మొదటిముగ్గురికంటెను జ్ఞానియొక్క విలక్షణత్వమును ప్రకటించుటకై 'తు' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - నా అభిప్రాయములో "జ్ఞాని" యైనవాడు నా స్వరూపమే" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - జ్ఞానికిని తనకును మధ్య ఎట్టి అంతరమూ లేదని భగవానుడు తెల్పుచున్నాడు. భక్తుడేతాను. తానే భక్తుడు. ఇదియే అందలి అంతరార్థము.

ప్రశ్న - "యుక్తాత్మా" అను పదమునకర్థమేమి? అతడు పరమగతి స్వరూపుడైన భగవంతునియందే స్థితుడైయుండుట అనగానేమి?

సమా - మనస్సును, బుద్ధిని భగవంతుని యందే పూర్తిగా లగ్నముచేసిన వాడు "యుక్తాత్మా" అని యనబడును. అట్టివాడు భగవంతుడే సర్వోత్తముడు. పరమగతి అని భావించి, నిత్యము, నిరంతరము అతని యందే ఏకీభావముతో నిశ్చలస్థితుడైయుండుట - అనగా అతనిని చేరుటయే పరమగతి స్వరూపుడైన భగవంతుని యందే స్థితుడైయుండుట యనబడును.

సంబంధము - 'అట్టి జ్ఞానియైన భక్తుడు దుర్లభుడు' - అని భగవానుడు తెల్పుచున్నాడు-

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।**
**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| బహూనామ్ | = అనేకములైన | | ఎఱింగిన జ్ఞాని | మామ్ | = నన్ను |
| జన్మనామ్ | = జన్మములయొక్క | సర్వమ్ | = సమస్తము | ప్రపద్యతే | = భజించును |
| అంతే | = అంతమున (పిదప) | వాసుదేవః } | = వాసుదేవమయమే | సః, మహాత్మా | = అట్టి మహాత్ముడు |
| జ్ఞానవాన్ | = భగవత్తత్త్వమును | ఇతి } | అని భావించి | సుదుర్లభః | = లభించుట అరుదు |

**అనేకజన్మలపిదప జ్ఞానియైనవాడు(భగవత్తత్త్వమును ఎఱిగినవాడు) సర్వమూ వాసుదేవమయమే యని భావించి, నన్ను శరణుపొందును. అట్టి మహాత్ముడు లభించుట అరుదు. (19)**

ప్రశ్న - 'బహూనాం జన్మనామ్ అంతే' అనియనుటలో ఆంతర్యమేమి?

సమా - పెక్కు జన్మలపిమ్మట భగవత్తత్త్వ జ్ఞానము కలిగిన భక్తునకు అదియే అంతిమ జన్మయగును. ఏలనన అట్టి భక్తునకు 'పునర్జన్మ' యుండదు.

ప్రశ్న - అనేక జన్మలవఱకును సకామ భావముతో భగవంతుని సేవ చేయగా చేయగా మనుష్యుడు భగవంతునకు ఆంతరంగికి (ఐకాంతిక) మరియు జ్ఞానియైన భక్తుడగును - అని భావించినచో కలుగు దోషమేమి?

సమా - అట్లు భావించినచో అర్థార్థి, ఆర్తుడు, జిజ్ఞాసువు ఐన భగవద్భక్తులకు పెక్కు జన్మలు అనివార్యములే యగును. కాని భగవానుడు పెక్కుచోట్ల సర్వవిధభక్తులకును తాను ప్రాప్యుడనని తెలిపియుండెను. (7/23, 9/25) అచ్చట ఎక్కడను అనేక జన్మల నియమమును పేర్కొనియుండలేదు. శ్రద్ధాభక్తులలో లోపము ఏర్పడినప్పుడు సాధన దెబ్బతిని, పెక్కు జన్మలెత్త వలసియుండును. భక్తిశ్రద్ధలు వృద్ధిచెందినప్పుడు సాధన బలముగా కొనసాగి ఒకే జన్మయందును భగవత్ప్రాప్తి కలుగవచ్చును. ఇందు కాలనియమములేదు.

ప్రశ్న- ఇచట 'జ్ఞానవాన్' అను పదము ఎవరిని తెల్పును?

సమా - భగవంతుడు ఈ అధ్యాయమునందలి 2వ శ్లోకమున విజ్ఞాన సహిత జ్ఞానమును ప్రశంసించియుండెను. 3వ శ్లోకమునందు అట్టి విజ్ఞాన సహిత జ్ఞానమును పొందినవారిలో ఎవరో ఒక్కరు మాత్రమే తన తత్త్వమును సమగ్రముగా తెలిసికొందురని తెల్పెను. అట్టి భక్తుని గూర్చియే ఇచట 'జ్ఞానవాన్' అను పదము ప్రయోగింప బడినది. కనుక 18వ శ్లోకమునందు 'అతడు తన స్వరూపమే' అని పేర్కొనెను.

ప్రశ్న - 'సర్వమూ వాసుదేవుడే' అని భావించి భగవంతుని సేవించుట యనగానేమి?

సమా - జగత్తంతయు వాసుదేవుని స్వరూపమే. వాసుదేవునకు తప్ప ఈ జగత్తునందు మఱిదేనికిని అస్తిత్వమే లేదు. ఈ తత్త్వమును ప్రత్యక్షముగా బలముగా అనుభవించుటయు, దానియందే నిత్యమూ స్థితుడై యుండుటయును, సర్వమూ వాసుదేవుడేయని భావించి అతనిని సేవించుట యగును.

ప్రశ్న - 'అట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - సాధారణముగా జగత్తునందు మానవులకు భజనపై అభిరుచి కలుగుటయే అరుదు. వేలమందిలో ఎవరికో ఒకరికి భజనపై అభిరుచి కలిగినను స్వభావ వశమున తత్ప్రయత్నము శిథిలమై మధ్యలోనే ఆభజనను మానివేయును. ఎవరైనను కొంత విశేష ప్రయత్నము చేసినను భక్తి శ్రద్ధలు లోపించిన కారణమున కోరికల ప్రవాహమున అది (ఆభజన) కొట్టుకొని పోవును. ఈ కారణమున అతడు గూడ భగవత్తత్త్వమును తెలిసికొనలేడు. కనుక భగవత్తత్త్వము ఎఱిగినజ్ఞాని నూటికి కోటికి ఒక్కడు మాత్రమే ఉండును. కనుక అట్టి మహాత్ముడు దుర్లభుడని తెల్పబడినది.

ఇట్టి మహాత్ముడు ఎవ్వరికైనను లభించినచో అతడు మిక్కిలి భాగ్యశాలియని భావింపవలెను. "మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ." (నారదభక్తి సూత్రము. 39) మహాపురుషుల సాంగత్యము దుర్లభము, అగమ్యము, అమోఘము, అను నారద మహర్షి వచనములు పరమ సత్యములు.

*సంబంధము - 15వ శ్లోకమునందు ఆసురీ ప్రకృతిగల మూఢులు తనను భజింపరని తెల్పెను. సుకృతులైనవారే తనను సేవింతురని 16 నుండి 19వ శ్లోకములలో తెల్పియుండెను. సుకృతులైనప్పటికీ కోరికల ప్రభావమున తమ తమ స్వభావముల ననుసరించి, ఇతర దేవతలను ఉపాసన చేయువారి విషయము భగవానుడు తెల్పగోరుచున్నాడు-*

**కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః ।**
**తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ॥ 20 ॥**

తైః, తైః, కామైః = నానావిధములైన ఆయా భోగవాంఛలచే
హృతజ్ఞానాః = అపహృతమైన జ్ఞానముగలవారు
స్వయా, ప్రకృత్యా = తమ స్వభావములచే
నియతాః = ప్రేరితులై
తమ్, తమ్, నియమమ్ = వారి వారి (ఆయా) నియమములను
ఆస్థాయ = పాటించి
అన్యదేవతాః = ఇతర దేవతలను
ప్రపద్యంతే = ఆరాధింతురు

**నానావిధములైన భోగవాంఛలలో కూరుకొనిపోయినవారిజ్ఞానము హరింపబడును. వారు తమతమస్వభావములకు అనుగుణముగా వారివారి (ఆయా) నియమములను బట్టి ఇతర దేవతలను ఆరాధించుచుందురు. (20)**

ప్రశ్న - ఇచట 'తైః' అను పదమును రెండు పర్యాయములు ప్రయోగించుటలోని విశేషమేమి? కోరికలవలన జ్ఞానము హరింపబడును అని యనగానేమి?

సమా - అందఱి కోరికలూ ఒక్క రీతిగా ఉండవు అని తెల్పుటకే 'తైః' అను పదము రెండుమార్లు ప్రయోగింపబడినది. ఆ భోగముల యందలి కోరికల మోహము వలన మనుష్యుల వివేకము నశించును. అప్పుడు నే నెవరిని? నా కర్తవ్యమేమి? జీవేశ్వరుల సంబంధమెట్టిది? మానవజన్మ ఏల ప్రాప్తించినది? ఇతర ప్రాణుల శరీరములకంటెను ఇందలి వైశిష్ట్యమేమి? మొదలుగా గల వివేకవంతుని ప్రశ్నలు అతనికి (అజ్ఞానమును కోల్పోయిన వానికి) కలుగనే కలుగవు. భోగములకు లోబడుట కంటెను భగవంతుని భజించుటయే శ్రేయస్కరము అని అతడు భావింపడు. కోరికలమూలమున జ్ఞానము హరింపబడుట యనగా ఇదియే.

ప్రశ్న - 15వ శ్లోకమున 'మాయయా + అపహృత జ్ఞానాః' అను ప్రయోగముచే పేర్కొనబడినవారికిని, ఇచట 'తైస్తైః కామైః హృతజ్ఞానాః' అను పదముల ద్వారా పేర్కొన బడినవారికిని మధ్యగల భేదమేమి?

సమా - 15వ శ్లోకమున 'మాయయాపహృతజ్ఞానాః' అని వర్ణింపబడిన వారిని భగవానుడు పాపాత్ములు, మూఢులు, నరాధములు, ఆసుర స్వభావముగలవారు అని పేర్కొనెను. వారు ఆసురీ ప్రకృతి గలవారగుటచేత తమోగుణాధిక్యము గలవారు. కనుక వారు నరకయాతనలను అనుభవింపదగినవారు. (శ్లో 16/16,19) కాని ఇచ్చట వర్ణింపబడిన వారి జ్ఞానము వేర్వేఱు కోరికలచేత హరింపబడుట వలనను, వారు దేవతలను పూజించు భక్తులు, శ్రద్ధాళువులు అగుటవలనను స్వర్గలోక ప్రాప్తికి పాత్రులు. (7/23, 9/25) వీరు రజోమిశ్రిత సాత్త్వికులని భావింపబడిరి. కావున ఈ యిద్దఱి మధ్యను మిక్కిలి అంతరముగలదు.

ప్రశ్న - తమ తమ స్వభావములు అనగానేమి? వాటిచే ప్రేరితులనగానేమి?

సమా - జన్మజన్మాంతరములలో చేయబడిన కర్మల వలన సంచితమైన సంస్కారములచే ప్రకృతి ఏర్పడును. దానినే స్వభావము అని అందురు. ఈ స్వభావము ప్రతిజీవికిని వేర్వేఱుగా ఉండును. ఈ స్వభావములను అనుసరించి, అంతఃకరణమునందు వేర్వేఱు దేవతలను పూజించు కోరికలు ఉత్పన్నములగును. వాటిచే ప్రేరితులై జనులు వేర్వేఱు దేవతలను పూజింతురు.

ప్రశ్న - ఆయా నియమములను అనుసరించి, అన్యదేవతలను పూజింతురు - అనగానేమి?

సమా - సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఇంద్రుడు, మరుత్తు, యముడు, వరుణుడు మొదలగు శాస్త్రోక్త దేవతలను పరమాత్మ కంటెను వేఱుగా భావించుటయు, వారియుపాసనలయందు వేర్వేరు ఉద్దేశ్యములతో చేయదగు జప, ధ్యాన, పూజా, నమస్కారములు, న్యాసము, హవనము, వ్రతము, ఉపవాసము మొదలగు నియమములను సావధానముగ చక్కగా పాటించుటయు ఆయా నియమములతో అన్య దేవతలను సేవించుటయగును. కోరికలు, ఇష్టదేవతలు వేర్వేఱగుట వలన తదనుసారము పూజాదికనియమములలో గూడ భేదములుండును. కనుక 'తం' అను పదము రెండుమార్లు ప్రయోగింపబడినది.

మఱొక విషయము. భగవానుని కంటె వారిని వేఱుగా భావించి, పూజించుటయే అన్య దేవతలను పూజించుట యగును. ఆ దేవతలను భగవానుని స్వరూపముగా భావించి, నిష్కామ భావముతో భగవదాజ్ఞానుసారము లేక భగవత్ప్రీత్యర్థము వారిని పూజించినచో అది అన్యదేవతలను పూజించుట గాక పరమాత్మని పూజించుటయే యగును. అప్పుడు దాని ఫలము గూడ భగవత్ప్రాప్తియే యగును.

*సంబంధము - ఈ దేవతోపాసకులకు లభించు ఉపాసనా ఫలము లేవి? అవియెట్లు లభించును? అను విషయములను ఇప్పుడు రెండు శ్లోకములలో వర్ణించుచున్నాడు-*

**యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః,యః,భక్తః | = ఏయే సకామభక్తుడు | అర్చితుమ్ | = పూజించుటకు | | గూర్చియే (ఆ దేవతయందే) |
| యామ్, యామ్, తనుమ్ | = ఏయే దేవతా స్వరూపమును | ఇచ్ఛతి | = కోరుకొనునో | అచలామ్ | = స్థిరమైనదానినిగా |
| | | తస్య తస్య | = ఆయా భక్తుల | అహమ్ | = నేను |
| శ్రద్ధయా | = శ్రద్ధతో | శ్రద్ధామ్ | = శ్రద్ధను | విదధామి | = చేయుదును |
| | | తామ్, ఏవ | = ఆ దేవతను | | |

**సకామభక్తుడు ఏయేదేవతాస్వరూపములను భక్తిశ్రద్ధలతో పూజింప నిశ్చయించుకొనునో, ఆ భక్తునకు ఆయాదేవతలయందే భక్తిశ్రద్ధలను స్థిరముగా కుదురుకొనునట్లు చేయుదును. (21)**

ప్రశ్న - 'భక్తః' అను పదముతోపాటు 'యః' అనియు, 'తనుమ్' అను పదముతోపాటు 'యామ్' అనియు, రెండుమార్లు ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 'యః' అను పదమును రెండుమార్లు ప్రయోగించి, భక్తుల బాహుళ్యమును 'యాం' అను పదమును రెండుమార్లు ప్రయోగించి, దేవతల అసంఖ్యాకత్వమును తెల్పెను. సకామభక్తులలో గూడ అనేక విధములగువారు ఉందురు. కోరికలు, స్వభావముల భేదములను బట్టి, వారిచే సేవింపబడు దేవతలును వేర్వేఱుగా ఉందురు.

ప్రశ్న - ఆ దేవతా స్వరూపమును భక్తుడు శ్రద్ధతో పూజించును. అని యనుటలోని విశేషమేమి?

సమా - దేవతలయొక్క ఉనికి యందును, వారి ప్రభావగుణములయందును అట్లే వారి పూజా విధానముల యందును, ఫలములయందును భక్తుడు పూర్తి విశ్వాసముంచును. ఆ దేవతా మూర్తిని లోహముతోగాని,

కఱ్ఱతోగాని, మట్టితోగాని, లోహముతోగాని నిర్మించి, దానిని గాని లేక చిత్రపటమును గాని విధ్యుక్తముగా నిలుపును. లేక ఆ మూర్తిని మానసికముగా నిర్మించుకొని, నిర్దిష్టమైన మంత్రమును నియమితసంఖ్యాపూర్వకముగా జపించుచు, అతడు విధివిధానముగ పూజించును. ఆయా దేవతలను ఉద్దేశించి అగ్నిద్వారా ఆహుతులను సమర్పించి, యజ్ఞాదికములను చేయును. ఆయాదేవతలను ధ్యానించును. సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలగు ప్రత్యక్ష దేవతలను పూజించును. వీరందఱికిని యథావిధిగా నమస్కారాదులను ఆచరించును. దేవతల యొక్క స్వరూపమును శ్రద్ధతో పూజించుట అనగా నిదియే.

ప్రశ్న - 'తామ్' అను పదము 'శ్రద్ధామ్' అను పదముతో సంబంధించినదిగాకాక దానిని 'తనుం' (దేవతా స్వరూపమును) అనుదానికి సంబంధించినదిగా ఏల భావింపబడినది?

సమా - పూర్వార్ధమునందు 'యామ్, యామ్' అను పదముల సంబంధము 'తనుమ్' (దేవతా స్వరూపము) అను పదముతో గలదు. దానితో ఏకాన్వయము చేయుటకే 'తామ్' అను పదమును గూడ 'తనుమ్' అను పదమునకు బోధకముగా భావించుటయే ఉచితము - 'శ్రద్ధా' అను పదముతో పాటు గూడ దానిసంబంధమును భావించుటవలన ఎట్టి వ్యత్యాసమూ కలుగదు. ఎందుకనగా ఆ శ్రద్ధ కూడ దేవతా విషయమునకు సంబంధించినదే.

ప్రశ్న - 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించుట లోని విశేషమేమి?

సమా - భక్తుడు ఏ దేవతను పూజించుటకు ఇష్టపడునో ఆ భక్తుని శ్రద్ధను అతని ఇష్టదేవత యెడనే స్థిరమగునట్లు చేసెదనని భగవానుడు తెల్పుటకే 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించెను.

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే ।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥ 22 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సః | = ఆ భక్తుడు | ఈహతే | = ఇష్టముతో చేయును | విహితాన్ | = విహితములైన |
| తయా, శ్రద్ధయా | = అట్టిశ్రద్ధతో | చ | = మఱియు | తాన్, కామాన్ | = ఆ భోగములను |
| యుక్తః | = కూడినవాడై | తతః | = ఆ దేవతనుండి | హి | = నిస్సందేహముగా |
| తస్య, ఆరాధనమ్ | = ఆ దేవతారాధనమునే | మయా,ఏవ | = నా అనుగ్రహము వలననే | లభతే | = పొందును |

అట్టి సకామభక్తుడు తగిన భక్తిశ్రద్ధలతో ఆ దేవతనే ఆరాధించును. తత్ఫలితముగ నా అనుగ్రహము వలననే ఆ దేవతద్వారా తాను కోరుకొనిన భోగములను అతడు తప్పక పొందగలడు. (22)

ప్రశ్న - ఈ శ్లోకమునందు భగవానుడు తెల్పిన విషయవిశేషములేమి?

సమా - భగవంతుడు స్థిరపఱచినట్టి ఆ శ్రద్ధతో గూడినవాడై భక్తుడు యథావిధిగా ఆ దేవతను పూజించును. అట్టి ఉపాసనా ఫలస్వరూపముగ ఆ దేవత ద్వారా భగవానుడు నిర్ణయించిన ఫలమును ఆ భక్తుడు పొందును. భగవన్నిర్ణయమునకు అధికముగాగాని, తక్కువగా గాని ఫలములనిచ్చు శక్తి ఆ దేవతలకు లేదు. ఏ ప్రభుత్వము నందైనను చట్ట ప్రకారము వేర్వేఱు విభాగములలో పనిచేయు అధికారులకుగల స్థాయిని (స్థితిని) పోలినదే ఈ వివిధదేవతల స్థాయి (స్థితి) గూడ. వారు ఎవరికైనను కార్యాచరణమునకు బదులుగా ఏదైనను ఇయ్యదలచినను అది చట్ట ప్రకారము అతని యోగ్యతను బట్టియు, అట్లే తన అధికారమును బట్టియు ఇయ్యవలసినదే.

ప్రశ్న - ఈ శ్లోకమునందు 'హితాన్' అను పదమును 'కామాన్' అను పదమునకు విశేషణముగా భావించి, 'వారు హితకరములైన' భోగములను ఇచ్చెదరు - అను అర్థమును చెప్పినచో కలుగు దోషమేమి?

సమా - ఇట్లు అర్థము చెప్పుట సముచితము కాదని తోచును. ఏలనన కామశబ్ద వాచ్యములైన భోగపదార్థములు నిజముగా ఎవ్వరికిని హితకరములు కానేకావు.

**సంబంధము** - అన్యదేవతోపాసనాఫలము నశ్వరమని తెల్పుచు, భగవదుపాసనాఫలమహాత్మ్యమును ప్రతిపాదించుచున్నాడు-

**అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।**
**దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = అయితే | అంతవత్ | = నశ్వరము | యాంతి | = పొందుదురు |
| తేషామ్, అల్పమేధసామ్ | = ఆ అల్పబుద్ధుల యొక్క | భవతి | = అగును | మద్భక్తాః | = నా భక్తులు |
| | | దేవయజః | = దేవతలను పూజించువారు | మామ్, అపి | = (కడకు) నన్నే |
| తత్, ఫలమ్ | = ఆ ఫలము | దేవాన్ | = ఆ దేవతలనే | యాంతి | = పొందుదురు |

**కాని ఈ సకామభక్తులు (అల్పబుద్ధులు) పొందెడి ఫలములు గూడ నశ్వరములు. అన్యదేవతలను పూజించువారు ఆ దేవతలనే చేరుదురు. నా భక్తులు ఏ విధముగా ఆరాధించినను (వారి వాంఛలనేగాక) చివరకు నన్నే పొందుదురు. (23)**

ప్రశ్న - 15వ శ్లోకమునందు తెల్పబడిన మూఢులకును, ఈ అన్యదేవతోపాసకులైన అల్ప బుద్ధులకును మధ్యగల వ్యత్యాసమేమి? వీరిని 'అల్పబుద్ధులు' అనియనుటలోని విశేషమేమి?

సమా - భగవద్భక్తి రహితులై, పాపకర్మలను ఆచరించు నరాధములను, అసుర స్వభావము గల వారనియూ మూఢులనియూ 15వ శ్లోకమున పేర్కొనుట జరిగినది. ఇచ్చట పేర్కొనబడిన వారు పాపకర్మలను చేయువారు కారు. శాస్త్రోక్తముగనే దేవతలను ఉపాసించువారగుట వలన వారికంటెను శ్రేష్ఠులు, వీరు అసుర స్వభావముగల మూఢులును కారు. కాని కోరికలకు వశులై ఇతర దేవతలను పరమాత్మకంటెను వేఱుగా భావించి, భోగ్యవస్తువుల లాభముకొఱకు వారిని ఉపాసించెదరు. కనుక భక్తులకంటెను వీరు నిమ్నశ్రేణికి చెందినవారు. కావున వీరిని 'అల్పబుద్ధులు' అని పేర్కొనుట జరిగినది. వీరి బుద్ధులు అల్పములైనవి కానిచో భగవానుడే సకల దేవతా రూపముల ద్వారా సమస్త పూజలను ఆహుతులను గ్రహించుననియు, భగవానుడే అందఱికిని పరమేశ్వరుడనియు గట్టిగా భావించి యుండెడివారు. (5/29, 9/24) బుద్ధి అల్పమైనదగుట వలననే మిక్కిలి శ్రమతో కూడిన యజ్ఞాది కర్మాచరణముల వలన వీరికి క్షుద్రమైన, నశ్వరములైన ఫలములే లభించును. నిజముగా వీరు బుద్ధిమంతులే ఐయుండినట్లయితే భగవంతుని ప్రభావము తెలిసికొని తదుపాసన కొఱకే శ్రమపడి (యత్నించి) ఉండెడివారు. లేదా! సమస్త దేవతలను భగవంతునికంటెను వేఱుగాదని భావించి, భగవత్ప్రీతికై అతనిని ఉపాసించి యుండెడివారు. అప్పుడు అంతేశ్రమతో దుర్లభమైన భగవత్ప్రాప్తి పొంది. కృతకృత్యులైయుండెడి వారు. ఈ భావమును తెల్పుటకే వీరిని అల్పబుద్ధులని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - దేవతలప్రాప్తి కలుగుటయనగా నేమి? దేవతలను పూజించు భక్తులందఱికిని ఆ దేవతల ప్రాప్తి కలుగునా? దేవతోపాసన ఫలము అంతము కలదని (అల్పమైనదని) తెల్పుటలోని విశేషమేమి?

సమా - దేవతలను ఉపాసించువారు ఆయా దేవతల లోకములకు చేరి, వారి సామీప్యమును, సారూప్యమును పొంది, అచటి భోగములను అనుభవించుటయే దేవతల ప్రాప్తి కలుగుట యనబడును. దేవతోపాసనవలన కలుగు అత్యున్నత ఫలము ఇదియే. కాని దైవోపాసకులలో కొందరికి మాత్రమే ఈ ఫలములు లభించును. అందరికీ లభించవు. భార్యాపుత్రులు, సిరి సంపదలు, కీర్తి ప్రతిష్ఠలు మున్నగు తుచ్ఛములైన క్షణికములైన భోగములకొఱకే ఉపాసన చేయువారికి వారి వారి కోరికలను బట్టి ఆయా భోగములే లభించును. కొందరు భక్తులు దేవతల యందు విశేషమైన భక్తివిశ్వాసములు కలిగియుండి, భోగములకంటెను దేవతలనే అధికమైన ప్రీతితో, ఉపాసించు చుందురు. మరణకాలమునందు వారికి ఆ దేవతల స్మృతియే కలుగును.

కనుక వారు దేవలోకములకు చేరుదురు. కాని ఈ దేవతలు, వారిద్వారా లభించుభోగములు, వారి లోకములు, అన్నియును నశ్వరములే. కనుక వాటినన్నింటిని 'అంతవత్' అని చెప్పుట జరిగినది.

ప్రశ్న - భగవత్ప్రాప్తి కలుగుట యనగానేమి? ఆర్తులు మొదలగు భక్తులందఱికిని ఆ భగవత్ప్రాప్తి యెట్లు కలుగును? ఈ వాక్యము నందలి 'అపి' అను అవ్యయ ప్రయోగము యొక్క విశేషమేమి?

సమా - భగవంతుని యొక్క శాశ్వతమైన దివ్యపరమధామము నందు భగవంతునకు సమీపముగా నివసించుటయు, లేక అభేద భావముతో భగవానునియందు ఐక్యము అగుటయు అను ఈ రెండిటిని భగవత్ప్రాప్తియే అనియుందురు. జ్ఞానియైన భక్తుని దృష్టిలో జగత్తంతయు పరమాత్మ స్వరూపమే. కావున అతనికి నిత్యము భగవత్ప్రాప్తి లభించుచునే యుండును. అతనిని గూర్చి చెప్పవలసిన పనియేలేదు. జిజ్ఞాసువైన భక్తుడు భగవత్తత్త్వమును ఎఱుంగుటకు కాంక్షించును. అతనికి భగవత్తత్త్వజ్ఞానము కలిగినంతనే భగవత్ప్రాప్తి కల్గును. ఇంక మిగిలినవారు అర్థార్థులు, ఆర్తులు. వారికి గూడ భగవదనుగ్రహమువలన భగవత్ప్రాప్తి కల్గును. భగవంతుడు పరమదయాళువు. భక్తునకు సాధ్యమైనంత త్వరగా భగవత్ప్రాప్తిని చేకూర్చు శ్రేయోమార్గమునే అతడతనికి సమకూర్చును. భక్తుడు మోహవశమున వాంఛాసిద్ధినిగాని, సంకట నివృత్తిని గాని త్వరపడి అర్థించినను అది అతనికి హానికరమైనచో భగవంతుడు ఆ కోరకను నెరవేర్చడు. భక్తుని యొక్క భక్తివిశ్వాసములు పెరుగుటకే అనుగ్రహించును. దాని వలన భక్తుని వాంఛలు నెరవేరుటయే గాక భగవత్ప్రాప్తియు కల్గును. 'అపి' అను అవ్యయప్రయోగము యొక్క ఆంతర్యముగూడ ఇదియే.

ఎప్పుడైనను భక్తిద్వారా భగవంతునితోడి సంబంధమును ఒక్కసారి కలుపుకొన్న పిమ్మట అతడు దానిని విడిపించుకొనదలచినను భగవంతుడు దానిని విడిపించుకొననీయడు. భక్తుడు కోరిన దానిని అనుగ్రహించుట, లేక అది ఆ భక్తునకు పరిణామమున హానికరమైనచో దానిని అనుగ్రహింపకుండుట ద్వారా అతనికి నష్టమును కలుగనీయకుండుట - ఇదియే భక్తియొక్క మహత్త్వము, రహస్యము. అవకాశము దొరికినంతనే ఆ భక్తి భక్తుడిని భగవంతుని వైపునకు ఆకర్షించును. ఒక్కసారి ఏదైననొక కారణమువలన భక్తి ఏర్పడినచో అనేక జన్మలు గడిచినను భగవత్ప్రాప్తియగునంతవరకు అదియతనిని అంటిపెట్టుకొనియే ఉండును. భగవత్ప్రాప్తి కలిగిన పిమ్మట వానినుండి భక్తి దూరమగుట అను ప్రశ్నయే తలయెత్తదు. అపుడు భక్తి, భక్తుడు, భగవానుడు అను మూడును ఏకత్వమును పొందును.

*సంబంధము - భగవంతుడు మిక్కిలి భక్తవత్సలుడును, పరమదయాళువును అయి తనను భక్తులు ఎట్లు సేవించినను వారికి తన స్వరూప ప్రాప్తిని కల్గించుచున్నప్పుడు జనులందఱును అతనిని ఏల భజింపరు? అను సందేహము కలుగుట సహజము. దీనికి భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః ।**
**పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥ 24 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మమ | = నాయొక్క | అజానంతః | = ఎఱుంగనివారై | | |
| అనుత్తమమ్ | = అత్యుత్తమము | అవ్యక్తమ్ | = ఇంద్రియములకును, మనస్సునకును గోచరింపనివాడనైన | | |
| అవ్యయమ్ | = శాశ్వతము ఐన | | | వ్యక్తిమ్, | = సామాన్యవ్యక్తినిగా |
| పరమ్, భావమ్ | = పరమభావమును | | | ఆపన్నమ్ మన్యంతే | = తలంచెదరు |
| అబుద్ధయః | = బుద్ధిహీనులు | మామ్ | = సచ్చిదానందఘన పరమాత్ముడనైన నన్ను | | |

నేను శాశ్వతుడను. సర్వోత్తముడను, ఇంద్రియములకును, మనస్సునకును గోచరింపనివాడను. నా పరమభావమును బుద్ధిహీనులు గ్రహింపక, ఇట్టి సచ్చిదానందఘనపరమాత్ముడనైన నన్ను సాధారణ మనుష్యునిగా అనగా జననమరణచక్రములోబడి పరిభ్రమించు వానినిగా తలంచెదరు.(24)

ప్రశ్న - ఇచ్చట 'అబుద్ధయః' అను పదము ఎట్టి మనుష్యులను సూచించును. సర్వోత్తమమైన, శాశ్వతమైన, పరమభావమును వారు తెలిసికొనక పోవుట యనగా నేమి?

సమా - భగవంతుని గుణప్రభావనామస్వరూపలీలాదుల యందు విశ్వాసములేని వారిని, బుద్ధి విషయ విమోహితమగుట వలన మోహావృతులై వితండవాదములలో చిక్కుకొనిన మందమతులను 'అబుద్ధయః' అను పదము తెలుపును. సమస్త జగత్తు భగవంతునియొక్క రెండు విధములైన ప్రకృతుల యొక్క విస్తార రూపమేయనియు, ఈ రెండు ప్రకృతులకును పరమాధారుడగుట వలన భగవంతుడే సర్వోత్తముడనియు, అతనికంటెను ఉత్తముడు మఱియొకడు లేడనియు అను విషయము ఈ మందబుద్ధులకు తోచదు. భగవంతునియొక్క స్వరూప స్వభావ మహత్త్వములు, అచింత్యములు, అనిర్వచనీయములు, అట్లే అతని గుణములు నిరుపమానములు. గ్రహించుటకు గాని, వివరించుటకుగాని అవి మనోవాక్కులకు అందనివి. భగవంతుడు మిక్కిలి దయాళువు, శరణాగతవత్సలుడు. ఆ కారణమున జగత్తులోని శరణాగతులైన ప్రాణులకు తన ఆశ్రయమును ఇచ్చుటకై భగవానుడు తన జన్మరాహిత్యమును శాశ్వతత్వమును, మహేశ్వరత్వమును, సామర్థ్యమును వివిధస్వరూప (అవతార) ములలో ప్రకటించుచున్నాడు. తన అలౌకికలీలల ద్వారా జగత్తునందలి ప్రాణులను, పరమానందములో ప్రశాంత మహాసముద్రములో ఓలలాడించుచున్నాడు. భగవంతుని ఈ నిత్యమైన, సర్వోత్తమమైన ఈ భావమును బుద్ధిహీనులు గ్రహింపలేరు. సర్వోత్తమమైన, శాశ్వతమైన పరమభావమును వారు తెలిసికొనక పోవుట యనగానిదియే.

ప్రశ్న - 'అవ్యక్తస్థితుడనైన నన్ను ఒక వ్యక్తిగా భావింతురు' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - భగవంతుని నిర్గుణసగుణరూపములు రెండును నిత్యములు, దివ్యములు. భగవంతుడు తన అచింత్యమైన అలౌకికమైన దివ్య స్వరూపస్వభావ ప్రభావగుణములను ప్రకటించుటకే మనుష్యాది రూపములయందు అవతరించు చుండును. ఇట్లు మనుష్యాది రూపములతో ప్రాదుర్భవించుటయే అతడు జన్మించుట, అంతర్ధానమగుటయే పరంధామమునకు చేరుటయగును. ఇతర ప్రాణులవలె అతనికి శరీర సంయోగవియోగరూప జననమరణములు లేవు. ఈ రహస్యమును ఎఱుంగని కారణమున బుద్ధిహీనులైన వారు ఇతర ప్రాణులకు వలె శ్రీకృష్ణ భగవానునకును జన్మ (అవతారమున)కు పూర్వము ఉనికియే లేదనియు. ఇప్పుడు వసుదేవుని ఇంటిలో జన్మించినాడనియు తలంతురు. ఇతర మనుష్యులకును శ్రీకృష్ణునకును భేదమేమియు లేదని భావింతురు. ఈ విషయమునే బుద్ధిహీనులైన మనుష్యులు అవ్యక్తస్థితిలో నున్న భగవంతుని వ్యక్తిగా భావింతురని తెల్పబడినది.

ప్రశ్న - అవ్యక్తస్థితిలో ఉన్న భగవానుని అనగా నిర్గుణ నిరాకార పరమేశ్వరుని సగుణ సాకార మనుష్యరూపములో ప్రకటితమైన వానినిగా బుద్ధిహీనులు భావింతురని అర్థము చెప్పినచో దోషమేమి?

సమా - ఇచట ఈ యర్థమును చెప్పుట సముచితము గాదు. ఏలనన భగవంతుని నిర్గుణ, సగుణ, నిరాకార, సాకార స్వరూపములన్నియును శాస్త్రసమ్మతములే. స్వయముగా భగవానుడే "నేను జన్మరహితుడను, శాశ్వతుడను, ఐన పరమేశ్వరుడను. ఐనను నా ప్రకృతిని స్వీకరించి, సాధువులను రక్షించుటకును, దుష్టులను శిక్షించుటకును ధర్మమును స్థాపించుటకును కాలానుగుణముగ అవతరింతును." (4/6,7,8.) అని చెప్పియుండెను. అల్పబుద్ధులు చెప్పిన అర్థమును ఒప్పుకొన్నచో భగవంతుని అవతారతత్త్వమును వ్యతిరేకించినట్లగును.

ప్రశ్న - వ్యక్తిగా అవతరించిన భగవానుని అనగా మనుష్యరూపమున ప్రత్యక్షముగా ప్రకటితమైన సగుణసాకార పరమేశ్వరుని అవ్యక్త స్థితిలోనున్న నిర్గుణ నిరాకారునిగా బుద్ధిహీనులైన మనుష్యులు భావించెదరని అర్థము చెప్పిన దోషమేమి?

సమా - ఈ అర్థముగూడ సముచితముగాదు. ఏలనన సగుణసాకారరూపమున వ్యక్తమైన పరమేశ్వరుడు నిర్గుణ నిరాకారుడు గూడ. కనుక ఈ యథార్థతత్త్వమును గ్రహించిన వారిని బుద్ధిహీనులని భావించుటకు వీలులేదు. భగవంతుడే స్వయముగా నా అవ్యక్త నిరాకార స్వరూపముతోడనే ఈ సమస్త జగత్తు వ్యాప్తమైయున్నది" - (9/4) అని పల్కియుండెను. కనుక ఇచట పేర్కొనబడిన అర్థము సరియైనది అని తోచుచున్నది.

సంబంధము - మనుష్యరూపమున ప్రకటితుడైన సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని జనులు సాధారణమానవునిగా ఏల భావింతురు? అను ప్రశ్నకు భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥ 25 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యోగమాయా-సమావృతః | = నా యోగమాయచే కప్పబడినవాడనై | | గోచరించువాడను కాను | మామ్ | = నన్ను |
| అహమ్ | = నేను | అయమ్ | = ఈ | అజమ్ | = జన్మరహితునిగా |
| సర్వస్య | = ప్రతివ్యక్తికిని | మూఢః, లోకః | = మూఢలోకము (అజ్ఞానులు) | అవ్యయమ్ | = శాశ్వతునిగా |
| ప్రకాశః, న | = ప్రత్యక్షముగా | | | న, అభిజానాతి | = తెలిసికొనలేదు (తెలిసికొనలేరు) |

**నా యోగమాయచే ఆవరింపబడియున్నందున నేను అందరికిని గోచరింపను. కనుక అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా, పరమేశ్వరునిగా తెలిసికొనలేరు. (అనగా నన్ను జనన మరణములకు లోనగువానినిగా తలంతురు) (25)**

ప్రశ్న - 'యోగమాయ' అనగా నేమి? భగవానుడు దానిచే ఆవృతుడయ్యెను – అని యనగానేమి?

సమా - నాల్గవ అధ్యాయమునందలి 6వ శ్లోకమున భగవానుడు **'ఆత్మమాయా'** అను సమాసమును ప్రయోగించి ఆ యోగ శక్తిద్వారా తన దివ్యగుణములతో గూడ స్వయముగా మనుష్యాది రూపములలో తాను ప్రకటితుడనౌదునని తెల్పియుండెను. అట్లైనను లోకదృష్టిలో అతడు సాధారణ మనుష్యునిగా జన్మించినట్లు గోచరించుచున్నాడు. ఆ మాయాశక్తినే ఇచట 'యోగమాయ' అని తెల్పెను. భగవానుడు మనుష్యాది రూపములలో అవతరించి ఇతరులకు బహురూపుడుగా (పెక్కురూపములతో) కనబడినప్పుడు తన యథార్థ (అవతార) రూపమును కప్పియుంచును. అట్లే తన యోగమాయాశక్తిని అన్ని దిశలయందును వ్యాపింపజేసి, అందులో స్వయముగా దాగియుండును. అతడు యోగమాయావృతుడగుటయనగా ఇదియే.

ప్రశ్న - నేను 'అందరికిని కనపడను' అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - భగవంతుడు యోగమాయచేత కప్పబడి యుండుట వలన సాధారణమానవుల దృష్టి ఆ మాయయను తెరను అధిగమింపజాలదు. ఈ కారణము వలన పెక్కుమంది అతనిని తమవంటి సాధారణమనుష్యునిగా భావింతురు. కనుక భగవానుడు అందఱికిని గోచరింపడు. భగవంతునియందు అనన్యభక్తి గలిగి అతని గుణప్రభావ స్వరూపలీలలయందు సంపూర్ణమైన శ్రద్ధాదరములు గలవారిని అనుగ్రహింపదలచి వారికి మాత్రమే ప్రత్యక్షమగును.

ప్రశ్న - జీవుడు మాయచే ఆవరింపబడుట సహజమే - కాని భగవానుడు మాయచే ఆవరింపబడుట ఎట్లు పొసగును?

సమా - సూర్యుని మేఘములు కప్పివేసినవి - అని అన్నప్పుడు వాస్తవముగా సూర్యుడు కప్పివేయబడడు. కాని సూర్యునకును మానవ దృష్టికిని మధ్య మేఘములు అడ్డుగా నిలుచును. నిజముగా సూర్యుడే కప్పబడియున్నచో బ్రహ్మాండమునందెచ్చటను అతని ప్రకాశమే ఉండదు. అట్లే వాస్తవముగా భగవానుడు మాయచే కప్పివేయబడడు. ఒకవేళ అతడే కప్పివేయబడినచో ఏ భక్తునకును అతని దర్శనము కాదు. కేవలము మూఢులకే అతడావృతుడైనట్లు ఏల చెప్పబడును? మఱియొక కోణమునుండి ఆలోచించి, చూచినచో సూర్యుని ఉదాహరణము కూడ ఇచట సరిపోదు. ఏలనన అనంతుడైన భగవంతుని విషయమున అంతము (అవధి) గల దేనితోను పోల్చుట తగదు. లోకమునకు అర్థమగుట కొఱకే ఈ ఉదాహరణము ఈయబడినది.

ప్రశ్న - 'అయం మూఢః' అను విశేషణములతో గూడ ప్రయుక్తమైన 'లోకః' అను పదము ఎవరిని సూచించును?

ఇది ఈ యధ్యాయమునందలి 15వ శ్లోకమునందు వర్ణింపబడిన ఆసురీ ప్రకృతి గల మూఢులను గూర్చియా? లేక 20వ శ్లోకమున పేర్కొనబడినట్లు కోరికలద్వారా హరింపబడిన జ్ఞానము గల అన్యదేవతోపాసకులను గూర్చియా?

సమా - 'అయమ్' అను విశేషణముతో పాటు 'లోకః' అను పదము భగవద్భక్తులను గాక ఇతరులైన పాపాత్ములను (ఆసురీ ప్రకృతిగల మూఢులను) పుణ్యాత్ములను (అన్యదేవతోపాసకులను) సూచించును. ఏదో ఒక శ్రేణికి చెందిన వారికి మాత్రమే గాక అజ్ఞానులైన సాధారణమనుష్యులందరికిని ఇది వర్తించును.

ప్రశ్న - అజ్ఞానులైనవారు జన్మ రహితుడను, శాశ్వతుడను, పరమేశ్వరుడను ఐన నన్ను తెలిసికొనలేరు. అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని యెడ శ్రద్ధాదరములు లేని కారణమున అజ్ఞానులైన వారు అతని గుణ ప్రభావ స్వరూపములను, లీలారహస్యములను, మహిమలను తెలిసికొనజాలరు. అందువలన శ్రీకృష్ణుడును జనన మరణములు కలిగిన తమవంటి సాధారణ మనుష్యుడే యని భ్రమలో పడుదురు. అతడు జన్మమృత్యువులకు అతీతుడనియు, నిత్యుడనియు, శాశ్వతుడనియు (సత్యమైనవాడనియు) సాక్షాత్తు విజ్ఞానానందఘన పరమేశ్వరు డనియు ఎఱుగరు.

*సంబంధము - భగవానుడు తాను యోగమాయావృతుడనని తెలిపెను. ఒక మందమైన తెరలోపలనున్న వానిని బయటి వారు చూడజాలరు. లోపలనున్న వానికిని బయటివారు కనపడరు. అదే విధముగ లోకులు మాయావృతుడైన భగవంతుని తెలిసికొనలేనప్పుడు భగవంతుడు గూడ వారిని చూడలేక పోవచ్చును గదా? అను సందేహము రావచ్చును. ఈ సందేహనివృత్తికై యోగమాయ తన శక్తివిశేషమే యనియు అది తన అధీనములోనే యుండును. గావున తన దివ్యజ్ఞానమును అది ఆవృతము చేయజాలదనియు భగవానుడు తెల్పుచున్నాడు-*

**వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।**
**భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున! | = ఓ అర్జునా! | చ | = మఱియు | వేద | = ఎఱుంగుదును |
| సమతీతాని | = గతించిపోయినట్టివియు | భవిష్యాణి | = రాబోవుకాలమున జన్మించునట్టివియు ఐన | తు | = అయితే |
| చ | = మఱియు | | | మామ్ | = నన్ను |
| వర్తమానాని | = ప్రస్తుత కాలమునందు ఉన్నట్టివియు | భూతాని | = ప్రాణులనన్నింటిని గూర్చి | కశ్చన | = నాయందు శ్రద్ధలేనివాడు ఎవ్వడును |
| | | అహమ్ | = నేను | న వేద | = ఎఱుంగడు |

**ఓ అర్జునా! గతకాలమునకు చెందినట్టివియు, వర్తమాన (ప్రస్తుత) కాలము నందున్నట్టివియు ఐన చరాచర ప్రాణులన్నింటిని నేను ఎఱుగుదును. అంతేకాదు రాబోవుకాలమున ప్రభవించు (జన్మించు) ప్రాణులనుగూర్చియు నేను ఎఱుగుదును. కాని నాయందు భక్తిశ్రద్ధలుగలవారుతప్ప వేరెవ్వరును నన్ను ఎఱుగజాలరు. (26)**

ప్రశ్న - ఇచట 'భూతాని' అను పదము ఎవరెని సూచించును? భూత, భవిష్యద్వర్తమాన కాలముల యందలి ప్రాణులనన్నింటిని నేను ఎఱుగుదును - అని యనుటలోని విశేషమేమి ?

సమా - దేవతలు, మనుష్యులు, పశువులు కీట, పతంగాది సమస్త చరాచర ప్రాణులను 'భూతాని' అను పదము తెల్పును. భూతకాలమునందు కల్పకల్పాంతరములలోను ప్రాణులు ఎప్పుడు ఏయే యోనులలో ఏ విధముగా జన్మించినవి? అవి ఎట్లుండినవి? ఏమి చేసినవి? అట్లే వర్తమాన కల్పమునందు ఎవరు? ఎక్కడ? ఏయే యోనుల

యందు ఏవిధముగా జన్మించి, ఏమి చేయుచున్నారు? ఇంకను భవిష్యత్కల్పమునందు ఎవరు? ఎక్కడ? ఏవిధముగా ఉందురు? - ఈ సమస్త విషయములను భగవంతుడెఱుగును.

ఇదియును లోకదృష్టితో చెప్పిన విషయమే. ఏలనన భగవంతునకు భూత భవిష్యద్వర్తమాన కాలభేదములు లేవు. ఆయన యొక్క అఖండ జ్ఞానస్వరూపములు అన్నియును సర్వదా ప్రత్యక్షముగా నుండును. ఆయనకు అన్నియును సర్వదా వర్తమానములే. వాస్తవముగ అతడు సమస్త కాలములకును ఆశ్రయమైన మహాకాలస్వరూపుడు. ఆయనకు తెలియకుండ ఏదియును జరుగదు.

ప్రశ్న - ఇచట 'తు' అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - జీవులకంటెను భగవంతుని వైశిష్ట్యమును తెల్పుటకై 'తు' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'కశ్చన' అను పదము ఎవరిని తెల్పును? దానితోపాటు అర్థవివరణమునందు 'శ్రద్ధాభక్తిరహిత పురుషులు' అను విశేషణమును కలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ అధ్యాయమునందలి 3వ శ్లోకమునందు భగవానుడు "ఎవరో ఒక్కరు మాత్రమే నాతత్త్వమును తెలిసికొన గలరు." అనియు ఈ అధ్యాయమునందలి 30వ శ్లోకమునందు 'అధిభూత అధిదైవ, అధియజ్ఞ సహితుడైన నన్ను తెలిసికొందురు." అనియు తెల్పియుండెను. ఇంతేగాక 11వ అధ్యాయమునందలి 54వ శ్లోకమున భగవానుడు "అనన్య భక్తిద్వారా మనుష్యుడు నాతత్త్వమును తెలిసికొనగలడు, నన్ను చూడగలడు. నాలో ప్రవేశింపనూగలడు." అని పేర్కొనియుండెను. కనుక భగవద్భక్తులు తప్ప మూఢులైన సాధారణ మనుష్యులెవ్వరును భగవంతుని తెలిసికొనలేరని గ్రహింపవలెను. 'కశ్చన' అను పదము ఇట్టి వారినే సూచించును. ఈభావమును స్పష్ట పరచుటకే శ్రద్ధా భక్తిరహిత పురుషులు అను విశేషణము అర్థవివరణమున చేర్చబడినది - రాబోవు శ్లోకమునందు, రాగద్వేష జనితద్వంద్వ మోహములకు లోనగు జనులు తన నెఱుగరని తెల్పియున్నాడు. కావున రాగద్వేష రహితులైన భక్తులు భగవంతుని తెలిసికొనగలరని రూఢియగుచున్నది.

*సంబంధము - శ్రద్ధాదరములులేని మూఢులైన మనుష్యులలో ఎవ్వరును భగవంతుని తెలిసికొనలేక పోవుటకు గల కారణమేమి? అను విషయమును భగవానుడు తెలుపుచున్నాడు-*

**ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ।**
**సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥ 27 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ భరతవంశీ! | ద్వంద్వ-మోహేన | = వలన కలిగిన సుఖదుఃఖాదిద్వంద్వముల ప్రభావమున మోహ కారణముగ | సర్వభూతాని | = సమస్తప్రాణులును |
| పరంతప! | = ఓ అర్జునా! | | | సమ్మోహమ్ | = అంతులేని వ్యామోహమును |
| సర్గే | = (ఈ) జగత్తునందు | | | యాంతి | = పొందుచున్నవి |
| ఇచ్ఛాద్వేషసముత్థేన | = రాగద్వేషముల | | | | |

**భరతవంశీ! ఓ అర్జునా! జగత్తునందు ప్రాణులన్నియును రాగద్వేషములవలన కలిగిన సుఖ దుఃఖాదిద్వంద్వములప్రభావమున అంతులేని మోహములో పడిపోవుచున్నవి. (27)**

ప్రశ్న - ఇచ్ఛాద్వేషములనగానేమి? వాటినుండి ఏర్పడిన ద్వంద్వరూపమోహములెట్టివి?

సమా - భగవానుడు రాగద్వేషములనే ఇచట ఇచ్ఛాద్వేషములని పేర్కొనెను. మనుష్యుని శ్రేయోమార్గములకు అవి విఘాతమును కల్గించు శత్రువులుగా (3/34) పేర్కొనబడెను. కామక్రోధములను పేర పాపహేతువులుగా అవి (3/37) వర్ణింపబడియుండెను. ఈ ఇచ్ఛాద్వేషముల నుండి ఉత్పన్నములైన హర్షశోకములు, సుఖదుఃఖాది ద్వంద్వములు, జీవుల అజ్ఞానమును దృఢపఱచుటకు కారణములగును. కనుక వీటిని ద్వంద్వరూపమోహములు అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - 'సర్వ భూతాని' అను సమాసము ఎవరిని

తెల్పును? వారు మోహితులగుదురు - అని యనగానేమి?

సమా - నిజమైన భక్తి శ్రద్ధలు గలిగి భగవంతుని భజించు భక్తులు తప్ప మిగిలిన జనులనందఱిని 'సర్వభూతాని' అను పదము సూచించును. వారు ఇచ్ఛాద్వేష జనితములైన హర్షశోకములు, సుఖదుఃఖాది రూపమోహములకు వశమగుదురు. తమ జీవిత పరమలక్ష్యమును విస్మరించి, భగవంతుని భజించు విషయమును గూర్చి ఏ మాత్రము ఆలోచింపరు - దుఃఖమునకును, భయమునకును కారణమైన, నశ్వరములైన, క్షణభంగురములైన భోగములనే సుఖహేతువులుగా భావింతురు. వాటిని సమకూర్చుకొని, అనుభవించుటలోనే తమ అమూల్యజీవితములను కోల్పోవుచుందురు. వారు మోహితులగుట యనగా ఇదియే.

సంబంధము - 'భూతాని' అనుపదముతో 'సర్వ' అను పదమును ప్రయోగించుట వలన ప్రాణులందరును ఈ ద్వంద్వములకు మోహితులు అగుదురనియు, ఎవ్వరును వాటినుండి తప్పించుకొనలేరనియు భ్రమ కలుగవచ్చును. భగవానుడు ఈ భ్రమను నివృత్తి చేయుచున్నాడు-

**యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥ 28 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | పాపమ్ | = పాపము(లు) | దృఢవ్రతాః | = దృఢనిశ్చయము గలవారై |
| పుణ్య-కర్మణామ్ | = నిష్కామభావముతో పుణ్యకర్మలను ఆచరించు | అంతగతమ్ | = నశించిపోవునో | మామ్ | = నన్ను |
| యేషామ్, జనానామ్ | = ఏ పురుషులయొక్క | తే | = అట్టివారు (అట్టిభక్తులు) | భజంతే | = భజింతురు |
| | | ద్వంద్వ మోహ నిర్ముక్తాః | = రాగద్వేషజనితములైన సుఖదుఃఖాది రూపమోహముల నుండి విముక్తులై | | |

**కాని నిష్కామభావముతో పుణ్యకర్మలను ఆచరించు పురుషులపాపములు రూపుమాసిపోవును (నశించును). అట్టివారు రాగద్వేషజనితములైన సుఖదుఃఖాది రూపమోహములనుండి విముక్తులయ్యెదరు. దృఢనిశ్చయముగల్గిన అట్టి భక్తులే అన్నివిధముల నన్ను భజింతురు. (28)**

ప్రశ్న - ఇచట 'తు' అను అవ్యయమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - సామాన్యజనుల కంటెను శ్రేష్ఠులైన భగవద్భక్తుల వైశిష్ట్యమును తెల్పుటకై ఇచట 'తు' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - నిష్కామభావముతో శ్రేష్ఠమైన కర్మలను ఆచరించువారి పాపములన్నియును రూపుమాయును - అను విషయము ఎట్టి పురుషులను గూర్చి చెప్పబడినది?

సమా - జన్మజన్మాంతరములనుండియు శాస్త్రవిహిత యజ్ఞదాన తపశ్చర్యాది శ్రేష్ఠకర్మలను భక్తి శ్రద్ధలతో ఆచరించువారును, పూర్వసంస్కారముల వలనను, ఉత్తమ సాంగత్య ప్రభావమునను, ఈ జన్మయందును నిష్కామభావముతో పవిత్రకర్మలను ఆచరించుచు భగవంతుని సేవించు వారును, తమ దుర్గుణదురాచారాది సమస్త దోషములును నశించుట వలన పవిత్రాంతఃకరణులు అయ్యెడివారును అగు మహాపురుషుల పాపములన్నియును తొలగిపోవును. ఇట్టి పురుషుల విషయమును గూర్చియే పైన తెల్పబడినది.

ప్రశ్న - ద్వంద్వముల మోహము నుండి ముక్తుడగుట యనగానేమి?

సమా - రాగద్వేషములనుండి ఉత్పన్నములగు సుఖ దుఃఖములు, హర్షశోకములు మున్నగు ద్వంద్వ సముదాయరూప మోహముల నుండి సర్వథా ముక్తుడగుట - అనగా ప్రాపంచిక సుఖదుఃఖాదుల సంయోగవియోగములు ఏర్పడినప్పుడు ఎప్పుడును, ఏ స్థితియందును చిత్తమునందు ఏవిధములైన వికారములు లేకుండుటనే ద్వంద్వ మోహములనుండి ముక్తుడగుట యందురు.

ప్రశ్న - 'దృఢవ్రతాః' అనగా నేమి?

సమా - అంతులేని ప్రలోభములును, విఘ్నములును ఎన్ని ఎదురైనను వాటిలో దేనినీ ఏ మాత్రమూ లెక్కచేయక భగవత్సేవాబలముతో వాటినన్నింటిని కాలరాచి, భక్తిశ్రద్ధలతో గూడిన తమ ఆలోచనలయెడలను, నియమముల పైనను మిక్కిలి దృఢముగా నిశ్చలముగా ఉందురు. అందు ఏమాత్రమూ విచలితులు గారు. అట్టి స్థిరనిశ్చయములు గల భక్తులనే 'దృఢవ్రతులు' అని యందురు.

ప్రశ్న - అన్ని విధములుగా భగవంతుని సేవించుట యనగానేమి?

సమా - సర్వవ్యాపియు, సర్వాధారుడును, సర్వశక్తి మంతుడును అందఱికిని ఆత్మయు, పరమ పురుషోత్తముడును ఐనవాడా భగవంతుడు మాత్రమే అని భావించి, భక్తి శ్రద్ధలతో బాహ్యాభ్యంతరకరణములను (శరీరేంద్రియమనస్సులను) భగవత్సేవలయందే లగ్నము చేయుట - అనగా బుద్ధిద్వారా భగవత్తత్త్వమును గ్రహించుట, మనస్సు ద్వారా ఆయన యొక్క గుణ ప్రభావ స్వరూప లీలారహస్యములను చింతన చేయుట, వాక్కుద్వారా ఆ భగవన్నామ గుణములను కీర్తించుట, శిరస్సుతో నమస్కరించుట, చేతులతో పూజించుట, దీనులు, దుఃఖితులు మొదలగువారిలో ఆయనను చూచుట, సేవించుట, కన్నులార ఆయన మూర్తిని దర్శించుట, పాదములతో (నడకతో) ఆయన మందిరములకును, తీర్థక్షేత్రములకును వెళ్ళుట, అట్లే తమ సమస్త వస్తువులను నిశ్శేషముగా కేవలము ఆ భగవంతునకే అర్పించి, సర్వథా శరణు జొచ్చినవాడగుట, - అన్ని విధములుగా భగవంతుని సేవించుట యనగా ఇదియే.

సంబంధము - భగవంతుని సేవించువారి యొక్క సేవారీతులను, వాటి ఫలములను తెలుపుచున్నాడు-

**జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్ అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యే | = ఏ పురుషులు | యతంతి | = ప్రయత్నింతురో | చ | = మఱియు |
| మామ్ | = నన్ను | తే | = వారు (ఆపురుషులు) | అఖిలమ్, కర్మ | = సంపూర్ణ కర్మమును |
| ఆశ్రిత్య | = ఆశ్రయించి (శరణుపొంది) | తత్, బ్రహ్మ | = ఆ పరబ్రహ్మను | విదుః | = తెలిసి కొందురు |
| జరామరణ-మోక్షాయ | = జరామరణములనుండి విముక్తికై | కృత్స్నమ్, అధ్యాత్మమ్ | = సంపూర్ణ అధ్యాత్మమును | | |

నన్ను శరణుపొంది జరామరణవిముక్తికై ప్రయత్నించు పురుషులు ఆ పరబ్రహ్మను, సమస్త - అధ్యాత్మమును, సంపూర్ణ కర్మను తెలిసికొందురు. **(29)**

ప్రశ్న - "జరామరణములనుండి ముక్తులగుటకు భగవంతుని శరణుపొందు యత్నము చేయుట" అనగా నేమి?

సమా - జన్మబంధములనుండి ముక్తి కలుగునంత వఱకు వార్ధక్యము, మృత్యువులనుండి విముక్తి లభించుట అసంభవము. జీవుడు అజ్ఞాన జనిత కర్మబంధముల నుండి సర్వథా ముక్తుడై భగవంతుని పొందినప్పుడే అతనికి జన్మరాహిత్యము కలుగును. కోరికలను అన్నింటిని త్యజించి, దృఢనిశ్చయముతో నిత్యము నిరంతరము భగవంతుని భజించుటవలననే భగవత్ప్రాప్తికల్గును. మానవుడు సత్సాంగత్య ప్రభావమువలన పాపములనుండి బయటపడిన పిమ్మటనే ఆసురభావములు సర్వథా తొలగిపోయి భగవంతుని భజించును. ఈ అధ్యాయమునందే భగవంతుడు "ఆసుర స్వభావముగల నీచులు, పాపులు, మూఢులు నన్ను భజింపరు" **(7/15)**. అని తెలిపియుండెను. అందువలన **27**వ శ్లోకమునందును లోకులు భగవంతుని ఎరుగకుండుటకు కారణములను తెలుపుచు భగవానుడు "రాగద్వేషజనితమైన సుఖదుఃఖాది ద్వంద్వ మోహములయందు చిక్కుకొనిన జీవులు సర్వథా అజ్ఞానముననే మునిగి యుందురు." అని చెప్పియుండెను.

ఇట్టి వారి మనస్సులు నానా విధములైన భోగవాంఛలతో నిండియుండును. కోరికలనన్నింటిని రూపుమాపి, జనన మరణములనుండి విముక్తి పొందవలెనను కాంక్ష వీరి మనస్సులలో కలుగనే కలుగదు. కనుకనే 28వ శ్లోకమునందు పాపరహితులును, పుణ్యకర్ములును సుఖదుఃఖాది ద్వంద్వములనుండి ముక్తులైన వారును మఱియు దృఢనిశ్చయముతో భగవంతుని సేవించువారును, భగవంతుని సమగ్రముగా తెలిసికొనుటకు అర్హులని తెల్పబడినది. జననమరణచక్రమునుండి ముక్తిని పొంది అత్యంత శీఘ్రముగ పరబ్రహ్మ పరమాత్మను తెలిసికొని, భగవత్ప్రాప్తిని పొందవలెనను పవిత్ర కాంక్ష పాపరహితులైన ఇట్టి మనుష్యుల మనస్సులయందే జాగృతమగును. కావుననే "ప్రాపంచిక విషయముల నన్నింటిని ఆశ్రయించుట మాని, దృఢ విశ్వాసముతో నన్నే ఆశ్రయించి, సంతతము నాయందే మనస్సును బుద్ధిని నిల్పిన వారు నన్ను శరణు పొందుటకు యత్నింతురు." అని భగవానుడు తెలిపెను.

ప్రశ్న - 'తత్' అను విశేషణముతోపాటు, 'బ్రహ్మ' అను పదము ఎవరిని తెలుపును. 'కృత్స్నమ్' అను పదముతో పాటు 'అధ్యాత్మమ్' అను పదము ఎవరిని సూచించును? 'అఖిలమ్' అను విశేషణముతోపాటు 'కర్మ' అను పదము దేనిని తెల్పును - అట్లే వీనినన్నింటిని ఎఱుంగుట అనగానేమి?

సమా - నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్మను తెల్పునదియే 'తత్' విశేషణముతో గూడిన 'బ్రహ్మ' అను పదము. ఈ పరబ్రహ్మ పరమాత్మ తత్త్వమును చక్కగా గ్రహించి, దానిని సాక్షాత్కరింప చేసికొనుటయే దానిని ఎఱుంగుట యగును. ఈ అధ్యాయము నందు భగవానునిచే, 'పరాప్రకృతి' అను పేరుతో వర్ణింపబడిన తత్త్వము, అట్లే 15వ అధ్యాయమునందు అక్షరము అని తెల్పబడినదియూ - అగు సమస్త జీవసముదాయమును 'కృత్స్నమ్' అను విశేషణముతోపాటు 'అధ్యాత్మమ్' అను పదము తెల్పును. సచ్చిదానంద ఘనపరమాత్మయే అనేకాకారములతో జీవుల రూపములలో కన్పించుచున్నాడు. వాస్తవముగా ఈ జీవసముదాయ రూప అధ్యాత్మము సచ్చిదానంద ఘనపరమాత్మ కంటె వేఱైనది కాదు. ఈ తత్త్వమును తెలిసికొనుటయే దీనిని (కృత్స్నమ్ - అధ్యాత్మమ్) ఎఱుగుట అగును. సమస్త భూతముల, సంపూర్ణక్రియల, ఉత్పత్తికై భగవానుని ఆదిసంకల్పరూపమైన విసర్గమునే 'కర్మ' యందురు. (దీని సమగ్ర వివరణము 8వ అధ్యాయమునందలి 3వ శ్లోక వ్యాఖ్యానమున చేయబడినది.) ఇది భగవత్సంకల్పమే అగుట వలన భగవంతునకభిన్నమైనదే యగును. ఈ విధముగా తెలిసికొనుటయే 'అఖిలమ్ కర్మ' అనుదానిని ఎఱుంగుట యగును.

**సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।**
**ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥ 30 ॥**

యే = ఏ పురుషులు
సాధిభూతాధిదైవమ్ = అధిభూత - అధిదైవములతో
చ = మఱియు
సాధియజ్ఞమ్ = అధియజ్ఞముతో గూడిన (అందఱికినీ ఆత్మరూపుడనైయున్న)
మామ్ = నన్ను
ప్రయాణకాలే, అపి = ప్రయాణకాలము నందైనను (అవసానసమయమున నైనను)
విదుః = ఎఱుంగుదురో
తే = వారు (ఆ పురుషులు)
యుక్తచేతసః = నిశ్చలబుద్ధి గలవారై
మామ్, చ = నన్నే
విదుః = ఎఱుంగుదురు (పొందుదురు)

అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతోపాటు అందరికినీ ఆత్మరూపుడనైన నన్ను అంత్యకాలమునందైనను తెలిసికొనువారు నిశ్చలబుద్ధితో నన్నే చేరుదురు. (30)

ప్రశ్న - 'అధిభూతం' 'అధిదైవం' 'అధియజ్ఞం' అను పదములు ఏయే తత్త్వములను తెలుపును? వీటన్నింటితోపాటు భగవానుని సమగ్రముగా (సంపూర్ణముగా) తెలిసికొనుట యనగానేమి?

సమా - ఈ అధ్యాయమునందు 'అపరాప్రకృతి' యనియు, 15వ అధ్యాయమునందు 'క్షరపురుషుడు' అనియు భగవానునిచే తెలుపబడిన నశ్వరమైన సమస్త జడవర్గమునకే 'అధిభూతమ్' అని పేరు. 8వ అధ్యాయమున 'బ్రహ్మ' అని తెల్పబడిన సూత్రాత్మయైన హిరణ్యగర్భుని పేరే 'అధిదైవమ్'. 9వ అధ్యాయమునందలి 4, 5, 6 శ్లోకముల యందు వర్ణింపబడినట్లు సమస్త ప్రాణుల అంతః కరణములయందు అంతర్యామి రూపముతో వ్యాప్తమైయున్న భగవానుని 'అవ్యక్తస్వరూపము'నే 'అధియజ్ఞమ్' అని యందురు.

29వ శ్లోకమున వర్ణింపబడిన 'బ్రహ్మ' జీవ సముదాయ రూపమైన 'అధ్యాత్మము' భగవంతుని ఆది సంకల్పరూపమైన 'కర్మ'. అట్లే ఈ శ్లోకమున ప్రస్తావింప బడిన జడ వర్గరూపమైన 'అధిభూతమ్', హిరణ్య గర్భరూపుడైన 'అధిదైవమ్' అంతర్యామి రూపుడైన 'అధియజ్ఞమ్' - ఇవి యన్నియు భగవంతుని స్వరూపములే. ఇదియే భగవంతుని సంపూర్ణ రూపము. ఈ సంపూర్ణ రూపమును తెల్పుటకే భగవానుడు అధ్యాయ ప్రారంభమున ప్రతిజ్ఞ చేసియుండెను. మఱల 7వ శ్లోకమునందు "నాకంటెను భిన్నమైన మఱియొక పరమకారణమేదియును లేదు" అనియును, 12వ శ్లోకమున "సాత్త్విక, రాజస, తామస భావములన్నియును నానుండియే కలుగుచున్నవి" అనియును, అట్లే 19వ శ్లోకమున "అంతయును ఆ వాసుదేవుడే" అనియును, ఈ సంపూర్ణ స్వరూపమునే వర్ణించెను. ఇచ్చటను ఉపర్యుక్త పదములద్వారా దీనినే వర్ణించి, ఈ అధ్యాయమును ముగించెను. పరమాణువు, ఆవిరి, మేఘము, ధూమము, జలము, మంచు, అన్నియును జలస్వరూపమే ఐనట్లు బ్రహ్మ, అధ్యాత్మము, కర్మ, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము ఇవి యన్నియును వాసుదేవుడే అని భగవంతుని యథార్థ రూపమును గ్రహించుటయే సంపూర్ణముగా పరబ్రహ్మమును లేక భగవానుని తెలిసికొనుట యగును.

ప్రశ్న - "ప్రయాణకాలే" అను పదముతో పాటు 'అపి' అను అవ్యయ ప్రయోగము యొక్క విశేషమేమి?

సమా - 'వాసుదేవః సర్వమ్' ఇతి - అనగా సర్వమూ వాసుదేవుడే యని భగవంతుని సంపూర్ణ రూపమును అంతకాలమునందు తెలిసికొన్న వారును యథార్థమునెఱింగి, భగవత్ప్రాప్తినందెదరు. 2వ అధ్యాయము చివరగూడ 'బ్రాహ్మీస్థితి' మహిమను తెలుపుచు ఇదే విధముగ 'అపి' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞాన విజ్ఞాన యోగో నామ సప్తమోఽధ్యాయః ॥ ౭ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఎనిమిదవ అధ్యాయము - అక్షరబ్రహ్మయోగము

**అధ్యాయ నామము :** అక్షరము, బ్రహ్మము అను రెండు పదములును భగవంతుని సగుణ నిర్గుణ స్వరూపములను తెల్పును. *(8/3,11,21,24).* అట్లే భగవంతుని యొక్క 'ఓమ్' అను నామమును గూడ అక్షరము, బ్రహ్మము అని పిలిచెదరు. *(8/13)* ఈ అధ్యాయమునందు భగవంతునియొక్క సగుణ నిర్గుణరూపములు, ఓంకారము వర్ణింపబడినవి. కనుక 'అక్షరబ్రహ్మ యోగము' అను పేరు ఈ అధ్యాయమునకు రూఢియైనది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయముయొక్క మొదటి రెండు శ్లోకములయందు బ్రహ్మ, అధ్యాత్మము. మొదలగు విషయములను గూర్చి అర్జునుని ప్రశ్నలు 'ఏడు' గలవు. 3 నుండి 5వ శ్లోకము వరకు భగవానుడు ఈ ఏడు ప్రశ్నలకును సంక్షిప్తముగ సమాధానమును ఇచ్చెను. మానవుడు అంత్యకాలమునందు చేయదగు చింతనయొక్క మహత్త్వమును గూర్చి 6వ శ్లోకమునందు వివరించి, 7వ శ్లోకమున నిరంతరము భగవచ్చింతననే చేయుచుండుమని అర్జునుని ఆజ్ఞాపించెను. 8 నుండి 10వ శ్లోకము వరకు విధ్యుక్తముగ భక్తితో యోగి సగుణనిరాకారరూపమును చింతన చేయుచు ప్రాణత్యాగము చేయు రీతిని , మరియు దాని ఫలమును వర్ణించెను. 11 నుండి 13వ శ్లోకము వరకు పరమాత్మయొక్క నిర్గుణ స్వరూపమును ప్రశంసించుచు అంత్యకాలమున యోగధారణా విధిద్వారా నిర్గుణ పరబ్రహ్మయొక్క జపధ్యానరీతిని, దాని ఫలమును వివరించెను. 14వ శ్లోకమున భగవత్ప్రాప్తికి అనన్య భక్తితో నిరంతరము చింతనచేయుటయే సులభమైన ఉపాయమని తెలిపెను. 15, 16వ శ్లోకములయందు భగవత్ప్రాప్తికి ఫలము పునర్జన్మరాహిత్యమనియు, ఇతర సమస్తలోకములన్నియును పునరావృత్తి శీలములనియు తెలిపెను. 17 నుండి 19వ శ్లోకము వరకును బ్రహ్మయొక్క దివారాత్రముల అవధులను గూర్చి తెల్పుచు సమస్త ప్రాణులయొక్క ఉత్పత్తి ప్రళయములను వర్ణించెను. 20వ శ్లోకమున ఒక అవ్యక్తముకంటెను పరమైన మరొక సనాతన - అవ్యక్తమును ప్రతిపాదించెను. 21, 22వ శ్లోకములయందు ఆ సనాతన అవ్యక్తమునే 'అక్షరము' అనియు, 'పరమగతి' అనియు, 'పరమధామము' అనియు, 'పరమ పురుషుడు' అనియు వివిధములగు పేర్లతో పేర్కొని ఆ పరమ పురుషప్రాప్తికి అనన్య భక్తియే పరమోపాయమని పేర్కొనెను. తదనంతరము 23 నుండి 26వ శ్లోకము వరకు శుక్లకృష్ణగతులను ఫల సహితముగా వర్ణించి, 27వ శ్లోకమున ఈ రెండు గతులను ఎరింగిన యోగిని ప్రశంసించుచు అర్జునుని యోగివి కమ్ము అని ఆజ్ఞాపించెను. 28వ శ్లోకమున ఈ అధ్యాయమునందు వర్ణింపబడిన తత్త్వమును తెలిసికొనుటవలన కలుగు ఫలమును వివరించుచు ఈ అధ్యాయమును ముగించెను.

సంబంధము - ఏడవ అధ్యాయమునందు 1 నుండి 3వ శ్లోకము వరకు తన సమగ్ర రూపతత్త్వమును వినుటకు అర్జునుని సావధానునిగా చేసి, దానిని తెలుపుదునని ప్రతిజ్ఞ చేసి, భగవానుడు ఆ తత్త్వజ్ఞులను ప్రశంసించెను. పిదప 27వ శ్లోకము వరకును ఆ తత్త్వమును పెక్కురీతుల వివరించి, దానిని తెలిసికొనలేకపోవుటకు గల కారణములను గూడ విశదపరచెను. చివరకు బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ, అధిభూతము, అధి దైవము, అధియజ్ఞములతో గూడ భగవానుని సంపూర్ణ రూపమును తెలిసికొను భక్తుల మహిమను వర్ణించుచు ఆ 7వ అధ్యాయమును ముగించెను. 29, 30వ శ్లోకములయందు వర్ణింపబడిన బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము, అను ఆరింటిని, అట్లే ప్రయాణకాలమున భగవంతుని స్మరించు విషయ రహస్యములను అర్జునుడు చక్కగా ఎరుగక పోవుటవలన 8వ అధ్యాయ ప్రారంభమున మొదటి రెండు శ్లోకములలో పై 7 విషయములను సమగ్రముగా వివరింపుమని అర్జునుడు ఏడు ప్రశ్నల ద్వారా భగవానుని అడుగుచున్నాడు-

### అర్జున ఉవాచ

**కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।**
**అధిభూతం చ కిం ప్రోక్తమ్ అధిదైవం కిముచ్యతే ॥ 1 ॥**

పురుషోత్తమ! = ఓ పురుషోత్తమా!
తత్ = ఆ
బ్రహ్మ = బ్రహ్మము అనగా
కిమ్ = ఏమి?
అధ్యాత్మమ్ = అధ్యాత్మము-అనగా
కిమ్ = ఏమి?
కర్మ = కర్మ అనగా
కిమ్ = ఏమి
అధిభూతమ్ = అధిభూతము-అని
కిమ్, ప్రోక్తమ్ = ఏది చెప్పబడినది
చ = మఱియు
అధిదైవమ్ = అధిదైవము-అని
కిమ్, ఉచ్యతే = ఏది చెప్పబడును?

**అర్జునుడు పలికెను- ఓపురుషోత్తమా! బ్రహ్మ అనగానేమి? అధ్యాత్మము అనగానేమి? కర్మఅనగానేమి? అధిభూతము అని దేనికి పేరు? అధిదైవము అని దేనిని అందురు? (1)**

ప్రశ్న - "ఆ బ్రహ్మము" అనగానేమి? అను అర్జునుని ప్రశ్నలోని అంతరార్థమేమి?

సమా - 'బ్రహ్మ' అను శబ్దమునకు వేదము, బ్రహ్మ, నిర్గుణపరమాత్మ, ప్రకృతి, ఓంకారము మొదలగు అనేక తత్త్వముల అర్థములు లోకవ్యవహారములో ఉన్నవి. ఇచ్చట బ్రహ్మశబ్దము పై వానిలో ఏ తత్త్వమును గూర్చి తెల్పును? అని తెలిసికొనుటకై అర్జునుడు ఇట్లు ప్రశ్నించెను.

ప్రశ్న - 'అధ్యాత్మము' అనగానేమి? ఈ ప్రశ్నలోని అంతర్యమేమి?

సమా - శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, జీవుడు, పరమాత్మ మొదలగు అనేక తత్త్వములను అధ్యాత్మము అని అందురు. ఇచ్చట అధ్యాత్మము అను పేరుతో భగవానుడు ఏ తత్త్వమును గూర్చి తెలిపెనో అర్జునుడు తెలిసికొనగోరెను.

ప్రశ్న - 'కర్మ' అనగానేమి? అని ప్రశ్నించుటలోని అంతర్యమేమి?

సమా - 'కర్మ' అను శబ్దము ఇచ్చట 'యజ్ఞ' 'దానాది' శుభకర్మలను సూచించునా? లేక కేవలము క్రియలను మాత్రమే సూచించునా? లేక ప్రారబ్ధాది కర్మలను సూచించునా? లేదా పరమేశ్వరుని సృష్టి రచనారూపకర్మలను సూచించునా? అను ఈ విషయములను స్పష్టముగా తెలిసికొనుటకే అర్జునుడు ఇట్లు ప్రశ్నించెను.

ప్రశ్న - 'అధిభూతం' అనగానేమి ? అను ఈ ప్రశ్నలోని అంతర్యమేమి?

సమా - అధిభూతమనగా పంచమహాభూతములా? లేక సమస్త ప్రాణిసముదాయమా? లేక సమస్త దృశ్య ప్రపంచమా? లేక మరియేదైన తత్త్వమును తెల్పునదియా? అను విషయమును తెలిసికొనుటకు ఈ ప్రశ్న వేయబడినది.

ప్రశ్న - 'అధిదైవము' అని దేనినందురు? అను ఈ ప్రశ్న యొక్క అంతరార్థమేమి?

సమా - అధిదైవము అను పదము ఏదైన 'అధిష్ఠాన దైవమును' సూచించునా? లేక అదృష్టము, హిరణ్యగర్భుడు, జీవుడు లేక మరియొక దానిని దేనినైనను సూచించునా? అను విషయములను తెలిసికొనుటకే ఈ ప్రశ్న వేయబడినది.

ప్రశ్న - 'పురుషోత్తమా! అని సంబోధించుటలోని అంతర్యమేమి?

సమా - శ్రీకృష్ణ భగవానుడు పురుషులందరిలో శ్రేష్ఠుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వాధిష్ఠాత, సర్వాధారుడు, కనుక అర్జునుని ప్రశ్నలకు సరియైన సమాధానములను ఇచ్చుటకు అతడు తప్ప ఇతరులు ఎవ్వరును అర్హులు కారని తెల్పుటకు అర్జునుడతనిని 'పురుషోత్తమా!' అని సంబోధించెను.

**అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।**
**ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2 ॥**

మధుసూదన! = ఓ మధుసూదనా!
అత్ర = ఇచట
అధియజ్ఞః = అధియజ్ఞము అనగా
కః = ఎవరు?
అస్మిన్ = ఈ
దేహే = దేహమునందు
కథమ్ = (అది) ఎట్లుండును?
చ = మఱియు
ప్రయాణకాలే = అంత్యకాలమున
నియతాత్మభిః = మనస్సును పరమాత్మని యందు లగ్నము చేసిన యోగులచే
కథమ్ = ఎట్లు
జ్ఞేయః, అసి = (నీవు) తెలిసికొన బడుదువు.

**ఓ మధుసూదనా! 'అధియజ్ఞము' అనగానేమి? ఆ అధియజ్ఞము ఈ శరీరమునందు ఎట్లుండును? అంత్యకాలమున మనస్సును పరమాత్మయందు లగ్నముచేసిన యోగులు నిన్నెట్లు తెలిసికొనగలరు?(2)**

ప్రశ్న - అధియజ్ఞమనగానేమి? అను అర్జునుని ఈ ప్రశ్న యొక్క అంతర్యమేమి?

సమా - **'అధియజ్ఞము'** అను పదము యజ్ఞము యొక్క ఒక అధిష్ఠాన దైవమును తెలుపునా? లేక అంతర్యామి యైన పరమేశ్వరుని తెలుపునా? లేక మరియొకరిని తెలుపునా? అట్లే అధియజ్ఞనామక తత్త్వము మనుష్యాది సమస్తప్రాణుల శరీరములయందు ఏ విధముగా నుండును?అతనిని 'అధియజ్ఞము' అని యేల అందురు? మొదలగు విషయములను అన్నింటిని తెలిసికొనుటకు అర్జునుడు అట్లు ప్రశ్నించెను.

ప్రశ్న - **'నియతాత్మభిః'** అనగానేమి? అంత్యకాలము నందు యోగులు నిన్ను ఎట్లు తెలికొందురు? అను ప్రశ్నయొక్క అంతరార్థమేమి?

సమా - భగవానుడు 7వ అధ్యాయమునందలి 30వ శ్లోకములో **'యుక్త చేతసః'** అను ప్రయోగము ద్వారా తెల్పిన పురుషులను గూర్చియే ఇక్కడ అర్జునుడు **'నియతాత్మభిః'** అను ప్రయోగము ద్వారా పేర్కొనెను. 'యుక్తచేతసు'లైన పురుషులు అంత్యకాలమునందు తమ చిత్తములను ఏ విధముగ భగవంతునిపై నిలిపి అతనిని తెలిసికొనగలరు? అని అర్జునుడు ప్రశ్నించుచున్నాడు. అనగా ప్రాణాయామము, జపము, చింతనము, ధ్యానము, 'సమాధి' మొదలగు సాధనలలో దేనిద్వారా భగవంతుని యథార్థ జ్ఞానము కలుగును? అని అర్జునుడు తెలియగోరుచున్నాడు.

**సంబంధము** - అర్జునుని ఏడు ప్రశ్నలలో మొదట బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ అను విషయములకు సంబంధించిన మూడు ప్రశ్నలకు క్రమముగా భగవానుడు సంక్షిప్తముగా సమాధానమును ఇచ్చుచున్నాడు-

**శ్రీభగవాన్ ఉవాచ**

**అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3 ॥**

పరమమ్ = సర్వశ్రేష్ఠుడైన
అక్షరమ్ = శాశ్వతుడైన, పురుషోత్తముని
బ్రహ్మ = బ్రహ్మము అనిఅందురు
స్వభావః = స్వస్వరూపము అనగా జీవాత్మ
అధ్యాత్మమ్ = అధ్యాత్మము-అని
ఉచ్యతే = చెప్పబడును
భూత-భావోద్భవకరః = సకల ప్రాణుల ఉత్పత్తి అభ్యుదయములకు కారణమైన
విసర్గః = త్యాగ (సృష్టించు) క్రియయే
'కర్మ' సంజ్ఞితః = 'కర్మ' యనబడును

శ్రీ భగవానుడు పలికెను - బ్రహ్మమనగా సర్వశ్రేష్ఠుడు, శాశ్వతుడు. అధ్యాత్మము అనగా స్వస్వరూపము అనగా జీవాత్మ, పరమాత్మయందు లీనమైన సకల భూతములను బహిర్గతమొనర్చి, **వాటి ఉత్పత్తి- అభ్యుదయములకు కారణమైన చేష్టను అనగా సృష్ట్యాదికర్మలను కర్మయందురు.(3)**

ప్రశ్న - 'అక్షరం పరమం బ్రహ్మ' అనగానేమి?

సమా - 'పరమమ్' అను విశేషణముతోపాటు ప్రయుక్తమైన 'అక్షరమ్' అను పదము ఏడవ అధ్యాయము నందలి 29వ శ్లోకమున బ్రహ్మ అను పదము ద్వారా పేర్కొనబడిన నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘన పరమాత్మను సూచించును. వేదము, బ్రహ్మ, ప్రకృతి మొదలగు వాటిని సూచింపదు. 'పరమమ్' అనగా అన్నిటికంటెను శ్రేష్ఠము, సూక్ష్మము అయినది. బ్రహ్మ, అక్షరమ్ అను పేర్లతో నిర్దేశింపబడు తత్త్వములన్నింటిలోను సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్మ ఒక్కడే శ్రేష్ఠతముడు. కనుక 'పరమమ్' 'అక్షరం' అను పదద్వయము ఆ పరబ్రహ్మ పరమాత్మనే తెలుపును. పరబ్రహ్మ పరమాత్మయన్నను, భగవానుడు అన్నను ఒక్కటియే.

ప్రశ్న - స్వభావమునే 'అధ్యాత్మము' అనియందురు - అనగానేమి?

సమా - 'స్వో భావః స్వభావః' అను వ్యుత్పత్తిని అనుసరించి, తనదైన భావమునే స్వభావము అని అందురు. భగవంతుని యొక్క చేతన పరాప్రకృతి రూప - ఆత్మ తత్త్వమే జీవుడు. అది ఆత్మశబ్దవాచ్యమైన శరీరేంద్రియ మనోబుద్ధ్యాది రూపమైన అపరా ప్రకృతికి అధిష్ఠాతయైనప్పుడు దానిని 'అధ్యాత్మము' అని అందురు. 7వ అధ్యాయమునందలి 29వ శ్లోకమున 'కృత్స్నమ్' అను విశేషణముతోపాటు ప్రయుక్తమైన 'అధ్యాత్మమ్' అను పదమునకు అర్థము చేతన జీవసముదాయము అని గ్రహింపవలెను. భగవదంశమైన చేతన పరాప్రకృతి వాస్తవముగ భగవంతునికంటే అభిన్నమైనదగుటవలన అధ్యాత్మనామక సంపూర్ణ జీవ సముదాయముగూడ యథార్థముగ భగవంతునికంటే అభిన్నమైనది మరియు అతని స్వరూపమే.

ప్రశ్న - "భూతముల ఉనికికి, ఉత్పత్తికి కారణమైన త్యాగమునే (విసర్గమునే) 'కర్మ' అని యందురు." అను ఈ వాక్యము యొక్క అంతరార్థమేమి?

సమా - ఇచట 'భూత' శబ్దము సకల చరాచర ప్రాణులను సూచించును. ఈ ప్రాణుల ఉద్భవమునకును, అభ్యుదయమునకును కారణమైన త్యాగమును అనగా సృష్టి స్థితులకు ఆధారమైన దానిని 'కర్మ' యందురు. మహాప్రళయమునందు విశ్వమునందలి సమస్త ప్రాణులును తమతమ కర్మ సంస్కారములతోపాటు భగవంతునిలో విలీనములగును-మరల సృష్ట్యాదియందు భగవానుడు 'నేను ఒక్కడనే అనేకములుగా అగుదును' అని సంకల్పింపగనే వాటి ఉత్పత్తి జరుగును. భగవంతుని ఈ ఆదిసంకల్పమే అచేతన ప్రకృతిరూప యోని యందు చేతనరూప బీజమును స్థాపించుట యగును. ఇదియే జడచేతన సంయోగము - ఇదియే మహావిసర్జనము. ఈ విసర్జనమును, లేక త్యాగమునే 'విసర్గము' అని అందురు. దీనినుండియే ప్రాణుల వేర్వేరు భావములు ఉత్పన్నములగును. కనుకనే భగవానుడు 'సంభవః సర్వభూతానాం తతో భవతి భారత!' (14/3) "ఆ జడచేతన సంయోగము నుండియే సకల భూతముల ఉత్పత్తి జరుగును" అని పల్కెను. ఇదియే భావముల ఉద్భవము. భగవంతుని ఆదిసంకల్పమునుండి సమస్తభూతములు ఉద్భవములై అభ్యుదయము అగుటనే విసర్గము అని అందురు. భగవంతుని ఈ విసర్గరూప మహాకర్మవలననే జడము, అక్రియము అయిన ప్రకృతి స్పందించి క్రియాశీలమగును. దానినుండి మహా ప్రళయము వరకు విశ్వమునందు అనంత కర్మల అఖండ ధారా ప్రవాహము సాగుచుండును. అందువలన ఈ విసర్గమునకే 'కర్మ' యని పేరు. 7వ అధ్యాయమునందలి 29వ శ్లోకమున దీనినే భగవానుడు 'అఖిలమ్‌కర్మ' అని పేర్కొనెను. భూతముల భావోద్భవమునకు కారణమైన భగవానునియొక్క ఈ మహావిసర్గమే ఒక మహాసమష్టి యజ్ఞము - ఈ మహాయజ్ఞమునుండియే వేర్వేరు లౌకిక యజ్ఞములు ఉద్భవించినవి. ఆ యజ్ఞముల యందు ఉత్సర్గములైన హవిస్సు మొదలగు వానిని గూడ 'విసర్గము' అనియే యందురు - ఆ యజ్ఞములనుండియు ప్రజలు ఉద్భవింతురు. మనుస్మృతి యందు-

> అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే ।
> ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః ॥
> (మనుస్మృతి 3/76)

వేదోక్త విధి ప్రకారము అగ్నిద్వారా ఇయ్యబడిన ఆహుతి సూర్యునియందు స్థితమగును. సూర్యుని నుండి వర్షము కలుగును. వర్షమువలన అన్నము, అన్నమువలన ప్రజలు ఉద్భవింతురు.

ఈ 'కర్మ' యను పేరుగల విసర్గము వాస్తవముగా భగవంతుని ఆది సంకల్పమే. కనుక ఇదియును భగవంతునికంటెను అభిన్నమైనదియే.

సంబంధము - ఇప్పుడు అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము అను విషయములకు సంబంధించిన ప్రశ్నలకు క్రమముగ సమాధానమును ఇచ్చుచున్నాడు-

**అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।**
**అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేహభృతామ్ = | దేహధారులలో | అధిభూతమ్ = | అధిభూతములు | చ = | మఱియు |
| వర! | శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! | | అనబడును | అత్ర, దేహే = | ఈ దేహము(ల)లో |
| భావః, క్షరః = | ఉత్పత్తి, | పురుషః = | హిరణ్మయుడైన | | అంతర్యామిగానున్న |
| | వినాశశీలములైన | | పురుషుడు | అహమ్, ఏవ = | నేనే (వాసుదేవుడనే) |
| | పదార్థములన్నియును | అధిదైవతమ్ = | అధిదైవము | అధియజ్ఞః = | అధియజ్ఞమును |

**ఉత్పత్తి వినాశశీలములైన పదార్థములు అన్నియును అధిభూతములు అనబడును. హిరణ్మయుడైన పురుషుడు అధిదైవము. దేహధారులలో శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! ఈ శరీరములలో అంతర్యామిగా ఉన్న నేనే - వాసుదేవుడనే అధియజ్ఞమును. (4)**

ప్రశ్న - **'క్షరభావమే అధిభూతము'** అనియనుటలోని విశేషము ఏమి?

సమా - అపరాప్రకృతియు, దాని పరిణామముచే ఉత్పన్నమైన నశ్వరమైన తత్త్వమును 'క్షరభావము' అని అందురు. ఇది ప్రతిక్షణము క్షీణించునది. దీనినే 13వ అధ్యాయమునందు 'క్షేత్రము' (శరీరము), 15వ అధ్యాయమునందు, 'క్షరపురుషుడు' అని పేర్కొనుట జరిగినది. ఈ క్షరభావము శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము, భూతములు మరియు శబ్దాది విషయముల రూపమున గోచరించును. జీవరూప చేతన పరాప్రకృతి ఈ శరీరాది క్షరభావమును ధరించుచున్నది. కనుక దీనిని **'అధిభూతం'** అని యందురు. ఏడవ అధ్యాయములో భగవానుడు అపరాప్రకృతియు తనదేయని తెల్పెను. కనుక క్షరభావము గూడ భగవంతునకు చెందినదే. భగవంతునినుండి అభిన్నమైనదే. భగవంతుడే స్వయముగా సత్, అసత్, అన్నియు నేనే **(9/19)** అని తెల్పెను.

ప్రశ్న - హిరణ్మయపురుషుడు ఎవరు? అతడు **'అధిదైవము'** ఎట్లగును?

సమా - ఇచట పురుషుడు అను పదము ఆదిపురుషుని తెల్పును. అతనినే సూత్రాత్మ, హిరణ్యగర్భుడు, ప్రజాపతి, బ్రహ్మ అని అందురు. జడ చేతనాత్మకమైన విశ్వమున కంతటికిని ఇతడు ప్రాణపురుషుడు, సమస్త దేవతలును ఇతని అంగములు. ఇతడే సర్వమునకు అధిష్ఠాత, అధిపతి, ఉత్పాదకుడు, కనుక అతనికి **'అధిదైవము'** అని పేరు. స్వయంగా భగవంతుడే అధిదైవరూపములో ప్రకటితుడగుచున్నాడు. కనుక అధిదైవము గూడ భగవంతునికంటె భిన్నము కాదు.

ప్రశ్న - ఈ శరీరమునందు **'అధియజ్ఞమును నేనే'** - అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - అధియజ్ఞమనగానేమి? అది ఈ శరీరమున ఎట్లుండును? అని అర్జునుడు రెండు విషయములను గూర్చి అడిగియుండెను. ఈ రెండు ప్రశ్నలకు భగవానుడు ఒకేసారి సమాధానమును ఇచ్చుచున్నాడు. భగవానుడే అన్ని యజ్ఞములకును భోక్త, ప్రభువు. **(5/29, 9/24)** సమస్త కర్మల ఫలములను అతడే నిర్ణయించును. **(7/22)** కనుక 'నేనే స్వయముగా అధియజ్ఞమును' అని భగవంతుడు తెల్పియుండెను. అధిభూతము, అధిదైవము గూడ భగవంతుని కంటె వేరుగాదు-అని 'ఏవ' అను పదప్రయోగము వలన తెలియుచున్నది. తానే అధియజ్ఞమునని అతడే స్పష్టముగా తెల్పెను. కాని ఈ అధియజ్ఞము శరీరమునందు ఎట్లుండును? అను ప్రశ్నకు సమాధానముగ **'అత్రదేహే'** అనగా ఈ శరీరమునందు అని తెల్పుచు, తాను అంతర్యామిననియు, తన స్వరూపమే దేహమునందు వ్యాపించినదనియు స్పష్టపరచెను. ఈ

సర్వవ్యాపి, అంతర్యామియైన భగవంతుడు అందరి దేహముల యందును గలడు. ఈ అధ్యాయమునందలి 8,10 శ్లోకముల యందు తాను దివ్యపురుషుడనని యు, 20వ శ్లోకమునందు తానే సనాతన - అవ్యక్తము నని యు తెలిపి, 22వ శ్లోకమున దాని వ్యాపకత్వమును, సర్వాధారత్వమును భగవానుడు వర్ణించెను. 9వ అధ్యాయమునందలి 4వ శ్లోకమున గూడ అవ్యక్తరూపుని వ్యాపకత్వమును గూర్చి పేర్కొనెను. ఆ అవ్యక్తమైన, సూక్ష్మమైన వ్యాపక స్వరూపమునే అధియజ్ఞమని తెల్పెను. దానికంటెను తన అభిన్నత్వమును ప్రకటించుటకు 'నేనే ఆ అధియజ్ఞమును' అని స్పష్టముగా తెల్పెను.

ప్రశ్న - దేహభృతాం వర! అను సంబోధనలోని ప్రత్యేకత ఏమి?

సమా - అర్జునుడు తనకు భక్తుడు కావున చెప్పెడి విషయములన్నింటిని సంకేతమాత్రముతోనే అతడు గ్రహింపగలడని తెల్పుటకు 'దేహభృతాంవర!' (దేహధారులలో శ్రేష్ఠుడా!) అని సంబోధించెను. కనుక 'నేనే అధియజ్ఞమును' అను సంకేతమునుబట్టి ఈ సర్వమూ భగవత్స్వరూపమే అని గ్రహించుటకు అర్జునునకు అంతగా కష్టమైన పనిగాదు.

*సంబంధము - ఈ విధముగా అర్జునుని ఆరు ప్రశ్నలకు సమాధానమును ఇచ్చిన పిమ్మట, అంత్యకాలమునకు సంబంధించిన 7వ ప్రశ్నకును సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేవరమ్ ।**

**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ 5 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఎవడు | కలేవరమ్ | = శరీరమును | | (నన్నే) |
| అంతకాలే, చ | = అంత్యకాలము నందును | ముక్త్వా | = వీడి | యాతి | = పొందును |
| | | ప్రయాతి | = పోవునో | అత్ర | = ఈ విషయమున |
| మామ్, ఏవ | = నన్నే | సః | = ఆపురుషుడు | సంశయః | = సందేహము |
| స్మరన్ | = స్మరించుచు | మద్భావమ్ | = నాస్వరూపమునే | న, అస్తి | = లేదు |

**అంత్యకాలమునందైనను నన్నే స్మరించుచు దేహత్యాగమును చేసినవాడు నన్నే (నాస్వరూపమునే) పొందును. ఇందేమాత్రము గూడ సందేహము లేదు. (5)**

ప్రశ్న - ఇచట 'అంతకాలే' అను పదముతో పాటు 'చ' అను అక్షరమును ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా- ఇచట 'చ' అను అవ్యయము 'అపి' అను అర్థములో ప్రయుక్తమైనది. దీనివలన అంత్యకాలము యొక్క విశేష మహిమ ప్రకటింపబడినది. సర్వదా భగవంతునే అనన్య భావముతో చింతన చేయువారి విషయము చెప్పనవసరమే లేదు. మానవజన్మమునందు చివరి క్షణము వరకును భగవచ్చింతన చేయుచు శరీర త్యాగము చేసిన వారికి కూడ భగవత్ప్రాప్తి కలుగును అని భగవానుడు విశదపరిచెను.

ప్రశ్న - 'మామ్' అను పదము ఎవరిని తెల్పును?

సమా - భగవానుడు 7వ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున ప్రతిజ్ఞచేసి, 30వ శ్లోకమున తన సంపూర్ణ రూపమును వర్ణించెను. ఇచట 'మామ్' అను పదము ఆ సంపూర్ణ స్వరూపమునే సూచించును. అందు భగవానుని అన్ని స్వరూపములును గలవు. కనుక ఎవరైనను భక్తితో భగవంతుని యొక్క ఏదైనను ఒక్క స్వరూపమును స్మరించినను అది భగవంతుని సమగ్ర స్వరూప స్మరణయే యగును. అట్లే భగవంతుని వేర్వేరు అవతారములకు సంబంధించిన నామ, గుణ, ప్రభావ, లీలా, చరిత్రాదులు గూడ భగవంతుని స్మరణకు హేతువులగును. వాటి యొక్క స్మరణతో పాటే భగవంతుని స్మరణ కూడా జరిగినట్లే యగును. కనుక నామ, గుణ, ప్రభావ, లీలా, చరిత్రాదుల స్మరణయు భగవంతుని స్మరణయే.

ప్రశ్న - 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 'మామ్', 'స్మరన్' అను రెండు పదముల

మధ్యన 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించుట ద్వారా మాతాపితరులు, సోదరులు, బంధువులు, భార్యాపుత్రులు, సిరిసంపదలు, కీర్తిప్రతిష్ఠలు, స్వర్గ సుఖములు మొదలైన వానిలో అంత్యకాలమునందు దేనిని గూడ స్మరింపక సర్వదా కేవలము భగవంతునే స్మరింపవలెనని తెలిపెను. స్మరణ చిత్తము ద్వారానే జరుగును. ఏవ అను పదమును ప్రయోగించుట వలన మానవుని చిత్తము కేవలము భగవంతుని యందే లగ్నమయి యుండవలెనని దీని భావము.

ప్రశ్న - 'మద్భావమును పొందును' అనగానేమి? సాయుజ్యాదులలో ఏదో ఒక ముక్తిని పొందుటయా? లేక నిర్గుణ బ్రహ్మను పొందుటయా?

సమా - ఇది సాధకుని ఇచ్ఛపై ఆధారపడి యుండును. సాధకుని ఇచ్ఛననుసరించి, అతనికి భగవత్ప్రాప్తి కలుగును. అన్నియును భగవద్భావములో అంతర్గతములే.

ప్రశ్న - 'ఇందు ఎట్టి సంశయమూ లేదు'- అని యనుటలోని విశేషమేమి?

సమా - అంత్యకాలమునందు, భగవంతుని స్మరించిన మనుష్యుడు ఏదేశమునందు, ఏకాలమునందు మరణించినను, అంతకుముందు అతని ప్రవర్తన ఎట్లున్నను నిస్సందేహముగా అతడు భగవత్ప్రాప్తిని పొందును. ఇందు ఏ మాత్రముగూడ శంకకు తావేలేదు.

*సంబంధము - భగవంతుని స్మరించుచు మరణించిన వానికి భగవత్ప్రాప్తి కలుగునని తెల్పబడినది. ఈ విశేషనియమము కేవలము భగవత్స్మరణకు సంబంధించినదేనా? లేక ఇతర అన్ని విషయములకును సంబంధించినదా? అను సందేహము కలుగవచ్చును. ఈ సందేహమును నివృత్తి చేయుచు భగవానుడు చెప్పుచున్నాడు-*

**యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్ ।**
**తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ కుంతీసుతా! | స్మరన్ | = స్మరించుచు | ఏతి | = పొందును |
| అంతే | = (ఏమనుష్యుడు) అంత్యకాలమునందు | కలేవరమ్ | = శరీరమును | సదా | = (ఏలనన) నిరంతరము |
| యమ్, యమ్ | = ఏ,యే | త్యజతి | = త్యజించునో | తద్భావభావితః | = (అతడు) ఆభావములచే ప్రభావితుడు అగును |
| భావమ్, వా, అపి | = భావము(ల)ను | తమ్, తమ్, ఏవ | = ఆయా స్వరూపములనే | | |

**కౌంతేయా! మనుష్యుడు అవసానదశయందు ఏఏభావములను స్మరించుచు దేహత్యాగము చేయునో అతడు మరుజన్మలో ఆయా స్వరూపములనే పొందును. ఏలనన సర్వదా అతడు దానినే స్మరించుచుండెను. (6)**

ప్రశ్న - ఇచట భావ శబ్దమున కర్థమేమి? దానిని స్మరించుట యనగానేమి?

సమా - ఈశ్వరుడు, దేవతలు, మనుష్యులు, పశుపక్షి, కీటపతంగాదులు, వృక్షములు, ఇండ్లు, పొలములు మొదలగు చేతనా జడ పదార్థములను అన్నింటిని **భావము** అను పదము తెలుపును. అంత్యకాలమునందు ఏ పదార్థమును గూర్చి చింతన చేయునో దానినే స్మరించుట యందురు.

ప్రశ్న - అంత్యకాలము అనగా ఏ సమయము?

సమా - ఈ స్థూలదేహమునుండి ప్రాణములు, మనోబుద్ధీంద్రియములతో సహా జీవాత్మ వియోగము చెందు అంతిమ క్షణమునే అంత్యకాలమందురు.

ప్రశ్న - 13వ అధ్యాయమునందలి 21వ శ్లోకములోను, అట్లే 14వ అధ్యాయమునందలి 14,15,18వ శ్లోకములలోను భగవానుడు సత్త్వరజస్తమోగుణములు ఉచ్చనీచ జన్మల ప్రాప్తికి హేతువులని తెల్పెను. మరి ఇచ్చట 'అంత్య' కాలమునందలి స్మరణయే కారణమని పేర్కొనబడినది. ఇది ఎట్లు పొసగును?

సమా - మానవుడు చేసిన కర్మలే సంస్కార రూపములుగా అతని అంతఃకరణమునందు స్థిరపడును. ఇట్టి అసంఖ్యాక కర్మ సంస్కారములు అంతఃకరణమునందు

నిండియుండును. ఈ సంస్కారములను అనుసరించియే తగిన సమయమున నిమిత్తము (కారణము) లభించినప్పుడు ఆవృత్తి లేక స్మృతి కలుగును. సాత్త్విక కర్మలు అధికమైనచో సాత్త్విక సంస్కారములు వృద్ధి చెందును. ఆ సమయమున మానవుడు సత్త్వగుణ ప్రధానుడగును. దానిని అనుసరించి, స్మృతియు సాత్త్వికమగును. ఇదే విధముగ రాజసతామస కర్మల ఆధిక్యము వలన రాజస తామస సంస్కారములు వృద్ధిచెంది అతడు రజోగుణ, తమోగుణ ప్రధానుడగును. వాటిననుసరించియే అతనికి స్మృతులు కలుగును. కర్మ, గుణము, స్మృతి ఈ మూడును ఒకటే యగుటవలన రాబోవు జన్మలకు అవి హేతువులగునని తెల్పుటలో దోషము లేదు. వాస్తవముగా విషయము ఒక్కటియే.

ప్రశ్న - అంత్యకాలమునందు దేవ మనుష్యపశువృక్షాది సజీవ పదార్థములను స్మరించుచు చనిపోయిన వానికి ఆయా జన్మలు ప్రాప్తించుననుట సరియైనదే. కాని పొలములు, ఇండ్లు మొదలగు నిర్జీవ జడపదార్థములను చింతన చేయుచు మరణించిన మనుజునకు ఎట్టి జన్మ లభించును?

సమా - పొలములు, ఇండ్లు మొదలగు వానిని చింతన చేయుచు మృతిచెందిన వానికి వాని గుణకర్మానుసారము మంచి-చెడు యోని జన్మ లభించును. అతని అంతిమ సమయపు వాసనలను అనుసరించి, ఆ జన్మయందు అతనికి పొలములు, ఇండ్లు మొదలగు జడపదార్థములు లభించును. అతడు జన్మించిన యోని యందే అతడు స్మరించిన పొలములు, ఇండ్లు మొదలగు వాటితో అతనికి సంబంధం ఏర్పడును. ఇంటి యజమాని ఆ ఇల్లు తనదేయని భావించినట్లు పక్షియు తాను నిర్మించిన గూడు తనదేయని తలంచును. రంధ్రములోనున్న ఎలుక, చీమలు మొదలగు జీవులు గూడ అవి తమవే అని భావించును. కావున ప్రతి యోనియందును ప్రత్యేక జడవస్తుప్రాప్తి ప్రకారాంతరములో కల్గునని ఎరుంగవలెను.

ప్రశ్న - 'సదా తద్భావభావితః' అనగానేమి?

సమా - మనుష్యుడు అంత్యకాలమునందు శరీర త్యాగము చేయునప్పుడు స్మరింపబడిన భావమునే మరల పొందును. ఈ సిద్ధాంతము సరియైనదే. కాని అంత్యకాలము నందు ఏ భావస్మరణయైనను ఎందుకు కలుగును? ఈ విషయమును తెల్పుటకే భగవానుడు 'సదా తద్భావభావితః' అని పల్కెను - అనగా అంత్యకాలమున స్మరింపబడిన భావమే బహుశా అతని చిత్తమునందు భావితమగును. వైద్యులు ఏదైననొక పదార్థమునకు ఒక ఔషధ గుణమును కల్గించుటకు ఆ గుణముగల రసములో దానిని నానబెట్టుదురు. దాని ప్రభావమున ఆ పదార్థమునకు ఆ ఔషధగుణమే అబ్బును. అట్లే పూర్వ సంస్కారములు, సాంగత్యము, వాతావరణము, ఆసక్తి, కోరిక, భయము, అధ్యయనము మొదలగు వాటి ప్రభావమున మాటిమాటికిని చింతన చేయు భావములచేతనే భావితుడగును. 'సదా' అనుపదము నిరంతర స్థితిని తెల్పుటకై ప్రయోగింపబడినది. జీవితమునందు సదా, మాటిమాటికి, దీర్ఘకాలము వరకు, అధిక చింతన చేయు భావమునందే దృఢమైన అభ్యాసము ఏర్పడును. ఈ దృఢమైన అభ్యాసమే 'సదా ఆభావముతో భావితమగుట!' దృఢమైన అభ్యాసము చేయబడిన భావమే అంత్యకాలమునందు అనాయాసముగనే స్మరణకు వచ్చును.

ప్రశ్న - జీవితమంతయు అధికముగా చింతన చేయు భావమే అందరికిని అంత్యకాలమున స్మరణకు వచ్చునా?

సమా - పెక్కుమందిలో అట్లే జరుగును. కాని అప్పుడప్పుడు జీవితములో అధికముగా చింతన చేసిన భావమును విస్మరించియు, అంత్యకాలమున సమీపమునగల వస్తువును స్మరించుటయు జరుగుచుండును. అది పూర్వాభ్యాసమును అణచివేసి, దాని స్మరణయే దృఢమగునట్లు చేయును. అందులకు జడ భరతుని వృత్తాంతమే నిదర్శనము. అంత్యకాలమున జడ భరతుని చిత్తము జింకపిల్ల భావముతో నిండియుండెను. ఆ కారణమున అతనికి మరణానంతరము జింకజన్మయే వచ్చెను.

ప్రశ్న - మనుష్యుడు అంత్యకాలమున ఏ భావములను స్మరించుచు దేహత్యాగము చేయునో నిరంతరము ఆ భావములతోడనే భావితుడగుచు మరణానంతరము మరల ఆ భావములనే పొందును - అని 'తద్భావ భావితః' అను పదమునకు అర్థము చెప్పిన దోషమేమి?

సమా - పై విధముగ అర్థము చెప్పినను దోషమేమియు లేదు.మనుష్యుడు మరణించిన వెంటనే అంత్యకాలమున స్మరించిన భావమును పూర్తిగా పొందడు. మరణించిన పిమ్మట సూక్ష్మ రూపముతో అంతఃకరణము నందు స్థిరమైన భావములతో భావితుడగుచు నిశ్చిత సమయమునందే ఆ భావములను పూర్తిగా పొందును. 'మనుష్యుని' ఛాయా

చిత్రమును తీయు సమయమున అతడే స్థితిలో నుండునో అదే విధముగ అతని చిత్రము ముద్రితమగును. అట్లే అంత్యకాలమున మనుష్యుడు ఎట్లు చింతన చేయునో అదే రూపము (భావము) అతని అంతఃకరణమున అంకితమగును. కాని తర్వాత ఇతర పదార్థముల సహాయమున ఆ అంకితమైన సూక్ష్మఛాయా చిత్రము స్థూలరూపమున బయటికి వచ్చును.

ఇచ్చట అంతఃకరణమే కెమెరాప్లేటు. దాని యందు కలుగు స్మరణయే ప్రతిబింబము. ఇతర సూక్ష్మశరీర ప్రాప్తియే ఛాయాచిత్రము తీయుట. చిత్రము తీయువాడు అందరిని సావధానముగా నుండుమని చెప్పును. అతని సూచనలను పాటింపక ఇటునటు కదలినచో చిత్రము చెడిపోవును. అట్లే ప్రాణులందరి చిత్రము తీయువాడు భగవానుడు. అతడు మనుష్యుని సావధాన పరుచుచు 'నీ చిత్రములను తీయు సమయము ఆసన్నమైనది. నీ అంతిమ క్షణము ఎప్పుడు వచ్చునో నీ వెరుగవు. కావున నీవు సావధానుడవై ఉండుము. లేనిచో నీ చిత్రము చెడిపోవును' అని హెచ్చరించును. నిరంతరము పరమాత్మ స్వరూపమును చింతన చేయుటయే సావధానుడగుట యగును. పరమాత్ముని వదలి ఇతర విషయములను చింతన చేయుటయే తన చిత్రమును చెడగొట్టుకొనుట యగును.'

*సంబంధము* - *అంత్యకాలమునందు మనుష్యుడు దేనిని స్మరించుచు మరణించునో మరుజన్మమునందు దానినే పొందును. జీవితమంతయు అధికముగా స్మరించు భావమే బహుశా అంత్యకాలమున స్ఫురణకు వచ్చును. భగవత్ప్రాప్తిని కోరు సాధకుడు అంత్యకాలమున భగవంతుని స్మరణ చేయుట అత్యంతావశ్యకము. ఈ అంత్యకాలము అకస్మాత్తుగా ఎప్పుడు తటస్థించునో ఎవ్వరికిని తెలియదు. కావున నిరంతరము భగవంతుని స్మరించుచునే యుద్ధము చేయుమని భగవానుడు అర్జునుని ఆదేశించెను-*

**తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।**
**మయ్యర్పితమనోబుద్ధిః మామేవైష్యస్యసంశయమ్ ॥ 7 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన (ఓ అర్జునా!) | అనుస్మర | = స్మరించుచుండుము | అర్పిత-మనోబుద్ధిః | = మనస్సును, బుద్ధిని నిమగ్నమొనర్చిన వాడవై |
| సర్వేషు | = సమస్తమైన | చ | = మఱియు | అసంశయమ్ | = నిస్సందేహముగా |
| కాలేషు | = కాలములయందును | యుధ్య | = యుద్ధమును చేయుము | మామ్, ఏవ | = నన్నే |
| మామ్ | = నన్ను | మయి | = నాయందే | ఏష్యసి | = పొందగలవు |

**కావున ఓ అర్జునా! నీవు సర్వదా నన్నే స్మరించుచుండుము. యుద్ధమును (కర్తవ్యకర్మను) కూడ చేయుము. ఈవిధముగా నీ మనోబుద్ధులను నాయందే నిల్పియున్నచో నిజముగా (నిస్సందేహముగా) నన్నే పొందెదవు. (7)**

ప్రశ్న - ఇచట 'తస్మాత్' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - పూర్వ శ్లోకద్వయములోని అర్థముతో సమన్వయమును కలిగించుటకు ఇచట 'తస్మాత్' అనుపదము ప్రయుక్తమైనది. మనుష్య జీవితము క్షణభంగురము. మృత్యువు ఏ క్షణమునందైనను రావచ్చును. జీవితమున అధికముగా చింతనచేయు భావమే అంత్యకాలమున స్ఫురణకు వచ్చును. భగవంతుని స్మరణ నిరంతరము చేయక విషయభోగముల స్మరణ చేయుచునే శరీర వియోగము కలిగినచో భగవత్ప్రాప్తికి ద్వారమైన ఈ మానవజన్మ వ్యర్థమై పోవును. అందువలననే నిరంతరము భగవంతుని స్మరణ చేయుచుండవలెను.

ప్రశ్న - సర్వకాలములయందును తనను స్మరించుచుండుమని భగవానుడు అర్జునునకు చెప్పుట సముచితమే. కాని యుద్ధమొనరింపుమని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - అర్జునుడు క్షత్రియుడు. ధర్మ యుద్ధము క్షత్రియునకు వర్ణధర్మము. అతని ధర్మమును అనుసరించి, యుద్ధమునకు అవసరమేర్పడినది. కనుక ఇచ్చట యుద్ధము అను పదము వర్ణాశ్రమ ధర్మాచరణమునకు ఉపలక్షణము

మాత్రమే. భగవదాజ్ఞననుసరించి, నిష్కామ భావముతో చేయబడు వర్ణాశ్రమ ధర్మ కర్మాచరణమువలన అంతః కరణశుద్ధి కలుగును. ఇంతేగాక కర్తవ్య కర్మాచరణము యొక్క ఆవశ్యకమును ప్రతిపాదించుచు ఇంకను అనేక కారణములు 3వ అధ్యాయమునందలి 4 నుండి 30వ శ్లోకము వరకు వివరింపబడినవి. వాటిని అన్నింటిని పరిశీలించినచో మనుష్యునకు వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి, కర్తవ్య కర్మలను ఆచరించుట ఎంతైనను అవసరమేయని రూఢియగును. ఈ భావమును ప్రకటించుటకే ఇచట యుద్ధము చేయుమని చెప్పుట జరిగినది.

ప్రశ్న - ఇచట 'చ' అను అక్షరమును ప్రయోగించుట లోని వైశిష్ట్యమేమి?

సమా - 'చ' అను అక్షరమును ప్రయోగించి, భగవానుడు యుద్ధము గౌణమనియు, స్మరణయే ప్రధానమనియు తెల్పెను. యుద్ధము మొదలగు వర్ణాశ్రమ ధర్మకర్మలు వాటి ప్రయోజన విధానములను అనుసరించి, నియతకాలము నందే చేయబడును. అట్లు చేయుటయే యుక్తము. కాని భగవంతుని స్మరణ మాత్రము అన్ని కాలముల యందును, అన్ని పరిస్థితులయందును తప్పనిసరిగా చేయుచుండవలెను.

ప్రశ్న - నిరంతరము భగవచ్చింతన మరియు యుద్ధాది వర్ణధర్మ కర్మాచరణము - ఈ రెండును ఒక్కసారి ఎట్లు సాధ్యమగును.

సమా - సాధ్యమే. సాధకులయొక్క భావన, అభిరుచి, యోగ్యతలను అనుసరించి, దీనికి వేర్వేరు యుక్తులు గలవు. భగవంతుని గుణప్రభావములను చక్కగా ఎరింగిన అనన్యభక్తులు సంపూర్ణ జగత్తును భగవత్సృష్టియే యనియు, వాస్తవముగా భగవంతునికంటె ఇది అభిన్నమైనదనియు, అతనికి ఇది క్రీడాస్థలమనియు భావింతురు. వారు ప్రహ్లాదుడు, గోపికలవలె ప్రతిపరమాణువునందును భగవంతుని ప్రత్యక్షముగా చూచెదరు. కనుక వారికి నిరంతరము భగవత్స్మరణతోపాటు ఇతర కర్మలు చేయుట మిక్కిలి సులభమగును. అట్లే విషయభోగముల యెడ వైరాగ్యమేర్పడి భగవంతునియందు భక్తి కలిగినవారు నిష్కామ భావముతో వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి, కర్మలను భగవదాజ్ఞగా భావించి చేయుచుందురు. వారుకూడ నిరంతరము భగవంతుని స్మరించుచు, కర్మలను ఆచరించుచుందురు. త్రాటిపై నడుచుచున్న నటి తన పాదములగమనముపై ధ్యాస యుంచుచునే అనేక విధములగు వినోదములను ప్రదర్శించు చుండును. ఇంకను ఒక మోటారు డ్రైవరు తన చక్రము (స్టీరింగు) పైన ధ్యాసయుంచుచునే ఇతరులతో మాట్లాడుచుండును. ఆపదలు రాకుండా మార్గముపై దృష్టిని నిల్పియే యుంచును. అదే విధముగా నిరంతరము భగవంతుని స్మరణ చేయుచూ వర్ణాశ్రమ కర్మలను చక్కగా ఆచరించుట సాధ్యమే.

ప్రశ్న - మనస్సును, బుద్ధిని భగవదర్పణ చేయుట యనగానేమి?

సమా - బుద్ధి ద్వారా భగవంతుని గుణప్రభావ స్వరూప రహస్యతత్త్వాలను ఎరింగి, పరమ శ్రద్ధతో దృఢ నిశ్చయము కల్గియుండి, అనన్య శ్రద్ధాదరములతో భగవంతుని గుణప్రభావములను నిరంతరము చింతన చేయుటనే మనస్సును, బుద్ధిని భగవదర్పణ చేయుట యందురు. 6వ అధ్యాయమునందలి చివరి శ్లోకమును గూడ 'మద్గతేనాంతరాత్మనా' అనే సమాసము ద్వారా ఈ విషయమే స్పష్టము చేయబడినది.

*సంబంధము - భగవంతుని చింతనచేయుచు, దేహత్యాగము చేసిన మనుష్యుల గతిని 5వ శ్లోకమునందు భగవానుడు వర్ణించి, అర్జునుని ఏడవ ప్రశ్నకును సంక్షిప్తముగా సమాధానమును ఇచ్చెను. ఇప్పుడు ఆ ప్రశ్నకే విశదముగా సమాధానమును ఇచ్చుటకై అభ్యాసయోగము ద్వారా మనస్సును వశపరచుకొని భగవంతుని అధియజ్ఞ రూపమును అనగా సగుణ నిరాకార దివ్య - అవ్యక్తరూపమును చింతనచేయు యోగుల అంత్యకాలీనగతిని మూడు శ్లోకముల ద్వారా వర్ణించుచున్నాడు-*

**అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ 8 ॥**

పార్థ! = ఓ పార్థా!
అభ్యాసయోగ-యుక్తేన = పరమేశ్వరుని ధ్యానయోగ సాధనయందే నిమగ్నమైన
న, అన్యగామినా = మఱియొక విషయమునే చింతింపనట్టి
చేతసా = మనస్సుతో
(పురుషః = మనుష్యుడు)
అనుచింతయన్ = అనుక్షణము స్మరించుచు
పరమమ్ = సర్వశ్రేష్ఠుడైన
దివ్యమ్, పురుషమ్ = ఆపురుషోత్తముని
యాతి = పొందును

**మనస్సును ఎటూ పోనీయక (వేరే ధ్యాస ఏ మాత్రమూ లేకుండ) నిరంతరము పరమేశ్వరుని ధ్యానరూప యోగమునే సాధనచేయు మనుష్యుడు దివ్యపురుషుడైన పరమాత్మనే చేరును. (8)**

ప్రశ్న - 'అభ్యాసయోగము' అను పదము దేనిని సూచించును? మనస్సు ఆ అభ్యాసయోగముతో యుక్తమగుట యనగానేమి?

సమా - యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానముల అభ్యాసమే 'అభ్యాసయోగము' అనబడును. ఇట్టి అభ్యాసయోగము ద్వారా చక్కగా వశపరచుకొనబడి, నిరంతరము అభ్యాసము నందే లగ్నము చేయబడిన చిత్తమును అభ్యాసయోగ యుక్తచిత్తమని యందురు.

ప్రశ్న - 'నాన్యగామి' అను పదము ఎట్టిచిత్తమును తెల్పును.

సమా - ఒక లక్ష్యమును నిర్దేశించుకొనిన పిమ్మట దానిని వీడి మరియొక విషయమువైపు పోనీయక నిర్దిష్ట లక్ష్యమునందే నిరంతరము లగ్నము చేయబడిన చిత్తమును 'నాన్యగామి' అని యందురు. ఇది పరమేశ్వరుని విషయము. గావున చిత్తము ఆయనయందే లగ్నమై యుండవలెనని భావము.

ప్రశ్న - 'అనుచింతన' చేయుట యనగానేమి?

సమా - అభ్యాసమునందు లగ్నమై వేరొక వైపు మరలని (నాన్యగామి) చిత్తముద్వారా పరమేశ్వరుని నిరాకార స్వరూపమును నిరంతరము ధ్యానము చేయుటయే 'అనుచింతనము' అనబడును.

ప్రశ్న - ఇచట 'పరమమ్', 'దివ్యమ్' అనే విశేషణములతోపాటు 'పురుషమ్' అను పదము ఎవరిని సూచించును. అతనిని పొందుట యనగానేమి?

సమా - ఈ అధ్యాయమునందలి 4వ శ్లోకము నందు 'అధియజ్ఞమనియు' 22వ శ్లోకమున పరమపురుషుడనియు తెల్పబడినట్టి సృష్టిస్థితి సంహారములకు కారకుడైన సగుణ నిరాకార సర్వవ్యాపియు, అవ్యక్తమైన వాడును, జ్ఞానస్వరూపుడును అయిన భగవంతునే ఇచట దివ్య, పరమ, పురుషుడని పేర్కొనుట జరిగినది. అతనిని చింతన చేయుచు అతని యథార్థ రూపమును తెలిసికొని తాద్రూప్యమును పొందుటయే తత్ప్రాప్తియగును.

సంబంధము - *దివ్య పురుషప్రాప్తిని గూర్చి తెల్పి, దాని స్వరూపమును వివరించుచున్నాడు-*

**కవిం పురాణమనుశాసితారమ్ అణోరణీయాంసమనుస్మరేద్యః ।**
**సర్వస్య ధాతారమచింత్యరూపమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ 9 ॥**

యః = ఏ పురుషుడు
కవిమ్ = సర్వజ్ఞుడును
పురాణమ్ = అనాదియు
అనుశాసితారమ్ = అందఱిని శాసించువాడును
అణోః = అణువుకంటెను
అణీయాంసమ్ = సూక్ష్మమైనవాడును
సర్వస్య, = సకలప్రాణులను
ధాతారమ్ ధరించి, పోషించువాడును
అచింత్యరూపమ్ = అచింత్యరూపుడును
ఆదిత్యవర్ణమ్ = సూర్యుని వలె నిత్యచేతన ప్రకాశరూపుడును
తమసః, పరస్తాత్ = అజ్ఞానమును పారద్రోలు వాడును ఐన సచ్చిదానంద ఘనపరమాత్మను
అనుస్మరేత్ = అనుక్షణము స్మరించునో.....

**సర్వజ్ఞుడును, సనాతనుడును, అందరిని శాసించువాడును, అణువుకంటెను సూక్ష్మమైనవాడును, అందరిని ధరించి పోషించువాడును, అచింత్యరూపుడును, సూర్యుని వలె నిత్యచేతన ప్రకాశరూపుడును, అజ్ఞానాంధకారమును పారద్రోలువాడును ఐన సచ్చిదానంద ఘనపరమేశ్వరుని స్మరించువాడగు............(9)**

ప్రశ్న - ఈ శ్లోకముయొక్క భావవైశిష్ట్యమేమి?

సమా - ఇందు భగవానుడు పరమదివ్యపురుష స్వరూపము యొక్క మహత్త్వమును, ప్రతిపాదించుచున్నాడు. ఆ పరమాత్మ సర్వజ్ఞుడు. భూత భవిష్యద్వర్తమానకాలముల యందును, స్థూల సూక్ష్మకారణ జగత్తులయందును జరిగెడి ప్రత్యక్ష పరోక్ష విషయముల అన్నింటి యథార్థ రూపములను అతడు ఎరుగును. కనుక అతనిని సర్వజ్ఞుడు (**కవిః**) అని యందురు. అతడు సర్వమునకును ఆద్యుడు. అతని కంటె ముందేదియును లేదు. అతడే అన్నింటికిని, అందరికిని కారకుడు (కారణము), పురాతనుడు. కనుక అతనిని సనాతనుడు (**పురాణః**) అని యందురు. సమస్తమునకును స్వామి అతడే. సర్వశక్తిమంతుడు. సర్వాంతర్యామి. సర్వనియంతయు అతడే. అందరికిని శుభాశుభ కర్మఫలములను వారివారి యోగ్యతలను అనుసరించి అనుగ్రహించు వాడు అతడే. కనుక అతనిని '**అనుశాసిత**' అని యందురు. అతడు అట్టి అనంతశక్తిమంతుడయ్యును, మిక్కిలి సూక్ష్మస్వరూపుడు. సూక్ష్మాతి సూక్ష్మ తత్త్వము లన్నింటి కంటెను మిక్కిలి సూక్ష్మతముడు. అన్నిటి యందును సర్వదా వ్యాపించియుండువాడు. ఈ కారణముల వలన సూక్ష్మదర్శి యైనవాని సూక్ష్మబుద్ధియే అతని (ఆ భగవంతుని) అనుభూతిని పొందగల్గును. కనుక అతని (ఆ పరమపురుషుని) సూక్ష్మతముడు (**అణోరణీయాన్**) అని యందురు. ఇంతటి సూక్ష్మమైనవాడైనను సమస్తబ్రహ్మాండ ములకును అతడే ఆధారము. ఈ సమస్త ప్రాణుల ధారణ పాలనపోషణములు చేయువాడును అతడే. కనుక అతడందరికిని ధాత. అందరిని ధరించి, పోషించు వాడైనప్పటికిని, అతడందరికిని అతీతుడు. ఇంద్రియములకును, మనస్సునకును గోచరము కాని వాడు. మనస్సునకును బుద్ధికిని చింతన, ఆలోచన చేయుశక్తిని అతడే ప్రసాదించును. అతడనుగ్రహించిన ప్రాణశక్తితోడనే అందరును జీవింతురు. కార్యశీలురగుదురు. అందరిని అతడు చూడగలడు. శక్తిని ప్రసాదింపగలడు. కాని వారు అతనిని చూడజాలరు. కనుక అతనిని '**అచింత్యరూపుడు**' అందురు. అచింత్యరూపుడైనను అతడు స్వయం ప్రకాశమానుడు. సూర్యుడు స్వయంప్రకాశరూపుడై సంపూర్ణ జగత్తును ప్రకాశితమొనర్చునట్లు పరమ పురుషుడును స్వయంప్రకాశమానుడై తన అఖండ జ్ఞానమయ దివ్యజ్యోతిద్వారా సర్వదా అందరిని (సమస్త విశ్వమును) ప్రకాశింపజేయును. కావున అతనిని సూర్యునివలె నిత్యచేతన ప్రకాశరూపుడు (**ఆదిత్యవర్ణుడు**) అని యందురు. ఇట్టి దివ్యమైన నిత్యమైన అనంతజ్ఞానమయ ప్రకాశరూపము నందు అవిద్యగాని లేక అజ్ఞాన రూప అంధకారముగాని ఉండునని ఊహించుటకును తావులేదు. సూర్యునకు దరిదాపులలోగూడ అంధకారమనునదియే యుండదు. అట్లే అతని స్వరూపము గూడ సర్వదా సర్వథా అజ్ఞానాంధకార రహితమై యుండును. ఘోరమైన కాళరాత్రి చీకట్లు గూడ సూర్యోదయము అయినంతనే పటాపంచలై పోవునట్లు విషయాసక్తుడైన పురుషుని అజ్ఞానము గూడ అతని (పరమ పురుషుని) విజ్ఞానమయ ప్రకాశకిరణములు సోకగానే రూపు మాసిపోవును. కనుక అతనిని '**తమసఃపరః**' అని యందురు. ఇట్టి శుద్ధ సచ్చిదానంద ఘన పరమపురుషుని సదాస్మరణ చేయవలెను.[1]

ప్రశ్న - పైన తెల్పబడిన భగవత్స్వరూపము అచింత్యమై మనోబుద్ధుల ద్వారా చింతన చేయుటకే వీలుకానప్పుడు అతనిని స్మరించుట యెట్లు?

సమా - అతని స్వరూపము అచింత్యమనియు, మనోబుద్ధులకు గ్రాహ్యము కాదనియు తెల్పుట అతని స్వరూప లక్షణ మహత్త్వమును తెలుపుటయే. ఇట్టి లక్షణములు కలవాడని తెలిసికొని అతని స్వరూప స్మరణ మననములను చేయవచ్చును కావున అతనిని స్మరింపుమని తెలుపుట ఉచితమే.

**సంబంధము** - పరమదివ్యపురుషుని స్వరూపమును గూర్చి తెల్పిన పిమ్మట సాధనావిధిని, తత్ఫలమును తెల్పుచున్నాడు-

1) శ్వేతాశ్వతరోపనిషత్తునందు దీనిని పోలిన మంత్రముగలదు-

**వేదాహమేతం పురుషం మహాన్తమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।**

**తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ ॥** (3/8)

సూర్యునివలె ప్రకాశస్వరూపుడును, శ్రేష్ఠుడును, అజ్ఞానాంధకారమునకు అతీతుడును ఐనట్టి పురుషుని నేనెఱుంగుదును, అతనిని తెలిసికొనిన వాడే మృత్యువును అధిగమించును. పరమాత్మ ప్రాప్తికి మఱియొక మార్గము లేదు.

ప్రయాణకాలే మనసాచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ 10 ॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సః | = అట్టి | ప్రాణమ్ | = ప్రాణమును | (స్మరన్) | = (స్మరించుచు) |
| భక్త్యా, యుక్తః | = భక్తిగలపురుషుడు | సమ్యక్ | = చక్కగా | తమ్ | = ఆ |
| ప్రయాణకాలే | = అంత్యకాలమున | ఆవేశ్య | = నిలిపి | దివ్యమ్ | = దివ్యుడును |
| యోగబలేన | = యోగబలముచే | చ | = మఱియు | పరమ్, పురుషమ్, ఏవ | = పరమపురుషుడును ఐన పరమాత్మనే |
| భ్రువోః, మధ్యే | = భ్రూమధ్య ప్రదేశమున | అచలేన | = నిశ్చలమైన | | |
| | | మనసా | = మనస్సుతో | ఉపైతి | = పొందు(చేరు)ను |

అట్టి పరమభక్తుడు అంత్యకాలమునందు యోగబలము చేత భ్రుకుటీ మధ్యమున ప్రాణములను స్థిరముగా నిల్పి, నిశ్చలమైన మనస్సుతో స్మరించుచు దివ్యస్వరూపుడును, పరమపురుషుడును ఐన పరమాత్మనే చేరును. **(10)**

ప్రశ్న - భక్త్యాయుక్తః అను పదములను ప్రయోగించుట లోని విశేషమేమి?

సమా - 'భక్త్యాయుక్తః' అను పదములకు భక్తితో కూడినవాడై అని యర్థము. భగవత్పరమైన అనురాగమును భక్తి యందురు. అట్టి భక్తిని కలిగి యుండువానిని 'భక్తియుక్తు'డందురు. ప్రియమైన వస్తువునందుగాని, విషయమునందుగాని అనురాగము లేక ప్రేమ యుండును. ఈ సందర్భము నిర్గుణ నిరాకార బ్రహ్మయొక్క అహంగ్రహోపాసనకు (జ్ఞానయోగమునకు) సంబంధించినది గాదు. ఇది ఉపాస్య, ఉపాసక భావముతో చేయబడు భక్తికి సంబంధించినది.

ప్రశ్న - యోగబలము అనగానేమి? భృకుటీ మధ్యస్థానమేది? అచ్చట ప్రాణములను నిలుపుట నేమందురు. అది యే విధముగా చేయబడును?

సమా - 8వ శ్లోకమున తెల్పబడిన అభ్యాసయోగము (అష్టాంగయోగము)నే "యోగము" అని యందురు. యోగాభ్యాసము ద్వారా ఉత్పన్నమైన యథాయోగ్య ప్రాణసంచాలనము, ప్రాణ నిరోధములనే యోగబలమందురు. రెండు కనుబొమ్మల మధ్యగల స్థానమును యోగశాస్త్రమునందు 'ఆజ్ఞాచక్రము' అని వ్యవహరింతురు. ఈ ఆజ్ఞాచక్రము ద్విదళమై త్రికోణాకారము కలిగియుండును. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, ఈ త్రికోణమునందు కేంద్రీకృతమై యుందురు. ఈ విషయమును ఎరింగిన యోగి మహాప్రయాణ సమయమున యోగబలము ద్వారా ప్రాణములను ఇచ్చటికి తెచ్చి స్థిరముగా నిరోధించును. దీనినే ప్రాణములను నిలుపుట యందురు. ఈ విధముగా ఆజ్ఞాచక్రమునందు ప్రాణములనునిరోధించుసాధన సాపేక్షము. ఈ ఆజ్ఞాచక్రమునకు సమీపమున ఏడు కోశములున్నవి. ఇందు, బోధిని, నాదము, అర్ధచంద్రిక, మహానాదము (సోమసూర్యాగ్నిరూపిణి), కళ, ఉన్మని అనునవి వాటి పేర్లు. ప్రాణముల ద్వారా జీవుడు ఉన్మనీ కోశమునందు చేరినప్పుడు పరమపురుషప్రాప్తి కలుగును. అనంతరము అతడు భగవదధీనుడగును, పునర్జన్మను పొందడు. ఒకవేళ పునర్జన్మను పొందినచో లోకోపకారముకొరకు స్వేచ్ఛతోడనో, లేక భగవదిచ్ఛతోడనో పొందును.

ఈ సాధన విధానము ఒక అనుభవజ్ఞుడైన యోగినుండియే తెలిసికొనదగును. కేవలము పుస్తకములను చదివి యోగసాధన చేయరాదు. అట్లు చేయుటవలన లాభమునకు (మేలుకు) మారుగా కీడు సంభవింపవచ్చును.

ప్రశ్న - నిశ్చల మనస్సు లక్షణము లేవి?

సమా - 8వ శ్లోకమునందు 'నాన్యగామి' అనుపేరుతో పేర్కొనబడిన మనస్సునే ఇచ్చట 'అచలము' అని పేర్కొనుట జరిగినది. ధ్యేయ వస్తువుపై స్థిరముగా నిల్పబడిన మనస్సు అచటి నుండి ఏ మాత్రము చలింపనిచో దానిని అచలము అని యందురు. (6/19)

ప్రశ్న - పరమ దివ్యపురుషుని లక్షణములేవి?

సమా - పరమదివ్య పురుషుని లక్షణములు 8, 9వ శ్లోకములందు వర్ణింపబడినవి.

సంబంధము - భగవానుని చింతన చేయుచు మరణించు సామాన్య మానవులకు కలుగు గతి సంక్షిప్తముగా 5వ శ్లోకమునందు వర్ణింపబడినది. మరల 8 నుండి 10 వ శ్లోకము వరకు 'అధియజ్ఞము' అను పేరుగల సగుణ నిరాకార దివ్య-అవ్యక్త స్వరూపమును చింతనచేయు యోగుల అంత్యకాలీనగతిని భగవానుడు విశదపరచెను. ఇపుడు 11 నుండి 13వ శ్లోకము వరకు పరమ-అక్షర నిర్గుణ నిరాకార పరబ్రహ్మమును ఉపాసించు యోగుల అంత్యకాలీన గతిని వర్ణించుటకై, మొదట అక్షరబ్రహ్మను ప్రశంసించుచున్నాడు-

**యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11 ॥**

వేదవిదః = వేదవిదులైన విద్వాంసులు
యత్ = ఏ సచ్చిదానందఘన పరమాత్మను
అక్షరమ్ = శాశ్వతునిగా
వదంతి = చెప్పుదురో
వీతరాగాః = ఆసక్తిరహితులైన
యతయః = యత్నశీలురైన సన్న్యాసులు
యత్ = ఏ పరమపదమును
విశంతి = ప్రవేశించుచున్నారో
యత్ = ఏ పరమపదమును
ఇచ్ఛంతః = కోరుకొనువారై బ్రహ్మచారులు
బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచర్య వ్రతమును
చరంతి = ఆచరించుచున్నారో
తత్ = అట్టి
పదమ్ = పరమపదమును గూర్చి
తే = నీకు
సంగ్రహేణ = సంక్షిప్తముగా
ప్రవక్ష్యే = చెప్పెదను

వేదవిదులైన విద్వాంసులు ఆ సచ్చిదానందఘనపరమాత్మను శాశ్వతుడు (అక్షరుడు) అని ప్రస్తుతింతురు. ఆసక్తిరహితులై యత్నశీలురైన సన్న్యాసులు ఆ పరమపదమునందే ప్రవేశింతురు. ఆ పరమపదమును కోరియే బ్రహ్మచారులు బ్రహ్మచర్య వ్రతమును ఆచరింతురు. అట్టి పరమపదమునుగూర్చి సంక్షిప్తముగా నేను నీకు వివరింతును. **(11)**

ప్రశ్న - 'వేదవిదః' అను పదమునకు అర్థమేమి?

సమా - పరమాత్మను గూర్చిన జ్ఞానమును వేదమందురు. ఈ వేదము ఇప్పుడు నాల్గు సంహితలుగా, ఐతరేయాది బ్రాహ్మణ భాగ రూపములలో లభించుచున్నది. వేదమునకు ఆధారము, ప్రాణము పరబ్రహ్మ పరమాత్మ. వేదములకు అతడే అర్థము - (15/15). ఈ అర్థమును తెలిసికొని, తత్ప్రాప్తికై అనవరతము సాధన చేయువారును, చివరకు అతనిని పొందువారును ఐన జ్ఞానులు, మహాత్ములే వేదవిదులు - (వేదములయొక్క అర్థములను ఎరింగినవారు).

ప్రశ్న - 'వేదములనెరింగినవారు దీనిని 'అక్షరమ్' (నాశరహితుడు) అని యందురు - అను ఈ వాక్యము యొక్క అంతరార్థమేమి?

సమా - 'యత్' అను పదము సచ్చిదానంద ఘన పరబ్రహ్మను నిర్దేశించును. వేదములనెరింగిన జ్ఞానులైన మహాత్ములు ఆ బ్రహ్మ విషయమున తెల్పినదానిని ఇతరులు తెల్పజాలరు. వారు దానిని ( ఆ పరబ్రహ్మను) 'అక్షరమ్' అని వ్యవహరింతురు. అనగా ఇది యొక మహాత్త్వము - దీనికి ఎట్టి స్థితియందును ఎన్నడును ఏ రూపమునందును క్షయము అనునదియే లేదు. అది సదా శాశ్వతము. ఏకరసము. ఏకరూపము. 12వ అధ్యాయము నందలి 3వ శ్లోకమున వర్ణింపబడిన అవ్యక్తాక్షర-ఉపాసనయే ఇచ్చటగూడ ప్రస్తావింపబడినది.

ప్రశ్న - 'వీతరాగాః' అను విశేషణముతోపాటు 'యతయః' అనుపదము ఎవరిని తెలుపును.

సమా - సర్వథా ఆసక్తి రహితులైన వారిని వీతరాగులని యందురు. అట్టి వైరాగ్యసంపన్నులే పరమాత్మకు ప్రీతిపాత్రులు. బ్రహ్మమునందు స్థితులై ఉన్నత శ్రేణీసాధనాసంపన్నులై సన్న్యాసులైన మహాత్ములను సూచించునదియే 'యతయః' అను పదము.

ప్రశ్న - 'యద్విశంతి' అనగానేమి?

సమా - 'యత్' అనగా ఆ సచ్చిదానంద ఘనపరమాత్మ. పై విధముగా సాధన చేయుగా అంతిమ దశకు చేరిన

యోగులు అభేదభావముతో ఆ పరమాత్మయందు ప్రవేశించెదరు. ఇచట ప్రవేశించుట యనగా బయటనున్న వ్యక్తి బలవంతముగా ఇంటిలోనికి ప్రవేశించుటవంటిదికాదు. పరమాత్మ ఆత్మస్వరూపుడే. కనుక నిత్యప్రాప్తుడు. ఇట్లు నిత్యప్రాప్తమైన తత్త్వమును అప్రాప్తమనుకొనుట ఒక భ్రమ. అవిద్యారూపమైన ఈ భ్రమ తొలగిపోవుటయే అందు ప్రవేశించుట యగును.

ప్రశ్న - దీనిని కోరుకొనువారు బ్రహ్మచర్యమును ఆచరింతురు-అనియనుటలోని విశేషమేమి?

సమా - వేదవిదులు ఉపదేశించునట్టి, వీతరాగులైన యతులు అభేదభావముతో ప్రవేశించునట్టి బ్రహ్మను గూర్చి 'యత్' అను పదము తెల్పును. ఆ బ్రహ్మప్రాప్తికే బ్రహ్మచారులు బ్రహ్మచర్య వ్రతమును పాటింతురు-బ్రహ్మచర్యమునకు నిజమైన అర్థము బ్రహ్మమునందు లేక బ్రహ్మమార్గమునందు సంచరించుట. బ్రహ్మప్రాప్తికై సాధన చేయు మార్గములలో శ్రేష్ఠమైన దానిని ఆచరించుట. ఇట్టి సాధననే 'బ్రహ్మచర్య వ్రతము' అని యందురు.[1] బ్రహ్మచర్యాశ్రమమునందు ఆశ్రమ ధర్మముగా దీనిని పాటించుట ఆవశ్యకము. అవస్థా భేదము ననుసరించి, సాధకులందరును సాధారణముగా యథాశక్తి బ్రహ్మచర్యమును పాటించుట అవసరము.

బ్రహ్మచర్యముయొక్క ముఖ్య లక్షణము వీర్యవృద్ధి, తత్సంరక్షణము. దీనివలన విషయవాసనలు నశించును. బ్రహ్మప్రాప్తి సులభమగును. ఊర్ధ్వరేతస్కులైన నైష్ఠిక బ్రహ్మచారుల వీర్యము ఎట్టి పరిస్థితులలోను అధోముఖమును పొందదు. కనుక వారు బ్రహ్మప్రాప్తి మార్గమునందు అనాయాసముగనే ముందునకు సాగుదురు. వీరికంటెను నిమ్నస్థాయికి చెందిన వారి వీర్యము అధోగామియైనను, వారు మనస్సు, వాక్కు, శరీరముల మైథున క్రియలను సర్వథా త్యజించి వీర్య పరిరక్షణ చేయుదురు. ఇదియును ఒక విధమగు బ్రహ్మచర్యమే. దీనిని గూర్చి గరుడ పురాణమునందు ఇట్లు చెప్పబడినది-

> కర్మణా మనసా వాచా సర్వావస్థాసు సర్వదా!
> సర్వత్ర మైథునత్యాగో బ్రహ్మచర్యం ప్రచక్షతే!!
> (గరుడ పురాణం-పూ-ఖం.ఆ.కా.అ 238/6)

అంతటను, ఎల్లప్పుడు, సర్వావస్థలయందును మనోవాక్కర్మలచే మైథున త్యాగమును 'బ్రహ్మచర్యము' అని యందురు.

చతుర్విధాశ్రమ వ్యవస్థ కూడ బ్రహ్మప్రాప్తియే. బ్రహ్మచర్యము ఆ చతురాశ్రమములలో మొదటిది. అందు మిక్కిలి సావధానముగా బ్రహ్మచర్య నియమములను పాటించుట ఆవశ్యకము. కనుక బ్రహ్మప్రాప్తి కోరువారు (బ్రహ్మచారులు) బ్రహ్మచర్యమును ఆచరింతురని ఇచట చెప్పబడినది.

ప్రశ్న - 'ఆ పరమపదమునుగూర్చి నీకు సంక్షిప్తముగా తెలిపెదను' అనియనుటలోని విశేషమేమి?

సమా - పైన వివరింపబడిన పరబ్రహ్మ, పరమాత్మను గూర్చియు అంతకాలమున తత్ప్రాప్తికై మనుజుడు చేయవలసిన సాధనను గూర్చియు సంక్షిప్తముగా తెలిపెదనని భగవానుడు ప్రతిజ్ఞ చేసెను.[2]

సంబంధము - పూర్వశ్లోకమున భగవానుడు ప్రతిజ్ఞ చేసిన విషయమును రెండు శ్లోకములలో వర్ణించుచున్నాడు-

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమ్ ఆస్థితో యోగధారణామ్ ॥ 12 ॥**

---

1) 6వ అధ్యాయమునందలి 14వ శ్లోక వ్యాఖ్యను చూడుడు.

2) కఠోపనిషత్తు నందు గూడ ఈ శ్లోకమును పోలిన మంత్రము గలదు.

> శ్లో॥ సర్వే వేదాయత్పదమామనన్తి, తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।
> యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి, తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓమిత్యేతత్ ॥

వేదములన్నియును ఆ పరమపదమును గూర్చియే వర్ణించుచున్నవి. సమస్త తపస్సులు తత్ప్రాప్తికై సాధనములుగా చెప్పబడినవి. దానిని పొందుటకే బ్రహ్మచారులు బ్రహ్మచర్యమును ఆచరింతురు. ఆ పదమునే సంగ్రహరూపముగా నీకు తెల్పుచున్నాను. అదియే 'ఓమ్' (ॐ) అను అక్షరము.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥ 13 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వద్వారాణి | = సర్వేంద్రియములను | ఆధాయ | = స్థిరముగా ఉంచి | మామ్ | = నిర్గుణ పరబ్రహ్మమైన నన్ను |
| సంయమ్య | = నిగ్రహించి | ఆత్మనః | = పరమాత్మ యొక్క | | |
| చ | = అట్లే | | | | |
| మనః | = మనస్సును | యోగధారణామ్ | = ధ్యానమునందే | అనుస్మరన్ | = చింతనచేయుచు |
| హృది | = హృదయమునందు | ఆస్థితః | = నిమగ్నుడై | దేహమ్ | = శరీరమును |
| నిరుధ్య | = స్థిరమొనర్చి | యః | = ఏపురుషుడు | త్యజన్ | = త్యజించుచు |
| ప్రాణమ్ | = (అట్లు వశమైనమనస్సు ద్వారా) ప్రాణమును | ఓమ్, ఇతి | = 'ఓమ్' అను | ప్రయాతి | = వెళ్ళిపోవుచున్నాడో |
| | | ఏకాక్షరమ్ బ్రహ్మ | = ఏకాక్షరరూప బ్రహ్మమును | సః | = ఆపురుషుడు |
| మూర్ధ్ని | = మూర్ధస్థానము (సహస్రారము) నందు | | | పరమామ్,గతిమ్ | = పరమగతిని |
| | | వ్యాహరన్ | = ఉచ్చరించుచు | యాతి | = పొందును |

సర్వేంద్రియములను నిగ్రహించి, మనస్సును హృదయమునందే స్థిరముగా నిలిపి, అట్లు వశమైన మనస్సుద్వారా ప్రాణములను మూర్ధస్థానమునందు (సహస్రారమునందు) స్థిరమొనర్చి, పరమాత్మధ్యానమునందే నిమగ్నుడై, అక్షర బ్రహ్మస్వరూపమైన ఓంకారమును ఉచ్చరించుచు, ఆ ఓంకారమునకు అర్థస్వరూపుడను, నిర్గుణబ్రహ్మను ఐన నన్ను చింతించుచు దేహత్యాగ మొనర్చువాడు పరమగతిని (మోక్షమును) పొందును. **(12-13)**

ప్రశ్న - సర్వద్వారములను నిరోధించుట యనగానేమి?

సమా - శ్రోత్రాదిజ్ఞానేంద్రియములద్వారా వాక్కు మొదలగు కర్మేంద్రియములద్వారా విషయములు గ్రహింపబడును. కనుక ఈ దశేంద్రియములను ద్వారములని యందురు. ఇవిగాక వీటి కేంద్రములనుగూడ ద్వారములనియే యందురు. ఈ ఇంద్రియములను బాహ్యవిషయములనుండి మరల్చవలెను. అనగా చూచుట, వినుట మొదలగు క్రియలన్నింటిని నిలిపి వేయవలెను. మరియు ఇంద్రియకేంద్రములను గూడ నిలిపి, ఇంద్రియ వృత్తులను అంతర్ముఖమొనర్చుటయే సర్వద్వారములను నిరోధించుటయని యందురు. దీనినే యోగశాస్త్రమున ప్రత్యాహారమని యందురు.

ప్రశ్న - హృద్దేశమని దేనిని అందురు. మనస్సును హృద్దేశమున స్థిరపరచుటయనగా నేమి?

సమా - నాభి, కంఠ మధ్యప్రదేశమును 'హృద్దేశము' అని యందురు. దీనిని హృదయ కమలము అనియు అందురు. ఇది మనఃప్రాణములకు నివాసస్థానమనియు అందురు. ఇటునటు పరుగులు దీయు మనస్సునందు సంకల్ప వికల్పములను లేకుండ జేసి, హృదయమునందు దానిని నిరోధించుటయే-అ మనస్సును హృద్దేశమున స్థిరముగా నిల్పుటయగును.

ప్రశ్న - ప్రాణములను మూర్ధమునందు (మస్తకమున) స్థాపింపవలెనని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - మనస్సును హృదయమునందు నిల్పిన తరువాత ప్రాణములను ఊర్ధ్వగామియైన నాడిద్వారా హృదయము యొక్క పైభాగమునకు చేర్చి, మస్తకమున స్థాపింపవలెను. ఇట్లు చేయుటవలన ప్రాణములతోపాటు మనస్సుగూడ అచ్చట స్థిరమగును.

ప్రశ్న - యోగధారణయందు స్థితమై యుండుట యనగానేమి? 'యోగధారణామ్' అను పదముతో పాటు ఆత్మనః అను పదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - పైన తెలుపబడిన విధముగా ఇంద్రియములను సంయమమొనర్చి, మనస్సును, ప్రాణములను మస్తకమునందు చక్కగా నిశ్చలముగా నిల్పుటయే

యోగధారణయందు స్థితమగుట యందురు. ఈ యోగధారణ విషయము పరమాత్మకు సంబంధించినది. ఇతర దేవతలను లేదా ప్రకృతిని చింతన, ధారణల చేయు విషయముగాదు. కనుక 'ఆత్మనః' అను పదము ప్రయోగించుట జరిగినది.

ప్రశ్న - ఇచట 'ఓంకారమును' ఏకాక్షరమని పేర్కొనుటకు కారణమేమి? మరియు దీనిని 'బ్రహ్మము' అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 10వ అధ్యాయమునందలి 25వ శ్లోకమునందు గూడ 'ఓంకారమును' ఏకాక్షర మనియే పేర్కొనుట జరిగినది. **(గిరామస్మ్యేకమక్షరమ్)** ఇంతేగాక ఇది అద్వితీయుడును, నాశరహితుడును ఐన పరబ్రహ్మ పరమాత్మ పేరుకూడ. వాస్తవముగా నామము, నామి-అను రెంటిమధ్యను భేదము లేదు. ఈ కారణములవలనను 'ఓంకారమును' ఏకాక్షరమనియు, బ్రహ్మమనియు పేర్కొనుట సముచితమే. కఠోపనిషత్తునందును ఇట్లే చెప్పబడినది-

**ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ, ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా, యో యదిచ్ఛతి తస్యతత్ ॥**
*(1/2/16)*

ఈ అక్షరమే బ్రహ్మము. ఈ అక్షరమే పరమము. ఈ అక్షరమును తెలిసికొనినంతనే కోరిన దంతయును లభించును.

ప్రశ్న - వాక్కు మొదలగు ఇంద్రియములను, మనస్సును నిరోధించి, ప్రాణములను మస్తకమున (మూర్ధస్థానమున) స్థాపించిన పిమ్మట 'ఓంకారమును' ఉచ్చరించుట- ఎట్లు కుదురును?

సమా - ఇచ్చట ఉచ్చారణ వాక్కు ద్వారాగాక మనస్సు ద్వారా జరుగుచుండవలెనని భావము.

ప్రశ్న - ఇచట 'మామ్' అను పదము ఎవరిని తెలుపును?

సమా - ఇది జ్ఞానయోగియొక్క అంత్య కాల సందర్భము, కావున 'మామ్' అను పదము సచ్చిదానంద ఘననిర్గుణ నిరాకార బ్రహ్మను తెలుపును. నాల్గవ శ్లోకము నందు 'ఈ శరీరమునందు అధియజ్ఞమును నేనే' అని తెలిపి భగవానుడు అధియజ్ఞముతో తన ఏకత్వమును వెల్లడించినట్లే బ్రహ్మముతో తన ఏకత్వమును ప్రకటించుటకు 'మామ్' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - మనస్సుతో ఓంకారమును ఉచ్చరించుట, దాని అర్థస్వరూపమైన బ్రహ్మమును చింతన చేయుట అను రెండు పనులు ఒక్కసారి చేయుట ఎట్లు పొసగును?

సమా - మనస్సుద్వారా రెండు పనులను ఒక్కసారే చక్కగా నెరవేర్చవచ్చును. పరమాత్మ నామమైన 'ఓమ్' ను మనస్సుతో ఉచ్చరించుచు అదే సమయమున బ్రహ్మము యొక్క చింతన చేయుటలో ఎట్టి ఇబ్బందియు కలుగదు. పైగా మనస్సుద్వారా జరుగు నామోచ్చారణ 'నామి' యొక్క చింతన యందు సహాయకమగును. పతంజలి మహర్షి కూడ 'సవితర్క సమాధి వరకు శబ్దము, అర్థము, తద్విషయక జ్ఞానము, సవికల్ప మనస్సునందు ఉండును'-అని తెల్పెను.

*(యోగదర్శనమ్-41)*

కనుక చింతన చేయబడు బ్రహ్మముయొక్క వాచకమైన ఓంకారము మనస్సుయొక్క సంకల్పమునందుండుట స్వాభావికము. పతంజలి యోగసూత్రమున మరల ఇట్లు చెప్పబడినది.

**తస్యవాచకః ప్రణవః, తజ్జపస్తదర్థభావనమ్ ।**
*(యోగదర్శనమ్ - 1/27,28)*

దానిపేరు ప్రణవము (ఓం). ఈ ఓంకారమును జపించుచు పరమాత్మను (ప్రణవార్థమును) చింతన చేయవలెను.

ప్రశ్న - 'పరమగతిని' పొందుట యనగానేమి?

సమా - నిర్గుణ నిరాకార బ్రహ్మను అభేదభావముతో పొందుటనే పరమగతి ప్రాప్తి యని యందురు. దీనినే శాశ్వతముగా జననమరణ చక్రమునుండి ముక్తుడగుట, ముక్తి లభించుట, మోక్షప్రాప్తి కలుగుట, నిర్వాణ బ్రహ్మప్రాప్తి కలుగుట అని యందురు.

ప్రశ్న - 8 నుండి 10వ శ్లోకము వరకు సగుణనిరాకార - ఈశ్వరోపాసన ప్రకరణ మనియు, 11 నుండి 13వ శ్లోకము వరకు నిర్గుణ నిరాకార బ్రహ్మోపాసనా ప్రకరణ మనియు తెల్పబడినది. ఈ విధముగ రెండు వేర్వేరు ప్రకరణములుగా అని యేల తెల్పబడినవి? ఆరు శ్లోకములను ఒకే ప్రకరణముగ భావించిన దోషమేమి?

సమా - 8వ శ్లోకము నుండి 10వ శ్లోకము వరకు గల వర్ణనమునందు ఉపాస్యుడైన పరమ పురుషుడు సర్వజ్ఞుడు, సర్వనియంత, అందరిని ధరించి పోషించువాడు, సూర్యునివలె స్వయంప్రకాశరూపుడు అని తెల్పబడినది. ఇవి యన్నియును

సర్వవ్యాపియైన భగవానుని దివ్యగుణములు. కాని 11 నుండి 13వ శ్లోకము వరకు ఇయ్యబడిన విశేషణములను బట్టి భగవంతుడు నిర్గుణ, నిరాకార స్వరూపుడనియు భావింపవచ్చును. ఇంతేగాక ఆ ప్రకరణమునందు ఉపాసకుని భక్తియుక్తుడని పేర్కొనుట జరిగినది. అందువలన అది భేదోపాసనయని తెలియుచున్నది. దానిఫలము గూడ దివ్యపరమపురుష (సగుణపరమేశ్వర) ప్రాప్తియని తెలుపబడినది. ఇచ్చట (11నుండి 13వ శ్లోకము వరకు) అభేదోపాసన వర్ణన యుండుటచే ఉపాసకునకు ఎట్టి విశేషణములు ఇయ్యబడలేదు. దీనిఫలము గూడ పరమగతి (నిర్గుణ బ్రహ్మప్రాప్తి) అని తెలుపబడినది. ఇంతేగాక 11వ శ్లోకమున నూతన ప్రకరణము ప్రారంభించుటకు ప్రతిజ్ఞ చేయబడి యుండెను. 2 ప్రకరణములను ఒకటేయని భావించినచో యోగవిషయ వర్ణనమువలన పునరుక్తి దోషము గూడ సంభవించును. ఈ కారణముల వలన ఈ ఆరు శ్లోకములును ఒకే ప్రకరణమునకు సంబంధించినవి కావనియు, రెండును వేర్వేరు ప్రకరణములనియు తెలియుచున్నది.

*సంబంధము - నిరాకార సగుణ పరమేశ్వరుని మరియు నిర్గుణనిరాకార బ్రహ్మను ఉపాసన చేయు యోగుల అంత్యకాలీన గతిరీతులను, ఫలములను తెల్పుట జరిగినది. కాని మొదటి నుండియు యోగాభ్యాసము చేసి, మనస్సును తమ అధీనములో ఉంచుకొనిన వారే అంత్యకాలమున ఇట్టి సాధనను చేయగలరు. సామాన్య మానవులు అంత్యకాలమున ఈ విధమైన సగుణ నిరాకార మరియు నిర్గుణనిరాకార సాధనలను చేయుట మిక్కిలి కష్టము. కనుక సులభముగ పరమేశ్వరప్రాప్తి కలుగుటకు నిత్యము నిరంతరము భగవంతుని స్మరణయే ఉపాయమని భగవానుడు తెల్పుచున్నాడు-*

**అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ 14 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓపార్థా! | సతతమ్ | = నిరంతరము | నిత్యయుక్తస్య | = సంతతము మత్పరాయణుడైన |
| యః | = ఏయోగి | మామ్ | = పురుషోత్తముడనైన నన్ను | యోగినః | = యోగికి |
| (మయి) | = (నాయందు) | స్మరతి | = స్మరించునో | అహమ్ | = నేను |
| అనన్యచేతాః | = అనన్యచిత్తుడై | తస్య | = ఆ | సులభః | = సులభుడను (సులభముగా లభింతును) |
| నిత్యశః | = సర్వదా | | | | |

**పార్థా! నిత్యము నిరంతరము అనన్యభావముతో చిత్తమును నాయందే నిలిపి, పురుషోత్తముడనైన నన్నే స్మరించుచు, సంతతము మత్పరాయణుడైన యోగికి నేను సులభుడను. అనగా అతనికి సహజముగనే నేను లభింతును. (14)**

ప్రశ్న - "అనన్యచేతాః" అనగానేమి?

సమా - చిత్తమును మరి ఏ ఇతర వస్తువు పైనను నిల్పక నిరంతరము అనన్య భక్తితో కేవలము పరమ ప్రేమాస్పదుడైన పరమేశ్వరునియందే లగ్నము చేయువానిని 'అనన్యచేతాః' అని యందురు.

ప్రశ్న - 'సతతమ్' 'నిత్యశః' అను రెండు పదములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఒక్క క్షణము గూడ వ్యవధి లేకుండ నిరంతరము స్మరణ చేయవలయునని 'సతతమ్' అను పదము తెల్పును. ఈ నిరంతరస్మరణ జీవితపర్యంతము సదా చేయుచుండవలెననియు ఒక్కదినము గూడ మానివేయ గూడదనియు, 'నిత్యశః' అనే పదము తెల్పును. ఈ రెండు పదములను ప్రయోగించుటద్వారా జీవిత పర్యంతము నిత్యమూ నిరంతరమూ స్మరణ చేయుచునే ఉండవలయునని భగవానుడు తెల్పెను.

ప్రశ్న - ఇచట 'మామ్' అనుపదము ఎవరిని తెల్పును? అతనిని స్మరించుట యనగానేమి?

సమా - ఇది నిత్యమూ భక్తితో స్మరణ చేయు

విషయమును తెల్పు ప్రకరణము. ఇందు తస్య, అహం అను భేదోపాసనను సూచించు పదములు ప్రయోగింపబడినవి. కనుక 'మామ్' అను పదము సగుణసాకారపురుషోత్తముడైన శ్రీకృష్ణ భగవానుని తెల్పును. కాని శ్రీమహావిష్ణువు, శ్రీరాముడు లేదా భగవానుని ఇతర రూపములను ఇష్టదైవములుగా భావించువారికి ఆ రూపముగూడ 'మామ్' అను శబ్దవాచ్యమగును, పరమభక్తిశ్రద్ధలతో భగవంతుని స్వరూపమును లేదా అతని నామగుణ ప్రభావలీలాదులను చింతన చేయుచుండుటయే అతనిని స్మరించుట యగును.

ప్రశ్న - అట్టి భక్తులకు భగవానుడు ఏల సులభుడు?

సమా - అనన్యభావముతో భగవంతుని చింతన చేయు పరమభక్తుడు భగవంతుని వియోగమును సహింపజాలడు. 'యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్' (4/11) అను వాక్యమును అనుసరించి, భగవానుడు కూడ అతని వియోగమును సహింపలేడు. భగవానుడే స్వయముగా అతనిని కలిసికొనుటకు ఇచ్ఛగించినప్పుడు భక్తునికి భగవత్ప్రాప్తి ఏ మాత్రము కష్టము కాదు. ఈ కారణము వలననే భక్తునకు భగవానుడు మిక్కిలి సులభుడు-అని చెప్పబడినది.

ప్రశ్న - నిత్యము, నిరంతరము, స్మరణచేయు భక్తునకు భగవానుడు సులభుడనుట సమ్మతమే. కాని నిత్యమూ, నిరంతరమూ భగవంతుని స్మరించుట సహజముగా సాధ్యమా?

సమా - భగవంతుని యందును, భగవత్ప్రాప్తి నందిన మహాత్ముల యందును భక్తిశ్రద్ధలుగల వారికి నిత్యమూ, నిరంతరమూ భగవచ్చింతన చేయుటవలన భగవత్ప్రాప్తి సులభముగ కలుగునను విశ్వాసమేర్పడును. అట్టి వారికి భగవత్కృపవలన నిత్యమూ, నిరంతరమూ, భగవత్స్మరణ సహజముగనే కల్గును. భక్తిశ్రద్ధలు లేనివారికి, భగవంతుని గుణప్రభావములను ఎరుంగని వారికిని మహాత్ముల సాంగత్య సౌభాగ్యములబింపని వారికిని, నిత్యమూ, నిరంతరమూ భగవచ్చింతన చేయుట తప్పక కష్టమే యగును.

*సంబంధము - నిత్యమూ, నిరంతరమూ చింతన చేయుటచే భగవత్ప్రాప్తి సులభమగునని భగవానుడు తెలిపెను. అట్టివారికి పునర్జన్మ యుండదనియు, భగవత్ప్రాప్తి నందిన మహాత్ములకు భగవంతునినుండి ఎన్నడును వియోగము కలుగదనియు అతడు తెలుపుచున్నాడు-*

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।**
**నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరమామ్ | = అత్యుత్తమమైన | మామ్ | = నన్ను | | నిలయమైన |
| సంసిద్ధిమ్ | = సిద్ధిని | ఉపేత్య | = పొంది (పొందిన | అశాశ్వతమ్ | = క్షణభంగురమైన |
| గతాః | = పొందినట్టి | | పిమ్మట) | పునర్జన్మ | = పునర్జన్మను |
| మహాత్మానః | = మహాత్ములు | దుఃఖాలయమ్ | = దుఃఖములకు | న, ఆప్నువంతి | = పొందనే పొందరు |

**పరమసిద్ధిని పొందిన మహాత్ములు నన్ను చేరిన పిదప దుఃఖములకు నిలయమైన, క్షణభంగురమైన పునర్జన్మను పొందరు. (15)**

ప్రశ్న - 'పరమసిద్ధి' అనగానేమి? 'మహాత్మానః' అను పదము ఎవరిని సూచించును?

సమా - మిక్కిలి భక్తి శ్రద్ధలతో నిత్యమూ నిరంతరమూ భజన ధ్యానాదులు చేయుచు, ఆ సాధన పరాకాష్ఠ స్థితికి చేరినప్పుడు వెంటనే భగవత్సాక్షాత్కారము కల్గును. ఆ పిమ్మట ఎట్టిసాధనయు చేయవలసిన పనియే ఉండదు. అట్టి పరాకాష్ఠ స్థితినే పరమ సిద్ధియని యందురు. ఇట్టి పరమసిద్ధిని పొందిన జ్ఞానులైన ఈ భక్తులనే 'మహాత్మానః' అనుపదము సూచించును.

ప్రశ్న - 'పునర్జన్మ' అనగానేమి? అది 'దుఃఖాలయము' అనియు 'అశాశ్వతము' అనియు తెల్పుటకు కారణమేమి?

సమా - జీవునికి భగవత్ప్రాప్తి కలుగనంత వరకు

కర్మవశమున వివిధ యోనులయందు జన్మింపక తప్పదు. మరణించిన పిదప కర్మవశమున జీవుడు దేవ, మనుష్య, పశుపక్ష్యాది యోనులలో ఏదో ఒకదానియందు జన్మించుటను 'పునర్జన్మ' అందురు. దుఃఖపూర్ణము, అనిత్యము కాని యోని ఏదియు లేదు. జీవితము అనిత్యము అనుటకు మృత్యువేసాక్షి కాని, జీవితములో మానవునికి సంబంధించిన వస్తువులన్నియును పరిణామశీలములే. అనగా మార్పు చెందునవియే. వాటితోడి సంబంధము గూడ ఎల్లకాలము స్థిరముగా ఉండునది కాదు. అనగా అశాశ్వతమైనదే. నేడు సుఖముగా ప్రతీతమగు వస్తువుగూడ కాలక్రమమున రూపాంతరము చెందుటచేతనో లేక దానితోగల సంబంధమును మానవుడు మార్చుకొనుటవలననో అది దుఃఖప్రదమే అగును. జీవితములో మనుష్యుడు సుఖప్రదమని తలచువస్తువునశించినప్పుడు లేక దానిని వదలి అతడు మరణింపవలసి వచ్చినప్పుడు అది దుఃఖదాయకమే అగును. అంతేగాక ప్రతి వస్తువునందు లేక స్థితియందు లోపము కలిగినప్పుడు గాని, లేక అది వినాశమగునను ఆశంక కల్గినప్పుడు గాని దుఃఖములే మిగులును. సుఖకరములుగా కన్పడు వస్తువులయొక్క సేకరణ, అనుభవముల యందు గల ఆసక్తివలన మనుజుడు పాపకృత్యములను చేయవలసియే ఉండును. తత్ఫలితముగా అనేక విధములగు కష్టములు, నరకయాతనలును ప్రాప్తించును. కావున పునర్జన్మయందు జన్మాది మృత్యుపర్యంతము దుఃఖపరంపరలే యుండుటవలన దానిని 'దుఃఖాలయము' అని పేర్కొనుట జరిగినది. ఏ జన్మమైనను, ఆ జన్మయందు లభించు భోగములైనను, అనిత్యములే యగుటవలన వాటిని క్షణభంగురములేయని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - పైన పేర్కొనబడిన 'మహాత్ముల'కు పునర్జన్మ యేల కలుగదు?

సమా - ఈ అనన్యభక్తులకు భగవత్ప్రాప్తి కలుగును. సమస్త సుఖములకును నిధానమూ, సకల జగత్తునకును పరమాధారుడును, పరమాశ్రయుడును, పరమాత్మ, పరమపురుషుడు ఐన భగవంతుని పొందినవానికి ఎట్టి పరిస్థితులలోను, ఎప్పుడును అతనితో (పరమాత్మతో) వియోగము సంభవింపదు. కనుక భగవత్ప్రాప్తి కలిగిన పిమ్మట మరల ఈ ప్రపంచమున జన్మించుట జరుగదు. ఈ కారణమున అట్టి 'మహాత్ముల'కు పునర్జన్మయుండదు- అని తెల్పబడినది.

*సంబంధము - భగవత్ప్రాప్తి కల్గిన మహాత్ములకు పునర్జన్మ యుండదు. అనగా అన్యులకు పునర్జన్మ తప్పదని దీనివలన తెలియుచున్నది. అట్టి జీవులు ఏయే లోకములను చేరిన పిమ్మట తిరిగి ఈ లోకమునకు వత్తురో? అను విషయమును భగవానుడు తెల్పుచున్నాడు-*

**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।**
**మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ 16 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున! | = ఓ అర్జునా! | పునరావర్తినః | = పునరావృత్తములు | ఉపేత్య | = పొందుట వలన |
| ఆబ్రహ్మ-భువనాత్ | = బ్రహ్మలోక పర్యంతముగల | తు, కౌంతేయ! | = అయితే ఓ అర్జునా! | పునర్జన్మ | = పునర్జన్మ |
| లోకాః | = సమస్తలోకములును | మామ్ | = నన్ను | న, విద్యతే | = ఉండదు |

**అర్జునా! బ్రహ్మలోకపర్యంతము ఉన్న సమస్తలోకములును పునరావృత్తములు. కౌంతేయా! (ఈలోకములన్నియును కాలమునకు పరిమితమైనవి. కాని నేను కాలాతీతుడను) కనుక నన్ను చేరినవానికి పునర్జన్మ యుండదు.** **(16)**

ప్రశ్న - ఇచట 'బ్రహ్మలోకము' అనుపదము ఏ లోకమును తెల్పును. 'ఆ' (ఆఙ్) అను ప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి? 'లోకాః' అను పదము ఏ లోకములను తెల్పును?

సమా - సృష్ట్యాదియందు భగవంతుని నాభి కమలమునుండి ఉత్పన్నమైన చతుర్ముఖ బ్రహ్మ ఈ జగత్తునంతయును సృష్టించును. అతనిని ప్రజాపతి,

హిరణ్యగర్భుడు, సూత్రాత్మ అనియు అందురు. ఈ అధ్యాయమునందు అతనిని 'అధిదైవము' అని పేర్కొనుట జరిగినది. (8/4) అతడు నివసించు ఊర్ధ్వలోకమునే బ్రహ్మలోకము అందురు. అదియును గాక 'భూః', భువః' 'స్వః' మొదలగు ఇతర లోకములకన్నింటికి వేర్వేరు లోకపాలకులు గలరు. 'ఆ' (ఆఙ్) అను అవ్యయ ప్రయోగము వలన బ్రహ్మలోక సహితముగా దాని క్రిందనుండు వేర్వేరులోకములన్నియును సూచింపబడినవి.

ప్రశ్న -'పునరావర్తినః' అని యేలోకములను గూర్చి తెలుపుట జరిగినది?

సమా - మాటిమాటికి నశించుచు, ఉత్పన్నములగు స్వభావములుగల లోకములను 'పునరావర్తినః' అని యందురు. ఆ లోకములను చేరిన ప్రాణులుగూడ ముక్తులుగారు. మరల వారు జన్మింపవలసినదే.

*సంబంధము - బ్రహ్మలోక పర్యంతముగల లోకములన్నియును, పునరావృతములే అని తెల్పబడినవి. కాని అవి ఏ విధముగా పునరావృతములు? అను జిజ్ఞాసకు సమాధానముగా బ్రహ్మయొక్క దివారాత్రముల కాలపరిమాణమును వర్ణించి, లోకములు అన్నియును అనిత్యములేయని తెలుపుచున్నాడు-*

**సహస్రయుగపర్యంతమ్ అహర్యద్బ్రహ్మణో విదుః ।**
**రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = ఏది | యుగసహస్రాంతామ్ | = అట్టి వేయి చతుర్యుగముల కాలమును | తే, జనాః | = అట్టి యోగులు |
| సహస్రయుగ పర్యంతమ్ | = వేయిచతుర్యుగముల కాలము | రాత్రిమ్ | = 'రాత్రి' నిగాను | అహోరాత్రవిదః | = కాల తత్త్వమును నిజముగా నెఱిగినవారు |
| బ్రహ్మణః | = బ్రహ్మకు | యే | = ఏ పురుషులు | | |
| అహః | = పగలు-అనియు | విదుః | = ఎఱుంగుదురో | | |
| (యామ్) | = ఏది | | | | |

**వేయి చతుర్యుగముల కాలము బ్రహ్మకు ఒక 'పగలు' అనియు, అంతేకాలము ఆ బ్రహ్మకు ఒక రాత్రియనియు తెలిసిన యోగులు కాలతత్త్వమును నిజముగా ఎఱిగినవారు. (17)**

ప్రశ్న - 'సహస్రయుగము అనగా ఎంతకాలము?' బ్రహ్మయొక్క దివారాత్రముల కాలపరిమాణమును నిర్ణయించుటకు ఈ సహస్రయుగము ఒక కొలతబద్ద - అని యనుటలోని విశేషమేమి?

సమా - కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు- అను నాల్గింటి కాల ప్రమాణమునకు 'దివ్యయుగము' అని పేరు-ఇచట యుగము అనగా దివ్యయుగమే. ఇది దేవతలకు ఒక యుగము-అగుటవలన దీనిని దివ్యయుగము అని పేర్కొనిరి. ఈ దేవతల కాలప్రమాణము మన (మానవ) కాలప్రమాణమునకు 360 రెట్లు అధికమని భావింపబడుచున్నది. అనగా మన ఒక సంవత్సరముకాలము దేవతలకు (24 గంటల ప్రమాణముగల) ఒక దివారాత్రము (ఒక దినము) మన 30 సంవత్సరములు దేవతలకు ఒక నెల. మన 360 సంవత్సరములు వారికి ఒక దివ్య సంవత్సరము. ఇట్టి 12,000 దివ్యసంవత్సరములు వారికి ఒక దివ్య యుగము అగును. దీనిని మహాయుగము అనియు అందురు. మన చతుర్యుగముల కాల ప్రమాణమునకు ఇది సమానము. ఈ విధముగ లెక్కించినచో మన 43 లక్షల 20వేల సంవత్సరములు ఒక మహాయుగము అగును. దివ్యవర్షములను బట్టి చూచినచో 12 వందల దివ్య వర్షములు మన కలియుగ కాల ప్రమాణమునకును, 24 వందల దివ్యవర్షములు ద్వాపర యుగమునకును, 36వందల దివ్యవర్షములు త్రేతాయుగమునకును, 48 వందల దివ్య సంవత్సరములు కృతయుగమునకును సమానము. ఇవి యన్నియును కలిపి 12 వేల దివ్యవర్షములగును. ఇది ఒక దివ్యయుగము. ఇట్టి వేయి దివ్యయుగములు బ్రహ్మకు ఒక పగలు. మరియు ఇట్టి వేయి దివ్య యుగములు బ్రహ్మకు ఒక రాత్రి అగును.

| | | | |
|---|---|---|---|
| కలియుగము | = | 4,32,000 | సంవత్సరములు |
| ద్వాపరయుగము | = | 8,64,000 | సం॥లు కలియుగమునకు రెట్టింపు |
| త్రేతాయుగము | = | 12,96,000 | సం॥లు కలియుగమునకు మూడురెట్లు |
| కృతయుగము | = | 17,28,000 | సం॥లు కలియుగమునకు నాలుగురెట్లు |

మన యుగముల కాలప్రమాణముతో లెక్కించినచో

| | | | |
|---|---|---|---|
| మొత్తము | = | 43,20,000 | సంవత్సరములు |

ఇది యొక దివ్యయుగము. ఇట్టి వేయి దివ్యయుగములు అనగా 4,32,00,00,000 సం॥లు. (నాలుగు అర్బుదముల, 32 కోట్ల సంవత్సరములు) బ్రహ్మకు ఒక పగలు, అంతేకాలము ఒక రాత్రి.

మనుస్మృతియొక్క మొదటి అధ్యాయమునందు 64 నుండి 73వ శ్లోకము వరకు ఈ విషయము విశదముగా వర్ణింపబడినది. బ్రహ్మయొక్క దివసమయమును కల్పము లేక సర్గము అనియు, రాత్రిని ప్రళయము అనియు అందురు. ఇట్టి 30 దివారాత్రములు కలిసి, బ్రహ్మకు ఒక నెల. ఇట్టి 12 నెలలు ఒక సంవత్సరము. ఇట్టి వంద సంవత్సరములు బ్రహ్మకు పూర్ణాయువు. బ్రహ్మ యొక్క ఈ దివారాత్ర ప్రమాణములను తెలుపుట వలన బ్రహ్మ జీవితము, అతని లోకము కూడ పరిమితమైనది అనియు, అది కాలావధి కలదనియు తెలియుచున్నది. కనుక అదియే (ఆ బ్రహ్మలోకమే) అనిత్యమైనప్పుడు దానికి క్రిందనున్న లోకములు, అందున్న ప్రాణుల శరీరములు అనిత్యములని చెప్పవలసిన పనియేలేదు.

ప్రశ్న - బ్రహ్మయొక్క దివారాత్ర కాలప్రమాణమును ఎరిగినవారే నిజముగా కాలతత్త్వమును ఎరిగినవారు. అనియనుటలోని అంతర్యమేమి?

సమా - బ్రహ్మ యొక్క దివారాత్రముల కాల-అవధిని తెలిసిన వారికి బ్రహ్మలోకము, దానిక్రిందనున్న అన్ని లోకములూ అనిత్యములని తెలియును. ఆ లోకములే అనిత్యములైనప్పుడు అచటి భోగములు అనిత్యములు, నశ్వరములు. అనిత్యములూ, నశ్వరములూ అయిన వస్తువులు శాశ్వత సుఖమును ఇయ్యజాలవు. కనుక ఇహ-పర లోక భోగముల యందు ఆసక్తులై , వాటిని పొందుటకు ప్రయత్నించుటయు, మనుష్య జీవనమును ప్రమాదాదుల యందు వ్యర్థపరచుటయు, కేవలము మూర్ఖత్వమేయగును. మనుష్యుడు జీవించుకాలము పరిమితమైనది. (9/33) కనుక భక్తిశ్రద్ధలతో నిరంతరము భగవచ్చింతన చేయుచు శీఘ్రాతి శీఘ్రముగ అతనిని పొందుటయే బుద్ధిమంతుల లక్షణము. ఇట్టి జీవన విధానములోనే మానవ జన్మ సార్థకమగును. ఈ విషయమును ఎరింగినవారే దివారాత్ర రూపకాలతత్త్వమును ఎరింగి, తమ అమూల్య సమయమును సఫలము చేసికొందురు.

*సంబంధము* - *బ్రహ్మయొక్క దివారాత్ర కాల ప్రమాణములను తెల్పిన పిదప ఆ దివారాత్రారంభమునందు పదేపదే జరుగు సమస్త భూతముల ఉత్పత్తి - ప్రలయములను గూర్చి తెల్పుచు వాటి అనిత్యత్వమును వివరించుచున్నాడు-*

**అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే ।**
**రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ 18 ॥**

సర్వాః, వ్యక్తయః = సమస్త చరాచర ప్రాణులన్నియును
అహరాగమే = బ్రహ్మయొక్క పగటికాలము ప్రారంభముకాగానే
అవ్యక్తాత్ = అవ్యక్తమునుండి
ప్రభవంతి = ఉత్పన్నములు (ప్రకటితములు) అగును మఱియు
రాత్ర్యాగమే = బ్రహ్మయొక్క రాత్రి కాలము ప్రారంభము కాగానే
తత్ర, అవ్యక్తసంజ్ఞకే, ఏవ = అవ్యక్తమను పేరుగల బ్రహ్మము యొక్క సూక్ష్మ శరీరమునందే
ప్రలీయంతే = లీనమగును

చరాచరప్రాణులన్నియును బ్రహ్మయొక్క పగటి కాలము ప్రారంభము కాగానే అవ్యక్తమునుండి అనగా బ్రహ్మయొక్క సూక్ష్మశరీరమునుండి ఉత్పన్నములగును. (ప్రకటితములగును). మఱల బ్రహ్మయొక్క రాత్రికాలము ప్రారంభసమయమున అవి అదే అవ్యక్తమునందు లీనమగును.(18)

ప్రశ్న - ఇచట 'సర్వాః' అను విశేషణముతోపాటు 'వ్యక్తయః' అను పదము ఎవరిని సూచించును?

సమా - ఇంద్రియముల ద్వారా తెలిసికొనదగు వస్తువును 'వ్యక్తి' అని యందురు. ప్రాణులు (స్థావర జంగమములు) అన్నియును ఇంద్రియ గోచరములే. కనుక దేవమనుష్య పితృపశుపక్ష్యాది యోనులలో వ్యక్తరూపములో స్థితమైయున్న దేహధారులైన ప్రాణులన్నింటిని 'సర్వాః' అను విశేషణముతోపాటు 'వ్యక్తయః' అను పదము తెల్పును.

ప్రశ్న - 'అవ్యక్తః' అను పదము దేనిని తెల్పును? బ్రహ్మయొక్క దినారంభమున ఆ అవ్యక్తము నుండి ప్రాణుల ఉత్పత్తి జరుగుట యనగానేమి?

సమా - అవ్యక్తమనగా అపరా ప్రకృతి యొక్క సూక్ష్మస్థితి. దీనినే బ్రహ్మయొక్క సూక్ష్మ శరీరము అని యందురు. ఇది స్థూలపంచమహాభూతముల ఉత్పత్తికి పూర్వస్థితి.

బ్రహ్మయొక్క దినారంభమునందు అనగా బ్రహ్మ తన సుషుప్త్యవస్థను త్యజించి, జాగ్రదవస్థను స్వీకరించినప్పుడు, ఆ సూక్ష్మ ప్రకృతియందు వికారము (మార్పు) కలుగును. అప్పుడది స్థూలరూపమును పొందును. అట్టి స్థూలరూప ప్రకృతితోపాటు ప్రాణులన్నియును తమతమ కర్మాను సారము వేర్వేరు రూపములలో ప్రకటితమగును. అవ్యక్తస్థితి నుండి వ్యక్త స్థితిని చేరుట యనగా ఇదియే.

ప్రశ్న - రాత్రియొక్క ఆరంభమనగానేమి? అట్టి సమయమున అవ్యక్తమునుండి ఉత్పన్నమైన సర్వప్రాణులును మరల అందే లీనమగును- అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఒక వంద దివ్యయుగములు కడచిన మరుక్షణమే బ్రహ్మ జాగ్రదవస్థను త్యజించి, సుషుప్త్యవస్థను స్వీకరించును. ఆ క్షణముననే బ్రహ్మయొక్క రాత్రి ఆరంభమగును.

ఆ సమయమున స్థూలరూపమున పరిణతమైన ప్రకృతి సూక్ష్మస్థితిని పొందును. దేహములను ధరించిన సమస్త ప్రాణికోటియు వేర్వేరు స్థూలశరీరములను త్యజించి, ప్రకృతి యొక్క సూక్ష్మస్థితియందు స్థితమగును. దీనినే సమస్త ప్రాణులు అవ్యక్తమున లీనమగుట యందురు. ఆత్మకు జననమరణములు లేవు. కావున దానికి వాస్తవముగా ఉత్పత్తి లయములు లేవు. కనుక ప్రకృతి స్థిత ప్రాణులకు సంబంధించిన ప్రకృతి యొక్క సూక్ష్మాంశస్థూల రూపములో పరిణతి చెందుటనే వాటి ఉత్పత్తియనియు, ఆ స్థూల స్థితినుండి మరల సూక్ష్మరూపమునకు చేరుటనే ఆ ప్రాణులు అందు లీనమగుటయనియు భావింపవలెను.

ప్రశ్న - ఇచట అవ్యక్తమని పేర్కొనబడిన సూక్ష్మ ప్రకృతికిని, 9వ అధ్యాయమునందలి 7,8 శ్లోకములయందు వర్ణింపబడిన ప్రకృతికిని మధ్యగల భేదమేమి?

సమా - స్వరూపతః ఎట్టి భేదమూ లేదు. ఒకే ప్రకృతి అవస్థాభేదముచే రెండువిధములుగా వేర్వేరుగా వర్ణింపబడినది. 7వ అధ్యాయమునందు 4వ శ్లోకమున ఎనిమిది భేదములతో విభక్తమైయున్నట్లు చెప్పబడియున్న 'అపరా' ప్రకృతియే ఈ శ్లోకమున అవ్యక్తము అను పేరుతో పేర్కొనబడినది. 9వ అధ్యాయమునందలి 7,8 శ్లోకములయందు వర్ణింపబడిన మూల ప్రకృతి 8 భేదములుగా లేనిదై అనిర్వచనీయరూపమునందు స్థితమై యుండును. ఈ మూల ప్రకృతియే కారణస్థితినుండి సూక్ష్మస్థితియందు పరిణతి చెందినప్పుడు 8 భేదములతో విభక్తమైన 'అపరా' ప్రకృతియను పేరుతో తెల్పబడును.

సంబంధము - బ్రహ్మయొక్క రాత్రి ప్రారంభమునందు సమస్తభూతములు అవ్యక్తమునందు లీనమైనప్పటికిని, పరమపురుషుడైన పరమేశ్వర ప్రాప్తి కలుగనంతవరకును వాటికి పునర్జన్మ రాహిత్యము లభింపదు. అవి జనన మరణ చక్రములో తిరుగుచునే యుండును. ఈ విషయమునే భగవానుడు మరల తెలుపుచున్నాడు-

**భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।**
**రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = అర్జునా! | భూత్వా, భూత్వా | = మఱలమఱల ఉత్పన్నమగుచు | ప్రలీయతే | = లీనమగును మరియు |
| సః, ఏవ | = అట్టి (ఉపర్యుక్తమైన) | | | అహరాగమే | = దినప్రవేశ కాలమునందు |
| అయమ్ | = ఈ | అవశః | = ప్రకృతివశమున | | |
| భూతగ్రామః | = భూతసముదాయము | రాత్ర్యాగమే | = రాత్రి ప్రవేశకాలమునందు | ప్రభవతి | = (మరల) ఉత్పన్నమగును |

**పార్థా! ఈభూత(ప్రాణి) సముదాయమే ప్రకృతివశమున మాటిమాటికిని ఉత్పన్నమగుచుండును. రాత్రి ప్రారంభకాలమున లీనమగుచుండును. పగటి ప్రారంభ కాలమున ఉత్పన్నమగుచుండును.(19)**

ప్రశ్న - 'భూతగ్రామః' అను పదము దేనిని తెలుపును? దానితోపాటు 'సః' 'ఏవ' 'అయమ్' అను పదములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 'భూతగ్రామః' అను పదము ఇచట చరాచర ప్రాణిసముదాయమును సూచించును. సకల ప్రాణులు బ్రహ్మయొక్క రాత్రి ఆరంభమున అవ్యక్తమునందు లీనమగును. వాటిని పూర్వ శ్లోకమున 'సర్వాః వ్యక్తయః' అని పేర్కొనుట జరిగినది. అవియే (ఆ ప్రాణులే) బ్రహ్మయొక్క దినప్రారంభమున మరల ఉత్పన్నములగును. అవ్యక్తము నందు లీనములగుట వలన అవి పూర్తిగా విముక్తములుకావు. వాటి ప్రత్యేకమైన ఉనికి గూడ సమసిపోదు. కావుననే బ్రహ్మయొక్క రాత్రి సమయము సమాప్తము కాగానే అవియన్నియును తమతమ గుణకర్మలను అనుసరించి, యథాయోగ్యములుగ స్థూల శరీరములను పొంది ప్రకటితము లగును. కల్పకల్పాంతరములనుండియు ఈ విధముగ ఈ స్థావరజంగమ భూతసముదాయములన్నియును మాటిమాటికిని అవ్యక్తములో లీనములై మరల దాని నుండియే ప్రకటితములగుచున్నవి-అని తెల్పుటకే సః, ఏవ, అయమ్ అను పదములు ప్రయుక్తములైనవి.

ప్రశ్న - 'భూత్వా' అను పదము రెండు మారులు ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ విధముగా ఈ భూత సముదాయ మంతయును అనాదికాలమునుండియే ఉత్పన్నము లగుచును, లీనములగుచును ఉన్నవి. బ్రహ్మయొక్క ఆయువు నూరు సంవత్సరములు పూర్తికాగానే ఆయన శరీరము గూడ మూల ప్రకృతిలో లీనమగును. అతనితోపాటు ఈ భూత సముదాయముగూడ అందులోనే లీనమగును. (9/7) అప్పటికిని వీటి జననమరణ చక్రము పూర్తిగాదు. ఆ తరువాత గూడ అవి మరల మరల ఈ రీతిగనే ఉత్పన్నములు అగుచునే యుండును. (9/8) ప్రాణులకు పరమాత్మ ప్రాప్తి యగునంత వరకును అవి మాటిమాటికిని ఈ విధముగ ఉత్పన్నములగుచు, ప్రకృతిలో లీనము లగుచునే యుండును.

ప్రశ్న - 'అవశః' అనగానేమి?

సమా - 'అవశః' అనునది 'భూతగ్రామః' అను పదమునకు విశేషణము. స్వతంత్రుడు గాక ఇతరుల అధీనము నందున్న వానిని 'అవశుడు' లేక 'పరవశుడు' అని యందురు. అవ్యక్తమునుండి ఉత్పన్నములై, మరల అవ్యక్తమునందే లీనములగు సమస్త ప్రాణులును తమ తమ స్వభావములకు వశములై యుండును. అనగా అనాదిసిద్ధములైన వేర్వేరు గుణకర్మలను అనుసరించి, వివిధ ప్రకృతులు లేక స్వభావములు కలిగియుండును. ఈ స్వభావములకు వశములగుటవలన ఇవి జన్మించుచు మరణించుచు ఉండును. కనుక 13వ అధ్యాయమునందలి 21వ శ్లోకమున భగవానుడు "ప్రకృతియందు స్థితుడైన పురుషుడే ప్రకృతి జన్యములైన గుణములను అనగా సుఖ దుఃఖములను అనుభవించును. మరియు ప్రకృతి సాంగత్యము వలననే ఉచ్చనీచ యోనుల యందు జన్మించుచుండును. జీవుడు ప్రకృతికి అతీతుడై పరమాత్మను చేరినప్పుడు అతనికి పునర్జన్మ ఉండదు'. అను విషయమును స్పష్టముగా తెలిపెను.

ప్రశ్న - స్వభావములకు ఆధీనములై ప్రాణులు మాటిమాటికి జన్మించుచుండును. వాటి వాటి గుణకర్మలను అనుసరించి, చక్కటి వ్యవస్థను చేయుచు వాటిని ఉత్పన్నము చేయువాడెవడు? ప్రకృతియా? పరమేశ్వరుడా? బ్రహ్మయా? లేక మరియొకడా?

సమా - ఇది బ్రహ్మయొక్క దివారాత్రముల సందర్భము గావున బ్రహ్మయే సమస్త ప్రాణులను వాటివాటి గుణకర్మలను అనుసరించి, ఆయా శరీరములతో ఉత్పన్నము చేయును. మహాప్రలయమునకు తరువాత బ్రహ్మోత్పత్తియు ఉండదు. కావున ఆ సమయమున సృష్టి రచన స్వయముగా

భగవానుడే చేయును. కాని బ్రహ్మోత్పత్తియైన పిదప సమస్త భూతసృష్టిని బ్రహ్మయే చేయును.

9వ అధ్యాయమున 7 నుండి 10వరకు మరియు14వ అధ్యాయమున 3,4 శ్లోకముల యందును ప్రస్తావింపబడిన సృష్టిరచన విషయము మహాప్రలయము తరువాత, మహాసర్గమునకు ముందు కాలమునకు సంబంధించినది. ఇచట వర్ణింపబడిన విషయము బ్రహ్మ యొక్క రాత్రి (ప్రలయము) తరువాత బ్రహ్మ యొక్క దినము (సర్గము)నకు ముందు కాలమునకు సంబంధించినది.

*సంబంధము - బ్రహ్మయొక్క రాత్రి ఆరంభమునందు సమస్త భూతములు దేనియందు లీనమగుచుండునో, మరల దినారంభమున దేనినుండి ఉత్పన్నములగుచుండునో ఆ అవ్యక్తమే సర్వశ్రేష్ఠమైనదా? లేక దానికంటెను పరమమైనది మరియొకటి కలదా? అను జిజ్ఞాసపై భగవానుడు ఇట్లు తెలుపుచున్నాడు-*

**పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః ।**
**యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = అయితే | | మఱియొకటి | సః | = ఆ పరమ దివ్యపురుషుడు |
| తస్మాత్, అవ్యక్తాత్ | = ఆ అవ్యక్తముకంటెను | యః | = ఏ | సర్వేషు | = సమస్తమైన |
| | | సనాతనః | = సనాతనమైన | భూతేషు | = భూతములు |
| పరః | = అత్యంత పరమైనది | అవ్యక్తః | = అవ్యక్తమైన | నశ్యత్సు | = నశించిపోవుచున్నను |
| అన్యః | = విలక్షణమైన | భావః | = భావముగలదో | న, వినశ్యతి | = నశించిపోడు |

**ఆ అవ్యక్తముకంటెను పరమైన విలక్షణమైన సనాతన (శాశ్వత) మైన అవ్యక్తభావమే ఆ పరమపదము. ప్రాణులన్నియు నశించినను ఆ పరమ పురుషుడు మాత్రము నశింపడు (నిత్యుడే). (20)**

ప్రశ్న - 'తస్మాత్' అను విశేషణముతోపాటు 'అవ్యక్తాత్' అను పదము ఏ అవ్యక్త పదార్థమును సూచించును? దానికంటెను భిన్నమైన మరొక అవ్యక్త భావమేమి? అట్లే దానిని 'పరః' 'అన్యః' 'సనాతనః' అని యనుటలోని విశేషమేమి?

సమా - 18వ శ్లోకమునందు తెల్పబడినట్లుగా సమస్త ప్రాణులు లయము చెందునట్టి ఆ అవ్యక్తమును సూచించునదియే 'తస్మాత్' అను విశేషణముతో గూడిన 'అవ్యక్తాత్' అను పదము. దానికంటెను వేరైన మరొక అవ్యక్త భావము (తత్త్వము) ఈ అధ్యాయమునందు 4వ శ్లోకమున 'అధియజ్ఞము' అనియు, 9వ శ్లోకమున కవి పురాణాది నామములతోడను, 8,10 శ్లోకములయందు పరమదివ్య పురుషుడనియు, 22వ శ్లోకమున పరమపురుషుడనియు, అట్లే 9వ అధ్యాయమునందలి 4వ శ్లోకమునందు 'అవ్యక్తమూర్తి' అనియు వర్ణింపబడినది. పూర్వోక్తమైన అవ్యక్తముకంటెను ఈ అవ్యక్తమును 'పరః' 'అన్యః' అని తెలిపి, దీనియొక్క శ్రేష్ఠత్వమును విలక్షణస్థితిని రూఢిచేయుట జరిగినది. రెండు స్వరూపములును అవ్యక్తములేయైనను రెండును ఒక జాతికి (శ్రేణికి) చెందినవి కావు. మొదటి అవ్యక్తము జడము, నశ్వరము, జ్ఞేయము. కాని ఈ రెండవది చేతనము, నాశరహితము, మరియు జ్ఞాత. పైగా ఇది దానికి (మొదటి అవ్యక్తమునకు) స్వామి, సంచాలకుడు, అధిష్ఠాత. కనుక ఇది దానికంటెను మిక్కిలి శ్రేష్ఠమూ, విలక్షణమూ అయినది. ఇది అనాదియు, అనంతమూ అగుటవలన 'సనాతనము' అని పేర్కొనబడెను.

ప్రశ్న - 'భూతములు' అన్నియును నశించినను ఈ సనాతనమైన అవ్యక్తము నశింపదు - అను వాక్యములో 'సర్వభూతములు' అనగానేమి? అవి నశించుటయు ఆ సమయమున ఆ సనాతనము - అవ్యక్తము నశింపకపోవుటయు అనగానేమి?

సమా - బ్రహ్మతోగూడ బ్రహ్మయొక్క దివారాత్రముల యందు ఉత్పన్నములై విలీనమగుచున్నట్టి చరాచర ప్రాణులును, మరియు వాటి శరీరేంద్రియ మనస్సులు, భోగ్యవస్తువులు, వాసస్థానములు-అన్నియు సర్వభూతములు అను పదముతో తెల్పబడినవి. మహాప్రలయ సమయమున

స్థూల, సూక్ష్మ శరీరరహితములై ఇవి 'అవ్యాకృత మాయ' అను మూల ప్రకృతియందు లీనమగును. అవి నాశమగుట యనగా ఇదియే. ఆ సమయము నందును ఆ ప్రకృతియొక్క అధిష్ఠాతయైన సనాతన, అవ్యక్త, పరమ దివ్య పురుషుడైన పరమేశ్వరుడు ప్రకృతితో సహా సమస్తజీవులను తనలో లీనమొనర్చుకొని , తన మహిమయందే స్థితుడై యుండును. సమస్త భూతములు నశించినను, అతడు నశింపకుండట అనగా ఇదియే.

*సంబంధము - 8, 10వ శ్లోకములయందు అధియజ్ఞోపాసనా ఫలము పరమదివ్యపురుష ప్రాప్తి యనియు, 13వ శ్లోకమునందు పరమ, అక్షర, నిర్గుణ బ్రహ్మోపాసనాఫలము పరమగతి ప్రాప్తియనియు, 14వ శ్లోకమున సగుణ సాకార- శ్రీకృష్ణ భగవానుని ఉపాసనా ఫలము భగవత్ప్రాప్తి యనియు తెల్పబడినవి. దీనివలన ఈ మూడింటి ఫలములయందు భేదము కలదని భ్రమ కలుగవచ్చును. కాని వీటన్నింటి యొక్క ఏకత్వమును ప్రతిపాదించుచు తత్ప్రాప్తియనంతరము పునర్జన్మ రాహిత్యమే అని తెల్పుచున్నాడు-*

**అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్ ।**
**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవ్యక్తః | = ఈ అవ్యక్తమే | పరమామ్, గతిమ్ | = పరమగతి అనియు | ప్రాప్య | = పొంది |
| అక్షరః, ఇతి | = అక్షరమనియు | | | న, నివర్తంతే | = (మఱల) తిరిగిరారో |
| ఉక్తః | = చెప్పబడును | ఆహుః | = పలుకుదురు (వ్యవహరింతురు) | తత్ | = అది |
| తమ్ | = 'అక్షరము' అని వ్యవహరింపబడు ఆ అవ్యక్తభావమునే | యమ్ | = ఏ పరమగతిని | మమ | = నాయొక్క |
| | | | | పరమమ్, ధామ | = పరంధామము |

**ఈ అవ్యక్తమునే అక్షరము అనియు అందురు. ఇదియే పరమగతి మరియు నా పరమధామము. ఈ సనాతన - అవ్యక్తమును అనగా నా పరంధామమును చేరినవారు మఱల తిరిగిరారు. (21)**

ప్రశ్న - 'అవ్యక్తః' 'అక్షరః' అను పదములు దేనిని సూచించును?

సమా - పూర్వ (20వ) శ్లోకమున సనాతన అవ్యక్త భావము అను పేరుతో 8,10 శ్లోకములయందు పరమ దివ్య పురుషుడు అనుపేరుతో పేర్కొనబడిన 'అధియజ్ఞ' పురుషుని తెల్పునవియే 'అవ్యక్తః, అక్షరః' అను పదములు.

ప్రశ్న- 'పరమగతి' యను శబ్దము ఎవరిని సూచించును?

సమా - ఇచట 'పరమ' అను విశేషణము ఉండుటవలన ఇది సర్వోత్తమప్రాప్యమైన ముక్తి. ఇది ప్రాప్తించిన ఇంక ప్రాప్యమైన వస్తువేదియు ఉండదు. ఇది ప్రాప్తించినంతనే సర్వదుఃఖములును శాశ్వతముగా నశించును. కనుక ఆ నిర్గుణ నిరాకార పరమాత్మను పరమము, అక్షరము, బ్రహ్మము అని యందురు. ఈ పరమగతి అను శబ్దము ఆ సచ్చిదానందఘనపరబ్రహ్మానే తెలుపును. (8/13).

ప్రశ్న - 'పరమధామము' అనగానేమి? దానితోపాటు అవ్యక్తము, అక్షరము, పరమగతి అని తెలుపుచు దానిని పొందినవారు మరలి రారు-అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - పరమధామము అనగా భగవానుని నిత్యధామము. ఇది సచ్చిదానందమయ దివ్యచేతనుడైన భగవంతుని స్వరూపమే యగుటవలన వాస్తవముగా భగవంతునికంటెను వేరైనది కాదు. కావున ఇచట పరమధామ శబ్దము భగవంతుని నిత్యధామము, అతని స్వరూపము భగవద్భావము - అను ఈ అన్నింటిని తెలుపును. నిత్యధామ ప్రాప్తియన్నను భగవత్స్వరూప ప్రాప్తియన్నను, భగవద్భావ ప్రాప్తియన్నను ఎట్టి భేదమూ లేదు. అట్లే అవ్యక్తాక్షర ప్రాప్తి, పరమగతి ప్రాప్తి, భగవత్ప్రాప్తి అను ఈ మూడింటియందును వస్తుతః ఎట్టి భేదమూ లేదు. దీనిని పొందిన మనుజుడు తిరిగి రాడు. అనగా వానికి పునర్జన్మ ఉండదు. అదియే తన పరమ ధామము అనియు దానినే అవ్యక్తము, అక్షరము, పరమగతి అనియు భగవానుడు తెలిపెను. సాధనాభేదముల వలన సాధకుల దృష్టిలో ఫలమునందు భేదము కనబడును. ఈ కారణము వలన ఒకే ఫలము వేర్వేరు పేర్లతో వ్యవహరింపబడెను.

సంబంధము - ఈ విధముగా సనాతన - అవ్యక్త పురుషునకును, పరమగతి పరమధామములకును ఏకత్వమును నిరూపించి, ఆ సనాతన - అవ్యక్త పరమపురుష ప్రాప్తికి ఉపాయములను తెల్పుచున్నాడు-

**పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।**
**యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ అర్జునా! | | ఘనపరమాత్మచేత | పురుషః తు | = పురుషోత్తముడు |
| భూతాని | = సమస్త భూతములును | ఇదమ్ | = ఈ | | (అనగా సనాతన -అవ్యక్త |
| యస్య, అంతఃస్థాని | = ఏ సచ్చిదానంద ఘన పరమాత్మయందు అంతర్గతములైయున్నవో | సర్వమ్ | = సమస్తమైన జగత్తు | | పరమాత్మ) అయితే |
| | | తతమ్ | = పరిపూర్ణమైయున్నదో | అనన్యయా, భక్త్యా | = అనన్యమైన భక్తితో మాత్రమే |
| | | సః | = ఆ | | |
| యేన | = ఏ సచ్చిదానంద | పరః | = సర్వశ్రేష్ఠుడైన | లభ్యః | = లభ్యుడు (అగును) |

**ఓ పార్థా! సమస్త భూతములు (ప్రాణులు) ఆపరమాత్మయందే అంతర్గతములై యున్నవి. ఆ సచ్చిదానంద ఘనపరమాత్మచేతనే ఈ జగత్తంతయు వ్యాప్తమై (పూర్ణమై) ఉన్నది. అట్టి సనాతన అవ్యక్త పరమ పురుషుడు అనన్యభక్తి ద్వారా మాత్రమే లభ్యుడగును. (22)**

ప్రశ్న - సర్వభూతములును పరమాత్మలో అంతర్గతములు, పరమాత్మతోడనే ఈ జగత్తంతయు పరిపూర్ణమై యున్నది - అను ఈ రెండు వాక్యముల అంతరార్థమేమి?

సమా - వాయువు, తేజస్సు, జలము, పృథ్వి అను నాలుగు భూతములును ఆకాశమునందు అంతర్గతములు. ఆకాశమే వాటికి ఒకే ఒక కారణము, ఆధారము. అట్లే జగత్తంతయు పరమేశ్వరునిలోనే అంతర్గతము. పరమేశ్వరుని నుండియే ఉత్పన్నమై, పరమేశ్వరుని పైననే ఆధారపడి నిల్చియున్నది. కనుక పరమేశ్వరుడే జగత్తునకు కారణము, ఆధారము. వాయువు, తేజస్సు, జలము, పృథ్వి వీటన్నింటియందును ఆకాశము వ్యాప్తమై యున్నది. అట్లే ఈ జగత్తంతయు అవ్యక్త పరమేశ్వరునిచే వ్యాప్తమై యున్నది. ఈ విషయమే 9వ అధ్యాయమునందలి 4,5,6, శ్లోకములలో విస్తృతముగా తెల్పబడినది.

ప్రశ్న - 'పరః, పురుషః' అనగానేమి?

సమా - 'పరః పురుషః' సర్వవ్యాపియైన అధియజ్ఞమును సూచించును. ఈ అధ్యాయము యొక్క 8,9,10వ శ్లోకములయందు వర్ణింపబడిన సగుణ నిరాకార ఉపాసనయు, 20వ శ్లోకమున తెల్పబడిన అవ్యక్త పురుషుని ఉపాసనయు ఒక్కటియే. ఈ ప్రకరణమునందును అతని ఉపాసనను గూర్చియే తెల్పబడినది. ఆ పరమ పురుషుని యందే సమస్త భూతములు స్థితమై యున్నవనియు, అతడే సర్వత్ర వ్యాపించి యున్నాడనియు ఇచట వివరించుట జరిగినది.

ప్రశ్న - 8, 9, 10వ శ్లోకములలో అవ్యక్త పురుషుని ఉపాసనను గూర్చి వివరించబడినది గదా! మరల ఆ విషయమే ఇచట తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ రెండు చోట్లను అవ్యక్త పురుషుని ఉపాసనను గూర్చియే వర్ణించుట జరిగినది. ఇందులో సందేహము లేదు. కాని 8,9,10 శ్లోకములలో యోగిద్వారా చేయబడు అంత్యకాలీన సాధనయొక్క ఫలసహిత వర్ణన గలదు. ఇచ్చట సర్వసాధారణముగ సర్వదా చేయబడు అనన్య భక్తి సాధన, తత్ఫలమైన పరమాత్మ ప్రాప్తి వర్ణనలుగలవు. కనుక ఆ యుపాసనా విషయమే ఇచ్చటయు ప్రస్తావింపబడినది.

ప్రశ్న - అనన్యభక్తి యనగానేమి? దానిద్వారా పరమ పురుషప్రాప్తి కలుగుట యనగానేమి?

సమా - సర్వాధారుడు సర్వాంతర్యామి, సర్వ శక్తిమంతుడు అయిన పరమేశ్వరునియందే సర్వము సమర్పించి, అతని విధానమునందే సదా పరమ సంతుష్టుడై,

అన్ని విధముల అనన్య ప్రేమతో నిత్యము, నిరంతరము భగవంతుని స్మరించు చుండుటయే, 'అనన్యభక్తి' అనబడును. ఈ అనన్య భక్తి ద్వారా సాధకుడు తన ఉపాస్యదైవమైన పరమేశ్వరుని గుణ స్వభావతత్త్వములను చక్కగా నెరింగి, అందు తన్మయుడగును. శీఘ్రముగనే అతనికి సాక్షాత్కారము కలిగి కృతకృత్యుడగును. సాధకునకు పరమేశ్వర ప్రాప్తి కల్గుట యనగా ఇదియే.

*సంబంధము - అర్జునుని 7 ప్రశ్నలకును సమాధానమునిచ్చుచు, అంత్యకాలమున మనుజునకు ఏ విధముగ పరమాత్మ ప్రాప్తి కలుగుననెడి విషయమును భగవానుడు చక్కగా విశదపరచెను. ప్రసంగ వశమున - భగవత్ప్రాప్తి కలుగని జీవులు బ్రహ్మలోకము వరకు చేరినను వారికి జనన మరణ చక్రమునుండి విముక్తి కలుగదని తెల్పెను. కాని పునరావృత్తి రహితమైన పరమ పదమును చేరువారు ఏ మార్గము ద్వారా ఎట్లు వెళ్లుదురు? అట్లే పునరావృత్తి గల లోకములకు వెళ్లెడివారు ఏ మార్గము ద్వారా ఎట్లు వెళ్ళుదురు? అను విషయములను వివరింపలేదు-కనుక ఇప్పుడు ఆ రెండింటిని తెల్పెదనని భగవానుడు ప్రస్తావించుచున్నాడు-*

**యత్ర కాలే త్వనావృత్తిమ్ ఆవృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 23 ॥**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| భరతర్షభ! | = | ఓ అర్జునా! | తు | = | అయితే | యాంతి | = | పొందుదురో |
| యత్ర, కాలే | = | ఏ కాలమునందు | అనావృత్తిమ్ | = | తిరిగిరానిగతిని (చేరుదురో) | తమ్, కాలమ్ | = | ఆ కాలమును అనగా రెండు మార్గములను గూర్చి |
| ప్రయాతాః | = | శరీరత్యాగముచేసి, వెళ్ళిపోవునట్టి | చ | = | మఱియు | | | |
| యోగినః | = | యోగులు | ఆవృత్తిమ్, ఏవ | = | తిరిగి వచ్చుగతినే | వక్ష్యామి | = | చెప్పెదను |

**ఓ భరతశ్రేష్ఠా! ఏ కాలమునందు దేహత్యాగమును చేసిన యోగులు తిరిగిరాని గతిని చేరుదురో, మఱియు ఏకాలమునందు దేహత్యాగము చేసినవారు తిరిగివచ్చు గతిని పొందుదురో అట్టి కాలములను, అనగా రెండు మార్గములను తెలిపెదను.** **(23)**

ప్రశ్న - ఇచట 'కాల' శబ్దమునకు అర్థమేమి?

సమా - ఇచట 'కాలము' అనగా మార్గము-కాలాధిష్ఠానములైన వేర్వేరు దేవతలు ఆయా హద్దుల (సీమల) వరకు అధికారులు.

ప్రశ్న - కాలము అను పదమునకు 'సమయము' అను అర్థమును చెప్పిన దోషమేమి?

సమా - 26వ శ్లోకమునందు దీనినే (ఈ కాలశబ్దమునే) శుక్ల, కృష్ణ అను రెండు విధములైన గతులుగా పేర్కొనుట జరిగినది. 27వ శ్లోకమున కాలము 'సృతి' అను పేరుతో పేర్కొనబడినది. ఈ రెండును (గతి, సృతి) మార్గవాచకములు. ఇంతేగాక 'అగ్నిః, జ్యోతిః, ధూమః' అను పదములు గూడ సమయ వాచకములు గావు. కనుక 24,25 శ్లోకములయందు ప్రయుక్తమైన తత్ర అను పదమునకు అర్థము సమయము అని చెప్పుట సరికాదు. కనుక ఇచ్చట కాలము అను పదమునకు అర్థము కాలాధిదేవతకు (కాలాభిమాన దేవత) సంబంధించిన మార్గము అని చెప్పుట యుక్తము.

ప్రశ్న - అట్లైయినచో ప్రపంచమున జనులు దినమునందు, శుక్లపక్షమునందు, ఉత్తరాయణమునందు మరణించుట మంచిదని యేల తలంతురు?

సమా - జనులు ఇట్లు భావించుట కూడ ఒక విధముగా సమంజసమే. ఏలనన ఆ సమయమున ఆయా కాలాభిమాన (కాలాధిష్ఠాన) దేవతలతో ఆయా కాలములకు వెంటనే సంబంధము కలుగును. కనుక ఆ సమయములయందు చనిపోయిన యోగి గమ్యస్థానము వరకు శీఘ్రముగా సులభముగా చేరును. కాని రాత్రి సమయమున, కృష్ణ పక్షమున దక్షిణాయనమున చనిపోవువారు అర్చి మార్గముద్వారా పోరని భావింపరాదు. ఏ సమయమున

మరణించినను అతడు తన అర్హతననుసరించి, తగిన మార్గముననే గమ్యమునకు కొనిపోబడును. అర్చి మార్గమునకు అర్హత గలవాడు రాత్రి సమయమున మరణించినచో అతనికి దినాధిదేవతతో సంబంధం దిన ప్రారంభముననే కలుగును. అంతవరకును అతడు అగ్ని అభిమానదేవత అధీనములో ఉండును. కృష్ణపక్షములో మరణించినచో అతనికి శుక్ల పక్షాభిమాన దేవతతో సంబంధం శుక్లపక్ష ప్రారంభముననే కలుగును. అంతవరకును అతడు దినాభిమాన దేవత అధికారములోనే ఉండును. అదేవిధముగా దక్షిణాయనమున మృతి చెందినచో అతని ఉత్తరాయణాభిమాన దేవతతో సంబంధం ఉత్తరాయణ ప్రారంభముననే కలుగును. ఈ మధ్య కాలమున అతడు శుక్లపక్షాభిమాన దేవత అధీనములో ఉండును. ఇదేవిధముగ దక్షిణాయన మార్గ–అర్హుల విషయములందు భావింపవలెను.

ప్రశ్న - ఇచ్చట 'యోగినః' అను పదమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - ఈ లోకమునందే ఒక యోనినుండి మరియొక యోనియందు జన్మించువారి గతిని నరకాది లోకములను చేరువారి గతిని గూర్చి ఇచట వర్ణింపబడలేదు. ఇది శుక్ల, కృష్ణ మార్గములకు సంబంధించిన విషయము. యజ్ఞదాన తపశ్చర్యాది శుభకర్మలు, ఉపాసనలు చేయు శ్రేష్ఠపురుషుల గతిని గూర్చియే వర్ణించుట జరిగినది. ఇచట 'యోగినః' అను పదమును ప్రయోగించుటలోని విశేషమిదియే.

ప్రశ్న - 'ప్రయాతాః' అను పదము యొక్క అర్థమేమి? భగవానుడు 'వక్ష్యామి' అను క్రియాపదము ద్వారా చెప్పదలచిన విషయమేమి?

సమా - 'ప్రయాతాః' అను పదము ఇచట మరణించిన వారిని గూర్చి తెలుపును. అందునా అంత్యకాలమున దేహత్యాగము చేసి, ఊర్ధ్వలోకములను చేరువారి విషయమును వర్ణించుటకే 'ప్రయాతాః' అను పదము ప్రయుక్తమైనది. పునరావృత్తిలేని గతిని చేరు యోగులు పయనించు మార్గము పునరావృత్తిని పొందు పుణ్యాత్ములు పొందు మార్గము, ఈ రెండింటి భేదము, ఈ రెండు మార్గములకు అర్హులైన వారి విషయములు, మొదలగు వాటిని గూర్చి చెప్పుచున్నాను – అని 'వక్ష్యామి' అను క్రియాపదము ద్వారా భగవానుడు తెలిపెను.

సంబంధము - యోగులు, పుణ్యాత్ములు మరణానంతరము గమ్యస్థానములకు చేరు రెండు మార్గములను గూర్చి భగవానుడు పూర్వశ్లోకమున ప్రస్తావించియుండెను. యోగులు పునరావృత్తిరహిత పరమపదమును చేరు మార్గమును మొదట వర్ణించుచున్నాడు-

**అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24 ॥**

జ్యోతిః = జ్యోతిర్మయమగు మార్గమునకు
అగ్నిః = అగ్ని - అభిమానదేవత
బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలైన
జనాః = యోగులు
ప్రయాతాః = మృతి చెందినవారై
అహః = పగలు
శుక్లః = 'శుక్లపక్ష'ము
షణ్మాసాః = ఆఱు నెలలుగల
ఉత్తరాయణమ్ = ఉత్తరాయణము
(వీటియొక్కఅభిమానదేవతలుగల)
తత్ర = ఆ మార్గముద్వారా
బ్రహ్మ = పరబ్రహ్మ (పరమపద)మును
గచ్ఛంతి = పొందుచున్నారు

బ్రహ్మవేత్తలైన యోగులు జ్యోతిర్మయమార్గముద్వారా బ్రహ్మపదప్రాప్తి నందుదురు . ఈ జ్యోతిర్మయ మార్గమునకు అధిదేవత అగ్ని. దేహత్యాగము చేసిన ఆ యోగులను క్రమముగా దిన(పగలు)శుక్లపక్ష ఉత్తరాయణ - అభిమాన దేవతలు కొనిపోయి, పరమపదమును చేర్చుదురు.**(24)**

ప్రశ్న - 'జ్యోతిః', అగ్నిః' అను ఈ రెండు పదములు ఏ దేవతను తెల్పును? ఆ దేవత స్వరూపమేమి? ఉక్తమార్గములయందు వానికి ఎంత అధికారము గలదు? ఈ విషయమున అతడు ఏమి చేయును?

సమా - 'జ్యోతిః' అను పదము అగ్నికి విశేషణము - అగ్ని అను పదము అగ్ని అభిమాన దేవత యొక్క పేరు.

ఉపనిషత్తులయందు ఈ దేవతయే 'అర్చిః'అని పిలవబడెను. ఇతని స్వరూపము దివ్యము, ప్రకాశమయము. పృథ్విపై సముద్రములతో సహా అన్ని ప్రదేశములయందును ఇతనికి అధికారము గలదు. ఉత్తరాయణ మార్గమునందు పోవుటకు అర్హులైన వారికి దినాభిమాన దేవతతో సంబంధము ఏర్పరచుటయే ఇతని పని. ఉత్తరాయణ మార్గము ద్వారా వెళ్లుటకు అర్హుడైన ఉపాసకుడు రాత్రియందు శరీర త్యాగము చేసినచో అతనిని రాత్రియంతయు తన అధీనములో నుంచుకొని, ఉదయముననే దినాధిదేవతకు అప్పగించును. పగటియందు మరణించిన వారిని వెంటనే దినాధి దేవతకు అప్పగించును.

ప్రశ్న - 'అహః' అను పదము ఏ దేవతను తెలుపును? అతని స్వరూపమేమి? అతనికి ఎంతవరకు అధికారము గలదు? ఈ విషయమున అతడేమి చేయును?

సమా - 'అహః' అను పదము దినాధి దేవతను సూచించును. ఇతని స్వరూపము అగ్ని అధిదేవతకంటె మిక్కిలి దివ్యము, ప్రకాశవంతము అయినది. భూమండల పర్యంతము అనగా భూమ్యాకాశముల మధ్యగల వాయు మండలమంతయు ఇతని అధికారములో నుండును. ఉత్తరాయణ మార్గమున వెళ్లు ఉపాసకులకు శుక్లపక్షాభిమాన దేవతతో సంబంధమును ఏర్పరచుటయే ఈ దేవత పని. ఉపాసకుడు కృష్ణపక్షమున మరణించినచో అతనిని శుక్లపక్షము వచ్చువరకు తన అధీనములో ఉంచుకొనును. యోగి శుక్లపక్షములో మరణించినచో వెంటనే అతనిని తన సీమ (హద్దు) వరకు కొనిపోయి, శుక్ల పక్షాభిమాన దేవతకు అప్పగించును.

ప్రశ్న - 'శుక్లః' అను పదము ఏ దేవతను సూచించును? అతని స్వరూపమేమి? అతనికి ఎంతవరకు అధికారము గలదు? అతడేమి చేయును?

సమా - 'శుక్లః' అను పదము శుక్లపక్షాభిమాన దేవతను సూచించును. ఇతని స్వరూపము దినాభిమాన దేవతకంటెను మిక్కిలి దివ్యము, ప్రకాశమయము. భూమండల - అవధి దాటి అంతరిక్షలోకమునందు ఇతనికి పూర్తిగా అధికారముగలదు. ఈ లోకము (అంతరిక్షము) నందు పగలు మానవ (భూ) లోకమునందలి 15 దినములకు (రోజులకు) సమానము. అటులే అచటి రాత్రి భూలోకమునందలి 15 దినములకు (రోజులకు) సమానము.

ఉత్తరాయణ మార్గములో వెళ్లుటకు అధికారముగల వారిని తన సీమ (హద్దు)ను దాటించి, ఉత్తరాయణ - అభిమాన దేవతకు అప్పగించుట ఈ దేవత పని. సాధకుడు దక్షిణాయనములో ఇతని అధీనములోనికి వచ్చినచో ఉత్తరాయణమువచ్చు (ప్రారంభము) వరకు తన అధీనములో ఉంచుకొనును. ఒకవేళ ఉత్తరాయణములో తన అధీనములోనికి వచ్చినచో వెంటనే తన సీమను దాటించి ఉత్తరాయణ - అభిమాన దేవతకు అప్పగించును.

ప్రశ్న - 'షణ్మాసా ఉత్తరాయణమ్' అను పదములు ఏ దేవతను సూచించును? అతని స్వరూపమేమి?అతని అధికారము ఎంతవరకు గలదు. అతని పనియేమి?

సమా - సూర్యుడు ఉత్తరదిశయందు ప్రయాణించు ఆరునెలల కాలమును 'ఉత్తరాయణము' అని యుందురు. ఉత్తరాయణ కాలాభిమాన దేవతను తెల్పునవియే - ఈ 'షణ్మాసా ఉత్తరాయణమ్' అను పదములు. ఇతని స్వరూపము శుక్లపక్షాభిమాన దేవతకంటె కూడ ఎక్కువ దివ్యము, ప్రకాశమయము - ఆరు నెలలు పగలు, ఆరునెలలు రాత్రి ఉండు అంతరిక్షమునకు పైనున్న లోకములన్నియు ఇతని అధికారములో నుండును. ఉత్తరాయణ మార్గము ద్వారా పరమధామమునకు చేరుటకు అర్హతగల వారిని తమ సీమ (హద్దు)ను దాటించి, ఉపనిషత్తులలో వర్ణింపబడిన (ఛాందోగ్య 4/15/5, 5/10/1,2, బృహదారణ్యక - 6/2/15) సంవత్సరాభిమాన దేవతకు అప్పగించుట ఈతని పని. సంవత్సరాభిమాన దేవత అతనిని అచ్చటినుండి సూర్యలోకమునకు చేర్చును. అచటినుండి అతడు క్రమముగా ఆదిత్యాభిమాన దేవత, చంద్రాభిమాన దేవత అధీనమునకును పిదప విద్యుత్ - అభిమాన దేవత - అధీనమునకును చేర్చబడును. అచటికి భగవానుని పరంధామమునుండి పారిషదులు వచ్చి, అతనిని ఆ పరంధామమునకు కొనిపోవుదురు. అప్పుడాయోగికి భగవదైక్యము సిద్ధించును. ఇచట పేర్కొనబడిన చంద్రశబ్దము మనకు కనబడు చంద్రలోకమునుగాని, దాని అభిమాన దేవతనుగాని తెలుపదని గ్రహింపవలెను.

ప్రశ్న - 'బ్రహ్మావిదః' అను పదము ఎవరిని సూచించును?

సమా - నిర్గుణ బ్రహ్మతత్త్వమును లేక సగుణ పరమేశ్వరుని యొక్క గుణప్రభావ తత్త్వ స్వరూపములను

శాస్త్రముల మరియు ఆచార్యుల ఉపదేశానుసారము శ్రద్ధాదరములతో పరోక్షభావముతో తెలిసికొను ఉపాసకులను, అట్లే నిష్కామ భావముతో కర్మలను ఆచరించు కర్మయోగులను 'బ్రహ్మవిదః' అను పదము సూచించును. ఇచట 'బ్రహ్మవిదః' అను పదము పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తినందిన జ్ఞానులైన మహాత్ములను సూచింపదు. ఏలనన వారు ఒక స్థానమునుండి మరియొక స్థానమునకు వెళ్లుదురని చెప్పుట సరికాదు. శ్రుతియందును ఇట్లు తెల్పబడినది-

'న తస్య ప్రాణా హ్యుత్క్రామంతి'

*(బృహదారణ్యక-4/4/6)*

'అత్రైవ సమవలీయంతే'

*(బృహదారణ్యక-3/2/11)*

'బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి

*(బృహదారణ్యక-4/4/6)*

అనగా అతని ప్రాణములు, శరీరము మరియొక చోటికి వెళ్లుటలేదు. అవి ఆ శరీరములోనే లీనములగును. అతడు బ్రహ్మమై, బ్రహ్మను పొందును. సగుణ పరమాత్మ సాక్షాత్కారమైన భక్తుడు పైన పేర్కొనబడిన మార్గముద్వారా భగవానుని పరంధామమును గూడ చేరవచ్చును. లేదా భగవత్స్వరూపమునందే లీనము గూడ కావచ్చును. అది అతని ఇష్టముపై ఆధారపడి యున్నది.

ప్రశ్న - ఇచట 'బ్రహ్మము' అనగానేమి? దానిని పొందుట యనగానేమి?

సమా - ఇచట 'బ్రహ్మము' అను పదము సగుణ పరమేశ్వరుని గూర్చి తెల్పును. ఎన్నడును నాశము చెందని నిత్యధామమే అతనిది. దానిని సత్యలోకము, పరమధామము, గోలోకము, సాకేతలోకము, వైకుంఠలోకము, అట్లే బ్రహ్మలోకము - అనియు అందురు. ఇచటికి చేరి భగవంతుని ప్రత్యక్షము చేసికొనుటయే భగవత్ప్రాప్తి యనబడును. ఇచట పేర్కొనబడిన బ్రహ్మలోకము, ఈ అధ్యాయమునందలి 16వ శ్లోకమున వర్ణింపబడిన పునరావర్తియైన బ్రహ్మలోకము కాదని గ్రహింపవలెను.

*సంబంధము - పరమపదమును చేరు యోగులు అనుసరించు (మరల తిరిగిరాని) మార్గమును వర్ణించిన పిదప ఇప్పుడు స్వర్గాది లోకములను చేరు పుణ్యాత్ములు అనుసరించు (పునరావృత్తి) మార్గమును వర్ణించుచున్నాడు-*

**ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25 ॥**

ధూమః = ధూమాభిమాన దేవత
రాత్రి = రాత్రి అభిమానదేవత
తథా = అట్లే
కృష్ణః = కృష్ణపక్ష-అభిమానదేవత
దక్షిణాయనమ్ = దక్షిణాయనము యొక్క
షణ్మాసాః = ఆఱుమాసముల అభిమానదేవత
తత్ర = ఈ దేవతల ద్వారా ఆ మార్గమున (ధూమమార్గమున)
యోగీ = సకామకర్మలను ఆచరించుయోగి (పైన పేర్కొనబడిన అభిమాన దేవతలద్వారా కొనిపోబడినవాడై)
చాంద్రమసమ్, జ్యోతిః = చాంద్రమసజ్యోతిని
ప్రాప్య = పొంది (స్వర్గలోకాది ఫలములను అనుభవించి)
నివర్తతే = తిరిగి భూలోకమునకు చేరును

అట్లే సకామకర్మయోగులు ధూమ్రమార్గముద్వారా స్వర్గాదిలోకములను చేరుదురు. దేహత్యాగము చేసిన ఈ సకామకర్మయోగులను క్రమముగా రాత్రి, కృష్ణపక్ష, దక్షిణాయన - అభిమానదేవతలు కొనిపోయి, స్వర్గాదిలోకములను చేర్చుదురు. వారు అచట చాంద్రమసజ్యోతిని పొంది, అనగా తమశుభకర్మ ఫలములను అనుభవించి, తిరిగి భూలోకమును చేరుదురు. **(25)**

ప్రశ్న - 'ధూమః' అను పదము ఏ దేవతను సూచించును? దాని స్వరూపమేమి? దాని అధికారము ఎంత వరకు గలదు? అదియేమి చేయును?

సమా - 'ధూమః' అను పదము 'ధూమాభిమాన దేవత-అనగా అంధకార - అధిష్ఠాన దేవతను తెలుపును. దాని స్వరూపము అంధకారమయము. అగ్ని అభిమాన దేవత వలెనే దీని అధికారము గూడ సముద్రసహితముగా భూమండలము నందలి అన్ని ప్రదేశములయందును కలదు. దక్షిణాయన మార్గములో వెళ్ళు సాధకులను రాత్రి అభిమాన దేవత కడకు చేర్చుట దీని పని. దక్షిణాయన మార్గములో వెళ్ళు సాధకులు పగటికాలమునందు మరణించినచో వారిని పగలంతయు తన ఆధీనములో ఉంచుకొని రాత్రి ఆరంభమున రాత్రి అభిమాన దేవతకు అప్పగించును. రాత్రి కాలమున చనిపోయిన వారిని వెంటనే రాత్రి అభిమాన దేవత ఆధీనమునకు చేర్చును.

ప్రశ్న - 'రాత్రిః' అను పదము దేనిని తెల్పును? దాని స్వరూపమేమి? దాని అధికారము ఎంత వరకు? దాని పనియేమి?

సమా - రాత్రిః యను పదము రాత్రి అభిమాన దేవతను సూచించును. దీని స్వరూపము అంధకారమయము. దినాభిమాన దేవత వలె దీని అధికారము గూడ పృథ్వియంతయు ఉండును. కాని భూలోకమున పగటి కాలమున దినాభిమాన దేవత అధికారమును, రాత్రికాలమున రాత్రి అభిమాన దేవత అధికారమును కలిగియుండును. ఇంతే భేదము. దక్షిణాయన మార్గము ద్వారా వెళ్ళు సాధకులను పృథ్వీలోకము యొక్క చివరి అంచువరకు చేర్చి, అంతరిక్షమున కృష్ణ పక్షాభిమాన దేవతకు అప్పగించుట దీని పని. సాధకుడు శుక్లపక్షమున మరణించినచో ఇది అతనిని కృష్ణపక్షము వచ్చువరకు తన అధీనములో ఉంచుకొనును. కృష్ణ పక్షములో మరణించిన సాధకుని వెంటనే కృష్ణపక్షాభిమాన దేవతకు అప్పగించును.

ప్రశ్న - 'కృష్ణః' అను పదము దేనిని సూచించును? దాని స్వరూపమేమి? దాని అధికారమెంత వరకు? దాని పనియేమి?

సమా - 'కృష్ణః' అనుపదము కృష్ణపక్షాభిమాన దేవతను తెల్పును. దీని స్వరూపముగూడ అంధకారమయమే. భూమండల సీమకు (హద్దుకు) ఆవల అంతరిక్షలోకములందు దీనికిని అధికారము గలదు. భూలోకమున 15 దినముల కాలము అచటి ఒక పగటికాల ప్రమాణము తోడను, మరియొక 15 దినముల కాలము అచటి రాత్రికాల ప్రమాణముతోడను సమానము. అయితే ఆ లోకమున శుక్లపక్షమున శుక్ల పక్షాభిమానదేవత అధికారమును, కృష్ణపక్షమున కృష్ణపక్షాభిమాన దేవతఅధికారమును ఉండును. దక్షిణాయన మార్గము ద్వారా వెళ్ళు సాధకులను దక్షిణాయనాభిమాన దేవతకు అప్పగించుట దీని పని. అట్టి సాధకుడు ఉత్తరాయణ సమయమున ఈ దేవత అధీనములో ఉండును. వానిని దక్షిణాయనము వచ్చు వరకు తన అధీనములో ఉంచుకొని దక్షిణాయనాభిమాన దేవతకు అప్పగించును. దక్షిణాయనమున వచ్చు వారిని వెంటనే తన సీమను దాటించి దక్షిణాయన అభిమాన దేవతకు చేర్చును.

ప్రశ్న - 'షణ్మాసా దక్షిణాయనమ్' అను పదములు ఏ దేవతను సూచించును? ఆ దేవత స్వరూపమేమి? దాని అధికారము ఎంతవరకు గలదు. దాని పనియేమి?

సమా - సూర్యుడు దక్షిణ దిశగా పయనించు ఆరు మాసముల కాలమును దక్షిణాయనము అందురు. దాని అభిమాన దేవతను సూచించునదియే 'దక్షిణాయనము' అను పదము. దీని స్వరూపము గూడ అంధకారమయము. అంతరిక్షలోకములకు పైన ఆరునెలలు పగలు, ఆరునెలలు రాత్రి ఉండు లోకములయందు దీని అధికారముండును. భేదమేమనగా ఉత్తరాయణమునందు ఆ అభిమాన దేవత అధికారమూ, దక్షిణాయనమునందు దక్షిణాయన అభిమాన దేవత అధికారమూ నడుచుచుండును. దక్షిణాయన మార్గము ద్వారా స్వర్గమునకు వెళ్లు సాధకులను తన అధికార సీమ (హద్దు)ను దాటించి, ఉపనిషత్తులలో వర్ణింపబడిన పితృలోకాభిమాన దేవతకు అప్పగించుటయే ఈ దేవత పని. పితృలోకాభిమాన దేవత సాధకుని ఆకాశాభిమాన దేవత యొద్దకు కొనిపోవును. అతనిని ఆకాశాభిమాన దేవత చంద్రలోకమునకు చేర్చును. (ఛాందోగ్యము 5/10/4, బృహదారణ్యకం 6/2/16). ఇచట చంద్రలోకము ఉపలక్షణము మాత్రమే. కనుక బ్రహ్మలోక పర్యంతము పునరాగమన శీలములైన లోకములన్నియును ఈ చంద్రలోకమువంటివానిగనే భావింపవలెను.

ఉపనిషత్తులలో వర్ణింపబడిన ఈ పితృలోకము 15 దినములు పగలు, 15 దినములు రాత్రిగాగల అంతరిక్ష - అంతర్గతమైన పితృలోకము కాదని భావింపవలెను

ప్రశ్న - దక్షిణాయన మార్గము ద్వారా వెళ్లువానిని 'యోగి' అని పేర్కొనుటకు కారణమేమి?

సమా - స్వర్గాది లోకముల ప్రాప్తికై పుణ్యకర్మల నాచరించు పురుషుడు కూడ తన ఐహిక భోగప్రవృత్తిని నిరోధించును. ఈ దృష్టితో అతనిని గూడ 'యోగి' అనుట సమంజసమే. అంతేగాక యోగభ్రష్టులైనవారు గూడ ఈ మార్గము ద్వారా స్వర్గమునకు వెళ్లి, అక్కడ కొంతకాలము నివసించి తిరిగి వత్తురు. ఈ మార్గము ద్వారా వెళ్ళువారిలో వీరుగూడ (యోగభ్రష్టులు గూడ) కలరు. పాప కర్మలనాచరించు తామసులు ఈ మార్గము ద్వారా వెళ్ళరని తెలుపుటకు గూడ యోగియను శబ్దము ప్రయుక్తమైనది. ఈ మార్గము శాస్త్రోక్త కర్మల నాచరించి, ఊర్ధ్వలోకముల ప్రాప్తికి అర్హతగలవారికే ఉద్దేశింపబడినది (2/42,43,44, 9/20,21 మొదలగు-).

ప్రశ్న - దక్షిణాయన మార్గము ద్వారా వెళ్లు సాధకులకు ప్రాప్తించు చంద్రజ్యోతి (చాంద్రమసజ్యోతి) ఏది? దానిని పొందుట అనగానేమి?

సమా - చంద్రలోకమునందు దాని అభిమాన దేవత స్వరూపము శీతలము, ప్రకాశమయము. అట్టి ప్రకాశమయ స్వరూపమునే 'జ్యోతి' అని యందురు. అట్టి స్వరూపమును పొందుటయే చంద్రజ్యోతిని పొందుట యగును. అచట చేరిన సాధకుడు ఆ లోకమునందు శీతలము, ప్రకాశమయమునై దివ్య శరీరమును పొంది తన పుణ్యకర్మల ఫలస్వరూపములైన దివ్యభోగములను అనుభవించును.

ప్రశ్న - ఉపర్యుక్త చంద్రజ్యోతిని పొంది, తిరిగి వచ్చుట యనగానేమి? సాధకుడు అచటినుండి ఏ మార్గము ద్వారా ఏ విధముగా తిరిగివచ్చును?

సమా - అచట ఉండుటకు నియమిత సమయము సమాప్తము ఐనంతనే ఈ మృత్యులోకమునకు ఆ సాధకుడు తిరిగి వచ్చును. సాధకులు తాము ఆచరించిన కర్మల ఫలస్వరూపములైన స్వర్గమును, స్వర్గసుఖములను పొందుదురు. ఆ భోగములు అనుభవించినప్పుడు అతని పుణ్యకర్మల ఫలములు క్షీణించును. అపుడు ప్రాణులు ఈ భూలోకమునకు తిరిగి రావలసియే యుండును. చంద్రలోకమునుండి అతడు ఆకాశమున ప్రవేశించి, వాయురూపమును పొంది, ధూమాకారమున పరిణతి చెందును. ధూమమునుండి ఆవిరిగా, ఆ పిమ్మట మేఘముగ, తదనంతరము జలరూపములో భూమికి చేరును. అచట గోధుమలు, జొన్నలు, తిలలు, మినుములు మొదలగు బీజములయందుగాని, వనస్పతుల యందుగాని ప్రవేశించును. వాటిద్వారా పురుషుని వీర్యమునందు ప్రవేశించి, స్త్రీ యోనిలో చేరును. తన పూర్వకర్మానుసారము అర్హమగు యోనిని పొంది మరల జన్మించును. (ఛాందోగ్యము - 5/10/5,6,7, బృహదారణ్యకం - 6/2/16).

**సంబంధము** - ఈ విధముగా ఉత్తరాయణ దక్షిణాయన మార్గములను వర్ణించి, ఆ రెండును సనాతన మార్గములేయని తెల్పుచు ఈ విషయమును ముగించుచున్నాడు-

**శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।**
**ఏకయా యాత్యనావృత్తిమ్ అన్యయావర్తతే పునః ॥ 26 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | మతే | = భావింపబడుచున్నవి | అన్యయా | = మఱియొకదాని (పితృయానమార్గము) ద్వారా వెళ్ళువాడు అయితే |
| జగతః | = జగత్తులోని | ఏకయా | = ఒకదాని (దేవయాన మార్గము) ద్వారా వెళ్ళువాడు | | |
| ఏతే | = ఈరెండు విధములైన | | | | |
| శుక్లకృష్ణే, గతీ | = శుక్లకృష్ణమార్గములు, లేక దేవయాన పితృయాన మార్గములు | అనావృత్తిమ్ | = తిరిగి రాని స్థితిని (పరమగతిని) | పునః,ఆవర్తతే | = తిరిగి వచ్చును (జనన మరణ చక్రములో పడును) |
| శాశ్వతే | = సనాతనములైనవిగా | యాతి | = పొందును | | |

ఈ రెండు మార్గములకును శుక్ల, కృష్ణమార్గములనియు లేక దేవయాన పితృయాన మార్గములనియు వ్యవహారప్రసిద్ధి గలదు. ఇవి సనాతనములు. దేవయాన మార్గమున వెళ్లువారు పరమగతిని పొంది తిరిగిరారు. పితృయానమార్గమున వెళ్ళువారు తిరిగివచ్చి జననమరణచక్రములో పడుదురు. **(26)**

ప్రశ్న - 'జగతః' అను పదము దేనిని సూచించును? ఈ రెండు మార్గములతో దానికి గల సంబంధమేమి? ఈ రెండు మార్గములును శాశ్వతములైనవి అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - ఊర్ధ్వ, అధోలోకములయందు సంచరించు సమస్తచరాచర ప్రాణులను 'జగతః' అను పదము సూచించును. ఏలనన ప్రాణులన్నియును అర్హతను పొందినప్పుడు ఈ రెండు మార్గముల ద్వారా గమనము సాగింపగలవు. **84** లక్షల జీవరాసుల యోనులలో తిరుగుచుండు జీవులకు ఎప్పుడో ఒకప్పుడు భగవంతుడు దయదలచి, మానవ జన్మను ప్రసాదించి, భగవత్ప్రాప్తికిని, దివ్యలోకములను చేరుటకును సదవకాశమును కల్పించును. ఆ సమయమున మానవుడు తన జీవితమును సదుపయోగమును చేసికొన్నచో పైరెండింటిలో ఏదో యొక మార్గము ద్వారా గమ్యస్థానమును అవశ్యముగా పొందగలడు. కావున ప్రకారాంతరమున సమస్త ప్రాణులకును ఈ రెండు మార్గములతో సంబంధము ఉండును. ఈ రెండు మార్గములును సమస్త ప్రాణుల ఉపయోగార్థము ఎప్పటినుండియో కొనసాగుచువచ్చుచున్నవి. కొనసాగు చుండును గూడ. కనుక ఇవి శాశ్వతమైనవి అని తెల్పబడినవి. మహా ప్రళయకాలమునందు సమస్త లోకములును భగవంతునియందు లీనమైనప్పుడు ఈ మార్గములు, వాటి అభిమాన దేవతలు గూడ అందే లీనమగుదురు. అయినప్పటికి పునఃసృష్టి జరిగినప్పుడు ఎప్పటివలెనే వాటి నిర్మాణము గూడ జరుగును. కనుక ఇవి శాశ్వతములనుటలో ఎట్టి దోషమూ లేదు.

ప్రశ్న - ఈ రెండు మార్గములను శుక్ల, కృష్ణములని వ్యవహరించుటలోని విశేషమేమి?

సమా - పరమేశ్వరుని పరమధామమును చేరు మార్గము ప్రకాశమయము, దివ్యము. దాని అధిష్ఠాతృ దేవతలందరును ప్రకాశసమంచితులు, ఆ మార్గమున వెళ్లువారి అంతః కరణములు గూడ సర్వదా జ్ఞానముతో ప్రకాశించుచుండును. కనుక ఇది శుక్లమార్గముగ పేర్కొనబడినది. బ్రహ్మలోకము వరకు గల సమస్త దివ్యలోకములను చేరుమార్గము శుక్లమార్గమువలె ప్రకాశమయమైనది గాక, అంధకారమయమైనది. దాని అధిష్ఠాతృ దేవతలు గూడ అంధకారస్వరూపులు. ఆ మార్గమున వెళ్లువారు గూడ అజ్ఞానముచే మోహితులు. కావున దానిని కృష్ణమార్గము అని వ్యవహరించుట జరిగినది.

ప్రశ్న - 'అనావృత్తి' అనగానేమి? ఆ పదప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - భగవంతుని పరంధామమును 'అనావృత్తి పదము' అని యందురు. ఏలనన అచటికి చేరిన సాధకులు తిరిగి రారు. **24**వ శ్లోకమునందు శుక్లమార్గమున వెళ్లినవారికి బ్రహ్మప్రాప్తి (భగవత్ప్రాప్తి) కల్గునని తెల్పబడినది. భగవత్ప్రాప్తి కల్గిన పిమ్మట మనుజులకు పునర్జన్మ యుండదు. అందువలన దానిని 'అనావృత్తి పదము' అనియు అందురు. ఆ విషయమును స్పష్టపరచుటకే 'అనావృత్తి' శబ్దము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'పునః ఆవర్తతే' అనగానేమి?

సమా - కృష్ణ మార్గము ద్వారా ప్రాప్తించు లోకము లన్నియును పునరావృత్తిశీలములని తెలుపుటకు 'పునః ఆవర్తతే' అను పదములు ప్రయోగింపబడినవి. కృష్ణమార్గము ద్వారా వెళ్లిన మనుష్యులు చేరు లోకములన్నియును నశ్వరములే. కనుక ఈ మార్గము ద్వారా వెళ్లినవారు తిరిగి మృత్యు (మానవ) లోకమునకు రావలసి యుండును.

*సంబంధము - ఈ రెండింటి ద్వారా వెళ్ళుటకు అర్హులైన యోగులను ప్రశంసించుచు, అర్జునుని యోగివికమ్మని భగవానుడు తెలుపుచున్నాడు-*

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ 27 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = అర్జునా! | న, ముహ్యతి | = మోహితుడుకాడు | యోగయుక్తః | = (నీవు) సమబుద్ధి రూపయోగయుక్తుడవు |
| ఏతే | = ఈ రెండు | తస్మాత్ | = అందువలన | భవ | = కమ్ము (నిరంతరము నన్నే పొందుటకు యత్నింపుము) |
| సృతీ | = మార్గములను | అర్జున! | = ఓ అర్జునా! | | |
| జానన్ | = తెలిసికొనిన | సర్వేషు,కాలేషు | = సర్వకాలముల యందును | | |
| కశ్చన, యోగీ | = ఏ యోగియు | | | | |

**ఓ పార్థా! ఈ విధముగా ఈ రెండు మార్గములతత్త్వములను తెలిసికొన్నయోగి మోహితుడు కాడు. కావున అన్నికాలముల యందును సమత్వబుద్ధిరూపయోగ యుక్తుడవు కమ్ము. అనగా నిరంతరము నన్నే పొందుటకు ప్రయత్నింపుము. (27)**

ప్రశ్న - ఇచ్చట 'ఏతే' అను విశేషణముతోపాటు 'సృతీ' అను పదము దేనిని తెల్పును? మరియు దానిని తెలిసికొనుట యనగానేమి?

సమా - పూర్వశ్లోకములందు వివరింపబడిన రెండు మార్గములను 'ఏతే' విశేషణముతోపాటు 'సృతీ' అను పదము తెలుపుచున్నది. సకామ భావముతో శుభకర్మాచరణమును, దేవతోపాసనను చేయు పుణ్యాత్ములు 'కృష్ణమార్గము' ద్వారా తమ కర్మానుసారము దివ్యలోకములను చేరి, పుణ్య క్షయము కాగానే (భోగానుభవములతో పుణ్యక్షయము కాగానే) అచటినుండి తిరిగి వత్తురు. (9/20,21) నిష్కామ భావముతో కర్మోపాసన చేయు కర్మయోగులును, అట్లే కర్తృత్వాభిమానమును వీడిన సాంఖ్య యోగులును (ఉభయులును) శుక్లమార్గము ద్వారా భగవంతుని పరమధామమును చేరుదురు. వారు అచటినుండి ఎన్నడును తిరిగిరారు. ఈ విషయమును శ్రద్ధగా విశ్వాసముతో చక్కగా తెలిసికొనుటయే ఈ రెండు మార్గముల తత్త్వములను తెలిసికొనుట యగును.

ప్రశ్న - ఇచట 'యోగీ' అను పదమునకు అర్థమేమి? 'కశ్చన' అను విశేషణము యొక్క ప్రత్యేకత ఏమి? అతడు మోహితుడు కాడు అనగానేమి?

సమా - పరమేశ్వరప్రాప్తికై, కర్మయోగము, ధ్యానయోగము, భక్తియోగము, జ్ఞానయోగము మొదలగు పెక్కు ఉపాయములు తెల్పబడినవి. వాటిని అనుష్ఠించుటకు ప్రయత్నించు సాధకులందరును యోగులనబడుదురు. వారిలో పైన పేర్కొనబడిన రెండు మార్గముల తత్త్వములను ఎరింగిన ఏ ఒక్కడును మోహితుడు కాడు. ఈ విషయమును స్పష్టము చేయుటకే 'కశ్చన' అను పదము ప్రయోగింపబడినది. ఈ మార్గముల తత్త్వములను పూర్తిగా ఎరుంగని కారణమున ఇహపరలోక భోగములయందు ఆసక్తుడై సాధకుడు సాధనమునుండి భ్రష్టుడగును. అతడు మోహితుడగుట యనగా ఇదియే. ఈ రెండుమార్గముల తత్త్వములను తెలిసికొనినవాడు బ్రహ్మలోకపర్యంతము సమస్తలోకముల యందలి భోగములును నశ్వరములు, తుచ్ఛములు అని గ్రహించును. అతడు ఏ విధముగను ఆ భోగముల యందు ఆసక్తుడు గాక నిరంతరము పరమేశ్వరప్రాప్తికై సాధన చేయుచునే యుండును. సాధకుడు మోహితుడు కాకుండుట యనగా ఇదియే.

ప్రశ్న - 'తస్మాత్' అను పదప్రయోగము యొక్క విశేషమేమి? అన్ని సమయములయందును యోగయుక్తుడవు కమ్మని అర్జునునితో చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవత్ప్రాప్తి సాధనారూపయోగము మిక్కిలి మహిమాన్వితమైనది. దానితో యుక్తుడైన యోగి రెండు మార్గముల తత్త్వములను చక్కగా ఎరుంగును. ఆ కారణమున అతడేవిధముగను భోగములయందు ఆసక్తుడును గాడు. మోహితుడును గాడు. కనుక అర్జునుడు గూడ సర్వదా యోగయుక్తుడై కేవలము భగవత్ప్రీతి కొరకే నిరంతరము భక్తి ప్రధాన కర్మయోగమునందు శ్రద్ధగా తత్పరుడై యుండవలెనని తెల్పుటకై భగవానుడు 'తస్మాత్' అను పదమును ప్రయోగించెను. ఈ అధ్యాయమునందలి 7వ శ్లోకమున గూడ భగవానుడు ఈ విధముగనే ఆదేశించెను. ఏలనన అర్జునుడు ఈ యోగమునకే అర్హుడు. అనగా భక్తి ప్రధాన కర్మయోగమునకే అర్హుడు.

మానవ జీవితము క్షణభంగురము.మృత్యువు ఎప్పుడు కబళించునో ఎవ్వరికిని తెలియదు. ఈ జీవితకాలమున ప్రతిక్షణమును సాధనయందే లగ్నము చేయుటకు ప్రయత్నింపనిచో సాధన కుంటుపడుచుండును. సాధన

కొనసాగని (ఆగిన) కాలమున మృత్యువు వచ్చిపడినచో యోగభ్రష్టుడై మరల జన్మింపవలసివచ్చును. కావున మనుష్యుడు భగవత్ప్రాప్తి సాధనయందు నిత్యము, నిరంతరము నిమగ్నుడై ఉండవలెను. ఈ విషయమును స్పష్టపరచుటకే సర్వకాలముల యందును యోగయుక్తుడవు కమ్మని భగవానుడు అర్జునుని ఆదేశించెను.

*సంబంధము - యోగయుక్తుడవు కమ్మని భగవానుడు అర్జునుని ఆదేశించెను. ఇప్పుడు యోగయుక్తుడైన వాని మహాత్మ్యమును, ఈ అధ్యాయమునందు వర్ణింపబడిన రహస్యమును తెలిసికొని దానిననుసరించి సాధన చేయుటవలన కలుగు ఫలమును తెలుపుచు ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-*

**వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ 28 ॥**

| పదము | అర్థము |
|---|---|
| యోగీ | = యోగియైన పురుషుడు |
| ఇదమ్ | = ఈ తత్త్వరహస్యమును |
| విదిత్వా | = తెలిసికొని |
| వేదేషు | = వేద(పఠన)ముల యందును |
| చ | = మఱియు |
| యజ్ఞేషు | = యజ్ఞముల (చేయుట) యందును |
| తపస్సు | = తపస్సుల (ఆచరించుట) యందును |
| దానేషు | = దానముల (చేయుట) యందును |
| యత్ | ఏ |
| పుణ్యఫలమ్ | = పుణ్యఫలము |
| ప్రదిష్టమ్ | = చెప్పబడినదో |
| తత్, సర్వమ్ | = ఆ సమస్త ఫలమును |
| ఏవ | = నిస్సందేహముగా |
| అత్యేతి | = అధిగమించును |
| చ | = మఱియు |
| ఆద్యమ్ | = సనాతనమైన |
| పరమ్, స్థానమ్ | = పరమపదమును |
| ఉపైతి | = పొందును |

**ఈ తత్త్వరహస్యమును ఎఱిగిన యోగి వేదపఠనమువలనను, యజ్ఞదాన తపశ్చర్యాదులవలనను కలుగు పుణ్యఫలమును త్రోసిరాజని నిస్సందేహముగా సనాతనపరమపదమును చేరును. (28)**

ప్రశ్న - ఇచట 'యోగి' శబ్దమునకు అర్థమేమి?

సమా - భగవత్ప్రాప్తికై పేర్కొనబడిన వివిధ సాధనలలో ఏ ఒక్కదానియందైనను భక్తిశ్రద్ధలతో నిరంతరము నిమగ్నుడై యుండు పురుషుని 'యోగి' అని అందురు.

ప్రశ్న - 'ఇదమ్' అను పదము దేనిని తెల్పును? దాని తత్త్వమును తెలిసికొనుట యనగానేమి?

సమా - ఈ అధ్యాయమున వివరింపబడిన సమస్త ఉపదేశమును 'ఇదమ్' అను పదము తెలుపును. ఈ యధ్యాయమున భగవంతుని యొక్క సగుణ నిర్గుణ, సాకార నిరాకార స్వరూపముల ఉపాసనలు, భగవంతుని యొక్క గుణప్రభావ మహత్త్వములు, పరమాత్మ ప్రాప్తికై మనుష్యుడు చేయదగు సాధనలు, పునరావృత్తిని గల్గించు లోకములు, పునరావృత్తిని (పునర్జన్మను) కల్గింపని పరమధామము- ఈ మొదలైన విషయములన్నియును తెల్పబడినవి. వీటినన్నింటిని చక్కగా తెలిసికొనుటయే వీటి తత్త్వమును తెలిసికొనుట యగును.

ప్రశ్న - ఇచ్చట ప్రయుక్తములైన వేదములు, యజ్ఞములు, తపస్సులు, దానములు-అను పదములకు అర్థములేవి? వాటి పుణ్యఫలములేమి? వాటిని ఉల్లంఘించుట యనగానేమి?

సమా - వేదములనగా షడంగములతో కూడిన చతుర్వేదములు, వాటికి సంబంధించిన శాస్త్రములు. యజ్ఞములనగా శాస్త్ర విహితములైన పూజలు, హోమములు మొదలగు అన్ని విధములైన యజ్ఞములు. తపస్సులు, వ్రతములు, ఉపవాసములు, ఇంద్రియ సంయమము, స్వధర్మపాలనయు మొదలగునవి అన్నియును శాస్త్ర సమ్మతములైన తపస్సులు. అన్నదానము, విద్యాదానము, క్షేత్రదానము మొదలగునవి అన్నియును శాస్త్రవిహితములైన దానములు.

భక్తిశ్రద్ధలతో సకామభావముతో వేదశాస్త్రముల స్వాధ్యాయము, అట్లే యజ్ఞ, దాన, తపశ్చర్యాది సత్కర్మల అనుష్ఠానము చేయుటచే పుణ్యసంచయము జరుగును. వాటివలన బ్రహ్మలోక పర్యంతము వేర్వేరుగా

దేవలోకములును, అచటి భోగములు ప్రాప్తించునని వేదశాస్త్రములయందు తెల్పబడినవి. ఇవియే వాటి పుణ్యఫలములు.

ఈ లోకములు, అందలి భోగములు క్షణభంగురములు, అనిత్యములు అని భావించి, వాటియందు ఆసక్తిని వీడి, సర్వథా, వాటికి దూరముగా ఉండి, నిత్యసత్యమైన పరమపదప్రాప్తికి ప్రయత్నించుటయే ఆ పుణ్యఫలములను ఉల్లంఘించుట యగును.

ప్రశ్న - 'ఆద్యమ్', 'పరమ్' అను విశేషణములతో పాటు 'స్థానమ్' అను పదము దేనిని సూచించును? దానిని పొందుట అనగానేమి?

సమా - ఈ అధ్యాయమున తెల్పబడినట్లు భగవానుని పరంధామమును చేరిన వాడు మరల ఈ సంసార చక్రములో పడడు. ఆ పరంధామము అన్నిటికిని ఆద్యము. అన్నింటి కంటెను పరమమైనది శ్రేష్ఠమైనది. దీనినే ఇచట 'పరమ్' 'ఆద్యమ్' అను విశేషణములతోపాటు 'స్థానమ్' అను పదము తెల్పును. దాని తత్త్వమును తెలిసికొని దానిని చేరుటయే 'తత్పదప్రాప్తి' అనబడును. దీనినే పరమగతి ప్రాప్తి, దివ్యపురుష ప్రాప్తి, పరమపద ప్రాప్తి, భగవద్భావప్రాప్తి అనియును అందురు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః ॥ ౮ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

## తొమ్మిదవ అధ్యాయము - రాజవిద్యా రాజగుహ్య యోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు చేయబడిన ఉపదేశము సమస్త విద్యలకు రాజనియు, (అనగా శ్రేష్ఠమయినదనియు), అతి గోప్యమైనదనియు భగవానుడు తెలిపెను. కనుక ఈ అధ్యాయనామము 'రాజవిద్యా రాజగుహ్య యోగము' అని పేర్కొనబడినది.

**అధ్యాయసారాంశము :** ఈ అధ్యాయమునందలి 1,2, శ్లోకములలో విజ్ఞాన సహిత జ్ఞానమును మరల ఉపదేశించెదనని భగవానుడు ప్రతిజ్ఞచేసి, దాని మహత్త్వమును తెలిపెను. ఈ ఉపదేశమునందు శ్రద్ధలేనివారికి జననమరణ రూపసంసార బంధప్రాప్తి తప్పదని 3వ శ్లోకమున తెలిపెను. 4 నుండి 6వ శ్లోకము వరకు నిరాకార రూపుడైన భగవంతుని వ్యాపకత్వమును నిర్లిప్తతను వర్ణించుచు, భగవంతుని దివ్యయోగశక్తిని సూచించుచు, ఆ స్వరూపమునందు సమస్త ప్రాణులు ఆకాశమునందు వాయువువలె స్థితులై యున్నట్లు తెలిపెను. తదనంతరము మహాప్రలయసమయమున ప్రాణులన్నియును భగవంతుని ప్రకృతియందు లయమగుట, కల్పాది యందు మరల ప్రకృతి ద్వారా వాటి సృష్టి భగవంతుని అధ్యక్షతన జరుగుచుండుట, ఈ కర్మలను చేయుచున్నను భగవానుడు వాటి యెడ నిర్లిప్తుడుగా నుండుట - ఈ మొదలగు విషయములన్నియును 7నుండి 10వ శ్లోకము వరకు వర్ణింపబడెను. భగవంతుని ప్రభావమును ఎరుంగని కారణమున ఆయనను ఉపేక్షించువారిని 11,12 శ్లోకములలో విమర్శించుచు, భగవత్ప్రభావమును ఎరిగిన అనన్య భక్తుల సేవారీతులను 13,14వ శ్లోకములలో ప్రశంసించెను. ఏకత్వ భావముతో జ్ఞానయజ్ఞము ద్వారా బ్రహ్మోపాసన చేయు జ్ఞానయోగులను, అట్లే విశ్వరూప పరమేశ్వరుని ఉపాసించువారిని గూర్చి 15వ శ్లోకములో ప్రస్తావించెను. అనంతరము 16 నుండి 19వ శ్లోకము వరకు భగవానుడు గుణప్రభావవిభూతిసహితమైన తన స్వరూపమును వర్ణించుచు, వ్యక్తావ్యక్త స్థితియందును జగత్తు తన రూపమే అని తెల్పెను. స్వర్గ భోగములకై యజ్ఞాది కర్మల నాచరించువారికి పునర్జన్మ తప్పదని 20, 21వ శ్లోకములలో వివరించెను. నిష్కామ భావముతో నిత్యమూ, నిరంతరమూ తనను చింతనచేయు భక్తుల యోగక్షేమములను తానే వహించెదనని 22వ శ్లోకమున ప్రతిజ్ఞ చేసెను. అన్యదేవతల ఉపాసన కూడ ఒక విధముగ తనను ఉపాసించుట వంటిదే యనియు, కాని అది శాస్త్ర విహితము కాదనియు, భగవత్తత్త్వమును ఎరుంగక అన్యదేవతలను ఉపాసించుటవలన కలుగు ఫలితము అన్యదేవతాప్రాప్తియేయనియు తనను ఉపాసించిన వారికే భగవత్ప్రాప్తి యనియు 23,24,25వ శ్లోకములలో వివరించెను. 26వ శ్లోకమునందు భగవద్భక్తి మార్గసౌలభ్యమును గూర్చి తెల్పెను. సమస్త కర్మలను భగవదర్పణ గావింపుమని 27వ శ్లోకమున అర్జునుని ఆదేశించుచు, తత్ఫలము భగవత్ప్రాప్తియేయని 28వ శ్లోకమున తెలిపెను. సమస్త ప్రాణులయెడ తన సమభావమును 29వ శ్లోకమున వివరించెను. మిక్కిలి దురాచారుడైనను అనన్యభక్తితో భగవంతుని సేవించిన వాడెన్నడును నష్టమునకు గురికాడు - అని 30,31వ శ్లోకములలో నుడివెను. 32వ శ్లోకమున తనను శరణు జొచ్చినవారు స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, చండాలాదులైనను పరమగతిని పొందుదురని తెలిపెను. పుణ్యాత్ములైన బ్రాహ్మణులు, రాజర్షులు మొదలగు భక్తుల మహత్త్వమును గూర్చి తెలుపుచు, శరీరము అనిత్యమనియు, కనుక తనను శరణుపొందు మనియు 33,34వ శ్లోకములలో అర్జునుని ఆదేశించి, శరణాగతి స్వరూపమును దెలుపుచు భగవానుడు ఈ అధ్యాయమును ముగించెను.

**సంబంధము** - 7వ అధ్యాయ ప్రారంభమున భగవానుడు విజ్ఞాన సహిత జ్ఞానమును గూర్చి తెలిపెదనని చెప్పియుండెను. దానిని అనుసరించి, ఆ విషయమును వర్ణించుచు చివరకు బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞముల సహితముగా భగవానుని తెలిసికొనుమనిపలికి, అంత్యకాలమున భగవచ్చింతనవలన కలుగు ఫలమును వివరించెను. 8వ అధ్యాయ ప్రారంభమున అర్జునుడు ఆ తత్త్వములను గూర్చియు, అంత్యకాల - ఉపాసనా విషయమును గురించియు తెలిసికొనుటకు 7 ప్రశ్నలు అడిగెను. అందులో 6 ప్రశ్నలకు సమాధానములను సంక్షిప్తముగా 3,4వ శ్లోకములలో వివరించెను. 7వ ప్రశ్నకు సమాధానమును 8వ అధ్యాయాంతము వరకు తెలిపెను. ఈ విధముగ ఏడవ అధ్యాయమున ఆరంభింపబడిన విజ్ఞానసహితజ్ఞానచర్చ సాంగోపాంగముగా వర్ణింపబడనందున ఆ విషయమునే సమగ్రముగా వివరించుటకై

భగవానుడు ఈ నవమాధ్యాయమును ప్రారంభించుచున్నాడు. 7వ అధ్యాయమునందలి ఉపదేశముతో ఈ 9వ అధ్యాయమునకుగల బలీయమైన సంబంధమును తెల్పుటకు మరల అదే విజ్ఞాన సహిత జ్ఞానమును గూర్చి వర్ణింతునని ప్రకటించెను.

**శ్రీభగవాన్ ఉవాచ**

**ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।**
**జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 1 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్, తు | = దేనినయితే | మోక్ష్యసే | = ముక్తుడవయ్యెదవో | జ్ఞానమ్ | = జ్ఞానమును |
| జ్ఞాత్వా | = తెలిసికొనుట వలన | (తత్) | = అట్టి | అనసూయవే | = దోషదృష్టిలేనివాడవైన |
| | | ఇదమ్ | = ఈ | తే | = నీకు |
| అశుభాత్ | = దుఃఖరూపసంసారము నుండి | గుహ్యతమమ్ | = పరమగోప్యమైన | ప్రవక్ష్యామి | = (మఱల) సమగ్రముగా వివరించెదను. |
| | | విజ్ఞానసహితమ్ | = విజ్ఞానసహితమైన | | |

శ్రీ భగవానుడు పలికెను - ఓ అర్జునా! నీవు దోషదృష్టిలేని భక్తుడవు. కనుక నీకు పరమగోప్యమైన విజ్ఞాన సహిత జ్ఞానమును మఱల విశదముగ చెప్పుచున్నాను. దీనిని తెలిసికొని నీవు ఈ దుఃఖరూపసంసారమునుండి ముక్తుడవు కాగలవు (1)

ప్రశ్న - 'అనసూయవే' అను పదమునకు అర్థమేమి? అర్జునుని 'అనసూయుః'అని అనుటలోని విశేషమేమి?

సమా - గుణవంతుల గుణములను గుర్తింపకుండుట, గుణములయందు దోషములను చూచుట, వారిని నిందించుట, అట్లే వారిపై మిథ్యాదోషారోపణములను చేయుట-మొదలగునవి అసూయా లక్షణములు. ఇట్టి అసూయా దోషములు స్వాభావికముగా ఏ మాత్రమూ లేనివానిని 'అనసూయుః' అని యందురు.[1] భగవంతుని యందు శ్రద్ధ కలిగి అసూయాదోష రహితుడైనవాడే ఈ అధ్యాయమునందలి ఉపదేశమునకు పాత్రుడని తెల్పుటకే అర్జునుని 'అనసూయుః' అని పేర్కొనెను. దీనికి వ్యతిరేకముగా భగవంతునియెడ దోషదృష్టి కలిగి, శ్రద్ధారువు కానివాడు ఈ ఉపదేశమునకు పాత్రుడు కాడు. 18వ అధ్యాయమునందలి 71వ శ్లోకమున భగవానుడు 'నాయందు దోషదృష్టి గలవానికి గీతాశాస్త్రోపదేశమును వినిపింపరాదు' అని స్పష్టముగా తెలిపియున్నాడు.

ప్రశ్న - ఇచట 'ఇదమ్' అను పదముదేనిని సూచించును? భగవంతుడు ప్రతిజ్ఞ చేసిన 'విజ్ఞాన సహిత జ్ఞానము' ఏమి?

సమా - 7,8,9 అధ్యాయములయందు భగవంతుని నిర్గుణ నిరాకార తత్త్వము యొక్క ప్రభావ మహత్త్వాది రహస్యములను, సగుణ, నిరాకార, సాకార తత్త్వముల లీలా రహస్య మహత్త్వ ప్రభావాదులను మరియు వాటిని ప్రాప్తింపజేయు ఉపదేశములను వర్ణించుట జరిగినది. వీటన్నింటిని సూచించునదియే 'ఇదమ్' అనుపదము-దీనినే 'విజ్ఞానసహిత జ్ఞానము' అందురు.

ప్రశ్న - దీనిని 'గుహ్యతమం' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ప్రపంచమున శాస్త్రములలో గోప్యాతి గోప్యములైన విషయములన్నింటిలోను పురుషోత్తముడైన భగవానుని తత్త్వ, ప్రేమ, గుణ, ప్రభావ, విభూతి మహత్త్వాదులును, ఆతని శరణాగతి స్వరూపమును అత్యంత గోప్యములు. కావున ఈ ఉపదేశమును 'గుహ్యతమం' అని పేర్కొనుట జరిగినది. 15వ అధ్యాయమున 20వ శ్లోకమునందును, 18వ అధ్యాయము 64వ శ్లోకమునందును

1) న గుణాన్ గుణినో హన్తి స్తౌతి మందగుణానపి । నాన్యదోషేషు రమతే, సానసూయా ప్రకీర్తితా ॥ అత్రిస్మృతి (34)
గుణవంతుని గుణములలో దోషములను వెదకనివాడు, పరుల స్వల్పగుణములను సైతము ప్రశంసించువాడు ఇతరుల దోషములను చూచి ఆనందింపనివాడు అగునట్టి మనుష్యుని స్వభావమును అనసూయ (దోషదృష్టిలేనివాడు) అనియందురు.

ఈ విధమైన వర్ణనను భగవానుడు 'గుహ్యతమం' అని తెల్పెను.

ప్రశ్న - ఇచట 'అశుభ' అను శబ్దము దేనిని తెల్పును? దానినుండి ముక్తుడగుట యనగానేమి?

సమా - సమస్త దుఃఖములు, వాటికి హేతుభూతములైన కర్మలు, దుర్గుణములు, జననమరణరూప సంసార బంధనములు, వీటికి అన్నింటికిని కారణమైన అజ్ఞానము-ఈ అన్నింటిని తెల్పునదియే 'అశుభ' శబ్దము-ఈ అన్నింటి నుండియు శాశ్వతముగా సంపూర్ణముగా విముక్తుడై పరమానంద స్వరూపుడైన పరమేశ్వరుని పొందుటయే అశుభమునుండి ముక్తుడగుట యగును.

*సంబంధము - భగవంతుడు తానుపదేశింపదలచిన 'విజ్ఞానసహిత జ్ఞానము' నెడ శ్రద్ధాభక్తులను, వినవలెనను కుతూహలమును, ఆ ఉపదేశానుసారము ఆచరించుటకు అధికోత్సాహమును అర్జునునిలో కల్గించుటకై ఇప్పుడు దాని యథార్థ మహత్త్వమును తెల్పుచున్నాడు-*

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ 2 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఇదమ్ | = ఈ విజ్ఞానసహిత జ్ఞానము | పవిత్రమ్ | = మిక్కిలి పవిత్రమైనది | ధర్మ్యమ్ | = ధర్మయుక్తము |
| రాజవిద్యా, రాజగుహ్యమ్ | = అన్ని విద్యలకును తలమానికము, సమస్త గోప్యవిషయములకును శిరోభూషణము | ఉత్తమమ్ | = అత్యుత్తమము | కర్తుమ్ | = సాధన చేయుటకు |
| | | ప్రత్యక్షావగమమ్ | = ప్రత్యక్షముగా ఫలములను ఇచ్చునది | సుసుఖమ్ | = మిక్కిలి సుగమమైనది |
| | | | | అవ్యయమ్ | = శాశ్వతమైనది. |

**ఈ విజ్ఞానసహితజ్ఞానము (నిర్గుణ సగుణ పరమాత్మతత్త్వజ్ఞానము) అన్ని విద్యలకును తలమానికము. సమస్త గోప్యవిషయములకును శిరోభూషణము. అతి పవిత్రము. ఉత్తమోత్తమము. ప్రత్యక్షఫలదాయకము. ధర్మయుక్తము, సాధన చేయుటకు మిక్కిలి సుగమము, శాశ్వతము. (2)**

ప్రశ్న - ఈ శ్లోకమునందలి 'ఇదమ్' అను పదము దేనిని తెల్పును? దానిని 'రాజవిద్యారాజగుహ్యమ్' అని పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - పూర్వ శ్లోకమున పేర్కొనిన విజ్ఞాన సహిత జ్ఞానమునే ఇచట 'ఇదమ్' అనుపదము సూచించును. ప్రపంచమున జ్ఞాతములు, అజ్ఞాతములు అయిన విద్యలన్నింటిలోను ఇది అత్యుత్తమము. ఈ విద్య యొక్క యథార్థానుభవము కల్గినవానికి ఇంకను తెలిసికొనవలసినది ఏమియు ఉండదు. కనుక దీనిని 'రాజవిద్య 'అనగా సర్వవిద్యలలో శ్రేష్ఠమైనది' అని తెల్పెను. దీనియందు భగవానుని సగుణ నిర్గుణ సాకార నిరాకార స్వరూప తత్త్వములు, అయనయొక్క గుణప్రభావ మహత్త్వముల, భగవదుపాసనా రీతులు, వాటి ఫలములు అన్నియును చక్కగా నిర్దేశింపబడినవి. ఇంతేగాక శ్రీకృష్ణ రూపములో అర్జునుని ఎదుట విరాజమానుడై ఉన్నది తానే అనియు, తాను సమస్త జగత్తునకు కర్తయు, హర్తయు ఆధారమూ అయిఉన్నాననియు, సర్వశక్తిమంతుడైన పరబ్రహ్మ, పరమేశ్వరుడు, పురుషోత్తముడు తానే అనియు భగవానుడు స్పష్టపరచెను. కావున అన్ని విధములుగా తనను శరణుపొందుమని అర్జునునకు తెల్పెను. అర్జునుడు దోషదృష్టి లేని పరమశ్రద్ధాలువైన భక్తుడు. అట్టివానికే పరమగుహ్యమైన ఈ విషయము తెల్పదగును. కావుననే దీనిని 'రాజగుహ్యము' (గోప్యాతిగోప్యము) అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - దీనిని 'పవిత్రము', 'ఉత్తమము' అని పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ ఉపదేశమును శ్రద్ధగా విని,మననము చేసి, ఆచరించినవాని సమస్త పాపములును, అవగుణములును, సమూలముగా నశించిపోవును. అతడు శాశ్వతముగా పరమపవిత్రుడగును. కనుక దీనిని 'పవిత్రము' అని పేర్కొనుట జరిగినది. ప్రపంచమునందు ఉత్తమమైన వాటిలో ఇది అత్యుత్తమమైనది. కనుక ఇది 'ఉత్తమమ్' అని పేర్కొనబడినది.

ప్రశ్న - ఇచట 'ప్రత్యక్షావగమమ్' 'ధర్మ్యమ్' అను విశేషణములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - విజ్ఞానసహితమైన ఈ జ్ఞానము యొక్క ఫలము శ్రాద్ధాది కర్మలఫలములవలె అదృష్టము కాదు. సాధకుడు తన సాధనయందు ముందుకు సాగుచున్నకొలదియు అతని దుర్గుణములు, దురాచారములు, దుఃఖములు అన్నియు నశించును. అతనికి పరమశాంతి పరమసుఖముల ప్రత్యక్షానుభవము కలుగును. సంపూర్ణముగా దీనిని (విజ్ఞానసహిత జ్ఞానమును) పొందినవాడు వెంటనే పరమసుఖశాంతులకు నిధానము, పరమప్రేమాస్పదుడు, పరమదయాళువు, అందరికిని సుహృదుడైన భగవానుని ప్రత్యక్షముగా పొందును. కనుక దీనిని 'ప్రత్యాక్షావగమమ్' అని పేర్కొనుట జరిగినది. అట్లే వివిధములగు వర్ణాశ్రమ ధర్మములన్నింటికిని విరుద్ధము కానిదియు, స్వాభావికముగనే పరమ ధర్మయుక్తమైనదియు అగుటవలన సర్వశ్రేష్ఠమైనది. కనుక ఇది 'ధర్మ్యమ్' అని పేర్కొనబడెను.

ప్రశ్న - దీనిని 'అవ్యయమ్' 'కర్తుం సుసుఖమ్' అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - సకామ కర్మలు ఫలములను ఇయ్యగనే సమాప్తమగును. ప్రాపంచిక విద్యలు ఒకసారి చదివిన పిమ్మట మాటిమాటికి వాటిని అభ్యసింపనిచో అవి నష్టమగును. కాని భగవంతుని ఈ జ్ఞానవిజ్ఞానము అట్లు నశించునది కాదు. ఒకసారి దీనిని చక్కగా గ్రహించినవాడు ఎప్పుడును ఏ పరిస్థితిలోను దీనిని మరువజాలడు. పైగా దీని ఫలముగూడ శాశ్వతము. కనుక ఇది అవ్యయము అని పేర్కొనబడినది. ఇంత మహిమాన్వితమైనదగుటవలన దీనిని అవగాహన చేసికొనుటగాని దీనిని అనుసరించి ఆచరించుటగాని ఎంతో కష్టమగునని అపోహ కలుగవచ్చును. కాని భగవానుడు 'కర్తుం సుసుఖమ్' అని పలికి దాని సౌలభ్యమును విశదపరచెను. ఈ అధ్యాయమునందలి ఉపదేశాంసారము భగవంతుని శరణాగతిని పొందుట మిక్కిలి సులభము. ఏలనన ఇందు ఏవిధమైన బాహ్యాడంబరములకును ఆర్భాటములకును తావు లేదు. ఎట్టి శ్రమకును గురికానక్కరలేదు. సాధన ఆరంభము నుండియే సాధకునకు సుఖశాంతులు అనుభవములోనికి వచ్చుచునే యుండును. ఇక సిద్ధి లభించిన పిమ్మట వాటి విషయము చెప్పవలసిన పనియేలేదు.

*సంబంధము - విజ్ఞాన సహిత జ్ఞానమునకు ఇంతటి మహత్త్వము ఉన్నప్పుడు, సాధనకు గూడ అది సులభముగనే ఉన్నప్పుడు మనుష్యులు అందరును దానిని ఏల ఆచరింపరు? అను సందేహమునకు సమాధానముగా - అశ్రద్ధయే దీనికి కారణమని తెల్పుచు శ్రద్ధ లేనివారిని భగవానుడు నిందించుచున్నాడు-*

**అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।**
**అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని ॥ 3 ॥**

పరంతప! = ఓ పరంతపా!
అస్య = (పైన పేర్కొనబడిన) ఈ
ధర్మస్య = ధర్మమార్గమునందు
అశ్రద్ధధానాః = శ్రద్ధారహితులైన
పురుషాః = పురుషులు
మామ్ = నన్ను
అప్రాప్య = పొందక
మృత్యుసంసార వర్త్మని = మృత్యురూప సంసార చక్రమున
నివర్తంతే = పరిభ్రమించుచుందురు.

**ఓ పరంతపా! ఈ ధర్మమార్గమునందు విశ్వాసములేని పురుషులు నన్ను పొందజాలరు. కనుక వారు మృత్యురూపసంసారచక్రమున పరిభ్రమించుచుందురు. (3)**

ప్రశ్న - 'అస్య' విశేషణముతోపాటు 'ధర్మస్య' అను పదము ఏ ధర్మమును తెల్పును? దానియందు శ్రద్ధ లేకుండుట యనగానేమి?

సమా - పూర్వ శ్లోకమున విజ్ఞానసహిత జ్ఞానము యొక్క మహత్త్వము తెల్పబడినది. ఈ అధ్యాయము సందంతయు దానిని గూర్చిన వివరణయే యున్నది. ఇచట 'అస్య' అను విశేషణముతోపాటు 'ధర్మస్య' అను పదము దానినే సూచించును. ఈ సందర్భమున వర్ణింపబడిన భగవానుని స్వరూప ప్రభావ గుణ మహత్త్వములను తత్ప్రాప్తికై తెల్పబడిన ఉపాయములను, మరియు వాటి ఫలములను సత్యములని

భావింపకుండుట,వాటి యెడ నిరాదరణ, విరుద్ధభావనలను కలిగియుండుట, అవి కేవలము జనాకర్షణ వచనములని తలంచుట మున్నగు విశ్వాస విరుద్ధ భావనలు కలిగియుండుటయే దానియందు శ్రద్ధ లేకుండుట యగును.

ప్రశ్న - 'అశ్రద్దధానాః' అను పదము ఏ శ్రేణి మనుష్యులను తెల్పును?

సమా - భగవానుని స్వరూప గుణ ప్రభావ మహత్త్వాదుల యందు విశ్వాసము లేకపోవుటచే భక్తితో భగవంతుని సేవింపనివారు, దుర్లభమైన మనుష్య జీవితమును భోగానుభవముల యందును, ఆ భోగాదుల ప్రాప్తికై చేయు వివిధోపాయముల యందును వ్యర్థము చేయువారు 'అశ్రద్దధానాః' అని వ్యవహరింపబడుదురు.

ప్రశ్న - 'శ్రద్ధారహితులైన వారు నన్ను చేరక మృత్యురూప సంసారచక్రమున పరిభ్రమించుచుందురు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - 84 లక్షల జీవరాసుల యోనుల యందు తిరుగుచు తిరుగుచు ఎప్పుడో ఒకప్పుడు భగవత్కృపచే జీవుడు సంసారచక్రమునుండి విముక్తిని, పరమేశ్వరప్రాప్తిని పొందుటకు సాధనమైన మానవశరీరమును పొందును. ఇట్టి దుర్లభమైన మానవశరీరమును పొంది కూడ జనులు భగవద్వచనములయందు శ్రద్ధలేని కారణమున భజన ధ్యానాది సాధనములను చేయరు. వారు భగవంతుని పొందక ఆ జన్మ మృత్యురూప సంసారచక్రమునందు పడి ఎప్పటివలె నానా యోనులయందు పరిభ్రమించుచునే యుందురు.

*సంబంధము - ఇంతవరకును భగవానుడు విజ్ఞానసహితజ్ఞానమును ఉపదేశింపదలచి, దాని మహత్త్వమును వర్ణించెను. ఇప్పుడు దానిని ప్రారంభించుచు రెండు శ్లోకములలో తన అవ్యక్త స్వరూప ప్రభావమును వర్ణించుచున్నాడు-*

**మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।**
**మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ 4 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అవ్యక్తమూర్తినా | = నిరాకారపరబ్రహ్మనైన | | పరిపూర్ణమై యున్నది | | | | యందే అంతర్గతములై యున్నవి (కాని) |
| మయా | = నాచేత | చ | = మఱియు | అహమ్ | = నేను | | |
| ఇదమ్ | = ఈ | సర్వభూతాని | = ప్రాణులన్నియును | తేషు | = వాటియందు | | |
| సర్వమ్ | = సమస్తమైన | మత్స్థాని | = (నా సంకల్పమును ఆధారముగాగొని) నా | న అవస్థితః | = (వాస్తవముగా) స్థితుడనుకాను. | | |
| జగత్ | = జగత్తు | | | | | | |
| తతమ్ | = (నీటితో మంచువలె) | | | | | | |

**నిరాకారపరబ్రహ్మనైన నాచేతనే ఈ జగత్తంతయును జలముతో మంచువలె పరిపూర్ణమైయున్నది. ప్రాణులన్నియును నా సంకల్పమును ఆధారముగా కలిగి నాయందే అంతర్గతములైయున్నవి. కాని వాస్తవముగా నేను వాటియందు స్థితుడనుకాను. (4)**

ప్రశ్న - 'అవ్యక్త మూర్తినా' అను పదము ద్వారా భగవంతుని ఏ స్వరూపము తెల్పబడినది?

సమా - 8వ అధ్యాయమునందలి 4వ శ్లోకములో అధియజ్ఞము అనియు, 8,10 శ్లోకములయందు 'పరమ దివ్య పురుషుడు' అనియు, 9వ శ్లోకమున 'కవిమ్' 'పురాణమ్' అది పేర్లతోడను, 20,21 శ్లోకముల యందు 'అవ్యక్తము' 'అక్షరము' అనియు, 22వ శ్లోకమున భక్తిద్వారా ప్రాప్యమగు 'పరమపురుషుడు' అనియు తెల్పబడిన సర్వవ్యాపి, సగుణ నిరాకార స్వరూపమే 'అవ్యక్తమూర్తినా' అను పదముచేత సూచింపబడుచున్నది.

ప్రశ్న - 'ఇదమ్' 'సర్వమ్' అను విశేషణముతో గూడ 'జగత్' అను పదము దేనిని తెల్పును?

సమా - ఈ విశేషణముతోపాటు 'జగత్' అను పదము సంపూర్ణ జడచేతన పదార్థములతో గూడిన సమస్త బ్రహ్మాండములను సూచించును.

ప్రశ్న - అవ్యక్తమూర్తియైన భగవానునితో సమస్త జగత్తు ఏ విధముగా వ్యాప్తమై యున్నది?

సమా - వాయువు, తేజస్సు, జలము, పృథ్వి అనువానిలో ఆకాశము, ఆభరణములలో సువర్ణము, మట్టితో చేయబడిన పాత్రలలో మట్టి వ్యాప్తమైయున్నట్లే సమస్త విశ్వము దానిని సృజించిన సగుణ పరమేశ్వర నిరాకార రూపములో వ్యాప్తమై యున్నది. శ్రుతి ఈ విధముగా తెల్పుచున్నది.

ఈశావాస్యమిదం సర్వం, యత్కించ జగత్యాం జగత్
(ఈశోపనిషత్-1)

ఈ ప్రపంచమునందలి జడచేతన పదార్థ సముదాయము అంతయును ఈశ్వరునిచే వ్యాప్తమై యున్నది.

ప్రశ్న - 'సర్వభూతాని' అను పదము దేనిని తెల్పును? ఈ ప్రాణులన్నియును భగవంతుని యందే స్థితమైయున్నవి- అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - శరీరేంద్రియమనోబుద్ధులు, వాటి విషయములు (ఇంద్రియార్థములు) వాసస్థానములతోపాటు, సమస్తచరాచర ప్రాణులను తెలుపునది 'సర్వభూతాని' అను పదము. భగవానుడే తన ప్రకృతిని స్వీకరించి సమస్త జగత్తు యొక్క ఉత్పత్తి స్థితిలయములను నిర్వహించుచున్నాడు. అతడే ఈ సమస్తజగత్తును తన ఒక అంశమునందు ధరించుచున్నాడు. (10/42) అతడొక్కడే ఈ సమస్త జగత్తునకును గతి, భర్త, నివాసస్థానము, ఆశ్రయము, ప్రభావము, ప్రళయము, స్థానము, నిధానము అయియున్నాడు. (9/18) ఈ విధముగ అన్నింటి ఉనికియు భగవానుని ఆధీనములోనే యున్నది. కనుక సర్వభూతములు భగవంతుని యందు స్థితమైయున్నట్లు తెల్పబడినది.

ప్రశ్న - సమస్త జగత్తు భగవానునితో పరిపూర్ణమై యున్నప్పుడు 'నేను ఈ భూతములన్నింటిలోను స్థితుడను కాను' - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - మేఘములలో ఆకాశమువలె సమస్త జగత్తు నందును వ్యాప్తమైయున్నప్పటికిని భగవానుడు దానికి సర్వథా అతీతుడు, సంబంధరహితుడు. మేఘములు నశించినను ఆకాశము ఉన్నట్లు సమస్త జగత్తు నశించినను భగవానుడు ఎట్టి మార్పులేకుండ ఉండును. జగత్తు నశించుట వలన భగవంతుడు నశింపడు. ఈ జగత్తుయొక్క వాసనయు లేనప్పుడు (మహాప్రళయకాలమున) భగవానుడు తన మహిమ యందు స్థితుడై యుండును. "నేను భూతములయందు స్థితుడను కాను' అనుటలోని ఆంతర్యమిదియే. అనగా భగవానుడు తనకు తానే నిత్యస్థితుడై యుండును.

ప్రశ్న - 'నేను ఆ ప్రాణులలో స్థితుడనై లేను' అను ఈ వాక్యమునకు ఈ క్రింది విధముగా అర్థము చెప్పిన దోషమేమి?-

స్వప్నములోని జీవులు మరియు పదార్థములు స్వప్నద్రష్టయైన పురుషునియందు ఉన్నను ఆ పురుషుడు వాటిలోపల పరిమితుడై స్థితుడై లేడు. పైగా బయటగూడ కలడు. అట్లే జగత్తంతయు భగవంతుని ఒక అంశయందు ఉండుటవలన భగవానుడు దానియందు సర్వత్ర వ్యాప్తుడై యున్నను దానికి పరిమితుడు గాడు. పైగా బయటను గలడు. స్వప్నద్రష్టయైన పురుషుడు స్వప్నపదార్థములన్నింటిని స్వప్నావస్థయందు ప్రత్యక్షముగా చూచుచున్నను అతనికి స్వప్నక్రియలతో పదార్థములతో వస్తుతః ఎట్టి సంబంధమూ లేదు. అతడు స్వప్న సృష్టికంటెను సర్వథా అతీతుడు. సంబంధ రహితుడు. ఆ స్వప్న పురుషుడు స్వప్నమునకు ముందును కలడు, స్వప్నకాలమునందును గలడు. స్వప్నానంతరమును ఉండును. అట్లే భగవంతుడు సర్వదా ఉండును. జగత్తంతయు నశించినను అతడు శాశ్వతముగనే ఉండును. పైగా జగత్తు యొక్క వాసన లేని చోట కూడ భగవంతుడు తన మహిమతో విలసిల్లుచునే యుండును. ఈ విధముగా దానినుండి ఆయన సర్వథా అతీతుడు, నిర్లిప్తుడు అగుటవలన దానియందు స్థితుడు కాడు.

స్వప్నములయందలి పదార్థములన్నియును వస్తుతః స్వప్నద్రష్టయైన పురుషునికంటెను అభిన్నములును, అతని స్వరూపములును అగుటవలన అవి అతని యందు వేరుగా లేవు. పైగా అవియే యతడు. అట్లే సమస్త జగత్తును భగవంతునికి అభిన్నమై అతని స్వరూపమే యగుటవలన అతనియందు అవి వేరుగా లేవు. పైగా అవియే అతడు.

ఈ విధముగా భగవానుడు జగత్తునకు ఆధారమూ మరియు దానికంటె అతీతుడు అగుటవలనను, అట్లే జగత్తు అతని స్వరూపమే అగుటవలనను అతడు జగత్తునందు స్థితుడు కాడు. ఈ కారణము చేతనే జగత్తు యొక్క అణువణువునను వ్యాప్తమైయున్నను వస్తుతః వాటిలో లేననియు, తన మహిమయందే నిశ్చల స్థితిలో ఉన్నాననియు భగవానుడు పలికెను.

సమా - ఇట్లు భావించినను ఎట్టి దోషమూ లేదు. అభేద జ్ఞాన దృష్టితో చూచినచో ఈ భావమూ సరియైనదే. కాని ఇచ్చట ఆ ప్రస్తావనయే లేదు.

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ 5 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూతాని | = ఆ ప్రాణులన్నియును | పశ్య | = చూడుము | | నేనేయైనను |
| మత్స్థాని, న | = నాయందు స్థిరముగా లేవు, కాని | భూతభావనః | = భూతములను సృష్టించువాడను | మమ, ఆత్మా | = నా ఆత్మ (వాస్తవముగా) |
| మే | = నాయొక్క | చ | = మఱియు | భూతస్థః, న | = ఆ భూతముల యందు స్థితమైయుండదు. |
| ఐశ్వరమ్ | = ఈశ్వరీయమైన | భూతభృత్, చ | = భూతములను ధరించువాడను, భరించువాడను | | |
| యోగమ్ | = యోగశక్తిని | | | | |

ఈ ప్రాణులన్నియును నాలో స్థిరముగా లేవు. ఈశ్వరీయమైన నా యోగశక్తిని చూడుము. ఈ భూతములనన్నింటిని సృష్టించునదియు, పోషించునదియు నేనేయైనను యథార్థముగా నా ఆత్మ వాటియందు స్థితమై యుండదు. (5)

ప్రశ్న - సర్వభూతములును తనలోనే కలవని పూర్వ శ్లోకమున భగవానుడు తెలిపెను. కాని ఈ శ్లోకమున సకల భూతములును తనలో లేవని తెల్పుచున్నాడు. ఈ విరుద్ధ వచనములలోని అంతరార్థమేమి?

సమా - ఇచట ఈ విరుద్ధ వచనములను ప్రయోగించుచు అదే సమయమున తన దివ్యయోగ శక్తిని గూడ తెలిసికొనుమని భగవానుడు అర్జునునకు తెల్పెను. ఈ యోగశక్తి అసాధారణమైనది. ఆకాశమునందు మేఘములవలె సమస్త జగత్తు భగవంతునియందు స్థితమైయున్నది. ఒక విధముగా లేదు కూడ. మేఘములకు ఆధారము ఆకాశము. కాని మేఘములు సర్వదా దానియందు ఉండవు. వస్తుతః అనిత్యములగుటవలన వాటికి స్థిరమైన ఉనికి కూడ లేదు. కనుక అవి ఆకాశమునందు లేవు. అదేవిధముగా సమస్త జగత్తు భగవానుని యోగశక్తి నుండియే ఉత్పన్నమైనది. అతడే దీనికి ఆధారము. కనుక సర్వభూతములును అతనియందే స్థితములై యున్నవి. కాని అవి అట్లున్నను వాటికి అతడు సర్వథా అతీతుడు. అవి అతనియందు ఎల్లప్పుడు ఉండవు. అతనికంటె వేఱైన ఉనికి వాటికి లేదు. కనుక అవి అతనిలో స్థిరముగా లేవు. మనుష్యుని దృష్టిలో జగత్తు ఉన్నంతవరకును అన్నియును అతనిలోనే యుండును. అతడు తప్ప ఈ జగత్తునకు మరియొక ఆధారమే లేదు. భగవత్సాక్షాత్కారమైనంతనే సాధకుని దృష్టిలో భగవంతునికంటె భిన్నమైన వస్తువేదియును ఉండదు. ఆ సమయమున ఆ జగత్తు అతనియందు ఉండదు.

ప్రశ్న - ఈ విరుద్ధ వచనములకు ఈ క్రింది విధముగా అర్థము చెప్పినచో దోషమేమి?-

ఈ విరుద్ధ వచనముల ద్వారా భగవానుడు తాను మునుపు చెప్పిన సిద్ధాంతములకు పుష్టిని గూర్చుచున్నాడు. స్వప్న సృష్టివలె జగత్తంతయు భగవత్సంకల్పముపైననే ఆధారపడియున్నది. వస్తుతః దానికి భగవానునికంటె వేఱైన అస్తిత్వము లేనే లేదు. కనుక భగవంతునిలో లేవు - అని చెప్పుట సమంజసమే. అయితే ఈ సృష్టి యంతయు దృశ్యమానమగుచుండుట యెట్లు? దీని రహస్యమేమి? ఈ సందేహమును నివారించుటకు భగవానుడు ఇట్లు చెప్పుచున్నాడు. 'అర్జునా! నా అసాధారణ యోగశక్తి ఎంత ఆశ్చర్యకరమో చూడుము - జగత్తంతయు నాయందు ఉన్నట్లే కనబడుచున్నది. వస్తుతః నేను తప్ప మరి ఏదియును లేదు' - మనుష్యుని దృష్టిలో జగత్తు ఉన్నంతవరకును అంతయు అతనిలోనే స్థితమై యుండును. అతడు తప్ప ఈ జగత్తునకు ఇతర ఆధారమేదియును లేదు. వాస్తవముగా అన్నియును అతడే - అతడు తప్ప వేరే ఏమియు లేదు. సాధకునకు భగవత్సాక్షాత్కారమైనంతనే ఈ విషయము స్పష్టమగును. అప్పుడతని దృష్టిలో భగవంతునికంటె వేఱైన వస్తువు ఏదియు ఉండదు. కనుక సర్వభూతములును వస్తుతః అతనిలో స్థితములు కానేకావు - అని భగవద్వచనముల అభిప్రాయము.

సమా - ఇట్లు భావించుటలో దోషమేమియు లేదు - అభేద జ్ఞానదృష్టితో చూచినచో ఇదియును సరియైనదే - కాని ఇచ్చట ఆ ప్రస్తావన లేదు.

ప్రశ్న - 'ఐశ్వరమ్' 'యోగమ్' అను పదములు దేనిని గూర్చి తెలుపును? ఈ పదముల ద్వారా దేనిని చూడవలెనని భగవానుడు తెల్పెను?

సమా - అన్నిటిని ఉత్పన్నము చేయుచు, అన్నింటి యందును వ్యాప్తమై అన్నింటిని ధరించి, పోషించు చున్నప్పటికిని అన్నింటికంటెను సర్వథా నిర్లిప్తుడైయుండు భగవంతుని అద్భుత ప్రభావశక్తి విశేషమునే 'ఐశ్వరమ్, 'యోగమ్' అను పదములు సూచించును. ఇట్టి దివ్యశక్తి భగవంతుని యందు తప్ప మరియెవ్వరియందును లేదు. ఇట్టి దివ్యయోగ శక్తినే చూడుమని భగవానుడు అర్జునునితో పల్కెను.

ప్రశ్న - 'భూతభృత్' 'భూతభావనః' అను రెండు పదముల అర్థమేమి? "మమ ఆత్మా" అను పదములు దేనిని సూచించును? 'భూతస్థః న' అనగానేమి?

సమా - భూతములన్నింటిని భరించి, పోషించువాడు **'భూతభృత్'** అని యనబడును. భూతములను సృష్టించు వానిని **'భూతభావనః'** అని యందురు. **'మమ, ఆత్మా'** అను పదములు భగవానుని సగుణ నిరాకార స్వరూపమును నిర్దేశించును. ఈ సగుణ నిరాకార స్వరూపము నుండియే సమస్త జగత్తుయొక్క ఉత్పత్తియు, ధారణ పోషణలును జరుగుచున్నవి. కనుక దానిని **'భూతభావనః', భూతభృత్'** అని పేర్కొనుట జరిగినది. అట్లయినను వాస్తవముగ భగవానుడు ఈ సమస్త జగత్తునకు అతీతుడు. ఆ విషయమును స్పష్టపరచుటకే **'భూతస్థః న'** (అతడు భూతములయందు లేడు) - అని తెల్పబడినది.

*సంబంధము - సమస్త భూతములు తన అవ్యక్తరూపములో వ్యాప్తమైనవనియు, దానియందే స్థితమైనవనియు పూర్వ శ్లోకములలో భగవానుడు తెలిపెను. ఈ విషయమునే దృష్టాంతముల ద్వారా భగవానుడు స్పష్టీకరించుచున్నాడు-*

**యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్ ।**
**తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥ 6 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| సర్వత్రగః | = అంతటను సంచరించు నట్టి | నిత్యమ్ | = నిరంతరము | | (ప్రాణులు) |
| మహాన్ | = మిక్కిలి విస్తృతమైన | ఆకాశస్థితః | = ఆకాశమునందే స్థితమైయుండునో | సర్వాణి | = అన్నియును |
| వాయుః | = (ఆకాశమునుండియే ఉత్పన్నమైన) వాయువు | తథా | = అట్లే | మత్స్థాని | = నా యందే స్థితమై యున్నవి |
| యథా | = ఎట్లు | భూతాని | = నా సంకల్పమువలననే ఉత్పన్నములైన భూతములు | ఇతి | = అని |
| | | | | ఉపధారయ | = ఎఱుంగుము. |

**ఆకాశమునుండి ఉత్పన్నమై సర్వత్ర సంచరించుచున్న విస్తృతమైన వాయువు సర్వదా ఆకాశమునందే స్థితమైయుండును. అట్లే నా సంకల్పము ద్వారా ఉత్పన్నమైన భూతములు (ప్రాణులు) అన్నియును నాయందే స్థితమై యుండును అని ఎఱుంగుము. (6)**

ప్రశ్న - ఇచ్చట వాయువును 'సర్వత్రగః' 'మహాన్' అనుటలో గల వైశిష్ట్యమేమి?

సమా - ప్రాణులను వాయువుతో పోల్చుటకై దానిని 'సర్వత్రగః' 'మహాన్' అని పేర్కొనుట జరిగినది. వాయువు సర్వత్ర చరించునట్లే భూతములన్నియును నానాయోనులలో పరిభ్రమించుచుండును. వాయువు 'మహాన్' అనగా అత్యంత విస్తృతమైనది. అట్లే భూతసముదాయమును మిక్కిలి విస్తరించియుండును.

ప్రశ్న - 'నిత్యమ్' అను పదమును ప్రయోగించి, వాయువు సర్వదా ఆకాశమునందు స్థితమైయుండునని తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - వాయువు ఆకాశమునుండి ఉత్పన్నమై ఆకాశమునందే స్థితమై, ఆకాశమునందే లీనమైయుండును. అన్ని పరిస్థితులయందును, అన్ని సమయములయందును వాయువునకు ఆధారము ఆకాశమే. ఈ విషయమును తెల్పుటకే 'నిత్యమ్' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'ఆకాశమునందు వాయువు స్థితమై యున్నట్లు భూతములన్నియు నాయందే స్థితమై యున్నవి. అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఆకాశమువలె భగవానుడు సముడు, నిరాకారుడు, అకర్త, అనంతుడు, అసంగుడు, నిర్వికారుడు. వాయువువలె సమస్త చరాచర భూతములు భగవంతుని నుండియే ఉత్పన్నములై, అతనియందే స్థితమై, అతనియందే లీనమగుచున్నవి. వాయువు యొక్క ఉత్పత్తిస్థితిలయములు ఆకాశమునందే కలుగుట వలన అది ఎప్పుడును, ఏ పరిస్థితిలోను ఆకాశమునుండి వేరుగా ఉండదు. సదా ఆకాశమునందే స్థితమై యుండును. అట్లైనప్పటికిని ఆకాశమునకు వాయువుతోగాని, దాని గమనాది వికారములతోగాని ఎట్టి సంబంధమూ ఉండదు. అది (ఆకాశము) దానికి (వాయువునకు) సదా అతీతమైనది. అదే విధముగ సమస్త ప్రాణుల ఉత్పత్తి, స్థితి, లయములు భగవంతుని సంకల్పముపైనే ఆధారపడియుండుటవలన సమస్త భూతసముదాయము సర్వదా భగవంతునియందే స్థితమై యుండును. అయినను భగవానుడు ఆ భూతములకు సర్వథా అతీతుడు. కనుక అతనియందు ఎన్నడును ఏ విధమైన వికారములు ఉండవు.

*సంబంధము - విజ్ఞానసహిత జ్ఞానమును వర్ణించుచు భగవానుడు ఇంతవరకును తననిరాకార స్వరూపతత్త్వ ప్రభావమును తెల్పుటకై దాని వ్యాపకత్వమును, అసంగత్వమును, నిర్వికారత్వమును గూర్చి వివరించెను. ఇప్పుడు తన భూతభావన స్వరూపమును స్పష్టీకరించుచు సృష్టి రచనాది కర్మల తత్త్వమును విశదపరచుటకై 2 శ్లోకములలో కల్పాంతమునందు సకల భూత ప్రళయమును కల్పాదియందు వాటి ఉత్పత్తిని గూర్చి తెలుపుచున్నాడు-*

**సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్ ।**
**కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ కౌంతేయా! | యాంతి | = చేరును (ప్రకృతిలో లీనమగును) | తాని | = వాటిని |
| కల్పక్షయే | = కల్పాంతమునందు | | | పునః | = మరల |
| సర్వభూతాని | = భూతములన్నియును | | | అహమ్ | = నేను |
| మామికామ్, ప్రకృతిమ్ | = నా ప్రకృతినే | కల్పాదౌ | = (మరియు) కల్పాది యందు | విసృజామి | = సృష్టించు చుందును. |

**ఓ కౌంతేయా! కల్పాంతమునందు భూతములన్నియును నా ప్రకృతినే చేరును. అనగా ప్రకృతిలో లీనమగును. కల్పాదియందు నేను మరల వాటిని సృజించుచుందును. (7)**

ప్రశ్న -'కల్పక్షయము' అనగానేమి?

సమా - బ్రహ్మయొక్క ఒక పగటికాలమును 'కల్పము' అని యందురు. అతని రాత్రి కాలప్రమాణముగూడ అంతే. బ్రహ్మయొక్క అహోరాత్ర ప్రమాణమునుబట్టి నూరు (100) వర్షములు పూర్తికాగానే బ్రహ్మ ఆయుస్సు సమాప్తమగును. ఆకాలమును తెల్పునది గాన కల్పక్షయమందురు. దానినే కల్పాంతము, మహాప్రళయము అనియు అందురు.

ప్రశ్న - 'సర్వభూతాని' అను పదము దేనిని తెల్పును?

సమా - శరీరేంద్రియ మనోబుద్ధులు, భోగ వస్తువులు, వాటి వాసస్థానములతో సహా సకల చరాచర ప్రాణులను తెల్పునది 'సర్వభూతాని' అను పదము.

ప్రశ్న - 'ప్రకృతిమ్' అను పదము దేనిని సూచించును? దానితోపాటు 'మామికామ్' అను విశేషణమును ప్రయోగించుట లోని వైశిష్ట్యమేమి? ఆ ప్రకృతిని పొందుట అనగానేమి?

సమా - సమస్త జగత్తునకు కారణభూతమైన మూలప్రకృతిని తెల్పునదియే 'ప్రకృతిమ్' అను పదము. దీనినే 14వ అధ్యాయమునందలి 3,4 శ్లోకములలో 'మహద్బ్రహ్మ' అని పేర్కొనుట జరిగినది. దీనినే అవ్యాకృతము, ప్రధానము అనియు అందురు. ఆ ప్రకృతి భగవంతుని శక్తి కావున అది 'మామికామ్' అని పేర్కొనబడినది. కల్పముల అంతమునందు శరీరేంద్రియ

మనోబుద్ధులు భోగవస్తువులు, లోకములతో సహా సమస్త ప్రాణులు ప్రకృతియందు లయమగును. అనగా వాటి గుణకర్మల సంస్కార సముదాయరూపమైన కారణశరీరములు మూలప్రకృతియందు లీనమగును. సర్వభూతములు ప్రకృతిని చేరును అనగానిదియే.

ప్రశ్న - 8వ అధ్యాయమునందలి 18,19 శ్లోకములలో అవ్యక్తమునుండి సర్వభూతముల ఉత్పత్తి జరుగుననియు, మరల అందే అవియన్నియును లయమగుననియు తెల్పబడినది. ఆ అవ్యక్తమునకు ఈ ప్రకృతికి మధ్యగల భేదమేమి? అచ్చటి లయమునకు, ఇచ్చటి లయమునకును మధ్యనున్న అంతరమేమి?

సమా - అచట అవ్యక్తమను పదము ప్రకృతి యొక్క నిరాకార - స్వరూప సూక్ష్మమును దెలుపును. అది మూల ప్రకృతిని సూచింపదు. సమస్త భూతములును తమ సూక్ష్మ శరీరములతో సహా అందులీనమగును. ఈ మూల ప్రకృతియందు కారణ శరీరములతో సహా సర్వభూతములును లీనమగును. అచట (అవ్యక్తమునందు) బ్రహ్మ లీనముగాడు. అతడు నిద్రించును. ఈ మూల ప్రకృతి యందు బ్రహ్మయు స్వయముగా లీనమగును. అచటి ప్రలయమునకును ఇచటి మహా ప్రలయమునకును మిక్కిలి అంతరము కలదు.

ప్రశ్న - 7వ అధ్యాయమునందలి 6వ శ్లోకములో సమస్త జగత్తు తనయందు ప్రళయమగునని భగవానుడు తెలిపెను. ఇచట ప్రకృతియందు లీనమగుచున్నట్లు తెల్పుచున్నాడు. ఈ రెండింటిలో ఏది సరియైనది?

సమా - రెండును సరియైనవే. వాస్తవముగా రెండు చోట్లను ఒకే విషయము తెల్పబడినది. ప్రకృతి భగవంతుని యొక్క శక్తి, శక్తి, శక్తిమంతుడు రెండును వేర్వేరు గాదు. కనుక ప్రకృతిలో లీనమగుట యనగా భగవంతునిలో లీనమగుటయే. అందువలన ఇచట సర్వభూతములును ప్రకృతిలో లీనమగునని చెప్పబడినది. ప్రకృతి భగవంతునకు సంబంధించినది. భగవంతుని యందే స్థితమైనది. భగవానుడే సమస్త జగత్తునకును ప్రళయస్థానము. ఈ విధముగా రెండభిప్రాయములును ఒకే విషయమును తెల్పుచున్నవి.

ప్రశ్న - 'కల్పాది' అను శబ్దము ఏ సమయమును సూచించును? ఆ సమయమున భగవంతుడు సమస్త భూతములను సృష్టించుననగానేమి?

సమా - కల్పములు ముగిసిన పిదప అనగా బ్రహ్మకు నూరేండ్లు నిండిన పిదప జీవులచే కర్మ ఫలములను అనుభవింపజేయుటకై మరల జగత్తును విస్తరింప జేయవలయునని భగవానుడు సంకల్పించును. ఆ కాలమునే కల్పాదియని యందురు. దీనినే 'మహాసర్గ ప్రారంభము' అనియు అందురు. ఆ సమయమున భగవానుడు సకల భూతములను ఉత్పత్తి చేయుటకై తన సంకల్పము ద్వారా హిరణ్యగర్భుడైన బ్రహ్మను, అతని లోకమును సృష్టించును. సర్వభూత సృష్టియనగా ఇదియే.

**ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।**
**భూతగ్రామమిమం కృత్స్నమ్ అవశం ప్రకృతేర్వశాత్ ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| (అహమ్) | = నేను | | వశమున | | సముదాయమును |
| స్వామ్, | = స్వీయప్రకృతిని | అవశమ్ | = పరతంత్రమైయున్న | పునః, పునః | = మాటిమాటికిని |
| ప్రకృతిమ్ | (నామూలప్రకృతిని) | ఇమమ్ | = ఈ | విసృజామి | = (వాటి కర్మాను |
| అవష్టభ్య | = స్వీకరించి | కృత్స్నమ్ | = సమస్తమైన | | సారము) సృష్టించు |
| ప్రకృతేః, వశాత్= | తమతమ స్వభావ | భూతగ్రామమ్ | = భూత | | చుందును |

తమతమ స్వభావవశమున పరతంత్రమైయున్న భూతసముదాయమును నాప్రకృతినాశ్రయించి మాటిమాటికి వాటి కర్మానుసారము సృజించుచున్నాను. **(8)**

ప్రశ్న - 'స్వామ్' అను విశేషణముతో గూడిన 'ప్రకృతిమ్' అను పదము దేనినిసూచించును? ఆ ప్రకృతిని భగవంతుడు అంగీకరించుట యనగానేమి?

సమా - సర్వభూతములును మూలప్రకృతి యందు లయమగునని పూర్వ శ్లోకమున చెప్పబడినది. 'స్వామ్' అను విశేషణముతో గూడిన 'ప్రకృతిమ్' అనుపదము ఆ మూలప్రకృతినే సూచించును. సృష్టికార్యమును నిర్వహించుటకై తనలో శక్తిరూపమున స్థితమై యున్న ప్రకృతిని భగవానుడు స్మరించుటయే - దానిని స్వీకరించుట యగును.

ప్రశ్న - 'ఇమమ్', కృత్స్నమ్' అను విశేషణములతోపాటు 'భూతగ్రామమ్' అను పదము దేనిని సూచించును? అవి స్వభావ బలముచే (ప్రకృతి ప్రభావమున) అవశమగుట యనగానేమి?

సమా - 'సర్వభూతాని' అను పేరుతో వర్ణింపబడిన సమస్త చరాచర భూత సముదాయమునే 'ఇమమ్' 'కృత్స్నమ్' అను విశేషణములతో గూడిన 'భూతగ్రామమ్' అను పదము సూచించును. వేర్వేరు ప్రాణుల గుణకర్మలననుసరించి, ఏర్పడిన వాటి స్వభావమే వాటియొక్క ప్రకృతి. భగవంతుని ప్రకృతి 'సమష్టి ప్రకృతి'. జీవుల ప్రకృతి దానియొక్క ఏకాంశమైన వ్యష్టిప్రకృతి. ఆ వ్యష్టి ప్రకృతి బంధములో పడియుండుటయే దాని బలముచే పరతంత్రమగుట యగును.

భగవంతుని శరణుపొందినవారు ఆ ప్రకృతి బంధములను తెంచుకుందురు. అందువలన వారు దానికి వశముకారు. ప్రకృతికి అతీతుడైన భగవంతుని చేరి వారు భగవంతునే పొందుదురు.

ప్రశ్న - ఇచట 'పునః' అను పదము రెండుమార్లు ప్రయోగించుటలోని విశేషమేమి? 'విసృజామి'. అను క్రియాపదమునకు అర్థమేమి?

సమా - జీవులు తమ ప్రకృతికి వశమైయున్నంత వరకును భగవానుడు వారిని ప్రతికల్పారంభము నందును వారివారి గుణకర్మలననుసరించి, నానాయోనుల యందు మాటిమాటికి జన్మింప జేయుచుండును. ఈ విషయమును తెల్పుటకే పునః అనుపదము రెండు మారులు ప్రయోగించి, 'విసృజామి' అని గూడ తెల్పుట జరిగినది.

*సంబంధము - ఈ విధముగా జగత్సృష్ట్యాది సమస్త కర్మలను చేయుచున్నప్పటికిని భగవానుడు ఆ కర్మబంధములలో ఏల పడడు? ఈ తత్త్వవిశేషములను భగవానుడు వివరించుచున్నాడు-*

**న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ।**
**ఉదాసీనవదాసీనమ్ అసక్తం తేషు కర్మసు ॥ 9 ॥**

ధనంజయ! = ఓ అర్జునా!
తేషు, కర్మసు = ఆ కర్మలయందు
అసక్తమ్ = ఆసక్తిరహితుడనైన
చ = మఱియు
ఉదాసీనవత్ = ఉదాసీనునివలె
ఆసీనమ్,మామ్ = ఉన్నట్టి నన్ను
తాని, కర్మాణి = ఆ కర్మలు
న, నిబధ్నంతి = బంధింపవు.

**ఓ అర్జునా! ఆ సృష్ట్యాది కర్మలయందు ఆసక్తిరహితుడనై, ఉదాసీనునివలెనున్న నన్ను ఆ కర్మలు బంధింపవు. (9)**

ప్రశ్న - 'ఆ కర్మలు' అను పదములద్వారా ఏ కర్మలు సూచింపబడుచున్నవి? వాటియందు భగవంతుడు ఆసక్తి రహితుడై ఉదాసీనునివలె ఉండుట యనగానేమి?

సమా - జగత్తుయొక్క సృష్టి స్థితి లయముల నిమిత్తమై పూర్వ శ్లోకమున వర్ణింపబడినట్లు భగవంతుని ద్వారా నెరవేరు కర్మలనన్నింటిని 'ఆ కర్మలు' అనుపదము సూచించును. భగవానుడు ఆ కర్మలయందుగాని, వాటి ఫలములయందు గాని ఏ విధముగను ఆసక్తుడు గాడు. కేవలము ఆయన యొక్క పర్యవేక్షణలో (అధ్యక్షతన) ప్రకృతిద్వారా ప్రాణుల గుణకర్మానుసారము వాటి ఉత్పత్తి మొదలగునవి జరుగును. ఆ సృష్ట్యాది క్రియలయందు భగవంతుడు కర్తృత్వాభిమానమును గాని, పక్షపాతమును గాని కలిగియుండక నిర్లిప్తుడుగా ఉండును. భగవంతుడు ఆసక్తిరహితుడై ఉదాసీనునివలె ఉండుట యనగా ఇదియే.

ప్రశ్న - భగవంతుడు తననుగూర్చి ఆసక్తి రహితునిగా, ఉదాసీనునివలె ఉండువానినిగా తెలిపెను. కాని ఆ కర్మలు తనను బంధింపవు - అని తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - కర్మలయందు గాని, వాటి ఫలములయందు గాని, ఆసక్తుడు కాకుండుట వలనను, వాటియందు కర్తృత్వాభిమానము పక్షపాతము లేని కారణమునను ఆ కర్మలు ఆతనిని బంధింపవు. ఇతరులకు గూడ జననమరణ హర్షశోక సుఖదుఃఖాది కర్మఫల రూపబంధములనుండి విముక్తి లభించుటకు ఇదియే సుగమమైన ఉపాయము. ఈ తత్త్వమును గ్రహించి, ఇదే విధముగ కర్తృత్వాభిమానముగాని, ఫలాసక్తిగాని లేకుండ కర్మలను ఆచరించు మనుష్యుడు కర్మబంధములనుండి అవలీలగా ముక్తుడగును.

సంబంధము - 'ఉదాసీనవదాసీనం' అను పదము ద్వారా, భగవానుడు తెలిపిన కర్తృత్వ - అభావమునే స్పష్టముగా తెలియజేయుచున్నాడు-

**మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।**
**హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ 10 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ కుంతీసుతా! | సచరాచరమ్ | = ఈ చరాచరజగత్తును | హేతునా | = కారణమున |
| అధ్యక్షేణ | = అధ్యక్షుడనైయున్న | సూయతే | = సృష్టించుచున్నది | జగత్ | = సంసారచక్రము |
| మయా | = నా చేత (నాద్వారా) | అనేన | = ఈ | విపరివర్తతే | = పరిభ్రమించుచున్నది. |
| ప్రకృతిః | = ప్రకృతి | | | | |

**ఓ అర్జునా! అధిష్ఠాతనైన నా అధ్యక్షతన ప్రకృతి ఈ చరాచరజగత్తును సృష్టించుచున్నది. ఈ కారణమువలననే సంసారచక్రము పరిభ్రమించుచున్నది. (10)**

ప్రశ్న - 'మయా' అను పదముతోపాటు 'అధ్యక్షేణ' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - జగత్తు యొక్క సృష్ట్యాది కార్యములను చేయుట యందు భగవానుడు ప్రకృతికి అస్తిత్వమును స్ఫూర్తిని ఇచ్చెడి అధిష్ఠాత మాత్రమే. భగవానునినుండి అస్తిత్వమును, స్ఫూర్తిని పొంది, అతని ప్రకృతియే జగత్సృష్ట్యాది సమస్త క్రియలను నిర్వహించును.

ప్రశ్న - భగవానుని అధ్యక్షతన ప్రకృతి సచరాచర జగత్తును ఏ విధముగా ఉత్పత్తి చేయును?

సమా - రైతుయొక్క పర్యవేక్షణలో (అధ్యక్షతన) భూమికి బీజములతో సంబంధము ఏర్పడును. పృథ్వి ఆ బీజ లక్షణములను బట్టి వేర్వేరు మొక్కలను ఉత్పన్నము చేయును. అదేవిధముగా భగవంతుడు తన పర్యవేక్షణలో (అధ్యక్షతన) చేతనారూప బీజములకు ప్రకృతి రూపభూమితో సంబంధమును ఏర్పరచును. (14/3) ఈ విధముగా జడచేతన సంయోగము కలుగుటవలన ఈ ప్రకృతి సమస్త చరాచర జగత్తును తత్తత్కర్మానుసారము వేర్వేరు యోనులయందు ఉత్పన్నము చేయును. ఈ దృష్టాంతము కేవలము అవగాహన కొరకే ఇవ్వబడినది. వాస్తవముగా భగవంతుని విషయములో ఈ పోలిక సరిపోదు. ఏలనన రైతు అల్పజ్ఞుడు, స్వల్ప శక్తిమంతుడు. ఏకదేశీయుడు. అతడు భూమిద్వారా దేనిని చేయించుటకును శక్తుడు గాడు. కాని భగవానుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి. అతని నుండి శక్తిని, అస్తిత్వమును, స్ఫూర్తిని పొంది ప్రకృతి సమస్త జగత్తును ఉత్పత్తి చేయుచున్నది.

ప్రశ్న - ఈ కారణముచేతనే ఈసంసారచక్రము (జగత్తు) పరిభ్రమించుచున్నది - అని యనగానేమి?

సమా - భగవంతుని పర్యవేక్షణ (అధ్యక్షత), ప్రకృతి యొక్క కర్తృత్వము - ఈ రెండింటి ద్వారానే చరాచర జగత్తుయొక్క సృష్టిస్థితిలయాది సమస్త కార్యములు నిర్వహింపబడుచున్నవి. అని ఈ వాక్యము యొక్క సారాంశము.

ప్రశ్న - 4వ అధ్యాయమునందలి 13 వ శ్లోకమునను, ఈ అధ్యాయమునందలి 8వ శ్లోకమునను, 'నేను ఈ భూతములను (ప్రాణులను అన్నింటిని వేర్వేరు స్వరూపములలో సృష్టింతును' -అని భగవానుడు

తెల్పియుండెను. మరి ఈ శ్లోకమున 'చరాచర ప్రాణులతో గూడిన సమస్త జగత్తును ప్రకృతి సృజించుచున్నది' అని తెలిపెను. ఈ రెండు విధములైన వర్ణనములలోని అంతర్యమేమి?

సమా - భగవంతుడు తాను జగత్తును సృష్టించుచున్నట్లు తెలిపినప్పుడు వాస్తవముగా ఆతడే స్వయముగా సృష్టించుట లేదనియు, తన శక్తియైన ప్రకృతిని స్వీకరించి, దానిద్వారా జగత్తును సృష్టించుచున్నాడనియు ఎరుంగవలెను. ప్రకృతి సృష్ట్యాదికార్యములను నెరవేర్చుచున్నట్లు చెప్పినప్పుడు, భగవంతుని అధ్యక్షతన అతని నుండి అస్తిత్వమును, స్ఫూర్తిని పొంది, ప్రకృతియే ఆ కార్యములను నెరవేర్చుచున్నదని తెలిసికొనవలెను. భగవంతుని సహాయ సహకారములు లేనిదే జడప్రకృతి ఏమియు చేయజాలదు. కావుననే 8వ శ్లోకమున భగవానుడు 'నేను నా ప్రకృతిని స్వీకరించి, జగత్తును సృజించుచున్నాను' అనియు, ఈ శ్లోకమున 'నా అధ్యక్షతన ప్రకృతి జగత్తును సృజించుచున్నది' అనియు చెప్పెను. వాస్తవముగా ఈ రెండు వాక్యములును ఒకే తత్త్వవిధానమును తెల్పుచున్నవి.

సంబంధము - విజ్ఞాన సహిత జ్ఞాన విషయమును వర్ణించుచు 4 నుండి 6వ శ్లోకము వరకును భగవానుడు తన సగుణ నిరాకార స్వరూప తత్త్వ ప్రభావమును వర్ణించెను. పిమ్మట 7 నుండి 10వ శ్లోకము వరకును సృష్ట్యాది సమస్త కర్మలయందు తన అసంగత్వమును, నిర్వికారత్వమును తెలుపుచు ఆ కర్మలయొక్క దివ్యతత్త్వమును వివరించెను. ఇప్పుడు తన సగుణ సాకార రూపమహత్త్వమును, భక్తిద్వారా తనను ఆరాధించురీతిని, తన గుణప్రభావములను తెల్పుటకు, తన ప్రభావమును ఎరుంగని ఆసురీ ప్రకృతిగల మనుష్యులను రెండు శ్లోకములలో అధిక్షేపించుచున్నాడు-

**అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।**
**పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥ 11 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మమ | = నాయొక్క | భూత-మహేశ్వరమ్ | = | సకలప్రాణులకును మహేశ్వరుడను | ఆశ్రితమ్ | = | ఆశ్రయించిన (స్వీకరించిన)వాడను ఐన |
| పరమ్, భావమ్ | = పరమభావమును | | | | | | |
| అజానంతః | = ఎఱుగనివారై | మానుషీమ్, తనుమ్ | = | (లోకకల్యాణార్థము) మానుషశరీరమును | మామ్ | = | నన్ను |
| మూఢాః | = అజ్ఞానులు | | | | అవజానంతి | = | తక్కువగా ఊహింతురు |

నా పరమభావమును ఎఱుగని మూఢులు సర్వప్రాణులకును మహేశ్వరుడను (ప్రభువును) ఐన నన్ను లోకకల్యాణమునకై అవతారములను ఎత్తిన కారణమున సామాన్యమానవునిగా భావించి, తక్కువగా ఊహింతురు. **(11)**

ప్రశ్న - 'పరమ్' అను విశేషణముతోపాటు 'భావమ్' అనుపదము దేనిని సూచించును? దానిని ఎరుగకుండుట అనగానేమి?

సమా - **4** నుండి **6**వ శ్లోకమువరకు భగవంతుడు తన సర్వవ్యాపకత్వాది ప్రభావములను వర్ణించెను. దానినే ఐశ్వరయోగము అని పేర్కొనెను. 7వ అధ్యాయమునందలి 24వ శ్లోకమున మందబుద్ధులు తన పరమభావమును ఎరుగరని తెలిపియుండెను. భగవానుని ఆ సర్వోత్తమ ప్రభావమునే ఇచట 'పరమ్' 'భావమ్' అనుపదములు తెలుపుచున్నవి. సర్వాధారుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు మరియు, అందరికిని కర్త, హర్త అయిన పరమేశ్వరుడే, జీవులందరిని అనుగ్రహించి, అందరికిని తన శరణాగతిని ప్రసాదించును. ధర్మసంస్థాపనము, భక్తులను ఉద్ధరించుట మొదలగు అనేక లీలలను ప్రదర్శించుటకై తన యోగమాయ ద్వారా మానవరూపమున అవతరించును. (4/6,7,8) ఈ తత్త్వరహస్యములను ఎరుగకుండుట, దానిపై విశ్వాసము లేకుండుటయే ఆ పరమభావమును తెలిసికొనకుండుట యగును.

ప్రశ్న - 'మూఢాః' అను పదము-ఎట్టి మనుష్యులను తెల్పును? వారు మానవశరీరధారి, భూతమహేశ్వరుడు

అయిన భగవానుని చులకనగా చూచుటయునగానేమి?

సమా - 'మూఢా:' అను పదము ఆసురీ ప్రకృతిని ఆశ్రయించిన మనుష్యులను తెలుపును. వీరిని గూర్చియే రాబోవు శ్లోకమున రాక్షస, అసుర స్వభావములు గలవారని చెప్పుట జరిగినది. 7వ అధ్యాయమునందలి 15వ శ్లోకమునందును, అట్లే 16వ అధ్యాయమునందలి 4, మరియు 7 నుండి 20వ శ్లోకము వరకును వీరి వివిధ లక్షణములు వర్ణింపబడినవి. భగవంతుని ప్రభావము తెలియని కారణమున పిపీలికాది బ్రహ్మపర్యంతము సమస్త ప్రాణులకును మహేశ్వరుడైన భగవానుడు తమవలెనే సామాన్య మానవుడని భావించుట, ఆ కారణమున అతని ఆజ్ఞలను పాలింపకుండుట అతనిపై నిరంతరము దోషారోపణ చేయుచుండుట ఈ మొదలగునవి అన్నియు అతనిని చులకనగా చూచుట యగును.[1]

**మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।**
**రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మోఘాశా: | = వ్యర్థములైన ఆశలు గలవారును | | వారును | చ | = మఱియు |
| | | విచేతస: | = విక్షిప్తములైన మనస్సులు గలవారును అగు అజ్ఞానులు | మోహినీమ్ | = మోహినీ |
| మోఘకర్మాణ: | = వ్యర్థములైన కర్మలను ఆచరించువారును | | | ప్రకృతిమ్, ఏవ | = స్వభావములనే |
| | | రాక్షసీమ్ | = రాక్షసీ | శ్రితా: | = ఆశ్రయింతురు (కల్గియుందురు) |
| మోఘజ్ఞానా: | = విపరీతజ్ఞానముగల | ఆసురీమ్ | = ఆసురీ | | |

వ్యర్థములైన ఆశలచే, కర్మలచే, విపరీత జ్ఞానముచే విక్షిప్తములైన మనస్సులుగల అజ్ఞానులు రాక్షసీ-ఆసురీ - మోహినీ స్వభావములను ఆశ్రయింతురు. (12)

---

1) శ్రీకృష్ణపరమాత్మ (విషయము)ను గూర్చి బ్రహ్మకును దేవతలకును మధ్య సంవాదము జరిగినది, దానిని భీష్మపితామహుడు దుర్యోధనునకు తెల్పెను. ఆ సంవాదము అద్భుతమైన శ్రీకృష్ణ ప్రభావమును ప్రకటించుచున్నది. సకల దేవతలను సావధానులను గావించి బ్రహ్మ ఇట్లు పల్కెను. "సకల లోకేశ్వరుడైన వాసుదేవుడు మీకందఱికిని పూజ్యుడు. శంఖచక్ర గదాధారియు, మహావీరుడును ఐన వాసుదేవుని సామాన్య మానవునిగా భావించి ఎన్నడును ఆయనను చులకనగా చూడరాదు. పరమగుహ్యము, పరమపదము, పరమబ్రహ్మము, పరమయశస్స్వరూపము అతడే. అతడే అక్షరుడు, అవ్యక్తమైనవాడు, సనాతనుడు, పరమతేజస్సు, పరమసుఖము, పరమసత్యము. మనుష్యులు మాత్రమే గాదు, ఇంద్రాది దేవతలు సైతము ఎవ్వరును అమిత పరాక్రమశాలియు, ప్రభువు ఐన వాసుదేవుని సామాన్య మనుష్యునిగా తలచి ఆయనను నిరాదరింపరాదు. ఆ హృషీకేశుని మానవునిగా తలంచు మూఢమతులు నరాధములు. ఈ యోగేశ్వరుని నరునిగా తలచి ఆయన యెడ అనాదరము చూపువారును, చరాచర ప్రాణికోటికి ఆత్మస్వరూపుడు, శ్రీ వత్సలాంఛనుడు, మహా తేజస్వి ఐన పద్మనాభుని యథార్థముగా తెలియనివారు తామస స్వభావులు. కౌస్తుభమును, కిరీటమును ధరించినవాడు, మిత్రులకు అభయప్రదాత ఐన భగవానుని అవజ్ఞ చేయువారు అతి భయంకరములైన నరక యాతనలకు గురియగుదురు.

ఏవం విదిత్వా తత్త్వార్థం, లోకానాం ఈశ్వరేశ్వరః । వాసుదేవో నమస్కార్యః, సర్వలోకైః సురోత్తమాః ॥

(మహాభారత భీష్మపర్వ 66/23)

ఓ దేవతా శ్రేష్ఠులారా! ఈ విధముగా ఆయనయొక్క దివ్యస్వరూప తత్త్వమును తెలిసికొని, జనులెల్లరును లోకేశ్వరులకు ఈశ్వరుడైన ఆ వాసుదేవ భగవానునకు ప్రణమిల్లవలెను.

ప్రశ్న - 'మోఘాశాః' అను పదమునకు అర్థమేమి?

సమా - వ్యర్థములైన ఆశలు అనగా కోరికలు కలవారిని 'మోఘాశాః' అని యందురు. భగవంతుని ప్రభావమును తెలియని అసుర స్వభావముగల మనుష్యులు నిరర్థకములైన వాంఛలను కల్గియుందురు. అవి ఎన్నటికిని నెరవేరవు. (16/10,11,12) కనుక వారిని 'మోఘాశాః' అని యందురు.

ప్రశ్న - 'మోఘకర్మాణః' అను పదమునకు అర్థమేమి?

సమా - భగవంతునిపైనను, శాస్త్రములయెడను విశ్వాసములేని విషయాసక్తులైన పామరులు శ్రద్ధాదరములు లేకుండ ఇష్టము వచ్చిన రీతిగా శాస్త్ర విరుద్ధముగా యజ్ఞాది కర్మలను ఆచరింతురు. వాటివలన వారికి ఇహపర లోకములకు సంబంధించిన ఎట్టి ఫలములును లభింపవు. అట్టివారొనర్చు యజ్ఞదానతపఐశ్వర్యాది కర్మలన్నియును వ్యర్థములు. అట్టి వ్యర్థకర్మలనొనర్చువారిని 'మోఘకర్మాణః' అని యందురు. (16/17,23, 17/28).

ప్రశ్న - 'మోఘజ్ఞానాః' అను పదమునకు అర్థమేమి?

సమా - తాత్త్వికార్థశూన్యమై, యుక్తి యుక్తము కాని జ్ఞానము వ్యర్థజ్ఞానము (18/22). అట్టి వ్యర్థజ్ఞానము గలవారిని 'మోఘజ్ఞానాః' అని యందురు. భగవంతుని ప్రభావమును ఎరుంగనివారు ప్రాపంచిక భోగములనే సత్యములుగా, సుఖప్రదములుగా భావించి, వాటియందే నిమగ్నులై యుందురు. ఆ భోగములను అనుభవించుటయే పరమ సుఖమనియు, వాటిని మించిన సుఖములు మరి లేవనియు భ్రమవశమున భావించుచుందురు. (16/11) ఆ కారణమున వారు నిజమైన సుఖములను పొందజాలరు. కనుక అట్టి వ్యర్థజ్ఞానులను 'మోఘజ్ఞానాః' అని పేర్కొనుట జరిగినది. అట్టివారు తమ జ్ఞానశక్తిని దురుపయోగపరచి దానిని వ్యర్థము గావింతురు.

ప్రశ్న - 'విచేతసః' అను పదమునకు అర్థమేమి?

సమా - ప్రాపంచికములైన వివిధ వస్తువుల యందు ఆసక్తులగుటవలన అస్థిరములైన, విచలితములైన మనస్సులు గల వారిని 'విచేతసః' అని యందురు. ఆసురీ ప్రకృతిగల ఈ మనుష్యుల మనస్సులు ప్రతిక్షణమునందును చిత్రవిచిత్రములైన ఊహలలో తేలిపోవుచుండును (16/13 నుండి 16).

ప్రశ్న - 'రాక్షసీమ్' 'ఆసురీమ్' 'మోహినీమ్' అను విశేషణములతోపాటు ప్రయుక్తమైన 'ప్రకృతిమ్' అను పదమునకు అర్థమేమి? అట్టి ప్రకృతిని కలిగియుండుట అనగానేమి?

సమా - నిష్కారణముగ ఇతరులను ద్వేషించుచు, వారికి అప్రియకార్యములనొనర్చుచు, కష్టపెట్టువారు 'రాక్షసులుగా' పేర్కొనబడుదురు. అట్టివారి స్వభావమును 'రాక్షసీ' ప్రకృతియని యందురు. కామమునకును, లోభమునకును వశులై తమ స్వార్థసిద్ధికై ఇతరులకు క్లేశములను కలిగించియైనను వారి స్వత్వములను (సొత్తులను) హరించువారి స్వభావమును 'ఆసురీ' ప్రకృతియనియందురు.

ప్రమాదమోహముల కారణమున ఏ ప్రాణికైనను దుఃఖమును కలిగించు స్వభావమును 'మోహినీ' ప్రకృతియని యందురు. ఇట్టి దుష్ట స్వభావములు కలవారు వాటిని త్యజించుటకు ప్రయత్నింపరు. పైగా వాటినే ఉత్తమములు అని భావించి పట్టుకొని యుందురు. భగవత్ప్రభావమును తెలియనివారు తరచుగా పైవిధముగనే ఆచరించుచుందురు. కావున వారిని పైన పేర్కొనబడిన దుష్టప్రకృతులను ఆశ్రయించువారని తెలుపుట జరిగినది.

ప్రశ్న - ఇచట 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించుట లోని విశేషమేమి?

సమా - పైన పేర్కొనబడినవారు 'ఆసురీ' ప్రకృతి (స్వభావము)నే ఆశ్రయించి యుందురు. దైవీప్రకృతిని ఎన్నడును కలిగియుండరు అని తెల్పుటకు 'ఏవ' అవ్యయప్రయోగము జరిగినది.

*సంబంధము - భగవంతుని మహత్త్వమును తెలియని ఆసురీ ప్రకృతిగల మనుష్యులను అధిక్షేపించిన పిమ్మట సగుణరూపమునైగల భక్తితత్త్వమును వివరించుటకై, భగవత్ప్రభావము నెరింగిన దైవీ స్వభావముగల ఉత్తములైన పరమభక్తుల లక్షణములను తెల్పుచున్నాడు.'-*

**మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।**
**భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ 13 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తు | = కాని | మహాత్మానః | = | మహాత్ములు | జ్ఞాత్వా | = | గ్రహించి |
| పార్థ! | = ఓ పార్థా! | మామ్ | = | నన్ను | అనన్యమనసః | = | నిశ్చల(ఏకాగ్రతగల) మనస్సులుగలవారై |
| దైవీమ్ ప్రకృతిమ్ | = దైవీ ప్రకృతిని | భూతాదిమ్ | = | సకలప్రాణులకును మూలముగను | భజంతి | = | నిరంతరము భజింతురు |
| ఆశ్రితాః | = ఆశ్రయించిన | అవ్యయమ్ | = | అక్షరస్వరూపునిగను | | | |

**కాని ఓ పార్థా! దైవీప్రకృతిని ఆశ్రయించిన మహాత్ములైతే నన్ను సకల ప్రాణులకు మూలకారణముగను, అవ్యయునిగను (అక్షరస్వరూపునిగను) తెలిసికొని, నిశ్చలమనస్కులై నిరంతరము నన్నే భజింతురు. (13)**

ప్రశ్న - ఇచట 'తు' అను అవ్యయమును ప్రయోగించుట లోని విశేషమేమి?

సమా - 11, 12 శ్లోకములలో నిమ్నశ్రేణికి చెందిన మూఢులు, ఆసుర స్వభావములుగల మనుష్యులను గూర్చి వివరించుట జరిగినది. వారికంటెను సర్వథా విలక్షణమైన ఉత్తమ శ్రేణికి చెందిన పురుషుల వర్ణన ఈ శ్లోకమునందు కలదని తెల్పుటకు 'తు' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'దైవీమ్' అను విశేషణముతో గూడిన 'ప్రకృతిమ్' అను పదము దేనిని సూచించును. దానిని ఆశ్రయించుట యనగానేమి?

సమా - సాత్త్వికగుణయుక్తమై భగవత్పరమైన స్వభావమును దైవీప్రకృతి అని యందురు. ఇది భగవత్ప్రాప్తిని కలిగించును. దైవీప్రకృతి యొక్క గుణములు 16వ అధ్యాయమునందు, 1,2,3 శ్లోకములలో అభయాది (26) నామములతో వర్ణింబడినవి. ఈ గుణములను చక్కగా కల్గియుండుటయే దైవీప్రకృతిని ఆశ్రయించుట యగును.

ప్రశ్న - 'మహాత్మానః' అను పదము ఎట్టి శ్రేణికి చెందినవారిని తెలుపును?

సమా - గొప్ప ఆత్మగలవానిని 'మహాత్ముడు' అని యందురు. భగవత్ప్రాప్తియే జీవితలక్ష్యముగా చేసికొని, ఆ లక్ష్యమును సాధించుటకు పాటుపడువారు మహాత్ములు. నిష్కామభావముతో అనన్య భక్తియుక్తులైన భాగవతోత్తముల విషయమున 'మహాత్మానః' అను పదము ప్రయోగింపబడినది. వారు సదా భగవత్సేవలోనే నిమగ్నులైయుందురు. భగవత్ప్రాప్తికి వారు పాత్రులు.

ప్రశ్న - ఇచట 'మామ్' అను పదము భగవంతునియొక్క ఏరూపమును సూచించును? దానిని సర్వభూతములకును ఆదియనియు, నాశరహితమైనదనియు భావించుట అనగానేమి?

సమా - భగవంతుని సగుణపురుషోత్తమ రూపమును తెలుపునదియే 'మామ్' అను పదము. ఆ సగుణ పరమేశ్వరుని నుండియే శరీరేంద్రియమనోబుద్ధులు, భోగవస్తువులు సమస్తలోకములు, అందలి చరాచర ప్రాణులు మొదలగు వానియొక్క సృష్టి స్థితి లయములు జరుగుచున్నవి. (7/6, 9/18, 10/2,4,5,6,8) ఈ తత్త్వమును చక్కగా గ్రహించుటయే భగవంతుని సకల భూతములకును 'ఆదియైనవాడు' - అని తెలిసికొనుటయగును. భగవంతుడు 'పుట్టుట గిట్టుట'లు లేనివాడు. కేవలము జనులపై గల అనుగ్రహము చేతనే లీలామానుషరూపములో ప్రకటితమగుచు, అంతర్ధానమగుచు ఉండును. అతనినే అక్షరుడు, శాశ్వతుడు ఐన పరబ్రహ్మ పరమాత్మయని యందురు. సమస్త భూతములు అంతరించినను, అతడు శాశ్వతముగానుండును. (8/20) ఈ విషయమును యథార్థముగా తెలిసికొనుటయే భగవానుని శాశ్వతుడని యెరుంగుట యగును.

ప్రశ్న - 'అనన్యమనసః' అను పదము ఏ స్థితికి చేరిన భక్తులను సూచించును? వారు భగవంతునెట్లు సేవింతురు?

సమా - మహాభక్తుల మనస్సులు భగవద్విషయములందే రమించును. ఏ ఇతర విషయములందును రమింపవు. వారు క్షణమాత్రము గూడ భగవద్వియోగమునకు తట్టుకొనలేరు. అట్టి పరమభక్తులను తెల్పునదియే 'అనన్యమనసః' అను పదము. రాబోవు (14వ) శ్లోకమునందును, మఱియు 10వ అధ్యాయమునందలి 9వ శ్లోకమునందును తెలుపబడిన రీతిగా ఆ భక్తులు భగవంతుని నిరంతరము సేవింతురు.

సంబంధము - పూర్వ శ్లోకమున వర్ణింపబడిన భగవద్భక్తులయొక్క సేవారీతులను ఇప్పుడు తెల్పుచున్నాడు-

**సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః ।**
**నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14 ॥**

దృఢవ్రతాః = అట్టి దృఢనిశ్చయము గల భక్తులు
సతతమ్ = నిరంతరము (వాద్యబృందముతో)
కీర్తయంతః, చ = (నా నామ గుణములను) కీర్తించుచుందురు
యతంతః, చ = (నన్ను చేరుటకు) యత్నించుచుందురు
మామ్ = నన్నుగూర్చి
నమస్యంతః = నమస్కరించుచుందురు
నిత్యయుక్తాః = నా ధ్యానమునందే నిమగ్నులగుచుందురు
భక్త్యా = అనన్యభక్తితో
మామ్ = నన్ను
ఉపాసతే = ఉపాసించుచుందురు

ఆ దృఢవ్రతులైన భక్తులు నా నామగుణములను నిరంతరము వాద్యబృందముతో కీర్తింతురు. నన్ను చేరుటకు యత్నింతురు. పదేపదే నాకు ప్రణమిల్లుదురు. సర్వదా నా ధ్యానమునందే నిమగ్నులయ్యెదరు. అనన్య భక్తితో నన్ను ఉపాసింతురు. **(14)**

ప్రశ్న - 'దృఢవ్రతాః' అనగానేమి?

సమా - దృఢమైన వ్రతము లేక నిశ్చయముగల వారిని 'దృఢవ్రతాః' అని యందురు. భగవద్భక్తుల నిశ్చయములు, వారి శ్రద్ధానియమములు, ఆలోచనలు మొదలగునవి అన్నియును మిక్కిలి స్థిరముగా ఉండును. అంతులేని ఆపదలు, ప్రబలములైన విఘ్నములు వచ్చి పడినను వారు తమ సాధన విధానములనుండియు, సంకల్పములనుండియు ఏమాత్రమూ చలింపరు. అందువలన వారు 'దృఢవ్రతాః' అని పేర్కొనబడుదురు.

ప్రశ్న - 'సతతం' అనగానేమి? దీని సంబంధము "కీర్తయంతః" అను దానితో మాత్రమేనా? యతంతః, నమస్యంతః, అను వానితో గూడ కలదా?

సమా - 'సతతమ్' అను పదము ఇచట నిత్యము, నిరంతరము అను అర్థములను తెల్పును. ప్రత్యేకముగా దీని సంబంధము ఉపాసనతో కలదు. కీర్తనము, నమస్కారములు అన్నియును ఉపాసనాంగములే. కనుక ప్రకారాంతరమున వాటన్నింటితోను దీనికి (సతతమ్ అను పదమునకు) సంబంధము కలదు. భక్తుడు ఒక్కొక్కప్పుడు భగవంతుని కీర్తించుచుండును. మఱొకప్పుడు నమస్కరించుచుండును, వేఱొకప్పుడు సేవాదులనొనర్చుచుండును. అతడు ఏమేమి చేయుచున్నను సర్వదా భగవచ్చింతన కొనసాగించుచు నిరంతరము అతనిని ఉపాసించునే యుండును.

ప్రశ్న - భగవంతుని కీర్తించుట యనగానేమి?

సమా - కథలు, వ్యాఖ్యానముల ద్వారా భక్తుల ఎదుట భగవంతుని గుణప్రభావ మహిమలు, చరిత్రలు మొదలగువానిని వర్ణించుట, ఒంటరిగాగాని, పలువురితో కలిసిగాని, భగవంతుడు తన సమ్ముఖముననే యున్నట్లు భావించి, రామ! కృష్ణ! గోవింద! హరి! నారాయణ! వాసుదేవ! కేశవ! మాధవ! శివ! ఆది పవిత్రనామములను జపించుట, ఉచ్చస్స్వరముతో కీర్తించుట, భగవంతుని గుణప్రభావ చరిత్రాదులను భక్తి శ్రద్ధలతో తిన్నగా లేక వేగముగా నిలబడిగాని, కూర్చొనిగాని, నృత్యవాద్య యుక్తముగాగాని, అవి లేకుండగా గాని గానముచేయుట, అట్లే దివ్య స్తోత్రములతో మధురములైన పదములు పాటలద్వారా భగవంతుని స్తుతించుట, ప్రార్థించుట ఈ మొదలైన భగవన్నామ గుణగాన ప్రక్రియలన్నియును కీర్తించుటలో అంతర్భాగములే.

ప్రశ్న - 'యతంతః' అను పదమునకర్థమేమి?

సమా - భగవంతుని పూజించుట, అందఱిని భగవత్స్వరూపులుగా భావించి, వారికి సేవల నొనర్చుట, భక్తులద్వారా భగవంతుని గుణప్రభావ చరిత్రాదులను వినుట మొదలగు భగవద్భక్త్యంగ ప్రక్రియలను అన్నింటిని ఉత్సాహముతో, తత్పరతతో చేయువారిని 'యతంతః' అను పదము తెలుపును.

ప్రశ్న - భగవంతునకు మాటిమాటికి ప్రణమిల్లుట యనగానేమి?

సమా - దేవాలయములకు వెళ్ళి, భక్తిశ్రద్ధలతో భగవంతుని విగ్రహములకు సాష్టాంగ ప్రణామములు చేయుట, తమ ఇండ్లలో భగవంతుని ప్రతిమలను, చిత్రపటములను, నామములను, పాదములను, పాదుకలను, భగవంతుని తత్త్వరహస్య, ప్రేమ, ప్రభావ, మధుర లీలలను వర్ణించు దివ్యగ్రంథములను ఉంచి, వాటిని భగవత్స్వరూపములుగా భావించి, నమస్కరించుచుండుట, అందఱి హృదయములలోను భగవంతుడున్నట్లు భావించి, సమస్త ప్రాణులకును యథాయోగ్యముగ, సవినయముగ, భక్తిశ్రద్ధలతో, ఆర్తితో మనోవాక్కాయములతో నమస్కరించుచుండుట - ఈ మొదలగు వానిని ఆచరించుట భగవంతునకు ప్రణమిల్లుట యగును.

ప్రశ్న - 'నిత్యయుక్తాః' అనగానేమి?

సమా - నడచుచు, తిరుగుచు, లేచుచు, కూర్చొనుచు, నిద్రించుచు, మేల్కొనుచు మున్నుగా గల పనులన్నింటిని చేయుచును, ఏకాంతమున ధ్యానము చేయుచును, నిత్యము నిరంతరముగ భగవచ్చింతన చేయువారిని 'నిత్యయుక్తాః' అని యందురు.

ప్రశ్న - 'భక్త్యా' అను పదమునకు అర్థమేమి? దాని ద్వారా భగవదుపాసన చేయుట అనగానేమి?

సమా - శ్రద్ధతో గూడిన అనన్యప్రేమనే 'భక్తి' అని యందురు. కావున శ్రద్ధతో, అనన్యప్రేమతో, ఉపర్యుక్త సాధనలను నిరంతరము చేయుచుండుటయే భక్తిద్వారా భగవంతుని ఉపాసించుట యగును.

*సంబంధము - భగవంతుని గుణప్రభావాదులను ఎఱింగిన పరమభక్తుల సేవారీతులను తెలిపిన పిమ్మట భగవానుడు వారికంటెను వేఱైనవారి ఉపాసనా రీతులను తెల్పుచున్నాడు-*

**జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అన్యే | = మఱికొందఱు జ్ఞానయోగులు | ఏకత్వేన | = అభేదభావముతో | విశ్వతోముఖమ్ | = నా విరాట్స్వరూపమును |
| మామ్ | = నిర్గుణనిరాకార బ్రహ్మమైన నన్ను | యజంతః | = పూజింతురు | పృథక్త్వేన | = పృథగ్భావముతో |
| జ్ఞానయజ్ఞేన | = జ్ఞానయజ్ఞము ద్వారా | అపి, చ | = మఱికొందఱు | ఉపాసతే | = ఉపాసింతురు |
| | | బహుధా | = అనేకవిధములుగానున్న | | |

**మఱికొందరు జ్ఞానయోగులు నిర్గుణనిరాకారబ్రహ్మమైన నన్ను జ్ఞానయజ్ఞముద్వారా అభేదభావముతో ఉపాసించుచుందురు. మఱికొందరు అనంతరూపములతో ఒప్పెడి నా విరాట్స్వరూపమును పృథక్ భావముతో ఆరాధించుచుందురు. (15)**

ప్రశ్న - 'అన్యే' అను పదప్రయోగముయొక్క ప్రత్యేకతయేమి?

సమా - పూర్వోక్తభక్తులస్థాయినుండి జ్ఞానయోగులను వేఱుగా చూపుటకు 'అన్యే' అను పదము ప్రయోగింపబడినది. జ్ఞానయోగులు ఈ శ్లోకమున తెలుపబడుచున్న రీతిలో భగవదుపాసన చేయుచుందురు అని తెలుపుటకే 'అన్యే' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'మామ్' అను పదమునకు 'నిర్గుణ నిరాకార బ్రహ్మము' అను అర్థము ఏల చెప్పబడెను?

సమా - జ్ఞానయజ్ఞముద్వారా నిర్గుణ నిరాకార బ్రహ్మోపాసనయే జరుగును. 'మామ్' అను పదమును ప్రయోగించి, సచ్చిదానందఘన నిర్గుణబ్రహ్మనుండి తనయొక్క అభిన్నత్వమును భగవానుడు ప్రతిపాదించెను. కనుక 'మామ్' అను పదమునకు 'నిర్గుణ నిరాకార బ్రహ్మము' అని అర్థము చెప్పబడినది.

ప్రశ్న - జ్ఞానయజ్ఞ స్వరూపమేమి? దానిద్వారా

ఏకత్వభావముతో నిర్గుణబ్రహ్మమును ఉపాసన చేయుట యనగానేమి.?

సమా - 3వ అధ్యాయమునందలి 3వ శ్లోకమునందు వర్ణింపబడిన జ్ఞానయోగస్వరూపమే ఇచట ప్రతిపాదింప బడినది. దానినిబట్టి సాధకుడు శరీరేంద్రియమనస్సులద్వారా జరుగు సమస్త క్రియలకు తాను కర్తగాదనియు, మాయామయమైన గుణములే గుణములయందు వర్తించుచున్నవనియు భావించును. దృశ్యప్రపంచ మంతయును మృగతృష్ణలోని నీటివలెను, స్వప్నజగత్తు వలెను అనిత్యమని భావించును. ఒక్క సచ్చిదానంద ఘననిర్గుణ నిరాకార పరబ్రహ్మ పరమాత్మను తప్ప తదితరమైన దానికి దేనికిని అస్తిత్వమే లేదని భావించి, నిరంతరము శ్రవణమనననిదిధ్యాసలద్వారా ఆ సచ్చిదానందఘన బ్రహ్మయందే నిత్యమూ అభిన్న భావముతో స్థితమైయుండి సాధన చేయుచుండును. నిర్గుణ బ్రహ్మమును జ్ఞానయజ్ఞము ద్వారా ఉపాసించుట యనగా నిదియే.

ప్రశ్న - 'చ' అను దానిని ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - జ్ఞానయజ్ఞము ద్వారా సేవించు ఉపాసకుల కంటెను వేరైన వారిని ప్రత్యేకముగా తెల్పుటకు 'చ' అనునది ప్రయోగింపబడినది.

ప్రశ్న - అనంతరూపములతో విలసిల్లు భగవంతుని విరాట్ స్వరూపమును పృథక్ భావముతో ఆరాధించుట యనగానేమి?

సమా - విశ్వమంతయు భగవంతునినుండియే ఉద్భవించినది. భగవంతుడే ఇందు వ్యాప్తమైయున్నాడు. కనుక భగవానుడు స్వయముగా విశ్వరూపమున స్థితుడై యున్నాడు. కావున సూర్యచంద్రులు, ఇంద్రుడు, అగ్ని, వరుణుడు మొదలగు వేర్వేఱు దేవతలు, అట్లే సమస్త ప్రాణులును భగవత్స్వరూపములే అని భావించి, వారందఱికిని తమ కర్మల ద్వారా యథా యోగ్యముగ నిష్కామ భావముతో సేవాదికమును ఒనర్పవలెను. (18/46) అనంతరూపములతో విలసిల్లు భగవంతుని విరాట్ స్వరూపమును పృథక్ భావముతో ఆరాధించుట అనగా ఇదియే.

*సంబంధము - సమస్తవిశ్వమును ఆరాధించుట 'భగవదుపాసన' ఎట్లగును? అను విషయమును స్పష్టపఱచుటకు ఒక నాలుగు శ్లోకములలో భగవానుడు విశ్వమంతయు తనస్వరూపమే అని ప్రతిపాదించుచున్నాడు-*

**అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్ ।**
**మంత్రోఽహమహమేవాజ్యమ్ అహమగ్నిరహం హుతమ్ ॥ 16 ॥**

అహమ్, ఏవ = నేనే
క్రతుః = క్రతువును
అహమ్ = నేనే
యజ్ఞః = యజ్ఞమును
అహమ్ = నేనే
స్వధా = స్వధయును
అహమ్ = నేనే
ఔషధమ్ = ఔషధమును
అహమ్ = నేనే
మంత్రః = మంత్రమును
అహమ్, ఏవ = నేనే
ఆజ్యమ్ = ఘృతమును
అహమ్ = నేనే
అగ్నిః = అగ్ని(ని)
అహం = నేనే
హుతమ్ = హోమక్రియయును

**నేనే క్రతువును. నేనే యజ్ఞమును, స్వధయును నేనే, ఓషధులును నేనే. నేనే మంత్రమును, నేనే ఘృతమును. నేనే అగ్నిని. హోమరూపక్రియయును నేనే. (16)**

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క అంతరార్థమేమి?

సమా - దేవతలను పితరులను ఉద్దేశించి చేయబడు శ్రౌత స్మార్తకర్మలును, వాటి సాధనలును అన్నియు తానేయని భగవంతుడు ఈ శ్లోకమున తెలిపెను. శ్రౌతకర్మలను క్రతువులు అని యందురు. పంచమహాయజ్ఞాది స్మార్తకర్మలు యజ్ఞములనబడును. పితరుల నిమిత్తము ప్రదానము చేయబడు అన్నము 'స్వధా' అనబడును. ఈ క్రతువులును, యజ్ఞములును, స్వధయును తానేయని భగవానుడు తెలుపుచున్నాడు. అట్లే ఈ కర్మలకై ఉపయుక్తములగు వనస్పతులు, అన్నము, రోగనాశకములగు

మూలికలు మొదలగునవి యన్నియును భగవంతుడే. వివిధ కర్మలను ఆచరించునప్పుడు పఠింపబడు మంత్రములును, వేర్వేరు వ్యక్తుల ద్వారా వివిధ భావములతో ఆచరింపబడు జపములు అన్నియును భగవంతుడే. యజ్ఞములకై అవసరమగు సామగ్రులు, హవిస్సులు గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నులు మొదలగు అగ్నులును భగవంతుడే. చేయబడు హవన క్రియయు భగవంతుడే. యజ్ఞములు, శ్రాద్ధములు మొదలగు శాస్త్రీయ పవిత్ర కర్మలకు ఉపయోగించు సమస్త వస్తువులును, తత్సంబంధములైన మంత్రములును భగవంతుడే. యజ్ఞాదులకు అధిష్ఠానములైన మనోవాక్కాయములచే చేయబడు క్రియలన్నియునూ భగవత్స్వరూపములే. జగత్తునందు భగవంతుడు తప్ప మఱేమియు లేదనియు, వేర్వేఱు రూపములలో కనబడునవి అన్నియును భగవత్స్వరూపములే- అని తెల్పుటకే ప్రతి పదముతో పాటు 'అహమ్' అను పదమును, 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించెను. భగవత్తత్త్వమును ఎఱుంగని కారణముననే వస్తువులన్నియును వేర్వేఱుగా గోచరించును.

**పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అస్య | = ఈ | మాతా | = తల్లియు | ఋక్ | = ఋగ్వేదమును |
| జగతః | = జగత్తునకు | పితామహః | = తాతయు | సామ | = సామవేదమును |
| ధాతా | = ధాతయు (ధరించు వాడను, కర్మఫలముల నిచ్చువాడను) | వేద్యమ్ | = తెలిసికొనదగినవాడనూ | చ | = మఱియు |
| | | పవిత్రమ్ | = పవిత్రమైనవాడనూ | యజుః | = యజుర్వేదమును |
| | | ఓంకారః | = ఓంకారమును | అహమ్, ఏవ | = నేనే |
| పితా | = తండ్రియు | | | | |

ఈ సమస్త జగత్తునకు ధాతను అనగా ధరించువాడను, అట్లే కర్మలఫలములను ఇచ్చువాడను నేనే. తల్లియును, తండ్రియును, తాతయును నేనే. తెలిసికొనదగిన వాడనూ నేనే. పవిత్రుడను, ఓంకారమును నేనే. ఋక్సామయజుర్వేదములును నేనే. **(17)**

ప్రశ్న - 'అస్య' విశేషణముతో పాటు 'జగతః' అను పదము దేనిని తెల్పును? భగవంతుడు దానికి 'పితయు, మాతయు, ధాతయు, పితామహుడును' ఎట్లగును?

సమా - చరాచర ప్రాణులతో గూడిన సమస్త విశ్వమును 'జగతః' అను పదము సూచించును. ఈ విశ్వమంతయును భగవంతుని నుండియే ఉద్భవించినది. భగవానుడే దీనికి మహాకారణము. కావున దీనికి తల్లియు, తండ్రియు తానేయని తెల్పెను. భగవానుడు తన ఒక అంశద్వారా ఈ సమస్త విశ్వమును ధరించుచున్నాడు. (10/42) అంతేగాక అన్నివిధములగు కర్మఫలములను యథాయోగ్యముగ నిర్ణయించుచున్నాడు. కనుక అతడే అన్నింటికిని ధాత. బ్రహ్మాది ప్రజాపతులద్వారా జగత్సృష్టి జరుగును. కాని వారి ప్రాదుర్భావమునకు కారణమైన వాడును అతడే. కావున భగవంతుడే పితామహుడు కూడ.

ప్రశ్న - 'వేద్యమ్' అనగానేమి? భగవానుడు తనను వేద్యునిగా ప్రకటించుకొనుటలో గల విశేషమేమి?

సమా - తెలిసికొనదగిన దానిని వేద్యమని యందురు. వేదముల ద్వారా తెలిసికొన దగిన పరమతత్త్వము భగవత్తత్త్వము (భగవంతుడు) మాత్రమే. (15/15) కనుక భగవానుడు తనను వేద్యునిగా తెలియజేసెను.

ప్రశ్న - 'పవిత్రమ్' అనగా అర్థమేమి? భగవంతుడు తనను పవిత్రునిగా తెలుపుటలోని విశేషమేమి?

సమా - స్వయముగా విశుద్ధుడై సహజముగనే ఇతరుల పాపములను రూపుమాపి వారిని గూడ విశుద్ధమొనర్చువాడు పవిత్రుడనబడును. భగవంతుడు పరమ పవిత్రుడు. భగవద్దర్శనము, భాషణము, స్మరణము మనుష్యుని పరమ పవిత్రునిగాజేయును. ఇంతేగాక జగత్తునందు జపతపోవ్రత తీర్థాది పవిత్ర కార్యములన్నియును భగవత్స్వరూపములే. వాటి యందుగల పవిత్రమొనర్చు శక్తిగూడ భగవంతునిదే.

కావున భగవానుడు తనను పవిత్రునిగా తెలియజేసెను.

ప్రశ్న - 'ఓంకారము' అనగానేమి? భగవంతుడు తనను ఓంకార స్వరూపునిగా ఏల తెలియజేసెను?

సమా - ఓంకారము భగవంతుని పేరు. దీనిని ప్రణవము అనియు అందురు. 8వ అధ్యాయమునందలి 13వ శ్లోకమున దీనిని బ్రహ్మము అని తెల్పియుండెను. దీనిని ఉచ్చరింపు (జపింపు) మనియు అర్జునుని ఆదేశించెను. నామము, నామి – ఈ రెంటికిని భేదము లేదని దెల్పుటకే భగవానుడు తనను ఓంకారస్వరూపునిగా పేర్కొనెను.

ప్రశ్న - 'ఋక్సామయజుః' అను సమాసము వేటిని తెలుపును? భగవానుడు వాటిని తన స్వరూపములని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ మూడును వేదములపేర్లు, వేదములు భగవంతుని ద్వారా ప్రకటితములైనవి. అవి భగవంతుని గూర్చి తెలుపును. కావున వేదములన్నియును తన స్వరూపములేయని భగవానుడు తెలిపెను.

ప్రశ్న - ఇచట 'చ' 'ఏవ' అను అవ్యయములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 'చ' అను అవ్యయము ఈ శ్లోకమున వర్ణింపబడిన సమస్త పదార్థముల సమాహారమును దెల్పును. భగవానునకు తప్ప ఏ ఇతర వస్తువునకును అస్తిత్వమే లేదని తెల్పుటకు 'ఏవ' అను అవ్యయము ప్రయుక్తమైనది. ఈ శ్లోకమున వర్ణితములైన పదార్థములన్నియును భగవత్స్వరూపములే. ఆయనకంటె వేఱైన వస్తువు ఏదియునులేదు.

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ 18 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| గతిః | = పరమగతియైన పరంధామమును | అహమ్, ఏవ | = (నేనే) | స్థానమ్ | = వారి స్థితికి ఆధారమును |
| | | నివాసః | = నివాసస్థానమును | | |
| భర్తా | = భరించి, పోషించు వాడను | శరణమ్ | = శరణుపొందదగినవాడను | నిధానమ్ | = నిధానమును (పెన్నిధిని) |
| | | సుహృత్ | = సుహృత్తును | | |
| ప్రభుః | = అందఱికిని స్వామిని | ప్రభవః, ప్రలయః | = అందఱి ఉత్పత్తి, ప్రలయములకు హేతువును | అవ్యయమ్ | = శాశ్వతమైన |
| సాక్షీ | = అందఱి మంచి చెడ్డలను చూచువాడను | | | బీజమ్ | = కారణమును |
| | | | | (అహమ్, ఏవ) | = నేనే |

**పరమగతియైన పరమధామమును, జగత్తును భరించి, పోషించువాడను నేనే. అందరికిని స్వామిని, అందరి శుభాశుభములను చూచువాడను నేనే, అందఱికిని నివాసస్థానమును, శరణుపొందదగినవాడను నేనే, ప్రత్యుపకారమును ఆశింపక హితమొనర్చువాడను, అందఱి ఉత్పత్తిప్రళయములకు హేతువును, వారి స్థితికి ఆధారమును, నిధానమును, శాశ్వతకారణమును నేనే. (18)**

ప్రశ్న - 'గతిః' శబ్దమున కర్థమేమి?

సమా - ప్రాప్యవస్తువును గతి యందురు. సర్వశ్రేష్ఠమైన ప్రాప్యవస్తువు భగవంతుడు మాత్రమే - కనుక అతడు తనను 'గతిః' అని పేర్కొనెను. పరాగతి, పరమాగతి, శాశ్వత పదము అనునవి దీని పేర్లే -

ప్రశ్న - 'భర్తా' అను పదమునకు అర్థమేమి?

సమా - పాలించి, పోషించువానిని 'భర్త' యందురు. సమస్తజగత్తును రక్షించి, పోషించువాడు భగవానుడే. కనుక అతడు తనను 'భర్తా' అని పేర్కొనెను.

ప్రశ్న - 'ప్రభుః' అనగానేమి?

సమా - ప్రజలను శాసించువాడు ప్రభువు. భగవంతుడే అందరికిని ఏకైక పరమప్రభువు. అతడు ఈశ్వరులకు పరమేశ్వరుడు. దేవతలకు పరమదైవము. పతులకు పరమపతి. సమస్త భువనములకు స్వామి. పరమపూజ్యుడు. పరమదైవము. (శ్వేతాశ్వతరోపనిషత్ 6/7) సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, వాయువు, మృత్యువు (యముడు)

మొదలగువారందరునూ ఆ భగవానునకు భయపడియే తమతమ పరిధులలో తమ ధర్మమును నడుపుచుందురు. (కఠ-ఉప 2/3/3) కావున భగవానుడు తనను ప్రభువు అని పేర్కొనెను.

ప్రశ్న - 'సాక్షీ' అనగానేమి?

సమా - సమస్త లోకములను, జీవులను, వారి శుభాశుభ కర్మలను అన్నింటిని తెలిసికొనువాడు, చూచువాడు భగవానుడు మాత్రమే. భూతభవిష్యద్వర్తమానములయందు ఎచ్చటను, ఏ విధముగను ఆ భగవానుని దృష్టిని తప్పించుకొని జరుగుకార్యములే యుండవు. అతనిని మించిన సర్వజ్ఞుడు లేడు. అతడు సర్వజ్ఞత్వమునకు పరాకాష్ఠ కనుక అతడు తనను 'సాక్షీ' అని పేర్కొనెను.

ప్రశ్న - 'నివాస' అను శబ్దమునకర్థమేమి?

సమా - వసించు ప్రదేశమును 'నివాసము' అనియుందురు. సమస్తజీవులు నిలబడినను, కూర్చున్నను, నిద్రించినను, మేల్కొన్నను, నడిచినను, తిరిగినను, జన్మించినను, మరణించినను, సర్వదా సర్వథా భగవంతునియందే వసించుచుందురు. కనుక భగవానుడు తనను సర్వజీవులకును నివాస స్థానముగా పేర్కొనెను.

ప్రశ్న - 'శరణమ్' అనగానేమి?

సమా - శరణప్రదాతను 'శరణం' అని యందురు. భగవంతునితో సమానమైన శరణాగత వత్సలుడు, ప్రపన్నులను అదుకొనువాడు, శరణాగతుల దుఃఖములను తొలగించువాడు మరియొకడు లేడు. వాల్మీకి రామాయణములో శ్రీరాముడు ఇట్లు నుడివెను-

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥
*(6/18/33)*

అనగా ఒక్కసారియైనను 'నేను నీ వాడను' అని పలుకుచు నన్ను శరణుజొచ్చిన సర్వభూతములకును నేను అభయమిచ్చెదను - ఇది నా వ్రతము.

కనుక భగవానుడు తనను 'శరణమ్' అని పేర్కొనెను.

ప్రశ్న - 'సుహృత్' అనగానేమి?

సమా - ప్రత్యుపకారమును (ప్రతిఫలమును) కోరక అవ్యాజప్రేమతో సహజముగనే ఇతరులకు హితమును గూర్చు దయామయుని 'సుహృత్' అని యందురు - భగవానుడు సమస్త ప్రాణులకును అహేతుకముగ మేలుచేయు పరమ హితైషి, అందరియెడ మిక్కిలి ప్రేమగల పరమ బంధువు. కనుక భగవానుడు తనను 'సుహృత్' అని పేర్కొనెను- 5వ అధ్యాయాంతమునందును భగవానుడు 'నన్ను సమస్త ప్రాణులకును సుహృదునిగా ఎరింగినవాడు పరమశాంతిని పొందును'- అని తెలిపెను. (5/29)

ప్రశ్న - 'ప్రభవః, ప్రలయః, స్థానమ్' అను మూడు పదములకు అర్థమేమి?

సమా - సమస్త జగదుత్పత్తికి కారణమును 'ప్రభవః' అనియు, దాని స్థితికి ఆధారమును 'స్థానమ్' అనియు, ప్రళయకారణమును 'ప్రలయః' అనియు అందురు. ఈ సంపూర్ణజగత్తుయొక్క సృష్టి స్థితిలయములు భగవానుని సంకల్పమాత్రమున జరుగుచున్నవి. కనుక అతడు తనను 'ప్రభవః', 'ప్రలయః', 'స్థానమ్' అని పేర్కొనెను.

ప్రశ్న - 'నిధానమ్' అను పదమునకర్థమేమి?

సమా - ఒక వస్తువును దీర్ఘకాలము సురక్షితముగా ఉంచు స్థానమును 'నిధానమ్' అని యందురు. మహా ప్రలయమునందు సమస్త ప్రాణులతో సహా అవ్యక్త ప్రకృతి భగవానుని ఒక అంశయందు బహుకాలము 'అక్రియావస్థ'లో 'న్యాసము' వలె సురక్షితముగా నుండును. కనుక భగవానుడు తనను 'నిధానమ్' అని పేర్కొనెను.

ప్రశ్న - 'అవ్యయమ్' అను విశేషణముతో పాటు 'బీజమ్' అను పదము యొక్క అర్థమేమి?

సమా - ఎన్నడును నశింపని దానిని 'అవ్యయమ్' అని యందురు. భగవానుడు సమస్త చరాచర ప్రాణులకును శాశ్వతకారణము. ఆయన నుండియే సర్వప్రాణుల ఉత్పత్తి జరుగును. వారందరికిని ఆయనయే పరమాధారము. కావున భగవానుడు తనను 'అవ్యయం బీజం' అని పేర్కొనెను. 7వ అధ్యాయము నందలి 10వ శ్లోకమున ఆయన సనాతన బీజమనియు, 10వ అధ్యాయమునందలి 39వ శ్లోకమున సర్వభూతములకును బీజము అనియు తెలుపబడెను.

ప్రశ్న - ఈ శ్లోకమునందు భగవానుడు ఒక్కసారిగూడ 'అహమ్' అను పదమును ప్రయోగింపలేదు. దీనికి కారణమేమి?

సమా - ఇతర శ్లోకములయందు ప్రయుక్తమైన క్రతు, యజ్ఞ, స్వధా, ఔషధ, మంత్ర, ఘృత, ఋక్, యజు, ఆది

శబ్దములన్నియు సహజముగనే భగవంతుని కంటె వేరుగా గోచరించు వస్తువుల పేర్లు. కనుక అవియన్నియును యథార్థముగా తన స్వరూపములే అని తెలుపుటకు వాటితోపాటు 'అహమ్' పదమును ప్రయోగించెను. కాని ఈ శ్లోకమున ప్రయుక్తములైన శబ్దములన్నియును భగవానునకు విశేషణములు. అంతేగాక మునుపటి శ్లోకమున ప్రయుక్తమైన 'అహమ్' అను పదము ఇచట గూడ అన్వయించును. కనుక ఈ శ్లోకమునందు 'అహమ్' అను పదమును ప్రయోగింప నవసరము లేదు.

**తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున! | = ఓ అర్జునా! | నిగృహ్ణామి | = ఆకర్షించుచున్నాను | చ | = మఱియు |
| అహమ్ | = నేను | చ | = మఱియు | మృత్యుః, చ | = మృత్యువును |
| తపామి | = సూర్యరూపమున తపించుచున్నాను | ఉత్సృజామి | = వర్షించుచున్నాను | సత్, అసత్, చ | = సత్తును, అసత్తును గూడ |
| | | అహమ్, ఏవ | = నేనే | | |
| వర్షమ్ | = (సముద్రములనుండి) వర్షజలములను | అమృతమ్ | = అమృతమును | అహమ్, (ఏవ) | = నేనే. |

**ఓ అర్జునా! సూర్యరూపమున నేనే తపించుచున్నాను. సముద్రములనుండి నీటిని గ్రహించి , వర్షరూపమున మఱల వదలెదను. అమృతమును, మృత్యువును గూడ నేనే. సత్తును(శాశ్వతమైన ఆత్మను) అసత్తును (నశ్వరమైన సమస్త వస్తుజాలమును) గూడ నేనే. (19)**

ప్రశ్న - 'సూర్యరూపమున నేనే తపింపజేయుదును, మరియు నీటిని ఆకర్షించి, వర్షింతును.' - ఈ వాక్యముల విశేషమేమి?

సమా - సూర్యుడు తన కిరణములద్వారా జగత్తునకు వేడిని, ప్రకాశమును ఇచ్చును. అట్లే సముద్రము మొదలగు జలాశయములనుండి ఆవిరి రూపమున నీటిని గ్రహించి, మేఘముల ద్వారా లోకహితార్థమై తగిన సమయములో తగినంతగా వానలను అనుగ్రహించును. అట్టి సూర్యుడు కూడా భగవత్స్వరూపమే.

ప్రశ్న - 'అమృతమ్' అను పదమునకు అర్థమేమి?

సమా - అమృతపానము చేసిన వారిని మృత్యువు దరిజేరదు. అయినను దేవలోకమునందు దేవతలు ఆస్వాదించెడి అమృతము వారిని పూర్తిగా మృత్యువునకు దూరము చేయదు. కాని వారి మరణము మృత్యు (మర్త్య) లోకములోని జీవుల మరణముకంటె విలక్షణమైనది. అయితే పరమ - అమృత మూర్తియైన భగవంతుని పొందినవాడు శాశ్వతముగా మృత్యుపాశమునుండి ముక్తుడగును- కావున భగవానుడు తనను 'అమృతమ్' అని పేర్కొనెను. ఈ కారణమున ముక్తిని గూడ 'అమృతమ్' అని యందురు.

ప్రశ్న - 'మృత్యువు' అనగానేమి? దానిని భగవానుడు తన స్వరూపముగా తెల్పుటలోని విశేషమేమి?

సమా - అందరిని నశింపచేయు కాలుని మృత్యువు అని యందురు. జగల్లీలావిలసనమునకు సృష్టిసంహారములు రెండును అవసరమే - జగన్నాటకసూత్రధారి (లీలామయుడు) అయిన భగవంతుడు ఈ రెండు కార్యములను నెరవేర్చుచుండును. ఆయనయే లోకములను సంహరించుటకు తగు సమయములలో మహాకాలరూపమును స్వీకరించును. భగవానుడే స్వయముగా 'లోకక్షయము కొరకు నేనే మహాకాలుడనైతిని'. (11/32) అని పలికెను. కావుననే భగవానుడు తనను మృత్యుస్వరూపునిగా పేర్కొనెను.

ప్రశ్న - 'సత్, అసత్' అనగానేమి? భగవానుడు వాటిని తన స్వరూపముగా తెలుపుటలోని విశేషమేమి?

సమా - ఎన్నడును నశింపని శాశ్వతమైన ఆత్మ 'సత్' అనబడును. నశ్వరమై అనిత్యమైన వస్తువు 'అసత్'

అనబడును. 15వ అధ్యాయమున ఈ రెండింటిని 'అక్షరుడు', 'క్షరుడు' అను పురుషులుగా చెప్పుట జరిగినది. ఈ రెండును భగవంతుని యొక్క పరా, అపరా ప్రకృతులు. ఈ ప్రకృతులు రెండును భగవంతునికంటె భిన్నమైనవి (వేరైనవి) కావు. కావున భగవానుడు 'సత్', అసత్' అను రెండును తన స్వరూపములే అని తెల్పెను.

*సంబంధము - 13 నుండి 15వ శ్లోకము వరకు భగవానుడు తన సగుణ నిర్గుణ విరాట్ స్వరూప - ఉపాసనారీతులను వర్ణించి, విశ్వమంతయు తన స్వరూపమే అని 19వ శ్లోకము వరకు తెల్పెను. ఆకారణమున ఇంద్రాది - అన్యదేవతల ఉపాసనయు ప్రకారాంతమున భగవదుపాసనయే యగును. కాని ఈ విషయమును ఎరుంగని వారు ఫలాసక్తితో వేర్వేరు భావములతో (అన్యదేవతలను) ఉపాసించుట వలన భగవత్ప్రాప్తిని పొందక అనిత్యములైన ఫలములను పొందుదురు. ఈ విషయమును స్పష్టపరచుటకే రెండు శ్లోకములలో ఆ (అన్యదేవతల) ఉపాసనలను ఫలసహితముగ వర్ణించుచున్నాడు-*

**త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।**
**తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్ అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥ 20 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్రైవిద్యాః | = ఋగ్యజుస్సామవేదము | | పురుషులు | పుణ్యమ్ | = పుణ్యఫలరూపమైన |
| | లచే ప్రోక్తములైన | యజ్ఞైః | = యజ్ఞములద్వారా | సురేంద్రలోకమ్ | = స్వర్గలోకమును |
| | సకామకర్మలను | మామ్ | = నన్ను | ఆసాద్య | = పొంది |
| | ఆచరించువారును | ఇష్ట్వా | = పూజించి | దివి | = స్వర్గమునందు |
| సోమపాః | = సోమరసపానము | స్వర్గతిమ్ | = స్వర్గప్రాప్తిని | దివ్యాన్ | = దివ్యములైన |
| | చేయువారును | ప్రార్థయంతే | = అర్థించుచుందురు | దేవభోగాన్ | = దేవభోగములను |
| పూతపాపాః | = పాపరహితులును అగు | తే | = ఆ పురుషులు | అశ్నంతి | = అనుభవింతురు. |

**ఋగ్యజుస్సామవేదములచే ప్రోక్తములైన సకామకర్మలను చేయువారును, సోమరసపానము చేయువారును, పాపరహితులై యజ్ఞములద్వారా నన్ను సేవించి, స్వర్గప్రాప్తిని కోరుచుందురు. అట్టి పురుషులు తమ పుణ్యఫలరూపమైన స్వర్గలోకమును పొందుదురు. అచ్చట దేవతలదివ్యభోగములను అనుభవింతురు. (20)**

ప్రశ్న - 'త్రైవిద్యాః' 'సోమపాః', 'పూతపాపాః' అను మూడు పదముల అర్థము లేమి? ఈ విశేషణములు ఏ శ్రేణి వారికి చెందినవి?

సమా - ఋగ్యజుస్సామవేదములను మూడింటిని 'వేదత్రయీ' లేక 'త్రివిద్యాః' అని యందురు. ఈ మూడు వేదములయందును వర్ణితములైన నానా విధయజ్ఞవిధులయందును, వాటి ఫలములయందును శ్రద్ధాదరములు గలవారిని, అట్లే వాటిననుసరించి, సకామకర్మలను చేయువారిని 'త్రైవిద్యాః' అని యందురు. యజ్ఞవిధుల ననుసరించి సోమలతారసమును ఆస్వాదించు వారిని 'సోమపాః' అని యందురు. వేదోక్తకర్మలను విధివిధానముగా అనుష్ఠించుట వలన స్వర్గ ప్రాప్తికి ప్రతిబంధకములైన పాపములు నశించిన వారిని 'పూతపాపాః' అని యందురు. సర్వరూపములును భగవంతునివే అని ఎరుంగనివారు వేదోక్తములైన కర్మకాండలయెడ భక్తిశ్రద్ధలు గలిగి, తమను పాపకర్మ ఫలములనుండి రక్షించుకొనుటకై సకామ భావముతో యజ్ఞాది కర్మలను విధి పూర్వకముగా అనుష్ఠింతురు. పైన పేర్కొనబడిన మూడు విశేషణములును ఈ శ్రేణికి చెందిన వారికి వర్తించును.

ప్రశ్న - 'పూతపాపాః' అను సమాసపదమునకు సమస్త పాపములును సర్వథా నశించినవారు - అను అర్థమును చెప్పినచో దోషమేమి?

సమా - 'పూతపాపాః' అనగా వారి పాపములన్నియు సమూలముగా నశించినవని అర్థముగాదు. ఏలనన పాపపుణ్య ఫలములు రెండును క్షయమైనచో ఆ క్షణముననే వారికి ముక్తి లభించియుండవలెను. కాని రాబోవు శ్లోకములో

దేవతాలోకములలో వారి పుణ్య ఫలానుభవములు పూర్తికాగానే వారు మనుష్యలోకమునకు చేరుదురు - అని తెల్పబడినది. పుణ్యపాపములు రెండును నశించినచో పునర్జన్మ ఉండనే ఉండదుగదా! కావున 'పూతపాపాః' అను పదమునకు పైన తెలుపబడిన అర్థమే సరియైనది.

ప్రశ్న - ఇచట 'మామ్' అను పదము ఎవరిని తెలుపును? యజ్ఞములద్వారా ఆయనను సేవించుట యనగానేమి?

సమా - భగవానుని అంగములైన ఇంద్రాది దేవతలను సూచించునదియే 'మామ్' అను పదము. శాస్త్ర విధిననుసరించి, శ్రద్ధతో యజ్ఞ పూజాదికముల ద్వారా వేర్వేరు దేవతలను పూజించుటయే భగవానుని సేవించుట యగును. ఇంద్రాది దేవతలు భగవంతుని అంగములగుట వలన వారిని పూజించుటయు ప్రకారాంతరమున భగవంతుని పూజించుటయే యగును. కాని, ఈ తత్త్వము నెరుంగక అజ్ఞానవశమున సకామకర్ములైనవారు భగవత్ప్రాప్తికి దూరమగుదురు.

ప్రశ్న - 'స్వర్గతిమ్' అనగానేమి? దానికై ప్రార్థించుట యనగానేమి?

సమా - స్వర్గప్రాప్తియే 'స్వర్గతి' అనబడును. వేదవిహిత కర్మల ద్వారా దేవతలను ఆరాధించి, వారిని స్వర్గప్రాప్తికై అర్థించుటయే దానికై ప్రార్థించుట యగును.

ప్రశ్న - 'పుణ్యమ్' అను విశేషణముతో పాటు 'సురేంద్ర లోకమ్' అను పదము ఏ లోకమును సూచించును? అచట దేవతల దివ్యభోగములను అనుభవించుట యనగానేమి?

సమా - యజ్ఞాది పుణ్యకర్మల ఫల రూపములైన ఇంద్రలోకము మొదలుకొని బ్రహ్మలోక పర్యంతముగల లోకములన్నియు 'పుణ్యమ్' అను విశేషణముతోపాటు ప్రయుక్తమై 'సురేంద్రలోకమ్' - అను పదముచే సూచింపబడును. 'సురేంద్రలోకమ్' అను పదమునకు 'ఇంద్రలోకము' అనియే అర్థము. అయినను అది సమస్త దివ్యలోకములను సూచించును. తమతమ పుణ్యకర్మలననుసరించి, ఆయాలోకములను చేరి, మానవులు మర్త్యలోకమున లభింపని తేజోమయ విలక్షణ దివ్యభోగములను మనస్సుద్వారా, ఇంద్రియములద్వారా అనుభవించుటయే దివ్యములైన దేవభోగములను అనుభవించుట యగును.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।**
**ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తే | = ఆ పురుషులు | మర్త్యలోకమ్ | = మనుష్యలోకమును | కామకామాః | = భోగములను ఆశించువారై |
| తమ్ | = ఆ | విశంతి | = ప్రవేశింతురు | గతాగతమ్ | = స్వర్గమర్త్యలోకముల మధ్య రాకపోకలను, |
| విశాలమ్ | = విశాలములైన | ఏవమ్ | = ఈ ప్రకారముగా | లభంతే | = పొందుదురు (సాగింతురు), (పుణ్యప్రభావముచే స్వర్గమునకు పోవుదురు. పుణ్యము క్షీణింపగానే మర్త్యలోకమునకు వచ్చెదరు). |
| స్వర్గలోకమ్ | = స్వర్గలోకభోగములను | త్రయీధర్మమ్ | = (స్వర్గప్రాప్తి సాధనములైన వేద త్రయ విహిత సకామ కర్మఫలము(ల)ను | | |
| భుక్త్వా | = అనుభవించి | | | | |
| పుణ్యే | = పుణ్యములు | | | | |
| క్షీణే | = క్షీణింపగనే | అనుప్రపన్నాః | = ఆశ్రయించువారును | | |

ఆ విశాలస్వర్గమునందు భోగములను అనుభవించి, పుణ్యములు అయిపోగానే (క్షీణింపగానే) మరల మర్త్యలోకమున ప్రవేశింతురు. ఈ విధముగ స్వర్గప్రాప్తి సాధనములైన వేదత్రయవిహిత సకామకర్మలను ఆశ్రయించువారు, భోగములను ఆశించుచూ స్వర్గమర్త్యలోకముల మధ్య రాకపోకలు సాగించుచుందురు. అనగా పుణ్యప్రభావముచే స్వర్గమునకు పోవుదురు. పుణ్యము క్షీణింపగనే మర్త్యలోకమునకు వచ్చెదరు. **(21)**

ప్రశ్న - స్వర్గలోకము 'విశాలము' అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - స్వర్గలోకముల విస్తృతి, వివిధములగు భోగ్యవస్తువుల సంఖ్య, వాటి సుఖకరస్థితి, వాటిని అనుభవించు వారి శారీరక మానసిక శక్తులు, వారి ఆయుః ప్రమాణములు అన్నియును మర్త్యలోకముతో పోల్చినప్పుడు అధికములు, శ్రేష్ఠములు. కావున స్వర్గలోకమును విశాలమైనదిగా పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - పుణ్యములు క్షీణించుట, మర్త్యలోకము ప్రాప్తించుట అనగానేమి?

సమా - పుణ్యకర్మల ఫలములను అనుభవించుటకు జీవులకు స్వర్గలోక ప్రాప్తి కలుగును. ఆ పుణ్యకర్మల ఫలానుభవములు సమాప్తమగుటయే అవి క్షీణించుట యనబడును. ఆ స్వర్గమునకు సంబంధించిన పుణ్యఫలములు సమాప్తముకాగానే మిగిలిన పాపపుణ్య ఫలానుభవములకై మరల మర్త్యలోకమునకు నెట్టబడుట (విసరివేయబడుటనే) మర్త్యలోకప్రాప్తి కలుగుట యందురు.

ప్రశ్న - 'త్రయీ ధర్మమ్' అను పదము ఏ ధర్మమును సూచించును? దానిని ఆశ్రయించుట యనగానేమి?

సమా - ఋగ్యజుస్సామములు అను మూడు వేదములను 'త్రయీ' అని యందురు. అందు స్వర్గప్రాప్తికి ఉపాయములైన ధర్మములు తెల్పబడినవి. వాటినే 'త్రయీ ధర్మము' అను పదము సూచించును. స్వర్గప్రాప్తి రూపములైన ఆ ధర్మములను యథావిధిగా పాటించుట, స్వర్గసుఖములే సర్వశ్రేష్ఠములు, ప్రాప్యములు అని తలంచుట త్రయీధర్మమును ఆశ్రయించుట యగును.

భగవంతుని స్వరూపతత్త్వమును ఎరుంగనివారు కోరికలపై ఆసక్తి గలిగి అనన్య చిత్తములతో భగవంతుని శరణు పొందరు. వారు భోగవాంఛావశులై త్రయీ ధర్మములను ఆశ్రయింతురు. ఆ కర్మఫలములు అనిత్యములు అగుటవలన వారు మరల మర్త్యలోకమునకు రావలసి వచ్చును. కాని స్వర్గసుఖములనిచ్చు ఈ ధర్మములను ఆశ్రయింపక భగవంతునే శరణుజొచ్చినవారు సాక్షాత్తు భగవంతునే పొంది అన్ని బంధముల నుండి సర్వథా విముక్తులయ్యెదరు. కృతకృత్యులైన అట్టి పురుషులు మరల ఈ జగత్తునందు జన్మింపరు.

ప్రశ్న - 'కామకామాః' అను పదమునకు అర్థమేమి? ఇది ఎట్టి పురుషులకు విశేషణము? మరియు గతాగతములను (గమనాగమనములను) పొందుట యనగానేమి?

సమా - సాంసారిక భోగములను కామములందురు. అట్టి భోగములను కోరుకొను మనుష్యులనే 'కామకామాః' అని యందురు. స్వర్గప్రాప్తి సాధన రూపములైన వేదవిహిత సకామ కర్మలను, ఉపాసనలను అనుష్ఠించు మనుష్యులకు ఇది విశేషణము. ఇట్టివారు తమ కర్మఫలములను అనుభవించుటకై మాటిమాటికి ఊర్ధ్వ - అధోలోకములకు మధ్య తిరుగుచునే యుందురు. ఇట్లు తిరుగుటనే గతాగతములను పొందుట యందురు.

సంబంధము - యజ్ఞముల ద్వారా దేవతలను సేవించు సకామకర్ములైన మనుష్యులొనర్చు దేవతా పూజల ఫలములు *గమనాగమనములని రెండు శ్లోకములలో భగవానుడు తెలిపెను. ఇపుడు వారికంటె వేరైన తన అనన్యభక్తుల నిష్కామ - ఉపాసనల ఫలముగా వారి యోగక్షేమములను తానే వహింతునని తెల్పుచున్నాడు-*

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యే, అనన్యాః, జనాః | = అనన్యభక్తులైన ఏ పురుషులు | పర్యుపాసతే | = (ఉన్నవారై) (నిష్కామభావముతో) సేవింతురో | తేషామ్ | = ఆ పురుషుల యొక్క |
| మామ్ | = పరమేశ్వరుడనైన నన్ను | | | యోగక్షేమమ్ | = యోగక్షేమములను |
| చింతయంతః | = నిరంతరము చింతించుచు | నిత్యాభియుక్తానామ్ | = నిరంతరము నన్నే చింతించునట్టి | అహమ్ | = నేనే (స్వయముగా) |
| | | | | వహామి | = వహింతును. |

పరమేశ్వరుడనైన నన్ను నిరంతరము అనన్య భక్తితో చింతనచేయుచు, నిష్కామ భావముతో సేవించువారి యోగక్షేమములను నేనే వహించుచుందును. (అప్రాప్త వస్తుప్రాప్తిని 'యోగము' అనియందురు. ప్రాప్తించిన వస్తురక్షణమును 'క్షేమము' అని యందురు.) (22)

ప్రశ్న - 'అనన్యాః' అను పదము ఎట్టి భక్తులకు విశేషణము?

సమా - ప్రాపంచిక భోగములన్నిటి యందలి ఆసక్తిని త్యజించి, కేవలము భగవంతునియందే స్థిరమైన, దృఢమైన భక్తిగలవారును, భగవంతుడు తప్ప ఇతరులెవ్వరును ఉపాస్యులు కారని నమ్మినవారును, భగవంతుడే పరమాశ్రయుడు, పరమగతి, పరమప్రేమాస్పదుడని భావించువారును అగు ఏకనిష్ఠాపరులైన పరమభక్తులకు విశేషణమే 'అనన్యాః' అను పదము.

ప్రశ్న - 'మామ్' అనుపదము ఎవరిని సూచించును? అతనిని చింతన చేయుచు నిష్కామ భావముతో భజించుట యనగానేమి?

సమా - 'మామ్' అను పదము సగుణపరమేశ్వరుడైన పురుషోత్తముని సూచించును. అతని గుణప్రభావ తత్త్వములను, రహస్యములను తెలిసికొని నడుచుచు, తిరుగుచు, లేచుచు, కూర్చొనుచు, నిద్రించుచు, మేల్కొనుచు ఏకాంతమున సాధన చేయుచు, అన్ని సమయములందును నిరంతరము అవిచ్ఛిన్నముగా భగవచ్చింతన చేయుచు, అతని ఆజ్ఞానుసారమే నిష్కామభావముతో భగవదనుగ్రహము కొరకు పాటుపడుచుండుటయే 'అతని చింతన చేయుచు నిష్కామభావముతో భజించుట' యగును.

ప్రశ్న - నిత్యము, నిరంతరము చింతన చేయువారి యోగక్షేమములను వహించుట యనగానేమి?

సమా - ప్రాప్తింపని వస్తువుయొక్క ప్రాప్తిని యోగమని యందురు. ప్రాప్తించిన వస్తువుయొక్క పరిరక్షణమును క్షేమమని యందురు. కనుక భగవత్ప్రాప్తి కొరకై లభించిన సాధనలను అన్ని విధములైన విఘ్నముల నుండి బాధలనుండి రక్షించుట, ఆ సాధనలలోని లోపములను సవరించి, భగవత్ప్రాప్తి కలిగించుట - ఇదియే అనన్య భక్తుల యోగక్షేమములను వహించుట యగును. మహాభక్తుడైన ప్రహ్లాదుని జీవితము ఇందుకు చక్కని నిదర్శనము. హిరణ్యకశిపుని వలన అతని సాధనకు మహావిఘ్నపరంపర ఏర్పడినను భగవానుడే అన్ని విధముల అతనిని రక్షించి, కడకు పరమప్రాప్తిని ప్రసాదించెను.

ప్రశ్న - భగవంతుడు (భగవత్ప్రాప్తి) సాధనకు సంబంధించిన యోగక్షేమములను వహించుననుమాట సత్యమే - కాని జీవన నిర్వహణకు కావలసిన లౌకికమైన యోగక్షేమములనుగూడ ఆయనయే వహించునా?

సమా - చిన్న పెద్ద భేదములు లేకుండ సమస్త విశ్వమునందు గల అనంత జీవరాసుల పోషణభారమును భగవానుడే మోయును. వారిలో తనచింతన చేయువారు - చేయనివారు అనుభేదములకు తావీయక సహజముగనే పరమ సుహృద్భావముతో అందరి యోగక్షేమములను వహించుచుండును. ఇక పరమ భక్తుల యోగక్షేమములను వహించుచుండునను విషయమును గూర్చి చెప్పవలసిన పనియేలేదు. మహాభక్తులు అనుక్షణము కేవలము భగవచ్చింతన యందే నిమగ్నులైయుందురు. భగవంతుడు తప్ప వారికి మరియే విషయమూ పట్టదు. ఇట్లు నిత్యాభియుక్తులైన భక్తుల యోగక్షేమములను ఆయనయే చూచును. తల్లియొడిలో పెరుగు పసిపాప తల్లిని మాత్రమే ఎరుగును. అతనికి అవసరములగు వస్తువులను, తద్రక్షణను తల్లియే చూచును. ఆ శిశువునకు ఏమియు తెలియదు. సమయమునకు తగినట్లుగా అతని అవసరములను ఆమెయే తీర్చును. అదే విధముగ నిత్యాభియుక్తులైన భక్తులయొక్క లౌకిక పారమార్థిక - అవసరములను అన్నింటిని భగవంతుడే తీర్చుచుండును. రక్షించుచుండును. తల్లిమీదనే ఆధారపడు సంతానమునకు హితకరములైన విషయములను వారి నిర్ణయములకే విడిచిపెట్టక స్వయముగా ఆమెయే చూచుచుండును. భగవంతుడు తన భక్తుల యథార్థహితమును తల్లికంటె ఎక్కువ విచారించుచుండును. భక్తుల అవసరములను గమనించి, వాటిని సమకూర్చుచు వారిని కాపాడుచుండును. భక్తులకు సమకూర్చబడు వస్తువులు ఐహికములా? పారమార్థికములా? అను ప్రశ్నలకు ఇచట తావులేదు. భక్తులకు యథార్థముగా అన్ని విధములుగను హితకరములైన వాటిని మాత్రమే అతడు సమకూర్చును. భగవద్విస్మృతిని కలిగించు వస్తువుల ప్రాప్తి లేకుండ చేయుటయే అతని యోగ క్షేమములను చూచుట - అట్లే భక్తునకు ఏ వస్తువు లేనిచో అతడు భగవంతుని

మరచిపోవునో దానిని సమకూర్చి కాపాడుటయు అతని యోగక్షేమ విచారణ చేయుటలోని భాగమే.

భక్తునకు శ్రేయస్కరములైన వస్తువులను భగవంతుడు స్వయముగా తానే సమకూర్చి వాటిని పరిరక్షించును. అవి లౌకికములైనవియైనను కావచ్చును లేక సాధనకు సంబంధించినవైనను కావచ్చును. భగవత్పరాయణులై అనన్య చిత్తముతో నిరంతరము భగవంతునే చింతన చేయుచు అన్ని పనులను నిర్వహించువారియొక్క భారమును, ఇతరములైన ఏ విషయముల యందును కోరిక, ఆసక్తి, చింతన లేని వారియొక్క జీవన నిర్వహణ భారమంతయును భగవంతుడే భరించును. సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వదర్శి, పరమసుహృదుడైన భగవానుడు తన భక్తులయొక్క అన్ని విధములైన యోగక్షేమములను వహించును. అందులో ఎట్టి లోపముగాని, విపరీత పరిణామముగాని ఉండదు. భగవన్నిర్ణయము వలన భక్తునకు ఎల్లప్పుడును సుఖము, శాంతి, ప్రేమ, ఆనందము లభించుచుండును. అట్టి భక్తునకు అతి శీఘ్రముగా భగవత్సాక్షాత్కారము లభ్యమగును. కావున ఇచ్చట యోగమనగా భగవత్స్వరూప ప్రాప్తి అనియు, క్షేమమనగా తత్ప్రాప్తికై చేయు సాధన సంరక్షణ యనియు అర్థము చెప్పబడినది.

సంబంధము - పూర్వ శ్లోకమునందు సమస్త విశ్వమును తన స్వరూపముగా భగవానుడు తెలిపెను. ఆ పిమ్మట యజ్ఞముల ద్వారా చేయబడు అన్యదేవతాపూజలు ప్రకారాంతరమున తన పూజలే యని తెలుపుచు దాని ఫలము జనన మరణచక్రములో పడుటయే యని పేర్కొనెను. అనన్య భక్తి ద్వారా తనను ఉపాసించు వారికి తన ప్రాప్తియెట్లు కలుగునో తెలుపుచున్నాడు-

**యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ కుంతీసుతా! | శ్రద్ధయాన్వితాః | = శ్రద్ధాదరములుగలవారై | మామ్, ఏవ | = నన్నే |
| అపి | = అయినప్పటికిని | అన్యదేవతాః | = ఇతర దేవతలను | యజంతి | = పూజించుచున్నారు |
| యే | = ఏ | యజంతే | = పూజింతురో | | కాని, వారి పూజలు |
| భక్తాః | = సకామ భక్తులు | తే, అపి | = వారుకూడ | అవిధిపూర్వకమ్ | = విధ్యుక్తములు కావు |

**ఓ అర్జునా! శ్రద్ధాన్వితులైన సకామ భక్తులు ఇతరదేవతలను పూజించినప్పటికిని వారు నన్ను పూజించినట్లే. కాని వారిపూజలు అవిధిపూర్వకములైనవి. అనగా అజ్ఞానముతో కూడినవి. (23)**

ప్రశ్న - 'శ్రద్ధయాన్వితాః' అనగానేమి? ఇచటి ఈ విశేషణముల యొక్క వైశిష్ట్యమేమి?

సమా - వేదశాస్త్రములలో వర్ణింపబడిన దేవతల యందును, వారి ఉపాసనలయందును, స్వర్గాదిప్రాప్తి రూపతత్ఫలములయందును ఆదర పూర్వకమైన దృఢవిశ్వాసము కలవారిని 'శ్రద్ధయాన్వితాః' అను పదము సూచించును. శ్రద్ధాదరములు లేక దంభముతో యజ్ఞాది కర్మల ద్వారా దేవతలను సేవించువారు ఈ శ్రేణికి చెందరు. వారు ఆసురీ ప్రకృతి కలవారుగా పరిగణింపబడుదురు అని తెలుపుటకే ఈ విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ఇట్టి మనుష్యులు అన్యదేవతలను పూజింతురు - అనగానేమి? అది అవిధిపూర్వకముగా భగవంతుని పూజించుట అని యేల చెప్పబడినది?

సమా - కోరికలు సిద్ధించుటకు శాస్త్రములలో తెల్పబడిన రీతిగా ఆయా దేవతలను యజ్ఞాది కర్మలద్వారా భక్తిశ్రద్ధలతో పూజించుట అన్య దేవతలను పూజించుటయగును. సమస్త దేవతలును భగవంతుని అంగములే - భగవంతుడే వారందరికిని స్వామి - వాస్తవముగా భగవంతుడే వారి రూపములలో ప్రకటితుడగుచున్నాడు. ఈ తత్త్వమునెరుంగక ఆ దేవతలను భగవానునికంటె వేరుగా భావించి సకామభావముతో వారిని పూజించుట భగవంతుని అవిధిపూర్వకముగా పూజించుట యగును.

ప్రశ్న - అన్య దేవతలను పూజించుట ద్వారా భగవంతుని విధిపూర్వకముగా ఎట్లు పూజింపవచ్చును? దానిఫలమేమి?

సమా - ఇతర దేవతలు గూడ భగవంతుని యొక్క అంగములగుట వలన వారందరును భగవత్స్వరూపులే యని భావించి, భగవత్ప్రాప్తికై నిష్కామభావముతో ఆదేవతలను శాస్త్రోక్తరీతిగా భక్తిశ్రద్ధలతో పూజించుటయు ఆ దేవతలను పూజించుట ద్వారా భగవంతుని విధి పూర్వకముగా పూజించుటయే యగును. దీని ఫలముగూడ భగవత్ప్రాప్తియే.

రాజా రంతిదేవుడు, అతిథి, అభ్యాగతులను భగవత్స్వరూపులుగా నెంచి, వారిని అన్నదానములతో ఆదరించెడివాడు. తాను ఆకలిబాధకు ఓర్చుకొనుచు అతిథి సపర్యలు నడపుచుండెడివాడు. దానినే భగవత్సేవగా భావించెడివాడు. దాని ఫలస్వరూపముగా అతడు భగవత్ప్రాప్తినందెను. ఈ విధముగా ఎవ్వరైనను దేవతలను, గురువులను, బ్రాహ్మణులను, మాతాపితరులను, అతిథులను, అభ్యాగతులు మొదలగు సమస్త ప్రాణులను భగవత్స్వరూపులుగా భావించి, భగవదనుగ్రహముకొరకై అతని ఆజ్ఞానుసారము, వారందరికిని సేవాది కార్యక్రమములను ఒనర్చినచో వారి ఆ సేవ విధిపూర్వకమైన భగవత్సేవయగును. దాని ఫలము భగవత్ప్రాప్తియే యగును. ఈ తత్త్వమును తెలియక సకామ బుద్ధితో శ్రద్ధాదరములు కలిగి, అన్య దేవతలను తమ యోగ్యతలను అనుసరించి, సేవాపూజాదికములను ఎవ్వరు నిర్వహించినను ఆ సేవలు భగవంతునకే చెందును. ఏలనన భగవంతుడే అన్ని యజ్ఞములకును భోక్త, అందరికిని మహేశ్వరుడు, మరియు సర్వరూపుడు. అయినను భావములో లోపముండుటవలన అది విధిపూర్వకముగా భగవంతుని సేవించినట్లు గాదు. కనుక దాని ఫలము గూడ భగవత్ప్రాప్తికిగాక స్వర్గాది ప్రాప్తి యగును. భగవత్స్వరూపతత్త్వము తెలియనందువలన ఫలమునందు గూడ మిక్కిలి తారతమ్యములు కలుగుచునే యుండును.

*సంబంధము - ఇతర దేవతల కొనర్చు పూజ విధ్యుక్తముగా భగవంతుని పూజించుటగాదు - అని ఇంతకు ముందు పేర్కొనబడెను. ఆ విధముగా పూజించువారికి భగవత్ప్రాప్తిరూప ఫలములభింపకుండుటకు కారణమేమి? అను విషయములను స్పష్టపరచుచున్నాడు-*

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।**
**న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥ 24 ॥**

హి = ఏలనన
సర్వయజ్ఞానామ్ = సకలయజ్ఞములకును
భోక్తా = భోక్తయును
చ = మఱియు
ప్రభుః, చ = స్వామియును
అహమ్, ఏవ = నేనే
తు = కాని
తే = వారు
మామ్ = పరమేశ్వరుడనైన నన్ను
తత్త్వేన = తత్త్వపూర్వకముగా
(నాపరమేశ్వర తత్త్వమును)
న, అభిజానంతి = ఎఱుంగరు
అతః = అందువలన
చ్యవంతి = పతనమగుదురు
(పునర్జన్మను పొందుదురు)

**ఏలనన సకల యజ్ఞములకును భోక్తను, స్వామిని గూడ నేనే. వారు నా పరమేశ్వర తత్త్వమును ఎఱుంగరు. కాపున పతనమగుదురు. అనగా పునర్జన్మను పొందుదురు. (24)**

ప్రశ్న - భగవంతుడే అన్ని యజ్ఞములకును భోక్త, ప్రభువు అనియెట్లు చెప్పనచ్చును.

సమా - ఈ విశ్వమంతయు భగవంతుని విరాడ్రూపము అగుటవలన వేర్వేరు యజ్ఞపూజాదికర్మలకు భోక్తలుగా భావింపబడు దేవతలందరును భగవానుని అంగములే - భగవానుడే వారందరికిని ఆత్మ .(10/20) కావున ఆయా దేవతల రూపములలో భగవానుడే సమస్త యజ్ఞాది కర్మలకు భోక్తయగును. భగవానుడే తన యోగశక్తిద్వారా సంపూర్ణ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను ఒనర్చుచు అందరిని వారివారి యోగ్యతలను అనుసరించి, నియమముల ప్రకారము నడిపించుచుండును., ఇంద్రుడు, వరుణుడు, యముడు, ప్రజాపతి మొదలగు లోకపాలురు మరియు ఇతర దేవగణములందరికిని అతడే నియంత - కావున అతడందరికిని ప్రభువు. అనగా మహేశ్వరుడు (5/29).

ప్రశ్న - ఇచట 'తు' అను అవ్యయ ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - ఇచట 'తు' అనగా 'పరంతు' (కాని) అని యర్థము. భగవంతుడే భోక్త, స్వామి అయినప్పటికిని వారు అజ్ఞానవశమున ఆయన ప్రభావమును గుర్తింపరు.

ప్రశ్న - ఇచట 'తే' అను సర్వనామము ఎవరిని సూచించును? వారు భగవత్తత్త్వమును ఎరుగరు - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - అన్యదేవతలను పూజించుట ద్వారా అవిధి పూర్వకముగా భగవానుని పూజించు సకామకర్ములను తెలుపునదియే ఇచట 'తే' అను పదము. 16 నుండి 19వ శ్లోకము వరకు వర్ణింపబడిన భగవానుని గుణప్రభావ సహితమైన స్వరూపమును ఎరుగక పోవుటచే వారు (సకామకర్ములు) యజ్ఞములన్నింటికిని భగవంతుడే భోక్తయనియు, సమస్త లోకములకును మహేశ్వరుడనియు తెలియజాలరు. భగవత్తత్త్వమును ఎరుంగక పోవుట యనగా ఇదియే.

ప్రశ్న - 'అతః' అను అవ్యయము యొక్క అర్థమేమి? దానితోపాటు 'చ్యవన్తి' అను క్రియాపదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'అతః' అను అవ్యయము హేతువాచకము. భగవత్తత్త్వమును ఎరుంగని కారణముననే అజ్ఞానులైన ఈ మనుష్యులు భగవత్ప్రాప్తి రూపమైన అత్యుత్తమ ఫలమును పొందక స్వర్గప్రాప్తి వంటి అల్పఫలములను అనుభవించుచు జనన మరణ చక్రములో చిక్కుపడుచున్నారు.

*సంబంధము - భగవద్భక్తులకు పునర్జన్మప్రాప్తి యుండదు. అన్యదేవతలను ఉపాసించు వారికే పునర్జన్మ కలుగును. దీనికి కారణమేమి? అను సందేహమునకు సమాధానముగా ఉపాస్యదేవతా స్వరూపములు, ఉపాసకుల భావములు ఈ రెండింటియందు భేదములుండుటవలన ఫలములయందు గూడ భేదము లేర్పడుచున్నవని భగవానుడు తెలుపుచున్నాడు-*

**యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః ।**
**భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్ ॥ 25 ॥**

| పదము | అర్థము |
|---|---|
| దేవవ్రతాః | = దేవతలను పూజించువారు |
| దేవాన్ | = దేవతలను |
| యాంతి | = పొందుదురు |
| పితృవ్రతాః | = పితరులను సేవించువారు |
| పితౄన్ | = పితృలోకములను |
| యాంతి | = పొందుదురు |
| భూతేజ్యాః | = భూతప్రేతములను అర్చించువారు |
| భూతాని | = భూతప్రేతరూపములను |
| యాంతి | = పొందుదురు |
| మద్యాజినః | = నన్ను ఆరాధించు భక్తులు |
| మామ్, అపి | = నన్నే |
| యాంతి | = పొందుదురు. |

**దేవతలను పూజించువారు దేవలోకములను చేరుదురు. పితరులను సేవించువారు పితృలోకములకు వెళ్ళుదురు. భూతప్రేతములను అర్చించువారు భూతప్రేత రూపములను పొందుదురు. నన్ను ఆరాధించు భక్తులు నన్నే పొందుదురు. అట్టి నా భక్తులకు పునర్జన్మ ఉండదు. (25)**

ప్రశ్న - 'దేవవ్రతాః' అను పదము ఎవరిని సూచించును? వారు దేవతలను పొందుదురు - అనగానేమి?

సమా - దేవతలను పూజించుట, వారి పూజానియమములను పాటించుట, వారి అనుగ్రహము కొరకై యజ్ఞాదులను ఆచరించుట, వారి మంత్రములను జపించుట, ఆ దేవతల ప్రీతికై బ్రాహ్మణాదులకు అన్న సంతర్పణ చేయుట మొదలగునవి అన్నియు దేవతలను ఉద్దేశించి చేయబడు వ్రతములు. ఈ వ్రతములను ఆచరించు వారిని 'దేవవ్రతాః' అని యందురు. వారి ఉపాసనల ఫలితముగా వారికి దేవలోకములు, దివ్యభోగములు, దేవతల రూపములు ప్రాప్తించును. దేవతలను పొందుట యనగా ఇదియే.

ప్రశ్న - 3వ అధ్యాయమునందలి 11వ శ్లోకమునందును, 4వ అధ్యాయమునందలి 25వ శ్లోకమునందును దేవతా పూజలు కల్యాణహేతువులని తెల్పబడినది. మరి ఇచ్చట (20,21,24 శ్లోకములయందు) దైవ పూజాఫలము అనిత్యమగు స్వర్గ ప్రాప్తియు, జనన మరణ చక్రమున బడి తిరుగుచుండుటయు అని తెల్పబడినది. దీనికి కారణమేమి?

సమా - 3,4 అధ్యాయముల యందు నిష్కామభావముతో దైవసేవలొనర్చు వారి విషయము తెలుపబడినది. అందువలన ఆ సేవల ఫలము పరమకల్యాణము (మోక్షము) అని చెప్పబడినది. ఏలనన నిష్కామభావముతో చేయబడు దైవసేవలు అంతఃకరణ శుద్ధికి హేతువులగుట వలన అవి పరమకల్యాణ (మోక్ష) ప్రదాయకములే. కాని ఇది సకామ భావముతో చేయబడు దేవ పూజా ప్రకరణము అగుటవలన దీని ఫలము దేవతాప్రాప్తి అని తెల్పబడినది. అనగా ఎక్కువలో ఎక్కువ వారు ఉపాస్యదేవతల ఆయువు పర్యంతము స్వర్గాది లోకములలో ఉండవచ్చును. కావున వారి పునరాగమనము అనివార్యము.

ప్రశ్న - 'పితృవ్రతాః' అను పదము ఎవరిని సూచించును? వారు పితరులను చేరుదురు అనగానేమి?

సమా - పితరులకొరకై యథావిధి శ్రాద్ధతర్పణములను చేయుట, వారి తృప్తికై బ్రాహ్మణ భోజనాది కార్యక్రమములను ఆచరించుట, హోమము చేయుట, జపములు చేయుట. పారాయణములు పూజలు ఒనర్చుట, వారికై విధ్యుక్తవ్రత నియమములను పాటించుట మొదలగునవి అన్నియును పితరుల కొరకై ఉద్దేశింపబడిన వ్రతములు. వాటిని ఆచరించువారు 'పితృవ్రతాః' అనబడుదురు. సకామ భావముతో ఈ వ్రతములను చేయువారు మరణించిన పిమ్మట పితృలోకములకు చేరుదురు. అచ్చట వారు పితరుల స్వరూపములను పొంది వారివలె భోగములను అనుభవింతురు. వీరు గూడ ఎక్కువలో ఎక్కువ దివ్యపితరుల ఆయువు పర్యంతమే అచట ఉందురు. చివరకు వీరు గూడ భూలోకమునకు తిరిగి రాక తప్పదు. (వీరికిని పునర్జన్మతప్పదు).

ఇచట దేవ, పితృ పూజలు నిషిద్ధములని తలంపరాదు. దేవపితృపూజలు యథావిధిగా తమతమ వర్ణాశ్రమ ధర్మములను, యోగ్యతలను అనుసరించి అందరికిని అవశ్యాచరణీయములే. కాని ఆ పూజ సకామభావముతో చేసినచో ఆ పుణ్యము దాని అవధికి (స్థాయికి) తగిన ఫలమునిచ్చి, అంతరించును. (ఐపోవును) దానిని భగవదాజ్ఞగా భావించి (భగవత్సేవగా భావించి) కర్తవ్య బుద్ధితో చేసినచో భగవత్ప్రాప్తి రూపమైన మహాఫలము లభించును. కావున దేవపితృకార్యములను అవశ్యముగా ఆచరింపవలెను. కాని వాటిని నిష్కామభావముతో చేయుచుండవలెను.

ప్రశ్న - 'భూతేజ్యాః' అను పదము ఎవరిని సూచించును? వారు భూతములను పొందుదురని చెప్పుటలో గల అంతర్యమేమి?

సమా - భూతప్రేతములను పూజించువారును, ఆ పూజానియమములను పాటించువారును వాటికై హోమములు, దానములు మొదలగువానిని చేయువారును 'భూతేజ్యాః' అనబడుదురు. ఇట్టి వారికి భూతప్రేతాదికములతో సమానమైన రూపభోగాదులు ప్రాప్తించుటయే ఆ 'భూతప్రాప్తి' యగును. భూతప్రేతముల పూజ తామసమైనది. అనిష్టఫలదాయకము. కావున దానిని చేయరాదు.

ప్రశ్న - ఇచట - 'మద్యాజినః' అను పదము ఎవరిని సూచించును? వారికి భగవత్ప్రాప్తి కలుగుట యనగానేమి?

సమా - భగవంతునకు సగుణ నిరాకార లేక సాకార రూపమునగాని, మరే రూపమునగాని సేవలు, పూజలు, భజన ధ్యానాదులు చేయువారును, సమస్త కర్మలను ఆయనకే అర్పించువారును, ఆయన నామజపమును చేయువారును ఆయన గుణాధికములను వినువారును, గానము చేయువారును, ఈ విధముగా భగవద్భక్తి విషయక వివిధ రీతులను సాధన చేయువారును 'మద్యాజినః' అనబడుదురు. వారు భగవంతుని దివ్యలోకములను చేరుట, ఆయన సమీపమున ఉండుట, ఆయన దివ్య రూపమును పొందుట మరియు ఆయనలో లీనమగుట - ఇవి యన్నియు భగవత్ప్రాప్తినొందుట యగును.

ప్రశ్న-ఈ వాక్యమునందలి 'అపి' ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - భగవంతుని నిరాకార/సాకార రూపమునగాని, మరి యేరూపమున గాని నిష్కామభావముతో ఉపాసించువారికి భగవత్ప్రాప్తి కలుగుననుటలో సందేహమునకు తావులేదు. అయినను సకామ భావముతో ఉపాసించు వారికి కూడ భగవత్ప్రాప్తి కలుగును -అని తెలుపుటకై 'అపి' అను అవ్యయము ప్రయుక్తమైనది.

*సంబంధము - భగవద్భక్తికి భగవత్ప్రాప్తియనెడి మహాఫలము లభించును. అయినను దానికై సాధన చేయుట ఏ మాత్రము కష్టముగాదు. పైగా ఆ సాధన మిక్కిలి సులభము. ఈ శ్లోకమున ఈ విషయమునే భగవానుడు వివరించుచున్నాడు-*

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥ 26 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ పురుషుడు | తోయమ్ | = జలమునుగాని | భక్త్యుపహృతమ్ | = భక్తి పూర్వకముగా సమర్పితమైన |
| మే | = నాకు | ప్రయచ్ఛతి | = సమర్పించుచున్నాడో | | |
| భక్త్యా | = భక్తితో | ప్రయతాత్మనః | = నిర్మలబుద్ధి, నిష్కామ భావముగల భక్తునిచే | తత్ | = ఆ పత్ర, పుష్పాదులను |
| పత్రమ్ | = పత్రమునుగాని | | | అహమ్ | = నేను (సగుణరూపమున) |
| పుష్పమ్ | = పుష్పమునుగాని | | | అశ్నామి | = స్వయముగా, ప్రీతితో ఆరగింతును. |
| ఫలమ్ | = ఫలమునుగాని | | | | |

**నిర్మలబుద్ధితో, నిష్కామభావముతో పరమభక్తునిచే సమర్పింపబడిన పత్రమునుగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని, జలమును గాని, నేను ప్రత్యక్షముగా (స్వయముగా) ప్రీతితో ఆరగింతును. (26)**

ప్రశ్న - 'యః' అను పదమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - ఏ వర్ణమునకు, ఆశ్రమమునకు, జాతికి చెందిన వాడెవ్వడైనను పత్ర, పుష్ప, ఫల, జలాదులలో భక్తితో దేనిని అర్పించినను భగవానుడు తృప్తుడగును. బలము, రూపము, ధనము, ఆయువు, జాతి, గుణము, విద్య మొదలగు వాటి కారణమున ఒక వ్యక్తికి మరొక వ్యక్తికిని మధ్య భగవానుడు ఎట్టి వ్యత్యాసమును చూపడు. అయితే అర్పణ చేయువారి భావము (అంతఃకరణము) విదురుడు, శబరి మొదలగువారి భావములవలె సర్వథా పవిత్రము, భక్తిభరితమైయుండుట అవసరము.

ప్రశ్న - పూజలకు ఉపయుక్తములగు వివిధ సామగ్రులలో కేవలము పత్రము, పుష్పము, ఫలము, జలములను పేర్కొనుట లోని ఆంతర్యమేమి? వీటిని భక్తితో భగవదర్పణ చేయుట అనగానేమి?

సమా - సామాన్య మానవులకు సైతము ఎట్టి శ్రమగాని, హింసగాని, వ్యయముగాని లేకుండ సులభముగా లభించు ఏ వస్తువునైనను భగవదర్పణ చేయవచ్చును అను విషయమును తెలుపుటకే పత్రపుష్పఫలజలములను పేర్కొనుట జరిగెను. భగవంతుడు పూర్ణకాముడు. కనుక ఆయన ఏ వస్తువునూ ఆశింపడు. ఆయన కేవలము భక్తినే కోరుకొనును. 'నావంటి అతి సామాన్యుడైన మానవుడు సమర్పించు అత్యల్పమైన వస్తువును గూడ భగవానుడు సంతోషముతో స్వీకరించును. ఆయన సౌజన్యము, ఔదార్యము ఎంత మహాత్త్వపూర్ణమైనవి?'' - ఈ భావముతో ప్రేమైక చిత్తముతో ఏ వస్తువునైనను సమర్పణ చేయుటయే భక్తి పూర్వకముగా భగవదర్పణచేయుట యగును.

ప్రశ్న - 'ప్రయతాత్మనః' అనుపదమునకు అర్థమేమి? ఆ పదప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - అంతఃకరణశుద్ధి గల వానిని 'ప్రయతాత్మా' అని యందురు. అర్పించువాని భావము (అంతఃకరణము) నిర్మలము కానిచో బయటికి అతడెంత శిష్టాచారసంపన్నుడైనను, ఎంతటి గొప్ప వస్తువులను సమర్పించినను వాటిని భగవానుడు స్వీకరింపడు. శ్రీ కృష్ణభగవానుడు దుర్యోధనుని ఆహ్వానమును ఆదరింపక పవిత్రాంతఃకరణము గల విదురుని ఇంటికి పోయి భక్తితో అతడిచ్చిన భోజనమును ప్రేమతో స్వీకరించెను. సుదాముడు (కుచేలుడు) ఇచ్చిన అటుకులను మిక్కిలి తృప్తితో ఆరగించెను. ద్రౌపది అందించిన అక్షయపాత్రలో మిగిలిన ఆకును భుజించి, విశ్వమునే తృప్తిపరచెను. గజేంద్రునికడకు స్వయముగా ఏగి అతడు ఆర్తితో అర్పించిన పుష్పమును పేర్మితో స్వీకరించెను. శబరి కుటీరమును చేరి, ఆమె అందించిన ఫలములను ఆరగించెను. రంతిదేవునియొద్ద జలములను స్వీకరించి, అతనిని కృతార్థుని చేసెను. ఈ విధముగా ప్రతిభక్తుడును ప్రేమాదరములతో సమర్పించిన వస్తువును సంతృప్తితో గైకొనెను.

విశేషముగా ఈ సందర్భమున ఈ భక్తులకు సంబంధించిన సంఘటనలు సంక్షిప్తముగ వివరింపబడుచున్నవి.

## విదురుడు

12 ఏండ్లు అరణ్యవాసమును, ఒక ఏడు అజ్ఞాత వాసమును పూర్తిచేసిన పాండవులు తమ రాజ్యభాగమును తమ కిమ్మని దుర్యోధనుని అడుగగా దానికతడు పూర్తిగా నిరాకరించెను. పాండవుల పక్షమున శ్రీకృష్ణభగవానుడు దూతగా కౌరవులకడకేగెను. బయట మిక్కిలి శిష్టాచారుని వలె కనబడుటకై దుర్యోధనుడు ఆయనకు అడంబరముగా స్వాగతసన్నాహాలను నెరపెను. అతడు భోజనమున కాహ్వానింపగా భగవానుడు అందులకు నిరాకరించెను. దుర్యోధనుడు కారణ మడుగగా భగవానుడు ఇట్లు చెప్పెను. 'భుజించుటకు రెండు కారణములు ఉండును. ప్రేమగలచోట ఏది సమర్పించినను అది తృప్తికరముగనే యుండును. లేదా ఆకలికి నకనకలాడు వానికి ఎదుటివారు ఏ భావముతో ఏది సమర్పించినను దానితో ఆ ఆకలిని తీర్చుకొనవలసియే వచ్చును. ఇచట ఈ రెండు కారణములును లేవు. మీలో నాపై ప్రేమలేనే లేదు. నేను ఆకలిగొనియు లేను. "సంప్రీతి భోజ్యాన్యన్నాని, ఆపద్భోజ్యాని వాపునః నచ సంప్రీయసే రాజన్ నచైవాపద్గతా వయమ్॥" (మ.భా.ఉద్యోగ 91/25) ఈ విధముగా పలికి పిలుపుతో పనిలేకయే విదురునింటికి పోయెను. భీష్మపితామహుడు, ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు, బాహ్లికుడు మొదలగు పెద్దలు (వృద్ధులు) విదురునింటికి వెళ్లి, తమ ఇంటికి రమ్మని శ్రీకృష్ణుని ఆహ్వానించిరి. కాని భగవానుడు ఎవ్వరి ఇండ్లకు వెళ్ళలేదు. విదురుని ఇంటిలోనే అతడు భక్తితో సమర్పించిన పదార్థములను ప్రేమతో స్వీకరించి, అతనిని కృతార్థుని జేసెను. (మహాభారత - ఉద్యోగ 91) "దుర్యోధనకీ మేవత్యాగీ, సాగ్ విదుర్ ఘర్ ఖాయో" అనునది ఒక ప్రసిద్ధగీతము - దుర్యోధనుని విందును తిరస్కరించి, విదురునింట పప్పు పులుసులను ఆరగించెను. 'భక్తి కలుగుకూడు పట్టెడైనను చాలు'.

## సుదాముడు (కుచేలుడు)

సుదాముడు శ్రీకృష్ణునకు బాల్యమిత్రుడు. వారిరువురును. సాందీపుని యొద్ద తోడుగా విద్యనభ్యసించిరి. సుదాముడు వేదవేత్త. విషయవిరక్తుడు. స్వభావముచే శాంతచిత్తుడు. జితేంద్రియుడు. విద్యాభ్యాసానంతరము ఆ ఇరువురును తమ ఇండ్లకేగిరి.

సుదాముడు కడుబీదబ్రాహ్మణుడు. ఒకానొక సమయమున వరుసగా కొన్ని దినములవరకు ఆ సుదాముని కుటుంబమునకు అన్నమే కరువాయెను. ఆకలితో ఆయన భార్య ముఖము వాడిపోయెను. పిల్లలు ఆకలికి అలమటించుటను చూచి ఆమె తట్టుకొనలేకపోయెను. ద్వారకాపతియైన శ్రీకృష్ణ భగవానుడు తన భర్తకు మిత్రుడని ఆమె ఎరుంగును. ఆమె భయముతో వణుకుచు తమ పరిస్థితిని భర్తకు వివరించి, ద్వారకకు ఒకసారి వెళ్ళిరమ్మని ఆయనను ప్రార్థించెను. పతియొక్క నిష్కామభావమును గూడ ఆమె ఎరుగును. కనుక ఆమె ఇట్లు పలికెను. 'స్వామీ! మీకు ధనముపై ఇసుమంతయు ఆసక్తిలేదని నేను ఎరుగుదును. కాని ధనము లేనిదే ఇల్లు గడచుట కష్టము. కనుక మీ ప్రియమిత్రుడైన శ్రీకృష్ణుని కడకేగుటయే అవసరము, ఉచితము అని నాకు తోచుచున్నది.'

తన భార్య ఆకలి బాధను భరింపలేక తనను మిత్రుని కడకు పంపగోరుచున్నదని సుదాముడు గ్రహించెను. ఈ పనిపై మిత్రుని ఇంటికి వెళ్ళుటకు అతడు వెనుకాడెను. అప్పుడు అతడు ఇట్లు పలికెను. - 'పిచ్చిదానా' ధనముకొరకు నన్ను అచటికి పంపదలచితివా? బ్రాహ్మణుడెప్పుడైనా ధనమును ఆశింపవచ్చునా? భగవంతుని భజించుటయే మన పని. ఆకలిని తీర్చుకొనుటకై బిచ్చమెత్తుకొనవచ్చును'.

ఆ ఇల్లాలు ఇట్లనెను - 'ఇది మంచిమాటే. కాని దురదృష్టము వలన ఆ బిచ్చముగూడ లభించుట లేదు. నా చినిగిన బట్టలను, పిల్లల వాడిన ముఖములను ఒకసారి చూడుడు. నేను ధనమును ఆశించుటలేదు. మీరు అక్కడికి వెళ్లి, రాజ్యమును గాని, సంపదలనుగాని ఆయనను కోరుడని నేను అనుటలేదు. ఈ కష్టదశలో ఒకసారి వెళ్ళి, ఆయనను కలసికొనిన చాలును'.

సుదాముడు వెళ్ళుటకు మొదట తటపటాయించెను. కాని చివరకు ఈ నెపముతోనైనను శ్రీకృష్ణుని దర్శింపవచ్చునని వెళ్ళుటకే నిశ్చయించుకొనెను. కాని ఒట్టి చేతులతో పోవుటయెట్లు? భార్యతో పలికెను. "ఓ కల్యాణీ!" ఆయనకు కానుకగా సమర్పించుటకు ఉంటే ఏదో ఒకటి ఇమ్ము." - భర్త పలికినదియు నిజమే. కాని ఈ అసహాయురాలు ఏమి ఇయ్యగలదు. ఇంటిలో అన్నియు నిండుకొన్నవి. ఆమె




अजामिल-उद्धार

Redemption of Ajāmila




पत्र, पुष्प, फल, जलका ग्रहण

**Trifle offerings accepted**




चार अवस्थाएँ

Four stages

మౌనము వహించెను. కాని ఏమియు ఇయ్యనిదే తన భర్త కదలడని భావించి, అతి సంకోచముతోనే పొరుగింటికి వెళ్లి, ఆ ఇల్లాలినడిగి నాలుగు పిడికిళ్ళ అటుకులు తీసికొని వచ్చెను. వాటిని ఒక చినిగిన మలిన వస్త్రమునందు మూటకట్టి, శ్రీకృష్ణునకు కానుకగా ఇమ్మని భర్తకిచ్చెను-

సుదాముడు దీర్ఘప్రయాణముతో అలసిసొలసి, ద్వారకకు చేరెను. చివరకు శ్రీకృష్ణుని ప్రాసాదమును సమీపించెను. ఇచట కవివరుడైన నరోత్తముడు ఈ ఘట్టమును అతిరమ్యముగా వర్ణించెను. ద్వారపాలకుడు సుదాముని అత్యాదరముతో అచట కూర్చుండబెట్టి, కృష్ణునకెరింగించుటకు లోపలికి వెళ్ళెను. అతడు ఇట్లు చెప్పెను-

'ప్రభూ! ఒక ఆగంతకుడు మీకొరకై ద్వారముకడవేచి యున్నాడు. అతడు ఎచటినుండి వచ్చెనో తెలియదు. అతని శిరముపై తలపాగ లేదు.

ఒంటినిండా బట్టలు లేవు. చినిగిన గోచిపాతలతోనున్నాడు. కాళ్ళకు పాదరక్షలు లేవు. కటిక దరిద్ర బ్రాహ్మణుని వలె కనపడుచున్నాడు. బక్కచిక్కి యున్నాడు. ద్వారముకడ వేచియున్నాడు. నగర సౌందర్యమును చూచి, అచ్చెరువందుచున్నాడు. అతని పేరు సుదాముడట'.

సుదాముడను పేరు చెవిని పడినంతనే భగవానుడు తన్నుతాను మరచిపోయెను. వెంటనే తన ఆసనమునుండి దిగ్గున లేచెను. తలపై నున్న కిరీటమును గూడ సవరించుకొనలేదు. భుజముపైనున్న పీతాంబరము జారిపోయెను. పాదుకలను గూడ ధరింపకయే పరుగెత్తెను.

ఈ సందర్భమును ఆంధ్రమహాభాగవతమున ఇట్లు వర్ణింపబడినది-

కరమర్థినెదురుగా జని,
పరిరంభణమాచరించి, బంధు స్నేహ
స్ఫురణన్ దోడ్తెచ్చి, సమా
దరమున గూర్చుండబెట్టె తన తల్పమునన్.

(భాగ-దశమ-981)

దూరమునుండియే సుదాముని దుఃస్థితిని జూచి భగవానుడు ఇట్లు పలికెను. మిత్రమా! 'ఏమిటి ఈ నీ దీనావస్థ'? కృష్ణుడు సుదాముని కాలికి గ్రుచ్చుకొన్న ముండ్లను గమనించెను. 'అయ్యో!! మిత్రమా! ఎన్ని కష్టములను ఓర్చితివి? ఇంతవరకు ఇక్కడికి ఏల రాలేదు. ఇంతకాలము ఎందులకు జాగుచేసితివి? సుదాముని దీనదశను చూచి, కరుణాసముద్రుని గుండె నీరయ్యెను. పాద్యములను (కాళ్ళుకడుగుటకు మంచినీళ్ళను) తాకకయే తన కన్నీళ్ళతోడనే కృష్ణుడు సుదాముని పాదములను కడిగెను. సుదాముని తన హృదయమునకు హత్తుకొనిన పిమ్మట భగవానుడు అతనిని సాదరముగా అంతఃపురములోనికి గొనిపోయి, తన దివ్యతల్పముపై కూర్చుండబెట్టెను. పూజాసామగ్రిని స్వయముగా కొనివచ్చి తనచేతులతోడనే ఆయన పాదములను కడిగెను. తాను త్రిలోకపావనుడైనను అతని పాదజలమును తన శిరముపై చల్లుకొనెను.

అనంతరము భగవానుడు తన ప్రియమిత్రుని శరీరమును సువాసనలను వెదజల్లుచున్న చందనము, అగరు, కుంకుమలతో అలంకరించి, ధూపదీపములతో పూజించి, దివ్య భోజనముతో అలరింపచేసెను. తాంబూలము సమర్పించెను. సుదాముని శరీరము బక్కచిక్కియుండెను. అచ్చటచ్చట నరములు బయటికి కనబడుచుండెను. కాని భగవానుని ప్రియసఖుడగుట వలన సాక్షాత్తు లక్ష్మీ-అవతారమైన రుక్మిణీదేవి తన చెలులతో సహా వింజామరలను వీచుచు ఆయనకు సేదలు తీర్చెను. శ్రీకృష్ణభగవానుడు సుదాముని చేతులను తన చేతులలోనికి తీసికొని చిన్ననాటి ముచ్చట్లను చెప్పసాగెను.

ఈ దృశ్యమును జూచిన అంతఃపురకాంతలు కుచేలుని సౌభాగ్యమును ఇట్లు ప్రశంసించిరి-

ఏమి తపంబు సేసెనొకొ
యీ ధరణీదివిజోత్తముండు, తొల్
బామున యోగి విస్ఫుర
దుపాస్యకుడై, తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథునిజ
తల్పమునన్ వసియించియున్నవా
డీ మహనీయమూర్తికెనయే?
మునిపుంగవులెంతవారలున్.

(భాగ-దశమ-ఉత్తరభాగం 984)

కొంత తడవునకు భగవానుడు తన ప్రియమిత్రుని ప్రేమతో చూచుచు స్మితముతో ఇట్లనెను- 'మిత్రమా!' నాకేమైనను కానుక తెచ్చితివా? భక్తులు ప్రేమతో ఇచ్చిన

స్వల్ప వస్తువును గూడ నేను గొప్పగా భావింతును - ఏలనన నేను ప్రేమ ఆకలితో నున్నవాడను. భక్తి రహితులు అపారముగా ఎన్నెన్ని కానుకలు సమర్పించినను అవి నాకు సంతృప్తికరములుకావు.'

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥
(భగవద్గీత. 9/26)

దీనినే పోతన మహాకవి తెలుగున ఇట్లు పలికెను-

దళమైన బుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిన్,
గొలిచిన జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.

(పోతన-భాగవతము-దశమ-ఉత్తరభాగము-1010)

భగవానుడింతగా చెప్పినను సుదాముడు ఆ అటుకుల మూటను ఆయనకు ఇయ్యలేకపోయెను. భగవంతుని అపారసంపదను, వైభవమును చూచి, ఆయనకు దానిని సమర్పించుటకు సుదాముడు సిగ్గుపడెను.

సర్వప్రాణుల అంతర్యామియైన శ్రీహరి ఆ బ్రాహ్మణుని ఆగమనకారణమును గ్రహించి ఇట్లు తలచెను. 'ఇతడు నాకు నిష్కామభక్తుడు, ప్రియసఖుడు, ధనతృష్ణతో మునుపెన్నడును నన్ను భజించియుండలేదు - ఇప్పుడును ఇతనికట్టి కోరికయే లేదు. కాని పతివ్రతయైన భార్య ప్రార్థనపై ఇతడు నాకడకు వచ్చెను. కనుక నేను ఇతనికి దేవతలకును దుర్లభమైన సంపదలను (భోగమోక్షములను) ఇచ్చెదను.'

ఇట్లాలోచించి, భగవానుడు 'ఇదియేమి' అని పలుకుచు సుదాముని కడనున్న మూటను బలవంతముగా లాగికొనెను. ఆ మూట కట్టిన జీర్ణవస్త్రము చినుగుటయు, అందలి అటుకులు చెల్లాచెదరుగా పడిపోవుటయు క్షణములో జరిగెను. భగవానుడు మిక్కిలి ప్రేమతో చెప్పసాగెను-

'నన్వేతదుపనీతం మే పరమప్రీణనం సఖే ।
తర్పయంత్యంగ మాం విశ్వమేతే పృథుకతండులాః ॥
(శ్రీమద్భాగవతమ్ - 10/81/9)

"మిత్రమా! నీవు తెచ్చిన ఈ అటుకుల కానుకయే నన్ను మిక్కిలి ప్రసన్నునిగా జేసినది. ఈ అటుకులు నన్ను నాతోపాటు సమస్త విశ్వమును సంతృప్తి పరచినవి'.

అని పల్కుచు ఆ అటుకులను ఒక్కొక్క దానిని ఏరుకొనుచు తినసాగెను.

కుచేలుడు తెచ్చిన అటుకులలో ఒక పిడికెడు ఆరగించిన పిమ్మట, శ్రీకృష్ణ భగవానుడు మరియొక పిడికెడు అటుకులను తీసికొనబోవుచుండగా ఆయనను వారించుచు రుక్మిణిదేవి ఇట్లు పలికెను-

మురహరుడు పిడికెడటుకులు
కరమొప్పగనారగించి, కౌతూహలియై
మరియును, బిడికెడుగొనగ
త్కరమప్పుడు పట్టి, కమల కరకమలములన్

సంపారగనితనికి బహు
సంపదలందింపనివియు చాలును నిక భ
క్షింపగవలవదు, త్రిజగ
త్సంపత్కర! దేవదేవ! సర్వాత్మహరీ!

(పోతన-భాగవతము - దశమ - ఉ.భా. 1013, 1014)

భక్తుడిచ్చిన కానుకను ఈ విధముగా స్వీకరించి భగవానుడు తన అపార ప్రేమను ఆయనపై ప్రసరింపచేసెను.

కొన్ని దినములు అచట మిత్రునితో ఆనందముగా గడిపి, సుదాముడు ఇంటికి మరలెను. ఇచట ఇంటిరూపమే మారిపోయినది. భగవదనుగ్రహముతో ఆయన పటకుటీరము స్వర్ణమందిరముగా రూపొందినది. సుదాముడు 'ఇదియంతయు భగవంతుని లీల' యని గ్రహించి ఆనందించెను. అతడు తనలో ఇట్లనుకొనెను. 'నేను ధన్యుడను. అర్థులు ఏమియు అర్థింపకున్నను గుప్తముగా వారి మనోరథముల తీర్చు దయాళువు నా మిత్రుడు. కాని నాకు ఈ ధనమక్కరయేలేదు. జన్మజన్మాంతరముల యందును కృష్ణుడే నాకు మిత్రుడు, సుహృదుడు, నేనతనికి పరమభక్తుడను. ఇదియే నా ప్రార్థన. ఈ సంపదలను నేను కోరుకొనుటలేదు. ప్రతిజన్మయందును సర్వగుణ సంపన్నుడైన భగవంతుని యెడ విశుద్ధభక్తి, భక్తుల పవిత్ర సాంగత్యము నాకు కలుగవలెను. అతని దయకు పాత్రులైన వారికి అతడు ధనమొసంగడు. ఏలనన ధనము వలన గర్వము, దాని వలన పతనము సంభవించును. కనుక తన ప్రియభక్తుల కతడు సంపదలను, రాజ్యమును ఐశ్వర్యమును ఇయ్యడు.'

సుదాముడు జీవితమంతయు అనాసక్త భావము తోడనే గడిపి, ఎల్లవేళల భగవంతుని భజించుచునే యుండెను.

## ద్రౌపది

పాండవులు వనవాసము చేయుచు దుఃఖముతోనే కాలము గడుపుచుండిరి. కాని దుర్యోధనుడు, దుష్టులైన అతని మిత్రులు వారి (పాండవుల) వినాశనమునకు పన్నుగడలను పన్నుచుండిరి. ఒకసారి దుర్యోధనుడు దుర్వాసమహామునిని ప్రసన్నుని జేసికొని ఇట్లు ప్రార్థించెను. 'ధర్మాత్ముడైన మా సోదరుడు యుధిష్టిరుడు తన తమ్ములతో సహా అడవులలో ఉన్నాడు. మీ పదివేలమంది శిష్యులతో సహా మీరు ఆయన యొద్దకు వెళ్లి అచట ఆతిథ్యము స్వీకరింపుడు. వారు అందరును భుజించిన పిమ్మట ద్రౌపదియు భుజించి, విశ్రాంతి తీసికొను సమయమున మీరు అచటికి వెళ్ళుడు. ఇదియే నా ప్రత్యేక ప్రార్థన!'

ద్రౌపది భుజించిన పిమ్మట సూర్యుడొసంగిన అక్షయపాత్రనుండి ఆ రోజున భోజన పదార్థములు లభ్యము కావని దుర్యోధనుడు తలంచెను. కోపస్వభావుడైన దుర్వాసుడు పాండవులను శపించి, భస్మము చేయును. ఈ విధముగా సులభముగా అతని కోరిక నెరవేరును. సరళహృదయుడైన దుర్వాసుడు దుర్యోధనుని కపటోపాయమును గ్రహింపలేదు. అతని మాట ప్రకారము పాండవులున్న 'కామ్యక వనమునకు' వెళ్ళెను. పాండవులును, ద్రౌపదియు భుజించి సుఖాసీనులైయుండిరి. ఇంతలో పదివేలమంది శిష్యులతో దుర్వాసుడచటికి చేరెను. యుధిష్ఠిరుడు తమ్ములతో గూడి ఆ మహామునికి స్వాగత సత్కారములను నెరపెను. భోజనమునకు ఆహ్వానించెను. దుర్వాసుడు అతని ప్రార్థనను మన్నించి, స్నానము చేయుటకై నదికి వెళ్ళెను. ఇచట ద్రౌపది చింతాక్రాంతురాలాయెను. కాని ఈ విపత్తు నుండి ఆమెను ఆ శ్రీ కృష్ణభగవానుడే రక్షింపవలెను. వెంటనే ఆమె కృష్ణుని స్మరించెను. 'ఓ కృష్ణా! గోపాలా! అశరణశరణ్యా!శరణాగతవత్సలా! ఈ ఆపదనుండి మమ్ము నీవే కాపాడవలయును'.

దుశ్శాసనాదహం పూర్వం సభాయాం మోచితా యథా ।
తథైవ సంకటాదస్మాత్ మాముద్ధర్తుమిహార్హసి ॥
(మహాభారత - వనపర్వ - 263/16)

ఇంతకు మునుపు కౌరవసభలో దుష్టదుశ్శాసనుని బారి నుండి నన్ను కాపాడితివి. అట్లే ఇప్పుడును ఈ ఆపదనుండి నీవే రక్షింపవలెను.

ఆ సమయమున శ్రీకృష్ణభగవానుడు ద్వారకలో రుక్మిణీదేవి మందిరమున నుండెను. ద్రౌపదీ ప్రార్థనను వినగానే భక్తవత్సలుడైన భగవానుడు వెంటనే తీవ్రగతితో ద్రౌపది కడకు పరుగిడెను. ఆమె చెంత నిలిచెను. ద్రౌపదికి కృష్ణభగవానుని చూడగానే ప్రాణములు లేచివచ్చెను. ఆమె ఆయనకు ప్రణమిల్లి, తనకు వచ్చిపడిన ఆపదను విన్నవించెను. భగవంతుడు పలికెను. 'నీ ఈ మాటలను కట్టిపెట్టుము. నాకు చాల ఆకలిగా ఉన్నది. తినుటకేమైనా వెంటనే ఇమ్ము.' ద్రౌపది ఇట్లుపలికెను. 'ఓ భగవంతుడా! భోజనమునకు(తినుటకు) ఏమియు లేకయే నేను నిన్ను ప్రార్థించితిని. నా భోజనము అయిపోయినది. ఇప్పుడా పాత్రలో ఏమియు మిగులలేదు' - వినోదముకొరకు భగవంతుడిట్లు పలికెను-

'కృష్ణే! న నర్మకాలోఽయం క్షుచ్ఛ్రమేణాతురే మయి ।
శీఘ్రం గచ్ఛ మమ స్థాలీమానయిత్వా ప్రదర్శయ ॥
(మహాభారత - వనపర్వ - 263/23)

'ఓ ద్రౌపదీ! ఇది వినోదమునకు సమయము గాదు. నేను మిక్కిలి ప్రయాణశ్రమతో, ఆకలి బాధతో ఉన్నాను. వెంటనే వెళ్లి, ఆ అక్షయ పాత్రను తెచ్చిచూపుము'.

చేయునది లేక ద్రౌపది ఆ పాత్రను ఆయన ముందుంచెను. భగవానుడు నిశితముగా పరిశీలించి చూడగా ఆ పాత్రయందు ఒక ఆకు (మెతుకు) మిగిలియుండెను. భగవంతుడు పలికెను. 'ఏమియు లేదని చెప్పుచుంటివి ఈ ఆకుతో త్రిభువనములు తృప్తి చెందును' యజ్ఞభోక్తయైన ఆ కృష్ణభగవానుడు ఆ ఆకును తన నోటిలో వేసికొనెను.

విశ్వాత్మా ప్రీయతాం దేవస్తుష్టశ్చాస్త్వితి యజ్ఞభుక్ ।
(మహా-వన-263/25)

ఆ ఒక్క ఆకుతో విశ్వాత్మయు, యజ్ఞభోక్తయు, అయిన భగవానుడు తృప్తుడయ్యెను. వెంటనే ఆయన సహదేవునితో 'వెంటనే వెళ్ళి ఋషులను భోజనమునకు పిలుచుకొనిరమ్ము' అని పలికెను. అచట నదీతీరమున ఒక వింత జరిగెను. సంధ్య వార్చుకొనుచున్న ఋషులకు పొట్టలు నిండిపోయెను. త్రేన్పులు రాసాగెను. శిష్యులు గురువుగారితో 'స్వామీ' మాకు గొంతు వరకు భుజించినట్లైనది- ఇప్పుడేమియు తినజాలము' దుర్వాసుని అవస్థయు అట్లే యుండెను. 'శిష్యులారా! వెంటనే పరుగులు దీయుడు. పాండవులు ధర్మాత్ములు, విద్వాంసులు, సదాచారులు. శ్రీకృష్ణభగవానునకు పరమభక్తులు. వారు

తలచుకొనినచో దూదిని అగ్నివలె మనలను భస్మము చేయగలరు. ఇప్పటికిని అంబరీషుని గాథను నేను మరువలేను. శ్రీకృష్ణశరణాగతులనినచో నాకు మిక్కిలి భయము-' అని దుర్వాసుడు శిష్యులతో పలికెను. శిష్యులందరును ఆ మాటలను విని, నలువైపులకును పరుగెత్తిరి. సహదేవునకు అచట ఎవ్వరును కన్పింపలేదు.

అప్పుడు భగవానుడు ద్రౌపదితో పాండవులతో ఇట్లనెను. 'ఇప్పుడు నన్ను ద్వారకకు పోనిండు. మీరు ధర్మాత్ములు. నిరంతరము ధర్మము నాచరించువారికి ఎన్నడును దుఃఖములు రావు'.

ధర్మనిత్యాస్తు యే కేచిన్న తే సీదన్తి కర్హిచిత్

(మహాభారత - వనపర్వ-263/44)

## గజేంద్రుడు

గజేంద్రుడు త్రికూట పర్వతనివాసి. ఒకానొక దినమున అతడు వేడికి భరింపలేక అనేకములైన ఆడు, మగ ఏనుగులతో 'ఋతుమంతము' అను పేరుగల వరుణదేవుని తోటలోని ఒక సరోవర తీరమునకు చేరెను. అది మిక్కిలి విశాలమైనది. సుందరమైనది. అతడు ఆ సరోవరమున ప్రవేశించి అందలి అమృతతుల్యజలములను త్రాగి, ఆడు ఏనుగులతో, ఏనుగుగున్నలతో జలకములాడ సాగెను. ఆ సరోవరమున మహాబలశాలియగు ఒక మొసలి యుండెను. అది ఆ గజేంద్రుని కాలిని ఒడిసి పట్టుకొనెను. గజేంద్రుడు తన బలమునంతయును కూడ గట్టుకొని, తన కాలిని విడిపించుకొనుటకు ప్రయత్నించెను. కాని విడిపించుకొనలేక పోయెను. ఇచట మొసలి దానిని నీటిలోనికి లాగసాగెను. ఆడు, మగ ఏనుగులన్నియును తొండముతో తొండమును కలిపి, గజేంద్రుని రక్షించుటకై అతనిని బయటికి లాగసాగెను. కాని వాటి ప్రయత్నము ఫలింపలేదు. ఈ పెనుగులాట బహుకాలము సాగెను. చివరకు ఆ గజేంద్రుడు ధైర్యమును కోల్పోయి, భగవంతుని శరణుజొచ్చి ఇట్లు ప్రార్థించెను-

యః కశ్చనేశో బలినోఽన్తకోరగాత్
ప్రచండవేగాదభిధావతో భృశమ్!
భీతం ప్రపన్నం పరిపాతి యద్భయాత్
మృత్యుః ప్రధావత్యరణం తమీమహి

(శ్రీమద్భాగవతం - 8/2/33)

అతి వేగముతో ఇటునటు పరుగెత్తుచుండు మహాబలీయమైన కరాళకాలసర్పమునకు భయపడి, తనను శరణుపొందు ప్రాణులను రక్షించునట్టి ఈశ్వరుడే నాకు దిక్కు. ఏలనన ఆ ఈశ్వరునకు భయపడి మృత్యువుకూడ (ప్రాణులను కబళించుటకు) ఇటునటు పరుగెత్తుచుండును. అతనినే నేను శరణుజొచ్చుచున్నాను.

పిమ్మట గజేంద్రుడు భగవానుని అనేక విధముల స్తుతించెను. భక్తుని మొరవినగానే అతనిని రక్షించుటకు భగవంతుడు తటాలున లేచి పరుగిడసాగెను. ఈ సందర్భమున ఒక కవి ఇట్లు మధురముగా వర్ణించెను.

పర్యంకం విస్సృజన్ గణానగణయన్
భూషామణిం విస్మరన్
ఉత్థానోఽపి గదాగదేతి నిగదన్
పద్మామనాలోకయన్ ।
నిర్గచ్ఛన్నపరిచ్ఛదం ఖగపతిం
చారోహమాణోఽవతు
గ్రాహగ్రస్తమతంగపుంగవ సము-
ద్ధారాయ నారాయణః ॥

గ్రాహము నోటికి చిక్కిన గజరాజును రక్షించుటకై శ్రీహరి తటాలున లేచి పరుగెత్తసాగెను. పారిషదులవైపు కన్నెత్తి చూడనైనను చూడలేదు. కౌస్తుభమణిని మరచిపోయెను. లేచుచుండగనే గద, గద అని పలికెను. లక్ష్మీదేవిని గూడ పట్టించుకొనలేదు. గరుత్మంతునిపై ఎట్టి ఆసనము లేకుండగనే బయలుదేరెను. అట్టి నారాయణుడు నన్ను రక్షించుగాక. ఈ ఘట్టమును వర్ణించుచు పోతనామాత్యుడు చేసిన రచన పరమ రమణీయము - అత్యద్భుతావహము.

'తనమనంబున అగ్గజేంద్రుడు ఈశ్వర సన్నిధానంబున్ గల్పించుకొని ఇట్లనియె- (ఆంధ్రమహాభాగవతము 8/89)

శా॥ లావొక్కింతయు లేదు
ధైర్యము విలోలంబయ్యె, ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చె
తనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్,
నీవేతప్ప నితఃపరం బెరుగ
మన్నింపన్ దగున్ దీనునిన్
రావే! ఈశ్వర! కావవే! వరద!
సంరక్షింపు భద్రాత్మకా!

(ఆంధ్రమహాభాగవతం-8/90)

ఇట్లు అగ్గజేంద్రుడు మొర పేయుచున్న సమయంబున

మ॥ సిరికింజెప్పడు, శంఖ చక్రయుగమున్
జేదోయి సంధింపడే
పరివారంబును జీరడభ్రగపతిన్
బన్నింపడాకర్ణికాం
తర ధమ్మిల్లముజక్క నొత్తడు
వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడడు
గజప్రాణావనోత్సాహియై ॥

(ఆంధ్రమహాభాగవతం 8/96)

గరుడుని మూపున అధిరోహించి, భగవానుడు అచటికి చేరెను. ఆకాశమున గరుడునిపై అధిరోహించి యున్న భగవానుని దర్శించి, గజేంద్రుడు తన తొండముతో ఒక కమలమును (పుష్పమును) తీసికొని, అతి కష్టముపై ఆర్తితో ఇట్లనెను. **'ఓ నారాయణ! జగన్నాథా!నీకు నమస్కారము'** భగవానుడు ప్రేమతో భక్తుడు సమర్పించిన పుష్పమును స్వీకరించెను. తన సుదర్శన చక్రముతో మొసలి శిరస్సును ఖండించి, ఆ ప్రమాదమునుండి గజేంద్రుని రక్షించెను.

## శబరి

శబరి భిల్లజాతికి చెందిన ఒక మహిళ - మహా భక్తురాలు. ఆమె తన జీవితములో చాలా కాలము దండకారణ్యమున మహర్షుల సేవలు చేయుచు గడిపెను. ఋషులు నడిచిపోవు మార్గములను ఊడ్చి శుభ్రపరచుట, మార్గములలో గల కంకర రాళ్ళను ఏరివేసి ఇసుకను పరచుట, అడవిలో కట్టెలుకొట్టి, ఇంధనములుగా ఋష్యాశ్రమములకు చేర్చుట మొదలగు సేవలను ఋషులకు చేయుచుండెడిది. ఆమెపై దయదలచి మతంగ మహాముని ఆమెకు భగవన్నామమును ఉపదేశించెను. మతంగముని ఆమెతో 'భగవానుడైన శ్రీరాముడు నీ కుటీరమునకు రాగలడు. ఆయనను దర్శించి, సేవించి తరించుము. అంతవరకు ఇచటనే యుండుము.' అని బ్రహ్మలోకమునకు ఏగెను.

శబరి శ్రీరామభజనలో నిమగ్నమయ్యెను. ఆమె జీవితమంతయును భగవన్నామస్మరణతోడను, శ్రీరాముని రాకకై ఎదురుతెన్నులు చూచుట తోడను గడచిపోవుచుండెను. కాలము గడచిన కొలదియు ఆమెలో ఉత్కంఠ అధికమగు చుండెను. శ్రీరామ చంద్రప్రభువు ఏక్షణమైనను రావచ్చును- ఆయన పాదములకు ముళ్ళుగుచ్చుకొనునేమోయను శంకతో దారులను పలురీతుల శుభ్రము చేయుచు వచ్చెను. భగవానుడు కూర్చుండుటకై మట్టితో వేదికను సిద్ధము చేసెను. అడవికి వెళ్ళి, తీయని ఫలములను ఒసంగు వృక్షములనుండి పండ్లను తెంపి దొన్నెల నింపుచుండెను. దినములు సాగిపోవుచునే యుండెను. ఆమె దినచర్యయంతయు ఇదియే యయ్యెను. కడకు ఆమె కుటీరమునకు శ్రీరామచంద్రుడు రానే వచ్చెను. ఆమె కృతకృత్యురాలయ్యెను.

శ్రీరామచరిత మానసమునందు గోస్వామి తులసీదాసు ఈ ఘట్టమును ఇట్లు వర్ణించెను- 'తన కుటీరమునకు వచ్చిన శ్రీరాముని జూచి శబరి హృదయము ఉప్పొంగెను. మతంగముని మాటలు నిజమైనందులకు పొంగిపోయెను. శ్రీరాముని నేత్ర పద్మములను, దీర్ఘబాహువులను, శిరస్సున జటాజూటమును, వక్షమున వనమాలను దర్శించెను. శ్యామవర్ణుడైన శ్రీరాముని, గౌరవర్ణము గల లక్ష్మణుని చూచి, వారి పాదములకు మోకరిల్లెను. భక్తిపరవశఅయిన ఆమెనోట మాటలు రాకుండెను. వారి పాదములకు పదేపదే ప్రణమిల్లసాగెను. శబరి ఆనందసాగరమున ఓలలాడెను. ప్రేమావేశమున ఆమె కంఠము మూగవోయెను. మాటిమాటికి భగవానుని పాదపద్మములకు ప్రణమిల్లుచుండెను. ఆయనను పూజించి ఫలముల సమర్పించెను. భగవానుడు ఆమె భక్తికి మెచ్చి, ఆమె పూజలను సాదరముగా అందుకొనెను. ఆమె సమర్పించిన ఫలములను ఆరగించి, ఆమెను కృతార్థురాలిని జేసెను. ఆ ఫలములలో భగవానున కెంత రుచిదొరికెనో తులసీదాసు వర్ణన తెల్పును.

'తన ఇంటగాని, గురువుగారి ఆశ్రమమున గాని, మిత్రుల సదనములలో గాని, మామగారి మందిరమున గాని ఎచ్చటనూ ఎప్పుడునూ శబరి అందించిన ఫలముల రుచిని అనుభవించి ఎరుగడు. ఆ భగవానుడే పెక్కుసందర్భములలో ఈ విషయమును వెల్లడించియుండెను.

## రంతిదేవుడు

రంతిదేవుడు 'సంకృతి' అను పేరుగల మహారాజు కుమారుడు. అతడు మిక్కిలి ప్రతాపశాలి, దయాళువు. దుఃఖితులైన బీదవారికి తన సర్వస్వమును దానము చేసెను. ఆ పిమ్మట మిక్కిలి పేదరికముతో అతని కుటుంబజీవనము కొనసాగెను. ఆకలిదప్పులతో తికమకలు పడుచునూ అతడు తన దానధర్మములను విడిచి పెట్టలేదు. ఈ విధముగ ఆ

రాజు పూర్తిగా నిర్ధనుడై కుటుంబసభ్యులతో కూడ పెక్కు కష్టములను సహించుచు వచ్చెను. కడకు ఒక దశలో ఆ రంతిదేవుని కుటుంబమునకు **48** దినముల వరకు ఆహారమే గాదు నీరును దొరకని గడ్డు స్థితి ఏర్పడెను. ఆ కష్టముల కారణముగ వారు ఆకలిదప్పులలో అలమటించిరి. వారి శరీరములు కృశించిపోయినవి. చివరికి 49వ దినమున ప్రాతః కాలమున రాజునకు(రాజకుటుంబమునకు) నెయ్యి, పాయసము, హల్వా, నీరు లభించెను.

రంతిదేవుడు భోజనమునకు ఉపక్రమింపబోవుచుండగా ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చెను. కోటీశ్వరుడు ఒక లక్షరూపాయలు దానము చేయవచ్చును. కాని తాను ఆకలితో నకనకలాడుచూ, అన్నదానముచేయుట కష్టమైన కార్యము. కాని సర్వత్ర ఆ శ్రీహరినే దర్శించు రంతిదేవుడు ఆ బ్రాహ్మణ రూప-అతిథి నారాయణునకు ఆ అన్నమును సమర్పించెను. ఆ ఆహారముతో బ్రాహ్మణుడు పరితృప్తుడై వెళ్ళిపోయెను. ఆ పిమ్మట మిగిలిన అన్నమును తాను తన కుటుంబసభ్యులు భుజించుటకు సిద్ధమైరి. ఇంతలో ఒక శూద్రుడు అన్నార్థియై వచ్చెను. రాజు శ్రీహరిని స్మరించి, మిగిలిన అన్నములో కొంత భాగమును ఆదరిద్రనారాయణునకు సమర్పించెను. ఇంతలో మరియొకడు కొన్ని కుక్కలను వెంటబెట్టుకొని వచ్చి 'రాజా! నా కుక్కలు, నేను ఆకలిగొనియున్నాము. మా ఆకలిని తీర్చండి' - అని పలికెను. అప్పుడు ఆ రాజు వారిని (అతనిని, కుక్కలను) దైవములుగా భావించి, మిగిలిన అన్నమును పూర్తిగా ఆ అతిథికిని, అతని కుక్కలకును అర్పించెను.

ఇప్పుడు రాజుకడ ఒకరికి సరిపోవు నీరు మాత్రమే ఉండెను. రాజు ఆ నీటితో ఆకలిని తీర్చుకొనుటకు సిద్ధపడెను. అకస్మాత్తుగా ఒక చండాలుడు అచటికి వచ్చి దీనస్వరముతో 'మహారాజా నేను చాల అలిసిపోయి యుంటిని. తాగుటకు కొంచెము నీరు ఇయ్యండి' అని పలికెను.

చండాలుని దీన వచనములను విని, రాజు మిక్కిలి దయార్ద్ర హృదయుడై, ఇట్లు పలికెను-

న కామయేఽహం గతిమీశ్వరాత్పరామ్
అష్టర్ధియుక్తామపునర్భవం వా ।
ఆర్తిం ప్రపద్యేఽఖిలదేహభాజామ్
అంతఃస్థితో యేన భవంత్యదుఃఖాః ॥
క్షుత్తృట్ఛ్రమో గాత్రపరిభ్రమశ్చ
దైన్యం క్లమశ్శోకవిషాదమోహాః
సర్వే నివృత్తాః కృపణస్య జంతో
ర్జిజీవిషోర్జీవజలార్పణాన్మే॥

(శ్రీమద్భాగవతం - 9/21/12, 13)

'నేను అణిమాది అష్టసిద్ధులతో గూడిన ఉత్తమ గతినిగాని, ముక్తినిగాని భగవంతుని కోరుటలేదు. కాని ప్రాణుల అంతః కరణములయందు స్థితుడనై, వారిదుఃఖములను నేను అనుభవింపవలెను. దానివలన వారు దుఃఖరహితు లయ్యెదరు- ఇది నా కోరిక.'

ఈ మనుష్యుడు నీరులేనిచో ప్రాణములను కోల్పోవుస్థితిలో ఉన్నాడు. ప్రాణములను నిలుపుకొనుటకై దైన్యముతో నీటిని అర్థించుచున్నాడు. 'జీవించు కోరికగల ఇతని ప్రాణములను కాపాడుటకై నీటిని అర్పించినచో ఇతని ప్రాణములు నిలుచుటయే గాక భగవదనుగ్రహము వలన నా ఆకలిదప్పులు, అలసట, శారీరిక కష్టము, దైన్యము, క్లాంతి, శోకవిషాదమోహములు మొదలగునవి అన్నియు నశించును' అని పలికి సహజముగ దయాళువైన రంతిదేవుడు ఆ సమయమున తాను మిక్కిలి పిపాసాపీడితుడైయున్నప్పటికిని ఆ చండాలునికి ప్రేమాదరములతో జలములను సమర్పించెను.

కర్మఫలాసక్తి గలవారికి ఫలములను ఇచ్చు ముల్లోకాధిపతులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు రంతిదేవుని పరీక్షించుటకై తమ మాయద్వారా బ్రాహ్మణాది రూపములను ధరించి వచ్చియుండిరి. రాజుయొక్క ధైర్యమును భక్తిని గమనించి, తమ యథార్థరూపములతో ప్రత్యక్షమైరి. తనకు ప్రత్యక్షమైన ఆ త్రిమూర్తులకు రాజు ప్రణమిల్లెను. వరములను ఇత్తుమని వారు చెప్పినప్పటికిని అతడు వారిని ఏమియు కోరలేదు. ఏలనన అతడు ఇచ్ఛాసక్తులను త్యజించి, భగవంతునకే ఆత్మార్పణచేసియుండెను. పరమభక్తుడైన రంతిదేవుడు తన చిత్తమును పూర్తిగా పరమాత్మునియందే లగ్న మొనర్చి తన్మయుడై అర్పించి యుండుటవలన త్రిగుణమయమైన మాయ అతనికి స్వప్నమువలె గోచరించెను. అతనితోపాటు అతని పరివారము, ఇతరులు గూడ అతని సాంగత్యప్రభావమున నారాయణ పరాయణులు యోగులు పొంది పరమగతిని చేరిరి.

ప్రశ్న - 'భక్త్యుపహృతం' అనగానేమి? ఆ పదప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - భగవంతునకు భక్తి శ్రద్ధలతో సమర్పింపబడు పత్రపుష్పాది వస్తుసముదాయమంతయును (వస్తువులన్నియును) 'భక్త్యుపహృతం' అనబడును. భక్తిరహితముగా ఏ వస్తువును సమర్పించినను దానిని భగవంతుడు స్వీకరింపడు. భక్తియున్నచో దానిని సమర్పించుటలో భక్తునకును, స్వీకరించుటలో దైవమునకును ఆనందము ఉండును. భగవంతుడు భక్తులనుండి ఆశించునది వస్తువులను (కానుకలను) గాదు, వారి భక్తి ప్రపత్తులను మాత్రమే - భక్తి ప్రపత్తులను తమ హృదయములలో నింపుకొనిన గోపికల ఇండ్లలోనికి జొరబడి, అచటి పదార్థములను (పాలు, పెరుగు, వెన్న మొదలగువాటిని) తానే స్వయముగా తీసికొని ఆ కృష్ణభగవానుడు తృప్తిగా ఆరగించెను.

ప్రశ్న - 'అహం అశ్నామి' - అనగానేమి?

సమా - పవిత్ర భక్తితో సమర్పించిన పదార్థమును భగవంతుడు స్వయముగా వారి ఎట్టయెదుట నిలిచి ఆరగించును. అనగా మనుష్య రూపమున అవతరించినప్పుడు తానే స్వయముగా ఆ భక్తుని యెదుట నిలుచును. ఇతర సమయములయందు భక్తుడు కోరిన రూపమున ప్రత్యక్షమై అతడు సమర్పించిన వస్తువును స్వీకరించి, అతనిని కృతార్థుని జేయును.

*సంబంధము - ఇట్టి పరిస్థితులలో తన కర్తవ్యమును గూర్చి తెలుపుమని కోరిన అర్జునునకు భగవానుడు ఇట్లు వివరించుచున్నాడు-*

## యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
## యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ కుంతీసుతా! | యత్ | = ఏ హవ్యమును | యత్ | = దేనినిగూర్చి |
| యత్ | = ఏ కర్మను | జుహోషి | = హోమము చేయుదువో | తపస్యసి | = తపమొనరించుదువో |
| కరోషి | = ఆచరించుదువో | | | తత్ | = ఆ కర్మలన్నింటినీ |
| యత్ | = ఏ పదార్థమును | యత్ | = దేనిని | మదర్పణమ్, కురుష్వ | = నాకే అర్పింపుము. |
| అశ్నాసి | = తినెదవో | దదాసి | = దానము చేయుదువో | | |

**ఓ కౌంతేయా! నీవు ఆచరించు కర్మను, భుజించెడి ఆహారమును, హోమముచేయు హవ్యమును, అర్పించు దానమును, ఆచరించు తపస్సును నాకే సమర్పింపుము. (27)**

ప్రశ్న - 'యత్' అను పదముతో 'కరోషి, అశ్నాసి, జుహోషి, దదాసి, తపస్యసి, అను ఐదు క్రియాపదములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ విధముగా భగవానుడు కర్తవ్య కర్మలనన్నింటిని సమాహార మొనర్చెను. యజ్ఞదాన తపశ్చర్యలే గాక జీవిత నిర్వహణాదులకై చేయబడు వర్ణాశ్రమ ధర్మాది లోకవ్యవహార కర్మలను, అట్లే భగవద్ధ్యాన భజనాదులను అన్నింటిని కలిపి, 'యత్కరోషి' అను పదము సూచించును. శరీర పోషణనిమిత్తమై చేయబడు అన్నపానాది కర్మలను 'యదశ్నాసి' అను పదము వివరించును. పూజలకు, హవనములకు సంబంధించిన సమస్త కర్మలను 'యజ్జుహోషి' అను పదము తెలుపును. సేవలు, దానధర్మాది కర్మలను 'యద్దదాసి' అను పదము సూచించును. సంయమము, తపస్సులకు సంబంధించిన సమస్త కర్మలను 'యత్తపస్యసి' అను పదము ద్వారా తెలుపును. (17/14-17).

ప్రశ్న - పైన తెల్పబడిన సమస్త కర్మలను భగవంతునకు అర్పించుట యనగానేమి?

సమా - సామాన్య మానవుడు పైన తెల్పబడిన కర్మలయందు మమతాసక్తులను ఫలేచ్ఛను సహజముగా కలిగియుండును. కనుక సమస్త కర్మలయందును మమతాసక్తులకు ఫలేచ్ఛను త్యజించి, జగత్తంతయు భగవంతునిదే యనియు, తన మనస్సు, బుద్ధి, శరీరము, ఇంద్రియములును భగవంతునివేయనియు, తామును స్వయముగా భగవంతునకు చెందిన వాడనేయనియు, కనుక

తన ద్వారా జరుగు యజ్ఞాది కర్మలన్నియును భగవంతునకు చెందినవేయని భావించుటయే సమస్త కర్మలను భగవంతునకర్పించుట యగును.

తోలుబొమ్మలనాడించు సూత్రధారివలె 'భగవంతుడే నాచేత ఈ కర్మలన్నింటిని చేయించుచున్నాడు. అతడే అనేక రూపములలో వీటన్నింటికిని భోక్త, నేను కేవలము నిమిత్తమాత్రుడను' అని భావించుచు మానవుడు భగవదాజ్ఞానుసారము భగవత్ప్రీతికొరకై నిష్కామభావముతో పై కర్మలను అన్నింటిని చేయుటయే ఆయా కర్మలను భగవదర్పణ చేయుటయగును.

ప్రశ్న - మొదట వేరే ఉద్దేశ్యముతో కర్మనారంభించి తరువాత దానిని భగవదర్పణ చేయుట, కర్మచేయుచు, చేయుచు మధ్యలో దానిని భగవంతునకు అర్పించుట, కర్మ సమాప్తమైన వెంటనే భగవంతునకు సమర్పించుట లేక కర్మల ఫలములనే భగవంతునకు అర్పణచేయుట- ఈ విధమైన 'అర్పణ' వాస్తవముగా 'అర్పణచేయుట' అగునా కాదా?

సమా - ఈ విధముగా అర్పించుటయు భగవంతున కర్పించుటయే యగును. మొదట ఇదే విధముగ జరుగును. ఇట్లు చేయగా చేయగా పైన తెలిపిన ప్రకారము సంపూర్ణముగా భగవదర్పణ చేయుట యగును.

*సంబంధము - ఈ విధముగా కర్మలనన్నింటిని భగవదర్పణ కావించినచో ఏమగును? అను ప్రశ్నకు భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।**
**సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ 28 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏవమ్ | = ఈ ప్రకారముగా | | భగవంతుడనైన | మోక్ష్యసే | = ముక్తుడవయ్యెదవు |
| సన్న్యాసయోగ యుక్తాత్మా | = సన్న్యాసయోగముతో యుక్తమైన ఆత్మకల వాడవై అనగా సమస్త కర్మలను | శుభాశుభఫలైః = | నాకే అర్పించి శుభాశుభఫల రూపములైన | విముక్తః | = విముక్తుడవైన పిదప, నీవు |
| | | | | మామ్ (ఏవ) | = నన్నే |
| | | కర్మబంధనైః = | కర్మబంధముల నుండి | ఉపైష్యసి | = చేరగలవు. |

**ఈ విధముగా సన్న్యాసయోగమునందు స్థిరచిత్తుడవై, అనగా సమస్తకర్మలను భగవంతుడనైన నాకే సమర్పించి, శుభాశుభఫలరూపకర్మబంధములనుండి ముక్తుడవయ్యెదవు. పిదప నన్నే చేరగలవు.(28)**

ప్రశ్న - 'ఏవమ్' అను అవ్యయముతోపాటు, ప్రయుక్తమైన 'సన్న్యాసయోగయుక్తాత్మా' అను సమాసమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఇచట సన్న్యాసయోగము అను పదము, సాంఖ్యయోగమును అనగా జ్ఞానయోగమును సూచింపదు. పూర్వశ్లోకములో తెల్పబడిన ప్రకారము కర్మలను అన్నింటిని భగవంతునకు అర్పించుటయే ఇచట సన్న్యాస యోగము అనబడును. 'ఏవమ్' అను ప్రయోగము ఈ విషయమునే తెల్పును. కనుక ఇట్టి సన్న్యాసయోగముతో యుక్తమైన ఆత్మగలవాడును, మనోబుద్ధులయందు సమస్త కర్మలను భగవంతునకే అర్పింపవలెనను భావము సుదృఢముగా కలిగియున్నవాడును, 'సన్న్యాసయోగయుక్తాత్మా' అనబడును.

ప్రశ్న - శుభాశుభ ఫలరూప కర్మబంధముల నుండి ముక్తుడగుట అనగానేమి?అట్లు ముక్తుడై భగవానుని పొందుట యనగానేమి?

సమా - వేర్వేరు శుభాశుభకర్మలను అనుసరించి, స్వర్గనరకాది లోకములను పొందుట,మానవ పశుపక్ష్యాది జన్మలనెత్తుట, అట్లే సుఖదుఃఖములను అనుభవించుటయే శుభాశుభకర్మఫలములు అనబడును. వీటినే కర్మబంధములు అని యందురు. ఏలనన ఈ కర్మల ఫలములను అనుభవించుటయే కర్మబంధములలో చిక్కుకొనుట యగును. పై విధముగా సమస్త కర్మలను భగవంతునకు అర్పించినవాడు, కర్మఫలరూపములైన పునర్జన్మలనుండి, సుఖదుఃఖానుభవములనుండి ముక్తుడగును. శుభాశుభ ఫలరూప కర్మబంధములనుండి ముక్తుడగుట యనగా నిదియే. మరణానంతరము భగవంతుని పరమధామమును

జేరుటగాని లేక, ఈ జన్మయందే భగవత్సాక్షాత్కారమును పొందుటగాని ఆ కర్మబంధముల నుండి ముక్తుడై భగవంతుని పొందుట యగును.

ప్రశ్న - పూర్వశ్లోకమున (27వ) చెప్పబడిన రీతిగా కర్మలనన్నింటిని భగవదర్పణము చేయువాడు అశుభకర్మలను చేయనే చేయడు గదా! అయినచో అతడు అశుభఫలముల నుండియు విముక్తుడగునని చెప్పుటలోని అర్థమేమి?

సమా - ఈ విధమైన సాధన చేయకముందు ఈ జన్మయందును, జన్మాంతరముల యందును మనుజుడు అశుభకర్మలను చేసి యుండవచ్చును. 'సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః' అను ప్రస్తావనను అనుసరించి, విహిత కర్మలను చేయుటయందును ఆనుషంగిక దోషములు కలుగుచునేయుండును. కర్మలనన్నింటిని భగవదర్పణము చేయు సాధకుడు వీటన్నింటి నుండియు ముక్తుడగును. ఈ విషయమును తెలుపుటకే శుభాశుభకర్మల నుండి విముక్తుడగునని చెప్పబడినది.

ప్రశ్న - శుభకర్మల ఫలములు బంధకారకము లెట్లగును?

సమా - పూర్వ (27వ) శ్లోకమున చెప్పబడిన రీతిగా సమస్త శుభకర్మలును భగవంతునకు అర్పింపబడినప్పుడు వాటి ఫలము భగవత్ప్రాప్తియే యగును. కాని సకామ భావముతో చేయబడిన శుభకర్మలు ఇహపరలోక భోగరూప ఫలములను ఇచ్చును. భోగప్రాప్తియే ఫలముగా గల కర్మలు పునర్జన్మ హేతువులగును. పైగా అవి భోగేచ్ఛలను, ఆసక్తిని ఇనుమడింపజేయును. కావున ఆ విధమైన శుభకర్మఫలములు బంధకారకములే యనుట సమంజసమే. అయినను శుభకర్మలు త్యాజ్యములని భావింపరాదు. శుభకర్మలు అవశ్యాచరణీయములు. కాని వాటి ఫలములను ఆసింపక వాటిని భగవదర్పణము చేయవలెను. అట్లు చేయుటవలన వాటి ఫలములు బంధకారకములుకాక భగవత్ప్రాప్తి దాయకములే యగును.

*సంబంధము - పైన పేర్కొనబడిన విధముగా భగవంతుని సేవించిన వారికే భగవత్ప్రాప్తి కలుగును. ఇతరులకు కలుగదు - అని చెప్పుట వలన భగవంతునియందు పక్షపాతధోరణి యున్నట్లు సందేహము కలుగును గదా ! దానిని నివారించుటకు భగవానుడిట్లు తెల్పుచున్నాడు-*

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ 29 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహమ్ | = నేను | ప్రియః | = ప్రియమైనవాడును | మయి | = నాయందు (స్థితులై యుందురు) |
| సర్వభూతేషు | = సమస్తప్రాణుల యందును | న, అస్తి | = లేడు | | |
| సమః | = సమభావముతో వ్యాపించియుండును | తు | = కాని | చ | = మఱియు |
| | | యే | = ఏ భక్తులు | అహమ్, అపి | = నేనును |
| మే | = నాకు | మామ్ | = నన్ను | తేషు | = వారియందు (ప్రత్యక్షముగా ఉందును). |
| ద్వేష్యః | = అప్రియమైనవాడును | భక్త్యా | = భక్తితో | | |
| న, అస్తి | = లేడు | భజంతి | = భజింతురో | | |
| | | తే | = వారు | | |

**నేను సకలభూతముల (ప్రాణుల) యందును సమభావముతో వ్యాపించియుందును. నాకు అప్రియుడు గాని ప్రియుడు గాని ఎవ్వడును లేడు. కాని నన్ను భక్తితో భజించువారు నాయందేయుందురు. నేనును వారియందు ప్రత్యక్షముగా ఉందును. (29)**

ప్రశ్న - నేను సకల ప్రాణులయందును సమభావముతో వ్యాపించి యుందును. నాకు అప్రియుడుగాని, ప్రియుడుగాని ఎవ్వరును లేరు. అని పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల ప్రాణులలో పరమాత్ముడు సమభావముతో అంతర్యామిగా వ్యాపించి యుండును. కనుక భగవానునకు అందరియందును సమభావమే యుండును. ఎవ్వరియందును ఆయనకు రాగముకాని, ద్వేషముగాని యుండదు. కావున వాస్తవముగా ఆయనకు ప్రియులుగాని, అప్రియులుగాని ఉండరు.

ప్రశ్న - భక్తితో భగవంతుని భజించుట యనగానేమి? 'వారు నాయందు ఉందురు. నేనువారియందు ప్రత్యక్షముగా ఉందును'- అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - సాకార రూపమునగాని, నిరాకార రూపమునగాని భక్తిశ్రద్ధలతో భగవంతుని నిరంతరము చింతన చేయుట, ఆయన నామగుణ ప్రభావమహిమలను లీలా చరిత్రములను శ్రవణ మనన కీర్తనలు గావించుట, ఆయునకు నమస్కరించుట, పత్రపుష్పాది వస్తువులతో భక్తి పూర్వకముగా ఆరాధించుట, సమస్త కర్మలను ఆయునకే సమర్పణ చేయుట మొదలగు క్రియలన్నియు భక్తితో భగవంతుని భజించుటలో అంతర్గతములు.

ఈ విధముగా భగవంతుని భజించువారిని భగవంతుడు అదే విధముగ ఆదరించును, అనుగ్రహించును. వారు భగవంతుని మరువనట్లే వారిని భగవంతుడు గూడ మరువడు. ఈ భావమును స్పష్టపరచుటకే వారు తనయందు ఉందురు అని తెల్పెను. ఆ భక్తుల శుద్ధాంతఃకరణములు భగవద్భక్తితో పరిపూర్ణముగా ఉండును. కనుక వారి హృదయములయందు భగవానుడు సర్వదా ప్రత్యక్షముగా గోచరించుచుండును. భగవంతుడు తాను వారియందు ఉండునని పలుకుటలోని అంతరార్థమిదియే.

భగవానుడు నిరాకార రూపముతో సమస్త చరాచర ప్రాణులయందు వ్యాప్తుడుగను, సమస్త చరాచరప్రాణులును ఆయున యందు స్థితమై ఉన్నట్లును ఈ అధ్యాయము నందలి 4, 5 శ్లోకములలో తెల్పియుండెను. అట్లైనను తన భక్తులను తాను తన హృదయమునందు విశేషముగా ధరించియున్నట్లును, అట్లే వారి హృదయములయందు తాను నివసించి యున్నట్లును తెలుపుచు, భక్తియే దీనికి ప్రబలకారణమని పేర్కొనెను.

భగవానుడు దుర్వాసునితో ఇట్లు పల్కి యుండెను.

సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం త్వహమ్ ।
మదన్యత్తే న జానంతి, నాహం తేభ్యో మనాగపి ॥
(శ్రీమద్భాగవతమ్ - 9/4/68)

సాధువులు (భక్తులు) నాకు హృదయము వంటి వారు. నేను వారికి హృదయము వంటివాడను. వారు నన్ను తప్ప వేరెవ్వరిని ఎరుగరు. కనుక వారు తప్ప మరెవ్వరును నామదిలో మెదలరు. సమభావముతో అంతటను ప్రకాశమును ఇచ్చుచుండు సూర్యుడు అద్దము మొదలగు స్వచ్ఛ పదార్థములతో ప్రతిబింబించుచుండును. కట్టెలు మొదలగు వాటియందు ప్రతిబింబింపడు. అయినను ఆ సూర్యునిలో ఎట్టి పక్షపాతము లేదు. అట్లే భగవానుడును భక్తులకు లభించుచుండును. ఇతరులకు లభింపడు. ఇందులో ఆయునకు భేదభావములేదు. ఇదియే భక్తియొక్క మహిమ.

*సంబంధము - భగవానుడు తనను భజించు వారియందు సమభావమును ప్రదర్శించుచు రాబోవు రెండు శ్లోకములలో దుష్టులకు గూడ భక్తి ద్వారా శాశ్వతశాంతి లభించునని ఉద్ఘోషించుచు భక్తియొక్క నిరుపమానమహిమను చాటెను-*

**అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సుదురాచారః, అపి | = మిక్కిలి దురాచారుడైన వాడును | భజతే, చేత్ | = భజించినట్లయితే | హి | = ఏలనన |
| | | సః | = అతడు | సః | = అతడు |
| అనన్యభాక్ | = అనన్య భావముతో నాభక్తుడై | సాధుః, ఏవ | = సత్పురుషుడుగానే | సమ్యక్ | = యథార్థముగా |
| | | మంతవ్యః | = భావింపదగిన వాడు | వ్యవసితః | = నిశ్చయబుద్ధిగల వాడు. |
| మామ్ | = నన్ను | | | | |

మిక్కిలి దురాచారుడైనను అనన్యభక్తితో నన్ను భజించినచో అతనిని సత్పురుషునిగానే భావింపదగును. ఏలనన యథార్థముగా అతడు నిశ్చయబుద్ధి గలవాడు. అనగా పరమాత్మని సేవించుటతో సమానమైనది మఱియొకటి ఏదియును లేదని గట్టిగా నిశ్చయించుకొనినవాడు.

(30)

ప్రశ్న - 'అపి' అను అవ్యయమును ప్రయోగించుట లోని విశేషమేమి?

సమా - సదాచారులు, సాధారణపాపులు భగవంతుని భజించుట ద్వారా ఉద్ధరింపబడుటలో విశేషమేమాత్రమును లేదు. కాని మిక్కిలి దురాచారులు గూడ భగవంతుని భజించుట వలన ఉద్ధరింపబడుదురని తెల్పుటకు 'అపి' అను అవ్యయము ప్రయుక్తము అయ్యెను.

ప్రశ్న - 'చేత్' అను అవ్యయప్రయోగములోని విశేషమేమి?

సమా - 'చేత్' అను అవ్యయమునకు 'యది' అనగా 'ఒకవేళ' అని యర్థము. దురాచారులైన వారు సామాన్యముగ విషయములయందును, పాపముల యందును ఆసక్తులై యుందురు గాన వారు భగవంతుని భక్తితో భజింపరు. అయినను ఏదైనా పురాకృత శుభసంస్కారముల యొక్క ప్రభావము వలనను, భగవద్భావములతో గూడిన వాతావరణము వలనను, శాస్త్రాధ్యయన మూలముననను, మహాత్ముల సత్సాంగత్య కారణముననను, భగవంతుని గుణ ప్రభావ మహత్త్వ రహస్యములను వినుటవలనను, దురాచారుడైనవాడు ఎప్పుడైనను ఒకవేళ భగవంతునిపై భక్తి శ్రద్ధలు కలిగి ఆయనను (భగవంతుని) భజించినచో అతడును (ఆ దురాచారుడును) ఉద్ధరింపబడును.

ప్రశ్న - 'సుదురాచారః' అను పదము ఎట్టి మనుష్యుని తెల్పును? అతడు 'అనన్యభాక్' అయి భగవంతుని భజించుట యనగానేమి?

సమా - అత్యంత దూషితమైన ప్రవర్తన గలవాడును, ఆహార విహారములయందు భ్రష్టుడైనవాడును, స్వభావమును బట్టియు, ఆసక్తిని బట్టియు చెడు అలవాట్లకు లోనైన వాడై దురాచారములను విడిచిపెట్టలేని వాడును అగు వానిని తెల్పునదియే 'సుదురాచారః' అను పదము. అట్టివాడు భగవానుని యొక్క గుణప్రభావాదులను వినుట లేక చదువుటవలనను, మరియే ఇతర కారణము వలననైనను భగవానుని సర్వోత్తమునిగా గ్రహించును. ఆయననే ఆశ్రయించి, మిక్కిలి భక్తి శ్రద్ధలతో తన ఇష్టదైవముగా భావించును. అట్టి వానిని 'అనన్యభాక్' అని యందురు. ఈ విధముగ భగవద్భక్తుడైన వాడు భగవత్స్వ రూపమును చింతనచేయుట, భగవంతుని నామగుణమహిమా ప్రభావములను శ్రవణము, మననము, కీర్తనము కావించుట, ఆయనకు నమస్కరించుట, పత్రపుష్పాదులను సమర్పించి పూజించుట, తాను చేసిన శుభకర్మలను భగవదర్పణ చేయుట - ఇత్యాది కర్మలను కొనసాగించుటయే 'అనన్యభాక్' అయి భగవంతుని భజించుట అగును.

ప్రశ్న - అట్టి మనుష్యుడు సాధువుగా భావింపదగిన వాడనియు, యథార్థముగా దృఢమైన నిశ్చయ బుద్ధిగల వాడనియు పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - భక్తుడైనవాడు దురాచారములను సర్వథా త్యజించుటకు ఇచ్ఛయుండి, ప్రయత్నించినప్పటికిని స్వభావ - అభ్యాసములకు వివశుడై ఏ దురాచారమును (చెడు అలవాటును) మానివేయ లేకున్నను, అతనిని దుష్టుడని భావింపక సాధువుగానే తలంపవలెను. ఏలనన భగవానుడు పతితపావనుడు, సర్వసుహృదుడు, సర్వశక్తిమంతుడు, పరమదయాళువు, సర్వజ్ఞుడు, అందరికిని స్వామి, సర్వోత్తముడు అని భావించుచు, అతనిని భజించుటయే మానవజీవితము యొక్క పరమ కర్తవ్యము, దానివలన సమస్త పాపములు, పాపవాసనలును గూడ సమూలముగ నాశమై భగవత్కృపచే తనకు సహజముగనే భగవత్ప్రాప్తి కలుగునని దృఢముగా నిశ్చయించుటనే యథార్థనిశ్చయము చేయుట యగును. ఇట్టి నిశ్చయముగల భక్తుడు భక్తిమహిమవలన, శీఘ్రముగనే పూర్తిగా ధర్మాత్ముడగును. కనుక అతనిని 'పాపి' లేక దుష్టుడు అని భావింపక 'సాధువు' అని భావించుటయే సముచితము.

ప్రశ్న - దుష్కృతి (దురాచారుడు) యైన వాడు నన్ను భజింపడు-అని 7వ అధ్యాయము నందలి 17వ శ్లోకమున తెల్పియుండెను. కాని ఇచ్చట 'దురాచారుడు' భగవంతుని భజించుట వలన కలుగు ఫలమును తెల్పుచున్నాడు. ఈ రెండు వచనముల మధ్య వైరుధ్యము కన్పడుచున్నది గదా? దీనికి సమాధానమేమి?

సమా - అచట వర్ణింపబడిన దురాచారులు కేవలము పాపములను చేయువారు మాత్రమే గాదు. వారికి భగవంతునిపై విశ్వాసమూ ఉండదు. భగవంతుని గూర్చి తెలిసికొనరు. మరియు పాప కర్మల నుండి బయటపడుటకు ఇష్టపడరు - అట్టి నాస్తికులు, మూఢులు అయిన వారిని గూర్చియే 'మాయయాపహృతజ్ఞానాః', 'నరాధమాః' 'ఆసురం భావమాశ్రితాః' మున్నగు విశేషణములు ప్రయుక్తములైనవి. కాని ఇచ్చట వర్ణింపబడిన వారి ద్వారా

పాపములు జరుగుచుండును. కాని వీరాపాపములనుండి బయటపడుటకు యత్నింతురు. వీరికి భగవంతుని గుణప్రభావ స్వరూపములయందును, నామములయందును భక్తి గలదు. పతితపావనుడును, పరమదయాళువు అయిన పరమేశ్వరుడే అందరికంటెను పరమ శ్రేష్ఠుడు అని వీరు విశ్వసింతురు. 'భగవానుడే వీరికి ఇష్టదైవము. ఆయనను భజించుటయే మానవ జీవితమున పరమకర్తవ్యము, ఆయన కృపచేతనే తమ పాపములు సమూలముగా నశించును. తమకు సహజముగనే భగవత్ప్రాప్తి కలుగును.' అని దృఢముగా వీరు నమ్ముదురు. కనుక వీరిని 'సమ్యగ్వ్యవసితః' 'అనన్యభాక్' అని పేర్కొనుట జరిగినది. కావున వీరి ద్వారా భజన జరుగుట సహజమే. నాస్తికులకు భగవంతునియందు విశ్వాసమే యుండదు. అందువలన వారి ద్వారా భజన జరుగుట సంభవమేగాదు. కాబట్టి భగవంతుని ఆ రెండు వచనముల మధ్య ఎట్టి వైరుధ్యమూ లేదు. సందర్భమునననుసరించి రెండును సరియైనవే.

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।**
**కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ కుంతీసుతా! | భవతి | = అగును | మే, భక్తః | = నా భక్తుడు |
| (సః) | = (అతడు) | శశ్వత్ | = శాశ్వతమైన | న, ప్రణశ్యతి | = ఎన్నడును నష్టము పాలుగాడు-అని |
| క్షిప్రమ్ | = శీఘ్రముగా | శాంతిమ్ | = పరమశాంతిని | ప్రతిజానీహి | = నిశ్చయముగా ఎఱుంగుము. |
| ధర్మాత్మా | = ధర్మాత్ముడు | నిగచ్ఛతి | = పొందును | | |

**కౌంతేయా! అతడు శీఘ్రముగా ధర్మాత్ముడగును. శాశ్వతమైన పరమశాంతిని పొందును.'నా భక్తుడెన్నడును నష్టమునకు గురికాడు' అను విషయమును నిశ్చయముగా ఎఱుంగుము. (31)**

ప్రశ్న - పై విధముగా భగవంతుని భజించు భక్తుడు శీఘ్రముగనే ధర్మాత్ముడగును. అనగానేమి? అతడు శాశ్వతశాంతిని పొందుట అనగానేమి?

సమా - ఈ జన్మయందే అతి శీఘ్రముగా అన్ని విధములైన దుర్గుణములనుండియు, దురాచారముల నుండియు బయటపడి, **16**వ అధ్యాయమునందలి 1,2,3, శ్లోకములయందు వర్ణింపబడిన దైవీసంపదతో యుక్తుడగుటయే - అనగా భగవత్ప్రాప్తికి పాత్రుడగుటయే శీఘ్రముగా ధర్మాత్ముడగుట యగును. ఒకసారి ప్రాప్తించిన పిమ్మట ఎన్నటికిని దూరముగాని శాంతిని **'శశ్వచ్ఛాంతి'** అని యందురు-దానినే **'నైష్ఠికీ శాంతి' (5/12) 'నిర్వాణపరమశాంతి' (6/15) 'పరమశాంతి' (18/62)** అనియు అందురు. ఇదియే పరమేశ్వర ప్రాప్తి రూప శాశ్వతశాంతి.

ప్రశ్న - 'ప్రతి జానీహి' అను పదమునకు అర్థమేమి? ఈపద ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - 'ప్రతి' అను ఉపసర్గతోపాటు 'జ్ఞా' అను ధాతువు నుండి ఏర్పడిన పదమే 'ప్రతిజానీహి' ప్రతిజ్ఞ చేయుము, లేక దృఢముగా నిశ్చయింపుము - అని దీని యర్థముగా - భగవంతుడు తన భక్తుని యొక్క మరియు అతని భక్తియొక్క మహత్త్వమును ఇంతవరకును తెలిపెను. ఆ మహత్త్వమునందు ఏ మాత్రమూ సంశయములేకుండ దానిని సర్వథా సత్యమని నమ్మి దృఢముగా ధారణ చేయుమని ఆదేశించుచు భగవానుడు అర్జునునితో 'ప్రతిజానీహి' అని యనెను.

ప్రశ్న - నా భక్తుడు ఎన్నడును నష్టమునకు గురికాడు. (నశింపడు) అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 'ప్ర' అను ఉపసర్గముతోపాటు 'నశ్యతి' క్రియకు పతనము చెందుట అని భావార్థము. భగవద్భక్తుడు క్రమముగా ఉద్ధరింపబడును. కాని పతనముకాడు. అనగా తన ప్రస్తుత స్థాయినుండి అధోగతిపాలుగాడు. అతనికి నీచయోనులుగాని, నరకాది దుర్గతులుగాని ప్రాప్తింపవు. భక్తుడు క్రమముగా దుర్గుణ దురాచారములనుండి విముక్తుడై ధర్మాత్ముడగును. పరమశాంతిని పొందును.

ప్రశ్న - ఇట్టి భక్తుడెవడైనను కలడా?

సమా - పెక్కుమంది గలరు. బిల్వమంగళుని గాథయే

దీనికి ప్రబల నిదర్శనము. భక్తిరసపరిపూర్ణమైన శ్రీకృష్ణకర్ణామృతమును ఇతడు రచించెను. 'లీలాశుకుడు'గా వాసికెక్కెను.

## 'బిల్వమంగళుడు'

దక్షిణ దేశమందు కృష్ణానదీ తీరమున ఒకానొక గ్రామమునందు 'రామదాసు' అను బ్రాహ్మణ భక్తుడు నివసించుచుండెను. అతని కుమారుడే ఈ బిల్వమంగళుడు. ఇతడు విద్యావంతుడు. శాంతసాధుస్వభావుడు. శిష్టాచార సంపన్నుడు. కాని తండ్రి చనిపోయిన పిమ్మట దుష్టుల సాంగత్యములోబడి మిక్కిలి దురాచారుడయ్యెను. వేశ్యాలోలుడై రాత్రింబవళ్ళు పాపకర్మలలో మునిగి తేలుటయే ఇతని పనియయ్యెను. 'చింతామణి' అను వేశ్యపై మిక్కిలి అనురక్తుడయ్యెను. ఆమె నదికి అవలి తీరమున నివసించుచుండెడిది. ఒకానొకనాడు తండ్రి శ్రాద్ధకారణముగ పగటిపూట ఇతడు ఆ సానియింటికి వెళ్ళలేక పోయెను. శ్రాద్ధకర్మ ముగియునప్పటికి చీకటి పడెను. అప్పుడతను వేశ్య కడకు వెళ్ళుటకు సిద్ధపడెను. పితృశ్రాద్ధము నాచరించి వేశ్యకడకు వెళ్ళుట తగదని లోకులు పలికిరి. కాని వారి మాటలను పెడచెవిన బెట్టి, పరుగెత్తి నదీతీరమునకు చేరెను. తుఫాను రాకతో కుంభవృష్టి కురియసాగెను. నావికులు తుఫాను వర్షమునకు భయపడి పడవలను తీరమునకు చేర్చి, చెట్ల క్రిందికి చేరిరి. అది భయంకరమైనరాత్రి. అవలి తీరమునకు చేర్చుడని అతడు నావికులను ప్రార్థించెను. ధనాశచూపెను. కాని ప్రాణభయముతో వారు సిద్ధపడలేదు. అతడు ముందు వెనుకలు ఆలోచింపక నదిలో దూకెను. ఒక స్త్రీయొక్క కుళ్ళిన శవము ప్రవాహములో కొట్టుకొని పోవుచుండెను కామాంధుడైన అతడు దానిని శవమని గమనింపక కొయ్యయని భావించి, దానినే పట్టుకొనెను. అతనికి అది మృతకళేబరము అని గాని, దుర్గంధ పూరితము అనిగాని తోచలేదు. దైవయోగము వలన అవలి ఒడ్డుచేరి, చింతామణి ఇంటికి పరుగెత్తెను. ఇంటి తలుపులు మూయబడియుండెను. అతడు గోడనెక్కి లోపలికి పోదలచెను. గోడపై త్రాడు వలెనున్న ఒక మెత్తని వస్తువు చేతికి తగిలెను. అది ఒక కాలసర్పము. దాని పడగ పైవైపునకు ఉండి, క్రిందికి వ్రేలాడుచుండెను. అతడు దానితోకను పట్టుకొని పైకి ఎగబ్రాకెను. భగవచ్చిత్రమో? ఏమో? మరి అది అతనిని కాటువేయలేదు. వెళ్ళి అతడు చింతామణిని లేపెను. ఆమె అతనిని సంభ్రమాశ్చర్యములతో చూచుచు పలికెను. 'ఈ భయంకర రాత్రి సమయమున నదినిదాటి తలుపులు మూసి యున్న ఇంటిలోనికి ఎట్లు ప్రవేశించితిరి?' అందులకు సమాధానముగా కొయ్య సాయమున నదినిదాటి, త్రాడు సహాయముతో గోడను ప్రాకి వచ్చితినని ఆ బిల్వమంగళుడు చెప్పెను. వర్షము వెలిసెను చింతామణి దీపమును చేతగొని బయటికి వచ్చి చూడగా గోడపై భయంకరమైన కాలసర్పము వ్రేలాడుచుండెను. నదీతీరమున ఒక కుళ్ళిన శవము పడియుండెను. ఆ దృశ్యములను చూడగనే బిల్వమంగళుడు వణకిపోయెను.

చింతామణి అతనిని ఏవగించుకొనుచు ఇట్లనెను. 'ఓరీ! నీవు బ్రాహ్మణుడవు. పైగా నేడు నీ తండ్రి శ్రాద్ధము. రక్తమాంసములతో గూడిన ఈ తోలుబొమ్మ మీది మోజుతో (మోహముతో) నీ ధర్మకర్మములన్నింటికినీ తిలాంజలి వదలి ఈ భయంకరరాత్రియందు శవమును, పామును ఊతగా గొని పరుగిడి వచ్చితివి. పరమసుందరమైనదని నీవు భావించు ఈ నా శరీరముగూడ ఒకరోజున క్రుళ్ళిపోయిన ఆ శరీరస్థితికి చేరును. ఇప్పటి నీ ప్రవర్తన అతిహేయమైనది. ఈ విధమైన ఈ ఆసక్తిని మనోహరుడైన ఆ శ్యామసుందరునిపై ఉంచి, అతనిని పొందుటకు నీవు ఇట్లు పరుగులు తీసియున్నచో తప్పక అతనిని పొంది కృతార్థుడవై యుండెడివాడవు.'

వేశ్యయొక్క ఉపదేశముతో బిల్వమంగళునకు కనువిప్పు కలిగెను. అతని హృదయతంత్రులు క్రొత్తరాగములను పలికినవి. వివేకాగ్నిలో అతని పాపములన్నియును భస్మమైపోయెను. అంతఃకరణ శుద్ధి కలుగగనే అతనిలో భక్తితరంగములు ఉప్పొంగెను. కన్నులనుండి అవిచ్ఛిన్నముగా అశ్రుధారలు ప్రవహించెను. చింతామణి (వేశ్య) యొక్క పాదములపై బడి అతడు 'తల్లీ! నేడు నీవు నాకు వివేక దృష్టిని ప్రసాదించి, కృతార్థుని జేసితివి' అనెను. మనస్సులో అతడు చింతామణిని గురువుగా భావించి ప్రణమిల్లెను. పిమ్మట ఆ రాత్రి యంతయు అతనికి చింతామణి శ్రీకృష్ణభగవానుని లీలలను గానము చేయుచు వినిపించెను. బిల్వమంగళుడు దానితో మిక్కిలి ప్రభావితుడయ్యెను. ప్రాతఃకాలముననే అతడు జగచ్చింతామణియైన శ్రీకృష్ణుని పవిత్ర చింతనయందు నిమగ్నుడై ఉన్మత్తునివలె చింతామణి (వేశ్య) ఇంటి నుండి బయల్వెడలెను. అతని జీవిత నాటకములో (మాయ) తెర తొలగిపోయెను. కృష్ణాతీరమున గల

సోమగిరియను మహాత్ముని యొద్దకేగి, అతనినుండి గోపాల మంత్రోపదేశమును పొంది, దీక్షతో దానిని జపింపసాగెను.

అతడు భగవన్నామమును కీర్తించుచు తిరుగసాగెను. మనస్సునందు దైవ దర్శన కాంక్ష జాగృతమయ్యెను. కాని అతనిలో ఇంకను దురాచార స్వభావము పూర్తిగా నశింపలేదు. ప్రాత అలవాట్ల ప్రభావమున అతని మనస్సు మరియొక యువతిపైకి పోయెను. బిల్వమంగళుడు ఆమె ఇంటికి వెళ్ళి, ముంగిట కూర్చొనియుండెను. ఆ ఇంటి యజమాని బయటికి వచ్చి చూడగా మలిన ముఖముతో నున్న ఇతడు కనబడెను. బిల్వమంగళుడు కపటము వీడి తన వృత్తాంతమును అంతయును వినిపించి, 'నేను ఆ యువతిని ఒకసారి మనసార చూడదలచితిని. దయతో పిలిపింపుడు' అని అతనితో పలికెను. ఆ యువతి ఆ ఇంటి ధర్మపత్ని, అప్పుడాయజమాని 'ఇతడు ఆమెను ఒకసారి చూచినంతనే తృప్తిజెందినచో చూడనిమ్ము. ఇందువలన హాని ఏమి?' అని తలపోసెను. సాధుస్వభావము గల ఆ యజమాని తన భార్యను పిలుచుకొని వచ్చుటకై లోనికేగెను. ఇచట బిల్వమంగళుని మనస్సునందు వివిధములగు ఆలోచనా తరంగములు అతనిని కల్లోల పరచెను.

భక్తుడుగా మారిన బిల్వమంగళుడు ఎట్లు పతనము చెందును? దీనవత్సలుడైన భగవానుడు అజ్ఞానాంధుడైన బిల్వమంగళునకు వివేక దృష్టిని అనుగ్రహించెను. అతడు తన దిగజారుడు స్థితిని గుర్తించెను. హృదయము శోకముతో నిండి పోయెను. కొద్దితడవు ఆలోచించి, సమీపమున గల రేగిచెట్టు కడకు వెళ్ళి, రెండు ముళ్ళను తీసికొనెను. ఇంతలో ఆ యజమాని ధర్మపత్ని అచటికి వచ్చెను. బిల్వమంగళుడు ఆమెను చూచి, మనస్సులోనే తనను ఏవగించుకొనుచు, 'ఓ దుష్టనేత్రములారా! మీరు లేకున్నచోనాకీ దురవస్థ వచ్చెడిదికాదు గదా! అని పలుకుచు ఆ చంచల నేత్రములను శిక్షింపదలచి, రెండు ముండ్లతో తన కనులను పొడుచుకొనెను. కండ్ల నుండి రక్తము స్రవింపసాగెను. అప్పుడు బిల్వమంగళుడు నవ్వుచు నాట్యము చేయుచు బిగ్గరగా హరినామము కీర్తింపసాగెను. ఈ దృశ్యమునుగాంచి ఆ యజమానియు, అతని భార్యయు మిక్కిలి బాధపడిరి. చేయునదిలేక నిస్సహాయముగా మిగిలిపోయిరి. బిల్వమంగళునిలో మిగిలియున్న ఆ కొద్ది మనోమాలిన్యము గూడ అంతరించిపోయెను. అనాథనాథుడైన పరమాత్మప్రాప్తికై అతడు విలవిలలాడ సాగెను.

ప్రియతముడైన శ్రీకృష్ణుని దారుణ వియోగ వ్యథ వలన అతని కన్నుల నుండి అహర్నిశలు అశ్రువులు స్రవింపసాగెను. అతనికి ఆకలిదప్పుల స్పృహయే లేకుండెను. అతనికి నిద్రాజాగృతుల ధ్యాసయే దూరమయ్యెను. 'కృష్ణా! కృష్ణా!' అను అతని పిలుపులు అన్ని దిక్కులయందును ప్రతిధ్వనించుచుండెను. ఆ విధముగ అడవులయందును, గ్రామములయందును తిరుగుచుండెను. దీనజనబాంధవుడైన ఆ భగవానునికై తన చర్మచక్షువులను నష్టపరచుకొనెను. ప్రియతముడైన ఆ కృష్ణుని యొక్క దర్శన ప్రాప్తికై తన విలాస జీవితమునకు స్వస్తి పలికెను. ప్రేమస్వరూపుడైన శ్రీకృష్ణుడు ఆతని దుస్థితిని జూచి సహింపలేకపోయెను. భగవంతుడు చిన్న గోపబాలకుని రూపముతో అతనిముందు నిలిచి, మునిమనోహరమైన తన మధురస్వరముతో ఇట్లనెను. 'ఓ సూరదాసూ!' నీకు మిక్కిలి ఆకలివేసియుండవచ్చును. నేను మిఠాయిలు, నీళ్ళు తీసికొని వచ్చితిని. వీటిని స్వీకరింపుము.'

ఆ బాలగోపాలుని మధుర స్వరమును వినినంతనే బిల్వమంగళుని సంతోషమునకు మేరలేకపోయెను. దుర్లభమైన ఆ ప్రసాదమును స్వీకరించినంతనే ఆతని హృదయము సంతోషముతో ఉప్పొంగిపోయెను. బిల్వమంగళుడు ఆబాలకునితో "బాబూ నీ ఇల్లెక్కడ' నీ పేరేమి? నీవేమి చేయుచుందువు". అని పలికెను.

బాలకుడు ఇట్లు చెప్పెను. 'నా ఇల్లు ఈ సమీపముననే యున్నది. నాకు ప్రత్యేకమైన పేరులేదు. ఎవరేపేరుతో పిలిచిన ఆ పేరుతోనే నేను పలుకుచుందును. గోవులను కాయుచుందును. నన్ను ప్రేమించువారిని నేనును ప్రేమింతును'.

బిల్వమంగళుడు ఆ బాలుని మధురవచనములకు ముగ్ధుడయ్యెను. బాలకుడు వెళ్ళుచూ 'నేను ప్రతిదినము నీకు భోజనమును తెచ్చి ఇచ్చుచుందును' అని ఆతనితో పలికెను. బిల్వమంగళుడు 'మంచిది' ప్రతిదినము రమ్ము'అని యనెను. బాలకుడు వెళ్ళుచూ బిల్వమంగళుని మనస్సును గూడ తీసికొని పోయెను.

శ్రీకృష్ణ ప్రాప్తి కొరకై అతడు విరాగియయ్యెను. ఆ కన్నయ్య దర్శనార్థమే అతడు తన కన్నులను పొగొట్టుకొనెను. కాని ఆ కృష్ణుడే ఈ బాలకుడై వచ్చినట్లు అతడు గ్రహింపలేకపోయెను. కాని ఆ గోపబాలకునిచే అతడు

మిక్కిలి ప్రభావితుడయ్యెను. ఆ గోపకిశోరము యొక్క మధురస్వరము తప్ప ఇతరుల వచనములు రుచింపకుండెను. ఒకనాడు బిల్వమంగళుడు తన మనస్సులో ఇట్లు ఆలోచింపసాగెను. 'ఆపదలనన్నింటిని తప్పించుకొని వచ్చితిని. కాని ఈ క్రొత్త ఆపద ఎదురైనది. స్త్రీ వ్యామోహము నుండి బయటపడితిని. ఈ బాలుని మరులకు చిక్కుపడితిని.' ఇంతలో ఆ బాలకుడు వచ్చి ప్రక్కన కూర్చొని మత్తెక్కించు మంజుల స్వరముతో 'బాబా! ఏమి ఆలోచించుచుంటివి? బృందావనమునకు వెళ్ళుదామా?' అని ప్రశ్నించెను. 'బృందావనము' అను మాట చెవి సోకినంతనే అతని హృదయము పరవశమాయెను. కాని తన నిస్సహాయస్థితిని ప్రకటించుచు 'బాబూ! నేను అంధుడను. బృందావనమునకు ఎట్లు వెళ్ళగలను'? అని యనెను. బాలకుడు 'ఈ కర్రను పట్టుకొనుము. నేను దీనిని పట్టుకొని నీవెంట వచ్చెదను.' అని పల్కెను. బిల్వమంగళుని ముఖము విప్పారెను. కర్రను పట్టుకొని భగవానుడు భక్తునిముందు నడువసాగెను. భగవంతుడు ఎంత దయాళువు? భక్తునకు స్వయముగా మార్గమును చూపుచున్నాడు. కొద్దిసేపటికే 'ఇదిగో బృందావనము వచ్చినది. నేను వెళ్ళుచున్నాను' అని బాలుడు పలికెను. బిల్వమంగళుడు బాలకుని చేయిపట్టుకొనెను. ఆ కరస్పర్శతో అతని శరీరమున విద్యుత్తు ప్రవహించినట్లాయెను. ఆ సాత్త్విక తేజఃప్రభావమున అతని జ్ఞానద్వారములు ప్రకాశితములు అయ్యెను. బిల్వమంగళునకు దివ్యదృష్టి ప్రాప్తించెను. బాలకునిలో ఆ శ్యామసుందరుడే సాక్షాత్కరించెను. అతని శరీరము పులకితమయ్యెను. ఆనందాశ్రువులు సంతతము ప్రవింపసాగెను. భగవానుని చేతిని ఇంకను గట్టిగా పట్టుకొని 'ఆ! ఇప్పుడు గుర్తించితిని. చాలా దినముల తరువాత నా చేతికి చిక్కితివి. ఇంక నిన్ను వదలను' అని పలికెను. భగవానుడు 'వదలుము' అనెను. బిల్వమంగళుడు 'ఎన్నటికిని వదలను' అనెను.

భగవానుడు విదిలించుచు తన చేతిని అతని నుండి వదలించుకొనెను. మాయయు భగవంతుని బాసటతో బలాన్వితయై సమస్త జగత్తును తన పాదములకు మోకరిల్లునట్లుగా జేయుచున్నది. అట్టి బలశాలియైన భగవంతుని ముందర అంధుడైన ఈ బిల్వమంగళుని బలమెంత? కాని బిల్వమంగళుని భక్తిసూత్రముతో భగవానుడు కట్టి వేయబడెను. ఆ బంధమును విడిపించుకొనుట అసాధ్యము గదా! బిల్వమంగళుడు పలికెను - 'నిజముగా వెళ్ళెదవా? కాని జ్ఞాపకముంచుకొనుము-

హస్తముత్క్షిప్య యాతోఽసి, బలాత్ కృష్ణ! కిమద్భుతమ్? ।
హృదయాద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే ॥

'కృష్ణ! బలప్రభావముతో నా చేతినైతే విడిపించుకొని వెళ్ళుచున్నావు. దానిలో ఆశ్చర్యము లేదు. కాని నా హృదయమునుండి నీవు తప్పించుకొని పోయినచో నీ బలము బయటపడును'.

మొట్టమొదట దురాచారుడైన బిల్వమంగళుడు పిదప భక్తుడాయెను. పతన స్థితులు ఎంతగా ఎదురైనను వాటినుండి బయటపడి భగవంతుని పొంది కృతార్థుడయ్యెను. బృందావనమునకు వెళ్ళునప్పుడు త్రోవలో భావావేశమున పలికిన పలుకులే శ్లోకములై 'శ్రీ కృష్ణకర్ణామృతము'గా రూపొందెను. చింతామణిని గురువుగా భావించి, అందు మొదటి శ్లోకమునే ఆమెకు నమస్సులు అర్పించెను-

చింతామణిర్జయతి సోమగిరిర్గురుర్మే
శిక్షాగురుశ్చ భగవాన్‌శిఖిపింఛమౌళిః ।
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు
లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః ॥

'నామోహమును దూరముచేసిన చింతామణికిని, దీక్షాగురువైన సోమగిరికిని జయము అగుగాక. అట్లే శిఖిపింఛమౌళియును, నాదీక్షాగురువును అయిన శ్రీకృష్ణభగవానునకు జయమగుగాక. అతని చరణ రూపకల్పవృక్షముయొక్క పత్రాంచలముల యందు విజయలక్ష్మి విలసిల్లుచు స్వయంవర సుఖములను అనుభవించును. (అనగా భక్తుల కోరికలను తీర్చు అట్టి చరణములయందు విజయలక్ష్మి సర్వదా మక్కువతో మసలుచుండును.)

శ్రీ శుకమహర్షివలె శ్రీబిల్వమంగళుడు గూడ శ్రీకృష్ణభగవానుని మధురములైన లీలలను తనివితీర ఆస్వాదించెను. కనుక అతడు లీలాశుకుడుగా ప్రసిద్ధికెక్కెను.

సంబంధము - సదాచారుల దురాచారుల మధ్య తనకెట్టి తారతమ్యములును లేవని ఇంతవరకు తెల్పెను. ఇప్పుడు నిమ్నోన్నత జాతుల మధ్యగూడ తనకెట్టి భేదభావములును లేవని రాబోవు రెండు శ్లోకములలో భగవానుడు తెలుపుచు, శరణాగతి రూపభక్తి మహత్త్వమును ప్రతిపాదించి, తనను భజింపుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు-

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథాశూద్రాః తేఽపి యాంతి పరాం గతిమ్ ॥ 32 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | పాపయోనయః | = చండాలాది పాపయోనిజులు | వ్యపాశ్రిత్య | = శరణుపొంది |
| పార్థ! | = ఓ పార్థా! | యే, అపి, స్యుః | = ఎవ్వరైనను | పరామ్, గతిమ్ | = పరమగతినే |
| స్త్రియః | = స్త్రీలు | తే, అపి | = వారందఱును | యాన్తి | = పొందుదురు. |
| వైశ్యాః | = వైశ్యులు | మామ్ | = నన్ను | | |
| శూద్రాః, తథా | = శూద్రులు అట్లే | | | | |

ఓ అర్జునా! స్త్రీ, వైశ్య, శూద్రులును, అట్లే చండాలాదిపాపయోనిజులును నన్ను శరణుపొంది పరమగతినే పొందుదురు. (32)

ప్రశ్న - 'పాపయోనయః' అను సమాసము ఎవరికి తెల్పును?

సమా - పూర్వజన్మ పాపముల కారణమున చండాలాది యోనులయందు జన్మించినవారిని 'పాపయోనయః' అను పదము తెల్పును. వీరుగాక శాస్త్రములను అనుసరించి, భిల్లులు, ఖసులు, హూణులు, యవనులు మొదలగు వారును 'పాపయోనయః' అని భావింపబడుదురు. ఇచట 'పాపయోనయః' అను పదము వీరందరిని తెలుపును. భక్తి సాధనకు జాతులు, వర్ణములు ఏవిధముగను ఆటంకములు కాజాలవు. అచ్చట పవిత్ర ప్రేమయే ఆవశ్యకము.[1] పూర్వకాలముననే గాక ఈ కాలమునందును ఇట్టి జాతుల వారిలో ఎక్కుమంది మహాభక్తులు వెలసిరి. వారు తమ భక్తిప్రపత్తుల ప్రభావమున భగవంతుని పొందిరి. వారిలో నిషాదజాతికి చెందిన గుహుడు మొదలగు వారు మిక్కిలి ప్రసిద్ధులు.

### నిషాదరాజు - గుహుడు

నిషాదజాతికి చెందిన గుహుడు శృంగిబేరపురమునందు భిల్లులకు రాజు. అతడొక మహాభక్తుడు. సీతాలక్ష్మణ సమేతముగా శ్రీరామచంద్రుడు వనములకు ఏతెంచుచు ఈతని ఆతిథ్యమును స్వీకరించెను. భగవంతుడితనిని తన మిత్రునిగా భావించెను. భరతుడు ఇతనిని తన హృదయమునకు హత్తుకొనెను.

శ్రీరామచరితమానస్ - నుండి

కరత దండవత్ దేఖి తేహి భరత లీన్హ ఉర లాఇ ।
మనహు లఖన సన భేంట్ భఇ ప్రేము న హృదయఁసమాఇ ॥

తనకు దండప్రణామములాచరించిన గుహుని చూచి భరతుడు అతనిని చేయూతతో లేపి హృదయమునకు హత్తుకొనెను. ఆ సమయమున అతడు తన సోదరుడైన లక్ష్మణునే చూచినట్లు భావించెను. అతని హృదయము ఆనంద తరంగితమయ్యెను.

---

1) 1. నాస్తి తేషు జాతివిద్యారూపకులధనక్రియాది భేదః (నారదభక్తిసూత్రములు- 72)
భక్తుల మధ్య జాతి, విద్యా, రూప, కుల, ధన, క్రియాది భేదములుండవు.

2. అనింద్యయోన్యధిక్రియతే పారంపర్యాత్ సామాన్యవత్. (శాండిల్య భక్తిసూత్రములు- 78)
అహింసాది సామాన్య ధర్మములవలెనే - భక్తిమార్గమును అనుసరించుటకు గూడ చండాలురు మొదలగు పాపయోనులందఱికిని అధికారము గలదని శాస్త్రములు చెప్పుచున్నవి.

3. భక్త్యాహమేకయా గ్రాహ్యః శ్రద్ధయాఽఽత్మా ప్రియః సతామ్ ।
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్ ॥ (శ్రీమద్భాగవతము - 11/14/21)
ఓ ఉద్ధవ! సత్పురుషులకు ఆత్మరూపుడను, పరమ ప్రియుడను ఐన నేను కేవలము భక్తి శ్రద్ధలద్వారానే వశమగుదును. నాయెడల గల భక్తి జన్మతః చండాలురైనవారిని గూడ పవిత్రులను జేయును.

ప్రశ్న - 'పాపయోనయః' అను పదమును, స్త్రీ, వైశ్య, శూద్రులకు విశేషణముగా భావించిన దోషమేమి?

సమా - వైశ్యులు ద్విజులుగా పరిగణింప బడుదురు - వేదాధ్యయనమునకును, యజ్ఞాది కర్మలను ఆచరించుటకును వారికి అధికారము కలదని శాస్త్రములు తెలుపుచున్నవి. వైశ్యులు ద్విజులగుట వలన వారిని పాపయోనులుగా భావింప వీలులేదు. ఇంతేగాక జీవుల కర్మానురూపగతిని వర్ణించుచు ఛాందోగ్యోపనిషత్తు ఇట్లు స్పష్టపరచుచున్నది-

'తద్య ఇహ రమణీయచరణా అభ్యాశో హ యత్తే రమణీయాం యోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం వా వైశ్యయోనిం వాథ య ఇహ కపూయచరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చాండాలయోనిం వా ॥" (అధ్యాయ 5 ఖండ 10 మంత్ర 7)-

'ఈ లోకమున ఉత్తమ కర్మలను ఆచరించిన పుణ్యాత్ములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యయోనులను పొందుదురు. పాపకర్మలను ఆచరించినవారు శ్వాన, సూకర, చండాల యోనులను పొందుదురు'.

కావున వైశ్యులను పాపయోనులు అనిచెప్పరాదు. ఇక స్త్రీల విషయము - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య స్త్రీలు తమ భర్తలతో గూడి యజ్ఞాది వైదిక కర్మలను ఆచరించుటకు అధికారము గలవారుగా భావింపబడిరి. కనుక వారిని పాపయోనులుగా భావింపవీలులేదు. భక్తిద్వారా చండాలాదులకును పరమగతి లభించునను విషయము సర్వశాస్త్ర సమ్మతము. భక్తి ప్రభావము అట్టిది.[1] కనుక 'పాపయోనయః' అనుపదము స్త్రీ వైశ్య శూద్రులకు విశేషణముగా భావింపక వారికంటె హీనజాతుల వారిని సూచించు పదముని భావించుట సముచితముగా కన్పట్టును.

స్త్రీ వైశ్య, శూద్రులయందును పెక్కుమంది భక్తులుగలరు. యజ్ఞపత్ని, సమాధి, సంజయుడు మున్నగువారి చరిత్రలే యిందుకు నిదర్శనములు-

## యజ్ఞపత్ని

బృందావనమున కొందరు బ్రాహ్మణులు యజ్ఞము చేయుచుండిరి. శ్రీకృష్ణభగవానుని అనుమతితో అతని స్నేహితులు అచటికివెళ్లి అన్నమడిగిరి. యాజ్ఞికులైన ఋషులు వారిని మందలించి వెళ్ళగొట్టిరి. అప్పుడు వారు ఆ ఋషిపత్నుల కడకు వెళ్ళి అన్నమడిగిరి. శ్రీకృష్ణుని పేరు వినగానే మిక్కిలి సంతసించి, వారు భోజన పదార్థములను తీసికొని శ్రీకృష్ణుని యొద్దకేగిరి. ఒక బ్రాహ్మణుడు తన పత్నిని పోనీయక బలవంతముగా పట్టుకొని గదిలో బంధించెను. ఆమె భక్తి పరవశురాలై అచటనే భగవంతుని ధ్యానించుచు దేహత్యాగము చేసెను. అందరికంటెను ముందుగానే ఆమెకు భగవత్ప్రాప్తి కలిగెను.

(శ్రీమద్భాగవతమ్ 10/23)

---

1) కిరాతహూణాంధ్రపుళిందపుల్కసా ఆభీరకంకా యవనాః ఖసాదయః ।
యేన్యేఽచ పాపా యదుపాశ్రయాశ్రయాః శుద్ధ్యన్తి తస్మై ప్రభవిష్ణవే నమః ॥ (శ్రీమద్భాగవతమ్ 2/4/18)

'జగన్నాథుడైన విష్ణువుయొక్క భక్తులను ఆశ్రయించి, కిరాత, హూణ, ఆంధ్ర, పుళింద, పుల్కస, ఆభీర, కంక, యవన, ఖసాది నిమ్నజాతుల వారును, ఇంకను మహాపాపాత్ములును పవిత్రులగుచుందురు - అట్టి శ్రీ మహావిష్ణువునకు నమస్కారము.

వ్యాధస్యాచరణం ధ్రువస్య చ వయో విద్యా గజేంద్రస్య కా
కా జాతిర్విదురస్య యాదవపతేరుగ్రస్య కిం పౌరుషమ్ ।
కుబ్జాయాః కమనీయరూపమధికం కిం తత్సుదామ్నో ధనం
భక్త్యా తుష్యతి కేవలం న చ గుణైర్భక్తిప్రియో మాధవః ॥

'ధర్మవ్యాధుని వృత్తి ఎట్టిది? ధ్రువుని వయస్సు ఎంత? గజేంద్రుని విద్య యేపాటిది? విదురుడు ఏ ఉత్తమజాతియందు జన్మించెను? యాదవరాజైన ఉగ్రసేనుని పౌరుషమెట్టిది? కుబ్జ యొక్క సౌందర్య విశేషమేమి? సుదాముని సంపదలేపాటివి? కేవలము భక్తి ద్వారా మాధవుడు సంతుష్టుడగును - గుణములతో గాదు. ఏలనన భక్తియే ఆయనకు ప్రియమైనది'.

## సమాధి అను వైశ్యుడు

ద్రుమిణుడనువాడు సంపన్నవైశ్యుడు. అతని కుమారుడు సమాధి. ఆసమాధిని వాని భార్యాపుత్రులు ధనలోభముచేత ఇంటినుండి వెళ్లగొట్టిరి. అతడు అడవులకు వెళ్ళెను. అచట సురథుడను పేరు గల రాజును కలిసికొనెను. ఆ రాజుకూడ మంత్రులు, సేనాపతులు, స్వజనులు మొదలగువారిచేత మోసగింపబడి, వనములకు చేరి అచట తలదాచుకొనెను. ఆ ఇద్దరును ఒకే అవస్థకులోనై యుండిరి. కడకు ఆ ఇద్దరును సచ్చిదానందమయియైన భగవతిని శరణుజొచ్చిరి. విషయాసక్తులను వీడి భగవతిని ఆరాధించిరి. మూడుసత్సరములు ఆ దేవిని సేవించిన పిమ్మట భగవతి దర్శనమిచ్చి వరములను వేడుకొనుడనెను. సురథునకు ఇంకను మనస్సునందు భోగవాసనలు మిగిలియుండెను. కావున అతడు భోగములను కోరుకొనెను. కాని 'సమాధి' యొక్క మనస్సు వైరాగ్యముతో నిండియుండెను. ప్రపంచము క్షణభంగురమనియు, దుఃఖాలయమనియు, అతడు తెలిసికొని యుండెను. కనుక అతడు భగవత్తత్త్వ జ్ఞానమును ఆర్జించెను. భగవంతునియొక్క కృపచేత అతని అజ్ఞానమంతయు తొలగిపోయెను. భగవత్తత్త్వజ్ఞానము సిద్ధించెను. (మార్కండేయ పురాణం -18/93, బ్రహ్మవైవర్త పురాణం - (62/63).

## 'సంజయుడు'

'గావల్గణుడు' అను సూతుని కుమారుడు సంజయుడు. అతడు పరమశాంత స్వభావుడు. శిష్టాచార సంపన్నుడు. జ్ఞానవిజ్ఞాన సముపేతుడు. భయరహితుడు. సత్యవాది. జితేంద్రియుడు, ధర్మాత్ముడు. నిష్కపటి. శ్రీకృష్ణునకు పరమభక్తుడు. భగవత్తత్త్వమును ఎరిగినవాడు. బాల్యము నుండియు అర్జునునకు మిత్రుడు. కావున అర్జునుని అంతః పురమునందు యథేచ్ఛగా ప్రవేశించునధికారము గలవాడు. కౌరవుల పక్షమున పాండవుల యొద్దకు దూతగా వెళ్ళినప్పుడు అర్జునుని అంతఃపురమునందు శ్రీకృష్ణభగవానుడు, సత్యభామ, ద్రౌపది అచటనేయుండిరి. అచట తాను చూచిన దృశ్యమును సంజయుడు తిరిగి వచ్చిన పిదప స్పష్టముగా వర్ణించెను. (మహాభారతం - ఉద్యోగ-59)

మహాభారతయుద్ధసమయమున శ్రీ వేదవ్యాస భగవానుడు అతనికి దివ్యదృష్టిని ప్రసాదించెను. దాని ప్రభావమున ఇతడు ధృతరాష్ట్రునకు యుద్ధదృశ్యములను యథాతథముగ వర్ణించి చెప్పెను. వ్యాసమహర్షి, సంజయుడు, విదురుడు, భీష్ముడు మొదలగు కొద్దిమంది మహాత్ములు మాత్రమే శ్రీకృష్ణభగవానుని యథార్థస్వరూపమును గుర్తించియుండిరి. ధృతరాష్ట్రుని ప్రశ్నకు సమాధానముగా సంజయుడిట్లు పల్కియుండెను- 'నేను స్త్రీపుత్రాదుల మోహములోపడను. అవిద్యనాశ్రయింపను. భగవంతున కర్పించుచు సర్వధర్మములను ఆచరించుచుందును. పవిత్రభావముతో భక్తియోగముద్వారా జనార్దనుడైన శ్రీ కృష్ణుని యథార్థస్వరూపమును ఎరుంగుదును' - భగవంతుని స్వరూప పరాక్రమములను అతడు ఈ విధముగా వర్ణించెను. 'ఉదారహృదయుడైన శ్రీవాసుదేవుని చక్రముయొక్క మధ్యభాగము ఐదు మూరల విస్తీర్ణము గలది. కాని అది భగవంతుని ఇచ్ఛానుసారము ఎంత పెద్దదియైనను కావచ్చును. మిక్కిలి తేజఃపుంజముతో ప్రకాశించు ఆ చక్రము ఎదుటి వారి బలపరాక్రమములను అంచనావేయుశక్తి గలది. అది కౌరవులను సంహరించునది. పాండవులకు ప్రియతమమైనది. మహాపరాక్రమశాలియైన శ్రీకృష్ణుడు అవలీలగనే భయంకర రాక్షసుడైన నరకాసురుని, శంబరాసురుని, కంస శిశుపాలురను వధించెను. పరమసుందరుడైన ఐశ్వర్యవంతుడైన శ్రీకృష్ణుడు తన సంకల్పమాత్రముననే భూమ్యాకాశములను, స్వర్గమును తన వశమునందుంచుకొనును. జగత్తునంతయును త్రాసులోబెట్టి తూచినను అది శ్రీకృష్ణునితో సరితూగజాలదు. అతడు తన ఇచ్ఛామాత్రమున సమస్త జగత్తునూ రూపు మాపగలడు. కాని విశ్వమంతయు ఒక్కటిగా నిల్చియు ఆయనను ఏమియు చేయజాలదు.'

యతః సత్యం యతో ధర్మోయతో హ్రీరార్జవం యతః ।
తతో భవతి గోవిందో యతః కృష్ణస్తతో జయః ॥
(మహాభారతమ్ - ఉద్యోగ - 68/9)

'సత్యధర్మములు, హృదయ సారళ్యము, దైవ విరుద్ధ కార్యములయందు లజ్జయుగల చోట శ్రీకృష్ణుడుండును. శ్రీకృష్ణుడు ఉండుచోట తప్పక 'విజయము' ఉండును'.

సర్వభూతాత్ముడును, పురుషోత్తముడును అయిన శ్రీకృష్ణుడు భూమ్యాకాశములను, స్వర్గలోకమును తన కనుసన్నలతో నడపును. సకలలోకములను మోహితము గావించు శ్రీకృష్ణుడు పాండవులను నిమిత్తముగా జేసికొని మూర్ఖులును అధర్మపరులును అయిన నీ పుత్రులను

తుదముట్టింపగోరెను. శ్రీకృష్ణభగవానుడు తన ప్రభావముతో కాలచక్రమును, జగచ్చక్రమును, యుగచక్రమును నిరంతరముగా త్రిప్పుచునే యుండును. కాలమునకును, మృత్యువునకును స్థావరజంగరూపమైన ఈ జగత్తునకును ఏకైక ప్రభువు శ్రీకృష్ణుడే. ఇది ముమ్మాటికిని సత్యము. రైతు తాను నాటిన పైరును పరిపక్వదశలోతానే కోసివేయును. అట్లే మహాయోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు సమస్త జగత్తుయొక్క సృష్టి స్థితులను నెరుపువాడైనప్పటికిని స్వయముగా తానే దానిని రూపుమాపును. ఆయన తన మాయా ప్రభావమున అందరిని మోహితులనుగా జేయును. కాని అతనిని శరణుజొచ్చిన వారు మాయామోహితులుకారు'.

యే తమేవ ప్రపద్యన్తే న తే ముహ్యన్తి మానవాః ॥
(మహాభారతం - ఉద్యోగ - 68/15)

మరియు అతడు శ్రీకృష్ణభగవానుని వివిధనామములను, వాటి అర్థవిశేషములను ధృతరాష్ట్రునకు వివరించెను. మహాభారత యుద్ధమును నివారించుటకు అతడు మిగుల ప్రయత్నించెను. కాని దానిని ఆపలేకపోయెను. ధృతరాష్ట్రుడు వనములకు వెళ్ళినప్పుడు అతని వెంట సంజయుడును వెళ్ళెను. భగవత్తత్త్వమును ఎరిగిన సంజయుని విశేషములిట్టివి.

ప్రశ్న - ఇచట 'అపి' అను అవ్యయమును రెండు పర్యాయములు ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - వివిధ జాతుల మధ్య భగవంతుడు నిమ్నోన్నత స్థితులను (ఉచ్చనీచభావములను) పాటింపడు. బ్రాహ్మణ, క్షత్రియులకంటెను నిమ్నస్థితికి చెందిన స్త్రీ, వైశ్య, శూద్రాదుల యెడలను, వారికంటెను తక్కువగా భావింపబడు చండాలాదుల యెడను భగవంతునకు ఎట్టి భేదబుద్ధియు లేదని తెల్పుటకే 'అపి' అను అవ్యయము రెండు మారులు ప్రయుక్తమైనది. భగవానుని శరణుపొంది భజించువారికి పరమగతి లభించును.

ప్రశ్న - 'భగవంతుని శరణుజొచ్చుట' అనగానేమి?

సమా - భగవంతునిపై పూర్తిగా విశ్వాసముంచి, 34వ శ్లోకములో తెల్పబడినట్లు, భక్తితో అన్ని విధముల భగవంతుని శరణుపొందుట - అనగా ఆయనయొక్క ప్రతి విధానము నందును సంతృప్తిని కలిగియుండుట, ఆతని నామరూపగుణ లీలాదులను నిరంతరము శ్రవణ, కీర్తన, చింతన, మననములను గావించుట, ఆయననే తనకు పరమగతిగా, భర్తగా, ప్రభువుగా భావించుట, భక్తిశ్రద్ధలతో ఆయనను పూజించుట, నమస్కరించుట, ఆయన ఆజ్ఞలను పాలించుట, సమస్త కర్మలను ఆయనకే అర్పించుట మొదలగు వానిని అన్నింటిని ఆచరించుటయే భగవానుని సర్వథా శరణుజొచ్చుట యగును.

ప్రశ్న - ఈ విధముగా భగవంతుని శరణుపొందిన భక్తులు పరమగతిని పొందుట అనగానేమి?

సమా - సాక్షాత్తు పరమేశ్వరుని పొందుటయే పరమగతిని పొందుట యగును. పై విధముగా భగవంతుని శరణుజొచ్చిన స్త్రీపురుషులు ఎట్టి జాతిభేదములును లేకుండగనే భగవంతుని జేరుదురు.

## కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।
## అనిత్యమసుఖం లోకమ్ ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33 ॥

పుణ్యాః = పుణ్యాత్ములైన
బ్రాహ్మణాః = బ్రాహ్మణులును
తథా = అట్లే
రాజర్షయః = రాజర్షులును, ఐన
భక్తాః = భక్తులు - (వీరు భగవంతుని శరణు పొందినచో) పరమపదమును పొందుదురను విషయమున
కిమ్, పునః = చెప్పవలసినది ఏమున్నది?
అసుఖమ్ = సుఖరహితమైన
అనిత్యమ్ = క్షణభంగురమైన (ఐనను దుర్లభమైన)
ఇమమ్ = ఈ
లోకమ్ = మనుష్యలోకమును (మనుష్య శరీరమును)
ప్రాప్య = పొంది (నిరంతరము)
మామ్ = నన్ను
భజస్వ = భజింపుము.

ఇక పుణ్యాత్ములైన బ్రాహ్మణులును, రాజర్షులును భక్తులును నన్ను శరణుపొందినచో వారు పరమపదమునుచేరుదురని చెప్పవలసిన పనియేలేదు. ఈ మానవశరీరము క్షణభంగురము. సుఖరహితము. ఐనను దుర్లభము. కనుక దీనిని పొంది- నిరంతరము నన్నే భజింపుము. (33)

ప్రశ్న - 'కిమ్' 'పునః' అనువానిని ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - అత్యంత దురాచారులును (9/30) చండాలాది నీచజాతులవారును (9/32) భగవంతుని భజించి, పరమగతిని పొందుచున్నప్పుడు ఉత్తమ ఆచార వ్యవహారములను కలిగియున్న అగ్రవర్ణస్థులైన బ్రాహ్మణులును, రాజర్షులును తనకు భక్తులై, పుణ్యాత్ములై తనను శరణు పొందినచో వారు పరమగతిని పొందుటలో ఆశ్చర్యము లేదని తెల్పుటకే 'కిమ్' 'పునః' అనునవి ప్రయుక్తములైనవి.

ప్రశ్న - 'పుణ్యాః' అనగానేమి? ఈ విశేషణము బ్రాహ్మణులకు మాత్రమే వర్తించునా? బ్రాహ్మణులకును, రాజర్షులకును వర్తించునా?

సమా - పవిత్రమైన, ఉత్తమమైన స్వభావము, ఆచరణము గలవారిని 'పుణ్యాః' అని యందురు. ఈ విశేషణము బ్రాహ్మణులకే వర్తించును. ఏలనన రాజులైయుండియు ఋషులవలె పవిత్రస్వభావము ఉత్తమాచరణము గలవారిని 'రాజర్షులు' అనియందురు - కావున వారికి 'పుణ్యాః' అను విశేషణమును ప్రయోగింప నవసరమేలేదు.

ప్రశ్న - 'భక్తాః' అను పదము ఎవరికి వర్తించును?

సమా- 'భక్తాః' అను పదము బ్రాహ్మణులకును, రాజర్షులకును వర్తించును. ఏలనన వారు భక్తికారణముగనే పరమగతిని పొందిరి.

బ్రాహ్మణులలో, రాజర్షులలో పెక్కుమంది భక్తులు గలరు. వారి మహిమలను తెల్పుటకు మచ్చునకు (ఉదాహరణముగా) సుతీక్ష్ణమహర్షి వృత్తాంతమును, రాజర్షియైన అంబరీషుని ఉపాఖ్యానమును సంక్షిప్తముగా వివరింతును-

### సుతీక్ష్ణుడు

మహర్షి సుతీక్ష్ణుడు దండకారణ్యవాసి. ఇతడు అగస్త్యుని శిష్యుడు. మహా తపస్వి. తేజస్వి. భక్తుడు. దుష్పణ్యుడను వైశ్యుడు తన పాపముల కారణముగా పిశాచముకాగా అతనిని ఇతడు ఉద్ధరించెను. (స్కంద-బ్రహ్మ-22) ఇతడు శ్రీరామచంద్రునకు పరమభక్తుడు. శ్రీరాముడు సీతాసమేతుడై వనములకు వచ్చు వృత్తాంతము నెరింగి ఇతడు పరమానందభరితుడయ్యెను. వివిధములైన ఊహలలో తేలిపోవుచు శ్రీరాముని రాకకై అతడు నిరీక్షింపసాగెను. భక్తిపారవశ్యమున 'అతడు తానెవ్వరో'? తాను ఏ దిశగా ఎచ్చటికి వెళ్ళుచున్నాడో? అను మాటయేమరచెను. వెనుకముందులకు నడచును, ప్రభువు యొక్క గుణములను కీర్తించుచు నాట్యము చేయసాగెను. శ్రీరామచంద్రుడు ఒక చెట్టుచాటున నిలబడి అతని ప్రేమోన్మాదస్థితిని చూచుచుండెను. అతని భక్తిపారవశ్యమును గమనించి, అతనికి వాని హృదయమునందే దర్శనమిచ్చెను. సుతీక్ష్ణుడు మార్గమధ్యమునవే నిశ్చలుడై పడిపోయెను. హర్షాతిరేకమున అతని శరీరము పులకితమయ్యెను. శ్రీరాముడు వాని యొద్దకు వెళ్ళి, అతని భక్తికి సంతసించెను.

శ్రీరామచంద్రుడు అతనిని అనేక విధముల మేల్కొల్పెను. కాని ముని మేల్కొనలేదు. అతడు ప్రభుధ్యానమునందు అత్యంతానందమును అనుభవించుచుండెను. శ్రీరాముడు అతని హృదయమునుండి తన రూపమును ఉపసంహ రించెను. అప్పుడు వ్యాకులుడైన ముని లేచి నిలబడెను. కన్నులు తెరవగానే ఎదుట శ్రీ సీతాలక్ష్మణ సమేతుడై సుఖనిధానమైన శ్యామసుందరుడు (శ్రీరాముడు) ప్రత్యక్షమై నిలిచెను. ఆ ముని తపస్సు ఫలించినది. అతడు ధన్యుడాయెను. (శ్రీరామచరితమానస్-అరణ్యకాండమునుండి)

### అంబరీషుడు

రాజర్షియైన అంబరీషుడు వైవస్వతమనువు యొక్క పౌత్రుడు. నాభాగుడను మహారాజు యొక్క పుత్రుడు. ఇతడు ప్రతాపశాలియైన చక్రవర్తి. అయినను ఐశ్వర్యములన్నియును స్వప్నప్రపంచపదార్థముల వలె నశ్వరములని భావించువాడు. కనుక అతడు తన జీవితమును పరమాత్మ చరణములకే అంకితమొనర్చెను. అతడు తన మనస్సును, ఇంద్రియములను సర్వదా భగవత్సేవయందే లగ్నమొనర్చెను.

ఒకానొక సమయమున రాజు రాణితో గూడి శ్రీకృష్ణప్రీతికై ఒక సంవత్సరము పాటు ఏకాదశీ వ్రతమును (వ్రత నియమ దీక్షను) చేపట్టెను. చివరి ఏకాదశీ ఉపవాసాది దీక్ష ముగిసెను. ద్వాదశినాడు విధ్యుక్తముగా పూజాదికములు ఆచరింపబడినవి. అంబరీషుడు 'పారణ' చేయుటకు ఉద్యుక్తుడగుచుండగా దుర్వాసమహర్షి శిష్యులతో గూడి అచటికి ఏతెంచెను. రాజు దుర్వాసునకును, ఆయన శిష్యులకును స్వాగత మర్యాదలు నెరపి, భోజనమునకు రండని పలికెను. మహర్షి ఆయన ఆహ్వానమును స్వీకరించి, మాధ్యాహ్నిక కర్మలను నిర్వర్తించుటకు శిష్యులతోపాటు యమునా నదికి వెళ్ళెను. ద్వాదశి పారణకు ఇంక ఒక్క గడియ మాత్రమే మిగిలియుండెను. సకాలములో పారణ చేయనిచో వ్రతభంగమగును. రాజు బ్రాహ్మణుల అనుమతితో శ్రీహరి పాదోదకము (శ్రీపాదతీర్థము)తో 'పారణ' చేసెను. దుర్వాసాదుల రాకకై భోజనమునకు నిరీక్షించుచుండెను. దుర్వాసుడు తన నిత్యక్రియలను ముగించుకొని శిష్యులతో రాజమందిరమున కేతెంచెను. తన తపోబలము వలన రాజు పారణ చేసిన విషయమును గ్రహించి, మిక్కిలి క్రుద్ధుడై తన ఎదుట అంజలి ఘటించి నిలిచియున్న రాజుతో ఇట్లనెను. 'ఏమి! ధనమదముతో కన్నుగానక దుష్టుడైన ఈ రాజు ధర్మమును నిరాదరించెను. ఇప్పుడితడు విష్ణుభక్తుడు కాడు. తానే ఈశ్వరుడనని భావించుచున్నాడు. అతిథినైన నన్ను భోజనమునకు ఆహ్వానించి, నేను రాకముందే తాను భుజించినాడు. ఇప్పుడే దీని ఫలితమును రుచి చూపెదను' అని పలికి, దుర్వాసుడు తన తలనుండి ఒక జడను లాగి నేలపై గట్టిగా కొట్టెను. వెంటనే ఆ జడనుండి కాలాగ్ని సదృశయైన 'కృత్య'అను పేరుగల ఒక భయంకర రాక్షసి ఉద్భవించెను. అది తన పాదఘట్టనములతో నేలను కంపింప జేయుచు ఖడ్గమును చేబూని, రాజువైపుగా ముందుకు సాగెను. కాని భగవంతునిపై దృఢవిశ్వాసము గల అంబరీషుడు నిశ్చలముగా అచటనే నిలబడియుండెను. భయపడుటగాని, వెనుకడుగు వేయుటగాని చేయలేదు. సమస్త జగత్తునందును పరమాత్మయే వ్యాపించియున్నాడని తెలిసినవాడు ఎవరికి, ఎందుకు, ఎట్లు భయపడును?

కృత్య అంబరీషుని సమీపించు లోపలనే భగవంతుని సుదర్శనచక్రము దావాగ్ని కాలసర్పమును భస్మము చేయురీతిగా ఆకృత్యను భస్మమొనర్చెను. ఇక దుర్వాసుని సంగతిని చూచుటకై ఆ సుదర్శనచక్రము ఆయన వెంటబడెను. దుర్వాసుడు మిక్కిలి భయకంపితుడై ప్రాణములను అరచేతబట్టుకొని పరుగిడసాగెను. చక్రము ఆయనను వెంబడించెను. దుర్వాసుడు ఆత్మరక్షణకై దశదిశలు, పదునాలుగు భువనములు పరుగులు దీసెను. కాని ఎచ్చటను ఆయనకు నిలబడుటకు చోటుదొరకలేదు. ఎవ్వరును ఆయనకు ఆశ్రయముగాని, అభయప్రదానముగాని ఇయ్యనేలేదు. చివరకు వైకుంఠమునకు వెళ్ళి, శ్రీమహావిష్ణువు యొక్క పాదములనాశ్రయించి, ఇట్లనెను.-'ఓ ప్రభూ! నీ ప్రభావమును గుర్తింప లేక నీ భక్తుని అవమానించితిని. నా ఈ అపరాధమును క్షమింపుము. నీనామమును కీర్తించినంత మాత్రముననే నరకమున పడినవారు కూడ అచటి యాతనల నుండి విముక్తులగుదురు-కనుక నన్ను మన్నింపుము'.

భగవానుడు ఇట్లనెను. 'ఓ బ్రాహ్మణుడా! నేను భక్తపరాధీనుడను. స్వతంత్రుడనుగాను. వారే నాకు మిక్కిలి ప్రీతిపాత్రులు. నాపై వారికే పూర్తి అధికారము గలదు. నన్నే పరమగతిగా తలంచు మహాభక్తుల విషయమున నన్నుగాని, లక్ష్మీదేవినిగాని ఎక్కువగా భావింపను. భార్యాపుత్రులను, గృహమును, పరివారమును, సంపదలను, ప్రాణములను కడకు ఇహపరలోకములను అన్నింటిని త్యజించి, కేవలము నన్నే ఆశ్రయించినవారిని నేను ఎల్లప్పుడును విస్మరింపను. పతివ్రతయైన స్త్రీ తన పవిత్రప్రేమతో ఉత్తముడైన పతిని వశపరచుకొన్నట్లు నాయందే చిత్తమునుంచి, సర్వత్ర సమదర్శనముగల భక్తులును తమ పవిత్ర భక్తితో నన్ను వశపరచుకొందురు. నన్ను సేవించువారు చతుర్విధముక్తులను (సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను) గూడ అపేక్షపడక నన్నే సేవించుచుందురు. కాలక్రమమున నశించు స్వర్గాది లోకములను వారు లెక్కింపకుండుటలో ఆశ్చర్యమేముండును?'

మరల భగవానుడిట్లనెను 'ఓ బ్రాహ్మణుడా? ప్రస్తుతము నిన్ను అంబరీషుడు మాత్రమే రక్షింపగలడు. కనుక అతని కడకే వెళ్లి రక్షింపుమని ప్రార్థింపుము. శాంతి లభించును'. పిదప దుర్వాసుడు భగవదాజ్ఞానుసారము వెనుకకు మరలెను.

ఇచ్చట భక్త శిరోమణియైన అంబరీషుని స్థితి వేరుగా నుండెను. విష్ణుచక్రము దుర్వాసుని వెంటాడుటవలన

ఆయనకు కలిగిన బాధకు అంబరీషుడును మిక్కిలి వ్యథచెందెను. అంబరీషుడు మనస్సున ఇట్లు తలంచెను. 'పాపము! బ్రాహ్మణుడు ఆకలిగొని పోయెను. నాకారణముగ అతడు మృత్యుభయముతో పరుగెత్తవలసివచ్చెను. ఇట్టి పరిస్థితిలో నేను భుజించుట తగదు' - ఇట్లాలోచించి, రాజు ఆ క్షణమునుండియు భుజించుటమాని, కేవలము నీరు త్రాగుచు కాలమును గడుపుచుండెను. దుర్వాసుడు తిరిగి వచ్చునప్పటికి ఒక సంవత్సరము గడిచెను. కాని అంబరీషుడు వ్రతదీక్షనుండి వైదొలగలేదు.

దుర్వాసుడు వచ్చుచునే (రాజును సమీపించుచునే) అంబరీషుని పాదములపై బడెను. రాజు చకితుడాయెను. అతడు అతి వినయముతో సుదర్శన చక్రమును స్తుతించుచు ఇట్లు పలికెను. 'నా మనస్సునందు దుర్వాసుని యెడ ఏ మాత్రము ద్వేషము లేనిచో, సర్వప్రాణులకును ఆత్మయైన శ్రీమహావిష్ణువు నాయెడ ప్రసన్నుడగుచో - ఓ చక్రరాజమా! నీవు శాంతింపుము. ఋషిని ఈ సంకటమునుండి కాపాడుము'- సుదర్శనము శాంతమయ్యెను. ఇంతవరకును భయాగ్నితో దహింపబడుచున్న దుర్వాసునకు స్వస్థత చేకూరెను. అతని ముఖమున సంతోషము, కృతజ్ఞతా చిహ్నములును స్పష్టముగా పొడసూపెను.

(శ్రీమద్భాగవతము - నవమస్కంధము - అ 4.5)

ప్రశ్న - సుఖరహితము, క్షణభంగురము అయినది ఈ మానవశరీరము. అయినను ఇది దుర్లభము. దీనిని పొంది నన్నే భజింపుము-అని యనుటలో విశేషమేమి?

సమా - మానవ దేహము మిక్కిలి దుర్లభము. ఇది గొప్ప పుణ్య విశేషముచేతను, అందునా భగవత్కృప చేతను లభ్యమగును. ఈ శరీరమును పొందినందులకు భగవత్ప్రాప్తికై సాధన చేయుట ప్రతి మానవునకును ముఖ్యకర్తవ్యము. అప్పుడే అతని జీవితము సార్థకమగును. ఈ శరీరము ద్వారా నిజమైన సుఖము లభించుననుకొనుట వ్యర్థమే. ఏలనన ఈ శరీరమే అనిత్యమైనది. దీని ద్వారా నిత్య (శాశ్వత) సుఖమెట్లు లభించును? విషయ భోగములను సుఖములుగా భావించువాడు మాటిమాటికిని జనన మరణ చక్రములో పడుచునే యుండును. కనుక మానవ జన్మయెత్తినందులకు అనుక్షణము భగవత్ప్రాప్తికై యత్నించుట కర్తవ్యము. ఇది క్షణభంగురము. ఎప్పుడు రాలిపోవునో ఎవ్వరికిని తెలియదు. కావున దీనిని సుఖదాయకముగా భావించి, విషయసుఖములలో చిక్కుకొనరాదు. ఇది నిత్యమని భావించి భగవత్సేవను ఉపేక్షింపరాదు. అజ్ఞానగ్రస్తవలన జీవితము వ్యర్థమైనచో తరువాత పశ్చాత్తాప పడవలసి వచ్చును. శ్రుతి ఇట్లు చెప్పుచున్నది-

'ఇహ చేదవేదీదథ సత్య మస్తి
న చేదిహా వేదీన్మహతీ వినష్టిః' (కేనోపనిషత్2/5)

'ఈ మనుష్య జన్మయందే పరమాత్ముని తెలిసికొన్నచో మంచిదే. ఈ జన్మయందు తెలిసికొనకున్నచో కలుగుహాని అపారము'.

కావున ఈ శరీరమును పొందినందులకు నిత్యము, నిరంతరము భగవంతుని భజింపవలెను. క్షణమాత్రము గూడ ఆయనను మరవరాదు.

ప్రశ్న - 'మామ్' అను పదము ఎవరిని సూచించును? అతనిని భజించుట యనగానేమి? భజింపుమని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - 'మామ్' అను పదము ఇచట సగుణ పరమేశ్వరుని సూచించును. రాబోవు (34వ) శ్లోకములో చెప్పబడినట్లు భగవత్పరాయణుడగుట - అనగా మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరాదులను భగవంతునకే సమర్పణ చేయుటయే ఆయనను భజించుటయగును. భజన వలన భగవత్ప్రాప్తి శీఘ్రముగా లభించును. మానవజీవిత లక్ష్యము, సాఫల్యము భగవత్ప్రాప్తియందే గలవు. ఇందువలననే భగవంతుని భజింపుమని భగవానుడు నుడివెను.

*సంబంధము - పూర్వ శ్లోకములయందు భగవానుడు తనను భజించుట వలన కలుగు మహాఫలమును తెలిపెను. పిమ్మట తనను భజింపుమని అర్జునునితో పలికెను. ఇప్పుడు భజించు విధానమును అనగా శరణాగతిని గూర్చి తెలుపుచు అధ్యాయమును ముగించుచున్నాడు-*

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవమ్ ఆత్మానం మత్పరాయణః ॥ 34 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మన్మనాః | = నాయందుమనస్సు కలవాడవు | మద్యాజీ | = నన్ను పూజించువాడవు | ఆత్మానమ్ | = ఆత్మను |
| భవ | = కమ్ము(అగుము) | (భవ) | = కమ్ము(అగుము) | యుక్త్వా | = (నాయందే) నిలిపి |
| మద్భక్తః | = నా భక్తుడవు | మామ్ | = నన్ను (నాకు) | మత్పరాయణః | = మత్పరాయణుడవై |
| (భవ) | = కమ్ము (అగుము) | నమస్కురు | = నమస్కరింపుము | మామ్, ఏవ | = నన్నే |
| | | ఏవమ్ | = ఈ విధముగా | ఏష్యసి | = పొందగలవు. |

ప్రశ్న - భగవంతునియందే మనస్సును లగ్నము చేయుట యనగానేమి?

సమా - భగవంతుడే సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వలోక మహేశ్వరుడు, సర్వాతీతుడు, సర్వమయుడు, నిర్గుణ సగుణ, నిరాకార-సాకార సౌందర్య మాధుర్య - ఐశ్వర్యనిధానము, పరమప్రేమస్వరూపుడు – అని భావించుచు ఆయన గుణ, ప్రభావ, తత్త్వ, రహస్యములను యథార్థముగా తెలిసికొన్నచో సాధకునకు భగవంతుడే పరమ ప్రేమాస్పదుడనెడి విశ్వాసము రూఢియగును. అపుడు జగత్తునందును, అందలి యే వస్తువునందును అతనికి ఏ మాత్రము స్పృహయే ఉండదు. ఇట్టి స్థితియందు ప్రపంచమునందలి ఎట్టి దుర్లభమైన భోగ్యవస్తువుచేతను అతడు ఆకర్షితుడు కాడు. ఇట్టి స్థితి ఏర్పడినప్పుడు సహజముగనే ఇహపరలోక సమస్త వస్తువులనుండి అతని మనస్సు దూరమగును. అప్పుడు అతడు మిక్కిలి భక్తి శ్రద్ధలతో నిరంతరము భగవంతునే చింతన చేయుచుండును. భక్తిపూర్ణమైన ఈ భగవచ్చింతనయే అతనికి ప్రాణప్రియమగును. అతడు ఒక్క క్షణమైనను భగవచ్చింతనను విస్మరింపజాలడు. ఇట్టి స్థితిని కలిగియుండుటనే 'భగవంతునియందే' మనస్సును లగ్నము చేయుట' అని యందురు.

ప్రశ్న - భగవద్భక్తుడగుట యనగానేమి?

సమా - 'భగవంతుడే పరమగతి' అతడే ఏకైక స్వామి, భర్త, పరమాశ్రయుడు, పరమాత్మీయుడు, సంరక్షకుడు-' అని భావించి ఆయనపైననే భారము ఉంచుట, ఆయన ప్రతివిధానమునందును సర్వథా సంతృప్తిని కల్గియుండుట, అతని ఆజ్ఞలను అనుసరించుట, ఆయన నామరూపగుణ ప్రభావలీలాదులను వినుట, కీర్తించుట, స్మరించుట మొదలగు వాని యందు తన మనస్సును, బుద్ధిని, ఇంద్రియములను నిమగ్నము చేయుట, ప్రతికార్యమును భగవత్ప్రీతి కొరకే ఆచరించుట మున్నగువానిని నెరపుటయే భగవద్భక్తుడగుటయగును.

ప్రశ్న - 'భగవంతుని పూజించుట' యనగానేమి?

సమా - భగవంతుని మందిరమునకు వెళ్ళి, మంగళకరమైన ఆయన మూర్తిని యథావిధిగా పూజించుట, అనుకూలతను బట్టి తమతమ ఇండ్లలో ఇష్టదేవతా మూర్తిని ఏర్పరచుకొని, దానిని విధ్యుక్తముగా భక్తిశ్రద్ధలతో ఆరాధించుట, హృదయమునందుగాని, అంతరిక్షమునందు గాని, 'మానసిక'ముగా భగవంతుని ఊహించుకొని, మానసపూజ చేయుట, ఆయన ఉపదేశములను, లీలా భూమికను, చిత్రపటాదులను ఆదరించుట, ఆయన సేవాకార్యముల యందు నిమగ్నమగుచుండుట, నిష్కామ భావముతో యజ్ఞాదులను అనుష్ఠించుటద్వారా భగవంతుని అర్చించుట, మాతాపితరులను, బ్రాహ్మణులను, సాధువులను, మహాత్ములను, గురువులను, అట్లే ఇతర సమస్త ప్రాణులను భగవంతుని స్వరూపముగా భావించి, లేక భగవంతుడే అందరిలో అంతర్యామిగా వ్యాప్తుడై యున్నట్లు తలంచి, అందరికిని యథాయోగ్యముగా పూజాసత్కారములను ఆచరించుట, శరీర శ్రమద్వారా, మనస్సుతో, ధనముతో ఎల్లరకును సుఖహితములను చేకూర్చుట, మొదలగు ఈ కార్యములన్నింటిని ఆచరించుటయే భగవంతుని పూజించుటయగును.

ప్రశ్న - 'మామ్' అనుపదము ఎవరిని సూచించును? ఆయనకు నమస్కరించుట యనగానేమి?

సమా - పరమేశ్వరుడే సగుణ-నిర్గుణ, సాకార నిరాకారాది రూపములను ధరించును. బ్రహ్మగా అందరిని

సృష్టించును. విష్ణువుగా పాలించును. రుద్రునిగా లయమొనర్చును. ఆ భగవానుడే వేర్వేరు యుగములయందు మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, శ్రీరామ, శ్రీకృష్ణాది దివ్యరూపములలో అవతరించి, జగత్తునందు తన లీలా విలాసములను ప్రదర్శించుచుండును. భక్తుల ఇచ్ఛాను సారము వేర్వేరు రూపములలో దర్శనమిచ్చుచు వారి వారికి అభయప్రదానములను చేయుచుండును. సమస్త జగత్తునకును కర్త, హర్త, విధాత, సర్వాధారుడు, సర్వశక్తి మంతుడు, సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, సర్వసుహృదుడు, సర్వగుణసంపన్నుడు, పరమ పురుషోత్తముడును అయిన అట్టి భగవానుని సూచించునదియే 'మామ్' అను పదము.

ఆయన సాకార - నిరాకార రూపమునకును, మూర్తికిని చిత్రపటమునకును ఆయన చరణములకును, పాదుకలకును పాద చిహ్నములకును, ఆయన తత్త్వరహస్యప్రేమ ప్రభావములను, మరియు ఆయన యొక్క మధురలీలలను విప్పి చెప్పెడి సద్గ్రంథములకును నమస్కరించుట, అట్లే మాతాపితరులను, బ్రాహ్మణులను, గురువులను, సాధువులను, మహాత్ములను, విశ్వమునందలి సమస్త ప్రాణులను ఆయన స్వరూపముగా భావించి, లేక భగవంతుడే అందరిలో అంతర్యామిగా ఉన్నాడని తలంచి, భక్తిశ్రద్ధలతో త్రికరణ శుద్ధిగా వారికి ప్రణమిల్లుట -ఇదియే భగవంతునకు నమస్కరించుటయగును.

ప్రశ్న - 'ఆత్మానమ్' అను పదము ఎవరిని సూచించును? దానిని పైన పేర్కొనబడిన విధానముగా భగవానునియందు యుక్తము చేయుటయనగానేమి?

సమా - మనోబుద్ధీంద్రియముల సహితముగా శరీరమును సూచించునదియే 'ఆత్మా' అనుపదము. వీటన్నింటిని పైవిధముగా భగవంతునియందు లగ్నము చేయుటయే ఆత్మను ఆయనయందు యుక్తము చేయుట యగును.

ప్రశ్న - భగవత్పరాయణుడగుట యనగానేమి?

సమా - సర్వవిధములుగా సమస్తమూ భగవంతునకే సమర్పణము జేయుట, భగవంతునే పరమప్రాప్యునిగా, పరమగతిగా, పరమాశ్రయునిగా తన సర్వస్వముగా భావించుటను భగవత్పరాయణుడగుట యందురు.

ప్రశ్న - 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి? మరియు భగవానుని పొందుట యనగానేమి?

సమా - 'ఏవ' అను పదము ఇచట అవధారణార్థకము - పై విధముగా సాధన చేయుటవలన భగవత్ప్రాప్తి కలుగుటలో ఎట్టి సందేహమూ లేదు. అని తెల్పుటకే 'ఏవ' అను అవ్యయము ప్రయోగింపబడినది. ఈ మానవ జీవితమునందే భగవత్సాక్షాత్కారమును పొందుట, భగవత్తత్త్వమును తెలిసికొని ఆయనలో లీనమగుట, లేదా (దేహత్యాగానంతరము) భగవంతుని దివ్యధామమును చేరుట, అతని సమీపమునసుండుట, ఆయన దివ్యరూపము వంటి రూపమును పొందుట - ఇవి యన్నియును భగవత్ప్రాప్తియే యగును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్య యోగో నామ నవమోఽధ్యాయః ॥ ౯ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదియవ అధ్యాయము - విభూతి యోగము

**అధ్యాయ నామము :** *ఈ అధ్యాయమునందు ప్రధానముగా భగవంతుని యొక్క విభూతుల వర్ణనముగలదు. కావున ఈ అధ్యాయమునకు 'విభూతి యోగము' అను ప్రసిద్ధి యేర్పడినది.*

**అధ్యాయ సారాంశము :** *ఈ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున 'సర్వోత్తమమైన ఉపదేశమును ఇచ్చెదను వినుము' అని భగవానుడు అర్జునునితో పలికెను. 2, 3 శ్లోకములయందు యోగశబ్దవాచ్యమైన తన ప్రభావమును వర్ణించి, దానిని తెలిసికొనుటవలన గలుగు ఫలమును తెలిపెను. 4, 5, 6, శ్లోకములయందు తన విభూతులను సంక్షిప్తముగా వర్ణించి, 7వ శ్లోకమునందు తన విభూతిని, యోగతత్త్వమును తెలిసికొనుట వలన గలుగు ఫలమును తెలిపెను. వివేకశీలురైన తన పరమభక్తుల భజనరీతులను 8,9 శ్లోకములలో వివరించి, దాని ఫలమును 10, 11 శ్లోకములలో విశదపరచెను. తదనంతరము 12 నుండి 15వ శ్లోకము వరకును అర్జునుడు భగవానుని స్తుతించి, 16, 17, 18 శ్లోకములలో భగవంతుని విభూతులను యోగశక్తిని మరల విపులముగా వివరింపుమని ప్రార్థించెను. 19వ శ్లోకమునందు భగవంతుడు తన విభూతుల విస్తృతి అనంతమనియు వాటిలో ప్రధానమైన వాటినే వర్ణింతుననియు తెలిపి, 20 నుండి 39వ శ్లోకము వరకును ఆ విభూతులను గూర్చి వర్ణించెను. ఇంకను తన దివ్య విభూతుల విస్తృతి అనంతమని 40వ శ్లోకమున తెలిపి, ఈ ప్రకరణమును ముగించెను. తదనంతరము 41, 42 శ్లోకములలో యోగశబ్దవాచ్యమైన తన ప్రభావమును వర్ణించి, ఈ అధ్యాయమును సమాప్తి చేసెను.*

సంబంధము : *7వ అధ్యాయమునుండి 9వ అధ్యాయమువరకును వర్ణింపబడిన విజ్ఞాన సహిత జ్ఞాన విషయము మిక్కిలి గంభీరమైన దగుటచే మరల దానినే వేరొక విధముగా సమగ్రముగ వివరించుటకై 10వ అధ్యాయము ప్రారంభింపబడుచున్నది. ఇచట మొదటి శ్లోకమునందు పూర్వోక్త విషయమునే మరల వర్ణించుచున్నానని భగవానుడు నుడివెను-*

**శ్రీభగవాన్ ఉవాచ**

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ **1** ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = ఓ అర్జునా! | తే | = నీకు | మే | = నాయొక్క |
| యత్, వచః | = ఏమాట(ల)ను | హితకామ్యయా | = హితమును చేయు కోరికతో | తత్, పరమమ్, వచః, ఏవ | = ఆ సర్వశ్రేష్ఠములైన మాటలనే |
| ప్రీయమాణాయ | = నాపై ప్రేమాదరములు (భక్తివిశ్వాసములు) గలవాడవైన | భూయః | = మఱల | శృణు | = వినుము. |
| | | అహమ్, వక్ష్యామి | = నేను చెప్పబోవు చున్నానో | | |

శ్రీ భగవానుడు పలికెను- హే మహాబాహో! నీవు నా మీద ప్రేమ గలవాడవు. కావున నీ మేలుగోరి నేను మఱల చెప్పుచున్న వచనములను వినుము. అవి మిక్కిలి గోప్యములు . మహిమాన్వితములు. **(1)**

ప్రశ్న - 'భూయః' 'ఏవ' అను వానియొక్క అర్థమేమి?

సమా - 'భూయః' అను పదమునకు 'పునః' (మరల) అని అర్థము. 'ఏవ' అను దానికి 'అపి' (కూడ) అని అర్థము. 7వ అధ్యాయమునుండి 9వ అధ్యాయము వరకును తెలిపిన విషయమునే మరల ఇప్పుడు ప్రకారాంతరమున వివరించు చున్నానని తెలుపుటకే భగవానుడు 'భూయః' 'ఏవ' అను వానిని ప్రయోగించెను.

ప్రశ్న - 'పరమం వచః' అను పదముల కర్థమేమి? ఈ పదభావమును మరల వినుమని చెప్పుటలోని విశేషమేమి?

సమా - పరమపురుషుడైన పరమాత్మయొక్క పరమ గోప్యములైన గుణ ప్రభావ తత్త్వ రహస్యములను ఈ పరమ వచనము విప్పి చెప్పును, మరియు పరమేశ్వరప్రాప్తి కలిగించును. కనుక ఈ అధ్యాయమునందు భగవద్గుణ ప్రభావాది విశేషములను తెల్పునట్టి ఉపదేశములనే 'పరమంవచః' (పరమవచనము) అని భగవానుడు పేర్కొనెను. భక్తితత్త్వము మిక్కిలి గహనమైనది. దాని పూర్తి అవగాహనకు దానిని పదేపదే వినవలసియే యుండును. కావున సావధానుడవై శ్రద్ధాదరములతో మరల వినుమని భగవానుడు అర్జునునితో పల్కెను.

ప్రశ్న - 'ప్రీయమాణాయ', 'హితకామ్యయా' అను పదములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'ఓ అర్జునా!' నాకు నీయందు మిక్కిలి అనురాగము గలదు. నా వచనములను నీవు అమృత ప్రాయములుగా భావించి, అత్యంత భక్తి శ్రద్ధలతో వినెదవు. కావున నీవు అడుగకున్నను ఎట్టి సంకోచము లేకుండ పరమ గోప్యములైన నా గుణప్రభావతత్త్వ రహస్యములను మాటిమాటికి తెలుపుచున్నాను. ఇది నామీద నీకు గల ప్రేమ యొక్క ఫలము అని తెల్పుటకే 'ప్రీయమాణాయ' అను విశేషణమును భగవానుడు ప్రయోగించెను. తనపై మిక్కిలి అనురాగము కలిగియున్న అర్జునునకు హితమును గూర్చు సంకల్పము భగవంతునిలో సమృద్ధమై యున్నది. కావున భగవానుడు నుడివెడి విషయములన్నియును అర్జునునకు హితకారకములే యగును-అని తెల్పుటకే 'హితకామ్యయా' అను పదము ప్రయుక్తమైనది.

సంబంధము - భగవానుడు మొదటి శ్లోకమున ప్రతిజ్ఞ చేసిన విషయమును ప్రారంభించుచు ఐదు శ్లోకములలో యోగశబ్దవాచ్యమైన తన దివ్య ప్రభావములను, విభూతులను సంక్షిప్తముగా వర్ణించుచున్నాడు-

**న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।**
**అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥ 2 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మే | = నాయొక్క | న, విదుః | = ఎఱుంగరు | సర్వశః | = అన్నివిధములుగను |
| ప్రభవమ్ | = పుట్టుక(ల)ను (లీలావతారము(ల)ను గూర్చి) | మహర్షయః | = మహర్షులును | దేవానామ్, చ | = దేవతలకును |
| | | న, విదుః | = ఎఱుంగరు | మహర్షీణామ్, చ | = మహర్షులకును |
| | | హి | = ఏలనన | ఆదిః | = ఆది (మూల)కారణమైన వాడను. |
| సురగణాః | = దేవతలు | అహమ్ | = నేను | | |

**నా ఉత్పత్తిని అనగా నా లీలావతారవిశేషములను దేవతలుగాని, మహర్షులుగాని తెలిసికొనజాలరు. ఏలనన నేను అన్నివిధములుగా ఆ దేవతలకును, ఈ మహర్షులకును మూలకారణమైనవాడను.(2)**

ప్రశ్న - ఇచ్చట 'ప్రభవమ్' అనగానేమి? దానిని సమస్త దేవతలుగాని, మహర్షులుగాని ఎరుగరు - అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవంతుడు తన అమేయ ప్రభావముతో జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయ కార్యములను నెరపుటకై బ్రహ్మ, విష్ణు, రుద్రుల రూపములలో ప్రకటితమగును. దుష్టశిక్షణకై, శిష్టరక్షణమునకై, ధర్మసంస్థాపనకై, మరియు నానావిధములగు చిత్ర విచిత్ర లీలలను ప్రదర్శించుటద్వారా జగత్తునందలి ప్రాణికోటిని ఉద్ధరించుటకై శ్రీమత్స్య, శ్రీకూర్మ, శ్రీరామ, శ్రీకృష్ణాది - అవతారములను దాల్చుచుండును. భక్తులకు దర్శనమిచ్చి వారిని కృతార్థులను జేయుటకై వారికి ఇష్టమైన వివిధ రూపములను ధరించుచుండును. చిత్ర విచిత్రములగు లీలా విశేషములను సంతత ధారగా ప్రవహింప (వెలసిల్ల) జేయుటకు సమస్త విశ్వమునందును తన నానారూపములను ప్రకటించు చుండును. ఈ నానారూప సముదాయమునే 'ప్రభవం' అను పదము తెలుపును. భగవంతుడు ఏయే సమయములందు ఏయే కారణములవలన ఏయే రూపములను ధరించునో

అనునది పరమ రహస్యము. అతీంద్రియ విషయములను గ్రహించు సామర్థ్యముగల దేవతలు, మహర్షులు గూడ దీనిని యథార్థముగ తెలిసికొనజాలరు. ఇక సామాన్య మానవుల సంగతిని గూర్చి చెప్పనేల?

ప్రశ్న - 'సురగణాః' అను పదము ఏయే దేవతలను తెల్పును? 'మహర్షయః' అను పదము ఏయే మహర్షులను తెలుపును?

సమా - ఏకాదశ రుద్రులు, అష్టవసువులు, ద్వాదశాదిత్యులు, ప్రజాపతులు, 49 మంది మరుద్గణములు, అశ్వినీ కుమారులు, ఇంద్రాది దేవతలు మొదలగు వారినందరిని 'సురగణాః' అను పదము తెలుపును. 'మహర్షయః' అను పదమువలన సప్తమహర్షులని ఎరుంగవలెను.

ప్రశ్న - సమస్త దేవతలకును, మహర్షులకును నేను ఆద్యుడను - అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - ఈ జగత్తునందలి ప్రాణులన్నియును దేవతల యొక్క, మహర్షులయొక్క సంతానమే. ఆ దేవతలును, మహర్షులును భగవంతునినుండియే ఉద్భవించిరి. వారికి నిమిత్త, ఉపాదాన కారణములు భగవంతుడే. విద్య,బుద్ధి, శక్తి, తేజస్సు మొదలగునవి యన్నియును వారికి భగవంతునినుండియే లభించుచుండును.

**యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।**
**అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3 ॥**

మర్త్యేషు = మానవులలో
యః = ఏ పురుషుడు
మామ్ = నన్ను
అజమ్ = జన్మరహితునిగను
అనాదిమ్ = అనాదియైన వానినిగను
చ = మరియు
లోకమహేశ్వరమ్ = సకలలోక మహేశ్వరునిగను
వేత్తి = ఎఱుంగునో
అసమ్మూఢః = జ్ఞానియైన
సః = అతడు
సర్వపాపైః = సర్వపాపముల నుండియు
ప్రముచ్యతే = విముక్తుడగును.

**నన్ను యథార్థముగా జన్మరహితునిగను, అనాదియైన వానినిగను, సకలలోక మహేశ్వరునిగను తెలిసికొనువాడు మానవులలో జ్ఞాని. అట్టివాడు సర్వపాపములనుండియు విముక్తుడగును. (3)**

ప్రశ్న - భగవానుని జన్మరహితునిగా, అనాదియైన వానినిగా, సకల లోకమహేశ్వరునిగా తెలిసికొనుట యనగానేమి?

సమా - భగవంతుడు తన యోగమాయ ద్వారా వివిధ రూపములలో ప్రకటితమైనను అతడు జన్మ రహితుడు. (4/6) ఇతర జీవులవలె అతడు జన్మింపడు. ఆశ్రయించిన వారిని ఆదుకొనుటకును, ధర్మ సంస్థాపనమునకును, అతడు లీలావతారములను ఎత్తుచుండును. ఈ విషయములను విశ్వాస శ్రద్ధలతో సంపూర్ణముగా గ్రహించుట, అందు ఏ మాత్రమూ సందేహింపకుండుట - ఇదియే భగవానుని జన్మరహితునిగా ఎరుంగట యగును. సమస్త జగత్తునకు ఆయనయే ఆది, అనగా మహా కారణము. ఆయనకు ఆది ఎవ్వరును లేరు. అతడు నిత్యుడు, శాశ్వతుడు, అన్ని పదార్థములవలె అతని ఆరంభము కాలావధికి లొంగియుండునది కాదు. ఈ విషయమును గూడ విశ్వాసముతో సంపూర్ణముగా ఎరుంగుటచే భగవానుని అనాదియైన వానినిగా ఎరుంగుట యగును. ఈశ్వరాంశ సంభూతులుగా పరిగణింపబడు ఇంద్ర, వరుణ, యమ, ప్రజాపతి మొదలగు లోకపాలురందరికిని భగవంతుడే మహేశ్వరుడు. అతడే అందరికిని నియంత, ప్రేరకుడు, కర్త, హర్త, భరించి పోషించువాడు. సంరక్షకుడు, సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడు- ఈ విషయమును శ్రద్ధగా సంశయము లేకుండా గ్రహించుటయే భగవానుని సర్వలోక మహేశ్వరునిగా ఎరుంగుటయగును.

ప్రశ్న - అట్టి (భగవానుని అనాదిగా, జన్మరహితునిగా మహేశ్వరునిగా ఎరింగినట్టి) వానిని 'అసంమూఢః' అని తెల్పుచు, అతడు సమస్త పాపములనుండి ముక్తుడగును- అని పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - పై విధముగా భగవానుని జన్మ రహితునిగా, అనాదిగా, లోకమహేశ్వరునిగా ఎరుంగుటవలన కలుగు ఫలము ఇందు తెల్పబడినది. భగవంతుని ప్రభావమును పై విధముగా సరిగా ఎరింగినవాడే వాస్తవముగా భగవంతుని ఎరింగినవాడు. మనుష్యులందరిలో అతడే అసంమూఢుడు. మిగిలిన వారందరును సంమూఢులే. భగవత్తత్త్వమును చక్కగా ఎరింగినవాడు సహజముగనే తన మానవ జీవితము యొక్క అమూల్య సమయమును నిరంతరము అన్ని విధములుగ భగవత్సేవలోనే గడుపును (15/19). విషయాసక్తులవలె భోగములే సుఖహేతువులని తలంపడు. అందు చిక్కుకొనడు.

కనుక అతడు ఈ జన్మయందును, పూర్వ జన్మలయందును చేసిన పాపములన్నింటి నుండియు సర్వథా ముక్తుడై సహజముగనే పరమాత్మప్రాప్తినందును.

బుద్ధిర్ జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమః శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥ 4 ॥
అహింసా సమతా తుష్టిః తపో దానం యశోఽయశః ।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| బుద్ధిః | = బుద్ధి (నిశ్చయాత్మక శక్తి) | భవః, అభావః | = ఉత్పత్తి ప్రళయములు | యశః | = కీర్తి |
| జ్ఞానమ్ | = యథార్థజ్ఞానము | భయమ్, అభయమ్ | = భయము అభయము | అయశః | = అపకీర్తి |
| అసమ్మోహః | = మోహరాహిత్యము | | | ఏవమ్ | = ఈ మొదలగునవి |
| క్షమా | = క్షమ | చ | = మఱియు | భూతానామ్ | = ప్రాణులయొక్క |
| సత్యమ్ | = సత్యము | అహింసా | = అహింస | పృథగ్విధాః | = వివిధములగు |
| దమః | = ఇంద్రియనిగ్రహము | సమతా | = సమత్వము | భావాః | = భావములన్నియును |
| శమః ఏవ | = మనోనిగ్రహము, అట్లే | తుష్టిః | = సంతోషము | మత్తః, ఏవ | = నానుండియే |
| సుఖమ్, దుఃఖమ్ | = సుఖదుఃఖములు | తపః | = తపస్సు | భవంతి | = కలుగుచున్నవి. |
| | | దానమ్ | = దానము | | |

**నిశ్చయాత్మకశక్తి, యథార్థజ్ఞానము, మోహరాహిత్యము, క్షమ, సత్యము, దమము (ఇంద్రియనిగ్రహము), శమము (మనోనిగ్రహము), సుఖదుఃఖములు, ఉత్పత్తి ప్రళయములు, భయము, అభయము, అహింస, సమత, సంతోషము, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, అనునవి ప్రాణులవివిధభావములు. ఇవి యన్నియును నావలననే కలుగును. (4-5)**

ప్రశ్న - బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము అను ఈ మూడును ఏయే భావములను తెలుపును.

సమా - కర్తవ్యాకర్తవ్యములు, గ్రాహ్యాగ్రాహ్యములు, మంచిచెడ్డలు మొదలగువానిని నిర్ణయించు నిశ్చయాత్మక శక్తినే బుద్ధి యందురు.

ప్రతిపదార్థముయొక్క యథార్థ జ్ఞానమునే జ్ఞానము అని యందురు. ఇచటి జ్ఞాన శబ్దము సాధారణ జ్ఞానము మొదలుకొని భగవత్స్వరూప జ్ఞానము వరకు గల అన్ని విధములగు జ్ఞానములను సూచించును.

భోగాసక్తులైన మనుష్యులకు నిత్యము సుఖప్రదముగా ప్రతీతమగు సమస్త ప్రాపంచిక భోగములు అనిత్యములు, క్షణికములు, దుఃఖమూలకములు - అని భావించి, వాటియందు మోహితులు గాకుండుటయే 'అసమ్మోహః' (మోహరాహిత్యము) అని యనబడును.

ప్రశ్న - 'క్షమ' 'సత్యము' యనగానేమి?

సమా - చెడుకోరుట, చెడు చేయుట, ఇతరుల ధనాదికములను హరించుట, అవమానించుట, ఆటంకములను కలిగించుట, పరుషవచనములను పలుకుట,

తిట్టుట, నిందించుట, చాడీలు చెప్పుట, నిప్పు పెట్టుట, విషమిచ్చుట, చంపుట, ప్రత్యక్షముగా గాని పరోక్షముగాగాని హాని చేయుట మొదలగు అపరాధములలో ఒకటిగాని, పెక్కింటినిగాని ఏదో విధముగా చేయు ఏ ప్రాణినైనను క్షమించుట అనగా అట్టి అపరాధిని శిక్షింపగల శక్తి సామర్థ్యాలు ఉన్నను, ఏ విధముగను వానిని శిక్షింపకుండుటయు, శిక్షింపవలెనను భావమునే త్యజించుటయు, అపరాధముల కారణముగ అతడు ఇహపరలోకముల యందు ఎట్టి శిక్షలకును గురికాకూడదని భావించుటయు 'క్షమ' అని యనబడును.

ఇంద్రియాంతఃకరణముల ద్వారా చూచిన, వినిన, అనుభవించిన విషయమును అదే రూపములో ఇతరులకు వివరించు ఉద్దేశ్యముతో హితకరముగా ప్రియవచనములతో దానిని ప్రకటించుటను 'సత్యము' అని యందురు.

ప్రశ్న - 'దమము' 'శమము' అనగానేమి?

సమా - విషయములవెంట పరుగులు దీయు ఇంద్రియములను నిరోధించి, వాటిని ఆధీనములో ఉంచుకొనుట - అనగా వాటి విశృంఖలత్వమును అదుపుచేయుటను 'దమము' అని యందురు. మనస్సును చక్కగా సంయమమొనర్చి, ఆధీనములో ఉంచుకొనుటను 'శమము' అని యందురు.

ప్రశ్న - 'సుఖము' 'దుఃఖము' అను పదములకు అర్థమేమి?

సమా - ప్రియ (అనుకూల) మైన వస్తువుల సంయోగము చేతను, అప్రియ (ప్రతికూల) మైన వాటి వియోగము చేతను కలుగు అన్ని విధములగు అనుభూతినే 'సుఖము' అని యందురు. అదే విధముగ ప్రియ వస్తు వియోగము, అప్రియ వస్తు సంయోగము వలన కలుగు ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక కష్టములనే 'దుఃఖము' అని యందురు.[1]

ప్రశ్న - 'భవ', 'అభావ' అను పదములకును, అట్లే భయ, అభయ అను పదములకును అర్థమేమి?

సమా- సర్గకాలమందు సమస్త చరాచర జగత్తు ఉత్పన్నమగుటను 'భవము' అని యందురు. ప్రలయకాలమున ఆ జగత్తు (అవ్యక్తమునందు) లీనమగుటనే 'అభావము' అని యందురు. ఏదైన నొక హానిగాని, మృత్యువుగాని సంభవించు కారణమును చూచి, అంతఃకరణమునందు ఏర్పడు తొట్రుపాటును 'భయ'మందురు. సర్వత్ర పరమేశ్వరుడే వ్యాపించియున్నాడని తెలిసికొనుట వలనను, మరియే ఇతర కారణములవలనైనను భయము లేకుండుటను 'అభయము' అని యందురు.

ప్రశ్న - 'అహింస' 'సమత' 'తుష్టి' అను పదముల యర్థమేమి?

సమా - ఏ ప్రాణికైనను, ఏ సమయము నందైనను, ఏ విధముగనైనను మనోవాక్కాయములచే ఏ మాత్రము కష్టము కల్గింపకూడదను భావమునే 'అహింస' అని యందురు.

సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు, నిందాస్తుతులు, మానావమానములు, మిత్రులు శత్రువులు మొదలగు పరస్పర విరుద్ధములగు కృత్యములు, పదార్థములు, సంఘటనములయందు నిరంతరము రాగద్వేషములు లేకుండ సమబుద్ధి కలిగియుండు భావమునే 'సమత' అని యందురు.

ప్రాప్తించినదానిని ప్రారబ్ధభోగమనియు, విధినిర్ణయ మనియు భావించి సర్వదా సంతృప్తి కలిగియుండు భావమునే 'తుష్టి' అని యందురు.

ప్రశ్న - 'తపస్సు' 'దానము,' యశస్సు' 'అపయశస్సు' అను నాలిగింటియొక్క వేర్వేరు అర్థములేవి?

సమా - స్వధర్మ పాలనకై కష్టములను సహించుటను 'తపస్సు' అని యందురు. తన సొత్తును ఇతరులహితముకొరకై వితరణ చేయుటను (వినియోగించుటను 'దానము' అనియందురు. జగత్తునందు కీర్తిని 'యశము' అనియు, అపకీర్తిని 'అపయశము' అని యందురు.

1) మనుష్యులు, పశు, పక్షి, క్రిమి, కీటకాది ప్రాణుల నిమిత్తముగా కలుగు కష్టములను అధిభౌతిక దుఃఖములందురు. అతివృష్టి - అనావృష్టి, భూకంపములు, పిడుగుపాటులు, కఱవు కాటకములు మొదలగు ప్రకృతి వైపరీత్యముల వలన కలుగు కష్టములను అధిదైవిక దుఃఖములందురు. శరీరేంద్రియ - అంతఃకరణములయందు కలుగు సర్వవిధరోగ బాధలను ఆధ్యాత్మిక దుఃఖములందురు.

ప్రశ్న - 'ప్రాణుల యొక్క వివిధ భావములన్నియును నావలననే కలుగును' అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - వేర్వేరు ప్రాణులకు వాటి (వారి) ప్రకృతుల ననుసరించి కలుగు వివిధభావములు భగవంతుని వలననే కలుగుచున్నవి, అనగా అవి యన్నియును ఆయన సహాయము, శక్తి, ఉనికి (సత్తా) మూలముననే కలుగుచుండును.

ప్రశ్న - ఇచట ఈ రెండు శ్లోకములలో సుఖము, భవము, అభయము, యశస్సు అను నాలుగు భావములకే తద్విరుద్ధ భావములైన దుఃఖము, అభావము, భయము, అపయశస్సులను వర్ణించుట జరిగినది. కాని క్షమ, సత్యము, దమము, అహింస మొదలగు వాటి విరుద్ధ భావములు ఏల వర్ణింపబడలేదు?

సమా - దుఃఖము, అభావము, భయము, అపయశస్సు మొదలగు భావములు జీవులచే వాటి ప్రారబ్ధములను అనుభవింపజేయుటకు ఉత్పన్నములగును. కనుక ఇవి యన్నియును కర్మఫలదాత, జగన్నియంత అయిన భగవానునినుండి ఉద్భవించుట సముచితమే కాని క్షమ, సత్యము, దమము, అహింస, మొదలగువాని విరుద్ధ భావములైన క్రోధము, అసత్యము, ఇంద్రియలౌల్యము, హింస మొదలగు దుర్గుణ దురాచారములు భగవానునినుండి ఉత్పన్నములు కావు. ఈ దుర్గుణ దురాచారముల ఉత్పత్తికి మూలకారణము అజ్ఞానజనితమైన 'కామము' అని గీతయందే ఇతర సందర్భములయందు తెల్పబడినది. (3/37) వీటిని 'సమూలముగ' త్యజింపవలెనని ఆదేశించుట జరిగినది. కనుక సత్యము మొదలగు సద్గుణ సదాచారముల యొక్క విరుద్ధ భావములు ఇచ్చట వర్ణింపబడలేదు.

**మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ 6 ॥**

లోకే = లోకమునందుగల
ఇమాః, ప్రజాః = ఈప్రజలు
యేషామ్ = ఎవరి యొక్క సంతానమో
పూర్వే = (అట్టి) ప్రాచీనులైన
సప్తమహర్షయః = సప్తమహర్షులును
తథా = అట్లే వారికంటెను పూర్వులైన
చత్వారః = సనకాది మహామునులు నలుగురును
మనవః = చతుర్దశమనువులు (మొదలగువారు అందఱు)ను
మద్భావాః = నాయందు భక్తి భావములు గల్గినవారై
మానసాః, జాతాః = నాసంకల్పము వలననే జన్మించిరి.

**సప్తమహర్షులును, వారికంటెను పూర్వులైన సనకాదిమహామునులు నలుగురును, స్వాయంభువాది చతుర్దశ మనువులును మొదలగు వీరందఱును నా భక్తులే. అందరూ నాయెడ సద్భావముగలవారే. వీరు నా సంకల్పమువలననే జన్మించిరి. ఈ జగత్తునందలి సమస్త ప్రాణులును వీరిప్రజలే. (6)**

ప్రశ్న - సప్త మహర్షులనగా నెవరు? వారి లక్షణములెట్టివి?

సమా - సప్తర్షుల లక్షణములీవిధముగా తెల్పబడినవి-

ఏతాన్ భావానధీయానా యే చైత ఋషయో మతాః ।
సప్తైతే సప్తభిశ్చైవ గుణైః సప్తర్షయః స్మృతాః ॥
దీర్ఘాయుషో మంత్రకృత ఈశ్వరా దివ్యచక్షుషః ।
వృద్ధాః ప్రత్యక్షధర్మాణో గోత్రప్రవర్తకాశ్చ యే ॥
(వాయు పురాణం 16/13-14)

దేవర్షులయొక్క[1] ఈ భావములను అధ్యయనము (స్మరణము) చేయువారు ఋషులుగా భావింపబడిరి. ఈ ఋషులలో దీర్ఘాయువులు, వేదమంత్ర కర్తలు, దివ్యశక్తి సంపన్నులు, దివ్యదృష్టి గలవారు, సద్గుణ సముపేతులేగాక, వేదశాస్త్రాది వివిధ విద్యాసమంచితులైనవయోవృద్ధులు, సర్వధర్మ మర్మజ్ఞులైన, ధర్మస్వరూపులు, గోత్రప్రవర్తకులు ఈ గుణములేడునుగల ఏడుగురు మహర్షులు 'సప్తర్షులు'గా ప్రసిద్ధి వహించిరి. వీరినుండియే వంశములు వృద్ధిచెందినవి. ధర్మ వ్యవస్థ సుప్రతిష్ఠితమై సాగుచున్నది.[2]

1) దేవర్షుల లక్షణములు ఈ అధ్యాయమునందలి 12, 13 శ్లోకముల వ్యాఖ్యానమున చూడగలరు.

2) ఈ సప్తర్షులు లౌకికధర్మాచరణ (ప్రవృత్తిమార్గ) ప్రవర్తకులు. వీరి భావములు, జీవన విధానములు ఇట్లు వర్ణింపబడినవి.

ఈ సప్తర్షులు ప్రతిమన్వంతరమునందును వేర్వేరుగా ఉందురు. ఈ సప్తర్షులనే భగవానుడు మహర్షులుగా వర్ణించెను. వీరు భగవత్సంకల్ప మాత్రమున జన్మించుచుందురు. ఇట్టి వీరు ఋషులకంటె ఉచ్చస్థాయికి చెందినవారు. సప్తర్షులను గూర్చి మహాభారతమున శాంతిపర్వము నందు ఉల్లేఖింపబడినది. సాక్షాత్తుగా పరమేశ్వరుడే బ్రహ్మాది దేవతలతో వీరిని గూర్చి ఇట్లు చెప్పెను-

మరీచిరంగిరాశ్చాత్రిః పులస్త్యః పులహః క్రతుః ।
వసిష్ఠ ఇతి సప్తైతే మానసా నిర్మితా హి తే ॥
ఏతే వేదవిదో ముఖ్యావేదాచార్యాశ్చ కల్పితాః ।
ప్రవృత్తిధర్మిణశ్చైవ, ప్రాజాపత్యే చ కల్పితాః ॥
(మహాభారతం-శాంతి పర్వము 340/69, 70)

'మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు అను ఈ ఏడుగురు మహర్షులను నీ (బ్రహ్మ) మానస పుత్రులే. వీరు వేదవేత్తలు. వీరిని వేదధర్మ ప్రవర్తకులుగా నేనే చేసితిని. వీరు ప్రవృత్తి మార్గసంచాలకులు, ప్రజాపతి కార్యములను (ధర్మములను) ఆచరించుటకు నాచే వీరు నియుక్తులైరి.'

ఈ కల్పమునందలి మొట్టమొదటి స్వాయంభువ మన్వంతరమునందు సప్తర్షులు వీరే. (హరివంశం7/8,9) కనుక ఇచ్చట వీరినే 'సప్తర్షులు'గ భావింపవలెను.[1]

ప్రశ్న - ఈ వర్తమాన మన్వంతరమునందలి విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, గౌతముడు, అత్రి, వసిష్ఠుడు, కశ్యపుడు అనువారిని సప్తమహర్షులుగా భావించినచో కల్గు దోషమేమి?

---

షట్కర్మాభిరతా నిత్యం, శాలినో గృహమేధినః । తుల్యైర్వ్యవహరంతి స్మ, అదృష్టైః కర్మ హేతుభిః ॥
అగ్రామ్యైర్వర్తయంతి స్మ, రసైశ్చైవ స్వయం కృతైః । కుటుంబినః బుద్ధిమంతో, బాహ్యాంతరనివాసినః ॥
కృతాదిషు యుగాఖ్యేషు, సర్వేష్వేవ పునఃపునః । వర్ణాశ్రమవ్యవస్థానం, క్రియతే ప్రథమం తు వై ॥
(వాయుపురాణం 61/95-97)

అధ్యయన+అధ్యాపనములు - యజ్ఞములను చేయుట, చేయించుట, దానములను ఇచ్చుట, తీసికొనుట అను ఆఱు కర్మలను నిత్యము ఆచరించెడివారు, బ్రహ్మచారులకు విద్యలను నేర్పుటకై గురుకులములను నడిపెడివారు. సంతాన ప్రాప్తికే గృహస్థాశ్రమమును స్వీకరించి, అగ్నికార్యములను నెరపుచుండువారు, వర్ణధర్మములను అనుసరించియే వివాహాది లౌకికవ్యవహారములను నడిపెడివారు, స్వయముగా సంపాదించుకొనిన అనింద్య భోగ్యవస్తువులను మాత్రమే అనుభవించువారు, సంతానము కలిగి, గోధనాది సంపదలతో ఒప్పుచుండువారు, ప్రాపంచిక జీవితములను కొనసాగించుచునే నిరాసక్తులై యుండువారు అగు ఈ మహర్షులే కృతాది చతుర్యుగముల ప్రారంభములయందు మొట్టమొదట మాటిమాటికి వర్ణాశ్రమ ధర్మవ్యవస్థను ఏర్పఱచుచుందురు.

1) ఈ ఏడుగురు మిక్కిలి తేజోమూర్తులు వివేకశీలురైన ప్రజాపతులు. సృష్టికార్యమునకు కారణభూతులగుట వలన వీరిని 'సప్తబ్రహ్మలు' అనియునందురు. (మహాభారతం - శాంతిపర్వం - 208/3,4,5)

సంక్షిప్తముగా వీరి చరిత్రలు ఇవి -

1. మరీచి - ఇతడు భగవంతుని అంశాంశావతారముగా భావింపబడును. ఈయనకు పెక్కుమంది భార్యలు గలరు. వారిలో 'సంభూతి' అనునామె ముఖ్యురాలు. ఈమె దక్షప్రజాపతివలన ఆయన భార్యయగు ధర్మవ్రతయందు కలిగిన కూతురు. ధర్మవ్రత ధర్ముడు అను బ్రాహ్మణుని కుమార్తె. మరీచి మహర్షి అధిక సంతానవంతుడు. కశ్యప మహర్షి ఈయన కుమారుడే. పద్మపురాణమునందు కొంత భాగమును బ్రహ్మ ఈతకశ్యపునకు వినిపించెను. అన్ని పురాణములలోను, మహాభారతమునందును ఈతని ప్రస్తావనలు కలవు. బ్రహ్మదేవుడు అందఱికంటెను ముందుగా బ్రహ్మపురాణమును ఈయనకే ఉపదేశించెను. జగత్సృష్టి పాలనా కార్యములయందే ఈతడు సర్వదా నిరతుడై యుండును. వాయు, స్కంద - అగ్ని - పద్మ - మార్కండేయ, విష్ణు పురాణములయందును, మహాభారతాదులయందును ఇతని వృత్తాంతములు విపులముగా గలవు.

2. అంగిరసుడు - ఇతడు అసాధారణ - ఆధ్యాత్మిక తేజస్సంపన్నుడు. ఈయనకు భార్యలు పెక్కుమంది గలరు. వారిలో ముఖ్య సతులు ముగ్గురు. మరీచి మహర్షి పుత్రికయైన సురూప, కర్దమ మహర్షి కూతురు స్వరాట్టు, మనుపుత్రికయైన పథ్య అనువారే ఆ ముగ్గురు. సురూపకు బృహస్పతియు, స్వరాట్టుకు గౌతమ, వామదేవాది పుత్రపంచకము, పథ్యకు విష్ణు

సమా - విశ్వామిత్రాది సప్తమహర్షులలో అత్రి, వసిష్ఠుడు తప్ప తక్కిన ఐదుగురును భగవంతుని మానస పుత్రులుగారు. బ్రహ్మ మానస పుత్రులునుగారు. కనుక వీరిని సప్తర్షులుగా భావింపక పైన పేర్కొనబడిన మరీచి ప్రభృతులనే సప్తర్షులుగా భావించుట సముచితము.

ప్రశ్న - 'చత్వారః పూర్వే' అను పదములు ఎవరిని తెలుపును?

సమా - అందరికంటెను పూర్వులైన, సనక, సనందన, సనాతన, సనత్కుమారులు అనువారిని ఈ చత్వారః పూర్వే అను పదములు తెల్పును. వీరును భగవత్స్వరూపులే. బ్రహ్మ తపస్సు చేయుట వలన వీరు స్వయముగా ప్రకటితులైరి, బ్రహ్మస్వయముగా ఇట్లు చెప్పెను-

తప్తం తపో వివిధలోకసిసృక్షయా మే
ఆదౌ సనాత్స్వతపసః స చతుస్సనోఽభూత్
ప్రాక్కల్పసంప్లవవినష్టమిహాత్మతత్త్వం
సమ్యగ్ జగాద మునయో యదచక్షతాత్మన్ ॥
(శ్రీమద్భాగవతం - 2/7/5)

---

మొదలగు ముగ్గురు పుత్రులు కలిగిరి. (వాయు పురాణం - 65వ అధ్యాయం) - అట్లే అగ్నిపుత్రికయైన ఆత్రేయియందు జన్మించినవారు అంగిరసులు (బ్రహ్మపురాణం) కొన్ని గ్రంథములలో బృహస్పతి ఇతని పత్నియైన 'శుభ'యందు జన్మించెనని తెల్పబడినది. (మహాభారతం)

3. అత్రి - ఇతడు దక్షిణ దిశకు చెందినవాడు. మహాపతివ్రతయైన అనసూయ ఈయనయొక్క ధర్మపత్ని. ఈమె కర్దమదేవహూతుల కూతురు. కపిల భగవానుని చెల్లెలు. శ్రీరామచంద్రుడు వనవాసకాలమున అత్రి - అనసూయల ఆతిథ్యమును స్వీకరించెను. జగజ్జననియైన సీతాదేవికి అనసూయాదేవి వివిధ ఆభరణములను, వస్త్రములను ఇచ్చి సతీధర్మములను ఉపదేశించెను.

బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన అత్రిని ప్రజాసృష్టిని విస్తృతమొనర్చుమని బ్రహ్మ ఆజ్ఞాపించెను. అప్పుడు అత్రిమహర్షి అనసూయా దేవితో సహా 'ఋక్ష' మహాపర్వతముపై తపమొనరించెను. ఈ దంపతులు భగవద్భక్తులు. వీరు తీవ్రముగా తపస్సు చేసి, ఫలముగా భగవత్సాక్షాత్కారమును కోరిరి. వీరు జగన్నాథుడైన భగవంతుని శరణు జొచ్చి, అతనిని నిరంతరము చింతన చేయసాగిరి. వీరి మస్తకములనుండి యోగాగ్ని బయల్వెడలి మూడు లోకములను దహింపసాగెను. వీరి తపస్సులకు ప్రసన్నులై బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రత్యక్షమైరి. వరములను కోరుకొమ్మనిరి. త్రిమూర్తుల దర్శనముతో మునిదంపతులు కృతార్థులైరి. ఆర్తితో భగవానుని కీర్తింపసాగిరి. భగవానుడు వరములను కోరుకొనుడని వీరినడిగెను. సృష్టికార్యమొనరింపుమని పలికిన బ్రహ్మ యొక్క ఆదేశానుసారము అత్రిముని యిట్లు నుడివెను- "పుత్రులకై నేను భగవంతుని ఆరాధించి ఆయన దర్శనమును వేడుకొంటిని. మీరు ముగ్గురును విచ్చేసితిరి. ఇది నా ఊహకే అందని విషయము. నాపై మీకింత అనుగ్రహము కల్గిన కారణమును మీరు వివరింపుడు". అత్రి వచనములను విని త్రిమూర్తులు చిఱునవ్వుతో ఇట్లనిరి- "ఓ మహామునీ! నీ సంకల్పము సరియైనదే. నీవు ధ్యానించిన ఆ పరమేశ్వరుని స్వరూపములే మేము. మా అంశములతో మీకు ముగ్గురు కుమారులు కలుగుదురు. మీరు కృతార్థులయ్యెదరు." ఇట్లు పలికి త్రిమూర్తులు అంతర్ధానమైరి. వారు ముగ్గురును ఆ దంపతులకు పుత్రులై ఆ యింటనే వెలసిరి. విష్ణ్వంశతో దత్తాత్రేయుడును, బ్రహ్మ అంశతో చంద్రుడును, శివాంశతో దుర్వాసుడును జన్మించిరి. భక్తి మహిమ ఇట్టిది - మానవుల ఊహలకు అందనిరీతిలో భగవంతుడు వారికి శిశువులుగా జన్మించి, అనసూయాదేవి ఒడిలో ఆటలాడసాగిరి. (వాల్మీకి రామాయణము - అరణ్యకాండ. శ్రీమద్భాగవతము 4వ స్కంధము)

4. పులస్త్యుడు - ఇతడు మహాధర్మపరాయణుడు. తపస్వి, తేజస్వి. ఇతడు యోగశాస్త్రనిష్ణాతుడు. ఆచార్యవతంసుడు. రాక్షససంహారమునకై పరాశరుడొక మహాయజ్ఞమును ఆచరించుచుండగా వసిష్ఠుని సూచన మేరకు యజ్ఞము నాపుమని పులస్త్యుడాతనితో పల్కెను. పరాశరుడాయన మాటను ఆదరించి యజ్ఞమును నిల్పెను. దానితో ప్రసన్నుడై, పులస్త్యుడు ఆ పరాశరుని ఆశీర్వదించెను. తత్ప్రభావమున పరాశరుడు సమస్త శాస్త్రపారంగతుడయ్యెను.

సంధ్య, ప్రతీచి, ప్రీతి, హావిర్భువు అను భార్యలయందు పులస్త్యునకు పెక్కుమంది పుత్రులు ఉదయించిరి. దత్తోలి, నిదాఘుడు అనువారు ఈయన యొక్క కుమారులు. దత్తోలి అగస్త్య నామముతో ప్రసిద్ధి గాంచెను. విశ్రవసువు గూడ ఈతని కుమారుడు. కుబేరుడు, రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు అనువారు విశ్రవసుని కుమారులు. పురాణములయందును

'నేను వివిధ లోకములను సృష్టించు కోరికతో మొట్టమొదట తపస్సు ఆచరించితిని. నా తీవ్రతపః ఫలితముగా భగవానుడే స్వయముగా సనక, సనందన, సనాతన, సనత్కుమార - అను నాలుగు 'సన' (మూర్తీభవించిన తపస్సు') అను పేర్లుగల రూపములతో ప్రకటితుడాయెను. పూర్వకల్పమున ప్రళయకాల సమయము నందు జగత్తున లుప్తమైన ఆత్మ తత్త్వజ్ఞానమును వీరు చక్కగా ఉపదేశించిరి. ఆ జ్ఞానము ద్వారా మునులు తమ హృదయములయందు ఆత్మ తత్త్వమును సాక్షాత్కరింపజేసికొనిరి'

ప్రశ్న - ' ఈ జగత్తునందలి ప్రాణులన్నియును వారి సంతానమే' అని ఈ శ్లోకమునందే చెప్పబడినది. కాని సనకాదులకు ఎట్టి సంతానము లేదుగదా! మరి 'చత్వారః పూర్వే' అను పదములకర్థమును సనకాదులని భావించినచో పై వాక్యమునకు విరుద్ధమగును గదా?

సమా - సనకాదులు అందరికిని జ్ఞాన ప్రదాతలు - నివృత్తి ధర్మమార్గ ప్రవర్తకులైన ఆచార్యులు. కనుక వారినుండి జ్ఞానమును పొందిన శిష్యులు (అంతేవాసులు) అందరిని వారి ప్రజలుగా (సంతానముగా) భావింపవలెను. కనుక ఇందు ఎట్టి వైరుధ్యమూ లేదు.

---

మహాభారతమునందును, ఇంకను పలుచోట్ల ఈ పులస్త్యుని ప్రస్తావనలు గలవు. విష్ణు, బ్రహ్మవైవర్త, కూర్మ, వాయు పురాణముల యందును, మహాభారత (ఉద్యోగ పర్వము), శ్రీమద్భాగవతములయందును ఈతని కథలు విస్తృతముగా వర్ణింపబడినవి.

5. పులహుండు - ఇతడు మహాప్రభావశాలి, మహాజ్ఞాని. ఇతడు సనందన మహర్షి కడ దివ్యజ్ఞానమును పొంది, దానిని గౌతమునికి అందించెను. దక్షప్రజాపతి కూతురైన 'క్షమ', కర్దమఋషిపుత్రికయైన 'గతి'అనువారు ఈయన యొక్క భార్యలు. వారియందు ఈతడు పెక్కుమంది పుత్రులను పుత్రికలను (సంతానమును) పొందెను. విష్ణు కూర్మ పురాణములయందును, శ్రీమద్భాగవతమునందును ఈతని వృత్తాంతము గలదు.

6. క్రతువు - ఈ మహర్షియు గొప్ప ఆధ్యాత్మిక తేజస్సంపన్నుడు. ఇతడు కర్దమ మహర్షి పుత్రికయైన 'క్రియ'ను దక్షకన్యయైన 'సన్నతి'ని వివాహమాడెను. ఇతనివలన 'వాలఖిల్యులు' అను పేరుతో ప్రసిద్ధిగాంచిన 60 వేలమంది ఋషులు జన్మించిరి. వీరు సూర్యుని రథమునకు అభిముఖులై అతనిని స్తుతించుచు నడచుచుందురు. పురాణములయందు పలుచోట్ల వీరి గాథలు గలవు. (శ్రీమద్భాగవతం - 4వ స్కంధము - విష్ణుపురాణం ప్రథమాంశ)

7) వసిష్ఠుడు - వసిష్ఠుని యొక్క తపస్సు, తేజస్సు, క్షమాధర్మములు విశ్వవిఖ్యాతములు. ఇతని జన్మను గూర్చిన వర్ణనలు పురాణముల యందు పెక్కు గలవు. కల్పభేదములను బట్టి అన్నియును సరియైనవే. మహాసాధ్వి, పతివ్రతాతిలకమైన అరుంధతి వసిష్ఠుని ధర్మపత్ని. ఇతడు సూర్యవంశ ప్రభువుల పురోహితుడు. మర్యాదాపురుషోత్తముడైన శ్రీరామచంద్రుని దర్శన, సాంగత్యములకై సూర్యవంశరాజులకు పురోహితుడుగా ఉండుటకు అంగీకరించెను. సూర్యవంశము యొక్క హితము కొఱకై నిరంతరము పాటుపడెను. భగవంతుడైన శ్రీరామచంద్రుని తన శిష్యునిగా పొంది, తన జీవితము సఫలమైనట్లు భావించెను.

"తపస్సు గొప్పదా? సత్సాంగత్యము గొప్పదా?"- అను విషయముపై ఒకసారి ఈయనకు విశ్వామిత్రునితో వాగ్వివాదము ఏర్పడెను. సత్సాంగత్యమే గొప్పదని వసిష్ఠుడును, తపస్సు గొప్పదని విశ్వామిత్రుడును అభిప్రాయపడిరి. చివరకు ఈ వివాద పరిష్కారమునకై ఆదిశేషుని కడకేగిరి. వీరి వివాదములను విని శేషభగవానుడిట్లనెను- "మహాత్ములారా! నాతలపై పృథ్వీ భారమంతయు ఉండుట మీరు చూచుచున్నారు. మీలో ఒకరు కొంత తడవు ఈ భారమును వహించినచో నేను ఆలోచించి, మీ వివాదమును పరిష్కరింతును."

విశ్వామిత్రునకు తన తపశ్శక్తిపై మిక్కిలి విశ్వాసము ఉండెను. ఆతడు 10 వేల సంవత్సరముల తపఃఫలమును ధారపోసి పృథ్విని మోయుటకు సిద్ధపడెను. కాని మోయలేకపోయెను. పృథ్వి చలింపసాగెను. అప్పుడు వసిష్ఠుడు సత్సాంగత్యము యొక్క అర్ధక్షణ ఫలమును ధారపోసి, అవలీలగా పృథ్విని ఎత్తుకొని చాలతడవు నిలబడెను. విశ్వామిత్రుడు ఆదిశేషుని అడిగెను. "ఇంత తడవైనను మీ నిర్ణయమును ఏల ప్రకటింపలేదు". అప్పుడు శేషుడు నవ్వి ఇట్లనెను- "మునివరా! నా ప్రమేయము లేకయే నిర్ణయము జరిగినది. పదివేల సంవత్సరముల తపశ్శక్తి అర్ధక్షణ సత్సాంగత్యమునకును సమానము కానప్పుడు ఈ రెండింటిలో ఏది గొప్పదియో మీరే ఆలోచింపుడు" - సత్సాంగత్య మహిమను ఎఱింగి మహర్షులిద్దఱును సంతృప్తి పడి వెడలిపోయిరి.

ప్రశ్న - 'మనవః' అను పదము ఎవరిని తెలుపును?

సమా - బ్రహ్మయొక్క ఒక 'దిన' కాల ప్రమాణమున పదునాల్గుమంది మనువులుందురు. ప్రతి మనువు యొక్క అధికార కాలమును 'మన్వంతరము' అని యందురు. 71 చతుర్యుగములకంటె కొంత అధికమైన కాలము ఒక మన్వంతరము అగును. మానవసంవత్సర కాలమానము ప్రకారము ఒక మన్వంతరము 30,67, 20,000 సం॥ కాలముకంటె కొంత అధికము. దేవతల కాలప్రమాణమునననుసరించి ఇది 8,52,000 సం॥లకంటే కొంత అధికము.[1] (విష్ణుపురాణం - 1/3)

వసిష్ఠ మహర్షి అష్టవసుసంపన్నుడు (అణిమాది అష్టసిద్ధులు గలవాడు) గృహస్థులలో సర్వశ్రేష్ఠుడు. కనుక వసిష్ఠుడని ప్రసిద్ధి కెక్కెను. కామక్రోధలోభమోహాదిశత్రువులు ఈయన ఆశ్రమ సమీపమునకును వచ్చెడివికావు. తన నూఱుమంది పుత్రులను విశ్వామిత్రుడు సంహరించినప్పుడు తాను సర్వసమర్థుడై యుండియు, ఆయనపైకినుక వహింపలేదు. అతనికి ఎట్టి కీడును తలపెట్టలేదు. మహాదేవుడు (శంకరుడు) ప్రసన్నుడై వసిష్ఠునకు బ్రాహ్మణాధిపత్యమును ప్రదానము చేసెను. సనాతన ధర్మమును యథార్థముగా తెలిసిన వారిలో వసిష్ఠుడు సర్వప్రథముడుగా భావింపబడును. రామాయణ మహాభారతములయందును, దేవీ భాగవతమునందును విష్ణు, మత్స్య, వాయు, శివ, లింగ పురాణాదుల యందును ఇతని గురించిన ఇతర వృత్తాంతములు విస్తృతముగా వర్ణింపబడినవి.

(1) సూర్యసిద్ధాంతమును అనుసరించి మన్వంతరాదుల వర్ణనము ఈవిధముగా నున్నది. సౌరమానము ప్రకారము 43, 20,000 మానవ సంవత్సరములు లేక దేవమానము ప్రకారము 12 వేల సంవత్సరములు ఒక (చతుర్యుగము కృత, త్రేతా, ద్వాపర, కలియుగముల సంపూర్ణకాలము) చతుర్యుగము. దీనినే మహాయుగము అనియు అందురు. ఇట్టి 71 మహాయుగములు ఒక మన్వంతరము. ప్రతి మన్వంతరాంతమునకును తదనంతర మన్వంతర - ఆదికిని మధ్యగల కాలమును 'సంధ్య' అని యందురు. ఈ సంధ్యాకాలము మానవ కాలమాన ప్రకారము 17,28,000 సంవత్సరములు. ఇది సత్యయుగ కాల ప్రమాణమునకు సమానము. ప్రతి మన్వంతరము గడిచిన పిదప ఈ 'సంధ్యా' కాలములో భూమి నీటిలో మునిగియుండును. ప్రతి కల్పమునందును (బ్రహ్మయొక్క ఒక దిన ప్రమాణ కాలమునందు) 14 మన్వంతరములు, 14 సంధ్యాకాలములు ఉండును. ఇవిగాక కల్పారంభ కాలమునందు కూడ ఒక సత్యయుగ కాల ప్రమాణమునకు సమానమగు ఒక సంధ్యాకాలముండును. ఈ విధముగా ఒక కల్పము యొక్క 14 మన్వంతరములలో 71 చతుర్యుగ (మహాయుగ)ములు గాక సత్యయుగ కాల ప్రమాణమునకు సమానమైన 15 సంధ్యా కాలములు ఉండును. ప్రతి కల్పమునందును 14 మన్వంతరములు + 15 సంధ్యాకాలములు ఉండును - ప్రతి మన్వంతరమునందు 71 మహాయుగములు, 15 సంధ్యాకాలములు 6 మహాయుగముల కాలమునకు సమానము. అనగా 14×71=994 మహాయుగములు+6 మ.యు. = 1000 మహాయుగములు = ఒక కల్పము. ఈ గణనము వివరముగా ఈ క్రింద ఈయబడినది.

| | సౌర - (మానవ) సం॥లు | దివ్య సం॥లు |
|---|---|---|
| ఒక చతుర్యుగము (మహాయుగము) లేక దివ్యయుగము | 43,20,000 | 12,000 సం॥లు |
| 71 చతుర్యుగములు | 30,67,20,000 సం॥లు | 8,52,000 సం॥లు |
| ప్రతికల్పాదియందును గల సంధ్యాకాలము | 17,28,000 సం॥లు | 4,800 సం॥లు |
| 14 సంధ్యాకాలములు | 2,41,92,000 సం॥లు | 67,200 సం॥లు |
| ఒక సంధ్యాకాలముతోపాటు ఒక మన్వంతరము | 30,84,48,000 సం॥లు | 8,56,800 సం॥లు |
| 14 సంధ్యలతోపాటు కలిసిన 14 మన్వంతరములు | 4,31,82,72,000 సం॥లు | 1,19,95,200 సం॥లు |
| 14 మన్వంతరములు + కల్పాది సంధ్య = ఒక కల్పకాల | 4,32,00,00,000 సం॥లు | 1,20,00,000 సం॥లు |

ప్రమాణము = ఇది బ్రహ్మయొక్క ఒక పగటికాల ప్రమాణము

కల్పమనగా బ్రహ్మయొక్క పగటి కాలము. బ్రహ్మయొక్క రాత్రి కాల ప్రమాణము గూడ అంతియే. అనగా బ్రహ్మకు ఇది ఒక దినము (రోజు). ఈ ప్రమాణ రీతిలో బ్రహ్మయొక్క వంద (100) సంవత్సరములు ఆయునకు ఒక జీవితకాలము. ఈ కాలమును 'పర' అని యందురు. ఇప్పుడు బ్రహ్మయొక్క మొదటి పరార్థము ముగిసినది. ప్రస్తుతము ఈ కల్పమునందు 6 (ఆఱు) మన్వంతరములు వాటి (7) సంధ్యలతోపాటు గడిచినవి. ప్రస్తుతము 7వదియైన వైవస్వత మన్వంతరము నడచుచున్నది. ఇందులోను 27 చతుర్యుగములు ముగిసినవి. ఇప్పుడు 28వ చతుర్యుగము (మహాయుగము)లోని

ప్రతి మన్వంతరమునందు ధర్మ వ్యవస్థను నిలుపుటకును, లోకరక్షణకు తోడ్పడుటకును వేర్వేరు సప్తర్షులు ఉందురు. ఒక మన్వంతరము గడిచిన పిదప ఆ మనువుతోపాటు సప్తర్షులు, దేవతలు, ఇంద్రుడు మనుపుత్రులును మారిపోవుదురు. ప్రస్తుత కల్పము యొక్క మనువులు - స్వాయంభువు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి అనువారు.[1]

ప్రశ్న - ఈ సప్త మహర్షులు మొదలగు వారితోబాటు 'మద్భావాః' అను విశేషణమును ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - వీరందరును భగవానునియందు భక్తిశ్రద్ధలుగల వారని తెల్పుటకే 'మద్భావాః' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - సప్తర్షులు, సనకాదులు బ్రహ్మమానస పుత్రులుగా భావింపబడుదురు. ఇచట భగవంతుడు వారిని తన మానసపుత్రులుగా ఎట్లు పేర్కొనెను?

సమా - వీరి ఉత్పత్తి బ్రహ్మనుండి జరిగినదని తెల్పినను వాస్తవముగా భగవంతునినుండియే జరిగినదని భావింపవలెను. ఏలనన భగవానుడే జగత్సృష్టికై తాను స్వయముగా బ్రహ్మరూపమును ధరించును. కనుక బ్రహ్మమానసపుత్రులను భగవానుడు తన మనస్సునుండియే ఉద్భవింపజేసినట్లు తెలిపెను. ఇందు వైరుధ్యమేమియును లేదు.

*సంబంధము - ఈ విధముగా 2,3 శ్లోకములయందు భగవంతుని యోగము, (ప్రభావము) 4 నుండి 6 వరకు ఆయన విభూతులు (వైభవములు) సంక్షిప్తముగా వర్ణింపబడినవి. ఇప్పుడు వాటిని తెలిసికొనుటవలన కలుగు ఫలము తెలుపబడుచున్నది-*

**ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।**
**సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ పురుషుడు | యోగమ్ | = యోగశక్తిని | యోగేన | = భక్తియోగముచే |
| మమ | = నాయొక్క | తత్త్వతః | = యథార్థముగా | యుజ్యతే | = యుక్తుడగును |
| ఏతామ్ | = ఈ | వేత్తి | = ఎఱుంగునో | అత్ర | = ఈవిషయమున |
| విభూతిమ్ | = పరమైశ్వర్యరూపవిభూతిని | సః | = ఆపురుషుడు | న, సంశయః | = సంశయములేదు. |
| చ | = మఱియు | అవికంపేన | = నిశ్చలమైన | | |

**ఈ నా పరమైశ్వర్యరూపవిభూతిని, యోగశక్తియొక్క తత్త్వమును తెలిసికొన్నవాడు నిశ్చలభక్తియుక్తుడగును. ఇందు ఏమాత్రమూ సందేహమే లేదు. (7)**

ప్రశ్న - 'ఏతామ్' అను విశేషణముతోపాటు 'విభూతిమ్' అను పదము దేనిని తెలుపును? 'యోగమ్' అను పదమునకర్థమేమి? ఈ రెండింటి తత్త్వమును తెలిసికొనుట యనగానేమి?

సమా - పూర్వపు మూడు శ్లోకములలో బుద్ధి మొదలగు భావములు, మహర్షులు మొదలగువారు, తననుండే ఉద్భవించిరని భగవానుడు తెల్పెను. 7వ అధ్యాయమున జలమునందలి రసమును నేను - అనియు (7/8) 9వ

సంధ్యాకాలములో కలియుగ ప్రారంభమున (మొదటి పాదమున) ఉన్నాము. (సూర్య సిద్ధాంత మధ్యమాధికారం 15 నుండి 24). విక్రమశకం - 2056వ సంవత్సరం వఱకు కలియుగమునందు 5,100 సంవత్సరములు గడిచినవి. కలియుగారంభము నందు సంధ్యాకాలము 36 వేల సంవత్సరములుగా గణింపబడును. ఈ లెక్కను అనుసరించి, ఇంకను కలియుగ సంధ్యాకాలము 30,900 సౌరసంవత్సరములు గడుపవలసి యున్నవి.

1) శ్రీమద్భాగవతము నందు 8వ స్కంధమున మొదటి 5వ, 13వ అధ్యాయముల యందు వీరి వర్ణనము విస్తృతముగా గలదు. వేర్వేఱు పురాణముల యందు వీరి పేర్లు వేర్వేఱుగా నున్నవి. ఇచట వీరి పేర్లు శ్రీమద్భాగవతముననుసరించి ఈయబడినవి.

అధ్యాయమున నేనే క్రతువును, యజ్ఞమును (9/16) మొదలగు వాక్యములద్వారా వివిధ పదార్థములను, భావములను, దేవతాదులను వర్ణించెను. వీటన్నింటిని తెల్పునదియే 'ఏతామ్' అను విశేషణముతో గూడిన 'విభూతిమ్' అను పదము.

భగవానుని శక్తి అలౌకికమైనది. దానిని దేవతలు, మహర్షులును పూర్తిగా తెలియజాలరు (10/2,3) సాత్త్విక, రాజస, తామస భావములకు అభిన్నుడై నిమిత్తకారణము, ఉపాదాన కారణము తానే అయినప్పటికిని భగవంతుడు సర్వదా వాటినుండి వేరుగనే ఉండును. కనుక 'ఆ భావములు భగవానునిలో లేవు. అతడును వాటిలో లేడు. (7/12). అని చెప్పబడినది.

నవమాధ్యాయమునందలి 5వ శ్లోకములో తెల్పబడిన 'ఐశ్వర్య యోగమ్' అను అద్భుతశక్తిని (ప్రభావమును) తెల్పునదియే 'యోగమ్' అనుపదము. ఈ శక్తి ద్వారా సంపూర్ణ జగత్తు యొక్క ఉత్పత్తి స్థితి సంహారాది కర్మలనన్నింటిని చేయును, ఆ జగత్తును భగవానుడు నియమప్రకారము నడిపించును. ఈ శక్తి కారణముననే భగవానుడు సమస్త లోకములకును మహేశ్వరుడుగా, సమస్త ప్రాణులకును సుహృదునిగా, యజ్ఞాదులకు భోక్తగా, సర్వాధారుడుగా, సర్వశక్తిమంతుడుగా వాసిగాంచెను. భగవంతుడు సమస్త జగత్తును తన ఒక యంశయందే ధరించుటకు ఈ శక్తియే కారణము (10/42) - ప్రతి యుగమునందును తన ఇచ్ఛానుసారము వేర్వేరు కార్యములను నిర్వర్తించుటకై అనేక రూపములు ధరించుటకును, మరియు అన్ని కార్యములను చేయుచును ఆ కర్మల చేతగాని, జగత్తుచేతగాని, జన్మాదివికారములచేత గాని లిప్తుడు కాకుండ ఉండుటకును ఈ యోగశక్తియే కారణము.

సమస్త జగత్తు భగవంతునిచేతనే సృష్టింపబడిన దనియు, అన్నియు అతనియొక్క ఒక అంశయందే స్థితములై యున్నవనియు, జగత్తునందు శక్తి సంపన్నములైన వస్తువులన్నియును అతని శక్తి విశేషములే అనియు తెలిసికొనుట భగవంతుని విభూతి యోగతత్త్వములను ఎరుంగుట యగును. అట్లెరుంగుటవలన సాధకుడు సమస్త జగత్తు భగవంతుని విభూతియని, అనగా అతని స్వరూపమేయని తెలిసికొనును. సమస్త జగత్తునకు భగవంతుడే కర్త, హర్త, సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు, సర్వాధారుడు, పరమదయాళువు, సర్వాంతర్యామి, సర్వసుహృదుడు-అని యెరుంగుటయును, ఆయన విభూతి యోగతత్త్వమును తెలిసికొనుట యగును.

ప్రశ్న - 'అవికంపేన' అను విశేషణముతో పాటు 'యోగేన' అను పదము దేనిని తెల్పును? మరియు దానితో యుక్తుడగుట యనగానేమి?

సమా - ఇచట 'అవికంపేన' అను విశేషణముతో గూడిన 'యోగేన' అను పదము నిశ్చల భక్తియోగమును సూచించును. దీనినే భగవానుడు

'అనన్యభక్తి' (11/55) అవ్యభిచారిణీ భక్తి (13/10) అవ్యభిచారి భక్తియోగము (14/26) అనియును పేర్కొనెను. 7వ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున దీనినే 'యోగము' అని పేర్కొనెను. 9వ అధ్యాయమునందలి 13, 14, 34 శ్లోకములయందును, ఈ అధ్యాయమున 9వ శ్లోకము నందును ఈ భక్తియోగ స్వరూపమునే వర్ణించెను. దానిలో సంలగ్నమైయుండుటయే దానితో యుక్తుడగుట యగును.

**సంబంధము** - భగవంతుని ప్రభావ, విభూతులను ఎఱుంగుటవలన కలుగు ఫలము నిశ్చలమైన భక్తియోగ ప్రాప్తియని తెల్పబడినది. ఇప్పుడు ఆ భక్తియోగప్రాప్తి క్రమమును రెండు శ్లోకములలో పేర్కొనుచున్నాడు-

**అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।**
**ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహమ్ | = నేనే | మత్తః | = నావలననే | భావసమన్వితాః | = భక్తిశ్రద్ధలు గల్గిన |
| సర్వస్య | = సమస్త జగత్తుయొక్క | సర్వమ్ | = జగత్తంతయు | బుధాః | = బుద్ధిమంతులైన భక్తులు |
| ప్రభవః | = ఉత్పత్తికి మూల కారణమును | ప్రవర్తతే | = నడచుచున్నది | మామ్ | = నన్నే |
| | | ఇతి, మత్వా | = అని, తెలిసికొని | భజంతే | = నిరంతరము సేవింతురు. |

ఈ సమస్తజగత్తుయొక్క ఉత్పత్తికి వాసుదేవుడనైన నేనే మూలకారణము. నావలననే ఈ జగత్తంతయు నడుచుచున్నది . ఈ విషయమును బాగుగా ఎఱింగిన జ్ఞానులైన భక్తులు భక్తిశ్రద్ధలతో నిరంతరము నన్నే సేవింతురు. **(8)**

ప్రశ్న - 'సమస్త జగదుత్పత్తికిని భగవానుడే మూలకారణము' అని భావించుట యనగానేమి?

సమా - సమస్త జగత్తు భగవంతునినుండియే ఉత్పత్తి అగుచున్నది. కనుక భగవానుడే జగత్తునకు ఉపాదానకారణము, నిమిత్తకారణము గూడ. అందువలన భగవంతుని సర్వోత్తముడని ఎరుంగుటయే సమస్త జగదుత్పత్తికిని భగవంతుడే మూలకారణమని ఎరుంగుటయగును.

ప్రశ్న - 'భగవంతుని వలననే జగత్తంతయు నడుచుచున్నది' అని యనుటలో విశేషమేమి?

సమా - భగవంతుని యోగశక్తిద్వారానే ఈ సృష్టి చక్రము తిరుగుచున్నది. అతని శాసన ప్రభావము వలననే సూర్యుడు, చంద్రుడు, తారకలు, భూమి, మున్నగునవి యన్నియును నియమ పూర్వకముగా తిరుగుచున్నవి. ఆయన శాసనమువలననే సమస్త ప్రాణులును తమతమ కర్మానుసారము ఉచ్చనీచ యోనులలో జన్మించి, తమతమ కర్మల ఫలములను అనుభవించుచున్నారు. ఈ విధముగా భగవానుడే జగన్నియంత, ప్రవర్తకుడు అని భావించుటయే భగవంతునివలననే ఈ జగత్తంతయు నడుచుచున్నది అని భావించుట యగును.

ప్రశ్న - 'భావసమన్వితాః' అను విశేషణముతో పాటు ప్రయుక్తమైన 'బుధాః' అను పదము ఎట్టి భక్తులను సూచించును.

సమా - భగవంతునియందు మిక్కిలి నిశ్చయమైన భక్తిశ్రద్ధలు గలవారును, భగవంతుని గుణప్రభావములను పరమ విశ్వాసముతో ఎరింగినవారును అయినట్టి వివేక వంతులైన భక్తులను తెల్పునదియే-'భావసమన్వితాః' అను విశేషణముతోపాటు ప్రయుక్తయైన 'బుధాః' అను పదము.

ప్రశ్న - పై విధముగా తెలిసికొని భగవంతుని భజించుట యనగానేమి?

సమా - సమస్త జగత్తునకు భగవంతుని కర్తగను, హర్తగను, ప్రవర్తకునిగను, ఎరింగి, రాబోవు శ్లోకమున చెప్పబడు రీతిగా మిక్కిలి భక్తిశ్రద్ధలతో మనోబుద్ధీంద్రియముల ద్వారా నిరంతరము భగవంతుని స్మరణము, సేవనములను ఆచరించుటయే భగవంతుని భజించుట యగును.

## మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।
## కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ 9 ॥

మచ్చిత్తాః = నిరంతరము నాయందే చిత్తములను నిల్పిన వారును

మద్గత ప్రాణాః = తమజీవితములను నాకే అంకితమొనర్చిన వారును, అగు భక్తులు

పరస్పరమ్, బోధయంతః = నామహత్త్వమును గూర్చి పరస్పరము తెలుపుకొనుచు

చ = అట్లే, (నాగుణ ప్రభావములను గూర్చి)

కథయంతః, చ = కథలు కథలుగా చెప్పి కొనువారై

నిత్యమ్ = సంతతము

తుష్యంతి = సంతుష్టులగుదురు

చ = మఱియు

మామ్, రమంతి = నాయందే ఆనందించు చుందురు.

నా భక్తులు నాయందే తమ మనస్సులను లగ్నమొనర్తురు. తమ ప్రాణములను, తమ కర్మలన్నింటిని, తమ సర్వస్వమును నాకే అంకితమొనర్తురు. వారు పరస్పరచర్చలద్వారా నా మహత్త్వమును గూర్చి ఒకరికొకరు తెలుపుకొనుచు, కథలు కథలుగా చెప్పికొనుచు, నిరంతరము సంతుష్టులగుచుందురు. మఱియు వారు సంతతము నాయందే రమించుచుందురు. **(9)**

ప్రశ్న - 'మచ్చిత్తాః' అనగానేమి?

సమా - భగవంతునే తమ పరమప్రేమాస్పదునిగా, పరమ సుహృదునిగా, పరమ-ఆత్మీయునిగా, పరమగతిగా, పరమప్రియునిగా భావించి, తమ చిత్తములను అనన్య భావముతో భగవంతుని యందే లగ్నమొనర్చువారిని 'మచ్చిత్తాః' అనియందురు. (8/14, 9/22) వారికి భగవంతునియందు తప్ప మరి యే వస్తువునందును ప్రీతిగాని, ఆసక్తిగాని , రమణీయబుద్ధిగాని ఉండవు. వారు సర్వదా భగవంతుని నామగుణప్రభావ లీలలను, ఆయన స్వరూపమును, చింతన చేయుచు ఉందురు. వారు శాస్త్రోక్తముగా కర్మలను ఆచరించుచునే లేచినను, కూర్చున్నను, నిద్రించినను, మేల్కొన్నను, నడిచినను, తిరిగినను, అన్నపానాదులను స్వీకరించుచున్నను, లౌకిక వ్యవహారకాలము నందును, ధ్యానకాలమునందును గూడ క్షణమాత్రమైనను భగవంతుని విస్మరింపరు.

ఇట్లు నిత్యము నిరంతరము చింతనచేయు భక్తులను గూర్చియే భగవానుడు 'మచ్చిత్తాః' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'మద్గతప్రాణాః' అనగానేమి?

సమా - పరమభక్తులు తమ జీవితములను భగవంతునికే అర్పింతురు. ఆయనను ఉద్దేశించియే సమస్తకర్మలను ఆచరింతురు. క్షణమాత్రమైనను ఆయన వియోగమును ఓర్చుకొనలేరు. ఆయన కొరకే తమ ప్రాణములను నిల్పుకొందురు. తినుట, త్రాగుట, నడచుట, తిరుగుట, నిద్రించుట, మేల్కొనుట మొదలగు చేష్టలన్నింటియందును తమ కొరకై ఎట్టి ప్రయోజనములను ఆపేంపక భగవంతునకే అర్పణ చేయుదురు. అట్టి వారిని గూర్చియే భగవానుడు 'మద్గతప్రాణాః' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'పరస్పరం బోధయంతః' అని యనగానేమి?

సమా - భగవంతుని యందు భక్తిశ్రద్ధలుగల పరమభక్తులు తమతమ అనుభవములను గురించి, భగవంతుని గుణప్రభావ లీలాతత్త్వ మాహాత్మ్యములను, రహస్యములను, అనేక విధములైన యుక్తి ప్రయుక్తులతో, కథలు కథలుగా పరస్పరము చెప్పికొనుచుందురు. భగవంతుని గూర్చి పరస్పరము వివరించుకొనుట యనగా ఇదియే.

ప్రశ్న - భగవంతుని గాథలను భాషించుకొనుట యనగానేమి?

సమా - భక్తి శ్రద్ధలతో భగవానుని నామ, గుణ, ప్రభావలీలలను స్వరూపమును కీర్తించుట, గానముచేయుట, ఆయన గాథలను వ్యాఖ్యానాదుల ద్వారా ప్రజలలో ప్రచారముచేయుట, ఆయనను స్తుతించుట మొదలగువి యన్నియు భగవంతుని గాథలను 'భాషించుకొనుట' యగును.

ప్రశ్న - పై విధముగా అన్ని క్రియలను ఆచరించుచు నిత్యము సంతుష్టులై యుండుట యనగా నేమి?

సమా - సమస్త క్రియలను చేయుచు నిరంతరము పరమానందము ననుభవించుటయే 'నిత్యము సంతుష్టులగుట' యగును - ఇట్లు సంతుష్టులైన భక్తులు శాంతి, ఆనందము, సంతోషములను అనుభవింతురు. భగవంతుని నామగుణ ప్రభావలీలలు, స్వరూపము మొదలగువాని శ్రవణ, మనన, కీర్తనలయందును, పఠన పాఠనాదులయందును వీరు పరమానందము ననుభవింతురు. ప్రాపంచిక వస్తువులద్వారా వీరికి ఆనందముగాని, సంతోషముగాని ఏ మాత్రము కలుగదు.

ప్రశ్న - పై విధముగ అన్ని క్రియలను ఆచరించుచు భగవంతుని యందే నిరంతరము రమించుట యనగా నేమి?

సమా - భగవంతుని నామగుణ ప్రభావలీలా స్వరూపతత్త్వములను, రహస్యములను యథాయోగ్యముగ శ్రవణ, మనన, కీర్తనాదులను జేయుట, ఆయన సంకల్పములను, ఆజ్ఞలను, సంకేతములను అనుసరించి కేవలము ఆయనయందలి భక్తితోడనే ప్రతికార్యమును చేయుట, మానసికముగా ఆయన సర్వదా ప్రత్యక్షముగా తనయొద్దనే ఉన్నట్లు భావించి, నిరంతరము ప్రేమపూర్వకముగా ఆయన దర్శనస్పర్శనాదులను, ఆయనతో సంభాషణములను నెరపుటయే భగవంతునియందు అనుక్షణము రమించుట యగును.

*సంబంధము - పై విధముగా భజించు భక్తుల యెడ భగవంతుడు ఎట్లు వ్యవహరించును? అను విషయమును ఒక రెండు శ్లోకములలో వివరించుచున్నాడు-*

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సతత యుక్తానామ్ | = నిరంతరము నా ధ్యానమునందే నిమగ్నులైనవారును | | వారును-అగు | మామ్ | = నన్ను |
| | | తేషామ్ | = అట్టి నా భక్తులకు | ఉపయాంతి | = చేరుదురో |
| | | యేన | = ఏబుద్ధియోగము ద్వారా | తమ్, బుద్ధి యోగమ్ | = అట్టి తత్త్వజ్ఞాన రూపయోగమును |
| ప్రీతిపూర్వకమ్ భజతామ్ | = ప్రీతితో నన్నే భజించు | తే | = వారు | దదామి | = ప్రసాదింతును |

అట్లు నిరంతరము ధ్యానాదులద్వారా నాయందే లగ్నమనస్కులై భక్తిశ్రద్ధలతో నన్నే భజించువారికి నేను బుద్ధియోగమును అనగా తత్త్వజ్ఞానరూపయోగమును ప్రసాదించెదను. దానిద్వారా వారు నన్నే పొందుదురు. **(10)**

ప్రశ్న - 'తేషామ్' అను పదము ఎవరిని తెలుపును?

సమా - పూర్వ శ్లోకమునందు 'బుధాః' 'మచ్చిత్తాః' అనుపదముల ద్వారా పేర్కొనబడిన నిష్కామ పరమభక్తులను గూర్చియే 'తేషాం' అను పదము తెలుపును.

ప్రశ్న - 'సతత యుక్తానామ్' అను పదమున కర్థమేమి?

సమా - పూర్వ శ్లోకమునందు 'మచ్చిత్తాః' 'మద్గత ప్రాణాః' 'పరస్పరం మాం బోధయంతః' కథయంతః' అను పదముల ద్వారా వర్ణింపబడిన వారే 'సతతయుక్తానామ్' అను పదముచే తెల్పబడుదురు.

ప్రశ్న - 'ప్రీతిపూర్వకం భజతామ్' అను పదములు ఎవరిని తెలుపును?

సమా - పూర్వశ్లోకమునందు 'నిత్యం తుష్యంతి చ రమంతి చ' అను వాక్యమునందు తెలుపబడిన విషయమునే 'ప్రీతిపూర్వకం భజతామ్' అను పదముల ద్వారా వర్ణించుట జరిగినది. పూర్వశ్లోకమున భగవానుడు పేర్కొనిన భక్తులు భోగేచ్ఛతో భగవత్సేవచేయువారుకారు. వారు ఎట్టి ఫలమును ఆసింపక నిష్కామ భావముతో ఆ శ్లోకమున చెప్పబడినరీతిగా భగవానుని నిరంతరము భజించెదరు.[1]

ప్రశ్న - ఇట్టి భక్తులకు భగవానుడు ప్రసాదించు బుద్ధియోగ మెట్టిది? దాని ద్వారా భగవంతుని పొందుట యనగానేమి?

సమా - భక్తుల అంతఃకరణములయందు భగవానుడు తన ప్రభావ మహత్త్వాది రహస్యములతో గూడిన నిర్గుణ నిరాకార తత్త్వమును గ్రహించుశక్తిని, అట్లే తవలీలా రహస్య మహిమా ప్రభావాదులతో గూడిన సగుణనిరాకార సాకారతత్త్వమును, యథార్థముగా గ్రహించు శక్తిని నింపును. దీనినే భక్తులకు భగవానుడు బుద్ధియోగమును ప్రదానము చేయుట యందురు. దీనినే భగవానుడు 7,9 అధ్యాయముల యందు 'విజ్ఞాన సహిత జ్ఞానము' అని పేర్కొనెను. ఈ బుద్ధియోగము ద్వారా భగవత్సాక్షాత్కారమును పొందుటనే భగవంతుని పొందుట యందురు.

**తేషామేవానుకంపార్థమ్ అహమజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11 ॥**

1) న నాకపృష్ఠం న చ పారమేష్ఠ్యం న సార్వభౌమం న రసాధిపత్యమ్ ।
న యోగసిద్ధిరపునర్భవం వా సమంజస త్వా విరహయ్య కాంక్షే ॥ (శ్రీ మద్భాగవతం - 6/11/25)

'ఓ సర్వసద్గుణ యుక్తా! నిన్ను విడిచి స్వర్గమునేగాదు, దానికిపైనున్న ఉన్నతోన్నత లోకములను గూడ కోరను, బ్రహ్మపదవిని గూడ కాంక్షింపను. సమస్త పృథ్వియొక్క ఆధిపత్యమునకుగాని, పాతాళలోకముపై అధికారమునకు గాని అపేక్ష పడను. యోగ సిద్ధినిగాని, కడకు మోక్షమును కూడ ఆసింపను'.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తేషామ్,- అనుకంపార్థమ్ | = వారిని అనుగ్రహించుటకొఱకై | అహమ్, ఏవ | = నేనే | జ్ఞానదీపేన | = తత్త్వజ్ఞానరూప దీపము ద్వారా |
| ఆత్మభావస్థః | = వారి అంతఃకరణములయందు స్థితుడనైయున్న | అజ్ఞానజమ్, తమః | = (వారి) అజ్ఞానజనితమైన అంధకారమును | నాశయామి | = నశింప జేయుదును |
| | | భాస్వతా | = ప్రకాశించుచున్న | | |

**ఓ అర్జునా! వారి యంతఃకరణములయందు స్థితుడనైయున్న నేను వారిని అనుగ్రహించుటకై తేజోమయమైన తత్త్వజ్ఞానరూప దీపమును (జ్యోతిని) వెలిగించి, వారి అజ్ఞానాంధకారమును పారద్రోలెదను. (11)**

ప్రశ్న - "ఆ భక్తులను అనుగ్రహించుటకై నేను స్వయముగా వారి అజ్ఞానాంధకారమును పారద్రోలెదను' అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - తన భక్తులను అనుగ్రహించుటకు భగవానుడు స్వయముగా వారి అజ్ఞానజనితమైన అంధకారమును నశింపజేయును. దీనికి మరొక సాధనమేదియును లేదు.

ప్రశ్న - 'అజ్ఞానజమ్' అను విశేషణముతో పాటు ప్రయుక్తమైన 'తమః' అను పదము దేనిని సూచించును? 'వారి యంతఃకరణములయందు స్థితుడనై యున్న నేను దానిని పారద్రోలెదను' అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - అనాదిసిద్ధమైన అజ్ఞానమువలన ఉత్పన్నమైన ఆవరణశక్తి కారణమున మనుష్యుడు భగవానుని గుణప్రభావ స్వరూపములను యథార్థముగ తెలిసికొనజాలడు. ఈ ఆవరణ శక్తినే ఇచట 'అజ్ఞానజం' అను విశేషణముతో గూడిన 'తమః' అను పదము తెలుపును. 'భక్తుల అంతఃకరణములయందు స్థితుడనైన నేను దానిని పారద్రోలెదను' అని భగవంతుడు తెల్పుట వలన భక్తియొక్క మహిమయును' ఆయనలో ఎట్టి భేదభావమూ లేకుండుటయును వెల్లడి యగుచున్నది. భగవంతుడు అందరి హృదయములయందును అంతర్యామిగా సర్వదా స్థితుడైయుండును. అయినను కొందరు జనులా విషయమును విశ్వసింపని కారణమున వారి అజ్ఞానాంధకారము తొలగిపోదు. కాని భగవంతుని తమ అంతర్యామిగా ఎరింగిన పరమభక్తులు పూర్వశ్లోకములో చెప్పిన రీతిగా నిరంతరము భగవంతునే భజించుచుండుట వలన వారి అజ్ఞాన జనిత- అంధకారమును సహజముగ ఆయన పారద్రోలును.

ప్రశ్న - 'భాస్వతా' అను విశేషణముతోపాటు ప్రయుక్తమైన 'జ్ఞానదీపేన' అను పదము దేనిని తెలుపును? దాని ద్వారా అజ్ఞాన జనితాంధకారమును నాశము చేయుట యనగానేమి?

సమా - పూర్వ శ్లోకమున పేర్కొనబడిన బుద్ధియోగము 7, 9 అధ్యాయములయందు విజ్ఞాన సహిత జ్ఞానము పేరుతో వ్యవహరింపబడినది. ఈ బోధ ద్వారానే భగవంతుని ప్రభావ మహిమాదులతో గూడిన నిర్గుణ నిరాకార తత్త్వమును, అట్లే ఆయన లీలా రహస్య మహత్త్వ ప్రభావాది సహితమైన సగుణ నిరాకార సాకార తత్త్వరూపమును భక్తుడు తెలిసికొనగలుగును. అట్టి దివ్యబోధను సూచించునదియే 'భాస్వతా' అను విశేషణముతో ప్రయుక్తమైన 'జ్ఞానదీపేన' అను పదము. దాని ద్వారా భక్తుని అంతఃకరణము నందలి భగవత్తత్త్వజ్ఞాన ప్రతిబంధకమైన ఆవరణ దోషమును సర్వథా రూపుమాపుటయే అజ్ఞానజనితాంధకారమును నశింప జేయుట యగును.

ప్రశ్న - ఈ జ్ఞాన దీపము (బుద్ధియోగము) ద్వారా మొదట అజ్ఞానము నాశమగునా?లేక భగవత్ప్రాప్తి కలుగునా?

సమా - జ్ఞానదీపము ద్వారా అజ్ఞానము తొలగిపోవుటయు భగవత్ప్రాప్తి కలుగుటయు, రెండును ఏకకాలమునందే సంభవించినను ఏదిముందు? ఏది వెనుక? అని పూర్వాపరవిభాగము చేసినచో మొదట అజ్ఞానము తొలగుననియు, పిమ్మట అదే క్షణమున భగవత్ప్రాప్తియు సిద్ధించుననియు గ్రహింపవలెను.

*సంబంధము - 7వ అధ్యాయమున మొదటి శ్లోకమున తన స్వరూప జ్ఞానమును సమగ్రముగా తెలిపెదననియు, దానిని వినుమనియు భగవానుడు అర్జునుని ఆదేశించెను. 2వ శ్లోకమున విజ్ఞాన సహిత జ్ఞానమును పూర్తిగా తెలుపుదునని మాటిచ్చి, ఆ అధ్యాయాంతము వరకును దానిని వర్ణించెను. 8వ అధ్యాయమున అర్జునుని 7 ప్రశ్నలకును సమాధానమును ఇచ్చుచు ఆ విషయమునే స్పష్టీకరించెను. కాని అచ్చట తెలిపిన రీతి వేరుగా ఉండుట వలన నవమాధ్యాయమున ఆ విజ్ఞాన*

సహిత జ్ఞానమునకు సంబంధించిన విషయమునే అంగప్రత్యంగసహితముగ (సాంగోపాంగముగా) సమగ్రముగా వివరించెను. తదనంతరము ఆ విషయమునే మరియొక విధముగా స్పష్టీకరించుటకు 10వ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున దానినే మరల తెలిపెదనని ప్రతిజ్ఞ చేసెను. తరువాత ఐదు శ్లోకములలో తన యోగశక్తి విభూతులను వర్ణించి, 7వ శ్లోకమున వాటిని తెలిసికొనుట వలన కలుగు ఫలము నిశ్చలభక్తి యోగప్రాప్తియని తెలిపెను. పిమ్మట 8,9 శ్లోకములయందు భక్తియోగము ద్వారా భగవద్భజనయందు నిమగ్నులైన భక్తుల భావములను ఆచరణములను వర్ణించెను. 10వ, 11వ శ్లోకములయందు దాని ఫలము అజ్ఞానజనితాంధకార నాశము, భగవత్ప్రాప్తి కలిగించు బుద్ధియోగమును పొందుటయని తెల్పి, ఆ విషయమును ముగించెను. భగవద్విభూతి యోగతత్త్వ జ్ఞానము భగవత్ప్రాప్తికి మిక్కిలి సహాయకమని గ్రహించి, 7 శ్లోకములలో భగవంతుని స్తుతించుచు, ఆయన యోగశక్తిని విభూతులను విస్తారముగా వర్ణింపుమని అర్జునుడు భగవానుని ప్రార్థించుచున్నాడు-

**అర్జున ఉవాచ**

**పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।**
**పురుషం శాశ్వతం దివ్యమ్ ఆదిదేవమజం విభుమ్ ॥ 12 ॥**
**ఆహుస్త్వామ్ ఋషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।**
**అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ 13 ॥**

భవాన్ = పూజ్యుడవైననీవు
పరమ్, బ్రహ్మ = పరబ్రహ్మవు
పరమ్, ధామ = పరంధాముడవు
పరమమ్, పవిత్రమ్ = పరమపవిత్రుడవు
సర్వే, ఋషయః = మహర్షులందరును
త్వామ్ = నిన్ను
శాశ్వతమ్ = సనాతనుడవనియు
దివ్యమ్, పురుషమ్ = దివ్యపురుషుడవనియు
ఆదిదేవమ్ = దేవాదిదేవుడవనియు
అజమ్ = జన్మరహితుడవనియు
విభుమ్ = సర్వవ్యాపివనియు
ఆహుః = తెలిపియున్నారు
తథా = అట్లే
దేవర్షిః, నారదః = దేవర్షియైన నారదుడును
అసితః = అసితుడును
దేవలః = దేవలుడును
వ్యాసః, చ = వ్యాసమహర్షియును (తెలిపిరి)
స్వయమ్, ఏవ = నీవేస్వయముగా
మే = నాకు (ఆ విధముగనే)
బ్రవీషి = తెలుపుచున్నావు.

అర్జునుడు పలికెను - నీవు పరబ్రహ్మవు. పరంధాముడవు. పరమపవిత్రుడవు. మహర్షులు నిన్ను సనాతనుడవనియు, దివ్యపురుషుడవనియు, దేవదేవుడవనియు, జన్మరహితుడవనియు, సర్వవ్యాపివనియు ప్రస్తుతింతురు. దేవర్షి నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసమహర్షియు, నుతింతురు. నీవును నాకు ఆ విధముగనే తెలుపుచున్నావు. **(12-13)**

ప్రశ్న - "నీవు పరమబ్రహ్మవు, పరంధాముడవు, పరమ పవిత్రుడవు" అను అర్జునుని వచనముల యందలి వైశిష్ట్యమేమి?

సమా - 'పరంబ్రహ్మ' నామముతో నొప్పునిర్గుణ పరమాత్మ ఆ భగవత్స్వరూపమే. భగవంతుని యొక్క నిత్యధామము గూడ సచ్చిదానందమయము, దివ్యము మరియు భగవంతునికంటె వేరుకానిదియు అగుట వలన అదియును భగవత్స్వరూపమే. భగవంతుని నామగుణ ప్రభావలీలలు, స్వరూపములు పరమ పవిత్రములు. వాటి శ్రవణ, మనన, కీర్తనాదులు అందరిని సర్వథా పరమ పవిత్రులుగా చేయును. కనుక ఆయన పరమపవిత్రుడు.

ప్రశ్న - 'సర్వే' అను విశేషణముతోపాటు 'ఋషయః' అను పదము ఏయే ఋషులను తెలుపును? వారు నిన్ను సనాతన దివ్య పురుషుడవనియు, ఆది దేవుడవనియు, విభుడవనియు, జన్మరహితుడవనియు పేర్కొందురు. ఇట్లు వచించుటలోని ఆంతర్యమేమి?

సమా - 'సర్వే' అను విశేషణముతోపాటు 'ఋషయః' అను పదము ఇచట మార్కండేయ, అంగిరాది సమస్త మహర్షులను తెల్పును.[1] అర్జునుడు తాను చెప్పిన విషయమునకు ఋషుల వచనములను ప్రమాణములుగా చూపుచున్నాడు. వారు భగవానుని సనాతనుడనియు (అనగా-నిత్యము ఒకే స్థితిలో నుండువాడును, క్షయవినాశ రహితుడును, దివ్యుడును అనియు), స్వయం ప్రకాశము గలవాడును, జ్ఞాన స్వరూపుడును, అందరికిని ఆద్యుడైనవాడును, జన్మరహితుడును, ఉత్పత్తి వికారములు లేని వాడును, సర్వవ్యాపియు అనియు వర్ణించిరి. కనుక భగవానుడు పరబ్రహ్మము, పరమధాముడు, పరమ పవిత్రుడు అని యనుటలో ఎట్టి సందేహమూ లేదు.[2]

ప్రశ్న - దేవర్షి లక్షణము లెవ్వి? ఆ దేవర్షులు ఎవరు?

సమా - దేవర్షి లక్షణములు -

దేవలోకప్రతిష్ఠాశ్చ, జ్ఞేయా దేవర్షయః శుభాః ।
దేవర్షయస్తథాన్యే చ, తేషాం వక్ష్యామి లక్షణమ్ ॥
భూతభవ్యభవద్ జ్ఞానం సత్యాభివ్యాహృతం తథా ।
సంబుద్ధాస్తుస్వయం యే తు సంబద్ధా యే చ వైస్వయమ్ ॥
తపసేహ ప్రసిద్ధా యే గర్భే యైశ్చ ప్రణోదితమ్ ।
మంత్రవ్యాహారిణో యే చ ఐశ్వర్యాత్ సర్వగాశ్చ యే ।
ఇత్యేతే ఋషిభిర్యుక్తా దేవద్విజనృపాస్తు యే ॥
(వాయుపురాణం - 61/88,90,91,92)

దేవలోకమునందు నివసించు ఋషులు శుభదేవర్షులు. వీరివంటివారే ఇతర దేవర్షులును గలరు. వారి లక్షణములు - వారు భూత భవిష్యద్వర్తమాన జ్ఞానమును కలిగియుందురు. అన్ని విధములుగను సత్యమునే పలుకుచుందురు. వీరుగాక స్వయముగా జ్ఞానమును పొందినవారు, కర్మబద్ధులుగాక తమ ఇచ్ఛమేరకే ప్రాపంచిక సంబంధములను కలిగి యుండువారు. తపస్సంపన్నులుగా ఖ్యాతికెక్కిన వారు. గర్భస్థ శిశువులకును (ప్రహ్లాదాదులకువలె) ఉపదేశములను చేయువారు. మంత్రప్రవక్తలు. తమ తపస్సిద్ధి బలముతో సర్వలోకముల యందును నిరాటంకముగా సంచరించుచుండువారు.

1) ఋషీ త్యేష గతౌధాతుః శ్రుతౌ సత్యే తపస్యథ । ఏతత్ సన్నియతం యస్మిన్ బ్రహ్మణా స ఋషిః స్మృతః ॥
గత్యర్థాదృష తేర్ధాతో: నామనిర్వృత్తి రాదితః । యస్మాదేష స్వయం భూతః తస్మాచ్చ ఋషి తాస్మృతా ॥
(వాయుపురాణం, 59/79, 81)

'ఋష్' అను ధాతువు గమనము (జ్ఞానము) శ్రవణము, సత్యము, తపస్సు అను అర్థములలో ప్రయుక్తమగును. ఇవి అన్నియును నిశ్చిత రూపములో నుండు వానిని 'ఋషి' అని బ్రహ్మ పేర్కొనెను. గత్యర్థకమైన 'ఋష్' అను ధాతువునుండియే ఋషి అను శబ్దము నిష్పన్నమైనది. ఆదికాలమున ఈ ఋషి వర్గమంతయును స్వయముగా ఉత్పన్నమాయెను. కనుక ఈ వర్గమునకు ఋషి వర్గము అని పేరు రూఢియయ్యెను.

2) పరమ సత్యవాదియు, ధర్మమూర్తియు ఐన భీష్మపితామహుడు శ్రీ కృష్ణ భగవానుని ప్రభావమును గూర్చి దుర్యోధనునకు తెల్పుచు ఇట్లనెను - "వాసుదేవ భగవానుడు దేవదేవుడు, సర్వశ్రేష్ఠుడు. ఈయనయే ధర్మము, ధర్మజ్ఞుడు, వరదుడు, సర్వమనోరథములను ఈడేర్చువాడు. ఇతడే కర్త, కర్మ, స్వయంప్రభువు. భూతభవిష్యద్వర్తమానములను, సంధ్యలను, దిశలను, ఆకాశమును, అన్ని నియమములను ఈ జనార్దనుడే సృజించెను. మహాత్ముడును, శాశ్వతుడును ఐన ఈ ప్రభువే ఋషులను, తపస్సులను, జగత్సృష్టిని జేయు ప్రజాపతిని సృష్టించెను. ప్రాణులందఱికిని అగ్రజుడైన సంకర్షణుని గూడ ఇతడే సృష్టించెను. లోకములు ఆదిశేషుని 'అనంతుడు' అని పిలుచును. పర్వతములతో సహా పృథ్విని ధరించు ఆదిశేషుడు కూడ ఈయననుండియే ఉత్పన్నుడాయెను. ఈయనయే వరాహ, నృసింహ, వామనాది - అవతారములను దాల్చెను. అందఱికిని తల్లియు, తండ్రియు ఇతడే. ఈయన కంటె శ్రేష్ఠుడు మఱియొకడు లేడు. ఇతడే కేశవుడు, పరమతేజః స్వరూపుడు. అందఱికిని పితామహుడు. మునులు ఈయనను హృషీకేశుడు అని పిల్చెదరు. ఇతడే ఆచార్యుడు, పితృదేవుడు, గురువు. ఈ శ్రీ కృష్ణుని అనుగ్రహమునకు పాత్రుడైన వానికి అక్షయలోక ప్రాప్తి కలుగును. భగవానుడైన ఈ కేశవుని భయగ్రస్తుడు శరణుపొంది, ఈయనను స్తుతించినచో ఆతడు భయవిముక్తుడై పరమసుఖమును పొందును. " శ్రీ కృష్ణ భగవానుని శరణు పొందినవారు మోహపాశములలో చిక్కుకొనరు. మహాభయమునకు (సంకటమునకు) గురియైనవారిని గూడ భగవానుడైన జనార్దనుడు అనుక్షణమూ కాపాడుచుండును."

యే చ కృష్ణం ప్రపద్యంతే తే న ముహ్యంతి మానవాః ।
భయే మహతి మగ్నాంశ్చ పాతి నిత్యం జనార్దనః ॥ (మహాభారతం - భీష్మపర్వం - 67/24)

ఋషులచే సర్వదాపరివృతులై యుండెడివారు. ఇట్టి లక్షణములుగల దేవతలు, బ్రాహ్మణులు, రాజులు గూడ 'దేవర్షులు' అనబడుదురు.

దేవర్షులు పెక్కుమంది గలరు. వారిలో ముఖ్యులైన వారు-

దేవర్షీ ధర్మపుత్రౌ తు నరనారాయణావుభౌ ।
వాలఖిల్యాః క్రతోః పుత్రాః కర్దమః పులహస్య తు ॥
పర్వతో నారదశ్చైవ కశ్యపస్యాత్మజావుభౌ ।
ఋషంతి దేవాన్ యస్మాత్తే తస్మా ద్దేవర్షయః స్మృతాః ॥
(వాయుపురాణం 61/83, 84, 85)

ధర్ముని పుత్రులైన నరనారాయణులు, క్రతుకుమారులైన వాలఖిల్యులు, పులహసుతులైన కర్దముడు, పర్వతుడు, నారదుడు, కశ్యపుని సూనులు బ్రహ్మవాదులు అయిన అసితుడు, వత్సలుడు అనువారు దేవతలను గూడ తమ అధీనములో నుంచుకొనగల్గిన వారు. కనుక వీరిని దేవర్షులు అందురు.

ప్రశ్న - దేవర్షులైన అసితుడు, నారదుడు, దేవలుడు, వ్యాసుడు అనువారు ఎవరు? అర్జునుడు ప్రత్యేకముగా వీరి పేర్లనే ప్రస్తావించుటకు కారణమేమి? శ్రీకృష్ణ భగవానుని మహిమను గూర్చి వీరు తెల్పిన విశేషములు ఏవి?

సమా - దేవర్షులైన నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు అను నలుగురును భగవత్తత్త్వమును ఎరింగినవారే. వీరు పరమభక్తులు, జ్ఞానులును.[1] వీరు తమ కాలమున

1) "నారదుడు"

నారదులు పెక్కుమంది గలరు - కాని వారిలో దేవర్షియైన నారదుడు ఒక్కడే. ఇతడు భగవంతుని మనస్సునకు ప్రతిరూపము అని ప్రసిద్ధి - ఇతడు తత్త్వజ్ఞుడు, పరమభక్తుడు, ఊర్ధ్వరేతస్కుడైన బ్రహ్మచారి, భక్తిమార్గమునకు మార్గదర్శకుడు. ఇతడు లోకమునకు మహోపకారి. ప్రహ్లాదుడు, ధ్రువుడు, అంబరీషుడు మొదలగు మహాభక్తులను భక్తిమార్గ ప్రవృత్తులనుగా జేసెను. శ్రీమద్భాగవతము, వాల్మీకి రామాయణము వంటి రెండు అమూల్య గ్రంథములును ఇతని కృపవలననే లోకమునకు లభించెను. మహాజ్ఞానియైన శుకమహర్షికి గూడ ఇతడే ఉపదేశమును కావించెను.

ఇతడు పూర్వజన్మమునందు దాసీపుత్రుడు. ఈతని తల్లి మహర్షుల కుటీరములలో ఎంగిలి పాత్రలు శుద్ధిచేయుచు ఉండెడిది. ఇతనికి 5 సంవత్సరముల వయస్సులో తల్లి అకస్మాత్తుగా మరణించెను. అప్పుడితడు అన్ని విధములైన బంధములనుండి ముక్తుడై అడవికి ఏగెను. అచ్చట ఒక చెట్టునీడను చేరి, భగవత్స్వరూపమును ధ్యానము చేయసాగెను. ధ్యానము చేయుగా చేయుగా ఇతని వృత్తులు ఏకాగ్రస్థితికి చేరెను. ఈతని హృదయమున భగవంతుడు ప్రకటితుడయ్యెను. కాని అతడు తన దివ్యాద్భుత రూపమును కొన్ని క్షణములవఱకే కన్పింపజేసి వెంటనే అంతర్ధానమయ్యెను. అపుడితడు మిక్కిలి ఆందోళనపడి మఱల మనస్సును స్థిరముగా భగవద్ధ్యానమున నిల్పెను. కాని భగవంతుని యొక్క ఆ రూపము మఱల కన్పింపలేదు. ఇంతలో ఆకాశవాణి ఇట్లు పల్కెను. "ఓ దాసీపుత్ర! ఈ జన్మయందు నీవు మఱల నన్ను దర్శింపలేవు... ఈ శరీరమును త్యజించిన పిమ్మట నా పార్షదుడనై నీవు మఱల నన్ను పొందగలవు. భగవంతుని ఈ వాక్యములు అతనికి ఎంతో అనునయించెను. మృత్యువు కొఱకై నిరీక్షించుచు ఈతడు నిస్సంగుడై తిరుగసాగెను. సమయము ఆసన్నము కాగానే తన పాంచభౌతిక శరీరమును వీడెను. కల్పాంతమునందు భగవానుని ప్రాణములలో ప్రవిష్టుడై తదుపరి కల్పమున దివ్యదేహమును ధరించి, బ్రహ్మమానస పుత్రుడై అవతరించెను. అప్పటినుండి అఖండ బ్రహ్మచర్య వ్రతమును బూని వీణ (మహతిని) వాయించుచు భగవద్గుణములను కీర్తించుచూ ఉన్నాడు.(శ్రీమద్భాగవతం-1/6)

మహాభారత సభా పర్వమున 5వ అధ్యాయమున ఈ నారదుని గూర్చి ఇట్లు చెప్పబడినది. ఇతడు "వేదోపనిషత్తుల లోతులను ఎఱిగినవాడు. దేవతలచే పూజితుడు. ఇతిహాస పురాణములను బాగుగా ఎఱింగినవాడు. కల్పాతీత విశేష విషయములను తెలిసికొనినవాడు. న్యాయధర్మ తత్త్వజ్ఞుడు. శిక్షాకల్ప వ్యాకరణ - ఆయుర్వేదాదులను ఎఱిగిన వారిలో శ్రేష్ఠుడు. పరస్పర విరుద్ధములైన వివిధ విధివాక్యములను సమన్వయ పఱచుటలో సమర్థుడు. ప్రతిభాశాలియైన వక్త. నీతివేత్త. మేధావి. స్మరణశీలుడు. జ్ఞాని. కవి. మంచి చెడులను వేర్వేఱుగా గుర్తించుటలో నిపుణుడు. వివిధ ప్రమాణముల ద్వారా వస్తు తత్త్వమును నిర్ణయించుటలో శక్తిశాలి. న్యాయవాక్యముల గుణదోషములనెఱిగినవాడు. బృహస్పతి వంటి విద్వాంసుల సందేహములను తీర్చుటలోనూ ప్రతిభామూర్తి. ధర్మార్థకామ మోక్షముల యథార్థ తత్త్వములను ఎఱింగినవాడు. సమస్త బ్రహ్మాండముల యందును, ముల్లోకముల యందును జరుగు సంఘటనమును తన యోగబలముచే దర్శింపగలవాడు. సాంఖ్యయోగ విభాగములను ఎఱిగినవాడు. దేవదానవులకు వైరాగ్యమును ఉపదేశించుటలో చతురుడు. సంధి విగ్రహతత్త్వములను తెలిసినవాడు. కర్తవ్య+అకర్తవ్యములను విభాగమొనర్చుటలో

మాన్యులుగా సత్యవాదులుగా ప్రసిద్ధికెక్కిరి. కనుక వీరిపేర్లు ప్రత్యేకముగా ప్రస్తావింపబడినవి. భగవంతుని మహిమాదికమును వీరు నిత్యము కీర్తించుచుందురు. భగవన్మహిమను లోకమున చాటుటయే వీరికి పరమకర్తవ్యము. మహాభారతమునందు గూడ వీరును, ఇతర మహర్షులును భగవన్మహిమలను కీర్తించువట్టి ప్రస్తావనలు గలవు. శ్రీకృష్ణ భగవానుని గూర్చి ఋషులలో ఎవరెవరు ఏమేమి నుడివిరో వాటిని సంక్షిప్తముగా భీష్మపర్వమునందు భీష్మపితామహుండు వర్ణించెను.[1]

---

దక్షుడు. రాజనీతికి సంబంధించిన ఆఱుగుణముల ప్రయోగ విషయములయందు కుశలుడు. సకల శాస్త్ర ప్రవీణుడు. యుద్ధవిద్యా నిపుణుడు. సంగీత విశారదుడు. భగవద్భక్తుడు. విద్యాగుణనిధి - సదాచారములకు ఆధారమైనవాడు. లోకహితకారి. సర్వత్ర సంచరింపగలవాడు" - ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములయందు ఈతని పవిత్ర గాథలు కొల్లలుగా గలవు.

❖ ❖ ❖

'అసితుడు', 'దేవలుడు'. అసిత మహర్షి కుమారుడే దేవలుడు. కూర్మ పురాణమున వీరికి సంబంధించిన వర్ణనమిట్లు గలదు.

ఏతానుత్పాద్య పుత్రాంస్తు, ప్రజాసంతాన కారణాత్ । కశ్యపః పుత్రకామస్తు, చచార సుమహత్తపః ॥
తస్యైవం తపతోఽత్యర్థం, ప్రాదుర్భూతౌ సుతావిమౌ । వత్సరశ్చాసితశ్చైవ తావుభౌ బ్రహ్మవాదినౌ ॥
అసితస్యైకపర్ణాయాం, బ్రహ్మిష్ఠః సమపద్యత । నామ్నా వై దేవలః పుత్రో యోగాచార్యో మహాతపాః ॥

(కూర్మపురాణము-19/1,2,5)

కశ్యప మహర్షి కొంతమంది పుత్రులను సంతానముగా బడసిన పిమ్మట ఇంకను పుత్రప్రాప్తికై గొప్ప తపమును ఆచరించెను. ఆ తీవ్రతపః ఫలముగా వత్సరుడు, అసితుడు అను పుత్రులు ఉదయించిరి. ఆ ఇరువురును బ్రహ్మవాదులు. (బ్రహ్మవేత్తలు, బ్రహ్మోపదేశమును చేయువారు) అసితునకు అతని ధర్మపత్నియగు ఏకపర్ణ యందు దేవలుడు జన్మించెను. అతడు మహాతపస్వి, యోగాచార్యుడు, వేదనిష్ణాతుడు, అసితుడు, దేవలుడు ఇద్దఱును ఋగ్వేద మంత్రద్రష్టలు. వీరిద్దఱు మహామహులు, అతిప్రాచీనులు. దేవలుడు శివుని అరాధించి, సిద్ధిని పొందెను. ప్రత్యూషుడు అను పేరుగల వసువునకును దేవలుడను పుత్రుడుండెను. (హరివంశము - 3/44)

❖ ❖ ❖

వేదవ్యాసుడు: శ్రీ వేదవ్యాసుడు భగవానుని అంశావతారము. ఈతడొక ద్వీపమునందు జన్మించెను. కనుక ఈయనకు ద్వైపాయనుడను పేరు గల్గెను. ఈతడు శ్యామవర్ణుడగుట వలన కృష్ణద్వైపాయనుడనియు పిలువబడెను. పరాశరమహర్షి యొక్క సుతుడితడు. తల్లి సత్యవతి. జన్మింపగనే ఇతడు తపస్సునకై వనములకేగెను. భగవత్తత్త్వమును పూర్తిగా ఎఱిగినవాడు. సాటిలేని మహాకవి. ఇతడు అగాధానంత జ్ఞానసముద్రుడు. వైదుష్యమునకు పరాకాష్ఠ. కవిత్వమునకు అవధియైన వాడు. వ్యాసుని భావములు, వాక్కులే సమస్త జగత్తునందలి జ్ఞానమునకును వెలుగుల నిచ్చునవి, ఆధారమైనవి.

శ్రీ వ్యాసభగవానుడు బ్రహ్మ సూత్రములను రచించెను. మహాభారతమువంటి అలౌకిక గ్రంథమునకు ఇతడే రచయిత. పదునెనిమిది పురాణములను, పెక్కు ఉపపురాణములను రచించెను. భారతదేశ ఇతిహాసమే దీనికి సాక్షి. ఇతడు తన జ్ఞానభండారమునుండియే లోకులకు కర్తవ్యమార్గమును ప్రసాదించుచున్నాడు.

ప్రతి ద్వాపరయుగమునందును వేదవిభాగముల నొనర్చు వ్యాసులు వేర్వేఱుగా ఉందురు. ఈ వైవస్వత మన్వంతరమునందు పరాశరపుత్రుడైన ఈ కృష్ణద్వైపాయనుడు 28వ వేదవ్యాసుడు. ఇతడు తన ప్రధాన శిష్యులైన పైలునకు ఋగ్వేదమును, వైశంపాయనునకు యజుర్వేదమును, జైమినిమునికి సామవేదమును, సుమంతునకు అథర్వ వేదమును బోధించెను. సూత జాతీయుడు, మహాబుద్ధిశాలియైన రోమహర్షణ మహామునికి ఇతిహాస పురాణములను ఉపదేశించెను.

1) దేవర్షియైన నారదుడు పలికెను.

'శ్రీకృష్ణభగవానుడు సమస్తలోకముల ఉత్పత్తికి కారకుడు. సమస్త భావజ్ఞుడు, సాధ్యులకును, సమస్త దేవతలకును మహా ప్రభువు'

మార్కండేయుని వచనములు- "శ్రీకృష్ణుడు యజ్ఞములకు యజ్ఞము, తపస్సులకు తపస్సు, భూత భవిష్యద్వర్తమాన రూపుడు."

ప్రశ్న - 'నీవుగూడ స్వయముగా చెప్పుచున్నావు' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - భగవంతుని యొక్క అనిర్వచనీయ (అనుపమ) ప్రభావమును గూర్చి కేవలము పైన పేర్కొనబడిన ఋషులేగాక ఆయనయే స్వయముగా తెల్పియుండెను. (4/6 నుండి 9 వరకు, 5/29, 7/7-12 వరకు, 9/4-11, 16-19 వరకు అట్లే 10/2,3,8 శ్లోకములు) కనుక అర్జునుడు శ్రీకృష్ణుని సాక్షాత్ పరమేశ్వరునిగా భావించుట సముచితమే.

**సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।**
**న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ 14 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కేశవ! | = ఓ కేశవా! | ఋతమ్, మన్యే | = సత్యమని తలంతును | | స్వరూపమును |
| యత్ | = దేనిని | | | దానవాః | = దానవులు |
| మామ్ | = నన్ను (నాకు) | భగవన్ | = ఓదేవా! (కృష్ణా!) | న, విదుః | = ఎఱుంగరు |
| వదసి | = చెప్పుచున్నావో | తే | = నీయొక్క | దేవాః, హి | = దేవతలును |
| ఏతత్, సర్వమ్ | = ఇదియంతయును | వ్యక్తిమ్ | = లీలామయ | న (విదుః) | = ఎఱుంగరు. |

భృగుమహర్షి పలుకులు: "శ్రీకృష్ణుడు దేవదేవుడు. అతడే శ్రీ మహావిష్ణువు."

వ్యాసుని మాటలు: "ఇతడు ఇంద్రునకు ఇంద్రత్వమును ఒసంగినవాడు. దేవతలకు పరదేవత"

అంగిరుని వాక్కులు: "సర్వప్రాణుల సృష్టికిని ఇతడే కారకుడు."

సనత్కుమారాదుల భాషణములు: "ఈయన మస్తకమునుండి ఆకాశము, భుజములనుండి పృథ్వి వ్యాపించినవి. ముల్లోకములు ఇతని ఉదరమునందు గలవు. ఇతడు సనాతన పురుషుడు. తపస్సుచే పవిత్రమైన అంతఃకరణముగల సాధకులే ఇతనిని తెలిసికొనగలరు. ఆత్మ సాక్షాత్కారమును పొందిన ఋషులు గూడ ఇతనిని పురుషోత్తమునిగా భావింతురు. యుద్ధమునందు వెన్ను చూపని ధీరులైన రాజర్షులకును ఇతడే పరమగతి." (మహాభారతము - భీష్మపర్వం - 68)

మహాభారతమునందలి అరణ్యపర్వమున 12వ అధ్యాయమున భక్తురాలైన ద్రౌపది మహర్షుల వచనములను ఇట్లు ప్రస్తావించెను. అసితుడు, దేవలుడు - ఇట్లు పలికిరి - "శ్రీ కృష్ణుడే ప్రాణులను మొట్టమొదట సృష్టించిన ప్రజాపతి. సర్వలోకములకును సృష్టికర్త."

పరశురాముని వచనములు - " ఇతడే విష్ణువు. ఇతనిని ఎవ్వరును జయింపలేరు. ఇతడే యజ్ఞము, యజ్ఞకర్త. యజ్ఞము ద్వారా ఆరాధింపదగినవాడు."

నారదుని మాటలు- 'ఇతడు సాధ్యులకును, దేవతలకును, సమస్త హితములను చేకూర్చు ప్రభువులకు ప్రభువు'.

"బాలుడు స్వేచ్ఛగా బొమ్మలతో ఆడుకొనినట్లు శ్రీకృష్ణుడును బ్రహ్మ, శివుడు, ఇంద్రాది దేవతల ద్వారా ఆడుకొనును".

ఇంతేగాక మహాభారతమునందు వ్యాస భగవానుడిట్లు పలికెను- "సౌరాష్ట్రదేశమున 'ద్వారక'యను పవిత్ర నగరము గలదు. అందు సాక్షాత్తు పురాణ పురుషోత్తముడు, భగవానుడైన మధుసూదనుడు విరాజిల్లుచుండును. అతడు సాక్షాత్తు సనాతన ధర్మస్వరూపుడు. వేదజ్ఞులైన బ్రాహ్మణులు, ఆత్మజ్ఞానులైన మహాత్ములు శ్రీకృష్ణుని మూర్తీభవించిన సనాతన ధర్మమేయని పేర్కొందురు. గోవిందుడు పవిత్రులలో పరమ పవిత్రుడు, పుణ్యాత్ములలో సర్వోత్తముడు, మంగళప్రదులలో పరమశ్రేష్ఠుడు. కమలనయనుడైన శ్రీకృష్ణ భగవానుడు ముల్లోకముల యందును దేవదేవుడు. అతడే అక్షరుడు, క్షరుడు, క్షేత్రజ్ఞుడు, పరమేశ్వరుడు, అచింత్యమూర్తి". (మహాభారతం - అరణ్యపర్వం 8/24-27)

శ్రీ మద్భాగవతమునందు దేవర్షియైన నారదుడు ధర్మజుడైన యుధిష్ఠిరునితో ఇట్లు పలికెను- "ఓ రాజా! మానవులలో మీరు మిక్కిలి భాగ్యవంతులు. ఏలనన లోకములనే పవిత్ర మొనర్చు మునులు మీ భవనములకు ఏతెంచుచున్నారు. పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడే మానవరూపమును స్వీకరించి, మీకడ విరాజిల్లుచున్నాడు. మహాత్ములు వెదకు కైవల్య సుఖానుభావము శ్రీకృష్ణ పరమాత్మయే. ఇతడు మీకు ప్రియ సుహృదుడు. మేనత్త కుమారుడు (ఆత్మబంధువు), పూజ్యుడు, మార్గదర్శకుడు, గురువు. మీవంటి భాగ్యశాలి యెవరో? చెప్పుము." (7/15/75,76)

**ఓ కేశవా! నీవు చెప్పునది అంతయును సత్యమే. హే భగవన్! నీ లీలామయస్వరూపమును దేవతలుగాని, దానవులుగాని తెలిసికొనజాలరు. (14)**

ప్రశ్న - 'కేశవ!' అని సంభోధించుటలో గల ప్రత్యేకత ఏమి?

సమా - 'బ్రహ్మ', విష్ణు, మహేశ్వర శక్తులను' క్రమముగా క+అ+ఈశ అనునవి 'కేశ'గా రూపొందును. ఈ త్రిమూర్తుల 'వపుః' అనగా స్వరూపము కలవాడు గావున ఆయనను 'కేశవుడు' అని యందురు. ఇట్లు సంభోధించుటవలన శ్రీకృష్ణభగవానుడు సమస్త జగత్తు యొక్క సృష్టి స్థితి లయములకు కారకుడనుటలో తనకు ఎట్టి సందేహమూలేదని అర్జునుడు పలికెను.

ప్రశ్న - 'ఏతత్' 'యత్' అను పదములు భగవానుని యే విషయములను తెల్పును? వాటి నన్నింటిని సత్యమని భావించుట యనగానేమి?

సమా - 7వ అధ్యాయ ఆరంభమునుండి ఈ అధ్యాయమునందలి 11వ శ్లోకము వరకు భగవానుడు తన గుణ ప్రభావ స్వరూప మహిమారహస్యములను, ఐశ్వర్యాది విషయములను తెల్పెను. దీనివలన శ్రీకృష్ణుడు తనను సాక్షాత్తు పరమేశ్వరునిగా రూఢిపరచెను. ఈ వచనములను అన్నింటిని సూచించునవియే 'ఏతత్', 'యత్' అను పదములు. శ్రీకృష్ణభగవానుడు సమస్త జగత్తునకు హర్త, కర్త సర్వాధారుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, అందరికిని ఆద్యుడు, నియంత, సర్వాంతర్యామి, దేవాది దేవుడు, సాక్షాత్తు సచ్చిదానందఘన పరబ్రహ్మ పరమాత్మ' అని భావించుటయు, ఆయన ఉపదేశములు సత్యములని విశ్వసించి, వాటియందు ఏ మాత్రమూ సందేహములు లేకుండుటయు, వాటినన్నింటిని సత్యమని భావించుట యగును.

ప్రశ్న - 'భగవన్' అని సంబోధించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - విష్ణుపురాణమునందు ఈ విధముగా చెప్పబడినది.

ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం 'భగ'ఇతీరణా॥ (6/5/74)

సమస్తమైన ఐశ్వర్యములు, ధర్మములు, యశస్సు, సంపదలు, జ్ఞానము, వైరాగ్యము- ఈ ఆరింటిని 'భగము' అని యందురు. ఈ అన్నింటిని కలిగినవాడు భగవంతుడు. అచ్చటనే ఈ విధముగా గూడ చెప్పబడినది.

ఉత్పత్తిం ప్రలయంచైవ భూతానామాగతిం గతిమ్ ।
వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥ (6/5/78)

ఉత్పత్తి, ప్రలయములను, ప్రాణుల ఆగమన, గమనములను, విద్య, అవిద్యలను ఎరింగినవాడు భగవానుడని తెలిసికొనవలెను. కనుక శ్రీకృష్ణుని 'భగవన్' అని సంబోధించుట వలన ఆయన సర్వైశ్వర్యసంపన్నుడు, సర్వజ్ఞుడు, సాక్షాత్తు పరమేశ్వరుడని యనుటలో ఎట్టి సందేహమూ లేదని తెలిపెను.

ప్రశ్న - ఇచట 'వ్యక్తిమ్' అను పదము ఎవరిని తెల్పును? అతనిని దేవదానవులు గూడ తెలిసికొనలేరు- అని యనుటలోని విశేషమేమి?

సమా - జగదుత్పత్తి, స్థితి, సంహారముల నొనర్చుటకును, ధర్మమును స్థాపించుటకును, భక్తులకు దర్శనమొసంగి వారిని ఉద్ధరించుటకును, దేవతలను రక్షించి, రాక్షసులను తుదముట్టించుటకును, మరియు ఇతర కారణముల వలనను భగవానుడు ప్రకటించు నేర్వేరు లీలామయ స్వరూపములను తెల్పునదియే ఇచట 'వ్యక్తిమ్' అను పదము. తమ మాయచేత వివిధ రూపములను ధరించు శక్తిగల దానవులను, ఇంద్రియాతీతవిషయములను ప్రత్యక్షము గావించుకొను దేవతలును భగవానుని దివ్యలీలామయ రూపములను, వాటిని దాల్చు అతని దివ్యశక్తియుక్తులను, వాటి నిమిత్తములను, ఆయన లీలారహస్యములను తెలిసికొన జాలరు. ఇక సామాన్య మానవుల విషయము చెప్పనేల?

**స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।**
**భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూతభావన! | = ఓ జగదుత్పత్తికారకా! | పురుషోత్తమ! | = ఓ పురుషోత్తమా! | స్వయమ్, | = స్వయముగా |
| భూతేశ! | = ఓ సర్వభూతేశా! | త్వమ్ | = నీవు | ఆత్మనా, ఏవ | నీచేతనే (నీవే) |
| దేవదేవ! | = ఓ దేవాదిదేవా! | ఆత్మానమ్ | = నిన్ను (స్వస్వరూపమును) | వేత్థ | = ఎఱుంగుదువు. |
| జగత్పతే | = ఓ జగన్నాథా! | | | | |

**ఓ జగదుత్పత్తికారకా! ఓ సర్వభూతేశా! ఓ దేవాదిదేవా! ఓ జగన్నాథా! ఓ పురుషోత్తమా! నీ తత్త్వమును నీవే స్వయముగా ఎఱుంగుదువు. (15)**

ప్రశ్న - **'భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే! పురుషోత్తమ!'** అను ఐదు సంబోధనల అర్థమేమి? ఇచట ఒకేసారి ఐదు సంబోధనలనూ ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - **'భూతభావన!'** అనగా సమస్త ప్రాణులను ఉత్పత్తి చేయువాడు. సమస్త జీవులను నియమానుసారము నడిపించు శాసకుని **'భూతేశ!'** అని యందురు. దేవతలకును పూజ్యుడైన దేవుని **'దేవదేవ!'** అని యందురు. సమస్త జగత్తును పాలించు స్వామిని **'జగత్పతి'** అని యందురు. **'క్షర, అక్షర'** అను పురుషులిద్దరికంటెను ఉత్తముడైనవానిని **'పురుషోత్తమ'** అని యందురు. ఈ ఐదు సంబోధనలను ఒకేసారి ప్రయోగించుట వలన భగవానుడు సమస్త జగత్తును ఉత్పన్నము చేయు వాడనియు, అందరికిని శాసకుడు, పూజ్యుడు, పాలించి పోషించువాడనియు, అపరా, పరా ప్రకృతులను పేరుగల క్షర, అక్షర పురుషులకంటెను ఉత్తముడైన పురుషోత్తముడనియు అర్జునుడు పేర్కొనెను.

ప్రశ్న - 'నీ తత్త్వములను స్వయముగా నీవే ఎరుంగుదువు' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - భగవానుడు సమస్త జగత్తునకును ఆద్యుడు, ఆయన గుణప్రభావలీలామాహాత్మ్యరూపాదులు అపరిమితములు. కనుక ఆయన గుణప్రభావ మాహాత్మ్య రహస్యములను, స్వరూపాదికమును ఇతరులెవ్వరును పూర్తిగా తెలిసికొనజాలరు. ఆయన ప్రభావాదికమును స్వయముగా ఆతడే ఎరుంగును. ఆ ఎరుంగుట గూడ సామాన్య మానవులు తమకంటెను భిన్నమైన వేరే వస్తువుల స్వరూపములను తమ బుద్ధి కౌశలము ద్వారా శాస్త్రాదికముల సహాయముతో తెలిసికొనుట వంటిది గాదు. భగవానుడు స్వయముగా జ్ఞానస్వరూపుడు. కనుక తనను తానే తెలిసికొనును. ఆయన విషయమున జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను భేదమేమియును లేదు.

## వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః ।
## యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| యాభిః | = ఎట్టి(ఏ) | తిష్ఠసి | = స్థితుడవై ఉన్నావో అటువంటి | అశేషేణ | = సంపూర్ణముగా |
| విభూతిభిః | = (దివ్య) విభూతులద్వారా | దివ్యాః | = దివ్యములైన | వక్తుమ్ | = చెప్పుటకు (విశద పఱచుటకు) |
| ఇమాన్, లోకాన్ | = ఈ (సమస్త) లోకములను | ఆత్మ విభూతయః | = నీవిభూతులను (గూర్చి) | త్వం, హి | = నీవే |
| వ్యాప్య | = వ్యాపించి | | | అర్హసి | = అర్హుడవు (తగుదువు). |

**సమస్తలోకములయందును నీ దివ్యవిభూతులద్వారా వ్యాపించి, స్థితుడవై యున్నావు. మహామహితములైన ఆ దివ్యవిభూతులను సంపూర్ణముగా తెల్పుటకు నీవే సమర్థుడవు. (16)**

ప్రశ్న - 'దివ్యాః' అను విశేషణముతోపాటు 'ఆత్మ విభూతయః' అను పదము ఏయే విభూతులను తెల్పును. ఆ దివ్య విభూతులను సంపూర్ణముగా తెల్పుటకు నీవే సమర్థుడవు అని యనుటలోని విశేషమేమి?

సమా - సమస్త లోకములందును తేజస్సు, బలము, విద్య, ఐశ్వర్యము, గుణములు, శక్తి మొదలగువానితో సుసంపన్నములైన పదార్థములన్నింటిని సూచించునది 'దివ్యాః' అను విశేషణముతో గూడిన 'ఆత్మవిభూతయః'

అను పదము. ఆ విభూతులన్నియును భగవానునకు సంబంధించినవే. కనుక ఆయన తప్ప ఇతరులెవ్వరును వాటిని గూర్చి పూర్తిగా ఎరుంగరు, అందువలన వర్ణింపనూ లేరు. 'కనుక దయతో నీవే నీవిభూతులను వర్ణింపుము' అని అర్జునుడు విన్నవించుకొనెను.

ప్రశ్న - 'సమస్త లోకములయందును నీ దివ్యవిభూతుల ద్వారా నీవు వ్యాపించియున్నావు' అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవానుని దివ్య విభూతులు కేవలము ఈ లోకమునందే గాక విభిన్న రూపములలో స్వర్గాది సకల లోకములయందును పరిపూర్ణముగా వ్యాపించియున్నవి. వాటినన్నింటిని గూర్చి తాను వినగోరుదునని అర్జునుడు పలికెను.

**కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్ ।**
**కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్ మయా ॥ 17 ॥**

యోగిన్ = ఓ యోగీశ్వరా!
అహమ్ = నేను
కథమ్ = ఎట్లు?
సదా = నిరంతరము
పరిచింతయన్ = బాగుగాచింతన చేయుచు
త్వామ్ = నిన్ను
విద్యామ్ = ఎఱుంగుదును
చ = మఱియు
భగవన్ = ఓ దేవా!
కేషు, కేషు భావేషు = ఏయే భావముల ద్వారా
మయా = నా చేత
చింత్యః, అసి = చింతనచేయదగిన వాడవు?

**ఓ యోగీశ్వరా! నిరంతరము చింతనచేయుచూ నేను నిన్ను ఏవిధముగా తెలిసికొనగలను? హే భగవన్! ఏయే భావములతో నాద్వారా చింతన చేయదగినవాడవు ? నిన్ను నేను ఎట్లు చింతన చేయవలెను? (17)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు అర్జునుడు ఏయే విషయములను గూర్చి ప్రశ్నించెను?

సమా - అర్జునుడు రెండు విషయములను గూర్చి ఇందు భగవానుని ప్రశ్నించెను.

1) భక్తిశ్రద్ధలతో నిరంతరము భగవానుని చింతన చేయుటకును, ఆయన గుణప్రభావతత్త్వములతో సహా ఆయనను చక్కగా ఎరుంగుటకును ఉపాయమేమి?

2) జడచేతనములైన ఈ చరాచర పదార్థముల యందు వేటిని భగవత్స్వరూపములుగా భావించి, వాటియందు చిత్తమును లగ్నము చేయవలెను?

ఏయే పదార్థములను ఏ విధముగా నిరంతరము చింతన చేసినచో సహజముగానే భగవంతుని గుణప్రభావ తత్త్వ రహస్యములు బోధపడును? అని అర్జునుడు ప్రశ్నించెను.

**విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18 ॥**

జనార్దన! = ఓ జనార్దనా!
ఆత్మనః = పరమాత్మవైన నీయొక్క
యోగమ్ = యోగశక్తిని గూర్చియు
విభూతిమ్, చ= విభూతుల వైభవములను గూర్చియు
భూయః = ఇంకను
విస్తరేణ = విస్తృతముగా
కథయ = తెలుపుము
హి = ఏలనన
అమృతమ్ = (నీ) అమృతమయ వచనములను
శృణ్వతః = వినుచున్న
మే = నాకు
తృప్తిః = సంతృప్తి (తనివియే)
న, అస్తి = లేదు(తీరదు).

**ఓ జనార్దనా! నీ యోగశక్తిని గూర్చియు, నీ విభూతి వైభవములను గుఱించియు విస్తృతముగా ఇంకను తెలుపుము. ఏలనన నీ అమృతమయవచనములను ఎంతగా విన్నను తనివియే తీరదు.(18)**

ప్రశ్న - 'జనార్దన' అను సంబోధనయొక్క విశేషమేమి?

సమా - మానవులు తమ ఇచ్ఛలననుసరించి, అర్థించు వస్తువులను అనుగ్రహించు వానిని 'జనార్దనుడు' అని యందురు. మనుష్యులందరును భగవానుని తమ ఇష్టవస్తుప్రాప్తికై ప్రార్థింతురు. అతడు అందరికిని అన్నింటిని ప్రసాదించుటకు (ఇచ్చుటకు) సమర్థుడు. కావున తాను ప్రార్థించిన విషయములను గూడ దయతో అనుగ్రహింపుమని అర్జునుడు భగవానుని కోరెను.

ప్రశ్న - ఇచ్చట 'యోగమ్', 'విభూతిమ్' అను పదములు వేటిని తెల్పును? ఆ రెండింటిని గూర్చి మరల విస్తృతముగా ప్రార్థించుటలో గల విశేషమేమి?

సమా - తన దివ్యశక్తిద్వారా భగవానుడు స్వయముగా ఈ జగద్రూపమున ప్రకటితుడై, అనేక రూపములలో విస్తరించును. ఆ శక్తినే 'యోగము' అని యందురు. ఆ విభిన్న రూపముల విస్తృతినే 'విభూతి' యందురు. ఈ యధ్యాయమున 7వ శ్లోకమునందు భగవానుడు ఈ రెండు శబ్దములను ప్రయోగించెను. అచట వీటి యర్థములు విపులముగా వివరింపబడినవి. ఈ రెండింటి తత్త్వములను తెలిసికొనుట వలన కలుగు ఫలము నిశ్చలభక్తి యోగప్రాప్తి అని తెల్పియుండెను. కనుక అర్జునుడు ఈ విభూతి, యోగముల రెండింటి రహస్యము సంపూర్ణముగా తెలిసికొను కోరికతో ఆ విషయమునే విపులముగా వర్ణింపుమని భగవానుని ప్రార్థించుచున్నాడు.

ప్రశ్న - 'నీ అమృతమయమైన వాక్కులను ఎంతగా విన్నను నాకు తనివి తీరుటలేదు' - అను అర్జునుని వచనముల వైశిష్ట్యమేమి?

సమా - భగవద్వచనములు మధురాతి మధురములు. వాటినుండి జాలువారు ఆనంద సుధాధారలను ఎంతగా గ్రోలినను ఏ మాత్రమూ తనివి తీరదు. ఆ దివ్యామృతమును పానముచేసిన కొలదియు ఆ పిపాస అధికమగుచునే యుండును. ఈ అమృతమును నిరంతరము ఆస్వాదించుటకై మనస్సు ఉవ్విళ్ళూరుచుండును. కనుక అర్జునుడు 'హే భగవాన్! ఈ విశిష్ట విషయమును గూర్చి విపులముగా ఇదివరకే వివరింపబడినదని తలంపవద్దు. దయతో ఆ దివ్యామృతమును వర్షించుచునే యుండుము'. అని ప్రార్థించెను.

*సంబంధము - భగవంతుని యోగ, విభూతులను సమగ్రముగా వర్ణింపుమని అర్జునుడు శ్రీకృష్ణుని అర్థించెను - భగవానుడు మొదట తన విభూతుల విస్తృతి అనంతమైనదని తెల్పుచు, వానిలో ప్రధానమైన కొన్నింటిని మాత్రమే వర్ణింతునని చెప్పుచున్నాడు-*

**శ్రీభగవాన్ ఉవాచ**

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥ 19 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కురుశ్రేష్ఠ! | = ఓ అర్జునా! | హి | = అందువలన | | మాత్రము |
| మే | = నాయొక్క | దివ్యాః | = అదివ్యములైన | హంత | = ఇప్పుడు |
| విస్తరస్య | = విభూతుల విస్తృతికి | ఆత్మ విభూతయః | = నావిభూతులను | తే | = నీకొఱకై |
| అంతః, న, అస్తి | = అంతము లేదు | ప్రాధాన్యతః | = ముఖ్యమైన కొన్నింటిని | కథయిష్యామి | = తెలుపుదును. |

శ్రీ భగవానుడు పలికెను - ఓ అర్జునా! నా దివ్యవిభూతుల విస్తృతికి (వ్యాప్తికి) అంతమే లేదు. వాటిలో ప్రధానమైనవాటిని కొన్నింటిని మాత్రము నీకు తెలుపుచున్నాను. (19)

ప్రశ్న - 'కురుశ్రేష్ఠ!' అను సంబోధనలోని ప్రత్యేకత యేమి?

సమా - అర్జునుడు కురువంశజులలో సర్వశ్రేష్ఠుడు. కనుక భగవద్విభూతులను తెలిసికొనుటకు అర్హుడు. ఈ ప్రత్యేకతను ప్రకటించుటకే భగవానుడు అర్జునుని 'కురుశ్రేష్ఠ' అని సంబోధించెను.

ప్రశ్న - 'దివ్యాః' అను విశేషణముతో గూడిన 'ఆత్మవిభూతయః' అను పదప్రయోగము యొక్క

వైశిష్ట్యమేమి? వాటిని అన్నింటిని ముఖ్యముగా ఇప్పుడు తెల్పుదును- అని యనుటలోని విశేషమేమి?

సమా - జగత్తంతయును భగవత్స్వరూపమే. వస్తువు లన్నియును సాధారణముగా ఆయన విభూతులే. కాని అవి యన్నియును దివ్యవిభూతులు కావు. భగవంతుని తేజస్సు, బలము, విద్య, ఐశ్వర్యము, కాంతి, శక్తి మొదలగువాని విశేష వికాసములతో గూడిన వస్తువులను లేక ప్రాణులను ఆయన దివ్యవిభూతులుగా భావింపవలెను. ఇట్టి దివ్య విభూతులును అనంతములు. కనుక వాటినన్నింటిని పూర్తిగా వర్ణించుటకు వీలుపడదనియు, వాటిలో ప్రధానమైన వాటినే వర్ణించుచున్నాననియు భగవానుడు తెలిపెను.

ప్రశ్న - 'నా విభూతి విస్తృతికి అంతము లేదు' అని అనుటలోని విశేషమేమి?

సమా - భగవంతుని విస్తృతవిభూతులను సంపూర్ణముగా వర్ణింపుమని 18వ శ్లోకమున అర్జునుడు భగవానుని ప్రార్థించియుండెను. తన సమస్త విభూతులను వర్ణించుట సాధ్యము కాదనియు, వానిలో ప్రధానమైన వాటిని గూడా సంపూర్ణముగా వర్ణించుట అసాధ్యమనియు భగవానుడు నుడివెను.[1]

*సంబంధము - భగవంతుడు అర్జునునకు తాను ఇచ్చిన మాట ప్రకారము 20 నుండి 39వ శ్లోకము వఱకు తన దివ్యవిభూతులను వర్ణించుచున్నాడు-*

---

1) విశ్వమునందు అనంతములైన పదార్థములు, భావములు, విభిన్న జాతుల ప్రాణులు విస్తరించి యున్నవి. వీటన్నింటిని విధివిధానముగా నియంత్రించుటకును, నడిపించుటకును వీలుగా జగత్స్రష్టయైన భగవంతుని నియమానుసారము విభిన్న జాతులకు చెందిన పదార్థములుగా, భావములుగా, జీవులుగా సమష్టివిభాగములు చేయబడినవి. నియమ ప్రకారము వీటియొక్క సృష్టి, పాలనము, సంహారము జరుగుటకై ప్రతి సమష్టివిభాగమునకును ఒక అధికారి నియుక్తుడై యున్నాడు. రుద్రులు, వసువులు, ఆదిత్యులు, ఇంద్రుడు, సాధ్యులు, విశ్వేదేవతలు, మరుత్తులు, పితృదేవతలు, మనువులు, సప్తర్షులు మొదలగువారు ఈ విభాగములకు అధిపతులు. వారు మూర్తులు, అమూర్తులు కూడా వీరందఱును భగవానుని విభూతులే.

సర్వేచ దేవా మనవః సమస్తాః సప్తర్షయో యే మనుసూనవశ్చ ।
ఇంద్రశ్చ యోఽయం త్రిదశేశ భూతో విష్ణోరశేషాస్తు విభూతయస్తాః ॥ (శ్రీ విష్ణుపురాణం - 3/1/46)

'సమస్తదేవతలు, సకల మనువులు, సప్తర్షులు, మనుసూనులు' దేవతల కధిపతియైన ఇంద్రుడు - వీరందరును శ్రీ మహావిష్ణువు యొక్క విభూతులే.

వీరుగాక సృష్టిని నడుపుటకు ప్రజల సమష్టి విభాగములనుండి యథా యోగ్యముగ, ప్రతినిధులు నియమింపబడిరి. భగవానుని తేజస్సు, శక్తి, విద్య, జ్ఞానము, బలము మొదలగునవి విశేషముగా వికాసము నొందినవారే ప్రతినిధులుగా నియమింపబడుటకు అర్హులు. కనుక వీరందఱిని భగవానుడు తన విభూతులుగా పేర్కొనెను.

వాయు పురాణమున 70వ అధ్యాయమునందు ఇట్లు తెల్పబడినది- "కశ్యప మహర్షి ద్వారా ప్రజాసృష్టి జరిగిన పిమ్మట ప్రజాపతి ఆ విభిన్న జాతులకు చెందిన ప్రజలలో సర్వశ్రేష్ఠులను, తేజోమూర్తులను గుర్తించి, ఆయా జాతి ప్రజలను చక్కగా నియంత్రించుటకై వారిని ఆధిపతులనుగా జేసెను. చంద్రుడు నక్షత్రములకును, గ్రహములకును, బృహస్పతి అంగిరసులకును, శుక్రుడు భార్గవులకును, విష్ణువు ఆదిత్యులకును, పావకుడు వసువులకును, దక్షుడు ప్రజాపతులకును, ప్రహ్లాదుడు దైత్యులకును, ఇంద్రుడు మరుత్తులకును, నారాయణుడు సాధ్యులకును, శంకరుడు రుద్రులకును, వరుణుడు జలములకును, కుబేరుడు యక్షరాక్షసాదులకును, శూలపాణి భూత పిశాచములకును, సాగరుడు నదులకును, చిత్రరథుడు గంధర్వులకును, ఉచ్చైశ్శ్రవము గుఱ్ఱములకును, సింహము మృగములకును, వృషభము చతుష్పాత్తులకును, గరుడుడు పక్షులకును, శేషుడు సర్పములకును, మఱియు సరీసృపములకును, వాసుకి నాగులకును, తక్షకుడు ఇతర జాతుల సర్పములకును, నాగులకును, హిమవంతుడు పర్వతములకును, విప్రచిత్తి యనువాడు దానవులకును, వైవస్వతుడు పితరులకును, పర్జన్యుడు సాగరములు, నదులు, మేఘములకును, మన్మథుడు అప్సరసలకును, సంవత్సరుడు ఋతుమాసాదికములకును, సుధాముడు తూర్పుదిశకును, కేతుమంతుడు పశ్చిమ దిశకును, వైవస్వత మనువు మానవులందఱికిని అధిపతులుగా నియమితులైరి. ఈ అధిపతుల ద్వారానే సమస్త జగత్ప్రంచాలనము, పాలనము జరుగుచున్నవి."
- ఈ యధ్యాయమునందు వర్ణింపబడిన విభూతులు పైన తెల్పబడిన వివరణముతో ఇంచుమించు సరిపోవును.

## అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
## అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥ 20 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుడాకేశ! | = ఓ అర్జునా! | చ | = మఱియు | చ | = ఇంకను |
| సర్వభూతాశయ స్థితః | = సమస్తప్రాణుల హృదయములయందున్న | భూతానామ్ | = సకల భూతము (ప్రాణు)లకు | అంతః, చ | = అంతమునూ (ప్రాణుల సృష్టిస్థితి లయముల కారణము) |
| ఆత్మా | = ఆత్మను | ఆదిః | = ఆదియు | అహమ్, ఏవ (అస్మి) | = నేనే |
| అహమ్ | = నేను | మధ్యమ్ | = మధ్యస్థితియు | | |

**ఓ అర్జునా! సమస్తప్రాణులహృదయములయందున్న ఆత్మను నేనే. సకల భూతముల (ప్రాణుల) ఆదియు, మధ్యస్థితియు, అంతము నేనే. (ప్రాణులయొక్క సృష్టిస్థితిలయములకు కారణము నేనే)(20)**

ప్రశ్న - 'గుడాకేశ!' అను సంబోధనము యొక్క ప్రత్యేకతయేమి?

సమా - 'గుడాకా' అనగా నిద్ర. దానికి స్వామి యైన వానిని గుడాకేశుడని యందురు. అర్జునుడు నిద్రను జయించినవాడు. కనుక భగవానుని ఉపదేశమును గ్రహించి, అజ్ఞాననిద్రనుగూడ పారద్రోలగలడు - అని తెల్పుటకే భగవానుడు అర్జునుని 'గుడాకేశ!' అని సంబోధించెను.

ప్రశ్న - 'సర్వభూతాశయస్థితః' అను విశేషణముతో పాటు 'ఆత్మ' అను పదము ఎవరిని తెలుపును? 'ఆ ఆత్మను నేనే' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - సమస్త ప్రాణుల హృదయములందుండు 'చైతన్యమును' 'పరాప్రకృతి' 'క్షేత్రజ్ఞుడు' (7/5, 13) అనియు అందురు. దానిని సూచించునదియే 'సర్వభూతాశయస్థితః' అను విశేషణముతోపాటు ప్రయుక్తమైన 'ఆత్మా' అను పదము. అది భగవంతుని 'అంశ' యే అనుటవలన (15/7) వాస్తవముగా భగవత్స్వరూపమే (13/2). కనుక భగవానుడు 'ఆ ఆత్మనునేనే' అని పల్కెను.

ప్రశ్న - 'భూతానాం' అను పదము ఎవరిని తెలుపును? 'వాటి ఆది మధ్యాంతములు నేనే' అని యనుటలోని విశేషమేమి?

సమా - దేహధారులైన సమస్త చరాచరప్రాణులను సూచించునదియే 'భూతానాం' అను పదము. సమస్త ప్రాణుల సృష్టి, పాలనము, సంహారము అనునవి భగవంతునివలననే జరుగును. ప్రాణులన్నియును భగవంతునినుండియే ఉత్పన్నములగును. అతని యందే స్థితమై యుండును. ప్రలయకాలమున అతని యందే లీనమగును. భగవానుడే అన్నిటికిని మూలకారణము, ఆధారము. ఈ విషయమును స్పష్టపరచుటకే భగవానుడు 'సమస్త భూతములకును ఆది మధ్యాంతములును నేనే' అని పల్కెను.

## ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్ ।
## మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ 21 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదిత్యానామ్ | = ఆదిత్యులలో | రవిః | సూర్యుడను (తేజమును) | | |
| విష్ణుః | = విష్ణువును | అహమ్, అస్మి | = నేనే | నక్షత్రాణామ్ | = నక్షత్రములకు అధిపతియైన |
| జ్యోతిషామ్ | = జ్యోతిర్మయ స్వరూపులలో | మరుతామ్ | = (49మంది) వాయుదేవతలలో | శశీ | = చంద్రుడును |
| అంశుమాన్, | = గొప్పకిరణములు గల | మరీచిః | = మరీచిని | అహమ్, అస్మి | = నేనే. |

**అదితియొక్క ద్వాదశపుత్రులైన ఆదిత్యులలో విష్ణువును నేను. జ్యోతిర్మయ స్వరూపులలో నేను సూర్యుడను. 49 మంది వాయుదేవతలలోని 'తేజము'ను[1] నేను. నక్షత్రాధిపతియైన చంద్రుడను నేను. (21)**

ప్రశ్న - 'ఆదిత్యులు' అనగానెవరు? 'హరిలో విష్ణువును నేను' అని యనుటలోని విశేషమేమి?

సమా - అదితి యొక్క 12 మంది పుత్రులను 'ఆదిత్యులు' అని యందురు. వారి పేర్లు వరుసగా ధాత, మిత్ర, అర్యమ, శక్ర, వరుణ, అంశ, భగ, వివస్వాన్, పూష, సవిత, త్వష్ట, విష్ణు అనునవి. వీరిలో విష్ణువు అందరికిని రాజు, సర్వశ్రేష్ఠుడు. కనుక భగవానుడు విష్ణువును తన స్వరూపముగా పేర్కొనెను.[2]

ప్రశ్న - 'జ్యోతిర్మయ' స్వరూపులలో నేను అంశుమంతుడగు (కిరణములుగల) సూర్యుడను' అని యనుటలోగల విశేషమేమి?

సమా - సూర్యుడు, చంద్రుడు, తారకలు, మెరుపులు, అగ్ని, మొదలగు ప్రకాశస్వరూపములన్నింటిలో సూర్యుడు ప్రధానుడు. కనుక సమస్త జ్యోతిర్మయులలో సూర్యుడు తన స్వరూపము-అని భగవానుడు తెలిపెను.

ప్రశ్న - 'వాయుదేవతలలో 'మరీచి' శబ్ద వాచ్యమైన 'తేజస్సును' నేను' అని యనగానేమి?

సమా - దితీదేవి యొక్క భగవద్ధ్యానవ్రత తేజస్సునుండి 49 మంది 'మరుత్తులు' ఆమెకు పుత్రులుగా జన్మించిరి. ఆ తేజస్సు యొక్క ప్రభావముననే వారు మాతృగర్భములో వధింపబడలేదు.[3] కనుక ఈ తేజస్సును భగవానుడు తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - 'నక్షత్రములకు అధిపతియైన చంద్రుడను నేనే' అనియనుటలోని విశేషమేమి?

సమా - అశ్విని, భరణి, కృత్తిక మొదలగు 27 నక్షత్రములకు ప్రభువు, తారకలన్నింటికిని రాజైన చంద్రుడు భగవానుని ముఖ్య విభూతి. కనుక భగవానుడు అతనిని తన స్వరూపముగా తెల్పెను.

1) 49 మంది మరుద్దేవతలు - సత్త్వజ్యోతి, ఆదిత్యుడు, సత్యజ్యోతి, తిర్యగ్జ్యోతి, సజ్యోతి, జ్యోతిష్మంతుడు, హరితుడు, ఋతజిత్తు, సత్యజిత్తు, సుషేణుడు, సేనజిత్తు, సత్యమిత్రుడు, అభిమిత్రుడు, హరిమిత్రుడు, కృతుడు, సత్యుడు, ధ్రువుడు, ధర్త, విధర్త, విధారయుడు, ధ్వాంతుడు, ధుని, ఉగ్రుడు, భీముడు, అభియుడు, సాక్షిపుడు, ఈదృక్కు, అన్యాదృక్కు, యాదృక్కు, ప్రతికృతుడు, ఋక్కు, సమితి, సంరంభుడు, ఈదృక్షుడు, పురుషుడు, అన్యాదృక్షుడు, చేతసుడు, సమితి, సమిదృక్షుడు, ప్రతిదృక్షుడు, మరుతి, సరతుడు, దేవుడు, దిశుడు, యజుడు, అనుదృక్కు, సాముడు, మానుషుడు, విశుడు. (వాయుపురాణం-67/123-130) గరుడ పురాణమునందును, ఇతర పురాణములయందును, కొన్ని నామభేదములు కన్పట్టుచున్నవి. కాని 'మరీచి' అను పేరు ఎచ్చటను కన్పించుటలేదు. కనుక 'మరీచి' అను పదమునకు అర్థము మరుత్తు అని భావింపక సమస్త మరుద్గణముల 'తేజస్సు' లేక కిరణము అని భావింపబడినది.

దక్షకన్యయైన మరుద్వతికి జన్మించిన పుత్రులను గూడ 'మరుత్తులు' అనియే పిలుతురు. (హరివంశము-) వేర్వేఱు మన్వంతరములయందు వేర్వేఱు పేర్లతో నానా విధములుగా ఆయా పురాణములలో వీరి జననములను గూర్చి వర్ణింపబడినది.

2) ధాతా మిత్రోఽర్యమా శక్రో వరుణస్త్వంశ ఏవ చ । భగో వివస్వాన్ పూషా చ, సవితా దశమస్తథా ॥
ఏకాదశస్తథా త్వష్టా, ద్వాదశో విష్ణురుచ్యతే । జఘన్యజస్తు సర్వేషామాదిత్యానాం గుణాధికః ॥
(మహాభారతం, ఆదిపర్వం 65/15,16)

3) కశ్యపబ్రహ్మాపత్నియైన దితియొక్క కుమారులు పెక్కుమంది యుద్ధమున దేవతల చేతులలో మృతిచెందిరి. పిమ్మట ఆమె తన సేవలతో తన పతియగు కశ్యపుని ప్రసన్నునిగా జేసికొనెను. ఆమె ఆరాధనకు సంతుష్టుడై తాపస శ్రేష్ఠుడైన కశ్యపుడు ఆమెకు వరమును ప్రసాదించెను. అప్పుడామె ఇంద్రుని వధింపగల, మిక్కిలి పరాక్రమవంతుడైన పుత్రుని వరముగా కోరెను. కశ్యపుడు ఆమె కోరిన వరమును ఇచ్చుచు ఆమెతో ఇట్లు పలికెను. "నీవు నిత్యమూ భగవద్ధ్యానతత్పరవై సంయమముతో నీ గర్భపవిత్రతను కాపాడుకొనుచు నూరు వర్షములు భరింపగల్గినచో నీ పుత్రుడు ఇంద్రుని వధింపగలడు" - ఇంద్రుడు తనను వధింపగలవాడు దితి గర్భమున పెఱుగుచున్నట్లు తెలిసికొని, అతడు ఆమెకు సవినయముగ సేవలొనర్పసాగెను. ఆమె పవిత్రతకు ఎప్పుడైనను హాని కల్గినచో (లోపము సంభవించినచో) తానేమైనను చేయుటకు వీలగునని రాత్రింబవళ్ళు

**వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వేదానామ్ | = వేదములలో | వాసవః, అస్మి | = ఇంద్రుడను నేను | చ | = మఱియు |
| సామవేదః, అస్మి | = సామవేదమును నేను | ఇంద్రియాణామ్ | = ఇంద్రియములలో | భూతానామ్ | = ప్రాణులలో |
| దేవానామ్ | = దేవతలలో | మనః, అస్మి | = మనస్సును నేను | చేతనా, అస్మి | = చైతన్యమును నేను. |

**వేదములలో నేను సామవేదమును. దేవతలలో ఇంద్రుడను నేను. ఇంద్రియములలో నేను మనస్సును. ప్రాణులలో చైతన్యమును (ప్రాణశక్తిని) నేను. (22)**

ప్రశ్న - వేదములలో నేను సామవేదమును అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఋగ్యజుస్సామాథర్వణములు అను నాలుగు వేదములలో సామవేదము అత్యంత మధురమైనది. సంగీత మయమైనది. పరమేశ్వరునియొక్క అత్యంత రమణీయ స్తుతులతో కూడినది. కనుక వేదములలో ఇది ముఖ్యమైనదిగా భావింపబడుచున్నది. అందువలన భగవానుడు దానిని తన స్వరూపముగా చెప్పెను.

ప్రశ్న - 'దేవతలలో నేను ఇంద్రుడను' అని యనుటలోని విశేషమేమి?

సమా - సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు మొదలగు దేవతలనందరిని శాసించు రాజు అగుట వలన ఇంద్రుడు వారిలో ప్రముఖుడని భావింపవలెను కనుక భగవంతుడు ఇంద్రుని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - 'ఇంద్రియములలో నేను మనస్సును' అని యనుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, మనస్సు అను పదకొండు ఇంద్రియములలో మనస్సు ఇతర దశేంద్రియములకును స్వామి, ప్రేరకము. అన్నింటికంటెను ఇది సూక్ష్మము, శ్రేష్ఠము అయినది. కనుక అది ముఖ్యమైనది. అందువలన భగవానుడు దానిని తన స్వరూపముగా తెలిపెను.

ప్రశ్న - 'సకల ప్రాణులలో నేను చైతన్యమును' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - సమస్త ప్రాణులలోగల జ్ఞానశక్తిద్వారా వారికి (ప్రాణులకు) సమస్త పదార్థముల అనుభూతియు, సుఖ దుఃఖముల అనుభవమును కలుగును. ఇదియే వారి అంతః కరణ వృత్తి విశేషము. 13వ అధ్యాయమునందలి 6వ శ్లోకమునందు క్షేత్రవికారములలో ఒకటిగా గణింపబడిన జ్ఞానశక్తినే చైతన్యము అనియందురు. ఇది ప్రాణుల సమస్త - అనుభవములకు హేతుభూతమైన ప్రధానశక్తి. కావున దీనిని (చైతన్యమును) భగవానుడు తన స్వరూపముగా తెలిపెను.

**రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।**
**వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥ 23 ॥**

---

అవకాశము కొఱకు ఎదురుచూచుచు అచ్చటనే యుండెను. దితి సంయమదీక్షాకాలమైన నూరు వర్షములు ముగియుటకు కొన్ని దినములే మిగిలియుండెను. ఒక దినమున 'దితి' కాళ్లు కడుగుకొనకయే శయ్యపై నిద్రించెను. వెంటనే అదను చూచి ఇంద్రుడు వజ్రాయుధముతో ఆమె గర్భమున ప్రవేశించి, ఆ గర్భస్థ పిండమును ఏడు ముక్కలుగా ఖండించెను. ఈవిధముగా వజ్రపీడితమైన పిండము బిగ్గరగా ఏడ్వసాగెను. ఇంద్రుడు ఆ గర్భస్థశిశువు చెవిలో మాటిమాటికి 'ఏడ్వకుము' (మారోదీః) అని చెప్పెను. కాని ఆ పిండము ఏడు భాగములుగా విభక్తమైనను మృతిచెందకపోవుట వలన ఇంద్రుడు మిక్కిలి క్రుద్ధుడై ఒక్కొక్క భాగమును మఱల ఏడేసి భాగములుగా చేసెను. ఈ విధముగా ఒకే పిండము 49 భాగములు (ముక్కలు)గా ఐనను అవి జీవించియే యుండెను. అప్పుడు ఇంద్రుడు అవి చావవని గ్రహించెను. అవియే తేజోవంతములైన (మిక్కిలి వేగముగల) 'మరుత్తులు' అను దేవతలుగా ప్రసిద్ధికెక్కెను. ఇంద్రుడు వీటితో 'మారోదీః' అని పల్కుట వలన వాటికి సామూహికముగా 'మరుత్తులు' అను నామము ఏర్పడెను. (విష్ణు పురాణం - ప్రథమాంశం - 21వ అధ్యాయం)

రుద్రాణామ్ = ఏకాదశ రుద్రులలో
శంకరః, అస్మి = నేను శంకరుడను
చ = మఱియు
యక్ష, రక్షసామ్ = యక్ష, రాక్షసులలో
అహమ్, = నేను
విత్తేశః = ధనాధిపతియైన కుబేరుడను
వసూనామ్ = అష్టవసువులలో
పావకః అస్మి = నేను అగ్నిని
చ = మఱియు
శిఖరిణామ్ = శిఖరములుగల పర్వతములలో
మేరుః(అస్మి) = నేను సుమేరు పర్వతమును.

**ఏకాదశ రుద్రులలో శంకరుడను నేను. యక్ష రాక్షసులలో ధనాధిపతియైన కుబేరుడనునేను. అష్ట వసువులలో అగ్నిని నేను. పర్వతములలో 'సుమేరు' పర్వతమునునేను. (23)**

ప్రశ్న - ఏకాదశ రుద్రులెవరు? వారిలో తాను శంకరుని రూపమని తెల్పుటలోని అంతర్యమేమి?

సమా - హరుడు, బహురూపుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, వృషాకపి, శంభుడు, కపర్ది, రైవతుడు, మృగవ్యాధుడు, శర్వుడు, కపాలి అనువారు ఏకాదశ రుద్రులు.[1] వీరిలో శంభువు అవగా శంకరుడు అందరికిని అధీశ్వరుడు. అట్లే అతడు కల్యాణప్రదాత, కల్యాణస్వరూపుడు కనుక అతనిని (శంకరుని) భగవానుడు తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - యక్షరాక్షసులలో ధనాధిపతియైన కుబేరుని తన స్వరూపముగా పేర్కొనుటలోని అంతరార్థమేమి?

సమా - కుబేరుడు యక్షరాక్షసులకు రాజు[2] అతడు వారిలో శ్రేష్ఠుడు. ధనాధ్యక్ష పదవిని అలంకరించిన వాడు. ప్రసిద్ధుడు. లోకపాలుడు, అందువలన భగవానుడు అతనిని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - అష్టవసువులు ఎవరు? వారిలో పావకుడు (అగ్ని) తన స్వరూపమని భగవానుడు తెలుపుటలోని విశేషమేమి?

సమా - ధరుడు, ధ్రువుడు, సోముడు, అహస్సు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు - అనువారు అష్టవసువులు.[3] వీరిలో అనలుడు (అగ్ని) వసువులకు రాజు. దేవతలకు హవిస్సును అందించువాడు. మరియు ఇతడు భగవానుని ముఖముగా భావింపబడువాడు. కనుక భగవానుడు అగ్ని (పావకు)ని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - శిఖరములు గల పర్వతములలో 'మేరువు'ను నేను - అని యనుటలోని విశేషమేమి?

సమా- మేరు (సుమేరు) పర్వతము నక్షత్రములకును ద్వీపములకును కేంద్రము. సువర్ణములకును రత్నములకును భాండారము. దీని శిఖరములు ఇతర పర్వతశృంగ (శిఖర)ముల కంటెను ఎత్తైనవి. కనుక శిఖరములు గల పర్వతములలో ప్రముఖమైనదగుట వలన సుమేరును భగవానుడు తన స్వరూపముగా తెల్పెను.

**పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥ 24 ॥**

1) హరశ్చ బహురూపశ్చ, త్ర్యంబకశ్చాపరాజితః । వృషాకపిశ్చ శంభుశ్చ, కపర్దీ రైవతస్తథా ॥ మృగవ్యాధశ్చ శర్వశ్చ, కపాలీ చ విశాంపతే! । ఏకాదశైతే కథితా రుద్రాస్త్రిభువనేశ్వరాః ॥ (హరివంశం 1/3/51,52)

2) ఇతడు పులస్త్యునియొక్క పౌత్రుడు. విశ్రవసుని ఔరసపుత్రుడు. భరద్వాజుని కూతురైన 'దేవవర్ణిని' యొక్క గర్భము నందు ఇతడు జన్మించెను. ఇతడు పెక్కు సంవత్సరములు (దీర్ఘకాలము) కఠోర తపస్సు చేయగా బ్రహ్మదేవుడు ప్రసన్నుడై వరము కోరుకొమ్మనెను. అప్పుడతడు విశ్వమునందు తనను ధనరక్షకునిగా చేయుమని కోరుకొనెను. అప్పుడు బ్రహ్మ ఇట్లనెను- "నేనుగూడ నాల్గవ లోకపాలుని నియమింప దలచితిని. కనుక ఇంద్ర, యమ, వరుణుల వలె నీవును ఈ పదవిని గ్రహింపుము. బ్రహ్మయే ఇతనికి పుష్పక విమానమును ఇచ్చెను. అప్పటినుండి ఇతడు ధనాధ్యక్షుడయ్యెను. ఈయన యొక్క సవతి తల్లియైన కైకసికి రావణ, కుంభకర్ణాదులు జన్మించిరి. (వాల్మీకి రామాయణం ఉత్తరకాండ 3వ సర్గము) నలకూబర, మణిగ్రీవులు ఈ కుబేరుని పుత్రులే. వీరు నారదముని శాపమువలన అర్జున (మద్ది) వృక్షములైరి. శ్రీకృష్ణ భగవానుడు వారిని ఉద్ధరించెను. (శ్రీమద్భాగవతం - 10/10)

3) ధరో ధ్రువశ్చ సోమశ్చ, అహశ్చైవానిలోఽనలః । ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ, వసవోఽష్టౌ ప్రకీర్తితాః ॥ (మ.భా. ఆది. 66/18)

పార్థ! = ఓపార్థా!
పురోధసామ్ = పురోహితులలో
ముఖ్యమ్ = ముఖ్యుడైన
బృహస్పతిమ్ = బృహస్పతినిగా
మామ్ = నన్ను
విద్ధి = తెలిసికొనుము
అహమ్ = నేను
సేనానీనామ్ = సేనాధిపతులలో
స్కందః = కుమారస్వామిని
చ = మఱియు
సరసామ్ = జలాశయములలో
సాగరః అస్మి = నేను సముద్రుడను.

**పార్థా! పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేనే. సేనాపతులలో కుమారస్వామిని నేను. జలాశయములలో నేను సాగరుడను. (24)**

ప్రశ్న - బృహస్పతిని తన స్వరూపముగా పేర్కొనుటలో గల విశేషమేమి?

సమా - బృహస్పతి దేవేంద్రుని గురువు[1]. దేవతల కులపురోహితుడు. విద్యాబుద్ధులయందు సర్వశ్రేష్ఠుడు. జగత్తునందలి పురోహితులలో ముఖ్యుడు. ఆంగిరసులలో ప్రముఖుడు. కనుక భగవంతుడు ఆయనను తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - స్కందుడెవరు? సేనాపతులలో ఇతనిని భగవంతుడు తన స్వరూపముగా చెప్పుటలోగల విశేషమేమి?

సమా - స్కందుని మరియొక పేరు కార్తికేయుడు. ఇతనికి ఆరుముఖములు, 12 చేతులును గలవు. ఇతడు మహాదేవుని (శివుని) కుమారుడు.[2] ఇతడు దేవతలకు సేనాపతి. జగత్తునందలి సకల సేనాపతులలో ప్రముఖుడు. కనుక ఇతనిని భగవానుడు తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - 'జలాశయములలో నేను సాగరుడను' అని తెల్పుటలోని విశేషమేమి?

సమా - భూమి యందలి జలాశయములలో సాగరము మిక్కిలి గొప్పది. విశాలమైనది. లోతైనది. కనుక విశిష్టమైనది. అందువలన సమస్త జలాశయములలో సాగరమును[3] భగవంతుడు తన స్వరూపముగా తెల్పెను.

**మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాంహిమాలయః ॥ 25 ॥**

మహర్షీణామ్ = మహర్షులలో
భృగుః, అహమ్ = భృగువునునేను
గిరామ్ = శబ్దములలో
ఏకమ్, = ఏకాక్షరమైన
అక్షరమ్, అస్మి = ఓం కారమును నేను
యజ్ఞానామ్, జపయజ్ఞః = యజ్ఞములన్నింటిలో జపయజ్ఞమును
స్థావరాణామ్ = స్థావరములలో
హిమాలయః, అస్మి = హిమాలయమును నేనే

**మహర్షులలో భృగువును నేను. శబ్దములలో ఏకాక్షరమును అనగా ఓంకారమును నేను. యజ్ఞములయందు జపయజ్ఞమును నేను. స్థావరములలో హిమాలయమును నేను. (25)**

1) ఇతడు అంగిరుని కుమారుడు. మిక్కిలి ప్రతిభామూర్తి. స్వారోచిషమన్వంతరమునందు ఇతడు సప్తర్షులలో ముఖ్యుడు. (హరివంశము 7/12: మత్స్య 9/8) ఇతడు గొప్ప విద్వాంసుడు. వామనావతారమునందు భగవానుడు వేదములు షట్+శాస్త్రములు, స్మృతులు, ఆగమాదులన్నింటిని ఈయనయొద్దనే అభ్యసించెను. (బృహద్ధర్మపురాణము-మధ్య-16/69-73) ఈతని కుమారుడు కచుడు శుక్రాచార్యునికడ 'సంజీవని' విద్యను అభ్యసించెను. ఇతడు దేవేంద్రునకు పురోహితుడు. ఆయా సమయములలో ఇతడు ఇంద్రునకిచ్చిన ఉపదేశములను స్మరించినవారికి శ్రేయోలాభములు కలుగును. మహాభారత శాంతిపర్వమునందును, అనుశాసన పర్వమునందును ఈయన యొక్క ఉపదేశ గాథలు చదువదగినవి.

2) అగ్నికి దక్షకన్యయైన 'స్వాహాదేవి' యందు ఇతడు ఉద్భవించినట్లు అచ్చటచ్చట ప్రస్తావింపబడినది. (మహాభారతం - అరణ్యపర్వం - 223) ఈయనను గూర్చి మహాభారతమునందును, పురాణములలోను చిత్రవిచిత్ర గాథలు కలవు.

3) ఇచ్చట సాగరమనగా సర్వసముద్రముల సమష్టిరూపము అని గ్రహింపవలెను.

ప్రశ్న - మహర్షులెవరెవరు? వారి లక్షణములెవ్వి?

సమా - మహర్షులు పెక్కుమంది గలరు. వారి లక్షణములను, వారిలో ముఖ్యులైన పదిమందిని గూర్చి తెలుపబడుచున్నది.

ఈశ్వరాః స్వయముద్భూతా మానసా బ్రహ్మణస్సుతాః ।
యస్మాన్న హన్యతే మానైః మహాన్ పరిగతః పురః ॥
యస్మాదృషంతి యే ధీరా మహాంతం సర్వతో గుణైః ।
తస్మాన్మహర్షయః ప్రోక్తా బుద్ధేః పరమదర్శినః ।
భృగుర్మరీచిరత్రిశ్చ అంగిరాః పులహః క్రతుః ।
మనుర్దక్షో వసిష్ఠశ్చ పులస్త్యశ్చేతి తే దశ ॥
బ్రహ్మణో మానసా హ్యేత ఉద్భూతాః స్వయమీశ్వరాః ।
ప్రవర్తత ఋషేర్యస్మాన్ మహాంస్తస్మాన్ మహర్షయః ॥
(వాయుపురాణం - 59/82,83; 89,90)

వీరు బ్రహ్మమానస పుత్రులు. ఐశ్వర్యవంతులు (అష్టసిద్ధి సంపన్నులు) స్వయముగా ఉద్భవించిన వారు. వీరు ఎవ్వరిచేతను చంపబడరు. (అనగా అపరిమేయులు) వీరు సర్వత్ర వ్యాప్తులైన ప్రత్యక్షముగా గోచరించు మహాత్ములు. వీరు బుద్ధిచే చరమసీమను (స్థితిని) చేరినవారు (భగవత్ప్రాప్తినందినవారు) అనంత కల్యాణ గుణసంపన్నుడైన భగవంతుని మీదనే సర్వవిధముల ఆధారపడినవారగుట వలన మహర్షులు - అని పిలువబడిరి. (మహాంతం ఋషన్తీతి మహర్షయః)భృగు, మరీచి, అత్రి, అంగిరుడు, పులహుడు, క్రతువు, మనువు, దక్షుడు, వసిష్ఠుడు, పులస్త్యుడు, అను వారు పది మంది మహర్షులు. వీరందరును బ్రహ్మమానస పుత్రులు, ఐశ్వర్యవంతులు. స్వయముగా పరమేశ్వరుడే (మహాన్) ఋషి (బ్రహ్మ) నుండి ఈ ఋషుల రూపములో ప్రకటితుడాయెను. కనుక వీరిని మహర్షులని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - మహర్షులలో భృగువును భగవానుడు తన స్వరూపముగా పేర్కొనుటకు కారణమేమి?

సమా - మహర్షులలో భృగువు[1] ప్రముఖుడు. ఇతడు భగవద్భక్తుడు. జ్ఞాని, మహాతేజస్వి. కనుక భగవానుడు ఈయనను తన రూపముగా ప్రకటించెను.

ప్రశ్న - 'గిరామ్' అను పదమునకు అర్థమేమి? 'ఏకమ్ అక్షరమ్' అనగా నేమి? దానిని భగవానుడు తన రూపముగా చెప్పుటలోగల విశేషమేమి?

సమా - అర్థవంతమైన శబ్దమును 'గీః' (వాణి) అని యందురు. ఓంకారమును (ప్రణవమును) 'ఏకమ్ అక్షరమ్' అని యందురు. (8/1) అర్థబోధకములైన శబ్దములన్నింటిలో ప్రణవమే ముఖ్యమైనది ఏలనన ప్రణవము భగవంతుని పేరు. (17/23) ప్రణవమును జపించుటవలన భగవత్ప్రాప్తి కలుగును. నామము, నామి అను రెండును అభేదములని భావింపబడును. కావున భగవానుడు ప్రణవమును తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - సమస్త యజ్ఞములలో జపయజ్ఞము తన స్వరూపముగా తెల్పుటలో విశేషమేమి?

సమా - జప యజ్ఞము నందు హింస ఏ విధముగనూ, ఏ మాత్రమూ ఉండనే ఉండదు. అది భగవత్సాక్షాత్కారమును కల్గించును. మనుస్మృతి యందును జపయజ్ఞము మిక్కిలి ప్రశంసించబడినది.[2] కనుక సమస్త యజ్ఞములలో

1) బ్రహ్మమానస పుత్రులలో భృగువు ఒక ప్రముఖుడు. స్వాయంభువ చాక్షుషాది - అనేక మన్వంతరములలో సప్తర్షి గణములలో ఇతడొకడుగా ఉండెను. ఈయన వంశజులలో పెక్కుమంది ఋషులు మంత్ర ప్రణేతలుగా, గోత్ర ప్రవర్తకులుగా ఉండిరి. మహర్షులలో ఇతడు మిక్కిలి ప్రభావశాలి. ఇతడు దక్షకన్యయైన ఖ్యాతిని వివాహమాడెను. వారికి ధాత, విధాత అను ఇద్దరు పుత్రులు 'శ్రీ' అను పేరుగల ఒక కూతురు జన్మించిరి. ఆమెయే శ్రీమన్నారాయణుని పత్ని. చ్యవనమహర్షియు ఇతని కుమారుడే. జ్యోతిష్మంతుడు, సుకృతి, హవిష్మంతుడు, తపోధృతి, నిరుత్సుకుడు, అతిబాహువు అను పేర్లుగల ఈయన సుతులు వేర్వేరు మన్వంతరముల యందు సప్తర్షులలో ప్రముఖులుగా ఉండిరి. ఇతడు మహామంత్ర ప్రణేత. శ్రీమహావిష్ణువుయొక్క వక్షస్థలముపై తన్ని ఇతడు ఆయన యొక్క సాత్త్విక క్షమాగుణమును పరీక్షించెను. ఇప్పటికిని శ్రీ మహావిష్ణువుయొక్క వక్షస్థలముపై ఈయన పాదచిహ్నములుండును. భృగువు, పులస్త్యుడు, పులహుడు, అంగిరుడు, మరీచి, దక్షుడు, అత్రి, వసిష్ఠుడు అనువారు ప్రజాసృష్టి గావించుటచే వీరిని నవబ్రహ్మలు - అనియు అందురు. పురాణములన్నింటిలోను భృగువును గూర్చిన చర్చ కన్పట్టును. ఈతని జీవితగాథ హరివంశము, మత్స్య, శివ, బ్రహ్మాండ, మార్కండేయ, పద్మ, వాయు పురాణములలోను, దేవీభాగవతము నందును, మహాభారత, శ్రీమద్భాగవతములయందును గలదు.

2) విధి యజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః । ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః ॥ (మనుస్మృతి - 2/85) విధియజ్ఞముకంటెను జపయజ్ఞము పది రెట్లును, ఉపాంశు జపము నూరు రెట్లును, మానస జపము వేయి రెట్లును శ్రేష్ఠమైనదని చెప్పబడినది.

జపయజ్ఞము సర్వశ్రేష్ఠమైనదని తెల్పుటకే భగవానుడు దానిని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - స్థావరములలో హిమాలయము తన స్వరూపమేయని భగవంతుడు తెల్పుటలోని ప్రత్యేకతయేమి?

సమా - స్థిరముగా ఉండు వాటిని స్థావరములని యందురు. పర్వతములన్నియును నిశ్చలముగా ఉండునవి గావున వాటిని స్థావరములని యందురు. వాటిలో హిమాలయము సర్వోత్తమమైనది. అది పరమ పవిత్ర తపోభూమి, ముక్తిసోపానము. భగవత్స్వరూపులైన నరనారాయణులు అచటనే తపమాచరించిరి. పైగా హిమాలయము పర్వతరాజము. కనుక భగవానుడు దానిని తన స్వరూపముగా పేర్కొనెను.

**అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।**
**గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26 ॥**

సర్వవృక్షాణామ్ = సమస్త వృక్షములలో
అశ్వత్థః = రావిచెట్టును నేను
దేవర్షీణామ్ = దేవర్షులలో
నారదః = నారదమునిని
గంధర్వాణామ్ = గంధర్వులలో
చిత్రరథః = చిత్రరథుడను
చ = మఱియు
సిద్ధానామ్ = సిద్ధులలో
కపిలః, మునిః, (అస్మి) = కపిలమునిని నేనే

**వృక్షములలో నేను అశ్వత్థమును (రావిచెట్టును). దేవర్షులలో నారదుడను నేను. గంధర్వులలో నేను చిత్రరథుడను. సిద్ధులలో నేను కపిలమునిని. (26)**

ప్రశ్న - వృక్షములలో 'రావిచెట్టును'[1] భగవంతుడు తన స్వరూపముగా తెల్పుటకు కారణమేమి?

సమా - రావిచెట్టు (అశ్వత్థవృక్షము) వనస్పతులలో శ్రేష్ఠమైనది. పూజార్హమైనది. కనుక భగవానుడు దానిని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - 'దేవర్షి' అని ఎవరిని అందురు? దేవర్షులలో నారదుని భగవానుడు తన స్వరూపముగా పేర్కొనుటకు కారణమేమి?

సమా - దేవర్షి లక్షణములు 12,13 శ్లోకముల వ్యాఖ్యానముల యందు ఇవ్వబడినవి. దేవర్షులలో నారదుడు, సర్వశ్రేష్ఠుడు. పరమభాగవతోత్తముడు, మహాజ్ఞాని. మంత్ర

1) పురాణములయందు అశ్వత్థ వృక్షమాహాత్మ్యము వర్ణింపబడినది. స్కంద పురాణమునందు -
మూలే విష్ణుఃస్థితో నిత్యం, స్కంధే కేశవ ఏవచ ।
నారాయణస్తు శాఖాసు, పత్రేషు భగవాన్ హరిః ।
ఫలేఽచ్యుతో న సందేహః, సర్వదేవైః సమన్వితః ।
స ఏవ విష్ణుర్ద్రుమ ఏవమూర్తో, మహాత్మభిః సేవిత పుణ్యమూలః ।
యస్యాశ్రయః పాపసహస్రహన్తా, భవన్నృణాం కామదుఘో గుణాఢ్యః ॥ (స్కంద-నాగర-247/41,42,44)
రావిచెట్టు యొక్క మూలమునందు విష్ణువు, స్కంధమునందు కేశవుడు, శాఖలయందు నారాయణుడు, పత్రములయందు శ్రీహరి, ఫలములయందు సర్వ దేవతా సమన్వితుడు ఐన అచ్యుతుడు నివసించుచుందురు. ఇందు ఏమాత్రమూ సందేహము లేదు. ఇది మూర్తీభవించిన శ్రీమహావిష్ణుస్వరూపము - పుణ్యఫలప్రదమైన ఈ వృక్షమూలమును మహాత్ములు సేవింతురు. ఈ వృక్షము సకల సద్గుణములు గలది. ఇది కోరిన కోర్కెలెల్ల తీర్చునది. దీనిని ఆశ్రయించిన వారి పాపములన్నియును అంతరించును.

ఇంతేగాదు. వైద్యగ్రంథముల యందును ఈ వృక్షమహిమ ప్రకటింబడినది. దీని పత్రములును, ఫలములును, బెరడును అన్నియునూ రోగములను నశింపజేయును. రక్తవికారము, కఫము, వాతము, పిత్తము, దాహము, వమనము, శోథము (మహోదరము), అరుచి, విషదోషము, దగ్గు, విషజ్వరము, ఎక్కిళ్లు, గుండెమంట, నాసికారోగము, చర్మవ్యాధులు, క్రిమి, కుష్ఠు, అగ్నిదగ్ధ వ్రణములు, మంటలు మొదలగు అనేక వ్యాధులకు ఇది ఔషధముగా ఉపయుక్తమగును.

ద్రష్టలలో శిరోమణి. కనుక భగవానుడు నారదుని తన స్వరూపముగా తెలిపెను. నారదుని గూర్చి 12,13 శ్లోకముల వ్యాఖ్యానములయందు వివరింపబడినది.

ప్రశ్న - గంధర్వులలో భగవంతుడు చిత్రరథుని తన స్వరూపముగా చెప్పుటలోని విశేషమేమి?

సమా - గంధర్వులు దివ్యజాతికి చెందినవారు. వీరు దేవలోకమునందు గాన, వాద్య, నాట్యాభినయములను కావించుచుందురు. స్వర్గమున ఉండువారిలో అందరి కంటెను మిక్కిలి రూపసౌందర్యములు గలవారు. గుహ్యక లోకమునకు పై భాగమునను, విద్యాధరలోకమునకు క్రిందిభాగమునను వీరి గంధర్వలోకము గలదు. దేవతలు, పితరులవలె గంధర్వులును రెండు విధములుగా ఉందురు. మర్త్యులు, దివ్యులు. మరణించిన మానవులు తమ పుణ్యప్రభావమున గంధర్వలోకమును చేరినచో వారిని మర్త్యులందురు. కల్పారంభమునుండియు గంధర్వులుగా నున్నవారు దివ్యులు. దివ్యగంధర్వులలో రెండు శ్రేణులు గలవు. వారు మౌనేయులు, ప్రాధేయులు, కశ్యప మహర్షికి ముని, ప్రాధ అను ఇరువురు పత్నులు గలరు. అప్సరసలు, గంధర్వులలో వీరి సంతానమే ఎక్కువ. భీమసేనుడు, ఉగ్రసేనుడు, సుపర్ణుడు, వరుణుడు, గోపతి, ధృతరాష్ట్రుడు, సూర్యవర్చసుడు, సత్యవాక్కు, అర్కపర్ణుడు, ప్రయుతుడు, భీముడు, చిత్రరథుడు, శాలిశిరసుడు, పర్జన్యుడు, కలి, నారదుడు అను దివ్యగంధర్వులు 'ముని' అను నామె సంతానమగుట వలన వీరు మౌనేయులుగా పిలువబడిరి.

సిద్ధుడు, పూర్ణుడు, బర్హి, పూర్ణాయువు, బ్రహ్మచారి, రతిగుణుడు, సుపర్ణుడు, విశ్వావసువు, సుచంద్రుడు, భానువు, అతిబాహువు, హాహా, హూహూ, తుంబురుడు, అను పదునాలుగు మందియు ప్రాధ అను నామె సంతానమగుట వలన వారు ప్రాధేయులని పిలువబడిరి (మహాభారతం - ఆదిపర్వం - 65) వీరిలో హాహా, హూహూ, విశ్వావసువు, తుంబురుడు, చిత్రరథుడు మొదలగువారు ప్రముఖులు. వీరిలోను చిత్రరథుడు అందరికిని అధిపతి. ఇతడు దివ్యసంగీత విద్యాపారంగతుడు, మరియు అత్యంత నిపుణుడు. కావున భగవానుడు ఇతనిని తన స్వరూపముగా తెల్పెను. ఇతని కథలు అగ్ని, మార్కండేయ, వాయుపురాణాదుల యందును, మహాభారతము - ఆదిపర్వమునందును గలవు.

ప్రశ్న - 'సిద్ధులు' అనగా ఎవరు? వారిలో కపిలమునిని భగవానుడు తన స్వరూపముగా చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - అన్ని విధముల స్థూలసూక్ష్మజగత్తుల సిద్ధులను పొందినవారిని, ధర్మజ్ఞాన-ఐశ్వర్య వైరాగ్యాది శ్రేష్ఠగుణ సంపన్నులైనవారిని సిద్ధులు అని యందురు. ఇట్టి సిద్ధులు వేలకొలది గలరు. వారిలో కపిల భగవానుడు ప్రముఖుడు. కపిలుడు సాక్షాత్తుగా పరమేశ్వరుని అవతారము. మహాయోగియైన కర్దమముని యొక్క పత్నియగు దేవహూతియందు జన్మించి, అతడు తన తల్లికి జ్ఞానోపదేశమొనర్చెను. ఈ కపిలుని అవతార సమయమున స్వయముగా బ్రహ్మ కర్దమముని ఆశ్రమమునకు వచ్చి దేవహూతితో ఇట్లు పలికెను-

అయం సిద్ధగణాధీశః, సాంఖ్యాచార్యైః సుసమ్మతః ।<br>
లోకే కపిల ఇత్యాఖ్యాం, గంతా తే కీర్తివర్ధనః ॥<br>
(శ్రీమద్భాగవతం 3/24/19)

"ఇతడు (నీ పుత్రుడు) సిద్ధగణములకు అధిపతియగును. సాంఖ్యాచార్యులచే పూజితుడై నీ కీర్తిని ఇనుమడింపజేయును. లోకమున కపిలుడను పేరుతో ప్రసిద్ధికెక్కును".

ఇతడు సహజముగనే నిత్యజ్ఞాన-ఐశ్వర్య ధర్మ వైరాగ్యాది సద్గుణ సంపన్నుడు. సిద్ధులలో ఈయనకు సాటియైన వాడే లేడు. ఇక ఇతనిని మించినవాడెవడుండును? అందువలన భగవానుడు సిద్ధులందరిలో కపిలుని తన స్వరూపముగా తెల్పెను.

**ఉచ్చైఃశ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।**<br>
**ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27 ॥**

అశ్వానామ్ = గుఱ్ఱములలో<br>
అమృతోద్భవమ్ = అమృతముతోపాటు ఉత్పన్నమైన<br>
ఉచ్చైఃశ్రవసమ్ = 'ఉచ్చైఃశ్రవము'ను<br>
గజేంద్రాణామ్ = భద్రగజములలో<br>
ఐరావతం చ = ఐరావతమును<br>
నరాణామ్ = మానవులలో<br>
నరాధిపమ్ = రాజును<br>
మామ్ = నన్నుగా<br>
విద్ధి = తెలిసికొనుము.

**అశ్వములలో పాలసముద్రమునుండి అమృతముతో పుట్టిన ఉచ్చైఃశ్రవమును నేను. భద్రగజములలో ఐరావతమును నేను. మనుష్యులలో ప్రభువును నేను. (27)**

ప్రశ్న - అశ్వములలో ఉచ్చైఃశ్రవమును భగవానుడు తన స్వరూపముగా తెల్పుటకు కారణమేమి?

సమా - అమృతము కొరకు క్షీరసాగరమథనము జరిగినప్పుడు అమృతముతోపాటు ఉచ్చైశ్శ్రవము గూడ ఉద్భవించెను. కనుక ఇది పదునాలుగు రత్నములలో ఒకటిగా పరిగణింపబడును. ఇది అశ్వరాజము. కావున భగవానుడు దీనిని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - గజేంద్రులలో ఐరావతమును తన స్వరూపముగా భగవానుడు తెల్పుటలో గల విశేషమేమి?

సమా - గజములలో శ్రేష్ఠమైనదానిని 'గజేంద్రుడు' అని యందురు. అట్టి గజేంద్రులలో సైతము ఐరావతము సర్వశ్రేష్ఠమైనది. ఇది ఇంద్రునకు వాహనము. గజరాజు. ఇదియును ఉచ్చైశ్రవమువలెనే సముద్ర మథన సమయమున క్షీరసాగరము నుండి ఉద్భవించినది - కనుక దీనిని భగవానుడు తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - మనుష్యులలో రాజును భగవానుడు తన స్వరూపముగా తెల్పుటలోగల విశేషమేమి?

సమా- శాస్త్రోక్త లక్షణములతో గూడి, ధర్మపరాయణుడైన రాజు తన ప్రజలను పాపముల నుండి మరల్చి, ధర్మప్రవృత్తులనుగా జేయును. తన ప్రజలందరిని రక్షించుచుండును. కనుక సాధారణ మానవులకంటే రాజు శ్రేష్ఠుడుగా భావింపబడును. ఇట్టి రాజునందు భగవచ్ఛక్తి విలసిల్లుచుండును. కావున భగవానుడు రాజును తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - రాజు అను పదమునకు అర్థమును లోకసామాన్యమైన రాజు అని భావింపక, ప్రతిమన్వంతరము నందును మానవులకు అధిపతియైన 'మనువు' అని భావించిన దోషమేమి? ఈ మన్వంతరమునందు ప్రజాపతి (బ్రహ్మ) వైవస్వతమనువును ప్రజలకు అధిపతిగా చేసిన వృత్తాంతము ప్రసిద్ధమైనది.

మనుష్యాణామధిపతిం చక్రే వైవస్వతం మనుమ్
(వాయుపురాణం-70/18)

సమా - ఇట్లు భావించుటలో దోషమేమియు లేదు -వైవస్వతమనువుగూడ నరాధిపునిగా (రాజుగా) భావింపవచ్చును.

## ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
## ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ 28 ॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఆయుధానామ్ | = ఆయుధములలో | కామధుక్, అస్మి | = కామధేనువును నేను | చ | = మఱియు |
| వజ్రమ్, అహమ్ | = వజ్రాయుధమును నేను | ప్రజనః | = సంతానోత్పత్తికి కారణమైన | సర్పాణామ్ | = సర్పములలో |
| ధేనూనామ్ | = పాడియావులలో | కందర్పః, అస్మి | = మన్మథుడను నేను | వాసుకిః, అస్మి | = వాసుకిని నేను. |

**ఆయుధములలో వజ్రాయుధమును నేను. పాడిఆవులలో కామధేనువును నేను. శాస్త్రవిహితరీతిలో సంతానోత్పత్తికి కారణమైన మన్మథుడను నేను. సర్పములలో వాసుకిని నేను. (28)**

ప్రశ్న - శస్త్రములలో వజ్రాయుధమును తన స్వరూపముగా భగవంతుడు తెల్పుటలోని విశేషమేమి?

సమా - శస్త్రములన్నింటిలో వజ్రాయుధము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఏలనన వజ్రాయుధమునందు దధీచి మహర్షియొక్క తపోబలము, సాక్షాత్తు భగవంతుని తేజస్సు విరాజిల్లుచుండును. అది అమోఘమైనదిగా భావింపబడును. (శ్రీమద్భాగవతం-6/11/19-20) కనుక భగవానుడు వజ్రాయుధమును తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - పాడి ఆవులలో కామధేనువును భగవంతుడు తన స్వరూపముగా తెల్పుటలోని విశేషమేమి?

సమా- కామధేనువు గోవులన్నింటిలోను శ్రేష్ఠమైనది, దివ్యమైనది, ఇది దేవమానవుల సమస్త మనోరథములను

పూర్తిగా తీర్చునది. ఇదియును సముద్ర మథన సమయమున క్షీరసాగరమునుండి ఉద్భవించినదే. కనుక దీనిని (కామధేనువును) భగవానుడు తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - 'కందర్పః' అను పదముతోపాటు 'ప్రజనః' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'కందర్పః' అను పదము మన్మథుని దెల్పును. ధర్మమార్గమున సంతానోత్పత్తికి మూలమైన కామమును భగవానుడు తన విభూతిగా తెల్పుటకే 'ప్రజనః' అను విశేషణమును ప్రయోగించెను. 7వ అధ్యాయమునందలి 11వ శ్లోకమున గూడ 'కామము' అను పదముతో పాటు 'ధర్మావిరుద్ధః' విశేషణమును ప్రయోగించి, భగవానుడు ఈ భావమునే ప్రకటించెను. ఇంద్రియలోలురైన మనుష్యులు విషయేంద్రియముల తృప్తికై అనుభవించు కామము నికృష్టమైనది. అది ధర్మానుకూలమైనది కాదు. కాని శాస్త్ర విధిని అనుసరించి, సంతానోత్పత్తికై జితేంద్రియులైన పురుషుల కామమే ధర్మానుకూలమగుట వలన శ్రేష్ఠమైనది. కనుక భగవానుడు దానిని తన విభూతులలో ఒకటిగా పేర్కొనెను.

ప్రశ్న - సర్పములలో వాసుకిని భగవానుడు తన స్వరూపముగా పేర్కొనుటలోని విశేషమేమి?

సమా- వాసుకి సమస్త సర్పములకు రాజు. భగవద్భక్తుడు. కనుక సర్పములలో శ్రేష్ఠుడుగా భావింపబడును. అందువలన భగవానుడు వాసుకిని తన స్వరూపముగా తెల్పెను.

**అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।**
**పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్ ॥ 29 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| నాగానామ్ | = నాగజాతివారిలో | వరుణః, | = వరుణుడను | అర్యమా | = అర్యముడను |
| అనంతః, అహమ్ | = ఆదిశేషుడను నేను | అహమ్, అస్మి | నేను | సంయమతామ్ | = శాసించువారిలో |
| చ | = మఱియు | చ | = మఱియు | (అహమ్) యమః, అస్మి | = నేను యముడను. |
| యాదసామ్ | = జలచరములకు అధిపతియైన | పితౄణామ్ | = పితరులలో | | |

నాగజాతివారిలో ఆదిశేషుడ(అనంతుడ)ను నేను. జలచరములకు అధిపతియైన వరుణుడను నేను. పితరులలో అర్యముడను (పితృగణప్రభువును) నేను. శాసకులలో యమధర్మరాజును నేను.(29)

ప్రశ్న - నాగులలో ఆదిశేషుని భగవానుడు తన స్వరూపముగా పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - ఆదిశేషుడు నాగజాతికి ప్రభువు. వేయి పడగలుగలవాడు. శ్రీ మహావిష్ణువునకు శయ్యగా నుండి అనవరతము ఆయనను సేవించుచు ఆనందమును గూర్చుచుండువాడు. భగవంతునకు పరమ భక్తుడు. పెక్కు పర్యాయములు ఆయనకు తోడుగా అవతారములను దాల్చి భగవల్లీలలయందు పాలుపంచుకొన్నవాడు. ఇతడును భగవానునినుండియే ఉద్భవించెను.[1] కనుక భగవానుడు ఇతనిని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - జలచరములకు అధిపతియైన వరుణుని తన స్వరూపముగా పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - వరుణుడు సమస్త జలచరములకును, జలదేవతలకును అధిపతి. ఇతడు పశ్చిమ దిశకు లోకపాలకుడు, దేవతలలో ఒకడు. భగవద్భక్తుడు, శ్రేష్ఠుడు అగుటవలన భగవానుడు ఇతనిని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - పితరులలో అర్యముని భగవానుడు తన స్వరూపముగా తెలుపుటలోని విశేషమేమి?

1) శేషం చాకల్పయద్దేవమనంతం విశ్వరూపిణమ్ । యో ధారయతి భూతాని ధరాం చేమాం సపర్వతామ్ ॥
(మహాభారతం, భీష్మ-67/13)

పరమేశ్వరుడు విశ్వరూపుడైన 'అనంతుడు' అను పేరుగల ఆదిశేషుని సృష్టించెను. అతడు దివ్యస్వరూపుడు. అతడు పర్వతములతో కూడియున్న భూభారమును, సమస్త ప్రాణులను వహించుచున్నాడు.

సమా - కవ్యవాహుడు, అనలుడు, సోముడు, యముడు, అర్యముడు, అగ్నిష్వాత్తుడు, బర్హిషదుడు, అను ఏడుగురును పితృదేవతలు.[1] వీరిలో అర్యముడు ప్రముఖుడు. కనుక అతనిని భగవానుడు తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - శాసించువారిలో యముని తన స్వరూపముగా తెల్పుటలోని విశేషమేమి?

సమా - మర్త్యలోకమునందును, దేవలోకమునందును శాసించు అధికారులలో యమధర్మరాజు ప్రధానుడు. ఇతడు విధించు శిక్షలన్నియును న్యాయముగా ధర్మయుక్తముగా హితకరముగా పాపములనుండి విముక్తి కలిగించునవిగా ఉండును. ఇతడు భగవద్భక్తుడు. జ్ఞాని, లోకపాలుడు. దక్షిణ దిశాధిపతి - కనుక భగవానుడు ఇతనిని తన స్వరూపముగా తెల్పెను.[2]

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।**
**మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥ 30 ॥**

---

1) కవ్యవాహోఽనలః సోమో యమశ్చైవార్యమా తథా! అగ్నిష్వాత్తా బర్హిషదస్త్ర యశ్చాన్యా హ్యమూర్తయః ॥
(శివపురాణం, ధర్మ 63/2)

అచ్చటచ్చట వీరి నామములు ఈ విధముగా కన్పట్టును - సుకాలుడు, అంగిరసుడు, సుస్వధ, సోమప, వైరాజ, అగ్నిష్వాత్త, బర్హిషద - (హరివంశం-పూర్వ-అ.18) మన్వంతర భేదమును బట్టి పేర్లలో భేదముండుట సంభవమే.

2) యమధర్మరాజు సమవర్తి. ఆయన ఆస్థానమున ఎవ్వరియెడలను, ఏ కారణమునను ఎట్టి పక్షపాతమునకును తావే ఉండదు. ఏవిధమైన సిఫారసు గాని, లంచములుగాని, కాకాపట్టుటగాని అచట చెల్లవు. యముని నియమములు అతికఠోరములు. వాటియందేమాత్రము సడలింపునకు అవకాశమే యుండదు. కనుక శాసకులందరిలో శ్రేష్ఠుడుగా భావింపబడును - ఇంద్రుడు, అగ్ని, నిర్ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు, బ్రహ్మ, అనంతుడు, యముడు అనువారు దశదిక్పాలకులు. (బృహద్ధర్మపురాణం - ఉత్తర - 9) వీరు సమష్టి జగత్తుయొక్క దిశలన్నింటికిని సంరక్షకులు. పుణ్యాత్ములైన జీవులకు యముడు సహజముగానే సౌమ్యమూర్తిగా కనబడునని చెప్పుదురు. పాపులకు మిక్కిలి నల్లని భయంకర రూపముతో రక్తనేత్రములతో భీతిని గొలుపు దవడలతో, మెఱుపులను విరజిమ్ముచున్న నాలుకతో నిక్కపొడుచుకొని భయమును గొలుపుచున్న కేశములతో, భయానకమైన ఆకృతితో చేతిలో కాలదండమును ధరించి దర్శనమిచ్చును. (స్కందపురాణం - కాశీఖండము - పూర్వ-8/55,56) ఇతడు ఉత్తమజ్ఞాని. నచికేతునకు ఇతడు ఆత్మతత్త్వజ్ఞానమును బోధించెను. (కఠోపనిషత్తు నందును మహాభారత - అను శాసన పర్వమునందును వరాహ పురాణము నందును నచికేతుని వృత్తాంతములు గలవు) యమధర్మరాజు గొప్ప భగవద్భక్తుడు. శ్రీమద్భాగవతమునందలి 6వ స్కంధము 3వ అధ్యాయమునందును, విష్ణు పురాణమునందలి తృతీయాంశ - 7వ అధ్యాయమునందును, స్కంద పురాణ, కాశీఖండ పూర్వార్ధమున 8వ అధ్యాయమున- ఇతడు తన దూతలయెదుట భగవంతుని మహిమను, భగవన్నామ మహత్త్వమును వర్ణించెను. అది అందఱికిని అవశ్య పఠనీయము.

కాని మహాధర్మాత్ముడైన ఇతనిని గూడ అప్పుడప్పుడు కొందఱు తికమక పెట్టుచుందురు. స్కంద పురాణమునందు ఒక కథ గలదు - కీర్తిమంతుడను చక్రవర్తి మహాభక్తుడు. అతని సదుపదేశములవలన ప్రజలెల్లరును సదాచార సంపన్నులును పరమ భక్తులును ఐరి. వారి పుణ్యప్రభావమున అంతకుముందు యమలోకమునకు చేరి యాతనలకు లోనైన జీవులును క్రమముగా సద్గతిని బొందిరి. నారికాలమున ప్రస్తుతము మరణించువారును పరమగతినే పొందసాగిరి. ఈ కారణమున యమలోకమునకు క్రొత్త జీవుల రాకలు నిలిచిపోయెను. ఈ విధముగా యమలోకము శూన్యమాయెను. అప్పుడితడు (యముడు) బ్రహ్మదేవునితో మొరపెట్టుకొనెను. అతడు ఇతనిని శ్రీమహావిష్ణువు కడకు పంపెను. విష్ణువు యమునితో ఇట్లనెను- "ధర్మాత్ముడును, భక్తుడును ఐన కీర్తిమంతుడు జీవించియున్నంత వఱకును ఇట్లే జరుగును. కాని జగత్తునందు ఎప్పటికిని ఈ స్థితియే కొనసాగదు." ( స్కంద పురాణము - విష్ణు - వై - 11/12/13)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| దైత్యానామ్ | = దైత్యులలో | కాలః, అస్మి | = నేను సమయమును | చ | = మఱియు |
| అహమ్, ప్రహ్లాదః | = నేను ప్రహ్లాదుడను | చ | = మరియు | పక్షిణామ్ | = పక్షులలో |
| చ | = మఱియు | మృగాణామ్ | = మృగములలో | అహమ్, | = నేను |
| కలయతామ్ | = గణకులలో | మృగేంద్రః | = మృగరాజైన సింహమును నేను | వైనతేయః (అస్మి) | గరుత్మంతుడను. |

దైత్యులలో నేను ప్రహ్లాదుడను. గణించువారిలో (గణకులలో) నేను కాలమును. మృగములలో మృగరాజు ఐన సింహమును నేను. పక్షులలో పక్షిరాజైన గరుత్మంతుడను నేనే. **(30)**

ప్రశ్న - భగవానుడు దైత్యులలో ప్రహ్లాదుని తన స్వరూపముగా తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - దితికి పుట్టినవారు దైత్యులు. ఆ వంశజులలో ప్రహ్లాదుడు ఉత్తమోత్తముడు. ఏలనన ఇతడు సర్వసద్గుణ సంపన్నుడు. పరమధర్మాత్ముడు. మిక్కిలి భక్తిశ్రద్ధలు గలిగిన మహాభగవద్భక్తుడు. దైత్యులకురాజు. కనుక భగవానుడు ఇతనిని తన స్వరూపముగా పేర్కొనెనుట

ప్రశ్న - కాలశబ్దము దేనిని సూచించును? దానిని భగవానుడు తన స్వరూపముగా తెల్పుటలోని విశేషమేమి?

సమా - ఇచట 'కాల' శబ్దము క్షణము, గడియ, దినము, పక్షము, మాసము మొదలగు పేర్లలో వ్యవహరింపబడు సమయమును సూచించును. గణిత విద్యావేత్తల గణనమునకు ఇది ఆధారము - కనుక కాలమును భగవానుడు తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - సింహము హింసాత్మక జంతువు గదా! దానిని భగవానుడు తన విభూతిగా ఎట్లు పేర్కొనెను?

సమా - సింహము మృగరాజు. ఇది అన్ని జంతువుల కంటెను బలశాలి, పరాక్రమశాలి, తేజస్వి, సాహసి. కనుక భగవానుడు సింహమును తన విభూతిగా పేర్కొనెను.

ప్రశ్న - పక్షులలో గరుడుని తన స్వరూపముగా భగవానుడు పేర్కొనుటలో గల విశేషమేమి?

సమా - వినతాసుతుడైన గరుడుడు పక్షులకు రాజు. పక్షులన్నింటిలో పెద్దయగుట వలన శ్రేష్ఠుడుగా భావింపబడును. పైగా ఇతడు శ్రీ మహావిష్ణువునకు వాహనము. పరమ భక్తుడు. అత్యంత పరాక్రమశాలి. కనుక భగవానుడు గరుడుని తన స్వరూపముగా పేర్కొనెను.

**పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ 31 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పవతామ్ | = పవిత్రమొనర్చువానిలో | రామః, అస్మి | = శ్రీరాముడను నేను | చ | = మఱియు |
| పవనః, అహమ్ | = వాయువును నేను | ఝషాణామ్ | = మత్స్యములలో | స్రోతసామ్ | = నదులలో |
| శస్త్రభృతామ్ | = శస్త్రధారులలో | మకరః, అస్మి | = మొసలిని నేను | జాహ్నవీ, అస్మి | = గంగానదిని నేను[1] |

పవిత్రమొనర్చు వానిలో వాయువును నేను, శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను నేను. మత్స్యములలో మొసలిని నేను. నదులలో గంగానదిని నేను. **(31)**

1) ధాతుః కమండలుజలం తదురుక్రమస్య పాదావనేజనపవిత్రతయా నరేంద్ర ।
స్వర్ధున్యభూన్నభసి సా పతతీ నిమార్ష్టి, లోకత్రయం భగవతో విశదేవ కీర్తిః ॥ (శ్రీమద్భాగవతం-8-21/4)
ఓ రాజా! ఆ బ్రహ్మదేవుని కమండలు జలము భగవంతుని చరణములను కడుగుట వలన 'స్వర్గగంగ' (మందాకిని) అయ్యెను. ఆ గంగ భగవంతుని నిర్మలకీర్తితో తుల్యమై ఆకాశమునుండి భువిపైబడి ఇప్పటికిని ముల్లోకములను పవిత్ర మొనరించుచున్నది-

న హ్యేతత్ పరమాశ్చర్యం స్వర్ధున్యా యదిహోదితమ్ । అనంతచరణాంభోజప్రసూతాయా భవచ్ఛిదః ।
సన్నివేశ్య మనో యస్మిన్ శ్రద్ధయా మునయోఽమలాః । త్రైగుణ్యం దుస్త్యజం హిత్వా సద్యో యాతాస్తదాత్మతామ్ ॥
(శ్రీమద్భాగవతం 99/14,15)

ప్రశ్న - 'పవతాం' అను పదమునకు మిక్కిలి వేగము కలవారు అనిఅర్థమును చెప్పిన దోషమేమి?

సమా - వ్యాకరణ (శబ్దశాస్త్ర) దృష్టితో 'పవతాం' అను పదమునకు 'వేగవాన్' అను అర్థము సరికాకున్నను టీకాకారులు దానిని గూడ సమ్మతించిరి. కావున అట్టి అర్థమును గూడ స్వీకరింపవచ్చును. తీవ్ర వేగ గమనులలో గూడ వాయువు శ్రేష్ఠుడు. అట్లే పవిత్రమొనర్చు వారిలో గూడ అతడు శ్రేష్ఠుడు. కనుక రెండు విధములుగను వాయువునకు శ్రేష్ఠత్వము గలదు.

ప్రశ్న - 'రామ' శబ్దము ఎవరిని తెలుపును? అయనను భగవానుడు తన స్వరూపముగా పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - 'రామ' శబ్దము దశరథ పుత్రుడైన శ్రీరామచంద్రుని తెల్పును. వేర్వేరు యుగములలో అనేక విధముల లీలలను ప్రదర్శించుటకై భగవానుడు వివిధ రూపములను స్వీకరించును. స్వయముగా భగవానుడే శ్రీరామచంద్రునిగా అవతరించెను. శ్రీరామచంద్రునకును శ్రీకృష్ణునకును మధ్య ఎట్టి భేదములేదు. కనుక భగవానుడు శస్త్ర ధారులలో శ్రీరామచంద్రుని తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - మత్స్యములలో మొసలిని తన విభూతిగా భగవంతుడు తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - నానావిధములైన మత్స్యములన్నింటిలో మొసలి మిక్కిలి బలీయమైనది. మహా శక్తిశాలి. కనుక మత్స్యములలో మొసలిని భగవానుడు తన విభూతిగా పేర్కొనెను.

ప్రశ్న - నదులలో జాహ్నవి (గంగానది) ని భగవానుడు తన స్వరూపముగా పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - జాహ్నవి అనగా భాగీరథి. గంగానది నదులన్నింటిలో మిక్కిలి శ్రేష్ఠమైనది. శ్రీ మహావిష్ణువు యొక్క చరణములనుండి ఉద్భవించినది. పరమ పవిత్రమైనది. పురాణేతిహాసముల యందు గంగానది మిక్కిలి మాహాత్మ్యము కలదిగా వర్ణింపబడినది. ఇంతేగాక, ఒకసారి శ్రీమహావిష్ణువు ద్రవరూపముగా మారి బ్రహ్మకమండలములో చేరి గంగారూపమును పొందినట్లు వృత్తాంతము గలదు. ఇట్లు సాక్షాత్తు ఆ పరబ్రహ్మమే ద్రవరూపమగుట వలన గంగ మిక్కిలి మహిమోపేతమయ్యెను.[1] కనుక భగవానుడు గంగను తన స్వరూపముగా తెల్పెను.

---

అనంతుడైన భగవానుని చరణ కమలములయందు భక్తిశ్రద్ధలతో చిత్తమును లగ్నముచేయుచు నిర్మల హృదయులైన మునులు వెంటనే దుస్త్యజములైన త్రిగుణాత్మకములైన ప్రాపంచిక బంధములనుండి విముక్తిని పొంది, ఆయన స్వరూపమునే పొందుదురు. అట్టి మహిమాన్వితములైన భగవచ్చరణకమలములనుండియే ఉద్భవించిన గంగా భవాని పరమ పునీత. మహామహిమాన్విత. ఆమె లోకుల భవబంధములను త్రెంచివైచి, వారికి ముక్తిని ప్రసాదించుటలో ఆశ్చర్యములేదు.

1) జగజ్జనని, మహేశ్వరి, దక్షకన్యయైన సతీదేవి దేహత్యాగము చేసినప్పుడు పరమేశ్వరుడు (శంకరుడు) తపమొనరింపసాగెను. దేవతలు జగన్మాతను స్తుతించిరి. మహేశ్వరి వారికి ప్రత్యక్షమాయెను. శంకరుని వివాహమాడుము అని వారు ఆ దేవిని ప్రార్థించిరి. అప్పుడు దేవి ఇట్లు పలికెను- "నేను రెండు రూపములతో సుమేరు కన్యయైన మేనక గర్భమునందు పర్వత రాజైన హిమవంతుని మందిరమున జన్మించెదను. తదనంతరము ఆమె మొదట గంగారూపమున ప్రకటితయయ్యెను. దేవతలు ఆమెను స్తుతించి, దేవలోకమునకు గొనిపోయిరి. అచట ఆమె మూర్తిమతియై శంకరునితోపాటు దివ్య కైలాసధామమును అలంకరించెను. బ్రహ్మదేవుని ప్రార్థనపై అంతర్ధానాంశతో అనగా నిరాకార రూపముతో ఆయన కమండలువునందు ప్రవేశించెను. ("అంతర్ధానాంశ భాగేన స్థితా బ్రహ్మకమండలౌ") బ్రహ్మదేవుడు ఆమెను తన కమండలమునందు బ్రహ్మలోకమునకు గొనిపోయెను. - అటు పిమ్మట ఒక పర్యాయము శంకరుడు గంగతో కూడి వైకుంఠమునకు వెళ్ళెను. అచ్చట శ్రీమహావిష్ణువు కోరికపై అతడు వివిధ రాగములతో గానము చేసెను. ఆయన ఆలపించిన రాగములన్నియును యుక్త రూపములను దాల్చెను. శ్రీరాగము ఆలపింపగా ఆ రాగము మూర్తిమతియయ్యెను. ఆ రాగిణిని చూచి ముగ్ధుడై, రసమయుడైన నారాయణుడు స్వయముగా రసరూపుడై ప్రవహింప సాగెను. బ్రహ్మదేవుడాలోచించెను. "పరబ్రహ్మము నుండి జనించిన సంగీతము (నాదబ్రహ్మము) బ్రహ్మమయమే. పరబ్రహ్మమైన శ్రీహరి ఈ సమయమున ద్రవీభవించెను. కనుక బ్రహ్మమయమైన గంగ ఆ శ్రీహరిలో లీనముగుగాక" - అని ఆలోచించి, అతడు బ్రహ్మద్రవమునకు తన కమండలమును తాకించెను. వెంటనే, ఆ పరబ్రహ్మ (విష్ణు) ద్రవమంతయును గంగలో మిళితమాయెను. నిరాకార గంగ జలమయ మాయెను. బ్రహ్మదేవుడు తన లోకమునకు వెడలిపోయెను. పిమ్మట మహావిష్ణువు వామనావతారమున

సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥ 32 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున! | = ఓ అర్జునా! | విద్యానామ్ | = విద్యలలో | | వివాదములలో |
| సర్గాణామ్ ఆదిః, | సృష్టిపరంపరకు | అధ్యాత్మవిద్యా | = అధ్యాత్మ(బ్రహ్మ) | వాదః, అహమ్ = | తత్త్వ నిర్ణయమునకై |
| మధ్యమ్, అంతశ్చ, | ఆదిమధ్యాంతములు | | విద్యను నేను | | చేయువాదమును |
| అహమ్, ఏవ = | నేనే | ప్రవదతామ్ | = పరస్పర వాద | | నేను |

**ఓ అర్జునా! సృష్టికి ఆదిమధ్యాంతములు నేను. (సృష్టి స్థితిలయ కారకుడను నేనే). విద్యలలో అధ్యాత్మవిద్యను అనగా బ్రహ్మవిద్యను నేను. పరస్పరవాదవివాదములలో తత్త్వనిర్ణయమునకై చేయు 'వాదము'ను నేను.(32)**

ప్రశ్న - భగవానుడు తాను ప్రాణులకు ఆది మధ్యాంతములు అయిన వానినిగా 20వ శ్లోకమున తెలిపెను. మరల ఇచ్చట సర్గమునకు (సృష్టికి) ఆది మధ్యాంతములు తానే అని తెలుపుచున్నాడు. ఇందు పునరుక్తి దోషము లేదా?

సమా - ఇచట పునరుక్తి దోషము లేదు. ఏలనన అచట భూతశబ్దము చేతన ప్రాణులను తెల్పును. ఇచట జడచేతనయుతమైన సమస్తవస్తుజాలము, లోకములతో గూడిన సంపూర్ణ సృష్టిని తెల్పును.

ప్రశ్న - సమస్త విద్యలలో 'అధ్యాత్మ' విద్యను తన స్వరూపముగా తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆత్మకు సంబంధించిన విద్యను 'అధ్యాత్మవిద్య' లేక 'బ్రహ్మవిద్య' అని యందురు. ఆది ఆత్మ తత్త్వజ్ఞానమును వికసింపజేయును. దీని ప్రభావముచే అనాయాసముగ బ్రహ్మ సాక్షాత్కారము కలుగును. జగత్తునందలి జ్ఞాతాజ్ఞాత విద్యలన్నియును ఈ బ్రహ్మవిద్యయందు దిగదుడుపే. ఏలననగా అట్టి విద్యల వలన ప్రాపంచిక బంధములు విడిపోవు. సరిగదా! ఇంకను బలపడును. కాని ఈ బ్రహ్మ విద్యవలన అజ్ఞానపు ముడి శాశ్వతముగా విడిపోయి, పరమాత్మస్వరూప సాక్షాత్కారము గలుగును. కావున ఈ అధ్యాత్మవిద్య అన్నివిద్యలలో శ్రేష్ఠమైనది. అందువలన భగవానుడు దీనిని తన స్వరూపముగా తెలిపెను.

ప్రశ్న - వాదమును భగవంతుడు తన విభూతిగా తెలుపుటలోని విశేషమేమి?

సమా - శాస్త్రార్థ చర్చలకు (తర్కమునకు) మూడు స్వరూపములు (పద్ధతులు) ఉండును. 1. జల్పము, 2. వితండము, 3. వాదము. ఉచితానుచితములను పాటింపక తన పక్షమున మండనము, ఎదుటి పక్షమును ఖండనము చేయు వివాదమును 'జల్పము' అని యందురు. కేవలము ఎదుటి పక్షమువారి చర్చను ఖండించుటకే చేయు వివాదమును 'వితండము' అని యందురు. తత్త్వనిర్ణయమును చేయు ఉద్దేశ్యముతో నిర్మలమైన మనస్సుతో చేయు చర్చను 'వాదము' అని యందురు. జల్పము, వితండములనుండి, ద్వేషము క్రోధము, హింస, దురభిమానాది దోషములు సంభవించును. వాదము సత్య (ధర్మ) నిర్ణయమునందును, శ్రేయోదాయక సాధనమునందును తోడ్పడును. జల్ప, వితండ చర్చలు త్యాజ్యములు. వాదము గ్రాహ్యము సందర్భమునుబట్టి అనుసరణీయము. ఈ కారణమున భగవానుడు 'వాదమును' తన విభూతిగా పేర్కొనెను.

---

తన సాత్త్విక పాదముతో సర్వదివ్యలోకములను కొలిచెను. అప్పుడు బ్రహ్మతన కమండలములోని ఆ నీటితోనే భగవంతుని (విష్ణు) పాదమును కడిగెను. కమండల జలముతో ప్రక్షాళితమైన ఆ పాదము అచటనే స్థిరముగా నుండెను. భగవంతుడంతర్ధానమైన తరువాత గూడ ఆ దివ్యచరణము అచ్చటనే స్వర్గగంగతోపాటు ఉండెను. ఆ పాదమునుండి ఉత్పన్నమైన గంగను భగీరథుడు తన పూర్వజులను ఉద్ధరించుటకై తీవ్రముగా తపమాచరించి, ఆ గంగను భువికి తీసుకొని వచ్చెను. ఇచ్చట గూడ పరమేశ్వరుడు ఆమెను తన శిరమున దాల్చెను. గంగా మాహాత్మ్యమును వర్ణించు ఈ ఘట్టము అతి సుందరమైనది. ఉపదేశప్రదమైనది. విచిత్రమైనది. ఇది బృహద్ధర్మ పురాణ మధ్యఖండమున 12 నుండి 28 అధ్యాయము వఱకు విస్తృతముగా వర్ణింపబడినది."

**అక్షరాణామకారోఽస్మి ద్వంద్వః సామాసికస్య చ ।**
**అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥ 33 ॥**

| | | |
|---|---|---|
| అక్షరాణామ్ = అక్షరములలో | ద్వంద్వః, అస్మి = ద్వంద్వ సమాసమును నేను | విశ్వతోముఖః = సర్వతోముఖుడనైన విరాట్ పురుషుడను నేను |
| అకారః, అహమ్ = 'అ'కారమును నేను | అక్షయః, కాలః = మహాకాలమును నేను | ధాతా, అహమ్, ఏవ(అస్మి) = ధరించి, పోషించు వాడను నేనే. |
| చ = మఱియు | | |
| సామాసికస్య = సమాసములలో | | |

**అక్షరములలో "అ" కారమును నేను. సమాసములలో 'ద్వంద్వ' సమాసమును నేను. అక్షయకాలము అనగా మహాకాలమును నేను. అట్లే విశ్వతోముఖుడైన విరాట్ పురుషుడను నేను. అందరిని ధరించువాడను, పోషించువాడను నేను. (33)**

ప్రశ్న - అక్షరములలో 'అ'కారమును భగవానుడు తన స్వరూపముగ తెల్పుటలోని విశేషమేమి?

సమా - స్వర, వ్యంజనాది అక్షరములన్నింటి యందును 'అ' కారము మొదటిది. అది అన్నింటి యందును వ్యాప్తి చెందినది. 'శ్రుతి' యందు ఇట్లు తెల్పబడినది-

"అకారో వై సర్వా వాక్"

(ఐతరేయబ్రాహ్మణము).పూ 3/6)

వాక్కంతయు'అకార' స్వరూపమే. ఈ కారణముల వలన 'అకారము' వర్ణములన్నింటి యందును శ్రేష్ఠమైనది. కనుక భగవానుడు దానిని తన స్వరూపముగా తెలిపెను.

ప్రశ్న - వివిధములగు సమాసములలో ద్వంద్వ సమాసమును తన విభూతిగా భగవంతుడు తెలుపుటలోని విశేషమేమి?

సమా - ద్వంద్వ సమాసమునందు పూర్వోత్తర పదముల అర్థములకు ప్రాధాన్యము కలదు.[1] (ఉభయ పదార్థ ప్రధానః ద్వంద్వః) అందువలన ఇతర సమాసములకంటెను అది శ్రేష్ఠమైనది. కనుక భగవానుడు దానిని తన విభూతులలో చేర్చెను.

ప్రశ్న - భగవంతుడు కాలమును తన స్వరూపముగా 30వ శ్లోకమున తెలిపెను. దానికిని ఈ శ్లోకమున తెల్పబడిన కాలమునకును గల భేదమేమి?

సమా - 30వ శ్లోకమున తెల్పబడిన కాలము కల్పము, యుగము, సంవత్సరము, అయనము, మాసము, దినము, గడియ, క్షణము మొదలగు పేర్లతో పిలువబడు సమయమును తెల్పును. అది ప్రకృతి కార్యము. మహాప్రలయమున ఉండదు. కనుక అది అక్షయము గాదు.

1) సంస్కృత వ్యాకరణమునుసరించి సమాసములు నాల్గు విధములు - 1. అవ్యయీభావము 2. తత్పురుషము. 3. బహువ్రీహి 4. ద్వంద్వము. కర్మధారయము, ద్విగువు అనునవి తత్పురుష సమాసమునందు అంతర్గతములే. అవ్యయీభావ సమాసమునందు పూర్వోత్తర పదములలో పూర్వ పదముయొక్క అర్థమునకు ప్రాధాన్యము కలదు

- ఉదా - అధిహరి అను సమాసమునకు "హరౌ" అనగా హరియందు అని యర్థము - ఇచట 'అధి' అను శబ్దము సప్తమీ విభక్త్యర్థకము- దానిని తెలుపుటయే ఇచటి ఉద్దేశ్యము. తత్పురుష సమాసమునందు ఉత్తర పదముయొక్క అర్థమునకు ప్రాముఖ్యము గలదు. 'సీతాపతిం' వందే - అను వాక్యములో 'సీతాపతి' తత్పురుష సమాసము - సీతాపతి యనగా సీత యొక్క పతి అనగా శ్రీరాముడు. ఈ సమాసములో ఉత్తర పదమైన 'పతి' శబ్దార్థమునకు ప్రాధాన్యము గలదు. బహువ్రీహి సమాసము అన్య పదముయొక్క అర్థప్రాధాన్యము కల్గియుండును. ఉదా - 'పీతాంబరః' అనగా పసుపువన్నె వస్త్రము గలవాడు, అనగా భగవంతుడు. ఇచట పూర్వపదమైన 'పీత' అను శబ్దము యొక్క అర్థమునకుగాని, ఉత్తర పదమైన 'అంబర' అను శబ్దము యొక్క అర్థమునకు గాని ప్రాముఖ్యములేదు. ఈ రెండింటికిని వేఱైన (అన్యమైన) శబ్దార్థమునకు (ఇచట విష్ణువునకు) ప్రాధాన్యము గలదు. ద్వంద్వ సమాసమునందు రెండు (పూర్వోత్తర) పదములయొక్క అర్థములకును ప్రాముఖ్యము గలదు. ఉదా- 'రామలక్ష్మణౌ పశ్య' అను వాక్యమున 'రామలక్ష్మణౌ' అను సమాసమునకు రాముని మఱియు లక్ష్మణుని చూడుము అని యర్థము. కనుక ఇచట ఉభయ పదముల యొక్క అర్థములకును ప్రాముఖ్యము గలదు.

కాని ఈ శ్లోకమునందు వర్ణింపబడిన కాలము సనాతనము, శాశ్వతము, అనాది, అనంతము, నిత్యము, సాక్షాత్తు పరబ్రహ్మ పరమాత్మ స్వరూపము. కనుక దీనికి అక్షయము అను విశేషణము ప్రయుక్తమైనది. కావున 30వ శ్లోకమున వర్ణితమైన కాలమునకును దీనికిని మధ్య మిక్కిలి భేదము గలదు. అది ప్రకృతి కార్యము. ఇది ప్రకృతికి సర్వథా అతీతము.[1]

ప్రశ్న - 'అన్నివైపుల ముఖములు గల (విశ్వతో ముఖః) 'ధాతా' అనగా అన్నింటిని ధరించి, పోషించు వాడను నేనే' అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - భగవంతుడు 'విరాట్' రూపముతో తన ఏకత్వమును ప్రకటించెను. అందరిని ధరించి, పోషించు వాడను, సర్వ వ్యాపియు, విరాడ్రూపుడునైన పరమేశ్వరుడను తానేయనియు, తనకంటే వేరైనది మరియొకటి లేదనియు తెల్పుటకు 'విశ్వతోముఖః' అని పేర్కొనెను.

మృత్యుః సర్వహరశ్చాహమ్ ఉద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వహరః | = సర్వప్రాణులను | | నేను | స్మృతిః | = స్మృతిని |
| | హరించునట్టి | చ | = మఱియు | మేధా | = మేధను |
| మృత్యుః, అహమ్ | = మృత్యువును నేను | నారీణామ్ | = స్త్రీలలో | ధృతిః | = ధృతిని |
| భవిష్యతామ్ | = పుట్టబోవుచున్న | కీర్తిః | = కీర్తిని | చ | = మఱియు |
| | సమస్తప్రాణులయొక్క | శ్రీః | = లక్ష్మిని | క్షమా | = క్షమను |
| ఉద్భవః | = ఉత్పత్తి హేతువును | వాక్ | = వాక్కును | (అహమ్) అస్మి | = నేను. |

అన్నిప్రాణములను హరించు మృత్యువును నేనే. సమస్తప్రాణుల ఉత్పత్తి హేతువును గూడ నేనే. స్త్రీలలో కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమా అను వారందఱును నేనే. (34)

ప్రశ్న - సర్వమును లయమొనర్చు మృత్యువును తన స్వరూపముగా తెల్పుటలోని విశేషమేమి?

సమా - భగవంతుడే మృత్యురూపములో అందరినీ సంహరించును. ఇచట భగవానుడు మృత్యువును తన స్వరూపముగా తెలిపెను. 9వ అధ్యాయమునందలి 19వ శ్లోకమున గూడ 'మృత్యువును, అమృతమును నేనే' -అని పేర్కొనెను.

ప్రశ్న - 'ఉత్పన్నమగువాటి (వారి) ఉత్పత్తి హేతువును నేనే' అని భగవానుడు తెల్పుటలోని విశేషము ఏమి?

సమా - మృత్యురూపమున భగవంతుడు అందరిని లయమొనర్చినట్లు - అనగా ఆ జీవులను శరీరములనుండి వేరుచేసినట్లు భగవానుడే మరల వారికి వేరే శరీరములతో సంబంధము నేర్పరచి వారిని ఉత్పన్న మొనర్చును. ఈ విషయమును వివరించుటకే భగవానుడు 'ఉత్పన్నమగువారి ఉత్పత్తి హేతువును నేనే' అని పలికెను.

1) కాలము మూడు విధములు (1) సమయవాచక కాలము (2) ప్రకృతి రూపకాలము. మహాప్రలయానంతరము ప్రకృతి యొక్క సామ్యావస్థ సమయమునే ప్రకృతి రూపకాలమని యందురు. (3) నిత్యము, శాశ్వతము, ఐన విజ్ఞానానంద ఘన పరమాత్మయే కాల స్వరూపము.

సమయ వాచకమైన స్థూలకాలము కంటెను బుద్ధిగ్రాహ్యము కాని ప్రకృతి రూపకాలము సూక్ష్మము, పరము. ఈ ప్రకృతిరూపకాలము కంటెను కూడ పరమాత్మ రూపకాలము అత్యంత సూక్ష్మము, పరాత్పరము, పరమశ్రేష్ఠము - వస్తుతః పరమాత్ముడు సర్వథా, సర్వదా దేశకాలాతీతుడు. కాని ప్రకృతియు, దాని కార్యరూపమైన జగత్తును వర్ణించినపుడు వాటన్నింటికిని ఉనికిని, స్ఫూర్తిని ఇచ్చుట వలన అన్నింటికిని అధిష్ఠాన రూపుడైన విజ్ఞానానంద ఘన పరమాత్ముడే వాస్తవిక కాలమగును. అక్షయ కాలమనగా ఆ పరమాత్మయే.

ప్రశ్న - కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమ అను ఏడుగురును ఎవరు? భగవానుడు వారిని తన విభూతులనుగా పేర్కొనుటలోగల వైశిష్ట్యమేమి?

సమా - స్వాయంభువమనువుయొక్క పుత్రిక యైన 'ప్రసూతి' దక్షప్రజాపతియొక్క భార్య. వారికి 24 మంది కుమార్తెలు జన్మించిరి. ఇందులో కీర్తి, మేధా, ధృతి, స్మృతి, క్షమ అను కుమార్తెలు గలరు. వీరిలో కీర్తి, మేధ, ధృతి, అనువారు ధర్మునకు పత్నులైరి. స్మృతి, అంగిరునకును, క్షమ పులహ మహర్షికిని పత్నులైరి. భృగుమహర్షికి దక్షకన్యయైన ఖ్యాతియందు 'శ్రీ' అనునామె జన్మించెను. ఈమె వివాహము శ్రీ మహావిష్ణువుతో జరిగెను. వాక్కు బ్రహ్మకూతురు. ఈ ఏడుగురును ఆ పేర్లతో నిర్దేశింపబడిన గుణములకు అధిష్ఠాన దేవతలు - జగత్తునందలి స్త్రీలందరిలో శ్రేష్ఠులు కనుక వారిని భగవానుడు తన విభూతులనుగా పేర్కొనెను.

**బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్ ।**
**మాసానాం మార్గశీర్షోఽహమ్ ఋతూనాం కుసుమాకరః ॥ 35 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తథా | = అట్లే | బృహత్సామ | = బృహత్సామమును | మార్గశీర్షః | = మార్గశీర్షమును |
| సామ్నామ్ | = గానముచేయుటకు అనువగు శ్రుతులలో | ఛందసామ్ | = ఛందస్సులలో | ఋతూనామ్ | = ఋతువులలో |
| | | గాయత్రీ | = గాయత్రీఛందస్సును | కుసుమాకరః | = వసంతఋతువును |
| అహమ్ | = నేను | మాసానామ్ | = మాసములలో | అహమ్, (అస్మి) | = నేనే. |

గానముచేయుటకు అనువైన శ్రుతులలో బృహత్సామమును నేను. ఛందస్సులలో 'గాయత్రీఛందస్సు'ను నేను. మాసములలో మార్గశీర్షమును, ఋతువులలో వసంతఋతువును నేనే.(35)

ప్రశ్న - భగవంతుడిదివరకే సామవేదమును తన స్వరూపముగా తెల్పియుండెను. (10/22). ఇచట వేరుగా బృహత్సామమును తన స్వరూపముగా పేర్కొనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - సామవేదము యొక్క రథంతరాది సామములలో 'బృహత్ సామము'[1] (బృహత్ అను పేరుగల సామము) ప్రధానమైనది. కనుక సర్వశ్రేష్ఠమైనది. అందువలన భగవానుడు బృహత్ సామమును తన స్వరూపముగా చెప్పెను.

ప్రశ్న - ఛందస్సులలో 'గాయత్రీ ఛందస్సు'ను తన స్వరూపముగా భగవానుడు తెలుపుటలోని విశేషమేమి?

సమా - ఛందోబద్ధమైన వేద-ఋక్కులలో 'గాయత్రీ ఛందస్సు' అతి ముఖ్యమైనది. శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణాది శాస్త్రములయందు పెక్కుచోట్ల గాయత్రీ మహిమ వర్ణితమైనది.[2] గాయత్రీ ఛందస్సు యొక్క శ్రేష్ఠత్వ కారణమున భగవానుడు దానిని తన స్వరూపముగా తెల్పెను.

---

1) సామవేదమునందు 'బృహత్సామము' ఒక గతి విశేషము. దీని ద్వారా ఇంద్రరూపమున గల పరమేశ్వరుడు స్తుతింపబడును. అతిరాత్ర యాగమునందు చివరకు ఈ బృహత్ సామము గానము చేయబడును.

2) క్రింద పేర్కొనబడిన వచనములు గాయత్రీ మహిమను సూక్ష్మముగా తెల్పుచున్నవి. 'గాయత్రీ ఛందసాం మాతేతి' (నారాయణోపనిషత్ -34) గాయత్రి సమస్త వేదములకును మాత.

సర్వవేదసారభూతా గాయత్ర్యాస్తు సమర్చనా । బ్రహ్మాదయోఽపి సంధ్యాయాం తాం ధ్యాయన్తి జపన్తి చ ॥

(దేవీ భాగవతం - 11/16/15)

గాయత్రీ ఉపాసన సమస్త వేదములకు సారభూతమైనది. బ్రహ్మాది దేవతలు గూడ సంధ్యాకాలమున గాయత్రిని ధ్యానింతురు, జపింతురు.

గాయత్ర్యుపాసనా నిత్యా, సర్వవేదైస్సమీరితా । యయా వినా త్వధఃపాతో బ్రాహ్మణస్యాస్తి సర్వథా ॥

(దేవీభాగవతం- 12/8/89)

ప్రశ్న - మాసములలో మార్గశీర్షమును భగవానుడు తన స్వరూపముగా పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - మహాభారత కాలములో మాసములు మార్గశీర్షముతో ఆరంభమగుచుండెను. (మహాభారతం- అను శాసన పర్వం-106 నుండి 109) కనుక మాసములలో మార్గశీర్షము మొదటిది. అట్లే ఈ మాసములో ఆచరింపబడు ఉపవాసాది వ్రతములన్నియును మహాఫలమును ఇచ్చునవిగా శాస్త్రములయందు తెల్పబడినవి.[1] ఈ మాసము నందే క్రొత్తగా ఇంటికి వచ్చిన పంటను భగవదర్పణము కావింతురు. దీనినే 'అన్నయజ్ఞము' అందురు. వాల్మీకి రామాయణమునందు - ఈ మార్గశిర మాసము మాసశిరోభూషణముగాను, ఆ సంవత్సరమునకే అలంకార ప్రాయముగాను చెప్పబడినది. ఈ విధముగా ఇతర మాసములకంటె మార్గశిరమునందు అనేక విశిష్టలక్షణములు గలవు. కనుక భగవానుడు దీనిని తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - ఋతువులలో వసంత ఋతువును భగవానుడు తన స్వరూపముగా తెల్పుటలోని వైశిష్ట్యమేమి?

సమా - వసంత ఋతువు ఆరు ఋతువులలోకెల్లను శ్రేష్ఠమైనది. అది ఋతురాజము. నీటితో పనిలేకుండగనే వనస్పతులు (వృక్షములు) అన్నియు చిగురించును. పచ్చని నవపల్లవములతోడను, కలకలలాడు పువ్వులతోడను అందములను చిందించుచుండును. ఈ ఋతువునందు అధికమైన వేడిగాని, చలిగాని ఉండదు. సమస్త ప్రాణులకును ఈ ఋతువు ఆనందదాయకము- కనుక భగవానుడు దీనిని తన స్వరూపముగా పేర్కొనెను.

**ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।**
**జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥ 36 ॥**

---

గాయత్రిఉపాసన నిత్యము ఆచరింపదగినది. (అనివార్యము) అని సమస్త వేదములును వాక్కి చెప్పుచున్నవి. ఈ గాయత్రి ఉపాసన చేయని బ్రాహ్మణునకు అన్ని విధముల అధఃపతనము (పతనావస్థ) తప్పదు.

**అభీష్టం లోకమాప్నోతి, ప్రాప్నుయాత్ కామమీప్సితమ్ । గాయత్రీ వేదజననీ గాయత్రీ పాపనాశినీ ॥**
**గాయత్ర్యాః పరమం నాస్తి, దివి చేహ చ పావనమ్ । హస్తత్రాణప్రదా దేవీ పతతాం నరకార్ణవే ॥** (శంఖస్మృతి-12/24-25)

గాయత్రి ఉపాసన చేయు ద్విజుడు తన అభీష్టలోకమును పొందును. మనోవాంఛిత భోగములను గూడ పొందును. గాయత్రి వేదములన్నింటికిని తల్లి. పాపములన్నింటిని నశింపజేయును. దివియందుగాని, భువియందుగాని గాయత్రికంటెను పవిత్రమైనది మఱియొకటి లేదు. నరకార్ణవమునందు పడినవానిని గాయత్రీదేవి చేయూతనిచ్చి రక్షించును.

**గాయత్ర్యాస్తు పరం నాస్తి, శోధనం పాపకర్మణామ్ । మహావ్యాహృతిసంయుక్తాం ప్రణవేనం చ సంజపేత్ ॥**
(సంవర్తస్మృతి - 218)

మానవుని పాపములను పారద్రోలుటలో గాయత్రిని మించిన శక్తిశాలినియైన మంత్రము మఱియొకటి లేదు - ప్రణవ (ఓంకార) సహితముగ మూడు మహావ్యాహృతులతో కూడిన గాయత్రీమంత్రమును జపింపవలెను.

**నాస్తి గంగా సమం తీర్థం, న దేవః కేశవాత్ పరః । గాయత్ర్యాస్తు పరం జప్యం, న భూతం న భవిష్యతి ॥**
(బృహద్యోగ యాజ్ఞవల్క్యం- 10/10)

గంగతో సమానమైన తీర్థము లేదు. శ్రీమహావిష్ణువును మించిన దేవుడు లేదు. గాయత్రిని మించిన జపయోగ్యమైన మంత్రము ఇంతకు ముందులేనే లేదు. ఇకపైన ఉండబోదు.

1) **శుక్లే మార్గశిరే పక్షే యోషిత్ భర్తురనుజ్ఞయా । ఆరభేత వ్రతమిదం, సార్వకామిక మాదితః ॥**
(శ్రీ మద్భాగవతం- 6/19/2)

వివాహిత యువతి క్రొత్తగా కాపురమునకు వచ్చిన పిమ్మట వచ్చు మొదటి మార్గశిరమాసమునందలి శుక్లపక్షమున పతియనుమతితో 'పుంసవన వ్రతము'ను ఆరంభింప (ఆచరింప) వలెను. అది సమస్త మనోరథములను తీర్చును.

ఛలయతామ్ = వంచకులలో
అహమ్, ద్యూతమ్= నేను జూదమును
తేజస్వినామ్ = ప్రభావశాలురలో
తేజః, అస్మి = తేజమును నేను

(జేతౄణామ్) = విజేతలలో
జయః, అస్మి = జయమును నేను
(వ్యవసాయినామ్) = నిశ్చయాత్మకులలో
అహమ్, వ్యవసాయః = నిశ్చయమును నేను

సత్త్వవతామ్ = సాత్త్వికపురుషులలో
సత్త్వమ్, అస్మి = సాత్త్వికభావమును నేనే.

**వంచకులలో జూదమును నేనే. ప్రభావశాలురలోని ప్రభావమును నేను. విజేతలలో విజయమును నేను. నిశ్చయాత్మకులలో నిశ్చయమును, సాత్త్విక పురుషులలో సాత్త్వికభావమును నేనే. (36)**

ప్రశ్న - 'ద్యూతము' అనగా జూదము. ఇది దుర్వ్యసనములలో ఒకటి. ఇది శాస్త్రములచే నిషేధింపబడినది. అయినను దీనిని భగవానుడు తన స్వరూపముగా ఏల తెలిపెను? ఇది భగవత్స్వరూపమే అయినచో ఈ ద్యూత క్రీడ వలన దోషమేమి?

సమా - ప్రపంచమునందు ఉత్తమ, మధ్యమ, నీచ శ్రేణులకు చెందిన జీవులయందును, పదార్థముల యందును భగవానుడు వ్యాపించియున్నాడు. భగవంతుని ఉనికి, స్ఫూర్తి ఉండుటవలననే ఇవి చైతన్యవంతములగుచు తమ కార్యములను కొనసాగింపగలుగుచున్నవి. భగవంతుని ఉనికి, శక్తి లేని పదార్థము ఒక్కటియును లేదు. అన్ని విధములైన సాత్త్విక, రాజస, తామసజీవులయందును, పదార్థములయందునుగల విశేషగుణములు, ప్రభావములు చమత్కారాదులకు వాటియందలి భగవానుని ఉనికి, శక్తి విశేషముల వికాసములే కారణములు. ఈ దృష్టి తోడనే భగవానుడు సంక్షిప్తముగా దేవతలు, దైత్యులు, మనుష్యులు, పశుపక్ష్యాదులు, సర్పాది చేతనములను, వజ్రాయుధము, ఇంద్రియములు, మనస్సు, సముద్రాది జడపదార్థములను, జయము, నిశ్చయము, తేజస్సు, నీతి, జ్ఞానాది భావములను వర్ణించెను. ముఖ్యమైన సమష్టి విభాగములన్నింటిని సంక్షిప్తముగా వర్ణించెను. ఏ వ్యక్తినీ, పదార్థమునూ, క్రియనూ, భావమునూ మనస్సుతో చింతన చేసినను, దానిని భగవత్స్వరూపముగా భావించుటయే దీని పరమార్థము. ఈ కారణమువలననే ఛలము (మోసము)తో గూడిన కార్యములలో జూదమును భగవానుడు తన స్వరూపమని తెల్పెను. అది ఉత్తమమైనదనిగాని, దానిలో ప్రవృత్తులు కావలసినదని గాని భగవానుడు తెల్పలేదు. ఆయన ఆంతర్యము (ఉద్దేశ్యము) గూడ అదికానే కాదు.

క్రూరమైన హింసాత్మకమైన సింహమకరములును, సహజముగా అన్నింటిని దహించివేయు అగ్నియు, సర్వసంహారకుడైన మృత్యువు తన స్వరూపములని భగవంతుడు తెల్పెను. దానివలన మనుష్యుడు సింహమకరములతో ఆడుకొనవలయుననిగాని, అగ్నిలో దూకవలయుననిగాని, ఉద్దేశ్య పూర్వకముగా మృత్యు ముఖమున ప్రవేశింపవలయునని గాని అభిప్రాయము గాదు. అట్లు చేయుట వలన కలుగు ఆపద వలెనే జూదమాడుటవలనను కలుగును.

ప్రశ్న - ప్రభావము, విజయము, నిశ్చయము, సాత్త్విక భావము మున్నగువాటిని తన స్వరూపముగా భగవానుడు తెల్పుటలో గల విశేషమేమి?

సమా - ఈ నాలుగు గుణములును భగవత్ప్రాప్తికి సహాయకములు. కనుక భగవానుడు వీటిని తన స్వరూపములుగ తెలిపెను. తేజోవంతములైన ప్రాణులలో గల తేజస్సు లేక ప్రభావము వాస్తవముగా భగవానునిదే. మానవుడు దానిని తన శక్తిగా అనుకొని అహంకరించినచో అది వాని పొరపాటే. అట్లే విజయమును పొందినవాని విజయము, నిశ్చయాత్ముల నిశ్చయము, సాత్త్విక పురుషుల సాత్త్వికభావము లన్నియును భగవంతుని గుణములే. వీటి కారణముగ దురభిమానమునకు గురియగుట మూర్ఖత్వమే.[1] ఇంతేగాక పైన తెల్పబడిన గుణములు గలవారిలో భగవంతుని తేజస్సు అధికముగా ఉన్నదని గ్రహించి, వారిని శ్రేష్ఠులుగా గుర్తింపవలెను.

1) కేనోపనిషత్తునందు ఒక కథ ఇట్లు గలదు - ఒకసారి దివిజులైన దేవతలు పరమాత్మ ప్రభావమున అసురులపై విజయమును పొందిరి. దేవతల కీర్తిప్రతిష్ఠలు దశదిశల వ్యాపించెను. విజయోన్మత్తులైన దేవతలు భగవంతుని మఱచి, ప్రగల్భములను పలుకసాగిరి. "ఈ విజయము మాదే. మేము మా పరాక్రమముతో, బుద్ధి బలముతో దైత్యులను అణచివేసితిమి. కనుక జనులు మమ్ము పూజించెదరు. మా విజయగీతములను పాడెదరు." - దేవతల ఈ దురభిమానమును రూపుమాపుట

**వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।**
**మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ 37 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వృష్ణీనామ్ | = వృష్ణివంశజులలో | ధనంజయః | = అర్జునుడను నేను | కవీనామ్ | = కవులలో |
| వాసుదేవః | = వాసుదేవుడనునేను | మునీనామ్ | = మునులలో | ఉశనా, కవిః, అపి, | శుక్రాచార్యుడను |
| పాండవానామ్ | = పాండవులలో | వ్యాసః | = వేదవ్యాసుడనునేను | అహమ్, అస్మి = | గూడ నేనే. |

ద్వారా వారికి పరమాత్మ ఉపకారము చేయదలచెను. తన లీలలతో ఒక అద్భుతరూపమును సృష్టించెను. దానిని చూచిన దేవతలకు మతి పోయెను. దేవతలు యక్షరూప ధారియైన ఈ అద్భుత పురుషుడెవరో తెలిసికొనగోరి, అగ్నిదేవునితో ఇట్లనిరి. "ఓ జాతవేదసా! (ఓ అగ్నీ!) నీవు మా అందఱికంటెను మిక్కిలి తేజస్వివి. వాస్తవముగా ఈ యక్షరూపధారి ఎవరో తెలిసికొనిరమ్ము." – అగ్నిదేవుడు "మంచిది అట్లే తెలిసికొని వచ్చెదగాక" – అని పలికి అతనిని సమీపించెను. వెంటనే అతని తేజస్సు ముందు వెలవెలబోయి, మాట్లాడుటకును సాహసింపలేక పోయెను. చివరకు ఆ యక్షరూప పరబ్రహ్మ అగ్నిని 'నీవు ఎవ్వరు' అని ప్రశ్నించెను. అగ్ని ప్రత్యుత్తరమిచ్చెను. "నా పేరు ప్రసిద్ధమైనది. నన్ను అగ్నియందురు. జాతవేదసుడనియు అందరు." బ్రహ్మ మఱల ప్రశ్నించెను. "ఇది యంతయు సరియే – ఓ అగ్నిదేవా! నీలో ఏవిధమగు సామర్థ్యము గలదు? నీవేమి చేయగలవు?" – అపుడు అగ్ని "ఓ యక్షా! ఈ పృథ్వియందును, అంతరిక్షమునందును గల స్థావర జంగమ పదార్థములన్నింటిని నేను భస్మము చేయగలను" – అనెను.

బ్రహ్మ అతనిముందర ఎండిన గడ్డిపోచను వేసి "దీనిని కాల్చి వేయుము" – అనెను. అగ్నిదేవుడు తన శక్తినంతయును ప్రయోగించి, ఆ గడ్డిపోచను కాల్చివేయుటకు ప్రయత్నించెను – కాని దానిని కాల్చివేయలేకపోయెను. సిగ్గుతో తల వంచుకొని, యక్షుని ముందు ఏమియు మాట్లాడలేక అగ్ని దేబెముఖముతో దేవతలకడకు చేరెను. పిమ్మట ఇట్లనెను. "ఆ యక్షుని గూర్చి తెలిసికొనుటకు నాకు సాధ్యము కాలేదు."

అనంతరము వాయుదేవుడు ఆ యక్షుని కడకు వెళ్ళెను. కాని ఆయనకును అగ్నికి వలెనే మతి తప్పెను. నోట మాట రాకపోయెను. యక్షుడు "నీవు ఎవరు" – అని యడిగెను. అతడిట్లు పలికెను "నేను వాయువును. నా పేరు, గుణములు, ప్రసిద్ధములు – నేను అతి వేగముగా సంచరించువాడను – పృథ్వి యొక్క గంధమును వహించువాడను. అంతరిక్షమున సంచరించు వాడనగుటచే నన్ను 'మాతరిశ్వా' అనియు అందురు." యక్షుడు 'నీలో గల సామర్థ్యమేమి?' అని ప్రశ్నించెను. వాయువు సమాధానమిచ్చెను. "ఈ పృథ్వి అంతరిక్షములయందు గల పదార్థములన్నింటిని ఎగురగొట్టగలను" – బ్రహ్మ వాయువునెదుట ఎండిన గడ్డిపరకను ఉంచి, 'దీనిని ఎగురగొట్టుము' అనెను – వాయువు తన బలమునంతయును ప్రయోగించియు దానిని కదలింపలేక పోయెను. అతడు మిక్కిలి లజ్జతో వెంటనే పలాయనము పఠించెను. దేవతలను చేరి ఇట్లు పలికెను – "ఓ దేవతలారా! ఆ యక్షుని గూర్చి తెలిసికొనుటకు నాకు సాధ్యము కాలేదు."

ఈసారి ఇంద్రుని వంతు వచ్చెను. అతడు యక్షుని సమీపించెను. విఱ్ఱవీగుచు వచ్చుచున్న ఇంద్రుని జూచి, యక్షరూపుడైన బ్రహ్మ అంతర్ధానమయ్యెను. ఇంద్రుని దురభిమానమును రూపుమాపుటకు ఇంద్రునితో ఒక్క ముక్కను గూడ మాట్లాడలేదు. ఇంతలో అంతరిక్షమున అత్యంత తేజోవిలాసములతో సర్వోత్తమ భూషణ విరాజితయై హిమవత్పుత్రిక పార్వతి ప్రత్యక్షమై నిలిచెను. ఇంద్రుడు సవినయముగ ఆమెను ప్రశ్నించెను–

"అమ్మా! ఇంతకుముందు మాకు దర్శనమిచ్చి, అంతర్ధానమైన ఆ యక్షుడెవరు?" – ఉమాదేవి యిట్లు పలికెను– "ఆయక్షుడు పరబ్రహ్మయే – ఓ ఇంద్రా! ఆ పరమాత్మయే అసురులను పరాజితులను గావించెను. మీరు కేవలము నిమిత్తమాత్రులే – పరమాత్మ విజయము ద్వారానే మీ మహిమ పెఱిగినది. దీనవలన మీకు పూజలందుచున్నవి. అదియంతయు మీ విజయము, మీ మహిమ – అని తలంచుట మీ మిథ్యాభిమానమే – దానిని త్యజింపుడు. కేవలము ఆ పరమాత్మయొక్క శక్తి వలననే ఇవి యన్నియును జరుగును." పార్వతి పలుకులతో ఇంద్రునకు కనువిప్పు గలిగెను. దురభిమానము తొలగిపోయెను. పరబ్రహ్మ యొక్క అపారశక్తిని తెలిసికొని ఇంద్రుడు మఱలివచ్చెను. అగ్నికిని, వాయువునకును పరమాత్మ మహిమను గూర్చి ఉపదేశించెను. అగ్ని, వాయువులు గూడ పరమాత్మ మహిమలను తెలిసికొనిరి. అందువలననే ఈ ముగ్గురు దేవతలను సర్వశ్రేష్ఠులైరి! పరమాత్మను మొట్టమొదట తెలిసికొనిన కారణమున ఇంద్రుడు అందఱికంటెను శ్రేష్ఠుడుగా భావింపబడెను.

**వృష్ణివంశజులలో వాసుదేవుడను నేను. పాండవులలో ధనంజయుడను నేను. అనగా నీవే నేను. మునులలో వేదవ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను నేనే. (37)**

ప్రశ్న - భగవానుడు వృష్ణివంశజులలో తాను వాసుదేవుడనని తెల్పుటలోని విశేషమేమి?

సమా - జన్మరహితుడు, శాశ్వతుడు, సర్వభూతమహేశుడు, సర్వశక్తిమంతుడు, పరబ్రహ్మయైన పురుషోత్తముడే ఇచట వసుదేవుని కుమారుడై తన లీలలను ప్రకటించుచున్నాడు. **(4/6)** ఇచట భగవానుడు అవతారి, అవతారముల ఏకత్వమును ప్రతిపాదించెను. అతనిని సామాన్యమానవునిగా తలచువారు గొప్ప పొరపాటు చేయుచున్న వారగుదురు.

ప్రశ్న - పంచపాండవులలో యుధిష్ఠిరుడు, అందరి కంటెను జ్యేష్ఠుడు భగవద్భక్తుడు, అయినను భగవానుడు అర్జునుని తన స్వరూపముగా పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - నిస్సందేహముగా యుధిష్ఠిరుడు పాండవులలో అగ్రజుడు, ధర్మాత్ముడు, భగవద్భక్తుడు. కాని నరనారాయణుల అవతారములయందు అర్జునుడు 'నరఋషి' భగవానునితో ఉండెను. అంతేగాక అర్జునుడు భగవానునకు ప్రియసఖుడు. పరమ భక్తుడు. ఆ కారణమున అర్జునుడే పాండవులలో శ్రేష్ఠుడుగా భావింపబడెను. కనుక భగవానుడు అర్జునుని తన స్వరూపముగా తెల్పెను.[1]

ప్రశ్న - మునులలో వ్యాసుని భగవానుడు తన స్వరూపముగా తెల్పుటలోని విశేషమేమి?

సమా - భగవత్స్వరూపమును, వేదశాస్త్రాదులను మననము చేయువానిని 'ముని' అందురు. వేదవ్యాస భగవానుడు సమస్త వేదములను చక్కగా మననముచేసికొని, వాటి విభాగములను ఏర్పరచెను. మహాభారతమును, పురాణములను, అనేక శాస్త్రములను రచించెను. ఇతడు భగవానుని అంశావతారము. సర్వసద్గుణసంపన్నుడు. కనుక మునిగణములో ప్రముఖుడగుట వలన భగవానుడు ఆయనను తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - భగవానుడు కవులలో శుక్రాచార్యుని తన స్వరూపముగా పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - పండితుడు, బుద్ధిమంతుడు అయిన వానిని 'కవి' అని యందురు - శుక్రాచార్యుడు భృగువంశజులలో శ్రేష్ఠుడు. సర్వవిద్యావిశారదుడు. సంజీవని విద్యను ఎరిగినవాడు. కవులలో ప్రముఖుడు. కావున భగవానుడు అతనిని తన స్వరూపముగా తెలిపెను.[2]

---

1) భగవానుడు స్వయముగా పలికెను.

నరస్త్వమసి దుర్ధర్ష! హరిర్నారాయణో హ్యహమ్ । కాలే లోకమిమం ప్రాప్తౌ నరనారాయణావృషీ ॥
అనన్యః పార్థ! మత్తస్త్వం, త్వత్తశ్చాహం తథైవ చ । నావయోరంతరం శక్యం వేదితుం భరతర్షభ! ॥

(మహాభారతం, అరణ్యపర్వం- 12/46,47)

ఓ దుర్ధర్ష! అర్జున! నీవు భగవానుడనైన నరుడవు - నేను స్వయముగా హరిని, నారాయణుడను. మనము ఇరువురము ఒక సమయమున నరనారాయణులు అను ఋషులుగా ఈ లోకమునకు వచ్చియుంటిమి. కావున ఓ అర్జున! నీవు నామండి వేఱుగాదు. అదేవిధముగా నేనును నీ నుండి వేఱుగాదు. ఓ భరతశ్రేష్ఠ! మన ఇద్దఱిలో ఎట్టి భేదమూ లేదని ఇతరులు ఎవ్వరికిని తెలియదు.

2) భృగుమహర్షి యొక్క చ్యవనాదులైన ఏడుగురుపుత్రులలో శుక్రుడు ప్రముఖుడు. ఇతడు శంకరునారాధించి, 'సంజీవనీ విద్య'ను జరామరణ రహితమైన వజ్రశరీరమును పొందెను - శంకరుని అనుగ్రహముచేతనే యోగవిద్యానిపుణుడై 'యోగాచార్య' పదవి నలంకరించెను. ఇతడు దైత్యపురోహితుడు. కావ్యుడు, కవి, ఉశనుడు అనునవి ఇతని నామాంతరములు. పితరుల మానస పుత్రికయైన 'గో' అను నామెతో ఈయనకు వివాహము జరిగెను. ప్రహ్లాదునకు గురువులైన చండుడు, అమర్కుడు అనువారు ఇతని కుమారులు. ఇతడు అత్యంత గుప్తములైన, దుర్లభములైన పెక్కుమంత్రములను తెలిసినవాడు. బహువిద్యా పారంగతుడు. మిక్కిలి బుద్ధిశాలి. నీతి కోవిదుడు. ఇతని 'శుక్రనీతి' ప్రసిద్ధమైనది. బృహస్పతి పుత్రుడైన కచుడు ఈయన యొద్దనే మృతసంజీవనీ విద్యనభ్యసించెను. మహాభారత భాగవతములయందును, వాయు, బ్రహ్మ, మత్స్య, స్కంద పురాణాదులయందును ఇతని గాథలు గలవు.

**దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ 38 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దమయతామ్ | = శిక్షించువారిలో | నీతిః, అస్మి | = నీతిని నేను | చ | = మఱియు |
| దండః, అస్మి | = దండించుశక్తిని నేను | గుహ్యానామ్ | = గోప్యవిషయ రక్షణమున | జ్ఞానవతామ్ | = జ్ఞానులయొక్క |
| జిగీషతామ్ | = జయేచ్ఛగలవారియొక్క | మౌనమ్, అస్మి | = మౌనమును నేను | జ్ఞానమ్, అహమ్, ఏవ | = తత్త్వజ్ఞానమును నేనే. |

శిక్షించువారిలో దండమును అనగా దమనశక్తిని నేనే. జయేచ్ఛకలవారినీతిని నేనే. గోప్యవిషయరక్షణమున 'మౌనము'ను నేను. జ్ఞానులయొక్క తత్త్వజ్ఞానమును నేనే. **(38)**

ప్రశ్న - భగవంతుడు శిక్షించువారిలోని దమనశక్తి తన స్వరూపమేయని పలుకుటలోని విశేషమేమి?

సమా - ధర్మ మార్గమును వీడి అధర్మమార్గమున నడుచుచు విచ్చలవిడిగా ప్రవర్తించువారు పాపములను ఆచరించుచుందురు. అట్టివారిని పాపకృత్యముల నుండి మరల్చి సత్కర్మలయందు ప్రవృత్తులనుగా చేయుటకు ఉపయుక్తమగునదియే దండము (దమనశక్తి). మానవుల మనస్సులు, ఇంద్రియాదులు గూడ ఈ దమనశక్తివలననే వశమై భగవత్ప్రాప్తికి సహాయకములు కాగలవు. దమనశక్తి ప్రభావమున సమస్త ప్రాణులు విధ్యుక్త కార్యములను ఆచరించుచు ధర్మమార్గమును అనుసరింతురు. దేవతలు, రాజులు, శాసకులు మొదలగువారు న్యాయము ననుసరించి అధర్మ ప్రవర్తకులను దండించుచుందురు. వీరిందరి ఈ దమనశక్తినే భగవానుడు తన స్వరూపముగా తెల్పెను.

ప్రశ్న - జయేచ్ఛ గలవారిలో నీతిని భగవానుడు తన స్వరూపముగా తెలుపుటలోని విశేషమేమి?

సమా - ఇచట 'నీతి' శబ్దము న్యాయవాచకము. న్యాయము ద్వారా ప్రతి వ్యక్తికిని నిజమైన విజయము కలుగును. నీతి తప్పిన రాజ్యము అనగా అవినీతి ప్రబలిన రాజ్యము శీఘ్రముగా పతనమగును. కనుక నీతి యనగా న్యాయమే విజయమునకు ముఖ్యమైన మార్గము. కనుక జయేచ్ఛ గలవారి నీతిని భగవానుడు తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - గోప్య విషయరక్షణమున మౌనమును భగవానుడు తన స్వరూపముగ తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - గోప్యముగా ఉంచదగిన భావములనన్నింటిని మౌనము ద్వారానే గుప్తముగా నుంచవచ్చును. మాట్లాడుట మాననిచో భావములను గుప్తముగా నుంచుట కష్టము. గోప్యభావరక్షణమునందు మౌనము ప్రధానమైనది. కనుక భగవానుడు మౌనమును తన స్వరూపముగా పేర్కొనెను.

ప్రశ్న - ఇచట 'జ్ఞానవతాం' అను పదము ఎట్టి జ్ఞానులను సూచించును? వారి జ్ఞానమును భగవానుడు తన స్వరూపముగ చెప్పుటలోని విశేషమేమి?

సమా - 'జ్ఞానవతాం' అను పదము పరబ్రహ్మ పరమాత్మ స్వరూపమును సాక్షాత్కరింపజేసి కొనునట్టి యథార్థ జ్ఞానులను తెల్పును. వారి జ్ఞానమే సర్వోత్తమము. కనుక భగవానుడు దానిని తన (పరమాత్మ) స్వరూపముగా తెల్పెను. 13వ అధ్యాయము నందలి 17వ శ్లోకమున గూడ భగవానుడు తనను జ్ఞానస్వరూపునిగా పేర్కొనెను.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।**
**న తదస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరాచరమ్ ॥ 39 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | బీజమ్ | = బీజమో | మయా, వినా, స్యాత్ | = నేను లేనిదగునో |
| అర్జున! | = ఓ అర్జునా! | తత్, అపి, అహమ్ | = ఆ బీజమును గూడ నేనే | తత్ | = అది |
| యత్ | = ఏది | | | | |
| సర్వభూతానామ్ | = సమస్తచరాచర ప్రాణులయొక్క | యత్ చరాచరమ్, భూతమ్ | = ఏ చరాచర ప్రాణికోటి | న, అస్తి | = ఉండనే ఉండదు. |

**ఓ అర్జునా! సర్వప్రాణులఉత్పత్తికి కారణమైన బీజమును నేనే. ఏలనన నేనులేని చరాచరప్రాణియేదియును లేదు. (39)**

ప్రశ్న - సమస్త చరాచర ప్రాణుల బీజమనగానేమి? భగవానుడు దానిని తన స్వరూపముగా తెలుపుటలోని విశేషమేమి?

సమా - భగవంతుడే సమస్త చరాచర ప్రాణులకును పరమ - ఆధారము. అతని నుండియే అన్నియు ఉద్భవించును. కనుక అతడే అన్నింటికిని బీజము లేక మహాకారణము. 7వ అధ్యాయమునందలి 10 వ శ్లోకమున, సకల భూతములకును అతడు సనాతన బీజమనియు, 9వ అధ్యాయమునందు 18వ శ్లోకమున **'శాశ్వత బీజము'** అనియు తెలుపబడెను. కనుక భగవానుడు దానిని తన స్వరూపముగా తెలిపెను.

ప్రశ్న - నేను లేని చరాచరప్రాణి యేదియును లేదు-అని యనుటలోని విశేషమేమి?

సమా - ఈ వాక్యముద్వారా భగవానుడు తన సర్వవ్యాపకత్వమును తెలుపుచు, అన్ని రూపములు తనవే యనియు ప్రకటించెను. చరాచర ప్రాణులన్నింటిలోను అతడే వ్యాపించియున్నాడు. అతడు లేని ప్రాణి ఏదియునులేదు. కనుక ప్రాణులన్నింటిని భగవత్స్వరూపముగను, అతడు వాటన్నింటి యందును వ్యాపించియున్నట్లును భావించుచు భగవచ్చింతన చేయుచుండవలెను. 'నిన్ను ఏయే భావములలో చింతన చేయు చుండవలెను? **(10/17)** అను అర్జునుని ప్రశ్నకు ఇది సమాధానము.

*సంబంధము - 19వ శ్లోకమున భగవానుడు తన దివ్య విభూతులు అనంతములని తెలిపి, ప్రాధాన్యక్రమమున వాటిని వర్ణింతునని తెలిపెను. ఆ మాట ప్రకారము 20 నుండి 39వ శ్లోకము వరకు వాటిని స్పష్టముగా వర్ణించెను. ఇప్పుడు తన విభూతులు అనంతములని తెల్పుచు ఆ వివరణను ముగించుచున్నాడు-*

## నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।
## ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప! | = ఓ అర్జునా! | అంతః | = అంతమే | ఏషః | = ఈ |
| మమ | = నా యొక్క | న, అస్తి | = లేదు | విస్తరః, తు | = విస్తృతి ఐతే |
| దివ్యానామ్ | = దివ్యములైన | మయా | = నాచేత | ఉద్దేశతః | = సంక్షిప్తముగా |
| విభూతీనామ్ | = విభూతులకు | విభూతేః | = విభూతులయొక్క | ప్రోక్తః | = చెప్పబడినది. |

**ఓ పరంతపా! నా దివ్యవిభూతులకు అంతమే లేదు. నా విభూతులవిస్తృతిని గూర్చి నేను నీకు చాలా సంక్షిప్తముగా వివరించితిని. (40)**

ప్రశ్న - 'నా దివ్యవిభూతులకు అంతమే లేదు' అని యనుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - భగవానుని దివ్యవిభూతులే అనంతము లైనప్పుడు ఇక ఆయన యొక్క సామాన్య విభూతుల మాట చెప్పవలసిన పనియే లేదు. పృథ్వీ జలముల పరమాణువులను లెక్కించుట సాధ్యము కానట్లే భగవద్విభూతుల గణనము గూడ అసాధ్యము. అవి అసంఖ్యాకములు. వాటిని తెలిసికొనుటకు గాని, లెక్కించుటకు గాని ఎవ్వరికైనను అశక్యమే - బ్రహ్మాండములనంతములు. అట్లే భగవానుని విభూతులును అనంతములు. వాటి అవధులను (హద్దులను) ఎవ్వరును తెలిసికొనజాలరు.

ప్రశ్న - "ఈ విభూతుల విస్తారమును నేను చాలా సంక్షిప్తముగా తెల్పితిని" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - భగవానుడు ఆయన యొక్క అపారమైన దివ్య విభూతులలో వర్ణించినది అంశాంశము మాత్రమే. వాటిని పూర్తిగా వర్ణించుటకు ఆయనకు తప్ప మఱెవ్వరికైనను ఎంతటి వారికిని అశక్యమే. కనుక ఆ వర్ణనను ఇంతటితో ముగించెను.

*సంబంధము - అర్జునుడు భగవంతునితో అతని విభూతులను యోగశక్తిని వర్ణింపుమని 18వ శ్లోకమున ప్రార్థించియుండెను. దానిని అనుసరించి, భగవానుడు తన దివ్య విభూతులను వర్ణించెను. ఇప్పుడు సంక్షిప్తముగా తన యోగశక్తినిగూర్చి తెలుపుచున్నాడు-*

**యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥ 41 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| విభూతిమత్ | = ఐశ్వర్యయుక్తము | యత్, యత్, ఏవ | = ఏయే | మమతేజోఽంశ-సంభవమ్, ఏవ | = నా తేజము యొక్క అంశమునుండియే కలిగినదిగా |
| శ్రీమత్ | = కాంతియుతము | సత్త్వమ్ | = వస్తువులు కలవో | త్వమ్ | = నీవు |
| వా | = మఱియు | తత్, తత్ | = ఆయా వస్తువులు | అవగచ్ఛ | = గ్రహింపుము |
| ఊర్జితమ్ | = శక్తియుక్తమగు | | | | |

**విభూతియుక్తము అనగా ఐశ్వర్యయుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము ఐన వస్తువేదైనను నా తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినదిగా తెలిసికొనుము. (41)**

ప్రశ్న - 'యద్యత్', 'విభూతిమత్', 'శ్రీమత్', 'ఊర్జితమ్' అను విశేషణములతోగూడిన 'సత్త్వమ్' అనుపదము దేనిని సూచించును? అది భగవంతుని తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినట్లు తెలిసికొనుట యనగానేమి?

సమా - ఐశ్వర్యము, శోభ, కాంతి మొదలగు గుణములతో సుసంపన్నమైనట్టిదియు, బలము, తేజస్సు, పరాక్రమము లేక అనేకములైన ఇతర శక్తులతో కూడినట్టిదియు ఐన ప్రాణిని లేక జడవస్తువును తెలుపునదియే ఉపర్యుక్త విశేషణములతోగూడిన 'సత్త్వమ్' అను పదము - పైన పేర్కొనబడిన ఐశ్వర్యము, శోభ, శక్తి, బలము, తేజస్సు మొదలగు వాటన్నింటిలో ఏ ఒక్కటి ప్రతీతమైనను ఆ ప్రత్యేకమైన ప్రాణి లేక వస్తువు భగవంతుని తేజముయొక్క అంశయేయని భావింపవలెను.

విద్యుచ్ఛక్తి ఒకచోట 'ప్రకాశము'ను ఇచ్చును. మఱొకచోట వాయు ప్రసారమునకు తోడ్పడును. అట్లే భూగర్భ జలములను అందించును. దూరశ్రవణ, దూర దర్శనములకు సహాయపడును. ఇట్లు విద్యుచ్ఛక్తి ప్రభావమున వేర్వేఱు స్థానములయందు అనేకానేక కార్యములు జరుగుచున్నవి. వాస్తవముగా వాటియందు విద్యుచ్ఛక్తి యొక్క అంశమే యున్నట్లు భావింపవలెను - అట్లే ఏదో ఒక వైశిష్ట్యము గల ప్రాణి లేక వస్తువునందు భగవంతుని తేజస్సుయొక్క అంశయే అభివ్యక్తమగుచున్నదని తెలియవలెను.

*సంబంధము - ఈవిధముగ ముఖ్యములైన సమస్త వస్తువులయందును తన యోగశక్తిరూపతేజస్సు యొక్క అంశమే అభివ్యక్తమగుచున్నదని వర్ణించి, సమస్త జగత్తు తన యోగశక్తియొక్క ఒక అంశ చేతనే వహింపబడుచున్నదని భగవానుడిప్పుడు తెలుపుచున్నాడు-*

**అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।**
**విష్టభ్యాహమిదం కృత్స్నమ్ ఏకాంశేన స్థితో జగత్ ॥ 42 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథవా | = (ఒకవేళ) | తవ, కిమ్ | = నీకు (కలుగు) ప్రయోజనమేమి? | | యొక్క) |
| అర్జున! | = ఓ అర్జునా! | | | ఏకాంశేన | = ఒక్క అంశతోడనే |
| ఏతేన | = ఈ(ఇట్లు) | ఇదమ్, కృత్స్నమ్, జగత్ | = ఈ సమస్త జగత్తును | | |
| బహునా, జ్ఞాతేన | = ఎక్కువగా తెలిసికొనుటవలన | అహమ్ | = నేను (నా యోగశక్తి | విష్టభ్య | = ధరించి |
| | | | | స్థితః | = స్థితమైయున్నాను |

**ఓ అర్జునా! ఇంతకంటెను విపులముగా తెలిసికొని ప్రయోజనమేమి? ఈ సంపూర్ణజగత్తును కేవలము నా యోగశక్తియొక్క ఒక్క అంశతోడనే ధరించు చున్నాను. (42)**

ప్రశ్న - ఇచట 'అథవా' అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 'అథవా' అను శబ్దము పక్షాంతర బోధకము- 20 నుండి 39వ శ్లోకమువఱకు భగవానుడు ముఖ్యములైన తన దివ్యవిభూతులను వర్ణించెను. 41వ శ్లోకమునందు తన తేజస్సు అభివ్యక్తమగు స్థానములను ప్రకటించుచు తన ప్రభావ విశేషములనుగూర్చి తెల్పెను. ఆభావమునే ఇచట 'అథవా' అను శబ్దప్రయోగముద్వారా ప్రకటించెను.

ప్రశ్న - 'ఇంతకంటెను విపులముగా (ఎక్కువగా) తెలిసికొనుటవలన నీకు కలుగు ప్రయోజనమేమి?' అని యనుటలోని విశేషమేమి?

సమా - అర్జునుని అభ్యర్థనను అనుసరించి, ఇంతవఱకును భగవానుడు తన ముఖ్యవిభూతులను గూర్చి వర్ణించెను. కాని వాటిని తెలిసికొన్నంత మాత్రముననే అన్నింటిని తెలిసికొన్నట్లు గాదు. భగవానుడు ఇప్పుడు చెప్పబోవు విషయమును సమగ్రముగా చక్కగా అవగాహన చేసికొన్నచో అది కరతలామలకములగును. తరువాత తెలిసికొనవలసిన విషయములేమాత్రమూ మిగిలియుండవు.

ప్రశ్న - 'ఇదమ్', 'కృత్స్నమ్' అను విశేషణములతోపాటు 'జగత్' అను పదము దేనిని తెల్పును. అది (జగత్తు) భగవంతుని యోగశక్తియొక్క ఒక అంశచేతనే వహింపబడినదని తెల్పుటలోని అంతరార్థమేమి?

సమా - ఇచట 'ఇదమ్', 'కృత్స్నమ్' అను విశేషణములతో గూడిన 'జగత్' అనుపదము శరీరేంద్రియ మనస్సులతోగూడిన సమస్త చరాచరప్రాణులనూ, భోగ్య వస్తువులనూ, భోగస్థానములనూ, సమస్త లోకములతో గూడిన బ్రహ్మాండమునూ తెలుపునట్టి పదము. ఈ బ్రహ్మాండము భగవంతుని ఏదోయొక అంశములోని ఆయన యోగశక్తిచేత ధరింపబడియున్నది. ఈ భావమును తెల్పుటకే ఈ విస్తృతజగత్తు తన యోగశక్తియొక్క ఒక అంశచేతనే వహింపబడియున్నదని భగవానుడు తెల్పెను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః ॥ ౧౦ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదకొండవ అధ్యాయము - విశ్వరూపదర్శన యోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు అర్జునుని ప్రార్థనమేరకు భగవానుడు తన విశ్వరూపమును ఆయనకు దర్శింపజేసెను. ఈ అధ్యాయమున అధికాంశము కేవలము విశ్వరూప వర్ణనము, దాని ప్రస్తుతియు కలవు. అందుచే ఈ అధ్యాయమునకు 'విశ్వరూప దర్శన యోగము' అను పేరు ఏర్పడెను.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందలి మొదటి నాలుగు శ్లోకముల వరకును అర్జునుడు భగవానుని, ఆయన ఉపదేశములను ప్రశంసించి, భగవానుని విశ్వరూపదర్శన భాగ్యమును తనకు కల్గింపుమని ప్రార్థించెను. 5 నుండి 8వ శ్లోకము వఱకును, భగవానుడు తనలో దేవతలను, మనుష్యులను, పశుపక్ష్యాది సమస్త చరాచర ప్రాణులను, పెక్కు ఆశ్చర్యకరదృశ్యములుగల సంపూర్ణ జగత్తును చూడుమని తెల్పి, పిదప ఆయనకు దివ్య దృష్టిని ప్రసాదించెను. 9వ శ్లోకమున భగవానుడు అర్జునునకు విశ్వరూపమును చూపిన విషయమును సంజయుడు తెలుపుచు ఆరూపవిశేషములను 10 నుండి 13వ శ్లోకమువఱకు వర్ణించెను. ఈ విశ్వరూపమును చూచి అర్జునుడు చకితుడై, హర్షానందములను పొందినవాడై, భగవానునకు ప్రణమిల్లి తెల్పిన విషయమును 14వ శ్లోకమున సంజయుడు వివరించెను. పిమ్మట 15 నుండి 31వ శ్లోకమువఱకును అర్జునుడు ఆ విరాడ్రూపమును స్తుతించుచు దాని ప్రభావమును, అందలి దృశ్యములను వర్ణించుచు, చివరకు తన యథార్థరూపమును గూర్చి తెల్పుమని భగవానునే ప్రార్థించెను. 32, 33, 34 శ్లోకములలో - భగవానుడు తాను లోకములను సంహరించు కాలస్వరూపుడననియు, భీష్మద్రోణాదివీరులు తనద్వారా ముందుగనే మృత్యువాతపడిరనియు, అతడు కేవలము నిమిత్త మాత్రుడనియు తెల్పుచు, అర్జునుని యుద్ధము చేయుటకు ప్రోత్సహించెను. పిమ్మట 35వ శ్లోకమునందు భయాశ్చర్యనిమగ్నుడైన అర్జునుడు భగవద్వచనములను విన్న పిమ్మట పల్కిన విషయములను సంజయుడు తెల్పెను. 36 నుండి 46వ శ్లోకము వఱకును అర్జునుడు భగవంతుని స్తుతించి, నమస్కరించి, క్షమింపుమని అర్థించి, ఆయన దివ్యచతుర్భుజరూపమును దర్శింపజేయుమని ప్రార్థించిన విషయములు వర్ణింపబడినవి. 47, 48 శ్లోకములయందు భగవంతుడు తన విశ్వరూప మహిమను వివరించి, దానిని దర్శించు భాగ్యము దేవతలకును దుర్లభమని పేర్కొనెను. 49వ శ్లోకమున - అర్జునుని ఓదార్చుచు తన చతుర్భుజరూపమును చూడుమని పలికెను. చతుర్భుజరూపమును దర్శింపజేసిన పిమ్మట మఱల మానవరూపములో ప్రకటితుడైన విషయమును 50వ శ్లోకమున సంజయుడు వర్ణించెను. భగవానుని సౌమ్యమైన మానవరూపమును జూచి అర్జునుని మనస్సు కుదుటబడిన విషయమును 51వ శ్లోకమున తెలుపబడెను. పిమ్మట భగవానుడు తన చతుర్భుజరూపదర్శనము దుర్లభమని 52, 53వ శ్లోకములలో తెల్పెను. అనన్య భక్తిద్వారానే ఆ రూపముయొక్క దర్శనము, జ్ఞానము, ప్రాప్తి సులభముగా కలుగునని 54వ శ్లోకములో పేర్కొనెను. 55వ శ్లోకములో అనన్యభక్తి యొక్క స్వరూపమును, దాని ఫలమును తెల్పుచు ఈ అధ్యాయమును ముగించెను.

సంబంధము - 10వ అధ్యాయము నందలి 7వ శ్లోకము వఱకును భగవానుడు తన విభూతులను, యోగశక్తిని, వాటి మహత్త్వమును సంక్షిప్తముగా వర్ణించెను. 11వ శ్లోకమువఱకు భక్తియోగమును దానిఫలమును గూర్చి తెలిపెను. పిమ్మట 12 నుండి 18వ శ్లోకమువఱకు అర్జునుడు భగవానుని స్తుతించుచు ఆతనిదివ్య విభూతులను యోగశక్తిని విస్తృతముగా వర్ణింపుమని ప్రార్థించెను. అప్పుడు భగవానుడు 40వ శ్లోకమువఱకు తన దివ్యవిభూతులను వర్ణించి కడకు యోగశక్తిప్రభావమును తెలుపుచు సమస్తబ్రహ్మాండము తన ఒకే అంశతో వహింపబడుచున్నదని తెల్పెను. భగవంతునినుండి ఈ విశేషములను విని (తెలిసికొని) ఆ మహా స్వరూపమును (సమస్త విశ్వము ఒకే భగవదంశలో స్థితమైయున్న స్వరూపమును) ప్రత్యక్షముగా దర్శింపవలెనను కోరిక అర్జునుని మనస్సులో కలిగెను. కనుక ఈ అధ్యాయమున మొదటి నాలుగు శ్లోకములలో భగవానుని, ఆయన ఉపదేశమును ప్రశంసించుచు ఆయన విశ్వరూపమును దర్శింపజేయుమని అర్జునుడు ప్రార్థించుచున్నాడు-

### అర్జున ఉవాచ

**మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।**
**యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥ 1 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మదనుగ్రహాయ | = నన్ను అనుగ్రహించుట కొఱకు | అధ్యాత్మ-సంజ్ఞితమ్ | = అధ్యాత్మ విషయక మైనదియు అగు | తేన | = ఆవచనము(ల)చేత |
| పరమమ్ | = మిక్కిలి శ్రేష్ఠమైనదియు | యత్, వచః | = ఏ వచనము(లు) | మమ | = నా |
| | | త్వయా | = నీచేత | అయమ్ | = ఈ |
| గుహ్యమ్ | = గోప్యమైనదియు | ఉక్తమ్ | = చెప్పబడినదో(వో) | మోహః | = మోహము |
| | | | | విగతః | = తొలగినది |

**అర్జునుడు పలికెను - ఓ కృష్ణా! నన్ను అనుగ్రహింపదలచి పరమగోప్యమైన అధ్యాత్మిక విషయములను ఉపదేశించితివి. దానివలన నా అజ్ఞానము (మోహము) తొలగిపోయినది. (1)**

ప్రశ్న-'మదనుగ్రహాయ' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - 10వ అధ్యాయ ప్రారంభమున కరుణా సముద్రుడైన భగవానుడు "అర్జునా! నీ పైగల అత్యంతవాత్సల్యముచే నీ హితము గోరి ఈ విషయములనన్నింటిని తెలుపుచున్నాను." అని పలికి తన అలౌకిక ప్రభావమును తెలిపెను. దానిని వినిన అర్జునుని హృదయమునందు కృతజ్ఞతాభావము పెల్లుబికెను. భక్త్యానందతరంగములు పొంగిపొరలెను. అప్పుడతడిట్లు ఆలోచించెను. "ఆహా! సర్వలోక మహేశ్వరుడైన ఈ భగవానునకు అల్పుడనైన నాపై ఎంత కృపగలదు? అల్పజ్ఞుడనైన నన్ను తన భక్తునిగా భావించి, మహిమాన్వితములైన, అతిగోప్యములైన తన విషయములను గూడ తేటతెల్లము గావించుచున్నాడు." - అప్పుడతనికి (అర్జునునకు) మహర్షుల వచనములు స్మరణకు వచ్చెను. వెంటనే అతడు మిక్కిలి విశ్వాసముతో భగవంతుని గుణములను కీర్తించుచు మఱల ఆయనయొక్క యోగశక్తి విభూతులను విస్తృతముగా తెల్పుమని భక్తితో ప్రార్థించెను. ఆ ప్రార్థనను మన్నించి, భగవానుడు తన విభూతులను యోగశక్తిని సంక్షిప్తముగా వర్ణించెను. అర్జునుని హృదయముపై భగవత్కృప ముద్రితమయ్యెను. అతడు పరమానందభరితుడయ్యెను. సాధకుడు తన పురుషార్థమును, సాధనను, యోగ్యతను నమ్ముకొని యున్నంతవరకు అతనిపై భగవత్కృప ప్రసరింపదు. భగవదనుగ్రహము (కృప) లేనిదే ఎవ్వరైనను సాధన యందు ప్రగతిని సాధింపలేరు. కాని భగవత్కృపచే మాత్రమే ఆయన కృపావిశేషమును గుర్తించుట సాధ్యమగును. అప్పుడు అన్నియును భగవంతుని అనుగ్రహము వలననే కలుగుచున్నవని గ్రహించిననాడు అతని హృదయము కృతజ్ఞతతో నిండిపోవును. అప్పుడు అతని హృదయపు లోతులనుండి ఈ మాటలు పెల్లుబికెను - "ఓహో! భగవాన్! నేను దేనికిని యోగ్యుడనుకాను. నేను సర్వథా అనర్హుడనే. ఇదియంతయు నీ అనుగ్రహలీలావిశేషమే." - ఇట్టి కృతజ్ఞతాపూర్ణమైన హృదయముతోడనే అర్జునుడు "భగవాన్! నీ మహిమా ప్రభావములను గూర్చి నీవు వినిపించిన విషయములకు నేను పాత్రుడను గాను. నన్ను అనుగ్రహించుటకే పరమగోప్యమైన తత్త్వమును నాకు వినిపించితివి -" అని ప్రకటించుటకే 'మదనుగ్రహాయ' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'పరమమ్' గుహ్యమ్' 'అధ్యాత్మసంజ్ఞితమ్' అను మూడు విశేషణములతో గూడిన 'వచః' అను పదము భగవానుని ఏయే ఉపదేశములను సూచించును? ఈ విశేషణముల అర్థము లేమి?

సమా - 10వ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున చేసిన ప్రతిజ్ఞావచనములను అనుసరించి, 11వ శ్లోకము వఱకు భగవంతుడు తన దివ్యోపదేశములను అర్జునునకు వినిపించెను. మఱల అర్జునుని ప్రార్థనమేరకు 20 నుండి 42వ శ్లోకమువఱకు తన విభూతులను యోగశక్తిని గూర్చి తెల్పెను - ఏడవ అధ్యాయము నుండి 9వ అధ్యాయము

వఱకును విజ్ఞాన సహిత జ్ఞానమును తెల్పెదనని ప్రతిజ్ఞచేసి, భగవానుడు తనగుణ ప్రభావ - ఐశ్వర్య స్వరూప తత్త్వములను, రహస్యములను వివరించెను. ఈ యుపదేశములనన్నింటిని సూచించునదియే 'పరమమ్' 'గుహ్యమ్' 'అధ్యాత్మసంజ్ఞితమ్' అను మూడు విశేషణములతో గూడిన 'వచః' అను పదము.

భగవానుడు తనగుణప్రభావ తత్త్వములను వర్ణించి, తనను శరణు పొందుమని ఆదేశించెను. శ్రీకృష్ణరూపముతో అర్జునుని ఎదుట విరాజమానుడైయున్న తానే సమస్త జగత్తునకును కర్త, హర్త, నిర్గుణ సగుణ, నిరాకార, సాకార స్వరూపుడననియు, మాయాతీతుడును, సర్వశక్తిమంతుడును, సర్వాధారుడును ఐన పరమేశ్వరుడననియు స్పష్టముగా తెలిపెను. ఈ విషయములనన్నింటిని భగవంతుడు స్వయముగా పరమగుహ్యములని పేర్కొనెను. కనుక ఆ విషయములనే అర్జునుడు పరమ గోప్యములని మరల నుడివెను.

ప్రశ్న - ఇచట 'అయమ్' అను విశేషణముతో పాటు 'మోహః' అను పదము అర్జునుని ఎట్టి మోహమును సూచించును? పై ఉపదేశము ద్వారా అది తొలగి పోవుట యనగా నేమి?

సమా - భగవంతుని గుణప్రభావ - ఐశ్వర్య స్వరూపములను అర్జునుడు సంపూర్ణముగా తెలియక పోవుట- అనునదియే అతని మోహము (అజ్ఞానము). ఇప్పుడు ఉపర్యుక్త ఉపదేశముల ద్వారా భగవంతుని గుణప్రభావ ఐశ్వర్య రహస్య స్వరూపములను కొద్దిగా తెలిసికొని, శ్రీకృష్ణుడే సాక్షాత్తు పరమేశ్వరుడని అర్జునుడు గ్రహించెను. అతని మోహము (అజ్ఞానము) తొలగి పోవుటయనగానిదియే.

**భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।**
**త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ 2 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి = ఏలనన | | భూతానామ్ = ప్రాణులయొక్క | | శ్రుతౌ = వినబడినవి | |
| కమలపత్రాక్ష! = కమలపత్రములనంటి నేత్రములుగల ఓకృష్ణా! | | భవాప్యయౌ = ఉత్పత్తి ప్రళయములు | | చ = మఱియు నీయొక్క | |
| | | విస్తరశః = విశదముగా | | అవ్యయమ్ = శాశ్వతమైన | |
| త్వత్తః = నీవలన | | మయా = నాచేత | | మాహాత్మ్యమ్, అపి(శ్రుతమ్) = మాహాత్మ్యము గూడ (వినబడినది) | |

**ఓ కమలాక్షా! ఓ కృష్ణా! సమస్త ప్రాణుల ఉత్పత్తి ప్రళయములనుగూర్చి సవిస్తరముగా వింటిని. అట్లే శాశ్వతమైన నీ మహిమలను గూర్చియు వింటిని. (2)**

ప్రశ్న - "నేను సమస్త ప్రాణుల ఉత్పత్తి ప్రళయములను గూర్చి విస్తృతముగా వింటిని" అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవంతునినుండియే సమస్త చరాచర ప్రాణుల ఉత్పత్తి జరుగును. ఆయనయే వాటిని పాలించును. మఱల అవి అతనిలోనే లీనమగును. ఈ విషయములన్నియును (7వ అధ్యాయము నుండి 10వ అధ్యాయము వఱకు) అర్జునుడు భగవంతుని ముఖతః విస్తారముగా వినియుండెను. ఈ విషయమునే అర్జునుడు తెల్పుచున్నాడు.

ప్రశ్న - 'అట్లే శాశ్వతమైన నీ మహిమలను గూర్చియు వింటిని' అని యనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - కేవలము ప్రాణుల ఉత్పత్తి ప్రళయములను గూర్చియేగాక అర్జునుడు భగవంతుని శాశ్వతమహిమను గూర్చియును వినియుండెను. భగవంతుడు సమస్త విశ్వమును సృజించి, పాలించి, సంహరించుచుండినను వాస్తవముగ అకర్తయే - వాటిని నియమించుచున్నను ఉదాసీనుడే. అన్నిటియందును వ్యాపించి యున్నను ఆయా వస్తువుల గుణ దోషముల యెడ సదా నిర్లిప్తుడే. శుభాశుభకర్మలకు సుఖదుఃఖరూపఫలముల నొసంగినను నిర్దయ, పక్షపాతము లేనివాడు. తానే ప్రకృతి, కాలుడు, సమస్త లోకపాలుర రూపములలో ప్రకటితుడైనను అందఱిని నియమించు సర్వశక్తిమంతుడు. ఈ విధముగ భగవంతుని మాహాత్మ్యమును ఆయా సందర్భములలో వినియుండెను.

**ఏవమేతద్యథాత్థ త్వమ్ ఆత్మానం పరమేశ్వర ।**
**ద్రష్టుమిచ్ఛామి తే రూపమ్ ఐశ్వరం పురుషోత్తమ ॥ 3 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరమేశ్వర! | = ఓ పరమేశ్వరా! (కృష్ణా!) | ఆత్థ | = చెప్పియుంటివో | ఐశ్వరమ్, రూపమ్ | = షడ్గుణైశ్వర్యసంపన్న మైన నీ దివ్య రూపమును |
| త్వమ్ | = నీవు | ఏతత్ | = ఇది | | |
| ఆత్మానమ్ | = నిన్ను గూర్చి | ఏవమ్ (ఏవ) | = అంతయు సత్యమే | ద్రష్టుమ్ | = ప్రత్యక్షముగా చూచుటకు |
| యథా | = ఎట్లు (ఏవిధముగా) | పురుషోత్తమ! | = ఓ పురుషోత్తమా! | ఇచ్ఛామి | = కుతూహలపడు చున్నాను |
| | | తే | = నీయొక్క | | |

**ఓ పరమేశ్వరా! నీవు చెప్పినదంతయు సత్యమే. అందు సందేహమునకు తావులేదు. కాని ఓ పురుషోత్తమా! జ్ఞాన, ఐశ్వర్య, శక్తి, బల, వీర్య, తేజోమహితమైన నీ షడ్గుణైశ్వర్య సంపన్న రూపమును ప్రత్యక్షముగా చూచుటకు కుతూహలపడుచున్నాను. (3)**

ప్రశ్న - పరమేశ్వరా! పురుషోత్తమా! అను రెండు సంబోధనల యొక్క వైశిష్ట్యమేమి?

సమా - భగవానుడు ఈశ్వరులకే ఈశ్వరుడు (దేవదేవుడు) మఱియు సర్వసమర్థుడు - కనుక తాను చూడదలచిన మహైశ్వర్యయుక్తమైన భగవత్స్వరూపమును సహజముగనే దర్శింపజేయగల మహాశక్తిమంతుడు - అని తెల్పుటకే పరమేశ్వరా! అని సంబోధించెను. భగవానుడు క్షర-అక్షర పురుషులకంటెను శ్రేష్ఠుడైన వాడు. కనుక తనపైగల దయతో అతని విశ్వరూపమును దర్శింపజేయుమని ప్రార్థించుచు పురుషోత్తమా! అని సంబోధించెను.

ప్రశ్న - 'నీవు చెప్పినదంతయు సత్యమే' - అనియనుట లోని విశేషమేమి?

సమా - భగవానుడు తన గుణప్రభావ తత్త్వములను, ఐశ్వర్యమును విపులముగా వర్ణించి యుండెను. ఆ విషయములన్నియును పూర్తిగా యథార్థములనియు, అందు తనకేమాత్రము సందేహమే లేదనియు తెలుపుటకే "నీవు చెప్పిన దంతయు సత్యమే" అని అర్జునుడు పలికెను.

ప్రశ్న - 'ఐశ్వరమ్' అను విశేషణముతోపాటు 'రూపమ్' అను పదము ఏ రూపమును సూచించును? 'దానిని చూడగోరుదును' అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని అపరిమిత, అనంత జ్ఞాన, శక్తి, బల, వీర్య తేజస్సులు మొదలగు 'ఐశ్వర' గుణప్రభావములను ప్రత్యక్షముగా దర్శింప జేయునట్టియు, విశ్వమునంతటిని తన ఒక్క అంశయందే చూపగల్గునట్టిదియును, ఐన రూపమునే ఇచట 'ఐశ్వరమ్' అను విశేషణముతో గూడిన 'రూపమ్' అను పదము తెల్పును. అట్టి అద్భుతమైన రూపమును అర్జునుడెన్నడును చూచియెరుగడు. దాని వర్ణనమును భగవంతుని ముఖతః వినిన పిమ్మట (10/42) దానిని చూచుటకు అతని మనస్సు మిక్కిలి ఉత్కంఠభరిత మాయెను. దానిని దర్శించి తాను కృతార్థుడనయ్యెదనని అర్జునుడు తెల్పెను.

ప్రశ్న - భగవానుడు చెప్పిన విషయములపై అర్జునునకు ఎట్టి సందేహము లేకుండ పూర్ణవిశ్వాసము ఉన్నప్పుడు అట్టి రూపమును అతడు ఏల చూడగోరెను?

సమా - ఒక సత్యవంతునియొద్ద పరుసవేదిగాని, చింతామణిగాని, మరియొక అద్భుతమైన వస్తువు ఏదైనా గాని ఉన్నదని తెలిసినప్పుడు విన్న వారలకు అతనిపై పూర్తిగా విశ్వాసమున్నను, అట్టి వస్తువతని యొద్ద ఉన్నదని నిస్సందేహముగ నమ్మినను, దానిని చూచుటకు వారు కుతూహలపడుట సహజమే. అంతేగాని, అంతమాత్రమున వారి విశ్వాసములో లోపమున్నట్లు భావింపరాదు. అదేవిధముగ భగవంతుని అలౌకిక స్వరూపమును అర్జునుడు మునుపెన్నడును చూచియుండలేదు. కనుక అతని మనస్సునందు దానిని దర్శించుకోరిక పెల్లుబికెను. దానిని అతడు ప్రకటించెను. అంతేగాని అతని విశ్వాసములో ఎట్టి లోపమూ లేదు. పైగా దృఢ విశ్వాసము ఉండుట వలననే దానిని చూచుటకు తన ఇచ్ఛను ప్రకటించెను.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్ ॥ 4 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రభో | = ఓ ప్రభూ! | శక్యమ్, ఇతి | = సాధ్యమేయని | త్వమ్ | = నీవు |
| మయా | = నాచేత | మన్యసే, యది | = నీవు భావించు చున్నచో | అవ్యయమ్ | = శాశ్వతమైన |
| తత్ | = దానిని (నీదివ్య రూపమును) | | | ఆత్మానమ్ | = నిన్ను (నీరూపమును) |
| | | తతః | = అయితే | మే | = నాకు |
| ద్రష్టుమ్ | = చూచుటకు | యోగేశ్వర! | = ఓ యోగేశ్వరా! | దర్శయ | = చూపించుము. |

ఓ యోగేశ్వరా! ఓ ప్రభూ! నీ దివ్య రూపమును చూచుటకు నన్ను అర్హునిగా నీవు భావించినచో శాశ్వతమైన నీ దివ్యస్వరూపమును నాకు చూపింపుము. (4)

ప్రశ్న - "ఓ ప్రభూ! ఓ యోగేశ్వరా!" అను రెండు సంబోధనల యొక్క వైశిష్ట్యమేమి?

సమా - భగవానుడు సర్వప్రాణుల ఉత్పత్తి స్థితిలయములకును, అంతర్యామి రూపములో వాటిని శాసించుటకును కారకుడు అగుటవలన సర్వసమర్థుడు. "ఒకవేళ నేను నీ విరాడ్రూపమును దర్శించుటకు యోగ్యుడను (అర్హుడను) కానిచో నీవే దయదలచి నీ ప్రభావముతో ఆ రూపమును దర్శించుటకు తగు శక్తిని (దివ్యదృష్టిని) నాకు ప్రసాదింపుము." అని ప్రార్థించుచు 'ప్రభో!' అని అర్జునుడు సంబోధించెను. భగవానుడు యోగులందరికిని స్వామి. సాధారణమైన యోగియే సర్వవిధముల తన సిద్ధులను చూపగల్గునప్పుడు యోగీశ్వరుడైన భగవానుడు తనరూపమును అవలీలగా చూపునని తెల్పుటకు 'యోగేశ్వరా!' అని సంబోధించెను.

ప్రశ్న - "నీ రూపమును నేను చూడగలనని (చూచుటకు యోగ్యుడనని) భావించినచో నాకా దివ్యరూపమును చూపుము" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని ముఖతః ఆయన ప్రభావమును గూర్చి అర్జునుడు విన్న విషయము పూర్తిగా సత్యమే. అందేమాత్రమూ సందేహము లేదు. ఒకవేళ భగవానుడు తన స్వరూపమును అర్జునునకు చూపనిచో యోగేశ్వరేశ్వరుడైన భగవంతునకు సామర్థ్యము లేదనిగాని, అర్జునునకు భగవదంశ ప్రభావమునందు విశ్వాసము లోపించినదనిగాని భావింపరాదు. అయితే అర్జునుని మనస్సునందు భగవద్రూప దర్శన కాంక్ష ప్రబలముగా ఉన్న విషయమును భగవానుడెరుగును. ఆ పరమాత్మ భక్తుల వాంఛాకల్పతరువు. కావున అతడు భక్తులయొక్క భక్తి తత్పరతలను దప్ప వారి ఇతర యోగ్యతలను చూడనే చూడడు. కావున పరమ భక్తుడైన అర్జునుని యొక్క కోరికను తప్పక తీర్చునని అతడు విశ్వసించెను. అందువలననే "నీ రూపమును చూచుటకు నన్ను యోగ్యునిగా భావించినచో దయతో నాకు ఆ దివ్యరూపమును చూపుడు" అని అర్జునుడు పలికెను.

*సంబంధము - పరమశ్రద్ధాళువు, భక్తుడు ఐన అర్జునుడు ఈ విధముగా ప్రార్థింపగా తన విశ్వరూపమును వర్ణించుచు దానిని దర్శింపుమని భగవానుడు అర్జునుని ఆదేశించెను-*

***శ్రీభగవాన్ ఉవాచ***

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ 5 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | నానావిధాని | = నానావిధములైన | దివ్యాని | = అలౌకికములైన |
| అథ | = ఇప్పుడు | చ | = మఱియు | రూపాణి | = రూపములను |
| మే | = నాయొక్క | నానావర్ణా-కృతీని | = నానావర్ణము (వన్నె)లతో, ఆకృతులతో ఉన్న | పశ్య | = చూడుము. |
| శతశః, సహస్రశః | = వందలు, వేలకొలదిగల (అసంఖ్యాకములైన) | | | | |

శ్రీభగవానుడు పలికెను - ఓ అర్జునా! అసంఖ్యాకములైన బహువిధములైన, పెక్కువర్ణములు, ఆకృతులు గల నా అలౌకికరూపములను చూడుము. **(5)**

ప్రశ్న - ఇచట 'శతశః', 'సహస్రశః' అను రెండు సంఖ్యావాచకపదములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ రెండు సంఖ్యావాచకములను ప్రయోగించుట ద్వారా భగవానుడు తన రూపములు అసంఖ్యాకములని ప్రకటించెను. తన విశ్వరూపమున ఒకేచోట అసంఖ్యాకములైన రూపములను చూడుమని అర్జునుని ఆదేశించెను.

ప్రశ్న - 'నానావిధాని' అనగానేమి?

సమా - 'నానావిధాని' అను పదము వర్గభేదములను సూచించును. భగవంతుడు తన విశ్వరూపమునందు కన్పట్టు రూపముల వర్గవైవిధ్యములు అనేకములని ప్రకటించెను. అనగా దేవ, మనుష్య, తిర్యగాది సమస్త చరాచర జీవుల నానా భేదములను తనలో చూడుమని తెల్పెను.

ప్రశ్న - 'నానావర్ణాకృతీని' అను సమాసమున కర్థమేమి?

సమా - వర్ణము అను పదము ఎఱుపు, పసుపు, నలుపు, మొదలగు వేర్వేఱు రంగులను, 'ఆకృతి' అను పదము అంగముల పొందికను సూచించును. రూపముల రంగులును వాటి అంగముల అమరికలును వేర్వేఱుగా, అనేక విధములుగా ఉండుటవలన 'నానావర్ణాకృతీని' అను సమాసమును ప్రయోగించుట ద్వారా అట్టి రూపవైవిధ్య, వైభవములను తిలకింపుమని భగవానుడు తెల్పెను.

ప్రశ్న - 'దివ్యాని' అనగానేమి?

సమా - అలౌకిక - ఆశ్చర్యజనకములైన వస్తువులను 'దివ్యములు' అనియందురు. తన శరీరమునందు కన్పించు వివిధములైన అసంఖ్యాక రూపములన్నియును దివ్యములనియు, తన అద్భుతయోగశక్తిద్వారా రచింపబడుటచే అవి అలౌకికములును, ఆశ్చర్యకరములును అనియు తెల్పుటకే భగవానుడు దివ్యాని అను పదమును ప్రయోగించెను.

**పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా ।**
**బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | అశ్వినౌ | = అశ్వినీ కుమారులను | అదృష్ట-పూర్వాణి | = మునుపు(లోగడ) ఎన్నడును చూడనట్టి |
| ఆదిత్యాన్ | = అదితియొక్క ద్వాదశ పుత్రులను | మరుతః | = 49మంది మరుత్తులను | ఆశ్చర్యాణి | = ఆశ్చర్యకర రూపములను |
| వసూన్ | = అష్టవసువులను | పశ్య | = చూడుము | | |
| రుద్రాన్ | = ఏకాదశరుద్రులను | తథా | = అట్లే | | |
| | | బహూని | = అనేకములైన | పశ్య | = చూడుము. |

ఓ అర్జునా! ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను, అశ్వినీ కుమారులను, మరుద్గణములను నాయందు చూడుము. అంతేగాక ఇంకను మునుపెన్నడును చూచి యెరుగని అపూర్వమైన ఆశ్చర్యకరములైన రూపములను చూడుము. **(6)**

ప్రశ్న - ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీకుమారులను, మరుద్గణములను చూడుమని చెప్పుటలోని విశేషమేమి?

సమా - పైన పేర్కొనబడిన పదములన్నియును ప్రధానమైన దేవతలను సూచించును. వీరి పేర్లను పేర్కొని భగవానుడు, దేవతలను అందరిని తన విరాట్ స్వరూపములో దర్శింపుమని అర్జునుని ఆదేశించెను. వీరిలో ఆదిత్యులను, మరుద్గణములను గూర్చి, 10వ అధ్యాయము నందలి 21వ శ్లోకమునందును, వసు, రుద్రాదులను గూర్చి 23వ శ్లోకవ్యాఖ్యానమునందును వివరింప బడినది. అశ్వినీ కుమారులు అను సోదరులు దేవవైద్యులు.[1]

ప్రశ్న - 'అదృష్టపూర్వాణి, బహూని' అను రెండు విశేషణములతోపాటు ఆశ్చర్యాణి అను పదమునకు అర్థమేమి? వాటిని చూడుమని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - మునుపు ఎన్నడును చూడని దృశ్యములను 'అదృష్టపూర్వాణి' అని యందురు. చూచినంత మాత్రముననే ఆశ్చర్యమును గొలుపు అద్భుతములైన దృశ్యములను 'ఆశ్చర్యాణి' (ఆశ్చర్యకరములు) అని యందురు. 'బహూని' అను పదము అధికసంఖ్యను దెల్పును. మునుపెన్నడును ఎవరిద్వారా కూడ దర్శింపని ఆశ్చర్యకరములైన రూపములను అన్నింటిని తన 'విరాట్' స్వరూపములో దర్శింపుమని భగవానుడు అర్జునునితో పలికెను.

ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ 7 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుడాకేశ | = ఓ అర్జునా! | | గూడియున్న | యత్ | = దేనిని |
| అద్య | = నేడు (ఇప్పుడు) | కృత్స్నమ్, జగత్ | = సంపూర్ణజగత్తును | ద్రష్టుమ్ | = చూచుటకు |
| ఇహ, మమ దేహే | = ఈ నా దేహము నందు | పశ్య | = చూడుము | ఇచ్ఛసి | = కోరుకొనుచున్నావో |
| ఏకస్థమ్ | = ఒకేచోట స్థితమైయున్న | చ | = ఇంకను | | వాటినన్నింటిని |
| సచరాచరమ్ | = చరాచరములతో | అన్యత్ | = ఇతరమైన | | చూడుము. |

**ఓ అర్జునా! నా ఈ రూపమునందు ఒకేచోట స్థితమైయున్న సమస్తచరాచర జగత్తును చూడుము. అంతేగాక ఇంకను నీవు చూడదలచుకొనిన వాటినన్నింటినీ చూడుము. (7)**

ప్రశ్న - 'గుడాకేశ!' అను సంబోధనలోని ప్రత్యేకత ఏమి?

సమా - గుడాకేశుడనగా నిద్రకుస్వామి. (నిద్రను జయించినవాడు) ఈవిధముగాసంబోధించి, భగవానుడు తన రూపమును చక్కగా దర్శించినచో ఏవిధమైన సంశయముగాని భ్రమగాని ఉండదని తెల్పెను.

ప్రశ్న - 'అద్య' అను పదమునకర్థమేమి?

సమా - 'అద్య' యనగా 'ఇప్పుడు' అని యర్థము. అర్జునుడు చూడగోరిన విరాడ్రూపమును ఏమాత్రము విలంబము (ఆలస్యము) లేకుండ ఇప్పుడే చూపించుచున్నానని తెల్పుటకు భగవానుడు 'అద్య' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'సచరాచరమ్' 'కృత్స్నమ్' అను విశేషణములతో పాటు ప్రయుక్తమైన 'జగత్' అను పదము దేనిని సూచించును? 'ఇహ', 'ఏకస్థం' అను పదప్రయోగముల

1) వీరిద్దఱును సూర్యపత్నియైన సంజ్ఞయందు జన్మించినట్లు తెలియుచున్నది. (విష్ణుపురాణం 3/2/7, అగ్నిపురాణం 273/4) కశ్యపునకు వీరు అదితి గర్భమునందు జన్మించినట్లు రామాయణము తెలుపుచున్నది. (వాల్మీకి రామాయణము - అరణ్య-14/14) కొందఱు వీరు బ్రహ్మదేవుని కర్ణము నుండి జన్మించిరని పేర్కొనిరి - (వాయుపురాణం 65/57) కల్పభేదముచే అన్నియును యథార్థములే. వీరు దధ్యఙ్ముని నుండి జ్ఞానమును పొందిరి. (ఋగ్వేదం - 1/17/116/12, దేవీభాగవతం 7/36) శర్యాతి రాజు కూతురు సుకన్య యెడ ప్రసన్నులై ఆమె భర్తయైన చ్యవన మహర్షికి వృద్ధత్వమును, అంధత్వమును తొలగించి, నవయౌవనమును, నేత్రములను ప్రసాదించిరి (దేవీభాగవతం 7/4,5) రామాయణ మహాభారతములందును, పురాణములందును వీరిగాథలు పెక్కుగలవు.

ద్వారా (తన ఏ శరీరమునందు, ఏ ప్రదేశమున) సమస్త జగత్తును చూడుమని చెప్పెను?

సమా - పశు, పక్షి, కీట పతంగాదులను, దేవమనుష్యాది సంచరించుప్రాణులను చరములనియందురు - ఒకేచోట స్థిరముగా నుండు పర్వతవృక్షాదులను 'అచరముల'ని యందురు. ఇట్టి సమస్త ప్రాణులు, వాటి శరీరేంద్రియములు, భోగస్థానములు, భోగసామగ్రులుగల సమస్త బ్రహ్మాండమును సూచించునదియే 'కృత్స్నమ్' 'సచరాచరమ్' అను విశేషణములతో గూడిన 'జగత్' అను పదము.

'ఇహ' అను పదము 'దేహే' అను పదమునకు విశేషణము. దీనితోపాటు 'ఏకస్థమ్' అను పదమును ప్రయోగించి, అర్జునునకు సారథిగా అతనియెదుటనేయున్న తన శరీరముయొక్క ఒక అంశయందే సమస్త జగత్తును చూడుమని భగవానుడు పలికెను. 10వ అధ్యాయమునందలి చివరి శ్లోకమున ఈ సమస్త జగత్తును తాను తన ఒక అంశయందే కలిగి (ధరించి) ఉన్నానని భగవానుడు తెల్పియుండెను. ఇప్పుడు దానినే ప్రత్యక్షముగ చూపదలచెను.

ప్రశ్న - "ఇంకను నీవు చూడదలచిన వన్నియును చూడుము" - అని యనుటలోని విశేషమేమి?

సమా - ప్రస్తుత సంపూర్ణ జగత్తునే కాకుండా ఇంకను భగవానుని గుణప్రభావాదులను ద్యోతకమొనర్చు దృశ్యములను, తన మఱియు ఇతరుల జయాపజయములను సూచించు దృశ్యములను, ఇంకను అర్జునుడు చూడ గోరిన భూత భవిష్యద్వర్తమాన ఘటనలనన్నింటిని తన శరీరముయొక్క ఒక అంశయందే ప్రత్యక్షముగా చూడుమని భగవానుడు పలికెను.

*సంబంధము - ఈ విధముగా మూడు (5, 6, 7) శ్లోకముల ద్వారా తన అద్భుత రూపమును చూడుమని భగవానుడు పదే పదే చెప్పినను అర్జునుడు భగవద్రూపమును (అవిరాడ్రూపమును) చూడలేకపోయెను. అంతర్యామియైన భగవానుడు దానికి కారణమును గ్రహించి, అర్జునునకు దివ్యదృష్టిని ఇయ్యదలచి ఇట్లు పలికెను-*

**న తు మాం శక్యసే ద్రష్టుమ్ అనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | ద్రష్టుమ్ | = చూచుటకు | దివ్యమ్ | = దివ్యమైన |
| మామ్ | = నన్ను (ఈనా రూపమును) | ఏవ | = నిస్సందేహముగా | చక్షుః | = దృష్టిని |
| అనేన | = ఈ | న, శక్యసే | = సమర్థుడవుకావు (అశక్తుడవు) | దదామి | = ఇచ్చెదను |
| స్వచక్షుషా | = (ప్రాకృతములైన) చర్మచక్షువులతో | (అతః) | = ఇందువలన | మే, ఐశ్వరమ్, యోగమ్ | = నా దివ్యయోగ శక్తిని |
| | | తే | = నీకు | పశ్య | = చూడుము |

**కాని ఈ ప్రాకృత(చర్మ) చక్షువులతో నా ఈ రూపమును నీవు నిజముగా (నిస్సందేహముగా) చూడజాలవు. కనుక నీకు దివ్య(అలౌకిక) దృష్టిని ప్రసాదించుచున్నాను. ఆ దివ్యదృష్టితో నా ఈశ్వరీయ(దివ్య) యోగశక్తిని చూడుము. (8)**

ప్రశ్న - ఇచట 'తు' అను అవ్యయముతోపాటు "నీవునన్ను ఈ సాధారణ నేత్రములతో చూడలేవు" - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - భగవంతుని అద్భుతయోగశక్తి యుక్తమైన దివ్య స్వరూపమును అర్జునుడు చూడదలంచెను. భగవానుడు గూడ తన రూపమును చూపింపదలచెను. కాని అర్జునుడు తన చర్మచక్షువుల ద్వారా ఆ అలౌకికరూపమును చూడలేకపోయెను. దానిని చూచుటకై తగిన శక్తిని ప్రసాదించునుద్దేశ్యముతో "నీవు నీ సాధారణ నేత్రముల ద్వారా ఆరూపమును చూడలేవు" - అని భగవంతుడు పలికెను.

ప్రశ్న - భగవానుడు అర్జునునకు ప్రసాదించిన దివ్యదృష్టి ఎట్టిది?

సమా-అర్జునునకు తన విశ్వరూపమును ప్రదర్శించుటకు తన యోగబలము ద్వారా భగవానుడు అతనికి ఒక విధమైన యోగశక్తిని ప్రసాదించెను. దాని ప్రభావమున అర్జునునిలో

ఒక అలౌకిక సామర్థ్యము ప్రాదుర్భవించెను. తద్వారా ఆ దివ్యరూపమును చూచు యోగ్యత అతనికి ప్రాప్తించెను. ఈ యోగశక్తిపేరే 'దివ్యదృష్టి'. ఇట్టి దివ్య దృష్టినే శ్రీవ్యాసభగవానుడు సంజయునకు గూడ ఇచ్చియుండెను.

ప్రశ్న - ఈ సమస్తవిశ్వమును భగవత్స్వరూపముగా భావించు జ్ఞానమును భగవానుడు అర్జునునకు ప్రసాదించెను. ఆ జ్ఞానమే ఇచట ఈ 'దివ్యదృష్టి' అని భావించిన దోషమేమి?

సమా - ఈ సందర్భమును బాగుగా పరిశీలించిన పిమ్మట జ్ఞానము ద్వారా అర్జునుడు ఈ దృశ్యజగత్తును భగవద్రూపముగా భావించుటయే విశ్వరూపదర్శనమనియు, ఆ జ్ఞానమే దివ్య దృష్టి అనియు తలంచుటకు వీలులేదు - "భగవంతుని ఒక అంశయందే సమస్త విశ్వమూ స్థితమై యున్నదను విషయమును జ్ఞానము ద్వారా గ్రహింపుము" అని 10వ అధ్యాయమునందలి చివరి శ్లోకమున భగవానుడు అర్జునునకు తెలిపియుండెను. అర్జునుడు దానిని స్వీకరించెను. ఐనను భగవంతుని బల, వీర్య, శక్తి, తేజోయుక్తమైన ఆయన దివ్య స్వరూపమును ప్రత్యక్షముగా చూడగోరెను. భగవానుడు గూడ తన శ్రీకృష్ణరూపమునందే ఒకేచోట, సమస్త విశ్వమునూ చూపించెను. కాని జ్ఞానము ద్వారా ఆ విశ్వరూపమును దర్శించుట సాధ్యముగాదు. అంతేగాక భగవంతుడు వర్ణించి, చూపించిన ఆ విశ్వరూపము నందు అర్జునుడు సమస్త బ్రహ్మాండ దృశ్యములను, భవిష్యత్తునందు సంభవించునట్టి యుద్ధ సంబంధమైన ఘటనలను, వాటి పరిణామములను చూచుచుండెను. అర్జునుడు స్థితుడైయున్న విశ్వము వేఱు, భగవంతుని శరీరమున దర్శించిన విశ్వము వేఱు. అట్లుకానిచో దివినుండి భువివరకు గల సమస్త - ఆకాశమూ, దిశలూ, ఈ విశ్వరూపముచే వ్యాప్తమైయున్నట్లు చూచుట సాధ్యమైయుండెడిది గాదు. భయానకమైన ఆ విశ్వరూపమును జూచి, అర్జునుడు ఆశ్చర్యమూ, మోహమూ, భయమూ, సంతాపమూ, దిగ్భ్రమాదులలో మునిగిపోయెను. కావున భగవానుడు ఇచ్చిన ఉపదేశజ్ఞానము ద్వారా ఈ దృశ్యజగత్తును ఆయన స్వరూపముగా భావింపుమని చెప్పినట్లు కాదు. ఒకవేళ అదే సంభవమైతే (జ్ఞానముద్వారా విశ్వరూపమును దర్శించుటకు వీలైతే) అర్జునుడు భయ, సంతాప, మోహాదులకు లోనగువాడు కాడు.

ప్రశ్న - ఈ రోజులలో దూరశ్రవణ, దూరదర్శన యంత్రముల ద్వారా అతిదూర ప్రదేశశబ్దములను వినుటకును, దృశ్యములను చూచుటకును వీలగుచున్నదిగదా! అట్లే ఒకే స్థానమున ఉండి సమస్త విశ్వమును అవలీలగా చూచుటకు వీలగునట్లు భగవానుడు అర్జునునకు ఒక యంత్రమునిచ్చెనని ఆ యంత్రమే 'దివ్యదృష్టి' అని భావించినచో దోషమేమి?

సమా - రేడియో మొదలగు యంత్రముల ద్వారా ఒక కాలమందు ఒక స్థలమునందలి దూర ప్రదేశశబ్దములను వినుటకును, దృశ్యములను చూచుటకు వీలగును. అవి ఒకే ప్రదేశమునకును, ఒకే సమయమునకును సంబంధించినవి. ఒకే యంత్రముద్వారా ఒకే కాలమునందు ఒకే చోట అన్ని ప్రదేశములకును సంబంధించిన ఘటనలను చూచుటకు వీలులేదు. వాటి ద్వారా జనుల మనస్సులోని విషయములను ప్రత్యక్షముగా చూచుటకు వీలులేదు. భవిష్యత్తులో సంభవించు ఘటనలనూ చూడలేము. పైగా అర్జునుడు ఏదో ఒక యంత్రము ద్వారా భగవంతుని విశ్వరూపమును చూచినట్లు ఈ సందర్భమున తెలుపబడలేదు. కావున అట్లు భావించుట యుక్తియుక్తముగాదు. రేడియో మొదలగు భౌతిక యంత్రముల ఏర్పాటుచే దూర దేశమునందలి ఘటనలను వినుటకును చూచుటకును వీలైనప్పుడు భగవంతుడిచ్చిన యోగ శక్తిద్వారా అతని విశ్వరూపమును దర్శింపగల్గుట అసాధ్యమేమియు కాదని అధునికులైన సంశయగ్రస్తులకు కొంతవఱకు నచ్చజెప్పవచ్చును. పైగా స్వప్న జగత్తులోని దృశ్యములవలె అసత్యమైన సంఘటనలను అర్జునుడు చూచునట్లు భగవానుడేదో మాయచేసెనని భావించుటకు వీలులేదు. అర్జునుడు చూచిన స్వరూపము ప్రత్యక్షముగా సత్యమైనది. భగవత్కృపచే లభ్యమైన యోగశక్తిరూప దివ్యదృష్టియే దానిని దర్శించుటకు ఒకే ఒక సాధనము.

ప్రశ్న - 'ఐశ్వరమ్' అను విశేషణముతోపాటు 'యోగమ్' అను పదముదేనిని సూచించును? దానిని చూడుమని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - అర్జునుడు దర్శించిన రూపము దివ్యమైనది. భగవానుడు తన అద్భుత యోగశక్తి ద్వారా దానిని అర్జునునకు ప్రదర్శించెను. కనుక దానిని చూచుటవలననే భగవానుని అద్భుతయోగశక్తి దర్శనము గూడ అప్రయత్నముగనే కలుగును. కనుక 'ఐశ్వరమ్' అను విశేషణముతోపాటు 'యోగమ్' అను పదము భగవంతుని అద్భుతయోగశక్తితో గూడిన 'విరాట్' స్వరూపమును సూచించును. తన విరాట్ స్వరూపమును దర్శించుట ద్వారా యోగశక్తిని తెలిసికొనుమని భగవంతుడు అర్జునునితో పల్కెను.

సంబంధము - దివ్యదృష్టిని ప్రసాదించి, భగవానుడు అర్జునునకు చూపించిన దివ్యవిరాట్స్వరూపమును సంజయుడు ఐదు *(5)* శ్లోకములలో వర్ణించుచున్నాడు-

**సంజయ ఉవాచ**

**ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।**
**దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥ 9 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజన్! | = ఓరాజా! | ఏవమ్ | = ఈవిధముగా | పరమమ్, రూపమ్ | = సంపన్నమైన (తన) పరమదివ్య రూపమును |
| మహాయోగేశ్వరః | = మహాయోగేశ్వరుడును | ఉక్త్వా | = పలికి | దర్శయామాస | = చూపెను. |
| హరిః | = పాపములను హరించు వాడును అగు భగవానుడు | తతః | = అనంతరము | | |
| | | పార్థాయ | = అర్జునునకు | | |
| | | ఐశ్వరమ్ | = షడ్గుణైశ్వర్య | | |

**సంజయుడు పలికెను- ఓరాజా! మహాయోగేశ్వరుడును, పాపములను హరించువాడును ఐన భగవానుడు ఈ విధముగా పలికి, అనంతరము షడ్గుణైశ్వర్య సంపన్నమైన తన పరమదివ్య స్వరూపమును అర్జునునకు చూపెను. (9)**

ప్రశ్న - ఇచట సంజయుడు భగవానుని ఉద్దేశించి 'మహాయోగేశ్వరః' 'హరిః' అను రెండు విశేషణములను ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - యోగేశ్వరులలో ఉత్తమోత్తముడైనవానిని 'మహాయోగేశ్వరుడు' అని యందురు. అందఱి పాపములను, దుఃఖములను హరింప జేయువానిని 'హరిః' అని యందురు. ఈ రెండు విశేషణములను ప్రయోగించి, సంజయుడు భగవానుని యొక్క అద్భుత శక్తిసామర్థ్యములను పేర్కొనుచు, ధృతరాష్ట్రుని హెచ్చరించెను. శ్రీకృష్ణుడు సాధారణమైన మానవుడు కాడనియు, అత్యుత్తమ యోగేశ్వరుడనియు, అందఱి పాపములను దుఃఖములను రూపుమాపు సాక్షాత్ పరమేశ్వరుడనియు, ధృతరాష్ట్రునకు తెలియజేయుటయే సంజయుని ఉద్దేశ్యము. భగవానుడు అర్జునునకు చూపిన దివ్య విశ్వరూపమును తానుగూడ చూచితిననియు, దానిని వర్ణించి, ధృతరాష్ట్రునకు వినిపించుచున్నాననియు అతడు పలికెను. ఉత్తములైన యోగులు గూడ అట్టి దివ్యరూపమును చూపలేరనియు, కేవలము పరమేశ్వరుడొకడు మాత్రమే చూపగలడనియు దీని భావము.

ప్రశ్న - 'రూపమ్' అను పదముతో పాటు 'పరమమ్' 'ఐశ్వరమ్' అను విశేషణములను ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - పవిత్రమైన, శ్రేష్ఠమైన, అలౌకికమైన పదార్థమును 'పరమమ్' అనియందురు. పరమేశ్వరుని గుణప్రభావములను, తేజస్సును, ప్రకటించునట్టి, ఆయన దివ్యయోగశక్తి సమన్వితమైనదానిని 'ఐశ్వరమ్' అని యందురు. భగవానుడు అర్జునునకు చూపిన 'విరాట్' స్వరూపము అలౌకికము, దివ్యము, సర్వశ్రేష్ఠము, తేజోమయము. ఆ విశ్వరూపము పాంచభౌతికమైన దృశ్య (సాధారణ) జగత్తువలె నిర్మింపబడినది కాదు. భగవానుడు తన పరమభక్తుడైన అర్జునుని అనుగ్రహించి, తన అద్భుత ప్రభావమును అతనికి తెలియజెప్పుటకే తన అద్భుత యోగశక్తి ద్వారా ఆరూపమును ప్రకటించి చూపెను. ఈ విషయములను వివరించుటకే సంజయుడు 'రూపమ్' అను పదముతోపాటు 'పరమమ్' 'ఐశ్వరమ్' అను రెండు విశేషణములను ప్రయోగించెను.

**అనేకవక్త్రనయనమ్ అనేకాద్భుతదర్శనమ్ ।**
**అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10 ॥**
**దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।**
**సర్వాశ్చర్యమయం దేవమ్ అనంతం విశ్వతోముఖమ్ ॥ 11 ॥**

అనేకవక్త్ర-నయనమ్ = అనేకములైన ముఖములతో నేత్రములతో ఒప్పుచున్నదియు
అనేకాద్భుత-దర్శనమ్ = పెక్కు అద్భుత దృశ్యములను కలిగి యున్నదియు
అనేక-దివ్యాభరణమ్ = అనేకములగు దివ్యా భరణములను ధరించి యున్నదియు
దివ్యానేకోద్యతా-యుధమ్ = అనేకములైన దివ్యా యుధములను చేపట్టి యున్నదియు
దివ్యమాల్యాంబర ధరమ్ = దివ్యములైన మాలలను వస్త్రములను ధరించి యున్నదియు
దివ్యగంధాను-లేపనమ్ = దివ్యములైన చందన పరిమళములను దశ దిశల గుబాళింప జేయుచున్నదియు
సర్వాశ్చర్య-మయమ్ = సర్వాశ్చర్యకర మైనదియు
అనంతమ్ = అనంతమైనదియు
విశ్వతో-ముఖమ్ = సర్వత్ర ముఖ శోభలను విరజిమ్ము చున్నదియు అగు
దేవమ్ = ఆదేవదేవుని విరాడ్రూపమును (అర్జునుడు దర్శించెను).

అర్జునుడు చూచిన ఆ పరమేశ్వరుని విరాట్ (విశ్వ) రూపమునందలి ముఖములు అనంతములు-నేత్రములు అసంఖ్యాకములు. అందలి దృశ్యములు అద్భుతములైనవి. ఆ రూపము అనేకదివ్యాభరణశోభితము. ఆ పరమేశ్వరుడు పెక్కు దివ్యాస్త్రములను చేపట్టియుండెను. దివ్యములగు మాలలను, వస్త్రములను ధరించియుండెను. ఆ దివ్యశరీరమునుండి దివ్యచందనపరిమళములు దశదిశల గుబాళించుచుండెను. ఆ రూపము సర్వాశ్చర్యకరము, అనంతము, సర్వతోముఖము. **(10-11)**

ప్రశ్న - 'అనేక వక్త్రనయనమ్' అనగా నేమి?

సమా - అనేక విధములైన, అసంఖ్యాకములైన ముఖములు, కన్నులు గల రూపము 'అనేక వక్త్రనయనమ్' అని యనబడును. అర్జునుడు చూచిన భగవద్రూపమునందు ప్రధాననేత్రములు సూర్యుడు, చంద్రుడు అని తెల్పబడినవి. **(11/19)**. కాని ఆ విశ్వరూపమునందు ఇంకను అసంఖ్యాకము లైన నానావిధముఖములు, నేత్రములు గలవు. కనుక భగవానుని గూర్చి అనేక ముఖములు, నేత్రములు, కలవానినిగా తెల్పుట జరిగినది.

ప్రశ్న - 'అనేకాద్భుత దర్శనమ్' అనగానేమి?

సమా - మునుపెన్నడును చూడబడనిదియు, విచిత్రమైన, ఆశ్చర్యకరమైన దానిని అద్భుత దర్శనము అనియందురు. ఆరూపమునందు అసంఖ్యాకములైన అద్భుత దర్శనములు గలవు. కనుక దానిని 'అనేకాద్భుత దర్శనమ్' అని తెల్పుట జరిగినది. భగవానుని ఆ విరాడ్రూపమున అర్జునుడు అట్టి అలౌకిక విచిత్రదృశ్యములను అసంఖ్యాకములుగా చూచెను.

ప్రశ్న - 'అనేక దివ్యాభరణమ్' అనగానేమి?

సమా - ఆభరణములనగా సొమ్ములు. లౌకికమైన ఆభరణములకంటె విలక్షణములును, తేజోమయములును, అలౌకికములును ఐనట్టి వానిని 'దివ్యములు' అనియందురు. అట్టి దివ్యాభరణములు అసంఖ్యాకములుగా గల రూపమును 'అనేక దివ్యాభరణమ్' అని యందురు. అర్జునుడు చూచిన భగవద్రూపము అసంఖ్యాకములైన తేజోమయ దివ్యాభరణములచే శోభితమైయుండెను.

ప్రశ్న - 'దివ్యానేకోద్యతాయుధమ్' అనగానేమి?

సమా - యుద్ధమునకు ఉపయోగింపబడు శస్త్రములను ఆయుధములని యందురు. శ్రీమహావిష్ణువు యొక్క శంఖము, చక్రము, గద, ధనుస్సు మొదలగు అలౌకిక, తేజోమయములైన ఆయుధములు దివ్యములు. ఇట్టి దివ్య శస్త్రములను భగవానుడు అసంఖ్యాకములుగా తన చేతులలో ధరించియుండెను.

ప్రశ్న - 'దివ్యమాల్యాంబరధరమ్' అనగా నేమి?

సమా -అత్యుత్తమములై, తేజోమయములై, అలౌకికములైన మాలలను వస్త్రములను ధరించినవానిని **'దివ్యమాల్యాంబరధరుడు'** అని యందురు. భగవానుని విశ్వరూపమున కంఠములయందు సుందరములైన తేజోమయములైన దివ్యమాలలు విలసిల్లుచుండెను. అట్లే అనేకవిధములైన అత్యుత్తమములైన వస్త్రములచే సుసజ్జితుడై యుండెను.

ప్రశ్న - 'దివ్యగంధానులేపనమ్' అనగానేమి?

సమా - చందనాది లౌకికగంధములకంటెను విలక్షణమైన గంధములను అలౌకికములనియందురు. ఇట్టి దివ్యగంధముల అనుభవము ప్రాకృతములైన ఇంద్రియముల ద్వారా గాక దివ్యములైన ఇంద్రియముల ద్వారానే జరుగును. భగవానుని విశ్వరూపము యొక్క సమస్తాంగములనుండి ఇట్టి అత్యంతమనోహరములైన దివ్యగంధములు దశదిశల గుబాళించుచుండెను. కనుక ఆ రూపము 'దివ్యగంధానులేపనమ్' అని పేర్కొనబడినది

ప్రశ్న - 'సర్వాశ్చర్యమయమ్' అనగానేమి?

సమా - భగవానుని ఆ విరాడ్రూపమునందు అనేకవిధములైన ముఖములు/నేత్రములు, ఆభరణములు, శస్త్రములు, మాలలు, వస్త్రములు, గంధములు మొదలగునవియన్నియును ఆశ్చర్యకరములై యుండెను. కనుక ఆయనను 'సర్వాశ్చర్యమయమ్' అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - 'అనంతమ్' అనగానేమి?

సమా - అంతములేనిది, అవధిలేనిది 'అనంతమ్' అనబడును. అర్జునుడు చూచిన భగవద్విశ్వరూపము అతి విస్తృతమై, అంతములేనిదై యుండెను.

ప్రశ్న - 'విశ్వతోముఖమ్' అనగానేమి?

సమా - అసంఖ్యాకములైన ఆ విరాట్ పురుషుని ముఖములు అన్నిదిశలయందు వ్యాపించియుండెను. కనుక ఆ రూపమును 'విశ్వతోముఖమ్' అనియనుట జరిగినది.

ప్రశ్న - 'దేవమ్' అను పదమునకు అర్థమేమి? ఆ పదప్రయోగానైశిష్ట్యమేమి?

సమా - తేజోమయుడు, పూజ్యుడు అయినవానిని దేవుడు అనియందురు - ఉపర్యుక్త విశేషలక్షణములతో గూడి పరమతేజోమయుడైన శ్రీకృష్ణభగవానుని అర్జునుడు దర్శించెనని తెల్పుటకే సంజయుడు **'దేవమ్'** అను పదమును ప్రయోగించెను.

సంబంధము - పరమేశ్వరునియొక్క విరాట్ స్వరూప తేజస్సును సంజయుడు వర్ణించుచున్నాడు-

**దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।**
**యది భాః సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ॥ 12 ॥**

దివి = ఆకాశమునందు; సూర్యసహస్రస్య = వేలకొలది సూర్యుల యొక్క; భాః = కాంతిపుంజము (కాంతులు); యుగపత్ = ఒక్కుమ్మడిగా; ఉత్థితా, భవేత్ = ఉదయించినచో (వెల్లివిరిసినచో); సా = ఆకాంతిపుంజము; తస్య = ఆ; మహాత్మనః = విరాట్ పురుషుని యొక్క; భాసః = కాంతులకు; సదృశీ = సమానమైనది; యది = బహుశా; స్యాత్ = అగునేమో? (ఐనను సమానము కాదని భావము).

**ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచోవచ్చు కాంతి పుంజములును ఆ విరాట్- రూపతేజస్సులకు సాటిరావు. (12)**

ప్రశ్న - భగవత్తేజమును వేయి సూర్యుల తేజముతో పోల్చుటలోని విశేషమేమి?

సమా - భగవంతుని విరాట్ స్వరూపము యొక్క దివ్య తేజస్సు నిరుపమానము. వేలకొలది నక్షత్రములు ఒక్కసారిగా ప్రకాశించినను ఆ కాంతులు సూర్యతేజస్సుతో సమానము కానట్లు, వేలకొలది సూర్యులు ఒక్కసారిగా ఆకాశమున ప్రకాశించినను ఆ కాంతి పుంజము భగవానుని విరాట్ స్వరూపతేజస్సునకు సమానము కాదు. ఏలనన సూర్యుల ప్రకాశము అనిత్యము, భౌతికము, పరిమితము. కాని విరాట్ స్వరూపుడైన భగవానుని ప్రకాశము నిత్యము, దివ్యము, అలౌకికము, అపరిమితము.

*సంబంధము - తేజోమయుమైన భగవానుని అద్భుత స్వరూపమునందు అర్జునుడు సమస్త విశ్వమును చూచిన రీతిని సంజయుడు తెల్పుచున్నాడు-*

**తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।**
**అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥ 13 ॥**

తదా = అప్పుడు
అనేకధా = పెక్కు విధములుగా
ప్రవిభక్తమ్ = వేర్వేఱుగా వివిధ బ్రహ్మాండములుగా విభక్తమైయున్న
కృత్స్నమ్, జగత్ = సమస్త జగత్తును
దేవదేవస్య = దేవదేవుడైన విరాట్ పురుషుని యొక్క
తత్ర, శరీరే = ఆ శరీరమునందు
ఏకస్థమ్ = కేంద్రీకృతమై యున్నట్లు
పాండవః = అర్జునుడు
అపశ్యత్ = చూచెను

**ఆ సమయమున అర్జునుడు ఆ దేవాదిదేవుని శరీరమునందు అసంఖ్యాకములైన వివిధబ్రహ్మాండములు వేర్వేరుగా ఒకేచోట కేంద్రీకృతమైయున్నట్లు చూచెను. (13)**

ప్రశ్న - 'తదా' అను అవ్యయము ఏ సమయమును సూచించును?

సమా - భగవానుడు అర్జునునకు దివ్యదృష్టినొసంగి 'అసాధారణయోగశక్తితో గూడిన తన విరాట్ స్వరూపమును చూడుము.' అని ఆదేశించిన సమయమును (11/8) 'తదా' అను అవ్యయము తెలుపును.

ప్రశ్న - 'జగత్' అను పదముతోపాటు 'అనేకధా ప్రవిభక్తమ్' కృత్స్నమ్' అను విశేషణములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, క్రిమికీటకములు, వృక్షములు మొదలగు భోక్తృవర్గము, పృథ్వి, అంతరిక్షము, స్వర్గము, పాతాళము మొదలగు భోగ్య స్థానములు మఱియు వాటికి భోగ్యములగు అసంఖ్యాకవస్తువుల వైవిధ్యముచే విభక్తమైన సమస్త బ్రహ్మాండమును అర్జునుడు భగవానుని శరీరమునందు కేంద్రీకృతమైయున్నట్లు చూచెను - అనగా అతడు విశ్వములోని ఏదో ఒక అంశమును మాత్రమే చూచినాడనిగాని, లేక ఈ వర్గములన్నింటిని కలగాపులగముగా చూచినాడనిగాని అర్థముగాదు. కాని సమస్త విశ్వమునందలి సమస్త వర్గములను నిర్దుష్టముగా విస్తృతరూపములలో చూచెను.

ప్రశ్న - 'ఏకస్థమ్' అను పదప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - 10వ అధ్యాయమునందలి చివరి శ్లోకమున ఈ సంపూర్ణ జగత్తును తన ఒక అంశయందే ధరించియున్నట్లు భగవానుడు తెల్పియుండెను. దానినే అర్జునుడిచ్చట ప్రత్యక్షముగా చూచెను. ఈ విషయమును స్పష్ట పఱచుటకే 'ఏకస్థమ్' అనగా 'ఒకే ప్రదేశమున స్థితమైయున్న' అను పదము ప్రయోగింపబడెను.

ప్రశ్న - 'తత్ర' అను పదము దేనికి విశేషణము. ఆ పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - 'తత్ర' అను పదము ఇంతకుముందు వర్ణింపబడిన విషయమునకు సంబంధించినది. ఇచట ఇది దేవాధిదేవుడైన భగవానుని శరీరమునకు సంబంధించినది. దేవతలకును దేవుడు, సర్వశ్రేష్ఠుడు, బ్రహ్మాదులకును పూజ్యుడైన శ్రీకృష్ణభగవానుని విరాడ్రూపమునందు పాండుపుత్రుడైన అర్జునుడు సమస్త జగత్తును ఒకేచోట స్థితమైనదానినిగా చూచెనని తెల్పుటకే 'తత్ర' అను పదము ప్రయోగింపబడెను.

*సంబంధము - ఈ విధముగా అర్జునుడు విరాట్స్వరూపమును చూచిన పిమ్మట ఏమయ్యెను? అను విషయమును సంజయుడు తెల్పుచున్నాడు-*

**తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।**
**ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత ॥ 14 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తతః | = ఆపిమ్మట | హృష్టరోమా | = పులకితగాత్రుడై | | | | నమస్కరించి |
| సః, ధనంజయః | = ఆ అర్జునుడు | దేవమ్ | = ఆ విరాట్ పురుషునకు | కృతాంజలిః | = | అంజలిఘటించినవాడై | |
| విస్మయావిష్టః | = ఆశ్చర్యచకితుడై | శిరసా, ప్రణమ్య | = సాష్టాంగముగా | అభాషత | = | భాషించెను. | |

**అద్భుతమైన ఆ పరమాత్మని విశ్వరూపమును జూచి, అర్జునుడు ఆశ్చర్యచకితుడై పులకితగాత్రుడయ్యెను. తేజోమయమైన ఈ విశ్వ(విరాట్) రూపమునకు భక్తిశ్రద్ధలతో సాష్టాంగప్రణామములాచరించెను. తదనంతరము చేతులు జోడించి యిట్లు పలికెను. (14)**

ప్రశ్న - 'తతః' అనగానేమి?

సమా - 'తతః' అనగా ఆ పిమ్మట అని యర్థము. భగవానుని అత్యద్భుత ప్రభావముగల విరాట్ స్వరూపమును చూచిన పిమ్మట అర్జునునిలో గలిగిన మార్పును 'తతః' అను పదము సూచించును.

ప్రశ్న - 'ధనంజయః' అను పదముతోపాటు 'విస్మయావిష్టః' 'హృష్టరోమా' అను రెండు విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - పెక్కుమంది రాజులను జయించి రాజసూయ యాగము కొఱకు ధనమును సేకరించుట (సమకూర్చుట) వలన అర్జునునకు ధనంజయుడు అను పేరు వచ్చెను 'ధనంజయః' అను పదముతోపాటు, 'విస్మయావిష్టః', 'హృష్టరోమా' అను విశేషణములను ప్రయోగించి, అర్జునుని యొక్క సంభ్రమ, సంతోష+ఆశ్చర్యాధిక్యములను ప్రకటించుట జరిగినది.

భగవానుని విశ్వరూపమును దర్శించినట్టి ఆ క్షణముననే అతడు సంభ్రమ, సంతోషములతో పులకిత గాత్రుడాయెను. అతడు షడ్గుణైశ్వర్య సంపన్నుమైన భగవానుని అట్టి రూపమును ఇంతకు ముందెన్నడును చూచియుండలేదు- కనుక ఆ అలౌకిక రూపమును చూడగనే అతని హృదయముపై భగవానుని అపరిమిత ప్రభావముయొక్క అంశము ఒకింత ముద్రితమయ్యెను. భగవత్ప్రభావము కొంత అవగతమయ్యెను. అతనికి గల్గిన హర్షాశ్చర్యములకు మేరయే లేకుండెను.

ప్రశ్న - 'దేవమ్' అను పదము ఎవరిని తెలుపును? 'శిరసా ప్రణమ్య కృతాంజలిః' అనువాక్యప్రయోగ విశేషమేమి?

సమా - 'దేవమ్' అను పదము తేజోమయమైన భగవానుని విరాట్ స్వరూపమును తెల్పును. భగవానుని విరాట్ స్వరూపము అనంతాశ్చర్యమయ దృశ్యములతో ఒప్పారునది. పరమ తేజోమయమై, అపరిమిత+ఐశ్వర్య సమన్వితమైనది. అట్టి దివ్య స్వరూపమును చూచిన అర్జునుడు తత్ప్రభావితుడు అయ్యెను. అతని మనస్సులోగల పూర్వపు సఖ్యస్థితి (మైత్రీభావము) అదృశ్యమాయెను. శ్రీకృష్ణ భగవానునిముందు తాను మిక్కిలి అల్పుడనను భావము అతనిలో పొడుకొనెను. అతని హృదయమునందు ఆయన యెడ అత్యంత పూజ్యభావము జాగృత మయ్యెను. ఆ పూజ్యభావ ప్రవాహము విద్యుత్తువలె అతనిలో ప్రసరించుటయు, అప్రయత్నముగనే అతని మస్తకము భగవానుని పాదములపై వ్రాలిపోవుటయు ఏక కాలములో జరిగెను. పిమ్మట అతడు చేతులు జోడించి, మిక్కిలి వినమ్రభావముతో భక్తిశ్రద్ధలతో భగవానుని స్తుతింపసాగెను.

*సంబంధము - పై విధముగా హర్షాశ్చర్యచకితుడైన అర్జునుడు భగవానుని విశ్వరూపమునందు చూచిన దృశ్యములను వర్ణించుచు ఆ విశ్వరూపమును స్తుతింపసాగెను -*

## అర్జున ఉవాచ

**పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।**
**బ్రహ్మాణమీశం కమలాసనస్థమ్ ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేవ! | = ఓ పరమేశ్వరా! | కమలాసనస్థమ్ | = కమలమునందు ఆసీనుడైయున్న | సర్వాన్, ఋషీన్ | = సమస్త-ఋషులను |
| తవ దేహే | = నీదేహ(విరాట్ స్వరూప)మునందు | బ్రహ్మాణమ్ | = బ్రహ్మను | చ | = మఱియు |
| సర్వాన్, దేవాన్ | = సకలదేవతలను | ఈశమ్ | = శంకరుని | దివ్యాన్ | = దివ్యములైన |
| తథా | = అట్లే | చ | = మఱియు | ఉరగాన్ | = సర్పములను |
| భూతవిశేష సంఘాన్ | = వివిధప్రాణి సముదాయములను | | | పశ్యామి | = చూచుచున్నాను. |

**అర్జునుడు పలికెను - ఓ దేవాదిదేవా! నీ విరాట్-రూపమునందు సకల దేవతలను, నానావిధప్రాణికోటిని, కమలాసనుడైన బ్రహ్మను, మహాదేవుడైన శంకరుని, సమస్త ఋషులను, దివ్యసర్పములను చూచుచున్నాను. (15)**

ప్రశ్న - ఇచట 'దేవ!' అను సంబోధనయొక్క ప్రత్యేకత ఏమి?

సమా - భగవానుని తేజోమయమైన అద్భుత రూపమును చూచిన అర్జునునకు ఆయనయందు భక్తి శ్రద్ధాన్వితమైన పూజ్యభావము ఏర్పడెను - దానిని ప్రకటించుటకే ఇచట 'దేవ!' అనుచు సంబోధించుట జరిగెను.

ప్రశ్న - 'తవ, దేహే' అనగానేమి?

సమా - అర్జునుడు తన యెదుట నున్న భగవానుని శరీరము (విశ్వరూపము) నందు అన్నింటిని చూపుచుండెనని తెల్పుటకే 'తవ, దేహే' అను రెండు పదములను ప్రయోగించెను.

ప్రశ్న - 'నీ శరీరమున సమస్త చరాచర ప్రాణుల వివిధసముదాయములను చూచుచున్నాను' అని తెల్పియున్నప్పుడు "దేవతలనందరిని చూచుచున్నాను" అని వేఱుగా చెప్పవవసరమేమున్నది?

సమా - జగత్తునందలి సమస్త ప్రాణులలో దేవతలు సర్వశ్రేష్ఠులుగా భావింపబడుదురు. కనుక వారిపేర్లు ప్రత్యేకముగా పేర్కొనబడినవి.

ప్రశ్న - బ్రహ్మ, శివుడు అనువారు దేవగణములో చేరినవారే. విడిగా వారిపేర్లను తెలుపుటలోని విశేషమేమి? బ్రహ్మతోపాటు 'కమలాసనస్థమ్' అను విశేషణమును ప్రయోగించుటలో గల ప్రత్యేకత యేమి?

సమా - బ్రహ్మయు, శివుడును దేవతలకును ఆరాధింప దగినవారు. అట్లే వారు దివ్య స్వరూపులు. కనుక వారి ప్రత్యేకతకు తగినట్లు వారి పేర్లు విడిగా పేర్కొనబడినవి. శ్రీమహావిష్ణువు నాభి నుండి ఉత్పన్నమైన కమలముపై విరాజిల్లుచున్న బ్రహ్మను గూడ అర్జునుడు చూచుచున్నాడని తెల్పుటకు 'కమలాసనస్థమ్' అను విశేషణము ప్రయుక్తమైనది. అనగా బ్రహ్మతోపాటు శ్రీమహావిష్ణు స్వరూపమును గూడ ఆవిరాట్ స్వరూపమున అతడు చూచెనని దీని భావము.

ప్రశ్న - 'సమస్త ఋషులను, దివ్యములైన సర్పములను ప్రత్యేకముగా తెల్పుటలోని విశేషమేమి?

సమా - మానవలోకమున గల సకల ప్రాణులలో ఋషులును, పాతాళలోకమున వాసుకి మున్నగు దివ్యసర్పములును శ్రేష్ఠములుగా భావింపబడును. కనుక వారిని గూర్చి ప్రత్యేకముగా తెల్పుట జరిగినది.

ఇచ్చట స్వర్గ, మర్త్య, పాతాళ లోకముల యందలి ప్రముఖుల సముదాయమును పేర్కొనుచు తాను త్రిభువనాత్మకమైన సమస్త విశ్వమును భగవానుని శరీరమునందు చూచుచున్నానని అర్జునుడు తెల్పెను.

**అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్ ।**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వరవిశ్వరూప ॥ 16 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| విశ్వేశ్వర! | = ఓ జగన్నాథా! | అనంతరూపమ్ | = అనంతములైన రూపములుగల వాడవును ఐన | న పశ్యామి | = చూడ (తెలిసికొన) లేకున్నాను |
| అనేకబాహూదర వక్త్రనేత్రమ్ | = అనేకములైన బాహువులును, ఉదరములును, ముఖములును, నేత్రములును గల వాడవును | త్వామ్ | = నిన్ను | మధ్యమ్ | = మధ్యమును |
| సర్వతః | = అంతటను | పశ్యామి | = చూచుచున్నాను | న | = చూడకున్నాను |
| | | విశ్వరూప! | = ఓ విరాడ్రూపా! | పునః | = మఱియు |
| | | తవ | = నీ యొక్క | అంతమ్ | = అంతమును |
| | | ఆదిమ్ | = ఆదిని | న | = చూడకున్నాను. |

ఓ విశ్వేశ్వరా! విశ్వరూపా! నీ బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు అసంఖ్యాకములు. నీ అనంతరూపము సర్వతోముఖముగ విలసిల్లుచున్నది. నీవు అదిమధ్యాంతరహితుడవు. మహత్త్వపూర్ణమైన నీ దివ్యరూపమునకు ఆది మధ్యాంతములను తెలిసికొనలేకున్నాను. (16)

ప్రశ్న - 'విశ్వేశ్వర!' 'విశ్వరూప!' అను రెండు సంబోధనములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - భగవానుడే ఈ సమస్త విశ్వమునకు కర్త, హర్త. అందరిని వారి వారి కార్యముల యందు నియుక్తులనుగా చేయు అధీశ్వరుడు. వాస్తవముగా విశ్వమంతయును ఆయన స్వరూపమే. ఆయనయే దాని నిమిత్త కారణము, ఉపాదాన కారణము. ఈ భావమును ప్రకటించుటకే 'విశ్వేశ్వర!' 'విశ్వరూప!' అని అర్జునుడు భగవానుని సంబోధించెను.

ప్రశ్న - 'అనేకబాహూదరవక్త్రనేత్రమ్' - అనగానేమి?

సమా - అర్జునుడు దర్శించిన ఆ విశ్వరూపమునందు భుజములు, ఉదరములు, ముఖములు, నేత్రములు అసంఖ్యాకములుగా ఉండెను. వాటిని ఎవ్వరును, ఏ విధముగను లెక్కింపజాలరు.

ప్రశ్న - 'సర్వతః' 'అనంతరూపమ్' అనగానేమి?

సమా - అర్జునుడు దర్శించిన భగవానుని శరీరమునందు అన్ని వైపుల నుండి అనేక విధములైన రూపములు అసంఖ్యాకములుగా నుండెను. అనగా భగవానుని ఒకే శరీరమునందు వేర్వేఱు రూపములు అనంతములుగా అన్ని దిశలా వ్యాపించి యున్నట్లు అర్జునుడు చూచెను.

ప్రశ్న - "నీ రూపముయొక్క ఆది మధ్యాంతములను నేను చూడజాలకయున్నాను" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని ఆ విరాట్ స్వరూపము యొక్క ఆద్యంతములు ఎచ్చట గూడ అర్జునునకు గోచరింపలేదు. అనగా ఆ రూపము ఎచటినుండి ఎచటి వఱకు వ్యాపించి యున్నదో అర్జునుడు తెలిసికొనలేక పోయెను. ఈ విధముగా ఆద్యంతముల ఉనికి తెలియకపోవుట వలన ఆ రూపముయొక్క మధ్యభాగమును గూడ అతడు తెలిసికొనలేకపోయెను. ముందు, వెనుక, కుడి, ఎడమ, పైన, క్రింద అన్ని వైపుల అతని అవధిలేని రూపమే అతనికి గోచరించెను - ఏవైపు నుండి చూచినను ఆ రూపమునకు హద్దు గోచరించుటయే లేదు.

**కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్ దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్ ॥ 17 ॥**

కిరీటినమ్ = కిరీటమును ధరించిన వాడవును,
గదినమ్ = గదను చేపట్టిన వాడవును
చ = మఱియు
చక్రిణమ్ = చక్రము చేబూనిన వాడవును ఐ
సర్వతః = అన్ని దిశలయందును
తేజోరాశిమ్ = తేజోరాశియు
దీప్తిమంతమ్ = ప్రకాశించుచున్న వాడవును
దీప్తానలార్క ద్యుతిమ్ } = ప్రజ్వలితాగ్నివలెను, జ్యోతిర్మయుడైన సూర్యునివలెను వెలుగొందుచు
దుర్నిరీక్ష్యమ్ = చూచుటకు శక్యము గాని వాడవును
సమంతాత్ = అంతటను
అప్రమేయమ్ = అప్రమేయ స్వరూపుడవును ఐయున్న
త్వామ్ = నిన్ను
పశ్యామి = చూచుచున్నాను

**హే విష్ణో! కిరీటమును, గదను, చక్రమును ధరించి, అంతటను తేజఃపుంజములను విరజిమ్ముచున్న నిన్ను దర్శించుచున్నాను. ప్రజ్వలితాగ్నివలెను, జ్యోతిర్మయుడైన సూర్యునివలెను వెలుగొందుచున్న నీ అప్రమేయరూపము దుర్నిరీక్ష్యమై యున్నది. (17)**

ప్రశ్న-'కిరీటినమ్', 'గదినమ్', 'చక్రిణమ్' అనగా నేమి?

సమా - శిరస్సుపై తేజస్సుతో మిక్కిలి మిరుమిట్లు గొల్పుచున్న కిరీటముగల వానిని 'కిరీటీ' అనియందురు. చేతులలో గదను, చక్రమును ధరించిన వానిని 'గదీ', 'చక్రీ' అని యందురు. అర్జునుడు దర్శించిన పరమాద్భుత విశ్వరూపమునందు భగవానుడు తన శిరమున మిక్కిలి తేజోమయమైన కిరీటమును, చేతులలో గదను, చక్రమును ధరించియుండెను. కనుక అర్జునుడు ఈ మూడు పదములను ప్రయోగించెను.

ప్రశ్న - 'సర్వతః' దీప్తిమంతమ్' 'తేజోరాశిమ్' అనగానేమి?

సమా - దివ్యమైన ప్రకాశముతో పైన, క్రింద, లోపల, బయట సర్వదిశలయందును వ్యాపించియున్నదానిని 'సర్వతోదీప్తిమంతమ్' అని యందురు. ప్రకాశ సమూహమును 'తేజోరాశిమ్' అని యందురు. అర్జునుడు చూచిన విరాడ్రూపము మూర్తీభవించిన 'తేజఃపుంజము'గా, సర్వదిశలయందును పరమప్రకాశవంతముగా నుండెను.

ప్రశ్న - 'సర్వతోదీప్తిమంతమ్' 'తేజోరాశిమ్' అను విశేషణములను ప్రయోగించిన పిమ్మట అదే భావమును స్ఫురింపజేయు 'దీప్తానలార్కద్యుతిమ్' అను సమాసమును ప్రయోగించవలసిన అవసరము ఏమి?

సమా - భగవంతుని విరాడ్రూపమును పరమ ప్రకాశయుక్తము, ఆకృతిదాల్చిన 'తేజఃపుంజము' అని తెలిపి, ఆ విషయమునే ధ్రువీకరించుటకు అగ్నిసూర్యులను ఉపమానములుగా ఇచ్చుటకు 'దీప్తానలార్కద్యుతిమ్' అను సమాసము ప్రయోగింపబడెను. ప్రజ్వలితాగ్ని, తేజోమండలమైన సూర్యుల ప్రకాశములకు పెక్కురెట్లు అధికముగా భగవంతుని విరాట్ స్వరూపము ప్రకాశించుచుండెను. అగ్ని, సూర్యులతేజస్సు ఏదో ఒక దిశగా, పరిమితప్రదేశమునకే వెలుగునిచ్చును. కాని భగవంతుని విరాట్స్వరూపము అన్ని దిశలయందు అగ్ని సూర్యులకంటె అనంత గుణాధిక తేజోమయముగా గోచరించుచుండెను.

ప్రశ్న - 'దుర్నిరీక్ష్యమ్' అనగానేమి? భగవంతుని ఆ రూపము దుర్నిరీక్ష్యమేయైనచో అర్జునుడెట్లు చూడగలిగెను?

సమా - అత్యంతాద్భుత ప్రకాశశోభితమైనదగుట వలన ఆ రూపము ప్రాకృతనేత్రములతో ఎవ్వరును చూడజాలరు. కనుక అది సామాన్యులకు 'దుర్నిరీక్ష్య'మని తెల్పబడినది. ఆరూపమును చూచుటకు భగవానుడు అర్జునునకు దివ్యదృష్టిని ప్రసాదించెను. తత్ప్రభావమున అతడు దానిని చూడగల్గెను. ఇతరులకు అది దుర్నిరీక్ష్యము.

ప్రశ్న - 'సమంతాత్ అప్రమేయమ్' అనగానేమి?

సమా - ఏ ప్రమాణము చేతనైనను కొలుచుటకు (తెలిసికొనుటకు) శక్యము కాని దానిని అప్రమేయమ్ - అనియందురు. సర్వవిధముల అప్రమేయమైన దానిని 'సమంతాత్ అప్రమేయమ్' అని యందురు. భగవానుని గుణప్రభావ శక్తి స్వరూపములను ఏ ప్రాణియును ఏ ఉపాయము ద్వారా కూడ తెలిసికొనజాలరని తెల్పుటకే అర్జునుడు ఆ రూపమును 'సమంతాత్ అప్రమేయమ్' అని వర్ణించెను.

**త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే ॥ 18 ॥**

త్వమ్ = నీవు
వేదితవ్యమ్ = తెలిసికొనదగిన
పరమమ్, అక్షరమ్ = పరమ-అక్షరుడవు(పరబ్రహ్మ పరమాత్మవు)
త్వమ్ = నీవే
అస్య, విశ్వస్య = ఈ విశ్వమునకు
పరమ్, నిధానమ్ = పరమాశ్రయుడవు
త్వమ్, (ఏవ) = నీవే
శాశ్వతధర్మగోప్తా = సనాతనధర్మమును పరిరక్షించువాడవు
త్వమ్(ఏవ) = నీవే
అవ్యయః = నాశరహితుడవు
సనాతనః, పురుషః = సనాతన పురుషుడవు, అని
మే, మతః = నా నిశ్చయము.

పరమ - అక్షరస్వరూపుడవైన పరబ్రహ్మపరమాత్మవు నీవే, కనుక అందరికిని తెలిసికొనదగిన వాడవు. ఈజగత్తునకు నీవే పరమాశ్రయుడవు. సనాతన ధర్మరక్షకుడవు. నీవు అవ్యయుడవు. సనాతనపురుషుడవు అని నావిశ్వాసము. (18)

ప్రశ్న - 'వేదితవ్యమ్', 'పరమమ్' అను విశేషణములతో పాటు 'అక్షరమ్' అను పదము ఎవరిని సూచించును? దాని అర్థమేమి?

సమా - 8వ అధ్యాయమునందలి 3వ శ్లోకములో 'అక్షరపరబ్రహ్మ' అని తెల్పబడిన 'పరతత్త్వ స్వరూపుడైన సచ్చిదానందఘన నిర్గుణ నిరాకార పరబ్రహ్మ పరమాత్మను తెల్పునదియే 'వేదితవ్యమ్', 'పరమమ్' అను విశేషణములతో గూడిన 'అక్షరమ్' అను పదము. తెలిసికొనదగిన పరతత్త్వమునే ముముక్షువులు కోరుకొందురు. జిజ్ఞాసువులైన సాధకులు అనేకవిధముల సాధన చేయుదురు. భగవంతుని విరాట్ స్వరూపమును చూచిన అర్జునునకు పరబ్రహ్మ పరమాత్మయైన నిర్గుణ బ్రహ్మయు ఆయనయే అని దృఢనిశ్చయమాయెను.

ప్రశ్న - 'నిధానమ్' అనగానేమి? భగవానుని 'ఈ జగత్తునకు పరమనిధానము' అని పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - ఒక వస్తువునకు ఆధారము (ఆశ్రయము) ఐనదానిని 'నిధానమ్' అనియుందురు. ఈ సమస్త జగత్తు కారణ, కార్యసహితముగ భగవంతునియందే స్థితమైయున్నది. ఆయనయే దీనిని వహించుచున్నాడు. కనుక 'ఆయనయే దీనికి ఆధారము' - అని తెల్పుటకు - "భగవానుడే ఈ జగత్తునకు నిధానము" అని అర్జునుడు పేర్కొనెను.

ప్రశ్న - 'శాశ్వతధర్మము' అనగానేమి? భగవానుడే దానికి 'గోప్త' అని పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - వేదప్రోక్తమైన సనాతన ధర్మము అనాది కాలమునుండియు స్థిరముగా కొనసాగుచు వచ్చుచునే యున్నది. దానినే శాశ్వత ధర్మము అని అందురు. భగవానుడు పదే పదే అవతారములను దాల్చి ఆ ధర్మమును రక్షించుచున్నాడు. కనుక భగవానుడే 'శాశ్వతధర్మగోప్త'- అని అర్జునుడు నుడివెను.

ప్రశ్న - 'అవ్యయ, సనాతన' అను విశేషణములతో పాటు 'పురుష' శబ్దమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఎన్నటికిని నశింపని దానిని 'అవ్యయము' అనియుందురు. ఎప్పటికిని ఒకే విధముగ స్థిరముగా నుండుదానిని 'సనాతనము' అని యుందురు. భగవానుడు నాశరహితుడు. సమస్త జగత్తునకును కర్త, హర్త, సర్వశక్తిమంతుడు, వికారరహితుడు, సనాతన పరమపురుషుడు, సాక్షాత్పరమేశ్వరుడు - అని తెల్పుటకు అవ్యయ, సనాతన అను విశేషణములతోపాటు పురుషశబ్దమును అర్జునుడు ప్రయోగించెను.

**అనాదిమధ్యాంతమనంతవీర్యమ్ అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।**
**పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥ 19 ॥**

అనాది మధ్యాంతమ్ = ఆదిమధ్యాంత రహితుడవును
అనంతవీర్యమ్ = అనంతమైన సామర్థ్యము గలవాడవును
అనంత బాహుమ్ = అపరిమితమైన బాహువులుగల వాడవును
శశిసూర్య నేత్రమ్ = సూర్యచంద్రులను నేత్రములుగా గల వాడవును
దీప్తహుతాశ వక్త్రమ్ = ప్రజ్వలితాగ్నివలె ప్రకాశించుచున్న ముఖములుగల వాడవును
స్వతేజసా = నీ తేజస్సుతో
ఇదమ్ = ఈ
విశ్వమ్ = విశ్వమును
తపంతమ్ = తపింపజేయుచున్న వాడవును- అగు
త్వామ్ = నిన్ను
పశ్యామి = చూచుచున్నాను.

**నీవు ఆదిమధ్యాంతరహితుడవు. అపరిమితశక్తిశాలివి. అసంఖ్యాకములైన భుజములు గలవాడవు. సూర్యచంద్రులు నీ నేత్రములు. అగ్నివలె నీ ముఖము ప్రజ్వరిల్లుచున్నది. నీ తేజస్సుతో ఈ జగత్తును సంతప్తమొనర్చుచున్నావు. అట్టి నిన్ను నేను చూచుచున్నాను. (19)**

ప్రశ్న - 16వ శ్లోకమునందు అర్జునుడు "నీ ఆది మధ్యాంతములను నేను చూడకున్నాను" - అని తెల్పియుండెను. ఇచట మరల "ఆదిమధ్యాంతరహితుడవైన నిన్ను చూచుచున్నాను" - అని పల్కుటచే పునరుక్తి వలె ప్రతీతమగుచున్నది కనుక దీని యందలి అంతర్యమేమి?

సమా - అచట అర్జునుడు భగవానుని విరాట్ స్వరూపమును అపారమైనదని తెల్పెను. ఇచట ఉత్పత్తి మొదలగు షడ్వికారములులేనివాడు, నిత్యుడు అని తెల్పుచున్నాడు. కనుక ఇందు పునరుక్తి దోషము లేదు. ఆది అను శబ్దమునకు 'ఉత్పత్తి' అని యర్థము. 'మధ్యము' అనగా ఉత్పత్తి వినాశముల మధ్య గలస్థితి, వృద్ధి క్షయము, పరిణామము – అను నాల్గుభావ వికారములు, అంతమనగా వినాశము. ఈ మూడు దశలును (షడ్వికారములు) లేనివారిని ఆదిమధ్యాంత రహితుడు అనియందురు. కనుక ఉత్పత్తి మొదలగు ఆఱు భావవికారములు సర్వథా లేనివానినిగా నిన్ను భావించుచున్నాను- అని అర్జునుడు పలికెను.

ప్రశ్న - 'అనంత వీర్యమ్' అనగా నేమి?

సమా - వీర్యము – అనగా సామర్థ్యము, బలము, తేజస్సు, శక్తి మొదలగునవి. ఈ సామర్థ్యాదులు అనంతముగా కలవానిని అనంతవీర్యుడు అని యందురు. అర్జునుడు భగవానుని అనంతవీర్యమ్! అని పేర్కొని, అతని బలవీర్య సామర్థ్య తేజస్సులకు ఎట్టి హద్దులును లేవని తెల్పెను.

ప్రశ్న - 'అనంత బాహుమ్' అనగానేమి?

సమా – అంతము (అంతు)లేని భుజములు గలవానిని అనంతబాహువు అనియందురు. భగవానుని విరాట్ స్వరూపము నందు అర్జునుడెట్లు చూచినను భుజములు అసంఖ్యాకములుగా కనబడెను. కనుక అతడు భగవానుని 'అనంత బాహుమ్' అని పేర్కొనెను.

ప్రశ్న - 'శశిసూర్యనేత్రమ్' అనగానేమి?

సమా - భగవానుడు సూర్యచంద్రులను నేత్రములుగా కలిగియున్నట్లు అర్జునుడు చూచెను. ఆ విరాట్ స్వరూపమున అన్ని వైపులను అసంఖ్యాకములుగా ముఖములు కన్పట్టినను అందులో ప్రధానముఖమునందు నేత్రముల స్థానమున సూర్యచంద్రులను అతడు చూచెను.

ప్రశ్న - 'దీప్తహుతాశవక్త్రమ్' అనగానేమి?

సమా - హుతాశనుడనగా అగ్ని. ప్రజ్వలితాగ్నిని దీప్తహుతాశనుడందురు. ప్రజ్వలితాగ్నివలె ప్రకాశమానము, తేజఃపూర్ణమైన ముఖము గలవానిని 'దీప్తహుతాశవక్త్రమ్' అనియందురు. ఆ సమాసమును ప్రయోగించుట ద్వారా అర్జునుడు భగవానుని ప్రధానముఖమును అన్నివైపుల ప్రజ్వలించుచున్న అగ్నివలె తేజస్సుతో ప్రకాశముతో కూడియున్నట్లు చూచుచున్నానని తెలిపెను.

ప్రశ్న - "జగత్తును సంతప్తమొనర్చుచున్న నీ తేజస్సును చూచుచున్నాను" – అని అనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - "నీవు నీ తేజస్సుతో నేను నిలబడియున్న ఈ సమస్త విశ్వమును సంతప్త మొనర్చుచున్నట్లు చూచుచున్నాను." అని అర్జునుడు పలికెను.

**ద్యావాపృథివ్యోరిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాత్మన్ | = ఓ మహాత్మా! | ఏకేన, త్వయా, హి | = నీ ఒక్కని చేతనే | రూపమ్ | = రూపమును |
| ఇదమ్ | = ఈ | వ్యాప్తమ్ | = వ్యాప్తములైనట్టి | దృష్ట్వా | = చూచి |
| ద్యావాపృథివ్యోః | = దివినుండిభువి వఱకు గల | తవ | = నీ యొక్క | లోకత్రయమ్ | = ముల్లోకములును |
| అంతరమ్ | = ఆకాశము | ఇదమ్ | = ఈ | ప్రవ్యథితమ్ | = వ్యథితములైనవి (భయకంపితము లైనవి). |
| చ | = మఱియు | అద్భుతమ్ | = అద్భుతమైన | | |
| సర్వాః, దిశః | = అన్ని దిశలును | ఉగ్రమ్ | = భయంకరమైన | | |

ఓ మహాత్మా! దివినుండి భువివఱకుగల అంతరిక్షమునందంతటను అన్ని దిశలను నీవే పరిపూర్ణుడవై యున్నావు. అద్భుతమైన నీ భయంకరరూపమును చూచి, ముల్లోకములును గడగడలాడుచున్నవి **(20)**

ప్రశ్న - ఈ శ్లోక భావవైశిష్ట్యమేమి?

సమా - "ఈ సమస్త విశ్వమునకును నీవే పరమాత్ముడవు" అని తెల్పుటకే అర్జునుడు శ్రీకృష్ణుని 'మహాత్మన్!' అని సంబోధించెను. ఆ భగవానుని విరాడ్రూపము భూనభోంతరాళములకును విస్తరించి, అన్ని దిశలయందును వ్యాప్తమైయున్నది. భగవత్స్వరూపముచే వ్యాప్తము కాని ప్రదేశమే ఆయనకు (అర్జునునకు) కన్పించుటలేదు. అద్భుతమైన ఆ విరాడ్రూపము అత్యంత భయానకము. స్వర్గ, మర్త్య, అంతరిక్షములనెడి ముల్లోకముల యందలి జీవులు ఆ రూపమును జూచి మిక్కిలి భయగ్రస్తులై యున్నారు. వారి స్థితి మిక్కిలి శోచనీయముగా నున్నది.

**అమీ హి త్వాం సురసంఘా విశంతి కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి ।**
**స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అమీ | = ఇదిగో, ఆ | ప్రాంజలయః | = అంజలిఘటించినవారై | | (జయమగుగాక-అని) |
| సురసంఘాః హి | = దేవతలందరును | గృణంతి | = (నీనామగుణములను) కీర్తించుచున్నారు | ఉక్త్వా | = పలికి |
| త్వామ్ | = నీలో | | | పుష్కలాభిః | = పుష్కలములైన |
| విశంతి | = ప్రవేశించుచున్నారు | మహర్షిసిద్ధ సంఘాః | = మహర్షుల, సిద్ధుల సమూహములు | స్తుతిభిః | = ఉత్తమోత్తమ స్తోత్రములతో |
| కేచిత్ | = కొందఱు | | | త్వామ్ | = నిన్ను |
| భీతాః | = భీతులై | స్వస్తి, ఇతి | = స్వస్తివచనములను | స్తువంతి | = స్తుతించుచున్నారు. |

ఇదిగో, ఆ దేవతలెల్లరును నీలో ప్రవేశించుచున్నారు. కొందఱు భయపడినవారై అంజలి ఘటించి, నీ నామగుణములను కీర్తించుచున్నారు. మహర్షులును, సిద్ధులును స్వస్తివచనములతోడను, ఉత్తమోత్తమ స్తోత్రములతోడను నిన్ను ప్రస్తుతించుచున్నారు. **(21)**

ప్రశ్న - 'సురసంఘాః' అను పదముతో పాటు 'అమీ' అను విశేషణమును ప్రయోగించి, 'ఆ దేవతలే నీలో ప్రవేశించుచున్నారు'. అని అనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'సురసంఘాః' అను పదముతో పాటు ప్రయుక్తమైన 'అమీ' అను విశేషణము పరోక్షవాచకము. ఇప్పుడు భగవంతుని విరాడ్రూపములో ప్రవేశించుచుండగా

తాను చూచుచున్న దేవతా సముదాయమంతయు పూర్వము తాను స్వర్గమున చూచిన వారేయని అర్జునుడు పేర్కొనెను.

ప్రశ్న - "కొంతమంది భయముతో చేతులు జోడించి, నీనామ గుణములను ఉచ్చరించుచున్నారు"- అని యనుటలోని విశేషమేమి?

సమా - పెక్కుమంది దేవతలు భగవంతుని ఉగ్రరూపములో ప్రవేశించుటను చూచి, మిగిలిన దేవతలు తాము కూడ అట్లు ప్రవేశింపవలసి వచ్చునేమో? అని భీతిల్లుచు, భగవంతుని ప్రసన్నునిగా చేసికొనుటకై ఆయన నామగుణములను కీర్తించుచుండిరి.

ప్రశ్న - "మహర్షిసిద్ధసంఘాః" అనగానేమి? వారు స్వస్తి వచనములను పల్కుచు, పుష్కల స్తోత్రముల ద్వారా నిన్ను స్తుతించుచున్నారు! - అని యనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - మరీచి, అంగిరుడు, భృగువు మొదలగు మహర్షులను జ్ఞాతాజ్ఞాత సిద్ధ సమూహములను తెల్పునదియే "మహర్షిసిద్ధసంఘాః" అను పదము. వారెల్లరును భగవంతుని తత్త్వరహస్యములను యథార్థముగా తెలిసిన వారగుటచే ఆయన ఉగ్రరూపమును చూచి భీతిల్లకుండిరి. పైగా జగత్కల్యాణమునకై ప్రార్థించుచు అనేక విధములగు మధురభావస్ఫోరకములైన స్తోత్రములద్వారా భక్తిశ్రద్ధలతో భగవంతుని స్తుతించుచుండగా అర్జునుడు చూచెను.

**రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।**
**గంధర్వయక్షాసురసిద్ధసంఘా వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| రుద్రాదిత్యాః చ | = ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును | మరుతః, చ | = మరుద్గణములును | యే | = ఎవరెవరు గలరో |
| వసవః | = అష్టవసువులును | ఊష్మపాః, చ | = పితరులును | (తే)సర్వే | = (వారు)అందరును |
| సాధ్యాః | = సాధ్యులును | గంధర్వ యక్షాసుర సిద్ధసంఘాః | = గంధర్వులును, యక్షులును, అసురులును, సిద్ధులును, | విస్మితాః | = సంభ్రమాశ్చర్యములకు లోనైనవారై |
| విశ్వే | = విశ్వేదేవతలును | | | త్వామ్, ఏవ | = నిన్నే |
| అశ్వినౌ, చ | = అశ్వినీ కుమారులును | | | వీక్షంతే | = చూచుచున్నారు. |

ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, సాధ్యులును, విశ్వేదేవతలును, అశ్వినీకుమారులును, మరుద్గణములును, పితరులును అట్లే గంధర్వయక్షాసురసిద్ధ సముదాయములును సంభ్రమాశ్చర్యములతో నిన్నే దర్శించుచున్నారు. **(22)**

ప్రశ్న - "రుద్రాః", "ఆదిత్యాః", "వసవః", "సాధ్యాః", "విశ్వేదేవాః", "అశ్వినౌ", "మరుతః" - అను పదములు వేర్వేఱుగా ఏయే దేవతలను తెలుపును?

సమా - ఏకాదశరుద్రులు, ద్వాదశ - ఆదిత్యులు, అష్టవసువులు, 49 మంది మరుత్తులు - ఈ చతుర్విధ దేవతా సమూహముల వర్ణనము 10వ అధ్యాయమునందలి 21వ, 23వ శ్లోకముల వ్యాఖ్యానములయందును వాటి టిప్పణులయందును చేర్చబడినది. అట్లే అశ్వినీ కుమారులను గూర్చిన వివరణ ఈ అధ్యాయమునందలి 6వ శ్లోక టిప్పణిలో ఇయ్యబడినది. మన, అనుమంతా, ప్రాణ, నర, యాన, చిత్తి, హయ, నయ, హంస, నారాయణ, ప్రభవ, విభు - అను ఈ 12 మంది సాధ్యదేవతలు-[1] క్రతు, దక్ష, శ్రవ, సత్య,

---

1) మనోఽనుమంతా ప్రాణశ్చ, నరో యానశ్చ వీర్యవాన్ ।
చిత్తిర్హయో నయశ్చైవ, హంసో నారాయణస్తథా ॥
ప్రభవోఽథ విభుశ్చైవ, సాధ్యా ద్వాదశ జజ్ఞిరే । (వాయుపురాణం 66/15,16)

దక్షకన్యయు, ధర్ముని పత్నియు ఐన సాధ్యయందు ఈ 12 మంది సాధ్యదేవతలు జన్మించిరి. స్కందపురాణము నందు వీరి పేర్లు మఱొక విధముగా ఉన్నవి - మన, అనుమంతా ప్రాణ, నర, అపార, భక్తి, భయ, అనఘ, హంస, నారాయణ, విభు, ప్రభు - అనునవి. (స్కందపురాణం ప్రభాస ఖండం 21/17,18) మన్వంతర భేదముచే అన్నియు సరియైనవే.

కాల, కామ, ధుని, కుర్వాన్, ప్రభవాన్, రోచమాన - అను ఈ 10 మంది విశ్వేదేవతలు.[1] ఆదిత్య, రుద్రాది దేవతలయొక్క, 8 గణములలోనే సాధ్యవిశ్వేదేవతలును విభిన్నమైన రెండు గణములు. (బ్రహ్మాండ పురాణం-71/2)

ప్రశ్న - 'ఊష్మపాః' అనగానేమి?

సమా - ఊష్మ (వేడి) అన్నమును తినువారిని 'ఊష్మపాః' అని యందురు. మనుస్మృతి యందలి 3వ అధ్యాయములో 237 శ్లోకమునందు "పితరులు వేడి యన్నమునే తిందురు" అని తెలుపబడినది. కనుక ఇచట 'ఊష్మపాః' అను పదము పితృదేవతల సముదాయమును తెలుపును. (పితృదేవతల పేర్లు 10వ అధ్యాయమున 29వ శ్లోక వ్యాఖ్యానమున వివరింపబడినవి.)

ప్రశ్న - "గంధర్వ, యక్షాసుర సిద్ధసంఘాః" అను సమాసము ఏయే సముదాయముల వారిని తెల్పును?

సమా - కశ్యప మహర్షి పత్నులైన ముని, ప్రాధా, అరిష్ట అను వారి సంతానమే గంధర్వులు. వీరు దేవలోకవాసులు. సంగీత, నృత్య, వాద్య కళావిశారదులు. కశ్యపమహాముని పత్నియైన 'ఖసా'కు జన్మించినవారు యక్షులు. మహేశ్వరుని ప్రమథగణములలోనూ యక్షులు గలరు, యక్షులకును, రాక్షసులకును రాజు కుబేరుడు. దేవతల విరోధులైన దైత్య, దానవ, రాక్షసులను అసురులు అనియందురు. కశ్యపుని భార్యయైన దితికి జన్మించినవారు దైత్యులు. దనువుకు జన్మించినవారు దానవులు. రాక్షసుల పుట్టుక వివిధములుగా నున్నవి. కపిలాదులను 'సిద్ధులు' అని యందురు. ఈ సముదాయముల వారినందఱిని తెల్పునదియే 'గంధర్వయక్షాసుర సిద్ధసంఘాః' అను సమాసము.

ప్రశ్న - 'వీరందఱును విస్మితులై నిన్ను చూచుచున్నారు' అనియనుటలోని విశేషమేమి?

సమా - పైన తెల్పబడిన దేవతలు, పితరులు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధుల వేర్వేఱు సముదాయముల వారందఱును ఆశ్చర్యచకితులై, భగవానుని అద్భుత రూపమును చూచుచున్న దృశ్యమును అర్జునుడు గాంచెను.

**రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్ ।**
**బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో! = | ఓ మహాబాహో, (కృష్ణా!) | | గలదియు | దృష్ట్వా = | చూచి |
| బహువక్త్ర నేత్రమ్ = | అనేకములైన వక్త్రములును, నేత్రములును గలదియు | బహూదరమ్ = | పెక్కు ఉదరములు గలదియు | లోకాః = | లోకములన్నియును |
| | | బహుదంష్ట్రాకరాళమ్ = | పెక్కు కోరలచే భయంకరమైనదియు, అగు | ప్రవ్యథితాః = | భయకంపితములు అగుచున్నవి |
| బహుబాహూరు పాదమ్ = | అసంఖ్యాకములైన బాహువులు, తొడలు, పాదములు | తే, మహత్, రూపమ్ = | నీ మహారూపమును | తథా = | అట్లే |
| | | | | అహమ్, అపి = | నేనును వణకిపోవుచున్నాను. |

**హే మహాబాహో!** అసంఖ్యాకములైన వక్త్రములను, నేత్రములను, చేతులను, ఊరువు(తొడ)లను, పాదములను, ఉదరములను, కోరలను కలిగిన మిక్కిలి భయంకరమైన నీ రూపమును చూచి, అందఱును భయకంపితులగుచున్నారు. నేనుకూడ భయముతో వణకిపోవుచున్నాను. **(23)**

1) విశ్వేదేవాస్తు విశ్వాయా, జజ్ఞిరే దశ విశ్రుతాః ।
క్రతుర్దక్షః శ్రవః సత్యః, కాలః కామో ధునిస్తథా ॥
కుర్వాన్ ప్రభవాంశ్చైవ, రోచమానశ్చ తే దశ । *(వాయుపురాణం 66/31,32)*

దక్షకన్యయు, ధర్ముని పత్నియు ఐన విశ్వయందు పది (10) మంది విశ్వేదేవతలు ఉదయించిరి. కొన్ని పురాణములయందు మన్వంతర భేదముచే వీరి పేర్లను వేఱుగా పేర్కొనబడినవి.

ప్రశ్న - 16వ శ్లోకమునందు అర్జునుడు "నేను నీ విరాడ్రూపమున అసంఖ్యాకములైన భుజములను, ఉదరములను, ముఖములను, నేత్రములను చూచుచున్నాను" - అని తెల్పియుండెను. మఱల ఈ శ్లోకమున 'బహువక్త్రనేత్రమ్ బహుబాహూరుపాదమ్, బహూదరమ్' అను విశేషణముల ద్వారా ఆ విషయమునే తెల్పవలసిన అవసరమేమి?

సమా - 16వ శ్లోకమున అర్జునుడు విరాడ్రూపమును కేవలము "తానే చూచుచున్నా"నని తెల్పియుండెను. ఇచ్చట దానిని (ఆ రూపమును) చూచి, ఇతర లోకములతో పాటు తానును వ్యాకులుడైన విషయమును తెల్పుచున్నాడు. కావున ఆ రూపమును మఱల వర్ణించెను.

ప్రశ్న - ముల్లోకములును వ్యథితములైన విషయము గూడ 20వ శ్లోకమున తెల్పబడియే యుండెను. మఱల ఈ శ్లోకమున తెల్పుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - విరాట్ స్వరూపము యొక్క అనంతవిస్తృతిని, దాని ఉగ్రతను చూచి, కేవలము ముల్లోకములే వ్యాకులపడిన విషయము 20వ శ్లోకమున ప్రస్తావింపబడియుండెను. ఈ శ్లోకమున పెక్కు చేతులు, కాళ్ళు, పిక్కలు, ముఖములు, నేత్రములు, ఉదరములతో యుక్తమై అనేకములైన కోరలతో భయంకరమైన ఆ రూపమును జూచి, లోకములేగాక తానుగూడ వ్యాకులుడైన విషయమును అర్జునుడు ఈ శ్లోకమున తెల్పెను. కనుక ఇందు పునరుక్తి దోషము లేదు.

**నభఃస్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।**
**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో ॥ 24 ॥**

హి = ఏలనన
విష్ణో! = ఓ మహావిష్ణూ!
నభఃస్పృశమ్ = ఆకాశమును స్పృశించుచున్న
దీప్తమ్ = మిక్కిలి ప్రకాశించుచున్న
అనేకవర్ణమ్ = రంగురంగుల
వ్యాత్తాననమ్ = వెన్నెలముగల్గియున్న విస్తరించిన ముఖములతో ఒప్పుచున్న
దీప్తవిశాలనేత్రమ్ = కాంతులను విరజిమ్ము విశాలనేత్రములుగల
త్వామ్ = నిన్ను (నీరూపమును)
దృష్ట్వా = చూచి
ప్రవ్యథితాంతరాత్మా (అహమ్) = మిక్కిలి తత్తర పడుచున్న నేను
ధృతిమ్, చ = ధైర్యమును
శమమ్, చ = శాంతిని
న, విందామి = పొందలేకున్నాను.

ఏలనన హే విష్ణో! నీ రూపము అంతరిక్షమును తాకుచున్నది. అది అనేకవర్ణములతో దేదీప్యమానమై వెలుగుచున్నది. కాంతులను విరజిమ్ము విశాలనేత్రములతో, విస్తరించినముఖములతో అద్భుతముగా ఒప్పుచున్నది. అట్టి నీ రూపమును చూచిన నా మనస్సు తత్తరపడుచున్నది. అందువలన నా ధైర్యము సడలినది. శాంతి దూరమైనది. (24)

ప్రశ్న - ఇచట 'విష్ణో!' అని సంబోధించుటలోగల విశేషమేమి?

సమా - సాక్షాత్ శ్రీమహావిష్ణువే పృథ్వీభారమును బాపుటకై శ్రీకృష్ణుడుగా అవతరించెనని తెల్పుచు అర్జునుడు ఆయనను 'విష్ణో!' అని సంబోధించెను. కనుక తన వ్యాకులపాటును తొలగించుటకై ఈ విశ్వరూపమును ఉపసంహరించుకొని విష్ణురూపమున దర్శనము నిమ్మని ప్రార్థించుచు అర్జునుడట్లు సంబోధించెను.

ప్రశ్న - భూనభోఽంతరాళములయందు భగవానుడు వ్యాప్తుడైయున్నట్లు ఆయన అనంత విస్తృతి 20వ శ్లోకమున వర్ణింపబడియేయుండెను. మఱల ఇచ్చట 'నభఃస్పృశమ్' అను విశేషణమును ప్రయోగింపనవసరమేమి?

సమా - 20వ శ్లోకమున భగవానుని విరాట్ స్వరూపము యొక్క విస్తృతి వర్ణింపబడి ముల్లోకములు వ్యాకులత నొందిన విషయము తెలుప బడియుండెను. ఈ శ్లోకమున దాని అనంత విస్తృతిని జూచి, అర్జునుడు తన వ్యాకులతను, ధైర్యశాంతులను కోల్పోయిన విషయమును వర్ణించుచున్నాడు. కనుక ఇచ్చట 'నభస్స్పృశమ్' అను విశేషమును ప్రయోగించెను.

ప్రశ్న - 17వ శ్లోకమునందు 'దీప్తిమంతమ్' అను

విశేషణము ప్రయోగింపబడియే యుండెను. మఱల ఇచట 'దీప్తిమ్' అను విశేషణములు ప్రయోగింపవలసిన అవసరమేమి?

సమా - అచట కేవలము భగవంతుని రూపమును చూచిన విషయమే తెల్పబడినది. ఇచట ఆ రూపమును చూచి, ధైర్యశాంతులు సడలిన విషయము ప్రస్తావింపబడినది. కనుక ఆ రూపము మఱల వర్ణింపబడినది.

ప్రశ్న - అర్జునుడు తన వ్యాకులపాటును 23వ శ్లోకమున ప్రకటించియే యుండెను. మఱల ఈ శ్లోకమున 'ప్రవ్యథితాంతరాత్మా' అను విశేషణములు ప్రయోగించుట లోని ప్రత్యేకత యేమి?

సమా - అచట అర్జునుడు తన వ్యాకులతను గూర్చియే తెల్పియుండెను. కాని ఇచ్చట తన వ్యాకులస్థితిని స్పష్టముగా ప్రకటించుటకై కేవలము తాను వ్యాకులుడగుటయే గాక అసంఖ్యాకములైన ముఖములూ, ప్రజ్వలిత నేత్రములూ గల భగవానుని కరాళరూపమును గాంచి, అతని ధైర్యశాంతులు సడలుటను గూడ తెల్పుచున్నాడు.

**దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని ।**
**దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 25 ॥**

జగన్నివాస! = ఓ జగన్నివాసా!
దంష్ట్రా కరాళాని = భయంకరములైన కోరలుగలవియు
చ = మఱియు
కాలానల సన్నిభాని = ప్రళయాగ్నిజ్వాలలవలె భీతి గొల్పునవియు అగు
తే, ముఖాని = నీ ముఖములను
దృష్ట్వా = చూచి
దిశః, న జానే = దిక్కులను తెలిసి కొనలేకున్నాను
చ = మఱియు
శర్మ, ఏవ న, లభే = నెమ్మదిని (శాంతిని) పొందలేకున్నాను
దేవేశ! = ఓ దేవాధిదేవా!
ప్రసీద = అనుగ్రహింపుము.

**ఓ జగన్నివాసా! కరాళదంష్ట్రలతో (భయంకరములైన కోరలతో) ఒప్పుచున్న నీ ముఖములు ప్రళయాగ్నిజ్వాలల వలె భీతిగొల్పుచున్నవి. వాటిని చూచిన నాకు దిక్కుతోచకున్నది. నెమ్మది(శాంతి) శూన్యమైనది. ఓ దేవేశా! ప్రసన్నుడవు కమ్ము. (25)**

ప్రశ్న - భగవంతుని విరాట్ స్వరూపమునకు విశేషణముగా 23వ శ్లోకమున 'దంష్ట్రాకరాళమ్' అను పదమును అర్జునుడు ప్రయోగించి యుండెను. మఱల ఇచ్చట ఆయన ముఖములను వర్ణించుచు 'దంష్ట్రాకరాళాని' అను విశేషణములు ప్రయోగింపవలసిన పనియేమి?

సమా - భగవంతుని విరాడ్రూపమును జూచి, అర్జునుడు తాను వ్యాకులుడైన విషయమును అచట తెల్పియుండెను. ఇచట దిగ్భ్రమను తన సుఖరహిత స్థితిని గూర్చి విశేషముగా తెల్పుచున్నాడు. కనుక ఆ విశేషణమును మఱల 'ముఖాని' అను విశేష్యమునకు అనుబంధముగా ప్రయోగించుచున్నాడు.

ప్రశ్న - 'దేవేశ!' 'జగన్నివాస!' అను రెండు సంబోధనలను ప్రయోగించుచు 'ప్రసన్నుడవుకమ్ము' అని భగవంతుని ప్రార్థించుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవానుడు సమస్త దేవతలకును స్వామి, సర్వవ్యాపి, సమస్తజగత్తునకు పరమాధారుడు అను విషయమును అర్జునుడు ఇదివరలోనే వినియుండెను. దానియందతనికి సంపూర్ణ విశ్వాసముగూడ కలదు. నేడు అతని విరాట్ స్వరూపమును ప్రత్యక్షముగా చూచి, అతడు దేవేశుడు, జగన్నివాసుడు అను విషయమున తనకెట్టి సందేహమూ లేదని తెల్పుటకే ఆ రెండు పదములతో అర్జునుడు శ్రీకృష్ణుని సంబోధించెను.

భగవానుని 'ప్రసన్నుడవు కమ్మ'ని ప్రార్థించుచు అర్జునుడు "ప్రభూ! నీ ప్రభావమును నేను ప్రత్యక్షముగా చూచితిని. కాని నీ విరాడ్రూపమును జూచి, నేను మిక్కిలి దైన్య స్థితికి లోనైతిని. నా సుఖ, శాంతి, ధైర్యములు సన్నగిల్లినవి. నాకు దిక్కుతోచని స్థితి యేర్పడినది. కనుక దయతో నీ విరాట్స్వరూపమును శీఘ్రముగా ఉపసంహరించి ప్రసన్నుడవు కమ్ము" అని పలికెను.

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ 26 ॥
వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాలాని భయానకాని ।
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః ॥ 27 ॥

అమీ = ఇదిగో
ధృతరాష్ట్రస్య పుత్రాః = ధృతరాష్ట్రుని కుమారులు
సర్వే, ఏవ = అందఱును
అవనిపాల సంఘైః, సహ = రాజసముదాయముతో గూడినవారై
త్వామ్ = నీలో
(ప్రవిశంతి) = ప్రవేశించుచున్నారు
చ = మఱియు
భీష్మః = భీష్ముడును
ద్రోణః = ద్రోణుడును
తథా = అట్లే
అసౌ = ఈ
సూతపుత్రః = సూతపుత్రుడైన కర్ణుడును
అపి = మఱియును
అస్మదీయైః = మనపక్షమునకుచెందిన
యోధముఖ్యైః, సహ = ముఖ్యయోధులతో గూడ
తే = నీయొక్క
దంష్ట్రాకరాలాని = భయంకరములైన కోరలతో గూడి
భయానకాని = భీతిని గొల్పు
వక్త్రాణి = నోళ్ళలో
త్వరమాణాః = త్వరపడుచున్నవారై
విశంతి = ప్రవేశించుచున్నారు
కేచిత్ = కొందఱు
చూర్ణితైః = నుగ్గునుగ్గు కావింపబడిన
ఉత్తమాంగైః = శిరస్సులతో
దశనాంతరేషు = దంతములమధ్య
విలగ్నాః = చిక్కుకొని వ్రేలాడుచున్నవారై
సందృశ్యంతే = కనబడుచున్నారు.

ఇదిగో! (ఇచ్చట చేరియున్న) ఈ ధృతరాష్ట్రపుత్రులు (దుర్యోధనాదులు) ఇతర రాజన్యులతోసహా నీలో ప్రవేశించుచున్నారు. భీష్మపితామహుడు, ద్రోణుడు, కర్ణుడు, అట్లే మన పక్షమునందలి ప్రధానయోధులు అందఱును భయంకరములైన కోరలతోగూడిన నీ ముఖములయందు అతివేగముగా పరుగులుదీయుచు ప్రవేశించుచున్నారు. కొందఱి తలలు కోరల మధ్యబడి నుగ్గునుగ్గైపోవుచుండగా వారు దంతములలో చిక్కుకొని వ్రేలాడుచున్నారు. (26-27)

ప్రశ్న - 'ధృతరాష్ట్రస్యపుత్రాః' అను పదములతో పాటు 'అమీ' 'సర్వే' 'ఏవ' అను పదములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - "దుర్యోధనాది ధృతరాష్ట్రపుత్రులను ఇంతకు ముందే యుద్ధసన్నద్ధులై నాయెదుట నుండగా చూచి యుంటిని. వారే ఇప్పుడు నీలో ప్రవేశించి, నశించిపోవుచుండుట చూచుచున్నాను". అని తెల్పుటకే 'అమీ' అను పదమును ప్రయోగించెను. "దుర్యోధనాదులు అందఱును నీలో ప్రవేశించుచున్నారు." అని తెల్పుటకై 'సర్వే' 'ఏవ' అను పదములను ప్రయోగించెను.

ప్రశ్న - 'అవనిపాలసంఘైః' 'సహ' అను పదములకు అర్థమేమి?

సమా - 'అవనిపాలసంఘైః' అను పదము (సమాసము) పెక్కు రాజసమూహములను సూచించును. కేవలము ధృతరాష్ట్రపుత్రులేగాక దుర్యోధనుని సహాయార్థమై అచట చేరిన ఇతర రాజసమూహములన్నియును వారితో సహా ఆ విరాణ్ముఖములలో ప్రవేశించుచున్నట్లు చూచుచున్నానని తెల్పుటకే 'అవనిపాలసంఘైః సహ' అను పదములను అర్జునుడు ప్రయోగించెను.

ప్రశ్న - భీష్మద్రోణులను వేఱుగా పరిగణించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - భీష్మపితామహుడు, ద్రోణాచార్యుడు కౌరవ సేనలో ప్రముఖులు, మహాయోధులు. అర్జునుని దృష్టిలో వారు ఓడిపోవుట గాని, మరణించుట గాని అసంభవము. ఆ ఇద్దఱి పేర్లు ప్రత్యేకముగా తెల్పుట వలన అర్జునుడు "భగవన్! భీష్మద్రోణుల వంటి మహాయోధులు భయంకరము లైన నీ

కరాళ వక్త్రములయందు ప్రవేశించుటను చూచుచున్నాను. ఇక ఇతరుల సంగతి వేఱుగా చెప్పనేల?" అని పేర్కొనెను.

ప్రశ్న - సూతపుత్రునకు 'అసౌ' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - వీరశ్రేష్ఠుడైన కర్ణుని సహజముగనే అర్జునుడు తన ప్రతిద్వంద్వి (ప్రతియోధుడు)గా భావించువాడు. కర్ణుడు తన శౌర్యపరాక్రమ దర్పముతో అందఱిని అల్పులుగా భావించువాడు. అట్టి వీరవరుడు గూడ విరాట్ పురుషుని కరాళ ముఖమునందు చిక్కుకొని నుగ్గునుగ్గగుచున్నాడు - అని తెల్పుటకై అసౌ, సూతపుత్రః అను పదములను ప్రయోగించినాడు.

ప్రశ్న - 'అపి' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి? 'సహ' అను పదమును ప్రయోగించి, 'అస్మదీయైః' 'యోధముఖ్యై' అను పదముల ద్వారా తెలిపిన విషయమేమి?

సమా - 'అపి' అను పదమును, మఱి ఇతర పదములను ప్రయోగించి, అర్జునుడు "కేవలము శత్రుపక్షములోని వీరులే గాక వారితోపాటు మన పక్షములోని ముఖ్యవీరులందఱును నీ కరాళముఖములలో ప్రవేశించుచున్నట్లు నేను చూచుచున్నాను" అని తెల్పెను.

ప్రశ్న - 'త్వరమాణాః' అను పదము దేని విశేషణము? దాని ప్రయోగ వైశిష్ట్యమేమి? అట్లే 'ముఖాని' అను పదముతో పాటు దంష్ట్రాకరాళాని, భయానకాని అను విశేషణములను ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - 'త్వరమాణాః' అను పదము పూర్వశ్లోకమున వర్ణింపబడిన ఇరుపక్షముల యోధులందఱికిని చెందిన విశేషణము. మిక్కిలి పొడవై భయంకరము గానున్న కోరలు కల్గిన కరాళాకృతి గల ముఖములను వర్ణించునదియే దంష్ట్రాకరాళాని, అను విశేషణము. చూచినంత మాత్రముననే భీతిని గొల్పునవి - అని తెల్పుటకే 'భయానకాని' అను విశేషణము ప్రయుక్తమయ్యెను. పూర్వశ్లోకమున వర్ణింపబడిన ఉభయ పక్షముల యోధులందఱును త్వరత్వరగా పరుగెత్తుచు కరాళ దంష్ట్రలతో గూడిన భయానక ముఖములయందు ప్రవేశించుటను తాను చూచుచున్నట్లు అర్జునుడు తెల్పెను. అనగా వీరులందఱును నలువైపులనుండి అతి వేగముగా పరుగులు దీయుచు, విరాట్ పురుషుని భీకర ముఖముల యందు ప్రవేశించి నశించుచున్నారని తెల్పుటకు దంష్ట్రాకరాళాని, భయానకాని అను పదములను ప్రయోగించెను.

ప్రశ్న - 'కొందఱు నీ ముఖదంష్ట్రల మధ్య చిక్కుకొని యుండుట వలన వారి శిరములు నుగ్గు నుగ్గగుచున్నవి. అట్టివారిని నేను చూచుచున్నాను' అని యనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - యోధులందఱును ఆ విరాట్ పురుషుని ముఖముల యందు ప్రవేశించుచుండుటయే గాక, వారిలో కొందఱు కరాళదంష్ట్రల మధ్య చిక్కుకొని యుండుటయూ, వారి తలలు నుగ్గునుగ్గగుచుండుటయూ గూడ తాను చూచుచున్నట్లు అర్జునుడు తెల్పెను.

సంబంధము - ఉభయ సేనలకు చెందిన యోధులు విరాట్ పురుష కరాళముఖములలో ప్రవేశించిన తీరును నదీజలముల మిడుతల దృష్టాంతముల ద్వారా అర్జునుడు స్పష్టీకరించుచున్నాడు-

**యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖా ద్రవంతి ।**
**తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి ॥ 28 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యథా | = ఏవిధముగా | అభిముఖాః, ఏవ | = అభిముఖముగానే | | యోధులు(నరలోక వీరులు) |
| నదీనామ్ | = నదీనదములయొక్క | ద్రవంతి | = పరుగులుదీయుచు | తవ | = నీయొక్క |
| బహవః | = అనేకములైన | | అందుప్రవేశించునో | అభివిజ్వలంతి | = మిక్కిలి జ్వలించుచున్న |
| అంబువేగాః | = వేగముగా ప్రవహించు | తథా | = అట్లే | వక్త్రాణి | = ముఖములను |
| | చున్న జలము లన్నియును | అమీ | = ఈ | | (ముఖములయందు) |
| సముద్రమ్ | = సముద్రమునకు | నరలోకవీరాః | = శ్రేష్ఠులైనసమర | విశంతి | = ప్రవేశించుచున్నారు. |

అనేకములైన నదీనదముల ప్రవాహములన్నియును సహజముగా సముద్రమునకు అభిముఖముగా ప్రవహించుచు అందు ప్రవేశించుచున్నట్లు, ఈ శ్రేష్ఠులైన సమరయోధులు (నరలోకవీరులు) కూడ జ్వలించుచున్న నీ ముఖములయందు ప్రవేశించుచున్నారు. **(28)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు సముద్రములో ప్రవేశించు నదుల దృష్టాంతమును ఇచ్చుచు విరాణ్ముఖములలో ప్రవేశించువారికి 'నరలోకవీరాః' అను విశేషణమును ప్రయోగించుట లోని ఆంతర్యమేమి? అట్లే ముఖములకు 'అభివిజ్వలంతి' అను విశేషణమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - భీష్మద్రోణాది ప్రముఖ యోధులు కూడ విరాట్ పురుషుని ముఖములలో ప్రవేశించుచున్నట్లు వర్ణింపబడినది. వారు భగవత్ప్రాప్తికై సాధన చేయుచుండిరి. ఇష్టము లేకున్నను వారు యుద్ధమునందు పాల్గొనవలసివచ్చెను. యుద్ధమునందు మరణించినను వారికి భగవత్ప్రాప్తి కలిగియుండెడిది. అట్టివారిని ఉద్దేశించియే అర్జునుడు 'నరలోకవీరాః' అను విశేషణమును ప్రయోగించెను. వారు భౌతికముగా రణరంగము నందు మహావీరులైనట్లే భగవత్ప్రాప్తి సాధన రూప - ఆధ్యాత్మిక యుద్ధమునందు కూడ కామాది శత్రువులతో పోరాడుటయందును సాటిలేని వీరులే - నదీజలములు సముద్రాభిముఖముగా పరుగులు దీయుచు చివరకు జలనిధిలో లీనమై తన నామరూపములను త్యజించి, సముద్రముతో ఏకీభావ స్థితినందును. అట్లే భక్తులైన ఈ వీరులు గూడ విరాట్ పురుషుని వైపు పరుగెత్తుచు ఆయన ముఖములలో అభేదభావముతో ప్రవేశించుచుండిరి.

సముద్రము అపారమైనది. అనంతజలనిధి, నదీ జలములు అందు ప్రవేశించి, దానితో ఏకత్వమును పొందును. అట్లే విరాడ్రూపము యొక్క ముఖములన్నియును అన్నివైపుల అత్యంత జ్యోతిర్మయములు. ఆ విరాణ్ముఖముల మహాజ్యోతుల యందు భక్తులైన ఈ మహావీరుల భౌతిక రూపములు ప్రవేశించి, భస్మమైపోగా వారు సహజముగా జ్యోతిర్మయులై భగవంతునిలో లీన(ఐక్య)మగుచున్నారు.

**యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః ।**
**తథైవ నాశాయ విశంతి లోకాః తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యథా | = విధముగా | జ్వలనమ్ | = అగ్నిని (అగ్నిలో) | తవ | = నీయొక్క |
| పతంగాః | = మిడుతలు | సమృద్ధవేగాః | = మిక్కిలి వేగముగా | వక్త్రాణి | = ముఖములను (ముఖములయందు) |
| నాశాయ | = మోహవశమున తమ నాశము కొఱకు | విశంతి | = ప్రవేశించునో | సమృద్ధవేగాః | = మిక్కిలి వేగము గలవై (వేగముగా) |
| | | తథా, ఏవ | = అవిధముగానే | | |
| | | లోకాః, అపి | = లోకములన్నియును | | |
| ప్రదీప్తమ్ | = ప్రజ్వలించుచున్న | నాశాయ | = తమ నాశమునకై | విశంతి | = ప్రవేశించుచున్నవి. |

మిడుతలన్నియును మోహవశమున బాగుగా మండుచున్న అగ్నివైపు అతివేగముగా పరుగెత్తి, తమ నాశనముకొఱకు అందు ప్రవేశించి, నశించునట్లు ఈ వీరులందఱును తమనాశమునకై అతివేగముగా పరుగెత్తి, నీ వక్త్రములయందు ప్రవేశించుచున్నారు. **(29)**

ప్రశ్న - ఈ శ్లోకమున ప్రజ్వలితాగ్ని - మిడుతల దృష్టాంతము నిచ్చుచు భగవన్ముఖములయందు లోకములన్నియు ప్రవేశించుచున్నవని చెప్పుటలోని విశేషమేమి?

సమా - పూర్వ శ్లోకమున తెల్పబడిన భక్తులకంటెను వేఱైన సామాన్య జనులందఱి ప్రవేశములను గుఱించి ఈ శ్లోకమున వర్ణించుట జరిగినది. వారు ఐచ్ఛికముగా యుద్ధము చేయుటకు వచ్చియుండిరి. కనుక అర్జునుడు ప్రజ్వలితాగ్ని - మిడుతల దృష్టాంతమును చూపెను. మిడుతలు మోహవశమున అతివేగముతో అగ్నియందు ప్రవేశించి స్వయముగా భస్మమైనట్లు, ఈ సామాన్యజనులు గూడ భగవంతుని ప్రభావమును ఎఱుంగక మోహవశమున మిడుతల వలె పరుగులు దీయుచు ఆ విరాణ్ముఖజ్వాలలలో ప్రవేశించి భస్మమగుచున్నారు.

*సంబంధము - ఉభయ సేనలయోధులు విరాట్‌పురుషుని ముఖములయందు ప్రవేశించుటను దృష్టాంత పూర్వకముగా వర్ణించి, ఇప్పుడు వారిని భగవంతుడు కబళించుచున్నరీతిని వివరించుచున్నాడు-*

**లేలిహ్యసే గ్రసమానః సమంతాత్ లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।**

**తేజోఽభిరాపూర్య జగత్ సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| విష్ణో | = ఓ మహావిష్ణూ! | సమంతాత్ | = అన్నివైపుల నుండి | భాసః | = కాంతులు |
| సమగ్రాన్ | = సమగ్రములైన | | | సమగ్రమ్, జగత్ | = సమస్తజగత్తును |
| లోకాన్ | = లోకములను | లేలిహ్యసే | = మాటిమాటికిని ఆస్వాదించుచున్నావు | తేజోభిః | = తేజస్సులతో |
| జ్వలద్భిః | = ప్రజ్వలించుచున్న | | | ఆపూర్య | = నింపి |
| వదనైః | = ముఖములతో | తవ | = నీయొక్క | ప్రతపంతి | = తపింపజేయుచున్నవి |
| గ్రసమానః | = కబళించుచున్న వాడవై | ఉగ్రాః | = భయంకరములైన | | |

**హే విష్ణో! ప్రజ్వలించుచున్న నీ ముఖములతో సమస్త లోకములను కబళించుచు అన్నివైపులనుండి మాటిమాటికిని ఆస్వాదించుచున్నావు. నీ ఉగ్రతేజస్సులు అంతటను నిండి జగత్తును తపింపజేయుచున్నవి. (30)**

ప్రశ్న - ఈ శ్లోకభావవైశిష్ట్యమేమి?

సమా - ఆ విరాట్ పురుషుని మహోగ్రరూపమును చూచి, భయగ్రస్తుడైన అర్జునుడు ఆ రూపమును వర్ణించుచున్నాడు. విరాట్ పురుషుని భయానక ముఖములనుండి ప్రజ్వలితాగ్ని జ్వాలలు వెడలుచున్నవి. ఆ కరాళ ముఖములతో విరాట్ పురుషుడు సమస్త లోకములను కబళించుచున్నాడు. ఐనను తృప్తి జెందక నాల్కలు చాచి పదేపదే చప్పరించు (ఆస్వాదించు) చున్నాడు. జగత్తంతయు ఆ ఉగ్రాగ్నిజ్వాలలలో భస్మీపటలమై పోవుచున్నది.

*సంబంధము - ఈ యధ్యాయమునందలి 3,4 శ్లోకములలో షడ్గుణైశ్వర్యసంపన్నమైన విశ్వరూపమును దర్శింపజేయుమని అర్జునుడు భగవానుని ప్రార్థించెను. ఆ ప్రార్థనను మన్నించి, భగవానుడు తన విశ్వరూపమును అర్జునునకు చూపెను. కాని భగవానుని ఆ ఉగ్రరూపమును జూచి అర్జునుడు మిక్కిలి భీతిల్లెను. అప్పుడాతని మనస్సులో "వాస్తవముగా ఈ శ్రీకృష్ణుడెవరు? ఈ మహోగ్రరూపముద్వారా ఇప్పుడతడు ఏమి చేయగోరెను?" అను ప్రశ్నలు ఉదయించెను. కనుక అతడు భగవానుని ఇట్లు ప్రశ్నించుచున్నాడు-*

**ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద ।**

**విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేవవర! | = ఓ పరమాత్మా! | విజ్ఞాతుమ్ | = విశదముగా తెలిసికొనుటకు | | (కనుక) |
| తే | = నీకు | | | ఉగ్రరూపః భవాన్ | = ఉగ్రరూపుడవైన నీవు |
| నమః, అస్తు | = నమస్కారము | ఇచ్ఛామి | = కోరుచున్నాను | | |
| ప్రసీద | = ప్రసన్నుడవు కమ్ము | హి | = ఏలనన | కః | = ఎవరవో? |
| ఆద్యమ్ | = ఆదిపురుషుడవైన | తవ, ప్రవృత్తిమ్ | = నీప్రవృత్తిని | మే | = నాకు |
| భవంతమ్ | = నిన్ను | న, ప్రజానామి | = ఎఱుంగకున్నాను. | ఆఖ్యాహి | = తెలుపుము. |

ఓ పరమాత్మా! నీకు నా నమస్కారములు - ప్రసన్నుడవు కమ్ము. ఉగ్రరూపుడవైన నీవు ఎవరో దయతో నాకు తెలుపుము. ఆదిపురుషుడవైన నిన్ను విశదముగా తెలిసికొనగోరుచున్నాను. ఏలనన నీ ప్రవృత్తిని ఎఱుంగలేకున్నాను. **(31)**

ప్రశ్న - శ్రీకృష్ణ భగవానుడే నిజయోగశక్తి ద్వారా తన విశ్వరూపమును అర్జునునకు చూపుచున్నాడని అతడు (అర్జునుడు) ఎఱుంగునుగదా! "మఱి ఉగ్రరూపధారివైన నీవెవరు?" అని ప్రశ్నించుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆ ఉగ్రరూపము శ్రీకృష్ణ భగవానునిదే అని అర్జునుడెఱుంగును. కాని ఆ భయంకరరూపమును చూచిన పిదప - "ఆ విధమైన అత్యుగ్రరూపమును గూడ ధరింపగల్గిన ఈ శ్రీకృష్ణుడు వాస్తవముగా ఎవరు?" అను ప్రశ్న అతని మనస్సును కలచివైచెను. కావున ఆదిపురుషుడైన ఆ భగవానుని గూర్చి సమగ్రముగ తెలిసికొనగోరుచున్నాని అతడు పల్కెను.

ప్రశ్న - **'దేవవర!'** అని సంబోధించుచు నమస్కరించుట లోను, ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించుటలోను గల అంతరార్థమేమి?

సమా - దేవతలందఱిలోను సర్వశ్రేష్ఠుడైన వానిని 'దేవవరుడు' అని యందురు - భగవానుని దేవవర! అని సంబోధించి, అర్జునుడు ఆయన యొక్క పరమేశ్వరత్వమును ప్రకటించుచు నమస్కరించెను. కాని ఆయన భయంకర రూపమును గాంచి భీతిల్లిన అర్జునుడు ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించెను.

ప్రశ్న - 'నీ ప్రవృత్తిని ఎఱుంగలేకున్నాను' అని యనుట లోని ఆంతర్యమేమి?

సమా - భగవానుని భయంకరమైన ఆ విరాడ్రూపము నందు ఉభయ పక్షముల సమర యోధులందఱును నశించిపోవుచుండుటను అర్జునుడు ప్రత్యక్షముగా చూచెను. ఆ సందర్భమున భగవానుడు ఆ అత్యుగ్రరూపమును దాల్చి తనకు ప్రదర్శించుటకు గల కారణమును, సమీపభవిష్యత్తులో ఆయన కార్యసంకల్పమును అర్జునుడు తెలిసికొనగోరెను. కనుక దయతో ఆ రహస్యమును తనకు విపులముగా తెల్పుమని అతడు అభ్యర్థించెను.

*సంబంధము - అర్జునుని కోరికమేరకు భగవానుడు తన ఉగ్ర (విశ్వ) రూపధారణకు గల కారణమును తెల్పుచున్నాడు-*

**శ్రీభగవాన్ ఉవాచ**

**కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।**
**ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| లోకక్షయకృత్ | = సర్వలోకములను తుదముట్టించునట్టి | సమాహర్తుమ్ | = రూపుమాపుటకై | అవస్థితాః | = కలరో |
| ప్రవృద్ధః | = విజృంభించిన | ప్రవృత్తః | = పూనుకొనియున్న వాడను | (తే) | = (వారు) |
| కాలః, అస్మి | = మహాకాలుడను | ప్రత్యనీకేషు | = శత్రుపక్షముల యందు | సర్వే | = అందఱును |
| ఇహ | = ఇప్పుడు | యే, యోధాః | = ఏ వీరులు | త్వామ్, ఋతే, అపి | = నీవు యుద్ధము చేయకున్నను |
| లోకాన్ | = (ఈ) లోకములను | | | న, భవిష్యంతి | = మిగిలియుండరు. |

శ్రీ భగవానుడు పలికెను - నేను లోకములనన్నింటిని తుదముట్టించుటకై విజృంభించిన మహాకాలుడను. ఇప్పుడు ఈ లోకములను రూపుమాపుటకై పూనుకొనియున్నాను. కనుక నీవు యుద్ధముచేయకున్ననూ ప్రతిపక్షమునందున్న ఈ వీరులెవ్వరును మిగులరు. **(మిగిలియుండరు)(32)**

ప్రశ్న - "లోకములనన్నింటిని తుదముట్టించుటకై అవతరించిన మహాకాలుడను నేను." అని అనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - "నీవెవ్వరు?" అని అర్జునుడడిగిన మొదటి ప్రశ్నకు ఇది సమాధానము. సృష్టి స్థితిలయములకు

కారణమైన పరమేశ్వరుడు తానేయనియు, ఆ సమయమున సమస్త లోకములను క్షయమొనర్చుటకై కాలస్వరూపుడుగా అవతరించితిననియు భగవానుడు పలికెను.

ప్రశ్న - ఈ లోకములనన్నింటిని రూపుమాపుటకే పూనుకొని యున్నాను- అని యనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - "నీ ప్రవృత్తిని ఎఱుంగలేకున్నాను" అను అర్జునుని వాక్యమునకు ఇది సమాధానము. ఆ సమయమున భగవానుని చర్యలు అన్నియును లోకసంహారమునకే సంకల్పింపబడినవి. ఆ విషయమును స్పష్టపఱచుటకే తన విరాడ్రూపమున అందఱిని కబళించునట్టి భయంకరదృశ్యమును అర్జునునకు చూపెను.

ప్రశ్న - "నీ ప్రమేయము లేకున్నను ప్రతి పక్షమున నున్న ఈ వీరులెవ్వరును మిగులరు" - అని యనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - గురువులు, పెదతండ్రులు, పినతండ్రులు, మామలు, సోదరులు మొదలగు ఆత్మీయులందఱు యుద్ధసన్నద్ధులై యుండుటను జూచిన అర్జునుని మనస్సున పిఱికితనము ప్రవేశించెను. ఆ కారణమున అతడు యుద్ధరంగమునుండి వైదొలగదలచెను. ఇది సరియైన నిర్ణయము కాదని భగవానుడు తెల్పుచున్నాడు. ఏలనన అర్జునుడు యుద్ధమున వారిని వధింపకున్నను వారి మరణము నిశ్చితము, అనివార్యము. భగవంతుడే వారి సంహారమునకు పూనుకొనినప్పుడు వారిని రక్షించు నుపాయము (మార్గము) ఏదియును లేదు. కావున అర్జునుడు రణరంగమునుండి వైదొలగరాదనియు, తన ఆజ్ఞను అనుసరించి, యుద్ధమున ప్రవృత్తుడగుటయే అతనికి శ్రేయస్కరమనియు భగవానుడు తెలిపెను.

ప్రశ్న - భగవానుని విరాట్ స్వరూపమున ఉభయపక్షముల యోధులు అందఱును మరణించుటను అర్జునుడు చూచెను. కాని భగవానుడు కేవలము కౌరవ పక్షయోధులను గూర్చి మాత్రమే తెల్పుటకు కారణమేమి?

సమా - అర్జునుని ద్వారా స్వపక్షయోధులు మరణించుట అసంభవము. కనుక నీవు చంపకున్నను వారు చనిపోవుట నిశ్చయము - అని యనుట ఇచట పొసగదు - కావున భగవానుడు ఇచట కేవలము కౌరవపక్షయోధులను గూర్చియే తెలిపెను. ఇంతేగాక అర్జునుని ఉత్సాహపఱచుటకు గూడ భగవానుడిట్లు పలుకుట యుక్తియుక్తమే. శత్రు పక్షమువారెల్లరును మృతులైనట్లుగనే భావింపవలెననియు, వారిని చంపుట అర్జునునకు అంతగా శ్రమతో గూడిన పని గాదనియు భగవానుడు తెల్పుచున్నట్లు భావింపవలెను.

సంబంధము - అర్జునుని ప్రశ్నలకు ఈ విధముగా సమాధానములను ఇచ్చిన పిమ్మట భగవానుడు రెండు శ్లోకముల ద్వారా యుద్ధము చేయుటయే అర్జునునకు శ్రేయస్కరమని తెల్పుచు అతనిని యుద్ధోన్ముఖునిగా చేయుచున్నాడు-

**తస్మాత్ త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।**
**మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన | జిత్వా | = జయించి | పూర్వమ్, ఏవ | = ఇంతకు ముందే |
| త్వమ్ | = నీవు | సమృద్ధమ్ | = సర్వసంపదలతో తులతూగుచున్న | మయా, ఏవ | = నాచేతనే |
| ఉత్తిష్ఠ | = (యుద్ధము చేయుటకై) లెమ్ము | | | నిహతాః | = చంపబడిరి |
| యశః | = కీర్తిని | రాజ్యమ్ | = రాజ్యమును | సవ్యసాచిన్ | = ఓ సవ్యసాచీ! అర్జునా! |
| లభస్వ | = పొందుము | భుంక్ష్వ | = అనుభవింపుము | నిమిత్త మాత్రమ్, భవ | = నీవు నిమిత్త మాత్రుడవుకమ్ము |
| శత్రూన్ | = శత్రువులను | ఏతే | = వీరందరును | | |

కనుక ఓ సవ్యసాచీ! లెమ్ము, కీర్తి గాంచుము. శత్రువులను జయించి సర్వసంపదలతో తులతూగు రాజ్యమును అనుభవింపుము. వీరందఱును నాచేత మునుపే హతులైనవారు.నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము (33)

ప్రశ్న - 'తస్మాత్' అను పదముతో పాటు 'ఉత్తిష్ఠ' అను క్రియాపదమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు యుద్ధము చేయకున్నను వారందఱును నిస్సందేహముగ మరణించువారే. అట్టి స్థితిలో యుద్ధము చేయుటయే అన్ని విధముల అర్జునునకు శ్రేయస్కరము. కావున ఎట్టి పరిస్థితిలోను యుద్ధమునుండి వైదొలగక ఉత్సాహముతో 'యుద్ధసన్నద్ధుడవు కమ్ము' అని తెల్పుటకే తస్మాత్ అను పదముతోపాటు "ఉత్తిష్ఠ" అను క్రియాపదమును ప్రయోగించెను.

ప్రశ్న - "శత్రువులను జయించి, యశోలాభములను పొందుము, సర్వసంపదలతో తులతూగు రాజ్యమును అనుభవింపుము" - అని పల్కుటలోని ఆంతర్యమేమి?

సమా - యుద్ధమునందు అర్జునుని విజయము నిశ్చితము. కనుక శత్రువులను జయించి, ధనధాన్య సంపదలతో నిండిన రాజ్యమును అనుభవింపుమనియు, అనితరసాధ్యమయిన యశస్సును పొందుమనియు, ఈ అవకాశమును చేతులార జారవిడుచుకొనరాదనియు భగవానుడు హితోపదేశమొనర్చెను.

ప్రశ్న - "సవ్యసాచిన్!" అను సంబోధనలోని వైశిష్ట్యమేమి? అట్లు సంబోధించుచు వీరందరు నాద్వారా మునుపే నిహతులైరి. నీవు కేవలము నిమిత్తమాత్రుడవగుము - అని తెల్పుటలోని ప్రత్యేకత యేమి?

సమా - సవ్య (ఎడమ) హస్తముతో గూడ బాణములను ప్రయోగించువానిని "సవ్యసాచి" అని యందురు. అర్జునుడు రెండు చేతులతోను అతి వేగముగా బాణములను ప్రయోగించుటలో అత్యంత నిపుణుడు. అతనికి ఈ వీరులను జయించుట గొప్ప విషయము కాదు పైగా వారందఱును భగవంతుని వలన అంతకు మునుపే మృతులగుటను, అతడు ప్రత్యక్షముగా చూచియే యుండెను. కనుక వాస్తవముగా అతడు చంపువాడు కాడు. కేవలము నిమిత్తమాత్రుడు. కావున వారిని చంపుటకు ఏ మాత్రమూ సంకోచింపకుమని భగవానుడు నుడివెను.

అతడు కేవలము నిమిత్తమాత్రుడే. కావున వారిని చంపుట వలన అతనికి ఎట్టి పాపములూ అంటనే అంటవు. ఏలనన వారిని చంపుట అతనికి క్షాత్రధర్మ కర్తవ్యము కూడ. అందువలన ఆతనిని పాపములు అంటవు సరిగదా పైగా అతడు క్షాత్రధర్మమును పాటించినట్లగును. అందువలన మనస్సునందెట్టి సంశయమును పెట్టుకొనక మమతాహంకార రహితుడై ఉత్సాహముతో యుద్ధమునందు ప్రవృత్తుడగుటకు భగవానుడతనిని ఆదేశించెను.

**ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।**
**మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34 ॥**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మయా | = | నాచేత | తథా | = | అట్లే | రణే | = | యుద్ధమునందు |
| హతాన్ | = | చంపబడిన | అన్యాన్ | = | తదితరులైన | సపత్నాన్ | = | శత్రువీరులను |
| ద్రోణమ్, చ | = | ద్రోణుని | యుద్ధవీరాన్ అపి | = | యుద్ధవీరులను గూడ | జేతాసి | = | తప్పక జయింపగలవు |
| భీష్మమ్, చ | = | భీష్ముని | త్వమ్ | = | నీవు | | | |
| జయద్రథమ్, చ | = | సైంధవుని | జహి | = | వధింపుము | యుధ్యస్వ | = | (కనుక) యుద్ధము చేయుము. |
| కర్ణమ్, చ | = | కర్ణుని | మా, వ్యథిష్ఠాః | = | భయపడవలదు | | | |

ఇదివరకే నాచే చంపబడిన భీష్మ, ద్రోణ, జయద్రథ(సైంధవ), కర్ణాది యుద్ధ వీరులందఱిని నీవు సంహరింపుము. భయపడకుము. రణరంగమున శత్రువులను తప్పక జయింపగలవు. కనుక యుద్ధము చేయుము. (34)

ప్రశ్న - ద్రోణభీష్మ జయద్రథ కర్ణులను వేర్వేఱుగా పేర్కొనుటలోని విశేషమేమి? అట్లే 'అన్యాన్' అను విశేషణముతోపాటు 'యోధవీరాన్' అను పదము ద్వారా ఎవరు సూచింపబడిరి? వీరందఱును తనవలన చంపబడిరని తెలుపుచు వారిని చంపుమని భగవానుడు ఆదేశించుటలోని ఆంతర్యమేమి?

సమా - ద్రోణాచార్యుడు ధనుర్వేదమునందును, ఇతర శస్త్రాస్త్ర ప్రయోగ విద్యలయందును పారంగతుడు. యుద్ధకళయందు పరమ నిపుణుడు. ఆయన చేతిలో శస్త్రము ఉన్నంత వఱకును ఆయనను ఎవ్వరూ చంపజాలరనుట ప్రసిద్ధము. ఈ కారణమువలన అర్జునుడు ఆయనను అజేయునిగ భావించుచుండెను. పైగా అతడు తన గురువగుట వలన అతనిని చంపుట పాపమనియు తలంచుచుండెను.

భీష్మపితామహుని పరాక్రమము జగత్ప్రసిద్ధము. పరశురాముని యంతటి అజేయుడైన వీరుని కూడ యుద్ధమున తికమకల పాలుచేసెను. అంతేగాక అతనికి ఇచ్ఛలేనిదే మృత్యువు కూడ అతనిని తాకజాలదని తండ్రియైన శంతనుడు వరమిచ్చియుండెను. ఈ కారణముల వలన భీష్మపితామహునిపై నెగ్గుట అసాధ్యమని అర్జునుడు భావించెను. పితామహుని తన చేతులార వధించుట పాపకృత్యమనియు తలంచెను. అతడు భీష్ముని చంపుట కిష్టపడనని పెక్కుమార్లు చెప్పియుండెను.

జయద్రథుడు సహజముగా మహావీరుడు.[1] మహేశ్వరుని భక్తుడగుటవలన దుర్లభమైన వరములను పొంది, అత్యంత దుర్జయుడయ్యెను. దుర్యోధనునిచెల్లెలగు దుస్సలకు భర్తయగుట వలన అతడు పాండవులకు బావయగును. సహజమైన సౌజన్యమువలనను, ఆత్మీయత కారణమునను అర్జునుడు అతనిని గూడ చంపుటకు సంకోచించుచుండెను.

కర్ణుని గూడ అర్జునుడు ఏవిధముగను తనకంటెను తక్కువవీరునిగా భావింపకుండెను. అర్జునునకు సరిజోడైన ప్రతియోధుడు కర్ణుడేయనుట జగత్ప్రసిద్ధము. అతడు సహజముగనే మహావీరుడు. పరశురాముని కడ దుర్లభమైన శస్త్ర విద్యలను అభ్యసించెను.

ఈ కారణమువలన ఈ నలుగురి పేర్లను వేర్వేఱుగా ప్రత్యేకముగా పేర్కొనెను. వీరుగాక భగదత్తుడు, భూరిశ్రవుడు, శల్యుడు మొదలగు యోధులను గూడ అర్జునుడు మహాయోధులుగా భావించి, వారిని జయించుట గూడ సులభముగాదని తలంచుచుండెను. 'అన్యాన్' అను విశేషణముతోపాటు 'యోధవీరాన్' అను పదమును ప్రయోగించి, శ్రీకృష్ణుడు వారుకూడ తన ద్వారా నిహతులే యనియు, వారినిగూడ వధింపుమని అర్జునుని ఆజ్ఞాపించెను. ఈ వాక్యములద్వారా శత్రుపక్షములోని వీరులందఱును తనద్వారా మృతి చెందిరనియు, వారిలో ఎవరితో పోరాడుటకైనను సందేహింపనవసరము లేదనియు భగవానుడు నుడివెను. గురువులను వధించుటచే పాపము కల్గునని తలచుటయు సమంజసము గాదు. ఏలనన క్షత్రియ ధర్మము ననుసరించి వారిని చంపుటలో అతడు నిమిత్తమాత్రుడే. దానివలన అతనికి ఎట్టిపాపము అంటదు సరిగదా! ధర్మపాలనయే యగును - కనుక "లెమ్ము, వీరిని జయింపుము" - అని భగవానుడు అర్జునుని ఆజ్ఞాపించెను.

ప్రశ్న - "మా వ్యథిష్ఠాః" అనగానేమి?

---

1) జయద్రథుడు సింధుదేశపు రాజైన వృద్ధక్షత్రుని కుమారుడు. ఇతడు ధృతరాష్ట్రుని ఏకైక కుమార్తెయైన దుస్సలను పెండ్లియాడెను. పాండవుల వనవాస సమయమున ఒకసారి వారు లేనప్పుడు ఇతడు ద్రౌపది నపహరించుకొని పోయెను. భీమసేనాదులకు ఈ విషయము తెలియగనే అతనిని వెంబడించి, బంధించి, ద్రౌపదిని విడిపించుకొని వచ్చిరి. యుధిష్ఠిరుని సూచన మేరకు వానిని చంపకుండ తలగొరిగి పంపించిరి. కురుక్షేత్ర యుద్ధమునందు అర్జునుడు సంసప్తకులతో యుద్ధము చేయుటకు వెళ్ళినప్పుడు. ఇతడు తనకు శివుడిచ్చిన వరప్రభావమున పద్మవ్యూహద్వారముకడ యుధిష్ఠిరుని, భీముని, నకులుని, సహదేవుని అడ్డగించెను. ఆ కారణమున వారు అభిమన్యునికి తోడుగా లోనికి ప్రవేశింపలేకపోయిరి. పెక్కుమంది మహారథులు చుట్టుముట్టి అభిమన్యుని వధించిరి. ఈ విషయమును విన్న అర్జునుడు మఱునాడు సూర్యాస్తమయములోపలనే జయద్రథుని వధించెదననియు, లేనిచో అగ్నిప్రవేశము చేసి, ప్రాణములను త్యజించెదననియు ప్రతిజ్ఞ చేసెను. కౌరవ పక్షములోని వీరులందఱును జయద్రథుని రక్షించుటకు అనేక ప్రయత్నములు చేసిరి. కాని శ్రీకృష్ణభగవానుని ప్రభావమున వారి ప్రయత్నములన్నియును వ్యర్థములయ్యెను. సూర్యాస్తమయమునకు ముందుగనే అర్జునుడు అతని శిరస్సును మొండెమునుండి వేఱుచేసెను. అతని శిరస్సును నేలపై పడద్రోసిన వాని తల ఆ క్షణముననే మాఱు ప్రక్కలగునని వానికి వరముగలదు. కనుక భక్తవత్సలుడైన శ్రీకృష్ణ భగవానుని ఆజ్ఞ మేరకు అర్జునుడు జయద్రథుని తలను భూమిపై పడకుండ పైపైనే తన బాణముల ద్వారా తీసికొని పోయి సమంత పంచక తీర్థము కడ కూర్చొని తపమాచరించుచున్న వృద్ధక్షత్రుని (జయద్రథుని తండ్రి) యొక్క ఒడిలో పడవైచెను. వృద్ధక్షత్రుడు దానిని భూమిపై పడద్రోసెను. వెంటనే అతని శిరస్సు నూఱుప్రక్కలాయెను. (మహాభారతం - ద్రోణపర్వము)

సమా - భగవానుని ఉగ్రరూపమును చూచి అర్జునుడు భయగ్రస్తుడై వ్యథితుడగుట తగదని అతనిని ఊరడించెను. తాను అతని ప్రియసఖుడైన కృష్ణుడే యనియు, కనుక ఏమాత్రమూ భయపడుటగాని, సంతప్తుడగుటగాని తగదనియూ తెలిపెను.

ప్రశ్న - "యుద్ధమునందు నిస్సందేహముగా శత్రువులను నీవు జయింపగలవు. కనుక యుద్ధము చేయుము" అని యనుటలో అంతర్యమేమి?

సమా - అర్జునుని మనస్సులో యుద్ధమున తామే గెల్చెదమో? లేక శత్రువులే గెల్చెదరో అను శంక యుండెను. (2/6) దీనిని తొలగించుటకై భగవానుడిట్లు పలికెను. యుద్ధమునందు అర్జునునకు విజయప్రాప్తి నిశ్చయమనియు కనుక ఉత్సాహముతో యుద్ధము చేయవలయుననియు ప్రేరేపించెను.

*సంబంధము - ఈ విధముగా భగవానుని నోట విషయములన్నింటిని విన్నపిమ్మట అర్జునుని స్థితిని గూర్చియు అతడు స్పందించిన రీతిని గూర్చి సంజయుడిట్లు తెల్పుచున్నాడు-*

### *సంజయ ఉవాచ*

**ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలిర్వేపమానః కిరీటీ ।**
**నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కేశవస్య | = శ్రీకృష్ణునియొక్క | కృతాంజలిః | = అంజలి ఘటించినవాడై | | | | భయగ్రస్తుడై |
| ఏతత్ | = ఈ | వేపమానః | = వణకిపోవుచున్నవాడై | ప్రణమ్య | = నమస్కరించి | | |
| వచనమ్ | = మాటలను | నమస్కృత్వా | = నమస్కరించి | కృష్ణమ్ | = కృష్ణునితో | | |
| శ్రుత్వా | = విని | భూయః, ఏవ | = మఱల | సగద్గదమ్ | = గద్గదస్వరముతో | | |
| కిరీటీ | = అర్జునుడు | భీతభీతః | = మిక్కిలి | ఆహ | = పలికెను | | |

**సంజయుడు పలికెను - ఓ రాజా! శ్రీ కృష్ణపరమాత్మయొక్క ఈ మాటలను విని, అర్జునుడు వణకుచు, చేతులు జోడించి నమస్కరించెను, మఱల మిక్కిలి భయముతో ప్రణమిల్లి, గద్గదస్వరముతో తడబడుచు శ్రీకృష్ణుని స్తుతింపసాగెను. (35)**

ప్రశ్న - భగవానుని వచనములు విన్న అర్జునుడు భయకంపితుడైనట్లు తెల్పుటలోని విశేషమేమి?

సమా - శ్రీకృష్ణభగవానుని యొక్క ఉగ్రమైన ఆ విశ్వరూపమును జూచి అర్జునుడు మిక్కిలి వ్యాకులపాటుకు గురియయ్యెను. భగవానుడు అతనిని ఎంతగా ఓదార్చినను అతని భయము తొలగిపోలేదు. మనస్సు కుదుటబడ కుండెను. కనుక అతడు భయముతో వణకుచు ఆ ఉగ్రరూపమును ఉపసంహరింపుమని భగవానుని ప్రార్థింపసాగెను.

ప్రశ్న - అర్జునునకు 'కిరీటి' అను పేరు ఎట్లు ఏర్పడెను?

సమా - దేవేంద్రుడు అర్జునునకు సూర్యకాంతితో సమానమైన తేజస్సుగల దివ్యకిరీటమును ప్రదానము చేసి యుండెను. దానినే అతడు సర్వదా శిరముపై ధరించుచుండెను. కనుక అతనికి 'కిరీటీ' అను పేరు ఏర్పడెను.[1]

ప్రశ్న - "కృతాంజలిః" అను విశేషణముతో పాటు మఱల అదే అర్థమును ఇచ్చు, నమస్కృత్వా, ప్రణమ్య, అను రెండు పదములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

1) పురా శక్రేణ మే దత్తం, యుధ్యతో దానవర్షభైః ।
కిరీటం మూర్ధ్ని సూర్యాభం, తేనాహుర్మాం కిరీటినమ్ ॥ (మహాభారతం - విరాటపర్వం - 44/17)

విరాటరాజకుమారునితో అర్జునుడు ఇట్లనెను- "పూర్వకాలమున నేను వీరులైన దానవులతో యుద్ధమొనర్చినప్పుడు ఇంద్రుడు ప్రసన్నుడై సూర్య సమాన తేజస్సు గల కిరీటమును నా శిరమున అలంకరించెను. కనుక జనులు నన్ను 'కిరీటి' అని పిలువసాగిరి"

సమా - భగవానుని ఆ అనంత - ఐశ్వర్య సంపన్నమైన రూపమును చూచి, ఆ స్వరూపమునెడ అర్జునునకు అత్యంత గౌరవభావము కుదురుకొనెను. అతడు భయగ్రస్తుడయియే ఉండెను. అందువలన అతడు చేతులు జోడించి, మాటిమాటికి నమస్కరించుచు, ప్రణమిల్లుచు భగవానుని స్తుతింపసాగెను. అని తెల్పుటకే "కృతాంజలిః" అను విశేషణముతో పాటు పైన తెల్పబడిన పదములను సంజయుడు ప్రయోగించెను.

ప్రశ్న - 'భూయః' అను పదమునకు అర్థమేమి?

సమా - అర్జునుడు ఇంతకుముందు గూడ భగవానుని స్తుతించియుండెను. ఇప్పుడు పరమాత్ముని వచనములను విన్న పిమ్మట మఱల స్తుతింపసాగెను.

ప్రశ్న - "సగద్గదమ్" అనగానేమి? అది దేనికి విశేషణము? దాని ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - "సగద్గదమ్" అను పదము క్రియా విశేషణము. ఇది అర్జునుడు పలికిన తీరును, అతని స్థితిని తెల్పుటకై ప్రయుక్తమైనది. భగవంతుని స్తుతించునప్పుడు భయాశ్చర్యముల కారణమున అతని హృదయము ఆర్ద్రమయ్యెను. నేత్రములు అశ్రుపూర్ణములాయెను. గొంతు పెగలకుండెను. ఈ కారణముల వలన అతని కంఠము గద్గదమయ్యెను. ఫలితముగా అతని పలుకులు అస్పష్టములై జాలిగొలుపునవిగా ఉండెను.

*సంబంధము - 36వ శ్లోకమునుండి 46వ శ్లోకము వఱకును అర్జునుడొనర్చిన భగవన్నుతి, నమస్కారములు, క్షమాభ్యర్థనము వర్ణింపబడినవి. అందు మొట్టమొదట 'స్థానే' అను పదమును ప్రయోగించి జగత్తు హర్షితమగుటలోని ఔచిత్యమును ప్రకటించుచున్నాడు-*

**అర్జున ఉవాచ**

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః ॥ 36 ॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| హృషీకేశ! | = ఓ అంతర్యామీ! | చ | = మఱియు | సర్వే | = సమస్తమైన |
| తవ | = నీ నామగుణ ప్రభావములను | అనురజ్యతే | = అనురాగముతో పొంగిపోవుచున్నది | సిద్ధసంఘాః | = సిద్ధ సముదాయముల వారును |
| ప్రకీర్త్యా | = బాగుగా కీర్తించుటచే (కీర్తించుచు) | భీతాని | = భయగ్రస్తులైన | | |
| | | రక్షాంసి | = రాక్షసులు | నమస్యంతి | = ప్రణమిల్లుచున్నారు. |
| జగత్ | = విశ్వమంతయును | దిశః | = నలుదిక్కులకును | | |
| ప్రహృష్యతి | = మిక్కిలి హర్షించుచున్నది | ద్రవంతి | = పాఱిపోవుచున్నారు | స్థానే | = ఇది సముచితము |
| | | చ | = మఱియు | | |

అర్జునుడు పలికెను- ఓ అంతర్యామీ! కేశవా! నీనామగుణప్రభావములను కీర్తించుచు జగత్తు హర్షాతిరేకముతో, అనురాగముతో ఉప్పొంగిపోవుచున్నది. ఇది సముచితము. భయగ్రస్తులైన రాక్షసులు నలుదిక్కులకును పారిపోవుచున్నారు. సిద్ధగణములవారెల్లరును ప్రణమిల్లుచున్నారు. (36)

ప్రశ్న - 'స్థానే' అను పదమునకు అర్థమేమి?

సమా - 'స్థానే' అనునది అవ్యయము - ఇది ఔచిత్యార్థకము. భగవానుని కీర్తనాదులతో జగత్తు హర్షపులకితమై భక్తిభరితమగుచున్నది. రాక్షస గణములు ఆ అద్భుతరూపమును, తత్ప్రభావమును చూచి, భయభ్రాంతములై ఇటునటు పరుగులు దీయుచుండెను. సిద్ధసముదాయములన్నియును మాటిమాటికిని నమస్కరించుచుండెను. ఇదంతయు యుక్తమే. ఇట్లు జరుగవలసినదే - ఏలనన శ్రీకృష్ణుడు సాక్షాత్ పరమేశ్వరుడే - అని తెల్పుటకు 'స్థానే' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'ప్రకీర్త్యా' అను పదమున కర్థమేమి? దానివలన జగత్తు హర్షితమై అనురాగ భరితమగుచున్నదనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - కీర్తి శబ్దము ఇచట 'కీర్తించుట'ను తెల్పును. 'ప్ర' అను ఉపసర్గను ప్రయోగించుటవలన ఉచ్చస్వరముతో కీర్తించుచుండుటను గ్రహింపవలెను. భగవానుని నామ, రూప, గుణ, ప్రభావ మాహాత్మ్యములను ఉచ్చస్వరముతో కీర్తించుచుండుట వలన చరాచరాత్మకమైన ఈ సమస్త జగత్తు మిక్కిలి ప్రసన్నమగుచున్నది. ప్రాణులన్నియును ప్రేమ పరవశములగుచున్నవి.

ప్రశ్న - భగవానుని విరాడ్రూపమును అర్జునుడే చూచెనా? లేక జగత్తంతయు చూచెనా? ఒకవేళ సమస్త జగత్తూ చూడనిచో ప్రాణులు అన్నియును హర్షితములగుట, ప్రేమపూర్ణములగుట, రాక్షసులు భయముతో పాఱిపోవుట, సిద్ధులు నమస్కరించుట ఎట్లు సంభవము? కానిచో, అర్జునుడు ఆ సంఘటనలను ఎట్లు తెల్పగలిగెను?

సమా - భగవానుడు ప్రసాదించిన దివ్య దృష్టి ద్వారా కేవలము అర్జునుడే ఆ విశ్వరూపమును చూడగలిగెను. జగత్తు దానిని చూడనే లేదు. జగత్తు హర్షితమూ, అనురక్తమూ అగుట, రాక్షసులు భయపడి పాఱిపోవుట, సిద్ధులు నమస్కరించుట అనునవి అన్నియును ఆ విరాడ్రూపము యొక్క దృశ్యవిశేషములే. ఇది అర్జునుడు గాంచిన విరాడ్రూపచిత్రణమే. బాహ్య జగత్తు యొక్క వర్ణనము కాదు. అతడు తాను చూచిన విరాడ్రూపములోని దృశ్యములనే వర్ణించెను.

సంబంధము - పూర్వశ్లోకమున 'స్థానే' అను పదమును ప్రయోగించి సిద్ధసముదాయముల నమస్కారములు మొదలగునవి నడచుట యుక్తమే అని తెలుపబడెను. ఇప్పుడు నాలుగు శ్లోకములలో భగవానుని ప్రభావమును అర్జునుడు వర్ణించుట, మాటిమాటికిని నమస్కరించుట మున్నగు విషయములు వివరింపబడుచున్నవి-

**కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।**
**అనంత దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్ తత్పరం యత్ ॥ 37 ॥**

మహాత్మన్ = ఓ పరమాత్మా!
బ్రహ్మణః, అపి = సృష్టికర్తయైన బ్రహ్మకును
ఆదికర్త్రే = (నీవు) మూల కారకుడవు
చ = మఱియు
గరీయసే, తే = సర్వ శ్రేష్ఠుడవునైన నీకు (సిద్ధాదు లందరును)
కస్మాత్, న, నమేరన్ = నమస్కరింపక ఎట్లుండ గలరు? (తప్పక నమస్కరింతురు)
అనంత! దేవేశ! = ఓ అనంతా! దేవాధిదేవా!
జగన్నివాస! = ఓ జగన్నివాసా!
యత్ = ఏది
సత్ = 'సత్' అయి యున్నదో
అసత్ = 'అసత్' అయి యున్నదో
తత్పరమ్ = వాటికంటెనుపరమైన (శ్రేష్ఠమైన)
అక్షరమ్ = శాశ్వతమైన సచ్చిదానంద పరమాత్మ తత్త్వముగలదో
(తత్) = (అది)
త్వమ్ (ఏవ, అపి) = నీవే

**ఓమహాత్మా! నీవు సర్వశ్రేష్ఠుడవు. సృష్టికర్తయైన బ్రహ్మకే మూలకారకుడవు - కనుక వారు (సిద్ధాదులందఱును) నీకు నమస్కరింపక ఎట్లుండగలరు? ఓ అనంతా! ఓ దేవేశా! ఓ జగన్నివాసా! సత్ - అసత్‌లు నీవే. వాటికంటెను పరమైన అక్షరస్వరూపుడవు అనగా సచ్చిదానంద ఘనపరబ్రహ్మవు నీవే.(37)**

ప్రశ్న - 'మహాత్మన్!' 'అనంత!' 'దేవేశ!' 'జగన్నివాస!' అని అర్జునుడు నాలుగు సంబోధనలను ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - ఈ సంబోధనలను ప్రయోగించి, అర్జునుడు నమస్కారాది క్రియల ఔచిత్యమును ప్రకటించెను. భగవానుడు సమస్తచరాచర ప్రాణులకు 'పరమాత్మ', అంతరహితుడు అనగా అతని రూపగుణ ప్రభావాదులకు అవధి లేదు. భగవానుడు సర్వదేవతలకును స్వామి. సమస్తజగత్తునకును ఏకైక పరమాధారుడు. జగత్తంతయు అతనిలోనే స్థితమై యున్నది. అతడు దానియందు వ్యాప్తమై యున్నాడు. కనుక వీరందఱును భగవానునకు నమస్కారాదులను చేయుట యుక్తమే.

ప్రశ్న - 'గరీయసే బ్రహ్మణో-ప్యాదికర్త్రే' అను పదప్రయోగములలోని విశేషమేమి?

సమా - ఈ పదములు గూడ నమస్కారాదుల ఔచిత్యమునే ప్రకటించుచున్నవి. భగవానుడు సర్వశ్రేష్ఠుడు. సర్వోత్తముడు. సమస్తజగత్తును సృష్టించు బ్రహ్మను గూడ సృజించినవాడు. ఇక జగద్విషయము చెప్పనేల? కనుక అందఱికిని పరమపూజ్యుడు, పరమశ్రేష్ఠుడు అగుటవలన అందఱును అతనికి నమస్కారాదులొనర్చుట సముచితమే.

ప్రశ్న - "సత్తు, అసత్తు మఱియు వాటికంటెను పరమైన అక్షరస్వరూపుడవు నీవే" అని యనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - ఎప్పటికిని నశింపని శాశ్వతమైన 'ఆత్మను' 'సత్' అని యందురు. నశ్వరమై, అనిత్యమైన వస్తు సముదాయమును 'అసత్' అని యందురు. వీటినే 7వ అధ్యాయమున క్రమముగా "పరా" "అపరా" ప్రకృతులనియు, అట్లే 15వ అధ్యాయమున 'అక్షర' 'క్షర' పురుషులు అనియు పేర్కొనుట జరిగినది. పరాత్ పరమైన సచ్చిదానంద ఘనపరమాత్మతత్త్వమే వీటికంటెను పరమైనది. తన నమస్కారాదుల ఔచిత్యమును దెల్పుటకే ఇవి యన్నియును పరమాత్మ (భగవత్) స్వరూపములే - కనుక ఆయనకు నమస్కారాదులొనర్చుట సర్వవిధముల సముచితము.

**త్వమాదిదేవః పురుషః పురాణః త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనంతరూప ॥ 38 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనంతరూప! | = ఓ అనంతరూపా! | అస్య | = ఈ | పరమ్, ధామ, అపి | = పరంధాముడవు |
| త్వమ్ | = నీవు | విశ్వస్య | = జగత్తునకు | | |
| ఆదిదేవః | = ఆదిదేవుడవు | పరమ్, నిధానమ్ | = పరమాశ్రయుడవు | త్వయా | = నీ చేత |
| పురాణః, పురుషః | = సనాతనపురుషుడవు | వేత్తా, చ | = సర్వజ్ఞుడవు | విశ్వమ్ | = జగత్తు |
| త్వమ్ | = నీవు | వేద్యమ్, చ | = సర్వవేద్యుడవు | తతమ్ | = పరిపూర్ణమైయున్నది |

**ఓ అనంతరూపా! నీవు ఆదిదేవుడవు, సనాతనపురుషుడవు, ఈజగత్తునకు పరమాశ్రయుడవు. సర్వజ్ఞుడవు, సర్వవేద్యుడవు, పరంధాముడవు. ఈ జగత్తు అంతయును నీచే పరిపూర్ణమైయున్నది.(38)**

ప్రశ్న - నీవు ఆదిదేవుడవు. సనాతన పురుషుడవు - అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవంతుని స్తుతించుచు అర్జునుడు ఆయనను సమస్త దేవతలకును ఆదిదేవుడనియు, (సర్వదా) ఎప్పటికిని ఉండునట్టివాడు, నిత్యుడు ఐన పరమాత్మ (సనాతనుడు) అనియు పేర్కొనెను.

ప్రశ్న - "సర్వజగత్తునకును నీవు పరమాశ్రయుడవు. అనగా పరమాధారమైనవాడవు" అని యనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - ఈ జగత్తంతయు ప్రళయకాలమున భగవంతునిలోనే లీనమగును. ఆయనయొక్క ఏదో యొక అంశయందు అది స్థితమై యుండును. కనుక భగవానుడే జగత్తునకు పరమాశ్రయుడని అర్జునుడు పేర్కొనెను.

ప్రశ్న - 'వేత్తా' అను పదమునకర్థమేమి?

సమా - భూత, వర్తమాన, భవిష్యత్కాలములనుండు సమస్తజగత్తును యథార్థముగా సంపూర్ణముగా తెలిసినవాడే పరమాత్మ. అన్నింటిని ఎల్లప్పుడును చూచువాడును, సర్వజ్ఞుడును ఐనవాడు ఆ పరమాత్మ. ఆయనవలె సర్వజ్ఞుడైనవాడు మఱొకడు లేడు.

ప్రశ్న - 'వేద్యమ్' అను పదమునకు అర్థమేమి?

సమా - 'వేద్యమ్' అనగా తెలిసికొనదగినవాడు. భగవంతుని గూర్చి తెలిసికొనుటయే మానవ జన్మకు పరమ లక్ష్యము. 13వ అధ్యాయమునందలి 12వ శ్లోకమునుండి 17వ శ్లోకమువఱకును వర్ణింపబడిన జ్ఞేయతత్త్వము సాక్షాత్ ఆ పరబ్రహ్మ పరమేశ్వరుడేయని తెల్పుటకే అర్జునుడు 'వేద్యమ్' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'పరమ్' అను విశేషణసహితముగా 'ధామ' అను పదమునకు అర్థమేమి?

సమా - ముక్తపురుషులకు పరమగతి ఆ పరమాత్ముడే. ఆయనను చేరినవారు తిరిగి కర్మబంధములలో చిక్కుకొనరు. అనగా వారు పునర్జన్మ లేనివారు. అట్టి సాక్షాత్ పరంధాముడు అతడేయని తెల్పుటకై 'పరమ్' అను విశేషణసహితముగా 'ధామ' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'అనంతరూప!' అను సంబోధన యొక్క వైశిష్ట్యమేమి?

సమా - అసంఖ్యాకములైన రూపములు గలవారిని అనంతరూపుడని యందురు. ఇట్లు సంబోధించుటవలన భగవానుని రూపములు అపరిమితములు, అగణ్యములు అనియు, వాటి యొక్క అంతమును ఎవ్వరును తెలిసికొనజాలరు అనియు పేర్కొనెను.

ప్రశ్న - 'ఈ సమస్త జగత్తు నీచే వ్యాప్తమై యున్నది' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - సమస్త విశ్వములోని ప్రతి పరమాణువునందును భగవానుడు వ్యాప్తమై యున్నాడనియు, అతడు లేని స్థానమే లేదనియు అర్జునుడు పలికెను.

**వాయుర్యమోఽగ్నిర్వరుణ శ్శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।**
**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ 39 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్వమ్ | = నీవు | ప్రజాపతిః | = ప్రజాపతియైన బ్రహ్మవు | అస్తు | = అగుగాక |
| వాయుః | = వాయుదేవుడవు | ప్రపితామహః, చ | = బ్రహ్మకును జనకుడవు | తే | = నీకు |
| యమః | = యముడవు | | | భూయః, అపి | = మఱల గూడ |
| అగ్నిః | = అగ్నివి | తే | = నీకు | | |
| వరుణః | = వరుణుడవు | సహస్రకృత్వః, నమః, నమః | = వేలకొలది నమస్కార పరంపరలు | పునః, చ | = ఇంకను |
| శశాంకః | = చంద్రుడవు | | | నమః, నమః | = నమస్కారములు |

నీవే వాయుదేవుడవు, యముడవు, అగ్నివి, వరుణుడవు, చంద్రుడవు, ప్రజాపతియైన బ్రహ్మవు. బ్రహ్మకును జనకుడవు. నీకువేలకొలది నమస్కారములు. మఱల మఱల నమస్కారములు. ఇంకను నమస్కారములు. **(39)**

ప్రశ్న - "వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, ప్రజాపతియైన బ్రహ్మ - నీవే" అని యనుటలోని అర్థమేమి?

సమా - పైన పేర్కొనబడిన దేవతలందఱును, ఇంకను ఇతర దేవతలును భగవత్స్వరూపులే. "కనుక వారందఱికిని అన్నివిధముల మీరే పూజ్యులు" అని అర్జునుని పలుకుల అంతర్యము.

ప్రశ్న - "నీవు ప్రపితామహుండవు - అనగా బ్రహ్మకును తండ్రివి" అని యనుటలోని విశేషమేమి?

సమా - సమస్తజగదుత్పత్తికిని కారకులైన కశ్యపుడు, దక్షప్రజాపతి, సప్తర్షులు మొదలగువారికి తండ్రియగుట వలన బ్రహ్మ అందఱికిని పితామహుండు. భగవానుడు బ్రహ్మకు సైతము జన్మనిచ్చువాడగుటచే ఆయనయే అందఱికిని ప్రపితామహుండు. ఈ కారణమువలన గూడ ఆయన అందఱికిని సర్వథా నమస్కరింపదగినవాడు.

ప్రశ్న - 'సహస్రకృత్వః' అను పదముతో పాటు 'నమః' అను పదమును మాటిమాటికి ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - భగవానుని యెడ అర్జునునకు గల భయ భక్తుల వలన ఆయనకు ఎన్నిసార్లు నమస్కారములు చేసినను ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

**నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।**
**అనంతవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ 40 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనంతవీర్య! | = అనంతమైన సామర్థ్యము గలవాడా! | సర్వ! | = సర్వాత్మా! | త్వమ్ | = నీవు |
| తే | = నీకు | తే | = నీకు | సర్వమ్, సమాప్నోషి | = జగత్తునందంతటను వ్యాపించియున్న వాడవు |
| పురస్తాత్ | = ముందుగా ఉండియు | సర్వతః, ఏవ | = అన్నివైపులనుండియు | | |
| అథ | = మఱియు | నమః అస్తు | = నమస్కారము(లు) | తతః | = ఈ విధముగా నీవే |
| పృష్ఠతః | = వెనుక నుండియు | అమితవిక్రమః | = అపరిమితమైన పరాక్రమము గలవాడవైన | | |
| నమః | = నమస్కారములు | | | సర్వః, అసి | = సర్వరూపుడవు |

అనంతసామర్థ్యముగలవాడా! నీకు ఎదురుగా ఉండియు, వెనుకనుండియు నమస్కరించుచున్నాను. ఓ సర్వాత్మా! నీకు అన్నివైపులనుండియు నమస్కారములు. ఏలనన అనంతపరాక్రమశాలివై నీవు జగత్తంతటను వ్యాపించియున్నవాడవు. అన్ని రూపములును నీవియే. **(40)**

ప్రశ్న - "సర్వ!" అను సంబోధన మొనర్చి, 'ముందు నుండియు, వెనుకనుండియు, అన్నివైపులనుండియు నీకు నమస్కారములు' అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవంతుడే అందఱికిని ఆత్మ, సర్వవ్యాపి, సర్వరూపుడు. కనుక అర్జునుడతనికి ముందు వెనుక, పైన క్రింద, కుడి, ఎడమ - అన్నివైపులనుండియు నమస్కరించెను. ఏలనన భగవంతుడు లేని చోటే లేదు. సర్వత్ర స్థితుడైయున్న భగవానునకు అర్జునుడు అన్నివైపులనుండి ప్రణమిల్లెను.

ప్రశ్న - 'అమిత విక్రమః' అనియనగా నేమి?

సమా - సాధారణ మానవులవలె భగవానుని పరాక్రమము పరిమితము గాదు. అతడు అపరిమిత పరాక్రమశాలి. అనగా ఆయన పరాక్రమ లీలలు శాస్త్రములకును అందనివి.

ప్రశ్న - "నీవు సమస్త జగత్తునందును వ్యాపించి యున్నవాడవు. కనుక నీవు సర్వరూపుడవు" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు మొదట 'సర్వ!' అని భగవానుని సంబోధించియుండెను. ఇప్పుడు ఆయన 'సర్వత్వము'ను బలపఱచుచున్నాడు. భగవానుడు సంపూర్ణ జగత్తునందు వ్యాపించి యున్నాడు. విశ్వమునందలి అల్పాతి - అల్పమైన అణువులోగూడ అతడు వ్యాపించియున్నాడు. అతడు లేని చోటే లేదు. కనుక సర్వమూ భగవంతుడే. భగవంతుడు తప్ప ప్రపంచమున మరొక వస్తువే లేదు- అని అర్జునుని నిశ్చితాభిప్రాయము.

సంబంధము - భగవంతుని ఈవిధముగా స్తుతించి, ప్రణమిల్లిన పిదప అర్జునునకు భగవానుని గుణరహస్య మాహాత్మ్యములు యథార్థముగా తెలియని కారణమున అతడు వాక్కుద్వారాగాని, ఆచరణముల ద్వారా గాని ఇదివరలో తాను చేసిన అపరాధములను క్షమింపుమని రెండు శ్లోకములలో భగవానుని ప్రార్థించుచున్నాడు-

**సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి ।**
**అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ ప్రణయేన వాఽపి ॥ 41 ॥**

**యచ్చావహాసార్థమసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు ।**
**ఏకోఽథ వాప్యచ్యుత తత్సమక్షం తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ 42 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తవ | = నీయొక్క | మయా | = నాచేత (నేను) | ప్రమాదాత్, అపి | = పొరపాటువలనగాని |
| ఇదమ్ | = ఈ | సఖా, ఇతి | = మిత్రుడవని | హే కృష్ణ! | = ఓ కృష్ణా! |
| మహిమానమ్ | = మహిమను | మత్వా | = తలంచి | హే యాదవ! | = ఓ యాదవా! |
| అజానతా | = ఎఱుగనివాడనైన | ప్రణయేన, వా | = చనువుచేగాని | హే సఖే, ఇతి | = ఓ మిత్రమా! అనిగాని |

యత్ = ఏది
ప్రసభమ్ = తొందరపాటుగా
ఉక్తం, చ = పలుకుట జరిగి యుండవచ్చును
అచ్యుత! = ఓ కృష్ణా!
యత్ = ఏది (నాద్వారా)
అవహాసార్థమ్ = పరిహాసమునకుగాని,
విహార, శయ్యా+ఆసన భోజనేషు = ఆహార విహారముల యందుగాని, శయ్యాసనములపై ఉన్నప్పుడుగాని
ఏకః = ఏకాంతమునగాని
అథవా = లేక
తత్సమక్షమ్ అపి = మిత్రుల మధ్యగాని
అసత్కృతః, అపి = నీవు కించపఱచబడి యుండవచ్చును
తత్ = ఆ అపరాధములు అన్నింటికిని
అప్రమేయమ్ = అప్రమేయ స్వరూపుడవైన
త్వామ్ = నిన్ను
క్షామయే = క్షమింపుమని వేడుకొనుచున్నాను

నీ మహిమను ఎఱుగక నిన్ను నా సఖునిగా భావించి, చనువుచేగాని, పొరపాటువలనగాని, ఓ కృష్ణా! ఓయాదవా! ఓ మిత్రా! అనుచు తొందరపాటుతో ఆలోచింపక, నేను నిన్ను సంబోధించి ఉంటిని. ఓ అచ్యుతా! విహారశయ్యాసనభోజనాది సమయములయందు ఏకాంతమునగాని, అన్యసఖుల సమక్షమున గాని సరసమునకై పరిహాసములాడి, నేను నిన్ను కించపఱచి యుండవచ్చును. ఓ అప్రమేయస్వరూపా! నా అపరాధములనన్నింటిని క్షమింపుమని వేడుకొనుచున్నాను. **(41-42)**

ప్రశ్న - 'ఇదమ్' అను విశేషణముతోపాటు 'మహిమానమ్' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - విరాట్ స్వరూపదర్శన సమయమున అర్జునుడు భగవానుని నిరుపమానమైన, అప్రమేయమైన ఐశ్వర్య గౌరవగుణ ప్రభావములను ప్రత్యక్షముగా చూచెను. వాటిని సూచించుటకే 'ఇదమ్' అను విశేషణముతోపాటు 'మహిమానమ్' అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - 'మయా' అను పదముతో 'అజానతా' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'అజానతా' అను పదము హేత్వర్థక విశేషణము. అర్జునుడు భగవానుని మహిమను ఇప్పుడే ప్రత్యక్షముగా తెలిసికొనెను. దానిని యథార్థముగా ఇంతకుముందు ఎఱుంగకున్నకారణమున అర్జునుడు ఆయనతో సముచితముగా ప్రవర్తించియుండకపోవచ్చును. కావున అజ్ఞానమువలన తాను చేసిన అపరాధములనన్నింటిని క్షమింపుమని ప్రార్థించుటకే 'అజానతా' 'మయా' అను పదములను ప్రయోగించెను.

ప్రశ్న - 'సఖా ఇతి మత్వా, ప్రణయేన, ప్రమాదాత్' అను పదములను ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి?

సమా - భగవంతుని సాటిలేని అపారమహిమను ఎఱుంగని కారణమున అర్జునుడు ఆయనను తనతో సమానమైన (సామాన్య) మిత్రునిగ భావించెను. అందువలన ఆయనతో సంభాషించునప్పుడు చూపింపవలసిన గౌరవ భావమునుగాని, పూజ్యభావమునుగాని చూపింపకపోయి యుండవచ్చును. కనుక చనువుచేగాని, పొరపాటువలనగాని దోషము వాటిల్లియుండవచ్చును. దేవతాశ్రేష్ఠులును, మహర్షులును ఆయనకు పాదాభివందనముల నాచరించుటయే తమ సౌభాగ్యముగా భావింతురు. అట్టి మహానుభావునితో సమానముగా అర్జునుడు వ్యవహరించెను. కావున అట్టి తన దోషములను దయతో మన్నింపుమని అర్జునుడు ప్రార్థించుచున్నాడు.

ప్రశ్న - ప్రసభమ్' అను పదముతోపాటు "హే కృష్ణ!' "హే యాదవ!' "హే సఖే!' అను పదములను ప్రయోగించుటలోని ప్రత్యేకతయేమి?

సమా - ప్రేమతోగాని, ప్రమాదవశమునగాని అర్జునుడు తనవలన దోషములు జరిగియుండవచ్చునని పేర్కొని, ఆ భావనను స్పష్టీకరించుటకు ఈ పదములను ప్రయోగించెను. అర్జునుడు "ప్రభూ! నీవెక్కడ? నేనెక్కడ? పరమ పూజ్యుడవైన, పరమేశ్వరుడవైన నిన్ను మూఢమతినై నా మిత్రునిగా భావించి, ఏ మాత్రమూ ఆదరభావముగాని, ఆలోచనగాని లేక కృష్ణా! యాదవా! సఖా! మొదలగు సంబోధనలతో పిలుచుచు వచ్చితిని. నా ఈ అపరాధములను క్షమింపుము" అని పలికెను.

ప్రశ్న - 'అచ్యుత!' అను సంబోధనలోని ప్రత్యేకత ఏమి?

సమా - భగవానుని మహిమగాని, స్వరూపము గాని ఎన్నటికిని చెక్కు చెదరవు. కావున ఆయనను 'అచ్యుతుడు' అనియుందురు. అట్టి మహిమాన్వితుడైన వానిని తాను తన ప్రవర్తన ద్వారా గౌరవింపక యుంటినని, అట్లు ప్రవర్తించి యుండుట నిజముగా మహాపరాధమేయని అర్జునుడు పరితప్తుడయ్యెను. కావున "భగవన్! నా ఈ ప్రవర్తన వలన నీ గౌరవమునకు ఎట్టి లోపమూ కలుగదు. జగత్తునందు ఏదియు నీ మహిమను చలింపజేయలేదు. నీకు అవమానము కల్గింపగల శక్తి ఎట్టి వారికిని లేదు. ఏలనన నీవు ఎల్లప్పుడును అచ్యుతుడవే" - అని అర్జునుడు పరితాపముతో పల్కెను.

ప్రశ్న - 'యత్' 'చ' అను వానిని ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - అర్జునుడు పూర్వశ్లోకమున తాను ప్రకటించిన అపరాధములనే గాక తన ప్రవర్తనద్వారా ఘటిల్లిన తదితరములైన మఱికొన్ని అపరాధములను వర్ణించుచున్నాడు. పూర్వశ్లోకమున వర్ణింపబడిన అపరాధములను 'యత్' అను పదము సూచించును. ఈ శ్లోకమున తాను ప్రకటింపనున్న తదితరములైన మఱికొన్ని అపరాధములను 'చ' అను పదప్రయోగము సూచించును.

ప్రశ్న - "అవహాసార్థమ్" (అపహాసార్థమ్) అనగానేమి?

సమా - చనువు, పొరపాటు, వినోదము - ఈ మూడు కారణములవలన మానవుడు తన వ్యవహారమునందు ఇతరులకు గలుగు మానావమానములను తెలిసికొనలేడు. చనవువలన నియమములను పాటింపడు. ప్రమాదమువలన పొరపాట్లు జరుగుచుండును. వినోదములో (సరసాలాపములలో) సంభాషించుట యందు ఔచిత్యము లోపించును. పూజ్యుడైన వానికి జరుగు అవమానములో ఈ మూడును కారణములు కావచ్చును లేక ఏ ఒక్కటియైనను కావచ్చును. చనవు, ప్రమాదములను గూర్చిన విషయములను అర్జునుడు పూర్వశ్లోకమున నుడివియున్నాడు. ఇప్పుడు మూడవ కారణమైన అపహాస్యమును 'అవ(ప)హాసార్థమ్' అను పదము తెలుపుచున్నది.

ప్రశ్న - "విహారశయ్యాసన భోజనేషు, ఏకః, తత్సమక్షమ్" అను పదములను ప్రయోగించి, 'అసత్కృతోఽపి' అని యనుటలోని విశేషమేమి?

సమా - పై పదముల ద్వారా అర్జునుడు తన వలన భగవంతునియెడ అపచారములు జరిగిన సందర్భములను ఉగ్గడించుచున్నాడు. విహారములయందు గాని, శయనించునప్పుడుగాని, ఆసనములపై కూర్చొనునప్పుడు గాని, భోజనాది సమయములయందుగాని తన వలన భగవంతునకు పెక్కు పర్యాయములు అపచారములు జరిగియుండవచ్చును.[1] - అవి ఏకాంతమున జరిగినను, ఇతరుల సమక్షమున జరిగినను వాటినన్నింటిని మహాపరాధములుగా తాను భావించుచున్నాననియు, అట్టి ప్రతి అపరాధమును క్షమింపుమనియు అర్జునుడు భగవానుని ప్రార్థించుచున్నాడు.

ప్రశ్న - 'తత్' అను పదము దేనిని సూచించును? 'త్వామ్' సర్వనామముతోపాటు 'అప్రమేయమ్' అను విశేషణమును 'క్షామయే' అను క్రియాపదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 41, 42 శ్లోకములయందు అర్జునుని చే పేర్కొనబడిన సమస్త - అపరాధములను సూచించునదియే 'తత్' అను పదము - 'త్వామ్' అను సర్వనామముతో 'అప్రమేయమ్' అను విశేషణము, 'క్షామయే' అను క్రియాపదమును ప్రయోగించి, తన సమస్త - అపరాధములను క్షమింపుమని ప్రార్థించెను. అర్జునుడు ఇట్లు పల్కుచున్నాడు. "ప్రభూ! నీ స్వరూపము, మాహాత్మ్యము

---

1) శ్రీమద్భాగవతమునందు అర్జునుడు ఇట్లు పలికెను -

శయ్యాసనాటనవికత్థన భోజనాదిష్వైక్యాత్, వయస్య ఋతవానితి విప్రలబ్ధః ।
సఖ్యుః సఖేవ పితృవత్తనయస్య సర్వం సేహే మహాన్ మహితయా కుమతేరఘం మే ॥ (1/15/19)

శ్రీకృష్ణభగవానునితో పరుండునప్పుడును, కూర్చుండునప్పుడును, తిరుగునప్పుడును, సంభాషించునప్పుడును, భోజనాదికములను చేయుచున్నప్పుడును మా యిద్దఱి మధ్య చనవు కొలది అప్పుడప్పుడు 'మిత్రమా! నీవు మిక్కిలి సత్యవాదివి' అని ఆక్షేపించుచుంటిని. కాని మహాత్ముడైన ఆ ప్రభువు నిండు మనస్సుతో ఒక మిత్రుని మిత్రుడు వలెను, ఒక కుమారుని తండ్రి వలెను, అల్పబుద్ధిని అపరాధినైననన్ను అతడు క్షమించుచుండెడివాడు.

అచింత్యములు. వాటి నెవ్వరును పూర్తిగా తెలిసికొనజాలరు. వాటినిగూర్చి ఏ కొద్దిగా తెలిసినను అది నీ అనుగ్రహ ప్రభావము వలననే. మొదట నీ ప్రభావమును ఏమాత్రమూ ఎఱుగక నిన్ను సముచితముగా ఆదరింపకుంటిని. నీ అనుగ్రహ ఫలితముగా ఇప్పుడు నీ ప్రభావమును కొద్దిగా నైనను తెలిసికొంటిని. ఐనను నీ ప్రభావమును గూర్చిన పూర్తి అవగాహన నాకు కలుగలేదు. లభించిన ఆ కొద్దిజ్ఞానము వలననే 'నీవు సర్వశక్తిమంతుడవు, సాక్షాత్ పరమేశ్వరుడవు' అని గ్రహించితిని. నిన్ను నాతో సమానునిగా, మిత్రునిగా భావించి, ప్రవర్తించుటను అపచారముగా భావింతును – అట్టి సమస్త-అపరాధములనూ క్షమింపుమని వేడుకొనుచున్నాను."

సంబంధము – ఈవిధముగా తన అపరాధములను క్షమింపుమని ప్రార్థించి, అర్జునుడు రెండు శ్లోకములలో భగవానుని ప్రభావములను వర్ణించుచున్నాడు. అపరాధులను సైతము క్షమించునట్టి భగవద్వాత్సల్యమును ప్రస్తుతించుచు, తనయెడ ప్రసన్నుడవు కమ్మని భగవానుని మఱల ప్రార్థించుచున్నాడు–

**పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।**
**న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ॥ 43 ॥**

అప్రతిమప్రభావ! = సాటిలేని ప్రభావముగలవాడా!
త్వమ్ = నీవు
అస్య, చరాచరస్య = ఈ చరాచరప్రాణులతో గూడిన
లోకస్య = జగత్తునకు
పితా = తండ్రివి
చ = మఱియు
గరీయాన్ = సర్వశ్రేష్ఠుడవు
గురుః = గురుడవు
పూజ్యః, అసి = పూజ్యుడవు
లోకత్రయే, అపి = ముల్లోకముల యందును
త్వత్సమః = నీతోసమానుడు
అన్యః = మఱియొకడు
న, అస్తి = లేడు
అభ్యధికః = అధికుడు
కుతః = ఎట్లుండును?

**ఓ అనుపమప్రభావా! ఈ సమస్త చరాచరజగత్తునకు నీవే తండ్రివి. నీవు పూజ్యుడవు. గురుడవు. సర్వశ్రేష్ఠుడవు. ఈ ముల్లోకములయందును నీతో సమానుడెవ్వడును లేడు. ఇంక నీకంటె అధికుడెట్లుండును? (43)**

ప్రశ్న – ఈ చరాచర జగత్తునకు నీవు తండ్రివి, పూజ్యుడవు, గురుడవు – అని యనుటలోని వైశిష్ట్యమేమి?

సమా – తన అపరాధములను క్షమించుటలోని ఔచిత్యమును అర్జునుడు ప్రతిపాదించుచున్నాడు. అతడిట్లు పల్కుచున్నాడు. "భగవన్! ఈ చరాచర జగత్తంతయు నీనుండియే ఉద్భవించినది. కనుక నీవే దీనికి తండ్రివి. జగత్తునందలి దేవతాశ్రేష్ఠులు, మహర్షులు, సమర్థులైన ఇతర పురుషులు మున్నగు వారందఱికంటెను బ్రహ్మ శ్రేష్ఠుడు. ఏలనన వీరందఱికంటెను ముందుగా అతడు ప్రాదుర్భవించెను. అతడే నీ నిత్య (శాశ్వత) మైన జ్ఞానము ద్వారా అందఱికిని యథాయోగ్యముగ జ్ఞానమును ప్రసాదించును – కాని ప్రభూ! ఆ బ్రహ్మయు నీనుండియే ఉత్పన్నమగును. ఆ జ్ఞానము గూడ ఆయనకు నీనుండియే లభించును. కావున ఓ సర్వేశ్వరా! నీవు గురువులకు గురుడవు. సర్వశ్రేష్ఠుడవు. సమస్త లోకములలోని దేవతలకును, మహర్షులకును నీవు పూజ్యుడవు. నిత్యమూ జగద్వంద్యులైన బ్రహ్మాది దేవతలును, వసిష్ఠాది మహర్షులును క్షణమాత్రమైనను నిన్ను పూజించుటను, స్తుతించుటను తమ అదృష్టముగా భావింతురు. కావున పూజ్యులైన వారందఱికిని నీవు పరమపూజ్యుడవు. కనుక అల్పుడైన నా అపరాధములను క్షమించుట నీకు అన్ని విధముల తగును."

ప్రశ్న – "అప్రతిమ ప్రభావ!" అను సంబోధనతోపాటు "ముల్లోకములలోను నీతో సమానమైన వారెవ్వరును లేరు. ఇంక నీకంటె అధికుడెట్లుండును?" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా – సాటిలేని ప్రభావము గలవానిని 'అప్రతిమప్రభావ!' అని యందురు. "అచింత్య+అనంత మహాగుణములు, ఐశ్వర్యములు, మహిమలు గల నీతో సరితూగ గలవాడు ఈ విశ్వమునందలి బ్రహ్మాండములలో ఎవ్వడును లేడు. నీకు నీవే సాటి. నీతో సమానుడైన వాడెవ్వడును లేనప్పుడు నీకంటె అధికుడుండుట అసంభవము. ఇట్టి నీవే నా అపరాధములను క్షమించనిచో ఓ దయామయా! ఇంక క్షమించు వారు ఎవరు?"

**తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయేత్వామహమీశమీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ 44 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేవ! | = ఓ దేవాదిదేవా! | త్వామ్ | = నిన్ను | ప్రియాయాః | = భార్య |
| తస్మాత్ | = అందువలన | ప్రసాదయే | = (నన్ను | | (అపరాధము)ను |
| అహమ్ | = నేను | | అనుగ్రహించుటకై) | ప్రియః ఇవ | = భర్తవలెను |
| కాయమ్ | = శరీరమును | | ప్రార్థించుచున్నాను | త్వమ్ | = నీవు |
| ప్రణిధాయ | = నీ పాదములకడ ఉంచి | పుత్రస్య | = పుత్రుని (తప్పును) | సోఢుమ్ | = (నా అపరాధములను |
| ప్రణమ్య | = నమస్కరించి | పితా, ఇవ | = తండ్రివలెను | | అన్నింటిని) సహించు |
| ఈడ్యమ్ | = స్తవనీయుడవు | సఖ్యుః | = సఖుని (దోషమును) | | (క్షమించు)టకు |
| ఈశమ్ | = పరమేశ్వరుడవును ఐన | సఖా, ఇవ | = సఖునివలెను | అర్హసి | = తగినవాడవు |

**కనుక ఓ ప్రభూ! నాశరీరమును నీపాదములకడనిడి, సాష్టాంగముగా ప్రణమిల్లుచున్నాను. స్తవనీయుడవు, సర్వేశ్వరుడవు ఐన నీవు నాయందు ప్రసన్నుడవగుటకై నిన్ను ప్రార్థించుచున్నాను. దేవా! కుమారుని తండ్రి క్షమించినట్లును, మిత్రుని మిత్రుడు క్షమించినట్లును, భార్యను భర్త క్షమించినట్లును, నా అపరాధములను నీవు క్షమింపుము. (44)**

ప్రశ్న - 'తస్మాత్' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - భగవానుడు తనయందు ప్రసన్నుడగుటకు పూర్వశ్లోకమున వర్ణింపబడిన మహామహిమాన్వితములైన గుణములే హేతువులని తెల్పుటకు అర్జునుడు 'తస్మాత్' అని ప్రయోగించెను. భగవానుడు మిక్కిలి మహిమాన్వితుడు. ప్రభావశాలి. అర్జునునివంటి దీనుడైన శరణాగతునిపై దయచూపుట ఆయనకు సహజమే. కనుక అర్జునుడు వినయపూర్వకముగ ఆయనను అర్థించెను.

ప్రశ్న - తనకు ప్రసన్నుడవు కమ్మని 'త్వామ్' అను పదముతోపాటు 'ఈశమ్' 'ఈడ్యమ్' అను పదములను ప్రయోగించి, 'నేను నా శరీరమును నీ పాదములకడనుంచి, ప్రణమిల్లి, (సాష్టాంగముగా నమస్కరించి) నాయెడ ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించుచున్నాను" అని అనుటలోని విశేషమేమి?

సమా - అందరిని నియమించు స్వామిని ఈశుడని యందురు. స్తుతికి యోగ్యుడైన వానిని (స్తవనీయుడైన వానిని) ఈడ్యుడు - అని యందురు. భగవంతుడు సమస్తజగత్తును నియమించువాడు. ఇంద్రుడు, ఆదిత్యుడు, వరుణుడు, కుబేరుడు, యముడు మొదలగు లోకనియంతలైన దేవతలను గూడ నియంత్రించువాడు ఆ పరమేశ్వరుడే. అతని గుణగౌరవములు, మహిమలు మిక్కిలి అనంతములైనవి. సమస్త జగత్తు సర్వదా ఆయనను స్తుతించినను ఆయన గుణగౌరవాదులను వారు పూర్తిగా తెలిసికొనలేరు (భగవానుని అనంత కళ్యాణ గుణాదులను లెక్కించుటకు ఎవ్వరికిని సాధ్యము గాదు.) అర్జునుడు భగవానుని స్తుతించి ఆయనను ప్రసన్నుని చేసికొన గలిగిన జ్ఞానముగాని, వాక్శక్తిగాని తనకు లేవు అనియు, భగవత్ప్రభావమును గూర్చి యెద్దైన చెప్పినను అది కేవలము రేఖామాత్రముగనే యుండుననియు భావించెను. కనుక అర్జునుడు భగవానునకు దండప్రణామములాచరించి, ఆయన (భగవంతుని) చరణధూళిని శిరమున దాల్చి, భగవంతుని ప్రసన్నుని చేసికొనగోరెను. కావున దయతో తన అపరాధములను మన్నించి, ప్రసన్నుడవు కమ్మని అర్జునుడు భగవంతుని ప్రార్థించెను.

ప్రశ్న - తండ్రి కుమారుని, మిత్రుడు మిత్రుని, పతి పత్నిని క్షమించినట్లు తనను (తన అపరాధములను) క్షమింపుమని కోరుటలోని ఆంతర్యమేమి?

సమా - ప్రమాదము, వినోదము, ప్రేమ అను ఈ మూడు కారణముల వలన మనుష్యులు ఇతరుల యెడ అపచారము చేయుట జరుగుచుండునని 41, 42 శ్లోకములలో తెల్పబడినది. ఇచ్చట ఈ మూడు ఉపమానములను చూపి ఈ మూడు కారణముల ద్వారా తనవలన సంభవించు

అపరాధములనన్నింటిని మన్నింపుమని అర్జునుడు భగవానుని ప్రార్థించెను. అజ్ఞానమువలన ప్రమాదవశమున పుత్రుడొనర్చిన అపరాధములను తండ్రి క్షమించును. సరసాలాపములలో జరిగిన దోషములను మిత్రుడు క్షమించును. ప్రేమాతిరేకమున పత్ని వలన జరుగు దోషములను పతి మన్నించును. అట్లే తనవలన జరిగిన అపచారములను మన్నింపుమని అర్జునుడు భగవంతుని ప్రార్థించెను.

సంబంధము - ఈ విధముగ తన అపరాధములను క్షమింపుమని కోరిన పిమ్మట అర్జునుడు భగవానుని యొక్క చతుర్భుజ రూపమును చూపుమని రెండు శ్లోకములలో ఆయనను ప్రార్థించుచున్నాడు-

**అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే ।**
**తదేవ మే దర్శయ దేవరూపం ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 45 ॥**

అదృష్టపూర్వమ్ = ఇంతకుముందెన్నడును చూడనట్టి విశ్వరూపమును
దృష్ట్వా = చూచి
హృషితః, అస్మి = సంతుష్టుడనైతిని
చ = మఱియు
మే, మనః = నామనస్సు
భయేన = భయముతో
ప్రవ్యథితమ్ = కలతచెందినది
తత్ = ఆ
దేవరూపమ్, ఏవ = చతుర్భుజ శోభితమైన విష్ణురూపమునే
మే = నాకు
దర్శయ = చూపుము
దేవేశ! = ఓ దేవాధిదేవా!
జగన్నివాస! = ఓ జగన్నివాసా!
ప్రసీద = ప్రసన్నుడవుకమ్ము

**మునుపు ఎన్నడునుచూడని ఆశ్చర్యకరమైన ఈ రూపమును గాంచి, మిక్కిలి సంతసించితిని. కాని భయముచే నామనస్సు కలవరపాటు పొందినది. కనుక దేవేశా! చతుర్భుజయుక్తుడవై విష్ణురూపముతోడనే నాకు దర్శనమిమ్ము. జగన్నివాసా! ప్రసన్నుడవు కమ్ము. (45)**

ప్రశ్న - 'అదృష్టపూర్వమ్' అని యనగానేమి? దానిని చూచి హర్షితుడైనట్లును, అదే సమయమున వ్యాకులుడైనట్లును- అర్జునుడు తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇదివఱలో ఎన్నడును చూడని పరమాశ్చర్య కరమైన రూపమును 'అదృష్టపూర్వమ్' అని యందురు. భగవంతుని అలౌకిక రూపమును (విశ్వరూపమును) చూచి ఆయన గుణప్రభావ - ఐశ్వర్యములను గూర్చి తలంచినప్పుడు అర్జునుడు మిక్కిలి హర్షితుడాయెను. అప్పుడు "అహో! నేనెంత భాగ్యశాలిని! సాక్షాత్పరమేశ్వరుడే అల్పుడనైన నన్ను అనుగ్రహించి, తన అపారకృపా వాత్సల్యముచే తన అలౌకిక దివ్య (విశ్వ) రూపమును చూపుచున్నాడు. కాని భయానకమైన ఈ మూర్తిని తిలకించినప్పుడు నా మనస్సు భీతితో వణకుచున్నది. అందువలన నేను మిక్కిలి వ్యాకులుడనగుచున్నాను" - అని భావించెను. అర్జునుని ఈ ఆలోచన సహేతుకమే. కనుక అట్టి ఆ రూపమును ఉపసంహరింపుమని సవినయముగ ప్రార్థించెను.

ప్రశ్న - 'ఏవ' అను పదముతో పాటు 'తత్' అను పదమును ప్రయోగించి, 'దేవరూపము'ను చూపుమని అర్జునుడు ప్రార్థించుటలోని ఆంతర్యమేమి?

సమా - 'తత్' అను పదము పరోక్షవాచకము అంతేగాక లోగడ చూడబడి, ఇప్పుడు పరోక్షముగా నున్న (దూరముగా అందుబాటులో లేని) వస్తువును సూచించును. అట్లే 'ఏవ' అను అవ్యయము దానికంటెను వేఱైన రూపమును (వస్తువును) నిరాకరించును. కనుక వైకుంఠవాసియైన ఆ చతుర్భుజ విష్ణురూపమునే దర్శింపజేయుమని ప్రార్థించెను. కేవలము 'తత్' అను పదము ప్రయోగించినచో మానవావతార రూపమును చూపుమని ప్రార్థించినట్లగును. కాని 'దేవ' అను పదమును ప్రయోగించుటచే స్పష్టముగా మానవరూపము కంటెను వేఱైన దివ్యరూపమును చూపుమని ప్రార్థించినట్లు భావింపవలెను.

ప్రశ్న - 'దేవేశ!' 'జగన్నివాస!' అను సంబోధనలను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - దేవతలకు స్వామియైన వానిని దేవేశ! అని యందురు. జగత్తునకు 'ఆధారము', 'సర్వవ్యాపి' యైనవానిని జగన్నివాసుడు అని యందురు. భగవానుడు సమస్త దేవతలకు స్వామియు, జగత్తునకు సర్వాధారుడును, సర్వవ్యాపియునైన సాక్షాత్పరమేశ్వరుడు అగుటవలన తన దివ్యరూపమును ప్రకటించుటకు అతడే సమర్థుడని తెల్పుటకు అర్జునుడు పైరెండు సంబోధనలను ప్రయోగించెను.

ప్రశ్న - 'ప్రసీద' అనగానేమి?

సమా - 'ప్రసీద' అనగా ప్రసన్నుడవు కమ్ము (అనుగ్రహింపుము) అని యర్థము. "శీఘ్రముగా ఈ కరాళరూపమును ఉపసంహరించి, ప్రసన్నమైన నీ చతుర్భుజరూపమును దయతో నాకు చూపుము" అని అర్జునుడు భగవానుని ప్రార్థించెను.

**కిరీటినం గదినం చక్రహస్తమ్ ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।**
**తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవవిశ్వమూర్తే! ॥ 46 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| విశ్వమూర్తే! | = ఓ విశ్వరూపా! | చక్రహస్తమ్ | = చక్రపాణివియును అగు | (అతః) | = (అందువలన) |
| అహమ్ | = నేను | త్వామ్ | = నిన్ను | సహస్రబాహో! | = ఓ పరమాత్మా! |
| కిరీటినమ్ | = కిరీటముగల వాడవును | తథా, ఏవ | = అట్లే | తేన చతుర్భుజరూపేణ ఏవ | = చతుర్భుజరూపము గలవాడవు |
| గదినమ్ | = గదను ధరించిన వాడవును | ద్రష్టుమ్ | = చూచుటకై | | |
| | | ఇచ్ఛామి | = కోరుకొనుచున్నాను | భవ | = కమ్ము |

కిరీటమును, గదను, శంఖచక్రములను ధరించిన నీ రూపమును చూడగోరుచున్నాను. ఓ సహస్రబాహూ! విరాడ్రూపా! నీ చతుర్భుజరూపమును నాకు చూపుము. **(46)**

ప్రశ్న - 'తథా' అను పదముతోపాటు 'ఏవ' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - మహాభారతయుద్ధమున తాను శస్త్రమును చేపట్టనని భగవానుడు ప్రతిజ్ఞ చేసియుండెను. అర్జునుని రథముపై ఆయన ఒక చేతిలో 'చెన్నకోలను' మఱియొక చేతిలో గుఱ్ఱముల పగ్గములను ధరించి యుండెను. కాని ఈ సమయమున ఆ ద్విభుజరూపమును చూచుటకు ముందుగా అర్జునుడు శంఖచక్రగదాది ఆయుధ పాణియైన చతుర్భుజ విష్ణురూపమును చూడగోరెను. 'తథా' అను పదముతో పాటు 'ఏవ' అను పదప్రయోగ వైశిష్ట్యమిదియే.

ప్రశ్న - 'తేన' 'ఏవ' అను పదముల యర్థమేమి?

సమా - పూర్వశ్లోకమున ప్రయుక్తమైన 'తత్ - దేవరూపమ్ - ఏవ' అను పదములచే తెల్పబడిన భగవంతుని చతుర్భుజ రూపమునే తాను చూడగోరుచున్నాని ప్రకటించుటకే తేన, ఏవ అను పదములను ప్రయోగించుట జరిగెను. అర్జునుడు సర్వదా (ప్రాయః) భగవానుని ద్విభుజరూపమునే దర్శించుచుండెను. కాని ఇచట చతుర్భుజ రూపమునే చూడగోరుచున్నట్లు అర్జునుడు పలికెను.

ప్రశ్న - చతుర్భుజ రూపము శ్రీకృష్ణ రూపమును తెల్పునా? లేక 'దేవరూపమ్' అని పేర్కొనుట వలన శ్రీ మహావిష్ణురూపమును తెల్పునా?

సమా - ఇది శ్రీమహావిష్ణురూపమునే తెల్పును. దీనికి పెక్కు హేతువులు గలవు.

1) శ్రీకృష్ణరూపము స్వాభావికముగా చతుర్భుజ రూపమేయైనచో 'గదినమ్' 'చక్రహస్తమ్' అని ప్రయోగింప నవసరము లేదు. ఏలనన అర్జునుడు ఆరూపమును సర్వదా చూచుచునే యుండెను. 'చతుర్భుజమ్' అని ప్రయోగించుటయు అనవసరము. కానిచో "సామాన్యముగా నేను ఇంతవఱకును చూచుచు వచ్చిన రూపమునే చూడగోరుదును" అని చెప్పిన చాలును.

2) పూర్వశ్లోకమున 'దేవరూపమ్' అను పదము వాడబడినది. రాబోవు 51వ శ్లోకమున ప్రయుక్తమైన 'మానుషమ్ రూపమ్' అను పదము ద్వారా దానికంటె వేఱైన రూపమని తెలియును. కావున 'దేవరూపమ్' అను పదము శ్రీమహావిష్ణురూపమునే సూచించును.

3) రాబోవు 50వ శ్లోకమున 'స్వకమ్, రూపమ్' అను పదములతో పాటు 'భూయః' అను పదమును, 'సౌమ్యవపుః' అను పదముతోపాటు 'పునః' అను పదమును ప్రయోగించుట వలన మొదట చతుర్భుజ రూపమును, పిమ్మట ద్విభుజ మానుష రూపమును భగవానుడు చూపినట్లు గ్రహింపవలెను.

4) రాబోవు 52వ శ్లోకమున 'సుదుర్దర్శమ్' అను పదమును ప్రయోగించుటవలన ఈ రూపము అత్యంత దుర్లభమనియు, దేవతలు గూడ ఈ రూపమును నిత్యము చూచుటకు తహతహలాడుదురనియు తెల్పుట జరిగినది. చతుర్భుజ రూపమే శ్రీకృష్ణుని స్వాభావికరూపమైనచో దానిని సామాన్యమానవులు గూడ చూచుచుండెడివారు. దేవతలు దానిని ఎల్లప్పుడును దర్శించుచుండుటకు ఉవ్విళ్ళూరెడివారు కారు. ఒకవేళ 'దేవరూపమ్' అను పదమునకు 'విశ్వరూపమ్' అను అర్థమును ఊహించినచో భీష్మద్రోణాది వీరులు గూడ కోరలమధ్య చిక్కుకొన్న ఆ భయంకర రూపమును చూచుటకు దేవతలు ముచ్చట పడుదురని చెప్పుట సమంజసము గాదు. కనుక దేవతాగణములు వైకుంఠవాసియైన శ్రీమహావిష్ణువునే దర్శించుటకు కాంక్షింతురని చెప్పుటయే సమంజసము.

5) 48వ శ్లోకమున 'విరాట్ స్వరూప మహిమ' 'న వేదయజ్ఞాధ్యయనైః' మొదలగు పదముల ద్వారా వర్ణింపబడినది. మఱల 53వ శ్లోకమున 'నాహంవేదైర్నతపసా' మున్నగు పదముల ద్వారా అదే రీతిగా చెప్పబడినది. ఆ రెండుచోట్లను ఒకే విరాడ్రూప మహిమ వర్ణితమైనచో పునరుక్తి దోషము కల్గును. కావున భగవానుడు తన మానుషరూపమును చూపుటకు ముందుగా అర్జునునకు చతుర్భుజ దేవ రూపమును చూపెననియు, దాని మహిమయే 53వ శ్లోకమున వర్ణింపబడినదనియు గ్రహింపవలెను.

6) ఈ అధ్యాయమునందు 24, 30 శ్లోకములలో అర్జునుడు భగవానుని 'విష్ణో!' అని సంబోధించెను. ఈ కారణమువలన గూడ విష్ణురూపమును చూడవలెనని అతడు కోరుకొనుచున్నట్లు ప్రతీతమగుచున్నది.

పై కారణములనుబట్టి శ్రీ మహావిష్ణువుయొక్క చతుర్భుజరూపమునే చూపుమని అర్జునుడు శ్రీకృష్ణ భగవానుని ప్రార్థించుచున్నాడని గ్రహింపవలెను.

ప్రశ్న - 'సహస్రబాహో!' 'విశ్వమూర్తే!' అని సంబోధించుచు చతుర్భుజరూపమును చూపుమని ప్రార్థించుటలోని విశేషమేమి?

సమా - భగవానుడు అర్జునునకు వేలకొలది బాహువులు గల విరాట్ స్వరూపమును చూపుచుండెను. ఆ రూపమును ఉపసంహరించి, చతుర్భుజరూపమును చూపుమని ప్రార్థించుచు పైరెండు సంబోధనలను ప్రయోగించెను.

*సంబంధము - అర్జునుని ప్రార్థనను అనుసరించి, భగవానుడు తన విశ్వరూపమహిమను, దాని దుర్లభత్వమును రెండు శ్లోకములలో వర్ణించుచు 49వ శ్లోకమున అర్జునుని ఓదార్చుచు, చతుర్భుజ రూపమును చూడుమని పల్కెను-*

### *శ్రీ భగవాన్ ఉవాచ*

## మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
## తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = ఓ అర్జునా! | తేజోమయమ్ | = తేజోమయమైన | నదృష్టపూర్వమ్ | = ఇంతకు ముందు చూడబడలేదో అట్టి |
| ప్రసన్నేన | = నీయెడ ప్రసన్నుడనైన | ఆద్యమ్ | = అన్నింటికిని ఆదియైన | మే | = నా యొక్క |
| మయా | = నాచేత | అనంతమ్ | = అపరిమితమైన | విశ్వమ్,రూపమ్ | = విశ్వరూపమ్ |
| ఆత్మయోగాత్ | = నా యోగశక్తి ప్రభావమున | యత్ | = ఏదైతే | తవ | = నీకు |
| ఇదమ్ | = ఈ | త్వదన్యేన | = నీవుదప్ప మరియెవ్వరి చేతను | దర్శితమ్ | = చూపబడినది |
| పరమ్ | = శ్రేష్ఠమైన | | | | |

**శ్రీ భగవానుడు పలికెను- ఓ అర్జునా! నీపైగల అనుగ్రహమున నా యోగశక్తి ప్రభావముతో నీకు నా విరాట్ - రూపమును ప్రదర్శించితిని. అది మిక్కిలి తేజోమయమైనది. అనంతమైనది, ఆద్యమైనది. దీనిని నీవు తప్ప ఇంతకుముందు మఱి యెవ్వరును చూచియుండలేదు. (47)**

ప్రశ్న - 'మయా' అను పదముతో పాటు 'ప్రసన్నేన' అను విశేషణమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - అర్జునుని భక్తికిని, ప్రార్థనకును ప్రసన్నుడై, అతనిపై గల వాత్సల్యముతో భగవానుడు తన గుణప్రభావ తత్త్వములను వివరించుటకై అతనికి తన అలౌకికరూపమును చూపెను. ఇట్టి స్థితియందు అర్జునుని భయము, దుఃఖము, మోహములకు ఎట్టి కారణమూ లేదు. ఈ విధముగా భయముతో ఏల వ్యాకులుడవగుచున్నావని భగవానుడు అర్జునుని అడిగెను.

ప్రశ్న - 'ఆత్మయోగాత్' అనగానేమి?

సమా - భగవంతుని ఆ విరాడ్రూపమును దర్శించుటకు అందఱికిని అన్ని సమయములందును సాధ్యముగాదు. భగవానుడు తన యోగశక్తివలన ఎవ్వరికి ఏ సమయము నందు దానిని దర్శింపజేయుటకు సంకల్పించునో, వారికి 'దివ్యదృష్టి'ని ఒసంగి, ఆరూపమును దర్శింపజేయును. కనుక ఈ రూపమును దర్శింపగల్గిన వారు అదృష్టవంతులు.

ప్రశ్న - 'రూపమ్' అను పదముతో పాటు 'ఇదమ్' 'పరమ్' 'తేజోమయమ్' 'ఆద్యమ్' 'అనంతమ్' 'విశ్వమ్' అను విశేషణములను ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - ఈ విశేషణములను ప్రయోగించుట ద్వారా భగవానుడు తన అలౌకిక అద్భుత, విరాట్ స్వరూపము యొక్క మహాత్మ్యమును అర్జునునకు వివరించెను. తన ఈ రూపము అత్యంత - ఉత్కృష్టము, దివ్యము, అపరిమితము, అత్యద్భుతదివ్యతేజఃపుంజము, సమస్త సృష్టికిని మూలము, ఆద్యము, అనంతము, విస్తృతము అని తెల్పుచు ఈ రూపము సంపూర్ణము కాదనియు, తన మహాద్రూపమునందు ఒక అంశమాత్రమేయనియు భగవానుడు పేర్కొనెను.

ప్రశ్న - "నా ఈ రూపమును నీవు తప్ప మఱెవ్వరును ఇంతకుముందు చూచి యెఱుఁగరు" అని భగవానుడు పలికెను. కాని ఇంతకుముందు యశోదాదేవికి తన ముఖమునందును, కౌరవ సభలో భీష్మాదివీరులకును తన విరాడ్రూపమును దర్శింపజేసియుండెను గదా!

సమా - యశోదాదేవికి తన ముఖమునందును, భీష్మాది వీరులకు కౌరవసభయందును చూపిన విరాడ్రూపములకును, ఇప్పుడు అర్జునునకు చూపిన విశ్వరూపమునకు మిక్కిలి అంతరము గలదు. ఇవి మూడును వేర్వేఱు రూపములు. ఇప్పుడు అర్జునునకు చూపిన విశ్వరూపమునందు భీష్మద్రోణాది యోధులు ప్రజ్వలించుచున్న ఆయన ముఖములో ప్రవేశించుచున్నట్లు కనబడిరి. ఇట్టి విరాడ్రూపమును భగవానుడు మునుపెవ్వరికిని ఎప్పుడును చూపించియుండలేదు. కనుక భగవానుడు నుడివిన విషయము ఏవిధముగను అసంగతము కాదు.

**న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।**
**ఏవంరూపః శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ 48 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కురుప్రవీర! | = కురువీరులలో | | చేతను | న(శక్యః) | = శక్యముకాను |
| | శ్రేష్ఠుడవైన | వేద, యజ్ఞ+ అధ్యయనైః | = వేదపఠనముల ద్వారాను | క్రియాభిః, చ | = ఇతర క్రియల |
| | ఓ అర్జునా! | | = యజ్ఞాచరణముల | | ద్వారాను |
| నృలోకే | = మానవలోకమున | | ద్వారాను | న(శక్యః) | = శక్యముగాను |
| ఏవం, రూప | = ఇట్టి విశ్వరూపుడనైన | ద్రష్టుమ్ | = చూచుటకు | ఉగ్రైః, తపోభిః | = తీవ్రతపశ్చర్యల |
| అహమ్ | = నేను | న శక్యః | = శక్యముగాను | చ | ద్వారా కూడ |
| త్వదన్యేన | = నీవుదప్పమఱియెవ్వరి | దానైః | = దానములద్వారా | న(శక్యః) | = శక్యము గాను |

**ఓ అర్జునా! వేదాధ్యయనములచేగాని, యజ్ఞాచరణములచేగాని, దానములచేగాని, తీవ్రతపశ్చర్యలచేగాని, తదితరపుణ్యకర్మలచేగాని ఈ మానవలోకమున నా ఈ విశ్వరూపము నీకుదప్ప మఱియెవ్వరికిని చూడశక్యము గాదు. (48)**

ప్రశ్న - "వేదయజ్ఞాధ్యయనైః, దానైః, క్రియాభిః, ఉగ్రైః తపోభిః", అను పదములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి? వీటిద్వారా భగవంతుని విరాడ్రూపమును చూచుటకు శక్యము కాదు - అని యనుటలోని యాంతర్యమేమి?

సమా - వేదవేత్తయైన ఆచార్యునికడ వేదములను సాంగోపాంగముగ చదివి, వాటిని కూలంకషముగ అవగాహనము చేసికొనుటను వేదాధ్యయనమని యందురు. యజ్ఞ కర్మలయందు కుశలురైన యాజ్ఞికులను సేవించుచు, వారి ద్వారా యజ్ఞవిధులను ఎఱుంగుట, వారి పర్యవేక్షణమున విధ్యుక్తముగా చేయబడు యజ్ఞములను ప్రత్యక్షముగా చూచి, యజ్ఞసంబంధమైన సమస్త క్రియలను సమగ్రముగా తెలిసికొనుటనే యజ్ఞాధ్యయనమని యందురు. ధన, కనక వస్త్ర, వాహనాదికములు, ఆహారము, నీరు, విద్య, గోవులు, భూములు మొదలగు తన సొంత వస్తువులను ఇతరుల సుఖహితముల కొఱకై ప్రసన్న హృదయముతో వారికి యథాయోగ్యమున ఇచ్చుటనే 'దానము' అని యందురు.

శ్రౌత, స్మార్త, యజ్ఞాదులను అనుష్ఠించుటను, తమ వర్ణాశ్రమధర్మములను పాటించుటకై చేయబడు సమస్త శాస్త్రోక్త కర్మలను 'క్రియలు' అని యందురు.

కృచ్ఛచాంద్రాయణాది వ్రతములను ఆచరించుట వివిధములైన కఠోర నియమములను పాటించుట, మనస్సును, ఇంద్రియములను, వివేకముతో గట్టిసాధనద్వారా నిగ్రహించుట, ధర్మము కొఱకై శారీరక, మానసిక క్లేశములను సహించుట, అట్లే శాస్త్రవిధినసురించి చేయబడు వివిధ తపశ్చర్యాదులను ఉగ్రములగు తపస్సులు- అని యందురు.

ఈ సాధనలు అన్నింటి ద్వారా కూడ తన విరాట్ స్వరూపమును దర్శించుట అసంభవమని తెల్పుచు భగవానుడు ఆ రూపమహత్త్వమును ప్రకటించెను. మహాప్రయత్నములచేతగూడ సాధ్యముకాని అట్టిరూపమును భగవంతుని కృపచేతనే అర్జునుడు చూడగల్గెను. అది అతనికి దొరికిన మహా - అదృష్టము. కావున అతడు భయము, దుఃఖము, మోహములకు లోనగుట సమంజసము కాదు.

ప్రశ్న - విరాడ్రూపదర్శనము అర్జునునకు తప్ప ఇతరులకు అశక్యమని తెల్పుచు 'నృలోకే' అను పదమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి? ఇతర లోకములయందు ఆ విశ్వరూప దర్శనము అశక్యము కాదా?

సమా - వేదముల అధ్యయనమునకును, యజ్ఞాచరణములకును, ఇతర వివిధ విధులకును అర్హులు మానవలోకమునందే గలరు. మానవ శరీరమునందే జీవుడు వివిధములైన నూతన కర్మలను ఆచరించి యోగ్యతను సాధించును. ఇతర లోకములన్నియును ముఖ్యముగా (ప్రధానముగా) భోగస్థానములే. మానవ లోకము యొక్క ఈ మహత్త్వమును వివరించుటకే ఇచట 'నృలోకే' అను పదము ప్రయోగింపబడినది - అంతేగాక మానవలోకము నందు గూడ పై సాధనల ద్వారా ఇతరులకు ఎవ్వరికిని ఈ రూపమును చూచుట శక్యము కానప్పుడు ఇతర లోకముల యందు ఎట్టి సాధన లేకయే చూచుటకు అశక్యమని చెప్పనవసరము లేదు.

ప్రశ్న - 'కురుప్రవీర!' అను సంబోధనలోని ప్రత్యేకత యేమి?

సమా - అర్జునుడు కురువీరులలో శ్రేష్ఠుడు, మహావీరుడు. అట్టి వీరుడు ఈ విధముగా భయగ్రస్తుడగుట చెల్లదు. కనుక అట్టి భయమును వీడుమని 'కురుప్రవీర!' అని సంబోధించెను.

**మా తే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।**
**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మమ | = నాయొక్క | రూపమ్ | = రూపమును | వ్యథా | = వ్యాకులపాటు |
| ఈదృక్ | = ఈ విధమైన | దృష్ట్వా | = చూచి | మా | = వలదు |
| ఇదమ్, ఘోరమ్ | = ఈ భయంకర | తే | = నీకు | చ | = మఱియు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| విమూఢభావః | = మోహముగూడ | ప్రీతమనాః | = ప్రసన్నచిత్తుడవై | ఇదమ్, రూపమ్, ఏవ | = ఈ చతుర్భుజ రూపమునే |
| మా | = వలదు | తత్ | = ఆ | పునః | = మఱల |
| త్వమ్ | = నీవు | మే | = నాయొక్క | ప్రపశ్య | = దర్శింపుము |
| వ్యపేతభీః | = భయరహితుడవై | | | | |

**ఈ విధమైన నా ఈ భయంకరరూపమును చూచి, నీవు ఎట్టి వ్యథకును, మోహమునకును గురికావలదు. భయమును వీడి ప్రసన్నచిత్తుడవై శంఖచక్ర గదాపద్మములతో విలసిల్లుచున్న నా చతుర్భుజరూపమును మరల చూడుము. (49)**

ప్రశ్న - "నా ఈ భయంకర రూపమును చూచి నీవు ఎట్టి వ్యథకును మోహమునకును గుఱికావలదు" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - పరమాత్ముడు అర్జునునకు చూపిన విరాట్ స్వరూపము అతి దుర్లభము, దానిని చూచి అర్జునుడు వ్యాకులపాటునుగాని, మోహమునుగాని పొందుట ఏవిధముగను సమంజసము గాదు. ఐనప్పటికిని దానిని జూచి, అతడు వ్యథకును, మోహమునకును లోనై, ఆ స్వరూపమును ఉపసంహరింపుమని కోరినచో అతని కోరికననుసరించి, అతనికి ఆనందమును గూర్చుటకై, ఆ స్వరూపమును తాను మఱుగు పఱచెదననియు, అర్జునుడు మోహితుడుగాని భయమువలన వ్యథితుడు గాని కానవసరము లేదనియు, భగవానుడు అతనికి అభయమిచ్చున్నాడు.

ప్రశ్న - 'త్వం' అను పదముతోపాటు 'వ్యపేతభీః' 'ప్రీతమనాః' అను విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునునకు వ్యాకులతను, భీతిని కలిగించు ఆ భీకరరూపమును ఉపసంహరించి, అతని ఇష్టప్రకారము చతుర్భుజరూపమునే ప్రకటించుచున్నాననియు, దానివలన అతడు భయరహితుడై, ప్రసన్నమనస్కుడగునని తెల్పుటకు 'త్వం' అను పదముతోపాటు 'వ్యపేతభీః' 'ప్రీతమనాః' అను విశేషణములను ప్రయోగించుట జరిగెను.

ప్రశ్న - 'రూపమ్' అను పదముతోపాటు 'తత్' 'ఇదమ్' అను విశేషణములను ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి? 'పునః' అను పదములను ప్రయోగించి, "ఆ రూపమును చూడుము" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - 'రూపమ్' అను పదముతోపాటు 'తత్' 'ఇదమ్' అను విశేషణములను ప్రయోగించి భగవానుడు తాను మునుపు అర్జునునకు చూపిన చతుర్భుజదివ్యరూపమును మఱల అతని ప్రార్థనమేరకు ఇప్పుడు చూపుచున్నాననియు, దానినే ఇప్పుడు చూడుమనియు తెలిపెను. ఇప్పుడా విశ్వరూపమును అర్జునుని ఎదుటినుండి అదృశ్యమై, దాని స్థానమున 'చతుర్భుజరూపము' ప్రకటితమయ్యెను. కనుక దానిని అర్జునుడు ప్రసన్నమనస్కుడై నిర్భయముగా చూడవచ్చునని భగవానుడు తెలిపెను.

'పునః' అను పదప్రయోగమును బట్టి భగవానుడు తన చతుర్భుజరూపమును ఇదివరలో అర్జునునకు చూపియుండెనని తెలియుచున్నది. 45, 46 శ్లోకముల యందు తత్+ఏవ, తేన+ఏవ అను పదములను ప్రయోగించుచు అర్జునుడు ప్రార్థించుటను బట్టియు ఈ విషయము స్పష్టమగుచునే యున్నది.

సంబంధము - తన చతుర్భుజరూపమును దర్శింపుమని అర్జునుని ఆజ్ఞాపించిన పిదప భగవానుడు ఆ రూపమును అతనికి చూపెనని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు-

### సంజయ ఉవాచ

**ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః ।**
**ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా ॥ 50 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| వాసుదేవః | = వాసుదేవుడు (శ్రీకృష్ణుడు) | స్వకమ్, రూపమ్ | = తన చతుర్భుజ రూపమును | సౌమ్యవపుః, భూత్వా | = సౌమ్యస్వరూపుడై (ప్రసన్నమైన తన కృష్ణరూపమును దాల్చి) |
| అర్జునమ్ | = అర్జునుని గూర్చి (అర్జునునితో) | దర్శయామాస | = దర్శింపజేసెను | | |
| | | చ | = మఱియు | | |
| ఇతి, ఉక్త్వా | = ఈ విధముగా పలికి | పునః | = తర్వాత | భీతమ్, ఏనమ్, | = భయపడుచున్న ఈ అర్జునుని |
| భూయః | = అనంతరము | మహాత్మా | = మహాత్ముడైన శ్రీకృష్ణుడు | | |
| తథా | = అదేవిధముగా | | | ఆశ్వాసయామాస | = ఓదార్చెను |

**సంజయుడు పలికెను - వాసుదేవుడు ఈ విధముగా పలికి, అర్జునునకు తన చతుర్భుజరూపమున దర్శనమిచ్చెను. అనంతరము శ్రీకృష్ణపరమాత్మ సౌమ్యమూర్తియైన తన కృష్ణరూపమును స్వీకరించి, భయపడుచున్న అర్జునునకు ధైర్యము చెప్పెను. (50)**

ప్రశ్న - 'వాసుదేవః' అను పదము నకర్థమేమి?

సమా - శ్రీకృష్ణభగవానుడు వసుదేవుని పుత్రునిగా ప్రకటితుడై అందఱిలోను ఆత్మస్వరూపునిగా వసించుచుండెను. కావున అతడు 'వాసుదేవుడు'గా ప్రసిద్ధికెక్కెను.

ప్రశ్న - 'రూపమ్' అను పదముతోపాటు 'స్వకమ్' అను విశేషణమును 'దర్శయామాస' అను క్రియాపదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'స్వకమ్' 'రూపమ్' అనగా తన నిజరూపము. విశ్వరూపముగూడ శ్రీకృష్ణభగవానుని స్వకీయరూపమే - అట్లే మానవరూపములో అందఱి మధ్య మసలునట్టి శ్రీకృష్ణరూపము గూడ ఆయనకు స్వకీయమే - కాని ఇచట సందర్భమునసనుసరించి, 'స్వకమ్' 'రూపమ్' అను పదములకు పైరెండింటి కంటె వేఱైన మూడవ రూపమని ఎఱుంగవలెను - ఏలనన విశ్వరూపము అర్జునుని ఎదుటనేయుండెను. అది అర్జునునకు భయావహముగా గూడ నుండెను. దానినే మఱల భగవానుడు చూపెననుట ఏ విధముగను పొసగదు. విశ్వరూపమును మఱుగుపఱచిన పిమ్మట ఆయన మానవావతార (శ్రీకృష్ణ) రూపమున ప్రత్యక్షమగుట సహజము. కావున ప్రత్యేకముగా దానిని చూపనవసరము లేదు. కనుక 'దర్శయామాస' అను క్రియాపదము ద్వారా ప్రత్యేకముగా చూపబడినది చతుర్భుజ రూపమే - అని ఎఱుంగవలయును. కనుక తన లీలలను ప్రదర్శించుటకై నలుగురిమధ్య సామాన్య రీతిలో మసలునట్టి శ్రీకృష్ణుని మానవ - అవతారరూపమని గాని, తన యోగశక్తిచేత ప్రకటింపబడిన విశ్వరూపమనిగాని భావించుటకు వీలులేదు. కావున 'స్వకమ్' అను విశేషణమునూ 'దర్శయామాస' అను క్రియాపదమునూ ప్రయోగించుటను బట్టి నిత్యమూ వైకుంఠధామమున నివసించు శ్రీమహావిష్ణువుయొక్క దివ్య చతుర్భుజ రూపమునే అర్జునుని ప్రార్థన మేరకు భగవానుడు దర్శింపజేసెనని సంజయుడు తెల్పెను.

ప్రశ్న - 'మహాత్ముడైన భగవానుడు సౌమ్యవపుడై, భీతుడైన అర్జునునకు ధైర్యమును గొల్పెనని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - ఉత్తమోత్తమమైన స్వరూపము కలవానిని 'మహాత్ముడు' అనియందురు. శ్రీకృష్ణ భగవానుడు అందఱికిని ఆత్మ స్వరూపుడు (ఉత్తమోత్తమస్వరూపుడు). కనుక అతడు మహాత్ముడుగా పేర్కొనబడెను - చతుర్భుజ రూపమును దర్శింపజేసిన పిమ్మట అతడు సౌమ్యవపుడై అనగా పరమశాంత శ్యామసుందరుడై, (మానవ రూపుడై) భయవ్యాకులుడైన అర్జునుని ఓదార్చెను.

*సంబంధము - ఈ విధముగా శ్రీకృష్ణ భగవానుడు తన విశ్వరూపమును ఉపసంహరించి, చతుర్భుజ రూపమును దర్శింపజేసిన పిమ్మట తన సహజమైన మానవరూపమున విలసిల్లుచున్నవాడై, అర్జునుని ఓదార్చెను. అపుడు అర్జునుడు సావధానుడై ఇట్లు పలుకసాగెను-*

**అర్జున ఉవాచ**

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ 51 ॥

| | | |
|---|---|---|
| జనార్దన! = ఓ కృష్ణా! | మానుషమ్, రూపమ్ = మానవాకృతిని | సచేతాః, సంవృత్తః, అస్మి = కుదుటబడిన మనస్సు గలవాడనైతిని (మఱియు) |
| తవ = నీయొక్క | దృష్ట్వా = చూచి | ప్రకృతిమ్, గతః = నా సహజస్థితిని పొందితిని. |
| ఇదమ్, సౌమ్యమ్ = ఇట్టి సౌమ్యమైన | ఇదానీమ్ = ఇప్పుడు (నేను) | |

**అర్జునుడు పలికెను - ఓ జనార్దనా! మీ అతిసౌమ్యమైన మానవాకృతిని (శ్యామసుందర రూపమును) చూచి, ఇప్పుడు నా మనస్సు కుదుటబడినది. నేను నా స్వాభావిక (సహజ) స్థితిని పొందితిని.(51)**

ప్రశ్న - 'రూపమ్' అను పదముతో పాటు, 'సౌమ్యమ్' 'మానుషమ్' అను విశేషణములను ప్రయోగించుటలో ఆంతర్యమేమి?

సమా - భగవంతుని మానవరూపము మిక్కిలి మధురము, శాంతము, పరమరమణీయము, ఈ రూపమునే మునుపటి శ్లోకమున "సౌమ్యవపుః" అని పేర్కొనుట జరిగినది. ఆ విషయమునే స్పష్ట పఱచుటకు అర్జునుడు 'రూపమ్' అను పదముతో పాటు, 'సౌమ్యమ్' 'మానుషమ్' అను విశేషణములను ప్రయోగించెను.

ప్రశ్న - 'సచేతాః' 'సంవృత్తః' 'ప్రకృతిం గతః' అనుపదముల యర్థమేమి?

సమా - భగవానుని విరాడ్రూపమును జూచిన అర్జునుని మనస్సునందు భయము, వ్యథ, మోహము మొదలగు వికారములు ఉత్పన్నములయ్యెను. అవి యన్నియు తొలగిపోయినవని ఇప్పుడు అర్జునుడు తెల్పుచున్నాడు. మనోహరమైన ఆ శ్యామసుందరుని మానుషరూపమును చూచినప్పుడు అర్జునుడు స్థిరచిత్తుడయ్యెను. అనగా అతనిలోని భయమోహములు, భ్రమ తొలగిపోయినవి. అతడు తన సహజ స్థితిని పొందెను. అతని మనస్సునందును, ఇంద్రియముల యందును, శరీరము నందును ఉద్భవించిన భయము, వ్యాకులత, కంపము మొదలగునవి దూరమగుటచే అతనికి మునుపటివలె స్వస్థత చేకూరెను.

*సంబంధము - ఈవిధముగా అర్జునుని వచనములను విని, భగవానుడు తన చతుర్భుజ దేవరూప దర్శనముయొక్క దుర్లభత్వమును దాని మహిమను వర్ణించుచున్నాడు-*

**శ్రీ భగవాన్ ఉవాచ**

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥ 52 ॥

| | | |
|---|---|---|
| మమ = నాయొక్క | ఇదమ్ = ఈ రూపము | అస్య, రూపస్య = ఈ రూపము యొక్క |
| యత్, రూపమ్ = ఏ చతుర్భుజ రూపమును | సుదుర్దర్శమ్ = దర్శించుటకు దుర్లభమైనది | దర్శనకాంక్షిణః = దర్శనకాంక్షతో నిరీక్షించు చుండువారే |
| దృష్టవాన్, అపి = నీవు చూచియుంటివో | దేవాః, అపి = దేవతలు గూడ | |
| | నిత్యమ్ = సదా, | |

**శ్రీ భగవానుడు పలికెను- నీవు చూచిన నా ఈ చతుర్భుజరూపముయొక్క దర్శనభాగ్యము అన్యులకు అత్యంతదుర్లభము. దేవతలుసైతము ఈ రూపమును దర్శించుటకై సదా ఉవ్విళ్ళూరుచుందురు. (52)**

ప్రశ్న - 'రూపమ్' అను పదముతోపాటు 'సుదుర్దర్శమ్' 'ఇదమ్' అను విశేషణములను ప్రయోగించుటలోని పరమార్థమేమి?

సమా - 'సుదుర్దర్శమ్' అను విశేషణమును ప్రయోగించి, తన చతుర్భుజ దివ్యరూపదర్శనము యొక్క దుర్లభత్వమును, మహత్త్వమును వివరించెను. 'ఇదమ్' అను

పదము సమీప వస్తువును నిర్దేశించును. ఈ పదప్రయోగముద్వారా విశ్వరూపానంతరము చూపబడిన చతుర్భుజరూపము సూచింపబడినది. ఈ చతుర్భుజరూపము మాయాతీతమైనది, దివ్యగుణయుక్తమైన, దాని దర్శనము అతి దుర్లభము. భగవత్కృపకు సంపూర్ణముగా పాత్రులైన అనన్యభక్తులకే అది లభ్యమగును - అని భగవానుడు తెలిపెను.

ప్రశ్న - "దేవతలును ఈ రూపమును దర్శించుటకై సర్వదా ఉవ్విళ్ళూరుచుందురు" - అని యనుటలోని విశేషమేమి? అట్లే ఈ వాక్యమునందలి 'అపి' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - భగవానుడు తనచతుర్భుజ రూపదర్శనము యొక్క దుర్లభత్వమును మహత్త్వమును ప్రకటించెను. దేవతలు గూడ సర్వదా దీనిని (ఈ రూపమును) చూచుటకు తహతహపడుచుండినను వారిలో గూడ అందఱునూ దీనిని చూడలేరు. ఇక మనుష్యులవిషయమున చెప్పనేల- అని తెల్పుటకే 'అపి' అను పదము ప్రయోగింపబడినది.

**నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| యథా | = ఏవిధముగా | | వాడనగు | | న(శక్యః) | = శక్యముగాను |
| మామ్ | = నన్ను (నా చతుర్భుజ రూపమును) | అహమ్ | = నేను | | దానేన | = దానముచేతను |
| దృష్టవాన్, అపి | = చూచి యుంటివో | వేదైః | = వేదములద్వారా | | న(శక్యః) | = శక్యముగాను |
| ఏవంవిధః | = ఈ విధమైన రూపముగల | ద్రష్టుమ్ | = చూచుటకు | | ఇజ్యయా, చ | = యజ్ఞాచరణను ద్వారాగూడ |
| | | న, శక్యః | = శక్యముగాను | | | |
| | | తపసా | = తపస్సుచే | | న(శక్యః) | = శక్యముగాను |

**నీవు గాంచిన నా చతుర్భుజరూపమును దర్శించుటకు వేదపఠనములచేగాని, తపశ్చర్యలచేగాని, దానములచేగాని, యజ్ఞకర్మలచేగాని శక్యము కాదు. (53)**

ప్రశ్న - 9వ అధ్యాయమునందలి 27, 28 శ్లోకములయందు "నీవాచరించు యజ్ఞదాన తపశ్చర్యలను అన్నింటిని నాకర్పించినచో నీవు కర్మబంధములనుండి ముక్తుడవై, నన్ను పొందెదవు" అని భగవానుడు అర్జునునితో పలికియుండెను. 17వ అధ్యాయమునందలి 25వ శ్లోకమున మోక్షమును అభిలషించువారు యజ్ఞదాన తపశ్చర్యలను ఫలేచ్ఛారహితముగ చేయుదురు - అని తెల్పియుండెను. దీనివలన భగవత్ప్రాప్తికిని, ముక్తికిని యజ్ఞదాన తపస్సులు ప్రముఖ సాధనమార్గములని విదితము అగుచున్నది. కాని ఈ శ్లోకమునందు తన చతుర్భుజరూపదర్శనము వేదాధ్యయన - అధ్యాపనముల వలనగాని, యజ్ఞదాన తపశ్చర్యాదులవలన గాని లభ్యముకాదని భగవానుడు తెల్పుచున్నాడు. కనుక ఇందు పరస్పరవైరుధ్యము గోచరించుచున్నది గదా?

సమా - ఇందు వైరుధ్యము ఏమాత్రమూ లేదు. ఏలనన కర్మలను భగవంతునకు అర్పణ చేయుట అనన్యభక్తిలో ఒక భాగము. 55వ శ్లోకమునందు అనన్యభక్తిని వర్ణించుచు స్వయముగా 'మత్కర్మకృత్' (నాకొఱకై కర్మలనాచరించు వారు) అను పదమును ప్రయోగించెను. అనన్యభక్తి ద్వారా తన యీ స్వరూపమును చూచుటకును, తెలిసికొనుటకును, పొందుటకును సాధ్యమగునని 54వ శ్లోకమున స్పష్టముగా తెల్పియుండెను. కావున నిష్కామ భావముతో భగవదర్థముగా భగవదర్పణబుద్ధితో చేయబడు యజ్ఞదానతపశ్చర్యాది కర్మలు భక్తికి అంగములగుటవలన భగవత్ప్రాప్తికి సాధన మార్గములగుచున్నవి.

సకామ భావముతో చేయబడునవి కావు. పైన తెల్పబడిన యజ్ఞాది కర్మలు భగవద్దర్శన ప్రాప్తికి సహజముగా సమర్థములు (ప్రత్యక్షసాధనములు) కావు. భక్తిశ్రద్ధలతో భగవంతుని శరణుపొంది, నిష్కామభావముతో కర్మలను ఆచరించినపుడు భగవదనుగ్రహము వలననే లభ్యమగును.

ప్రశ్న - 'ఏవంవిధః' 'మామ్ యథా దృష్టవానసి' అను పదముల ప్రయోగమున కర్థమును, భగవానుడు తాను

అర్జునునకు చూపిన విశ్వరూపము వేదాధ్యయనము మొదలగు వాని ద్వారా లభ్యముకాదని తెల్పినట్లు, భావించినచో దోషమేమి?

సమా - విశ్వరూపముయొక్క మహిమను ఇంచుమించుగా ఈ పదములనే ప్రయోగించి, 48వ శ్లోకమున భగవానుడు తెల్పియున్నాడు. ఈ శ్లోకమున చేయబడిన విశ్వరూపమహిమ వర్ణన మఱల ఆదేయని భావించినచో పునరుక్తి దోషము ఏర్పడును. ఇంతేగాక ఆ విశ్వరూప దర్శనము అర్జునునకు తప్ప మఱి ఇతరులెవ్వరికిని లభ్యము కాదని భగవానుడు తెల్పియుండెను. ఈ (చతుర్భుజ) రూపమును దర్శించు మార్గమును గూడ రాబోవు శ్లోకమున తెల్పుచున్నాడు. కావున ఇచ్చట భావింపబడిన రీతియే సరియైనది.

*సంబంధము - పైన తెల్పబడిన ఉపాయములద్వారా (యజ్ఞదానతపశ్శ్రాద్యాదులద్వారా) భగవద్దర్శనము సాధ్యపడనిచో మఱి ఏ యుపాయము ద్వారా అది సాధ్యమగును? అను ప్రశ్నకు భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ 54 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తు | = అయితే | ఏవంవిధః | = ఇట్టి చతుర్భుజరూపుడనైన | చ | = అట్లే |
| పరంతప! | = ఓపరంతపా! | అహమ్ | = నేను | ప్రవేష్టుమ్, చ | = అందు ఏకీభావ స్థితిని పొందుటకును |
| అర్జున | = అర్జునా! | ద్రష్టుమ్ | = చూచుటకును | | |
| అనన్యయా, భక్త్యా | = అనన్యభక్తి ద్వారా | తత్త్వేన, జ్ఞాతుమ్ | = తత్త్వజ్ఞానముద్వారా ఎఱుంగుటకును | శక్యః | = సాధ్యుడనగుదును |

**కాని ఓ పరంతపా! అర్జునా! ఇట్టి నా చతుర్భుజరూపమును ప్రత్యక్షముగా చూచుటకును, తత్త్వజ్ఞానమును పొందుటకును, అందు ఏకీభావస్థితినందుటకును కేవలము అనన్యభక్తిద్వారా మాత్రమే సాధ్యమగును.(54)**

ప్రశ్న - భగవంతుని చతుర్భుజ రూపమును చూచుటకును, తెలిసికొనుటకును, దానిని పొందుటకును సాధన మార్గమైన అనన్య భక్తి యనగాననేమి?

సమా - భగవంతునియందే అనన్య ప్రేమను కల్గియుండుట - అనగా తన శరీరేంద్రియ మనస్సులును, ధన, జనాది సర్వస్వములును భగవంతునివేయని భావించి, వాటిని భగవంతుని సేవయందే సర్వదా లగ్నమొనర్చుటను అనన్య భక్తి యందురు. ఈ అనన్యభక్తి లక్షణములు రాబోవు శ్లోకమున విపులముగా వర్ణింపబడినవి.

ప్రశ్న - సాంఖ్యయోగముద్వారా కూడ పరమాత్మప్రాప్తి కలుగునని తెల్పబడినది. మఱి ఇచ్చట కేవలము అనన్యభక్తి ద్వారా భగవద్దర్శనాదులు లభ్యమగునని పేర్కొనుటకు గల కారణమేమి?

సమా - సాంఖ్యయోగము ద్వారా నిర్గుణబ్రహ్మప్రాప్తి కల్గునని తెల్పబడినది. అది సర్వథా సత్యము. కాని సగుణ సాకారభగవానుని దివ్యచతుర్భుజరూపమును గూడ దర్శించుట సాంఖ్యయోగముద్వారా సాధ్యమగునని తెలుపబడలేదు. ఏలనన సాంఖ్యయోగము ద్వారా సాకార రూపమున భగవంతుడు దర్శన మొసంగుటకు బాధ్యుడు కాడు. ఇచ్చటి ఈ ప్రకరణము గూడ సగుణ పరమాత్మ దర్శనమునకు సంబంధించినదే - కావున కేవలము అనన్యభక్తియే భగవద్దర్శనాదులకు సాధనమని తెల్పుట సముచితము.

*సంబంధము - అనన్యభక్తిద్వారా భగవానుని చూచుటకును, తెలిసికొనుటకును, ఏకీభావముతో పొందుటకును, సులభముగా సాధ్యమగునని తెల్పబడెను. ఈ అనన్యభక్తిస్వరూపమును గూర్చి తెలిసికొనుటకు ఆకాంక్ష కలుగుట సహజము. కావున అనన్యభక్తిలక్షణములు వర్ణింపబడుచున్నవి-*

**మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః ।**
**నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥ 55 ॥**

పాండవ! = ఓ పాండవా!
యః = ఎవడైతే
మత్కర్మకృత్ = నాకొఱకై కర్తవ్య కర్మలను ఆచరించునో
మత్పరమః = మత్పరాయణుడగునో
మద్భక్తః = నాయందు భక్తి శ్రద్ధలు కల వాడగునో
సంగవర్జితః = ప్రాపంచిక విషయముల యందు ఆసక్తి రహితుడగునో
సర్వభూతేషు = సమస్త ప్రాణులయందును
నిర్వైరః = వైరభావములేని వాడగునో
సః = అట్టి అనన్యభక్తి యుక్తుడు
మామ్ = నన్ను
ఏతి = పొందును.

**అర్జునా! కర్తవ్యకర్మలను అన్నింటిని నాకే అర్పించువాడును, మత్పరాయణుడును, నాయందు భక్తిశ్రద్ధలుగలవాడును, ప్రాపంచిక విషయములయందు ఆసక్తిలేనివాడును, ఏ ప్రాణియందును ఏమాత్రము వైరభావము లేనివాడును ఐన అనన్య (పరమ) భక్తుడు మాత్రమే నన్ను పొందగలడు. (55)**

ప్రశ్న - 'మత్కర్మకృత్' అనగానేమి?

సమా - స్వార్థమును, మమతను, ఆసక్తిని వదలి అంతయును (సర్వమూ) భగవంతునిదేయని భావించి, తాను కేవలము నిమిత్తమాత్రుడను అనుభావముతో యజ్ఞదానతపశ్చర్యాదులను, అన్నపానాదులను, ఇతర వ్యవహారాది సమస్త శాస్త్ర విహితకర్తవ్యకర్మలను నిష్కామ భావముతో భగవదనుగ్రహము కొఱకు ఆతని ఆజ్ఞానుసారము చేయు మనుజుని 'మత్కర్మకృత్' అనగా భగవన్నిమిత్తమే భగవత్కార్యములను చేయువాడు అని యందురు.

ప్రశ్న - 'మత్పరమః' అని యనగానేమి?

సమా - భగవంతుడే పరమ - ఆశ్రయుడు, పరమగతి, శరణు జొచ్చుటకు ఏకైక రక్షకుడు, సర్వోత్తముడు, సర్వాధారుడు, సర్వశక్తిమంతుడు, సర్వసుహృదుడు, పరమ - ఆత్మీయుడు అను భావముతో ఆతడే తన సర్వస్వమని విశ్వసించి, భగవత్సంకల్ప విధానమునందు సదా సంతుష్టుడై యుండువానిని 'మత్పరమః' అనగా భగవత్పరాయణుడు - అని యందురు.

ప్రశ్న - 'మద్భక్తః' అనగానేమి?

సమా - భగవంతుని యందు అనన్య భక్తి యుండుటవలన ఆయునయందే నిమగ్నమనస్కుడై (తన్మయుడై) నిత్యమూ, నిరంతరమూ ఆయన నామ, రూప, గుణ, ప్రభావ, లీలాదులశ్రవణ, కీర్తన, మననాదులను చేయువాడును, ఆయన విరహమును క్షణకాలము గూడ తట్టుకొనలేనివాడును, భగవద్దర్శనముకొఱకు మిక్కిలి ఉత్కంఠతతో నిరంతరము నిరీక్షించువాడును ఐన వానిని 'మద్భక్తః' అనగా భగవద్భక్తుడు - అని యందురు.

ప్రశ్న - 'సంగవర్జితః' అనగానేమి?

సమా - శరీరము, భార్యాపుత్రులు, గృహము, ధనము, కుటుంబము, కీర్తిప్రతిష్ఠలు మొదలగు ఇహ పరలోక భోగ్య వస్తువులయందును, జడ చేతన పదార్థములన్నింటియందును ఏ మాత్రమూ ఆసక్తిలేనివాడును, భగవంతుని తప్ప తదన్యమైన దానిని దేనిని గూడ ఆసింపని వాడును అగు పురుషుని 'సంగవర్జితః' అనగా 'ఆసక్తి రహితుడు' అని యందురు.

ప్రశ్న - 'సర్వభూతేషు నిర్వైరః' అనగా నేమి?

సమా - సమస్త ప్రాణులును భగవత్స్వరూపములే యనియు, అన్నింటియందును భగవంతుడే వ్యాప్తుడై యున్నాడనియు భావించుటవలన ఎవ్వరికారణముగానైనను ఎట్టి విపరీతవ్యవహారము ఎదురైనను మనోవికారములకు లోనుకానివాడును, ఏ ప్రాణియందును, ఏ మాత్రమూ ద్వేషమూ లేక వైరభావమూ లేనివాడును అగునట్టివాడు 'సర్వభూతేషు నిర్వైరః' అనగా సమస్త ప్రాణులయెడను వైరభావరహితుడు - అని యనబడును.

ప్రశ్న - 'యః' 'సః' అను పదములు ఎవరిని సూచించును? మఱియు 'అతడు నన్నే పొందును' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - 'యః' 'సః' అను పదములు - ఉపర్యుక్తలక్షణములు గల పరమ భక్తుని సూచించును. 54వ శ్లోకమున తెల్పబడిన రీతిగా సగుణ పరమేశ్వరుని ప్రత్యక్షముగా దర్శించుట, ఆయన తత్త్వమును సమగ్రముగా తెలిసికొనుట, ఆయనతో ఏకీభావమునొందుట, (అభేద స్థితిని పొందుట) మున్నగు లక్షణములను గల్గియుండుటను 'భగవంతుని పొందుట' యందురు. సారాంశమేమనగా ఉపర్యుక్త లక్షణములు గల్గిన పరమ (అనన్య) భక్తునకే భగవంతుడు లభ్యుడగును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపదర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః ॥ ౧౧ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పన్నెండవ అధ్యాయము - భక్తి యోగము

**అధ్యాయ నామము :** *ఈ 12వ అధ్యాయమునందు అనేకవిధములైన సాధనలతోపాటు 'భగవద్భక్తి' వర్ణనము చేయుచు, భగవద్భక్తుల లక్షణములును తెల్పబడినవి. ఈ అధ్యాయముయొక్క ఉపక్రమ, ఉపసంహారములు భగవద్భక్తిప్రస్తావనలతోడనే జరిగినవి. కేవలము 3 శ్లోకములలో మాత్రమే 'జ్ఞానసాధనను గూర్చి వర్ణింపబడినది. అదియును భక్తి - జ్ఞానయోగముల యొక్క తులనాత్మక వివేచనకై చేయబడినది. కనుక ఈ అధ్యాయమునకు 'భక్తియోగము' అని పేరు ఏర్పడినది.*

**అధ్యాయ సారాంశము :** *ఈ అధ్యాయముయొక్క మొదటి శ్లోకమునందు సగుణ సాకార, నిర్గుణ నిరాకార ఉపాసకులలో శ్రేష్ఠుడెవ్వడు? అని యర్జునుడు ప్రశ్నించెను, దానికి సమాధానముగ సగుణ, సాకార ఉపాసకులే యుక్తతములని (శ్రేష్ఠులని) భగవానుడు 2వ శ్లోకమున తెలిపెను. 3, 4 శ్లోకములయందు నిర్గుణ, నిరాకార పరమాత్మ యొక్క లక్షణములను వర్ణించి, ఆయనను ఉపాసించుటవలన కలుగు ఫలము గూడ భగవత్ప్రాప్తియే యని తెల్పెను. దేహాభిమానులైన మనుష్యులకు నిరాకారోపాసన కష్టసాధ్యమని 5వ శ్లోకమున తెల్పెను. కర్మలను అన్నింటిని భగవదర్పణము గావించి, అనన్యభావముతో నిరంతరము సగుణ పరమేశ్వరుడైన ఆతనిని చింతనచేయు భక్తులను ఆయనయే స్వయముగా ఉద్ధరించునని 6,7 శ్లోకములయందు వివరింపబడినది. 8వ శ్లోకమునందు మనోబుద్ధులను తనకు అర్పణ చేయుమని భగవానుడు అర్జునుని ఆదేశించుచు, దాని ఫలముగూడ భగవత్ప్రాప్తియే యని పేర్కొనెను. తదనంతరము 9 నుండి 11వ శ్లోకమువఱకు పై సాధన చేయజాలనిచో అభ్యాసయోగమును అనుష్ఠింపుమనియు, దానికిగూడ శక్తి చాలనిచో భగవంతునికొఱకే కర్మలను ఆచరింపుమనియు, దానికి గూడ అశక్తుడైనచో సమస్తకర్మల ఫలత్యాగమును ఒనరింపుమనియు క్రమముగా పేర్కొనెను. 12వ శ్లోకమున కర్మఫలత్యాగము సర్వశ్రేష్ఠమని తెల్పుచు, దాని ఫలితము తత్క్షణమే పరమశాంతిప్రాప్తి అని పలికెను. పిమ్మట 13 నుండి 19వ శ్లోకమువఱకు తనకు ప్రియమైన జ్ఞానులగు మహాభక్తుల లక్షణములను భగవానుడు వర్ణించెను. 20వ శ్లోకమున అట్టి జ్ఞానులైన మహాభక్తుల లక్షణములను ఆదర్శముగా గొని, శ్రద్ధతో అదేవిధముగ సాధనచేయు భక్తులును తనకు అత్యంత ప్రియులని భగవానుడు తెల్పెను.*

**సంబంధము -** *2వ అధ్యాయమునుండి 6వ అధ్యాయము వఱకు భగవానుడు పెక్కుచోట్ల నిర్గుణ బ్రహ్మోపాసనను, సగుణ సాకార పరమేశ్వరోపాసనను ప్రశంసించెను. 7వ అధ్యాయమునుండి 11వ అధ్యాయము వఱకును విశేషముగా సగుణసాకార పరమాత్మయొక్క ఉపాసనామహత్త్వమును వివరించెను. 5వ అధ్యాయము నందలి 17 నుండి 26వ శ్లోకము వఱకును, 6వ అధ్యాయము నందలి 24 నుండి 29వ శ్లోకము వఱకును, 8వ అధ్యాయమున 11, 12, 13 శ్లోకములలోను, ఇంతేగాక ఇంకను పెక్కుచోట్ల నిర్గుణనిరాకార ఉపాసనామహత్త్వమును గూడ తెల్పెను. చివరకు 11వ అధ్యాయాంతమున సగుణ సాకార పరమాత్ముని యెడ అనన్యభక్తియొక్క ఫలము భగవత్ప్రాప్తి యని తెల్పి 'మత్కర్మకృత్' అను పదముతో ప్రారంభమగు ఈ చివరిశ్లోకమున సగుణ సాకార స్వరూపుడైన భగవంతునియెడ అనన్యభక్తిగల వానిని విశేషముగా ప్రశంసించెను. దీనిపై నిర్గుణనిరాకారబ్రహ్మను ఉపాసించువారును, సగుణ సాకార పరమాత్మను ఉపాసించువారును వీరి - రెండు విధములైన ఉపాసకులలో ఉత్తములెవ్వరు? అను సందేహము అర్జునునకు కలిగెను. ఆ సందేహనివృత్తికై అర్జునుడు ప్రశ్నించుచున్నాడు-*

**అర్జున ఉవాచ**

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ 1 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏవమ్ | = పూర్వోక్తరీతిగా | యే, భక్తాః | = ఏ అనన్యభక్తులు గలరో | పర్యుపాసతే | = మిక్కిలి ఏకాగ్రచిత్తులై భజింతురో |
| త్వామ్ | = సగుణరూప పరమేశ్వరుడవైన నిన్ను | చ | = మఱియు | తేషామ్ | = ఆ రెండువిధములైన ఉపాసకులలో |
| సతతయుక్తాః | = నిరంతరము భజన ధ్యానాదులతో ఉపాసించునట్టి | యే | = ఎవరయితే | యోగవిత్తమాః | = అత్యుత్తమ యోగవిదులు |
| | | అక్షరమ్ | = నాశరహితుడవైన | | |
| | | అవ్యక్తమ్, అపి | = నిరాకారసచ్చిదానంద ఘనపరబ్రహ్మవగు నిన్ను | కే, | = ఎవరు? |

**అర్జునుడు పలికెను - ఓ కృష్ణా! అనన్యభక్తితో పూర్వోక్తరీతిగా నిరంతరము నిన్నే భజించుచు, ధ్యానించుచు, పరమేశ్వరుడవైన నీ సగుణరూపమును ఆరాధించువారును, కేవలము అక్షరుడవగు సచ్చిదానంద ఘననిరాకార పరబ్రహ్మవైన నిన్ను అత్యంతభక్తిభావముతో సేవించువారును కలరు. ఈ రెండువిధములైన ఉపాసకులలో అత్యుత్తమ యోగవిదులెవరు? (1)**

ప్రశ్న - 'ఏవమ్' అను పదమునకర్థమేమి?

సమా - 'ఏవమ్' అను పదము ద్వారా అర్జునుడు 11వ అధ్యాయమునందలి 55వ శ్లోకమున తెలుపబడిన 'అనన్యభక్తి' రీతిని నిర్దేశించెను.

ప్రశ్న - 'త్వామ్' అను పదము ఇచట ఎవరిని తెల్పును? నిరంతరము భజనధ్యానములయందు నిమగ్నమై అతనిని ఉపాసించుట యనగానేమి?

సమా - 'త్వామ్' అను పదము ఇచట శ్రీకృష్ణభగవానుని తెల్పును. ఐనను వేర్వేఱు అవతారముల యందు భగవానుడు అనేక సగుణ రూపములను స్వీకరించెను. అట్లే తన దివ్యధామమున భగవానుడు సగుణరూపమున విరాజమానుడై యుండును. జనులతనిని తమతమ విశ్వాసములను అనుసరించి, అనేక నామరూపములతో పేర్కొనుచుందురు. ఇచట 'త్వామ్' అను పదము వాటినన్నింటిని తెల్పునని భావింపవలెను. ఏలనన అవియన్నియును శ్రీకృష్ణభగవానుని కంటె వేఱుగావు. అట్టి సగుణపరమాత్మను నిరంతరము చింతనచేయుచు పరమభక్తి శ్రద్ధలతో నిష్కామభావముతో సమస్త - ఇంద్రియములను ఆయన సేవలయందు నియుక్తమొనర్చుటయే సంతతము భజన ధ్యానాదులలో మగ్నమై ఆయనను ఉపాసించుట యగును.

ప్రశ్న - 'అక్షరమ్' అను విశేషణముతో గూడిన 'అవ్యక్తమ్' అను పదము ఇచట ఎరిని సూచించును?

సమా - 'అక్షరమ్' అను విశేషణముతోపాటు 'అవ్యక్తమ్' అను పదము ఇచట నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘనబ్రహ్మను సూచించును. జీవాత్ముడు గూడ అక్షరుడును, అవ్యక్తుడును ఐనప్పటికిని అర్జునుని ప్రశ్న అతని (జీవాత్ముని) ఉపాసనకు సంబంధించినది కాదు. ఏలనన అతనిని (జీవాత్ముని) ఉపాసించువాడు సగుణ పరమేశ్వరుని ఉపాసకునికంటెను ఉత్తముడని చెప్పుటకు వీలులేదు. పూర్వప్రసంగములో ఎచ్చటనూ భగవానుడు అట్టి జీవాత్మ - ఉపాసనారీతిని గూర్చి తెల్పలేదు.

ప్రశ్న - ఈరెండు విధములగు ఉపాసకులలో ఉత్తమ యోగవిదులు ఎవరు? అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - పైన తెల్పబడిన రెండు విధములగు ఉపాసకులును శ్రేష్ఠులే. ఇందు ఎట్టి సందేహమూ లేదు. కాని ఆ యిద్దఱిని తులనాత్మకముగ వివేచన చేసినప్పుడు వారిలో ఉత్తములెవరు? అని అర్జునుడు అడిగెను.

సంబంధము - అర్జునుడు అడిగిన పై ప్రశ్నకు సమాధానముగా భగవానుడు సగుణ సాకార + ఉపాసకులను ఉత్తములుగా పేర్కొనుచున్నాడు-

**శ్రీభగవాన్ ఉవాచ**

**మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।**
**శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమామతాః ॥ 2 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మయి | = నాయందు | ఏ | = ఏ భక్తులు | ఉపాసతే | = ఉపాసింతురో |
| మనః, ఆవేశ్య | = మనస్సును ఏకాగ్రమొనర్చి | పరయా, శ్రద్ధయా | = అత్యంత భక్తిశ్రద్ధలతో | తే | = వారు |
| | | | | మే | = నాకు |
| నిత్యయుక్తాః | = నిరంతరము నా భజనధ్యానాదుల యందు నిమగ్నులై | ఉపేతాః | = కూడినవారై | యుక్తతమాః | = యోగులలో అత్యుత్తములని |
| | | మామ్ | = సగుణరూప పరమేశ్వరుడనైన నన్ను | మతాః | = భావింపబడుదురు. |

**శ్రీ భగవానుడు ఇట్లనెను - పరమేశ్వరుడనైన నాయందే ఏకాగ్రచిత్తులై, నిరంతరము నా భజనధ్యానాదులయందే నిమగ్నులై, అత్యంతశ్రద్ధాభక్తులతో సగుణరూపమున నన్ను ఆరాధించు భక్తులే యోగులలో మిక్కిలి శ్రేష్ఠులు - అని నా అభిప్రాయము. (2)**

ప్రశ్న - భగవంతుని యందే మనస్సును ఏకాగ్రతతో నిలిపి, నిరంతరము ఆయన భజనధ్యానాదులయందే లగ్నమొనర్చి, ఆయనను ఉపాసించుట యనగానేమి?

సమా - గోపికలవలె[1] సమస్త కర్మలను చేయుచునే, సర్వశక్తిమంతుడును, పరమప్రేమాస్పదుడును, సర్వాంతర్యామియు, సకలసద్గుణనిధియును ఐన భగవంతుని యందు తన్మయ మనస్కులై ఆయన గుణప్రభావ స్వరూపములను సదా సర్వథా భక్తితో చింతన చేయుచుండుటయే మనస్సును ఏకాగ్రమొనర్చి, సంతతము ఆయన ధ్యానమునందు నిమగ్నులై ఆయనను ఉపాసించుట యగును.

ప్రశ్న - 'అత్యంతశ్రద్ధ' యొక్క లక్షణమేమి? దానితో యుక్తుడగుట యనగానేమి?

సమా - భగవానుని ఉనికి యందును, ఆయన అవతారముల యందును, ఆయన పలుకులయందును, ఆయన శక్తియందును, ఆయన గుణ ప్రభావ లీలా - ఐశ్వర్యాదులయందును, ప్రత్యక్షముగా కనబడుదానికంటెను ఎక్కువ గౌరవాదరములతో గూడిన విశ్వాసమును కలిగియుండుటనే 'అత్యంత శ్రద్ధ' అందురు.

భక్తుడైన ప్రహ్లాదునివలె భగవంతునిపై భారమునుంచుటయే అట్టి శ్రద్ధతో గూడియుండుట యగును.

ప్రశ్న - 'వారే ఉత్తమయోగవిదులని నా అభిప్రాయము' అని యనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - పై రెండువిధములగు ఉపాసకులలో భగవానుని సగుణపరమేశ్వరునిగా ఉపాసించు వారే ఉత్తమ యోగవిదులని భగవానుడు తెలిపెను.

*సంబంధము - పూర్వశ్లోకమున సగుణసాకార పరమేశ్వరోపాసకులే ఉత్తములైన యోగవిదులని తెల్పబడినది. ఐతే నిర్గుణనిరాకారబ్రహ్మను ఉపాసించువారు ఉత్తమయోగవిదులు కారా? అను సందేహము కలుగును. దానికి సమాధానముగా భగవానుడు పలుకుచున్నాడు-*

**యే త్వక్షరమనిర్దేశ్యమ్ అవ్యక్తం పర్యుపాసతే ।**
**సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ 3 ॥**

---

1) యా దోహనేఽవహననే మథనోపలేప ప్రేంఖేంఖనార్భరుదితోక్షణమార్జనాదౌ ।
గాయంతి చైనమనురక్తధియోఽశ్రుకంఠ్యో ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమచిత్తయానాః ॥ (శ్రీమద్భాగవతం 10/44/15)
ఆవుల పాలు పితుకునప్పుడు, ధాన్యములను దంచునప్పుడును, పెఱుగుచిలుకునపుడును, ముంగిలిని అలుకునపుడును, ఊయలలో పిల్లలను ఊపునప్పుడును, ఏడ్చుచున్న పిల్లలను జోలపాటలతో సముదాయించునపుడును, ఇండ్లలో నీటిని చల్లునపుడును, ఊడ్చుటమొదలగు పనులను చేయుచున్నప్పుడును, భక్తి పరిపూర్ణచిత్తముతో ఆనందాశ్రువులతో గద్గద కంఠముతో గోపికలు శ్రీకృష్ణుని కీర్తించుచుండిరి. ఈ విధముగా శ్రీకృష్ణుని యందే లగ్నమైన చిత్తములు గల వ్రజవాసినులైన గోపకాంతలు ధన్యురాండ్రు.

సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥ 4 ॥

తు = కాని
యే = ఏపురుషులు
ఇంద్రియగ్రామమ్ = ఇంద్రియ సముదాయమును
సంనియమ్య = పూర్తిగా వశపఱచుకొని
అచింత్యమ్ = మనస్సుకు బుద్ధికి గోచరము గానివాడును
సర్వత్రగమ్ = సర్వవ్యాపియైనవాడును
అనిర్దేశ్యమ్ = అనిర్వచనీయమైన స్వరూపముగలవాడును
చ = మఱియు
కూటస్థమ్ = సర్వదా ఒకే స్థితిలో ఉండువాడును
ధ్రువమ్ = నిత్యుడును
అచలమ్ = నిశ్చలుడును
అవ్యక్తమ్ = నిరాకారుడును, ఐన
అక్షరమ్ = శాశ్వతుడైన సచ్చిదానందఘనబ్రహ్మను
పర్యుపాసతే = ఏకీభావముతో ఉపాసింతురో
సర్వభూతహితేరతాః = సకల ప్రాణులకు హితముచేయ గోరువారు
సర్వత్ర సమబుద్ధయః = అన్నింటియందును సమభావముగలవారును, ఐన
తే = వారు (యోగులు)
మామ్, ఏవ = నన్నే
ప్రాప్నువంతి = పొందుదురు.

కాని ఇంద్రియసముదాయమును చక్కగా వశపఱచుకొనినవారును, సకల భూతములకును హితమునే కోరుచుండువారును, సర్వప్రాణులను సమభావముతో చూచువారును యోగులు అనబడుదురు. అట్టివారు మనోబుద్ధులకు అతీతుడును, సర్వవ్యాపియు, అనిర్వచనీయమైన స్వరూపముగలవాడును, కూటస్థుడును, నిత్యుడును, నిశ్చలుడును, నిరాకారుడును, నాశరహితుడును ఐన సచ్చిదానంద ఘనపరబ్రహ్మయందే నిరంతరము ఏకీభావస్థితులై, ధ్యానము చేయుచు, భక్తితో భజించుచు, ఆ పరబ్రహ్మమునే పొందుదురు. (3-4)

ప్రశ్న - 'అచింత్యమ్' అనగానేమి?

సమా - మనస్సునకు, బుద్ధికి గోచరముకాని విషయమును అచింత్యమని యందురు.

ప్రశ్న - 'సర్వత్రగమ్' అనగానేమి?

సమా - భగవానుడు ఆకాశము వలె సర్వవ్యాపియైన వాడు. ఆయన లేనట్టి స్థలమే లేదు. అట్టివానిని 'సర్వత్రగమ్' అనియందురు.

ప్రశ్న - 'అనిర్దేశ్యమ్' అనగానేమి?

సమా - ఏ యుక్తి ద్వారాగాని, ఉపమానముద్వారా గాని అతని స్వరూపమును నిర్దేశింప (వివరింప)లేము. అట్టివానిని 'అనిర్దేశ్యమ్' అని యందురు.

ప్రశ్న - 'కూటస్థమ్' అనగానేమి?

సమా - ఎన్నడును ఏకారణముచేతనైనను పరివర్తనము (మార్పు) చెందనివానిని, ఎల్లప్పుడును ఒకే విధముగా ఉండు వానిని 'కూటస్థమ్' అనియందురు.

ప్రశ్న - 'ధ్రువమ్' అనగానేమి?

సమా - నిత్యుడైన వానిని, సత్యస్వరూపుడైనవానిని 'ధ్రువమ్' అనియందురు. ఆయన ఉనికి (సత్తా) విషయమున ఎట్టి సందేహమునకును తావులేదు. ఆయన లేకుండుటయే సంభవింపదు - అనగా ఆయన శాశ్వతుడు.

ప్రశ్న - 'అచలమ్' అనగానేమి?

సమా - చలించుటగాని, కంపించుటగాని లేనివానిని 'అచలమ్' అని యందురు.

ప్రశ్న - 'అవ్యక్తమ్' అనగానేమి?

సమా - ఇంద్రియములకు గోచరింపని వానిని, ప్రత్యేకమైన రూపమూ, ఆకృతీలేని వానిని 'అవ్యక్తమ్' అనియందురు.

ప్రశ్న - 'అక్షరమ్' అనగానేమి?

సమా - ఎన్నడును, ఏకారణమునలనను నాశనము లేనివానిని (శాశ్వతుని) 'అక్షరమ్' అనియందురు.

ప్రశ్న - ఈ విశేషణములనన్నింటిని ప్రయోగించుటలోని ఆంతర్యమేమి? అట్టి బ్రహ్మమును చక్కగా ఉపాసించుట యనగానేమి?

సమా - పై విశేషణముల ద్వారా నిర్గుణ నిరాకారబ్రహ్మ స్వరూపము ప్రతిపాదింపబడినది. ఈ విధముగ ఆ పరబ్రహ్మ స్వరూపమును ఎఱింగి అభేదభావముతో నిరంతరము ఆయనను ధ్యానించుటయే ఆయనను చక్కగా ఉపాసించుట యగును.

ప్రశ్న - 'సర్వభూతహితే రతాః' అని యనగానేమి?

సమా - 'అవివేకి' యైనవాడు తన హితమునందే సర్వథా ఆసక్తి కలిగియుండును - కాని ఆ నిర్గుణ-ఉపాసకులు సమస్త ప్రాణుల యందును ఆత్మభావమును కలిగి యుండుట వలన సమభావముతో అందఱి హితము నందును రతులైయుందురు. అట్టివారు 'సర్వభూతహితే రతాః' అనియునబడుదురు.

ప్రశ్న - 'సర్వత్ర సమబుద్ధయః' అనియునగాననేమి?

సమా - నిర్గుణ నిరాకార బ్రహ్మమును ఉపాసించువారికి ఎప్పటను ఏ విషయమునను భేదబుద్ధిఉండదు. సమస్తజగత్తు నందును అతని దృష్టిలో ఒక్క బ్రహ్మమునకు తప్ప దేనికిని ఉనికియే యుండదు. అందువలన అన్ని విషయములయందును సమబుద్ధియేయుండును.

ప్రశ్న - 'వారు నన్నే పొందుదురు' అనియునుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యముద్వారా భగవానుడు "బ్రహ్మము తనకంటె వేఱుగాదనియు, తానే బ్రహ్మముననియు" తెలిపెను. పై విధమగు ఉపాసనాఫలము 'నిర్గుణబ్రహ్మప్రాప్తి' యైనను అది తననే పొందుట యగును. ఏలనన బ్రహ్మము తన కంటెను వేఱుగాదు, తాను బ్రహ్మము కంటెను వేఱుగాదు. తానే ఆ బ్రహ్మము. ఈ భావమునే 14వ అధ్యాయమునందలి 27వ శ్లోకమున 'బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్' అనగా ఆ నిరాకార బ్రహ్మము నందు నేనే ప్రతిష్ఠితుడను - అని తెలిపెను.

ప్రశ్న - రెండు విధములైన ఉపాసనలకును 'పరమేశ్వర ప్రాప్తియే ఫలము' అయినప్పుడు సగుణోపాసకులను శ్రేష్ఠులుగా తెల్పుటలోని విశేషమేమి?

సమా - 11వ అధ్యాయము నందు "అనన్యభక్తిద్వారా మనుష్యుడు తనను చూడగలడు, తన తత్త్వమును తెలిసికొనగలడు, తనను పొందగలడు." అని భగవానుడు తెల్పియుండెను. (11/54) పరమాత్మతత్త్వమును తెలిసికొనుట, అతనిని పొందుట అనునవి సగుణ నిర్గుణోపాసకులిద్దరికిని సమాన ఫలమైనను, నిర్గుణోపాసకులకు సగుణరూపములో భగవానుడు దర్శనమిచ్చుటకు బాధ్యుడు కాడు. సగుణోపాసకులకు భగవంతుని దర్శనము గూడ లభించును. కనుక ఆ ఇద్దరిలో సగుణోపాసకులు శ్రేష్ఠులని చెప్పబడిరి.

*సంబంధము - ఈవిధముగా నిర్గుణోపాసననుగూర్చి, దాని ఫలమునుగూర్చి తెల్పిన పిమ్మట దేహాభిమానులకు అవ్యక్తగతిప్రాప్తి (నిర్గుణోపాసన) కష్టసాధ్యమని వివరించెను-*

**క్లేశోఽధికతరస్తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ 5 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తేషామ్ | = ఆ | క్లేశః | = సాధనయందలి శ్రమ | అవ్యక్తా, గతిః | = అవ్యక్తపరబ్రహ్మ ప్రాప్తి |
| అవ్యక్తాసక్త చేతసామ్ | = సచ్చిదానంద ఘన నిరాకారబ్రహ్మము నందు ఆసక్తచిత్తులైన వారికి | అధికతరః | = మిక్కిలి అధికము | దుఃఖమ్, అవాప్యతే | = కష్టసాధ్యమే |
| | | హి | = ఏలనన | | |
| | | దేహవద్భిః | = దేహాభిమానముగల వారిచేత | | |

కాని సచ్చిదానందఘన నిరాకార పరబ్రహ్మమునందు ఆసక్తచిత్తులైనవారు తత్ప్రాప్తికై చేయు సాధన మిక్కిలి శ్రమతో గూడినది. ఏలనన దేహాభిమానులకు అవ్యక్తపరబ్రహ్మ ప్రాప్తి కష్టసాధ్యమే. (5)

ప్రశ్న - 'తేషామ్' అను పదముతోపాటు 'అవ్యక్తాసక్తచేతసామ్' అను పదము ఎవరిని తెలుపును? వారికి శ్రమ అధికము - అనియునుటలోని ఆంతర్యమేమి?

సమా - పూర్వశ్లోకమున వర్ణింపబడిన నిర్గుణోపాసకుల మనస్సులయందు ధ్యానింపబడు నిర్గుణనిరాకార సచ్చిదానంద ఘనబ్రహ్మమునందే ఆసక్తులైన వారిని 'తేషామ్', 'అవ్యక్తాసక్తచేతసామ్' అను పదములు తెల్పును. నిర్గుణబ్రహ్మతత్త్వము మిక్కిలి గహనమైనది. పవిత్రమైన, స్థిరమైన, సూక్ష్మబుద్ధిగలవాడును, దేహాభిమానము లేనివాడును దానిని గ్రహింపగల్గును. సామాన్యులకు అది అంత సులభముగా గ్రాహ్యముగాదు. కావున నిర్గుణోపాసన సాధన ఆరంభకాలమున మిక్కిలి శ్రమతో గూడినది.

ప్రశ్న - దేహాభిమానులకు "అవ్యక్తపరబ్రహ్మ ప్రాప్తికష్టసాధ్యమే" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - 'నిర్గుణ పరబ్రహ్మోపాసన' శ్రమతోగూడినదని ఈ శ్లోక పూర్వార్ధమున తెల్పబడినది. దేహాభిమానముగల్గియున్న వారికి నిర్గుణ బ్రహ్మతత్త్వము సులభముగా బోధపడదు. కావున అట్టి వారికి నిర్గుణోపాసనము శ్రమతోగూడినదని.

ప్రశ్న - ఇచ్చట 'అవ్యక్తోపాసన' మిక్కిలి శ్రమైక సాధ్యమని తెల్పబడినది. 9వ అధ్యాయమునందలి 2వ శ్లోకమున 'కర్తుం' 'సుసుఖం' అను పదములద్వారా జ్ఞానవిజ్ఞానములు సుగమములు (సులభసాధ్యములు) అని పేర్కొనబడినవి. 4,5,6 శ్లోకములలో అవ్యక్తముయొక్క వర్ణన చేయబడినది. కనుక ఈరెండుచోట్ల చేయబడిన వర్ణనలయందు వైరుధ్యమున్నట్లు కనబడుచున్నదిగదా!

సమా - ఇందు ఎట్టి వైరుధ్యమూ లేదు. ఏలనన 9వ అధ్యాయమునందు జ్ఞాన విజ్ఞాన శబ్దములు సగుణపరమాత్మని గుణప్రభావతత్త్వ విశేషములకు సంబంధించినవి. కనుక అచట సగుణ నిరాకార-ఉపాసన చేయుట సులభమని తెల్పబడెను. అచట 4వ శ్లోకమున ప్రయోగింపబడిన 'అవ్యక్త' శబ్దము సగుణనిరాకార వాచకము. కనుక అతడు సమస్త భూతములను ధరించి పోషించువాడనియు, అన్నిటియందును వ్యాప్తుడనియు, వాస్తవముగా అసంగుడైయున్నను సర్వభూతముల 'ఉత్పత్తి' మొదలగువాటికి కారణమనియు తెలుపబడినది.

ప్రశ్న - 6వ అధ్యాయమునందలి 24 నుండి 27వ శ్లోకము వఱకును నిర్గుణోపాసనారీతిని తెల్పుచు 28వ శ్లోకమున ఆ విధముగా సాధన చేయగా చేయగా 'పరమాత్మప్రాప్తి రూప+అత్యంతానందము' సుఖముగా లభించునని తెల్పబడినది - అదియెట్లు పొసగును?

సమా - సమస్తపాపములును, రజస్తమోగుణములును దూరమై బ్రహ్మభూతుడైన వానిని అనగా బ్రహ్మమునందే అభేదస్థితినొందిన వానిని అచ్చట వర్ణించుట జరిగినది. అది దేహాభిమానములను గూర్చిన వర్ణన కాదు. కనుక అట్టి వానికి బ్రహ్మప్రాప్తి సుఖముగా కలుగునని చెప్పుట సముచితమే.

ప్రశ్న - నిర్గుణోపాసకులకే సాధనకాలమందు అధిక శ్రమయుండునా? సగుణోపాసకులకు ఉండదా?

సమా - సగుణోపాసకులకు అధికశ్రమ యుండదు. ఏలనన సగుణోపాసన సులభమైనది. పైగా వారు భగవంతుని పైననే భారము ఉంచెదరు. అందువలన భగవానుడే స్వయముగా అన్ని విధముల వారి యోగక్షేమములను చూచుచుండును. ఇట్టి స్థితియందు శ్రమ యెట్లు గల్గును?

సంబంధము - ఈ విధముగా నిర్గుణనిరాకార బ్రహ్మోపాసన వలన దేహాభిమానులకు పరమాత్మప్రాప్తి కష్టసాధ్యమని తెల్పిన పిదప ఇప్పుడు రెండు శ్లోకములలో సగుణ పరమేశ్వరోపాసన వలన పరమేశ్వరప్రాప్తి శీఘ్రముగా అనాయాసముగ లభించునని భగవానుడు తెల్పుచున్నాడు-

**యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యే, తు | = ఎవరయితే | మామ్, ఏవ | = సగుణరూప పరమేశ్వరుడనైన నన్నే | ధ్యాయంతః | = నిరంతరము చింతన చేయుచు |
| మత్పరాః | = మత్పరాయణులై | అనన్యేన, యోగేన | = అనన్యభక్తి యోగముద్వారా | ఉపాసతే | = ఉపాసింతురో |
| సర్వాణి కర్మాణి | = సమస్తకర్మలను | | | | |
| మయి, సన్న్యస్య | = నాకు సమర్పించి | | | | |

కాని మత్పరాయణులైన ఏ భక్తులు కర్మలన్నింటిని నాయందే అర్పించి, నా సగుణపరమేశ్వరరూపమునే అనన్యభక్తియోగముతో సంతతము చింతన చేయుచు భజించుచుందురో.... (6)

ప్రశ్న - 'తు' అను పదప్రయోగము యొక్క ప్రత్యేకత యేమి?

సమా - ఇచ్చట - నిర్గుణోపాసకులతో పోల్చినప్పుడు సగుణోపాసకుల వైలక్షణ్యమును తెల్పుటకు 'తు' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - భగవత్పరాయణుడగుట యనగాననేమి?

సమా - భగవంతునిపైననే భారముంచి, నానావిధ దుఃఖము లెదురైనను మహాభక్తుడైన ప్రహ్లాదుని వలె నిర్భయముగా నిర్వికారుడుగా నుండుట, ఆ దుఃఖములను అన్నింటిని భగవద్దత్తములైన వరములుగను, సుఖములుగను భావించుట, అట్లే భగవంతుడే పరమప్రేమాస్పదుడు, పరమగతి, పరమ సుహృదుడు, అనన్యశరణ్యుడు అని భావించి, భగవంతునకు ఆత్మార్పణము చేసికొనుట - భగవత్పరాయణుడు అగుటయనగానిదియే.

ప్రశ్న - కర్మలనన్నింటిని భగవదర్పణము చేయుట యనగానేమి?

సమా - కర్మాచరణమునందు తాను పరాధీనుడనని భావించుచు భగవదాజ్ఞా సంకల్పములననుసరించి, తోలు బొమ్మలవలె సమస్త కర్మలనాచరించుట, ఆ కర్మలయందు ఎట్టి మమతాసక్తులు లేకుండుట, వాటి ఫలములతో ఎట్టి సంబంధమూ లేకుండుట, శాస్త్రోక్తమైన ప్రతి కర్మయందును తాను కేవలము నిమిత్తమాత్రుడననియు, భగవంతుడు ఆయన ఇచ్ఛానుసారము తన ద్వారా సమస్త కర్మలను చేయించుచున్నాడనియు భావించుట- సమస్త కర్మలను భగవదర్పణము చేయుట యనగానిదియే.

ప్రశ్న - 'అనన్య భక్తియోగము' అనగానేమి? దానిద్వారా భగవచ్చింతన చేయుచు ఆయనను ఉపాసించుట యనగాననేమి?

సమా - "పరమేశ్వరుడుతప్ప నాకు 'నా' అనువారెవ్వరును లేరు. అతడే నాకు సర్వస్వము" అని భావించుచు, స్వార్థరహితుడై భగవంతుని యందు అత్యంతభక్తిశ్రద్ధలు గల్గియుండుటను 'అనన్య భక్తియోగము' అనియందురు. ఈ భక్తియందు స్వార్థముగాని అభిమానముగాని ఉండవు. ఇట్టి నిర్మలమైన భక్తియందు వ్యభిచారదోషము లేశమాత్రమును ఉండదు. అది సర్వథా పరిపూర్ణము, నిశ్చలము ఐయుండును. భగవదంకితమైన అట్టి పవిత్రభక్తియందలి అంశమాత్రము గూడ తద్భిన్నమైన వస్తువునందు ఉండదు. అందువలన క్షణమాత్రము గూడ భగవంతుని విస్మరించుట సహింపరానిదియగును. ఇట్టి భక్తియోగము ద్వారా భగవచ్చింతన చేయుచు అతని గుణప్రభావలీలలను వినుట, కీర్తించుట, ఆయన నామములను ఉచ్చరించుట, జపించుట మొదలగు వానిని ఆచరించుటయే - అనన్యభక్తి యోగము ద్వారా భగవచ్చింతన చేయుచు ఆయనను ఉపాసించుట యగును.

**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి నచిరాత్ పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ 7 ॥**

పార్థ! = ఓ అర్జునా!
తేషామ్ = అట్టి
మయి, ఆవేశిత చేతసామ్ = నా యందే లగ్నమైన చిత్తము గలవారికి
అహమ్ = నేను
నచిరాత్ = శీఘ్రముగా
మృత్యుసంసార సాగరాత్ = మృత్యురూపసంసార సాగరమునుండి
సముద్ధర్తా = ఉద్ధరించువాడను
భవామి = అగుదును.

ఓ అర్జునా! నాయందే లగ్నమనస్కులైన అట్టి పరమభక్తులను నేను శీఘ్రముగనే మృత్యురూపసంసారసాగరము నుండి ఉద్ధరించెదను. (7)

ప్రశ్న - 'తేషామ్' అను పదములో గూడ 'మయ్యావేశిత చేతసామ్' అను పదము ఎవరిని సూచించును?

సమా - మనస్సును బుద్ధిని ఎల్లకాలములయందును భగవంతుని యందే లగ్నమొనర్చు అనన్య భక్తియుక్తులైన సగుణోపాసకులు పూర్వశ్లోకమున వర్ణింపబడిరి. అట్టి పరమభక్తులనే 'తేషామ్' 'మయ్యావేశితచేతసామ్' అను పదములు సూచించును.

ప్రశ్న - మృత్యురూప సంసార సాగరమనగానేమి? దాని నుండి ఉపర్యుక్త భక్తుని భగవానుడు శీఘ్రముగా ఉద్ధరించుట యనగానేమి?

సమా - ఈ సంసారబంధములన్నియును మృత్యు మయములే. జన్మించిన ప్రతి ప్రాణియు ఒక్కక్షణము గూడ మృత్యువు నుండి తప్పించుకొనజాలదు. సముద్రమునందు అసంఖ్యాకము లైన అలలు ఉవ్వెత్తుగా లేచినట్లు ఈ అపార సంసార సాగరమునందు అనవరతము జన్మమృత్యురూప తరంగములు లేచి పడుచునే యుండును. సముద్రపు అలలను లెక్కింప వచ్చునేమోగాని పరమేశ్వరప్రాప్తి కలుగునంత వఱకును జీవుని జననమరణములను లెక్కించుటకు ఎవ్వరికిని సాధ్యముగాదు. కనుక దీనిని మృత్యురూప సంసారసాగరమందురు.

పై విధముగా మనస్సును, బుద్ధిని భగవంతునియందే లగ్నమొనర్చి, భగవదుపాసన చేయువారిని భగవానుడు తత్క్షణమే జననమరణచక్రము నుండి శాశ్వతముగా విముక్తమొనర్చి భగవత్ప్రాప్తి కల్గించును. లేదా వారు మరణించిన పిదప తన పరంధామమునకు చేర్చును. నావను నడుపువాడు (కర్ణధారి) నౌకయందున్న ప్రయాణికుని క్షేమముగా నదిని దాటించును. అట్లే భక్తియను నావను ఆశ్రయించిన భక్తుని భగవానుడు స్వయముగా కర్ణధారియై అతని సమస్త-ఆపదలను, కష్టములను దూరముచేసి, అతిశీఘ్రముగా అతనిని భీషణ సంసారసాగరమును దాటించి తన పరంధామమునకు చేర్చును. భగవానుడు తన పరమభక్తుని మృత్యురూపసంసారమునుండి తరింపజేయును - అని యనగా ఇదియే.

సంబంధము - నిర్గుణోపాసన కంటెను సగుణోపాసన సుగమమని భగవానుడు పూర్వశ్లోకమున ప్రతిపాదించెను. కావున అదే విధముగా మనస్సును బుద్ధిని లగ్నముచేసి, సగుణోపాసన కావింపుమని ఇప్పుడు అర్జునుని ఆదేశించుచున్నాడు-

**మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మయి | = (కనుక) నాయందే | బుద్ధిమ్ | = బుద్ధిని | మయి, ఏవ | = నాయందే |
| మనః, ఆధత్స్వ | = మనస్సును లగ్నము చేయుము | నివేశయ | = నిమగ్నమొనర్చుము | నివసిష్యసి | = నివసించెదవు |
| మయి, ఏవ | = నాయందే | అతః, ఊర్ధ్వమ్ | = ఆ పిమ్మట | సంశయః, న | = ఇందేమాత్రము సంశయములేదు. |

**నాయందే మనస్సును నిలుపుము. నాయందే బుద్ధిని లగ్నముచేయుము. పిమ్మట నాయందే స్థిరముగా నుందువు. ఇందు ఏ మాత్రమూ సందేహమునకు తావులేదు. (8)**

ప్రశ్న - బుద్ధిని, మనస్సును భగవంతునియందు లగ్నము చేయుట యనగానేమి?

సమా - సమస్త చరాచర భూతములయందు వ్యాప్తుడై భగవానుడు అందఱి హృదయములయందును స్థితుడైయున్నాడు. అతడు కారుణ్యము, సర్వజ్ఞత్వము, సౌశీల్యము, సౌహృదము మొదలగు అనంత సుగుణములకు నిధి. ఆయనను పరమ పురుషుడు, ప్రేమమయుడు, ఆనందమయుడు, సర్వశక్తిమంతుడు, సర్వోత్తముడు, అనన్య శరణ్యుడు అని తెలిసికొని, అట్టి పరమేశ్వరుని గుణప్రభావలీలాతత్త్వములను, రహస్యములను సమగ్రముగా గ్రహించి, అతనియందు సర్వదా సర్వత్ర దృఢ విశ్వాసమును కల్గియుండుటయే బుద్ధిని భగవంతుని యందు లగ్నము చేయుట యగును. అదే విధముగ తనకు పరమప్రేమాస్పదుడును, పురుషోత్తముడును ఐన

భగవంతునియందు తప్ప ఇతర సమస్తవిషయముల యందు ఆసక్తిని సర్వథా త్యజించి, మనస్సును కేవలము ఆయన యందే తన్మయమొనర్చుటయు, నిత్యము, నిరంతరము, పూర్వోక్తరీతిగా అతని చింతన చేయుటయు మనస్సును భగవంతుని యందు లగ్నముచేయుట యగును.

ఈ విధముగా మనస్సును, బుద్ధిని భగవంతుని యందే లగ్నముచేయువానికి శీఘ్రముగా భగవత్ప్రాప్తి కల్గును.

ప్రశ్న - భగవంతుని యందు మనస్సును, బుద్ధిని లగ్నము చేయుటచే మనుష్యునకు నిశ్చయముగా భగవత్ప్రాప్తి కల్గునట్లయితే జనులందఱును తమ మనోబుద్ధులను భగవంతునియందు ఏల లగ్నము చేయరు?

సమా - భగవంతుని గుణ ప్రభావ లీలాతత్త్వములను, రహస్యములను ఎఱుంగని కారణమున మానవులకు భగవంతుని యందు భక్తి శ్రద్ధలు ఏర్పడుట కష్టము. అజ్ఞానజనితమైన ఆసక్తి కారణమున సాంసారిక విషయచింతనయందే వారు నిమగ్నులైయుందురు. లోకమున ఎక్కువమంది స్థితి యిట్లేయుండును. కనుక లోకులు (జనులు) అందఱు భగవంతుని యెడ తమ మనోబుద్ధులను లగ్నము చేయుటలేదు.

ప్రశ్న - అజ్ఞానజనితమైన ఆసక్తివలన జనులకు సాంసారిక భోగములను చింతన చేయు కుతూహలము బలపడినచో దానినుండి వారు బయటపడు ఉపాయమేమి?

సమా - భగవంతుని గుణప్రభావలీలా తత్త్వములను, రహస్యములను తెలిసికొని విశ్వసించుట వలన వారు దాని నుండి బయటపడగలరు.

ప్రశ్న - భగవంతుని గుణ ప్రభావ లీలాతత్త్వ రహస్యముల యొక్క జ్ఞానము ఎట్లు కలుగును?

సమా - భగవంతుని గుణ ప్రభావ లీలా తత్త్వములను, రహస్యములను ఎఱింగిన మహాపురుషుల సాంగత్యము చేయుట, వారి గుణములను, ఆచరణములను అనుకరించుట, అట్లే భోగ-ఆలస్యప్రమాదములను త్యజించి, వారు చూపిన మార్గమును పూర్తి విశ్వాసముతో, తత్పరతతో అనుసరించుటవలన అట్టి జ్ఞానము కలుగగలదు.

*సంబంధము - పైన తెల్పబడిన విధముగా మనస్సును, బుద్ధిని భగవంతుని యందు లగ్నము చేయలేకపోయినచో ఏమిచేయవలెను? అను ప్రశ్న ఉదయింపవచ్చును. దానికి సమాధానముగా భగవంతుడిట్లు పలుకుచున్నాడు-*

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9 ॥**

అథ = ఒకవేళ
చిత్తమ్ = చిత్తమును
మయి = నాయందు
స్థిరమ్ = స్థిరముగా
సమాధాతుమ్ = నిల్పుటకు
న, శక్నోషి = సమర్థుడవు కానిచో
తతః = అట్టి స్థితిలో
ధనంజయ! = ఓ అర్జునా!
అభ్యాస యోగేన = అభ్యాసయోగము ద్వారా
మామ్, ఆప్తుమ్ = నన్ను పొందుటకు
ఇచ్ఛ = కోరుము (యత్నింపుము)

**మనస్సును సుస్థిరముగా నాయందే నిల్పుటకు సమర్థుడవు కానిచో అర్జునా! అభ్యాసయోగము ద్వారా నన్ను పొందుటకు ప్రయత్నింపుము. (9)**

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క భావవైశిష్ట్యమేమి?

సమా - అర్జునుని నిమిత్తమాత్రునిగా జేసికొని భగవానుడు జగత్తునకు హితమును గూర్చుటకై ఉపదేశమును ఇచ్చుచున్నాడు. జగత్తునందు సాధకులందఱి స్వభావములు ఒకే విధముగా ఉండవు. అందువలన అందఱికిని ఒకే సాధన మార్గము అనువుగా ఉండదు. వేర్వేఱు స్వభావములుగల వారికి వివిధ సాధనమార్గములు ఉపయుక్తములగును. కనుక పైన తెల్పినవిధముగా భగవంతుని యందు మనస్సును బుద్ధిని స్థిరముగా నిల్పజాలనివారు అభ్యాసయోగముద్వారా భగవత్ప్రాప్తికై సాధన చేయవలెనని భగవంతుడు ఈ శ్లోకమున తెల్పుచున్నాడు.

ప్రశ్న - అభ్యాసయోగమనగానేమి? దానిద్వారా భగవత్ప్రాప్తికై సాధన చేయుట యనగానేమి?

సమా - భగవత్ప్రాప్తికై ఆయనయందు చిత్తమును నిల్పుటకు అనేక ఉపాయములద్వారా మాటిమాటికిని ప్రయత్నించుటనే 'అభ్యాసయోగ'మందురు. సాధకునకు భక్తిశ్రద్ధలుగల భగవన్నామ రూప గుణ లీలాదులయందు కేవలము భగవత్ప్రాప్తియే పరమలక్ష్యముగా మాటిమాటికిని మనస్సును నిమగ్నముచేయ ప్రయత్నించుటయే అభ్యాస యోగముద్వారా భగవత్ప్రాప్తికై సాధన చేయుటయగును.

భగవంతునియందు మనస్సును లగ్నము చేయుటకు శాస్త్రములయందు పెక్కు సాధన మార్గములు తెల్పబడినవి. క్రింద తెల్పబడుచున్న కొన్ని సాధనమార్గములు సామాన్యులకు విశేషముగా ఉపయుక్తములగునట్లుగా గోచరించును-

1) సూర్యుని యెదుట కన్నులు మూసికొని నిలబడినచో మన మనస్సులయందు సర్వత్ర సమభావముతో ఒకే తేజఃపుంజము గోచరించును. భగవత్స్వరూపము దానికి వేలరెట్లు తేజోమయమని భావించి పరమాత్ముని ఆ జ్యోతిస్స్వరూపమును చిత్తమునందు నిల్పుకొనుటకు పదేపదే ప్రయత్నము చేయుట.
2) అగ్గిపుల్లలో అగ్ని నిక్షిప్తమైయున్నట్లు భగవంతుడే సర్వత్ర వ్యాపించియున్నట్లు భావించి, మనస్సు ఒకదానిపై నిలబడక ఎటుపోయినను ఆ పోయినచోటనే గుణప్రభావ సహితుడును, సర్వశక్తిమంతుడును, పరమప్రేమాస్పదుడైన పరమేశ్వరుని స్వరూపమును భక్తితో మాటిమాటికిని చింతన చేయుట.
3) ఇటునటు సంచరించు మనస్సును ఇష్టదైవము (శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శివుడు మొదలగువారి) వైపునకు మరల్పవలెను. పిమ్మట ఆ ఇష్టదైవమును మానసికముగా గాని, విగ్రహము, చిత్రపటముద్వారాగాని నామ జపము ద్వారాగాని, ధ్యానించుచు భక్తి శ్రద్ధలతో మఱల మఱల మనస్సును ఏకాగ్రమొనర్చుటకు ప్రయత్నించుట.
4) తుమ్మెద ఝుంకారము వలె ఏకతారాపై ఓంకారధ్వని చేయుచు అందు పరమేశ్వర స్వరూపమును పదేపదే చింతన చేయుచుండుట.
5) స్వాభావికముగా ఉచ్ఛ్వాసనిశ్వాసములతో పాటు భగవన్నామ జపమును నిత్యము, నిరంతరము కొనసాగించుటకు ప్రయత్నించుట.
6) పరమాత్ముని నామ రూప గుణచరిత్రలను, ప్రభావ రహస్యములను తెలిసికొనుటకై తత్సంబంధ శాస్త్రములను అధ్యయనము చేయుట.
7) నాల్గవ అధ్యాయమునందలి 29వ శ్లోకమున చెప్పబడిన రీతిగా ప్రాణాయామమును అభ్యసించుట.

ఏదో యొకసాధనను శ్రద్ధాదరముతో కొనసాగించినచో క్రమముగా పాపములు, విఘ్నములు అన్నియును తొలగిపోయి, చివరకు భగవత్ప్రాప్తి కలుగును. కనుక మిక్కిలి ఉత్సాహముతో తత్పరతతో అభ్యాసయోగమును ఆచరింపవలెను. సాధకుల స్థితి, యోగ్యత, సాధనగతిని బట్టి ఫలప్రాప్తి శీఘ్రముగాగాని, ఆలస్యముగాగాని జరుగవచ్చును. కావున శీఘ్రముగ ఫలము లభింపనిచో ఫలప్రాప్తి కష్టమని భావించి నిరాశా నిస్పృహలకును, సోమరి తనమునకును లోనగుటగాని, అభ్యాసమును విడిచిపెట్టుటగాని, అందు ఏ విధమైన లోపమును రానిచ్చుటగాని చేయరాదు - పైగా ఆ అభ్యాసమును వృద్ధిచేయుచుండవలెను.

*సంబంధము - ఈ విధముగు అభ్యాసయోగమునుగూడ ఆచరింపజాలనిచో సాధకుడేమి చేయవలెను? అను ప్రశ్నకు సమాధానముగా భగవానుడిట్లు చెప్పుచున్నాడు-*

**అభ్యాసేప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ 10 ॥**

అభ్యాసే, అపి = అభ్యాసమునందును
అసమర్థః, అసి = అసమర్థుడవైనచో
మత్కర్మపరమః = మత్పరాయణుడవై
భవ కర్మల నాచరింపుము
మదర్థమ్ = నాకొఱకై
కర్మాణి = కర్మలను
కుర్వన్, అపి = చేయుచును
సిద్ధిమ్ = నా ప్రాప్తిరూప సిద్ధిని
అవాప్స్యసి = పొందెదవు

**అభ్యాసముచేయుటకును అశక్తుడవైనచో మత్పరాయణుడవై కర్మలను ఆచరింపుము. ఈ విధముగా నా నిమిత్తమై కర్మలను ఆచరించుటద్వారాకూడ నన్నే పొందెదవు. (10)**

ప్రశ్న - "నీవు అభ్యసించుటకును (అభ్యాసయోగ సాధనకును) అశక్తుడవైనచో" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - వాస్తవముగా అర్జునునకు భగవంతునిపై మనస్సును లగ్నము చేయుట లేక పైనతెల్పబడిన రీతిగా అభ్యాసయోగసాధన చేయుట ద్వారా భగవంతుని పొందుట కష్టమైనపని గాదు - ఐనప్పటికిని అతడు తాను అట్టి సాధనకు అశక్తుడనని భావించినచో చింతింపనవసరము లేదు - ఇంకొక ఉపాయము గూడ గలదు. స్వభావ భేదములచే వేర్వేఱు సాధకులకు విభిన్న సాధనరీతులు ఉపయోగకరము లగును.

ప్రశ్న - 'మత్కర్మ' అను పదము ఏయే కర్మలను సూచించును? తత్పరాయణులు అగుట యనగానేమి?

సమా - కేవలము భగవంతుని కొఱకే ఆచరింపబడు సేవాపూజాదికములను 'మత్కర్మ' అను పదము తెల్పును. అట్లే స్వార్థము, మమత, ఆసక్తి మొదలగు వానితో ఏమాత్రమూ సంబంధము లేని కర్మలను గూడ సూచించును. 11వ అధ్యాయమునందలి చివరిశ్లోకమున గూడ 'మత్కర్మకృత్' అను పదమున 'మత్కర్మ' అను శబ్దము ప్రయుక్తమైనది. అక్కడ గూడ దీని వ్యాఖ్యానము చేయబడినది.

భగవానుడు మాత్రమే తమకు పరమ-ఆశ్రయుడు, పరమగతి అని భావించుట, కేవలము ఆయన అనుగ్రహము కొఱకే అత్యంత భక్తిశ్రద్ధలతో మనోవాక్కాయముల ద్వారా ఆయన సేవా పూజాదికములనొనర్చుట, యజ్ఞదానతపశ్చర్యాది శాస్త్రవిహితకర్మలను తమ కర్తవ్యములుగా భావించి, నిరంతరము వానిని ఆచరించుచుండుట - ఆ కర్మల యందు పరాయణులగుట యనగా ఇదియే.

ప్రశ్న - "నా కొఱకైనను కర్మలనాచరించుము నన్నే పొందుదువు." అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ విధమైన భగవత్కర్మలను ఆచరించుట గూడ భగవత్ప్రాప్తికి ఒక ప్రత్యేకమైన సుగమమైన సాధనమే. భగవద్భజన ధ్యానాదులను చేయువారికి భగవత్ప్రాప్తి కల్గునట్లే భగవంతునికై కర్మలనాచరించు వారికిని తత్ప్రాప్తి కలుగగలదు. కావున భగవంతునికై కర్మలను ఆచరించుట పూర్వోక్తసాధనలకంటెను ఏ మాత్రమూ తక్కువస్థాయికి చెందిన సాధనకాదు.

*సంబంధము - పైన చెప్పబడిన రీతిగా భగవంతునికై కర్మలు చేయుటకును సాధ్యము కానిచో ఏమి చేయవలెను? అను ప్రశ్న ఉదయింపవచ్చును. దీనికి సమాధానముగా భగవానుడు ఇట్లు పల్కుచున్నాడు-*

**అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।**
**సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథ | = ఒకవేళ | కర్తుమ్, అపి | = చేయుటకును | | వశపఱుచుకొన్నవాడవై |
| మద్యోగమ్ | = నా ప్రాప్తిరూపయోగమును | అశక్తః, అసి | = అసమర్థుడవైనచో | సర్వకర్మఫల త్యాగమ్ | = సకలకర్మలఫల త్యాగమును |
| ఆశ్రితః | = ఆశ్రయించినవాడవై | తతః | = అట్టిస్థితియందు | | |
| ఏతత్ | = ఈ ఉపర్యుక్తసాధనను | యతాత్మవాన్ | = మనోబుద్ధ్యాదులను | కురు | = చేయుము. |

**మత్ప్రాప్తికై వలయు యోగమునాశ్రయించి సాధన చేయుటకును నీవు అశక్తుడవైనచో మనోబుద్ధీంద్రియాదులను వశమునందు ఉంచుకొని, సకల కర్మఫలములను త్యజింపుము.(11)**

ప్రశ్న - "మత్ప్రాప్తికై వలయు యోగము నాశ్రయించి, సాధన చేయుటకును నీవు అశక్తుడవైనచో" అనియనుటలో గల ప్రత్యేకత యేమి?

సమా - వాస్తవముగా పైన తెల్పిన రీతిగా భక్తియుక్త కర్మయోగసాధనను చేయుట అర్జునునకు కష్టము గాదు. సాధ్యమే. ఐనప్పటికిని అది కష్టసాధ్యమని అతడు

భావించినచో మఱి యొకమార్గమును తెల్పుచున్నానని భగవానుడు పేర్కొనెను.

ప్రశ్న - "యతాత్మవాన్" అని యెవ్వరినందురు? అర్జునుని 'యతాత్మవాన్' కమ్మని ఆదేశించుటలోని ఆంతర్యమేమి?

సమా - 'ఆత్మ' అను శబ్దము మనోబుద్ధీంద్రియ సహితమైన శరీరమును సూచించును. కావున మనోబుద్ధీంద్రియ సహితమైన శరీరముపై విజయము సాధించిన వానిని 'యతాత్మవాన్' అనియందురు. మనస్సును, ఇంద్రియములను వశము నందుంచుకొనలేనిచో అవి మనుష్యుని బలవంతముగా భోగములలో చిక్కుపడునట్లు చేయును. అట్టి పరిస్థితులలో సమస్తకర్మల ఫలరూపమైన భోగేచ్ఛాసక్తులను త్యజించుటకు సాధ్యముకాదు. కనుక సర్వకర్మఫలత్యాగసాధనయందు ఆత్మసంయమము పరమావశ్యకమని తెల్పుటకే భగవానుడు అర్జునుని 'యతాత్మవాన్' కమ్మని ఆజ్ఞాపించెను.

ప్రశ్న - 6 నుండి 10వ శ్లోకము వఱకును తెలుపబడిన సాధనముల యందు 'యతాత్మవాన్' కమ్మని ఆదేశింపకపోవుట లోని అంతరార్థమేమి?

సమా - 6, 7, 8 శ్లోకములలో అనన్య భక్తియోగసాధకుల వర్ణనగలదు. అట్టి అనన్యభక్తులకు సాంసారిక భోగములయందు ప్రేమ (ఆసక్తి) యుండని కారణమున వారి మనోబుద్ధులు సహజముగనే వాటినుండి విరక్తి కలిగియుండి, భగవానునియందు లగ్నమైయుండును. అందువలన ఆ శ్లోకములయందు 'యతాత్మవాన్' కమ్మని ఆదేశించుట జరుగలేదు.

9వ శ్లోకమునందు అభ్యాసయోగమునుగురించి తెల్పబడినది. భగవంతునియందు మనస్సును, బుద్ధిని లగ్నము చేయుటకు ఉపయుక్తములగు సాధన మార్గములన్నియును అభ్యాసయోగమునందు అంతర్గతములే. కావున అచట 'యతాత్మవాన్' కమ్మని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు. 10వ శ్లోకమున భక్తియుక్తకర్మయోగవర్ణనము గలదు. అందు సాధకుడు భగవంతునాశ్రయించి, సమస్తకర్మలను భగవదర్థముగనే చేయవలసియుండును. కావున అచటను 'యతాత్మవాన్' కమ్మని చెప్పబడలేదు. కాని ఈ శ్లోకమున సర్వకర్మఫలత్యాగ రూపకర్మయోగ సాధనను గూర్చి తెల్పబడినది. ఇందు మనస్సును, బుద్ధిని వశమునందుంచుకొనక ఆ పని సాధ్యము కాదు - ఏలనన వర్ణాశ్రమోచిత సమస్త వ్యావహారిక కర్మలు చేయుచును మనస్సూ, బుద్ధియును, ఇంద్రియములూ వశములో లేనిచో భోగములయందు మమత, ఆసక్తి, కోరికలు కల్గుట సహజము- అప్పుడు సర్వకర్మఫలత్యాగరూపసాధన సాధ్యముగాదు - కనుక 'యతాత్మవాన్' అను పదమును ప్రయోగించి, మనోబుద్ధీంద్రియాదులను వశము నందుంచుకొని సాధనాపరుడవు కమ్మని భగవానుడు అర్జునుని ఆదేశించెను.

ప్రశ్న - 'సర్వకర్మ' అను పదము ఇచట ఏ కర్మలను సూచించును? వాటి ఫలత్యాగము చేయుట యనగానేమి?

సమా - యజ్ఞదానతపశ్చర్యలు, సేవలు, అట్లే వర్ణాశ్రమ ధర్మానుసారము జీవికకు, శరీర నిర్వహణకు ఆచరింపబడు శాస్త్రసమ్మతములైన కర్మలనన్నింటిని 'సర్వకర్మ' అను పదము సూచించును. ఆ కర్మలను అన్నింటిని యోగ్యతలను అనుసరించి చేయుచు వాటి ఫలస్వరూపములైన ఇహపరలోక భోగముల యందు మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించుటనే 'సర్వకర్మఫలత్యాగము' అనియందురు. అసత్యము పల్కుట, కపటము, వ్యభిచారము, హింస, దొంగతనము, మొదలగు నిషిద్ధకర్మలు సర్వకర్మలలో చేరవు. భోగములయందు ఆసక్తి, కోరిక ఉండుటవలననే పాపకర్మలు ఆచరించుట జరుగును. తత్ఫలితముగ మనుష్యుడు అన్ని విధములుగను పతనమగును. కనుక అట్టి కర్మాచరణము సర్వథా త్యజింపవలెను. అట్టి కర్మల ఆచరణమే నిషిద్ధమైనప్పుడు వాటి ఫలత్యాగప్రస్తావనకే తావులేదు.

ప్రశ్న - భగవంతుడు మొదట మనోబుద్ధులను వశపరచుకొనుమని చెప్పెను. పిమ్మట అభ్యాసయోగమును గూర్చి తెల్పెను. అనంతరము తన కొఱకై కర్మలను ఆచరింపుమనెను. చివరకు సర్వకర్మఫలత్యాగమును చేయుమని ఆజ్ఞాపించెను. క్రమముగా ఒకదానియందు అసమర్థుడైనచో మరియొకటి ఆచరింపుమనిచెప్పెను. భగవంతుడు ఈ విధముగా తెల్పుటకు కారణము ఫలభేద దృష్టియా? లేక ఒకదానికంటెను మఱొకటి సులభమనియా? లేక సాధకుని యోగ్యతయా?

సమా - ఫలభేదదృష్టితో కాదు. ఏలనన అన్నింటికిని ఫలము భగవత్ప్రాప్తియే. ఒక దానికంటె మరియొకటి సులభమనియును కాదు - ఏలనన పై సాధనమార్గములలో ఒకదానితో మఱియొక దానిని పోల్చినప్పుడు సాధనయందు ఒకటి మరొకదానికంటె సులభమని తెల్పుటకిట్లు చెప్పబడలేదు. ఒకరికి సులభముగా నుండు సాధన మఱియొకరికి కష్టముగావచ్చును. కావున ఈ నాలుగు సాధనల వర్ణనము సాధకుల యోగ్యతలను బట్టి చేయబడినది.

ప్రశ్న - ఈ నాల్గు సాధనలయందును ఏ సాధనరీతి ఎట్టి వారికి ఉపయోగకరము?

సమా - సగుణపరమేశ్వరునియందే సహజముగా భక్తిగలవానికి భగవంతుని గుణ ప్రభావ రహస్యముల విషయములు, ఆయన లీలలు వర్ణనలు, సహజముగనే ప్రియములగును. అట్టి వానికి 8వ శ్లోకమున తెల్పబడిన సాధన సుగమము, ఉపయోగకరము.

భగవానునియందు నిజముగా భక్తి లేకున్నను శ్రద్ధ యుండుటవలన పట్టుదలతో సాధన చేయుచు భగవంతుని యందు మనస్సును లగ్నము చేయగోరు వానికి 9వ శ్లోకమున తెలుపబడిన సాధన సులభము. సుగమము, ఉపయోగకరము.

సగుణ పరమేశ్వరుని యందు శ్రద్ధగలిగి యజ్ఞదాన తపశ్చర్యాదికర్మలయందు స్వాభావికముగా ఆసక్తియు, భగవంతుని ప్రతిమను పూజించుట యందును, సేవించుట యందును శ్రద్ధగలవానికి 10వ శ్లోకమున తెల్పిన సాధన సుగమము ఉపయోగకరము.

సగుణ సాకార పరమాత్మయందు సహజముగా భక్తిశ్రద్ధలు లేనివాడు, ఈశ్వరుని కేవలము సర్వవ్యాపిగా, నిరాకారునిగా భావించును. అట్టి సాధకునకు వ్యావహారికలోకహిత కర్మలయందే సహజముగా ఆసక్తి యుండును. కర్మలయందు శ్రద్ధాసక్తులు అధికముగా ఉండుటవలన అతని మనస్సు 9వ శ్లోకమున తెల్పబడిన అభ్యాసయోగమునందు గూడ నిమగ్నముగాదు. అట్టివానికి ఈ శ్లోకమునందు తెల్పబడిన సాధన సుగమము, ప్రయోజనకరము.

ప్రశ్న - 6వ శ్లోకమునందు సమస్తకర్మలను భగవదర్పణ చేయుటకును, 10వ శ్లోకమునందు భగవంతునికై కర్మలను ఆచరించుటకును, ఈ శ్లోకమున సమస్త కర్మల ఫలములను త్యజించుటకును ఆదేశించుట జరిగినది - ఈ మూడు విధములగు సాధనల మధ్య గల భేదమేమి? ఈ మూడింటి ఫలము ఒక్కటియేనా? లేక వేర్వేరా?

సమా - కర్మలనన్నింటిని భగవదర్పణము చేయుట, భగవంతుని కొఱకై సమస్త కర్మలనాచరించుట, సర్వకర్మఫలత్యాగము చేయుట అను ఈ మూడును కర్మయోగములే. మూడింటి ఫలమూ పరమేశ్వర ప్రాప్తియే. కావున ఫలమునందెట్టి భేదమూ లేదు. కేవలము సాధకుల భావములయందును, వారి సాధనారీతులయందును భేదముండును. కర్మలను భగవదర్పణము చేయుట, భగవంతుని కొఱకై సమస్తకర్మలను చేయుట అను ఈ రెండింటియందును భక్తికి ప్రాధాన్యముగలదు. సర్వకర్మఫల త్యాగమునందు కేవలము ఫలత్యాగమే ముఖ్యము - ఇదియే వీటిమధ్యగల ముఖ్యభేదము.

సమస్త కర్మలను భగవదర్పణము చేయువాడు "నేను భగవంతుని చేతిలో ఆటబొమ్మను, నాయందెట్టి సామర్థ్యమూ లేదు. నామనస్సూ బుద్ధీ, ఇంద్రియాదులన్నియును అతనివే, భగవంతుడే వాటిద్వారా తన సంకల్పానుసారము సమస్త కర్మలనూ చేయించును, ఆ కర్మలతో గాని, వాటి ఫలితములతో గాని నాకెట్టి సంబంధమూ లేదు." - అని భావించును. అట్టి సాధకునకు కర్మలయందును, వాటి ఫలములయందును ఏమాత్రమూ రాగద్వేషములుండవు. ప్రారబ్ధానుసారము లభించిన సుఖదుఃఖానుభవము లన్నియును అతడు భగవత్ప్రసాదముగా భావించి, ఎల్లప్పుడును ప్రసన్నమనస్కుడై యుండును. కనుక అతని కందఱి యందును సమభావమేర్పడి శీఘ్రముగా భగవత్ప్రాప్తి కల్గును.

భగవదర్థమై కర్మలనాచరించువాడు పూర్వోక్తసాధకునివలె "నేనేమియు చేయను, భగవంతుడే నాద్వారా అన్నియు చేయించును." అని భావింపడు. "భగవానుడు నాకు పరమ పూజ్యుడు, ప్రేమాస్పదుడు, సుహృదుడు, అతనిని సేవించుట, అతని ఆజ్ఞలను పాలించుట నాకు పరమ కర్తవ్యము" అని భావించును. కనుక భగవంతుడు సమస్త జగత్తునందు వ్యాప్తుడని యెఱింగి, అతని సేవల కొఱకై శాస్త్రోక్తములైన యజ్ఞదానతపశ్చర్యలను, వర్ణాశ్రమ ధర్మములను, తన

జీవికకును, శరీర నిర్వహణమునకును అనుకూలములైన సమస్త కర్మలను, అట్లే భగవంతుని పూజాసేవాది కర్మలను, ఆచరించుట యందు నిమగ్నుడైయుండును. అతని క్రియలన్నియు భగవదాజ్ఞానుసారము భగవత్సేవకొఱకే జరుగుచుండును. (11/55) కనుక సమస్తక్రియలయందును, వాటి ఫలముల యందును, అతనికి ఆసక్తియు, కోరికలూ ఉండవు. అందువలన అతనికి శీఘ్రముగ భగవత్ప్రాప్తియు కలుగును.

కేవలము సర్వకర్మఫలత్యాగము చేయువాడు భగవానుడే తనద్వారా కర్మలను చేయించుచున్నాడనిగాని తాను భగవంతుని కొఱకే సమస్త కర్మలను చేయుచున్నానని గాని భావింపడు. కర్మలనాచరించుటకే మనుష్యునకు అధికారము (అర్హత) కలదనియు, దాని ఫలమునందు (ఫలానుభవమునందు) లేదనియు అతడు భావించును. (2/47 నుండి 51 వఱకు) కావున అతడెట్టి ఫలమునూ ఆశింపక, యజ్ఞదాన తపశ్చర్యలు, సేవలు, జీవికకును, శరీర నిర్వహణకును, తగిన వర్ణాశ్రమ ధర్మములననుసరించి, అన్న పానాది సమస్త శాస్త్రవిహిత కర్మలను ఆచరించుటయే తన కర్తవ్యమని భావించును. అట్టి కర్మల ఫలరూపములైన ఇహపరలోక భోగములయందు మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించును. (18/9) కనుక అతనియందు రాగద్వేషములు సర్వథా అంతరించును. అతనికి శీఘ్రముగా భగవత్ప్రాప్తి కలుగును.

ఈ విధముగా ఈ మూడు సాధనల ఫలము భగవత్ప్రాప్తియే యైనను సాధకుల భావముల యందును వారి సాధనారీతులయందును భేదములుండుట వలన ఈ త్రివిధ సాధనలును వేర్వేఱుగా తెల్పబడినవి.

*సంబంధము - 6 నుండి 8వ శ్లోకము వఱకును ఫల సహితమైన అనన్యధ్యాన వర్ణనము చేయబడినది. 9 నుండి 11వ శ్లోకము వఱకును ఒకవిధమైన సాధనకు శక్తి చాలకున్నచో మఱొకసాధనను తెలుపుచు చివరకు సర్వకర్మఫలత్యాగరూప సాధనను వర్ణించుట జరిగెను. అందువలన కర్మఫలత్యాగ రూపసాధన ఇతర సాధనల కంటె నిమ్నశ్రేణికి చెందినది కావచ్చునను సందేహము కలుగవచ్చును. ఈ సందేహ నివృత్తికై రాబోవుశ్లోకమున కర్మఫలత్యాగమహత్త్వమును పేర్కొనుచున్నాడు-*

**శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్ ॥ 12 ॥**

అభ్యాసాత్ = తత్త్వము నెఱుంగకచేయు అభ్యాసముకంటెను
జ్ఞానమ్ = జ్ఞానము (శాస్త్రజ్ఞానము)
శ్రేయః = శ్రేష్ఠమైనది
జ్ఞానాత్ = అనుభవరహితశాస్త్ర జ్ఞానముకంటెను
ధ్యానమ్ = పరమేశ్వర స్వరూప ధ్యానము
విశిష్యతే = శ్రేష్ఠమైనది
ధ్యానాత్ = ధ్యానముకంటెను
కర్మఫలత్యాగః = సకలకర్మల ఫల త్యాగము (శ్రేష్ఠము)
హి = ఏలనన
త్యాగాత్ = త్యాగమువలన
అనంతరమ్ = వెంటనే
శాంతిః = పరమశాంతి
(లభ్యతే) = లభించును.

తత్త్వము నెఱుంగకయే చేయు అభ్యాసముకంటెను జ్ఞానము శ్రేష్ఠము. కేవలము పరోక్షజ్ఞానముకంటెను అనగా అనుభవరహితమైన జ్ఞానముకంటెను (శాస్త్ర పాండిత్యముకంటెను) పరమేశ్వరస్వరూపధ్యానము శ్రేష్ఠము. ధ్యానము కంటెను కర్మఫలత్యాగము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఏలనన త్యాగమువలన వెంటనే పరమశాంతి లభించును. **(12)**

ప్రశ్న - ఇచ్చట 'అభ్యాసము' అనగానేమి? 'జ్ఞానము' అనగానేమి? అభ్యాసము కంటెను జ్ఞానము శ్రేష్ఠమైనదని తెల్పుటలోని అంతర్యమేమి?

సమా - ఇచ్చట 'అభ్యాసము' అను శబ్దము 9వ

శ్లోకమున తెల్పబడిన అభ్యాసయోగమునందలి 'అభ్యాసమును' మాత్రమే తెల్పును. అనగా సకామభావముతో ప్రాణాయామము, మనోనిగ్రహము, స్తోత్రపాఠము, వేదాధ్యయనము, భగవన్నామ జపము మొదలగు వానిని పదేపదే చేయుటనే 'అభ్యాసము' అనియందురు. ఇందు వివేకజ్ఞానముగాని, ధ్యానముగాని, కర్మఫలత్యాగముగాని ఉండవు. 9వ శ్లోకమున పేర్కొనబడిన యోగము - అనగా నిష్కామభావము, వివేక జ్ఞానఫలరూపమైన భగవత్ప్రాప్తికై ఇచ్చు ఈ అభ్యాసమున ఉండవు. ఏలనన ఈ రెండు అంతర్గతములైయున్న అభ్యాసముతో జ్ఞానమును పోల్చుటగాని, దాని కంటెను అభ్యాసరహిత జ్ఞానము శ్రేష్ఠమని తెల్పుటగాని పొసగదు.

అట్లే 'జ్ఞానము' అను శబ్దము కూడ సత్సాంగత్యము, శాస్త్రాధ్యయనము వలన కలిగిన వివేక జ్ఞానమును సూచించును. దీని ద్వారా మనుష్యుడు ఆత్మపరమాత్మల స్వరూపమును భగవంతుని గుణప్రభావలీలాదులను తెలిసికొనును. అట్లే ఈ జగత్తు మరియు భోగముల అనిత్యత్వము మొదలగు ఇతర ఆధ్యాత్మిక విషయములను గూడ అతడు తెలిసికొనును. కాని ఇట్టి జ్ఞానము వలన అభ్యాసము, ధ్యానము, కర్మఫలేచ్ఛాత్యాగము జరుగవు. ఏలనన ఇవియన్నియును ఈ జ్ఞానములో అంతర్గతములైయున్నచో అట్టి జ్ఞానముతో అభ్యాసము, ధ్యానము, కర్మఫలత్యాగముల తారతమ్యవివేచన చేయుట గాని, దానికంటెను ధ్యానము, కర్మఫలత్యాగము శ్రేష్ఠమని తెల్పుటగాని జరుగదు.

పైన తెల్పబడిన అభ్యాసము, జ్ఞానము అను రెండును వాటి వాటి సాధన రీతులలో భగవత్ప్రాప్తికై సహాయకములే- భక్తిశ్రద్ధలు, నిష్కామభావము కలిగిన మనుష్యుడు ఈ రెండింటి ద్వారాను పరమాత్మప్రాప్తిని పొంద గల్గును - ఐనను ఈ రెండింటిని పరస్పర తారతమ్యములతో పరిశీలించినచో అభ్యాసము కంటెను జ్ఞానము శ్రేష్ఠమైనదని తెలియును. భగవత్ప్రాప్తియందు అభ్యాసరహిత వివేక జ్ఞానము తోడ్పడినంతగా గూడ వివేక రహిత అభ్యాసము తోడ్పడదు. ఏలనన అట్టి జ్ఞానము భగవత్ప్రాప్తికై కోరికనైనను కల్గించును. ఈ విషయమును స్పష్టపఱచుటకే అభ్యాసము కంటెను జ్ఞానము శ్రేష్ఠమైనదని తెల్పబడెను.

ప్రశ్న - ఇచట ధ్యానము అను శబ్దము దేనిని సూచించును అది జ్ఞానముకంటెను శ్రేష్ఠమైనదని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - ధ్యానమను పదము 6నుండి 8వ శ్లోకము వరకు పేర్కొనబడిన ధ్యానయోగమునందలి ధ్యానమును మాత్రమే సూచించును. అనగా సకామభావముతో కేవలము మనస్సును బుద్ధిని ఉపాస్యదేవతయొక్క సాకార లేక నిరాకార స్వరూపము నందు స్థిరముగా నుంచుటనే 'ధ్యానము' అనియందురు. ఇందు పూర్వోక్తమైన వివేకజ్ఞానముగాని, భోగేచ్ఛా త్యాగరూపమైన నిష్కామభావముగాని ఉండవు. ధ్యానయోగమునందు సమస్త కర్మలను భగవదర్పణము చేయుట, భగవంతుడే పరమప్రాప్యుడని భావించుట, అనన్యభక్తితో భగవంతుని ధ్యానించుట - అనునవి అంతర్గతములైయుండును. కాని అవి ఇచ్చట ఉండవు. ఏలనన భగవంతుని సర్వశ్రేష్ఠునిగా భావించి, అనన్యభక్తిభరితనిష్కామభావముతో ఆచరింపబడు ధ్యానయోగమునందు వివేకజ్ఞానము, కర్మఫలత్యాగము అంతర్గతములై యుండును. కనుక దానితో వివేకజ్ఞానమును పోల్చుటగాని, దానికంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠమని భావించుటగాని పొసగదు.

మొదటి ప్రశ్నకు సమాధానముగా తెల్పబడిన వివేకజ్ఞానము, ఉపర్యుక్త ధ్యానము రెండును శ్రద్ధాభక్తులతో నిష్కామభావముతో కూడినప్పుడు పరమాత్మప్రాప్తిని కల్గించును. కావున రెండును భగవత్ప్రాప్తిని కల్గించును. కావున రెండును భగవత్ప్రాప్తికి ప్రముఖసాధనములే - కాని ఆ రెండింటిని పరస్పరము తులనాత్మకముగా చూచినప్పుడు వివేకరహితధ్యానమే ధ్యానాభ్యాసరహిత జ్ఞానముకంటెను శ్రేష్ఠముగా కన్పట్టును. ఏలనన భగవత్ప్రాప్తిని కల్గించుటలో వివేకరహితమైన ధ్యానముతోడ్పడినంతగా గూడ ధ్యానాభ్యాసములులేని కేవల వివేకజ్ఞానముతోడ్పడదు. ధ్యానముద్వారా చిత్తమాలిన్యము, చాంచల్యము తొలగిపోవును. కాని, కేవలము (శాస్త్ర) జ్ఞానము ద్వారా అది సాధ్యముగాదు. కావున శాస్త్రజ్ఞానముకంటెను ధ్యానము శ్రేష్ఠమని తెల్పబడినది.

ప్రశ్న - 'కర్మఫలత్యాగము' అనగానేమి? అది ధ్యానముకంటెను శ్రేష్ఠమైనదిని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - కర్మఫలత్యాగము 11వ శ్లోకమున తెల్పబడిన కర్మఫలత్యాగమును సూచించును. 2వ ప్రశ్నకు సమాధానముగా తెల్పబడిన ధ్యానము గూడ పరమాత్మప్రాప్తికి దోహదకారియైనను ఇచ్ఛా-ఆసక్తులు నశింపనంతవరకు మనుష్యునకు పరమాత్మప్రాప్తి సహజముగా లభింపదు. కనుక పరమాత్మ ప్రాప్తియందు ధ్యానరహితమైన సమస్తకర్మఫలాసక్తుల త్యాగము తోడ్పడినంతగా ఫలాసక్తిరహిత ధ్యానము తోడ్పడదు. కనుక ధ్యానముకంటెను కర్మఫలత్యాగము శ్రేష్ఠమని పేర్కొనబడినది.

ప్రశ్న - "త్యాగము వలన తత్క్షణమే శాంతి లభించును." అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - కర్మఫలరూపములైన ఇహపరలోకభోగము లన్నింటి యందును గల మమతాసక్తులను, కోరికలను, త్యజించుటవలన వెంటనే మనుష్యునకు పరమేశ్వరప్రాప్తి కల్గును. ఇచట విలంబము (ఆలస్యము) ఏమాత్రము జరుగదు - ఏలనన విషయాసక్తియే మనుష్యునకు బంధహేతువగును. అది (ఆసక్తి) తొలగిపోయినంతనే భగవత్సాక్షాత్కారము కల్గును.

ఈ శ్లోకమునందు అభ్యాసయోగము, జ్ఞానయోగము, ధ్యానయోగము, కర్మయోగముల తులనాత్మక వివేచనము లేదు. ఏలనన అన్ని సాధనలయందును కర్మఫలరూప భోగముల యందలి ఆసక్తి త్యాగమనెడి నిష్కామభావము అంతర్గతమైయున్నది. కావున వాటి తులనాత్మక వివేచనము సాధ్యపడదు. కర్మఫలత్యాగము యొక్క మహత్త్వమును తెల్పుటకే అభ్యాస, జ్ఞాన, ధ్యానరూపసాధనలను గూర్చి తెల్పబడినది. ఇవి యన్నియును ప్రాపంచిక బంధములను దూరమొనర్చుకొనుటకు తోడ్పడునవియే. సాధనదృష్టితో ఒకటికంటె మఱియొకటి సాత్త్వికము, నివృత్తిపరము అగుటవలన శ్రేష్ఠమని తెల్పబడినది. వీటన్నింటికంటెను కర్మఫలత్యాగము భావప్రధానమగుటవలన అత్యంత శ్రేష్ఠమని పేర్కొనబడినది. ఆధ్యాత్మిక-ఉన్నతియందు కార్యాచరణముకంటెను భావమే కీలకమైనది. అతి ప్రధానమైనది. వర్ణాశ్రమధర్మములననుసరించి చేయబడు యజ్ఞదాన యుద్ధవాణిజ్యసేవాదులును అట్లే శరీర నిర్వహణ క్రియలును, ప్రాణాయామము, స్తోత్రపాఠము, వేదాధ్యయనము, నామజపాది- అభ్యాసక్రియలును, సత్సాంగత్యము, శాస్త్రములద్వారా ఆధ్యాత్మిక విషయములను తెలిసికొనునట్టి జ్ఞానవిషయక్రియలును, మనస్సును స్థిరముగా నిల్పుకొనుటకు ఆచరింపబడుధ్యాన విషయక్రియలును - ఇవియన్నియును ఉత్తరోత్తర శ్రేష్ఠములైనవే. ఐనప్పటికిని వాటికి కర్మఫలత్యాగరూపమైన వైరాగ్యము తోడయినప్పుడే అవి అత్యంత శ్రేష్ఠములైన వగును - ఏలనన జగత్తునందు వైరాగ్యము వలనను, భగవంతునియెడ అనన్యమైన భక్తివలనను భగవత్ప్రాప్తి కలుగును. అన్యథా కలుగదు. కనుక కర్మఫలత్యాగమే శ్రేష్ఠమైనది. దానితో గూడిన శాస్త్రసమ్మతమైనట్టి, చూచుటకు అతి సాధారణమైనట్టి క్రియయైనను సర్వశ్రేష్ఠమేయగును.

*సంబంధము - భగవత్ప్రాప్తికొరకై భక్త్యంగములైన వేర్వేఱు సాధనలను తెలిపి, వాటి ఫలము పరమాత్మప్రాప్తియే యని పై శ్లోకమునందు తెల్పబడినది. కనుక భగవత్ప్రాప్తి కలిగిన భక్తుని లక్షణములను తెలిసికొనవలెనను కోరిక కలుగుట సహజము. కనుక ఇపుడు వరుసగా ఏడు శ్లోకములలో భగవత్ప్రాప్తి కల్గిన జ్ఞానులైన భక్తుల లక్షణములను భగవానుడు తెల్పుచున్నాడు-*

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥ 13 ॥**

**సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః ॥ 14 ॥**

యః = ఏపురుషుడు
సర్వభూతానామ్ = సకలప్రాణుల యందును
అద్వేష్టా = ద్వేషభావమును కలిగియుండడో
మైత్రః, చ = స్వార్థరహితమైన ప్రేమను కలిగియుండునో
కరుణః = హేతురహిత దయాళువో
ఏవ = అట్లే
నిర్మమః = మమతారహితుడో
నిరహంకారః = అహంకారము లేనివాడో
సమదుఃఖసుఖః = సుఖదుఃఖముల ప్రాప్తి యందు సమభావము కలిగి యున్నవాడో
క్షమీ = క్షమాగుణముగలవాడో
యోగీ = యోగియై
సతతమ్, సంతుష్టః = సర్వదా సంతుష్టుడై యుండువాడో
యతాత్మా = శరీరేంద్రియ మనస్సులను వశ పఱచుకొన్నవాడో
దృఢనిశ్చయః = నాయందే నిశ్చయ బుద్ధిగలవాడో
మయి = నాయందే
అర్పితమనో బుద్ధిః = మనోబుద్ధులను అర్పించిన వాడో
సః = అట్టి
మద్భక్తః = నా భక్తుడు
మే, ప్రియః = నాకు ఇష్టుడు.

**ఏ ప్రాణియందును ద్వేషభావము లేనివాడును, పైగా సర్వప్రాణులయందును అవ్యాజమైనప్రేమ, కరుణ కలవాడును, మమతాహంకారములు లేనివాడును, సుఖము ప్రాప్తించినను, దుఃఖము ప్రాప్తించినను, సమభావము కలిగియుండువాడును, క్షమాగుణము కలవాడును (అపరాధికిని అభయమును ఇచ్చువాడును), సర్వకాల సర్వావస్థలయందును సంతుష్టుడైయుండు యోగియు, శరీరేంద్రియ మనస్సులను వశమునందుంచుకొనినవాడును, నాయందు దృఢమైన నిశ్చయము గలవాడును, అయి నాయందే మనోబుద్ధులను అర్పణ చేసిన నా భక్తుడు నాకు ప్రియుడు.(13-14)**

ప్రశ్న - 'సర్వభూతానాం' అను పదము దేనిని సూచించును?

సమా - ముఖ్యముగా ఈ పదము 'అద్వేష్టా' అను పదమునకు సంబంధించినది. అనువృత్తి రీతిననుసరించి, 'మైత్రః', 'కరుణః' అను పదములకును సంబంధించినది. సమస్త భూతములయెడ ద్వేషరాహిత్యమేగాక వాటియెడ సహజముగనే అవ్యాజకరుణ, మైత్రి ఉండుట అవసరము.

ప్రశ్న - సిద్ధపురుషునకు అందఱి యెడలను సమభావమే యుండును గదా! అతనికి మైత్రి, కరుణ విశేషముగా ఎట్లుండగలవు?

సమా - భక్తిసాధకునియందు ప్రారంభమునుండియే మైత్రి, దయ విశేషముగా నుండును. కనుక సిద్ధావస్థయందును అతని స్వభావవ్యవహారములయందు అవి సహజముగనే అతనిలో గోచరించును. అంతేగాక భగవంతునియందు నిర్హేతుకముగనే అపారమైన దయ, ప్రేమ మొదలగు సద్గుణములుండును. అట్టి సద్గుణములు సిద్ధుడైన భక్తుని యందును ఉండుట సహజమే.

ప్రశ్న - 'నిర్మమః' 'నిరహంకారః' అను రెండు లక్షణముల ప్రత్యేకత ఏమి?

సమా - భగవతత్త్వమును బాగుగా నెఱింగిన భక్తునకు సర్వత్ర సమభావమే యుండును. కనుక అతనికి ఎవరియందును మమకారము ఉండదు. తన శరీరమునందును 'అహంకారము' ఉండదు. ఐనను అతడు ఎట్టి ప్రయోజనమును ఆశింపక సమస్తభూతములయెడ ప్రేమ దయ కలిగియుండును. ఇదియే అతనియొక్క వైశిష్ట్యము. సాధకుడైన భక్తుడుగూడ దయయు, ప్రేమయు కలిగియుండునుగాని, అతనినుండి మమతాహంకారములు పూర్తిగా తొలగిపోవు.

ప్రశ్న - 'సమదుఃఖసుఖః' అను సమాసము నందలి సుఖదుఃఖములు హర్షశోకములనే సూచించునా? లేక ఇతరములైన ద్వంద్వముల యందును సమభావమును సూచించునా?

సమా - ఇచ్చటి సుఖదుఃఖములు హర్షశోకములను సూచింపవు. కాని వాటి హేతువులను సూచించును. ఆ హేతువులనుండి ఉత్పన్నములగు వికారములను హర్షశోకములని యందురు. అజ్ఞానియైనవానికి సుఖము నందు ఆసక్తియుండును. ఆ కారణమున సుఖప్రాప్తియందు అతనికి హర్షము కల్గును. దుఃఖమునెడ అతనికి ద్వేషము ఉండును. కాని జ్ఞానియైన వానికి సుఖదుఃఖముల యందు సమభావము ఉండుటవలన ఎట్టి పరిస్థితియందును అతని

అంతఃకరణమున హర్షశోకాది వికారములు కలుగవు. 'హర్షశోకౌ జహాతి' (కఠోపనిషత్ - 1/2/12) అనునది ఉపనిషద్వాక్యము. అనగా జ్ఞానియైన వాడు హర్షశోకములను సర్వథా త్యజించును. ప్రారబ్ధానుభవములననుసరించి, శరీరము రోగగ్రస్తమైనప్పుడు దుఃఖమనిపించును. శరీరము ఆరోగ్యముగా నున్నప్పుడు బాధలేనందున సుఖమనిపించును. కాని రాగద్వేషములు లేని కారణమున అతనికి హర్షశోకములుండవు. అదేవిధముగ ఏదైనను అనుకూల ప్రతికూలపదార్థముల - లేక - సంఘటనల సంయోగ వియోగముల యందును అతనికి హర్షశోకములు కలుగవు. సుఖదుఃఖములయందు సమముగా నుండుట యనగా ఇదియే.

ప్రశ్న - 'క్షమీ' అని యెవరినందురు? జ్ఞానియైన భక్తుని 'క్షమీ' అనియనుటలోని విశేషమేమి?

సమా - తనకు అపకారము చేసిన వానికి గూడ ఏ విధమైనశిక్షను విధింప నిచ్ఛగింపక అతనికి అభయమును ఇచ్చువానిని 'క్షమీ' అని యందురు. జ్ఞానియైన భగవద్భక్తునియందు క్షమాగుణము గూడ అపరిమితముగ ఉండును. అతడు అందరిని భగవత్స్వరూపులుగా భావించుటవలన ఏ సంఘటనమునందును అతడెవ్వరిని అపరాధిగా తలంపడు. కనుక తనకు అపరాధము చేసిన వానిని గూడ ఏ విధముగను తిరిగి దండింప దలంపడు. 'క్షమీ' అనగా ఇట్టివాడే - 'క్షమ' అను పదమునకు 10వ అధ్యాయము నందలి 4వ శ్లోకమున విపుల వ్యాఖ్యచేయబడినది.

ప్రశ్న - ఇచట 'యోగీ' అను పదము ఎవరిని సూచించును? అతడు నిరంతరము సంతుష్టుడైయుండుట యనగానేమి?

సమా - భక్తి యోగము ద్వారా భగవత్ప్రాప్తినందిన 'జ్ఞాని' యగు భక్తుని సూచించునదియే 'యోగీ' అను పదము. ఇట్టి భక్తుడు అక్షయ-అనంతానంద నిధియైన భగవానుని ప్రత్యక్షము చేసికొనును. ఆ కారణమున అతడు ఎల్లప్పుడును సంతుష్టుడైయుండును. ఏ సమయమునందైనను, ఎట్టి పరిస్థితియందైనను, ఎట్టి ప్రాపంచిక వస్తువు లేకున్నను అతడు అసంతృప్తికి లోనుగాడు. అతడు పూర్ణకాముడగును. కనుక జగత్తునందలి ఏ సంఘటనవలన గూడ అతనికి సంతోషరాహిత్యము ఏర్పడదు. నిరంతరము సంతుష్టుడగుట యనగా ఇదియే.

సాంసారికులైన మనుజులకు కలుగు సంతోషము క్షణికమైనది. తమకు సంతోషమును గూర్చు కోరికలు నెరవేరనపుడు వారు అసంతుష్టికి గురియగుదురు. కావున వారు సదా సంతుష్టులుగా ఉండరు.

ప్రశ్న - 'యతాత్మా' అనగానేమి? ఆ పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - శరీరేంద్రియ మనస్సులను జయించిన వానిని 'యతాత్మా' అని యందురు. జ్ఞానియైన భగవద్భక్తుని శరీరేంద్రియ మనస్సులు సదా అతనివశములో నుండును. మనస్సు, ఇంద్రియములకు ఎన్నడును వశము కాని వానికి ఏ విధమైన దుర్గుణములు దురాచారములు ఏర్పడవు. ఇదియే ఈ పదప్రయోగవైశిష్ట్యము.

ప్రశ్న - 'దృఢనిశ్చయః' అనగానేమి?

సమా - పరమేశ్వరస్వరూపమునందు పూర్తిగా నిశ్చయమైన బుద్ధిగలవానిని 'దృఢనిశ్చయః' అనియందురు. అతనికి సర్వత్ర భగవానుని ప్రత్యక్షానుభవము కల్గును. గుణకర్మ దుఃఖాదికారణముల వలన అతని బుద్ధి పరమాత్మస్వరూపము నుండి ఎన్నడును చలింపదు.

ప్రశ్న - మనస్సును బుద్ధిని భగవదర్పణము చేయుట యనగానేమి?

సమా - నిత్యము, నిరంతరము, మనస్సు ద్వారా భగవత్స్వరూపమును చింతన చేయుచు, బుద్ధిద్వారా నిశ్చయము చేయగా చేయగా మనోబుద్ధులు భగవత్స్వరూపము నందే శాశ్వతముగా తన్మయమగుటను మనోబుద్ధులు భగవదర్పణము చేయుట యగును.

ప్రశ్న - 'అట్టి నా భక్తుడు నాకు ప్రియుడు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని యందు నిర్హేతుకమైన అనన్యభక్తిగల జ్ఞానియైనభక్తుని భగవానుడు తనకత్యంత ప్రియునిగా పేర్కొనెను. అతడు భగవత్స్వరూపమునందే నిశ్చలస్థితిని కల్గియుండును. భగవంతునినుండి ఆతనికి వియోగము సంభవింపదు. అతని మనోబుద్ధులు భగవదర్పితములు. భగవానుడే అతని జీవనము, ధనము, ప్రాణము, సర్వస్వము. అతడు భగవానుని చేతిలో ఆటబొమ్మగా తనను భావించుకొనును. కావున జ్ఞానియైన భక్తుని భగవానుడు తన ప్రియుడని తెల్పుచున్నాడు.

**యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।**
**హర్షామర్షభయోద్వేగైః ముక్తోయస్స చ మే ప్రియః ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యస్మాత్ | = ఎవని వలన | న, ఉద్విజతే | = ఉద్వేగమును పొందడో | | మొదలగు వాటినుండి |
| లోకః | = ఏ ప్రాణియు | | | | |
| న, ఉద్విజతే | = ఉద్వేగమునకు గురికాడో | చ | = అట్లే | ముక్తః | = ముక్తుడో |
| చ | = మఱియు | యః | = ఎవడు | సః | = అట్టిభక్తుడు |
| యః | = ఎవడు (స్వయముగా) | హర్షామర్ష భయోద్వేగైః | = హర్షము, ఈర్ష్య, భయము, ఉద్వేగము | మే | = నాకు |
| లోకాత్ | = ఏ ప్రాణివలనను | | | ప్రియః | = ఇష్టుడు. |

**లోకమున ఎవరికిని ఉద్వేగము (క్షోభ) కలిగింపనివాడును, ఎవరివలనను తాను ఉద్వేజితుడు కానివాడును (ఉద్వేగమునకు గురికానివాడును), హర్షము, ఈర్ష్య, భయము, ఉద్వేగము మున్నగు వికారములు లేనివాడును అగు భక్తుడు నాకు ప్రియుడు. (15)**

ప్రశ్న - 'అతని నుండి ఏ జీవికిని ఉద్వేగము కలుగదు' అనియనుటలోని అంతర్యమేమి? భక్తుడు ఉద్దేశ్యపూర్వకముగా ఎవ్వరినీ ఉద్విగ్ను పఱచడా? లేక అతని ద్వారా ఎవ్వరికిని ఉద్వేగము (క్షోభ) కలుగదా?

సమా - సర్వత్ర(అంతట) భగవత్స్వరూపమునే చూచు చుండుట వలన భక్తుడు ఉద్దేశ్యపూర్వకముగా ఎవ్వరికిని దుఃఖము, సంతాపము, భయము, క్షోభకలిగింపడు సరికదా అతని వలన సహజముగనే అందఱికిని సేవలు, పరమహితము చేకూరును. కనుక అతని నుండి ఎవ్వరికిని, ఎప్పుడును ఎట్టి ఉద్వేగము కలుగదు. పొరపాటున ఎవరికైనను ఉద్వేగము కలిగినచో అది భక్తుని దోషముగాదు. ఆ వ్యక్తి యొక్క అజ్ఞానజనిత రాగద్వేషములు, ఈర్ష్యాది దోషములే కారణములు. ఏలనన మూర్తీభవించిన దయాప్రేమ స్వరూపుడైనవాడు సహజముగనే ఇతరులకు హితమును గూర్చును. అట్టి పరమదయాళువైన పరమభక్తుడు ఎవ్వరి ఉద్వేగమున(క్షోభ) కును కారణము కాజాలడు.

ప్రశ్న - భక్తుడు ఇతరమైన ఏ ప్రాణివలనను ఉద్వేగమునకు ఏల లోనుకాడు? ఏ ప్రాణియు అతనికి దుఃఖమును కల్గింపదా? లేక దుఃఖహేతువు ఏర్పడినను అతనికి ఉద్వేగము (క్షోభ) కలుగదా?

సమా - భగవత్ప్రాప్తి కల్గిన జ్ఞాని యైన భక్తుడు అందరి యందును సమభావమును కల్గియుండును. ఆ కారణమున ఇతరులకు ఆయనయెడ ద్వేషము కలుగునట్లు ఏ కార్యమును ఆచరింపడు. కావున ఇతరులు కూడ అతనికి దుఃఖమును కలిగించుటకు ఎట్టి ప్రయత్నమును చేయరు. ఐనప్పటికిని అతనికి శారీరకముగాగాని, మానసికముగా గాని ఏ ప్రాణియు దుఃఖము కల్గింపదని సర్వథా చెప్పుటకు వీలులేదు. కనుక జ్ఞానియైన భక్తునకును ప్రారబ్ధవశమున ఇతరుల వలన దుఃఖము కలుగవచ్చును. కాని అతనిలో రాగద్వేషములే మాత్రమును లేకుండుట వలన ఎట్టి మహా దుఃఖమునకును చలింపడు (6/22). కావున జ్ఞానియైన భక్తుడు ఏ ప్రాణి వలన గూడ ఉద్వేగమునకు (క్షోభకు) లోనుకాడు.

ప్రశ్న- 'భక్తుడు ఎట్టి ఉద్వేగమునకును లోనుకాడు' అను విషయము ఈ శ్లోక పూర్వార్థమునందు తెల్పబడినదిగదా! మఱి ఉత్తరార్థమున అతడు ఉద్వేగముల నుండి ముక్తుడగును - అని మఱల తెల్పుటలోని అంతరార్థమేమి?

సమా - 'ఇతర ప్రాణివలన అతనికి ఎట్టి ఉద్వేగమూ కలుగదు' అని మాత్రమే శ్లోక పూర్వార్థమున తెల్పబడినది. దీని వలన పరేచ్ఛాజనిత-ఉద్వేగముల విషయము నివృత్తియైనది. కాని తన ఇచ్ఛ ఉన్నను లేకున్నను ఎదురైన సంఘటనలు, ప్రాప్తించిన పదార్థములు మున్నగు వానివలన మనుజునకు ఉద్వేగములు కలుగవచ్చును - 'భగవత్ప్రాప్తినందిన భక్తుడు ఎన్నడును ఏవిధమైన సంఘటనలకు ఉద్విగ్నుడు కాడని చెప్పుటకే శ్లోక-ఉత్తరార్థమునందు ఉద్వేగముల నుండి అతడు ముక్తుడు' అని తెల్పబడినది.

ప్రశ్న - హర్షము, ఉద్వేగములనుండి ముక్తుడని చెప్పుటవలన భక్తుని యొక్క నిర్వికారస్థితి స్పష్టమగుచున్నది- కాని అమర్షము భయమ్ముల నుండి గూడ అతడు ముక్తుడగునని తెల్పుటలోని అంతర్యమేమి?

సమా - హర్షోద్వేగములనుండి ముక్తుడని తెల్పుటవలన అతని నిర్వికారస్థితి స్పష్టమైనది - కాని అన్నివిధములైన వికారములును తొలగిపోయినవని పూర్తిగా స్పష్టముకాదు. కనుక భక్తుని యందు ఎట్టి వికారములూ, ఏమాత్రమూ ఉండవని స్పష్టపఱచుటకే అమర్షభయముల నుండియును అతడు ముక్తుడని పేర్కొనబడినది.

వాస్తవముగ మనుష్యుడు తానభిలషించిన గౌరవప్రతిష్ఠలు, ధనము మొదలగునవి ప్రాప్తించినప్పుడు ఏ విధముగ సంతోషపడునో, అదేవిధముగ తనతో సమానముగా లేక అధికముగ ఇతరులకు అవి ప్రాప్తించినపుడు కూడ చూచి ప్రసన్నుడు కావలెను. కాని తరచుగా అట్లు జరుగదు. అజ్ఞానకారణమున జనులకు అమర్షము (అసూయ) కలుగును. వివేక శీలుడైనవాని చిత్తమునందు గూడ ఈ అమర్షము (అసూయ) తొంగిచూచుచుండును. ఇచ్ఛ, నీతి, ధర్మములకు విరుద్ధములైన పరిస్థితులు సంభవించినపుడు ఉద్వేగము కలుగును. అట్లే నీతి, ధర్మములకు అనుకూలములైనను దుః ఖప్రదములైన పరిస్థితులు ఏర్పడినప్పుడు, లేక అవి తటస్థపడునేమోయను సందేహములు కలిగినప్పుడును భయమునకు లోనగుట చూచుచుండుము. వివేకవంతులకు గూడ మృత్యుభయము ఉండనేయుండును. ఇక సామాన్యుల విషయమున చెప్పనేల? కాని జ్ఞానియైన భగవద్భక్తుడు సర్వత్ర భగవంతునే దర్శించుచుండుటవలన, అన్ని సంఘటనలను భగవల్లీలలుగా భావించును. కనుక జ్ఞానియైన భక్తునకు అమర్షము గాని, ఉద్వేగము గాని, భయముగాని ఉండనే యుండవు.

**అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥ 16 ॥**

యః = ఏ పురుషుడు
అనపేక్షః = అపేక్షలేనివాడో
శుచిః = బాహ్యాభ్యంతరముల యందు శుచియైనవాడో
దక్షః = నిపుణుడో
ఉదాసీనః = పక్షపాతరహితుడో
గతవ్యథః = దుఃఖములనుండి ముక్తుడో
సః = అట్టి
సర్వారంభ పరిత్యాగీ = సమస్తకర్మల యందును కర్తృత్వ అభిమానము లేనివాడైన
మద్భక్తః = నా భక్తుడు
మే = నాకు
ప్రియః = ఇష్టుడు

ఏమాత్రమూ కాంక్షలేనివాడును, శరీరేంద్రియమనస్సులయందు శుచియై యున్నవాడును, దక్షుడును, పక్షపాతరహితుడును, ఎట్టి దుఃఖములకును చలింపనివాడును, సమస్తకర్మల యందును కర్తృత్వాభిమానములు లేనివాడును అగు భక్తుడు నాకు ప్రియుడు. **(16)**

ప్రశ్న - కాంక్షారహితుడనగానేమి?

సమా - పరమాత్మప్రాప్తినందిన భక్తునకు ఏ వస్తువు వలనను ఏ మాత్రమూ ప్రయోజనము ఉండదు. కనుక అతనికి దేనియందును ఇచ్ఛ, స్పృహ, (ఆసక్తి) వాసన మొదలగునవి ఉండవు. అతడు పూర్ణకాముడు. అట్టివాడే కాంక్షారహితుడనబడును.

ప్రశ్న - ఇచ్ఛయు, అవసరములు లేనివాని ఏ విధమగు క్రియలునూ జరుగుటకు సాధ్యముకాదు. కార్యములను చేయజాలడు. కార్యాన్వితుడు కాని వాని జీవితనిర్వహణము గూడ అసంభవము. మరి అట్టి భక్తుని జీవితమెట్లు గడచును?

సమా - ఇచ్ఛలును, అవసరములును లేకున్నను, ప్రారబ్ధములను అనుసరించి, క్రియలు జరుగును. కావున అతని జీవనము గూడ ప్రారబ్ధానుసారముగనే సాగిపోవును. అతని మనోవాక్కాయముల ద్వారా జరుగు క్రియలన్నియును ఎట్టి కోరికలు, ఆసక్తి, సంకల్పములును లేకుండగనే ప్రారబ్ధముననుసరించి సహజముగ కొనసాగుచుండును.

కావున అతని జీవన నిర్వహణమునందు ఏవిధమైన ఆటంకములూ ఉండవు. (4/19)

ప్రశ్న - భగవద్భక్తుడు కలిగియున్న బాహ్యాభ్యంతరశుచి స్వరూప లక్షణమేమి?

సమా - భగవద్భక్తుడు పవిత్రతకు పరాకాష్ఠ. అతని శరీరేంద్రియ మనోబుద్ధులు, ఆచరణములు అతి పవిత్రములు- అతనిని దర్శించినను, స్పృశించినను ఇతరులు పవిత్రులగుదురు. ఇక అతనితో సంభాషించినవారు పవిత్రులగుదురని చెప్పవలసినపనియేలేదు. అట్టి భక్తుడు అడుగిడిన ప్రదేశమంతయును పవిత్రమే యగును. అతని సాంగత్యము వలన గాలి, నీరు, స్థలము మొదలగునవి యన్నియును పవిత్రములగును.

ప్రశ్న - దక్షశబ్దమునకర్థమేమి?

సమా - మానవజన్మలక్ష్యసాఫల్యమునకు తగినకృషి యొనర్చుచు సిద్ధిని సాధించుటయే దక్షతయగును. అనన్యభక్తి ద్వారా పరమ ప్రేమాస్పదుడు, సర్వసుహృదుడును, సర్వేశ్వరుడును ఐన పరమేశ్వరుని పొందుటయే మానవజన్మకు పరమలక్ష్యము. జ్ఞానియైన భక్తుడు భగవత్ప్రాప్తికై నిరంతరము పాటుపడుచు ఆ లక్ష్యమును సాధించును. కనుక అతడప్పుడు 'దక్షుడు'గా పేర్కొనబడును.

ప్రశ్న - పక్షపాతరహితుడగుట యనగాననేమి?

సమా - న్యాయస్థానమునందు సాక్ష్యమిచ్చునపుడును, న్యాయాధికారి ఎట్టి వివాదమునైనను పరిష్కరించి, తీర్పులు ఇచ్చునప్పుడును, లేక ఇట్టివే మరికొన్ని సందర్భములలోను, తనకుటుంబ సభ్యులు బంధువులు, మిత్రులు అను దృష్టితో అనుచితముగా మేలుచేయుట, లేక ద్వేషభావముతోగాని మఱియే యితర కారణముతోగాని (స్వపర భేదభావముతో) తప్పుడు సాక్ష్యములను ఇచ్చుట, న్యాయ విరుద్ధముగా తీర్పులనిచ్చుట, మఱియొక విధముగా హానితలపెట్టుట మొదలగు దుష్కృత్యములను పక్షపాతములందురు. అవి లేకున్న వానిని పక్షపాతరహితుడని యందురు.

ప్రశ్న - "భగవద్భక్తుడు అన్ని విధములుగా దుఃఖరహితుడే యగును" అనియనుటలోని అంతర్యమేమి?

సమా - శ్లోకమున 'గతవ్యథః' అని ప్రయుక్తమైనది - దానివలన ఏ విధమైన దుఃఖహేతువు ప్రాప్తించినను అతడు దుఃఖితుడు కాడు- అనగా అతని అంతఃకరణము నందు ఎట్టి చింతయు, దుఃఖము, శోకము చోటు చేసికొనవు. శారీరిక అనారోగ్యము, స్త్రీ పుత్రాదుల వియోగము, ధనగృహాదుల నష్టము మొదలగు దుఃఖహేతువులు ప్రారబ్ధానుసారము అతనికి తటస్థపడుచుండును. కాని ఇట్టి పరిస్థితులన్నింటి వలనను అతని అంతఃకరణమునందు ఏవిధమైన వికారములు పొడసూపవు.

ప్రశ్న - 'సర్వారంభపరిత్యాగీ' అని యనగానేమి?

సమా - జగత్తున సంభవించు సంఘటనలన్నియును భగవల్లీలలే. అవి ఆయన మాయాశక్తివిలాసములే. అతడు ఎవరి ద్వారా ఎప్పుడు ఎట్లు ఏవి చేయింపవలెనో అట్లే చేయించును. మనుష్యుడు నిత్యాభిమానము కలిగి "ఈ ప్రత్యేక కార్యము నేనే చేయుదును. నేనే దీనికి సమర్థుడను." అని భావించును - కాని భగవద్భక్తుడు ఈ రహస్యమును చక్కగా ఎరుగును. కనుక తాను సర్వదా భగవంతుని చేతిలో ఆటబొమ్మయనియే భావించును. భగవంతుడు అతనిని ఎట్లు ఆడించిన అతడు సంతోషముతో అట్లాడును. అతడు ఏమాత్రమూ అహంభావమును కల్గియుండడు. స్వతంత్రించి తానేమియు చేయడు. కనుక లోకదృష్టిలో అతడు అన్నిపనులను చేయుచున్నను కర్తృత్వాభిమాన రహితుడగుటవలన వాస్తవముగా అతడేమియు చేయనట్లే - అట్టివానినే 'సర్వారంభపరిత్యాగీ' అనియందురు.

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।**
**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః ॥ 17 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| యః | = ఎవడు | న, కాంక్షతి | = | దేనినీ కోరడో, అట్లే | సః | = | అట్టి |
| న, హృష్యతి | = ఇష్టప్రాప్తికి పొంగిపోడో | యః | = | ఎవడైతే | భక్తిమాన్ | = | భక్తుడు |
| న, ద్వేష్టి | = దేనినిగూడ ద్వేషింపడో | శుభాశుభ పరిత్యాగీ | = | శుభాశుభకర్మలను పరిత్యజించినవాడో | మే | = | నాకు |
| న, శోచతి | = దేనికినీ విచారపడడో | | | | ప్రియః | = | ఇష్టుడు |

**ఇష్టవస్తుప్రాప్తికి పొంగిపోనివాడును, దేనియందును ద్వేషభావము లేనివాడును, దేనికినీ శోకింపనివాడును, దేనినీ ఆశింపనివాడును, శుభాశుభకర్మలను త్యజించినవాడును, ఐన భక్తుడు నాకు ప్రియుడు. (17)**

ప్రశ్న - ఎన్నడును హర్షితుడు కాకుండుట యనగానేమి? ఈ లక్షణముద్వారా భగవంతుడు తెలుపదలచుకొనిన విశేషమేమి?

సమా - ఇష్టవస్తుప్రాప్తి వలనను, అనిష్ట వస్తు వియోగము వలనను ప్రాణులకు కలుగు భావమును 'హర్షము' అనియందురు. కావున ఎట్టి వస్తువుయొక్క సంయోగవియోగముల వలన అంతఃకరణమునందు హర్షవికారము (హర్షము) కలుగకుండుటయే ఎన్నడును హర్షితుడు కాకుండుట యగును - జ్ఞానియైన భక్తునియందు హర్షము ఎన్నడును ఎట్టి పరిస్థితులలోను కలుగదు. భక్తునకు సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు, పరమ దయాళువు ఐన భగవానుడే పరమప్రియుడు. ఆయన అతనికి సర్వదా లభ్యుడు. కావున అతడు ఎల్లప్పుడును బ్రహ్మానందమునే అనుభవించుచుండును. ఏ ప్రాపంచికవస్తువువలనగాని, సంఘటనము వలనగాని అతనిలో ఏమాత్రమును రాగద్వేషములు జనింపవు. ఈ కారణమున లోక సహజమైన ప్రియవస్తు సంయోగము వలన గాని, అప్రియవస్తువియోగము వలనగాని అతని అంతఃకరణమునందు ఎన్నడును, ఏ మాత్రమూ హర్షవికారము కలుగనే కలుగదు.

ప్రశ్న - "భగవద్భక్తుడు ద్వేషింపడు" అనియనుటలోని ప్రత్యేకతయేమి?

సమా - "భగవద్భక్తుడు" సమస్తజగత్తును భగవత్స్వరూపముగనే భావించును. కావున అతనికి ఏ వస్తువునందును, ఏ ప్రాణియందును, ఎన్నడును ఏ కారణము వలనను ద్వేషము కలుగదు. అతని అంతఃకరణమున ద్వేషభావము శాశ్వతముగా సర్వథా అంతరించును.

ప్రశ్న - "భగవద్భక్తుడు ఎన్నడును శోకింపడు" - అని యనుటలోని విశేషమేమి?

సమా - హర్షము కలుగనట్లే అతనికి శోకవికారమూ కలుగదు. అనిష్ట వస్తుప్రాప్తి వలనను, ఇష్టవస్తువియోగము వలనను ప్రాణులకు శోకము కలుగును. లీలామయుడు, పరమదయాళువు ఐన పరమేశ్వరుని యొక్క దయాపూర్ణ ప్రభావమున భగద్భక్తునకు ఎన్నడును ప్రాతికూల్యమే కనబడదు. భగవంతుని లీలారహస్యములను ఎఱిగిన వాడగుట వలన భక్తుడు అన్ని సమయములయందును ఆయన పరమానంద స్వరూపానుభవమునందే నిమగ్నుడై యుండును - కావున అతనికి శోకము కలుగనే కలుగదు.

మఱియొక విషయము - సర్వవ్యాపియు, సర్వాధారుడును ఐన భగవానుడు అన్ని విధములుగా భక్తునకు పరమప్రియుడు. ఆయననుండి అతనికి ఎన్నడును వియోగము కలుగదు. ప్రాపంచిక వస్తువులయొక్క ఉత్పత్తివినాశనమువలన అతనికి ఎట్టి మేలుగాని కీడుగాని కలుగదు. ఈ కారణమున లోక సహజమగు ప్రియవస్తు వియోగమువలనను అప్రియవస్తు సంయోగమువలనను అతనికెట్టి శోకమూ కలుగదు.

ప్రశ్న - భగవద్భక్తుడు ఎన్నడును ఏ వస్తువును గూడ కాంక్షింపక పోవుటలోని విశేషమేమి?

సమా - మానవుడు తన యొద్దలేని ఇష్టవస్తువును కాంక్షించును. భక్తునకు సాక్షాత్తు భగవానుడే ప్రాప్తించుట వలన అతడు శాశ్వతముగా పరమానందమును, పరమశాంతిని పొంది పూర్ణకాముడగును. కనుక అతడు మనస్సున ఎన్నడును ఏ వస్తువునైనను కాంక్షనే పెట్టుకొనడు. అతని అవసరములన్నియు దూరమగును. అతడు నిశ్చలస్థితి యందు స్థితుడైయుండును. కావున అతని అంతఃకరణమునందు సాంసారిక వస్తువుల కాంక్ష యుండుటకెట్టి కారణము మిగులదు.

ప్రశ్న - ఇచట శుభాశుభశబ్దము ఏ కర్మలను సూచించును? - "భగవద్భక్తుడు ఆ శుభాశుభములను పరిత్యజించును" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - యజ్ఞదాన తపశ్చర్యలు, వర్ణాశ్రమ ధర్మములు, జీవికకు, శరీర నిర్వహణకై చేయబడు శాస్త్రవిహిత కర్మలు మొదలగువానిని అన్నింటిని 'శుభ' శబ్దము తెల్పును. అబద్ధము, కపటము, దొంగతనము, హింస, వ్యభిచారము మొదలగు పాపకర్మలను 'అశుభ' కర్మలను తెలుపును. జ్ఞానియైన భక్తుడు ఈ రెండు విధములైన కర్మలను త్యజించును. ఏలనన శరీరేంద్రియ మనస్సుల ద్వారా

ఆచరింపబడు సమస్త కర్మలను అతడు భగవదర్పణము గావించును. వాటియందు అతనికి ఏమాత్రము మమతాసక్తులు, ఫలేచ్ఛ ఉండవు. కనుక అట్టివి కర్మలుగనే భావింపబడవు. (4/20) రాగద్వేషములు లేని కారణమున అతని ద్వారా పాపకర్మలు జరుగనే జరుగవు. కనుక అతనిని 'శుభాశుభపరిత్యాగీ' అని యందురు.

**సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః ॥ 18 ॥**

| పదము | అర్థము |
|---|---|
| శత్రౌ, మిత్రే, చ | శత్రువులయందును, మిత్రుల యందును |
| మాన-అవమానయోః | మానావమానముల యందును |
| సమః | సమభావముగల వాడును |
| తథా | అట్లే |
| శీతోష్ణసుఖ దుఃఖేషు | శీతోష్ణములయందును, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వముల యందును |
| సమః | సమభావము కలిగి యుండువాడును |
| చ | మఱియు |
| సంగవివర్జితః | ఆసక్తి రహితుడును... |

శత్రువులయెడను, మిత్రులయెడను సమభావముతో మెలగువాడును, మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములను సమానముగా స్వీకరించువాడును, ఆసక్తిరహితుడును.... **(18)**

ప్రశ్న - భగవద్భక్తునకు ఏ ప్రాణియెడలను ద్వేషము ఉండదు గదా! మఱి అతనికి శత్రువు ఎట్లుండును? ఇట్టి పరిస్థితిలో అతడు శత్రువుల యెడలను, మిత్రుల యెడలను సమముగా ఉండునని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - భక్తునిదృష్టిలో అతనికి నిజముగా శత్రువుగాని, మిత్రుడుగాని ఉండడు. కాని జనులు తమ స్వభావముల ననుసరించి, మూర్ఖత్వము (అజ్ఞానము) వలన భక్తునిద్వారా తమకు అనిష్టము కలుగునేమోయని భావించియు, అతని స్వభావము తమకు అనుకూలముగా కనపడని కారణముననను, ఈర్ష్యావశముననను అతని (భక్తుని) యెడ శత్రుభావములను ఏర్పఱచుకొందురు. అట్లే ఇతరులు తమ స్వభావములను గురించి అతని యెడ మిత్రభావములను ఏర్పరచుకొందురు. కాని సమస్త జగత్తునందును భగవంతునే దర్శించు భక్తుడు అందఱియందును సమభావమునే కలిగియుండును. అతని దృష్టిలో శత్రుమిత్ర భేదభావము ఏమాత్రమును ఉండదు. అతడు సర్వదా అందరియెడలను పరమప్రేమభావముతోడనే వ్యవహరించును. అందఱిని భగవత్స్వరూపులుగా భావించి, సమభావముతో అందఱికిని సేవలొనర్చుట అతని స్వభావమగును. వృక్షము తనను కొట్టినవానికి, నీరుపోసిన వానికి ఇద్దఱికిని సమానముగా నీడను, పూవులను, ఫలములను సమకూర్చుచు సేవలొనర్చును. పైగా ఎట్టి భేదభావము చూపదు. అట్లే భక్తుడును ఎట్టి బేధభావమును చూపక అందఱికిని సమానముగా సేవలొనర్చును. భక్తుని సమత్వము వృక్షముకంటెను మిక్కిలి మహిమాన్వితమైనది. అతని దృష్టిలో పరమేశ్వరుని కంటెను వేఱైన దేదియు లేని కారణమున అతనియందు భేదభావమునకు తావులేదు. కావున అతడు శత్రుమిత్రుల యెడ సముడు. అని తెల్పబడినది.

ప్రశ్న - మానావమానములు, శీతోష్ణములు, సుఖ దుఃఖములు మొదలగు ద్వంద్వములయందు భక్తుడు సముడు, అని తెలుపుటలోని వైశిష్ట్యమేమి?

సమా - మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు అనుకూల, ప్రతికూల ద్వంద్వములు శరీరేంద్రియములకు సంబంధించినవి. వాటిని అనుభవించుచున్నప్పటికి, భక్తుని అంతఃకరణమున రాగద్వేషహర్షశోకాదివికారములేమాత్రమును కలుగవు. అతడు సదాసముడై యుండును. అనుకూల పరిస్థితులయెడ ఇష్టమును ప్రకటించుటగాని, ప్రతికూల పరిస్థితులయెడ అనిష్టమును ప్రకటించుటగాని అతడు చేయడు. అతడు ఎన్నడును, ఎట్టి పరిస్థితులలోను తన సహజస్థితినుండి ఏమాత్రమూ చలింపడు. సర్వత్ర భగవంతునే దర్శించు చుండువాడు గావున అతడు తన యంతఃకరణమున ఎట్టి

వైషమ్యమునూ కల్గియుండడు. కనుక అతడు అన్ని ద్వంద్వముల యందును 'సముడు' అని తెల్పబడినది.

ప్రశ్న - 'సంగవివర్జితః' అను పదమునకు ప్రాపంచిక సంబంధము లేనివాడని భావించిన దోషమేమి?

సమా - మనుష్యునకు ప్రాపంచిక భోగాసక్తియుండుటయే అన్ని అనర్థములకు మూలకారణము. అతడు బాహ్యముగా ప్రాపంచిక సంబంధములను వదలినను మనస్సునందు ఆసక్తి కల్గియున్నచో అట్టి త్యాగమువలన విశేషలాభము ఏమియు ఉండదు. అట్లుగాక మనస్సున ఆసక్తిని వీడి జనకాదులవలె అన్నింటియెడ మమతాసక్తి రహితుడై, వాటితో సంబంధము కల్గియున్నను అతనికి ఎట్టి హానియు ఉండదు. ఇట్లు ఆసక్తిని త్యజించిన వాడే 'సంగవివర్జితః' అని యనబడును. 2వ అధ్యాయమున 57వ శ్లోకమున గూడ ఈవిషయమే తెల్పబడినది - కనుక 'సంగవివర్జితః' అను సమాసమునకు ఇచట తెల్పబడిన అర్థమే సమంజసమైనది.

ప్రశ్న - 13వ శ్లోకమున భక్తుడు ప్రాణులన్నింటియెడ మిత్రభావమును కల్గియుండునని భగవానుడు తెల్పియుండెను. మఱి ఇచ్చట అందఱియెడలను ఆసక్తి రహితుడై యుండునని తెల్పుచున్నాడు. ఈ రెండింటిలో వైరుధ్యము కనబడుచున్నది. దీనికి సమాధానమేమి?

సమా - ఇందు వైరుధ్యమేమియును లేదు. భగవద్భక్తునకు సర్వప్రాణుల యెడ గల మిత్రభావము ఆసక్తిరహితము, దోషరహితము, విశుద్ధము. ప్రాపంచిక మనుష్యుల ప్రేమ ఆసక్తితో కూడియుండును. కావున ఇచట స్థూలదృష్టితో చూచినవారికి వైరుధ్యము గోచరించును. కాని వాస్తవముగా ఎట్టి విరోధము లేదు. మైత్రి అను సద్గుణము భగవంతునియందును ఉండును. కాని ఆసక్తి యను దుర్గుణము సమస్త అవగుణములకును మూలము. కనుక అది త్యాజ్యము. భక్తుని యందు అది యుండనే యుండదు.

**తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।**
**అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19 ॥**

| పదము | అర్థము |
|---|---|
| తుల్యనిందాస్తుతిః | = నిందాస్తుతులను సమానముగా భావించువాడును |
| మౌనీ | = మననశీలుడును |
| యేన కేనచిత్ | = శరీరనిర్వహణకై ప్రాప్తించిన దానితోడనే |
| సంతుష్టః | = తృప్తిపడువాడును |
| అనికేతః | = గృహాదులయందు ఎట్టి ఆసక్తియు లేనివాడును |
| స్థిరమతిః | = స్థిరబుద్ధి గలవాడును |
| భక్తిమాన్, నరః | = (ఐన) భక్తుడైనవాడు |
| మే | = నాకు |
| ప్రియః | = ఇష్టుడు |

**నిందాస్తుతులకు చలింపనివాడును, మననశీలుడును, శరీరనిర్వహణకై లభించిన దానితోడనే తృప్తిపడువాడును, నివాసస్థానములయందు మమతాసక్తులు లేనివాడును, స్థితప్రజ్ఞుడును అగు భక్తుడు నాకు ఇష్టుడు. (19)**

ప్రశ్న - భగవద్భక్తుడు నిందాస్తుతులను సమానముగా భావించుట యనగానేమి?

సమా - భక్తుడు తన పేరు ప్రతిష్ఠలయందును, శరీరము నందును ఏమాత్రము మమతాభిమానములను కలిగి యుండడు. కావున ఇతరులు తనను పొగడినప్పుడు హర్షమునకుగాని, నిందించినపుడు శోకమునకుగాని లోనుగాడు. ఆ రెండింటి యందును అతనికి సమభావమే యుండును. సర్వత్ర భగవద్బుద్ధి కలిగియుండుట వలన స్తుతించువారి యెడలను, నిందించువారి యెడలను గూడ ఏమాత్రము భేదబుద్ధిని చూపడు. అతడు నిందాస్తుతులను సమానముగా భావించుట యనగా ఇదియే.

ప్రశ్న - 'మౌని' అను పదమునకు మౌనముగా నుండువాడను అర్థము ప్రసిద్ధి. కాని ఇచట మననశీలుడు అని యేల చెప్పబడినది?

సమా - మనుష్యుడు కేవలము వాక్కుతోడనే మాట్లాడడు. మనస్సుతోగూడ మాట్లాడును. విషయములను అనవరతము చింతన చేయుటయే మనస్సుతో మాట్లాడుట యగును. భక్తుని చిత్తము పూర్తిగా భగవంతుని యందే లగ్నమైయుండును. మనస్సునందు భగవంతునిస్మృతితప్ప మరి యేదియు నుండదు. అతడు సర్వదా

భగవన్మననమునందే నిమగ్నుడైయుండును. ఇదియే నిజమైన మౌనము. మాట్లాడుటమాని మనస్సుతో ఇంద్రియ విషయములను గూర్చి చింతన చేయుట బాహ్యమౌన మగును. మనస్సును నిర్విషయమొనర్చి, వాక్కును పవిత్రమూ, నియమితమూ ఒనర్చు ఉద్దేశ్యముతో చేయబడు బాహ్యమౌనము గూడ లాభదాయకమే. కాని ఇచ్చట భగవంతునకు ప్రియమైన భక్తులయొక్క లక్షణములు వర్ణింపబడినవి. అతనివాణి సహజముగనే పవిత్రము, నియమితము. భక్తుడు కేవలము వాణి యందు (వాక్కునందు) మౌనము వహించునని చెప్పుటకును వీలులేదు. ఆ భక్తుని వాణి ద్వారా నిరంతరము భగవన్నామగుణముల సంకీర్తనమే జరుగుచుండును. దానివలన జగత్తునకు మహోపకారము జరుగును. ఇంతేగాక భగవానుడు తన భక్తిప్రచారమునుగూడ భక్తులద్వారానే చేయించును. కనుక వాణియందు మౌనము వహించిన వాడు భగవానునకు ప్రియభక్తుడనియు, మాట్లాడువాడు కాడనియు తెలుపుటకు వీలులేదు. 18వ అధ్యాయమునందలి 68, 69 శ్లోకములలో గీతాప్రచారము చేయువాడు తనకు అత్యంత ప్రియకార్యమొనర్చువాడని భగవానుడు నుడివెను. వాణియందు మౌనము వహించినచో ఈ మహాత్కార్యము నెరవేఱదు. ఇంతేగాక 17వ అధ్యాయమునందలి 16వ శ్లోకమున మానసిక తపోలక్షణములలో గూడ మౌనము చేర్చబడినది. మౌన శబ్దమునకు వాక్కు పరమైన మౌనము అను అర్థమును చెప్పినచో దానిని వాక్తపస్సని చెప్పియుండెడివారు. కావున మునిభావమునే మౌనమని గ్రహింపవచ్చును. అట్టిమునిభావము గలవాడు మౌని, అనగా మననశీలుడు. వాక్కునందు మౌనమును మొండి పట్టుదలతో కొందరు పాటింపవచ్చును. కాని అందువలన ఎట్టి విశేషమహత్త్వమూ ఉండదు. కావున ఇచట మౌన శబ్దమునకు అర్థమును వాక్కునందు మౌనము అనియే భావింపక మనస్సుయొక్క మననశీలత్వము అని భావించుటయే సముచితము - వాక్సంయమము ఇందులో అంతర్గతమే.

ప్రశ్న - 'యేన కేనచిత్ సంతుష్టః' అని యనగానేమి? భగవద్భక్తుడు శరీరనిర్వహణకై ఏ విధమైన ప్రయత్నమును చేయక అప్రయత్నముగా వచ్చిన దానితోడనే సంతుష్టుడు కావలెనా?

సమా - అనన్యభావముతో భగవచ్చింతనయందే లగ్నమైన భక్తుని చిత్తమునందు మఱియే స్ఫురణము ఉండదు. శరీరనిర్వహణమునకై అతడెట్టి ప్రయత్నమును చేయకుండుటయు, అతని లౌకిక యోగక్షేమములను గూడ భగవంతునిద్వారానే నెరవేరుట సర్వథా సుసంగతము. కాని ఇచ్చట 'యేన కేనచిత్ సంతుష్టః' అను పదములకు అర్థము నిష్కామభావముతో వర్ణాశ్రమధర్మములకు అనుకూలమైన శరీరనిర్వహణమునకు ఉపయుక్తమైన న్యాయమైన ప్రయత్నములను నిషేధించుటగాదు - ఇట్టి ప్రయత్నమును చేసినను ప్రారబ్ధానుసారము లభించిన దానితోడనే భక్తుడు సంతుష్టుడగును - 'యేన కేనచిత్ సంతుష్టః' అనగా ఇదియే - వాస్తవముగా భగవద్భక్తుడు సాంసారిక వస్తువులు లభించినను అవి నష్టమైనను పట్టించుకొనడు. అతడు తనకు అత్యంతము ఇష్టుడైన భగవంతుని పొంది, సర్వదా సంతుష్టుడైయుండును. కనుక బాహ్యవస్తువులు వచ్చుచు పోవుచుండుటవలన అతని సంతుష్టియందు ఎట్టి మార్పును ఉండదు - అని తెల్పుటకే 'యేన కేనచిత్ సంతుష్టః' అను పదములు ప్రయోగింపబడినవి... ప్రారబ్ధానుసారము సుఖ దుఃఖాదులకు హేతువులైన పదార్థములు ఏవి లభించినను వాటితోడనే అతడు సంతుష్టుడగును.

ప్రశ్న - 'అనికేతః' అను పదమునకర్థమేమి?

సమా - సొంత ఇల్లు లేని వానిని 'అనికేతః' అని యందురు. గృహస్థాశ్రమమును వదలి పూర్తిగా గృహాదులను త్యజించిన సన్న్యాసులును, జ్ఞానులును, భక్తులును, ఏ స్థానమునందును విశేషాసక్తి, మమత, స్వత్వభావము లేనివారును 'అనికేతులు' అనబడుదురు. వారు తమ సర్వస్వమును భగవదర్పణము గావించి, సర్వథా అకించనులై యుందురు. వారు ఇల్లూ, వాకిలీ, శరీరమూ మొదలగునవి అన్నియును భగవంతునకు చెందినవేయని భావించువారు. బ్రహ్మచారులైనను, గృహస్థులైనను, వానప్రస్థులైనను వారు కూడ 'అనికేతులు'గానే భావింపబడుదురు. శరీరమునందు అహంకారము, మమత, ఆసక్తి లేని జ్ఞానిని విదేహుడని పిలిచినట్లే ఇంటిపై మమతాసక్తులులేని వాడు ఇంటిలోనున్నను 'అనికేతుడే' యగును.

ప్రశ్న - భక్తుని 'స్థిరబుద్ధి' గలవాడు - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - భక్తునకు భగవానుడు ప్రత్యక్షమగుటవలన అతని సంశయములన్నియును సమూలముగా తొలగిపోయి,

భగవానునియందు అతనికి దృఢవిశ్వాసము కలుగును - అతని నిశ్చయము ఏ మాత్రము చలింపదు. కనుక సామాన్య మానవులవలె అతడు కామక్రోధలోభమోహభయాది వికారములకు వశుడు గాడు. ధర్మమునుండియు, భగవత్స్వరూపమునుండియు విచలితుడు కాడు. కనుక అతనిని 'స్థిరబుద్ధి' అని పేర్కొనుట జరిగినది. 'స్థిరబుద్ధి' అను పదము యొక్క విశేషార్థము రెండవ అధ్యాయము నందలి 55 నుండి 72వ శ్లోకము వఱకుగల వ్యాఖ్యానముల యందు వివరింపబడినది.

ప్రశ్న - 13వ శ్లోకమునుండి 19వ శ్లోకము వరకు భగవానుడు తన ప్రియభక్తుల లక్షణములను తెల్పుచు "భక్తుడైనవాడు నాకు అత్యంతప్రియుడు, ఇట్టి భక్తిగల పురుషుడు నాకు ప్రియుడు, ఇట్టి పురుషుడు నాకు ప్రియుడు." ఈ విధముగా వేర్వేఱుగా ఐదుసార్లు పేర్కొనెను. దీని ఆంతర్యమేమి?

సమా - పైన తెల్పబడినవన్నియును భగవద్భక్తుల లక్షణములే. అవి శాస్త్రానుకూలములు, శ్రేష్ఠములు. కాని స్వభావాదుల భేదముల వలన భక్తుల గుణములయందును, ఆచరణములయందును ఎంతోకొంత అంతరము ఉండుట సహజము. అందఱిలోను అన్ని లక్షణములును ఒకే విధముగా నుండవు. సమత, శాంతి, అందరిలోను ఉండును - రాగద్వేషహర్షశోకాది వికారములు ఎవ్వరిలోను ఉండవు. కనుక ఈ శ్లోకమునందు పైకి పునరుక్తియున్నట్లు కనబడును. పరిశీలనగా చూచినచో ఈ 5 విభాగముల యందును ఒకచోట భావము ద్వారాను, మఱియొకచోట శబ్దములద్వారాను, రాగద్వేషహర్షశోకాదుల రాహిత్యము అందరిలో ఉండును. మొదటి విభాగమున 'అద్వేష్టా' అను పదము ద్వారా ద్వేషరాహిత్యము, నిర్మమః అను పదము ద్వారా రాగరాహిత్యము 'సమదుఃఖసుఖః' అనుటద్వారా హర్షశోకాదుల అభావమును తెలిపెను. రెండవ విభాగమున హర్ష+అమర్ష, భయ+ఉద్వేగములు లేకుండుటను తెల్పుటచే రాగద్వేష హర్షశోకాదుల అభావము స్పష్టము చేయబడినది - మూడవ విభాగమున 'అనపేక్షః' అను పదముద్వారా రాగము, 'ఉదాసీనః' అను పదముద్వారా ద్వేషము, 'గతవ్యథః' అను పదము ద్వారా హర్షశోకముల అభావము తెలుపబడినవి. నాల్గవ విభాగమున 'నకాంక్షతి' అనుటలో రాగము, 'నద్వేష్టి' అనుటలో ద్వేషము, 'నహృష్యతి' 'నశోచతి' అనుటలో హర్షశోకాదులరాహిత్యము తెల్పబడినట్లైనది. ఇదే విధముగా ఐదవ విభాగము 'సంగవివర్జితః' 'సంతుష్టః' అనుటవలన రాగద్వేషములు: 'శీతోష్ణసుఖదుఃఖేషు సమః' అనుట వలన హర్షశోకాదులు లేకుండుట తెల్పడినది - 'సంతుష్టః' అను పదము ఈ ప్రకరణమున రెండుసార్లు ప్రయుక్తమైనది. దీనివలన రాగద్వేషములయు, హర్షశోకాది వికారములయు అభావమూ, అట్లే సమత, శాంతి, అన్నిటియందును ఆవశ్యకమనియూ స్పష్టమైనది. ఆయావ్యక్తుల స్వభావ భేదములనుబట్టి, వారి వారి లక్షణములలో కొంతవఱకు తారతమ్యములు ఉండవచ్చును. ఈ భేదముల కారణముగ భగవానుడు వేర్వేఱు శ్రేణులలో విభజించి, భక్తుల లక్షణములను 5 పర్యాయములు వేర్వేఱుగా తెలిపెను. వీటిలో ఏ ఒక్క విభాగమునందలి లక్షణములైనను సంపూర్ణముగా గలవాడే భగవానునకు ప్రియభక్తుడు.

ప్రశ్న - ఈ లక్షణములు సిద్ధపురుషునివా? లేక సాధకునివా?

సమా - పరిశీలించి చూడగా ఈ లక్షణములు సాధకునివి కావనియు, భక్తియోగము ద్వారా భగవత్ప్రాప్తినందిన సిద్ధపురుషునివనియు స్పష్టపడును. ఏలనన మొదట భగవత్ప్రాప్తికి మార్గములును, ఫలమును పేర్కొనిన పిమ్మట ఈ లక్షణములు వర్ణింపబడినవి. అంతేగాక 14వ అధ్యాయము నందలి 22 నుండి 25వ శ్లోకము వఱకును భగవానుడు తెల్పిన తత్త్వదర్శియైన గుణాతీతమహాత్ముని లక్షణములును, ఇప్పుడు తెల్పబడిన లక్షణములును ఇంచుమించు ఒకటిగనే యున్నవి. కావున ఇవి సాధకుని లక్షణములు గావు.

ప్రశ్న - ఇవియన్నియును భక్తియోగము ద్వారా భగవత్ప్రాప్తి నందిన పురుషుని లక్షణములని తెల్పుటకుగల కారణమేమి?

సమా - ఈ అధ్యాయమునందు భక్తియోగ వర్ణనము గలదు - దీని పేరుగూడ భక్తియోగమే - అర్జునుని ప్రశ్నయును, దానికి భగవానుని సమాధానము గూడ ఉపాసనావిషయమునకు సంబంధించినవే. కనుకనే భగవానుడు "యో మద్భక్తః స మేప్రియః', "భక్తిమాన్ యస్సమేప్రియః" మొదలగు వాక్యముల ద్వారా దీనిని స్పష్టీకరించెను. కావున ఇవి భక్తిమార్గము ద్వారా పరమసిద్ధిని బొందిన లక్షణములే యని భావింపవలెను.

ప్రశ్న - కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము మొదలగు మార్గములయందు ఏదో యొక దాని ద్వారా సిద్ధిపొందిన పిమ్మట గూడ అట్టి సిద్ధపురుషులలో వ్యత్యాసములుండునా?

సమా - వాస్తవముగా వారి స్థితియందును, వారికి ప్రాప్తించిన పరతత్త్వమునందు ఎట్టి వ్యత్యాసము ఉండదు. కాని స్వాభావిక భేదముల వలన వారి ఆచరణములయందు కొంత భేదములుండవచ్చును. "సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి" (3/33) అనువాక్యము వలన జ్ఞానులందఱి ఆచరణస్వభావములయందు జ్ఞానప్రాప్తి అనంతర కాలమునందు గూడ భేదములుండునని తెలియుచున్నది.

అహంకార, మమకారములును, రాగద్వేష, హర్షశోక, కామక్రోధాది అజ్ఞానజనిత వికారములును లేకుండుటయు, సమత్వము పరమశాంతి కలిగియుండుటయు, అందఱిలోను సమానముగా కనబడు లక్షణములు. కాని మైత్రి, కరుణ అనునవి భక్తి మార్గముద్వారా భగవత్ప్రాప్తినందిన మహాపురుషులలో విశేషముగా కన్పట్టును. జగత్తు, శరీరము, కర్మలు మొదలగు వానియందు అనాసక్తి జ్ఞానమార్గముద్వారా పరమపదమును పొందిన మహాత్ములలో విశేషముగా గోచరించును. అదేవిధముగ ఇంద్రియమనస్సుల సంయమము, అనాసక్త భావముతో కర్మలయందు తత్పరత అను లక్షణములు విశేషముగా కర్మయోగము ద్వారా భగవత్ప్రాప్తినందిన వారిలో కన్పించును.

రెండవ అధ్యాయమునందలి 55 నుండి 72వ శ్లోకము వఱకును కర్మయోగము ద్వారా భగవత్ప్రాప్తినొందిన పురుషుల లక్షణములు తెల్పబడినవి. 14వ అధ్యాయము నందలి 22 నుండి 25వ శ్లోకము వఱకును జ్ఞానయోగము ద్వారా పరమాత్మప్రాప్తినొందిన గుణాతీతపురుషుని లక్షణములు తెల్పబడినవి. ఈ అధ్యాయమున 13 నుండి 19వ శ్లోకము వఱకును భక్తియోగము ద్వారా భగవత్ప్రాప్తి నందిన పురుషుని లక్షణములు గలవు.

సంబంధము - పరమాత్మప్రాప్తి నందిన భక్తుల లక్షణములను తెల్పిన పిమ్మట అట్టి లక్షణములను ఆదర్శముగా భావించి, చక్కగా సాధనచేయుచు సేవలొనర్చు పరమశ్రద్ధాళువులు శరణాగతులు ఐన భక్తులను ప్రశంసించుటకై వారు తనకు అత్యంత ప్రియులని తెలుపుచు భగవానుడు ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ 20 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యే, తు | = ఎవరైతే | ఇదమ్ | = ఈ | | సేవింతురో |
| శ్రద్దధానాః | = శ్రద్ధాయుక్తులై | ధర్మ్య-అమృతమ్ | = ధర్మ్యామృతమును | తే, భక్తాః | = ఆ భక్తులు |
| మత్పరమాః | = మత్పరాయణులై | | | మే | = నాకు |
| యథా, ఉక్తమ్ | = పైన తెల్పబడినట్టి | పర్యుపాసతే | = నిష్కామభక్తి భావముతో | అతీవ, ప్రియాః | = మిక్కిలి ఇష్టులు |

**ఉపర్యుక్తధర్మ్యామృతమును సేవించుచు (పైనపేర్కొనబడిన ఉత్తమ గుణములను కలిగియుండి), నిష్కామభక్తిశ్రద్ధలతో మత్పరాయణులైన భక్తులు నా కత్యంత ప్రియులు. (20)**

ప్రశ్న - ఇచ్చట 'తు' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - 13 నుండి 19వ శ్లోకమువఱకు భగవత్ప్రాప్తి సిద్ధించిన భక్తుల లక్షణములు వర్ణింపబడినవి. అట్టి భక్తుల లక్షణములను ఆదర్శముగా గొని, వారిని సేవించు సాధకభక్తులను ఈ శ్లోకమున ప్రశంసించుట జరిగినది. ఈ భేదమును చూపుటకే ఇచట 'తు' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - "శ్రద్ధాళువైన భగవత్పరాయణుడు" - అని యొవరిని అందురు?

సమా - సర్వవ్యాపియు, సర్వశక్తిమంతుడును ఐన భగవానుని అవతారములయందును, వచనముల యందును, ఆయన గుణ ప్రభావ - ఐశ్వర్య చరిత్రాదులయందును,

శ్రద్ధాదరములు విశ్వాసము కలవానిని 'శ్రద్దాళువు' అనియందురు. పరమ ప్రేమాస్పదుడు దయాళువు ఐన భగవంతుడే తనకు పరమగతి, పరమాశ్రయము, తన ప్రాణములకాధారము, సర్వస్వము అని నమ్మి, ఆయనపైననే భారముంచి, ఆయన విధానమునందు ప్రసన్నత కలిగియుండువానిని 'భగవత్పరాయణుడు' అని యందురు.

ప్రశ్న - పైన తెల్పబడిన ఏడు శ్లోకములలో వర్ణింపబడిన భగవద్భక్తుల లక్షణములను "ధర్మమయ అమృతము" అని పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - పైన తెల్పబడిన భగవద్భక్తుల లక్షణములే వాస్తవముగా మానవ ధర్మము యొక్క నిజస్వరూపము. వీటిని పాటించుట వలననే మానవ జన్మసార్థకమగును. వీటిని పాటించిన సాధకుడు మృత్యుముఖము నుండి ముక్తుడగును. అప్పుడతనికి అమృతస్వరూపుడైన భగవంతుని ప్రాప్తి కలుగును. కనుక ఇచటి ఈ లక్షణసముదాయమును ధర్మమయ-అమృతమని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - 'పర్యుపాసతే' అనగానేమి?

సమా - తదేక ధ్యాసతో భగవత్తత్పరుడై నిష్కామభక్తి భావముతో ఉపర్యుక్త లక్షణములను అత్యంత శ్రద్ధతో సర్వథా సాధన చేయుటయే 'పర్యుపాసతే' అను పదమునకర్థము.

ప్రశ్న - మొదటి ఏడు శ్లోకములలో భగవత్ప్రాప్తి సిద్ధించిన భక్తుల లక్షణములను వర్ణించుచు భగవానుడు వారిని తన "ప్రియభక్తులు" అని పేర్కొనెను. ఈ శ్లోకమున భగవత్ప్రాప్తి సిద్ధింపని వారై ఈ లక్షణములను ఉపాసించు సాధక భక్తులను తనకు "అత్యంత ప్రియులు" అని తెల్పెను - దీని అంతరార్థమేమి?

సమా - భగవత్ప్రాప్తి సిద్ధించిన భక్తులయందైనచో పై లక్షణములు సహజముగనే యుండును. వారికి భగవంతునితో నిత్యము తాదాత్మ్య సంబంధము (స్థితి) ఉండనే యుండును. కనుక వారిలో ఈ గుణములుండుట విశేషముగాదు. కాని ఒకే నిష్ఠ గలిగిన సాధక భక్తులకు భగవంతుని ప్రత్యక్షదర్శనము ఇంకను కావలసియున్నది. ఐనను వారు భగవంతునిపై విశ్వాసము ఉంచి, మిక్కిలి శ్రద్ధతో తమ తనువులను, మనస్సులను, ధనమును, సర్వస్వమును భగవదర్పణ చేసి తత్పరాయణులగుదురు. భగవద్దర్శనమునకై, నిష్కామభావముతో భక్తిపూర్వకముగా నిరంతరము భగవచ్చింతన చేయుచుందురు. పై లక్షణములను అనుసరించియు తమ జీవితములను గడుపుటకు సంతతము ప్రయత్నింప గోరుదురు. కావున భగవంతుని ప్రత్యక్షదర్శనము కాకున్నను కేవలము విశ్వాసముతో ఆయనపై భారమునుంచి మసలుట అత్యంత మహత్త్వపూర్ణ విషయము. కనుక వారు భగవంతునకు అత్యంతప్రియతములు. ఇట్టి భక్తులకు భగవానుడు తన నిత్యసాంగత్యమును గూర్చి సంతోషపెట్టనంతవరకు ఆయన వారికి (భక్తులకు) ఋణపడియే యుండును. భక్తుల యెడ భగవానునకు గల పరమప్రేమ యనగా ఇట్టిదియే - కావుననే ఇట్టివారిని భగవానుడు సిద్ధభక్తులకంటెను మిక్కిలి ప్రియతములు - అని పేర్కొనుట ఎంతేని సమంజసము.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః ॥ ౧౨ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదుమూడవ అధ్యాయము - క్షేత్ర-క్షేత్రజ్ఞవిభాగయోగము

**అధ్యాయ నామము :** క్షేత్రము, (శరీరము) క్షేత్రజ్ఞుడు (ఆత్మ) అను ఉభయతత్త్వములు పరస్పరము అత్యంత విలక్షణములైనవి. కేవలము అజ్ఞానమువలననే ఈ రెండును ఒకటిగా గోచరించును. క్షేత్రము జడము, వికారములు గలది, క్షణికము, నశ్వరము. కాని క్షేత్రజ్ఞుడు చేతనుడు, జ్ఞానస్వరూపుడు, నిర్వికారుడు, నిత్యుడు, శాశ్వతుడు. ఈ అధ్యాయమున క్షేత్ర-క్షేత్రజ్ఞుల స్వరూపములు పైవిధముగా వర్గీకరింపబడినవి. కనుక ఈ అధ్యాయమునకు "క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగయోగము" అను పేరు ఏర్పడినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందు మొదటి శ్లోకమున 'క్షేత్రము' (శరీరము) క్షేత్రజ్ఞుడు (ఆత్మ) అను రెండింటి లక్షణములు తెల్పబడినవి. రెండవ శ్లోకమున పరమాత్మతో ఆత్మయొక్క ఏకత్వము ప్రతిపాదింపబడి, క్షేత్ర, క్షేత్రజ్ఞుల జ్ఞానమే నిజమైన జ్ఞానమని తెల్పబడినది. వికారములకు లోనగునట్టి క్షేత్రము (శరీరము) యొక్క స్వరూప స్వభావాదులను, ప్రభావ సహిత క్షేత్రజ్ఞుని (ఆత్మ) స్వరూపమును వర్ణింతునని మూడవ శ్లోకమున ప్రతిజ్ఞచేసి, భగవానుడు నాల్గవ శ్లోకమున ఋషుల వేదముల, బ్రహ్మసూత్రముల ప్రమాణములను చూపుచు, 5, 6 శ్లోకములయందు వికారసహితమైన క్షేత్రస్వరూపమును వివరించెను. 7 నుండి 11వ శ్లోకమువరకును తత్త్వజ్ఞాన ప్రాప్తియందు జ్ఞానమే సాధనమని తెల్పి, అమానిత్వాది 20 సాత్త్విక భావములను, ఆచరణములను వర్ణించెను. పిమ్మట 12 నుండి 17వ శ్లోకమువరకును జ్ఞానము ద్వారా తెలిసికొనదగిన పరమాత్మస్వరూపమును వర్ణించెను. 18వ శ్లోకమున ఇంతవఱకును ప్రతిపాదింపబడిన విషయములను పేర్కొనుచు వాటిని తెలిసికొనుట వలన కలుగు ఫలము పరమాత్మస్వరూపప్రాప్తియని తెల్పెను. అనంతరము ప్రకృతి, పురుషుల ప్రకరణమును ఆరంభించి, 19 నుండి 21వ శ్లోకము వఱకును ప్రకృతి స్వరూపమును, కార్యములను, అట్లే క్షేత్రజ్ఞుని స్వరూపమును వర్ణించెను. 22వ శ్లోకమున ఆత్మ, పరమాత్మల ఏకత్వమును ప్రతిపాదించెను. 23వ శ్లోకమున గుణసహితమైన ప్రకృతిని, పురుషుని తెలిసికొను ఫలమును తెలుపుచు 24, 25 శ్లోకములయందు పరమాత్మసాక్షాత్కారమునకు వేర్వేఱు ఉపాయములను (సాధన మార్గములను) వర్ణించెను. 26వ శ్లోకము క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంయోగము వలననే సమస్త చరాచరప్రాణుల ఉత్పత్తి జరుగుచున్నదని తెలిపెను. 27 నుండి 30వ శ్లోకము వరకును "పరమాత్మ అన్నింటియందును, (అన్ని ప్రాణులయందును) స్థితమైయున్నవాడు, శాశ్వతుడు, అకర్త అనియు, కర్మలన్నియును ప్రకృతిద్వారానే జరుగుననియు, అన్నింటియందును పరమాత్మతత్త్వము విస్తరించి, స్థితమై యుండుననియు," తెలిపెను. ఈ విధమైన జ్ఞానముయొక్క ప్రభావ ఫలములను గూడ తెలిపెను. 31 నుండి 33వ శ్లోకమువరకును ఆత్మయొక్క మహత్త్వమును వివరించుచు దాని అకర్తృత్వమును, నిర్లేపత్వమును నిరూపించెను. 34వ శ్లోకమున క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగములను తెలిసికొనుటవలన కలుగు ఫలము పరమాత్మప్రాప్తియని తెలుపుచు ఈ (13వ) అధ్యాయమును ముగించెను.

**సంబంధము -** 12వ అధ్యాయప్రారంభమున అర్జునుడు సగుణ నిర్గుణోపాసకులలో శ్రేష్ఠుడెవ్వరని ప్రశ్నించెను. దానికి సమాధానముగా భగవానుడు 2వ శ్లోకమున సగుణోపాసకుల శ్రేష్ఠత్వమును ప్రతిపాదించుచు 3 నుండి 5వ శ్లోకమువఱకును నిర్గుణోపాసన స్వరూపమును, దాని ఫలమును తెలిపి, దేహాభిమానులు దానిని అనుష్ఠించుట క్లిష్టతరమని పేర్కొనెను. అనంతరము 6 నుండి 20వ శ్లోకము వఱకును సగుణోపాసన మహత్త్వమును, ఫలమును, విధానమును, అట్లే భగవద్భక్తుల లక్షణములను వర్ణించుచు అధ్యాయమును ముగించెను.

నిర్గుణతత్త్వము, దాని మహిమ, తత్ప్రాప్తి సాధనలు అచట విస్తారముగా తెలుపబడలేదు - కనుక నిర్గుణ నిరాకారతత్త్వము అనగా జ్ఞానయోగవిషయము సమగ్రముగా వివరించుటకు 13వ అధ్యాయము ప్రారంభింపబడుచున్నది. ఇందు మొదట భగవానుడు క్షేత్రము, (శరీరము) క్షేత్రజ్ఞుడు (ఆత్మ) అను రెండింటి లక్షణములను తెలుపుచున్నాడు-

### శ్రీభగవాన్ ఉవాచ

**ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 1 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | ఏతత్ | = దీనిని గూర్చి | క్షేత్రజ్ఞః, ఇతి | = 'క్షేత్రజ్ఞుడు' అని |
| ఇదమ్, శరీరమ్ | = ఈ శరీరము | యః, వేత్తి | = ఎవరు తెలిసికొందురో | తద్విదః | = తత్త్వజ్ఞానులైన వారు |
| క్షేత్రమ్, ఇతి | = 'క్షేత్రము' అని | | | | |
| అభిధీయతే | = పిలువబడును | తమ్ | = అతనిని | ప్రాహుః | = పేర్కొందురు. |

**శ్రీ భగవానుడు పలికెను - ఓ కౌంతేయ! ఈ శరీరమును 'క్షేత్రము' అని పేర్కొందురు. ఈ క్షేత్రమును గూర్చి ఎఱింగిన వానిని 'క్షేత్రజ్ఞుడు' అని తత్త్వము తెలిసిన జ్ఞానులు తెలుపుదురు.(1)**

ప్రశ్న - **'శరీరమ్'** అను పదముతోపాటు **'ఇదమ్'** అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి? శరీరమును **'క్షేత్రము'** అని పేర్కొనుటకు గల కారణమేమి?

సమా - ఈ శరీరము ఆత్మద్వారా చూడబడును, తెలియబడును. కనుక ఇది దృశ్యము. ద్రష్టయైన ఆత్మకంటెను ఇది సర్వథా వేఱైనది. కనుక **'శరీరమ్'** అను పదముతోపాటు **'ఇదమ్'** అను పదము ప్రయుక్తమైనది - పొలమునందు నాటబడిన విత్తనములకు అనురూపమైన ఫలము తగిన సమయమున ప్రకటితమగును. అట్లే ఈ శరీరమున నాటబడిన కర్మసంస్కార రూపబీజముల ఫలముగూడ తగిన సమయమున ప్రకటితమగును. కనుక దీనిని **'క్షేత్రము'** అని వ్యవహరింతురు. అంతేగాక ఇది (శరీరము) ప్రతిక్షణము క్షీణించుచునే యుండును. అందువలన గూడ దీనిని **'క్షేత్రము'** అనియందురు. కనుక 15వ అధ్యాయమున దీనిని **'క్షరపురుషుడు'** అనియును పేర్కొనుట జరిగినది. ఈ క్షేత్ర స్వరూపము ఈ అధ్యాయమునందలి 5వ శ్లోకమున సంక్షిప్తముగా తెలుపబడినది.

ప్రశ్న - **"ఈ క్షేత్రమును తెలిసికొన్న వానిని 'క్షేత్రజ్ఞుడు' అందురు"** - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - అంతరాత్మయే **'ద్రష్ట'** యని భగవానుడు ఈ వాక్యము ద్వారా తెలిపెను. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, మహాభూతములు, ఇంద్రియ విషయములు మొదలగు **'జ్ఞేయ'** (తెలియదగిన) దృశ్యవర్గములన్నియును జడములు, నశ్వరములు, పరిణామశీలములు. చేతనుడైన ఈ క్షేత్రజ్ఞుడు (ఆత్మ) ఈ దృశ్యవర్గముకంటెను సర్వథా విలక్షణుడు. కనుక అతడు దానియొక్క జ్ఞాత, అధిపతి, దానితో ఉండువాడు. కనుక ఆత్మను **'క్షేత్రజ్ఞుడు'** అందురు. జ్ఞాతయైన ఈ చైతన్యవంతమైన ఆత్మనే 7వ అధ్యాయమున 'పరాప్రకృతి' యనియు, (7/5) 8వ అధ్యాయమున అధ్యాత్మము అనియు (8/3), 15వ అధ్యాయమున **'అక్షరపురుషుడు'** అనియు, వ్యవహరించుట జరిగినది. (15/16) ఈ ఆత్మతత్త్వము మిక్కిలి గహనమైనది. కనుక భగవానుడు దీనిని వేర్వేరు ప్రకరణములయందు ఒకచోట స్త్రీవాచకముగను, మరియొకచోట నపుంసక వాచకముగను వేరొకచోట పురుషవాచకముగను పేర్కొనెను. వాస్తవముగ **'ఆత్మ'** సర్వథా వికారరహితము. లింగాతీతము, నిత్యము, నిర్వికారము, చేతన జ్ఞాన స్వరూపము.

ప్రశ్న - 'తద్విదః' అనగానేమి?

సమా - ఇందు **'తత్'** శబ్దము ద్వారా **'క్షేత్ర-క్షేత్రజ్ఞులు'** అను రెండును గ్రాహ్యములు. ఈ రెండింటి యథార్థ రూపమును సంపూర్ణముగా తెలిసినవారిని **'తద్విదః'** అనియందురు. తత్త్వవేత్తలయిన మహాత్ములు ఈ విషయమును తెల్పుదురు, కావున ఇందు ఎట్టి సందేహమునకు తావులేదు.

*సంబంధము - ఈ విధముగా క్షేత్ర-క్షేత్రజ్ఞుల లక్షణములను తెలిపి, క్షేత్రజ్ఞుడు, పరమాత్ముడు ఒక్కటియే అని తెల్పు జ్ఞానమును నిరూపణ చేయుచున్నాడు-*

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥ 2 ॥**

| పదము | | అర్థము |
|---|---|---|
| భారత! | = | ఓ అర్జునా! |
| సర్వక్షేత్రేషు | = | క్షేత్రములన్నింటిలో ఉన్న |
| క్షేత్రజ్ఞమ్ అపి | = | క్షేత్రజ్ఞుని (జీవాత్మను) గూడ |
| మామ్ | = | నన్నుగా (నేనేయని) |
| విద్ధి | = | ఎఱుంగుము |
| చ | = | మఱియు |
| క్షేత్ర-క్షేత్రజ్ఞయోః | = | క్షేత్ర, క్షేత్రజ్ఞుల యొక్క (ప్రకృతి పురుషుల యొక్క) |
| యత్, జ్ఞానమ్ | = | ఏ తత్త్వజ్ఞానము గలదో |
| తత్ | = | అది |
| జ్ఞానమ్ (ఇతి) | = | జ్ఞానము అని |
| మమ, మతమ్ | = | నా అభిప్రాయము |

**ఓ అర్జునా! అన్ని క్షేత్రములయందున్న క్షేత్రజ్ఞుడను అనగా జీవాత్మను నేనే అని తెలిసికొనుము. క్షేత్రక్షేత్రజ్ఞులకు సంబంధించిన జ్ఞానము అనగా వికారసహిత (త్రిగుణాత్మకమైన) ప్రకృతి మరియు నిర్వికారపురుషుల తత్త్వములనుగూర్చి తెలిసికొనుటయే 'జ్ఞానము' అని నా అభిప్రాయము. (2)**

ప్రశ్న - 'అన్ని క్షేత్రముల యందలి క్షేత్రజ్ఞుడను (జీవాత్మను) నేనే యని యెఱుంగుము' అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇందు భగవానుడు ఆత్మపరమాత్మల ఏకత్వమును ప్రతిపాదించుచున్నాడు. ఆత్మపరమాత్మల మధ్య 'వస్తుతః' ఎట్టి భేదమూలేదు. ప్రకృతి సాంగత్యము వలన భేదము ఉన్నట్లు గోచరించుచుండును. కనుక 2వ అధ్యాయమునందలి 24, 25 శ్లోకములయందు ఆత్మ స్వరూపమును వర్ణించుటకు ప్రయుక్తములైన శబ్దములే 12వ అధ్యాయమున 3వ శ్లోకమున నిర్గుణ నిరాకార పరమాత్మ లక్షణములను వర్ణించునప్పుడును ప్రయోగింపబడెను. సమస్త క్షేత్రములయందలి చైతన్యస్వరూపమైన ఆత్మ అనగా క్షేత్రజ్ఞుడు భగవదంశయే యగుట వలన (15/7) 'వస్తుతః' భగవంతుని కంటె వేఱుగాదు. పరమాత్మయే జీవాత్మ రూపములో వేర్వేఱుగా గోచరించుచున్నాడు.

ప్రశ్న - సర్వక్షేత్రములయందును అనగా శరీరముల యందును 'క్షేత్రజ్ఞుడు' మఱియు భగవానుడు గూడ స్థితులై యున్నారని భావించిన దోషమేమి?

సమా - భక్తి ప్రధాన ప్రకరణమైనచో ఆ విధముగా గూడ భావింపవచ్చును. ఇచ్చటి ప్రకరణము జ్ఞాన ప్రధానమైనది. ఇందు జ్ఞానసాధనముగా భక్తి వర్ణింపబడినది. కనుక ఇచటి భక్తి స్థానము గౌణమైనది. అందువలన అద్వైతపరమైన వ్యాఖ్యయే సముచితముగా తోచును.

ప్రశ్న - "క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే నిజమైన జ్ఞానము అని నా అభిప్రాయము" అని యనుటలోని ఆంతర్యము ఏమి?

సమా - క్షేత్రము ఉత్పత్తి వినాశలక్షణములు గలది. ఇది జడము, అనిత్యము, జ్ఞేయము, క్షణికము. క్షేత్రజ్ఞుని లక్షణములు వీటికంటె భిన్నమైనవి. అతడు (క్షేత్రజ్ఞుడు - ఆత్మ) నిత్యుడు, చేతనుడు, జ్ఞాత, నిర్వికారుడు, శుద్ధుడు సర్వదా ఒకే విధముగా ఉండువాడు. కనుక ఈ రెండును పరస్పరము అత్యంత విలక్షణమైనవి. అజ్ఞానము వలననే రెండును ఒక్కటిగా గోచరించును. ఈ తత్త్వమును తెలిసికొనుటయే నిజమైన జ్ఞానము. "ఇది నా అభిప్రాయము" అని యనుట వలన ఇందెట్టి సంశయమునకును, భ్రమకును తావులేదని భగవానుడు తెలిపెను.

*సంబంధము - క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞానము సంపూర్ణముగా కలిగినంతనే ప్రాపంచిక భ్రమలు తొలగి పోవును. పరమాత్మ ప్రాప్తి కల్గును. కనుక క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపాదులను విభాగ పూర్వకముగా సమగ్రముగా తెలిసికొనవలెనని భగవానుడు తెలుపుచున్నాడు-*

**తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।**
**స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 3 ॥**

తత్, క్షేత్రమ్ = ఆ క్షేత్రము
యత్, చ = ఏదియో,
యాదృక్, చ = ఎటువంటిదో
యద్వికారి = ఎట్టి వికారములు కలదో
యతః, చ, యత్ = దేని నుండి ఉత్పన్నమైనదో (అట్లే)
సః, చ = ఆ క్షేత్రజ్ఞుడును
యః = ఎవరో
యత్ప్రభావశ్చ = ఎట్టి ప్రభావము గలవాడో
తత్ = దానిని (ఆ విషయము అన్నింటిని)
సమాసేన = సంక్షిప్తముగా
మే = నా నుండి
శృణు = వినుము

**క్షేత్రమనగానేమి? అది యెట్లుండును? దాని వికారములు (భావములు) ఏవి? ఆ వికారములు దేనినుండి ఏర్పడినవి? అట్లే క్షేత్రజ్ఞుడు అనగా ఎవరు? అతని ప్రభావమేమి? ఆ వివరములను అన్నింటిని సంక్షిప్తముగా తెలిపెదను వినుము (3)**

ప్రశ్న - 'క్షేత్రమ్' అను పదముతో పాటు 'తత్' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి? 'యత్' అను పదము ద్వారా క్షేత్రమునకు సంబంధించిన ఏ విషయమును భగవానుడు స్పష్టీకరింప దలచెను? అది యే శ్లోకమున గలదు?

సమా - 'క్షేత్రమ్' అను పదముతో పాటు 'తత్' అను పదమును ప్రయోగించుట ద్వారా మొదటి శ్లోకమున తెల్పబడిన శరీరరూపక్షేత్రలక్షణములే ఈ శ్లోకమున స్పష్టీకరింపబడుచున్నవని పేర్కొనుట జరిగినది - 'యత్' అను పదము ద్వారా క్షేత్ర స్వరూపమును తెల్పెదనని భగవానుడు సూచించెను. అది ఈ యధ్యాయమునందలి 5వ శ్లోకమున తెల్పబడినది.

ప్రశ్న - 'యాదృక్' అను పదము ద్వారా క్షేత్రము యొక్క యే విషయము సూచింపబడినది. అది యెచ్చట తెల్పబడినది?

సమా - 'యాదృక్' అను పదము ద్వారా భగవానుడు క్షేత్రస్వభావమును తెల్పెదనని సూచించెను. సమస్త భూతములును ఉత్పత్తి వినాశశీలములని తెల్పుచు 26, 27 శ్లోకములలో దాని వర్ణనము చేయబడినది.

ప్రశ్న - 'యద్వికారి' అను పదము ద్వారా క్షేత్రము యొక్క ఏ విషయము తెల్పుదునని భగవానుడు సూచించెను? దానిని ఏ శ్లోకమున తెల్పెను?

సమా - 'యద్వికారి' అను పదము ద్వారా క్షేత్రము యొక్క వికారములను వర్ణింతునని సూచించెను. ఆ వర్ణనను భగవంతుడు 6వ శ్లోకమున జేసెను.

ప్రశ్న - 'యతః, చ, యత్' అను పదముల ద్వారా క్షేత్రము యొక్క ఏయే విషయములను గూర్చి తెల్పుటకు భగవానుడు సూచించెను? అయా విషయములు ఎచ్చట తెల్పబడెను?

సమా - 'క్షేత్రము' అని వ్యవహరింపబడు వివిధ పదార్థములలో ఏది ఎచ్చట ఉత్పన్నమైనది? అను విషయమును తెల్పెదనని భగవానుడు 'యతః, చ, యత్' అను పదముల ద్వారా సూచించెను. ఆ విషయవర్ణనము 19వ శ్లోక ఉత్తరార్థమునను, 20వ శ్లోక పూర్వార్థమునను చేయబడెను.

ప్రశ్న - 'సః' అను పదము ఎవరిని సూచించును? అట్లే 'యః' అను పదము ద్వారా అతనికి సంబంధించిన ఏ విషయమును తెల్పుటకు సూచన చేసెను. అది ఎచ్చట తెల్పబడినది?

సమా - 'సః' అను పదము క్షేత్రజ్ఞుని తెల్పును. అతని స్వరూపమును తెల్పెదనని 'యః' అను పదము ద్వారా భగవానుడు సూచించెను. ముందుగా అతని ప్రకృతిస్థమైన మఱియు వాస్తవికమైన రెండు స్వరూపములను వర్ణించెను. 19వ శ్లోకమున 'అనాది' అనియు 20వ శ్లోకమున సుఖదుఃఖముల భోక్తయనియు, 21వ శ్లోకమున ఉచ్చ, నీచ యోనులయందు జన్మించువాడనియు తెల్పి, ప్రకృతిస్థపురుషుని స్వరూపమును వివరించెను. 22వ శ్లోకమునను, అట్లే 27 నుండి 30వ శ్లోకము వఱకును పరమాత్మతో అతని ఏకత్వమును ప్రతిపాదించి, ఆక్షేత్రజ్ఞుని వాస్తవ స్వరూపమును నిరూపించెను.

ప్రశ్న - 'యత్ప్రభావః' అను పదము ద్వారా క్షేత్రజ్ఞుని యేవిషయమును తెల్పెదనని భగవానుడు సూచించెను? దానిని ఏ శ్లోకమునందు తెల్పెను?

సమా - 'యత్ప్రభావః' అను పదము ద్వారా క్షేత్రజ్ఞుని ప్రభావమును గూర్చి భగవానుడు సూచించెను. దానిని 31, 32, 33 శ్లోకములలో తెల్పెను.

సంబంధము - "క్షేత్ర, క్షేత్రజ్ఞుల" వివిధ తత్త్వములను గురించి, సంక్షిప్తముగా తెల్పెదనని భగవానుడు 3వ శ్లోకమున అర్జునునితో పల్కెను. ఇప్పుడా విషయములయందు ఋషుల, వేదముల, బ్రహ్మసూత్రముల వచనములను ప్రమాణముగా తెలిపి భగవానుడు వారిని ఆదరించెను-

**ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్ ।**
**బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఋషిభిః | = (ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల తత్త్వము) ఋషులచేత | వివిధైః ఛందోభిః | = వివిధములైన వేదమంత్రములద్వారా | వినిశ్చితైః | = నిశ్చయాత్మకములైన |
| | | | | హేతుమద్భిః | = సహేతుకములైన |
| | | పృథక్ | = వేర్వేఱుగా | బ్రహ్మసూత్ర పదైః, ఏవ | = బ్రహ్మసూత్రపదముల ద్వారాకూడ |
| బహుధా | = అనేకవిధములుగా | (గీతమ్) | = (తెలుపబడినది) | | |
| గీతమ్ | = వివరింపబడినది | చ | = అట్లే | (గీతమ్) | = చెప్పబడినది. |

క్షేత్ర, క్షేత్రజ్ఞులతత్త్వములనుగూర్చి ఋషులెల్లరును బహువిధములుగా వివరించిరి. వివిధవేదమంత్రములును వేర్వేరుగా తెల్పినవి. అట్లే బ్రహ్మసూత్ర పదములుగూడ నిశ్చయాత్మకముగ సహేతుకముగ తేటతెల్లము గావించినవి. **(4)**

ప్రశ్న - "ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల తత్త్వము ఋషులచే పలువిధములుగా వివరింపబడినది." అనియనుటలోని అంతర్యమేమి?

సమా - మంత్రద్రష్టలు, శాస్త్రములను, స్మృతులను రచించిన మహర్షులు, క్షేత్ర, క్షేత్రజ్ఞుల స్వరూపములను, వాటికి సంబంధించిన అన్ని విషయములను తమ గ్రంథముల యందును, పురాణేతిహాసములయందును. అనేక విధములుగా వర్ణించి, విపులముగా వివరించిరి. ఆ విషయముల సారమునే సంక్షిప్తముగా తెల్పెదనని భగవానుడు నుడివెను.

ప్రశ్న - 'వివిధైః' అను విశేషణముతో పాటు 'ఛందోభిః' అను పదము దేనిని సూచించును? వాటి ద్వారా అది (ఆ తత్త్వము) వేర్వేఱుగా (విభాగపూర్వకముగా) తెల్పబడినది - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 'వివిధైః' అను విశేషణముతో పాటు 'ఛందోభిః' అను పదము ఋక్ యజుస్సామాథర్వ వేదముల సంహితలు, బ్రాహ్మణములు అను రెండు భాగములను సూచించును. ఉపనిషత్తులు వివిధ శాఖలును ఇందులో అంతర్భాగములు, వీటన్నిటిద్వారా ఆ తత్త్వము వేర్వేఱుగా పేర్కొనబడినది - క్షేత్ర, క్షేత్రజ్ఞుల విషయమున భగవానుడు సంక్షిప్తముగా ప్రకటించు సిద్ధాంతములే విపులముగా వేర్వేఱుగా అనేక విధములుగా అందు (వేదాదులయందు) వర్ణింపబడినవి.

ప్రశ్న - 'వినిశ్చితైః' 'హేతుమద్భిః' అను విశేషణములతో పాటు 'బ్రహ్మసూత్రపదైః' అను సమాసము ఏ పదములను తెల్పును? దీని అంతర్యమేమి?

సమా - సమగ్రముగా నిశ్చయింపబడిన అన్నివిధముల అసందిగ్ధమైన పదములను 'వినిశ్చితము'లని యందురు. యుక్తియుక్తములైన అనగా వేర్వేఱు యుక్తుల ద్వారా నిర్ణయింపడిన సిద్ధాంతములను "హేతుమత్" అని యందురు. కనుక ఈ రెండు విశేషణములతోపాటు ప్రయుక్తమైన 'బ్రహ్మసూత్రపదైః' అను సమాసము 'అథాతోబ్రహ్మజిజ్ఞాసా' మొదలగు సూత్రములు గల వేదాంత దర్శనమును సూచించును - పేలనన పైన తెల్పబడిన లక్షణములన్నియు వాటిలో చక్కగా లభించును. శ్రుతి, స్మృత్యాదులలో వర్ణింపబడిన క్షేత్రక్షేత్రజ్ఞుల తత్త్వము బ్రహ్మ సూత్రముల ద్వారా సహేతుకముగా వివరింపబడినది. దాని సారాంశమునే భగవానుడిచట సంక్షిప్తముగా తెల్పుచున్నాడు.

సంబంధము - ఈ విధముగ ఋషులను, వేదములను, బ్రహ్మసూత్రములను ప్రమాణములుగా పేర్కొనిన పిమ్మట భగవానుడు 3వ శ్లోకమున 'యత్' అను పదము ద్వారా తెల్పబడిన క్షేత్రమును గూర్చియు, 'యద్వికారి' అను పదము ద్వారా తెల్పబడిన దాని వికారములను గూర్చియు 2 శ్లోకములలో వర్ణించుచున్నాడు-

**మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।**
**ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః ॥ 5 ॥[1]**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాభూతాని | = పంచమహాభూతములు (పృథివ్యాపస్తేజోవాయురాకాశములు) | చ | = మఱియు | ఏకమ్ | = మనస్సు |
| అహంకారః | = అహంకారము | అవ్యక్తమ్, ఏవ | = మూలప్రకృతియు | చ | = మఱియు |
| బుద్ధిః | = బుద్ధి | చ | = అట్లే | పంచ | = ఐదు |
| | | దశ, ఇంద్రియాణి | = ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు | ఇంద్రియ-గోచరాః | = ఇంద్రియ విషయములు (శబ్దస్పర్శరూపరసగంధములు) |

**పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, మూలప్రకృతియు, అట్లే దశేంద్రియములు, మనస్సు, పంచేంద్రియగ్రాహ్యవిషయములు (శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు) (5)**

ప్రశ్న - 'మహాభూతాని' అను సమాసము దేనిని సూచించును?

సమా - స్థూలభూతములకు, శబ్దాది విషయములకు కారణరూపములైన పంచతన్మాత్రలు అనగా సూక్ష్మపంచ మహాభూతములనే **"మహాభూతాని"** అను పదము తెల్పెను. ఇవి 7వ అధ్యాయమున భూమి, నీరు, అగ్ని (తేజస్సు) వాయువు, ఆకాశము అను పేర్లతో తెల్పబడినవి.ది

ప్రశ్న - **'అహంకారము'** అను పదము దేనిని సూచించును?

సమా - ఇది సమష్టి అంతఃకరణము యొక్క ఒక భేదము. అహంకారమే పంచతన్మాత్రలకును, మనస్సు, ఇంద్రియములకును కారణము. మహత్తత్త్వము యొక్క కార్యము. దీనినే అహంభావము అనియును అందురు. ఇచట అహంకారము అను పదము దీనినే సూచించును.

ప్రశ్న - బుద్ధి అను పదము దేనిని సూచించును?

సమా - దీనిని **'మహత్తత్త్వము'** అనియు, సమష్టిబుద్ధి యనియు అందురు. ఇది సమష్టి అంతఃకరణముయొక్క భేదము. నిశ్చయించుటయే దీని స్వరూపము. **'బుద్ధి'** అను పదము దీనినే సూచించును.

---

(1) ఇంచుమించు దీనితో సరిపోవు వర్ణన (సాంఖ్యకారిక, 3) యోగదర్శనములయందు గలదు -

మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త ।
షోడశకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః ॥

మూలప్రకృతి దేనికిని వికృతి (వికారరూపము) కాదు. మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు) ఈ ఏడును ప్రకృతి - వికృతి అనబడును - అనగా ఈ ఏడును, పంచమహాభూతములకు కారణములు అగుటచే 'ప్రకృతి' అనియు, మూలప్రకృతికి కార్యములగుటచే 'వికృతి' యనియు ఎఱుంగవలెను. ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, మనస్సు, అను ఈ 11 ఇంద్రియములును, మఱియు పంచమహాభూతములు - ఈ 16 కేవలము వికృతులు. (వికారములు) అవి దేనికిని ప్రకృతులు (కారణములు) కావు. వీటిలో 11 ఇంద్రియములు అహంకారమునకును, పంచ స్థూలమహాభూత పంచతన్మాత్రలకును కార్యములు. కాని పురుషుడు దేనికిని కారణముగాని, కార్యముగాని కాడు. అతడు సర్వథా అసంగుడు.

యోగదర్శమునందు ఇట్లు చెప్పబడినది - "విశేషావిశేషలింగ మాత్రాలింగాని గుణపర్వాణి । (2/19) విశేషములు అనగా పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనస్సు, ఐదు (5) స్థూల భూతములు, అవిశేషములు అనగా అహంకారము, పంచతన్మాత్రలు, లింగమాత్రము అనగా మహత్తత్త్వము, అలింగము అనగా మూల ప్రకృతి - ఈ 24 తత్త్వములును "గుణముల అవస్థావిశేషములు." వీనిని 'దృశ్యములు' అనియందురు. యోగదర్శనమున 'దృశ్యము' అని తెల్పబడినదియే గీతయందు 'క్షేత్రము' అని పేర్కొనబడినది.

ప్రశ్న - 'అవ్యక్తమ్' అను పదము దేనిని సూచించును?

సమా - ఇది మహత్తత్త్వాది సమస్త పదార్థములకును కారణ రూపమైన మూల ప్రకృతి. సాంఖ్యశాస్త్రమునందు దీనిని 'ప్రధానము' అని యందురు. 14వ అధ్యాయమున దీనిని 'మహద్బ్రహ్మ' యనియు, ఈ అధ్యాయమునందలి 19వ శ్లోకమున ప్రకృతి యనియు భగవానుడు పేర్కొనెను. అవ్యక్తము అను పదము దీనినే సూచించును.

ప్రశ్న - 'దశేంద్రియములు' ఏవి?

సమా - వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు అను కర్మేంద్రియములును (5) త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములు అను జ్ఞానేంద్రియములును (5) కలసి (10) దశేంద్రియములు - వీటియన్నింటికిని అహంకారము కారణము.

ప్రశ్న - 'ఏకమ్' అను పదము దేనిని సూచించును?

సమా - 'ఏకమ్' అను పదము 'మనస్సు'ను సూచించును. ఇది సమష్టి అంతఃకరణమున మననము చేయు శక్తి విశేషము. సంకల్ప వికల్పములే దీని స్వరూపము. ఇదియు అహంకారము యొక్క కార్యమే.

ప్రశ్న - 'పంచ-ఇంద్రియగోచరాః' అనగానేమి?

సమా - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనునవి ఐదు జ్ఞానేంద్రియ స్థూల విషయములు. వీటిని సూచించునదియే పంచేంద్రియ గోచరాః అను సమాసము.

**ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।**
**ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇచ్ఛా | = కోరిక | చేతనా | = చైతన్యము | ఏతత్ | = ఇదియే |
| ద్వేషః | = ద్వేషము | ధృతిః | = ధృతి | క్షేత్రమ్ | = క్షేత్రస్వరూపమని |
| సుఖమ్ | = సుఖము | సవికారమ్ | = ఉపర్యుక్త వికారములతో గూడినట్టి | సమాసేన | = సంగ్రహముగా |
| దుఃఖమ్ | = దుఃఖము | | | ఉదాహృతమ్ | = చెప్పబడినది. |
| సంఘాతః | = స్థూలశరీరము | | | | |

**ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, స్థూలశరీరము, చైతన్యము, ధృతి అను వికారములతో గూడిన 'క్షేత్రస్వరూపము' సంక్షిప్తముగా పేర్కొనబడినది. (6)**

ప్రశ్న - 'ఇచ్ఛ' అనగానేమి?

సమా - మానవుడు సుఖహేతువులుగా దుఃఖ నాశకములుగా భావించు పదార్థములను పొందవలెనను ఆసక్తి యుక్తమైన కోరికనే 'ఇచ్ఛ' అని యందురు. వాసన, తృష్ణ, ఆశ, లాలస, స్పృహ మొదలగు అనేక భేదములు ఇందు గలవు. ఇది అంతఃకరణము యొక్క వికారము. కనుక ఇది క్షేత్రవికారముగా పరిగణింపబడినది.

ప్రశ్న - 'ద్వేషము' అనగానేమి?

సమా - మానవుడు దుఃఖహేతువులుగా, సుఖబాధకములుగా భావించు పదార్థముల యెడ గల విరోధ బుద్ధినే (భావమునే) 'ద్వేషము' అని యందురు. వైరము, ఈర్ష్య, ఘృణ, క్రోధము మొదలగునవి దీని స్థూలరూపములు. ఇదియును అంతఃకరణ వికారమే. కనుక దీనిని క్షేత్రము యొక్క వికారములలో చేర్చుట జరిగినది.

ప్రశ్న - 'సుఖము' అనగానేమి?

సమా - అనుకూల ప్రాప్తి, ప్రతికూలనివృత్తి వలన అంతఃకరణమున కలుగు ప్రసన్నతా వృత్తినే 'సుఖము' అనియందురు. ఇదియు అంతఃకరణవికారము అగుటవలన 'క్షేత్రవికారము'గా పరిగణింపబడినది.

ప్రశ్న - 'దుఃఖము' అను పదము దేనిని సూచించును?

సమా - ప్రతికూలస్థితి ప్రాప్తి, అనుకూల స్థితి వినాశము అను అంతఃకరణమున కలుగు వ్యాకులతను లేక వ్యథను సూచించునదియే 'దుఃఖము' అను పదము. ఇదియు అంతఃకరణవికారమే గనుక దీనిని క్షేత్రవికారములలో చేర్చుట జరిగినది.

ప్రశ్న - 'సంఘాతః' అను పదమునకర్థమేమి?

సమా - పంచభూతములతో ఏర్పడిన స్థూలశరీరమునే 'సంఘాతః' అనియందురు. మరణానంతరము

సూక్ష్మశరీరము వదలివెళ్ళినను అందఱియెదుట ఇది పడియుండును. ఇది పంచభూతముల వికారమగుట వలన క్షేత్రవికారములలో చేర్చబడినది.

ప్రశ్న - 'చేతనా' అను పదము దేనిని సూచించును?

సమా - అంతఃకరణమునందు గల 'జ్ఞానశక్తినే' 'చేతనా' అను పదము తెల్పును. దీని ద్వారా సుఖదుఃఖముల, సమస్త పదార్థముల అనుభవము కలుగును. దీనినే 10వ అధ్యాయమునందలి 22వ శ్లోకమున 'చేతనా' అని పేర్కొనుట జరిగినది. ఇదియును అంతఃకరణము యొక్క వృత్తి విశేషమే. కనుక దీనిని గూడ క్షేత్రవికారములలో ఒకటిగా పరిగణింపదగును.

ప్రశ్న - 'ధృతిః' అను పదము దేనిని సూచించును?

సమా - 18వ అధ్యాయము నందలి 33, 34, 35 శ్లోకములయందు సాత్త్విక, రాజస, తామస భేదములుగా వర్ణింపబడిన ధారణాశక్తినే 'ధృతిః' అను పదము సూచించును. దీని సాత్త్వికాంశము 16వ అధ్యాయము నందలి 3వ శ్లోకములో దైవీ సంపదంతర్గతమైన 'ధృతి' యని పేర్కొనబడినది. అంతఃకరణవికారమగుట వలన ఇదియును క్షేత్ర వికారములలో చేర్చబడినది.

ప్రశ్న - "వికారసహితమైన క్షేత్రము సంక్షిప్తముగా వివరింపబడినది." అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇంతవరకును వికారసహితమైన క్షేత్రవర్ణన సంక్షిప్తముగా జరిగినది. 5వ శ్లోకమున క్షేత్ర స్వరూపము, 6వ శ్లోకమున దాని వివిధవికారములైన ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, స్థూలదేహము, చేతన, ధృతి అనునవి సంక్షిప్తముగా తెల్పబడినవి.

*సంబంధము - ఈ విధముగా క్షేత్ర స్వరూపము, దాని వికారములు భగవానుడు వర్ణించెను. క్షేత్ర, క్షేత్రజ్ఞుల జ్ఞానమే నిజమైన జ్ఞానమని 2వ శ్లోకమున నుడివి యుండెను. అట్టి జ్ఞానప్రాప్తికై తగు సాధనములను గూడ 'జ్ఞానము' అను పేరుతోడనే 5 శ్లోకముల ద్వారా వర్ణించుచున్నాడు-*

**అమానిత్వమదంభిత్వమ్ అహింసా క్షాంతిరార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ 7 ॥**

అమానిత్వమ్ = తానే శ్రేష్ఠుడనను భావము లేకుండుట; అదంభిత్వమ్ = దాంభికములేకుండుట; అహింసా = ఏ ప్రాణినీ ఏ విధముగను హింసింపకుండుట; క్షాంతిః = క్షమాగుణము; ఆర్జవమ్ = మనోవాక్కులయందు సరళత్వము; ఆచార్యోపాసనమ్ = భక్తిశ్రద్ధలతో గురుజనుల సేవ; శౌచమ్ = బాహ్యాభ్యంతరశుద్ధి; స్థైర్యమ్ = అంతః కరణ స్థిరత్వము; ఆత్మవినిగ్రహః = మనస్సు, శరీరేంద్రియముల నిగ్రహము

**తానే శ్రేష్ఠుడనను భావము లేకుండుట, దాంభికము లేకుండుట, అహింస, క్షమించుగుణము, మనోవాక్కుల యందు సరళత్వము, శ్రద్ధాభక్తులతో గురుజనులను సేవించుట, బాహ్యాభ్యంతరశుద్ధి, అంతఃకరణస్థిరత్వము, మనశ్శరీరేంద్రియముల నిగ్రహము. (7)**

ప్రశ్న - 'అమానిత్వమ్' అనగానేమి?

సమా - "నేను సర్వశ్రేష్ఠుడను, సమ్మాన్యుడను, పూజ్యుడను, మిక్కిలి గొప్ప వాడను" అని తనను గూర్చి తానే భావించుకొనుచు తన గౌరవప్రతిష్ఠల కొరకును, పూజాదికమునకును ప్రాకులాడుచుండుటను, అవి తాను కోరకయే ప్రాప్తించినపుడు గర్వముతో పొంగిపోవుటను 'మానిత్వము' అనియందురు. ఇవి లేకుండుటను 'అమానిత్వము' అనియందురు. అట్టి అమానిత్వము సంపూర్ణముగానున్న వాడు గౌరవ ప్రతిష్ఠలు, పూజాదికములు లభించినపుడు పొంగిపోడు సరిగదా! వాటి యెడల ఉదాసీనభావము, విరక్తి కలిగియుండును.

ప్రశ్న - 'అదంభిత్వమ్' అనగానేమి?

సమా - సమాజములో గౌరవప్రతిష్ఠలను, పూజలను పొందుటకును, ధనలోభముచే ఇతరులను మోసగించిదానిని కప్పిపుచ్చుకొనుటకును, తననుగూర్చి, ధర్మాత్మునిగా, దానశీలునిగా, భగవద్భక్తునిగా, జ్ఞానిగా, మహాత్మునిగా

ప్రచారము చేసికొనుటను, తనలో లేకున్నను ధర్మపాలనము, ఔదార్యము, దాతృత్వము, భక్తి, యోగసాధన వ్రత-ఉపవాసాదుల ఆచరణము, ఇంకను ఇతర సద్గుణములు కలిగియున్నట్లు నటించుటను దంభిత్వ మందురు. ఇది సర్వథా లేకుండుటనే 'అదంభిత్వము' అనియందురు. అదంభిత్వము సంపూర్ణముగా ఉన్న సాధకుని యందు గౌరవ ప్రతిష్ఠలకై ఏ మాత్రము కోరికలేనందువలన తన ధార్మిక భావములను, సద్గుణములను, భక్తితో గూడిన ఆచరణమును ఇతరుల యెదుట ప్రకటించుటకు ఇష్టపడడు. ఇక లేని గుణములను అతడు తనలో ఉన్నట్లు ప్రదర్శించు ప్రసక్తియే రాదు.

ప్రశ్న - అహింస యనగానేమి?

సమా - ఏ ప్రాణినైనను మనోవాక్కాయములచే ఏ విధముగనైనను కష్టపెట్టుట అనగా మనస్సులో ఇతరులకు కీడుతలపెట్టుట, వాక్కుద్వారా ఇతరులను తిట్టుట, కఠోరవచనములను పల్కుట, నిందించుట, ఏవిధముగనైనను దుఃఖము, అహితము కలిగించు మాటను పలుకుట, శారీరికముగా కొట్టుట, బాధించుట, ఏదోయొకవిధముగా హానిని కలిగించుట మొదలగునవి యన్నియును హింస యనబడును. ఇట్టివి ఏవియును ఏమాత్రము లేకుండుటయే అహింస యనబడును. ఇట్టి అహింసాభావము సంపూర్ణముగా నుండు సాధకునకు ఎవ్వరి యెడలను వైరభావము, ద్వేషము ఉండవు. కనుక అతని వలన ఏ ప్రాణికిని, ఎన్నడును అహితము ఏమాత్రము జరుగదు. ఎవ్వరికిని పరోక్షముగనైనను, పరిణామమునకైనను అతని కారణముగ దుఃఖము కలుగదు. వాస్తవముగా అతడెవ్వరికిని భయకారకుడే గాడు. అట్టివాని సమీపమున నుండు క్రూరమృగములు సైతము తమ హింసాస్వభావములను త్యజించును. పరస్పర వైరభావములు గల జంతువులును ఆ వైరములను వీడి, మైత్రితో మెలగును.[1]

ప్రశ్న - 'క్షాన్తిః' అనగానేమి?

సమా - క్షమాభావమునే 'క్షాంతి' అనియందురు. తన యెడల అపరాధము చేసిన వానిని గూడ ఏ విధముగను దండింపవలెనను భావము మనస్సులో లేకుండుటయు, అతనిపై పగదీర్చుకొనుటకై ఆలోచింపకుండుటయు, అతనికి ఇహలోకమునందు గాని, పరలోకమునందు గాని 'దండన' జరుగవలెనని కోరకుండుటయు, వాని అపరాధములను వాస్తవముగా అపరాధములుగనే భావింపకుండుటయు, వాటిని సర్వథా మఱచిపోవుటయు "క్షమాభావము" (క్షాంతి) అనబడును 10వ అధ్యాయము నందలి 4వ శ్లోకమున దీని వ్యాఖ్యానము విస్తృతముగా చేయబడినది.

ప్రశ్న - 'ఆర్జవమ్' అనగానేమి?

సమా - మనోవాక్కాయముల సరళత్వమునే 'ఆర్జవమ్' అనియందురు. ఈ సారళ్యభావము సంపూర్ణముగా నుండు సాధకుడు అందరితోను సరళముగనే వ్యవహరించును. అతనిలో 'కుటిలత్వము' ఏ మాత్రము ఉండదు. అనగా అతని వ్యవహారము (జీవితము) నందు కృత్రిమము, కపటము నిజాయితీలేమి ఏమాత్రమూ ఉండవు. అతడు లోపల బయట సదా ఒకే విధముగా సరళముగా ఉండును.

ప్రశ్న - 'ఆచార్యోపాసనమ్' అనగానేమి?

సమా - విద్యను, సదుపదేశముల నిచ్చుగురువును 'ఆచార్యుడు' అని యందురు. అట్టి గురువు కడనుండి భక్తిశ్రద్ధలతో మనోవాక్కాయముల ద్వారా ఆయనను సేవించుచుండుట, నమస్కరించుట, తదాజ్ఞలను పాటించుచుండుట, ఆయనకనుకూలముగా నడచుకొనుట మొదలగు కార్యములను ఆచరించుచుండుటను 'ఆచార్యోపాసనమ్' (గురుసేవ) అనియందురు.

ప్రశ్న - 'శౌచమ్' అను పదమున కర్థమేమి?

సమా - 'శౌచమ్' అనగా శుద్ధి. నీతి, నిజాయితీలతో గూడిన జీవనము (జీవనవిధానము) వలన ద్రవ్యశుద్ధి ఏర్పడును. అట్టి ద్రవ్యము ద్వారా సమకూర్చుకొనబడిన అన్నపానాదుల వలన 'ఆహారశుద్ధి' ఏర్పడును. యథాయోగ్యమైన పవిత్ర ప్రవర్తన వలన ఆచరణశుద్ధి కలుగును. నీరు, మట్టి మొదలగు పదార్థములతో ప్రక్షాళనము చేయుటవలన శరీరశుద్ధిఏర్పడును. వీటినన్నింటిని "బాహ్యశుద్ధి" అనియందురు. రాగద్వేషములు, మోసము, కపటము మొదలగు వికారములు తొలగి, అంతఃకరణము పవిత్రమగుటను "అంతశ్శుద్ధి" అని యందురు. ఈ రెండు విధములగు శుద్ధిని 'శౌచము' అనియందురు.

1) అహింసా ప్రతిష్ఠాయాం, తత్సన్నిధౌ వైరత్యాగః - (యోగదర్శనం 2/35)

ప్రశ్న - 'స్థైర్యము' అనగానేమి?

సమా - 'స్థిర' భావమునే 'స్థైర్యము' అని యందురు. అనగా తీవ్రాతితీవ్రములైన కష్టములు, ఆపదలు, భయవిహ్వలస్థితులు, దుఃఖములు ఎదురైనప్పుడు చలింపకుండుటను, కామ, క్రోధ, లోభ, భయాదుల కారణముగ ఏ విధముగను తన ధర్మము నుండియు, కర్తవ్యములనుండి వైదొలగకుండుటను, అట్లే మనోబుద్ధుల యందు ఏ మాత్రము చాంచల్యము లేకుండుటను 'స్థైర్యము' అనియందురు.

ప్రశ్న - 'ఆత్మవినిగ్రహః' అనగానేమి?

సమా - ఇచట 'ఆత్మ' అను పదము అంతఃకరణేంద్రియ సహితమైన శరీరమును సూచించును. వీటన్నింటిని పూర్తిగా వశమునందుంచుకొనుటనే 'ఆత్మవినిగ్రహః' అని యందురు. ఈ ఆత్మవినిగ్రహ భావము సంపూర్ణముగాగల సాధకుని మనస్సు, బుద్ధి, ఇంద్రియములు అతని ఆజ్ఞకు లోబడి ప్రవర్తించును. అవి అతనిని ఇంద్రియ విషయములయందు చిక్కు కొననీయవు. అతని ఇచ్ఛాను సారము నిరంతరము సాధనయందే నిమగ్నమగును.

**ఇంద్రియార్థేషు వైరాగ్యమ్ అనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥ 8 ॥**

- ఇంద్రియార్థేషు = ఇహపరలోక భోగముల యందును
- వైరాగ్యమ్ = ఆసక్తిలేకుండుట
- చ = మఱియు
- అనహంకారః, ఏవ = అహంకార రాహిత్యము
- జన్మమృత్యు-జరావ్యాధి = జన్మమృత్యు, జరా, రోగాదులయందు
- దుఃఖదోషాను-దర్శనమ్ = దుఃఖదోషములను గూర్చి పదే పదే తలంచుట.

**ఇంద్రియార్థములయందు వైరాగ్యము (ఇహపరలోక భోగములన్నింటియందును ఆసక్తి లేకుండుట), అహంకార రాహిత్యము, జన్మ, మృత్యు, జరా (ముసలితనము) రోగాదులయందు దుఃఖదోషములను పదేపదే దర్శించుట. (8)**

ప్రశ్న - 'ఇంద్రియార్థేషు వైరాగ్యమ్' అనగానేమి?

సమా - ఇహపరలోకములకు సంబంధించిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయములను 'ఇంద్రియార్థములు' అని యందురు. వీటియందు సర్వథా ప్రీతిలేకుండుటను 'ఇంద్రియార్థేషు వైరాగ్యమ్' అని యందురు. అంతః కరణము, ఇంద్రియముల ద్వారా ఇవి అనుభవింపబడును. అజ్ఞాన కారణమున మనుజుడు వీటిని సుఖహేతువులుగా భావించును. కాని వాస్తవముగా ఇవి దుఃఖ కారణములు.

ప్రశ్న - 'అనహంకారము' అనగానేమి?

సమా - శరీరేంద్రియమనోబుద్ధులయందు 'అహంభావము' అనగా దేహాభిమానము లేకుండుటను 'అనహంకారము' అనియందురు. అజ్ఞానము వలన అనాత్మవస్తువుల యందు ఆత్మ బుద్ధి కల్గియుండుటనే దేహాభిమాన మందురు - దీనినే 'అహంకారము' అందురు.

ప్రశ్న - జన్మమృత్యుజరావ్యాధుల యందు దుఃఖమును దోషములను పదేపదే చూచుట యనగానేమి?

సమా - జన్మ క్లేశములు సాధారణమైనవి కావు. మొదట నిస్సహాయుడైన జీవుడు మాతృగర్భమున చాలకాలము వివిధ క్లేశములను అనుభవించును. జననకాలమున దుర్భరమైన యాతనలను అనుభవింప వలసివచ్చును. నానా యోనులయందు పెక్కు జన్మలెత్తుట ఇంకను దుఃఖకరమైన విషయము. మృత్యుసమయమునందు గూడ అధికక్లేశములు ఎదురగును. జీవన పర్యంతము మమకారముతో పెనవైచుకొనిన శరీరమును, ఇంటిని బలవంతముగా వదలి వెళ్ళవలసివచ్చును. మరణసమయమున నిరాశానేత్రములను, శారీరిక బాధలను చూచినచో ఆ సమయమున జీవుడనుభవించు యాతన లెంత దుస్సహమైనవో ఊహింపవచ్చును. వార్ధక్యము నందలి యాతనలుగూడ తక్కువేమీ గావు. ఇంద్రియములు శిథిలములై శక్తిహీనములగును. శరీరము జర్జరమగును. మనస్సున వివిధ వాంఛలు అవిచ్ఛిన్నముగా చెలరేగుచుండును. ఈ అసహాయ పరిస్థితులయందు జీవుడనుభవించు కష్టములు (దుఃఖములు) మిక్కిలి భయానకములు. ఇట్లే అనారోగ్య

(రోగ) బాధలు గూడ మిక్కిలి దుస్సహములు. శరీరము క్షీణించును. పరాధీన స్థితి ఏర్పడును. ఆ అవస్థలనుండి బయటపడు ఉపాయమే గోచరము కాదు. ఇట్టివియే జన్మ, మృత్యు, జరా, వ్యాధుల వలన కలుగు దుఃఖపరంపరలు. ఈ దుఃఖములను మాటిమాటికి స్మరించుచు వాటిని గూర్చి ఆలోచించుచుండుటయే దుఃఖ దర్శనమగును.

జీవులకు ప్రాప్తించు జన్మమృత్యు జరావ్యాధులు పాపముల పరిణామస్వరూపములు. కనుక ఈ నాల్గును దోషయుక్తములే. ఈ విషయములను గురించి పదే పదే ఆలోచించుటయే వాటియందలి దోషములను చూచుటయగును.

చైతన్యరూపమైన ఆత్మ తప్ప ఈ లోకమున ఈ నాల్గు దోషములులేని వస్తువేదియును లేదు. జడమైనగృహము ఒకరోజు నిర్మింపబడును. అది దానికి జన్మవంటిది - అందు కొంతభాగము శిథిలమగుచుండును. అది దానికి వ్యాధి, దానిని బాగుచేయుటయే చికిత్స. పాత బడిపోవును. అది దానికి వార్ధక్య దశ. కొంతకాలమునకు అది జీర్ణదశకు చేరి పడిపోవును. అది దానికి మరణము - చిన్న, పెద్ద, అనుభేదములకు తావులేకుండ అన్ని వస్తువులకును ఇదే పరిస్థితి ఏర్పడును. ఈ విధముగా జగత్తునందు ప్రతి వస్తువు జన్మమృత్యు జరావ్యాధి గ్రస్తమేయగుచుండుట చూచి, చూచి ప్రతివ్యక్తియు వైరాగ్యమును పొందవలెను.

**అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వమ్ ఇష్టానిష్టోపపత్తిషు ॥ 9 ॥**

| పదము | అర్థము |
|---|---|
| పుత్రదార-గృహాదిషు | = భార్య, పిల్లలు, ఇల్లు మొదలగు వానియందు |
| అసక్తిః | = ఆసక్తి లేకుండుట |
| అనభిష్వంగః | = మమతారాహిత్యము |
| చ | = మరియు |
| ఇష్టానిష్టోపపత్తిషు | = ఇష్టానిష్టవస్తు ప్రాప్తియందు |
| నిత్యమ్ | = నిరంతరము |
| సమచిత్తత్వమ్ | = సమభావముతో ఉండుట |

**భార్య, పుత్రులు, ఇల్లు, సంపదలు మున్నగువానియందు మమతాసక్తులు లేకుండుట, ఇష్టానిష్ట వస్తుప్రాప్తి వలన ఎట్టి మనోవికారములకును లోనుగాకుండుట, ఎల్లప్పుడును సమభావముతో నుండుట. (9)**

ప్రశ్న - 8వ శ్లోకమున ఇంద్రియార్థములయందు వైరాగ్యముండవలెనని తెల్పబడినది. భార్యాపుత్రులు, గృహము, సంపదలు మొదలగు వానియందు ఆసక్తి రాహిత్యము అందు అంతర్గతమేగదా? మఱల ఆ విషయమునే తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - భార్యాపుత్రులు, ఇల్లు, శరీరము, సంపదలు మున్నగువానితో మనుష్యునకు అత్యంత (మిక్కిలి) సంబంధము ఉండుట వలన బహుశః అతనికి వాటియందు విశేష+ఆసక్తియుండును. ఇంద్రియార్థములైన శబ్దాది సాధారణ విషయములయందు వైరాగ్యము ఏర్పడినను వీటియందు (ఈ దారాపుత్రాదులయందు) మాత్రము ఆసక్తి లోలోపల గుప్తముగా ఉండనే యుండును. కనుక వీటియందలి ఆసక్తి సర్వథా తొలగించుకొనవలెనను విషయము ప్రత్యేకముగా తెల్పబడినది.

ప్రశ్న - 'అనభిష్వంగము' అను పదమునకు అహంకార రాహిత్యము అను అర్థమును చెప్పక 'మమతారాహిత్యము' అని చెప్పుటకు గల కారణమేమి?

సమా - అహంకారరాహిత్యమును గూర్చి పూర్వ (8వ) శ్లోకమున 'అనహంకారః' అను పదముయొక్క వివరణమునందు స్పష్టపఱచబడినది. కనుక ఇచట 'అనభిష్వంగః' అను పదమునకు అర్థము 'మమతా రాహిత్యము' అని తెల్పబడినది. మమత్వకారణముననే మనుష్యునకును స్త్రీపుత్రాదులకును విడదీయరాని (ఘనిష్ఠ) సంబంధము ఏర్పడును. వారి సుఖదుఃఖములు మేలుకీడులను తాను స్వయముగా తన సుఖదుఃఖములుగా భావించును. మమతారాహిత్యము వలననే ఈ భావము గూడ దూరమగును. కనుక ఇచ్చట దీనికి 'మమతా రాహిత్యము' అను అర్థమును చెప్పుటయే సమంజసము.

ప్రశ్న - 'ఇష్ట+అనిష్టముల ఉపపత్తి' అనగానేమి? దానియందు సమచిత్తత్వము - అని దేనిని అందురు?

సమా - అనుకూలమైన వ్యక్తి, క్రియ, ఘటన, పదార్థముల సంయోగము, ప్రతికూలమైన వాటి వియోగము అందటికిని ఇష్టమగును. ఇదే విధముగా అనుకూలమైన వాటి వియోగము ప్రతికూలమైన వాటి సంయోగము అనిష్టమగును. ఈ ఇష్టానిష్టములతో సంబంధము గలిగి, హర్షశోకాదులు లేకుండుట, అనగా అనుకూల పదార్థ సంయోగము, ప్రతికూలముల వియోగముల వలన చిత్తమునందు హర్షములేకుండుట, అట్లే ప్రతికూలముల సంయోగము వలనను అనుకూలముల వియోగము వలనను ఏ విధమైన శోకము, భయము, క్రోధము మొదలగునవి లేకుండుట అనగా సర్వదా నిర్వికారుడై ఒకేవిధముగా సమముగా నుండుట - దీనినే ఇష్టానిష్టముల ఉపపత్తి (ప్రాప్తి) యందు సమచిత్తత్వము అనియందురు.

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వమ్ అరతిర్జనసంసది ॥ 10 ॥

| పదము | అర్థము |
|---|---|
| మయి | = పరమాత్మనైన నాయందు |
| అనన్యయోగేన | = అనన్యయోగము (భగవంతుడే సర్వస్వమని భావించుట) ద్వారా |
| అవ్యభిచారిణీ, భక్తిః | = దృఢమైన నిశ్చలభక్తి |
| చ | = మఱియు |
| వివిక్తదేశ-సేవిత్వమ్ | = ఏకాంతమైన పవిత్ర ప్రదేశమునందు నివసించుట |
| జనసంసది, అరతిః | = విషయాసక్తులైన మనుష్య సముదాయమునందు ఆసక్తిలేకుండుట |

**పరమేశ్వరుడనైన నాయందు అనన్యయోగముద్వారా అవ్యభిచారిణీభక్తి కలిగియుండుట, ఏకాంత పవిత్రప్రదేశమున వసించు ప్రవృత్తి కలిగియుండుట, విషయాసక్తులైన జనులయెడ ఆసక్తిలేకుండుట. (10)**

ప్రశ్న - 'అనన్యయోగమనగానేమి?' దానిద్వారా భగవంతుని యందు 'అవ్యభిచారిణీ భక్తి' ఉండుట యనగానేమి?

సమా - "భగవంతుడే సర్వశ్రేష్ఠుడు. అతడే మనకు స్వామి, శరణు జొచ్చుటకు దిక్కైనవాడు. పరమగతి, పరమాశ్రయుడు, తల్లి, తండ్రి, సోదరుడు, బంధువు, పరమహితైషి, ఆత్మీయుడు, సర్వస్వమును అతడే, అతడు తప్ప మనకు ఇతరులెవ్వరును లేరు." అనుభావమును కల్గియుండి, భగవంతునితో విడదీయరాని సంబంధ ముండుటనే అనన్యయోగమందురు. ఈ విధమగు సంబంధముతో కేవలము భగవంతునియందే దృఢమైన సంపూర్ణవిశుద్ధప్రేమను గలిగి, నిరంతరము భగవద్ధ్యానాదులు చేయుటయే 'అనన్య యోగము ద్వారా భగవంతుని యందు అవ్యభిచారిణీ భక్తి యుండుట' యగును.

ఇట్టి భక్తి గలిగిన మనుష్యునియందు స్వార్థము, అభిమానము లేశమైనను ఉండవు. అతనికి ఎట్టి ప్రాపంచిక వస్తువునందును మమత్వము ఉండదు. అతనికి జగత్తుతో భగవద్విషయముగనే సంబంధము ఉండును. ప్రత్యేక సంబంధము ఎవ్వరితోడను ఉండదు. అంతయు భగవంతునిదే అని భావించుట వలన అతడు భక్తి శ్రద్ధలతో, నిష్కామ భావముతో నిరంతరము భగవానునే చింతన చేయుచుండును. అతడు చేయు ప్రతికార్యము భగవత్పరముగనే యుండును.

ప్రశ్న - 'వివిక్తదేశము' అనగా ఎట్టి స్థానమని భావింపవలెను. దానిని సేవించుట యనగానేమి?

సమా - వివిక్తదేశమనగా ఎట్టి అలజడియు, జనసమ్మర్దమూ లేని ప్రదేశము. అది నిర్జనమైనది. ఆ ప్రదేశము ఎవ్వరికిని ఆపదగాని, క్షోభగాని కల్గింపదు. అచట మురికి, ముండ్లు, ఆళ్ళు, బురద మొదలగునవి ఉండరాదు. అచటి ప్రకృతిదృశ్యము సుందరమై నీరు, గాలి, వాతావరణము నిర్మలముగా నుండవలెను. ఎట్టి వ్యాధులుగాని, క్రూరజంతువులుగాని, హింస జరుగుటకు అవకాశముగాని ఉండరాదు. సహజముగనే సాత్త్వికవాతావరణము నెలకొని యుండవలెను. అట్టి

వాతావరణముగల దేవాలయములు, తపోభూములు, పవిత్రగంగా నదీతీరములు, పునీతవనములు, ప్రశాంత పర్వతగుహలు మొదలగు నిర్జన- ఏకాంత ప్రదేశములనే 'వివిక్తదేశము' అని అందురు. జ్ఞానప్రాప్తి సాధనకై ఇట్టి స్థలమున నివసించుటయే దానిని సేవించుట యందురు.

ప్రశ్న - 'జనసంసది' అనగా నేమి? దానియందు ఆసక్తి లేకుండుటయననేమి?

సమా - మోహప్రమాదములకు లోనై, విషయాసక్తులైన ప్రాపంచిక మనుష్య సముదాయమునే 'జనసంసది' అను పదము సూచించును. ఇట్టి జనుల సాంగత్యము సాధనకు అన్ని విధముల విఘ్నకారియని భావించి, దానినుండి విరక్తుడగుటయే దానియందు ఏమాత్రము ఆసక్తి చూపకుండుటయగును. సాధువులు, మహాత్ములు, సాధకులు ఐనవారి సాంగత్యము సాధనకు సహకారి, కావున అట్టి జనసముదాయమును 'జనసంసది' అను పదము సూచింపదని భావింపవలెను.

**అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।**
**ఏతద్జ్ఞానమితి ప్రోక్తమ్ అజ్ఞానం యదతోఽన్యథా ॥ 11 ॥**

అధ్యాత్మ-జ్ఞాననిత్యత్వమ్ = ఆధ్యాత్మికజ్ఞానమునందు నిత్యస్థితుడై యుండుట
తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ = తత్త్వజ్ఞానమునకు ప్రతిపాద్యుడు భగవంతుడే యనియెఱుంగుట
ఏతత్ = ఇదియంతయును (అమానిత్వము మొదలుకొని తత్త్వజ్ఞానార్థ దర్శనము వరకుగలదంతయును)
జ్ఞానమ్ = జ్ఞానము (జ్ఞాన ప్రాప్తికి సాధనములు)
అతః = దీనికంటెను
అన్యథా = వేఱుగా
యత్ = ఏదిగలదో
(తత్) అజ్ఞానమ్, ఇతి = (అది) అజ్ఞానము అని
ప్రోక్తమ్ = చెప్పబడినది

ఆధ్యాత్మికజ్ఞానమునందు నిత్యస్థితుడై యుండుట, తత్త్వజ్ఞానమునకు ప్రతిపాద్యుడు భగవంతుడేయని యెఱుంగుట - ఇవియన్నియును (అమానిత్వము మొదలుకొని తత్త్వజ్ఞానార్థదర్శనమువఱకుగల ఇవియన్నియును) జ్ఞానప్రాప్తికి సాధనములు. దీనికి విపరీతమైనది అజ్ఞానము. **(11)**

ప్రశ్న - 'అధ్యాత్మజ్ఞానం' అనగానేమి?దాని యందు నిత్యము స్థితులై యుండుట యనగానేమి?

సమా - ఆత్మ నిత్యము, చేతనము, నిర్వికారము, శాశ్వతము. దాని కంటెను భిన్నమైనది నశ్వరము, జడము, వికారసహితము, పరివర్తన శీలము ఐన వస్తు సముదాయము. ఆత్మకు దానితో ఎట్టి సంబంధమూ లేదు. శాస్త్రముల ద్వారా, ఆచార్యోపదేశముల ద్వారా ఇట్టి ఆత్మతత్త్వమును చక్కగా గ్రహించుటయే అధ్యాత్మజ్ఞానము - అనబడును. నిశ్చయాత్మకమైన బుద్ధితో మనస్సునందు ఈ ఆత్మతత్త్వమును నిత్యమూ, నిరంతరమూ మననము చేయుటయే అధ్యాత్మజ్ఞానము నందు నిత్యమూ స్థితుడైయుండుట - అనబడును.

ప్రశ్న - 'తత్త్వజ్ఞానార్థమనగానేమి?' దానిని దర్శించుట యనగానేమి?

సమా - సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్మనే 'తత్త్వజ్ఞానార్థము' అనియందురు. ఏలనన తత్ప్రాప్తియే తత్త్వజ్ఞానమునకు ఫలము. ఆ సచ్చిదానందఘన గుణాతీత పరమాత్మను సర్వత్ర సమభావముతో నిత్యమూ, నిరంతరమూ ధ్యానించుచు ఉండుటయే తత్త్వజ్ఞానార్థమును దర్శించుట యగును.

ప్రశ్న - "ఇదియంతయును జ్ఞానము" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - 'అమానిత్వం' మొదలుకొని 'తత్త్వజ్ఞానార్థ దర్శనమ్' వఱకు వర్ణింపబడిన విషయములన్నియును జ్ఞానప్రాప్తికి సాధనములే. కనుక వీనిని గూడ సమష్టిగా 'జ్ఞానము' అని పేర్కొనుట జరిగినది. రెండవ శ్లోకమున

భగవానుడు క్షేత్ర-క్షేత్రజ్ఞుల జ్ఞానమే నిజమైన జ్ఞానమని పేర్కొనియుండెను. కాని 'క్షేత్రము' అనగా శరీరము, క్షేత్రజ్ఞుడనగా 'ఆత్మ' అని తెలిసికొనినంతనే జ్ఞానము ప్రాప్తించినట్లు భావింపరాదు - పైన తెల్పబడిన 'అమానిత్వాది' 20 సాధనముల ద్వారా క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపమును యథార్థముగా తెలిసికొనుటవలననే నిజమైన జ్ఞాన ప్రాప్తి కల్గును. కనుక ఈ సాధనములను గూడ జ్ఞానమనియే పేర్కొనుట జరిగినది. జ్ఞానియందు పై గుణములు మొదటి నుండియే ఉండుట ముఖ్యము. కాని అన్నిగుణములూ సాధకులందఱిలోను ఒకే సమయమున ఉండనవసరములేదు. అమానిత్వము, అదంభిత్వము మొదలగు గుణములు అందఱికిని ఉపయోగకరములు, ఇవిగాక అవ్యభిచారిణీ భక్తియు, ఏకాంత దేశసేవిత్వమూ, అధ్యాత్మజ్ఞాననిత్యత్వమూ, తత్త్వజ్ఞానార్థ దర్శనమూ మొదలగువాని యందు తమతమ సాధనరీతులననుసరించి వేర్వేఱుగా గూడ ఉండవచ్చును.

ప్రశ్న - దీనికి భిన్నమైనది 'అజ్ఞానము'-అని యనుటలోని విశేషమేమి?

సమా - పైన తెల్పబడిన 'అమానిత్వాది' గుణములకు వ్యతిరేకమైన కీర్తి ప్రతిష్ఠలకై ఆరాటము, దంభము, హింస, క్రోధము, కపటము, కుటిలత్వము, ద్రోహము, అపవిత్రత, అస్థిరత, లౌల్యము, ఆసక్తి, అహంభావము, వైషమ్యము, అశ్రద్ధ, దుస్సాంగత్యము మొదలగునవి యన్నియును దోషములు. ఇవియన్నియును జనన మరణములకు కారణములై అజ్ఞానమును పెంచి, జీవుడు పతనమగునట్లు చేయును. కావున ఇవియన్నియును అజ్ఞానరూపములే. వీటినన్నింటిని త్యజింపవలెను.

*సంబంధము - ఈ విధముగా జ్ఞానసాధనములను జ్ఞానమను పేరుతో వర్ణించుటను విన్న పిమ్మట ఈ సాధనముల ద్వారా ప్రాప్తించిన జ్ఞానమువలన తెలిసికొనదగిన వస్తువేమి? దానిని తెలిసికొనుట వలన ప్రయోజనమేమి? అను సందేహములు కలుగును. దీనికి సమాధానముగా భగవానుడు ఇప్పుడు తెలిసికొనదగిన వస్తుస్వరూపమును వర్ణించెదనని ప్రతిజ్ఞ చేయుచు దానిని తెలిసికొనుట వలన కలుగు ఫలము 'అమృతత్వప్రాప్తి' యని తెలిపి తెలిసికొన దగిన ఈ పరమాత్మ స్వరూపమును వరుసగా ఆఱు శ్లోకములలో వర్ణించుచున్నాడు-*

**జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే ।**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ 12 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = ఏదైతే | తత్ | = దానిని | న, సత్ | = సత్తు కాదు |
| జ్ఞేయమ్ | = తెలిసికొనదగినదో | ప్రవక్ష్యామి | = చక్కగా తెల్పెదను | న, అసత్ | = అసత్తు కూడ కాదు (సదసత్తులకు అతీతుడు) |
| యత్ | = దేనిని | తత్ | = అది (అతడు) | | |
| జ్ఞాత్వా | = తెలిసికొని (మనుష్యుడు) | అనాదిమత్ | = సనాతనుడైన వాడును | | |
| అమృతమ్, అశ్నుతే | = పరమానందమును పొందునో | పరమ్, బ్రహ్మ | = పరబ్రహ్మము | (ఇతి) ఉచ్యతే | = అని చెప్పబడును |

అనాదియైన (సనాతనుడైన) పరబ్రహ్మయే తెలిసికొనదగినవాడు. అతనిని తెలిసికొనుటవలన మానవుడు పరమానందమును పొందును. అతడు సదసత్తులకు(సత్+అసత్ లకు) అతీతుడు. ఆ పరమాత్మనుగూర్చి సమగ్రముగా నీకు తెల్పుచున్నాను. **(12)**

ప్రశ్న - భగవానుడు తాను వర్ణింతునని ప్రతిజ్ఞచేసిన 'జ్ఞేయమ్' అను పదము దేనిని తెల్పును?

సమా - ఇచట 'జ్ఞేయమ్' అను పదము సచ్చిదానంద ఘనుడైన నిర్గుణ సగుణ బ్రహ్మను తెల్పును. ఏలనన భగవానుడే స్వయముగా ఆయనను 'నిర్గుణు'డనియు, 'గుణభోక్త' యనియు ఈ ప్రకరణమునందే పేర్కొనెను.

ప్రశ్న - ఆ జ్ఞేయమును గూర్చి తెలిసికొనుట వలన ప్రాప్తించు అమృత మనగానేమి?

సమా - అమృతమనుపదము ఇచ్చట పరమానంద స్వరూపుడైన పరమాత్మను తెలుపును. తెలిసికొనదగిన పరబ్రహ్మ పరమాత్మను ఎఱుంగుట వలన మనుష్యుడు శాశ్వతముగ జనన మరణ రూపసంసార బంధములనుండి విముక్తుడై పరమానంద స్వరూపుడైన పరబ్రహ్మను పొందును. దీనినే పరమగతి, పరమపదప్రాప్తి అనియుందురు.

ప్రశ్న - 'అనాదిమత్' అను పదమునకు అర్థమేమి?

సమా - ఈ అధ్యాయమునందే 19వ శ్లోకమున భగవానుడు ప్రకృతిని, జీవాత్మను 'అనాది' యని పేర్కొనెను. ఈ రెండింటికిని స్వామి యగుట వలన పరబ్రహ్మపురుషోత్తముని 'అనాదిమత్' అనియుందురు.

ప్రశ్న - 'పరమ్' అను విశేషణముతోపాటు బ్రహ్మ అను పదమునకు అర్థమేమి?

సమా - ఇచట 'పరమ్' అను విశేషణముతో పాటు బ్రహ్మ అను పదమును ప్రయోగించి, ఆ జ్ఞేయతత్త్వమే నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్మ యని తెల్పబడెను. బ్రహ్మము అను పదము వేదము, బ్రహ్మ, ప్రకృతి అను అర్థములను గూడ తెల్పును. కనుక జ్ఞేయ తత్త్వస్వరూపము వాటికంటెను విలక్షణమైనదని తెల్పుటకు 'బ్రహ్మ' అను పదముతోపాటు 'పరమ్' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - ఆ పరబ్రహ్మ పరమాత్మను 'సత్' అనిగాని, 'అసత్' అని గాని పిలుచుటకు ఏల వీలులేదు?

సమా - ప్రమాణముల ద్వారా ఋజువగు వస్తువును 'సత్' అనియుందురు. 'స్వతః' ప్రమాణరూపుడు, నిత్యుడు, శాశ్వతుడు ఐన పరమాత్మను ఏ ప్రమాణముద్వారా కూడ ఋజువు చేయజాలము. ఏలనన పరమాత్మ వలననే అన్నియు ఋజువగును. పరమాత్ముడు అన్ని ప్రమాణములకును అతీతుడు. శ్రుతియును ఇట్లే చెప్పుచున్నది - "ఆ తెలిసికొనువానిని (జ్ఞాతను) తెలిసికొనుట ఎట్లు?" - ప్రమాణముల ద్వారా తెలియబడు వస్తువులన్నింటికంటెను అతడు అత్యంత విలక్షణుడు. కనుక పరమాత్మను 'సత్' అనుటకు వీలు లేదు. వాస్తవముగా 'ఉనికి' లేని వస్తువును 'అసత్' అనియుందురు. కాని పరబ్రహ్మ పరమాత్మకు 'ఉనికి' లేదని చెప్పుటకు వీలులేదు. అతని 'ఉనికి' నిజము. ఆయన 'ఉనికి' వలననే ఇతర వస్తువుల ఉనికి సాధ్యమగును. కనుక ఆయనను 'అసత్' అనుటకు వీలులేదు. అందువలన పరమాత్మ 'సత్' 'అసత్'లకు అతీతుడు.

ప్రశ్న - 9వ అధ్యాయమునందలి 19వ శ్లోకమున భగవానుడు 'సత్తు'ననేనే 'అసత్తు'నేనే అని తెలిపియుండెను మఱి ఇచ్చట "ఆ తెలిసికొనదగిన పరమాత్మను 'సత్' అనిగాని, 'అసత్' అని గాని తెలుపుటకు వీలులేదు" అని పల్కి యుండెను. ఈ వైరుధ్యమునకు సమాధానమేమి?

సమా - 'వస్తుతః' ఇచట ఎట్టి వైరుధ్యమూ లేదు. ఏలనన పరమాత్మ స్వరూపము విధ్యర్థకముగా సర్వమూ బ్రహ్మమే. వ్యతిరేకార్థములో "ఇట్లుకాదు, ఇట్లుకాదు" అని వర్ణింపబడును. కాని ఉండుట నిజము. కనుక అచ్చటి వర్ణన విధ్యర్థకము. కనుక భగవానుడు సత్తును నేనే అసత్తును నేనే అని చెప్పుట సమంజసము. కాని వాస్తవముగా ఆ పరబ్రహ్మస్వరూపమును వాక్కు ద్వారా విధ్యర్థకముతోగాని, వ్యతిరేకార్థ రూపమునగాని వర్ణించుటకు వలను గాదు. ఆయనను గురించి 'శాఖాచంద్రన్యాయము' ద్వారానే తెలుపుటకు వీలగును. ఆయన సాక్షాత్స్వరూపమును వాక్కు ద్వారా వర్ణించుటకు సాధ్యము కాదు. శ్రుతియు ఇట్లనుచున్నది. 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' (తైత్తిరీయం 2/9) అనగా మనస్సుగాని, వాక్కుగాని అతనిని చేరజాలవు. (అతడే బ్రహ్మము). ఈ విషయమును స్పష్టపఱచుటకే భగవానుడు వ్యతిరేకార్థరూపమున ఆయనను 'సత్' అనిగాని, 'అసత్' అనిగాని తెల్పుటకు వీలు లేదని చెప్పెను. అనగా తాను వర్ణింపబోవు జ్ఞేయ వస్తువు యొక్క వాస్తవిక స్వరూపము మనస్సునకును, వాక్కునకును అందనిది. కావున దాని విషయమున వర్ణింపబడునది అంతయు దాని తటస్థలక్షణమేయని భావింపవలెను.

*సంబంధము - ఈ విధముగా జ్ఞేయతత్త్వమును వర్ణింపుటకు ప్రతిజ్ఞ చేసి, భగవానుడు ఆ తత్త్వమును సంక్షిప్తముగా వర్ణించెను - కాని ఆ జ్ఞేయతత్త్వము మిక్కిలి నిగూఢమైనది. కనుక సాధకులకు దానిని బాగుగా తెలియజెప్పుటకు సర్వవ్యాపకాది లక్షణముల ద్వారా దానినే మరల విస్తృతముగా వర్ణించుచున్నాడు-*

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 13 ॥**[(1)]

| | | | | | |
|---|---|---|---|---|---|
| తత్ | = అపరమాత్మ | సర్వతోఽక్షి శిరోముఖమ్ | = అంతటను నేత్రములు, శిరస్సులు, ముఖములు గలవాడు | యతః | = ఎందువలననగా (అతడు) |
| సర్వతః | = అంతట | | | లోకే | = లోకమునందు |
| పాణి పాదమ్ | చేతులును, పాదములును కల్గియున్నవాడు | | | సర్వమ్ | = అంతటను |
| | | సర్వతః, | = అంతటను | ఆవృత్య | వ్యాపించి |
| | | శ్రుతిమత్ | = చెవులుగలవాడు | తిష్ఠతి | = స్థితమైయున్నాడు |

**ఆ పరమాత్మని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై యున్నవి. అతడు సర్వమును ఆవరించి యున్నాడు. (13)**

ప్రశ్న - పరమాత్మని చేతులు, పాదములు, సర్వత్ర స్థితములైయున్నవి - అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆ పరబ్రహ్మ చేతులు అన్ని దిక్కుల యందును వ్యాపించియున్నవి. ఆయనకు ఏ వస్తువునైనను ఎచ్చటినుండి సమర్పించినను అచ్చటనే దానిని అతడు స్వీకరించును. అదే విధముగా ఆయన పాదములును అన్నివైపుల వ్యాపించి యున్నవి. ఏ భక్తుడైనను ఎచట నుండి యైనను ఆ చరణములకు ప్రణామములు చేసినచో అతడచటి నుండియే ఆ నమస్కారములను అందుకొనును. ఏలనన ఆయన సర్వశక్తిమంతుడగుట వలన అన్ని స్థానములయందును అన్ని ఇంద్రియములద్వారా ఆయా పనులను చేయుచుండును. అతని హస్తేంద్రియముల పనియైన 'గ్రహణ శక్తి', పాదేంద్రియముల పనియైన 'చలన శక్తి' సర్వత్రా వ్యాపించి యున్నది.

ప్రశ్న - "ఆయన నేత్రములు, శిరస్సులు, ముఖములు, సర్వత్ర వ్యాపించియున్నవి -" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆ జ్ఞేయతత్త్వమైన పరమాత్మని సర్వవ్యాపకత్వము పై వాక్యము ద్వారా తెలియుచున్నది. ఆయన కన్నులు (చూపులు) సర్వత్ర వ్యాపించియున్నవి. అతడు చూడని స్థలమే ఉండదు. ఆయన కడ ఏమియు దాచుటకు వీలులేదు. అతని శిరస్సులు సర్వత్ర వ్యాపించి యున్నవి. భక్తులు తమతమ భగవదర్చనలో భాగముగ ఎచ్చటి నుండి పుష్పాదులు సమర్పించినను అవి ఆయన శిరస్సునే అలంకరించును. ఆయన శిరస్సులులేని స్థానమే లేదు. ఆయన ముఖములు సర్వత్ర వ్యాపించియుండును. భక్తులు ఆయన ఏ పదార్థమును ఎచ్చటినుండి నివేదన చేసినను అచటినుండియే ఆతడా వస్తువును ఆరగించును. ఆయన ముఖములులేని స్థలమేలేదు. సారాంశమేమనగా ఆ జ్ఞేయస్వరూపుడైన పరమాత్మ సర్వసాక్షి. అందరి పూజలను, నివేదనలను స్వీకరింపగలవాడు.

ప్రశ్న - "ఆయన చెవులు సర్వత్ర వ్యాపించి యుండును" అనియనుటలోని యంతరార్థమేమి?

సమా - ఈ వాక్యము ద్వారా కూడ జ్ఞేయ స్వరూపుడైన ఆ పరమాత్మ యొక్క సర్వవ్యాపకత్వమే వర్ణింపబడినది. పరమాత్మ అన్ని స్థలముల నుండియు వినగలడు. ఎచటనుండి యైనను భక్తులు చేయు స్తుతులను, ప్రార్థనలను, అభ్యర్థనలను అతడు చక్కగా ఆలకింపగలడు.

ప్రశ్న - 'అతడు జగత్తంతయు వ్యాపించి (ఆవరించి) యున్నాడు' - అని యనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - ఆ జ్ఞేయతత్త్వముయొక్క సర్వవ్యాపకత్వమే ఇందు సమగ్రముగా ప్రతిపాదింపబడినది. గాలి, నీరు, అగ్ని, భూమి అను వాటికి కారణమైన ఆకాశము సర్వత్ర వ్యాపించి స్థితమై యున్నట్లే, జ్ఞేయస్వరూపుడైన పరమాత్ముడును ఈ చరాచర జీవకోటితో గూడి, సమస్త జగత్తునకు కారణమగుట వలన అతడు సర్వత్ర వ్యాపించియున్నాడనియు, అన్నియు ఆయనతోడనే నిండియున్నవనియు ఎఱుంగవలెను.

1) ఈ శ్లోకము 'శ్వేతాశ్వతరోపనిషత్తునందు యథాతథముగ కలదు' (3/16)

సంబంధము - జ్ఞేయస్వరూపుడైన పరమాత్మ సర్వత్ర చేతులు పాదములు మొదలగు సర్వేంద్రియములును గలిగి, సర్వశక్తిమంతుడు అని తెలిపిన పిదప ఇప్పుడు ఆ స్వరూపముయొక్క అలౌకికత్వమును నిరూపించుచున్నాడు-

**సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్ ।**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 14 ॥**

సర్వేంద్రియ గుణాభాసమ్ = ఇంద్రియగ్రాహ్య విషయములనన్నింటిని ఎఱిగినవాడు
సర్వేంద్రియ వివర్జితమ్ = (కాని) వాస్తవముగా ఇంద్రియ రహితుడు
చ = మఱియు
అసక్తమ్, ఏవ = ఆసక్తి రహితుడైనను
సర్వభృత్ = సర్వజగత్తును ధరించి, పోషించువాడు
చ = అట్లే
నిర్గుణమ్ = గుణరహితుడైనను
గుణభోక్తృ, చ = గుణములను అనుభవించువాడు

**అతడు ఇంద్రియగ్రాహ్యవిషయములను అన్నింటిని ఎఱిగినవాడు. కాని వాస్తవముగా ఇంద్రియాదులకు అతీతుడు. ఆసక్తిరహితుడైనను సమస్తజగత్తును భరించి పోషించువాడు. అతడు నిర్గుణుడయ్యును (గుణాతీతుడయ్యును) ప్రకృతి సంబంధమువలన గుణానుభవములను కలిగియుండువాడు. (14)**

ప్రశ్న - "ఆ పరమాత్మ వాస్తవముగా ఇంద్రియ రహితుడైనను, ఇంద్రియ విషయములనన్నింటిని గ్రహించును-" అనియనుటలోని అంతరార్థమేమి?

సమా - ఆ జ్ఞేయస్వరూపుడైన పరమాత్మయొక్క సగుణరూపము గూడ అత్యంతము అద్భుతము, అలౌకికము. 13వ శ్లోకమున ఆ పరమాత్మ సర్వత్ర చేతులు, పాదములతో ఇతర - ఇంద్రియములతో వ్యాపించి యున్నాడని తెల్పుటవలన ఆయనకూడ ఇతర జీవులవలె ఇంద్రియములను కలిగియున్నాడని భావింపరాదు. అతడు సర్వథా - ఇంద్రియ రహితుడైనను, సర్వత్ర ఆయా ఇంద్రియ విషయములను గ్రహింప సమర్థుడు. కనుక ఆయనను సర్వత్ర ఇంద్రియములు కలవాడనియు, ఇంద్రియ రహితుడనియు తెలుపబడినది.

శ్రుతియు ఇట్లు చెప్పుచున్నది -

**అపాణిపాదో జవనో గ్రహీతా**
**పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః ।**
(శ్వేతాశ్వతరోపనిషత్ - 3/19)

అనగా "ఆ పరమాత్మ పాదములు, చేతులు లేకున్నను వేగముగా సంచరింపగలడు, గ్రహింపగలడు. నేత్రములు లేకున్నను చూడగలడు. చెవులు లేకున్నను వినగలడు." - కనుక ఆయన స్వరూపము అలౌకికమని ఇందు వర్ణింపబడినది.

ప్రశ్న - "అతడాసక్తి రహితుడైనను అందరిని ధరించి, పోషించును-" అనియనుటలోని విశేషమేమి?

సమా - ప్రపంచమున తలిదండ్రులు మొదలగు వారు తమ కుటుంబభారమును ఆసక్తితో వహించి, పోషించుచుందురు. ఆ పరబ్రహ్మపరమాత్మయు ఆసక్తిలేకున్నను వారివలెనే అదే విధముగా అందఱి భారమును వహించి, పోషించుచుండును. అందువలననే సర్వప్రాణులకును అతడు సుహృదుడు. అనగా ఎట్టి కారణము లేకుండగనే అందఱికిని హితమును గూర్చువాడు (5/29). జ్ఞేయ స్వరూపుడును, సర్వవ్యాపియు ఐన ఆ పరమాత్మ వాస్తవముగా సర్వథా ఆసక్తిదోష రహితుడైనను ప్రకృతి సంబంధము వలన అందరిని ధరించి పోషించుచున్నాడు. ఇదియే ఆయన యొక్క అలౌకికరీతి.

ప్రశ్న - అతడు గుణాతీతుడైనను, గుణములను అనుభవించును. ఈ కథనము యొక్క అభిప్రాయమేమి?

సమా - ఈ వాక్యము ద్వారా కూడ పరమాత్మయొక్క అలౌకికత్వమే ప్రతిపాదింప బడుచున్నది. పరమాత్మ గుణములనన్నింటికిని భోక్తయైనను ఇతర జీవుల వలె ప్రకృతి గుణములతో లిప్తుడుకాడు. అతడు యథార్థముగా సర్వథా గుణాతీతుడు. ఐనను ప్రకృతి సంబంధ కారణమున సమస్త గుణములకును భోక్త. ఇదియే ఆయన యొక్క అలౌకికత్వము.

**బహిరంతశ్చ భూతానామ్ అచరం చరమేవ చ ।**
**సూక్ష్మత్వాత్ తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూతానామ్ | = చరాచరప్రాణులన్నింటికిని | చరమ్, అచరమ్, ఏవ | = చరాచర రూపుడును అతడే | అవిజ్ఞేయమ్ | = తెలిసికొన శక్యముగానివాడు |
| బహిః, అంతః, చ | = బయట, లోపల, పరిపూర్ణుడై యుండువాడు | చ | = మఱియు | చ | = అట్లే |
| | | తత్ | = అతడు | అంతికే, చ | = అతి సమీపమునందును |
| | | సూక్ష్మత్వాత్ | = అతిసూక్ష్మ రూపుడగుట వలన | దూరస్థమ్ తత్, చ | = దూరమునందును (ఉండువాడు) అతడే |

**చరాచరభూతములన్నింటికిని బాహ్యాభ్యంతరములయందు పరిపూర్ణముగా ఉండువాడును, చరాచర రూపుడును అతడే. అతిసూక్ష్మ(పరమాణు) రూపుడైనందున తెలిసికొనశక్యముకానివాడు, అతిదూరముగను, అతిసమీపముగను స్థితుడై ఉండువాడును అతడే.[1] (15)**

ప్రశ్న - జ్ఞేయస్వరూపుడైన పరమాత్మ సమస్త ప్రాణులకును బయట, లోపల పరిపూర్ణుడై ఎట్లుండును?

సమా - సముద్రములోనున్న మంచుగడ్డ బయటను లోపలను నీటితోనే నిండియుండును. అట్లే జ్ఞేయస్వరూపుడైన పరమాత్మ సమస్త చరాచర ప్రాణులకు లోపల బయట గూడనుండును.

ప్రశ్న - "చరరూపుడును, అచరరూపుడును ఆతడే" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఆ పరమాత్మ చరాచరభూతములకు లోపల బయటకూడ కలడని మొదటి వాక్యములో తెలుపుటవలన చరాచర ప్రాణులు ఆయన కంటెను భిన్నమైనవని భావింపరాదు. ఈ విషయమే ఇచట స్పష్టపరచుటకు చరాచర ప్రాణులన్నియును అతడే. మంచుకు బయట లోపల కూడ నీరే. వాస్తవముగా మంచుకూడా నీరే. నీటికంటెను భిన్నమైన (వేరైన) వస్తువు మంచులో మరియొకటి లేదు. అదేవిధముగా ఈ సమస్త చరాచరజగత్తు ఆ పరమాత్మ స్వరూపమే. ఆయనకంటె భిన్నమైనది కాదు.

ప్రశ్న - సూక్ష్మ స్వరూపుడైనందున ఆయన అవిజ్ఞేయుడు. అనగా సాధారణముగా తెలియబడడు. అని యనుటలోని అంతర్యమేమి?

సమా - జ్ఞేయస్వరూపుడైన పరమాత్మ 'సర్వరూపుడు' అని తెల్పుటచే సర్వమును అతడే యైనప్పుడు అందఱును ఆయనను ఏల తెలిసికొన లేరు - అను సందేహము రావచ్చును. దీనికి సమాధానముగా సూర్యకిరణముల యందు స్థితమైయున్న పరమాణు రూపజలమును సామాన్య మానవులు తెలిసికొనలేరు. అది వారికి దుర్విజ్ఞేయము. అదేవిధముగా సర్వవ్యాపియైన పరబ్రహ్మ పరమాత్మ కూడ ఆ పరమాణురూపజలము కంటెను అత్యంత సూక్ష్మ స్వరూపుడగుటచే సామాన్యులకు తెలియబడడు. కనుక అతడు అవిజ్ఞేయుడు.

ప్రశ్న - "అతడు అతి సమీపముగను ఉండును, దూరముగాను ఉండును." - ఇది యెట్లు పొసగును?

సమా - సమస్త జగత్తునందును దాని వెలుపలను పరమాత్మ లేని స్థానమే లేదు. కనుక అతడు అత్యంత సమీపస్థుడును, అతిదూరస్థుడు గూడ. ఏలనన మనుష్యుడు తనకు దూరముగాను, సమీపముగను ఉన్న స్థానములన్నింటియందును ఆ విజ్ఞానానంద ఘనపరమాత్మ సర్వదా పరిపూర్ణుడైయున్నాడు అని యెఱుంగ వలెను. ఈ తత్త్వమును గ్రహించిన శ్రద్ధాళువులైన వారికి ఆ పరమాత్మ అత్యంత సమీపస్థుడు. అశ్రద్ధాళువులకు అతిదూరస్థుడు.

---

1) శ్రుతి ఇట్లు పేర్కొనుచున్నది. 'తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే ।
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥ (ఈశోపనిషత్. 5)
అతడు నడచును, నడవడు, దూరస్థుడును, సమీపస్థుడును. ఈ సమస్త జగత్తునకు లోపలను బయటను ఉండువాడు.

**అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।**
**భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 16 ॥**

అవిభక్తమ్, చ = విభాగరహితుడై పరిపూర్ణరూపుడై యున్నను
భూతేషు = చరాచరప్రాణుల రూపములలో
విభక్తమ్, = వేర్వేఱుగా
ఇవ, స్థితమ్ = ఉన్నట్లుగోచరించు వాడును
తత్, జ్ఞేయమ్ = తెలిసికొనదగిన ఆ పరమాత్మ
ప్రభవిష్ణు, చ = బ్రహ్మరూపములో సృష్టి చేయువాడును
భూతభర్తృ, చ = విష్ణురూపములో ప్రాణులను ధరించి, పోషించువాడును
గ్రసిష్ణు, చ = రుద్రరూపములో లయమొనర్చువాడును అయియున్నాడు

పరమాత్మ ఆకాశమువలె విభజించుటకు వీలులేని ఒకేరూపమున పరిపూర్ణుడైయున్నను, సమస్తచరాచరప్రాణులరూపములలో వేర్వేరుగా గోచరించుచుండును. ఆ పరమాత్మయే సృష్టికర్తయైన బ్రహ్మగా, పోషకుడైన విష్ణువుగా, లయకారకుడైన రుద్రునిగా తెలిసికొనదగినవాడు. **(16)**

ప్రశ్న - పరమాత్మ 'అవిభక్తుడైనను - ప్రాణులందరిలో విభక్తుడైన వాని వలె ఉండును.' అను ఈ వాక్యము యొక్క అంతరార్థమేమి?

సమా - తెలిసికొనదగిన ఆ పరమాత్మ యొక్క ఏకత్వము ఈ వాక్యము ద్వారా ప్రతిపాదింపబడినది. మహాకాశము వాస్తవముగా విభాగరహితమే. (అవిభక్తమే.) ఐనను వేర్వేఱు కుండలలో వేర్వేఱుగా విభక్తమైయున్నట్లు గోచరించును. అట్లే పరమాత్మ వాస్తవముగా విభాగరహితుడే యైనను సమస్త చరాచర ప్రాణులయందు క్షేత్రజ్ఞ రూపములో వేర్వేఱుగా గోచరించును. కాని ఈ భిన్నత్వము కేవలము ప్రతీతి మాత్రమే. వాస్తవముగా పరమాత్మ ఒక్కడే. అతడు సర్వత్ర పరిపూర్ణుడు.

ప్రశ్న - 'భూతభర్తృ', 'గ్రసిష్ణు', 'ప్రభవిష్ణు' అను పదముల అర్థమేమి? ఈ పదములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - సమస్త ప్రాణులను ధరించి, పోషించు వానిని "భూతభర్త" అని యందురు. సమస్త జగత్తును సంహరించు వానిని 'గ్రసిష్ణువు' అనియందురు. అందరి ఉత్పత్తికి కారణమైనవానిని 'ప్రభవిష్ణువు' అనియందురు. ఈ మూడు పదములను ప్రయోగించుట ద్వారా సర్వశక్తిమంతుడును, జ్ఞేయస్వరూపుడును ఐన ఆ పరమాత్మ సమస్తచరాచర జగత్తుయొక్క ఉత్పత్తిస్థితి సంహారములను చేయువాడని తెల్పబడినది. అతడే బ్రహ్మరూపుడై జగదుత్పత్తికిని, విష్ణురూపుడై జగద్రక్షణకును, రుద్రరూపుడై దాని సంహారమునకును కారణమని ఎఱుంగవలెను - అనగా ఆ పరమాత్మయే బ్రహ్మ విష్ణు శివస్వరూపుడు.

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 17 ॥**

తత్ = ఆ పరబ్రహ్మ
జ్యోతిషామ్, అపి = జ్యోతి స్స్వరూపము లన్నింటికిని
జ్యోతిః = పరంజ్యోతి
తమసః, పరమ్ = మాయాతీతుడు-అని
ఉచ్యతే = చెప్పబడును
జ్ఞానమ్ = (ఆపరమాత్మ) జ్ఞానస్వరూపుడును
జ్ఞేయమ్ = తెలిసికొన దగినవాడును
జ్ఞానగమ్యమ్ = తత్త్వజ్ఞానము ద్వారా ప్రాప్యుడును మఱియు
సర్వస్య, హృది = సకల ప్రాణుల హృదయముల యందును
విష్ఠితమ్ = విశేషముగా స్థితమైయుండువాడు

**ఆ పరబ్రహ్మ అన్నిజ్యోతులకును జ్యోతి (పరంజ్యోతి) మాయాతీతుడును, జ్ఞానస్వరూపుడును, తెలిసికొనదగినవాడును, తత్త్వజ్ఞానముద్వారా ప్రాప్యుడును అతడే. సర్వప్రాణుల హృదయములయందు విశేషముగా ఉండువాడును అతడే. (17)**

ప్రశ్న - ఆ పరబ్రహ్మ జ్యోతులకును 'పరంజ్యోతి' అనియనుట లోని ఆంతర్యమేమి?

సమా - చంద్రుడు, సూర్యుడు, విద్యుత్తు, తారకలు మొదలగు బాహ్యజ్యోతులకును, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు మొదలగు ఆధ్యాత్మిక జ్యోతులకును, వేర్వేఱులోకముల, వస్తువుల అధిష్ఠాన దేవతా రూపములైన దివ్యజ్యోతులకును, అందరికిని ప్రకాశమును ఇచ్చువాడు ఆ పరమాత్మ. వాటన్నింటియందలి ప్రకాశశక్తియు ఆ పరబ్రహ్మ పరమాత్మయొక్క ఒక అంశము మాత్రమే. కావున అతడు సమస్తజ్యోతులకును జ్యోతి. అనగా అందరికిని ప్రకాశమును ఇచ్చువాడును, ప్రకాశకుడును అతడే. అతనిని ప్రకాశింప జేయువాడు మరియొకడు లేదు.

శ్రుతియందు ఇట్లు చెప్పబడినది - న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం, నేమా విద్యుతో భాంతి, కుతోయమగ్నిః। తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ॥ (కఠోపనిషత్ 2/2/15, శ్వేతాశ్వతర ఉపనిషత్ - 6/14) అనగా అచ్చట సూర్యుడుగాని, చంద్రుడుగాని, తారకలు (చుక్కలు)గాని ప్రకాశింపవు. అచట విద్యుత్తు గూడ ప్రకాశింపదు. ఇంక అగ్ని విషయము చెప్పనేల? అతని ప్రకాశమువలననే ఇవి యన్నియును ప్రకాశించుచున్నవి. ఆయన ప్రకాశమువలననే సమస్త జగత్తు ప్రకాశించుచున్నది.

గీతయందును 15వ అధ్యాయము నందలి 12వ శ్లోకమున ఇట్లు చెప్పబడినది. "సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సే యని యెఱుంగుము" (15/19)

ప్రశ్న - ఇచట 'తమః' అను పదము దేనిని సూచించును? ఆ పరమాత్మ దానికంటెను పరమైనవాడు - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇచట 'తమః' అను పదము అంధకారమును, అజ్ఞానమును సూచించును. ఆ పరమాత్మ స్వయంజ్యోతి. జ్ఞానస్వరూపుడు. అంధకారము, అజ్ఞానము ఆయనను సమీపింపలేవు. కనుక అతడు తమస్సునకు అతీతుడు - అని తెల్పబడినది.

ప్రశ్న - ఇచట 'జ్ఞానము' అను పదము దేనిని సూచించును? ఈ పదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - ఇచట 'జ్ఞానము' అను పదము పరమాత్మ స్వరూపమును సూచించును. ఈ పదప్రయోగము ద్వారా ఆ పరమాత్మ చేతన, బోధస్వరూపుడని తెలియుచున్నది.

ప్రశ్న - ఆయనను ఇచట మరల 'జ్ఞేయమ్' అని పేర్కొనుటలోని విశేషమేమి?

సమా - 12వ శ్లోకమున ఈ ప్రకరణమును ఆరంభించుచు పరమాత్మయే జ్ఞేయము అని తెల్పుట జరిగినది - ఇచ్చట మఱల ఆయనను 'జ్ఞేయము' అని తెల్పుట వలన ఆ పరమాత్మ జ్ఞానప్రాప్తియే ఈ మానవజన్మకు పరమకర్తవ్యమనియు, ఈ ప్రపంచమున తెలిసికొనదగిన తత్త్వము కేవలము ఆ పరమాత్మయే యనియు స్పష్టము చేయబడెను. కనుక ఆ తత్త్వమును తెలిసికొనుటకే అందఱును సంపూర్ణముగా ప్రయత్నింపవలెను. తమ అమూల్య జీవితములను సాంసారిక భోగములయందు మునిగి వ్యర్థము చేయరాదు.

ప్రశ్న - ఆయనను 'జ్ఞానగమ్యమ్' అని పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - 'జ్ఞేయమ్' అను పదముద్వారా ఆయనను తెలిసికొనుట ఆవశ్యకమని పేర్కొనుట జరిగెను. అయినచో ఆయనను తెలిసికొనుట ఎట్లు? అను ప్రశ్న ఉదయించును. కనుక ఆయన జ్ఞానగమ్యము - అనగా పూర్వోక్త 'అమానిత్వాది' జ్ఞానసాధనల ద్వారా ప్రాప్తమైన తత్త్వజ్ఞానము వలన ఆయనను తెలియదగును - అని విశదము చేయబడినది. కావున ఆ సాధనల ద్వారా తత్త్వజ్ఞానమును పొంది, ఆ పరమాత్మను తెలిసికొనవలెను.

ప్రశ్న - పూర్వశ్లోకమునందు ఆ పరమాత్మ సర్వత్ర వ్యాప్తుడు - అని తెల్పబడెను. మఱి ఇచ్చట 'హృది సర్వస్య విష్ఠితమ్' అనగా కేవలము అందరి హృదయముల యందు స్థితుడై యున్నాడని తెల్పుటలోని విశేషమేమి?

సమా - ఆ పరమాత్మ అంతటను సమానముగా పరిపూర్ణుడై యున్నను విశేషముగా అతడు అందరి హృదయములయందు అభివ్యక్తమగుచునే యుండును. సూర్యుని ప్రకాశము అన్నిచోట్లను సమానముగా వ్యాపించియున్నను దర్పణాదులయందు ఆయన ప్రతిబింబము విశేషముగా అభివ్యక్తమగును. అట్లే భూతద్దములో ఆయన తేజస్సు సూటిగా ప్రకటితమై అగ్నిని ఉత్పన్నము చేయును. ఇతర పదార్థముల యందు ఆ విధముగ అభివ్యక్తముగాదు. అట్లే హృదయము ఆ పరమాత్ముని యొక్క ఉపలబ్ధిస్థానము. జ్ఞాని హృదయము నందయితే ఆయన సూటిగా ప్రకటితుడగును. ఈ విషయమును వివరించుటకే అతడు సర్వ హృదయముల యందును విశేషముగా స్థితుడైయుండునని తెల్పబడెను.

*సంబంధము - ఈ విధముగా క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయముల స్వరూపములను సంక్షిప్తముగా వర్ణించి, ఇపుడు ఈ ప్రకరణమును తెలిసికొనుట వలన కలుగు ఫలమును తెల్పుచున్నాడు-*

**ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇతి | = ఈ విధముగా | జ్ఞేయమ్ | = తెలిసికొనదగిన పరమాత్మ స్వరూపమును గూర్చియు | మద్భక్తః | = నా భక్తుడు |
| క్షేత్రమ్ | = క్షేత్రమును గూర్చియు | | | ఏతత్, విజ్ఞాయ | = దీనిని సమగ్రముగాతెలిసికొని |
| తథా | = అట్లే | | | | |
| జ్ఞానమ్ | = జ్ఞానమును గూర్చియు | సమాసతః | = సంక్షిప్తముగా | మద్భావాయ | = నాస్వరూపమునే |
| చ | = మరియు | ఉక్తం | = చెప్పబడినది | ఉపపద్యతే | = పొందును |

**ఇంతవఱకును క్షేత్రమును గూర్చియు, జ్ఞానమును గూర్చియు, జ్ఞేయమును (తెలిసికొనదగిన పరమాత్మ స్వరూపమును) గుఱించియు సంక్షిప్తముగా వివరించితిని. ఈ తత్త్వమును సమగ్రముగా తెలిసికొనిన నా భక్తుడు నా స్వరూపమునే పొందును. (18)**

ప్రశ్న - ఇంతవరకును క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయముల స్వరూపములు ఏయే శ్లోకములయందు తెల్పబడినవి?

సమా - 5,6 శ్లోకములలో వికారసహితక్షేత్రస్వరూపము వివరింపబడినది. 7 నుండి 11వ శ్లోకము వఱకును 'జ్ఞానము' అను పేరుతో జ్ఞానముయొక్క 20 సాధనరీతులు వర్ణింపబడినవి. 12 నుండి 17వ శ్లోకము వఱకును 'జ్ఞేయము' అనగా తెలిసికొనదగిన పరమాత్మ స్వరూపము వర్ణింపబడినది.

ప్రశ్న - 'మద్భక్తః' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి? ఆ క్షేత్ర, జ్ఞాన, జ్ఞేయములను తెలిసికొనుట యనగానేమి? అట్లే భగవద్భావమును పొందుటయనగానేమి?

సమా - 'మద్భక్తః' అను పదము ఇచ్చట భగవానుని భజన ధ్యాన - ఆజ్ఞాపాలన, పూజాసేవాది క్రియలను భక్తి పూర్వకముగా చేయు భగవద్భక్తుని సూచించును. ఈ పదప్రయోగముద్వారా ఈ జ్ఞాన మార్గమునను సరించియు భగవంతుని శరణుజొచ్చిన సాధకుడు సహజముగనే పరమపదమును పొందునని భగవానుడు స్పష్టపరచెను.

ఇచ్చట 'క్షేత్రము' అనగా ప్రకృతి కార్యము. ఇది జడము, వికారసహితము, అనిత్యము, నశ్వరము అని తెలిసికొనవలెను. జ్ఞాన సాధనలను సంపూర్ణముగా ధారణ చేసి, వాటి ద్వారా భగవానుని నిర్గుణ సగుణరూపమును సమగ్రముగా ఎఱుంగవలెను. క్షేత్ర, జ్ఞాన, జ్ఞేయములను తెలిసికొనుట యనగా ఇదియే. జ్ఞేయస్వరూపుడైన ఆ పరమాత్మను పొందుటయే భగవద్భావమును పొందుట యగును

*సంబంధము - 3వ శ్లోకమున క్షేత్రవిషయమునందు నాలుగు మాటలను క్షేత్రజ్ఞుని విషయమున రెండు మాటలను సంక్షిప్తముగా వినుమని భగవానుడు అర్జునునితో పల్కియుండెను. ఈ విషయమును ఆరంభించుచు క్షేత్ర స్వరూపమును, దాని వికారములను వర్ణించెను. పిమ్మట క్షేత్ర, క్షేత్రజ్ఞుల తత్త్వములను సమగ్రముగా తెలిసికొను ఉపాయములను (సాధనలను)*

తెలిసికొనదగిన పరమాత్మ స్వరూపమును ప్రసంగ వశమున వర్ణించెను. క్షేత్రముయొక్క స్వభావమును గాని, ఏ కారణము వలన ఏ కార్యోత్పత్తి జరుగునను విషయమును గాని, అట్లే క్షేత్రజ్ఞుని స్వరూప ప్రభావములను గాని వర్ణించుట జరుగలేదు. కనుక ఆ విషయములను, అన్నింటిని వర్ణించుటకు భగవానుడు మఱల 'ప్రకృతి-పురుషుల' ప్రకరణమును ప్రారంభించుచున్నాడు. మొట్టమొదట ప్రకృతి - పురుషుల అనాదిత్వమును ప్రతిపాదించుచు సమస్త గుణములు, వికారములు ప్రకృతి జన్యములని తెలుపుచున్నాడు-

**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రకృతిమ్ | = ప్రకృతిని | విద్ధి | = ఎఱుంగుము | | గుణములనూ |
| చ | = మఱియు | చ | = మఱియు | ప్రకృతి సంభవాన్, ఏవ | = ప్రకృతినుండియే ఉత్పన్నములైన |
| పురుషమ్ | = పురుషుని | వికారాన్, చ | = రాగద్వేషాది వికారములను | | వానినిగా |
| ఉభౌ, ఏవ అనాదీ | = ఈ రెండును ఆదిలేనివని | గుణాన్, అపి | = సత్త్వరజస్తమో | విద్ధి | = ఎఱుంగుము |

ప్రకృతి, పురుషుడు - అను ఈ రెండును అనాదియైన (సనాతనమైన) వనియు, రాగద్వేషాదివికారములును, త్రిగుణాత్మకములైన పదార్థములన్నియును ప్రకృతినుండియే ఉత్పన్నములైనవనియు ఎఱుంగుము. (19)

ప్రశ్న - ఈ శ్లోకమున "ప్రకృతి" దేనిని సూచించును? 7వ అధ్యాయమునందలి 4, 5 శ్లోకములలో 'అపరాప్రకృతి' అను పేరుతోడను, ఈ అధ్యాయమున 5వ శ్లోకములో క్షేత్రస్వరూపములని వర్ణింపబడిన వాటికిని ఈ ప్రకృతికిని మధ్యగల బేధమేమి?

సమా - ఇచట 'ప్రకృతి' అను పదము ఈశ్వరుని యొక్క అనాదిసిద్ధమైన మూల ప్రకృతిని సూచించును. 14వ అధ్యాయమున దీనినే 'మహద్బ్రహ్మ' అని పేర్కొనుట జరిగినది. 7వ అధ్యాయము నందలి 4, 5 శ్లోకములలో 'అపరాప్రకృతి' అను పేరుతోడను, ఈ అధ్యాయమునందలి 5వ శ్లోకమున 'క్షేత్రము' అను పేరుతోడను ఇదియే వర్ణింపబడినది. అచట మనస్సు, బుద్ధి, అహంకారము, పంచమహాభూతములు మొదలగు కార్యములతో పాటు 'మూలప్రకృతి' వర్ణింపబడినది. ఇచట కేవలము 'మూలప్రకృతి' వర్ణనయే కలదు. ఇదియే వీటి మధ్య గల భేదము.

ప్రశ్న - ప్రకృతి, పురుషుడు ఈ రెండింటిని అనాదియని తెల్పుటలోను అట్లే 'చ' 'ఏవ' అను అవ్యయములను ప్రయోగించుటలోను గల విశేషమేమి?

సమా - ప్రకృతి - పురుషుడు ఈ రెండింటి యొక్క అనాదిత్వము సమానమే. ఈ విషయమును తెలిసికొనుటకై అనగా ఈ లక్షణము రెండింటికిని ఒకటేయని తెలుపుటకై 'చ' 'ఏవ' అను అవ్యయములు ప్రయుక్తములైనవి. జీవుని జీవత్వము (అనగా ప్రకృతితో పాటు అతని సంబంధము) ఏదో యొక కారణము వలన క్రొత్తగా వచ్చి చేరినదిగాదు. ఇది అనాదిసిద్ధమైనది. ఇదే విధముగా ఈశ్వర శక్తియైన ఈ ప్రకృతి గూడ అనాదిసిద్ధమే.

ప్రశ్న - ఇచట "వికారాన్, గుణాన్" అను పదములు వేనిని సూచించును? "ఈ రెండును ప్రకృతి నుండి ఉత్పన్నములైనవని తెలిసికొనుము" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ అధ్యాయమునందలి 6వ శ్లోకమున ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు మొదలగు వికారములు వర్ణింపబడినవి. వాటిని సూచించునదియే 'వికారాన్' అనుపదము, సత్త్వరజస్తమోగుణములను వాటి నుండి ఉత్పన్నములైన సమస్త జడపదార్థములను సూచించునదియే 'గుణాన్' అనుపదము. సత్త్వరజస్తమోగుణములను ప్రకృతియను పేరుతో వ్యవహరింపరాదు. ప్రకృతి అనాది.

ఈ మూడు గుణములను సృష్ట్యాదియందు దాని నుండి ఉత్పన్నములైనవి. (భాగవతం - 2/5/22, 11/24/5). ఈ విషయమును స్పష్టపఱచుటకే భగవంతుడు 14వ అధ్యాయమునందలి 5వ శ్లోకమున సత్త్వరజస్తమోగుణములు ప్రకృతి సంభవములని పేర్కొనెను. ఇంతేగాక 3వ అధ్యాయము నందలి 5వ శ్లోకమునను, 18వ అధ్యాయమునందలి 40వ శ్లోకమునను, ఈ అధ్యాయమునందలి 21వ శ్లోకమునను గుణములు ప్రకృతిజన్యములని తెల్పెను. 3వ అధ్యాయమునందలి 27, 29 శ్లోకముల యందును గుణములు ప్రకృతియొక్క కార్యరూపములని చెప్పబడెను. కనుక సత్త్వరజస్తమో గుణములు వాటి కార్యసహితమైన ప్రకృతి నుండి ఉత్పన్నములైనవని తెలిసికొనవలెను. అట్లే సమస్త వికారములును ప్రకృతిసంభవములేయని భావింపవలెను.

*సంబంధము - దేనినుండి ఏవి ఉత్పన్నములైనవి? అను విషయమును వినుమని భగవానుడు అర్జునునితో 3వ శ్లోకమునందు పలికియుండెను. దాని వర్ణనమును పూర్వశ్లోకము యొక్క ఉత్తరార్ధమున కొంత చేసెను. ఇప్పుడు ఆ విషయమునే ఈ శ్లోకము యొక్క పూర్వార్ధమున కొంత వివరించుచు దీని (ఈ శ్లోకము యొక్క ) ఉత్తరార్ధమునను, 21వ శ్లోకమునను ప్రకృతియందు స్థితుడైన పురుషుని వర్ణనము చేయుచున్నాడు-*

**కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే ।**
**పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥ 20 ॥**

కార్యకరణ కర్తృత్వే = కార్యములను, కరణములను ఉత్పన్నము చేయుటలో; ప్రకృతిః, హేతుః, ఉచ్యతే = ప్రకృతియే హేతువుగా చెప్పబడును; సుఖదుఃఖానామ్, భోక్తృత్వే = సుఖదుఃఖములను అనుభవించుటలో; పురుషః = జీవాత్మయే; హేతుః, ఉచ్యతే = హేతువుగా చెప్పబడుచున్నది

**కార్యకరణములను ఉత్పన్నము చేయుటలో ప్రకృతియే హేతువనియు, సుఖదుఃఖములను అనుభవించుటలో జీవాత్మయే హేతువనియు చెప్పబడుచున్నది. (20)**

ప్రశ్న - 'కార్యములు - కరణములు' అను పదములు ఏయే తత్త్వములను సూచించును? వాటి కర్తృత్వమునందు ప్రకృతిని హేతువుగా తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి అను ఐదు సూక్ష్మమహాభూతములను, అట్లే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి ఐదు ఇంద్రియ విషయములను (ఈ పదింటిని) కార్యములు అను శబ్దము సూచించును. బుద్ధి, అహంకారము, మనస్సు, అను మూడు అంతఃకరణములును, త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములు అను (ఐదు) జ్ఞానేంద్రియములును, వాక్, పాణి, పాద, పాయూపస్థలను ఐదు కర్మేంద్రియములును (ఈ పదమూడును) 'కరణములు', అనబడును. ఈ 23 తత్త్వములు ప్రకృతినుండియే ఉత్పన్నములైనవి. ప్రకృతియే వీటికి ఉపాదానకారణము. కనుక ఇవి ఉత్పన్నములగుటకు ప్రకృతియే 'హేతువు' అని తెల్పబడినది.

ప్రశ్న - ఈ 23 తత్త్వములలో ఒకదాని ఉత్పత్తి మఱియొకదానినుండి ఎట్లు జరిగినది?

సమా - ప్రకృతినుండి మహత్‌తత్త్వము, దాని నుండి అహంకారము, ఆ అహంకారము నుండి 5 సూక్ష్మమహాభూతములు, మనస్సు, దశేంద్రియములు ఉత్పన్నములైనవి. సూక్ష్మ మహాభూతముల నుండి శబ్దాది ఐదు స్థూలవిషయములు ఉత్పన్నములైనవి. సాంఖ్యకారిక యందును ఇట్లే చెప్పబడినది-

ప్రకృతేర్మహాంస్తతోఽహంకారస్తస్మాద్గణశ్చ షోడశకః ।
తస్మాదపి షోడశకాత్ పంచభ్యః పంచ భూతాని ॥
(సాంఖ్యకారిక 22)

అనగా "ప్రకృతి నుండి మహత్తత్త్వము (సమష్టిబుద్ధి) అనగా బుద్ధితత్త్వము, దాని నుండి అహంకారము, దానినుండి 5 తన్మాత్రలు, మనస్సు, దశేంద్రియములు అను 16 ఉత్పన్నములు ఐనవి. ఈ పదునారింటిలోని 5 తన్మాత్రల

నుండి 5 స్థూలభూతములును ఏర్పడినవి."

గీతయందు తన్మాత్రల స్థానములో 5 సూక్ష్మమహాభూతములనియు, 5స్థూల భూతముల స్థానములో 5 ఇంద్రియ విషయములనియు వర్ణింపబడినవి. ఇందలి భేదమిదియే.

ప్రశ్న - ఒక్కొక్క చోట 'కార్య-కరణ' అను పాఠమునకు మాఱుగా 'కార్యకారణ' అను పాఠాంతరము గలదు - దానిని సమ్మతించినచో కార్యకారణ శబ్దములు ఏయే తత్త్వములను తెల్పును?

సమా - 'కార్యకారణ' అను పాఠాంతరమును అంగీకరించినచో ఐదు జ్ఞానేంద్రియములును, 5 కర్మేంద్రియములును, మనస్సు, ఐదు ఇంద్రియ విషయములు - ఈ పదునాఱింటిని కార్యము అను పదము సూచించునని భావింపవలెను. ఏలనన ఇవి అన్నియును వేఱే (ఇతరములైన) వాటికి కార్యములు. స్వయముగా దేనికిని కారణములు కావు. బుద్ధిని, అహంకారమును, ఐదు సూక్ష్మమహాభూతములను తెలుపునది 'కారణము' అను పదమని భావింపవలెను. ఏలనన 'బుద్ధి' అహంకారమునకు కారణము. మనస్సు, ఇంద్రియములు, సూక్ష్మమహాభూతములకును అహంకారము కారణము. సూక్ష్మమహాభూతములు పంచేంద్రియ (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ) విషయములకు కారణములు.

ప్రశ్న - అంతఃకరణమున బుద్ధి, అహంకారము, చిత్తము, మనస్సు అనునాల్గు భేదములున్నట్లు ఇతర శాస్త్రములలో తెల్పబడినది. కాని భగవానుడు ఇచ్చట మూడింటినే ఏల వర్ణించెను?

సమా - చిత్తము, మనస్సు, వేర్వేఱు తత్త్వములని భగవానుడు భావింపలేదు - ఒకే తత్త్వమునకే ఈ రెండు పేర్లు. సాంఖ్యయోగ శాస్త్రములయందును ఇట్లే భావింపబడినది. కనుక అంతఃకరణమున నాల్గు (4) భేదములు గాక మూడు (3) భేదములే తెల్పబడినవి.

ప్రశ్న - 'పురుష' శబ్దము చైతన్యవంతమైన 'ఆత్మ' వాచకము. ఆత్మ నిర్లిప్తము, శుద్ధము ఐనదని భావింపబడినది. మఱి ఇచ్చట పురుషుడు సుఖదుఃఖముల భోక్తృత్వమునకు కారణమని చెప్పుట యెట్లు?

సమా - ప్రకృతి జడము. కావున దానిని భోక్త యనుటకు వీలులేదు. పురుషుడు అసంగుడు. కావున అతడును వాస్తవముగా భోక్తకాడు. ప్రకృతిసాంగత్యము వలననే పురుషుని యందు భోక్తృత్వము ప్రతీతమగుచున్నది. ఈ ప్రకృతి పురుషుల సాంగత్యము అనాది. కనుక పురుషుడు సుఖదుఃఖముల భోక్తృత్వమునకు 'హేతువు - అనగా నిమిత్తముగా భావింపబడుచున్నది. ఈ విషయమును స్పష్టపరచుటకే రాబోవు శ్లోకమున "ప్రకృతియందు స్థితుడైన పురుషుడే ప్రకృతి జన్యములైన గుణములను అనుభవించును." - అని తెల్పబడినది. కనుక ప్రకృతినుండి ముక్తుడైన పురుషునియందు భోక్తృత్వవాసన గూడ ఉండదు.

**పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।**
**కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥ 21 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రకృతిస్థః | = ప్రకృతియందు స్థితుడైన | గుణాన్ | = ఉత్పన్నములైన త్రిగుణాత్మకములైన పదార్థములను | గుణసంగః | = గుణముల సాంగత్యమే |
| పురుషః, హి | = పురుషుడే | | | అస్య | = ఈ జీవాత్మయొక్క |
| ప్రకృతిజాన్ | = ప్రకృతినుండి | భుంక్తే | = అనుభవించును | సదసద్యోని జన్మసు | = ఉత్తమాధమ జన్మలకు |
| | | | | కారణమ్ | = కారణము |

**పురుషుడు ప్రకృతిస్థుడై ప్రకృతినుండి ఉత్పన్నములైన త్రిగుణాత్మక పదార్థములను అనుభవించును. ఈ గుణసాంగత్యమే జీవాత్మయొక్క ఉత్తమాధమ జన్మలకు కారణమగును. (21)**

ప్రశ్న - ఇచ్చట 'ప్రకృతిజాన్' అను విశేషణముతో పాటు 'గుణాన్' అను పదము దేనిని సూచించును. అట్లే 'పురుషః' అను పదముతోపాటు 'ప్రకృతిస్థః' అను విశేషణమును ప్రయోగించి, అతడు గుణములకు భోక్త అని తెల్పుటలోని వైశిష్ట్యమేమి?

సమా - ప్రకృతి జన్యములైన సత్త్వరజస్తమో

గుణములను, అట్లే వాటి కార్యములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధవిషయములైన సాంసారిక పదార్థములను 'ప్రకృతిజాన్' అను విశేషణముతో పాటు 'గుణాన్' అను పదము తెలుపును. ప్రకృతితో ఏర్పడిన స్థూలసూక్ష్మ కారణ శరీరములలో ఏ ఒక్క దానితోడనైనను జీవాత్మతో సంబంధము ఉన్నంత వరకును ఆ పురుషుడు ప్రకృతియందున్నట్లు (ప్రకృతిస్థః) అని భావింపబడును. కావున ఆత్మకు ప్రకృతితో సంబంధము ఉన్నంతవరకు అతడు ప్రకృతిజన్యములైన గుణములకు భోక్త. ప్రకృతితో సంబంధము తొలగిన వెంటనే అతనికి (జీవునకు) భోక్తృత్వము గూడ ఉండదు. ఏలనన పురుషస్వరూపము (జీవాత్మయథార్థస్థితి) నిత్యము, సంగరహితము.

ప్రశ్న - 'సదసద్యోని' అను సమాసము ఏ యోనులను తెల్పును? 'గుణసంగము' అనగా నేమి? అది జీవాత్మ సదసద్యోనులలో జన్మించుటకు కారణమెట్లగును?

సమా - 'సదసద్యోని' అను సమాసము ఉచ్చనీచ యోనులను సూచించును. మనుష్యయోని మొదలుకొని అంతకంటె ఉన్నతమైన దేవాదియోనులను 'సత్-యోనులు' అని యందురు. అంతకంటె నీచమైన పశు, పక్షి, వృక్ష, లతా యోనులను 'అసత్-యోనులు' అని యందురు. సత్త్వరజస్తమోగుణములతోడ జీవునకు అనాదిసిద్ధ సంబంధము గలదు. దాని కార్యరూపమైన ప్రాపంచిక పదార్థముల యందలి ఆసక్తినే 'గుణ సంగము' అని యందురు. ఒక వ్యక్తి ఏ 'గుణమునందు, లేక దాని కార్యరూప పదార్థమునందు ఆసక్తియుండునో అతనికి అట్టి వాసనలే ఏర్పడును. వాటిని అనుసరించి, అతనికి పునర్జన్మ కల్గును. కనుక ఇచట ఉచ్చనీచయోనుల యందు జన్మించుటకు గుణసాంగత్యమే కారణమని తెలుపబడినది.

ప్రశ్న - నాల్గవ అధ్యాయమునందలి 13వ శ్లోకమున గుణకర్మలననుసరించి, నాలుగు వర్ణముల ఏర్పాటు తనద్వారానే జరిగినట్లు భగవానుడు నుడివెను. 8వ అధ్యాయము నందలి 6వ శ్లోకములో - మానవుడు అంత్యకాలమున ఏ భావమును స్మరించునో అతనికి ఆ జన్మయే ప్రాప్తించునని తెల్పెను. ఇచ్చట ఉచ్చనీచయోనుల యందు జన్మించుటకు గుణసాంగత్యమే కారణమని తెలుపుచున్నాడు. ఈ మూడింటి సమన్వయము ఎట్లు సాధ్యమగును?

సమా - ఈ మూడింటియందును వాస్తవముగా సమంజసముకానిది ఏదియును లేదు. పరిశీలించి చూచినచో ప్రకారాంతరమున గుణసాంగత్యమే ఉచ్చనీచయోనుల ప్రాప్తికి కారణమని తెలియుచున్నది. (1) భగవంతుడు నాల్గు వర్ణముల ఏర్పాటు వారి వారి గుణ కర్మలను అనుసరించియే చేయును. ఇందు ఆ జీవుల గుణసాంగత్యము సహజముగానే హేతువగును. (2) మనుష్యుడు తన కర్మలసాంగత్యమును అనుసరించి, మూడు గుణములలో ఏదో ఒకదానియందు విశేషమైన ఆసక్తి కల్గియుండును. దానివలన ఆ కర్మసంస్కారములు ఏర్పడును. ఆయా సంస్కారములను బట్టి అంత్యకాలమున స్మృతి కల్గును. స్మృతిననుసరించియే ఉచ్చనీచయోనుల యందు వారికి జన్మలు ప్రాప్తించును. కనుక ఇందు గూడ గుణసాంగత్యమే మూలకారణము అగుచున్నది. (3) ఉచ్చనీచయోనులలో జన్మలు ప్రాప్తించుటకు గుణసాంగత్యమే హేతువని ఈ శ్లోకమున సూటిగా తెల్పబడినది. కావున మూడు శ్లోకముల యందును ఒకే విషయమే వివరింపబడినది.

సంబంధము - ఈ విధముగా ప్రకృతిస్థుడైన పురుషుని స్వరూపమును వర్ణించిన పిదప జీవాత్మ పరమాత్మల ఏకత్వమును ప్రతిపాదించుచు ఆత్మయొక్క గుణాతీత స్వరూపమును వర్ణించుచున్నాడు-

**ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 22 ॥**

అస్మిన్, దేహే, = ఈ దేహమునందు
(స్థితః) అపి స్థితుడైయున్నను
పురుషః = ఆత్మ
పరః, ఏవ = వాస్తవముగా
పరమాత్మయే
ఉపద్రష్టా, చ = (అతడే) సాక్షియగుటచే 'ఉపద్రష్ట' అనియు,
అనుమంతా = యథార్థముగా సమ్మతిని ఇచ్చువాడు అగుటవలన 'అనుమంత' అనియు

భర్తా = అన్నింటిని ధరించి, పోషించువాడగుట వలన 'భర్త' అనియు
భోక్తా = జీవరూపముతో 'భోక్త' యనియు
మహేశ్వరః, చ = బ్రహ్మాదులకును ప్రభువగుటవలన 'మహేశ్వరుడు' అనియు,
పరమాత్మా, ఇతి } = శుద్ధసచ్చిదానంద ఘనుడగుటవలన 'పరమాత్మ' అనియు,
ఉక్తః = పేర్కొనబడెను.

ఈ దేహమునందున్న ఆత్మ వాస్తవముగా పరమాత్మయే. అతడు సాక్షీభూతుడగుటవలన 'ఉపద్రష్ట' యనియు, యథార్థసమ్మతినిచ్చువాడగుట వలన 'అనుమంత' అనియు, అన్నింటిని ధరించి, పోషించువాడు అగుటవలన 'భర్త' అనియు, జీవరూపములో 'భోక్త' అనియు, బ్రహ్మాదులకును స్వామి యగుటవలన 'మహేశ్వరుడు' అనియు, శుద్ధసచ్చిదానందఘనస్వరూపుడగుట వలన 'పరమాత్మ' అనియు పిలువబడుచున్నాడు. **(22)**

ప్రశ్న - "ఈ దేహస్థితమైన ఆత్మ వాస్తవముగా పరమాత్మయే." అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యము ద్వారా క్షేత్రజ్ఞుని గుణాతీత స్వరూపము నిర్దేశింపబడినది. చైతన్యవంతమైన ఆత్మ ప్రకృతి జన్యమైన శరీరము అను ఉపాధి వలనను అజ్ఞాన కారణమున జీవభావమును పొందినట్లు గోచరించును. కాని ఆ క్షేత్రజ్ఞుడు వాస్తవముగా సర్వథా ఈ ప్రకృతికి అతీతుడైన పరమాత్మయే. ఏలనన ఆ పరబ్రహ్మ పరమాత్మునకును, క్షేత్రజ్ఞునకును మధ్య వస్తుతః ఎట్టి భేదమూ లేదు. కేవలము శరీరరూప ఉపాధి వలననే భేదము ప్రతీతమగుచున్నది.

ప్రశ్న - ఈ ఆత్మయే 'ఉపద్రష్ట' 'అనుమంత' 'భర్త' 'భోక్త' మహేశ్వర' 'పరమాత్మ' - అని తెల్పుటలోని అంతర్యమేమి?

సమా - వేర్వేఱు కారణముల (నిమిత్తముల) వలన ఒకే పరబ్రహ్మ పరమాత్మ వేర్వేఱు పేర్లతో పిలువబడును. వస్తు దృష్టితో బ్రహ్మము నందు ఎట్టి భేదమూలేదు. సచ్చిదానంద ఘన పరబ్రహ్మయే అంతర్యామి రూపముతో అందఱి శుభాశుభకర్మలను వీక్షించుచుండు వాడు. కనుక ఆయనను ఉపద్రష్ట అనియందురు. ఆయనయే అంతర్యామి రూపములతో సమ్మతిని కోరువానికి తగిన అనుమతి నిచ్చును. కావున 'అనుమంత' యని యందురు. అతడే విష్ణురూపముతో సమస్త జగత్తును రక్షించి, భరించి పోషించును - కనుక ఆయనను 'భర్త' అనియందురు. అతడే దేవతల రూపములతో సమస్త యజ్ఞముల హవిస్సును, సర్వప్రాణుల రూపములతో సమస్త భోగములను అనుభవించును. కనుక ఆయనను 'భోక్త' యని యందురు. అతడే సకలలోకపాలురను, బ్రహ్మాది దేవతలను గూడ నియమించును. కనుక ఆయనను మహేశ్వరుడని యందురు. 'వస్తుతః' అతడు సర్వదా, సర్వథా గుణములన్నింటికిని అతీతుడు. కనుక ఆయనను 'పరమాత్మ' అని యందురు. ఒకే పరబ్రహ్మ పరమాత్మ వేర్వేఱు నిమిత్తముల వలన వేర్వేరు పేర్లతో పిలువబడును. 'వస్తుతః' ఆయన ఎట్టి భేదములును లేనివాడు.

*సంబంధము - ఈ విధముగా గుణముల సహితముగ ప్రకృతి పురుషుల స్వరూపములను వర్ణించిన పిదప వాటి యథార్థ తత్త్వమును తెలిసికొనుట వలన కలుగు ఫలమును తెలుపుచున్నాడు-*

**య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 23 ॥**

ఏవమ్ = ఈ విధముగా
పురుషమ్ = పురుషుని
చ = మఱియు
గుణైః సహ = త్రిగుణసహితముగా
ప్రకృతిమ్ = ప్రకృతిని
యః = ఏమనుష్యుడు
వేత్తి = యథార్థముగా తెలిసికొనునో
సః = అతడు
సర్వథా = అన్నివిధములుగా
వర్తమానః, అపి } = కర్తవ్య కర్మలను చేయుచున్నను
భూయః = మఱల
న అభిజాయతే = జన్మింపడు

**ఈ విధముగా పురుషునితత్త్వమును, గుణసహితమైన ప్రకృతితత్త్వమును తెలిసికొనినవాడు అన్ని విధములగు కర్తవ్యకర్మలను ఆచరించుచున్నప్పటికిని పునర్జన్మను పొందడు. (23)**

ప్రశ్న - పూర్వోక్తరీతిగా పురుషుని తత్త్వములను, గుణసహితమైన ప్రకృతి తత్త్వములను తెలిసికొనుట యనగానేమి?

సమా - ఈ అధ్యాయమున వర్ణించిన రీతినమసరించి, పురుషునియొక్క స్వరూప ప్రభావములను సమగ్రముగా తెలిసికొనుట - అనగా వేర్వేఱుగా ప్రతీతమగు క్షేత్రజ్ఞులు ఒకే పరబ్రహ్మ పరమాత్మయొక్క అభిన్న స్వరూపములే అవియు, ప్రకృతి సాంగత్యముచే ఆ క్షేత్రజ్ఞుల యందు భిన్నత్వము ఉన్నట్లుగా గోచరించుచున్నదనియు, 'వస్తుతః' ఎట్టి భేదమూ లేదనియు, ఆ పరమాత్మనిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తుడు, శాశ్వతుడు, ప్రకృతికి అతీతుడు అని తెలిసికొనుటయే, ఈ విషయమును ఎట్టి సంశయమూ లేకుండ గ్రహించి, ఏకీభావముతో ఆ సచ్చిదానంద ఘనపరమాత్మయందు నిత్యస్థితుడై యుండుటయే పురుష తత్త్వమును తెలిసికొనుట యగును.

మూడు గుణములును ప్రకృతి నుండి ఉత్పన్నమైనవనియు, ఈ సమస్త విశ్వమూ ప్రకృతియొక్క వ్యాప్తియనియు, ఇది నశ్వరము, జడము, క్షణభంగురము, అనిత్యము అను రహస్యమును తెలిసికొనుటయే గుణసహితముగ ప్రకృతి తత్త్వమును తెలిసికొనుటయగును.

ప్రశ్న - 'సర్వథా వర్తమానః' అను పదములతో పాటు 'అపి' అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - పైన తెల్పబడిన రీతిగా పురుషుని, గుణ సహితముగా ప్రకృతిని ఎఱింగినవాడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములలో ఏ వర్ణమునకు చెందినవాడైనప్పటికిని, బ్రహ్మచర్యాది ఆశ్రమములలో దేనియందు ఉన్నప్పటికిని, అయా వర్ణాశ్రమ ధర్మములను విధిపిధానముగా సమస్త కర్మలను యథాయోగ్యముగ చేసినప్పటికిని, అతడు ఏమియు చేయుని వాడేయగును. అతనికి పునర్జన్మయుండదు. ఈ విషయమును వివరించుటకే 'సర్వథా వర్తమానః' అను పదములతోపాటు 'అపి' అను అవ్యయమును ప్రయోగించుట జరిగినది.

ప్రశ్న - 'సర్వథా వర్తమానః' అను పదముతో పాటు 'అపి' అను అవ్యయప్రయోగమునకు "నిషిద్ధ కర్మలనాచరించుచున్నను పునర్జన్మ ప్రాప్తింపదు" అని భావించినచో దోషమేమి?

సమా - ఆత్మతత్త్వము నెఱింగిన జ్ఞానియందు కామక్రోధాది దోషములు ఏమాత్రమును ఉండవు. (5/26). అందువలన అతని ద్వారా నిషిద్ధకర్మలు జరుగుటకు వీలులేదు. కనుక అతని ఆచరణము ప్రపంచమున ప్రమాణముగా భావింపబడును. (3/21) కనుక 'సర్వథా వర్తమానః' అను పదములతోపాటు 'అపి' అను పదప్రయోగమునకు ఈ అర్థమును చెప్పుటకు వీలులేదు. మానవుడు పాపములలో ప్రవృత్తుడగుటకు అతని కామక్రోధాది - అవగుణములే కారణములు. అర్జునుని ప్రశ్నకు సమాధానముగా భగవానుడు 3వ అధ్యాయమునందలి 37వ శ్లోకమున ఈ విషయమునే స్పష్టపఱచెను.

ప్రశ్న - ఈ విధముగా ప్రకృతి, పురుషుల తత్త్వములను ఎఱింగిన వానికి పునర్జన్మ ఏల ఉండదు?

సమా - ప్రకృతి పురుషుల తత్త్వమును ఎఱిగినంతనే పురుషునకు ప్రకృతితో సంబంధము వదలిపోవును. ఏలనన ప్రకృతి పురుషుల సంయోగము స్వప్నమువలె అవాస్తవము. కేవలము అజ్ఞానజనితము. ప్రకృతిపురుషులను గూర్చిన జ్ఞానము సంపూర్ణముగా ఉండునంతవరకు పురుషునకు ప్రకృతితోడను, దాని గుణములతోడను సంబంధము ఉండియే తీరును. అంతవరకును అతడు పదేపదే నానా యోనులలో జన్మింపవలసియుండును. (13/21) కనుక ఈ తత్త్వజ్ఞానమును పొందిన పిమ్మట పునర్జన్మ యుండదు.

*సంబంధము - ఈ విధముగా గుణసహితమైన ప్రకృతి మఱియు పురుషుల జ్ఞానమహాత్మ్యమును విన్న పిదప - ఈ జ్ఞానము ఎట్లు లభించును? అను ప్రశ్న ఉదయించును. దీనికి సమాధానముగా వేర్వేఱు అధికారులకు (అర్హులకు) వేర్వేరు సాధనలు రెండు శ్లోకములలో ప్రతిపాదింపబడుచున్నవి-*

**ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 24 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆత్మానమ్ | = పరమాత్మను | ఆత్మని | = హృదయమునందు (హృదయముల యందు) | సాంఖ్యేన, యోగేన, చ | = జ్ఞాన (సాంఖ్య) యోగముద్వారాను |
| కేచిత్ | = కొందఱు పురుషులు | | | అపరే | = మఱికొందరు |
| ఆత్మనా | = శుద్ధమైన సూక్ష్మబుద్ధితో | పశ్యంతి | = చూచెదరు | కర్మయోగేన | = కర్మయోగముద్వారాను |
| ధ్యానేన | = ధ్యానయోగముద్వారా | అన్యే | = మఱికొందరు | పశ్యంతి | = చూచెదరు (పొందెదరు) |

కొందరు ఈ పరమాత్మను శుద్ధమైన సూక్ష్మబుద్ధితో ధ్యానయోగముద్వారా తమ హృదయముల యందు చూతురు. మఱికొందరు (జ్ఞాన) యోగముద్వారాను, మఱికొందఱు కర్మయోగముద్వారాను ఆ పరమాత్మను దర్శింతురు. **(24)**

ప్రశ్న - ఇచ్చట 'ధ్యానము' అను పదము దేనిని సూచించును? దానిద్వారా ఆత్మతో ఆత్మయందు ఆత్మను చూచుటయనగానేమి?

సమా - 6వ అధ్యాయమునందలి 11, 12, 13 శ్లోకముల యందు తెల్పబడినట్లు విధ్యుక్తముగా పవిత్రమైన ఏకాంత స్థలమున ఆసనమున నిశ్చలభావముతో కూర్చుండి, ఇంద్రియములను విషయముల నుండి మరల్చి, మనస్సును వశపరచుకొని పరమాత్మ తప్ప దృశ్యప్రపంచమును పూర్తిగా ప్రక్కన బెట్టి నిరంతరము పరమాత్మ చింతనచేయుటయే ధ్యానమందురు. ఈ విధముగా ధ్యానము చేయుచుండుట వలన బుద్ధి పవిత్రమగును. ఈ విశుద్ధ సూక్ష్మబుద్ధిద్వారా హృదయమునందు సచ్చిదానంద ఘనపరబ్రహ్మ పరమాత్మను సాక్షాత్కరింప జేసి కొనుటయే ధ్యానముద్వారా ఆత్మతో ఆత్మయందు ఆత్మను చూచుటయగును.

ప్రశ్న - సచ్చిదానంద ఘనబ్రహ్మను పొందుటకు చేయవలసిన ధ్యానము సగుణ పరమేశ్వరునకు సంబంధించినదా? నిర్గుణ బ్రహ్మదా? సాకారునిదా? నిరాకారునిదా? అట్లే ఈ ధ్యానము భేద భావముతో చేయబడునా? లేక అభేద భావముతోడనా? దీని ఫలస్వరూపమైన సచ్చిదానంద ఘన పరబ్రహ్మప్రాప్తి భేదభావముతోడనా? లేక అభేదభావముతోడనా?

సమా - 22వ శ్లోకమున ఆత్మపరమాత్మలు అభేదములని ప్రతిపాదించి దానిని అనుసరించియే పురుషస్వరూప జ్ఞానఫలప్రాప్తికై వేర్వేఱు సాధన రీతులు వర్ణింపబడినవి. అందువలన ఇచటి సందర్భానుసారము - నిర్గుణ నిరాకార బ్రహ్మయొక్క అభేదధ్యానమే వర్ణింపబడినది. మరియు దాని ఫలము గూడ అభేదరూప పరమాత్మప్రాప్తి యనియే తెల్పబడినది. కాని భేదభావముతో సగుణ నిరాకార మరియు సగుణ సాకార ధ్యాన సాధన చేయువారు కూడ ఈ విధమైన ఫలమును కోరినచో వారికిని అభేదభావముతో నిర్గుణనిరాకారసచ్చిదానంద ఘనబ్రహ్మప్రాప్తి కలుగవచ్చును.

ప్రశ్న - 'సాంఖ్యేన' 'యోగేన' అను ఈ రెండు పదములును వేర్వేఱు సాధనలను సూచించునా? లేక ఒకే సాధన యొక్క విశేష్య విశేషణములా? అది ఒకే సాధనను తెల్పుచో ఏ సాధనను తెలుపును? దాని ద్వారా ఆత్మను దర్శించుటయనగా నేమి?

సమా - ఇచ్చట 'సాంఖ్యేన', 'యోగేన' అను పదములు సాంఖ్యయోగమును సూచించును. దీని వర్ణన 2వ అధ్యాయమునందలి 11 నుండి 30వ శ్లోకము వరకు విపులముగా చేయబడినది. అంతేగాక దీనివర్ణన 5వ అధ్యాయమునందు 8, 9, 13 శ్లోకములలోను మఱియు అచ్చటచ్చట సందర్భానుసారముగను చేయబడినది. పదార్థములన్నియును మృగతృష్ణలో నీటివలె, స్వప్నసృష్టివలె మాయారూపములు. కనుక 'ప్రకృతి కార్యరూపములైన గుణములే గుణములయందు వర్తించుచున్నవి' అని భావించి శరీరేంద్రియ మనస్సుల ద్వారా జరుగు కర్మలన్నింటి యందును కర్తృత్వాభిమానము లేకుండుట, అట్లే

సర్వవ్యాపియు, సచ్చిదానందఘనుడైన పరమాత్మయందు ఏకీభావముతో నిత్యస్థితుడైయుండి, సచ్చిదానందపరమాత్మ తప్ప ఇతరమైన దేనికిని ఉనికియేలేదని భావించుట - ఇదియే సాంఖ్య యోగ సాధన అనబడును. దీని ద్వారా ఆత్మ పరమాత్మల అభేదరూపమును ప్రత్యక్షమొనర్చుకొని సచ్చిదానంద ఘనపరమాత్మను అభేదభావముతో పొందుటయే సాంఖ్యయోగముద్వారా ఆత్మను ఆత్మయందు దర్శించుట యగును.

ఈ సాంఖ్యయోగ సాధనను సాధన చతుష్టయ సంపన్నులైన సాధకులు సులభముగా అనుష్ఠింపగలరు.

ప్రశ్న - సాధన చతుష్టయమనగానేమి?

సమా - వివేకము, వైరాగ్యము, షట్‌సంపత్తి, ముముక్షుత్వము అను ఈ నాల్గింటిని 'సాధనచతుష్టయము' అని యందురు. అవి దిగువ విధముగా నుండును-

## 1. వివేకము

సత్ - అసత్తుల, మరియు నిత్యానిత్యవస్తువుల వివేచనమును 'వివేకము' అని యందురు. ఈ సదసత్తులను నిత్యానిత్యవివేకము చక్కగా పృథక్కరించును. వివేకమనగా తత్త్వము యొక్క యథార్థ్యమును (వాస్తవస్థితిని) అనుభవించుట. వివిధపరిస్థితులయందు ప్రతివస్తువు నందును ప్రతిక్షణము (అనుక్షణము) ఆత్మ+అనాత్మల వివేచన చేయగా చేయగా వివేకసిద్ధి కలుగును. వివేకసిద్ధి కలిగినంతనే సదసత్తుల, నిత్యానిత్యవస్తువుల ప్రత్యక్షానుభవములు నీరక్షీర వివేకము వలె ప్రత్యక్షమగును.

## 2. వైరాగ్యము

వివేకము ద్వారా సదసత్తుల, నిత్యానిత్యముల పృథక్కరణ శక్తి ఏర్పడిన పిమ్మట అసత్తునందును, అనిత్యమునందును గల ఆసక్తి సహజముగనే తొలగిపోవును. దీనినే 'వైరాగ్యము' అందురు. మనస్సు నందు భోగాభిలాషలు నిలిచియుండి, బాహ్యముగా సంసారమునందు ద్వేషమును, వైముఖ్యమును ప్రదర్శించినచో అది వైరాగ్యము అనబడదు. వైరాగ్యమునందు 'రాగము' ఏ మాత్రమూ ఉండదు. యథార్థముగా అభ్యంతర + అనాసక్తియే 'వైరాగ్యము' అనబడును. నిజమైన వైరాగ్యము కలిగిన వారి చిత్తములయందు బ్రహ్మలోక పర్యంతముగల సమస్త భోగములయెడ తృష్ణయు, ఆసక్తియు ఏమాత్రమును ఉండవు. వారు అసత్తు, అనిత్యములకు దూరమై అఖండ రూప సత్తునందును, నిత్యమైన వస్తువునందును నిమగ్నులైయుందురు. ఇదియే వైరాగ్య లక్షణము. ఇట్టి వైరాగ్యము కలుగనంతవరకును వివేకమునందు లోపమున్నట్లు భావింపవలెను. వివేకము సంపూర్ణముగా ఏర్పడినప్పుడు వైరాగ్యము సహజముగనే కలుగును.

## 3. షట్ సంపత్తి

వివేక వైరాగ్యముల ఫలస్వరూపమైన పరమ సంపదయే షట్ సంపత్తి. వివేక వైరాగ్యముల సాధన పూర్తియైన పిమ్మటనే ఈ సంపత్తి లభించును. ఈ షట్ సంపత్తిలో శమ, దమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము అని ఆరువిభాగములు గలవు.

### (1) శమము

మనస్సు పూర్తిగా నిగ్రహింపబడి, నిశ్చలమై శాంతముగా ఉండుటనే 'శమము' అనియందురు. వివేక వైరాగ్యములు సిద్ధించిన పిమ్మట మనస్సు సహజముగనే నిశ్చలమై శాంతమగును.

### (2) దమము

ఇంద్రియములు పూర్తిగా నిగ్రహింపబడి విషయ రసాస్వాదన రహితమగుటనే 'దమము' అని యందురు.

### (3) ఉపరతి

విషయముల నుండి 'చిత్తము' ఉపరతమగుటనే 'ఉపరతి' యందురు. మనస్సునకు ఇంద్రియములకు విషయములయందు రసానుభూతి లేనప్పుడు సాధకునకు సహజముగనే వాటి నుండి 'ఉపరతి' కలుగును. ఈ ఉపరతి కేవలము బాహ్యముగా కాక ఆంతరికముగా కలుగవలెను. బ్రహ్మలోకపర్యంతముగల దుర్లభములైన భోగముల యెడ ఎన్నడును భోగ సంకల్పములకు సంబంధించిన మనోవృత్తులు కలుగరాదు. దీనినే 'ఉపరతి' యని యందురు.

### (4) తితిక్ష

సుఖదుఃఖాది ద్వంద్వములను సహించుటనే 'తితిక్ష' యని యందురు. శీతోష్ణములు, సుఖదుఃఖములు మానావమానములు మొదలగు వానిని సహించుటగూడ (ఓర్చుకొనుటగూడ) తితిక్షయేయైనను, వివేక, వైరాగ్య, శమ, దమ + ఉపరతుల అనంతరము ప్రాప్తించు తితిక్ష

వాటికంటెను విలక్షణమైనది. ప్రపంచమున ద్వంద్వములెన్నడును నశింపవు. సామాన్యముగా ఎవ్వరును వీటినుండి సర్వథా (పూర్తిగా) తప్పించుకొనలేరు. ఏదోవిధముగ వాటిని ఓర్చుకొనుట గూడ ఉత్తమమే. కాని ఈ ద్వంద్వజగత్తునకు అతీతుడై సాక్షీభూతుడుగా నుండి (ఎట్టి ప్రతిస్పందన లేకుండ) ద్వంద్వములను చూచుచుండుట అత్యుత్తమము. ఇదియే నిజమైన తితిక్ష. ఇట్లుండుట వలన శీతోష్ణములు, మానావమానములు అతనిని చలింప జేయజాలవు.

### (5) శ్రద్ధ

ప్రత్యక్షముగా చూచిన వస్తువునందువలె ఆత్మయొక్క ఉనికియందు దృఢమైన విశ్వాసమును కలిగియుండుటయే శ్రద్ధ యనబడును. మొట్టమొదట శాస్త్రములయందును, గురువునందును, సాధనాదులయందును శ్రద్ధ కలుగును - దానివలన ఆత్మయందు శ్రద్ధ దృఢపడును. కాని ఆత్మ స్వరూపమునందు పూర్తిగా శ్రద్ధ దృఢపడనంతవరకును నిష్కల, నిరంజన, నిరాకార, నిర్గుణబ్రహ్మనే పరమలక్ష్యముగా జేసికొనుటయును, దానియందు బుద్ధి స్థిరముగా నుండుటయును జరుగదు.

### (6) సమాధానము

మనస్సు, బుద్ధి, పరమాత్మయందు పూర్తిగా సమాహితమగుటను 'సమాధానము' అనియందురు. అర్జునుడు ద్రోణాచార్యుని సమక్షమున తన అస్త్రవిద్యా పాటవమును ప్రదర్శించుటకు సన్నద్ధుడాయెను. ద్రోణుడు ఒక పక్షి బొమ్మను చెట్టకొమ్మపై నుంచి, దాని మెడకు గురి పెట్టుమనెను. వెంటనే అర్జునుడు మనస్సును ఏకాగ్రమొనర్చి, తన ఏకైకలక్ష్యమైన పక్షిమెడను మాత్రమే చూచెను. అట్లే మనస్సు, బుద్ధి నిరంతరము ఏకైకలక్ష్యమైన పరబ్రహ్మమునే దర్శించుచుండుటను 'సమాధానము' అనియందురు.

## 4. ముముక్షుత్వము

ఇట్లు వివేక, వైరాగ్య, షట్ సంపత్తులు సిద్ధించిన పిమ్మట సాధకుడు సహజముగనే అవిద్యా బంధనముల నుండి సర్వథా ముక్తుడు కాగోరును. అపుడు అతడు తన చిత్తమును అటు నిటు పోనీయక అన్నివైపుల నుండి మరల్చి, తన ఏకైక లక్ష్యమైన పరమాత్మనే అనుసరింప జేయును. ఈ సాధనను అతితీవ్రతరముగా చేయుటద్వారా మిక్కిలి శీఘ్రముగా పరమాత్మను పొందుటకై పడు తపననే 'ముముక్షుత్వము' అనియందురు.

ప్రశ్న - ఇచ్చట 'కర్మయోగ' శబ్దము ఏ సాధనను సూచించును? దాని ద్వారా ఆత్మయందు ఆత్మను చూచుట యనగానేమి?

సమా - 2వ అధ్యాయమునందలి 40వ శ్లోకమునుండి ఆ అధ్యాయాంతము వరకును ఫల సహితముగ వర్ణింపబడిన సాధనను, ఇచట కర్మయోగ శబ్దము సూచించును. అనగా ఆసక్తిని, కర్మఫలమును, సర్వథా త్యజించి, సిద్ధి-అసిద్ధుల యెడ సమత్వ భావన కలిగి, నిష్కామ భావముతో తనతమ వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి, శాస్త్రోక్తమైన విహిత కర్మలను అనుష్ఠించుటయే 'కర్మయోగము' అనబడును. దీనిద్వారా సచ్చిదానందఘన పరబ్రహ్మ పరమాత్మను అభేద భావముతో పొందుటయే కర్మయోగము ద్వారా ఆత్మయందు ఆత్మను చూచుట యగును.

ప్రశ్న - కర్మయోగసాధన యందు సాధకుడు తనను పరమాత్మకంటె వేఱుగా భావించును. కనుక అతనికి పరబ్రహ్మప్రాప్తి భేదభావముతోడనే కలుగవలయును గదా? కాని ఇచ్చట పరబ్రహ్మప్రాప్తి అభేద భావముతో కలుగునని చెప్పుటలోని విశేషమేమి?

సమా - సాధనకాలమందు భేదభావము ఉన్నప్పటికిని సాధకుడు ఫలమునందు అభేదభావమును కల్గియున్నచో అతనికి అభేదభావముతోడనే బ్రహ్మ ప్రాప్తి సిద్ధించును. అభేదభావబ్రహ్మజ్ఞానము ఏయే సాధనల ద్వారా కలుగునో వాటిని గూర్చిన ప్రసంగమే ఇచట చేయడినది. కనుక ఇచట కర్మయోగము ద్వారా కూడ అభేదభావముతో పరబ్రహ్మ పరమాత్మప్రాప్తి కలుగునని చెప్పబడినది.

**అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 25 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | | (తత్త్వజ్ఞులైన వారినుండి) | శ్రుతిపరాయణాః | = శ్రవణపరాయణులైన |
| అన్యే | = వీరికంటెను వేఱైన మందబుద్ధులు | శ్రుత్వా | = విని | తే, అపి | = వారును |
| ఏవమ్ | = ఈ విధముగా | ఉపాసతే | = తదనుసారముగా ఉపాసింతురు | మృత్యుమ్ | = మృత్యురూప సంసారమును |
| అజానంతః | = తెలిసికొననివారై | చ | = మఱియు | అతితరంతి, ఏవ | = నిస్సందేహముగా దాటుదురు. |
| అన్యేభ్యః | = ఇతరులనుండి | | | | |

**కాని ఈ సాధనమార్గములనుగూర్చి ఎఱుగని మందబుద్ధులు తత్త్వజ్ఞానముగల ఇతరులనుండి విని, తదనుసారముగ ఉపాసనలు చేయుదురు. ఆ శ్రవణపరాయణులును మృత్యురూపసంసార సాగరమునుండి నిస్సందేహముగా బయటపడుదురు. (25)**

ప్రశ్న - ఇచట 'తు' ను అవ్యయమును ప్రయోగించుట లోని విశేషమేమి?

సమా - 'తు' అను అవ్యయమును ప్రయోగించుట ద్వారా పూర్వోక్త సాధకులకంటెను వేఱైన ఇతరసాధకులను గూర్చి వర్ణించుట జరిగినది. పూర్వోక్త సాధనరీతులను చక్కగా తెలిసికొనలేని (అనుసరింపలేని) జనులు ఉద్ధరింపబడుటకు తగిన సాధనమార్గము ఈ శ్లోకమున సూచింపబడినది.

ప్రశ్న - 'ఏవమ్ అజానంతః' అను విశేషణముతోపాటు 'అన్యే' అను పదము ఎవరిని సూచించును? వారు ఇతరుల నుండి విని ఉపాసన చేయుట యనగానేమి?

సమా - పూర్వోక్త ధ్యానయోగ, సాంఖ్యయోగ కర్మయోగముల యందు ఏ సాధనము గూడ సమగ్రముగా గ్రహింపలేని మందబుద్ధులైన సాధకులను ఇచట 'ఏవమ్ అజానంతః' అను విశేషణముతోపాటు 'అన్యే' అను పదము సూచించును.

జబాలా పుత్రుడైన 'సత్యకాముడు' బ్రహ్మజ్ఞానమును పొందు కోరికతో గౌతమగోత్రజుడైన 'హారిద్రుమతుడు' అను మహర్షి కడకేగెను. అతనితో సంభాషించిన పిదప గురువు అతనికి మిక్కిలి కృశించిన, బక్కచిక్కిన నాలుగు వందల ఆవులను అప్పగించి, వాటిని మేపుకొని రమ్మని చెప్పెను. గురువుఆజ్ఞను అనుసరించి, అతిశ్రద్ధతో, హర్షోత్సాహములతో సత్యకాముడు వాటివెంట వనముల కేగెను. వెళ్ళునపుడు "వీటి సంఖ్య వేయియైన పిమ్మటనే తిరిగి వచ్చెదను" అని పల్కెను. గడ్డి, నీరు సమృద్ధిగా లభించు సురక్షిత ప్రదేశమునకు తీసికొని వెళ్ళి, ఒక వెయ్యి ఆవులు ఐన పిమ్మట వాటితో తిరిగివచ్చెను. ఫలితముగా తిరిగి వచ్చు సమయమున త్రోవలోనే అతనికి బ్రహ్మజ్ఞానము కలిగెను. (ఛాందోగ్య-ఉపనిషత్-4/4/9) ఈ విధముగా తత్త్వజ్ఞానులైన వారి ఆదేశములను అత్యంత భక్తిశ్రద్ధలతో ఆచరించుటయే 'ఇతరులనుండి విని ఉపాసన చేయుట' యగును.

ప్రశ్న - 'శ్రుతిపరాయణాః' అనగానేమి? అట్లే 'అపి' అను అవ్యయప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - శ్రవణ పరాయణులైనవారు అనగా వినిన దానిని భక్తిశ్రద్ధలతో సాధన చేయుటయందు తత్పరులైనవారిని 'శ్రుతిపరాయణాః' అని యందురు. ఈ విధముగా మందబుద్ధులైనవారు ఇతరులనుండి విని గూడ మృత్యువు నుండి తరించెదరు - అని తెల్పుటకే 'అపి' అను అవ్యయము ప్రయోగింపబడినది. ఇందు ఏ విధమైన సందేహమూ లేదు. ఇట్టి పరిస్థితిలో పైన పేర్కొనబడిన మూడు సాధనరీతుల యందును ఏదో ఒక సాధనను అనుసరించువారి విషయమును గూర్చి చెప్పనవసరమేలేదు.

ప్రశ్న - ఇచట 'మృత్యుమ్' అను పదము దేనిని సూచించును? 'అతి' అను ఉపసర్గతోపాటు 'తరంతి' క్రియాపదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - పదేపదే సంభవించు జన్మమృత్యురూప సంసారబంధమును సూచించునదియే 'మృత్యుమ్' అను పదము. పైన తెల్పబడిన విధముగా సాధన చేయువారు జన్మమృత్యు రూప దుఃఖమయ సంసారసముద్రమును తరించి, శాశ్వతముగా సచ్చిదానంద ఘన పరబ్రహ్మపరమాత్మను పొందుదురు. వారికి ఇక పునర్జన్మయే యుండదు. ఈ విషయమును తెల్పుటకే 'అతి' అను ఉపసర్గతోపాటు 'తరంతి' క్రియాపదము ప్రయుక్తమైనది. ఈ విషయమే 23వ శ్లోకమున 'న భూయోఽభిజాయతే' అనియు, 24వ శ్లోకమున 'ఆత్మని ఆత్మానం పశ్యన్తి' అనియు పేర్కొనబడినది.

సంబంధము - ఈ విధముగా పరమాత్మ సంబంధమైన తత్త్వజ్ఞానమును పొందుటకు వేర్వేఱు సాధనమార్గములను ప్రతిపాదించెను. ఇప్పుడు 3వ శ్లోకమున 'యాదృక్' అను పదము ద్వారా తెల్పిన క్షేత్ర స్వభావమును రెండు (2) శ్లోకములలో నిరూపించుచు అది (క్షేత్రము) ఉత్పత్తి వినాశములు కలదని వివరించి, ఆత్మయొక్క యథార్థతత్త్వజ్ఞానమును ప్రశంసించుచున్నాడు-

**యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్ ।**
**క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ తద్విద్ధి భరతర్షభ ॥ 26 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతర్షభ | = ఓ అర్జునా! | సంజాయతే | = పుట్టుచున్నదో | క్షేత్ర, క్షేత్రజ్ఞ సంయోగాత్ | = క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమువలననే |
| స్థావరజంగమమ్ | = చరాచరాత్మకమైన | తత్ | = అది (ఆ ప్రాణి సముదాయము) | విద్ధి | = (కలుగునని) ఎఱుంగుము |
| సత్త్వమ్ | = ప్రాణి | | | | |
| యావత్, కించిత్ | = ఏదేది | | | | |

**ఓ అర్జునా! ఈ స్థావరజంగమప్రాణులన్నియును క్షేత్ర-క్షేత్రజ్ఞ సంయోగము వలననే ఉత్పన్నమగునని ఎఱుంగుము. (26)**

ప్రశ్న - 'యావత్ కించిత్ స్థావరజంగమమ్' అను విశేషణములు ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి? ఈ మూడు విశేషణములతో పాటు ప్రయుక్తమైన 'సత్త్వమ్' అను పదము దేనిని సూచించును?

సమా - 'యావత్' 'కించిత్' అను రెండు పదములును సమస్త చరాచర జీవకోటిని సూచించును. దేవ మనుష్య పశుపక్ష్యాది ప్రాణులను (చరములను) 'జంగమములు' అనియందురు. వృక్షములు, లతలు, పర్వతములు మొదలగునవి స్థిరమైన వాటిని (అచరములను) 'స్థావరములు' అని యందురు. కనుక ఈ మూడు విశేషణములతోపాటు ప్రయుక్తమైన 'సత్త్వమ్' అను పదము సమస్త చరాచరప్రాణి సముదాయమును తెల్పును.

ప్రశ్న - 'క్షేత్ర, క్షేత్రజ్ఞ' శబ్దములు ఇచట వేనిని తెల్పును? ఈ రెండింటి సంయోగము వలన సమస్తప్రాణులు ఉత్పన్నములగును. అనగానేమి?

సమా - ఈ అధ్యాయమునందలి 5వ శ్లోకమున క్షేత్రస్వరూపమని తెల్పబడిన 24 తత్త్వముల సముదాయమును, అట్లే 7వ అధ్యాయము నందలి 4,5 శ్లోకములయందు తెల్పబడిన 'అపరాప్రకృతి'ని, ఇచట 'క్షేత్రము' అను పదము సూచించును. దానిని తెలిసికొను చేతనతత్త్వమునే 'క్షేత్రజ్ఞుడు' అనియందురు. ఈ తత్త్వమునే 7వ అధ్యాయమున 5వ శ్లోకమునందు 'పరాప్రకృతి' అని పేర్కొనుట జరిగినది. ప్రకృతిస్థుడైన ఈ క్షేత్రజ్ఞుని (పురుషుని) యొక్క సంయోగము ప్రకృతినుండి ఏర్పడిన సూక్ష్మ స్థూల శరీరములతో కలుగును. దీనినే క్షేత్ర-క్షేత్రజ్ఞ సంయోగము అని యందురు. ఈ సంయోగము కలిగినంతనే అతడు (పురుషుడు) వివిధయోనుల ద్వారా వేర్వేరు ఆకృతులలో ప్రాణులరూపములో ప్రకటితుడగును. అతడు ఉత్పన్నుడగుట యనగా ఇదియే.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥ 27 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఎవడు | అవినశ్యంతమ్ | = నాశరహితుడైన | పశ్యతి | = చూచునో |
| వినశ్యత్సు | = నశించుచున్నట్టి | పరమేశ్వరమ్ | = పరమేశ్వరుని | సః | = అతడే |
| సర్వేషు, భూతేషు | = సమస్త చరాచర భూతములయందు | సమమ్, తిష్ఠంతమ్ | = సమభావముతో ఉన్నవానినిగా | పశ్యతి | = (నిజముగా) చూచువాడు |

నశ్వరములైన చరాచరభూతముల(ప్రాణుల) యందు సమముగా స్థితుడైయున్న పరమేశ్వరుడు నాశరహితుడు. అట్టి పరమేశ్వరుని చూచువాడే నిజమైన ద్రష్ట. (27)

ప్రశ్న - 'వినశ్యత్సు, సర్వేషు' అను రెండు విశేషణములతో సహా 'భూతేషు' అను పదము ఎవరిని సూచించును? ఈ విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - వేర్వేరు సూక్ష్మస్థూల శరీరముల సంయోగ వియోగముల వలన పదేపదే పుట్టుచు, గిట్టుచునుండు ప్రాణులను సూచించునదియే 'వినశ్యత్సు', 'సర్వేషు' అను విశేషణములతో పాటు ప్రయుక్తమైన 'భూతేషు' అను పదము. సమస్త ప్రాణులు అని తెల్పుటకు 'సర్వేషు' అనియు, శరీరసంబంధముచే అవి నశ్వరములు అని తెల్పుటకు 'వినశ్యత్సు' అనియు రెండు విశేషణములు ప్రయుక్తములైనవి.

నశించుట శరీరధర్మము. ఆత్మధర్మము గాదు. ఆత్మతత్త్వము నిత్యము, నాశరహితము. ఈ ఆత్మ సమస్త ప్రాణుల వేర్వేఱు శరీరములలో స్థితమై యుండుట వలన వేర్వేరుగా గోచరించినప్పటికిని వాస్తవముగా ఒక్కటియే. ఈ విషయమే ఈ శ్లోకమునందు స్పష్టీకరింపబడినది.

ప్రశ్న - ఇచట 'పరమేశ్వరమ్' అను పదము దేనిని సూచించును? పైన తెల్పబడిన సమస్త భూతముల (ప్రాణుల)యందు ఆయనను (భగవానుని) నాశరహితునిగా సమభావముతో ఉన్నవానినిగా చూచుట యనగానేమి?

సమా - ప్రకృతికి సర్వథా అతీతుడై, నిర్వికారుడైన ఆ మహాచైతన్య స్వరూపునే 'పరమేశ్వరమ్' అను పదము సూచించును. ఈ అధ్యాయమునందే 22వ శ్లోకమున ఈ పరమేశ్వరుడును, క్షేత్రజ్ఞుడును ఒకటే అని తెలుపుచు, ఇతనిని ఉపద్రష్ట, అనుమంత, భర్త, భోక్త, మహేశ్వర, పరమాత్మ అను పేర్లతో వర్ణించుట జరిగినది. ఈ పరమ పురుషుడు వస్తుతః శుద్ధ సచ్చిదానంద ఘనపరమాత్మ. సర్వథా ప్రకృతికి అతీతుడు. ఐనను ప్రకృతి సాంగత్యముచే ఇతడు క్షేత్రజ్ఞుడనియు, ప్రకృతిజన్యగుణముల భోక్తయనియు తెల్పబడుచున్నాడు. కనుక నశ్వరములగు శరీరముల సంబంధము వలన సమస్త ప్రాణులు నశించుచున్నట్లు భావింపబడును. కాని వాస్తవముగా ఈ సమస్త శరీరములయందున్న క్షేత్రజ్ఞుడు శాశ్వతుడైన, నిర్వికారుడైన ఒకే చైతన్యస్వరూపుడు. నశ్వరములైన మేఘముల యందు ఆకాశమువలె ఇతడు సమభావముతో స్థితుడు, నిత్యుడు. ఇట్లు సమస్త ప్రాణులలో అంతర్యామిగా నున్న పరమేశ్వరుని, శాశ్వతునిగా, సమభావస్థితునిగా దర్శించువాడే నిజమైన ద్రష్ట.

ప్రశ్న - "చూచువాడే యథార్థముగా ద్రష్ట" - అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - ఈ శ్లోకమున ఆత్మతత్త్వము జనన మరణాది సమస్త వికార రహితమైనదని - అనగా నిర్వికారమైనది, సమస్థితి గలది అని తెల్పబడినది. నిత్యచేతనమైన ఈ ఆత్మతత్త్వమును ఈ విధముగా నిర్వికారము, శాశ్వతము, సంగరహితమూ అయి, సర్వత్ర సమభావముతో స్థితమై యున్నట్లు చూచువాడే యథార్థద్రష్ట. దీనిని శరీరసాంగత్యముచే జననమరణ శీలమనియు సుఖదుఃఖములను అనుభవించుననియు భావించువారు యథార్థముగా ద్రష్టలుగారు. వారు చూచుచున్నను చూడనివారే.

సంబంధము - సర్వప్రాణులయందును శాశ్వతుడై సమభావముతో స్థితుడైయున్న ఆ పరమేశ్వరుని చూచువాడు నిజమైన ద్రష్ట అని పై శ్లోకమున తెల్పబడెను. ఈ విషయముయొక్క సార్థకతను చూపుటకై దాని ఫలము పరమగతి ప్రాప్తియని తెల్పుచున్నాడు-

**సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ 28 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలననగా | ఈశ్వరమ్ | = పరమేశ్వరుని | న, హినస్తి | = నాశమొందించుకొనడు |
| సర్వత్ర | = (అతడు) అన్నింటియందును | సమమ్, పశ్యన్ | = సమానముగా చూచుచు | తతః | = అందువలన (అతడు) |
| | | ఆత్మనా | = తనద్వారా | పరామ్, గతిమ్ | = పరమగతిని |
| సమవస్థితమ్ | = సమభావముతోస్థితుడైన | ఆత్మానమ్ | = తనను | యాతి | = పొందును |

సమస్తప్రాణులయందును సమభావముతోనుండు పరమేశ్వరుని సమత్వభావముతో చూచువాడు ఆత్మహంతకుడుకాడు - అనగా తనను తాను నాశము చేసికొనువాడు కాడు. అందువలన అతడు పరమగతిని పొందును. (28)

ప్రశ్న - ఇచట 'హి' అను అవ్యయమునకు అర్థమేమి? దానిని ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - ఇచట 'హి' అనునది హేత్వర్థకము. సమభావము గలవాడు అనగా సమస్త ప్రాణులయందును పరమేశ్వరుని దర్శించువాడు తనను తాను నశింపజేసికొనడు. అతడు పరమగతిని పొందును - అని తెలుపుటకు 'హి' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - సర్వత్ర సమభావముతో పరమేశ్వరుని చూచుట యనగానేమి? "అట్లు చూచువాడు ఆత్మ హంతకుడు కాడు!" అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఒకే సచ్చిదానందఘనపరమాత్మ సర్వత్ర సమభావముతో స్థితుడైయుండును. నానావిధ శరీరముల యందు వేర్వేఱుగా ప్రతీతుడగుటకు జనుల అజ్ఞానమే కారణము. వాస్తవముగా ఆయన యందు ఎట్టి భేదభావమునకును తావులేదు. ఈ తత్త్వమును చక్కగా ఎఱింగి, అతనిని ప్రత్యక్షముగా చూచుటయే సర్వత్ర సమభావముతో స్థితుడైయున్న పరమేశ్వరుని చూచుట యగును. ఈ తత్త్వమును తెలియని వారు ఆయనను సమభావముతో చూడజాలరు. ఏలనన వారికి సర్వత్ర భేదభావమే గోచరించును. వారు కొందఱిని తమకు ఇష్టులుగను, హితైషులుగను, మఱికొందరిని అప్రియులుగను, అహితులుగను భావింతురు. అట్లే తమను తాము ఇతరులకంటెను వేఱుగను, ఏకదేశీయులుగను తలంతురు. అందువలన వారు శరీరముయొక్క జనన మరణములను తమ (ఆత్మయొక్క) జనన మరణములుగా భావింతురు. ఈ అజ్ఞానకారణమున వారు నానా యోనులలో జన్మించుచు మరణించుచుందురు. తమను తాము నష్టపరచుకొనుట యనగా నిదియే - కాని పైన తెల్పినరీతిగా ఒకే పరమేశ్వరుని సర్వప్రాణులయందు సమభావముతో స్థితుడై యున్నవానినిగా చూచువాడు తనను పరమేశ్వరుని కంటెను వేరుగా తలంపడు. ఈ శరీరములతో తనకు ఎట్టి సంబంధమూ ఉన్నట్లు భావింపడు. కనుక ఈ శరీరములు నశించినను తాను నశించినట్లు తలంపడు. ఆ కారణమున అతడు ఆత్మహంతకులలో చేరడు. అతనికి సర్వజ్ఞుడును, శాశ్వతుడును ఐన సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్మయందు అభేద భావస్థితి కలుగును. కనుక అతడు శాశ్వతముగా జననమరణముల నుండి ముక్తుడగును.

ప్రశ్న - 'తతః' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి? ఈ పదమును ప్రయోగించుచు సమత్వయోగికి పరమగతి ప్రాప్తించునని తెలుపుటలోని విశేషమేమి?

సమా - 'తతః' అను పదము హేత్వర్థకము. సర్వత్ర సమభావముతో స్థితుడైయున్న సచ్చిదానంద ఘన పరబ్రహ్మయందు అభేదస్థితినొందిన వాడు తనకు తానుగా పతనముకాడు. ఈ కారణమున అతడు శాశ్వతముగా జనన మరణముల నుండి ముక్తుడై పరమగతిని పొందును. ఈ పరమగతినే పరమపదమని యందురు. దీనిని పొందిన వానికి పునర్జన్మ యుండదు. సాధనల యన్నింటికిని ఇదియే సర్వోన్నత ఫలము.

సంబంధము - నిత్యము, విజ్ఞానానందఘనముఐన ఆత్మ తత్త్వమున సర్వత్ర సమభావముతో చూచుట వలన కలుగు మహత్త్వమును, దాని ఫలమును తెలిపెను. పిమ్మట అట్లు దర్శించుచు తనను అకర్తగా భావించువాని యొక్క మహిమను వివరించుచున్నాడు.

**ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।**
**యః పశ్యతి తథాత్మానమ్ అకర్తారం స పశ్యతి ॥ 29 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | క్రియమాణాని | = చేయబడుచున్నట్లు | | (కర్తకానివానినిగా) |
| యః | = ఏ పురుషుడు | పశ్యతి | = చూచునో | పశ్యతి | = భావించునో |
| కర్మాణి | = సర్వకర్మలు | తథా | = అట్లే | సః | = అతడు |
| సర్వశః | = అన్నివిధముల | ఆత్మానమ్ | = ఆత్మను | (పశ్యతి) | = (నిజముగా) |
| ప్రకృత్యా, ఏవ | = ప్రకృతిచేతనే | అకర్తారమ్ | = అకర్తనుగా | | చూచువాడు |

**సకలకర్మలు అన్నివిధములుగ ప్రకృతిద్వారానే జరుగుచున్నవనియు, ఆత్మ అకర్త అనియు ఎఱింగినవాడు వాస్తవముగ చూచువాడు. (29)**

ప్రశ్న - 3వ అధ్యాయము నందలి 27, 28 శ్లోకములలోను, 14వ అధ్యాయమునందలి 19వ శ్లోకములోను సమస్త కర్మలు గుణముల ద్వారానే చేయబడుచున్నవని తెల్పుట జరిగినది. అట్లే 5వ అధ్యాయమునందలి 8,9 శ్లోకములలో ఇంద్రియములన్నియును ఇంద్రియార్థము (విషయము)ల యందు ప్రవర్తిల్లునని పేర్కొనబడినది. ఇచ్చట కర్మలన్నియు ప్రకృతి ద్వారా చేయబడుచున్నట్లు చూచుటను గూర్చి వివరించుచున్నాడు. ఇట్లు మూడు విధములుగా వివరించుటలోని ఆంతర్యమేమి?

సమా - సత్త్వరజస్తమోగుణములు ప్రకృతి కార్యములు. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగునవియును, అట్లే ఇంద్రియ విషయములును గుణములయొక్క విస్తృత రూపములే. కనుక ఇంద్రియార్థములయందు ప్రవర్తిల్లుట యనినను, గుణముల ద్వారా సమస్తకర్మలు జరుగుట యనినను, కర్మలన్నియును ప్రకృతి ద్వారా జరుగుచున్నట్లు తెల్పుటయేయగును. ఒకే విషయమే మూడు విధములుగా వివరింపబడినది. ఇందు ఎట్టి తారతమ్యములును లేవు. ఆత్మకు కర్తృత్వము లేదనియే అన్నింటను స్పష్టపఱచబడినది.

ప్రశ్న - ఆత్మను 'అకర్త'గా భావించుట యనగానేమి? అట్లు భావించినవాడు 'యథార్థద్రష్ట' అనియనుటలోని విశేషమేమి?

సమా - ఆత్మ నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తము, అన్ని విధముల వికారరహితము. ప్రకృతితో దానికి ఎట్టి సంబంధమూ లేదు. కనుక అది ఏ కర్మకును కర్త కాదు. కర్మఫలభోక్తయు కాదు. ఈ విషయమున ప్రత్యక్షానుభూతిని పొందుటయే ఆత్మను 'అకర్త'గా భావించుట - ఇట్లు చూచువాడే నిజమైన ద్రష్ట - అని యనుట వలన అతని (అట్లు చూచువాని) మహిమ ప్రకటితమగుచున్నది. ఆత్మకు మనస్సు, బుద్ధి, శరీరములతో గల సంబంధము వలన దానిని (ఆత్మను) సమస్తకర్మలకును కర్తగా, భోక్తగా భావించుట భ్రమవలన జరుగు దోషము.

*సంబంధము - ఆత్మను అకర్తగా భావించుటయందలి మహిమను తెలిపిన పిమ్మట ఇప్పుడు దాని ఏకత్వదర్శనఫలమును తెల్పుచున్నాడు-*

**యదా భూతపృథగ్భావమ్ ఏకస్థమనుపశ్యతి ।**
**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యదా | = ఎప్పుడైతే (ఏక్షణమున) | | స్థితమైన వానినిగా | అనుపశ్యతి | = (ఈ పురుషుడు)చూచునో |
| భూత | = వేర్వేఱుగా | చ | = మఱియు | తదా | = ఆక్షణమునందే (అతడు) |
| పృథగ్భావమ్ | గోచరించుచున్న ప్రాణులన్నియును | తతః, ఏవ | = ఆ పరమాత్మ నుండియే | బ్రహ్మ | = సచ్చిదానంద ఘనబ్రహ్మను |
| | | విస్తారమ్ | = విస్తరించుచున్న వానినిగా | | |
| ఏకస్థమ్ | = ఒకేపరమాత్మయందు | | | సంపద్యతే | = పొందును. |

**వేర్వేరుగా గోచరించుచున్న ప్రాణులన్నియును ఒకే పరమాత్మయందు స్థితమై యున్నవనియు, అట్లే అవి యన్నియును ఆ పరమాత్మనుండియే విస్తరించుచున్నట్లుగా, ఎఱింగిన పురుషుడు ఆ క్షణముననే సచ్చిదానందఘనపరబ్రహ్మను చేరును. (30)**

ప్రశ్న - 'భూతపృథక్ భావమ్' అను పదము దేనిని తెల్పును? అది ఒక్కదానియందే (ఒక్కపరమాత్మయందే) స్థితమైయున్నదనియు, ఆ ఒక్కదాని నుండియే వాటి విస్తృతి కలిగినదనియు తెలిసికొనుట యనగానేమి?

సమా - సమస్త చరాచర ప్రాణుల ఉత్పత్తి క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంయోగమువలననే కలిగినదని తెల్పబడినది. (13/26) ఈ సమస్త ప్రాణులయందు పరమేశ్వరుని సమభావముతో చూడవలెనని తెల్పబడినది. (13/27) ఆ సమస్త

ప్రాణులయొక్క 'నానాత్వమును' సూచించునదియే ఇచ్చట 'భూతపృథక్భావం' అను పదము. స్వప్నము నుండి మేల్కొనిన మనుష్యుడు స్వప్నకాలమునందు చూచియున్నట్లు, సమస్తప్రాణుల నానాత్వమును తనలోనే చూచియున్నట్లు, అవియన్నియును తన నుండియే విస్తరించినట్లు భావించును. కాని వాస్తవముగా స్వప్న ప్రపంచమునందు అతనికంటెను వేరైనది ఏదియును లేదు. తానొక్కడే తనను పెక్కు రూపములలో చూచియుండును. ఇదే విధముగా సమస్తప్రాణులును కేవలము ఒక్క పరమాత్మయందే స్థితమైయున్నట్లును, ఆయనయందియే అన్నింటి విస్తృతి జరుగుచున్నట్లును చూచినవాడు నిజమైన ద్రష్ట.

ప్రశ్న - 'యదా, తదా' అను పదములను ప్రయోగించుటలోని విశేషమేమి? అట్లే పరబ్రహ్మమును పొందుట యనగానేమి?

సమా - 'యదా, తదా' అనునవి కాలమును తెలుపు అవ్యయములు. మనుష్యునకు ఇట్టి జ్ఞానము కలిగిన వెంటనే- అనగా మరుక్షణముననే బ్రహ్మ (పరమాత్మ) ప్రాప్తి సిద్ధించును. అనగా బ్రహ్మమేయగును. ఇందేమాత్రమూ విలంబము జరుగదు. ఈ విధముగా సచ్చిదానందఘన పరబ్రహ్మ యొక్క అభేదప్రాప్తి కలుగుటనే 'పరమగతి ప్రాప్తి' 'మోక్షప్రాప్తి' 'ఆత్యంతిక సుఖప్రాప్తి' 'పరమశాంతి ప్రాప్తి' అనియు అందురు.

*సంబంధము - ఆత్మ ప్రాణులన్నింటియందును సమభావముతో స్థితమైన దనియు, నిర్వికారమైనదనియు, 'అకర్త' యనియు తెల్పిన పిమ్మట శరీరములన్నింటియందును ఉన్నను 'ఆత్మ' వాటి దోషములన్నింటి నుండి నిర్లిప్తమై 'అకర్త'గా ఎట్లు ఉండగల్గును? అను సందేహము కలుగవచ్చును. ఆ సందేహనివృత్తికై భగవానుడు మూడవ శ్లోకమున 'యత్ప్రభావశ్చ' అను పదముద్వారా క్షేత్రజ్ఞుని ప్రభావమును వినిపించెదనని చేసిన సూచనను అనుసరించి మూడు శ్లోకములలో ఆత్మప్రభావమును వర్ణించుచున్నాడు-*

అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే ॥ 31 ॥

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | అయమ్, పరమాత్మా | = ఈ పరమాత్మ | న, కరోతి | = వాస్తవముగా ఏమియును చేయడు |
| అనాదిత్వాత్ | = అనాదియగుటవలనను | శరీరస్థః, అపి | = శరీరము నందున్నప్పటికిని | న, లిప్యతే | = లిప్తుడును కాడు |
| నిర్గుణత్వాత్ | = నిర్గుణుడగుటవలనను | | | | |
| అవ్యయః | = నాశరహితుడైన | | | | |

**ఓ అర్జునా! నాశరహితుడైన పరమాత్ముడు ప్రాణుల శరీరములందున్నప్పటికిని అనాది (సనాతనుడు) అగుటవలనను, నిర్గుణుడు అగుటవలనను ఎట్టి కర్మలకును కర్తకాడు. కనుక కర్మలతనిని ఏమాత్రమును అంటవు. (31)**

ప్రశ్న - 'అనాదిత్వాత్' 'నిర్గుణత్వాత్' అను పదముల అర్థమేమి? ఈ రెండు పదములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఆదియుగాని కారణముగాని లేనిదియు, ఏకాలమునందును క్రొత్తగా ఉత్పన్నముకానిదియు, శాశ్వతముగా ఉండునదియు ఐనదానిని "అనాది" యందురు. ప్రకృతికిని, దాని గుణములకును అతీతమైనదియును, గుణములతోడను గుణముల కార్యముల తోడను ఏ కాలమునందును ఎట్టి పరిస్థితులలోను వాస్తవిక సంబంధము లేనిదియును ఐన దానిని 'నిర్గుణము' అనియందురు. కనుక ఇచట 'అనాదిత్వాత్' 'నిర్గుణత్వాత్' అను పదములను ప్రయోగించి, సందర్భానుసారముగా ఆత్మ అనాది యనియు, నిర్గుణమనియు పేర్కొనుట జరిగినది. కనుక అది (ఆత్మ) అకర్త, నిర్లిప్తము, అవ్యయము, జననమరణాది షడ్వికారములకు సర్వథా అతీతము - అని గ్రహింపవలెను.

ప్రశ్న - ఇచట 'పరమాత్మ' అను పదముతోపాటు 'అయమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని అంతరార్థమేమి?

సమా - మొదటినుండియు వచ్చుచున్న ప్రకరణమును నిర్దేశించునదియే 'అయమ్' అను పదము. కనుక ఇచట 'పరమాత్మ' అను పదముతోపాటు 'అయమ్' అను పదము ప్రయుక్తమైనది. 27వ శ్లోకమున 'పరమేశ్వరుడు' అనియు, 28వ శ్లోకమున 'ఈశ్వరుడు' అనియు, 29వ శ్లోకమున 'ఆత్మ' యనియు, 30వ శ్లోకమున 'బ్రహ్మము' అనియు పేర్కొనబడిన 'భగవానుడే' ఇచట 'పరమాత్మ' అనుపదముతో నిర్దేశింపబడెను. వీటన్నింటను అభేదమును, ఏకత్వమును చూపుటకే ఇచట 'అయమ్' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 27వ శ్లోకమున పరమేశ్వరుడనియు, 28వ శ్లోకమున 'ఈశ్వరుడు' అనియు, 29వ శ్లోకమున ఆత్మయనియు, 20వ శ్లోకమున బ్రహ్మయనియు ఈ శ్లోకమున 'పరమాత్మ' అనియు ఒకే తత్త్వమును వేర్వేరు పేర్లతో పేర్కొనుటకు కారణమేమి?

సమా - 3వ శ్లోకమునందు క్షేత్రజ్ఞుని స్వరూపమును, ప్రభావమును తెలిపెదనని భగవానుడు అర్జునునకు సూచించెను. దానిని అనుసరించి, పరబ్రహ్మ పరమాత్మ క్షేత్రజ్ఞుల అభిన్నత్వమును తెల్పి, తద్వాస్తవస్వరూపమును నిరూపించుటకై పరమాత్మను పెక్కు నామములతో సహేతుకముగ పేర్కొనెను.

ప్రశ్న - శరీరమునందు స్థితమై యున్నను ఆత్మకు కర్తృత్వము ఏల ఉండదు. దానిలో ఆత్మ ఏల లిప్తము కాదు?

సమా - వాస్తవముగా ప్రకృతి గుణములతోను దాని విస్తృతరూపములైన శరీరేంద్రియమనోబుద్ధులతోను ఆత్మకు ఎట్టి సంబంధమూ లేదు. అది సర్వథా గుణములకు అతీతమైనది. ఆకాశము మేఘములయందు స్థితమైయున్నను వాటికి అది కర్తకాదు - మఱియు వాటితో లిప్తముగాదు. అట్లే కర్మలకు ఆత్మ కర్తగాదు. శరీరములతో అది లిప్తము గూడ కాదు. ఈ విషయమును భగవానుడు స్వయముగా రెండు శ్లోకములలో దృష్టాంత పూర్వకముగా వివరించు చున్నాడు.

*సంబంధము - శరీరమునందు ఉన్నను 'ఆత్మ' దానితో ఏల లిప్తము కాదు? అను ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥ 32 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యథా | = ఏవిధముగా | | లిప్తముకాదో | ఆత్మా | = ఆత్మ (నిర్గుణమగుటచే) |
| సర్వగతమ్ | = సర్వత్రావ్యాపించిన | తథా | = అట్లే | | |
| ఆకాశమ్ | = ఆకాశము | దేహే | = దేహమునందు | న, ఉపలిప్యతే | = దేహముయొక్క గుణములతో లిప్తముకాదు |
| సౌక్ష్మ్యాత్ | = సూక్ష్మమగుటవలన | సర్వత్ర, అవస్థితః | = అంతటను వ్యాపించి యున్నను | | |
| న, ఉపలిప్యతే | = గుణదోషములచే | | | | |

**సర్వత్ర (ఇతరమహాభూతములయందు) వ్యాపించియున్న ఆకాశము సూక్ష్మ మగుట వలన వాటి గుణదోషములు దానికి అంటవు. అట్లే సకల ప్రాణుల దేహముల యందు స్థితమైయున్నను ఆత్మ నిర్గుణమగుట వలన వాటి గుణదోషములును దానికంటవు. (32)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు 'ఆకాశము'ను దృష్టాంతముగా చూపి వివరింపబడిన విషయమేమి?

సమా - ఆకాశ దృష్టాంతము ద్వారా 'ఆత్మ యొక్క నిర్లిప్తత నిరూపించబడినది - వాయువు, అగ్ని, జలము, పృథ్వి అను వానియందు అంతట సమానముగా ఆకాశము వ్యాపించియున్నను వాటి గుణదోషములతో అది యేవిధముగను లిప్తముగాదు. అట్లే ఆత్మ కూడ ఈ శరీరమున అంతట వ్యాప్తమైయున్నను అత్యంత సూక్ష్మము, గుణాతీతము - అగుటవలన శరీరేంద్రియమనోబుద్ధుల గుణదోషములతో అది ఏమాత్రము లిప్తముకాదు.

*సంబంధము - శరీరమునందున్నప్పటికిని ఆత్మ కర్తకాకుండుటకు కారణమేమి? అను ప్రశ్నకు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ 33 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జున ! | ఇమమ్, కృత్స్నమ్, లోకమ్ | = ఈ సమస్త బ్రహ్మాండమును | కృత్స్నమ్, క్షేత్రమ్ ప్రకాశయతి | = సర్వప్రాణులలో స్థితమైయుండి వాటిని ప్రకాశింప జేయును. |
| యథా | = ఏవిధముగా | ప్రకాశయతి | = ప్రకాశింపజేయునో | | |
| ఏకః, రవిః | = ఒకే సూర్యుడు | తథా | = అట్లే | | |
| | | క్షేత్రీ | = ఒకే ఆత్మ | | |

అర్జునా! ఒక్క సూర్యుడే ఈ సమస్త జగత్తును ప్రకాశితమొనర్చుచున్నట్లు, ఒకే ఆత్మ సర్వప్రాణుల యందును స్థితమై, వాటినన్నింటిని ప్రకాశింప (చైతన్యవంతములుగా) జేయుచున్నది. **(33)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు సూర్యుని దృష్టాంతముగా గొని ఏ విషయమును తెలిపెను? 'రవిః' అను పదముతోపాటు 'ఏకః' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - ఇచట సూర్యుని దృష్టాంతముగాగైకొని, ఆత్మయొక్క అకర్తృత్వమును, 'రవిః' అను పదముతోపాటు 'ఏకః' అను విశేషణమును ప్రయోగించి, ఆత్మయొక్క 'అద్వైత' భావమును నిరూపించుట జరిగినది. ఒకే సూర్యుడు సంపూర్ణబ్రహ్మాండమును ప్రకాశింప జేయుచున్నట్లు ఒకే ఆత్మ సకల క్షేత్రములను, సమస్త జడవర్గమును ప్రకాశింప జేసి, వాటికి 'ఉనికి'ని, 'స్ఫూర్తి'ని కలుగజేయును. ఈ క్షేత్రముల 'స్వరూపము' 5, 6 శ్లోకములయందు దాని వికారములతో గూడ వర్ణింపబడినది. వేర్వేఱు అంతః కరణముల సంబంధముచే వివిధశరీరముల యందు ఆత్మవేర్వేఱుగా ప్రకటితమైనట్లున్ననూ అది (ఆత్మ) సూర్యుని వలె ఆ శరీరాదుల కర్మలను చేయునదిగాదు, చేయించునదియుగాదు. ద్వైతభావముగాని, వైషమ్యాది దోషములుగాని దానికి లేవు. శాశ్వతమైన ఆత్మ ప్రతిపరిస్థితియందును సర్వథా శుద్ధము, విజ్ఞాన స్వరూపము, అకర్త, నిర్వికారము, సమము, నిరంజనము అయివుండును.

*సంబంధము - 3వ శ్లోకములో సూచించిన ఆఱు విషయములను వర్ణించిన పిమ్మట ఇప్పుడు ఈ అధ్యాయమునందలి ఉపదేశము చక్కగా గ్రహించుటవలన కలుగుఫలము పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తియని తెల్పుచు, భగవానుడు ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-*

**క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమ్ అంతరం జ్ఞానచక్షుషా ।**
**భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్ ॥ 34 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏవమ్ | = ఈ విధముగా | భూతప్రకృతి మోక్షమ్ | = కార్యసహిత ప్రకృతి నుండి ముక్తులగు ఉపాయములను | విదుః | = తెలిసికొందురో |
| క్షేత్ర, క్షేత్రజ్ఞయోః | = క్షేత్రక్షేత్రజ్ఞుల మధ్యగల | | | తే | = అట్టిమహాత్ములు |
| | | | | పరమ్ | = పరబ్రహ్మ పరమాత్మను |
| అంతరమ్ | = భేదమును | యే | = ఏ పురుషులయితే | | |
| చ | = మఱియు | జ్ఞానచక్షుషా | = జ్ఞాననేత్రముల ద్వారా | యాంతి | = పొందుదురు |

ఈ విధముగా క్షేత్ర-క్షేత్రజ్ఞులమధ్యగలఅంతరమును, కార్యసహిత ప్రకృతినుండి విముక్తులగుటకు ఉపాయములను జ్ఞాననేత్రముల ద్వారా ఎఱింగిన మహాత్ములు పరమగతిని పొందుదురు. **(34)**

ప్రశ్న - 'జ్ఞానచక్షుషా' అనగానేమి? జ్ఞాన చక్షువు ద్వారా క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును తెలిసికొనుట యనగానేమి?

సమా - 2వ శ్లోకమున భగవానుడు జ్ఞానమును గూర్చి నిర్వచించెను. అది అజ్ఞానమును పారద్రోలునని, 5వ అధ్యాయమునందలి 16వ శ్లోకమున నుడివెను. అమానిత్వాది సాధనల ద్వారా అది ప్రాప్తించునని పేర్కొనెను. అట్టి తత్త్వజ్ఞానమును సూచించునదియే ఇచ్చటి 'జ్ఞానచక్షుషా' అను పదము.

మహాభూతాది 24 తత్త్వముల సముదాయ రూపమైన సమష్టి శరీరమునే 'క్షేత్రము' అని అందురు. ఇది తెలిసికొనుటకు వీలైనది. పరివర్తన శీలము, నశ్వరము, వికారములు గలది, జడము, భౌతికము, అనిత్యము.

క్షేత్రజ్ఞుడు దానిని (క్షేత్రమును) తెలిసికొనువాడు. చైతన్య స్వరూపుడు, నిర్వికారుడు. అకర్త, నిత్యుడు. నాశరహితుడు. అసంగుడు, శుద్ధుడు, జ్ఞానస్వరూపుడు, మఱియు అద్వితీయుడు. ఈ విధముగా ఈ రెండింటి యందలి వైలక్షణ్యకారణమున 'క్షేత్ర-క్షేత్రజ్ఞులు' సర్వథా విభిన్నములు. అజ్ఞానము వలన ఈ రెండును ఒకటిగా తోచును. వాస్తవముగా క్షేత్రజ్ఞునకు దానితో (క్షేత్రముతో) ఎట్టి సంబంధమూ లేదు. జ్ఞానచక్షువు ద్వారా క్షేత్ర-క్షేత్రజ్ఞుల భేదమును తెలిసికొనుట యనగానిదియే.

ప్రశ్న - 'భూతప్రకృతిమోక్షమ్' అనగానేమి? జ్ఞానచక్షువు ద్వారా దానిని తెలిసికొనుట యనగానేమి?

సమా - ఇచట భూతశబ్దము ప్రకృతి కార్యరూపమైన సమస్త దృశ్యవర్గము. ప్రకృతి దానికి కారణము. కనుక కార్యసహితమైన ప్రకృతి నుండి సర్వథాముక్తిని పొందుటయే 'భూతప్రకృతి మోక్షమ్' అనబడును. పైన తెల్పబడిన రీతిగా క్షేత్ర-క్షేత్రజ్ఞుల భేదమును తెలిసికొనినంతనే క్షేత్రజ్ఞుడు ప్రకృతినుండి వేరై, తన వాస్తవిక పరమాత్మ స్వరూపమునందు అభేద భావముతో స్థితుడగును. కార్యసహిత ప్రకృతినుండి ముక్తుడగుట యనగా ఇదియే.

స్వప్నమునకు లోనైన మనుష్యుడు ఏదోయొక కారణమున తన జాగ్రదవస్థాస్మృతి కలుగుటచే దానిని స్వప్నమని తెలిసికొనును. కనుక వెంటనే స్వప్నావస్థయందలి దుఃఖముల నుండి బయట పడుటకు నిజశరీరముతో జాగృతుడగును. అట్లే క్షేత్ర-క్షేత్రజ్ఞుల వైలక్షణ్యమును ఎఱింగిన జ్ఞాన యోగి ఇంతకు ముందు అజ్ఞానవశమున క్షేత్రమును సత్యమైనదానినిగా భావించుట వలన దానితో సంబంధము ఉన్నట్లు తలంచితినని గ్రహించును. వాస్తవముగా సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపమునందు స్థితుడగుటయే ఈ భ్రమనుండి ముక్తుడగుటయగును. కార్యసహిత ప్రకృతి నుండి ముక్తిని పొందుటయనగా ఇదియే.

ప్రశ్న - 'వీటిని తెలిసికొనిన వారు పరమాత్మను పొందుదురు' అనియనుటలోని అంతర్యమేమి?

సమా - పైన తెల్పబడిన తత్త్వజ్ఞానము కల్గినంతనే అజ్ఞానసహితముగా సమస్త దృశ్యము మటుమాయమగును. తత్క్షణమే వారికి పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తి కల్గును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః ॥ ౧౩ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునాల్గవ అధ్యాయము - గుణత్రయవిభాగయోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు సత్త్వరజస్తమములు – అను మూడు గుణముల స్వరూపములును, వాటి కార్యములును, కారణములును ప్రభావములును వర్ణింపబడినవి. అవి యేవిధముగా ఏ పరిస్థితులయందు జీవాత్మను ఎట్టి బంధములలో పడవేయును? మనుష్యుడు ఏ విధముగా వీటి నుండి ముక్తిని పొంది, పరమపదమును చేరగలడు. అట్లే ఈ మూడు గుణముల కతీతుడై పరమాత్మప్రాప్తిచెందిన మనుష్యుని లక్షణములేవి? త్రిగుణ సంబంధమైన ఈ విషయములన్నియును ఇందు వివేచన చేయడినవి. మొదట సాధనకాలమందు రజస్తమో గుణములను పారద్రోలి, సత్త్వగుణమునే గ్రహింపవలెననియు, చివరకు గుణములన్నింటితో గల సంబంధము పూర్తిగా తొలగించు కొనవలెననియు తెల్పుటకై ఆ మూడు గుణములను విభాగపూర్వకముగా వర్ణించుట జరిగినది. కావున ఈ అధ్యాయమునకు "గుణత్రయవిభాగయోగము" అను పేరు ఏర్పడినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందలి 1,2 శ్లోకములయందు మున్ముందు తెల్పబోవు జ్ఞాన మహిమను గూర్చి ప్రస్తావించెను. మూడు నాలుగు శ్లోకములయందు ప్రకృతి, పురుషుల సంయోగము చేతనే సకలప్రాణుల ఉత్పత్తి కలుగునని తెలుపుచు, 5వ శ్లోకమున సత్త్వరజస్తమోగుణములు జీవాత్మకు బంధహేతువులని తెల్పెను. 6, 7, 8 శ్లోకములలో సత్త్వాదిగుణముల స్వరూపములను, వాటి ద్వారా జీవుడు ఎట్లు బంధింపబడునదియు క్రమముగా పేర్కొనెను. 9వ శ్లోకమున జీవాత్మను ఏ గుణము ఎందులో నిమగ్నమొనర్చునో తెలిపెను. 10 శ్లోకమునందు మూడు గుణములలో ప్రతిగుణము మిగిలిన రెండు గుణములను అణచివేసి, వాటికంటెను ఎట్లు ఆధిక్యమును కల్గియుండునో వివరించెను. 11, 12, 13 శ్లోకములలో సత్త్వరజస్తమో గుణముల ఆధిక్యలక్షణములను వరుసగా పేర్కొనెను. 14, 15 శ్లోకములయందు ప్రతిగుణము వృద్ధిచెందు సమయమున మరణించిన వానికి కలుగు గతిని నిరూపణము చేసెను. 16వ శ్లోకమునందు సాత్త్విక రాజస తామస కర్మలను వాటి ఫలములను వివరించెను. 17వ శ్లోకమునందు సత్త్వగుణము జ్ఞానమునకును, రజోగుణము లోభమునకును, తమోగుణము ప్రమాద, మోహ, అజ్ఞానములకును హేతువులని తెలిపెను. 18వ శ్లోకమున ప్రతిగుణమునందును స్థితుడైయున్న జీవాత్మ దానికి అనురూపమైన గతినేపొందునని తెలిపెను. 19, 20 శ్లోకములయందు సమస్తకర్మలు గుణముల ద్వారా జరుగుననియు, ఆత్మ ఈ గుణములకు అతీతమనియు, అకర్తయనియు తెలుపుచు గుణాతీతుడగుట వలన కలుగు ఫలమును వివరించెను. 21వ శ్లోకమున అర్జునుడు గుణాతీతపురుషుని లక్షణములను, ఆచరణములను గుణాతీతుడగుటకు గల ఉపాయములను తెల్పుమని భగవానుని ప్రార్థించెను. దీనికి సమాధానముగా భగవానుడు గుణాతీత పురుషుని లక్షణములను, ఆచరణములను 22 నుండి 25వ శ్లోకము వరకు వివరించెను. 26వ శ్లోకములో గుణాతీతుడగుటకు ఉపాయమును, దాని ఫలమును పేర్కొనెను. పిమ్మట బ్రహ్మ, అమృతము, అవ్యయము మొదలగునవి భగవత్స్వరూపములనియు, అవి యన్నియును తనయందే ప్రతిష్ఠితమైనవనియు 27వ శ్లోకములో తెలుపుచు ఈ 14వ అధ్యాయమును ముగించెను.

**సంబంధము :** 13వ అధ్యాయమున క్షేత్ర-క్షేత్రజ్ఞుల లక్షణములను నిర్దేశించి, ఆ రెండింటి జ్ఞానమే నిజమైన జ్ఞానమని భగవానుడు తెల్పెను. దానిని అనుసరించి క్షేత్రముయొక్క స్వరూప స్వభావ వికారములను, దాని తత్త్వముల ఉత్పత్తి క్రమాదులను వర్ణించెను. అట్లే క్షేత్రజ్ఞుని స్వరూప ప్రభావములను గూడ వివరించెను. పిమ్మట 19వ శ్లోకమునుండి ప్రకృతి పురుషుల ప్రకరణమును ఆరంభించి, గుణములు ప్రకృతి జన్యములని తెల్పెను. పురుషుడు పదే పదే ఉచ్చనీచయోనుల యందు జన్మించుటకు గుణసాంగత్యమే హేతువని 21వ శ్లోకమున తెల్పెను. గుణముల వేర్వేఱు స్వరూపము లెవ్వి? అవి జీవాత్మను ఎట్లు బంధించును? ఏ గుణసాంగత్యము వలన ఏ యోనియందు జన్మ కల్గును? గుణములనుండి ముక్తుడగుటకు ఉపాయములేవి? గుణాతీతుడైన పురుషుని లక్షణములు, ఆచరణములు ఎట్లుండును? మొదలైన విషయములను తెలిసికొనవలెనను ఇచ్ఛకలుగుట సహజము. కనుక ఈ విషయమును స్పష్టీకరించుటకే 14వ అధ్యాయము ఆరంభింపబడినది.

*13వ అధ్యాయమున వర్ణింపబడిన జ్ఞానవిషయమే 14వ అధ్యాయమున స్పష్టముగా, విపులముగా వివరింపబడినది. కనుక భగవానుడు మొదటి రెండు శ్లోకములలో ఆ జ్ఞానమహాత్మ్యమును దెల్పుచు దానిని మరల వర్ణించుటకు ప్రతిజ్ఞ చేసెను-*

**శ్రీభగవాన్ ఉవాచ**

## పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
## యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥ 1 ॥

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| యత్, జ్ఞాత్వా | = దేనిని తెలిసికొని నందువలన | పరామ్, సిద్ధిమ్ | = పరమసిద్ధిని | పరమ్, జ్ఞానమ్ | = పరమ జ్ఞానమును గూర్చి |
| సర్వే, మునయః | = మునులందఱును | గతాః | = పొందిరో అట్టి | భూయః | = మఱల |
| ఇతః | = ఈ సంసారము నుండి (ముక్తులై) | జ్ఞానానామ్ | = జ్ఞానము లన్నింటిలోను | ప్రవక్ష్యామి | = (నేను) చెప్పెదను |
| | | ఉత్తమమ్ | = అత్యుత్తమమైనట్టి | | |

**శ్రీ భగవానుడు పలికెను - జ్ఞానములలో అత్యుత్తమమైన పరమజ్ఞానమును నీకు మరల తెల్పబోవుచున్నాను. ఆ పరమజ్ఞానమును తెలిసికొనిన మునులు సంసార బంధములనుండి విముక్తులై పరమసిద్ధిని పొందిరి. (1)**

ప్రశ్న - ఇచట 'జ్ఞానానామ్' అను పదము ఏ జ్ఞానములను సూచించును? భగవానుడు వాటి యందు ఏ జ్ఞానమును తెల్పుదునని ప్రతిజ్ఞచేసెను? ఆ జ్ఞానము ఇతరజ్ఞానములకంటె ఉత్తమము, పరము అని ఏల తెలిపెను?

సమా - శ్రుతి, స్మృతి, పురాణాదులలో వేర్వేఱు విషయములను విశదపరచుటకు అనేక విధములైన ఉపదేశములు పెక్కు గలవు. వాటన్నింటిని 'జ్ఞానానామ్' అను పదము సూచించును. వాటిలో ప్రకృతి - పురుషుల స్వరూపముల వివేచన మొనర్చి, పురుషుని వాస్తవిక స్వరూపమును ప్రత్యక్షముచేయు తత్త్వజ్ఞానమునే వర్ణింతునని భగవానుడు ప్రతిజ్ఞచేసెను. ఈ జ్ఞానము పరమాత్మ స్వరూపమును ప్రత్యక్షమొనర్చునది. జీవాత్మను ప్రకృతి బంధముల నుండి విడిపించి, శాశ్వతముగా ముక్తిని గూడ ప్రసాదించునది. కావున ఈ జ్ఞానమును ఇతర జ్ఞానముల కంటె ఉత్తమము, పరమము (అత్యంత+ఉత్కృష్టము) - అని భగవానుడు పేర్కొనెను.

ప్రశ్న - ఇచట 'భూయః' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - ఈ జ్ఞానమును గూర్చి ఇంతకు ముందు గూడ భగవానుడు వివరించియే యుండెను. కాని ఇది అత్యంత నిగూఢము, దుర్విజ్ఞేయము అగుట వలన సులభగ్రాహ్యము కాదు. కనుక సమగ్రముగా తెల్పుటకు ప్రకారాంతరమున మరల దానినే భగవానుడు వర్ణించుచున్నాడు. కనుక ఇచట 'భూయః' అను పదము ప్రయుక్తమాయెను.

ప్రశ్న - 'మునయః' అను పదము ఎవరిని సూచించును? వారికి ఈ జ్ఞానము ద్వారా లభించిన పరమసిద్ధి ఏమి?

సమా - జ్ఞానయోగసాధన ద్వారా పరమగతిని పొందిన జ్ఞానులను 'మునయః' అను పదము సూచించును. ఈ పరమగతినే పరబ్రహ్మ ప్రాప్తి, పరమశాంతి, ఆత్యంతిక సుఖము, అపునరావృత్తి మొదలగు పెక్కు పేర్లతో వర్ణించుట జరిగినది. దానిని పొందినవారెవ్వరికిని పునర్జన్మ యుండదు. మునులకు ప్రాప్తించినదని చెప్పబడిన పరమసిద్ధియును అదియే.

ప్రశ్న - 'ఇతః' అనగానేమి? ఆ పద ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - 'ఇతః' అనగా ఈ ప్రపంచము. జ్ఞానులైన ఆ మునులు దుఃఖమయమృత్యు రూపమైన ఈ మహాప్రపంచ బంధమునుండి శాశ్వతముగా ముక్తిని పొందిరి - అని తెల్పుటకే 'ఇతః' అను పదము ప్రయోగింపబడినది.

## ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
## సర్గేఽపి నోపజాయంతే ప్రలయే న వ్యథంతి చ ॥ 2 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇదమ్, జ్ఞానమ్ | = ఈ జ్ఞానమును | ఆగతాః | = పొందినవారు | చ | = మఱియు |
| ఉపాశ్రిత్య | = ఆశ్రయించి | సర్గే | = సృష్ట్యాదియందు | ప్రలయే, అపి | = ప్రళయకాలము నందును |
| మమ, సాధర్మ్యమ్ | = నా స్వరూపమునే | న, ఉపజాయంతే | = మఱల ఉత్పన్నులు కారు | న వ్యథంతి | = వ్యాకులతనొందరు |

ఈ జ్ఞానమును ఆశ్రయించినవారు నా స్వరూపమునే పొందుదురు. అట్టి పురుషులు సృష్ట్యాదియందు మఱల జన్మింపరు, ప్రళయకాలమున వ్యథనొందరు. **(2)**

ప్రశ్న - 'జ్ఞానమ్' అను పదముతోపాటు 'ఇదమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని విశేషమేమి? ఆ జ్ఞానమును ఆశ్రయించుట యనగానేమి?

సమా - 13వ అధ్యాయమునందు తెల్పబడినట్టిదియును, ఈ 14వ అధ్యాయమునందు గూడ తెల్పబడ నున్నట్టిదియును ఐన జ్ఞాన మహిమను స్పష్టమొనర్చుటకే 'జ్ఞానమ్' అనుపదముతోపాటు 'ఇదమ్' అను విశేషణము ప్రయుక్తమైనది. ఈ ప్రకరణము నందు వర్ణింపబడిన జ్ఞానమును అనుసరించి, ప్రకృతి పురుషుల స్వరూపమును తెలిసికొని, గుణ సహిత ప్రకృతికి సర్వథా అతీతుడగుటకు, నిర్గుణ నిరాకార సచ్చిదానంద స్వరూపమునందు అభేదభావముతో స్థితుడగుటయే ఈ జ్ఞానమును ఆశ్రయించుట యగును.

ప్రశ్న - భగవానుని 'సాధర్మ్యమును పొందుట' యనగా నేమి?

సమా - పూర్వ శ్లోకమున 'పరాంసిద్ధిం గతాః' అను పదముల ద్వారా తెల్పబడిన విషయమునే ఈ శ్లోకమునందు 'మమ సాధర్మ్యమాగతాః' అను పదముల ద్వారా తెల్పుట జరిగినది. భగవానుని నిర్గుణ రూపమును అభేదభావముతో పొందుటయే భగవానుని సాధర్మ్యమును పొందుట యగును.

ప్రశ్న - భగవత్ప్రాప్తిగల్గిన పురుషుడు సృష్ట్యాది యందు మరల జన్మింపడు. ప్రళయకాలమునందు వ్యాకులపాటుకు గురికాడు - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ యధ్యాయములయందు తెల్పబడిన జ్ఞానము నాశ్రయించి, తదనుసారము సాధన చేసి, పరబ్రహ్మ పరమాత్మ స్వరూపమును అభేదభావముతో పొందినట్టి ముక్తపురుషులు మహా సర్గాదియందు మరల జన్మింపరు. ప్రళయకాలమునందు వ్యాకులత నొందరు. వాస్తవముగా సృష్టియొక్క సర్గ ప్రళయములతో వారికి ఎట్టి సంబంధమూ మిగులదు. ఏలనన ఉచ్చనీచయోనులలో జన్మించుటకు గుణసాంగత్యము ప్రధాన కారణము. ముక్తపురుషులు గుణములనుండి సర్వథా అతీతులగుట వలన వారికి పునరాగమనము ఉండదు. ఉత్పత్తియే లేనప్పుడు లయమునొందు ప్రసక్తియే యుండదుగదా!

సంబంధము - ఈ విధముగా మరల జ్ఞానోపదేశము చేసెదనని తెల్పుచు తత్త్వభావమును నిరూపించి భగవానుడు ఆ జ్ఞానమును వర్ణించుటకు ఆరంభించుచు రెండు శ్లోకములలో ప్రకృతి పురుషుల నుండియే సమస్తజగత్తుయొక్క ఉత్పత్తి జరుగునని తెల్పుచున్నాడు-

**మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।**
**సంభవః సర్వభూతానాం తతో భవతి భారత ॥ 3 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = అర్జునా! | అహమ్ | = నేను | దధామి | = ఉంచెదను |
| మమ, మహత్, | = మహద్బ్రహ్మరూపమైన నామూల ప్రకృతి | తస్మిన్ | = దానియందు | తతః, | = ఆ జడచేతన సంయోగమువలన |
| బ్రహ్మ యోనిః | = సకల భూతములకును యోని, అనగా జన్మస్థానము | గర్భమ్ | = చేతనసముదాయ రూప గర్భమును (బీజమును) | సర్వభూతానామ్ | = సకలప్రాణుల యొక్క |
| | | | | సంభవః, భవతి | = ఉత్పత్తి జరుగును |

**ఓ అర్జునా! నా మహద్బ్రహ్మరూపమైన మూలప్రకృతి సర్వప్రాణులకు జన్మ స్థానము. దానియందు చేతనసముదాయరూపమైన బీజమును ఉంచెదను (స్థాపన చేసెదను). ఆ జడచేతన సంయోగమువలననే సర్వభూతముల ఉత్పత్తి జరుగును. (3)**

ప్రశ్న - 'మహత్' అను విశేషణముతో పాటు 'బ్రహ్మ' అను పదము దేనినిసూచించును? దానిని 'మమ యోనిః' అని భగవానుడు తెల్పుటలోని విశేషమేమి?

సమా - సమస్త జగత్తునకు కారణ రూపమైనది మూలప్రకృతి. దీనినే 'అవ్యక్తము' 'ప్రధానము' అనియు నందురు. ఈ ప్రకృతిని సూచించునదియే 'మహత్' విశేషణముతోపాటు 'బ్రహ్మ' అను పదము. దీనిని గూర్చిన వ్యాఖ్యానము 9వ అధ్యాయమునందలి 7వ శ్లోకమున చేయబడినది. భగవానునకు దానితో అనాదినుండియు సంబంధము గలదు - అని 'మమ' అను పదము ద్వారా తెల్పెను. 'యోనిః' అనునది ఉపాదాన కారణము. గర్భాధానమునకు ఆధారము. అది (మూలప్రకృతి) సమస్త ప్రాణులయొక్క విభిన్న శరీరములకు ఉపాదాన కారణమును, గర్భాధానమునకు ఆధారము అగుట వలన దానిని భగవానుడు 'యోనిః' అని పేర్కొనెను.

ప్రశ్న - ఇచట 'గర్భము' అను పదము దేనిని తెల్పును? దానిని 'మహద్బ్రహ్మ' రూప ప్రకృతియందు స్థాపన చేయుట యనగానేమి?

సమా - ఏడవ అధ్యాయమునందు 'పరాప్రకృతి' అని పేర్కొనబడిన చేతన సమూహమును 'గర్భమ్' అను పదము తెల్పును. మహాప్రళయకాలమున తమ తమ సంస్కారములతో సహా జీవసముదాయము పరమేశ్వరుని యందు స్థితమై యుండును. ఈ జీవ సముదాయమునకు మహా సర్గాదియందు ప్రకృతితో సంబంధమును (సంయోగమును) కలిగించుటయే ఆ చేతనసముదాయ గర్భమును ప్రకృతిరూపయోనియందు స్థాపనచేయుట యగును.

ప్రశ్న - 'తతః' అను పదము దేనిని సూచించును? 'సర్వభూతానామ్' అనగానేమి? అవి ఉత్పన్నములగుట యనగానేమి?

సమా - భగవంతుని ద్వారా చేయబడు జడచేతన సంయోగమును సూచించునదియే 'తతః' అనుపదము. తమతమ కర్మ సంస్కారములను అనుసరించి, దేవమనుష్య పశుపక్ష్యాది వివిధ శరీరములయందు ఉత్పన్నములగు ప్రాణులను 'సర్వభూతానాం' అను పదము తెల్పును. జడచేతన సంయోగము ద్వారా వేర్వేరు ఆకృతులలో ప్రాణులు అన్నియును సూక్ష్మరూపములలో ప్రకటితము లగుటయే అవి ఉత్పన్నములగుట యగును. మహాసర్గాదియందు పైన తెల్పబడిన సంయోగము ద్వారా మొట్టమొదట హిరణ్యగర్భునిఉత్పత్తి, తదనంతరము ఇతర ప్రాణుల ఉత్పత్తి జరుగును.

## సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః ।
## తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥ 4 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | సంభవంతి | = పుట్టుచున్నవో, | | తల్లి |
| సర్వయోనిషు | = నానాయోనుల యందు | తాసామ్ | = వాటన్నింటికిని | అహమ్ | = నేను |
| | | మహద్బ్రహ్మ | = మూలప్రకృతియే | బీజప్రదః | = బీజమునుంచునట్టి |
| యాః, మూర్తయః | = ఏ ప్రాణులు | యోనిః | = జన్మను ఇచ్చెడి | పితా | = తండ్రిని. |

**ఓ అర్జునా! నానాయోనులయందు జన్మించు ప్రాణులను తనగర్భమున ధరించు మూలప్రకృతియే ఆ ప్రాణులకు తల్లి. బీజస్థాపనచేయు నేను వాటికి తండ్రిని . అనగా సర్వప్రాణులకును ప్రకృతియే తల్లి. నేనే జనకుడను. (4)**

ప్రశ్న - 'మూర్తయః' అను పదము దేనిని తెల్పును? సమస్త యోనులయందును అవి ఉత్పన్నములగుట యనగానేమి?

సమా - దేవ మనుష్య రాక్షస పశు పక్ష్యాది వివిధ జాతులకు చెందిన వేర్వేఱు వర్ణాకృతులు గల శరీరములతో యుక్తములైన సమస్త ప్రాణులను 'మూర్తయః' అను పదము సూచించును. ఆ దేవ మనుష్య పశు పక్ష్యాది యోనులలో ఆ ప్రాణులు స్థూలరూపముతో జన్మించుటయే అవి ఉత్పన్నములగుట యనబడును.

ప్రశ్న - "ఆ మూర్తులన్నింటికిని నేను బీజ ప్రదుడనైన తండ్రిని, మహద్బ్రహ్మ యోనియే తల్లి." అని యనుటలోని విశేషమేమి?

సమా - ఆ మూర్తుల సూక్ష్మ, స్థూల శరీరములు అన్నియును ప్రకృతి అంశములతోడనే నిర్మితమైనవి. వాటియందలి చేతనాత్మ భగవదంశ. ఈ రెండింటి సంయోగముచే మూర్తులన్నియును అనగా శరీరధారులైన ప్రాణులు అన్నియును ప్రకటితములగును. కనుక ప్రకృతి వాటికి తల్లి, పరమాత్మ వాటికి తండ్రి.

*సంబంధము - గుణ సాంగత్యముచేతనే జీవునకు ఉచ్చనీచయోనులలో జన్మ లభించునని 13వ అధ్యాయమునందలి 21వ శ్లోకమున తెల్పబడినది. జీవులు నానా విధములైన యోనులయందు జన్మింతురు - అను విషయము ఈ అధ్యాయమునందలి 4వ శ్లోకము వరకు పేర్కొనబడినది. కాని అచట గుణములను గూర్చి ప్రస్తావింపలేదు. కావున ఆ గుణములనగా ఏవి? వాటి సాంగత్యమనగానేమి? ఏ గుణముల సాంగత్యము వలన ఉత్తమ యోనులయందును, మఱి ఏ గుణముల సాంగత్యము వలన నీచయోనులయందును జన్మలు లభించుచుండును? ఈ విషయములను అన్నింటిని స్పష్టము చేయుటకే ఈ ప్రకరణమును ఆరంభించును, ఇప్పుడు భగవానుడు 5 నుండి 8వ శ్లోకమువరకును మొదట ప్రకృతినుండి ఆ మూడు గుణముల ఉత్పత్తిని వాటి వేర్వేరు పేర్లను తెలిపి, వాటి స్వరూపములను, వాటి ద్వారా జీవాత్మల బంధరీతులను క్రమముగా వేర్వేరుగా వర్ణించుచున్నాడు-*

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।**
**నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥ 5 ॥**

మహాబాహో = ఓ అర్జునా!
సత్త్వమ్ = సత్త్వగుణము
రజః = రజోగుణము
తమః, ఇతి = తమోగుణము, అను
ప్రకృతిసంభవాః = ప్రకృతినుండి ఉత్పన్నములైన
గుణాః = మూడు గుణములు
అవ్యయమ్ = వినాశరహితుడైన
దేహినమ్ = జీవాత్మను
దేహే = శరీరమునందు
నిబధ్నంతి = బంధించుచున్నవి

**ఓ అర్జునా! ప్రకృతినుండి ఉత్పన్నములైన సత్త్వరజస్తమోగుణములు నాశములేని జీవాత్మను శరీరమున బంధించును. (5)**

ప్రశ్న - "సత్త్వం, రజః, తమః' - అను మూడు పదములను ప్రయోగించుటలోను, ఈ మూడు గుణములు ప్రకృతినుండి సంభవించినవని తెలుపుటలోను ఆంతర్యమేమి?

సమా - గుణభేదములను, వాటి పేర్లను, సంఖ్యను తెల్పుటకు 'సత్త్వం' 'రజః', 'తమః' అను పదములు ప్రయుక్తములైనవి. గుణములు మూడు. సత్త్వరజస్తమములని వాటి పేర్లు, అవి పరస్పరము భిన్నమైనవి. ఈ మూడు గుణములను ప్రకృతి కార్యములనియు, సమస్త జడ పదార్థములు ఈ మూడింటియొక్క విస్తృతరూపములనియు తెల్పుటకు ఇవి 'ప్రకృతి సంభవములు' అని పేర్కొనబడినవి.

ప్రశ్న - 'దేహినమ్' అను పదమును ప్రయోగించుటలోను, దానిని అవ్యయమని తెల్పుటలోను ఆంతర్యమేమి? ఆ మూడు గుణములు దీనిని (దేహిని) శరీరమునందు బంధించుట యనగానేమి?

సమా - దేహాభిమానముకలవాని పైననే ఈ గుణముల ప్రభావము ఉండునని తెల్పుటకు 'దేహినమ్' అను పదము ప్రయుక్తమైనది. వాస్తవముగా దీని స్వరూపము అన్నివిధముల వికారరహితము, శాశ్వతము. కనుక దీనిని బంధించుటకు వీలేకాదు అని తెల్పుటకు దీనిని 'అవ్యయమ్' అని

పేర్కొనుట జరిగినది. అనాది సిద్ధమైన అజ్ఞానకారణమున అది బంధములలో చిక్కుకొనుచున్నది. ఈ మూడు గుణములు వాటికి అనురూపములైన భోగముల యందును, శరీరముల యందును దీనికి (దేహికి) మమత్వము, ఆసక్తి, అభిమానము కలిగించుచున్నవి. దీనిని ఈ మూడు గుణములు శరీరమునందు బంధించుట యనగా ఇదియే. మూడు గుణముల నుండి ఉత్పన్నములైన శరీరముల యందును, వాటికి సంబంధించిన పదార్థముల యందును, జీవాత్మకు గల అభిమానము ఆసక్తి, మమత్వము - అనునవియే బంధములనబడును.

సంబంధము - ఇప్పుడు సత్త్వగుణ స్వరూపమును దాని ద్వారా జీవాత్మ బంధింపబడుటను తెలుపుచున్నాడు-

**తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్ ।**
**సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనఘ! | = ఓ పాపరహితుడా! | | వలన | | (కాని అది) |
| తత్ర | = ఈ మూడు గుణములయందు | ప్రకాశకమ్ | = ప్రకాశమును (జ్ఞానమును) ఇచ్చునది | సుఖసంగేన | = సుఖసాంగత్యముతో |
| సత్త్వమ్ | = సత్త్వగుణము | అనామయమ్ | = మఱియు వికార రహితమైనది | చ | = మఱియు |
| నిర్మలత్వాత్ | = నిర్మలమగుట | | | జ్ఞానసంగేన | = జ్ఞానాభిమానముతో |
| | | | | బధ్నాతి | = జీవుని బంధించును |

**ఓ పాపరహితుడా! ఈ మూడింటిలో సత్త్వగుణము నిర్మలమైనది. కనుక ప్రకాశకమైనది. వికారరహితమైనది. అది సుఖసాంగత్యమువలన జ్ఞానాభిమానము వలన మనుజుని బంధించును.(6)**

ప్రశ్న - 'నిర్మలత్వాత్' అను పదమును ప్రయోగించుటలోను, సత్త్వగుణము ప్రకాశకము, అనామయము అని తెలుపుటలోను గల ఆంతర్యమేమి?

సమా - సత్త్వగుణ స్వరూపము సర్వథా నిర్మలము. అందు ఏవిధమైన దోషమూ లేదు. కావున అది ప్రకాశకము, అనామయము, దాని వలన అంతఃకరణమునందును, ఇంద్రియములయందును ప్రకాశము వృద్ధి యగును. దుఃఖము, విక్షేపము, దుర్గుణ దురాచారములు నశించి, శాంతి ప్రాప్తించును. సత్త్వగుణము వృద్ధి చెందినప్పుడు మనుష్యుని మనశ్చాంచల్యము తనంతటతానే తొలగిపోవును. సంసారమునందు విరక్తి, ఉపరతి కలిగి మనస్సు సచ్చిదానందఘన పరమాత్మయందే నిమగ్నమగును. వెంటనే అతని చిత్తమునందును, సమస్త - ఇంద్రియములందును దుఃఖము, ఆలస్యము (సోమరితనము) తొలగి 'చేతనశక్తి' వృద్ధి చెందును. 'నిర్మలత్వాత్' అను పదము సత్త్వగుణము యొక్క ఈ లక్షణములనే తెల్పును. సత్త్వగుణ స్వరూపమును వివరించుటకే దానిని 'ప్రకాశకము' 'అనామయము' అని వర్ణించుట జరిగినది.

ప్రశ్న - ఆ సత్త్వగుణము ఈ జీవాత్మను సుఖజ్ఞాన సాంగత్యముతో బంధించుట యనగానేమి?

సమా - ఇచ్చట సుఖము అను శబ్దము 18వ అధ్యాయము నందలి 36, 37 శ్లోకములలో తెలుపబడిన లక్షణములు గల సాత్త్విక సుఖమును సూచించును. ఈ సుఖప్రాప్తి సమయమున మనుష్యుడు "నేను సుఖముగా ఉన్నాను" - అని అభిమానము కలిగి యుండును. జీవాత్మకు ఆ సుఖముతో సంబంధము ఏర్పడును. అది సాధన మార్గమునకు ముఖ్యమైన ఆటంకమై, జీవన్ముక్త స్థితి ప్రాప్తికి అడ్డు తగులును. కనుక సత్త్వగుణము సుఖసాంగత్యముచే జీవాత్మను బంధించుట యనగానిదియే.

జ్ఞానము అనగా బోధశక్తి - అది ప్రకటితము కాగానే జీవుడు "నేను జ్ఞానిని" అని అభిమానపడును. ఈ యభిమానము అతని గుణాతీత స్థితికి ఆటంకమును కలిగించును. కనుక సత్త్వగుణము జీవాత్మను జ్ఞాన సాంగత్యము ద్వారా బంధించుననుట యనగానిదియే.

ప్రశ్న - 'అనఘా!' అను సంబోధన యొక్క ప్రత్యేకత యేమి?

సమా - 'అఘము' అనగా పాపము. పాపరహితుడైన వానిని 'అనఘుడు' అని యందురు. అర్జునుడు సహజముగనే పాపరహితుడు. కనుక అతడు బంధములకు భయపడవలసిన పనిలేదు - అని తెల్పుటకే భగవానుడు అతనిని 'అనఘా!' అని సంబోధించెను.

సంబంధము - ఇప్పుడు రజోగుణ స్వరూపమును, అది జీవాత్మను బంధములలో పడవేయు రీతిని తెల్పుచున్నాడు-

**రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।**
**తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥ 7 ॥**

కౌంతేయ! = ఓ అర్జునా!
రాగాత్మకమ్ = రాగాత్మకమైన
రజః = రజోగుణము
తృష్ణాసంగ-సముద్భవమ్ = కామము, ఆసక్తుల నుండి ఉత్పన్నమైనదని
విద్ధి = ఎఱుంగుము
తత్ = అది (ఆ రజోగుణము)
దేహినమ్ = జీవాత్మను
కర్మసంగేన = కర్మలు, వాటి ఫలముల సాంగత్యముతో
నిబధ్నాతి = బంధించును

**అర్జునా! రజోగుణము రాగాత్మకము. అది కామము, ఆసక్తులనుండి ఉత్పన్నమగునని యెఱుంగుము. అది జీవాత్మను కర్మలయొక్కయు, కర్మఫలముల యొక్కయు సాంగత్యముతో బంధించును. (7)**

ప్రశ్న - రజోగుణమును 'రాగాత్మకమ్' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - రజోగుణము సహజముగనే 'రాగము', అనగా ఆసక్తి రూపములో ప్రకటితమగును. రాగము రజోగుణము యొక్క స్థూలస్వరూపము. కనుక ఇచట రజోగుణము 'రాగాత్మకము' అని పేర్కొనబడినది.

ప్రశ్న - ఇచ్చట రజోగుణము కామన (తృష్ణ) ఆసక్తుల నుండి ఉత్పన్నమైనదని తెల్పబడినది. కాని కామన సహజముగా రజోగుణము నుండియే ఉత్పన్నము అగును గదా! (3/37,14/12) కనుక రజోగుణము వాటికి కార్యమా? లేక కారణమా?

సమా - కామనాసక్తుల వలన రజోగుణము వృద్ధి చెందును. అట్లే రజోగుణము వలన కామనాసక్తులు వృద్ధి యగును. ఇవి పరస్పరము బీజము - వృక్షమువలె అన్యోన్యాశ్రయ సంబంధము గలవి. వీటియందు రజోగుణము బీజస్థానీయము. కామనాసక్తులు మొదలగునవి వృక్ష స్థానీయములు. బీజము వృక్షమునుండియే ఉత్పన్న మగును. ఐనను వృక్షమునకు కారణముగూడ బీజమే. ఈ విషయమును స్పష్టపఱచుటకే ఒకచోట రజోగుణమునుండి కామనాదులు ఉత్పన్నములైనట్లును, మరొకచోట కామనాదుల నుండి రజోగుణము ఉత్పన్నమైనట్లును తెల్పబడినది. ఇచట 'తృష్ణాసంగముద్భవమ్' అను సమాసమునకు రెండు విధములగు అర్థములనూ చెప్పవచ్చును. తృష్ణ, (కామన) సంగము (ఆసక్తి) అను వానినుండి ఏది ఉత్పన్నమగునో దానిని రజోగుణమని భావింపవలెను. అపుడు రజోగుణము వాటికి కార్యమగును. (తృష్ణాసంగాభ్యాం సముద్భవతి) దేని నుండి తృష్ణాసంగములు ఉత్పన్నములగునో దానిని రజోగుణమనియందురు. అపుడు రజోగుణము కారణము. అగును (తృష్ణాసంగయోః సముద్భవో యస్మాత్) బీజవృక్ష న్యాయముననుసరించి, ఈ రెండు అర్థములును సరియైనవే.

ప్రశ్న - 'కర్మసంగము' అనగానేమి? దాని ద్వారా రజోగుణము జీవాత్మను బంధములలో పడవేయుట యనగానేమి?

సమా - "ఈ కర్మలను అన్నింటిని నేను చేయుదును. వీటి ఫలము నాకు లభించును." - అనుచు కర్తృత్వాభిమానమును, కర్మఫలాసక్తిని కలిగి యుండుటనే 'కర్మసంగము' అని యందురు. దీని ద్వారా రజోగుణము ఈ జీవాత్మను జన్మమృత్యు రూపసంసారమునందు చిక్కుకొనునట్లు చేయును. అది (రజోగుణము) కర్మసంగము ద్వారా జీవాత్మను బంధించుట యనగానిదియే.

సంబంధము - ఇపుడు తమోగుణ స్వరూపమును, అది జీవాత్మను బంధములలో పడవేయు రీతిని తెలుపుచున్నాడు-

**తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**

**ప్రమాదాలస్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | అజ్ఞానజమ్ | = అజ్ఞానమునుండి ఉత్పన్నమైనదానినిగా | (దేహినమ్) | = (జీవాత్మను) |
| సర్వదేహినామ్ | = దేహాభిమానముగల వారినందఱిని | విద్ధి | = తెలిసికొనుము | ప్రమాద ఆలస్య నిద్రాభిః | = ప్రమాదాలస్య నిద్రాదులతో |
| మోహనమ్ | = మోహింపజేయు | తత్ | = అది (ఆ తమోగుణము) | నిబధ్నాతి | = బంధించును |
| తమః, తు | = తమోగుణమయితే | | | | |

**అర్జునా! తమోగుణము సకలదేహాభిమానులను మోహితులనుగా చేయును. అజ్ఞానమువలన జనించును. అది జీవాత్మను ప్రమాదాలస్యనిద్రాదులతో బంధించును. (8)**

ప్రశ్న - 'తమోగుణము సమస్త దేహాభిమానులను మోహితులనుగా జేయును'' అనగానేమి?

సమా - అంతఃకరణమునందును, ఇంద్రియముల యందును, జ్ఞానశక్తిని నశింపజేసి, వాటిలో మోహమును ఉత్పన్నముచేయుటనే, తమోగుణము దేహాభిమానులందరిని మోహితులనుగా చేయుటయగును. అంతఃకరణముతో ఇంద్రియములతో సంబంధము కలిగి శరీరమునందు అహంకార మమకారములు గల ప్రాణులన్నియును నిద్రాదిసమయములయందు ఇంద్రియాంతఃకరణములలో మోహము ఉత్పన్నమగుట వలన తాము మోహితులమని భావింతురు. కాని 'ఇంద్రియాంతఃకరణముతో పాటు శరీరముపై అభిమానములేని జీవన్ముక్తులు వాటితో తమకు ఎట్టి సంబంధమూ లేదని భావింతురు. అందువలన ఇచట తమోగుణము సమస్త దేహాభిమానులను మోహితులనుగా జేయునని తెల్పబడినది.'

ప్రశ్న - తమోగుణము అజ్ఞానము నుండి ఉత్పన్న మగునని తెల్పుటలోని ఆంతర్యమేమి? 17వ శ్లోకమున అజ్ఞానము తమోగుణము నుండి ఉత్పన్నమగునని తెల్పబడినదిగదా!

సమా - తమోగుణమునుండి అజ్ఞానము వృద్ధియగును. అజ్ఞానమునుండి తమోగుణము వృద్ధి చెందును. ఈ రెండింటియందును బీజ-వృక్షములకు వలె అన్యోన్యాశ్రయ సంబంధము గలదు. అజ్ఞానము బీజస్థానీయము. తమోగుణము వృక్షస్థానీయము. కావున ఒకచోట తమోగుణము నుండి అజ్ఞానము, మఱొకచోట అజ్ఞానము నుండి తమోగుణము ఉత్పన్నములగునని తెల్పబడెను.

ప్రశ్న - ప్రమాదము, ఆలస్యము, నిద్ర అనగానేమి? వాటి ద్వారా తమోగుణము జీవాత్మను బంధించును - అనగానేమి?

సమా - అంతఃకరణేంద్రియముల వ్యర్థచేష్టలును, శాస్త్రవిహితకర్తవ్యపాలనమునందు అవహేళనమును (చులకన భావమును) ప్రమాదమని యందురు. కర్తవ్య కర్మలయందు ప్రవృత్తుడు కాకుండుటను ఆలస్యము (సోమరితనము) అనియందురు. తంద్ర, స్వప్నము, సుషుప్తి, ఈ మూడింటిని 'నిద్ర' అని వ్యవహరింతురు - వీటన్నింటిద్వారా తమోగుణము జీవాత్మను 'ముక్తిసాధన' నుండి దూరము చేసి, జన్మమృత్యు రూపసంసారమునందు చిక్కుకొనునట్లు చేయును. అది (తమోగుణము) ప్రమాదాలస్య నిద్రల ద్వారా జీవాత్మను బంధించుటయనగా నిదియే.

సంబంధము - ఈ విధముగా సత్త్వరజస్తమోగుణముల స్వరూపములను, వాటిద్వారా జీవాత్మ బంధింపబడు రీతులను తెల్పిన పిదప భగవానుడు ఈ మూడు గుణముల స్వాభావిక వ్యాపారములను (పనులను) తెలుపుచున్నాడు-

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।**

**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥ 9 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | రజః | = రజోగుణము | జ్ఞానమ్ | = జ్ఞానమును |
| సత్త్వమ్ | = సత్త్వగుణము (జీవుని) | కర్మణి | = కర్మ యందు | ఆవృత్య | = కప్పివేసి |
| సుఖే | = సుఖమునందు | (సంజయతి) | = నిమగ్నమొనర్చును | ప్రమాదే, ఉత | = ప్రమాదాదులలోను |
| సంజయతి | = నిమగ్నముచేయును | తమః, తు | = (అట్లే) తమోగుణమయితే | సంజయతి | = ముంచివేయును |

సత్త్వగుణము జీవుని సుఖములలో నిమగ్నము చేయును. రజోగుణము కర్మలయందు నిమగ్నునిగా చేయును. తమోగుణము జ్ఞానమును కప్పివేసి ప్రమాదాదులలోను ముంచివేయును. **(9)**

ప్రశ్న - ఇచ్చట 'సుఖ' శబ్దము ఎట్టి సుఖమును సూచించును? సత్త్వగుణము దానియందు మనుష్యుని నిమగ్నము చేయుటయనగానేమి?

సమా - 'సుఖ' శబ్దము సాత్త్విక సుఖమును తెల్పును. (18/36,37) సత్త్వగుణము మనుష్యుని సాంసారిక భోగముల నుండియు, చేష్టలనుండియు, అట్లే ప్రమాదాలస్య నిద్రాదుల నుండియు దూరమొనర్చి, ఆత్మచింతనాదుల ద్వారా సాత్త్విక సుఖమునందు నిమగ్నము చేయును. అతనిని సుఖమునందు నిమగ్నుని చేయుట యనగానిదియే.

ప్రశ్న - 'కర్మ' శబ్దము ఏయే కర్మలను సూచించును? రజోగుణము వాటియందు మనుష్యుని నిమగ్నుని చేయుట యనగానేమి?

సమా - 'కర్మ' శబ్దము ఇచ్చట (ఇహపరలోక భోగరూప ఫలములను ఇచ్చునట్టి) శాస్త్రవిహిత సకామ కర్మలను సూచించును. నానా విధములైన భోగేచ్ఛలను కలిగించి, తత్ప్రాప్తికై ఆ కర్మలయందు మనుష్యుని ప్రవృత్తునిగా చేయుటయే ఆ కర్మలయందు నిమగ్నుని చేయుటయగును.

ప్రశ్న - తమోగుణము మనుష్యుని జ్ఞానమును ఆచ్ఛాదించుట (కప్పివేయుట), అతనిని 'ప్రమాదము'లో పడవేయుట యనగానేమి? మఱియు ఈ వాక్యములయందు 'తు' 'ఉత' అను అవ్యయములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - తమోగుణము వృద్ధియైనప్పుడు అది ఒక్కొక్కసారి మనుష్యుని కర్తవ్యాకర్తవ్య నిర్ణయము చేయు వివేక శక్తిని నశింపజేయును. ఇంకొకసారి ఇంద్రియాంతః కరణముల చైతన్యమును నష్టపరచి, నిద్రావృత్తిని కలిగించును. అది మనుష్యుని జ్ఞానమును కప్పివేయుట యనగా నిదియే - కర్తవ్యపాలనమునందు చులకనభావమును కలిగించి, అతనిని వ్యర్థచేష్టల యందు నియుక్తుని చేయుట, ప్రమాదమునందు నిమగ్నుని చేయుట యగును.

తమోగుణము కేవలము జ్ఞానమును కప్పివేయుటయే గాక మఱియొక కార్యమును గూడ చేయును. దానిని వివరించుటకే 'ఉత' అను పదము ప్రయుక్తమైనది. అది జ్ఞానమును ఆచ్ఛాదితమొనర్చి ప్రమాదమునందు పడవేసినట్లే మనుష్యుని నిద్రాలస్యములయందును పడద్రోయును. వివేక జ్ఞానమును ఆవృతమొనర్చినపుడు అది (తమోగుణము) మనుష్యుని ప్రమాదములో పడద్రోయును. అతని ఇంద్రియాంతఃకరణముల యొక్క చేతనాశక్తిరూపమైన జ్ఞానమును క్షీణింపజేసి, ఆవృతమొనర్చును. (కప్పివేయును). అప్పుడతనిని నిద్రాలస్యముల యందు నిమగ్నునిగా చేయును.

*సంబంధము - సత్త్వాది మూడు గుణములను జీవుని తమతమ కార్యముల యందు నియుక్తునిగా జేయు ననుయమున అవి అట్లు చేయుటకు ఏ విధముగా సమర్థములగును? అను విషయమును రాబోవు 10వ శ్లోకములో తెలుపుచున్నాడు-*

**రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।**
**రజఃసత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | సత్త్వమ్ | = సత్త్వగుణమును | తథా, ఏవ | = అట్లే |
| రజః | = రజోగుణమును (మఱియు) | చ | = మఱియు | సత్త్వమ్ | = సత్త్వగుణమును |
| తమశ్చ | = తమోగుణమును | తమః | = తమోగుణమును (అణచి వేసి) | రజశ్చః | = మఱియు రజోగుణమును (అణచివేసి) |
| అభిభూయ | = అణచివేసి | రజః | = రజోగుణము (వృద్ధి చెందును) | తమః, భవతి | = తమోగుణము వృద్ధిచెందును |
| సత్త్వమ్ | = సత్త్వగుణము (వృద్ధిచెందును) | | | | |

**ఓ అర్జునా! రజస్తమోగుణముల నణచి సత్త్వగుణము వృద్ధిచెందును. సత్త్వ, తమోగుణముల నణచి రజోగుణము వృద్ధిచెందును. అట్లే సత్త్వరజో గుణముల నణచి తమోగుణము వృద్ధియగును.[1] (10)**

ప్రశ్న - రజస్తమోగుణములను అణచివేసి, సత్త్వగుణము వృద్ధిచెందుట యనగానేమి?

సమా - రజస్తమోగుణ ప్రవృత్తులను నిరోధించి, సత్త్వగుణము తన కార్యములను ఆరంభించినప్పుడు శరీరేంద్రియ + అంతఃకరణముల యందు ప్రకాశము, వివేకము, వైరాగ్యము మొదలగునవి వృద్ధి చెందుట వలన అవి మిక్కిలి శాంతమై సుఖమయములగును. కనుక ఆ సమయమున రజోగుణకార్యములైన లోభము, ప్రవృత్తి, భోగవాసనాదులును, అట్లే తమోగుణకార్యములైన నిద్రాలస్య ప్రమాదాదులును తలయెత్తజాలవు. ఈ విధముగా ఈ రెండు గుణములను అణచివేసి, సత్త్వగుణము జ్ఞానము, ప్రకాశము, సుఖము మొదలగువానిని కలిగించుటకే రజస్తమో గుణములను అణచి, సత్త్వగుణము వృద్ధి చెందుట యందురు.

ప్రశ్న - సత్త్వ తమోగుణములను అణచివేసి, రజోగుణము వృద్ధియగుట యనగానేమి?

సమా - సత్త్వతమోగుణముల ప్రవృత్తులను నిరోధించి, రజోగుణము తన కార్యములను ఆరంభించు సమయమున శరీరేంద్రియ + అంతఃకరణములయందు చాంచల్యము, అశాంతి, లోభము, భోగవాసనలు, వివిధ కర్మలయందు ప్రవృత్తుడగుటకు గాఢమైన ఇచ్ఛయు కలుగును. ఈ కారణమున ఆ సమయము నందు సత్త్వగుణకార్యములైన ప్రకాశము, వివేకశక్తి, శాంతి మొదలగునవి అడుగంటును. తమోగుణ కార్యములైన నిద్రా ప్రమాదాలస్యాదులు కూడ అణచివేయబడును. సత్త్వతమోగుణములను అణచి, రజోగుణము వృద్ధి యగుటయనగా ఇదియే.

ప్రశ్న - సత్త్వరజోగుణమునణచి తమోగుణము వృద్ధిచెందుట యనగానేమి?

సమా - సత్త్వ రజోగుణముల ప్రవృత్తులను నిరోధించి, తమోగుణము తన కార్యములను ఆరంభించు సమయమున శరీరేంద్రియ+అంతఃకరణముల యందు మోహాదులు వృద్ధియగును. ప్రమాద ప్రవృత్తి కలుగును. వృత్తులు వివేక శూన్యములగును. కనుక సత్త్వగుణ కార్యములైన ప్రకాశము, జ్ఞానము, రజోగుణ కార్యములైన కర్మప్రవృత్తి, భోగేచ్ఛ మొదలగునవి అడుగంటును. అవి యన్నియును ప్రకటితములు కావు. సత్త్వరజోగుణములను అణచి, తమోగుణము వృద్ధి యగుటయనగా ఇదియే.

*సంబంధము - ఇంతవరకును సత్త్వాది మూడు గుణములలో ఒక్కొక్కటి మిగిలిన రెండు గుణములను అణచివైచి, అది అభివృద్ధిచెందు విషయము తెల్పబడినది. ప్రతి గుణము వృద్ధిచెందు లక్షణములను తెల్పుటకై మొదట సత్త్వగుణాభివృద్ధి లక్షణములను తెలుపుచున్నాడు-*

**సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత ॥ 11 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యదా | = ఏ సమయమునందు | ప్రకాశః | = చైతన్యము (మఱియు) | తదా | = అప్పుడు |
| అస్మిన్, దేహే | = ఈ దేహమునందు | | | సత్త్వమ్, ఉత | = సత్త్వగుణము |
| సర్వద్వారేషు | = అంతఃకరణేంద్రియముల యందును | జ్ఞానమ్ | = వివేకశక్తి | వివృద్ధమ్, ఇతి | = వృద్ధి చెందినదని |
| | | ఉపజాయతే | = ఏర్పడునో | విద్యాత్ | = తెలిసికొనవలెను |

1) గుణముల వృద్ధిని శ్రీమద్భాగవతములో క్రింద తెల్పబడిన రీతిగా పది హేతువులు గలవు.
ఆగమోఽపః ప్రజా దేశః, కాలః కర్మచ జన్మ చ ।
ధ్యానం మంత్రోఽథ సంస్కారో, దశైతే గుణహేతవః ॥ (11/13/4)
శాస్త్రము, జలము, సంతానము, దేశము, కాలము, కర్మ, యోని, చింతనము, మంత్రము, సంస్కారము - ఈ పది గుణహేతువులు. అనగా గుణములను వృద్ధి చేయునవి. ఉపర్యుక్త పదార్థములు ఏ గుణముతో యుక్తములగునో వాటి సాంగత్యముచే ఆ గుణము వృద్ధి చెందును.

**శరీరేంద్రియములయందును, అంతఃకరణమునందును చైతన్యము, వివేకశక్తి ఉత్పన్నములైనప్పుడు అతనిలో సత్త్వగుణము వృద్ధిచెందినదని తలంపవలెను. (11)**

ప్రశ్న - 'యదా, తదా' అను కాల వాచకపదములను, అట్లే 'వివృద్ధే' అను క్రియాపదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ శ్లోకమునందు తెల్పబడిన లక్షణములు ఏర్పడి వృద్ధిచెందినప్పుడు సత్త్వగుణము వృద్ధిచెందినట్లు భావింపవలెనని తెల్పుటకే యదా, తదా అను కాలవాచకములను, 'విద్యాత్' అను క్రియాపదమూ ప్రయుక్తములైనవి. ఆ సమయమున మనుష్యుడు సావధానుడై తన మనస్సును భజన ధ్యానములయందు లగ్నము చేయుటకు ప్రయత్నింపవలెను. అప్పుడే సత్త్వగుణ ప్రవృత్తి ఎక్కువకాలము నిలద్రొక్కుకొనగలదు. అట్లుగాక దానిని ఉపేక్షించినచో శీఘ్రముగనే రజస్తమోగుణములు దానిని అణచివైచి, విజృంభించి తమ ప్రభావములను చూపగలవు.

ప్రశ్న - 'దేహే' అను పదముతోపాటు 'అస్మిన్' అను పదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - మానవ శరీరవైశిష్ట్యమును ప్రతిపాదించుటకు భగవానుడు 'అస్మిన్' అను పదమును ప్రయోగించెను. ఈ శ్లోకమునందు తెల్పబడిన సత్త్వగుణవృద్ధి - మానవ శరీరమునందే సంభవించును. ఈ శరీరమునందు సత్త్వగుణ సహాయము వలన మానవుడు ముక్తికై ప్రయత్నింప వీలగును. ఇతర యోనులయందు ఈ యర్హత లభింపదు.

ప్రశ్న - శరీరేంద్రియ అంతఃకరణముల యందు ప్రకాశము, జ్ఞానము, ఉత్పన్నములగుట యనగానేమి?

సమా - శరీరమునందు చైతన్యము, తేలికదనము (లాఘవము), అట్లే ఇంద్రియాంతఃకరణములయందు నిర్మలత్వము, చైతన్యాధిక్యము ఏర్పడుటయే ప్రకాశము ఉత్పన్నమగుటయగును. సత్యాసత్యములు, కర్తవ్యాకర్తవ్యములు నిర్ణయించు వివేక శక్తి జాగృతమగుటయే జ్ఞానము ఉత్పన్నమగుట యగును. ప్రకాశము, జ్ఞానము రెండును ప్రాదుర్భవించినప్పుడు సహజముగనే సంసారమునందు వైరాగ్యము ఏర్పడి, మనస్సునందు ఉపరతి, సుఖశాంతులు ఉప్పొంగును. అట్లే రాగద్వేషములు, దుఃఖశోకములు, చింతా భయములు, చాంచల్యము, నిద్రాలస్య ప్రమాదాదులు అడుగంటును.

సంబంధము - సత్త్వగుణ వృద్ధి లక్షణములను వర్ణించి పిదప ఇపుడు రజోగుణవృద్ధి లక్షణములను తెల్పుచున్నాడు-

**లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా ।**
**రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ॥ 12 ॥**

భరతర్షభ = ఓ అర్జునా!
రజసి = రజోగుణము
వివృద్ధే = వృద్ధియైనప్పుడు
లోభః, ప్రవృత్తిః = లోభము, మరియు ప్రాపంచిక కర్మలయందుప్రవృత్తి
కర్మణామ్, ఆరంభః = స్వార్థబుద్ధితో కర్మలయొక్క ఆరంభము
అశమః = అశాంతి
(మఱియు)
స్పృహా = విషయభోగలాలస
ఏతాని = ఈ మొదలగునవి అన్నియును
జాయంతే = కలుగును

**ఓ అర్జునా! రజోగుణము వృద్ధియైనప్పుడు లోభము, ప్రవృత్తి, (ప్రాపంచిక విషయములయందు ఆసక్తి), స్వార్థబుద్ధితో సకామభావముతో కర్మాచరణము, అశాంతి, విషయభోగములయందు లాలస అనునవి ఉత్పన్నములగుచుండును. (12)**

ప్రశ్న - లోభము, ప్రవృత్తి, కర్మారంభము, అశాంతి, స్పృహ - అను వీటన్నింటి స్వరూపమేమి? రజోగుణవృద్ధి సమయమున ఇవి ఉత్పన్నములగుట యనగానేమి?

సమా - "ధనలాలసను (ధనదాహమును) లోభము" అనియందురు. ఈ కారణముగా మనుష్యుడు ధనవృద్ధికి ఉపాయములనాలోచించును. ధనవ్యయమునకు

సముచితమైన అవసరమేర్పడినను దానిని వినియోగింపడు. ధనార్జన సమయమున కర్తవ్యాకర్తవ్య వివేచనము వదలి ఇతరుల స్వత్వముపై గూడ పెత్తనము చేయుటకై అభిలాష కలిగి ప్రయత్నించుచుండును. వివిధములైన కర్మలను చేయుటకు మనస్సున సంకల్పించుటకు ప్రవృత్తి యందురు. ఆ కర్మలను సకామభావముతో చేయుటను కర్మారంభమని యందురు. మనశ్చాంచల్యమే అశాంతి. ఏదోయొక విధముగా సాంసారిక పదార్థములను తన కావశ్యకమని భావించుటను 'స్పృహ' అని యందురు.

రజోగుణము వృద్ధి చెందునపుడు మనుష్యుని అంతఃకరణమునందు సత్త్వగుణకార్యములైన ప్రకాశము, వివేక శక్తి, శాంతి మొదలగునవియును, అట్లే తమోగుణ కార్యములైన నిద్రాలస్యాదులును అడుగంటును. అప్పుడతనికి వివిధ భోగములు అవశ్యకములుగా గోచరించును. అతని అంతఃకరణమున లోభము వృద్ధిచెందును. ధన సంగ్రహమునకై మిక్కిలి అభిలాష కలుగును. వివిధ కర్మలను చేయుటకై మనస్సున నూతనభావములు వెల్లుబుకును. మనస్సు చంచలమగును. భావములను అనుసరించి క్రియలు గూడ మొదలగును. ఈ విధముగా రజోగుణవృద్ధి సమయమున ఈ లోభాది భావములు వెల్లుబుకుటనే అవి ఉత్పన్నములగుట అని యందురు.

ప్రశ్న - ఇచట భరతర్షభ! అను సంబోధనము యొక్క ప్రత్యేకత ఏమి?

సమా - భరతవంశమునందు ఉత్తముడైన వానిని 'భరతర్షభుడు' అని యందురు. అర్జునుడు భరతవంశ శ్రేష్ఠుడగుట వలన అతనిలో రజోగుణ కార్యరూపములైన లోభాదులు ఉండవని తెల్పుటకే భగవానుడు అతనిని భరతర్షభ! అని సంబోధించెను.

**సంబంధము** - ఇట్లు రజోగుణవృద్ధి లక్షణములను వర్ణించి, ఇప్పుడు తమోగుణవృద్ధి లక్షణములను తెల్పుచున్నాడు-

**అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।**
**తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ॥ 13 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కురునందన! = | ఓ అర్జునా! | అప్రవృత్తిః = | కర్తవ్య కర్మలయందు విముఖత | మోహః = | నిద్రాది మోహవృత్తులు |
| తమసి = | తమోగుణము | | | | |
| వివృద్ధే = | వృద్ధియగుచున్నప్పుడు | చ = | అట్లే | ఏతాని, ఏవ = | ఈ మొదలగునవి |
| అప్రకాశః = | (అంతఃకరణేంద్రియముల యందు) అప్రకాశము | ప్రమాదః = | వ్యర్థచేష్టలు | జాయంతే = | కలుగును |
| | | చ = | మఱియు | | |

**ఓ అర్జునా! తమోగుణము అధికమైనప్పుడు అంతఃకరణమునందును. ఇంద్రియములయందును, వివేకశక్తి నష్టమగును. కర్తవ్యకర్మలయందు విముఖత, ప్రమాదము అనగా అంతఃకరణమును మోహింపజేయు వ్యర్థచేష్టలు, నిద్రాదివృత్తులు మొదలగునవి ఉత్పన్నములగుచుండును. (13)**

ప్రశ్న - అప్రకాశము, అప్రవృత్తి, ప్రమాదము, మోహము అను వీటన్నింటి యొక్క వేర్వేఱు స్వరూపములు ఏవి? తమోగుణవృద్ధి సమయమున ఇవి ఉత్పన్నములగుట యనగానేమి?

సమా - ఇంద్రియాంతఃకరణముల దీప్తినే 'ప్రకాశము' అనియందురు. దీనికి విరుద్ధముగా ఇంద్రియాంతఃకరణములయందు దీప్తి లేకపోవుటను అప్రకాశమని యందురు. అట్లే సత్త్వగుణము యొక్క ఇతర లక్షణముల 'అభావమును' గూడ గ్రహింపవలెను. 12వ శ్లోకమున తెల్పబడిన రజోగుణకార్యమైన ప్రవృత్తికి విరుద్ధమైన భావము అనగా ఏకర్తవ్యమును గూడ ఆరంభించుటకు ఇచ్ఛ లేకుండుటను 'అప్రవృత్తి' అనియందురు. రజోగుణము యొక్క, ఇతర కార్యముల అభావమును గూడ 'అప్రవృత్తి'లో భాగముగనే భావింపవచ్చును. శాస్త్రవిహిత కర్మల అవహేళనమును వ్యర్థచేష్టలను 'ప్రమాదము' అని యందురు. వివేక శక్తికి వ్యతిరేకమైన మోహవృత్తిని, నిద్రను 'మోహము' అనియందురు.

తమోగుణము వృద్ధి చెందు సమయమున ఇంద్రియాంతః

కరణములయందు 'దీప్తి' తరిగిపోవును. అప్రకాశము ఉత్పన్నమగుట యనగానిదియే. ఏ పని చేయుటకు ఇచ్ఛగింపక కేవలము వృథాగా పడియుండి కాలయాపన చేయుటకు తలంపు కలుగును. 'అప్రవృత్తి' కలుగుట యనగా ఇదియే - శరీరేంద్రియములద్వారా వ్యర్థమైన చేష్టలు చేయుచుండుటయు, కర్తవ్య కర్మలయెడ చులకన భావము కలిగియుండుటయు 'ప్రమాద' లక్షణములు. మనస్సు మోహములోపడుట, ఏ విషయమూ జ్ఞాపకము లేకుండుట తంద్ర, స్వప్నము, సుసుప్తి - అవస్థలు ప్రాప్తించుట, వివేకశక్తి లోపించుట, ఏ విషయమును గూడ అవగాహన చేసికొను శక్తిలేకుండుట. 'మోహము' ఉత్పన్నమగుట యనగా ఇదియే - ఈ లక్షణములన్నియును తమోగుణవృద్ధి సమయమున కలుగును. ఇందులో ఏ ఒక్క లక్షణమైనను తనలో పొడసూపినట్లు కనుగొన్నప్పుడు మనుష్యుడు తమోగుణము వృద్ధియగుచున్నట్లు భావింపవలెను.

*సంబంధము - ఈ విధముగ మూడు గుణముల వృద్ధి లక్షణములను వేర్వేఱుగా తెలిపి, ఇప్పుడు మనుష్యుడు చనిపోవునప్పుడు వృద్ధిలోనున్న గుణమును బట్టి అతనికి ప్రాప్తించుగతిని గూర్చి రెండు శ్లోకములలో తెల్పుచున్నాడు-*

**యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।**
**తదోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే ॥ 14 ॥**

యదా = ఎప్పుడు
దేహభృత్ = మనుష్యుడు
సత్త్వే, ప్రవృద్ధే = సత్త్వగుణము వృద్ధి చెందుచున్నప్పుడు
ప్రలయమ్, యాతి = మృతి చెందునో
తదా, తు = అప్పుడైతే
ఉత్తమవిదామ్ = ఉత్తమ కర్మలను ఆచరించువారు వెళ్ళునట్టి
అమలాన్ = నిర్మలములైన
లోకాన్ = స్వర్గాది దివ్యలోకములను
ప్రతిపద్యతే = పొందును

**సత్త్వగుణము వృద్ధిచెందినపుడు మనుజుడు మరణించినచో అతడు ఉత్తమ కర్మలను ఆచరించువారుచేరెడి నిర్మలములైన స్వర్గాది దివ్యలోకములను పొందును (14)**

ప్రశ్న - 'యదా, తదా' అను కాలవాచకములైన అవ్యయములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి? సత్త్వగుణవృద్ధి యందు మృత్యువు ప్రాప్తించుట యనగానేమి?

సమా - స్వాభావికస్థితి వేరేగుణములయందు ఉన్నప్పటికిని, సాత్త్వికగుణవృద్ధి యందు మృత్యువు ప్రాప్తించిన మనుష్యుని గతిని గూర్చి ఈ ప్రకరణమున వివరించుట జరిగినది. ఈ విషయమును తెల్పుటకే 'యదా, తదా' అను కాలవాచక-అవ్యయములు ప్రయుక్తములైనవి. 11వ శ్లోకమున వర్ణింపబడిన రీతిగా మానవుని యొక్క సమస్త శరీరేంద్రియ - అంతఃకరణములయందు ప్రకాశము, జ్ఞానము, ఉత్పన్నములగుటను సత్త్వగుణవృద్ధియని యందురు. ఇది అతని పూర్వసంస్కారాదుల వలన కలుగును. ఇట్టి సత్త్వగుణవృద్ధి కొనసాగుచున్న సమయమున స్థూల శరీరమునుండి మనస్సు, ఇంద్రియ, ప్రాణముల సహితముగా జీవాత్మ సంబంధము విచ్ఛేదము అగుటనే 'సత్త్వగుణవృద్ధియందు మృత్యువు ప్రాప్తించుట -' అని యందురు.

ప్రశ్న - 'దేహభృత్' అను పదమును ప్రయోగించుట లోని వైశిష్ట్యమేమి?

సమా - శరీరమునందు 'అహంకార, మమకారములు' గల దేహధారులకే పునర్జన్మ రూపమున వేర్వేఱు గతులుండును. దేహాభిమానములేని జీవన్ముక్తులైన మహాత్ములకు పునరావృత్తి (పునర్జన్మ) యుండదు. ఈ విషయమును తెల్పుటకే 'దేహభృత్' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'లోకాన్' అను పదముతోపాటు 'అమలాన్' అను విశేషణమును, 'ఉత్తమవిదాం' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - సత్త్వగుణవృద్ధియందు మృతిచెందు వారికి ప్రాప్తించు లోకములలో మలము అనగా ఏ విధమైన

దోషముగాని, క్లేశముగాని ఉండదు. అవి (ఆలోకములు) దివ్య ప్రకాశమయములు, పవిత్రములు, సాత్త్వికములు. ఈ విషయమును తెల్పుటకే 'లోకాన్' అనుపదముతో పాటు 'అమలాన్' అను విశేషణము ప్రయుక్తమైనది. 'ఉత్తమవిదాం' అను పదములో 'ఉత్తమశబ్దము' శాస్త్రవిహిత కర్మలను, ఉపాసనలను తెల్పును. వాటిని తెలిసికొని, నిష్కామభావముతో ఆచరించువానిని 'ఉత్తమవిత్' అని యందురు. అట్టి కర్మోపాసనల ప్రభావమున వారికి స్వర్గాది పుణ్యలోకములు ప్రాప్తించును. సత్త్వగుణవృద్ధి యందు మరణించిన వారికి ఆలోకములు ప్రాప్తించును.

**రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।**
**తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15 ॥**

రజసి = రజోగుణము వృద్ధి చెందుచున్నప్పుడు
ప్రలయమ్, గత్వా = మృతిచెందినవాడు
కర్మసంగిషు = కర్మాసక్తులైన మనుష్యులయందు
జాయతే = పుట్టును
తథా = అట్లే
తమసి = తమోగుణము వృద్ధి చెందునప్పుడు
ప్రలీనః = మరణించినవాడు
మూఢయోనిషు = పశుపక్షికీటకాది మూఢయోనుల యందు
జాయతే = జన్మించును.

**రజోగుణము వృద్ధిచెందినపుడు మృత్యువు ప్రాప్తించినచో అతడు కర్మాసక్తులైన మానవులలో జన్మించును. అట్లే తమోగుణము వృద్ధిచెందినప్పుడు మృతిచెందిన మానవుడు పశుపక్షికీటకాది నీచయోనులలో జన్మించుచుండును. (15)**

ప్రశ్న - రజోగుణవృద్ధియందు మృత్యువును పొందుట యనగానేమి? 'కర్మసంగిషు' అను పదమునకు అర్థమేమి? వాటిలో జన్మించుట యనగానేమి?

సమా - 12వ శ్లోకమున తెల్పబడిన రీతిగా లోభము, ప్రవృత్తి మొదలగు రాజసభావములు వృద్ధియగుటను రజోగుణవృద్ధి యని యందురు. ఆ సమయమున స్థూల శరీరమునుండి మనస్సు, ఇంద్రియములు, ప్రాణములతో సహా జీవాత్మ సంబంధము విచ్ఛేదమగుటనే రజోగుణవృద్ధి యందు మృత్యువు ప్రాప్తించుట యందురు. కర్మలయందును వాటి ఫలములయందును ఆసక్తిగల వారిని 'కర్మసంగులు' (కర్మసంగినః) అని యందురు. కావున మనుష్యయోని యందు జన్మించుటనే కర్మసంగులయందు జన్మించుట అని యందురు.

ప్రశ్న - తమోగుణ వృద్ధియందు మరణించుట, మూఢయోనుల యందు జన్మించుట యనగానేమి?

సమా - 13వ శ్లోకములో తెల్పబడిన రీతిగా అప్రకాశము, అప్రవృత్తి, ప్రమాదము మొదలగు తామసభావములు వృద్ధి చెందుటను 'తమోగుణవృద్ధి' అనియందురు. అట్టి సమయమున స్థూలశరీరము నుండి మనస్సు, ఇంద్రియములు, ప్రాణములతో సహా జీవాత్మ సంబంధము విచ్ఛేదమగుటనే తమోగుణ వృద్ధియందు మృత్యువు ప్రాప్తించుట యగును. కీట, పతంగ, పశు, పక్షి, వృక్షలతాది తామసయోనుల యందు జన్మించుటనే మూఢయోనుల యందు జన్మించుట యందురు.

*సంబంధము - సత్త్వరజస్తమములను మూడు గుణముల వృద్ధియందు మరణించిన వారికి కలుగు వేర్వేఱు ఫలములు తెల్పబడినవి. అయితే ఒక సమయమున ఒక గుణము, మఱియొక సమయమున మఱియొక గుణము ఏల వృద్ధి చెందును? అను ప్రశ్న ఈ సందర్భమున తలయెత్తును. దీనికి సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।**
**రజసస్తు ఫలం దుఃఖమ్ అజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సుకృతస్య, కర్మణః | = శ్రేష్ఠమైన కర్మకు | ఆహుః | = అందురు | తమసః | = తామసకర్మకు |
| సాత్త్వికమ్ | = సుఖ, జ్ఞాన, వైరాగ్యాది సాత్త్వికమైన | తు | = కాని | ఫలమ్ | = ఫలము |
| | | రజసః | = రాజసకర్మకు | అజ్ఞానమ్ | = అజ్ఞానము అనియు |
| నిర్మలమ్, ఫలమ్ | = నిర్మలమైన ఫలము లభించునని | ఫలమ్ | = ఫలము | | |
| | | దుఃఖమ్ | = దుఃఖము అనియు | (ఆహుః) | = అందురు |

**శ్రేష్ఠములైన కర్మలను ఆచరించుటవలన సాత్త్వికఫలము అనగా సుఖము, జ్ఞానము, వైరాగ్యము మొదలగు నిర్మలఫలములు కలుగును. రాజసకర్మలకు ఫలము దుఃఖము. తామసకర్మలకు ఫలము అజ్ఞానము. (16)**

ప్రశ్న - 'సుకృతస్య' అను విశేషణముతో పాటు 'కర్మణః' అను పదము ఏయే కర్మలను తెలుపును? వాటి యొక్క సాత్త్విక నిర్మలఫలములేవి?

సమా - నిష్కామభావముతో చేయబడు శాస్త్ర విహిత సాత్త్విక కర్తవ్య కర్మలను 'సుకృతస్య' అను విశేషణముతో పాటు 'కర్మణః' అను పదము తెల్పును. ఇట్టి కర్మసంస్కారముల వలన అంతఃకరణమునందు జ్ఞాన వైరాగ్యాది నిర్మల భావములు పదే పదే ఉత్పన్నములగును. మరణానంతరము దుఃఖ దోషరహితములగు దివ్య ప్రకాశమయ లోకములు ప్రాప్తించును. వాటి సాత్త్వికనిర్మలఫలములనగా ఇవియే.

ప్రశ్న - రాజస కర్మలనగా నేమి? వాటి ఫలము దుఃఖమే యనగానేమి?

సమా - అహంకారముతో భోగప్రాప్తికై మిక్కిలి శ్రమతో చేయబడు కర్మలను 'రాజసకర్మలు' అని యందురు. (18/24) ఈ కర్మలను ఆచరించు సమయమున శ్రమరూపమున దుఃఖము కలుగును. కాని ఆ పిమ్మటగూడ అవి దుఃఖములనే కలిగించును. వాటి సంస్కారముల ప్రభావమున అంతఃకరణమునందు పదే పదే భోగానుభవములు, కోరికలు, లోభము, ప్రవృత్తి మొదలగు రాజసభావములు స్ఫురించును. వీటి వలన మనస్సు ఉత్క్షిప్తమై అశాంతితో, దుఃఖములతో నిండిపోవును. ఈ కర్మల ఫల స్వరూపముగా ప్రాప్తించు భోగములు గూడ అజ్ఞానకారణమున సుఖములుగా కనబడినను వాస్తవముగా అవి దుఃఖములే. వాటి ఫలములను అనుభవించుటకు మాటిమాటికి జనన మరణ రూపచక్రము నందు పడవలసి వచ్చును. ఇది మహాదుఃఖపూరితము. కావున రాజస కర్మలన్నియును దుఃఖ రూపములే.

ప్రశ్న - తామసకర్మలనగా ఎట్టివి? వాటి ఫలము అజ్ఞానమే అనగానేమి?

సమా - ముందు వెనుకలు ఆలోచింపకుండ మూర్ఖత్వముతో చేయబడు హింసాది దోషపూరితములైనవి తామసకర్మలు. (18/25) వాటి సంస్కారముల వలన అంతఃకరణమునందు మోహము వృద్ధియగును. మరణానంతరము తమోగుణమే అధికముగా గల జడయోనుల యందు జన్మలభించును. "వాటి ఫలము అజ్ఞానమే" అనగానిదియే.

ప్రశ్న - ఇది గుణముల ఫలములను వర్ణించు సందర్భముగదా! మధ్యలో కర్మఫలముల ప్రసక్తి ఏల వచ్చినది? ఇది అసందర్భముగా గోచరించుచున్నది.

సమా - ఇది అసందర్భమేమీకాదు. ఏలనన పూర్వ శ్లోకములలో ఆయాగుణములు వృద్ధి చెందునపుడు మృతి చెందుటవలన కలుగు వేర్వేఱు ఫలములు తెల్పబడినవి. కనుక ఆ గుణములవృద్ధికి కారణములైన కర్మసంస్కారముల ప్రసక్తియు వచ్చియే తీరును. కనుక కర్మల విషయము తెల్పబడినది. సాత్త్విక రాజస, తామస సంస్కారములు ప్రతి మనుష్యుని అంతఃకరణముల నందును సంచితములగును. ఏ సమయమున ఎట్టి సంస్కారములు అబ్బునో అట్టి సాత్త్వికాది భావములు వృద్ధియగును. వాటిననుసరించియే నూతన కర్మలు కొనసాగును. కర్మల వలన సంస్కారములు, సంస్కారముల వలన సాత్త్వికాదిగుణముల వృద్ధి మఱియు స్మృతియు, స్మృతిననుసరించి పునర్జన్మ, మరల కర్మల ఆరంభము - ఈ విధముగా ఈ చక్రము తిరుగుచునే యుండును. ఇందు పూర్వశ్లోకములయందు విశేషముగా తెల్పబడిన అంతకాలీన సాత్త్వికాది భావముల ఫలములు కూడ బహుశా పూర్వకృత సాత్త్విక రాజస తామస కర్మల సంబంధము చేతనే ఏర్పడును. ఈ భావమే ఈ శ్లోకమునందు తెల్పబడినది. ఇది అసందర్భమేమియు కాదు. ఏలనన గుణ కర్మల రెండింటి సంబంధము చేతనే ఉచ్చనీచ యోనులలో జన్మలు లభించుచుండును (4/13).

*సంబంధము - 11, 12, 13, శ్లోకములలో సత్త్వరజస్తమోగుణముల వృద్ధి లక్షణములు వర్ణింపబడినవి. పిమ్మట సత్త్వాదిగుణముల వృద్ధి సమయమున మృతిచెందిన ఫలములు వేర్వేఱుగా పేర్కొనబడినవి. జ్ఞానాదుల ప్రాదుర్భావములను సత్త్వాదిగుణముల వృద్ధి లక్షణములని ఏల భావింపవలెను? అను విషయమును గూర్చి జిజ్ఞాస కలుగుట సహజము. కనుక కార్యోత్పత్తిని బట్టి కారణముయొక్క ఉనికిని తెలిసికొను రీతిననుసరించి జ్ఞానాదుల ఉత్పత్తియందు సత్త్వాది గుణములు కారణమని తెల్పుచున్నాడు-*

**సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।**
**ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సత్త్వాత్ | = సత్త్వగుణమునుండి | లోభః, ఏవ | = నిస్సందేహముగా లోభము | భవతః | = కలుగును, మఱియు |
| జ్ఞానమ్ | = జ్ఞానము | చ | = అట్లే | అజ్ఞానమ్, ఏవ | = అజ్ఞానము, కూడ |
| సంజాయతే | = కలుగును | తమసః | = తమోగుణమునుండి | (భవతి) | = కలుగును |
| చ | = మఱియు | ప్రమాదమోహౌ | = ప్రమాద మోహములు | | |
| రజసః | = రజోగుణమునుండి | | | | |

**సత్త్వగుణమువలన జ్ఞానమూ, రజోగుణమువలన లోభమూ, తమోగుణమువలన ప్రమాదమోహాదులూ, అజ్ఞానమూ తప్పక ఉత్పన్నములగుచుండును. (17)**

ప్రశ్న - "సత్త్వగుణమునుండి జ్ఞానము ఉత్పన్నమగును." అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇచట 'జ్ఞాన' శబ్దము ఉపలక్షణము మాత్రమే. కనుక జ్ఞానము, ప్రకాశము, సుఖము, శాంతి మొదలగు సాత్త్వికభావములన్నియును సత్త్వగుణము నుండియే ఉత్పన్నములగునని భావింపవలెను.

ప్రశ్న - "రజోగుణము నుండి లోభము కలుగును" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - "లోభ", శబ్దప్రయోగము గూడ ఇచట ఉపలక్షణము మాత్రమే. అందువలన లోభము, ప్రవృత్తి, ఆసక్తి, కామన (కోరిక) స్వార్థ సహిత కర్మారంభము మొదలగు రాజస భావములన్నియును రజోగుణమువలననే కలుగునని భావింపవలెను.

ప్రశ్న - ప్రమాదము, మోహము, అజ్ఞానము, తమోగుణము వలన కలుగునని తెల్పుచు, 'ఏవ' అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - తమోగుణము నుండి ప్రమాదము, మోహము, అజ్ఞానము కలిగియే తీరును. ఇవి మాత్రమే గాక నిద్ర, ఆలస్యము, అప్రకాశము, అప్రవృత్తి మొదలగు తామస భావములన్నియును తమోగుణము నుండియే ఉత్పన్నములగునని తెల్పుటకు 'ఏవ' అను పదము ప్రయుక్తమయ్యెను.

*సంబంధము - సత్త్వాదిగుణముల కార్యములైన జ్ఞానాదులను వర్ణించిన పిదప ఇప్పుడు సత్త్వగుణమును పెంపొందించుటకును, రజస్తమోగుణములను త్యజించుటకును ప్రేరణనిచ్చుటకై ఈ మూడు గుణముల యందు స్థితులైన పురుషుల వేర్వేరు గతులను గూర్చి తెలుపుచున్నాడు-*

**ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।**
**జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥ 18 ॥**

| పదము | | అర్థము |
|---|---|---|
| సత్త్వస్థాః | = | సత్త్వగుణ ప్రధానులు |
| ఊర్ధ్వమ్, గచ్ఛంతి | = | స్వర్గాది-ఊర్ధ్వ లోకములను పొందుదురు |
| రాజసాః | = | రాజసపురుషులు |
| మధ్యే | = | మధ్య (మానవ) లోకమున |
| తిష్ఠంతి | = | ఉందురు (జన్మింతురు) |
| జఘన్యగుణ వృత్తిస్థాః | = | తమోగుణ కార్యములైన నిద్రా ప్రమాదాలస్యములందు స్థితమైనట్టి |
| తామసాః | = | తామస పురుషులు |
| అధః | = | అధోగతులను (అనగా పశుకీటకాది జన్మలను (నరకములను) |
| గచ్ఛంతి | = | పొందుదురు. |

**సత్త్వగుణస్థితులు స్వర్గాది- ఊర్ధ్వలోకములకు పోవుదురు. రజోగుణస్థితులైన (రాజస) పురుషులు మధ్య (మానవ) లోకమునందే ఉందురు. తమోగుణ కార్యరూపములైన నిద్రాప్రమాదాలస్యాదుల యందు స్థితులైనవారు అధోగతిని అనగా కీట, పశుపక్ష్యాది యోనులను, నరకములను పొందుదురు. (18)**

ప్రశ్న - 'ఊర్ధ్వమ్' అను పదము ఏ స్థానమును సూచించును? "సత్త్వగుణమునందు స్థితులైన పురుషులు ఆ (అట్టి) స్థానమును చేరుదురు." అనియనుటలోని విశేషమేమి?

సమా - 14వ శ్లోకమునందు వర్ణింపబడిన 'ఉత్తమవిదామ్', 'అమలాన్' అను పదములతో గూడిన 'లోకాన్' అను పదము ద్వారాను, అట్లే 6వ అధ్యాయము నందలి 41వ శ్లోకమున పుణ్యకర్ములు చేయువారు చేరులోకములు - అని భావింపబడు లోకములను సూచించునదియే 'ఊర్ధ్వమ్' పదము. ఇవి మనుష్యలోకమునకు పైన ఉండుట వలన 'ఊర్ధ్వమ్' అని పేర్కొనబడినవి. సాత్త్విక పురుషులు మరణానంతరము ఆ లోకములను చేరుదురు.

ప్రశ్న - 'మధ్యే' అన పదము ఎట్టి స్థానమును సూచించును? రాజస పురుషులు అచట ఉందురు. అని యనుటలోని అంతర్యమేమి?

సమా - 'మధ్యే' అనుపదము మానవలోకమును సూచించును. రాజసస్వభావము గల మనుష్యులు ఇతర లోకములను చేరక మరల ఈ లోకమునందు మనుష్యులుగా పుట్టి యుండుటనే 'ఇచట' ఉండుట యనియందురు.

ప్రశ్న - 'జఘన్యగుణము' అనగానేమి? దాని వృత్తి యనగానేమి? అందు స్థితులైయుండుట యనగానేమి? తామస మనుష్యులకు 'అధోగతి' ప్రాప్తించుట యనగానేమి?

సమా - 'జఘన్య' శబ్దమునకు నీచము, నింద్యము అని యర్థము. కనుక జఘన్య గుణమనగా తమోగుణము - దాని కార్యములైన ప్రమాదము, మోహము, అజ్ఞానము, అప్రకాశము, అప్రవృత్తి, నిద్ర మొదలగునవి దాని వృత్తులు. వాటన్నింటియందును లగ్నమైయుండుటచే వాటి యందు స్థితమైయుండుట యనబడును. ఈ వృత్తులలో నిమగ్నమై యుండువారిని 'తామసులు' అనియందురు - వారు మరణించిన పిదప కీట - పతంగ, పశు-పక్షి, వృక్షాది నీచయోనులయందు జన్మించుటయు, రౌరవ, కుంభీపాకాది నరకముల యందు బడి, యమయాతనలను అనుభవించుటయు అధోగతులను పొందుటయగును.

ప్రశ్న - మూడు గుణముల వృద్ధి యందు మృతి చెందిన వారి వేర్వేరు ఫలములు 14,15 శ్లోకములలో దాదాపు ఇదేవిధముగా చెప్పడినది. మరల అదే విషయమును ఇచట ప్రస్తావించుటకు గలకారణమేమి?

సమా - ఆ శ్లోకమునందు 'యదా-తదా' అను కాలవాచక - అవ్యయములు ప్రయుక్తములైనవి. కనుక సహజముగా ఇతర గుణములలో స్థితులైనప్పటికిని మరణకాలమున వృద్ధి చెందు గుణమును అనుసరించి వారి వారి గతులు మార్పుచెందునని తెల్పుటకు అక్కడ వేర్వేరు గతులు తెల్పబడినవి. ఇచ్చట స్వాభావికముగా సత్త్వాది గుణములలో స్థిరమైన స్థితిగలవారి గతులభేదములు వర్ణింపబడినవి. కనుక ఇచ్చట పునరుక్తి దోషము లేదు.

ప్రశ్న - 15వ శ్లోకములో తమోగుణ వృద్ధి సమయమున చనిపోవువారు కేవలము మూఢ యోనులలోనే జన్మింతురని తెల్పబడినది. ఇచట తామస పురుషుల గతి 'అధః' అను పదము ద్వారా నకరాది ప్రాప్తియనియు పేర్కొనుటకు కారణమేమి?

సమా - సాత్త్విక, రాజస స్వభావము గల వారై, తమోగుణ వృద్ధి కాలమున మృతిచెందినచో, అట్టి వారికి కలుగు గతి అచట వర్ణింపబడినది. కనుక అచట 'అధః' అను పదమును

ప్రయోగింపక 'మూఢయోనిషు' అను పదము మాత్రమే ప్రయుక్తమైనది. ఏలనన అట్టివారికి ఆ గుణసాంగత్యమువలన అట్టి జన్మ లభించును. సత్త్వగుణస్థితుడైన రాజర్షి భరతునకు జింకజన్మ ఆ విధముగనే లభించినది. కాని సదా తమోగుణకార్యముల యందే స్థితుడైన తామసులకు నరకాదులును ప్రాప్తింపవచ్చును. తామస స్వభావము గల మనుష్యులు ఆసురీయోనులలో జన్మించి, పిమ్మట వాటికంటెను నీచగతుల పాలుకావచ్చునని 16 అధ్యాయమునందలి 20వ శ్లోకమున తెల్పబడినది.

*సంబంధము - గుణసాంగత్యమే మనుష్యులకు ఉచ్చనీచయోనులయందు పునర్జన్మలకు కారణమని 13వ అధ్యాయము నందలి 21వ శ్లోకమున తెల్పడినది. తదనుసారము ఈ అధ్యాయమున 5 నుండి 18వ శ్లోకములవరకు గుణముల స్వరూపములు, గుణముల కార్యముల ద్వారా బంధింపబడిన మనుష్యుల గతులు మొదలగు వాటిని విపులముగా ప్రతిపాదించెను. ఈ వర్ణనవలన మనుష్యుడు మొదట తమోగుణ రజోగుణమునుత్యజించి, సత్త్వగుణమునందు స్థితుడు కావలెనని విశదీకరింపబడెను. ఆ పిమ్మట సత్త్వగుణమును గూడ త్యజించి గుణాతీతుడు కావలెను. కనుక గుణాతీతుడగుటకు గల ఉపాయములను, గుణాతీతస్థితి ఫలములు రాబోవు 2 శ్లోకములలో తెల్పబడుచున్నవి-*

**నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యదా | = ఎప్పుడైతే | న, అనుపశ్యతి | = చూడడో | | పరమాత్మను |
| ద్రష్టా | = ద్రష్టయైనవాడు | చ | = మఱియు | వేత్తి | = యథార్థముగా తెలిసికొనునో |
| గుణేభ్యః | = మూడు గుణములను తప్ప | గుణేభ్యః | = మూడు గుణముల కంటెను | | (అప్పుడు) |
| | | | | సః | = అతడు |
| అన్యమ్, కర్తారమ్ | = మఱియొక దానిని కర్తగా | పరమ్ | = అతీతుడైన సచ్చిదానంద ఘన | మద్భావమ్ | = నాస్వరూపమునే |
| | | | | అధిగచ్ఛతి | = పొందును |

ద్రష్టయైనవాడు గుణములే గుణములయందు వర్తించుచున్నవనియూ, త్రిగుణములుతప్ప వేఱుగా కర్తలు లేరనియూ తెలిసికొని, త్రిగుణములకు అతీతముగానున్న సచ్చిదానంద ఘనపరమాత్మ స్వరూపుడనైన నా తత్త్వమును తెలిసికొనును. అప్పుడతడు నా స్వరూపమునే పొందును. **(19)**

ప్రశ్న - కాలవాచకమైన **'యదా'** అను అవ్యయమును, 'ద్రష్టా' అను పదమును ప్రయోగించుటలోని అంతర్యమేమి?

సమా - మనుష్యుని యొక్క సహజ స్థితికంటె విలక్షణమైన స్థితిని వర్ణించుటకు ఈ శ్లోకమున **'యదా'**, **'ద్రష్టా'** అను ఈ రెండు పదములును ప్రయుక్తములైనవి. మనుష్యుడు సహజముగా తాను శరీర ధారిననియు, కర్తయు, భోక్తయు తానే అనియు భావించును. కనుక సమస్తకర్మలతోను. వాటి ఫలములతోడను తనకెట్టి సంబంధమూ లేదనియు, తాను ఉదాసీనుడైన ద్రష్టయనియు భావింపడు. కాని శాస్త్రములద్వారా ఆచార్యోపదేశముల ద్వారా వివేకమును పొంది, అతడు తనను ద్రష్టగా భావించుకొనును. ఆ సమయము ఇచట వర్ణింపబడినది.

ప్రశ్న - 'త్రిగుణములు తప్ప వేఱుగా కర్తలు లేరు" అని తెలిసికొనుట యనగానేమి?

సమా - ఇంద్రియములు, అంతఃకరణము, ప్రాణములు మొదలగువాని ద్వారా శ్రవణము, దర్శనము, అన్నపానములు, చింతనము, మననము, శయనము, ఆసనము, వ్యవహారాది స్వాభావిక క్రియలన్నియును జరుగు సమయమున సర్వదా నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘన బ్రహ్మయందు తాను అభేద భావముతో స్థితుడైన వానినిగా చూచువాడు నిజమైన ద్రష్ట. గుణములు తప్ప మఱెవ్వియును కర్తలు కావనియు గుణముల కార్యములైన ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రాణములు మొదలగునవియే ఇంద్రియార్థముల యందు ప్రవర్తిల్లుచున్నవనియు (5/8,9) కనుక గుణములే

గుణములయందు వర్తిల్లుచున్నవనియు (3/28) ఇందు తనకెట్టి సంబంధమూ లేదనియు, అతడు తలంచును. గుణములకు అతిరిక్తములైన కర్తలేవియు లేవని భావించుట అనగా ఇదియే.

ప్రశ్న - మూడు గుణములకును అత్యంత పరమైనవాడు ఎవ్వడు? అతని తత్త్వమును తెలిసికొనుట యనగానేమి?

సమా - మూడు గుణములకును అత్యంతము పరమైన వాడు (త్రిగుణాతీతుడు) సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్ముడే. ఈ మూడు గుణములతో తనకెట్టి సంబంధమూ లేదనియు, ఆ నిర్గుణ నిరాకార బ్రహ్మ నుండి తాను వేఱుగాదని భావించుచు, సచ్చిదానంద ఘన పరబ్రహ్మమునకు తప్ప మఱిదేనికిని (శాశ్వతమైన) ఉనికి లేదనియు భావించుచు సర్వత్ర సర్వదా కేవలము పరమాత్మనే చూచుటను అతని తత్త్వమును తెలిసికొనుట యనియందురు.

ప్రశ్న - ఇట్టి స్థితికి చేరిన పిమ్మట భగవద్భావము ప్రాప్తించుట యనగానేమి?

సమా - ఇట్టి స్థితిని పొందిన పిమ్మట అభేదభావముతో సచ్చిదానంద ఘనబ్రహ్మ ప్రాప్తి కలుగుటయే భగవద్భావము ప్రాప్తించుట యగును.

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైః విముక్తోఽమృతమశ్నుతే ॥ 20 ॥**

దేహీ = పురుషుడు
దేహసముద్భవాన్ = శరీరము యొక్క ఉత్పత్తికి కారణములైన
ఏతాన్, త్రీన్, గుణాన్ = ఈ మూడు గుణములను
అతీత్య = అధిగమించినచో
జన్మమృత్యుజరాదుఃఖైః = జన్మ, మృత్యు, వార్ధక్యములవలన కలుగు వివిధ దుఃఖముల నుండి
విముక్తః = విముక్తుడై
అమృతమ్ = పరమానందమును (మోక్షమును)
అశ్నుతే = పొందును.

**దేహోత్పత్తికి కారణరూపములైన ఈ మూడు గుణములను అధిగమించిన పురుషుడు జన్మ, మృత్యు, జరా(వార్ధక్య), దుఃఖములనుండి విముక్తుడై, పరమానందమును పొందును. (20)**

ప్రశ్న - ఇచట 'దేహీ' అను పదమును ప్రయోగించుట లోని ప్రత్యేకత యేమి?

సమా - మొట్టమొదట తాను దేహమునందు స్థితుడైయున్న వాడనని - భావించువాడే గుణాతీతుడైన పిమ్మట అమృతమును అనగా బ్రహ్మ అనగా బ్రహ్మమును పొందునని తెల్పుటకే 'దేహీ' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'గుణాన్' అను పదముతోపాటు 'ఏతాన్, దేహసముద్భవాన్, త్రీన్' అను విశేషణములను ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి? గుణములకు అతీతుడగుట యనగా నేమి?

సమా - ఈ అధ్యాయమునందు ఇంతవరకును జీవాత్మను శరీరమునందు బంధించు గుణముల స్వరూపములు తెల్పబడినవి. వాటికి అతీతుడగు విషయమును ఇచట ప్రస్తావించుటకే 'ఏతాన్' అను పదము ప్రయోగింపబడినది. బుద్ధి, అహంకారము, మనస్సు, ఐదు జ్ఞానేంద్రియములును, ఐదు కర్మేంద్రియములును, పంచ మహాభూతములును, పంచేంద్రియ విషయములును అను ఈ 23 తత్త్వముల పిండరూపమగు ఈ స్థూలశరీరము ప్రకృతి జన్యములైన గుణముల కార్యరూపమే. కనుక దీనితో తనకు సంబంధమున్నట్లు భావించుటను ఆ గుణములతో యుక్తుడగుట యగును. ఈ విషయమును తెలుపుటకే 'దేహసముద్భవాన్' అను విశేషణము ప్రయోగింపబడినది. మూడు విధములుగానున్న ఈ గుణములతో సంబంధము తొలగిపోయిన పిమ్మటనే ముక్తి లభించును. రజస్తమో గుణములు తొలగినను సత్త్వగుణముతో స్థిరసంబంధము ఉన్నచో అదియును ముక్తికి ఆటంకమై పునర్జన్మకు కారణమగును. కనుక దానితో గల సంబంధమును గూడ త్యజింపవలెను. వాస్తవముగా ఆత్మ సంగరహితము. గుణములతో దానికి ఎట్టి సంబంధమూ లేదు. ఐనను అనాది

సిద్ధమైన అజ్ఞానము వలన సంబంధము ఉన్నట్లు మానవుడు భావించును. ఆ సంబంధమును జ్ఞానము ద్వారా ఛేదించి, తాను నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘనబ్రహ్మనుండి వేరుకాదనియు, గుణములతో ఎట్టి సంబంధమూ ఏ మాత్రమూ తనకు లేదనియు భావించుటయే, అనగా పరబ్రహ్మముతో ప్రత్యక్షానుభవము కల్గియుండుటయే గుణాతీతుడగుట యగును.

ప్రశ్న - జన్మమృత్యు జరాదుఃఖముల నుండి విముక్తుడగుట యనగానేమి? అనంతరము అమృతమును అనుభవించుట యనగానేమి?

సమా - జనన మరణములు, బాల్య, యౌవన, వృద్ధావస్థలు శరీరమునకు కలుగును. ఆధివ్యాధి మొదలగు దుఃఖములన్నియును ఇంద్రియములు, మనస్సు, ప్రాణాదుల సంఘాత (సమూహ) రూపమైన శరీరమునందే వ్యాపించి యుండును. కనుక శరీరముతో ఏమాత్రమూ వాస్తవముగా సంబంధము లేని పురుషుడు లోకదృష్టిలో శరీరము నందున్నను శరీరధర్మములైన జన్మ, మృత్యు, జరాదులనుండి సర్వదా ముక్తుడే. కావున భగవత్తత్త్వజ్ఞానము ద్వారా శరీరముతో గల సంబంధము సర్వథా తొలగిపోవుటయే జన్మమృత్యు జరాదుఃఖాదులనుండి పూర్తిగా ముక్తుడగుట యగును. తదనంతరము అమృతస్వరూపుడైన సచ్చిదానంద ఘనబ్రహ్మను అభేదభావముతో సాక్షాత్కరించుకొనును. దీనినే 19వ శ్లోకమున 'భగవద్భావప్రాప్తి' అని పేర్కొనుట జరిగినది. అదియే ఇచట 'అమృతానుభవము' అని వర్ణింపబడినది.

*సంబంధము - జీవితకాలముననే మనుష్యుడు త్రిగుణాతీతుడై అమృతప్రాప్తి నొందునను రహస్య విషయమును విని, గుణాతీత పురుషుని లక్షణములను, ఆచరణములను, గుణాతీతుడగుటకు వలయు సాధనలను తెలిసికొనవలయునను కోరికతో అర్జునుడు ప్రశ్నించుచున్నాడు-*

**అర్జున ఉవాచ**

కైర్లింగైః త్రీన్ గుణానేతాన్ అతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణానతివర్తతే ॥ 21 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రభో! | = ఓ ప్రభూ! | కైః, లింగైః | = ఏయే లక్షణములతో (కూడి) | (భవతి) | = కలిగియుండును? |
| ఏతాన్ | = ఈ | | | ఏతాన్, త్రీన్ గుణాన్ | = (మనుష్యుడు) ఈ మూడు గుణములను |
| త్రీన్, గుణాన్ | = మూడు గుణములను | భవతి | = ఉండునో | | |
| అతీతః | = అధిగమించిన పురుషుడు | చ | = మఱియు | కథమ్ | = ఎట్లు |
| | | కిమాచారః | = ఎట్టి ఆచరణములను | అతివర్తతే | = అధిగమించును? |

**అర్జునుడు పలికెను - ఓ ప్రభూ! ఈ మూడు గుణములకును అతీతుడైనవాని లక్షణములెవ్వి? అతని లోకవ్యవహారరీతి యెట్లుండును? మనుష్యుడు త్రిగుణాతీతుడగుటకు ఉపాయమేమి?(21)**

ప్రశ్న - 'గుణాన్' అను పదముతోపాటు 'ఏతాన్', 'త్రీన్' అను పదములను పదే పదే ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ అధ్యాయమునందు విస్తృతముగా వర్ణింపబడిన ఆ మూడు గుణములకు అతీతుడగు విషయమునే అర్జునుడు అడిగెనని తెల్పుటకు ఈ పదములు ప్రయుక్తములైనవి.

ప్రశ్న - అతడు ఏయే లక్షణములను కల్గియుండును? అను ఈ ప్రశ్నద్వారా అర్జునుడు తెలిసికొనగోరిన విశేషములేమి?

సమా - శాస్త్రములలో తెల్పబడిన గుణాతీత పురుష లక్షణములను గూర్చి అర్జునుడు తెలిసికొనగోరెను. ఈ లక్షణములు గుణాతీతులకు సహజములగును. అవి సాధకులకు అనుసరించుటకు ఆదర్శములగును.

ప్రశ్న - అతడెట్టి ఆచరణములను కల్గియుండును? అను ఈ ప్రశ్న యొక్క అంతరార్థమేమి?

సమా-గుణాతీత పురుషుని లోక వ్యవహారమెట్లుండును?

అనగా ఎవరితో ఎట్లు మెలగును? అతని నిత్యజీవన విధానము ఏ రీతిగా ఉండును? మొదలగు విషయముల నన్నింటిని అతడు తెలిసికొనగోరెను.

ప్రశ్న - 'ప్రభో!' అను సంబోధనయొక్క వైశిష్ట్యమేమి?

సమా - శ్రీకృష్ణభగవానుడు సమస్తజగత్తునకు స్వామి, కర్త, హర్త, సర్వసమర్థుడు, పరమేశ్వరుడు. కనుక అతడే ఈ విషయమును సమగ్రముగా వివరింపగలడు - అని తెల్పుటకు అర్జునుడు 'ప్రభో!' అని భగవానుని సంబోధించెను.

ప్రశ్న - మనుష్యుడు 'త్రిగుణాతీతుడు' ఎట్లగును? అనుప్రశ్నద్వారా తెలిసికొనదగు విశేషమేమి?

సమా - గుణాతీతుడగుటకు అనుసరింపదగు సాధన మార్గమును తెలిసికొనుటకై ఇట్లు ప్రశ్నించెను. గుణాతీతుడగుటకు వలయు ఉపాయమును ఇంతకు ముందు 19వ శ్లోకమున తెలుపుట జరిగెను. మనుష్యుడు అనాయాసముగను శీఘ్రముగను, ఈ మూడు గుణములను అధిగమించుటకు ఇంతకు ముందు తెల్పిన దానికంటెను సరళమైన, సులభమైన ఉపాయమును అర్జునుడు తెలిసికొనగోరెను.

*సంబంధము - అర్జునుడడిగిన ఈ ప్రశ్నలకు సమాధానముగా భగవానుడు త్రిగుణాతీతుని లక్షణములను, ఆచరణములను గూర్చి నాలుగు శ్లోకములద్వారా వివరించుచున్నాడు-*

**శ్రీభగవాన్ ఉవాచ**

**ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।**
**న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22 ॥**

పాండవ! = ఓ అర్జునా! (ఏ పురుషుడైతే)
ప్రకాశమ్ చ = సత్త్వగుణకార్య రూపమైన ప్రకాశమూ
ప్రవృత్తిమ్, చ = రజోగుణకార్యరూపమైన ప్రవృత్తియు
మోహమ్, ఏవ = తమోగుణకార్య రూపమైన మోహమూ
సంప్రవృత్తాని = ఏర్పడినప్పుడు
న, ద్వేష్టి = వాటిని ద్వేషింపడో
చ = మఱియు
నివృత్తాని = అవి తొలగి పోయినప్పుడు
న, కాంక్షతి = వాటికై ఆరాటపడడో..

**శ్రీ భగవానుడు పలికెను - ఓ పాండవా! సత్త్వగుణకార్యరూపమైన ప్రకాశము, రజోగుణకార్య రూపమైన ప్రవృత్తి, తమోగుణ కార్యరూపమైన మోహము, తమంతట తామే ఏర్పడినప్పుడు త్రిగుణాతీతుడు ద్వేషింపడు - అనగా వాటిని గూర్చి విచారపడడు. అట్లే అవి తొలగిపోయినప్పుడు వాటికై కాంక్షపడడు- అనగా ఎల్లప్పుడును ఒకే స్థితిలోనుండును. (22)**

ప్రశ్న - 'ప్రకాశము' అను పదమునకు అర్థమేమి? ఇచట సత్త్వగుణకార్యములయందు కేవలము ప్రకాశము యొక్క ప్రాదుర్భావ - తిరోభావములయందు ద్వేషింపడు. కాంక్షింపడు అని యేల తెలిపెను?

సమా - శరీరేంద్రియ - అంతఃకరణములయందు అలసత్వము, జడత్వము దూరమై, లాఘవము, నైర్మల్యము, చైతన్యము కలుగుటను 'ప్రకాశము' అనియందురు. గుణాతీతుని యందు జ్ఞానము, శాంతి, ఆనందము అనుక్షణము (ఎల్లప్పుడును) ఉండును, ఇవి ఎన్నడునూ తొలగిపోవు, కావున ఇచ్చట సత్త్వగుణ కార్యములలో కేవలము ప్రకాశము మాత్రమే తెల్పబడినది. సత్త్వగుణము యొక్క ప్రకాశ వృత్తి అతని శరీరేంద్రియ-అంతఃకరణముల యందు సహజముగా ప్రాదుర్భవించినప్పుడు అతడు వాటిని ద్వేషింపడు, అవి తొలగిపోయినప్పుడు వాటి పునరాగమనమును ( ఆ ప్రకాశమును తిరిగి పొందుటను) కోరడు. సర్వదా (ఎల్లప్పుడు) ఒకేరీతిగా ఉండును.

ప్రశ్న - 'ప్రవృత్తిమ్' అను పదమునకు అర్థమేమి? రజోగుణ కార్యముల యందు కేవలము ప్రవృత్తి యొక్క ప్రాదుర్భావతిరోభావముల యందే ద్వేషము, ఇచ్ఛ ఉండవని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - నానావిధములగు కర్మలను ఆచరించు స్ఫురణను ప్రవృత్తి యందురు. ఇదిగాక కామము, లోభము, స్పృహ, ఆసక్తి మొదలగు రజోగుణకార్యములు గుణాతీతుని యందు ఉండవు. కర్మారంభము గుణాతీతుని శరీరేంద్రియముల ద్వారా కూడ జరుగును. ఇది ప్రవృత్తిలోని అంతర్భాగమే. కావున ఇచట రజోగుణ కార్యములయందు కేవలము ప్రవృత్తియందే రాగద్వేషములుండవని తెల్పబడినవి. గుణాతీతుని మనస్సునందు ఏదైనా ఒక కర్మను ఆరంభించుటకు స్ఫురణ కల్గినప్పుడుగాని, శరీరాదుల ద్వారా అది ఆరంభింపబడునప్పుడు గాని అతడు దానిని ద్వేషింపడు. అట్టి కర్మారంభము జరుగనప్పుడు దానికై కాంక్షింపడు. ఎట్టి స్ఫురణ లేక క్రియ యొక్క ప్రాదుర్భావ తిరోభావముల యందు సర్వదా అతడు ఒకే స్థితిలో నుండును.

ప్రశ్న - 'మోహమ్' అను పదమునకు అర్థమేమి? తమోగుణ కార్యములయందు కేవలము మోహము యొక్క ప్రాదుర్భావ తిరోభావముల యందే ద్వేషము, ఆకాంక్ష కలుగవని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - అంతఃకరణము యొక్క మోహినీ వృత్తినే 'మోహము' అని యందురు. దీని వలన మనుష్యునకు తంద్ర, స్వప్నము, సుషుప్తి మొదలగు అవస్థలు కలుగును. శరీరేంద్రియ+అంతఃకరణముల యందు సత్త్వగుణకార్యమైన ప్రకాశము తొలగిపోయినట్లగును. అంతేగాక తమోగుణ కార్యములైన అజ్ఞానము, ప్రమాదాదులు గుణాతీతుని యందు ఉండనే యుండవు. ఏలనన అజ్ఞానము జ్ఞానియొక్క దరిదాపులకును రాజాలదు. కర్తయే లేనపుడు ప్రమాదము (వ్యర్థ చేష్టలు) ఎట్లు కలుగును? ఇచట తమోగుణకార్యములలో కేవలము మోహముయొక్క ప్రాదుర్భావ తిరోభావములయందు రాగద్వేషములుండవని తెల్పబడినది. గుణాతీతుని శరీరమునందు తంద్ర, స్వప్నము, నిద్ర మొదలగు తమోగుణవృత్తులు వ్యాప్తమైనప్పుడు గుణాతీతుడు వాటిని ద్వేషింపడు. అవి నివృత్తములైనప్పుడు వాటి పునరాగమనమును కోరడు. రెండు పరిస్థితుల యందును అతని స్థితి సర్వథా ఒకే రీతిగా నుండును.

**ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।**
**గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥ 23 ॥**

యః = ఎవడైతే
ఉదాసీనవత్ = ఉదాసీనుని (సాక్షి)వలె
ఆసీనః = స్థితుడై యుండునో
గుణైః = త్రిగుణములచే
న, విచాల్యతే = చలింపజేయబడడో (మఱియు)
గుణాః, ఏవ = గుణములే
వర్తంతే = (గుణములయందు) ప్రవర్తించుచున్నవి
ఇతి = అని భావించి
యః = ఎవడు (సచ్చిదానంద ఘనపరమాత్మ యందు ఏకీ భావముతో)
అవతిష్ఠతి = స్థితుడైయుండునో మఱియు
న, ఇంగతే = ఆ స్థితినుండి ఎన్నడును చలింపడో

**త్రిగుణములకును, వాటి కార్యరూపములైన శరీరేంద్రియాంతఃకరణ వ్యాపారములకును ఏమాత్రము చలింపక, త్రిగుణాతీతుడు, ఉదాసీనుని వలె(సాక్షివలె) ఉండును. గుణములే గుణములయందు ప్రవర్తించుచున్నవని తలంచును. అతడు సచ్చిదానందఘనపరమాత్మయందు ఏకీభావస్థితుడై యుండును. ఆ స్థితినుండి ఎన్నడును చలింపడు. (23)**

ప్రశ్న - 'ఉదాసీనుడు' అని ఎవరిని అందురు? అతని వలె స్థితుడై యుండుట అనగానేమి?

సమా - తనకేమాత్రమూ సంబంధమేలేని సంఘటనల యందును, మరియు వస్తువుల యెడలను ఉపేక్షాభావముతో ఉండి, వాటి నుండి సర్వథా ఉపరతుడైన వానిని 'ఉదాసీనుడు' అని యందురు. గుణాతీతునకు మూడు గుణముల తోడను, వాటికార్య రూపములైన శరీరేంద్రియాంతఃకరణముల తోడను, సమస్త పదార్థములతోడను, సంఘటనల తోడను ఏ విధమైన సంబంధమూ లేనందు వలన అతడు ఉదాసీనుని వలె స్థితుడైయున్నట్లు కనబడును. కాని వాస్తవముగా అదియును ఔపచారికమే. దానితో గూడ అతని కెట్టి సంబంధమూ

ఉండదు. అతడు ఉదాసీనుని వలె ఉండునని చెప్పుటలోని భావమిదియే.

ప్రశ్న - గుణముల వలన విచలితుడు కాకుండుట యనగానేమి?

సమా - గుణములతో సంబంధము గల జీవులను ఆ గుణములు వారికి ఇష్టము లేకున్నను బలవంతముగా వివిధ కర్మల యందును నిమగ్నులనుగాజేయును. తత్ఫలములు వారిచే అనుభవింప జేయును. అవి వారికి సుఖ దుఃఖములను కలుగజేసి, వారి మనశ్శాంతిని భంగపఱచును. ఆ కారణమున వారు అనేక యోనులలో జన్మలెత్తుచుందురు. కాని గుణములతో సంబంధము లేని వారిపై ఈ గుణముల ప్రభావము ఏ మాత్రము ఉండదు. గుణముల కార్యరూపములైన శరీరేంద్రియ-అంతఃకరణముల పరివర్తనముల (మార్పుల) యందును, అట్లే నానావిధములైన సాంసారిక పదార్థముల సంయోగవియోగముల యందును అతడు సర్వదా నిర్వికారుడై ఒకే స్థితి యందుండును. గుణముల వలన అతడు విచలితుడు కాకుండుటయనగా నిదియే.

ప్రశ్న - "గుణములే గుణములయందు ప్రవర్తిల్లును" - అని తెలిసికొనుట, తెలిసికొని అందుస్థితుడైయుండుట అనగానేమి?

సమా - 3వ అధ్యాయమునందలి 28వ శ్లోకమున 'గుణాగుణేషు వర్తంత ఇతిమత్వానసజ్జతే' అను వాక్యము ద్వారా చెప్పబడిన విషయమే ఇచట 'గుణా వర్తంత ఇత్యేవ' అను వాక్యము ద్వారా చెప్పబడినది. మనోబుద్ధీంద్రియములు, ప్రాణములు మొదలగు సమస్త కరణములు, శబ్దాది సమస్త విషయములు అన్నియు గుణముల విస్తారరూపములే. కావున మనోబుద్ధీంద్రియాదులు తమ తమ విషయముల యందు చరించుటయే గుణములే గుణముల యందు ప్రవర్తిల్లుటయగును. ఆత్మతో వీటికి ఎట్టి సంబంధమూ లేదు. ఆత్మ నిత్యము, చైతన్యస్వరూపము సర్వథా అసంగము, ఏకైకసచ్చిదానందస్వరూపము అని భావించి, నిర్గుణ నిరాకార సచ్చిదానంద పరబ్రహ్మ పరమాత్మ యందు అభేద భావముతో నిత్యస్థితుడైయుండుటయే పరమాత్మయందు స్థితుడగుట యగును.

ప్రశ్న - 'న ఇంగతే' అను క్రియాపదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'న ఇంగతే' అను క్రియాపదమునకు 'కదలడు' అని యర్థము. గుణములు గుణాతీతుడైన పురుషుని విచలితునిగా చేయువు సరిగదా! అతడు స్వయముగా తనస్థితినుండి ఎన్నడును ఏ సమయమునందును చలింపడు. ఏలనన సచ్చిదానందఘన పరబ్రహ్మ పరమాత్మ యందు స్థితమై యున్న పిమ్మట జీవునకు వేఱుగా ఉనికియే యుండదు. అప్పుడు ఎవరు ఎట్లు విచలితులగుదురు?

**సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।**
**తుల్యప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః ॥ 24 ॥**

స్వస్థః = ఎవడు నిరంతరము ఆత్మభావమునందే స్థితుడై
సమదుఃఖసుఖః = సుఖదుఃఖములను సమానముగా భావించినవాడై
సమలోష్టాశ్మ కాంచనః = మట్టి, ఱాయి, బంగారములను సమానముగా భావించునట్టి
ధీరః = జ్ఞాని
తుల్యప్రియాప్రియః = ప్రియాప్రియములను సమానముగా చూచువాడును
తుల్యనిందాత్మ సంస్తుతిః = నిందాస్తుతుల యందును సమానభావము గల్గియుండువాడును

త్రిగుణాతీతుడు స్వస్వరూపమునందే నిరంతరము స్థితుడై యుండును. సుఖదుఃఖములను సమానముగా భావించును. మట్టి, రాయి, బంగారములయందు సమభావమునే కలిగియుండును. అనగా ఆ మూడింటియందును గ్రాహ్యత్యాజ్య భావములను కలిగియుండడు. అతడే ధీరుడైన జ్ఞాని. ప్రియాప్రియములకు గాని, నిందాస్తుతులకు గాని లొంగడు. అనగా రెండింటియందును సమస్థితిలోనే యుండును. (24)

ప్రశ్న - 'స్వస్థః' అను పదప్రయోగావైశిష్ట్యమేమి? సుఖ దుఃఖములను సమానముగా భావించుట యనగానేమి?

సమా - తన వాస్తవికస్వరూపమునందు స్థితమైయున్న వానిని 'స్వస్థః' అని యందురు. ఇట్టి స్వస్థపురుషుడే సుఖ దుఃఖముల యందు సమముగా ఉండగలడు. ఈ భావమును తెల్పుటకే ఇచట 'స్వస్థః' అను పదము ప్రయుక్తమైనది. సామాన్య మానవుల స్థితి ప్రకృతికార్య రూపములైన స్థూల సూక్ష్మకారణ శరీరములయందు ఏదో యొక దాని యందు ఉండును. కనుక వారు స్వస్థులు కారు. వారు ప్రకృతిస్థులు. అట్టి పురుషులు ప్రకృతి గుణములను అనుభవింతురు - (13/21) కావున సుఖదుఃఖముల యందు సమముగా ఉండజాలరు. గుణాతీత పురుషునకు ప్రకృతితోడను, దాని కార్యములతోడను ఎట్టి సంబంధమూ ఉండదు. కావున అతడు 'స్వస్థుడు.' అనగా తన సచ్చిదానంద స్వరూపమునందే స్థితుడైయుండును. అందువలన శరీరేంద్రియ - అంతః కరణముల యందు సుఖదుఃఖముల ప్రాదుర్భావ తిరోభావములు కలుగుచున్నను గుణాతీతునకు వాటితో ఎట్టి సంబంధమూ లేనికారణమున వాటి ద్వారా సుఖ దుఃఖములను పొందడు. అతని స్థితి సర్వదా సమముగానే యుండును. సుఖదుఃఖములను అతడు సమముగా భావించుటయనగా నిదియే.

ప్రశ్న - 'లోష్ట' 'అశ్మ, కాంచన' అను మూడు పదముల యొక్క అర్థములేవి? ఈ మూడింటియందును సమభావమనగా నేమి?

సమా - ఇండ్లగోడలను అలుకుటకు ఉపయోగించు గోమయముతో గూడిన మట్టి ముద్దను 'లోష్టము' అని అందురు. అశ్మము అనగా 'రాయి'. కాంచనమనగా బంగారము. ఈ మూడింటియందును గ్రహించు, లేక త్యజించు భావము లేకుండుటను 'సమభావము' అని యందురు. ప్రపంచమున గల పదార్థములు ఉత్తమ మధ్యమ నీచ శ్రేణులకు చెందినవిగా భావింపబడును. గుణాతీతునకు వాటన్నింటియందును సమభావమే యుండును. అతని దృష్టిలో పదార్థములన్నియును మృగతృష్ణలోని నీటివలె మాయికములే (అభాస మాత్రములే) యగుట వలన ఏ వస్తువునందును అతనికి భేదబుద్ధియుండదు.

ప్రశ్న - 'ధీరః' అను పదమున కర్థమేమి?

సమా - జ్ఞానియైన స్థితప్రజ్ఞుని 'ధీరః' అని యందురు. గుణాతీతుడు అత్యధిక సుఖ దుఃఖముల ప్రాప్తియందును తన స్థితినుండి విచలితుడు కాడు. (6/21,22). కనుక అతని బుద్ధి సర్వదా స్థిరముగానే యుండును.

ప్రశ్న - ప్రియ, అప్రియ శబ్దములు వేటిని తెల్పును? వాటియందు సమముగా ఉండుటయనగానేమి?

సమా - శరీరేంద్రియమనోబుద్ధులకు అనుకూలములై వాటికి పోషకములుగను, సహాయకముగను ఉండి, ప్రశాంతిని ప్రసాదించు పదార్థములు లోక దృష్టిలో 'ప్రియములు' అనబడును. అట్లుగాక వాటికి ప్రతికూలములై, క్షీణింపజేయునవియును, వైరుధ్యమును తాపమును కలిగించునవియును ఐన పదార్థములు 'అప్రియములు' అని భావింపబడును. ఇట్లు అనేక విధములైన పదార్థములతో, ప్రాణులతో శరీరేంద్రియ-అంతఃకరణములకు సంబంధమున్నను దేనియందును భేదబుద్ధి లేకుండుటనే వాటియందు సమముగా నుండుటయందురు.

గుణాతీత పురుషునకు ఇంద్రియాంతఃకరణ సహితమైన శరీరముతో ఎట్టి సంబంధమూ లేకుండుట వలన వాటికి సంబంధించిన ఏ పదార్థమునందును అతనికి భేదభావము ఉండదు. సామాన్యముగా మానవులకు ప్రియవస్తు సంయోగమునందును, అప్రియవస్తు వియోగమునందును రాగము, సంతోషము కలుగుచుండును. అట్లే అప్రియవస్తు సంయోగమునందును, ప్రియవస్తు వియోగమునందును ద్వేషము, శోకము కలుగుచుండును. కాని గుణాతీతునకు ఇవి యెప్పుడును ఉండవు. అతడు సర్వదా రాగద్వేషములకు హర్షశోకములకు సర్వథా అతీతుడుగా ఉండును.

ప్రశ్న - 'నిందాస్తుతులు' అనగానేమి? వాటికి సమముగా భావించుట యనగానేమి?

సమా - వాస్తవమైన లేక అసత్యమైన దోషములను ఎత్తి చూపుటనే నిందయందురు. గుణములను వర్ణించుటను స్తుతియందురు - ఈ రెండింటికిని ముఖ్యముగా పేరు ప్రతిష్ఠలతోడను, కొంతవరకు శరీరముతోడను సంబంధము ఉండును. గుణాతీతునకు శరీరముతోగాని, పేరు (కీర్తి)తో గాని ఏమాత్రమూ సంబంధము లేకుండుటవలన నిందాస్తుతుల కారణముగా అతనికి హర్షశోకములు కలుగనే కలుగవు. నిందించిన వారిపై కోపముగాని, స్తుతించినవారిపై ప్రసన్నత్వము గాని ఉండవు. సర్వదా అతడు ఏకీభావముతో ఉండును. రెండింటియందును అతడు సమముగా ఉండుట యనగా ఇదియే.

**మానావమానయోస్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః ।**
**సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥ 25 ॥**

మానావమానయోః, తుల్యః = మానావమానములను సమానముగా తలంచువాడును
మిత్రారిపక్షయోః, తుల్యః = మిత్రులయెడను, శత్రువులయెడను సమానముగా ఉండువాడును
సర్వారంభపరిత్యాగీ = కర్మాచరణముల యందు కర్తృత్వాభిమానము లేనివాడును అగు
సః = అట్టి పురుషుడు
గుణాతీతః = త్రిగుణములకు అతీతుడని
ఉచ్యతే = పేర్కొనబడును

మానావమానములయందును, మిత్రులయందును, శత్రువులయందును సమభావముతో ప్రవర్తించువాడును, విధ్యుక్తకర్మలను ఆచరించుచు కర్తృత్వాభిమానము లేనివాడును ఐనవాడు త్రిగుణాతీతుడనబడును. **(25)**

ప్రశ్న - మానావమానములయందు సమముగా ఉండుటయనగా నేమి?

సమా - మానావమానముల సంబంధము ఎక్కువగా (ముఖ్యముగా) శరీరముతో ఉండును. కనుక దేహాభిమానము గల లౌకిక పురుషులకు కీర్తి ప్రతిష్ఠలయందు రాగము, అవమానమునందు ద్వేషము ఉండును. కావున వారికి మానమునందు హర్షము, అవమానమునందు శోకము కలుగును. తమను గౌరవించిన వారియెడ ప్రేమను, అవమానించినవారియెడ వైరమును చూపుదురు. కాని గుణాతీత పురుషునకు శరీరముతో ఎట్టి సంబంధమూ లేనందు వలన మానమునందు (గౌరవమునందు) హర్షముగాని, అవమానమునందు శోకముగాని కలుగవు. అతని దృష్టిలో మానావమానములును, వాటికి కారణమైన వ్యక్తులును, వారి కార్యములును అన్నియును స్వప్న సదృశములు. కనుక మానావమానముల వలన అతనియందు ఏమాత్రమూ రాగద్వేషములును, హర్ష శోకములును కలుగవు. మానావమానముల యందు అతడు సమముగా నుండుట యనగా నిదియే.

ప్రశ్న - మిత్రారిపక్షములయందు సమముగా నుండుటయనగా నేమి?

సమా - గుణాతీతుని దృష్టిలో ఎవ్వరూ మిత్రులుగారు, శత్రువులును గారు. అతనికి ఏ ప్రాణి యందును మిత్రభావము గాని, శత్రుభావముగాని ఉండదు. ఐనను లోకులు తమభావములను అనుసరించి అతని యెడ మిత్ర, శత్రుభావములను కల్పించుకొందురు.

అట్లు అతనిపై మిత్రశత్రుభావములు కల్గినవారి యెడలను అతడు సమభావముతోనే నుండును. కాని లోకమున సామాన్యముగా మనుష్యులు బంధు, మిత్ర, హితైషులయందు ఆత్మీయతను, ప్రీతిని కల్గియుందురు. వారికై తమ స్వత్వమును (సొత్తును) త్యాగముచేసి, వారికి సహాయపడుచుందురు. తమ యెడ వైరము గలవారి యెడలను, వారి బంధుమిత్ర హితైషులయెడలను ద్వేషము కల్గియుందురు. కావున వారికి కీడు తలపెట్టుదురు. అందులకై తమ శక్తియుక్తులను వీలైనంత ఎక్కువగా వినియోగింతురు. గుణాతీతుడు ఇట్లు చేయడు. అతడు ఈ ఉభయపక్షముల వారియందును సమభావముతో నుండును. రాగద్వేషములు లేకయే సమభావముతో అందరి హితమునకును ప్రయత్నించును. ఎవ్వరికిని చెఱుపుచేయడు. ఎవ్వరియందును భేదబుద్ధిని కల్గియుండడు. అతడు మిత్ర శత్రు పక్షములయందు సమముగా నుండుట యనగా ఇదియే.

ప్రశ్న - 'సర్వారంభపరిత్యాగీ' అనగానేమి?

సమా - ఆరంభశబ్దము అన్ని క్రియలను సూచించును. గుణాతీతపురుషుని శరీరేంద్రియ మనోబుద్ధులద్వారా జరుగు శాస్త్రానుకూల క్రియలలో దేనియందును దేనికిని అతనికి కర్తృత్వము ఉండదు. అవి (ఆ క్రియలు) అతని ప్రారబ్ధానుసారము లోకసంగ్రహము కొరకు అనగా లోకులను చెడు మార్గమునుండి మంచి మార్గము వైపు మళ్ళించుట కొరకు చేయబడును. 'సర్వారంభపరిత్యాగీ' అనగా సమస్త క్రియలను సంపూర్ణముగా త్యాగము చేయువాడు అని చెప్పుటలోని అభిప్రాయమిదియే.

ప్రశ్న - "అతడు గుణాతీతుడనబడును" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యము ద్వారా అర్జునుని ప్రశ్నలో రెండింటికి సమాధానము లభించుచున్నది. 22 నుండి 25వ శ్లోకము వరకు వర్ణింపబడిన లక్షణములు గలవానిని గుణాతీతుడని యందురు. గుణాతీతుని గుర్తించుటకు ఇవే అతని చిహ్నములు. ఇవియే అతని ఆచార వ్యవహారములు. అంతఃకరణమునందు రాగద్వేషములు వైషమ్యములు, హర్షశోకములు, అవిద్య, అభిమానము లేశమాత్రమున్నను అతనికి గుణాతీతస్థితి ప్రాప్తింపలేదనియే భావింపవలెను.

*సంబంధము - ఈ విధముగా అర్జునుని రెండు ప్రశ్నలకు సమాధానము ఇచ్చి పిమ్మట ఇప్పుడు గుణాతీతుడగుటకు ఉపాయములను మూడవ ప్రశ్నకు సమాధానముగా తెలుపుచున్నాడు. తనను అకర్తగా భావించి, నిర్గుణ నిరాకార సచ్చిదానందఘనబ్రహ్మ యందు నిత్యము, నిరంతరము స్థితుడై యుండుటయే గుణాతీతస్థితిని చేరుకొనుటకు ఉపాయమని 19వ శ్లోకములో భగవానుడు తెల్పినప్పటికిని, పై నాలుగు శ్లోకములలో వర్ణింపబడిన గుణాతీతుని లక్షణములను, ఆచరణములను ఆదర్శముగా తలంచి, వాటిని అభ్యసించుటగూడ గుణాతీతుడు అగుటకు ఉపాయముగా భావింపబడుచున్నది- కాని అర్జునుడు ఈ యుపాయములన్నింటి కంటెను వేఱైన సులభమైన ఉపాయమును తెలిసికొనగోరి ప్రశ్నించెను. కనుక అతని కోరికను అనుసరించి భగవానుడు దానికంటెను సులభమైన ఉపాయమును తెలుపుచున్నాడు-*

**మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | = మఱియు | మామ్, సేవతే | = నన్ను, నిరంతరము భజించునో | సమతీత్య | = పూర్తిగా అధిగమించి |
| యః | = ఏ పురుషుడు | | | బ్రహ్మ భూయాయ | = సచ్చిదానంద ఘన ప్రాప్తికై |
| అవ్యభిచారేణ, భక్తియోగేన | = అనన్య భక్తియోగముద్వారా | సః | = అతడుగూడ | | |
| | | ఏతాన్, గుణాన్ | = ఈ మూడు గుణములను | కల్పతే | = అర్హుడగును |

**అనన్య (నిర్మలమైన) భక్తియోగముద్వారా నన్నే నిరంతరము భజించువాడును, ఈ మూడు గుణములకును పూర్తిగా అతీతుడైనవాడును అగు పురుషుడు సచ్చిదానంద ఘనపరబ్రహ్మ ప్రాప్తికి అర్హుడగును. (26)**

ప్రశ్న - అవ్యభిచార భక్తియోగమనగానేమి? దానిద్వారా భగవంతుని నిరంతరము భజించుట యనగానేమి?

సమా - కేవలము పరమేశ్వరుడొక్కడే సర్వశ్రేష్ఠుడు. ఆయనయే మనస్వామి. శరణు కోరదగిన వాడు, పరమగతి, పరమాశ్రయుడు, తల్లి, తండ్రి, సోదరుడు, బంధువు, పరమహితకారి, వేయేల! సర్వస్వమును అతడే. అతడు తప్ప మనకెవ్వరును లేరు - అని భావించి, ఆయనయందే స్వార్థ రహితమైన అత్యంతశ్రద్ధాసక్తులు గల అనన్య ప్రేమనే **అవ్యభిచార భక్తియోగమందురు** - ఈ భక్తియందు స్వార్థము, అభిమానము, వ్యభిచార దోషము ఏ మాత్రమూ ఉండవు. అది సర్వదా సర్వథా పూర్ణము, నిశ్చలము. ఆ భక్తిలో అణుమాత్రమైనను భగవదన్యవిషయము ఉండదు. అందువలన భగవద్విషయము నందు క్షణమాత్రమైనను విస్మృతి రానీయరాదు.

ఈ భక్తియోగము ద్వారా భగవంతుని గుణప్రభావ లీలలను నిరంతరము శ్రవణ, కీర్తన, మననములను, ఆయన నామోచ్చారణము, జపము, తత్స్వరూపచింతనములను చేయుచుండవలెను. శరీరమనోబుద్ధులను, అట్లే సమస్త పదార్థములను భగవంతునివిగా భావించి, తాను కేవలము నిమిత్తమాత్రుడనని తలంచి, నిష్కామభావముతో ఆయన ఆజ్ఞానుసారము సమస్త క్రియలను ఆయన సేవలరూపములో చేయుచుండవలెను. అవ్యభిచార భక్తియోగము ద్వారా నిరంతరము భజించుట యనగా ఇదియే.

ప్రశ్న - 'మామ్' అను పదము ఎవరిని సూచించును?

సమా - 'మామ్' అను పదము ఇచట సర్వ శక్తిమంతుడును, సర్వాంతర్యామియు, సర్వవ్యాపియు,

సర్వాధారుడును, సమస్త జగత్తునకు హర్తయును, కర్తయును, పరమదయాళువూ, అందరికి సుహృదుడును, పరమప్రేమాస్పదుడును ఐన సగుణ పరమేశ్వరుని సూచించును.

ప్రశ్న - 'గుణాన్' అను పదముతో పాటు 'ఏతాన్' అను పదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి? పైన పేర్కొనబడిన పురుషుడు ఈ గుణములకు అతీతుడగుట యనగానేమి?

సమా - ఈ అధ్యాయమునందు ప్రస్తావింపబడిన గుణములను సూచించునదియే అని తెల్పుటకు ఇచట 'ఏతాన్' అను పదముతోపాటు 'గుణాన్' అను పదము ప్రయోగింపబడినది. ఈ మూడు గుణములతోడను, వాటి కార్యరూపములైన శరీరేంద్రియ మనోబుద్ధులతోడను, అట్లే సమస్త సాంసారిక పదార్థములతోడను సంబంధము లేకుండుటయే ఆ గుణములకు అతీతుడగుటయగును.

ప్రశ్న - 'బ్రహ్మప్రాప్తికి యోగ్యుడగుట' యనగానేమి?

సమా - పైన తెల్పబడిన విధముగా గుణాతీతుడైన వెంటనే మనుష్యుడు బ్రహ్మభావమును అనగా నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘన పరబ్రహ్మను అభేదభావముతో పొందుటకు యోగ్యుడగును. తత్క్షణమే అతనికి బ్రహ్మప్రాప్తి కలుగును. అటుపిమ్మట అతనికి పొందవలసిన దేమియు ఉండదు.

*సంబంధము - ఉపర్యుక్త శ్లోకమునందు సగుణ పరమేశ్వరోపాసనాఫలము నిర్గుణ నిరాకార బ్రహ్మప్రాప్తియని తెల్పబడెను. 19వ శ్లోకమున గుణాతీతస్థితికి ఫలము భగవద్భావప్రాప్తియనియు, 20వ శ్లోకమున అమృతప్రాప్తియనియు పేర్కొనబడెను. ఫలమునందు గోచరించు వైవిధ్యము (వైరుధ్యము)ను తొలగించుటకై అన్నింటి ఫలమూ ఒక్కటే అని ప్రతిపాదించుచు ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-*

**బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్ అమృతస్యావ్యయస్య చ ।**
**శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ ॥ 27 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | అమృతస్య, చ | = అమృతత్వమునకును | ఐకాంతికస్య, సుఖస్య | = అఖండా నందమునకును |
| అవ్యయస్య | = నాశరహితుడైనట్టి | శాశ్వతస్య, ధర్మస్య, చ | = సనాతనమైన ధర్మమునకును | అహమ్, ప్రతిష్ఠా | = నేనే ఆధారమును |
| బ్రహ్మణః, చ | = పరబ్రహ్మకును | | | | |

**ఏలనన అట్టి శాశ్వతపరబ్రహ్మకును, అమృతత్వమునకును, సనాతన ధర్మమునకును, అఖండానందమునకును నేనే ఆధారము. (27)**

ప్రశ్న - 'బ్రహ్మణః' అను పదముతోపాటు 'అవ్యయస్య' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి. 'ఆ బ్రహ్మకు ఆధారమును నేనే." అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇచట 'బ్రహ్మ' పదము ప్రకృతి వాచకము కాదు. అది నిర్గుణ నిరాకార పరమాత్మను సూచించును. దానికి ఆధారము భగవానుడే. ఆ బ్రహ్మ సగుణ పరమేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మకంటె వేఱుగాదు. ఆయనకూడ ఆ బ్రహ్మము కంటెను వేఱుగాదు. వాస్తవముగా ఈ రెండును ఒకే తత్త్వవాచకములు. అందువలన పూర్వశ్లోకమునందు తెల్పబడిన బ్రహ్మప్రాప్తియు శ్రీకృష్ణపరమాత్మ ప్రాప్తియే యని యెఱుంగవలెను. ఏలనన వాస్తవముగా ఒకే పరబ్రహ్మ పరమాత్మను ఉపాసించుటకు ఉపాసకుల యోగ్యతా భేదములను బట్టి, ఆయనకు వేర్వేరు రూపములున్నట్లు పేర్కొనుట జరిగినది. ఆ వివిధ రూపములయందు మాయాతీతుడు, అచింత్యుడు, మనోవాక్కులకు అగోచరుడు, నిర్గుణ స్వరూపుడునైన పరమాత్మ ఒక్కడే. కాని సగుణ రూపమున సాకార, నిరాకార భేదములు రెండు గలవు. సమస్త జగత్తునందు వ్యాపించినట్టియు, అందఱికిని ఆశ్రయ మైనట్టియు, తన అచింత్య శక్తితో అందరిని ధరించి పోషించు నట్టియునైన భగవత్స్వరూపము సగుణము, అవ్యక్తము అనగా నిరాకారరూపము. శ్రీశివుడు, శ్రీమహావిష్ణువు, శ్రీరాముడు శ్రీకృష్ణుడు మొదలగునవి భగవంతుని సాకారరూపములు. ఈ సమస్త జగత్తు భగవంతుని విరాట్ స్వరూపము.

ప్రశ్న - 'అమృతస్య' అను పదము దేనిని తెలుపును? అమృతమునకు ఆధారమును నేను - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - 'అమృతస్య' అను పదము ఆ పరబ్రహ్మమునే తెల్పును. దానిని పొంది మనుష్యుడు అమరుడగును. అనగా జన్మమృత్యురూపమైన సంసారము నుండి శాశ్వతముగా ముక్తుడగును. ఈ అమృతత్వమును గూడ భగవానుడే ఆధారము. ఈ అధ్యాయమునందలి 20వ శ్లోకమునను, 13వ అధ్యాయయమునందలి 12వ శ్లోకమునను తెల్పబడిన అమృతప్రాప్తి భగవత్ప్రాప్తియే.

ప్రశ్న - 'శాశ్వతస్య' అను విశేషణముతోపాటు 'ధర్మస్య' అను పదము దేనిని తెల్పును? భగవానుడు తనను ఇట్టి ధర్మమునకు ఆధారముగా పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - 12వ అధ్యాయమునందలి చివరి శ్లోకములో 'ధర్మ్యామృతం' అను పేరుతో వర్ణింపబడినట్టిదియును, ఈ ప్రకరణమునందు గుణాతీత లక్షణాత్మకముగా పేర్కొనబడినట్టిదియునైన నిత్యధర్మమునే ఇచట 'శాశ్వతస్య' అను విశేషణముతో పాటు 'ధర్మస్య' అను పదము సూచించుచున్నది. ఆ ధర్మము భగవత్ప్రాప్తికి హేతువు అగుటవలన అది భగవత్స్వరూపమే. కావున భగవానుడు దానికి ఆధారము తానే అని తెల్పెను. ఈ ధర్మమును ఆచరించువాడు ఇతరమైన ఫలమును దేనిని పొందక పరమాత్మనే పొందును.

ప్రశ్న - 'ఐకాంతికస్య' అను విశేషణముతో పాటు 'సుఖస్య' అను పదము దేనిని సూచించును? దానికి ఆధారముతానే అని తెల్పుటలోని అంతరార్థమేమి?

సమా - 5వ అధ్యాయమునందలి 21వ శ్లోకమున 'అక్షయసుఖము' అను పేరుతోడను, 6వ అధ్యాయము నందలి 21వ శ్లోకమున 'ఆత్యంతిక సుఖము' అనియు, మరియు 28వ శ్లోకమున 'అత్యంతసుఖము' అనియు వర్ణింపబడిన నిత్యపరమానందమును సూచించునదియే ఇచటి 'ఐకాంతికస్య' అను విశేషణముతో పాటు 'సుఖస్య' అను పదము - ఆ నిత్యపరమానందము భగవత్స్వరూపమే. ఆయన కంటెను వేఱైనది మఱియొకటి లేదు. కనుక ఆ సుఖప్రాప్తియే భగవత్ప్రాప్తి. దీనిని స్పష్టపఱచుటకే భగవానుడు దానికి తానే ఆధారము అని తెల్పెను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః ॥ ౧౪ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునైదవ అధ్యాయము - పురుషోత్తమయోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు సమస్త జగత్తునకు కర్తయు, హర్తయు, సర్వశక్తిమంతుడును, అందరికిని నియంతయు, సర్వవ్యాపియు, అంతర్యామియు, పరమదయాళువు అందరికిని సుహృదుడును, సర్వాధారుడును, శరణాగతవత్సలుడును, సగుణ పరమేశ్వరుడును, పురుషోత్తముడును ఐన భగవానుని గుణ ప్రభావ స్వరూపముల వర్ణనము గలదు. క్షరపురుషుడు (క్షేత్రము) అక్షరపురుషుడు (క్షేత్రజ్ఞుడు) పురుషోత్తముడు (పరమేశ్వరుడు) - ఈ ముగ్గురిని వర్ణించి, క్షరాక్షరులకంటె భగవానుడే ఏ విధముగా ఉత్తముడు? అతడు పురుషోత్తముడుగా పిలువబడుటకు కారణమేమి? ఆయనను పురుషోత్తమునిగా ఎఱుంగుటవలన కలుగు మహాత్మ్యమేమి? అతడు ఏ విధముగా లభ్యుడగును - మొదలైన విషయములన్నియును సమగ్రముగా ఇందు వివరింపబడినవి. ఆ కారణమున ఈ అధ్యాయమునకు 'పురుషోత్తమ యోగము' అని పేరు ఏర్పడినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమున మొదటి రెండు శ్లోకములలో 'అశ్వత్థవృక్ష రూపకము ద్వారా' జగత్తు (విశ్వము) వర్ణింపబడెను. 3వ శ్లోకమునందు ఈ సంసారవృక్షము యొక్క, ఆది-అంతము, ఆధారము తెలియరానివి (తెలిసికొనుటకు శక్యముగానివి) అని తెల్పి, దృఢమైన వైరాగ్యరూపశస్త్రముద్వారా దీనిని ఛేదించుటకు భగవంతుడు మనకు ప్రోత్సాహమును గూర్చెను. 4వ శ్లోకమున పరమపదస్వరూపుడైన ఆ పరమేశ్వరుని పొందుటకు ఆ ఆదిపురుషుని శరణు జొచ్చుమని ఉపదేశించెను. 5వ శ్లోకమున ఆ పరమ పదప్రాప్తి నొందు పురుషుల లక్షణములను దెల్పుచు ఆ పరమపదము పరమప్రకాశమయము, అపునరావృత్తి శీలము - అని 6వ శ్లోకమున దెలిపెను. పిమ్మట 7 నుండి 11వ శ్లోకము వరకును జీవుని స్వరూపమును, మనస్సు ఇంద్రియములతో గూడ అతడు (జీవుడు) ఒక శరీరము నుండి మఱియొక శరీరమున ప్రవేశించు విధమును, శరీరమునందుండి ఇంద్రియ మనస్సుల సహాయముతో విషయ సుఖములను అనుభవించు విధమును తెల్పుచు, ప్రతి అవస్థయందును స్థితుడైయుండు ఆ జీవాత్మను జ్ఞానియే తెలుసుకొన గలడనియు, మలినాంతఃకరణము గల పురుషుడు ఏ విధముగను తెలిసికొనలేడనియు - మొదలగు ఈ విషయములన్నియును వర్ణింపబడినవి. 12వ శ్లోకమున సకలజగత్తును ప్రకాశింపజేయు సూర్యచంద్రాదులలో ఉన్న తేజస్సు భగవంతునిదేయని తెలిపెను. భగవానుడు పృథ్వియందు ప్రవేశించి, సమస్త ప్రాణులను భరించుననియు, చంద్రరూపమున అందరిని (ఓషధుల ద్వారా) పోషించుననియు, ప్రాణులు స్వీకరించు ఆహారమును వైశ్వానరరూపమున జీర్ణము చేయుననియు, 13, 14 శ్లోకములలో తెలిపెను. భగవంతుడే అందఱి హృదయములయందును స్థితుడై, అందరి స్మృత్యాదులకు కారణమై వేదముల ద్వారా తెలిసికొనదగినవాడు, వేదములనెరింగిన వాడు, వేదాంతకర్త అని 15వ శ్లోకములో తెల్పబడినది. సమస్త ప్రాణులు క్షరములనియు, కూటస్థుడైన 'ఆత్మ' అక్షర పురుషుడనియు 16వ శ్లోకమున తెల్పెను. ఈ క్షరాక్షరపురుషులకంటెను విలక్షణుడైన పరమాత్మ సర్వవ్యాపియు, అందరిని భరించి, పోషించు వాడును, శాశ్వతుడును ఐన పురుషోత్తముడని 17వ శ్లోకములో తెల్పుట జరిగెను. 18వ శ్లోకమునందు ఆ పరమాత్మ పురుషోత్తముడని ప్రసిద్ధిగాంచుటకు గల హేతువు పేర్కొనబడెను. శ్రీకృష్ణభగవానుని పురుషోత్తమునిగా ఎఱింగినవారి గొప్పదనమును గూర్చి 19వ శ్లోకములోను, ఈ పరమగుహ్యమైన విషయ జ్ఞాన మహాత్మ్యమును గూర్చి 20వ శ్లోకమునందు తెల్పుచు భగవానుడు ఈ అధ్యాయమును ముగించెను.

**సంబంధము :** 14వ అధ్యాయమున 5 నుండి 18వ శ్లోకము వరకు మూడు గుణములను స్వరూపములను, వాటి కార్యములను, వాటి బంధలక్షణములను, అట్లే బంధింపబడిన మనుష్యుల యొక్క ఉత్తమ, మధ్యమ, అధమగతులు మొదలగు అనేక విషయములను వర్ణించెను. 19-20 శ్లోకములలో ఈ గుణములకు అతీతుడగుటకు వలయు ఉపాయములను, తత్ఫలములను తెల్పెను. పిమ్మట అర్జునుని ప్రశ్నలకు సమాధానముగా 22 నుండి 25వ శ్లోకమువరకు గుణాతీత పురుషుని లక్షణములను, ఆచరణములను వర్ణించెను. 26వ శ్లోకమునందు సగుణ పరమేశ్వరుని యెడ అవ్యభిచారభక్తియోగము ద్వారా గుణాతీతుడై సాధకుడు బ్రహ్మప్రాప్తికి అర్హుడగుటకు సులభోపాయమును తెల్పెను.

కావున భగవంతునియందు అవ్యభిచారభక్తియోగరూపమైన అనన్యప్రేమను కల్గించుటకై ఇప్పుడు ఆ సగుణ పరమేశ్వరుడైన పురుషోత్తముని గుణప్రభావ స్వరూపములను వర్ణించుచున్నాడు. గుణాతీతుడగుటకు ప్రధాన సాధనమైన వైరాగ్యమును భగవచ్ఛరణాగతిని వర్ణించుటకై 15వ అధ్యాయము ప్రారంభింప బడుచున్నది. మొదట సంసారమునందు వైరాగ్యమును కల్గించుటకై మూడు శ్లోకములలో అశ్వత్థవృక్షరూపము ద్వారా జగత్తు స్వరూపమును వర్ణించి, దానిని వైరాగ్యమను శస్త్రముతో ఛేదింపవలెనని తెల్పుచున్నాడు-

**శ్రీభగవాన్ ఉవాచ**

**ఊర్ధ్వమూలమధశ్శాఖమ్ అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ 1 ॥**

ఊర్ధ్వమూలమ్ = ఆదిపురుషుడైన పరమేశ్వరుడే మూలముగాను
అధశ్శాఖమ్ = బ్రహ్మయే ముఖ్యశాఖగాను కలిగిన
అశ్వత్థమ్ = సంసారరూపమైన అశ్వత్థవృక్షము (రావిచెట్టు)ను
అవ్యయమ్ = శాశ్వతమైనదానినిగా
ప్రాహుః = పేర్కొందురు
ఛందాంసి = వేదములు
యస్య, పర్ణాని= దేనియొక్క ఆకులో
తమ్ = అట్టి సంసారరూప వృక్ష తత్త్వమును
యః = ఏ పురుషుడు
వేద = (సమగ్రముగా) తెలిసికొనునో
సః = అతడు
వేదవిత్ = వేదార్థములను బాగుగా ఎఱిగినవాడు

శ్రీ భగవానుడు పలికెను- ఆదిపురుషుడైన పరమేశ్వరుడే మూలముగా, బ్రహ్మయే ముఖ్యశాఖగా (కాండముగా), వేదములే పర్ణములు(ఆకులు)గా గల ఈ సంసారరూప-అశ్వత్థవృక్షము నాశరహితమైనది (శాశ్వతమైనది). ఈ సంసారవృక్షతత్త్వమును మూలసహితముగా తెలిసినవాడు నిజముగా వేదార్థములను ఎఱిగిన వాడు. **(1)**

ప్రశ్న - ఇచట 'అశ్వత్థ' శబ్దమును ప్రయోగించుట లోను, ఈ సంసారరూపవృక్షమును ఊర్ధ్వమూలమని పేర్కొనుటలోను గల అంతర్యమేమి?

సమా - 'అశ్వత్థము' అనునది రావి చెట్టు పేరు. వృక్షములన్నింటిలోను ఇది శ్రేష్ఠమైనదిగా భావింపబడును. కనుక అశ్వత్థరూపముతో సంసారమును వర్ణించుట జరిగినది. మూల శబ్దము కారణవాచకము. ఈ సంసార వృక్షముయొక్క ఉత్పత్తి, విస్తృతి ఆదిపురుషుడైన శ్రీమన్నారాయణునుండి కలిగినది. ఈ విషయము 4వ శ్లోకమునందును, ఇతర సందర్భముల యందును చెప్పబడినది. ఈ ఆదిపురుషుడైన పరమేశ్వరుడు నిత్యుడు, అనంతుడు, సర్వాధారుడు. సగుణరూపముతో అతడు అత్యున్నతమైన పరంధామము నందు నివసించును. కనుక 'ఊర్ధ్వం' అను పేరుతో పిలువబడెను. ఈ సంసార వృక్షము మాయాధీశుడు, సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడి నుండియే ఉత్పన్నమైనది. కావున దీనిని ఊర్ధ్వమూలం - అనగా పై వైపున మూలము గలది. ఇతర సామాన్య వృక్షముల మూలములు క్రిందివైపున పృథ్వియందు ఉండును - కాని ఈ సంసార వృక్షమూలములు పైవైపునకు ఉండును. ఇది మిక్కిలి అలౌకిక విషయము.

ప్రశ్న - ఈ సంసార వృక్షశాఖ (బోదె/కాండము) క్రింది వైపునకు ఉండును. - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - జగత్సృష్టిసమయమున మొట్టమొదట చతుర్ముఖబ్రహ్మ ఉద్భవించెను. కావున బ్రహ్మయే దీని ప్రధానశాఖ. బ్రహ్మలోకము ఆది పురుషుని నిత్యధామమునకు క్రిందనుండును. బ్రహ్మయొక్క అధికారస్థాయి పరమాత్ముని కంటెనునిమ్నమైనది. బ్రహ్మ శ్రీమన్నారాయణునుండియే ఉద్భవించి, ఆయన శాసనములకు లోబడియుండును. కనుక ఈ సంసార వృక్షమునకు అతడు క్రిందివైపునకు గల ప్రధానశాఖ.

ప్రశ్న - "అవ్యయం, ప్రాహుః" అను ఈ రెండు పదములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ సంసారవృక్షము పరివర్తన శీలమైనదగుట వలన నశ్వరము, అనిత్యము, క్షణభంగురమైన దైనప్పటికిని దీని సృష్టిప్రవాహము అనాది కాలమునుండి కొనసాగుచు వచ్చుచున్నది. ఈ ప్రవాహము అవిచ్ఛిన్నమైనది. కనుక దీనిని 'అవ్యయం' (నాశరహితము) అని తెల్పుట జరిగినది. ఏలనన దీనికి మూలమైన పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు, నిత్యుడు, నాశరహితుడు కాని, వాస్తవముగా ఈ సంసారవృక్షము నాశరహితము గాదు, అనగా నశించునదియే. ఒకవేళ ఇది అవ్యయమేయైనచో 3వ శ్లోకములో దీని స్వరూపమును భగవానుడా విధముగా చెప్పియుండెడివాడు కాడు. దీనిని వైరాగ్యమను శస్త్రముతో ఛేదింపుమని చెప్పియుండెడి వాడు కాడు.

ప్రశ్న - వేదములు ఈ సంసార వృక్షమునకు పత్రములని చెప్పుటలోని విశేషమేమి?

సమా - పత్రములు వృక్షశాఖనుండి ఉత్పన్నములై ఆ వృక్షరక్షణకును, వృద్ధికిని తోడ్పడును. వేదములుగూడ ఈ సంసారరూపవృక్షముయొక్క ముఖ్యశాఖయైన బ్రహ్మనుండియే ప్రకటితములైనవి. వేదవిహిత కర్మల ద్వారా జగత్తు యొక్క వృద్ధి, రక్షణలు కలుగుచుండును. కావున వేదములు ఈ వృక్షమునకు 'పత్రములు' అని తెల్పబడినవి.

ప్రశ్న - "సంసార వృక్షమును ఎఱింగిన వాడు వేదవిదుడు" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - మూలసహితముగా ఈ సంసారవృక్ష తత్త్వమును ఇట్లెఱింగినవాడు సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని మాయ చేత ఉత్పన్నమైన ఈ సంసారము (జగత్తు) కూడ ఈ వృక్షము వలెనే ఉత్పత్తి వినాశశీలమైనదనియు, క్షణికమైన దనియు ఎఱుగును. కావున దీని ఆకర్షణలో చిక్కుకొనక, దీనిని సృష్టించు మాయాధీశుడైన పరమేశ్వరుని శరణు జొచ్చుటయే కర్తవ్యముగా భావించి, సంసారము నుండి విరక్తుడై, ఉపరతుడై, భగవంతుని శరణు బొందును. వాస్తవముగా అతడే వేదములను ఎఱిగినవాడు. ఏలనన వేదములన్నింటి ద్వారా తెలిసికొన దగినవాడు భగవంతుడు మాత్రమేయని 15వ శ్లోకమున తెల్పబడినది. సంసారవృక్షముయొక్క ఈ స్వరూపము తెలిసినవాడు దాని నుండి ఉపరతుడై భగవంతుని శరణు వేడును. అట్లు శరణుగోరుటయే సకలవేదముల తాత్పర్యము (సారము). 'సంసారవృక్షమును గూర్చి బాగుగా తెలిసినవాడు వేదవిదుడు' - అని యనుటలోని ఆంతర్యమిదియే.

## అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।
## అధశ్చమూలాన్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే ॥ 2 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| తస్య | = ఆ సంసార వృక్షమునకు | | తిర్యగ్యోనులలో | | సారముగా బంధించు |
| గుణప్రవృద్ధాః | = త్రిగుణములనెడి | | జన్మించెడి ప్రాణులే | మూలాని (అపి) | = అహంకార, మమకార |
| | జలములచే | అధః, చ | = క్రిందివైపునకును | | వాసనలు అనెడి |
| | వృద్ధిపొందునట్టి | ఊర్ధ్వమ్ | = పైవైపునకును | | వేర్లు, ఊడలు గూడ |
| విషయప్రవాలాః | = శబ్దాది | ప్రసృతాః | = సర్వత్ర వ్యాపించి | అధః, చ | = క్రిందను |
| | భోగములనెడి | | యుండును | (ఊర్ధ్వం, చ) | = (పైనను) |
| | చిగుళ్ళుగల | మనుష్యలోకే | = మానవలోకమునందు | అనుసంతతాని | = అన్ని లోకములలో |
| శాఖాః | = దేవ మనుష్య | కర్మానుబంధీని | = (మనుజులను) కర్మాను | | వ్యాపించి యున్నవి. |

ఈ సంసారవృక్షమును త్రిగుణములనెడి జలములు తడుపుచుండును. ఆ జలములచే వృద్ధిపొందు శాఖలే దేవమనుష్యతిర్యగ్యోనులలో జన్మించుప్రాణులు, చిగుళ్లే విషయభోగములు. ఈ శాఖలు, చిగుళ్ళు సర్వత్ర వ్యాపించియున్నవి. మనుజులను కర్మానుసారముగా బంధించు అహంకార మమకార వాసనలనెడి వేర్లు, ఊడలు అన్నిలోకములలోను క్రింద, పైన వ్యాపించి ఉన్నవి.(2)

ప్రశ్న - ఈ శాఖలు గుణముల ద్వారా వృద్ధిచెందునవనియు, విషయములే చిగుళ్ళు అనియు తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - ఉచ్చనీచయోనులలో జన్మించుట గుణ సాంగత్య ప్రభావమున కలుగును. (13/21) ఈ సమస్త లోకము, ప్రాణుల శరీరములును త్రిగుణముల పరిణామరూపములే. కనుక ఈ శాఖలు గుణముల ద్వారా వృద్ధి పొందునని తెల్పబడినది. ఈ శాఖలయందే శబ్ద స్పర్శ రూప రస గంధములనెడు ఐదు విషయములుండును. కావున వాటిని చిగుళ్ళు అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - ఈ సంసార వృక్షముయొక్క అనేక శాఖలు ఏవి? అవి అన్నిదిక్కుల (సర్వత్ర) వ్యాపించుట యనగానేమి?

సమా - బ్రహ్మలోకము నుండి పాతాళలోక పర్యంతము గల సమస్త లోకములును, వాటియందు నివసించు సమస్త ప్రాణులును ఈ సంసారవృక్షముయొక్క వివిధశాఖలు. అవి (శాఖలు) క్రింద పాతాళమునుండి పైనున్న బ్రహ్మలోక పర్యంతము సర్వత్ర వ్యాపించి యున్నవి.

ప్రశ్న - 'మూలాని' అను పదము దేనిని సూచించును? అవి క్రింద, పైన అన్నిలోకముల యందును వ్యాపించి యున్నవని తెలుపుటలోని ఆంతర్యమేమి? అవి మనుష్య లోకమున వారివారి కర్మలను అనుసరించి వారిని ఎట్లు బంధించును?

సమా -'మూలాని' అను పదము ఇచట అవిద్యా మూలకములైన అహంకార, మమకార వాసనలనెడి వేర్లు, ఊడలను సూచించును. ఈ మూడును బ్రహ్మలోకము నుండి పాతాళలోకపర్యంతము సమస్త లోకములయందు నివసించు ఆవాగమన శీలములైన ప్రాణుల అంతఃకరణముల యందు వ్యాపించి యున్నవి. కనుక ఇవి సర్వత్ర వ్యాప్తములైయున్నవని తెల్పబడినవి. మానవులకు మాత్రమే కర్మలనాచరించు అధికారము గలదు. మానవశరీరము ద్వారా అహంకార మమకారవాసనా సహితముగా చేయబడు కర్మలు బంధహేతువులగును. కనుక ఈ మూలములు మనుష్యలోకమునందు మానవులను వారి వారి కర్మల ననుసరించి బంధించును. ఇతర ప్రాణులన్నియును భోగజీవులే. వాటికి కర్మాచరణాధికారము లేదు - కనుక అచట (మానవేతర సమస్త లోకములయందును) అహంకార, మమకార, వాసనారూపములైన మూలములున్నను, అవి కర్మానుసారము బంధించునవి కావు.

**న రూపమస్యేహ తథోపలభ్యతే నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।**
**అశ్వత్థమేనం సువిరూఢమూలమ్ అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ 3 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అస్య | = ఈ సంసార వృక్షముయొక్క | (యతః) | = ఏలనన | సువిరూఢమూలమ్ | = అహంకార, మమకారవాసనలనెడి దృఢమైన మూలములుగల |
| రూపమ్ | = స్వరూపము (ఎట్లు వర్ణింపబడినదో) | న, ఆదిః | = (దీనికి) ఆదియు లేదు | | |
| | | చ | = మఱియు | | |
| | | న, అంతః | = అంతమూలేదు | అశ్వత్థమ్ | = సంసారరూపమైన అశ్వత్థవృక్షమును |
| తథా | = అట్లు | చ | = అట్లే | | |
| ఇహ | = ఈ లోకమునందు (సంసారాసక్తిగల వారిచేత) | న, సంప్రతిష్ఠా | = సరియైనస్థితియులేదు | దృఢేన | = నిశితమైన |
| | | (అతః) | = ఇందువలన | అసంగశస్త్రేణ | = వైరాగ్యమనెడి శస్త్రమునే |
| న, ఉపలభ్యతే | = తెలియబడకున్నది | ఏనమ్ | = ఇట్టి | ఛిత్త్వా | = ఛేదించి |

ఈ సంసారవృక్షమును బాగుగా పరిశీలించి చూచినచో ఇందు వర్ణింపబడిన రీతిగా లభ్యము గాదు. ఏలనన ఇది ఆదియు, అంతము, సరియైన స్థితియు లేనిది. కనుక అహంకారమమకారవాసనారూపములైన దృఢమైన వేర్లు, ఊడలు గల ఈ సంసారరూప - అశ్వత్థవృక్షమును నిశితమైన వైరాగ్యమనెడి శస్త్రముతో ఖండించి.... (3)

ప్రశ్న - (బాగుగా పరిశీలించి చూచినచో) "ఈ సంసారవృక్షము ఇందు వర్ణింపబడిన రీతిగా గోచరింపదు" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - క్షుణ్ణముగా పరిశీలించిన పిమ్మట, తత్త్వ జ్ఞానము కల్గిన పిదప శాస్త్రములయందు వర్ణింపబడిన రీతిగాను, విజ్ఞులవలన విన్న రీతిగాను, మానవులకు సామాన్యముగా గోచరించు రీతిగాను ఈ సంసారవృక్ష స్వరూపములేదు. ఏలనన పరిశీలించు సమయమునందు కూడ అది నశ్వరముగను, క్షణభంగురముగను గోచరించును. తత్త్వజ్ఞానప్రాప్తి యైన వెంటనే దానితోడి సంబంధము శాశ్వతముగా తెగిపోవును. తత్త్వజ్ఞానికి అది (సంసారవృక్షము యొక్క ఉనికి) ఉండనే ఉండదు. కనుక 16వ శ్లోకమునందు దీని వర్ణన 'క్షరపురుషుడు' అని చేయబడినది.

ప్రశ్న - 'దీనికి ఆది, అంతము, స్థితియు లేవు' అనియనుటలోని విశేషమేమి?

సమా - 'సంసార వృక్షము' అనిర్వచనీయము. ఈ సంసారము (జగత్తు) కల్పాదియందు ఉత్పన్నమై కల్పాంతమున లీనమగును. ఈ విధముగా ఆద్యంతములు ప్రసిద్ధములైనను, ఇది ప్రకటితమగుట, లయమగుట అను పరంపర ఎప్పటినుండి ఆరంభమైనది? ఎప్పటి వరకు కొనసాగును? – అను విషయము తెలియరాదు. స్థితికాలమునందు గూడ ఇది నిరంతరము పరివర్తన మగుచుండును. ఒక క్షణము నందున్న రూపము మఱుక్షణమున ఉండదు. ఈ విధముగ ఈ సంసారవృక్షము యొక్క ఆద్యంతస్థితులు మూడును తెలియరావు.

ప్రశ్న - ఈ సంసార వృక్షము 'సువిరూఢ మూలము' - అనియనుటలోని వైశిష్ట్యమేమి? అసంగ శస్త్రమనగానేమి? దానితో సంసారవృక్షమును ఛేదించుట యనగానేమి?

సమా - అవిద్యా మూలకములైన అహంకార, మమకార, వాసనలు సంసారవృక్షముయొక్క మూలములు. ఇవి అనాదికాలమునుండియు పరిపుష్టములై యుండుటవలన మిక్కిలి దృఢములైనవి. కనుక ఈ మూలములు ఛేదింపబడనంతవరకు ఈ సంసారవృక్షము నిర్మూలింపబడదు. వృక్షమును పైపైన ఛేదించినను అది మరల మరల చిగురించుచుండును. అట్లే బాహ్య సంబంధములను త్యజించినను అహంకార, మమకార వాసనలు ఏడవంత వరకును ఈ సంసార వృక్షము పూర్తిగా నిర్మూలింపబడదు. ఈ మూలములను అనగా వేళ్ళను ఛేదించుట మిక్కిలి దుష్కరము. కావున ఈ సంసార వృక్షము అతి దృఢమైన మూలములు గలది – అని తెల్పబడినది.

వివేకముద్వారా ఈ సమస్త సంసారము నశ్వరము, క్షణికము అని భావించి, భార్యా పుత్రులు, ధనము, గృహము, గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు స్వర్గాది ఇహపరలోక భోగములన్నింటియందు సుఖమును, ప్రీతిని, రామణీయకమును భావింపకుండుటను, వాటియందే మాత్రము ఆసక్తి లేకుండుటను దృఢవైరాగ్యమందురు. అదియే ఇచ్చట 'అసంగశస్త్రము' అని పేర్కొనబడినది. ఈ అసంగశస్త్రముతో ఈ సకల చరాచర సంసార (జగత్) చింతనను త్యజించి, దానినుండి ఉపరతుడై, అహంకార, మమకార, వాసనా రూపమూలములను ఛేదింపవలెను. సంసార వృక్షమును నిశితమైన వైరాగ్య మనెడి శస్త్రముతో సమూలముగా ఛేదించుటయనగా ఇదియే.

సంబంధము - ఈ విధముగా వైరాగ్యరూప శస్త్రముతో సంసార బంధములను ఛేదించిన పిమ్మట చేయవలసిన కర్తవ్యమును తెల్పుచున్నాడు-

**తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తతః | = అనంతరము | యతః | = ఏ పరమేశ్వరునినుండి | పురుషమ్, ఏవ | నారాయణునే |
| యస్మిన్ | = ఏపరమపదమును | పురాణీ | = పురాతనమైన | ప్రపద్యే | = శరణుపొందుదును |
| గతాః | = పొందినవారు | ప్రవృత్తిః | = సంసారవృక్షపరంపర | (ఇతి | = అను భావముతో) |
| భూయః | = మఱల | ప్రసృతా | = వ్యాపించియున్నదో | తత్, పదమ్ | = ఆ పరమపదమును |
| న, నివర్తంతి | = తిరిగిరారో | తమ్, ఆద్యమ్, | = ఆ ఆదిపురుషుడగు | పరిమార్గితవ్యమ్ | = అన్వేషింపవలెను. |
| చ | = మఱియు | | | | |

అనంతరము ఆ పరమపదరూపుడైన పరమేశ్వరుని సర్వతోముఖముగ అన్వేషింపవలెను. ఆ పరమపదమును చేరిన పురుషులు ఈ జగత్తునకు తిరిగిరారు. అట్టి పరమేశ్వరునినుండియే ఈ పురాతనసంసారవృక్షపరంపర విస్తరించియున్నది. అట్టి ఆదిపురుషుడైన నారాయణునే శరణుపొంది, దృఢనిశ్చయముతో ఆ పరమేశ్వరుని మనన, నిదిధ్యాసాదులు చేయవలెను. **(4)**

ప్రశ్న - ఆ 'పరమపదము' అనగానేమి? దానిని అన్వేషించుట యనగానేమి?

సమా - ఈ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున 'ఊర్ధ్వమ్' అనియు, 14వ అధ్యాయమునందలి 26వ శ్లోకమున 'మామ్' అను పదము ద్వారాను, 27వ శ్లోకమునందు 'అహమ్' అను పదము ద్వారాను పేర్కొనబడి నట్టిదియును వేర్వేరు స్థలములయందు పరమపదము, అవ్యయపదము, పరమగతి, పరంధామము అని వర్ణింపబడి నట్టిదియును అగు ఆ వైకుంఠధామము ఇచట 'పరమ పదము' అను పేరుతో తెలుపబడినది. సర్వశక్తిమంతుడును, సర్వాధారుడును ఐన ఆ పరమేశ్వరుని పొందుకోరికతో మాటి మాటికిని అతని గుణప్రభావస్వరూపములను మనన నిదిధ్యాసల ద్వారా అనుసంధానము చేయుటయే ఆ పరమపదమును అన్వేషించుట యగును. 3వ శ్లోకమునందు తెల్పబడిన విధానమును అనుసరించి, వివేకవైరాగ్యములద్వారా సంసారము నుండి సర్వథా ఉపరతుడై మనుష్యుడు ఆ పరమపదస్వరూప పరమేశ్వరప్రాప్తికై మనన నిదిధ్యాసల ద్వారా అతని అనుసంధానమును చేయవలెను.

ప్రశ్న - 'ఆ పరమపదమును చేరిన పురుషుడు ఈ జగత్తునకు తిరిగిరాడు' అనియనుటలోని అంతర్యమేమి?

సమా - అనుసంధానము చేయుటకై ఇంతకుముందు వర్ణింపబడిన పరమపదము తానేయని భగవానుడు తెలుపుచున్నాడు. సర్వశక్తిమంతుడును, సర్వాధారుడును, అందరిని ధరించి, పోషించువాడును ఐన పురుషోత్తముని పొందిన వానికి పునర్జన్మయుండదు. అట్టి పరమేశ్వరునే ఇచట 'పరమపదము' అని ప్రస్తావించుట జరిగినది. ఇదే విషయము 8వ అధ్యాయమున 21వ శ్లోకమున గూడ వివరింపబడినది.

ప్రశ్న - "అట్టి పరమేశ్వరునినుండియే ఈ పురాతన సంసారవృక్షపరంపర విస్తరించి యున్నది" - అని యనుటలో ప్రత్యేకత ఏమి?

సమా - ఆది పురుషుడైన పరమేశ్వరుని నుండి అనాదియైన ఈ సంసారవృక్ష పరంపర కొనసాగుచు వచ్చుచున్నది. ఆయననుండి ఇది ఉత్పన్నమై బహుముఖములుగా విస్తరించియున్నది. ఆయనను శరణు పొందుటవలననే శాశ్వతముగా ఈ సంసార వృక్షసంబంధము తొలగిపోయి ఆది పురుషుడైన పరమాత్మ ప్రాప్తి కలుగును.

ప్రశ్న - 'తమ్ ఆద్యమ్' అను పదములతో సహా 'పురుషమ్' అను పదము దేనిని తెలుపును. 'ప్రపద్యే' అను క్రియాపద ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - 'తమ్ ఆద్యమ్' అను రెండు పదములతో గూడిన 'పురుషమ్' అను పదము పురుషోత్తముడైన ఆ భగవానునే సూచించును. 'తత్,' 'పదమ్' అను పదముల ద్వారా ఆయన వర్ణనయే చేయబడెను. ఆయన మాయా శక్తి వలన ఈ చిరకాలీన సంసారవృక్షము యొక్క ఉత్పత్తియు, విస్తృతియు జరిగినవి. 'ప్రపద్యే' అను క్రియాపదమునకు 'నేను ఆయనను శరణుజొచ్చెదను' అని యర్థము - ఆ పరమపద స్వరూపుడైన పరమేశ్వరుని ఆశ్రయించి, అతని అనుసంధానము చేయవలెను. మనుష్యుడు తనలో ఏమాత్రము దురభిమానమును రానీయక అన్ని విధముల అనన్యాశ్రయపూర్వకముగ ఆ పరమేశ్వరునిపై పూర్తి విశ్వాసము ఉంచి, అతని అనుసంధానము చేయుచుండవలెను.

ప్రశ్న - 'ఏవ' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - ఆ పరమ పదప్రాప్తికై, ఆ పరమేశ్వరునొక్కనినే శరణు గోరవలయునని తెల్పుటకై 'ఏవ' అను అవ్యయము ప్రయుక్తమయ్యెను.

*సంబంధము - పై విధముగా ఆదిపురుషుడు, పరమపదస్వరూపుడు, ఐన పరమేశ్వరుని శరణుజొచ్చి, అతనిని పొందిన పురుషుల లక్షణములను తెల్పుచున్నాడు-*

**నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।**
**ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥ 5 ॥**

నిర్మానమోహాః = దురభిమానమును, మోహమును త్యజించినవారును
జితసంగదోషాః = ఆసక్తియనెడి దోషమును జయించిన వారును
అధ్యాత్మనిత్యాః = పరమాత్మస్వరూపమునందే నిత్యస్థితులైన వారును
వినివృత్తకామాః = ప్రాపంచిక వాంఛల నుండి పూర్తిగా మఱలినవారును
సుఖదుఃఖసంజ్ఞైః = సుఖదుఃఖములను పేరుగల
ద్వంద్వైః విముక్తాః = ద్వంద్వములనుండి విముక్తులైన వారును అగు
అమూఢాః = జ్ఞానులు
తత్, అవ్యయమ్, పదమ్ = శాశ్వతమైన ఆ పరమపదమును
గచ్ఛంతి = చేరుదురు

దురభిమానమును, మోహమును త్యజించినవారును, ఆసక్తియను దోషమును జయించినవారును, ప్రాపంచిక వాంఛలనుండి పూర్తిగా మఱలినవారును, పరమాత్మ స్వరూపమునందు నిత్యస్థితులైనవారును, సుఖదుఃఖాది ద్వంద్వములనుండి విముక్తులైన వారును అగు జ్ఞానులు శాశ్వతమైన ఆ పరమపదమును పొందుదురు. **(5)**

ప్రశ్న - 'నిర్మానమోహాః' అనగానేమి?

సమా - 'మాన' శబ్దము ఇచ్చట గౌరవము, కీర్తిప్రతిష్ఠలను తెల్పును. మోహశబ్దము అవివేకము, విపర్యయజ్ఞానము, భ్రమ మొదలగు తమోగుణభావములను సూచించును. ఈ రెండును (మానము, మోహము) లేని వారు 'నిర్మానమోహాః' అనబడుదురు. వీరు జాతి, గుణ, ఐశ్వర్య, విద్యాదుల కారణముగా తాము గొప్పవారమను భావన ఏమాత్రము కలిగియుండరు. గౌరవ కీర్తిప్రతిష్ఠలతోను, అవివేక భ్రమాది తమోగుణభావముల తోడను వారికి లేశమాత్రము గూడ సంబంధము ఉండదు.

ప్రశ్న - 'జితసంగదోషాః' అనగానేమి?

సమా - 'సంగము' అనగా ఆసక్తి. ఆసక్తి రూపదోషములను జయించినవారును, ఇహపరలోక భోగముల యందు ఏ మాత్రము ఆసక్తి లేని వారును, శబ్దాది విషయములతో సంబంధమున్నను అంతఃకరణములయందు ఎట్టి వికారములకును లోనుగానివారును 'జితసంగదోషాః' అనబడుదురు.

ప్రశ్న - 'అధ్యాత్మనిత్యాః' అనగానేమి?

సమా - 'అధ్యాత్మ' శబ్దము ఇచట పరమాత్మ స్వరూపమును సూచించును. పరమాత్మ స్వరూపమునందే నిత్య స్థితులైన వారును, క్షణమాత్రము గూడ పరమాత్మ నుండి వియోగము పొందనివారును, సర్వదా నిశ్చలస్థితిలో ఉండువారును ఐన పురుషులు 'అధ్యాత్మనిత్యాః' అని అనబడుదురు.

ప్రశ్న - 'వినివృత్తకామాః' అనగానేమి?

సమా - 'కామ' శబ్దము ఇచ్చట అన్ని విధములగు ఇచ్ఛ, తృష్ణ, అపేక్ష, వాసన, స్పృహ మొదలగు హెచ్చు తగ్గుల భేదములతో గూడిన మనోవృత్తిరూపములైన కోరికలను తెలుపును. అన్ని విధములైన కోరికలను పారద్రోలినవారును, ఇచ్ఛ, కామన, తృష్ణ, వాసన మొదలైనవి లేశమాత్రమును లేని వారును 'వినివృత్తకామాః' అని యనబడుదురు.

ప్రశ్న - సుఖ దుఃఖ సంజ్ఞకములైన ద్వంద్వములు అనగానేమి? వాటి నుండి విముక్తులగుట యనగానేమి?

సమా - శీతోష్ణములు, ప్రియాప్రియములు, మానావమానములు, స్తుతినిందలు మొదలగునవి సుఖదుఃఖములకు హేతువులగుటచే అవి సుఖదుఃఖ సంజ్ఞకములని పేర్కొనబడినవి. వీటన్నింటితోడను ఏ మాత్రమును సంబంధము లేకుండుట - యనగా ఇందులో ఏ ద్వంద్వము యొక్క సంయోగవియోగములయందు లేశమాత్రము గూడ రాగద్వేషహర్షశోకాది వికారములకు లోనుగాకుండుటనే ఈ ద్వంద్వముల నుండి సర్వథా ముక్తుడగుట యందురు - అట్టి పురుషులను 'సుఖదుఃఖద్వంద్వములనుండి విముక్తులు' 'ద్వంద్వైర్విముక్తాః' అని యందురు.

ప్రశ్న - 'అమూఢాః' అను పదము ఎవరిని తెలుపును?

సమా - మౌఢ్యము లేక అజ్ఞానము సర్వథా లేని జ్ఞానులైన మహాత్ములను 'అమూఢాః' అను పదము తెల్పును. పైన తెల్పబడిన విశేషణములన్నింటికిని ఇది విశేష్యము.

'నిర్మానమోహాః' మొదలగు సమస్తగుణములు గల జ్ఞానులే పరమపదమును పొందుదురు- అని భగవానుడు తెలిపెను.

ప్రశ్న - శాశ్వతమైన ఆ పరమపదము ఏది? దానిని పొందుట యనగానేమి?

సమా - సర్వశక్తిమంతుడును, సర్వాధారుడునైన పరమేశ్వరుని సూచించునదియే శాశ్వతపరమపదము. ఆయనను అనుసంధానము చేయుటకు ఆ ఆదిపురుషుని శరణుగోరుటకు నాల్గవ (4వ) శ్లోకమున ఆదేశించుట జరిగెను. ఆ పరమేశ్వరుని మాయనుండి ఉత్పన్నమై విస్తరించిన ఈ సంసార వృక్షమునకు సర్వథా అతీతుడై ఆ పరమపదమస్వరూపుడైన పరమేశ్వరుని పొందుటయే 'అవ్యయ' పదమును పొందుట యగును.

సంబంధము - పై లక్షణములు గల పురుషులకు ప్రాప్తించు ఆ పరమపదము ఎట్లుండును? అను జిజ్ఞాసకు సమాధానముగా ఆ పరమేశ్వర స్వరూపమైన పరమపద మహత్త్వమును తెలుపుచున్నాడు-

**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః[1] ।**
**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ 6 ॥**

యత్ = ఏ పరమపదమును
గత్వా = పొంది
న, నివర్తంతే = (మనుష్యులు) ఈ లోకమునకు తిరిగిరారో
తత్ = అట్టి స్వయం ప్రకాశస్వరూపమైన పరమపదమును
సూర్యః = సూర్యుడు
న, భాసయతే = ప్రకాశింప చేయజాలడు
శశాంకః = చంద్రుడు
న, (భాసయతే) = ప్రకాశింపజేయజాలడు
పావకః = అగ్నియును
న, భాసయతే = ప్రకాశింప చేయజాలడు
తత్ = అదియే
మమ, పరమమ్, ధామ = నా పరంధామము

స్వయంప్రకాశస్వరూపమైన నా పరంధామమును సూర్యుడుగాని, చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపజేయజాలరు. అట్టి పరంధామమును చేరిన పుణ్యాత్ములు మఱల ఈ జగత్తున ప్రవేశింపరు. అనగా జన్మింపరు. **(6)**

ప్రశ్న - 'తత్' అను పదము ఇచట దేనిని తెల్పును? దానిని సూర్యచంద్రాగ్నులు ప్రకాశింప జేయజాలరు. అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇచట 'తత్' అను పదము శాశ్వత పదమైన పరబ్రహ్మ పురుషోత్తముని సూచించును. దానిని సూర్య చంద్రాగ్నులు ప్రకాశింపజేయజాలరు – అనియనుట వలన అది అప్రమేయము, అచింత్యము, అనిర్వచనీయము – అని నిర్దేశించుట జరిగినది. జగత్తును ప్రకాశింపజేయు సూర్యచంద్రాగ్నులు సైతము ఆ పరమపదమును ప్రకాశింపజేయజాలరు. ఆ సూర్యచంద్రాగ్నులే అధిదేవతలుగా గల చక్షువులు, మనస్సు, వాక్కు సైతము ఆ పరమపదమును (ఆత్మజ్యోతిని) ప్రకాశింపజేయజాలవు. ఇంతేగాక ప్రకాశించు స్వభావముగల వస్తువులలో ఏఒక్కటైనను, లేక అన్నియు కలిసియైనను ఆ పరంధామమును ప్రకాశింప జేయుటకు సమర్థములు గావు. ఏలనన అతని ప్రకాశమువలననే ఇవియన్నియును ప్రకాశించుచున్నవి (15/12). ఇదియే సర్వథా యుక్తి యుక్తము గూడ. ఏలనన తమను ప్రకాశింపజేయు పరంధామమును చేరలేని నేత్రములు, మనస్సు, వాణి

1) శ్రుతియందును ఇట్లు చెప్పబడినది.
న తత్ర సూర్యో భాతి, న చంద్రతారకమ్. నేమా విద్యుతో భాంతి, కుతోయమగ్నిః ।
తమేవ భాంతమనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదం విభాతి ॥ (కఠోపనిషత్ 2/2/15)
ఆ పరబ్రహ్మ పరమాత్మను సూర్యుడును ప్రకాశింపజేయజాలడు. చంద్రుడు, తారకలు, విద్యుత్తు కూడ ఆయనను ప్రకాశింపజేయజాలవు. సూర్యాదులే ఆయనను ప్రకాశింపజేయజాలనప్పుడు ఈ లౌకికాగ్ని విషయముచెప్పనేల? ఏలనన అతని ప్రకాశము వలననే ఇవి అన్నియును ప్రకాశించును. అతని ప్రకాశమును అనుసరించియే ఇవియన్నియును ప్రకాశించును.

మొదలగువవి ఏ విధముగా దానిని ప్రకాశింపజేయగలవు? వర్ణింపగలవు? శ్రుతియు ఇట్లు చెప్పుచున్నది. 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' (బ్రహ్మోపనిషత్) ఆ పరబ్రహ్మ పరమాత్మను మనస్సు వాక్కు గూడ చేరజాలవు." కనుక ఆ పరమపదము వాక్కు, మనస్సు, మొదలగు వానికి మిక్కిలి అతీతమైనది. దాని స్వరూపము ఏ విధముగను తెల్పుటకుగాని, వివరించుటకుగాని సాధ్యము కాదు.

*సంబంధము - 1, 2, 3 శ్లోకములలో సంసారవృక్షమనుపేర క్షరపురుషుడు వర్ణింపబడెను. అందు జీవరూపుడైన అక్షరపురుషుడు మనుష్యజన్మ యందు అహంకార మమకార-ఆసక్తులతో చేయు కర్మలు అతనికి బంధహేతువులని తెల్పబడెను. ఈ బంధముల నుండి విముక్తుడగుటకు సృష్టికర్తయైన ఆదిపురుషుని శరణు వేడుటయే మార్గమని చెప్పబడెను. పైన తెల్పబడినట్లు బంధింపబడిన జీవుని స్వరూపమేమి? అతని వాస్తవ స్వరూపమేమి? దానిని ఎవరు ఎట్లు తెలిసికొందురు? మొదలగు విషయములను స్పష్టపరచుటకై మొదట జీవుని స్వరూపమును తెల్పుచున్నాడు-*

**మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।**
**మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7 ॥**

జీవలోకే = సర్వప్రాణుల దేహములలో ఉన్న
సనాతనః = సనాతనమైన
జీవభూతః = జీవాత్మ
మమ, ఏవ, అంశః = నా అంశయే (అదియే)
ప్రకృతిస్థాని = ప్రకృతియందు స్థితములైన
మనఃషష్ఠాని, ఇంద్రియాణి = మనస్సును, ఐదు ఇంద్రియములను
కర్షతి = (శబ్దాదివిషయముల ద్వారా తనవైపునకు) ఆకర్షించును

**ప్రాణి లోకమున ఈ దేహమునందున్న సనాతనమైన జీవాత్మ నా అంశయే. అది ప్రకృతియందు స్థితములైన మనస్సు, ఇంద్రియములను, శబ్దాదివిషయములద్వారా తనవైపు ఆకర్షించును. (7)**

ప్రశ్న - **'జీవలోకే'** అను పదము దేనిని సూచించును. అందు స్థితుడైయున్న జీవాత్మను భగవానుడు తనసనాతనాంశగా పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - **'జీవలోకే'** అను పదము ఇచట జీవాత్మకు నివాసస్థానమైన శరీరమును సూచించును. స్థూల సూక్ష్మ కారణ శరీరములన్నియును ఇందు అంతర్భాగములు. కారణ శరీరములయందు స్థితమైయున్న జీవసముదాయమునకు సూక్ష్మ స్థూల శరీరములతో సంబంధమును ఏర్పరచి, భగవానుడే ఈ జగదుత్పత్తి స్థితి పాలనములను ఒనర్చుచున్నాడు. (14/3,4) ఈ విషయమును వివరించుటకే ఇందు స్థితమైయున్న జీవాత్మ తన సనాతనాంశయని పేర్కొనెను. కావున భగవానుడందరికిని తండ్రి. తండ్రి యొక్క అంశయే పుత్రుడైనట్లు జీవసముదాయమంతయును భగవదంశయే. అట్లే స్వరూపము చేతను భగవంతుని వలె జీవసముదాయము గూడ చేతనము. స్వయంచేతనమైన జీవసముదాయము మహాచైతన్యముయొక్క అంశయేయైయుండును. జడము యొక్క అంశకానేరదు. వాస్తవముగా అంశి నుండి అంశవేరుగాదు. భగవంతుని వలెనే జీవసముదాయము గూడ అనాది, నిత్యము - కావున అది సనాతనము. ఆయన కంటెను వేరుగాదు. ఇంతేగాక ఇచట అద్వైతసిద్ధాంతమును అనుసరించియు, ఈ భావము సరియైనదే. సర్వత్ర సమభావముతో స్థితమైయున్న విభాగరహితమైన మహాకాశము గృహము, కడవ మొదలగు వానియందు విభక్తములుగా ప్రతీతమగును. ఈ కడవలో నున్న ఆకాశము మహాకాశముయొక్క అంశయే. అట్లే విభాగరహితముగా సమభావముతో సర్వత్ర వ్యాపించియున్న భగవానుడు వేర్వేఱు శరీరముల సంబంధముచే వేర్వేఱుగా విభక్తమైయున్నట్లు ప్రతీతమగును (13/16). ఆ శరీరములయందున్న జీవుడు ఆయన అంశయని తెల్పుటకే భగవానుడు జీవాత్మను తన అంశగా పేర్కొనెను.

ప్రశ్న - 'ఏవ' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - పైన పేర్కొనబడినట్లు జీవాత్మ భగవంతుని అంశయే యగుట వలన **'స్వరూపతః'** అది అతనికంటె వేరుగాదు - అని తెల్పుటకు 'ఏవ' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'ఇంద్రియాణి' అను పదముతో పాటు 'ప్రకృతిస్థాని' అను విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకత యేమి? వాటి సంఖ్య మనస్సుతోపాటు ఆఱు (6) అని ఏల తెల్పబడినది? (13/5) మనస్సుతో సహా అవి 11 గదా!

సమా - ఇంద్రియములు ప్రకృతి కార్యములు. ప్రకృతి కార్యరూపమైన శరీరమే దీనికి ఆధారము. కావున 'ఇంద్రియాణి' అను పదముతో 'ప్రకృతిస్థాని' అను పదము ప్రయుక్తమైనది. 5 జ్ఞానేంద్రియములు, మనస్సు అనునవి విషయములను అనుభవించుటయందు ముఖ్యమైనవి. కర్మేంద్రియముల కార్యములు జ్ఞానేంద్రియములు లేనిదే కొనసాగవు. కావున మనస్సుతో సహా ఇంద్రియముల సంఖ్య ఆఱుగా తెల్పబడినది. 5 కర్మేంద్రియములును వీటిలో అంతర్భానములే.

ప్రశ్న - 'జీవాత్మ మనస్సుతో సహా ఆఱు ఇంద్రియములను ఆకర్షించుట' యనగానేమి? జీవాత్మ శరీరమును వదలినపుడు అది కర్మేంద్రియములను ప్రాణములను బుద్ధినిగూడ తనతో తీసికొని పోవునని శాస్త్రములయందు చెప్పబడినది. మఱి ఇచట ఈ ఆఱింటినీ ఆకర్షించునని యేల చెప్పబడినది?

సమా - జీవాత్మ ఒక శరీరము నుండి మరొక శరీరమునందు ప్రవేశించునపుడు మొదటి శరీరమునుండి మనస్సుతోపాటు ఇంద్రియములను ఆకర్షించి తీసికొని పోవును. విషయానుభవములయందు మనస్సు 5 జ్ఞానేంద్రియములే ముఖ్య పాత్ర వహించుచుండుటచే ఈ ఆఱింటిని ఆకర్షించునని చెప్పబడినది. ఇచట మనస్సనగా అంతఃకరణము - కనుక బుద్ధి అందులో భాగమే - జీవాత్మ ప్రాణముల ద్వారా మనస్సహితములైన ఇంద్రియములను ఆకర్షించును. కావున ఐదు కర్మేంద్రియములు, 5 ప్రాణములు గూడ ఇందు చేరినవనియే భావింపవలెను.

*సంబంధము - ఈ జీవాత్మ మనస్సహితమైన ఆరు ఇంద్రియములను ఏ సమయమున ఏ విధముగా ఎట్లు ఆకర్షించును? మరియు మనస్సహితములైన ఆయూరు ఇంద్రియములు ఏవేవి? అను విషయములను రెండు శ్లోకములలో వివరించుచున్నాడు-*

**శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥ 8 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వాయుః | = వాయువు | | యందున్న | గృహీత్వా | = గ్రహించి |
| ఆశయాత్ | = గంధస్థానమునుండి | | జీవాత్మయు | చ | = మఱియు |
| గంధాన్ | గంధములను | యత్ | = ఏ శరీరమును | యత్, శరీరమ్ | = ఏ శరీరమును |
| | = (వాసనలను) | ఉత్క్రామతి | = త్యజించునో | అవాప్నోతి | = పొందునో |
| ఇవ | గ్రహించి, తీసికొని | (తస్మాత్) | = దానినుండి | (తస్మిన్) | = దానియందు |
| | పోయినట్లుగా | ఏతాని | = ఈ మనస్సును, | | (ఆ శరీరమునందు) |
| ఈశ్వరః, అపి | = ప్రాణుల దేహముల | | ఇంద్రియములను | సంయాతి | = చేరును |

వాయువు వాసనలను ఒకచోటినుండి మఱియొకచోటికి తీసికొని పోయినట్లుగా దేహాదులకు స్వామియైన జీవాత్మ ఒక శరీరమును త్యజించునపుడు, మనస్సు ఇంద్రియములను గ్రహించి, వాటితో గూడ మఱొక శరీరమును పొందును. అనగా దానిలో ప్రవేశించును. **(8)**

ప్రశ్న - ఇచట 'ఆశయాత్' అను పదము దేనిని సూచించును? అట్లే గంధ- వాయువుల దృష్టాంతములు ఏవిధముగ అర్థయుక్తము?

సమా - పుష్పములు, చందనము, కేసరి (కుంకుమ పూవు), కస్తూరి మొదలగు సుగంధ యుక్తములైన వస్తువులను ఇచట 'ఆశయాత్' అను పదము సూచించును. ఆ వస్తువుల

నుండి గంధము కొని పోబడినట్లు మనస్సు ఇంద్రియములకు ఆశయము (ఆధారము) ఐన స్థూలశరీరము నుండి వాసనలు కొని పోబడును. గంధయుక్తములైన పుష్పాది పదార్థముల సూక్ష్మాంశమే గంధము. అట్లే స్థూలశరీరముయొక్క సూక్ష్మాంశము సూక్ష్మశరీరము. ఇచట వాయుస్థానమున జీవాత్మ కలదు. వాయువు గంధమును ఒకచోటనుండి మఱియొక చోటికి కొనిపోయి అచట విలిపినట్లు జీవాత్మయు ఇంద్రియ మనోబుద్ధి ప్రాణసముదాయ రూపమైన సూక్ష్మ శరీరమును ఒక స్థూల శరీరమునుండి మఱియొక స్థూల శరీరమునకు చేర్చును.

ప్రశ్న - ఇచ్చట 'ఏతాని' అను పదము దేనిని సూచించును? జీవాత్మను ఈశ్వరుడని పేర్కొనుటలోని అంతరార్థమేమి?

సమా - 'ఏతాని' అను పదము మనస్సహితమైన ఐదు జ్ఞానేంద్రియములను సూచించును. మనస్సు అంతః కరణమునకు ఉపలక్షణమగుటచే బుద్ధి అందు అంతర్భావము. ఐదు కర్మేంద్రియములు, ఐదు ప్రాణములు జ్ఞానేంద్రియములలో అంతర్భావములు. కనుక 'ఏతాని' అను పదము ఈ 17 తత్త్వముల సముదాయ రూపమైన సూక్ష్మశరీరమును సూచించును. మనోబుద్ధులతో గూడ సమస్త - ఇంద్రియములను శాసించు స్వామి జీవాత్మ. కావున జీవాత్మను ఈశ్వరుడని భగవానుడు పేర్కొనెను. జీవాత్మయే ఈ ఇంద్రియములను ఆకర్షించుటకు సమర్థమైనది.

ప్రశ్న - 'యత్' అను పదము రెండు మార్లు ప్రయోగించి, 'ఉత్క్రామతి', 'అవాప్నోతి' అను రెండు క్రియాపదముల ద్వారా తెల్పబడిన విశేషమేమి?

సమా - జీవుడు విడిచి పెట్టిన శరీరమును మొదటి 'యత్' అను పదము తెల్పును. గ్రహించిన శరీరమును రెండవ 'యత్' అనునది తెల్పును. కావున 'యత్' అను పదము 2 మార్లు ప్రయోగింపబడినది. 'ఉత్క్రామతి' అను పదమునకు (శరీరమును) విడిచిపెట్టుచున్నది అనియు, 'అవాప్నోతి' అను పదమునకు క్రొత్త శరీరమును గ్రహించుచున్నది అనియు అర్థములు.

ప్రశ్న - 2వ అధ్యాయమునందలి 24వ శ్లోకములో ఆత్మస్వరూపము అచలము అని తెల్పబడినది మరి ఇచట 'సంయాతి' అనుక్రియాపదమును ప్రయోగించుట ద్వారా ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు పోవునని చెప్పుట యెట్లు పొసగును?

సమా - జీవాత్మ పరమాత్మయొక్క అంశయే అగుటవలన 'వస్తుతః' నిత్యము, అచలము ఐనది. ఆ జీవాత్మ వచ్చుట పోవుట జరుగదు. ఐనప్పటికిని సూక్ష్మ శరీరముతో సంబంధము ఉండుట వలన దానిద్వారా ఒక స్థూలశరీరము నుండి మఱియొక స్థూలశరీరమునకు జీవాత్మ పోయినట్లు గోచరించును. కనుక 'సంయాతి' అను క్రియాపదమును ప్రయోగించి, జీవాత్మ ఒక శరీరమునుండి మరియొక శరీరమునకు పోవునని తెల్పబడినది. రెండవ అధ్యాయము నందలి 22వ శ్లోకమున గూడ ఈ విషయమే పేర్కొనబడినది.

**శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।**
**అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ 9 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయమ్ | = ఈజీవాత్మ | చ | = అట్లే | అధిష్ఠాయ | = అధిష్ఠించి |
| శ్రోత్రమ్ | = చెవిని | రసనమ్ | = నాలుకను | ఏవ | = వీటిద్వారా |
| చక్షుః | = కంటిని | ఘ్రాణమ్ | = నాసికను | విషయాన్ | = శబ్దాది విషయములను |
| చ | = మఱియు | చ | = మఱియు | | |
| స్పర్శనమ్ | = చర్మమును | మనః | = మనస్సును | ఉపసేవతే | = అనుభవించును |

ఈ జీవాత్మ త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు అనెడి పంచేంద్రియములను, మనస్సును ఆశ్రయించి, శబ్దాదివిషయములను అనుభవించును. (9)

ప్రశ్న - "త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు" అను పంచేంద్రియములతో సహా మనస్సు "జీవాత్మకు ఆశ్రయము" - అనియనుటలోని ఆంతర్యమేమి? వీటిని ఆశ్రయించియే జీవాత్మ విషయములను సేవించును - అనియనుటలోని విశేషమేమి?

సమా - జీవాత్మ అంతఃకరణముతో, ఇంద్రియములతో సంబంధమును కల్గియుండుటయే వాటిని ఆశ్రయించుట యగును. వాస్తవముగా ఆత్మ ఏ కర్మలకును కర్తగాదు వాటి ఫలస్వరూపమైన విషయములకును, సుఖదుఃఖాదులకును భోక్తయుగాదు. కాని ప్రకృతితోను, దానికార్యములతోను ఆత్మకు అజ్ఞానజనితమైన సంబంధము అనాదినుండియు ఉండుట వలన అది కర్తయు, భోక్తయు అగుచున్నది. ఈ విషయమును తెల్పుటకే జీవాత్మ వీటిని ఆశ్రయించి, విషయములను సేవించునని పేర్కొనబడినది. 13వ అధ్యాయమునందలి 21వ శ్లోకములో గూడ ప్రకృతిస్థుడైన పురుషుడే ప్రకృతిజన్యములైన గుణములను అనుభవించును అని తెల్పబడినది. శ్రుతియు ఇట్లు అనుచున్నది. 'ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః' (కఠోపనిషత్ 1/3/4) అనగా మనోబుద్ధీంద్రియములతో గూడిన ఆత్మనే 'భోక్త'యని జ్ఞానులు చెప్పుదురు.

*సంబంధము - జీవాత్మ మూడుగుణములచే బద్ధుడై ఒక శరీరమును వదలి మరొక శరీరమును చేరుననియు, శరీరమునందు స్థితుడై, విషయములను సేవించుననియు తెల్పబడినది. ఇట్టి ఆత్మను ఎవరు ఎట్లు తెలిసికొందురు? ఎవరు తెలిసికొనలేరు? అను విషయములను భగవానుడు రెండు శ్లోకములలో వివరించుచున్నాడు-*

**ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్ ।**
**విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉత్క్రామంతమ్ | = జీవుడు శరీరమును వదలుచున్నప్పుడును | భుంజానమ్ | = భోగములను అనుభవించుచున్నప్పుడును | న, అనుపశ్యంతి | = తెలిసికొనలేరు |
| వా | = లేక | గుణాన్వితమ్, అపి | = అట్లే త్రిగుణములతో కూడియున్నప్పుడును | జ్ఞానచక్షుషః | = కేవలము జ్ఞానులే తమ జ్ఞాన నేత్రములద్వారా |
| స్థితమ్ | = శరీరమునందు స్థితుడైయున్నప్పుడును | విమూఢాః | = అజ్ఞానులు | పశ్యంతి | = స్వస్వరూపమును తెలిసికొందురు |
| వా | = లేక | | | | |

**జీవాత్మ శరీరమును త్యజించునప్పుడును, శరీరమునందు స్థితుడై యున్నప్పుడును, విషయభోగములను అనుభవించుచున్నప్పుడును, అటులే త్రిగుణములతో కూడియున్నప్పుడును అజ్ఞానులు తెలిసికొనలేరు. కేవలము వివేకశీలురైన జ్ఞానులే తమజ్ఞాననేత్రములవలన స్వస్వరూపమును తెలిసికొనగల్గుదురు. (10)**

ప్రశ్న - 'గుణాన్వితం' అను పదము ఎవరిని సూచించును? 'అపి' అను అవ్యయమును ప్రయోగించి, ఆ జీవాత్మ శరీరమును విడిచి పెట్టునప్పుడును శరీరమునందు స్థితుడైయున్నప్పుడును, విషయ భోగములను అనుభవించుచున్నప్పుడును, అజ్ఞానులు దీనిని తెలిసికొనలేరు - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - గుణములతో సంబంధము గల ప్రకృతిస్థ పురుషుని (జీవాత్మను) సూచించినదియే 'గుణాన్వితం' అను పదము. ఈ జీవాత్మ శరీరమును వదలుచున్నప్పుడును, శరీరము నందు స్థితుడైయున్నప్పుడును, విషయములను అనుభవించు చున్నప్పుడును, ప్రత్యక్షముగా చూచుచున్నను, అజ్ఞానులు దాని యథార్థస్వరూపమును తెలిసికొనలేరు. ఈ విషయమును స్పష్టపరచుటకే 'అపి' అను అవ్యయము ప్రయుక్తమైనది. మరి పూర్తిగా క్రియారహితుడై గుణాతీత రూపమున స్థితుడైయున్న ఆత్మను వారు ఎట్లు తెలిసికొనగలరు?

ప్రశ్న - జ్ఞాననేత్రముల ద్వారా వివేక శీలురైన జ్ఞానులే దానిని తెలిసికొన గల్గుదురు - అనియనుటలోని అంతరార్థమేమి?

సమా - వివేకజ్ఞాననేత్రములు గలవారు ఆ ఆత్మయొక్క యథార్థరూపమును, అది గుణములతో సంబంధమును కల్గియున్నను తెలిసికొన గల్గుదురు. అనగా శరీరమును వదిలిపెట్టు సమయమునను, శరీరమునందున్న సమయమునను, విషయములను అనుభవించు సమయమునను ప్రతి పరిస్థితి యందును ఆ ఆత్మ వాస్తవముగా సర్వథా ప్రకృతికి అతీతమైనదనియు, శుద్ధమైనదనియు, జ్ఞానస్వరూపమైనదనియు సంగరహితమైన దనియు, వారు తెలిసికొందురు.

## యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।
## యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ॥ 11 ॥

| | | |
|---|---|---|
| యోగినః = యోగులు | యతంతః = ప్రయత్నశీలురై | అచేతసః = అజ్ఞానులు |
| ఆత్మని = తమహృదయముల యందు | పశ్యంతి = ఎఱుంగుదురు | యతంతః, అపి = గట్టిగా ప్రయత్నించినను |
| అవస్థితమ్ = స్థితమైయున్న | చ = కాని | ఏనమ్ = ఈ ఆత్మను |
| ఏనమ్ = ఈ ఆత్మతత్త్వమును | అకృతాత్మానః= అంతఃకరణశుద్ధి లేనివారైన | న, పశ్యంతి = తెలిసికొనజాలరు |

**అంతఃకరణశుద్ధిగలయోగులు తమహృదయములయందున్న ఈ ఆత్మతత్త్వమును ప్రయత్నశీలురై తెలిసికొనగలరు. కాని అంతఃకరణశుద్ధిలేని అజ్ఞానులు ఎంతగా ప్రయత్నించియు, ఈ ఆత్మను తెలిసికొనజాలరు. (11)**

ప్రశ్న - ప్రయత్నశీలురైన యోగులనగానెవరు? వారు తమ తమ హృదయములయందు ఆత్మతత్త్వమును తెలిసికొనుట యనగానేమి?

సమా - పవిత్రాంతఃకరణమును తమ వశము నందుంచుకొన్న ఉత్తమ సాధకులనే ప్రయత్నశీలురైన 'యోగులు' అని యందురు. పూర్వ శ్లోకమున తెల్పబడినట్లు వివేకశీలురైన ఈ జ్ఞానులే ఆత్మ తత్త్వమును ఎఱుంగుదురు. ఆత్మస్వరూపమును తెలిసికొనుటకై వీరు నిరంతరము శ్రవణ మనన నిదిధ్యాసాది ప్రయత్నములను చేయుచునే యుందురు. శరీరసంబంధము గలిగి, హృదయమునందు స్థితమైన జీవాత్మయొక్క నిత్యశుద్ధ విజ్ఞానానందమయ వాస్తవస్వరూపమును యథార్థముగా తెలిసికొనుటయే వారు ఈ యాత్మతత్త్వమును ఎఱుంగుట యగును.

ప్రశ్న - 'అకృతాత్మానః' 'అచేతసః' అను పదములు ఎట్టి మనుష్యులను సూచించును? వారు ఎంతగా ప్రయత్నించియు ఈ యాత్మను తెలిసికొనలేరు - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - అంతఃకరణ శుద్ధిలేనివారిని 'అకృతాత్మానః' అనియందురు. నిష్కామకర్మాదుల ద్వారా వారియంతఃకరణ మాలిన్యములు కడిగివేయబడలేదు. భక్త్యాదిసాధన మార్గముల ద్వారా వారు ఎన్నడును చిత్తస్థైర్యము కొఱకు సముచిత అభ్యాసములను చేయలేదు. తత్ఫలముగా వారి అంతఃకరణములు మలినములై విక్షిప్తములై యుండును. అంతఃకరణములయందు అవగాహన శక్తిలేని మూఢులను 'అచేతసః' అని యందురు - కనుక 'అకృతాత్మానః' 'అచేతసః' అను పదములు 'మలవిక్షేప ఆవరణములు' అను మూడు దోషములు గల అంతఃకరణములను కల్గియున్న రాజస, తామస మనుష్యులను సూచించును. ఇట్టి మనుష్యులు తమ అంతఃకరణశుద్ధికై ఏ ప్రయత్నమునూ చేయకయే కేవలము శాస్త్రాలోచన ద్వారా ఆత్మను తెలిసికొనుటకు ప్రయత్నింతురు - వారు ఆత్మతత్త్వమును తెలిసికొనజాలరు.

ప్రశ్న - ఆ మూఢులు ఆత్మను తెలిసికొనజాలరు - జ్ఞాననేత్రములు గల వివేక శీలురైన జ్ఞానులే తెలిసికొందురు- అని 10వ శ్లోకమున తెల్పబడినది - యత్నశీలురైన యోగులు దానిని తెలిసికొనగలరు. అశుద్ధాంతఃకరణము గల అజ్ఞానులు దానిని తెలిసికొనలేరు. అని ఈ శ్లోకమున తెల్పబడినది - ఈ రెండు వర్ణనల మధ్య గల భేదమేమి?

సమా - 10వ శ్లోకమునందలి 'విమూఢాః' అను పదము అజ్ఞానులైన సామాన్యమానవులను, 'జ్ఞానచక్షుషః' అను పదము వివేకశీలురైన జ్ఞానులను తెల్పును. ఈ శ్లోకమునందును 'యోగినః' అను పదము ఆ వివేకశీలురైన సాత్త్విక స్వభావము గల ఉత్తమ శ్రేణికి చెందిన సాధకులనే తెలుపును. 'అచేతసః' అను పదము రాజస తామస స్వభావము గల మనుష్యులను సూచించును. కనుక ఆత్మ స్వరూపమును తెలిసికొనుట, తెలిసికొనలేకపోవుట - అను విషయమున 10వ శ్లోకమున తెలిపిన దానినే ఇచట స్పష్టీకరించుట జరిగినది. వివేకశీలురైన వారు ప్రయత్నము చేయుట వలన ఆత్మతత్త్వమును తెలిసికొందురు. అజ్ఞానులు ఎంత ప్రయత్నించినను తెలిసికొనలేరు అని ఇచట తెల్పబడినది- కనుక ఈ విషయమున ఎట్టి భేదమూ లేదు.

*సంబంధము - 6వ శ్లోకవివరణపై రెండు ప్రశ్నలు తలయెత్తును. సర్వమును (సమస్తజగత్తును) ప్రకాశింపజేయు సూర్యచంద్రాగ్నులు మొదలగు వారి తేజస్సులు పరమాత్మను ఏల ప్రకాశింపజేయజాలవు? అనునది మొదటి ప్రశ్న. పరంధామమును చేరిన పురుషులు ఏల తిరిగిరారు? అనునది రెండవ ప్రశ్న - వీటిలో రెండవ ప్రశ్నకు సమాధానముగా ఏడవ శ్లోకమున జీవాత్మ పరమేశ్వరుని 'సనాతనాంశ' అని తెల్పి, 11వ శ్లోకము వరకు దాని స్వరూప స్వభావ వ్యవహారములను వర్ణించును. దాని యథార్థ స్వరూపమును తెలిసికొన్న వారి మహిమను గూర్చి వివరించెను. ఇప్పుడు మొదటి ప్రశ్నకు సమాధానముగా భగవానుడు 12 నుండి 15వ శ్లోకము వరకు గుణప్రభావ - ఐశ్వర్య సహితముగ తన స్వరూపమును వర్ణించుచున్నాడు-*

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదిత్యగతమ్ = | సూర్యమండలము నందున్న | చ = | మఱియు | అగ్నౌ = | అగ్నియందును గలదో |
| యత్, తేజః = | ఏ తేజస్సు | యత్ = | ఏ తేజస్సు | | |
| అఖిలమ్, జగత్ = | సమస్తజగత్తును | చంద్రమసి = | చంద్రుని యందును | తత్, తేజః = | ఆ తేజస్సు |
| | | | | మామకమ్ = | నాదేయని |
| భాసయతే = | ప్రకాశింపజేయునో | యత్ = | ఏది | విద్ధి = | ఎఱుంగుము |

సమస్తజగత్తును ప్రకాశింపజేయు సూర్యునితేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్నితేజస్సును నాతేజస్సేయని యెఱుంగుము. (12)

ప్రశ్న - 'ఆదిత్యగతం' అను విశేషణముతోపాటు 'తేజః' అను పదము దేనిని తెల్పును? అది సమస్త జగత్తును ప్రకాశింపజేయును - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - సూర్యమండలమునందు గల ఒక మహాజ్యోతినే 'ఆదిత్యగతం' అను విశేషణముతో పాటు 'తేజః' అను పదము సూచించును. అదియే సమస్త జగత్తును ప్రకాశింపజేయును. స్థూలజగత్తుయొక్క సమస్త వస్తువులను ఒక్క సూర్యతేజస్సే ప్రకాశితమొనర్చును - అని భగవానుడు తెలిపెను.

ప్రశ్న - చంద్రునియందును, అగ్నియందును గల తేజస్సు దేనిని తెల్పును? ఈ మూడింటి యందు గల తేజస్సు నా తేజస్సేయని యెఱుంగుము - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - చంద్రునియందు గల 'జ్యోత్స్న' (వెన్నెల) చంద్రుని యందలి తేజస్సు, అగ్నియందలి ప్రకాశము అగ్నితేజస్సు ఈ మూడింటి (సూర్యచంద్రాగ్నుల) యందును, మఱియు అవి (వారు) అధిష్ఠాన దేవతలుగా గల నేత్రములు, మనస్సు, వాక్కులయందును గల వస్తుప్రకాశక శక్తి భగవంతుని తేజస్సులోని ఒక అంశయే - అని తెల్పుటకు సూర్యచంద్రాగ్నులయందలి తేజస్సు తన తేజస్సే యని భగవానుడు తెల్పెను. ఈ మూడింటియందలి తేజస్సు భగవత్తేజము యొక్క అంశయేయైనప్పుడు అమూడింటి సంబంధముచే తేజోయుక్తములైన (ప్రకాశితములైన) ఇతర పదార్థముల తేజస్సు భగవత్తేజస్సే యని చెప్పవలసిన అవసరమే లేదు - కనుక 6వ శ్లోకములో భగవంతుడు సూర్యచంద్రాగ్నులు ఎవ్వియును తన స్వరూపమును ప్రకాశింప జేయుటకు సమర్థములు కావని తెలిపెను.

**గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।**
**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥ 13 ॥**

చ = మఱియు
అహమ్ = నేనే
గామ్, ఆవిశ్య = భూమిని ప్రవేశించి
ఓజసా = (నా)శక్తిద్వారా
భూతాని = సకల భూతములను
ధారయామి = ధరించి, పోషించుచున్నాను
చ = మఱియు
రసాత్మకః = రసస్వరూపుడగు (అమృతమయుడగు)
సోమః, భూత్వా = చంద్రుడనై
సర్వాః, ఓషధీః = ఓషధులకు (వనస్పతులకు) అన్నింటికిని
పుష్ణామి = పుష్టిని చేకూర్తును

పృథ్వియందు ప్రవేశించి, నేను నా శక్తిద్వారా సకలభూతములను ధరించి, పోషించుచున్నాను. రసస్వరూపుడనై- అనగా అమృతమయుడైన చంద్రుడనై ఓషధులకు అనగా వనస్పతులన్నింటికి పుష్టిని చేకూర్చుచున్నాను. **(13)**

ప్రశ్న - "పృథ్వియందు ప్రవేశించి, నేను నా శక్తితో సకలభూతములను ధరించి, పోషించుచున్నాను-" అనియనుటలోని అంతర్యమేమి?

సమా - పృథ్విని ఉపలక్షణముగా జేసి, విశ్వవ్యాప్తమైన ధారణ, పోషణ శక్తిని తన యంశగా భగవానుడు తెల్పెను. సకల ప్రాణులను ధరించి, పోషించుటకు పృథ్వియందును ఇతరవస్తువులయందునుగల శక్తి వాస్తవముగా వాటిది కాదు. అది భగవంతుని యొక్క ఒక అంశయే. కావున తానే ఆత్మరూపముతో పృథ్వియందు ప్రవేశించి, తన బలముతో సమస్త ప్రాణులను ధరించి, పోషించుచున్నానని భగవానుడు తెల్పెను.

ప్రశ్న - 'రసాత్మకః' అను విశేషణముతో పాటు 'సోమః' అను పదము ఎవరిని తెల్పును? ఈ విశేషణ ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - రసస్వరూపుని 'రసాత్మకుడు' అని యందురు. 'రసాత్మకః' అను విశేషణముతోపాటు 'సోమః' అను పదము చంద్రుని తెల్పును. చంద్రుని స్వరూపము రసమయము. అనగా అమృతమయము. అతడందరికిని అమృతమును (రసమును) ప్రసాదించును. కనుక 'రసాత్మకః' అను విశేషణము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'ఓషధీః' అను పదము దేనిని సూచించును? "నేనే చంద్రుడనై సమస్త - ఓషధులకు పుష్టినొసంగెదను"- అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పత్రపుష్పఫలాది సమస్త - అంగప్రత్యంగ సహితమైన వృక్షలతాతృణాది భేదములు గల వనస్పతులన్నింటిని 'ఓషధీః' అను పదము తెల్పును. చంద్రునియందుగల ప్రకాశశక్తి భగవంతుని ప్రకాశము నందలి ఒక అంశయే ఐనట్లు, చంద్రునిలో గల పోషణ శక్తియు భగవచ్ఛక్తిలోని ఒక అంశయే - భగవంతుడే చంద్రరూపములో ప్రకటితుడై అందరిని పోషించును. ఈ విషయమును స్పష్టపరచుటకే "పుష్టినొసంగుచున్నాను" - అని తెల్పెను.

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14 ॥**

అహమ్ = నేనే
ప్రాణినామ్ = సకలప్రాణులయొక్క
దేహమ్, ఆశ్రితః = దేహములయందు ఉన్నవాడనై
ప్రాణాపాన సమాయుక్తః = ప్రాణాపానములతో గూడిన
వైశ్వానరో భూత్వా = వైశ్వానరాగ్నినై
చతుర్విధమ్ = నాలుగు విధములైన
అన్నమ్ = ఆహారమును
పచామి = జీర్ణింపజేయుదును

**నేనే ప్రాణాపానసంయుక్తమైన వైశ్వానరాగ్నిరూపములో సర్వప్రాణుల శరీరములయందుండి నాలుగు విధములైన ఆహారములను జీర్ణము చేయుచుందును. (14)**

ప్రశ్న - 'ప్రాణినాం' 'దేహమాశ్రితః' అను విశేషణముతో పాటు 'వైశ్వానరః' అను పదము దేనిని తెల్పును? ప్రాణాపాన సంయుక్తమైన వైశ్వానరుడనై నాలుగు విధములైన అన్నమును జీర్ణము చేయుదును. అని భగవానుడు పల్కుటలోని అభిప్రాయమేమి?

సమా - అందరి శరీరములకు ఉష్ణమును చేకూర్చుచు అన్నమును జీర్ణింప జేయునట్టి 'అగ్ని' (జఠరాగ్ని) సమస్త ప్రాణుల శరీరములలో నుండును - దానిని సూచించునదియే 'ప్రాణినాం దేహమాశ్రితః' అను విశేషణసహితమైన 'వైశ్వానరః' అను పదము. అగ్నియొక్క ప్రకాశశక్తి భగవంతుని తేజస్సు యొక్క అంశయైనట్లు, దాని ఉష్ణత్వము అనగా పాచన, దీపనశక్తియు భగవదంశయే. కనుక భగవానుడు ప్రాణాపాన సంయుక్తమైన ప్రాణుల శరీరములయందు నివసించు వైశ్వానరాగ్ని రూపములో భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములు అను చతుర్విధ పదార్థములను జీర్ణము చేయును. దంతములతో నమలి తినబడు రొట్టె, అన్నము మొదలగునవి భక్ష్యములు. నమలకయే నేరుగా స్వీకరింపబడు ద్రవపదార్థములు భోజ్యములు. ఉదా- పాలు పెరుగు మొదలగునవి. నాలుకతో ఆస్వాదింపబడు తేనె, పచ్చళ్ళు మొదలగునవి లేహ్యములు. పీల్చబడు చెరకు, పండ్లు, మొదలగునవి చోష్యములు. భగవానుడు ప్రాణాపాన సంయుక్తమైన వైశ్వానరాగ్నియై ఈ చతుర్విధములైన ఆహారములను జీర్ణము చేయును.

*సంబంధము - విద్యుత్ పంఖాద్వారా వాయుప్రసారము నందు, విద్యుత్ బల్బు ద్వారా ప్రకాశమునందు, మోటారు తిరుగుటయందు, నీరుకాగుటయందు, రేడియో మొదలగు వాటిద్వారా శబ్ద ప్రసారమునందు, విద్యుచ్ఛక్తియొక్క అంశయే పనిచేయుచున్నది. అట్లే సూర్యచంద్రాగ్నుల ద్వారా జగత్తునందలి సర్వపదార్థములను ప్రకాశింపజేయుటలోను, పృథ్వి మొదలగువాటి ద్వారా అన్నింటిని ధారణచేయుటలోను, చంద్రునిద్వారా పోషణ చేయుటలోను, అట్లే వైశ్వానరాగ్ని ద్వారా అన్నమును జీర్ణింప జేయుటలోను భగవచ్ఛక్తియొక్క ఒకఅంశయే ప్రభావమును చూపుచున్నది. ఈ విధముగా 10వ అధ్యాయమునందలి 41వ శ్లోకభావమును అనుసరించి, సమస్త (ప్రకాశకశక్తి, ధారణశక్తి, పోషణ శక్తి, జీర్ణశక్తి, (పాచనశక్తి) మొదలగునవి అన్నియును తన శక్తియొక్క అంశయే' - అని భగవానుడు పేర్కొనెను. ఇప్పుడు సర్వాంతర్యామిత్వము, సర్వజ్ఞత్వము మొదలగు గుణములతో గూడిన తన స్వరూపమును వర్ణించుటకై అన్ని విధముల తాను తెలిసికొనదగిన వాడనని భగవానుడు తెల్పుచున్నాడు-*

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహమ్ | = నేనే | స్మృతిః | = స్మృతి | సర్వైః, వేదైః | = వేదములన్నింటి ద్వారా |
| సర్వస్య, హృది | = ప్రతిప్రాణియొక్క హృదయమునందు | జ్ఞానమ్ | = జ్ఞానము | అహమ్, ఏవ | = నేనే |
| | | చ | = మఱియు | వేద్యః | = తెలిసికొనదగిన వాడను |
| సన్నివిష్టః | = అంతర్యామిగా ఉన్నవాడను | అపోహనమ్ | = అపోహనము (సంశయనివారణము) | వేదాంతకృత్ | = వేదాంతకర్తను |
| | | | | వేదవిత్, చ | = వేదములను ఎఱింగిన వాడనుగూడ |
| చ | = మఱియు | (భవతి) | = (కలుగును) | | |
| మత్తః | = నానుండియే | చ | = మఱియు | అహమ్, ఏవ | = నేనే |

**సమస్తప్రాణుల హృదయములలో అంతర్యామిగా ఉన్న వాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహమును తొలగించుట) కలుగుచున్నవి. వేదముల ద్వారా తెలిసికొనదగిన వాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను గూడ నేనే. (15)**

ప్రశ్న - నేను అందరి (సమస్త ప్రాణుల) హృదయములలో ఉండువాడను - అనగానేమి?

సమా - సర్వత్ర సమభావముతో భగవానుడు పరిపూర్ణుడై యున్నను సర్వప్రాణుల హృదయములలో అంతర్యామిరూపమున విశేషముగా ఉండును. కావున హృదయము ఆయన ఉనికికి విశేషస్థానము. కనుక "అందరి హృదయములలో నేను ఉన్నాను" - (13/17, 18/61) - అని తెల్పెను. శుద్ధమైన స్వచ్ఛమైన అంతఃకరణములుగలవారి హృదయములయందు ఆయన ప్రత్యక్షముగా గోచరించును.

ప్రశ్న - స్మృతి, జ్ఞానము, అపోహనము అనగానేమి? "ఈ మూడును నానుండి యే కలుగును" - అని భగవానుడు పలుకుటలోని ఆంతర్యమేమి?

సమా - మొదట చూచిన, వినిన, లేక ఏదో ఒక విధముగా అనుభవించిన వస్తువును లేక సంఘటనను స్మరించుటయే 'స్మృతి' అనబడును. ఏదైన ఒక వస్తువును యథార్థముగా తెలిసికొను శక్తిని జ్ఞానము అని అందురు. సంశయ విపర్యయాది వితర్కసముదాయమును 'ఊహనము' అనియందురు. అవి లేకుండుటనే 'అపోహనము' అని యందురు. సర్వప్రాణుల హృదయములయందు స్థితుడై అంతర్యామిగా నున్న పరమేశ్వరుడే వారి కర్మానుసారము ఉపర్యుక్త స్మృతి, జ్ఞాన, అపోహనాది భావములను వారి అంతః కరణముల యందు ఉత్పన్నము చేయును.

ప్రశ్న - 'సమస్త వేదముల ద్వారా తెలిసికొనదగిన వాడను నేనే' - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడే వేదములన్నిటి ద్వారా వేద్యుడు. అనగా వేదములలో వర్ణింపబడిన కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండల అంతిమ లక్ష్యము సంసార విషయమున వైరాగ్యమును కలుగజేసి, అన్ని విధములుగా యోగ్యులైన వారికి భగవద్ జ్ఞానమును ప్రసాదించుట. వాటిద్వారా భగవత్స్వరూపమును గూర్చి తెలిసికొన్న మనుష్యులే వేదముల అర్థమును చక్కగా ఎఱుంగుదురు. అట్లుగాక సాంసారిక భోగములయందు చిక్కుపడినవారు వాటి యర్థమును ఎఱుంగలేరు.

ప్రశ్న - వేదాంతశబ్దము ఇచట దేనిని తెల్పును? భగవంతుడు తాను దానికి కర్తననియు, సమస్తవేదముల జ్ఞాతననియు తెల్పుటలోని అంతరార్థమేమి?

సమా - వేదముల తాత్పర్యముల నిర్ణయము చేయుటనే వేదాంతమందురు. అనగా వేద విషయములను గూర్చిన సందేహములన్నింటిని దూరమొనర్చి, పరమాత్మయందే, అన్నింటిని సమన్వయ పరచుటను 'వేదాంతము' అని యందురు. వేదములయందు ప్రతీతమగు వైరుధ్యములను తొలగించుచు, వాస్తవముగా వాటిని సమన్వయ పరచి, మనుష్యునకు శాంతిని ప్రసాదించువాడు భగవంతుడే. కావున ఆయనయే కర్తయని తెల్పబడెను. వేదములయొక్క యథార్థ తాత్పర్యమును తెలిసిన వాడు గూడ భగవంతుడే. కావున ఆయనయే వేదవిదుడు.

*సంబంధము - 1 నుండి 6వ శ్లోకమువరకు వృక్షరూప సంసారమును, దృఢవైరాగ్యము ద్వారా దాని ఛేదనమును, పరమేశ్వరుని శరణు పొందుటను, పరమాత్మప్రాప్తిని పొందిన పురుషుల లక్షణములను పరంధామ స్వరూపుడైన పరమేశ్వరుని మహిమను వర్ణించుచు అశ్వత్థవృక్షరూప క్షర పురుషుని ప్రకరణము పూర్తి చేయుటజరిగెను. ఆపిమ్మట 7వ శ్లోకము నుండి జీవశబ్ద వాచ్యుడును, ఉపాసకుడును ఐన అక్షరపురుషుని ప్రకరణమును ఆరంభించి, అతని స్వరూపశక్తి స్వభావ వ్యవహారముల వర్ణించి, అతనిని తెలుసుకొనుట వలన గలుగు మహిమను తెల్పుచు 11వ శ్లోకము వరకు ఆ ప్రకరణమును ముగించెను. ఉపాస్యుడైన పరమాత్ముని ప్రకరణమును 12వ శ్లోకమున ప్రారంభించి, 15వ శ్లోకమువరకు ఆయన గుణ ప్రభావ స్వరూపములను వర్ణించుచు, ఆ ప్రకరణమును గూడ ముగించెను. ఇప్పటినుండి ఈ అధ్యాయ సమాప్తి వరకు పూర్వోక్తములైన మూడు ప్రకరణముల సారమును సంక్షిప్తముగా తెల్పుటకై రాబోవు శ్లోకమున క్షరాక్షర పురుషుల స్వరూపమును గూర్చి తెల్పుచున్నాడు-*

**ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16 ॥**

లోకే = ఈ జగత్తునందు
క్షరః, చ = క్షరుడు (నశ్వరుడు) అనియు
అక్షరః = అక్షరుడు (నాశరహితుడు) అనియు
ఇమౌ, ద్వౌ పురుషౌ, ఏవ = ఈ రెండువిధములగు పురుషులే గలరు
సర్వాణి, భూతాని = సకలప్రాణుల శరీరములును
క్షరః = నశ్వరములు
చ = మరియు
కూటస్థః = జీవాత్మ
అక్షరః = నాశరహితుడు అని
ఉచ్యతే = పేర్కొనబడుచున్నది

ఈ జగత్తునందు క్షరుడు(నశ్వరుడు), అక్షరుడు (వినాశరహితుడు) అని పురుషులు రెండు విధములుగా గలరు. సకలప్రాణులశరీరములు నశ్వరములు. జీవాత్మ నాశరహితుడు. **(16)**

ప్రశ్న - 'ఇమౌ ద్వౌ' అను రెండు సర్వనామములతో పాటు ప్రయుక్తమైన **'పురుషౌ'** అను పదము ఏ పురుషులను సూచించును - అందులో ఒకరిని **'క్షరుడనియు'**, మరొకరిని **'అక్షరుడ'**నియు పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ అధ్యాయమున ప్రస్తావింపబడిన రెండు తత్త్వములనే ఇచట క్షర-అక్షర అను పేర్లతో వర్ణించుట జరిగినది - **'ఇమౌ, ద్వౌ'** అను సర్వనామముల ప్రయోగము ఈ విషయమును తెల్పుటకే చేయబడినది. 7వ అధ్యాయమున **'అపరా' 'పరా'** ప్రకృతులనియు (7/4, 5), 8వ అధ్యాయమున అధిభూత, అధ్యాత్మములనియు, (8/3, 4) 13వ అధ్యాయమున క్షేత్ర, క్షేత్రజ్ఞులనియు, (13/1) మరియు ఈ అధ్యాయమున అశ్వత్థము, జీవుడు అనియు, వర్ణింపబడిన రెండు తత్త్వములనే ఇచట **'పురుషౌ'** అను పదము సూచించును. అందులో ఒకరిని క్షరుడు, మరియొకరిని **'అక్షరుడు'** అని తెల్పుట ద్వారా భగవానుడు ఆ యిద్దఱును పరస్పరము అత్యంత విలక్షణులని తెల్పెను.

ప్రశ్న - **'సర్వాణిభూతాని', 'కూటస్థః'** అను పదములు వేటిని సూచించును? మరియు వారిని **'క్షర-అక్షర పురుషులు'** అని యనుటకు కారణమేమి?

సమా - **'భూతాని'** అను పదము ఇచట సమస్త జీవుల స్థూల సూక్ష్మ కారణ శరీరములను సూచించును. వీటినే 13వ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున క్షేత్రము పేరుతో తెల్పి 5వ శ్లోకమున దాని స్వరూపమును వర్ణించెను. .ఇచట **'సర్వాణి, భూతాని'** అను పదములు ఆ సమస్త జడవర్గమును సూచించును. అవి నశ్వరములు, అనిత్యములు - 2వ అధ్యాయమునందు **'అంతవంత' 'ఇమే దేహాః'** (2/18) 8వ అధ్యాయమున **'అధిభూతం' 'క్షరోభావః'** (8/4) అని, ఈ విషయమే తెల్పబడినది. సమస్త శరీముల యందుండు ఆత్మలను సూచించునదియే **'కూటస్థ'** శబ్దము. ఇది సర్వదా ఒకేరీతిగా ఉండును. ఇది పరివర్తన శీలముకాదు. కనుక దీనిని **'కూటస్థః'** అని యందురు - ఇది యెన్నడును ఏ పరిస్థితియందును క్షయము, నాశము, అభావములను పొందదు. కనుక ఇది అక్షరము.

సంబంధము - ఇట్లు క్షరాక్షర పురుషుల స్వరూపములను దెలిపి, ఆ యిద్దరికంటెను శ్రేష్ఠుడును, పురుషోత్తముడును ఐన భగవానుని స్వరూపమును, అతనిని పురుషోత్తముడు - అని యనుటకు గల కారణములను రెండు శ్లోకములలో వివరించుచున్నాడు-

**ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।**
**యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ 17 ॥**

ఉత్తమః, పురుషః, = (పై ఇద్దరి కంటెను) ఉత్తమపురుషుడే
తు అన్యః = వేరైనవాడు,
యః = ఎవడైతే
లోకత్రయమ్, = ముల్లోకములలో
ఆవిశ్య = ప్రవేశించి
బిభర్తి = అందఱిని భరించి, పోషించుచున్నాడో అతడే
అవ్యయః = నాశరహితుడు (శాశ్వతుడు)
ఈశ్వరః = పరమేశ్వరుడు
పరమాత్మా, ఇతి = పరమాత్మ, అని
ఉదాహృతః = పేర్కొనబడుచున్నాడు

పై ఇద్దరికంటెను ఉత్తముడైన పురుషుడు వేరైనవాడొకడు కలడు. అతడే నాశరహితుడైన పరమేశ్వరుడు, పరమాత్మ. అతడు ముల్లోకములయందును ప్రవేశించి, అందఱిని భరించి పోషించుచున్నాడు. **(17)**

ప్రశ్న - 'ఉత్తమః పురుషః' అనగానెవరు? 'తు' 'అన్యః' అను ఈ రెండు పదముల అర్థమేమి?

సమా - నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తుడు, సర్వశక్తిమంతుడు, పరమదయాళువు, సర్వగుణసంపన్నుడు, పురుషోత్తముడు ఐన భగవానుని 'ఉత్తమః, పురుషః' అను పదములు తెలుపును. 'తు, అన్యః' అను పదముల ద్వారా క్షరాక్షరపురుషులకంటెను భగవానుని విలక్షణత్వము ప్రతిపాదింపబడినది. ఈ ఉత్తమ పురుషుడు పూర్వోక్త పురుషులిద్దరికంటెను వేరైనవాడు మరియు అత్యంతశ్రేష్ఠుడు.

ప్రశ్న - అతడు ముల్లోకములయందు ప్రవేశించి, అందరిని ధరించి, పోషించును - అనియనుటలో ఆంతర్యమేమి?

సమా - ఈ వాక్యముద్వారా పురుషోత్తముని లక్షణములు వర్ణింపబడినవి. సర్వాధారుడును, సర్వవ్యాపియు ఐన పురుషోత్తముడు సకల జగత్తునందు ప్రవేశించి, క్షరాక్షర పురుషులను ధరించి, సమస్త ప్రాణులను పాలించుచున్నాడు. ఆయన ఆ ఇద్దరి కంటెను విలక్షణుడు, ఉత్తముడు. కావున పురుషోత్తముడనబడును.

ప్రశ్న - అతడు అవ్యయుడు, ఈశ్వరుడు, పరమాత్మ - అనిఅనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ పరమాత్మ ముల్లోకములయందును ప్రవేశించియున్నను అవి నశించినను తాను నశింపడు. అతడు సర్వదా నిర్వికారుడు, ఒకేరీతిగా ఉండువాడు. క్షరాక్షర పురుషులిద్దరికిని నియామకుడు. స్వామి. సర్వశక్తిమంతుడైన ఈశ్వరుడు. గుణాతీతుడు. శుద్ధుడు. అందరికిని ఆత్మ. అతడే పురుషోత్తముడైన పరమాత్మ. క్షర + అక్షర + ఈశ్వరతత్త్వములు శ్వేతాశ్వతరోపనిషత్తు నందు ఈ విధముగా వర్ణింపబడినవి -

క్షరం ప్రధానమమృతాక్షరం హరః, క్షరాత్మానావీశతే దేవ ఏకః (శ్వేతాశ్వతరోపనిషత్తు - 1/10)

'ప్రధానం' అనగా ప్రకృతి. దీనిపేరే క్షరము. దాని భోక్త, నాశరహితుడైన ఆత్మ. అతడే అక్షరుడు. ప్రకృతి - ఆత్మల రెండింటిని శాసించువాడు పురుషోత్తముడు.

లోకంబులు, లోకేశులు,
లోకస్థులు దెగిన తుది, అలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుగు, నతనినే సేవింతున్ -
(పోతన - మహాభాగవతము - అష్టమ - 75)

**యస్మాత్ క్షరమతీతోఽహమ్ అక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యస్మాత్ | = ఏలనన | అతీతః | = పూర్తిగా అతీతుడను | అతః | = ఇందువలన |
| అహమ్ | = నేను | చ | = మఱియు | లోకే చ | = లోకమునందును |
| క్షరమ్ | = నశ్వరమైన జడవర్గక్షేత్రము కంటెను | అక్షరాత్, అపి | = నాశరహితుడైన జీవాత్మకంటెను | వేదే(చ) | = వేదము నందును |
| | | | | పురుషోత్తమః | = పురుషోత్తముడనని |
| | | ఉత్తమః | = ఉత్తముడను | ప్రథితః, అస్మి | = ప్రసిద్ధుడనైతిని |

ఏలనన నశ్వరమగు జడవర్గము (క్షేత్రము) కంటెను నేను సర్వథా అతీతుడను. నాశరహితమైన జీవాత్మ కంటెను ఉత్తముడను. కనుక ఈజగత్తునందును, వేదముల యందును పురుషోత్తముడనని ప్రసిద్ధికెక్కితిని. **(18)**

ప్రశ్న - 'అహం' అను పదము ఎవరిని సూచించును?

సమా - "పైన తెల్పబడిన లక్షణములు గల పురుషోత్తముడను నేనే" - అని శ్రీకృష్ణుడు అర్జునునకు తన పరమరహస్యమును వెల్లడించెను.

ప్రశ్న - భగవానుడు తాను క్షరునికంటెను అతీతుడననియు, అక్షరుని కంటెను శ్రేష్ఠుడననియు తెల్పుటలోని వైశిష్ట్యమేమి?

సమా - భగవానుడు క్షర పురుషుని కంటెను విలక్షణుడు. అనగా అతనితో (అపరాప్రకృతితో) ఎట్టి సంబంధమూ లేనివాడు. 13వ అధ్యాయమునందు శరీరము, క్షేత్రము -

అను పేర్లతో ప్రస్తావింపబడిన త్రిగుణసముదాయ రూపమైన, వినాశశీలమైన, సమస్త జడవర్గమునుండి అతడు సర్వథా నిర్లిప్తుడు, భగవానుడు అక్షరుని కంటెను ఉత్తముడు. కాని అతీతుడు కాడు. ఏలనన అక్షరుడు భగవంతుని అంశయే అగుటవలన శాశ్వతుడు, చేతనాత్మకుడు. కాని భగవానుడు అక్షరుని కంటె శ్రేష్ఠుడు. ఏలనన ఆయన (అక్షరుడు) ప్రకృతిస్థుడు, కాని పరమాత్మ ప్రకృతికిని, గుణములకును అతీతుడు. అక్షరుడు అల్పజ్ఞుడు. భగవానుడు సర్వజ్ఞుడు. అతడు నియమింపబడువాడు. ఇతడు నియామకుడు. అతడు ఉపాసకుడు, అల్పశక్తి సంపన్నుడు. ఇతడు ఉపాస్యుడు, సర్వశక్తి మంతుడు. కనుక అక్షరుని కంటెను భగవంతుడు అన్ని విధముల ఉత్తముడు.

ప్రశ్న - 'యస్మాత్' 'అతః' - అను హేతువాచక పదములను ప్రయోగించి, "నేను లోకమునందును, వేదమునందును పురుషోత్తముడను – అని ప్రసిద్ధి గాంచితిని" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - 'యస్మాత్' 'అతః' - అను హేతువాచక పదములను ప్రయోగించి, లోకమునందును, వేదముల యందును, తాను పురుషోత్తమునిగా ప్రసిద్ధి గాంచితినని తెల్పుట ద్వారా భగవానుడు తన పురుషోత్తమత్వమును నిరూపించెను – క్షరుని కంటెను అతీతుడు, అక్షరునికంటెను ఉత్తముడు అగుటవలన సంపూర్ణజగత్తునందును, వేదశాస్త్రముల యందును భగవానుడు పురుషోత్తముడని ప్రసిద్ధిగాంచెను.

**సంబంధము** - *పైన తెల్పబడిన రీతిగా భగవానుడు పురుషోత్తముడని తెలిసికొన్న వారి మహత్త్యమును, లక్షణములను తెల్పుచున్నాడు-*

## యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
## స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ 19 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | పురుషోత్తమమ్ | = పురుషోత్తమునిగా | సర్వభావేన | = అన్నివిధముల నిరంతరము |
| యః, అసమ్మూఢః | = ఏ జ్ఞానియైనవాడు | జానాతి | = తెలిసికొనునో | | |
| మామ్ | = నన్ను | సః | = ఆ జ్ఞాని | మాం | = వాసుదేవుడనైన నన్ను |
| ఏవమ్ | = ఈ విధముగా | సర్వవిత్ | = సర్వజ్ఞుడు | భజతి | = భజించును |

**ఓ అర్జునా! జ్ఞానియైనవాడు ఈ విధముగా నన్ను తత్త్వతః పురుషోత్తమునిగా ఎఱుంగును. సర్వజ్ఞుడైన అతడు వాసుదేవుడనైన నన్నే నిరంతరము పరమేశ్వరునిగా భజించును. (19)**

ప్రశ్న - ఇచట 'ఏవమ్' అను పదమునకు అర్థమేమి?

సమా - 'ఏవమ్' అను అవ్యయము ఇచట పై రెండు శ్లోకములలో చేయబడిన వర్ణనను నిర్దేశించును.

ప్రశ్న - 'మామ్' అను పదము ఎవరిని తెలుపును. అతనిని పురుషోత్తమునిగా ఎఱుంగుట యనగానేమి?

సమా - 'మామ్' అను పదము ఇచట సర్వశక్తి మంతుడును, సర్వాధారుడును, సమస్త జగత్తు యొక్క సృష్టి, పాలన, సంహారాదులను చేయువాడును, అందరికిని పరమ సుహృదుడును, నియంతయు, సర్వగుణ సంపన్నుడును, పరమదయాళువును, పరమ ప్రేమాస్పదుడును, సర్వాంతర్యామియు, సర్వవ్యాపియు ఐన పరమేశ్వరుని తెలుపును. ఆయనయే పై రెండు శ్లోకములలో వర్ణింపబడిన రీతిగా క్షరాక్షర పురుషులిద్దరికంటెను ఉత్తముడు, గుణాతీతుడు, సర్వగుణసంపన్నుడు, సాకారుడు, నిరాకారుడు, వ్యక్తావ్యక్త స్వరూపుడు, పరమపురుషుడు ఐన పురుషోత్తముడు. ఈ విధముగా ఆయనను శ్రద్ధాదరములతో సంపూర్ణముగా తెలిసికొనుటయే పురుషోత్తముడని యెరుంగుట యగును.

ప్రశ్న - 'అసమ్మూఢః' అను పదమునకు అర్థమేమి?

సమా - సంశయవిపర్యయాదిదోష రహితమైన జ్ఞానము గల వానిని, మోహము ఏ మాత్రములేని వానిని 'అసంమూఢః' అని యందురు. భగవానుని సామాన్య

మానవునిగా తలంపక సర్వశక్తిమంతుడు, సాక్షాత్ పరమేశ్వరుడైన పురుషోత్తముడని యెరింగిన వాని జ్ఞానమే యథార్థజ్ఞానము. అట్టివాడే 'అసంమూఢుడు'.

ప్రశ్న - 'సర్వవిత్' అనగానేమి?

సమా - తెలియదగిన విషయములను సమగ్రముగా తెలిసిన వానిని 'సర్వవిత్' అని యందురు. ఈ అధ్యాయమున క్షర, అక్షర, పురుషోత్తముల విషయములు మూడు భాగములుగా వర్ణింపబడినవి. క్షరాక్షర పురుషుల యథార్థ స్వరూపమును తెలిసికొని, వారికంటెను అత్యుత్తముడైన పురుషోత్తముని తత్త్వమును ఎఱింగిన వాడే 'సర్వవిత్' అనగా సమస్త విషయములను యథార్థముగా ఎఱింగినవాడు.

ప్రశ్న - "భగవంతుని పురుషోత్తమునిగా ఎఱింగిన వాడు నన్ను సర్వభావముతో భజించును" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని పురుషోత్తమునిగా ఎఱింగినవాడు సమస్త జగత్తునందలి మమత్వమోహములను విడిచి పెట్టి కేవలము పరమ ప్రేమాస్పదుడైన పరమేశ్వరునియందే సంపూర్ణ ప్రేమ (భక్తి) కలిగి యుండును. భగవంతుని గుణ ప్రభావ తత్త్వరహస్య లీలా స్వరూపములను, మహత్త్వమును సంపూర్ణముగా విశ్వసించును. అతని నామగుణ ప్రభావచరిత్ర స్వరూపాదులను భక్తిశ్రద్ధలతో మనన, శ్రవణ, కీర్తన, దర్శనాదులతో సేవించును. అన్నియు ఆయనవే యనియు, అన్నిటియందును ఆయనయే వ్యాపించి యుండునని యు భావించి, ఆయన ఆజ్ఞానుసారము కర్తవ్యకర్మల ద్వారా అందరికిని సుఖమును ఇచ్చుటకై ఆయన సేవాదులను నిర్వహించును. భగవానుని అన్ని విధముల భజించుట యనగానిదియే - భగవంతుని పురుషోత్తమునిగా ఎఱిగించినవానిని గుర్తించుటకై "అతడు సర్వభావముతో నన్ను భజించును." - అని భగవంతుడు పేర్కొనెను. భగవంతుడు క్షరునికంటెను అతీతుడు, అక్షరునికంటెను ఉత్తముడు, అని భావించువాడు కేవలము భగవంతునే పై విధముగ నిరంతరము దృఢ భక్తితో భజించును - అని తెలిసికొనవలయును.

సంబంధము - ఈ విధముగా భగవంతుని పురుషోత్తమునిగా ఎఱింగిన వాని మహత్త్వమును విశదపఱచి, ఇప్పుడు ఈ అధ్యాయమునందు వర్ణింపబడిన విషయము 'గుహ్యతమము' అని తెల్పుచు దానిని తెలిసికొనుట వలన కలుగు ఫలమును వర్ణించి, ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-

**ఇతి గుహ్యతమం శాస్త్రమ్ ఇదముక్తం మయానఘ ।**
**ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చభారత ॥ 20 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అనఘ! | = ఓ పుణ్యపురుషా! | ఇదమ్, శాస్త్రమ్ | = ఈ శాస్త్రము | బుద్ధ్వా | = తెలిసికొని (మనుష్యుడు) |
| భారత! | = ఓ అర్జునా! | మయా | = నాచేత | బుద్ధిమాన్ | = జ్ఞానియు |
| ఇతి | = ఈ విధముగా | ఉక్తమ్ | = చెప్పబడినది | కృతకృత్యః చ | = కృతార్థుడును |
| గుహ్యతమమ్ | = మిక్కిలి గోప్యమైన | ఏతత్ | = దీనిని (ఈ తత్త్వమును) | స్యాత్ | = అగును |

**ఓ పుణ్యపురుషా! ఓ అర్జునా! అత్యంతము గోప్యమైన ఈ శాస్త్రమును ఈ విధముగా నీకు తెలిపితిని. దీని తత్త్వమును తెలిసికొనిన మనుష్యుడు జ్ఞానియై కృతార్థుడు కాగలడు. (20)**

ప్రశ్న - 'అనఘా!' అని సంబోధన చేయుటలోని విశేషమేమి?

సమా - 'అఘము' అనగా పాపము. పాపరహితుని 'అనఘుడు' అనియందురు. అర్జునుని అంతఃకరణము శుద్ధము, నిర్మలము. కావున గుహ్యతమమైన ఈ ఉపదేశమును వినుటకును, ధారణ చేయుటకును అతడు పాత్రుడని తెల్పుటకే భగవానుడు 'అనఘ!' అని సంబోధించెను.

ప్రశ్న - 'ఇతి' 'ఇదమ్' అను పదములతోపాటు ప్రయుక్తమైన 'శాస్త్రమ్' అను పదము ఇచట ఈ

అధ్యాయమును మాత్రమే సూచించునా? లేక సమస్త గీతోపదేశమునా?

సమా - 'ఇతి' 'ఇదమ్' అను పదములతో పాటు ప్రయుక్తమైన 'శాస్త్రమ్' అను పదము ఇటచట 'ఈ' 15వ అధ్యాయమును మాత్రమే సూచించును. 'ఇదమ్' అను పదము అధ్యాయమును, 'ఇతి' అనునది దాని సమాప్తిని నిర్దేశించును. దానిని ఆదరించుటకై 'శాస్త్రమ్' అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - ఈ ఉపదేశమును గుహ్యతమమనియు, ఇది "నాచే చెప్పబడినది" అనియు తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ అధ్యాయమునందు సగుణ పరమేశ్వరుడైన తనయొక్క గుణ ప్రభావతత్త్వరహస్య విషయములు ముఖ్యముగా తెలుపబడినవి. కావున అవి మిక్కిలి గోప్యములు. పైగా భగవానుడు తన గుణప్రభావతత్త్వ రహస్య-ఐశ్వర్యములను ఈ విధముగా ఎవ్వరికిని ప్రకటింపడు. కావున అర్జునుడు కూడ ఈ రహస్యమును అపాత్రులైన వారికి ఎవ్వరికిని తెల్పరాదని భగవానుడు ఆదేశించెను. ఈ ఉపదేశము సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, పరమేశ్వరుడు ఐన తన ద్వారా ఉపదేశింపబడుట వలన ఇది సమస్త వేదశాస్త్రముల సారము అని తెల్పుటకే 'ఇది నాచే చెప్పబడినది.' అని భగవానుడు ప్రకటించెను.

ప్రశ్న - ఈ శాస్త్రముయొక్క తత్త్వ రహస్యమును ఎఱుంగుట యనగానేమి? దీనిని ఎఱింగిన వాడు 'జ్ఞానియు' 'కృతార్థుడు'ను అనియనుటలోని పరమార్థమేమి?

సమా - ఈ అధ్యాయమునందు వర్ణింపబడిన భగవద్గుణ ప్రభావ తత్త్వస్వరూపాదులను సమగ్రముగా ఎరింగి, పూర్వోక్తరీతిగా భగవంతుని సాక్షాత్ పురుషోత్తముడని తెలిసికొనుటయే ఈ శాస్త్ర తత్త్వమును ఎరుంగుటయగును. అట్లెఱింగి పురుషోత్తముడైన ఆ భగవానుని అపరోక్ష భావముతో పొందుటనే అతడు జ్ఞాని యగుట యగును. సమస్త కర్తవ్యములను పూర్తి చేయుటను అన్ని ఫలములను పొంది కృతకృత్యుడగుట యగును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమయోగో నామ పంచదశోఽధ్యాయః ॥ ౧౫ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునాఱవ అధ్యాయము - దైవాసుర సంపద్విభాగయోగము

**అధ్యాయ నామము :** ఈ అధ్యాయమునందు దైవీసంపద- ఆసురీ సంపద, అను రెండువిభాగములను భగవానుడు వర్ణించుచున్నాడు. దైవీసంపదలు పరమేశ్వరునకు సంబంధించినవి. అవి భగవత్ప్రాప్తికిని, సద్గుణసదాచారముల పెంపునకును తోడ్పడును. ఆసురీసంపదలు దుర్గుణ దురాచారములను పెంపొందించును. కావున మానవుడు దైవీ సంపదలను అలవరచుకొనవలెననియు, ఆసురీసంపదలను త్యజింపవలెననియు ఉపదేశించుచు, ఈ రెండింటిని వేర్వేఱుగా భగవానుడు వర్ణించుచున్నాడు. అందువలన దీనికి దైవాసుర సంపద్విభాగయోగము - అని పేరు గల్గినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమున 1,2,3 శ్లోకములలో దైవీసంపద గల పురుషుల లక్షణములు ప్రస్తావింపబడినవి. 4వ శ్లోకమున ఆసురీ సంపదను గూర్చి సంక్షిప్తముగా ప్రస్తావించబడినది. 5వ శ్లోకమున దైవీసంపద ఫలము ముక్తి యనియు, ఆసురీ సంపద ఫలము బంధములనియు తెల్పుచు, అర్జునుడు దైవీసంపద కలవాడగుటచే, అధైర్యపడవలదని భగవానుడు అతనిని ఊరడించెను. 6వ శ్లోకమున దైవాసుర సంపదలను గూర్చి మరల ప్రస్తావించుచు, ఆసురీ సంపదలను విస్తృతముగా వినుమని భగవానుడాదేశించెను. పిమ్మట 7 నుండి 20వ శ్లోకము వరకును ఆసురీ ప్రకృతి గల మనుష్యుల దుర్భావదుర్గుణ దురాచారములను, అట్టి వారికి ప్రాప్తించు దుర్గతులను వర్ణించెను. 21వ శ్లోకమున ఆసురీ సంపదలో ముఖ్యములైన కామ, క్రోధ, లోభములు నరకద్వారములని తెల్పుచు, సాధకుడు వాటిని త్యజించి, నిష్కామభావముతో దైవీసంపద సాధనల ద్వారా పరమగతిని పొందవలెనని 22వ శ్లోకమున ఆదేశించెను. శాస్త్రవిధులను త్యజించి, ఇచ్ఛానుసారము కర్మలను ఆచరించువారిని 23వ శ్లోకమున నిందించి 24వ శ్లోకమున శాస్త్రానుకూలమైన కర్మలను ఆచరించుటకు ప్రోత్సహించుచు ఈ (16వ) అధ్యాయమును సమాప్తమొనరించెను.

**సంబంధము :** "ఆసురీ, రాక్షసీప్రకృతులు గల మూఢులు నన్ను భజింపరు సరిగదా! నన్ను చులకన చేయుదురు." అని భగవానుడు 7వ అధ్యాయమున 15వ శ్లోకమునందును, 9వ అధ్యాయమున 11, 12 శ్లోకములయందును తెల్పియుండెను. అట్లే "దైవీ ప్రకృతి గల మహాత్ములు నన్ను సమస్తప్రాణులకును ఆద్యుడు, శాశ్వతుడు అని భావించి, అనన్యభక్తితో అన్ని విధముల నిరంతరము నన్నే సేవింతురు." - అని 9 అధ్యాయమున 13, 14 శ్లోకములయందు తెల్పియుండెను. కాని అచట ఇతర ప్రకరణములను గూర్చిన చర్చయుండుట వలన దైవీ, ఆసురీ ప్రకృతుల లక్షణములు వర్ణింపబడలేదు. మరల 15వ అధ్యాయమున 19వ శ్లోకమునందు "నన్ను పురుషోత్తమునిగా ఎరింగిన జ్ఞానులు నన్నే భజింతురు." -అని తెల్పియుండెను. దీనిపై భగవంతుని పురుషోత్తమునిగా ఎఱింగి, సర్వభావముతో ఆయనను భజించు దైవీప్రకృతి గల మహాత్ములయొక్కయు, అట్లు భజింపని ఆసురీప్రకృతిగల అజ్ఞానులయొక్కయు లక్షణములను తెలిసికొనవలెనని ఇచ్ఛకలుగుట సహజమే. కనుక ఇప్పుడు భగవానుడు దైవీ, ఆసురీ సంపదలు గల వారి లక్షణములను స్వభావములను విస్తృతముగా ఈ (16వ) అధ్యాయమున వర్ణించుచున్నాడు. ఇందు మొదటి మూడు శ్లోకములయందు దైవీసంపదగల సాత్త్వికపురుషుల స్వాభావికలక్షణములు విపులముగా వర్ణింపబడినవి-

**శ్రీ భగవాన్ ఉవాచ**

**అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ 1 ॥**

అభయమ్ = నిర్భయత్వము
సత్త్వసంశుద్ధిః = అంతఃకరణశుద్ధి
జ్ఞానయోగ వ్యవస్థితిః = తత్త్వజ్ఞానప్రాప్తికై ధ్యానయోగమునందు నిరంతర దృఢస్థితి
చ = మఱియు
దానమ్ = సాత్త్వికదానము
దమః = ఇంద్రియనిగ్రహము
యజ్ఞః = భగవంతుని, గురువులను, అట్లే దేవతలను పూజించుట, మఱియు అగ్నిహోత్రాది- ఉత్తమ కర్మాచరణము
స్వాధ్యాయః = వేదశాస్త్రముల పఠన, పాఠనములు, భగవన్నామ గుణకీర్తనలు
తపః = స్వధర్మాచరణము నందలి కష్టములను ఓర్పుకొనుట
చ = మఱియు
ఆర్జవమ్ = శరీరేంద్రియ- అంతఃకరణముల సరళత్వము

శ్రీ భగవానుడు పలికెను - నిర్భయత్వము, అంతఃకరణశుద్ధి, తత్త్వజ్ఞానప్రాప్తికై ధ్యానయోగమునందు నిరంతర దృఢస్థితి, సాత్త్వికదానము, ఇంద్రియనిగ్రహము, భగవంతుని, దేవతలను, గురుజనులను పూజించుట, అట్లే అగ్నిహోత్రాది ఉత్తమ కర్మాచరణము, వేదశాస్త్రములపఠన,పాఠనములు మఱియు భగవంతుని నామగుణకీర్తనములు, స్వధర్మాచరణమునందలి కష్టములను ఓర్పుకొనుట, శరీరేంద్రియాంతఃకరణముల సరళత్వము (ఆర్జవము) **(1)**

ప్రశ్న - 'అభయము' అనగానేమి?

సమా - ఇష్టవస్తు వియోగము, అనిష్టవస్తు సంయోగము కలుగునను శంకతో మనస్సునందు సంభవించు పిరికితనముతో కూడిన వికారమునే 'భయము' అని యందురు. ప్రతిష్ఠాభంగము, అవమానము, నింద, రోగము, రాజదండనము, భూతప్రేతములు, మరణము మొదలగు వానివలన కలుగు భయాందోళనలు ఏమాత్రము లేకుండుటనే 'అభయము' అనియందురు.

ప్రశ్న - 'సత్త్వసంశుద్ధిః' అనగానేమి?

సమా - 'సత్త్వము' అనగా అంతఃకరణము. అంతఃకరణము నందు రాగద్వేషములు, హర్షశోకములు, మమతాహంకారములు, మోహమత్సరములు మొదలగు వికారములును, నానావిధములైన కలుషిత పాపాత్మకభావములును ఏ మాత్రమును లేకుండుటను, అంతఃకరణము పూర్తిగా నిర్మలమై పరిశుద్ధముగా ఉండుటను 'సత్త్వసంశుద్ధిః' అనియందురు.

ప్రశ్న - 'జ్ఞానయోగవ్యవస్థితిః' అనగానేమి?

సమా - పరమాత్మ స్వరూపమును యథార్థముగా తెలిసికొనుటనే 'జ్ఞానము' అని యందురు. తత్ప్రాప్తికై పరమాత్మధ్యానమునందే నిరంతరము స్థితుడైయుండుటను 'జ్ఞానయోగవ్యవస్థితిః' అని యందురు.

ప్రశ్న - 'దానమ్' అనగానేమి?

సమా - దేశకాల పాత్రతలను బట్టి నిష్కామ భావముతో అన్న, వస్త్ర, విద్యా-ఔషధాది వస్తువులను కర్తవ్యబుద్ధితో వితరణ చేయుటను 'దానము' అని యందురు. (17/20)

ప్రశ్న - 'దమః' అను పదమునకు అర్థమేమి?

సమా - ఇంద్రియములను విషయముల నుండి మరల్చి, వాటిని తన వశము నందుంచుకొనుటనే 'దమము' అనియందురు.

ప్రశ్న - 'యజ్ఞః' అను పదమునకు అర్థమేమి?

సమా - భగవానుని, దేవతలను, బ్రాహ్మణులను, మహాత్ములను, అతిథులను, తల్లిదండ్రులను, పెద్దలను పూజించుటయు, హవనము (హోమము) బలివైశ్వదేవము చేయుట మొదలగునవి యన్నియును యజ్ఞము లనబడును.

ప్రశ్న - 'స్వాధ్యాయము' అనగానేమి?

సమా - వివేకవైరాగ్యములను కల్గించునట్టి, భగవంతుని గుణ ప్రభావతత్త్వ స్వరూపములను, ఆయన దివ్యలీలలను వర్ణించునట్టి వేదములను అధ్యయనము చేయుట, శాస్త్ర, ఇతిహాస, పురాణాదుల పఠన, పాఠనములను చేయుట, భగవంతుని నామ గుణములను కీర్తించుట మొదలగునవి యన్నియును 'స్వాధ్యాయ' మనబడును.

ప్రశ్న - 'తపః' అను పదమునకర్థమేమి?

సమా - స్వధర్మపాలనము చేయుటలో ఎదురగు సమస్త కష్టములను సహించుటను, అనగా అందులకై అంతః

కరణేంద్రియములను తపింపజేయుటను, 'తపః' అని యందురు. 17వ అధ్యాయమునందు వర్ణింపబడిన శారీరిక, వాచిక, మానసిక తపస్సులు ఇచట 'తపః' అను పదము ద్వారా నిర్దేశింపబడుటలేదు. ఏలనన అహింస, సత్యము, శౌచము, స్వాధ్యాయము, అర్జవము మొదలగు లక్షణములు అచట 'తపస్సు'నకు అంగరూపములుగా నిరూపింపబడినవి. అవి ఇచ్చట వేఱుగా వర్ణింపబడినవి.

ప్రశ్న - 'ఆర్జవమ్' అనగానేమి?

సమా - శరీరేంద్రియ-అంతఃకరణముల సరళత్వమునే 'ఆర్జవము' అనియందురు.

**అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతిరపైశునమ్ ।**
**దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥ 2 ॥**

అహింసా = మనోవాక్కాయముల ద్వారా ఎవ్వరికిని ఏవిధముగను కష్టమును కల్గింపకుండుట
సత్యమ్ = యథార్థమైన ప్రియమైన భాషణము
అక్రోధః = తనకు అపకారము చేయువారిపైగూడ క్రోధము లేకుండుట
త్యాగః = కర్మాచరణమునందు కర్తృత్వాభిమానమును త్యజించుట
శాంతిః = చిత్తచాంచల్యము లేకుండుట
అపైశునమ్ = ఎవరినీ నిందింపకుండుట
భూతేషు, దయా = సకలప్రాణులయెడను నిర్హేతుక కృప
అలోలుప్త్వమ్ = ఇంద్రియ విషయ సంయోగమున్నను వాటిపై ఆసక్తి లేకుండుట
మార్దవమ్ = కోమలత్వము
హ్రీః = లోక, శాస్త్రవిరుద్ధ కార్యాచరణమునకు వెనుకాడుట (సిగ్గుపడుట)
అచాపలమ్ = వ్యర్థ చేష్టలు చేయకుండుట

అహింస (మనోవాక్కాయముల ద్వారా ఎవ్వరికిని ఏ విధముగను కష్టమును కల్గింపకుండుట), సత్యము (యథార్థమైన, ప్రియమైన భాషణము), అక్రోధము (తనకు అపకారము చేయువారిపైనకూడ కోపము లేకుండుట), త్యాగము(కర్మాచరణమునందు కర్తృత్వాభిమానమును త్యజించుట), శాంతి (చిత్తచాంచల్యము లేకుండుట), అపైశునము (ఎవరినీ నిందింపకుండుట), దయ (అన్నిప్రాణులయెడ నిర్హేతుక కృప), అలోలుప్త్వము (ఇంద్రియవిషయసంయోగము ఉన్నను వాటిపై ఆసక్తి లేకుండుట), మార్దవము (కోమలత్వము), శాస్త్రవిరుద్ధ కార్యాచరణమునకు వెనుకాడుట (సిగ్గుపడుట), అచాపలము(వ్యర్థచేష్టలు చేయకుండుట)..... (2)

ప్రశ్న - 'అహింస' అనగానేమి?

సమా - ఏప్రాణికైనను ఎప్పుడైనను, ఎక్కడైనను, లోభ, మోహ, క్రోధముల కారణముగా స్వయముగా ఏమాత్రముగనైనను, ఏ విధముగనైనను కష్టపెట్టుట, ఇతరుల ద్వారా ఐనను కష్టములను కల్గించుట, ఒకరు మరియొకరిని కష్టపెట్టునపుడు దానిని ఆమోదించుటయు, 'హింస' అనబడును. ఇట్టి హింసను మనోవాక్కాయముల ద్వారా ఏ నిమిత్తముగానైనను చేయకుండుటయే 'అహింస' అనబడును. అనగా మనస్సులో ఎవరికిని కీడు తలపెట్టకుండుట, వాక్కు ద్వారా ఎవ్వరినీ దూషింపకుండుట, పరుషవచనములను గాని, హానికరములైన వచనములను గాని పలుకకుండుట, ఎవ్వరినీ చంపకుండుట, శారీరికముగ కష్టములను, హానిని కల్గింపక యుండుట మొదలగునవి అన్నియును అహింసలోని భాగములే.

ప్రశ్న - 'సత్యము' అనగానేమి?

సమా - ఇంద్రియాంతఃకరణముల ద్వారా చూచిన, వినిన, అనుభవించిన విషయములను అదేవిధముగనే వివరించుటకై, కపటము లేకుండ ప్రియమైన మరియు హితమైన వాక్కులను పల్కుటనే 'సత్యము' అనియందురు.

ప్రశ్న - 'అక్రోధః' అనగానేమి?

సమా - స్వభావము వలనగాని లేక, ఎవరైనను అవమానించినను, అపకారము చేసినను, నిందించినను,

మనస్సునకు ప్రతికూలములైన కార్యములను ఆచరించినను, దుర్భాషలాడినను, నీతి మాలిన పనులు చేసినను వాటిని చూచుట వలన గాని, వినుట వలన గాని మనస్సునందున కలుగు ద్వేషభావముతో గూడి ఉద్వేగవృత్తిని 'అంతః క్రోధము' - అనియందురు. ఆ పిమ్మట కలుగు మనః శరీరములయందలి తాపము, ముఖవికారములు, కన్నులెఱ్ఱబారుట మొదలగునవి అన్నియును క్రోధము యొక్క బాహ్యస్వరూపములు. ఈ క్రోధమును పొందిన వానిని, పొందుటకు కారణమైన వానిని ఇది తపింప జేయును. ఈ రెండువిధములైన వృత్తులను 'క్రోధము' అని యందురు. ఈ వృత్తులు ఏ మాత్రమూ లేకుండుటను 'అక్రోధము' అనియందురు.

ప్రశ్న - 'త్యాగము' అనగానేమి?

సమా - "కేవలము గుణములే గుణములయందు వర్తించుచున్నవి. ఈ కర్మలతో నాకు ఎట్టి సంబంధమూ లేదు. నేను భగవంతుని చేతిలో కేవలము ఒక ఆటబొమ్మను మాత్రమే. భగవానుడే తన ఇచ్ఛానుసారము నా మనో వాక్కాయముల ద్వారా అన్ని పనులను చేయించుచున్నాడు. నాయందు సహజముగా స్వయముగ చేయుటకు ఎట్టి శక్తియును లేదు. ఏమియు చేయుటలేదు." అని భావించుచు కర్తృత్వాభిమానమును త్యజించుటనే 'త్యాగము' అని యందురు. కర్తవ్యకర్మలను చేయుచు, వాటి యందు మమతాసక్తులను, ఫలమును, స్వార్థమును సర్వథా త్యజించుటను గూడా 'త్యాగము' అని యందురు - అట్లే ఆత్మోన్నతికి అవరోధములైన వస్తువులను, భావములను, క్రియలను త్యజించుటను గూడ 'త్యాగము' అని యందురు.

ప్రశ్న - 'శాంతి' అనగానేమి?

సమా - ప్రాపంచిక చింతనము సర్వథా దూరమగుట వలన విక్షేపరహితమైన అంతఃకరణమునందు కలుగు సాత్త్విక ప్రసన్న స్థితినే 'శాంతి' అని యందురు.

ప్రశ్న - 'అపైశునమ్' అనగానేమి?

సమా - ఇతరుల దోషములను వెదకుట, వాటిని నలుగురిలో ప్రకటించుట, ఇతరులపై నిందలు వేయుట, చాడీలు చెప్పుట మొదలగు వానిని 'పిశునత్వము' అని యందురు - ఇది లేకుండుటను 'అపైశునమ్' అని యందురు.

ప్రశ్న - సర్వప్రాణులయెడ దయగలిగి యుండుట యనగానేమి?

సమా - ఏదైనను ఒక ప్రాణి దుఃఖముతో బాధపడుటను జూచి, ఆ దుఃఖమును ఏదో యొక విధముగ నివారించుటకు స్వార్థరహితముగ ప్రయత్నించి, అన్ని విధముల ఆ ప్రాణికి సుఖమును చేకూర్పవలెనను భావమును 'దయ' అని యందురు - ఇతరులను కష్టపెట్టకుండుట అహింస యగును. ఇతరులకు సుఖములను చేకూర్చుటను 'దయ' అని యందురు. అహింసకును దయకును మధ్యగల భేదమిదియే.

ప్రశ్న - 'అలోలుప్త్వమ్' అనగానేమి?

సమా - ఇంద్రియ విషయసంయోగము కలిగినప్పుడు దానియందు ఆసక్తి కల్గియుండుటయు, ఇతరుల విషయభోగములను చూచి, ఆ విషయ ప్రాప్తికై మనస్సు ఆశపడుటయు 'లోలుపత' అని యందురు. ఇదియే మాత్రమూ లేకుండుటనే 'అలోలుప్త్వం' అనియందురు.

ప్రశ్న - 'మార్దవమ్' అనగానేమి?

సమా - అంతఃకరణమునందును, వాక్కునందును, వ్యవహారమునందును కాఠిన్యము (పరుషత్వము) ఏ మాత్రమూలేకుండ మిక్కిలి కోమలముగా ఉండుటను 'మార్దవము' అందురు.

ప్రశ్న - 'హ్రీ' అనగానేమి?

సమా - వేదములకును, శాస్త్రములకును, లోకవ్యవహారమునకును విరుద్ధముగా ఆచరింపకూడదు అని నిశ్చయించుకొనిన కారణమున ఆ సంకల్పమునకు వ్యతిరేకముగా ఆచరించుటలో గలుగు సంకోచమును 'హ్రీ' అనగా 'లజ్జ' అనియందురు.

ప్రశ్న - 'అచాపలము'నగానేమి?

సమా - కాళ్ళు, చేతులను ఊపుట, పుల్లలను విరుచుట, కాళ్ళతో నేలను రాచుట, వ్యర్థముగా వాగుట, ఆలోచించుట మొదలగు వ్యర్థ చేష్టలను, ఇంకను కాలుసేతులు, వాక్కు, మనస్సుల ద్వారా చేయబడు ఇతర నిరర్థక చేష్టలను చేయుటను, 'చాపలము' (చపలత్వము) అనియందురు. దీనినే 'ప్రమాదము' అనియు అందురు - చాపలముయొక్క అభావమే 'అచాపలము'.

**తేజః క్షమా ధృతిః శౌచమ్ అద్రోహో నాతిమానితా ।**
**భవంతి సంపదం దైవీమ్ అభిజాతస్య భారత ॥ 3 ॥**

తేజః = తేజస్సు
క్షమా = క్షమ
ధృతిః = ధైర్యము
శౌచమ్ = బాహ్యశుద్ధి
అద్రోహః = ఎవ్వరిపైనను శత్రుభావము లేకుండుట
న, అతిమానితా = తానుపూజ్యుడనను అభిమానము లేకుండుట
భారత! = ఓ అర్జునా!
(పైన తెల్పబడిన గుణములన్నియును)
దైవీమ్, సంపదమ్ = దైవీ సంపదతో
అభిజాతస్య = పుట్టినవాని యొక్క (లక్షణములు)
భవంతి = అగును

**ఓఅర్జునా! తేజస్సు, క్షమ, ధైర్యము, శౌచము(బాహ్యశుద్ధి), అద్రోహము (ఎవ్వరిపైనను శత్రుభావము లేకుండుట), అమానిత్వము (తాను పూజ్యుడనను అభిమానము లేకుండుట) మొదలగునవి యన్నియును దైవీసంపదగలవాని లక్షణములు. (3)**

ప్రశ్న - 'తేజము' అనగానేమి?

సమా - శ్రేష్ఠపురుషుల శక్తి విశేషమును 'తేజస్సు' అని యందురు. తేజము గలవారి యెదుట విషయాసక్తులు నీచ ప్రవృత్తులు గల మనుష్యులు గూడ అన్యాయాచరణమునుండి వైదొలగి, వారు చెప్పినట్లు శ్రేష్ఠకర్మలయందు ప్రవృత్తులగుదురు.

ప్రశ్న - 'క్షమ' అనగానేమి?

సమా - తమకు అపకారము చేసినవారిని గూడ ఏ విధముగను దండించు ఆలోచనయే లేకుండుట, ఏ రీతిగనైనను వారిపై పగతీర్చుకొనవలెనను ఇచ్ఛ లేకుండుట, వారి అపరాధములను అపరాధములుగా భావింపకుండుట, వాటిని సర్వథా మరచిపోవుటను 'క్షమ' అనియందురు. అక్రోధమునందు కేవలము క్రోధము లేకుండుటయే తెలుపబడినది. కాని అపరాధమునకు తగిన శిక్షను విధించు ఇచ్ఛలేకుండుట 'క్షమ' అనబడును. అక్రోధమునకును క్షమకును భేదమిదియే.

ప్రశ్న - 'ధృతి' యనగానేమి?

సమా - దుర్భరమైన ఆపదలు, భయము, దుఃఖము కల్గినప్పుడు కూడ చలింపకుండుట, కామ క్రోధభయలోభముల కారణమున తన విధ్యుక్త ధర్మము నుండి, కర్తవ్యమునుండి ఏమాత్రము విముఖుడు కాకుండుటను 'ధృతి' అని యందురు- దీనినే 'ధైర్యము' అనియు వ్యవహరింతురు.

ప్రశ్న - 'శౌచము' అనగానేమి?

సమా - సత్యముగా, పవిత్రవ్యవహారము ద్వారా సంపాదించుట వలన 'ద్రవ్యశుద్ధి' కలుగును. అట్టి ద్రవ్యముతో ప్రాప్తించిన అన్నము వలన 'ఆహారశుద్ధి' ఏర్పడును. యథాయోగ్య ప్రవర్తన వలన ఆచరణశుద్ధి కలుగును. జల, మృత్తికాదులద్వారా ప్రక్షాళన చేయుట వలన 'శరీరశుద్ధి' కలుగును. వీటన్నింటిని కలిపి 'బాహ్యశుద్ధి' అని యందురు. ఇదియే 'శౌచము' అని పేర్కొనబడినది. 'సత్త్వసంశుద్ధి' అను పేరుతో 'అంతశ్శుద్ధిని' గూర్చి మొదటి శ్లోకమున నేరుగా చెప్పబడినది.

ప్రశ్న - 'అద్రోహము' అనగానేమి?

సమా - తనయెడ శత్రుత్వముతో వ్యవహరించిన ప్రాణుల విషయమున ఏ మాత్రమూ ద్వేషముగాని, శత్రుభావముగాని లేకుండుటను 'అద్రోహము' అనియందురు.

ప్రశ్న - 'న-అతిమానితా' అనగానేమి?

సమా - తనను తాను శ్రేష్ఠునిగా, గొప్పవానినిగా, పూజ్యునిగా తలంచుకొనుటయు, తన గౌరవకీర్తి ప్రతిష్ఠలకొరకై, సేవలకై, మిక్కిలి ఆరాటపడుటయు, తాను కోరుకున్నను అవి లభించినప్పుడు, అతి ప్రసన్నుడగుటయు - మొదలుగా గల ఇవియన్నియును 'అతిమానితా' లక్షణములు. ఇవి లేకుండుటను 'న-అతిమానితా' అనియందురు.

ప్రశ్న - 'దైవీసంపద' అని దేనిని అందురు?

సమా - దైవమునకు (భగవానునకు) సంబంధించినట్టి, భగవత్ప్రాప్తికి సాధనరూపమైన, సద్గుణ సదాచార సముదాయమును 'దైవీసంపద' అనియందురు. 'దైవీప్రకృతి' అనియు దీనికి పేరు.

ప్రశ్న - 'ఇవి యన్నియును దైవీసంపద గలవాని లక్షణములు' అనియనుటలోని ప్రత్యేకత యేమి?

సమా - ఈ అధ్యాయముయొక్క మొదటి శ్లోకమునుండి ఈ మూడవ శ్లోక పూర్వార్థము వరకును వర్ణింపబడిన ఇఱువదియారు (26) లక్షణములును దైవీ సంపద రూప సద్గుణ సదాచారములు. ఈ లక్షణములు స్వాభావికముగా కలవాడు గాని, సాధనద్వారా పొందినవాడు గాని దైవీసంపద కలవాడే యగును.

సంబంధము - పెంపొందించు కొనవలసిన దైవీ సంపద లక్షణములను వర్ణించి, ఇప్పుడు త్యజింపవలసిన 'ఆసురీ సంపద' లక్షణములను సంక్షిప్తముగా తెల్పుచున్నాడు-

**దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | క్రోధః | = క్రోధము | | అన్నియును |
| దంభః | = దాంబికము (కపటము) | పారుష్యమ్, చ | = మాటలయందును, చేష్టలయందును కాఠిన్యము | ఆసురీమ్, సంపదమ్ | = ఆసురీ సంపదతో |
| దర్పః, చ | = మొండితనము | | | అభిజాతస్య | = పుట్టినవాని (లక్షణములు) |
| అభిమానః | = దురభిమానము | అజ్ఞానమ్, ఏవ | = అజ్ఞానము మొదలగునవి | | |
| చ | = మఱియు | | | (భవంతి) | = (అగును) |

**ఓ పార్థా! దంభము(కపటము), దర్పము(మొండితనము), అభిమానము, క్రోధము, పారుష్యము, (మాటల యందును, చేష్టలయందును కఠినత్వము), అజ్ఞానము మొదలగునవి ఆసురీ స్వభావముగలవాని లక్షణములు. (4)**

ప్రశ్న - 'దంభము' అనగానేమి?

సమా - గౌరవకీర్తిప్రతిష్ఠలకై, సేవలకై (తనను ఇతరులు సేవించుటకై), ధనాదుల యందలి లోభముచే గాని, ఇతరులను మోసపుచ్చు దృష్టితోగాని తనను ధర్మాత్మునిగా, భగవద్భక్తునిగా, జ్ఞానిగా, మహాత్మునిగా ప్రచారము చేసికొనుట, దాన ధర్మగుణములను, భక్తిని, వ్రత - ఉపవాసాదులను యోగసాధనను ఆచరించుచున్నట్లు నటించు చుండుటను 'దంభము' (మిథ్యాచారము) అనియందురు.

ప్రశ్న - 'దర్పము' అనగానేమి?

సమా - విద్య, ధనము, కుటుంబము, జాతి, వయస్సు, బలము, ఐశ్వర్యము మొదలగువాటి సంబంధముచే మనస్సునందు మొండితనము గర్వము ఏర్పడును. ఆకారణమున అతడు ఇతరులను చిన్నచూపు చూచుచు చులకన చేయును – దీనినే 'దర్పము' అనియందురు.

ప్రశ్న - 'అభిమానము' అనగానేమి?

సమా - తనను తాను శ్రేష్ఠునిగా, గొప్పవానినిగా, పూజ్యునిగా తలంచుకొనుట, గౌరవమును, కీర్తిప్రతిష్ఠలను, సేవాదికములను కోరుకొనుట, అవి లభించినపుడు ప్రసన్నుడగుట 'అభిమానము' అనబడును.

ప్రశ్న - 'క్రోధము' అని దేనిని అందురు?

సమా – చెడు అలవాట్లవలనగాని, కోపిష్ఠులైన మనుష్యుల సాంగత్యమువలన గాని, లేక ఇతరులద్వారా తిరస్కారము, అపకారము, నింద. ఎదురైనప్పుడు గాని, తన మనస్సునకు విరుద్ధముగా ఏవైనా పనులు జరిగినప్పుడుగాని, ఇతరుల దుర్వచనములను విన్నప్పుడుగాని, అన్యాయమును చూచినప్పుడు గాని, ఈ మొదలైన వాటిలో దేనివలననైనను అంతఃకరణము నందు కలుగు ద్వేషయుక్తమైన ఉద్వేగమును 'క్రోధము' అని యందురు. దీని కారణమున మనస్సునందు

ప్రతిహింసాభావము పెల్లుబుకును. నేత్రములు ఎఱ్ఱబారును. పెదవులు వణకును. ముఖాకృతి భయానక మగును. బుద్ధి మొద్దుబారును. కర్తవ్య వివేకము నశించును. ఈ విధమైన ఉద్వేజిత వృత్తివి క్రోధమనియందురు.

ప్రశ్న - 'పారుష్యము' అనగానేమి?

సమా - 'కోమలత్వము' ఏ మాత్రమూ లేకుండుటను పారుష్యము (కఠోరత్వము) అనియందురు. ఇతరులను తిట్టుట, దుర్భాషలాడుట, ఎగతాళి చేయుట మొదలగునవి 'వాక్పారుష్యము'లోని భాగములు - వినయము లేకుండుట 'శరీర పారుష్యము' క్షమా, దయాగుణములు లేకుండ ప్రతిహింసా క్రూరత్వభావనలు - మానసిక కఠోరత్వము క్రిందికి వచ్చును.

ప్రశ్న - 'అజ్ఞానము' అను పదము ఇచట దేనిని సూచించును?

సమా - సత్యాసత్యములు, ధర్మాధర్మములు మొదలగు వాటిని యథార్థముగా గ్రహింపక, వాటి విషయమున విపరీత నిర్ణయములను చేయుటను 'అజ్ఞానము' అనియందురు.

ప్రశ్న - 'అసురీసంపద' - అనగానేమి? 'ఇవన్నియును అసురీసంపదగల పురుషుని లక్షణములు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని అస్తిత్వమును విశ్వసింపని వారిని, ఆయనకు విరోధులైన నాస్తికులను అసురులు అనియందురు. ఇట్టి వారిలోగల దుర్గుణ దురాచార సముదాయమునే 'అసురీ సంపద'యని యందురు. ఈ శ్లోకమునందు ఇట్టి దురాచార సముదాయము సంక్షిప్తముగా తెలుపబడినది. కనుక ఈ లక్షణములన్నియును, లేక వీటిలో ఏ ఒక్కటియైనను కలవానిని అసురీ సంపద గలవాడని భావింపవలెను.

*సంబంధము - ఈ విధముగా దైవీ సంపదలు, అసురీ సంపదలు గల పురుషుల లక్షణములను వర్ణించి, ఈ రెండు సంపదల యొక్క ఫలములను తెలుపుచున్నాడు. అర్జునుడు దైవీ సంపదగలవాడని తెల్పి, ఆయనకు ధైర్యము గల్గించుచున్నాడు-*

**దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।**
**మా శుచః సంపదం దైవీమ్ అభిజాతోఽసి పాండవ ॥ 5 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాండవ! | = ఓ అర్జునా! | నిబంధాయ | = బంధము కొఱకు (బంధ హేతువు) అని | మా శుచః | = శోకింపకుము |
| దైవీ సంపత్ | = దైవీ సంపద | | | (యతః) | = ఎందువలన అనగా (నీవు) |
| విమోక్షాయ | = ముక్తికొఱకు (ముక్తిదాయకము) | మతా | = భావింపబడును | దైవీమ్, సంపదమ్ | = దైవీసంపదతో |
| ఆసురీ | = అసురీసంపద | (అతః) | = కనుక | అభిజాతః, అపి | = పుట్టినవాడవు |

**ఓ అర్జునా! దైవీసంపద ముక్తిదాయకము. అసురీసంపద బంధహేతువు. నీవు దైవీసంపదతో పుట్టినవాడవు. కనుక శోకింపకుము. (5)**

ప్రశ్న - "దైవీసంపద ముక్తిదాయకము" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - మొదటి మూడు శ్లోకములలో వర్ణింపబడిన సాత్త్వికగుణములయొక్క, ఆచరణములయొక్క సముదాయ రూపమైన దైవీసంపద మనుష్యుని సంసారబంధముల నుండి శాశ్వతముగా ముక్తునిగా చేసి, సచ్చిదానంద ఘన పరమేశ్వర ప్రాప్తి కల్గునట్లు చేయునని వేదశాస్త్రములును, మహాత్ములును తెల్పుట జరిగినది. ఈ విషయమును స్పష్టపరచుటకే దైవీసంపద ముక్తిదాయకమని పేర్కొనబడినది.

ప్రశ్న - "అసురీసంపద బంధహేతువు" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - నాల్గవ (4వ) శ్లోకమున సంక్షిప్తముగా వర్ణింపబడిన దుర్గుణ దురాచార రూప రజోమిశ్రిత తమోగుణప్రధానమైన భావ సముదాయమును 'అసురీ సంపద'గా భావింపవలెను. ఇది మనుష్యుని అన్నివిధములుగ

సంసారబంధములయందు చిక్కుకొను నట్లుచేసి, అతనిని అధోగతి పాలుచేయును - అని వేదశాస్త్రములచేతను, మహాత్ములచేతను తెల్పబడినది.

ప్రశ్న - "నీవు దైవీసంపదతో జన్మించితివి. కనుక శోకింపకుము." అని అర్జునునితో అనుటలోని అంతరార్థమేమి?

సమా - అర్జునుడు సహజముగనే దైవీసంపదతో జన్మించినవాడు. ఆ దైవీసంపదలక్షణములన్నియును అతనిలో గలవు. కావున అతనికి సంసార బంధముల నుండి విముక్తి కలిగి, శ్రేయస్సు చేకూరుననుటలో ఎట్టి సందేహమూలేదు. కనుక అతడు శోకింపపనిలేదని భగవానుడు అతనికి ధైర్యమును చేకూర్చెను.

*సంబంధము - ఈ అధ్యాయము యొక్క ప్రారంభమునందును, ఇంతకు ముందును దైవీసంపద వర్ణనము విస్తృతముగా చేయబడినది. కాని, ఆసురీ సంపదను గూర్చి ఇంతవరకును మిక్కిలి సంక్షిప్తముగా వర్ణించుట జరిగినది. కావున ఆసురీ ప్రకృతిగల మనుష్యుల స్వభావములను ఆచారవ్యవహారములను విపులముగా వర్ణించుటకు భగవానుడు ఉపక్రమించుచున్నాడు-*

**ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।**
**దైవో విస్తరశః ప్రోక్తః ఆసురం పార్థ మే శృణు ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ అర్జునా! | | సముదాయము (అని) | విస్తరశః | = విస్తృతముగా |
| అస్మిన్, లోకే | = ఈలోకమునందు | ద్వౌ, ఏవ | = రెండు విధములగు | ప్రోక్తః | = చెప్పబడినది |
| దైవః | = దైవలక్షణములుగల మానవ సముదాయము | భూతసర్గౌ | = ప్రాణుల (మానవ) సృష్టులు | ఆసురమ్ | = ఆసురసృష్టిని (వారిని గూర్చి) |
| | | (స్తః) | = (కలవు) | | |
| ఆసురః, చ | = ఆసురలక్షణములు గల మానవ | దైవః | = దైవలక్షణములుగల సృష్టి (అని) | మే | = నా వలన |
| | | | | శృణు | = వినుము |

**ఓ అర్జునా! ఈ లోకముననున్న మానవులు రెండువిధములుగా ఉందురు. దైవలక్షణములు గలవారు కొందఱు. ఆసురలక్షణములు గలవారు మఱికొందఱు. దైవ లక్షణములు విస్తృతముగా తెల్పబడినవి. ఇప్పుడు ఆసురలక్షణములుగలవారిని గూర్చి వివరముగా తెల్పెదను వినుము. (6)**

ప్రశ్న - 'భూతసర్గౌ' అనుపదమునకు 'మనుష్య సముదాయము' అను అర్థము ఎట్లుచెప్పబడినది?

సమా - సర్గమనగా సృష్టి. భూతసృష్టిని 'భూతసర్గము' అని యందురు. ఇచట 'అస్మిన్' 'లోకే' అనుపదముల ద్వారా మనుష్యలోకము సూచించబడినది. అట్లే ఈ అధ్యాయము నందు మనుష్య లక్షణములు తెల్పబడినవి. అందువలన ఇచట 'భూతసర్గౌ' అను సమాసమునకు 'మనుష్యసముదాయము' అను అర్థము తెల్పబడినది.

ప్రశ్న - మనుష్య సముదాయము రెండు విధములు - అని తెల్పుచు 'ఏవ' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - మనుష్య సముదాయమునందు పెక్కు భేదములున్నను అందు రెండు విభాగములే ముఖ్యమైనవి. ఏలనన ఆ ఇతరభేదములు అన్నియును ఈ రెండింటిలోనే అంతర్గతములు.

ప్రశ్న - ఒక వర్గము వారు దైవీ ప్రకృతి గలవారు. మరియొక వర్గము వారు అసురీ ప్రకృతిగలవారు - అనియనుటలోని విశేషమేమి?

సమా - ఇచట రెండు వర్గముల వారిని గూర్చి స్పష్టముగా తెల్పబడినది. రెండు విధములైన మనుష్య సముదాయములలో సాత్త్వికులు దైవీ ప్రకృతి గలవారు. రజోమిశ్రిత తమోగుణము గలవారు ఆసురీప్రకృతిగలవారు. రాక్షసీ, మోహినీ ప్రకృతులు గల మనుష్యులు ఆసురీ ప్రకృతి సముదాయములో చేరుదురు.

ప్రశ్న - "దైవీ ప్రకృతిగలవారిని గూర్చి విస్తృతముగా తెల్పబడినది - ఇప్పుడు ఆసురీ ప్రకృతి వారిని గూర్చియు

వినుము" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ అధ్యాయమునందలి మొదటి మూడు శ్లోకములలోను ఇతర అధ్యాయములందును దైవీ ప్రకృతి గలవారి స్వభావాచరణ వ్యవహారాదుల వర్ణనము విపులముగా చేయబడినది. కాని ఆసురీ ప్రకృతి గల వారియొక్క స్వభావాచరణ వ్యవహారములను గూర్చి సంక్షిప్తముగా మాత్రమే ప్రస్తావింపబడినది. కనుక అట్టి లక్షణములను త్యజించుటకై అని విస్తృతముగా తెల్పబడుచున్నవి.

*సంబంధము - ఆసురీప్రకృతిగలవారి లక్షణములను వినుటకై అర్జునుని సుముఖునిగా జేసి, భగవానుడు ఇపుడు వారిని గూర్చి వర్ణించుచున్నాడు-*

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఆసురాః | = ఆసురస్వభావముగల | న విదుః | = ఎఱుంగరు | ఆచారః, చ | = సత్కర్మాచరణమూ |
| జనాః | = మనుష్యులు | తేషు | = వారిలో | న | = ఉండదు |
| ప్రవృత్తిమ్, చ | = (ధర్మ) ప్రవృత్తినిగాని | శౌచమ్ | = బాహ్యాభ్యంతరశుద్ధి | సత్యమ్, అపి | = సత్యభాషణముకూడ, |
| నివృత్తిమ్,చ | = (అధర్మ) నివృత్తినిగాని | న, విద్యతే | = ఉండదు | న | = ఉండదు |

**ఆసురస్వభావముగలవారు ప్రవృత్తినివృత్తులను (కర్తవ్యాకర్తవ్యములను) ఎఱుగరు. కనుక వారిలో బాహ్యాభ్యంతర శుచిత్వముగాని, శ్రేష్ఠమైన ప్రవర్తనగాని, సత్యభాషణముగాని ఉండనే ఉండవు.(7)**

ప్రశ్న - 'ఆసుర స్వభావముగలవారు ప్రవృత్తి నివృత్తి మార్గములను గూర్చి యెరుగరు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇహపరలోకములయందు మనుష్యునకు నిజముగా శ్రేయస్సును గూర్చు కర్మాచరణమే అతని కర్తవ్యము. అతడు దాని యందే ప్రవృత్తుడు కావలెను. శ్రేయస్కరము గాని కర్మాచరణము అకర్తవ్యము - దాని నుండి మనుష్యుడు నివృత్తుడు కావలెను. ఆసురస్వభావము గలవారు ఈ కర్తవ్యాకర్తవ్యములకు సంబంధించిన ప్రవృత్తి, నివృత్తులను ఏమాత్రము ఎరుగరు. కనుక వారు తమకు తోచిన రీతిగా ప్రవర్తింతురు.

ప్రశ్న - "వారిలో శౌచము (శుచిత్వము), శ్రేష్ఠకార్యాచరణము, సత్యభాషణము ఉండవు" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - బాహ్యాభ్యంతర పవిత్రతను శౌచము అందురు. దీనిని గూర్చి 13వ అధ్యాయమునందలి 7వ శ్లోకముయొక్క వ్యాఖ్యానమునందు విపులముగా తెల్పబడినది. శ్రేష్ఠమైన కర్మలు ఇట్టి పవిత్రతతో సుసంపన్నములై యుండును. అట్టి కర్మలనే **ఆచారములు** అని అందురు. నిష్కపటముగా, హితకరముగా చేయబడు యథార్థ భాషణమును 'సత్యము' అని యందురు. ఈ అధ్యాయమునందలి 2వ శ్లోకవ్యాఖ్యానము నందు దీనిని గూర్చి వివరింపబడినది. ఆసుర స్వభావము గల మనుష్యులయందు ఈ మూడు లక్షణములలో ఏదియు ఉండదు సరికదా వారి యందు అపవిత్రత, దురాచారములు, మిథ్యాభాషణములును ఉండును.

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క ఉత్తరార్ధమున 'న' అను దానిని మూడు పర్యాయములు, మరల 'అపి' అను అవ్యయమును భగవానుడు ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - అసుర స్వభావముగల వారి యందు కేవలము అపవిత్రత యుండుటయే గాదు వారిలో సదాచారమూ ఉండదు, సత్యభాషణమూ ఉండదు - అని తెల్పుటకే అట్లు ప్రయోగించుట జరిగినది.

*సంబంధము - అసురస్వభావము గలవారియందు వివేక శౌచ సదాచారాదులు ఉండవని తెల్పుచు వారి నాస్తిక భావములను గూడవర్ణించుచున్నాడు-*

**అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।**
**అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకమ్ ॥ 8 ॥**

తే = వారు (ఆసురీ ప్రకృతి గల మనుష్యులు)
జగత్ = జగత్తు
అప్రతిష్ఠమ్ = ఆశ్రయ రహితమనియు
అసత్యమ్ = సర్వథా అసత్యమనియు
అనీశ్వరమ్ = ఈశ్వరుడే లేనిదనియు
అపరస్పర సంభూతమ్ = కేవలము స్త్రీపురుష సంయోగమువలననే ఉత్పన్నమైనదనియు
కామ హైతుకమ్ = కామమే దీనికి కారణమనియు
అన్యత్, కిమ్ = ఇది తప్పమఱేమియు లేదనియు
ఆహుః = పలికెదరు

ఈ జగత్తునకు ఆధారమైనది ఏదియును లేదనియు, ఇది అసత్యమనియు, భగవంతుడనెడివాడు లేనేలేడనియు, కామప్రేరితులైన స్త్రీపురుషులసంయోగ కారణముగ జీవులు సహజముగనే పుట్టుచున్నారనియు, కావున సృష్టికి కామము తప్ప మఱొక కారణమే లేదనియు అసురలక్షణములు గలవారు భావింతురు. **(8)**

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క అంతరార్థమేమి?

సమా - ఆసురీ ప్రకృతి గలవారు ఊహాలోకములలో తేలిపోవుచుందురు. ఈ చరాచర జగత్తునకు భగవానుడు గాని, ధర్మాధర్మములు గాని, ఆధారములు కావనియు, ఈ జగత్తునకు శాశ్వతమైన ఉనికి ఏదియు లేదనియు వారు భావింతురు. పుట్టుటకు ముందును, మరణించిన పిదపను జీవికి అస్తిత్వమే లేదనియు, ప్రాణులను సృష్టించు, నియమించు, శాసించు ఈశ్వరుడు అనువాడు లేనేలేడనియు వారు తలంతురు. కామప్రేరితులైన స్త్రీపురుషులయొక్క సంయోగ కారణముగ జీవులు సహజముగనే పుట్టుచున్నారనియు, సృష్టికి కామముతప్ప మఱియొక కారణమే లేదనియు అసురలక్షణములు గలవారు భావింతురు.

*సంబంధము - ఇట్టి నాస్తిక సిద్ధాంతములను విశ్వసించు వారి స్వభావాచరణములను గూర్చి, రాబోవు నాలుగు(4) శ్లోకములలో భగవానుడు వర్ణించుచున్నాడు-*

**ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।**
**ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9 ॥**

ఏతామ్, దృష్టిమ్ = ఈ మిథ్యావాదమును (నాస్తిక దృష్టిని)
అవష్టభ్య = అవలంబించి
నష్టాత్మానః = తమస్వభావమును కోల్పోయిన వారైన (ఆత్మయొక్క అస్తిత్వమును విశ్వసింపనివారై)
అల్పబుద్ధయః = మందబుద్ధులు
అహితాః = అందఱికిని అపకారము చేయునట్టి
ఉగ్రకర్మాణః = క్రూరకర్మలను ఆచరించువారై
జగతః, క్షయాయ = జగత్తుయొక్క వినాశము కొఱకే
ప్రభవంతి = సమర్థులగుచున్నారు

అసంబద్ధమైన ఇట్టి మిథ్యావాదముచేయుభౌతికవాదులు ఆత్మనుగూర్చి తలంపరు. (ఆత్మయొక్క అస్తిత్వమును విశ్వసింపరు) వారు మందబుద్ధులు. వారు అందఱికిని అపకారముచేయుక్రూరులు. వారి శక్తిసామర్థ్యములు ప్రపంచ వినాశమునకే వినియోగపడుచుండును. **(9)**

ప్రశ్న - "ఇట్టి మిథ్యావాదమును వారు అవలంబింతురు" - అనగానేమి?

సమా - అసుర స్వభావములు గల మనుష్యులయొక్క కార్యములన్నియును ఈ నాస్తిక సిద్ధాంతదృష్టితోడనే సాగుచుండును. ఈ విషయమును సూచించుటకే 'ఏతాం దృష్టి మవష్టభ్య' అను వాక్యము ప్రయోగింపబడినది.

ప్రశ్న - వారిని 'నష్టాత్మానః' 'అల్పబుద్ధయః' 'అహితాః' 'ఉగ్రకర్మాణః' అని పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - నాస్తిక సిద్ధాంతములను నమ్మువారు ఆత్మయొక్క ఉనికిని విశ్వసింపరు. వారు కేవలము దేహవాదులు, భౌతిక వాదులు. దీని వలన వారి స్వభావములు భ్రష్టములగును. ఏ విధములైన సత్కార్యాచరణముల యందును వారు ప్రవృత్తులు కారు. వారు మందబుద్ధులు. దేనినైనను వారు కేవలము భోగానుభవదృష్టితోడనే చూచుదురు. ఇతరులకు ఎల్లరకును కీడు చేయుటకే వారు తలపెట్టు చుందురు. ఈ కారణముగ వారు తమకు గూడ హానియే చేసికొందురు. సకల ప్రాణులను భయపెట్టుటకును, దుఃఖము కల్గించుటకును, నాశము చేయుటకును మనోవాక్కాయముల ద్వారా వారు అత్యంత భయానకములైన కర్మలనే జేయుచుందురు.

ప్రశ్న - "వారి శక్తి సామర్థ్యములు జగద్వినాశమునకే దారి తీయును."- అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పైన పేర్కొనబడిన ఆసురీ ప్రకృతి గలవారు తమ జీవితములయందు మనోబుద్ధి వాక్+కాయముల ద్వారా చేయు కర్మలన్నియును సకలచరాచరప్రాణి లోకమునకు హాని గూర్చుటకును, నాశము చేయుటకును తోడ్పడును. కావున వారి శక్తిసామర్థ్యములు జగద్వినాశమునకే దారి తీయునని తెల్పబడినది.

**కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః ।**
**మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥ 10 ॥**

దంభమాన మదాన్వితాః = దంభము, దురభిమానము, మదము మున్నగు వానితోగూడినవారు
దుష్పూరమ్ = నింపశక్యముగాని (తనివితీరని)
కామమ్, ఆశ్రిత్య = కోరికలను ఆశ్రయించి
మోహాత్ = అజ్ఞానకారణముగ
అసద్గ్రాహాన్ = మిథ్యా సిద్ధాంతములను
గృహీత్వా = అవలంబించి
అశుచివ్రతాః = శాస్త్రవిరుద్ధములైన భ్రష్టాచారములను ఆచరించుచు
ప్రవర్తంతే = ప్రవర్తించెదరు

**దంభము, దురభిమానము, మదములతోగూడిన ఈ ఆసురలక్షణములు గలవారు యుక్తాయుక్తములను మరచి, తమవాంఛలను ఏదో విధముగ తీర్చుకొనుటకు సిద్ధపడుదురు. అజ్ఞానకారణముగ మిథ్యాసిద్ధాంతములను ఆశ్రయింతురు. శాస్త్రవిరుద్ధముగా భ్రష్టాచారులై ప్రవర్తింతురు. (10)**

ప్రశ్న - 'దంభమానమదాన్వితాః' అనగానేమి?

సమా - వాస్తవముగా గొప్పదనము, ధనము, కీర్తి ప్రతిష్ఠలు మొదలగునవి లేకున్నను స్వార్థ లాభములకై అవి ఉన్నట్లుగా నటించుటను దంభమనియందురు. తనకు తాను గౌరవార్హుడనని, పూజ్యుడనని అనుకొనుటను, ప్రకటించుకొనుటను దురభిమానము (గర్వము) అని యందురు. రూపము, గుణము, జాతి, ఐశ్వర్యము, విద్య, పదవి, ధనము, సంతానము మొదలగు వాటి కారణమున ఉన్మత్తుడై గర్వపడుటను 'మదము' అని యందురు. ఆసురస్వభావము గలవారు ఈ దంభమాన మదములను కల్గియుందురు. అని తెల్పుటకే 'దంభమానమదాన్వితాః' అను సమాసము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'దుష్పూరమ్' అను విశేషణముతోపాటు 'కామమ్' అను పదము దేనిని తెల్పును? దానిని ఆశ్రయించుట యనగానేమి?

సమా - పూర్తిగా తీర్చుకొనుటకు సాధ్యము కాని వేర్వేఱు భోగానుభవముల ఇచ్ఛలను సూచించునదియే 'దుష్పూరమ్' అను విశేషణముతో పాటు ప్రయుక్తమైన 'కామమ్' అను

పదము. ఇట్టి కోరికలను తీర్చుకొనుటకు మనస్సునందు దృఢముగా సంకల్పించుటయే వాటిని ఆశ్రయించుట యగును.

ప్రశ్న - అజ్ఞానకారణముగా మిథ్యా సిద్ధాంతములను ఆశ్రయించుట యనగానేమి?

సమా - అజ్ఞానములోబడి అనేక విధములైన శాస్త్రవిరుద్ధ సిద్ధాంతములను ఊహించుకొని, వాటినే అంటిపెట్టుకొని యుండుటను 'అజ్ఞాన కారణమున మిథ్యాసిద్ధాంతములను ఆశ్రయించుట' అని యందురు.

ప్రశ్న - 'అశుచివ్రతాః' అనగానేమి?

సమా - అన్నపానాదులు, నిత్యజీవన విధానము, మాటాడుతీరుతెన్నులు, వ్యాపారవ్యవహారములు, ఇచ్చి పుచ్చుకొనుటలు (ఆదాన ప్రదానములు), సామాజిక ప్రవర్తనలు మొదలగునవి అన్నియు శాస్త్రనియమ విరుద్ధములై, భ్రష్టములై యుండును.

ప్రశ్న - 'ప్రవర్తన్తే' అనగానేమి?

సమా - వారు అజ్ఞానములో కూరుకొని పోయిన వారై భ్రష్టాచారులై, ప్రపంచమున విశృంఖలముగా ప్రవర్తింతురు.

**చింతామపరిమేయాం చ ప్రలయాంతాముపాశ్రితాః ।**
**కామోపభోగపరమాః ఏతావదితి నిశ్చితాః ॥ 11 ॥**

| | | |
|---|---|---|
| ప్రలయాంతామ్ = మరణించు వఱకును ఉండెడి | పరంపరను | మునిగియున్నవారై |
| | ఉపాశ్రితాః = ఆశ్రయించిన వారై | చ = మఱియు |
| అపరిమేయామ్ = అంతులేని | | ఏతావత్, ఇతి = ఇదియే నిజమైన సుఖమని |
| చింతామ్ = చింతా | కామోపభోగ పరమాః = విషయభోగానుభవములయందే | నిశ్చితాః = భావింతురు |

మరణించువఱకును వారు అంతులేనిచింతలలోనే మునిగిపోవుచుందురు. విషయభోగానుభవముల యందే తత్పరులై అదియే నిజమైన సుఖమని భావింతురు. (11)

ప్రశ్న - "వారు మరణించు వరకును అంతు లేని చింతలలో మునిగియుందురు" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆసురస్వభావము గలవారు భోగానుభవములకై మృత్యుపర్యంతము అసంఖ్యాకములైన చింతలలో మునిగి యుందురు. ఈ చింతలకు అంతమే యుండదు. ఇందులకు వారు కామోపభోగపరాయణులగుటయే కారణము.

ప్రశ్న - "విషయానుభవములలో మునిగి, ఇదియే నిజమైన సుఖము" - అని భావింతురనుటలోని విశేషమేమి?

సమా - విషయభోగానుభవములకై వస్తువులను సేకరించుచు వాటిని అనుభవించుటయే వారి జీవిత లక్ష్యము. కావున జీవితాంతమువరకును అందులోనే మునిగి తేలుచు, భోగానుభవములలో వాస్తవముగా సుఖము కలదని గట్టిగా విశ్వసింతురు.

**ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।**
**ఈహంతే కామభోగార్థమ్ అన్యాయేనార్థసంచయాన్ ॥ 12 ॥**

| | | |
|---|---|---|
| ఆశాపాశశతైః, = ఆశాపాశపరంపరలచే | కామభోగార్థమ్ = విషయభోగముల నిమిత్తమై | అర్థసంచయాన్ = ధనసమూహములను ప్రోగుచేయుటకొఱకు |
| బద్ధాః బంధింపబడినవారు | | |
| కామక్రోధ పరాయణాః = కామక్రోధములకు లోనైనవారై | అన్యాయేన = అక్రమ మార్గముల ద్వారా | ఈహంతే = ఆరాటపడు చుందురు |

వారు ఆశాపాశపరంపరలచే ఎల్లప్పుడును బంధింపబడుచుందురు. కామక్రోధపరాయణులై ప్రవర్తింతురు. విషయభోగముల నిమిత్తమై, అన్యాయ మార్గములద్వారా ధనార్జనకు పాల్పడుచుందురు. (12)

ప్రశ్న - 'వారు ఆశాపాశపరంపరలచే బంధింపబడుచుందురు -' అని అనుటలోని విశేషమేమి?

సమా - ఆసుర స్వభావము గలవారి మనస్సుల యందు అనేక విధములైన కామోపభోగ కల్పనలు చెలరేగుచుండును. వాటిని తీర్చుకొనుటకై నానావిధములైన ఆశాపాశపరంపరలలో చిక్కుకొనుచుందురు. వారి మనస్సులు ఒక క్షణమున ఒక విషయమునందు ఆసక్తమగును. మరుక్షణముననే అవి మరియొక విషయముచే లాగబడును. తత్క్షణమే అవి వేఱొక విషయమున మునుగును. ఈ విధముగా ఆశాపాశపరంపరలు వారిని ఎప్పటికిని వదలవు. అందువలన వీరు ఆశాపాశ బద్ధులని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - 'కామక్రోధపరాయణాః' అనగానేమి?

సమా - ఈ ఆశలను నెరవేర్చుకొనుటకై వారు భగవంతుని గాని, ఏదేని యొక దేవతనుగాని, సత్కర్మలను గాని, సద్విచారములనుగాని ఆశ్రయింపరు. వారు కేవలము కామక్రోధములనే ఆలంబనముగా చేసికొందురు. కావున వారిని కామక్రోధపరాయణులని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - "విషయభోగముల నిమిత్తమై అన్యాయ పద్ధతులలో ధనార్జనకు పాలు పడుచుందురు". అని యనుటలోని విశేషమేమి?

సమా - విషయభోగానుభవములకై కామక్రోధములను ఆలంబనముగా జేసికొని, దొంగతనము, దోపిడి, అసత్యభాషణము, కపటము, మోసము, దంభము, హింస, కూటనీతి, జూదము, అక్రమార్జన, విషప్రయోగము, నిందలు వేయుట, భయపెట్టుట, మొదలగు శాస్త్ర (ధర్మ) విరుద్ధములైన అక్రమ పద్ధతులద్వారా ఇతరుల సొత్తులను అపహరింప ప్రయత్నింతురు. విషయ భోగముల నిమిత్తమై అన్యాయరీతిలో అర్థసంచయమునకై ప్రయత్నించుట యనగా నిదియే.

*సంబంధము - ఇంతవఱకును చెప్పబడిన నాలుగు(4) శ్లోకములయందును ఆసురస్వభావము గల మనుష్యుల లక్షణములు, ఆచరణములు తెలుపబడినవి. ఇపుడు రాబోవు నాలుగు శ్లోకములలో అహంకారమమకార మోహములతో గూడిన వారి సంకల్పములను వివరించుచు, వారికి పట్టు దుర్గతులను వర్ణించుచున్నాడు-*

**ఇదమద్య మయా లబ్ధమ్ ఇమం ప్రాప్స్యే మనోరథమ్ ।**
**ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ 13 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మయా | = నాచేత | ఇమమ్, మనోరథమ్ | = ఇంకను ఇట్టి అభీష్టమునుగూడ | ఇదమ్, ధనమ్ | = ఈపాటిధనము |
| అద్య | = ఈనాటికే (ఇప్పటికే) | | | అస్తి | = కలదు |
| ఇదమ్ | = ఇట్టి అభీష్టవస్తువు(లు) | ప్రాప్స్యే | = పొందగలను | పునః, అపి | = ఇంకను |
| లబ్ధమ్ | = పొందబడినది(వి) | మే | = నాయొద్ద | ఇదమ్, భవిష్యతి | = ఈ సంపద ఎంతో పెఱుగును |

"నేను మిక్కిలి పురుషార్థిని గనుక ఈ అభీష్టవస్తువును పొందితిని. ఇంకను నా మనోరథము లన్నింటిని సాధించుకొనగలను. ఇప్పటికే నాకడ ఎంతో ధనము ఉన్నది. ముమ్ముందు ఇంకను ఎంతోధనమును సంపాదింపగలను" అని వారు తలంచుచుందురు. (13)

ప్రశ్న - ఈ శ్లోకము యొక్క అంతరార్థమేమి?

సమా - 'మనోరథము' అను పదము ఇచట స్త్రీ, పుత్రులు, ధనము, ఇల్లు, గౌరవప్రతిష్ఠలు, మొదలగు మనోవాంఛిత పదార్థముల చింతనను తెలియజేయును. ఆసుర స్వభావము గలవారు అహంకారకారణముగ అనేకములగు ఆలోచనలను చేయుచుందురు – "ఈ ప్రత్యేక అభీష్టవస్తువును నేను నా పురుషార్థముతో సంపాదించితిని. ఈ మనోవాంఛిత వస్తువును నా పురుషార్థతతో సంపాదింపగలను. నేనే మిక్కిలి ధనము, ఐశ్వర్యము కలవాడను. ఇంకను సంపాదింతును." – అని వారు తలపోయుచుందురు.

**అసౌ మయా హతః శత్రుః హనిష్యే చాపరానపి ।**
**ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥ 14 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అసౌ, శత్రుః | = ఈ శత్రువు | అహమ్, హనిష్యే | = నేను వధింపగలను | అహమ్, సిద్ధః | = నేను సర్వసిద్ధులు గలవాడను |
| మయా | = నాచేత | అహమ్, ఈశ్వరః | = నేనే సర్వాధిపతిని | బలవాన్ | = నేను మిక్కిలి బలవంతుడను |
| హతః | = చంపబడెను | భోగీ | = సమస్త భోగములను అనుభవించువాడను | సుఖీ | = సుఖిని |
| చ | = మఱియు | | | | |
| అపరాన్, అపి | = ఇతరశత్రువులనుగూడ | | | | |

"నేను ఈ శత్రువును వధించితిని. ఇతర శత్రువులనుగూడ వధింపగలను. నేనే సర్వాధిపతిని. సమస్త సుఖ భోగములను అనుభవింపగలవాడను నేనే. సిద్ధులన్నియు నా గుప్పిటనే యున్నవి. నేనే గొప్ప బలవంతుడను, సుఖిని. **(14)**

ప్రశ్న - "ఈ శత్రువులను నేనే వధించితిని. ఇతర శత్రువులను గూడ నేను వధింపగలను." - అనియనుటలోని విశేషమేమి?

సమా - కామోపభోగములనే పరమపురుషార్థములుగా భావించు అసురస్వభావము గలవారు కామక్రోధపరాయణు లగుదురు. ఈశ్వరుడు, ధర్మము, కర్మఫలము మొదలగు వాటియందు వారికి ఏ మాత్రము విశ్వాసము ఉండదు. కావున వారు మదోన్మత్తులై "జగత్తునందు నా దారికి అడ్డురాగలవారెవరు? నాకు విరోధులై బ్రతికియుండు వారెవరు?" అని విఱ్ఱవీగుచుందురు. కావున వారు క్రోధోద్రిక్తులై తీవ్రస్వరముతో మాట్లాడుచుందురు. వారు "గొప్ప బలశాలిని, జగత్ప్రసిద్ధ ప్రభావముగలవానిని గూడ (నాతోవైరము పెట్టుకొని నందువలన) చూచుచుండగనే నేను యమపురికి పంపితిని. నాదారికి అడ్డువచ్చినవాడు ఎంత బలవంతుడైనను వరే వానిని సులభముగా తుదముట్టింపగలను." - అని ప్రగల్భము లాడుదురు.

ప్రశ్న - "నేనే సర్వాధిపతిని. భోగిని. సిద్ధులన్నియును నా గుప్పిటలోనే యున్నవి. నేనే బలవంతుడను, సుఖిని." - అని అనుటలోని అంతరార్థమేమి?

సమా - అసురీ ప్రకృతి గలవారు అహంకార పూరితులగుటయేగాక మదోన్మత్తులుగా గూడ అగుచుందురు. వారు "ప్రపంచమున మాకంటెను అధికులు ఎవరు? మా ఇష్టానుసారము ఎవ్వరినైనను చంపగలము, రక్షింపగలము, సమూలముగా రూపుమాపగలము" అని పల్కుచుందురు. ఇంకను గర్వముతో "మేము సర్వదా స్వతంత్రులము, అన్నియును మా చేతులలోనే యున్నవి. మాకు మించిన ఐశ్వర్యవంతులు లేనేలేరు. ఈశ్వరులకు ఈశ్వరులము మేము. అందరును మమ్ములనే ఆశ్రయింప వలెను. పూజింపవలెను. మేము కేవలము ఐశ్వర్యాధిపతులమే కాదు. సమస్తైశ్వర్యములను అనుభవించువారము కూడ. మా జీవితములో వైఫల్యము అనునదియే యుండదు. మేము తాకినదంతయును బంగారము కావలసినదియే. సిద్ధులన్నియును మావే. భవిష్యత్తు సంఘటనములన్నియును మాకనులముందు కనబడుచుండును - మేము సర్వజ్ఞులము. మాకు దృష్టికి రాకుండా ఏ విషయమూ జరుగదు. మేము మిక్కిలి బలశాలురము - మా మనశ్శరీరబలముల అండతోనే ప్రతివ్యక్తికిని జయము సాధ్యమగును - ఈ సర్వాధిపత్యములు, బలములు మాకు మిక్కిలి సుఖములను కలిగించుచున్నవి" - అని వారు ప్రకటించుకొను చుందురు.

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥ 15 ॥
అనేకచిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ ॥ 16 ॥

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| ఆఢ్యః, (అహమ్) | నేను గొప్ప ధనవంతుడను | దాస్యామి | దానములను ఈయగలను | మోహజాల సమావృతాః | మోహజాలమున చిక్కుకొన్నవారై |
| అభిజనవాన్, అస్మి | గొప్ప పరివారము గలవాడను | మోదిష్యే | యథేచ్ఛగా వినోదింపగలను | కామభోగేషు | విషయ భోగములయందు |
| మయా, సదృశః | నాతో సమానుడైనవాడు | ఇతి | ఇట్లు | ప్రసక్తాః | మిక్కిలి ఆసక్తులై (ఈ ఆసురీసంపద గలవారు) |
| అన్యః | మఱియొకడు | అజ్ఞాన విమోహితాః | అజ్ఞాన విమోహితులై | | |
| కః, అస్తి | ఎవడు కలడు? | అనేక చిత్తవిభ్రాంతాః | పెక్కురీతుల చిత్త భ్రమణములకులోనై | అశుచౌ, నరకే | ఘోరనరకముల యందు |
| యక్ష్యే | యజ్ఞములను చేయగలను | | | పతంతి | పడుచుందురు |

**"నేనే గొప్ప ధనవంతుడను, మిక్కిలి పరివారము గలవాడను. నాతో సమానుడు మరియొకడులేడు. నేను యజ్ఞములను చేయగలను. దానములు ఇయ్యగలను. యథేచ్ఛముగా వినోదింపగలను." - అనుచు అనేక విధములుగా అజ్ఞానమోహితులై చిత్తభ్రమణమునకు లోనై మోహజాలమునందు చిక్కుకొని, ఆసురలక్షణములు గలవారు విషయభోగములయందే మిక్కిలి ఆసక్తులై ఘోరనరకముల యందు పడిపోవుచుందురు. (15, 16)**

ప్రశ్న - "నేనే ధనాఢ్యుడను (మిక్కిలి ధనము గలవాడను) పరివారము గలవాడను, ఎవ్వరును నాకు సాటిరారు" అను ఈ వాక్యముల యొక్క అంతరార్థమేమి?

సమా - ఆసురీ ప్రకృతి గలవారు ఈ వాక్యములద్వారా తమ ధన జన గర్వమును ప్రకటించుచుందురు. వారు అహంకారపూరితులై తమ ధనము, కుటుంబము, బంధుమిత్రులు అనుయాయులు, పరివారము మొదలగు వానికి అవధిలేదని పేర్కొందురు. అసంఖ్యాకులైనవారు అన్ని సందర్భములలో తమ కనుసన్నలననుసరించి మెలగుచుందురనియు, ధనజనబలములు కల్గియుండుటలో తమకు సమానులు ఎవ్వరును లేరనియు స్వోత్కర్షతో పలుకుచుందురు.

ప్రశ్న - "నేను యజ్ఞములను చేయగలను. దానములను ఇయ్యగలను." అని యనుటలోని విశేషమేమి?

సమా - వీరు యజ్ఞదానములకు సంబంధించిన మిథ్యాభిమానములను కలిగియుందురు. వీరు వాస్తవముగా సాత్త్విక యజ్ఞములను గాని, దానములను గాని చేయరు. చేయనివ్వగింపరు. కేవలము ఇతరులపై తమ అధికారమును చూపుటకై యజ్ఞదానముల పేరుతో తమ గర్వమును ప్రకటించుకొనుచుందురు - 'నేను ఈ యజ్ఞమును చేయుదును. ఈ దానములను చేయుదును. యజ్ఞదానములను చేయుటలో నేను సాటిలేనివాడను.' అనుచు ఇట్టి వారు, నలుగురిలో తమ ప్రత్యేకతను ప్రకటించుకొనుచుందురు.

ప్రశ్న - "నేను యథేచ్ఛగా వినోదింప గలను" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ వాక్యముద్వారా వారి వినోదజీవితమునకు సంబంధించిన మిథ్యాభిమానము వెల్లడియగుచున్నది. ఈ ఆసుర స్వభావులు నానా విధములైన ప్రగల్భములను పలుకుచు, గర్వోన్మత్తులై తమ భోగ విలాసములలో నిమగ్నులైయుందురు.

ప్రశ్న - 'ఇతి -అజ్ఞాన విమోహితాః' అనగానేమి?

సమా - 13వ శ్లోకమునుండి ఇంతవరకును వివరింపబడిన అహంకారరూప అజ్ఞానముతో ఆసురస్వభావము గలవారు అత్యంతము మోహితులగుదురని పై వాక్యముయొక్క సారాంశము.

ప్రశ్న - 'అనేకచిత్తవిభ్రాంతాః' అనగానేమి?

సమా - ఆసురస్వభావము గల మనుష్యుల చిత్తములు పెక్కు విషయ వాంఛలయందు తగుల్కొని, అనేక విధములగు భ్రాంతులకు లోనగు చుండును. వారి చిత్తము ఏ విషయముల యందును స్థిరముగా ఉండక ఊగిసలాడుచుండును.

ప్రశ్న - 'మోహజాలసమావృతాః' అనగానేమి?

సమా - వలలో చిక్కుకొని, దిక్కుతోచక గిలగిల కొట్టుకొను చేపల వలె ఆసురీ ప్రకృతి గలవారు అవివేక రూప మోహ మాయాజాలములయందు చిక్కుకొని అయోమయ స్థితిలో పడియుందురు.

ప్రశ్న - 'కామభోగేషు ప్రసక్తాః' అనగానేమి?

సమా - ఆసురీప్రకృతి గలవారు విషయోప భోగములనే తమ జీవితముయొక్క ఏకైకలక్ష్యముగా భావింతురు. కనుక వాటియందే వారు విశేషముగా ఆసక్తులై యుందురు.

ప్రశ్న - 'వారు ఘోరనరకముల పాలగుదురు' అనియనుటలోని విశేషమేమి?

సమా - ఆసురస్వభావములు గలవారికి కలుగు దుర్గతి ఇందు వర్ణింపబడినది. పైన తెల్పబడిన లక్షణములు గలవారు కామోపభోగముల కొఱకై వివిధ పాపకర్మలను ఆచరింతురు. తత్ఫలితముగ మలమూత్రములు, చీము, నెత్తురు మొదలగు కశ్మలపూరితమై దుస్సహమైన కుంభీపాక రౌరవాది నరకయాతనలకు గురియగుదురు.

*సంబంధము - ఆసురీ సంపదగలవారు 'నేను యజ్ఞములను చేయగలను' అని పల్కుచుందురని భగవానుడు 15వ శ్లోకమున తెల్పియుండెను. వారు చేయు యజ్ఞముల స్వరూపములను రాబోవు శ్లోకమునందు భగవానుడు వివరించుచున్నాడు-*

**ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।**
**యజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్ ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తే = | వారు ( ఆ అసుర లక్షణములు గలవారు) | స్తబ్ధాః = | స్తబ్ధులై (గర్వోన్మత్తులై) | అవిధిపూర్వకమ్ = | శాస్త్రవిరుద్ధముగా |
| ఆత్మ సంభావితా = | తమకు తామే గొప్పవారమని తలంచుకొను చుందురు | ధనమాన మదాన్వితాః = | సంపదలచే, దురభిమానముచే మదోన్మత్తులై విఱ్ఱవీగువారు | నామయజ్ఞైః = | పేరుకు మాత్రమే |
| | | | | దంభేన = | ఆడంబరముతో |
| | | | | యజంతే = | యజ్ఞములను ఆచరింతురు |

**వారు తమకు తామే గొప్పవారమని భావించుకొనుచు, గర్వోన్మత్తులై, ధనదురహంకారములతో కన్నుమిన్నుగానక ప్రమత్తులై, శాస్త్రవిరుద్ధముగా ఆడంబరప్రధానముగా పేరుకు మాత్రమే యజ్ఞముల నాచరించుదురు. (17)**

ప్రశ్న - 'ఆత్మసంభావితాః' అనగానేమి?

సమా - తమ తమ మనస్సులలో తమకు తామే అన్ని విషయములయందును సర్వశ్రేష్ఠులమని, గౌరవార్హులమని, ఉన్నతులమని, పూజ్యులమని భావించుకొనువారిని 'ఆత్మసంభావితాః' అని యందురు.

ప్రశ్న - 'స్తబ్ధాః' అనగానేమి?

సమా - గర్వకారణముగ పూజ్యులైన వారి యెడ గూడ వినయముతో నడచుకొనని వారిని 'స్తబ్ధాః' అని యందురు.

ప్రశ్న - 'ధనమానమదాన్వితాః' అని ఎవరిని అందురు?

సమా - ధనము, దురభిమానముల కారణముగ మదోన్మత్తులైన వారిని 'ధనమానమదాన్వితాః' అని యందురు.

ప్రశ్న - "శాస్త్రవిరుద్ధముగా ఆడంబరమును ప్రదర్శించుటకై పేరుకు మాత్రమే యజ్ఞములను ఆచరించుదురు." అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఉపర్యుక్త లక్షణములతో ఆసురస్వభావము గలవారు కేవలము పేరుకు మాత్రమే యజ్ఞములను ఆచరింతురు. అవియును విధ్యుక్తములు గాక శాస్త్ర విరుద్ధములైయుండును. వారు కేవలము ఆడంబరమును ప్రదర్శించుటకై, శ్రద్ధాదరములు లేక పేరుకు మాత్రమే అట్టి యజ్ఞములను ఆచరింతురు. వారి ఈ యజ్ఞములు తామసములు. 'అధోగచ్ఛన్తి తామసాః' అను వచనానుసారము వారు నరకముల పాలయ్యెదరు. తామస యజ్ఞములను గూర్చిన పూర్తి వ్యాఖ్యానము 17వ అధ్యాయము నందలి 13వ శ్లోకము నందు ఈయబడినది.

*సంబంధము - ఆసుర స్వభావము గలవారి యజ్ఞముల తీరుతెన్నులను దెలిపిన పిదప వారి దుర్గతికి కారణమైన వారి స్వభావములను మరల వర్ణించుచున్నాడు-*

**అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః ॥ 18 ॥**

అహంకారమ్ = అహంకారము
బలమ్ = బలము
దర్పమ్ = దర్పము (మొండితనము)
కామమ్ = కామము
క్రోధమ్ = క్రోధము (మొదలగువాటిని)
సంశ్రితాః, చ = ఆశ్రయించినవారై
అభ్యసూయకాః = అసూయతో ఇతరులను నిందించువారై
ఆత్మ పరదేహేషు = తమ శరీరముల యందును, ఇతరుల శరీరముల యందును
మామ్ = అంతర్యామిగా నున్న నన్ను
ప్రద్విషంతః = ద్వేషించుచుందురు

**అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధములకు వశులై, ఇతరులను నిందించుచు తమ శరీరములయందును, ఇతరులశరీరములయందును, అంతర్యామిగానున్న నన్ను ద్వేషించుచుందురు. (18)**

ప్రశ్న - 'అహంకార, బల, దర్ప, కామ, క్రోధపరాయణులు'- అనగానేమి?

సమా - ఆసుర స్వభావము గలవారు అహంకారమును అలంబనముగా చేసికొని, "మేమే ప్రభువులము. అన్ని భోగములను అనుభవింప గలవారము. సిద్ధులము, బలవంతులము సుఖులము. మాకు అసాధ్యము అనునదియే లేదు." - అని ప్రగల్భములను పల్కు చుందురు. తమ క్షుద్ర బలములను చూచుకొని, ఇతరులతో వైరము బూని, వారిని భయపెట్టుట, హింసించుట, ఆపదలకు గురిచేయుట మొదలగు వాటి యందు ప్రవృత్తులగుదురు. తమ కండకావరములను చూచుకొని ఎవ్వరిని లెక్క పెట్టరు. తాము గొప్ప ధనాఢ్యులమని, పరివారబలములు కలవారమనియు తలంచి దర్పముతో మిడిసిపడుచుందురు. కామమునాశ్రయించి, అనేక విధములైన దురాచారములకు పాల్పడుదురు. వారు క్రోధోన్మత్తులై తమకు ప్రతికూలములైన కార్యములను చేయువారిని, అనిష్టములను ఆచరించువారిని తుదముట్టింతుమని పల్కుచుందురు - ఈ విధముగ కేవలము అహంకార బలదర్పకామక్రోధములను ఆశ్రయించి, వాటి ప్రభావమున నానావిధములైన కల్పన జల్పనములలో (కల్పనములలోను, వ్యర్థప్రలాపముల లోను) మునిగి తేలుచుందురు. ఈ దోషముల ప్రేరణలద్వారా వాటిని అలంబనముగా చేసికొని, అనేక దుష్కృత్యములను చేయుచుందురు. ఈశ్వరుడు, ధర్మము, శాస్త్రము మొదలగు వానిలో దేనిని గూడ ఆశ్రయింపరు.

ప్రశ్న - ఇచట 'చ' అను అవ్యయమును ప్రయోగించుట లోని ప్రత్యేకత యేమి?

సమా - అసురస్వభావము గల మనుష్యులు, అహంకార బలదర్ప కామ క్రోధములకు గురియగుటకే గాక దంభ మోహలోభాది- ఇతరములైన అనేక దోషములకు గూడ లోనై పెక్కు పాపకృత్యములకు ఒడిగట్టుదురు - అని తెల్పుటకే 'చ' అను అవ్యయము ప్రయోగింపబడినది-

ప్రశ్న - 'అభ్యసూయకాః' అనగానేమి

సమా - ఇతరులలో దోషములను వెదకుట, వారిని నిందించుట, వారి సుగుణములను ఖండించుట, వాటిని దోషములుగా చిత్రించుట మొదలగు లక్షణములకు 'అసూయ'యే ముఖ్యకారణము. అసురప్రకృతి గలవారియందు ఈ అసూయ అధికముగా ఉండును - వారు భగవంతుని యందును, సాధుపురుషుల యందును గూడ దోషములను వెదకుచుందురు - అట్టివారిని "అభ్యసూయకాః" అనియందురు.

ప్రశ్న - "ఆసురీ ప్రకృతి గల మనుష్యులు తమలోను ఇతరులలోను అంతర్యామిగా ఉన్న పరమేశ్వరుని ద్వేషింతురు." అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఆసురీ ప్రకృతి గల మనుష్యులు ఇతరుల యెడ వైరము పూని, వారికి పెక్కురీతుల కష్టములను కల్గించు చుందురు. అందులకై వారును పెక్కు కష్టములను అనుభవించు చుందురు. ఇట్లు చేయుట పరమేశ్వరునే ద్వేషించుట యగును- ఏలనన వారిలోను ఇతరులలోను పరమేశ్వరుడే అంతర్యామిగా స్థితుడైయున్నాడు. గదా! ఎవరిని ద్వేషించినను, బాధించినను సర్వాంతర్యామి యగు పరమేశ్వరునే ద్వేషించినట్లు అగునుగదా!

*సంబంధము - 7వ శ్లోకమునుండి 18వ శ్లోకమువరకును ఆసురస్వభావము గలవారి దుర్గుణ దురాచారాదులను వర్ణించి, ఇప్పుడు భగవానుడు రెండు శ్లోకములలో అట్టి వారిని నిందించుచు వారికి పట్టుదుర్గతులను వర్ణించుచున్నాడు-*

**తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు ॥ 19 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| తాన్, ద్విషతః | = అట్లు ద్వేషించువారైన | అహమ్ | = నేను | ఆసురీషు, యోనిషు, ఏవ | = ఆసురీ యోనుల యందే |
| అశుభాన్ | = పాపాత్ములను | సంసారేషు | = ఈ సంసారము యందు | క్షిపామి | = పడవేయుదును |
| క్రూరాన్, నరాధమాన్ | = క్రూరులైన నరాధములను | అజస్రమ్ | = ఎల్లప్పుడును, మాటి మాటికిని | | |

**అట్లు ఇతరులను ద్వేషించు పాపాత్ములను, క్రూరులైన నరాధములను మాటిమాటికిని ఈ సంసారమునందు ఆసురీయోనులలోనే నేను పడవేయుచుందును. (19)**

ప్రశ్న - 'ద్విషతః' 'అశుభాన్' 'క్రూరాన్' 'నరాధమాన్' అను నాలుగు విశేషణములతోపాటు, తాన్ అను పదము ఎవరిని సూచించును? ఈ విశేషణముల యొక్క అంతరార్థమేమి?

సమా - పైన తెల్పబడిన విశేషణములతోపాటు ప్రయుక్తమైన 'తాన్' అను పదము పూర్వశ్లోకములయందు విపులముగా వర్ణించబడిన ఆసురీప్రకృతి గల మనుష్యులను సూచించును. వారిదుర్గతికి వారి దుర్గుణదురాచారములే కారణములని తెల్పుటకు పై విశేషణములు ప్రయోగింప బడినవి. వీరు (ఆసురీ ప్రకృతి గలవారు) అందరినీ ద్వేషించు చుందురు. అనేకములైన అశుభకార్యములను ఆచరించుచు సమాజమును భ్రష్టపఱచుచుందురు. దయ అనునది ఏకోశమునను లేకుండ క్రూరకర్మలను ఆచరించుచు నిష్కారణముగ ఇతరులకు కీడు చేయుచుందురు. అందువలననే వీరు నరాధములుగా పరిగణింపబడు చుందురు. ఈ కారణమువలన భగవానుడు వీరికి పదే పదే నీచజన్మలనే ప్రసాదించుచుండును.

ప్రశ్న - ఆసురీయోనులగానేమి?

సమా - సింహము, పెద్దపులి, సర్పము, తేలు, సూకరము, కుక్క, కాకి మొదలగు పశుపక్షి కీటపతంగాదులన్నియును ఆసురీయోనులే (అసురజన్మలే).

ప్రశ్న - 'అజస్రమ్' 'ఏవ' అను పదములకు అర్థమేమి?

సమా - వీరు నిరంతరము లెక్కలేనన్ని సార్లు ఆసురజన్మలలో పడవేయబడుచుందురని 'అజస్రమ్' అను పదము తెల్పును. వీరు దేవపితృమనుష్య జన్మలను పొందక విధిగా పశుపక్ష్యాది నీచయోనులలోనే జన్మింతురని 'ఏవ' అను పదము తెల్పును.

**ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।**
**మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ ॥ 20 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | జన్మని, జన్మని | = ప్రతిజన్మ యందును | తతః | = దానికంటెను |
| మూఢాః | = ఈ మూఢులు | ఆసురీమ్, యోనిమ్ | = ఆసురీయోనిని | అధమామ్, గతిమ్ | = అతిహీనమైన గతిని (నరకమును) |
| మామ్, అప్రాప్య, ఏవ | = నన్ను పొందకయే | ఆపన్నాః | = పొందినవారై | యాంతి | = పొందుదురు |

**ఓ అర్జునా! ఈ ఆసురీప్రకృతిగల మూఢులు, నన్ను పొందకయే, ప్రతిజన్మయందును ఆసురీయోనులనే పొందుచు చివరకు అంతకంటెను హీనమైనగతిని పొందుదురు. అనగా ఘోరమైన నరకములయందు పడెదరు. (20)**

ప్రశ్న - పైన పేర్కొనబడిన అసురలక్షణములు గల మూఢులకు భగవత్ప్రాప్తి కలుగనే కలుగదు. సరిగదా ఉత్తమగతియు లభింపదు. కేవలము అసురజన్మలే గతియగును. అట్టి పరిస్థితులలో 'మాం అప్రాప్య' అనగా నన్ను చేరకయే - అని యనుటలో అంతర్యమేమి?

సమా - మానవజన్మయందే జీవికి భగవంతుని పొందు అర్హతయు, అవకాశమూ కలవు. ఇట్టి అధికారమును పొందినప్పటికిని మానవుడు ఈ విషయమును మరచి, దైవస్వభావ రూప భగవత్ప్రాప్తి మార్గమును వదలి, అసుర స్వభావమును ఆలంబనము చేసికొన్నచో, మానవశరీరమును పొందియు, చేజిక్కిన భగవత్ప్రాప్తి అవకాశమును కోల్పోవుదురు. కావున ఇచట మానవుని ఈ దయనీయ (దైన్య) స్థితికి జాలిపడి, "దుర్లభమైన మానవజన్మ ఎత్తియు, అసుర లక్షణములను అవలంబించి, నన్ను పొందు అవకాశమును చేతులార ఏల జారవిడుచుకొందురో?" అని తెల్పుటకే దయాళువైన భగవానుడు 'మాం అప్రాప్యైవ' అని పలికి మానవాళిని హెచ్చరించెను.

ప్రశ్న - వారు మాటిమాటికిని అసుర జన్మలనే పొందుచుందురు - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - వారు లెక్కలేనన్నిసార్లు అసురజన్మలనే పొందుచుందురు - ఉన్నత జన్మలు వారికి లభించనే లభింపవు - అని భగవానుడు పలికెను.

ప్రశ్న - 'దానికంటెను అధమగతిని వారు పొందుదురు' - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - అసురస్వభావము గల మనుష్యులు అసంఖ్యాకములైన అసురజన్మలనే ఎత్తుచు వాటి కంటెను నీచమైన యాతనామయములైన కుంభీపాక, మహారౌరవ, తామిస్ర, అంధతామిస్రాది ఘోరనరకములలో పడుదురు.

*సంబంధము - అసురస్వభావము గల మనుష్యులు పరంపరగా అసుర జన్మలనే ఎత్తుచు ఘోరనరకముల పాలగుదురని తెల్పిన పిదప - వారు ఈ దుర్గతులనుండి బయటపడుటకును, పరమగతిని పొందుటకును, ఉపాయమును భగవానుడు తెలుపుచున్నాడు. అదియేమనగా సమస్త దుర్గతులకు ప్రధాన కారణములైన (ఆసురీ సంపదకు సంబంధించిన) మూడు దోషములను త్యజించుటయే-*

## త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
## కామః క్రోధస్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ 21 ॥

కామః = కామము
క్రోధః = క్రోధము
తథా = అట్లే
లోభః = లోభము
ఇదమ్, త్రివిధమ్ = ఈమూడు విధములైన
నరకస్య, ద్వారమ్ = నరక ద్వారములును
ఆత్మనః, నాశనమ్ = ఆత్మనాశమునకు కారణమైనవి
తస్మాత్ = అందువలన
ఏతత్, త్రయమ్ = ఈ మూడింటిని
త్యజేత్ = త్యజింపవలెను

**కామక్రోధలోభములు అను ఈ మూడును నరకద్వారములు. అవి ఆత్మ నాశమునకు కారణములు. అనగా మనుజుని అధోగతిపాలుచేయునవి. కనుక ఈ మూడింటిని త్యజింపవలెను. (21)**

ప్రశ్న - 'కామక్రోధలోభములను' నరకద్వారములని పేర్కొనుటలోని అంతర్యమేమి?

సమా - స్త్రీపుత్రాది సమస్త భోగవాంఛల సముదాయమునే 'కామము' అని యందురు. ఈ కామమునకు లోనై మనుష్యులు దొంగతనము, వ్యభిచారము, అభక్ష్య భక్షణము మొదలగు అనేక విధములైన పాపములను ఆచరింతురు - మనో వైపరీత్యము వలన కలుగు ఉద్వేగ వృత్తిని 'క్రోధము' అనియందురు. క్రోధావేశమున మానవులు హింసా

ప్రతిహింసాది వివిధ పాపములను ఆచరింతురు. ధనాది విషయములయందలి తీవ్ర వాంఛనే (లాలసనే) 'లోభము' అని యందురు. లోభియైన వాడు తగిన అవసరములు ఏర్పడినప్పుడును ఆ ధనాదులను వినియోగింపడు. అనుచితమార్గముల ద్వారానైనను వాటిని సమకూర్చుకొనుటలో నిరంతరము నిమగ్నుడైయుండును. ఈ కారణమున ఆ లోభులు అసత్యము, కపటము, దొంగతనము, విశ్వాసఘాతుకత్వము మొదలగు మహాపాపములకు ఒడిగట్టుదురు. తత్ఫలితముగ తామిస్ర, అంధతామిస్రాది నరకములను పొందుదురు. కావున ఈ మూడింటిని (కామక్రోధ లోభములను) నరక ద్వారములని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - కామక్రోధ లోభములు ఆత్మనాశనమునకు కారణములని తెల్పుటలోని విశేషమేమి?

సమా - 'ఆత్మ' అను శబ్దము ఇచ్చట 'జీవాత్మ'ను నిర్దేశించును. కాని అది ఎన్నడును నశింపదు. కావున ఇచటి ఆత్మనాశనము అనగా జీవుని అధోగతి అని యర్థము. మనుష్యులు కామక్రోధలోభములకు లోనైనంతనే వారి ఆలోచనలు, ఆచరణలు, భావములు మున్నగువాని యందు పతనము ప్రారంభమగును. వాటికారణముగ వారు చేయు కర్మలు వారి శారీరక పతనమునకు దారితీయును. (శారీరక పతనమనగా అడ్డదారిలో ధనార్జనాదులకై అహర్నిశము పడుపాట్లు) మనస్సునందు దురాలోచనలు నిండియుండును. బుద్ధి భ్రష్టమగును. చేయుపనులన్నియును దోషపూరితములై యుండును. ఫలితముగా వారి ప్రస్తుత జీవితమునందు సుఖశాంతులు, పవిత్రతలు కుంటుపడి జీవితము దుఃఖ మయమగును. మరణానంతరము వారికి ఆసురజన్మలు, పరంపరగా నరకములు గతియగును. కావున ఈ మూడు దోషములు ఆత్మనాశన కారకములు - అని పేర్కొనబడినవి.

ప్రశ్న - కావున ఈ మూడింటిని త్యజింపవలెను - అని యనుటలోని విశేషమేమి?

సమా - కామక్రోధలోభములు మోహజనితములు. అవి అన్ని అనర్థములకును మూలకారణములు. వాటివలననే మనుష్యులు అధోగతుల పాలగుచుందురు. కావున వాటిని విషతుల్యములుగా భావించి, వెంటనే పూర్తిగా త్యజింపవలెను.

**ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైః త్రిభిర్నరః ।**
**ఆచరత్యాత్మనః శ్రేయః తతో యాతి పరాం గతిమ్ ॥ 22 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | ఆత్మనః, శ్రేయః | = తనకు శ్రేయస్కరమైన (శుభకర్మలనే) | పరామ్, గతిమ్ | = పరమగతిని |
| ఏతైః, త్రిభిః, తమోద్వారైః | = ఈ మూడు నరక ద్వారములనుండి | ఆచరతి | = ఆచరించును | యాతి | = పొందును. అనగా నన్నే పొందును |
| విముక్తః నరః | = బయటపడినవాడు | తతః | = దానివలన (అతడు) | | |

**ఓ అర్జునా! ఈ మూడునరకద్వారములనుండి బయటపడినవాడు శుభకర్మలనే ఆచరించును. అందువలన పరమగతిని పొందును. అనగా నన్నే పొందును. (22)**

ప్రశ్న - 'ఏతైః త్రిభిః' అను రెండు పదములతో పాటు ప్రయుక్తమైన 'తమోద్వారైః' అను సమాసపదము వేటిని సూచించును? వీటినుండి విముక్తుడైన మనుష్యుని 'నరః' అని పిలుచుటలోని ఆంతర్యమేమి?

సమా - పూర్వశ్లోకమునందు 'నరకద్వారములు' అని పేర్కొనబడిన కామక్రోధ లోభములనే ఇచట 'ఏతైః, త్రిభిః' అను పదములతో పాటు 'తమో ద్వారైః' అను సమాసపదము తెల్పును. తామిస్ర, అంధతామిస్రాది నరకములు అంధకారమయములు. అవి అజ్ఞానరూప - అంధకారముచే ఉత్పన్నములైన దురాచారదుర్గుణముల ఫలస్వరూపములు. వాటిలో బడి జీవులు మోహము, దుఃఖరూపతమస్సులచే ఆవరింపబడుదురు. కావున వాటిని 'తమస్సులు' అని పేర్కొనుట జరిగినది. కామ, క్రోధ, లోభములు అను మూడును వాటికి ద్వారములు - అనగా కారణములు. అందువలన అవి 'తమోద్వారములు' అని పేర్కొనబడినవి. ఈ మూడు నరకద్వారముల నుండి విముక్తుడైన వాడే తన శ్రేయస్సునకై సాధన చేయగలడు. మానవ దేహమును పొంది, ఈ విధముగా శ్రేయస్సాధనచేయువాడే వాస్తవముగా

'నరుడు' (మనుష్యుడు). 'నరః' అను పదమును ప్రయోగించుట లోని ఆంతర్యమిదియే.

ప్రశ్న - 'తమశ్రేయస్సునకై పాటుపడుట' అనగానేమి?

సమా - కామక్రోధలోభములకు లోనైనవారు పతన మగుదురు. వాటినుండి ముక్తులైన వారు తమ శ్రేయస్సునకై పాటుపడుదురు. కనుక కామక్రోధలోభములను త్యజించి, శాస్త్రప్రతిపాదితములైన సద్గుణసదాచార రూపదైవీ సంపదలను నిష్కామభావముతో పెంపొందించుకొనుటయే ఆత్మశ్రేయస్సునకై పాటుపడుట యగును.

ప్రశ్న - "దీనివలన అతడు పరమగతిని పొందును" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - కామక్రోధలోభములను విస్తృత రూపములైన అసురీ సంపదలనుండి పూర్తిగా విముక్తుడై, నిష్కామ భావముతో దైవీ సంపదలను పెంపొందించుకొనువాడు పరమగతిని అనగా పరమాత్మను పొందును.

*సంబంధము - పైన తెల్పబడిన దైవీసంపదను పెంపొందించుకొనక తన ఇష్టానుసారము కర్మలను ఆచరించువానికి పరమగతి లభ్యమగునా? కాదా? అను ప్రశ్నకు భగవానుడు సమాధానమును ఇచ్చుచున్నాడు-*

**యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఏ మనుష్యుడు | | (విశృంఖలముగా) | పరామ్, గతిమ్ | = పరమగతిని |
| శాస్త్రవిధిమ్ | = శాస్త్రోక్తవిధులను | వర్తతే | = ప్రవర్తించునో | న | = పొందజాలడు |
| ఉత్సృజ్య | = త్యజించి | సః | = అతడు | సుఖమ్ | = సుఖమును సైతము |
| కామకారతః | = తనయిష్టము | సిద్ధిమ్ | = సిద్ధిని | న | = పొందజాలడు |
| | వచ్చినట్లు | న, అవాప్నోతి | = పొందజాలడు | | |

**శాస్త్రవిధిని త్యజించి, యథేచ్ఛగా (విశృంఖలముగా) ప్రవర్తించువాడు సిద్ధిని పొందజాలడు. వానికి ఇహపరలోకసుఖములు లభింపవు. పరమగతియు ప్రాప్తింపదు. (23)**

ప్రశ్న - శాస్త్ర విధిని అనుసరింపక తమ ఇష్టానుసారము ఆచరించుట యనగానేమి?

సమా - వేదములు, వాటిని ఆధారముగా చేసికొని రచింపబడిన స్మృతి, పురాణేతిహాసాదులను అన్నింటిని శాస్త్రములని యందురు. ఆసురలక్షణములను, ఆచారవ్యవహారములను త్యజించి, ఈ వేదాదిశాస్త్రములలో తెల్పబడిన జ్ఞానమును ఆధారము చేసికొని దైవీసంపదకు సంబంధించిన గుణములను ఆచారములను పెంపొందించుకొనుట మానవులకు శ్రేయస్కరము. కర్తవ్యాకర్తవ్య జ్ఞానమును ప్రసాదించు శాస్త్రవిధానములను అవహేళనచేసి తమ తమ బుద్ధినే (తోచినదానినే) ప్రమాణముగా తీసికొని, తమ ఇష్టానుసారము గౌరవకీర్తి ప్రతిష్ఠలు మొదలగువాటికి తహతహ పడుచు కర్మలను ఆచరించుటను "శాస్త్రవిధిని త్యజించి, తమ ఇష్టానుసారము ఆచరించుటయగును."

ప్రశ్న - "ఇట్లు ఆచరించినవారికి, సిద్ధి, సుఖము, పరమగతి లభింపవు. అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - శాస్త్ర విధిని అనుసరింపని మనుష్యుని కర్మలు శాస్త్ర నిషిద్ధములై పాపకృత్యములగును. అప్పుడు అవి దుర్గతులకు కారణములగును." - అను విషయములో ఎట్టిసందేహమూ లేదు. కాని తమ బుద్ధులనే ప్రమాణముగా గైకొని ఏవోకొన్ని కోరికలచే ప్రేరితులై, తమ ఇష్టము వచ్చినట్లు కర్మలను ఆచరించుట వలన శాస్త్రములను అవహేళన చేసినట్లగును. దీనివలన కర్తకు ఎట్టి ఫలమూ లభింపదు. ఇక పరమగతి ప్రాప్తిని గూర్చి చెప్పవలసిన పనియే లేదు. ఇంతేగాదు - లౌకికములైన అణిమాదిసిద్ధులూ, స్వర్గ ప్రాప్తి రూపసిద్ధియూ లభింపవు. అట్లే ప్రపంచమున సాత్త్విక సుఖముగూడ లభింపదు.

*సంబంధము - శాస్త్రవిధులను త్యజించి, ఇష్టానుసారముగా చేయబడు కర్మలు నిష్ఫలములు, ఇట్టి పరిస్థితిలో కర్తవ్యమును గుర్తు చేయుచున్నాడు-*

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ 24 ॥**

| పదము | అర్థము |
|---|---|
| తస్మాత్ | = అందువలన |
| తే | = నీకు |
| ఇహ | = ఈ |
| కార్యాకార్య వ్యవస్థితౌ | = కార్యాకార్య వ్యవస్థితియందు |
| శాస్త్రమ్, ప్రమాణమ్ | = శాస్త్రమే ప్రమాణము |
| ఏవమ్ జ్ఞాత్వా | = ఈ విషయమును ఎఱింగి |
| శాస్త్ర విధానోక్తమ్ | = శాస్త్ర మర్యాదను అనుసరించి చెప్పబడిన |
| కర్మ | = కర్మలనే |
| కర్తుమ్ | = చేయుటకు |
| అర్హసి | = తగియున్నావు (ఆచరింపుము) |

**కావున కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుటకు శాస్త్రమే ప్రమాణము. కనుక శాస్త్రోక్తకర్మలను గూర్చి బాగుగా తెలిసికొని, అట్టి కర్మలను ఆచరింపుము. (24)**

ప్రశ్న - "కర్తవ్య-అకర్తవ్యములను నిర్ణయించుటలో శాస్త్రమే ప్రమాణము" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఏది కర్తవ్యము? ఏది అకర్తవ్యము? అను విషయమును శ్రుతులు, స్మృతులు, పురాణేతిహాసాది శాస్త్రములు స్పష్టపఱచును. కావున మానవుడు ఈ విషయమున తన యిష్టానుసారము ఆయాకర్మలను ఆచరింపక శాస్త్రములనే ప్రమాణములుగా తీసికొనవలెను. అనగా ఈ శాస్త్రములననుసరించి ఏయే కర్మలు విధ్యుక్తములో వాటినే ఆచరింపవలెను. ఏవి నిషిద్ధములో (అకర్తవ్యములో) వాటిని ఆచరింపరాదు.

ప్రశ్న - ఈ విషయమును తెలిసికొని శాస్త్ర విహిత కర్మలనే చేయవలెను - అనియనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ విధముగా శాస్త్రములను ప్రమాణముగా స్వీకరించి, అందు తెల్పబడిన కర్తవ్యకర్మలనే విధిపూర్వకముగా ఆచరింపవలెను. నిషిద్ధకర్మలను ఎన్నడును ఆచరింపరాదు. శాస్త్రవిహిత పవిత్ర కర్మలను గూడ నిష్కామభావముతోడనే ఆచరింపవలెను. ఏలనన నిష్కామభావముతో చేయబడిన పవిత్ర కర్మలే భగవత్ప్రాప్తికి మూలములని శాస్త్రములలో తెల్పబడినది.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః ॥ ౧౬ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునేడవ అధ్యాయము - శ్రద్ధాత్రయ విభాగయోగము

**అధ్యాయ నామము :** ఈ *17వ* అధ్యాయ ప్రారంభమున శ్రద్ధాయుక్తులైన పురుషుల నిష్ఠలను గూర్చి అర్జునుడు ప్రశ్నించెను- దానికి సమాధానముగా భగవానుడు మూడు విధములైన శ్రద్ధలను దెల్పి, వాటిని అనుసరించియే పురుషుల స్వభావములుండునని తెల్పెను. పిమ్మట పూజలు, యజ్ఞములు, తపస్సులు మొదలగు వాటితో శ్రద్ధకు గల సంబంధమును వర్ణించి, చివరి శ్లోకమున శ్రద్ధారహిత పురుషుల కర్మలను 'అసత్' అని పేర్కొనెను. ఈ విధముగ త్రివిధశ్రద్ధలను విభాగపూర్వకముగా వివరించుటచే ఈ అధ్యాయమునకు 'శ్రద్ధాత్రయవిభాగయోగము' - అని పేరు ఏర్పడినది.

**అధ్యాయ సారాంశము :** ఈ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున శాస్త్రవిధిని వీడి, శ్రద్ధతో యజ్ఞములు మొదలగు వానిని చేయువారియొక్క నిష్ఠలను గూర్చి అర్జునుడు ప్రశ్నించెను. దానికి సమాధానముగా మనుష్యుల గుణములననుసరించి శ్రద్ధ త్రివిధములని భగవానుడు రెండవ శ్లోకమున తెలిపెను. శ్రద్ధను అనుసరించియే వ్యక్తుల స్వభావములు ఉండునని మూడవ శ్లోకమున తెలిపెను. సాత్త్విక రాజస తామస శ్రద్ధాయుక్తులైన వారు క్రమముగా దేవ, యక్ష - రాక్షస, భూత - ప్రేతముల పూజలు చేయుదురని నాల్గవ శ్లోకమున తెలిపెను. ఐదు, ఆరు శ్లోకములలో శాస్త్రవిరుద్ధముగా ఘోరతపస్సులను ఆచరించు వారిని అధిక్షేపించెను. ఏడవశ్లోకమున ఆహార, యజ్ఞతపోదానముల భేదములను వినుమని అర్జునుని ఆజ్ఞాపించెను. ఎనిమిది, తొమ్మిది, పదవ శ్లోకములయందు క్రమముగా సాత్త్విక, రాజస, తామస ఆహారములను వర్ణించెను. *11, 12, 13* శ్లోకములయందు క్రమముగా సాత్త్విక, రాజస, తామస యజ్ఞముల లక్షణములను తెల్పెను. *14, 15, 16,* శ్లోకములయందు వరుసగా శారీరిక, వాచిక, మానసిక తపస్సుల స్వరూపములను వివరించెను. *17వ* శ్లోకమున సాత్త్విక తపోలక్షణములను, *18, 19* శ్లోకములయందు వరుసగా రాజస తామస తపోలక్షణములను వర్ణించెను. *20, 21, 22* శ్లోకములయందు క్రమముగా సాత్త్విక, రాజస తామస దానములను గూర్చి వ్యాఖ్యానించెను. *23వ* శ్లోకమున పరమాత్ముని నామములైన, 'ఓమ్ తత్ సత్'ల మహిమను తెలిపెను. *24వ* శ్లోకమున 'ఓంకార'ము యొక్క ప్రయోగమును, *25వ* శ్లోకమున 'తత్' శబ్ద ప్రయోగమును, *26, 27వ* శ్లోకముల యందు 'సత్' శబ్ద ప్రయోగమును గూర్చి వ్యాఖ్యానించెను. కడకు *28వ* శ్లోకమున శ్రద్ధా రహితములైన యజ్ఞదాన తపశ్చర్యాది కర్మలు ఇహ-పరలోకముల యందును నిష్ఫలములని తెల్పి, వాటిని 'అసత్' అని పేర్కొనుచు భగవానుడు ఈ అధ్యాయమును ముగించెను.

**సంబంధము :** *16వ* అధ్యాయప్రారంభమున 'దైవీ సంపద' అను పేరుతో నిష్కామభావముతో ఆచరింపదగు శాస్త్రవిహితగుణములను, ఆచరణములను భగవానుడు వర్ణించి, శాస్త్రవిరుద్ధమైన ఆసురీసంపదను గూడ వివరించెను. ఆసురస్వభావముగల పురుషులు నరకముల పాలయ్యెదరని పేర్కొనుచు, కామక్రోధలోభములే ఆసురీ సంపదయొక్క ప్రధానమైన అవగుణములనియు, అవియే నరక ద్వారములనియు పేర్కొనెను. వీటిని త్యజించి, ఆత్మశ్రేయస్సునకై సాధన చేయువాడు పరమగతిని పొందునని పల్కెను. తదనంతరము శాస్త్రవిధిని త్యజించి, తమ ఇష్టానుసారము తమకు మంచివిగా తోచిన కర్మలను చేయువారికి ఆ కర్మలఫలమూ లభింపదు, సిద్ధియులభింపదు, సుఖమూ లభింపదు. ఇక పరమగతిప్రాప్తి విషయమై చెప్పవలసిన పనియే లేదు - కావున కర్తవ్యాకర్తవ్యముల వ్యవస్థను తెలుపు శాస్త్ర విధానముల ననుసరించియే నిష్కామభావముతో కర్మలను ఆచరింపవలెనని భగవానుడు పలికెను.

శాస్త్ర విధిని ప్రక్కన బెట్టి, తమ ఇష్టానుసారము కర్మలను ఆచరించువారికి ఎట్టి ఫలమూ లభింపదు - అను మాటసత్యమే. కాని కొందరు శాస్త్రవిధిని ఎరుంగని కారణముననో, మఱియేయితర కారణముననో వాటిని త్యజింతురు. కాని యజ్ఞపూజాది పవిత్ర కర్మలను శ్రద్ధతో ఆచరింతురు - అట్టి వారి స్థితియేమగును? అను సందేహమును అర్జునుడు వెల్లడించుచున్నాడు-

**అర్జున ఉవాచ**

**యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥ 1 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృష్ణ! | = ఓ కృష్ణా! | | గలవారై | కా | = ఎట్టిది? (అది) |
| యే | = ఎవరైతే | యజంతే | = దేవపూజాదికములను | సత్త్వమ్ | = సాత్త్వికమా |
| శాస్త్రవిధిమ్ | = శాస్త్రవిధానమును | | ఆచరింతురో | ఆహో | = అథవా (లేక) |
| ఉత్సృజ్య | = త్యజించి | తేషామ్ | = వారియొక్క | రజః | = రాజసమా (లేక) |
| శ్రద్ధయా, అన్వితాః | = భక్తిశ్రద్ధలు | నిష్ఠా, తు, | = నిష్ఠ అయితే | తమః | = తామసమా? |

**అర్జునుడు పలికెను - ఓ కృష్ణా! శాస్త్రవిధిని త్యజించి, భక్తిశ్రద్ధలతోయజ్ఞములను గాని, దైవపూజలనుగాని కొందఱు చేయుచుందురు. వారినిష్ఠ (వారి విధానము) సాత్త్వికమా? రాజసమా? తామసమా? (1)**

ప్రశ్న - శాస్త్రవిధిని త్యజించు విషయము 16వ అధ్యాయమునందలి 23వ శ్లోకమునందు కూడ ప్రస్తావింపబడినది. మరియు ఇచ్చటను ప్రస్తావింపబడుచున్నది. ఈ రెండింటి భావము ఒకటియేనా? లేక వీటి మధ్య తారతమ్యములు గలవా?

సమా - తారతమ్యము గలదు. అచ్చట అవహేళనా పూర్వకముగ శాస్త్రవిధిని త్యజించు వారివిషయము తెలుపబడినది. ఇచట శాస్త్రవిధిని గూర్చి యెఱుంగని కారణమున వాటిని త్యజించు వారి విషయము తెల్పబడినది. అచట వారు శాస్త్ర విషయమును లెక్కయే చేయరు. వారు తమకు మంచివని తోచిన కర్మలను మాత్రమే చేయుదురు. కనుక 'వర్తతే కామకారతః' అని చెప్పబడినది. కాని ఇచట 'యజన్తే శ్రద్ధయాన్వితాః' అని పేర్కొనబడినది. కనుక వీరియందు శ్రద్ధ గలదు. శ్రద్ధయున్నచోట అవహేళన యుండదు. వాతావరణ ప్రభావమున గాని, పరిస్థితులు అనుకూలింపని కారణమున గాని అవకాశము లేకపోవుట వలనగాని, పరిశ్రమ, అధ్యయనాదులు లోపించుట వలనగాని, వీరికి శాస్త్రవిధిపరిజ్ఞానము లభింపదు. ఈ అజ్ఞాన కారణముననే వాటిని విస్మరించుట జరుగును.

ప్రశ్న - నిష్ఠ యనగానేమి?

సమా - 'నిష్ఠా' అను పదము ఇచట స్థితిని తెల్పును. వీరు శ్రద్ధాళువులనియు, వీరి శ్రద్ధనుబట్టియే ఆ స్థితియు ఉండును-అనియు భగవానుడు 3వ శ్లోకమున తెల్పియున్నాడు. కావున ఇచట 'నిష్ఠ' అనగా స్థితి.

ప్రశ్న - వారి 'నిష్ఠ' సాత్త్వికమా? రాజసమా? తామసమా? అని ప్రశ్నించుటలోని ఆంతర్యమేమి?

సమా - 16వ అధ్యాయమున 6వ శ్లోకమునందు భగవానుడు దైవీ ప్రకృతి మరియు ఆసురీ ప్రకృతి గల రెండు విధములైన మనుష్యులను వర్ణించెను. ఇందు దైవీ ప్రకృతి గల వారు శాస్త్ర విహిత కర్మలను నిష్కామభావముతో ఆచరింతురు. దీనివలన వారికి మోక్షప్రాప్తి కలుగును. ఆసురస్వభావము గల తామస జనులు పాపకర్మలను ఆచరింతురు - వారికి నీచ జన్మలు లేక నరకములు ప్రాప్తించును. తమోమిశ్రిత రజోగుణము గలవారు శాస్త్రవిధిని విస్మరించి, తమకు మంచివని తోచిన కర్మలను తమ ఇష్టానుసారము చేయుదురు. వారు చేసిన కర్మలలో కొన్ని మంచివి కావచ్చును. కొన్ని పాపకర్మలును కావచ్చును. శాస్త్రవిధిని విస్మరించిన కారణమున ఆ మంచి కర్మలకు ఎట్టి ఫలమూ లభింపదు. కాని పాపకర్మల ఫలమును వారు అనుభవించియే తీరవలయును. ఈ వర్ణన ద్వారా దైవీ, ఆసురీ ప్రకృతులు గల వారి విషయములన్నియును అర్జునునకు అవగతములైనవి. కాని శాస్త్రవిధిని ఎఱుంగని కారణమున వాటిని విస్మరించి, శ్రద్ధతో పూజాదికములను నిర్వహించువారిది దైవ స్వభావమా? లేక ఆసురస్వభావమా? అను విషయము స్పష్టీకరింపబడలేదు. ఆ విషయమును తెలిసికొనుటకే అట్టివారి స్థితి సాత్త్వికమా? రాజసమా?

తామసమా? అని అర్జునుడు ప్రశ్నించెను. అనగా వారు దైవీసంపద గలవారా? లేక ఆసురీ సంపద గలవారా? అని అర్జునుడు తెలిసికొన గోరెను.

ప్రశ్న - పై విశ్లేషణను బట్టి ప్రపంచమున మనుష్యులు ఐదు విధములుగా ఉండవచ్చునని తెలియుచున్నది.

1. కొందరు శ్రద్ధగలిగి, శాస్త్రవిధులను పాటించువారు.
2. తగిన శ్రద్ధచూపక కొంతవరకు శాస్త్రవిధిని పాటించువారు కొందరు.
3. శ్రద్ధయున్నను శాస్త్రవిధులను పాటింపజాలని వారు మరికొందరు.
4. కొందరికి శ్రద్ధయూ ఉండదు, వారు శాస్త్రవిధులనూ పాటింపరు.
5. శాస్త్రవిధులయందు గౌరవభావము లేక అవహేళన చేయుచు వాటిని త్యజించువారు మరికొందరు.

ప్రశ్న - ఈ ఐదు విధములైన వారి యొక్క స్వరూప స్వభావము లెట్టివి? వారికి ప్రాప్తించుగతులేవి? గీతయందు ఏయే శ్లోకములలో వీటి ప్రస్తావనలు గలవు?

సమా - 1. శ్రద్ధగలిగి శాస్త్రవిధులను పాటించువారును రెండు విధములుగా ఉందురు - కొందరు నిష్కామభావముతో కర్మలను ఆచరించువారు - మఱికొందరు సకామభావముతో కర్మలను ఆచరించువారు. నిష్కామభావముతో కర్మలను ఆచరించువారు దైవీసంపదగల సాత్త్విక పురుషులు. వీరికి మోక్షము సిద్ధించును. వీరి వర్ణన ముఖ్యముగా 16వ అధ్యాయమునందు మొదటి మూడు శ్లోకములలోను ఈ అధ్యాయమున 11, 14, 17, 20 శ్లోకములలోను గలదు. సకామభావముతో కర్మాచరణము చేయు సత్త్వమిశ్రిత రాజస పురుషులకు కర్మఫల సిద్ధియు, సుఖము, స్వర్గాది లోకములును ప్రాప్తించును. వీరి వర్ణన రెండవ అధ్యాయమున 42, 43, 44 శ్లోకములలోను, 4వ అధ్యాయమున 12వ శ్లోకములోను, 7వ అధ్యాయమున 20, 21, 22 శ్లోకములలోను, 9వ అధ్యాయమున 20, 21, 23 శ్లోకములలోను గలదు.

2. తగిన శ్రద్ధచూపక కొంతవరకు శాస్త్రవిధిని పాటించుచు, యజ్ఞదానతపశ్చర్యాది క్రియలను ఆచరించువారి కర్మలు 'అసత్' (నిష్ఫలములు) అగును. వారికి ఇహ పరలోకములయందు ఆ కర్మలవలన ఎట్టి ప్రయోజనమూ ఉండదు. వీరి వర్ణనము ఈ అధ్యాయమున 28వ శ్లోకమున చేయబడినది.

3. శ్రద్ధయున్నను అజ్ఞానకారణమున శాస్త్రవిధులను పాటింపజాలనివారు శ్రద్ధాభేదములతో సాత్త్వికులుగను, రాజసులుగను, తామసులుగను ఉండవచ్చును. వారికి లభించు గతియును వారి స్వరూప స్వభావములను బట్టియే యుండును. వీరి వర్ణన ఈ అధ్యాయమునందే 2, 3, 4 శ్లోకములలో చేయబడినది.

4. శ్రద్ధయును లేక శాస్త్రవిధులనూ పాటింపని వారు కామక్రోధలోభములకు లోనై, తమ పాపమయ జీవితములను గడుపుచుందురు. ఆసురీ సంపదగల వీరికి నరకములూ, నీచజన్మలునూ ప్రాప్తించును. వీరివర్ణన 7వ అధ్యాయమునందు 17వ శ్లోకములోను, 9వ అధ్యాయమున 12వ శ్లోకములోను 16వ అధ్యాయమున 7నుండి 20వ శ్లోకము వరకును, ఈ అధ్యాయమున 5, 6, 13 శ్లోకములలోను గలదు.

5. శాస్త్రవిధులయందు గౌరవభావము లేక అవహేళన చేయుచు వాటిని త్యజించువారు తమకు నచ్చిన రీతిలో కర్మలను చేయుచుందురు. ఇట్టి స్వేచ్ఛాచారులలో శాస్త్రనిషిద్ధ కర్మలను చేయు తామసపురుషులు నరకాది దుర్గతులను పొందుదురు. వీరి వర్ణన 4వ ప్రశ్నయొక్క సమాధానమునందు గలదు. వీరిలో మంచికర్మలను ఆచరించు 'రజః' ప్రధానతామస పురుషులు శాస్త్ర విధులను విస్మరించిన కారణమున వారికి ఎట్టి ఫలమూ లభింపదు. వీరి వర్ణన 16వ అధ్యాయమున 23వ శ్లోకమున చేయబడినది - వీరి ద్వారా జరుగు పాపకర్మల ఫలము నిశ్చయముగ తిర్యగ్యోనులప్రాప్తి, నరక ప్రాప్తి అనియెరుంగవలెను.

ఈ ఐదు ప్రశ్నలకు సమాధానముగ ప్రామాణికముగా సూచింపబడిన శ్లోకములయందేగాక వేర్వేరు ఇతర శ్లోకములయందును వీరి వర్ణన గలదు. కాని అవియన్నియు ఇచట ఉల్లేఖింపబడలేదు.

సంబంధము - అర్జునుని ప్రశ్నకు భగవానుడు రెండు శ్లోకములలో సంక్షిప్తముగా సమాధానమును ఇచ్చుచున్నాడు-

### శ్రీభగవాన్ ఉవాచ

**త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।**
**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ 2 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| దేహినామ్ | = మనుష్యుల యొక్క | సాత్త్వికీ, చ | = సాత్త్వికమనియు | భవతి | = ఉండును |
| స్వభావజా | = స్వభావమును అనుసరించి ఏర్పడు | రాజసీ,చ | = రాజసమనియు | తామ్ | = అట్టి శ్రద్ధను గూర్చి |
| | | తామసీ, ఇతి | = తామసమనియు | | |
| సా, శ్రద్ధా | = శాస్త్రవిధిని పాటింపని, అట్టి శ్రద్ధ | త్రివిధా, ఏవ | = మూడు విధములుగనే | (మత్తః) | = నానుండి |
| | | | | శృణు | = వినుము |

శ్రీ భగవానుడు పలికెను- శాస్త్రోక్తముగానుండక కేవలము స్వభావమును అనుసరించి ఏర్పడుచుండు మానవుల శ్రద్ధ సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధములుగా ఉండును. వాటిని గూర్చి వివరించెదను. వినుము. (2)

ప్రశ్న - 'దేహినామ్' అను పదము ఎట్టి వారిని సూచించును?

సమా - 'దేహినామ్' అను పదము సహజముగా దేహాభిమానము గల సామాన్య మానవులను సూచించును?

ప్రశ్న - 'సా' 'స్వభావజా' అను పదములు ఎట్టి శ్రద్ధను సూచించును?

సమా - శాస్త్రవిధిని త్యజించి, శ్రద్ధతో యజ్ఞాది కర్మలను చేయువారి శ్రద్ధను 'సా' 'స్వభావజా' అను పదములు తెలుపును. ఈ శ్రద్ధ శాస్త్ర జనితము గాదు. స్వభావజనితము. కనుక దీనిని 'స్వభావజా' అని పేర్కొందురు. శాస్త్రముల యొక్క శ్రవణ పఠనాదులవలన కలుగు శ్రద్ధను 'శాస్త్రజా' అనియందురు. పూర్వజన్మ యందలి, ఈ జన్మయందలి కర్మల సంస్కారములను అనుసరించి, సహజముగా ఏర్పడిన శ్రద్ధను 'స్వభావజా' అని యందురు.

ప్రశ్న - సాత్త్వికీ, రాజసీ, తామసీ, త్రివిధా అను పదములతో పాటు 'ఇతి' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ శ్రద్ధ సాత్త్వికీ, రాజసీ, తామసీ అను మూడు విధములుగనే యుండును - అని తెల్పుటకు 'ఇతి' అను పదము ప్రయుక్తమైనది.

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥ 3 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| భారత! | = ఓ అర్జునా! | భవతి | = ఉండును | యః | = ఏ పురుషుడు |
| సర్వస్య, శ్రద్ధా | = ప్రతివ్యక్తియొక్క శ్రద్ధయు | అయమ్, పురుషః | = ఈపురుషుడు | యచ్ఛ్రద్ధః | = ఎట్టి శ్రద్ధగలవాడో |
| | | శ్రద్ధామయః | = ఏదియేని ఒక శ్రద్ధనుకలిగియే యుండును | సః | = అతడు |
| సత్త్వానురూపా | = వారి అంతఃకరణ రీతికి తగినట్లు | | | సః, ఏవ | = తద్రూపముగలవాడే యగును |
| | | (అతః) | = ఇందువలన | | |

ఓ అర్జునా! మనుష్యులందఱి శ్రద్ధయు వారిఅంతఃకరణరీతులకు తగినట్లు ఉండును. ప్రతివ్యక్తికిని ఏదో ఒక శ్రద్ధఉండనే ఉండును. అతని జీవన విధానమంతయును అతని శ్రద్ధకు అనుగుణముగా కొనసాగుచుండును. దానినిబట్టి అతడెట్టి శ్రద్ధ కలిగియున్నదియు తెలిసికొనవచ్చును. (3)

ప్రశ్న - 'సర్వమానవులు' (సర్వస్య) అని ప్రయోగించుట లోని విశేషమేమి?

సమా - పూర్వశ్లోకమున 'దేహినామ్' అను పదముద్వారా తెల్పబడిన దేహాభిమానులైన వారినే ఇచట 'సర్వస్య' అను పదము తెల్పును. అనగా ఇచట దేహాభిమానము గల సామాన్య మానవులను గూర్చియే తెల్పబడుచున్నదని భావము. ఏలనన శ్రద్ధను బట్టియే మానవుని జీవన విధానము కూడ ఉండును. కావున 'సర్వస్య' అను పదము దేహాభిమానులైన జీవులకే వర్తించును. కాని గుణాతీతులకు గాదు.

ప్రశ్న - 2వ శ్లోకమున శ్రద్ధ స్వభావజము అనగా స్వభావమును బట్టి యేర్పడును - అని తెల్పబడినది. కాని ఇచట సత్త్వానురూపా అనగా అంతఃకరణమునకు అనురూపముగా ఏర్పడునని తెల్పబడుచున్నది. దీని అంతర్యమేమి?

సమా - మనుష్యుడు ఆచరించు సాత్త్విక రాజస తామస కర్మలను బట్టియే అతని స్వభావము ఏర్పడును. స్వభావము అంతఃకరణములో ఒక భాగము. కావున స్వభావమును బట్టియే అంతఃకరణము గూడ ఉండును. అందువలన 'స్వభావము నుండి ఉత్పన్నమైనది యన్నను, అంతః కరణమునకు అనురూపమైనది' - అని యన్నను ఒకటియే.

ప్రశ్న - పురుషుడు 'పరః' అనగా సర్వథా గుణాతీతుడు- అని తెల్పబడినది - (13/22) కాని ఇచ్చట పురుషుడు శ్రద్ధామయుడు అని పేర్కొనుటలో ఆంతర్యమేమి?

సమా - వాస్తవముగా పురుషునిది 'గుణాతీత' స్వరూపమే. కాని ఇచ్చట ప్రకృతి యందు స్థితుడై ప్రకృతిజములైన గుణములచే బద్ధుడైన పురుషుని గూర్చి తెల్పబడుచున్నది. ఏలనన గుణ జన్యభేదములు ప్రకృతిస్థ పురుషులయందే సంభవమగును. గుణాతీతులైనవారి యందు గుణభేదములను ఊహించుటకును వీలులేదు. అంతః కరణమునకు అనురూపముగా గల సాత్త్వికీ, రాజసీ, తామసీ శ్రద్ధలను బట్టి, పురుషులనిష్ఠ, స్థితి ఉండునని ఇచట భగవానుడు తెల్పుచున్నాడు. అనగా శ్రద్ధను బట్టియే మనుజుల స్వరూపము - శ్రద్ధా నిష్ఠా స్వరూపములను ఒకటిగా చేసియే "వారినిష్ఠ (స్థితి) ఎట్లుండును?" - అను అర్జునుని ప్రశ్నకు సమాధానమును ఇచ్చెను.

*సంబంధము - శ్రద్ధను అనుసరించి, మనుష్యుల నిష్ఠా స్వరూపములుండునని భగవానుడు తెలిపెను. ఇప్పుడు మనుష్యులు కలిగియుండు నిష్ఠలను గుర్తించు ఉపాయములను భగవానుడు తెల్పుచున్నాడు-*

**యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।**
**ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సాత్త్వికాః | = సాత్త్విక పురుషులు | యక్షరక్షాంసి | = యక్షులను, రాక్షసులను | ప్రేతాన్ | = ప్రేతములను |
| దేవాన్ | = దేవతలను | | | భూతగణాన్, చ | = భూత గణములను |
| యజంతే | = పూజింతురు | అన్యే, తామసాః, జనాః | = ఇతరులైన తామస లక్షణములు గలవారు | యజంతే | = పూజింతురు |
| రాజసాః | = రాజసపురుషులు | | | | |

**వారిలో సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను, తామసులు ప్రేతభూతగణములను పూజించెదరు. (4)**

ప్రశ్న - సాత్త్వికులు దేవతలను పూజించెదరు. అని యనుటలోని విశేషమేమి?

సమా - "కార్యమును చూచి, కారణమును గుర్తింప వచ్చును" - అను సూత్రమును అనుసరించి, దేవతలు సాత్త్వికులు గావున వారిని పూజించువారును సాత్త్వికులేయై యుందురు. 'దేవతలను బట్టి వారిని అర్చించువారుగూడ' - అను సూక్తిననుసరించి, దేవతలను అర్చించువారు సాత్త్విక నిష్ఠకలవారు' అని తెల్పబడినది. దేవతలనగా ఇచట సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, ఇంద్రుడు, వరుణుడు, యముడు, అశ్వినీకుమారులు, విశ్వేదేవతలు మొదలగు శాస్త్రోక్తదేవతలు అని భావింపవలెను.

దేవతల పూజలు సాత్త్విక క్రియలు అగుట వలన వాటిని

ఆచరించువారు సాత్త్వికులని తెల్పబడినది. కాని ఈ సాత్త్విక క్రియలను నిష్కామభావముతో చేయువారే పూర్ణ (శుద్ధ) సాత్త్వికులు.

ప్రశ్న - "రాజస పురుషులు యక్షరాక్షసులను పూజింతురు." అని యనుటలోని అంతర్యమేమి?

సమా - దేవతలను పూజించువారు సాత్త్విక పురుషులైనట్లే యక్షరాక్షసులను పూజించువారు రాజసులు. వారిని రాజసనిష్ఠకలవారినిగా గుర్తింపవచ్చును. యక్షులు అనగా కుబేరాదులు, రాక్షసులు అనగా రాహువు, కేతువు మొదలగు వారని గ్రహింపవలెను.

ప్రశ్న - తామసమనుష్యులు ప్రేత భూతగణములను పూజింతురని యనుటలోని అంతర్యమేమి?

సమా - పై న్యాయమును అనుసరించియే భూతప్రేత పిశాచములను పూజించువారు తామస నిష్ఠగలవారినిగా గ్రహింపవలెను. పాపకర్మవశమున మరణానంతరము భూతప్రేతాది వాయు ప్రధాన దేహములను పొందినవారిని భూతప్రేతములనియందురు.

ప్రశ్న - ఈ వేర్వేరు నిష్ఠలు గలవారికి ఏయే గతులు ప్రాప్తించును?

సమా - వారి వారి ఇష్టములకు అనుగుణముగనే వారివారి గతులు ఉండును. దేవతలను పూజించువారికి దివ్య శరీరములు ప్రాప్తించును. యక్షరాక్షసులను పూజించువారు యక్షరాక్షసులుగనే జన్మింతురు. భూతప్రేతములను పూజించు వారికి తదనుగుణములైన రూపములు, గుణములు, స్థితులు మొదలగునవి ప్రాప్తించును. 9వ అధ్యాయము నందలి 25వ శ్లోకమున **'యాంతి దేవవ్రతా దేవాన్' 'భూతాన్' యాంతి భూతేజ్యాః'** మొదలగు వాక్యములద్వారా భగవానుడు ఈ విషయములనే స్పష్టపరచియుండెను.

*సంబంధము - శాస్త్రవిధులను గూర్చి తెలియని కారణమున వాటిని త్యజించి, శ్రద్ధతో పూజాదికములను ఒనరించు వారి త్రివిధములైన శ్రద్ధలను గూర్చి వర్ణించుట జరిగినది - కాని శాస్త్రవిధులను త్యజించు అశ్రద్ధాళువులైన వారినిగూర్చి ఏమియు పేర్కొనలేదు. శ్రద్ధయును లేక, శాస్త్ర విధులపై విశ్వాసమును కల్గియుండక ఘోరమైన తపశ్చర్యాది కర్మలను ఆచరించువారు ఏ శ్రేణికి చెందుదురు? అను విషయమును భగవానుడు రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు-*

**అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః ।**
**దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥ 5 ॥**

దంభాహంకార సంయుక్తాః = దంభము, అహంకారములతో కూడియుండు వారు, మఱియు
కామ, రాగ బలాన్వితాః = కోరికలు, ఆసక్తి కలిగి యుండి బలగర్వితులైనవారు
యే, జనాః = ఏమనుష్యులు
అశాస్త్రవిహితమ్ = శాస్త్రవిరుద్ధమైన (కేవలము మనస్సునకు తోచినరీతిగా)
ఘోరమ్, తపః = ఘోరమైన తపస్సును
తప్యంతే = ఆచరింతురో

**దంభము అహంకారము గలవారు, కోరికలు ఆసక్తి కలిగియుండువారు, బలగర్వితులు ఐనవారు, శాస్త్రవిరుద్ధముగా మనఃకల్పితమైన ఘోరతపస్సులను ఆచరించుచు... (5)**

ప్రశ్న - "శాస్త్రవిధిరహితములైన ఘోర తపస్సులు" - అనగానేమి?

సమా - శాస్త్రవిధిరహితమైన ఘోరతపస్సుల ఆచరణ విధానము ఏ శాస్త్రమునందును నిర్దేశింపబడియుండదు. వీటి ఆచరణమునందు శాస్త్రవిధులు పాటింపబడవు. వీటిలో పెక్కు విధములైన ఆడంబరములు, శరీరేంద్రియముల శ్రమలు ఉండును. ఈ తపస్సులయొక్క స్వరూపములు మిక్కిలి భయంకరములు.

ప్రశ్న - "ఈ విధముగా తపస్సులు చేయువారిని దంభాహంకారయుక్తులు" - అనియనుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - ఈ విధముగా శాస్త్రవిరుద్ధములైన భయంకరములైన తపస్సులను ఆచరించువారికి శ్రద్ధయుండదు. వారు ఆడంబర ప్రదర్శనకును, ఇతరులను మోసగించుటకును ఇట్టి క్రియలను చేయుదురు. వీరు

అహంకార పూరితులు. కనుక వీరిని దంభాహంకార యుక్తులని తెల్పుట జరిగినది.

ప్రశ్న - "వీరు కోరికలు, ఆసక్తులు, బలగర్వములు గలవారు" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - వీరికి భోగములయందు అత్యంతాసక్తి యుండును. వీరి చిత్తములయందు నిరంతరము ఆ భోగేచ్ఛలే వృద్ధి చెందుచుండును. వారు "మేము మిక్కిలి బలశాలురము. మేము కోరుకొనినవన్నియును సాధింపగలము - మమ్ములను ఏ శక్తియును ఆపజాలదు" - అని వీరు బలగర్వితులై తమను గూర్చి ప్రకటించుకొనుచుందురు - అందువలన వీరు కోరికలు, ఆసక్తులు, బలగర్వములు కలవారు - అని పేర్కొనుట జరిగినది.

**కర్శయంతః శరీరస్థం భూతగ్రామమచేతసః ।**
**మాం చైవాంతఃశరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| శరీరస్థమ్ = | శరీరములయందున్న | మామ్, ఏవ = | పరమాత్ముడనైన నన్నే | తాన్, అచేతసః = | అట్టి అజ్ఞానులను |
| భూతగ్రామమ్ = | భూతసముదాయమును | | | ఆసుర నిశ్చయాన్ = | ఆసురస్వభావములు గలవారని |
| చ = | మఱియు | కర్శయంతః = | కృశింపజేయు చుందురు | | |
| అంతశ్శరీరస్థమ్ = | అంతర్యామిగానున్న | | | విద్ధి = | ఎఱుంగుము. |

**శరీరములయందున్న జీవులను, మరియు అంతర్యామిగా అనగా పరమాత్ముడనైన నన్ను కృశింపజేయు వారు అజ్ఞానులైన ఆసురస్వభావము గలవారని యెఱుంగుము. (6)**

ప్రశ్న - శరీరములయందున్న భూతసముదాయ మనగానేమి?

సమా - పంచమహాభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము, దశేంద్రియములు, ఐదు ఇంద్రియ విషయములు, అను 23 తత్త్వముల సమూహామునే భూత సముదాయము అని యందురు. వీటి వర్ణన 13వ అధ్యాయమునందలి 5వ శ్లోకమున 'క్షేత్రము' అను పేరుతో చేయబడినది.

ప్రశ్న - "వీరు భూతసముదాయము, అంతర్యామిగానున్న పరమేశ్వరుడనగు నన్ను కృశింపజేయుదురు" అని అనుటలోని అంతర్యమేమి?

సమా - శాస్త్రవిరుద్ధముగా తమ యిష్టానుసారముగా ఘోరమైన తపస్సులను ఆచరించువారు వివిధములైన భయంకరాచరణములద్వారా భూతసముదాయమును అనగా శరీరమును క్షీణింపజేసి, దుర్బలముగా జేయుదురు. అంతేగాదు వారు తమ ఘోరమైన చర్యలద్వారా అంతఃకరణ స్థితుడైన పరమాత్మను గూడ క్లేశపరచుదురు. ఏలనన అందరి హృదయములయందును పరమాత్మ ఆత్మరూపుడుగా స్థితుడైయున్నాడు. అందువలన స్వయముగా తమ ఆత్మను గాని, ఇతరుల ఆత్మలనుగాని కష్టపెట్టుట పరమాత్మను కష్టపెట్టుటయేయగును. కావున వారు భూతసముదాయమును, పరమాత్మను గూడ క్లేశపరచువారని తెల్పబడినది.

ప్రశ్న - 'అచేతసః' అనగానేమి?

సమా - శాస్త్రవిరుద్ధ కార్యములను ఆచరించువారును, అజ్ఞానులును, ఆవరణ దోషయుక్తులైన మూఢులును 'అచేతసః' అని వ్యవహరింపబడుదురు.

ప్రశ్న - "వీరు ఆసుర స్వభావము గలవారు" - అని యనుటలోని విశేషమేమి?

సమా - శాస్త్ర విరుద్ధముగా ఘోరములైన తామస తపస్సులను చేయువారు దంభాహంకారయుక్తులు, ఆసురీ సంపదగలవారని 16వ అధ్యాయమున వర్ణించుట జరిగినది. ఇచట గూడ ఆ భావమే ప్రకటింపబడినది.

*సంబంధము - మూడు విధములైన స్వాభావిక శ్రద్ధలు కల వారి లక్షణములను, ఘోర తపస్సులను ఆచరించువారి లక్షణములను తెల్పిన పిదప, సాత్త్వికములైన వాటిని పరిగ్రహించుటకును, రాజస, తామసములైన వాటిని త్యజించుటకును ఆహారము, యజ్ఞము, తపస్సు, దానము మొదలగు వాటి యందలి సాత్త్విక, రాజస, తామస భేదములను భగవానుడు తెల్పుచున్నాడు-*

**ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।**
**యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ 7 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వస్య | = ప్రతివ్యక్తికిని | తు | = మఱియు | | మూడు విధములు) |
| ఆహారః, అపి | = (వాని వాని స్వభావమును అనుసరించి) ఆహారము గూడ | తథా | = అట్లే | తేషామ్ | = వాటియొక్క |
| | | యజ్ఞః | = యజ్ఞము | ఇమమ్, భేదమ్ | = ఈభేదమును వేర్వేఱుగా |
| త్రివిధః | = మూడువిధములుగా | తపః | = తపస్సు | | |
| ప్రియః, భవతి | = ప్రియముగా ఉండును | దానమ్ | = దానము (అనువనిగూడ | శృణు | = వినుము |

**మనుష్యుల స్వభావములను అనుసరించి, వారికి ఇష్టములైన ఆహారములు గూడ మూడు విధములుగా ఉండును. అట్లే ఆయా మనుష్యులు ఆచరించు యజ్ఞములు, తపస్సులు, దానములుగూడా మూడేసివిధములుగానే ఉండును. వాటినిగూర్చి వేర్వేఱుగా విశదపరచెదను వినుము.(7)**

ప్రశ్న - 'అపి' అను 'అవ్యయ' ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - శ్రద్ధలయందును, పూజలయందును సాత్త్విక, రాజస, తామసభేదములున్నట్లే ఆహారములయందుగూడ మూడు విధములగు భేదములుండును - అవి తెల్పుటకు 'అపి' అను అవ్యయము ప్రయుక్తమైనది.

ప్రశ్న - 'సర్వస్య' అనగానేమి?

సమా - 'సర్వస్య' అను పదము ఇచట మనుష్య మాత్రులను సూచించును. ఏలనన మనుష్యులందరును ఆహారమును స్వీకరింతురు - ఈ ప్రకరణము గూడ మనుష్యులకు సంబంధించినదే.

ప్రశ్న - ఆహారాదులను గూర్చి అర్జునుడు ఏమియు ప్రశ్నింపలేదు గదా! మరి ప్రశ్నింపనిదే భగవానుడు ఆహారాది విషయముల గూర్చి ఏల చెప్పెను?

సమా - మనుష్యుడు భుజించు ఆహారమును బట్టి అతని అంతఃకరణస్థితి యేర్పడును. అంతఃకరణమునకు అనుగుణముగా శ్రద్ధయు ఉండును. ఆహారము శుద్ధమైనచో అంతఃకరణము గూడ శుద్ధముగా ఉండును. "ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః" (ఛాందోగ్య - ఉపనిషత్ - 7/26/2) అంతః కరణశుద్ధి వలననే ఆలోచనలు, భావములు, శ్రద్ధాది గుణములు, క్రియలు పవిత్రములుగా ఉండును. కనుక ఈ సందర్భమున ఆహార ప్రస్తావన అవసరమైనది.

దేవాదుల పూజలను అందరు ఆచరింపరు. కాని ఆహారమును అందరును స్వీకరింతురు. సాత్త్విక, రాజస, తామస గుణములు గలవారు క్రమముగా దేవతలను, యక్షరాక్షసులను భూతప్రేతములను పూజింతురు. వారివారి గుణములను బట్టి మనుష్యులు సాత్త్విక, రాజస, తామస-ఆహారములను ఇష్టపడుదురు. ఇచట 'ప్రియః' అను పదము విశేషముగా ఆ అర్థమునే తెల్పును. కనుక మనుష్యులు భుజించు ఆహారములను బట్టియు వారి సాత్త్వికాది స్వభావములను గుర్తింపవచ్చును. కావున సాత్త్వికాహారమును గ్రహించుటకును, రాజస, తామస-ఆహారములను త్యజించుటకును భగవానుడు ఆహారములయందలి మూడు భేదములను తెలుపుచున్నాడు. యజ్ఞదాన తపశ్చర్యాది విషయములయందును ఇదే విధముగా భావింపవలెను.

*సంబంధము - ఆహారయజ్ఞతపోదానములయందలి భేదములను వినుమని భగవానుడు పూర్వశ్లోకమున తెలిపియుండెను. దానిని అనుసరించి, భుజించుటకు యోగ్యమైన సాత్త్వికాహారమును గూర్చి ఈ శ్లోకమున వర్ణించుచున్నాడు-*

**ఆయుఃసత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః ।**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ॥ 8 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆయుస్సత్త్వ బలారోగ్యసుఖ ప్రీతివివర్ధనాః | = ఆయువు, బుద్ధి, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి, మున్నగు వాటిని అభివృద్ధి పఱచునవి | రస్యాః | = రసయుక్తములైనవి | ఆహారాః | = ఆహార పదార్థములు |
| | | స్నిగ్ధాః | = స్నిగ్ధములైనవి | సాత్త్విక ప్రియాః | = సాత్త్విక లక్షణములు గల వారికి ప్రియమైనవి |
| | | స్థిరాః | = స్థిరముగా ఉండునవి | | |
| | | హృద్యాః | = సహజముగ మనః ప్రీతికరములైన | | |

**ఆయువు, బుద్ధి, బలము, ఆరోగ్యము,సుఖము,ప్రీతి మున్నగువానిని అభివృద్ధిపఱచునవియు , పాలు, చక్కెర మొదలగు రసపదార్థములును, వెన్న, నెయ్యి మొదలగు స్నిగ్ధపదార్థములును, ఓజస్సును అభివృద్ధి పఱచు స్థిరపదార్థములును, సాత్త్విక స్వభావమును పెంచు హృద్య పదార్థములును సాత్త్వికులకు ఇష్టమైనవి.(8)**

ప్రశ్న - ఆయువు, బుద్ధి, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి అను వానిని వృద్ధిచేయుట యనగానేమి? వాటిని వృద్ధిచేయు ఆహారపదార్థములేవి?

సమా - (1) ఆయువు అనగా వయస్సు లేక జీవనము. జీవిత కాల వ్యవధిని వృద్ధిచేయుటనే ఆయువును వృద్ధిచేయుట యందురు.

(2) సత్త్వమనగా బుద్ధి. బుద్ధి నిర్మలముగా, తీక్ష్ణముగా (నిశితముగా) యథార్థముగా (సరిగా) సూక్ష్మదర్శినిగా చేయుటయే సత్త్వమును వృద్ధిచేయుటయగును.

(3) సత్కార్యమునందు సాఫల్యమును గూర్చు శారీరిక మానసిక శక్తినే 'బలము' అని యందురు. ఇట్టి బాహ్యాభ్యంతర శక్తిని వృద్ధి చేయుటయే బలమును వృద్ధి చేయుటయగును.

(4) మానసిక శారీరిక రోగములను దూరము చేయుటయే ఆరోగ్యమును వృద్ధిచేయుట యగును.

(5) హృదయమునందు సంతోషము, సాత్త్విక ప్రసన్నత పుష్టి కలిగియుండుట, ముఖము మొదలగు శరీరాంగముల యందు శుద్ధ భావజనితములైన ఆనంద చిహ్నములు ప్రకటితములగుటను 'సుఖము' అందురు - దీనిని వృద్ధి చేయుటయే సుఖవృద్ధి చేయుటయగును.

(6) చిత్తవృత్తులు ప్రేమభావసంపన్నములగుటయు, శరీరము నందు ప్రీతికరములైన చిహ్నములు ప్రకటితములు అగుటయే ప్రీతి వృద్ధిచెందుట యగును.

ఉపర్యుక్తములైన ఆయువు, బుద్ధి, బలము మొదలగు వానిని వృద్ధిచేయు పాలు, నేయి, కూరగాయలు, ఫలములు, చక్కెర, గోధుమ, బార్లి, పప్పులు, బియ్యము మొదలగునవి సాత్త్వికాహార పదార్థములు.

ప్రశ్న - ఈ సాత్త్వికాహార లక్షణము లెవ్వి?

సమా - 'రస్యాః' 'స్నిగ్ధాః', 'స్థిరాః', 'హృద్యాః' అను పదముల ద్వారా భగవానుడీ విషయమునే వివరించెను.

(1) పాలు, చక్కెర, మొదలగు రసయుక్తములగు పదార్థములను 'రస్యాః' అనియందురు.

(2) వెన్న, నేయి అట్లే సాత్త్విక ద్రవ్యముల నుండి తీయబడిన నూనె మొదలగు స్నేహయుక్త పదార్థములను 'స్నిగ్ధాః' అనియందురు.

(3) ఎక్కువకాలమువరకు శరీరము నందు స్థిరముగా ఉండునట్టి సారము గల పదార్థములను 'స్థిరాః' అని యందురు. అది ఓజస్సును ఉత్పన్నముచేయును.

(4) కుళ్ళిపోనివి, అపవిత్రముగానివి, పరిశుద్ధముగా నున్నవి, దర్శనమాత్రమున (చూడగనే) సాత్త్వికాభిరుచులను ఉత్పన్నము చేయు పదార్థములను 'హృద్యాః' అని యందురు.

ప్రశ్న - 'ఆహారాః' అనగానేమి?

సమా - భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములు - అను నాలుగువిధములైన ఆహారపదార్థములు భుజించుటకు యోగ్యములైనవి. దీని విశేషవివరణము 15వ అధ్యాయమునందలి 14వ శ్లోకమున చతుర్విధాన్నములకు సంబంధించిన వ్యాఖ్యానమున కలదు.

ప్రశ్న - పూర్వశ్లోకమున భగవానుడు ఆహారముయొక్క మూడు విధములను వినుమని తెల్పియుండెను. కాని ఇచ్చట 'సాత్త్వికప్రియాః' అను సమాసము ద్వారా ఆహారమును భుజించు వారి విషయమును గూర్చి తెల్పుటకు కారణమేమి?

సమా - వ్యక్తుల గుణములను బట్టియే వారికి ఆయా గుణములు గల ఆహారములు ఇష్టమగును. కావున వ్యక్తులను గూర్చి చెప్పినను, ఆహారములను గూర్చి చెప్పినట్లే - భోజనవిషయము నందలి అభిరుచులను బట్టి వ్యక్తుల గుణములను గుర్తించుటకు వీలగునని ఇట్లు తెల్పబడినది.

సంబంధము - (గ్రహింపదగిన (గ్రహించుటకు యోగ్యమైన) సాత్త్వికాహారమును వర్ణించిన పిదప ఇప్పుడు త్యజింపదగిన (త్యాజ్యములైన) రాజస, తామస-ఆహారములను భగవానుడు రెండు శ్లోకములలో తెలుపుచున్నాడు-

**కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః ।**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ 9 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కటు | = చేదు | రూక్ష | = మాడిన | | రోగములను కలిగించు నట్టివియుఅగు |
| అమ్ల | = పులుపు | విదాహినః | = దాహకములైన పదార్థములును | ఆహారాః | = ఆహారపదార్థములు |
| లవణ | = ఉప్పు | | | రాజసస్య | = రాజసపురుషునకు |
| అత్యుష్ణ | = మిక్కిలి వేడి | దుఃఖశోక-ఆమయప్రదాః | = దుఃఖమును, చింతలను, | ఇష్టాః | = ప్రియములైనవి |
| తీక్ష్ణ | = కారము | | | | |

**చేదు, పులుపు, ఉప్పు, కారము, రుచులకు సంబంధించినవి, మిక్కిలి వేడి వస్తువులు, మాడిన పదార్థములు, దాహము కల్గించునవి, అట్లే దుఃఖము, చింత, రోగములను ఉత్పన్నము చేయు ఆహారపదార్థములు రాజస స్వభావము గలవారికి ఇష్టములగును. (9)**

ప్రశ్న - చేదు, పులుపు, ఉప్పు, కారము, రుచులుగలవి, వేడి, మాడిన, దాహకములైన ఆహారపదార్థములు-అనగా ఏవి?

సమా - వేప, కాకర మొదలగు పదార్థములు చేదైనవి. చింతకాయలు, చింతపండు మొదలగునవి పులుపు పదార్థములు. క్షారములు ఉప్పుగా నుండు ఇతర లవణములు, మిక్కిలి వేడియైన పదార్థములు. మిరపకాయలు, కారము మొదలగునవి తీక్ష్ణ పదార్థములు. వేయింపబడిన (మాడిన) పదార్థములు, ఆవాలు మొదలగునవి దాహక పదార్థములు.

ప్రశ్న - 'దుఃఖశోకామయప్రదాః' అనగానేమి?

సమా - భుజించునపుడు ఈ పదార్థముల వలన గొంతులో బాధ ఏర్పడుచుండును. నాలుకపైనను, దవడలయందును మంట పుట్టుచుండును. పండ్లు (దంతములు) పులిసిపోవు చుండును. నములుటకు కష్టమగుచుండును. కండ్లనుండియు, ముక్కురంధ్రముల నుండియు నీరు వచ్చుచుండును. ఎక్కిళ్లు కలుగుచుండును. ఈ కష్టములనన్నింటిని 'దుఃఖములు' అని యందురు. భుజించిన పిమ్మట కలుగు బాధలను 'శోకము' అనియందురు. భుజించుటవలన కలుగు రోగములను 'ఆమయములు' అనియందురు. పైన తెలుపబడిన చేదు, పులుపు మొదలగు పదార్థములను తినుటవలన దుఃఖము, శోకము, రోగములు ఉత్పన్నములగును. కావున ఇవి 'దుఃఖశోకామయప్రదాః' అని పిలువబడినవి. కనుక వీటిని త్యజించుట సముచితము.

ప్రశ్న - "ఇవి రాజస పురుషులకు ఇష్టమైనవి." అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - పైన తెల్పబడిన ఆహారములు రాజసములు. కావున అట్టి పదార్థములను ఇష్టపడువారిని రజోగుణస్వభావులని భావింపవలెను.

**యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్, భోజనమ్ | = ఏభోజనమైతే | పూతి | = దుర్గంధయుక్తమైనదియు | అమేధ్యమ్, అపి | = అపవిత్రమైనదియు అగునో |
| యాతయామమ్ | = వండిన పిదప ఒక జాము కాలము గడచినదియు, బాగుగా ఉడకనిదియు | పర్యుషితమ్, చ | = పాసిపోయి నట్టిదియును | తత్ | = అట్టి భోజనము |
| గతరసమ్ | = రసహీనమైనదియు | ఉచ్ఛిష్టమ్, చ | = ఎంగిలియైనదియు | తామసప్రియమ్ | = తామసలక్షణములు గలవారికి ప్రియమైనది |

**అర్ధపక్వములైన పదార్థములు(సరిగా ఉడకనివి, పండనివి), రసహీనములు, దుర్గంధయుక్తములు (చెడువాసన గలవి), పాసిపోయిన పదార్థములు, ఎంగిలి వస్తువులు, అపవిత్రపదార్థములు మొదలగునవి తామసస్వభావము గలవారికి ఇష్టమైనవి. (10)**

ప్రశ్న - యామమనగా జాము. కనుక **'యాతయామమ్'** అను సమాస పదమునకు - సిద్ధమైన పిదప ఒక జాము గడిచిన ఆహారము అను అర్థమును చెప్పక అర్ధపక్వమైన ఆహారమని యేల చెప్పబడినది? ఎట్టి భోజనపదార్థమును అర్ధపక్వమని యందురు?

సమా - ఈ శ్లోకమునందు **'పర్యుషితమ్'** అనగా పాసిపోయిన అన్నమును తామసమని పేర్కొనుట జరిగినది. **'యాతయామమ్'** అను పదమునకు ఒక జాము క్రిందట సిద్ధమైన భోజన పదార్థము - అని భావించినచో పాసిపోయిన భోజన పదార్థము తామసము - అని చెప్పుటలో అర్థము లేదు. ఏలనన ఒక జాము (3 గంటల) క్రితము వండిన పదార్థమే తామసమైనప్పుడు ఒకరాత్రి కాలము గడచిన పిమ్మట ఆ భోజన పదార్థము **'తామసము'** అని వేరుగా చెప్పనక్కరలేదు. కనుక **'యాతయామమ్'** అను పదమునకు అర్ధపక్వమైనది అను అర్థము చెప్పబడినది.

అర్ధపక్వమైన ఫలములను, ఉడికీ ఉడకని భోజన పదార్థములను, తామస పదార్థములుగా భావింపవలెను. **'యాతయామమ్'** అను పదమునకు ఒక జాముక్రిందట వండిన పదార్థములు అను అర్థమును చెప్పినను దోషము కాదు.

ప్రశ్న - 'గతరసమ్' అను పదము ఎట్టి భోజన పదార్థమును దెల్పును?

సమా - అగ్ని మొదలగు వాటి సంయోగము వలనను, గాలివలనను, అనువైన కాలము గడచుటవలనను, రసయుక్తములైన పదార్థములు క్రమముగా ఎండిపోయి రసహీనములగును. (బత్తాయిపండ్లు, చెఱకు మొదలగునవి) వీటిని 'గతరసములు' అని యందురు.

ప్రశ్న - **'పూతి'** అను పదము ఎట్టి పదార్థమును తెలుపును?

సమా - సహజముగా దుర్గంధయుక్తములైన పదార్థములు (ఉల్లిగడ్డలు, ఎల్లిగడ్డలు మొదలగునవి.) లేదా పులియబెట్టుట మొదలగు ప్రక్రియల వలన దుర్గంధయుక్తములైన వాటిని పూతి (దుర్గంధ) యుక్తములు అనియందురు.

ప్రశ్న - 'పర్యుషితమ్' అనగానేమి?

సమా - క్రిందటి రోజున వండిన భోజన పదార్థమును 'పర్యుషితమ్' లేక 'పాసినది' అనియందురు. ఒకరాత్రి గడచుటచే అట్టి ఖాద్యపదార్థములయందు వికారము ఉత్పన్నములై వాటిని భుజించువారికి అవి రోగములను కలుగజేయును. చెట్టునుండి త్రెంపబడిన పిదప చాల కాలము గడచుటచే వికారములకు (మార్పులకు) లోనైన పండ్లు మొదలగు వానిని గూడ పాసిపోయినవానినిగనే భావింపవలెను.

ప్రశ్న - 'ఉచ్ఛిష్టము' అనగానేమి?

సమా - ఒకరు భుజించిన పిదప మిగిలిన (ఎంగిలి ఐన) పదార్థములను 'ఉచ్ఛిష్టము' అని యందురు.

ప్రశ్న - 'అమేధ్యమ్' అను పదము ఎట్టి పదార్థమును సూచించును?

సమా - మాంసము, గ్రుడ్లు మొదలగు హింసాత్మకములైనవి, కల్లు సారాయము మొదలగు (శాస్త్ర) నిషిద్ధ మాదక ద్రవ్యములు సహజముగా అపవిత్రములైనవి. అట్టి పదార్థములను **'అమేధ్యములు'** అని యందురు. అంతేగాక సంగదోషము వలన ఏదైనను అపవిత్ర వస్తువు, స్థానము, పాత్ర, వ్యక్తి సంయోగము వలన అపవిత్రములైనవియును, అన్యాయముగా అధర్మముగా ఆర్జించిన ధనముతో ప్రాప్తించిన వస్తువులను గూడ అమేధ్యములుగనే భావింపవలెను. దైవసేవలో ఇట్టి పదార్థములు నిషిద్ధములు.

ప్రశ్న - 'చ' 'అపి' - అను అవ్యయములను ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - పైన తెల్పబడిన పదార్థములే గాక అట్టి దోషములు గల ఇతర వస్తువులన్నింటిని తామసములుగనే భావింపవలెను. ఇంతేగాక గంజాయి, భంగు, పొగాకు, సిగరెట్లు, అర్కములు, ఆసవములు, ఇతర అపవిత్రములైన మందులు తమోగుణమును కల్గించును. వీటిని తామసములు అనియందురు.

ప్రశ్న - "ఇట్టి భోజన పదార్థములు తామసపురుషులకు ఇష్టములైనవి" - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - పై లక్షణములు గల భోజనపదార్థములు తామసములు. తామస ప్రకృతి గలవారు ఇట్టి భోజన పదార్థములనే ఇష్టపడుదురు. వారిని గుర్తించుటకు ఇది యొక మార్గము.

సంబంధము - భోజనపదార్థములలో మూడు విధములైన భేదములను తెల్పిన పిదప ఇప్పుడు యజ్ఞములలో మూడు భేదములను భగవానుడు తెల్పుచున్నాడు - ఇందు సాత్త్విక యజ్ఞములు ఆచరణీయములు-

**అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।**
**యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ 11 ॥**

యః, యజ్ఞః = ఏ యజ్ఞము
విధిదృష్టః = శాస్త్రోక్తమైనదో
యష్టవ్యమ్, ఏవ, ఇతి, మనః, సమాధాయ = ఇది నాకు కర్తవ్యమే అని, మనస్సున దృఢముగా నిశ్చయించుకొని
అఫలాకాంక్షిభిః = ప్రతిఫలాపేక్ష లేనివారిచే
ఇజ్యతే = చేయబడునో
సః = ఆ యజ్ఞము
సాత్త్వికః = సాత్త్వికము

**శాస్త్రోక్తమైనదియు, ఈ యజ్ఞము నాకు కర్తవ్యము అని మనస్సున దృఢముగా నిశ్చయించుకొనబడినదియు, ప్రతిఫలాపేక్ష లేకుండ చేయబడునదియు ఐన యజ్ఞము సాత్త్వికయజ్ఞము అనబడును. (11)**

ప్రశ్న - 'విధి దృష్టః' అను పదమునకు అర్థమేమి? ఈ విశేషణమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - శ్రౌతస్మార్త యజ్ఞములలో వర్ణాశ్రమములను అనుసరించి కర్తవ్యములుగా శాస్త్రములయందు చెప్పబడిన శాస్త్రవిహిత యజ్ఞములే సాత్త్వికములు. శాస్త్ర విరుద్ధములై, ఇష్టాను సారము చేయబడిన యజ్ఞములు సాత్త్వికములు కావు.

ప్రశ్న- ఇచట 'యజ్ఞః' అను పదము దేనిని సూచించును?

సమా - దేవతలు మొదలగు వారిని ఉద్దేశించి, హోమాగ్ని యందు ఆజ్యము (నేయి) మొదలగు వానిని హోమము (హవనము) చేయుటయు, అట్లే ఏ రీతిగనైనను, ఏ వస్తువులనైనను సమర్పించి, ఏ దేవతనైననూ యథా యోగ్యముగ పూజించుటను గూడ యజ్ఞము అని యందురు.

ప్రశ్న - "యజ్ఞము చేయుటయే నా కర్తవ్యము అని మనస్సునందు దృఢముగా నిశ్చయించుకొని చేయబడు యజ్ఞము సాత్త్వికము" - అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఫలేచ్ఛయే లేనప్పుడు కర్మ చేయవలసిన అవసరమేమున్నది? అను సందేహము కల్గినప్పుడు మనుష్యునకు యజ్ఞప్రవృత్తియే లేకపోవచ్చును. కావున తమతమ వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి, శాస్త్రములలో తెల్పబడిన పద్ధతులద్వారా యజ్ఞములను ఆచరించుట ప్రతి యొక్కరి కర్తవ్యమని తెల్పుటకే 'కర్మాచరణమే నా కర్తవ్యము' అను భావముతో చేయబడు యజ్ఞము 'సాత్త్వికము' అని భగవానుడు నుడివెను. ఇట్టి శాస్త్రవిహిత కర్తవ్య రూప యజ్ఞమును చేయకుండుట భగవానుని ఆదేశమును ఉల్లంఘించుటయే యగును. ఈ విధముగా 'యజ్ఞములు చేయుట నాకర్తవ్యము' అని దృఢముగా నిశ్చయించుకొని చేయబడుయజ్ఞము 'సాత్త్వికము' అగును.

ప్రశ్న - 'అఫలాకాంక్షిభిః' అను సమాసము ఎట్టి వారిని తెల్పును? వారిచే చేయబడు యజ్ఞములు సాత్త్వికములు - అని తెల్పుటలోని అంతర్యమేమి?

సమా - భార్యాపుత్రులు, ధనము, గృహము, గౌరవము, కీర్తిప్రతిష్ఠలు, విజయము, స్వర్గము మొదలగునవి లభించుట కొరకు గాని, ఏదోయొక విధముగా అనిష్టము కలుగకుండుటకు గాని, అనగా సుఖభోగములను గాని, దుఃఖనివృత్తినిగాని కోరక యజ్ఞములను ఆచరించువారిని 'అఫలాకాంక్షిభిః' అను పదము సూచించును. (6/1) ఫలేచ్ఛతో చేయబడు యజ్ఞము విధ్యుక్తముగా చేసినను, అది పూర్ణసాత్త్వికము కానేరదు. సాత్త్విక భావ పూర్ణత్వమునకై ఫలేచ్ఛాత్యాగము పరమావశ్యకము.

సంబంధము - ఇప్పుడు రాజస యజ్ఞలక్షణములను తెల్పుచున్నాడు-

**అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12 ॥**

తు = కాని
భరతశ్రేష్ఠ! = ఓ అర్జునా!
యత్ = ఏది
దంభార్థమ్, ఏవ = (సరియైన నిష్ఠ లేకుండ) ఆడంబరము కొఱకు ఆచరింపబడునో
చ = మఱియు
ఫలమ్, అపి = ఫలమును గూడ
అభిసంధాయ = దృష్టిలోనుంచుకొని
ఇజ్యతే = చేయబడునో
తమ్, యజ్ఞమ్ = అట్టి యజ్ఞమును
రాజసమ్ = రాజసమైనదిగా
విద్ధి = ఎఱుంగుము.

**కాని, ఓ అర్జునా! సరియైన నిష్ఠలేకుండ ఆడంబరముకొఱకు ఆచరింపబడునదియు, ప్రతిఫలాపేక్షతో చేయబడునదియు అగు యజ్ఞము రాజసయజ్ఞము అని ఎఱుంగుము. (12)**

ప్రశ్న - 'తు' అను అవ్యయప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - సాత్త్విక యజ్ఞమునకును దీనికిని గల భేదమును తెల్పుటకై 'తు' అను అవ్యయము ప్రయుక్తమైనది.

ప్రశ్న - ఆడంబరముకొరకు యజ్ఞము చేయుట యనగానేమి?

సమా - యజ్ఞ కర్మలయందు 'ఆస్థ' లేకున్నను తనకు యజ్ఞనిష్ఠకలదని సమాజమున (ప్రపంచమున) చాటుకొనుటకై యజ్ఞమును చేయుటను ఆడంబరము కొరకు యజ్ఞము చేయుట అని యందురు.

ప్రశ్న - ప్రతిఫలాపేక్షతో యజ్ఞము చేయుట యనగానేమి?

సమా - భార్యాపుత్రులు, ధనము, ఇల్లు, గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు, విజయము, స్వర్గము మొదలగు ఇహపరలోక సుఖభోగములు లభించుటకు గాని, అనిష్టములు తొలగిపోవుటకుగాని, యజ్ఞములను చేయుటను ఫలేచ్ఛతో యజ్ఞములను చేయుటయని యందురు.

ప్రశ్న - 'ఏవ, అపి, చ' అను అవ్యయములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఏదైన ఫలప్రాప్తికై చేయబడు యజ్ఞము శాస్త్రవిహితము, శ్రద్ధాన్వితము - ఐనను అది రాజసమే యగును. అట్లే ఆడంబరముకొరకు చేయబడు యజ్ఞము కూడ రాజసమేయగును. ఈ రెండు దోషములు గల యజ్ఞము 'రాజసము' అని చెప్పనవసరమే లేదు - అని తెల్పుటకే 'ఏవ, అపి, చ' అను అవ్యయములు ప్రయోగింపబడినవి.

*సంబంధము - సర్వథా త్యజింపవలసిన తామస యజ్ఞముల లక్షణములను గూర్చి ఇప్పుడు తెల్పుచున్నాడు-*

**విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్ ।**
**శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13 ॥**

విధిహీనమ్ = శాస్త్రవిధులను పాటింపనిదియును
అసృష్టాన్నమ్ = అన్నదాన రహితమైనదియు
మంత్రహీనమ్ = మంత్రహీనమైనదియు
అదక్షిణమ్ = దక్షిణలు లేనిదియు
శ్రద్ధావిరహితమ్ = శ్రద్ధలేకుండ చేయబడునదియు అగు
యజ్ఞమ్ = యజ్ఞమును
తామసమ్ = తామసమైనదిగా
పరిచక్షతే = చెప్పుదురు

**శాస్త్రవిధిననుసరింపనిదియు, అన్నదానరహితమైనదియు, మంత్రహీనమైనదియు, దక్షిణలు లేనిదియు, శ్రద్ధారహితమైనదియు అగు యజ్ఞము 'తామసయజ్ఞము' అనబడును. (13)**

ప్రశ్న - 'విధిహీనమ్' (శాస్త్ర విరుద్ధమైన) యజ్ఞము అనగా అది ఎట్టిది?

సమా - శాస్త్రవిహితము కానిదియు, శాస్త్రోక్తములైన విధులను ప్రక్కన బెట్టి, ఇష్టానుసారముగా నిరాదరణతో చేయబడు యజ్ఞమును 'విధిహీనమ్' అని యందురు.

ప్రశ్న - 'అసృష్టాన్నమ్' అను పదము ఎట్టి యజ్ఞము తెల్పును?

సమా - బ్రాహ్మణ భోజనముగాని, అన్నదానముగాని లేని యజ్ఞమును 'అసృష్టాన్నమ్' అని యందురు.

ప్రశ్న - 'మంత్రహీనమ్' అను పదము ఎట్టి యజ్ఞమును తెల్పును?

సమా - శాస్త్రోక్తములైన మంత్రములు లేనిదియు, అంతేగాక మరి ఎట్టి మంత్రములూ లేనిదియు అగు యజ్ఞమును 'మన్త్రహీనమ్' అని యందురు - ఒకవేళ మంత్రములున్నను అవి విధానమును అనుసరింపనివియు, లేక నిరాదరణతో లోపభూయిష్టములైనవియు అగుచో అట్టి యజ్ఞము 'మంత్రహీనమ్' అని యనబడును.

ప్రశ్న - 'అదక్షిణమ్' అను పదము ఎట్టి యజ్ఞమును తెల్పును?

సమా - యజ్ఞమును చేయించువారికిని, ఋత్విక్కులకును, ఇతర బ్రాహ్మణులకును దక్షిణలు ఇయ్యబడనిచో అట్టి యజ్ఞమును 'అదక్షిణమ్' అని యందురు.

ప్రశ్న - 'శ్రద్ధావిరహితమ్' అనునది యెట్టి యజ్ఞము?

సమా - తగిన శ్రద్ధలేకుండ కేవలము అభిమానము, మదము, మోహము, దంభము, అహంకారము మొదలగు వాని ప్రేరణచే చేయబడు యజ్ఞమును 'శ్రద్ధావిరహితమ్' అని యందురు.

*సంబంధము - ఈ విధముగా మూడు విధములైన యజ్ఞలక్షణములను దెల్పి, ఇప్పుడు తపస్సు లక్షణములను తెల్పు ప్రకరణమును ఆరంభించుచున్నాడు. 4 శ్లోకముల ద్వారా సాత్త్విక తపోలక్షణములను తెల్పుటకై మొదట శారీరిక తపస్స్వరూపమును వర్ణించుచున్నాడు-*

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 14 ॥

దేవ, ద్విజ, గురు, ప్రాజ్ఞ పూజనమ్ = దేవతలను, బ్రాహ్మణులను, గురుజనులను, జ్ఞానులను పూజించుట
శౌచమ్ = పవిత్రత
ఆర్జవమ్ = ఋజుత్వము, (మనో వాక్కాయములయందు సరళత్వము కలిగి యుండుట)
బ్రహ్మచర్యమ్, చ = బ్రహ్మచర్య వ్రతమును పాటించుట
అహింసా = అహింసయు
శారీరమ్, తపః = శారీరికమైన తపస్సు అని
ఉచ్యతే = చెప్పబడును

**దేవతలను, బ్రాహ్మణులను, గురుజనులను,జ్ఞానులను సేవించుట, పవిత్రత(శౌచము) నిరాడంబరత్వము, బ్రహ్మచర్యము, అహింస అనునవి శారీరక తపస్సులు. (14)**

ప్రశ్న - 'దేవ, ద్విజ, గురు, ప్రాజ్ఞ' - అను శబ్దములువివరెవరిని సూచించును? వారిని పూజించుట యనగానేమి?

సమా - బ్రహ్మ, మహాదేవుడు, సూర్యుడు, చంద్రుడు, దుర్గ, అగ్ని, వరుణుడు, యముడు, ఇంద్రుడు మొదలగువారు శాస్త్రములలో తెల్పబడిన దేవతలు. వీరి పూజావిధానము గూడ శాస్త్రములలో తెల్పబడినది. ఇచట 'దేవ' అను శబ్దము ఈ దేవతలనే తెల్పును. 'ద్విజ' శబ్దము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు అను మూడు వర్ణముల వారిని తెల్పునదేయైనను, ఇచ్చట బ్రాహ్మణులనుద్దేశించియే ప్రయుక్తమైనది - ఏలనన శాస్త్రములను అనుసరించి, బ్రాహ్మణులే అందరికిని పూజ్యులు.

తల్లిదండ్రులు, ఆచార్యులు, వృద్ధులు, అట్లే తమకంటెను వర్ణాశ్రమములలో, వయస్సు మొదలగు వానిలో సర్వవిధముల

శ్రేష్ఠులైనవారిని 'గురు' శబ్దము సూచించును. పరమేశ్వర స్వరూపమును చక్కగా ఎరింగిన మహాత్ములైన జ్ఞానులను 'ప్రాజ్ఞ' శబ్దము తెల్పును.

వీరందరికిని యథాయోగ్యముగా ఆదర సత్కారములను జేయుట, నమస్కరించుట, దండప్రణామములను ఆచరించుట, పాదములను కడుగుట, చందన పుష్ప ధూపదీప నైవేద్యాదులను సమర్పించుట, యథాయోగ్యముగ సేవలొనర్చుట, సుఖపెట్టుటకై యథోచితముగా ప్రయత్నించుట మొదలగునవియన్నియు చేయుటయే వీరిని పూజించుట యగును.

ప్రశ్న - 'శౌచమ్' అను పదము ఇచట ఏ శౌచమును తెల్పును?

సమా - 'శౌచమ్' అను పదము ఇచ్చట కేవలము శారీరక శౌచమునే తెల్పును. ఏలనన 15వ శ్లోకమున 'వాక్+శుద్ధి'ని గూర్చియు, 16వ శ్లోకమున 'మనశ్శుద్ధి'ని గురించియు వేరుగా వర్ణించుట జరిగినది. జలమృత్తికాదుల ద్వారా శరీరమును స్వచ్ఛముగా పవిత్రముగా ఉంచుకొనుట, అట్లే శారీరక పవిత్రతను కాపాడుకొను చేష్టలన్నియును 'శౌచము' అను పదముచే నిర్దేశింపబడును. (16/3)

ప్రశ్న - 'ఆర్జవమ్' అను పదమునకు అర్థమేమి?

సమా - 'ఆర్జవమ్' అనగా సరళత్వము - ఇది శారీరిక తపస్సునకు సంబంధించిన సందర్భముగావున 'ఆర్జవము' అనగా శరీరము అటునిటు వంగక, బిగుసుకొని యుండక, ఎట్టి వక్రత్వములేక నిటారుగా ఉండుటయే.

ప్రశ్న - 'బ్రహ్మచర్యమ్' అనగానేమి?

సమా - శరీర సంబంధమైన మైథున క్రియలన్నింటికిని దూరముగా ఉండుటను, పూర్తిగా వీర్యధారణ చేయుటను బ్రహ్మచర్యము అందురు.

ప్రశ్న - అహింస యనగానేమి?

సమా - శారీరికముగా ఏ ప్రాణినీ ఏ విధముగనూ ఎన్నడునూ ఏమాత్రమూ కష్టపెట్టకుండుటను 'అహింస' అని యందురు.

ప్రశ్న - వీటన్నింటిని 'శారీరిక తపశ్చర్యలు' అనియనుట లోని ఆంతర్యమేమి?

సమా - పైన తెల్పబడిన క్రియలన్నింటియందును శరీర ప్రాముఖ్యమే కలదు - అనగా వీటితో శరీరమునకే ఎక్కువ సంబంధము గలదు. ఇవి (ఈ క్రియలు) శరీరేంద్రియములన్నింటి యందలి దోషములను రూపుమాపి, శరీరమును పవిత్రమొనర్చును. కనుక వీటిని 'శారీరిక తపస్సులు' - అని యందురు.

సంబంధము - ఇప్పుడు వాక్కునకు సంబంధించిన తపస్స్వరూపమును తెల్పుచున్నాడు-

**అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయమ్ తప ఉచ్యతే ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = ఏదయితే | | అగు | | కూడి యున్నదో |
| అనుద్వేగకరమ్ | = ఉద్వేగమును కల్గింపనిదియు | వాక్యమ్ | = భాషణమో | (తత్) ఏవ | = అదియే |
| ప్రియహితమ్, చ | = ప్రియమైనదియు, హితకరమైనదియు | చ | = అవిధముగానే | వాఙ్మయమ్, తపః | = వాక్కులకు సంబంధించిన తపస్సు- అని |
| సత్యమ్ | = యథార్థమైనదియు | స్వాధ్యాయాభ్యసనమ్ | = వేదశాస్త్రపఠనములతో పరమేశ్వరనామ జపము యొక్క అభ్యాసములతో | ఉచ్యతే | = పేర్కొనబడును |

ఉద్వేగమునుకలిగింపనిదియు, ప్రియమైనదియు, హితమును గూర్చునదియు, యథార్థమైనదియు అగు భాషణము, అట్లే వేదశాస్త్రపఠనము, పరమేశ్వరుని నామ జప సాధన మొదలగునవి యన్నియును వాక్కునకు సంబంధించిన తపస్సులు. **(15)**

ప్రశ్న - 'అనుద్వేగకరమ్', 'సత్యమ్', 'ప్రియహితమ్' అను విశేషణములకు అర్థమేమి? 'వాక్యమ్' అను పదముతోపాటు వీటిని, 'చ' అను అవ్యయమును ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - ఎవ్వరి మనస్సునందును, ఏమాత్రమూ ఉద్వేగమును కలిగింపనిదియును, నింద, చాడీలు, దూషణాది దోషములు లేనిదియును ఐనట్టి వచనమును 'అనుద్వేగకరమ్' అని యందురు. చూచిన దానిని, వినిన దానిని, అనుభవించిన దానిని యథాతథముగా ఇతరులకు వివరించు యథార్థ వచనమును 'సత్యమ్' అనియందురు. వినినవానికి ప్రియమును గూర్చునదియును, కాఠిన్యము, కపటము, నటన, ఎగతాళి, అవమానము మొదలగు దుష్టభావములు లేకుండ ప్రేమయుక్తమై, మధురము, సరళము, శాంతము ఐన వచనములు 'ప్రియములు' అనబడును. పరిణామమున అందరికిని హితమును గూర్చునదియు, హింసాద్వేషములు, అసూయ, వైరము మొదలగునవి లేనిదియును, ప్రేమ, దయ, హితాభిలాష కలిగిన వచనమును 'హితము' అనియందురు.

అనుద్వేగకరము, సత్యము, ప్రియము, హితకరము అను లక్షణములన్నియును గలదియు, శాస్త్రోక్తములైన వాక్సంబంధ దోషము లెవ్వియును లేనిదియు ఐనట్టి వాక్యమును ఉచ్చరించుటను 'వాచిక తపస్సు' అని యందురు. ఇందులో ఏ దోషమున్నను, లేక పైన దెల్పబడిన గుణములలో ఏ ఒక్కటి లేకున్నను, ఆ వాక్యము సాంగోపాంగ వాచిక (వాక్సంబంధమైన) తపస్సు కాదు.

ప్రశ్న - 'స్వాధ్యాయాభ్యసనమ్' అనగానేమి?

సమా - యోగ్యతను అనుసరించి, వేదవేదాంగ, స్మృతి, పురాణ స్తోత్రాదులను పఠించుట, భగవానుని గుణ ప్రభావనామములును ఉచ్చరించుట, భగవంతుని స్తుతించుట మొదలగునవి యన్నియును 'స్వాధ్యాయాభ్యసనమ్' అను దానిలో అంతర్గతములు.

ప్రశ్న - వీటన్నింటిని 'వాచిక తపస్సు' అనియనుటలోని విశేషమేమి?

సమా - పైన తెల్పబడిన గుణములన్నియును వాక్కునకు సంబంధించినవి. ఇవి యన్నియును వాగ్దోషములను నశింపజేసి, అంతఃకరణమును, వాక్కును పవిత్రమొనర్చును. కనుక వీటిని 'వాక్సంబంధ తపస్సులు' అనియనుట జరిగినది.

సంబంధము - ఇప్పుడు 'మానసిక తపస్సును గూర్చి భగవానుడు తెల్పుచున్నాడు-

**మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।**
**భావసంశుద్ధిరిత్యేతత్ తపో మానసముచ్యతే ॥ 16 ॥**

మనఃప్రసాదః = మనఃప్రసన్నత
సౌమ్యత్వమ్ = శాంత స్వభావము
మౌనమ్ = భగవచ్చింతనము
ఆత్మవినిగ్రహః = మనోనిగ్రహము మఱియు
భావసంశుద్ధిః = అంతఃకరణమునందలి భావముల పవిత్రత
ఇతి, ఏతత్, తపః = అనెడి, ఈ విధమైన తపస్సు
మానసమ్ = మానసికమైనదిగా
ఉచ్యతే = చెప్పబడును

**మనఃప్రసన్నత, శాంతస్వభావము, భగవచ్చింతన, మనోనిగ్రహము, అంతఃకరణశుద్ధి మొదలగునవి యన్నియును మానసికతపస్సులు. (16)**

ప్రశ్న - 'మనఃప్రసాదః' అనగానేమి?

సమా - మనస్సు యొక్క నిర్మలత్వము, ప్రసన్నతను 'మనఃప్రసాదః' అని యందురు. విషాదభయములు, చింతా శోకములు, వ్యాకులత, ఉద్విగ్నత మొదలగు దోషములులేని మనస్సు శుద్ధమై, ప్రసన్నత, హర్షము, జ్ఞానశక్తి మొదలగువానితో యుక్తమైనచో దానిని 'మనఃప్రసాదః' అని యందురు.

ప్రశ్న - 'సౌమ్యత్వమ్' అనగానేమి?

సమా - నిర్లక్ష్యము, అసూయ, హింసాప్రతిహింసలు, క్రౌర్యము, నిర్దయ మొదలగు తాపకారకములైన దోషము లేమాత్రమూ లేక మనస్సు సర్వదా శాంతమై యుండుటను 'సౌమ్యత్వము' అని యందురు.

ప్రశ్న - 'మౌనమ్' అనగానేమి?

సమా - మనస్సును నిరంతరము భగవంతుని యొక్క గుణ, ప్రభావ, తత్త్వ, స్వరూప, లీలల, నామముల చింతన యందు లగ్నము చేయుట, బ్రహ్మ విచారమునందే మునిగి యుండుట 'మౌనము' అనబడును.

ప్రశ్న - 'ఆత్మవినిగ్రహము' అనగానేమి?

సమా - అంతఃకరణమునందు చాంచల్యము ఏ మాత్రము లేకుండ అది స్థిరమై పూర్తిగా తన వశములో ఉండుటను 'ఆత్మవినిగ్రహః' అని యందురు.

ప్రశ్న - 'భావసంశుద్ధిః' అనగానేమి?

సమా - అంతఃకరణమునందు రాగద్వేషములు, కామ క్రోధములు, లోభమోహములు, మదమాత్సర్యములు, ఈర్ష్యాద్వేషములు, ఘృణాతిరస్కారములు, అసూయా - అసహిష్ణుతలు, ప్రమాద, వ్యర్థ విచారములు, ఇష్ట విరోధ - అనిష్టచింతనాది దుర్భావములు అన్నియును సర్వథా తొలగిపోవుట, వాటి స్థానములో దయ, క్షమ, ప్రేమ, వినయము మొదలగు సమస్త సద్భావములు సర్వదా వికసితమగుటనే 'భావసంశుద్ధిః' అని యందురు.

ప్రశ్న - ఈ గుణములన్నింటిని మానసిక (మనస్సునకు సంబంధించిన) తపస్సు - అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ గుణములన్నియును మనస్సునకు సంబంధించినవి. మనోదోషములనన్నింటిని పారద్రోలి, పరమ పవిత్ర మొనరించునవి. కావున ఇవి యన్నియును మానసిక తపస్సులుగా పేర్కొనబడినవి.

సంబంధము - ఇప్పుడు సాత్త్విక తపోలక్షణములను గూర్చి తెల్పుచున్నాడు-

**శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః ।**
**అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17 ॥**

అఫలాకాంక్షిభిః = ఫలాపేక్షలేనివారగు
యుక్తైః, నరైః = యోగులచేత
పరయా, శ్రద్ధయా తప్తమ్ = అత్యంత శ్రద్ధతో చేయబడిన
తత్, త్రివిధమ్, తపః = అట్టి మూడు విధములైన (శారీరక, వాచిక, మానసిక) తపస్సును
సాత్త్వికమ్ = సాత్త్వికమని
పరిచక్షతే = పేర్కొందురు

**పూర్వోక్తములైన (శారీరిక,వాచిక, మానసిక) తపస్సులను ఫలాకాంక్షలేని యోగులు మిక్కిలి శ్రద్ధతో ఆచరించినపుడు వాటిని 'సాత్త్విక తపస్సులు' అని యందురు. (17)**

ప్రశ్న- 'నరైః' అను పదముతో పాటు 'అఫలా కాంక్షిభిః', 'యుక్తైః' అను రెండు విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇహపరలోకముల యందలి ఏ సుఖభోగ ప్రాప్తికి గాని, దుఃఖనివృత్తికి గాని, ఏమాత్రమూ అపేక్ష పడనివానిని 'అఫలాకాంక్షీ' అని యందురు. అట్టివాని మనస్సు, బుద్ధి, ఇంద్రియములు అనాసక్తములై, నిగృహీతములై, శుద్ధములై యుండుటవలన అవి ఎన్నడును, ఏ విధముగను భోగసంబంధముచే విచలితములుగావు. అట్టి ఆసక్తిరహితుడైన వానిని 'యుక్తః' అని యందురు. పైన తెల్పబడిన మూడు విధములైన (శారీరిక, వాచిక, మానసిక) తపస్సులు నిష్కామభావముతో ఆచరించినప్పుడు అది పూర్ణ సాత్త్విక మనబడును. కనుక నిష్కామభావము పరమావశ్యము.

ప్రశ్న- 'పరమశ్రద్ధా' అనగానేమి? అట్టి శ్రద్ధతో మూడు విధములైన తపస్సులు చేయుట యనగానేమి?

సమా - శాస్త్రములయందు తెల్పబడిన పై మూడు విధములగు తపస్సుల యొక్క మహత్త్వ ప్రభావ, స్వరూపములయందు అత్యంత విశ్వాసము కలిగియుండుటను 'పరమశ్రద్ధ' అని యందురు. ఇట్టి శ్రద్ధాయుక్తుడై అనివార్యములైన విఘ్నములకును, కష్టములకును ఏమాత్రమూ లెక్కచేయక చలింపక మిక్కిలి ఆదరముతో ఉత్సాహముతో పై తపస్సులను ఆచరించుటయే పరమశ్రద్ధతో వాటిని ఆచరించుట యగును.

ప్రశ్న - 'తపః' అను పదముతోపాటు 'తత్-త్రివిధమ్' అను విశేషణములను ప్రయోగించుటలోని ఆంతర్యమేమి?

సమా - శరీర వాఙ్మనస్సులకు సంబంధించిన ఉపర్యుక్త తపస్సులే 'సాత్త్విక తపస్సులు' అగును. ఈ అధ్యాయమున

5వ శ్లోకమునందు 'అశాస్త్రవిహితమ్, ఘోరమ్, అను విశేషణములతోపాటు తెల్పబడిన వేరువిధములైన కాయిక, వాచిక, మానసిక తపస్సులు సాత్త్వికములు కానేరవు. 14, 15, 16 శ్లోకములయందు తెల్పబడిన కాయిక, వాచిక, మానసిక తపస్సులు 'స్వరూపత:' సాత్త్వికములు. కాని అవి ఈ శ్లోకమునందు తెల్పబడిన భావముతో (అఫలాకాంక్షా, పరమశ్రద్ధలతో) ఆచరించినపుడే అవి పూర్ణసాత్త్వికము లగును.'

సంబంధము - ఇపుడు రాజస తపోలక్షణములను తెల్పుచున్నాడు-

**సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।**
**క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్, తప: | = ఏతపస్సు | చ, ఏవ | = ఇతరస్వార్థ ప్రయోజనముల కొఱకును | చలమ్ | = క్షణికఫలమును ఇచ్చునదియు అగు |
| సత్కారమాన పూజార్థమ్ | = ఇతరులనుండి సత్కారములను, గౌరవములను, పూజలను అందుకొనుటకును | వా | = లేక | తత్ | = ఆ తపస్సు |
| | | దంభేన | = దంభముతో | ఇహ | = ఇచ్చట |
| | | క్రియతే | = చేయబడునో | రాజసమ్ | = రాజసమని |
| | | అధ్రువమ్ | = అనిశ్చితమైనదియు | ప్రోక్తమ్ | = చెప్పబడినది |

**ఇతరులనుండి సత్కారములను, గౌరవములను, పూజలను అందుకొనుటకును, అట్లే తదితర స్వార్థప్రయోజనముల కొఱకును, స్వాభావికముగా గాని, కల్పితముగా గాని చేయబడునవియు, అనిశ్చితఫలములనుగాని, క్షణికఫలములను గాని ఇచ్చునవియు ఐన తపస్సులను 'రాజసతపస్సులు' అని యందురు. (18)**

ప్రశ్న - ఇచ్చట 'తప:' అను పదముతో 'యత్' అను పదమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - శాస్త్రములలో వర్ణింపబడిన వ్రతములు, ఉపవాసములు, సంయమము మొదలగు తపస్సులను సమాజమునుండి సత్కారములను, గౌరవములను, పూజలను అందుకొనుటకై చేసినచో అట్టివానిని 'రాజసతపస్సులు' అని యందురు. ఈ భావమును తెల్పుటకే 'తప:' అను పదముతో 'యత్' అను పదము ప్రయుక్తమైనది.

ప్రశ్న - సమాజమునందు తమకు సత్కారములు, గౌరవప్రతిష్ఠలు, పూజలు లభించుటకై 'తపమును' ఆచరించుట యనగానేమి? 'చ', 'ఏవ' అను అవ్యయములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - తపస్సులను ఆచరించుట ద్వారా ప్రపంచమున 'ఈ మనుష్యుడు గొప్ప తపస్వి. ఈయనతో సమానులు ఎవ్వరును లేరు. ఈయన మిక్కిలి శ్రేష్ఠుడు' - అని ప్రసిద్ధి పొందుటయే సత్కారము అనబడును. తపస్వి యని భావించి ఒక వ్యక్తికి 'స్వాగతము' పలుకుట, ఆతని యెదుట నిలబడుట, ప్రణమిల్లుట, సమ్మానపత్రము సమర్పించుట, ఇతర రీతులలో గౌరవించుట మొదలగునవి 'గౌరవప్రతిష్ఠలు' అనబడును. సమున్నతవేదికపై సముచితముగా ఆసీనులను గావించి, అర్ఘ్య పాద్యాది షోడశోపచారములను చేసి, వారి ఆజ్ఞలను పాటించుటయే పూజలనబడును.

ఈ సత్కారాదులకై లౌకిక శాస్త్రీయ తపశ్చర్యలను ఆచరించుటను 'సత్కార, మాన, పూజలకై 'తపము' ఆచరించుట యగును - ఇవిగాక స్వార్థసిద్ధికై ఇతరములైన ఏతపస్సులను ఆచరించినను అవియన్నియును 'రాజసములే' అనబడును.'

ప్రశ్న - 'దంభముతో తపస్సు చేయుట' అనగానేమి?

సమా - వాస్తవముగ తపస్సు చేయుట యందు 'ఆస్థ' లేకున్నను, ఇతరులను మోసగించి, ఏదోయొక విధముగా స్వార్థలాభములను పొందుటకై 'తపస్వి'గా నటించుచు లౌకిక శాస్త్రీయ తపస్సులను చేయుచున్నట్లు లోకులకు కనబడుటకై, తపమాచరించుటను 'దంభముతో తపమాచరించుట' యగును.

ప్రశ్న - స్వార్థసిద్ధికై దంభముతో చేయు తపస్సునే రాజసము అందురా? కేవలము స్వార్థలాభములకై చేయబడు తపస్సును రాజసము అందురా?

సమా - కేవలము స్వార్థ చింతనతో చేయబడుతపస్సును 'రాజసము' అందురు. మఱిదానితో దంభముగూడ ఉన్నచో దానిని "రాజసము" అని వేరుగా చెప్పనలసిన అవసరమేలేదు.

ప్రశ్న - 'రాజసతపస్సు'ను 'అధ్రువమ్', 'చలమ్' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ 'రాజస తపస్సు'ల ఫలము తప్పక సిద్ధించునని నిశ్చయముగా చెప్పలేము. కనుక దానిని 'అధ్రువమ్' అని పేర్కొనుట జరిగినది - ఒకవేళ ప్రాప్తించినను అది శాశ్వతముగాదు. అది నశ్వరమగుట నిశ్చయము - కావున అది 'చలమ్' అని పేర్కొనబడినది.

సంబంధము - సర్వథా త్యజింపవలసిన 'తామస తపోలక్షణముల'ను భగవానుడు ఇప్పుడు తెలుపుచున్నాడు-

**మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః ।**
**పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్, తపః | = ఏతపస్సు | పీడయా | = బాధ కల్గించునదియు | క్రియతే | = ఆచరింపబడునో |
| మూఢగ్రాహేణ | = మొండిపట్టుదలతో గూడినదియు | వా | = లేక | తత్ | = అట్టి తపస్సు |
| | | పరస్య, ఉత్సాదనార్థమ్ | = ఇతరులకు కీడు కల్గించుటకును | తామసమ్ | = తామసమైనదిగా |
| ఆత్మనః, | = తనమనోవాక్కాయములకు | | | ఉదాహృతమ్ | = పేర్కొనబడినది |

**మొండిపట్టుదలతో మనోవాక్కాయములకు బాధకలిగించునవియు, ఇతరులకు కీడు కల్గించుటకై చేయబడునవియు, ఐన తపస్సులను 'తామసతపస్సులు' అనియందురు. (19)**

ప్రశ్న - 'తపః' అను పదముతో 'యత్' అను పదము యొక్క ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - ఈ అధ్యాయమునందలి 5, 6 శ్లోకములలో వర్ణింపబడిన అశాస్త్రీయమైనదియు, మనఃకల్పితమైనదియు (మనస్సునకు అప్పటికప్పుడు తోచినదియు) ఘోరమైనదియు నగు తపస్సు సహజముగనే తామసికము. మచ్చునకు - చెట్టు కొమ్మకు కాళ్ళు, క్రిందికి తల ఉండునట్లు వ్రేలాడుట, ఇనుపమేకులపై కూర్చుండుట, ఇట్లే ఘోరకృత్యములను చేయుచు శరీరమును కష్టపెట్టుట - మొదలగునవి అన్నియును తామసతపస్సులు. ఇవి దంభముచే, అజ్ఞానముచే ప్రేరితములైనవి. ఈ భావమును తెలుపుటకే ఇచ్చట 'తపః' అను పదముతోపాటు 'యత్' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'మూఢగ్రాహ' మననేమి? దానిద్వారా తపస్సు చేయబడుట యనగానేమి?

సమా - తపస్సు యొక్క వాస్తవ లక్షణములను ఎరుంగక ఏ క్రియనైనను తపస్సుగా భావించి, దానిని చేయుటకై ప్రదర్శింపబడు పట్టుదలను, మొండితనమును, దురాగ్రహమును మూఢగ్రాహము - అని యందురు. ఇట్టి మొండితనముతో ఏదో యొకవిధముగా శారీరిక, వాచిక, మానసిక కష్టములు సహించి చేయబడు తామస క్రియలను తపమని తలంచి చేయుటనే 'మూఢగ్రాహ'ము ద్వారా తపస్సు చేయుట యగును.

ప్రశ్న - తన ఆత్మను క్షోభింపజేయుచు తపస్సుచేయుట యనగానేమి?

సమా - ఇచ్చట ఆత్మ అను పదము మనస్సు, వాక్కు, శరీరము అను వాటిని సూచించును. వీటన్నింటిని కష్ట పెట్టుటయే ఆత్మను క్షోభపెట్టుటయగును. ఆ మనస్సు, వాక్కు, శరీరములలో అన్నింటినిగాని, ఏ ఒక్కదానిని గాని అనవసరముగా కష్టపెట్టుచు చేయబడు అశాస్త్రీయమైన తపస్సును 'ఆత్మను క్షోభపెట్టుచు చేయబడు తపస్సు' అని యందురు.

ప్రశ్న - ఇతరులకు హానిని గూర్చుటకై తపస్సును చేయుట యనగానేమి?

సమా - ఇతరుల సంపత్తిని హరించుటకును, వాటిని నశింపజేయుటకును, వారి వంశములను

తుదముట్టించుటకును, అట్లే వారికి ఏదోయొకవిధముగా కీడు కల్గించుటకును, తమ మనస్సులను, వాక్కులను, శరీరములను కష్టపెట్టుచు చేయు తపస్సులను ఇతరులకు కీడుగల్గించుటకై తపస్సుచేయుట యగును.

ప్రశ్న - ఇచట 'వా' అను అవ్యయ ప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - పై లక్షణములలో ఏ ఒక్క లక్షణము కల్గియున్నను అట్టి తపస్సును 'తామసతపస్సు' అని తెల్పుటకే 'వా' అను అవ్యయము ప్రయుక్తమైనది.

సంబంధము - త్రివిధ తపస్సుల లక్షణములను తెలిపి, ఇప్పుడు దానము యొక్క మూడు భేదములను వివరించుచున్నాడు. వానిలో మొదట సాత్త్విక దాన లక్షణములను తెలుపుచున్నాడు-

**దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దాతవ్యమ్ | = దానముచేయుటయే కర్తవ్యము | కాలే, చ | = దుర్భిక్షాది యుక్త కాలములయందును | దీయతే | = నిష్కామభావముతో ఇయ్యబడునో |
| ఇతి | = అని(అను భావముతో) | పాత్రే, చ | = పాత్రులైన వారికిని | తత్, దానమ్ | = ఆ దానము |
| యత్, దానమ్ | = ఏ దానము | అనుపకారిణే | = ప్రత్యుపకారము ఆసింపక | సాత్త్వికమ్ | = సాత్త్వికమని |
| దేశే, చ | = తగిన ప్రదేశముల యందును | | | స్మృతమ్ | = భావింపబడును. |

**'దానము చేయుటయే కర్తవ్యము' అను భావముతో తగిన ప్రదేశముల యందును, దుర్భిక్షాదికాలముల యందును, ఆకలిదప్పులతో బాధపడువారు, అంగవైకల్యముగలవారు, రోగులు మొదలగువారికిని, బ్రాహ్మణులు, పండితులు, బ్రహ్మచారులు, వానప్రస్థులు మొదలగు పాత్రులైనవారికిని ప్రత్యుపకారమును ఆసింపక నిస్వార్థభావముతో చేయబడు దానము 'సాత్త్వికదానము' అనబడును. (20)**

ప్రశ్న - ఇచట 'ఇతి' అను అవ్యయముతోపాటు 'దాతవ్యమ్' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - ఈ రెండు పదములను ఉపయోగించుట ద్వారా సత్త్వగుణపూర్ణత్వమునందు నిష్కామభావము యొక్క ప్రాముఖ్యమును భగవానుడు ప్రతిపాదించెను. వర్ణాశ్రమములు, పరిస్థితులు మున్నగువానిని అనుసరించి, శాస్త్రవిహితములైన దానములను చేయుట, అనగా తన సొత్తును యథాశక్తి ఇతరులహితము కొరకై వినియోగించుట పరమకర్తవ్యము. అట్లుచేయనివాడు మానవత్వమునుండి పతనమై, భగవానుని శ్రేయస్కరమైన ఆదేశమును త్రోసిపుచ్చినవాడగును. కేవలము కర్తవ్యబుద్ధితోడనే చేయబడు ఈ దానమునందు గూడ ఇహపరలోక ఫలముల అపేక్ష ఏమాత్రము లేనిచో ఆదానము పూర్ణసాత్త్వికమనబడును.

ప్రశ్న - ఇచట దేశ, కాలములు అను పదములు ఏదేశకాలములను తెల్పును?

సమా - దేశకాలములకు అవసరములగు వస్తువులను దానముచేయుట ద్వారా ఆర్తులను సుఖపెట్టుట సముచితము. అట్టి యోగ్యములైన దేశకాలములనే ఇచటి దేశ కాలములు అను పదములు సూచించును.

కరవు కాటకములు అతివృష్టి, అనావృష్టి, వరదలు, భూకంపములు మొ॥ సంభవించిన దేశకాలములయందు అన్నమును, నీటిని దానము చేయుటకు ఆదేశకాలములే అనువైనవి. అవి తీర్థస్థానములుగాని, పర్వకాలములుగాని కాక పోవచ్చును. ఇంతేగాక సాధారణ పరిస్థితులలో కురుక్షేత్రము, హరిద్వారము, మధుర, కాశీ, ప్రయాగ, నైమిశారణ్యము మొదలగు తీర్థక్షేత్రములును, గ్రహణకాలము, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతి, ఏకాదశి మొదలగు పుణ్యకాలములును దానములు చేయుటకు యోగ్యములైన దేశకాలములని శాస్త్రములు పేర్కొనుచున్నవి. ఇచటి దేశకాల శబ్దములు వీటన్నింటిని సూచించును.

ప్రశ్న - 'పాత్ర' శబ్దము ఎవరిని సూచించును?

సమా - దేశకాలములను అనుసరించి, ఎవనికి ఏ వస్తువు అవసరమో కొరతగా ఉండునో ఆ సమయమున ఆ వస్తువును పొందుటకు అతడు పాత్రుడు. ఆకలి దప్పులతో బాధపడువారు,

కట్టుకొనుటకు గుడ్డలు లేనివారు, దరిద్రులు, రోగులు, ఆర్తులు, అనాథలు, భయగ్రస్తులైనప్రాణులు, అన్నము, జలము, వస్త్రములు, జీవన నిర్వహణమునకై వలసిన ధనము, ఔషధములు, ఓదార్పు, ఆశ్రయము, అభయము మున్నగువానిని దానముగా గ్రహించుటకు పాత్రులు. ఆర్తులైనవారి పాత్రతయందు దేశ, కాల, జాతి నియమములు లేవు. వారి ఆతుర స్థితియే వారి పాత్రతకు నిదర్శనము.

ఇంతేగాక సదాచారులైన విద్వాంసులు, బ్రాహ్మణులు, ఉత్తమబ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్న్యాసులు, సేవానిరతులు మొదలగువారును దానములను గ్రహించుటకు పాత్రులు. శాస్త్రములలో నిర్దేశింపబడిన విధముగా దాతయొక్క యోగ్యతననుసరించి, యథాశక్తి ధనము మొదలగు ఆవశ్యక వస్తువులను దానము చేయుట సమంజసము.

ప్రశ్న - ఇచట 'అనుపకారిణే' అను పదప్రయోగ వైశిష్ట్యమేమి? తమకు ఉపకారము చేయువారికి దానము చేయుట అనుచితమా? లేక రాజసదానమా?

సమా - తమకు మేలు (ఉపకారము) చేసినవారికి సేవలు చేయుట, సాధ్యమైనంతలో సుఖములను గూర్చుటకు ప్రయాసపడుట మనుష్యుల కర్తవ్యమే - అంతేగాదు సజ్జనులు తమకు మేలు చేసినవారికి సేవలు (ప్రత్యుపకారము) చేయకుండ ఉండలేరు. నిజమైన ఉపకారమునకు ప్రత్యుపకారము చేయుట వారిని తిరస్కార భావముతో చూచినట్లు అగును. ఏలనన నిజమైన ఉపకారమునకు సరియైన ప్రత్యుపకారమును చేయుట అసాధ్యము - అని వారు (ఉపకారము పొందినవారు) ఎరుగుదురు - కావున వారు ఆత్మతృప్తికొరకే వారిని సేవింతురు. కాని ఎంతగా సేవించినను వారి దృష్టిలో అది తక్కువయే - వారిలో కృతజ్ఞతా భావమే నిండియుండును. శ్రీరామచరితమానసమునందు భగవంతుడైన శ్రీరాముడు తన భక్తుడైన ఆంజనేయునితో ఇట్లనెను -

'ఓ ఆంజనేయా! నీవు ఉపకారులలో సాటిలేనివాడవు. నీవు నాకు చేసిన ఉపకారమును దేవతలు గాని, నరులుగాని, మునులుగాని, మరియే ప్రాణులును చేయజాలరు. నీకు నేను ఎట్టి ప్రత్యుపకారమును చేయగలను? నా మనస్సు కృతజ్ఞతా భావముతో నిండియున్నది. అందువలన నీ కనులలోనికి సూటిగా చూచుటకు నా మనస్సు సిగ్గుపడుచున్నది-

సును కపి తోహి సమాన ఉపకారీ।
నహిఁ కోఉ సుర నర ముని తను ధారీ॥
ప్రతి ఉపకార కరౌఁ కా తోరా।
సనముఖ హో ఇ న సకత మన మోరా॥
*(శ్రీరామచరిత మానసం. సుందరకాండము 32/3)*

శ్రీమద్భాగవతమునందు శ్రీకృష్ణభగవానుడు తాను గోపికలకు ఋణపడియున్నానని ప్రకటించెను. ఇట్టి పరిస్థితిలో ఉపకారము చేయువారికి ఏదైనను ఇచ్చుట అనుచితముగాని, రాజసముగాని ఎన్నడునూ కానేరదు. కాని అది దానముగా పరిగణింపబడదు - అది కృతజ్ఞతను ప్రకటించుటకు సహజమైన, సముచితమైన క్రియ-దానిని దానముగా భావించువారు ఆ ఉపకారిని చులకన చేసిన వారేయగుదురు. ఉపకారికి సేవలొనర్చనివారు కృతఘ్నులే యగుదురు. కావున తమకు ఉపకారము చేసినవారిని సేవించియే తీరవలెను.

కాని ఇచట దానమిచ్చువాడు దానమును గ్రహించు పాత్రునినుండి ఏవిధమైన ప్రత్యుపకారమును కోరరాదు - అని తెల్పుటకే అనుపకారికి దానము ఇయ్యవలయునని చెప్పబడినది. ఎట్టి స్వార్థచింతనము లేకుండ ఇయ్యబడు దానము సాత్త్వికమగును. ఇది దాతయందు ఎట్టి స్వార్థ బుద్ధియు ఉండగూడదని సూచించుచున్నది.

సంబంధము - ఇప్పుడు రాజస దాన లక్షణములను తెల్పుచున్నాడు-

**యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| యత్, తు | ఏదానమైతే | ఫలమ్, ఉద్దిశ్య, వా, పునః | ఫలములను ఆశించి యైనను గాని | తత్, దానమ్ | ఆదానము |
| పరిక్లిష్టమ్, చ | మనఃక్లేశముతోడను | దీయతే | ఇయ్యబడునో | రాజసమ్ | రాజసమని |
| ప్రత్యుపకార అర్థమ్ | ప్రత్యుపకారము పొందుటకును | | | స్మృతమ్ | తలంపబడును |

కాని ప్రత్యుపకారమును ఆసించిగాని, ప్రతిఫలాపేక్షతో గాని వివిధములగు ఒత్తిడులకు లోనైగాని బాధపడుచు విధిలేక ఇచ్చు దానమును 'రాజసదానము' అనియందురు. **(21)**

ప్రశ్న - 'తు' అను అవ్యయ ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - సాత్త్వికదానమునకును, రాజస దానమునకును మధ్యగల భేదమును తెల్పుటకు 'తు' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'క్లేశపడుచు దానమిచ్చుట' అనగానేమి?

సమా - ఇష్టము లేకున్నను ఇతరుల భయమునకును, వత్తిడికినిలోనై పలుకుబడి గలవారి యొక్క బలవంతము కారణముగను, మనస్సులో బాధపడుచు విధిలేక ఇచ్చుదానమును 'క్లేశపడుచు ఇచ్చు దానము' అందురు.

ప్రశ్న - 'ప్రత్యుపకారకాంక్షతో ఇచ్చుదానము' అనగా ఎట్టిది?

సమా - ఏదో ఒకవిధముగా ఆ వ్యక్తి మున్ముందు తనకు ఉపయోగ పడునను దృష్టితోడను, మరియు ఆతని నుండి ప్రత్యుపకారమును పొందుటకు అవకాశముండునను ఆశతోడను ఆ వ్యక్తికి ఇచ్చు దానము వాస్తవముగా దానమే గాదు. అది ప్రత్యుపకారమును పొందుటకు ఈయబడు బయానా (సంచకారము) వంటిది. ఉదాహరణముగా, సోమవారముతో గూడిన అమావాస్య వంటి పర్వదినములయందు బ్రాహ్మణులకు వారినుండి (అబ్రాహ్మణులనుండి) తమకు గాని, తమ బంధుమిత్రులకు గాని, ఏదో ఒక ప్రయోజనము కలుగునని ఆశించి, తరచు చేయబడు దానము ఈ కోవకే చెందును. ఇంతేగాక భవిష్యత్తులో తమకు ఉపయోగముండునని తలంచి ఏవైనా సంస్థలకు గాని, ఆ సంస్థల నిర్వాహకులకు గాని ఇయ్యబడుదానము ప్రత్యుపకారకాంక్షతో చేయబడు దానమే- ఇందు పెక్కురీతుల స్వార్థ చింతనలు ఉండును.

ప్రశ్న - ఫలాపేక్షతో దానమును చేయుట యనగానేమి?

సమా - గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు, స్వర్గము మొ॥ ఇహలోక, పరలోక భోగముల ప్రాప్తికిగాని, రోగాదుల నివృత్తికి గాని ఏదైనా వస్తువును ఒక వ్యక్తికి గాని, ఒక సంస్థకు గాని ఈయబడు దానము ఫలాపేక్షతోగూడిన దానము. కొందరు ఒకే దానము ద్వారా ఒకేసారి అనేక లాభములను పొందగోరుదురు. ఎట్లనగా దాతలు ఈ విధముగా భావింతురు-

క) దానగ్రహీత తనకు కృతజ్ఞుడుగా ఉండును. తాను చేయు మంచి, చెడులకు తన పక్షము వహించును.

ఖ) కీర్తిప్రతిష్ఠలు హెచ్చును. దానివలన సమాజములో గౌరవ, ఆదరములబ్బును.

గ) తమ ఖ్యాతి నలుమూలలకును వ్యాపించుట వలన జనులు తమను ధనవంతులని, దాతలని ప్రశంసింతురు. దానివలన తమ వ్యాపార వ్యవహారములలో అభివృద్ధి కలుగును. ఇంకను సంపదలను పెంచుకొనవచ్చును.

ఘ) సమాజములో పలుకుబడి, ప్రసిద్ధి ఏర్పడుటవలన గొప్పవారితో సంబంధములేర్పడును. ఆ కారణముగా అనేక స్వార్థములు నెరవేరును.

ఙ) శాస్త్రములను అనుసరించి పెక్కు దానములను చేసినచో స్వర్గాదిసుఖములును లభించును. ఈ విధములగు భావనలతో మనుష్యులు దానముయొక్క మహత్త్వమును చాలా తక్కువ చేయుదురు.

సమా - 'వా' 'పునః' 'చ' అను మూడు అవ్యయములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - పైన తెల్పబడిన మూడు రీతులలో ఏ రీతిగా దానము చేసినను అది 'రాజస దానమే' అగును - అని తెల్పుటకు ఈ మూడు అవ్యయములు ప్రయుక్తములైనవి.

సంబంధము - ఇప్పుడు తామస దానలక్షణములను తెల్పుచున్నాడు-

**అదేశకాలే యద్దానమ్ అపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥ 22 ॥**

| | | |
|---|---|---|
| యత్, దానమ్ = ఏ దానము | అవజ్ఞాతమ్ = తృణీకార భావముతో చేయబడునదియు | (యోగ్యులు) కాని వారికి |
| అసత్ కృతమ్ = సద్భావము లేకుండ (దానము పుచ్చుకొనువారి యెడ సద్భావము లేకుండ | అదేశకాలే, చ = దేశ, కాలోచితము కానిదియు | దీయతే = ఇయ్యబడునో |
| | | తత్ = ఆ దానము |
| | | తామసమ్ = తామసమని |
| వా = (లేక) | అపాత్రేభ్యః = పాత్రులు | ఉదాహృతమ్ = పేర్కొనబడును. |

**సద్భావములేకుండా, దానము పుచ్చుకొనువారియెడల గౌరవాదరములను చూపక, తృణీకారభావములతో ఛీకొట్టుచు, అయోగ్యులకును, అపాత్రులకును చేయబడు దానమూ, దేశకాలోచితముకాని దానమూ, 'తామసదానము' అని యనబడును. (22)**

ప్రశ్న - సద్భావములేకుండ చేయబడు దానము యొక్క స్వరూపమేమి?

సమా - దానము పుచ్చుకొనుటకు వచ్చిన వారి యెడ గౌరవాదరములను చూపక తగిన విధముగ అభివాదము, కుశలప్రశ్నలు, ప్రియభాషణము, సుఖాసనము మొదలగు వాటి ద్వారా సమ్మానింపకయే నిర్లక్ష్యముగా చేయు దానమును సద్భావము లేకుండ చేయబడుదానమందురు.

ప్రశ్న - తృణీకారభావముతో చేయబడు దానము అనగా ఎట్టిది?

సమా - దానమును గ్రహించువారితో కఠినముగా మాట్లాడుచు, వారిని భయపెట్టుచు, మరల రావలదని సూచించుచు, ఎగతాళి చేయుచు, అట్లే అనేక విధములుగా మాటల ద్వారా చేష్టల ద్వారా (సంకేతములద్వారా) అవమానించుచు ఇయ్యబడుదానము తృణీకారభావముతో ఇయ్యబడుదానము అందురు.

ప్రశ్న - దానమును ఇచ్చుటకై యోగ్యము కాని దేశకాలము లెవ్వి? వాటియందు ఇయ్యబడుదానము తామసమెట్లగును?

సమా - దానము చేయుటకై అనువు గాని దేశ కాలములు అనగా ఏ దేశకాలములయందు దానము చేయుట అవసరము కాదో లేక, ఎచ్చట, ఎప్పుడు దానము చేయుట శాస్త్రనిషిద్ధమో (ఉదా: మ్లేచ్ఛదేశమున గోదానము చేయుట, గ్రహణ సమయమున కన్యాదానము చేయుట మొదలగునవి). అట్టి దేశకాలములు దానము చేయుటకు యోగ్యములు కానివి. వాటియందు దానము చేసిన దాతకు నరకప్రాప్తి కలుగును. కావున అది తామసము.

ప్రశ్న - దానమునకై అపాత్రులెవరు? వారికి దానము చేయుట తామసము ఎట్లగును?

సమా - దానము పుచ్చుకొనుటకు అవసరము లేనివారు, శాస్త్రములయందు నిషేధింపబడినవారు, ఉదా: సదాచారపరుని వలె నటించువాడు, కపటి, కపట వేషధారి, హింసచేయువాడు, ఇతరులను నిందించువాడు, ఇతరుల జీవికను అపహరించువాడు, స్వార్థపరుడు, ధూర్తుడు, (కృత్రిమ వినయమును ప్రదర్శించు వాడు) మద్యమాంసాది - అభక్ష్య వస్తువులను భక్షించువాడు. దొంగతనము, వ్యభిచారము మొదలగు నీచకర్మలను చేయువాడు, అవినీతిపరుడు, జూదరి, నాస్తికుడు మొదలగువారు దానమును పుచ్చుకొనుటకు అపాత్రులు. వారికి దానము చేయుట వ్యర్థమగుటయేగాక, దాతకు నరక ప్రాప్తియు గలుగును - కావున అది తామసము అనబడును. ఇచ్చట ఆకలిదప్పులతో బాధపడువానికి, వస్త్రములు లేనివానికి, రోగికి, ఆర్తులకు, అన్నపానములు, వస్త్రములు, ఔషధములు మొదలగు వానిని దానము చేయుట నిషిద్ధముగాదు.

*సంబంధము - ఈ విధముగ త్రివిధములగు యజ్ఞ తపో, దానాదులలో సాత్త్వికములు ఆచరింపదగినవనియు, రాజస తామసములు త్యజింప దగినవనియు తెలుపుచు, వాటియందలి వేర్వేరు (త్రివిధములగు) భేదములను భగవానుడు వివరించెను. ఇప్పుడు ఈ సాత్త్విక యజ్ఞదాన తపస్సులు ఏల ఉపాదేయములు? భగవానునితో వాటికి గల సంబంధమేమి? అట్లే సాత్త్విక యజ్ఞతపో దానముల యందు అంగవైగుణ్యము సంభవించినచో దానిని ఎట్లు పూర్తి చేయవలెను? మొదలగు విషయములన్నింటిని ముమ్ముందు తెల్పబోవుచున్నాడు-*

**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఓమ్, తత్, సత్ | = ఓమ్, తత్, సత్ | త్రివిధః | = మూడువిధములగు | బ్రాహ్మణాః, చ | = బ్రాహ్మణాది సమస్త ప్రాణులును |
| | | నిర్దేశః | = నామనిర్దేశము | | |
| ఇతి | = అని | స్మృతః | = చేయబడినది | వేదాః, చ | = వేదములును |
| బ్రహ్మణః | = సచ్చిదానందఘన బ్రహ్మకు | తేన | = ఆ పరమాత్మచేతనే | యజ్ఞాః | = యజ్ఞాదులును |
| | | పురా | = సృష్ట్యాదియందు | విహితాః | = రచింపబడినవి |

**ఓమ్, తత్, సత్ అని మూడువిధములగు పేర్లు సచ్చిదానందఘనపరబ్రహ్మకు నిర్దేశించబడినవి. ఆ పరమాత్మనుండియే సృష్ట్యాదియందు బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు ఏర్పడుట జరిగినది.(23)**

ప్రశ్న - పరబ్రహ్మకు అనగా సర్వశక్తిమంతుడైన పరమేశ్వరునకు అనేక నామములు గలవు. మరి ఇచ్చట ఆయనను మూడు పేర్లతో మాత్రమే వర్ణించుటకు కారణమేమి?

సమా - పరమాత్మకు గల పేర్లలో **ఓమ్, తత్, సత్,** అను ఈ మూడు పేర్లు ప్రధానములైనవని వేదములయందు తెలుపబడినవి. యజ్ఞదాన తపశ్చర్యాది శుభకర్మలతో ఈ పేర్లకు విశేషసంబంధము గలదు. కావున ఇచ్చట ఈ మూడు పేర్లే వర్ణింపబడినవి.

ప్రశ్న - **'తేన'** అను పదము ఇచట పైన తెల్పబడిన మూడు పేర్లను సూచించునా? ఆ పేర్లుగల పరమేశ్వరుని సూచించునా?

సమా - ఈ మూడు పేర్లుగల పరమేశ్వరుని తెల్పునదియే ఇచట 'తేన' అను పదము.

ప్రశ్న - మూడవ అధ్యాయమున యజ్ఞసహితముగ సకలప్రాణుల ఉత్పత్తి ప్రజాపతి బ్రహ్మనుండియే కల్గినదని తెల్పబడినది. **(3/10)** మరి ఇచ్చట బ్రాహ్మణులు మొదలగు వారి ఉత్పత్తి పరమాత్మనుండి జరిగినట్లు తెల్పబడుచున్నది. దీని ఆంతర్యమేమి?

సమా - ప్రజాపతియైన బ్రహ్మయొక్క ఉత్పత్తి పరమాత్మ నుండియే జరిగినది. ప్రజాపతి నుండి బ్రాహ్మణాది సర్వ ప్రాణులు, వేదములు, యజ్ఞాదులు ఉత్పన్నములైనవి. కనుక ఒకచోట అవి పరమేశ్వరుని నుండి ఉత్పన్నములైనవని చెప్పుటయు, మరొకచోట ప్రజాపతి బ్రహ్మనుండి ఉత్పన్నములైనట్లు చెప్పుటయు ఒక్కటియే.

ప్రశ్న - **'బ్రాహ్మణ, వేద, యజ్ఞ'** శబ్దముల యర్థము లేమి? **'పురా'** అను పదము ఏ సమయమును సూచించును?

సమా - బ్రాహ్మణ శబ్దమునకు బ్రాహ్మణాది సమస్త ప్రాణులని యర్థము. వేదములనగా చతుర్వేదములు. యజ్ఞ శబ్దము యజ్ఞతపోదానాది సమస్త శాస్త్రవిహిత కర్తవ్య కర్మలను సూచించును. **'పురా'** అనునది సృష్ట్యాది కాలవాచకము.

ప్రశ్న - పరమేశ్వరునికి పైన తెల్పిన మూడు పేర్లను పేర్కొనుచు పరమేశ్వరుని నుండి సృష్ట్యాది యందు బ్రాహ్మణాదుల ఉత్పత్తి కల్గినదని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - పరమాత్మ నుండియే యజ్ఞకర్తయు, కర్మలు, కర్మవిధులు ఉత్పన్నములైనవి. ఓమ్, తత్, సత్ అను పేర్లను ఆపరమాత్మనే సూచించును. కావున వీటి ఉచ్చారణాదులచే వాటి అన్నింటి అంగవైగుణ్యము తొలగిపోవును. అవి పూర్తియగును. కనుక ప్రతి కర్మారంభము నందును పరమేశ్వరుని నామములను ఉచ్చరించుట పరమావశ్యకము.

సంబంధము - పైన తెల్పబడిన ఓమ్, తత్, సత్ అను పరమేశ్వర నామములకు యజ్ఞ, దాన, తపశ్చర్యాదులతో గల సంబంధమును వివరించుటకు మొదట 'ఓమ్' అను నామము యొక్క ప్రత్యేకతను తెల్పుచున్నాడు-

**తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।**
**ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24 ॥**

తస్మాత్ = అందువలన
బ్రహ్మవాదినామ్ = వేదమంత్రములను ఉచ్చరించువారి యొక్క
విధానోక్తాః = శాస్త్రముల యందు చెప్పబడిన
యజ్ఞదానతపః క్రియాః = యజ్ఞములు, దానములు, తపస్సులు, మొదలగు క్రియలు
సతతమ్ = (ఎల్లప్పుడును) సర్వదా
'ఓమ్' ఇతి = 'ఓమ్' అని (ఈ పరమాత్మ నామమును)
ఉదాహృత్య = ఉచ్చరింపబడుచునే
ప్రవర్తంతే = ఆరంభమగుచున్నవి.

**కనుక, వేదమంత్రములను పఠించువారు శాస్త్రవిహితములైన యజ్ఞ దాన తపశ్చర్యలను సర్వదా 'ఓమ్' అను పరమాత్మనామమును ఉచ్చరించుచునే ప్రారంభింతురు. (24)**

ప్రశ్న - హేతువాచకమైన 'తస్మాత్' అను పదమును ప్రయోగించుచు, వేదవిదులు శాస్త్రవిహిత యజ్ఞాది క్రియలను సర్వదా 'ఓంకార' (నామ) మును ఉచ్చరించుచునే ఆరంభింతురు - అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా- ఇచట భగవానుడు ముఖ్యముగా నామమహిమను గూర్చి తెల్పియుండెను. యజ్ఞాది కర్మలు పరమేశ్వరునినుండి ఉత్పన్నములైనవి. ఆ పరమేశ్వరుని నామమగుట వలన 'ఓంకారము'ను ఉచ్చరించుటచే సమస్త కర్మల అంగవైగుణ్యము దూరమగును. పైగా అవి పవిత్రములు, శ్రేయస్కరములు అగును. ఇదియే భగవన్నామము యొక్క అపారమహిమ. వేదవిదులనగా వేదోక్తమంత్రములను ఉచ్చరించుచు, యజ్ఞాదికర్మలను చేయుటకు అర్హులైన విద్వాంసులు, బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులు. వారు చేయు యజ్ఞదాన తపశ్చర్యాది సమస్త శాస్త్రవిహిత పవిత్రకర్మలు సర్వథా 'ఓంకార + ఉచ్చారణము' తోడనే ప్రారంభమగు చుండును. వారు ఎన్నడును, ఎప్పుడును ఏ శుభకర్మను కూడ భగవంతుని పవిత్రనామమైన ఓంకారమును ఉచ్చరింపకుండ చేయనేచేయరు. కనుక అందరును అట్లే చేయవలెను.

*సంబంధము - ఈ విధముగా ఓంకార మహిమను తెల్పినపిదప పరమేశ్వరుని యొక్క 'తత్' అను నామవైశిష్ట్యమును తెల్పుచున్నాడు-*

**తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।**
**దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః ॥ 25 ॥**

మోక్షకాంక్షిభిః = మోక్షకాంక్ష గలవారిచే
ఫలమ్, అనభిసంధాయ = ఫలము ఏమాత్రము కోరబడకయే (లోక హితార్థమే)
వివిధాః = వివిధములగు
యజ్ఞ తపః క్రియాః = యజ్ఞములు, తపశ్చర్యలు
చ = మఱియు
దానక్రియాః = దానములును
తత్, ఇతి = 'తత్' అనగా ఇది యంతయును పరమాత్మదే అను భావముతో
క్రియంతే = చేయబడును.

**మోక్షకాంక్షగలవారు స్వలాభాపేక్ష లేశమాత్రమైనను లేకుండ లోకహితార్థమై యజ్ఞ దాన తపశ్చర్యలను 'ఇదియంతయును పరమాత్మదే' అను భావముతో 'తత్' అను నామమును ఉచ్చరించుచు చేయుదురు. (25)**

ప్రశ్న - 'ఇతి' అను అవ్యయముతోపాటు 'తత్' అను పదమును ప్రయోగించుటలోని అంతరార్థమేమి?

సమా - 'తత్' అను పదము పరమేశ్వరుని నామము. ఆ నామస్మరణ ఉద్దేశ్యమును వివరించుటకే ఇచట 'ఇతి' అను అవ్యయముతో పాటు 'తత్' అనునది ప్రయోగింప బడినది. శ్రేయస్సును కోరుకొనువాడు ఏ క్రియను చేసినను ఆ సమయమున భగవంతుని 'తత్' అను నామమును స్మరించుచు "ఈ సమస్త జగత్తు పరమేశ్వరుని నుండియే ఉత్పన్నమైనది. ఇవి యన్నియు ఆయనవే. ఆయన వస్తువులతో ఆయన ఆజ్ఞానుసారము, ఆయన కొరకే నా ద్వారా యజ్ఞాదిక్రియలు చేయబడు చున్నవి. కనుక నేను కేవలము నిమిత్తమాత్రుడను" - అని భావించుచు అహంకార మమకారములను సర్వథా త్యజించును.

ప్రశ్న - "మోక్షమును కోరుకొను సాధకులు ఫలములను ఆసింపకయే కర్మలను చేయుదురు" అనియనుటలోని ఆంతర్యమేమి?

సమా - మోక్షకాములైన సాధకులు కర్మలనన్నింటిని ఫలములను ఆసింపకయే చేయుచుందురు. విహితకర్మలను చేయు సాధారణ వేదవిదులు 'ఫలేచ్ఛను' అహంకార మమకారములను త్యజింపజాలరు. కాని శ్రేయస్సులను కోరుకొనువారికి పరమేశ్వరప్రాప్తి తప్ప ఇతరమైన ఏ వస్తువు యొక్క అవసరమూ ఉండదు. వారు అహంతామమతాసక్తులను, ఫలేచ్ఛలను, సర్వథా త్యజించి, కేవలము పరమేశ్వరుని కొరకే ఆయన ఆజ్ఞానుసారము సమస్త కర్మలను చేయుచుందురు. ఈ వాక్యము ద్వారా ఫలేచ్ఛా త్యాగమహత్త్వమును భగవానుడు వివరించెను.

**సంబంధము** - ఈ విధముగా 'తత్' అను నామప్రయోగవైశిష్ట్యమును తెల్పిన పిదప పరమేశ్వరుని 'సత్' అను నామ ప్రయోగమును గూర్చి రెండు శ్లోకములలో తెల్పుచున్నాడు-

**సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ 26 ॥**

| పదము | అర్థము |
|---|---|
| పార్థ! | = ఓ పార్థా! |
| సద్భావే | = సత్యభావమునందును |
| సాధుభావే, చ | = శ్రేష్ఠభావము నందును (మంచిది అనుభావము నందును) |
| సత్, ఇతి, ఏతత్ | = 'సత్' అను ఈ పరమాత్మనామము |
| ప్రయుజ్యతే | = ప్రయోగింపబడు చున్నది |
| తథా | = అట్లే |
| ప్రశస్తే, కర్మణి | = ఉత్తమమైన కర్మయందును |
| 'సత్' శబ్దః | = 'సత్' అనుశబ్దము |
| యుజ్యతే | = ప్రయుక్తమగు చుండును. |

**ఓ పార్థా! 'సత్' అను పరమాత్మనామము సత్యభావమునందును, శ్రేష్ఠభావమునందును అనగా పరమాత్ముడు నిత్యుడు, శ్రేష్ఠుడు అను భావము నందును ప్రయోగింపబడుచుండును. ఉత్తమకర్మాచరణము నందును 'సత్' అను శబ్దము ప్రయుక్తమగుచుండును. (26)**

ప్రశ్న - 'సద్భావము' అనగానేమి? దానియందు (ఆభావమునందు) పరమాత్ముని యొక్క 'సత్'అను నామము ఏల ప్రయోగింపబడును?

సమా - 'సద్భావము' అనగా నిత్యభావము. అనగా దాని 'అస్తిత్వము' (ఉనికి) సర్వదా ఉండును. అది శాశ్వతత్త్వ వాచకము. అదియే పరమేశ్వర స్వరూపము. కావున అది 'సత్' అను పేరుతో పిలువబడును.

ప్రశ్న - 'సాధుభావము' అనగానేమి? ఆ భావము నందు పరమాత్ముని యొక్క 'సత్' అను నామము ఏల ప్రయోగింపబడును?

సమా - అంతఃకరణ శుద్ధిని, శ్రేష్ఠభావమును, 'సాధుభావము' - అని యందురు - అది పరమేశ్వరప్రాప్తికి హేతువు. కావున ఆ భావమునందు పరమేశ్వరుని యొక్క 'సత్' అను నామము ప్రయోగింపబడును. అనగా అది 'సద్భావము' అనబడును.

ప్రశ్న - ప్రశస్త కర్మయనగానేమి? దానియందు 'సత్' శబ్దము ఏల ప్రయోగింపబడును?

సమా - శాస్త్రవిహితములై చేయదగిన శుభకర్మలను 'ప్రశస్త' (శ్రేష్ఠ) కర్మలు అనియందురు. వాటిని నిష్కామభావముతో చేయుటచే పరమాత్మప్రాప్తి కలుగును. కావున వాటి యందు 'సత్' అను పరమేశ్వర నామము ప్రయోగింపబడును - అనగా అది 'సత్కర్మ' అనబడును.

**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ 27 ॥**

యజ్ఞే, చ = యజ్ఞమునందును
తపసి, చ = తపస్సునందును
దానే, చ = దానమునందును (గల)
(యా), స్థితిః = ఏ నిష్ఠ కలదో
(సా) స్థితిః ఏవ = ఆ స్థితియును
'సత్', ఇతి = 'సత్' అని
ఉచ్యతే = పేర్కొన బడుచున్నది
చ = మఱియు
తదర్థీయమ్, కర్మ = భగవత్ప్రీత్యర్థమైన కర్మయును
ఏవ = నిశ్చయముగా
'సత్', 'ఇతి' = 'సత్' అని
అభిధీయతే = చెప్పబడును.

**యజ్ఞ దాన తపఃక్రియలయందలి నిష్ఠ, ఆస్తిక భావమును 'సత్' అనియందురు. పరమాత్మను ఉద్దేశించి, చేయబడు నిశ్చయాత్మకకర్మలనుగూడ 'సత్' అని యందురు. (27)**

ప్రశ్న - ఇచట ప్రయుక్తములైన **'యజ్ఞతపోదానములు'** అను పదములు ఏయే యజ్ఞతపోదానములను సూచించును? అట్లే 'స్థితి' యను శబ్దము యొక్క అర్థమేమి? దానిని 'సత్' అని అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇచట యజ్ఞతపోదానములు అను పదములు సాత్త్విక యజ్ఞతపోదానములను సూచించును. వాటియందు గల భక్తిశ్రద్ధలతో గూడిన ఆస్తిక బుద్ధిని 'స్థితి' అని యందురు. దీనికే 'నిష్ఠ' అనియు పేరు. ఈ స్థితి పరమేశ్వర ప్రాప్తికి హేతువు గావున దీనిని 'సత్' అని యందురు.

ప్రశ్న - **'తదర్థీయమ్'** అను విశేషణముతో గూడిన **'కర్మ'** అను పదము దేనిని సూచించును? దానిని 'సత్' అని అనుటలోని విశేషమేమి?

సమా - కేవలము భగవంతుని ఆజ్ఞానుసారము ఆయనకొరకే చేయబడు ఏకర్మనైనను **'తదర్థీయమ్'** అను విశేషణముతో గూడిన 'కర్మ' అను పదము సూచించును. ఇందు కర్తకు ఏమాత్రమూ స్వార్థము ఉండరాదు. అట్టి కర్మ, కర్తయొక్క అంతఃకరణమును శుద్ధమొనర్చి అతనికి పరమేశ్వరప్రాప్తి కలిగించును. కావున దానిని 'సత్' అని యందురు.

ప్రశ్న - 'ఏవ' అను అవ్యయ ప్రయోగవైశిష్ట్యమేమి?

సమా - ఇట్టి కర్మను 'సత్' అనుటలో ఏమాత్రమూ సందేహము లేదు. పైగా ఇట్టి కర్మయే వాస్తవముగా 'సత్' అగును. ఇతర కర్మల ఫలములన్నియును అనిత్యములగుట వలన వాటిని 'సత్' అని పిలుచుటకు వీలులేదు. ఈ భావమును తెలుపుటకే ఇచ్చట 'ఏవ' అను అవ్యయము ప్రయుక్తమైనది.

*సంబంధము - ఈ విధముగా శ్రద్ధతో చేయబడిన శాస్త్రవిహిత యజ్ఞతపోదానాది కర్మల మహత్త్వమును భగవానుడు తెల్పెను. శాస్త్రవిహితములైన యజ్ఞాది కర్మలను శ్రద్ధలేకుండ చేసినచో వాటి ఫలమేమగును? అను జిజ్ఞాస ఏర్పడును. దానికి సమాధానమును ఇచ్చుచు భగవానుడు ఈ అధ్యాయమును ముగించుచున్నాడు-*

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28 ॥

పార్థ! = ఓ అర్జునా!
అశ్రద్ధయా = అశ్రద్ధతో చేయబడిన
హుతమ్ = హోమము
దత్తమ్ = ఇయ్యబడిన దానము
తప్తమ్, తపః, చ = ఆచరింపబడిన తపస్సు
యత్, కృతమ్ = చేయబడిన ఏ శుభ కర్మయును కలదో
(తత్) = (అది)
'అసత్', 'ఇతి' = 'అసత్' అని
ఉచ్యతే = చెప్పబడును
తత్ = ఆ హోమాదికకర్మ
నో, ఇహ = ఈ లోకమునందు ఫలప్రదముగాదు
చ = మఱియు
ప్రేత్య, న = మరణానంతరము గూడ ఫలప్రదముగాదు.

**ఓ అర్జునా! శ్రద్ధ(విశ్వాసము) లేకుండ చేయబడు హోమము, ఇయ్యబడు దానము, ఆచరింపబడు తపస్సు, ఇంకను జరుపబడు ఇతర శుభకర్మలన్నియును,'అసత్' అని చెప్పబడును. దానివలన జీవించి యుండగా గాని, మరణించిన పిదపగాని ఎట్టి ప్రయోజనమూ కలుగదు. (28)**

ప్రశ్న - శ్రద్ధలేకుండ చేయబడిన హోమము, తపస్సు, దానము మఱి ఇతర శాస్త్రవిహిత కర్మలను అన్నింటిని 'అసత్' అని పేర్కొనుటలోని అంతర్యమేమి? అవి ఇహపరలోకములయందు లాభప్రదములు కావని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - హోమము, దానము, తపస్సు - అట్లే ఇతర పవిత్రకర్మలు శ్రద్ధతో చేసినప్పుడే అవి అంతశ్శుద్ధిని కలిగించి, ఇహ పరలోకములయందు ఫలములను ఇచ్చుటకు సమర్థములగును. శ్రద్ధలేకుండ చేయబడినవి శుభ (పవిత్ర) కర్మలు ఐనను అవి వ్యర్థములు. కావున వాటిని 'అసత్' అనియు, అవి ఇహపరలోకములయందు ఎట్టి ఫలములను (లాభములను) ఇయ్యజాలవనియు తెల్పబడినది.

ప్రశ్న - 'యత్' అను పదముతో పాటు ప్రయుక్తమైన 'కృతమ్' అను పదమునకు 'నిషిద్ధకర్మ' అనియు అర్థము చెప్పినచో దోషమేమి?

సమా - నిషిద్ధ కర్మాచరణమునందు 'శ్రద్ధ' అవసరము లేదు. వాటి ఫలము గూడ శ్రద్ధపై ఆధారపడదు. వాటిని ఆచరించు మనుష్యులకు శాస్త్రములయందు, మహాత్ముల యందు, ఈశ్వరునియందు శ్రద్ధ యుండదు. అట్లే పాపకర్మలకు లభించు ఫలములు దుర్గతులే అనుటయందు వారికి విశ్వాసము ఉండదు. ఐనను వారికి దుఃఖరూపఫలములు తప్పక లభించును. కావున 'యత్కృతమ్' అను పదమునకు పాపకర్మలు అని అర్థము చెప్పరాదు. ఇంతేగాక, యజ్ఞదాన తపోరూపశుభ(పవిత్ర) కర్మలతోపాటు ప్రయుక్తమైన 'యత్కృతమ్' అను పదమునకు అట్టి శుభకర్మలే అని అర్థము చెప్పవలెను. ఇహపరలోకముల యందు వాటివలన ఎట్టి ప్రయోజనమూ ఉండదు - అని తెల్పుట వలన అది పాపకర్మలకు వర్తింపదు. ఏలనన అవి సర్వథా దుఃఖ హేతువులగుట వలన లాభప్రదములగుటకు ఎట్టి అవకాశమూ లేదు. కావున ఇచ్చట 'యత్కృతమ్' అను పదమునకు శ్రద్ధలేకుండ చేయబడు శుభకర్మలు అనియే అర్థము చెప్పుట సముచితము. అశుభ (నిషిద్ధ) కర్మలను అది సూచింపదు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః ॥ ౧౭ ॥

❖ ❖ ❖

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునెనిమిదవ అధ్యాయము - మోక్షసన్న్యాసయోగము

**అధ్యాయ నామము :** *జననమరణ రూప సంసారబంధములనుండి శాశ్వతముగా విముక్తిని పొంది, పరమానంద స్వరూపుడైన పరమాత్మను చేరుటయే మోక్షము. పూర్వోక్తములైన అన్నియధ్యాయముల సారరూపముగా మోక్షమార్గములైన సాంఖ్యయోగమును 'సన్న్యాస' మనియు, కర్మయోగమును 'త్యాగ' మనియు తెలిపి, భగవానుడు ఈ అధ్యాయమునందు వాటిని సాంగోపాంగముగా వర్ణించుచున్నాడు. కావున అట్లే సాక్షాత్తు మోక్షస్వరూపుడైన పరమేశ్వరుని యందే కర్మలనన్నింటిని సన్న్యసింపుమని అనగా త్యాగమొనర్పుమని తెలుపుచు, భగవానుడు తనయుపదేశమును ముగించుచున్నాడు. (18/66). అందువలననే ఈ అధ్యాయమునకు "మోక్షసన్న్యాసయోగము" అని పేరు ఏర్పడినది.*

**అధ్యాయ సారాంశము :** *ఈ అధ్యాయమునందలి మొదటి శ్లోకమున అర్జునుడు సన్న్యాసత్యాగ తత్త్వములను గూర్చి తెలిసికొనగోరెను. ఈ విషయమున ఇతర విద్వాంసుల అభిప్రాయములను 2,3, శ్లోకముల యందు భగవానుడు వివరించెను. త్యాగవిషయమున తన నిశ్చితాభిప్రాయమును వినుమని పల్కుచు, కర్తవ్య కర్మాచరణమును త్యజించుట సమంజసము కాదని 4,5, శ్లోకములలో స్పష్టపఱచెను. త్యాగవిషయమున ఇతరుల అభిప్రాయములకంటెను తన నిశ్చితాభిప్రాయము ఉత్తమమైనదని 6వ శ్లోకమున నొక్కి చెప్పెను. పిమ్మట 7, 8, 9 శ్లోకములయందు క్రమముగ తామస, రాజస, సాత్త్విక త్యాగ లక్షణములను తెలిపెను. 10, 11 శ్లోకములయందు సాత్త్విక త్యాగి లక్షణములను వివరించుచు, 12వ శ్లోకమున త్యాగుల మహాత్మ్యములను వర్ణించి, త్యాగవిషయ వివరణమును ముగించెను. అనంతరము 13, 14, 15 శ్లోకములలో సాంఖ్య (సన్న్యాస) యోగ విషయములను వివరించుచు, సాంఖ్య సిద్ధాంతము ననుసరించి కర్మ సిద్ధియందు అధిష్ఠానాది అయిదు హేతువులను వివరించెను. 16, 17 శ్లోకములలో శుద్ధ స్వరూపుడైన ఆత్మను కర్తగా భావించుటతగదని తెల్పుచు కర్తృత్వాభిమానమును వీడి, కర్మలను ఆచరించువారిని భగవానుడు ప్రశంసించెను. 18వ శ్లోకమున కర్మప్రేరణ, కర్మసంగ్రహ స్వరూపములను, దెలిపి, జ్ఞాన, కర్మ, కర్తల త్రివిధ భేదములను వివరింతునని 19వ శ్లోకమున పేర్కొనెను. 20నుండి 28వ శ్లోకము వఱకు వాటి (జ్ఞాన, కర్మ, కర్తల) యొక్క సాత్త్విక, రాజస, తామస భేదములను విశదపఱచెను. బుద్ధి, ధృతియనునవి గూడ మూడు విధములని తెల్పుచు, వాటియొక్క సాత్త్విక, రాజస, తామస భేదములను 29 నుండి 35 వ శ్లోకమువఱకు వివరించెను. సుఖములయందలి సాత్త్విక, రాజస, తామస భేదములను 36 నుండి 39వ శ్లోకమువఱకు వివరించుచు, సమస్త జగత్తు త్రిగుణాత్మకమేయని తెల్పి, 40వ శ్లోకమున గుణముల ప్రస్తావనను ముగించెను.*

41వ శ్లోకమున బ్రాహ్మణులు మొదలగు నాలుగు వర్ణముల వారి కర్మలు స్వాభావిక గుణములను బట్టియే ఏర్పడినవని తెల్పుచు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణముల వారి స్వాభావిక కర్మలను వేర్వేఱుగా 42, 43 44 శ్లోకములలో వర్ణించెను. 45, 46 శ్లోకములలో మానవులు తమ తమ వర్ణధర్మములను పాటించుటవలన పరమసిద్ధిని పొందుదురని తెల్పుచు, ప్రతివ్యక్తియు వాటిని విధిగా ఆచరింపవలెనని నిర్దేశించెను. 47, 48 శ్లోకములలో స్వధర్మాచరణములను ప్రశంసించుచు, వాటిని త్యజింపరాదని పల్కెను. 49వ శ్లోకమున మరల సన్న్యాసయోగ ప్రసంగమునారంభించి, సన్న్యాసమువలన పరమసిద్ధి లభించునని తెలిపెను.

తదనంతరము 50వ శ్లోకమున జ్ఞానముయొక్క పరానిష్ఠను ప్రస్తావించుచు, ఫలసహిత జ్ఞాననిష్ఠను 51 నుండి 55వ శ్లోకమువరకు భగవానుడు వివరించెను. 56, 57, 58 శ్లోకములలో భక్తి ప్రధాన కర్మయోగ మహాత్మ్యమును, ఫలమును దెల్పుచు, దానిని ఆచరింపుమని అర్జునుని ఆజ్ఞాపించెను. ఆచరింపనిచో కలుగు హానిని గూర్చియు తెల్పెను. ప్రకృతి ప్రభావకారణమున స్వాభావిక కర్మలను మానవుడు త్యజింపజాలడని 59, 60 శ్లోకములలో తెల్పుచు, పరమేశ్వరుడే సర్వనియంత, సర్వాంతర్యామి, కావున సర్వథా అతనినే శరణుపొందుమని 61, 62 శ్లోకములలో భగవానుడు అర్జునుని ఆజ్ఞాపించెను. 63వ శ్లోకమునందు ఈ విషయమును ముగించుచు, తాను చెప్పిన విషయములను అన్నింటిని పరిశీలించి, తనకు ఇష్టమైన దానినే (నచ్చిన) ఆచరింపుమని అర్జునుని ఆదేశించెను.

*పరమ గుహ్యతమమైన సమస్త గీతోపదేశసారమును వినుమని **64**వ శ్లోకమున నిర్దేశించెను. **65, 66** శ్లోకములలో అనన్యశరణాగతియే గీతోపదేశసారమని ఫలసహితముగా దానిని వర్ణించి, తనను శరణుజొచ్చుమని అర్జునుని ఆదేశించుచు గీతోపదేశమును ముగించెను. **67**వ శ్లోకమున అనర్హులైన నాలుగు విధముల వారికి గీతోపదేశమును చేయరాదని నుడివెను. అర్హులైన వారు గీతా ప్రచారమునూ, గీతాధ్యయనమునూ, గీతాశ్రవణమునూ భక్తిశ్రద్ధలతో చేయుటవలన కలుగు సత్ఫలములను **68** నుండి **71**వ శ్లోకము వఱకు వివరించెను. పిమ్మట "నేను బోధించిన ఈ గీతోపదేశమును ఏకాగ్రతతో వింటివా? నీ మోహము నశించినదా?" అని **72**వ శ్లోకమున భగవానుడు అర్జునుని అడిగెను. అప్పుడర్జునుడు "నా మోహము నశించినది. స్మృతి గలిగి, సంశయరహితుడనైతిని. నీఆజ్ఞను పాలించెదను" అని **73**వ శ్లోకమున విన్నవించెను. **74** నుండి **77**వ శ్లోకమువఱకు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన గీతాశాస్త్రోపదేశ మహిమలను వర్ణించుచు, ఆయుపదేశమును, భగవంతుని విరాట్ స్వరూపమును తన స్మృతిపథమునకు తెచ్చుకొని, సంజయుడు మిక్కిలి విస్మితుడు అగుచు హర్షమును పొందెను. **78**వ శ్లోకమున యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడును, ధనుర్ధారియైన అర్జునుడును ఉండుచోట సంపదలును, విజయమూ, ఐశ్వర్యమూ, సర్వోత్తమ నీతియును వర్ధిల్లుచుండుట నిశ్చయమే అని సంజయుడు ప్రకటించుటతో ఈ **18**వ అధ్యాయము ముగిసెను.*

**సంబంధము** - *ద్వితీయాధ్యాయమునందలి 11వ శ్లోకము నుండి గీతోపదేశము ప్రారంభమైనది. అచటినుండి ప్రారంభించి 30వ (ముప్పదియవ) శ్లోకమువఱకు భగవంతుడు జ్ఞానయోగమును గూర్చి ఉపదేశించెను. ప్రసంగ వశమున క్షత్రియ ధర్మమునుసరించి, యుద్ధము చేయుట అర్జునుని కర్తవ్యమని ప్రతిపాదించుచు, 39వ శ్లోకమునుండి అధ్యాయసమాప్తము వఱకును భగవానుడు కర్మయోగమును గూర్చి ఉపదేశించెను. అనంతరము 3వ అధ్యాయమునుండి 17వ అధ్యాయమువఱకు ఒకచోట జ్ఞానయోగ దృష్టితోడను, మఱియొకచోట కర్మయోగ దృష్టితోడను పరమాత్మప్రాప్తికై పెక్కు సాధన మార్గములను పేర్కొనెను. వాటిని అన్నింటిని శ్రద్ధగా విన్నపిదప, ఈ 18వ అధ్యాయమునందు అన్ని అధ్యాయముల ఉపదేశములసారమును తెలిసికొను ఉద్దేశ్యముతో అర్జునుడు సన్న్యాసము అనగా జ్ఞానయోగము యొక్కయు, మఱియు త్యాగము అనగా ఫలాసక్తి త్యాగరూపకర్మయోగముయొక్కయు తత్త్వములను సమగ్రముగా వేర్వేఱుగా వివరింపుమని భగవానుని అర్థించెను-*

**అర్జున ఉవాచ**

**సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।**
**త్యాగస్య చ హృషీకేశ పృథక్ కేశినిషూదన ॥ 1 ॥**

| | | |
|---|---|---|
| మహాబాహో! = ఓ మహాబాహూ! | సన్న్యాసస్య, తత్త్వమ్ = సన్న్యాస తత్త్వమును | పృథక్ = వేర్వేఱుగా |
| హృషీకేశ! = ఓ అంతర్యామీ! | త్యాగస్య (తత్త్వమ్), చ = త్యాగ తత్త్వమును | వేదితుమ్, ఇచ్ఛామి = (నేను) తెలిసికొన గోరుచున్నాను |
| కేశినిషూదన! = ఓ వాసుదేవా! | | |

**అర్జునుడు పలికెను- ఓ మహాబాహూ! అంతర్యామీ! వాసుదేవా! సన్న్యాస తత్త్వమును, త్యాగతత్త్వమును వేర్వేఱుగా తెలిసికొనగోరెదను. (1)**

ప్రశ్న - మహాబాహో! హృషీకేశ! కేశినిషూదన! అను మూడు సంబోధనల ప్రయోగముల యొక్క ఆంతర్యమేమి?

సమా - శ్రీకృష్ణభగవానుడు సర్వశక్తిమంతుడు, సర్వాంతర్యామి, సమస్త దోషములను రూపుమాపు సాక్షాత్పరమేశ్వరుడు. కావున అర్జునుడు తెలిసికొనగోరు విషయములను అన్నింటిని శ్రీకృష్ణుడు ఎఱుగును. కనుక తన ప్రార్థనను మన్నించి, సంపూర్ణముగ యథార్థమును తాను గ్రహించుటకు వీలగునట్లు తన సందేహములన్నియును దూరమగునట్లు, విషయములను వివరింపుమని అర్జునుడు భగవంతుని ప్రార్థించెను. పై సంబోధనల అంతరార్థములు ఇవియే.

ప్రశ్న - "నేను సన్న్యాస తత్త్వమును, త్యాగ తత్త్వమును వేర్వేఱుగా తెలిసికొనగోరుచున్నాను" అని యనుటలోని అర్జునుని యభిప్రాయమేమి?

సమా - సన్న్యాసము (జ్ఞానయోగము) యొక్క స్వరూపమేమి? అందు ఏయే భావములు, కర్మలు సహాయకములు? అట్లే ఏవేవి ప్రతిబంధకములు? ఉపాసనాసహిత సాంఖ్యయోగమును మఱియు కేవల సాంఖ్యయోగమును సాధనచేయుట యెట్లు? అట్లే త్యాగము (ఫలాసక్తి త్యాగరూప కర్మయోగము) యొక్క స్వరూపము ఏమి? కేవలము కర్మయోగసాధన చేయుట ఎట్లు? ఏవి చేసినచో దీనికి ఉపయోగకరములు? ఏవి బాధాకరములు? భక్తి మిశ్రిత కర్మయోగమనగానేమి? భక్తి ప్రధాన కర్మయోగ మనగానేమి? అట్లే లౌకిక శాస్త్రీయ కర్మలనాచరించుచు భక్తి మిశ్రిత, భక్తి ప్రధాన కర్మయోగ సాధనలను ఏవిధముగా చేయవలయును? - ఈ విషయములను అన్నింటిని అర్జునుడు సమగ్రముగా తెలిసికొనగోరెను. ఇంతేగాక ఈ రెండు సాధనల స్వరూప స్వభావములను వేర్వేరుగా ఎఱుంగ తలంచెను. వాటిని ఒకదానితో మఱియొకదానిని కలుపక రెండింటిని వేర్వేఱుగా తనకు చక్కగా అర్థమగునట్లు దయతో తెల్పుమని అర్జునుడు భగవానుని ప్రార్థించెను.

ప్రశ్న - పైన పేర్కొనబడిన సన్న్యాసము యొక్కయు, త్యాగము యొక్కయు తత్త్వములను వివరించుటకు భగవానుడు ఏయే శ్లోకములయందు ఏయే విషయములను తెలిపెను?

సమా - ఈ యధ్యాయమున 13 నుండి 17వ శ్లోకము వఱకు సన్న్యాసము (జ్ఞానయోగము) యొక్క స్వరూపమును తెలిపెను. 19 నుండి 40వ శ్లోకము వరకు జ్ఞానయోగ సాధనకు ఉపయోగకరములైన సాత్త్విక భావములను, కర్మలను, అవరోధములైన రాజస తామస భావములను, కర్మలను విపులీకరించెను. 50 నుండి 55వ శ్లోకము వఱకు ఉపాసనాసహిత సాంఖ్యయోగవిధులను, ఫలములను విశదీకరించెను. అట్లే 17వ శ్లోకమునందు కేవలము సాంఖ్యయోగ సాధన పద్ధతిని తెలిపెను.

ఇదేవిధముగ 6వ శ్లోకమునందు ఫలాసక్తి త్యాగరూపమైన కర్మయోగ స్వరూపమును తెలిపెను. 9వ శ్లోకమున సాత్త్విక త్యాగమను పేర కేవలము కర్మయోగసాధన ప్రణాళికను సూచించెను. 47, 48 శ్లోకములయందు స్వధర్మ పాలన ఈ (కర్మ)యోగ సాధనకు ఉపయోగకరమనియు, 7,8 శ్లోకముల యందు వర్ణింపబడిన తామస రాజసత్యాగములు దీనికి బాధకములనియు వివరించెను. 45, 46 శ్లోకముల యందు భక్తి మిశ్రిత కర్మయోగమును గూర్చియు, 56 నుండి 66వ శ్లోకము వఱకు భక్తిప్రధాన కర్మయోగమును గూర్చియు వర్ణించెను. 46వ శ్లోకమున లౌకిక శాస్త్రీయ కర్మలన్నింటిని చేయుచు, భక్తి మిశ్రిత కర్మయోగ సాధనారీతిని తెల్పెను. 57వ శ్లోకమున భగవానుడు భక్తి ప్రధాన కర్మయోగ సాధన విధానమును వివరించెను.

సంబంధము - ఈ విధముగు అర్జునుని ప్రశ్నలకు సమాధానముగా భగవానుడు తన నిశ్చితాభిప్రాయములను ప్రకటించుటకు ముందు సన్న్యాస - త్యాగ విషయములను గూర్చి, ఇతర విద్వాంసుల యొక్క వేర్వేఱు అభిప్రాయములను రెండు శ్లోకములలో తెలుపుచున్నాడు-

**శ్రీభగవాన్ ఉవాచ**

**కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।**
**సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 2 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| కవయః | = (కొందరు) పండితులు | సన్న్యాసమ్ | = సన్న్యాసమని | సర్వకర్మఫల త్యాగమ్ | = సమస్తకర్మల ఫలములను త్యజించుటనే |
| కామ్యానామ్ కర్మణామ్ | = కామ్యకర్మల యొక్క | విదుః | = భావింతురు | త్యాగమ్ | = త్యాగమని |
| న్యాసమ్ (ఏవ) | = త్యాగమునే | విచక్షణాః | = విచక్షణాశీలురైన మఱికొందఱు మాత్రము | ప్రాహుః | = పేర్కొందురు. |

శ్రీ భగవానుడు పలికెను- కామ్యకర్మల త్యాగమునే సన్న్యాసమని కొందఱు పండితులు తలంతురు. కాని విచక్షణాశీలురైన మఱికొందరు మాత్రము సర్వకర్మఫలములను త్యజించుటను త్యాగమని పేర్కొందురు. **(2)**

ప్రశ్న - కామ్యకర్మలనగానేమి? కొందరు పండితులు వాటిని త్యజించుటయే సన్న్యాసమని చెప్పుటలోని అంతర్యమేమి?

సమా - స్త్రీ పుత్ర ధన స్వర్గాది ప్రియవస్తు ప్రాప్తికిని, రోగ సంకటాది – అప్రియ నివృత్తికిని, యజ్ఞదాన తపస్సులు, ఉపాసనలు మొదలగు పవిత్ర కర్మలు విధ్యుక్తములని శాస్త్రములలో తెల్పబడినవి. ఆయా ఫలాపేక్షలు సిద్ధించుటకై మనుష్యులు నిర్దిష్ట కర్మలను ఆచరింపవలెననియు, ఫలేచ్ఛలేనిచో వాటిని అనగా ఆ యజ్ఞాదులను ఆచరింపకున్నను హాని లేదనియు శాస్త్రములలో చెప్పబడినది. అట్టి శుభ కర్మలనే కామ్యకర్మలని యందురు.

పైన తెల్పబడిన కామ్యకర్మల యాచరణమును త్యజించుటయే అనగా మానివేయుటయే సన్న్యాసమని కొందరు పండితుల యభిప్రాయము. ఈ కామ్యకర్మలను అనుష్ఠింపక, కేవలము నిత్యనైమిత్తిక కర్తవ్యకర్మలనే విధ్యుక్తముగా ఆచరించువారు "సన్న్యాసులని" వారి యభిప్రాయము.

ప్రశ్న - సర్వకర్మలనగానేమి. వాటి ఫలత్యాగమనగానేమి? విచక్షణాకుశలురైనవారు సర్వకర్మఫలములను త్యజించుటయే 'త్యాగము' అని చెప్పుటలోని వారి అంతర్యమేమి?

సమా - ఈశ్వరభక్తి, దేవతార్చనము, మాతాపిత్రాది గురుజనసేవలు, యజ్ఞదాన తపస్సులు, వర్ణాశ్రమ ధర్మములను అనుసరించుచు చేయబడు కర్మలు, దైహికములైన భోజనభాజనాది శాస్త్ర విహితకర్మలన్నియును కర్తవ్య కర్మలుగా చెప్పబడినవి. అనగా ఆయా వర్ణాశ్రమముల వారికి ఆయా కర్మలను కర్తవ్యములుగా శాస్త్రములు నిర్దేశించినవి. వాటిని ఆచరింపనిచో నీతికిని, ధర్మమునకును, కర్మపరంపరకును అవరోధములు ఏర్పడును. ఈసమస్త కర్మలనే 'సర్వకర్మలు' అని పేర్కొనుట జరిగినది. వీటిని అనుష్ఠించుట వలన ప్రాప్తించు ఫలములను (భార్యా పుత్రులు, సంపదలు, కీర్తిప్రతిష్ఠలు, స్వర్గసుఖాదులు మొదలగు ఇహపరలోక సుఖములను) త్యాగము చేయుటయు, ఏ కర్మను ఆచరించినను తత్ఫలమును ఆశింపకుండుటయు, "సర్వకర్మఫలత్యాగము" అనబడును.

విచక్షణా కుశలురైనవారు నిత్యానిత్యవస్తు వివేచన చేసి, పైన చెప్పబడిన కర్మల ఫలములను త్యజించి, కేవలము కర్తవ్యకర్మలను అనుష్ఠించుచుండుటనే "త్యాగము" అని భావింతురు. కావున వారు ఇట్టి అభిప్రాయముతో సమస్త కర్తవ్యకర్మలనే చేయుచుందురు.

**త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।**
**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥ 3 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏకే | = కొందఱు | త్యాజ్యమ్ | = త్యజింప దగినదే | తపః కర్మ | = తపస్సులను ఆచరించుట |
| మనీషిణః | = విద్వాంసులు | ఇతి | = అని | | |
| కర్మ | = ప్రతికర్మయు | ప్రాహుః | = పలికెదరు | న, త్యాజ్యమ్ | = త్యజింపరానిది |
| దోషవత్ | = దోషయుక్తమే (కనుక అది) | అపరే, చ | = మఱికొందరు | ఇతి, (ఆహుః) | = అని పేర్కొందురు |
| | | యజ్ఞ, దాన, | = యజ్ఞ, దాన, | | |

కొందరు విద్వాంసులు కర్మలన్నియును దోషయుక్తములే గావున వాటిని త్యజింపవలెనని యందురు. కాని యజ్ఞ దాన తపశ్చర్యాది కర్మలు త్యాజ్యములు కావని మఱికొందరందురు. **(3)**

ప్రశ్న - "కర్మలన్నియును దోషయుక్తములే కావున వాటిని త్యజింపవలెను" అని కొందరు విద్వాంసులనుటలోని భావమేమి?

సమా - ఏ కర్మను ఆచరించినను దానికి పాపసంబంధము ఉండియే తీరును. విహితకర్మలు సైతము పూర్తిగా దోషరహితములు కాజాలవు. భగవానుడు కూడ

'సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః' (18/48) అనగా ఆచరింపబడు కర్మలన్నియును పొగతో ఆవరింపబడిన అగ్నివలె దోషయుక్తములగును అని చెప్పియుండెను. కనుక శ్రేయస్సును కోరువారు నిత్య నైమిత్తిక కామ్యాది కర్మలన్నింటి ఆచరణను త్యజింపవలెనని పెక్కుమంది విద్వాంసులు చెప్పుచుందురు. అనగా సన్న్యాసాశ్రమము గ్రహింపవలెనని వారి భావము.

ప్రశ్న - "యజ్ఞదాన తపశ్చర్యాది కర్మలు త్యాజ్యములు కావు" అని మఱికొందరు విద్వాంసులు తలంచుటలోని ఆంతర్యమేమి?

సమా - యజ్ఞదాన తపోరూప కర్మలు వాస్తవముగా దోషయుక్తములు కావని పెక్కుమంది విద్వాంసుల అభిప్రాయము, ఆయా కర్మల ఆచరణమునందు ఆవశ్యకములగు హింసాది పాపకృత్యములు వాస్తవముగ పాపములు గావు. పైగా అవి శాస్త్రవిహితములేయై యున్నందున మనుష్యులను పవిత్రులనుగా జేయును. కావున శ్రేయస్సును గోరువారు నిషిద్ధ కర్మలను త్యాగము చేయవలెనేగాని శాస్త్రోక్తములైన కర్తవ్య కర్మలను త్యజింపరాదని కొందఱి అభిప్రాయము.

సంబంధము - ఈ విధముగ సన్న్యాస - త్యాగ విషయములను గూర్చి, విద్వాంసుల వేర్వేఱు అభిప్రాయములను తెలిపిన పిదప భగవానుడు త్యాగవిషయమున తన నిశ్చితాభిప్రాయమును ప్రకటించుచున్నాడు-

**నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।**
**త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః ॥ 4 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురుషవ్యాఘ్ర! | = ఓ పురుషశ్రేష్ఠా! | | (మొదట) | హి | = ఏలనన |
| భరతసత్తమ! | = ఓ అర్జునా! | త్యాగే | = త్యాగవిషయమున | త్యాగః | = త్యాగము |
| తత్ర | = సన్న్యాసము, త్యాగము అను రెండు విషయములలో | మే | = నాయొక్క | త్రివిధః | = మూడు విధములుగా |
| | | నిశ్చయమ్ | = నిశ్చితాభిప్రాయమును | | |
| | | శృణు | = వినుము | సంప్రకీర్తితః | = పేర్కొనబడినది. |

**ఓ పురుషశ్రేష్ఠా! అర్జునా! సన్న్యాసము, త్యాగము అను రెండు విషయములలో మొదట త్యాగమునుగూర్చి నా నిశ్చయమును వినుము. త్యాగము సాత్త్వికము, రాజసము, తామసము అని మూడువిధములుగా చెప్పబడినది. (4)**

ప్రశ్న - **భరతసత్తమ! పురుషవ్యాఘ్ర!** అను సంబోధనల వైశిష్ట్యమేమి?

సమా - భరతవంశీయులలో అత్యంత శ్రేష్ఠుడైన వానిని భరతసత్తముడు అని యందురు. పురుషులలో శ్రేష్ఠమైన వీరుడు గావున పురుషవ్యాఘ్రము అని యందురు. అర్జునుడు భరతవంశజులలో ఉత్తముడు, మఱియు వీరపురుషుడు. కావున అట్లు సంబోధించుట జరిగినది. కనుక ముందు చెప్పబడునట్టి మూడు విధములగు త్యాగములలో తామస, రాజస త్యాగ రూపకర్మయోగములను ఆచరింపక సాత్త్విక త్యాగరూపకర్మయోగమును అనుష్ఠించుటలో సమర్థుడని ఇట్లు సంబోధించుట జరిగినది.

ప్రశ్న - '**తత్ర**' అను శబ్దము యొక్క అర్థమేమి? దానిని ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - '**తత్ర**' అనగా పైన చెప్పబడిన '**త్యాగము**', '**సన్న్యాసము**' అను రెండు విషయములు - అని యర్థము. ఈ రెండింటి తత్త్వములను విశదపఱచుమని అర్జునుడు భగవానుని ప్రార్థించియుండెను. ఈ రెండింటిలో మొదట భగవానుడు త్యాగతత్త్వమును ఆరంభించెను. ఈ రెండు తత్త్వములను వేర్వేరుగా విశదపఱచుమని అర్జునుడు కోరియుండుట వలన దానిని మన్నించుచు భగవానుడు మొదట త్యాగ విషయమును వివరించుచున్నట్లు తెల్పుటకై తత్ర (ఆ రెండింటిలో) అను పదమును ప్రయోగించెను. దీనిని బట్టి ఆ రెండింటిలో మఱియొకటియగు 'సన్న్యాసము'ను గూర్చి మున్ముందు చెప్పబోవుచున్నట్లు తెలియనగును.

ప్రశ్న - '**త్యాగ**' "విషయమున నా నిశ్చయమును వినుము" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - అర్జునుడు తెలిసికొనగోరిన రెండు విషయములను గూర్చి భగవానుడు ఇంతవఱకును ఇతరుల అభిప్రాయములను తెలిపియుండెను. ఇప్పుడు భగవానుడు తన అభిప్రాయము ననుసరించి మొదట 'త్యాగతత్త్వము'ను గూర్చి వివరించు చున్నట్లు తెలిపి, సావధానుడవై వినుమని అర్జునునితో పలికెను.

ప్రశ్న - 'త్యాగము' (సాత్త్విక, రాజస, తామసములని) మూడు విధములు - అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవానుడు శాస్త్రములను ఆదరించుటకై తన అభిప్రాయము శాస్త్రసమ్మతమని తెల్పుటకై శాస్త్రములలో చెప్పబడిన త్రివిధ త్యాగములను గూర్చి పేర్కొనుచున్నట్లు తెలిపెను.

*సంబంధము - ఇట్లు అర్జునుని త్యాగతత్త్వశ్రవణోన్ముఖునిగా చేసి, భగవానుడు 'త్యాగతత్త్వ స్వరూపము'ను వివరించుటకు ముందుగా రెండు శ్లోకములలో శాస్త్రవిహిత శుభకర్మాచరణ విషయమును గూర్చి తన నిశ్చయమును తెలుపుచున్నాడు-*

**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5 ॥**

యజ్ఞదానతపః కర్మ = యజ్ఞ, దాన, తపస్సులను ఆచరించుట
న, త్యాజ్యమ్ = త్యజింపరానిది
తత్ = ఆ మూడును
కార్యమ్, ఏవ = అవశ్యము ఆచరింపవలసినవే-ఏలననగా
యజ్ఞః = యజ్ఞము
దానమ్ = దానము
చ = మఱియు
తపః = తపస్సు
ఏవ = అను మూడు కర్మలే
మనీషిణామ్ = బుద్ధిమంతులను
పావనాని = పవిత్రమొనర్చునవి

**యజ్ఞదానతపశ్చర్యాది కర్మలు త్యజింపదగవు, అవి అవశ్యము అనుష్ఠింపదగినవి. ఏలనన యజ్ఞదాన తపస్సులు అను ఈ మూడు కర్మలే బుద్ధిమంతులైన వారిని పవిత్రమొనర్చును. (5)**

ప్రశ్న - "యజ్ఞదాన తపోరూపకర్మలు త్యజింప దగదు. అవి అవశ్యకర్తవ్యములు" - అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ శాస్త్రవిహితకర్మలను విధిగా ఆచరింపవలెనని భగవానుడు నిర్దేశించెను. వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి, మానవులు తమతమ కర్మలను ఆచరింపవలసిన విధానములు శాస్త్రములలో తెలుపబడినవి. ఆ యజ్ఞదాన తపఃకర్మలు చేయవలసిన వారిని గూర్చియు, సమయమును, విధానములను గురించియు శాస్త్రములలో చెప్పబడిన రీతిగా అనుష్ఠింపవలెను. ఏ కారణములనైనను త్యజింపరాదు. శాస్త్ర నియమములను ఉల్లంఘింపరాదు. ఏలనన వాటిని త్యజించినచో ఎట్టి లాభములు కలుగవు. సరిగదా! ప్రత్యవాయ దోషములను పొందవలసి వచ్చును. కనుక మానవుడు ఈ కర్తవ్యకర్మలను విధిగా ఆచరించియే తీరవలెను. వీటిని ఏ భావముతో అనుష్ఠింపవలెనో ముందు శ్లోకములో చెప్పబడుచున్నది.

ప్రశ్న - 'మనీషిణామ్' అను పదమునకు అర్థమేమి? యజ్ఞదాన తపస్సులు అను కర్మలు వీరిని పవిత్రమొనర్చు ననుటలోని అంతర్యమేమి?

సమా - వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి విధ్యుక్తములైన కర్తవ్య కర్మలు శాస్త్ర ప్రకారము సాంగోపాంగముగా నిష్కామ భావముతో చక్కగా అనుష్ఠించునట్టి బుద్ధిమంతులును, ముముక్షువులును ఐన పురుషులను ఇచట 'మనీషిణామ్' అను పదము తెలుపును. అట్టి మనీషులైనవారు ఆచరించు యజ్ఞదాన తపోరూపకర్మ లన్నియును వారికి బంధహేతువులు కావు సరిగదా! వారి అంతఃకరణములను గూడ పవిత్రమొనర్చును. కావున మానవుడు నిష్కామ భావముతో యజ్ఞదాన తపోరూప కర్మలను విధిగా అనుష్ఠింపవలెను. ఈ భావమును స్పష్టముగా ప్రకటించుటకై యజ్ఞదాన తపః కర్మలు మనీషులైన వారిని పవిత్రులను జేయునని చెప్పబడినది.

**ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥ 6 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | అపి, కర్మాణి | = కర్మలును (అన్నియు) | కర్తవ్యాని | = తప్పక చేయదగినవి |
| ఏతాని | = ఈయజ్ఞ, దాన, తపః కర్మలును | సంగమ్ | = ఆసక్తిని | ఇతి | = అని |
| | | చ | = మఱియు | మే | = నాయొక్క |
| తు | = అట్లే | ఫలాని | = ఫలములను | ఉత్తమమ్ నిశ్చితమ్, మతమ్ | = ఉత్తమమైన నిశ్చితమైన అభిప్రాయము |
| (అన్యాని), | = ఇతరములగు కర్తవ్య | త్యక్త్వా | = త్యజించి | | |

**కావున ఓ పార్థా! "ఈ యజ్ఞ దాన తపోరూపకర్మలను మరియు కర్తవ్యకర్మలను అన్నింటిని ఫలాసక్తులను త్యజించి, అవశ్యమాచరింపవలెను" అనునది ఉత్తమమైన నా నిశ్చితాభిప్రాయము.(6)**

ప్రశ్న - "ఏతాని" అను పదము ఏయే కర్మలను తెలుపును? తు, అపి అను అవ్యయ ప్రయోగముల విశేషములేవి?

సమా - ఉపర్యుక్తములైన యజ్ఞదాన తపోరూపకర్మలను 'ఏతాని' అను పదము తెలుపును. ఇంకను మాతాపిత్రాది గురుజన సేవలు, వర్ణాశ్రమ ధర్మానుసారముగ జీవిత నిర్వహణమునకు ఉపయుక్తములగు కర్మలు, దేహ సంబంధములైన భోజన భాజనాదులు మొదలగునవి అన్నియును శాస్త్రవిహిత కర్మలే. వీటిని తెలుపుటకే 'తు' 'అపి' అను అవ్యయములు ప్రయోగింపబడినవి.

ప్రశ్న - "ఫలాసక్తులను త్యజించియే ఈ కర్మలను అన్నింటిని ఆచరింపవలెను" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - శాస్త్ర విహిత కర్మలను అనుష్ఠించునపుడు వాటియందు మమతాసక్తులను సర్వథా వీడవలెను. వాటివలన లభించు ఫలములయందును ఇచ్ఛాసక్తులను సర్వథా త్యజింపవలెను. అంతేగాక ముముక్షువులైనవారు కామ్యకర్మలను, నిషిద్ధకర్మలను గూడ ఆచరింపరాదని తెలుపుట జరిగినది.

ప్రశ్న - "ఉత్తమమైన నా నిశ్చితాభిప్రాయము కూడ ఇదియే" అని యనుటలోని విశేషమేమి? మొదట తెలుపబడిన విద్వాంసుల అభిప్రాయములకంటెను భగవంతుని యభిప్రాయములోని వైశిష్ట్యమేమి?

సమా - భగవంతుని అభిప్రాయమును అనుసరించి ఫలాసక్తుల త్యాగమే నిజమైన త్యాగము. ఏలనన ఈ విధముగా కర్మలను ఆచరించు మానవుడు సమస్త కర్మబంధములనుండియు ముక్తుడై పరమపదమును పొందును. మఱియు కర్మలతో అతనికి ఎట్టి సంబంధము ఉండదు. కావున భగవంతుని అభిప్రాయమే ఉత్తమమైనది.

త్యాగమును, సన్న్యాసమును గూర్చి ఇతర విద్వాంసులు చెప్పిన లక్షణములు సమగ్రములు కావు. ఏలనన కేవలము కామ్యకర్మలను ఆచరించుట మానినంతమాత్రమున చాలదు. ఇతర నిత్యనైమిత్తిక కర్మలయందును, వాటి ఫలితముల యందును మమతాసక్తుల ఇచ్ఛను త్యజింపకున్నచో, అవి బంధహేతువులే యగును. కర్మఫలములన్నింటి యెడ ఇచ్ఛను త్యజించినప్పటికిని కర్మలయందు మమతాసక్తులున్నచో అవి బంధకారకములే యగును. అహంకారమును, మమతాసక్తులను, కోరికలను త్యజింపకయే, కర్మలన్నియును దోషయుక్తములేయని తలంచి, కర్తవ్య కర్మాచరణములను గూడ మానినచో, మానవుడు కర్మబంధముల నుండి ముక్తుడు కాజాలడు. ఏలనన శాస్త్రవిహిత కర్మలను త్యజించుట వలన ప్రత్యవాయ దోషములను అనుభవించవలసియు వచ్చును. అదేవిధముగ యజ్ఞదాన తపోరూప కర్మలను చేయుచున్నప్పటికిని వాటియందలి ఆసక్తి ఫలేచ్ఛలను త్యజింపకున్నచో అవి బంధహేతువులగును. కావున విద్వాంసులు నుడివిన లక్షణములుగల సన్న్యాసము, త్యాగము మనుజుని కర్మబంధముల నుండి సర్వథా విముక్తుని చేయజాలవు. భగవంతుని అభిప్రాయము ప్రకారము కర్మలన్నింటియందలి మమతాసక్తులను, ఫలములను త్యజించుటయే పూర్ణత్యాగమగును. అట్లు చేయుటవలన కర్మబంధము లన్నియును సర్వథా నశించిపోవును. ఏలనన సహజముగా కర్మాచరణములు బంధహేతువులు కావు. మమతాసక్తులతో ఫలేచ్ఛలతో కూడియున్నప్పుడే అవి (కర్మాచరణములు) బంధహేతువులగును. భగవంతుని అభిప్రాయములోని వైశిష్ట్యమిదియే.

*సంబంధము - ఈవిధముగ తన సునిశ్చితాభిప్రాయమును తెలిపి, శాస్త్రములలో పేర్కొనబడిన తామస, రాజస, సాత్త్విక త్యాగములయందు సాత్త్విక త్యాగమే నిజమైన త్యాగమనియు, అదియే కర్తవ్యమనియు భగవానుడు నొక్కి పల్కుచున్నాడు. మిగిలిన రెండు విధములైన త్యాగములను (తామస, రాజస త్యాగములును) వాస్తవముగా త్యాగములే కావనియు, కావున అవి ఆచరణీయములు కావనియు తెల్పెను. ఈ విషయమును వివరించుటకును తన యభిప్రాయము శాస్త్ర సమ్మతమైనదని చూపుటకును భగవానుడు క్రమముగా ఈ మూడు విధములైన త్యాగలక్షణములను మొదట అధమశ్రేణికి చెందిన తామసత్యాగ లక్షణములను వివరించుచున్నాడు-*

**నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।**
**మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః ॥ 7 ॥**

తు = కాని
నియతస్య = శాస్త్రవిహితమైన
కర్మణః, సన్న్యాసః = కర్మాచరణమును త్యజించుట
న, ఉపపద్యతే = ఉచితము కాదు
మోహాత్ = (కావున) మోహవశమున
తస్య పరిత్యాగః = దానిని పరిత్యజించుట
తామసః పరికీర్తితః = 'తామసత్యాగము' అని చెప్పబడును.

**(నిషిద్ధ కర్మల, కామ్యకర్మలఆచరణను త్యాగముచేయుట సముచితమే.) కాని శాస్త్రవిహిత కర్మాచరణమును త్యజించుట ఉచితముగాదు. కావున మోహవశమున దానిని త్యజించుట 'తామస త్యాగము' అనబడును. (7)**

ప్రశ్న - 'నియతస్య' అను విశేషణముతో పాటు 'కర్మణః' అను పదము ఏ కర్మలను సూచించును. వాటి ఆచరణను త్యజించుట ఏల ఉచితము కాదు?

సమా - వర్ణాశ్రమ ధర్మములను, స్వభావములను, పరిస్థితులను అనుసరించి ఆయా వ్యక్తులకు విహితములైన యజ్ఞము, దానము, తపస్సు, అధ్యయనము, అధ్యాపనము, ఉపదేశము, యుద్ధము, ప్రజాపాలనము, పశుపాలనము, వ్యవసాయము, వ్యాపారము, సేవలు మఱియు భోజన భాజనాదులు మొదలగు కర్మలన్నియును శాస్త్రములయందు అవశ్యకర్తవ్యములుగా తెల్పబడినవి. ఇట్టి కర్మల ఆచరణమును త్యాగము చేయువాడు తన కర్తవ్య పాలనను చేయని కారణమున పాపఫలములను అనుభవించును. ఎందుకనగా అట్టి త్యాగము వలన పరంపరగా (ఒకతరము నుండి మఱియొక తరమునకు) కొనసాగుచు వచ్చుచున్న కర్మలకు విచ్ఛిత్తి కలుగును. సమస్త జగత్తునందును విప్లవము చెలరేగును. (3/23,24) కావున నియత కర్మల ఆచరణమును త్యజించుట (మాని వేయుట) ఉచితముగాదు.

ప్రశ్న - మోహవశమున వాటిని (నియత కర్మలను) త్యజించుట 'తామస త్యాగము' అనుటలోని విశేషమేమి?

సమా - ఎవరైనను తమ వర్ణాశ్రమ, స్వభావ, పరిస్థితులను అనుసరించి, శాస్త్రవిహిత కర్తవ్యకర్మలను త్యజించుటను ముక్తిహేతువని భ్రమించి, వాటిని త్యజించినచో ఆ త్యాగము మోహపూర్వకమగుట వలన అది (ఆ త్యాగము) "తామస త్యాగము" అనబడును. ఏలనన మోహము తమోగుణమునుండి ఉత్పన్నమగును. (14/13,17) తామసస్వభావము గలవారు అధోగతి పాలగుదురు. (14/18) ఈ తామస త్యాగము మనుజునకు విముక్తిని కలిగింపజాలదు. పైగా ప్రతికూల ఫలమును ఇచ్చునది గావున ఇది మనుష్యుని అధోగతి పాలు చేయును. కనుక ఇట్టిత్యాగము త్యాగమే కాదు.

*సంబంధము- తామస త్యాగమును గూర్చి తెల్పిన పిదప ఇప్పుడు భగవానుడు రాజసత్యాగమును గూర్చి తెల్పుచున్నాడు-*

**దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ 8 ॥**

(యః = ఎవడు)
యత్, కర్మ = ఏ విధ్యుక్తకర్మాచరణమును
దుఃఖమ్, ఏవ, ఇతి = దుఃఖకారకమేయని తలంచి
కాయక్లేశ భయాత్ = శారీరిక క్లేశములకు భయపడి
త్యజేత్ = త్యజించునో
సః = అతడు
రాజసమ్, = 'రాజస
త్యాగమ్ = త్యాగము'ను
కృత్వా = చేసి
త్యాగఫలమ్ = త్యాగఫలమును
న, ఏవ, లభేత్ = ఏవిధముగను పొందడు.

కర్మలన్నియును దుఃఖకారకములే యని భావించి, శారీరికక్లేశమునకు భయపడి, కర్తవ్యకర్మలను త్యజించుటను రాజసత్యాగము అని యందురు. అట్టి త్యాగమువలన ఎట్టి ఫలమూ లభింపదు.(8)

ప్రశ్న - 'యత్' అను పదముతోపాటు 'కర్మ' అను పదము ఏయే కర్మలను సూచించును. వాటిని దుఃఖకారకములని భావించి, శరీర క్లేశభయముతో త్యజించుటయనగానేమి? అట్టి త్యాగలక్షణములేవి?

సమా - ఈ యధ్యాయమునందలి 7వ శ్లోకవ్యాఖ్యానమునందు చెప్పబడిన శాస్త్రవిహిత కర్తవ్యకర్మలనన్నింటిని ఈ 'యత్, కర్మ' అను పదద్వయము సూచించును. ఆ కర్మలను అనుష్ఠించుటలో శరీరేంద్రియ మనస్సులకు శ్రమ (ప్రయాస) కలుగును. అనేకవిధములగు విఘ్నములు ఏర్పడును. పెక్కువస్తువులను సమకూర్చుకొనవలసి యుండును. శరీర విశ్రాంతి మాటనే మఱచి పాటుపడవలసి వచ్చును. ఉపవాస వ్రతాది క్లేశములను తట్టుకొనవలసి వచ్చును. వివిధములగు నియమములను పాటింపవలసి యుండును. ఈ కారణముల వలన కర్మలను అన్నింటిని దుఃఖకారకములని భావించి, శరీరేంద్రియ మనస్సులకు కలుగు ప్రయాసలనుండి రక్షించుకొనుటకై విశ్రాంతిని గోరుచు, యజ్ఞదాన తపశ్చర్యాది శాస్త్రవిహిత కర్మలను త్యజించుటయే 'రాజసత్యాగము' అనగా దుఃఖకారకములని భావించి, శారీరక క్లేశభయముతో విహిత కర్మలను త్యజించుట యగును.

ప్రశ్న - 'ఇట్టి రాజసత్యాగము చేయువాడు ఎట్టి ఫలమునూ పొందడు' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ విధమగు భావనతో విహిత కర్మలను త్యజించుటను రాజస త్యాగమని యందురు. ఏలనన శరీరేంద్రియ మనస్సులకు విశ్రాంతిని కోరుకొనుట రజోగుణ లక్షణము. ఈ రాజస త్యాగము చేయువాడు నిజమైన త్యాగ ఫలమును అనగా సమస్త కర్మబంధములనుండి విముక్తుడై పరమాత్మ ప్రాప్తిని పొందజాలడు. ఏలనన శరీరేంద్రియ మనస్సులయందు మమతాసక్తులున్నంత వఱకును ఏ విధముగను కర్మ బంధములనుండి ఎవ్వడును విముక్తుడు కానేరడు. ఇది నామమాత్రత్యాగమే యగును. నిజమైన త్యాగమేమాత్రము కాదు. కావున శ్రేయస్సును గోరు సాధకులు ఇట్లు విహిత కర్మలను త్యజింపరాదు. ఇట్లు త్యజించుట వలన సత్పుల ప్రాప్తి దూరమగుటయేగాక, విహిత కర్మలను త్యజించినందువలన కలుగు పాపఫలములను గూడ అనుభవింపవలసి యుండును.

*సంబంధము - ఇపుడు ఉత్తమ శ్రేణికి చెందిన 'సాత్త్విక త్యాగలక్షణము'లను గూర్చి చెప్పుచున్నాడు-*

**కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।**
**సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥ 9 ॥**

అర్జున! = ఓ అర్జునా!
నియతమ్ = శాస్త్రవిహితమైన
యత్, కర్మ కార్యమ్, ఏవ = ఏ కర్మమైనను చేయదగినదే
ఇతి = అనెడిభావముతో
సంగమ్ = ఆసక్తిని
చ = మఱియు
ఫలమ్ = ఫలమును
త్యక్త్వా = త్యజించి
క్రియతే = చేయబడునో
సః, ఏవ = అదియే
సాత్త్వికః, త్యాగః = సాత్త్విక త్యాగము
మతః = (అని) భావింపబడును

**ఓ అర్జునా! శాస్త్రవిహిత కర్మలను కర్తవ్యములుగా భావించి వాటియందలి ఫలాసక్తులను త్యజించి, చేయుటయే సాత్త్వికత్యాగము అని భావింపబడును. (9)**

ప్రశ్న - ఇచట "నియతమ్, కర్మ" అనగా నేమి? వాటిని కర్తవ్యములుగా భావించి, ఫలాసక్తులను త్యజించి ఆచరించుట యనగానేమి?

సమా - 6వ శ్లోకముయొక్క వ్యాఖ్యానమునందు వివరింపబడిన రీతిగా వర్ణాశ్రమస్వభావ పరిస్థితులను అనుసరించి, ఆయా వ్యక్తులకు శాస్త్రములయందు అవశ్య కర్తవ్యములుగా తెలుపబడిన కర్మలన్నింటిని "నియతమ్ కర్మ" అను పదద్వయము సూచించును. కనుక నిషిద్ధ కర్మలు, కామ్యకర్మలు, నియత కర్మలలో చేరవని ఇచట గ్రహింపవలెను. "ఉపర్యుక్త నియత కర్మలను మానవులు విధిగా ఆచరింపవలెను. వాటిని ఆచరింపకుండుట భగవదాజ్ఞను ఉల్లంఘించుటయే యగును." - అను భావనతో ఆ కర్మల యందును, వాటి ఫలరూపములైన ఇహపరలోక సమస్త భోగములయందును, మమతాసక్తులను, కోరికలను సర్వథా త్యజించి, ఉత్సాహముతో విధివిధానముగా ఆ కర్తవ్య కర్మలను ఆచరించుటయే 'సాత్త్విక త్యాగము'. అనగా వాటిని కర్తవ్యములుగా భావించి, ఫలాసక్తులను త్యజించి, ఆచరించుట యగును.

ప్రశ్న - ఇచట 'కర్మలను త్యజించుట' లేదు గదా! పైగా కర్మలను ఆచరించుట గదా! ఐనచో ఇట్టి కర్మానుష్ఠానమును 'సాత్త్విక త్యాగము' అనుట యెట్లు పొసగును?

సమా - శాస్త్రోక్తములైన ఐశ్వర్యములైన అవశ్య కర్తవ్య కర్మాచరణమును త్యజింపక వాటియందును, వాటి ఫలస్వరూపములైన భోగవస్తువులయందును, ఆసక్తిని, ఇచ్ఛను సర్వథా త్యజించుటయే తన దృష్టిలో నిజమైన త్యాగమని పల్కుచు భగవానుడు కర్మానుష్ఠాన రూపమైన కర్మయోగమును 'సాత్త్విక త్యాగము' అని పేర్కొనెను. కర్మఫల రూపములైన ఇహపరలోకభోగముల యందు గల ఆసక్తి, ఇచ్ఛలను త్యజింపక ఏదేని ఒక భావ ప్రభావమున (ప్రేరణతో) విహిత కర్మాచరణమును త్యజించుట నిజమైన త్యాగము ఏమాత్రమూ కాదు. కర్మలకును, ఆ కర్మల ఫలములకును మధ్యగల సంబంధము తెగిపోవుటయే త్యాగము యొక్క పరిణామరూపము. ఈ పరిణామ స్థితి కేవలము కర్మాచరణమును త్యజించుటవలన గలుగదు. మమతాసక్తులను, ఇచ్ఛలను త్యజించుట వలననే కలుగును. కావున కర్మల ఫలేచ్ఛ, ఆసక్తులను త్యజించుటయే 'సాత్త్విక త్యాగము' అగును.

*సంబంధము - సాత్త్విక త్యాగము చేయు పురుషుడు నిషిద్ధ కర్మలయొక్క, కామ్య కర్మల యొక్క ఆచరణమును త్యజించును, కర్తవ్య కర్మలను మాత్రము ఆచరించును, అప్పటి అతని మనోభావములను, అంతిమ స్థితి లక్షణములను భగవానుడు తెల్పుచున్నాడు-*

**న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।**
**త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ 10 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| (యః) | = ఎవడు | న, అనుషజ్జతే | = ఆసక్తిని కలిగి యుండడో | ఛిన్నసంశయః | = సంశయ రహితుడు |
| అకుశలమ్, కర్మ | = అకుశల కర్మ(ల)ను | | | | |
| న, ద్వేష్టి | = ద్వేషింపడో | సః | = అతడే | మేధావీ | = బుద్ధిమంతుడు |
| కుశలే | = కుశలకర్మలయందు | సత్త్వసమావిష్టః | = శుద్ధసత్త్వగుణ యుక్తుడు | త్యాగీ | = నిజమైన త్యాగి |

**అకుశలకర్మలను నిషిద్ధ కర్మలను, కామ్యకర్మలను ద్వేషింపనివాడు, కుశలకర్మలయందు (నిత్య నైమిత్తిక పవిత్ర కర్మలయందు) ఆసక్తి కలిగియుండనివాడు, శుద్ధసత్త్వగుణ యుక్తుడు, సంశయరహితుడు, బుద్ధిమంతుడు ఐనవాడు నిజమైన త్యాగి. (10)**

ప్రశ్న - "అకుశలం కర్మ" అనగానేమి? "సాత్త్విక త్యాగి వాటిని ద్వేషింపడు" అని యనుటలోని విశేషమేమి?

సమా - "అకుశలం కర్మ" అను పదద్వయము శాస్త్ర నిషిద్ధ పాపకర్మలను, కామ్యకర్మలను సూచించును. పాపకర్మాచరణమువలన మానవుడు నానావిధ నీచ జన్మలనెత్తును కడకు నరకము పాలగును. కామ్యకర్మలు గూడ కర్మఫలములను అనుభవింపజేయుటకై మానవులకు పునర్జన్మలు ప్రాప్తింపజేయును. ఈ విధముగ రెండును బంధహేతువులే యగుట వలన ఇవి "అకుశల కర్మలు"గా పేర్కొనబడినవి. సాత్త్విక త్యాగి రాగద్వేషములు లేనివాడగుట వలన అకుశలకర్మలను ఆచరింపకుండుటయేగాక వాటిని ఎట్టి పరిస్థితులలోను ఏ మాత్రమును ద్వేషింపడు. అకుశలకర్మల త్యాగము మానవకర్తవ్యముగా భావించి, లోకసంగ్రహము కొఱకై వాటిని త్యజించును.

ప్రశ్న - 'కుశలే' అను పదము ఏయే కర్మలను సూచించును? 'సాత్త్వికత్యాగి వాటియందు ఆసక్తుడు కాడు' అని యనుటలోని విశేషమేమి?

సమా - 'కుశలే' అను పదము ఇచట శాస్త్రవిహిత నిత్యనైమిత్తికములైన యజ్ఞదాన తపశ్చర్యాది పవిత్ర కర్మలను, వర్ణాశ్రమ ధర్మానుకూల కర్తవ్య కర్మలను అన్నింటిని సూచించును. నిష్కామభావముతో చేయబడు ఈ కర్మలు పూర్వకృతసంచితపాపములను నశింపజేసి, మనుష్యుల కర్మబంధములనుండి విముక్తిని కల్గించును. కనుక అవి 'కుశలకర్మలు' అనబడును. సాత్త్విక త్యాగి ఈ కుశల కర్మలను విధ్యుక్తముగా ఆచరించును. కాని కర్మఫలాసక్తిని కలిగియుండడు. శాస్త్రవిహితకర్మలను ఆచరించుట మానవ కర్తవ్యముగా భావించును మమతాసక్తులను, ఫలేచ్ఛను విడనాడి, లోకక్షేమముకొఱకై వాటిని అనుష్ఠించును.

ప్రశ్న - "అట్టి శుద్ధ సత్త్వగుణయుక్తుడైన పురుషుడే సంశయ రహితుడు, మేధావి, నిజమైన త్యాగి" అనుటలోని విశేషమేమి?

సమా - రాగద్వేషరహితుడై కేవలము కర్తవ్యబుద్ధితో ఫలాసక్తులను త్యజించి, కర్మలను ఆచరించు శుద్ధ సత్త్వగుణయుక్తుడైన పురుషుడు సంశయరహితుడు అగును. ఈ కర్మయోగరూపమైన సాత్త్విక త్యాగమే అతనిని కర్మబంధములనుండి విముక్తుని గావించి, పరమ పదమును ప్రాప్తింపజేయు ఉత్తమసాధనమని అతడు పూర్తిగా విశ్వసించును. కావున అతడు సంశయరహితుడు, మేధావి, నిజమైన త్యాగి.

సంబంధము - నిష్కామ భావములో కర్తవ్యకర్మలను ఆచరించు కర్మయోగియైన సాత్త్విక త్యాగియే 'నిజమైన త్యాగి' యని పై శ్లోకమున తెల్పబడినది. నిషిద్ధకర్మలవలె, కామ్యకర్మలవలె ఇతర సమస్తకర్మలను గూడ త్యజించువాడును నిజమైన త్యాగి కాడా?, కేవలము నిష్కామభావముతో కర్మలను ఆచరించువాడే నిజమైన త్యాగియగునా? అను సందేహములు రావచ్చును. దీనికి సమాధానముగా భగవంతుడు ఇట్లు చెప్పుచున్నాడు-

**న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।**
**యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥ 11 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హి | = ఏలనన | దేహభృతా | = దేహధారియైన ఏ మనుష్యునకును | కర్మఫలత్యాగీ | = కర్మఫలములను త్యజించువాడో |
| కర్మాణి | = కర్మల నన్నింటిని | న, శక్యమ్ | = సాధ్యముగాదు | సః, తు | = అతడే |
| అశేషతః | = సంపూర్ణముగా | (తస్మాత్) | = అందువలన | త్యాగీ ఇతి | = నిజమైన 'త్యాగి' యని |
| త్యక్తుమ్ | = త్యజించుటకు | యః | = ఏ పురుషుడు | అభిధీయతే | = పేర్కొనబడును |

ప్రతి శరీరధారికిని కర్మలను సంపూర్ణముగ త్యజించుట అశక్యము. కావున కర్మలను గాక కర్మఫలములను త్యజించినవాడే నిజమైన త్యాగి అని గ్రహింపవలెను. **(11)**

ప్రశ్న - 'దేహభృతా' అనగానేమి? 'వారికి కర్మలను సంపూర్ణముగా త్యజించుట అశక్యము' అనుటలోని ఆంతర్యమేమి?

సమా - దేహములను ధరించి, వాటిని పోషించు మానవులందరిని 'దేహభృతా' అను పదము సూచించును. కావున శరీరధారియైన ప్రతి వ్యక్తియు సమస్తకర్మలను సంపూర్ణముగా త్యజించుట అశక్యము. ఏ దేహధారియైనను కర్మలను చేయకుండ ఉండజాలడు. (3/5) ఏలనన కర్మలనాచరింపకుండ శరీరనిర్వహణమే శక్యముకాదు. (3/8) బ్రహ్మచర్యాది ఆశ్రమములలో దేనియందున్నను మానవుడు జీవించియున్నంత వఱకు తన పరిస్థితులను అనుసరించి, భోజనభాజనాదులను చేయుచుండుట, నిద్రించుట, మేల్కొనుట, నడచుట, తిరుగుట, మాట్లాడుట మొదలగు పనులలో ఏదేని ఒకటి చేయుచునే యుండవలెను. కావున కర్మలను అన్నింటిని సంపూర్ణముగ త్యజించుట అసంభవము.

ప్రశ్న - "కర్మఫలత్యాగీ" అనగానేమి? 'కర్మఫలత్యాగియే నిజమైన త్యాగి' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - కర్మలయందును, వాటి ఫలముల యందును మమతాసక్తులను, ఇచ్ఛను త్యజించి, శాస్త్రవిహిత కర్తవ్యకర్మలను అనుష్ఠించు కర్మయోగియే "కర్మఫలత్యాగి." ప్రతిమానవుడు ఏదేని ఒక కర్మ ఆచరించుచునే యుండవలెను. ఎవ్వడును కర్మచేయకుండ ఉండలేడు. కావున నిషిద్ధకర్మలను, కామ్యకర్మలను సర్వథా త్యజించి, యథావశ్యకముగ శాస్త్ర విహిత కర్తవ్య కర్మలను అనుష్ఠించుచు, ఆ కర్మలయందును, వాటి ఫలముల యందును మమతాసక్తులను ఇచ్ఛను సర్వథా త్యజించినవాడే నిజమైన త్యాగియగును. భౌతికముగా ఇంద్రియక్రియలను నిగ్రహించి, మానసికముగా ఇంద్రియ విషయచింతన చేయు వాడు త్యాగి కాడు. అట్లే అహంకార, మమకారములను, ఆసక్తిని కలిగియుండి శాస్త్రవిహిత యజ్ఞదాన తపశ్చర్యాది కర్తవ్య కర్మల ఆచరణమును త్యజించువాడు కూడ త్యాగికాడు.

*సంబంధము - "కర్మఫల త్యాగియే నిజమైన త్యాగి" అని పూర్వ శ్లోకమున చెప్పబడినది. కర్మఫలములను కోరకున్నను చేసిన కర్మ ఫలమును ఇచ్చియే తీరునుగదా! నాటబడిన విత్తనము కాలక్రమమున మొక్కగా మొలచి వృక్షమైనట్లు చేయబడిన కర్మయొక్క ఫలములను ఏదో యొక జన్మలో అందఱును తప్పక అనుభవింపవలసియే వచ్చును. కావున కర్మఫలత్యాగమువలన మానవుడు 'త్యాగి' అనగా కర్మబంధరహితుడు ఎట్లు కాగలడు? ఈ సందేహ నివృత్తికై భగవానుడు ఇట్లు పలుకుచున్నాడు-*

## అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
## భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12 ॥

అత్యాగినామ్ = కర్మఫలత్యాగము చేయని వారియొక్క
కర్మణః = కర్మ(ల)కు
ఇష్టమ్ = మంచి
అనిష్టమ్ = చెడు
చ = మఱియు
మిశ్రమ్ = మిశ్రము (మంచి, చెడులతో కలిసి యుండునది)
(ఇతి) = అని
త్రివిధమ్, ఫలమ్ = మూడువిధములైన ఫలములను
ప్రేత్య = మరణానంతరము (అవశ్యముగా)
భవతి = అగును (అనుభవింప వలసియుండును)
తు = అయితే
సన్న్యాసినామ్ = కర్మఫలములను పూర్తిగా త్యాగము చేసిన వారికి (కర్మ ఫలానుభవము)
క్వచిత్ = ఏకాలము నందును
న (భవతి) = ఉండదు

కర్మఫలత్యాగము చేయని మనుష్యుల కర్మలకైతే మంచి, చెడు, మిశ్రము అని మూడు విధములగు ఫలములుండును. మరణానంతరము వారు వాటిని తప్పక అనుభవించియే తీరవలయును. కాని కర్మఫలత్యాగ మొనర్చిన కర్మయోగులు తమ కర్మలఫలములను ఏ కాలమునందైనను, ఏ విధముగను అనుభవింపవలసిన పనియుండదు. **(12)**

ప్రశ్న - 'అత్యాగినామ్' అను పదమునకు అర్థమేమి? వారి కర్మలకు గల మంచి, చెడు, మిశ్రము అను మూడు ఫలములెవ్వి? "మరణానంతరము వాటిని అనుభవింపక తప్పదు" అనగానేమి?

సమా - తాము ఆచరించిన కర్మలయందును, వాటి ఫలములయందును మమతాసక్తులను, ఇచ్ఛలను త్యజింపనివారును, ఆసక్తి, ఫలేచ్ఛా పూర్వకముగ అన్ని విధములైన కర్మలను ఆచరించువారును ఐనట్టి సర్వ సాధారణ ప్రాకృతులగు మనుష్యులను తెలుపునదియే "అత్యాగినామ్" అను పదము.

వారు చేయు శుభ కర్మలకు ఫలములుగా లభించు స్వర్గాది సుఖములును, ఇతర సాంసారిక - ఇష్టభోగములును మంచి ఫలములు అనబడును. తమచే చేయబడిన పాపకర్మలకు ఫలములుగా ప్రాప్తించు పశు పక్షి కీటపతంగ వృక్షాది తిర్యగ్జన్మలును, నరకయాతనలు, ఇతర దుఃఖములును చెడుఫలములు. అదే విధముగ మనుష్యాది జన్మలనెత్తిపొందునట్టి ఇష్టభోగములును, అనిష్ట బాధలును (సుఖదుఃఖములు) 'మిశ్రఫలములు' అనబడును. ఇవియే కర్మలయొక్క త్రివిధ రూపములైన ఫలములు.

వారు (అత్యాగులు) ఈ మూడు విధములగు ఫలములను మరణానంతరము అనుభవింపవలసి యుండును. ఆ కర్మల ఫలములను వారు అనుభవింపకయే అవి తొలగిపోవు. అవి జన్మజన్మాంతరముల వఱకును ఆయా ఫలములను ఇచ్చుచునే యుండును. అట్టివారు సంసార (జనన మరణ) చక్రములో పరిభ్రమించుచునే యుందురు.

ప్రశ్న - 'ప్రేత్య' అను పదప్రయోగము వలన కర్మఫలానుభవము మరణానంతరమే జరుగునని స్ఫురించుచున్నది. అయినచో జీవించియున్నప్పుడు (జీవితకాలమున) వారికి తమ కర్మ ఫలములను అనుభవింపవలసిన అవసరమే యుండదా?

సమా - మానవుడు పూర్వజన్మలయందు చేసిన కర్మల ప్రారబ్ధమునే బహుశా ప్రస్తుత జన్మయందు అనుభవించును. ఇప్పటి కర్మల ఫలము ఈ జన్మయందు చాల తక్కువ అనుభవములోనికి రావచ్చును. మనుష్యుడు ఒక జీవితకాలమున తాను చేసిన కర్మల ఫలము పెక్కు జన్మలలో అవశ్యముగ అనుభవింపవలసి యుండును. ఈ భావమును వివరించుటకే 'ప్రేత్య' అను పదమును ఉపయోగించుట ద్వారా కర్మఫలానుభవము మరణానంతరము జరుగునని తెలుపబడినది.

ప్రశ్న - 'తు' అను అవ్యయ ప్రయోగము యొక్క ప్రత్యేకత ఏమి?

సమా - కర్మఫలత్యాగము చేయని వారికంటెను కర్మఫలత్యాగము చేసినవారు మిక్కిలి శ్రేష్ఠులనియు, విలక్షణమైనవారనియు, ప్రకటించుటకై 'తు' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'సన్న్యాసినామ్' అను పదము ఎట్టివారిని గూర్చి తెలుపును? "వారికి కర్మఫలములను అనుభవింపవలసిన అవసరము ఎప్పుడునూ ఉండదు" అని యనుటలోని విశేషమేమి?

సమా - కర్మలయందును, వాటి ఫలములయందును, మమతాసక్తులను, ఇచ్ఛను సర్వథా త్యజించినవారు, ఈ యధ్యాయమునందలి 10వ శ్లోకమున తెలుపబడిన లక్షణములు గల త్యాగులు, ఆఱవ అధ్యాయమునందలి మొదటి శ్లోకములో సన్న్యాసి, యోగి అను రెండు పదములతోడను సూచింపబడినవారు, రెండవ అధ్యాయమునందలి ఏబది ఒకటవ శ్లోకమున పేర్కొనబడిన రీతిగా అనామయ పదమును పొందుటకు అర్హులైనవారు, అట్టి కర్మయోగులందఱిని ఈ "సన్న్యాసినామ్" అను పదము తెలుపును. వేగింప (వేయింప) బడిన విత్తనములు ఉత్పాదక శక్తిని కోల్పోయినట్లే కర్మఫల త్యాగము చేసిన త్యాగులయొక్క కర్మలు ఫలములనిచ్చెడి శక్తిని కోల్పోవును. ఆదేవిధముగ యజ్ఞార్థమై చేయబడు నిష్కామ కర్మలయొక్క పూర్వసంచిత సమస్త శుభాశుభ కర్మఫలములును నశించును. (4/23) అందువలన ఈ జన్మయందుగాని, జన్మాంతరములయందు గాని, వారు చేసిన ఎట్టి కర్మఫలమైనను, ఏ విధముగను ఎట్టి పరిస్థితులలోను జీవించి యుండగాగాని, మరణానంతరము గాని అనుభవింపవలసిన అవసరమే ఉండదు. వారు కర్మబంధములనుండి సర్వథా విముక్తులగుదురు.

*సంబంధము - అర్జునుడు ఈ యధ్యాయము నందలి ప్రథమ శ్లోకమున సన్న్యాసము - త్యాగముల తత్త్వములను వేర్వేఱుగా తెలిసికొనగోరెను. దానికి సమాధానముగా భగవానుడు 2,3 శ్లోకములయందు త్యాగమును గూర్చి విద్వాంసుల అభిప్రాయములను తెలిపెను. 4 నుండి 12వ శ్లోకము వఱకు భగవానుడు తన అభిప్రాయము ప్రకారము త్యాగమును అనగా కర్మయోగ తత్త్వమును చక్కగా వివరించెను. ఇప్పుడు సన్న్యాసము యొక్క అనగా సాంఖ్యయోగముయొక్క తత్త్వమును విశదపఱచుటకు మొట్టమొదట సాంఖ్యసిద్ధాన్తమును అనుసరించి, కర్మసిద్ధికై ఐదు హేతువులను తెల్పుచున్నాడు-*

**పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।**

**సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 13 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో! | = ఓ మహాబాహూ! | కారణాని | = హేతువులు (అని) | సాంఖ్యే | = సాంఖ్యశాస్త్రము నందు |
| సర్వకర్మణామ్ | = సమస్తకర్మల యొక్క | కృతాంతే | = కర్మలను అంతముచేయు ఉపాయములను తెలుపునట్టి | ప్రోక్తాని | = చెప్పబడినవి |
| సిద్ధయే | = సిద్ధికి | | | (తాని) | = (వాటిని) |
| ఏతాని, పంచ | = ఈ ఐదును | | | మే | = నానుండి |
| | | | | నిబోధ | = ఎఱుంగుము. |

**ఓ మహాబాహూ! సర్వకర్మలసిద్ధికి ఐదు హేతువులు గలవని కర్మలను అంతముచేయు ఉపాయములను తెలుపు సాంఖ్యశాస్త్రమునందు పేర్కొనుట జరిగినది. వాటిని నానుండి నీవు స్పష్టముగా తెలిసికొనుము. (13)**

ప్రశ్న - 'సర్వకర్మణామ్' అను పదము ఏ కర్మలను గూర్చి తెల్పును. మఱియు వాటియొక్క సిద్ధి యనగానేమి?

సమా - శాస్త్ర విహితములైన కర్మలను, శాస్త్ర నిషిద్ధ కర్మలను, అన్నివిధములైన కర్మలను గూర్చి ఈ 'సర్వకర్మణామ్' అను పదము తెలుపును. ఏకర్మయైనను పూర్తియగుట అనగా దాని ఫలము లభించుటయే దాని సిద్ధియగును.

ప్రశ్న - **'కృతాంతే'** అను విశేషణముతోపాటు **'సాంఖ్యే'** అను పదము దేనిని తెలుపును? అందు "సర్వకర్మలసిద్ధికి ఐదు హేతువులు తెల్పబడినవి. వానిని నానుండి తెలిసికొనుము" అని యనుటలోని యాంతర్యమేమి?

సమా- "కృతములు" అనగా కర్మలు. ఆ కర్మలను సమాప్తిచేయుటకు ఉపాయములను తెలుపు శాస్త్రమునే **"కృతాంతము"** అని యందురు. సాంఖ్యమనగా జ్ఞానము. (సమ్యక్ ఖ్యాయతే జ్ఞాయతే పరమాత్మా అనేనేతి సాంఖ్యమ్: తత్త్వజ్ఞానమ్) తత్త్వజ్ఞానము యొక్క సాధన రూపమైన జ్ఞానయోగమును ప్రతిపాదించు శాస్త్రమున **'సాంఖ్యము'** అని యందురు. కనుక **'కృతాంతే'** అను విశేషణముతో ప్రయుక్తమైన 'సాంఖ్యే' అను పదము ఆ శాస్త్రమును తెలుపును. అందు జ్ఞానయోగము చక్కగా ప్రతిపాదింపబడినది. దాని ననుసరించి సమస్త కర్మలు ప్రకృతిద్వారా జరుగును. ఆత్మను సర్వథా అకర్తగా భావించి కర్మరాహిత్య విధానము ఆ సాంఖ్య శాస్త్రమునందు తెలుపబడినది.

ఆత్మయొక్క అకర్తృత్వమును దృఢపఱచుటకై జ్ఞాన యోగమును ప్రతిపాదించు సాంఖ్యశాస్త్రము నందు సమస్త కర్మల సిద్ధికి ఐదు హేతువులు తెల్పబడినవి. ఈ ఐదు హేతువులవలన సమస్త కర్మలు పూర్తిగా నెరవేరును. "ఈ హేతువులను వివరముగా తెల్పుచున్నాను. వినుము" అని భగవానుడు అర్జునునితో పల్కెను.

*సంబంధము - భగవానుడు ఇప్పుడు ఆ ఐదు హేతువుల పేర్లను తెల్పుచున్నాడు-*

**అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।**

**వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥ 14 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అత్ర | = ఈవిషయమున (కర్మసంసిద్ధియందు) | పృథగ్విధమ్ | = వివిధములైన | తథా, ఏవ | = ఆ విధముగనే |
| అధిష్ఠానమ్ | = అధిష్ఠానము | కరణమ్ | = సాధనములును | పంచమమ్ | = ఐదవదియగు |
| చ | = మఱియు | చ | = మఱియు | దైవమ్ | = దైవము (అను ఐదును హేతువులు) |
| కర్తా చ | = కర్తయును | వివిధాః | = వివిధములైన | | |
| | | పృథక్, చేష్టాః | = వేర్వేఱు చేష్టలు | | |

కర్మల సిద్ధియందు అధిష్ఠానము, కర్త, వివిధములైన కరణములు(సాధనములు), నానావిధ చేష్టలు, దైవము అను ఐదును హేతువులు. **(14)**

ప్రశ్న - అధిష్ఠానమనగానేమి?

సమా - అధిష్ఠానమనగా ముఖ్యముగా కరణము, క్రియలకు ఆధారరూపమైన శరీరము. గౌణముగా యజ్ఞాది కర్మలయందు తత్సంబంధిత క్రియలకు ఆధారమైన భూమి మొదలగు వానిని అధిష్ఠానముగా భావింపవచ్చును.

ప్రశ్న - ఇచట 'కర్తా' అను పదము దేనిని తెలుపును?

సమా - ఇచట 'కర్తా' అను పదము ప్రకృతిస్థుడైన పురుషుని దెల్పును. ఈ పురుషునే 13వ అధ్యాయము నందలి 21వ శ్లోకమున 'భోక్తా' అనియు, 3వ అధ్యాయమునందలి 27వ శ్లోకమున 'అహంకార విమూఢాత్మా' అనియు వ్యవహరించుట జరిగినది.

ప్రశ్న - 'పృథగ్విధమ్' అను విశేషణముతోపాటు 'కరణమ్' అను పదము దేనిని తెలుపును?

సమా - మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి 'అంతః కరణములు'. ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు కలిసి పది బాహ్యకరణములు. ఇవిగాక యజ్ఞాది కర్మలయందు సహాయకములైన స్రువాది ఉపకరణములు గూడ బాహ్యకరణములే. ఇంకను వేర్వేఱు కర్మలయందు ఉపయుక్తములగు వివిధోపకరణము లన్నింటిని తెలుపునదియే 'పృథగ్విధమ్' అను విశేషణముతోపాటు 'కరణమ్' అను పదము.

ప్రశ్న - "వివిధాః, పృథక్" అను రెండు పదములతో కూడిన "చేష్టాః" అను పదము యొక్క అర్థమేమి?

సమా - ఒక స్థానమునుండి మఱియొక స్థానమునకు గమనము, కాళ్లు, చేతులు మొదలగు అంగముల కదలికలు, ఉచ్ఛ్వాస నిశ్వాసలు, అంగముల సంకోచ వ్యాకోచములు, కనులు మూయుట, తెరచుట, మనసు యొక్క సంకల్ప వికల్పములు, మొదలగు క్రియలనన్నింటిని "వివిధాః" "పృథక్" అను రెండు పదములతో గూడిన "చేష్టాః" అను పదము తెల్పును.

ప్రశ్న - 'దైవమ్' అనగానేమి? 'పంచమమ్' అను పదప్రయోగము యొక్క విశేషమేమి?

సమా - పూర్వకృత శుభాశుభ కర్మల సంస్కారములనే 'దైవమ్' అను పదము తెల్పును. ప్రారబ్ధముగూడ ఇందులో అంతర్గతమే. దీనికి 'అదృష్టము' అనియు పేరు. పీనిలో ఉన్న ఐదు హేతువులలో వరుసగా నాలుగు చెప్పబడినవి. ఈ 'దైవమ్' అనునది ఐదవది. కనుక 'పంచమమ్' అని ప్రయోగించుట జరిగినది.

**శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః ।**
**న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥ 15 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| నరః | = మానవుడు | | విధానమునగాని | ప్రారభతే | = ఆచరించునో |
| శరీరవాఙ్మనోభిః | = శరీరము వాక్కు మనస్సులతో | విపరీతమ్, వా | = తద్విపరీతముగా గాని | తస్య | = ఆకర్మకు |
| | | | | ఏతే, పంచ | = ఈ ఐదును |
| న్యాయ్యమ్, వా | = శాస్త్రోక్త | యత్, కర్మ | = ఏకర్మను | హేతవః | = హేతువులు |

మానవుడు శరీరము వాక్కు మనస్సులతో ఆచరించు శాస్త్రానుకూలమైన లేక విపరీతమైన యేకర్మలైనను ఈ యైదు హేతువులతో ఒప్పుచుండును. **(15)**

ప్రశ్న - నరః అనుపదము ఎవరిని సూచించును? ఆ పద ప్రయోగము యొక్క విశేషమేమి?

సమా - 'నరః' అను పదము మనుష్యులందరిని తెలుపును. మానవశరీరము ద్వారానే జీవుడు పుణ్యపాప రూపమైన కర్మలు చేయుగలడు. మానవేతర జన్మలన్నియును భోగయోనులే. వాటియందు పూర్వకృత కర్మలఫలములు అనుభవింపబడును. నూతనకర్మలను అవి ఆచరింపజాలవు.

ప్రశ్న - "శరీరవాఙ్మనోభిః" అను సమాసము నందలి శరీరము, వాక్కు, మనస్సు అనువాటివలన ఏమి గ్రహింపనగును? ఆ పదములను ప్రయోగించుటలోని విశేషములేమి?

సమా - పై సమాసమునందలి 'శరీరము' అను పదము 'వాక్కు' తప్ప సమస్త ఇంద్రియములతో గూడిన స్థూల శరీరమును సూచించును. 'వాక్కు' అనగా వాణియనియు, 'మనస్సు' అనగా అంతఃకరణము అనియు గ్రహింపవలెను. మానవుడాచరించు పుణ్యపాప కర్మలన్నింటిని శాస్త్రకారులు కాయిక, వాచిక, మానసిక కర్మలు అని మూడు విధములుగా పేర్కొనినారు. కావున ఈ సమాసము సమస్త శుభాశుభ కర్మలను సూచించును.

ప్రశ్న - 'న్యాయ్యమ్' అను పదమునకు అర్థమేమి?

సమా - వర్ణాశ్రమ ధర్మములు, ప్రకృతి, పరిస్థితులు మొదలగువాని భేదములను అనుసరించి, న్యాయపూర్వకమైన కర్తవ్య కర్మలు అనగా యజ్ఞదాన తపస్సులు, విద్యాధ్యయనము, యుద్ధము, కృషి, గోరక్షా వాణిజ్యములు, సేవలు మున్నగు సమస్త శాస్త్రవిహిత కర్మలను సూచించునదియే 'న్యాయ్యమ్' అను పదము.

ప్రశ్న - 'విపరీతమ్' అను పదము ఏయే కర్మలను తెలుపును?

సమా - వర్ణాశ్రమధర్మములు, ప్రకృతి, పరిస్థితులు మున్నగువాని భేదములను అనుసరించి, శాస్త్రములచే నిషేధింపబడిన కర్మలు, నీతి, ధర్మములకు ప్రతికూలములైన కర్మలు, అట్లే అసత్యభాషణము, దొంగతనము, వ్యభిచారము, హింస, మద్యపానము, అభక్ష్య భక్షణము మొదలగు సమస్త పాపకర్మలను సూచించునదియే 'విపరీతమ్' అను పదము.

ప్రశ్న - 'యత్, కర్మ' అను పదద్వయమునకు అర్థమేమి? దానికి ఈ ఐదును హేతువులు అని యనుటలోని అంతర్యమేమి?

సమా - మనోవాక్కాయములద్వారా చేయబడు పుణ్యపాపకర్మలను సూచించునదియే 'యత్ కర్మ' అను పదద్వయము. ఈ కర్మల ఫలములను జీవుడు ఈ జన్మయందుగాని, జన్మాంతరములయందుగాని అనుభవింప వలసియుండును. శుభాశుభకర్మలన్నియును అధిష్ఠానాది పంచ హేతువుల సమాహారమువలననే జరుగును. ఇందులో ఏ ఒక్కటి లేకున్నను కర్మ జరుగదు. అందువలన కర్తృత్వభావనలేకుండ చేయబడు కర్మ వాస్తవముగా కర్మ కాదు. ఈ విషయము (18/17) శ్లోకమున చెప్పబడినది.

*సంబంధము - ఈవిధముగా సాంఖ్యయోగ సిద్ధాంతమును బట్టి సమస్త కర్మలసిద్ధికి అధిష్ఠానాది పంచహేతువులే మూలములని నిరూపించి ఆత్మకు కర్మలతో వాస్తవముగా ఎట్టి సంబంధము లేదనియు, ఆత్మ సర్వథా శుద్ధము, నిర్వికారము, అకర్త అనియు వివరించుటకై మొదట భగవంతుడు ఆత్మను కర్తగా భావించువారిని ఆక్షేపించుచున్నాడు-*

**తత్రైవం సతి కర్తారమ్ ఆత్మానం కేవలం తు యః ।**
**పశ్యత్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః ॥ 16 ॥**

| | | |
|---|---|---|
| తు | = | కాని |
| ఏవమ్, సతి | = | ఇట్టిదైనప్పటికిని |
| యః | = | ఏపురుషుడు |
| అకృతబుద్ధిత్వాత్ | = | విపరీతబుద్ధి కారణమున |
| తత్ర | = | ఆకర్మవిషయముల యందు |
| కేవలమ్ | = | కేవలుడు (శుద్ధ స్వరూపుడు ఐన) |
| ఆత్మానమ్ | = | ఆత్మను |
| కర్తారమ్ | = | సమస్త కర్మలకు కర్తగా |
| పశ్యతి | = | చూచునో (తలంచునో) |
| సః, దుర్మతిః | = | అట్టి మలిన బుద్ధి గల అజ్ఞాని |
| న, పశ్యతి | = | యథార్థమును గ్రహింపజాలడు. |

అట్లైనప్పటికిని (సర్వ కర్మలకును ఐదు హేతువులే మూలమైనప్పటికిని) విపరీత బుద్ధికారణమున ఏ మనుష్యుడు కేవలుడు(నిరంజనుడు), శుద్ధస్వరూపుడైన ఆత్మను సమస్తకర్మలకు కర్తగా భావించునో, అట్టి మలినబుద్ధిగల అజ్ఞాని యథార్థమును గ్రహింపలేడు. (16)

ప్రశ్న - 'ఏవమ్'తో పాటు 'సతి' అను పదము యొక్క అర్థమేమి?

సమా - సమస్త కర్మలకును అధిష్ఠానాది ఐదు హేతువులే మూలము. ఆత్మకు ఈ కర్మలతో నిజముగా ఎట్టి సంబంధమూ లేదు. కనుక ఆత్మను కర్తగా భావించుటకు ఏవిధముగను వీలులేదు. ఐనను మూర్ఖత్వము వలన మానవుడు సమస్త కర్మలకును తానే అనగా ఆత్మయే కర్తగా అనుకొనును. ఇది విచిత్ర విషయము - అని తెలుపుటకే 'ఏవమ్' 'సతి' అను పదములు ప్రయుక్తములైనవి.

ప్రశ్న - 'అకృతబుద్ధిత్వాత్' అనగానేమి?

సమా - సత్సాంగత్యము, ఉత్తమ శాస్త్రముల అధ్యయనము, వివేకవిచార శమదమాది - ఆధ్యాత్మిక సాధనముల ద్వారా పరిశుద్ధము కాని బుద్ధి గల ప్రాకృతుడైన అజ్ఞాని 'అకృతబుద్ధి' అనబడును. వాస్తవముగా ఆత్మకు కర్మలతో ఎట్టి సంబంధము లేకున్నను వివేక శూన్యమైన బుద్ధి కారణమున అజ్ఞానవశమున మనుజుడు ఆత్మను కర్తగా భావించును. ఈ విషయమును స్పష్టపఱచుటకే 'అకృత బుద్ధిత్వాత్' అను పదము ప్రయోగించుట జరిగినది.

ప్రశ్న - 'ఆత్మానమ్' అను పదమునకు 'కేవలమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 'కేవలమ్' అను విశేషణమును ప్రయోగించుట ద్వారా ఆత్మయొక్క యథార్థ స్వరూపము తెల్పబడినది. ఆత్మయనునది 'కేవలము'. అనగా సర్వథా శుద్ధము, నిర్వికారము, నంగరహితము. ఈ విషయమున శ్రుతి 'అసంగోహ్యయం పురుషః' (బృహదారణ్యక-4/3/15-16) అని చెప్పుచున్నది. అనగా ఈ యాత్మ వాస్తవముగా సర్వథా సంగరహితము. కనుక సంగరహితమైన ఆత్మకు కర్మలతో సంబంధమును జోడించి, దానిని కర్మలకు కర్తగా భావించుట మిక్కిలి విపరీతము.

ప్రశ్న - "దుర్మతిః" అను విశేషణముతో కూడిన 'సః' అను పదము ఎవరిని సూచించును. 'అతడు యథార్థమును గ్రహింపడు' అని యనుటలోని యభిప్రాయమేమి?

సమా - ఆత్మను కర్తగా భావించువాని బుద్ధి దోషయుక్తమైనది. ఆత్మ యొక్క యథార్థ స్వరూపమును తెలిసికొను శక్తి దానికి లేదు. కావున అట్టి వ్యక్తిని 'సః దుర్మతిః' అని వర్ణించుట జరిగినది. 13వ అధ్యాయము నందలి 29వ శ్లోకమున చెప్పిన రీతిగా కర్మలన్నియును ప్రకృతి లీలలనియు, ఆత్మసర్వథా అకర్తయనియు, భావించువాడే యథార్థమును గ్రహించిన వాడగును. దానికి విరుద్ధముగా ఆత్మను కర్తగా భావించువాడు అజ్ఞానాహంకారమోహితుడు. (3/27) కనుక అతని భావన సరియైనది కాదు. దోషపూరితమైనది.

ప్రశ్న - 14వ శ్లోకమునందు కర్మలకు ఐదు హేతువులు చెప్పబడినవి. వాటిలో అధిష్ఠానాది నాలుగు హేతువులును ప్రకృతి జనితములే. కాని 'కర్త' అను ఐదవ హేతువు మాత్రము ప్రకృతిస్థుడైన పురుషుడని భావించుట జరిగినది. ఇక్కడ 'ఆత్మ' కర్తగాదనియు, సంగరహితుడనియు తెలుపబడుచున్నది. దీని యాంతర్యమేమి?

సమా - వాస్తవముగా 'ఆత్మ' నిత్యము, శుద్ధము, బుద్ధము, నిర్వికారము, సర్వథా సంగరహితము. ప్రకృతితో, ప్రకృతి జనితములైన పదార్థములతో లేక కర్మలతో ఆ ఆత్మకు ఎట్టి సంబంధమూ లేదు. కాని అనాది సిద్ధమైన అవిద్య కారణమున ఈ యాత్మకే ప్రకృతితో సంబంధము ఉన్నట్లు కనిపించుచుండును. కనుక ప్రకృతిద్వారా జరుగు క్రియలయందు మిథ్యాభిమానమువహించి, ఆ కర్మలన్నింటికిని తానే కర్తయని భావించును. ఈ విధముగా భావించు పురుషుని ప్రకృతిస్థ పురుషుడని యందురు. అతడు ప్రకృతిద్వారా జరుగు కర్మలకు కర్తయగును. అపుడా కర్మలు ఫలములను ఇచ్చునవి యగును. కావున ప్రకృతిస్థుడైన ఆ పురుషుడు ఉత్తమ - అధమ జన్మలనెత్తి ఆ కర్మల ఫలములను అనుభవింపవలసి వచ్చును. (13/21) కనుక 14వ శ్లోకమునందు కర్మల సిద్ధికై చెప్పబడిన ఐదు హేతువులలో ఒకటి 'కర్త' యని భావింపబడినది. అతడు ప్రకృతి స్థితుడైన పురుషుడు. ఇచట 'ఆత్మ' కేవలుడుగా అనగా సంగరహితుడుగా, శుద్ధ స్వరూపుడుగా వర్ణించుట జరిగినది. కనుక అతనిని 'అకర్త'గా తెలిపి, అతని యథార్థ స్వరూప లక్షణము వివరింపబడినది. ఆత్మయొక్క యథార్థ స్వరూపమును తెలిసికొన్న వాని కర్మలయందు కర్తృత్వము లేకుండుట వలన, 'కర్త'లేను హేతువు ఉండదు. కావున అతని ద్వారా జరుగు కర్మలు కర్మలనబడవు.

సంబంధము - 'ఆత్మ' సర్వథా శుద్ధము, నిర్వికారము, అకర్త - అను విషయమును వివరించుటకు ఆత్మను కర్తగా భావించువారిని ఆక్షేపించుచు, ఆత్మ యొక్క యథార్థ స్వరూపమును తెలిసికొని దానిని 'అకర్త'గా భావించు వారిని ప్రస్తుతించుచున్నాడు-

**యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే ॥ 17 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యస్య | = ఏ పురుషునకు (అంతఃకరణమునందు) | న, లిప్యతే | = (ప్రాపంచిక పదార్థముల యందును, కర్మల యందును) అంటుకొనదో | హత్వా, అపి | = హతమార్చినను |
| అహంకృతః | = "నేనే కర్తను"-అను | | | న, హంతి | = (యథార్థముగా) చంపినవాడు కాడు |
| భావః | = భావము | | | | |
| న | = ఉండదో | సః | = అట్టి పురుషుడు | న, నిబధ్యతే | = (ఎట్టి పాపముల చేతను) బంధింపబడడు |
| యస్య | = ఏపురుషుని యొక్క | ఇమాన్, లోకాన్ | = ఈలోకములను అన్నింటిని | | |
| బుద్ధిః | = బుద్ధి | | | | |

**అంతఃకరణమునందు కర్తృత్వభావము లేనివానిబుద్ధి ప్రాపంచికపదార్థములయందును, కర్మలయందును అంటుకొనదు. అట్టి పురుషుడు ఈ లోకములను అన్నింటిని హతమార్చినను వాస్తవముగా చంపినవాడు కాడు. అతనిని ఎట్టి పాపములును అంటవు. (17)**

ప్రశ్న - 'యస్య' అనగానేమి? 'నేను కర్తను' అను భావము లేకుండుట యనగానేమి?

సమా - 'యస్య' అను పదము సమస్త కర్మలను ప్రకృతి లీలలుగా భావించు సాంఖ్యయోగిని సూచించును. అట్టివానికి దేహాభిమానము ఉండదు. కనుక కర్తృత్వ భావము కూడ ఉండదు. అనగా శరీరేంద్రియ మనస్సుల ద్వారా జరుగు సమస్త క్రియలందును "ఈ ప్రత్యేకమైన కర్మను నేను చేసితిని. ఇది నా కర్తవ్యము" అను భావము లేశమాత్రము గూడ లేకుండుటయే - 'నేను కర్తను' అను భావము లేకుండుట.

ప్రశ్న - బుద్ధి (ప్రాపంచిక విషయములందు) తగుల్కొనకుండుట యనగానేమి?

సమా - కర్మలయందును, వాటి ఫల స్వరూపములైన స్త్రీ పుత్రాదులు, సంపదలు, గృహములు, భూములు, కీర్తిప్రతిష్ఠలు, స్వర్గసుఖములు మొదలగు ఇహపరలోక సమస్త పదార్థములయందును మమతాసక్తులు, ఇచ్ఛలు లేకుండుట, ఏ కర్మతోడను, దానిఫలము తోడను తనకు ఏవిధమైన సంబంధము ఉన్నట్లు భావింపకుండుట, వాటిని అన్నింటిని స్వప్నములయందలి కర్మలు, భోగములవలె క్షణికములు నశ్వరములు కల్పితములు అని భావించుట వలన అంతఃకరణము నందు వాటి సంస్కార ప్రభావములు లేకుండుట - అనునవియే బుద్ధి ప్రాపంచిక విషయములందు తగుల్కొనకుండుట యగును.

ప్రశ్న - 'ఆ పురుషుడు (కర్మలయందు కర్తృత్వ భావమును కల్గియుండనివాడు) సమస్త లోకములను హతమార్చినను అతడు ఎవ్వరినీ చంపినవాడు కాడు. అతనికి ఎట్టి పాపములును అంటవు' అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఆత్మస్వరూపమును చక్కగా అవగాహన చేసికొనుట వలన అతని (ఆ సాంఖ్యయోగియొక్క) అజ్ఞాన జనితమైన అహంభావము సర్వథా అంతరించును. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరము మున్నగువానియందు అహంకార మమకారములు లేకుండుటవలన అతని ద్వారా జరుగు కర్మలతోడను, వాటి ఫలితముల తోడను అతనికి ఏమాత్రము సంబంధము ఉండదు. అట్టి పురుషుని మనస్సు, బుద్ధి, ఇంద్రియముల ద్వారా కర్మలు లోకకల్యాణార్థము ప్రారబ్ధానుసారము జరుగుచుండును. అవియన్నియును శాస్త్రమర్యాదలననుసరించి లోకహితము కొఱకై ఆచరింపబడుచుండును. ఏలనన అహంకార

మమకారములు, ఆసక్తి, స్వార్థబుద్ధి మొదలగునవి లేకుండుట వలన పాపకర్మాచరణమునకు ఏమాత్రము తావే ఉండదు. అగ్ని, వాయువు, జలము మొదలగు వాటివలన ప్రారబ్ధవశమున ఏ ప్రాణికైనను ప్రాణహాని జరిగినను అగ్ని, వాయువు, జలములు ఆ ప్రాణిని సంహరించినట్లు భావింపరాదు. ఆ కర్మలు వాటికి అంటనే అంటవు. అదేవిధముగ పైన పేర్కొనబడిన మహాపురుషుడు లోకహితముకొఱకు స్వధర్మపాలన చేయుసమయమున యజ్ఞదాన తపశ్చర్యాది శుభకర్మలను ఆచరించినను వాటికి అతడు కర్తగాడు. వాటి ఫలితములు అతనికి అంటవు. క్షాత్ర ధర్మమునను సరించి కార్యభారము వహింపవలసి వచ్చినప్పుడు పెక్కు ప్రాణుల సంహారరూప హింసాకృత్యములను ఆచరించినను వాటికి అతడు కర్తగాడు. వాటి ఫలములు అతనిని ఏమాత్రమూ అంటవు. అనగా లోకదృష్టిలో ఆ కర్మలన్నింటికిని అతడే కర్తగా కన్పించుచున్నను వాస్తవముగా అతడు కర్తకానేకాడు. అతనిని కర్మబంధములు తాకనే తాకవు.

భగవంతుడు సమస్త జగదుత్పత్తి స్థితి లయాది కార్యములు చేయుచున్నను యథార్థముగా వాటికి అతడు కర్తకాడు. (4/13) వానికి ఆ కర్మలతో ఎట్టి సంబంధమూ ఉండదు. (4/14:9/9) అదేవిధముగ సాంఖ్యయోగికి కూడ అతని మనస్సు, బుద్ధి, ఇంద్రియముల ద్వారా జరుగు సమస్త కర్మలతో ఎట్టి సంబంధముకూడ ఉండదు. అతని అంతః కరణము మిక్కిలి పరిశుద్ధమైనది. అందు అహంకార మమకారములు, ఆసక్తి, స్వార్థబుద్ధి లేకుండును. అందువలన రాగద్వేష - అజ్ఞాన మూలకములైన దొంగతనము, వ్యభిచారము, మిథ్యాభాషణము, హింస, కపటము, దంభము మొదలగు పాపకర్మలు అతని మనస్సు, బుద్ధి, ఇంద్రియముల ద్వారా జరుగనే జరుగవు. అతని కర్మాచరణము లన్నియును వర్ణాశ్రమ ధర్మములను, పరిస్థితులను అనుసరించి, శాస్త్రానుకూలముగనే జరుగుచుండును. వీనియందు ఏవిధముగను అతని ప్రయత్న ప్రమేయముండదు. అతని స్వభావమే ఆ స్థితికి చేరును.

*సంబంధము - ఈ విధముగ సన్న్యాస (జ్ఞానయోగ) తత్త్వమును వివరించుటకై ఆత్మ యొక్క అకర్తృత్వమును ప్రతిపాదించి, దానిని అనుసరించి ఇప్పుడు కర్మతత్త్వమును సాకల్యముగా వివరించుటకై కర్మప్రేరణ, కర్మ సంగ్రహములను గూర్చి తెల్పుచున్నాడు-*

**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ 18 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరిజ్ఞాతా | = జ్ఞాత, (తెలిసికొను వాడును) | కర్మచోదనా | = కర్మప్రేరణములు | ఇతి | = అని |
| | | త్రివిధా | = మూడువిధములు | కర్మసంగ్రహః | = కర్మ సంగ్రహములు |
| జ్ఞానమ్ | = జ్ఞానము | కర్తా | = కర్త | | |
| జ్ఞేయమ్ | = జ్ఞేయము (తెలిసికొన దగిన వస్తువు) అను | కరణమ్ | = కరణము | త్రివిధః | = మూడు విధములు |
| | | కర్మ | = క్రియ | | |

**జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనునవి మూడు విధములైన కర్మప్రేరణములు. కర్త, కరణము, క్రియ అని కర్మసంగ్రహములు మూడువిధములు. (18)**

ప్రశ్న - "పరిజ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము" అను మూడు పదములు వేర్వేరుగా ఏయే తత్త్వములను తెలుపును. వీటిని మూడు విధములైన కర్మప్రేరణలు అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఒక పదార్థము యొక్క లక్షణమును తెలిసికొనువాడు పరిజ్ఞాత. ఒక వస్తువుయొక్క స్వరూపమును తెలిసికొనుటకు ఉపయుక్తమగు మనోవృత్తిని 'జ్ఞానము' అని యందురు. తెలిసికొనదగిన వస్తువు 'జ్ఞేయము' అని యందురు. ఈ మూడింటి కలయిక వలననే మనుష్యునకు కర్మచేయు ప్రవృత్తి గలుగును. అనగా ఈ మూడింటి పరస్పర సమన్వయమే వ్యక్తులను కార్యోన్ముఖులనుగా చేయును. ఏ వస్తువుల ద్వారా ఏవిధముగ

ఎట్టి కార్యమును చేయవచ్చునో అర్థుడైనవాడు (దానిని) తెలిసికొని, మనోవిశ్లేషణ ద్వారా నిశ్చయించుకొనిన పిదపనే అతడు ఆ కర్మయందు ప్రవృత్తుడగును. ఈ కారణము వలననే ఈ మూడింటిని కర్మప్రేరణలుగా పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - 'కర్త, కరణము, కర్మ' అను ఈ మూడు పదములను వేర్వేఱుగా ఏ యే తత్త్వములను తెలుపును? ఈ మూడు విధములైన వాటిని కర్మసంగ్రహములని పేర్కొనుటలోని ఆంతర్యమేమి?

సమా - చూచుట, వినుట, తెలిసికొనుట, స్మరించుట, తినుట, త్రాగుట మొదలగు సమస్త క్రియలను ఆచరించు ప్రకృతిస్థుడైన పురుషునే 'కర్త' అనియందురు. పై క్రియలను అన్నింటిని ఆచరించుటకు ఉపయుక్తములగు మనోబుద్ధీంద్రియాదులను 'కరణములు' అని యందురు. పైన తెలుపబడిన సమస్త క్రియలను 'కర్మలు' అని యందురు. ఈ మూడింటి కలయిక వలననే కర్మాచరణము జరుగును. ఏలనన మనుష్యుడు తనను కర్తగా భావించి, తన మనోబుద్ధీంద్రియముల ద్వారా క్రియలను ఆచరించినప్పుడే అవి కర్మలు అగును. ఈ మూడింటి కలయిక లేకుండ ఎట్టి కర్మయు జరుగదు. 14వ శ్లోకములో కర్మసిద్ధికై పేర్కొనబడిన అధిష్ఠానాది ఐదు హేతువులందును అధిష్ఠానము, దైవము తప్ప మిగిలిన మూడింటిని (కర్త, కరణము, చేష్ట) కర్మ సంగ్రహములని పేర్కొనుట జరిగినది. ఆ ఐదింటిలోను ఈ మూడు హేతువులే కర్మాచరణమున ముఖ్యములైనవి.

*సంబంధము - సాంఖ్య (జ్ఞాన) యోగ సిద్ధాంతమునమనుసరించి, కర్మచోదన, (కర్మప్రేరణ) మఱియు కర్మసంగ్రహ తత్త్వములను నిరూపించి, తత్త్వ జ్ఞానమునందు సహాయపడు సాత్త్విక భావమును గ్రహించుటకును, దానికి విరుద్ధములైన రాజస, తామస భావములను త్యజించుటకును ఉపర్యుక్త కర్మ ప్రేరణ, కర్మ సంగ్రహములయందలి జ్ఞానము, కర్మ, కర్త అను మూడింటి యొక్క సాత్త్విక, రాజస, తామస భేదములను వరుసగా తెలుపుటకు పూనుకొనుచున్నాడు-*

**జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ 19 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుణసంఖ్యానే | = సాంఖ్యశాస్త్రమునందు | కర్తా | = కర్త | తాని, అపి | = వానిని గూర్చియు |
| జ్ఞానమ్ | = జ్ఞానము | గుణభేదతః | = గుణభేదములను బట్టి | యథావత్ | = సమగ్రముగా (వివరించెదను) |
| చ | = మఱియు | త్రిధా, ఏవ | = మూడు విధములుగానే | శృణు | = వినుము. |
| కర్మ | = కర్మ | ప్రోచ్యతే | = చెప్పబడినవి | | |
| చ | = అట్లే | | | | |

**గుణములసంఖ్యను వివరించు సాంఖ్యశాస్త్రమునందు జ్ఞానము , కర్మ, కర్త అనునవి గుణభేదములతో మూడేసి విధములుగా పేర్కొనబడినవి. వానిని గూర్చి విశదపరచెదను, వినుము. (19)**

ప్రశ్న - 'గుణసంఖ్యానే' అను పదమునకు అర్థమేమి? అందు గుణముల భేదముచే మూడేసి విధములుగా పేర్కొనబడిన జ్ఞాన, కర్మ, కర్తలను గూర్చి వినుమని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - సత్త్వరజస్తమోగుణముల సంబంధముచే సమస్త పదార్థములయొక్క వేర్వేఱు భేదములను గణించు శాస్త్రమును తెలుపునదియే గుణసంఖ్యానే అను పదము. గుణముల భేదములచే జ్ఞాన, కర్మ, కర్తలలో ఒక్కొక్కటి మూడేసి విధములని ఆ శాస్త్రమునందు వివరింపబడినది. దానిని తాను వివరింతునని భగవానుడు అనుటనుబట్టి ఆ శాస్త్రమును అతడు ప్రామాణికముగా భావించెనని గ్రహింపదగును. శ్రద్ధగా వినుమని తెల్పుచు భగవంతుడు అర్జునుని సన్నద్ధుని గావించెను.

జ్ఞాతయు కర్తయు ఒక్కడే. వేర్వేఱు గాదని గ్రహింప వలెను. కనుక జ్ఞాత యొక్క భేదములను వేర్వేఱుగా చూపలేదు. కరణము యొక్క భేదములను బుద్ధి ధృతి అను పేర్లతోడను, జ్ఞేయము యొక్క భేదములను సుఖము అను పేరుతోను మునుముందు వివరింపబోవుచున్నాడు. కనుక పూర్వోక్తములైన ఆఱు తత్త్వములయందును మూడింటి భేదములను గూర్చియే ఇచట సూచించుట జరిగినది.

సంబంధము - పూర్వశ్లోకమున జ్ఞాన కర్మ కర్తల యొక్క సాత్త్విక రాజస తామస భేదములను క్రమముగ తెలుపుదునని భగవానుడు ప్రస్తావించి యుండెను. దానిని అనుసరించి, మొట్టమొదట సాత్త్విక జ్ఞాన లక్షణములను తెల్పుచున్నాడు-

**సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20 ॥**

- యేన = (మనుష్యుడు) ఏ జ్ఞానముతో
- విభక్తేషు = వేర్వేఱుగా ఉన్న
- సర్వభూతేషు = సమస్త ప్రాణుల యందును
- ఏకమ్ = ఒక్కడేయైయున్న
- అవ్యయమ్ = శాశ్వతుడైన
- అవిభక్తమ్ = అఖండముగా సమభావ స్థితుడైయున్న
- భావమ్ = పరమాత్మభావమును
- ఈక్షతే = చూచునో
- తత్, జ్ఞానమ్ = అట్టి జ్ఞానమును
- సాత్త్వికమ్ = 'సాత్త్వికజ్ఞానము'గా
- విద్ధి = ఎఱుంగుము.

వేర్వేరుగా కన్పించు సమస్తప్రాణులయందును శాశ్వతుడైన పరమాత్మయే విభాగరహితుడుగా సమభావముతో స్థితుడై యున్నట్లు జ్ఞానియైన వాడు చూచును. అట్టి పురుషునిజ్ఞానమును సాత్త్విక జ్ఞానముగా తెలిసికొనుము. **(20)**

ప్రశ్న - 'యేన' అను పదమునకు ఇచ్చట అర్థమేమి? దాని ద్వారా వేర్వేఱు ప్రాణులయందు శాశ్వతుడైన పరమాత్ముని విభాగ రహితునిగా చూచుట యనగానేమి?

సమా - సాంఖ్యయోగ సాధన ద్వారా కలుగు అనుభవము (జ్ఞానము) ను సూచించునదియే 'యేన' అను పదము. 6వ అధ్యాయమునందలి 29వ శ్లోకమునందును, 13వ అధ్యాయమునందలి 27వ శ్లోకము నందును దీని వివరణ స్పష్టముగా గలదు. ఆకాశ తత్త్వమును తెలిసిన మానవుడు ఘటము, గృహము, గుహ, స్వర్గము, పాతాళము, సంపూర్ణబ్రహ్మాండమునందలి సమస్త వస్తుజాలము మున్నగు వానియందు ఒకే ఆకాశ తత్త్వమును (సర్వవ్యాపకత్వమును) చూచును. అట్లే లోకదృష్టిలో వేర్వేఱుగా గోచరించు సమస్త చరాచర ప్రాణులయందును మానవుడు తన అనుభవము (జ్ఞానము) ద్వారా అద్వితీయుడు, శాశ్వతుడు, నిర్వికారుడు, జ్ఞానస్వరూపుడును ఐన పరమాత్మనే విభాగరహితునిగా సమభావముతో సర్వవ్యాపినిగా చూచును. అనగా లోక వ్యవహార దృష్టిలో వేర్వేఱుగా గోచరమగు సమస్త ప్రాణులును, తానును శాశ్వతుడైన పరమాత్మకంటె వేఱుగాదని తెలిసికొనును. వేర్వేఱుగా కన్పించు ప్రాణులయందు శాశ్వతుడైన ఒకే పరమాత్మను విభాగరహితునిగా చూచుట యనగా ఇదియే.

ప్రశ్న - 'ఆ జ్ఞానమును సాత్త్విక జ్ఞానము' అని తెలిసికొనుము - అనుటలోని విశేషమేమి?

సమా - వాస్తవముగా ఈ సాత్త్విక జ్ఞానమే నిజమైన జ్ఞానము. శ్రేయస్సును కోరుకొను మనుజుడు ఇట్టి జ్ఞానమును పొందుటకే ప్రయత్నింపవలెను. ఇదిగాకుండ ప్రాపంచిక విషయ జ్ఞానమంతయును నామమాత్రజ్ఞానమే. యథార్థ జ్ఞానము కానేకాదు.

సంబంధము - ఇప్పుడు రాజసజ్ఞాన లక్షణములను తెల్పుచున్నాడు-

**పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21 ॥**

- తు = కాని
- యత్, జ్ఞానమ్ = (మనుష్యుడు) ఏ జ్ఞానము ద్వారా
- సర్వేషు, భూతేషు = సమస్త ప్రాణుల యందును
- పృథగ్విధాన్ = వేర్వేఱు విధములుగా నున్న
- నానాభావాన్ = వివిధభావములను
- పృథక్త్వేన = దేనికదే 'వేర్వేఱు' అని
- వేత్తి = ఎఱుంగు (తలంచు)నో
- తత్, జ్ఞానమ్ = ఆజ్ఞానము
- రాజసమ్ = 'రాజస జ్ఞానము'గా
- విద్ధి = ఎఱుంగుము.

సమస్త ప్రాణులయందును నానావిధములైన వివిధభావములను వేర్వేరుగా భావించు వారి జ్ఞానమును రాజసము అని యెరుంగుము. (21)

ప్రశ్న - సమస్త భూతములయందును భిన్నభిన్న విధములుగా వివిధ భావములను వేర్వేఱుగా తెలిసికొనుట యనగానేమి?

సమా - కీటకములు, శలభములు, పశుపక్ష్యాదులు, మనుష్యులు, రాక్షసులు, దేవతలు మొదలగు సమస్త ప్రాణులను ఆయా శరీరాకృతుల స్వభావముల భేదములను బట్టి ఆత్మలు వేర్వేఱు అని భావించుటను, అనగా ప్రతి శరీరమునందు ఆత్మ వేర్వేఱుగా ఉండుననియు అవి అనేకములనియు, పరస్పర విలక్షణములనియు భావించుటను సమస్త భూతములయందు భిన్నభిన్న విధములుగా నానా భావములను వేర్వేఱుగా చూచుట యగును.

ప్రశ్న - 'అట్టి జ్ఞానమును 'రాజసము' అని యెఱుంగుము' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - పైన తెలుపబడిన జ్ఞానమును 'రాజసజ్ఞానము' అని యందురు. అనగా అది నామమాత్రజ్ఞానమే. యథార్థ జ్ఞానము కాదు. ఆకాశతత్త్వమును చక్కగా ఎఱుంగనివాడు వేర్వేఱు ఘట పటాదులయందు ఆకాశము వేర్వేఱుగా పరిచ్ఛిన్నమై యున్నట్లు భావించును. దానియందలి సుగంధ దుర్గంధాదులతో దానికి సంబంధమున్నట్లు భావించి, ఆ ఆకాశము ఒకదానికంటె మఱియొకటి విలక్షణమైనదిగా (అనేకముగా) తలంచును. ఇట్లు తలంచుట అతడు భ్రమ పడుటయే. అదేవిధముగ ఆత్మతత్త్వమును ఎఱుంగని కారణమున సమస్త ప్రాణుల శరీరములయందు వేర్వేఱుగా అనేకాత్మలు కలవని భావించుటయు భ్రమపడుటయే.

సంబంధము - ఇప్పుడు భగవానుడు తామస జ్ఞాన లక్షణమును తెల్పుచున్నాడు-

**యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్ ।**
**అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | కృత్స్నవత్ | = సర్వస్వమువలె | అతత్త్వార్థవత్ | = తాత్త్వికముగా అర్థరహితమైనదియు |
| యత్ | = (మనుష్యుడు) ఏ జ్ఞానముద్వారా | సక్తమ్ | = ఆసక్తిని కల్గించునట్టిదియు | అల్పమ్ | = తుచ్ఛమైనదియు అగునో |
| ఏకస్మిన్, కార్యే | = ప్రకృతి కార్యరూపమైన శరీరమునందు మాత్రమే | చ | = మఱియు | తత్ | = అట్టి జ్ఞానము |
| | | అహైతుకమ్ | = హేతుబద్ధము కానిదియు | తామసమ్ | = 'తామసము, అని |
| | | | | ఉదాహృతమ్ | = పేర్కొనబడినది |

ప్రకృతికార్యమైన శరీరమునే(శరీరమునకు సంబంధించిన భౌతికవస్తువులనే) సమస్తముగా భావించి, దాని యందే ఆసక్తిని కల్గించునట్టిదియు, తాత్త్వికముగా అర్థరహితమైనదియు, హేతుబద్ధము కానిదియు, తుచ్ఛమైనదియు అగు విపరీత జ్ఞానమును తామసము అనియందురు. (22)

ప్రశ్న - 'తు' అనుదాని యర్థమేమి?

సమా - సాత్త్విక జ్ఞానముకంటెను, రాజసజ్ఞానముకంటెను ఈ జ్ఞానము మిక్కిలి నికృష్టమైనదని తెల్పుటకే 'తు' అను అవ్యయము ప్రయోగింపబడినది.

ప్రశ్న - "ఒక కార్యరూపమైన శరీరమునే సంపూర్ణముగా భావించి, దానియందు ఆసక్తమగు జ్ఞానము" అనగానేమి?

సమా - ఇచట తామస జ్ఞానము యొక్క ప్రధాన లక్షణము తెలుపబడినది. ఈ విపరీత జ్ఞానము వలన మనుజుడు ప్రకృతి కార్యరూపమైన శరీరమునే తన స్వరూపముగా భావించి, క్షణభంగురమైన, నశ్వరమైన శరీరమునందే సంపూర్ణముగా ఆసక్తుడై యుండును. శరీర సంబంధమైన సుఖ దుఃఖములను తన సుఖ దుఃఖములుగా, శరీర నాశనమునే తన నాశనముగా అతడు భావించును. ఆత్మను శరీరముకంటెను భిన్నమైనదానినిగా, సర్వవ్యాపిగా

భావింపడు. ఇట్టి జ్ఞానము యథార్థముగా జ్ఞానమేగాదు. అందువలననే ఈ శ్లోకమున భగవానుడు జ్ఞానము అను పదమును ప్రయోగింపలేదు. ఏలనన ఈ విపరీత జ్ఞానము వాస్తవముగా అజ్ఞానమే.

ప్రశ్న - 'ఈ జ్ఞానము అహైతుకము అనగా హేతుబద్ధము కాదు' అనగానేమి?

సమా - వివేకము గలవాడు ఇట్లు ఆలోచింపడు. ఏమాత్రము వివేకము ఉన్నవాడైనను ఏమాత్రము ఆలోచించినను జడమైన శరీరమునకు చేతనమైన ఆత్మకును భేదమును తెలిసికొనగలడు. ఆలోచనాశక్తి, వివేకము ఉన్నచోట ఇట్టి విపరీత జ్ఞానము ఉండదు.

ప్రశ్న - ఈ జ్ఞానము తాత్త్వికార్థ రహితమైనదనియు, అల్పమైనది (తుచ్ఛమైనది) అనియు భావించుటకు గల కారణమేమి?

సమా - ఇట్టి జ్ఞానము వలన వివరింపబడిన విషయము యథార్థము కాదు. అనగా వస్తువు యొక్క నిజ స్వరూపము దీనివలన బోధపడదు. అందువలన ఇది విపరీతమైనది. తుచ్ఛమైనది. కావున త్యాజ్యము.

ప్రశ్న - ఇట్టి జ్ఞానము 'తామసము' అని పేర్కొనబడినది- అని అనుటలోని అంతర్యమేమి?

సమా - తమోగుణము గల మనుజులే ఇట్లు ఆలోచించెదరు. వారి భావనలు కార్యములు అజ్ఞానజనితములు. కావున ఇట్టి లక్షణములు గలవారి జ్ఞానము 'విపరీతము', 'తామసము' అని పేర్కొనబడినది.

సంబంధము - ఇప్పుడు భగవానుడు సాత్త్విక కర్మలక్షణములను తెల్పుచున్నాడు-

**నియతం సంగరహితమ్ అరాగద్వేషతః కృతమ్ ।**
**అఫలప్రేప్సునా కర్మ యత్తత్ సాత్త్వికముచ్యతే ॥ 23 ॥**

| పదము | అర్థము |
|---|---|
| యత్ | = ఏ |
| కర్మ | = కర్మ |
| నియతమ్ | = శాస్త్రవిహితమైనదియు |
| సంగరహితమ్ | = కర్తృత్వాభిమానము లేనిదియు అగునో |
| అఫలప్రేప్సునా | = ఫలాపేక్షలేని పురుషుని చేత |
| అరాగద్వేషతః | = రాగద్వేష రహితముగా |
| కృతమ్ | = చేయబడినది యగునో |
| తత్ | = అది (ఆ కర్మ) |
| సాత్త్వికమ్ | = 'సాత్త్విక కర్మ' అని |
| ఉచ్యతే | = చెప్పబడును |

**కర్తృత్వాభిమానము గాని, ఫలాపేక్షగాని లేని పురుషునిచేత రాగద్వేషరహితముగా చేయబడు శాస్త్ర విహితమైన కర్మను సాత్త్వికకర్మయని యందురు. (23)**

ప్రశ్న - 'నియతమ్', 'కర్మ' అను పదద్వయము ఏ కర్మలను గూర్చి తెల్పును. 'నియతమ్' అను విశేషణ ప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - వర్ణాశ్రమ ధర్మములు, ప్రకృతి, పరిస్థితులను అనుసరించి, మనుష్యులకు అవశ్యకర్తవ్యములుగా తెల్పబడినవియును, శాస్త్ర విహిత యజ్ఞదాన తపశ్చర్యలును, జీవికకును, శరీర నిర్వహణమునకును ఆవశ్యకములగు శ్రేష్ఠ కర్మలన్నియును 'నియతమ్, కర్మ' అను పదద్వయముచే తెలుపబడుచున్నవి. కేవలము నిత్య నైమిత్తికాది కర్తవ్య కర్మలే సాత్త్వికములనియు, కామ్య కర్మలు, నిషిద్ధకర్మలు సాత్త్వికములు కానేరవనియు తెలుపుటకే 'నియతమ్' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'సంగరహితమ్' అను విశేషణము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - ఇచట 'సంగమ్' అనగా ఆసక్తి కాదు. ఏలనన 'అరాగద్వేషతః' అను సమాసప్రయోగము ద్వారా ఆసక్తి రాహిత్యము వేఱుగా తెలుపబడినది. మానవుడు కర్తృత్వాభిమానముతో తాను చేయు కర్మలతో తనకు సంబంధమున్నట్లు భావించుటను 'సంగమ్' అని యందురు. కర్మాచరణమునందు అట్టి సంగము లేకుండుటను 'సంగరహితమ్' అని యందురు. కర్తృత్వాభిమానము, దేహాభిమానము లేకుండ చేయు కర్మను 'సంగరహితమ్' 'కర్మ' అని యందురు. పైన తెలుపబడిన శాస్త్రవిహిత కర్మలు గూడ సంగరహితములైనప్పుడే అవి సాత్త్వికములగును. కానిచో

సాత్త్వికములు కాజాలవు.

ప్రశ్న - 'అఫలప్రేప్సునా' అను పదమునకు అర్థమేమి? అట్టి పురుషుడు రాగద్వేషరహితుడై ఆచరించు కర్మలను ఎట్టి కర్మలందురు?

సమా - కర్మల ఫలరూపములైన ఇహపరలోక భోగములందు మమతాసక్తులు లేని కారణమున వాటిని గూర్చి యేమాత్రము ఆకాంక్షలేనివాడును, తాను చేయు ఎట్టి కర్మవలనను స్వలాభాపేక్షలేనివాడును, తన కొఱకై ఏ వస్తువును ఆసింపనివాడును అగు స్వార్థరహితుడైన వానిని గూర్చి తెల్పునదియే 'అఫలప్రేప్సునా' అను పదము. అట్టి వాడు రాగద్వేషరహితుడై కేవలము లోకసంగ్రహము కొఱకే కర్మలను ఆచరించును. అట్టి కర్మలను 'రాగద్వేషరహితకర్మలు' అనియందురు.

ప్రశ్న - అట్టి కర్మలను 'సాత్త్వికకర్మలు' అని యనుటలోని విశేషమేమి?

సమా - పై లక్షణములన్నియును సంపూర్ణముగా గల కర్మలను 'పూర్ణసాత్త్వికకర్మలు' అని యందురు. పై లక్షణములలో ఏమాత్రము లోపించినను అట్టి కర్మలలో ఆమేరకు సాత్త్వికతయు లోపించినదని భావింపవలెను. అంతేగాక సత్త్వగుణము వలనను, సాత్త్విక కర్మాచరణముల వలనను జ్ఞానము కలుగునని గ్రహింపవలయును. కావున పరమాత్మతత్త్వమును తెలిసికొనగోరువారు ఉపర్యుక్త సాత్త్విక కర్మను విధిగా ఆచరింపవలెను. రాజస తామస కర్మలను ఆచరించి, కర్మబంధములలో చిక్కుకొనరాదు.

ప్రశ్న - ఈ శ్లోకములో చెప్పబడిన సాత్త్విక కర్మకును, 9వ శ్లోకమున చెప్పబడిన సాత్త్విక త్యాగమునకును గల భేదమేమి?

సమా - ఈ శ్లోకమునందు సాంఖ్య (జ్ఞాన) నిష్ఠాదృష్టితో సాత్త్విక కర్మలక్షణములు తెల్పబడినవి. 'సంగరహితమ్' అను పదప్రయోగము ద్వారా కర్తృత్వాభిమాన రాహిత్యమును, 'అరాగద్వేషతః' అను ప్రయోగము ద్వారా రాగద్వేష రాహిత్యమును తెల్పుట జరిగినది. కాని 9వ శ్లోకమున కర్మయోగ దృష్టితో చేయబడు కర్మలయందు ఆసక్తి, ఫలేచ్ఛల త్యాగమునే 'సాత్త్విక త్యాగము' అని చెప్పుట జరిగినది. అచట కర్తృత్వ రాహిత్య విషయమును ప్రస్తావింపక, కర్తవ్య బుద్ధితో కర్మాచరణ విషయము మాత్రమే తెల్పబడినది. ఇదియే ఈ రెండింటి మధ్యగల భేదము. ఈ రెండింటి వలనను లభించు ఫలము తత్త్వజ్ఞానము ద్వారా పరమాత్మ ప్రాప్తియే అగుటవలన వాస్తవముగా ఈ రెండింటి మధ్య ఎట్టి భేదమూ లేదు. కేవలము అనుష్ఠాన విధానమునందు మాత్రమే భేదము గలదు.

సంబంధము - ఇప్పుడు భగవానుడు రాజసకర్మ లక్షణములను తెలుపుచున్నాడు-

**యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।**
**క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ ॥ 24 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | పునః | = అట్లే | క్రియతే | = చేయబడునో |
| యత్, కర్మ | = ఏకర్మ అయితే | కామేప్సునా | = భోగలాలసుడైన పురుషుని చేతను | తత్ | = అది (ఆకర్మ) |
| బహులాయాసమ్ | = మిక్కిలిశ్రమతో గూడినదియో | వా | = లేక | రాజసమ్ | = 'రాజసకర్మ'గా |
| | | సాహంకారేణ | = అహంకారిచేతను | ఉదాహృతమ్ | = పేర్కొనబడును. |

**భోగలాలసుడైన పురుషునిచేతను, అహంకారిచేతను చేయబడు మిక్కిలి శ్రమతో కూడిన కర్మను రాజసకర్మ అని యందురు. (24)**

ప్రశ్న - 'బహులాయాసమ్' అను విశేషణముతో గూడిన కర్మ ఏ కర్మను సూచించును? ఈ విశేషణమును ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - నానావిధములైన అనేక క్రియలతో గూడిన కర్మలను, దేహాభిమానము గల మనుష్యుడు మిక్కిలి శ్రమతో గూడినదనియు, దుఃఖకరమైనదనియు భావించుచు చేయునట్టి కామ్య కర్మలను, వ్యావహారిక కర్మలను 'బహులాయాసమ్' అను విశేషణముతో గూడిన 'కర్మ' అను

పదము సూచించును. సాత్త్వికమైన కర్మకును, రాజస కర్మకును గల వైవిధ్యమును తెలుపుటకే 'బహులాయాసమ్' అను విశేషణము ప్రయోగింపబడినది. సాత్త్విక కర్మలను ఆచరించువానికి కర్తృత్వ భావము గాని, దేహాభిమానము గాని ఉండదు. కనుక ప్రతికర్మాచరణము నందును ఏవిధమైన శ్రమయున్నట్లుగాని, క్లేశమున్నటుల గాని భావింపడు. కావున అతని కర్మలు ఆయాసయుక్తములు గావు. కాని రాజసకర్మలను చేయువాడు దేహాభిమాని అగుటవలన శారీరక శ్రమ, క్లేశముల వలన మిక్కిలి దుఃఖభావనను పొందును. ఇందువలన ప్రతి కర్మయూ (కర్మాచరణమూ) అతనికి శ్రమగా తోచును. ఇంకను సాత్త్విక కర్మలను ఆచరించువాడు శాస్త్రదృష్టిలోగాని, లోకదృష్టిలోగాని తనకు కర్తవ్యములైన కర్మలనే చేయుచుండును. అందువలన అతడు కర్మల పరిధిని విస్తరింపడు. కాని రాజసకర్మలను ఆచరించువాడు ఆసక్తి, కోరికలచేత ప్రేరితుడై నిత్యమూ నూతన కర్మలను జేయుచుండును. కనుక అతడు కర్మలను విస్తారముగా చేయుచుండును. ఈ కారణమున గూడ 'బహులాయాసమ్' అను విశేషణమును ప్రయోగించి, మిక్కిలి శ్రమతో గూడిన కర్మలను 'రాజసము'లని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న- **'కామేప్సునా'** అను పదము ఎవరిని సూచించును?

సమా - ఇంద్రియ భోగములయందు మమతాసక్తులుండుట వలన నిరంతరము వివిధములైన భోగేచ్ఛలను కలిగియుండు వాడును, భార్యాపుత్రులు, సంపదలు, గృహాదులు, కీర్తిప్రతిష్ఠలు మొదలగు ఇహపరలోక భోగములకొఱకై కర్మలను ఆచరించు స్వార్థపరాయణుడైన పురుషుని **'కామేప్సునా'** అను పదము సూచించును.

ప్రశ్న - **'వా'** అను అవ్యయమును ప్రయోగించుటలోని విశేషమేమి.

సమా - భోగప్రాప్తికై చేయబడు కర్మలు రాజసములు. భోగేచ్ఛలేనివారుకూడ అహంకార పూర్వకముగ కర్మలను ఆచరించిన వారి కర్మలును రాజసములే. ఈ విషయమును స్పష్టమొనర్చుటకే **'వా'** అను అవ్యయము ప్రయోగింపబడినది. భోగేచ్ఛ, అహంకారము ఈ రెండింటిలో ఏ ఒక్కటి ఉన్నను అట్టి పురుషుడు చేయు కర్మలు **'రాజసములే"**. భోగేచ్ఛయు, అహంకారమూ రెండును గల పురుషుడాచరించు కర్మలను రాజసములని ప్రత్యేకముగా చెప్పనవసరమే లేదు.

ప్రశ్న - **'సాహంకారేణ'** అను పదము ఎట్టివారిని గూర్చి తెలుపును?

సమా - దేహాభిమానము గలిగి ప్రతి కర్మయు అహంకార పూర్వకముగా చేయువాడు, "నేనే ఈ కర్మను చేయువాడను" "నాతో సమానమైనవాడెవ్వడు?" "నేను ఇది చేయగలను" "అది చేయగలను" అని ఈవిధముగా మనస్సున భావించుచు వాక్కుద్వారా ప్రకటించుచు కర్మలను చేయువానిని **"సాహంకారేణ"** అను పదము తెలుపును.

ప్రశ్న - ఇట్టి కర్మలు **"రాజసములు"** అని యనుటలోని విశేషమేమి?

సమా - పైన చెప్పబడిన లక్షణములు గల వ్యక్తులచే చేయబడు కర్మలు **'రాజసములు'**. అట్టి కర్మల ఫలము **'దుఃఖమే'** అని చెప్పబడినది (14/16). రజోగుణము మనుష్యులను కర్మఫలాసక్తితో బంధించును. (14/7). కనుక ముముక్షువులు ఇట్టి కర్మలను ఆచరింపరాదు.

సంబంధము - ఇప్పుడు 'తామస కర్మల' లక్షణములను తెల్పుచున్నాడు-

**అనుబంధం క్షయం హింసామ్ అనవేక్ష్య చ పౌరుషమ్ ।**
**మోహాదారభ్యతే కర్మ యత్తత్ తామసముచ్యతే ॥ 25 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్, కర్మ | = ఏకర్మ | చ | = మఱియు | ఆరభ్యతే | = చేయబడునో |
| అనుబంధమ్ | = పరిణామమును | పౌరుషమ్ | = సామర్థ్యమును | తత్ | = అది (ఆకర్మ) |
| క్షయమ్ | = హానిని | అనవేక్ష్య | = ఆలోచింపక | తామసమ్ | = 'తామసము' అని |
| హింసామ్ | = హింసను | మోహాత్ | = కేవలము అజ్ఞానముతో | ఉచ్యతే | = చెప్పబడును. |

పరిణామము(మంచిచెడ్డలు), హాని, హింస, సామర్థ్యములను చూచుకొనక కేవలము మూర్ఖత్వముచే ఆరంభింపబడు కర్మలను తామసకర్మలు అనియందురు. **(25)**

ప్రశ్న - 'పరిణామము, హాని, హింస, సామర్థ్యములను చూచుకొనుట' అనగానేమి? వాటిని గూర్చి ముందు వెనుకలు ఆలోచింపకయే మోహావేశముతో కర్మలను ఆరంభించుట యనగానేమి?

సమా - ఏదైనను ఒక పనిని (కర్మను) ఆరంభించుటకు ముందుగా ఆ కర్మను చేయుట వలన కలుగు భావి పరిణామము సుఖప్రదమా? లేక కష్టనష్టదాయకమా? అని వివేకముతో లోతుగా సాధక బాధకములను ఆలోచింపవలెను. ఇదియే ఆ కర్మయొక్క అనుబంధమును లేక పరిణామమును గూర్చి ఆలోచించుట యగును. కర్మారంభమునకు ముందుగా దాని కవసరమగు ధనవ్యయమును గూర్చియు, వలయు శక్తియుక్తులను గూర్చియు, దానికి పట్టు సమయమును గూర్చియు, ఆ కర్మాచరణమువలన కలుగు ధర్మహాని మొదలగువానిని గూర్చియు మిక్కిలి ఆలోచింపవలయును. ఇదియే క్షయమును లేక హానిని గూర్చి ఆలోచించుట యగును. ఒక కర్మను ఆచరించునప్పుడు దానివలన మనుష్యులకు లేక ఇతర ప్రాణులకు కలుగు కష్టనష్టములను గూర్చి ముందుగా ఆలోచించుటయే హింసను గూర్చి ఆలోచించుట యగును. ఒక కర్మను ఆచరించుటకు ఆవశ్యకమగు సామర్థ్యమును అంచనా వేసికొని తగిన సామర్థ్యము తమకు కలదా లేదా యని ఆలోచించుటయే పౌరుషమును గూర్చి లేక సామర్థ్యమును గూర్చి ఆలోచించుట యగును. ఈవిధముగా పరిణామము, హాని, హింస, పౌరుషము అను ఈ నాల్గింటిని గూర్చియైనను లేదా ఈ నాల్గింటిలో ఏ ఒక్కదానిని గూర్చియైనను ఆలోచింపకయే, ఏది యేమైనను సరే! అను దుస్సాహసముతో మూర్ఖత్వముతో ఏదేని ఒక కర్మను ఆరంభించుటయే - పరిణామ, హాని, హింసా, పౌరుషములను విచారింపక కేవలము మోహావేశముతో కర్మలను ఆరంభించుట యగును.

ప్రశ్న - ఇట్టి కర్మలను 'తామస కర్మలు' అని యందురు - అనగానేమి?

సమా - ఈ విధముగా ముందు వెనుకలాలోచింపక తమోగుణ ప్రధాన మోహావేశముతో ఆరంభించి చేయబడు కర్మ 'తామసకర్మ' అనబడును. తామస కర్మల ఫలము సూకర శునకాది, వృక్షాది జ్ఞానరహిత జన్మల ప్రాప్తి లేక నరకప్రాప్తి అని చెప్పబడినది. (14/18) కావున శ్రేయస్సును కోరుకొనువారు ఇట్టి కర్మలను ఆచరింపరాదు.

సంబంధము - ఇప్పుడు భగవానుడు సాత్త్విక 'కర్త' యొక్క లక్షణములను తెల్పుచున్నాడు-

**ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।**
**సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ముక్తసంగః | = ఆసక్తిని త్యజించిన వాడును | ధృత్యుత్సాహ సమన్వితః | = ధైర్యోత్సాహములు గలవాడును | | | | లోనుకానివాడును, ఐనవాడు |
| అనహంవాదీ | = అహంకార రహితముగా భాషించువాడును | సిద్ధ్యసిద్ధ్యోః | = సిద్ధి- అసిద్ధులయెడ | సాత్త్వికః, కర్తా | = 'సాత్త్విక కర్త' అని | | |
| | | నిర్వికారః | = హర్షశోకాది వికారములకు | ఉచ్యతే | = పేర్కొనబడును. | | |

ఆసక్తిని త్యజించినవాడు, అహంకారరహితముగా భాషించువాడు, ధైర్యోత్సాహములు గలవాడును సిద్ధి- అసిద్ధులయెడ హర్షశోకాదివికారములకు లోనుకానివాడును అగు పురుషుడు సాత్త్వికకర్త యనబడును **(26)**

ప్రశ్న - 'ముక్తసంగుడు' అనగానెవరు?

సమా - కర్మలతోగాని వాటి ఫలరూపములైన వివిధ భోగములతోగాని ఏమాత్రమూ సంబంధము లేనివాడు అనగా శరీరేంద్రియ మనస్సులతో ఆచరించు కర్మలయందు వాటి

ఫలరూపములైన కీర్తిప్రతిష్ఠలు, స్త్రీ పుత్ర ధనాదులు, ఇహపరలోక భోగములు మొదలగువాని యన్నింటియందును ఏమాత్రము మమత, ఆసక్తి, కోరిక లేనివాడు **'ముక్తసంగుడు'** అని యనబడును.

ప్రశ్న - **'అనహంవాదీ'** అనగానెవరు?

సమా - "శరీరేంద్రియ మనోబుద్ధులు" అను అనాత్మ పదార్థములయందు ఆత్మ బుద్ధిలేని కారణమున ఏ కర్మయందును కర్తృత్వాభిమానములు లేనివాడును, ఆసురీప్రకృతి కలిగినవానివలె అహంకారవచనములు పలుకనివాడును అగు పురుషుడు **'అనహంవాది'** యనబడును. ఆసురీ ప్రకృతి కలవాడు "నేనే నా ఈ మనోరథమును సాధించితిని. ఇంకను సాధింపగలను. నేనే ఈశ్వరుడను. భోగిని. బలవంతుడను. సుఖిని. ఎవ్వరును నాతో సమానులు కారు. యజ్ఞములు చేయుటకును, దానములను చేయుటకును నేనే కర్తను." **(16/13,14,15)** మొదలగు అహంకార వచనములను పలుకును. కాని అనహంకారియైన పురుషుడు ఇట్టి దంభోక్తులు పలుకక, సరళ భావములు కలిగినవాడై కర్తృత్వాభిమానరహితుడై సౌమ్యముగా మాట్లాడును.

ప్రశ్న - **'ధృత్యుత్సాహసమన్వితః'** అను సమాసములోని **'ధృతి', 'ఉత్సాహము'** అను పదములు ఏయే భావములను తెలుపును. ఈ భావములు గల పురుషుని లక్షణములెవ్వి?

సమా - శాస్త్రవిహితములైన స్వధర్మ కర్మాచరణము నందు అంతులేని ఆటంకములు ఎదురైనను ఏమాత్రము చలింపకుండుటను **'ధృతి'** అనియందురు. కర్మసాఫల్య సిద్ధి లేకున్నను కర్మ సాఫల్య ప్రాప్తి గలవానివలెను, కర్మ ఫలేచ్ఛ లేకున్నను ఫలేచ్ఛకలవానివలెను శ్రద్ధాదరములతో కర్మాచరణమునకు పూనుకొనుటను **'ఉత్సాహము'** అని యందురు. ఈ **'ధృత్యుత్సాహములు'** గలవాడు అంతులేని ఆటంకములు ఏర్పడినను తన కర్తవ్యము నుండి వైదొలగడు. పైగా అతడు అనుక్షణము విఘ్నములు ఎంతెంతగా ఎదురగుచున్నను వాటిని అధిగమించుచు తన కర్తవ్యమునందు అత్యుత్సాహముతో స్థిరముగా నిలుచును. ఇవియే ధృత్యుత్సాహ సమన్వితుని లక్షణములు.

ప్రశ్న - **'సిద్ధ్యసిద్ధ్యోః నిర్వికారః'** అను వాక్యము ఎట్టి వానిని గూర్చి తెలుపును?

సమా - కర్మలయందు ఆసక్తుడగు సామాన్య మానవుడు కర్మాచరణమును తన ఇష్టఫలసిద్ధికి సాధనముగా భావించును. ఆ ఫలసిద్ధి కలిగినప్పుడు అతడు సంతోషముతో పొంగిపోవును. ఏవైనను విఘ్నములు ఏర్పడి కర్మాచరణమునకు భంగము కలిగి, ఫలసిద్ధి ప్రాప్తించనప్పుడు దుఃఖముతో క్రుంగిపోవును. కర్మఫలముల యొక్క సిద్ధ్యసిద్ధుల కారణమున అంతఃకరణమునందు అనేక విధములైన వికారములు ఉత్పన్నము అగును.

అహంకార మమకారములు, ఆసక్తి, ఫలేచ్ఛలు లేని మనుజుడు తన కర్మాచరణము సఫలమైనప్పుడు పొంగిపోడు, విఘ్నములు ఏర్పడి ఫలసిద్ధి కలుగనప్పుడు క్రుంగిపోడు. దేనికిని అతడు ఏవిధమైన మనోవికారములకును లోనుకాడు. సర్వకాల సర్వావస్థలయందును సముడై యుండును. "సిద్ధ్యసిద్ధ్యోః నిర్వికారః" అను వాక్యము ఇట్టి వ్యక్తిని గూర్చియే తెలుపును.

ప్రశ్న - అట్టివానిని **'సాత్త్వికకర్త'** అని యనుటలోని విశేషమేమి?

సమా - పై భావములన్నియు పూర్తిగా కలిగియున్న వాడే **"పూర్ణసాత్త్విక కర్త"** యగును. పై భావములలో ఏ ఒక్కటి ఏ కొంచెముగా లోపించినను అతని సాత్త్వికత యందు లోపమున్నట్లు భావింపవలెను. ఇట్టి సాత్త్విక భావము పరమాత్మ తత్త్వమును తెలిసికొనుటకు తోడ్పడును. కనుక ముక్తిని కోరువాడు సాత్త్విక కర్తయే కావలెను.

సంబంధము - ఇప్పుడు భగవానుడు 'రాజసకర్త' యొక్క లక్షణములను తెల్పుచున్నాడు-

**రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।**
**హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27 ॥**

| | | |
|---|---|---|
| రాగీ = ఆసక్తిగలవాడును | హింసాత్మకః = ఇతరులను కష్టపెట్టు స్వభావము గలవాడును | హర్షశోకాన్వితః = హర్షశోకములకు లోనగువాడును |
| కర్మఫలప్రేప్సుః = కర్మఫలములకై ఆరాటపడువాడును | అశుచిః = అపవిత్ర ప్రవర్తన గలవాడును | రాజసః కర్తా = 'రాజసకర్త' అని |
| లుబ్ధః = లోభియు | | పరికీర్తితః = చెప్పబడును. |

**ఆసక్తియుతుడు, కర్మఫలములకై ఆరాటపడువాడు, లోభి, ఇతరులను కష్టపెట్టు స్వభావము గలవాడు, అపవిత్రప్రవర్తన గలవాడు, హర్ష శోకములకు లోనగువాడు రాజసకర్తగా భావింపబడును.(27)**

ప్రశ్న - 'రాగీ' అను పదము ఎట్టి మనుష్యుని తెల్పును?

సమా - కర్మలయందును, వాటి ఫలరూపములైన ఇహపరలోక భోగముల యందును మమతాసక్తులు గలవాడు, అనగా తానెట్టి క్రియలను ఆచరించినను దానియందును, వాటి ఫలితము లందును అమితాసక్తి గలవాడు 'రాగీ' అనబడును.

ప్రశ్న - 'కర్మఫలప్రేప్సుః' అను సమాసము ఎవరిని తెల్పును?

సమా - కర్మల ఫలస్వరూపములైన స్త్రీ పుత్రాదులు, గృహము, సంపదలు, కీర్తి, ప్రతిష్ఠలు మొదలగు వివిధములైన ఇహపరలోక భోగములను కోరుకొనుచుండు వాడును, అట్టి భోగములను పొందుటకే కర్మలను ఆచరించు స్వార్థ పరాయణుడును అగు పురుషుని 'కర్మఫలప్రేప్సుః' అను పదము తెలుపును.

ప్రశ్న - 'లుబ్ధః' అనగా ఎట్టివాడు?

సమా - ధనాది సంపదలయందు అత్యాశఉండుట వలన సరియైన అవసరము ఏర్పడినప్పుడును విధిగా (న్యాయముగా) తన శక్తిననుసరించి, ధనమును వినియోగింపని వాడును, న్యాయాన్యాయములను ప్రక్కన పెట్టి సర్వదా ధనమును ఆరాటముతో కూడబెట్టువాడును, ఇతరుల సొత్తును కబళించుటకై ఆశపడువాడును, దానిని పొందుటకై ఎంతకైనను తెగించు వాడును, ఐనట్టి లోభిని 'లుబ్ధః' అను పదము తెలుపును.

ప్రశ్న - 'హింసాత్మకః' అను పదము ఎట్టివానిని తెలుపును?

సమా - ఏదో ఒకవిధముగా ఇతరులను కష్టపెట్టుటయే స్వభావముగా గలవాడును, తన అభిలాషను నెరవేర్చుకొనుటకై రాగద్వేషములతో కర్మలను ఆచరించు నప్పుడు ఇతరుల కష్టనష్టములను ఏమాత్రము పట్టించుకొనక తన సుఖమునకై ప్రాకులాడు వాడును ఐన హింసాపరాయణుడైన వానిని 'హింసాత్మకః' అని యందురు.

ప్రశ్న - 'అశుచిః' అను పదము ఎవరిని తెలుపును?

సమా - సదాచారములు లేనివాడును, శుచి, శుభ్రత లేనివాడును, అనగా శాస్త్రవిధులను అనుసరించి, జలమృత్తి కాదులచే శరీరమును, వస్త్రాదులను శుభ్రముగా ఉంచుకొననివాడును, నిత్యజీవితమునందు తన ప్రవర్తనను, కర్మాచరణములను యోగ్యతతో పవిత్రముగా నడుపనివాడును, భోగలాలసుడై వివిధ భోగములను అనుభవించుటకై సదాచారములను, శుచి, శుభ్రతలను త్యజించువాడును ఐన మనుజుని 'అశుచిః' అను పదము తెలుపును.

ప్రశ్న - 'హర్షశోకాన్వితః' అను సమాసము ఎట్టివానిని తెలుపును?

సమా - ప్రతికర్మయందును దాని ఫలితమునందును రాగద్వేషము లుండుటవలన ఆ కర్మను ఆచరించునప్పుడును, ప్రతిసంఘటనకును తరచుగా హర్షశోకములకు గురియగు అంతఃకరణము గలవానిని "హర్షశోకాన్వితః" అను సమాసము తెలుపును.

ప్రశ్న - 'అట్టివాడు రాజసకర్త' అని యనుటలోని విశేషమేమి?

సమా - పై 'రాగాది లక్షణములు' అన్నిగాని, వాటిలో కొన్నిగాని కలిగిన వానిని 'రాజస కర్త' అని యందురు. అట్టివాడు పదేపదే జన్మలెత్తుచు, మరణించుచు సంసార చక్రమునుండి ముక్తుడు కాలేడు. ముముక్షువు ఐనవాడు రాజసకర్త కాకూడదు.

సంబంధము - ఇప్పుడు భగవానుడు 'తామస కర్త లక్షణములను' తెల్పుచున్నాడు-

**అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।**
**విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అయుక్తః | = జితేంద్రియుడు కానివాడును | నైష్కృతికః | = అకారణముగ ఇతరుల వృత్తులకు విఘాతము కల్గించువాడును | చ | = మఱియు | | |
| ప్రాకృతః | = సుశిక్షితుడుగాని వాడును | విషాదీ | = నిరంతరము చింతాగ్రస్తుడును | దీర్ఘసూత్రీ | = ఉపేక్షతో కాలము గడుపుచుండు వాడును, అగువాడు | | |
| స్తబ్ధః | = మూర్ఖుడును | | | తామసః, కర్తా | = 'తామస కర్త' అని | | |
| శఠః | = ధూర్తుడును | అలసః | = సోమరియును | ఉచ్యతే | = పేర్కొనబడును. | | |

జితేంద్రియుడు కానివాడు, సుశిక్షితుడు కానివాడు, మూర్ఖుడు(మొండివాడు), ధూర్తుడు, అకారణముగ ఇతరుల వృత్తులకు విఘాతము కల్గించువాడు, సదా చింతాగ్రస్తుడు, సోమరి, కార్యాచరణమునందు ఉపేక్షతో కాలము గడుపుచుండువాడు (దీర్ఘసూత్రి) - ఇట్టి లక్షణములు గలవానిని తామసకర్త అని యందురు (28)

ప్రశ్న - 'అయుక్తః' అను పదము ఎట్టివానిని తెల్పును?

సమా - ఇంద్రియములు, మనస్సు తన వశమున లేనివాడును, పైగా తానే వాటికి వశవర్తియైన వాడును, భక్తి శ్రద్ధలు లేనివాడును, ఆస్తికత లేనివాడును అగు పురుషుని 'అయుక్తః' అను పదము తెలుపును.

ప్రశ్న - 'ప్రాకృతః' అను పదము ఎవరిని తెలుపును?

సమా - సుశిక్షితుడు కానివాడును, స్వభావము చేత బాలుని వంటివాడును, కర్తవ్య మూఢుడును (16/7), అంతః కరణమునందును, ఇంద్రియములయందును సంస్కారము లేనివాడును, స్వాభావికముగ మూర్ఖుడును ఐనవానిని 'ప్రాకృతః' అను పదము తెల్పును.

ప్రశ్న - 'స్తబ్ధః' అను పదము ఎవరిని తెల్పును?

సమా - కఠినుడును, వినయవిధేయతలు లేనివాడును, మంకుపట్టు గలవాడును, ఇతరులను ఏ మాత్రము లక్ష్యపెట్టని వాడును - అగువానిని 'స్తబ్ధః' అను పదము తెలుపును.

ప్రశ్న - 'శఠః' అను పదము ఎవరిని తెలుపును?

సమా - ఇతరులను మోసగించువాడును, తనలోని ద్వేషమును (కప్పిపుచ్చుకొని) బయటకు పొక్కనీయక అన్యులకు అపకారము చేయువాడును, ఇతరులకు హాని (కీడు) కలిగించుటకై లోలోన కుట్రలు పన్నువాడును అగు ధూర్తుని 'శఠః' అను పదము తెలుపును.

ప్రశ్న - 'నైష్కృతికః' అను పదము ఎవరిని గూర్చి తెలుపును?

సమా - అనేక విధములుగా ఇతరుల (జీవితముల)కు కీడు తలపెట్టువాడును, ఇతరుల వృత్తులకు హాని తలపెట్టు స్వభావము గలవాడును అగు పురుషుని 'నైష్కృతికః' అను పదము తెలుపును.

ప్రశ్న - 'అలసః' అనగానెవరు?

సమా - అహర్నిశలు మత్తుగా పడియుండువాడును, శాస్త్రోక్తమైన వ్యావహారికమైన ఎట్టి కర్తవ్య కర్మలను చేయు ప్రవృత్తి, ఉత్సాహము లేనివాడును, అంతఃకరణమునందును, ఇంద్రియములందును సోమరితనము నిండియుండువాడును అగు మనుష్యుని తెల్పునదియే 'అలసః' అను పదము.

ప్రశ్న - 'విషాదీ' అను పదము ఎవరిని తెలుపును?

సమా - రాత్రింబవళ్ళు దుఃఖించుచుండువాడును, అంతులేకుండా చింతలలో మునిగియుండువాడును, (16/11) అగు చింతాక్రాంతుడైనవానిని 'విషాదీ' అను పదము తెలుపును.

ప్రశ్న - 'దీర్ఘసూత్రీ' అనగానెవరు?

సమా - ఆరంభించిన పనిని ఎప్పటికప్పుడు వాయిదాలు వేయుచు ఎన్నటికిని పూర్తిచేయని చంచల స్వభావము గలవాడు అగు మనుష్యుని 'దీర్ఘసూత్రీ' అను పదము తెలుపును.

ప్రశ్న - ఇట్టి వానిని 'తామస కర్త' అనుటలోని విశేషమేమి?

సమా - పైన తెలుపబడిన అవగుణ విశేషణము లన్నియును తమోగుణ కార్యములే. పై గుణము లన్నియుగాని, లేక కొన్నిగాని కలిగియున్న వానిని **'తామసకర్త'** అని భావింపవలెను. తామసులగు వారికి అధోగతియే ప్రాప్తించును (14/18). వారు అనేక విధములైన పశుపక్ష్యాది జన్మలనే ఎత్తుచుందురు (14/15). శ్రేయస్సును కోరుకొను మనుష్యుడెవ్వడును తామస లక్షణములను ఏమాత్రమూ కల్గియుండరాదు.

*సంబంధము - తత్త్వజ్ఞాన విషయమున సహాయకమగు సాత్త్వికభావమును గ్రహించుటకును దానికి విరుద్ధములైన రాజస తామస భావములను త్యజించుటకును, కర్మప్రేరణ, కర్మ సంగ్రహములయందలి జ్ఞాన, కర్మ, కర్తల యొక్క సాత్త్వికాది త్రివిధ భేదములను భగవానుడు క్రమముగా తెలిపెను. ఇప్పుడు బుద్ధి, ధృతుల యొక్క సాత్త్విక, రాజస, తామస రూప భేదములను క్రమముగా తెలుపుదునని ప్రస్తావించుచున్నాడు-*

**బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।**
**ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥ 29 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధనంజయ! | = ఓ ధనంజయా! | గుణతః | = గుణములను బట్టి | అశేషేణ | = సంపూర్ణముగా |
| బుద్ధేః | = బుద్ధికి | త్రివిధమ్, భేదమ్ | = మూడువిధములగు భేదములు (గలవు) | పృథక్త్వేన | = వేర్వేఱుగా |
| చ | = మఱియు | | | ప్రోచ్యమానమ్ | = చెప్పబడుచున్న (వాటిని) |
| ధృతేః, ఏవ | = ధృతికిని | (మయా) | = నాచేత | శృణు | = వినుము |

**ఓ ధనంజయా! ఇప్పుడు నీవు బుద్ధి, ధృతులను గూడ గుణభేదములననుసరించి మూడు విధములుగా, విభాగ పూర్వకముగా సంపూర్ణముగా నానుండి వినుము. (29)**

ప్రశ్న - ఈ శ్లోకమునందు బుద్ధి, ధృతి అనునవి యేతత్త్వములను సూచించును? వాటిని గుణభేదములను బట్టి మూడు విధములుగా విభాగపూర్వకముగా (వేర్వేఱుగా) సంపూర్ణముగా వినుమని పల్కుటలోని విశేషమేమి?

సమా - ఇచట బుద్ధియనునది నిర్ణయాత్మక శక్తి విశేషమును తెల్పునది. దీనిని 'అంతఃకరణమనియు' అందురు. 20,21,22 శ్లోకములయందు మూడు విధములగు జ్ఞానములను తెలుపబడినవి. ఆ జ్ఞానములు బుద్ధిజనితములు అనగా అవి బుద్ధియొక్క వృత్తి విశేషములు. బుద్ధి జ్ఞానమునకు కారణము. 18వ శ్లోకమున జ్ఞానము కర్మప్రేరకమని చెప్పబడినది. బుద్ధి త్రివిధ కర్మసంగ్రహములలో 'కరణము' అను పేర చెప్పబడినది. ఇదియే జ్ఞానమునకును బుద్ధికిని గల వైవిధ్యము (భేదము). కర్మ సంగ్రహములయందు వర్ణింపబడిన కరణముల సాత్త్విక, రాజస, తామస భేదములను చక్కగా వివరించుటకు కరణములలో ముఖ్యమైన బుద్ధి యొక్క మూడు భేదములును తెల్పబడుచున్నవి.

ధృతియనగా ధారణాశక్తి విశేషము. ఇదియును బుద్ధియొక్క వృత్తియే. మనుష్యుడు ఏ క్రియనైనను లేక భావమునైనను ఈ శక్తి ద్వారా దృఢముగా ధారణ చేయును. కనుక ఈ ధృతియును కరణాంతర్గతమే. 26వ శ్లోకము నందలి సాత్త్విక కర్త లక్షణములలో 'ధృతి' అను శబ్దము ప్రయుక్తమైనది. అందువలన 'ధృతి' కేవలము సాత్త్విక లక్షణమనియే భావించుటకు అవకాశము కలదు. కాని అట్లు భావించుటకు వీలులేదు. ధృతి యందును మూడు భేదములు గలవు. వాటిని గూర్చి భగవంతుడు ఇచట వివరింపబోవుచున్నాడు.

బుద్ధి తత్త్వము, ధృతి తత్త్వముల లక్షణములు సత్త్వరజస్తమోగుణ రూపములలో మూడేసి విధములుగా ఉండుననియు, వాటిని సంపూర్ణముగా వేర్వేఱుగా తెల్పెదననియు భగవానుడు పల్కెను. సాత్త్విక బుద్ధి, సాత్త్విక ధృతి అనువానిని ధారణ చేయుటకును, రాజస తామస బుద్ధి, ధృతులను త్యజించుటకును, ఈ రెండు తత్త్వముల లక్షణములను సావధానముగా వినుమని పల్కెను.

సంబంధము - పూర్వశ్లోకమున బుద్ధి ధృతుల సాత్త్విక, రాజస, తామస గుణరూప భేదములను క్రమముగా తెల్పెదనని భగవంతుడు ప్రస్తావించియుండెను. దానిననుసరించి మొట్టమొదట సాత్త్విక బుద్ధిలక్షణములను తెలుపుచున్నాడు-

**ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।**
**బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ 30 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | | అకర్తవ్యమును | మోక్షమ్ | = మోక్షమును |
| యా | = ఏబుద్ధి | భయాభయే | = భయ- | వేత్తి | = యథార్థముగా |
| ప్రవృత్తిమ్ | = ప్రవృత్తిమార్గమును | | అభయములను | | ఎఱుంగునో |
| చ | = మఱియు | చ | = అట్లే | సా, బుద్ధిః | = అట్టి బుద్ధి |
| నివృత్తిమ్ | = నివృత్తి మార్గమును | బంధమ్ | = బంధమును | సాత్త్వికీ | = సాత్త్వికబుద్ధి అని |
| కార్యాకార్యే | = కర్తవ్యమును, | చ | = మఱియు | | చెప్పబడును. |

**ప్రవృత్తిమార్గమును, నివృత్తిమార్గమును, కర్తవ్యమును, అకర్తవ్యమును, భయమును, అభయమును, అట్లే బంధమును, మోక్షమును యథార్థముగా తెలిసికొను బుద్ధిని సాత్త్వికమైన బుద్ధియందురు.(30)**

ప్రశ్న - ప్రవృత్తి మార్గమనగానేమి? దానిని యథార్థముగా తెలిసికొనుట యనగానేమి?

సమా - గృహస్థ, వానప్రస్థాది ఆశ్రమములలో మసలుచు (ఉంటూ) మమతాసక్తులను, అహంకారమును, ఫలేచ్ఛను వీడి, పరమాత్మ ప్రాప్తికై తదుపాసన చేయుచు, శాస్త్ర విహితములైన యజ్ఞదాన తపశ్చర్యాది పవిత్ర కర్మలను, తమ తమ వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి, జీవికకై ఆచరించు కర్మలను, శరీరసంబంధమైన భోజన భాజనాది కర్మలను, నిష్కామ భావముతో ఆచరించుచు పరమాత్మ ప్రాప్తినొందు మార్గమునే 'ప్రవృత్తి మార్గము' అని యందురు.

జనక మహారాజు, అంబరీషుడు, వసిష్ఠ, యాజ్ఞవల్క్యాది మహర్షులవలె ఆ ప్రవృత్తిమార్గమును చక్కగా అవగాహన చేసికొని, దానిని అనుసరించి, జీవితమును గడుపుటయే దానిని యథార్థముగా ఎఱుంగుట (తెలిసికొనుట) యగును.

ప్రశ్న - 'నివృత్తి మార్గము'నగానేమి? దానిని యథార్థముగా తెలుసుకొనుట యనగానేమి?

సమా - సమస్త కర్మలను, భోగములను బాహ్యాభ్యంతరముల యందు సర్వథా త్యజించి, సన్న్యాసాశ్రమమునందు మసలుచు పరమాత్మ ప్రాప్తికై వివిధములైన ప్రాపంచిక బంధములనుండి విరక్తుడై, అహంకార మమకారములను, ఆసక్తులను వదలి, శమ, దమ, తితిక్షాది సాధనముల సహితముగా నిరంతరము శ్రవణ మనన నిదిధ్యాసలను సల్పుట లేక కేవలము భగవద్భజన స్మరణ కీర్తనాదులలోనే నిమగ్నుడై యుండుట - ఈ విధముగా పరమాత్మ ప్రాప్తిని పొందు మార్గమును 'నివృత్తి మార్గము' అని యందురు.

సనకాది మునులును, నారదుడును, ఋషభదేవుడును, శుక మహర్షియును - మొదలగువారివలె ఈ నివృత్తి మార్గమును చక్కగా గ్రహించి, దానిని అనుసరించుచు జీవితమును గడుపుటయే యథార్థముగా తెలిసికొనుట యగును.

ప్రశ్న - 'కర్తవ్యము' అనగానేమి? 'అకర్తవ్యము' అనగానేమి? ఈ రెండింటిని యథార్థముగా తెలిసికొనుట యనగానేమి?

సమా - వర్ణాశ్రమ ధర్మములను, ప్రకృతిని, దేశకాల పరిస్థితులను అనుసరించి, ఎవరెవరికి ఏయే సమయములందు ఏయే కర్మలు చేయుట ఉచితమో అవి వారికి కర్తవ్యములు. ఏయే సమయముల యందు, ఎవరెవరికి ఏయే కర్మలు త్యజింప దగినవో అవి వారికి అకర్తవ్యములు. ఈ రెండింటిని చక్కగా తెలిసికొనుట యనగా - ఎవ్వరికైనను ఏదైనను కార్యావసరము వచ్చినప్పుడు అది తనకు కర్తవ్యమా? అకర్తవ్యమా? అను విషయమును యథార్థముగా నిర్ణయించుకొనుటయే కర్తవ్యాకర్తవ్యములను యథార్థముగా తెలిసికొనుట యగును.

ప్రశ్న - 'భయము' అనగానేమి? 'అభయము' అనగానేమి? ఈ రెండింటిని యథార్థముగా తెలిసికొనుట యనగానేమి?

సమా - దుఃఖములను కలిగించు వస్తువుగాని, సంఘటనము గాని ఎదురైనప్పుడు లేదా అట్టి స్థితి సంభవించునని భావించినప్పుడును మనుష్యుని అంతః కరణమునందు ఏర్పడు (కలుగు) వ్యాకులతను కంపవృత్తిని (వణుకును) భయమందురు. దీనికి విరుద్ధముగా భయరహిత స్థితిని **'అభయము'** (నిర్భయము) అని యందురు. ఈ రెండింటి తత్త్వములను తెలిసికొనుట - అనగా భయమనగానేమి? అభయమనగానేమి? ఏయే కారణముల వలన మనుష్యునకు భయము కలుగును? ఏ విధముగా ఆ భయనివృత్తి కలిగి నిర్భయస్థితి ఏర్పడును? అను విషయములను పూర్తిగా తెలిసికొని, భయరహితుడగుటయే - భయ - అభయములను యథార్థముగా తెలిసికొనుట యగును.

ప్రశ్న - బంధమోక్షములనగానేమి?

సమా - పుణ్యపాపకర్మల ప్రభావములకు లోనై జీవుడు అనాది కాలమునుండియు నిరంతరము జనన మరణ చక్రమునందు పరిభ్రమించు చుండుటనే **'బంధము'** అని యందురు. సత్సంగ ప్రభావమున కర్మయోగము, భక్తి యోగము, జ్ఞానయోగము మొదలగు సాధన మార్గములలో ఏ ఒక్క దాని ద్వారా ఐనను భగవత్కృప వలన సమస్త పుణ్య పాప కర్మబంధములనుండి విముక్తుడై జీవుడు భగవత్ప్రాప్తి నందుటను **'మోక్షము'** అని యందురు.

ప్రశ్న - బంధమోక్షములను యథార్థముగా తెలిసికొనుట యనగానేమి?

సమా - బంధమనగానేమి? ఏ కారణము వలన జీవునకు బంధము ఏర్పడును? ఏ పరిస్థితులవలన ఈ బంధము బలపడును? ఈ విషయములను చక్కగా గ్రహించుటను, బంధమును గూర్చి యథార్థముగా తెలిసికొనుట యగును. ఇట్టి బంధమునుండి ముక్తుడగుట యనగానేమి? ఏయే ఉపాయములద్వారా ఏ విధముగా మనుష్యుడు బంధవిముక్తుడు కాగలడు? మొదలగు విషయములను అన్నింటిని సాకల్యముగా తెలిసికొనుటయే మోక్షమును గూర్చి యథార్థముగా తెలిసికొనుట యగును.

ప్రశ్న - "సాత్త్వికబుద్ధి యనగా ఇదియే" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పై విషయములను అన్నింటిని సమగ్రముగా నిర్ణయింపగలిగినదియును, వాటిలో ఏ విషయముగూర్చి యైనను నిర్ణయించుటలో పొరపాటునకుగాని, సంశయమునకు గాని తావీయనిదియును, ఏ విషయమునైనను అవసరము ఏర్పడినప్పుడు యథార్థముగా నిర్ణయించునదియును అగు బుద్ధిని **"సాత్త్విక బుద్ధి"** అని యందురు. సాత్త్విక బుద్ధి మనుజుని సంసార బంధమునుండి విముక్తునిగా జేసి, అతడు పరమపదమును పొందునట్లు చేయును. కనుక శ్రేయస్సును కోరుకొను మనుష్యుడు తన బుద్ధిని సాత్త్వికమొనర్చుకొనవలెను.

సంబంధము - ఇప్పుడు 'రాజస బుద్ధి లక్షణము' ను గూర్చి భగవానుడు తెల్పుచున్నాడు-

**యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।**
**అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥ 31 ॥**

| | |
|---|---|
| పార్థ! | = ఓ పార్థా! |
| యయా | = ఏ బుద్ధిద్వారా |
| ధర్మమ్, చ | = ధర్మమునూ |
| అధర్మం, చ | = అధర్మమునూ |
| కార్యమ్, చ | = కర్తవ్యమునూ |
| అకార్యమ్, ఏవ | = అకర్తవ్యమునూ |
| అయథావత్, ప్రజానాతి | = (మనుష్యుడు) యథార్థముగా తెలిసికొనలేడో |
| సా, బుద్ధిః | = ఆ బుద్ధి |
| రాజసీ, | = 'రాజసబుద్ధి' అని చెప్పబడును. |

**ఓ పార్థా! ధర్మాధర్మములయొక్కయు, కార్యాకార్యములయొక్కయు(కర్తవ్యాకర్తవ్యముల యొక్కయు), యథార్థతత్త్వములను తెలియజాలని బుద్ధిని, "రాజసబుద్ధి" అనియందురు (31)**

ప్రశ్న - ధర్మమనగానేమి? అధర్మమనగానేమి? ఈ రెండింటిని యథార్థముగా తెలిసికొనలేకపోవుట యనగానేమి?

సమా - అహింస, సత్యము, దయ, శాంతి, బ్రహ్మచర్యము, శమ, దమ, తితిక్షలు, యజ్ఞదానతపశ్చర్యలు, అధ్యయన - అధ్యాపనములు, ప్రజాపాలనము, కృషి, పశుపాలనము, సేవలు మొదలగునవి వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి శాస్త్రవిహిత శుభకర్మలు. వీటిని ఆచరించుట వలన ఇహపరలోక భోగములు కలుగునని శాస్త్రములయందు

తెలుపబడినది. పరహితము కొఱకు చేయబడు కర్మలు, ఇంకను ఇతర పవిత్ర కర్మలన్నియును 'ధర్మము' పేరుతోడనే వ్యవహరింపబడుచున్నవి.[1] అట్లే అసత్యము, కపటము, దొంగతనము, వ్యభిచారము, హింస, దంభము, అభక్ష్యభక్షణము మొదలగునవి అన్నియును పాపకర్మలు. అవి దుఃఖదాయకములు అని శాస్త్రములు తెలుపుచున్నవి. ఇవి యన్నియు అధర్మములే. ఏయే సమయములందు, ఏయే పరిస్థితులయందు ఏయే కర్మలు ధర్మములు? ఏవి అధర్మములు? అను విషయమును చక్కగా నిర్ణయించుటలో బుద్ధిలోపించుట, లేక సంశయ గ్రస్తమగుటను, ధర్మాధర్మములను యథార్థముగా తెలిసికొనలేకపోవుట యగును.

ప్రశ్న - కార్యమనగానేమి? అకార్యమనగానేమి? ధర్మాధర్మములకును కర్తవ్యాకర్తవ్యములకును మధ్యగల భేదమేమి? కర్తవ్యాకర్తవ్యములను యథార్థముగా

1) ధర్మము మిక్కిలి మహిమాన్వితమైనదని శాస్త్రములు పేర్కొనినవి.

బృహద్ధర్మ పురాణము పేర్కొనిన ధర్మరీతులు: ఇవి -

ఈ విశ్వమును రక్షించు వృషభ రూప ధర్మమునకు నాల్గు పాదములు గలవు. ఈ ధర్మము కృతయుగమున నాల్గు పాదములతోడను, త్రేతాయుగమున మూడు పాదముల తోడను, ద్వాపరయుగమున రెండు పాదముల తోడను, కలియుగమున ఒకే పాదము తోడను నడచుచుండును.

ధర్మమునకు నాల్గు పాదములు - సత్యము, దయ, శాంతి, అహింస

సత్యం దయా తథా శాంతిరహింసాచేతి కీర్తితాః । ధర్మస్యావయవాస్తాత! చత్వారః పూర్ణతాం గతాః ॥

సత్యము 12 విధములు:

అమిథ్యావచనం సత్యం స్వీకార ప్రతిపాలనమ్ । ప్రియవాక్యంగురోః సేవాదృఢంచైవవ్రతం కృతమ్ ॥
ఆస్తిక్యం సాధుసంగశ్చ పితుర్మాతుః ప్రియంకరః । శుచిత్వం ద్వివిధంచైవ హ్రీరసంచయ ఏవ చ ॥

అబద్ధము పలుకకుండుట, చేపట్టిన బాధ్యతను నడుపుట, ప్రియముగా మాటాడుట, గురువులను సేవించుట, దృఢముగా నియమములను పాటించుట, భగవంతుని యెడ విశ్వాసము కలిగియుండుట, సజ్జన సాంగత్యము, మాతాపితరులకు ప్రియమును గూర్చు కర్మలను ఆచరించుచుండుట, బాహ్యశుచిత్వము, అంతర శుచిత్వము, లజ్జ, అపరిగ్రహము.

దయ ఆఱు విధములు :

పరోపకారో దానం చ సర్వదా స్మితభాషణమ్ । వినయో న్యూనతాభావస్వీకారః సమతా మతిః ॥ పరోపకారము, దానము, ఎల్లప్పుడును చిఱునవ్వుతో మాటాడుచుండుట, వినయము, తనను స్వల్పునిగా భావించుకొనుట, సమత్వబుద్ధి.

శాంతి లక్షణములు ముప్పది:

అనసూయాల్పసంతోష ఇంద్రియాణాం చ సంయమః । అసంగమో మౌనమేవం, దేవ పూజావిధౌ మతిః ॥
అకుతశ్చిద్భయత్వం చ, గాంభీర్యం స్థిరచిత్తతా । అరూక్షభావః సర్వత్ర, నిస్పృహత్వం దృఢా మతిః ॥
వివర్జనం హ్యకార్యాణాం, సమః పూజాపమానయోః । శ్లాఘా పరగుణేఽస్తేయం, బ్రహ్మచర్యం ధృతిః క్షమా ॥
ఆతిథ్యం చ జపో హోమ, స్తీర్థసేవాఽఽర్యసేవనమ్ । అమత్సరో బంధమోక్షజ్ఞానం సన్న్యాసభావనా ॥
సహిష్ణుతా సుదుఃఖేషు, అకార్పణ్యమమూర్ఖతా।

ఎవరియందును, దేనియందును తప్పులు వెదకు స్వభావము లేకుండుట, అల్పసంతోషిగా ఉండుట, ఇంద్రియ నిగ్రహము, భోగములందు అనాసక్తి, మౌనము, దేవపూజా విధులయందు తత్పరత, నిర్భయత్వము, గాంభీర్యము, చిత్తస్థైర్యము, తీవ్ర స్వభావము లేకుండుట, దేనియందును తృష్ణ లేకుండుట, నిశ్చయాత్మక బుద్ధి, అకృత్యములను ఆచరింపకుండుట, మానావమానములయందు సమభావము, ఇతరుల గుణములను శ్లాఘించుట, దొంగతనము చేయకుండుట, బ్రహ్మచర్యము, ధైర్యము, క్షమ, అతిథి సత్కారము, జపము, హోమము, తీర్థసేవ, సత్పురుషులను సేవించుట, మాత్సర్యము లేకుండుట, బంధమోక్షముల జ్ఞానము, సన్న్యాసభావన, అతిదుఃఖములను సైతము సహించు స్వభావము, కృపణత్వము (పిసినారి తనము) లేకుండుట, మూర్ఖత్వము లేకుండుట.

తెలిసికొనలేక పోవుట యనగానేమి?

సమా - వర్ణాశ్రమ ధర్మములను, ప్రకృతిని, దేశకాల పరిస్థితులను అనుసరించి, శాస్త్రప్రకారము ఎవరెవరికి ఏయే కర్మలు చేయదగినవో వాటిని కార్యములు లేక కర్తవ్యములు అని యందురు. శాస్త్రములను అనుసరించి, ఎవరెవరికి ఏయే కర్మలు నిషిద్ధములో లేక చేయదగనివో వాటిని **'అకార్యములు'** లేక **'అకర్తవ్యములు'** అని యందురు.

శాస్త్ర నిషిద్ధ పాపకర్మలు అందఱికిని అకార్యములే. కాని శాస్త్రవిహిత పవిత్ర కర్మలయందు కొన్ని కొందఱికి కార్యములు. అవే మఱికొందఱికి అకార్యములు. ఉదాహరణమునకు కార్మికులకు (శూద్రులకు) సేవాదులు కార్యములు: యజ్ఞములు, వేదాధ్యయనములు మొదలగునవి అకార్యములు. సన్న్యాసులకు వివేక, వైరాగ్య శమదమాదులు కార్యములు: యజ్ఞదానాదుల ఆచరణములు అకార్యములు. బ్రాహ్మణులకు యజ్ఞములు చేయుట, చేయించుట, దానములను ఇచ్చుట, పుచ్చుకొనుట, వేదముల అధ్యయనము, అధ్యాపనము అనునవి కార్యములు: సేవావృత్తులు అకార్యములు: వైశ్యులకు కృషి, గోరక్ష, వాణిజ్యములు కార్యములు: దానములను పుచ్చుకొనుట మొదలగునవి అకార్యములు. అదేవిధముగ స్వర్గసుఖాదులను కోరుకొనువారికి కామ్యకర్మలు కార్యములు: ముముక్షువులకు అవి అకార్యములు. విరక్తులైన బ్రాహ్మణులకు సన్న్యాసమును స్వీకరించుట కార్యము: భోగాసక్తులకు అది అకార్యము. దీనినిబట్టి ఒక ధర్మము శాస్త్రవిహితమైనదేయైనను అది అందఱికిని కర్తవ్యముగాదు అని స్పష్టమైనది. కనుక ధర్మము కార్యమూ కావచ్చును, అకార్యమూ కావచ్చును. ఇదియే ధర్మాధర్మములకును, కార్యాకార్యములకును మధ్యగల భేదము.

ఒక వ్యక్తి ఏదైన నొక కర్మను చేయవలసి వచ్చినప్పుడు, లేదా త్యజింపవలసివచ్చినప్పుడు అతనికి ఆ కర్మ కర్తవ్యమా? అకర్తవ్యమా? అతడు ఏ కర్మను ఎట్లు చేయవలెను? దేనిని చేయరాదు? అను విషయములను చక్కగా అతడు నిర్ణయించుకొనుటలో అతని బుద్ధి నిర్ణయాత్మక శక్తిని కోల్పోవుట, లేక సంశయ గ్రస్తమగుటయే కర్తవ్యాకర్తవ్యములను యథార్థముగా తెలిసికొనలేకపోవుట యగును.

ప్రశ్న - 'అది రాజసబుద్ధి' అని అనుటలోని విశేషమేమి?

సమా - మనుష్యుడు ధర్మాధర్మములను, కర్తవ్యాకర్తవ్యములను యథార్థముగా నిర్ణయించుకొనలేనప్పుడు, తదితర విషయములను సైతము చక్కగా నిర్ణయించుకొనుటకు సమర్థుడు కానప్పుడు, అతని బుద్ధి రజోగుణ ప్రభావమునకు లోనైనట్లు భావింపవలెను. అందువలన అతని విచక్షణా జ్ఞానము ఏకాగ్రతను కోల్పోయి, విక్షిప్తమూ, అస్థిరమూ అగును. కనుక అప్పుడు అది రాజస బుద్ధి యనబడును. రజోగుణమునకు ఫలము దుఃఖప్రాప్తి. కనుక మేలును కోరుకొనువాడు సత్సాంగత్యము, సద్గ్రంథ పఠనము, సద్భావములను పెంపొందించుకొనుట మొదలగువాటి ద్వారా తనలోని రాజసభావములను త్యజించి, సాత్త్విక భావములను పెంపొందించుకొనవలెను.

---

అహింసకు ఏడు లక్షణములు:

> అహింసా త్వాసనజయః పరపీడా వివర్జనమ్ ।
> శ్రద్ధా చాఽఽతిథ్య సేవా చ, శాంతరూప ప్రదర్శనమ్ ॥
> ఆత్మీయతా చ సర్వత్ర, ఆత్మబుద్ధిః పరాత్మసు ।

ఆసనజయము, మనోవాక్కాయములచే ఇతరులను పీడింపకుండుట, శ్రద్ధ, అతిథి సత్కారము, ప్రశాంతముగా నుండుట, సర్వత్ర ఆత్మీయత, అందఱియెడ ఆత్మబుద్ధి:

ధర్మమనగా ఇదియే - ఈ ధర్మమును ఏమాత్రము ఆచరించినను అది పరమశ్రేయస్కరము. దీనికి విరుద్ధమైన ఆచరణము మిక్కిలి హానికరము.

**యథా స్వల్పమధర్మం హి జనయేత్తు మహాభయమ్ । స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥**

*(బృహద్ధర్మ పురాణమ్, పూర్వఖండం - **1/47**)*

అధర్మమును స్వల్పముగా ఆచరించినను అది మిక్కిలి భయంకరమైన ఫలితములను కల్గించును. అట్లే ధర్మమును ఏ కొంచెముగా ఆచరించినను తీవ్ర ప్రమాదములనుండియు కాపాడును. ఈ చతుర్విధ ధర్మములతోపాటు జనులు తమతమ వర్ణాశ్రమ ధర్మములను గూడ ఆచరించుచు ఉండవలెను.

సంబంధము - ఇప్పుడు 'తామస బుద్ధి' లక్షణములను తెలుపుచున్నాడు-

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।**
**సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥ 32 ॥**

పార్థ! = ఓ పార్థా!
యా = ఏబుద్ధి
తమసా, ఆవృతా = తమోగుణముచే కప్పబడినదై
అధర్మమ్ = అధర్మమును
ధర్మమ్, ఇతి = ధర్మమని
మన్యతే = తలంచునో
చ = మఱియు
సర్వార్థాన్ = సమస్తపదార్థములను, (విషయములను)
విపరీతాన్, చ = వాటికి విరుద్ధముగా
(మన్యతే) = భావించునో
సా = అది
తామసీ, బుద్ధిః = 'తామసబుద్ధి' అని పేర్కొనబడును.

**ఓ అర్జునా! తమోగుణావృతమైనందున అధర్మమును ధర్మముగను, అట్లే ఇతర పదార్థములను (విషయములను) తద్విపరీతముగను భావించు బుద్ధిని "తామస బుద్ధి" అని యందురు. (32)**

ప్రశ్న - అధర్మమును ధర్మముగను, ధర్మమును అధర్మముగను భావించుట యనగానేమి?

సమా - భగవంతుని దూషించుట, ఇతరదేవతలను నిందించుట, శాస్త్రవిరుద్ధముగా ప్రవర్తించుట, మాతాపితృ గురుజనులను అవమానించుట, వర్ణాశ్రమధర్మములకు వ్యతిరేకముగ నడచుకొనుట, అసంతృప్తి, దంభము, కపటము, వ్యభిచారము, అసత్య భాషణము, పరపీడనము, అభక్ష్య భక్షణము, స్వేచ్ఛాచారము, పరుల సొత్తును అపహరించుట మొదలగు అధర్మములను (నిషిద్ధ పాపకర్మలను) ధర్మములుగా భావించుటయే - అధర్మమును ధర్మముగా భావించుట యగును.

ధృతి, క్షమ, మనోనిగ్రహము, అస్తేయము, శుచిత్వము, ఇంద్రియ నిగ్రహము, సద్బుద్ధి, విద్య, సత్యము, అక్రోధము, ఈశ్వరార్చనము, దైవోపాసనము, శాస్త్రాధ్యయనము, వర్ణాశ్రమ ధర్మాచరణము, మాతాపితృ గురుజనుల ఆజ్ఞాపాలనము, సరళత్వము, బ్రహ్మచర్యము, సాత్త్విక భోజనము, అహింస, పరోపకారము మొదలగు పుణ్యకార్యములను అధర్మములుగా భావించుటను - ధర్మమును అధర్మముగా భావించుట యగును.

ప్రశ్న - ఇతర విషయములన్నింటిని తద్విరుద్ధముగా భావించుట యనగా ఏమి?

సమా - అధర్మమును ధర్మమని భావించినట్లు, అకర్తవ్యమును కర్తవ్యమనియు, దుఃఖమును సుఖమనియు, అనిత్యమును నిత్యమనియు, అపవిత్రమును పవిత్రమనియు, కీడును మేలనియు ముందుగా తలంచు విపరీత జ్ఞానమే- ఇతర విషయములను అన్నింటిని తద్విరుద్ధముగ భావించుట యగును.

ప్రశ్న - 'తామస బుద్ధి' యనగా నిదియే - అని యనుటలోని విశేషమేమి?

సమా - బుద్ధి తమోగుణావృతమగుటచే అది వివేక శక్తిని కోల్పోవును. అట్టి బుద్ధివలన వ్యతిరేక నిర్ణయములే జరుగుచుండును. కనుక అది తామసబుద్ధి. దాని వలన మనుష్యుడు అధోగతి పాలగుచుండును. కనుక శ్రేయస్సును కోరుకొనువాడు ఇట్టి విపరీతబుద్ధిని సర్వథా త్యజింపవలెను.

సంబంధము - ఇప్పుడు సాత్త్విక 'ధృతి' యొక్క లక్షణములను భగవానుడు తెల్పుచున్నాడు-

**ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః ।**
**యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ 33 ॥**

పార్థ! = ఓ పార్థా!
యయా = ఏ
అవ్యభిచారిణ్యా = ఇటునటుచలింపని
ధృత్యా = ధారణాశక్తిచే
(మనుష్యుడు)
యోగేన = ధ్యానయోగముద్వారా
మనఃప్రాణేంద్రియక్రియాః = మనఃప్రాణేంద్రియ క్రియలను
ధారయతే = ధారణచేయునో
సా = అది
సాత్త్వికీ, ధృతిః = సాత్త్వికధృతియని చెప్పబడును

ఓ పార్థా! ఇటునటు చలింపని ధారణాశక్తితో మనుష్యుడు ధ్యానయోగముద్వారా మనః ప్రాణేంద్రియక్రియలను ధారణచేయు శక్తిని 'సాత్త్వికధృతి' యందురు. (33)

ప్రశ్న - 'అవ్యభిచారిణ్యా, ధృత్యా' అను పదద్వయము దేనిని సూచించును? దానితో ధ్యానయోగము ద్వారా మనః ప్రాణేంద్రియ క్రియలను ధారణ చేయుట యనగానేమి?

సమా - ఒక క్రియనుగాని, ఒక భావననుగాని, ఒక వృత్తినిగాని, ధారణచేయునట్టి (అనగా దృఢముగా, స్థిరముగా నుంచునట్టి) శక్తి విశేషమును 'ధృతి' యందురు. ఆ ధృతి ద్వారా ధారణచేయబడిన క్రియయు, భావనయు, వృత్తియు విచలితము గాకుండ చిరకాలము స్థిరముగా నుండును. కాని ఈ ధృతిద్వారా మనుష్యుడు వేర్వేఱు ఉద్దేశ్యములతో వివిధ విషయములను ధారణ చేయుచున్నంతవఱకును దాని వ్యభిచార దోషము తొలగదు. అతడు దీనిద్వారా ఒకే నిశ్చలమైన లక్ష్యమును (మోక్షలక్ష్యమును) స్థిరపరచుకొన్నచో అది "అవ్యభిచారిణీధృతి" అగును. సాత్త్విక ధృతికి పరమాత్మ ప్రాప్తియే ఏకైక లక్ష్యము. ఈ కారణము వలననే దానిని 'అవ్యభిచారిణి' అని యందురు. "అవ్యభిచారిణ్యా ధృత్యా" అను పదద్వయము ఇట్టి ధారణాశక్తినే తెలుపును. ఇట్టి ధారణాశక్తితో పరమాత్మ ప్రాప్తికై ధ్యానయోగముద్వారా మనఃప్రాణేంద్రియ క్రియలను నిశ్చలముగా పరమాత్మయందు నిలుపుటనే సాత్త్విక ధృతితో ధ్యానయోగము ద్వారా మనః ప్రాణేంద్రియ క్రియలను ధారణ చేయుట యగును.

ప్రశ్న - దీనిని 'సాత్త్విక ధృతి' యని యనుటలోని విశేషమేమి?

సమా - సాత్త్వికధృతి 'పరమాత్మ ప్రాప్తి' అను ఏకైక లక్ష్యమునందే సర్వదా స్థిరముగా నుండును. అది తన లక్ష్యము నుండి ఎన్నడును చలింపదు. దానికి వేర్వేఱు ఉద్దేశ్యములు ఉండవు. దానిద్వారా మనుష్యుడు పరమాత్మ ప్రాప్తికై మనసును, ఇంద్రియాదులను పరమాత్మయందే లగ్నము చేయును. వాటిని ఏ కారణము వలననైనను విషయములయందు ఆసక్తము కానీయక చలింపనీయక సర్వదా తన వశమునందే యుంచుకొనును. ఇట్టి ధారణాశక్తి ద్వారా మనుష్యుడు శీఘ్రముగా పరమాత్మ ప్రాప్తినందును. కనుక తన మేలును కోరుకొను పురుషుడు ఇట్టి సాత్త్విక ధృతినే పెంపొందించుకొనవలెను.

సంబంధము - భగవానుడు ఇప్పుడు రాజసధృతి లక్షణములను తెలుపుచున్నాడు-

**యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।**
**ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ 34 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తు | = కాని | యయా, ధృత్యా | = ఏధృతిచేత | ధారయతే | = ధారణ చేయునో |
| పార్థ! | = ఓ పార్థా! | ప్రసంగేన | = మిక్కిలి ఆసక్తితో | సా | = అది |
| అర్జున! | = ఓ అర్జునా! | ధర్మకామార్థాన్ | = ధర్మార్థకామ విషయములను | రాజసీ, ధృతిః | = 'రాజసధృతి' అని పేర్కొనబడును |
| ఫలాకాంక్షీ | = కర్మఫలేచ్ఛగల మనుజుడు | | | | |

కాని, ఓ పార్థా! అర్జునా! కర్మఫలేచ్ఛగల మనుజుడు మిక్కిలి ఆసక్తితో ధర్మార్థకామవిషయములను ధారణచేయు శక్తిని 'రాజసధృతి' అనియందురు. (34)

ప్రశ్న - 'ఫలాకాంక్షీ' అను పదము ఎవరిని తెలుపును? అట్టి మనుష్యుడు ధారణాశక్తి ద్వారా మిక్కిలి ఆసక్తితో ధర్మార్థ కామ విషయములను ధారణ చేయుట యనగానేమి?

సమా - కర్మఫల రూపములైన ఇహపరలోక భోగముల యందు ఇచ్ఛగల పురుషుని 'ఫలాకాంక్షీ' అను పదము సూచించును. అట్టి మనుష్యుడు తన ధారణాశక్తి ద్వారా మిక్కిలి ఆసక్తితో ధర్మమును పాటించుచు జీవించును. ఐహిక సంపదలను, వాటి ద్వారా ప్రాప్తించు భోగములను తన జీవిత లక్ష్యములుగా కలిగియుండుట వలన వాటియందు ఆసక్తి కలిగి, వాటినే దృఢముగా అంటిపెట్టుకొనియుండును. అట్టి ధృతి ద్వారా అర్థకామములను ధారణ చేయుట యనగా నిదియే.

ప్రశ్న - దీనిని 'రాజసధృతి' అని యనుటలోని విశేషమేమి?

సమా - రజోగుణప్రభావమువలన మానవుడు ఈ ధృతి ద్వారా మోక్షసాధనము వైపునకు తన ధ్యాసను (ధ్యానమును) ఏ మాత్రము పోనీయక కేవలము ధర్మార్థకామ విషయములనే ధారణ చేయుచుండును. ఏలనన ఆసక్తి, కోరికలు రజోగుణకార్యములు. ఇట్టి ధృతిగల మానవుడు కర్మపాశబద్ధుడగును. కావున తన హితమును కోరుకొను మనుష్యుడు రాజసధృతిని పెంపొందించుకొనక సాత్త్విక ధృతిని తనలో పెంచుకొనుటకు ప్రయత్నింపవలెను.

సంబంధము - భగవానుడు ఇప్పుడు 'తామసధృతి' లక్షణములను తెలుపుచున్నాడు-

**యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।**
**న విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥ 35 ॥**

పార్థ! = ఓ పార్థా!
దుర్మేధాః = దుర్మతియైన మనుష్యుడు
యయా, (ధృత్యా)= ఏధారణాశక్తి ద్వారా
స్వప్నమ్ = నిద్రను
భయమ్ = భయమును
శోకమ్ = చింతను
చ = మఱియు
విషాదమ్ = దుఃఖమును
మదమ్, ఏవ = ఉన్మత్తతను
న, విముంచతి = విడిచిపెట్టడో అనగా ధారణ చేయుచుండునో
సా = అది
తామసీ, ధృతిః = 'తామసధృతి' యనిచెప్పబడును.

**పార్థా! నిద్ర, భయము,చింతాశోకములు, ఉన్మత్తతలను విడువక, దుర్మతియైన మనుష్యుడు వాటినే సంతతము ధారణ చేయుచుండును. అట్టి ధృతిని, 'తామసధృతి' అనియందురు. (35)**

ప్రశ్న - 'దుర్మేధాః' అను పదము ఎట్టి మనుష్యుని తెలుపును? ఇచట ఆ పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - మిక్కిలి మందబుద్ధియు, మలిన మనస్కుడును, అంతఃకరణమునందు ఎల్లప్పుడును ఇతరులకు కీడు చేయవలయునను తలంపు నుండువాడును అగు దుష్టబుద్ధిని 'దుర్మేధాః' అను పదము సూచించును. ఇట్టి మనుష్యుడు తామసీ ధృతి కలిగియుండును - అని తెలుపుటకే 'దుర్మేధాః' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - స్వప్నము, భయము, శోకము, విషాదము, మదము అను పదములు వేర్వేఱుగా ఏయే భావములను తెలుపును? ధృతి ద్వారా వీటిని వదలకుండుట లేక ధారణ చేయుట అనగానేమి?

సమా - మనస్సును, ఇంద్రియములను తమోగుణముచే ఆవరింపజేసి వాటిని బాహ్యక్రియారహితములుగా, మూఢములుగా కావించు నిద్ర, తంద్ర మొదలగువాటిని 'స్వప్నము' అను పదము తెల్పును. సంపదలు నశించుననియు, మృత్యువు సమీపించుననియు, దుఃఖములు ప్రాప్తించుననియు, సుఖములు దూరమగుననియు, అట్లే ఇతరములైన వివిధములగు ఇష్టములు (ఇష్ట వస్తువులు, భావనలు) నశించుననియు, అనిష్ట వస్తుప్రాప్తి కలుగుననియు ఆశంకతో అంతఃకరణమునందు కలిగెడి వ్యాకులత, ఆందోళనలతో నిండిన వృత్తియే భయము. మనస్సున కలిగెడి వివిధములగు దుశ్చింతలే శోకము. దాని ద్వారా ఇంద్రియములలో ఏర్పడు సంతాపమే విషాదము. శోకము యొక్క స్థూల భావమే (రూపమే) విషాదము. ధన, జన, బలాదుల కారణముగ వివేకము, భవిష్యదాలోచన, దూర దర్శిత్వము మున్నగునవి నశించుటచే సంభవించు ఉన్మత్త వృత్తినే 'మదము' అని యందురు. దీనిపేరే గర్వము, మొండితనము, ఉన్మాదము అనియందురు. వీటినన్నింటిని, ప్రమాదాది - ఇతర తామస భావములను అంతః కరణమునుండి తొలగించు ప్రయత్నము చేయక, వాటియందే మునిగియుండుటను ధృతి ద్వారా వీటిని వదలకుండుట లేక ధారణ చేయుట (పట్టుకొనుట) అని యందురు.

ప్రశ్న- దీనిని 'తామసధృతి' అని యనుటలోని విశేషమేమి?

సమా - త్యజింపవలసిన స్వప్నాది తామస భావములను ఈ ధృతి కారణముగ మనుష్యుడు వదులుకొనలేడు. ఈ ధారణాశక్తి వలన ఈ భావములు మనుష్యుని అంతః కరణమునందు సహజముగనే నిలిచియుండును. కనుక దీనిని 'తామస ధృతి' అని యందురు. ఇది సర్వథా అనర్థ హేతువు. కనుక శ్రేయస్సును కోరుకొను మనుష్యుడు దీనిని వెంటనే అన్నివిధములుగ త్యజింపవలెను.

సంబంధము - భగవానుడు బుద్ధి, ధృతుల యొక్క సాత్త్విక, రాజస, తామస భేదములను క్రమముగా తెల్పెను. వాటిలో సాత్త్విక బుద్ధి ధృతులను గ్రహింపవలెననియు, రాజస, తామస, బుద్ధి, ధృతులను త్యజింపవలెననియు తెల్పెను. మనుష్యుడు సుఖమును గోరి సమస్త కర్మలను ఆచరించును. అట్టి సుఖము గూడ సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధములు. వాటిని వరుసగా తెలుపదలచి, మొదట సాత్త్విక సుఖమును గూర్చి వివరించుచున్నాడు-

**సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।**
**అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥ 36 ॥**
**యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమ్ ఆత్మబుద్ధిప్రసాదజమ్ ॥ 37 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతర్షభ! | = ఓ అర్జునా! | రమతే | = ఆనందించునో | | ఉండునో |
| ఇదానీమ్ | = ఇప్పుడు | చ | = మఱియు | (అతః) | = (అందువలన) |
| త్రివిధమ్ | = మూడు విధములైన | దుఃఖాంతమ్ | = దుఃఖాంతమును | ఆత్మబుద్ధి ప్రసాదజమ్ | = పరమాత్మకు |
| సుఖమ్, తు | = సుఖములను | నిగచ్ఛతి | = పొందునో | | సంబంధించిన |
| | గూర్చియు | యత్ | = ఏ సుఖమైతే | | విషయములలో |
| మే, (వచః) | = నామాటలను | అగ్రే | = ప్రారంభ | | నిమగ్నమగుట |
| శృణు | = వినుము | | సమయమున | | వలన కలుగునట్టి |
| యత్ర | = ఏసుఖమునందు | విషమ్, ఇవ | = విషమువలె | తత్, సుఖమ్ | = ఆసుఖము |
| | సాధకుడు | | అనిపించినను | సాత్త్వికమ్ | = 'సాత్త్విక |
| అభ్యాసాత్ | = భజనధ్యానాదుల | పరిణామే, తత్ | = పరిణామమున అది | | సుఖము, అని |
| | అభ్యాసము వలన | అమృతోపమమ్ | = అమృతతుల్యముగా | ప్రోక్తమ్ | = చెప్పబడును |

**ఓ భరతశ్రేష్ఠా! మూడు విధములగు సుఖములను గూర్చియు నేను చెప్పెదను వినుము. ఏ సుఖమునందు సాధకుడు భజనధ్యానసేవాదుల నొనర్చి ఆనందించునో, దుఃఖములను అతిక్రమించునో, ప్రారంభమునందు విషతుల్యముగా (దుఃఖకరముగా) గోచరించినప్పటికిని పరిణామమున అమృతతుల్యమై పరమాత్మకు సంబంధించిన విషయములలో నిమగ్నమగునో, అట్టి సుఖమును 'సాత్త్విక సుఖము' అనియందురు. (36-37)**

ప్రశ్న - "మూడు విధములగు సుఖములను గూర్చియు ఇప్పుడు నేను చెప్పెదను వినుము", అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఇంతకుముందు (పూర్వ శ్లోకములలో) జ్ఞానము, కర్మ, కర్త, బుద్ధి, ధృతుల సాత్త్విక, రాజస, తామస భేదములను వివరించినట్లే, ఇపుడు సాత్త్విక సుఖమును పొందుటకును, రాజస, తామస సుఖములను త్యజించుటకును మూడు విధములగు సుఖములను గూర్చియు తెలిపెదనని భగవంతుడు నుడివెను.

ప్రశ్న - 'యత్ర' అను పదము ఎట్టి సుఖమును తెల్పును? దానిని సాధనచేసి ఆనందించుట యనగానేమి?

సమా - ప్రశాంతమనస్కుడైన యోగికి లభించు ఉత్తమ సుఖమునే (6/27) ఇచట 'యత్ర' అను పదము తెలుపును. మనుష్యుడు ఇహపరలోక భోగముల వలన కలుగు సుఖములను అన్నింటిని క్షణికములుగా భావించి, వాటియందలి ఆసక్తిని వీడి, నిరంతరము పరమాత్మచింతనాభ్యాసమును చేయుచున్నప్పుడే ఇట్టి సుఖానుభవము కలుగును. (5/21) సాధన చేయనిదే ఇట్టి సుఖానుభవము కలుగదు. కనుక ఈ విషయమును తెల్పుటకే సాధకుడు దానిని సాధన చేయుటద్వారా అనుభవించునని తెల్పెను.

ప్రశ్న - 'దీనివలన దుఃఖములను అతిక్రమించును' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ సుఖమును అనుభవించుచు ఆనందించు మనుష్యుడు ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతిక దుఃఖముల నుండి శాశ్వతముగ విముక్తుడగును. ఈ సుఖానుభవఫలము నిరతిశయసుఖస్వరూపుడైన సచ్చిదానంద పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తియని తెలుపబడినది. (5/21, 24:6/28) ఇదియే సాత్త్విక సుఖము.

ప్రశ్న - 'అగ్రే' అను పదము ఏ సమయమును సూచించును? సాత్త్విక సుఖము (మొదట) విషతుల్యముగా తోచుట యనగానేమి?

సమా - మనుష్యుడు సాత్త్విక సుఖప్రభావమును గూర్చి విని, దానిని పొందెడి కోరికతో తదుపాయములైన వివేక, వైరాగ్య, శమ, దమ, తితిక్షాది సాధనములయందు లగ్నమగు సమయమును 'అగ్రే' అను పదము సూచించును. ఒక బాలుడు విద్య యొక్క ప్రయోజనములను గూర్చి పెద్దలవలన విని విద్యాభ్యాసమునకు పూనుకొనును. కాని ఆరంభకాలమున విద్యప్రయోజనము వెంటనే అనుభవము లోనికి రాని కారణమున ఆటపాటలను వదలి విద్యవైపునకు మళ్ళుట అతనికి కష్టముగా (విషతుల్యముగా) తోచును. అదేవిధముగా సాత్త్విక సుఖమునకై సాధన చేయు మనుష్యునకు కూడ విషయసుఖములను త్యజించి, సంయమముతో వివేక వైరాగ్య శమ దమ తితిక్షాది సాధనములయందు నిమగ్నమగుట అత్యంత శ్రమగా, కష్టము కలిగించునదిగా తోచును. ఆరంభకాలమున సాత్త్విక సుఖసాధనము విషతుల్యముగా తోచుననుటలోని ఆంతర్యమిదియే.

ప్రశ్న - ఈ 'సాత్త్విక సుఖము' పరిణామమున 'అమృత తుల్యము' అని యనుటలోని విశేషమేమి?

సమా - సాత్త్విక సుఖప్రాప్తికై సాధన చేయగా చేయగా ఆ ధ్యానసాధన జనిత సుఖము పూర్తిగా అనుభవములోనికి వచ్చును. అప్పుడు అతనికి అది అమృతతుల్యముగా గోచరించును. అట్టి స్థితియందు ప్రాపంచిక భోగసుఖము లన్నియును తుచ్ఛములుగా, అగణ్యములుగా, దుఃఖరూపములుగా ప్రతీతములగును.

ప్రశ్న - పరమాత్మకు సంబంధించిన విషయములలో నిమగ్నమగుట వలన కలుగు సుఖమును 'సాత్త్విక సుఖము' అను యనుటలోని అంతర్యమేమి?

సమా - పై విధముగా అభ్యాసము చేయగా చేయగా నిరంతర పరమాత్మ ధ్యాన సాధనకు ఫలస్వరూపముగా అంతఃకరణము స్వచ్ఛమగుట వలన ఇట్టి సుఖానుభవము కలుగును. అందువలననే ఇది పరమాత్మ యందలి తత్పరత్వము వలన కలుగు సుఖమని తెల్పబడినది. ఈ సుఖము సాత్త్వికము. ఉత్తమోత్తమము, రాజస తామస సుఖములు యథార్థముగా సుఖములే గావు. అవి పేరుకు మాత్రమే సుఖములు. పరిణామమున దుఃఖరూపములు. కనుక హితమును కోరుకొను మానవుడు రాజసతామస సుఖములలో చిక్కుకొనక నిరంతరము సాత్త్విక సుఖమునందే నిమగ్నమై ఆనందించుచుండవలెను.

సంబంధము - భగవానుడు ఇప్పుడు 'రాజస సుఖలక్షణములను' తెలుపుచున్నాడు-

**విషయేంద్రియసంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38 ॥**

విషయేంద్రియ సంయోగాత్ = విషయేంద్రియ సంయోగమువలన
యత్, సుఖమ్ = ఏ సుఖము
(భవతి) = కలుగునో
తత్ = ఆసుఖము
అగ్రే = ప్రారంభ సమయమున (భోగానుభవ సమయమునందు)
అమృతోపమమ్ = అమృతతుల్యముగ గోచరించినను
పరిణామే = పరిణామమున
విషమ్, ఇవ = విషప్రాయమగును
(అతః = అందువలన)
తత్ = అది
రాజసమ్ = 'రాజస సుఖము' -అని
స్మృతమ్ = తలంపబడును.

**విషయేంద్రియసంయోగమువలన కలుగు సుఖము మొదట భోగానుభవ సమయమునందు అమృతతుల్యముగ అనిపించినను పరిణామమున అది విషతుల్యమగును. అట్టి సుఖమును 'రాజస సుఖ' మందురు.** **(38)**

ప్రశ్న - 'అగ్రే' అను పదము ఏ సమయమును తెలుపును? అట్టి సమయమున విషయేంద్రియ సంయోగము వలన కలుగు సుఖము అమృతతుల్యముగా అనిపించుట యనగానేమి?

సమా - రాజస సుఖప్రాప్తికై, మనుష్యుడు మనస్సు, ఇంద్రియముల ద్వారా విషయసుఖానుభవ ప్రారంభ సమయమును 'అగ్రే' అను పదము తెలుపును. మనుష్యుడు మనస్సు ఇంద్రియముల ద్వారా విషయ సంయోగము ఉన్నంత వఱకు అతడు ఆ సుఖమును అనుభవించు చుండును. ఆసక్తి కారణమున అతనికి అది అత్యంత ప్రియముగా తోచును. అట్టి సమయమున అతనికి దృగ్గోచరము కాని (అనుభవమునకు రాని), ఎట్టి సుఖమూ అతని తలపునకే రాదు. భోగ సమయమున ఆ సుఖము అమృతతుల్యముగా అనిపించుట యనగా నిదియే.

ప్రశ్న - 'రాజససుఖము పరిణామమున విషతుల్యము' అనుటలోని విశేషమేమి?

సమా - ఈ రాజససుఖభోగ పరిణామము విషమువలె దుఃఖప్రదమైనది. అది సుఖముగా అనిపించునేగాని యథార్థముగా సుఖము ఏమాత్రము గాదు. ఆసక్తితో గూడిన సుఖబుద్ధితో మనస్సు ఇంద్రియముల ద్వారా విషయ సంయోగము కలుగుట వలన వాటి సంస్కారములు అంతః కరణమునందే స్థిరపడును. అందువలన మనుష్యుడు మఱల ఆ విషయముల భోగప్రాప్తినే కోరుకొనును. దానికై అతడు అనేక విధములగు పాపకర్మలను ఆచరించును. ఆ పాపకర్మల ఫలములను అనుభవించుటకు కీట, పతంగ, పశుపక్ష్యాది నీచజన్మలను ఎత్తుచుండును. నరకములలో బడి భయంకరమైన యాతనలను అనుభవించును.

విషయములయందు ఆసక్తి అధికమగుట వలన మఱల అవి లభింపనప్పుడు దుఃఖానుభవము కలుగును. వాటితో వియోగము సంభవించినప్పుడును మిక్కిలి దుఃఖము ఏర్పడును. ఇతరుల అధిక సుఖసంపదలను చూచి మానవుడు ఈర్ష్యాగ్నిలో మాడిపోవును. భోగానుభవముల అనంతరము శరీరమునందలి బలము, వీర్యము, బుద్ధి, తేజస్సు, శక్తి మున్నగునవి నశించుటవలనను, అలసట చేతను, కష్టముల పాలగును. ఈవిధముగ ఇంకను అనేకములైన దుఃఖకరములగు పరిణామములు సంభవించును. కనుక విషయేంద్రియ సంయోగము వలన కలుగు క్షణిక సుఖములు అన్ని విధముల దుఃఖహేతువులే. రోగి జిహ్వాచాపల్యముచే వివిధములగు రుచులకు మఱిగి అనంతర పరిణామములను ఆలోచింపక అపథ్యములగు పదార్థములను యథేచ్ఛగా సేవించును. తత్ఫలితముగ రోగమధికమయి అతడు మృత్యువు వాతబడును. అట్లే మిడుత రూపాకర్షణచే సుఖార్థియై దీపమును సమీపించును. ఫలితముగ అది దీపాగ్నిలో కాలి మసియైపోవును. అదేవిధముగ విషయ లోలుడైన మనుష్యుడు కూడ మూర్ఖత్వముచే ఆసక్తికి వశుడై పరిణామములను పట్టించుకొనక సుఖార్థియై విషయ భోగములకు బానిసయగును. ఫలితముగా అనేక విధముల భయంకర దుఃఖముల పాలగును.

ప్రశ్న- ఇది 'రాజస సుఖము' అని యనుటలోని విశేషమేమి?

సమా - ఉపర్యుక్త లక్షణములు గల సుఖము ప్రతీత మాత్రము, క్షణికము, విషయాసక్తి వలన మాత్రమే అది సుఖముగా కనిపించును. ఆసక్తి రజోగుణ స్వరూపము. కనుక అది రాజసము. ఆసక్తి ద్వారా అది మనుజుని బంధించును. (14/7) కనుక శ్రేయస్సును కోరుకొనువాడు ఇట్టి (రాజస) సుఖమునందు చిక్కుకొనరాదు.

సంబంధము - ఇప్పుడు భగవానుడు తామస సుఖలక్షణములను తెల్పుచున్నాడు-

**యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।**
**నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39 ॥**

యత్, సుఖమ్ = ఏ సుఖము
అగ్రే = అనుభవ సమయమునను
చ = మఱియు
అనుబంధే, చ= పరిణామము నందును
ఆత్మనః, మోహనమ్ = ఆత్మను మోహింప జేయునదియుగునో
నిద్రాలస్య ప్రమాదోత్థమ్ = నిద్ర, సోమరితనము, ప్రమాదము (మోహము)ల వలన ఉత్పన్నమగునో
తత్ = ఆ సుఖము
తామసమ్ = 'తామససుఖము'-అని
ఉదాహృతమ్ = పేర్కొనబడును.

**నిద్ర, సోమరితనము, ప్రమాదము (మోహము)ల వలన ఉత్పన్నమగు సుఖమును తామససుఖము అనియందురు. ఇట్టి సుఖము భోగసమయమునందును, పరిణామమునందును ఆత్మను మోహింపజేయుచుండును. (39)**

ప్రశ్న - నిద్రాలస్య ప్రమాదజనిత సుఖమనగానేమి? అది భోగసమయమునందును, పరిణామమునందును ఆత్మను ఎట్లు మోహితమొనర్చును?

సమా - నిద్రాసమయమున మనస్సు, ఇంద్రియముల క్రియలు నిలిచిపోవును. కావున అలసటవలన కలుగు దుఃఖము తొలగిపోవుట వలన మనస్సు ఇంద్రియములకు విశ్రాంతి లభించి సుఖమనిపించును. దీనిని నిద్రాజనిత సుఖమందురు. ఈ సుఖము నిద్రావస్థయందు మాత్రమే (నిద్రలో నున్నంత వఱకు మాత్రమే) ఉండును. నిరంతరము ఉండదు. కనుక ఇది క్షణికము. ఇంతేగాక నిద్రాసమయమున మనస్సు, బుద్ధి, ఇంద్రియములు నిశ్చేష్ట స్థితిలో నుండును. వాటికి దేనిని గూడ అనుభవించు శక్తి ఉండదు. అందువలన ఈ సుఖము భోగసమయమునందు ఆత్మను అనగా అంతఃకరణమును, ఇంద్రియములను, వాటిని అభిమానించు పురుషుని మోహింపజేయును. ఈ సుఖాసక్తి కారణమున పరిణామమునందు మానవుడు అజ్ఞాన మయములైన వృక్షములు, పర్వతములు మొదలగు జడయోనులలో జన్మింపవలసివచ్చును. కనుక ఈ సుఖము పరిణామమునందును ఆత్మను మోహింప జేయునదియే.

ఇదేవిధముగ క్రియలన్నింటిని త్యజించి, సోమరిగా పడియుండు సమయమున మనస్సు, శరీరేంద్రియములకు శ్రమ లేకుండుటచే విశ్రాంతిగా తోచును. ఇదియే ఆలస్యజనిత సుఖము. నిద్రాజనిత సుఖమువలె ఇదియును మనస్సును ఇంద్రియములను జ్ఞానప్రకాశరహితములుగా కావించి భోగసమయములందు వాటిని మోహింపజేయును. మోహాసక్తుల కారణమున ఈ సుఖము మనుజుని జడజన్మలలో పడవేయును. కనుక పరిణామమునందును ఇది మోహమును కలిగించునదియే.

మనస్సును రంజింపజేయుటకై ఆసక్తివశమున వ్యర్థ క్రియలను చేయుటను, అజ్ఞానముతో కర్తవ్యకర్మలను అవహేళన చేయుచు వాటిని త్యజించుటను 'ప్రమాదము' అనియందురు. క్షణికమనోరంజనమునకై చేయబడు వ్యర్థక్రియలవలన మనస్సు ప్రసన్నతనందినట్లు అనిపించును. కర్తవ్యకర్మలను త్యజించుటవలన శ్రమ తొలగి ఆ సమయమున సుఖమును పొందినట్లు అనిపించును. దీనిని ప్రమాదజనిత సుఖమందురు. మనుష్యుడు ఏదో ఒక విధముగ మనస్సును రంజింపజేయు వ్యర్థక్రియలయందు నిమగ్నుడై యున్నప్పుడు అతనిలో కర్తవ్యాకర్తవ్య జ్ఞానము శూన్యమగును. వివేకశక్తి మోహాచ్ఛాదితమగుట వలన అతడు కర్తవ్యమును అవహేళన చేయును. ఈ కారణమువలన ప్రమాదజనిత సుఖము భోగసమయమున ఆత్మను మోహముచే కప్పివేయును. పైన పేర్కొనబడిన వ్యర్థక్రియలయందు అజ్ఞానాసక్తికి వశుడై మనుజుడు అబద్ధము, కపటము, హింసాది పాపకర్మలను చేయుచు, కర్తవ్యకర్మలను త్యజించును. తత్ఫలితముగ సూకర శునకాది నీచజన్మలను, నరకయాతనలను పొందును. కనుక ఈ సుఖము పరిణామమునగూడ ఆత్మను మోహింపజేయునదియే యగును.

ప్రశ్న - 'ఇది తామససుఖము' అని యనుటలోని విశేషమేమి?

సమా - నిద్రా ప్రమాదాలస్యములు మూడును తమోగుణ కార్యములే. **(14/17)** కనుక వీటినుండి ఉత్పన్నమగు సుఖము తామస సుఖము. ఇది కుహనా సుఖమేగాని యథార్థమైన సుఖము గాదు. నిద్రాలస్య ప్రమాదాదులలో సుఖబుద్ధిని కలిగించి, తమోగుణము మనుష్యుని బంధించును. **(14/8)** కావున శ్రేయస్సును కోరుకొనువాడు మోహకారకమూ, క్షణికమూ, ప్రతీతమాత్రమూ ఐన తామససుఖమునందు చిక్కుకొనరాదు.

*సంబంధము - ఈవిధముగ 18వ శ్లోకమునుండి 39వ శ్లోకము వఱకు వివిధ విషయములయొక్క సాత్త్విక, రాజస, తామస భేదములను సాకల్యముగా వర్ణించి ఈ ప్రకరణమును ముగించుటకు ముందు సమస్త సృష్టియు త్రిగుణాత్మకమేయని భగవానుడు తెలుపుచున్నాడు-*

**న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।**
**సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్ త్రిభిర్గుణైః ॥ 40 ॥**

ప్రకృతిజైః = ప్రకృతినుండి ఉత్పన్నములైన
ఏభిః, త్రిభిః, గుణైః = ఈ మూడు గుణములచేత
ముక్తమ్ = విడువబడినది
యత్ = ఏది (ఏ ప్రాణి)
స్యాత్ = అగునో
తత్, సత్త్వమ్ = ఆ ప్రాణి
పృథివ్యామ్, వా = భూమియందుగాని
దివి, వా = ఆకాశమునందుగాని
దేవేషు = దేవతలయందుగాని
పునః = మఱి ఏయితర లోకములయందు గాని
న, అస్తి = లేదు (ఉండదు)

**పృథివియందు గాని, ఆకాశమునందుగాని, దేవతలయందుగాని, మఱేయితర లోకములయందు గాని, ప్రకృతినుండి ఉత్పన్నములైన ఈ మూడు గుణములు లేకుండ ఏ ప్రాణియు ఉండదు.(40)**

ప్రశ్న - 'పృథివ్యాం, దివి, దేవేషు' అను పదములు వేర్వేఱుగా దేనిని గూర్చి తెలుపును? 'పునః' అను పదప్రయోగము యొక్క విశేషమేమి?

సమా - భూలోకమునుండి పాతాళము వఱకు గల అధోలోకములను, వీనియందుగల సమస్త స్థావర జంగమ ప్రాణులను, పదార్థములను 'పృథివ్యాం' అను పదము తెల్పును. అట్లే 'దివి' అను పదము భువికి పైనున్న అంతరిక్షము మొదలుకొని సమస్త ఊర్ధ్వ లోకములను, అందుగల సమస్త ప్రాణులను, పదార్థములను తెలుపును. సమస్త దేవతలను, వారి లోకములను వారికి సంబంధించిన సకల పదార్థములను 'దేవేషు' అను పదము తెలుపును. ఇవిగాక సృష్టియందుగల ఇతర సర్వప్రాణులను, వస్తువులను గూడ తెలుపుటకు పునః అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - 'సత్త్వము' అను పదము దేనిని తెలుపును? ప్రకృతినుండి ఉత్పన్నమైన వానిలో 'ఈ మూడు గుణములు లేనిది ఏదియును లేదు' అని యనుటలోని విశేషమేమి?

సమా - 'సత్త్వము' అను పదము సమస్తప్రాణులను, వివిధపదార్థములను తెలుపును. పదార్థములన్నియును ప్రకృతి జనితములైన సత్త్వరజస్తమోగుణముల కార్యములు. ఈ గుణత్రయ సంబంధముచే ప్రాణులు నానాజన్మలను ఎత్తుచుండును (13/21). కనుక పృథ్వి, అంతరిక్షము మఱియు దేవలోకములయందును, అట్లే ఇతరలోకములన్నింటి యందును ఈ మూడు గుణములు లేనివిగాని, వీటికి అతీతములైనవిగాని ఏ ప్రాణియు, పదార్థమూ ఉండవు. సమస్త జడవర్గమూ గుణముల కార్యమేయగుట వలన గుణమయమే. ప్రాణులన్నియును గుణములతో, గుణముల కార్యరూపములైన పదార్థములతో సంబంధము కల్గియుండుట వలన అవియును గుణయుక్తములే. ప్రకృతినుండి ఉత్పన్నమైన 'ఈ మూడు గుణములు లేనిది' ఏదియును లేదు - అని యనుటలోని ఆంతర్యమిదియే.

ప్రశ్న - సృష్టియందు గుణాతీత పురుషులు గూడ ఉందురు. ఐనచో గుణరహితమైన ప్రాణి ఏదియును సృష్టిలో లేదనుట యెట్లు పొసగును?

సమా - లోకవ్యవహారదృష్టిలో గుణాతీత పురుషులు సృష్టియందున్నను యథార్థముగా వారి దృష్టిలో సృష్టియే లేదు. అంతేగాదు సృష్టి (శరీరమునందు) యందు వారి ఉనికియే లేదు. వారు పరమాత్మయందే అభిన్న భావముతో నిత్యస్థితులై యుందురు. కనుక వారు పరమాత్మ స్వరూపులే. అందువలన వారిని సామాన్య ప్రాణులుగా లెక్కించుటకు వీలులేదు. మనస్సు, బుద్ధి, ఇంద్రియాదుల సంఘాత(సమూహ) రూపమైన శరీరము అందఱికిని ప్రత్యక్షముగా కనబడునది. కావున వారినిగూడ 'ప్రాణులని పిలుచుట'లో ఎట్టి 'అభ్యంతరమూ' ఉండదు. ఏలనన ఈ సంఘాతము (శరీరము) గుణముల కార్యమేగదా! కనుక దీనిని గుణాతీతమని చెప్పుట ఎట్లు? కనుక సృష్టి యందలి ఏ ప్రాణియు, లేక ఏ పదార్థము త్రిగుణ రహితమైనది ఏదియును లేదని చెప్పుటలో ఎట్టి దోషమూలేదు.

*సంబంధము - ఈ అధ్యాయముయొక్క మొదటి శ్లోకమున అర్జునుడు సన్న్యాసము, త్యాగముల తత్త్వములను వేర్వేఱుగా తెలిసికొనగోరెను. కనుక ఈ రెండింటి తత్త్వములను భగవానుడు మొట్టమొదట ఈ విషయములకు సంబంధించిన విద్వాంసుల అభిప్రాయములను తెలిపెను. పిదప నాలుగు నుండి 12వ శ్లోకము వఱకు తన అభిప్రాయములను అనుసరించి త్యాగము, త్యాగియొక్క లక్షణములను వివరించెను. తదనంతరము 13 నుండి 17వ శ్లోకము వఱకు సన్న్యాస (సాంఖ్య) స్వరూపమును వర్ణించెను. సన్న్యాసమునందు సహాయకమైన సత్త్వగుణమును పెంపొందించుకొనుటకును, తద్విరుద్ధములైన రజస్తమోగుణములను త్యజించుటకును ఆదేశించెను. 18వ శ్లోకము నుండి 40వ శ్లోకము వఱకును గుణత్రయము ననుసరించి జ్ఞాన, కర్మ, కర్త్రాదుల వైవిధ్యములను విశదీకరించెను. చివఱకు సృష్టియంతయు త్రిగుణమయమేయని తెలుపుచు ఆ విషయమును ముగించెను.*

*త్యాగస్వరూపమును తెలుపు సమయమున నియతకర్మలను భౌతికముగ త్యజించుట ఉచితము కాదనియు (18/7) నియత కర్మలను ఆచరించుచూ వాటియందలి ఆసక్తినీ, వాటి ఫలేచ్ఛనూ త్యజించుటయే నిజమైన త్యాగమనియూ పేర్కొనెను. (18/9) కాని ఎవరెవరికి ఏయే కర్మలు నియతములు అను విషయమును అచట తెలుపలేదు. కావున నియత కర్మల స్వరూపములను, త్యాగమను పేరుతో వర్ణింపబడిన కర్మయోగమునందు భక్తిప్రాముఖ్యమును దానియొక్క ఫల రూపమైన పరమసిద్ధిప్రాప్తి మార్గములను తెలుపుటకై మఱల అదే త్యాగరూపకర్మ యోగప్రకరణమును ఆరంభించుచు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల స్వాభావిక నియతకర్మలను వివరింతునని ప్రస్తావించుచున్నాడు-*

**బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప ।**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥ 41 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పరంతప! | = ఓ పరంతపా! (అర్జునా) | చ | = అట్లే | | | | |
| బ్రాహ్మణ క్షత్రియవిశామ్ | = బ్రాహ్మణక్షత్రియ వైశ్యులయొక్క | శూద్రాణామ్ | = శూద్రులయొక్క | | | | |
| | | కర్మాణి | = కర్మలు | | | | |
| | | స్వభావప్రభవైః | = వారివారి స్వభావములను అనుసరించి ఏర్పడిన | గుణైః | = గుణములనుబట్టి | ప్రవిభక్తాని | = విభజింపబడినవి |

**ఓ పరంతపా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కర్మలునూ, అట్లే శూద్రుల కర్మలునూ వారివారి స్వాభావికములైన గుణములనుబట్టి విభజింపబడియున్నవి. (41)**

ప్రశ్న - 'బ్రాహ్మణ క్షత్రియవిశాం' అను సమాసము ద్వారా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను కలిపి ఒకటిగను, శూద్రాణాం అను పదము ద్వారా శూద్రులను వేఱుగను తెలుపుటలోని ఆంతర్యమేమి?

సమా - బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అను మూడు వర్ణములవారును 'ద్విజులు'. యజ్ఞోపవీతధారణమునకును, వేదాధ్యయనమునకును, యజ్ఞాది వైదికకార్మాచరణములకును వీరికే అధికారము గలదు. ఈ కారణమున ఈ మూడు వర్ణముల వారిని కలిపి, ఒకే సమాసము ద్వారా తెల్పుట జరిగినది. శూద్రులు ద్విజులు కారు. కనుక యజ్ఞోపవీతధారణముకును, వేదాధ్యయనమునకును, యజ్ఞాది వైదిక కర్మాచరణములకును వారికి అధికారము లేదు. 'శూద్రాణాం' అను పదముద్వారా వారిని వేఱుగా చూపుటలోని ఆంతర్యమిదియే.

ప్రశ్న - 'గుణైః' అను విశేష్యమునకు 'స్వభావప్రభవైః' అను విశేషణమును ప్రయోగించుటలో గల విశేషమేమి? ఈ గుణముల ద్వారా నాలుగు వర్ణములవారి కర్మల విభజన చేయుబడినది - అని అనుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - ప్రాణులు జన్మజన్మాంతరములయందు చేసిన కర్మల సంస్కారముల రూపమునే వారి స్వభావమందురు. ఈ స్వభావములకు అనుగుణముగ వారి (ప్రాణుల) అంతః కరణములయందు సత్త్వరజస్తమోగుణముల వృత్తులు ఏర్పడును. ఈ విషయమును స్పష్టపఱచుటకే 'గుణైః' అను పదముతో 'స్వభావప్రభవైః' అను విశేషణము

ప్రయోగింపబడినది. ఈ గుణవృత్తులను అనుసరించియే బ్రాహ్మణాది వర్ణములలో మనుష్యులు జన్మింతురు. ఈ కారణమువలన ఆయా గుణములను బట్టియే శాస్త్రములయందు నాలుగు వర్ణముల వారి కర్మల విభజన జరిగినది. స్వభావముచే సత్త్వగుణము అధికముగా గలవారు బ్రాహ్మణులు. వారి స్వాభావికకర్మలు శమ దమాదులని చెప్పబడినవి. సత్త్వమిశ్రితరజోగుణము అధికముగా గలవారు క్షత్రియులు. వారి స్వాభావిక కర్మలు శౌర్యము, వీరత్వము, తేజస్సు మున్నగు లక్షణములతో గూడినవి. తమోమిశ్రితమైన రజోగుణము అధికముగా గలవారు వైశ్యులు. వారి స్వాభావిక కర్మలు కృషిగోరక్షాదులని తెల్పబడినవి. రజోమిశ్రిత తమోగుణము అధికముగా కలవారు శూద్రులు. పైమూడు వర్ణముల వారి సేవలు చేయుటయే వీరి స్వాభావిక కర్మలు. ఈ విషయము 4వ అధ్యాయమునందలి 13వ శ్లోక వ్యాఖ్యానమున సమగ్రముగా వివరింపబడినది.

*సంబంధము* - పూర్వశ్లోకమున ప్రస్తావింపబడిన రీతిగా మొదట బ్రాహ్మణుల స్వాభావిక కర్మలను భగవానుడు తెలుపుచున్నాడు-

**శమో దమస్తపః శౌచం క్షాంతిరార్జవమేవ చ ।**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్ ॥ 42 ॥**

శమః = శమము (మనోనిగ్రహము)
దమః = దమము (ఇంద్రియ నిగ్రహము)
తపః = తపస్సు (ధర్మములను పాటించుటలో ఎదురగు కష్టములను సహించుట)
శౌచమ్ = బాహ్యాభ్యంతరముల శుచిత్వము
క్షాంతిః = ఇతరుల అపరాధములను క్షమించుట
ఆర్జవమ్ = ఋజుమార్గజీవనము
ఆస్తిక్యమ్ = వేదశాస్త్రముల యందును, ఈశ్వరుని యందును, పరలోకాదుల యందును విశ్వాసము కలిగియుండుట
జ్ఞానమ్ = వేదశాస్త్రముల అధ్యయనము, అధ్యాపనము
చ = మఱియు
విజ్ఞానమ్ ఏవ = పరతత్త్వానుభవము (ఇవియన్నియును)
బ్రహ్మకర్మ స్వభావజమ్ = బ్రాహ్మణుల స్వాభావిక కర్మలు

**అంతఃకరణనిగ్రహము(శమము), ఇంద్రియములను వశమునందుంచుకొనుట (దమము), ధర్మములను పాటించుటలో ఎదురగు కష్టములను సహించుట, బాహ్యాభ్యంతరముల శుచిత్వము, ఇతరులఅపరాధములను క్షమించుట, ఋజుమార్గ జీవనము, (మనశ్శరీరేంద్రియముల సరళత్వము) వేదశాస్త్రములయందును ఈశ్వరునియందును పరలోకాదులయందును, విశ్వాసమును కలిగియుండుట, వేదశాస్త్రములఅధ్యయనము, అధ్యాపనము, పరతత్త్వానుభవము - ఇవి యన్నియును బ్రాహ్మణులస్వాభావికకర్మలు. (42)**

ప్రశ్న - 'శమము' అనగానేమి?

సమా - అంతఃకరణమును వశమునందుంచుకొని, దానిని విక్షేపరహితమొనర్చి అనగా శాంతపఱచి, సాంసారిక విషయచింతనమును త్యజించుటనే **'శమము'** అని యందురు.

ప్రశ్న - 'దమము' అనగా ఏమి?

సమా - ఇంద్రియములను అన్నింటిని వశపఱచుకొనుటను, అట్లు వశమైన ఇంద్రియములను బాహ్యవిషయములనుండి మఱల్చి, పరమాత్మ ప్రాప్తి సాధనలయందు లగ్నము చేయుటను **'దమము'** అని యందురు.

ప్రశ్న - ఇచట 'తపస్సు' అను పదమునకు అర్థమేమి?

సమా - స్వధర్మాచరణమునందు సంభవించు కష్టములను సహించుట - అనగా అహింసాది మహావ్రతములను పాటించుట, భోగవస్తువులను త్యజించి, నిరాడంబరముగా

జీవించుట, ఏకాదశి మొదలగు ఉపవాసదీక్షలను నడపుట, వనములలో నివసించుట, - ఇవి యన్నియు 'తపస్సు'లోని భాగములు.

ప్రశ్న - 'శుచిత్వము' అనగానేమి?

సమా - 16వ అధ్యాయమునందలి మూడవ (3వ) శ్లోకమున 'శౌచము' అను పదము యొక్క వ్యాఖ్యానమున బాహ్యశుద్ధినిగూర్చి తెలుపుట జరిగినది. మొదటి శ్లోకమున 'సత్త్వశుద్ధి' అను పేరుతో అంతఃకరణశుద్ధి వివరింపబడినది. ఈ రెండింటి సమన్వయ రూపమే అనగా బాహ్యాభ్యంతరముల 'శౌచము'. 13వ అధ్యాయమునందలి 7వ శ్లోకమున గూడ ఈ శుద్ధిని గూర్చియే వర్ణింపబడినది. మనస్సును, శరీరేంద్రియములను, వాటి ద్వారా ఆచరింపబడు క్రియలను పవిత్రముగా నుంచుట, వాటియందు ఏవిధమైన అశుద్ధిని చేరనీయకుండుటనే 'శౌచము' అని యందురు.

ప్రశ్న - 'క్షాంతి' అనగానేమి?

సమా - ఇతరులు చేసిన అపరాధములను క్షమించుటయే 'క్షాంతి' యనబడును. 10వ అధ్యాయమునందలి 4వ శ్లోక వ్యాఖ్యానమునందు 'క్షమ' అనుపేరుతోడను, 13వ అధ్యాయమునందలి 7వ శ్లోకవ్యాఖ్యానమున 'క్షాంతి' అను పేరుతోడను దీని వివరణము చక్కగా ఇయ్యబడినది.[1]

1) ఒకానొక సమయమున గాధిసుతుడైన విశ్వామిత్ర మహారాజు వసిష్ఠ మహర్షి ఆశ్రమమునకు చేరెను. అతని వెంట పెద్దసంఖ్యలో సైన్యము గూడ వచ్చెను. సేనాసమేతుడై వచ్చిన విశ్వామిత్రునకు 'నందిని' అని కామధేనువు అనుగ్రహముచే వసిష్ఠమహర్షి మృష్టాన్నభోజనములను సమకూర్చెను. రత్నాభరణవస్త్రాదులను సమర్పించెను. అద్భుతశక్తులు గల 'నందిని' పై విశ్వామిత్రునకు మనసు పడి, దానిని తనకిమ్మని వసిష్ఠుని ప్రార్థించెను. అందులకు ఆమోదింపలేక వసిష్ఠుడు ఇట్లు విన్నవించెను. "నేను దైవసేవలను, అతిథి సత్కారములను, పితృకార్యక్రమములను, యజ్ఞయాగాదులను దీని యనుగ్రహము వలననే నిర్వహించుచున్నాను. కనుక దీనిని ఇయ్యజాలను." - విశ్వామిత్రుడు తన సేనాబలమును, శస్త్రాస్త్రబలములను చూచుకొని గర్వముతో ఆ 'నందిని'ని బలవంతముగా తీసికొని వెళ్లుటకు పూనుకొనెను. అంతట నందినీ ధేనువు దుఃఖాశ్రువులతో ఇట్లు పలికెను. "మహాత్మా! నిర్దయులైన విశ్వామిత్రుని సైనికులు మిక్కిలి క్రూరముగా నన్ను కొరడాలతో కఱ్ఱలతో బాధించుచున్నారు. మీరు వీరి ఈ యత్యాచారములను ఎందులకు ఉపేక్షించుచున్నారు?"- అప్పుడు వసిష్ఠుడు ఇట్లనెను-

**క్షత్రియాణాం బలం తేజో, బ్రాహ్మణానాం క్షమా బలమ్ । క్షమా మాం భజతే యస్మాత్ గమ్యతాం యది రోచతే॥**

(మహాభారతము - ఆది - *175/28*)

"క్షత్రియుల యొక్క బలము తేజస్సు, బ్రాహ్మణుల బలము క్షమ. నేను క్షమను వీడలేను. నీకు ఇష్టమైనచో వెళ్ళుము." నందిని ఇట్లనెను. "మీరు త్యాగము చేయకున్నచో బలవంతముగా నన్ను ఎవ్వరును తీసికొని పోజాలరు" - వసిష్ఠుడు ఇట్లు సమాధానమిచ్చెను. "నేను త్యాగము చేయను. నీవు ఇచట ఉండగలిగినచో ఉండుము."

పిమ్మట నందిని రౌద్రరూపమును దాల్చెను. దాని వాలమునుండి నిప్పులు కురియసాగెను. పెక్కుమంది మ్లేచ్ఛులు దానినుండి బయల్వెడలిరి. విశ్వామిత్రుని సైనికులు నిశ్చేష్టులైరి. నందినీసైన్యము విశ్వామిత్రుని సైనికులలో ఏ ఒక్కనిని గూడ హతమార్చలేదు. కాని వారందఱును భయభ్రాంతులై పిక్కబలము చూపిరి. విశ్వామిత్రుని ఆదుకొనుటకు ఒక్కరును నిలిచియుండలేదు. అతడు మిక్కిలి ఆశ్చర్యచకితుడై ఇట్లుపలికెను-

**ధిగ్బలం క్షత్రియబలం, బ్రహ్మతేజోబలం బలమ్.** (మహా.భా.ఆది *175/44*)

"ధిక్! క్షత్రియ బలము బలమే గాదు. నిజముగా బ్రహ్మతేజోబలమే బలము." పిదప శాపవశమున రాక్షసుడైన కల్మాషపాదుడనురాజు విశ్వామిత్రుని ప్రేరణచే వసిష్ఠుని పుత్రులందఱిని హతమార్చెను. ఐనను వసిష్ఠుడు చలింపలేదు. ప్రతీకారమునకు పూనుకొనలేదు.

ఇక రామాయణాంతర్గత కథాసందర్భమును పరిశీలింతము - తదనంతరము విశ్వామిత్రుడు రాజ్యమును, త్యజించి, వేలకొలది సంవత్సరములు తీవ్రముగా తపము నాచరించి, 'రాజర్షి' 'మహర్షి' పదములను పొంది కడకు 'బ్రహ్మర్షి' అయ్యెను. దేవతల కోరిక మేరకు క్షమాశీలుడైన వసిష్ఠ మహర్షి ఆతనిని బ్రహ్మర్షిగా అంగీకరించెను. పిమ్మట - **విశ్వామిత్రోఽపి ధర్మాత్మా లబ్ధ్వా బ్రాహ్మణ్య ముత్తమమ్ । పూజయామాస బ్రహ్మర్షిం వసిష్ఠం జపతాం వరమ్ ॥**

*(వాల్మీకి రామాయణం, 1/65/27)*

ధర్మాత్ముడైన విశ్వామిత్రుడు కూడ ఉత్తమమైన బ్రాహ్మణ పదమును పొంది, మంత్రజపనిష్ఠాగరిష్ఠుడును, బ్రహ్మర్షియు ఐన శ్రీ వసిష్ఠుని పూజించెను.

ప్రశ్న - 'ఆర్జవం' అనగానేమి?

సమా - మనస్సు, శరీరేంద్రియములను నిర్మలముగా ఋజుమార్గమున నుంచుట అనగా మనస్సునందు ఎట్టి దురాగ్రహము, వక్రత్వము లేకుండుట, మనస్సునందలి భావములను ఇంద్రియముల ద్వారా ప్రకటించుట, శరీరము నందు ఏవిధమైన ఏహ్యాభావము లేకుండుట మున్నగునవి అన్నియును 'ఆర్జవము'లో భాగములే.

ప్రశ్న - 'ఆస్తిక్యం' అనగానేమి?

సమా - ఆస్తిక్యం అను పదము ఆస్తికతను తెలుపును. వేదశాస్త్రములయందును, ఈశ్వరునియందును, పరలోకము నందును సంపూర్ణ విశ్వాసము కలిగియుండుట, వేద శాస్త్రముల యొక్కయు, మహాత్ముల యొక్కయు వచనములను యథార్థములని భావించుట, ధర్మాచరణము నందు దృఢమైన విశ్వాసమును కలిగియుండుట - ఇవి యన్నియును ఆస్తికత యొక్క లక్షణములు.

ప్రశ్న - 'జ్ఞానము' అనగానేమి?

సమా - వేదశాస్త్రములను శ్రద్ధాదరములతో అధ్యయన-అధ్యాపనములను గావించుటను, వాటియందు పేర్కొనబడిన ఉపదేశములను చక్కగా అవగాహనము చేసికొనుటను 'జ్ఞానము' అనియందురు.

ప్రశ్న - 'విజ్ఞానం' అనగానేమి?

సమా - వేదశాస్త్రములలో ప్రవచింపబడిన, మహాపురుషుల నుండి వినిన, వివిధ సాధన మార్గములద్వారా పరమాత్మ స్వరూపమును సాక్షాత్కరింపజేసికొనుటనే 'విజ్ఞానము' అని యందురు.

ప్రశ్న - ఇవి యన్నియును బ్రాహ్మణుల "స్వాభావిక కర్మలు" అనుటలోని విశేషమేమి?

సమా - బ్రాహ్మణునియందు కేవలము సత్త్వగుణము ప్రధానముగా ఉండును. కావున అతనికి పై కర్మలయందు స్వాభావిక ప్రవృత్తి యుండును. పై కర్మలను ఆచరించుటకు అతని స్వభావము అనుకూలముగా నుండును. ఈ కర్మలను ఆచరించుటలో అతనికి ఎట్టి క్లిష్టస్థితి ఏర్పడినను దానిని అతడు ఇబ్బందిగా తలంపడు. ఈ కర్మలయందు అనేక సామాన్యకర్మలు గూడ వర్ణింపబడినవి. క్షత్రియాది ఇతర వర్ణములవారికి అవి స్వాభావిక కర్మలు కావు. కాని పరమాత్మ ప్రాప్తికి అందఱికిని అధికారము కలదు. వారికి అవి ప్రయత్న సాధ్యకర్తవ్యకర్మలు.

ప్రశ్న - మనుస్మృతియందు అధ్యయనము, అధ్యాపనము, యజనము, యాజనము, దానము, ప్రతిగ్రహము అను షట్కర్మలు బ్రాహ్మణులు ఆచరింపవలసిన కర్మలుగా పేర్కొనబడినవి.[1] మఱి ఇచట (ఈ శ్లోకమున) శమదమాది సామాన్య ధర్మములనే బ్రాహ్మణ ధర్మములుగా చెప్పుట జరిగినది. ఈ వైవిధ్యమునకు సమన్వయమెట్లు?

సమా - ఇచట తెలుపబడినవి కేవలము సాత్త్విక కర్మలు. కనుక ఇవి బ్రాహ్మణ (సాత్త్విక) స్వభావమునకు మిక్కిలి సన్నిహితములైనవి. కావున బ్రాహ్మణస్వాభావిక కర్మలయందు ఇవి మాత్రమే చేర్చబడినవి. ఇంకను విస్తారముగా చెప్పబడలేదు. ఇవిగాక మనుస్మృతి మొదలగు వాటియందు అదనముగా చెప్పబడినవి గూడ వీటితోపాటు ఉన్నట్లే పరిగణింపవలెను.

సంబంధము - ఈ విధముగా బ్రాహ్మణుల స్వాభావిక కర్మలను తెలిపిన పిమ్మట ఇప్పుడు భగవానుడు క్షత్రియుల స్వాభావిక కర్మలను తెలుపుచున్నాడు-

**శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।**
**దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| శౌర్యమ్ | = శౌర్యము | యుద్ధే, అపి | = యుద్ధమునందును | ఈశ్వర భావః | = స్వామిభావము మొదలగునవి అన్నియును |
| తేజః | = తేజస్సు | అపలాయనమ్ | = వెన్ను చూపకుండుట | | |
| ధృతిః | = ధైర్యము | దానమ్, చ | = దానము(ల)ను చేయుట మఱియు | క్షాత్రమ్, స్వభావజమ్, కర్మ | = క్షత్రియుల స్వాభావిక కర్మలు |
| దాక్ష్యమ్, చ | = దక్షత మఱియు | | | | |

1) అధ్యాపనమధ్యయనం యజనం యాజనం తథా । దానం ప్రతిగ్రహం చైవ, బ్రాహ్మణానామకల్పయత్ ॥ *(మనుస్మృతి 1/88)*

**శౌర్యము, తేజస్సు, ధైర్యము, దక్షత, యుద్ధమునందు వెన్నుచూపకుండుట, దానములనిచ్చుట, స్వామిభావముతో ప్రజలను ధర్మపరాయణులనుగా చేయుచు పరిపాలించుట మొదలగునవి యన్నియును క్షత్రియులస్వాభావికకర్మలు.** **(43)**

ప్రశ్న - 'శౌర్యము' 'వీరత్వము' అనగానేమి?

సమా - శత్రువెంత బలవంతుడైనను న్యాయముగా ఎదుర్కొనుటకు భయపడకుండుట, ధర్మయుద్ధమునకు ఉత్సాహము కలిగియుండుట, యుద్ధముచేయు సమయమున సాహసముతో గంభీరముగా పోరాడుట, ఇవి యన్నియును శూరత్వ వీరత్వ లక్షణములు. భీష్మపితామహుని జీవన విధానమే ఇందులకు సరియైన ఉదాహరణము.[1]

ప్రశ్న - "తేజస్సు" అనగా నేమి?

1) అజన్మబ్రహ్మచారియైన భీష్మపితామహునియందు క్షత్రియోచిత గుణములు అన్నియును ప్రస్ఫుటముగా గిలవు. క్షత్రియుల గర్వమణంచిన పరశురాముని కడ అతడు శస్త్రవిద్యలను నేర్చెను. కాశీరాజు కూతురైన అంబను వివాహమాడుమని పరశురాముడు ఆయనను ఆదేశించినప్పుడు భీష్ముడు తన సత్యవ్రత పాలనకై అతి వినమ్రతతో గురుని ఆదేశమును త్రోసిపుచ్చెను. భీష్ముని సమాధానమును అంగీకరింపక పరశురాముడతనిని భయపెట్టసాగెను. దానికతడు స్పష్టముగా ప్రత్యుత్తరమును ఇచ్చెను-

న భయాత్, నాప్యనుక్రోశాత్, నార్థలోభాత్, న కామ్యయా । క్షాత్రం ధర్మమహం జహ్యామితి మే వ్రతమాహితమ్ ॥
యచ్చాపి కత్థసే రామ! బహుశః పరివత్సరే । నిర్జితాః క్షత్రియా లోకే మయైకేనేతి తచ్ఛృణు ॥
న తదా జాతవాన్ భీష్మః క్షత్రియో వాపి మద్విధః । పశ్చాజ్జాతాని తేజాంసి తృణేషు జ్వలితం త్వయా ॥
వ్యపనేష్యామి తే దర్పం యుద్ధే రామ న సంశయః । *(మహా. భార.ఉద్యోగ.178)*

"భయము, దయ, ధనలోభము, కోరికలు మొదలగు వాటికొఱకై నేను నా క్షాత్రధర్మమును విడనాడజాలను. ఇది నాకు దృఢమైన వ్రతము. ఓ పరశురామా! మీరు అనేక సత్సరములు ఒంటరిగా క్షత్రియులను పెక్కుమార్లు (21 సార్లు) సంహరించినట్లు లోకుల యెదుట ప్రతాపవచనములు పలికితిరి. దానికి నా సమాధానము వినుడు. ఆ కాలమున భీష్ముడు గాని, భీష్మునితో సమానుడైన క్షత్రియుడుగాని జన్మింపలేదు. మీ ప్రతాపమును గడ్డిపరకలపైననే చూపించితిరి. తేజస్సు గల క్షత్రియులు ఆ తర్వాతనే జన్మించిరి. మీ దర్పమును యుద్ధమునందు నిస్సందేహముగ దూరమొనర్చెదను."

పరశురాముడు కుపితుడయ్యెను. యుద్ధము ఆరంభమయ్యెను. వరుసగా 23 దినములు భయంకరముగా పోరాటము సాగెను. కాని పరశురాముడు భీష్ముని జయింపలేకపోయెను. చివరకు నారదాది దేవర్షులు, భీష్ముని తల్లియైన గంగాదేవి ప్రత్యక్షమై, అడ్డుపడగా పరశురాముడు ధనుస్సును త్యజించెను. పిమ్మట యుద్ధము ఆగిపోయెను. భీష్ముడు రణమునందు మున్ముందుగా శస్త్రమును విడలేదు. వెన్ను చూపలేదు. (మహా. భార. ఉద్యోగ-185)

18 దినములు సాగిన మహాభారత సంగ్రామమున 10 దినముల వఱకు భీష్ముడొక్కడే కౌరవ పక్షమున సేనాధిపతిగా నిలిచి యుద్ధమును నడిపెను. మిగిలిన 8 దినములలో పెక్కుమంది సేనాపతులు మారిరి.

శ్రీకృష్ణుడు మహాభారత యుద్ధమున 'ఆయుధమును చేపట్టనని' ప్రతిజ్ఞ చేసియుండెను. భగవానునిచే శస్త్రగ్రహణము చేయించెదనని భీష్ముడు ప్రతిన బూనినట్లు భక్తకవి సూరదాసు వర్ణించియుండెను-

ఆజ్ జో హరిహి న శస్త్ర గహాఊఁ । తౌ లాజౌ గంగా జననీ కో, శాంతను సుత న కహాఊఁ ॥
స్యందన ఖండి మహారథ ఖండౌ, కపిధ్వజ సహిత డులాఊఁ । ఇతీ న కరౌఁ సపథ మోహి హరి కీ, క్షత్రియ గతిహి న పాఊఁ ॥
పాండవదల్ సనముఖ హ్వై ధాఊఁ, సరితా రుధిర బహాఊఁ । సూరదాస రనభూమి విజయ బిన, జియత న పీఠ దిఖాఊఁ ॥

"నేడు శ్రీకృష్ణభగవానునిచే రణరంగమున ఆయుధము పట్టింపకున్నచో మా తల్లియైన గంగాదేవికి తండ్రియైన శంతనునకును అప్రతిష్ఠ తెచ్చిన వాడనగుదును. ఈ దివ్యమైన మహారథమును కపిధ్వజముతో కూడ భగ్నమొనర్చెదను. ఇట్లు చేయనిచో క్షత్రియ గతినే పొందను - ఇది భగవంతునిపై ఆన - " పాండవ సేనను ఎదిరించి, నెత్తుటేఱులను ప్రవహింపజేయుదును. విజయమును చేపట్టక సమరభూమి నుండి మఱలను - అని సూరదాసు పచించుచున్నాడు. (సూరదాసు చేసిన ఈ వర్ణన సంస్కృత మహాభారతమున లేదు)

సమా - తేజస్సనగా ఒక శక్తి. తేజస్సుగలవాడు తేజస్వి. ఈ శక్తి ప్రభావమున అతడు ఇతరుల యొత్తిడికి లొంగడు. కర్తవ్యపాలనమునుండి ఎన్నడును విముఖుడు గాడు. ఇతరులును ఈ తేజశ్శక్తి గలవాని యెదుట న్యాయవిరుద్ధముగా ప్రవర్తించుటకు గాని, ఇతనికి ప్రతికూలముగా వ్యవహరించుటకుగాని భయపడుచుందురు. ఈ శక్తినే ప్రతాపము, ప్రభావము అనియు అందురు.

ప్రశ్న - ధైర్య మనగానేమి?

సమా - తీవ్రమైన సంకటములు సంభవించినప్పుడు - అనగా యుద్ధమున శరీరమందంతటను తీవ్రమైన గాయములు ఏర్పడుట, పుత్రపౌత్రాదులు మరణించుట, సర్వసంపదలను కోల్పోవుట - అట్లే ఇతరములైన క్లేశములు ఎదురైనప్పుడు వ్యాకులుడు కాకుండుటను, తన కర్తవ్యములనుండి విచలితుడు గాకుండ న్యాయానుకూలముగా కర్తవ్య పాలనము నందు నిమగ్నుడై యుండుటను 'ధైర్యము' అని యందురు.

ప్రశ్న - దక్షత అనగానేమి?

---

మహాభారతమున ఈ ఘట్టము ఈ విధముగా చెప్పబడినది. యుద్ధము ప్రారంభింపబడిన పిమ్మట మూడవ దినమున భీష్మపితామహుడు రణమున మిక్కిలి విజృంభించి పోరాడసాగెను. అప్పుడు కృష్ణభగవానుడు రోషమును బూని పగ్గములు వదలి, సూర్యప్రభాభాసమానమైన చక్రమును చేత ధరించి త్రిప్పుచు భూమిపైకి దుమికెను. అచటనున్న వారందఱును ఆ భీకర దృశ్యమునకు భయకంపితులై, ఉచ్చస్వరముతో హాహాకారములు గావించిరి. భగవానుడు ప్రళయకాలాగ్నివలె భీష్మునిపైకి లంఘించెను. చక్రధారియై తన మీదికి వచ్చుచున్న శ్రీకృష్ణుని గాంచి, భీష్ముడు ఏమాత్రము భయపడలేదు. అతడు నిశ్చల భావముతో నారిని సంధించుచు ఇట్లు పలికెను. "ఓ దేవ దేవా! జగన్నివాసా! మాధవా! చక్రపాణీ! దయచేయుడు మీకు నమస్కారములు. శరణాగత వత్సలా! నేడు మీ చేతిలో మరణించుట వలన ఇహపరలోక శ్రేయోలాభములు కలుగును. మీరు నన్ను సంహరించుటకు వచ్చుటచే ముల్లోకములయందును నా గౌరవము ఇనుమడించును."

అర్జునుడు భగవంతుని వెంట పరుగిడి, ప్రణమిల్లి, ఎట్టకేలకు ఆయనను మఱలించెను. (మహాభారతము-భీష్మపర్వము 59)

9వ దినమున జరిగిన విషయము. భీష్ముడు పాండవసేనను అల్లకల్లోలమొనర్చెను. శ్రీకృష్ణభగవానుడు చేతిపగ్గమును వీడి, కొఱడా చేతబట్టి భీష్ముని మీదికి పరుగెత్తెను. భగవానుని పాదముల తాకిడికి భూమి కంపించెను. కౌరవపక్ష సైనికులు భయభ్రాంతులై, భీష్ముడు మరణించెననుచు పదేపదే గగ్గోలు పెట్టిరి. కరిపై లంఘించు సింహమువలె తనపైకి వచ్చుచున్న భగవానుని చూచి, ఏమాత్రము చలింపక భీష్ముడు ధనుస్సును ఎక్కుపెట్టి ఇట్లనెను -

**ఏహ్యేహి పుండరీకాక్ష! దేవదేవ! నమోఽస్తు తే । మామద్య సాత్త్వతశ్రేష్ఠ! పాతయస్వ మహాహవే ॥**
**త్వయా హి దేవ! సంగ్రామే హతస్యాపి మమానఘ! । శ్రేయ ఏవ పరం కృష్ణ! లోకే భవతి సర్వతః ॥**
**సంభావితోఽస్మి గోవింద! త్రైలోక్యేనాద్య సంయుగే । ప్రహరస్వ యథేష్టం వై దాసోఽస్మి తవ చానఘ! ॥**

(మహాభారత - భీష్మపర్వ.106/64-66)

"పుండరీకాక్ష! దేవదేవ! నీకు నమస్కారము. యాదవశ్రేష్ఠ! దయతో విచ్చేయుడు. ఈ మహాయుద్ధమున నన్ను వధించి, వీరస్వర్గమును ప్రసాదింపుడు. అనఘ! దేవదేవ! నేడు మీ చేతిలో మరణించినచో నాకీ లోకమున సర్వథా శ్రేయస్సే సమకూరును. మీతో తలపడు అదృష్టము ప్రాప్తించినందువలన నాకు ముల్లోకములలో కీర్తి ప్రతిష్ఠలు సిద్ధించును. నేను మీ సేవకుడను. మీ ఇష్టప్రకారము నన్ను కొట్టండి."

అర్జునుడు పరుగెత్తుచు పోయి కృష్ణుని చేతులు పట్టుకొనెను. కాని శ్రీకృష్ణుడు అంతట ఆగక ముందునకుసాగెను. అర్జునుడు శ్రీకృష్ణునకు ఆయన యొక్క పూర్వ ప్రతిజ్ఞను జ్ఞప్తికి దెచ్చి, భీష్ముని తాను చంపెదనని ప్రతిజ్ఞ చేసిన పిమ్మట భగవానుడు వెనుకకు మఱలెను. ఈ ఘట్టమును పోతనామాత్యుడు ఆంధ్రమహా భాగవతమున అతిరమణీయముగ వర్ణించెను-

సీ ॥ కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగన భాగంబెల్ల గప్పి కొనగ,
ఉఱికిన నోర్వక ఉదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి కదల

సమా - పరస్పరము కలహించుకొనువారికి న్యాయమును కలిగించుటలోను, తన కర్తవ్యములను నిర్ణయించుకొనుటలోను, వాటిని పాటించుటలోను, యుద్ధము చేయుటలోను, మిత్రుల యెడను, శత్రువులయెడను, మధ్యస్థుల యెడను యథాయోగ్యముగ వ్యవహరించుట మొదలగు వాని యందును ప్రదర్శించు కౌశలమునే 'దక్షత' అని యందురు.

ప్రశ్న - యుద్ధమునుండి పారిపోకుండుట యనగానేమి?

సమా - యుద్ధము చేయు సమయమున ఊహాకందని ఘోరమైన సంకట పరిస్థితులెదురైనప్పటికిని వెన్నుచూపకుండుట, ప్రతి పరిస్థితి యందును న్యాయముగా నిలబడి తన శక్తిని ప్రదర్శించుట, ప్రాణములనుగూడ లెక్కింపక యుద్ధమునందు స్థిరముగా ఉండుట మున్నగువానినే

---

చక్రంబు చేపట్టి చనుదెంచు రయమున
పైనున్న పచ్చని పటము జార
నమ్మితి నాలావు నగుబాటు సేయుకు
మన్నింపుమని క్రీడి మరల దిగువ

తే॥గీ॥ కరికి లంఘించు సింహమ్ముకరణి మెఱసి,
నేడు భీష్ముని జంపుదు విన్నుగాతు
విడువు మర్జున! యంచు మద్విశిఖవృష్టి
దెటలి చనుదెంచు దేవుండు దిక్కునాకు. (ఆంధ్ర. మహాభాగవతము-ప్రథమస్కంధము-222)

పదిదినములు భారత యుద్ధము నడిచిన పిమ్మట భీష్ముడు మృత్యువును గూర్చి ఆలోచించుచుండెను. అప్పుడు ఆకాశమునుండి ఋషులు వసువులు భీష్మునితో ఇట్లనిరి - "నాయనా! నీ సంకల్పము (ఆలోచన) సరియైనదే అది మాకును సమ్మతమే" - అనంతరము శిఖండి కారణముగ భీష్ముడు అస్త్రసన్న్యాసము చేసెను. అర్జునుని బాణముల తాకిడితో అంపశయ్యను చేరెను. అది దక్షిణాయనమగుట వలన అతడు ప్రాణత్యాగము చేయలేదు. హంసరూపములలో మహర్షులను గంగాదేవి ఆయన కడకు పంపెను. అప్పుడు భీష్ముడు వారితో తాను ఉత్తరాయణము వచ్చువఱకు జీవించియే యుండుదుననియు, పిమ్మట సరియైన సమయమున ప్రాణత్యాగము చేయుదుననియు అనెను. అర్జునుడు ప్రయోగించిన బాణములు భీష్ముని శరీరమందతటను నాటుకొనెను. ప్రతి రెండు బాణముల మధ్య రెండంగుళముల ఎడము గూడ లేకుండెను. (మహాభారత. భీష్మపర్వం-119) అతని తలమాత్రము క్రిందికి వ్రేలాడుచుండెను. అతడు తలగడను కోరెను. దుర్యోధనాదులు సుకోమలములైన మెత్తని తలగడలను తీసికొని పరుగిడుచు వచ్చిరి. భీష్ముడు నవ్వుచు "వీరులారా! ఇవి వీరశయ్యకు యోగ్యమైనవి కావు" అని పలికి, తనకు యోగ్యమగు తలగడను ఇమ్మని యడిగెను. అర్జునుడు మూడు బాణములను ప్రయోగించి, వీరోచితమైన తలగడను ఏర్పాటుచేసెను. భీష్ముడు ప్రసన్నుడై వాటిపై తలను మోపి ఇట్లనెను-

ఏవమేవ మహాబాహో! ధర్మేషు పరితిష్ఠతా । స్వప్తవ్యం క్షత్రియేణాజౌ శరతల్ప గతేన వై ॥
(మహాభారత-భీష్మ-120/49)

ఓ మహాబాహూ! క్షాత్రధర్మమును అనుసరించి, క్షత్రియుడు యుద్ధ భూమియందు ప్రాణత్యాగమొనరించు సమయమున అంపశయ్యపై ఈవిధముగనే పరుండవలెను.

బాణముల గాయములతో భీష్ముడు అంపశయ్యపై పరుండి యుండెను. బాణములను తీసివేసి, చికిత్స చేయుటలో నేర్పరులైన శస్త్రవైద్యులు పిలిపింపబడిరి. అప్పుడు భీష్ముడు తనకు క్షత్రియోచితమైన పరమగతి లభించినదనియు, చికిత్సకుల యొక్క అవసరము లేదనియు పలికెను (మహాభార-భీష్మ-120).

గాయముల వలన భీష్మునకు మిక్కిలి బాధ కలుగుచుండెను. అతడు చల్లని నీరడిగెను. అపటివారు కుండలతో చల్లని నీటిని తీసికొని వచ్చిరి. భీష్ముడు ఇట్లు పలికెను. "నేను అంపశయ్యపై పరుండియుంటిని. ఉత్తరాయణము కొఱకు నిరీక్షించుచుంటిని. నాకొఱకు మీరు నీటిని (ఈ కుండల జలములను) తెచ్చినారేమి?" అని చివఱకు అర్జునుని పిలిచి "నాయనా! నానోరెండి పోవుచున్నది. నీవు సమర్థుడవు. నీటిని సమకూర్పుము" అని పలికెను. అర్జునుడు రథముపైనెక్కి, గాండీవమును ఎక్కుపెట్టి, భీష్ముని కుడివైపున నేలలోనికి పర్జన్యాస్త్రమును ప్రయోగించెను. ఆ క్షణముననే అమృతప్రాయమైన జలధార భూమినుండి పెల్లుబికి వచ్చి, భీష్ముని నోటిలో పడెను. భీష్ముడా నీటిని త్రాగి తృప్తిపడెను. (మహాభార.భీష్మ.121)

"యుద్ధమున పాఱిపోకుండుట" అని యందురు. ఈ ధర్మమునకు కట్టుబడియే వీరుడైన అభిమన్యుడు ఆఱుగురు మహారథులతో ఒంటరిగా పోరాడి, తన ప్రాణములనే యొడ్డెను. కాని శస్త్రములను త్యజింపలేదు. (మహాభారత-ద్రోణ-49/22) ఆధునిక యుగమున రాజస్థాన (రాజపుత్రుల) చరిత్రము నందును ఇట్టివి పెక్కు ఉదాహరణములు లభించును. వీరులైన రాజపుత్రులు యుద్ధమున ఓడిపోవు పరిస్థితులెదురైనను వారు శత్రువులకు వెన్నుచూపలేదు. ప్రాణములను పణముగా నొడ్డియు ఒంటరిగా వేలకొలది యోధులతో పోరాడిరి.

ప్రశ్న - దానమిచ్చుట యనగానేమి?

సమా - ఇతరుల అవసరములను గుర్తించి, యోగ్యులైన పాత్రులకు తన సొంత సొత్తును ఉదారముగా ఇచ్చుటనే 'దానమిచ్చుట' అని యందురు. (17/20).

ప్రశ్న - ఈశ్వరభావము - అనగానేమి?

సమా - ఈశ్వరభావమనగా స్వామిభావము - శాసనము ద్వారా ప్రజలను అన్యాయాచరణముల నుండి మఱల్చి, సదాచార ప్రవృత్తులనుగా చేయుట - దురాచారులను దండించుట, తన ఆజ్ఞలను ప్రజలు న్యాయయుక్తముగా పాటించునట్లు చేయుట, సమస్త ప్రజలహితమునకై, సుఖమునకై నిస్స్వార్థ భావముతో పుత్రవాత్సల్యముతో వారిని రక్షించుచు పాలించుట మొదలగువానినే ఈశ్వర భావము అందురు.

---

మహాభారతయుద్ధానంతరము యుధిష్ఠిరుడు శ్రీకృష్ణునితోపాటు భీష్ముని కడకేగెను. అచ్చట శ్రేష్ఠులైన బ్రహ్మవేత్తలైన ఋషులు, మునులు ఉండిరి. భీష్ముడు భగవానుని జూచి, ప్రణమిల్లి స్తుతించెను. శ్రీకృష్ణుడు భీష్మునితో పలికెను. "ఉత్తరాయణము ఆసన్నమగుటకు ఇంకను వ్యవధి గలదు. జ్ఞాన నిధులైన మీరు యుధిష్ఠిరునకు ఈలోపల ధర్మశాస్త్రములను ఉపదేశించి ఆయన శోకమును నివారింపుడు" - అనంతరము భీష్ముడు అందులకు సమాధానముగా "ప్రభూ! నా శరీరమంతయు బాణముల దెబ్బలకు గాయపడి యున్నది. మనస్సు, బుద్ధి నిలకడగా లేవు. మాట్లాడుటకును శక్తి చాలకున్నది. మాటిమాటికిని స్పృహ తప్పుచున్నది. కేవలము మీ కృపచే ఇంతవఱకును జీవించియున్నాను. మీరు జగద్గురువులు - నేను మీ శిష్యుడను. మీ యెదుట నేను ఉపదేశములను చేయుట మర్యాద గాదు. చెప్పజాలనందులకు నన్ను క్షమింపుడు" - వాత్సల్య పూర్ణములైన చూపులను ప్రసరింపజేయుచు, గద్గద స్వరముతో భగవానుడిట్లనెను. "భీష్మా! నీ గ్లాని, మూర్ఛ, దాహము, వ్యథ, క్షుధా క్లేశములు, మోహము మొదలగునవి యన్నియును నా ప్రభావమున ఇప్పుడే తొలగిపోవును. నీయంతఃకరణమునందు జ్ఞానము సమగ్రముగా స్ఫురణకు వచ్చును. నీ బుద్ధి నిశ్చయాత్మకమగును. నీ మనస్సు సంతతము సత్త్వగుణమునందే స్థిరముగా నుండును. నీవు ధర్మమును గూర్చిగాని, మఱియే విద్యను గుఱించియైనను ఆలోచించినంతనే అది నీ బుద్ధికి తట్టును. అంతేగాదు నేను స్వయముగా ఉపదేశింపక నా భక్తుడవైన నీ కీర్తిని ఇనుమడించుటకై నీచేత ఈ ధర్మోపదేశమును చేయించుటకై నిన్ను పురికొల్పుచున్నాను.

భగవదనుగ్రహము వలన భీష్ముని శారీరక బాధలన్నియు సమసిపోయెను. అంతఃకరణము సావధానమయ్యెను. బుద్ధి జాగృతమయ్యెను. బ్రహ్మచర్యము, అనుభవము, జ్ఞానము, భగవద్భక్తి మొదలగువాని ప్రభావమువలన జ్ఞానియైన భీష్ముడు పది దినములు రణరంగమున యువకునివలె అత్యుత్సాహమును ప్రదర్శించినట్లే యుధిష్ఠిరునకు అట్టి యుత్సాహము తోడనే సర్వధర్మములను ఉపదేశించెను. శోక సంతప్తమైన అతని హృదయమును శాంతపఱచెను.

(మహాభారతము-శాంతి-అనుశాసన పర్వములు)

58 దినములు అంపశయ్యపై ఉన్న పిదప ఉత్తరాయణము రాగానే ప్రాణత్యాగమునకు సన్నద్ధుడై, శ్రీకృష్ణభగవానుని ఇట్లు స్తుతించెను. "హే భగవాన్! దేవదేవేశ! సురాసుర వందిత! త్రివిక్రమ! శంఖచక్రగదాధారి! నేను నీకు ప్రణమిల్లుచున్నాను. వాసుదేవ! హిరణ్యాత్మ! పరమపురుష! సవిత! విరాట్పురుష! నీవే సమస్త జీవరూపుడవు. అణురూప పరమాత్మవు. సనాతనుడవు. పుండరీకాక్ష! పురుషోత్తమ! మీరు నన్ను ఉద్ధరింపుడు. ఓ కృష్ణ! వైకుంఠవాస! ఈ తనువును చాలించుటకు నాకు అనుజ్ఞను ఇండు. మందబుద్ధి యగు దుర్యోధనునకు పెక్కు విధముల నచ్చజెప్పితిని. -యతః కృష్ణస్తతో ధర్మో, యతోధర్మస్తతో జయః - కృష్ణుడున్నచోటనే ధర్మముండును. ధర్మమున్న చోటనే విజయముండును.' అని - కాని ఆ మూర్ఖుడు నా మాటలు వినలేదు. నేను నిన్ను ఎఱుగుదును. నీవు పురాణపురుషుడవు. ఈ భువిపై అవతరించిన నారాయణుడవు.

స మాంత్వమనుజానీహి కృష్ణ! మోక్ష్యే కళేబరమ్ । త్వయాహం సమనుజ్ఞాతో గచ్ఛేయం పరమాం గతిమ్ ॥

(మహాభారతము-అను శాసనపర్వము-*167/45*)

ప్రశ్న - "ఇవి యన్నియును క్షత్రియ స్వాభావిక కర్మలు" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - క్షత్రియులయొక్క స్వభావము ముఖ్యముగా సత్త్వమిశ్రిత రజోగుణపూర్ణమై యుండును. కనుక శౌర్యాది కర్మలయందు స్వాభావిక ప్రవృత్తి యుండును. వాటిని పాటించుట యందు వారికి ఎట్టి క్లేశము అనిపించదు. ఈ కర్మలయందు ధృతి, దానము మున్నగు సామాన్య ధర్మములు అందఱును ఆచరింపదగినవే. కనుక అవి ఇతరవర్ణములవారికి అధర్మములుగాని, పరధర్మములుగాని కావు. కాని అవి వారికి స్వాభావికకర్మలు మాత్రము కావు. కాని ప్రయత్న సాధ్యములు.

ప్రశ్న - మనుధర్మ శాస్త్రమునందు ప్రజలను రక్షించుట, దానము చేయుట, యజ్ఞములను ఆచరించుట, వేదాధ్యయనము చేయుట, విషయాసక్తులు కాకుండుట అనునవి క్షత్రియుల కర్మలుగా సంక్షిప్తముగా చెప్పబడినవి.[1] ఇచట వేఱుగా చెప్పబడినవి. ఇందలి అంతర్యమేమి?

సమా - ఇచట క్షత్రియ స్వభావమునకు సంబంధించిన కర్మలే ప్రత్యేకముగా వర్ణింపబడినవి. మనుస్మృతిలో తెలుపబడిన ప్రజాపాలనము, దానము అను కర్మలు ఇచట చేర్చబడినవి. కాని వారి ఇతర కర్తవ్య కర్మలు విస్తారముగా వర్ణింపబడలేదు. ఇవిగాక ఇతర ధర్మశాస్త్రములయందు తెల్పబడిన క్షత్రియ కర్మలు గూడ వారికి కర్తవ్యములే - అని గ్రహింపవలెను.

*సంబంధము - భగవానుడు ఈ విధముగా క్షత్రియుల స్వాభావికకర్మలను వర్ణించి, ఇప్పుడు వైశ్యులయు, శూద్రులయు స్వాభావిక కర్మలను తెలుపుచున్నాడు-*

**కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మస్వభావజమ్ ।**
**పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ 44 ॥**

కృషి, గౌరక్ష్య, వాణిజ్యమ్ = వ్యవసాయము, గోపాలనము, క్రయవిక్రయముల యందు సత్యవ్యవహారము మొదలగునవి
వైశ్యకర్మ స్వభావజమ్ = యన్నియును వైశ్యులకు స్వాభావికములైన కర్మలు
అపి = మఱియు అట్లే
పరిచర్యాత్మకమ్ = అన్ని వర్ణముల వారిని సేవించుట
శూద్రస్య = శూద్రులకు
స్వభావజమ్, కర్మ = స్వాభావికములైన కర్మలు

**వ్యవసాయము, గోరక్షణము, క్రయవిక్రయరూపసత్యవ్యవహారము ఇవి యన్నియును వైశ్యులస్వాభావిక కర్మలు. అట్లే అన్నివర్ణములవారిని సేవించుట శూద్రులస్వాభావికకర్మ. (44)**

ప్రశ్న - 'కృషి' (వ్యవసాయము) చేయుట అనగానేమి?

సమా - దేశకాల పరిస్థితులను అనుసరించి, న్యాయము (ధర్మము)గా విత్తనములను చల్లి వరి, గోధుమ, పప్పు ధాన్యములు మొదలగు సమస్త ఖాద్య పదార్థములను, ప్రత్తిని, వివిధ-ఓషధులను అట్లే దేవతలకును, మనుష్యులు, పశుపక్ష్యాది సర్వప్రాణులకును ఉపయుక్తములగు ఇతర పదార్థములను ఉత్పత్తి చేయుటనే - కృషి లేక వ్యవసాయము అనియందురు.

---

ఓ కృష్ణ! తనువును త్యజించుటకు నాకు అనుజ్ఞ ఇమ్ము. నీ ఆజ్ఞతో ఈ శరీరమును వీడి, పరమపదమును పొందెదను. భగవదనుజ్ఞతో భీష్ముడు యోగముద్వారా వాయువును నిరోధించి, ప్రాణములను ఊర్ధ్వముఖముగా పయనింపజేసెను. ప్రాణవాయువులు ఒక్కొక్క అంగమును దాటినంతనే ఆయా అంగములనుండి బాణములు వదలిపోయెను. గాయములు మటుమాయమయ్యెను. క్షణమాత్రములో భీష్ముని శరీరమునుండి బాణములన్నియును తొలగిపోయెను. బ్రహ్మరంధ్రము ద్వారా ప్రాణోత్క్రమణము జరిగెను. బ్రహ్మరంధ్రమునుండి వెడలిన తేజస్సు అచటి వారందఱు చూచుచుండగనే ఆకాశమున విలీనమయ్యెను.

1) ప్రజానాం రక్షణం దానమిజ్యాధ్యయనమేవ చ । విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః ॥ (మనుస్మృతి - 1/89)

ప్రశ్న - గోరక్షణము, లేక పశుపాలనము అనగానేమి?

సమా - నందుడు మొదలగు గోపాలకులవలె గోవులను తమతమ ఇండ్లలో పెంచుట, వాటిని అడవులలో మేపుట, ఇండ్లలోను వాటికి అవశ్యకమగు ఆహారములను, నీటిని సమకూర్చుట, వ్యాఘ్రాది దుష్టమృగములబారినుండి వాటిని బాగుగా కాపాడుట, వాటిపాలనుండి పెరుగు, వెన్న, నేయి మొదలగు పదార్థములను ఉత్పత్తిచేసి, వాటితో ప్రజల అవసరములను తీర్చుట, వాటివలన లభించు ధనముతో తమ కుటుంబములను, గోవులను చక్కగా న్యాయముగా పోషించుట - మొదలగునవి అన్నియును గోరక్షణ కార్యములలో భాగములు. పశువులలో గోవు ప్రముఖమైనది. ప్రజలకు మిక్కిలి ఉపయుక్తమైనది. కనుక భగవానుడు ఇచట 'పశుపాలనమ్' అను పదము ప్రయోగింపక 'గౌరక్ష్య' అను పదమును ప్రయోగించెను. కావున సర్వసాధారణముగ మనుష్యులందఱికిని ఉపయుక్తములగు గేదెలు, ఒంటెలు, గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు ఇతర జంతువుల పాలనము గూడ వైశ్యుల కర్మలే. గోపోషణము వీనియన్నింటికంటెను మిక్కిలి ఉత్కృష్టమైన ముఖ్యమైన కార్యము.

ప్రశ్న - 'వాణిజ్యము' లేక క్రయవిక్రయరూప సత్య వ్యవహారము అనగానేమి?

సమా - మనుష్యులకును, దేవతలకును, పశుపక్ష్యాది సమస్త ప్రాణులకును ఉపయోగపడు పవిత్ర వస్తువులను న్యాయముగా కొనుట, అమ్ముట - అట్లే ఆయా వస్తువులను ప్రజల అవసరములను బట్టి ఒకచోటినుండి మఱియొక చోటికి తరలించి, వారికి సదుపాయములను సమకూర్చుట మున్నగునవి వాణిజ్యము, లేక క్రయ విక్రయ రూప వ్యవహారములనబడును. వ్యాపారములను కొనసాగించునప్పుడు వస్తువులను కొనుట అమ్ముటలలోను, కొలతలలోను, తూకములలోను, లెక్కలలోను తక్కువ ఇచ్చుట ఎక్కువ తీసికొనుట, వస్తువుల మార్పిడి చేయుట, వస్తువులను కల్తీచేసి, మంచి వస్తువులకు బదులుగా నాసివస్తువులను ఇచ్చుట, నాసివస్తువుల పేరుతో మంచి వస్తువులను తీసికొనుట, లాభము, రుసుము, దలాలి మొదలగు వాటి పేరుతో ఎక్కువ ధనమును గుంజుట, తక్కువ ఇచ్చుట అదేవిధముగా ప్రతి వ్యాపారమునందును అబద్ధము, కపటము, దొంగతనము, దౌర్జన్యము, మఱియు ఇతర అన్యాయరీతులద్వారా పరుల సొత్తును కాజేయుట మొదలగునవి అన్నియును వాణిజ్యము లోని దోషములు - ఈ దోషములు లేకుండ నీతి నిజాయితీలతో పవిత్ర వస్తువులను కొనుట - అమ్ముటయే క్రయ విక్రయ రూప సత్యవ్యవహారము అనబడును. తులాధారుడు ఇట్టి సత్యవ్యవహారముద్వారానే కృతార్థుడయ్యెను.[1]

ప్రశ్న - 'ఇవి వైశ్యుల స్వాభావిక కర్మలు' అని యనుటలోని విశేషమేమి?

సమా - వైశ్యుల స్వభావమునందు తమోమిశ్రిత రజోగుణము ప్రధానముగా ఉండును. కనుక పైన తెలుపబడిన కర్మలయందే వారి స్వాభావిక ప్రవృత్తి ఆసక్తమైయుండును. సహజముగనే వారి స్వభావములు ఆయా కర్మలకు అనుకూలములు. కావున వాటిని ఆచరించుటలో వారికి ఎట్టి కష్టమూ అనిపించదు.

ప్రశ్న - మనుధర్మ శాస్త్రమునందు ఉపర్యుక్త కర్మలే గాక వైశ్యులకు యజ్ఞము, అధ్యయనము, దానము చేయుట, అప్పులిచ్చుట అను నాలుగు కర్మలును అదనముగ చెప్పబడినవి. ఇచట వాటి ప్రస్తావన లేని కారణమేమి?

---

1) కాశీ నగరమున 'తులాధారుడు' అను ఒక వైశ్య వ్యాపారియుండెను. అతడు గొప్ప తపస్వి. ధర్మాత్ముడు. అతడు నీతినిజాయితీలలో క్రయ విక్రయములను నిర్వహించుచుండెడివాడు.

జాజలి అను బ్రాహ్మణుడు సముద్ర తీరమున ఘోర తపస్సును ఆచరించుచుండెను. అతని జడలయందు పిట్టలు గూళ్లు కట్టుకొనెను. దానివలన అతనికి తపోగర్వము ఏర్పడెను. అప్పుడాకాశవాణి "ఓ జాజలీ! నీవు తులాధారుని యంతటి ధార్మికుడవు కావు. అతనికి నీవలె గర్వము లేదు" అని పలికెను. జాజలి కాశీనగరమునకు వచ్చెను. తులాధారుడు కందమూలములు, ఫలములు, మసాలా ద్రవ్యములు, నేయి మొదలగు వాటిని అమ్ముచుండుటను చూచెను. తులాధారుడు జాజలికి స్వాగత సత్కారములను ఆచరించి, ప్రణామములొనర్చి యిట్లు పలికెను.

"మీరు సముద్ర తీరమున గొప్ప తపస్సును ఆచరించితిరి. మీ జటాజూటములయందు పక్షులు గూళ్ళు కట్టుకొని సంతానములను పొందెను. దాని వలన మీకు గర్వము ఏర్పడెను. ఆకాశవాణి ప్రస్తావన విని మీరు ఇచ్చటికి వచ్చితిరి. మీకు నేను చేయవలసిన సేవలను తెలుపుడు." - తులాధారుని ఈ జ్ఞానమును జూచి జాజలి ఆశ్చర్యచకితుడయ్యెను. అతడు తులాధారుని నుండి అనేక ధర్మరహస్యములను తెలిసికొని శాంతిని పొందెను. (మహాభార. -శాంతి 261 నుండి 264వ అధ్యాయముల వఱకు ఈ కథ గలదు.)

సమా - ఇచట వైశ్యుల స్వభావములకు సంబంధించిన కర్మలు ప్రత్యేకముగా తెలుపబడినవి. యజ్ఞాది పవిత్ర కర్మలు ద్విజులందఱికిని సంబంధించినవి. కనుక వీటిని వారి స్వాభావిక కర్మలలో ప్రస్తావింపలేదు. వైశ్యుల ఇతర కర్మలతో పోల్చినప్పుడు, అప్పులిచ్చి వడ్డీ తీసికొనుట న్యూనమైన విషయముగా భావింపబడినది. అందువలన దానినిగూడ వారి స్వాభావిక కర్మలలో చేర్చలేదు. ఇవిగాక శమదమాది ఇతర ముక్తిసాధన మార్గములను అనుసరించుటకు అందఱికిని అధికారము గలదు. కావున ఆ విషయము వారి స్వధర్మమునకు వేఱుగాదు. పైగా వాటియందు వైశ్యులకు సహజముగా ప్రవృత్తి యుండదు. అందువలన వారి స్వాభావిక కర్మలయందు అది చేర్చబడలేదు.

ప్రశ్న - 'అన్ని వర్ణముల వారిని సేవించుట' (పరిచర్యాత్మకం) అనగానేమి?

సమా - ద్విజులకు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు) సేవలు చేయుట, వారి ఆజ్ఞలను పాలించుట, ఇంటికి నీళ్లను చేర్చుట, స్నానాది నిత్యజీవన కార్యక్రమములందు తోడ్పడుట, వారి పశువులను కాపాడుట, వస్తువాహనములను పరిరక్షించుట, గుడ్డలు ఉతుకుట, క్షౌరకర్మలను ఆచరించుట మొదలగు సేవలనొనర్చుట, అన్ని పనులకు ఉపయోగపడు ఉపకరణములను సిద్ధపఱచి, వారికి సమకూర్చుట ద్వారా తమ జీవనోపాధులను కొనసాగించుచుండుట- మొదలగునవన్నియును 'పరిచర్యాత్మకం' అనగా అన్ని వర్ణముల వారిని సేవించుటలో అంతర్గతములు.

ప్రశ్న - "ఇవియును శూద్రులకు స్వాభావిక కర్మలు" అని అనుటలోని విశేషమేమి? ఇచట 'అపి' అను అవ్యయము ఎందులకు ప్రయోగింపబడినది?

సమా - శూద్రుల స్వభావమునందు రజోమిశ్రిత తమోగుణము ప్రధానమై యుండును. అందువలన పై సేవా కార్యక్రమములందు వారికి స్వాభావిక ప్రవృత్తి యుండును. వారి స్వభావములకు ఈ కర్మలు అనుకూలములైనవి. కావున వాటిని నిర్వహించుటలో వారికి ఎట్టి కష్టము అనిపించదు. ఇతర వర్ణముల వారికి అనురూపమైన వేర్వేఱు కర్మలు వారికి ఎట్లు స్వాభావికములో అట్లే సేవారూపకర్మలు శూద్రులకు స్వాభావికములు - అని తెల్పుటకు 'అపి' అను అవ్యయము ప్రయుక్తమైనది. శూద్రులకు కేవలము సేవారూప కర్మలే కర్తవ్యములు.[1] అవియే వారికి స్వాభావికములు. కనుక వాటిని ఆచరించుట వారికి మిక్కిలి సులభము.[2]

1) ఏకమేవ తు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్ । ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా ॥ *(మనుస్మృతి, 1/91)*

పూర్వోక్తద్విజ వర్ణముల వారి యెడ ఎట్టి అసూయా భావము లేకుండ నిండు మనస్సుతో సేవలొనరించుటయును ఒకే ఒక్క కర్మను కర్తవ్యముగా భగవానుడు శూద్రులకు నిర్దేశించెను.

2) అధికారములను తమ గుప్పిటబెట్టుకొనిన అగ్రవర్ణములవారు స్వార్థబుద్ధితో ఈ వర్ణవిభాగమును ఏర్పరచిరని నేటికాలమున కొందఱు అభిప్రాయపడుచుందురు. కాని లోతుగా ఆలోచించినచో సమాజమను శరీరము సువ్యవస్థితముగా ఉండుటకు వర్ణధర్మములు మిక్కిలి ఆవశ్యకములే యని తేటతెల్లమగును. పైగా ఇవి మనుష్యులచే ఏర్పఱచబడినవి ఎంతమాత్రమూ కావు. ఈ వర్ణధర్మములను భగవంతుడే రచించెను. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" (4/13) గుణ కర్మల వైవిధ్యములను అనుసరించి, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులు - అను నాలుగు వర్ణములు నా చేతనే రచింపబడినవి - అని భగవంతుడు స్వయముగా చెప్పెను.

దివ్యదృష్టి గల త్రికాలజ్ఞులైన భారతీయ మహర్షులు భగవంతునిచే నిర్దేశింపబడిన ఈ వర్ణవిభాగ రూపవ్యవస్థను స్వయముగా దర్శించిరి. దానిని అనుసరించియే సమాజమును శాంతియుతముగా, సౌభాగ్యవంతముగా, సౌశీల్య శోభితముగా, క్రియాశీలముగా, నిస్స్వార్థముగా, శ్రేయస్కరముగా, సురక్షితముగా, సువ్యవస్థిత మొనర్చిరి. చక్కని సామాజిక వ్యవస్థ కొఱకు ప్రజలను నాలుగు విభాగములుగా చేయుట అన్ని కాలములందును, అన్ని దేశములందును ఆవశ్యకమే. సర్వథా (వివిధ దేశకాల పరిస్థితులలోను) ఈ నాలుగు విభాగములు ఉన్నవి. ఉండును గూడ. కాని ఆర్షదేశమైన భారతదేశమునందు ఈ వర్ణవ్యవస్థ పాదుకొని బలమైన పునాదులతో నిలబడినట్లు మఱియే దేశమునందును జరుగలేదు.

సుస్థిర సమాజ నిర్మాణమునకు ధర్మ సంస్థాపనము, పరిరక్షణము ప్రాణప్రదములు. సామాజిక జీవనము సుఖప్రదముగా ఉండవలెను. సమాజమున ఉపద్రవములు ఏర్పడినప్పుడు ప్రయత్నపూర్వకముగా వాటిని నివారింపవలెను. దోష దూషితములైన కర్మాచరణములను తొలగింపవలెను. సామాజిక సమస్యలు తలయెత్తినప్పుడు వాటిని పరిష్కరింపవలెను. ధర్మసంకటములు

సంబంధము - ఈ విధముగా భగవానుడు నాలుగు వర్ణముల వారి స్వాభావిక కర్మలను వర్ణించెను. పిదప భక్తియుత కర్మయోగస్వరూపమును ఫలమును తెలుపదలచెను. అందులకై మానవుడు అనాయాసముగా పరమపదప్రాప్తికై ఆ వర్ణ (చాతుర్వర్ణ్య) కర్మలను ఆచరింపవలసిన పద్ధతిని గూర్చి 2 శ్లోకములలో తెలుపుచున్నాడు-

**స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।**
**స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥ 45 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్వే, స్వే, | = తన తన | లభతే | = పొందును | సిద్ధిమ్ | = పరమసిద్ధిని |
| కర్మణి | కర్మలయందు | స్వకర్మనిరతః | = తనస్వాభావిక | విందతి | = పొందునో |
| అభిరతః | = తత్పరుడైన | | కర్మయందు | తత్ | = ఆవిధులను |
| నరః | = మానవుడు | | నిరతుడైనవాడు | శృణు | = (తెలుపుచున్నాను) |
| సంసిద్ధిమ్ | = భగవత్ప్రాప్తిరూప సిద్ధిని | యథా | = ఎట్లు | | వినుము |

ఏర్పడినప్పుడు వాటిని సముచితముగా సర్వజనామోద యోగ్యముగా పరిష్కరింపవలెను. ఈ అన్నింటి కొఱకై నిర్మలమైన నిష్పాక్షికమైన మేధాసంపద అవసరము. ధర్మమును, ధర్మస్థితమైన సమాజమును దురాక్రమణలనుండి కాపాడుటకు బాహుబలము ఆవశ్యకము. మేధాశక్తి (మేధావులు) బాహుబలము యథాయోగ్యముగ పోషింపబడుటకు దేశము పాడిపంటలతో, సిరి సంపదలతో సుసంపన్నమై యుండవలెను. పై కార్యములన్నియును సమృద్ధముగా, సమర్థముగా నిర్వహింపబడుటకు శారీరక పరిశ్రమ తప్పనిసరి.

కనుక సమాజమను శరీరమునకు మస్తిష్క స్థానము బ్రాహ్మణులది. బాహువులు క్షత్రియులు. ఊరువులు వైశ్యులు. పాదములు శూద్రులు. సమాజ శరీరమునకు ఈ నాల్గును ముఖ్యాంగములే. ఇవి పరస్పర సహకారముతో మసలినప్పుడే మనుగడ సాగింపగలవు. వీరిమధ్య న్యూనాధికములకుగాని, అసూయా ద్వేషములకు గాని, అవహేళనములకు గాని ఏమాత్రమును తావులేదు. తమతమ కర్తవ్య నిర్వహణములను బట్టి నలుగురును ముఖ్యులే. బ్రాహ్మణులు జ్ఞానప్రభావముతో, క్షత్రియులు బాహుబలముతో, వైశ్యులు ధన శక్తితో, శూద్రులు జనశక్తితో మఱియు శ్రమ శక్తితో గొప్పవారు. ఈ నలుగురును సమాజమునకు పూర్తిగా ఉపయోగపడుదురు. వీరి ప్రాదుర్భావము గూడ భగవంతుని విరాట్‌రూపము నుండియే జరిగినది -

బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్, బాహూ రాజన్యః కృతః। ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాం శూద్రో అజాయత ॥

*(ఋగ్వేద సంహిత - 10/90/12) (పురుష సూక్తము)*

బ్రాహ్మణులు భగవంతుని ముఖమునుండియు, క్షత్రియులు బాహువులనుండియు, వైశ్యులు ఊరువులనుండియు, శూద్రులు చరణములనుండియు ఉద్భవించిరి.

కాని వారియొక్క ఈ బలమును వారివారి స్వార్థలాభములకు ఉపయోగపడరాదు. మఱియు ఒకరు మఱియొకరిని అణచివేసి, తమ అధికారములను కొనసాగింపరాదు. ఈ కర్మవిభాగములు సమాజశరీరపరిపోషణమునకు ఆవశ్యకాంగములే. కేవలము ధర్మమును పాటించుట, పాటింపజేయుటయే వీటి లక్ష్యములు. న్యూనాధిక్య భావములకు తావు లేకుండ యథాయోగ్యముగ కర్మవిభాగములు జరుగుటవలన నాలుగు వర్ణముల వారి మధ్య శక్తి సామంజస్యము ఉండును. ఒకరు మఱియొకరిని కించపఱచజాలరు. ఇతరుల న్యాయమైన అధికారములను అతిక్రమింపజాలరు. ఈ కర్మ విభాగములు, కర్మాధికారములు దృఢమైన పునాదులపై ఏర్పడి యున్నందున వర్ణధర్మము సువ్యవస్థితమైనది. శక్తి సామంజస్యము సహజముగనే సిద్ధించినది. స్వయముగా భగవంతుడును, ధర్మమర్మజ్ఞులైన ఋషీశ్వరులును ప్రతివర్ణము వారికిని కర్మలను వేర్వేఱుగా, స్పష్టముగా నిర్దేశించి, అందఱును తమతమ ధర్మములను నిర్విఘ్నముగా ఆచరించుటకై, ఏర్పాట్లు కావించుట జరిగినది. స్వకర్మాచరణము పూర్తిగా జరుగుటచే, శక్తి సామంజస్యమున ఎన్నడును విఘాతము కలుగజాలదు.

యూరప్ మొదలగు దేశములందు సహజముగనే మానవసమాజమునందు నాల్గు విభాగములు ఉన్నప్పటికిని, నిర్దిష్టములైన నియమములు లేని కారణమున శక్తి సామరస్యము పాదుకొనలేదు. ఫలితముగా అప్పుడప్పుడు జ్ఞానబలము సైనిక బలమును అణచివేయును. మఱియొకప్పుడు జనబలము ధనబలముపై ఆక్రమణ చేయును. కావున ఈ విధముగా ఒక వర్గము వారు మరియొక వర్గము వారిని అణచుట వలన సమాజమున అల్లకల్లోలములు ఏర్పడి రక్తపాత విప్లవములు చెలరేగుచు వచ్చినవి. భారతీయ వర్ణ విభాగమునందు అట్లుగాక అందఱికిని కర్తవ్య కర్మలు వేర్వేఱుగా నిర్దేశింపబడినవి.

**తమతమ స్వాభావికకర్మలయందు తత్పరులైనవారు భగవత్ప్రాప్తిరూప పరమసిద్ధిని నిస్సందేహముగా పొందుదురు. స్వకర్మనిరతులైన మానవులు పరమసిద్ధిని పొందుటకు ఆచరింపవలసిన విధులను తెలుపుచున్నాను వినుము. (45)**

ఋషి సమ్మతమైన (అందఱికిని ఆమోదయోగ్యమైన ఆచరణీయమైన) వర్ణధర్మములందు బ్రాహ్మణునియొక్క స్థానము సర్వోన్నతమైనది. అతడు సామాజికధర్మములకు కుదురైనవాడు. అతడాచరించి చూపిన, చెప్పిన విధులను అందఱును ఆమోదింతురు. అతడందఱికిని గురువు, మార్గదర్శకుడు. అతడు ధనమును కూడబెట్టడు. ఎవ్వరినీ దండింపడు. భోగలాలసుడు కాడు. అతని జీవితములో స్వార్థచింతనయే కనబడదు. వివిధ సంపదలను, పదవీ ప్రతిష్ఠలను తృణప్రాయముగా చూచును. నగరములకు దూరముగా పవిత్ర స్థానములలో సపరివారముగా నివసించుచు, కందమూలములను భుజించుచు జీవయాత్రను కొనసాగించుచుండును. రాత్రింబవళ్ళు తపోధర్మ సాధనలతో, జ్ఞానసముపార్జనతో కాలము గడుపుచుండును. శమదమ తితిక్షాక్షమా సమన్వితమైన తపోబల ప్రభావముతో జ్ఞానదృష్టిని పొందును. దివ్యమైన ఆ జ్ఞాననేత్రము ద్వారా సత్యమును దర్శించును. ఎట్టి స్వార్థచింతనలేకుండ ఆ సత్యమును సదాచార పరాయణులైన సాధుపుంగవుల ద్వారా సమాజమునందు విస్తరింపజేయును. దానికి ప్రతిఫలముగా దేనినీ కోరడు. అప్రయత్నముగా సమాజము నుండి తనకు లభించినదానితో సంతృప్తి చెంది, నిరాడంబర జీవితమును గడుపును. ఆదర్శప్రాయమైన అతని ధార్మిక జీవితమిట్టిది.

క్షత్రియుడు అందఱిని శాసించును. అపరాధులను దండించును. సత్పురుషులను ఆదరించును. దండబలముతో దుష్టులను తలయెత్తకొనకుండ జేయును. దుర్మార్గులనుండియు, దొంగల నుండియు, బందిపోటులనుండియు, శత్రువుల నుండియు, ధర్మమును సమాజమును రక్షించుచుండును. క్షత్రియుడు దోషులను దండించునే గాని స్వయముగా చట్టములను చేయడు. బ్రాహ్మణులచే చేయబడిన చట్టములను అతడు ఆచరణలో పెట్టును. ఆ చట్టములను అనుసరించియే అతడు ప్రజలనుండి పన్నులను వసూలుచేయును. ప్రజాహితముకొఱకే వ్యవస్థాపూర్వకముగా ఆ ధనమును వినియోగించును. బ్రాహ్మణుడు చట్టమును చేయును. వైశ్యుడు ధనాగారమును నింపును. క్షత్రియుడు విధ్యుక్తముగా వ్యవస్థను సంరక్షణమును చేయువాడు మాత్రమే.

దేశసంపదకు ఆధారములైన వాణిజ్యము, పశుపాలనము, ఆహారోత్పత్తి మొదలగునవి యన్నియును వైశ్యుని చేతులలో ఉండును. వైశ్యుడు ధనార్జన చేసి, దానిని అభివృద్ధి చేయును. కాని దానిని తనకొఱకు వినియోగింపడు. బ్రాహ్మణుని యొక్క జ్ఞానము చేతను, క్షత్రియుని బలము చేతను, సంరక్షింపబడి, ధనమును సర్వవర్ణముల వారి హితము కొఱకు విధి విధానముగా వ్యయము చేయును. అతనికి శాసనములపైన ఎట్టి అధికారమూ లేదు. అవసరమూ లేదు. బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడు గాని అతని వాణిజ్య వ్యాపారముల విషయమున ఎన్నడును, ఏవిధముగను తలదూర్చరు, సరికదా తమ స్వార్థమునకు అతని ధనమును ఎన్నడును తీసికొనరు. పైగా దానిని రక్షింతురు. వారు తమ జ్ఞానబలముతో బాహుబలముతో వైశ్యుని వ్యాపారాదులు చక్కగా నిర్విఘ్నముగా సాగుచుండునట్లు తగిన వ్యవస్థను చేయుదురు. దీనివలన అతని మనస్సున ఎట్టి అసంతృప్తియు ఉండదు. అతడు బ్రాహ్మణ క్షత్రియుల యెడ వినమ్రతతో ఆదరాభిమానములతో మెలగును. అట్లు మెలగుట సైతము అవసరమని భావించును. ఏలనన అందులోనే అతని హితమున్నది. అతడు సంతోషముగా రాజునకు పన్నులను చెల్లించును. బ్రాహ్మణునకు సేవలొనర్చును. విధ్యుక్తముగా, సాదరముగా శూద్రులకు సమృద్ధిగా అన్నవస్త్రాదులను సమకూర్చును.

ఇక శూద్రుల విషయము. వాస్తవముగా శూద్రులు జన సంఖ్యలో అధికులు. వారి శారీరక శక్తి ప్రబలమైనది. కాని మానసిక శక్తి కొంచెము తక్కువ. కావున శారీరక శ్రమయే వారికి కర్తవ్యకర్మగా నిర్దేశింపబడినది. సమాజమునకు శారీరక శక్తియు మిక్కిలి ఆవశ్యకమే. వీరి శారీరక శక్తివిలువయు తక్కువేమీ గాదు. మిగిలిన మూడు వర్ణముల వారి ప్రతిష్ఠయు వీరి జనబలము మీదనే ఆధార పడియున్నది. కాళ్లబలమును బట్టియే శరీరము నడచును. కావున మిగిలిన మూడు వర్ణములవారును శూద్రులను తమకు ముఖ్యాంగముగా భావింతురు. వారి శ్రమకు తగినట్లు (ప్రతిఫలముగా) వైశ్యులు చాలినంత ధనమును ఇచ్చెదరు. క్షత్రియులు వారి ధనమును, జనమును రక్షించెదరు. బ్రాహ్మణులు వారికి ధర్మమార్గమును, భగవత్ప్రాప్తి మార్గమును చూపెదరు. ఏ వర్ణము వారును స్వార్థబుద్ధితో శూద్రుల వృత్తులను వారింపరు. స్వలాభమునకై వారి శ్రమకు తగిన ప్రతిఫలమును తగ్గించరు. వారిని తమకంటె తక్కువగా భావించి వారియెడ ఏ విధముగను అమర్యాదగా వ్యవహరింపరు (ప్రవర్తింపరు). ప్రతి వర్ణమువారును తమ తమ శ్రమలకు తగినట్లుగా ప్రతిఫలము లభించినదని భావించి, వచ్చిన దానితో తృప్తిపడుదురు. ఎవ్వరును మఱియొకరికి

ప్రశ్న - ఈ శ్లోకమున "స్వే" అను పదమును రెండుమార్లు ప్రయోగించుటలోని విశేషమేమి? 'సంసిద్ధిం' అను పదము ఏ సిద్ధిని సూచించును?

సమా - ప్రతి మానవుడు తన స్వాభావిక కర్మను అనుసరించినపుడే అతనికి పరమపదప్రాప్తి సిద్ధించును - అని తెలుపుటకే "స్వే' అను పదము రెండు పర్యాయములు ప్రయోగింపబడినది. అనగా బ్రాహ్మణుడు శమదమాది కర్మలను, క్షత్రియుడు శౌర్యముతో మెలగుట, ప్రజాపాలనము, దానము మొదలగు కర్మలను, వైశ్యుడు కృషి వాణిజ్యాది కర్మలను, అట్లే శూద్రులు సేవాకార్యములను ఆచరించినప్పుడే వారివారికి పరమపదము ప్రాప్తించును. ప్రతి వ్యక్తికిని తన స్వాభావిక కర్మాచరణమే శ్రేయస్కరము. ఏ వర్ణమువారైనను తమ శ్రేయస్సు కొఱకై ఇతర వర్ణముల వారి కర్మలను ఆచరింపవలసిన పనిలేదు.

'సంసిద్ధిం' అను పదము అంతఃకరణ శుద్ధినిగాని, స్వర్గప్రాప్తిని గాని, అణిమాది సిద్ధులను గాని తెలుపదు. ఈ పదము ఇచట పరమపద సిద్ధిని గూర్చి తెలుపును. దీనినే పరమాత్మప్రాప్తి, పరమగతిప్రాప్తి, శాశ్వత పదప్రాప్తి, పరమపద ప్రాప్తి, నిర్వాణబ్రహ్మప్రాప్తి అని యందురు. ఇంతేగాక బ్రాహ్మణుని స్వాభావిక కర్మలయందు జ్ఞానవిజ్ఞానములు గూడ కలవు. కనుక వాటి ఫలము పరమగతి ప్రాప్తి తప్ప మఱొకటియని చెప్పుటకు వీలులేదు.

---

ఉపకారములను చేయుచున్నట్లుగా తలంపరు. అందఱును ఒకరికి మఱియొకరు సహాయపడుచుందురు. తమ ఉన్నతితోపాటు ఇతరుల ఉన్నతి కొఱకు పాటుపడుదురు. ఇతరుల అభివృద్ధి తమ అభివృద్ధిగను, ఇతరుల అవనతి తమ అవనతిగను భావింతురు. ఇట్టి వ్యవస్థయందు జనసంపదగల శూద్రులు సంతుష్టులై యుందురు. ఈ నాలుగు వర్ణముల వారిలో ఎవరు ఎవరికిని హాని తలపెట్టరు. ఎవరు ఎవరినీ అవమానింపరు.

ఇక ఇంటిలోని నలుగురు సోదరులు తమ సమష్టి అభివృద్ధికై సంతోషముతో తమతమ యోగ్యతలను అనుసరించి, వేర్వేఱు కర్తవ్య కర్మలను ఆచరింతురు. అట్లే ఈ నాలుగు వర్ణముల వారును పరస్పరము - బ్రాహ్మణులు ధర్మస్థాపన ద్వారా, క్షత్రియులు బాహుబలము ద్వారా, వైశ్యులు ధనబలము ద్వారా, శూద్రులు శారీరిక శ్రమ బలము ద్వారా హితములను చేకూర్చుకొనుచు సమాజ శ్రేయస్సునకై పాటుపడుచుందురు. అందఱును ఒకే కార్యమును చేయుటకు ఇష్టపడరు. వేర్వేఱు కార్యములను చేయుటలో న్యూనాధిక భావములను కలిగియుండరు. దీనివలననే శక్తి సామంజస్యము ఏర్పడును. ధర్మము క్రమక్రమముగా బలిష్ఠమై పరిపుష్టమగును. ఇదియే వర్ణధర్మముల యొక్క సంగ్రహ స్వరూపము.

ఈ విధముగా గుణకర్మలను అనుసరించియే వర్ణ విభాగము ఏర్పడును. కాని ఇష్టము వచ్చిన రీతిగా కర్మలను ఆచరించుట వలన వర్ణము మాఱునని భావింపరాదు. జన్మయే వర్ణమునకు మూలము. దాని స్వరూపమును రక్షించుటలో కర్మయే ప్రధాన కారణమగును. కనుక జన్మకర్మలు రెండును వర్ణవిషయమున ముఖ్యములే. కేవలము కర్మవలన వర్ణమును నిర్ణయించువారు వాస్తవముగా వర్ణముల యొక్క పుట్టుపూర్వోత్తరములను ఎఱుగనివారే. కర్మలను ఆధారముగా గొని వర్ణములను నిర్ణయింపదలచినచో ఒకే వ్యక్తి ఒకే దినమున ఎన్నిసార్లు వర్ణములను మార్చవలసి వచ్చునో చెప్పజాలము. అట్టి పరిస్థితిలో సమాజమున ఎట్టి కట్టుబాట్లు, నియమములు నిలువజాలవు. సర్వథా సమాజమున అవ్యవస్థ స్థితి అలముకొనును. కాని జన్మను బట్టి ఏర్పడు భారతీయ వర్ణ విభాగమునందు ఇట్టి దుస్థితికి తావే లేదు. కేవలము కర్మను బట్టియే వర్ణమును నిర్ణయింపవలసివచ్చినచో యుద్ధసమయమున బ్రాహ్మణోచితమైన కర్మకు సిద్ధపడిన అర్జునునకు భగవానుడు గీతయందు క్షత్రియ ధర్మమును ఉపదేశము చేసెడివాడు కాడు. మనుష్యుని పురాకృత శుభాశుభ కర్మలను అనుసరించియే అతడు వేర్వేఱు వర్ణములలో జన్మించుట జరుగును. ప్రతివ్యక్తియు తాను జన్మించిన వర్ణమునకు నిర్దేశింపబడిన కర్మలను ఆచరింపవలెను. ఏలనన అదియే అతని స్వధర్మము - "స్వధర్మాచరణము చేయుచు మృతిచెందుటయు శ్రేయస్కరమే" అని శ్రీకృష్ణభగవానుడు నుడివెను - "స్వధర్మేనిధనం శ్రేయః" - దీనితోపాటు పరధర్మము భయావహము అనియు చెప్పెను. ఇది సరియైనదే. ఏలనన అన్ని వర్ణముల వారును స్వధర్మములను పాటించినప్పుడే సమాజమున శక్తిసామంజస్యము నిలుచును. అప్పుడే సమాజ ధర్మమునకు రక్షణము, ఉన్నతి కలుగును. స్వధర్మమును పాటింపకుండుట, పరధర్మమును చేపట్టుట వ్యక్తికిని, సమాజమునకును హానిని గూర్చును. ఆర్యజాతి యొక్క ఈ వర్ణ వ్యవస్థ ఈ కాలమున అనేకానేక కారణముల వలన శిథిలమగుచుండుట విచారకరము. నేడు ఏ వర్ణము వారును తమ వర్ణధర్మములపై గట్టిగా నిలబడక అందరూ యథేచ్ఛగా పరధర్మములను ఆచరించుచు దిగజారిపోవుచున్నారు. దీని దుష్ఫలితములు గూడ ప్రత్యక్షముగా నేడు కన్పడుచునే యున్నవి.

ప్రశ్న - 'నరః' అను పదము ఎవరిని గూర్చి తెలుపును? ఆ పదమును ప్రయోగించుచు 'మనుష్యుడు తన కర్మల యందు నిరతుడై పరమసిద్ధిని పొందును' అని అనుటలోని విశేషమేమి?

సమా - ఇచట 'నరః' అను పదము అన్ని వర్ణములకు చెందిన 'ప్రతి వ్యక్తి'ని సూచించును. "తన కర్మలయందు నిరతుడైన మనుష్యుడు పరమసిద్ధిని పొందును" అని యనుటలో మోక్షప్రాప్తికి మనుష్యులందఱికిని అధికారము కలదని స్పష్టమగుచున్నది. అంతేగాక పరమాత్మ ప్రాప్తికి కర్తవ్య కర్మలను భౌతికముగా త్యజింపనవసరము లేదనియు, పరమాత్ముని లక్ష్యముగా చేసికొని, సర్వదా వర్ణాశ్రమోచిత కర్మలు చేయుచునే మనుష్యుడు పరమాత్మ ప్రాప్తిని పొందును అనియు తెలుపబడినది. (18/56)

ప్రశ్న - "తన స్వాభావిక కర్మలయందు నిరతుడైన మనుష్యుడు కర్మల నాచరించుచు పరమసిద్ధిని ఏవిధముగ పొందునో నీవు వినుము" అని తెల్పుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ శ్లోకపూర్వార్ధమున "తన కర్మలయందు నిరతుడైన మనుష్యుడు పరమసిద్ధిని పొందును" అని తెలుపబడినది. కర్మలు మనుష్యుని బంధించునుగదా? అందు నిరతుడైన మనుష్యుడు పరమ సిద్ధిని ఎట్లు పొందును? అను సందేహము కలుగుట సహజము. దానికి సమాధానముగ కర్మలయందు నిరతుడైనను పరమపదప్రాప్తికి ఉపాయము కలదనియు దానిని రాబోవు శ్లోకమున తెలుపుచున్నాను, సావధానముగా వినుమనియు భగవానుడు పలికెను.

**యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥ 46 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| యతః | ఏభగవంతునినుండి | ఇదమ్, సర్వమ్ | ఈ సమస్తజగత్తు | అభ్యర్చ్య | పూజించి |
| భూతానామ్ | సమస్త ప్రాణులయొక్క | తతమ్ | వ్యాప్తమైయున్నదో | మానవః | మానవుడు |
| ప్రవృత్తిః | ఉత్పత్తి (జరుగుచున్నదో) | తమ్ | ఆ పరమేశ్వరుని | సిద్ధిమ్ | పరమసిద్ధిని |
| యేన | ఏభగవంతునిచే | స్వకర్మణా | తన స్వాభావిక కర్మాచరణముద్వారా | విందతి | పొందుచున్నాడు |

**సమస్తప్రాణులప్రాదుర్భావము పరమేశ్వరునినుండియే జరిగినది. సమస్త జగత్తునందును అతడు వ్యాపించియున్నాడు. అట్టి పరమేశ్వరుని తన స్వాభావికకర్మలద్వారా పూజించి, మానవుడు పరమసిద్ధిని పొందును. (46)**

ప్రశ్న - "సమస్త ప్రాణుల ప్రాదుర్భావము పరమేశ్వరుని నుండియే జరిగినది. సమస్త జగత్తునందును అతడు వ్యాపించియున్నాడు" అని యనుటలోని విశేషమేమి?

సమా - మానవులు తమతమ కర్మల ద్వారా భగవంతుని సేవించు విధానమును తెల్పుటకై మొదట భగవంతుని గుణప్రభావములను, శక్తిని, సర్వవ్యాపకత్వమును గుఱించి తెలుపబడినది. మానవులు తమ ప్రత్యేక కర్తవ్యకర్మలను ఆచరించు సమయమున సమస్త చరాచరములతో గూడిన ఈ సంపూర్ణ విశ్వము అతనినుండియే ప్రాదుర్భవించిన దనియు అతనితోడనే వ్యాప్తమైనదనియు గుర్తుంచుకొన వలయును. భగవంతుడే తన యోగమాయ ద్వారా జగత్తుగా ప్రకటితమగు చున్నాడు. కనుక ఈ జగత్తు అతని స్వరూపమే. ఈ విశ్వమంతయును భగవంతునిచే వ్యాప్తమైన విధము 9వ అధ్యాయమునందలి 4వ శ్లోకమునకు సంబంధించిన వ్యాఖ్యానమున వివరింపబడినది.

ప్రశ్న - మానవులు తమ స్వాభావిక కర్మల ద్వారా పరమేశ్వరుని పూజించుట యనగానేమి?

సమా - భగవంతుడు ఈ సమస్త జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారకుడు, సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు, అందఱికిని ప్రేరకుడు, ఆత్మీయస్వరూపుడు, అతడే సర్వాంతర్యామి, సర్వవ్యాపి. ఈ జగత్తంతయును అతని సృష్టియే. అతడే స్వయముగా తన యోగమాయతో జగద్రూపమున ప్రకటితుడగుచుండును. కనుక ఈ జగత్తంతయు భగవంతునిదే. ఈ విషయములను గ్రహించి,

మానవుడు తన శరీరేంద్రియ మనోబుద్ధుల ద్వారా ఆచరించు యజ్ఞదానాది స్వవర్ణోచిత కర్మలన్నియును భగవంతునకు చెందినవే అనియును, తాను భగవంతునివాడనే అనియూ, సమస్త దేవతలకును, ఇతర ప్రాణులకును భగవంతుడే ఆత్మయగుట వలన అతడే సమస్త కర్మలకును భోక్తయనియు (5/29) ఎఱుంగవలయును.

మానవుడు ఇట్లెఱింగిన పిమ్మట పరమ శ్రద్ధాదరములతో కర్మలయందు మమతాసక్తి, ఫలేచ్ఛలను సర్వథా త్యజించి, భగవదాజ్ఞానుసారము అతని అనుగ్రహము కొఱకు తన స్వాభావిక కర్మల ద్వారా సమస్త జగత్తును సేవింపవలెను. అనగా సమస్త ప్రాణులకును శ్రేయస్సును గూర్చుటకై నిస్స్వార్థముగా తన కర్తవ్యమును పాటింపవలెను. తన స్వాభావిక కర్మలద్వారా పరమేశ్వరుని పూజించుట యనగా ఇదియే.

ప్రశ్న - పై విధముగా తన కర్మల ద్వారా భగవంతుని పూజించి, మానవుడు పరమసిద్ధిని పొందును. అనగానేమి?

సమా - ఏవర్ణస్థుడైనను, ఏ ఆశ్రమమునందున్నను ప్రతి మానవుడును తన కర్మలద్వారా భగవంతుని పూజించి, పరమసిద్ధి రూపమైన పరమాత్మను పొందగలడు. పరమాత్మను పొందుటకు అందఱికిని సమానాధికారము గలదు. శమదమాది లక్షణములను కలిగియుండి కర్మలను పైవిధముగ భగవంతునకు సమర్పణము చేయుట ద్వారా భగవంతుని పూజించు బ్రాహ్మణుడు పొందు పరమపదమునే, శౌర్య పరాక్రమములు గలిగియుండి, తన కర్మల ద్వారా భగవత్సేవలొనర్చు క్షత్రియుడును పొందును. అట్లే కృషివాణిజ్యాది కర్మల ద్వారా భగవంతుని అర్చించు వైశ్యుడును, తన పరిచర్యరూపకర్మల ద్వారా భగవత్సేవలొనర్చు శూద్రుడును అదే పరమపదమును పొందుదురు. కర్మబంధముల నుండి విడివడి పరమాత్మను పొందుటకు ఇది అతి సులభమైన మార్గము. కనుక మనుష్యుడు పైన తెలుపబడిన భావముతో తన కర్తవ్య కర్మాచరణముద్వారా పరమేశ్వరుని పూజించుటను అభ్యసింపవలెను.

సంబంధము - పూర్వశ్లోకమునందు మానవుడు తన స్వాభావిక కర్మలద్వారా పరమేశ్వరుని పూజించి, పరమసిద్ధిని పొందునని తెలుపబడినది. ఐతే క్షత్రియుడు తన యుద్ధాది క్రూరకర్మలను చేయక బ్రాహ్మణునివలె అధ్యాపనాది శాంతిమయ కర్మలను ఆచరించుచూ, అట్లే వైశ్య శూద్రులు తమ కర్మలను ఉన్నతవర్ణముల వారి కర్మలకంటె తక్కువైన వాటినిగా భావించి, వాటిని ఆచరించుట మాని, ఉన్నత వర్ణముల వారి వృత్తులను అవలంబించుచు తమ శరీర నిర్వహణతోపాటు పరమాత్మ ప్రాప్తికై ప్రయత్నించుట ఎంతవఱకు ఉచితము? అను శంక కలుగవచ్చును. దీనికి సమాధానముగా ఇతరుల ధర్మములను ఆచరించుటకంటె స్వధర్మపాలనమే శ్రేష్ఠమని తెల్పుచు భగవానుడు స్వధర్మమును వీడుట తగదని తెల్పుచున్నాడు-

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**
**స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్వనుష్ఠితాత్ | = బాగుగా ఆచరింపబడిన | శ్రేయాన్ | = శ్రేష్ఠమైనది | కుర్వన్ | = చేయుచు (మనుష్యుడు) |
| పరధర్మాత్ | = ఇతరుల ధర్మముకంటెను | (యస్మాత్) | = ఎందువలననగా | కిల్బిషమ్ | = పాపము(ల)ను |
| విగుణః (అపి) | = గుణరహితమేయైనను | స్వభావనియతమ్ | = స్వభావమునకు అనుగుణమైన | న, ఆప్నోతి | = (ఏమాత్రము) పొందడు |
| స్వధర్మః | = స్వధర్మాచరణమే | కర్మ | = స్వధర్మరూప కర్మ(ల)ను | | |

బాగుగా ఆచరింపబడిన పరధర్మముకంటెను గుణరహితమైనను స్వధర్మాచరణమే శ్రేష్ఠమైనది. స్వభావమును అనుసరించి (స్వధర్మరూప వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి) కర్మలను ఆచరించు మనుష్యునకు ఎట్టి పాపములును ఏమాత్రము అంటనే అంటవు. **(47)**

ప్రశ్న - "స్వనుష్ఠితాత్" అను విశేషణముతో గూడిన "పరధర్మాత్" అను పదము దేనిని సూచించును. దానికంటెను గుణరహితమైన స్వధర్మమే శ్రేష్ఠము - అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - సాంగోపాంగముగా అనుష్ఠించబడు ధర్మమును 'సు+అనుష్ఠితము' అని యందురు. కాని ఈ శ్లోకమునందు 'స్వధర్మము' అను పదమునకు 'విగుణము' అను విశేషణము ప్రయుక్తమైనది. కావున పరధర్మముతోపాటు 'గుణసంపన్నము' అను విశేషణము అధ్యాహారము చేయబడినది. గుణయుక్తమైన కర్మను సమగ్రముగా అనుష్ఠించినప్పటికిని అది అనుష్ఠించిన వానికి విధ్యుక్తముగాక తదితరులకు విధ్యుక్తమైనప్పుడు అట్టి కర్మను సూచించునదియే "స్వనుష్ఠితాత్" అను విశేషణముతోగూడిన "పరధర్మాత్" అను పదము.

క్షత్రియుల, వైశ్యుల ధర్మములతో పోల్చినప్పుడు బ్రాహ్మణుని విశేష ధర్మములయందు 'అహింసాది సద్గుణములు' అధికముగా గలవు. అట్లే గృహస్థాశ్రమ ధర్మములతో పోల్చినప్పుడు సన్న్యాసాశ్రమ ధర్మములలో సద్గుణములు అధికముగా నుండును. అదేవిధముగా శూద్రధర్మములకంటెను క్షత్రియ, వైశ్య ధర్మములే గుణయుక్తములు. ఐనను పరధర్మము ఎక్కువ సద్గుణములను కలిగియున్నప్పటికిని దానిని అనుష్ఠింపక విగుణమైనను స్వధర్మమును అనుష్ఠించుటయే సముచితము. చూచుటకు తన భర్త కురూపియు, గుణరహితుడును ఐనను అతనిని సేవించుటయే స్త్రీకి శ్రేయస్కరము గదా! అదే విధముగా ఒక విధముగా పరధర్మముకంటెను స్వధర్మము గుణహీనముగా గోచరించినను అది విధ్యుక్త మగుటచే దానిని అనుష్ఠించుటయే మిక్కిలి శ్రేయస్కరము.

ప్రశ్న - 'స్వధర్మము' అనగానేమి?

సమా - వర్ణాశ్రమరీతులను, స్వభావ పరిస్థితులను బట్టి ప్రతి వ్యక్తికిని విధ్యుక్తమైన కర్మయే అతనికి స్వధర్మము. అబద్ధము, కపటము, చౌర్యము, హింస, మోసము, వ్యభిచారము మొదలగు నిషిద్ధ కర్మలు ఎవ్వరికిని స్వధర్మములు కావు. కామ్యకర్మలు గూడ ఎవ్వరికిని అవశ్యకర్తవ్యములు కావు. కనుక ఇవి ఎవ్వరి స్వధర్మములలోను చేరవు. వీటిని (ఇట్టివానిని) విడిచి వర్ణాశ్రమములను బట్టి విశేషధర్మములుగా చెప్పబడినవియును, అధికారికముగా ఇతర వర్ణాశ్రమముల వారిచే అనుష్ఠింపబడినవియును, అధికారముగా ఇతర వర్ణాశ్రమముల వారిచే అనుష్ఠింపబడుటకు వీలు లేనట్టివియును అగు కర్మలు ఆయా వర్ణాశ్రమముల వారికి వేర్వేరు స్వధర్మములు. వేదాధ్యయన యజ్ఞయాగాదులు ద్విజులకు మాత్రమే అనుష్ఠానార్హములైన కర్మలు. అవి వారికి స్వధర్మములు. ఈశ్వర భక్తి, సత్యభాషణము మాతాపితరుల సేవ, ఇంద్రియ సంయమము, బ్రహ్మచర్య పాలనము, వినయము మొదలగు సామాన్య ధర్మములు అందఱికిని స్వధర్మములే. వాటిని ఆచరించుటకు అన్ని వర్ణాశ్రమములకు చెందిన స్త్రీ పురుషులకు అధికారము గలదు.

ప్రశ్న - 'స్వధర్మః' అను పదముతోపాటు 'విగుణః' అను విశేషణమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - 'విగుణః' అనుపదము కొన్ని గుణములు తక్కువగా ఉండుటను సూచించును. అంతేగాని గుణములు పూర్తిగా లేకుండుటను గాదు. యుద్ధములు చేయుట, దుష్టులను దండించుట మొదలగునవి క్షత్రియ ధర్మములు. వాటిలో అహింస, శాంతి మున్నగు గుణములు కొన్ని లోపించినవి. అట్లే వైశ్యధర్మములైన వ్యవసాయాది కర్మల యందును హింసాది దోషములు కొన్ని గలవు. అందువలన బ్రాహ్మణుల శాంతిమయ కర్మలతో పోల్చినపుడు అవియును విగుణములే. శూద్రుల ధర్మములు క్షత్రియుల, వైశ్యుల ధర్మములకంటెను నిమ్నశ్రేణికి చెందినవే. ఇంతేగాక ఈ కర్మలను పాటించుటలో ఏదైన ఒక అంశమును విస్మరించుటయు లోపమే. స్వధర్మమునందు గుణములు లోపించినను, అది పరధర్మాచరణము కంటెను శ్రేష్ఠమే. 'స్వధర్మః' అను పదముతోపాటు 'విగుణః' అను విశేషణ ప్రయోగము ఈ భావమునే సూచించును.

ప్రశ్న - 'స్వభావనియతమ్' అను విశేషణముతో గూడిన 'కర్మ' అను పదము దేనిని తెలుపును? దానిని ఆచరించుచును మనుజుడు పాపములను పొందడు. అని యనుటలోని విశేషమేమి?

సమా - వర్ణాశ్రమములను బట్టి, మనుష్య స్వభావమును బట్టి శాస్త్రోక్తమైన కర్మయే అతనికి 'స్వభావనియతం కర్మ' యగును. కనుక 'స్వభావ నియతం' అను విశేషణముతో గూడిన 'కర్మ' అను పదము, పైన తెలుపబడిన స్వధర్మమునే సూచించును. స్వధర్మమును న్యాయముగా

ఆచరించు సమయమున సంభవించు ఆనుషంగిక హింసాదిపాపములు ఆతనికి అంటవు. పరధర్మములను ఆచరించునప్పుడు అందు హింసాది దోషములు తక్కువగనే యున్నను పరవృత్తిచ్ఛేదనాది పాపములు అతనిని అంటును. కనుక గుణలోపములున్నను గుణయుక్తమైన పరధర్మముకంటెను స్వధర్మమును ఆచరించుటయే శ్రేష్ఠము.

**సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్ ।**
**సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ 48 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ కుంతీసుతా! | న, త్యజేత్ | = త్యజింపరాదు | సర్వారంభాః, దోషేణ | = కర్మలన్నియును ఏదేని ఒక దోషముచేత |
| సహజమ్, కర్మ | = సహజ(స్వాభావిక)మైన కర్మ | హి | = ఏలనన | ఆవృతాః | = ఆవరింపబడియే ఉండును |
| సదోషమ్, అపి | = దోషయుక్తమైనను | అగ్నిః | = అగ్ని | | |
| (తత్ | = దానిని) | ధూమేన, ఇవ | = పొగచే ఆవరింపబడినట్లు | | |

**ఓ కౌంతేయా! (అర్జునా!) దోషయుక్తమైనను సహజమైన కర్మను త్యజింపరాదు. ఏలనన! అగ్ని పొగచే ఆవరింపబడినట్లు కర్మలన్నియును ఏదేని ఒక దోషముతో కూడియే యుండును. (48)**

ప్రశ్న - 'సహజమ్' అను విశేషణముతో కూడిన 'కర్మ' అను పదము ఏయే కర్మలను సూచించును "దోషయుక్తమైనప్పటికిని సహజ కర్మలను త్యజింపరాదు" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - వర్ణాశ్రమములను, స్వభావపరిస్థితులను బట్టి ఎవరెవరికి ఏవేవి విధ్యుక్తములో వారివారికి అవియే సహజకర్మలు. ఈ యధ్యాయమున 'స్వధర్మ', 'స్వకర్మ', 'నియతకర్మ', 'స్వభావ నియతకర్మ', 'స్వభావజ కర్మ' అను పేర్లతో వర్ణింపబడిన కర్మలన్నింటిని 'సహజమ్' విశేషణముతో కూడిన 'కర్మ' అను పదము సూచించును.

స్వాభావిక కర్మలు లోపములు కలిగియున్నను వాటిని త్యజింపరాదనుట స్పష్టమే. అవి ఉత్తమ లక్షణములను కలిగియున్నప్పుడు వాటిని త్యజించు ప్రసక్తియే రాదు. సాధారణముగా హింసాది దోషములతో మిశ్రితములైనట్లు గోచరించుచున్నప్పటికిని అవి శాస్త్రవిహిత న్యాయోచిత కర్మలగుట వలన (పైకి దోషయుక్తములుగా కనబడుచున్నప్పటికిని) వాస్తవముగా అవి దోషయుక్తములు కావు. కనుక వాటిని త్యజింపనవసరములేదు. అనగా విధిగా వాటిని ఆచరింపవలెను. ఏలనన వాటిని ఆచరించుట వలన మనుష్యుడు పాపములను పొందడు. పైగా వాటిని త్యజించినచో పాపములను పొందగలడు. ఈ విషయమును స్పష్టపఱచుటకే దోషయుక్తమైనను సహజ కర్మలను త్యజింపరాదు అని నొక్కి చెప్పుట జరిగినది.

ప్రశ్న - 'హి' అను అవ్యయమును ప్రయోగించి, పొగచే ఆవరింపబడిన అగ్నివలె కర్మలన్నియును దోషయుక్తములే యని చెప్పుటలోగల విశేషమేమి?

సమా - 'హి' అను అవ్యయము ఇచట హేత్వర్థకము. అగ్ని పొగతో గూడియుండును. పొగకును అగ్నికిని అవినాభావ సంబంధము గలదు. అట్లే కర్మయు ప్రతిసూక్ష్మముగనైనను దోషస్పర్శ కలిగియే యుండును. ఆచరణమునందు ఏదోయొక విధముగా ఏదేని ఒకప్రాణికి హింసజరుగుచునే యుండును. సన్న్యాసాశ్రమమునందును శౌచస్నాన భిక్షాటనాది కర్మలను ఆచరించునప్పుడును, ఏదో యొక విధముగా ప్రాణులను హింసించుట జరుగుచునేయుండును. బ్రాహ్మణుల యొక్క యజ్ఞాది కర్మలయందును క్రియాసంభారములధికముగా నుండుటచే క్షుద్ర ప్రాణి హింస కావచ్చును. కావున ఏ వర్ణాశ్రమ కర్మమైనను బాహ్యదృష్టిలో సాధారణముగా దోషరహితము కాదు. కర్మచేయక ఎవ్వరును ఉండజాలరు - (3/5) 'హి' అను అవ్యయ ప్రయోగము యొక్క విశేషమిదియే. స్వధర్మమును త్యజించినను మనుష్యుడు ఏదో యొక కర్మను చేయవలసియే యుండును. అతడేది చేసినను అందు దోషము ఉండియే తీరును. అట్లని మనుష్యుడు స్వధర్మాచరణమును మానివేయుట తగదు. అందలి మమత, ఆసక్తి, ఫలేచ్ఛా రూపదోషములను త్యజించి, వాటిని న్యాయముగా ఆచరింపదగును. ఇట్లు చేయుటవలన మనుష్యుని అంతఃకరణము పవిత్రమై అతనికి శీఘ్రముగా పరమాత్మ ప్రాప్తి కలుగును.

*సంబంధము - అర్జునుని జిజ్ఞాసను అనుసరించి, త్యాగ - సన్న్యాసముల తత్త్వములను వివరించుటకై భగవానుడు **4** నుండి **12**వ శ్లోకమువఱకు త్యాగమును గూర్చి తెలిపెను. **13** నుండి **40**వ శ్లోకమువఱకును సన్న్యాసమును అనగా సాంఖ్యమును గూర్చి వివరించెను. **41** నుండి ఇంత (**48**వ శ్లోకము) వఱకును కర్మయోగరూప త్యాగతత్త్వమును స్పష్టపఱచుటకై స్వాభావిక కర్మల స్వరూపమును, వాటి అవశ్య కర్తవ్య స్థితులను నిర్దేశించెను. అట్లే భక్తియుక్తమైన కర్మయోగమును గూర్చి తెలిపి, దాని ఫలము భగవత్ప్రాప్తియే అని వివరించెను. కాని సన్న్యాస ప్రకరణమునందు సన్న్యాసము యొక్క ఫలమేమి? అట్లే కర్మలయందు కర్తృత్వాభిమానము వదలి ఉపాసనా సహిత సాంఖ్యయోగ సాధనను ఏవిధముగ చేయవలెను? అను విషయములు చర్చింపబడలేదు. కనుక ఇచట ఉపాసనా సహితముగ వివేకవైరాగ్యములతో ఏకాంతమున సాధనచేయు రీతిని దాని ఫలమును తెలుపుటకై మఱల సాంఖ్యయోగ ప్రకరణమును ఆరంభించుచున్నాడు-*

**అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।**
**నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వత్ర | = ప్రాపంచిక విషయములన్నింటి యందును | విగతస్పృహః | = స్పృహారహితుడును | సన్న్యాసేన | = సాంఖ్యయోగము ద్వారా |
| అసక్తబుద్ధిః | = ఆసక్తి లేనివాడును | జితాత్మా | = అంతఃకరణమును జయించినవాడును, అగు పురుషుడు | పరమామ్ | = అత్యంత శ్రేష్ఠమైన |
| | | | | నైష్కర్మ్యసిద్ధిమ్ | = నైష్కర్మ్యసిద్ధిని |
| | | | | అధిగచ్ఛతి | = పొందును |

**ఓ అర్జునా! ప్రాపంచికవిషయములన్నింటియందు ఆసక్తిలేనివాడును, స్పృహారహితుడును, అంతఃకరణమును జయించినవాడును అగు పురుషుడు సాంఖ్యయోగముద్వారా పరమశ్రేష్ఠమైన నైష్కర్మ్యసిద్ధిని పొందును. (49)**

ప్రశ్న - 'సర్వత్ర, అసక్తబుద్ధిః' 'విగతస్పృహః' **'జితాత్మా'** - ఈ మూడు విశేషణములకును విడివిడిగా అర్థములేమిటి? వీటిని ఇచట ప్రయోగించుటలో గల ప్రత్యేకత ఏమి?

సమా - అంతఃకరణేంద్రియములతో గూడిన శరీరము నందును, వాటిద్వారా చేయబడు కర్మలయందును, సమస్త భోగములయందును, చరాచరములతో గూడిన సమస్త జగత్తునందును, సర్వథా ఆసక్తి లేని వాడును, మనస్సు, బుద్ధి ఐహిక విషయములయందు ఏమాత్రము సంలగ్నము కానివాడును అగు వ్యక్తి 'సర్వత్ర-అసక్తబుద్ధిః' అని అనబడును. 'సర్వథా స్పృహలేనివాడు' అనగా సాంసారిక వస్తువుల యెడ ఏమాత్రము ఏవిధమైన కాంక్షయు లేనివాడు **'విగతస్పృహః'** అని అనబడును. ఇంద్రియ సహితముగ అంతఃకరణమును తన వశమునందుంచుకొనిన వానిని **'జితాత్మా'** అని యందురు. ఈ మూడు లక్షణములు గలవాడే సన్న్యాసయోగమునకు అర్హుడని తెల్పుటకై ఈ మూడు విశేషణములు ప్రయోగింపబడినవి. అట్టివాడే సాంఖ్యయోగముద్వారా పరమాత్మయొక్క యథార్థ జ్ఞానమును పొందగలడు.

ప్రశ్న - 'సన్న్యాసేన' అను పదము ఏ సాధనమును తెలుపును? 'పరమామ్' అను విశేషణముతోగూడిన 'నైష్కర్మ్యసిద్ధిమ్' అను పదము ఏ సిద్ధిని తెలుపును? సన్న్యాసము ద్వారా దానిని పొందుట యనగానేమి?

సమా - 'సన్న్యాసేన' అను పదము జ్ఞానయోగమును తెలుపును. దీనినే సాంఖ్యయోగమని అందురు. దీని స్వరూపమును భగవంతుడు 51వ శ్లోకమునుండి 53వ శ్లోకమువఱకు వర్ణించెను. ఈ సాధనయొక్క ఫలము కర్మబంధములనుండి సర్వథా విముక్తుడై సచ్చిదానంద ఘన నిర్వికార పరమాత్మయొక్క యథార్థ జ్ఞానమును పొందుటయే - ఆ ఫలమునే 'పరమామ్' అను విశేషణముతో గూడిన 'నైష్కర్మ్యసిద్ధిమ్' అను పదము తెలుపును. సాంఖ్యయోగము ద్వారా ప్రాప్తించు పరమాత్మ యొక్క యథార్థ జ్ఞానము ఈ సన్న్యాస యోగము ద్వారా కూడ సిద్ధించునని స్పష్టమైనది.

*సంబంధము - సన్న్యాసము ద్వారా మనుష్యుడు పరమశ్రేష్ఠమైన నైష్కర్మ్య సిద్ధిని పొందునని పై శ్లోకమున తెలుపబడినది. ఈ సన్న్యాసము (సాంఖ్యయోగము) యొక్క స్వరూపమేమి? దాని ద్వారా మనుష్యుడు ఏ క్రమమున సిద్ధిని పొంది బ్రహ్మప్రాప్తినందుచున్నాడు? అను జిజ్ఞాస కలుగును. కనుక ఈ విషయములను వివరింతునని ప్రస్తావించుచు సావధానుడవై వినుమని భగవానుడు అర్జునునితో పలుకుచున్నాడు-*

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | ప్రాప్తః | = పొందినవాడై | తథా | = ఆవిధానమును |
| జ్ఞానస్య యా, పరా, నిష్ఠా సిద్ధిమ్ | = జ్ఞానయోగముయొక్క పరానిష్ఠయైన నైష్కర్మ్యసిద్ధిని | బ్రహ్మ | = పరబ్రహ్మ పరమాత్మను | సమాసేన ఏవ | = సంక్షిప్తముగానే |
| | | యథా | = ఎట్లు | మే | = నానుండి |
| యథా | = ఏవిధముగా | ఆప్నోతి | = పొందునో | నిబోధ | = ఎఱుంగుము |

**ఓ కౌంతేయా! జ్ఞానయోగము యొక్క పరానిష్ఠయైన నైష్కర్మ్యసిద్ధిని పొందు విధమును, తద్వారా మనుష్యుడు బ్రహ్మప్రాప్తినందు రీతిని సంగ్రహముగా తెల్పెదను వినుము. (50)**

ప్రశ్న - **'పరా'** అను విశేషణముతోగూడిన **'నిష్ఠా'** అను పదముయొక్క అర్థమేమి?

సమా - జ్ఞానయోగముయొక్క అంతిమ స్థితినే **'పరా'** అను విశేషణముతో గూడిన **'నిష్ఠా'** అను పదము తెలుపును. దీనినే **'పరాభక్తి'** అనియు, తత్త్వజ్ఞానము అనియు అందురు. ఇది సాధనలన్నింటికిని అవధి (పరమావధి). జ్ఞానయోగసాధన సముదాయమును జ్ఞాననిష్ఠ అనియందురు. ఆ సాధనల ఫలరూపమైన తత్త్వజ్ఞానమును జ్ఞానము యొక్క **'పరానిష్ఠా'** అని యందురు.

ప్రశ్న - ఇచట **'సిద్ధిమ్'** అను పదమునకు అర్థము ఏమి?

సమా- పూర్వ శ్లోకమున నైష్కర్మ్య సిద్ధి అనియు, ఇచట జ్ఞానము యొక్క **'పరానిష్ఠ'** అనియు, 54వ శ్లోకమున **'పరాభక్తి'** అనియు, వర్ణింపబడినదానినే ఇచట **'సిద్ధిమ్'** అను పదము తెలుపును.

ప్రశ్న - **'యథా'** అనగానేమి?

సమా - శుద్ధాంతఃకరణము గల యోగ్యుడైన పురుషుడు జ్ఞానము యొక్క పరానిష్ఠద్వారా పరబ్రహ్మ పరమాత్మను పొందుటకై అవలంబించు విధిని అనగా అంగప్రత్యంగ సహిత జ్ఞానయోగ సాధన రీతినే **'యథా'** అను పదము తెల్పును.

ప్రశ్న - జ్ఞాననిష్ఠను పొందిన పురుషునకు బ్రహ్మప్రాప్తి ఎప్పుడు కలుగును?

సమా - జ్ఞాననిష్ఠ (నైష్కర్మ్యసిద్ధి) కలిగిన మఱు క్షణముననే (అవ్యవహితముగనే) పురుషునకు పరబ్రహ్మ ప్రాప్తి కలుగును.

ప్రశ్న - **'బ్రహ్మ'** పదమునకు అర్థమేమి? దానిని పొందుట యనగానేమి?

సమా - ఇచట **'బ్రహ్మ'** అను పదము నిత్యుడు, నిర్వికారుడు, నిర్గుణుడు, నిరాకారుడు ఐన సచ్చిదానంద ఘన పూర్ణబ్రహ్మ 'పరమాత్మ'ను తెలుపును - తత్త్వజ్ఞానము ద్వారా 55వ శ్లోకములో వర్ణింపబడిన రీతిగా అభిన్నభావముతో అంతర్లీనమగుటయే దానిని పొందుటయగును.

ప్రశ్న - **'తథా'** అనగానేమి? దానిని నీవు నానుండి గ్రహింపుము - అని యనుటలోని విశేషమేమి?

సమా - **'యథా'** అను పదమునకు లక్ష్యముగా తెలుపబడిన 'విధి'నే ఇచట **'తథా'** అను పదము సూచించును. దానిని విస్తారముగా గాక సంక్షిప్తముగా తెలుపుదుననియు, కావున దానిని గ్రహించుటకు సావధానుడవై వినుమనియు భగవానుడు అర్జునుని ఆదేశించుచున్నాడు.

*సంబంధము - భగవానుడు పూర్వశ్లోకమున ప్రస్తావించిన రీతిగా 3 శ్లోకములలో జ్ఞానయోగమును సాంగోపాంగముగా వర్ణించుచున్నాడు-*

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 51 ॥
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ 52 ॥
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 53 ॥

విశుద్ధయా = విశుద్ధమైన
బుద్ధ్యా = బుద్ధితో
యుక్తః = కూడినవాడై
లఘ్వాశీ = తేలికయైన సాత్త్వికాహారమును మితముగా భుజించువాడును
శబ్దాదీన్ = శబ్ద, స్పర్శ, రూపాదులైన
విషయాన్ = విషయములను
త్యక్త్వా = త్యజించి
వివిక్తసేవీ = పరిశుభ్రమైన ప్రదేశమున ఏకాంతముగా నివసించువాడును
ధృత్యా = సాత్త్విక ధారణాశక్తిద్వారా
ఆత్మానమ్ = అంతఃకరణమును, ఇంద్రియములను
నియమ్య = సంయమమొనర్చి
యతవాక్కాయమానసః = మనోవాక్కాయములను అదుపులో ఉంచుకొనిన వాడును
రాగద్వేషౌ = రాగద్వేషములను
వ్యుదస్య = సర్వథా త్యజించి
వైరాగ్యమ్ = దృఢవైరాగ్యమును
సముపాశ్రితః = ఆశ్రయించిన వాడును
చ = మఱియు
అహంకారమ్ = అహంకారమును
బలమ్ = బలమును
దర్పమ్ = దర్పమును
కామమ్ = కామమును
క్రోధమ్ = క్రోధమును
చ = మఱియు
పరిగ్రహమ్ = పరిగ్రహమును
విముచ్య = పరిత్యజించి
నిత్యమ్ = నిరంతరము
ధ్యానయోగపరః = ధ్యానయోగ పరాయణుడైన వాడును
నిర్మమః = మమతా రహితుడును
శాంతః = శాంతియుతుడును ఐన పురుషుడు
బ్రహ్మభూయాయ = సచ్చిదానంద ఘన పరబ్రహ్మమునందు అభిన్న భావముతో స్థితుడగుటకు
కల్పతే = పాత్రుడగును

విశుద్ధమైన బుద్ధిగలవాడై, తేలికయైన సాత్త్వికమైన ఆహారమును మితముగా భుజించువాడు, శబ్దాది విషయములను త్యజించి, పరిశుభ్రమైన ప్రదేశమున ఏకాంతముగా నివసించువాడు, సాత్త్వికధారణాశక్తిద్వారా అంతఃకరణేంద్రియముల సంయమము కలిగి, మనోవాక్కాయములను అదుపులో ఉంచుకొనినవాడు, రాగద్వేషములను సర్వథా త్యజించి, దృఢమైన వైరాగ్యమును సంపూర్ణముగా ఆశ్రయించినవాడు, అహంకారమును, బలమును, దర్పమును, కామక్రోధములను, పరిగ్రహమును వదలిపెట్టి, నిరంతరము ధ్యానయోగపరాయణుడై యుండువాడు, మమతారహితుడు, శాంతియుతుడు ఐన పురుషుడు సచ్చిదానంద పరబ్రహ్మమునందు అభిన్నభావముతో స్థితుడగుటకు పాత్రుడగును. **(51, 52, 53)**

ప్రశ్న - 'విశుద్ధ బుద్ధి' అనగానేమి? దానిని కలిగియుండుట అనగానేమి?

సమా - ఎట్టి పాపసంస్కారములు, ఏమాత్రమును లేని అంతఃకరణమును విశుద్ధబుద్ధి యందురు. అట్టి పవిత్రాంతః కరణము గలవానిని విశుద్ధబుద్ధియుక్తుడందురు.

ప్రశ్న - 'లఘ్వాశీ' అనగా ఎవరు?

సమా - సాధనకు అనుకూలముగా సులభముగా జీర్ణమగు సాత్త్వికాహారమును (17/8) స్వభావమునకును, అవశ్యక స్థితికిని, శక్తికిని అనుగుణముగా నియమప్రకారముగా, పరిమితముగా భుజించువాడు అనగా యుక్తాహారమును తీసికొనువాడు (6/17) **'లఘ్వాశీ'** అనబడును.

ప్రశ్న - శబ్దాది విషయములను త్యజించి, పవిత్ర ప్రదేశమున ఏకాంతమున నివసించుట యనగానేమి?

సమా - ప్రాపంచికములైన ఇంద్రియ సుఖములను అన్నింటిని త్యజింపవలెను. అనగా వాటిని అనుభవించుటలో జీవితముయొక్క అమూల్య సమయమును వృథా చేయరాదు. నిరంతరము సాధనచేయుటకు అనుకూలమైన, స్వచ్ఛమైన వాయుప్రసారము గల్గి జనసంచారమేలేని పరిశుభ్రమైన ఏకాంతప్రదేశమున నివసింపవలెను. ఆ ప్రదేశము నదీతీరము, దేవాలయము, వనము, పర్వతగుహ మొదలగువానిలో ఒకటి కాదగును.

ప్రశ్న - సాత్త్విక ధారణాశక్తి ద్వారా అంతఃకరణమును, ఇంద్రియములను సంయమమొనర్చుట యనగానేమి? అట్లు చేసి మనోవాక్కాయములను అదుపులో ఉంచుట యనగానేమి?

సమా - ఈ అధ్యాయమునందలి 33వ శ్లోకమున తెలుపబడిన లక్షణములు గల నిశ్చల ధారణాశక్తిద్వారా విశుద్ధమైన నిష్ఠతో అంతఃకరణమును ప్రాపంచిక విషయ చింతనములనుండి మఱల్చి, ఇంద్రియములు సాంసారిక భోగములయందు ప్రవృత్తములు గాకుండ చేయుటయే సాత్త్విక ధారణ ద్వారా అంతఃకరణమును ఇంద్రియములను సంయమ మొనర్చుట యనబడును. ఇట్టి సంయమము ద్వారా శరీరేంద్రియమనస్సులను అదుపులో ఉంచుకొనవలెను. అనగా వాటియందలి విశృంఖలత్వమును, బుద్ధిని చలింపజేయు శక్తిని పూర్తిగా తొలగింపవలెను. దీనినే మనోవాక్కాయములను అదుపులో ఉంచుకొనుట యందురు.

ప్రశ్న - రాగద్వేషములను రూపుమాపి, సంపూర్ణముగా వైరాగ్యమును ఆశ్రయించుట యనగానేమి?

సమా - ప్రతి ఇంద్రియవిషయమునందును రాగద్వేషములు దాగియుండును. ఇవి సాధకునకు పరమశత్రువులు. (3/34) కనుక ఇహపరలోకముల భోగములలో దేనియందైనను, ఏ ప్రాణియందైనను, ఏ పదార్థమందైనను ఏ క్రియ, లేక ఘటనయందైనను ఏమాత్రము ఆసక్తి గాని, ద్వేషము గాని లేకుండుటను రాగద్వేషములను సర్వథా రూపుమాపుట యగును. ఈ విధముగా రాగద్వేషములను రూపుమాపి, నిస్పృహతో నిరంతరము వైరాగ్యమునందే నిమగ్నుడై యుండవలెను. దీనినే రాగద్వేషములను రూపుమాపి పూర్తిగా వైరాగ్యమును ఆశ్రయించుట అని యందురు.

ప్రశ్న - అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, పరిగ్రహములను త్యజించుట యనగానేమి? వీటినన్నింటిని త్యజించి, నిరంతరము ధ్యానయోగ పరాయణుడై ఉండుట యనగానేమి?

సమా - శరీరేంద్రియ - అంతఃకరణముల యందు ఆత్మబుద్ధి కలిగియుండుటను అహంకారము అనియందురు. ఈ కారణము వలన మనస్సు, బుద్ధి, శరీరముల ద్వారా చేయబడు కర్మలకు మనుష్యుడు తనను కర్తగా భావించును. కనుక ఈ దేహాభిమానమును సర్వథా త్యజించుటనే అహంకారమును త్యజించుట అందురు. అన్యాయముగా ఇతరులపై బలవంతముగా అధికారమును నెరపుటను 'బలము' అని యందురు. ఈ విధమగు దుస్సాహసమును సర్వథా త్యజించుటను 'బలమును త్యజించుట' అని యందురు.ధనము, జనము, విద్య, జాతి, శారీరికశక్తి మొదలగువాటి కారణమున కలుగు గర్వమును 'దర్పము' అని యందురు. ఈ లక్షణమును సర్వథా త్యజించుటనే 'దర్పమును' త్యజించుట అని యందురు. ఇహపరలోక భోగముల ప్రాప్తికై కలుగు కోరికను 'కామము' అని యందురు. దీనిని సర్వథా త్యజించుటనే 'కామము'ను త్యజించుటయందురు. తన మనస్సునకు ప్రతికూలముగా ఆచరించువానిపైనను, నీతి విరుద్ధముగా వ్యవహరించువానిపైనను అంతఃకరణమునందు ఉత్పన్నమగు ఉత్తేజనాభావమును 'క్రోధము' అని యందురు. దీనివలన మనుష్యుని కన్నులు ఎఱ్ఱబాఱును. పెదవులు కంపించును. హృదయమున తాపము చెలరేగును. ముఖము

వికృతమగును. ఈ క్రోధమును సర్వథా త్యజించుటయే - అనగా ఎట్టి పరిస్థితుల యందును ఇట్టి భావోద్వేగములకు గురికాకుండుటయే క్రోధమును త్యజించుట యగును. సాంసారిక భోగవస్తు సామగ్రిని 'పరిగ్రహము' అనబడును. కనుక వీటన్నింటిని అన్ని విధముల పరిత్యజించుటయే ముఖ్యముగా పరిగ్రహ త్యాగమనబడును. మఱొకవిధముగా చెప్పవలెనన్న భోగ్యవస్తువులను ప్రోగుచేయకుండుటయు పరిగ్రహత్యాగమే యనబడును.

ఈ విధముగా అహంకారాదులనన్నింటిని త్యజించి, పూర్వోక్తరీతిగా సాత్త్వికధృతిద్వారా మనస్సు, ఇంద్రియముల క్రియలను నిలిపి, భౌతిక వ్యూహాలను పాఱద్రోలి, నిత్యము నిరంతరము సచ్చిదానందఘన బ్రహ్మను అభిన్న భావముతో చింతనచేయుట (6/25) అట్లే కూర్చున్నను, నిలబడినను, నిద్రలోను, మెలకువలోను, స్నానపానాది నిత్యజీవనావశ్యక క్రియాసమయముల యందును, సంతతము పరమాత్మ స్వరూపచింతనము చేయుచుండుట, దానినే పరమోత్కృష్టకర్తవ్యముగా భావించుట మున్నగు క్రియల యందలి తత్పరత్వమునే ధ్యానయోగ పరాయణత్వము అనియందురు.

ప్రశ్న - మమతారహితుడగుటయనగానేమి?

సమా - మనస్సు, ఇంద్రియములతోగూడిన శరీరము నందును, సమస్త ప్రాణులయందును, సకల భోగముల యందును, కర్మలయందును, జాతి, కుల, దేశ, వర్ణాశ్రమముల యందును మమతను సర్వథా త్యజించుటయు, ఏ వస్తువు నందైనను, క్రియయందైనను, ప్రాణియందైనను స్వపరభేదము లేకుండుటయే 'మమతా రాహిత్యము' అనబడును.

ప్రశ్న - శాంతుడనగానెవరు?

సమా - విశుద్ధబుద్ధ్యాది సాధనముల వలన అంతః కరణము నందు విక్షేపాది దోషములు తొలగి నిశ్చలమైనశాంతి, శుద్ధసాత్త్విక ప్రసన్నత కల్గియుండి, ఉపరతుడై యుండువాడు 'శాంతుడు' అని యనబడును.

ప్రశ్న - "పైన పేర్కొనబడిన విశిష్ట లక్షణములు గల్గియున్నప్పుడే పురుషుడు సచ్చిదానంద ఘనబ్రహ్మయందు అభిన్న భావముతో స్థితుడగుటకు పాత్రుడగును" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - పై విధముగా సాధన చేయు మనుష్యుడు ఈ సాధనలతో ఒప్పుచున్నవాడై బ్రహ్మభావప్రాప్తికి అర్హుడగును. వెంటనే బ్రహ్మభావమును పొందును. అనగా అతని దృష్టిలో ఆత్మ - పరమాత్మల మధ్య భేదభావము అంతరించి "నేను సచ్చిదానందబ్రహ్మనే" అను దృఢస్థితి కలుగును. ఆ సమయమున అతడు సమస్త జగత్తునందును తాను స్థితుడై యున్నటుల సమస్త జగత్తును తనలో కల్పితమైయున్నట్లు చూచును. (6/29)

సంబంధము - ఈ సన్న్యాసయోగ స్వరూపమును సమగ్రముగా వివరించి, ఆ సాధనద్వారా బ్రహ్మభావమును పొందిన యోగి లక్షణములను, జ్ఞానయోగముయొక్క పరానిష్ఠరూపపరాభక్తిని పొందు రీతిని భగవానుడు వర్ణించుచున్నాడు-

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।**
**సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54 ॥**

బ్రహ్మభూతః = సచ్చిదానందఘన బ్రహ్మమునందు ఏకీభావస్థితుడును
ప్రసన్నాత్మా = ప్రసన్నమైన మనస్సుగలవాడును,
(ఐనయోగి)
న, శోచతి = (దేనికిని) శోకింపడు
న, కాంక్షతి = దేనినీ కాంక్షింపడు
సర్వేషు భూతేషు = సమస్త భూతముల యందును
సమః = సమభావముగల యోగి
పరామ్, మద్భక్తిమ్ = నా పరాభక్తిని
లభతే = పొందును

సచ్చిదానంద ఘనపరబ్రహ్మయందు ఏకీభావస్థితుడై ప్రసన్నమనస్కుడైన యోగి దేనికిని శోకింపడు, దేనినీ కాంక్షింపడు. సమస్తప్రాణులయందును సమభావము గల అట్టి యోగి నా పరాభక్తిని పొందును. (54)

ప్రశ్న - 'బ్రహ్మభూతః' అను పదము ఎట్టి స్థితిని చేరిన యోగిని తెల్పును?

సమా - సచ్చిదానంద ఘన బ్రహ్మయందు అభిన్నభావ స్థితిని పొందినవాడు బ్రహ్మభూతుడనబడును. అతని దృష్టిలో సచ్చిదానంద ఘనబ్రహ్మకు తప్ప తదన్యమునకు దేనికిని అస్తిత్వమే లేదు. 'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మను (బృహదారణ్యక 1/4/10) 'సోఽహమస్మి' ఆ బ్రహ్మయే నేను మొదలగు మహావాక్యములను అనుసరించి పరమాత్మ యందు అభిన్నభావముతో శాశ్వతమైన నిశ్చలమైన స్థితినిపొందిన సాంఖ్యయోగిని 'బ్రహ్మభూతః' అను పదము తెల్పును. 5వ అధ్యాయముయొక్క 24వ శ్లోకము నందును, 6వ అధ్యాయము యొక్క 27వ శ్లోకమునందును ఇట్టి స్థితిని పొందిన యోగిని 'బ్రహ్మభూతః' అని వర్ణించుట జరిగినది.

ప్రశ్న - 'ప్రసన్నాత్మా' అనగానేమి?

సమా - పవిత్రమైన, స్వచ్ఛమైన, శాంతమైన, నిరంతరము ప్రసన్నమైన మనస్సు గలవాడు 'ప్రసన్నాత్మా' అని అనబడును. బ్రహ్మభావమును పొందిన పురుషుని దృష్టిలో సచ్చిదానందఘన బ్రహ్మకు తప్ప మఱియే వస్తువునకు అస్తిత్వమేలేని కారణమున అతని మనస్సు అనవరతము ప్రసన్నముగా ఉండును. అది ఎన్నడును, ఏకారణముననను క్షోభకు గుఱికాదు. ఈ భావమును స్పష్టపఱచుటకే 'ప్రసన్నాత్మా' అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - "బ్రహ్మభూతుడైన యోగి దేనికిని శోకింపడు. దేనినీ కాంక్షింపడు" అని యనుటలోని విశేషమేమి?

సమా - ఈ వాక్యము 'బ్రహ్మభూతుడైన' యోగి లక్షణమును తెలుపును. అతనికి సర్వత్ర బ్రహ్మబుద్ధియే (బ్రహ్మభావమే) యుండుటవలన జగత్తునందలి ఏ వస్తువునందును బ్రహ్మభావమునకు భిన్నముగా ఏమియును గోచరింపదు. ఆ వస్తువులయెడ రమణీయబుద్ధిగాని, మమకారముగాని ఉండదు. కావున శరీరేంద్రియాదులతో విషయములకు సంయోగవియోగము లేర్పడినప్పుడు అతనిలో ఎట్టి వికారములును కలుగవు. అందువలన ఎట్టి పరిస్థితియందును ఏకారణము వలననైనను అతడు ఏమాత్రము చింతాశోకములకు లోనుకాడు. అతడు పూర్ణకాముడు. ఏలనన ఏ వస్తువుగూడ అతనికి పరబ్రహ్మకంటే భిన్నముగా గోచరింపదు. కనుక అతడు మఱియే వస్తువును కాంక్షింపడు.

ప్రశ్న - "సర్వేషు భూతేషు సమః" అనగానేమి?

సమా - బ్రహ్మభూతుడైన యోగికి సమస్త ప్రాణుల యెడను సమభావమే ఉండును. ఏ ప్రాణిని అతడు తనకంటె వేఱుగా భావింపడు. కనుక అతనికి దేనియందును విషమ భావము ఉండక అన్నింటియందును సమభావమే యుండును. 6వ అధ్యాయమునందలి 29వ శ్లోకమున 'సర్వత్ర సమదర్శనః' అను పదప్రయోగము ద్వారా ఈ విషయమే స్పష్టపఱచబడినది.

ప్రశ్న - 'పరామ్' అను విశేషణముతో కూడిన 'మద్భక్తిమ్' అను పదము దేనిని తెలుపును?

సమా - 'జ్ఞానయోగఫలమునే' 'పరాంభక్తిమ్' అను పదప్రయోగము తెలుపును. దీనినే జ్ఞానముయొక్క 'పరానిష్ఠ' అనియు, తత్త్వజ్ఞానము అనియు అందురు. ఇది పరమాత్మ యొక్క యథార్థ స్వరూపమును సాక్షాత్కరింపజేసి, దానియందు అభేదభావముతో విలీనము చేయును.

*సంబంధము - ఈ విధముగా బ్రహ్మభూతుడైన యోగికి పరాభక్తి ప్రాప్తించునని తెలిపి భగవానుడు దాని ఫలమును తెలుపుచున్నాడు-*

**భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥ 55 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| భక్త్యా | = ఆ పరాభక్తితో (అ(బ్రహ్మభూతుడైన యోగి) | చ | = మఱియు | తతః | = అనంతరము |
| మామ్ | = పరమాత్ముడనైననన్ను | యావాన్, అస్మి = | ఎంతటి శక్తిగలవాడనో | మామ్ | = నన్ను |
| (అహమ్, | = నేను) | తత్త్వతః | = యథాతథముగ వాతత్త్వమును | తత్త్వతః | = యథార్థముగా |
| యః | = ఎవరినో | అభిజానాతి | = బాగుగా ఎఱుంగును | జ్ఞాత్వా | = తెలిసికొని |
| | | | | తదనంతరమ్ | = తత్క్షణమే |
| | | | | విశతే | = నాలో లీనమగును |

బ్రహ్మభూతుడైనయోగి ఆ పరాభక్తిద్వారా నేనెవరినో? ఎంతటివాడనో? యథాతథముగ నా తత్త్వమును తెలిసికొనును. అట్లు భక్తితో నా తత్త్వమును గ్రహించిన వెంటనే అతడు నాలో లీనమగును. **(55)**

ప్రశ్న - **'భక్త్యా'** అను పదము ఇచట దేనిని తెలుపును?

సమా - పూర్వశ్లోకమున **'పరామ్'** అను విశేషణ సహితముగ **'మద్భక్తిమ్'** అను పదము తోడను 50వ శ్లోకమున జ్ఞానయోగముయొక్క పరానిష్ఠా అను పేరుతోడను వర్ణింపబడిన తత్త్వజ్ఞానమునే ఇచటి **'భక్త్యా'** అను పదము తెలుపును. జ్ఞాన, భక్తి, కర్మ, ధ్యాన యోగాదులన్నింటి సాధనల ఫలము ఇదియే. దీని ద్వారానే సాధకులందఱికినీ పరమాత్మ యొక్క యథార్థ స్వరూప జ్ఞానము లభించి భగవత్ప్రాప్తి కలుగును. ఈ విధముగా సమస్త సాధనల ఫలమొకటేయని తెలుపుటకే, ఈ జ్ఞానయోగప్రకరణమున 'భక్త్యా' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - "నేనెవరు? నేనెంతటివాడను? అను యథార్థ తత్త్వమును యోగి ఈ భక్తిద్వారా తెలిసికొనును" - అని తెల్పుటలోని విశేషమేమి?

సమా - ఈ పరాభక్తి రూపతత్త్వ జ్ఞానము ప్రాప్తించిన వెంటనే, యోగి ఆ తత్త్వజ్ఞానము ద్వారా భగవంతుని యథార్థరూపమును తెలిసికొనును. అతని నిర్గుణనిరాకార రూపములేవి? సగుణనిరాకార మఱియు సగుణసాకార రూపమేమి? నిరాకారస్థితినుండి అతడుసాకారరూపమును ఎట్లు ప్రకటించును? మఱల అతడు సాకారస్థితినుండి నిరాకారస్థితికి ఎట్లు చేరును? మొదలగు ఈ విషయములను యోగి సమగ్రముగ తెలిసికొనును. దీనిని తెలిసికొనిన పిమ్మట ఆ యోగికి తెలిసికొనవలసినది ఏదియును ఉండదు. అతని (యోగి) దృష్టిలో ఇంక ఏవిధమైన భేదభావమూ ఉండదు. ఈ విధమైన జ్ఞానయోగ సాధనద్వారా ప్రాప్తించు నిర్గుణనిరాకార బ్రహ్మకును, సగుణ సాకార బ్రహ్మకును అభేద స్థితిని నిరూపించుటకే ఇచట జ్ఞానయోగప్రకరణమున భగవానుడు బ్రహ్మ అను పదమునకు మాఱుగా **'మామ్'** అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - **'తతః'** అనగానేమి.

సమా - **'తతః'** అను పదము హేతువాచకము. పరమాత్మ స్వరూప జ్ఞానము కలిగిన వెంటనే పరమాత్మప్రాప్తి కలుగును. అందు ఏమాత్రమూ కాలవిలంబము ఉండదు. కనుక ఇచట **'తతః'** అను పదమునకు 'తరువాత' అని యర్థము కాదు. ప్రకరణమును (సందర్భమును) అనుసరించి **'జ్ఞాత్వా'**కు హేతువాచకమైన **'తతః'** అను పదమునకు 'పరాభక్తి' అని అర్థమును చెప్పవలెను.

ప్రశ్న - **'తదనంతరమ్'** అను పదమునకు **'తత్క్షణమ్'** అనునర్థము ఏల చెప్పబడినది? **'జ్ఞాత్వా'** అను పదముతోపాటు తదనంతరం అని ప్రయోగింపబడినది. గావున **'విశతే'** అను క్రియాపదము ఉండుటవలన మనుష్యుడు మొదట భగవంతుని యథార్థ స్వరూపమును ఎఱింగి, ఆ పిమ్మట అందు ప్రవేశించునని చెప్పవచ్చునుగదా?

సమా - ఇది సరికాదు **'జ్ఞాత్వా'** అను పదప్రయోగము వలన కాలవిలంబమును (వ్యవధానమును) గూర్చి కలుగు సందేహమును దూరము చేయుటకు ఇచట **'తదనంతరమ్'** అను పదము ప్రయుక్తమైనది. భగవత్తత్త్వ జ్ఞానమునకును భగవత్ప్రాప్తికిని ఎట్టి అంతరము అనగా వ్యవధానము ఉండదు. భగవత్స్వరూపమును యథార్థముగా తెలిసికొనుటయు, అందు లీనమగుటయు, అవ్యవహితముగ ఒకేసారి జరుగును. భగవానుడు అందఱికిని ఆత్మస్వరూపుడు గావున వాస్తవముగ ఎవరికిని అప్రాప్తుడు కాడు. కనుక యథార్థస్వరూపజ్ఞానము కల్గిన వెంటనే భగవత్ప్రాప్తి కల్గును. ఈ భావమును స్పష్టపఱచుటకే **'తదనంతరమ్'** అను పదమునకు **'తత్క్షణము'** అని అర్థము చెప్పబడినది. కాలాంతరమును తెల్పుటకు **'జ్ఞాత్వా'** అను పదప్రయోగమే చాలును. **'తదనంతరమ్'** అను పదమును ప్రయోగింపనవసరమే లేదు. కాని **'తదనంతరమ్'** అను పదప్రయోగమును ప్రత్యేకముగా చేయుటనుబట్టి **"తత్క్షణమ్"** అను అర్థమును చెప్పుటయే సమంజసము.

*సంబంధము* - *ఈ విధముగా అర్జునుని జిజ్ఞాసను అనుసరించి, త్యాగమును అనగా కర్మయోగమును, సన్న్యాసమును అనగా సాంఖ్యయోగమును వేర్వేఱుగా విశదీకరించి భగవానుడు ఆ ప్రకరణములను ముగించెను. కాని ఈ రెండింటిలో అర్జునునకు ఏది కర్తవ్యసాధనయో తెల్పలేదు. కనుక భక్తి ప్రధాన కర్మయోగమును చేపట్టుమని అర్జునుని ఆదేశించు ఉద్దేశ్యముతో భక్తిప్రధాన కర్మయోగ ప్రాశస్త్యమును తెలుపుచున్నాడు-*

**సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥ 56 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మద్వ్యపాశ్రయః | = మత్పరాయణుడై, నన్ను ఆశ్రయించిన కర్మయోగి | సదా | = నిరంతరము | శాశ్వతమ్ | = సనాతనమైన |
| | | కుర్వాణః అపి | = చేయుచునే | అవ్యయమ్ | = నాశరహితమైన |
| | | మత్ప్రసాదాత్ | = నా అనుగ్రహము వలన | పదమ్ | = పరమ పదమును |
| సర్వకర్మాణి | = సమస్తకర్మలను | | | అవాప్నోతి | = పొందును |

**సమస్తకర్మలయందును కర్తృత్వభావమును వీడి, ఆయాకర్మలఫలరూపమైన సమస్తభోగములను త్యజించి, నన్నే ఆశ్రయించిన కర్మయోగి కర్మలను అన్నింటిని సర్వదా చేయుచును నాయనుగ్రహముచే సనాతనమైన శాశ్వతమైన పరమపదమును పొందును. (56)**

ప్రశ్న - 'మద్వ్యపాశ్రయః' అను పదమునకు అర్థమేమి?

సమా - సమస్త కర్మలను, వాటి ఫలరూపములైన సమస్త భోగములను ఆశ్రయింపక, భగవంతుని ఆశ్రయించినవాడును, తన మనస్సు ఇంద్రియముల సహితముగ శరీరమును, దానిద్వారా చేయబడు సమస్త కర్మలను, వాటి ఫలములను భగవంతునకు సమర్పించి, వాటి యన్నింటియెడ గల మమతాసక్తులను, కోరికలను పాఱద్రోలి, భగవత్పరాయణుడైన వాడును, భగవంతుడే తనకు పరమప్రాప్యుడు, పరమ ప్రియుడు, పరమహితైషి, పరమాధారుడు, సర్వస్వమూ అని భావించి, భగవద్విధానమునందే ప్రసన్నుడును ఐన పురుషుడు ఎట్టి సాంసారిక వస్తుసంయోగ వియోగముల యందును, ఎట్టి సంఘటనములయందును, ఎన్నడును హర్షశోకములకు లోనుగాడు. అతడు సర్వదా భగవంతునిపైననే ఆధారపడును. తాను చేయు కర్మలన్నియును భగవదాజ్ఞానుసారము భగవదనుగ్రహమునకై చేయును. తాను కేవలము నిమిత్తమాత్రుడనని భావించి, భగవత్ప్రేరణా శక్తులతో భగవదాదేశానుసారమే చేయును. తనను సర్వథా భగవదధీనునిగా భావించును. ఇట్టి భక్తి ప్రధాన కర్మయోగినే 'మద్వ్యపాశ్రయః' అను పదము సూచించును.

ప్రశ్న - 'సర్వకర్మాణి' అను పదము ఏయే కర్మలను సూచించును?

సమా - వర్ణాశ్రమములననుసరించి, శాస్త్రోక్తములైన కర్తవ్యకర్మలను 'సర్వకర్మాణి' అను పదము తెలుపును. వీటినే 'నియతకర్మలు'గా స్వభావజకర్మలుగా వర్ణించుట జరిగినది. ఇవి భగవదాజ్ఞాప్రేరణలకు అనుకూలములైనవి.

ప్రశ్న - 'అపి' అను అవ్యయప్రయోగ విశేషమేమి?

సమా - 'అపి' అను అవ్యయమును ప్రయోగించి, భక్తి ప్రధాన కర్మయోగి యొక్క మహిమను, కర్మయోగము యొక్క సౌలభ్యమును తెలుపుట జరిగినది. సమస్త పరిగ్రహములను, భోగములను త్యజించి, ఏకాంత ప్రదేశమున నిరంతరము పరమాత్మధ్యానసాధన చేయు సాంఖ్యయోగికి లభించు పరమాత్మప్రాప్తియే సదా భగవంతుని ఆశ్రయించి, స్వవర్ణాశ్రమోచిత కర్మలను సర్వదా ఆచరించు కర్మయోగికిని సిద్ధించును. ఈ రెండింటి ఫలములయందును ఎట్టి భేదమూ లేదు.

ప్రశ్న - 'శాశ్వతమ్ 'అవ్యయమ్' అను విశేషణములతో గూడిన 'పదమ్' అను విశేష్యము దేనిని తెలుపును? భక్తిప్రధాన కర్మయోగికి భగవదనుగ్రహముచే ఆ పదము ప్రాప్తించును - అని యనుటలోని విశేషమేమి?

సమా - నిత్యసత్యమైనవాడు, నిరంతరము ఉండువాడు, ఎన్నడును నశింపనివాడు ఐన సచ్చిదానందఘనపూర్ణబ్రహ్మ సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు - అట్టి పరమేశ్వరుని తెల్పునదియే పై విశేషణములతో కూడిన 'పదమ్' అను ప్రయోగము. అదియే పరమప్రాప్యము అని తెలుపుటకు దానిని 'పదమ్' అని పేర్కొనుట జరిగినది. 45వ శ్లోకమున 'సంసిద్ధిప్రాప్తి' అనియు, 46వ శ్లోకమున 'సిద్ధిప్రాప్తి' అనియు, 55వ శ్లోకమున 'మామ్' అను పదముద్వారా తెలుపబడిన పరమేశ్వర ప్రాప్తియే యిచట 'శాశ్వతమ్' 'అవ్యయమ్' అను విశేషణములతో కూడిన పదమ్ అను ప్రయోగముచే

తెలుపబడినది. వేర్వేరు పేర్లతో ఒకే తత్త్వము వర్ణింపబడినది. పైన తెలుపబడిన భక్తిప్రధాన కర్మయోగి యొక్క భావముచే ప్రభావితుడై అతని యెడ ప్రసన్నుడై భగవంతుడు అపార కృపచే స్వయముగా అతనికి పరాభక్తి రూప బుద్ధియోగమును ప్రసాదించును. (10/10) ఆ బుద్ధియోగము ద్వారా భగవంతుని యథార్థ స్వరూప జ్ఞానమును పొందిన భక్తుడు భగవంతుని యెడ తన్మయుడగును. అనగా సచ్చిదానంద ఘనపరమేశ్వరుని యందు లీనమగును. ఉపర్యుక్త పరమపద ప్రాప్తియనగా ఇదియే.

*సంబంధము - ఈవిధముగా భక్తిప్రధాన కర్మయోగియొక్క మహాత్మ్యమును వర్ణించి, అర్జునుని కూడ అట్లే కావలసినదని భగవంతుడాజ్ఞాపించుచున్నాడు-*

**చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।**
**బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ 57 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వకర్మాణి | = సమస్తకర్మలను | బుద్ధియోగమ్ | = సమబుద్ధిరూప యోగమును | సతతమ్ | = సంతతము |
| చేతసా | = నిండుమనస్సుతో | ఉపాశ్రిత్య | = అవలంబించి | మచ్చిత్తః, భవ | = నాయందే చిత్తము గలవాడవగుము |
| మయి | = నాయందు(నాకు) | మత్పరః | = మత్పరాయణుడవై | | |
| సన్న్యస్య | = సమర్పించి | | | | |

**సర్వకర్మలను నిండుమనస్సుతో నాకే అర్పించి, సమబుద్ధిరూపయోగమును అవలంబించి, మత్పరాయణుడవై సంతతము చిత్తమును నాయందే నిల్పుము. (57)**

ప్రశ్న - సర్వకర్మలను మనస్పూర్తిగా భగవానునకు అర్పణ చేయుట అనగానేమి?

సమా - శరీరేంద్రియమనస్సులు, వాటి ద్వారా చేయబడు కర్మలు, సాంసారిక వస్తువులు అన్నియును భగవంతునకు చెందినవిగా భావించి, వాటియందలి మమతాసక్తులను కోరికలను సర్వథా త్యజింపవలెను. అట్లే "నేను దేనిని చేయుటకును నిజముగా అశక్తుడను. భగవంతుడే అన్ని విధముల నాకు శక్తిని ప్రసాదించి, నాద్వారా తన సంకల్పము ప్రకారము సమస్త కర్మలను చేయించుచున్నాడు. నేనేమియు చేయుటలేదు" అని భావించి, భగవదాజ్ఞానుసారము అతనికొలుకు ఆయన ప్రేరణ వలననే, అతడు చేయించిన రీతిగనే తాను నిమిత్తమాత్రుడై, సమస్త కర్మలను తోలుబొమ్మవలె చేయుచుండవలెను. సమస్త కర్మలను మనస్పూర్తిగా భగవానునకర్పించుట అనగా నిదియే.

ప్రశ్న - 'బుద్ధియోగము' అనగానేమి? దానిని అవలంబించుట యనగానేమి?

సమా - సిద్ధి - అసిద్ధులయందును, సుఖదుఃఖముల యందును, లాభనష్టములయందును, అట్లే ప్రాపంచిక పదార్థములయందును, ప్రాణులయందును, సమబుద్ధి కలిగి యుండుటనే 'బుద్ధియోగము' అని యందురు. అందువలన అంతయు భగవంతునియొక్క సంజ్ఞాసంకల్పములమేరకే జరుగుచుండునని తలంచి, సమస్త వస్తువులయందును, ప్రాణులయందును, సంఘటనలయందును, రాగద్వేషములు, హర్షశోకాది వికారములును లేకుండ సదా సమభావయుక్తుడై యుండుటనే 'బుద్ధియోగము'ను అవలంబించుట అని యందురు.

ప్రశ్న - 'భగవత్పరాయణుడగుట' అనగానేమి?

సమా - భగవంతుడే తనకు పరమప్రాప్యుడు, పరమగతి, పరమహితైషి, పరమప్రియుడు, పరమాధారుడు - అని భావించి, ఆ భగవద్విధివిధానములయందే సర్వదా సంతుష్టుడై, తత్ప్రాప్తి సాధనలయందు తత్పరుడై యుండుటనే భగవత్పరాయణుడగుట యందురు.

ప్రశ్న - నిరంతరము భగవంతునియందే 'చిత్తమును నిల్పుట' అనగానేమి?

సమా - మనస్సును, బుద్ధిని నిశ్చలభావముతో భగవంతుని యందే లగ్నము చేయుటను, భగవంతుని యందు తప్ప మఱి దేనియందును ఏమాత్రమూ ఆసక్తి లేకుండ అనన్య భక్తితో నిరంతరము భగవంతునే చింతన

చేయుటను, క్షణమాత్రము భగవంతుని విస్మృతిని ఓర్చుకొనలేకపోవుటను, కూర్చున్నను, నిలబడినను, నడచుచున్నను, తిరుగుచున్నను, త్రాగుచున్నను, తినుచున్నను, నిద్రించుచున్నను, మేల్కొని యున్నను, ఇంకను ఇతర సమస్తకర్మలను చేయుచున్నను, నిత్యము, నిరంతరము మనస్సునందు భగవానుని దర్శించుటనే "నిరంతరము భగవంతునియందు చిత్తమును నిల్పుట" అని అందురు. 9వ అధ్యాయము నందలి చివరి శ్లోకమునందును, ఈ అధ్యాయమునందలి 65వ శ్లోకమునందును, ప్రయుక్తమైన 'మన్మనా భవ' అను పదముల ద్వారా కూడ ఈ విషయమే తెల్పబడినది.

*సంబంధము - ఈ విధముగా "భక్తిప్రధాన కర్మయోగివి కమ్ము" - అని భగవానుడు అర్జునుని ఆదేశించి, ఆ యాజ్ఞను అనుసరించుట వలన కలుగు ఫలమును, అనుసరింపక పోవుటవలన కలుగు హానిని తెలుపుచున్నాడు-*

**మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి ।**
**అథ చేత్ త్వమహంకారాత్ న శ్రోష్యసి వినంక్ష్యసి ॥ 58 ॥**

| పదము | అర్థము | పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| మచ్చిత్తః, త్వమ్ | = నాయందు చిత్తమును నిల్పిన నీవు | తరిష్యసి | = అనాయాసముగ దాటగలవు | వినంక్ష్యసి | = బెట్టినచో నష్టముల పాలగుదువు (పరమార్థపథము నుండి భ్రష్టుడవగుదువు) |
| మత్ప్రసాదాత్ | = నాయనుగ్రహము వలన | అథ, చేత్ | = అట్లుగాక | | |
| సర్వదుర్గాణి | = సమస్త సంకటములను | అహంకారాత్ | = అహంకార కారణముగ | | |
| | | న, శ్రోష్యసి | = నావచనములను నీవు పెడచెవిని | | |

పైన తెలుపబడిన విధముగా నాయందు చిత్తమును నిల్పినచో, నా యనుగ్రహము వలన సమస్తసంకటముల నుండియు అనాయాసముగా బయట పడగలవు. ఒకవేళ అహంకార కారణమున నా వచనములను పెడచెవిన బెట్టినచో నష్టముల పాలగుదువు. అనగా పరమార్థ పథమునుండి భ్రష్టుడవగుదువు. **(58)**

ప్రశ్న - "నాయందు చిత్తమును నిల్పినచో నాయనుగ్రహము వలన సమస్త సంకటములన్నింటినుండియు అనాయాసముగా బయట పడగలవు" అనగానేమి?

సమా - పూర్వ శ్లోకమున తెల్పబడిన రీతిగా మనుజుడు సమస్త కర్మలను భగవంతునకర్పించి, భగవత్పరాయణుడై నిరంతరము ఆతనియందే చిత్తమును నిల్పిన పిమ్మట ఆ సాధకునకు ఎట్టి కర్తవ్యమూ మిగిలియుండదు. భగవత్కృపా ప్రభావమున అతడనాయాసముగ ఇహపరలోకముల దుఃఖములన్నింటికిని దూరమగును. అన్ని విధములుగా దుర్గుణ దురాచార రహితుడై జనన మరణరూప మహాసంకటములన్నింటి నుండియు, శాశ్వతముగా విముక్తుడై, నిత్యుడును, ఆనందఘనుడును అగు పరమేశ్వరుని పొందగలడు.

ప్రశ్న - 'అథ' 'చేత్' అను రెండు అవ్యయముల అర్థమేమి? 'అహంకార కారణమున నా వచనములను పెడచెవిని పెట్టినచో నష్టముల పాలగుదువు' అని యనుటలోని విశేషమేమి?

సమా - 'అథ' అనునది పక్షాంతర బోధకము. అనగా అనంతరము. (శ్లోకపూర్వార్థముతో సమన్వయము) 'చేత్' అను పదము 'యది' అనగా ఒకవేళ అను అర్థమున ప్రయుక్తమైనది. అర్జునుడు భగవంతునకు భక్తుడు, ప్రియసఖుడు. కనుక అవశ్యము ఆతని ఆజ్ఞను పాటించును. "భగవదాజ్ఞను పాటించుట వలన అత్యంత పరమార్థము చేకూరునట్లే, పాటింపనిచో తీరని హానియు సంభవించును"- అని తెల్పుటకే, 'అథ' 'చేత్' అను అవ్యయములు ప్రయోగింపబడినవి. అహంకారవశమున అర్జునుడు తాను

బుద్ధిమంతుడననియు, సమర్థుడననియు భావించి, భగవంతుని మాటలను పెడచెవిని బెట్టి, తన యిష్టమువచ్చిన రీతిగా ప్రవర్తించినచో పరమార్థమునకు దూరమగును. పైగా అతనికి ఇహపరలోకములయందెచ్చటను నిజమైన సుఖశాంతులు లభింపవు. అతడు తన కర్తవ్యము నుండి భ్రష్టుడై ప్రస్తుత స్థితినుండియు పతనమగును.

ప్రశ్న - 'అర్జునుడు తనకు పరమభక్తుడు' అని భగవానుడు వచించియుండెను. (4/3) 'న మే భక్తః ప్రణశ్యతి' అనగా "నా భక్తుడు ఎన్నడును పతనము చెందడు" అనియును పల్కియుండెను (9/31) మఱి ఇచ్చట నీవు నష్టపోవుదువు - అనగా పతనము చెందుదువు అని నుడువుచున్నాడు. ఈ వైరుధ్యమునకు సమాధానమేమి?

సమా - నిశితముగా పరిశీలించినచో ఈ శ్లోకము నందే 'చేత్' అను పదప్రయోగము ద్వారా భగవానుడే స్వయముగా ఈ వైరుధ్యమునకు సమాధానమును ఇచ్చియున్నాడు. భగవద్భక్తుడు ఎన్నడును పతనము చెందడు - అనుట నిత్యసత్యము. అర్జునుడు భగవానునకు పరమభక్తుడనుటయు సత్యమే. కనుక అతడు భగవదాజ్ఞను వినకపోవుటగాని, పాటింపకుండుట గాని జరుగనే జరుగదు. కాని ఒకవేళ అతడహంకార వశమున భగవదాజ్ఞను చులకనగా చూచినచో (ఉపేక్షించినచో) అతడు భగవద్భక్తుడే కానేరడు. అట్లు ఉపేక్షించిననాడు, అతనికి పతనము సంభవమే.

*సంబంధము - అహంకారవశమున భగవదాజ్ఞను పాటింపనివాడు పతనమగుట తథ్యమని భగవానుడు పూర్వశ్లోకమున నుడివెను. దానికి పుష్టిని సమకూర్చుటకై రెండు శ్లోకములలో అర్జునుని నిశ్చయమునందలి (యుద్ధము చేయననుటలోని) దోషమును చూపుచున్నాడు-*

**యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।**
**మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహంకారమ్, | = అహంకారమును | యత్, మన్యసే | = ఏదైతే తలంతువో | ప్రకృతిః | = (నీ) స్వభావమే |
| ఆశ్రిత్య, | = ఆశ్రయించి | తే | = నీయొక్క | త్వామ్ | = నిన్ను |
| న, యోత్స్యే, | = (నేను) యుద్ధము చేయను | ఏషః, వ్యవసాయః | = ఈ నిశ్చయము | నియోక్ష్యతి | = (యుద్ధము చేయుటకు) పురికొల్పును |
| ఇతి | = అని | మిథ్యా | = మిథ్యయే (వృథాయే) | | |
| | | (యతః) | = ఏలననగా | | |

**అహంకారవశమున "నేను ఈ యుద్ధమును చేయను" అని నీవు నిశ్చయించు కొనుట వృథా. ఏలనన నీ స్వభావమే యుద్ధముచేయుటకు నిన్ను పురికొల్పును. (59)**

ప్రశ్న - "నేను ఈ యుద్ధమును చేయను" అను నీ నిర్ణయము అహంకార పూరితము - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - 'యుద్ధము చేయుము' అని భగవంతుడు అర్జునుని ఆజ్ఞాపించెను. (2/3) అందులకు సమాధానముగా అర్జునుడు "నయోత్స్యే" నేను యుద్ధమును చేయను (2/9) – అని పల్కియుండెను. ఆ విషయమునే జ్ఞప్తికి తెచ్చుచు భగవానుడు ఈ వాక్యమును పల్కెను. "నేను యుద్ధమును చేయను" అని అర్జునుడు నిశ్చితముగా పల్కుట - కేవలము అహంకార పూరితమే. యుద్ధము చేయకుండుట అనునది అతని (అర్జునుని) అధీనములో లేదు. కనుక అజ్ఞానజనితమైన అహంకారమునకు వశుడైన వాడు "తాను పండితుడననియు, సమర్థుడననియు, స్వతంత్రుడననియు" భావించి "ఈ కార్యమును నేను ఈ విధముగా చేయుదును" "ఈ కార్యమును చేయను" అను నిశ్చయమును ప్రకటించుట ఎంతేని అనుచితము.

ప్రశ్న - "ఈ నీ నిశ్చయము వృథా" అని యనుటలోని విశేషమేమి?

సమా - అర్జునుని ఈ నిశ్చయము నిలబడ జాలదు. అనగా అర్జునుడు స్వతంత్రుడు కాడు, ప్రకృతికి అధీనుడు. కనుక యుద్ధమును చేయకుండ ఉండజాలడు - అని భగవానుని అభిప్రాయము.

ప్రశ్న - ఇచ్చట 'ప్రకృతిః' అను పదము దేనిని తెల్పును? నీ ప్రకృతియే నీచే యుద్ధము చేయించును - అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - జన్మజన్మాంతరములయందు చేయబడిన కర్మల సంస్కారములు ప్రస్తుత (ఈ) జన్మయందు స్వభావరూపమున ప్రాదుర్భవించును. వాటి (ఆ సంస్కారముల) సమష్టి రూపమునే ఇచట 'ప్రకృతిః' అను పదము సూచించును. దీనినే 'స్వభావము' అనియు అందురు. ఈ స్వభావమును అనుసరించియే మనుష్యుడు వేర్వేఱు కర్మలకు అధికారిగా జన్మించును. దానిననుసరించియే మనుష్యులకు వేర్వేరు కర్మలయందు ప్రవృత్తి కలుగుచుండును. కనుక అర్జునుడు క్షత్రియుడుగా జన్మించుటకు కారణమైన ఆ స్వభావమే (ప్రకృతియే) అతని ఇచ్ఛతో పనిలేకుండ బలవంతముగా అతనిని యుద్ధమున ప్రవృత్తునిగా చేయును. యోగ్యత ఏర్పడినప్పుడు శౌర్యపరాక్రమములతో యుద్ధము చేయవలెను. యుద్ధమునకు భయపడుటగాని, అందుండి పాఱిపోవుటగాని తగదు. యుద్ధము అతనికి (అర్జునునకు) సహజకర్మ. కావున దానిని ఆచరింపకుండ ఉండజాలడు. అవశ్యము యుద్ధమును చేసియే తీరవలెను. ఇచట అర్జునునకు క్షత్రియధర్మముగా యుద్ధము స్వాభావిక కర్మయైనట్లు ఇతర వర్ణముల వారికిని తమతమ వర్ణాశ్రమధర్మములు స్వాభావిక కర్మలని తెలిసికొనవలెను.

**స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా ।**
**కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ! | = ఓ అర్జునా! | న, ఇచ్ఛసి | = నీవు ఇష్టపడకున్నావో | కర్మణా | = కర్మ (సంస్కారముల)చే |
| మోహాత్ | = మోహప్రభావమున | తత్, అపి | = ఆయుద్ధమును గూడ | నిబద్ధః | = బంధింపబడినవాడవై |
| యత్ | = ఏ యుద్ధకర్మను | స్వేన, | } = నీ (క్షత్రియ) | అవశః, | = అవశుడవై |
| కర్తుమ్ | = చేయుటకు | స్వభావజేన | స్వభావమునకు తగిన | కరిష్యసి | చేయుదువు |

**ఓ కౌంతేయా! మోహప్రభావమున నీవు చేయుటకు ఇష్టపడని కర్మను గూడ నీ పురాకృత స్వాభావిక కర్మలచే(సంస్కారములచే)బంధింపబడి, తత్ప్రభావమున నీవు అవశుడవై చేయుదువు. (60)**

ప్రశ్న - 'కౌంతేయ!' అను సంబోధనలోని విశేషమేమి?

సమా - అర్జునుని తల్లి కుంతీదేవి. గొప్ప వీరవనిత. ఆమె శ్రీకృష్ణుని ద్వారా స్వయముగా సందేశమును పంపుచు పాండవులను యుద్ధమునకై ప్రోత్సహించెను. అట్టి వీరమాత పుత్రుడే అర్జునుడు. అతడు వీరుడు, శూరుడు. కనుక అతడు యుద్ధము చేయకుండ ఉండజాలడని తెల్పుటకే భగవానుడు అతనిని 'కౌంతేయ!' అని సంబోధించెను.

ప్రశ్న - నీవు యుద్ధమునకు విముఖుడవగుటకు నీ మోహమే ప్రబల కారణము అని అనుటలోని విశేషమేమి?

సమా - అర్జునుడు క్షత్రియుడు. యుద్ధము చేయుట అతనికి స్వాభావిక ధర్మము. కనుక అతనికి అది పాపకర్మ కాదు. కావున అతడు యుద్ధవిముఖుడగుట ఏవిధముగను సముచితము గాదు. ఐనప్పటికిని న్యాయముగ (స్వాభావికముగ) ప్రాప్తించిన యుద్ధరూప సహజకర్మను చేయుటకై ఇష్టపడకుండుటకు కేవలము అతని అవివేకమే కారణము. యుక్తి యుక్తమైన మఱొక కారణము ఏదియును లేదు - అని భగవానుడు స్పష్టపఱచెను.

ప్రశ్న - నీ స్వాభావిక కర్మలచే (సంస్కారములచే) బంధింపబడి నీవు యుద్ధకర్మలను అవశుడవై చేయుదువు. అని అనుటలోని విశేషమేమి?

సమా - యుద్ధము చేయుట అర్జునునకు స్వాభావిక కర్మ. అందువలన అతడు దానిచే బంధింపబడియున్నాడు. అనగా దానితో అతనికి బలమైన (అవినాభావ) సంబంధము గలదు. కనుక అతనికి ఇష్టము లేకున్నను అది అతనిని తనవైపునకు లాగికొనును. అతడు తన స్వభావమునకు లోబడి దానిని చేయవలసియే వచ్చును. 57వ శ్లోకమున చెప్పబడిన రీతిగా భగవదాజ్ఞానుసారము యుద్ధము చేసినచో అతడు కర్మబంధములనుండి ముక్తుడై భగవంతుని చేరును. లేనిచో రాగద్వేషములనెడి వలలో చిక్కుకొని, జనన మరణరూపసంసార సాగరమున మునకలు వేయుచుండును.

నదీప్రవాహమున కొట్టుకొని పోవుచున్న మనుష్యుడు ఆ ప్రవాహమునకు ఎదురీదుటకు ప్రయత్నించినచో ఆ నదీ

ప్రవాహమునుండి బయటపడలేడు. పైగా దానిలో మునిగి నశించును. ఏదైనా నౌకను గాని, కొయ్యను గాని ఆశ్రయించి, ప్రవాహమునకు అనుకూలముగా నీటిపై సాగిపోయినచో తీరముచేరి, నదిని దాటును. అట్లే ప్రకృతియను ప్రవాహమున కొట్టుకొని పోవుచున్న మనుష్యుడు ఆ ప్రకృతికి ఎదురీదినచో (విరుద్ధముగా సాగినచో) అనగా గర్వముతో కర్తవ్య కర్మను విడనాడినచో ఆ ప్రకృతి ప్రవాహమునుండి బయటపడలేడు. పైగా దానియందే అధికముగా చిక్కుకొనిపోవును. కాని పరమేశ్వరుని లేక కర్మయోగమును ఆశ్రయించి, లేక జ్ఞానమార్గమును అనుసరించి, ప్రకృతికి అతీతుడై, తదనుకూలముగా కర్తవ్య కర్మలను ఆచరించినచో కర్మబంధములనుండి ముక్తుడై ప్రకృతి ప్రవాహమునుండి బయటపడును. అనగా పరమాత్మను పొందును.

సంబంధము - *మానవుడు స్వభావమునకధీనుడై కర్మలను ఆచరించునని పూర్వశ్లోకమున తెల్పబడినది. ప్రకృతి లేక స్వభావము జడము గదా! దానికి మానవుడు ఎట్లువశుడగును? అను సందేహము కలుగవచ్చును. దానికి సమాధానముగా భగవానుడు ఈ శ్లోకమున తగు విషయములను వివరించుచున్నాడు-*

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥ 61 ॥**

అర్జున! = ఓ అర్జునా!
యంత్రారూఢాని = శరీరరూప యంత్రములను ఆధిరోహించిన
సర్వభూతాని = సమస్తప్రాణులను
ఈశ్వరః = అంతర్యామియైన పరమేశ్వరుడు
మాయయా = తన మాయచే
భ్రామయన్ = (వారివారి కర్మలను అనుసరించి, వారిని) భ్రమింపజేయుచు
సర్వభూతానామ్ = సకలభూతముల యొక్క
హృద్దేశే = హృదయముల యందు
తిష్ఠతి = స్థితుడై యుండును

**అర్జునా! శరీరరూపయంత్రములను అధిరోహించిన సర్వప్రాణుల హృదయములయందు అంతర్యామిగానున్న పరమేశ్వరుడు తన మాయచేత వారి వారి కర్మలను అనుసరించి, వారిని భ్రమింపజేయుచున్నాడు. (61)**

ప్రశ్న - శరీరములకు యంత్రముల ఉపమానము నిచ్చుటలో గల విశేషమేమి? ఈశ్వరుడు సర్వప్రాణుల హృదయములయందు స్థితుడై యుండునని చెప్పుటలో గల ప్రత్యేకత ఏమి?

సమా - రైలుబండి మొదలగు యంత్రములను అధిష్ఠించిన మనుష్యుడు స్వయముగా కదలజాలడు. ఐనను ఆ యంత్రము కదలుటచే అతడును కదలినట్లగును. అదేవిధముగా నిశ్చలమైన ఆత్మకు ఎట్టి క్రియతో (శారీరక క్రియతో) వాస్తవముగా ఎట్టి సంబంధమూ లేదు. ఐనను అనాది సిద్ధమైన అజ్ఞానకారణమున అతనికి శరీరముతో సంబంధము ఉండుట వలన ఆ శారీరకక్రియలు అతనిచే ఆచరింపబడుచున్నట్లుగా భావింపబడుచుండును.

యంత్రమును నడుపువాడు కూడ స్వయముగా ఆ యంత్రమునందే స్థితుడై యుండును. అదేవిధముగ భగవానుడు సమస్త ప్రాణుల యంతఃకరణములయందు ఉండి వారి వారి కర్మలను అనుసరించి, వారిని భ్రమింపజేయుచుండును. ఈశ్వర విధానమునందు (ఈశ్వర సంకల్పమునందు ఏమాత్రము లోపము సంభవింపదు. ఏలనన అతడు) సర్వశక్తిమంతుడు. సర్వవ్యాపి. సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు. అందరి కర్మలను అతడు పూర్తిగా ఎఱుంగును.

ప్రశ్న - 'యంత్రారూఢాని' అను విశేషణముతో గూడిన 'భూతాని' అను పదము ఎవరిని గూర్చి తెలుపును? భగవంతుడు తన మాయచే వారిని భ్రమింప జేయుచున్నాడనగానేమి?

సమా - (శరీరరూప యంత్రములయందు స్థితులైన సమస్తప్రాణులను సూచించునదియే 'యంత్రారూఢాని'

అను విశేషణముతో గూడిన 'భూతాని' అను పదము. వారివారి పూర్వార్జిత కర్మసంస్కారములనుబట్టి ఫలములను అనుభవింపజేయుటకై ఏదేవదే భగవంతుడు వారికి వేర్వేఱు జన్మలను ఇచ్చుచుండును. వేర్వేఱు పదార్థములతో, క్రియలతో, ప్రాణులతో వారికి సంయోగ వియోగములను కల్గించుచుండును. వారి స్వభావములను (ప్రకృతులను) అనుసరించి, మఱల వారు కర్మలయందు పాల్గొను (నిమగ్నులగు) నట్లు చేయును. భగవంతుడు సర్వప్రాణులను తన మాయద్వారా భ్రమింపజేయుచున్నాడనగా ఇదియే.

ప్రశ్న - కర్మలను చేయుటకును లేక చేయకుండుటకును మనుష్యుడు స్వతంత్రుడా? లేక పరతంత్రుడా? ఒకవేళ పరతంత్రుడే యైనచో ఏ రూపమున ఎవరికి పరతంత్రుడు? ప్రకృతికా? స్వభావమునకా? ఈశ్వరునకా? ఏలనన ఒకచోట (2/47) మనుష్యునకు కర్మలను చేయుటయందే అధికారము కలదనుట ద్వారా అతడు స్వతంత్రుడని చెప్పుట జరిగినది. వేఱొకచోట (3/33) అతడు ప్రకృతికి అధీనుడనియు, మఱొకచోట (10/8) ఈశ్వరునకధీనుడనియు తెల్పబడినది. ఈ యధ్యాయమున కూడా 59, 60 శ్లోకముల యందు అతడు ప్రకృతికిని, స్వభావమునకును అధీనుడని తెల్పబడినది. ఈ శ్లోకమునందు అతడు ఈశ్వరాధీనుడని చెప్పబడినది. కనుక ఈ విషయమును ఇచట స్పష్టీకరించుట అవసరము.

సమా - కర్మను చేయుటలోను, చేయకుండుటలోను మనుష్యుడు పరతంత్రుడే. కనుక "ఏ ప్రాణియైనను ఒక్కక్షణమైనను పనిచేయకుండా ఉండుట కుదరదు" (3/5) అని చెప్పబడినది. మనుష్యునకు కర్మను చేయుటయందే అధికారము కలదని తెలుపుటలో అతని స్వాతంత్ర్యమును గాక పారతంత్ర్యమునే తెలిపినట్లైనది. ఏలనన ఆ వాక్యము ద్వారా 'కర్మత్యాగము అశక్యము' అని సూచింపబడినది. ఇక "మనుష్యుడు ఎవరికి అధీనుడై కర్మను ఆచరించును?" అను ప్రశ్న మిగిలినది. ప్రకృతికా. స్వభావమునకా? లేక ఈశ్వరునకా? - వాస్తవముగా ఈ మూడును ఒక్కటే! స్వభావము, ప్రకృతి అను రెండును పర్యాయవాచకములే. ఈశ్వరుడు స్వయముగా నిరపేక్ష భావముతో అనగా సర్వథా నిర్లిప్తుడై ఆయా ప్రాణుల ప్రకృతులకనుగుణముగా తన మాయాశక్తి ద్వారా వారిని కర్మలయందు నియుక్తులనుగా చేయుచున్నాడు. కనుక ఈశ్వరాధీనుడనుటయు, ప్రకృతికి అధీనుడనుటయు ఒక్కటే! ఈశ్వరుడే ప్రకృతికి స్వామియు, ప్రేరకుడును. ఈ దృష్టితో చూచినచో ప్రకృతికి అధీనుడన్నను, ఈశ్వరునకు అధీనుడన్నను ఒక్కటియే.

మనుష్యుడు సర్వథా పరతంత్రుడేయైనచో అతడు ఉద్ధరింపబడుటకు ఉపాయమేమి? శాస్త్రములు అతని కర్తవ్యములను, అకర్తవ్యములను నిర్ణయింపవలసిన అవసరమేమి? అను విషయము పరిశీలింపదగినదే - మనుష్యుడు అతని స్వాభావిక కర్మలనుండి వైదొలగుమనిగాని, స్వభావ విరుద్ధకర్మలను ఆచరింపుమనిగాని శాస్త్రములు తెలుపవు. కర్మలను ఆచరించుటయందు రాగద్వేషములకు వశుడై అన్యాయాచరణములకు పాల్పడకుండా, న్యాయముగా కర్తవ్య కర్మలను ఆచరించుటకు అవి ప్రేరేపించును. కనుక మనుష్యుడు కర్మలను ఆచరించుటలో స్వభావమునకు అధీనుడేయైనను, ఆ స్వభావమును సరిదిద్దుకొనుటలో పరతంత్రుడు కాడు. కనుక మనుష్యుడు శాస్త్రములచే, మహాపురుషుల ఉపదేశములచే చైతన్యవంతుడై, ప్రకృతి ప్రేరకుడును, సర్వశక్తిమంతుడును ఐన పరమేశ్వరుని శరణుపొంది, రాగద్వేషాది వికారములను త్యజించి, శాస్త్ర విధిననుసరించి, న్యాయముగా తన స్వాభావిక కర్మలను నిష్కామ భావముతో ఆచరించుచు జీవితమును గడిపినచో అతడు ఉద్ధరింపబడును.

సంబంధము - పై శ్లోకమున మనుష్యుడు భౌతికముగా కర్మలను త్యజించుటకు స్వతంత్రుడు కాడనియు, అతడు తన స్వభావమునకు లోబడి, స్వాభావిక కర్మలయందు ప్రవృత్తుడగుట అనివార్యమనియు తెల్పబడినది. ఏలనన సర్వశక్తిమంతుడును, సర్వాంతర్యామియు ఐన పరమేశ్వరుడు స్వయముగా సర్వప్రాణుల హృదయములయందుండి వారివారి ప్రకృతులను అనుసరించి వారిని నడుపుచుండును. అతని ప్రేరణకు ప్రతికూలముగా ఆచరించుట మానవునకు శక్యము కాదు. ఇట్టి పరిస్థితులలో కర్మబంధములనుండి విముక్తుడై, పరమశాంతిని పొందుటకు మనుష్యుడేమి చేయవలెను? అను ప్రశ్న తలయెత్తును. దీనికి సమాధానముగా భగవానుడు అర్జునునకు అతని కర్తవ్యమును గూర్చి వివరించుచున్నాడు-

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62 ॥**

| | | |
|---|---|---|
| భారత! = ఓ అర్జునా! | తత్ప్రసాదాత్ = ఆయన యను గ్రహము వలన | శాశ్వతమ్, స్థానమ్ = శాశ్వతమైన పరమ పదమును |
| సర్వభావేన = అన్నివిధములుగా | పరామ్, శాంతిమ్ = పరమ శాంతిని | ప్రాప్స్యసి = పొందగలవు |
| తమ్, ఏవ = ఆ పరమేశ్వరునే | | |
| శరణమ్, గచ్ఛ = శరణుజొచ్చుము | | |

**ఓ భారతా! (అర్జునా!) అన్ని విధములుగా ఆ పరమేశ్వరునే శరణుజొచ్చుము. అతని కృపచేతనే పరమశాంతిని శాశ్వతమైన పరమపదమును పొందగలవు. (62)**

ప్రశ్న - 'తమ్' అను పదము ఎవరిని గూర్చి తెలుపును? అన్ని విధముల అతనిని శరణుజొచ్చుట యనగానేమి?

సమా - సమస్త ప్రాణుల హృదయములయందు భగవంతుడు స్థితుడై యున్నాడని పూర్వశ్లోకమున చెప్పబడినది. అట్టి సర్వశక్తిమంతుడును, సర్వాధారుడును, సమస్త ప్రాణులకు ప్రేరకుడును, సర్వాంతర్యామియు, సర్వవ్యాపియునైన పరమేశ్వరునే ఇచ్చటి 'తమ్' అను పదము సూచించును. మానవుడు తన మనోబుద్ధీంద్రియములను, ప్రాణములను, సమస్త ధనజనాదికమును, తన సర్వస్వమును ఆ పరమేశ్వరునకే సమర్పించి, అతని మీదనే ఆధారపడి యుండుటయే సర్వవిధముల ఆ పరమేశ్వరుని శరణుజొచ్చుట యగును.

భగవంతుని గుణప్రభావ తత్త్వములను, స్వరూపమును శ్రద్ధగా అవగాహన చేసికొని, భగవంతుడే పరమప్రాప్యుడు, పరమగతి, పరమాశ్రయుడు, సర్వస్వము అని యెఱుంగవలెను. అతడే తనకు స్వామి, భర్త, ప్రేరకుడు, రక్షకుడు, పరమహితైషి అనిభావించి, తన భారమునంతయును అతనిమీదనే ఉంచి నిర్భయుడై ఉండవలెను. సమస్తము భగవంతునిదేయని భావించి కర్మాచరణమునందు మమత, అభిమానము, ఆసక్తి, కోరికలను త్యజించి, భగవదాజ్ఞానుసారము తన కర్మల ద్వారా సర్వప్రాణుల హృదయములయందున్న పరమేశ్వరుని సేవింపవలెను. ఎట్టి సుఖదుఃఖములు ప్రాప్తించినను, అవి భగవంతుడు ప్రసాదించిన వరములేయని సదా సర్వథా సంతుష్టుడై యుండవలెను. ప్రపంచమున సంభవించు సంఘటనలన్నియును, దైవికములేయని గ్రహించి, భగవంతుని యేవిధానవిషయమునందును, ఎన్నడును ఏమాత్రమూ అసంతుష్టిని పొందరాదు. కీర్తి ప్రతిష్ఠలను, గౌరవాదరములను ప్రక్కనబెట్టి, భగవంతుని యందు తప్ప మరియే ప్రాపంచిక వస్తువునందు కూడ మమతాసక్తులను కలిగియుండరాదు. అనన్య భక్తిశ్రద్ధలతో భగవంతుని నామగుణ ప్రభావ లీలలను, తత్త్వమును, స్వరూపమును, నిత్యము, నిరంతరము శ్రవణము, మననము, కథనము చేయుచుండవలెను. ఈ భావములన్నియును, క్రియలన్నియును, సర్వవిధముల భగవంతుని శరణుజొచ్చుట యందు అంతర్గతములే.

ప్రశ్న - భగవదనుగ్రహముచే పరమశాంతిని, శాశ్వతమైన పరమపదమును పొందుట యనగానేమి?

సమా - పూర్వోక్తరీతిగా సర్వథా భగవంతుని శరణుజొచ్చిన భక్తునిపై పరమ దయాళువు, పరమ సుహృదుడు, సర్వశక్తిమంతుడును ఐన పరమేశ్వరుని అపార కృపాప్రవాహము నిరంతరము ప్రవహించుచునే యుండును. అందువలన అతని సమస్త దుఃఖములు, బంధములు శాశ్వతముగా సమూలముగా కొట్టుకొనిపోవును. ఈవిధముగా భక్తుడు సమస్త దుఃఖముల నుండి, బంధముల నుండి విముక్తుడై, శాశ్వతముగా, పరమానందమును, సచ్చిదానంద ఘనపూర్ణ బ్రహ్మ పరమేశ్వరుని పొందును. పరమేశ్వరుని కృపచే పరమశాంతిని, సనాతన పరమపదమును పొందుట యనగా ఇదియే.

*సంబంధము - ఈ విధముగా అంతర్యామియైన పరమేశ్వరుని శరణుజొచ్చుమని అర్జునుని ఆజ్ఞాపించి, భగవానుడు తన గీతోపదేశమును ముగించుచున్నాడు-*

**ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ 63 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఇతి | = ఈ విధముగా | తే | = నీకు | విమృశ్య | = పరిశీలించి |
| గుహ్యాత్, గుహ్యతరమ్ | = పరమ గోప్యమైన | ఆఖ్యాతమ్ | = చెప్పబడినది | యథా | = ఏవిధముగా |
| | | ఏతత్ | = ఈ గోప్యజ్ఞానమును | ఇచ్ఛసి | = నీవు కోరుకొనుచున్నావో |
| జ్ఞానమ్ | = జ్ఞానము | అశేషేణ | = సమగ్రముగా (పూర్తిగా) | తథా | = అట్లే ప్రకారము |
| మయా | = నాచేత | | | కురు | = చేయుము |

**ఈ విధముగా అత్యంతరహస్యమైన జ్ఞానమును నేను నీకు అందించితిని. ఇప్పుడు నీవు ఈ పరమ గోప్యమైన జ్ఞానమును పూర్తిగా గ్రహించి, నీకిష్టమైన రీతిగా ఆచరింపుము. (63)**

ప్రశ్న - ఇచట **'ఇతి'** అను పదమునకర్థమేమి?

సమా - **'ఇతి'** అను పదము **'ఉపదేశ'** పరిసమాప్తిని సూచించును. 2వ అధ్యాయమునందలి 11వ శ్లోకమునుండి ఇంతవఱకును భగవంతుడొసంగిన ఉపదేశమంతయును **'ఇతి'** అను పదము ద్వారా సూచింపబడినది.

ప్రశ్న - **'జ్ఞానమ్'** అను పదము ఇచట దేనిని (ఏ జ్ఞానమును) సూచించును. దానితోపాటు **'గుహ్యాద్గుహ్యతరమ్'** అను విశేషణమును ప్రయోగించుట లోని ఆంతర్యమేమి?

సమా - భగవానుడు 2వ అధ్యాయమునందలి 11వ శ్లోకముతో ప్రారంభించి, ఇంతవఱకును తన గుణప్రభావ తత్త్వ స్వరూప రహస్యములను అర్జునునకు సమగ్రముగా వివరించెను. ఈ సమస్తోపదేశమును **'జ్ఞానము'** అను పదము తెలుపును. ఈ ఉపదేశమంతయును భగవంతుని ప్రత్యక్షముగా తెలిసికొనునట్లు చేయునదియే. కనుక అది జ్ఞానముగా పేర్కొనబడినది. ప్రపంచమునందును, శాస్త్రముల యందును, అత్యంత రహస్యములుగా (గోప్యములుగా) తెలుపబడిన విషయములలో భగవంతుని గుణప్రభావ స్వరూపముల యథార్థ జ్ఞానమును తెల్పు ఉపదేశము అన్నింటికంటెను ఎక్కువ గోప్యముగా భావింపబడినది. అంతేగాక ఈ యుపదేశమును అనర్హులైన వారికి చేయరాదు. ఈ విషయమును స్పష్టపఱచుటకే **'జ్ఞానమ్'** అను పదముతోపాటు **'గుహ్యాద్గుహ్యతరమ్'** అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - **'మయా, తే, ఆఖ్యాతమ్'** అను పదములకు అర్థములేమి?

సమా - పరమేశ్వరుని గుణప్రభావ స్వరూపముల తత్త్వము మిక్కిలి మహిమాన్వితమైనది. వాటిని గూర్చిన జ్ఞానమును భగవంతుడే స్వయముగా వివరింపగలడు గాని, మఱి ఎవ్వరును వివరింపజాలరు. ఈ యథార్థమును స్పష్టపఱచుటకే భగవానుడు **'మయా'** అను పదమును ప్రయోగించెను. అర్జునుడు శ్రీకృష్ణభగవానునకు భక్తుడు, ప్రియసఖుడు, అందువలన భగవదుపదేశమును పొందుటకు అతడే అర్హుడు. అందువలననే భగవంతుడు అర్జునుని హితము గోరి ఈ ఉపదేశమును చేసెను. **"తే"** అను పదమును ప్రయోగించుటలోని ఆంతర్యము ఇదియే. భగవంతుడు "తాను అర్జునునకు చెప్పవలసిన దంతయును చెప్పినాననియు, ఇంక చెప్పవలసినది ఏదియును లేదనియు" అని తెల్పుటకు **'ఆఖ్యాతమ్'** అను పదమును ప్రయోగించెను.

ప్రశ్న - "అత్యంతము గోప్యమైన ఈ జ్ఞానమును సంపూర్ణముగా చక్కగా గ్రహించి, నీ యిష్టము వచ్చిన రీతిగా ఆచరింపుము" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - 2వ అధ్యాయమునందలి 11వ శ్లోకమునుండి ప్రారంభించి భగవానుడు అర్జునునకు సాంఖ్యయోగ కర్మయోగములను గూర్చి వివరించుచు ఈ రెండు సాధనమార్గములను అనుసరించి, స్వధర్మ రూపమైన యుద్ధమును ఆచరించుట అతని (అర్జునుని) కర్తవ్యమని పెక్కు సందర్భములలో (2/18,37: 3/30: 8/7: 11/34) ఉపదేశించెను. అట్లే తనను శరణుజొచ్చుమనియు పలికెను. పిదప 18వ అధ్యాయమున అర్జునుని జిజ్ఞాసననుసరించి, సన్న్యాసము, త్యాగముల తత్త్వమును సాకల్యముగా వివరించెను. అనంతరము మఱల 56, 57 శ్లోకములలో భక్తి ప్రధాన కర్మయోగము యొక్క మహత్త్వమును వర్ణించి, తనను శరణు పొందుమని అర్జునుని ఆదేశించెను. ఐనను అర్జునుడు ఎట్టి సన్నద్ధతను ప్రకటింపకుండుటచే భగవానుడు మఱల తన ఆజ్ఞలను అనుసరించుట వలన కలుగు గొప్ప ఫలమును పాటింపక పోవుటవలన కలుగు తీరని హానిని గూర్చి తెలిపెను. అప్పటికిని ఎట్టి సమాధానమూ రానందున

అర్జునుని సావధానునిగా చేయుటకై పరమేశ్వరుడే సర్వప్రాణులకు ప్రేరకుడును, సర్వప్రాణుల హృదయముల యందుండు వాడును అని తెలిపి, అతనిని శరణు జొచ్చుమని పలికెను. ఇంతకును అర్జునుని నుండి ఎట్టి సమాధానము రానందున ఈ శ్లోకము యొక్క పూర్వార్ధమున తనయుపదేశమును ముగించుచు దాని మహత్త్వమును గూడ పేర్కొనెను. ఈ వాక్యము ద్వారా మఱల తన యుపదేశమును గూర్చి బాగుగా సావధానముగా ఆలోచించుకొని యుక్తమైన రీతిగా ఆచరింపుమని తెల్పుచు "యథేచ్ఛసి తథా కురు" అని భగవానుడు పలికెను - తాను (భగవానుడు) ఉపదేశించిన కర్మ, జ్ఞాన, భక్తి యోగాది వివిధ సాధనలయందు అర్జునునకు మంచిదని (శ్రేయస్కరమని) తోచిన దానిని అనుసరింపుమనియు, లేదా అతడు యుక్తమని భావించిన దానిని ఆచరింపవలసినదనియు భగవానుడు తెలిపెను.

*సంబంధము* - *తన ఉపదేశమును పూర్తిగా అవగాహన చేసికొని, కర్తవ్యమును నిర్ణయించుకొనుమని భగవంతుడు తెల్పినప్పటికిని అర్జునుడు ఎట్టి సమాధానము నియ్యక, తనను అనర్హునిగా, కర్తవ్యమును నిర్ణయించుకొనుటయందు అశక్తునిగా భావించి, ఖిన్నచిత్తుడై, చకితుడై యున్నట్లు కనబడెను. అప్పుడు అందఱి హృదయములను ఎఱింగిన అంతర్యామియగు భగవంతుడు స్వయముగా అర్జునునిపై దయదలచి సమస్త గీతోపదేశసారమును తెలుపగోరి ఇట్లనెను-*

**సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమంవచః ।**
**ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥ 64 ॥**

| | | | | |
|---|---|---|---|---|
| సర్వ గుహ్యతమమ్ = సమస్త గోప్య విషయముల యందును పరమగోప్యమైన | భూయః | = ఇంకను | తతః | = అందువలన |
| | శృణు | = వినుము | ఇతి, హితమ్ | = హితకరములైన, ఈ, నావచనములను |
| | మే | = నాకు | | |
| మే, పరమమ్, వచః = సర్వశ్రేష్ఠమైన నా వచనములను | దృఢమ్ | = అత్యంతము | తే | = నీకు |
| | ఇష్టః, అసి | = ఇష్టమైనవాడవు | వక్ష్యామి | = చెప్పెదను |

**సమస్తగోప్యవిషయములయందును పరమగోప్యమైన నావచనములను మఱొక్కసారి వినుము. నీవు నాకు అత్యంతప్రియుడవు అగుటవలన నీకు మిక్కిలి హితమునుగూర్చు వచనములను మఱల చెప్పుచున్నాను. (64)**

ప్రశ్న - 'వచః' అను పదముతో 'సర్వగుహ్యతమమ్', 'పరమమ్' అను విశేషణములను ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - భగవానుడు ఇంతవఱకు చెప్పిన విషయము లన్నియును అతి గోప్యములు. కనుక భగవంతుడు పెక్కు సందర్భములలో తన యుపదేశములను పరమగుహ్యమ్, అతిరహస్యమ్, అని వ్యవహరించెను. భగవానుడు తన యుపదేశమునందును తన గుణప్రభావ స్వరూప మహిమలను, ఐశ్వర్యములను తెలుపుచు, తాను స్వయముగా సర్వవ్యాపియు, సర్వాధారుడును, సర్వశక్తిమంతుడును, సాక్షాత్ సగుణ నిర్గుణ పరమేశ్వరుడును అయినవాడను అని తనను గూర్చి తెలిపెను. ఈ విధముగా తెల్పి, తనను భజింపుమనియు, తనను శరణువేడుమనియు అర్జునుని ఆదేశించెను. ఈ వచనములన్నియును పరమరహస్యములు, అత్యంత గోప్యములు. 9వ అధ్యాయమునందలి మొదటి శ్లోకమునందు 'గుహ్యతమమ్' అనియు, 2వ శ్లోకమున 'రాజగుహ్యమ్' అనియు ప్రయోగించి, భగవానుడు ఆ అధ్యాయమున తన గుణప్రభావ స్వరూప రహస్యములను, ఐశ్వర్యమును చక్కగా వర్ణించి, తనను భజింపుమనియు, తనను శరణువేడుమనియు అర్జునుని స్పష్టముగా ఆదేశించెను. ఇదే విధముగా 10వ అధ్యాయమున తనను శరణుకోరు విషయమును ప్రారంభించుచు 'వచః' అను పదముతోపాటు 'పరమమ్' అను విశేషణమును గూడ ప్రయోగించెను. కనుక ఇచట గూడ భగవానుడు 'వచః' అను

పదముతోపాటు 'సర్వగుహ్యతమమ్' 'పరమమ్' అను విశేషణములను ప్రయోగించుచు, తన ఉపదేశములకు సారభూతము, మిక్కిలి మహిమాన్వితము అతి గోప్యము అగు విషయమును తెలుపుదునని పలికెను.

ప్రశ్న - ఆ 'ఉపదేశము'ను మఱల వినుము - అని చెప్పుటలోని ఆంతర్యమేమి?

సమా - ఇప్పుడు చెప్పబోవు విషయమును భగవానుడు ఇంతకు ముందుగూడ పెక్కు పర్యాయములు చెప్పియే యుండెను. (9/34, 12/6-7, 18/56-57) కాని దానిని ప్రత్యేకమైన దానినిగా అర్జునుడు గ్రహింపలేకపోయెను. కనుక అతి మహిమాన్వితమైన ఆ విషయమును తనయుపదేశ సముదాయమునుండి వేఱుచేసి చెప్పుచున్నానని తెల్పుటకు **'భూయః'** (మఱల) అను పదమును ప్రయోగించెను. దానిని సావధానముగా వినుము అనియు ఆదేశించెను.

ప్రశ్న - 'దృఢమ్'తో పాటు 'ఇష్టః' అను పదము యొక్క అర్థమేమి?

సమా - 63వ శ్లోకమునందు భగవానుడు అర్జునుని స్వయముగా ఆలోచించుకొని, తన కర్తవ్యమును నిర్ణయించుకొనవలసినదిగా ఆదేశించెను. కర్తవ్యనిర్ణయబాధ్యతను అర్జునుని పైననే ఉంచెను. భగవంతుని ఈ ఆదేశమును వినినంతనే అర్జునుడు ఒక విచిత్రమైన సందిగ్ధావస్థకు గురియయ్యెను. "భగవానుడు ఎందులకు ఇట్లు చెప్పుచున్నాడు? ఆయనపై నాకు విశ్వాసము లేదనుకొనెనా? నేనతనికి ప్రియభక్తుడనుకానా?" మున్నగు ఆలోచనలు అతనిలో ముసురుకొనెను. కనుక భగవానుడు అర్జునుని ఈ విచికిత్సావస్థ (సందిగ్ధావస్థ) నుండి బయట పడవేయుటకు 'నీవు నాకు అత్యంత ప్రియుడవు, మన యిద్దఱి మధ్యగల ప్రేమబంధములు దృఢమైనవి. కనుక నీవు ఎట్టి విచారమునకును గురికావలదు' అని వెన్నుతట్టి ప్రోత్సహించుటకై 'దృఢమ్', 'ఇష్టః' అను పదములను ప్రయోగించెను.

ప్రశ్న - "తతః" అను అవ్యయమును ప్రయోగించుటలోను, నేను నీకు పరమ శ్రేయస్కరమైన మాటను తెలిపెదను అని యనుటలోను గల విశేషమేమి?

సమా - 'తతః' అను పదము హేతువాచకము. అర్జునుడు భగవానునకు అత్యంత ప్రేమపాత్రుడు, భక్తుడు. కనుక ఎట్టి దాపఱికము లేకుండ అతని హితమును గోరియే అతి గోప్యమైన విషయమును సైతము తెల్పెదననియు, తాను తెల్పునది అంతయును అర్జునునకు హితమును గూర్చునదియే యనియు పలుకుచు అతనిని ఉత్సాహపఱచుటకై - "నేను నీకు పరమశ్రేయస్కరమైన మాటను పలికెదను" అని భగవంతుడు నుడివెను.

సంబంధము - గుహ్యాతిగుహ్యతమమైన విషయమునిప్పుడు తెలిపెదనని చేసిన ప్రతిజ్ఞానుసారము భగవంతుడు నుడువుచున్నాడు-

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| మన్మనాః | = నాయందే మనస్సు నిల్పినవాడవు | మామ్ | = నన్ను (నాకు) | సత్యమ్, ప్రతిజానే | = సత్యప్రతిజ్ఞ చేయుచున్నాను |
| | | నమస్కురు | = నమస్కరింపుము | | |
| మద్భక్తః | = నాయందు భక్తి గలవాడవు | (ఏవమ్) | = ఇట్లు చేయుటవలన | (యతః) | = ఏలనన |
| | | మామ్, ఏవ | = నన్నే | మే | = నాకు |
| మద్యాజీ | = నన్ను పూజించువాడవు | ఏష్యసి | = పొందెదవు | ప్రియః, అసి | = నీవు మిక్కిలి ఇష్టమైనవాడవు |
| భవ | = కమ్ము | తే | = నీకు (నీకొఱకై) | | |

ఓ అర్జునా! నీవు నాయందే మనస్సును నిలుపుము. నా భక్తుడవు కమ్ము. నన్నే సేవింపుము. నాకు ప్రణమిల్లుము. ఇట్లు చేయుటవలన నన్నే పొందగలవు. ఇది ప్రతిజ్ఞా పూర్వకముగా నేను చెప్పుచున్నమాట. ఏలనన నీవు నాకత్యంత ప్రియుడవు. (65)

ప్రశ్న - భగవంతునియందు మనస్సు నిలుపుట యనగానేమి?

సమా - భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వవ్యాపి, సర్వేశ్వరుడు అని భావింపుము, నిరతిశయ సౌందర్య మాధుర్య-ఐశ్వర్యాది - అనంతకల్యాణ సముద్రుడైన ఆ భగవంతునియందు అనన్య భక్తితో నిశ్చల భావముతో మనస్సును లగ్నము చేయుట, క్షణమాత్రమైనను భగవంతునియొక్క విస్మృతిని సహింపలేకుండుట (భగవంతుని మఱువలేకుండుట)యే - భగవంతుని యందు మనస్సును నిలుపుట యగును - దీని విశేష వ్యాఖ్యానము 9వ అధ్యాయమునందలి చివరి శ్లోకమున చేయబడినది.

ప్రశ్న - భగవద్భక్తుడగుట యనగానేమి?

సమా - భగవద్భక్తుడు తనకు భగవంతుడే ఏకైక స్వామియనియు, భర్తయు, సంరక్షకుడును, పరమగతియు, పరమాశ్రయుడును అని భావించి సర్వథా అతనికి అధీనుడై యుండును. అతడు తనను ఏమాత్రము స్వతంత్రునిగా భావింపడు. అన్ని విధములుగ తన సమస్త భారమును భగవంతునిపైననే ఉంచును. భగవంతుని ప్రతి విధానమునందును సదా సంతుష్టుడై యుండును. అతని ఆజ్ఞలను సదా శిరసావహించుచుండును. భగవంతుని యెడ అనన్య భక్తి శ్రద్ధాదరములు కలిగి యుండును. ఇట్టి ఉత్తమ లక్షణములు గలవాడే భగవద్భక్తుడు.

ప్రశ్న - భగవంతుని సేవించుట యనగానేమి?

సమా - 9వ అధ్యాయమునందలి 26వ శ్లోకమున వర్ణించిన రీతిగా పత్రపుష్పాదులతో భక్తిశ్రద్ధలతో భగవంతుని విగ్రహములను పూజింపవలెను. మనస్సునందు భగవంతుని నిల్పుకొని, మానసిక పూజ చేయవలెను. భగవద్వచనములను, లీలలను, విగ్రహములను, పరమవిశ్వాసముతో ఆరాధింపవలెను. భగవంతుడు సర్వవ్యాపియనియు, సమస్త ప్రాణులు భగవంతుని స్వరూపమే అనియు భావించి, యథాయోగ్యముగ వారికి ఆదర సత్కారపూర్వకముగా సేవలను ఒనర్పవలెను. ఈ మొదలగునవి యన్నియును భగవంతుని సేవించుటలోనే అంతర్గతములు. వీటి వర్ణన 9వ అధ్యాయమునందలి 26, 27, 28, 34 శ్లోకముల వ్యాఖ్యానములయందు చూడనగును.

ప్రశ్న - 'మామ్' అను పదము ఎవరిని గూర్చి తెలుపును? అతనికి ప్రణమిల్లుట యనగానేమి?

సమా - భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వభవ్యగుణ సంపన్నుడు, అంతర్యామి, పరమపురుషోత్తముడు. అట్టి పరమేశ్వరుడు సగుణ నిర్గుణ నిరాకార సాకారాది అనేక రూపములు దాల్చియుండెను. నృసింహావతారమును దాల్చి భక్తుడైన ప్రహ్లాదుని ఉద్ధరించెను.

శ్రీరామావతారమున దుష్టశక్తులను దునుమాడి లోకమున ధర్మపరిరక్షణ మొనర్చెను. ద్వాపరమున శ్రీకృష్ణునిగా అవతరించి, అర్జునునకు అమృతత్వమును గూర్చు గీతోపదేశమును గావించెను. అట్టి పరబ్రహ్మను సూచించునదియే 'మామ్' అను పదము.

అతని రూపమునకును (విగ్రహమునకును), చిత్రమునకును, చరణ చిహ్నములకును లేక, పాదుకలకును, అట్లే అతని గుణప్రభావ తత్త్వములను వర్ణించు శాస్త్రాదులకును సాష్టాంగ ప్రణామముల నొనరించుట, సమస్త ప్రాణులను భగవత్స్వరూపములుగనే భావించి, వారికిని నమస్కరించుట భగవంతునకు ప్రణమిల్లుట యగును. విపుల వివరణములకు 9వ అధ్యాయమునందలి చివరి శ్లోకవ్యాఖ్యాన విశేషములను చూడదగును.

ప్రశ్న - 'ఇట్లు చేయుట వలన నీవు నన్నే పొందెదవు' అని అనుటలోని అంతర్యమేమి?

సమా - పైన పేర్కొనబడిన రీతిగా సాధన చేసిన పిదప మనుజుడు అవశ్యముగా సచ్చిదానంద ఘనుడు, సర్వశక్తిమంతుడూ ఐన శ్రీకృష్ణ పరమాత్మనే పొందును. ఇందెట్టి సంశయమూ లేదు. భగవంతుని పొందుట అనగానేమి? అను ప్రశ్నకు సమాధానము గూడ 9వ అధ్యాయమునందలి చివరి శ్లోకమున వివరింపబడినది.

ప్రశ్న - 'నేను నీకు ప్రతిజ్ఞా పూర్వకముగా చెప్పుచున్నాను' అని భగవంతుడు అనుటలోని విశేషమేమి?

సమా - అర్జునుడు భగవంతునకు ప్రియభక్తుడు, సఖుడు కనుక అతనిపై భగవంతునకు నిరుపమాన కృపాకటాక్షములు, ప్రేమాదరములు కలవు. అర్జునునకు తనపై దృఢ విశ్వాసమును కలిగించుటకును, అర్జునుని నిమిత్తముగా జేసి, ఇతర అర్హులైన వారికిని భగవంతునిపై విశ్వాసము దృఢపడుటకును శ్రీకృష్ణభగవానుడీ విధముగా తెలిపెను.

పైన తెలుపబడిన రీతిగా సాధన చేయు భక్తుడు భగవంతుని పొందుననుటలో దృఢ విశ్వాసము నుంచి, అట్టి సాధనను గట్టిగా చేయుటకు విశేషముగా కృషి సలుపవలెను.

ప్రశ్న - 'నీవు నాకు ప్రియతముడవు'అని యనుటలోని విశేషమేమి?

సమా - ప్రేమమయుడైన భగవంతుడు పలికిన మాటలలో పై విధముగా ప్రతిజ్ఞ చేయుటకు గల కారణములు ద్యోతకములగుచున్నవి. అర్జునుడు భగవానునకు అత్యంత ప్రియుడనియు, అతని యెడగల ప్రేమాదరములకు కట్టుబడి, అతని విశ్వాసమును దృఢపఱచుటకై ఇట్టి ప్రతిజ్ఞను చేసెననియు గ్రహింపవలెను. లేనిచో ఈ విధముగా ప్రతిజ్ఞ చేయవలసిన అవసరమే యుండదు.[1]

---

1) మహాపురుషుడైన అర్జునునకు భగవానుడైన శ్రీకృష్ణుడు స్వయముగా దివ్యమైన గీతోపదేశమును కావించెను. అట్టి అర్జునుని (అదృష్టము) మహద్భాగ్యము వర్ణింపనలవికానిది. మహాభారత - ఉద్యోగ పర్వమునందు ఇట్లు చెప్పబడినది-

**ఏష నారాయణః కృష్ణః ఫల్గునశ్చ నరః స్మృతః । నారాయణో నరశ్చైవ సత్త్వమేకం ద్విధా కృతమ్ ॥** *(49/20)*

'ఈ శ్రీ కృష్ణుడు సాక్షాత్తు ఆ నారాయణుడు. ఆ నరుడే ఈ అర్జునుడు. ఈ నరనారాయణులిద్దఱును ఒకే సత్త్వము యొక్క రెండు రూపములు'. అర్జునునియెడ భగవానుని సంపూర్ణప్రేమను తెలిసికొనుట ముఖ్యము. దానినిబట్టి అర్జునునకు భగవానుని యెడల గల భక్తిశ్రద్ధలును తెలియుగలవు.

వనవిహారములయందును, జలవిహారములయందును, రాజసభలలోను, యజ్ఞానుష్ఠానాది కార్యములయందును శ్రీకృష్ణభగవానుడు తఱచుగా అర్జునునితో కూడియే యుండును. అంతఃపురములలో ఏకాంత ప్రదేశములయందును పవిత్ర ప్రేమానురాగములతో గూడిన వారి కదలికలు నిస్సంకోచముగా నిరాటంకముగా కొనసాగుచుండును. శ్రీకృష్ణార్జునుల యొక్క ఈ విలక్షణ మైత్రీబంధములను దర్శించి, పరమానందభరితుడైనవాడు సంజయుడు. అతడు పాండవులకడనుండి వచ్చి తన యనుభవములను ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పెను. "నేను శ్రీకృష్ణార్జునుల విశిష్ట ప్రేమానురాగములను చూచితిని. వారిద్దఱితో సంభాషించుటకై వారి అంతఃపురమునకు వినమ్రభావముతో వెళ్లితిని. ఆ మహాత్ములిరువురును చక్కని వస్త్రాభరణములను ధరించి, అమూల్యములైన ఆసనములపై ఆసీనులై యుండిరి. శ్రీకృష్ణుని పాదపద్మములు అర్జునుని ఒడిలో నుండెను. అర్జునుడు నన్ను చూచి తనచెంతనేయున్న బంగారు పాదపీఠమును కొద్దిగా జరిపి దానిపై కూర్చుండుమనెను. నేను వినయముతో దానికి తాకి ప్రక్కనే క్రింద కూర్చుంటిని."

వనవాసకాలమందు శ్రీకృష్ణభగవానుడు పాండవులను చూడబోయెను. అచట మాటల సందర్భమున అర్జునునితో అతడిట్లనెను-

**మమైవ త్వం తవైవాహం యే మదీయాస్తవైవ తే । యస్త్వాం ద్వేష్టి స మాం ద్వేష్టి, యస్త్వామను స మామను ॥**

*(మహాభారత - అరణ్య - 12/45)*

'అర్జునా! నీవు నావాడవు. నేను నీవాడను. నావారందఱును నీవారే. అంతేకాదు నావన్నియును నీకును చెందినవే. నిన్ను ద్వేషించువాడు నన్ను ద్వేషించినట్లే. నీ అనుయాయి నాకును అనుయాయియే'.

భీష్ముడు పాండవసేనను రూపుమాపుచు తొమ్మిది దినములు యుద్ధము చేసిన పిదప యుధిష్ఠిరుడు చింతాక్రాంతుడై, ఒకరాత్రివేళ శ్రీకృష్ణ భగవానుని కడకేగి, యిట్లు పలికెను. "ఓ కృష్ణా! దీపశిఖపై బడిన మిడుతలు మలమల మాడిమసియై పోవుచున్నట్లు మన సైనికులు భీష్ముని తాకిడికి రూపుమాసిపోవుచున్నారు. ఇప్పుడేమి చేయవలెనో చెప్పుము."

ధర్మజుని ఈ మాటలు విని శ్రీకృష్ణుడు అతనిని ఓదార్చుచు ఇట్లనెను. "మీరు చింతింపవలదు. మీరు కోరినచో నేను భీష్ముని వధింపగలను. కాని అర్జునుడే భీష్ముని వధింపగలడు. నామాటను గట్టిగా నమ్ముడు" పిమ్మట అర్జునునియెడ తనకుగల ప్రేమాదరములను దెల్పుచు భగవానుడు ధర్మజునితో ఇట్లనెను-

**తవ భ్రాతా మమ సఖా సంబంధీ శిష్య ఏవ చ । మాంసాన్యుత్కృత్య దాస్యామి ఫల్గునార్థే మహీపతే ॥**
**ఏష చాపి నరవ్యాఘ్రో మత్కృతే జీవితం త్యజేత్ । ఏష నః సమయస్తాత! తారయేమ పరస్పరమ్ ॥**

*(మహాభార-భీష్మ-107/33,34)*

"ఓ రాజా! అర్జునుడు నీకు సోదరుడు మాత్రమే. నాకు మిత్రుడు, బంధువు, శిష్యుడు కూడ. అర్జునునికై నా శరీర మాంసమునే స్వయముగా కోసి ఇచ్చెదను. పురుష సింహుడైన అర్జునుడు నా కొఱకు ప్రాణములను సైతము త్యజింపగలడు. నాయనా! పరస్పర రక్షణకై ఒకరికొకరము అండగా నిలుచుట మా ప్రతిజ్ఞాపూర్వక నిశ్చయము".

ప్రశ్న - భగవత్ప్రాప్తికై ఈ శ్లోకమునందు తెల్పబడిన నాలుగు ఉపాయములను సాధనచేయవలెనా? లేక వానిలో ఏ ఒక్కటి సాధన చేసినను చాలునా?

సమా - ఈ నాల్గింటిని సంపూర్ణముగా సాధన చేసినచో భగవత్ప్రాప్తి కల్గుననుటలో సందేహమే లేదు. కాని వీటిలో ఏ ఒక్క దానిని సమగ్రముగా సాధన చేసినను భగవత్ప్రాప్తి కలిగియే తీరును. 8వ అధ్యాయమునందలి 14వ శ్లోకమున కేవలము అనన్యచింతన ద్వారానే భగవత్ప్రాప్తి సులభ సాధ్యమని భగవానుడు స్వయముగా ప్రకటించి యుండెను. 7వ అధ్యాయమునందలి 23వ శ్లోకమున, 9వ అధ్యాయమునందలి 25వ శ్లోకమున తన భక్తులకు భగవత్ప్రాప్తి కల్గునని చెప్పియుండెను. 9వ అధ్యాయమునందలి 26నుండి 28వ శ్లోకము వఱకును, అట్లే ఈ యధ్యాయమునందలి 46వ శ్లోకమునను కేవలము తనను పూజించుటవలననే పరమపదప్రాప్తి సిద్ధించునని స్పష్టము చేసెను. పైన పేర్కొనబడిన సాధనలలో ఏ ఒక్కదానిని సంపూర్ణముగా శ్రద్ధాభక్తులతో అనన్య భావముతో ఆచరించినను తక్కినవన్నియును అందు అంతర్గతములై కొనసాగుచునే యుండును. వాటి అవినాభావ సంబంధము అట్టిది.

---

అర్జునుని యెడ శ్రీకృష్ణ భగవానునకు గల విలక్షణ ప్రేమకు ఇదియే ప్రబల నిదర్శనము.

కర్ణుడు ఇంద్రుని నుండి ఒక అమోఘ 'శక్తి'ని పొందియుండెను. ఆ శక్తి ధాటికి ఎవ్వరైనను మరణించుట నిశ్చయము. కాని దానిని ఒక్కసారి మాత్రమే ప్రయోగించుటకు వీలగును. అర్జునునిపై ప్రయోగించుటకు మాత్రమే కర్ణుడు దానిని నిలిపియుంచెను. ఈ శక్తిని ప్రయోగించి, నీవు అర్జునుని ఏల సంహరింపవు? అని దుర్యోధనాదులు కర్ణుని పదేపదే ప్రస్తావించుచు వచ్చిరి. కర్ణునికి అర్జునుని వధింపవలెనను సంకల్పము కలదు. అర్జునునకు సారథియై యున్న శ్రీకృష్ణుడు కర్ణునిపై ప్రసరింపజేయుచున్న మోహిని ప్రభావమున కర్ణునకు ఆ శక్తి ప్రయోగ విషయము స్ఫురణకే రాకుండెను. భీమపుత్రుడైన ఘటోత్కచుడు రాక్షసమాయచే కౌరవసేనను భయంకరముగా సంహరించునప్పుడు దుర్యోధనాదులు భయభ్రాంతులైరి. అప్పుడు వారందఱును గగ్గోలుపెట్టుచు కర్ణునితో ఇట్లనిరి. "ఇంద్రుడిచ్చిన 'శక్తి'ని ప్రయోగించి మొదట ఇతనిని సంహరించి, మా ప్రాణములను కాపాడుము. ఇప్పుడు ఆ శక్తిని ప్రయోగింపకున్నచో ఘటోత్కచుని (రాక్షసుని) చేతిలో మాకు చావు తప్పదు. ఆ శక్తి వలన తర్వాత మనకు కలుగు ప్రయోజనమేమి?" - పిమ్మట కర్ణుడు ఆ 'శక్తి'ని ఘటోత్కచునిపై ప్రయోగించెను. అంతట ఘటోత్కచుడు మరణించెను. పాండవులందఱును దుఃఖితులైరి. కాని శ్రీకృష్ణుడు మాత్రము హర్షోల్లాసముతో అర్జునుని పదేపదే కౌగిలించుకొనెను. పిదప శ్రీకృష్ణుడు సాత్యకితో ఇట్లనెను. "ఓ సాత్యకీ! యుద్ధసమయమున కర్ణుని నేనే మోహితునిగా చేయుచు వచ్చితిని. కనుక నేటివఱకు అతడు ఆ 'శక్తి'ని అర్జునునిపై ప్రయోగింపలేకపోయెను. అర్జునుని సంహరించుటకు అర్హమైన ఆ 'శక్తి' కర్ణునికడ ఉండునంతవఱకు నా మనసు నిలుకడగా లేకుండెను. నేడు ఆ 'శక్తి' ప్రయోగము జరిగిపోవుటతో అర్జునునకు మృత్యుభయము తొలగినది. మన పక్షమునగల బంధుమిత్ర వర్గములన్నింటికంటెను అర్జునుని ప్రాణములే నాకు ప్రియతమములు. యుద్ధమున అర్జునుని ప్రాణరక్షణమే నాకు అత్యంత ప్రధానము. ముల్లోకాధిపత్యమునే కాదు దానిని మించిన ఏ దుర్లభమైన వస్తువునైనను అర్జునుని వీడి కోరుకొనను. ఈ ప్రమాదము తప్పుటతో అర్జునునకు పునర్జన్మ లభించినట్లైనది. నాకు కలిగిన ఆనందమునకు మేరయే లేదు."

త్రైలోక్య రాజ్యాత్ యత్కించిత్, భవేదన్యత్ సుదుర్లభమ్ । నేచ్ఛేయం సాత్వతాహం తద్వినా పార్థం ధనంజయమ్ ।
అతః ప్రహర్షః సుమహాన్ యుయుధానాద్య మేఽభవత్ । మృతం ప్రత్యాగతమివ దృష్ట్వా పార్థం ధనంజయమ్ ॥

(మహాభార-ద్రోణ-182/44,45)

శ్రీకృష్ణార్జునుల ప్రాణస్నేహమును గూర్చి దుర్యోధనుడే ఒకసారి ఇట్లు ప్రస్తావించియుండెను-

ఆత్మా హి కృష్ణః పార్థస్య కృష్ణస్యాత్మా ధనంజయః ॥
యద్బ్రూయాదర్జునః కృష్ణం సర్వం కుర్యాదసంశయమ్ ।
కృష్ణో ధనంజయస్యార్థే స్వర్గలోకమపి త్యజేత్ ॥
తథైవ పార్థః కృష్ణార్థే ప్రాణానపి పరిత్యజేత్ ।

(మహాభార-సభా-52/31-33)

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66 ॥

సర్వధర్మాన్ = సమస్తధర్మములను (సర్వకర్తవ్యకర్మలను)
పరిత్యజ్య = నాకు సమర్పించి
ఏకమ్ = సర్వశక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన
మామ్, (ఏవ) = నన్నే
శరణమ్, వ్రజ= శరణుజొచ్చుము
అహమ్, త్వా = నేను నిన్ను
సర్వపాపేభ్యః = సమస్త పాపములనుండియు
మోక్షయిష్యామి = విముక్తుని గావించెదను
మా, శుచః = నీవు శోకింపకుము

సర్వధర్మములను అనగా సమస్తకర్తవ్యకర్మలను నాకు సమర్పింపుము. సర్వశక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండియు నిన్ను నేను విముక్తుని గావించెదను. నీవు శోకింపకుము. (66)

ప్రశ్న - 'సర్వధర్మాన్' అను పదము ఏయే ధర్మములను సూచించును? వాటిని పరిత్యజించుట యనగానేమి?

సమా - వర్ణాశ్రమములను, స్వభావ పరిస్థితులను అనుసరించి, మనుష్యులకు కర్తవ్యములుగా శాస్త్రములచే నిర్దేశింపబడిన సమస్త కర్మలను సూచించునదియే సర్వ 'ధర్మాన్' అను పదము. 12వ అధ్యాయమునందలి 6వ శ్లోకమునందు 'సర్వాణి' అను విశేషణముతో గూడిన 'కర్మాణి' అను పదము, ఈ యధ్యాయమున 57వ శ్లోకమున

---

'శ్రీకృష్ణుడు అర్జునునకు ఆత్మయే. కృష్ణుని ఆత్మయే ధనంజయుడు. అర్జునుడడిగిన దానిని శ్రీకృష్ణుడు కాదనుటయే యెఱుగడు. ఇందులకు సందేహమే లేదు. అర్జునుని కొఱకు శ్రీకృష్ణుడు స్వర్గాది దివ్యలోకములను సైతము తృణప్రాయముగా త్యజించును. శ్రీకృష్ణుని కొఱకు అర్జునుడు తన ప్రాణములను సైతము అర్పించును'.

శ్రీకృష్ణార్జునుల యొక్క ఆదర్శప్రాయములైన అన్యోన్యానురాగములను గూర్చిన ఉదాహరణములు మహాభారతము నందును, శ్రీమద్భాగవతము నందును కొల్లలుగా దర్శనమిచ్చుచుండును.

అర్జునుని విలక్షణమైన ఈ ప్రేమ ప్రభావ కారణముననే శ్రీకృష్ణ భగవానుడు అత్యంతము గోప్యమైన జ్ఞానముకంటెను పరమ గుహ్యతమమైన తన పురుషోత్తమ స్వరూప రహస్యమును అర్జునునకు వెల్లడించెను. బ్రహ్మాదులైన మహర్షులు సైతము తహతహపాటుతో కోరుకొనునట్టి అత్యంత దుర్లభమైన సేవాభాగ్యము పరమధామమునందును అర్జునునకు ఈ ప్రేమప్రభావముననే లభించినది. స్వర్గారోహణానంతరము ధర్మజ్ఞుడైన యుధిష్ఠిరుడు దివ్యదేహమును ధరించి, ఆ పరమధామమున చూచిన దృశ్యము ఇట్లుండెను.

దదర్శ తత్ర గోవిందం, బ్రాహ్మేణ వపుషాన్వితమ్ ॥
దీప్యమానం స్వవపుషా దివ్యైరస్త్రైరుపస్థితమ్ ।
చక్రప్రభృతిభిర్ఘోరైః, దివ్యైః పురుష విగ్రహైః ॥
ఉపాస్యమానం వీరేణ ఫల్గునేన సువర్చసా ॥

(మహాభార-స్వర్గారోహణ-4/2-4)

"శ్రీకృష్ణుడు అచట నిజబ్రాహ్మ శరీర శోభితుడై వెలుగొందుచుండెను. చక్రాది దివ్యాస్త్రములును, ఇంకను తదితర ఘోరాస్త్రములును పురుషాకృతులలో ఆతని సమీపమున ఉండి, ఆయనను సేవించుచుండెను. అట్లే మహావీరుడైన అర్జునుడు దివ్య తేజస్సుతో వెలుగొందుచు ఆ గోవిందుని ఉపాసించుచుండెను."

గీతా తత్త్వమును సాకల్యముగా విని, గ్రహించి, ధారణ చేసికొనుటవలన కలుగు "పరమ ఫలము" ఇదియే. పైగా ఇంద్రియ సంయమి, మహాత్యాగి, విచక్షణ జ్ఞాని, ఇంకను భగవంతునకు పరమప్రియసఖుడు, సేవకుడు, శిష్యుడు ఐన అర్జునునివంటి వానికి ఈ పరమఫలము ప్రాప్తించుట సర్వధా సముచితమే.

'సర్వ కర్మాణి' అను పదము ఈ శాస్త్రోక్త కర్మలనే వర్ణించినవి. ఈ రెండు శ్లోకములయొక్క వ్యాఖ్యానమునందు తెలుపబడినట్లుగా ఆ కర్మలనన్నింటిని అన్ని విధముల భగవంతునికి సమర్పణ చేయుటయే వాటిని త్యాగము చేయుట యగును. ఏలనన భగవానుడు ఈ యధ్యాయమున త్యాగస్వరూపమును గూర్చి వివరించుచు నియత కర్మలను భౌతికముగ (ఆచరణములో) త్యజించుట న్యాయసమ్మతము కాదని 7వ శ్లోకమున స్పష్టమొనర్చెను. ఏలనన మోహపూర్వకముగా వాటిని త్యజించుట తామసత్యాగమనబడును. కనుక ఇచట 'పరిత్యజ్య' అను పదమునకు సమస్త కర్మాచరణములను త్యజించుటయని భావింపరాదు.

ఇంతేగాక క్షాత్రధర్మమైన యుద్ధమును పరిత్యజింపక సమస్త కర్మలను భగవదర్పణముగావించి, యుద్ధము చేయుమని భగవంతుడు అర్జునుని పెక్కు సందర్భముల యందు ఆదేశించెను. (3/30, 8/7, 11/34). గీతోపదేశమును పూర్తిగా విన్న పిదప ఈ యధ్యాయమునందలి 73వ శ్లోకమున అర్జునుడు భగవద్వచనములను శిరసావహించి "కరిష్యే వచనం తవ" "నేను నీ ఆజ్ఞను పాటించెదను" అని పలుకుచు స్వధర్మ రూపమైన యుద్ధమును గావించెను. కనుక సమస్తకర్మలను భగవంతునకు సమర్పణచేయుట యనగా సర్వమూ భగవంతునిదేయని భావించి, శరీరేంద్రియ మనస్సుల యందును, వాటిద్వారా చేయబడు కర్మలయందును, వాటి ఫలరూపములైన సమస్త భోగములయందును, మమతాసక్తులను, అభిమానములను, కోరికలను సర్వథా త్యజించుటయని గ్రహింపవలెను. భగవంతుని కొఱకై అతని ఆజ్ఞలను ప్రేరణలను అనుసరించి, అతని చేతిలోని ఆటబొమ్మలవలె నడచుకొనుటయే (కర్మాచరణము గావించుటయే) సమస్త ధర్మములను పరిత్యజించుట యనబడును. కాని వాటిని భౌతికముగా త్యజించుట యని యర్థము గాదు.

ప్రశ్న - ఈ విధముగా సమస్త ధర్మములను పరిత్యజించి, కేవలము పరమేశ్వరుని యందే శరణుపొందుట యనగానేమి?

సమా - పైన పేర్కొనబడిన విధముగా కర్మలను అన్నింటిని భగవంతునకు సమర్పించి, 12వ అధ్యాయము నందలి 6వ శ్లోకమునందు, 9వ అధ్యాయమునందలి చివరి శ్లోకమునందు ఈ అధ్యాయమునందు 57వ శ్లోకమునందు చెప్పబడినట్లు భగవంతుడే తనకు పరమ ప్రియుడు, పరమహితైషి, పరమసుహృదుడు, పరమాత్మీయుడు, పరమాధారుడు, పరమప్రాప్యుడు, పరమగతి అనియు అట్లే తనకు స్వామి, భర్త, సంరక్షకుడు అనియు భావించి, కూర్చున్నను, నిలుచున్నను, భుజించుచున్నను, నిద్రించుచున్నను మేల్కొనియున్నను, సర్వకాల సర్వావస్థల యందును అతని ఆజ్ఞలను పాటించుచు, అనన్య భక్తిశ్రద్ధలతో నిత్యము నిరంతరము అతనినే చింతించుచుండవలెను. అతని విధానములయందు సర్వదా సంతుష్టిని పొందుచు అన్ని విధములుగ ప్రహ్లాదునివలె ఆయన మీదనే భారముంచవలెను. కేవలము పరమేశ్వరునే శరణుపొందుట యనగా ఇదియే.

ప్రశ్న - "నేను నిన్ను సర్వ పాపములనుండియు విముక్తుని జేయుదును" అని యనుటలోని విశేషమేమి?

సమా- శుభాశుభకర్మల ఫలరూపములైన కర్మబంధములచే బంధింపబడి మనుష్యుడు జన్మజన్మాంతరములలో నానా యోనులయందు పరిభ్రమించుచుండును. అట్టి కర్మబంధములను సూచించునదియే 'పాపము' అను పదము. ఆ కర్మ బంధములనుండి విముక్తుని గావించుట' యగును, 3వ అధ్యాయమునందలి 31వ శ్లోకమునందు 'కర్మభిః ముచ్యన్తే' అనియు, 12వ అధ్యాయమునందలి 7వ శ్లోకమునందు 'మృత్యుసంసారసాగరాత్ సముద్ధర్తాభవామి' అనియు, ఈ అధ్యాయమున 58వ శ్లోకమునందు 'మత్ప్రసాదాత్ సర్వదుర్గాణి తరిష్యసి' అనియు తెలుపబడిన విషయములనే భగవంతుడు ఇచట "నేను నిన్ను సర్వపాపములనుండి విముక్తునిగా చేయుదును" అను వాక్యముద్వారా తెలిపెను.

ప్రశ్న - 'మా శుచః' అనగా 'శోకింపకుము' అని చెప్పుటలోని విశేషమేమి?

సమా - 'మా శుచః' అని చెప్పుచు, అర్జునుని ఆశ్వాసించుచు, భగవానుడు గీతోపదేశమును ముగించెను. 2వ అధ్యాయమునందలి 11వ శ్లోకమున 'అశోచ్యాన్' అను పదప్రయోగముతో ప్రారంభించిన ఉపదేశమును 'మాశుచః' అను పదప్రయోగముతో ముగించెను. 2వ అధ్యాయము నందలి 7వ శ్లోకమున అర్జునుడు భగవానుని శరణుపొందియే యుండెను. ఇప్పుడు సంపూర్ణముగ

శరణాగతుడవై ఏమాత్రము విచారింపక శోకమును సర్వథా త్యజించి, పరమేశ్వరుడైన తనమీదనే సర్వథా భారమును ఉంచుమని అర్జునుని భగవానుడు ఆదేశించెను. శోకపరంపర తొలగి (పూర్తిగా శోకము తొలగిపోయి) భగవత్సాక్షాత్కారము సిద్ధించుటయే గీతోపదేశముయొక్క పరమలక్ష్యము. కనుకయే దీనికి మోక్షశాస్త్రము అనియు ప్రసిద్ధి యేర్పడినది.

*సంబంధము - ఈ విధముగా గీతోపదేశమును ముగించి, ఈ ఉపదేశముయొక్క అధ్యయన - అధ్యాపనముల యొక్క మాహాత్మ్యమును దెలుపుటకై మొదట ఈ ఉపదేశమునకు అనర్హులైన వారి లక్షణములను పేర్కొనుచు, అట్టివారికి గీతోపదేశమును వినిపింపరాదని తెలుపుచున్నాడు-*

**ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।**

**న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥ 67 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తే | = (త్వయా) నీచే | న, వాచ్యమ్ | = చెప్పదగదు | యః | = ఎవడు |
| ఇదమ్ | = రహస్యమయమైన ఈగీతోపదేశము | అభక్తాయ, చ | = భక్తిరహితునకును | మామ్ | = నన్ను |
| | | న, (వాచ్యమ్) | = చెప్పదగదు | అభ్యసూయతి | = దోషదృష్టితో చూచునో |
| కదాచన | = ఎప్పుడైనను (ఏస్థితియందైనను) | అశుశ్రూషవే | = వినుటకు ఇచ్ఛలేని వానికి | (తస్మై) | = వానికి (ఎన్నడును) |
| అతపస్కాయ | = తపస్సంపన్నుడు కాని వానికి | న, (వాచ్యమ్) | = చెప్పదగదు | న | = (ఈ ఉపదేశమును గూర్చి) తెలుపరాదు |
| | | చ | = మఱియు | | |

**తపస్సంపన్నుడు కానివానికిని, భక్తిరహితునకును, వినవలెనను కుతూహలము లేనివానికిని నీవు ఈ గీతారూపరహస్యోపదేశమును ఎన్నడునూ తెల్పరాదు. అట్లే నాయందు దోషదృష్టి గలవానికి ఎన్నడునూ ఈ ఉపదేశమును తెలుపరాదు. (67)**

ప్రశ్న - **'ఇదమ్'** అను పదము దేనిని సూచించును? 'తపస్సంపన్నుడు కానివానికి ఎన్నడును ఈ ఉపదేశమును చేయకూడదు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - 2వ అధ్యాయమునందలి 11వ శ్లోకము మొదలు ఇంతవఱకును తన గుణప్రభావ రహస్యస్వరూప తత్త్వములను వివరించుటకై అర్జునునకు భగవానుడు చేసిన సమస్తమైన ఉపదేశమును **'ఇదమ్'** అను పదము సూచించును. ఈ యుపదేశమును వినుటకు అర్హులైనవారిని నిర్ణయించుచు నాల్గుదోషములు గలవారు అనర్హులని భగవానుడు నుడివెను. వారిలో తపస్సంపన్నులు కానివారికి దీనిని వినిపింపరాదని పలికెను. గీతాశాస్త్రము అతి గోప్యమైన విషయము. అర్జునుడు భగవానునకు ప్రియుమైన భక్తుడేగాక దైవీ సంపద గలవాడు. కనుక అతని హితమునకై భగవానుడు దానిని తెలిపెను. స్వధర్మపాలనరూపమైన తపస్సును చేయని వాడును, భోగాసక్తి కారణమున ప్రాపంచిక విషయ సుఖలోభముచే తన ధర్మమును విడనాడి పాపకర్మముల యందే ప్రవృత్తుడైనవాడును, భగవానుని గుణప్రభావ తత్త్వముల వర్ణనను వినుటకు అనర్హుడు. కనుక అట్టివానికి ఈ గీతాశాస్త్రమును వినిపింపరాదు. ఏలనన అతడు దీనియెడ సుముఖతనూ కలిగియుండడు. ధారణనూ చేయజాలడు. పైగా ఈ ఉపదేశమునేగాక భగవానుని సైతము నిరాదరించుచుండును.

ప్రశ్న - 'భక్తిరహితుడైన వానికి దీనిని ఎప్పుడును వినిపింపరాదు' అని యనుటలో అంతరార్థమేమి?

సమా - పరమేశ్వరుని యందు భక్తి విశ్వాసములు, పూజ్యభావము లేకుండ అన్నింటికిని నేనే కర్తను అని అహంకారముతో మెలగు నాస్తికునకును పరమ గోప్యమైన ఈ గీతాశాస్త్రమును వినిపింపరాదు. ఏలనన దీనియెడ విశ్వాసములేని కారణమున ఇది అతనికి బోధపడదు. కావున ధారణ చేయలేడు.

ప్రశ్న - **'అశుశ్రూషవే'** అను పదము ఎవరిని సూచించును? గీతోపదేశము అతనికి వినిపింపరాదనుటకు కారణమేమి?

సమా - గీతాశాస్త్రమును వినుటకు కుతూహలము లేనివానిని 'అశుశ్రూషవే' అను పదము తెలుపును. అట్టివాడు కూడ దీనిని వినుటకు అనర్హుడు. తన ధర్మాచరణరూప తపమును చేయుచున్నను గీతాశాస్త్రమునందు భక్తిశ్రద్ధలు లేని కారణమున దానిని వినుటకు అతడు కుతూహలమునే కలిగియుండడు. అట్టి వానికిని పరమగోప్యమైన ఈ శాస్త్రమును తెలుపరాదు. ఏలనన అట్టి వానికి దీనియెడగల అశ్రద్ధ - ఉపేక్షల కారణమున అతడు విసుగును ప్రదర్శించును. అందువలన దీనిని అతడు గ్రహింపజాలడు. సరికదా! భగవంతుని యెడను, తదుపదేశమునెడను నిరాదరణనే చూపును. కనుక అట్టి అపాత్రునకు దీనిని తెలుపుట వ్యర్థము.

ప్రశ్న - 'నాయందు దోషదృష్టి గలవానికి మాత్రము ఎన్నడును దీనిని తెలుపరాదు' అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడు లోకోద్ధరణకై, ధర్మపరిరక్షణకై సగుణ రూపమున పెక్కు అవతారములను దాల్చుచుండును. సర్వారాధ్యుడైన ఆ భగవంతుని యెడ దోషదృష్టి గలిగి అతని సుగుణములయందు దోషారోపణ చేయుచు నిందించు మూర్ఖునకు ఎట్టి పరిస్థితియందు ఈ యుపదేశమును వినిపింపనేరాదు. ఏలనన భగవంతుని గుణప్రభావైశ్వర్యములను నిందించువాడు అధమాధముడు, పరమమూర్ఖుడు. అట్టి తమోగుణయుక్త మూఢునకు వినిపించినచో మునుపటికంటెను ఎక్కువగా దీనిని ఎగతాళి చేసి, పాపముల పాలగును.

ప్రశ్న - పైన తెలుపబడిన నాలుగు దోషములు గలవానికి మాత్రమే ఈ యుపదేశమును చేయరాదా? లేక ఆ నాల్గింటిలో ఒకటిగాని, రెండుగాని, మూడుగాని దోషములు గలవానికి చేయరాదా?

సమా - ఈ నాల్గింటిలో ఒక దోషము గూడ లేనివాడు ఈ ఉపదేశమునకు పూర్తిగా అర్హుడే. ఐతే స్వధర్మపాలన రూప తపస్సు ఆచరింపనివానికిని మిగిలిన దోషములు అతనిలో లేనిచో ఈ ఉపదేశమును చేయవచ్చును. అతడు దీనికి అర్హుడే. అట్లే తపస్సంపన్నుడు కాకున్నను, భగవంతునకు పూర్ణభక్తుడు కాకున్నను గీతను వినవలెనను కుతూహలమును కల్గియున్నచో అతడుగూడ ఒక విధముగా కొంతవఱకు దీనికి అర్హుడే. కాని భగవంతుని యందు దోషదృష్టి కలిగి, అతనిని, అతని గుణాదికములను నిందించు నాస్తికుడు ఎన్నడూ ఏవిధముగను ఈ యుపదేశమును పొందుటకు అర్హుడు కానేకాడు. ఏలనన అతడు నాస్తికుడైన కారణముగా తపస్సంపన్నుడును కాడు, భక్తుడును గాడు. మీదుమిక్కిలి భగవంతుని యెడగాని, తదుపదేశమునెడ గాని కుతూహలమును చూపడు సరిగదా నిరాదరణతో నిందించును.

సంబంధము - గీతోపదేశమును పొందుటకు అనర్హుల లక్షణములను దెలిపి, భగవంతుడు ఈ ఉపదేశమువలన భక్తులకు కలుగు ఉత్తమఫలములను, ఉపదేశమహిమలను ఒక రెండు శ్లోకములలో తెల్పుచున్నాడు-

**య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥ 68 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఎవడయితే | పరమమ్, గుహ్యమ్ | = మిక్కిలి గోప్యమైన గీతోపదేశమును | మామ్, ఏవ | = నన్నే |
| మయి | = నాయందు | మద్భక్తేషు | = నాభక్తులయందు | ఏష్యతి | = పొందును |
| పరామ్, భక్తిమ్, కృత్వా | = పరమభక్తిని గలిగి | అభిధాస్యతి | = పదిలపఱచునో | అసంశయః | = ఇందు సంశయమునకు తావేలేదు |
| ఇమమ్ | = ఈ | సః | = అతడు | | |

నా యందు పరమభక్తి గలిగి, ఈ పరమగోప్యమైన గీతోపదేశమును నా భక్తుల హృదయములలో పదిలపఱచువాడు నన్నే పొందును. ఇందేమాత్రమూ సందేహము లేదు. **(68)**

ప్రశ్న - 'ఇమమ్' పదము దేనిని సూచించును. దానితోపాటు 'పరమమ్' 'గుహ్యమ్' అను విశేషణములను ప్రయోగించుటలోగల ప్రత్యేకతయేమి?

సమా - 'ఇమమ్' అను పదము సమస్త గీతోపదేశమును సూచించును. ఈ యుపదేశము మనుష్యుని సంసారబంధముల నుండి విముక్తుని గావించి అతనికి సాక్షాత్ పరమేశ్వర ప్రాప్తిని కల్గించుననియు, ఆ కారణమున అది అత్యంత శ్రేష్ఠమైనదనియు, గోప్యమైనదియు అనియు తెల్పుటకే ఇచట 'పరమమ్' 'గుహ్యమ్' అను విశేషణములు ప్రయోగింపబడినవి.

ప్రశ్న - 'మద్భక్తేషు' అను పదప్రయోగము ఎవరిని సూచించును? ఆ పదప్రయోగ వైశిష్ట్యమేమి?

సమా - భగవంతుని యెడ భక్తిశ్రద్ధలు గలవారును, భగవంతుడే జగత్తుయొక్క సృష్టి, స్థితి, పాలనములను చేయువాడును, సర్వశక్తిమంతుడును, సర్వేశ్వరుడును అని భావించి, అతనిని సేవించువారును, భగవంతుని గుణప్రభావ లీలాతత్త్వ విశేషములను వినుటకు చిత్తమున కుతూహల పడువారును, విని సంతోషించువారును ఐనట్టి జనులను సూచించునదియే 'మద్భక్తేషు' అను పదము. ఈ పద ప్రయోగము ద్వారా గీతోపదేశమునకు అర్హులైనవారిని గూర్చి తెల్పుట జరిగినది. పూర్వశ్లోకమున తెల్పబడిన నాల్గుదోషములును భక్తునియందు ఉండనే ఉండవు. ఏ వర్ణస్థుడైనను, ఏ కులస్థుడైనను భగవద్భక్తుడైనచో గీతోపదేశమునకు అర్హుడే. (9/32)

ప్రశ్న - పరమభక్తుడైనవాడు భగవద్భక్తుల హృదయములలో ఈ గీతోపదేశమును పదిలపఱచుటయనగానేమి?

సమా - భగవంతునియందును, అతని ఉపదేశముల యందును మిక్కిలి భక్తిశ్రద్ధలు కలిగి భగవంతుని నామగుణ లీలాప్రభావ స్వరూపముల స్మరణ మాత్రముననే భగవత్ప్రేమ యందు విహ్వలుడై కేవలము భగవదనుగ్రహము కొఱకే నిష్కామ భావముతో భగవద్భక్తులకు ఈ గీతాశాస్త్రమును ఉపదేశింపవలెను. అనగా వారిచే గీతా శ్లోకములను అధ్యయనము చేయింపవలెను. వాటి తత్త్వరహస్యవిశేషములను వారికి సమగ్రముగా బోధపడునట్లు వివరింపవలెను. వారిచే శుద్ధపారాయణము చేయించవలెను. వారి వివిధ సందేహములను తీర్చి గీతోపదేశమును వారి హృదయములలో పదిలపరచవలెను. వారు గీతోపదేశమును అనుసరించి, తమ జీవన విధానమును కొనసాగించునట్లు చేయవలెను. ఈ క్రియలన్నియును భక్తుల హృదయములలో గీతోపదేశమును పదిలపఱచుటలో అంతర్భాగములే.

ప్రశ్న - "అతడు (ఆ పరమ భక్తుడు) నిస్సందేహముగా నన్నే పొందును" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - భగవంతుని యందు అనన్య భక్తి గలిగి, భగవదుపదేశములకు అర్హులైన వారికి బోధించు వాడు ఆ భగవంతుని పొందును. ఇందేమాత్రమూ సందేహము లేదు. ఇదియే భగవత్ప్రాప్తికి ఏకైక మార్గము. కనుక భగవత్ప్రాప్తిని కోరువారు అర్హులైన భక్తులకు గీతాశాస్త్ర బోధన ప్రచారములు అవశ్యముగా కావింపవలెను.

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి ॥ 69 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మనుష్యేషు | = మనుష్యులలో | కశ్చిత్, చ | = ఎవ్వడును | మే | = నాకు |
| మే | = నాకు | న | = లేడు | ప్రియతరః | = మిక్కిలి ప్రియమైనవాడు |
| తస్మాత్ | = వానికంటెను | చ | = అట్లే | | |
| ప్రియకృత్తమః | = మిక్కిలి ప్రియమును గూర్చువాడు | భువి | = ఈ భూమండలమున | అన్యః | = మఱియొకడు |
| | | తస్మాత్ | = వానికంటెను | న, భవితా | = ఉండబోడు |

నాకు ప్రీతిని గూర్చునట్టి కర్మల నాచరించు మనుష్యులలో అతనిని మించిన భక్తుడెవ్వడును లేడు. అంతేగాక అతనివలె గాని, అతనిని మించిగాని నాకు ప్రియమైన వాడు భూమండలమున మఱియొకడెవ్వడును భవిష్యత్తులోను ఉండబోడు. **(69)**

ప్రశ్న - 'తస్మాత్' అను పదము ఎవరిని తెలుపును? మనుష్యులలో అతనిని మించి నాకు ప్రియమును గూర్చువాడెవ్వడును లేడు అనగానేమి?

సమా - పూర్వశ్లోకమున వర్ణింపబడినట్లు గీతాశాస్త్రమును భగవద్భక్తులకు ఉపదేశించువాడును, గీతాశాస్త్ర రహస్యమును (తత్త్వమును) పూర్తిగా ఎఱింగినవాడును, శ్రద్ధాళువును ఐన భగవద్భక్తుని సూచించునదియే ఈ "తస్మాత్" అను పదము. యజ్ఞ, దాన, తపఃక్రియలు, సేవలు, పూజలు, జపములు, ధ్యానము మొదలగు భగవత్కార్యములన్నిటి కంటెను గీతాసారమును అవగాహన చేసికొని, భక్తులకు దానినందించుటయే భగవంతునకు అత్యంత ప్రీతికరము. దీనికి సమానమైన భగవత్కార్యము మఱియొకటి లేనేలేదు. ఈ కారణమున భక్తిశ్రద్ధలతో భగవంతుని సందేశమును భక్తసమూహమునకు బోధించువాడు భగవంతునకు ఎంతేని ప్రీతిపాత్రుడు. అతనికంటె అధికుడు వేఱొకడుండడు. ఏలనన అతడు తన స్వార్థమును సర్వథా వీడి, కేవలము భగవత్ప్రీతికర కార్యములనే చేయుచుండును. అతడు భగవంతునకత్యంత ప్రీతిపాత్రుడు.

ప్రశ్న - "ఈ భూమియందు నాకు అతనిని మించిన ప్రీతిపాత్రుడు మఱియొకడు భవిష్యత్తులోకూడ ఉండబోడు" అని యనుటలోని అంతరార్థమేమి?

సమా - పైన తెలుపబడిన రీతిగా భగవద్గీతాప్రచారము చేయు భక్తునిమించిన ప్రీతిపాత్రుడు తనకు మఱియొకడు ఉండడనియు, ఉండబోడనియు భగవానుడు తెల్పెను. ఏలనన గీతా ప్రచారముకంటెను ఉత్తమమైన కార్యము మఱియొకటి ఏదియును భగవంతునకు ప్రియమైనదికాదు. ఏ సాధనద్వారా ఐనను గీతాప్రచారము చేయువాడు భగవంతునకు ప్రియతముడు. "కావున భగవత్ప్రాప్తికై ఈ భగవత్సందేశమును భక్తులలో భక్తిపూర్వకముగా విస్తృత ప్రచారము చేయుటయే సర్వోత్తమ సాధనము" అని గ్రహించి, భక్తులు ఈ కార్యమును నిర్వహింపవలెను.

*సంబంధము - గీతాశాస్త్రము భగవద్భక్తులలో భక్తిశ్రద్ధలతో విస్తరింపజేయు కార్యముయొక్క ఫలమును, మాహాత్మ్యమును పైరెండు శ్లోకములలో వర్ణించుట జరిగినది. కాని సామాన్యముగా మనుష్యులందఱును ఈ కార్యమును చేయజాలరు. ఈ సామర్థ్యము గలవారు మిక్కిలి అరుదుగా మాత్రమే ఉందురు. కనుక గీతాశాస్త్రముయొక్క అధ్యయన మహాత్మ్యమును తెల్పుచున్నాడు-*

**అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।**
**జ్ఞానయజ్ఞేన తేనాహమ్ ఇష్టః స్యామితి మే మతిః ॥ 70 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = ఎవడయితే | | గీతాశాస్త్రమును | | ద్వారా |
| ఇమమ్ | = ఈ | అధ్యేష్యతే | = పఠించునో | ఇష్టః, స్యామ్ | = పూజితుడను |
| ధర్మ్యమ్ | = ధర్మయుక్తమైన | తేన, చ | = వానిచేతను | | అగుదును |
| ఆవయోః | = మన ఇరువురియొక్క | అహమ్ | = నేను | ఇతి | = అని |
| సంవాదమ్ | = సంవాదరూపమైన | జ్ఞానయజ్ఞేన | = జ్ఞానయజ్ఞము | మే, మతిః | = నా అభిప్రాయము |

ధర్మయుక్తమైన మనసంవాదరూపమైన ఈ గీతాశాస్త్రమును పఠించువాడు జ్ఞానయజ్ఞముద్వారా నన్ను పూజించువాడని నా అభిప్రాయము. **(70)**

ప్రశ్న - 'ఆవయోః సంవాదమ్' అనువాటితోపాటు 'ఇమమ్' అను పదము దేనిని తెలుపును? దానితో 'ధర్మ్యమ్' అను విశేషణమును ప్రయోగించుటలోని వైశిష్ట్యమేమి?

సమా - 68వ శ్లోకమున 'పరమగుహ్యమ్' అని తెలుపబడినదియు, శ్రీకృష్ణార్జునుల మధ్య ప్రశ్నోత్తర రూపమున కొనసాగినదియు అగు గీతాశాస్త్రమునే 'ఆవయోః సంవాదమ్'తోపాటు, 'ఇమమ్' అను పదము తెలుపును. ఇది సాక్షాత్తుగా పరమేశ్వరుని ముఖతః వెలువడిన శాస్త్రము. కనుక ఈ యుపదేశమంతయును ధర్మముతోడనే నిండియున్నది. ఇందు ధర్మవిరుద్ధమైనదిగాని, వ్యర్థమైనది

గాని ఏవిషయమూ లేదు. ఇందు తెలుపబడిన ఉపదేశమును పాటించుట ప్రతి వ్యక్తికిని పరమకర్తవ్యము - అని తెల్పుటకే **'ధర్మ్యమ్'** అను విశేషణము ప్రయోగింపబడినది.

ప్రశ్న - గీతాశాస్త్రము యొక్క 'అధ్యయనము' అనగానేమి?

సమా - గీతారహస్యమును బాగుగా ఎఱింగి భగవద్భక్తుల యొద్ద ఈ గీతాశాస్త్రమును అధ్యయనము చేయుట, దీనిని నిత్యము అర్థసహితముగా పఠించుట, అర్థజ్ఞానమును పొందుట దీని విశేష పరమార్థములను విజ్ఞులైన భక్తుల నుండి తెలిసికొనుటకు ప్రయత్నించుట మొదలగునవి యన్నియును గీతాశాస్త్రము యొక్క అధ్యయనమందు అంతర్గతములే.

గీతా శ్లోకముల అర్థములను తెలిసికొనకయే పఠించుట కంటెను, నిత్యపారాయణము చేయుటకంటెను, అర్థజ్ఞానముతో వాటిని పఠించుట, నిత్యపారాయణములను చేయుట మిక్కిలి ఉత్తమమైనవి. మఱియు గీతాశ్లోక పఠన, పారాయణ సమయములయందు అర్థజ్ఞానమును కలిగియుండుటయేగాక భక్తిభావభరితుడై ప్రేమ విహ్వలుడగుట ఇంకను ఉత్తమము.

ప్రశ్న - "అతడు గూడ (అధ్యయనము చేసినవాడు కూడ) జ్ఞానయజ్ఞము ద్వారా నన్ను సేవించినవాడే యగును" అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యము గీతాధ్యయన మాహాత్మ్యమును తెల్పుచున్నది. గీతాశాస్త్రాధ్యయనము చేయుట వలన మనుష్యునకు భగవంతుని సగుణ నిర్గుణ సాకార నిరాకార తత్త్వముల యథార్థజ్ఞానము సంపూర్ణముగా అవగతమగును. కనుక భగవత్తత్త్వమును ఎఱుంగుటకై గీతాశాస్త్రమును అధ్యయనము చేసినవాడు జ్ఞానయజ్ఞముద్వారా భగవంతుని పూజించినవాడే యగును. జ్ఞానయజ్ఞ రూప సాధనము ఇతర ద్రవ్యమయ సాధనలకంటె మిక్కిలి ఉత్తమమైనదిగా భావింపబడినది. (4/33) ఏలనన అన్ని సాధనల అంతిమ ఫలము భగవత్తత్త్వమును యథార్థముగా ఎఱుంగుటయే. ఆ ఫలము ఈ జ్ఞానయజ్ఞము ద్వారా అనాయాసముగానే లభించును. కనుక శ్రేయస్సును కోరుకొనువాడు తత్పరతతో గీతాధ్యయనమును చేయవలెను.

*సంబంధము - గీతాశాస్త్రాధ్యయనము యొక్క మహిమను తెలిపిన పిదప అట్లు అధ్యయనము చేయుటకు సామర్థ్యము లేనివారికై గీతా శ్రవణముయొక్క ఫలమును తెలుపుచున్నాడు-*

**శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**
**సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్ ॥ 71 ॥**

యః, నరః = ఏనరుడయితే
శ్రద్ధావాన్ = శ్రద్ధగలవాడై
అనసూయః, చ = దోషదృష్టిలేని వాడై
శృణుయాత్, అపి = (ఈ గీతాశాస్త్రమును) వినునో
సః, అపి = అతడును
ముక్తః = పాపవిముక్తుడై
పుణ్యకర్మణామ్ = పుణ్యకర్మలను ఆచరించువారి యొక్క
శుభాన్, లోకాన్ = ఉత్తమలోకములను
ప్రాప్నుయాత్ = తప్పక పొందును

**శ్రద్ధాదరములుగలవాడును, దోషదృష్టి(దోషములెన్ను స్వభావము) లేనివాడును ఐన మనుష్యుడు గీతాశాస్త్రమును వినుటవలనగూడ పాపవిముక్తుడై, పుణ్యకర్మలను ఆచరించువారుపొందు ఉత్తమలోకములను పొందును. (71)**

ప్రశ్న - ఇచట 'నరః' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - గీతాశాస్త్రమును శ్రద్ధతో వినుటకు గూడ ఆసక్తి లేనివాడు నరుడని పిలువబడుటకు గూడ యోగ్యుడు కాడు. అట్టివాడు మానవుడై జన్మించుటయే వ్యర్థము. అట్టివాడు పశుతుల్యుడే యగును. ఈ భావమును తెల్పుటకే ఇచట 'నరః' అను పదము ప్రయోగింపబడినది.

ప్రశ్న - శ్రద్ధ గలవాడై, దోషదృష్టిరహితుడై గీతాశాస్త్రమును వినుట యనగానేమి?

సమా - భగవంతునియొక్క అస్తిత్వమునందును, ఆతని గుణప్రభావములయందును విశ్వాసముునుంచి, ఈ గీతాశాస్త్రము సాక్షాత్తుగా భగవద్వాణి యనియు, ఇందులో చెప్పబడిన విషయములన్నియును పూర్తిగా యథార్థములనియు దృఢముగా నమ్మి, గీతను బోధించు వారియెడ భక్తి

విశ్వాసములు గలిగి, భగవద్గీత మూల శ్లోకములను, వాటి అర్థతాత్పర్యములను వినుటయే - శ్రద్ధతో గీతాశాస్త్ర శ్రవణము చేయుట యగును.

గీతాశ్రవణ సమయమున భగవంతుని పైనగాని, భగవద్వచనములయెడగాని, వివిధమైన దోషారోపణ చేయక, గీతాశాస్త్రమును అవహేళన చేయకుండుట దోషదృష్టిరహితుడై శ్రవణము చేయుటయగును.

ప్రశ్న - "శృణుయాత్" అను క్రియాపదముతో పాటు 'అపి' అను పదమును ప్రయోగించుటలో గల విశేషమేమి?

సమా - 68వ శ్లోకమున పేర్కొనిన రీతిగా గీతాశాస్త్రమును ఇతరులచే అధ్యయనమును చేయించువారిని గూర్చియు, 70వ శ్లోకమున చెప్పబడిన విధముగా స్వయముగా అధ్యయనము చేయువారిని గూర్చియు ఇక చెప్పవలసినదేముండును? శ్రద్ధతో శ్రవణము చేయువారుగూడ పాపవిముక్తులయ్యెదరు. కనుక గీతా అధ్యయనము - అధ్యాపనము గూడ చేయలేని వారు గీతాశ్రవణమునైనను తప్పక చేయవలయును.

ప్రశ్న - శ్రవణము చేయువారు పాపవిముక్తులై పుణ్యకర్మల నాచరించువారు పొందు ఉత్తమ లోకములను పొందుదురనగానేమి? అట్లే 'సః' అను పదముతోపాటు 'అపి' అను పదమును ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - జీవులు జన్మజన్మాంతరములలో పశుపక్ష్యాది నీచయోనులలో పుట్టి, నరకమునకు హేతుభూతమైన పాపకర్మలను ఆచరించియుండుట కొంతవరకు సంభవమే. అట్టివాడు కూడ ఈ నరజన్మయందు గీతాశ్రవణము చేయుట వలన ఆ పాపకర్మల (ఫలానుభవముల) నుండి విముక్తులై ఇంద్రలోకము మొదలు భగవంతుని పరంధామము వఱకు తమ తమ భక్తిశ్రద్ధలను అనుసరించి, వివిధ లోకములను పొందుదురు. పాపవిముక్తులై పుణ్యకర్మలను ఆచరించినవారు పొందెడి ఉత్తమ లోకములను పొందుట యనగా ఇదియే.

గీతాశాస్త్రము యొక్క అధ్యయన - అధ్యాపనములను చేయజాలని కారణమున మనుష్యుడు కేవలము గీతాశ్రవణము చేసినను పాపకర్మ ఫలానుభవముల నుండి విముక్తుడగును. అతడు పశుపక్ష్యాది జన్మలనుగాని, నరక యాతనలను గాని పొందక గీతాశ్రవణ ప్రభావమున పుణ్యకర్మలను ఆచరించెడి వారు పొందు ఉత్తమ లోకములను పొందును. 'సః' 'అపి' అను పదములను ప్రయోగించుటలోని ఆంతర్యమిదియే.

*సంబంధము - గీతాశాస్త్రము యొక్క కథన పఠన శ్రవణముల మాహాత్మ్యమును చెప్పి, అర్జునుని మానసిక స్థితిని తాను పూర్తిగా ఎఱిగియున్నను అతనిని చైతన్యవంతునిగా చేయుటకు భగవానుడు మఱల ఇట్లు ప్రశ్నించెను-*

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥ 72 ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ! | = ఓ పార్థా! | శ్రుతమ్, కచ్చిత్ | = వినుట జరిగినదా? | అజ్ఞాన సమ్మోహః | = అజ్ఞానజనితమైన మోహము |
| ఏతత్ | = ఈ గీతాశాస్త్రము | ధనంజయ! | = ఓ ధనంజయా! | కచ్చిత్, ప్రణష్టః | = పూర్తిగా తొలగిపోయినదా? |
| త్వయా | = నీ చేత | తే | = నీ యొక్క | | |
| ఏకాగ్రేణ, చేతసా | = ఏకాగ్రచిత్తముతో | | | | |

**ఓ పార్థా! ఈ గీతాశాస్త్రమును నీవు ఏకాగ్రచిత్తముతోవింటివా? ఓ ధనంజయా! అజ్ఞానజనితమైన నీ మోహము పూర్తిగా నశించినదా? (72)**

ప్రశ్న - 'ఏతత్' అను పదము దేనిని తెలుపును? దీనిని నీవు ఏకాగ్రచిత్తముతో వింటివా? వీనియొక్క అంతరార్థమేమి?

సమా - 2వ అధ్యాయమునందలి 11వ శ్లోకముతో ప్రారంభించి, ఈ అధ్యాయమునందలి 66వ శ్లోకము వఱకు గల అతిగోపనీయమైన, దివ్యమైన భగవదుపదేశమును తెల్పునదియే 'ఏతత్' అను పదము. ఈ ఉపదేశము యొక్క మహత్త్వమును ప్రకటించుటకే ఇచట భగవానుడు ఇట్లు ప్రశ్నించెను. భగవానుని ఉపదేశము లభించుట మిక్కిలి దుర్లభము. భగవంతుడు ప్రతి వ్యక్తి యెదుట "నేనే సాక్షాత్తు

పరమేశ్వరుడను. నీవు నన్ను శరణు పొందుము" మొదలగు విషయములను తెలుపడు. కనుక అర్జునుడు తన యుపదేశమును ఏకాగ్రచిత్తముతో సరిగా వినెనో? లేదో? అను విషయమును తెలిసికొనుటకు భగవానుడిట్లు ప్రశ్నించెను. ఒకవేళ అర్జునుడు భగవదుపదేశమును మనసుపెట్టి విననిచో అది నిజముగా అర్జునుని పొరపాటే యగును.

ప్రశ్న - 'అజ్ఞానజనితమైన నీ మోహము నశించినదా?' అని ప్రశ్నించుటలో గల అంతర్యమేమి?

సమా - అర్జునుడు భగవానుని ఉపదేశమును చక్కగా వినియున్నచో దాని ఫలము అతనికి తప్పక లభించియేతీరును. అర్జునుడు మొదట మోహవశుడై ధర్మవిషయమున తాను మూఢచేతస్కుడనని తెలిపియుండెను. (2/7) అప్పుడతడు స్వధర్మమైన యుద్ధమును చేయుట పాపకృత్యమని భావించియుండెను. (1/36) కర్తవ్య కర్మలను అన్నింటిని త్యజించి, భిక్షాన్నముతో జీవించుటయైనను శ్రేష్ఠమని తలపోసియుండెను. (2/5) ఆత్మీయులను చంపుటకు భయపడి వ్యాకులచిత్తుడై యుండెను. (1/45-47) అతడు తన కర్తవ్యమును నిర్ణయించుకొనజాలకుండెను. (2/6-7) కనుక అజ్ఞానజనితమైన ఈ మోహము గీతోపదేశమును విన్న తర్వాతనైనను తొలగిపోయినదా? లేదా? అని భగవానుడు ప్రశ్నించుచున్నాడు. ఒకవేళ భగవానుని ఉపదేశమును ఏకాగ్రచిత్తముతో వినియున్నచో అతని మోహము తప్పక తొలగిపోవలసినదే. ఒకవేళ అతని మోహము ఇంకను తొలగకున్నచో అతడు గీతోపదేశమును ఏకాగ్రచిత్తముతో వినలేదనియే భావింపవలెను.

మనుష్యులందఱును ఈ గీతాశాస్త్రము యొక్క అధ్యయనమును, శ్రవణమును సావధానులై ఏకాగ్రచిత్తముతో తత్పరతతో చేయవలెనని భగవానుడు లోకమునకు స్పష్టపఱచుచున్నాడు. అజ్ఞానజనితమైన మోహము పూర్తిగా తొలగిపోనంతవఱకు భగవదుపదేశమును తాము యథార్థముగా గ్రహింపలేదనియే భావింపవలెను. కనుక మఱల దానిని శ్రద్ధావివేకములతో అధ్యయనము చేయుట అవసరము.

సంబంధము - భగవానుడు ఈ విధముగా ప్రశ్నింపగా అర్జునుడు అందులకు తన కృతజ్ఞతను ప్రకటించుచు తన మానసిక స్థితిని వివరించుచున్నాడు-

**అర్జున ఉవాచ**

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ 73 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అచ్యుత! | = ఓ అచ్యుతా! | | తొలగినది | గతసందేహః స్థితః అస్మి | = సందేహములు తొలగిన వాడనైతిని |
| త్వత్ప్రసాదాత్ | = నీ అనుగ్రహము వలన | మయా | = నాచేత | | |
| | | స్మృతిః | = స్మృతి | (అతః) | = కనుక |
| (మమ) మోహః | = నా మోహము | లబ్ధా | = పొందబడినది | తవ, వచనమ్ కరిష్యే | = నీ ఆజ్ఞను తలదాల్చెదను |
| నష్టః | = (పూర్తిగా) | | | | |

**అర్జునుడు పలికెను- ఓ అచ్యుతా! నీ కృపచే నా మోహము పూర్తిగా తొలగినది. స్మృతిని పొందితిని. ఇప్పుడు సంశయరహితుడనైతిని. కనుక నీ ఆజ్ఞను తలదాల్చెదను. (73)**

ప్రశ్న - 'అచ్యుత!' అని సంబోధించుటలో గల విశేషమేమి?

సమా - శ్రీకృష్ణుడు సాక్షాత్ నిర్వికార పరబ్రహ్మ, పరమాత్మ, సర్వశక్తిమంతుడు, నిత్యుడైన పరమేశ్వరుడేయని తాను యథార్థముగా తెలిసికొంటినని ప్రకటించుటకే అర్జునుడు భగవానుని 'అచ్యుత!' అని సంబోధించెను.

ప్రశ్న - 'నీకృపచే నా మోహము నశించినది' అని యనుటలోని అంతర్యమేమి?

సమా - ఈ వాక్యముద్వారా అర్జునుడు భగవానునకు తన కృతజ్ఞతను ప్రకటించెను. భగవంతుడు తన దివ్యోపదేశమును మిక్కిలి అనుగ్రహముతో అర్జునునకు

ప్రసాదించెను. ఆ యుపదేశమును విని అర్జునుని అజ్ఞానజనిత మోహము సర్వథా తొలగిపోయెను. భగవంతుని గుణప్రభావ-ఐశ్వర్య స్వరూపములను ఎఱుంగకపోవుటచేతనే మునుపు మోహవివశుడై అర్జునుడు భగవదాజ్ఞయొక్క మహత్త్వమును గుర్తింపలేకపోయెను. (2/9) అతడు బంధుమిత్రుల గురువుల వినాశమునకు భయపడి, శోకముచే వ్యాకులచిత్తుడై యుండెను. (1/28-47 వఱకు) భగవంతుని యథార్థ తత్త్వమును గ్రహించుట వలన ఇప్పుడా మోహమంతయును తొలగిపోయినది.

ప్రశ్న - 'నేను స్మృతిని పొందితిని' అని యనుటలోని విశేషమేమి?

సమా - తన అజ్ఞానజనిత మోహము తొలగిపోవుట వలన అర్జునుని అంతఃకరణమునందు దివ్యజ్ఞానము ప్రకాశించెను. దానివలన అతనికి భగవంతుని గుణప్రభావ - ఐశ్వర్య స్వరూపముల స్మృతి కలిగెను. భగవంతుని యథార్థ స్వరూపము అతనికి కన్నులకు కట్టెను. భగవత్తత్త్వ జ్ఞానము కలిగినంతనే మోహము పటాపంచలయ్యెను.

ప్రశ్న - 'నేను సంశయరహితుడనైతిని' అని యనుటలోని విశేషమేమి?

సమా - భగవదుపదేశమును విని పిదప ఇప్పుడు అర్జునునకు భగవంతుని గుణప్రభావ ఐశ్వర్యములను గూర్చియు, అతని సగుణ, నిర్గుణ, సాకార, నిరాకార స్వరూపములను గూర్చియు, అట్లే ధర్మాధర్మ, కర్తవ్యాకర్తవ్యాది విషయములను గూర్చియు సంశయములన్నియును పూర్తిగా తీరినవి. సమస్త సంశయములను నివృత్తియగుట వలన అతని అంతఃకరణమునందలి చాంచల్యము తొలగిపోయినది. ఈ విషయమును స్పష్టపఱచుటకే అర్జునుడు "నేను సంశయ రహితుడను ఐతిని" అని పలికెను.

ప్రశ్న - 'నేను నీ ఆజ్ఞను తలదాల్చెదను' అని అనుటలోని విశేషమేమి?

సమా - భగవత్కృపచే అర్జునుడు కృతకృత్యుడాయెను. అతనికి ప్రస్తుతము భగవదాజ్ఞను పాలించుటయే కర్తవ్యము. ఇంక ఎట్టి కర్తవ్యమూ మిగిలిలేదు. కనుక భగవదాజ్ఞాను సారము లోకకల్యాణార్థము తాను నిమిత్తమాత్రుడై యుద్ధాది సమస్త కర్మలను చేయుదునని అర్జునుడు పలికెను.

సంబంధము - ధృతరాష్ట్రుని ప్రశ్నకు సమాధానముగా సంజయుడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన గీతాశాస్త్రమును వర్ణించి, దానిని ముగించుచు గీతామాహాత్మ్యమును రెండు శ్లోకములలో తెలుపుచున్నాడు-

**సంజయ ఉవాచ**

**ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।**
**సంవాదమిమమశ్రౌషమ్ అద్భుతం రోమహర్షణమ్ ॥ 74 ॥**

ఇతి = ఈ ప్రకారముగా
అహమ్ = నేను
వాసుదేవస్య = శ్రీ కృష్ణునియొక్క
మహాత్మనః = మహాత్ముడైన
పార్థస్య, చ = అర్జునుని యొక్క
ఇమమ్ = ఈ
అద్భుతమ్ = అద్భుతమైన
రోమహర్షణమ్ = తనువును పులకింపజేయునట్టి
సంవాదమ్ = సంవాదమును
అశ్రౌషమ్ = వింటిని

**సంజయుడు పలికెను- ఈ విధముగా శ్రీ వాసుదేవునకును మహాత్ముడైన అర్జునకును మధ్య జరిగిన సంవాదమును వింటిని. అది అద్భుతమైనది. తనువును పులకింపజేయునది. (74)**

ప్రశ్న - 'ఇతి' అను పదప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - 'ఇతి' అను పదముద్వారా గీతోపదేశము యొక్క సమాప్తి సూచింపబడినది.

ప్రశ్న - భగవంతుని 'వాసుదేవుడు' అనియు, పార్థుని 'మహాత్ముడు' అనియు పేర్కొనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - ఇట్లనుట ద్వారా సంజయుడు గీతా మహత్త్వమును ప్రకటించెను. అర్జునుడు సాక్షాత్తుగా 'నరుడు' అను ఋషియొక్క అవతారము. అట్టి మహాత్ముడు అడిగిన పిమ్మట అందఱి హృదయముల లోనుండు, సర్వ వ్యాపియైన శ్రీకృష్ణ పరమాత్ముడు ఈ యుపదేశమును లోకమునకు

అనుగ్రహించెను. కనుక ఇంతటి మహిమాన్విత శాస్త్రము మఱియొకటి లేదు. ఇది సమస్త శాస్త్రముల సారము.[1]

గీత శ్రీమహావిష్ణుయొక్క ముఖకమలమునుండి జాలువారినది. ఇది సర్వశాస్త్రముల సారము. దీని శ్రవణ, కీర్తన, పఠన, పాఠన, మనన, ధారణాదులు మిక్కిలి మహిమాన్వితములు, కర్తవ్యములు.

ప్రశ్న - 'సంవాదమ్' అను పదముతోపాటు 'అద్భుతమ్' 'రోమహర్షణమ్' అను విశేషములను ప్రయోగించుటలోని విశేషమేమి?

సమా - అర్జునుని ప్రార్థనను అనుసరించి, అతని మోహ నివృత్తికై పరమేశ్వరుడే స్వయముగా ఉపదేశించిన ఈ గీత నిజముగా అద్భుతమైనది. ఆశ్చర్య జనకము, అసాధారణమైనది. దీనివలన మనుష్యునకు భగవంతుని దివ్యమైన, అలౌకికమైన గుణప్రభావ - ఐశ్వర్యయుక్తమైన సంపూర్ణ జ్ఞానము కలుగును. మానవుడు దీనిని వినుచూ గ్రహించుచూ పోయిన కొలదియు హర్షాశ్చర్య చకితుడగు చుండును. అందువలన అతడు పులకితగాత్రుడగుట జరుగును. ఈ భావమును ప్రకటించుటకే సంజయుడు 'సంవాదమ్' అను పదముతోపాటు 'అద్భుతమ్' 'రోమహర్షణమ్' అను విశేషణములను ప్రయోగించెను.

ప్రశ్న - 'అశ్రౌషమ్' అను పదప్రయోగములోని విశేషమేమి?

సమా - ఈ అద్భుతమైన, ఆశ్చర్యకరమైన గీతోపదేశమును వినుట వలన సంజయుడు తనను ధన్యునిగా, అదృష్టవంతునిగా భావించెను.

**వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యమహం పరమ్ ।**
**యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతః స్వయమ్ ॥ 75 ॥**

వ్యాసప్రసాదాత్ = వ్యాసభగవానుని కృపవలన (దివ్యదృష్టిని పొందిన వాడనై)
అహమ్ = నేను
ఏతత్ = ఈ
పరమ్, గుహ్యమ్ = పరమగోప్యమైన
యోగమ్ = యోగమును (గీతను) (అర్జునునకు)
స్వయమ్ = స్వయముగా
కథయతః = చెప్పుచున్న (ఉపదేశించుచున్న)
యోగేశ్వరాత్ = యోగేశ్వరుడైన
కృష్ణాత్ = శ్రీకృష్ణభగవానుని నుండి
సాక్షాత్ = ప్రత్యక్షముగా
శ్రుతవాన్ = వింటిని

**వేదవ్యాసునికృపవలన దివ్యదృష్టిని పొందినవాడనై, పరమగోప్యమైన ఈ యోగమును(గీతను) యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు(స్వయముగ) అర్జునునకు చెప్పుచుండగా నేను ప్రత్యక్షముగా వింటిని. (75)**

ప్రశ్న - 'వ్యాసప్రసాదాత్' అను పదప్రయోగము యొక్క వైశిష్ట్యమేమి?

సమా - సంజయునకు వ్యాసభగవానుడు దయతో 'దివ్యదృష్టి'ని ప్రసాదించెను. దాని ప్రభావమున అతడు సుదూరప్రదేశములయందు జరుగుచున్న సంఘటనలను సైతము ప్రత్యక్షముగా చూడగలిగి, వినగలిగి గ్రహింపగలిగి యుండెను. ఆ కారణమువలననే అతడు శ్రీకృష్ణదివ్యోపదేశమును విను మహాభాగ్యమునకు నోచుకొనెను. కనుక 'వ్యాసప్రసాదాత్' అను పదముద్వారా వ్యాస భగవానునకు తన కృతజ్ఞతను ప్రకటించెను.

ప్రశ్న - 'ఏతత్' అను పదమునకు ఇచ్చట అర్థమేమి? దానితోపాటు 'పరమ్' 'గుహ్యమ్' 'యోగమ్' అను మూడు విశేషణములను ప్రయోగించుటలోని ప్రత్యేకత ఏమి?

సమా - శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన ఈ

1) గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రసంగ్రహైః । యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతా ॥
*(మహాభారత - భీష్మ 43/1)*
గీత శ్రీమహావిష్ణువుయొక్క ముఖకమలమునుండి జాలువారినది. ఇది సర్వశాస్త్రముల సారము. దీని శ్రవణ కీర్తన, పఠన, పాఠన, మనన ధారణాదులు మిక్కిలి మహిమాన్వితములు, కర్తవ్యములు.

గీతాశాస్త్రమును సూచించునదియే 'ఏతత్' అను పదము - ఇది 'అత్యుత్తమమైనది' అని తెలుపుటకు 'పరమ్' అను విశేషణము ప్రయోగింపబడినది. ఇది మిక్కిలి గోప్యముగా ఉంచదగినదనియు, అనర్హులైనవారికి దీనిని ఉపదేశింప రాదనియు తెలుపుటకు 'గుహ్యమ్' అను విశేషణము ప్రయుక్తమైనది. భగవత్ప్రాప్తికి ఉపాయములైన కర్మ, జ్ఞాన, ధ్యాన, భక్తి, యోగాది సాధనలు ఇందు చక్కగా వివరింపబడినవి. అంతేగాక దీనిని శ్రద్ధతో పఠించుటవలనను పరమాత్మప్రాప్తి కల్గును. కనుక దీనిని 'యోగమ్' అని పేర్కొనుట జరిగినది.

ప్రశ్న - "ఈ యోగమును యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడు ప్రత్యక్షముగా అర్జునునకు ఉపదేశించుచుండగా నేను వింటిని" అని యనుటలోని ఆంతర్యమేమి?

సమా - సంజయుడు ధృతరాష్ట్రునకు వినిపించిన గీతాశాస్త్రము సమస్త యోగ శక్తులకును అధిష్ఠానమై సర్వశక్తిమంతుడైన శ్రీకృష్ణభగవానుని ముఖారవిందము నుండి జాలువారుచుండగా అతడు ప్రత్యక్షముగా విని, ఆస్వాదించినట్టిది. దీనిని మఱియొకరిద్వారా వినలేదనియు, తాను స్వయముగానే వింటిననియు తెల్పెను. పై వాక్యమునందలి వైశిష్ట్యమిదియే.

*సంబంధము - అత్యంత దుర్లభమైన ఈ గీతాశాస్త్ర శ్రవణ మహిమను వివరించి, సంజయుడు తన మానసికస్థితిని తెలుపుచు ఆ ఉపదేశస్మరణ మహత్త్వమును గూడ ప్రకటించుచున్నాడు-*

**రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమ్ ఇమమద్భుతమ్ ।**
**కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76 ॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రాజన్ | = ఓ ధృతరాష్ట్ర మహారాజా! | ఇమమ్ | = ఈ (పరమగోప్యమైన) | సంస్మృత్య, సంస్మృత్య | = పదేపదే స్మరించుచు |
| కేశవార్జునయోః | = శ్రీకృష్ణభగవానునకును అర్జునునకును మధ్య జరిగిన | పుణ్యమ్ | = పవిత్రమైన | ముహుర్ముహుః | = మాటిమాటికిని (నిరంతరము) |
| | | అద్భుతమ్, చ | = అద్భుతమైనదియగు | హృష్యామి | = ఆనందించుచున్నాను |
| | | సంవాదమ్ | = సంవాదమును (గీతను) | | |

**ఓ రాజా! (ధృతరాష్ట్రా!) శ్రీ కృష్ణభగవానునకును, అర్జునునకును మధ్య జరిగిన గోప్యమైన ఈ సంవాదము పుణ్యప్రదమైనది. అత్యద్భుతమైన ఈ సంవాదమును అనుక్షణము పదేపదే స్మరించుచు నేను నిరంతరము ఆనందమున ఓలలాడుచున్నాను. (76)**

ప్రశ్న - 'పుణ్యమ్', 'అద్భుతమ్' అను రెండు విశేషణముల వైశిష్ట్యమేమి?

సమా - శ్రీకృష్ణార్జునులదివ్య సంవాద రూపగీతాశాస్త్రమును అధ్యయన - అధ్యాపన శ్రవణ మనన వర్ణనాదులను గావించువారు పరమ పవిత్రులగుదురు. అన్ని విధములుగా వారికి శుభములే కలుగును. అంతేగాక ఆశ్చర్యకరములైన భగవానుని గుణప్రభావ ఐశ్వర్య తత్త్వరహస్యములు, దివ్యమంగళ స్వరూపము గోచరములగును. కనుక ఇది అత్యంత పవిత్రము, దివ్యము, అలౌకికము అని తెలుపుటకే 'పుణ్యమ్', 'అద్భుతమ్' అను విశేషణములు ప్రయుక్తములైనవి.

ప్రశ్న - "దీనిని అనుక్షణము పదేపదే స్మరించుచు నేను నిరంతరము ఆనందమున ఓలలాడుచున్నాను" అని అనుటలోని అంతరార్థమేమి?

సమా - దీనిద్వారా సంజయుడు తన మానసోల్లాస స్థితిని, గీతోపదేశస్మరణ ప్రభావమును ప్రకటించుచున్నాడు. ఈ భగవదుపదేశము సంజయునకు అనంతానందాతిరేకమును కలిగించినది. దానిని విన్న తరువాత అతనికి మఱియొక విషయమే రుచింపని స్థితి యేర్పడినది. ఆ యుపదేశ స్మరణమాత్రముననే అతడు భావావేశమునకు లోనగుచు, పరమానందమును అనుభవించుచుండెను. భక్తిపారవశ్యమున విహ్వలుడగుచుండెను. అవధులు లేని అతని హర్షానుభవములను ప్రకటించుటయే ఇందలి అంతరార్థము. ఈ సంజయుని వలెనే భగవద్భక్తులెల్లరును ఏతత్ స్మరణ మాత్రమున బ్రహ్మానందమును అనుభవించుట తథ్యము.

*సంబంధము - గీతాశాస్త్ర స్మరణమహత్త్వమును తెలిపి అనంతరము సంజయుడు భగవంతుని విరాట్ స్వరూప స్మరణము వలన పరమానందమును స్వానుభవములతో ప్రకటించుచున్నాడు-*

**తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।**
**విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః ॥ 77 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజన్! | = ఓ రాజా! | సంస్మృత్య, సంస్మృత్య | = పదేపదే స్మరించుట వలన | (అహమ్) | = నేను |
| హరేః | = శ్రీకృష్ణుని యొక్క | మే | = నాకు | పునః, పునః | = మాటిమాటికిని |
| తత్, అతి, అద్భుతమ్ | = అట్టి అత్యద్భుతమైన | మహాన్, విస్మయః | = అంతులేని ఆశ్చర్యము కలుగుచున్నది | హృష్యామి | = ఆనందమున పొంగిపోవు చున్నాను. |
| రూపమ్, చ | = దివ్యరూపమునే | | | | |

**ఓ రాజా! అత్యంత విలక్షణము, పరమాద్భుతము, అపూర్వము ఐన ఆ శ్రీహరి రూపమును పదేపదే స్మరించుచు, నేను పొందుచున్న సంభ్రమాశ్చర్యములకు అవధియే లేదు. తత్ప్రభావమున మఱల మఱల హర్షోల్లాసములతో పులకితగాత్రుడనగుచున్నాను. (77)**

ప్రశ్న - 'హరిః' నామవైశిష్ట్యమేమి?

సమా - శ్రీకృష్ణభగవానుని గుణప్రభావ లీలా ఐశ్వర్య నామ, స్వరూప, మహిమలను శ్రవణ, మనన, కీర్తన, దర్శన, స్పర్శల ద్వారా సేవించు మానవుల పాపములన్నియును రూపుమాయును. ఆ శ్రీహరితో ఏవిధమైన సంబంధమున్నను (వివిధ భక్తిరీతుల ద్వారా ఆ శ్రీహరిని ఎట్లు సేవించినను) అట్టివారి సమస్త పాపములను, అజ్ఞానమును, దుఃఖములను అతడు హరింపజేయును. అంతేగాక శ్రీహరి భక్తుల మనస్సులను హరించువాడు కనుక ఆ భగవానునకు 'హరిః' అను నామము ప్రసిద్ధమయ్యెను.

ప్రశ్న -'తత్', 'అతి+అద్భుతమ్' అను విశేషణములతో పాటు 'రూపమ్' అను పదము భగవానుని ఏ రూపమును వర్ణించును?

సమా - భగవంతుని విశ్వరూపము అత్యద్భుతమైనది. భగవానుడు అర్జునునకు ఆ దివ్యరూపమును ప్రదర్శించెను. దానిని సంజయుడును దర్శించెను. ఆ రూపవైభవ ప్రభావములను భగవంతుడే స్వయముగ 11వ అధ్యాయమునందలి 47వ, 48వ శ్లోకములలో ప్రకటించెను. ఆ విరాడ్రూపమునే ఇచట తత్, అత్యద్భుతం అను విశేషణములతో కూడిన 'రూపమ్' అను పదము తెల్పుచున్నది.

ప్రశ్న - "ఆ రూపమును అనుక్షణము స్మరించుచుండుట వలన నాకు సంభ్రమాశ్చర్యములు కలుగుచున్నవి" అని యనుటలోని వైశిష్ట్యమేమి?

సమా - సంజయునకు అతని యదృష్టవశమున ప్రాప్తించిన ఆ విశ్వరూపదర్శనము, దాని వైభవము అతని మనః ఫలకమునుండి ఏమాత్రమూ వైదొలగుట లేదు. దానిని అతడు అనుక్షణమూ స్మరించుచునేయున్నాడు. అతిదుర్లభమైన ఆ దివ్యరూప దర్శన భాగ్యము తనకు ఏ పుణ్యఫలముగా లభించినదో తెలియక అతడు ఆశ్చర్యచకితుడగు చున్నాడు. అది కేవలము భగవానుని అహేతుక కృపాఫలమే గాని మఱియొకటి కాదని అతని తలంపు. ఆ విరాడ్రూపము నందలి అత్యద్భుత దృశ్యములను, సంఘటనలను తలచి, తలచి, భగవానుని యోగశక్తిప్రభావములకు అతడు సంభ్రమాశ్చర్యములకు లోనగుచున్నాడు. దాని వైశిష్ట్యము అట్టిది.

ప్రశ్న - 'నిరంతరము నేను బ్రహ్మానందభరితుడనగు చున్నాను' అని యనుటలోని విశేషమేమి?

సమా - కేవలము ఆశ్చర్యపడుటయే గాదు, ఆ విరాడ్రూపమును తలచి, తలచి సంజయుడు భక్తివిహ్వలుడగుచు పరమానందనిమగ్నుడాయెను. అదియే అందలి వైశిష్ట్యము.

*సంబంధము - ఈ విధముగా సంజయుడు తన నిరతిశయానంద మానసోల్లాసస్థితిని వర్ణించి, పిదప గీతోపదేశ, స్మరణ వైభవములను, విరాడ్రూప స్మరణ మహిమానుభవములను ప్రకటించి, అతడు పాండవుల విజయము నిశ్చయమని ధృతరాష్ట్రునకు తెలుపుచు, ఈ యధ్యాయమును ముగించుచున్నాడు-*

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ॥ 78 ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ర | = ఎచ్చటనయితే | ధనుర్ధరః, పార్థః | = గాండీవధనుస్సును చేతబట్టిన అర్జునుడు (ఉండునో) | భూతిః | = సకలైశ్వర్యములును |
| యోగేశ్వరః, కృష్ణః | = యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడు (ఉండునో) | తత్ర, శ్రీః | = అచ్చట సిరిసంపదలును | ధ్రువా, నీతిః | = దృఢమైన నీతియు |
| యత్ర | = ఎచ్చటనయితే | విజయః | = సర్వవిజయములును | (భవంతి) | = ఉండును |
| | | | | ఇతి | = అని |
| | | | | మమ, మతిః | = నా నిశ్చితాభిప్రాయము |

**ఓ రాజా! యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడును, గాండీవధనుర్ధారియైన అర్జునుడును ఉండుచోట సంపదలును, సర్వవిజయములును, సకలైశ్వర్యములును, సుస్థిరమైన నీతియు ఉండును - అని నా నిశ్చితాభిప్రాయము. (78)**

ప్రశ్న - సంజయుడు ఇచట శ్రీకృష్ణుని యోగేశ్వరుడనియు, అర్జునుని ధనుర్ధారియనియు, అనుటలోని ఆంతర్యమేమి?

సమా - ఈ శ్లోకమునందు శ్రీకృష్ణార్జునులయొక్క నిరుపమాన ప్రభావములను తెలుపుచు, సంజయుడు పాండవుల విజయము తథ్యమని నొక్కి చెప్పి, ధృతరాష్ట్రుని మనస్సును సంధిప్రయత్నముకొఱకై పరోక్షముగ ప్రేరేపించెను. శ్రీకృష్ణ భగవానుడు సమస్త యోగశక్తులకును స్వామి, తన యోగశక్తి ద్వారా క్షణమాత్రముననే సమస్తజగత్తు యొక్క సృష్టిస్థితి లయములను చేయుగలడు. శ్రీమహావిష్ణువుయొక్క అవతారమైన, అట్టి శ్రీకృష్ణుడు తోడుగా ఉన్నప్పుడు ధర్మజుడైన యుధిష్ఠిరుని విజయువిషయమున సందేహమునకు ఏమాత్రమూ తావేలేదు.

అంతేగాక అర్జునుడును 'నరుడు' అను ఋషీశ్వరుని అవతారము. శ్రీకృష్ణభగవానుని ప్రియసఖుడు. గాండీవధనుర్ధారియైన మహావీరుడు. అతడు తన సోదరుడైన యుధిష్ఠిరుని విజయమునకు కటిబద్ధుడై యుండెను. ఇట్లు శ్రీకృష్ణార్జునులు తోడుగా గల యుధిష్ఠిరుని ఎవ్వరును ఎదుర్కొనజాలరు. సూర్యుడున్నచోటనే ప్రకాశము ఉండును. అట్లే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధారియైన అర్జునుడు ఉండుచోట సంపూర్ణ శోభలును, సకలైశ్వర్యములును, సుస్థిరధర్మమును తప్పక వర్ధిల్లుచుండును. ధర్మమున్న చోటనే విజయము గూడ ఉండును. "యతోః కృష్ణస్తతో ధర్మః యతో ధర్మస్తతో జయః" కనుక పాండవుల విజయువిషయమున శంకకు తావు లేనేలేదనియు, స్వజనులహితమును గోరినచో ధృతరాష్ట్రుడు ఈ స్థితియందైనను తన పుత్రులైన సుయోధనాదులకు హితబోధ గావించి, పాండవులతో సంధికి ప్రయత్నించుటయే సముచితమనియు సంజయుడు పరోక్షముగా హెచ్చరించెను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగో నామ అష్టాదశోఽధ్యాయః ॥ ౧౮ ॥

❖ ❖ ❖

ఓం శాంతిః శాంతిః శాంతిః

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు

ఆనందచిద్ఘనుడు, షడ్గుణైశ్వర్య సంపన్నుడు, చరాచరవందితుడు, పరమపురుషోత్తముడు ఐన సాక్షాత్ శ్రీకృష్ణ భగవానుని దివ్యవాణియే 'శ్రీమద్భగవద్గీత'. ఇది అనంత రహస్యములకు రత్నాకరము. శ్రీకృష్ణభగవానుని కృపానుగ్రహములు ప్రసరించినప్పుడే ఇందలి రహస్యాంశములలో యత్కించిత్ సుబోధకము కాగలదు. అనన్య భక్తి శ్రద్ధాదరములు పొంగిపొరలుచున్న హృదయములు గలవారే భగవత్కృపా కటాక్షములను ప్రత్యక్షముగా అనుభవించి, గీతయొక్క నిజస్వరూపాంశమును (గీతయొక్క పరమతత్త్వార్థ లేశమునైనను) దర్శింపగలరు. కనుక నిజశ్రేయస్కాములైన స్త్రీపురుషులు భక్తాగ్రేసరుడైన అర్జునుని ఆదర్శముగా గైకొనవలెను. మఱియు అర్జునునివలె దైవీగుణములను పెంపొందించుకొని, భక్తిశ్రద్ధలతో గీతాశ్రవణ, మనన – అధ్యయనములను చేయవలెను. అంతేగాక భగవదాజ్ఞానుసారము యథాయోగ్యముగ తత్పరత్వముతో సాధనయందు నిమగ్నులు కావలెను. ఇట్లు సాధన చేసినవారు తమ అంతఃకరణములయందు నిత్యనూతనములైన, పరమానందదాయకములైన నిరుపమాన దివ్యభావస్ఫురణలకు నోచుకొందురు. ఇంకను వారు సర్వథా పవిత్రాంతఃకరణములు గలవారై భగవంతుని యొక్క అలౌకిక కృపామృత రసాస్వాదనము చేయుచు అచిరకాలములోనే (శీఘ్రముగనే) భగవత్ప్రాప్తి నందుదురు.

## హారతీ

జయ భగవద్గీతే, జయ భగవద్గీతే ।
హరిహియకమలవిహారిణి, సుందరసుపునీతే ॥ జయ ॥

కర్మసుమర్మ ప్రకాశిని కామాసక్తిహరా ।
తత్త్వజ్ఞానవికాశిని విద్యా బ్రహ్మ పరా ॥ జయ ॥

నిశ్చలభక్తివిధాయిని నిర్మల మలహారీ ।
శరణరహస్య ప్రదాయిని సబ విధి సుఖకారీ ॥ జయ ॥

రాగద్వేష విదారిణి కారిణిమోద సదా ।
భవభయహారిణి తారిణి పరమానందప్రదా ॥ జయ ॥

అసురభావవినాశిని నాశిని తమరజనీ ।
దైవీ సద్గుణదాయిని హరిరసికా సజనీ ॥ జయ ॥

సమతా త్యాగ సిఖావని హరిముఖకీ బానీ ।
సకల శాస్త్రకీ స్వామిని శ్రుతియోంకీ రానీ ॥ జయ ॥

దయాసుధా బరసావని మాతు! కృపా కీజై ।
హరిపదప్రేమ దాన కర అపనో కర లీజై ॥ జయ ॥

❖ ❖ ❖